# ఆంధ్రప్రదేశ్ దర్శిని

**2**

ప్రధాన సంపాదకులు:

**వై. వి. కృష్ణారావు**

సంపాదకవర్గం:

**డాక్టర్ ఏటుకూరి ప్రసాద్**

**సురవరం సుధాకర రెడ్డి**

**మల్లిక్**




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్- 500 001

# మా మాట

ఆంధ్రావనిలో చారిత్రక, సామాజిక, రాజకీయ శాస్త్ర, సాంకేతిక, సాంస్కృతిక, సాహిత్య, కళా రంగాలకు దర్పణం పడుతూ అనేక రంగాలలో నిష్ణాతులైన రచయితల వ్యాసాలతో ఆంధ్రప్రదేశ్ దర్శిని నూతనత్వాన్ని సంతరించుకొని ఒక బృహత్ గ్రంథంగా రూపొంది *1976* లో ప్రప్రథమంగా ప్రచురించబడింది. ఈ తొలి పలుకులలో ఈ కృషి వివరించబడింది.

తెలుగునాడులోని మేధావుల మన్ననలను, ఆదరాభిమానాలను ఈ గ్రంథం పొందగలిగింది. ఉన్నత పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ, విశ్వవిద్యాలయాలలోనూ, పరిశోధనా కేంద్రాలలోనూ, 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' పరిశీలనా గ్రంథంగా ఉపయోగపడింది. ఇంత విస్తృతమైన ఆదరణ ఉన్నందువల్లనే అచ్చు వేసిన ప్రతులన్నీ కొద్ది కాలంలోనే అమ్మకమయ్యాయి. ప్రతులకోసం ఆర్డర్లు వస్తున్నా వారికి గ్రంథాన్ని అందించలేకపోవడం జరిగింది.

పాఠకుల కోర్కె పై తిరిగి *1984* లో ఈ బృహత్తర గ్రంథాన్ని ప్రచురించాలని విశాలాంధ్ర ప్రచురణాలయం నిర్ణయించి ఆ బాధ్యతను ప్రథమ ప్రచురణకు సంపాదకులుగా వున్న శ్రీ వై.వి. కృష్ణారావు, శ్రీ ఏటుకూరి బలరామమూర్తి గార్లకు అప్పగించటం జరిగింది. ఈ గురుతర బాధ్యతను వీరిద్దరు పూర్తిచేశారు. దీనిలో అదనపు వ్యాసాలను చేర్చారు. ప్రథమ ప్రచురణలోని వ్యాసాలను అవసరమైన మేరకు సవరించటం జరిగింది. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ దర్శిని ద్వితీయ ప్రచురణ *1/4* డెమ్మి సైజులో *1800* పేజీలతో *1987* ఏప్రియల్ *30* కి పూర్తయింది. ఈ ప్రచురణ ఆవిష్కరణోత్సవాన్ని, విశాలాంధ్ర ప్రచురణాలయం వారు – కేంద్ర కార్యాలయం వున్న హైదరాబాదులోనే గాక విశాలాంధ్ర ప్రచురణాలయం బుక్ హౌసులున్న విశాఖపట్నం, కాకినాడ, విజయవాడ, గుంటూరు, తిరుపతి, అనంతపురం, హనుమకొండ పట్టణాలలో కూడ ఏకకాలంలో ఏర్పాటు చేయటం జరిగింది. అన్ని ప్రదేశాలలోను ఆంధ్రప్రదేశ్ దర్శిని ఆవిష్కరణోత్సవ సభలకు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులు, ఆచార్యులు, మేధావులు హాజరై తమ సందేశాలిచ్చారు. ఆ సభలకు హాజరైన పలువురు పుర ప్రముఖులు 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' ని పలువిధాలుగా ప్రశంసించడమే గాక దీనిని మరింత మెరుగుపరచడానికి కొన్ని సలహాలు కూడ యిచ్చారు. బృహత్తర ప్రచురణను రివ్యూ చేసిన దినపత్రికలు, వారపత్రికలు గూడ కొన్ని సూచనలు చేశాయి.

ద్వితీయ ప్రచురణ *2000* ప్రతులతో వెలువడింది. వెల ప్రథమంలో *200/-* రూపాయలుగా వుంచాము. ప్రతులన్నీ *8* మాసాలలోనే అమ్ముడుపోయాయి. ఆర్డర్లు వస్తున్నా ప్రతులు లేవు. తిరిగి *1/4* క్రౌన్ సైజులో దాదాపు *1700* పేజీలతో మరో *1000* ప్రతులను అచ్చువేయడం, *250/-* రూపాయలు వెలపెట్టడం జరిగింది. ఆ ప్రతులుకూడ కొద్దికాలంలోనే అమ్ముడుపోయాయి. తిరిగి సవరించిన ప్రచురణ కావలసిన అవసరం ఏర్పడింది. అయినా తృతీయ ప్రచురణకు వెంటనే పూనుకోలేకపోయాము.

*1993* ప్రథమ భాగంలో ఆంధ్రప్రదేశ్ దర్శినిని సవరించి ప్రచురించాలని విశాలాంధ్ర విజ్ఞాన సమితి, విశాలాంధ్ర ప్రచురణాలయం నిర్ణయించటం జరిగింది.

ఇందుకు లోగడ వెలువడిన రెండు ప్రచురణలకు సంపాదకుడుగావున్న శ్రీ వై.వి. కృష్ణారావు ప్రధాన సంపాదకుడుగా, శ్రీయుతులు ఏటుకూరి బలరామమూర్తి శ్రీ మల్లిక్, శ్రీ సురవరం సుధాకరరెడ్డి, డా. ఏటుకూరి ప్రసాద్‌గార్లతో కూడిన సంపాదక వర్గాన్ని ఏర్పాటు చేయడం జరిగింది.

రెండు సంపుటములు :

ఈ సంపుటిలో నూతన ఆర్థిక విధానం, ప్రకృతి వైద్యం, కంప్యూటర్ల విద్య, వృద్ధుల సమస్యలు, అక్షర

జ్యోతి, ఆధునిక కవిత్వ ధోరణులు, దళితవాదం, స్త్రీవాదం, విద్యావిధానం ప్రయివేటీకరణ ధోరణులు మొదలగు పలు నూతన అంశాలను చేర్చాము. 'తెలుగు వెలుగులు' శీర్షికలో వివిధరంగాలలోని పలువురు ప్రముఖుల సంక్షిప్త జీవిత విశేషాలను కూడా చేర్చాలని సంకల్పించాము. ఈ చేర్పులతో, ద్వితీయ ప్రచురణలో వున్న అంశాలకు మరింత అదనపు బోగట్టా చేర్చడంతో ఈ దఫా దర్శిని సైజు మరింత పెద్దదవుతోంది. ఇంత పెద్ద సైజులో ఒకే సంపుటంగా తీసుకురావడంవల్ల చదువరులకు అసౌకర్యంగా వుంటుందని భావించి, రెండు సంపుటాలుగా తీసుకురావాలని నిర్ణయించాము.

మొదటి సంపుటం 1144 పేజీలతో 1996 లో ప్రచురించగలిగాము. రెండవ సంపుటాన్ని; 1987 ప్రచురణలోని 6 నుండి 13 వరకు 7 అధ్యాయాలతో, 1996 లో తీసుకురావాలని సంకల్పించినా, అనివార్య కారణాలవల్ల 1997 లో కూడ ప్రచురించలేకపోయాము. ఈ మధ్యకాలంలో మా సంపాదకవర్గ సభ్యులు శ్రీ ఏటుకూరి బలరామమూర్తిగారి మరణం (1996) మాకు తీరని లోటుగా సంభవించింది. వారి మృతిపట్ల సంతాపం తెలియజేస్తూ, వారికి జోహార్లు అర్పిస్తున్నాం.

ఎంత శ్రమైనా మరికొన్ని అంశాలను చేర్చి, ఇప్పటికి తీసుకురాగలిగినందుకు మాకు సంతృప్తి కలిగింది. అయితే రెండవ సంపుటం త్వరలో వస్తుందని ఆశించిన పాఠకులకు జరిగిన అసౌకర్యానికి మన్నించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

1987 ప్రచురణలో వున్న నవయుగ వైతాళికులు, వివిధ రంగాలలోని ప్రముఖుల సంక్షిప్త జీవిత చరిత్రలను ఈ సంపుటం నుండి మినహాయించినాము. వాటిని ప్రత్యేక ప్రచురణగా తీసుకురావాలని సంకల్పించినాము. ఆ కృషి కొనసాగుతోంది.

'ఆంధ్రప్రదేశ్ దర్శిని' తృతీయ ప్రచురణ మొదటి, రెండవ సంపుటాలకు మేము కోరినంతనే లోగడ వ్రాసిన వ్యాసాలను సవరించి పంపి మాకు తోడ్పడిన రచయితలకు, నూతనంగా చేర్చిన అంశాలకు సంబంధించిన వ్యాసాలను వ్రాసి సహకరించిన రచయితలకు, ఈ గ్రంథ ప్రచురణకు ప్రకటనలిచ్చి సహాయపడిన ప్రకటనకర్తలకు, వివిధ సంస్థలకు, పి.హెచ్.డి. విద్యార్థులుగా వుంటూ మాకు తోడ్పాటు అందించిన శ్రీయుతులు కుషాల్, కందుల విష్ణు గార్లకు మేము కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. మేము కోరినంతనే మాకు అవసరమైన సమాచారాన్ని అందించిన ప్రభుత్వ అర్థగణాంక బ్యూరో వారికి, 'దర్శిని' ముద్రణలో, రూపకల్పనలో తోడ్పడిన ప్రచురణాలయం మేనేజరు శ్రీ పి. రాజేశ్వరరావుకు మా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

'ఆంధ్రప్రదేశ్ దర్శిని' ప్రథమ, ద్వితీయ (1976, 1987) ప్రచురణలకు లభించిన విశేష ఆదరణే; 1996 ప్రచురణ మొదటి సంపుటానికి కూడా - పాఠకుల, విద్యా సంస్థల, శాస్త్ర పరిశోధనాలయాల, పుస్తక భాండాగారాల, ఇతర సంస్థల - ఆదరాభిమానాలు లభించాయి. ఈ ఆదరాభిమానాలు ప్రస్తుతం వెలువడుతున్న ఈ రెండో సంపుటానికి కూడా కొనసాగుతాయని ఆశిస్తున్నాము.

ఈ సంపుటాన్ని గురించి మీ సూచనలను, విమర్శలను, సలహాలను సహృదయంతో స్వీకరిస్తామని తెలుపుకుంటున్నాము.

హైదరాబాదు
26-1-1998.

వై.వి. కృష్ణారావు
(ప్రధాన సంపాదకులు)

డాక్టర్ ఏటుకూరి ప్రసాద్
సురవరం సుధాకరరెడ్డి, మల్లిక్
(సంపాదకవర్గ సభ్యులు)

# సంపాదకవర్గం

**శ్రీ యార్లగడ్డ వెంకట కృష్ణారావు :** 1915లో కృష్ణాజిల్లా గన్నవరం మండలం పెద అవుటపల్లెలో జన్మించారు. 1929లో మహాత్మాగాంధి ఉపన్యాసంవిని జాతీయోద్యమం వైపు ఆకర్షితులయ్యారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహ సందర్భంలో తమ గ్రామంలో ఉప్పు తయారుచేశారు. విదేశీవస్త్ర బహిష్కరణ, కల్లు అంగళ్ల పికెటింగు, ఖద్దరు ఉద్యమాలలో పాల్గొన్నారు. 1937 నుండి 1940 వరకు ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌కు సంయుక్త కార్యదర్శిగా వున్నారు. 1937 లో భారత కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1940 లో గుంటూరు ఎ.సి. కాలేజీ నుండి బి.యస్.సి.లో పట్టభద్రులయ్యారు. 1940–42 మధ్యకాలంలో సెమిలీగల్‌గా వుంటూ గన్నవరం తాలూకాలో కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజరుగా పనిచేశారు.

1943 నుండి ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంలో పనిచేశారు. 1947 లో ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 1948 లో ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు సమితి సభ్యులు. 1948 నుండి 51 చివరి వరకు నాలుగేళ్ళు రహస్య జీవితం గడిపారు. 1951 నుండి 1968 వరకు ఆంధ్రరాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రైతుసంఘ ప్రధాన కార్యదర్శిగానూ, 1968 నుండి 86 వరకు ఆంధ్రప్రదేశ్ రైతుసంఘ అధ్యక్షుడుగాను పనిచేశారు. 1986–93 వరకు అఖిలభారత రైతుసంఘ ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. 1993 నుండి దానికి అధ్యక్షులుగా వున్నారు. 1969 నుండి 1989 వరకు రైతులోకం మాసపత్రికకు ప్రధాన సంపాదకులుగా వున్నారు. 1970 నుండి 1975 వరకు విశాలాంధ్ర విజ్ఞాన సమితి అధ్యక్షులు. తిరిగి 1986 లో అదే పదవికి ఎన్నికయ్యారు.

1951 లో ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి వర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1987 ఏప్రియల్ [illegible]లో కొనసాగారు. 1958 నుండి 1995 చివరివరకు భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి సభ్యులుగా వున్నారు. ప్రస్తుతం పార్టీ వెటరన్‌గా జాతీయ సమితి సమావేశాలకు ప్రత్యేక ఆహ్వానితులుగా వున్నారు. 1989–95 మధ్యకాలంలో భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్రకార్యవర్గంలో సభ్యులుగా వున్నారు. 1966–78 మధ్య ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు సభ్యులుగా వున్నారు. 1986–87 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ ఎకనమిక్ అసోసియేషన్ కార్యవర్గ సభ్యులు.

1955, 1969, 1986, 1988 సంవత్సరాలలో సోవియట్ యూనియన్ సందర్శించారు. 1955 లో హంగేరి, జకోస్లోవేకియాలలోనూ, 1969 లో జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌లోనూ, 1981, 1988 లో బల్గేరియా దేశంలోనూ పర్యటించారు. 1981 లో బల్గేరియా అగ్రేరియన్ పార్టీ కాంగ్రెసుకు సౌహార్ద్ర ప్రతినిధిగా హాజరయ్యారు. 1988 లో ప్రాగ్‌లో జరిగిన అంతర్జాతీయ వ్యవసాయ, అటవీ కార్మికుల 10 వ మహాసభకు అఖిలభారత రైతుసంఘ ప్రతినిధిగా హాజరయ్యారు. పోలెండు రాజధాని వార్సాలో జరిగిన పోలిష్ యునైటెడ్ పిజెంట్సు పార్టీ 10 వ మహాసభకు సౌహార్ద్ర ప్రతినిధిగా హాజరై సందేశాన్నిచ్చారు. 1988 లో సోఫియాలో జరిగిన అంతర్జాతీయ పాలస్తీనారైతుల సంఘీభావ సంఘ కమిటీ సమావేశానికి అఖిలభారత రైతుసంఘం తరపున హాజరయ్యారు. ప్రపంచశాంతి, సామాజిక ప్రగతిపై 1981 సోఫియాలో జరిగిన అంతర్జాతీయ సెమినార్‌లో పాల్గొన్నారు. "పర్యావరణ సంరక్షణ – సాంఘిక సమస్యలు" అన్న అంశంపై 1988 లో వార్సాలో జరిగిన అంతర్జాతీయ సెమినార్‌లో పాల్గొన్నారు. సెమినార్ అధ్యక్షవర్గ సభ్యునిగా ఎన్నుకోబడ్డారు.

1991 లో పాకిస్తాన్ సందర్శన, కరాచీలో జరిగిన ఆసియా పసిఫిక్ దేశాల ప్రాంతీయ ట్రేడ్‌యూనియన్, పాకిస్తాన్ ట్రేడ్‌యూనియన్ సంయుక్తంగా నిర్వహించిన అంతర్జాతీయ సెమినార్‌లో పాల్గొన్నారు.

1993 లో భారత కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి వర్గ సభ్యునిగా చైనా సందర్శించారు.

వ్యవసాయ సమస్యలపైన, రైతు పోరాటాలు, రైతుఉద్యమ చరిత్రపైన ఆంగ్లములోను, తెలుగులోను వందలకొద్దీ వ్యాసాలను వ్రాశారు. ఈ సమస్యలపై పలు గ్రంథ రచనలను చేశారు. అనేక జాతీయ, అంతర్జాతీయ సెమినార్లలో పాల్గొన్నారు. ఆ సెమినార్లకు పలు విషయాలపై 25కు పైగా పత్రాలను సమర్పించారు. ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర 2 వ భాగం రచనలో ముఖ్యపాత్ర వహించారు.

ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ ఆర్థిక పరిస్థితులపై వీరు ప్రత్యేక పరిశోధన గావించారు.

**2. డాక్టర్ ఏటుకూరి ప్రసాద్:** గుంటూరులో 1936న జన్మించిన వీరు, గుంటూరు, విశాఖపట్నం, హైదరాబాద్‌లలో విద్యాభ్యాసంచేసి యం.ఏ., బి.యిడి., పిహెచ్.డి. డిగ్రీలను సంపాదించారు. విద్యార్థి ఫెడరేషన్, యువజన సమాఖ్యలలో విద్యార్థి దశలోనే పలు ఉద్యమాలలో పాల్గొన్నారు. 1955లో అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడుగా చేరారు. 1957లో విశాఖపట్నంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం స్వీకరించారు. విద్యార్థి, యువజన సమాఖ్యల మాసపత్రిక "యువజన"కు ఆరంభంనుండి (1960), 1963 వరకు ప్రధాన సంపాదకుడుగా ఉన్నారు. గజ్జెల మల్లారెడ్డిగారి సంపాదకత్వాన 1970 దశకంలో వచ్చిన "వీచిక" సాహిత్య మాసపత్రికను నిర్వహించారు. తుమ్మల వెంకట్రామయ్యగారి సంపాదకత్వాన వచ్చిన "అభ్యుదయ"కు 1979 నుండి 1987 వరకూ నిర్వాహకులుగా ఉన్నారు. ఆ తర్వాత దాని సంపాదకత్వ బాధ్యతలను చేపట్టారు. నవల, విమర్శ, భాష, కవిత్వం ప్రక్రియలపై "అభ్యుదయ" ప్రత్యేక సంచికలను వెలువర్చారు.

అభ్యుదయ రచయితల సంఘంలో 1970 నుండి ఇప్పటివరకూ కార్యవర్గ సభ్యుడుగా, కార్యదర్శిగా, ప్రధాన కార్యదర్శిగా, ఉపాధ్యక్షుడిగా తమ బాధ్యతలను నిర్వహిస్తున్నారు.

అఖిలభారత అభ్యుదయ రచయితల సమాఖ్య కార్యవర్గసభ్యుడుగానూ, కార్యదర్శిగానూ పనిచేశారు.

వీరివి ఎర్రజెండా, ఎర్రబాట, పోరాటం వంటి పాటల సంకలనాలొచ్చాయి. సుమారు పది సాహిత్య విషయక సంకలనాలకు సంపాదకులుగా ఉన్నారు. కొంపెల్ల జనార్దనరావు జీవితం సాహిత్యం, తుమ్మల సాహిత్యం వంటివి కొన్ని. తాపీ ధర్మారావు సాహిత్యం జీవితం అన్నది వీరి డాక్టరేట్ సిద్ధాంత గ్రంథం. 1983 లో శ్రీ శ్రీ సాహితీసంస్థ స్థాపించి దాని కన్వీనర్‌గా ఉంటూ "పొయిట్రీ వర్క్‌షాప్" వంటి ప్రసిద్ధ సంకలనాలకు సంపాదకులుగా ఉన్నారు. పత్రికల్లో పలు వ్యాసాలనూ, రేడియోలో ప్రసంగాలనూ చేశారు.

ఏ.సి. కళాశాల గుంటూరులో కొంతకాలం, అగ్రివాల్ హైస్కూలు హైదరాబాద్‌లో కొంతకాలం అధ్యాపకులుగా పనిచేశారు. యస్.డి.యస్. కామర్స్ కళాశాల హైదరాబాద్‌లో తెలుగుశాఖలో రీడర్‌గా 1994లో పదవీ విరమణ చేశారు. తెలంగాణా టీచర్స్ గిల్డ్‌కు కొంతకాలం కార్యదర్శిగా, "అక్టా"కు కొంతకాలం కార్యవర్గ సభ్యుడుగా ఉన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం, సార్వత్రిక విశ్వవిద్యాలయాల (U.G.) పాఠ్యనిర్ణాయక సంఘం సభ్యులుగా కొంతకాలం ఉన్నారు.

విజయలక్ష్మి స్మారక ఎవార్డు, సుంకర స్మారక ఎవార్డు, పులుపుల శివయ్య స్మారక ఎవార్డు, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిభా పురస్కారాలు వీరికి (జర్నలిజంలో) లభించాయి.

1983 నుండీ విశాలాంధ్ర ప్రచురణాలయం సంపాదక వర్గ సభ్యులుగా ఉంటూ, 1996నుండి సంపాదక బాధ్యతలను నిర్వహిస్తున్నారు.

**3. శ్రీ సురవరం సుధాకర రెడ్డి:** సమరశీల రాజకీయ కార్యకర్త, మేధావి, మంచి వక్త, సి.పి.ఐ. రాష్ట్ర సమితి కార్యదర్శి, జాతీయ కార్యవర్గ సభ్యులు. శ్రీ సురవరం సుధాకర రెడ్డి 1942 వ సంవత్సరంలో కొల్లాపురం తాలుకా కొండ్రావుపల్లి గ్రామంలో జన్మించారు. అలంపూర్ తాలూకా కంచుపాడు వీరి స్వగ్రామం.

ప్రముఖ సాహితీవేత్త, ప్రసిద్ధ పాత్రికేయులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి వీరి పెద్ద నాన్నగారు. తెలంగాణా సాయుధ పోరాట యోధుడు, రైతు నాయకులు శ్రీ వెంకట్రామరెడ్డి వీరి తండ్రి.

శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ కాలేజి యూనియన్ అధ్యక్షులుగా ఉండి 62 రోజుల విద్యార్థి సమ్మెకు నాయకత్వం వహించారు.

ఎ.ఐ.ఎస్.ఎఫ్. కర్నూలు పట్టణ కార్యదర్శిగా, హైదరాబాద్ జిల్లా కార్యదర్శిగా పని చేశారు. తర్వాత ఉస్మానియాలో 'లా' కళాశాల యూనియన్ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఎ.ఐ.ఎస్.ఎఫ్. రాష్ట్ర శాఖ కార్యదర్శిగా, అధ్యక్షులుగా పనిచేశారు. 1966 లో అఖిల భారత విద్యార్థి సమాఖ్య ప్రధాన కార్యదర్శిగా, 1969 నుండి అధ్యక్షులుగా పని చేశారు. 1972లో భారత యువజన సమాఖ్య అధ్యక్షునిగా ఎన్నికయ్యారు.

అనేక ప్రజా ఉద్యమాలకు నాయకత్వం వహించి కలకత్తా, ఢిల్లీ, హైదరాబాద్‌లలో పలుసార్లు జైలు శిక్షలు అనుభవించారు.

1972 లో సోవియట్ యూనియన్ యువ కమ్యూనిస్టు లీగ్ శ్రీ సుధాకర్ రెడ్డికి లెనిన్ శత జయంత్యుత్సవ అంతర్జాతీయ అవార్డును ప్రదానం చేసింది. 1973 లో బెర్లిన్‌లో ప్రపంచ యువజనోత్సవాలకు మన దేశం నుండి వెళ్లిన అన్ని పార్టీల యువకుల, పార్లమెంట్ సభ్యుల ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించారు.

అంతర్జాతీయ విద్యార్థి సమాఖ్య మహాసభ ఉలన్‌బటార్ (మంగోలియా) లో మన దేశ ప్రతినిధి వర్గం నాయకుడు. నాటి సోషలిస్టు దేశాలైన బల్గేరియా, హంగేరి, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, సోవియట్ యూనియన్‌లతో పాటు ఆఫ్ఘనిస్తాన్‌లలో పర్యటించారు. బంగ్లాదేశ్ విముక్తి పోరాట సమయంలో ప్రపంచ విద్యార్థి సమాఖ్య ప్రతినిధి వర్గం సభ్యుడిగా వెళ్ళి ఆ దేశ విద్యార్థి సంఘంతో ప్రపంచ విద్యార్థి సంఘాలకు సంబంధాలు ఏర్పాటు చేశారు.

1982లో చెకోస్లోవేకియా, 1993లో చైనా పర్యటించారు. ఢిల్లీలోని 'న్యూజనరేషన్', 'యూత్ ఫ్' పత్రికలకు; ఆ తర్వాత హైదరాబాద్‌లో 'యువజన' తెలుగు మాసపత్రికకు సంపాదక బాధ్యతలు నిర్వహించారు.

1972 నుండి సి.పి.ఐ. జాతీయ సమితి సభ్యునిగా, 1984 నుండి రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కార్యవర్గ సభ్యునిగా, కొంతకాలం కార్యదర్శి వర్గ సభ్యులుగా, ప్రస్తుతం రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కార్యదర్శి బాధ్యతలతో పాటు రాష్ట్ర పౌరహక్కుల సంఘం (ఎ.పి.సి.ఎల్.ఎ) కార్యదర్శిగా, రాష్ట్ర వ్యవసాయ కార్మిక సంఘ ఉపాధ్యక్షునిగా పని చేస్తున్నారు.

4. శ్రీ మల్లిక్ : మల్లిక్ అసలు పేరు భళ్ళమూడి మల్లికార్జునరావు. 1944 లో శ్రీకాకుళం జిల్లా టెక్కలి లో జన్మించిన వీరి స్వగ్రామం, వంశధారా నదీ తీరాన ఉన్న 'కుద్దిగాం'. రచయితగా, జర్నలిస్టుగా మంచి పేరు సంపాదించారు. విజయనగరం, తణుకు ఆంధ్ర విశ్వవిద్యాలయం వాల్తేరుల్లో విద్యాభ్యాసం చేశారు. మేథమేటికల్ ఎకనామిక్స్‌లో ఆనర్సు చదివారు. 1964 విద్యాభ్యాసం ముగించి, తెలుగు భాషా సమితిలో అసిస్టెంటు కంపైలర్ గా 1965 వరకు హైదరాబాద్‌లో పని చేశారు. స్టాటిస్టికల్ అసిస్టెంటుగా కొన్నాళ్లు విశాఖపట్నంలో ఉండి తర్వాత అక్కడ ఒక ట్యుటోరియల్ కాలేజీ నిర్వహించారు.

పండిత కుటుంబం నుండి వచ్చిన శ్రీ మల్లిక్‌కు చిన్నతనం నుండీ సాహిత్యంపై అభిరుచి ఉంది. ప్రముఖ కవి తిలక్ గారితో సాన్నిహిత్యం (1959) వీరిలో కవిత్వంపై ఆసక్తిని పెంచింది.

జర్నలిజంపై సహజంగా వీరికున్న అభిరుచి వల్ల 1967–1973 సంవత్సరాల మధ్య విజయవాడలోని విశాలాంధ్ర దినపత్రిక సంపాదక శాఖలో వివిధ బాధ్యతలు నిర్వహించారు. 1973–1981 కాలంలో సెంట్రల్ న్యూస్ సర్వీస్, న్యూ వేవ్, జనయుగ్ సంస్థలకు ఆంధ్రప్రదేశ్ రాజధాని విలేఖరిగా హైదరాబాద్‌నుంచి పని చేశారు. తర్వాత మద్రాసు వెళ్ళి సోవియట్ భూమి, సోవియట్ సమీక్ష ఏ.పి.యన్. వార్తా సంస్థల సంపాదక వర్గంలో 1981–1991 కాలంలో పని చేశారు. ఆ కాలంలోనే సోవియట్ భూమి తెలుగు పత్రికకు సంపాదకత్వ బాధ్యతలను కూడా నిర్వహించారు. ప్రతి సమస్యను వామపక్ష దృష్టితో పరిశీలిస్తూ, విశ్లేషించే తత్వం మల్లిక్ గారిది.

జర్నలిస్టుగా ఉంటూనే, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల ఉద్యమ పునర్నిర్మాణంలో ప్రముఖ పాత్ర నిర్వహించారు. కవితలు, పాటలు, రెండు నవలలు, రెండు నాటకాలు, అనేక సాహిత్య, రాజకీయ

వ్యాసాలు రాశారు. విజయవాడ, హైదరాబాద్, మద్రాసు కేంద్రాలనుండి పలు రేడియో ప్రసంగాలు చేశారు. కొన్ని సినిమాలకు కథలు, మాటలు, పాటలు రాశారు.

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘంలో పలు బాధ్యతాయుతమైన పదవులు చేపట్టారు. 1994 లో అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం కార్యదర్శులలో ఒకరుగా ఎన్నికయ్యారు. సాహిత్య కార్యక్రమాలు, సదస్సులకు చక్కని రూపకల్పన చేసి సమర్థవంతంగా నిర్వహించగల నేర్పున్న వ్యక్తి శ్రీ మల్లిక్. ప్రజా నాట్యమండలి రచయితగా వీరి కృషి గణుతికెక్కింది. చాలాకాలం నుంచీ మద్రాసులో ఉంటూ అక్కడ తెలుగు సాహితీ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

20 వ శతాబ్దపు తెలుగు సాహిత్య సమాచార కోశాన్ని పది సంపుటాలుగా వెలువరించే బృహత్ ప్రణాళికను సిద్ధపర్చి, దాని నిర్వహణలో సెమినార్‌లు, చర్చలూ ఏర్పాటు చేసే నిరంతర కృషిలో ప్రస్తుతం నిమగ్నులై ఉన్న శ్రీ మల్లిక్, "తెలుగు సాహిత్య పరిశోధన సంఘం" అనే స్వచ్ఛంద సంస్థకు సెక్రటరీ జనరల్ గా ఉన్నారు. ఈ కార్యక్రమంలో భాగంగా 1996లో మద్రాసులోనూ, 1998లో హైదరాబాద్‌లోనూ రెండు పెద్ద జాతీయ సదస్సులను నిర్వహించారు.

ప్రపంచ తెలుగు సమాఖ్య (మద్రాసు) వారి తెలుగు జగతి అన్న తెలుగు త్రై మాసపత్రికకు సంపాదకులుగా ఉంటున్న శ్రీ మల్లిక్, జర్నలిజం రంగంలోనూ, అభ్యుదయ రచయితల ఉద్యమంలోనూ నిరంతరం కృషి కొనసాగిస్తున్నారు.

# వ్యాస రచయితల పరిచయం

**డా॥ గౌరీనాథశాస్త్రి ఎం.:-** మద్రాసు విశ్వవిద్యాలయం క్రింద నిర్వహింపబడే తిరుచునాపల్లి కాలేజీలో యం.ఏ. డిగ్రీపొంది, తర్వాత విజయనగరం కాలేజీలో పరిశోధనచేసి డాక్టరేటు సంపాదించారు. డి.యస్.సి. డిగ్రీ కూడా పొందారు. బందరు హిందూ కాలేజీలో భౌతిక శాఖాధిపతి గానూ, తర్వాత ప్రిన్సిపాల్‌గాను పనిచేసి పదవీ విరమణ చేశారు.

**ప్రొ. పార్వతీ సుబ్రహ్మణ్యం వారణాశి:-** 1925 మార్చి 11న జన్మించారు. 1947లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎస్‌సి. డిగ్రీ పొందారు. 1954లో అమెరికాలోని జోన్స్‌హాప్‌కిన్స్ విశ్వవిద్యాలయంనుంచి జియోగ్రఫీ క్లైమెటాలజీలో ఎం.ఏ. డిగ్రీ పొందారు. 1948 నుంచి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గా, రీడర్‌గా, ప్రొఫెసర్‌గా 1985 వరకు పనిచేసి పదవీ విరమణ చేశారు. దేశ, విదేశీ పత్రికలలో 170 పరిశోధనా వ్యాసాలు వ్రాశారు. గోదావరీ నదీ ప్రాంతంలో నీటి మిగులు అనే అంశంపై సమర్పించిన పరిశోధనా పత్రానికి బంగారు పతకం లభించింది. 1981లో రాష్ట్రప్రభుత్వం నుంచి ఉత్తమ ఉపాధ్యాయుని బహుమతి పొందారు. విదేశాలలో జరిగిన పలు సదస్సులకు హాజరైనారు.

**డా॥ కాశీపతి సి.:-** 1955వ సంవత్సరంలో తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో జన్మించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి 1976 లో అనుప్రయుక్త భూగర్భ శాస్త్రంలో ఎం.ఎస్సి. డిగ్రీని, 1989లో ఆర్థిక భూగర్భ శాస్త్రంలో పిహెచ్.డి. పట్టాను పొందారు. వీరు పలు జాతీయ, అంతర్జాతీయ సదస్సులకు హాజరై తమ పత్రాలను సమర్పించారు. వీరు ప్రత్యేకించి ఖనిజ నిల్వలు, మినరల్ ఎక్స్‌ప్లోరేషన్, [illegible]సింగ్, ఎన్విరాన్‌మెంటల్ జియోసైన్స్‌లో ఎక్కువగా కృషిచేశారు. వీరు భూగర్భ శాస్త్ర సంబంధమైన దాని సాంకేతిక సంస్థలో ఎడిటోరియల్ బో[illegible] మెంబరుగా ఉన్నారు. ముఖ్యంగా క్రోమైట్, మాం[illegible] పరిశోధనల్లో పేరు ప్రసిద్ధులు గడించారు. [illegible] 70 పరిశోధనా పత్రాలను వివిధ పత్రికల[illegible] ప్ర[illegible]. ప్రస్తుతం వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మినరల్ ఎక్స్‌ప్లోరేషన్ విభాగంలో పరిశోధనా [illegible]గానూ, భూగర్భ శాస్త్ర శాఖలో రీడర్‌గాను తమ పదవీ బాధ్యతలను నిర్వహిస్తున్నారు.

**ప్రొ. ప్రకాశరావు టి.కె.ఎస్.:-** 1938 డిసెంబరు 13 న తణుకులో జన్మించారు. 1962లో జియోఫిజిక్స్‌లో ఎం.ఎస్‌సి. డిగ్రీ పొందారు. 1972లో పిహెచ్.డి. పట్టా పొందారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం జియోఫిజిక్స్ శాఖలో లెక్చరర్‌గా, రీడర్‌గా పనిచేశారు. ప్రస్తుతం ఆ శాఖలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. యు.జి.సి. కార్యక్రమం క్రింద ఒక గ్రంథం ప్రచురించారు.

**డా. మహారాజు దేవరాజు:-** వీరి జననం: 1951 స్వస్థలం – వడపర్తి, నల్లగొండజిల్లాలో యం.యస్సి., పిహెచ్.డి. చేశారు. ప్రస్తుతం హైదరాబాదులో భవన్స్ న్యూసైన్స్ కళాశాల, జువాలజీ పోస్ట్ గ్రాడ్యుయేట్ డిపార్టుమెంట్‌లో రీడర్‌గా ఉన్నారు. కవిగా, కథారచయితగా, కాలమిస్ట్‌గా మంచి గుర్తింపు ఉంది. పాప్యులర్ సైన్స్‌కూడా రాస్తున్నారు. అచ్చయిన పుస్తకాలు డజనుదాకా ఉన్నాయి. కవిత్వం: 'గుడిసెగుండె; గాయపడ్డ ఉదయం – కథలు: కడుపుకోత, పాలు ఎర్రబడ్డాయ్, దేవరాజు మహారాజు కథలు – అనువాదాలు: కవితాభారతి, మట్టిగుండె చప్పుళ్ళు, బుడుంగు, గురువుకు ఎగనామం – వగైరా. సాహిత్యవిశ్లేషణ: ఆధునిక యుగంలో జానపద సాహిత్యం. లోగడ విశాలాంధ్ర ప్రచురించిన మూఢనమ్మకాలు – సైన్స్; ఎయిడ్స్ వంటి పాప్యులర్ సైన్స్ గ్రంథాలు పునర్ముద్రణలు పొందాయి. భారత్‌భవన్ – భోపాల్ సాహిత్య సభల్లో రెండుసార్లు తెలుగు సాహిత్య రంగానికి ప్రాతినిధ్యం వహించారు. వీరి కవితలు, కథలు ఇతర భారతీయ భాషల్లోకి, ఇంగ్లీషులోకి అనువదింపబడ్డాయి. 1991లో తెలుగు విశ్వవిద్యాలయ సాహితీ పురస్కారంతోపాటు పలు పత్రికలనుండి, సంస్థలనుండి బహుమతులు, అవార్డులూ, సన్మానాలు అందుకున్నారు.

**డా॥ బ్రహ్మారెడ్డి వి.:-** డా॥ వి. బ్రహ్మారెడ్డిగారు 1951 జూలై 1వ తేదీన అతి సామాన్య రైతుకుటుంబంలో జన్మించారు. 1968లో విజయవాడ లయోల కాలేజీ నుండి పి.యు.సి.ని పూర్తి చేసుకుని, 1974 లో కర్నూలు మెడికల్ కాలేజీ నుండి ఎం.బి.బి.ఎస్. డిగ్రీని పుచ్చుకున్నారు. 1975–78 వరకు నెల్లూరులోని డా॥ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి గారి ఆస్పత్రిలో పనిచేశారు. తదుపరి కర్నూలులో ప్రసిద్ధి చెందిన పీపుల్స్ హెల్త్ సొసైటీని 1985లో స్థాపించి, అక్కడ ప్రజలకు వైద్య సేవలందిస్తున్నారు.

డా॥ బ్రహ్మారెడ్డిగారు అనేక సామాజిక, వైజ్ఞానిక కార్యక్రమాలలో ప్రతిభావంతమైన కృషి సాగిస్తున్నారు. 1986 నుండి ఆరోగ్యం, మందుల మీద పత్రికలద్వారా, ఉపన్యాసాల ద్వారా, ఇతర పద్ధతుల ద్వారా నిరంతర ప్రచార

కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. 1988 లో ఏర్పడిన "జ్ఞాన విజ్ఞాన వేదిక" సైన్సు ప్రచార సంస్థలో రెండేళ్ళు రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా సమర్థవంతంగా బాధ్యతలు నిర్వహించి, ప్రస్తుతం ఈ సంస్థకు ఉపాధ్యక్షులుగా కొనసాగుతున్నారు.

డా॥ బ్రహ్మారెడ్డిగారు ఎం.బి.బి.యస్. డిగ్రీతోనే 300కు పైగా గుండె ఆపరేషన్లు, ఊపిరితిత్తుల ఆపరేషన్లు చేసి అనేకమంది ప్రశంసలు అందుకున్నారు. స్పెషలైజేషన్ లేకుండా ఇలాంటి ఆపరేషన్లు చేసినవారు చాలా అరుదు.

వైద్యం మీద, సైన్సు ప్రచారం మీద 18 కి పైగా పుస్తకాలు, అనేక పత్రాలను ప్రజలకు సులభంగా అర్థమయ్యే రీతిలో వ్రాశారు. వైద్యుడిగా, మేధావిగా, సంఘసేవకుడిగా డా॥ బ్రహ్మారెడ్డిగారు ప్రజలకు చిరపరిచితులు.

**డా॥ కృష్ణమూర్తి టి.:-** 1949 డిశంబరు 18వ తేదీన కడపలో జన్మించారు. 1969 లో పి.యు.సి. ఉత్తీర్ణులైనారు. పిదప 1970 నుండి 1974 వరకు గాంధీ నేచర్‌క్యూర్ కళాశాల నుండి ఎన్.డి. డిప్లొమా కోర్సును పొందారు. వీరు మొట్టమొదట మద్రాసు నేచర్‌క్యూర్‌లో ఆరునెలలు శిక్షణ పొందారు. పిదప వీరు ప్రభుత్వ ప్రకృతి చికిత్సాలయం (బేగంపేట). 1980 నుండి 1990 వరకు సీనియర్ మెడికల్ ఆఫీసర్‌గా పనిచేశారు. 1990 నుండి దీనిలోనే సూపర్‌ఇంటెండెంట్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వీరు 'మేగ్నటో థెరపీ మరియు ఇండాలజీ' అన్న అంశంపై పరిశోధన చేశారు. అంతే కాకుండా ఆనరరీ లెక్చరర్‌గా 1980 నుండి ప్రభుత్వ గాంధీ నేచర్ క్యూర్ కాలేజీలో పనిచేస్తున్నారు.

**ఆచార్య జి.యం. రెడ్డి :-** వీరు వరంగల్ జిల్లా దామెరగ్రామంలో 16-11-1932న జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.యస్.సి. చేసి; అమెరికాలో యం.యస్; పిహెచ్.డి. పట్టాలు పొందారు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో జన్యుశాస్త్రంలో పరిశోధకుడుగా కొంతకాలం ఉన్నారు.

అమెరికానుంచి తిరిగివచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1964లో అధ్యాపకుడుగా చేరారు. అప్పటినుండి పదవీ విరమణ చేసేటంత వరకూ ఇన్‌సాసీనియర్ సైంటిస్టుగా విశ్వవిద్యాలయంలో అనేక పదవులు నిర్వహించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం అధ్యాపకసంఘ అధ్యక్షుడుగా, ఆంధ్రప్రదేశ్ విశ్వవిద్యాలయాల అధ్యాపకసంఘాల సమాఖ్య అధ్యక్షుడుగా కొంతకాలం పని చేశారు.

ఆచార్య రెడ్డిగారు సుమారు 20 పరిశోధక ప్రాజెక్టులను నిర్వహించటమే కాక, 350 పరిశోధక వ్యాసాలను జాతీయ, అంతర్జాతీయ పత్రికలలో ప్రచురించారు. వీరి నేతృత్వం కింద 40 మంది పిహెచ్.డి. పట్టాలు పొందారు.

వీరికి అనేక అంతర్జాతీయ పురస్కారాలు లభించాయి. యఫ్.యన్.ఏ; యఫ్.ఎం.;లలో సభ్యత్వం పొందారు. శ్రీలంక ప్రభుత్వానికి బయోటెక్నాలజీ సంఘంలో సభ్యుడుగా కొంత కాలం ఉన్నారు. అమెరికా, చైనా, ఇండోనేషియా, పాకిస్తాన్ వంటి 60 దేశాలలో విస్తృతంగా పర్యటించి పలుసదస్సుల్లో పాల్గొన్నారు. బయోటెక్నాలజీ ఫలితాలు గ్రామీణ ప్రజల కందించేందుకు వివిధ విశ్వవిద్యాలయాల, సంస్థల ద్వారా కృషి చేస్తున్నారు. వాటిలో జి.యం.ఆర్. రిసెర్చి ఫౌండేషన్ ప్రధానమైంది.

**డా॥ స్వామి టి.యల్.యన్.:-** వీరు కరీంనగర్ జిల్లా మోహనరావుపేటలో 26-5-1956లో జన్మించారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం నుంచి యం.ఏ., పిహెచ్.డి., ఆర్థికశాస్త్రంలో సంపాదించారు. 1986 నుంచీ ఉస్మానియా విశ్వ విద్యాలయంలో పనిచేస్తున్నారు. ఆర్థిక సంబంధమైన పలు సంస్థలలో పనిచేసిన అనుభవం ఉంది. ఆర్థికశాస్త్రంలో పలువురు వీరి నేతృత్వం కింద పరిశోధన చేస్తున్నారు. అనేక జాతీయ సదస్సులు, చర్చాగోష్ఠులలో ఆర్థిక సంబంధమైన పలు అంశాలమీద పత్రాలను సమర్పించారు. ఇతరుల భాగస్వామ్యంతో చాలా పరిశోధనా ప్రాజెక్టులను పూర్తి చేశారు. వివిధ స్థాయిల విద్యార్థులకోసం పాఠ్యాంశాల రచన చేశారు. ప్రస్తుతం రీడర్‌గా కొనసాగుతున్నారు.

**శ్రీ బలరామమూర్తి ఏటుకూరు:-** 1918లో గుంటూరు జిల్లా ఏటుకూరు గ్రామంలో జన్మించారు. 1937లో ఎ.సి. కాలేజీనుండి బి.ఎ. డిగ్రీ పొందారు. తరువాత సోషియాలజీలో ఎం.ఎ. డిగ్రీని పొందారు. వీరికి విద్యార్థి దశలోనే కమ్యూనిస్టు సాహిత్యంతో పరిచయమేర్పడింది. 1940 నుండి కమ్యూనిస్టు కార్యకర్తగా 12 ఏండ్లపాటు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో నిర్మాణ బాధ్యతలు నిర్వహించారు. 1949-51 లలో కడలూరులో డిటెన్యూగా వున్నారు. భారతీయ చరిత్ర, తత్త్వశాస్త్రాలను మార్క్సిస్టు దృక్కోణంతో అధ్యయనం చేయాలనే ఆసక్తి కృషి మొదటినుంచి ఉంది. అందులో భాగంగానే 1953 లో ఆంధ్రుల సంక్షిప్త చరిత్రను ప్రచురించారు. ఇది 15 ముద్రణలు పొంది విశేష వ్యాప్తి పొందింది. 1956 లో "భారతీయ తత్త్వశాస్త్రం" ప్రకటించారు. 1970 లో "మన చరిత్ర" పేరుతో భారతదేశ సంగ్రహ చరిత్రను ప్రచురించారు. 1952-72 మధ్య విశాలాంధ్ర దినపత్రిక సంపాదక బాధ్యతలు, 1972 నుండి విశాలాంధ్ర ప్రచురణాలయం సంపాదక బాధ్యత నిర్వహించారు. కమ్యూనిజం పత్రిక సంపాదక వర్గ సభ్యులు. పార్టీ అధ్యయన రంగంలో విశేష కృషి చేశారు. వీరు "మార్క్సిజం-భగవద్గీత", "గాంధేయ మార్గం-తాత్త్వికత", "బౌద్ధం-మార్క్సిజం" అను గ్రంథాలు కూడా ప్రచురించారు. వీరు రచించిన

ఆంధ్రుల సంక్షిప్త చరిత్రను రష్యాలో స్థిరపడిన సుప్రసిద్ధ ఇంజనీరు శ్రీ కె. సీతారామయ్యగారు రష్యన్ భాషలోకి అనువదించారు. వీరు రాసిన ఉపనిషత్ చింతన అన్న గ్రంథానికి తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం లభించింది. బలరామమూర్తిగారు 3-4-1996 న చనిపోయారు.

శ్రీ రాధాకృష్ణమూర్తి. కె.:- 1945 అగస్టు 15 న పశ్చిమ గోదావరి జిల్లాలో జన్మించారు. వీరు ఎం.ఏ., డి.ఎ.ఎస్. సి.పి.ఎస్. డిగ్రీలను బొంబాయి విశ్వవిద్యాలయం నుండి పొందారు. ప్రస్తుతం ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని సామాజిక శాస్త్ర విభాగంలో లెక్చరరుగా పనిచేస్తున్నారు.

డా॥ సింగయ్య కె.:- 1935లో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని సర్వాయపాలెంలో జన్మించారు. వీరు 1958లో లక్నో విశ్వవిద్యాలయం నుండి సోషియాలజీలో ఎం.ఏ. డిగ్రీని పొందారు. 1960లో లెక్చరర్‌గా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1968 నుంచి ప్రభుత్వ కళాశాలల్లో సమాజశాస్త్ర శాఖ అధ్యక్షుడిగా, 1986 నుంచి 1993 వరకు విజయవాడ, రాయచోటి ప్రభుత్వ డిగ్రీ కళాశాలలకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. వీరు 1993 ఏప్రిల్‌లో పదవీ విరమణ చేశారు. తరువాత పలపర్లలోని మాగుంట సుబ్బరామరెడ్డి జూనియర్ కళాశాలలో రెండేళ్ళు ప్రిన్సిపాల్‌గా బాధ్యతలు నిర్వహించారు. అంతేకాకుండా ప్రస్తుతం రావినూతలలో మాగుంట సుబ్బరామిరెడ్డి జూనియర్ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా వ్యవహరిస్తున్నారు. మరియు డా॥ బి.ఆర్. అంబేడ్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం విద్యార్థులకు, ఆంధ్ర విశ్వవిద్యాలయం విద్యార్థులకు సమాజ శాస్త్ర బోధన చేస్తున్నారు. వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఎకడమిక్ కౌన్సిల్ సభ్యులుగా రెండుసార్లు, నాగార్జున విశ్వవిద్యాలయం ఎకడమిక్ కౌన్సిల్ సభ్యులుగా రెండుసార్లు ఉన్నారు. వీరు సమాజశాస్త్రంలో ఐదు పుస్తకాలు ప్రచురించారు. వివిధ దినపత్రికలలో పలు వ్యాసాలు వీరివి ప్రచురితమయ్యాయి.

శ్రీ భాస్కరరావు బోడేపూడి:- 1949 జనవరి 1న కృష్ణాజిల్లా నందిగామ తాలూకా మున్నలూరులో జన్మించారు. ఆంధ్రాయూనివర్సిటీ నుండి ఆర్థిక శాస్త్రంలో ఎం.ఏ. డిగ్రీని, స్టాటిస్టిక్స్‌లో యం.యస్‌సి. డిగ్రీని, నాటకకళలో డిప్లొమాను పొందారు. ప్రస్తుతం ఆంధ్రా యూనివర్శిటీలో పరిశోధన చేస్తున్నారు.

శ్రీమతి సుబ్బమ్మ మల్లాది:- జననం 1924, బి.ఏ. దాకా చదువు, కుటుంబ నియంత్రణోద్యమ శిక్షణ, మహిళోద్యమ కార్యకర్త, 'బహుగ్రంథకర్త, వక్త, పత్రికా రచయిత, హేతువాది, మానవతావాది, 'స్త్రీ స్వేచ్ఛ' పత్రికా సంపాదకులు, మద్యనిషేధ కార్యకర్త, స్త్రీ విమోచన ప్రచారకురాలు, సంఘ సంస్కర్త, సంఘ సేవకురాలు, పౌరహక్కుల, ప్రజాస్వామ్య ఉద్యమాల కార్యకర్త. వీరు అనేక బహుమానాలను ప్రవేశపెట్టారు. పలుపురస్కారాలను పొందారు.

శ్రీమతి మనోరమ యస్.:- 1969లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి రాజకీయ శాస్త్రంలో ఎం.ఏ. డిగ్రీ పొందారు. 1971 నుంచి ప్రభుత్వ కళాశాలలో లెక్చరర్‌గా గుంటూరు, విజయవాడలలో పనిచేశారు. ప్రస్తుతం తణుకు ప్రభుత్వ కళాశాలలో రాజనీతి శాఖ విభాగ అధిపతిగా పనిచేస్తున్నారు. 1973లో మహిళా సమస్యలపై మాస్కోలో జరిగిన సెమినార్‌లో పాల్గొన్నారు. సోషలిస్టు దేశాల్లో మహిళల అభివృద్ధిని తెలుసుకొనేందుకు సోవియట్ యూనియన్, హంగేరిలలో పర్యటించారు. జాతీయ, రాష్ట్రస్థాయి మహిళా సదస్సులలో పాల్గొన్నారు. ఆకాశవాణిలో అనేక సమస్యలపై ప్రసంగాలు చేశారు.

శ్రీమతి శారదా అశోకవర్ధన్:- 1938 జూలై 28న హైదరాబాదులో జన్మించారు. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. డిగ్రీని పొందారు. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం నుండి హోమ్‌సైన్స్‌లో డిప్లొమాను పొందారు. వీరు ఆకాశవాణి కుటుంబ నియంత్రణ విభాగములో ఫీల్డ్ ఆఫీసర్‌గానూ, జవహర్ బాలభవన్ డైరెక్టర్‌గానూ సేవచేశారు. వీరు గొప్ప రచయిత్రి. వీరు నవలలు, కథలు, వచన కవితలు, పద్యాలు, వ్యాసాలు, నృత్యనాటికలు, బాలసాహిత్యం, నాటికలు-నాటకం, పాటలు, ఫీచర్స్ మొదలగు ప్రక్రియలను చేపట్టి అనేక గ్రంథాలను వెలువరించారు; వెలువరిస్తున్నారు. అంతేకాకుండా పలుదేశ, విదేశాలలో జరిగిన సమావేశాలకు హాజరయ్యారు. వీరు సమాచార పౌర సంబంధశాఖలో అదనపు సంచాలకులుగా బాధ్యతలను నిర్వర్తించి ఇటీవల పదవీ విరమణ చేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ స్త్రీల విభాగంలో సభ్యురాలిగానూ, అనేక సాంస్కృతిక సంస్థలలో సలహాదారుగానూ, ఫిలింసెన్సార్ బోర్డు సభ్యులుగాను కొనసాగుతున్నారు. వీరికి ఎన్నో అవార్డులు వచ్చాయి. "సాహితీశిరోమణి" "సంచలన రచయిత్రి" అనే బిరుదులూ వచ్చాయి.

వెంకటేశ్వరరావు అట్లూరి శ్రీ వెంకటేశ్వరరావుగారు కృష్ణాజిల్లా వానపాముల గ్రామంలో 1928 సెప్టెంబరు 28వ తేదీన జన్మించారు. వీరి విద్యాభ్యాసము పదవ తరగతి వరకు గుడివాడ ఉన్నత పాఠశాలలో, ఇంటర్‌మీడియట్ హిందూ కళాశాల మచిలీ పట్నంలో జరిగింది. 1950లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి ఇంజనీరింగ్ డిగ్రీని పొందారు. శ్రీ రావుగారు గత 35 సంవత్సరముల నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి శాఖలో పలు శాఖలను నిర్వహిస్తూ, వివిధ

ప్రదేశాలలో పనిచేశారు. వీరు పరిపాలన, పారిశ్రామిక సంబంధాలు మరియు వ్యక్తిగత నిర్వహణ బాధ్యతలు మొదలగు పదవులు నిర్వహించి 1985లో చీఫ్ ఇంజనీరుగా రిటైర్ అయ్యారు.

శ్రీ రావుగారు మానవ వనరుల అభివృద్ధి శిక్షణా కార్యక్రమాలను చేపట్టినారు. ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు ఎన్నో శ్రీ రావుగారి సలహాలను పొందాయి, పొందుతున్నాయి.

శ్రీ వెంకటేశ్వరరావుగారు చేసిన సేవలకు గుర్తింపుగా "రిపబ్లిక్ డే నేషనల్ ఇన్‌వెన్షన్" అవార్డు లభించింది. అదే విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఆయన తెలుగులో రచించిన (పిల్లల) బాలల పుస్తకానికి అవార్డు లభించింది. తెలుగులోను ఇంగ్లీషులోనూ, 30 వరకు పుస్తకాలు రచించారు. అదే విధంగా ఎన్నో సాంకేతిక వ్యాసాలు మరియు సామాజిక, మానసిక, ప్రవర్తనలపై మరియు పారిశ్రామిక సంబంధాలు నిర్వహణపై వ్రాసిన అనేక వ్యాసాలు ఇంగ్లీష్, తెలుగు దిన, వార పత్రికలలో ప్రచురితమయ్యాయి.

శ్రీ రావుగారు జాతీయ, అంతర్జాతీయ కార్యక్రమాలలో పాల్గొని జపాన్, యు.కె., జర్మనీ, ఫ్రాన్స్, స్విడ్జర్లాండ్ దేశాలలో పర్యటించారు. హైదరాబాదు ఆల్విన్ సంస్థకు ఫైర్ మెన్‌గా కూడా పనిచేశారు.

డా॥ మురళీధరరావు యనగందుల:- రీడర్, అర్థశాస్త్ర విభాగము, నిజాం కళాశాల. జననం 8.12.1959 సంవత్సరము కాకతీయ విశ్వవిద్యాలయంలో, అర్థశాస్త్రంలో పోస్టుగ్రాడ్యుయేషన్, ఎం.ఫిల్. మరియు పిహెచ్.డి. దేశాల పారిశ్రామికార్థశాస్త్రమును ఒక ప్రత్యేక అధ్యయనాంశముగా తీసుకుని పరిశోధనలు జరుపుతున్నారు. డా॥ బి.ఆర్. అంబేడ్కర్ కళాశాల, హైదరాబాదులో ఆరు సంవత్సరములు అర్థశాస్త్ర అధ్యాపకునిగా పనిచేసి 1992 జనవరిలో రీడర్‌గా ఎంపికయ్యారు. దాదాపు నలభై పరిశోధనా వ్యాసాలు, రెండు పుస్తకాలు బి.ఎ.వారికి వ్రాశారు. వీరిదగ్గర పలువురు విద్యార్థులు పరిశోధనలు సాగిస్తున్నారు. ఐ.సి.ఎస్.ఎస్.ఆర్. న్యూఢిల్లీ వారి ఆర్థిక సహాయంతో రీసెర్చి ప్రాజెక్టు కూడా చేపట్టటం జరిగింది. అనేక జాతీయ పత్రికలకు మరియు సెమినార్లకు పత్రాలను సమర్పించారు.

బాల కొమరయ్య జె.:- 1968 జనవరి 6వ తేదీన జన్మించారు. 1991 నిజాం కళాశాల నుండి ఆర్థిక శాస్త్రంలో ఎం.ఏ. డిగ్రీని, 1993లో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి యం.ఫిల్. పట్టాను పొందారు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భద్రాచలం ఏజెన్సీ (గిరిజన) ప్రాంతంలోని 'గిరిజన ఆర్థిక వ్యవస్థపై సంస్థాపరమైన విత్త ప్రభావం' అనే అంశంపై పి.హెచ్.డి. పరిశోధనను సాగిస్తూ డా. బి.ఆర్. అంబేద్కర్ డిగ్రీ కళాశాలలో అర్థశాస్త్ర ఉపన్యాసకునిగా పనిచేస్తున్నారు. వీరు ఇండియన్ సొసైటీ ఆఫ్ లేబర్ ఎకనామిక్స్, ఇండియన్ ఎకనామిక్ అసోషియేషన్, ఏ.పి. ఎకనామిక్ అసోషియేషన్ రీజనల్ సైన్స్ అసోసియేషన్‌లో మెంబర్‌గా కొనసాగుతున్నారు. వీరి అనేక వ్యాసాలు జాతీయ స్థాయి, మాస, పక్ష పత్రికలలో ప్రచురించబడ్డాయి. పలు జాతీయ సమావేశాలలో పరిశోధనా పత్రాలను సమర్పించారు. అంతే కాకుండా అంతర్జాతీయ, జాతీయ, రాష్ట్ర స్థాయిలలో నిర్వహించబడ్డ అనేక ప్రాజెక్టులలో పరిశోధకునిగా, సహాయకునిగా పనిచేశారు. ఆయన డిగ్రీ స్థాయి నుండి "జాతీయ సేవా పథకం"లో వాలెంటరిగా, అనేక శిబిరాలలో చురుకుగా పాల్గొనడమే కాక, స్వచ్ఛంద సేవయైన హ్యూమన్ యాక్షన్ ఫర్ రూరల్ డెవలప్‌మెంట్ (హెచ్.ఎ.ఆర్.డి.) అభివృద్ధి కార్యక్రమాలలో కూడా చురుకుగా పాల్గొంటారు.

శ్రీ కేశవరావు కొత్తపల్లి:- 1924 నవంబరు 30వ తేదీన గుంటూరులో జన్మించారు. స్వగ్రామము గుంటూరు జిల్లాలోని తురిమెళ్ళ. 1949లో బి.ఎ. ఆనర్స్ డిగ్రీని పొందారు. కొంతకాలం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధన చేశారు. తిరుపతి, నిడుబ్రోలు, గుడివాడ కళాశాలల్లో లెక్చరరుగా పనిచేశారు. 1956 నుండి విజయవాడలో ఆంధ్ర లయోలా కాలేజీలో రాజకీయ శాస్త్ర విభాగానికి ప్రధాన అధ్యాపకులుగా పనిచేశారు. వీరి ఆధునిక భారత రాజకీయములు, తెలుగు అకాడమీచే పార్యగ్రంథంగా ప్రచురించబడింది. రాష్ట్ర శాంతి సంఘం ఉపాధ్యక్షులుగా కూడా సేవలు అందించి స్వర్గస్థులయ్యారు.

లక్ష్మణరెడ్డి వి.:- వృత్తిరీత్యా టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరులో అధ్యాపకులు. జన విజ్ఞాన వేదిక వ్యవస్థాపకుల్లో ఒకరు. ప్రస్తుతం భారతజ్ఞాన విజ్ఞాన సమితి రాష్ట్ర కార్యదర్శి. జన విజ్ఞాన వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షులు.

బాలసుబ్రహ్మణ్యం వి.:- ప్రభుత్వ జూనియర్ కళాశాల కుట్లూరు నెల్లూరు జిల్లాలో వృత్తిరీత్యా అధ్యాపకులు. జన విజ్ఞాన వేదిక రాష్ట్ర ప్రధాన కార్యదర్శి. భారత విజ్ఞాన సమితి జాతీయకమిటీ ఎగ్జిక్యూటివ్ మెంబరు. 1951 జూన్ 30వ తేదీన నెల్లూరు జిల్లా, మాముడూరం గ్రామంలో జన్మించారు. వీరి విద్యాభ్యాసం ఏర్పేడులోని శ్రీ వ్యాసాశ్రమంలో మరియు నెల్లూరు జిల్లాలోని విద్యానగర్‌లో, కడప జిల్లాలోని ప్రొద్దుటూరులో జరిగింది. వీరు విశారద విద్వాన్, ఎం.ఏ. పట్టభద్రులు. ప్రస్తుతం వీరు తెలుగు అధ్యాపకులుగా నెల్లూరులోని కె.వి.సి. ప్రభుత్వ జూనియర్ కళాశాలలో పనిచేస్తున్నారు.

శ్రీ శ్యామసుందరరావు అప్పరుసు:- వీరు మహబూబ్‌నగర్ జిల్లా వింజమూరులో 11-8-1929న జన్మించారు. బి.ఏ., బి.యిడి పట్టా పుచ్చుకొన్న వీరు గవర్నమెంటు

స్కూళ్ళలో చాలాకాలం ప్రధానోపాధ్యాయులుగానూ, కొంత కాలం స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్‌గానూ పనిచేశారు.

ఉపాధ్యాయ ఉద్యమంలో పనిచేస్తూ ఆంధ్రప్రదేశ్ స్టేట్ టీచర్స్ యూనియన్‌కు ప్రధానకార్యదర్శి, అధ్యక్షులుగానూ; ఆలిండియా సెకండరీ టీచర్స్ ఫెడరేషన్‌కు ప్రధానకార్యదర్శిగానూ కొంతకాలం పనిచేశారు. ప్రస్తుతం దానికి అధ్యక్షులుగా ఉంటున్నారు. ఉపాధ్యాయ ఉద్యమం పత్రికలు – మేధావి, ఏ.ఐ.యస్.టి.యఫ్. న్యూస్‌లెటర్, ప్రోగ్రెసివ్ న్యూస్ హెరాల్డ్ పత్రికలకు సంపాదకులుగా ఉన్నారు.

హంగేరీ, బల్గేరియా, స్వీడన్, బంగ్లాదేశ్, ఆస్ట్రేలియా, స్విట్జర్‌లాండ్ మొదలైన విదేశాలలో జరిగిన అంతర్జాతీయ విద్యా, ఉపాధ్యాయ సదస్సుల్లో పాల్గొని పత్రాలను సమర్పించారు. పలు పత్రికల్లో వ్యాసాలు రాశారు. 1978–84లలో ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ సభ్యులుగా ఉన్నారు. ప్రస్తుతం అనేక విద్యావిషయిక సంఘాల్లో సభ్యులుగా ఉంటూ హైదరాబాద్‌లో నివసిస్తున్నారు.

**రాఘవాచారి వి.పి.:–** వీరు 24–9–1920న మహబూబ్ నగర్ జిల్లా సిద్ధాపూర్‌లో జన్మించారు. యం.ఏ.,బి.యిడి. పట్టా పుచ్చుకొన్న వీరు ప్రధానోపాధ్యాయులుగా చాలా కాలం పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ స్టేట్ టీచర్స్ యూనియన్‌కు అధ్యక్షులుగా చాలాకాలం ఉన్నారు. 'మేధావి' పత్రికకు సంపాదకుడు. ప్రభుత్వ–ప్రభుత్వేతర విద్యావిషయిక సంఘాలలో సభ్యులుగా చాలా కృషి చేశారు. అనేక జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొన్నారు. అమెరికా, ఐరోపా, కెనడా, ఆస్ట్రేలియా వంటి అనేక దేశాలు పర్యటించారు.

విద్యార్థుల పాఠ్యపుస్తకరచన చేశారు. పత్రికల్లో వ్యాసాలు రాశారు. శాసనసభ్యులుగా 18 సంవత్సరాలున్నారు. మంచి వక్త. జాతీయ, అంతర్జాతీయ ఉపాధ్యాయ సంఘాల్లో పలు బాధ్యతలు నిర్వహించారు. విశ్వవిద్యాలయాల సెనేటు, సిండికేట్‌లలో సభ్యులుగా కొంతకాలం ఉన్నారు. వయోజన విద్యా ఉద్యమంలో కృషిచేస్తూ ప్రస్తుతం హైదరాబాద్‌లో విశ్రాంతి తీసుకొంటున్నారు.

**శ్రీ బాలస్వామి జి.:–** వీరు మహబూబ్‌నగర్ జిల్లాలో 1934లో జన్మించారు. అచ్చంపేట, హైదరాబాదులలో విద్యాభ్యాసం చేసి యం.యస్.సి. (బాటనీ) పట్టాపొందారు. 'లా' కూడా చదివారు. బి.యిడి. చేశారు. స్టేట్ టీచర్స్ యూనియన్‌కు కొంతకాలం ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. గవర్నమెంటు కాలేజీ టీచర్ల ఎసోసియేషన్‌కు చాలాకాలం ప్రధాన కార్యదర్శిగా పనిచేసి అధ్యాపకుల సమస్యల పరిష్కారానికి అనేక ఉద్యమాలను నిర్వహించారు. 1992 లో రీడర్‌గా పదవీ విరమణ చేశారు. ప్రస్తుతం అనిబిసెంటు ఉమెన్స్ డిగ్రీ కళాశాల హైదరాబాదులో ప్రిన్సిపాల్‌గా ఉంటున్నారు.

**శ్రీమతి కోటేశ్వరమ్మ వి.:–** 1925 మార్చి 5న జన్మించారు. 1945లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. డిగ్రీ, 1947లో బి.ఇడి. డిగ్రీ, 1972లో ఎం.ఏ. డిగ్రీ పొందారు. 7 సంవత్సరాలు నెల్లూరు కస్తూరీదేవి హైస్కూలులో ఉపాధ్యాయినిగా పనిచేశారు. తరువాత విజయవాడలో మాంటిసోరి స్కూల్ ఆధిపత్య బాధ్యతలు స్వీకరించి 16 సంవత్సరాలలో దానిని ఒక కళాశాలగా రూపొందించారు. ప్రస్తుతం ఆ మహిళా కళాశాల కరెస్పాండెంట్‌గా ఉన్నారు. సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డు సభ్యులుగా పనిచేశారు. 1971లో రాష్ట్రంలో ఉత్తమ ఉపాధ్యాయినిగా జాతీయ అవార్డు పొందారు. ఆంధ్రప్రదేశ్ మహిళా విద్యా సంఘ సభ్యులుగా నియమించబడ్డారు. 'లూయీపాశ్చర్' జీవితచరిత్ర 'భారతదేశంలో స్త్రీవిద్య' వీరి ముద్రిత గ్రంథాలు. నాగార్జున విశ్వవిద్యాలయ సెనేట్ మెంబరుగా ఉన్నారు.

**డా॥ విశ్వనాథరెడ్డి కేతు:–** పుట్టింది 1939వ సంవత్సరం జూలై 10వ తేదీ రంగశాయిపురం (కమలాపురం తాలూకా, కడపజిల్లా)లో. చదువు ఎర్రగుంట్ల ప్రొద్దుటూరు, కడప, తిరుపతిలో.

శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలో పిహెచ్.డి. పట్టా కోసం కడపజిల్లా గ్రామనామాలు అనే అంశం మీద పరిశోధన చేశారు. భారతదేశంలో స్థలనామాల పరిశోధనలో అగ్రగామి పరిశోధనా కృషి సలిపారు.

రాయలసీమ జిల్లాలలో జీవన విధానంలో వచ్చిన మార్పులనూ, వస్తున్న పరిణామాలనూ, బడుగు రైతుల జీవన పోరాటాన్ని చిత్రిస్తూ నలభైపైగా కథలు, రెండు నవలికలు వెలువరించారు. కన్నడ, మరాఠి, బెంగాలీ, హిందీ, రష్యన్, ఇంగ్లీష్ భాషల్లోకి కొన్ని కథలు అనూదితమయ్యాయి.

కొడవటిగంటి కుటుంబరావు రచనల సంకలనకర్తగా సంకలన విధానంలో మొట్టమొదట వస్తుగత వర్గీకరణ ప్రాతిపదికగా గల సంకలన విధానాన్ని తెలుగులో ప్రవేశపెట్టారు.

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యులుగా, డీన్‌గా, స్టూడెంట్ సర్వీసెస్ డైరెక్టర్‌గా పనిచేసి పదవీ విరమణ చేశారు. వీరి కథలకు, కేంద్రసాహిత్య అకాడమీ ఎవార్డు, శ్రీ పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం, ఇతర సంస్థల పురస్కారాలు లభించాయి. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడు. ఆధునిక భారతీయ భాషల పాఠ్య ప్రణాళికలో మౌలికమైన మార్పులకు దోహదం చేశారు. యునెస్కో, థాయ్‌లాండ్ సార్వత్రిక విశ్వవిద్యాలయాల సంయుక్త అధ్య

ర్యంలో జరిగిన దూర విద్యాబోధన సామాగ్రి రూపకల్పన శిక్షణా శిబిరంలో పాల్గొన్నారు.

**డా॥ రమణ కె.యస్.:-** వీరు చిత్తూరు జిల్లా కొండ రాజుకాల్వ గ్రామంలో 7-10-1956లో జన్మించారు. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయంనుండి యం.ఏ., పిహెచ్.డి. పట్టా పుచ్చుకొన్నారు. చలం మ్యూజింగ్స్‌పై విమర్శనాత్మక పరిశీలన వీరి సిద్ధాంతవ్యాసం. డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అసిస్టెంట్ ప్రొఫెసరుగా హైదరాబాద్‌లో పనిచేస్తున్నారు. వీరు ఇప్పటికి తమ కవితలను 3 సంపుటాలుగా ప్రచురించారు. 25కు పైగా కథలూ - అనేక వ్యాసాలూ, విమర్శలూ వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. సుమారు ఆరు అనువాద గ్రంథాలను వెలువర్చారు. చిత్తూరు జిల్లా రచయితల సంఘంలోనూ, రచయితల సహకార ప్రచురణల సంఘంలోనూ పలు బాధ్యతలు నిర్వహించారు. దేవదత్తం మాసపత్రికకు సంపాదకులుగానూ, సప్తగిరి మాసపత్రికకు ఉపసంపాదకులుగానూ కొంతకాలం పనిచేశారు.

**ఆచార్య జగన్నాథం పేర్వారం:-** వీరు 23-8-1934న వరంగల్లు జిల్లా ఖిలాషాపురంలో జన్మించారు. కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అధ్యాపకులుగా చేరి ఆచార్యులుగా పదవీ విరమణ చేశారు. పలు సాహితీ సంస్థల్లో ప్రధానబాధ్యతలు చేపట్టారు. అభ్యుదయ రచయితల సంఘంలో ఉన్నారు.

వృషభపురాణం, సాగర సంగీతం, గరుడపురాణం వంటి కావ్యాలను రాశారు. ఆరెజానపదుల గాథలు, గేయాలను సమీకరించి, సంపుటాలుగా ప్రచురించారు. అనేక గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. సాహిత్యం - సమాజం, రాజకీయాలు, సర్వాయిపాపన్న వంటి గ్రంథాలను రచించారు. వీరి కావ్యాలకు బహుమతులొచ్చాయి. అనేక జాతీయ సదస్సుల్లో పాల్గొని పత్రాలను సమర్పించారు. శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్‌గా పనిచేసి విశ్వవిద్యాలయ విస్తరణకు బాగా కృషి చేశారు. ప్రస్తుతం వరంగల్‌లో విశ్రాంతి తీసుకుంటున్నారు.

**శ్రీ కృష్ణారావు వి.వి.:-** 1946లో లక్నో విశ్వవిద్యాలయంనుండి విశ్వవిద్యాలయ ప్రప్రథమ శ్రేణిలో ఎం.ఎస్.సి. డిగ్రీ పొందారు. ఈ సందర్భంలో వారికి బంగారు పతకం లభించింది. విజయవాడలోని ఆంధ్ర లయోలా కళాశాలలో భౌతిక శాఖాధ్యక్షులుగా పనిచేసి పదవీ విరమణ చేశారు. కొంతకాలం ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాల అనుబంధ కళాశాలల ఉపాధ్యాయ సంఘం ఛైర్మన్‌గా ఉండి చనిపోయారు.

**శ్రీ సుదర్శన్ జి.:-** వీరు 6-3-1952 న జన్మించారు. పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్‌లో యం.ఏ., యం.ఫిల్., పిహెచ్.డి చేశారు. వరంగల్ కళాశాలలోనూ, హైదరాబాద్‌లోని 'సెస్'లోనూ కొంతకాలం పనిచేసి ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడర్‌గా ఉంటున్నారు. గ్రామీణ సమస్యలమీద, హరిజన సమస్యలమీద అనేక పత్రాలను రాశారు. సదస్సుల్లోనూ, చర్చాగోష్ఠుల్లోనూ పాల్గొని పలు పత్రాలను సమర్పించారు. విద్యార్థులకు పాఠ్యగ్రంథాల రచన సాగించారు. చాలా పత్రికల్లో అనేక సామాజిక, ఆర్థిక సమస్యలమీద తెలుగులోనూ, ఆంగ్లంలోనూ వ్యాసాలు రాశారు. వయోజన విద్యావిషయిక సంఘాల్లోనూ, పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ సంఘాల్లోనూ సభ్యులుగా ఉన్నారు. వీరి పర్యవేక్షణ క్రింద పలువురు యం.ఫిల్., పిహెచ్.డి. డిగ్రీలను పొందారు.

**శ్రీ శ్రీరామమూర్తి. పి.:-** నందిగామ తాలూకా కంచర్లలో జన్మించారు. వీరు బి.ఏ., బి.కాం., బి.ఇడి., డిగ్రీలను పొందారు. విద్యార్థి దశనుండే ప్రజాతంత్ర, కమ్యూనిస్టు ఉద్యమాలలో చురుకుగా పాల్గొన్నారు. కృష్ణాజిల్లా బోర్డు హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా చాలాకాలం పనిచేశారు. పిమ్మట ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాణానికి అంకితమైనారు. ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి శాసన మండలికి ఎన్నికై 1958 నుండి 1970 వరకు సభ్యులుగా వున్నారు. ప్రస్తుతం ఉపాధ్యాయ ఉద్యమంలో పనిచేస్తున్నారు. గత 2 దశాబ్దాలుగా మన రాష్ట్రంలోని ఉపాధ్యాయుల, ఉద్యోగుల పోరాటాలకు నాయకత్వం వహిస్తున్నారు.

**శ్రీ రామచంద్ర తిరుమల:-** వీరు 17-6-1913న అనంతపురం జిల్లా రాఘవం పల్లిలో జన్మించారు. తిరుపతి దేవస్థానం కళాశాలలోనూ, నెల్లూరు ఉభయవేద కళాశాలలోనూ, మద్రాసు మైలాపూర్ కళాశాలలోనూ విద్యాభ్యాసం చేసి 1934లో విద్వాన్ పరీక్ష తెలుగు - సంస్కృతాలలో పాసయ్యారు. మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగార్లతో కలిసి పనిచేశారు.

స్వాతంత్ర్య సమరయోధులు. స్కూలు విద్యార్థి దశ నుండి స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొని కాంగ్రెస్‌లో పలు బాధ్యతలను చిత్తూరు జిల్లాలో నిర్వహించారు. తిరుచిరాపల్లి రాయవెల్లూరులలో జైలుశిక్షలు అనుభవించారు.

లాహోర్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టులైబ్రరీలోనూ; హైదరాబాదు బిర్లా ఇన్‌స్టిట్యూట్ వ్రాతప్రతుల విభాగంలోనూ; రాష్ట్రప్రభుత్వ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలలోనూ; డెయిలీ టెలిగ్రాఫ్, మీజాన్, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలలోనూ; బాలల అకాడమీలోనూ పనిచేశారు. బెలూచిస్థాన్, క్వెట్టా, చమన్ ప్రాంతాలలో కొంతకాలం ఉపాధ్యాయులుగా పనిచేశారు. పరిశోధన పత్రికను కొద్దికాలం నిర్వహించారు.

మనలిపి పుట్టుపూర్వోత్తరాలు, నుడినానుడి, సాహితీ సుగతుని స్వగతం, హిందువుల పండుగలు – పర్వాలు, తెలుగుపత్రికలు సాహిత్యసేవ వంటి అనేక గ్రంథాలు రచించారు. పలు అవార్డులు – పురస్కారాలూ, బిరుదులూ వీరికి లభించాయి. డాక్టర్ అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం వీరికి గౌరవ డాక్టరేట్ బిరుదునిచ్చింది. మంచి పత్రికా రచయిత, హంపీ నుంచి హరప్పాదాక – అన్న స్వీయ చరిత్రను రాశారు. వీరు 12–10–1997న హైదరాబాదులో చనిపోయారు.

**ఆచార్య నిర్మల తమ్మారెడ్డి:–** వీరు కృష్ణాజిల్లాలోని బల్లిపర్రు గ్రామంలో 26–8–1940 తేదీన జన్మించారు. వీరు 1962 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. తెలుగులోనూ, 1967లో "నన్నెచోడ దేవ కుమారసంభవ పరిశీలనము" అన్న అంశం మీద పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టాను సంపాదించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. (లింగ్విస్టిక్స్) 1968 లో సంపాదించారు. వీరి ప్రత్యేకాధ్యయనాంశాలు భాషాశాస్త్రం – సాహిత్యాలు.

1969–1978 సంవత్సరాలలో వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో లెక్చరర్‌గానూ, 1978 నుండి 1985 వరకూ నాగార్జున విశ్వవిద్యాలయంలో రీడర్‌గానూ, పనిచేశారు. 1985 నుండి నేటివరకూ అదే విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు.

వీరు అనేక సదస్సుల్లో అధికారికంగా పలు పత్రాలను సమర్పించారు. మహిళా సమస్యల మీద అనేక వ్యాసాలు వ్రాశారు. వివిధ విశ్వవిద్యాలయాలలో ఉపన్యాసాలు ఇచ్చారు. వీరి నేతృత్వం క్రింద పలువురు యం.ఫిల్., పిహెచ్.డి., పట్టాలు పొందారు. "తెలుగు భాషా చరిత్ర తులనాత్మక పరిశీలన" అన్నది అచ్చైన వీరి మరో ప్రముఖ గ్రంథం.

**శ్రీ ఉమారాజేశ్వరరావు నిడమర్తి:–** 1923 అక్టోబరు 17 వ తేదీన పశ్చిమ గోదావరి జిల్లా నిడమర్రు గ్రామంలో జన్మించారు. 1939 లో కాకినాడలో జరిగిన రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మహాసభలో రాష్ట్ర కార్యవర్గ సభ్యులు. 1942వ సంవత్సరంలో వీరి తొలిఅనువాదాలు కమ్యూనిస్టు సూత్రాలు, చైనా ఎర్రసైన్యం వెలువడ్డాయి. ఆంధ్రలో తొలి సోషలిస్టు ప్రచురణాలయాల్లో ఒకటైన "ప్రగతి" సంపాదక వ్యవస్థాపకులలో ఒకరు. వీరి అనువాదాలు సుమారు 50, సాహిత్యం, మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలు అనువదించారు. వీరు సుమారు 100 వ్యాసాలు, గేయాలు రచించారు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శిగా, కోశాధికారిగా కొంతకాలం పనిచేశారు. ఆఫ్రో–ఆసియా రచయితల సంఘ జాతీయ కార్యవర్గసభ్యులు. ప్రదేశ్ శాఖ ప్రధాన కార్యదర్శి. 1976లో బాగ్దాద్‌లో జరిగిన ఆఫ్రో–ఆసియా రచయితల సంఘ కార్యవర్గ సమావేశానికి హాజరైన ఏకైక భారత ప్రతినిధి. 1967 నుండి విశాలాంధ్ర సాహిత్యానుబంధ సంబంధ సంపాదకులుగా ఉన్నారు. కొంత కాలం మాస్కోలోని ప్రగతి ప్రచురణాలయంలో ఉన్నారు ప్రస్తుతం బెంగుళూరులో ఉంటున్నారు.

**శ్రీ అంజనేయులు కుందుర్తి:–** శ్రీ అంజనేయులుగారు నయాగరా కవుల్లో ఒకరు. వీరు 1922 డిశంబరు 16వ తేదీన గుంటూరు జిల్లా నర్సరావుపేటలో జన్మించారు. బి.ఏ. పట్టం పొందారు. వీరు అనేక గేయ కవితా సంపుటాలను రచించారు. తెలంగాణా పోరాటంపై వీరు వ్రాసిన 'తెలంగాణా' కావ్యం అత్యంత ప్రసిద్ధమైనది. ప్రభుత్వ సమాచారశాఖలో ఆంధ్రప్రదేశ్ సంపాదకులుగా పనిచేశారు. అంజనేయులుగారు 1982లో స్వర్గస్థులైనారు.

**ఆచార్య నారాయణరెడ్డి సి.:–** వీరు 40 సంవత్సరాలకు పైగా కవితా వ్యాసంగంచేస్తూ సుమారు 40కి పైగా కావ్యాలనూ, వ్యాస సంకలనాలనూ రచించారు. సమగ్రత, స్పష్టత, నిష్పాక్షికతలతో కూడిన వీరి "ఆధునికాంధ్ర కవిత్వము – సంప్రదాయములు: ప్రయోగములు" అన్న సిద్ధాంత గ్రంథం పలుముద్రణలు పొంది విశేష గౌరవాన్ని సంతరించిపెట్టింది. వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడిగా చేరి ఆచార్యులుగా పదవీ విరమణ చేశారు. డా॥ అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయానికి, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గా పనిచేశారు.

మంచి వక్త, సినీ గేయ రచయిత, పలు సాహితీ సాంస్కృతిక సంస్థలతో సంబంధాలున్నాయి. అఖిలభారత అభ్యుదయ రచయితల సమాఖ్య అధ్యక్షవర్గసభ్యులు. విశేషంగా పలు దేశాల్లో పర్యటించారు. ప్రతిష్ఠాత్మకమైన జ్ఞానపీఠ అవార్డు వీరికి లభించింది. అనేక ఇతర పురస్కారాలుకూడా లభించాయి. పద్మశ్రీ బిరుదు గ్రహీత. వీరి రచనలపై పలువురు పరిశోధనలు.చేసి యం.ఫిల్., పిహెచ్.డి. పట్టాలను పుచ్చుకొన్నారు. వామపక్ష రాజకీయాభిమాని.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక వ్యవహార మండలి అధినేతగానూ, రాజ్యసభ సభ్యులుగానూ ఉన్నారు.

కరీంనగర్ జిల్లాలో 1931లో జన్మించారు.

**శ్రీ వెంకటరామయ్య తుమ్మల:–** ప్రముఖ అభ్యుదయ రచయిత. 1914 అక్టోబరు 6న గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని కొల్లూరు గ్రామంలో జన్మించారు. బెనారస్ విద్యాపీఠంలో విద్యాభ్యాసం. నవశక్తి, ప్రజాశక్తి పత్రికా సంపాదక వర్గ సభ్యులుగానూ, విశాలాంధ్ర దినపత్రికలో సహాయ సంపాదకులుగాను, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ సంపాదకులుగాను, "ఉదయిని" సాహిత్య పక్షపత్రిక సంపాదకులుగాను, 1948–51 లో కడలూరులో డిటెన్యూగాను,

1945–48లో 'అభ్యుదయ' సంపాదక వర్గ సభ్యులుగాను, 1952–53లో 'ఇండియన్ లిటరేచర్' పత్రికా సంపాదక సభ్యులుగాను, 1952–59 లో అభ్యుదయ సంపాదకులుగాను పనిచేశారు. రెండవ ప్రపంచయుద్ధ సమయంలో కమ్యూనిస్ట్ పార్టీ రహస్య పత్రిక 'స్వతంత్ర భారత్' సంపాదకులలో ఒకరు. కొంతకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ సభ్యులుగానూ, ఆంధ్రప్రదేశ్ అ.ర.సం. కార్యవర్గ సభ్యులుగానూ, కృష్ణాజిల్లా అ.ర.సం. అధ్యక్షులుగాను ఉన్నారు. ఎర్రజెండా, బెల్లీ మొదలగు గేయాలు, భారత కార్మికోద్యమ చరిత్ర, పాలస్టయిన్, మాప్లా తిరుగుబాటు రచించారు. 'మాతృహృదయం' (గోర్కీ 'అమ్మకు' అనుకరణం), మన లెనిన్, సోవియట్ యూనియన్ కమ్యూనిస్ట్ పార్టీ చరిత్ర, కారల్‌మార్క్స్ చరిత్ర మొదలైనవి అనువదించిన వీరు 1987లో మరణించారు.

శ్రీ రామమోహనరాయ్ కడియాల:- వీరు 11–4–1944 గుంటూరు జిల్లా సిరిపురంలో జన్మించారు. గుంటూరు హిందూకాలేజీ, ఆంధ్ర విశ్వ విద్యాలయం విశాఖపట్నంలలో విద్యాభ్యాసం చేశారు. తెలుగు సాహిత్యంలో యం.ఏ., పిహెచ్.డి. చేసిన వీరు ప్రస్తుతం గుంటూరు జె.కె.సి. కాలేజి తెలుగుశాఖలో రీడర్‌గా పనిచేస్తున్నారు.

వీరు వివిధ పత్రికలలో సుమారు 100 వ్యాసాలు రాశారు. పలు పత్రికలలో వెయ్యికి పైగా పుస్తక సమీక్షలు చేశారు. అచ్చైన వీరి రచనలు – తెలుగు కవితా వికాసం (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ 1982) కృష్ణశాస్త్రి కవితా వైభవం (యువభారతి ప్రచురణ) ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ ఇండియన్ లిటరేచర్ అన్న సాహిత్య అకాడమీ గ్రంథంలో 30 ఆంగ్ల వ్యాసాలు వ్రాశారు.

వీరి సిద్ధాంత వ్యాసం "సాహిత్యంలో కృషీవల జీవితం" అలాగే ఆంధ్ర సాహిత్యంపై మహాకవి శ్రీశ్రీ రచనల ప్రభావం అన్న అంశం మీద పరిశోధన చేశారు.

డా॥ సత్యనారాయణ ఎస్.వి.:- 16 అగస్టు 1954 లో హైదరాబాదు పాతనగరంలోని గౌలిపురాలో జన్మించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ. (తెలుగు), ఎం.ఎ. (ఇంగ్లీష్), ఎం.ఫిల్. డిగ్రీలను పొందారు. ఇదే విశ్వవిద్యాలయం నుండి 'తెలుగులో ఉద్యమగీతాలు' అనే అంశంపై పరిశోధనచేసి డాక్టరేట్ పట్టాను పొందారు. వీరు 'సరిగమలు, ఉద్యమం, జీవజ్వాల, రేఖాచిత్రాలు, యుద్ధం జరుగుతూనే ఉంది' మొదలగు గ్రంథాలను వెలువరించారు. అంతేకాకుండా "తెలుగులో ఉద్యమ గీతాలు" అనే తన పరిశోధన గ్రంథాన్ని 1991లో ప్రచురించారు. 1984లో "సోవియట్ యూనియన్"లో ఆరునెలలపాటు ఉన్నారు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అధ్యాపకులుగా సేవలు అందిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘంకు ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

డా॥ భారతి రావి:- 1975లో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి తెలుగులో డాక్టరేటు పట్టా తీసుకున్నారు. రాజబహద్దూర్ వెంకట రామరెడ్డి మహిళా కళాశాలలో తెలుగు ఉపన్యాసకురాలుగా పనిచేసి పదవీ విరమణ చేశారు. సాహిత్య వ్యాసాలు, వ్యాసతరంగాలు అన్న వ్యాస సంపుటాలు ప్రచురించారు.

డా॥ సీతాదేవి వాసిరెడ్డి:- వీరు గుంటూరు జిల్లా చేబ్రోలులో జన్మించారు. ఎం.ఎ. డిగ్రీని, సాహిత్యరత్న, డి.టి.ఎ. డిప్లొమా పొందారు. గతంలో రాష్ట్ర యువజన సర్వీసుల డిప్యూటీ డైరెక్టరుగా, బాలభవన్ డైరెక్టరుగా పనిచేశారు. ఈమె ప్రముఖ రచయిత్రి. 36 నవలలు, ఐదు కథానికల సంకలనాలు రచించారు. కొన్ని నవలలు ఇతర భాషలలోకి అనువదింపబడ్డాయి. ప్రజానాయకులు, మనస్సాక్షి, ఆమెకథ నవలలను చిత్రాలుగా రూపొందించారు. 1971లో సమత, 1981లో ఉరితాడు నవలలు సాహిత్య అకాడమీ అవార్డులు పొందాయి. 1976లో గృహలక్ష్మి స్వర్ణకమలం బహుమతిని, 1982లో వెంకన్న కళాపీఠం అవార్డును, 1983లో మాదిరెడ్డి స్మారక బంగారు పతకాన్ని పొందారు. వీరు ప్రాంతీయ సెన్సార్ బోర్డు సభ్యులుగా, జాతీయ చలన చిత్రాభివృద్ధి సంస్థ స్క్రిప్ట్ కమిటీ సభ్యులుగాకూడా ఉన్నారు.

శ్రీ సుబ్బరామయ్య పెద్దిభొట్ల:- 1938, డిశంబరు 15వ తేదీన జన్మించారు. ఒంగోలు, విజయవాడలలో విద్యాభ్యాసం పూర్తి చేసుకున్నారు. 1957 నుండి విజయవాడలోని ఆంధ్రా లయోలా కాలేజీలో తెలుగు విభాగంలో ఉద్యోగం చేస్తున్నారు. నయనతార, నీళ్ళు, ముసురు, పొగమంచు, మొదలగు కథాసంపుటాలు. ధృవతార, చేదుమాత్ర, అంగారతల్పం, ముక్తి, పంజరం మొదలగు నవలలు ప్రచురించారు. 100 కు పైగా కథలు 6 కుపైగా నవలలు వ్రాశారు. ప్రముఖ కథానికా, నవలా రచయిత. వీరు 1995 లో రావిశాస్త్రి సాహితీ పురస్కార అవార్డును అందుకున్నారు. వీరు 1996లో పదవీ విరమణ చేసి విజయవాడలో ఉంటున్నారు.

డా॥ లక్ష్మణరెడ్డి వి.:- చిత్తూరు జిల్లాలో జన్మించారు. ఎం.ఏ. పట్టభద్రులు. 'తెలుగు జర్నలిజం – అవతరణ వికాసాలు', 'చక్కని తెలుగు రాయటమెలా?', 'లెర్న్ తెలుగు' – అనే గ్రంథాలను ప్రచురించారు. వివిధ పత్రికలలో వందలాది వ్యాసాలు వీరివి ప్రచురితమయ్యాయి. ఇందిరాగాంధీ, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయాల కోసం పాఠాలు వ్రాశారు. ఇంకా 'తెలుగు, తమిళ భాషల తులనాత్మకత' అనే అంశంపై యు.జి.సి. ఆర్థిక సహాయంతో ఒక గ్రంథం రాశారు. "జై ఆంధ్ర" ఉద్యమకాలంలో ఆంధ్రుల

## 5. ఆంధ్రప్రదేశ్ రాజకీయ చరిత్ర - 721-764

# శాస్త్రవిజ్ఞానం - సామాజిక పరిణామం

ప్రొ॥ వి.వి.కృష్ణారావు, యం.యస్ సి., బి.యల్.,
అమెరికా సిగ్మాజై శాస్త్ర పరిశోధనాసంస్థ సభ్యులు

ఆధునిక విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక రంగాల్లో ప్రపంచం చాలా త్వరితంగా అభివృద్ధి చెందుతోంది. సామాజిక జీవితం, వ్యక్తిగత జీవితం కూడా అతి త్వరగా మార్పు చెందుతున్నాయి. మౌలికమైన ఆలోచనా ధోరణులు కూడా మారి నూతన అభిప్రాయాలు వ్యాప్తిలోకి వస్తున్నవి. అందుచేత యీ యుగం విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల యుగమని అభివర్ణిస్తున్నారు శాస్త్రవేత్తలు.

ప్రతి పది సంవత్సరాలకు విజ్ఞానం రెట్టింపవుతుందని అంచనాలు తెలుపుతున్నాయి. విజ్ఞానశాస్త్రం, సాంకేతిక శాస్త్రాన్ని ప్రోత్సహించి పారిశ్రామిక ఉత్పత్తికి దోహదం చేస్తుంది. దీని వలన జీవిత విధానం మారుతుంది. ఉత్పత్తి సాధనాలు మారి, వర్గాల మధ్య సంబంధాలు కొత్తరూపం ధరించుతాయి. ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు కూడా చివరకు మార్పు చెందుతాయి. ఆ విధంగా శాస్త్రవిజ్ఞానం ఒక విప్లవాత్మక శక్తి, చరిత్ర చోదక శక్తి. దీనిని విజ్ఞాన వేత్తలందరు ఈ రోజున ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు.

ప్రాచీన మానవుడు ఆహారాన్ని వెదకుకొనే దశ నుండి ఆహారాన్ని ఉత్పత్తి చేసుకునే దశకు రావడానికి ఆనాడున్న స్వల్ప విజ్ఞానంలో సాధ్యమైన సాంకేతిక సాధనాలే కారణం. విల్లు, అగ్నిని సృష్టించడం, నాగలి, కుండలు చేయడం, లోహాలను తయారు చేయడం మొదలైన సాంకేతిక సాధనాలతో మానవుడు తన వైజ్ఞానిక, సాంకేతిక జీవితాన్ని ఆరంభించాడు. దీని ఫలితంగా మానవుడు దేశ దిమ్మరి జీవితాన్నుండి స్థిర సమాజంలోకి మారాడు. ఈ సాధనాలతో తనకు కావలసిన దానికంటే ఎక్కువ ఉత్పత్తి చేసే శక్తిని మానవుడు సంతరించుకోగలిగాడు. దీనివలన బలవంతులు బలహీనులను దోచుకునే వ్యవస్థ ఏర్పడింది. యుద్ధాలలో ఓడిపోయినవారిని బానిసలుగా చేసి, వారిచేత ఊడిగం చేయించుకుని విలాసంగా బ్రతికే వర్గం రూపొందింది. అనగా సమాజంలో వర్గాలు తలెత్తినాయి అన్నమాట. ఆ తర్వాత చేతివృత్తులు కనిపెట్టి కొత్త వస్తువులను ఉత్పత్తి చేయడం వలన సమాజంలో వ్యాపార వర్గం ఒకటి కొత్తగా ఏర్పడి సమాజం యొక్క వర్గ స్వభావాన్ని మార్చింది. వ్యవసాయం అభివృద్ధి చెందిన తర్వాత సమాజం భూస్వామిక వ్యవస్థలోకి మారింది.

## 15 వ శతాబ్ది తర్వాత

ఈ దశ వరకు మానవుడు సాధించిన శాస్త్ర సాంకేతిక విజ్ఞానం చాల స్వల్పం. అయినప్పటికీ అది సాంఘిక పరిణామానికి దోహదం చేసింది. 15 వ శతాబ్దం ఆఖరినుండి ఒక నూతనయుగం ప్రారంభమయింది. అదే పారిశ్రామిక యుగం. ఇది 16, 17 శతాబ్దాలలో బాగా అభివృద్ధి చెంది, 18, 19 శతాబ్దాలలో ఉచ్ఛస్థాయికి చేరింది. సుమారు మూడు శతాబ్దాలలో జరిగిన వైజ్ఞానాభివృద్ధికి, తద్వారా వచ్చిన పారిశ్రామిక మార్పులకు శ్రీకారం పలికినవాడు మహా మేధావి, త్యాగ పురుషుడు, ఇటలీ దేశస్తుడయిన గెలీలియో.

ప్రకృతిని అవగాహన చేసుకోడానికి పాత పురాణాలు ఆధారం కాజాలవని, ప్రయోగముతో ప్రకృతి రహస్యాలను రాబట్టి విజ్ఞానాన్ని పెంపొందించుకోవాలని చెప్పి, విజ్ఞాన శాస్త్రానికొక కొత్త మలుపును కలిగించాడు గెలీలియో. టెలిస్కోపు అనే సాధనాన్ని నిర్మించి, గ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతవని నిరూపించాడు. కాని, సూర్యుడే భూమి చుట్టూ తిరుగుతాడని ఆ రోజుల్లో అనుకునేవారు. అందుచే గెలీలియో మతాధిపతులతో పేచీ పడి కారాగారాన్ని అనుభవించవలసి వచ్చింది. అయినా, ఆయన తుదివరకు తన నమ్మకాన్ని వీడకుండా ప్రయోగాలతో ఎన్నో శాస్త్రీయ సత్యాలను కనుగొని, నవీన విజ్ఞాన శాస్త్రానికి మూల పురుషుడయ్యాడు. విజ్ఞానశాస్త్ర చరిత్రలో గెలీలియో పేరు చిరస్మరణీయం.

మధ్యయుగంలో ప్రయోగాత్మక విధానం మరుగున పడిపోయింది. దీనికి కారణం అరిస్టాటిల్ లాంటి గ్రీకు తత్వవేత్తల వైఖరి కారణం. ప్రాచీన గ్రీకులు బానిసల సేవతో బ్రతికేవారు. అందుచేత అన్నిరకాలైన శారీరక శ్రమ నీచమనే భావం అనాడు ఉండేది. దాని ప్రభావం వల్ల మానసిక శ్రమతో కూడిన విజ్ఞాన పరిశోధనకు ప్రాధాన్య మిచ్చారు. శరీరశ్రమతో గూడిన ప్రయోగాత్మక పరిశోధనలను న్యూనతగా చూసే గ్రీకుల అలవాటు మధ్యయుగాలను చీకటి యుగంగా మార్చింది. ఈ పరిస్థితి నుండి శాస్త్రవిజ్ఞానాన్ని ప్రయోగపథంలోకి మళ్ళించారు గెలీలియో, రాబర్టు బోయిలు మొదలైనవారు. ఈ యుగంలో సమాజం మీద మత ప్రభావం ప్రముఖంగా ఉండేది. రాజులు, ప్రభుత్వాలు కూడ మతాధిపత్యానికి లోబడే ఉండేవారు.

17 వ శతాబ్దంలో గెలీలియో ప్రారంభించిన విజ్ఞానశాస్త్ర విప్లవం న్యూటన్ చేతిలో ప్రబలి 18, వ శతాబ్దంలో గరిష్ఠ స్థాయికి చేరింది. పరిశోధనలు తొందర తొందరగా జరిగినవి. ఈ పరిశోధనలు సాంకేతిక సాధనాలను నిర్మించడానికి దారి తీసినవి. ఈ సాంకేతిక సాధనాలే పారిశ్రామిక విప్లవానికి దారి తీశాయి.

పారిశ్రామిక విప్లవం 1776 లో జేమ్సు వాట్ అను ఆంగ్లేయునిచే కనిపెట్టబడిన అవిరి యంత్రంతో ప్రారంభయ్యింది. సాంకేతిక సాధనాలు సాంఘిక పరిస్థితిమీద అధారపడి ఉంటాయి. సమాజం యొక్క ఆర్థిక అవసరాలమీద, వర్గాల మధ్య గల ఆర్థిక సంబంధాల మీద అధారపడివుంటాయి. దీనికి అవిరి యంత్ర నిర్మాణమే ప్రబల తార్కాణం. 18 వ శతాబ్దంలో ఇంగ్లాండులోని బొగ్గు గనులు బొగ్గు త్రవ్వకం యెక్కువగుటచే లోతుకు పోయినవి. అందుచేత గనులలో నీరు వూరి బొగ్గు, త్రవ్వడానికి ఆటంకం కలుగుతుండేది. నీటిని తోడివేసి బొగ్గు త్రవ్వకాన్ని సాగించడమనేది ఒక పెద్ద సమస్యగా తయారయింది. ఆ దశలో అనేకమంది ఇంజనీర్లు, టెక్నీషియనులు ఈ సమస్యలను గురించి కృషి చేశారు. ఆ కృషిలో పాల్గొన్నవారిలో జేమ్సు వాట్ ఒకరు. ఆయన తయారు చేసిన నమూనా యంత్రమే అవిరి యంత్రంగా వాడుకలోనికి వచ్చింది. ఆ విధంగా అవిరి యంత్ర నిర్మాణం సమాజం ఎదుర్కొనే ఆర్థిక సమస్యల పరిష్కారంలో ఒక భాగమయ్యింది. సామాజిక సమస్యలకు, శాస్త్ర సాంకేతిక విజ్ఞానానికి గల సాన్నిహిత్యానికి యిది ఒక నిదర్శనం.

## పారిశ్రామిక విప్లవం

ఈవిధంగా ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం అతి త్వరగా అభివృద్ధి చెందింది. 1814 వ సంవత్సరంలో అవిరి యంత్రంతో మొట్టమొదటి రైలు బండిని స్టీవెన్ సన్ నడిపించాడు. 1825 లో రోడ్డుమీద నడిచే మొదటి యంత్రం తయారయింది. అవిరి యంత్రముతో నడిచే అవిరి ఓడ 1829 లో నిర్మించబడ్డది. ప్రయాణ సాధనాలే గాక యితర సాంకేతిక సాధనాలు కూడ కనుగొనబడినవి. 1876 లో అలెగ్జాండర్ గ్రహాంబెల్ కనిపెట్టిన టెలిఫోను వార్తా వాహనాన్ని ఎంతో మార్చివేసింది. అదేవిధంగా థామస్ అల్వా ఎడిసన్ 1880 లో కనిపెట్టిన విద్యుద్దీపం జీవితాన్ని ఎంత సుఖమయం చేసిందో వర్ణనాతీతం. విద్యుద్దీపాలు వచ్చినాక పరిశ్రమలలో రాత్రుళ్ళుకూడా పనిచేయడం సాధ్యపడింది. అవిధంగా వస్తూత్పత్తి యెంతో అధికమైంది. 1885 లో జార్జి యీస్ట్‌మన్ తయారుచేసిన ఫోటోగ్రఫి ఫిల్ముపల్ల వస్తువులయొక్క బింబాలను శాశ్వతరూపంలో కలిగియుండే అవకాశం కలిగింది. 1887 లో మార్కోని తీగలు లేకుండా వార్తలు దూరప్రాంతానికి పంపించే రేడియోను కనిపెట్టి ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచాడు. రైటు సోదరులు 1903 లో సాధ్యంచేసిన విమానయానం, జాన్ డన్‌లప్ 1921 లో కనుగొన్న రబ్బరు టైర్లు ప్రయాణ సౌలభ్యాన్ని ఎంతో అధికం చేశాయి. విమానాలు మొదటి ప్రపంచ యుద్ధంలో కీలకమయిన పాత్రను నిర్వహించాయి. పారాచూట్లు, తదితర పనులకు ఉపయోగించే పటుత్వంగల దారపు పీచు 1937 లో కనుగొనబడింది. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులలో చాలా సాధనాలు కనుగొనబడినవి. మొదటి జెట్ విమానం, మొట్టమొదటి కంప్యూటర్ కూడా 1942 లో కనుగొనబడ్డాయి. అదే సంవత్సరంలో యెన్‌రికో ఫెర్మీ చారిత్రాత్మకమైన అణువిచ్ఛేదనాన్ని సాధించాడు. రెండవ ప్రపంచ యుద్ధం తొందరగా పరిసమాప్తం కావడానికి కారణమైన ఆటంబాంబు యొక్క మూలసూత్రం అణు విచ్ఛేదనమే.

ఈ సాంకేతిక పరిణామాల వల్ల పారిశ్రామికాభివృద్ధి జరిగి పెట్టుబడిదారీ విధానం ప్రబలింది. సమాజం పెట్టుబడిదారులు, కార్మికులు అని స్థూలంగా రెండు వర్గాలుగా చీలిపోయింది. మొదటి వర్గం రెండో వర్గాన్ని దోపిడీచేసి తమ పెట్టుబడులను అభివృద్ధి చేసుకుంది. సాంకేతికాభివృద్ధి జరిగిన కొలదీ పెట్టుబడిదారీ విధానం కూడ అభివృద్ధి చెందినది. ప్రపంచాన్ని పెట్టుబడిదారీ దేశాలు పంచుకుని – వెనుకబడ్డ ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా లాంటి దేశాలను ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సు మొదలయిన పెట్టుబడిదారీ దేశాలు దోచుకోనారంభించాయి. దీనినే లెనిన్ సామ్రాజ్య వాదమని అభివర్ణించారు. రెండవ ప్రపంచయుద్ధానికి ముందు ఈ సామ్రాజ్యవాద దేశాల్లో ఇంగ్లాండు పెద్దదిగా వుండేది. దానికి రవి అస్తమించనంత సామ్రాజ్యముండేది. అందులో భారత దేశం చాలా ప్రధానమైంది.

17 వ శతాబ్దంలో ప్రారంభమైన వైజ్ఞానిక శకం, దాని వలన కలిగిన పారిశ్రామిక విప్లవం, ఆ రెంటివల్ల ఏర్పడిన నూతన పెట్టుబడిదారీ విధానం 19 వ శతాబ్దానంతరానికి ఒక పరాకాష్ట నందుకున్నవి. భౌతికశాస్త్ర విజ్ఞానం వల్ల పారిశ్రామికాభివృద్ధి ఒక పరిపూర్ణ దశకు వచ్చింది. డార్విన్ సిద్ధాంతంవల్ల హేతువాద దృక్పథం అంతిమ విజయం సాధించింది. కాని, విజ్ఞానశాస్త్ర పరిశోధనకూడా ఒక పరిణామక్రమంలోనే జరుగుతుంది. పాత విజ్ఞానం మారి కొత్త విజ్ఞానానికి చోటును కల్పించుతుంది. విజ్ఞానశాస్త్రంలో అంతకుముందున్న సిద్ధాంతాలు అసంపూర్ణమని, ఆ నియమాలను మెరుగుపరచి, మార్పులుచేసి, అవసరమైతే కొత్త మౌలికమార్పులను ప్రవేశపెట్టవలసిన అవసరం ఆసన్నమైందని విజ్ఞానశాస్త్రంలోని ప్రయోగాలవల్ల బహిర్గతమయింది.

## భౌతిక పరిమితులు

అదే విధంగా సాంకేతికంగా పాత పద్ధతులతో అభివృద్ధిని సాధించడం సాధ్యం కాదని కూడా సాంఘిక అవరోధాలవల్ల వ్యక్తమైంది. ప్రపంచంలో వున్న ఇంధనాలు (అనగా నూనె, బొగ్గు, సహజ వాయువు మొదలైనవి) అతిత్వరితంగా వినియోగింపబడుటచే యింకా 50 లేక అతి కష్టంమీద వంద సంవత్సరాల కంటే యెక్కువకాలం సరిపోవని తెలుస్తోంది. అదే విధంగా ముడి పదార్థాలుకూడా ప్రపంచ ప్రజల అవసరాలు తీర్చడానికి చాలినంతగా లేవనే అభిప్రాయం కూడా వెల్లడైంది. ఈ సమస్యల నన్నిటినీ సాంకేతికంగా పరిష్కరించుకోవలసిన పరిస్థితి 19 వ శతాబ్దానంతరానికి పొడసూపింది. అది రాను రాను 20 వ శతాబ్దంలో తీవ్రమైన స్థాయికి చేరింది.

ఈ రెండు సమస్యలతోబాటు ఆర్థిక వ్యవస్థకూడా ఒక క్లిష్టమైన పరిస్థితికి వచ్చింది. పెట్టుబడిదారీ విధానంలోని దోపిడి, దానితో పాటు ఆ వ్యవస్థలో వున్న అంతర్గత వైరుధ్యాలు ఒక తారస్థాయికి చేరినవి. అసలు సాంకేతికాభివృద్ధికి అనుకూలమైన వాతావరణం యీ ఆర్థిక విధానం కల్పించలేకపోగా ఉత్పత్తిని అరికట్టే దశకు చేరింది. కార్మికవర్గానికి, మధ్యతరగతికి యింకా యెక్కువ ఆర్థిక యిబ్బందులు కల్గించి, వారి జీవనస్థాయిని రోజు రోజుకి దిగజార్చుతూ వచ్చింది. ఈవిధంగా ఆర్థిక వ్యవస్థ, దాన్నిబట్టి రాజకీయ వ్యవస్థ కూడ ఒక పెద్ద మార్పును పొందడానికి పరిపక్వమై ఉన్నవి.

ఈవిధంగా విజ్ఞానశాస్త్రం, సాంకేతికాభివృద్ధి, సాంఘిక వ్యవస్థ – ఈ మూడు రంగాలు కూడా దాదాపు యేకకాలంలో పెద్ద స్థాయిలో ఒక నూతన పరిణామాన్ని పొందే స్థితికి రావడంలో చాలా ప్రాముఖ్యమున్నది. ఈ మూడు రంగాలు విడివిడిగా వుండవనీ, వాటి మధ్య సన్నిహిత సంబంధాలున్నవనీ, ఒకదాని నొకటి ప్రభావితం చేసుకుంటూ పరిణామం చెందుతాయనే చారిత్రక సత్యం విశదం అవుతుంది. విజ్ఞానవేత్తలు సాంఘిక శాస్త్రవేత్తలు కొందరు యీ విషయాన్ని నిర్ద్వంద్వంగా అంగీకరించరు. కాని చరిత్రను ఆధారంగా తీసుకునే వారందరూ అంగీకరించి తీరాలి.

## అణుయుగం

ఈ పరిణామ ఫలితంగా 19 వ శతాబ్దం ఆఖరి దశాబ్దంలోను, 20 వ శతాబ్దం ప్రథమభాగంలోనూ యీ మూడు వ్యవస్థలలోనూ బీటలు ఏర్పడి, కొత్త ప్రత్యామ్నాయాలకు కావలసిన బీజాలు ఏర్పడ్డవి. ఈ రోజున మనం అనుకునే అణుశక్తికి సంబంధించిన మొదటి ఆవిష్కరణ 1896 లో జరిగింది. అదే ప్రయోగ విజ్ఞానశాస్త్రంలో జె. జె. థాంసన్ అనే ఆంగ్ల శాస్త్రవేత్త సాధించిన ఎలక్ట్రాన్ ఆవిష్కరణ.

సైద్ధాంతిక విజ్ఞానశాస్త్రంలో రెండు మౌలికమైన నూతన ప్రతిపాదనలు ముందుకొచ్చినవి. 1900 సం॥ డిశంబరులో జర్మన్ శాస్త్రజ్ఞుడు – మాక్స్ ప్లాంక్ అతి సాహసంతో విప్లవాత్మకమైన క్వాంటం సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అదేవిధంగా 1905 లో, అనగా రష్యాలో మొదటి విప్లవం జరిగిన సంవత్సరంలో ఐన్‌స్టీన్ అతి క్లిష్టమైన సాపేక్ష సిద్ధాంతాన్ని వివరించాడు. ఈ రెండు సిద్ధాంతాలు విజ్ఞానశాస్త్ర రంగంలో కలిగించిన సంచలనం రష్యాలో 1917 లో జరిగిన సోషలిస్టు విప్లవం సామాజిక రంగంలో కలిగించిన మార్పుకు పోల్చదగింది.

సాంకేతికరంగంలో విప్లవంకూడా ఆరంభించింది. అయితే అది ఒక విధంగా 1942 లో ఫెర్మీ పరమాణు విచ్ఛేదనాన్ని సాధించిన తర్వాత ప్రారంభమయిందని చెప్పవచ్చు.

ఈ రెండు రంగాలలో వచ్చిన విప్లవంతోపాటు సమాజంలో కూడ విప్లవం వచ్చింది. 1905 లో రష్యాలో మొదటిసారిగా పెట్టుబడిదారీ విధానంమీద (భూస్వామిక విధానం మీదకూడా) కార్మిక వర్గం తిరుగుబాటు చేసింది. ఆ తర్వాత 1917 లో కార్మికులు పెట్టుబడిదారీ శక్తులను పడగొట్టి సోషలిస్టు వ్యవస్థకు పునాదులు వేశారు.

ఈ విధంగా సమాజం 20 వ శతాబ్దంలో ఒక నూతన దశలోకి ప్రవేశించింది. ఈ దశ ముందు ముందు అభివృద్ధి చెందడం చరిత్ర చెప్పే పాఠం. ఈ అభివృద్ధికి కొత్తగా ఏర్పడిన అణు సాంకేతిక విజ్ఞానం చోదకశక్తిగా పనిచేస్తుంది. ఫెర్మీ 1942 సం॥లో అణు విచ్ఛేదనం కనుగొన్న కొద్ది సంవత్సరాలకే, అనగా 1945 సం॥లో మొదటి ఆటంబాంబు ప్రేల్చబడింది. ఆ తర్వాత కొద్ది సంవత్సరాలకు హైడ్రోజన్ బాంబు నిర్మించబడింది. అణుశక్తిని ప్రప్రథమంగా 1954

సం॥లో రష్యా శాంతియుత అభివృద్ధికి వినియోగించింది. విద్యుచ్ఛక్తిని ఉత్పాదించుటకు, పర్వతాలను పేల్చుటకు – అఖరికి నదుల గమనాన్ని మార్చడానికి, మంచు కొండలను కరిగించడానికి కూడా వినియోగించి, మానవ జాతి జీవితాన్ని సుఖమయం చేసి భువిని దివిగాచేసే ఒక మహత్తర కృషికి మూల సాధనంగా శాస్త్ర విజ్ఞానాన్ని వాడుకుంటున్నారు.

## అంతరిక్ష యానం

అణుశక్తితో పాటు రష్యనులు అంతరిక్ష యానంలో కూడ ముందంజ వేసి మానవ మేధస్సు యొక్క మహోన్నతను చాటారు. 1957 సం॥లో మొదటి స్పుత్నిక్‌ని ప్రయోగించారు. ఆ తర్వాత అంతరిక్షంలోకి మానవుని పంపించడం, చంద్రమండలం యొక్క వెనుక భాగాన్ని ఫోటో తీయడం, అంతరిక్షంలో రెండు రాకెట్లను సంధానం చేయడం – కొన్ని పరిశోధనలు చేయడం; అఖరికి చంద్రమండలాన్ని మానవుడు స్వయంగా చూచి రావడం మొదలైన పరిణామాలు ఈ 15 సం॥లలో జరిగినవి. ఇతర గ్రహాలను చేరడానికి కూడ ప్రయత్నాలు జరుగుతున్నవి. ఆ గ్రహాల నుండి దూరంగా వున్న అంతరిక్షాన్ని నక్షత్రాలు, నెబ్యులాలు మొదలైన ఖగోళ వస్తువులను గూర్చిన పరిశోధనలు సాగించవచ్చును. విశ్వం యొక్క ముఖ్యమైన రహస్యాలను మరికొన్నిటిని మానవుడు అవగాహన చేసుకునే దశకు చేరుకున్నాడు. అదే విధంగా మానవ జన్మకు సంబంధించి జీనులు, క్రోమోజోములు, వాటి నిర్మాణం, లక్షణములు, జీవనానికి అవి ఏవిధంగా కారణభూతమవుతున్నాయి మొదలైన విషయాల మీద జీవ శాస్త్రజ్ఞులు ఎన్నో పరిశోధనలు చేస్తున్నారు. వైద్యశాస్త్రంలో మానవ శరీరంలోని అంగాలను మార్చు చెయ్యగల్గిన నైపుణ్యం సంపాదించబడింది.

ఈ విధంగా ఏర్పడిన నూతన సాంకేతిక పరిణామాలు మానవునకు అనేక కొత్త అవకాశాలు కల్పించుతున్నాయి. కాని, ఈ అవకాశాలను వినియోగించుకోడానికి కొత్త సాంఘిక వ్యవస్థ అవసరం. దోపిడీ లేనటువంటి వ్యవస్థ, వర్గ వైరుధ్యాలు లేనటువంటి సోషలిస్టు వ్యవస్థలో మాత్రమే ఆధునిక సాంకేతిక విజ్ఞానం యొక్క పూర్తి ఫలితాలను మానవుడు పొందగలుగుతాడు.

సోషలిస్టు సమాజం వ్యక్తుల యొక్క ఇష్టాఇష్టాలమీద ఆధారపడి లేదు. అది సామాజిక పరిణామంలో ఒక దశ. అది ఒక చారిత్రాత్మక అవశ్యకత అని చరిత్రను గతితార్కిక పరిశీలన చేసి కమ్యూనిస్టు సిద్ధాంత కర్త మార్క్స చాటిన సత్యం. సాంకేతిక పరిజ్ఞానం పారిశ్రామిక ఉత్పత్తిని పెంచుతుంది; కార్మికుల శ్రమశక్తిని అభివృద్ధి చేయగలదు. ఆ శ్రమశక్తిని ఎక్కువగా దోచుకునే అవకాశం పెట్టుబడిదార్లకు కలుగుతుంది. ఉత్పత్తి పెరుగుదల వల్ల మార్కెటులో మాంద్యం ఏర్పడే అవకాశం కూడా పెరుగుతుంది. పెట్టుబడి దారి వ్యవస్థలో గల అంతర్వైరుధ్యాలు తీవ్రమై, వ్యవస్థ కూలిపోయే స్థితి ఏర్పడి, సోషలిస్టు వ్యవస్థ స్థాపనకు దారి తీస్తుంది. ఈవిధంగా శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానం విప్లవ శక్తిగా సాంఘిక పరిణామానికి దోహదం చేస్తుంది.

## సోషలిస్టు భవిష్యత్తు

నేటి ప్రపంచ పరిస్థితి సోషలిస్టు వ్యవస్థను స్థాపించడానికి అనుకూలంగా వుంది. ప్రపంచ పెట్టుబడిదారీ విధానం సమాజ పురోభివృద్ధిని సాధించడంలో విఫలమైంది. స్వార్థంతో కూడిన లాభార్జనలను పెంచుకోడానికి, తమ వ్యవస్థను నిలబెట్టుకోడానికి ఎన్నో యత్నాలు పెట్టుబడిదారులు చేస్తున్నారు. కూలిపోయే వ్యవస్థను బలప్రయోగంతో ఫాసిస్టు పద్ధతులద్వారా నిలబెట్టుకోడానికి యత్నించడం వల్లనే రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. ఫాసిజాన్ని ఓడించి సోవియట్ యూనియన్ ప్రపంచాన్ని రక్షించింది. ఆర్థిక సంక్షోభం ప్రపంచంలో పెరుగుతోంది. ప్రపంచ ప్రజలు వారి జీవన ప్రమాణాలను అభివృద్ధి చేసుకునేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు. చాలినంత తిండి, ఉండటానికి ఇల్లు, సాంస్కృతికంగా అభివృద్ధి చెందటానికి అవసరమైన విశ్రాంతి మొదలైన అవకాశాలు ప్రతి మానవుడు పొందాలనే చైతన్యం ప్రపంచ వ్యాపితంగా ఏర్పడింది. నేడున్న విజ్ఞానాన్ని పూర్తిగా వినియోగించుకోగలిగితే మానవునకు కావలసిన అవసరాలను తీర్చుకొనడమే గాక, అంతకు మించిన ఉన్నత స్థాయిలో కూడ మానవుడు బ్రతికే అవకాశం వుంది. సోషలిస్టు దేశాలలో ప్రతి మనిషికి ఉద్యోగం, వైద్యం, ఆశ్రయం, విద్యా సౌకర్యాలు, సాంస్కృతికంగా అభివృద్ధి చెందే అవకాశాలు ఏర్పడినవి. రోజుకు 6 గంటలు మాత్రమే పనిచేసి, రేడియో, టెలివిజను మొదలైన ఆధునిక సౌకర్యాలతో సౌఖ్యంగా జీవించే అవకాశాలను వారు కలుగజేసుకోగలిగారు. ఇది ఇతర దేశాలలో కూడా సాధ్యమే.

శాస్త్ర విజ్ఞానం మానవుని నైతిక స్థాయిని కూడా పెంచుతుంది. విజ్ఞానం ద్వారా ప్రకృతి స్వభావాన్ని సామాజిక పరిణామ స్వభావాన్ని, అవగాహన చేసుకుని నైతికంగాను, మానసికంగాను తన స్థాయిని పెంచుకుని ఉన్నతమైన మేధావిగా రూపొందగలుగుతాడు. పెట్టుబడిదారీ విధానంలో ఇది కొద్దిమందికి మాత్రమే సాధ్యం. కాని, సోషలిస్టు సమాజంలో ప్రతివారికి ఈ అవకాశం కలుగుతుంది. సొంత ఆస్తిహక్కును తీసివేసి, అందరూ హాయిగా బ్రతికే అవకాశ మున్నప్పుడు దొంగతనం, ఖూనీలు, మోసాలు మొదలైన నేరాలు, అవినీతికరమైన పనులు చెయ్యవలసిన అవసరము ఏ వ్యక్తికీ ఏర్పడదు. అందుచే, ప్రతి మానవుడు నైతికంగా స్వచ్ఛమైన మనిషిగా రూపొందడానికి; యిబ్బం

దులు, మనోవ్యథలు లేకుండా స్వేచ్ఛాజీవనం చేయడానికి అవకాశం ఏర్పడుతుంది. అనగా ఒక నూతన మానవుడు సృష్టించబడతాడు. ఇది వాస్తవమేనని ప్రపంచంలో మూడవ వంతును ఆక్రమించిన సోషలిస్టు దేశాలలో ఉన్న ప్రజలు నిరూపించుకున్నారు.

విజ్ఞానశాస్త్రం, సాంకేతిక శాస్త్రాల ఫలితాన్ని పూర్తిగా పొందడం, వర్గరహితమైన సోషలిస్టు సమాజంలోనే సాధ్యం. ఉత్పత్తికి ఏర్పడే అవరోధాలు తొలగడమే గాక దానిని పెంపొందించే అవకాశాలు కూడా సోషలిస్టు సమాజంలో ఏర్పడగలవు. అసలు ఉత్పత్తిని పెంపొందించుకోగలిగితేనే ఆర్థికస్థాయి పెరిగి, సోషలిస్టు వ్యవస్థ పటిష్టం కాగలదు. ఈ విషయాన్ని సోవియట్ విప్లవ అధినేత ఏనాడో చెప్పారు. రాజ్యాధికారాన్ని విద్యుచ్ఛక్తితో జోడించినప్పుడే సోషలిజం వస్తుందని ఆయన చెప్పారు. ఆనాడు సాంకేతికరంగంలో విద్యుచ్ఛక్తి ప్రముఖమైన స్థానాన్ని కలిగి వుండడం, దానిని గూర్చి లెనిన్ ప్రస్తావించారు. ఈ రోజున అణుశక్తి అన్ని రంగాలలోను కూడ ఆవరిస్తోంది. అందుచేత దానిని విస్తృతంగా వినియోగించుకున్నట్లయితే మానవుడి అవసరాల నన్నిటినీ తీర్చే అవకాశం పూర్తిగా ఉంది. ఆ కృషి సోవియట్ దేశంలోను, యితర సోషలిస్టు దేశాలలోనూ జరుగుతోంది. సోషలిజమే గాక కమ్యూనిస్టు సమాజ స్థాపనకు కావలసిన పునాదులు కూడ వేయబడుతున్నవి. దీనిని సాధించడానికి విజ్ఞానశాస్త్రం, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధిని వ్యక్తులయొక్క కృషికి వదిలివేయకుండా ప్రభుత్వమే క్రమబద్ధంగా సామాజిక అవసరాలకు అనువుగా రూపొందించుతోంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో విజ్ఞానశాస్త్ర పరిశోధనకు – సాంకేతిక అణుప్రయోగాలకు మధ్య కొంత అంతరం ఉంటుంది. దాని ఫలితంగా సాంకేతికాభివృద్ధి కుంటుబడుతుంది. అదేవిధంగా సాంకేతిక విజ్ఞానానికి పారిశ్రామిక ఉత్పత్తికి మధ్య కూడ కొంత కాల విలంబన వుంటుంది. దాని ఫలితంగా సాంకేతిక విజ్ఞానం ఉత్పత్తికి పూర్తిగా వినియోగపడక పోవచ్చు. ఈ లోపాలు వర్గ రహిత సమాజంలో మాత్రమే సరిచేయడం సాధ్యమౌతుంది.

ఆంధ్రప్రదేశ్ సాంకేతికంగాను, పారిశ్రామికంగాను కొంత వరకు వెనుకబడివుంది. కాని, రాజకీయంగా చైతన్యంగల రాష్ట్రం. శాస్త్రవిజ్ఞానాన్ని, దాని ప్రయోజనాలను సామాన్య ప్రజలు గుర్తించడం అనేకవిధాల అవసరం. వారి రాజకీయ స్థాయి పెరగడానికి విజ్ఞానశాస్త్రం దోహదం చేస్తుంది. రాష్ట్రంలో శాస్త్ర పరిశోధనను, సాంకేతిక పరిశోధనను పెంపొందించవలసిన ఆవశ్యకత కూడ గుర్తించడం జరుగుతుంది. తద్వారా పారిశ్రామికాభివృద్ధిని సాధించవలసిన మార్గాలు సుగమమౌతవి. మనకున్న సహజ వనరులను పూర్తిగా వినియోగించుకొనడానికి, వ్యవసాయ రంగంలో మన స్థానాన్ని యింకా మెరుగుపరచుకోడానికి విజ్ఞాన శాస్త్రాన్ని గురించి, సాంకేతిక శాస్త్రాన్ని గురించి రైతులు, కార్మికులు, యితర సామాన్య ప్రజలు తెలుసుకోవడం చాలా అవసరం. అప్పుడే వారు రాష్ట్ర ఆర్థికాభివృద్ధి కార్యక్రమాల్లోను, జాతీయ ఆశయంగా యెంచుకున్న సోషలిస్టు సెక్యులర్ ప్రజాస్వామిక వ్యవస్థను స్థాపించుకోవడంలోను పూర్తి పాత్రను నిర్వహించగలుగుతారు.

## విజ్ఞానశాస్త్రం - సామాజికశాస్త్రం

రెండవ ప్రపంచయుద్ధానంతరం ప్రపంచ పరిణామం శరవేగంతో జరుగుతోంది. ఈ నేపథ్యంలో విజ్ఞానశాస్త్రానికి సామాజిక పరిణామానికి గల పరస్పర సంబంధం విస్పష్టంగా గోచరించుచున్నది.

వర్ధమాన దేశాలు రాజకీయంగా స్వాతంత్ర్యాన్ని పొందాయి. పొందిన తర్వాత అవి పరిశ్రమలను అభివృద్ధి చేసుకోడానికి కావలసిన శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని సంపాదించడానికి ఎంతో కృషి చేస్తున్నాయి. వైజ్ఞానికంగాను, రాజకీయంగా, అభివృద్ధి చెంది ప్రజాస్వామిక పద్ధతులను చేపట్టడానికి విద్యాభివృద్ధికి కూడా కృషి చేస్తున్నాయి. ఈ మార్పంతా ప్రపంచ వ్యాపితంగా వస్తున్న శాస్త్ర సాంకేతిక విజ్ఞాన విప్లవ ప్రభావమేననేది సువిదితం. పెరుగుతున్న జనాభాకి తగిన ఆరోగ్య ఆహార సదుపాయాలు కలుగజెయ్యడానికి సాంకేతిక ప్రగతి ఒకటే మార్గమని ఏకగ్రీవంగా ఆమోదించిన అంశం.

ఈ యుగం, కొద్ది సంవత్సరాల్లో అంతం అయ్యే శతాబ్దం యొక్క ముఖ్యలక్షణం అణుశక్తి ఆవిష్కరణ, అణుప్రయోగం అని చెప్పవచ్చు. అదే విధంగా రాజకీయంగా ఆలోచిస్తే సామ్రాజ్యవాదం, ఫాసిజం, కాపిటలిజానికి ప్రత్యామ్నాయంగా రూపొందిన సోషలిజం అని చెప్పవచ్చు. ఈ మూడు వ్యవస్థలు కూడ మారిపోయినాయి. సామ్రాజ్యవాదం ప్రత్యక్షరూపంలో నశించింది. ఫాసిజాన్ని యుద్ధంలో ఓడించారు. సోషలిజం స్వచ్ఛందంగా తన లోపాలను అవగాహన చేసుకుని మరొక వ్యవస్థలోకి మారి ఆర్థిక ప్రగతిని సాధించే నూతన ప్రయోగాన్ని చేపట్టింది. అదేవిధంగా అమెరికా కాపిటలిజం ఈ యుగంలో సాధించిన సాంకేతిక ప్రగతిని ఆకళింపు చేసుకుని తన వ్యవస్థ మనుగడను కొనసాగించుకోడానికి ప్రయత్నిస్తోంది. ఇప్పటివరకు ఆ వ్యవస్థ నిలబడగలిగింది. కాని, భవిష్యత్తులో ఈ రూపంలో కొనసాగడం మాత్రం అసాధ్యం. ఏవిధంగా ఏరూపంలోకి మారుతుందో రాబోయే చరిత్ర చెపుతుంది.

అణ్వాయుధాలు ఆర్థిక వ్యవస్థను, యుద్ధవ్యూహాన్ని, పరిసరాల ఆరోగ్య వాతావరణాన్ని మార్చాయి. యుద్ధం అనివార్యమనే స్థితినుండి ప్రపంచ నిరాయుధీకరణ మొక్కటే మానవజాతి మనుగడకు ప్రాతిపదిక అనే అవగాహన

అందరిలో అంకురించింది. ప్రపంచ స్థాయిలో ఇంధనపు వనరులు తరిగిపోతున్నవని భయపడేస్థితిలో అణుశక్తి ఒక పెద్ద వరంలాగా మానవుడికి లభ్యమైంది. ఎన్నో దేశాలు అణుశక్తిని అధీనం చేసుకోడానికి, ఆర్థిక ప్రగతిని సాధించ డానికి ప్రయత్నిస్తున్నాయి. ఈ విప్లవమంతా అణుశక్తి ప్రభావమేననేది సుస్పష్టం.

ఈ యుగాంతంలో రాబోయే యుగానికి, సమాజ జీవితానికి పట్టుగొమ్మగా ఉండే పరిణామాలు కూడ మనకు గోచరిస్తున్నాయి. అంతరిక్షయానం, కంప్యూటర్ల ప్రవేశం, జన్యుశాస్త్ర పరిశోధనలు 21 వ శతాబ్దంలో జరిగే ప్రగతికి ప్రాతిపదిక కాగలవు.

అంతేగాదు, ఈ శతాబ్దంలో మానసిక శాస్త్రం ఇప్పటివరకు మరుగునపడి ఉన్నా వెలుగులోకి రావడం మొదలైంది. దీనివలన మానవ మేధస్సుకున్న కొన్ని రహస్యాలు వెల్లడవ్వడం తథ్యం. ఈనాడు మూఢనమ్మకాలుగా ఉండే కొన్ని అతీంద్రియ శక్తులు శాస్త్రీయంగా సాధ్యమనే పరిస్థితులు రావచ్చు. సామాన్యుని ఆలోచనకు అనుభవానికి అందని కొన్ని అభిప్రాయాలు, అనుభూతులు విజ్ఞానశాస్త్ర పరిధుల్లోకి వస్తున్నాయి. అంతేగాక, నవీన విజ్ఞాన పరిశోధనల ఫలితంగా ఈ విశ్వం యొక్క అంతిమ రహస్యాలు, జీవం యొక్క మూలం మొదలైన విశ్వసృష్టి రహస్యాలు శాస్త్ర విజ్ఞానంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. భారతీయ తత్వశాస్త్రంలోని తాత్విక ఆలోచనా ధోరణులు ఈనాటి భౌతికశాస్త్రంలో ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతానికి, మాక్సు ప్లాంకు ప్రతిపాదించిన క్వాంటం సిద్ధాంతానికి దాపుగా వస్తునట్లనిపిస్తుంది. అందుకనే పాశ్చాత్య శాస్త్రవేత్తలు భారతీయ తత్వశాస్త్రాన్ని అధ్యయనం చెయ్యనారంభించారు. ప్రాచీన భారతీయ తత్వ శాస్త్రం, నవీన విజ్ఞానశాస్త్రం ఏకోన్ముఖంగా సాగుతున్నట్లనిపించుతోంది. ఇది తత్వశాస్త్రంలోను, విజ్ఞానశాస్త్రంలోను ఈనాడు ఏర్పడిన ఒక నూతన పరిస్థితి. ఇది 21 వ శతాబ్దానికి మరో ప్రాతిపదిక.

ఈ విధంగా రాబోయే శతాబ్దంలో మూడు ముఖ్య అంశాలు రూపొందబోతున్నాయి. ఈనాడు మొదలైన అంతరిక్షయానం, కంప్యూటర్ల అనుప్రయోగాలు అణుశక్తితో ఆర్థికవ్యవస్థను, వినిమయ వస్తువుల ఉత్పత్తిని అనూహ్యంగా మార్చుతాయి. తదనుగుణంగా ఈనాడున్న కాపిటలిస్టు వ్యవస్థ, సోషలిస్టు వ్యవస్థలో వచ్చిన మార్పుల నేపథ్యంలో మరొక ఆర్థిక రాజకీయ వ్యవస్థ రావడం తథ్యం. ఈ పరిణామంలో ఇప్పుడు ప్రబలుతున్న వినిమయ ధోరణిని నియంత్రించుతూ ఉన్నతస్థాయిలో సామాజిక విలువలు రూపొందుతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే – సమాజం సాంకేతిక విజ్ఞాన ప్రభావం వల్ల భౌతికంగాను, నైతికంగాను ఉన్నతస్థాయిలోకి మారబోతోంది. ఇదే 21 వ శతాబ్దం మానవాళికిచ్చే నూతన కానుక!

# ఆంధ్రదేశంలో తొలి శాస్త్ర పరిశోధనలు

డా॥ యం. గౌరీనాథశాస్త్రి

ఆంధ్రలో శాస్త్ర పరిశోధనలకు నాంది ప్రస్తావన చేసిన సంస్థ విజయనగర మహారాజ కళాశాల. శాస్త్ర పరిశోధనా కార్యక్రమానికి యీ కళాశాలలో 1918 ప్రాంతాల్లోనే అంకురార్పణ జరిగిందనడంలో సందేహం లేదు. 1921లో భౌతికశాస్త్ర విభాగాధిపతిగా ఉన్న డా: ఎ. యల్. నారాయణగారు భౌతిక శాస్త్ర విభాగంలో చిన్నసైజు 'రీసెర్చి లేబొరేటరీ' నిర్వహిస్తూండేవారు. డా: నారాయణగారు మహారాజావారి ఆర్థిక సహాయంతో రెండు చిన్న ప్రకాశ పరికరాలను సంపాదించారు. అందులో ఒకటి మధ్య తరహా క్వార్ట్జ్ వర్ణమాలాలేఖిని. మరొకటి స్థిరవిపథన వర్ణమాలా లేఖిని. ఈ పరికరాల సహాయంతో లేబొరేటరీలో దృగ్గోచర అల్ట్రా వైలెట్ ప్రాంతాలపై పరిశీలనలు జరిగాయి. మూలకాలు, కొన్ని సంయోగ పదార్థాలకు సంబంధించిన ఆవిరి యొక్క ఉద్గార మరియు శోషణ వర్ణమాలలకు సంబంధించిన కృషి వారు చేశారు.

ఈ రంగంలో ఆయన చేసిన మౌలిక పరిశోధనల ఫలితంగా 1924లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి మొట్టమొదటగా డి.యస్సి. పొందారు. డి.యస్సి. డిగ్రీ పొందిన మొదటి ఆంధ్రుడు డా: నారాయణ. కె. రంగమాధవరావుగారు కళాశాలలో అధ్యాపకులుగా పని చేస్తూనే డా: నారాయణగారి క్రింద రీసెర్చి స్కాలరుగా కళాశాల లేబొరేటరీలో పరిశోధనా కృషి జరిపి, మద్రాసు విశ్వ విద్యాలయం నుండి డి.యస్సి. డిగ్రీ పొందారు. తరువాత డా: రంగమాధవరావుగారు ఉన్నత పరిశోధనలకై ఇంగ్లాండు వెళ్ళి లండనులోని ఇంపీరియల్ శాస్త్ర కళాశాలలో ఏ.ఫౌలర్ వంటి ప్రఖ్యాత అణుభౌతిక శాస్త్ర వేత్తల క్రింద పని చేసి డి.యస్సి పొంది భారతదేశం తిరిగి వచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సైన్సు కళాశాలలో చేరి, అనేక మంది శాస్త్ర పరిశోధకులకు సలహాదారుగా వ్యవహరించారు.

1926 లో డా: నారాయణ కొడైకెనాల్‌లో గల ఖగోళ పరిశీలనా కేంద్రానికి అసిస్టెంట్ డైరెక్టరుగా వెళ్ళారు. మరి కొద్ది కాలానికి డా: రంగమాధవరావుగారు ఉన్నత పరిశోధనల కొరకు లండన్ వెళ్లారు. వీరిద్దరూ కళాశాల నుండి దూరంగా వెళ్లడంతో మహారాజ కళాశాలలో పరిశోధనా కార్యక్రమాలు కుంటుపడ్డాయి. నాటితొలిరోజుల్లో డాక్టరేట్లను తయారుచేసిన ఆ కొద్దిపాటి రెండు పరికరాలు యీనాటికీ కళాశాలలోని భౌతిక శాస్త్ర విభాగంలో భద్రపరచబడి, నిరుపయోగంగా ఉన్నాయి. భౌతిక శాస్త్ర ప్రయోగ శాలల్లో పరిశోధనలు జరిగే రోజుల్లోనే, డా: ఎచ్చూరి వెంకట రామయ్యగారి ఆధ్వర్యంలో రసాయన శాస్త్ర విభాగంలో కూడ పరిశోధనలు జరుగుతుండేవి. మహారాజ కళాశాలలో ఆ రోజుల్లో పని చేసిన రీసెర్చి స్కాలర్స్‌లో స్వర్గీయ ఆచార్య బి.హెచ్.యస్.వి. రాఘవరావు, టి.వరహాలు, ఏ.జానకిరామ్, జె.సి.కామేశ్వరరావు (భౌతికశాస్త్రం) మొదలగు వారుండేవారు.

కళాశాలలో 1918 లో సైన్సు అసోసియేషన్ ఏర్పాటు చేయబడి, ఒక త్రైమాసిక సైన్సు పత్రిక నడపబడుతుండేది.

డా: వై. వెంకటరామయ్య ప్యారిస్ విశ్వవిద్యాలయంలో డాక్టరేటు పొంది, భారతదేశం తిరిగివచ్చి మహారాజ కళాశాలలో గౌరవాచార్యులుగా పరిశోధనా కార్యక్రమాన్ని కొనసాగించారు. ఈయన కళాశాలలోని రసాయన ప్రయోగశాలల్లో చిన్నసైజు ఎలక్ట్రానిక్ లేబొరేటరిని ప్రారంభించారు. 1938 లో ఆయన చనిపోయిన తరువాత యీరంగంలోకూడ పరిశోధనలు ఆగిపోయాయి.

*అంతర్గ్రహ యాత్రలకై అన్వేషణ ఫలిస్తోంది, అజ్ఞేయం అన్నమాట అర్థచ్యుతి పొందుతోంది*
*వికసించే నవలోకపు మకుటధారి మానవుడని కోటికోట్ల గళాలెత్తి చాటుతోంది ఇతిహాసం!*

\- ఆగ్నేయ

# వాతావరణ, సముద్రశాస్త్ర పరిశోధనలు

ప్రొఫెసర్ వారణాశి పార్వతీ సుబ్రహ్మణ్యం

భారతదేశంలో విశ్వవిద్యాలయ స్థాయిలో వాతావరణ, సముద్రశాస్త్రాల అధ్యయనం, పరిశోధన మొట్ట మొదటిసారిగా మన ఆంధ్రప్రదేశ్‌లోనే ప్రారంభమయింది. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వాతావరణ, సాగరశాస్త్ర శాఖ పేరిట 1948వ సంవత్సరంలో స్థాపింపబడింది. నాటి నుండి నేటివరకు ఈ శాఖలో పరిశోధనా కృషి ప్రధానంగా రెండు విషయాలపై జరుగుతోంది. మొదటిది వాతావరణ శాస్త్రం, రెండోది భౌతిక సాగర విజ్ఞానం. ఈ శాస్త్ర విభాగాలకు సంబంధించిన విషయాలే అయిన రసాయినిక, జైవిక అంశాల మీద పరిశోధనా కృషి, విశ్వవిద్యాలయంలోని ఆయా యితర శాఖలలో సాగుతోంది.

వాతావరణ, సాగర శాస్త్రాల రెండింటి అధ్యయనం సర్వశక్తి ప్రదాత, పత్యక్ష దైవ స్వరూపుడయిన భానుని వికిరణ శక్తి నుండే ప్రారంభం అవుతుంది. ఈ శక్తి యొక్క తీవ్రత, వివిధ ఋతువులలోనూ, ప్రాంతాలలోను దాని వితరణ క్రమం, వాయు మండలంలోను, సముద్ర జలాలలోను దాని శోషణం, మొదలైన వివిధ అంశాలపై ఎంతో విజ్ఞాన సమాచారం ఇంతవరకు లభ్యమైనా, ఇతర విషయాలయిన సౌరశక్తి యొక్క వర్ణపట విశ్లేషణ, వితరణ, వివిధ తలాల నుండి దాని పరావర్తనం, వాయుమండలంలోని అనేక విధాలయిన రేణు, కణ, అణువుల ద్వారా అది చెందే అధిక్షేపణం (Scattering) మొదలైన భౌతిక ప్రక్రియల మీద వాతావరణ, భూతలాలపై ఉష్ణ వికిరణ సంతులనం మీద విశేషమైన కృషి జరుగుతోంది. ఈ పరిశోధనా అంశాలకు, ఫలితాలకు అనువర్తిత శాఖలయిన వ్యవసాయ, జల, పరిసర విజ్ఞాన శాస్త్రాలలో ఎంతో ప్రాముఖ్యం ఉంది.

ఉష్ణమండలంలోను, సమశీతోష్ణ ప్రాంతాలలోను, ధృవ మండలాలలోను, ఈ సౌరశక్తి ఒకే స్థాయిలోగాని, రీతిలోగాని వితరణం చెందకపోవడం వలన శక్తి అసమత్వ పరిస్థితులు ఉద్భవిస్తాయి. ఈ ఉష్ణశక్తి సంతులన సాధన ప్రయత్నంలోనే మనకు నిత్యమూ గోచరించే గాలులు, మేఘాలు, వర్షపాతము తుఫానులు మొదలైన వాతావరణ అలజడులు, సంక్షోభాలు సంభవిస్తుంటాయని రూఢి అయింది. అందువలన వాతావరణ జోస్యంలో ఉష్ణ సంతులన పరిశోధనకు ప్రత్యేక స్థానం ఉంది.

మనదేశానికి, పరిసర ప్రాంతాలకూ, వర్షపాతాన్ని కలుగచేసేవి రెండు ఋతుపవనాలు. వీనిలో అతి ముఖ్యమైన నైరుతి ఋతుపవనం జూన్ నుండి సెప్టెంబర్ వరకు వీస్తే, రెండవది ఈశాన్య ఋతుపవనం నవంబరు నుండి ఫిబ్రవరి వరకు వీస్తుంటుంది. అయితే ఈ రెండు ఋతుపవనాలు సంధి కాలాలలోను వేసవి, శీతాకాలంలోను, ఉష్ణమండల తుఫానులు, సమశీతోష్ణమండల తుఫానులు, పశ్చిమోత్తర గర్జన తుఫానులు (North Westers) శీతల, ఉష్ణ కెరటాలు (Heat and Cold Waves) మొదలైన సంక్షోభాలు కలుగుతూ దేశం యొక్క అనేక ప్రాంతాలను తికమక పెడుతూ ఉంటాయి. అయినా నీటి వనరుల దృష్ట్యా ఈ ఋతుపవనాలకు ఎంతో ప్రాధాన్యం ఉండడం వలన, వీటిమీద పరిశోధనా కృషి కేంద్రీకృతమై ఉంది. 1979లో అంతర్జాతీయంగా ప్రారంభం అయి జరిగిన మోనెక్స్ (Monex) అనే ఋతుపవన ప్రయోగం క్రింద ఎన్నో వాతావరణ సముద్ర శాస్త్ర ప్రేక్షణాంశాలు సేకరించబడి వాటి క్రోడీకరణ, విశ్లేషణ నేటికీ సాగుతున్నాయి. వీని ఫలితాల మూలాన ఋతుపవనాలకు సంబంధించిన అనేక ప్రక్రియలు, ఉప ప్రక్రియలు అవగాహన కావడమే కాక, మనదేశం మీద యీ పవనాల ప్రవేశం, నిష్క్రమణ, వర్షపాత వితరణ క్రమం, దాని పరిమాణాలలో మార్పులు మొదలైన అంశాల మీద యీ పవనాల ప్రవేశం, నిష్క్రమణ, వర్షపాత వితరణ క్రమం, దాని పరిమాణాలలో మార్పులు మొదలైన అంశాల మీద ఖచ్చితమైన సమాచారం తెలుసుకోవచ్చు. వీటియొక్క యావత్ప్రపంచ శాస్త్రీయ ప్రాముఖ్యం దృష్ట్యా అనేక యితర దేశాలు కూడ యీ కృషిని నిధులతోను, సాంకేతికపరంగాను ఎంతో ప్రోత్సహిస్తున్నాయి.

ముఖ్యంగా ఈ ఋతుపవన సంధి కాలాలయిన అక్టోబరు, నవంబర్ నెలలోను మే మాసంలోను సంభవించే అతి తీవ్రమైన పెను తుఫానులు మనదేశపు అనేక తీర ప్రాంతాలలో వరదలను, ఉప్పెనలను కలిగించి ఆందోళనలు కలుగజేస్తు ఉంటుంటాయి. ఈ తుఫానుల ఉద్భవం, ఉనికి, ప్రయాణ మార్గాలు, తీవ్రత మొదలైన లక్షణాలపై మనకు యింతవరకు ఎంతో సమాచారం లభించినా, వాటి ఇతర భౌతిక అంశాలయిన నిర్మాణం, మేఘ సముదాయం, వాటినుండి కలిగే వర్షపాత స్వభావం మొదలయిన కీలక విషయాలపై పరిశోధనా కృషి ద్విగుణీకృతంగా జరుగుతోంది. దీనికి మన భారతదేశపు భూస్థిర ఉపగ్రహం అయిన ఇన్సాట్–1బి కూడ ఎన్నో వాతావరణ అంశాలను అందిస్తూ ఎంతో సహకరిస్తున్నది. ఇది మనకూ మనదేశానికే కాక యావత్ప్రపంచానికి కూడ ఎంతో గర్వకారణం.

1963వ సంవత్సర ప్రాంతంలో మన హిందూ మహా సముద్రంపై జరిగిన అంతర్జాతీయ హిందూ మహా సముద్ర ప్రేక్షణ (International Indian ocean expedition) కార్యక్రమం మొదలుకొని మనకు లభ్యమైన సమాచారాన్ని బట్టి నైఋతి ఋతుపవనం యొక్క ఉద్భవ ప్రదేశాలు, అవి మనదేశం మీద వీచే క్రమం, దానివలన కలిగే వర్షపాతపు పరిమాణం, దాని విస్తరణ, ఆ సమయాలలో మన పరిసర, సమీప సముద్ర ప్రాంతాలలో జనించి, సంచరించే వివిధ వాయుగుండాల స్వరూప స్వభావాలపై ఆధారపడి ఉంటాయని నిర్ధారణ అయింది. బంగాళాఖాతపు శిరోభాగంలో సాధారణంగా ఈ కాలంలో ఏర్పడే వాయుగుండాలలోని మేఘావరణం, గాలులు, వర్షపాతం, ఉత్తరభాగంలో కంటె దక్షిణభాగంలో అధికంగా ఉంటాయని కూడ తేలింది. అంతేగాక ఉపగ్రహ సమాచారాన్ని బట్టి ఈ గుండాలలోని వాయుపీడన, నిర్మాణక్రమం మొదలైనవి కూడ సక్రమ పద్ధతిలో గాక అపక్రమంలో ఉంటాయని, ఉత్తరభాగంలో ఒత్తుగాను, దక్షిణ భాగాలలో పలుచగాను కనిపిస్తాయని తెలిసింది. ఈ అపక్రమ నిర్మాణమే బహుశా యీ వాయుగుండాలు తీరాన్ని దాటిన కొద్దిగంటలలోనే బలహీనపడి అంతరించిపోవడానికి కారణం కావచ్చునని వాతావరణ శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. ఈ ప్రాంతాలలోని భూమియొక్క, సముద్రాల యొక్క భౌతిక, భౌగోళిక స్వరూపం, విస్తరణకూడ యీ విషయంలో కొంతవరకు ప్రభావాన్ని కలిగియుండవచ్చు.

నైఋతి ఋతుపవన పరిస్థితులు ప్రాతిపదికగా ఉష్ణ మండలాలలోని సాధారణ వాయు ప్రసరణకు ఒక పథకం సూచించబడింది. ఈ మండలాలు శీతోష్ణ స్థితిలోనే ఒక ప్రధాన అంశమైన ప్రాక్పవన ప్రవాహం (Easterly jet stream) యొక్క అక్షం దక్షిణాన కంటె ఉత్తరాన ఎక్కువ యెత్తులో ఉన్నట్టు కనుగొనబడింది. ఆ కారణంగానే ఉష్ణమండల ట్రోపోపాజ్ (Tropical tropopause) దక్షిణాన మామూలు కంటె తక్కువ యెత్తులో ఉంటుంది. ట్రోపోపాజ్‌లోని అంతరాయాలు, ఈ ప్రవాహోక్షం వద్దనే ఏర్పడుతుంటాయని వెల్లడయింది. వీటిగుండానే ట్రోపో ఆవరణం (Troposphere) లోని ఉష్ణం, తేమ, మొదలైన వాయుమండల ధర్మాలు స్ట్రేటో ఆవరణం (Strato sphere) లోనికి కొనిపోతాయని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అదే విధంగా ఉష్ణమండలాలనుండి సమశీతోష్ణ మండలాలకు, అక్కడ నుండి ఉష్ణమండలాలకు వాయు ప్రవాహాల ద్వారానే పరస్పర రవాణా వివిధ తలాలలో జరుగుతుంటుందని కనుగొనబడింది.

ఉష్ణమండల మేఘాలు, వర్షపాతం యొక్క భౌతిక ధర్మాలు స్వభావాలపై ఆసక్తికరాలయిన విషయాలు, ఇటీవలి పరిశోధనల మూలంగా వెలుగులోకి వచ్చాయి. ద్రవీభవన కేంద్రకాల (Condensation Nuclei) ఉత్పత్తి మీదను, ఊర్ధ్వ, అధోతలాలలో, ఋతుక్రమాన్ననుసరించి వాటి వితరణపైనమా ఎంతో కృషి జరిగింది. తీరప్రాంతాలలో లవణ కణాల ఉత్పత్తికి సముద్ర కెరటాల భంగం కారణమనిన్నీ వాయు ప్రసరణకు అనుగుణంగా ఈ కణాలు దూర ప్రాంతాలకు కొనిపోబడుతుంటాయని తేలింది. తీరరేఖకు లంబదిశలో వీచే సముద్ర పవనరాసులవలన యివి అంతస్థలీయంగా కొనిపోబడి దూరం అధికమైన కొద్దీ నేలమీదకు పతనం చెందుతాయి. అతి చిన్న రేణువులు మాత్రం ఈ అవపాతాన్ని తట్టుకొని వాతావరణంలో నిలిచి, పరిస్థితులు అనుకూలించినపుడు ద్రవీభవనానికి తోడ్పడి, మేఘంలాగను, తదుపరి వర్ష బిందువులుగాను మనకు గోచరిస్తాయి. ఈ వర్షపాతం యొక్క పరిమాణానికి, తీవ్రతకు, రాడారు ప్రతిబింబాలకు మధ్యగల సంబంధాలు రాడార్ వాతావరణ అధ్యయనం ద్వారా ధృవీకరింపబడ్డాయి.

వాతావరణ మూలకాలకు వాయుమండల కాలుష్యాలకు వాయుమండల విద్యుత్ క్షేత్రంపై గల ప్రభావాన్ని అవగాహన చేసుకునే సంకల్పంతో, నేలలోని విద్యుత్ ప్రవాహాలు, బిందు నిరావేశిత విద్యుత్ప్రవాహాలు, విద్యుచ్ఛక్తి ప్రవణతలు మొదలైన విద్యుదంశాలను పరికరాల ద్వారా కొలవడం విరివిగా సాగుతోంది. నీటియొక్క భౌతిక స్థితి మార్పులవల్ల కూడా విద్యుదావేశ ఉద్భవం జరుగవచ్చుననే అభిప్రాయంపై కూడ పరిశోధనలు కొనసాగుతున్నాయి. వీటన్నిటికీ, గర్జన తుఫానుల విద్యుదీకరణ, మెరుపుల జననం, నిర్మాణం, వాటిలో ప్రవహించే విద్యుచ్ఛక్తి పరిమాణం మొదలయిన అంశాలన్నీ, పరిసరాలపై అవి కలిగించే ఫలితాలు ఆధారపడి ఉంటాయి. అందువలన భూమిమీద నిర్మింపబడే భవనాలు, విద్యుత్సరఫరా కేంద్రాలు, పరిరక్షణ యొక్క సాంకేతిక వివరాలు నిర్ణయించుకోవచ్చు.

అతిత్వరగా నేడు నగరీకరణ (Urbanization) పారిశ్రామి

కీకరణ (Industrialization) చెందుతున్న అనేక ప్రాంతాలకు పరిసరాల కాలుష్యపు బెడద కూడ అధికం అయిపోయింది. వివిధ పారిశ్రామిక కేంద్రాల నుండి, కార్ఖానాల నుండి వెడలే వాయు కాలుష్యాల స్థాయి, వాటి భౌతిక రసాయనిక స్వభావం వేర్వేరు ఋతువులలో అవి చెందే మార్పులు, వితరణ, విస్తరణ మొదలైన విషయాలపై పరిశోధన తీవ్రంగ సాగుతున్నాయి. కేంద్రప్రభుత్వపు పరిసరాల శాఖ, శాస్త్రీయ సాంకేతిక శాఖలనుండి యీ పరిశోధనా కార్యక్రమాలకు పరస్పర శాఖాంతరాల ప్రాతిపదికమీద నిధుల సహాయం లభిస్తోంది. అదివరకు విశ్వవిద్యాలయ నిధుల సంఘం సహాయంతో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో నిర్వహింపబడిన విశాఖపట్నపు నగర వాతావరణం కాలుష్యాలపై ప్రేక్షణా కృషి ముగిసి నగర వాతావరణ రీతులపైనను, వాటి మార్పుల పైనను, కాలుష్యాల వర్గీకరణ వాటి ప్రభావాలపైనను ఆసక్తిదాయకమైన విషయాలు వెల్లడవడమేగాక, నగర నివాస నిర్మాణాల విషయంలోను, పరిశ్రమల స్థాపన విషయంలోను, కాలుష్యాల సాంద్రత, స్వభావాలకు గల ప్రత్యేక ప్రభావానికి నిదర్శనగా అనేక నూతన అనుభవాలు కనుగొనబడ్డాయి.

మానవ ఆరోగ్యానికి, శీతోష్ణస్థితికి స్వల్పకాలిక వాతావరణ పరిస్థితులకు గల సన్నిహిత సంబంధం చిరకాలం నాటిది. వాతావరవణ రీతుల దృష్ట్యా దేశంలోని ఏయే ప్రాంతాలు ఏయే ఋతువులలో ఎటువంటి ఆరామస్థితి (Comfort Condition) ని కలిగి ఉంటాయో, అవి మన దేహ, మానసిక ఆరోగ్యానికి ఎంతవరకు ప్రయోజనకరంగా ఉంటాయి అనే విషయాలపై ఆంధ్ర విశ్వవిద్యాలయంలోనే దేశంలో మొట్టమొదటగా పరిశోధనలు చేపట్టడం జరిగింది. అనేక అంటువ్యాధులు ప్రబలడం, వాటి సోకుడు తీవ్రత (Virulence) విస్తరణక్రమం కూడ వాతావరణ పరిస్థితులపై ఆధారపడి ఉంటాయి. ఆయా వ్యాధుల నివారణకు, చికిత్సకు, చికిత్సాలయాల (Sanatoria) స్థాపనకు ఈ పరిశోధనా ఫలితాలు అత్యంత ఉపయోగకరమైనవి. ఈ వ్యాధులు మనకు గాలి ద్వారాను, నీటి ద్వారాను లేక ఆహారం ద్వారాను ఒక ప్రాంతంనుండి ఇంకొక ప్రాంతానికి, ఒకరిద్వారా ఇంకొకరికీ సంక్రమించినా, వాటి తీవ్రతకు, విస్తరణకూ, వాతావరణ పరిస్థితులకూ సమీప సంబంధాలు ఉన్నవనే అంశం ఈ పరిశోధనలో స్పష్టంగా నిరూపింపబడింది.

మనకు, మన మనుగడకూ ఆహారం, నీరు ఎంత అవసరమో, వాటికి వాతావరణ సానుకూలత కూడ అంతకంటె ఎంతో ఎక్కువ అవసరం. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వాతావరణశాఖలో వ్యవసాయ వాతావరణ శాస్త్రం (Agricultural Meteorology) జల వాతావరణ శాస్త్రం (Hydro Meteorlogy) ఎంతో ప్రధానమైన విభాగాలుగా ప్రారంభమై అనేక విధాలుగా ఎన్నో దిశలలో అభివృద్ధిచెందాయి. వివిధ వాతావరణ మూలకాలకు, పాడిపంటల విస్తరణకు, నాణ్యతకు గల సన్నిహిత బాంధవ్యాలను స్థూలంగా పరిశీలించడం జరుగుతోంది. పంట చేల జీవితక్రమంలోని వివిధ దశలలో సారశక్తి గల ప్రభావం మీద గాలి ఉష్ణోగ్రతకూ తేమకూ చేలమీద వాటిని సంక్షోభపరిచే క్రిమి కీటకాదుల యొక్క జీవిత క్రమంమీద, గల ప్రభావంపైన తీవ్రమైన పరిశోధనా కృషి జరుగుతోంది. ఈ పీడల నివారణకు, నిర్మూలనకు ఈ శోధనా ఫలితాలు ఎన్నో విధాల తోడ్పడుతున్నాయి. సస్యాలకు సంబంధించిన ఋతుచక్ర శాస్త్రం (phenology) మీద కూడ కృషి కొద్దిగా జరుగుతోంది. దీనినింకనూ అభివృద్ధిచేయడం ద్వారాను, ఇతర పంటచేలకు విస్తరింపచేయడం ద్వారాను, పైర్లనాటుడు, మార్పిడి, పరిపక్వత, కోత మొదలైన కార్యక్రమాల యొక్క కచ్చితమైన సమయాల నిర్ణయానికి, అందుకు కావలసిన యంత్రాంగం, సామగ్రి, కార్మిక స్థోమత, రవాణా యేర్పాట్లు, సౌకర్యాలు మొదలైనవి సమకూర్చుకోడానికి కూడా ఎన్నో ప్రయోజనాలు సిద్ధించగలవు. ధాన్యసేకరణ, దానినుండి బియ్యం తదితర దినుసుల తయారీ, చమురు గింజలనుండి నూనె ఉత్పత్తి మొదలైన కార్యక్రమాలలో కూడా యీ శాస్త్ర పరిశోధనలు ఎంతో ఉపయోగపడగలవు.

వ్యవసాయానికే గాక, నీటి వనరుల అభివృద్ధి నీటి సరఫరా వంటి అతిముఖ్యమైన సాంకేతిక అంశాలకు సంబంధించి, ఇటీవల ప్రారంభమై ప్రాముఖ్యంలోకి వచ్చిన వాతావరణ విజ్ఞానం జల సంతులనం (Water Balance). ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అనువర్తిత శీతోష్ణస్థితిశాస్త్రం (Applied Climatology)లో పరిశోధనలు ఈ జల సంతులనంతోనే 1954వ సంవత్సరంలో ప్రారంభం అయ్యాయి. ఈ కృషిలో మొదటి శోధనా విషయ శీతోష్ణ స్థితుల వర్గీకరణం (Climatic Classification) అయి ఆ తరువాత జల విజ్ఞానశాస్త్రంలో నీటివనరుల గుర్తింపు, అంచనాలోను, వినియోగంలోనూ వ్యవసాయ వాతావరణశాస్త్రంలో అనేక సమస్యల పరిష్కారానికి, ఈ జల సంతులన అధ్యయనానికీ, పరిశోధనలకూ ఎంతో ప్రాధాన్యం ప్రాముఖ్యం ఉన్నాయి. ఏదైనా ప్రాంతంలోని వర్షపాతం, బాష్పీభవనం (Evaporation) యొక్క బాష్పోత్సర్జనం (Transpiration) యొక్క పరిమాణాలుగాని లభిస్తే, ఆ ప్రాంతంలోని యదార్థ నీటివ్యయం, నేలలో నిల్వచేయబడే నీటి పరిమాణం, నీటికొరత, నీటి సమృద్ధి, తద్వారా నదులలోను, సరస్సులలోను ఇతర జలాశయాలలోను అను నిత్యమూ చేరుతుండే నీటి యొక్క మొత్తం ఘనపరిమాణం, మొదలగు అనేక వివరాలను జలసంతులన పద్ధతుల మూలాన్ని కనుక్కోవచ్చు. ఈ సందర్భంలోనే వర్షపాతం ద్వారా నేలలోకి యింకి పైపొరలలో నిల్వ ఉండే నీరు, నేలపొరల ద్వారా భూగర్భ నిమ్న తలాలలోకి ప్రవేశించే నీటి పరిమాణం, నేలయొక్క అధోతలాలనుండి

నదులకు, సరస్సులకూ, సముద్రాలకు నిత్యమూ ప్రవహించే నీరు మొదలైన జలసంతులన మూలకాలను కనుక్కోడానికి శాస్త్రీయ సాంకేతిక పద్ధతులు కూడ ఆంధ్రవిశ్వవిద్యాలయ జలసంతులన పరిశోధనా విభాగంలోనే రూపొందించబడ్డాయి. వీటి మూలంగా నదులలో ప్రవహించే నీటియొక్క పరిమాణాలు, వాటిలో అనునిత్యమూ కలుగుతుండే మార్పులు, వర్షాకాలంలో సంభవించే వరదలయొక్క గరిష్ఠస్థాయి, వేసవిలో కలిగే అల్పప్రవాహపు కనిష్ఠస్థాయి మొదలైన అంశాలు కనుక్కోడానికి అవకాశాలు కలిగాయి.

ఈ జలసంతులన విషయానికి సంబంధించినదే యింకొక అతిముఖ్యమైన విషయం క్షామశాస్త్రవిజ్ఞానం (Drought Climatology) క్షామాలన్నీ నీటికొరత వలన సంభవించినా క్షామాలకు కచ్చితమైన నిర్వచనం జలసంతులన మార్గం వలననే లభించింది. ఈ విజ్ఞానం కూడ ఆంధ్రవిశ్వవిద్యాలయంలోనే ప్రారంభం అయి, ఎంతగానో అభివృద్ధి చెంది, ఎన్ని రంగాలలోనో చోటుచేసికొని ప్రాముఖ్యం చెందడంతో, యీ విజ్ఞాన రంగానికి ఎంతో ఆదరణ లభించింది. క్షామాలు వరదలవలె క్షణికాలుగాని, స్వల్పకాలికాలు గాని కాక, కొంతకాలమో, లేక దీర్ఘకాలమో కొనసాగే నీటికొరతల వలననే కలుగుతాయి అని, వాటికి ఉద్భవం, విస్తరణ, తీవ్రీకరణం (Intensification) క్షీణత, మొదలయిన దశలు ఉంటాయని విశదం అయింది. ఈ కారణంగానే క్షామాల సంభవాన్నీ, వాటిలో కలిగే మార్పులనూ సకాలంలో గుర్తించి, హెచ్చరికలు ఇవ్వడం సాధ్యపడుతుందని వాతావరణ శాస్త్రజ్ఞుల దృఢమయిన విశ్వాసం. ఈ సందర్భంలోనే క్షామాలను కలిగించే నీటి కొరతలకు, వాయుమండలంలో తరచు సంభవిస్తుండే వాతావరణ అంశాల మార్పులకు మధ్యగల సంబంధాలను అవగాహన చేసుకోడానికి తీవ్రమైన కృషిమీద ప్రారంభం అయింది. దీనికి కారణం క్షామాలు కేవలం మనదేశానికిగాని, ఉష్ణమండలాలకు గాని పరిమితం గాక యావత్ప్రపంచాన్ని క్షోభపరిచే సహజ ఉపద్రవాలు అవడం. అందువలననే యీ పరిశోధనలకు అంతర్జాతీయ విద్యా, శాస్త్రీయ, సాంస్కృతిక సంస్థ (Unesco) ప్రపంచ వాతావరణ సంస్థ (World Meterological Organization) ఎన్నో విధాల ఎంతో ప్రోత్సాహాన్ని అందిస్తున్నాయి.

భూమధ్యరేఖ ప్రాంతాలలోను, ఉష్ణమండాలలోను సౌర వికిరణం (Solar Radiation) ఉష్ణశక్తి సమృద్ధిగా లభించడం వలన ఆయా ప్రాంతాల నిర్వీర్యత (Inefficiency) జల సంతులనానికే పరిమితం అయి ఉంటుందని పై విషయాలవలన నిర్ధారణ అవుతుంది. నీటి సమృద్ధి ఉన్నచోట్ల వృక్షజాలాలు, జంతుసంపద గరిష్ఠస్థాయిలోను, లేనిచోట అత్యల్పస్థాయిలోను ఉంటాయి. అందువలన పంటల దిగుబడికి, జైవిక ఆవరణ సామర్థ్యానికి, జలసంతులన సూచికల (Water Budget Indices) కూ మధ్యగల సంబంధం ప్రస్తుతం అన్ని శీతోష్ణ స్థితి మండలాలలోను గాఢంగా సమీక్షించబడుతోంది. అల్పకాలంపాటు సాగే సాధారణ క్షామాలకే జైవిక ప్రక్రియలమీద దుష్ప్రభావం ఎక్కువ ఉంటుందనే అభిప్రాయం ఈ పరిశోధనల మూలంగా బలపడుతోంది.

ఇక నౌకాయానానికీ, అనేక సాగరతీర పరిశ్రమల నిర్వహణలకూ, అన్నింటికీ మించి, ఆహార సముపార్జనకూ, సముద్రాల భౌతిక విజ్ఞానం ఎంతో అవసరం. మనదేశ రక్షణ, తీరప్రాంతాల పరిరక్షణకు కూడ ఈ విజ్ఞాన అధ్యయనానికి పరిశోధనలకు కీలకమైన ప్రాధాన్యం ఉంది. ఈ దిశలో మన పరిసర సముద్రప్రాంతాలలో జరిగిన అనేక సాగర పర్యవేక్షణ, పరిశోధనా కార్యక్రమాలలో ఆంధ్ర విశ్వ విద్యాలయపు అనేక శాస్త్ర విభాగాలు పాల్గొంటూ కృషి చేస్తున్నాయి. ఈ ప్రయత్నాలవలననే బంగాళాఖాతం, అరేబియా సముద్రం, హిందూమహాసముద్ర జలాల భౌతిక రసాయనిక, జైవిక స్వభావాలు, ధర్మాలు, లక్షణాలు ఎన్నో అవగాహన అయ్యాయి. ఈ పరిశోధనా కార్యక్రమాలన్నింటి రూపణ, నిర్వహణ, ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనేకసార్లు స్వచ్ఛందంగా విచ్చేసి ఎంతో దీక్షతోను, అభిమానంతోను కృషిచేసిన డాక్టర్ యూజీన్ సి, లా ఫాండ్ (Eugene C. Lafond) అనే అమెరికాదేశపు సాగరశాస్త్ర నిపుణుని ప్రోత్సాహంతోను, ప్రోద్బలంతోను సాగాయి. ఈ విస్తృత దీర్ఘకాల కార్యక్రమాలలో భారతదేశపు నౌకాదళ సంస్థ యొక్క అనేక వాహనాలను వాడుకోడం వలన, అనేక సాగరశాస్త్ర వాతావరణ వివరాలను సేకరించడం మన పరిసర సముద్రాల స్వభావ స్వరూపాల సమాచారం ఎంతో శ్రమతో సంపాదించడం, జరిగింది. సముద్ర ఉపరితల అధోతల ప్రవాహాల స్వభావం, జలరాసుల భౌతిక నిర్మాణం ఊర్ధ్వ అధో జలగమనాలు మొదలైన అంశాలమీద ఈ కృషి కేంద్రీకృతమై జరిగింది. బంగాళాఖాతపు జలాలకు, ఇతర పరిసర సముద్రజలాలకు గల వ్యత్యాసాలు, ఈ అఖాతంలోకి నిరంతరమూ ప్రవహించే గంగ, బ్రహ్మపుత్ర, మహానది, గోదావరి, కృష్ణ మొదలైన నదుల వలననే కలుగుతున్నదని నిర్ణయించబడింది. సముద్ర జలాల యొక్క ఊర్ధ్వ, అధోగమనాల శోధనల వలన మత్స్యరాసుల ఉనికి, సాంద్రత, పరిమాణం, తద్వారా మత్స్యపరిశ్రమ అభివృద్ధికి సంబంధించిన ఎన్నో ప్రయోజన పూర్వక వివరాలు లభ్యమయ్యాయి.

సాగర విజ్ఞానానికి సంబంధించిన యితర భౌతిక విషయాలలో వాయు మండలానికి సముద్రోపరితలానికి మధ్య అను నిత్యమూ జరుగుతుండే శక్తి మార్పిడి (Energy Exchange) అతి ముఖ్యమైనది. సముద్ర తరంగాల నిడివి,

ఎత్తు, పయనవేగం, అలజడి తీవ్రత మొదలైన వివరాల ద్వారా తీరప్రాంతాలలోని యిసుకమేటల యేర్పాటు, విచ్ఛేదాలపై అమూల్యమైన సమాచారం చేకూరింది. ఈ విజ్ఞానం మన తీరప్రాంతాల అభివృద్ధికీ, భవన నిర్మాణాలకు, కట్టడాల స్థిరత్వానికి తీసుకోవలసిన చర్యల విషయంలో ఎంతగానో ఉపయోగపడుతోంది. సముద్రతీర ప్రాంతాలకు భవిష్యత్తులో సంభవించగల ప్రమాదాలుగాని, సమకూరగల ప్రయోజనాలను గాని యీ విధమైన పరిశోధనా కృషిద్వారా ముందుగానే నిర్ణయించవచ్చు. నేడు మనం చేపడుతున్న అనేక తీరప్రాంత అభివృద్ధి కార్యక్రమాల దృష్ట్యా యీ రంగానికి ఎంతో ప్రాముఖ్యం ఉంది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కాకపోయినా యితర సాగర విజ్ఞాన సంస్థలలోను, పరిశోధనా కేంద్రాలలోను ఆహారం నిమిత్తమై సముద్రజీవరాసుల అభివృద్ధికి, సముద్రగర్భంలోని చమురు అన్వేషణ, సముద్రాల మీది అలలు కెరటాలనుండి శక్తి ఉత్పాదన, సముద్ర జలాల తారతమ్య ఉష్ణోగ్రత, లవణతల కారణంగా విద్యుచ్ఛక్తి సేకరణ, పురాణకాలాలలోను పురాతన యుగాలలోను సముద్రగర్భంలో మునిగిపోయిన కట్టడాల, నిర్మాణాల గుర్తింపు మొదలైన అశాలమీద పరిశోధనలు విడిగా సాగుతున్నాయి.

ఇతర ప్రాంతాలలో, ముఖ్యంగా ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలలోను అనేక వ్యవసాయ విశ్వవిద్యాలయాలలోను, వాతావరణ విజ్ఞానానికి సంబంధించి పరిశోధనా కృషి జరుగుతోంది. అయితే యిది ఏ వ్యవసాయరంగానికో, లేక కేవలం నీటివనరుల అభివృద్ధికో పరిమితం అయి, పరిశోధనా పత్రాలు, రచనలు, వ్యాసాలు, మాత్రమే తయారవుతున్నాయి. దేశం నలుమూలల నుండే గాక, యితర అభివృద్ధి చెందుతున్న దేశాలనుండి అనేకమంది విద్యార్థులు, పరిశోధకులు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి విచ్చేసి కొంతకాలంపాటు ఉండి అనువర్తిత విషయాలను శోధించి, మన విద్యాలయాలకు తమకు తమదేశాలకు కూడ గణనీయమైన సేవచేసి, కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తున్నారు. ఇది ఆంధ్రులందరూ కలకాలం చెప్పుకోదగ్గ అతిప్రాముఖ్యమైన విషయమైనా, ఈ పరిశోధనా కృషికి తగిన ప్రభుత్వ ప్రోత్సాహం అందడంలేదనే చెప్పాలి. సముద్ర శాస్త్ర పరిశోధనలకు అనువైన ప్రత్యేక నౌకాయాన వాహన వసతులు అవసరం. ఇవి ఎంత త్వరగా సమకూరి తగిన నిధులు లభించినట్టయితే అంతవేగంగాను, తీవ్రంగాను ఈ శోధనలు జరిగి మనశాస్త్ర, సాంకేతిక నైపుణ్యానికి, సామర్థ్యానికి దోహదంచేసి, దేశాన్ని ఈరంగాలలో ప్రముఖంగా పురోగమింపచేయగలవు.

"చరిత్ర నైజాన్ని అవగాహన చేసుకునే సామర్థ్యం కల్గి యుండటం రచయిత ప్రతిభకు అత్యంతావసరం." – ఇల్యా ఎహ్రెన్ బర్గ్

# వాతావరణ పరిశీలనా సంస్థల కృషి

మోటుపల్లి రామమోహనరావు
డైరెక్టర్, వాతావరణ కేంద్రము, హైదరాబాద్.

1865 వ సంవత్సరములో రెండు పెను తుఫానులు కలకత్తా నగరములోను, మచిలీపట్నము నగరములోను అపార జన నష్టమును కలిగించినవి. అప్పటి ఆంగ్ల ప్రభుత్వము తుఫాను హెచ్చరికలు ఇచ్చుట కొరకై వాతావరణ కేంద్రములను ఏర్పాటు చేసినది. ఆవిధముగ ఏర్పాటయిన పరిశీలనా కేంద్రములను ఒక పద్ధతిలో నడిపించుటకై 1875 లో భారత వాతావరణ విభాగము ఏర్పాటయినది.

ఇందలి ముఖ్య ఉద్దేశము వాతావరణ శీతోష్ణాది స్థితిగతులను క్రమ బద్ధముగా పరిశీలించి, వాటి ఫలితాలను బట్టి రాబోవు తుఫానులు మొదలగు వాటిని గురించి ముందుగా హెచ్చరికలు చేయుట. తరువాత వాతావరణ పరిశీలనా కేంద్రములను ఎక్కువగా స్థాపించి, అనుదినం వాతావరణ మార్పులను సూచించుట మొదలుపెట్టినారు. కాలక్రమేణ వాతావరణీకరమయిన విషయాలు ఈ శాఖ ఆధిపత్యము క్రింద తీసుకొని రాబడినవి.

దిన దినం, వారం వారం వాతావరణ సమాచారాన్ని అందించుట, తుఫాను హెచ్చరికలు చేయుట, జాలర్లకు సూచనలు, వైమానిక సూచనలు, ప్రభుత్వ నౌకాయానానికి సూచనలు, ప్రజలకు వాతావరణం గూర్చి సూచించుట, అతివృష్టి, అనావృష్టి, హిమపాతాల గురించి హెచ్చరించుట, వ్యవసాయదారులకు సూచనలు, ఋతుపవన ప్రభావం గురించి తెలియజేయుట మొదలైనవి ఈ విభాగము ముఖ్య కార్యక్రమములయినవి.

వాతావరణ పరిశీలనకు ఉపయోగింపబడే పరికరములు భారత వాతావరణ విభాగము వారే తయారుచేసుకొనుచున్నారు. వీటికొరకు ప్రత్యేక కర్మాగారములు ఢిల్లీ, పూనాలలో ఏర్పాటు చేయబడినవి.

భారత వాతావరణ విభాగము యొక్క ముఖ్య కేంద్రము ఢిల్లీలో వున్నది. దీనికి అనుబంధముగా 5 ప్రాంతీయ కేంద్రములను మద్రాసు, కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, నాగపూర్‌లలో ఏర్పాటు చేసినారు. మద్రాసు కేంద్రము ఆంధ్ర, తమిళనాడు, కర్నాటక మరియు కేరళ రాష్ట్రములలోని వాతావరణ పరిశీలనా కేంద్రములకు ఆధిపత్యము వహించుచు, వాతావరణ సూచనలు ఇచ్చుచుండెడిది. కాలక్రమేణ వాతావరణ సూచనల ప్రాముఖ్యము ఎక్కువవుతూ వచ్చినది. ప్రతీ రాష్ట్రములోను ఒక వాతావరణ కేంద్రం ఏర్పాటు అనివార్యమయినది. 1970–75 ల మధ్య కాలములో ప్రతి రాష్ట్ర రాజధానిలో ఒక వాతావరణ కేంద్రము ఏర్పాటు చేసినారు. హైదరాబాదులో వున్న వాతావరణ కేంద్రము 1972 లో స్థాపించబడినది. వాతావరణ సూచనలు ఇచ్చుటకు అవసరమయిన పరిశీలనా కేంద్రముల గురించి, వాతావరణ కేంద్రము అందజేయు సేవలగురించి విపులముగా చూద్దాం.

## భూతల పరిశీలనా కేంద్రములు:

వాతావరణమందలి నీటి ఆవిరి, వాయుపీడనము, గాలి చలనము, మేఘాల ఉనికి, దృష్టి ప్రసారం, వర్ష పాతముల గురించి తెలుసుకొనుటకు ఆంధ్రప్రదేశ్‌లో 35 పరిశీలనా కేంద్రములున్నవి. హైదరాబాదు, విశాఖపట్నము, విజయవాడ, తిరుపతి విమానాశ్రయములలోనే కాక ఇతర ముఖ్య పట్టణములలో కూడ ఈ పరిశీలనా కేంద్రములున్నవి. ఇందులో కొన్ని క్రిందటి శతాబ్దములోనే స్థాపించినారు. ఈ పరిశీలనా కేంద్రములలో రోజుకు రెండుమార్లు – ఉదయము, సాయంత్రము పరిశీలనలను చేస్తారు. కళింగపట్నం, విశాఖపట్నం, కాకినాడ, నరసాపురము, గన్నవరము, బాపట్ల, ఒంగోలు, నెల్లూరు, అనంతపురము, కర్నూలు, హైదరాబాదు, రామగుండం పరిశీలనా కేంద్రములలో రోజుకు 8 సార్లు – అంటే ప్రతి 3 గంటలకు ఒకసారి ఈ పరిశీలనలు చేస్తారు. తిరుపతి, నిజామాబాదులలో రోజుకు 5 మార్లు పరిశీలనలు జరుపుతారు. ఉష్ణోగ్రత, గాలిలో తేమ,

వాయుపీడనము, వర్షపాతము నిరంతరం – అంటే 24 గంటలు తెలుసుకొనుటకు పరికరములు పైనుదహరించిన 11 కేంద్రములలో ఉన్నవి. వీటి వలన వాతావరణంలోని మార్పులను క్షుణ్ణముగా పరిశీలించవచ్చును. ఖమ్మం, కొత్త గూడెం, అదిలాబాదు, మహబూబ్ నగర్, హనుమకొండ, కడప, నంద్యాల, ఆరోగ్యవరం, నిడదవోలు, రెంటచింతలలలో వర్షపాతం నిరంతరం రికార్డు చేయు పరికరము అమర్చినారు. ఈ పరికరము వలన వర్ష తీవ్రతను గుర్తించవచ్చును. దానినిబట్టి మురుగు పారుదల వ్యవస్థ రూపొందించవచ్చును.

## ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములు:

భూతల వాతావరణ విషయములనే గాక, ఉపరితలములో వుండే వాతావరణ విషయములను తెలుసుకొనవలయును. ఈ సమాచారము వాతావరరణ సూచనలు ఇచ్చుటకు ముఖ్యము. అందుకొరకై హైదరాబాదు, విశాఖపట్నము, మచిలీపట్నం,అనంతపురములలో ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములు ఏర్పాటు చేయుబడినవి. హైదరాబాదు, విశాఖపట్నము, మచిలీపట్నములలో వున్న ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములలో రాడార్లు ఉపయోగించి, రోజుకు రెండుమార్లు ఉదయము, సాయంత్రము ఉపరితల వాతావరణములోని ఉష్ణోగ్రత, గాలిలో తేమ, వాయువేగము, దిశ కనుగొంటారు. అనంతపురములో ఉపరితల వాతావరణములో వాయువేగము, దిశ కనుగొంటారు. ఇందుకొరకు ఉదజని నింపిన రబ్బరు బెలూన్లు ఉపయోగిస్తారు. ఇచ్చట రాడారు బదులు ప్రత్యేకమయిన దూరదర్శినిని ఉపయోగిస్తారు. హైదరాబాదు, విశాఖపట్నము, మచిలీపట్నములలో మధ్యాహ్నము, రాత్రి ఇటువంటి ఉదజని నింపిన రబ్బరు బెలూన్లను వదిలి వాతావరణ పరిశీలనలు జరుపుతారు. ఈ పరికరములు ఉపరితల వాతావరణములో వివిధ ఎత్తులలో ఉండే వాతావరణ విశేషాలను సేకరిస్తాయి.

## ప్రత్యేక పరిశీలనా కేంద్రములు:

పంటలకు సంబంధించిన సమాచారమును సేకరించటానికి ఆంధ్రదేశములో 13 పరిశీలనా కేంద్రములు స్థాపించబడినవి. వీటిని వ్యవసాయ వాతావరణ పరిశీలనా కేంద్రములంటారు.

విశాఖపట్నములో ఒక భూకంప పరిశీలన కేంద్రము వున్నది. ఇచ్చట భూప్రకంపనలు రికార్డు చేయుటకు పరికరములు అమర్చబడినవి. ఈ కేంద్రము, వివిధ రాష్ట్రములలో వున్న కేంద్రముల నుండి సేకరించిన డేటాతో భూకంపన కేంద్రమును, కాలాన్ని, తీవ్రతను నిర్ణయిస్తుంది. శాస్త్రీయమయిన విషయసేకరణ వీటి లక్ష్యం. ఈ కేంద్రము, ఋతుపవనకాలములో గాలి పీడనము వలన సముద్రములో ఏర్పడు స్వల్ప ప్రకంపనాలను కూడా గుర్తించగలదు. వీటివలన ఋతుపవన ప్రభావము, అల్పపీడన ప్రభావమును గుర్తించవచ్చును.

## వరదల వాతావరణ కార్యాలయము:

మన రాష్ట్రములో ప్రవహించే ముఖ్యనదులు గోదావరి, కృష్ణ వాటికి ఋతుపవనకాలములో వరదలు వచ్చి ప్రాణనష్టము, ఆస్తినష్టము కలిగిస్తూ వుంటాయి. కృష్ణ, గోదావరి, వాటి ఉపనదులు పరిగ్రహణ ప్రదేశములలో భారీ వర్షములు కురియుటవలన వరదలు సంభవించుటకు అవకాశము కలదు. ఈ భారీ వర్షములు కృష్ణ, గోదావరి వాటి ఉపనదుల పరిగ్రహణ ప్రదేశములలో ఎప్పుడు ఎక్కడ ఎంత పడునది సూచించుటయే ఈ కార్యాలయము యొక్క ముఖ్యమైనపని. ఇందులకుగాను ఈ నదుల ఉపనదుల పరిగ్రహణ ప్రాంతములలో వర్షపాతము కొలుచు యంత్రములను ఏర్పాటు చేసినారు. ప్రతి రోజు ఉదయము, ఈ కేంద్రములనుండి వర్షము ఎంత కురిసినది వైర్ లెస్ ద్వారా హైదరాబాదు వాతావరణ కార్యాలయమునకు వార్త చేరును. కొన్ని చోట్ల నిరంతరం వర్షపాతమును కొలుచు పరికరములు కూడ అమర్చినారు. వీటివలన వర్ష తీవ్రతను గుర్తించవచ్చును. ఈ నదుల, ఉపనదుల పరిగ్రహణ ప్రాంతములో కురిసిన భారీ వర్షములు నదుల దిగువ భాగములు వరదలు వచ్చుటకు దోహదము చేయును. వరదలు వచ్చు ప్రమాదమున్నచో హైదరాబాదు వాతావరణ శాఖవారు ఈ వర్షపాత కొలతలను ప్రతి మూడుగంటలకొక మారు తెప్పించుకొనెదరు. వర్షపాత/వరదసూచనలను కేంద్రీయ వరదల హెచ్చరిక కేంద్రములకు ఋతుపవన కాలములో రోజూ తెలుపబడును. వరదలు సంభవించు కాలములో రోజూ పలుమార్లు వరద సూచనలు ఈ కేంద్రమునకు ఇవ్వబడును. ఈ సమాచారమును బట్టి, పై నదుల పరిగ్రహణ ప్రదేశముల్లో ఎప్పుడు, ఎక్కడ వరదలు వచ్చుటకు అవకాశమున్నదో ఈ కేంద్రమువారు రాష్ట్ర ప్రభుత్వ సంబంధిత కార్యాలయములకు తెలియజేయుదురు. ఇందువలన లోతట్టు ప్రాంతములో వుండే మనుషులను ఇతర ప్రదేశములకు తరలించుటకు, నదిగట్లు తెగకుండ చూచుటకు అవకాశమున్నది.

## తుఫాను గమనిక రాడారు:

1969 లో సంభవించిన తుఫానుల వలన ఆంధ్రదేశము చాల నష్టపడినది. ఈ నష్టములను తగ్గించుటకుగాను భారతప్రభుత్వము ప్రొ॥ కోటేశ్వరం (డైరక్టర్ జనరల్ ఆఫ్ అబ్జర్వేటరీస్) గారి అధ్వర్యములో ఒక కమిటీని వేసినది. ఆ కమిటీ అన్ని విషయములు క్షుణ్ణముగా పరిశీలించి

తుఫాను వచ్చు ముందు, వచ్చినప్పుడు, వచ్చిన తరువాత తీసుకొనవలసిన జాగ్రత్తల విషయమై వివరమయిన నివేదిక ఇచ్చినది. ఈ నివేదిక ననుసరించుట వలన అనేక లాభములు కలుగుచున్నవి.

ఈ కమిటీ సిఫార్సుల ననుసరించే విశాఖపట్నములో 1970 లో డాల్ఫిన్స్ నోస్ కొండపైన తుఫానులను కనుగొనగల రాడార్‌ను అమర్చినారు. 1974 లో ఒక తుఫాను హెచ్చరికా కేంద్రమును కూడా ఏర్పాటు చేసినారు. ఈ రాడార్ సముద్రములో 400 కి.మీ. దూరములో వుండే తుఫానును గుర్తించగలదు. ఈ రాడార్‌ను ఉపయోగించి, విశాఖపట్నము నకు 400 కి.మీ. దూరమున ఉన్న తుఫాను లను గుర్తించి గంట గంటకు తుఫాను హెచ్చరికలు ఇవ్వగలుగుచున్నారు. ఈ రాడార్ ఆంధ్రకోస్తా ప్రాంతమంతయు వీక్షించలేదు. అందుకని మచిలీపట్నములో కూడా ఒక తుఫానును కనుగొనగల రాడార్‌ను అమర్చినారు. తమిళనాడులో సంభవించే తుఫానులను కనుగొనుటకు మద్రాసు, కారైకాల్ లలో రాడార్లు అమర్చినారు. మన ఆంధ్ర కోస్తా ప్రాంతమునకు రాగల తుఫానులను గుర్తించుటకు విశాఖపట్నము, మచిలీపట్నము, మద్రాసు రాడార్లు ఉపయోగపడుతున్నవి. ఈ మూడు రాడార్లలో ఏదేని రెండు రాడార్లు ఆంధ్ర తీర ప్రాంతమును తాకు తుఫానులను గుర్తించగలవు. కనీసము రెండు రాడార్లు గుర్తించుటవలన, తుఫాను కేంద్రమును, పయనము సరిగా అంచనా వేయుటకు వీలగుచున్నది. ఇందువలన గంట గంటకు తుఫాను హెచ్చరికలు ఆకాశవాణి ద్వారా ప్రసారము చేస్తున్నారు. ఈ తుఫానును కనుగొనే రాడార్లు ఉపరితల వాతావరణ కేంద్రములో ఉపయోగించే రాడార్లకన్నా పెద్దవి.

## భారత జాతీయ ఉపగ్రహములు (ఇన్‌సాట్ సీరీస్):

ఈ ఉపగ్రహములు భూమధ్యరేఖ పైన, వివిధ రేఖాంశములలో భూమికి 36,000 కి.మీ. ఎత్తున భూమితో పాటు పరిభ్రమించు చున్నవి. ఈ ఉపగ్రహములలో వాతావరణ సంబంధిత సమాచారమును సేకరించి, భూమిపైకి ప్రసారము చేయుటకు తగిన పరికరములు అమర్చబడినవి. మొట్టమొదట ఈ పరికరములు భూమిపైన వుండే మేఘములను ఫోటో ద్వారా (రేడియో సంకేతములను ఉపయోగించి) భూమిపైన వుండే ఉపగ్రహ వాతావరణ కేంద్రమునకు పంపుచుండెడివి. ముఖ్య ఉపగ్రహ వాతావరణ కేంద్రము ఢిల్లీలో ఏర్పాటయినది. ఈ ఢిల్లీ కేంద్రము ఆంధ్రదేశములో వాతావరణ కేంద్రమయిన హైదరాబాద్‌కు, తుఫాను హెచ్చరికా కేంద్రమయిన విశాఖపట్నమునకు మేఘ సంబంధిత సమాచారము టెలికమ్యూనికేషన్ డిపార్ట్‌మెంట్ ద్వారా పంపుచుండెడిది. తంతి ప్రసారములో వుండే లోటుపాట్లవలన కొన్నిసార్లు ఈ ఛాయాచిత్రములు హైదరాబాద్, విశాఖపట్టణము కేంద్రములకు చేరేవికావు. అందుకని ఇప్పుడు ఉపగ్రహము ద్వారా నేరుగా హైదరాబాదు, విశాఖపట్నము యొక్క వాతావరణ కేంద్రములకు ఈ మేఘ సముదాయ ఛాయాచిత్రపటములు పంపుచున్నారు.

కాలక్రమేణా ఉపగ్రహము ద్వారా వాతావరణ సూచనలకు ఉపయోగపడే సమాచారము గ్రహిస్తున్నారు. భూమిపై ఏర్పడే మేఘముల ఎత్తు, వాటి ఉపరితల ఉష్ణోగ్రత, ఉపరితలములోని వాయువేగము, దిశ, సముద్ర జల ఉష్ణోగ్రత మొదలగు ముఖ్య వాతావరణ పరిశీలనలు చేయుచున్నారు. ఈ సమాచార మంతయు ఢిల్లీ ముఖ్య కేంద్రమునుండి అన్ని వాతావరణ కేంద్రములకు పంపబడుచున్నది.

భారత జాతీయ ఉపగ్రహముల వలన భారత భూభాగము పైన వుండే వాతావరణ సమాచారమే కాక, ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, యూరోప్ నందలి కొంత భాగము లలోని వాతావరణ సమాచారము తెలుసుకొనవచ్చును. ఈ ఉపగ్రహము ద్వారా రోజుకు కనీసము 8 మార్లు, మూడు గంటలకొకసారి మేఘ సముదాయ చిత్రపటములు వాతావరణ కేంద్రములకు అందుచున్నవి. తుఫాను సమయములో గంట గంటకు ఈ చిత్రపటములు ప్రసారము చేయబడుచున్నవి. తుఫాను సమయములు, తుఫాను పరిసర ప్రాంతములను మాత్రమే గంట గంటకు చిత్రపటము ద్వారా వీక్షిస్తారు. ఇందువలన తుఫాను కదలిక, వేగము సరిగా అంచనా వేసి ఆ తుఫాను ఎప్పుడు ఎచ్చట మన దేశ తీర ప్రాంతమును దాటగలదో చెప్పవచ్చును. ఈ విషయములో తుఫాను కనుగొనే రాడార్లు ఎక్కువగా ఉపయోగపడుతున్నాయి. ఈ తుఫానులు పోగల దిశ, వేగము తెలుసుకొనుటకు ఉపరితల వాయువేగము దిశకూడా తెలియవలయును. అందుకని ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములనుండి వచ్చే సమాచారము కూడా ఉపయోగిస్తున్నారు. ఈ ఉపగ్రహము వలన బంగాళాఖాతము, అరేబియా సముద్రములలో ఏర్పడే అల్పపీడన ప్రాంతములను గుర్తించి, రాబోవు వాతావరణ సూచనలు, హెచ్చరికలు ఇవ్వగలుగుతున్నారు.

## డేటా కలెక్షన్ ప్లాట్‌ఫారమ్స్ (డి.సి.పి.):

తుఫాను సంబంధిత పెనుగాలులు, కుంభవృష్టివలన తీర ప్రాంతములోని తంతి తీగెలు తెగిపోయి తీరప్రాంత మందలి వాతావరణ పరిశీలనలు వాతావరణ కేంద్రమునకు చేరకపోవుట, చేరినను ఆలస్యముగా చేరుట సంభవించు చున్నది. భూమిపైన జన సంచారము లేని ప్రదేశములలో (అడవులు, కొండలు, ఎడారులు) వాతావరణ పరిశీలనలు

జరుపుట కష్టము. వాతావరణ హెచ్చరికల కొరకు అటువంటి ప్రాంతమునుండికూడ సమాచారము సేకరించవలసియున్నది.

ప్రస్తుతము సముద్రముపై నుండే వాతావరణ పరిశీలనలు సముద్రములో ప్రయాణించే నౌకలు నమోదు చేసి ప్రసారము చేయుటవలన వాతావరణ కేంద్రములకు వచ్చుచున్నవి. కాని, నౌకలు ప్రయాణము చేయుచునే వుండును. ఒకచోట స్థిరముగా వుండవు. అందుకని ఒకేచోటనుండి పలుమార్లు వాతావరణ పరిశీలనలు అందుట కష్టము. విశాల సముద్రములో జరుగు మార్పులు తెలియవు.

పైన ఉదాహరించిన ఇబ్బందులను అధిగమించి ప్రతిరోజు అనేకమార్లు వాతావరణ పరిశీలనలు చేయుటకుగాను భారత జాతీయ ఉపగ్రహము ఉపయోగపడుచున్నది. జన సంచారము లేని ప్రదేశములలో వాతావరణ పరిశీలనలు జరుపుట కొరకు ఉపయోగించే పరికరములు వాటంతట అవే పనిచేసి (పరిశీలకుని అవసరము లేకుండానే) ఉపగ్రహము ద్వారా సమాచారము అందించు పద్ధతిని కనుగొనినారు. వాయు పీడనము, గాలిలోని తేమ, వాయు దిశ, వేగము, ఉష్ణోగ్రత, వర్షపాతము కొలుచు పరికరములను ఈ జనసంచారము లేని ప్రదేశములలో అమర్చినారు. ఈ పరికరములు 24 గంటలు పని చేయుచు, గంట గంటకు వాతావరణ పరిశీలనలను ఉపగ్రహము ద్వారా ఢిల్లీలోని ఉపగ్రహ వాతావరణ ముఖ్య కేంద్రమునకు పంపును. వాటినే డేటా కలెక్షన్ ప్లాట్‌ఫారమ్స్ అంటారు. ఈవిధముగా వచ్చిన డేటానంతా ఢిల్లీ కేంద్రము టెలి ప్రింటర్ ద్వారా అన్ని వాతావరణ కేంద్రములకు పంపును. ఈ పద్ధతి వలన విపరీత వాతావరణ పరిస్థితులను కూడ జనసంచారము లేని ప్రదేశములనుండి వాతావరణ పరిశీలనలు జరిపి వాతావరణ హెచ్చరికలు ఇవ్వ గలుగుతున్నారు.

## తుఫాను వాతావరణ హెచ్చరికా కేంద్రములు (డి.డబ్ల్యు.ఎస్.):

మామూలుగా తుఫాను వాతావరణం హెచ్చరికలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ అధికారులకు తంతి ద్వారా అందజేస్తారు. విపరీత వాతావరణ పరిస్థితుల వలన ఈ హెచ్చరికలు వారికి సకాలములో చేరవు. అందుకని వాతావరణ హెచ్చరికలను ఆకాశవాణి ద్వారా కూడా ప్రసారము చేస్తున్నారు. ఈ తుఫాను హెచ్చరికలు సకాలములో అందనిచో కోస్తా తీరప్రాంత అధికారులు, ప్రజలు తుఫాను సమయములో తీసుకొనవలసిన జాగ్రత్తలలో జాప్యము జరిగి నష్టము వాటిల్లును. ఇటువంటి ఇబ్బందులను అధిగమించుటకు, ఇప్పుడు తుఫాను హెచ్చరికలను ఉపగ్రహము ద్వారా ప్రసారము చేస్తున్నారు. వీటికి అవసరమయ్యే పరికరాలను మండల రెవెన్యూ కార్యాలయములోను, జిల్లా కలెక్టర్ కార్యాలయము లోను, ఆకాశవాణి కేంద్రములలోను, సచివాలయములోను అమర్చినారు. తుఫాను హెచ్చరికలను ప్రాంతీయభాషలలో ఉపగ్రహముద్వారా అన్ని కేంద్రములకు పంపుచున్నారు. ఇందువలన జాప్యము లేకుండ, సచివాలయములో ముందు జాగ్రత్త చర్యలు ప్రారంభించి, జన నష్టము, ఆస్తి నష్టము నివారించవచ్చును. మొట్టమొదట ఇటువంటిది దక్షిణ ఆంధ్ర కోస్తా ప్రాంతములో వుండెడిది. ఇప్పుడు అన్ని కోస్తా జిల్లాలలో వుంది. ఈ పరికరముల వలన ఎటువంటి వాతావరణ పరిస్థితులలో నయినా తుఫాను హెచ్చరికలు సంబంధిత అధికారులకు తెలియజేయగలుగుతున్నారు. జన నష్టము, ప్రాణ నష్టము తగ్గించగలుగుతున్నారు.

## వాతావరణ మార్పులు, హెచ్చరికలు:

మన దేశ వాతావరణ మార్పులను తెలుసుకొనుటకు మన దేశ వాతావరణ పరిశీలనలు మాత్రమే చాలవు. ఎందుకంటే, మన దేశ వాతావరణము పొరుగుదేశముల నుండి వ్యాపించు వాతావరణము మీద కూడ ఆధారపడి యుండును. దక్షిణ చైనా సముద్రములో ఏర్పడు వాయుగుండముల, తుఫానుల ప్రభావము మన దేశ వాతావరణము మీద కూడా వుండును. అట్లాగే ఇరాన్ దేశములో ఏర్పడే అల్పపీడన ప్రాంతము తూర్పు లేక ఈశాన్య దిశగా ప్రయాణించి శీతాకాలములో ఉత్తర భారత దేశములో వర్షములను ఇచ్చును. కనుక, మన దేశములో ఏర్పడు వాతావరణ మార్పులను తెలుసుకొనవలయునన్న మన దేశ పరిశీలనలే కాక పొరుగు దేశములో జరిపిన పరిశీలనలు కూడ అవసరము. మన దేశములో ఉన్నట్లుగానే ఇతర దేశములలో కూడా భూతల వాతావరణ పరిశీలనా కేంద్రములు, ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములు ఉన్నవి. వారుకూడా మనమాదిరిగానే నిరీత సమయములలో పరిశీలనలు జరిపెదరు. ఈ నిర్ణీత సమయము ప్రపంచమంతటా ఒక్కటే. ఈ పరిశీలనలను పొరుగు దేశములు ఢిల్లీకి పంపెదరు. అచ్చట ప్రాంతీయ వాతావరణ టెలి కమ్యూనికేషన్ కేంద్రము వున్నది. ఆ కేంద్రమువారు, కంప్యూటర్ ద్వారా ఈ పరశీలనలన్నిటినీ మన దేశములోని అన్ని వాతావరణ కేంద్రములకు పంపెదరు. వీటికొరకు టెలిప్రింటర్లు ఉపయోగిస్తున్నారు.

ఈవిధముగా వచ్చే వాతావరణ పరిశీలనలను సేకరించి వాతావరణ చిత్రపటాలను తయారుచేసెదరు. భూమికి దగ్గరగా వున్న గాలిపొరల శీతోష్ణస్థితులు పైపొరలకన్నా త్వర త్వరగా మారుటవలన, భూమిమీద వాతావరణ పరిస్థితుల చిత్రపటాలు 3 గంటల కొకమారు, ఉపరితల వాతావరణ పరిస్థితులను తెలియజేయగల చిత్రపటాలను 6 గంటలకొకమారు తయారు చేస్తున్నారు. వాతావరణ

హెచ్చరికలను ఇచ్చే కేంద్రాలు ఈ చిత్రపటాలను రెగ్యులర్‌గా తయారు చేస్తునే వుంటాయి.

భూతల వాతావరణం గురించి తయారుచేసే చిత్ర పటాలలో వాయుపీడన, ఉష్ణోగ్రత, గాలిలో తేమ, మేఘముల రకములు మరియు ఎత్తు, దృష్టి ప్రసారం, వర్తమాన, భూతకాల వాతావరణం, వాయుదిశ, వేగము గురించిన వివరములు వుండును. వాయుపీడనము ఒకే విలువ గల ప్రదేశములను సరళరేఖలతో గుర్తిస్తారు. వీటినిబట్టి అల్పపీడన ప్రాంతము, అధిక పీడన ప్రాంతములను గుర్తించవచ్చును. వీటిని గుర్తించినంత మాత్రాన వాతావరణ మార్పులు, హెచ్చరికలు తెలియజేయుట కుదరదు. భూమిమీద వున్న అల్పపీడన ప్రాంతము ఉపరితలములో ఎంత ఎత్తువరకు వ్యాపించి యున్నాదో తెలుసుకొనవలయును. దాని విస్తీర్ణము, ఎత్తులనుబట్టి వాతావరణములో వచ్చు మార్పులను గుర్తించ వచ్చును. ఈ మార్పులను గుర్తించిన తగు హెచ్చరికలు ఇచ్చుటకు వీలగును. అందుకొరకు ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములనుండి వచ్చు సమాచారము అవసరము. ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రముల నుండి వచ్చే పరిశీలనలు కూడా ఢిల్లీలోని కంప్యూటర్ ద్వారా అన్ని వాతావరణ కేంద్రములకు పంపబడుచున్నవి. ఈ డేటానంతను ఉపయోగించి, వివిధ ఎత్తులకు ఉపరితల వాయు సమాచార పటములను తయారు చేయుదురు. ఈ సమాచార పటాలను విశ్లేషించి, ఉపరితలములో చక్రవ్యూహ ప్రాంతములను గుర్తిస్తారు. వీటన్నిటిని సమన్వయము చేసుకొని వాతావరణములో రాగల మార్పులను తెలియపరుస్తారు. వాతావరణ హెచ్చరికలు – కుంభవృష్టి, పెనుగాలులు మొదలగువాటిగురించి – ఇచ్చుటకు వీలగుచున్నది.

## వాతావరణ శాఖవారు అందించు సేవలు:

వాతావరణ శాఖ వారు ప్రతి రాష్ట్ర రాజధానిలో ఏర్పాటు చేసిన వాతావరణ కేంద్రములనుండి వాతావరణ సమాచారము, మార్పులు, హెచ్చరికలు ఇచ్చుచున్నారు. ప్రభుత్వ అధికారులకు, వ్యవసాయదారులకు, కలెక్టర్లకు, ప్రజలకు వారి వారి అవసరమును బట్టి వాతావరణ సమాచారము అందిస్తున్నారు. అవి ఏమిటో ఇప్పుడు చూద్దాము.

## విమానయాన సేవ:

అటు ప్రయాణీకులకు, ఇటు విమాన సిబ్బందికి భారత వాతావరణ విభాగము సేవలు అందిస్తోంది. ఈ సేవలయొక్క ముఖ్య ఉద్దేశము – సురక్షితముగా ప్రయాణము చేయుట, విమాన కంపెనీలకు లాభము చేకూర్చుట, ప్రతి రోజు ప్రయాణము చేయుటకు వీలు కలిగించుట, ప్రయాణము సుఖదాయకము చేయుట.

విమానము సురక్షితముగా ఎగురుటకు, దిగుటకు, గాలిలో తేలుచు పోవుటకు భూతల వాతావరణ పరిస్థితులు, ఉపరితల వాతావరణ పరిస్థితులు అవసరము. వైమానికుడు ప్రయాణ సరళిగురించి అంచనా వేయుటకు, ప్రయాణ వ్యవధి, ఇంధన పరిమితి గురించి అంచనా వేసుకొనుటకు, విమానాశ్రయము లలో భూతల వాతావరణము, రెండు విమానాశ్రయముల మధ్య నుండే ఉపరితల వాతావరణ విశేషములు గురించి ముందుగానే తెలుసుకొనవలయును. ఇందుకొరకు ఉపరితల వాతావరణ పరిశీలనా కేంద్రములనుండి లభ్యమయ్యే సమాచారము ఉపయోగపడుతుంది. ఈ పరిశీలనలవలన ఒక విమానాశ్రయము నుండి మరియొక విమానాశ్రయమునకు వున్న మధ్యదారిలోని ఉపరితల ఉష్ణోగ్రత, వాయువేగము, దిశ తెలుస్తాయి. అట్లానే విమానాశ్రయములలో వుండే భూతల వాతావరణ కేంద్రముల పరిశీలనలు విమానాశ్రయమునుండి ఎగురుటకు, దిగుటకు ఉపయోగపడ్తాయి.

ప్రతి ప్రయాణానికి ముందు, మార్గము మధ్యంలో, గమ్యస్థాన విమానాశ్రయములోని వాతావరణ పరిశీలనలు, వాతావరణ మార్పులను గురించి వాతావరణ శాఖవారు సంబంధిత వైమానికునకు లిఖిత పూర్వకముగా అందిస్తున్నారు. అన్ని రకముల విమానములు అన్నివేళల, అన్ని విమానాశ్రయములలో దిగలేవు, ఎగురలేవు. హైదరాబాదు విమానాశ్రయములో 24 గంటలలో ఎప్పుడయినా ఎగుర వచ్చును, దిగవచ్చును. అందుకని ఇచ్చటి వాతావరణ కేంద్రము నిరంతరము పని చేస్తూనే వుంటుంది. ఇచ్చట ప్రతి అర్ధగంటకు వాతావరణ పరిశీలనలు జరుపుతారు. గాలివేగము, దిశ, దృష్టి ప్రసారము, మేఘాలు, గాలిలో తేమ, వాయుపీడనము ప్రతి అరగంటకు ఒకసారి పరిశీలించి, వాటిని లిఖితపూర్వకముగా వైమానికునకు అందజేస్తారు. ఆంధ్ర దేశములో ఉన్న విశాఖపట్నము, విజయవాడ, రాజమండ్రి, తిరుపతి విమానాశ్రయములలో పరిమిత కాలములోనే విమానములు ఎగురగలవు, దిగగలవు. ఆయా విమానాశ్రయ అవసరాలనుబట్టి వాతావరణ పరిశీలనలు జరిపి, వాటిని లిఖితపూర్వకముగా అందజేస్తారు.

ఇదిగాక హైదరాబాదు విమానాశ్రయములో రద్దీ ఎక్కువగా వుండును. అందుకని ఇచ్చట 400 కి.మీ. దూరమువరకు వున్న మేఘ సముదాయమును గుర్తించ గల రాడారును అమర్చినారు. ఈ రాడారు సహాయముతో ఘర్షించగల మేఘములను గుర్తించి – అవి ఎచ్చట, ఏ దిశలో, ఎంత దూరములో వున్నవో వైమానికునకు తెలియపరుస్తారు. ఘర్షించే మేఘములలో కనుక విమానము ప్రయాణించిన, అది ఒడిదుడుకులకు లోనై, క్రిందకు పడిపోగల ప్రమాదమున్నది. అందులకే ఈ రాడారును ఎల్లప్పుడు ఉపయోగిస్తూ వుంటారు.

## వ్యవసాయదారులకు సేవ:

మన రాష్ట్రములో 80 శాతం ప్రజలు వ్యవసాయము మీదనే ఆధారపడుతున్నారు. నష్టము కలుగకుండ ఎక్కువ పంట దిగుబడికి వాతావరణ శాఖ రైతులకు సేవ చేస్తున్నది. 1945 నుండి రైతులకొరకు వాతావరణ శాఖ ప్రత్యేక వాతావరణ సూచనలు ఇస్తున్నది. ఈ సూచనలు సాయంత్రము వేళల్లో అన్ని ఆకాశవాణి కేంద్రములనుండి ప్రసారమగు చున్నవి. ఋతుపవన కాలములో మరియొక ప్రత్యేక సూచన ఉదయము వేళల్లో ప్రసారము చేస్తున్నారు. ఈ ప్రసారములలో రాగల రెండు రోజులలో వుండగల వాతావరణము గురించి తెలియపరుస్తున్నారు. అంటే సుమారు నాలుగు రోజుల వాతావరణ సమాచారము వ్యవసాయదారులకు అందుతున్నది. ఇందువలన రైతు పొలము పనులకు ముందుగానే ఆలోచించుకొని చేయగలుగుతున్నాడు.

వ్యవసాయదారులకు, మరింత మెరుగైన సేవలు అందించుటకు, భారత వాతావరణ విభాగము వారు ప్రతి రాష్ట్ర రాజధానిలోను వ్యవసాయ సలహా శాఖను ప్రారంభించినారు. ఈ శాఖల స్థాపనలో ముఖ్య ఉద్దేశము ఏమిటంటె, ఈ శాఖ రాష్ట్ర వ్యవసాయశాఖ వారితో సంప్రదించి, వారి సహాయముతో ప్రత్యేక వాతావరణ సూచనలు వారమునకు రెండుమార్లు – ప్రతి గురువారము, సోమవారము ఆకాశవాణి ద్వారా ప్రతి శుక్రవారము, మంగళవారము దూరదర్శన్ ద్వారా ప్రసారము చేయించుట. ఈ ప్రత్యేక వాతావరణ సూచనలలో క్రిందటి 7 రోజులుగా జరిగిన వాతావరణ మార్పులు, వర్షపాతము, మొక్కల పరిస్థితి, తీసుకోవలసిన జాగ్రత్తలు పొందుపరుస్తున్నారు. ఈ ప్రత్యేక వాతావరణ సూచనల ననుసరించి రైతు సకాలములో చర్యలు తీసుకొని, ఖర్చులను తగ్గించుకుంటున్నాడు. పంట దిగుబడి పెంచుకుంటున్నాడు.

## ఓడలకు సేవ:

తుఫాను హెచ్చరిక వాతావరణ కేంద్రము రోజుకు రెండుమార్లు సముద్రములో ప్రయాణించే పెద్ద పెద్ద ఓడలకు, ప్రభుత్వ నౌకలకు ఉపయోగపడే వాతావరణ సూచనలు ఇస్తున్నది. వాయుగుండము, తుఫాను ఏర్పడినప్పుడు ఈ సూచనలు పలుమార్లు ఇస్తారు.

చిన్న చిన్న పడవలు, లాంచీలు కోస్తా తీర ప్రాంతమునకు దగ్గరగా ప్రయాణించుచు, చేపలు పట్టుట మరి కొన్ని కార్యక్రమములలో నిమగ్నమయి వుండును. వాటి అవసరార్థము కూడ ప్రతి దినము రెండుమార్లు వాతావరణ సూచనలు ఇస్తున్నారు. వాయుగుండం ఏర్పడినప్పుడు ఒకమారు, తుఫాను ఏర్పడినప్పుడు పలుమార్లు ఎక్కువగా ఈ వాతావరణ సూచనలు ఇస్తున్నారు. ఈ సూచనల వలన, సముద్రములో ప్రయాణించే ఓడలు తుఫాను ఏర్పడిన ప్రాంతమునుండి బయటకు వచ్చి, వాటి ప్రయాణము సురక్షితము చేసుకొనుచున్నవి.

ఓడలు సముద్రములో ప్రయాణించునప్పుడు నిర్ణీతకాలములో వాతావరణ పరిశీలనలు జరుపును. అందుకొరకు కొన్ని పరికరములు ఓడలో అమర్చి ఉండును. ఆ పరికరములు సరిగా పనిచేయుచున్నవో లేదో తెలియనిచో ఆ పరిశీలనలు వృథా అగును. అందుకొరకు భారత వాతావరణ విభాగమువారు పోర్టు వాతావరణ కార్యాలయములను పెద్ద పెద్ద ఓడరేవులలో ఏర్పాటు చేసినారు. ఈ కార్యాలయము అధికారులు, ఓడలు రేవునకు చేరినంతనే కెప్టన్‌ని కలిసి, తరువాత వాతావరణ పరిశీలనా పరికరాలను పరీక్షిస్తారు. ఏదయినా లోటు పాట్లున్న ఎడల వాటిని సరిదిద్దుతారు. ఇందువలన సరిఅయిన వాతావరణ పరిశీలనలు చేసే అస్కారమున్నది. ఇది చాలా ముఖ్యము. ఎందుకంటే అల్పపీడన ప్రాంతము ఏర్పడినప్పుడు ఓడల ద్వారా వచ్చే వాతావరణ పరిశీలనల ఆధారముగా హెచ్చరికలు ఇచ్చుటకు అవకాశమున్నది.

## ఓడరేవులకు సేవ:

వాయుగుండము, తుఫాను ఏర్పడినప్పుడు వాతావరణములో జరుగు మార్పుల వలన రేవులలో వుండే ఓడలకు ప్రమాదము సంభవించవచ్చును. తుఫాను సమయములో తగు జాగ్రత్తలు తీసుకొనుటకుగాను తుఫాను వాతావరణ హెచ్చరికా కేంద్రములు ఓడరేవు అధికారులకు ప్రత్యేక హెచ్చరికలు ఇస్తున్నాయి. ఓడరేవు అధికారులు ఈ ప్రత్యేక హెచ్చరికలు సూచించినటువంటి సంకేతాలను ఎత్తయిన స్థంభాలమీద అమరుస్తారు. ఈ సంకేతాలు ఓడరేవులో వున్నటువంటి అన్ని ఓడలకు కనపడును. ఒక్కొక్క సంకేతము, ఒక్కొక్క వాతావరణ పరిణామమును సూచించును. ఈ సంకేతముల అర్థము ప్రతి నావికునకు తెలియును. వారు దానికి తగినట్లుగా జాగ్రత్తలు తీసుకొనెదరు. జాలర్లకు కూడ ఈ సంకేతముల అర్థము తెలియును గాన, వారు సముద్రములోనికి చేపలు పట్టుటకు పోరు. ఈ ప్రత్యేక సూచనలు వాయుగుండం ఏర్పడినప్పుడు రోజుకొకమారు, తుఫాను ఏర్పడినప్పుడు రోజుకు పలుమార్లు ఇచ్చెదరు. తుఫాను తీర ప్రాంతమును దాటిన తరువాత కానీ, దాటకుండా పొరుగు దేశమునకు పోవునపుడు గానీ ఈ సంకేతాలను తీసివేయుమని కూడా తుఫాను వాతావరణ హెచ్చరిక కేంద్రము ఓడరేవు అధికారులకు తెలియపరుచును.

## జాలర్లకు సేవ:

తీరప్రాంతములో నివసించే జాలర్లు ఎప్పుడు పడితే అప్పుడు సముద్రములోనికి చేపలు పట్టుటకు పోవుదురు.

వీరు తీర ప్రాంతము వదలి ఎక్కువ దూరము పోరు. వీరు నడి సముద్రములో చేపలు పట్టరు. వీరికి సదుపాయముగా వుండుటకొరకు, ప్రత్యేక సూచనలను వాతావరణ కేంద్రమువారు రోజుకు నాలుగు మార్లు ఇస్తున్నారు. ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, రాత్రి ఈ ప్రత్యేక సూచనలు తీరప్రాంత ఆకాశవాణి ద్వారా ప్రసారము చేస్తున్నారు. వాతావరణములో మార్పులు లేకపోయినను ఆవిషయముగూడా ప్రసారము చేస్తున్నారు. ఈ ప్రసారములు వినటానికి జాలర్లందరు ట్రాన్సిస్టర్ రేడియోలు ఉపయోగిస్తున్నారు.

## ఇంజనీర్లకు సేవ:

నదులు, ఉప నదులు వాటి పరిగ్రహణ ప్రదేశములలో కురియు వర్షము వలన ఎంత నీరు లభ్యమగునో తెలుసుకొనవచ్చును. ఇందుకొరకు వాతావరణ విభాగము వారు నదులు, ఉపనదుల పరిగ్రహణ ప్రదేశములలో వర్షపాతము కొలుచు పరికరములను అమర్చి, వాటి నుండి లభ్యమయ్యే సమాచారాన్ని డామ్ ఇంజనీర్లకు అందిస్తున్నారు. ఎచ్చటనయినా డామ్ కట్టడానికి ముందు ఆ ప్రదేశములో లభ్యమయ్యే నీరు గురించి తెలుసుకోవాలి. ఎందుకంటే తగినంత నీరు లభిస్తేనే డామ్ కట్టిన లాభము. ఇటువంటి సమాచారాన్ని రైల్వే ఇంజనీర్లకు వంతెనలు కట్టుటకు వాతావరణ శాఖవారు అందిస్తున్నారు.

పట్టణాలలో వర్షపు నీరు పోవుటకు చిన్న కాలవలను త్రవ్వుతారు. ఈ కాలువ వర్షపునీరు మొత్తము తీసుకొనగలిగి వుండాలి. ఇందుకొరకు వర్ష తీవ్రతను గుర్తించవలసి వుండును. వర్ష తీవ్రతను తెలుసుకొనుటకు వాటంతటవే (నిరంతరము) రికార్డు చేయగల వర్షపాతమును కొలుచు పరికరములు అవసరము. భారత వాతావరణ విభాగము ప్రతి ముఖ్యపట్టణములోను ఇట్టి పరికరములు అమర్చినారు. ఈ పరికరముల ద్వారా ఒకేసారి విడవకుండా ఎంత వర్షము కురియగలదో తెలుసుకొనవచ్చును. ఆ సమాచారమును పురపాలకశాఖ ఇంజనీర్లకు వాతావరణ శాఖ అందిస్తుంది. ఆ వివరములనుబట్టి పురపాలకశాఖవారు కాలవలుత్రవ్వుతారు.

## ప్రజా సేవ:

అన్ని సేవలలోకి ఇది చాలా ముఖ్యమయినది. ప్రజల సౌకర్యార్థం హైదరాబాదు వాతావరణ కేంద్రము వారు మధ్యాహ్న సమయములో వాతావరణ సమాచారమును ఆకాశవాణి ద్వారా ప్రజలకు అందిస్తున్నారు. ఈ సమాచారములో క్రిందటి 24 గంటలలో వున్నటువంటి వాతావరణ విశేషములు, అత్యధిక ఉష్ణోగ్రత, అత్యల్ప ఉష్ణోగ్రత, వర్షపాతము గురించి వివరములు ఉంటవి. దానికి తోడు రాగల 48 గంటలలో వాతావరణములో వుండగల మార్పులను సూచిస్తారు. అధిక వర్షపాత హెచ్చరికలు, పెనుగాలి హెచ్చరికలు అవసరమయినప్పుడు ఇందులో పొందుపరుస్తారు.

సముద్రములో అల్పపీడన ప్రాంతము ఏర్పడినప్పుడు వాతావరణ శాఖవారు 24 గంటలు అప్రాంతములోని వాతావరణ మార్పులను గమనిస్తూ ఉంటారు. ఈ అల్పపీడన ప్రాంతము తుఫానుగా మారగల సూచనలున్నచో ముందు భద్రతా హెచ్చరికలను వాతావరణ శాఖవారు ఇస్తారు. ఈ హెచ్చరికలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ అధికారులకే కాక, ఆకాశవాణి ద్వారా ప్రజలకు కూడ తెలియపరుస్తారు. ఈ భద్రతా సూచిక విన్నవెంటనే ప్రజలు తుఫాను తాకిడికి మానసికముగా తయారై, వారికి కావలసిన అన్ని సదుపాయములను చేకూర్చుకుంటారు.

తుఫాను తీరప్రాంతమునకు దగ్గరగా వచ్చినపుడు అంటే 24 గంటలలో కుంభవృష్టి కురియగల సూచనలున్నప్పుడు తుఫాను హెచ్చరికలు రోజుకు పలు పర్యాయములు ఆకాశవాణి ద్వారా ప్రసారము చేస్తారు. అప్పుడు ప్రజలు అప్రమత్తులై అన్ని జాగ్రత్తలు తీసుకొని ప్రాణనష్టము, ఆస్తినష్టము కాకుండా చూచుకోవాలి.

తుఫాను తీర ప్రాంతమునకు చేరువవుతున్నకొలదీ వాతావరణములో మార్పులు వస్తుంటాయి. మొట్టమొదట అధిక వర్షపాతము (కుంభవృష్టి) గురించి హెచ్చరిస్తారు. దాని తరువాత పెనుగాలులు, అధిక వర్షపాతము గురించి హెచ్చరిస్తారు. తుఫాను తీర ప్రాంతమును తాకుటకు ముందు ఉప్పెన, పెనుగాలులు, కుంభవృష్టి గురించి హెచ్చరిస్తారు. అంటే తుఫాను నడవడికనుబట్టి, తీవ్రతనుబట్టి తుఫాను హెచ్చరికలలో మార్పులు చేస్తూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ అధికారులను, ప్రజలను అప్రమత్తము చేస్తారు.

ఈ సూచనలలో రాగల విపత్తుగురించికూడ తెల్పుతారు. లోతట్టు ప్రాంతములు జలమయమగుట, చెట్లు విరిగిపోవుట, ఇండ్లు కూలిపోవుట, తంతి – విద్యుత్ తీగెలు తెగిపోవుట, విద్యుత్ స్తంభాలు పడిపోవుట లేక వంగిపోవుట – ఈ విషయములన్నియు వాతావరణ శాఖవారు ఇచ్చే తుఫాను హెచ్చరికలో పొందుపరుస్తారు. ప్రజలు తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి కూడ తెలుపుతారు. ఈ తుఫాను హెచ్చరికలు తు – చ తప్పకుండా విని, తగిన జాగ్రత్తలు తీసుకుంటే ప్రజలకు నష్టము నివారించవచ్చును.

భారత వాతావరణ విభాగము తమ వివిధ వాతావరణ కేంద్రములనుండి అనేక రకములయిన సేవలను ప్రజలకు, వ్యవసాయదారులకు, జాలర్లకు, కేంద్ర–రాష్ట్ర ప్రభుత్వ అధికారులకు, మరియు ఇతరులకూ అందిస్తున్నారు. కొత్త కొత్త పరికరములను అమర్చి, ఈ సేవలను మెరుగుపరుస్తున్నారు.

# భూ విజ్ఞాన శాస్త్రం

ఆచార్య టి.వి.యస్.ఆర్. క్షీరసాగర్, డాక్టర్ సి.కాశీపతి
జియాలజీ శాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం

భూ సంబంధమైన బృహత్తర విజ్ఞానాన్ని గురించి వివరించేది భూ విజ్ఞాన శాస్త్రం. ఇందులో సముద్ర విజ్ఞానం కూడా ఇమిడి ఉంటుంది. భూమి ఒక గ్రహం. ఇది సౌర వ్యవస్థలో ఒక భాగం. భూమి పుట్టుక మొదలు కొండలు, లోయలు, మైదానాలు మొదలైన భూ స్వరూపాల అవతరణ, భూమిలోని విభిన్న శిలల ఖనిజాల విజ్ఞానం, భూమిపై ప్రవహించే నదీజలాలు, హిమానీ నదాలు (glaciers), భూమిలోకి ఇంకి ప్రవహించే భూగర్భ జలాలు – వాటి సేకరణ, సద్వినియోగము ఇత్యాది అనేక విషయాలను గూర్చి తెలియచేసేది 'భూ విజ్ఞాన శాస్త్రం.' భూమి విభిన్న శిలల సముదాయం. ఇందులో అగ్ని శిలలు (Igneous Rocks), అవక్షేప శిలలు, (Sedimentary Rocks), అంతేకాక ఈ రెండు ఉష్ణ పీడనాలకు గురియైనపుడు ఏర్పడే రూపాంతర ప్రాప్త శిలలు (Metamorphic Rocks) కూడా ఉన్నాయి. ఒక శిల ఒకటి లేదా కొన్ని నిర్దిష్ట ఖనిజాల వల్ల ఏర్పడుతుంది. మానవునికి పనికి వచ్చే అనేక ఖనిజాలను, పారిశ్రామిక శిలలను గూర్చి పరిశీలించే శాస్త్ర విభాగాన్ని ఆర్థిక భూ విజ్ఞాన శాస్త్రం (Economic Geology) అంటారు. ఈ విభాగం మిగిలిన విభాగాల కంటే కడు ముఖ్యమైనది. విభిన్న శిలల తీరు, ఖనిజ శాస్త్రం, స్ఫటిక లక్షణం, భూ రసాయనిక విజ్ఞానం మరియు ఖనిజ సమ్మేళనాన్ని ఖనిజ శిలాశాస్త్రం (Ore Petrology) నేడు అతి ముఖ్యమైన భూ విజ్ఞాన శాస్త్ర భాగంగా గుర్తించబడింది. అంతే, కాక గనిశాస్త్రం (Mining), ఖనిజాన్వేషణ (Mineral Exploration), ఖనిజ ప్రసాధన (Mineral - Processing), దూరదర్శ ఛాయగ్రహణ (Remote Sensing), భూగర్భ జల శాస్త్రం (Hydrogeology) మొదలైన అనువర్తిత భూ విజ్ఞాన శాస్త్ర (Applied Geology) విభాగాలకు ఇది నాంది భూతమైనది కూడా. ఆర్థిక ఖనిజాలను లోహ ఖనిజాలని, అలోహ ఖనిజాలని, ఇంధనాలని విభజించవచ్చు. లోహ నిష్కర్షణకు కావలసినవి లోహ ఖనిజాలు. వీటిని ధాతు ఖనిజాలు (Ore Minerals) అంటారు. అనేక ఇతర అవసరాలకు, పారిశ్రామిక ప్రయోజనాలకు వాడేవి అలోహ ఖనిజాలు. పారిశ్రామిక శిలలు (Industrial Rocks) కూడా ఇందులో భాగమే. శక్తిని సమకూర్చే నేలబొగ్గు వంటి ఖనిజాలను ఇంధనాలంటారు. ఆర్థిక ఖనిజాలు మానవ నాగరికతకు పట్టుకొమ్మలు. పారిశ్రామిక ప్రగతికి, దేశపురోభివృద్ధికి వెన్నముక వంటివి. మానవునికి విశ్రాంతి సమయాలలోనే కాక, ఆత్మ రక్షణకు యుద్ధ సమయాలలో కూడా అవసరం. అందుకే మానవ జాతి చరిత్రలో ప్రస్తుత కాలాన్ని ఖనిజ యుగంగా చెప్పవచ్చు. మనకు ఎంతో కాలంగా తెలిసిన వివిధ ఖనిజాలకంటే నేటికాలంలో గ్రానైట్ అతి ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. ఇంకొక విధంగా ఆలోచిస్తే గ్రానైట్ మూలంగానే భూ విజ్ఞాన శాస్త్రం పామరులకు సైతం తెలిసిందని చెప్పకోవచ్చు. అందువల్ల ఖనిజ పరిజ్ఞానంలోనూ, ఖనిజ సంపద వినియోగంలోనూ ఆంధ్రప్రదేశ్ పూర్వాపరాలను గురించి యిక్కడ సంగ్రహంగా వివరించబడింది.

ఆంధ్రప్రదేశ్ ఖనిజ పరిజ్ఞానం: ఒక రాష్ట్రం యొక్క గాని, దేశం యొక్క గాని ఆర్థిక పరిస్థితి అందు లభించే ఖనిజ సంపద, వాటి యొక్క పరిమాణాలపై ఆధారపడి ఉంటుంది. ఈ ఖనిజాలను మానవ లోకము తొలుతనుండి అప్పటికున్న మేధా సంపత్తితో కాలానుగుణంగా పలురకాలుగా ఉపయోగించినట్లు చారిత్రకాధారాలు ఎన్నో ఉన్నాయి. ఆదిమానవుడు తన మనుగడకు, నిత్యావసరాలకు మొట్ట మొదట వాడిన ఖనిజ పదార్థాలు అలోహ సంబంధమైనవి. నిప్పుకు, పనిముట్లకు, ఆత్మరక్షణ కోసం ఆయుధాలకు ఇతడు చెకుముకి రాయి (flint), చెర్ట్, క్వార్ట్జ్ వంటి కఠిన ఖనిజాలను వాడాడు. మధ్య ప్రాచీన కాలంనాటి ఇటువంటి పనిముట్లు రేణిగుంట ప్రాంతంలో ఎన్నో తవ్వకాలలో బయల్పడినాయి. ఇతడు రకరకాల రాళ్లలో నీటి ఒరిపిడికి ప్రకృతిలో ఏర్పడ్డ నెర్రెలను ఆధారంగా చేసికొని శిలా గహ్వరాలను దొలుచుకొని నివసించాడు. ఆంధ్రప్రదేశ్‌లో ఇటువంటి శిలాగహ్వరాలను పెక్కింటిని పేర్కొనవచ్చు. ఉదా: స్ఫటిక శిలలలోని గుహాలలో యాదగిరి (నల్గొండ జిల్లా), ఇసుక రాళ్ళ గుహాలలో పెద్ద అహోబిలం

(కర్నూలు జిల్లా), సున్నపురాళ్ళ గుహలలో యాగంటి (కర్నూలు జిల్లా) మొదలగునవి ఎన్నో చెప్పవచ్చును. రానురాను నాగరికతాభివృద్ధితో మానవుడు స్టియటైట్ వంటి ఖనిజాలతో వంట పాత్రలు, మట్టి కుండలేకాక, ఇటుకలు, శిలలతో గృహనిర్మాణం మొదలైనవి చేయనేర్చినాడు. అందుకే చరిత్రకారులీకాలాన్ని శిలాయుగమన్నారు.

మానవుడు వాడిన అలోహ ఖనిజ పదార్థాలలో మట్టి లేదా సుద్ద ఒకటి. శిలల శైథిల్యం వల్ల ఇది ఏర్పడుతుంది. దీనిలో కాంజికాభ ధర్మం (Collordal Property) ఉండ టంవల్ల బంధిక సామర్థ్యం బాగా ఉంటుంది. మట్టిని – కుండలు మొదలు కోటలు వరకూ ఎన్నో రకాలుగా మన పూర్వీకులు ఉపయోగించారు. వరంగల్ కోట ఇందుకు మంచి ఉదాహరణ. కర్ణాటకలోని బ్రహ్మపురి వద్ద ఆంధ్ర నాగరికతను తెల్పు నాణాకు మట్టి పాత్రలు త్రవ్వకాలలో ఎన్నో బయల్పడినాయి. వీటిలో వర్ణ చిత్రాలన్నవి కూడా ఉన్నాయి. అంటే ఓకర్‌లు (రంగు సుద్దలు) అనే ఖనిజ విశేషాలను రంగుల పూతకు వాడటం వారికి సుపరిచితమని తెలుస్తూంది. మట్టి పరిశ్రమ నాటినుంచి నేటి వరకూ నిలిచిన ఒక భారీ ఖనిజ పరిశ్రమగా చెప్పవచ్చు. నాగరికతతో పాటు మానవుని ఆధ్యాత్మిక చింతన పెరిగి వైదిక, బౌద్ధ, జైన, మతాలు ప్రబలి, అనేక ఆలయాల నిర్మాణం జరిగింది. ఈ నిర్మాణాలలో ఇటుకలనేకాక, రకరకాల శిలలను కూడా వాడారు. ఇటుకలను బౌద్ధ మహా చైత్యాల కట్టుబడిలో వాడారు (అమరావతి, నాగార్జున కొండ మొదలగునవి). సన్న కణాలతో కూడిన స్ఫటిక శిలలు ఆలయాల విశిష్ట శిల్పానికి కారణ భూతమయ్యాయి. (ఉదా: వరంగల్, పానుగల్లు, లేపాక్షి మొదలగునవి), వీరు స్ఫటిక శిలలనే కాక కఠినత గల ఇసుక రాళ్ళ వంటి అవక్షేప శిలలను (ఉదా: అణిమల, గండికోట, అహోబిలం, రామల్ల కోట, శ్రీశైలం మొదలగునవి), చలువ రాళ్ళవంటి రూపాంతర ప్రాప్త శిలలను (ఉదా: కొలనుపాక జైన మందిరం, నల్గొండ జిల్లా) కూడా వాడారు.

**అమూల్య ప్రస్తరాలు:** నాగరికుడైన మానవుని అలంకారిక ప్రయోజనాల కోసం తొలుదొల్తగా ఆకర్షించినవి వజ్రము మొదలైన అమూల్య ప్రస్తరాలు (Gem stones). అమూల్య ప్రస్తర విజ్ఞానంలోను, ఉత్పత్తి – వినియోగాలలోను భారత దేశపు చారిత్రక ప్రసిద్ధి ప్లినీ (క్రీ.శ. 28–79) మొదలైన రోమన్, గ్రీక్ రచయితల మూలంగా మనకు తెలుస్తుంది. శుక్రనీతి, శుశ్రుత, వరాహమిహిరుని బ్రహత్సంహిత, కౌటిల్యుని అర్థశాస్త్రం, బుద్ధభట్టు రత్న పరీక్ష మహా భారతం, గరుడ పురాణం, అగ్ని పురాణం, భోజుని యుక్తి కల్పతరువు మొదలైన ప్రాచీన గ్రంథాలు మన అమూల్య ప్రస్తర విజ్ఞానానికి నిదర్శనాలు. బుద్ధభట్టు తన రత్న పరీక్షలో అమూల్య ప్రస్తారాలను 9 రకాలుగా వర్గీకరించినాడు. నవ రత్నాలన్న సాంకేతికం ఇట్లు వచ్చి వుండవచ్చు. అయితే, వీటిలో ముత్యం, పగడం తప్ప మిగిలినవన్నీ ఖనిజ విశేషాలే. వజ్రాన్ని డైమండ్‌గాను, మరకతం లేదా పచ్చ (Emarald)ను బెరిల్‌గాను, మాణిక్యం లేదా కెంపు (Ruby)ను, ఇంద్రనీలం (Saplire) ను కొరండమ్ ఖనిజాలుగాను, గోమేధికాన్ని జిర్కాన్‌గాను, పుష్యరాగాన్ని టోపాజ్‌గాను, వైడూర్యాన్ని క్రైసోబెరిల్‌గాను చెప్పవచ్చు. ఇవేకాక క్వార్ట్జ్ ఖనిజ జాతులను మన పూర్వీకులు ఎంతో ప్రాచీనకాలం నుంచీ అమూల్య – లఘుమూల్య ప్రస్తరాలు (Semi-precious stones)గా వాడారు. ఇందులో శ్రేష్ఠమైన ఓపల్ (Amorphous Quartz) ఖనిజం అమూల్య ప్రస్తరాల కోవలోకి వస్తుంది. ఓపల్ అనే పేరు ఉపలం (రాయి) అనే సంస్కృత శబ్ద జన్యం.

క్రీ॥శ॥ 1725 లో బ్రెజిల్ దేశంలో వజ్రాలను కనిపెట్టేంత వరకూ అంటే రెండు మూడు సహస్రాబ్దాలు యావ త్ప్రపంచానికి వజ్రాలను సరఫరా చేసిన కీర్తి భారతదేశానికే దక్కింది. ఇవి ముఖ్యంగా గోల్కొండ (ఆంధ్రప్రదేశ్), పన్నా (మధ్యప్రదేశ్) వజ్రాలు. మన రాయలసీమ రత్నాలసీమ. అందుకే భారతదేశం రత్నగర్భ అయింది. క్రీ॥శ॥ 1665 లో టెవెర్‌నీర్ అనే ఫ్రెంచ్ నగల వ్యాపారి గోల్కొండ, బీజాపూర్ రాజ్యాల వజ్రాల గనులను గూర్చి విపులంగా వర్ణించినాడు. ప్రపంచంలోని గొప్ప చరిత్రాత్మక వజ్రాలన్నీ – కోహినూర్, నిజాం, ఓర్‌లాఫ్, హోప్‌పిట్ లేదా రీజెంట్ మొదలైనవన్నీ గుంటూరు జిల్లాలోని కొల్లూరు వద్దను, కృష్ణా జిల్లాలోని పరిటాల వద్దను, కృష్ణానది గుండ్ల ఇసుకలో లభించినవే. భారత భూ విజ్ఞాన సర్వేక్షణ శాఖ (Geological Survey of India) వారి భౌమ మానచిత్రం (Geological Map) వల్ల ఆంధ్ర ప్రదేశ్‌లో 76 చోట్ల వజ్రసేకరణ జరిగినట్లు తెలుస్తూంది. వజ్రాలు నది ఇసుకలోను, కంగ్లా మరేట్ అనే అవక్షేప శిలలలోను లభిస్తున్నప్పటికీ వీటికి మూలాధారమైనవి అగ్నిపర్వత పైప్ శిలలు. మాగ్మా శిలాద్రవం నుంచి వజ్రాలు ముందుగా వేరై అవి మౌలిక శిలలలో వికీర్ణాలు (Disseminations) గా లభిస్తాయి. అనంతపురం జిల్లాలోని వజ్రకరూర్ సార్థక నామధేయం గల వజ్రభూమి. భారత భూ విజ్ఞాన సర్వేక్షణ శాఖవారు వజ్రకరూర్ ప్రాంతంలో 3, లత్తవరం ప్రాంతంలో 2 ఆఫ్రికాలో కింబర్ లైట్‌లను పోలిన అతి మౌలిక పైప్ శిలలను ఇటీవల గుర్తించారు. సన్నగిల్లిన ఈ అమూల్య సంపద కోసం మన రాష్ట్రంలో నిర్విరామ కృషి ఎంతైనా జరగవలసి ఉంది.

**లోహ విజ్ఞానం:** మన పూర్వీకుల లోహ విజ్ఞానం గురించి కూడా చెప్పవలె. ప్రస్తుతం అనేక లోహపు గనుల (ఉదా:

గుంటూరు జిల్లాలోని అగ్ని గుండాల రాగి, సీసం, గనులు మొ॥) వద్ద మనకు కనపడే ప్రాచీన త్రవ్వకాలు మన పూర్వీకుల లోహవిజ్ఞానానికి నిదర్శనాలు. అంతేకాక, ప్రస్తుత ఆధునిక ఖనిజాన్వేషణా కార్యక్రమాలకు ఇవి మార్గదర్శకాలు, సహాయకారులు కూడా. బంగారాన్ని శాతవాహనులు, వెండిని యవనులు, శాక్యులు; రాగిని కుషాణులు; నాణాలకోసం విరివిగా వాడారు. మెదకు జిల్లా కొండాపురంలోను, గుంటూరు జిల్లా చేబ్రోలులోను శాతవాహన చక్రవర్తుల నాణాలు లభించాయి. రాగి, ఇనుప వస్తువులు నాగార్జున కొండవద్ద లభించాయి. తగరం, సీసం, తుత్తునాగం, పాదరసం వంటి లోహాల వాడకం కూడా మన పూర్వీకులకు తెలుసు. కంచువంటి మిశ్రమ లోహాల (Alloy metals) ను తయారుచేయటం కూడా వీరికి సుపరిచితం. కంచుతో అనేక వస్తువులు, బుద్ధ విగ్రహాలు కూడా వీరు చేసేవారు.

**ఆంధ్రప్రదేశ్ - ఖనిజ సంపద:** ఇక మన రాష్ట్రంలోని ఖనిజ సంపదను వరుసగా లోహాలు, అలోహాలు, ఇంధనాలు గూర్చి సంగ్రహంగా పరిశీలిద్దాం. ఈ మధ్యకాలములో ప్రాముఖ్యత సంతరించుకున్న గ్రానైట్ రాళ్ళ గురించి కూడా తెలుసుకుందాం.

**లోహాలు:** లోహాలను గుణగణాలనుబట్టి అమూల్య లోహాలు (బంగారం మొ॥వి), ఇనుప మిశ్రమ లోహాలు (ఇనుము, మాంగనీస్ మొ॥వి), నాన్ - ఫెర్రస్ లోహాలు (రాగి మొ॥వి), తేలిక లోహాలు (అల్యూమినియమ్ మొ॥వి), రేడియోధార్మిక లోహాలు (యురేనియం మొ॥వి) అని పలురకాలుగా విభజించవచ్చు.

**అమూల్య లోహాలు:** బంగారం ఎక్కువగా సహజ సిద్ధంగా (Native state) (ఇతర మూలకాలతో కలియక) లభించే లోహం. బంగారం అనంతపూర్ జిల్లాలోని రామగిరి ప్రాంతంలో లభిస్తుంది. రామగిరి బంగారం క్షేత్రం పెనుగొండ పమిడి షిష్ట్ మేఖల అనుదైర్ఘ్యం వెంబడి 15 కి.మీ. పొడవున వ్యాపించి ఉంది. ఇందులో బంగారం లభించే లోడ్ వ్యవస్థల (Lode systems) లో నిర్దుష్టమైన వాటిని అయిదింటిని గుర్తించారు. జంబమాను, ఎప్పమాను, ఎర్రప్ప, గుంట్లప్ప అనే స్థలాలను గనుల తవ్వకానికి ఉపయుక్తమైన వాటిగా గుర్తించారు. ఇటీవల 10.5.1984 నాడు ఈ క్షేత్రంలో ఎప్పమాను గనిని బంగారం ఉత్పత్తి కోసం ఆవిష్కరించటం జరిగింది. బంగారం క్వార్ట్జ్ లోడ్‌లలో సన్నరేణువులుగా విస్తరించబడి లభిస్తుంది. ఈ క్షేత్రంలో ఉత్పత్తి రోజుకు 250 టన్నుల చొప్పున సాలుకు 50,000 టన్నుల స్వర్ణభరిత క్వార్ట్జ్ ధాతువును మొదటి సంవత్సరంలోను, తరువాత సంవత్సరంలో అది 75,000 టన్నులకు పెంచాలని పథకం వేశారు. అనుకున్న ఈ పథకం ప్రకారం సాలుకు 300 కి.గ్రా. బంగారం ఉత్పత్తి అవవలె. ఆంధ్రప్రదేశ్‌లో ఇదికాక చిత్తూరు జిల్లాలోని విశ్వనాథం (బిశానత్తం), చిగరకుంట ప్రాంతాలలో కూడా టన్నుకు 3.5 గ్రాములు అంశకల నిక్షేపాలు ఉన్నట్లు అన్వేషణా కార్యక్రమాలలో ధ్రువపడింది.

**ఇనుప - మిశ్రమ లోహాలు:** ఇనుము - ఉక్కు లేనిదే నేటి నాగరిక జీవనమే లేదు. ఉక్కు తయారీలో ఇనుముకు ప్రత్యేక అవసరాలను బట్టి మాంగనీసే కాక క్రోమియం, మాలిబ్డినమ్, టంగ్‌స్టన్, నికెల్ మొదలైన లోహాలను కలుపుతారు. వీటిని యథాతథంగా లోహాల రూపంలో కాక మిశ్ర లోహాల రూపంలో అంటే ఫెర్రో - మాంగనీస్, ఫెర్రోక్రోమ్ మొదలైన రూపాలలో ఉక్కుకు చేర్చవలె. అంటే ఉక్కు తయారీకి అయా లోహాల నిష్కర్షణే కాక మిశ్రలోహాల తయారీ కూడా దేశానికి అవసరమన్నమాట. మాగ్నటైట్, హెమటైట్ అనేవి ముఖ్యమైన ఇనుప ఖనిజాలు. మన రాష్ట్రంలో ఇనుప రాయి ప్రకాశం జిల్లాలో పట్టిత మాగ్నటైట్ - హెమటైట్, క్వార్ట్జైట్, షిష్ట్ శిలలలో లభిస్తుంది. ఈ ప్రాంతంలోని పట్టీలను ఒంగోలు గ్రూప్, గండ్లకమ్మ గ్రూప్ అని రెండింటి క్రింద విభజించారు. వీటిలో ఒంగోలు గ్రూప్ ప్రధానమైనవి. ఈ ప్రాంతంలో ఇనుప ధాతువు నిలవలు 29.5 కోట్ల టన్నుల (30.6-37.1% ఇనుము కలవి) మేరకు ఉంటాయని అంచనా. ఇదికాక పట్టిత హెమటైట్ క్వార్ట్జైట్‌తో కూడినవి అదిలాబాద్, కరీంనగర్, అనంతపూర్, చిత్తూరు జిల్లాలలోను, పట్టి, మాగ్నటైట్ - హెమటైట్ నిధులు ఖమ్మం జిల్లాలోను ఉన్నాయి. కర్నూలు జిల్లాలో (వెల్దుర్తి, రామల్లకోటల మధ్య), కడప, నెల్లూరు, వరంగల్ జిల్లాలలో కూడా ఇనుప ధాతువు లభిస్తుంది.

హెమటైట్ నిక్షేపాలలో ఇనుము అంశ 55 నుండి 60 శాతం వరకూ ఉంటుంది. చిత్తూరు, నెల్లూరుల యందు, సిరసనం బేడు, రోసనూరు మధ్య హెమటైట్ మరియు అవశిష్ట ఇనుప ధాతువుగా మంచి లోహ శాతంతో లభ్యమవుతుంది. నిజామాబాద్ జిల్లాలో కూడ తక్కువ అంశగల ఇనుప ధాతువు రిపోర్ట్ కాబడింది. మన రాష్ట్రంలో విశాఖపట్నం వద్ద ఒక పెద్ద సమీకృత ఉక్కు కర్మాగారం (Visakhapatnam Steel Plant) నిర్మించబడి, దేశంలోకల్ల పెద్ద కర్మాగారంగా రూపుదిద్దుకుంది. రష్యాదేశ సహాయంతో నిర్మించిన ఈ కర్మాగారం సాలుకు 3.5 మిలియన్ టన్నుల ద్రవ రూపమైన ఉక్కు ఉత్పత్తి చేసే ప్రతిష్ఠాపిత సామర్థ్యం (Installed Capacity) కలిగి యున్నది. యింకా మన రాష్ట్రంలో కొత్తగూడెం వద్ద పాల్వంచ (Paloncha)వద్ద స్పాంజ్ ఐరన్ ప్లాంట్ (Spange Iran Plant) నిర్మించబడింది. మన దేశంలో తక్కువగా లభించే కోకింగ్ బొగ్గును సంరక్షించి, విస్తారంగా ఉన్న నాన్

కోకింగ్ బొగ్గును ఉక్కు తయారీలో ఉపయోగించే పద్ధతి మీద భారత ప్రభుత్వం రెండు ప్రాజక్టులకు స్పాంజ్ ఐరన్ తయారీకి పారిశ్రామిక లైసెన్స్‌లను మంజూరు చేసింది. అందులో ఒకటి ఇది. 1980 జూలై నెలలో పాల్వంచ (Paloncha) వద్ద UNDP (United Nations Development Programme) సహాయంతో స్పాంజ్ ఐరన్ తయారీకి ఒక ప్రత్యేక ప్రాజెక్ట్ ప్రారంభించబడింది. ఇది నాన్ కోకింగ్ బొగ్గును ఉపయోగించే ఒక ప్రత్యక్ష క్షయీకరణ పద్ధతిపై నడుస్తుంది. ఈ సాంకేతిక సహాయం మనం దిగుమతి చేసుకుంటున్నాం. ఇది ప్రారంభంలో సాలుకు 30,000 టన్నులు ప్రతిస్థాపిత సామర్థ్యం కలది.

మాంగనీస్ ఇనుప ధాతువు నుండి ఇనుప లోహాన్ని రూపొందించటంలోను, ఉక్కు తయారీలకు కూడా అత్యవసరమైన ముడిపదార్థం. మాంగనీస్ ఖనిజాలు ముఖ్యంగా విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల (కోడూరు, గర్భాం, చీపురుపల్లి మొ॥వి) లోను, కొంతవరకు విశాఖపట్నం జిల్లాలో (నెల్లిమర్ల మొ॥వి)ను లభిస్తాయి. కోడూరు ప్రసిద్ధ మాంగనీస్ క్షేత్రం. అందుకే ఈ నిక్షేపాలను కోడురైట్ జాతి నిక్షేపాలని పిలిచేవారు. మధ్యప్రదేశ్‌లోని గోండైట్ జాతి నిక్షేపాల తరువాత ఇవే ప్రసిద్ధి చెందినవి. మాంగనీస్ తూర్పు కనుమలలో ఒక భాగమైన ఖాండొలైట్ శిలలలో రూపాంతర ప్రాప్త అవక్షేప నిక్షేపంగా లభిస్తుందని పరిశోధనల వల్ల వెల్లడైంది. ఈ ప్రాంతంలో మొత్తం మాంగనీస్ నిధులు 15 లక్షల టన్నులమేరకు ఉండవచ్చని అంచనా. ఇవి మాంగనీస్ పాలు తక్కువ ఉండే నిక్షేపాలు. లోహ ప్రసాధన పద్ధతులవల్ల వీటి శ్రేణిని అభివృద్ధి పరుస్తారు. కోడూరు వద్ద గరివిడిలో ఫెర్రో – మాంగనీస్, ఫెర్రో – క్రోమ్ తయారుచేసే కర్మాగారాలు పని చేస్తున్నాయి. ఇవియే కాకుండా గుంటూరు జిల్లాయందు సిరిగిరిపాడు మరియు ఆదిలాబాద్ యందును కూడా మాంగనీస్ లభ్యమగుచున్నది. ఆదిలాబాద్ మాంగనీస్ ఖనిజము మన దేశములో లభ్యమయ్యే మాంగనీస్ ఖనిజాలలో కంటే అతి చిన్న వయసు కలిగి అత్యధిక ఖనిజ శాతం కలిగియున్న ధాతువు.

క్రోమియం స్టెయిన్‌లెస్ ఉక్కు తయారీకి అవసరమైన లోహం. ఉక్కు తయారీలో దీనిని ఫెర్రో – క్రోమ్ రూపంలో కలుపుతారు. క్రోమియం "క్రోమైట్" అనే ఖనిజం నుండి మనకు లభిస్తుంది. కృష్ణాజిల్లాలోని కొండపల్లి వద్ద క్రోమైట్ లభిస్తుంది. క్రోమైట్ అతి మౌలిక శిలలో అంతక్షేపణలుగా లభిస్తుంది. ఈ శిలలు ఇంచుమించు ఖమ్మం జిల్లా వరకూ వ్యాపించి ఉన్నాయి. ఇందులో $CrO_3$ శాతం 39 నుంచి 55 వరకూ ఉంటుంది. ఖమ్మం జిల్లాలో క్రోమైట్ భీమవరం, గౌరారం, జన్నవరం, ఇమాంనగర్, శ్రీరామగిరి, లింగంపేట్ల వద్ద అతి మౌలిక శిలలలో కటకాకార సంచితులుగా లభిస్తుంది. తక్కువ శ్రేణి క్రోమైట్ పశ్చిమ గోదావరి జిల్లా టేకూరు (ఎనుకొండ) ప్రాంతంలో కూడా లభిస్తుంది. ఇచ్చట క్రోమైట్ ఖనిజం మరియు సంబంధిత పైరాగ్జినైట్ శిలలలో ప్లాటినం, బంగారం, పల్లాడియం మొదలైన అతి కీలక మూలకాలు ఉన్నట్లుగా ఈ మధ్యన జరిపిన పరిశోధనలలో తెలియవచ్చింది. అధిక వేగపు ఉక్కు తయారీకి మాలిబ్డినమ్ లోహం అవసరం. కరీంనగర్, మెదక్ జిల్లాలలోని గ్రానైట్, పెగ్మాటైట్ శిలలలో మాలిబ్డినైట్ ఖనిజం లభిస్తుంది. అధిక సామర్థ్యంగల నిర్మాణాత్మక ఉక్కు తయారీకి వెనేడియం లోహం అవసరం. వెనేడియం కృష్ణా జిల్లాలోని తిరువూరు ప్రాంతంలో మాగ్నటైట్ శిలలలో లభిస్తుంది. లోహాలన్నిటిలో అధిక ద్రవీభవన స్థానం (3350o$^C$) గలది టంగ్స్టన్ (వోల్‌ఫ్రమ్) అధిక వేగపు ఉక్కు తయారీకి ఇది అవసరం. నాన్ – ఫెర్రస్ లోహాల కోతకు, వెల్డ్ చేయటానికి ఇది కావాలి. వజ్రం తరువాత కఠినతలో ముఖ్యమైనవి టంగ్స్టన్ కార్‌బైడ్‌లు. అందువల్ల అందుబాటులో లేని ఖరీదైన పారిశ్రామిక వజ్రాల ప్రత్యామ్నాయం ఈనాడు ఛిద్రణా (Dorlling) కార్యక్రమాలలో వీటిని వాడుతున్నారు. టంగ్స్టన్ ఖనిజాలు (పోల్‌ఫ్రమ్, షీలైట్) పెగ్మటైట్ శిలలలో లభిస్తాయి. ఖమ్మం, తూర్పు – పశ్చిమ గోదావరి జిల్లాల్లోని ఖాండాలైట్ శిలలలో గల గ్రాఫైట్ నిక్షేపాల వద్ద పోల్‌ఫ్రమ్ భరిత పెగ్మటైట్‌లు ఉన్నాయి. వీటిలో రంపచోడవరం ఏజన్సీలోని బూరుగుబంద నిక్షేపం ముఖ్యమైనది.

నాన్ - ఫెర్రస్ లోహాలు: నాన్–ఫెర్రస్ లోహాలలో ప్రధానమైనది రాగి. అధిక విద్యుద్వాహకత, తీగగా – రేకుగా సాగే లక్షణం, మిశ్ర లోహాలకనువైన ధర్మం ఈ లోహ ప్రయోజకత్వానికి ప్రధాన కారణాలు. రాగి నిక్షేపాలు అగ్నిగుండాల (గుంటూరు జిల్లా), గని – కాలువ (కర్నూలు జిల్లా), గరిమనిపెంట (నెల్లూరు జిల్లా), మైలారం – ఎల్లంబైలు (ఖమ్మం జిల్లా) మొదలగుచోట్ల ఉన్నాయి. వీటన్నిటిలో ప్రధానమైనవి అగ్నిగుండాల నిక్షేపాలు. ఇక్కడ రాగితోపాటు సీసంకూడా విరివిగా లభిస్తుంది. ఈ నిక్షేపాలను స్థూలంగా మూడు బ్లాక్‌లు (blocks) గా వర్గీకరించారు. 1. బండలమెట్టు, 2. నల్గొండ, 3. ధూకొండ. ఇందులో బండలమెట్టు బ్లాక్‌లో ప్రధానంగా గెలీనా, కొంతవరకు చాల్కోపైరైట్, స్ఫాలరైట్, పైరైట్ ఖనిజాలున్నాయి. ఈ ధాతువులలో కొద్దిపాళ్ళలో ఉండే ఇతర లోహాలు వెండి (టన్నుకు 25 గ్రా.), కోబాల్ట్, నికెల్, కాడ్మియం కలిసి 0.1% లోపుగా ఉంటాయి. నల్లగొండ ధాతువులో ప్రధానంగా చాల్కోపైరైట్, బోర్నైట్ ఖనిజాలు, కొంతవరకు చాల్కోసైట్, పైరైట్‌లు ఉంటాయి. ఈ ధాతువులలో

కొద్దిపాళ్లలో ఉండే ఇతర లోహాలు: కోబాల్ట్ (0.6%), నికెల్ (0.5%), వెండి (టన్నుకు 25 గ్రా.), మాలిబ్డినమ్ కూడా ఉన్నాయి. ధూకొండ బ్లాక్ ధాతువులలో ప్రధానంగా చాల్కో-పైరైట్, గెలీనా, కొంతవరకు పైరైట్ ఉంటాయి. ఈ మొత్తం నిక్షేపాలలో 6.385 మిలియన్ టన్నుల రాగి, 11.919 మిలియన్ టన్నుల సీసం అనుమిత ధాతు నిలవలు (Inferred Ore reserves) ఉన్నాయని భూ విజ్ఞాన సర్వేక్షణ శాఖవారి అంచనా. ఈ ధాతువులనుండి లోహాలను సాంద్రీకరించటానికి (Concentration) కేంద్ర ప్రభుత్వం ఒక పైలట్ ప్లాంట్‌ను మంజూరు చేసింది. ఈ నిక్షేపంవల్ల ప్రస్తుతం దేశంలో ఉన్న రాగి కొరత తీరగలదని శాస్త్రజ్ఞుల విశ్వాసం. సీసం విషయంలో కూడా ఈనాడు ఈ నిక్షేపం దేశావసరాలకు బాగా అదుకొంటుంది. 1985 లో మన దేశం ఉత్పత్తి చేసిన సీసం ధాతువు, సాంద్రీకరణాలలో, 4538 టన్నులు ఈ గనులనుండి ఉత్పత్తి అయింది. ప్రభుత్వ రంగంలో పని చేస్తూన్న విశాఖపట్నం సీసం – తుత్తునాగం పగలకం (Smetter)లో ఈ ధాతువులు సాంద్రీకరింపబడతాయి. ఈ సాంద్రీకరణం చేసేటప్పుడు పగలకంలో అనుజన్యాలైన వెండి మొదలైన ధాతువులు కూడా మనకు లభిస్తాయి. ఇతర నాన్-ఫెర్రస్ లోహ నిక్షేపాలలో దేవరకొండ (నల్గొండ జిల్లా), ఉమిడివరం (ప్రకాశం జిల్లా) సీసం నిక్షేపాలు, వీరికుంట – జంగమ రాజపల్లె (కడప జిల్లా), సీసం – తుత్తునాగం నిక్షేపాలు చెప్పుకోతగ్గవి.

తేలిక లోహాలు: తేలిక లోహాలలో అల్యూమినియం "బాక్సైట్" ఖనిజం వల్ల లభిస్తుంది. బాక్సైట్ ఖనిజం పట్ల మన రాష్ట్రం దేశంలోనే కాక యావత్ప్రపంచంలోనే విశ్వ విఖ్యాతి సంతరిచుకోబోతూంది.

ఇటీవల తూర్పుకనుమలలోని ఖోండలైట్ శిలలలో విశాఖపట్నం జిల్లాలోని గాలికొండ, రక్తకొండ, చింతపల్లి; తూర్పుగోదావరి జిల్లాలోని దుంకొండ మొదలైన ఎత్తు పీఠ భూములలో విస్తారమైన బాక్సైట్ నిలవలను గుర్తించారు. మొత్తం మన దేశానికి అంచనా వేసిన 2500 మిలియన్ టన్నుల నిలవలలో సుమారు 2000 మిలియన్ టన్నులు తూర్పు కనుమలలో లభిస్తాయని అధునిక సమాచారాన్ని బట్టి తెలుస్తూంది. అయితే, ఈ ప్రాంతంలో బాక్సైట్ ధాతు సేకరణ ఇంకా జరగవలసి ఉంది. అల్యూమినియం లోహం భూపటలంలో పుష్కలంగా లభించే మూలకాలలో ఒకటి. అయినా, అల్యూమినియం భరిత శిలలలో ఉష్ణ, ఉపోష్ణ మండలాలలో శిలల శైథిల్యం వల్ల అవశిష్ట ధాతువుగా సంచయనం చెందే బాక్సైట్‌కు ఎన్నో అనువైన భౌమకాలమాన పరిస్థితుల అనుకూల్యం ఏర్పడినా వికోషీకరణానికి కొట్టుకు పోకుండా స్వస్థానంలో పరిరక్షింపబడటం జరగవలసి ఉంది. ఎంతోకాలం నుంచి బాక్సైట్ ధాతువు గురించి ప్రపంచానికి తెలిసినా బాక్సైట్ నుంచి అల్యూమినియం విద్యు విశ్లేషక పద్ధతి ద్వారా నిష్కర్షణ చేయటం కనిపెట్టేంత వరకూ అల్యూమినియం లోహం పెద్ద మొత్తాలలో వ్యాపార సరళికి అందుబాటులోనికి రాలేదు. ఒక టన్ను అల్యూమినియం లోహ నిష్కరణకు సుమారు 4 టన్నుల బాక్సైట్, 20,000 కిలోవాట్ గంటల విద్యుచ్ఛక్తి, ఇతర ముడి పదార్థాలు ఆవశ్యక తమవుతాయి. ఈనాడు రాగి మొదలైన కొరత లోహాలకు బదులుగా దేశంలో అల్యూమినియంను ప్రత్యామ్నాయ లోహంగా వాడుతున్నారు. ఈ విభిన్న ప్రయోజనాల దృష్ట్యా ఈ బాక్సైట్ నిలవలను పారిశ్రామికావసరాలకు ఉపయోగించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఒరిస్సాలోని తూర్పు కనుమల నుండి ఇప్పటికే ఉపరితలం గనుల ద్వారా బాక్సైట్‌ను వెలికితీసి NALCO ద్వారా ఈ ఖనిజమును విదేశాలకు ఎగుమతి చేయుచున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో మున్న ఈ భారీ ఖనిజ సంపదను వెలికి తీసి ఒక అల్యూమినియం ప్లాంట్‌ను నెలకొల్పుటకు కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వాలు ఎంతో కాలంగా కృషి చేయుచున్నారు. అయితే, కొంత రిజర్వు ఫారెస్ట్ ప్రాంత మూలంగాను మరియు పర్యావరణ సంబంధిత శాఖల వల్లను కొంత వరకు యీ ప్రాజెక్టు ఆలస్యము అయినట్లుగా తోచుచున్నది. ఈ కార్యాచరణ వలన ప్రభుత్వానికి ఆర్థిక పుష్టి మరియు క్రొత్త ఉపాధి కల్పన కల్పించబడవచ్చు.

టైటానియం లోహాన్ని భావిలోహం (Metal of the future) అంటారు. నిర్మాణాత్మక ప్రయోజనాలకు వాడే ఉక్కులో టైటానియంను ఫెర్రో – టైటానియం రూపంలో కలుపుతారు. టైటానియం ఇల్మనైట్, రూటైల్ అనే ఖనిజాలవల్ల లభిస్తుంది. ఇల్మనైట్‌ను ఎక్కువగా ఫెర్రో-టైటానియం తయారీకి, శ్వేత వర్ణదాల (White Pigments) కోసం రంగుల పరిశ్రమలలోను, రూటైల్‌ను ఆర్క్ వెల్డింగ్ పరిశ్రమలోనూ ప్రధానంగా వాడతారు. విశాఖపట్నం మొదలైన తీర ప్రాంతాలలో ఈ ఖనిజాలు యాంత్రిక సాంద్రీకరణం (Mechanical Concentration) అనే భౌమ ప్రక్రియ కారణంగా ఏర్పడే ప్లాసర్ ఇసుకలో లభిస్తాయి. మన దేశంలో ఇవి ప్రధానంగా కేరళ – తమిళనాడు కోస్తా ప్రాంతాలలో లభిస్తున్నప్పటికీ, ఆంధ్రతీర ప్రాంతాలలో కూడా పారిశ్రామిక ప్రయోజనాల దృష్ట్యా ఈ ఖనిజాలను సేకరించవలసిన అవసరం ఉంది. ఆంధ్రప్రదేశ్ తీరం వెంబడి ఎన్నో విలువైన ప్లాసర్ ఖనిజాలు ఉన్నట్లుగా వివిధ సర్వేల వల్ల తెలుస్తుంది. ఈ తీరంలో ఉత్తరాంధ్ర ప్రాంతములో ఇల్లమనైట్, మోనజైట్, రూటైల్, సిల్లిమనైట్ జిర్కాను, గార్నెట్, మాగ్నటైట్ మొదలైన ఇసుక సాంద్రతలు ఉన్నాయి. ఈ మధ్యను AMD మరియు IREL

ఈ ప్రాంతములో విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాల తీరం వెంబడి జరిపిన పరిశీలనలలో ఇల్లమనైట్, గార్నెట్, సిల్లిమనైట్ ఖనిజ సంపద విరివిగా నున్నట్లు తెలియ వచ్చినది. ఈ నిల్వల సాయంతో సుమారు 50 కోట్ల పెట్టుబడితో కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వాలు భీమిలి వద్ద ఒక ప్లాంట్‌ను నెలకొల్పే విషయమై ప్రయత్నించుచున్నారు. ఇప్పటికీ తెలిసిన సమాచారం ప్రకారం కొద్ది సంవత్సరాలలో ఈ ప్లాంట్ సాధ్యపడేటట్లుగా అగుపిస్తుంది. ఆధునిక సమాచారాన్నిబట్టి మిశ్రధాతునిగమ్ లిమిటెడ్ అనే సంస్థ హైదారాబాద్‌లో టైటానియం ధాతువుల నుంచి సాలుకు 200 – 250 టన్నుల స్వచ్ఛమైన టైటానియం లోహాన్ని, మిశ్రమ లోహాలను ఉత్పత్తి చేసే సామర్థ్యం గల ఒక లోహసేకరణ ప్లాంటును నెలకొల్పుతున్నట్లు తెలుస్తూంది. దీనికి కావలసిన సాంకేతిక విజ్ఞానం ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ దేశాల నుంచి గ్రహిస్తుంది.

**రేడియో ధార్మిక లోహాలు:** విశాఖపట్నం మొదలగు తీర ప్రాంతాలలో ఇల్మనైట్, రూటైల్‌ల వంటి టైటానియం ఖనిజాలేకాక మోనజైట్ వంటి రేడియో ధార్మిక ఖనిజాలు, సిల్లిమనైట్, గార్నెట్ వంటి అలోహ ఖనిజాలు కూడా ప్లాసర్ నిక్షేపాలుగా ఇసుకలో లభిస్తాయి. మోనజైట్ రేడియో ధార్మిక ధర్మంగల థోరియం లోహ ఖనిజం. సంఘటనంలో మోనజైట్ సీరియం, లాంతనమ్ మొదలగు విరళ మృత్తికాలోహాల (Rare earth metals) ఫాస్ఫేట్, దానిలో థోరియం ($Tho_2$) 1–10% వరకు అరుదుగా 30% వరకూ ఉంటుంది. థోరియం పరమాణు శక్తినిచ్చే మూలద్రవ్యం. మోనజైట్ నుండి థోరియంను వేరుచేసిన తరువాత అందులోని సీరియం సముదాయపు విరళ మృత్తికలను ఎన్నో ప్రయోజనాలకు వాడతారు. అదే విధంగా ఇందులోని ఫాస్ఫరస్ పెంటాక్సైడ్‌ను అనుజన్యంగా సేకరించి ఎరువుల కోసం లేదా భాస్వరం లక్షణాల తయారీకి వాడతారు. విశాఖ పట్నం – భీమునిపట్నం మధ్యగల తీరప్రాంతంలో ఉపయుక్తమైన మోనజైట్ సాంద్రీకరణలు ఉన్నట్లు ఆధునిక పరిశోధనల మూలంగా తెలుస్తూంది. సామర్‌స్కైట్, అల్లనైట్ వంటి రేడియో ధార్మిక ఖనిజాలు, బెరిల్ వంటి అపురూప ఖనిజాలు పెగ్మటైట్ శిలలో (ముఖ్యంగా నెల్లూరు జిల్లాలోని అభ్రకపు పెగ్మటైట్‌ల వంటివి) లభిస్తాయి. బెరిల్ ఖనిజ స్ఫటికాలను ప్రశస్తమైన వాటిని పచ్చలుగా (emaralds) మాత్రమే మన పూర్వీకులు వాడేవారు. అయితే, ఈనాడు శాస్త్ర సాంకేతిక విజ్ఞాన ప్రగతి కారణంగా, బెరిలియం లోహాన్ని కనిపెట్టి, వియోజనం (Isolation) చేసిన తరువాత బెరిల్ అనేక పారిశ్రామిక అవసరాలకు ఉపయోగపడుతూంది. దీనికి న్యూట్రాన్‌లను శోషణం చేసుకొనే ధర్మం ఉండటంవల్ల అణుశక్తి ఉత్పాదనలో బెరిల్‌ను మితకారి (Moderator)గా వాడుతున్నారు. అందువల్ల అణుశక్తి చట్టపు నియంత్రణలో తేర్చిన ఖనిజాలలో బెరిల్ ఒకటి. బెరిలియం తేలిక లోహాలలో ఒకటి. బెరిలియం – రాగి మిశ్రలోహాలు ఉక్కుతో సమానమైన దృఢత్వం కలవి. కఠినత, తగిన సామర్థ్యం, అధిక విద్యుత్ ఉష్ణవాహకత, నాన్ స్పార్కింగ్ స్వభావం, అయస్కాంతన స్వభావం ఉండుటవల్ల ఇవి పారిశ్రామిక రంగంలో ఎన్నో ప్రయోజనాలపట్ల కీలక పాత్ర వహిస్తున్నాయి. తీర ప్రాంతాలలో ప్లాసర్‌లుగాలు, పెగ్మటైట్‌లవంటి శిలలలోను లభించే ఖనిజాలలో జిర్కాన్ ఒకటి. అధిక వక్రీభవన గుణకం (Refractive index), పటిష్టమైన ద్వివక్రీ భవనం (Double refraction), విక్షేపణ సామర్థ్యం (Dispersive Power) ఉండే ప్రశస్తమైన జిర్కాన్ స్ఫటికాలను మన పూర్వీకులు గోమేధికంగా వాడేవారు. అయితే, జిర్కాన్ ఈనాడు అనేక పారిశ్రామిక ప్రయోజనాలకు పనికి వస్తూంది. న్యూట్రిన్ శోషణ ధర్మం వల్ల, అధిక ద్రవీభవన ఉష్ణోగ్రతవల్ల జిర్కోనియం లోహాన్ని కేంద్రక పరికరాలలో (Nuclear apparatus) విరివిగా వాడుతున్నారు. ఉక్కులో జిర్కోనియం చేరిస్తే అది ఆక్సీహరిణిగా పనిచేసి అలోహపదార్థాలను తొలగిస్తుంది. దీనిని ఉక్కు తయారీలో ఫెర్రో – జిర్కోనియం లేదా జిర్కోనియం – సిలికాన్ రూపాలలో కలుపుతారు. జిర్కాన్ ఇసుక ఉపయోగించి సిమెంటు, ఫౌండ్రీ అచ్చులు (Foundry moulds) మొదలైనవి తయారు చేస్తారు.

**అలోహాలు:** అలోహాల ఖనిజాలను వాటి ప్రయోజనాన్ని బట్టి వర్గీకరిస్తారు. అయితే, ఒక ఖనిజం లేదా పారిశ్రామిక శిల అనేక విధాల ఉపయోగపడవచ్చు. అనేక పరిశ్రమలకు ఇవి ముడి పదార్థాలు. దాదాపు అన్ని పరిశ్రమలలోను ఖనిజాల లేదా ఖనిజోత్పన్న పదార్థాల అవసరం ముడి పదార్థాల కోసమో లేదా ఏదో ఒక దశలో కలుగుతుంది. ఖనిజాధార పరిశ్రమలను విద్యుదాధార పరిశ్రమలని, ముడి పదార్థాలపై ఆధారపడే పరిశ్రమలని విభజించవచ్చు. అల్యూమినియం, విద్యుద్విశ్లేషక రాగి, ఫెర్రో–మాంగనీస్ మొదలైనవి విద్యుదాధార పరిశ్రమలు. ఇనుము – ఉక్కు తయారీ మొదలయిన అనేక పరిశ్రమలు కేవలం ముడి ఖనిజాలపై ఆధారపడే పరిశ్రమలు. సిమెంటు, గాజు, పింగాణి, బట్టలు, తోళ్ళ పరిశ్రమ, పంచదార శుద్ధి, చమురు శుద్ధి, కాగితం, రబ్బర్, ఎరువులు, రసాయనాలు, రంగులు మొ॥ ఎన్నో పరిశ్రమలకు అలోహ ఖనిజాలు అవసరం. మామూలు మట్టి మొదలు వజ్రం కంటె అమూల్య ప్రస్తరాల వరకూ ఇందులో ఎన్నో ఉన్నాయి. లోహశుద్ధి మొదలు కట్టడాల

నిర్మాణం వరకూ వీటి అవసరం ఎంతో ఉంటుంది.

లోహశుద్ధికి సున్నపురాయి, డోలమైట్ వంటి ద్రవకారక ఖనిజాలు (Flux minerals) కావాలి. సున్నపురాయి అనుకూలతనుబట్టి బ్లాస్టుకొలిమికే కాక కట్టడాలు, సిమెంటు తయారీ మొదలైన ప్రయోజనాల కవసరం. సున్నపురాయి సంపద మన దేశంలోని ఇతర రాష్ట్రాలతో పోల్చినపుడు ఆంధ్రప్రదేశ్‌లో అత్యధిక నిల్వలు ఉన్నట్లుగా తెలుస్తోంది.

మన రాష్ట్రంలో కడప, కర్నూలు, గుంటూరు, అదిలాబాద్ మొదలైన జిల్లాలలో లభ్యమయ్యే సున్నపురాయి పలు ప్రయోజనాలకు పనికి వస్తుంది. 1980 సం॥పు ఉత్పత్తి లెక్కలను బట్టి మన రాష్ట్రం ఉత్పత్తిలో మూడవ స్థానాన్ని అలంకరించింది. (దేశ ఉత్పత్తి 29.18 మిలియన్ టన్నులైతే, మన రాష్ట్ర ఉత్పత్తి 3.26 మి. టన్నులు.) డోలమైట్ కడప జిల్లాలోని వేంపల్లె వద్ద లభిస్తుంది. అదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, జిల్లాలలో లభించే సున్నపురాళ్లు కూడా అధిక మేగ్నీషియం గల డోలమైట్‌లు. వీటిలో చలువరాళ్లు కూడా ఉన్నాయి. లోహాలను కరిగించేటందుకు సిల్లిమనైట్, కయనైట్, గ్రాఫైట్ వంటి ఉష్ణనిరోధక ఖనిజాలను వాడతారు. ఈ ఖనిజాలు రూపాంతర ప్రాప్తశిలలలో లభిస్తాయి. సిల్లిమనైట్, కయనైట్ కన్న శ్రేష్టమయిన ఖనిజం. ఇది విశాఖపట్నం వంటి తీర ప్రాంతాలలో భారీ ఖనిజంగా ఇసుకలో లభిస్తుంది. కయనైట్ నెల్లూరు అభ్రకపు షిస్టులలోను, ఖమ్మం జిల్లాలోను స్వల్పంగా లభిస్తుంది. గ్రాఫైట్ ఖనిజాన్ని పెచ్చుల రూపంలో లభించే దానిని అధిక ఉష్ణోగ్రతలలో ($3000°C$) వరకు లోహాలను కరగపెట్టటానికి కావలసిన మూసల (crucebles) తయారీలో ఉపయోగిస్తారు. మెత్తనిదైన ఈ ఖనిజాన్ని స్నేహకాలు (lubricants), పెనిసిల్‌లు, విద్యుత్ మోటార్ బ్రష్‌లు మొదలైన వాటి తయారీలో వాడతారు. అతి స్వచ్ఛమయిన గ్రాఫైట్ అణుశక్తి తయారీలో కూడా అవసరమవుతుంది. విశాఖపట్నం, తూర్పుగోదావరి, ఖమ్మం, పశ్చిమ గోదావరి జిల్లాలలోని ఖోండలైట్ శిలలలో ఈ ఖనిజం లభిస్తుంది. గ్రాఫైట్ మూసల తయారీలో తూర్పుగోదావరి జిల్లాలోని రాజమండ్రి దేశం మొత్తంలో ప్రథమస్థానం వహిస్తున్నది.

శిలా శైధిల్యం వల్ల ఏర్పడే మట్టి లేదా సుద్ద శిలల తారతమ్యాన్ని బట్టి, ఏర్పడే తీరును బట్టి ఎంతో వైవిధ్యం కలిగి ఉంటుంది. ఆయా ధర్మాలను బట్టి ఇది అనేక పారిశ్రామిక ప్రయోజనాలకు పనికి వస్తుంది. అంచనాలను బట్టి మన రాష్ట్రంలో 11.85 మి.టన్నుల కయోలిన్ లేదా చైనా మట్టి, 12.5 మి.ట. బాల్ మృత్తిక (Ball Clay), 3.83 మి.ట. అగ్నిసహన జంబాలం (Fire Clay), 22.25 మి.ట. ఫుల్లర్ మట్టి నిల్వలు ఉన్నాయి. 1984 లో మన రాష్ట్రం 60,650 టన్నుల కయోలిన్‌ను ఉత్పత్తి చేసి మూడవ స్థానం తెచ్చుకుంది. కయోలిన్ పింగాణీ పరిశ్రమకు కావలసిన ముఖ్య ఘటకాలలో ఒకటి. కయోలిన్‌తో తయారయ్యే వాటిలో హై టెన్షన్ మరియు లో టెన్షన్ రోధకాలు (Insulators), తెల్ల పాత్రలు, మురుగు గొట్టాలు, తెల్ల పెంకులు, స్టోన్‌వేర్ గొట్టాలు మొదలైనవి వున్నాయి. అధికశ్రేణి కయోలిన్ నల్గొండ జిల్లాలోని చింత్రాల వద్ద, నెల్లూరు జిల్లాలోని ప్రభగిరి పట్నం వద్ద లభిస్తుంది. అవక్షేపస్తరాల సంబంధంతో ఉన్న జంబాలాలు కడప, పశ్చిమగోదావరి, కర్నూలు, నిజామాబాద్ జిల్లాలలో పెక్కుచోట్ల లభిస్తున్నాయి. నిజామాబాద్ జిల్లాలోని కోన సముద్రం వద్ద అధిక ఉష్ణ సహన ప్రయోజనాలకు పనికి వచ్చే మట్టి లభిస్తోంది. పశ్చిమగోదావరి జిల్లాలోని ద్వారకా తిరుమల వద్ద సూక్ష్మకణ భూయిష్టమైన ప్లాస్టిక్ ధర్మంగల బాల్ మృత్తిక లభిస్తోంది. ఆంధ్రప్రదేశ్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (APMDC) వారు దీనిని సేకరిస్తున్నారు. పశ్చిమగోదావరి జిల్లాలోని ఎగువ గోండ్వానాకాలపు రాఘవపురం శిలా విన్యాసాలలో మట్టి పింగాణీ పరిశ్రమకనువైనది. చమురు బావులలో వాడే ఫుల్లర్ మృత్తిక హైదరాబాద్ జిల్లాలోని వికారాబాద్ – తాండూర్ ప్రాంతంలో ట్రాప్‌ల మధ్యస్తరాలలో అంతర్–స్తరిత నిక్షేపాలుగా లభిస్తోంది. ఫుల్లర్ మట్టిని తైలాలను స్వచ్ఛపరచటం (Purification of oils ) లో విరివిగా వాడతారు.

పారిశ్రామిక ఖనిజాలలో అభ్రకం, రాతినార, బెరైటీస్, స్టియటైట్, వంటివి ఎన్నో ఉన్నాయి. అభ్రకం (Mica) అనేది ఒక సముదాయానికి వర్తించే పేరు. ఇందులో మస్కవైట్ అభ్రకం వ్యాపార రీత్యా అమూల్యమైనది. దీన్ని ప్రధానంగా విద్యుత్, ఉష్ణ ప్రయోజనాలలో రోధకం (Insulator) గా వాడతారు. దీనికి బదులుగా ఎన్నో ఇతర పదార్థాలు ప్రత్యామ్నాయంగా వాడుతున్నప్పటికీ, అభ్రకానికున్న విశిష్టత అద్వితీయమైనది.

పుస్తకాల రూపంలో లభించే అభ్రకపు రేకులకు ప్రపంచం లోనే భారతదేశం చారిత్రక ప్రసిద్ధి పొందింది. అభ్రకం ఉత్పత్తిలో బీహార్ తరువాత మన రాష్ట్రమే పేరు మోసింది. మన రాష్ట్రంలోని నెల్లూరు జిల్లాలో నెల్లూరు అభ్రకపు మేఖల ప్రధాన నిక్షేపం. దీని వ్యాప్తి గూడూరు, రావూరు, ఆత్మకూరు, కావలి తాలూకాలలో 90 కి. మీ. పొడవు, 13 నుంచి 16 కి.మీ. వెడల్పు కలిగి ఉంది. యీ మేఖలలో గార్నెట్ భరిత అభ్రకం షిస్టులు, కయనైట్ భరిత క్లోరైట్ షిస్టులు మొదలగు ప్రాదేశిక శిలలలో పెగ్మటైట్‌లు, క్వార్ట్జ్ సిరలు అంతర్గతమైన ప్రాంతాలలో అభ్రకం లభిస్తుంది.

అభ్రకపు పుస్తకాలు సగటున 15–30 సెం.మీ. పెద్దవి 50–90 సెం.మీ. దళసరి కలిగి ఉంటాయి. ఇచ్చట లభించే మస్కొవైట్ అభ్రకం ఆకుపచ్చరంగు (తరచుగా మచ్చలతో), ఎరుపు(Ruby) రంగు కలిగి ఉంటుంది.

ఈ ప్రాంతంలో షా అభ్రకం గని అతి లోతైన గని. కల్యాణరామ అభ్రకం గనిలో రూబీ అభ్రకం లభిస్తుంది. మన రాష్ట్రంలో శ్రీకాకుళం, చిత్తూరు, గుంటూరు, ఖమ్మం, కృష్ణా, అనంతపురం, పశ్చిమగోదావరి, విశాఖపట్నం జిల్లాలలో కూడా అభ్రకం స్వల్పంగా లభిస్తుంది. అభ్రకపు పరిశ్రమ చాలా పెద్దది. దీనిని ఇంచుమించు విదేశీ ఎగుమతుల నిమిత్తం కృషి చేస్తున్నారు. మన దేశంలో 70 అభ్రకం ఫేబ్రికేటర్‌లు (Fabricators) ఉన్నారు. ఇందులో కొందరు గూడూరులో ఉన్నారు. ఇది ఎక్కువగా కుటీర పరిశ్రమ లేదా చిన్న తరహా పరిశ్రమ. మన దేశంలో అభ్రకపు పొడిని తయారుచేసే కర్మాగారాలు 63 ఉన్నాయి. 1979 లో గూడూరు వద్ద నార్వే దేశ సహాయంతో తడి అభ్రకపు పేషణానికి (Wet ground mica) ఒక ప్లాంట్‌ను స్థాపించారు. మూడు ప్రధాన కంపెనీలలో మైకనైట్ (Micanite) ను ఉత్పత్తి చేస్తున్నారు. భారత ప్రభుత్వం అభ్రకం వ్యాపారాన్ని పర్యవేక్షించేటందుకు ఖనిజాలు లోహాలు వ్యాపార సంస్థ (MMTC) కి ఉపసంస్థగా అభ్రకం వ్యాపార కార్పొరేషన్ (MITCO) పశ్చిమ జర్మనీ, జపాన్ దేశాల సాంకేతిక సహాయంతో అభ్రకపు కాయితం, దాని ఆధారంగా రోధక పదార్థాలు (Insulating Products) తయారు చేయడానికి ప్రయత్నిస్తోంది.

మన రాష్ట్రంలో విశాఖపట్నం జిల్లాలో బొర్రాగుహల సమీపంలో ఫ్లోగొపైట్ అభ్రకం, కాశీపట్నం దగ్గర పెర్మి క్యులైట్ అభ్రకం లభిస్తున్నాయి. ఈ పెర్మిక్యులైట్ అభ్రకం తడిసినపుడు 6 నుంచి 20 రెట్ల వరకూ వ్యాకోచించే విచిత్రధర్మం కలిగి ఉంటుంది. టాస్క్‌ఫోర్స్ వారి అంచనాల మేరకు ఈ నిలవలు 15,000 టన్నుల వరకూ ఉంటాయి. దీనిని మట్టితో కలిపి రోధక ప్రయోజనాలకు ఇటుకలుగా తయారుచేస్తారు. ఇవి ఉష్ణ, శబ్దనిరోధక ప్రయోజనాలకు బాగా పనికి వస్తాయి. వీటి నిరోధక ప్రయోజనాలకే కాక, శీతలీకరణ ప్రయోజనాలకు (Refrigeration Purposes) కూడా వాడతారు.

కాశీపట్నం వద్ద వెర్మిక్యులైట్‌తో పాటు శ్రేష్ఠమైన అపటైట్ ఖనిజం లభిస్తుంది. 100 మీటర్‌ల లోతువరకూ అంచనా వేసిన అపటైట్ నిలవలు 6.2 లక్షల టన్నులు ఉంటాయి. అపటైట్ "ఫాస్ఫేట్" ఖనిజం. ఇందులో 35 నుంచి 42% $P_2O_5$ ఉంటుంది. అతి శ్రేష్ఠమైన ఈ ఫాస్ఫేట్ ఖనిజం సూపర్ ఫాస్ఫేట్ ఎరువుల తయారీకి అత్యంత అనుకూలమైంది. అపటైట్ ఉత్పత్తిలో పశ్చిమ బెంగాల్ తరువాత చెప్పుకో తగింది మన రాష్ట్రమే. 1986 లో మన రాష్ట్రం 3628 టన్నులు ఉత్పత్తి చేసింది.

ప్రశస్తమైన క్రైసోటైల్ జాతి రాతినార (asbestos) ఉత్పత్తిలో మన రాష్ట్రం పేరు మోసింది. రాతినారలో ఏంఫిబోల్ జాతి, క్రైసోటైల్ జాతి అని రకాలు ఉన్నాయి. తక్కువగా లభించే క్రైసోటైల్ జాతి రాతినార ఎంతో నాణ్యమైంది. అగ్ని సహన వస్త్రాలు, రేకులు, సిమెంట్, కాయితాలు మొదలైనవెన్నో ప్రయోజనాలకిది అవసరం. క్రైసోటైల్ రాతినార మన దేశంలో మన రాష్ట్రంలోని కడప జిల్లాలోను, బీహార్‌లోను మాత్రమే లభ్యమవుతూంది.

1986 లో 3628 టన్నులు కడపజిల్లా నుంచి ఉత్పత్తి అయింది. ఈ నిక్షేపాలు కడప జిల్లాలో పులివెందుల తాలూకా లోని బ్రాహ్మణపల్లె, పర్ణపల్లె, ఇప్పట్ల, చిన్నకూడాల, రామనూతులపల్లె, లింగాల, లోప నూతుల, వెలిదండ్ల ప్రాంతాలలో 20 కి.మీ. పొడవున వ్యాప్తి చెంది ఉన్నాయి. దేశ వనరులలో 50% వరకూ ఉండే ఈ నిలువలు 0.25 మిలియన్ టన్నులు ఉంటాయని అంచనా. ఈ నిక్షేపాలు అధిక గుణవంతమైనవి, ఎగుమతి వ్యాపారానికి శ్రేష్టమై నవి. ఆంధ్రప్రదేశ్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (APMDC) బ్రాహ్మణపల్లె వద్ద రాతినార ప్రాజెక్ట్‌ను నిర్వహిస్తూంది. అనంతపురం, కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాలలో కూడా రాతినార నిక్షేపాలను రిపోర్టు చేశారు.

బైరైటీస్ బరువు కల ఖనిజం (వి.గు. 4.5). దీనిని హెవీస్పార్ (Heavy Spar) అని కూడా అంటారు. బరువు, రసాయన జడత్వం, స్థిర స్వభావం వల్ల ఇది ఎన్నో పారిశ్రామిక ప్రయోజనాల కనుకూలం. చూర్ణం చేసిన బెరైటీస్ పొడిని రంగులలో వర్ణజంగాను, రబ్బర్, కాగితం, లినోలియం, చమురు వస్త్రాలు, గ్రామఫోన్ రికార్డులు, ప్లాస్టిక్‌లు మొదలైన వాటిలో జడ పూరకం (Inret filler) గానూ, వస్త్రాలు, చర్మం, కాగితం మొదలైన వాటిలో బరువు నిచ్చే ద్రవ్యంగానూ, చమురు బావుల భ్రమణ ఛిద్రణలో వాడే బురదలో భారీ యానకం (Heavy Media) గానూ ఇది ఎంతో ఉపయోగం.

బెరైటీస్ ఖనిజం విషయంలో మన రాష్ట్రానిదే పైచేయి. మన దేశపు నిలువలలో 98% ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నాయి. ఇవి 70 మి.ట. మేరకు ఉంటాయని అంచనా. బెరైటీస్ నిక్షేపాలు ప్రధానంగా కడప, కర్నూలు, అనంతపురం, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలోను; చిన్నరకానివి ఖమ్మం, కృష్ణా, మహబూబ్‌నగర్, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో ఉన్నాయి. కడప జిల్లాలోని రాజంపేట తాలూకాలో మంగపేట వద్ద ఇటీవల కనుగొన్న బెరైటీస్ నిక్షేపం చాలా పెద్దది. శ్రేష్టమైనది కూడా. ఈ ప్రాంతంలో ఆంధ్రప్రదేశ్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు ఇంకా బెరైటీస్

అన్వేషణా కార్యక్రమంలో నిమగ్నమయి ఉన్నారు.

స్టియటైట్ ఖనిజాన్ని సబ్బురాయి (Soap stone) అని కూడా అంటారు. ఈ ఖనిజం మృదుత్వంగల టాల్క్ ఖనిజానికి సన్నిహితమైనది. ఒకప్పుడు మన పూర్వీకులు దీనిని రాచ్చిప్పలకు వాడేవారు. ఇది ఈనాడు అనేక పారిశ్రామిక ప్రయోజనాలకు పనికి వస్తూంది. స్టియటైట్ ఉత్పత్తిలో కూడా మన రాష్ట్రం పేరు మోసింది. స్టియటైట్ నిక్షేపాలు అనంతపురం, కర్నూలు, విశాఖపట్నం, నెల్లూరు, చిత్తూరు, కడప జిల్లాలలో ఉన్నాయి. అన్నిటిలోను అనంతపురం నిక్షేపాలు విస్తృతమైనవి, శ్రేష్టమైనవి.

నవ నాగరికతతో భవన నిర్మాణానికి ఉపయోగించే శిలలు నేడు దేశానికి ఎన్నో రెట్లు విదేశీమారక ద్రవ్యాన్ని సమకూరుస్తున్నాయి. సాధారణంగా ఖోండలైట్, చార్నకైట్, గ్రానైట్, స్లేట్, షిస్టు మొదలైనవి భవన నిర్మాణాలకు, రోడ్ల ఏర్పాటుకు ఉపయోగిస్తూ ఉండేవారు. సుమారు 7 సం॥ల క్రితం వట్టి రోడ్డు మెటల్‌గాను మరియు భవన పునాదులకుగాను ఉపయోగించే గ్రానైట్ శిలలు నేడు అంతర్జాతీయ మార్కెట్‌లో విలువైన బంగారం కన్నా ఎంతో పేరు పొందింది. గ్రానైట్ అనే వ్యాపార సంబంధిత పేరుతో డోలరైట్, సయనైట్, చార్నకైట్, గ్రానైట్ వగైరాలు నేడు వ్యాపారంలో చలామణి అవుతున్నాయి. కోట్లాది రూపాయల పెట్టుబడితో హైదరాబాదు, మెదక్, వరంగల్, ఖమ్మం, నల్గొండ, కరీంనగర్, కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, చిత్తూరు, అనంతపురం, ప్రకాశం, మరియు విజయనగరం జిల్లాలలో గ్రానైట్ గనులు మరియు పాలిషింగ్ యూనిట్లను ఎన్నో ప్రైవేట్ సంస్థలు నెలకొల్పి ఉన్నాయి. వీటిని యునైటెడ్ కింగ్‌డమ్, జర్మనీ, జపాన్, కొరియా మరియు గల్ఫ్ ప్రాంతాలకు ఎగుమతి చేసి కోట్లాది రూపాయలను ఆర్జిస్తున్నారు. ఈ పరిశ్రమ ముందు ముందు యింకనూ ఎంతో పురోభివృద్ధిని సాధించగలదు.

**ఇంధనాలు:** శక్తిని సమకూర్చే ఖనిజాలను ఇంధన ఖనిజాలంటారు. నేలబొగ్గు, పెట్రోలియం, సహజ వాయువు (Natural gas) ఇంధన ఖనిజాలు. వీటిని శిలాజ ఇంధనాలు (Fossil Fuels) అని కూడా అంటారు. అణుశక్తిని సమకూర్చే యురేనియం, థోరియం ఖనిజాలను కేంద్రక ఇంధనాలు (Nuclear Fules) అని కూడా అంటారు.

మన రాష్ట్రంలో నేల బొగ్గు లభించే గోండ్వానా శిలలు గోదావరి లోయలో 10 వేల చ.కి.మీ. మించిన వైశాల్యంలో వ్యాపించి ఉన్నాయి. భౌగోళికంగా ఈ శిలలు ఆదిలాబాద్, తూర్పు గోదావరి, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్, వరంగల్, పశ్చిమ గోదావరి జిల్లాలలో కొన్ని భాగాలకు పరిమితం. ఈ బొగ్గు నిక్షేపాలు ప్రాణహిత గోదావరి గోండ్వానా మేఖలలో ఒక భాగం. బొగ్గు నిలవలు ప్రధానంగా బరాకర్ శిలా విన్యాసాలలో ఉన్నాయి. వీటి పై భాగంలో ఉన్న కామ్‌తి శిలా విన్యాసాలలో కూడా బొగ్గు నిక్షేపాలను కనుగొన్నారు.

బొగ్గు గనుల త్రవ్వకం సింగరేణి, కొత్తగూడెం, తాండూరు, ఉత్తర గోదావరి ప్రాంతం (ఆదిలాబాద్ జిల్లా), దక్షిణ గోదావరి ప్రాంతం (కరీంనగర్ జిల్లా) లకు పరిమితమైంది. ఈ బొగ్గు నాన్ - కోకింగ్ జాతికి చెందినది. ఇందులో భస్మశాతం (Aash Content), తేమపాలు (Moisture content) కూడా ఎక్కువ.

మన రాష్ట్రంలో మొత్తం బొగ్గు నిలవలు 850 కోట్ల టన్నుల మేరకు ఉంటాయని అంచనా. మన రాష్ట్రం 1985 లో 2.89 కోట్ల టన్నుల నేల బొగ్గును ఉత్పత్తి చేసింది. మన రాష్ట్రంలోని బొగ్గు గనులు ప్రస్తుతం సింగరేణి కోలరీస్ కంపెనీ లిమిటెడ్ (SCCL) అనే ప్రభుత్వరంగ సంస్థ యాజమాన్యంలో ఉన్నాయి.

మన రాష్ట్రంలో సహజవాయువు ఉభయ గోదావరి జిల్లాల డెల్టా భూములలోను, కృష్ణానది, ఒండలి యందు లభిస్తూంది. పెట్రోలియం కోసం మన దేశంలో చమురు సహజవాయువుల కమీషన్ (ONGC) మన రాష్ట్రంలో తీవ్రమైన అన్వేషణ చేస్తూంది. కృష్ణా-గోదావరి హరివాణం (Basin) పెట్రోలియం లభించటానికి అనుకూలంగా ఉన్నట్లు భౌమ, భూభౌతిక అన్వేషణల వల్ల తెలుస్తూంది. ఈ హరివాణం భూమి మీద (On shore) 15,000 చ.కి.మీ., తీర సముద్ర భాగంలో (Off shore) 25,000 చ.కి.మీ. వైశాల్యం గలది.

ONGC వారు అన్వేషణాత్మక కూపాలను పశ్చిమ గోదావరి జిల్లాలో నరసాపురం దగ్గర లింగబోయిన చర్ల, ఏనుగువాని లంకల వద్ద, తూర్పు గోదావరి జిల్లాలో రాజోలు, అమలాపురానికి దగ్గరలో కూనవరం, భీమనపల్లిల వద్ద తవ్వారు. సముద్ర భాగాలలో కూడా ఛిద్రణ జరుగుతూంది. ఈ కూపాలలో సహజవాయువు, సముద్ర భాగ కూపంలో చమురు కూడా ఉన్నట్లు అధునిక వర్తమానాన్ని బట్టి తెలుస్తుంది. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని కొన్ని ప్రాంతాలలో చమురును బావుల ద్వారా వెలికితీస్తున్నారు, మరియు ఈ శిలా - పెట్రోలును విశాఖపట్నం పెట్రోలియం రిఫైనరీలో శుద్ధిచేస్తున్నారు. ఇదే ప్రాంతంలోని చమురుతో పాటు భారీ సహజ వాయువు నిలవలను కూడా కనుగొన్నారు. ఈ సహజ వాయువునే ఇంధనముగా కాకినాడ పరిసర ప్రాంతాలలో ఒక ఎరువుల కర్మాగారాన్ని, మరియు ఒక చిన్న ఫెర్రో ఎల్లాయిస్ పరిశ్రమను నెలకొల్పబోతున్నారు. ఈ ప్రాంతాలలో పెట్రోలియం వనరులు, రాష్ట్ర, దేశపురోభివృద్ధికి ఎంతో తోడ్పడే అవకాశం ఉంది.

**భూగర్భ జలం:** భూగర్భ జలం కూడా ఒక ఖనిజమే.

నదీజలాలను ఆనకట్టల ద్వారా బహుముఖ ప్రయోజనాలకు వాడేటట్లు, వర్షాధారపు మెట్టప్రాంతాలలో వ్యవసాయం మొదలైన అవసరాలకు గొట్టపు బావుల ద్వారా భూగర్భ జలాన్ని వాడవచ్చు. ఈ జల సామర్థ్యం, వినియోగం కేంద్ర భూగర్భ జల సంస్థ, రాష్ట్రీయ సంస్థలు పర్యవేక్షిస్తూ ఉంటాయి. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, నెల్లూరు, గుంటూరు జిల్లాలలో మొత్తం 16,000 చ.కి.మీ. విస్తీర్ణం పరిశోధించబడింది. ఇందులో 9000 చ.కి.మీ. విస్తీరణం, 1000 సాగుబడి గొట్టపు బావుల నిర్మాణానికి అత్యుత్తమమైనదని కూడా ధ్రువపడింది. రాష్ట్రంలోని ఇతర జిల్లాలలో కూడా ఈ కార్యక్రమం అభివృద్ధి దశలో ఉంది. నేటి నాగరికతకు జనబాహుళ్య దృష్ట్యా భూగర్భ జల ఆవశ్యకత ప్రతి ఏటా ఎక్కువ అవుతున్నది. నీరే జీవనాధారం గనుక యింకా పరిశోధన యీ దిశగా అవసరం ఉంది.

**ఖనిజసంపద పర్యవేక్షణ - అభివృద్ధి:** ఇంతవరకూ మన రాష్ట్ర ఖనిజసంపదను గురించి సంగ్రహంగా తెలిసికొన్నాము. ఈ ఖనిజ సంపద పర్యవేక్షణ గురించి కూడా క్లుప్తంగా తెలుసుకోవాలి. దేశంలోని ఖనిజ సంపదను అన్వేషించి, అందుకు కావలసిన భౌమ, భూభౌతిక , భూ రసాయనిక మాన చిత్రాలను తయారుచేసి, అభివృద్ధి చేసే కార్యక్రమం భూ విజ్ఞాన సర్వేక్షణ శాఖ (G.S.I) నిర్వహిస్తుంది. ఇది 1851 నుంచి మన దేశంలో పనిచేస్తూన్న ప్రధాన సంస్థ. పర్యవేక్షణకు వీలుగా ఇది కొన్ని మండలాలుగా విభజించబడింది. మన రాష్ట్రం దక్షిణ మండలంలోకి వస్తుంది. ఈ కార్యాలయం హైదరాబాద్‌లో వుంది. ప్రతి రాష్ట్ర ఖనిజాభివృద్ధిని చూసేటందుకు యంత్రాంగం వుంది. దీనికి సహకారంగా దేశంలో జాతీయ ఖనిజాభివృద్ధి సంస్థ (NMDC) ఖనిజలోహ వ్యాపార సంస్థ (MMTC) ఖనిజాన్వేషణ సంస్థ (MECL) భారత గనుల బ్యూరో (IBM) మొదలైనవి వున్నాయి. మన రాష్ట్ర పరిధిలో ఆంధ్రప్రదేశ్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పోరేషన్ లిమిటెడ్ (APMDC), ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గనులు, భూ విజ్ఞాన సంస్థ డైరెక్టరేట్ (Directorate of AP Mines and Geology), భూగర్భ జల శాఖ (Ground Water Dept.) మొదలైనవి వున్నాయి. పరిశోధనా రంగంలో శాస్త్రీయ పారిశ్రామిక పరిశోధనా సంస్థ (CSIR) ఆధ్వర్యంలో జాతీయ భూభౌతిక పరిశోధనా సంస్థ (NGRI), జాతీయ దూర గ్రాహక కేంద్రం (National Remote Sensing Agency), అణు ఖనిజ సంస్థ (Atomic Minerals Division of D.A.E) మొదలైనవి పనిచేస్తున్నాయి. ఈ విభజన కేంద్రీయ, రాష్ట్రీయ సంస్థల ఆధ్వర్యంలో ఖనిజ సంపద అన్వేషణ, గనుల నిర్వహణ, సక్రమ వినియోగం మొదలైన చర్యలు సాధ్యమవుతున్నాయి.

**భూవిజ్ఞాన శాస్త్రాధ్యయనం:** మన రాష్ట్రంలో ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర, నాగార్జున, కాకతీయ విశ్వవిద్యాలయాలలో భూవిజ్ఞాన శాస్త్రాధ్యయనం పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో నిర్వహించ బడుతోంది. వీటి అనుబంధ కళాశాలలలో డిగ్రీ స్థాయిలోను, ఇటీవల ఇంటర్మీడియట్ స్థాయిలోనూ కూడా అధ్యయనం జరుగుతోంది. ఇటీవల ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో కూడా డిగ్రీస్థాయిలో ఈ శాస్త్ర అధ్యయనం నడుస్తూంది. ఈ విశ్వ విద్యాలయాలలో అనేక శాస్త్ర విభాగాలలో అధ్యయనమే కాక, పరిశోధనకూడా నడుస్తున్నది. చాలామంది డాక్టరేట్ డిగ్రీలను తీసుకొన్నారు. డిగ్రీస్థాయి వరకు అధ్యయనం తెలుగులో నడిస్తున్నది. ఇందుకు వీలుగా తెలుగు అకాడమీ ఆధ్వర్యంలో కావలసిన పాఠ్యపుస్తకాలు కూడా ప్రచురితమయ్యాయి. మన రాష్ట్రంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో కూడా తెలుగులో అధ్యయనం జరపాలని ఇటీవల సూత్రప్రాయంగా ఆమోదించటం వల్ల తెలుగు అకాడమీ అందుకు తగిన చర్యలు తీసుకుంటూంది.

ఖనిజ సంపద సంబంధంగా మన రాష్ట్రానికి ఉన్న కొన్ని విశేషాంశాలని పరిశీలిద్దాము. మన దేశంలో ఖనిజోత్పత్తిలో మన రాష్ట్రం ఆరవ స్థానంలో ఉంది. ముఖ్యంగా బైరటీస్, క్రైసోటైల్ ఆస్‌బెస్టాస్ పూర్తి శాతం ఉత్పత్తి మన రాష్ట్రమే చేస్తూంది. గ్రానైట్ ఉత్పత్తిలో మంచి ప్రతిభ చూపుతుంది. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కోహినూర్, నిజామ్, ఆర్లాఫ్ మరియు హోప్ అనే వజ్రాలు కృష్ణానదీ తీరం నుండే వెలికి తీయబడ్డవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించిన ఒక సంఘం 225 ఖనిజాధార పరిశ్రమలను గుర్తించింది. అంతేకాకుండా 1982–83 లో రాష్ట్రంలోని ఖనిజ పరిశ్రమ ద్వారా రెవెన్యూ వసూళ్ళు 479 లక్షల రూపాయల నుండి 1986–87 కు 3,404 లక్షల రూపాయలుగా అభివృద్ధి పొందాయి.

భూ విజ్ఞాన శాస్త్ర పరంగా మనం ఖనిజసంపదను ఎంతైనా సంతరించుకోవచ్చు. అయితే, ఇతర పంటలవలె కాక ఖనిజాలు – మానవాళికి భూమిలో ఒకే ఒకసారి లభించే అమూల్యమైన పంట. అందువల్ల నియమితమైన ఈ ఖనిజసంపదను దుర్వినియోగపరచకుండా సంరక్షించుకొని ముఖ్యావసరాలకు వాడుకోవటం; శాస్త్ర, సాంకేతిక విజ్ఞాన అభివృద్ధిని పురస్కరించుకొని కొత్త ఖనిజ నిక్షేపాల కోసం నిరంతరం కృషి చేయటం మన పురోగతికి ఎంతో అవసరం. ఇంకా ఎన్నో విషయాలు చెప్పవలసి ఉన్నప్పటికిన్నీ స్థలాభావం వల్ల ఇంతటితో ముగిస్తున్నాము. ఈ శాస్త్ర విషయంలో చదువరులకున్న ఎట్టి సందేహానికైనా మాలో రెండవ రచయితని సంప్రదించవచ్చును.

# ఆంధ్రప్రదేశ్ లో భూకంపాలు

ఆచార్య టి.కె.ఎస్. ప్రకాశరావు

దక్షిణ భారతదేశం ప్రచండమయిన భూకంపాలు సంభవించే ప్రదేశం కాదని ఇంతవరకు నమ్ముతూ వచ్చాం. అందుక్కారణం ఈ ప్రాంతంలో కొన్ని కోట్ల సంవత్సరాల క్రితమే భూమి పొరలలో విస్తృతంగా సంభవించే మార్పులు చాలవరకు ఆగిపోయాయని నమ్మటం. ఆ కారణంగానే కఠిన శిలామయమయిన దక్షిణ భారతాన్ని పీఠభూమిగా పరిగణించాం. ఈ ప్రాంతం ఇంచు మించు స్థిరత్వం పొందినా అక్కడక్కడ స్వల్పంగా జరిగే మార్పులు మాత్రం చిన్న తరహా, మధ్యతరహా ప్రకంపనల ద్వారా సూచింపబడుతున్నాయి.

చారిత్రక ఆధారాలను బట్టి ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలలో అతి స్వల్పమయినవి, తగు మాత్రమయినవి భూకంపాలు సంభవమేనని తెలుస్తోంది. నిజానికి భూతత్త్వ రీత్యా ఆంధ్రప్రదేశ్ దక్షిణ భారతంలో ఒక విశిష్టమయిన స్థానాన్ని ఆక్రమించింది. అందుకు కారణం ఈ ప్రాంతంలోగల గోదావరి లోయ, కడప హరివాణము, దక్కను లావా వెల్లువ తాలూకు ఆగ్నేయపుటంచులు, తూర్పుకనుమలు, తూర్పుకోస్తా ప్రాంతంలోగల అవక్షేప శిలాసముదాయము. వివిధ ప్రాంతాలలోని ఆధార శిలాసముదాయమందుగల భ్రంశాలు, ఇతర విరూప రేఖలు, ఆయా ప్రాంతాలలోని శిలావిన్యాసాలలో విరూప ప్రక్రియల తీరును కొంతవరకు సూచిస్తాయి.

భూకంప తత్త్వానికి ఆధారం కటకాలు, పెద్ద పగులు మండలాలు, పర్వత శ్రేణులు, విరూప రేఖలు, భ్రంశాలు. భూమిలో కొంత లోతున అనేక కారణాలవల్ల ప్రతి బలాలు ఏర్పడతాయి. కాలక్రమేణా ఆ ప్రతి బలాలు భూమిలోని పదార్థ నిర్మాణంలో మార్పులు తెస్తాయి. అట్టి మార్పుల వల్ల కలిగే అలజడినే భూకంపమంటారు. భూమి పొరలలోని శిలా విన్యాసాలలో క్రమక్రమంగా కూడుకొన్న ప్రతిబలాలు కొన్ని వేల, లక్షల సంవత్సరాల తరువాత భూకంపాల ద్వారా భయంకరమయిన ప్రకృతి బీభత్సాన్ని కలగజేస్తాయి. భూకంపాలు విడుదల చేసే శక్తినిబట్టి వాటిని ప్రచండమయినవి, తగుమాత్రమైనవి, స్వల్పమయినవిగా విభజించవచ్చు. భూప్రకంపన కేంద్రాలు నమోదు చేసే వివరాలనుండి ఈ శక్తిని కొలవటం సాధ్యమే. భూప్రకంపన గ్రాహక పరికరాల ద్వారా భూకంపాల స్థాయిని నిర్ణయించినప్పుడు దానిని 'మాగ్నిట్యూడ్' (M) అంటారు. 'రిక్టర్' అనే శాస్త్రవేత్త కనుగొన్న ఈ కొలమానాన్ని 'రిక్టర్ స్కేల్" అంటారు. దీనిలో భూకంప స్థాయి 'సున్న' నుండి 'తొమ్మిది' వరకు నిర్దేశింపబడింది.

భూకంపాలవల్ల కలిగే ఆస్తి, ప్రాణనష్టాలు, ప్రకంపనల ఉధృతం, శబ్దాలు వినిపించటం, పాత్ర సామగ్రి – కుర్చీలు మొదలైనవి స్థాన భ్రంశం చెందటం, బావులలో నీటి మట్టం మార్పులు, కొన్ని సందర్భాలలో ఇంకిపోవడం, నేల బీటలు వారటం, నదులు – కాలువలు గతి తప్పి ప్రవహించటం, పర్వత సానువులపైగల మట్టి పొరలు విడివడి క్రిందికి జారి వాటి నానుకొని ఉన్న లోయలను కప్పివేయటం మొదలయిన స్వభావాలను బట్టి భూకంపాల తీవ్రతను గుర్తింపవచ్చు. తీవ్రత ఆధారంగా నిర్ణయించిన కొలమానాన్ని 'ఇంటెన్సిటీ స్కేలు' అంటారు. ఇవి వివిధ దేశాలలో వివిధ రీతులలో అమలులో ఉన్నాయి. భారతదేశంలో 12 ఉపాంతాలు కలిగిన కొలమానం అమలులో ఉంది. ఒకటి ఉపాంతంగల భూకంపాన్ని అతి దగ్గరలో గల భూప్రకంపన కేంద్రంలోని అతి సున్నితమయిన గ్రాహక పరికరాలు మాత్రమే గుర్తిస్తాయి. 12 ఉపాంతంగల భూకంపం, పూర్తి విధ్వంసాన్ని కలగజేస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లో 1800 సంవత్సరం నుండి ఇంత వరకు గుర్తింపబడిన భూకంపాల ఉనికిని గమనిస్తే ఈ ప్రాంతంలోని భూకంపనుత్తేజకత సముద్ర తీరప్రాంతాలకే చాలవరకు పరిమితమైనదని గ్రహించవచ్చు. కొంతవరకు గోదావరి లోయ, కడప హరివాణమునకు తూర్పున గల పెద్ద చిన్న పగుళ్ళు, తీరప్రాంతంలో లెక్కను మించిన భ్రంశాలు, రాష్ట్ర పరిధిలోగల తూర్పుకనుమల ప్రాంతము తరచు భూకంపాలు సంభవించే ప్రాంతాలే. ఆంధ్రప్రదేశ్‌లో చెప్పుకోతగ్గ ప్రమాణ కొలమానం కలిగిన భూకంపాలు

1959 అక్టోబరు 17 న ఒంగోలు – గుంటూరుల మధ్య, 1967 మార్చి 27 న ఒంగోలు వద్ద, 1969 ఏప్రిల్ 13 న భద్రాచలంవద్ద సంభవించాయి. భద్రాచలం వద్ద సంభవించిన భూకంపం రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలను కంపింప జేసింది. 1983 జూన్ 30 న హైదరాబాదుకు సమీపంలో సంభవించిన భూకంపం ఆ నగరంలోనూ, చుట్టుప్రక్కల ప్రాంతాలలో సంచలనం సృష్టించింది. ఆంధ్రప్రదేశ్ పరిధికి ఆవల సంభవించిన భూకంపాలు రాష్ట్రంలోని పలుప్రాంతాలను కంపింప జేశాయి. 1843 మార్చి 31 న బళ్ళారి వద్ద సంభవించిన భూకంపంవల్ల కర్నూలు కొన్ని సెకన్లపాటు కంపించింది. 1900 ఫిబ్రవరి 8 న కోయంబత్తూరు ప్రాంతంలో సంభవించిన భూకంపం ఆంధ్రప్రదేశ్ దక్షిణ ప్రాంతాన్ని కంపింప జేసింది.

1967 డిశంబరు 10 న మహారాష్ట్రలోని 'కొయినాడాము' వద్ద సంభవించిన ప్రచండ మయిన భూకంపంవల్ల ఆంధ్రప్రదేశ్‌లో పశ్చిమ ప్రాంతం ప్రకంపనాలకు గురయింది. 1993 సెప్టెంబరు 30 న మహారాష్ట్ర లోని లాతూరు, ఉస్మానాబాద్ ప్రాంతాల్లో సంభవించిన భూకంపంవల్ల హైదరాబాదు, భువనగిరి, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్, కరీంనగర్, కడప, కర్నూలు, అనంతపురం మొదలయిన అనేక ప్రాంతాలు ప్రకంపనలకు గురయ్యాయి.

1960 తరువాత భూప్రకంపన శాస్త్రం అన్ని విధాల వృద్ధి చెందింది. 1965 లో బాబా అణుపరిశోధనా కేంద్రం కర్ణాటక రాష్ట్రంలోని గౌరీబిదనూరు వద్ద ఒక భూప్రకంపన మాపక సముదాయాన్ని (Seismic array) నెలకొల్పింది. దీని ముఖ్యోద్దేశం అణువిస్ఫోటన పరీక్షలను గుర్తించటం. ఆ కారణంచేత ఈ కేంద్రం అతి స్వల్పమ యిన ప్రకంపనలను పసిగట్టటమే కాకుండా వాటి ఉనికిని నిర్దిష్టంగా తెలియజేస్తుంది. 1967 లో జాతీయ భూ భౌతిక పరిశోధనాసంస్థ హైదరాబాదులో అతి శక్తివంతమైన భూప్రకంపన కేంద్రాన్ని నెలకొల్పింది. అతి స్వల్పమయిన ప్రకంపనాలనూ ఈ కేంద్రం నమోదు చేస్తుంది. భారత వాతావరణ శాఖ ఆధ్వర్యంలో పనిచేసే భూకంపమాపక కేంద్రాలు మన రాష్ట్రంలో హైదరాబాదు, విశాఖపట్నాలలో పని చేస్తున్నాయి.

గత 190 సంవత్సరాలలో గుర్తింపబడిన భూకంపాలను ఆంధ్రప్రదేశ్ పటంలో నమోదు చేసినప్పుడు అవి తరచు సంభవించే ప్రదేశాలను తెలుసుకోవచ్చు. అట్టి ప్రదేశాలు గోదావరిలోయ ప్రాంతం, ఒంగోలు ప్రాంతం, విజయనగరం, తూర్పుకనుమల ప్రాంతం, కడప హరివాణం, డామ్‌లు, రిజర్వాయర్లుగల నాగార్జున సాగర్, శ్రీశైలం కల్యాణి, సీలేరు వంటి ప్రాంతాలు. 1981 ఫిబ్రవరి నుండి 1984 జూన్ మధ్యకాలంలో ఒంగోలు ప్రాంతంలో సుమారు 43 అతి స్వల్పమయిన భూకంపాలు సంభవించాయని తెలుస్తోంది. 1969 ఏప్రిల్ 13 న భద్రాచలం వద్ద సంభవించిన భూకంపం తరువాత ఆ ప్రాంతంలో 1972 జూలై వరకు సుమారు 50 ప్రకంపనలు సంభవించాయి. భారత వాతావరణ శాఖ 1974 జూలై నుండి 1975 జూన్ వరకు ఎలమంచిలి, మాడుగుల, విజయనగరంలలో నెలకొల్పిన తాత్కాలిక కేంద్రాలు సుమారు 43 అతి స్వల్పమయిన భూకంపాలను పసిగట్టాయి. 1977 వ సంవత్సరం మొదటి ఆరునెలల కాలంలో గౌరీ బిదనూరు కేంద్రం సుమారు 255 అతి స్వల్పమయిన భూకంపాలను గుర్తించినట్టు ఆ కేంద్రం తెలిపింది. ఈ వివరాల నధ్యయనం చేస్తే ఆంధ్రప్రదేశ్‌లోనే అతి స్వల్పమయిన భూకంపాలు హెచ్చు సంఖ్యలోనూ, మధ్యతరహావి తక్కువ సంఖ్యలోనూ సంభవిస్తున్నాయని గ్రహించవచ్చు. గౌరీ బిదనూరు కేంద్రం 1968–1989 మధ్యకాలంలో గుర్తించిన ప్రకంపన వివరాలతో గంగారాడే తదితరులు రూపొందించిన దక్షిణ భారతం (పటం 1) ఇందుకు ఉదాహరణం. ఒక్క మాటలో చెప్పాలంటే – భూకంపాల కతీతమైన ప్రాంతం దక్షిణ భారతంలో కూడా లేదు.

భూకంపాలను నివారించలేము. అవి ఎప్పుడు, ఎక్కడ సంభవిస్తాయో కూడా తెలుసుకోలేము. కాని, భూకంపన శాస్త్ర పరిశోధనలవల్ల భూకంపాలు తరచు రాగల ప్రాంతాలను గుర్తించి, ఏ పరిమాణాన్ని అధిగమించి సుమారు ఎంత ఆవర్తన కాల వ్యవధిలో భూకంపాలు వాటి కనువయిన ప్రదేశాలలో రావటానికి అవకాశం వుందో నిర్ణయించవచ్చు.

ఈ వ్యాసంలో పొందుపరచిన పటం సర్వశ్రీ బి.కె. గంగారాడె, ఎ.జి.వి. ప్రసాద్, ఉన్నిక్రిష్ణన్, బి. చంద్ర శేఖర్, కె.ఆర్. సుబ్బరాము, ఆర్.డి. శర్మలు 1990 లో ప్రచురించిన 'Data of Earthquakes from Southern Peninsular India' వ్యాసంలోనిది. వారందరికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

*(దక్షిణ భారతదేశంలోని భూకంప క్షేత్రాలు సర్వశ్రీ గంగారాడే తదితరుల వ్యాసం ఆధారంగా, 1990.)*

# జంతుశాస్త్రాభివృద్ధి

- డా. దేవరాజు మహారాజు

ఆంధ్రప్రదేశ్‌లో జంతుశాస్త్ర వికాసానికి మూడు రకాల సంస్థలు కృషి చేస్తున్నాయి. 1. ఎకడమిక్ విశ్వవిద్యాలయాలు 2. జాతీయ పరిశోధనా సంస్థలు 3. రాష్ట్రప్రభుత్వ సంస్థలు. విద్య, వైద్య, వ్యవసాయ విశ్వవిద్యాలయాలన్నిటా జంతు శాస్త్ర శాఖలు పని చేస్తున్నాయి. జాతీయ పరిశోధనా సంస్థల్లో జంతు శాస్త్ర వికాసానికి ఇతోధికంగా తోడ్పడే పరిశోధనలు కొనసాగుతున్నాయి. అలాగే ఇంటర్మీడియెట్ బోర్డు, కమీషనర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్‌ల ఆధ్వర్యంలో జూనియర్ కళాశాలల్లో, డిగ్రీ కళాశాలల్లో జంతుశాస్త్ర బోధన జరుగుతోంది. ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వన్య ప్రాణులపై, ఫిషరీస్ డిపార్టుమెంట్ చేపలపై అధ్యయనం కొనసాగిస్తున్నాయి. సికింద్రాబాద్‌లో ఒకప్పుడు మిలట్రీ డాక్టరుగా పనిచేసిన సర్ రొనాల్డ్ రాస్, మలేరియా వ్యాధిని వ్యాప్తి చేసే దోమను గురించి ముఖ్యమైన పరిశోధనలు చేసింది ఇక్కడే. ఆయన ఇక్కడ చేసిన పరిశోధనలకే నోబెల్ బహుమతి, సర్ బిరుదూ లభించాయి. హైదరాబాద్‌లో బేగంపేట విమానాశ్రయ సమీపంలో ప్రస్తుతం శిథిలావస్థలో వున్న ఆయన ప్రయోగశాలల్ని పునరుద్ధరించే పనికి ఎవరూ పూనుకోలేదు. ఆయన కృషిని కొనసాగించే ప్రయత్నం కూడా ఎవరూ చేయకపోవడం మనస్తాపాన్ని కలిగించే విషయం.

## విశ్వవిద్యాలయాల కృషి:

రాష్ట్రంలో విశ్వ విద్యాలయాల సంఖ్య, స్నాతకోత్తర కేంద్రాల సంఖ్య గణనీయంగా పెరిగింది. అయా జంతుశాస్త్ర విభాగాలలో పరిశోధనలు విరివిగా కొనసాగుతున్నాయి. గత రెండు దశాబ్దాలలో ఊహించలేనన్ని మార్పులు వచ్చాయి. అన్నింటినీ పూర్తిగా బేరీజు వేయడం కష్టమైన పనే. పరిశోధకులందరినీ పేరుపేరుగా గుర్తుచేసు కోవడం కూడా సాధ్యం కాని పని. అయితే వివిధ విశ్వ విద్యాలయాల్లోని జంతు శాస్త్ర శాఖలు చేసిన కృషిని సంక్షిప్తంగా సమీక్షించుకోవచ్చు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వమే ఈ ప్రాంతంలో ఉస్మానియా, ఆంధ్ర విశ్వ విద్యాలయాలు ప్రారంభమయ్యాయి. అన్నింటి కన్నా మొట్టమొదట హైదరాబాద్‌లో ఏర్పడ్డ ఉస్మానియా విశ్వ విద్యాలయం (1918) జంతుశాస్త్ర శాఖను 1939 లో ప్రారంభించింది. విశాఖలో ఆంధ్ర విశ్వవిద్యాలయ జంతుశాస్త్ర శాఖ 1947 లోను, తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ జంతుశాస్త్ర శాఖ 1954 లోనూ ప్రారంభమయ్యాయి. 1970 దశకం చివరలో వరంగల్లులో కాకతీయ, గుంటూరులో నాగార్జున, అనంతపురంలో శ్రీ కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయాలు దాదాపు ఒకేసారి ప్రారంభమయ్యాయి. ఈ విశ్వ విద్యాలయాలన్నింటికీ అనుబంధంగా పనిచేస్తున్న స్నాతకోత్తర కేంద్రాలు మరెన్నో ఉన్నాయి. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ప్రొ. బి.కె.దాస్, డా. ఉమర్‌ఖాన్‌ల ఆధ్వర్యంలో మంచినీటి చేపలను గూర్చి, ప్రొ. ఎస్.ఎన్.సింగ్ ఆధ్వర్యంలో పరాన్న జీవులైన జంతువుల గూర్చి ఎన్నదగిన పరిశోధనలు జరిగాయి. ఆ తర్వాత తరంలో ప్రొ. మనోహర్ దాస్ నెమటోడ్ వృక్ష పరాన్న జీవులపై పరిశోధనలు జరిపి, భారతీయ నిమటాలజిస్ట్‌లలో ముఖ్యమైన వారయ్యారు. హైదరాబాద్ వృక్ష నెమటోడ్లపై ఆయన సమర్పించిన పరిశోధక గ్రంథం (1956) ఆ విషయంపై, భారత దేశంలోనే మొట్ట మొదటిది అయ్యింది. ఇతర పరాన్న జీవులపై ప్రొ. శ్యామ్ సుందర్ సింహా, ప్రొ. నారాయణ రావు, ప్రొ. తుకారాం కులకర్ణి ప్రభృతులు విశేషంగా కృషి చేశారు. ప్రొ. కిషన్ రావు ప్రొ. ఎస్.ఎస్. ఠాకూర్‌ల ఆధ్వర్యంలో కీటకాల అధ్యయనం, ప్రొ. జె.వి.రమణారావు ఆధ్వర్యంలో వన్యప్రాణుల అధ్యయనం, ప్రొ. యం.ఎ.ఖాన్ ఆధ్వర్యంలో పర్యావరణ అధ్యయనం, ప్రొ. పి. రామచంద్రరావు ఆధ్వర్యంలో హ్యూమన్ జెనటిక్స్‌లో పరిశోధన ముమ్మరంగా కొనసాగింది. ఇప్పటికీ ఇక్కడి జంతుశాస్త్ర విభాగంలో, ఇతర స్నాతకోత్తర కేంద్రాలలో పరిశోధనలు కొనసాగుతూనే ఉన్నాయి. ప్రొ. కృష్ణారెడ్డి (న్యూరోబయాలజీ) ప్రొ. జి.నారాయణ, డా.ఉమామహేశ్వర

రెడ్డి, డా.ఎస్.ఎల్.ఎన్.రెడ్డి (శరీర ధర్మశాస్త్రం), డా.జి. హెచ్.ఆర్.శర్మ (ఎండోక్రైనాలజీ), ప్రొ. రాజేశ్వరరావు, డా.నర్సిరెడ్డి, డా.రాఘవేంద్రరావు, డా.వెంకట నర్సయ్య (పారసైటాలజీ), ఈ వ్యాస రచయిత (ప్లాంట్ నెమటాలజీ), డా.నాగులు (వైల్డ్ లైఫ్ బయాలజీ), డా.నాగరాజు (ఎంటమాలజీ), డా.రామకృష్ణ (హిస్టోకెమిస్ట్రీ) - ఇంకా అనేక మంది యువశాస్త్రవేత్తలు వారి వారి ప్రత్యేక శాఖలలో పరిశోధనలు కొనసాగిస్తూనే ఉన్నారు. భారతీయ వైజ్ఞానిక ప్రగతికి దోహదం చేస్తూనే ఉన్నారు.

సముద్రజీవుల గురించి ఆంధ్ర విశ్వవిద్యాలయ జంతుశాస్త్ర శాఖ గణనీయమైన కృషి చేసింది. భారతదేశంలో ఆ శాఖలో ప్రముఖ పరిశోధనా కేంద్రంగా గుర్తింపు పొందింది. ఇక్కడి మొట్టమొదటి జంతుశాస్త్ర శాఖ అధిపతి ప్రొ. ఎ.గోపాల్ అయ్యర్ సముద్ర జీవ శాస్త్ర పరిశోధనకు గట్టి పునాదులు వేశారు. ప్రొ. పి.యస్.గణపతి, ప్రొ. హన్మంత రావుల ఆధ్వర్యంలో పరాన్నజీవులపై కూడా విశేషమైన కృషి జరిగింది. సుశిక్షితులైన వారి విద్యార్థులు సముద్ర జీవ శాస్త్రం, పారసైటాలజీలలో గణనీయమైన కృషి చేశారు. ఇంకా చేస్తున్నారు. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ జంతు శాస్త్ర విభాగం వారు తమ పరిశోధన శరీరధర్మ శాస్త్రంపై కేంద్రీకరించారు. ప్రొ. కె.పంపాపతిరావు, ప్రొ. కె.ఎస్.స్వామి, మొదలైనవారు ఈ అంశంపై, ఇతర అనుబంధిత అంశాలపై చెప్పుకోతగ్గ కృషి చేశారు. స్థూలంగా ఉస్మానియా - పరాన్న జీవులపై చేసిన కృషికి, ఆంధ్రా - సముద్ర జీవులపై చేసిన కృషికి, శ్రీ వెంకటేశ్వర - శరీర ధర్మ శాస్త్రంలో చేసిన కృషికి జాతీయ, అంతర్జాతీయ పరిశోధనారంగంలో గుర్తింపు పొందాయి. కొత్తగా ఏర్పడిన విశ్వ విద్యాలయాలు, స్నాతకోత్తర కేంద్రాలు బాలారిష్టాలు దాటి ఇప్పుడిప్పుడే స్థిరపడుతున్నాయి. వరంగల్లు కాకతీయ విశ్వవిద్యాలయ జంతు శాస్త్ర శాఖ నుండి ప్రొ. నర్సింహాచారి, ప్రొ. భాస్కర్ రావు; అనంతపురం నుండి ప్రొ. భాషా మొయినొద్దీన్‌ల పేర్లు ప్రముఖంగా వినిపిస్తున్నాయి. ఇంకా అనేక మంది ఉండి వుంటారు. సమాచారం తెలియక పోవడం వల్ల, సమీక్షను క్లుప్తీకరించుకోవడం జరుగుతోందే గాని, అయా పరిశోధనా కేంద్రాలలో జరుగుతున్న కృషి తక్కువదని గానీ అయా పరిశోధకుల పేర్లు పేర్కొనదగినవి కావని కానీ ఎంత మాత్రమూ కాదు. నిజానికి రాష్ట్రంలోని అన్ని సంస్థలలో జరుగుతున్న జంతుశాస్త్రాభివృద్ధిని గూర్చి ఇంతవరకు ఎవరూ నిశితంగా పరిశీలించలేదు. కాబట్టి ఇది విహంగ వీక్షణం కూడా కాదు. అయితే ప్రస్తుతానికి ఇంత కన్నా గత్యంతరం లేదు.

## జాతీయ సంస్థలు:

CSIR, ICAR, ICMR, ZSI మొదలైన జాతీయ సంస్థల శాఖలు రాష్ట్రంలో ఎన్నో ఉన్నాయి. వీటిలో ఎక్కువ రాష్ట్ర రాజధాని హైదరాబాదులోనే ఉన్నాయి. ఏవో కొన్నిమాత్రం ఇతర పట్టణాలల్లో ఉన్నాయి. కొన్ని వందల సంఖ్యలో శాస్త్రవేత్తలు ఈ శాఖల్లో పనిచేస్తున్నారు. ఇవి జాతీయ సంస్థల శాఖలైనా, ఆంధ్రప్రదేశ్‌లో నెలకొని ఉన్నాయి కాబట్టి, ఇక్కడి నేలలపై, ఇక్కడి పంటలపై, ఇక్కడి పురుగులపై , ఇక్కడి జంతువులపై , ఇక్కడి వాతావరణ పరిస్థితుల్లో పరిశోధనలు చేస్తున్నాయి కాబట్టి, ఇక్కడ జరిగే కృషి రాష్ట్రంలోని జంతు శాస్త్రాభివృద్ధికి ప్రత్యక్షంగా దోహదం చేస్తుంది. అలాగే రాజేంద్రనగర్‌లోని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం, వెటర్నరీ కాలేజి, బాపట్ల వ్యవసాయ కళాశాల గుంటూరు, సంగారెడ్డి ఇంకా ఇతర పట్టణాల్లోని పరిశోధనా సంస్థలు, అలాగే రాష్ట్రంలోని అన్ని వైద్య కళాశాలల్లో జరిగే పరిశోధనలు కొద్దో గొప్పో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జంతు శాస్త్ర వికాసానికి దోహదం చేస్తున్నవే!

## బోధన:

ఇక బోధనకు సంబంధించి చెప్పుకోవాలంటే రాష్ట్రంలో ఇంటర్మీడియెట్ స్థాయినుండి జంతు శాస్త్రం ఒక ప్రత్యేక విషయంగా విద్యార్థులకు బోధించబడుతోంది. డిగ్రీ స్థాయి. (B.Sc) లో కూడా అంతే. తెలుగు మాధ్యమంతో ఈ కోర్సులు చదివే వారికి తెలుగు అకాడెమీ పాఠ్యగ్రంథాలనెన్నో ప్రచురించింది. పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో ప్రత్యేకించి జంతు శాస్త్రంతో మాస్టర్స్ డిగ్రీ (M.Sc) తీసుకునే అవకాశం వుంది. అలాగే పరిశోధనలు చేసి డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ (Ph.D) డిగ్రీ సాధించగలిగే అవకాశం కూడా ఉంది. ఇంటర్మీడియేట్ కోర్సు ఇంటర్మీడియేట్ బోర్డ్ ఆధ్వర్యంలో కొనసాగితే, డిగ్రీనుండి పైస్థాయి కోర్సులన్నీ విశ్వవిద్యాలయాల ఆధ్వర్యంలో కొనసాగుతున్నాయి. స్నాతకోత్తర కేంద్రాలు, విశ్వవిద్యాలయ శాఖలు బోధన, పరిశోధన రెండింటినీ సమంగా నిర్వహిస్తున్నాయి.

## రాష్ట్రంలో ప్రాణి సంపద :

దక్షిణ భారతంలోని ఇతర రాష్ట్రాలలో వలె, ఆంధ్ర ప్రదేశ్‌లో ఉష్ణ ప్రాంతపు వర్షాలతో కూడిన అడవులు లేవు. శ్రీకాకుళానికి ఉత్తరంగానూ, విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలోనూ, తెలంగాణాలోని అదిలాబాద్, కరీంనగర్ ప్రాంతాలలో మాత్రమే తేమతో కూడిన అడవులు ఉన్నాయి.

తేమలేని అడవులు ఆంధ్రా, రాయలసీమల దక్షిణతీరం లోనూ, కొండ ప్రాంతాల్లోనూ ఉన్నాయి. అందువల్ల ఇక్కడ ప్రకృతి సిద్ధంగా తిరిగే ఏనుగులు లేవు. పులుల సంఖ్య పూర్తిగా తగ్గిపోయింది. గత ముప్పయ్యేళ్ళలో విశాఖ జిల్లాలోని అడవుల్లో చిరుతపులులు పూర్తిగా తగ్గిపోయాయి. మధ్య ఆంధ్రప్రదేశ్‌లో తేమలేని అడవులు, మామూలు అడవులు, పచ్చిక బీళ్ళు మాత్రమే ఉన్నాయి. ఇలాంటి అడవులలో, పచ్చిక బీళ్ళలో అడవి పందులు, చుక్కల జింకలు NILGAI, BLACK BUCK, FOUR HORNED ANTELOPE, SLOTH BEAR మొదలైనవి ఉన్నాయి. తెలంగాణా, రాయలసీమ మధ్య భాగాలు రాతిమయమైన తేమలేని ప్రాంతాలు కావడం వల్ల, శాకాహార, మాంసాహార, – పెద్ద జంతువులను పోషించే వృక్ష సంతతి లేదు. తీర ప్రాంతపు జిల్లాల్లో పంటలు బాగా పండడం వల్ల, ఈ విషయంలోని వాస్తవం తెలుస్తోంది.

రాష్ట్రంలో ఆసక్తికరమైన పక్షులు ఉన్నాయి. వాటిలో స్థిరంగా వుండేవి కొన్నయితే, వస్తూ పోతూ వుండేవి కొన్ని. మధ్య ఆసియా నుంచి, హిమాలయ ప్రాంతాల నుంచి రకరకాల పక్షులను ఎక్కువ సంఖ్యలో ఇక్కడి చెరువులు, కొలనులు ఆకర్షిస్తున్నాయి. సెప్టెంబర్ – అక్టోబర్, ఫిబ్రవరి – మార్చ్ మధ్య కాలంలో వీటిని ఇక్కడ చూడవచ్చు. ధాన్యం తినే పక్షులు, ఇతర రకాల పక్షులు ఇక్కడి తీర ప్రాంతాల్లో సంవత్సరం కంటే ఎక్కువ కాలం కనిపిస్తాయి. మన ప్రాచీన గ్రంథాలలో, కొన్ని రకాల పక్షుల, జంతువుల ప్రసక్తి చాలా చోట్ల ఉంది. అయితే కవిత్వంలో, జానపద కథల్లో వీటి జీవితాల గురించి, ప్రవర్తనను గురించి అనేక తప్పుడు అభిప్రాయాలు చోటు చేసుకున్నాయి. పాకే జంతువుల (సరీసృపాల) లో తాచుపాము, రస్సెల్ వైపర్ జెర్రిపోతు, మొసలి వంటివి గోదావరి భద్రాచలం ప్రాంతంలో విరివిగా ఉన్నాయి. అయితే వాటి చర్మంకోసం అనాలోచితంగా ఎక్కువ సంఖ్యలో ధ్వంసం చేయబడుతూ ఉన్నాయి. చిన్న తాబేలు విశాఖ ప్రాంతాలలో ఎక్కువ. చలన అవయవాలు లేని బల్లి కూడా అక్కడి ఇసుక ప్రాంతాల్లో ఉంది. కప్పలు, చిరుకప్పలు రాష్ట్రమంతటా విస్తరించి ఉన్నాయి. ఆహార యోగ్యమైన కప్పలను తీర ప్రాంతపు చెరువుల నుండి సేకరించి, కొచ్చిన్, మద్రాస్‌లకు పంపుతున్నారు. అక్కడ వాటి కాళ్ళను తెగ్గోసి మంచులో భద్రపరిచి అమెరికా, జపాన్ దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. అక్కడ అవి గొప్ప భోజన పదార్ధంగా పరిగణించబడుతున్నాయి. నిజమే – అయితే, ఇక్కడ ఆహార శృంఖలాలు తెగిపోయి, పర్యావరణం దెబ్బతింటుందన్న విషయం ఆలోచించడం లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో 600 మైళ్ళ తీరరేఖ ఉంది. దేశంలో పొడవైన తీరరేఖ గుజరాత్ తర్వాత ఈ రాష్ట్రానికే ఉంది. తీర జలాలు , గోదావరి కృష్ణానదీ జలాలలో వివిధ రకాల చేపల జాతులు ఆర్థిక దృక్పథంతోనూ, వైజ్ఞానిక దృక్పథంతోనూ పోషించబడుతున్నాయి. 1803 లో పాట్రిక్ రస్సెల్ మొదటి సారిగా భారతదేశపు జలాలలో లభించే చేపలను గురించి రాసిన ఒక పుస్తకం మనకు అత్యంత ఆసక్తిని కలిగిస్తుంది. అది ఆంధ్ర కోస్తాలో లభించే చేపలను గురించి రాయబడిన మొదటి పుస్తకమేకాక, చాలారకాల చేపలకు అందులో తెలుగు పేర్లు ఇవ్వడం జరిగింది. EMECICHTHYES FIKI VELIFER AFRICANUS అనే అరుదైన రెండు చేపల జాతులను విశాఖ పట్టణ ప్రాంతంలో ఈ గ్రంథ రచయిత కనుగొన్నాడు. ఈ రెండింటి నమూనాలు ప్రపంచం మొత్తం మీద పదికి మించి లేవు. ఇందులో మొదటిది హిందూ మహాసముద్రంలోనూ, రెండవది బంగాళాఖాతం లోనూ మొదటి సారిగా కనుగొనబడ్డాయి. ఆంధ్రప్రదేశ్‌లో దేశంలోని ఇతర ప్రాంతాల్లో వలె స్వభావ సిద్ధంగా వుండవల్సిన భూ, జల జంతువులు ప్రమాదంలో ఉన్నాయి. వ్యవసాయ భూముల విస్తరణకు, పరిశ్రమలు, కర్మాగారాలు నెలకొల్పడానికి అడవులను నిర్మూలించడం జరుగుతోంది. అనాలోచితంగా క్రిమి సంహారక మందులను వాడడం, చెరువుల్లోకి, నదుల్లోకి ప్రమాదకరమైన రసాయనిక పదార్థాలను వదలడం జరుగుతోంది. దీనివల్ల పర్యావరణ సమస్థితి దెబ్బ తింటోంది. అందువల్ల పక్షులు జంతువులు తగ్గిపోతున్నాయి. కొన్ని జాతులు పూర్తిగా నశించిపోతున్నాయి. నల్ల జింక, పాలపిట్ట, ఇండియన్ బస్టర్డ్ మన రాష్ట్ర వన్య ప్రాణులుగా గుర్తింపబడ్డాయి. వన్య ప్రాణుల సంరక్షణ కార్యక్రమాలకు బహుళ ప్రచారం కల్పించే నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం ప్రతి సంవత్సరం వన్యప్రాణి, సప్తాహం నిర్వహిస్తోంది. అలాగే ఎన్నో కొత్త పథకాలను కూడా ప్రవేశపెడుతోంది.

### ముందుజాగ్రత్త:

చివరగా కొన్ని చేదు నిజాల్ని కూడా చెప్పుకోవాలి. 1970 దశకం వరకు జరిగిన పరిశోధనలకు, ఆ తర్వాత ఇటీవల ఇరవై సంవత్సరాల నుండి జరుగుతున్న పరిశోధనలకు చాలా వ్యత్యాసం ఉంది. నేటి పరిశోధన దేశ భవిష్యత్తును, రాష్ట్ర అవసరాలను దృష్టిలో వుంచుకుని జరగడం లేదు. ప్రొఫెసర్లు, శాస్త్రవేత్తలు తమ వ్యక్తిగత ప్రయోజనాలను దృష్టిలో వుంచుకుని, తక్కువ సమయంలో సులభశైలిలో కొనసాగే ప్రయోగాలకు రూపకల్పన చేస్తున్నారు. ఒకవైపు నిరుద్యోగం పరిశోధనా రంగంపై ఒత్తిడి తెస్తోంది. పోటీ పరీక్షలు రాస్తూ, పరిశోధనలు చేస్తున్నామని ఆత్మద్రోహం చేసుకునే యువ పరిశోధకుల నిజాయితీ గూర్చి ఆలోచించాల్సి వస్తోంది.

పెడదారుల్లో డబ్బూ, హోదా సంపాయించుకునేందుకు ఆచార్య వర్యులంతా అగచాట్లు పడుతున్నారేమో కూడా ఆలోచించాల్సి ఉంది. ఇది కేవలం జంతు శాస్త్రానికి సంబంధించిన సమస్యకాదు – మొత్తానికి మొత్తంగా పరిశోధనా రంగానికి సంబంధించిన సమస్య. ఈ పరిస్థితి మారాలి. కొన్ని స్థిరమైన విలువల్ని నిలిపే పరిశోధనలు కొనసాగాలి. దేశ ఆర్థిక వనరులు వృధా కాకుండా, శాశ్వత ప్రయోజనాల్ని ఆశించి పరిశోధనలు కొనసాగించవలసిన అవసరం ఉంది. రాష్ట్ర ప్రగతి అందులోనే ఉంది.

ఏ దేశ సంస్కృతి అయినా
ఏనాడూ కాదొక స్థిర బిందువు
నైకనదీ నదాలు అదృశ్యంగా
కలిసిన అంతస్సింధువు – తిలక్

# రాష్ట్రంలో విశ్వవిద్యాలయాలు - పరిశోధనా సంస్థలు

మల్లిక్, వై.వి. కృష్ణారావు

## డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

మనదేశంలోని మొట్టమొదటి సార్వత్రిక విశ్వవిద్యాలయం ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం. ఈ విశ్వవిద్యాలయం స్థాపన కోసం రాష్ట్రప్రభుత్వం శాసనసభ 1982 ఆగస్టులో చట్టాన్ని రూపొందించి స్థాపించటం జరిగింది. ఈ విశ్వవిద్యాలయం రాష్ట్రం మొత్తం 275,068 చ.కి.మీ. కలిగి 23 జిల్లాలను ఆకలింపుకొంటుంది. దీని ప్రధాన కేంద్రం రాష్ట్ర రాజధాని అయిన హైదరాబాద్‌లో వుంది. రాజ్యాంగ నిర్మాత దళిత వర్గాల నాయకుడు, గొప్ప జాతీయ లీడర్ అయిన డా. బీంరావు బాబా సాహెబ్ అంబేద్కర్ పేరుతో 1991లో ఈ విశ్వవిద్యాలయానికి డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం అని నామకరణం చేయడం జరిగింది.

డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం సాధించిన అభివృద్ధి పథంలోకి ఒకసారి తొంగిచూస్తే 26 అధ్యయన కేంద్రాలు 6,250 మంది అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులతో చిన్నగా ప్రారంభమైన విశ్వవిద్యాలయం నేడు 102 అధ్యయన కేంద్రాలు 60 వేల మంది విద్యార్థుల మొత్తం లక్షా 67 మంది విద్యార్థుల సంఖ్యతో, పూర్తిస్థాయి మాస్టర్ కోర్సులతో వర్థిల్లుతున్నది. అంతేకాకుండా 1988-89 విద్యా సంవత్సరం నుంచి అన్ని శాఖలలో ఎం.ఫిల్. కోర్సులను కూడా నిర్వహిస్తూ వున్నది.

ఈ విశ్వవిద్యాలయం పట్టణ ప్రాంతాలకే పరిమితం కాకుండా గ్రామాల్లోనూ, గిరిజన ప్రాంతాలలోనూ, కలిపి 102 అధ్యయన కేంద్రాల ద్వార దూర విద్యావిధానం అమలు పరుస్తుంది.

విశ్వవిద్యాలయం 1994లో పరిపాలనా విభాగాలను విస్తృతపరుస్తూ మరియు బోధనలో అవసరమయ్యే అత్యంత ఆధునిక సదుపాయాలతో పరిశోధనలు జరుపుటకు అనుకూలంగా 53.63 ఎకరాల విస్తీర్ణంలో హైదరాబాద్‌లోని జూబ్లిహిల్స్‌లో నూతన భవనాలను ఏర్పాటు చేసుకుంది. ప్రస్తుతం విశ్వవిద్యాలయ కార్యకలాపాలన్నీ ఇక్కడనుంచే జరుగుతున్నాయి.

### ప్రవేశం:

ఈసార్వత్రిక విశ్వవిద్యాలయంలో విద్యను అభ్యసించాలనుకొనేవారు భారతీయ పౌరసత్వం కలవారై 20 సంవత్సరముల వయస్సు నిండినవారై ఉండాలి. అయితే విశ్వవిద్యాలయం డిగ్రీ కోర్సుల ప్రవేశం కొరకు రెండు పద్ధతులను పాటిస్తుంది. మొదటిది ఇంటర్మీడియట్ లేక తత్సమానమైన అర్హత కలిగిన వారు నేరుగా ప్రవేశానికి అర్హులు. ఇంటర్మీడియట్ స్థాయిలో సాధారణ విద్యాభ్యాసం లేక విద్యాసంబంధమైన ప్రమాణం కలిగినవారు వయస్సుతో నిమిత్తం లేకుండా ఈ కోర్సులలో ప్రవేశానికి అర్హులు. రెండవది ఏ మాత్రం ఉన్నత విద్యపై పూర్వ జ్ఞానం లేనివారికి విశ్వవిద్యాలయం అర్హత పరీక్షను జరిపి దానిలో ఉత్తీర్ణులైన వారినే విశ్వవిద్యాలయం నిర్వహించే కోర్సులలో చేర్చుకోవటం జరుగుతుంది. దీనికి ప్రతి సంవత్సరం అర్హత పరీక్షలను విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది.

విశ్వవిద్యాలయం నిర్వహించే పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులలో ప్రవేశాన్ని కోరే విద్యార్థుల అండర్ గ్రాడ్యుయేట్ లేదా విశ్వవిద్యాలయం నిర్వహించే అర్హత పరీక్షలో మార్కులు, సాధించిన దాని ప్రకారం ప్రవేశం లభిస్తోంది. అంతేకాకుండా విశ్వవిద్యాలయం ఆయా కోర్సులకు నిర్వహించే నిబంధనల ప్రకారం అర్హులవుతారు.

ఈ సార్వత్రిక విశ్వవిద్యాలయం మూడు సంవత్సరముల అండర్ గ్రాడ్యుయేట్ డిగ్రీ కోర్సులను, (బి.ఎ.,బి.కాం.,బి.ఎస్సీ

కోర్సులు), ఒక సంవత్సరం కాలవ్యవధిలో పబ్లిక్ రిలేషన్స్ (బి.పి.ఆర్) పి.జి. కోర్సును (బి.ఎల్.ఐ.సి.), బ్యాచ్‌లర్ డిగ్రీ, లైబ్రరీ మరియు ఇన్‌ఫర్‌మేషన్ సైన్స్ (పి.జి.) కోర్సును నిర్వహిస్తుంది. మరియు ఎం.బి.ఎ. మూడు సంవత్సరముల పి.జి. కోర్సును నిర్వహించటంతో పాటు రెండు సంవత్సరముల కాలవ్యవధిగల ఎం.ఎస్సీ, గణితశాస్త్రం, ఎం.ఎ పొలిటికల్ సైన్స్, (రాజకీయ శాస్త్రం), ఎం.ఎ. పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ (ప్రజాపరిపాలన, నిర్వహణా శాస్త్రం) మరియు ఎం.ఫిల్, పిహెచ్.డి. పరిశోధన కోర్సులను కూడా నిర్వహిస్తోంది. పై కోర్సులకు తోడు సర్టిఫికెట్ కోర్సులను కూడా నిర్వహిస్తోంది. అంతేకాకుండా 95-96లో ఈ క్రింద తెలుపబడిన అంశాలలో డిప్లమా కోర్సులను నిర్వహించాలని విశ్వవిద్యాలయం యోచిస్తున్నది.

ఈ విశ్వవిద్యాలయం ఇతర విశ్వవిద్యాలయాల సహాయ సహకారాలను కూడా పొందుతుంది. అంతేకాకుండా ఈ సహాయ సహకారాలతో దేశ విదేశాలలో వివిధ అంశాలపై వర్క్‌షాప్స్‌ను నిర్వహించింది, నిర్వహిస్తోంది.

ఈ విశ్వవిద్యాలయం ప్రారంభించిన నాటి నుండి వివిధ కోర్సులలో 1987లో 1491 మంది విద్యార్థులకు, 1988లో 2015 మంది విద్యార్థులకు, 1989లో 2065 మంది విద్యార్థులకు, 1990లో 4155 మంది విద్యార్థులకు, 1991 సంవత్సరములో 4882 మంది విద్యార్థులకు, 1993లో 3434 మంది విద్యార్థులకు, విశ్వవిద్యాలయం ప్రతి ఏటా జరిపే స్నాతకోత్సవంలో డిగ్రీలను ప్రదానం చేసింది. అయితే ఇందులో 22 ఎం.ఫిల్ డిగ్రీలు ప్రదానం చెయ్యడం విశేషం.

పట్టు పురుగుల పెంపకం, గ్రేష్-మష్‌రూం పెంపకం, కార్యాలయ యాజమాన్యం వంటి కొత్త డిప్లమా స్థాయి కోర్సులను మరియు, బి.ఏ., బి.కామ్. కోర్సులను, వినియోగదారుల అధ్యయనం, స్త్రీల అధ్యయనం, వాతావరణం అధ్యయనం, మానవ హక్కుల వంటి అంశాలను నిర్వహించడానికి ప్రయత్నం చేస్తోంది. ఇందువల్ల దేశ పౌరునికి ఉన్న హక్కులను, బాధ్యతలను తెలుసుకోవడమే కాదు, విద్యార్థుల జీవనోపాధికి ఉపయోగపడుతుంది.

డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం 1995-96 విద్యా సంవత్సరంలో ఇలాంటివి కనీసం ఏడు కొత్త కోర్సులను ప్రవేశపెట్టడానికి సన్నాహాలు చేస్తోంది. మాస్టర్ స్థాయిలో - సమాచారం విజ్ఞానంతో పాటు బిజినెస్ ఫైనాన్స్, ఎన్విరాన్‌మెంటల్ స్టడీస్, మార్కెటింగ్ మేనేజ్‌మెంట్, ఆఫీస్ మేనేజ్‌మెంట్, రైటింగ్ ఫర్ మీడియా, మహిళా అధ్యయనంలో పి.జి. డిప్లమా కోర్సులను ప్రవేశపెట్టాలని విశ్వవిద్యాలయం యోచిస్తోంది. అంతేకాకుండా సాధారణ న్యాయ చట్టాలపై పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లమా, విద్యలో బాచిలర్ డిగ్రీని కూడా విశ్వవిద్యాలయం ప్రవేశపెట్టడానికి ప్రయత్నం చేస్తోంది. కాబట్టి రాష్ట్ర, కేంద్ర స్థాయిలో నూతన విద్యా విధానాలు రూపొందుతున్న ఈ తరుణంలో అవసరాలకు అనుగుణమైన కోర్సులు ప్రారంభిస్తుందని ఆశిద్దాం.

దేశంలోనే ప్రప్రథమ సార్వత్రిక విశ్వవిద్యాలయమైన డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం సాంకేతిక రంగంలో వస్తున్న మార్పులను గమనిస్తూ అధ్యయన కేంద్రాలకు తోడుగా వృత్తి విద్యాకోర్సులు నేర్చుకొనేలా చేయాలని కూడా యోచిస్తోంది. అయితే ఇందుకు తగిన ప్రమాణాలకు సదుపాయాలు తప్పనిసరిగా అవసరం. ఇందుకుగాను రాష్ట్రానికి, కేంద్రానికి చెందిన అధికారులు దూరవిద్య అవసరాలను దృష్టిలో ఉంచుకుంటారని కూడా భావిద్దాం.

## శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మొట్టమొదటి మహిళా విశ్వవిద్యాలయంగా పేరు పొందిన శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయాన్ని 1983న తిరుపతిలో స్థాపించటం జరిగింది. ఈ విశ్వవిద్యాలయం 138.43 ఎకరాల విస్తీర్ణం కలిగి విద్యార్థుల విజ్ఞానానికి మంచి అహ్లాదాన్ని కలిగించే విధంగా ఉంది. ఈ విశ్వవిద్యాలయం రాష్ట్రం మొత్తంలో తమ కార్యకలాపాలను సాగిస్తోంది.

ప్రస్తుతం ఈ విశ్వవిద్యాలయం క్రింద తెలుపబడిన శాస్త్ర, విజ్ఞాన కోర్సులను నిర్వహిస్తోంది.

1. అనుప్రయుక్త గణిత శాస్త్రం, 2. అనుప్రయుక్త సూక్ష్మ జీవశాస్త్రం, 3. గృహ విజ్ఞాన శాస్త్రం. 4. సెరికల్చర్ శాస్త్రం మొదలగు కోర్సులను నిర్వహిస్తుంది.

### అనుప్రయుక్త గణిత శాస్త్ర విభాగం:

ఈ గణిత శాస్త్ర విభాగంలో 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో 30 మంది విద్యార్థినులను ఏటా చేర్చుకోవటం జరుగుతుంది. ఈ కోర్సులో ఆల్‌జీబ్రా, రియల్ అనాలిసిస్, మ్యాథమెటికల్ మెథడ్స్, డిఫరెన్షియల్ ఈక్వేషన్స్, కంట్యూనం మెకానిక్స్, కాంప్లెక్స్ అనాలిసిస్, టోపాలజీ మరియు ఫంక్షనల్ అనాలిసిస్, కంప్యూటర్ ఓరియంటెడ్ న్యూ మెడికల్ అనాలిసిస్‌తోబాటు ప్రత్యేకాంశముగా ఈ క్రింది వాటినీ బోధిస్తున్నారు.

ఆపరేషన్స్ రిసర్చ్, గ్రాఫ్‌థీరీ మరియు కాంబినేటరిక్స్, సెమిగ్రూఫ్ థీరి ఆల్‌జీబ్రాక్ జామెట్రి, అనుప్రయుక్త ఆల్‌జీబ్రా, విస్కస్‌ఫ్లోస్, రొటేటింగ్ మరియు స్ట్రాటిఫైడ్ ఫ్లోస్ అంశాలనూ బోధిస్తున్నారు.

## అనుప్రయుక్త సూక్ష్మజీవ శాస్త్ర విభాగం:

అనుప్రయుక్త సూక్ష్మజీవ శాస్త్రంలో 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతి సంవత్సరం 10 మంది విద్యార్థినులను చేర్చుకుంటున్నారు. ఈ శాఖలో జనరల్ మైక్రోబయాలజీ, ఇమ్యూనాలజీ, మెడికల్ మైక్రో బయాలజీ, బయో కెమిస్ట్రీ, అగ్రికల్చర్, ఫుడ్ అండ్ ఇండస్ట్రియల్ మైక్రోబయాలజీ, మైక్రో బయాల్ ఫిజియాలజీ, అండ్ యాంటీ మైక్రో బయల్ ఏజన్స్‌లు, మైక్రోబయల్ జెనటిక్స్ మరియు మాలుక్యులర్ బయాలజీ, విలోలాజీ మొదలగు అంశాలు బోధించటం జరుగుతోంది.

## గృహ విజ్ఞాన శాస్త్ర విభాగం:

ఈ గృహవిజ్ఞాన శాస్త్రాన్ని రెండు ప్రత్యేక అధ్యయనాల క్రింద బోధించటం జరుగుతుంది. మొదట ప్రత్యేకాంశముగా "ఆహార విజ్ఞానము మరియు పోషకాహారము" అనే అంశంపై బోధించటం జరుగుతోంది. ఇందులో రిసర్చ్ మెథడ్స్, న్యూట్రిషన్ డ్యూరింగ్ లైఫ్ స్పాన్, ఆహార విజ్ఞానము, న్యూట్రిషన్ బయోకెమిస్ట్రీ, ఫుడ్ కెమిస్ట్రీ, కమ్యూనిటి ఎడ్యుకేషన్, క్లినికల్ న్యూట్రిషన్ మరియు డైటిక్స్, అడ్వాన్స్‌డ్ న్యూట్రిషన్, ఫుడ్ సానిటేషన్ మరియు క్వాలిటీ కంట్రోలు, థీసెస్, స్టడీటూర్ (తప్పనిసరి) - అనే అంశాలను దీనిలో బోధిస్తారు. మరో ప్రత్యేకాంశముగా "హ్యూమన్ డెవలప్‌మెంట్ మరియు ఫ్యామిలీ స్టడీస్" అనే అంశంలో రీసర్చ్ మెథడ్స్, ఎర్లీచైల్డ్ కేర్ అండ్ ఎడ్యుకేషన్, టెక్నిక్స్ ఆఫ్ చైల్డ్‌స్టడీ లైఫ్‌స్పాన్ మరియు హ్యూమన్ డెవలప్‌మెంట్, సోషలాజికల్ పర్‌స్పెక్టీవ్స్ ఆఫ్ మ్యారేజ్ మరియు ఫ్యామిలీ, కమ్యూనిటి ఎడ్యుకేషన్ ఎక్స్‌టెన్షనల్ చైల్డ్ థీరిస్ ఆఫ్ హ్యూమన్ డెవలప్‌మెంట్ చైల్డ్ గైడెన్స్ మరియు పేరెంట్ కౌన్సిలింగ్, డిసర్టేషన్, స్టడీటూర్ (తప్పనిసరి) - మొదలగు అంశాలు దీనిలో బోధిస్తారు. మొత్తం ఈ గృహ విజ్ఞాన శాస్త్రంలో ప్రతి సంవత్సరము 20 మంది విద్యార్థినులను 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులోనికి చేర్చుకోవటం జరుగుతుంది.

## సెరికల్చర్ శాస్త్ర విభాగము:

ఈ పట్టుపురుగుల పెంపకం శాస్త్ర విభాగంలో ప్రతి సంవత్సరం 20 మంది విద్యార్థినులను ఎం.ఎస్. సి. రెండు సంవత్సరముల కోర్సులోనికి చేర్చుకోవటం జరుగుతుంది. దీనిలో సెరికల్చర్ వృక్షశాస్త్రం, సిల్క్‌వామ్ బయాలజీ మరియు రియరింగ్, బయో కెమిస్ట్రీ మరియు ఫిజియాలజీ రిలేటెడ్ టు సిల్క్‌వామ్, సీడ్ టెక్నాలజీ, మల్బరీ మరియు సిల్క్ వామ్ పాథాలజీ, సైటాలజీ, జెనిటిక్స్ మరియు బ్రీడింగ్ ఆఫ్ మల్బరీ మరియు సిల్క్‌వామ్, సిల్క్ టెక్నాలజీ, ఎక్స్‌టెన్షన్ మరియు ఎకనామిక్స్/ఆఫ్ సిల్క్ పరిశ్రమ, లాబరేటరీ వర్క్ మొదలగు అంశాలను గూర్చి దీనిలో బోధించటం జరుగుతుంది.

ముఖ్యంగా ఈ విశ్వవిద్యాలయంలో "స్త్రీలు అధ్యయనం" (ఉమెన్స్ స్టడీస్) గురించి కూడా ఒక శాఖను ఏర్పాటు చేసి వివిధ అంశాలపై బోధనలు జరుపుతున్నారు. ఈ కోర్సులో ఏటా 20 మంది విద్యార్థినులను రెండు సంవత్సరముల హ్యూమానిటీస్ కోర్సులో చేర్చుకోవడం జరుగుతోంది.

ఈ విశ్వవిద్యాలయం పైన తెలిపిన కోర్సులతోపాటు పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లమా కోర్సులను ఒక సంవత్సరం కాల వ్యవధిలో ఈ క్రింది అంశాలను బోధిస్తున్నారు.

లా మరియు మెడిసిన్ కోర్సులో ఒక సంవత్సరం డిప్లమా కోర్సును బోధిస్తుంది. దీనిలో ఏటా 15 మంది విద్యార్థినులను చేర్చుకోవటం జరుగుతుంది. ఇంకా న్యూట్రిషన్ మరియు డైటిక్స్‌లో 15 మంది విద్యార్థినులను ఏటా చేర్చుకొంటున్నారు. అదేవిధంగా సెరికల్చర్ శాస్త్రంలో 30 మంది ఏటా ఒక సంవత్సరం డిప్లమా కోర్సులో చేర్చుకొంటున్నారు.

శ్రీ పద్మావతి విశ్వవిద్యాలయం ప్రత్యేక విద్య (స్పెషల్ ఎడ్యుకేషన్) క్రింద "ఇయరింగ్ ఎంపైర్‌మెంట్" అనే అంశాన్ని డిగ్రీ స్థాయిలో ఒక సంవత్సరం కాలవ్యవధిలో ఈ కోర్సును నిర్వహిస్తున్నారు. ఏటా 10 మంది విద్యార్థినులను ఈ కోర్సులో చేర్చుకోవటం జరుగుతోంది.

ముఖ్యంగా యే ఇతర విశ్వవిద్యాలయంలో లేని "స్త్రీల అధ్యయనం ఇయరింగ్ ఎంపైర్‌మెంట్" అనే రెండు కోర్సులను ఈ విశ్వవిద్యాలయం నిర్వహించటం గర్వించతగింది.

# తెలుగు విశ్వవిద్యాలయం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన సభ 1985వ సంవత్సరంలో చేసిన ప్రత్యేక చట్టం (27) ద్వారా తెలుగు విశ్వవిద్యాలయం అదే సంవత్సరంలో డిసెంబర్ 2వ రూపుదాల్చింది. తెలుగు భాషా, సాహిత్య, సంస్కృతి, చరిత్ర రంగాలలో బోధన, పరిశోధన, ప్రచురణ బహుముఖీన నిర్వహణకు ఏర్పడిన సమున్నత విద్యా సంస్థ "తెలుగు విశ్వవిద్యాలయం". భాష ఆలంబనగా సువిశాల లక్ష్యాలను నిర్దేశించుకొని అవతరించిన విశ్వవిద్యాలయాల్లో తెలుగు విశ్వవిద్యాలయం దేశంలోనే రెండవది.

రాష్ట్ర రాజధాని నగరమైన హైదరాబాద్ పబ్లిక్ గార్డెన్‌లో 'లలిత కళాక్షేత్రం' పేరిట నిర్మాణమైన నూతన భవనం ప్రధాన పరిపాలనా కార్యాలయంగా ఉంది. నృత్య, సంగీత, శిల్ప, జానపద, రంగస్థల కళల సమాహారంగా

లలిత కళాపీఠం కూడా లలిత కళాక్షేత్రంలోనే వుంది. జ్యోతిష శాఖ మరియు తులనాత్మక అధ్యయన కేంద్రాలు కూడా ఈ భవనంలోనే వున్నాయి. హైదరాబాద్‌లో విద్యానగర్ సమీపంలోని "తెలుగుభవన్" సముదాయంలో భాషాభివృద్ధి పీఠం వుంది. దీనిలో భాషా ప్రణాళిక నవీకరణ శాఖ, నిఘంటు నిర్మాణ శాఖ, జర్నలిజం శాఖలు ఉన్నాయి. ఈ శాఖల్లో ఎం.ఎ, ఎం.ఫిల్, పిహెచ్.డి. కోర్సులను నిర్వహిస్తోంది. పూర్వం తెలుగు భాషా సమితిగా ఉండి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమైన కొమర్రాజు లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వ కేంద్రం కూడా తెలుగు భవన సముదాయంలోనే ఉంది. గోదావరీ తీరాన ప్రాచీనాంధ్ర సామ్రాజ్య కేంద్రమైన రాజమండ్రి దగ్గర బొమ్మూరులో సాహిత్య పీఠం ఏర్పాటు చేశారు. ఈ పీఠంలో తెలుగులో ఎం.ఎ., ఎం.ఫిల్, పిహెచ్.డి. కోర్సులు ఉన్నాయి. ఇక్కడ భక్తిపద కవితా శాఖ, జానపద గిరిజన విజ్ఞాన శాఖలు ఉన్నాయి. అంతేకాకుండా 1992 – 93లో 'అన్నమాచార్య అధ్యయన సంస్థ'ను తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహకారంతో ప్రారంభించటం జరిగింది. ఈ సంస్థ అన్నమాచార్యుల రచనలు, పదకవితలు, కీర్తనలపై విస్తృతంగా పరిశోధన చేయడానికి అవకాశం కల్పిస్తుంది. దక్షిణ కాశీగా పేరుబడిన కృష్ణాతీరం శ్రీశైల క్షేత్రంలో చరిత్ర – సంస్కృతి – పురావస్తు శాస్త్ర పీఠంను ఏర్పాటు చేశారు. ఈ శ్రీశైల ప్రాంగణంలోని పీఠంలో తెలుగు భాషీయుల చరిత్ర, సంస్కృతి శాఖ, పురావస్తుశాఖ, శాసనలేఖ శాఖలు ఉన్నాయి. ఈ శాఖలలో ఎం.ఫిల్., పిహెచ్.డి. కోర్సులు నిర్వహించబడుతున్నాయి. హైదరాబాద్ లలితకళాక్షేత్రంలో తులనాత్మక అధ్యయన కేంద్రంలో తులనాత్మక సాహిత్యం, తులనాత్మక సౌందర్య మీమాంసలలో ఎం.ఫిల్ కోర్సును, 1992 – 93 విద్యాసంవత్సరం నుండి పిహెచ్.డి. కోర్సును కూడా నిర్వహిస్తోంది. ఈ పీఠాలే కాకుండా ఇంకా రెండు పీఠాలను ఏర్పాటు చేయాలని ఈ మధ్యనే తెలుగు విశ్వవిద్యాలయం నిర్ణయించింది. దానిలో ఒకటి ప్రాచీన శిల్పకళావైభవానికి, కాకతీయ రాజుల రాజధానిగా పేరుగాంచిన ఓరుగల్లు (వరంగల్లు) ప్రాంగణంలో "జానపద గిరిజన విజ్ఞాన పీఠం"ను నెలకొల్పడం జరిగింది.

## శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం:

తెలుగు విశ్వవిద్యాలయం కృష్ణాజిల్లా కూచిపూడిలోని శ్రీ సిద్ధేంద్ర కళా క్షేత్రంలో 1991 – 92 నుండి కూచిపూడి నృత్యంలో సర్టిఫికేట్ కోర్సును, 1992–1993 నుండి డిప్లమా కోర్సును నిర్వహిస్తోంది. డిప్లమా కోర్సులో ఏటా 20 మంది విద్యార్థులను తీసుకోవటం జరుగుతోంది.

## వివిధ కోర్సుల్లో సీట్ల వివరాలు:

విశ్వవిద్యాలయం నిర్వహించే మూడు సంవత్సరాల బి.ఎ. కోర్సులో కర్ణాటక సంగీతం (గాత్రం), వాద్య సంగీతం – వీణ, వయోలిన్, మృదంగం (కోర్సులో ఏటా 40 మంది విద్యార్థులను చేర్చుకొంటున్నారు. నృత్యం – (కూచిపూడి)లో ఏటా 20 మంది విద్యార్థులనూ, జానపద కళల కోర్సులో ప్రతి సంవత్సరం 20 మంది విద్యార్థులను, శిల్పం శాఖలో 20 మంది విద్యార్థులను, నటనా కళ శాఖలో 20 మంది విద్యార్థులను ప్రతి సంవత్సరం చేర్చుకోవటం జరుగుతోంది.

విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న రెండు సంవత్సరాల ఎం.ఎ. కోర్సులలో – తెలుగులో 20 మందిని, అప్లయిడ్ లింగ్విస్టిక్స్‌లో 20 మందిని, కర్ణాటక సంగీతం (గాత్రం) వాద్య సంగీతం, మృదంగం, వీణలో 20 మందిని, నృత్యం – (కూచిపూడి)లో 20 మంది విద్యార్థులను ప్రతి సంవత్సరం చేర్చుకొంటున్నారు. అంతేకాకుండా ఎం.ఫిల్, కోర్సులలో భాషా శాస్త్రంలో 12 మందిని, తెలుగులో 12 మందిని చరిత్ర – సంస్కృతి – పురావస్తు శాస్త్రంలో 12 మందిని, తులనాత్మక అధ్యయనంలో 12 మందిని ప్రతి సంవత్సరం ఆయా పీఠాలలో చేర్చుకోవటం జరుగుతోంది.

విశ్వవిద్యాలయం పైన పేర్కొన్న అంశాలలోనే కాకుండా ఇంకా బి.సి.జె. ఒక సంవత్సరం కాలవ్యవధి కోర్సులో 20 మందిని, జానపద కళలు (కళాప్రవేశిక) రెండు సంవత్సరాల డిప్లమా కోర్సులో 30 మంది విద్యార్థులను, జ్యోతిష్యం – ఒక సంవత్సరం డిప్లమా కోర్సులో 60 మంది విద్యార్థులను, జ్యోతిష్యం – ఒక సంవత్సరం సర్టిఫికెట్ కోర్సులో 40 మంది విద్యార్థులను ప్రతి సంవత్సరం చేర్చుకొంటున్నారు.

ఈ విధంగా 1987లో విద్యాకార్యక్రమాలను ప్రారంభించి, గడిచిన 7 సంవత్సరాల కాలంలో 29 అధ్యయనాంశాల్లో తెలుగు విశ్వవిద్యాలయం బోధన జరుపుతున్నది.

పరిమితమైన నిధులతో పూర్వ అకాడమీల కార్యక్రమాల నిర్వహణలో విశ్వవిద్యాలయం శక్తి వంచన లేకుండా కృషి సాగిస్తోంది. ప్రముఖుల శతజయంత్యుత్సవాలు, రాష్ట్ర స్థాయిలో వివిధ కళల ఉత్సవాలు, గ్రంథరచనలకు బహుమతులు, సాహిత్య ప్రక్రియల్లో ఏటా ప్రతిష్ఠాత్మక పురస్కారాలు, ఉత్తమ గ్రంథాల ప్రచురణకు రచయితలకు ఆర్థిక సహాయం – వంటివి "విస్తరణ సేవా విభాగం" ద్వారా కార్యక్రమాలు జరుపుతున్నది. భాషా, సాహిత్యం, లలిత కళా సంస్కృతుల్లో తెలుగులో మౌలిక గ్రంథాలు, అనువాద గ్రంథాలు ప్రచురించటంలో విశ్వవిద్యాలయం ప్రచురణ శాఖ చాలా కృషి చేస్తోంది. ప్రామాణిక నిఘంటువులు, పరిశోధన, శాస్త్రగ్రంథాలు, జనరంజక గ్రంథాలు, జీవిత

చరిత్రలు; ఇటీవలి కాలంలో లలిత కళాపదకోశం, వివిధ మాండలిక వృత్తి పదకోశాలు మొదలగునవి. ఇలా ఇప్పటికే విశ్వవిద్యాలయప్రచురణ విభాగం 138 టైటిల్స్‌ని ప్రచురించింది. వీటితో పాటుగా విశ్వవిద్యాలయంలో అంతర్భాగంగా వున్న అంతర్జాతీయ తెలుగు కేంద్రం, అనువాద కేంద్రం, అవసరమైన సహకారాన్ని అందిస్తోంది. విశ్వవిద్యాలయంలోని విజ్ఞాన సర్వస్వ కేంద్రం అన్ని అంశాల్లో 14 సంపుటులుగా విజ్ఞానసర్వస్వాన్ని తెలుగులో సమకూర్చి ప్రచురించాలని ప్రణాళికను రూపొందించింది.

తెలుగు సంస్కృతి మూడు సంపుటాలుగా ప్రచురించాలని సంకల్పించి రెండింటిని పూర్తిచేసి అందించింది. ప్రస్తుతం మూడవ సంపుటం సిద్ధమవుతోంది. నాలుగవ సంపుటం "మతములు – దర్శనములు" ను భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ఢిల్లీలో ఆవిష్కరించారు. ఇంకా ఐదవ సంపుటం "విశ్వసాహితి", ఆరవ సంపుటం 'భారతభారతి' సిద్ధమవుతున్నాయి. తెలుగు వారి చరిత్ర సంస్కృతులను ఇతర భాషల వారికి తెలియజేసేందుకు ఉద్దేశించిన 'హిస్టరీ, కల్చర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' (ఏడవ సంపుటం) రూపుదిద్దుకుంటున్నది. ఇంకా భౌతిక, రసాయన శాస్త్రాల సంపుటాలు సంకలనంలో ఉన్నాయి.

తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతులను విస్తృత పరిధిలో అభివృద్ధి పరిచి ఉన్నత ప్రమాణాలను నెలకొల్పడానికి అనేక అకాడెమీలు అనేక యేళ్ళుగా పనిచేశాయి. వీటిని విడివిడిగా నిర్వహించటం కంటే అన్నింటిని కలిపి ఒకేపరిధిలోనికి తీసుకొని వచ్చి విస్తృత ప్రాతిపదికపై అభివృద్ధి పరిచేందుకు అనువుగా తెలుగు విజ్ఞాన పీఠాన్ని ఏర్పరిచారు. సాహిత్య అకాడెమీ, సంగీత అకాడెమీ, నృత్య అకాడెమీ, నాటక అకాడెమీ, లలితకళా అకాడెమీ, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు సంస్థలను ఇందులో విలీనం చేశారు. అనంతరం ఈ విజ్ఞాన పీఠం తెలుగు విశ్వవిద్యాలయంగా రూపాంతరం చెందింది. మొదటగా గతంలో అకాడెమీలు పనిచేసిన తీరును అర్థం చేసుకోవలసిన అవసరమెంతైనా ఉంది.

## సాహిత్య అకాడెమీ:

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ రాష్ట్ర ప్రభుత్వంచే 1957లో స్థాపించబడింది. ఇది నేషనల్ అకాడెమీ ఆఫ్ లెటర్స్ (కేంద్రసాహిత్య అకాడెమీ)కి అనుబంధించబడింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ తెలుగు భాషా, సాహిత్య రంగాలలో పరిశోధనా కార్యక్రమాలను అభివృద్ధి పరచేందుకు, తెలుగు భాషా, సాహిత్యాలను ప్రోత్సహించడానికి, సాహితీ పరుల మధ్య సహకారాన్ని పెంపొందించేందుకు; తెలుగు నిఘంటువులు, ఎన్‌సైక్లోపీడియా, రిఫరెన్స్ పుస్తకాల ప్రచురణకు – వ్యక్తులకుగాని, సాహితీ సంస్థలకుగాని అవసరమైతే సహకారాన్నందించేందుకు, ఆధునిక శాస్త్రీయ విధానంలో వివరణాత్మకమైన తెలుగు నిఘంటువును, వ్యాకరణ పదకోశాన్ని తయారుచేడం కొరకు; బహుమతు లివ్వడం ద్వారా తెలుగు రచయితల విమర్శనాత్మక, క్రియాత్మక కార్యకలాపాలను ప్రోత్సహించడం కొరకు; ఉత్తమ సాహిత్య పఠనాన్ని సాధారణ ప్రజల్లో మెరుగుపరచేందు కొరకు యీ సంస్థ స్థాపించబడింది.

వివిధ ప్రచురణలద్వారా, బహుమతులు, ఉపకారవేతనాలు యివ్వడంద్వారా సాహితీ సదస్సులనేర్పాటు చేయడం ద్వారా, తదితర కార్యక్రమాలద్వారా సాహిత్య అకాడెమీ తన లక్ష్యసాధనకు ప్రయత్నించింది. ఈ దిశగా అనేక పుస్తకాలను ప్రచురించింది. ఇందులో సాహిత్య చరిత్రకు సంబంధించిన గ్రంథాలు, తెలుగు సామెతల గ్రంథాలు, వ్యవహారిక పదాల వివరణ గ్రంథాలు; నన్నయ, నన్నెచోడ, శ్రీనాథ, తిక్కనాది ప్రముఖ కవుల కవితా రీతులపై గ్రంథాలు; సాహిత్య ఉపన్యాసాలు; శ్రేష్టమైన ప్రామాణిక నిఘంటువులు; ప్రామాణిక గ్రంథాలు; సావెనీర్లు, ఉర్దూ, హిందీ, సంస్కృత గ్రంథాలు – ఇలా అనేక తరహా గ్రంథాలు ప్రచురించబడ్డాయి. అకాడెమీ తన ప్రచురణలద్వారా ఆదాయం పొందింది. అకాడెమీ సూచనమేరకు – ప్రభుత్వం 1985 జూన్ 6వ తేదీ తెలుగు విజ్ఞానపీఠంలో విలీనం చేసింది.

## సంగీత అకాడెమీ:

సంగీత, నాట్యాలను ప్రోత్సహించేందుకు 1958లో దీనిని స్థాపించారు. 1981 వరకు సంగీత నాటక అకాడెమీగా వ్యవహరించేది. 1981 లో నృత్య అకాడెమీని విడిగా స్థాపించటంతో దీన్ని సంగీత అకాడెమీగా వ్యవహరిస్తున్నారు. సంగీత కళలో తగిన సలహాలను ప్రోత్సహించటం, ప్రముఖులకు బిరుదులను ప్రదానం చేయటం, పరిశోధన, శిక్షణలను కొనసాగించటం ఈ అకాడెమీ లక్ష్యం. 1983 నాటికి ఏడుగురు ప్రముఖులకు ఫెలోషిప్‌లు, 11 మందికి బహుమతులు, ఐదుగురికి 'కళాప్రపూర్ణ' బిరుదులను ప్రదానం చేయటం జరిగింది. 1984 – 85లో దీనికి 5 లక్షల రూపాయల గ్రాంటు లభించింది. అనేక గ్రంథాలను ప్రచురించటం జరిగింది.

## నాటక అకాడెమీ:

1981లో ఈ అకాడెమీ ఏర్పడింది. జిల్లా స్థాయిలో నాటక పోటీలను నిర్వహిస్తుంది. వృద్ధ కళాకారులకు ఈ అకాడెమీ తగిన ఆర్థిక సహాయం చేస్తుంది. 1984–85లో ఈ అకాడెమీకి రెండు లక్షల రూపాయలను గ్రాంటుగా ప్రభుత్వం అందజేసింది.

ఈ రెండు అకాడమీలను ఆయా అకాడెమీల కమిటీల సూచనమేరకు ప్రభుత్వం 1985 మే 17వ తేదీన విజ్ఞాన పీఠంలో విలీనం చేసింది.

### లలిత కళల అకాడెమీ:

రాష్ట్రంలో చిత్రలేఖనం, శిల్పం, మొదలైన కళలను ప్రోత్సహించేందుకు ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ 1961లో రాష్ట్ర ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడింది. ఈ సంస్థ జాతీయ కళాఅకాడెమీకి అనుబంధించబడింది. దీని కేంద్ర స్థానం హైదరాబాదులోని రవీంద్రభారతి ఆవరణలోని కళాభవన్‌లో ఉండేది. వివిధలలిత కళలయందు అధ్యయన, పరిశోధన కార్యక్రమాలను ప్రోత్సహించేది. అవసరమైన వారికి ధనసహాయం కూడ చేసేది. రాష్ట్రంలోగల వివిధ లలిత కళా సంస్థల మధ్య సద్భావన, సదవగాహనను కల్గించడమే కాక, అవి నిర్వహించే కార్యక్రమాలను సమన్వయపర్చేది. అవసరమైన నగరాలలో ప్రాంతీయ ఆర్టు గ్యాలరీలను నెలకొల్పడం, కళా సదస్సులు నిర్వహించడం ద్వారా వివిధ కళాకారుల మధ్య సహకారాన్ని అభివృద్ధి పర్చడం, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ప్రాచీన, మధ్యయుగ, వర్తమాన కళారీతులను విశదపరచే సాహిత్యాన్ని ప్రచురించడం, రాష్ట్రంలోని కళాకారుల ప్రతిభా విశేషాలను వెల్లడించడానికి వ్యక్తిగత, సామూహిక కళా ప్రదర్శనలను ఏర్పాటు చేయడం, ఏడాదికొక పర్యాయం రాష్ట్ర కళాకారుల కళా రూపాలను, అఖిలభారత ప్రదర్శనను ఏర్పాటు చేయడం, తగిన కళాకారులకు ఉపకార వేతనాలను, బహుమతులను అందచేయడం దీని కార్యక్రమాలు.

రాష్ట్రంలో వివిధచోట్లగల ఈ క్రింది సంస్థలు లలితకళా అకాడెమీ గుర్తింపు పొందాయి. వాటి కార్యక్రమాల కొరకు అకాడెమీ ధనసహాయం చేసేది.

1. చిత్రకళా సమితి, మచిలీపట్నం.
2. ఆంధ్రప్రదేశ్ కళాకారుల సమితి, హైదరాబాద్.
3. దామెర్ల రామారావు ఆర్టు గ్యాలరీ, రాజమండ్రి.
4. భారత కళా పరిషత్, హైదరాబాద్.
5. అంకాల ఆర్టు అకాడెమీ, భీమవరం.
6. ఆంధ్ర అకాడెమీ ఆఫ్ ఆర్ట్సు, విజయవాడ.
7. లలితకళా సమితి, సిద్దిపేట.
8. నవరంగ్ చిత్రకళానికేతన్, వెల్లటూరు.
9. హైదరాబాదు ఆర్ట్సు సొసైటీ, హైదరాబాద్.
10. చిత్రకళా పరిషత్, విశాఖపట్నం.
11. ఆంధ్రప్రదేశ్ శిల్పకారుల మహా సంఘం.
12. లలితకళా పరిషత్, విశాఖపట్నం.
13. గ్రాఫిక్ వర్క్సుషాఫ్, హైదరాబాదు ఆర్ట్సు సొసైటీ, హైదరాబాదు. అకాడెమీ సూచనమేరకు ప్రభుత్వం 1995 జూన్ 21వ తేదీన దీనిని తెలుగు విజ్ఞాన పీఠంలో విలీనం చేసింది.

## తెలుగు అకాడెమీ:

తెలుగు భాష వ్యాప్తి, అభివృద్ధి, ఆధునికీకరణ, తెలుగును అధికార భాషగా అమలుపరచటంలో ప్రభుత్వంతోను, ఉన్నత విద్యాస్థాయిలో తెలుగును బోధనా భాషగా చేయటంలో విశ్వవిద్యాలయాలతోనూ – సహకరించటం లక్ష్యాలుగా తెలుగు అకాడెమీ 1968లో ఏర్పాటైంది. 1985 మార్చి వరకు అకాడెమీ 618 గ్రంథాలను ప్రచురించింది. ప్రస్తుతం 125 పుస్తకాలు ప్రచురణలో ఉండగా, 426 పుస్తకాలు తయారీలో ఉన్నాయి. అకాడెమీ ప్రచురించిన ఆంధ్రప్రదేశ్‌లో సామాజిక, భాషా విషయక మాండలికాలపై పరిశీలన, మోనోగ్రాఫ్స్, తెలుగు లిపిలో – కోయ, గోండు జాతుల వారి భాషల పుస్తకాలు, కళాశాల విద్యార్థులకు అనేక రిఫరెన్స్ పుస్తకాలు, ఇంటర్మీడియట్ విద్యార్థుల పాఠ్య గ్రంథాలు ప్రధానమైనవి.

తెలుగు అకాడెమీ 'తెలుగు' అనే త్రైమాసిక పత్రికను ప్రచురిస్తున్నది. అధికార భాషా సంఘం, పరిపాలనా సంస్థ, రాష్ట్ర ప్రభుత్వ అనువాద విభాగం, విశ్వ విద్యాలయాల తెలుగు విభాగాలు, గిరిజన సాంస్కృతిక పరిశోధన శిక్షణ సంస్థ మొదలగు వాటి సహకారంతో తన కార్యకలాపాలను నిర్వర్తిస్తూ ఉంటుంది.

## శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

1968 సంవత్సరం నుండి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో పోస్టు గ్రాడ్యుయేట్ సెంటరుగా వున్న అనంతపురం కళాశాలను విస్తృతపరచి బోధనా పరిశోధనా సదుపాయాలకు మెరుగుపరచి దాదాపు 26 సంవత్సరములు చరిత్ర కలిగివున్న ఈ సెంటర్‌ను అనంతపురం పట్టణానికి 10 కి.మీ. దూరమున దాదాపు 600 ఎకరాల విస్తీర్ణంలో పూర్తి స్వయం ప్రతిపత్తి గల 1981 జూలై 25న – శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంగా ఏర్పాటు చేయడం జరిగింది.

1988 సంవత్సరంనాటికి అనంతపురం, కర్నూలు జిల్లాలతో కలిపి 64 కళాశాలలు ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఏర్పడినాయి. అందులో 5 మహిళా డిగ్రీ కళాశాలలు, 3 ఓరియంటల్ కళాశాలలు, 8 విద్యా సమగ్ర బోధనా కళాశాలలు, 3 బాచులర్ ఫిజికల్ ఎడ్యుకేషన్ కళాశాలలు, ఒక ఇంజనీరింగ్ కళాశాల, ఒక పోస్టుగ్రాడ్యుయేట్ సెంటర్ (కర్నూలు)లు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్నాయి.

ఈ విశ్వవిద్యాలయం 28 శాఖలను ఏర్పాటు చేసి మాస్టర్ కోర్సులు, ఎం.ఫిల్. మరియు పిహెచ్.డి. కోర్సులు నిర్వహిస్తుంది. అంతేకాకుండా ఎన్నో నూతన,

అధునాతనమైన కోర్సులను శాస్త్ర, సామాజిక శాస్త్ర అంశాలలో ప్రవేశపెట్టుతున్నది.

సామాజిక శాస్త్ర విభాగాలలో "గ్రామీణాభివృద్ధి" (రూరల్ డెవలప్‌మెంటు) అనే నూతన విభాగాన్ని శాస్త్ర విభాగాలలో పాలీమర్ సైన్సెస్ అనే కొత్త విభాగాన్ని నెలకొల్పటం ఈ విశ్వవిద్యాలయ ప్రత్యేకత. అదేవిధంగా ఇన్‌స్ట్రుమెంటేషన్‌లో, కంప్యూటర్ సైన్స్‌లో డిప్లమా పోస్టుగ్రాడ్యుయేట్ బోధనను కూడా ప్రారంభించింది. మరియు మానేజ్‌మెంట్ కోర్సును (M.B.A.) కూడా ప్రవేశపెట్టింది. అంతేకాకుండా 1994–95 నుండి పోస్టుగ్రాడ్యుయేట్‌లో సెరికల్చర్ కోర్సునూ ప్రారంభించింది.

ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న వివిధ కోర్సులలో ఈ క్రింది విధంగా విద్యార్థులను చేర్చుకోవడం జరుగుతుంది. గణితశాస్త్రంలో 20 మంది విద్యార్థులు, అనుప్రయుక్త గణిత శాస్త్రంలో 20 మంది విద్యార్థులు ఉన్నారు. ఈ శాఖకు డా. కె.ఎల్. నరసింహారావు అధిపతిగా వున్నారు. గణాంకశాస్త్రంలో 20 మంది, ఈ శాఖ అధిపతిగా డా. వై. కృష్ణారెడ్డిగారు నిర్వహిస్తున్నారు. భౌతిక శాస్త్రంలో 40 మంది, డా. కె. సుబ్బరంగయ్య అధిపతిగా నిర్వహిస్తున్నారు. రసాయన శాస్త్రంలో 40 మంది విద్యార్థులు, ఇన్‌స్ట్రుమెంటేషన్‌లో 12 మంది. ఈ శాఖ అధిపతిగా డా. కె. మాలకొండయ్యగారు బాధ్యత చేపట్టారు. జంతుశాస్త్రంలో 12 మంది, డా. పి. ఇందిర శాఖాధ్యక్షులుగాను, జీవ సంబంధశాస్త్ర శాఖకు డీన్‌గా డా. మహమ్మద్ భాషా మొహిద్దీన్ వ్యవహరిస్తున్నారు.

ఎలక్ట్రానిక్స్‌లో 6 మంది ఉన్నారు. వృక్షశాస్త్రంలో 12 మంది విద్యార్థులు ఉన్నారు. డా. టి. పుల్లయ్యగారు ఈ శాఖాధ్యక్షులుగా నిర్వహిస్తున్నారు. జీవరసాయన శాస్త్రంలో 12 మంది. ఈ శాఖకు డా. యస్. దయానంద అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. మైక్రోబయాలజీలో 18 మంది, ఈ శాఖాధ్యక్షులుగా డా. రామాంజనేయులు గారు వ్యవహరిస్తున్నారు. పాలిమర్ సైన్స్& టెక్నాలజీలో 15 మంది విద్యార్థులు ఉన్నారు. డా. ఎ. కామేశ్వరరావుగారు శాఖాధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. భూగోళశాస్త్రంలో 15 మంది డా. ఇ. స్వామినాథన్ గారు శాఖాధ్యక్షులుగాను, జీవ సంబంధ శాస్త్ర శాఖకు డీన్‌గాను వ్యవహరిస్తున్నారు. ఆర్థిక శాస్త్రంలో 30 మంది, డా. బి. లక్ష్మీపతిగారు శాఖాధ్యక్షులుగా నిర్వహిస్తున్నారు. అనుప్రయుక్త ఆర్థిక శాస్త్రంలో 30 మంది ఉన్నారు. ఆంగ్లంలో 40 మంది, డా. పి. బయ్యప్పరెడ్డి శాఖాధ్యక్షులుగా వుంటున్నారు. తెలుగులో 40 మంది డా. ఆర్. చంద్రశేఖర్‌రెడ్డిగారు శాఖాధ్యక్షులుగా నిర్వహిస్తున్నారు. చరిత్రశాస్త్రంలో 25 మంది డా. కె. కృష్ణానాయక్ అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. రూరల్ డెవలప్‌మెంట్ (గ్రామీణాభివృద్ధి) శాఖలో 25 మంది డా. పి. మురళీధరుడు గారు శాఖాధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. సోషల్ వర్క్స్‌లో 10 మంది ఉన్నారు. సామాజిక శాస్త్రంలో 25 మంది ఈ శాఖకు అధ్యక్షులుగా డా. జి. లక్ష్మయ్య నాయుడుగారు ఉన్నారు. రాజనీతి శాస్త్రంలో 25 మంది ఉన్నారు.

శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం యొక్క – కర్నూల్‌లో వున్న పి.జి. సెంటరులో తెలుగులో 25 మంది, ఆర్థిక శాస్త్రంలో 25 మంది, భౌతికశాస్త్రంలో 15 మంది, రసాయనిక శాస్త్రంలో 15 మంది, ఆపరేషన్ రీసర్చ్ & స్టాటిస్టికల్ క్వాలిటీ కంట్రోల్‌లో 15 మంది విద్యార్థులు ఉన్నారు. ఈ విశ్వవిద్యాలయం అనుబంధ కళాశాల నంద్యాలలో వున్న శ్రీ రామకృష్ణ కళాశాలలో గణాంక శాస్త్రంలో 30 మంది, ఎం.ఎస్సీ కంప్యూటర్ సైన్స్‌లో 30 మంది ఉన్నారు. మరియు కర్నూలులోని రాయలసీమ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎక్సిలెన్స్, కళాశాలలో గణాంక శాస్త్రంలో 30 మంది ఉన్నారు. అనంతపురంలోని శ్రీ గోపాలకృష్ణ కళాశాలలో ఉన్న బాచులర్ ఆఫ్ లైబ్రరీ & ఇన్‌ఫర్‌మేషన్ సైన్స్‌లో 60 మంది విద్యార్థులు ఉన్నారు. ఇంకా ఈ విశ్వవిద్యాలయంలో ఎం.సి.ఎ. (M.C.A.) కోర్సును కూడా నిర్వహిస్తున్నారు.

ఈ విశ్వవిద్యాలయం అన్ని శాఖలలోను, ఎం.ఫిల్., పిహెచ్.డి. డిగ్రీలను కూడా నిర్వహిస్తుంది.

ప్రస్తుతం ఈ విశ్వవిద్యాలయానికి డా. ఆర్. నాయుడుగారు ఉపాధ్యక్షులుగా డా. పి.ఎల్. శ్రీనివాసరెడ్డి రిజిస్ట్రార్‌గా వ్యవహరిస్తున్నారు. వీరి ఆధ్వర్యంలో ఈ విశ్వవిద్యాలయం పురోభివృద్ధి చెందుతోంది.

ఇక్కడ బోధిస్తున్న పాలిమర్ విభాగంలో భౌతిక రసాయనిక శాస్త్రాంశాలను సమ్మిళితం చేసి శాస్త్ర అధ్యయనంలో ఒక నూతన ప్రయోగం చేయడం ఈ విశ్వవిద్యాలయం ప్రత్యేకత.

## జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం అనుబంధ కళాశాలలు

### ఇంజనీరింగ్ కళాశాల, అనంతపురం

ఈ కళాశాలను రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత 1946లో ప్రారంభించారు. ఇది ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలగా గిండీ, మద్రాస్ ఇంజనీరింగ్ కళాశాలగా మొదట్లో పని చేస్తూ వుండేది. దీనిని 1948లో అనంతపురంకు మార్చడం జరిగింది. మొదట్లో

అద్దె భవనాలలో ఈ కాలేజీని నిర్వహించేవారు. పిదప 1958లో కళాశాల సొంత భవనాలకు మార్చారు. ఇక్కడ దీనిని ప్రారంభించకముందు మొదటి 25 సంవత్సరాలు మద్రాస్, ఆంధ్రా, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా వుండేది. అయితే 1972లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పడిన తరువాత దీనిని ఈ కళాశాలలో విలీనం చేయడం జరిగింది. ప్రస్తుతం దీనిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంకేతిక విద్యాశాఖ నిర్వహణలో పని చేస్తుంది.

ప్రస్తుతం అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో ఈ క్రింది విధంగా ఆయా కోర్సులలోకి విద్యార్థులను తీసుకోవటం జరుగుతుంది. సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ అంశాలలో 50 మంది విద్యార్థుల చొప్పున; కంప్యూటర్ సైన్స్ & ఇంజనీరింగ్‌లో 15 మంది విద్యార్థులు; కెమికల్ ఇంజనీరింగ్‌లో 30 మంది విద్యార్థులను బి.టెక్. కోర్సులోనికి రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే ఎం.సెట్. కామన్ ఎన్‌ట్రెన్స్ పరీక్ష ద్వారా తీసుకుంటారు. అదేవిధంగా ఎం.టెక్ కోర్సులో గేట్ పరీక్ష ద్వారా తీసుకుంటారు. అవి స్ట్రక్చరల్ ఇంజనీరింగ్‌లో 10 మందిని, ఎలక్ట్రికల్ పవర్ సిస్టమ్స్‌లో 10 మందిని, రిఫ్రిజిరేషన్ & ఎయిర్ కండిషన్డ్‌లో 10 మందిని ప్రతి యేటా తీసుకోవటం జరుగుతుంది.

ఈ కళాశాల ఇంకా ఇంజనీరింగ్ డిప్లమా కోర్సులను కూడా నిర్వహిస్తున్నది. ఇందులో బి.టెక్. డిప్లమా కోర్సులో ఈ.సెట్ (ఇంజనీరింగ్ పరీక్ష) ద్వారా సివిల్‌లో 40 మందిని, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్‌లో 40 మందిని, మెకానికల్‌లో 40 మందిని, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ ఇంజనీరింగ్‌లో 20 మందిని ప్రతి సంవత్సరం తీసుకోవడం జరుగుతుంది. అదే విధంగా కంప్యూటర్ అప్లికేషన్ డిప్లమాలో ప్రవేశ పరీక్ష ద్వారా ప్రతి సంవత్సరం 30 మంది విద్యార్థులను తీసుకోవడం జరుగుతుంది.

### ఇంజనీరింగ్ కళాశాల, కాకినాడ

ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలగా 1946లో కాకినాడలో స్థాపించడం జరిగింది. అప్పుడు ఇది మద్రాస్, ఆంధ్రా విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా వుండేది. కాని 1972లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పాటు అయిన తర్వాత పై కళాశాలను దీనిలో విలీనం చేయడం జరిగింది.

ప్రస్తుతం ఈ కేంద్రంలో బి.టెక్. & ఎం.టెక్. కోర్సులను ఫుల్‌టైమ్ & పార్ట్‌టైమ్‌లలో నిర్వహిస్తుంది. దీనిలో బి.టెక్. కోర్సులో సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ కోర్సులలో ప్రతియేటా 50 మంది చొప్పున; కంప్యూటర్ సైన్స్ & ఇంజనీరింగ్‌లో యేటా 15 మంది చొప్పున రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే ఎం.సెట్ కామన్ ప్రవేశ పరీక్ష ద్వారా తీసుకోవడం జరుగుతుంది.

ఎం.టెక్ కోర్సులో సాయిల్ మెకానిక్స్ మరియు ఫౌండేషన్ ఇంజనీరింగ్, హై వోల్టేజ్, మెషీన్ డిజైన్, ఎలక్ట్రానిక్స్ ఇన్‌స్ట్రుమెంటేషన్స్‌లో ప్రతియేట 8 మంది చొప్పున గేట్ ప్రవేశ పరీక్ష ఆధారంగా ఈ కోర్సులో తీసుకోవటం జరుగుతుంది.

ఈ కేంద్రంలో డిప్లమా కోర్సులను కూడా ఇంజనీరింగ్‌లలో యేటా 40 మంది చొప్పున; ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ ఇంజనీరింగ్‌లో 20 మంది చొప్పున ఈ.సెట్ (ఇంజనీరింగ్ ప్రవేశ పరీక్ష) ద్వారా తీసుకోవటం జరుగుతుంది. అంతేకాకుండా ప్రవేశ పరీక్ష ద్వారా పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లమా కంప్యూటర్ అప్లికేషన్‌లో ప్రతియేటా 30 మంది చొప్పున తీసుకోవటం జరుగుతుంది.

### ఇంజనీరింగ్ కళాశాల, హైద్రాబాద్

నాగార్జునసాగర్ ఇంజనీరింగ్ కళాశాలను 1965లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్థాపించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వుంటూ పరిపాలనా నియంత్రణ సాంకేతిక విద్యాశాఖ ఆధ్వర్యంలో వుండేది. 1972 లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పడిన తర్వాత దీనిలో విలీనం చేసి జె.ఎన్.టి.యు. ఇంజనీరింగ్ కళాశాలగా పేరు మార్చడం జరిగింది. కొంతకాలం తర్వాత పట్టణానికి 20 కి.మీ. దూరంలో బొంబే, హైద్రాబాద్ జాతీయ రహదారిలో వున్న కూకట్‌పల్లి దగ్గర 100 ఎకరాల విస్తీర్ణంలో సొంత భవనాలను నిర్మించి ఇక్కడ నిర్వహించటం జరుగుతోంది.

ప్రస్తుతం ఇక్కడ నిర్వహించే బి.టెక్. ఫుల్‌టైం కోర్సులో – సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్‌లలో ప్రతియేటా 50 మంది చొప్పున; కంప్యూటర్ సైన్స్ & ఇంజనీరింగ్‌లో యేటా 30 మంది చొప్పున; మెటలార్జికల్ ఇంజనీరింగ్‌లో, ప్రింటింగ్ టెక్నాలజీలో యేటా 15 మంది చొప్పున రాష్ట్రప్రభుత్వం నిర్వహించే ఎం.సెట్. ప్రవేశపరీక్ష ద్వారా విద్యార్థులను తీసుకోవటం జరుగుతుంది.

ఎం.టెక్. ఫుల్‌టైం కోర్సులో థర్మల్ ఇంజనీరింగ్‌లో 10 మంది చొప్పున; స్ట్రక్చరల్ ఇంజనీరింగ్‌లో 16 మంది చొప్పున, డిజిటల్ సిస్టమ్ & కంప్యూటర్ ఎలక్ట్రానిక్స్‌లో 16 మంది చొప్పున యేటా విద్యార్థులను తీసుకోవటం జరుగుతుంది.

బి.టెక్. డిప్లమా కోర్సులో – సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్‌లలో యేటా 40 మంది చొప్పున; ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ ఇంజనీరింగ్‌లో 20 మందిని, కంప్యూటర్ సైన్స్ & ఇంజనీరింగ్‌లో 30 మందిని ఇ.సెట్. ఆధారంగా తీసుకోవటం జరుగుతుంది.

ఎం.ఎస్సీ. (టెక్నాలజీ) మాథమేటిక్స్‌లో, ఫిజిక్స్‌లో, కెమిస్ట్రీలో యేటా 10 మంది చొప్పున, కంప్యూటర్ అప్లికేషన్ డిప్లమా కోర్సులో 30 మందిని ప్రవేశపరీక్ష ద్వారా తీసుకోవటం జరుగుతుంది.

ఈ కళాశాల యేటా ఫుల్‌టైం మరియు పార్ట్‌టైం బి.టెక్. డిగ్రీలను నిర్వహిస్తూ ఎం.టెక్. కోర్సును, ఎం.ఎస్సీ. (టెక్నాలజీ) మరియు కంప్యూటర్ అప్లికేషన్‌లో డిప్లమా కోర్సులనూ – ఫుల్‌టైం కాలవ్యవధిలో నిర్వహిస్తుంది.

## లలిత కళల కళాశాల, హైదాబాద్

నిజాం ప్రభుత్వ కాలంలో హైదాబాద్ రాష్ట్రంగా వున్నప్పుడు దీనిని 1940లో హైదాబాద్ నిజాం ప్రభుత్వం స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ & క్రాఫ్ట్స్ కళాశాలగా స్థాపించారు. ఇది తర్వాత కాలంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన పిదప ఆంధ్రప్రదేశ్ సాంకేతిక విద్యాశాఖ ఆధ్వర్యంలో ఫైన్ ఆర్ట్స్ & ఆర్కిటెక్చర్ ప్రభుత్వ కళాశాలగా ఏర్పాటు చేయడం జరిగింది. 1972లో జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం ఏర్పడిన తర్వాత ఇది స్థిరమైన కళాశాలగా తయారైంది. ఈ విభాగాన్నే 1990లో ఆర్కిటెక్చర్ సంబంధించిన శాఖను స్కూల్ ఆఫ్ ప్లానింగ్ & ఆర్కిటెక్చర్ అనే పేర్లతో రెండు శాఖలుగా విభజించటం జరిగింది. తద్వారా జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం లలిత కళల కళాశాలగా రూపొందించటం జరిగింది.

ప్రస్తుతం ఈ కళాశాల లలిత కళల శాఖలో బాచులర్ డిగ్రీలను (అనుప్రయుక్త) ప్రాయోజిత కళలు, చిత్రలేఖనం, శిల్పకళ మరియు ఫోటోగ్రఫీలలో కోర్సులనూ నిర్వహిస్తుంది.

ఈ కళాశాల 5 సంవత్సరాల బిఎఫ్.ఏ. కోర్సులో ప్రాయోజిత (అనుప్రయుక్త) కళలలో 35 మందిని, చిత్రలేఖనంలో 20 మందిని, శిల్పకళలో 5 మందిని యేటా తీసుకోవటం జరుగుతుంది. మరియు బిఎఫ్.ఏ. మూడు సంవత్సరాల కోర్సులో ఫోటోగ్రఫీలో 30 మందిని యేటా తీసుకోవటం జరుగుతోంది.

## స్కూల్ ఆఫ్ ప్లానింగ్ & ఆర్కిటెక్చర్, హైదాబాద్

1940లో స్థాపించబడిన ప్రభుత్వ లలిత కళలు & ఆర్కిటెక్చర్ కళాశాలలో ఒక శాఖగా వుండేది. దీనిని 1968 లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఏర్పాటు చేశారు. 1972లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పడిన తర్వాత లలిత కళలు & ఆర్కిటెక్చర్ కళాశాలగా అధికారికంగా ఏర్పాటు చేశారు. 1990లో ఈ శాఖను రెండు విభాగాలుగా విభజించి స్కూల్ ఆఫ్ ప్లానింగ్ & ఆర్కిటెక్చర్ అనే ఒక స్కూల్‌ను ఏర్పాటు చేశారు. ఈ స్కూల్‌ను ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ ఆర్కిటెక్చర్ దానిలో సభ్యత్వాన్ని కల్పిస్తూ నమోదు చేయడం జరిగింది.

ప్రస్తుతం ఈ స్కూల్ బాచులర్ ఆఫ్ ఆర్కిటెక్చర్, మాస్టరు ఆఫ్ అర్బన్ & రీజనల్ ప్లానింగ్ కోర్సులను నిర్వహిస్తుంది. బాచులర్ ఆఫ్ ఆర్కిటెక్చర్‌లో 60 మందిని, మాస్టర్ ఆఫ్ అర్బన్ అండ్ రీజినల్ ప్లానింగ్‌లో 16 మందిని యేటా తీసుకోవడం జరుగుతోంది.

# హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

ఆధునిక శాస్త్ర సాంకేతిక రంగాలలో విద్యా విషయాలను బోధించేందుకు పరిశోధనలు జరిపే లక్ష్యంతో హైదరాబాద్‌లో 1974 అక్టోబరు 2న హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పారు. ప్రారంభంలో శ్రీమతి సరోజిని నాయుడు నివాస భవనమైన "గోల్డెన్ త్రెష్ హోల్డ్"లో యీ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పారు. తరువాత రాష్ట్ర ప్రభుత్వం అందించిన సహకారంతో హైదాబాదుకు 20 కిలోమీటర్ల దూరంలో హైదాబాద్ – బొంబాయి జాతీయ రహదారిలో 2,300 ఎకరాల విస్తీర్ణం గల స్థలంలో తన స్వంత భవనాలను నిర్మించుకొన్నది. ఇప్పటికే చాలా భవనాలను నిర్మించుకొని శాస్త్ర విభాగాలన్నిటిని అక్కడికి మార్చుకొంది. ఈ కేంద్రీయ విశ్వవిద్యాలయానికి శ్రీ గురుభక్షసింగ్ ప్రారంభ వైస్ చాన్స్‌లర్‌గా వ్యవహరించగా ప్రస్తుత గోవర్ధన్ మెహతా వ్యవహరిస్తున్నారు. ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాలలు లేకపోవటం దీని ప్రత్యేకత.

ఈ విశ్వవిద్యాలయంలో ప్రవేశానికి అఖిల భారత స్థాయిలో విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న వివిధ కోర్సులలో ప్రవేశ పరీక్షను నిర్వహించి అందులో ఉత్తీర్ణులైన వారిని వివిధ కోర్సులలో తీసుకుంటారు.

ఈ విశ్వవిద్యాలయం 7 శాస్త్ర విభాగాలతో ప్రారంభమైంది. అవి:–

1. స్కూల్ ఆఫ్ మాథమాటిక్స్ అండ్ కంప్యూటర్ / ఇన్‌ఫర్‌మేషన్ సైన్సెస్.
2. స్కూల్ ఆఫ్ ఫిజిక్స్. (భౌతిక శాస్త్రం).
3. స్కూల్ ఆఫ్ కెమిస్ట్రీ. (రసాయనిక శాస్త్రం.)
4. స్కూల్ ఆఫ్ లైఫ్ సైన్సెస్. (జీవశాస్త్రం.)

5. స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్.
6. స్కూల్ ఆఫ్ సోషల్ సైన్సెస్.
7. సరోజినీ నాయుడు స్కూల్ ఆఫ్ పర్‌ఫామింగ్ ఆర్ట్స్, ఫైన్ ఆర్ట్స్ మరియు కమ్యూనికేషన్స్.

## స్కూల్ ఆఫ్ మాథమాటిక్స్ అండ్ కంప్యూటర్ / ఇన్‌ఫర్‌మేషన్ సైన్సెస్:

ఈ విభాగంలో గణిత, గణాంక శాస్త్రం, కంప్యూటర్ / ఇన్‌ఫర్‌మేషన్ శాస్త్ర రంగాలలో బోధనా, పరిశోధనా నిర్వహిస్తున్నారు. గణిత, గణాంక శాస్త్రాలలో 2 సంవత్సరముల పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు మరియు ఒక సంవత్సరం ఎం.ఫిల్. పరిశోధనా కోర్సును మరియు దీర్ఘకాలిక పరిశోధనలను నిర్వహిస్తున్నారు. కంప్యూటర్ అప్లికేషన్స్‌లో 3 సంవత్సరముల పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సును, కంప్యూటర్‌కి సంబంధించిన $1\frac{1}{2}$ సంవత్సరముల ఎం.టెక్ కోర్సును మరియు ఎం.టెక్ ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్ కోర్సును, మరియు కంప్యూటర్ అప్లికేషన్‌లో ఒక సంవత్సరపు పోస్టు గ్రాడ్యుయేటు డిప్లమా కోర్సును, కంప్యూటర్ సైన్స్ ఇంజనీరింగ్‌లో 3 సంవత్సరముల బి.టెక్ కోర్సులనూ నిర్వహిస్తున్నారు. ఈ కోర్సులన్నీ సెమిస్టర్ పద్ధతిలో నిర్వహించబడుతున్నాయి.

వీటితో పాటుగా, గణాంక శాస్త్రాలలో ఎం.ఫిల్, పిహెచ్.డి. కోర్సులను కూడ నిర్వహిస్తున్నారు.

ఈ విభాగం ఆధ్వర్యంలో:-

కుములేటివ్ ఆల్జిబ్రా, ఎనాల్సెస్ (కాంప్లెక్స్ ఎనాల్సిస్, ఫంక్షనల్ ఎనాల్సిస్, గ్లోబల్ ఎనాల్సిస్). జామెట్రి (ఆల్జిబ్రా మరియు డిఫరెన్సియల్), టోపాలజీ, ఆల్జిబ్రా నంబర్ థియరీ. డిఫరెన్సియల్ ఈక్వేషన్స్, అప్లయిడ్ మెకానిక్స్, ప్లాస్మాఫిజిక్స్, న్యూమరికల్ ఎనాల్సిస్. స్టాటిస్టికల్ ప్యాటర్న్ రికాగ్నిషన్, గేమ్ థియరీ, క్యూయనింగ్ థియరీ, స్టాటిస్టికల్ ఇన్‌ఫరెన్స్, మల్టీవేరియేట్ డేటా ఎనాల్సిస్, రియబిలిటి మరియు స్టాటిస్టిక్ మోడలింగ్, కరిచినేటరియల్ అప్టమైజేషన్. ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్, ఎక్స్‌పర్ట్ సిస్టమ్స్, డేటా బేసిస్, కంప్యూటర్ విజన్, ప్యారలల్ అల్గారిథమ్స్, కాంబినేటరియల్ అల్గారిథమ్స్, నేచురల్ లాంగ్వేజ్ ప్రాసెసింగ్, మిషైన్ లెర్నింగ్, స్పీచ్ రికాగ్నిస్, న్యూరల్ కంప్యూటింగ్, అబ్జక్ట్ ఓరియన్‌టెడ్ కంప్యూటింగ్, డెసిషన్ సఫోర్ట్ సిస్టమ్స్ ఆటోమాటెడ్ రీజనింగ్ మరియు డిస్ట్రిబ్యూటెడ్ ఎ.బి. మొదలగునవి.

పైన పేర్కొనబడిన అంశాలే కాకుండా ఇంకా కంప్యూటర్ సిస్టమ్స్ మరియు సాఫ్ట్‌వేర్‌కు సంబంధించినవి ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్ ల్యాబరేటరిలో లభిస్తాయి. మరియు కంప్యూటింగ్ అవసరాలు కూడా యూనివర్సిటీ కంప్యూటర్ సెంటర్ నందు లభిస్తాయి.

ప్రస్తుతం ఈ విభాగానికి డీన్‌గా ప్రొఫెసర్.వి.కన్నన్ వ్యవహరిస్తున్నారు. మాథమాటిక్స్ / స్టాటిస్టిక్స్ శాఖకు ప్రొఫెసర్ ఎం. సీతారామయ్య శాఖాధిపతిగాను, కంప్యూటర్ మరియు ఇన్‌ఫర్‌మేషన్ సైన్స్ శాఖకు ప్రొఫెసర్ అరుణ్ కుమార్ పూజారీ శాఖాధిపతిగా వ్యవహరిస్తున్నారు.

## స్కూల్ ఆఫ్ ఫిజిక్స్:-

భౌతిక శాస్త్రంలో వివిధ అంశాలలో సిద్ధాంతాలు ప్రయోగాలపై బోధన - పరిశోధనా నిర్వహిస్తూ భౌతిక శాస్త్రాన్ని పటిష్టం చేస్తున్నారు. ఎమ్.ఎస్.సి., ఎం.ఫిల్., పిహెచ్.డి. కోర్సులను యీ విభాగం నిర్వహిస్తోంది. అంతేకాకుండా క్వాంటం ఆప్టిక్స్ అండ్ లేజర్ ఫిజిక్స్, కండెన్స్‌డ్ ఫిజిక్స్ మరియు హై ఎనర్జి ఫిజిక్స్‌లలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో పరిశోధనలు కూడ నిర్వహిస్తున్నారు.

ఎం.ఎస్.సి. కోర్సును నాలుగు సెమిస్టర్‌లలో పూర్తి చేయాల్సి వుంటుంది. మరియు ఈ విభాగం యు.జి.సి., సి.ఓ.యస్.ఐ.ఎస్.టి. ప్రణాళిక, మరియు స్పెషల్ అసిస్టెన్ స్కీం సహాయంతో ఆయా అంశాలలో బోధనను, పరిశోధనలను నిర్వహిస్తుంది. వ్యక్తిగతంగా డి.ఎస్.టి, డి.ఎ.ఇ.సి.ఎస్.ఐ.ఆర్., యు.జి.సి. ల ఆర్థిక సహాయంతో పరిశోధనను పటిష్ట పరుస్తూ, పరిశోధనలు జరుపుతున్న విద్యార్థులకు జె.ఆర్.ఎఫ్., ఎస్.ఆర్.ఎఫ్ మరియు ప్రాజెక్టు అసిస్టెంట్ సఫోర్టు అనే వాటిని స్కాలర్ షిప్పులుగా కేటాయించటం జరిగింది.

ఎం.ఎస్.సి. కోర్సును నాలుగు సెమిస్టర్‌లలో పూర్తి చేస్తూ, క్లాసికల్ మెకానిక్స్, క్వాంటం మెకానిక్సు, మాథమెటికల్ పద్ధతులు, న్యూక్లియర్ ఫిజిక్స్, ఇంట్రిడక్షరీ పార్సిల్ ఫిజిక్స్, లేజర్ ఫిజిక్స్, కంప్యూటర్ అప్లికేషన్స్, ఎలక్ట్రానిక్స్, స్పెషల్ రిలేటివిటీ మరియు ఎలక్ట్రోమాగ్నటిజమ్, ఎలక్ట్రోడైనమిక్స్, స్టాటిస్టికల్ మెకానిక్స్ మరియు సాలిడ్ స్టేట్ ఫిజిక్స్ పాఠ్యాంశాలను; మరియు ల్యాబరేటరీ కోర్సులలో ఎలక్ట్రానిక్స్, సాలిడ్ స్టేట్, డిజిటల్ ఎలక్ట్రానిక్స్, లేజర్స్, మైక్రోవేవ్, మోడర్న్ ఫిజిక్స్ మరియు న్యూక్లియర్ ఫిజిక్స్ అంశాలు ఎం.ఎస్.సి. కోర్సులో చదువవలసి వుంటుంది. అంతే కాకుండా ఈ కోర్సులో పార్టికల్ ఫిజిక్స్ మరియు ఫీల్డ్ థియరీ, అడ్వాన్స్‌డ్ ఎలక్ట్రానిక్స్, సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, లేజర్ ఫిజిక్స్ మరియు మోడర్న్ ఆప్టిక్స్ అంశాలలో ప్రత్యేకంగా విశిష్టతను సాధించేందుకు యీ ఎం.ఎస్.సి. కోర్సులో బోధిస్తున్నారు.

రెండు సెమిస్టర్‌ల ఎం.ఫిల్. కాలసమయంలో భౌతిక

శాస్త్రంతో పాటుగా మెటీరియల్ సైన్స్, మోడర్న్ ఆప్టిక్స్, లేజర్ ఫిజిక్స్ అనే ప్రత్యేకమైన అంశాలపై ఎం.ఫిల్ కోర్సును నిర్వహిస్తున్నారు.

సాలిడ్ స్టేట్, టెంపరేచర్ ఫిజిక్స్, మాగ్నిటిజమ్ ఫేస్ ట్రాన్సిషన్: థిల్‌ఫిల్మ్ అండ్ సర్‌ఫేస్ ఫిజిక్స్, క్వాంటమ్ ఆప్టిక్స్, నాన్‌లైనర్ ఆప్టిక్ మరియు లేజర్ ఫిజిక్స్, వీటిలో (థియరిటికల్ స్టడీస్ పైన, ఎక్స్‌పర్ మెంటల్ స్టడీస్ పైన), కడెన్స్‌డ్ న్యూటర్ ఫిజిక్స్, మరియు మెటీరియల్ సైన్స్, మాగ్నిటిక్ రిసాన్స్, నాన్ ఈక్విలిబ్రియమ్ స్టాటిస్టికల్ మెకానిక్స్ అండ్ ట్రాన్స్‌పోర్టు ఫినామినా, క్వాంటమ్ ఫీల్డ్ థియరీ, మెనీబడీ థియరీ మరియు పార్టికల్ థియరీ, అనే అంశాలపై పరిశోధనా అవకాశాలను కల్పించి ఉన్నత స్థాయిలో ఎక్స్‌పర్‌మెంటల్ మరియు కంప్యూటర్ (అవకాశాలను) పద్ధతుల ద్వారా పరిశోధనలను నిర్వహిస్తూ పిహెచ్.డి. కోర్సును కూడా నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం ఈ విభాగానికి డీన్‌గా ప్రొఫెసర్. ఎ.పి.పాఠక్ వ్యవహరిస్తున్నారు. ఈ విభాగంలో మొత్తం 13 మంది ప్రొఫెసర్లు 7గురు రీడర్స్, 7గురు లెక్చరర్లు, ముగ్గురు పరిశోధనా స్టాఫ్/విజిటింగ్ సైన్‌టిస్టులు తమ సేవలను అందిస్తున్నారు. ఈ విభాగంలో ఇప్పటి వరకు ఎం.ఎస్.సి. డిగ్రీలను ఎందరో విద్యార్థులు పొందారు. ఎం.ఫిల్. డిగ్రీలను పలువురు పి.హెచ్.డి. డిగ్రీలను ఈ విశ్వవిద్యాలయం నుండి అందుకున్నారు.

## స్కూల్ ఆఫ్ కెమిస్ట్రీ:

రసాయనిక శాస్త్ర పరిశోధనలో ఉన్నత స్థాయి కేంద్రంగా ఉండే ఉద్దేశ్యంతో విభాగం ప్రారంభించి ఎం.ఎస్.సి., ఎం.ఫిల్, మరియు పిహెచ్.డి. కోర్సులను నిర్వహిస్తోంది. రసాయనిక శాస్త్రంలో అన్ని అంతర్ సంబంధ అంశాలను ఇక్కడ బోధించే ఎం.ఎస్.సి. కోర్సులో వున్నాయి. వీటివల్ల విద్యార్థులు ఎం.ఎస్.సి. డిగ్రీలు పొందేనాటికి రసాయనిక శాస్త్రం గురించి చాలా వరకు అవగాహన రావటం వల్ల తరువాత ప్రారంభించే పరిశోధనా రంగంలో సులువుగా వుండటమే కాకుండా ఆయా ప్రత్యేక అంశాలలో నిష్ణాతులుగా తయారవుతారు. రసాయనిక శాస్త్రంలో వస్తున్న సమకాలీన అభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తూ ఇక్కడ బోధిస్తున్నారు. అంతేకాకుండా కెమికల్ ఫిజిక్స్ మొదలుకొని బయోఆర్గానిక్ కెమిస్ట్రీ మరియు నేచురల్ ప్రొడక్ట్స్ మొదలుకొని మెటీరియల్ సైన్స్ వరకు ఇక్కడ బోధనలు జరుపుతున్నారు. అంతే కాకుండా తక్కువ కాలంలోనే కెమికల్ విద్యారంగంలో మరియు పరిశోధనా రంగంలో ఘనమైన పేరు ప్రతిష్టలు దేశంలో సంపాదించుకొంది. మరియు విశ్వవిద్యాలయం అవసరమైన సహకారాన్ని యు.జి.సి. నుండి అదనపు గ్రాంటు క్రింద పొందుతున్నది.

ఇక్కడ రసాయనిక శాస్త్ర విభాగంలో ఎం.ఎస్.సి.డిగ్రీని నాలుగు సెమిస్టర్‌లలో బోధిస్తున్నారు. ఈ కోర్సులో ఆర్గానిక్, ఇనార్గానిక్, ఫిజికల్ మరియు థియరిటికల్ కెమిస్ట్రీ మరియు ల్యాబరేటరీ కోర్సులలో: ఆర్గానిక్, ఇనార్గానిక్ మరియు ఫిజికల్ కెమిస్ట్రీ అంశాలలో బోధించటమే కాకుండా ప్రస్తుతం వస్తున్న అభివృద్ధిని గమనించి కెమికల్ సైన్సులో కూడా ప్రత్యేక అంశాలపై అనగా ఎలక్ట్రానిక్స్ మరియు కెమికల్ ఇన్‌స్ట్రుమేంటేషన్, మాథమాటిక్స్ ఇన్ కెమిస్ట్రీ, బయోలాజికల్ కెమిస్ట్రీ, కంప్యూటర్ ఇన్ కెమిస్ట్రీ మొదలైన అంశాలలో బోధన మరియు ప్రాజెక్టువంటి వాటిని – ఈ కోర్సు నాల్గవ సెమిస్టర్‌లో బోధించటం జరుగుతున్నది.

రసాయనిక శాస్త్రంలో 1 సంవత్సర కాలంలో 2 సెమిస్టర్‌లలో ఎం.ఫిల్ కోర్సును, ఈ విభాగం ఆయా విద్యార్థి తీసుకొనే ప్రత్యేక అంశాలపై బోధనలు నిర్వహిస్తోంది. మరియు అండర్ గ్రాడ్యుయేట్ పోస్టు గ్రాడ్యుయేట్ కళాశాలలో పని చేస్తున్న ఉపాధ్యాయులకు కూడా అవకాశాలు కల్పిస్తూ ఎం.ఫిల్ పరిశోధనలో డిగ్రీలను ఆయా అంశాలలో నిర్వహిస్తోంది.

స్కూల్ ఆఫ్ కెమిస్ట్రీ పరిశోధనలో అవకాశాలను కల్పిస్తూ పిహెచ్.డి. కోర్సును నిర్వహిస్తోంది. ఈ కోర్సులో అనేక విధాలైన అంశాలు వున్నాయి. అవి ఆర్గానిక్, ఇనార్గానిక్, ఫిజికల్ మరియు థియరిటికల్ కెమిస్ట్రీ, ఆర్గానిక్ సింతసీస్., రియాక్షన్ మెకానిజమ్, ఫోటో కెమిస్ట్రీ, బయో – ఆర్గానిక్ కెమిస్ట్రీ, ఫిజికల్ ఆర్గానిక్ కెమిస్ట్రీ ఆర్గానోమెటలిక్స్, సాలిడ్ స్టేట్ కెమిస్ట్రీ ఇనార్గానిక్ కెమిస్ట్రీ ఆఫ్ మెయిన్ గ్రూప్ ఎలిమెంట్స్, కో ఆర్డినేషన్ కెమిస్ట్రీ మరియు బయో ఇనార్గానిక్ కెమిస్ట్రీ, అప్లికేషన్స్ ఆఫ్ క్వాంటమ్ కెమిస్ట్రీ, స్టాటిస్టికల్ మెకానిక్స్ మరియు థియరిటికల్ మరియు ఎక్స్‌పర్‌మెంటల్ కెమికల్ ఫిజిక్స్ మొదలగు అనేకానేకమైన అంశాలలో పిహెచ్.డి. కోర్సును నిర్వహిస్తోంది. అంతే కాకుండా కంప్యూటర్ పద్ధతుల ద్వారా కూడా కెమిస్ట్రీలో పిహెచ్.డి. కోర్సును నిర్వహిస్తోంది.

రసాయన శాస్త్ర పరిశోధనలో ఈ విభాగం చేస్తున్న కృషిని గమనించి ఆర్గానిక్ కెమిస్ట్రీ రంగంలో పరిశోధనలు నిర్వహించే నిమిత్తం యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ ఒక నూతన పథకాన్ని మంజూరు చేసింది. ఈ పథకం ప్రొఫెసర్. జి. మెహతా ఆధ్వర్యంలో 8 మంది రీసెర్చి స్కాలర్స్ సహాయంతో నిర్వహిస్తున్నారు. ఇంతే కాకుండా

యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ ఈ కృషిని గమనించి, కో.సి.స్టే (కోసిస్టే) పథకం క్రింద అదనపు గ్రాంట్లను కూడా మంజూరు చేసింది. అంతేకాకుండా ఈ పథకం క్రింద కొత్తగా కొన్ని ఈ కోర్సులో చేర్చి ప్రత్యేకంగా శిక్షణను ఇస్తున్నారు. ఉదా: డిఫరెన్షియస్ స్కానింగ్ కాలోరిమీటర్, యు.వి. మరియు ఐ.అర్ స్పెక్ట్రో ఫోటో మీటర్స్, సి.హెచ్.ఎన్. ఎనాలేజర్, బ్రూకర్ ఎన్.అర్.200 ఎ.ఎఫ్.ఎన్.ఎ.అర్, జాస్కో ఎఫ్.టి.ఐ.అర్, యు.వి.స్పెక్ట్రో ఫోటో మీటర్స్, స్పెక్ట్రో ఫ్ల్యూరిమీటర్ మొదలయిన వాటికి ఈ నిధులను కేటాయించి బోధనకు (శిక్షణకు) అవకాశాలు కల్పిస్తున్నారు.

ప్రస్తుతం రసాయినిక విభాగానికి, ప్రొఫెసర్.పి.యస్. జాకారియాస్ డీన్‌గా వ్యవహరిస్తున్నారు. ప్రస్తుతం ఈ విభాగంలో 8 మంది ప్రొఫెసర్లు 8 మంది రీడర్లు ముగ్గురు లెక్చరర్లు తమ సేవలను అందిస్తున్నారు. ఇంత వరకు ఈ విభాగం నుండి ఎం.ఎస్.సి., ఎం.ఫిల్. పిహెచ్.డి. డిగ్రీ పలువురు అందుకున్నారు.

విశ్వవిద్యాలయం ఈ విభాగంలో అనేక అంశాలపై పరిశోధనలను నిర్వహించేందుకు అవసరమైన అత్యంత ఆధునికమైన సాంకేతిక యంత్రాలన్నింటిని సమకూర్చుకుంది. ఇంతే కాకుండా హైదరాబాదు నగరంలో ఉన్న ఇ.సి.ఐ.యల్.. సి.ఎం.సి మొదలగు సంస్థల సాంకేతిక సహకారాన్ని కూడా ఈ విభాగం పొందుతున్నది.

## స్కూల్ ఆఫ్ లైఫ్ సైన్సెస్:

ఇతర విశ్వవిద్యాలయాల మాదిరిగా కాకుండా జీవ, వృక్ష శాస్త్ర విభాగాలను 1993 లో వేరుచేసి జీవశాస్త్రంలో వస్తున్న అనేక విధాల సమకాలీన అధునిక మార్పుల ననుసరించి ఈ కోర్సులో పటిష్టవంతంగా బోధనను జర్గపటం కోసం ఒక్కొక్క శాఖగా హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది. ఈ విభాగాలు మూడు. అవి 1. జీవ రసాయన శాస్త్రం. 2. వృక్ష శాస్త్ర శాఖ. 3. జంతు శాస్త్ర శాఖ. ఈ ప్రతి ఒక శాఖలో జీవ వృక్ష శాస్త్రములలోని మౌలిక సూత్రాలతో ఉత్పన్నమైన శాస్త్రీయమైన జ్ఞానాన్ని విద్యార్థులకు అందించే నిమిత్తం ఇక్కడ ఎం.ఎస్.సి, ఎం.ఫిల్, పిహెచ్.డి. కోర్సులను విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది. ఈ కోర్సులతో పాటు మాస్టర్ డిగ్రీలో బయోటెక్నాలజీని క్రొత్తగా ఈ మూడు శాఖలలో ప్రస్తుతం నిర్వహిస్తుంది.

ఈ స్కూల్ ఆఫ్ లైఫ్ సైన్సెస్ విభాగంలోనే యు.జి.సి. ప్రత్యేక కార్యక్రమం క్రింద మరో రెండు కోర్సులను ఈ శాఖ నిర్వహిస్తోంది. అవి 1. ప్లాంట్ ఫిజియోలజీ మరియు మాలుక్యులర్ బయోలజీ. 2. ఎనిమల్ ఫిజియాలజీ మరియు రీ ప్రొడక్టివ్ బయోలజీ అవే వాటిని యు.జి.సి. స్పెషల్ ప్రోగ్రామ్ క్రింద నిర్వహిస్తోంది.

ఈ పైన పేర్కొన్న మూడు శాఖలను వేరు వేరుగా పరిశీలిస్తే ఒక్కొక్క శాఖలో నిర్వహిస్తున్న వివిధ అంశాల అధ్యయనం మనకు గోచరమవుతుంది.

### 1. జీవ రసాయన శాస్త్రం:

జీవ రసాయన శాస్త్ర విభాగం స్వతంత్రంగా ఒక శాఖగా 1993లో మాస్టర్ డిగ్రీలో ఈ క్రింది కోర్సులతో ప్రారంభమైంది. న్యూరో కెమిస్ట్రీ, మాలుక్యులర్, బయాలజీ, ఎండోక్రినాలజీ, ఇమ్యూనాలజీ, మాలుక్యులర్ బయోఫిజిక్స్, బయోఎనర్జటిక్స్ మరియు ప్రోటీన్ బయో కెమిస్ట్రీతో ఈ శాఖ ప్రారంభించబడింది. ప్రస్తుతం ఈ శాఖ పరిశోధన కోర్సులను కూడా నిర్వహిస్తోంది.

బయో కెమిస్ట్రీ శాఖలో వివిధ అంశాలను అధ్యయనం చేయడం కోసం ఆయా అంశాలకు అవసరమయ్యే పరికరాలను ప్రవేశపెట్టడం జరిగింది. అవి: అల్ట్రా సెంట్రీఫిగస్, హైస్పీడ్ రిఫ్రిజిరేటేడ్ సెంట్రిఫిగస్, అల్ట్రాడీప్‌ప్రీజర్స్, స్పెక్ట్రోఫొటోమీటర్స్, స్పెక్ట్రో ఫ్లోరోమీటర్స్, రేడియో యాక్టివ్ కౌంటర్స్, హెచ్.పి.ఎల్.పి. శీతల గదులు, టిష్యూకల్చర్ సదుపాయాలు మొదలగునవి. ఇంతేకాకుండా స్వతంత్రంగా పరిశోధన శాలను కూడా కలిగి ప్రత్యేకమైన పరికరాలను సమకూర్చుకుంది.

పరిశోధనలో అవసరమైన జంతువులపై ప్రయోగాలు జరుపుటకు ఒక సాధారణ జంతువుల గది కూడా కలిగివుంది. అంతేకాకుండా యు.జి.సి. స్పెషల్ అసిస్టెంట్ ప్రోగ్రాం క్రింద మాలుక్యులర్ బయోలజీ, ఎనిమల్ ఫిజియాలజీ, న్యూరో కెమిస్ట్రీ, ఎండోక్రినాలజీ, మరియు ఇమ్యునాలజీ మొదలగు వాటికి అవసరమయ్యే పరికరాలకు యు.జి.సి. గ్రాంటును సమకూర్చుతుంది.

పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు మొత్తం కాలపరిమితి నాలుగు సెమిస్టర్‌లలో వుంటుంది. అంటే ఇది రెండు సంవత్సరముల కోర్సు. పైన పేర్కొన్న అంశాలే కాకుండా ఇంకా ఇందులో ఎంజైమాలజీ, ఇంటర్మీడియరీ మెటబాలిజమ్, మాలుక్యులర్ ఇండోక్రినాలజీ, బయోఫిజికల్ కెమిస్ట్రీ బయో మాక్రోమాలుక్యులర్ బయాలజీ, న్యూట్రిషినల్ మరియు క్లినికల్ బయో కెమిస్ట్రీ మొదలగునవి ముఖ్యమైన కోర్సులు.

ఎం.ఫిల్ కోర్సు కాలపరిమితి రెండు సెమిస్టర్‌లలో వుంటుంది. అంటే ఇది ఒక సంవత్సర కాలం మాత్రమే. దీనిలో అనేక కోర్సులను ఈ శాఖ నిర్వహిస్తుంది. అయితే దీనికి కేటాయించిన కాలపరిమితితో మొదటి సెమిస్టర్‌లో ఆయా సంబంధిత అంశాలపై పరీక్ష వుంటుంది. రెండవ

సెమిస్టర్‌లో విద్యార్థికి కేటాయించిన అధ్యాపకుని పర్యవేక్షణలో తను తీసుకొన్న అంశాన్ని వివరించవలసివుంటుంది.

పిహెచ్.డి. కోర్సులో విద్యార్థికి కేటాయించిన అధ్యాపకుని పర్యవేక్షణలో తన సిద్ధాంత గ్రంథంను పూర్తి చేయవలసి వుంటుంది. ఇక్కడ జరుపుతున్న పరిశోధనలో డి.ఎన్.ఏ., ఆర్.ఎన్.ఎ., లకు సంబంధించిన అంశాలకు అధిక ప్రాధాన్యతను ఇస్తున్నారు.

ప్రస్తుతం స్కూల్ ఆఫ్ లైఫ్ సైన్సెస్‌కు ప్రొ.ఎన్.సి. సుబ్రహ్మణ్యం పీఠాధిపతి (డీన్) గాను, మరియు జీవ రసాయన శాస్త్రవిభాగానికి ప్రొ.టి.సూర్యనారాయణ అధిపతిగాను వ్యవహరిస్తున్నారు. ఈయన కాక ఒక ప్రొఫెసర్, ఐదుగురు రీడర్లు, ఇద్దరు లెక్చరర్లు ఈ విభాగంలో వున్నారు.

వృక్షశాస్త్ర విభాగం – బోధనకు మరియు పరిశోధనకు అధిక ప్రాధాన్యతను ఇస్తుంది. ముఖ్యంగా ప్లాంట్ బయాలజీ, సెల్యూలర్ మరియు మాలిక్యులర్ బయాలజీలకే కాకుండా అర్గానిజమల్ ఫిజియాలజీని మరియు జెనిటిక్సుకు కూడా అధిక ప్రాధాన్యతను ఇస్తున్నాయి. ఈ వృక్షశాస్త్ర కోర్సు మొత్తం ప్లాంట్ ఫిజియాలజీ బయో కెమిస్ట్రీ, ప్లాంట్ మాలుక్యులర్ బయాలజీ, మైక్రోబయాలజీ, జెనిటక్స్, ఎన్విరాన్‌మెంటల్ బోటనీ, బయో సిస్టమాటిక్, ఇవాల్యుయోషన్ కోర్సులతో కూడుకొని వున్నది. ఈ విభాగం అనేకానేక అంశాలలో దృష్టిని సారించి ప్లాంట్ సైన్స్‌లో అనేక ఉద్దేశ్యాలతో పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ విభాగానికి విత్త సహాయానికి జాతీయ, అంతర్జాతీయ స్థాయిల నుండి వనరులు సమకూరుతున్నాయి. ఉదా:– యు.జి.సి; ఎస్.ఐ.ఆర్; డి.ఎస్.టీ., డి.ఎన్.ఇ.ఎస్., ఐ.ఎన్.ఎస్.ఐ. డి.ఏ.ఇ., ఐ.సి.ఏ.ఆర్., అంబోల్డ్ ఫౌండేషన్, రాక్‌ఫల్లర్ ఫౌండేషన్, యూరోపియన్ ఎకనామిక్స్ కమీషన్; యు.ఎస్.డి.ఏ. మరియు వృక్షశాస్త్రానికి సంబంధించిన విషయాలను క్షుణ్ణంగా అధ్యయనం చేయడానికి పరిశోధనా శాలలు, మరియు అవసరమైన వివిధ కంప్యూటర్ పరికరాలను కూడా ఈ విభాగం కలిగివుంది. పరిశోధనలో వివిధ ప్రక్రియలకు సంబంధించి ప్లాంట్ సైన్స్ విభాగానికి అనుసంధానంగా యు.జి.సి. స్పెషల్ అసిస్టెంట్ కార్యక్రమాలలో ప్లాంట్ ఫిజియాలజీ, మాలుక్యులర్ బయాలజీలో పరిశోధనలు చేస్తున్నారు.

ఈ కోర్సు అధ్యయనానికి మాస్టర్ డిగ్రీ 4 సెమిస్టర్‌లలో, ఎం.ఫిల్ 2 సెమిస్టర్‌లలో, పిహెచ్.డి. దీర్ఘకాలిక కోర్సు అనగా 4 సంవత్సరముల క్రింద నిర్వహిస్తున్నారు.

పరిశోధనారంగంలో సూక్ష్మ, స్థూల స్థాయిలో అధ్యయనం చేయటానికి ఎం.ఫిల్. కోర్సులో ప్రత్యేక అంశాల అధ్యయనం క్రింద ప్లాంట్ ఫిజియాలజీ, మైక్రోబయాలజీ, మాలుక్యులర్ బయాలజీ, జెనిటిక్స్ ఎన్‌లాజీ మరియు డెవలప్‌మెంటల్ బయాలజీ అనే అంశాలను ఏర్పరించారు.

ప్రస్తుతం ఈ శాఖ అధిపతిగా ఆచార్య వి. రామచంద్రారెడ్డి వ్యవహరిస్తున్నారు. మొత్తం ఈ శాఖలో ఐదుగురు ప్రొఫెసర్లు, ఇద్దరు రీడర్లు, ముగ్గురు లెక్చరర్లు పనిచేస్తున్నారు.

### జంతుశాస్త్ర విభాగం:

ఈ విశ్వవిద్యాలయంలో జంతుశాస్త్ర విభాగం ఒక ప్రత్యేక శాఖగా 1993 నుండి పనిచేయటం ప్రారంభించింది. దీనికి ముందు ఈ శాఖ జీవ విభాగం శాఖ అధీనంలో వుండేది. ఈ శాఖ పటిష్టమైన విద్యాబోధన కోసం జీవ రసాయన శాస్త్రం, వృక్షశాస్త్రం శాఖల సహాయ సహకారాలతో మాస్టర్ డిగ్రీ స్థాయిలో బోధించటం జరుగుతుంది. అంతేకాకుండా వివిధ అంశాలపై పరిశోధనలు చేపట్టి పటిష్టవంతమైన పరిశోధనలు కూడా ఈ విభాగంలో వెలువడుతున్నాయి. ప్రస్తుతం ఈ క్రింది అంశాలపై పరిశోధనలు జరుగుతున్నాయి. అవి: మాలుక్యులర్ బయాలజీ ఆఫ్ హార్మోన్ యాక్షన్, ఎనిమల్ బయోటెక్నాలజీ, ఎన్విరాన్‌మెంటల్ టెక్సికాలజీ, విన్‌సెట్ ఫియాలజీ, బయోలాజికల్ ఆక్విడేషన్స్, మరియు లిపిడ్ బయోకెమిస్ట్రీ, క్యాన్సర్ బయాలజీ మరియు ఆంటీట్యూమర్ మోడలింగ్, ఎనిమల్ ఫియాలజీ, రీప్రోడక్టివ్ బయాలజీ మరియు న్యూరో కెమిస్ట్రీ మరియు న్యూరో బయాలజీ మొదలగునవి. వీటికి సంబంధించిన పరిశోధనలకు అవసరమయ్యే వాటికి సహాయ సహకారాలను డి.ఎ.ఇ., ఐ.సి.ఎం.ఆర్., యు.జి.సి., డి.ఓ.ఇ., సి.ఎ.ఐ.ఆర్., డి.ఎస్.టి. మొదలగు సంస్థలు అందిస్తున్నాయి.

ఈ శాఖ వివిధ పరిశోధనా సంస్థల సహాయంతో పరిశోధనా రంగంలో దిన దినం మరింత అభివృద్ధి చెందుతున్నది. అంతేకాకుండా పరిశోధనలు జరపడానికి అవసరమైన పరికరాలను కూడా ఈ శాఖ సమకూర్చుకొంది. మరియు వివిధ అంశాలను అధ్యయనం చేయడానికి వేరు వేరు ప్రయోగశాలలను కూడా కలిగివుంది. యు.జి.సి. ప్రత్యేక సహాయ కార్యక్రమం క్రింద ఎనిమల్ ఫిజియాలజీ మరియు రీప్రొడక్టివ్ బయాలజీ అంశాలపై ప్రత్యేక పరిశోధనలు నిర్వహిస్తూ అదనంగా ఈ కార్యక్రమం క్రింద మరింత పటిష్టపరచడం జరుగుతోంది.

ప్రస్తుతం ఈ శాఖలో మాస్టర్ డిగ్రీ, ఎం.ఫిల్ మరియు పిహెచ్.డి. స్థాయిలో అనేక అంశాలపై అధ్యయనం నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం ఈ విభాగానికి ఆచార్య ఎ.ఎస్.మూర్తి శాఖాధిపతిగా బాధ్యతను నిర్వహిస్తున్నారు. ఇద్దరు ప్రొఫెసర్లు, ముగ్గురు రీడర్లు, యు.జి.సి. ఏర్పాటు చేసిన శాస్త్రవేత్తతో ఈ శాఖను నిర్వహిస్తున్నారు.

పైన వివరించిన శాఖలకు అదనంగా పి.జి.స్థాయిలో బయోటెక్నాలజీ అనే శాఖను 1994లో ఏర్పాటు చేశారు. అయితే ఈ శాఖ పూర్తిగా జీవరసాయన శాస్త్రం,

వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం శాఖల సహాయంతో నడుస్తోంది. ఈ బయోటెక్నాలజీ కోర్సులో సెల్ బయాలజీ, జెనిటిక్స్, టిష్యూకల్చర్, ఇమ్యూనాలజీ, బయోప్రాసెస్ మరియు బయోకెమికల్ ఇంజనీరింగ్, మైక్రోబియల్ బయోటెక్నాలజీ, రీకాంబినెంట్. డి.ఎన్.ఎ. టెక్నాలజీ, ప్లాంట్ బయో టెక్నాలజీ, ఎనిమల్ బయో టెక్నాలజీ అనే అధ్యానాంశాలు నిర్వహిస్తున్నారు. వీటి పూర్తి నిర్వహణను భారత ప్రభుత్వ బయోటెక్నాలజీ శాఖ నిర్వహిస్తోంది.

## శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతిలో 1954న ప్రారంభించబడింది. అప్పుడు సైన్సు విభాగానికి సంబంధించి గణిత, భౌతిక, జంతుశాస్త్రాలలో ఆనర్సు కోర్సులు ప్రారంభించబడినవి. 1957లో ఈ విభాగాల్లో ఎం.ఎస్.సి. కోర్సులు ప్రారంభించబడ్డాయి. ప్రస్తుతం తిరుపతిలో గణిత, అప్లైయిడ్ ప్రాయోగిక గణిత శాస్త్రాలు, భౌతిక, రసాయనిక, వృక్ష, జంతు, భూగర్భ, గణాంక, గృహ విజ్ఞాన, ఆంత్రోపాలజీ, మనస్తత్వ, భూగోళ, జీవరసాయనిక, విషాణు, శిలాశాసన శాస్త్ర విభాగాలు ఇంకా అనేక శాస్త్రవిభాగాలు నిర్వహించ బడుతున్నాయి. అంతే కాకుండా వివిధ శాస్త్ర విభాగాలలో పరిశోధనా కార్యక్రమాలు చురుకుగా కొనసాగుతున్నాయి.

### గణితశాస్త్రము:

తిరుపతిలోని విశ్వవిద్యాలయ గణిత శాస్త్ర విభాగాధిపతిగా ప్రధమంలో ఆచార్య వైద్యనాథస్వామి గారు పనిచేస్తున్న రోజుల్లో "టోపాలజీ" "జ్యామెట్రిజేషన్ ఆఫ్ డైనమిక్స్"లలో పరిశోధనాధ్యయనాలు చేపట్టడం జరిగింది. వారి తరువాత యీ విభాగానికి ఆచార్యులుగా పనిచేసిన ఆచార్య బెనర్జీగారు గణిత, భౌతిక, శాస్త్రాలను గణనీయంగా అభివృద్ధి పరిచారు. ప్రస్తుతం యీ విభాగంలో ఉన్న ఆధునిక – బీజగణితం, సంఖ్యా సిద్ధాంతం (థియరీ ఆఫ్ నంబర్స్) రంగాలను అభివృద్ధి చేస్తున్నారు. ప్రాయోగిక గణిత మరియు భౌతిక శాస్త్ర విభాగాలకు డీన్‌గా ఆచార్య వి.వి. సుబ్రహ్మణ్య శాస్త్రి, మరియు శాఖాధిపతిగా ఆచార్య పి.వి. అరుణాచలం గారు వ్యవహరిస్తున్నారు. మొత్తం గణిత శాస్త్ర విభాగంలో గణిత శాస్త్రంలో 30 మంది విద్యార్థులను ప్రాయోగిక (అప్లైడ్) గణిత శాస్త్రంలో 30 మంది విద్యార్థులకు అవకాశం కల్పించబడుతోంది.

### భౌతిక శాస్త్ర విభాగము:

1954లో విశ్వవిద్యాలయ స్థాపన నాటికి ఉన్న ఆరు శాఖలలోను ఫిజిక్స్‌లో మూడు సంవత్సరాల ఆనర్సు కోర్సు ఒకటి. 1957 – 58లో 'వైర్లెస్' ప్రధాన విషయంగా ఒక సంవత్సరం ఎమ్.ఎస్.సి. కోర్సు ప్రారంభమైంది. 1959 – 60లో రెండేళ్ళ కోర్సు ప్రారంభమైంది. పాఠ్యప్రణాళిక కూడా పూర్తిగా మార్చబడింది. అల్ట్రాసోనిక్స్, సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, టెంపరేచర్ ఫిజిక్స్, అప్పర్‌ఎట్మాస్ఫియర్, మాగ్నటిజం, మాలిక్యులర్ వైబ్రేషన్స్, స్పెక్ట్రోస్కోప్ రంగాలలో పరిశోధన కృషి పుష్కలంగా జరిగింది. ప్రస్తుతం ఈ విభాగానికి శాఖాధిపతిగా ఆచార్య ఆర్.గోపాలకృష్ణన్ వ్యవహరిస్తున్నారు. ఈ శాఖలో ప్రతి సంవత్సరం 401 మంది విద్యార్థులకు ప్రవేశం లభిస్తుంది. అంతేకాకుండా యు.జి.సి. ఆర్థిక సహాయంతో 'న్యూ ఆప్టికల్ డివైసెస్', 'డెవలప్‌మెంట్ ఆఫ్ ఫిలిమ్స్', 'ఆప్టికల్ క్రిస్టాల్స్' అనే అంశాలపై విశేష పరిశోధనలు జరుపుతున్నారు.

ఆచార్య ఎస్. రామచంద్రరావు గారి ఆధిపత్యం క్రింద ప్రారంభించబడిన భౌతిక శాస్త్ర విభాగంలో వారి నిర్వహణ క్రింద డయామాగ్నటిక్ స్కపిబిలిటీ మెజర్‌మెంట్స్‌లో కొంత కృషి సాగింది. వారి తరువాత తిన్ ఫిల్మ్స్ యొక్క సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, ఎలక్ట్రానిక్స్, భౌతికశాస్త్రాలను అభివృద్ధి పరిచారు. ఇంకా లో టెంపరేచర్ ఫిజిక్స్ అక్సటిక్స్, వాటి ఫిల్మ్‌ల విషయాలపై కృషి జరుగుతోంది.

ఈ విశ్వవిద్యాలయంలో డిప్లమా కోర్సులు కూడా ప్రారంభించటం జరిగింది. ముఖ్యంగా భౌతిక శాస్త్ర విభాగం ఫోటోగ్రఫీలో పి.జి.డిప్లమా కోర్సును పార్ట్‌టైంలో బోధిస్తుంది. మరియు టెక్నాలజీ అండ్ రిలేటెడ్ అప్లికేషన్స్‌లో ఒక సంవత్సరం డిప్లమా కోర్సును కూడా బోధిస్తుంది.

### రసాయనిక శాస్త్ర విభాగము:

ఈ విశ్వవిద్యాలయంలో రసాయనిక శాస్త్ర విభాగాన్ని 1954లోనే ప్రారంభించారు. ఈ విభాగానికి అధిపతిగా మొదట డా.వి.ఎన్.కప్పన్. ఆ తరువాత కె.నీలకంఠం గారలు నిర్వహించారు. ప్రస్తుతం ఆచార్య కె. రామలింగారెడ్డి గారు వున్నారు. ఈ విభాగంలో విశేష రసాయనిక శాస్త్రం, భౌతిక రసాయనిక శాస్త్రం, సేంద్రియ రసాయనిక శాస్త్రం, నిరింద్రియ రసాయనిక శాస్త్రం, రేడియో రసాయనిక శాస్త్రం మొదలగు శాస్త్రాలలో ఎమ్.ఎస్.సి. కోర్సులు వున్నాయి. ప్రస్తుతం ఇందులో 40 మంది విద్యార్థులకు ప్రవేశ సౌకర్యం వుంది. అంతే కాకుండా అనేక మంది ఈ శాఖ నుండి డాక్టరేట్లు పొందారు. మరియు కళాశాలలోని రసాయనిక శాస్త్ర విభాగంలో విశ్లేష రసాయనిక శాస్త్రం, విద్యుత్ రసాయన శాస్త్రం, థర్మోడైనమిక్స్, సహజ పదార్థాల రసాయనిక శాస్త్రాలలో పరిశోధనాధ్యయనాల కృషి జరుగుతున్నది. కంట్రోల్ – ద గ్యాప్ బిట్‌వీన్ థీరి అండ్ ప్రాక్టిస్ అనే విషయంపై పరిశోధనలు జరుగుతున్నాయి.

జీవశాస్త్ర, భూగర్భ శాస్త్రాల కేంద్రాలకు ఆచార్య. ఎస్.ఆర్. వెంకట్రామయ్య డీన్‌గా వ్యవహరిస్తున్నారు. ఈ కేంద్రాల క్రింద వివిధ శాఖలు ఉన్నాయి. అవి ముఖ్యంగా:

### జంతుశాస్త్రము:

ఈ విశ్వవిద్యాలయంలో జంతుశాస్త్ర విభాగాన్ని 1954లో ప్రారంభించారు. ఇక్కడ నిర్వహిస్తున్న 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో మాలుక్యులర్ బయాలజీ, ఎన్విరాన్‌మెంటల్ బయాలజీ, రిప్రొడక్షన్ బయాలజీ అనే ప్రత్యేకాంశాలను బోధిస్తున్నారు. అంతే కాకుండా వివిధ అంశాలపై పరిశోధనలు కూడా జరుగుతున్నాయి. ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతి సంవత్సరం 40 మందీ విద్యార్థులు చేరటం జరుగుతోంది.

ఈ జంతుశాస్త్ర విభాగమే శరీర శాస్త్రం, (ఫిజియోలజీ ఆఫ్ నార్వియస్ సిస్టమ్) రంగాలలో కూడా అభివృద్ధిని సాధించింది. ఈ శాఖ నరాల, కండరాల కణ సంహితిపై స్కార్పిన్ వీనామ్ యొక్క ప్రభావాన్ని గూర్చి జరిపిన పరిశోధనలు ప్రాముఖ్యత వహించాయి. ఇంకా కణాలు, మాలుక్యులర్ ఫిజియాలజీలపై అధ్యయనాలు కొనసాగుతున్నాయి. ఈ శాఖలో ఏటా 30 మంది విద్యార్థులు చేరుతున్నారు. ఈ శాఖలో కూడా పరిశోధనలు జరుగుతున్నాయి.

ఈ జంతుశాస్త్ర విభాగం ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న పరిశోధనలలో ఫిష్ ఫిజియాలజీ (చేప శరీర క్రియా విజ్ఞానం) థెర్మల్ బయాలజీ, క్రిమి సంహారక మందులపై జరుగుతున్న పరిశోధనలు చాలా ముఖ్యమైనవి. 1981 – 82 సంవత్సరంలో ప్రొఫెసర్.ఆర్.రామ్మూర్తి ఆధ్వర్యంలో పెస్టిసైడ్సు – ఇండస్ట్రియల్ టాక్సికాలజీ (క్రిమి సంహారక మందులు – పారిశ్రామిక విషవాయు ప్రభావము) అనే ప్రత్యేకాంశంపై బోధన, పరిశోధన ప్రారంభించారు.

జంతు శాస్త్ర విభాగం – ఆక్వాకల్చర్‌లో మరియు సెరికల్చర్‌లో పి.జి. డిప్లమా కోర్సులను ప్రారంభించింది.

జంతుశాస్త్ర విభాగానికి ప్రస్తుతం ఆచార్య ఆర్ రామమూర్తి శాఖాధిపతిగా వ్యవహరిస్తున్నారు. ముఖ్యంగా ఈ శాఖ "ఎక్స్‌ప్లోరేటరీ...ఎక్సర్ సైజు", "మెకానోసెన్సరీ...అమెరికన్", "ఎస్‌పెట్స్ ఆఫ్...ఈస్టుకోస్టు" అనే అంశాలపై పరిశోధన ప్రాజెక్టులను చేపట్టింది.

### వృక్ష శాస్త్రము:

విశ్వవిద్యాలయ వృక్షశాస్త్ర విభాగాన్ని 1959లో ప్రారంభించారు. ఈ శాఖకు కొంత కాలం ఆచార్య ఐ.ఎం.రావు గారు అధిపతిగా బాధ్యతలు నిర్వహించారు. ఈ విభాగంలో ప్లాంట్ ఫిజియాలజీ, సాయిల్ మైక్రోబయోలజీ, ప్లాంట్ పాతోలజీలలో కొంత పరిశోధనా కృషి జరిగింది. ప్రస్తుతం ఇక్కడ ఇంకా విస్తృతంగా పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ శాఖలో 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో ప్రస్తుతం ఏటా 40 మంది విద్యార్థిని, విద్యార్థులు చేరుటకు అవకాశం కలదు. ప్రస్తుతం ఈ శాఖాధిపతిగా ఆచార్య జె.వి. శ్రీనివాస రావు గారు వున్నారు. మరియు యు.జి.సి. ఇతర సంస్థల ఆర్థిక సహాయంతో పరిశోధన ప్రాజెక్టులను చేపట్టడం జరిగింది. ప్రస్తుతం పరిశోధన ప్రాజెక్టులో భాగంగా "రోల్ ఆఫ్ ప్లాంట్స్" అనే అంశంపై పరిశోధనలు జరుపుతున్నారు.

### భూగర్భ శాస్త్ర విభాగము:

భూగర్భ శాస్త్ర విభాగము 1959లో ప్రారంభించబడింది. ప్రస్తుతం ప్రొఫెసర్.కె.ఆర్. రెడ్డి శాఖాధిపతిగా వున్నారు. ఈ విభాగం క్రింద ఖనిజ శాస్త్రం, పెట్రోలజీ సెడిమేంటేషన్, ప్లాంటాలజీ, రాక్ మెగ్నాటిజమ్ రంగాలలో పరిశోధనలు నిర్వహించబడుతున్నాయి. చిత్తూరు జిల్లాలో భూగర్భ జలసంపదను అన్వేషించి, వినియోగంలోకి తేవడంలో ప్రశంసనీయమైన కృషి చేసింది. ఈ విభాగం రాయలసీమ ప్రాంతపు మంచినీటిలో ఫ్లోరైడు పదార్థము యొక్క స్థాయిని గూర్చి కొంత కృషి జరిపింది. మరియు ప్రాయోగిక (ఎప్లైడ్) భూగర్భ శాస్త్రాన్ని కూడా ప్రారంభించింది. ప్రస్తుతం భూగర్భ శాస్త్ర విభాగాలలో ఎం.ఎస్.సి. కోర్సులో ఏటా 25 మంది విద్యార్థులు చేరుటకు అవకాశం వుంది. ప్రస్తుతం "టెక్టామిక్...కర్నాటక" అనే అంశంపై పరిశోధన ప్రాజెక్టును ఈ శాఖ చేపట్టింది.

### మానవశాస్త్ర విభాగం:

విశ్వవిద్యాలయం ఈ విభాగాన్ని 1971లో ప్రారంభించింది. ప్రస్తుతం ఈ శాఖకు అధిపతిగా ప్రొఫెసర్ ఎ.మణిరత్నం రెడ్డి వ్యవహరిస్తున్నారు. మానవశాస్త్ర విభాగంలో రెండు సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతి సంవత్సరం 45 మంది విద్యార్థులను చేర్చుకొంటున్నారు. అంతే కాకుండా పరిశోధనలు కూడా నిర్వహించబడుతున్నాయి. ప్రస్తుతం యు.జి.సి. ఆర్థిక సహాయంతో "జెనిటిక్...కాన్‌సన్‌ట్రేషన్" అనే అంశంపై పరిశోధన ప్రాజెక్టును ఈ శాఖ చేపట్టింది.

### గృహ విజ్ఞాన శాస్త్ర విభాగము:

ఈ విజ్ఞాన విభాగమును 1963లో ప్రొఫెసర్ దోరా ధిపియర్సన్ ఆదిపత్యంలో ప్రారంభించారు. ప్రస్తుతం ఈ విభాగానికి శ్రీమతి డి.పేరమ్మ అధిపతిగా వున్నారు. ఈ విభాగంలో శిశుపోషణ, అభివృద్ధి, పోషకాహారం, డైటోథెరఫీ, పిల్లల అభివృద్ధి మరియు కుటుంబ సంబంధాలు, గృహ విజ్ఞాన శాస్త్రము మరియు విస్తరణ, గృహ విజ్ఞానం యాజమాన్య

అంశాలను రెండు సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో బోధిస్తున్నారు. అంతేకాకుండా ప్రాయోగిక పోషకాహారం (ఎప్లైడ్ న్యూట్రిషియన్)లో ఒక సంవత్సరం డిప్లమా కోర్సును పార్టుటైంలో బోధిస్తున్నారు. ఈ గృహ విజ్ఞాన శాస్త్రంలో ప్రతి సంవత్సరము 30 మంది విద్యార్థులు ప్రవేశించడానికి అవకాశం వుంది. అంతేకాకుండా శాస్త్రంలో ఎం.ఫిల్.మరియు పిహెచ్.డి పట్టాల కోసం పరిశోధనలు కూడా జరుగుతున్నాయి. ముఖ్యంగా ఈ విభాగంలో ప్రోటీన్ విలువలు అధికంగా వున్న ఆహారంపై పరిశోధనలు భారీగా చేపట్టారు.

ఈ శాఖ 1973లో చైల్డ్ గైడెన్స్ క్లినిక్ అను దానిని స్థాపించింది. ఈ క్లినిక్ ద్వారా మానసికంగా శరీర బలహీనతల వల్ల బాధపడుతున్న పిల్లల ఆరోగ్యాన్ని గూర్చి సలహా ఇచ్చుటకు సేవలను కూడా నిర్వహిస్తుంది.

### భూగోళ శాస్త్రము:

భూగోళ శాస్త్ర విభాగాన్ని విశ్వవిద్యాలయంలో 1972లో ప్రారంభించారు. ప్రస్తుతం ఈ శాఖకు అధిపతిగా శ్రీమతి పి.నారాయణమ్మగారు వున్నారు. ఈ విభాగంలో 2 సంవత్సరాల ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతి సంవత్సరం 20 మంది విద్యార్థులు చేరుటకు వీలుంది. అంతేకాకుండా పరిశోధనలు కూడా ఈ శాస్త్రంలో జరుగుతున్నాయి. ప్రస్తుతం యు.జి.సి. ప్రాజెక్టు క్రింద అనేక అంశాలపై విస్తృతమైన అధ్యయనాలు జరుగుతున్నాయి

### జీవ రసాయన శాస్త్ర విభాగం:

ఈ విశ్వవిద్యాలయం ప్రారంభించిన 24 సంవత్సరముల అనంతరం 1978లో ఈ శాఖను ప్రొఫెసర్ వెంకయ్య అధిపత్యంలో ప్రారంభించడం జరిగింది. ప్రస్తుతం ఈ విభాగానికి డా.కె.త్యాగరాజు అధిపతిగా వున్నారు. ఈ విభాగంలో 1. ఫిజికల్ బయో కెమిస్ట్రీ, 2. మాలుక్యులర్ బయో కెమిస్ట్రీ, 3. న్యూట్రిషనల్ అండ్ క్లినికల్ బయో కెమిస్ట్రీ, 4. ఎంజయమాలజీ, 5. మెటబాలజీ 6. జెనిటిక్స్ మాలుక్యులర్ బయోలజీ, 7. ఎండోక్రినాలజీ, 8. మైక్రోబయాలజీ అండ్ ఇమ్యునాలజీ తదితర అంశాలను ఎం.ఎస్.సి. రెండు సంవత్సరముల కోర్సులో బోధిస్తున్నారు. ఈ కోర్సులో ఏటా పది మంది విద్యార్థులను తీసుకోవటం జరుగుతోంది. అంతే కాకుండా ఎం.ఫిల్, పిహెచ్.డి. పరిశోధనలు కూడా జరుగుతున్నాయి. ప్రస్తుతం సి.ఎస్.ఐ.ఆర్. సంస్థ ఆర్థిక సహాయంతో విస్తృతమైన అధ్యయనాలు జరుగుతున్నాయి. అదే విధంగా డి.ఎస్.టి. ఆర్థిక సహాయంతో అనేక అంశాలపై పరిశోధనా ప్రాజెక్టులను చేపట్టడం జరుగుతోంది.

### విషాణు శాస్త్ర విభాగం:

విశ్వవిద్యాలయంలో విషాణు శాస్త్ర శాఖను 1987లో ప్రారంభించటం జరిగింది. ప్రస్తుతం ఈ శాఖకు డా. పి.శ్రీనివాసులు అధిపతిగా వున్నారు. ఈ శాఖలో ప్రతి సంవత్సరం 10 మంది విద్యార్థులను 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో చేర్చుకోవటం జరుగుతోంది. అంతేకాకుండా ఈ కోర్సులో పరిశోధనలు కూడా జరుగుతున్నాయి. ముఖ్యంగా ఈ శాస్త్రాన్ని అధ్యయనం చేయుటకు అనేకమైన విషక్రిమి కీటకాల వల్ల వ్యాధిసోకే వాటిని శోధించి కనిపెట్టుటకు అందుబాటులో వున్న స్థానిక పంటలు సహాయపడుతున్నాయి.

### ఇంజనీరింగు విభాగం

విశ్వవిద్యాలయం ఇంజనీరింగు కళాశాలలో ఏడాదికి 100 మంది విద్యార్థులను చేర్చుకొనే సౌకర్యముంది. ఈ కళాశాలలో సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్, కమ్యూనికేషన్ ఇంజనీరింగు విభాగాలున్నాయి. మెకానికల్ ఇంజనీరింగు, ఎలక్ట్రికల్ ఇంజనీరింగు, పారిశ్రామిక యాజమాన్యాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు నిర్వహించబడుతున్నాయి. ఈ ప్రాంతంలోని పారిశ్రామిక యూనిట్లకు యీ కళాశాల సలహా సహకారాలనందిస్తోంది. అనంతపురం ఇంజనీరింగు కళాశాల 1959లో స్థాపించబడింది.

### వైద్య కళాశాల

1957లో కర్నూలులో, 1959లో తిరుపతిలో వైద్య కళాశాలలు ప్రారంభించబడ్డాయి.

తిరుపతిలో తొలుత వేంకటేశ్వర విశ్వవిద్యాలయం క్రింద ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికనుబంధించబడివున్న వ్యవసాయ, వెటర్నరీ కళాశాలలు రాయలసీమ ప్రాంతపు వ్యవసాయ, పశుపాలనా రంగాలలో విశేష కృషి చేస్తున్నాయి.

### పి.జి. కేంద్రం - కావలి:

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం కావలిలో ఒక (పి.జి.) పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రాన్ని 1972లో ఆర్థిక శాస్త్ర విభాగంతో ప్రారంభించింది. ఈ కేంద్రాన్ని ప్రారంభించిన 7 సంవత్సరముల తరువాత 1979లో జంతు శాస్త్ర విభాగాన్ని ప్రారంభించినారు. ఈ శాస్త్రంలో రెండు సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతి సంవత్సరం 40 మంది విద్యార్థులను చేర్చుకోవటం జరుగుతోంది. ఈ కేంద్రంలో కూడా జంతు శాస్త్రంలో పరిశోధన ప్రాజెక్టులను యు.జి.సి. ఆర్థిక సహాయంతో చేపట్టడం జరుగుతోంది. ప్రస్తుతం అనేక అంశాలపై అధ్యయనం చేస్తున్నారు. ప్రస్తుతం శాఖాధిపతిగా కె.వి.రమణారావు వ్యవహారిస్తున్నారు.

### భౌతిక శాస్త్ర విభాగం:

కావలి పి.జి. కేంద్రంలో ఈ విశ్వవిద్యాలయం 1979లో భౌతిక శాస్త్ర శాఖను ప్రారంభించింది. ప్రస్తుతం ప్రొఫెసర్.వి.పద్మనాభ శర్మ శాఖాధిపతిగా వున్నారు. ఈ విభాగంలో 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో ఏటా 40 మంది విద్యార్థులను చేర్చుకోవటం జరుగుతోంది.

### పి.జి. కేంద్రం - కడప

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం కడపలో పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రాన్ని 1977లో అడ్మినిస్ట్రేషన్ మరియు కామర్స్ (గణక) శాఖలతో ప్రారంభించింది. ఆ తరువాత రెండు సంవత్సరాలకు (ఎప్లైడ్ జియాలజీ) అను ప్రయుక్త, భూగర్భ శాస్త్ర శాఖను, రసాయనిక శాస్త్ర శాఖను 1979లో ప్రారంభించింది.

ప్రాయోగిక భూగర్భ శాస్త్రంలో ఏటా 25 మంది విద్యార్థులను రెండు సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులలో చేర్చుకొంటున్నారు. ప్రస్తుతం ఈ శాఖాధిపతిగా డా.కె.వి. ఆర్.చారి వున్నారు. అదే విధంగా రసాయనిక శాస్త్ర శాఖలో రెండు సంవత్సరాల ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతి సంవత్సరం 40 మంది విద్యార్థులు చేరుతున్నారు. ప్రస్తుతం ఈ శాఖకు అధిపతిగా ప్రొఫెసర్ ఎ.సాంబశివ రెడ్డి వున్నారు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయం

దేశ స్వతంత్ర సాధనకు ముందే విశాఖపట్టణంలో నెలకొల్పిన ఆంధ్రవిశ్వవిద్యాలయం విజ్ఞాన శాస్త్రాల అధ్యయనంలో ప్రపంచ ప్రఖ్యాతి పొందింది.

### భౌతిక శాస్త్ర విభాగం:

ఆంధ్ర విశ్వవిద్యాలయ భౌతికశాస్త్ర విభాగం 1932లో స్థాపించబడింది. శాస్త్ర – సాంకేతిక విశ్వవిద్యాలయ కళాశాల పేరుతో నెలకొల్పబడిన యీ విభాగం లక్షరూపాయలు విరాళంగా యిచ్చిన జయపూర్ మహారాజావారి దాతృత్వానికి గుర్తింపుగా 1933లో జయపూర్ విక్రందేవ్ శాస్త్ర సాంకేతిక కళాశాలగా నామాంతరం చెందింది. ప్రారంభ దశలో యీ విభాగం ప్రఖ్యాత భౌతిక శాస్త్రవేత్త సర్ సి.వి. రామన్‌గారి సలహాలను పొందుతుండేది. ఈ విభాగం ఏర్పడినప్పటినుండి సి.వి. రామన్‌గారు గౌరవాచార్యులుగా ఉంటూనే, కొన్నేళ్ళపాటు విశ్వవిద్యాలయ సైన్సు, టెక్నాలజీ ఫేకల్టీకి అధ్యక్షులుగా కూడ పనిచేశారు.

మొదట్లో ఏడాదికి ఆరుగురు విద్యార్థుల చొప్పున బి.యస్సి.ఆనర్స్ డిగ్రీ కోర్సుతో యీ విభాగం ప్రారంభించబడింది. అనంతరం విద్యార్థుల సంఖ్యను 1941 లో 12 కు, 1952లో 32కు, 1972లో 64కు హెచ్చించడం జరిగింది.

1959కి పూర్వం బి.యస్సి.ఆనర్స్ పాసయిన విద్యార్థులు అధ్యయన కోర్సుకన్నా ప్రధానంగా పరిశోధనపై హెచ్చుగా ఆధారపడిన ఒక సంవత్సరపు యం.యస్సి. (రీసెర్చి) కోర్సులో చేర్చుకొనబడుతుండే వారు. 1959 లో విశ్వవిద్యాలయ గ్రాంట్స్ కమీషన్ వారి ఉత్తర్వుల మేరకు యం.యస్సి (రీసెర్చి) కోర్సు రద్దు చేయబడి, యం.యస్సి. అధ్యయన కోర్సు ప్రవేశపెట్టబడింది.

భౌతిక శాస్త్ర విభాగం చొరవవల్లనే విశ్వవిద్యాలయంలో అనుప్రయుక్త భౌతికశాస్త్రం, గణిత భౌతిక శాస్త్రం, భూ భౌతిక శాస్త్రం, వాతావరణ శాస్త్రం, సాగర శాస్త్రం, న్యూ క్లియర్ భౌతిక శాస్త్రం, తదితర ప్రత్యేక నూతన విభాగాలు ప్రారంభించబడ్డాయి.

జయపూర్ విక్రమ్‌దేవ్ కళాశాల భవనంలో నాల్గింట మూడువంతుల భాగాన్ని భౌతికశాస్త్రం విభాగమే ఆక్రమిస్తున్నది. ఈ విభాగానికి చెందిన కొన్ని భాగాలు నగరంపాలెంలో నెలకొల్పబడి వున్నాయి. నగరంపాలెంలో రోదసీ పరిశోధనా ప్రయోగశాలకు అనుకొని ఉన్న 134 ఎకరాల బంజరు భూమిని ప్రభుత్వం ఉచితంగా యిచ్చి యీ రంగంలో విస్తృత పరిశోధనా కార్యక్రమాన్ని చేపట్టేందుకు వీలు కల్పించింది.

పరిశోధనా రంగంలో యీ విభాగం ప్రారంభంనుండి చురుగ్గానే పనిచేస్తోంది. తొలి సంవత్సరాల్లో వర్ణమాలా దర్శిని (Spectroscope), రామన్ ఎఫెక్టు (Raman effect)లపై విశేష పరిశోధనా కృషి జరిగింది. తరువాత అల్ట్రా సోనిక్స్, క్రిస్టల్ ఫిజిక్స్, తదితర నూతన రంగాలవైపు దృష్టి సారించింది. యుద్ధానంతరం దశలో U.G.C; C.S.I.R., A.E.C. తదితర సంస్థల ఆర్థిక సహకారంతో Solid State physics, Space State Physics, ఎలక్ట్రానిక్స్ – తదితర అధునాతన రంగాలలో పరిశోధనా కార్యక్రమాన్ని చేపట్టింది. సైద్ధాంతిక అణుభౌతిక శాస్త్రం (Theoretical Nuclear Physics)లో కూడ పరిశోధనలు ప్రారంభమయ్యాయి.

విద్యారంగంలో సెమిస్టర్ సిస్టం, ఇంటర్నల్ అసెస్‌మెంటులను ప్రవేశపెట్టడంలో చొరవ తీసుకొన్న మొట్టమొదటి దక్షిణ భారత్ విశ్వవిద్యాలయ విభాగం యిదే కావడం గమనార్హం! వివిధ శాఖలను అజమాయిషీ చేసే శాఖాధ్యక్షత పదవిని శాశ్వతంగా ఒకరికే అప్పజెప్పకుండా, ప్రతి శాఖలో వున్న ఆచార్యులందరు ఒకరి తర్వాత ఒకరు శాఖాధ్యక్షులై తమ నైపుణ్యంతో ఆ శాఖల అభివృద్ధికి దోహదంచేసే రొటేషన్ పద్ధతిని కొద్ది సంవత్సరాల క్రింద ఈ విశ్వవిద్యాలయంలో ప్రవేశపెట్టబడింది.

భౌతికశాస్త్ర, అణుభౌతికశాస్త్ర విభాగాల మొదటి సంవత్సరపు కోర్సులను సమైక్యంగా బోధిస్తున్న విభాగంకూడ ఆంధ్ర విశ్వవిద్యాలయ భౌతికశాస్త్ర విభాగమే కావడం మరో ప్రత్యేకత!

కళాశాల శాస్త్రాభివృద్ధి కార్యక్రమంలో ప్రముఖపాత్ర వహించి, అండర్ గ్రాడ్యుయేట్ స్థాయిలో బోధనా ప్రమాణాలను మెరుగు పర్చేందుకు అధ్యాపక వర్గం కృషి చేసింది.

భారతదేశంలోకెల్లా రోదసీ శాస్త్రరంగంలో పరిశోధనలు నిర్వహించే రెండే రెండు విశ్వవిద్యాలయ విభాగాల్లో ఆంధ్ర విశ్వవిద్యాలయ భౌతికశాస్త్ర విభాగం ఒకటి కావడం మనకు గర్వకారణం.

పారిశ్రామికాభివృద్ధి కృషిలో భాగంగా ఆంధ్ర విశ్వ విద్యాలయ భౌతికశాస్త్ర విభాగం యు. జి. సి. సహకారంతో ఉత్పత్తి, పరిశోధనా విభాగాలతో కూడిన భౌతికశాస్త్ర సాధన సమకూర్పు వర్కుషాపును నెలకొల్పింది. కొన్ని నూతన పరికరాలు ప్రయోగాత్మకంగా రూపొందించబడి వాణిజ్య ఉత్పత్తికి సిద్ధంగా ఉన్నాయి. దేశంలో ఒక విశ్వవిద్యాలయ విభాగంచే చేపట్టబడిన యీ తరహా ప్రాజెక్టుల్లో యిదే మొదటిది.

రూ.14 లక్షల ప్రాథమిక వ్యయంతో కళాశాల శాస్త్రాభి వృద్ధి కార్యక్రమం పథకాన్ని ప్రారంభించడానికి యు.జి.సి.చే దేశంలో ఎన్నిక చేయబడిన మూడు విశ్వవిద్యాలయాల్లో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఒకటి. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఈ కార్యక్రమాన్ని అమలు జరిపేందుకు భౌతికశాస్త్ర విభాగం నాయకత్వం వహిస్తోంది.

## అనుప్రయుక్త భౌతికశాస్త్ర విభాగం

ఈ శాఖ 1937లో జె.వి.డి. సైన్సు అండ్ టెక్నాలజి కళాశాల ఫిజిక్సు శాఖయందు ఐ.యం.యస్. యంత్ర పరికరోత్పత్తి విభాగం ప్రారంభింపబడింది. యాంత్రిక పరికరోత్పత్తి విభాగం ఐ.యం.యస్. యొక్క ముఖ్యోద్దేశం. జె.వి.డి. కళాశాలలోని యితర శాఖలకు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి సంబంధించిన కళాశాలలకు అవసరమగు పరికరాలను కల్పించుటయే, 1939లో ఎప్లైడ్ ఫిజిక్సులో ప్రత్యేకంగా పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు ప్రారంభించబడింది. ఇందలి అధ్యాపక వర్గంలో ఐ.యం.యస్.లోని వారేగాక, యితర విశేషాలలోని వారుకూడా కొందరు కలరు. ఈ కోర్సు ఉద్దేశ్యం ఫిజిక్సు ముఖ్యాంశముగా పోస్టుగ్రాడ్యుయేట్స్, ఆనర్సు గ్రాడ్యుయేట్స్‌ను తయారు చేస్తూ ఎలక్ట్రిసిటీ, వైర్‌లెస్, ఆప్టికల్ అండ్ సైంటిఫిక్ ఇన్‌స్ట్రుమెంట్స్ మొదలగు వానిలో ఎప్లైడ్ విషయాలలో శిక్షణ ఇవ్వటం. ఈ కోర్సు పాస్ గ్రాడ్యుయేట్స్‌కు 2 సంవత్సరాలు, తరువాత 1 సంవత్సరం ఆనర్సు గ్రాడ్యుయేట్స్‌కు, కాలనిర్ణయం చేయబడింది. కర్మాగారాభ్యాసం ప్రాక్టికల్ ఫిజిక్సుకు అత్యవసరమైన డ్రాయింగ్‌లో ప్రాథమికశిక్షణ యివ్వడం కూడా ఉంది. ఈ విధంగా కోర్సుపూర్తిచేసిన వారికి ఆల్ ఇండియా రేడియో, ఇండియా మెటీరియెలాజికల్ డిపార్టుమెంటు, ఆయిల్ అండ్ నాచురల్ గ్యాస్ కమీషన్ ఇంకా తదితర ప్రభుత్వ సంస్థలలో వెంటనే ఉద్యోగాలు దొరికేవి. విద్యా సంస్థలలో రసాయనికశాల నిర్వహణాభివృద్ధులకు ఎప్లైడ్ ఫిజిక్సులో ట్రైనింగు పొందిన పోస్టుగ్రాడ్యుయేట్లు ఉపయోగకరంగా ఉండుటచే, విద్యా సంస్థలు కూడా ఉద్యోగాలివ్వటంలో కూడా వీరికే ప్రాధాన్యమిచ్చాయి.

1946 లో ఫిజిక్సు నుండి ఎప్లైడ్ ఫిజిక్సు స్వతంత్ర ప్రతిపత్తి సంపాదించుకుంది. ప్రతి సంవత్సరం చేరు విద్యార్థుల సంఖ్య పెరిగింది. అందుమూలంగా ఎక్కువ లేబరేటరీ సదుపాయాలు కల్పించడం కోసం ఎక్కువ స్థలం అవసరమైంది. 1954లో టెక్నాలజీలో అభివృద్ధి పొందుతున్న సంఘావసరాలను గుర్తించి, ఈ ఎప్లైడ్ ఫిజిక్స్‌కోర్సు 3 సంవత్సరముల కాల పరిమితికి మార్చబడింది. ఆప్టికల్ ఇంజనీరింగు, ఇన్‌స్ట్రుమెంటేషన్ అండ్ ఎలక్ట్రానిక్సు మొదలైన 3 ముఖ్య విషయాలు గూడా చివరి సం॥ కోర్సులో చేర్చబడ్డాయి. జులై 1956లో ప్రత్యేక భవనం నిర్మించబడడంతో ఈ శాఖ అందులోకి మార్చబడింది. 1959లో ప్రణాళిక ఇంకను మార్చబడింది. ఈ కోర్సు పూర్తి చేసిన వారికిచ్చే డిగ్రీ పేరు యం.యస్‌సి. ఫిజిక్సు నుండి యం.యస్‌సి. ఎప్లైడ్ ఫిజిక్సుకు మార్చబడింది. ప్రస్తుతం ఇది మూడు సంవత్సరాల యం.యస్‌సి. కోర్సు. ఇందులో చేరుటకు, ఫిజిక్సు మెయిన్, లెక్కలు కెమిస్ట్రీ ఏన్సిలరీస్‌గా బి.యస్‌సి. పరీక్షలో కృతార్థులైన వారు అర్హులు.

1968 లో థాకర్ కమిటీ, భగవంతం కమిటీవారు సాంకేతిక విద్యపై చేసిన, సలహాలననుసరించి ఈ కోర్సుకు పారిశ్రామిక ప్రాధాన్యం ఇవ్వటానికి పాఠ్యప్రణాళిక వృద్ధి చేయబడింది. 1974 జూలైలో సెమిస్టర్ పద్ధతి ప్రవేశ పెట్టడంతో ఈ ప్రణాళిక ఆ పద్ధతికి తగినట్లు మార్చబడింది. ప్రస్తుతం యం.యస్‌సి (టెక్) ఎప్లైడ్ ఫిజిక్సు కోర్సు పూర్తి చేయుటకు విద్యార్థులు 6 సెమిస్టర్లు గడవవలసియున్నది. 4వ సెమిస్టరు కాగానే వారి ప్రత్యేక విషయాన్ని నిర్ణయించుకొంటారు. అధ్యాపకవర్గంలో ఒక ప్రొఫెసర్, ముగ్గురు రీడర్లు, 9 మంది లెక్చరర్లు కలరు. గత శతాబ్దంలో ప్రణాళికలు, ప్రయత్నాలు ఈ శాఖలోని పరిశోధనా విషయాలపై కేంద్రీకరింపబడినవి.

(1) థిన్ ఫిల్మ్స్ (2) ఫోటో ఎలాస్టిసిటి ఎట్మాస్ఫిరిక్స్ (3) మెడికల్ ఎలక్ట్రానిక్స్ పరిశోధనా విషయములైనవి.

థిన్ ఫిలిమ్స్‌లో ఇద్దరు పిహెచ్.డి.లు పొందగా ఇంకొకరి ఫలితం నిర్ణయింపబడవలసి యున్నది.

పరిశోధనలకు మూడు, శాస్త్రీయ పారిశ్రామిక ఉపయోగములకు తగు సామాగ్రిని ఊహించి అభివృద్ధి పరుచుటకు కావలసిన కృషికూడా ఈ శాఖ చేపట్టింది. ఈ పని కాంట్రాక్టు పద్ధతిలో చేపట్టడంచేత, ఇంతవరకు ఈ శాఖ ఇండియన్ రైల్వేలు, ఇంకను కొన్ని ప్రైవేటు సంస్థల అవసరములను కొన్నింటిని పూర్తి చేయకల్గింది. ఆప్టికల్ అండ్ ఎలెక్ట్రిక్ ఆప్టికల్ ఇన్‌స్ట్రుమెంటేషన్ (2) అల్ట్రాసోనిక్ ఇన్‌స్ట్రుమెంటేషన్ (3) మెడికల్ ఎలక్ట్రానిక్ ఇన్‌స్ట్రుమెంటేషన్ మొదలగు రంగాలతో టెక్నాలజీ ట్రాన్స్‌ఫర్ విషయంలో ఈ శాఖకు ప్రత్యేక సామర్థ్యం ఉంది.

## భూ భౌతిక శాస్త్ర విభాగం:

ఈ శాఖ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1949లో ప్రారంభింపబడింది. భారతప్రభుత్వం మెటీరియొలాజికల్ డిపార్టుమెంట్ సూపరింటెండెంటుగా రిటైరయిన యన్.కె. సూర్‌గారు ఈ శాఖ ప్రథమ అధ్యక్షులుగా పనిచేశారు. వీరు 1952 వరకు ఆ పదవి నిర్వహించిన తర్వాత, భారత ప్రభుత్వ మెటీరియొలాజికల్ డిపార్టుమెంటులో డైరెక్టరుగా రిటైరయిన డాక్టర్ యస్.ఆర్. సపుర్‌గారు ఈ పదవిని స్వీకరించారు. జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా డైరెక్టరుగా పనిచేసిన ప్రొ. యం.యస్.కృష్ణన్ 1959లో ఆంధ్ర విశ్వవిద్యాలయంచే ఈ పదవికి ఆహ్వానించబడ్డారు తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాశాల ప్రిన్స్‌పాల్ జియోలజీ శాఖ అధ్యక్షులైన ప్రొ. సి.మహదేవన్‌గారు ఈ శాఖాధ్యక్షులుగా ఉన్నారు.

ఆయా సంవత్సరాలలో శాఖాధ్యక్షులుగా పనిచేసిన వారి కృషికి తోడుగా ప్రొ బి.సుందర రామారావుగారు, జియో ఫిజిక్స్, ద్వితీయ శాఖ "ఫిజిక్స్ ఆఫ్ ది ఎర్తు", అభివృద్ధికి ముఖ్య కారకులైన వ్యక్తులు. ఈ శాఖాధ్యక్ష పదవీ బాధ్యతలను వారు 12 సంవత్సరాలు నిర్వహించారు. ఈనాడు దేశం మొత్తంలో ఈ శాఖకు గల ప్రతిష్ఠకు, అభివృద్ధికి వారి కృషియే కారణం. శాఖాధ్యక్ష పదవిలో దీర్ఘకాలం కృషిచేసి 3–1–75న పదవి నుండి వైదొలగారు.

**కోర్సులు:** 1954–55 వరకు జియోఫిజిక్సు M.Sc. కోర్సు సాధారణ పట్టభద్రులకు 3 సంవత్సరములు, ఫిజిక్స్‌లో ఆనర్స్ గ్రాడ్యుయేట్‌కు 2 సంవత్సరములు, 1959 నుండి యు.జి.సి. సలహాల మేరకు బి.యస్.సి. ఉత్తీర్ణులైన డిగ్రీ విద్యార్థులకు యం.యస్.సి. (టెక్నికల్) కోర్సు ప్రారంభించబడింది. సెమిస్టర్ పద్ధతి ప్రవేశపెట్టబడిన తర్వాత ఈ మొత్తం కోర్సు 6 సెమిస్టర్సుకు సర్దబడింది. 1963లో ఈ శాఖకు ప్రత్యేకమయిన భవనం ఏర్పడింది. ఇంతవరకు జియోఫిజిక్సులో యం.యస్.సి. (టెక్) డిగ్రీలు 300 మందికి ఇవ్వబడినాయి.

ఈ శాఖలోని చాలామంది అధ్యాపకులు ప్రపంచ ప్రసిద్ధి గాంచిన లండన్ యూనివర్సిటీ, ఇంపీరియల్ కాలేజి, ఆస్ట్రేలియాలోని సిడ్నీ యూనివర్సిటీ, యు.యస్.ఏ.లోని కొలంబియా యూనివర్సిటీ, హాలెండ్‌లోని డెల్ఫ్ ఇన్‌స్టిట్యూట్, కెనడాలోని సెయింట్ జాన్స్ మెమోరియల్ యూనివర్సిటీ, అమెరికాలోని టెక్సాస్, ఎ. అండ్ యం. కాలేజి, జపాన్‌లోని టోక్యో యూనివర్సిటీ వంటి ప్రముఖ సంస్థలలో ఆయా ప్రత్యేక రంగాలలో నిశితమైన శిక్షణ పొందియున్నారు.

**పరిశోధన:** ప్రారంభంలో ఎక్కువ పరిశోధనలు మాగ్నెటిక్సులోనే జరిగాయి. అవసరమైన మార్పులతో, వరుసగా వచ్చిన విద్యార్థి దళములచే బ్రూక్సా అండ్ రాప్స్ అపరేటస్ వాడబడింది. కాలక్రమేణా ఈ శాఖలో విద్యార్జనకు, పరిశోధనకు క్రొత్త విషయాలు ప్రవేశపెట్టబడ్డాయి. ప్రస్తుతం 1. మాగ్నటిక్ ప్రాస్పెక్టింగ్ 2. ఎలక్ట్రికల్ ప్రాస్పెక్టింగ్ 3. గ్రావిటీ ప్రాస్పెక్టింగ్ 4. రాక్ మాగ్నటిజమ్ అండ్ పారా మాగ్నటిజమ్ 5. ఇంటర్‌ప్రిటేషన్ టెక్నిక్స్ ఇన్ ఎక్స్‌ప్లోరేషన్ జియోఫిజికల్ 6. సెస్మాలజీ 7. జియో హైడ్రాలజీలలో చదువుకోటానికి, పరిశోధన చేయటానికి సదుపాయాలున్నాయి.

పైన చెప్పబడిన విషయాలలో యీనాడు 23 గురికి డాక్టరేట్ డిగ్రీలు ఇవ్వబడ్డాయి. ఈ శాఖ ప్రసిద్ధి కెక్కుటయే కాక ప్రత్యేకంగా రాక్ మాగ్నటిజమ్, మేగ్నటో మెట్రిక్ మెథడ్స్ ఫర్ మినరల్ ఎక్స్‌ప్లోరేషన్ అండ్ రీజినల్ గ్రావిటి అండ్ మాగ్నటిక్ సర్వేవంటి ప్రత్యేక రంగాలలో పేరు పొందింది. ప్రసిద్ధ దేశ, విదేశ పత్రికలలో సుమారు 150 వ్యాసములు ప్రకటించబడ్డాయి.

## రసాయన శాస్త్ర విభాగం

1931లో ఆంధ్రా యూనివర్సిటీ కళాశాలలు స్థాపించబడినప్పుడు, బోధించదలచిన కొద్ది శాస్త్ర విషయాలలో రసాయనిక శాఖ ఒకటి. జె.వి.డి. కాలేజి ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీలో సగభాగమందు ఈ శాఖ వుంది. అదినుండి మేధావంతులైన అధ్యాపకులచే రూపురేఖలు దిద్దుకొంది. మొదటి సంవత్సరంలో జర్మన్ దేశీయుడు సమర్థుడైన ఇన్‌ఆర్గానిక్ కెమిస్టు ప్రొ. లుడ్విగ్ ఉల్ఫ్. కెమిస్ట్రీ లేబరేటరీలను బోధనకు, పరిశోధనకు ఏర్పాటు చేశారు. తరువాత 1936లో అధ్యక్షుడుగావున్న ప్రొ. టి.ఆర్.శేషాద్రి ఇండియాలో పరిశోధనకు ఉన్నత విద్యాకేంద్రంగా ఈ శాఖను తీర్చిదిద్దారు. 1949 లో ప్రొ. జి.గోపాలరావుగారు

శాఖాధ్యక్షులుగా కృషి చేశారు. వీరి అధ్వర్యంలో ఈ క్రింది ప్రత్యేక విషయాలలో 2 సంవత్సరముల యం.యస్.సి కోర్సు ప్రారంభించబడింది. 1957లో ఎనలిటికల్, 1960లో ఇనార్గానిక్, ఆర్గానిక్, ఫిజికల్, 1963లో న్యూక్లియర్, రసాయనిక శాస్త్రవిభాగాలు తెరువబడ్డాయి.

ఈవిధంగా పెరిగిన శాఖావసరములకు ఎక్కువ స్థలం కావలసి వచ్చుటచే, 1963లో కెమికల్ ఇంజనీరింగ్ శాఖ ఖాళీచేసిన భవనమును ఈ శాఖకు ఇచ్చారు. అదే సమయంలో ఫిజికల్ కెమిస్ట్రీ లేబరేటరీస్ కొరకు ఒక క్రొత్త భవనం నిర్మించబడింది.

ఫలవంతమైన దీర్ఘకాలిక కృషి అనంతరం 1968లో ప్రొ. యల్.రామచంద్రరావుగారు శాఖాధ్యక్షులయ్యారు. భారత ప్రభుత్వ ఆరోగ్య కుటుంబ నియంత్రణ శాఖామాత్యుల ప్రేరేపణతో కెమిస్ట్రీ స్పెషలైజేషన్ అండ్ ఎనాలిసిస్ ఆఫ్ ఫుడ్సు, డ్రగ్స్, వాటర్ విభాగాలు 1972లో ప్రారంభ మయ్యాయి. ఈవిధమైన స్పెషలైజేషనులు 1936లోనే స్థాపించబడి, తరువాత 1954లో బి.ఫార్మసి కోర్సులలో కలిపివేయబడింది, 1971లో కెమిస్ట్రీశాఖకు చెందిన పలు విభాగములన్నియు ఒక బృహత్ ప్రణాళిక ద్వారా కలిపి వేయబడ్డాయి. దానితో మధ్యావసరాలు కలిగి పరస్పర సన్నిహిత సంబంధానుకూలమౌనట్లు, న్యూక్లియర్ కెమిస్ట్రీ భవనాలు, ఫిజికల్ కెమిస్ట్రీభవనం, రసాయనికశాలలు ఏకైక బృహద్భవన విభాగాలుగా తయారయ్యాయి.

ఆదిలో కెమిస్ట్రీశాఖలో, బి.యస్.సి. ఆనర్స్ కోర్సుకు 12 మంది విద్యార్థులకు స్థానం కల్పించడానికి ప్రణాళిక వేయబడినప్పటికీ, కొత్త కోర్సులు రావడంతో విద్యార్థుల సంఖ్య 1960లో 36కు పెరిగింది. ఆ విధంగా విద్యార్థుల సంఖ్య పెరుగుతూ వస్తోంది. ఆ విధంగా యం.యస్.సి. స్పెషలైజేషన్ చివరి సంవత్సరంలో ఆరు ప్రధాన విషయ భాగాలకు, ఒక్కొక్కదానికి 12 మంది చొప్పున విద్యార్థులున్నారు. కెమిస్ట్రీ శాఖ ప్రారంభం నుండి పరిశోధన అభివృద్ధి కేంద్రంగా అభివృద్ధి చెందింది. ప్రొ. టి.ఆర్.శేషాద్రి తరువాత శ్రీ యల్.రామచంద్రరావు సహజోత్పత్తి వస్తువులకు సంబంధించిన ఆర్గానిక్ కెమిస్ట్రీ పరిశోధనను, ప్రొ॥ జి.గోపాలరావుగారి తరువాత ప్రొ॥ యన్. వెంకటేశ్వరరావుగార్లు ఫిజికల్ అండ్ ఎనలిటికల్ కెమిస్ట్రీలో సమగ్ర పరిశోధనను, కీ॥శే॥ ప్రొ॥ బి.హెచ్.యస్.వి. రాఘవరావుగారు కెమిస్ట్రీ ఆఫ్ రేర్‌ఎర్త్‌లోను, ప్రొ. యన్. శాస్త్రిగారు ఇనార్గానిక్ కాంప్లెక్స్‌యొక్క కొత్త పద్ధతులను అభివృద్ధి పరచుచూ, ప్రొ॥ యస్.ఆర్.సాగీగారు సాలిడ్ స్టేట్ కెమిస్ట్రీలోను ఈ శాఖలను సర్వతోముఖాభివృద్ధి ఒనరించారు. ఈరోజున వివిధ రంగాలలో 12 మంది డైరెక్టర్లతో 40 మంది పరిశోధనా పండితులతో సి.యస్.ఐ.ఆర్., యు.జి.సి., ఐ.సి.యం.ఆర్... ఇంకను తదితర సంస్థల మూలకమైన నిధులతోను, ఫెలోషిప్‌లతోను ఈ శాఖ విశాల పరిశోధనా పరిధి స్థాపించుకొన్నది. సుమారు 115 మంది పోస్టు గ్రాడ్యుయేట్లు తమ డాక్టరేట్ డిగ్రీలను పొంది. అందులో చాలామంది ఈనాడు దేశ విదేశాలయందు ప్రముఖ స్థానాలలంకరించి వున్నారు.

ఈ శాఖ పరిశోధనా విషయంలో అనుభవం గడించినదగుటచే నిరంతరం అండర్ గ్యాడ్యుయేట్ స్థాయిని పెంచుటకై వేసవి పాఠశాలలను, సెమినార్సును నిర్వహిస్తూ చాలా కృషి చేసింది. ఈ శాఖ చేయు అన్ని ప్రయత్నాలలోను విశ్వవిద్యాలయ అధికారుల యొక్కయు పూర్తి సహకార ప్రోత్సాహాలు లభిస్తున్నాయి.

## జీవ రసాయన శాస్త్ర విభాగం

ఆంధ్రా యూనివర్సిటీలో క్రొత్తగా ఏర్పాటైన విజ్ఞానశాఖల్లో జీవ రసాయన శాఖ ఒకటి. ఇది మొదటి నుండి యు.జి.సి. సహాయంతో ప్రారంభించబడి, నడుస్తున్నది, 'ఎర్నెస్ట్' భౌతికశాస్త్ర. కళాశాల నానుకొని వున్న కొత్త భవనంలో ఈ శాఖ వుంది. సుమారు 60 మందికి సరిపోవు ఉపన్యాసపు హాలు, ఒక పరిశోధనా రసాయనికశాలతో కలిపి 5 రసాయనిక శాలలు, ఒక పరికరశాల, స్టాఫ్‌రూమ్, ఆఫీసు రూము కలవు. ఈ శాఖ ప్రక్కనే ఒక జంతుశాలను నిర్మించారు. ఇప్పటివరకు రు.3 లక్షలపైగా విలువగల సాధన సామగ్రి చేకూర్చబడింది. ఇందు దృశ్యమానమైన స్పెక్ట్రో ఫోటోమీటరు. యం.యస్.ఇ. 18 రిఫ్రిజిరేటర్, సెంట్రిఫ్యూజ్, ఎమెన్విఫాక్షన్ కలెక్టర్, పెరిస్టాలిటిక్ పంపు బయోకెమ్ ఎబ్జార్బియో మీటరు, అనేక ఫోటో ఎలక్ట్రిక్ కెలోరిమీటర్సు మొదలైన అనేక ఆధునిక యంత్రపరికరములు కలవు. ఈ శాఖ గ్రంథాలయానికి యు.జి.సి. రు.50,000 ఇచ్చింది. బ్రిటిష్ కౌన్సిల్ సుమారు రు.10,000 విలువగల పుస్తకములు, జర్నల్సు బహుమానంగా ఇచ్చింది.

ప్రస్తుతం యీ విభాగం డా॥ డి.శివప్రసాద్‌గారి ఆధిపత్యంలో నిర్వహించబడుతోంది.

**బోధన:** జనరల్ బయోకెమిస్ట్రీ మెటాబాలిజమ్‌లో (ఎంజియోమాలజి, ఎండోక్రైనాలజి, ఇమ్యునాలజి, క్లినికల్ బయోకెమిస్ట్రీ, ఫుడ్ అండ్ న్యూట్రిషన్‌తో) కాక ఫిజియాలజి, అయోస్టాటిస్టిక్స్, రేడియేషన్ బయాలజీ, సైటోజనిటిక్స్, మైక్రోబయాలజి, ఫెర్మెంటేషన్ కోర్సులు కూడా బోధింపబడుతున్నవి. బోధన వస్తు వైశాల్యమునుబట్టి, జూఆలజీ, బోటనీ, స్టాటిస్టిక్స్, కెమిస్ట్రీ, ఫార్మసీ శాఖల క్రియాత్మక సహాయంతో, శాఖాంతర బోధనా విధానమొకటి విజయవంతంగా నిర్వహింపబడినది.

వారానికి ఒకసారి సెమినార్ విధానం 1972 జూలై నుండి ప్రారంభించబడింది. ఇందు విద్యార్థులు ప్రతి సోమవారం పాక్షికంగా వచ్చు సెమినార్సులోను, లిటరేచర్ సెమినార్‌లో పాల్గొనుచున్నారు.

ప్రవేశం: కెమిస్ట్రిగాని, బయోకెమిస్ట్రిగాని ఒక విషయంగా వున్న ఏ విజ్ఞాన శాఖ యందైనా పట్టభద్రులైనవారు బయోకెమిస్ట్రీలో యం.యస్.సి. కోర్సుకు అర్హులు. విద్యార్హత తోపాటు, ప్రవేశపరీక్షయందును, ఇంటర్వ్యూనందును నెగ్గిన విద్యార్థులను ఎన్నుకొందురు.

పరిశోధన: ఈ శాఖ కొత్తగా ప్రారంభించబడినదగుటచే పరిశోధనలు కొద్దిగా మెల్లిగా ప్రారంభమైనవి. సీరం ప్రోటీను పదార్థములపైనను ఎంజైమ్స్ ఆఫ్ ఎడిబుల్ అండ్ మెడిసినల్ ప్లాంట్స్ మీదను, ఫండమెంటల్ ఎనర్జీ రియాక్షన్స్ ఇన్ ఎస్సెన్షియల్ ఎమినో యాసిడ్ డిఫిషియన్సి మీదను, టిష్యూ రెస్పిరేషన్ అండ్ ఇన్ ఆర్గానిక్ పైరో ఫాస్ఫేట్ మీదను, ప్రాథమిక కృషి జరుపబడుతున్నది. ప్రస్తుతం ఈ శాఖలో ముగ్గురు యు.జి.సి. పరిశోధకులు, ఒక సి.యస్.ఐ.ఆర్. పరిశోధకుడు కృషి చేయుచున్నారు. వీరందరు పిహెచ్.డి కి రిజిష్టర్ చేసుకొన్నవారే.

భూగర్భశాస్త్రం: (జియాలజి విభాగం) ఈ శాఖ 1941లో బి.యస్.సి; బి.యస్‌సి ఆనర్స్ కోర్సులతో ప్రారంభమైంది. పరిశోధనలు, యం.యన్‌సి. – 1952లో ప్రవేశపెట్టబడినాయి. 1954–57 మధ్య మూడు సంవత్సరాలపాటు జాగ్రఫీలో సంవత్సర కాల పరిమితివున్న పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా కోర్సు వుండేది. జియాలజీ శాఖలో విజ్ఞానము వేగంగా పెరిగెనని గ్రహించటంతో పరిశోధనతో కలిపి బి.ఎస్.సి. స్థానే విద్యార్థులలోని అజ్ఞాత శక్తులను పురికొల్పుటకై యం.యస్.సి. కోర్సు ప్రవేశపెట్టబడింది.

ప్రారంభంలో విద్యార్థులను ప్రొఫెషనల్ జియాలజిస్టులుగా తయారుచేయబడటానికి ప్రాధాన్యం ఇవ్వబడింది. మినరాలజి, పెట్రాలజీ, ఎకనామిక్ జియాలజి మొదలైన శాస్త్రీయ శాఖలలో ప్రత్యేక శ్రద్ధ వహించబడింది. కాని కాలక్రమేణ అంతర్ విభాగ అంశాలు పరస్పర సంబంధం గల ఇతర శాఖ విషయాలు ప్రాధాన్యం వహించటంతో పరిశోధనలో కొత్త పద్ధతులను అవలంబించారు. ఈ ఉద్దేశ్య సాధన కోసం మెరైన్ జియాలజి, న్యూక్లియర్ జియాలజి, ఫోటో జియాలజి, మైనింగ్ జియాలజి, హైడ్రాలజి అండ్ సాయిల్స్ మొదలైన విషయాలు పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థుల ప్రణాళికలో చేర్చారు. ఈ విధంగా ఆంధ్రా యూనివర్సిటీలో జియాలజీ శాఖలో ప్రారంభింపబడిన విషయాలన్నియు దేశమందలి ఇతర విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకములయినాయి.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆనర్సు కోర్సు ప్రారంభించటంలో ముఖ్య ఉద్దేశ్యం – విద్యార్థులలో ఉత్తములైన వారిని గ్రహించి, వారిని ఆ విషయాలలో పరిశోధన చేయటానికి తగినట్లుగా వారిని ప్రోత్సహించటమే. ప్రారంభంలో ముఖ్యంగా పరిశోధనలో ఈ శాఖ చాలా ఇబ్బందులకు గురైంది. యు.జి.సి. నుండి చెప్పుకోదగిన గ్రాంట్లు రావడంతో పరిశోధనకు ప్రోత్సాహం లభించింది. ప్రారంభం నుండి ఈ శాఖనుండి 365 వ్యాసములు, దేశ, విదేశీ పత్రికలలో ప్రకటించారు. 44 గురు విద్యార్థులు డాక్టరేట్ పట్టభద్రులయ్యారు. ఈ శాఖయందు "స్ట్రాటిగ్రఫీ, ఏజ్ అండ్ కరెలేషన్" మీద 1964లోను, ప్రోసెసెస్ అండ్ ప్రోడక్ట్సు ఆఫ్ సెడిమెంటేషన్ మీద, 1966లోను యు.జి.సి. ఆధ్వర్యంలో రెండు సింపోజియంలు నిర్వహించబడినాయి. ఇందులో ఇతర విశ్వవిద్యాలయాల వారుకూడా పాల్గొన్నారు. వీరేకాక జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కమీషన్, ఎక్స్ప్లొరేటరీ ట్యూబువెల్స్ ఆర్గనైజేషన్, స్టేట్ జియలాజికల్ సర్వీస్, ఆయిల్ కంపెనీస్, నేషనల్ జియోఫిజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారును ఇందులో పాల్గొన్నారు. 1972లో యు.జి.సి. వారు ఈ శాఖను సందర్శించి, "స్పెషల్ అసిస్టెన్సు సెలక్టెడ్ డిపార్టుమెంట్స్" ప్రోగ్రామ్ క్రింద సహాయం చేశారు. దీని ఫలితంగా బోధనకు, పరిశోధనా శాఖలలో ఇతోధికంగా బలమేర్పడింది. ఈమధ్యనే యు.జి.సి. ఆధ్వర్యంలో యునెస్కో సహాయం ఇచ్చుటకు స్పెషల్ అసిస్టెన్సు ప్రోగ్రాం క్రింద భారత ప్రభుత్వం అంగీకరించింది.

చాలాకాలం యీ విభాగం ప్రొ॥ మహదేవన్‌గారి అధ్వర్యము క్రింద నిర్వహించబడింది. వారి తరువాత ఆలూరి శ్రీరామదాసుగారు శాఖాధిపతిగా పని చేశారు. ఇటీవలనే దానికి ప్రధాన పరిశోధనా కేంద్రంగా గుర్తింపు నిచ్చారు. ఇప్పుడీశాఖను డా. యం.సుబ్బారావుగారు నిర్వహిస్తున్నారు.

## వృక్ష శాస్త్ర విభాగం

ఈ శాఖ 1946లో మూడు సంవత్సరములు బి.యస్.సి. ఆనర్సు డిగ్రీతో ప్రారంభమైంది. తరువాత పరిశోధనతో యం.యస్.సి. వచ్చేది. ఈ శాఖకు అధ్యక్షులుగా ప్రొ.యం.ఓ.పి. అయ్యంగారు; ప్రొ.జి.యన్. రంగస్వామి అయ్యంగారు మొదలైన మహామహులు ఉన్నారు. ఈమధ్య వరకు ప్రొ.జి. వెంకటేశ్వర్లుగారు ఈ శాఖ అధ్యక్షులుగా పనిచేశారు.

1951 నుండి ఎంబ్రియాలజీలోను, సైటోజనిటెక్స్‌లోను పరిశోధనా సదుపాయాలు క్రమంగా అభివృద్ధి పొందినాయి. 1959లో ఇంతకు పూర్వం డిగ్రీల స్థానే యం.యస్.సి. ప్రవేశ పెట్టబడింది. ప్లాంటు మార్ఫాలజి పరిశోధనలో ఈ

శాఖ అభివృద్ధి సాధించింది. 1957లో ఆంధ్ర ప్రభుత్వంచే 10 ఎకరముల భూమి పరిశోధనకు సమకూర్చబడటంతో సైటో జనిటెక్సు బోధనా, పరిశోధనల్లో అభివృద్ధి చెందింది. సైటో జనిటెక్స్‌లో రెండు దశాబ్దాలుగా ముఖ్యమైన పంట మొక్కలపై చేయబడిన కృషి గుర్తింపబడింది. యు.జి.సి. వారు 1972లో పంట మొక్కల సైటోజనిటెక్ విషయాల సమగ్ర విద్యార్జనకై ప్రత్యేక సహాయం చేశారు.

సైటోజనిటెక్స్ ప్రోయంబ్రియాలజి పరిశోధనతో పాటు, ఏరోబయాలజీ, ఆల్గాలజీ కృషికి సదుపాయాలు చేయబడ్డాయి. 1957 నుండి ఈ విషయంలో బాగా కృషి జరుగుతోంది.

ప్రొ॥ జె.వి. పంతులుగారు 1972లోను, టి. శ్రీరాములు గారు 1973లోను, మళ్ళీ 1974లో ప్రొ॥ జె.వి. పంతులుగారూ శాఖాధ్యక్షులుగా ఉన్నారు.

బోధనలోను, ఎవాల్యుయేషన్‌లోను చాలా మార్పులు వచ్చాయి. 1972లో సెమిస్టర్ పద్ధతి ప్రారంభించబడింది. జూఆలజీ శాఖ సహాయంతో బయోసైన్సులో యం.యస్.సి. కోర్సు ప్రారంభించబడింది. ప్రస్తుతం బోటనీ యం.యస్.సి.లో 44 మంది, బయోసైన్సు యం.యస్.సి.లో 15 మంది విద్యార్థులు కలరు. 1973 నుండి పాఠశాలలోని, కళాశాలలలోని ఉపాధ్యాయులకు ప్రైవేటుగా బయోసైన్సు యం.ఎస్.సి. చదువుకొనుటకు సదుపాయము కలదు. యు.జి.సి., సి.యస్.ఐ.ఆర్. ఆధ్వర్యంలో 40 మంది పరిశోధక విద్యార్థులు పనిచేయుచున్నారు. ఇందు మెరైన్ బోటనీ, ఏరో బయాలజి, బయో సిస్టమాటిక్సు, డెవలప్‌మెంటల్ మార్ఫాలజీ ఆఫ్ పంజియోస్ ఫెరమ్స్, రిప్రొడక్టివ్ బయాలజీ క్రాప్‌ప్లాంట్సు, జనిటిక్స్ ఆఫ్ క్రాప్ ఇంప్రూవ్‌మెంట్, రేడియేషన్ జనీటిక్స్, సైటో జనిటిక్స్, సైటో జనిటిక్స్ ఆఫ్ మేడి, సెల్ ఫిజియోలజీ మరియు సైటో కెమిస్ట్రీలు బోధిస్తారు.

ఐ.సి.ఎ.ఆర్; సి.యస్ ఐ.ఆర్; డి.ఎ.ఇ; యు.జి.సి; ఐ.సి.టి.ఇ; ఐ.సి, యం.ఆర్; ఏ.పి.ఏ.యస్.పి.యల్. 480 మొదలైన 13 సంస్థల ఆధ్వర్యంలో పరిశోధనా విషయాలు నిర్వహించబడుచున్నాయి. యు.జి.సి; సి.యస్.ఐ.ఆర్ అధ్వర్యంలో రెండు పరిశోధక విషయాలు నిర్వహింపబడుచున్నాయి. 25 మంది డి.యస్.సి.; పిహెచ్.డి. డిగ్రీలను పొందారు. జాతీయ, అంతర్‌జాతీయ పత్రికలయందు 250కి పైగా వ్యాసములు ప్రచురింపబడినాయి. ఈ విభాగానికి ప్రొ.జె. వెంకటేశ్వర్లుగారు అధిపతిగా వుండి పదవీ విరమణ చేశారు.

## న్యూక్లియర్ భౌతిక శాస్త్రం:

1954 అక్టోబరులో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ జ్ఞానానందగారు భౌతికశాస్త్ర విభాగంలో ప్రొఫెసర్‌గా ఉన్న రోజుల్లో భౌతికశాస్త్రంలో భాగంగా న్యూక్లియర్ భౌతికశాస్త్ర ప్రయోగశాలను ప్రారంభించారు. ఆచార్య యస్.యన్. బోసుగారి అధ్యక్షతన యూనివర్శిటీ గ్రాంట్స్ కమిటీ తరపున నిపుణుల బృందం 1955లో ఆంధ్రయూనివర్శిటీని సందర్శించినపుడు అణు భౌతికశాస్త్రాన్ని ప్రత్యేక శ్రద్ధతో అభివృద్ధి చేయాలని సిఫారసు చేస్తూ, తదనుగుణంగా భవన నిర్మాణానికి రు.1.8 లక్షలు మంజూరు చేశారు. 1956లో భౌతికశాస్త్రాన్నుండి న్యూక్లియర్ భౌతిక శాస్త్రాన్ని వేరుచేసి ప్రత్యేక విభాగంగా రూపొందించారు.

1956 అక్టోబరులో నాటి యు.జి.సి. అధ్యక్షులు డా॥ సి.డి. దేశముఖ్‌గారు ప్రయోగశాలలకు శంకుస్థాపన చేశారు. 1964 డిశంబరులో నాటి అణుశక్తి సంస్థ అధ్యక్షులు H.J. భాభా గారిచే ఈ శాస్త్రవిభాగ ప్రయోగశాలలు ప్రారంభించబడ్డాయి. స్వామిజ్ఞానానంద తర్వాత వారి సహచరుల ఆధ్వర్యం క్రింద పరిశోధనా కృషి చురుకుగా జరుగుతోంది.

1956లో బి.యస్.సి. ఆనర్సు విద్యార్థులకు ఒక సంవత్సరం యం.యస్సి. కోర్సుగా 12 మంది విద్యార్థులతో ప్రారంభమైంది. తరువాత 1956లో బి.యస్సీ విద్యార్థులకు యీ కోర్సు రెండేళ్ళకు పొడిగించబడింది. విద్యార్థుల సంఖ్యాస్థాయిని 1958లో 24కు, 1970లో 32కు పెంచడం జరిగింది. ప్రస్తుతం యీ విభాగం కేంద్రక భౌతిక శాస్త్రంలో యం.యస్సీ డిగ్రీకుపకరించే కోర్సులను నిర్వహిస్తున్నది.

ప్రస్తుత భౌతిక, న్యూక్లియర్ భౌతికశాస్త్ర విభాగాల యం.యస్సీ. కోర్సుల సిలబసు మొదటి సంవత్సరములో ఒక్కటిగా ఉన్నాయి. యం.యస్సీ. న్యూక్లియర్ భౌతికశాస్త్ర విద్యార్థులు ఆఖరి సంవత్సరములో అనుప్రయుక్త రేడియో యాక్టివిటీ, న్యూట్రాన్ ఫిజిక్సు, న్యూక్లియర్ స్పెక్ట్రోస్కోప్, అప్లయిడ్ సాలిడ్‌స్టేట్ ఫిజిక్సు, థియరిటికల్ న్యూక్లియర్ ఫిజిక్స్, ఎలిమెంటరీ పార్టికల్స్ లేక జనరల్ థియరీ ఆఫ్ రిలెటివిటీలలో ఏదేని ఒక్క దానిని స్పెషల్ సబ్జక్టుగా యెంచుకోవాలి.

### విద్యార్థుల కార్యకలాపాలు:

ఈ విభాగంలో న్యూక్లియర్ ఫిజిక్స్ అసోసియేషన్ ఉంది. ఇందులో అధ్యాపకులు, రీసెర్చిస్కాలర్లు, విద్యార్థులు సభ్యులుగా ఉంటారు. కనీసం నెలకొక పర్యాయమైనా వివిధ విషయాలపై సెమినార్లు నిర్వహిస్తుంటుంది. మొత్తంమీద యీ అసోసియేషన్ చురుకుగానే పనిచేస్తున్నది. విద్యార్థుల్లో కొందరు ఉపకార వేతనాలు పొందేవారు కూడ ఉన్నారు.

### పరిశోధన:

ఈ శాస్త్ర విభాగం ప్రారంభించిన మొదటి నుండి పరిశోధనా కార్యక్రమం చురుకుగా కొనసాగుతున్నది. 1959-69

దశాబ్దంలో అణుశక్తి సంస్థ యీ విభాగము పరిశోధనా పథకాలకు సహకరించి, పరిశోధకులకు, పరిశోధనా యంత్రాల కొరకు రు.6 లక్షల ధనాన్ని కూడ కేటాయించింది.

ఈ విభాగపు పరిశోధనలకు ధన రూపంలో కూడ సాయపడటానికి ముందుకొచ్చే అణుశక్తి సంస్థ 1971–75 మధ్య కేంద్రక భౌతిక శాస్త్రబోధనా, పరిశోధనాభివృద్ధి కొరకు రు.5 లక్షలను మంజూరు చేసింది. ఈ మొత్తంలో కొంతభాగం భవనాల విస్తరణకు, స్పెషల్ సబ్జక్టులలో ఇద్దరు అధ్యాపకులకు శిక్షణ నిమిత్తం కొంత సామాగ్రి కొనుగోలుకు ఖర్చుపెట్టబడింది.

**వాతావరణ శాస్త్రము, సముద్ర శాస్త్రము:**

వాతావరణాన్ని, సముద్రాన్ని గూర్చి అధ్యయనం చెయ్యడానికి గూడ ఒక విభాగము కలదు. సముద్రము సమీపములో ఉండుటచేత సముద్ర శాస్త్రాధ్యయనము ఇచ్చట సులభ సాధ్యమైనది. సముద్రశాస్త్ర అధ్యయనము ఈ దేశములో ఇక్కడొక చోటనే జరుగుతోంది.

**జంతుశాస్త్ర విభాగం:**

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో జంతుశాస్త్రవిభాగం 1946లో ప్రారంభించబడింది. ప్రారంభంలో సి.జె. జార్జిగారు కొంతకాలంపాటు యీ విభాగాధిపతిగా పనిచేశారు. అదే సంవత్సరం ఆచార్య ఆర్. గోపాలఅయ్యర్ యీ విభాగాధిపతిగా వచ్చారు. 1947 జూలై నుండి సముద్రజీవ శాస్త్రం ప్రత్యేక సబ్జక్టుగా బి.యస్సీ, (ఆనర్సు) క్లాసులు ప్రారంభించబడ్డాయి. 1951లో ఆచార్య గోపాల అయ్యర్ పదవీ విరమణ చేసిన తరువాత, అప్పటి వరకు రీడర్‌గా ఉన్న డా॥ పి.యస్. గణపతి యీ విభాగాధిపతిగా బాధ్యతలు స్వీకరించి 1970లో రిటైరయ్యే వరకూ ఆ పదవిలో వున్నారు.

ఈ శాస్త్రవిభాగంలో గత 30 సంవత్సరాలుగా సముద్ర జీవశాస్త్రం, పార సైటాలజీలపై పరిశోధనా కృషి సాగుతోంది.

ఈ విభాగంలో ఒక ప్రొఫెసరు, నలుగురు రీడర్లు, మరో నలుగురు అధ్యాపకులు పనిచేస్తున్నారు.

ఈ విభాగం క్రిందగల రేండేండ్ల యం.యస్సి. కోర్సులో మొదటి రెండు సెమిస్టర్లలో డెవలప్‌మెంటల్ ఎంబ్రియోలజీ, జీవకణశాస్త్రం, అనువంశిక శాస్త్రం, యానిమల్ ఈకాలజీ (వాతావరణ సంబంధిత జంతుశాస్త్రం) పురాతన శిలాజంతు శాస్త్రం, జంతు భూగోళ శాస్త్రాలలో శిక్షణ యివ్వబడుతుంది. మూడు, నాలుగు సెమిస్టర్లలో సముద్ర జీవశాస్త్రం, పరాన్నభుక్కు శాస్త్రం ప్రత్యేక సబ్జక్టులుగా తీసుకొనేందుకు అవకాశముంది.

ఈ విభాగంలో సముద్రజీవశాస్త్రం, ప్రోటోజూవాలజీలలో పరిశోధనలు చేసేందుకు అవకాశాలున్నాయి.

1946లో యీ విభాగం ప్రారంభించబడినప్పటినుండి 1959లో పరిశోధన ద్వారానే యం.యస్సి. డిగ్రీ పొందే విధానాన్ని రద్దుచేసేంతవరకు 47 మంది యం.యస్సి. డిగ్రీలు పొందారు. ఈ విభాగంలో ఇంతవరకూ 30 మంది డాక్టరేట్లు పొందారు. ప్రస్తుతం 40 మంది రీసర్చి స్కాలర్స్ వున్నారు.

**ఫార్మాస్యూటికల్ శాస్త్ర విభాగం:**

ఫార్మాస్యూటికల్ శాస్త్రాన్ని అభివృద్ధి చేయడంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నాల్గు దశాబ్దాలనుండి కృషి చేస్తున్నది. 1951లో ఫార్మసీ విభాగం ఏర్పాటు చేయబడి మూడేండ్ల బి.ఫార్మ్, ఒక ఏడాది యం.ఫార్మ్ కోర్సులను ప్రారంభించక ముందు రసాయన, రసాయనక సాంకేతిక శాస్త్ర విభాగంలో స్పెషల్ సబ్జెక్టుగా బోధించబడుతోంది. బి.ఫార్మ్; యం.ఫార్మ్ కోర్సుల బోధనాంశాలు, కాలపరిమితి రీత్యా దేశవ్యాపితంగా ఒకే రీతిలో వుండాలని నిర్ణయించబడి, AICTE రూపొందించిన విధంగా నాలుగేండ్ల ఇంటిగ్రేటెడ్ బి.ఫార్మ్ కోర్సు, రెండేండ్ల యం. ఫార్మ్ కోర్సులు వరుసగా 1968–69 సంవత్సరాలలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రవేశపెట్టబడ్డాయి. యం. ఫార్మ్‌లో స్పెషలైజ్డు సబ్జెక్టులను సూచించేందుకు 1969లో ఒక నిపుణుల సంఘం ఏర్పాటు చేయబడింది. ఆ సంఘం సిఫారసుల మేరకు ఫార్మాస్యూటికల్స్ అండ్ ఫుడ్ అనాలిసిస్, ఫార్మాస్యూటికల్ కెమిస్ట్రీ, ఫార్మాస్యూటికల్ అండ్ ఫెర్మంటేషన్ టెక్నాలజీలు స్పెషల్ సబ్జెక్టులుగా రెండేండ్ల యం.ఫార్మ్ కోర్సు ప్రారంభించబడ్డాయి. ఫార్మకాలజీ, సింథటిక్ డ్రగ్స్‌లలో కూడా స్పెషలైజేషన్‌లను ప్రవేశపెట్టే ప్రతిపాదనలున్నాయి. ప్రస్తుతం ఈవిభాగంలో నల్గురు ప్రొఫెసర్లు, నల్గురు రీడర్లు, 12 మంది అధ్యాపకులు పనిచేస్తున్నారు. 12 మంది పరిశోధకులు డాక్టరేట్ల కొరకు కృషి చేస్తున్నారు.

టి.ఆర్.శేషాద్రి, స్వర్గీయ ఆచార్య యం.యల్. ఖొరాన్, ఆచార్య యస్. రంగస్వామి, ఆచార్య జె. వేంకటేశ్వర్లు వంటి ప్రముఖ శాస్త్రవేత్తలు ప్రాథమిక దశలో అధ్యాపకులుగా పనిచేశారు.

యం.ఫార్మ్ విద్యార్థులు తమ ద్వితీయ సంవత్సర అధ్యయనంలో పరిశోధనలుకూడా చేయాల్సి ఉన్నందున, ఆమేరకు వివిధ ఫార్మాస్యూటికల్స్ శాస్త్రాలలో పరిశోధనా వసతులు అభివృద్ధి చేయబడ్డాయి. అధ్యాపకులు, విద్యార్థులు గత పాతికేండ్లుగా పరిశోధనా కార్యక్రమంలో అత్యంత శ్రద్ధ చూపిస్తున్నారు. వైద్యసంబంధ, విష సంబంధ మొక్కలు పరీక్షించబడ్డాయి. గుండె జబ్బులకు ఉపయోగించే మందులపై విస్తృత పరిశోధనలు జరిగాయి. Peruvoside కార్డియాటిక్

డ్రగ్స్‌లోకెల్లా అత్యుత్తమమైందని నిరూపించబడింది. ఇది ప్రస్తుతం ఒకక ఇటాలియన్ సంస్థచే మార్కెటింగు చేయబడుతున్నది. మొక్కల రసాయన శాస్త్రంతోపాటు ఇతర అనేక ఫార్మస్యూటికల్ శాస్త్ర రంగాలలో కూడ పరిశోధనలు సాగాయి. ఇంతవరకూ యీ విభాగంలో 10 మంది డాక్టరేట్లు పొందారు. మరో 72 మంది యం.ఫార్మా కోర్సుకు అనుబంధంగా పరిశోధనా శ్రమ చేశారు. 200కు పైగా శాస్త్ర పరిశోధనా పత్రాలు వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి.

గత 24 సంవత్సరాలలో 416 మంది బి.ఫార్మ్, 220 యం.ఫార్మలలో డిగ్రీలను పొందారు. ఫార్మసీ గ్రాడ్యుయేట్ల ఉద్యోగ పరిస్థితులపై అధ్యయనం చేయడం కొరకు 1969–72 మధ్యకాలంలో ప్రాయోజిత మానవశక్తి పరిశోధనా సంస్థ (Institute of Applied Man Power Research) యీ విభాగాన్ని ఎంపిక చేసింది. ఈ విభాగంలో శిక్షణ పొందిన అనేకమంది గ్రాడ్యుయేట్లు, పోస్టుగ్రాడ్యుయేట్లు వివిధ సంస్థలలో పనిచేస్తున్నారు.

**మాతృ విభాగాల విభజన:**

గత దశాబ్ద కాలములో పోస్టుగ్రాడ్యుయేటు (పి.జి.) కోర్సులలో విద్యార్థుల సంఖ్య అధికముగా పెరిగినది. అందుచేత ప్రయోగశాలలను పెంచవలసి వచ్చింది. అదేవిధంగా బోధనా సిబ్బంది కూడా పెరిగింది.

వివిధ రకాలైన నూతన పరిశోధనాంశాలు శాఖలు పెంపొందినవి. పెరిగే విజ్ఞానాన్ని పరిశోధించడానికి కొత్త ప్రయోగశాలలు బోధనా సిబ్బంది కావలసి వచ్చింది.

అందుచేత ప్రారంభములో ఒకటిగా వున్న విభాగాలు కొన్ని విభజన పొందినవి. ఈ విధంగా ఏర్పడిన విభాగాలెన్నో ఉన్నవి.

భూభౌతిక విభాగము, వాతావరణ శాస్త్రము, సముద్ర శాస్త్రాలతో సంబంధమున్న జాగ్రఫీ ఒక స్వతంత్ర విభాగముగా ఏర్పాటైనది. ఈ విభాగమునకు ప్రస్తుతము డా॥ శ్రీమతి ఎస్. శచీదేవి అధిపతిగా ఉన్నారు.

అదే విధంగా రసాయనశాస్త్రం విభాగము మూడు విభాగాలుగా చీలింది. ఆర్గానిక్ (Organic) రసాయన విభాగము అందులో ఒకటి. ఇనార్గానిక్ మరియు ఎనలిటికల్ (inorganic of analytical) రసాయన విభాగమొకటి. అదే విధంగా Physical & Nuclaer Chemistry and Chemical Oceanography అనే విభాగం కూడా ఉంది.

మానవ జన్యు శాస్త్రము – భౌతిక మనుష్య శాస్త్రము (Human genetics & Physical Anthropology) విభాగము కూడ కలదు. ఈ విభాగము బహుకొద్ది విశ్వవిద్యాలయాలలో మాత్రమే కలదు. సముద్ర జీవనిధులు (Marine Living Resources) అనే విభాగం కూడ కలదు. ఈ విభాగాలన్నీ ఆధునిక విజ్ఞానశాస్త్రం అభివృద్ధిని సూచిస్తాయి. అలాంటి ఆధునిక రంగాలలో అధ్యయనము పరిశోధనలు జరగటం ఈ విశ్వవిద్యాలయం విజ్ఞానశాస్త్ర పరిశోధనలో అగ్రస్థానాన్ని కలిగియున్నదనే దానిని సూచిస్తోంది.

## ఉస్మానియా విశ్వవిద్యాలయం

నాటి నిజాం పాలనలో ఏర్పడిన ఉస్మానియా విశ్వ విద్యాలయం దేశీయ భాషలలో విజ్ఞానశాస్త్ర బోధనకు అంకురార్పణ చేసింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో గ్రాడ్యుయేట్ కోర్సులో ఒక పాఠ్యాంశంగా రసాయన శాస్త్రం 1918 నుండి బోధింపబడుతోంది. 1928 సఅవత్సరం నుండి రసాయన శాస్త్రంలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సును ప్రారంభించారు. ప్రారంభంలో ఆర్గానిక్, ఇనార్గానిక్, ఫిజికల్ కెమిస్ట్రీ అంశాలను మాత్రమే బోధించడం జరిగింది.

1952 నాటికి కూడా కేవలం 12 మంది విద్యార్థులు మాత్రమే ఈ పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులో ప్రవేశం పొందేవారు. కాలక్రమేణా ఈ సంఖ్య పెరుగుతూ నేటికి 45కి చేరుకుంది. విశ్వవిద్యాలయ ప్రాంగణంలోనేకాక నిజాం కాలేజి, బికనూర్ కాలేజీలలో కూడా రసాయన శాస్త్రంలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులను నిర్వహిస్తున్నారు.

1951లో ఈ విభాగాధిపతిగా ప్రొఫెసర్ ఎన్. వి. సుబ్బారావు గారు నియమింపబడిన తరువాత శాస్త్ర బోధనలోనూ, పరిశోధనలోనూ గణనీయమయిన ప్రగతిని సాధించింది. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో రసాయనిక శాస్త్రానికి సంబంధించి అనేక గోష్టులను, సదస్సులను, వేసవి పాఠశాలలను నిర్వహించి విశ్వవిద్యాలయ పరిధిలో రసాయన శాస్త్ర బోధనలో గుణాత్మకమైన మార్పును తేవడం జరిగింది. ప్రస్తుతం ఈ విభాగం రసాయన శాస్త్రం 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సును, పి హెచ్.డి. పట్టాకు అనువుగా పరిశోధనలను నిర్వహిస్తోంది. 1978 సం॥లో ఎం.ఫిల్ డిగ్రీని ప్రారంభించి తరువాత అనివార్య కారణాలవల్ల నిలిపివేయడం జరిగింది.

1974 సంవత్సరంలో ఎం.ఎస్.సి. కోర్సులో ఫిజికల్ ఆర్గానిక్, ఫిజికల్ ఇనార్గానిక్, ఇనార్గానిక్ ఎనలిటికల్ కెమిస్ట్రీలను ప్రవేశపెట్టి మరింత లోతైన రసాయన శాస్త్ర బోధనకు అవకాశం కల్పించింది. రసాయన శాస్త్రంలోని కొన్ని ప్రత్యేకాంశాలను క్షుణ్ణంగా అధ్యయనం చేయడానికి అందుకు అవసరమైన బోధనా పద్ధతులను మెరుగుపరచు కోవడానికి వీలుగా ఐ.డి.పి.యల్., యన్.యఫ్.సి., వంటి సంస్థల సహకారాన్ని కూడా ఈ విభాగం పొందుతోంది.

ఇంతవరకు ఈ విభాగంలో పరిశోధనలు జరిపి 150

మంది పిహెచ్.డి. పట్టాలను పొందారు. ప్రస్తుతం రసాయన శాస్త్రంలోని వివిధ అంశాలపై పరిశోధన చేస్తూ 75 మంది రీసెర్చి స్కాలర్స్ ఈ విభాగంలో ఉన్నారు.

రసాయన శాస్త్రంలోని కెనిటిక్స్, పాలిమర్స్, ఫోటో కెమిస్ట్రీ, కెటాల్సిస్, ఎలక్ట్రో కెమిస్ట్రీ, స్పెక్ట్రోస్కోపీ, రియాక్షన్ ఇన్ ఇనార్గనిక్ కెమిస్ట్రీ, సొల్యూషన్ కెమిస్ట్రీ ఇన్ కాంప్లెక్సు కాంపౌండ్స్, సింథసిస్ ఆఫ్ హెటరో సైక్లిక్స్, నాచురల్ ప్రొడక్ట్స్ అండ్ ఆర్గానిక్ ఫోటో కెమిస్ట్రీ మొదలైన అంశాలపై విస్తృతమైన పరిశోధనకు తగినన్ని సదుపాయాలు ఈ విభాగం కలిగియుంది.

ప్రస్తుతం యు.జి.సి. సహకారంలో 4, ఐ.సి.ఎమ్.ఆర్., ఐ.సి.ఎ.ఆర్., ఐ.ఎస్.ఆర్.ఓ., సి.ఎస్.ఐ.ఆర్. సహకారంతో ఒక్కొక్కటి చొప్పున పరిశోధక ప్రాజెక్టులను నిర్వహిస్తోంది.

## జంతు శాస్త్ర విభాగం:

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని శాస్త్ర విభాగాలలో కెల్ల పురాతన విభాగాలలో జంతుశాస్త్ర విభాగం కూడా ఒకటి. ఈ విభాగం ఎం.ఎస్.సి., ఎం.ఫిల్., పి హెచ్.డి. కోర్సులను నిర్వహిస్తోంది. ఇక్కడ నిర్వహిస్తున్న 2 సం॥ల ఎం.యస్.సి. కోర్సులో ఎనిమల్ ఫిజియాలజి కార్డేటా, నాన్ కార్డేటా, డెవలప్‌మెంటు బయాలజీ, యానిమల్ ఎకాలజీ, పాలియంటాలజీ, అనే సాధారణ అంశాలతోపాటు హెలెమంతాలజీ, ఫిషరీస్, జనరల్ అండ్ మాలుక్యులర్ జెనిటిక్స్ అనే ప్రత్యేక అంశాలను బోధిస్తున్నారు. ఈ కోర్సులోకి ప్రతి సంవత్సరం 40 మంది విద్యార్థినీ విద్యార్థులు చేరే అవకాశం కలదు.

ఈ కోర్సుతో పాటుగా ఒక సంవత్సరపు కాలపరిధి వున్న ఎం.ఫిల్. కోర్సును కూడా చేర్చారు. ఇంతవరకు 8 మంది ఎం.ఫిల్.పట్టాలను ఈ విభాగం నుండి పొందారు.

జంతు శాస్త్రంలోని అన్ని ముఖ్యాంశాలకు సంబంధించి పరిశోధనలను నిర్వహించే సదుపాయాలు ఈ విభాగంలో వున్నాయి. ఇంతవరకు ఈ విభాగం నుండి 126 మంది పిహెచ్.డి. పట్టాలను పొందారు.

ప్రస్తుతం ఈ విభాగంలో ముగ్గురు మాలుక్యులర్ జెనెటికమస్ ఇమ్యూనాలజీ, ఎన్విరాన్ మెంటల్ బయాలజీ మొదలైన ముఖ్యమైన అంశాలపై పరిశోధన చేస్తున్నారు. వీటికి తోడుగా భారత వైద్య పరిశోధనా సమితి, పరిసరాల శాఖ, భారత వ్యవసాయ పరిశోధనా సమితి వారి సహాయ సహకారాలతో అనేక పరస్పర సంబంధిత విషయాలపై పరిశోధనా ప్రాజెక్టులను చేపట్టి నిర్వహించింది, నిర్వహిస్తోంది.

## వృక్ష శాస్త్ర విభాగం:

ఈ విభాగం డా॥ ఎం.బి.మీర్జా ఆధ్వర్యంలో 1924వ సంవత్సరంలో ప్రారంభింపబడింది. వృక్షశాస్త్రంలో 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సుకు, పిహెచ్.డి. పట్టాకు వృక్షశాస్త్రంలోని కొన్ని అంశాలపై పరిశోధనకు తగిన అవకాశాలు వున్నాయి. ఇక్కడ బోధిస్తున్న ఎం.ఎస్.సి. కోర్సులో 1. ఆల్గే, ఫంగై. 2. బయోఫైటా, టెరిడోఫైటా, జిమ్నో స్పెర్మ్స్. 3. ఆంజీయోస్పెర్మ్స్ టాక్సానమీ, ఎనాటమీ, ఎంబ్రియాలజీ, పాలినాలజీ. 4. ప్లాంట్ అండ్ సెల్ బయాలజీ. 5. ఎకాలజీ, ఎన్విరాన్‌మెంటల్ బయాలజీ ఫైటో జియోగ్రఫీ. 6. సైటాలజీ, జెనటిక్స్, ఎవల్యూషన్ అండ్ బయోమెట్రీ, అనే సాధారణ అంశాలతో పాటు మైకాలజీ అండ్ ప్లాంటు పాథాలజీ, అప్లైడ్ ప్లాంట్ ఫిజియాలజీ, సైటాలజీ, సైటో జెనెటిక్స్ అనే ప్రత్యేకాంశాలను కూడా బోధిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఈ ఎం.ఎస్.సి. కోర్సులో 36 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు.

1. ఆల్గేలాజీ, లిమ్నాలజీ. 2. మైకాలజీ అండ్ ప్లాంట్ పాథాలజీ 3. ప్లాంట్ ఫిజియాలజీ. 4. సైటో జెనెటిక్స్, సైటాలజీ అండ్ మ్యూటేషన్ బ్రీడింగు. 5. ప్లాంట్ టాక్సానమీ, ఎనాటమీ అండ్ ఎంబ్రియాలజీ అంశాలపై పరిశోధన గావించి తద్వారా పిహెచ్.డి. పట్టాను పొందటానికి తగినన్ని సదుపాయాలు ఈ విభాగంలో వున్నాయి. ఇంతవరకు ఈ విభాగంలో పరిశోధన గావించి 116 మంది పిహెచ్.డి. పట్టాలను పొందారు.

ఈ విభాగానికి అనుబంధంగా వివిధ రకాల వృక్షాలతో కూడిన బొటానికల్ గార్డెన్, ఒక మ్యూజియం, 5,000 రకాలతో హెర్బేరియం వుండటం ఈ విభాగపు ప్రత్యేకత. ప్రపంచ హెర్బేరియం జాబితాలో ఈ విభాగపు హెర్బేరియం చేర్చబడింది.

## మైక్రో బయాలజీ విభాగం:

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని శాస్త్ర విభాగాలలో ఒకటి ఈ మైక్రో బయాలజీ విభాగం. ఇది 1974 సంవత్సరములో ప్రారంభమైనది. భారతదేశంలో మైక్రో బయాలజీ ఎం.ఎస్.సి., పిహెచ్.డి. కోర్సులకు ప్రతీకంగా ఒక విభాగాన్ని ఏర్పరచటం ఉస్మానియా యూనివర్శిటీతోనే ప్రారంభమైంది. ఇక్కడ 2 సంవత్సరముల యం.యస్.సి. కోర్సును అదేవిధంగా పిహెచ్.డి. పరిశోధనలు నిర్వహించ టానికి తగిన ఏర్పాట్లు చేయడం జరిగింది. బి.ఎస్సీ.లో బోటనీ, జువాలజీ, మైక్రో బయాలజీ చదివినవారు ఈ ఎం.ఎస్.సి. కోర్సుకు అర్హులు.

ఈ విభాగం నిర్వహించిన పరిశోధనల వల్ల హాంగ్ కాంగ్ 68 అనే రకపు వైరస్ (ఇన్‌ఫ్లూయంజా ఎ

లోని భాగం) వల్ల జరిగే దుష్ఫలితాలు తెలుసుకోవడం జరిగింది. అదేవిధంగా వాటిని నిరోధించడంలో విటమిన్-సి ప్రముఖ పాత్ర వహిస్తుందని కూడా బుజువు చేయడం జరిగింది. వివిధ వ్యాధుల నిరోధానికి ఉపయోగించే ఔషధాల ప్రభావం మానవ కణాలపై ఏ విధమైన ప్రభావం కలిగియుంటాయో కూడ తెలుసుకొన్నారు. పలురకాల బాక్టీరియాలలో ఔషధాల నిరోధక శక్తి ఎంతవరకు ఉందో పరిశోధించడం జరిగింది. ఫంగస్ విషపదార్థాలు (మైకోటాక్సిన్స్) ఆహారధాన్యాలపై ఎటువంటి చెడు ప్రభావం కలిగి యుంటాయో వాటి మూలంగా మానవ, ఆరోగ్యానికి ఎటువంటి హాని జరుగుతుందో పరిశోధించడం జరిగింది. ఇంతేకాకుండా అధికంగాను, తక్కువ స్థాయిలోనూ కలుషితమైన చెరువులలో ఆల్గే, బాక్టీరియాల పరిమాణం ఎంత ఉంటుందీ అనే విషయంపై విస్తృత పరిశోధనలను ఈ విభాగం నిర్వహించింది. ఇంతవరకు 11 మంది ఈ విభాగం నుండి పిహెచ్.డి. పట్టాను పొందారు. 66 పరిశోధక పత్రాలను ఈ విభాగం అందించింది. వివిధ సంస్థల సహాయంతో మైక్రో బయాలజీలోని వివిధ అంశాలపై 10 ప్రాజెక్టులను ఈ విభాగం నిర్వహిస్తోంది. ప్రతి సంవత్సరం ఇక్కడ బోధిస్తున్న ఎం.ఎస్సి. కోర్సులో 10 మంది విద్యార్థులు చేరడం జరుగుతోంది.

**జన్యు శాస్త్ర విభాగం:**

జన్యు (జెనెటిక్స్) శాస్త్రానికి సంబంధించి ఒక ప్రత్యేక విభాగాన్ని భారత దేశంలో మొట్టమొదటి సారిగా స్థాపించిన ఘనత ఉస్మానియా యూనివర్శిటీకే దక్కింది. 1961లో రేడియేషన్ జెనెటిక్స్ ప్రాజెక్టుగా ప్రారంభమై భారత అణుశక్తి శాఖ వారి సహాయంతో రేడియో బయలాజికల్ యూనిట్‌గా మార్పు చెంది 1966 నుండి ఒక సంపూర్ణ జెనెటిక్స్ శాఖగా ఆవిర్భవించింది.

ఈ విభాగంలో సాధారణ జెనెటిక్స్, రేడియేషన్ జెనెటిక్స్, ప్లాంట్ జెనెటిక్స్, మ్యూటేషన్ బ్రీడింగ్, ప్లాంట్ బ్రీడింగ్, ప్లాంట్ సైటు జెనెటిక్స్, ఎన్విరాన్ మెంటల్ మ్యూటా జెనిసిస్, రిప్రొడక్టివిటీ ఫిజియాలజీ, సైటాలజీ, సెల్ బయాలజీ, సైటో జెనెటిక్స్, హ్యూమన్ జెనెటిక్స్, బయోమెట్రీ, మైక్రో బయాల్ అండ్ మాలు క్యులర్ జెనెటిక్స్, ఇమ్యూనో జెనెటిక్స్ అనే అంశాలను ఇక్కడ బోధిస్తున్న 2 సంవత్సరాల ఎం.యస్.సి. కోర్సులో ప్రవేశపెట్టారు. ఈ ఎం.ఎస్.సి. కోర్సులోకి ప్రతి సంవత్సరం 16 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. వివిధ కళాశాలలలో జన్యు శాస్త్రాన్ని బోధిస్తున్న అధ్యాపకులకు నూతనంగా అభివృద్ధి అయిన శాస్త్ర విషయాలను తెలియచెప్పేందుకు ఇంతవరకు 3 వేసవి అధ్యయన కేంద్రాలను ఏర్పాటు చేసింది. అంతేకాకుండా 1. ప్రస్తుత కాలంలో జన్యు శాస్త్రం (1968) 2. వైద్య జన్యుశాస్త్రం (1975) 3. జంతుశాస్త్ర అంశాలపై పరిసరాల ప్రభావం (1978) 4. పంటల పెరుగుదలపై అనువంశికాల ప్రభావం (1979) అనే అంశాలపై జాతీయ అంతర్జాతీయ సెమినార్‌లను నిర్వహించింది.

ఈ విభాగంలో వివిధ పరిశోధనలు నిర్వహించేందుకు ఒక పశుశాల 1,000 క్యూరీ కోబాల్ట్-60 యంత్రాగార ప్రయోగశాల, మొక్కల ప్రయోగశాలను ఏర్పాటు చేయడం జరిగింది.

ఈ విభాగం భారతీయ వైద్య పరిశోధనా సమితి, భారతీయ వ్యవసాయ పరిశోధనా సమితి, అణుశక్తి శాఖ, సాంకేతిక శాఖ, అంతర్జాతీయ అణుశక్తి శాఖ, ఐ.సి.ఎస్.ఆర్. సహాయ సహకారాలతో జన్యు శాస్త్రానికి సంబంధించిన వృక్ష జంతు మానవ జన్యువులపై అనేక పరిశోధనా ప్రాజెక్టులను చేపట్టింది.

ఇంతవరకు ఈ విభాగం నుండి 90 మంది పిహెచ్.డి. పట్టాలను పొందారు. ప్రస్తుతం 29 మంది, పిహెచ్.డి. పట్టా కోశం పరిశోధన చేస్తున్నారు. అంతేకాక ఈ విభాగంలో పనిచేస్తున్న, పని చేసిన శాస్త్రజ్ఞుల కృషి వల్ల 300 పైగా పరిశోధక పత్రాలు వెలువడడం జరిగింది. ప్రస్తుతం ఈ శాఖాధిపతిగా ఆచార్య కె.వైద్యనాథ్ వ్యవహరిస్తున్నారు.

**ఖగోళ శాస్త్ర విభాగం:**

నిజాం ప్రభుత్వ కాలంలో ఖగోళ అధ్యయన పరిశోధనలకై ప్రారంభమైన నిజాం అబ్జర్వేటరీ కాలక్రమేణా 1959-60 నాటికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఒక శాస్త్ర విభాగంగా రూపు దిద్దుకుంది.

ఖగోళ శాస్త్రంలో 2 సంవత్సరాలలో ఎం.ఎస్.సి. కోర్సును నిర్వహిస్తూ ప్రతి సంవత్సరం 12 మంది విద్యార్థులను ఆ కోర్సులోకి తీసుకుంటోంది. ఈ కోర్సులో అప్లయిడ్ మాథమాటిక్స్, మెకానిక్స్, స్టెల్లార్ ఎస్ట్రోమాస్ ఫియర్స్ అండ్ ఇంటీరియల్స్ మిల్కీ వే అండ్ ఎక్స్ట్రనల్ గెలాక్సీస్, ఎస్ట్రోనిమికల్ టెక్నిక్స్, రేడియో ఎస్ట్రోనమీ అండ్ స్పేస్ ఎస్ట్రో ఫిజిక్స్ అనే అంశాలను బోధిస్తున్నారు.

ఈ విభాగం ఆధ్వర్యంలో హైదరాబాదులోని నిజామియా అబ్జర్వేటరీ, జాపాల్-రంగపూర్ అబ్జర్వేటరీలు నిర్వహింప బడుతున్నాయి. ఈ అబ్జర్వేటరీలలో అత్యంత శక్తివంతమైన టెలిస్కోపులు అమర్చబడి వున్నాయి. ఎం.ఎస్.సి. కోర్సుతో పాటుగా ఖగోళ శాస్త్రంలో ఎం.ఫిల్ కోర్సును కూడా నిర్వహిస్తున్నారు. ఇంతవరకు ఈ విభాగం నుండి 12 మంది. ఎం.ఫిల్ డిగ్రీలను పొందడం జరిగింది.

ఈ విభాగంలో బోధనతో పాటుగా పరిశోధన చేయ టానికి తగినన్ని ఏర్పాట్లు వున్నాయి. ఖగోళ శాస్త్రంలోని వివిధ అంశాలపై పరిశోధన గావించి 17 మంది పిహెచ్.డి. పట్టాలను పొందారు.

ప్రస్తుతం ఖగోళ శాస్త్రానికి సంబంధించి 1. ఫొటోమెట్రిక్ అండ్ స్పెక్ట్రోస్కోపిక్ స్టడీస్ ఆఫ్ బైనరీ అండ్ వేరయబుల్ స్టార్స్ 2. స్టెల్లార్ డైనమిక్స్ 3. రేడియోటివ్ ట్రాన్స్‌ఫర్ ఇన్ ప్లానటరీ ఎట్మాస్ఫియర్ అనే అంశాలపై ప్రత్యేకమైన పరిశోధనను ఈ విభాగం చేపట్టింది. 85–86 సంవత్సరంలో హేలీ తోకచుక్కపై పూర్తిస్థాయి అధ్యయనాన్ని ఈ విభాగం నిర్వహించింది. వీటితో పాటుగా యు.జి.సి., డి.ఎస్.టి., ఇ.యస్.ఆర్.ఓ.ఇ.ఎన్.ఎస్.ఎ, సంస్థల, సహకారంతో పరిశోధక ప్రాజెక్టులను ఈ విభాగం చేపట్టి నిర్వహిస్తోంది.

ఖగోళ శాస్త్రంలో ఈ విభాగం నిర్వహిస్తున్న కృషికి చిహ్నంగా అనేక బహుమతులను కూడా గెల్చుకోవడం జరిగింది. ఈ విభాగంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న ఎస్.ఎమ్. అల్లాడిన్ "మేఘనాథ్ సహా అవార్డు"ను 1981 సం॥లో పొందారు. 1985–86 సంవత్సరానికి ఉత్తమ ఉపాధ్యాయునిగా రాష్ట్ర ప్రభుత్వ అవార్డును ప్రొఫెసరు అభయంకర్ పొందారు. భారతదేశంలో ఖగోళ శాస్త్ర అధ్యయనానికి సంబంధించి ఉన్నతస్థాయి బోధన, పరిశోధన నిర్వహించడంలో ఈ విభాగం గణనీయమయిన కృషి చేస్తోంది.

**జీవరసాయన శాస్త్ర విభాగం**

రసాయన శాస్త్రంలో ఒక ప్రత్యేకాంశంగా 1963 నుంచి బోధింపబడుతున్న జీవరసాయన శాస్త్రాన్ని 1972లో ఒక ప్రత్యేక విభాగంగా రూపొందించారు. ఈ విభాగం జీవరసాయన శాస్త్రంలో ఎం.ఎస్.సి. కోర్సును పిహెచ్.డి. పట్టాకు వీలుగా పరిశోధనలను నిర్వహిస్తోంది. ఇక్కడ నిర్వహిస్తున్న 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సులో అర్గానిక్స్ అండ్ ఫిజికల్ కెమిస్ట్రి టాపిక్స్, ఎంజయమ్స్ అండ్ బయో మెంబరిన్స్ బయాలాజికల్ ఆక్సిడేషన్, ఎమినో ఆసిడ్స్ ప్రోటీన్సు, న్యూక్లిక్ ఆసిడ్స్ కార్బోహైడ్రేట్స్, లిపిడ్స్, పొర్‌ఫిరిన్స్, విటమిన్స్ ఫిజియాలజీ ఆఫ్ టిష్యూస్ అండ్ ఆర్గన్స్ సెపరేటు మెథడ్స్, ఆప్టికల్ మెథడ్స్ మెటాబాలిక్ టెక్నిక్స్, ఎంజయమ్స్, న్యూక్లిక్ ఆసిడ్స్ ప్రొటీన్ బయోమైక్రో బయాలజీ వైరసస్, ఫేజస్, జెనిటిక్స్, ఇమ్యూనాలజీ, జెనిటిక్ ఇంజనీరింగు అనే అంశాలను బోధిస్తున్నారు. ఈ ఎం.ఎస్.సి. కోర్సులో ప్రతిసంవత్సరం 18 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు.

భారతదేశంలో జీవ రసాయన శాస్త్రాన్ని బోధిస్తున్న విశ్వవిద్యాలయ అధ్యాపకులకు ఉన్నతస్థాయి శాస్త్రాంశాలను నూతనంగా వచ్చినపోకడలను తెలియచేసేందుకు 1984 సెప్టెంబరులో ఒక అఖిల భారత వేసవి పాఠశాలను ఈ విభాగం నిర్వహించింది.

ఒక సంవత్సరంలో పూర్తికాగల 'క్లినికల్ లేబరేటరీ' డిప్లమో కోర్సును ప్రారంభించాలనే ఉద్దేశ్యం ఆర్థిక వనరులు లేనందువల్ల అమలు జరుగలేదు.

జీవరసాయన శాస్త్రంలో విస్తృతస్థాయిలో పరిశోధన లను ఈ విభాగం నిర్వహిస్తోంది. ప్రస్తుతం ఇన్‌ట్రాక్షన్ విత్ మాలిక్యుల్స్, ఫార్మకో థెరప్యూటిక్స్ ఆఫ్ వీనమ్, సర్క్యులేటింగు థెయిరాక్సిన్ లెవిల్స్ ఆఫ్ బెఫెలో సీరమ్, అనే విషయాలపై పరిశోధన జరుగుతోంది. జీవరసాయన శాస్త్రంలో ఈ విభాగం నిర్వహిస్తున్న పరిశోధనలలో ప్రతి సంవత్సరం ఒకరు పిహెచ్.డి, పట్టాను పొందుతున్నారు. ఇంతే కాకుండా ఇతర సంస్థలలో పనిచేస్తూ జీవరసాయనిక శాస్త్రంలో పరిశోధన చేసేవారికి ఈ విభాగం నుండి తగిన మార్గదర్శకత్వం లభిస్తోంది.

ప్రస్తుతం ఈ విభాగంలో నలుగురు ప్రొఫెసర్లు, ముగ్గురు రీడర్లు, ఇద్దరు లెక్చరర్లు ఇక్కడి బోధన, పరిశోధనలను నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం ఈ శాఖాధిపతిగా ప్రొఫెసర్ జి. వెంకటేశ్వర్లు ఉన్నారు.

ప్రథమంలో భూగర్భ శాస్త్రంలో ఒక అంశంగా 1960 భూభౌతిక శాస్త్రాన్ని బోధించడం జరిగింది. 1963 వరకు భూగర్భ శాస్త్ర ఎం.ఎస్.సి. పరీక్షలలో ఒక అంశంగా ఉంటూ వచ్చింది. ఆ తరువాత నుండి పరిశీలనా భూభౌతిక శాస్త్రం (ఎక్స్‌ప్లొరేషన్ జీయో ఫిజిక్సు) లో ఒక సంవత్సరం ఎం.ఎస్.సి. టెక్ కోర్సును ప్రారంభించారు. 1965 లో దానిని మార్చి భూభౌతిక శాస్త్రానికి ప్రాముఖ్యతనివ్వడం జరిగింది. భారత–సోవియట్ పరస్పర శాస్త్ర సహకార ఒప్పందంననుసరించి ఈ విభాగానికి ప్రత్యేకించి అభివృద్ధి పర్చవలసిందిగా గుర్తించి 1966లో భూగర్భ విభాగాలనుండి దీనిని వేరుచేయడం జరిగింది. ఆ తరువాత భూభౌతిక శాస్త్రవిభాగంలో పరిశీలనా భూభౌతిక కేంద్రాన్ని 1969లో ప్రారంభించారు. ఈ కేంద్రాన్ని ఉన్నత శాస్త్ర విభాగంగా రూపొందించేందుకు వీలుగా మాస్కోలోని భూభౌతిక కేంద్రం, శాస్త్ర నిపుణులను పంపడం ద్వారా, ఈ కేంద్రంలో పనిచేస్తున్న వారికి తగిన శిక్షణ మాస్కోలో ఇవ్వడం ద్వారా, అదే విధంగా ఈ కేంద్రానికి అవసరమైన సాంకేతిక, పరిశీలక యంత్రాలను అందివ్వడం ద్వారా ఎనలేని కృషి చేసింది.

ప్రస్తుతం ఈ విభాగం భూభౌతిక శాస్త్రంలో 3 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సును నిర్వహిస్తూ సాధారణ భూభౌతిక అంశాలతో పాటు థియరటికల్ జియోఫిజిక్సు అండ్ డేటా ప్రాసెసింగ్ జియో ఫిజిక్సు, రాక్ ఫిజిక్సు, జియో కెమికల్ ప్రాస్పెక్టింగ్ అండ్ ఎనలిటికల్ టెక్నిక్సు అనే ప్రత్యేకాంశాలను బోధిస్తోంది. ఈ కోర్సులోకి ప్రతి సంవత్సరం 24 మంది విద్యార్థులు ప్రవేశించే అవకాశం వుంది. దీనితోపాటుగా భూగర్భజల భూభౌతిక శాస్త్రం (గ్రౌండ్ వాటర్ జియో ఫిజిక్సు)లో 4గురితోనూ, పరిశీలనా భూభౌతిక శాస్త్రం (ఎక్స్‌ప్లొరేషన్ జియోఫిజిక్సు)లో ముగ్గురితోను, 3 నెలల వ్యవధి సర్టిఫికెట్ కోర్సును కూడా నిర్వహిస్తోంది. అంతే కాకుండా పెట్రోలియం జియో ఫిజిక్సు న్యూక్లియర్ జియో ఫిజిక్సులో ఒక సంవత్సరం పి.జి. డిప్లొమో కోర్సును ప్రారంభించడానికి తగిన పథకాలను రూపొందించింది.

ప్రథమంలో ముగ్గురు అధ్యాపకులతో ప్రారంభమై ప్రస్తుతం 25 మంది అధ్యాపక సిబ్బందిని కలిగియుంది.

ఈ విభాగం ఆధ్వర్యంలో పరిశీలన భౌతిక శాస్త్రంలో విస్తృతమైన పరిశోధనలను నిర్వహించడం జరుగుతోంది. ఇంతవరకు వివిధ అంశాలపై పరిశోధనలను నిర్వహించి 33 మంది పిహెచ్.డి. పట్టాలను పొందారు. భూభౌతిక శాస్త్ర పరిశోధన, పరిశీలనలు నిర్వహించడంలో ఈ కేంద్రం ఎన్.జి.ఆర్.ఐ., ఓ.ఎన్.జి.సి., జి.ఎస్.ఐ., సి.జి.డబ్ల్యూ.బి. వంటి జాతీయ సంస్థలతోనూ, ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ మినరల్ ఎక్స్‌ప్లొరేషను కార్పొరేషను, ఆంధ్రప్రదేశ్ గనులు, భూగర్భశాఖ, సింగరేణి కాలరీస్, కోల్ ఇండియా లిమిటెడ్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, గనులు, భూగర్భ శాఖలవంటి రాష్ట్ర సంస్థలతో సహకరించి విజయవంతమైన ఫలితాలను సాధిస్తోంది.

భూగర్భ జలాలు, ఖనిజాలను వెలికి తీయడంలో ప్రభుత్వం, అర్ధ ప్రభుత్వ సంస్థలతోనూ కాంట్రాక్టులను ఏర్పాటు చేసుకునే విశ్వవిద్యాలయ విభాగాలలో ఈ ఉస్మానియా విభాగం ప్రముఖమైనదిగా పేర్కొనవచ్చును.

ప్రారంభమైన ఒకటిన్నర దశాబ్దకాలంలోనే అత్యున్నత సంస్థల సహకారాన్ని అంతర్జాతీయ సంస్థల సహకారాన్ని పొంది భూభౌతిక పరిశోధనలను నిర్వహించడంలోనూ శాస్త్ర బోధనలోనూ గణనీయమైన ప్రగతిని సాధించింది, సాధిస్తోంది.

**భౌతిక శాస్త్ర విభాగం:**

ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రారంభం నుండి ఉన్న విభాగాలలో భౌతిక శాస్త్ర విభాగం ముఖ్యమయినది. 1949 లో ప్రొ॥ ఎస్. భగవంతం ఫిజిక్స్ ప్రధానాచార్యులుగా వచ్చినప్పటి నుంచి భౌతికశాస్త్ర బోధనలోనూ అధ్యయనం, పరిశోధనలోనూ, గుణాత్మకమైన మార్పు వచ్చింది. ఈ విభాగ విస్తృత అభివృద్ధికి ఆయన గణనీయమయిన కృషి చేశారు. ఆయన తరువాత వచ్చిన ప్రొఫెసరు సత్యనారాయణ, ప్రొఫెసరు అయ్యంగారు, ప్రొఫెసరు వెంకట్రామయ్యలు ఈ కృషిని కొనసాగించి బహుముఖాభివృద్ధి సాధించేటట్లు కృషిచేశారు.

ఈ విభాగంలో భౌతిక శాస్త్రంలో 2 సంవత్సరముల ఎం.ఎస్.సి. కోర్సును బోధిస్తున్నారు. ప్రతి సంవత్సరము 45 మంది విద్యార్థులు ఈ కోర్సులలో ప్రవేశించడం జరుగుతోంది. ఈ కోర్సుతోపాటుగా భౌతిక శాస్త్రంలో ఎం.ఎస్.సి. టెక్ కోర్సును కూడ బోధిస్తున్నారు. ఈ కోర్సులోకి ప్రతి సంవత్సరం 12 మంది విద్యార్థులు ప్రవేశించడం జరుగుతోంది. ఇటీవలి కాలంలో ఎం.ఫిల్. కోర్సును నిర్వహించి కొన్ని కారణాలవల్ల రద్దుచేయడం జరిగింది. ఈ భౌతిక శాస్త్రంలో విస్తృత పరిశోధనలకు ఈ విభాగం దక్షిణ భారతదేశంలో పేరు గడించింది. ఇంతవరకు భౌతిక శాస్త్రంలో పరిశోధనలు గావించి 100 మందికి పైగా పిహెచ్.డి. పట్టాలను పొందారు. ప్రస్తుతం ఈ శాఖకు అధిపతిగా ప్రొఫెసర్ ఎస్.వి. సూర్యనారాయణ ఉన్నారు.

సాలిడ్ స్టేట్ ఫిజిక్స్, న్యూక్లియర్ ఫిజిక్స్, థియరిటికల్ ఫిజిక్స్, స్పెక్ట్రోస్కోపీ, బయోఫిజిక్స్ రంగాలలో పరిశోధన గావించటానికి తగిన పరికరాలు సౌకర్యాలు కల్పించటం జరిగింది. పరిశోధనా రంగంలో గడించిన ఖ్యాతికి నిదర్శనంగా నేడు అనేక పరిశోధక ప్రాజెక్టులను వివిధ జాతీయ శాస్త్ర సంస్థల సహకారంతో నిర్వహిస్తోంది. ప్రస్తుతం విశ్వవిద్యాలయాల గ్రాంట్స్ కమీషన్, శాస్త్ర పారిశ్రామిక పరిశోధనా సంస్థ, రక్షణశాఖ, ఎలక్ట్రానిక్ కమీషన్‌ల సహకారంతో మొత్తం 42 పరిశోధక ప్రాజెక్టులను నిర్వహిస్తుంది. ఈ విభాగం నిర్వహించిన పరిశోధనల మూలంగా ఎలక్ట్రానిక్స్ రంగంలో ముఖ్యంగా టెలివిజన్ రంగాలలో కొన్ని ముఖ్యమైన సాంకేతిక సత్ఫలితాలను పొందడం జరిగింది.

## ఆం.ప్ర. వ్యవసాయ విశ్వవిద్యాలయం

వ్యవసాయం, పశువైద్యం, గృహ విజ్ఞాన శాస్త్రం ఈ మూడు రంగాలను అభివృద్ధి పరచటానికి అందుకు అవసరమయిన సమర్థవంతమయిన సాంకేతిక నిపుణులను తయారుచేయటానికి వీలుగా 1963 సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ చట్టం రూపొందించి తదనుగుణంగా 1964 మే 4న హైదరాబాదులోని రాజేంద్రనగర్‌లో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం స్థాపించడమయినది. ఆనాటికి

రాష్ట్రంలో వున్న వ్యవసాయ, పశువైద్య, గృహ విజ్ఞాన కళాశాలలను ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధించారు.

వ్యవసాయ విద్య, పశు వైద్యశాస్త్రం, గృహ విజ్ఞానం మొదలైన వాటిలో శిక్షణ యిచ్చి, గ్రామీణ ప్రజల ఆర్థిక పరిస్థితిని, ప్రతిపత్తిని ఇతోధికం చేయడం, అభ్యుదయ కర్షకులకు మరింత విజ్ఞానాన్ని అందజేసే నిమిత్తం సమర్థులయిన సాంకేతిక సిబ్బంది సహాయం సమకూర్చడం ఈ విశ్వవిద్యాలయం ముఖ్య ఆశయాలు. ఈ ఆశయాల ఆచరణకు వ్యవసాయదారులకు అధికంగా ఉపయోగపడే సేవా కార్యక్రమాలతోపాటు, వ్యవసాయ సంబంధ విషయాలపై అధ్యయన, పరిశోధన, విస్తరణా పథకాలను ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది.

ఈ విశ్వవిద్యాలయానికి రాజేంద్రనగర్, బాపట్ల, తిరుపతిలలో 3 వ్యవసాయ కళాశాలలు, రాజేంద్రనగర్, బాపట్లలలోని 2 గృహవిజ్ఞాన శాస్త్ర కళాశాల అనుబంధంగా వున్నాయి.

వ్యవసాయ విద్య:

వ్యవసాయ విద్యారంగంలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సును (ఎ.జి.బి.ఎస్.సి.) బాపట్ల, తిరుపతి, రాజేంద్రనగర్‌లలో బోధించడం జరుగుతోంది. ఈ మూడు కళాశాలలలో కలిపి ప్రతి సంవత్సరం 440 మంది విద్యార్థినీ విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. ఇటీవలి కాలంలో విద్యార్థినుల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. 1986–87 సంవత్సరంలో 367 మంది విద్యార్థినులు అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులో ప్రవేశించారు. ఈ కోర్సుతోపాటుగా వ్యవసాయ విద్యలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సును కూడా మూడు కళాశాలలలోను బోధిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఈ కోర్సులోకి 165 మంది ప్రవేశిస్తున్నారు. రాజేంద్రనగర్‌లోని వ్యవసాయ కళాశాలలో వ్యవసాయ విద్యపై పరిశోధన నిర్వహించడానికి తద్వారా పిహెచ్.డి. పట్టాను పొందటానికి తగినన్ని సదుపాయాలు వున్నాయి.

వ్యవసాయ ఆర్థిక శాస్త్రం, కృషి శాస్త్రం, కీటక శాస్త్రం విస్తరణ విద్య, ఉద్యోగ కృషి, మొక్కల పెంపకం, జన్యుశాస్త్రం, మొక్కల రోగ లక్షణ శాస్త్రం, మొక్కల నిర్మాణ శాస్త్రం, భూసార విజ్ఞాన శాస్త్రం, వ్యవసాయ రసాయన శాస్త్రం మొదలైన అంశాలలో పోస్టు గ్రాడ్యుయేషన్, పిహెచ్.డి. కోర్సును నిర్వహించడం జరుగుతోంది.

విద్యార్థులలో బోధనా తరగతులతో పాటు, ఆచరణాత్మక నైపుణ్యతను పెంచటానికి వీలుగా "గ్రామీణ వ్యవసాయ పనుల అనుభవ కార్యక్రమాన్ని" (ఆర్.ఎ.డబ్ల్యూ.ఇ) ఈ విశ్వవిద్యాలయం రూపొందించింది. దీనిని అనుసరించి బి.ఎస్.సి. ఆఖరి సంవత్సరంలోని విద్యార్థులను 4 లేక 5 గురిని బృందంగా ఏర్పరచి రాష్ట్రంలోని వ్యవసాయ విద్యాలయ పరిశోధనా కేంద్రాల చుట్టుపక్కల వున్న గ్రామాలలో ఒక రైతు వద్ద ఉంటూ ఆచరణాత్మక కౌశల్యాన్ని, పరిజ్ఞానాన్ని పెంచుకుంటారు. ఈ కార్యక్రమం వల్ల విద్యార్థులకు గ్రామీణ వాతావరణం అలవడటమే కాకుండా, రైతు సమస్యలు, సాగు పద్ధతులు, అవగాహనకు వస్తాయి. ఈ కార్యక్రమం ఖరీఫ్ పంటకాలంలో 5 నెలలు పాటు ప్రతి సంవత్సరం సాగుతుంది. ఈ కార్యక్రమంలో పాల్గొనే విద్యార్థులకు ప్రతినెల రూ.250/– స్టైఫండును చెల్లిస్తారు. విద్యార్థుల పరిజ్ఞానాన్ని పెంచడంలో ఈ కార్యక్రమం గుణాత్మకమైన మార్పును తెచ్చింది.

పశు వైద్యవిద్య:

ఈ విద్యను బోధించడానికి తిరుపతి, రాజేంద్రనగర్‌లలో కళాశాలలు నెలకొల్పడం జరిగింది. ఈ కళాశాలలో పశు వైద్యంలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులోకి ప్రతి సంవత్సరం 160 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. అదేవిధంగా ఈ పశువైద్యంలోని 16 అంశాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సును నిర్వహించడం జరుగుతోంది. ఈ కోర్సులోకి ప్రతి సంవత్సరం 70 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. గత సంవత్సరం తిరుపతి పశువైద్య కళాశాలలో కొత్తగా జన్యుశాస్త్రం, మొక్కల పెంపకం, ఔషధ శాస్త్రం, విష విజ్ఞాన శాస్త్రం, శరీర నిర్మాణ శాస్త్రంలో కొత్త పోస్టుగ్రాడ్యుయేట్ కార్యక్రమాలను ప్రవేశపెట్టారు. ఈ రెండు కళాశాలలకు అనుబంధంగా ఆధునికమైన పశు వైద్యశాలలు కూడా నిర్మించటం జరిగింది.

విద్యార్థులకు ఆచరణాత్మకమైన పరిజ్ఞానాన్ని అందివ్వడానికి వీలుగా బి.వి.ఎస్.సి. ఆఖరి సంవత్సరం కోర్సు ముగిసిన పిదప జిల్లాలలోని పశువైద్యశాలలకు పంపి అక్కడ వివిధ రకాల జంతువుల వ్యాధులకు చికిత్సను చేయించడం జరుగుతోంది. విద్యార్థులకు పశువుల పెంపకంలో వాణిజ్యపరంగా శిక్షణ ఇవ్వడానికి "విద్యార్థులుగా సంపాదించండి" అనే పథకం క్రింద పందులు, కోళ్ళ పెంపకంలోనూ శిక్షణ యిచ్చి మోడల్ ఫార్మ్‌ను నిర్వహిస్తున్నారు.

పశువైద్యతోపాటుగా పాడి సాంకేతిక శాస్త్రంలో (డైరీ టెక్నాలజీ)లో బి.యస్.సి. కోర్సును 1983–84 సంవత్సరంలో తిరుపతిలోని పశు వైద్య కళాశాలలో ప్రవేశ పెట్టారు. ఇందులో ప్రతి సంవత్సరం 20 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. ఈ కోర్సులో మొదటి రెండు సంవత్సరములు కళాశాలలో బోధించి తరువాత రెండు సంవత్సరముల పాటు, పాల ఉత్పత్తుల ప్రాసెసింగ్ నాణ్యత, నియంత్రణ అనే అంశాలను చిత్తూరులోని పాలపాడి ఫ్యాక్టరీలో బోధిస్తారు. ఈ కోర్సు నిర్వహణకు ఆంధ్రప్రదేశ్

పాడి పరిశ్రమ అభివృద్ధి సహకార సమాఖ్య ఇతోధిక సహాయ సహకారాలను అందిస్తోంది.

పశు వైద్యశాస్త్రంలోని వివిధ అంశాలపై పరిశోధన నిర్వహించి పిహెచ్.డి. పట్టాలను పొందటానికి అనువైన సదుపాయాలను ఈ రెండు కళాశాలలలో ఏర్పాటు చేయడమైంది. ఒకేసారి ఒక్కొక్క కాలేజీలో 10 మంది విద్యార్థులు పరిశోధన చేసే అవకాశాలు వున్నాయి.

### గృహ విజ్ఞానవిద్య:

ఈ విద్యను బోధించడానికి హైదరాబాదులోనూ, బాపట్ల లోనూ కళాశాలలను ఏర్పాటు చేయడం జరిగింది. బాపట్లలోని గృహ విజ్ఞానవిభాగం 1983లోనే ప్రారంభించారు. ఇక్కడ అండర్ గ్రాడ్యుయేషన్ కోర్సును మాత్రమే బోధిస్తారు. హైదరాబాదు కళాశాలలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సుతో పాటు ఆహారం, పోషకాహారం, శిశు అభివృద్ధి గృహనిర్వహణ శాఖలలో పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులను నిర్వహిస్తున్నారు. 1986 సంవత్సరములో దుస్తుల పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సును కూడా 6గురు విద్యార్థులతో ప్రారంభించారు. మొత్తం పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులలో 20 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. బాపట్ల, హైదరాబాదులలో కలిపి అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులో 140 (30+110), ఈ రెండు కోర్సులతో పాటు హైదరాబాదు కళాశాలలో ఆహారం, పోషకాహారం అనే అంశాలపై పరిశోధన చేస్తూ ఇద్దరు పరిశోధకులు కూడా వున్నారు. ప్రస్తుతం హైదరాబాదు కళాశాల – గృహ విజ్ఞానంలోని వివిధ అంశాలపై 4 అఖిల భారత పరిశోధక ప్రాజెక్టులను 3 తాత్కాలిక పరిశోధక ప్రాజెక్టులను చేపట్టి నిర్వహిస్తోంది.

ఈ కళాశాల పరిశోధక శాఖలను రాజేంద్రనగర్ కు త్వరలోనే మార్చే ప్రతిపాదన కలదు.

### పరిశోధన:

ఈ వ్యవసాయ విద్యాలయం బోధనతో పాటుగా విస్తృతమైన పరిశోధన కార్యక్రమాలనుకూడా చేపట్టింది. రాష్ట్రంమొత్తాన్ని వాతావరణం బట్టి 7 ప్రాంతాలుగా విభజించి ఆయా ప్రాంతాలలో పండే పంటలు, నివసించే పశువులు, ప్రజలు ఆరోగ్య ఆర్థికాభివృద్ధికి అవసరమైన పరిశోధనలను నిర్వహిస్తోంది. వాటి వివరాలను పట్టిక ద్వారా అందిస్తున్నాం. వివిధ పంటలపై ఈ కేంద్రాలు పరిశోధన గావించి అధిక దిగుబడిని అందించే 105 వంగడాలను అందించింది. వరి పంటలో అధిక దిగుబడి వరిగా సాగుచేస్తున్న మసూరి రకం యీ విశ్వవిద్యాలయం కృషి ఫలితమే. పల్నాడు రకం కందిపప్పు లాం హైబ్రీడ్ – 1 ప్రత్తి వంగడం, మంజీరా మామిడి వంగడం, ఎక్స్ – 235° మిర్చి వంగడం, మొదలైనవి యీ విశ్వవిద్యాలయ పరిశోధన మూలంగా సాగులోకి వచ్చిన అధిక దిగుబడి రకాలు.

ఆంధ్రప్రదేశ్ లో పంటల దిగుబడి పెంచటానికి అవరోధంగా వున్న జింకు లోపాన్ని కనుగొని జింకు సల్ఫేటు వాడకం వల్ల వరి దిగుబడిని 20 శాతం, జొన్న దిగుబడిని 12.40 శాతం పెంచవచ్చని యీ విశ్వవిద్యాలయ పరిశోధనలు తెలియచేసాయి.

సాధారణ పశువుల కంటే 200 శాతం అధిక పాలనిచ్చే అన్ని విధాల మేలైన ప్రిజియన్ ఒంగోలు జాతి సంకర ఆవులను అభివృద్ధి పరచింది.

నెల్లూరు. మాండ్యాకు చెందిన దేశావాళీ గొర్రెలను డార్సెట్, సఫోక్ రకాల విదేశీ జాతి గొర్రెలతో సంపర్కం చేయడం ద్వారా అభివృద్ధి చెందిన సంకర జాతి గొర్రెలు పెరుగుదలలోనూ, మాంసపు దిగుబడిలోనూ, ఉన్ని ఉత్పత్తిలోనూ మేలైన రకాలుగా కనుగొనడం జరిగింది. వీటితోపాటుగా వివిధ రకాల చేపలు. రొయ్యలపై కూడా అనేక పరిశోధనలు నిర్వహిస్తోంది. వీటితోపాటు సుగంధ ద్రవ్యాల చెట్లు. ఔషధ మొక్కలపైన, ఉద్యాన కృషి, కోతల తరవాత సాంకేతిక విజ్ఞానం, వ్యవసాయ అడవుల పెంపకం, క్షేత్ర పరికరాలు, నీటి నిర్వహణ, జంతు పోషకాహారం, వాణిజ్య పంటల నిర్వహణపై పరిశోధనలను నిర్వహిస్తోంది. విస్తృతస్థాయిలో జరిగే యీ పరిశోధనలను సక్రమంగా, సమర్థవంతంగా బహుముఖంగా నిర్వహించడానికి అంతర్జాతీయ బియ్యం పరిశోధనా సంస్థ (ఐ.అర్.అర్.ఐ) మెట్ట వ్యవసాయ పరిశోధక సంస్థ (ఇక్రిశాట్) వంటి అంతర్జాతీయ సంస్థల సహకారాన్ని కూడా విశ్వవిద్యాలయం తీసుకుంటోంది.

ఈ విశ్వవిద్యాలయం బోధనా, పరిశోధనతో పాటు అనేక విధాలైన విస్తరణ కార్యక్రమాలు చేపడుతోంది. అందుకొరకు పాలెం, జగిత్యాల, గుంటూరు, అనకాపల్లి, నంద్యాల, తిరుపతిలలో ఆరు విస్తరణ విద్యా యూనిట్లను ఏర్పాటు చేశారు. ఈ యూనిట్లు ఆకాశవాణిలో వ్యవసాయ సూచనలు అనే కార్యక్రమాలతో రైతులకు నేరుగా సమాచారాన్ని అందిస్తాయి. దీనితోపాటుగా శిక్షణ ప్రదర్శనలు, సానుకూలీకరణ ప్రయోగాలు, క్షేత్ర సందర్శనలు, రైతు దినోత్సవాలు, కిసాన్ మేళాలు, సమావేశాలు, సామూహిక చర్చలు, ముద్రణ సాహిత్యం మున్నగు వాటిద్వారా పరిశోధనా కేంద్రాల పరిసరాలలో ఉన్న రైతులకు సమాచారం అందచేస్తాయి.

వ్యవసాయ, పశు సంవర్ధక శాఖలలో పనిచేసే ఉద్యోగులకు తదితర సంబంధిత విస్తరణా ఉద్యోగులకు శిక్షణ కార్యక్రమాలను కూడా విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది. ఇంతవరకు 246

శిక్షణా కార్యక్రమాలు చేపట్టి 4,899 మంది ఉద్యోగులకు శిక్షణ యిచ్చింది. పొలాలలో పనిచేసే రైతులు, స్త్రీలు, యువజనులలో సాంకేతిక నైపుణ్యం పెంపొందించడానికి అనంతపురం, ఆముదాలవలస, రసాకుంటలలో కృషి విజ్ఞాన కేంద్రాలను స్థాపించింది.

రైతుల ఆర్థిక స్థితిని ముఖ్యంగా బలహీన వర్గాల రైతుల స్థితిని మెరుగు పర్చటానికి అందుకు అవసరమైన సాంకేతిక విజ్ఞానాన్ని అందివ్వటానికి రాష్ట్రం మొత్తంలో 72–82 కాలానికి 9,250 మందిని, 85–84 కాలానికి 8,483 మందిని, 84–86 కాలానికి 6,100 మంది రైతుకుటుంబాలను ఎంపికచేసి వారికి తగిన కార్యక్రమాలను రూపొందించి శిక్షణ ఇవ్వటం జరిగింది. 20 సూత్రాల పథకం క్రింది 42 గ్రామాలను కూడా ఈ విశ్వవిద్యాలయం దత్తత తీసుకుంది. వరంగల్, అనంతపురం, అనకాపల్లిలో ప్రధాన ఆహార పంటలపై జాతీయ ప్రదర్శనను కూడా నిర్వహిస్తోంది.

వ్యవసాయం ప్రధాన వృత్తిగా ఉన్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వ్యవసాయ, పశు, గృహ విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని సాధించటానికి అందుకు అవసరమైన సాంకేతిక నిపుణులను తయారుచేయడంలోనూ, వ్యవసాయంలో సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టడంలోనూ ఈ విశ్వవిద్యాలయం బహుముఖమైన కృషి చేస్తోంది.

# రాష్ట్రంలో పరిశోధనా సంస్థలు

## అంతరిక్ష పరిశోధనా కేంద్రం:

భారతీయరోదసీ పరిశోధనాసంస్థ, నెల్లూరుజిల్లా సూళ్ళూరుపేటకు తూర్పుదిక్కున 17 కిలోమీటర్ల దూరంలోగల శ్రీహరి కోటవద్ద రోదసీ పరిశోధనా కేంద్రాన్ని నెలకొల్పింది. బంగాళాఖాతానికి, పులికాట్ సరస్సుకుమధ్య చెదురుమదురుగా ఉన్న ద్వీపాలలో శ్రీహరికోట పెద్దది. ఇక్కడ ఉపగ్రహ ప్రయోగ కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని భారతప్రభుత్వం తలపెట్టిన తర్వాత, 32 వేల ఎకరాల విస్తీర్ణం గల రాష్ట్రప్రభుత్వ భూములు, అడవి – భారతీయ రోదసీ పరిశోధనా విభాగానికి దఖలు పర్చబడ్డాయి. ఒకప్పుడు మలేరియా, ఫైలేరియావంటి వ్యాధులకు ఆటపట్టయిన శ్రీహరికోట, యిప్పుడు రోదసీ పరిశోధనలకు, ఉపగ్రహ ప్రయోగాలకు చక్కని కేంద్రంగా విలసిల్లుతోంది.

స్వదేశీరాకెట్ల ప్రయోగాన్ని పరీక్షించేందుకు, శాస్త్రీయ, వార్తాప్రసార ఉపగ్రహాలను ప్రయోగించేందుకు శ్రీహరికోట "లాంచ్‌కాంప్లెక్స్" నిర్మించబడుతోంది. ఇందుకొరకు అవసరమైన సౌండింగు రాకెట్ కాంప్లెక్స్, ఉపగ్రహ ప్రయోగ వాహన కేంద్రం, లిక్విడ్ రాకెట్ లాంచ్ కాంప్లెక్సు, సింక్రొనస్ ఉపగ్రహ ప్రయోగవాహక కేంద్రం వంటి సౌకర్యాలు అభివృద్ధి చేయబడ్డాయి.

రాకెట్లు, అంతరిక్ష వాహనాలను భారీఎత్తున పరీక్షించేందుకు, విరివిగా పలు సౌకర్యాలు అభివృద్ధి చేయబడుతున్నాయి. భారతదేశంలో యీ తరహా ప్రాజెక్టుల్లో యిదే మొదటిది. దీన్ని రాకెట్ స్లెడ్ ఫెసిలిటీ అంటారు. ప్రయోగించే వాహనాలలోను సౌండింగు రాకెట్లలోనూ వినియోగించే వివిధ ప్రొపల్షన్ సిస్టమ్సును పరీక్షించే "శ్టాటిక్ టెస్టు మరియు ఎవాల్యుయేషన్ కాంప్లెక్స్" కూడ ఏర్పాటు చేయబడింది.

## శాంతి ప్రయోజనాల కోసం అంతరిక్ష పరిశోధన:

రెండవ ప్రపంచ యుద్ధానంతరం రెండు ప్రముఖ శాస్త్రరంగాలు ప్రాధాన్యత సంతరించుకున్నాయి. ఒకటి అణుశక్తి పరిశోధన, రెండు అంతరిక్ష పరిశోధన. ఈ రెండు రంగాలు కూడా ప్రభుత్వాల యాజమాన్యం క్రిందే అభివృద్ధి చెందుతున్నాయి. దీనికి కారణం వాటికి గల సైనిక ప్రాధాన్యతే.

మనదేశంలో కూడా అణు పరిశోధన అంతరిక్ష పరిశోధన సాగుతోంది. అయితే ఈ పరిశోధనలన్నీ యుద్ధ ప్రయత్నాలకు గాక శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే.

మన దేశంలో ముఖ్యంగా మూడు నాలుగు చోట్ల అంతరిక్ష పరిశోధనలు సాగిస్తున్నారు. గుజరాత్ రాష్ట్ర రాజధానియైన అహమ్మదాబాదు నగరంలో విక్రమసారాబాయి అంతరిక్ష ప్రయోగశాలలో ప్రముఖ పరిశోధనలు సాగుతున్నాయి. కేరళ రాష్ట్రంలో తుంబా అనే చోట కూడ అంతరిక్ష ప్రయోగాలు ప్రభుత్వపరంగా జరుగుతున్నాయి. ఈ ప్రయోగశాలను అంతర్జాతీయ శాంతి ప్రయోజనాలకు శ్రీమతి ఇందిరాగాంధీ అంకితం చేశారు.

## విశాఖపట్నం:

ఆంధ్రప్రదేశ్‌లో అంతరిక్షపరిశోధనలు విశాఖపట్నం దగ్గర నగరం పాలెం అనే గ్రామంలో కూడ జరుపబడుతున్నాయి. ఆంధ్ర విశ్వ విద్యాలయం భౌతిక శాస్త్ర శాఖవారు ఈ గ్రామంలో ఒక కొండ మీద ఈ ప్రయోగశాలను నిర్మించారు. దూరదర్శనిలాంటి సాధనాలతో గమనించడానికి అనువుగా వుంటుందని ఈ స్థలాన్ని ఎన్నుకున్నారు. ఈ ప్రయోగశాలలో అంతరిక్ష పరిస్థితులను అధ్యయనం చేసే ప్రయోగాలను మాత్రమే నిర్వహిస్తారు. శాస్త్ర పరిశోధనలోను మిలిటరీ ప్రాధాన్యతలోనూ అత్యధునాతనమైన రంగంలో కూడ మన రాష్ట్రంలో పరిశోధనలు జరగడం మనకు గర్వకారణం.

## జాతీయ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ:

అంతరిక్ష పరిశోధనలు ముందుకు సాగడంతో భూవనరులను గుర్తించడం, వర్గీకరించడం, ఆయా ప్రాంతాల సర్వే ముమ్మరమయింది. ఈ కార్యక్రమాన్ని అతి తక్కువ కాలంలో సాగించటానికి అంతరిక్ష విజ్ఞానాన్ని వినియోగించడాన్ని భారతదేశం కూడా ప్రారంభించింది. వ్యవసాయం, అడవులు, ఉపరితల, అంతర్గత భూజలాలు, భూవర్గీకరణ, భూవినియోగం, పట్టణ ప్రాంతీయ ప్రణాళికకు కాలుష్య హెచ్చరిక, ఖనిజాన్వేష, వాతావరణం మొదలైన విషయాలను అంతరిక్ష కేంద్రాలు అందించే సమాచారాన్ని ఉపయోగించడం నేడు భారతదేశం చేపట్టింది.

ఇందుకొరకు అంతరిక్ష శాఖ అధ్వర్యంలో స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా జాతీయ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ (సుదూర గ్రహణ కేంద్రం) నొకదానిని హైదరాబాదులో నెలకొల్పారు. ఈ సంస్థలో సమాచార సేకరణ, విశ్లేషణ, అన్వయించడం, ఏరియల్ సమాచార సేకరణకు కావలసిన అన్ని సౌకర్యాలను ఏర్పరిచారు. హైదరాబాద్ సమీపంలో గల షాద్‌నగర్‌లో సమాచార సేకరణ కొరకై ఒక భూ కేంద్రాన్ని (ఎర్త్ స్టేషన్) స్థాపించారు. ఉపగ్రహాల (సెటిలైట్స్) ద్వారా వచ్చే సమాచారాన్ని సరాసరి గ్రహించటానికి వీలుగా ఈ కేంద్రాన్ని తయారు చేయడమైంది.

ఏరియల్ సర్వే చేయడానికి వీలుగా అవసరమైన పరికరాలు అమర్చిన 3 విమానాలు ఈ కేంద్రం అధీనంలో పని చేస్తున్నాయి.

సేకరించిన సమాచారాన్ని సవరించటానికి, స్థిరీకరించటానికి కంప్యూటర్ పద్ధతి అధునాతనమైన అన్ని పరికరాలు కలిగియున్న ఫోటో రసాయన శాల సేకరించిన సమాచారాన్ని పంపిణీ చేయడానికి ఒక కేంద్రం అన్ని విభాగాలలో నిష్ణాతులైన ఇంజనీర్లు, రేఖా పటాల ప్రయోగశాల సుదూర గ్రహణంలో దీర్ఘ స్వల్పకాలిక శిక్షణ ఇచ్చే సదుపాయాలు ఈ కేంద్రంలో ఉన్నాయి.

సుదూర గ్రహణ కేంద్రం అందించే సమాచారాన్ని సక్రమంగా వినియోగించడానికి అనేక పథకాలను రూపొందించడం జరిగింది.

వరదలను తెలియజేసే పటాలు, భూగర్భ జలాలను తెలియచేయడం, ప్రాంతీయ భూగర్భాలను తెలియచేసే పటాలు, అనావృష్టి, అతివృష్టి హెచ్చరిక, భూవినియోగం, భూసార హీనత అధ్యయనం – మొదలైన అంశాలకు సంబంధించిన పథకాలను రూపొందించి వాటిని రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ శాఖల అధ్వర్యంలో అమలు జరిపి అందరికీ ఉపయోగపడేటట్లు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ నిర్వహించిన కార్యక్రమాలు:

ఉపగ్రహం ద్వారా భూవినియోగం, నీరు, అడవులు, భూగర్భ పరిశీలన 2,45,000 కి.మీ. విస్తీర్ణం మేరకు నిర్వహించి తగిన పటాలను తయారు చేశారు.

భారతదేశంలో గల అడవులు తెలియజేసే సంపూర్ణమైన పటాలు ఇంతకు మునుపు తయారు చేయలేదు. ఉపగ్రహం ద్వారా సర్వే చేసిన ఈ కేంద్రం కార్యక్రమాన్ని పూర్తి చేసింది. ఆంధ్రప్రదేశ్‌లో అటవీ ప్రాంతం 17.32% నుండి 14.6% తగ్గిపోయిందని ఈ కేంద్రం చేసిన పరిశోధనల వల్ల తెలిసింది.

* సాగు చేయకుండా వదలిన భూముల వివరాలను తెలియచేసే పటాలను రాష్ట్రాల వారీగా ఈ కేంద్రం తయారుచేసింది.
* పట్టణ ప్రణాళికా డైరెక్టరేట్ తరపున ఆంధ్రప్రదేశ్‌లోని 53 పట్టణాలను ఏరియల్ సర్వే చేయడం జరిగింది. అదేవిధంగా హైదరాబాదు నగర వాతావరణం, ఏరియా, సర్వే కూడా దాదాపు పూర్తిగా చేసింది. ఈ సర్వేలు భవిష్యత్తులో పట్టణ ప్రణాళికకు ఉపయోగపడతాయి.
* ఆంధ్రప్రదేశ్ తీర ప్రాంతంలో 14,300 కి.మీ. ప్రాంతాన్ని ఏరియల్ సర్వే చేయడం జరిగింది.
* గోదావరి నది, హుస్సేన్ సాగర్ సరస్సుల జలాలను కూడా సర్వే చేయడం జరిగింది.

  దీని వలన ఎంతెంత కాలుష్యం ఎక్కడెక్కడ జరుగుతోందో తెలుసుకోవడానికి సాధ్యపడే పటాలు తయారుచేయడం జరిగింది.
* కరీంనగర్, అనంతపురం, కడప జిల్లాలను సర్వే చేసి భూగర్భ జలాలు ఏ మేరకు ఉన్నాయో కనుగొనడం జరిగింది. ఈ సంస్థ తయారు చేసిన హైడ్రోలాజికల్ పటం ఆంధ్రప్రదేశ్ భూగర్భ జలవనరుల శాఖకు ఎంతో ప్రయోజనకరంగా వుంది.

ఇటీవలి కాలంలో ఈ సంస్థ శ్రీహరికోట, సూళ్ళూరుపేట ప్రాంతాలలో నిర్వహించిన సర్వే వల్ల హెచ్చు స్థాయిన భూగర్భ జలాలు ఉన్నట్లు కనుగొనబడింది.

పంట భూముల స్థాయిని తెలుసుకొని అందుకు తగ్గ పంటల విధానం నిర్ణయించటానికి వీలుగా వ్యవసాయ శాఖ సహకారంతో ఇబ్రహీం పట్నం, చావల్లు తాలూకాల (రంగారెడ్డి జిల్లా)లో భూపరీక్షలను ఈ సంస్థ జరిపింది.

రిమోట్ సెన్సింగ్ సాంకేతిక పరిజ్ఞానానికి సంబంధించిన అనేక విషయాలపై శిక్షణ ఇచ్చేందుకు తగిన సదుపాయాలు హైదరాబాదు రిమోట్ సెన్సింగ్ ఏజన్సీలో ఏర్పాటు చేయడం జరిగింది.

అమెరికా, పశ్చిమ జర్మనీ దేశాల సహకారంతో సంయుక్త కార్యక్రమాలను అనేకం ఈ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ నిర్వహించింది. ఇటీవల ఇతర దేశాల నుంచి వచ్చిన 50 మంది సాంకేతిక నిపుణులు రిమోట్ సెన్సింగ్ పరిజ్ఞానంపై ఈ హైదరాబాదు సంస్థలో శిక్షణ పొందారు. అంతరిక్ష విజ్ఞానాన్ని మానవాభ్యుదయానికి, పురోగతికి వినియోగించటంలో ఈ జాతీయ రిమోట్ సెన్సింగ్ ఏజన్సీ గణనీయమైన కృషి చేస్తోంది.

## రంగపూరు నక్షత్రగమన శాల:

ఆగ్నేయాసియాలో కెల్లా అతి పెద్ద దూరదర్శిని కలిగిన యీ నక్షత్రశాల హైదరాబాదుజిల్లా, ఇబ్రహీంపట్నం తాలూకా రంగాపురం సమీపంలోని ఒక ఎత్తైన కొండపై సముద్రమట్టానికి 2,280 మీ. ఎత్తున నెలకొల్పబడి ఉంది. ఈ నక్షత్ర గమన శాల హైదరాబాదు – నాగార్జునసాగర్ రహదారిపై హైదరాబాదుకు 35 మైళ్ళ దూరంలో ఉంది. చాలా అనువైనదిగా భావించి యీ స్థలాన్ని ఎంపిక చేయడం జరిగింది. 200 ఎకరాల విశాల స్థలంలో విశ్వవిద్యాలయ గ్రాంట్స్ కమిషన్ వారి నుండి పొందిన రూ. 10 లక్షల ఆర్థిక సహాయంతో అభివృద్ధి చేయబడిన యీ నక్షత్రశాల ఆవరణలో టెలిస్కోపు హౌస్, వర్కుషాపు భవనాలు, అబ్జర్వర్ల లాడ్జిలతోపాటు, ఉద్యోగస్తుల సౌకర్యార్థం క్వార్టర్లు కూడ నిర్మించబడ్డాయి.

1908 లో స్థాపించబడిన నిజామియా నక్షత్ర గమనశాల ప్రపంచవ్యాపిత సహకార ఖగోళ పరిశీలనా పథకం క్రింద 8 లక్షలకు పైగా ఉన్న నక్షత్రాలను ఫోటోగ్రఫీచేసి వాటి స్థితిని కనుగొనేందుకు 8 అంగుళాల ఖగోళ లేఖన దూరదర్శిని నుప యోగించి చక్కని పరిశీలనలు జరపడం ద్వారా నక్షత్రాదులను పరిశీలించటంలో అంతర్జాతీయ గుర్తింపు పొందింది.

1948లో అత్యంత శక్తివంతమైన 48 అంగుళాల దూరదర్శినిని ఈ కేంద్రంలో నెలకొల్పటం యీ దిశలో సాధించిన ప్రధాన విజయమని పేర్కొనవచ్చు. అమెరికా ప్రభుత్వం నుండి పొందిన గ్రాంట్ల నుండి రూ. 13 లక్షల ఖర్చుతో అమెరికాకు చెందిన ఒక ప్రముఖ సంస్థ నుండి యీ దూరదర్శిని కొనుగోలు చేయబడింది. ఈ దూరదర్శిని 30 అడుగుల వ్యాసార్ధం కలిగిన అర్ధ గోళాకారపు డోములో యిమిడ్చబడింది. పటవలయాకారంలో ఉండే 8 అంగుళాల మందము, 2 వేల పౌన్ల బరువుగల ఒక అద్దం ప్రత్యేకంగా రూపొందించిన పైరెక్స్ గ్లాస్‌తో తయారు చేయబడింది.

ఆకాశ ప్రాంతాన్ని ఒక్కసారిగా ఫోటోగ్రఫీ చేసి, విశాల కోణంతో ఆకాశ ప్రాంతాన్ని ఫోటో తీయడంలో యీ పరికరాలు దూరదర్శినిని అత్యంత శక్తివంతమైన ఆయుధంగా తయారు చేస్తున్నాయి.

భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ సహకారంతో 1980 ఫిబ్రవరి 16న సంభవించిన సంపూర్ణ సూర్యగ్రహణ సమయంలో సూర్యుని గురుత్వాకర్షణ మండలంలో సూర్య కిరణాల వక్రీకరణను కొలవడం ద్వారా ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని పరీక్షించడం జరిగింది. ఆ సమయంలో వాతావరణం పై పొరలోని ఎలక్ట్రాన్ పరిమాణంలో వచ్చిన మార్పులను కూడా పరిశీలించడం జరిగింది. 1933 నుండి రేడియో సమయాన్ని తెలిపే సాంకేతిక ధ్వనిని ప్రసారం చేయడానికి వీలుగా విద్యుత్ శాఖకు ఖచ్చితమైన కాలాన్ని కూడా ఇది అందిస్తోంది. 1956 వరకు రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల వర్షపాతం లెక్కలను కూడా ఈ గమన శాల నిర్వహించేది.

ఒక్క పరిశీలనకే పరిమితం కాకుండా అంతరిక్ష విజ్ఞానం పైన ఖగోళ శాస్త్రంలోని అనేక అంశాలపైన 200 పరిశోధక పత్రాలను కూడా ప్రచురించింది. అనేక జాతీయ, అంతర్జాతీయ ఖగోళ శాస్త్ర గోష్ఠులలో 30 పరిశోధక పత్రాలను సమర్పించింది.

ఇక్కడ నక్షత్రాల బరువు, పరిమాణం, ఉష్ణోగ్రత, తదితర లక్షణాలను గూర్చిన విలువైన సమాచారాన్ని రాబట్టుట క్వాసర్సు, పల్సార్సుని గూర్చి పరిశోధనలు, గ్రహాలను, తోకచుక్కలను, నక్షత్రమండలాన్ని అధ్యయనం చేయడం మొదలైన పరిశోధనలు జరుగుతున్నవి.

భారతదేశంలోగల కొడైకెనాల్, కవలూర్, నైనిటాల్, ఊటీలోని (రేడియో టెలిస్కోపు) ఖగోళ పరిశీలనా కేంద్రాల మధ్య ప్రధాన అనుసంధాన కేంద్రంగా మన రాష్ట్రంలోని రంగపూరు అబ్జర్వేటరీ కేంద్రం పని చేస్తుందని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

## గాంధీపర్వతం - విజయవాడ:

1964 సంవత్సరం నవంబరు 9వ తేదీన అప్పటి ప్రధానమంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి, గాంధీజీ జ్ఞాప కార్థమై నిర్మించనున్న గాంధీ స్తూపానికి శంకుస్థాపన చేశారు. నాలుగు సంవత్సరాల తర్వాత 1968 అక్టోబరు 6వ తేదీన డాక్టరు జకీర్ హుస్సేన్ ఆ స్తూపానికి ప్రారంభోత్సవం జరిపారు. గాంధీపర్వత సంఘం, గాంధీ స్మారక గ్రంథాలయం, మరియు ఒక పెద్దహాలు నిర్మించారు.

### కాంతి - ధ్వని పరికరము:

మాటలు లేకుండా, కాంతి–ధ్వని ద్వారానే గాంధీజీ జీవిత విశేషాలను, ఆయన ఆచరణలను సందేశాలను, ఉపదేశాలను చూపించడానికి ఒక ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేయబడివున్నది.

## నక్షత్రశాల:

గాంధీ పర్వతానికి నక్షత్రశాలను మరొకమంచి ఆకర్షణగా భావించాలి. మానవుడు ఏర్పాటుచేసిన కృత్రిమ విశ్వమే ఈ నక్షత్రశాల. ఈ నక్షత్రశాల నుండి మానవుడు ఆకాశంలోని నక్షత్రాలను, గ్రహాలను చూచి అర్థం చేసుకోవచ్చును. దీని నుండి విజయవాడపై వివిధ కాలములలో ఏ ఏ నక్షత్రాలు ఏ విధంగా వుంటాయో తెలుసుకోవచ్చు. దీనిని ఒక సాంకేతిక నిపుణుడు ప్రదర్శిస్తూ వివరిస్తారు. ప్రతి సంవత్సరం దాదాపు 25,000 మంది ప్రదర్శనశాలను తిలకిస్తున్నారు.

## బి.ఎమ్. బిర్లా ప్లానెటేరియం:

మొట్ట మొదటిసారిగా అత్యంత అధునికమైన జపాను సాంకేతిక పరిజ్ఞానంతో భారతదేశంలో ఏర్పాటుచేసిన ప్లానెటేరియమ్ ఈ బి.ఎమ్. బిర్లా ప్లానెటేరియమ్. 1985 సెప్టెంబరు 8వ హైదాబాదులోని అనువైన ప్రదేశంలో ఈ ప్లానెటేరియమ్ ప్రారంభించబడి అతితక్కువ కాలంలో హైదాబాదులో సందర్శించదగ్గ ప్రదేశాలలో ఒకటిగా ప్రాముఖ్యతను సంతరించుకుంది.

నేటి ప్రపంచములోని ప్లానెటేరియమ్ ప్రదర్శనలలోకెల్ల అత్యంత శాస్త్రీయమైన విజ్ఞానమైన ప్రదర్శనశాలగా ఈ ప్లానెటేరియమ్‌ని పేర్కొనవచ్చు.

ఈ ప్రదర్శనశాలలోని డూమ్ 12 మీటర్ల వైశాల్యం కలిగియుండి 150 మంది దర్శించే అవకాశం వుంది. ఇంతవరకు ఆశ్చర్యము కలిగించే మన విశ్వం "ఈ శతాబ్దపు తోకచుక్క", "వేసవి ఆకాశపు తమాషా" అనే ప్రదర్శనలను చూపిస్తారు. ప్రస్తుతం "ధ్రువాలకు అద్భుత యాత్ర" అనే ఫిల్మును ప్రదర్శిస్తున్నారు. ఇవేకాక పాఠశాల విద్యార్థులకు ఖగోళ విజ్ఞానాన్ని అందించే విధంగా ప్రత్యేక ప్రదర్శనలను, వాటికి అవసరమైన చార్టులు, తరగతులను కూడా ఈ ప్లానెటేరియమ్ నిర్వహిస్తోంది. పాఠశాల విద్యార్థులకు ప్రతి ప్రదర్శనలోనూ 50% తగ్గింపుపై ప్రవేశార్హతను కల్పిస్తోంది. ప్రజలలో ఖగోళ శాస్త్ర అంశాలను మరింత ప్రచారం చేసేందుకు వీలుగా ఖగోళ విజ్ఞానానికి సంబంధించిన సాహిత్యమును అందుబాటులోకి తీసుకురావడం, దానితో పాటుగా ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం, ఖగోళశాస్త్రానికి సంబంధించిన ప్రత్యేక సంఘటనపై ప్రజలకు తెలియచేయడం మొదలగు కార్యక్రమాలను నిర్వహిస్తోంది. 1986 మార్చిలో హాలీ తోకచుక్కపై ఒక అఖిల భారత సెమినార్‌ను నిర్వహించింది. ప్రాచీన భారత ఖగోళ శాస్త్రాన్ని అధ్యయనం చేయటానికి వీలుగా ఒక పరిశోధక విభాగాన్ని కూడా నెలకొల్పింది. అందుకు వీలుగా కొన్ని సంస్కృత తాళ పత్రాలను కూడా సేకరించింది. ఈ ప్లానెటేరియంలోని పీవియర్ సభ్యులు ఖగోళశాస్త్ర, థియరిటికల్ ఫిజిక్స్, ప్రాచీన ఖగోళ శాస్త్రంలో పోస్టు డాక్టరల్ పరిశోధన చేయడం, డాక్టరల్ పరిశోధనకు తగిన గైడెన్సును అంది వ్వడం కూడా చేస్తున్నారు. అనేక జాతీయ, అంతర్జాతీయ సెమినార్‌లలో పరిశోధక పత్రాలను కూడా ప్రచురించారు. దేశంలోని శాస్త్ర అధ్యాపకులకు ఖగోళ శాస్త్రంపై ఒక ఉచిత శిబిరాన్ని నిర్వహిస్తోంది. ప్రతి సంవత్సరం ఖగోళ శాస్త్రంపై ప్రముఖ శాస్త్రజ్ఞుల చేత ఉపన్యాసాలకు తగిన ఏర్పాట్లను ఈ ప్లానెటేరియమ్ చేసింది. 1987 జనవరిలో "ప్రాచీన భారతఖగోళ విజ్ఞానం" అనే అంశంపై ఒక జాతీయ సెమినార్‌ను ఏర్పాటు చేసింది. విద్యార్థులను శాస్త్ర అధ్యయనం వైపుకు ఆకర్షించేందుకు వీలుగా 10వ తరగతి పరీక్షలలో ప్రథముడుగా వచ్చిన వానికి 1000 రూపాయలు బహుమతిని ఈ ప్లానెటేరియం అందిస్తుంది. ప్రారంభించిన మొదటి సంవత్సరంలోనే 4,59,000 మంది ఇక్కడ ప్రదర్శనలను తిలకించడం ఈ ప్లానెటేరియం ప్రత్యేకతగా మనం చెప్పుకోవచ్చు.

## జాతీయ భూ భౌతిక పరిశోధనా సంస్థ:

జాతీయ భూభౌతిక పరిశోధనా సంస్థ 1961 లో హైదరాబాదులో నెలకొల్పబడింది. భారత శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధనా సమితి (సి.యస్.ఐ.ఆర్.) ఆధ్వర్యంలో పని చేసే యీ సంస్థ, భూభౌతిక శాస్త్ర రంగాని కంకితమైన పరిశోధనా సంస్థ. భూగర్భ జల, ఖనిజ సంపదలు వెలికి తీయడంలో ఈ సంస్థ ప్రముఖ పాత్ర వహిస్తోంది. భూ కంపాలు, భూ ఉష్ణత, భూ నిర్మాణము, భూ చలవ తదితర విధానాలను శాస్త్రీయంగా అధ్యయనం చేస్తోంది.

ఈ పరిశోధనా సంస్థ వివిధ వృత్తి సంస్థలకు – ఖనిజ ఆధార పరిశ్రమలకు, ప్రభుత్వ ఇతర సంస్థలకు ఉన్నత పరిశోధన అభివృద్ధి, సౌకర్యాలను కల్పిస్తుంది. భూగర్భ జల, తైల, ఖనిజ నిక్షేపాలను కనుగొని అంచనా వేయడంలో చేయూతనిస్తుంది.

1961 లో ఒక డైరెక్టరు – కొద్ది మంది శాస్త్రజ్ఞులతో ప్రారంభమైన ఈ సంస్థ, భూభౌతిక శాస్త్రంలో 5 ముఖ్య రంగాలలో పరిశోధన కార్యక్రమాలు నిర్వహిస్తోంది. 500 మంది సాంకేతిక ఇతర పరిపాలనా సిబ్బంది దీనికి వున్నారు.

ఖనిజ సంపద అన్వేషణ కొరకు, గగనతలం మీదుగా నిర్వహించదగిన విశిష్టమైన భూభౌతిక సర్వే విధానాలను దేశీయంగా రూపొందించింది. ఈ సర్వేలు అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఖనిజ సంపద విరివిగా లభ్యమయ్యే ప్రదేశాలను తక్కువ వ్యయంతో అన్వేషించడానికి, తద్వారా తమ సహజ వనరుల ఆధారంగా ఆర్థికాభివృద్ధిని త్వరిత పరచుకొనగలిగేందుకు యితోధికంగా సహకరిస్తాయి.

ఖనిజ నిక్షేపాలను వెలికి తీయడానికి అవసరమైన ఆధునిక యంత్ర పరికరాలను రూపొందించడంలోను, అందుకు అవసరమైన ఫీల్డు స్టడీస్ నిర్వహించడంలోనూ ఈ సంస్థ ఎంతో ప్రగతిని సాధించింది. సల్ఫేడ్స్, క్రోమైట్, బొరైట్, ఇనుము, ఖనిజ నిక్షేపాలను వెలికి తీయడంలోనూ, బొగ్గు, బంగారు గనులను కనుగొనడంలోనూ, భూభౌతిక విజ్ఞానంలోను ఆధునిక అంశాలైన గ్రావిటీ మాగ్నటిక్, ఎలక్ట్రో మాగ్నటిక్, ఇన్‌డ్యూస్‌డ్ పొలరైజేషన్, సెస్‌మిక్ పద్ధతులను ఈ సంస్థ వినియోగిస్తుంది.

భూభౌతిక పరీక్షల కవసరమైన అత్యంత ఆధునిక సున్నిత పరికరాలైన, ఎస్.పి. మీటర్, సెయిస్ మిక్ మీటర్ మాగ్నటిక్ సస్పెడబురిటీ మీటర్, రూబీడియమి వేపర్ మాగ్నోమీటర్ మొదలైన వాటిని ఎన్నిటినో ఈ సంస్థ రూపొందించింది.

కోలారు బంగారు గనులు, ఇంగాల్ ధల్ రాగి గనులలో వున్న ఖనిజ నిక్షేపాలు ఎంత మేరకు వున్నాయో అంచనా వాటిని వెలికి తీయడంలో ఎదురయ్యే సమస్యల అధ్యయనాన్ని ఈ సంస్థ సంపూర్ణంగా నెరవేర్చింది.

ప్రైవేటు, ప్రభుత్వ రంగ, తదితర పారిశ్రామిక సంస్థల కోరికపై భూగర్భ జల సంపదను వెలికితీసే కార్యక్రమాల్లో భూ భౌతిక సాంకేతిక పరిజ్ఞానాన్ని, పరిశోధనా ఫలితాలను చక్కగా అన్వయించ గలుగుతున్నది. వివిధ ప్రాంతాలలో బావులను త్రవ్వేందుకు అధునాతన యంత్ర సామాగ్రితో కూడుకొన్న 25 బృందాలను ఈ సంస్థ నిర్వహిస్తున్నది. అధునాతన పద్ధతుల ద్వారా భూగర్భ జలవనరులను వెలికి తీసేందుకు నిరంతర పరిశ్రమ ద్వారా పరిశోధనాభివృద్ధి చేస్తోంది.

భౌతిక, గణిత విధానాల ద్వారా వైవిధ్యం గల్గిన భూభౌతిక సిద్ధాంతాలపై అధ్యయనాలు జరుపబడుతున్నాయి. జియో ఎలక్ట్రో మాగ్నటిజం, జియోథెర్మిక్స్, గ్లోబల్ టెక్టానిక్స్ రంగాలలో ఎనలేని కృషి జరిగింది. ఇటీవలి కాలంలో భూచలన విధానాలపై నూతన సిద్ధాంతాలు అభివృద్ధి చేయబడ్డాయి.

ఈ సంస్థ భారతదేశంలో మొట్ట మొదటిసారిగా భూకంపాల శబ్ద అధ్యయన కార్యక్రమాన్ని చేపట్టింది. ఖనిజ భూగర్భ జల వనరుల అన్వేషణ కొరకు అనేక సర్వే పథకాలను నిర్వహించింది. ఖేత్రి (రాజస్థాన్)లోని ఇండియన్ కాపర్ కార్పోరేషన్, సుకిండా (ఒరిస్సా)లోని టాటా ఐరన్ స్టీలు కంపెనీల కొరకు నిర్వహించిన అన్వేషణ, అభివృద్ధిలో భాగంగా అంతర్జాతీయ ప్రాముఖ్యత గల సైద్ధాంతిక, ప్రయోగాత్మక అధ్యయనాలు, భూ పరిశీలనలు చేపట్టి నిర్వహించబడ్డాయి. ఈ సంస్థ ఎలక్ట్రో మాగ్నెటిక్ మోడల్ ప్రయోగాల ద్వారా భూ పరిశీలనలు జరిపింది. కర్నాటక రాష్ట్రంలోని కోలారు ప్రాంతంలో ప్రాచీన బంగారు గనులను గుర్తించేందుకు ఈ సంస్థ భూభౌతిక సర్వేలను నిర్వహించింది.

భారతదేశపు భూకంపాలపై జరిపిన అధ్యయనాలు – అవి సంభవించే విధానం, అవి ఎలా సంభవిస్తున్నాయి, అందుకు భారత ద్వీప కల్పపు భూగర్భ పొరలు ఎలా వాటికి దోహదం చేస్తున్నాయి, తదితర విషయాలను గూర్చిన స్పష్టమైన, శాస్త్రీయమైన అవగాహనకు దోహదం కలిగించాయి. ఈ సంస్థ 1976 లో సంభవించిన కొయినా భూకంపం, 1969 లో జరిగిన భద్రాచలం క్లబ్ భూకంపాలపై విశేష అధ్యయనం జరిపింది.

సముద్ర ప్రాంతాలలో నూనె అన్వేషణ కొరకు సముద్ర గర్భ భూభౌతిక సర్వేలను కూడ ఈ సంస్థ నిర్వహిస్తున్నది. అందుకొరకు కొన్ని పథకాలను, యంత్ర పరికర సౌకర్యాలను రూపొందించింది. 1969 లో నావల్ హైడ్రో గ్రాఫిక్ సర్వే వారి సహకారంతో బొంబాయి సముద్ర తీరంలో అయస్కాంత సంబంధమైన సర్వేలను జయప్రదంగా నిర్వహించగలిగింది.

భూగర్భ జలాలు త్రవ్వకానికి సరి అయిన ప్రదేశాల ఎంపిక, అక్కడ వున్న జలనిధుల సాంద్రత, త్రవ్వకాల మూలంగా తగ్గుతున్న జలనిధి, వీలైనంత ఎక్కువ జల త్రవ్వకానికి విధాన నిర్ణయానికి శాస్త్రీయ పరమైన అధ్యయనాలనుఈ సంస్థ అనేకం నిర్వహించింది. హైడ్రాలిక్ హైడ్రో కెమికల్ పరీక్షలను నిర్వహించడానికి అవసరమైన ఆల్టీ మీటర్, పి.హెచ్. మీటర్, కండక్టవిటీ మీటర్, వాటర్ లెవెల్ రికార్డర్, మినీ స్పెక్ట్రోమీటర్ వంటి పరికరాలెన్నిటినో ఈ సంస్థ ఏర్పరచుకుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని నీరు లభించే కొన్ని లోతట్టు ప్రాంతాలలో భూగర్భ జలనిధులను వెలికి తీయడానికి పశ్చిమ జర్మనీ సహకారంతో ఒక నూతన పధకాన్ని ఈ సంస్థ రూపొందించింది. ఇందుకు అవసరమయ్యే 30 లక్షల విలువ చేసే పరికరాలని కూడా కొనుగోలు చేసింది. ఈ సంస్థ శాస్త్రజ్ఞుల్లో కొంతమందికి ఇప్పటికే భూభౌతిక విజ్ఞానంలో పశ్చిమ జర్మనీలో శిక్షణ లభించింది.

భూమి, భూపొరలలో లభించే ఖనిజాలను ఇంకా ఇతర లక్షణాలను కనుగొనటానికి ఈ సంస్థ అనేక పరిశోధనలను నిర్వహించింది. ఇందుకు అవసరమైన జియో మాగ్నటిక్, జియో ఎలక్ట్రికల్ అబ్జర్వేటర్‌ను హైదరాబాదులోను, చౌటుప్పల్‌లో నెలకొల్పటం జరిగింది.

**ఇతర భూపరిశోధనా సంస్థలు:**

1. భారత భౌమ సర్వేక్షణా సంస్థ, హైదరాబాదు.
2. జాతీయ భూభౌతిక పరిశోధనా సంస్థ, హైదరాబాదు.
3. ఆంధ్ర విశ్వ విద్యాలయ భూభౌతిక శాస్త్రం, వాల్తేరు.

4. ఉస్మానియా భూభౌతిక శాస్త్రం, హైదరాబాదు.
5. కేంద్ర అంతర్జల బోర్డు, ఆంధ్ర విభాగం, హైదరాబాదు.
6. రాష్ట్రీయ ఖనిజాన్వేషణ కార్పొరేషన్, హైదరాబాదు.

**ఈ సంస్థలు 1960 - 75 మధ్య సాధించిన విజయాలు:**

1. గోదావరి లోయ నిర్మితి విదీర్ణమని, వాయవ్యంగా పోను పోను ఈ విదీర్ణం వెడల్పయి అగాధ మవుతుందనీ నిర్ణయించారు. గోదావరి లోయలోని ప్రాంతీయ శిలల మీదున్న అవక్షేప పొరల మందం 3.5 కి.మీ. అని కనుగొన్నారు.
2. భీమవరం – తణుకు ప్రాంతంలో అవక్షేప పొరలకు లోతున కటకాకారం రూపంలో ఆధార శిలలున్నాయి. ఇవి చమురు నిల్వల కనువైన నిర్మితులు.
3. గుంటూరు జిల్లా అగ్ని గుండాల ప్రాంతంలోని పైరైట్, గెలీనా వంటి మధ్య తరగతి రాగి ఖనిజం మిలియన్ టన్నుల్లో వుంది. వీటిలో 1.5% రాగి, 5.8% సీసం వుంటుంది.
4. గని కాలువ ఖనిజ మేఖలలోనూ, అనంతపురం జిల్లా రామల్లకోట దగ్గరా, కడప జిల్లా జంగంరాజుపల్లె వద్దా, ఖమ్మం జిల్లా మైలవరం యల్లంబెల్లు ప్రాంతాల్లో బహు లోహ ఖనిజాల ఉనికిని గుర్తించి, జాతీయ సర్వేక్షణా సంస్థ విస్తారంగా పరిశీలించటానికి అవకాశం కల్పించారు.
5. కర్నూలు జిల్లా వెల్దుర్తి, బ్రహ్మగుండం వద్ద ఇనుము ధాతువు ఉండవచ్చుననీ, కృష్ణా జిల్లా ఎనికేపాడు 'వెనేడియం' నిక్షేపం వున్నదనీ, ఖమ్మం జిల్లా రాచకొండలో గ్రాఫైటు వుందనీ కనుగొన్నారు.
6. హైదరాబాదు, వికారాబాదు, మెదక్ ప్రాంతాల్లో నీటి వనరుల అన్వేషణ సాగించారు.
7. రామపాద సాగర్ డామ్ నిర్మాణానికి స్థలాన్ని నిర్దేశించారు.
8. గోదావరి ఆనకట్టలో నెరదలు, బీటలు కనుగొన్నారు.
9. కడప జిల్లా పెన్నా నదిమీద ఆనకట్టకు అవకాశాలు, తిరుమల పాపనాశనం వద్ద ప్రాజెక్టుకు ఆధార శిలల నిర్ధారణ, సీలేరు ప్రాజెక్టు వద్ద భూమి పరిస్థితుల పరిశీలనా జరిపించారు.
10. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల్లో పలుచోట్ల విస్తృత పరిశీలనలు జరిపి, అంతర్జల నిల్వలు విరివిగా ఉన్నచోట్ల రైతులకు బావుల త్రవ్వకానికి, పూడికలు తీసి, లోతులు పెంచటానికి సలహాలిచ్చారు.

భూభౌతిక సంస్థ ఒక శాస్త్ర సాంకేతిక పరీక్షలకు మాత్రమే పరిమితం కాకుండా గ్రామాభ్యుదయానికి కూడా ఇటీవల కొన్ని పథకాలను చేపట్టింది. అందులో భాగంగావే కరీంనగర్ జిల్లాను ఎంపిక చేసి భారత ఫోటో ఇంటర్ప్రెటేషన్ సహాయంతో భూ, జల వనరుల సర్వేను చేపట్టింది. సర్వే ఫలితాలను గ్రామ ప్రజల అభ్యుదయానికి వినియోగించటానికి ప్రయత్నిస్తోంది. 300 గ్రామాలలో ఈ సంస్థ జరిపిన భూగర్భ జల సర్వేలన్నీ 100% ఫలితాలను ఇచ్చినవి.

**జాతీయ పరిసరాల తాంత్రిక పరిశోధనా సంస్థ:**

శాస్త్రీయ పారిశ్రామిక పరిశోధనా సమితి ఆధ్వర్యంలో నాగపూర్ లో ఒక జాతీయ ప్రయోగశాలను దానికి అనుబంధంగా దేశం మొత్తం మీద 9 ప్రాంతీయ కేంద్రాలను పరిసరాల తాంత్రిక విజ్ఞానంపై పరిశోధన చేయటానికి నెలకొల్పారు. అలా నెలకొల్పిన ప్రాంతీయ కేంద్రాలలో హైదరాబాదు జాతీయ పరిసరాల తాంత్రిక పరిశోధనా సంస్థ కేంద్రం ఒకటి. ఇది 1960 లో ప్రారంభించబడింది. దీని ముఖ్యలక్ష్యం పరిసరాలకి సంబంధించిన అన్ని అంశాలపైన ముఖ్యంగా ప్రజారోగ్యం సంబంధమున్న అంశాలపై పరిశోధన చేయడం.

ప్రారంభం నుండి ఈ సంస్థ ప్రాధాన్యతగల అనేక సమస్యలపై పరిశోధనలు చేసి అనేక ఉపయోగకరమైన విషయాలను వెలుగులోకి తెచ్చింది. ముఖ్యంగా పరిశ్రమలలో వాడి వదలివేయబడుతున్న నీరు, వాటిని తిరిగి ఉపయోగించడానికి తగిన మార్గాలపై అనేక పరిశోధనలు చేసి కొత్త పద్ధతులను కనుగొంది. హైదరాబాదులోని వాయు కాలుష్యానికి సంబంధించి అనేక సర్వేలను, హైదరాబాదులో వాయువుయొక్క గుణాన్ని తెలియజేసే విషయసేకరణను నిర్వహించింది.

ఇంతే కాకుండా అనేక పరిశ్రమలు ఉపయోగించిన జలాలను శుద్ధి చేయడంలోను వాటిని ప్రమాదరహితంగా విడుదల చేయడంలోను పరిసరాల సమస్యలను పరిష్కరించడంలోను తగిన పరిశోధనలు చేసి ఆర్థికంగా చౌకైన పద్ధతులను కనుగొనింది. హైదరాబాదులో గల అనేక పరిశ్రమలకూ, భారతీయ ఔషధసంస్థ (ఐ.డి.పి.యల్.)కీ శుద్ధిపరచు కట్టడాలలో తగిన సలహాలిచ్చి ఎంతో సహాయపడింది. పరిశ్రమల కాలుష్యంతో మగ్గుతున్న హైదరాబాదు ప్రజలకు పరిశుభ్రమైన వాతావరణాన్ని అందివ్వడంలో ఈ జాతీయ పరిసరాల తాంత్రిక పరిశోధనా సంస్థ చేయవలసినది ఎంతో వుంది.

**ఆల్ట్రా హై ఓల్టేజి పరిశోధన ప్రయోగశాల**

కేంద్ర విద్యుత్ పరిశోధన సంస్థ (సి.పి.ఆర్.ఐ) హైదరాబాదుకు సమీపంలోని ఉప్పల్ లో ఏడు కోట్ల రూపాయల వ్యయంతో 'ఆల్ట్రా హైఓల్టేజి పరిశోధనా ప్రయోగశాల'ను నెలకొల్పింది. 1987 ఫిబ్రవరిలో శంకుస్థాపన జరిగింది. ఈ ప్రయోగశాల ప్రపంచంలోనే అతికొత్త తరహా కేంద్రం. దీని స్థాపనకు అవసరమైన భూమి, ఇతర సౌకర్యాలను

రాష్ట్ర ప్రభుత్వం సమకూర్చింది. ఈ ప్రయోగశాలకు హైదరాబాదులోని జె అండ్ జె అసోసియేట్స్ డిజైన్లు రూపొందించారు. భవిష్యత్ అవసరాల కోసం భారీ పరిమాణంలో విద్యుచ్ఛక్తిని చౌకగా సరఫరా చేయడానికి అత్యంత శక్తివంతమైన 700 కె.వి. 1200 కె.వి. లైన్ల నిర్మాణం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. 1990 దశకంలో కొన్ని ప్రాంతాల నుంచి 10 వేల మెగావాట్ల నుంచి 15 వేల మెగావాట్ల విద్యుచ్ఛక్తిని ఇతర ప్రాంతాలకు పంపిణీ చేయాల్సి ఉంటుంది. ప్రస్తుతం ఉనికిలో ఉన్న 220 కె.వి. లైన్లు ఏ మాత్రం సరిపోవు. ఇప్పుడిప్పుడే ఉనికిలో కొస్తున్న 400 కె.వి. ట్రాన్స్మిషనులు కూడా చాలవు. అల్ట్రా ఓల్టేజిని మన దేశ పరిస్థితులకు అనుగుణంగా మలుచుకోవటానికి ఈ పరిశోధనా కేంద్రం కృషి చేస్తూంది.

### భవన నిర్మాణ పరిశోధన ఇన్స్టిట్యూట్:

కేంద్ర భవన నిర్మాణ పరిశోధన ఇన్స్టిట్యూట్ను 1976లో హైదరాబాదులో నెలకొల్పారు. చౌకగా గృహ నిర్మాణాలకు వీలుగా సంప్రదాయకమైన నిర్మాణ సామాగ్రిని మెరుగుపర్చడం, కొత్త సామాగ్రిని రూపొందించడం దీని విధులు. భవన నిర్మాణ ఖర్చును 25 శాతం తగ్గించేందుకు వీలుగా కొత్తరకం ఇటుకలను ఇతర నిర్మాణ సామాగ్రిని ఈ సంస్థ అభివృద్ధి పర్చింది.

### ఇంజనీరింగ్ పరిశోధనా ప్రయోగశాల:

హైదరాబాదులో అప్పటి నిజాం ప్రభుత్వం ఈ ప్రయోగశాలను నెలకొల్పింది. సివిల్ ఇంజనీరింగ్లో ఎదుర్కొనే నిర్దిష్ట సమస్యల పరిశీలన పరిష్కారాన్వేషణ దృష్టితో దానిని నెలకొల్పారు. రహదారుల నిర్మాణం, పౌర ఆరోగ్యం, భూగర్భ జలాలు తదితర ప్రాజెక్టుల విషయంలో వత్తిడి విశ్లేషణ, పాదార్థిక టెక్నాలజీ, ఇన్స్ట్రుమెంటేషన్ వంటి వాటిపై ఈ సంస్థ ఉపయుక్త పరిశోధనలు చేసి తోడ్పడింది.

### రక్షణ మెటలర్జీ రిసెర్చి లేబరేటరీ:

పశ్చిమ బెంగాల్లో మొదట వుండిన ఈ సంస్థ (డి.ఎం.ఆర్.ఎల్)ను 1963లో హైదరాబాదుకు తరలించారు. లోహాలు, మిశ్రమాలు, సిరామిక్స్లను రక్షణ అవసరాలకు వినియోగించే పరిశోధన, రూపకల్పనా కార్యక్రమాలకు ఒక స్వతంత్ర సంస్థగా ఈ లేబరేటరీ రూపొందింది.

### రక్షణ పరిశోధనా అభివృద్ధి ప్రయోగశాల (డి.ఆర్.డి.ఎల్.):

రాకెట్లలో సర్ఫేస్ ఎయిర్ మిసిలిలో ఉపయోగించే ఇంధన బూస్టర్ కోసం ప్రొపెలెంట్ను తయారుచేయడం ద్వారా 1983లో ఈ లేబరేటరి గొప్ప ఖ్యాతిని సాధించింది. అధునాతన రక్షణ పరికరాలు, ఆయుధాల తయారీలో విదేశాల దిగుమతుల మీద ఆధారపడటాన్ని కొంతైనా తగ్గించేందుకు ఈ సంస్థ కృషి చేస్తోంది.

### హిందూస్తాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్: (హెచ్.ఎ.ఎల్.)

ఎ.ఆర్.ఎస్.ఆర్. అనే అతిశక్తివంతమైన ఎయిర్ రూట్ సర్వేలైన్స్ రాడార్ను రూపొందించడంలో విజయం సాధించి ఈ సంస్థ గగన పత్తెదారీలోయలో సొంత రాడార్ను ఏర్పరచుకున్న దేశాలలో 6వ దేశంగా భారతదేశానికి స్థానం కల్పించింది. భారత వైమానిక దళానికి ఏవియేషన్ ఎలక్ట్రానిక్స్ రూపొందించడం, తయారుచేయడం ఈ సంస్థ ప్రధాన బాధ్యత.

### లఘు పరిశ్రమల విస్తరణ శిక్షణా సంస్థ:

ఈ సంస్థ 1962లో హైదరాబాదులో ఏర్పడింది. లఘు పరిశ్రమల అభివృద్ధికి శిక్షణ, పరిశోధనా కన్సల్టెన్సీలు నిర్వహిస్తుంది. ఆఫ్రికా, ఆగ్నేయాసియా దేశాల నుంచి కూడా నిపుణులకు శిక్షణనిస్తోంది. 1970 లో ఎస్.ఇ.సి.డి.ఐ.సి. అనే జాతీయ డాక్యుమెంటేషన్ కేంద్రాన్ని కూడా ఈ సంస్థలో భాగంగా నెలకొల్పారు. దేశంలో లఘు పరిశ్రమల ఉత్పత్తిదారులకు అనేక విధాలైన సేవలను ఈ సంస్థ అందిస్తోంది.

### పరికరాల రూప కల్పనా కేంద్ర ఇన్స్టిట్యూట్: (సి.ఐ.టి.డి.)

1968లో హైదరాబాదులో ఏర్పడిన ఈ సంస్థ లఘు పరిశ్రమలకు యంత్రపరికరాల రూపకల్పన, ఉత్పత్తిలో కృషి చేస్తోంది. కొత్త నమూనాలు, డైస్, టూల్స్ రూపొందిస్తోంది. పరికరాల ప్రమాణీకరణను నిర్ధారిస్తున్నది.

### సి.యస్.ఐ.ఆర్. పాలిటెక్నాలజీ బదిలీ సంస్థ:

1975 లో హైదరాబాదులో ఏర్పడిన ఈ సంస్థ అటు పారిశ్రామికవేత్తలకు, ఇటు ప్రభుత్వ సంస్థలకు సంధాన కర్తగా వుంటుంది. అలాగే సి.యస్.ఐ.ఆర్. క్రింద పనిచేసే అనేక సంస్థలకు పరిశోధనా రూపకల్పనా సంస్థలకు సంధాన కర్తగా పనిచేస్తోంది. ఖాయిలాపడ్డ పరిశ్రమలను పునరుజ్జీవింప చేయడంలో ప్రభుత్వానికి సలహాలిస్తుంది.

### ఎలక్ట్రానిక్స్ పరీక్ష అభివృద్ధి కేంద్రం: (ఇ.టి.డి.సి.)

1976 లో హైదరాబాదులోని కుషాయిగూడలో దీనిని ప్రభుత్వ ఎలక్ట్రానిక్స్ శాఖ ఏర్పరచింది. దేశంలో ఇలాంటివి నాలుగు కేంద్రాలున్నాయి. భారత్, జర్మనీ సహకారంతో దీనిని నిర్వహిస్తున్నారు. ఎలక్ట్రానిక్స్ రంగంలో ప్రమాణాలు నెలకొల్పడం దీని ప్రధాన ఆశయం.

**భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్: (బి.హెచ్.ఇ.ఎల్.)**

భారీ విద్యుత్ నిర్మాణాలకు దేశంలోని భోపాల్, తిరుచ్చి, హరిద్వార్‌లలో వున్న బి.హెచ్.ఇ.ఎల్ సంస్థలకు పరిశోధన రూపకల్పనా రంగాలలో తోడ్పడేందుకు రామచంద్రాపురం (హైదరాబాదు)లో 1965లో ఈ సంస్థను నెలకొల్పారు.

సోలార్ వాటర్ హీటర్లు, జలవిద్యుత్ కేంద్రాలను మైక్రోప్రాసెసర్ ల ఆధారంగా నియంత్రణా వ్యవస్థ విద్యుత్‌తో నడిచే బస్సు వంటి వాటిని ఈ సంస్థ అభివృద్ధి పర్చింది.

**రాజీవ్‌గాంధి టెక్నాలజీ మిషన్:**

గ్రామీణ ప్రాంతాలలో విజ్ఞాన సాంకేతిక విజ్ఞాన ఫలితాలను అమలు పరిచేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాజీవ్‌గాంధీ టెక్నాలజీ మిషన్‌ను నెలకొల్పింది. 294 గ్రామాలను ఈ సంస్థ దత్తత తీసుకొని వివిధ రంగాలలో గ్రామీణులకు విజ్ఞాన శాస్త్ర ఫలితాలు ఉపయోగపడేలా కృషిచేస్తోంది.

**జాతీయ ఖనిజాభివృద్ధి సంస్థ (ఎన్.ఎం.డి.సి.):**

1958 లో ఎన్.ఎం.డి.సి. ఏర్పడింది. 1976–77లో పరిశోధనా అభివృద్ధి కార్యక్రమాలు విస్తృతపర్చుకొంది. ఖనిజాల ముడిపదార్థాలపై పరిశోధనలు జరిపి గనుల పనితీరును త్రవ్వకాలను మెరుగుపర్చే పద్ధతులను రూపొందిస్తుంది.

**భూపటాల తయారీ డైరెక్టరేట్:**

సర్వే ఆఫ్ ఇండియా 1973 లో హైద్రాబాదులో ఈ సంస్థను నెలకొల్పింది. సర్వే, చిత్రపటాల తయారీ పద్ధతుల్లో పరిశోధన, రూపకల్పన కంప్యూటర్ల వినియోగం వంటి కార్యక్రమాలలో ఈ సంస్థ నిమగ్నమైవుంది.

**ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజ్:**

ప్రభుత్వరంగ పారిశ్రామిక సంస్థలు అకాడమీలు సభ్యులుగా ఒక సొసైటీ ద్వారా నిర్వహించే స్వయంప్రతిపత్తి గల సంస్థగా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజ్ (ఐ.పి.ఇ.)ని 1964లో నెలకొల్పారు. దీన్ని ఐ.సి.ఎస్.ఎస్.ఆర్. ద్వారా ఏర్పరచింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఈ సంస్థ భవనాలకు స్థలాన్ని విరాళంగా యిచ్చింది. అత్యంత ఆధునిక రంగాలలో ఉత్పత్తి సాగిస్తున్న ప్రభుత్వ రంగ సంస్థల వివిధ విభాగాల బాధ్యులకు ఎప్పటికప్పుడు మరింత అధునాతన శాస్త్ర సమాచార నైపుణ్యాన్ని అందించడం, శాస్త్రజ్ఞులను తయారుచేయడం, పరిశోధనలు ప్రోత్సహించడం వంటి ఆశయాలతో ఈ సంస్థను నెలకొల్పారు. 1944లో ప్రముఖ భారతీయ ప్రయివేటు పారిశ్రామికవేత్తలు రూపొందించిన బొంబాయి ప్రణాళికలనే ప్రభుత్వరంగ పారిశ్రామిక సంస్థలు స్వతంత్ర భారతదేశంలో నిర్వహించాల్సిన కీలక పాత్ర గురించి నొక్కి చెప్పారు. ప్రభుత్వరంగ సంస్థల పాత్ర అత్యున్నత స్థాయికి పెరగడంతో ఈ సంస్థ కృషి కూడా ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకొంది.

**ఆశయాలు:-**

1. ఆర్థిక, ద్రవ్య, వాణిజ్య, పరిపాలన, నిర్వహణ విభాగాలలో పరిశోధనలను నిర్వహించడం, ప్రోత్సహించడం, తోడ్పడడం, ఆయా రంగాలలో పరిశోధన ప్రాజెక్టులు రూపొందించడం అధ్యయన తరగతులు, సమావేశాలు గోష్ఠులు, ఉపన్యాసాలు నిర్వహించడం.
2. పరిశోధనా పత్రాలు పుస్తకాల ప్రచురణలు.
3. గ్రంథాలయాలు, సమాచార సేవలు నిర్వహించడం.
4. భారతదేశంలో ప్రాంతీయ కేంద్రాలు ఏర్పరచడం.
5. ఆయా విజ్ఞాన శాఖలలో అభివృద్ధికి సాటి గుర్తింపు పొందిన సంస్థలతో సమన్వయ సహకారం నెరపడం.

ఈ సొసైటీలో రెండు రకాల సభ్యత్వాలుంటాయి. 1. కార్పోరేటు 2. వ్యక్తిగతం. ఇచ్చే విరాళాలను బట్టి సభ్యత్వాలలో పేట్రన్, జీవిత సభ్యత్వం, సాధారణ సభ్యత్వం ఉంటాయి. 1994 నాటికి 49 మంది కార్పోరేట్ సభ్యులు, 8 మంది వ్యక్తిగత సభ్యులు ఈ సంస్థలో వున్నారు. ఐ.సి.ఎస్.ఎస్.ఆర్. (ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్ రిసెర్చ్) ప్రతినిధులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం, భారతప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతినిధులతోపాటు; కోఆప్ట్ చేసుకున్న సభ్యులు నలుగురితో కూడిన బోర్డు ఆఫ్ గవర్నర్స్ దీని పాలనా వ్యవహారాలు చూస్తారు.

కార్యనిర్వహణా మండలికి విధాన నిర్ణయాలు చేసే అధికారం వుంటుంది. ఇందులో అధ్యక్షులు, డైరెక్టరు, కోశాధికారి, నలుగురు ఎన్నికైన సభ్యులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రతినిధులు, ఇతర ఇన్‌స్టిట్యూట్ ల ప్రతినిధులు వుంటారు. డా. డి.ఎస్.రెడ్డి మొట్టమొదటి బోర్డు ఆఫ్ డైరెక్టర్స్ అధ్యక్షులు.

ఈ మూడు దశాబ్దాలలో ఈ సంస్థ ఎన్నో కార్యక్రమాలని నిర్వహించింది. జాతీయ స్థాయిలోనేగాక అంతర్జాతీయంగా కూడా ఎన్నో సంస్థలతో కలసి కృషి చేస్తోంది. ముఖ్యంగా కంప్యూటర్ సైన్స్, ఆర్టిఫిషియన్ ఇంటలిజన్స్, ఎక్స్‌పర్ట్ సిస్టంలలో ముందంజ వేసింది.

ఆసియన్, పసిఫిక్ డెవలప్‌మెంట్ సెంటర్ (ఎ.పి.డి.సి.) అసోసియేషన్ ఆఫ్ డెవలప్‌మెంట్ రిసెర్చి అండ్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఆసియా అండ్ పసిఫిక్ (ఎ.డి.ఐ.పి.ఎ.) బ్రిటిష్ కౌన్సిల్, చైనీస్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, స్టాక్‌హోమ్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్, ఐ.ఎల్.ఒ.ఎ.ఆర్.టి.ఎ.పి.,

ఇంటర్నేషనల్ సెంటర్ ఫర్ పబ్లిక్ ఎంటర్ ప్రయిజ్ (ఇ.సి.పి.ఇ.) ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్మినిస్ట్రేటివ్ సైన్సెస్ (ఐ.ఐ.ఎ.ఎస్.) సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ ప్లానింగ్, ఎకనామిక్స్ యూనివర్సిటీ, రాడర్ డాం యు.ఎన్.ఐ.డి.ఓ. (యునిడో) తదితర సంస్థలతో అంతర్జాతీయంగా సహకారం నెరపుతోంది.

ప్రణాళికా సంఘం, ప్రధానమంత్రి ఆర్థిక సలహాసమితి, ఫైనాన్స్ కమీషన్, భారత గోల్డ్‌మైన్స్ సంస్థ, భారత అల్యూమినియం కంపెనీ, ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి సంస్థ, రాష్ట్ర కాలుష్య నివారణ బోర్డు, రాష్ట్ర సహకార మార్కెటింగ్ ఫెడరేషన్, రాష్ట్ర విద్యుత్ బోర్డు, టూల్ (నెదర్లాండు) ప్రపంచ బ్యాంక్ తదితర సంస్థలకు కన్సల్టెన్సీ సేవలు అందిస్తున్నది.

## ఇండియన్ స్టాండర్డ్ ఇన్‌స్టిట్యూట్:

ఇండియన్ స్టాండర్డు ఇన్‌స్టిట్యూట్ 1947 సంవత్సరంలో స్థాపించబడింది. ప్రమాణాలను రూపొందించి అమలు చేయించటం, ప్రమాణాల ధ్రువీకరణను చూడటం కోసం ఈ జాతీయ సంస్థ ఏర్పడింది. విస్తృత స్థాయిలోని వివిధ ఉత్పత్తులు ముడి సరుకులకు సంబంధించిన 13,000 ప్రమాణాలకు పైగా ప్రచురించింది. వాటి అమలుకై వివిధ చట్టాలను, ఏర్పాట్లను రూపొందించింది. ప్రస్తుతం దేశమంతటా గల విస్తృత స్థాయిలోని ఉత్పత్తులకు దాదాపు 7200కు పైగా ధ్రువీకరిస్తూ లైసెన్సులను జారీ చేస్తున్నది.

ఈ ప్రమాణాలను వివిధ పరిశ్రమలకు చెందిన ఉత్పత్తిదారులు, వినియోగదారులు, సంబంధిత ప్రభుత్వ ఏజెన్సీలకు చెందిన వ్యక్తులతో ఏర్పడిన నిపుణుల కమిటీ రూపొందిస్తుంది. రూపొందించిన ముసాయిదా ప్రమాణాలను ఆయా పరిశ్రమలు, ఉత్పత్తిదారులకు పంపించి వారి నుండి వచ్చిన సూచనలను స్వీకరించి అనంతరం ఆ ప్రమాణాల అమలును ఆమోదిస్తారు.

1956 ఇండియన్ స్టాండర్డు ఇనిస్టిట్యూట్ సర్టిఫికేషన్ మార్కుల చట్టం ప్రకారం పార్లమెంటరీ చట్టం క్రింద ఈ పథకం పనిచేస్తుంది. ఉత్పాదక సౌకర్యాలు సక్రమంగా వున్నాయనీ ఉత్పత్తి నిర్దిష్ట ప్రమాణాలకు అనుకూలంగా వుంటుందనీ, నమ్మకం కలిగాకనే ఈ సంస్థ ఉత్పత్తిదారుని విజ్ఞప్తి మేరకు లైసెన్సు యిస్తుంది. లైసెన్సులను జారీచేసిన తరువాత కూడా ఐ.ఎస్.ఐ. అధికారులు ఆయా సంస్థలను అప్పుడప్పుడు పరీక్షించి నాణ్యత అమలు సక్రమంగా ఉన్నదో, లేదో పరిశీలిస్తారు. మార్కెట్ నుండి నమూనాలను సేకరించి కూడా నాణ్యతను పరిశీలిస్తారు. ఈ లైసెన్సును సంవత్సర కాలానికి జారీచేస్తారు. తరువాత గతకాలంలో నాణ్యతను సక్రమంగా అమలుజరిపారని తృప్తిపడిన అనంతరమే వాటిని తిరిగి పునరుద్ధరిస్తారు.

ఈ ధ్రువీకరణలు సహజంగా స్వచ్ఛంద పథకం క్రిందకు వచ్చినప్పటికి, ఆయా జాగ్రత్తలను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం కొన్ని సంస్థల ఉత్పత్తుల నాణ్యతల ప్రమాణాలను నిర్దేశించింది. వనస్పతి, గ్యాస్‌స్టౌలు, సిలెండర్లు - వాటి వాల్వులు, సిమెంటు, పిల్లల పౌష్టికాహారం, తెలుపు ముద్రణా కాగితం, శిరస్త్రాణాలు, గనులకు ఉపకరించేడు సంస్థలు ఈ పరిధిలోకి వస్తాయి.

ఐ.ఎస్.ఐ. ధ్రువీకరించిన ఉత్పత్తులకు గ్యారంటీ ఇవ్వటం ద్వారా వినియోగదారులకు, ఉత్పత్తిదారులకు మధ్య మూడవ పార్టీగా ఇది వ్యవహరిస్తుంది. వినియోగదారుల నుండి అందిన ఆరోపణలను ప్రాధాన్యతల ప్రాతిపదికపై పరిశీలించి ఆరోపణల్లో వాస్తవముంటే తగుచర్యలు తీసుకొంటుంది.

హైదరాబాదులోని ఐ.ఎస్.ఐ. శాఖ 1968వ సంవత్సరంలో ప్రారంభించారు. మన రాష్ట్రంలో ఆల్విన్ లిమిటెడ్ వారి గ్యాస్ సిలిండర్లకు మొదటిగా లైసెన్సును జారీచేసింది. మన రాష్ట్రశాఖ 140 ఉత్పత్తులకు సంబంధించి 350 లైసెన్సులను మంజూరు చేసింది. గ్యాస్ సిలిండర్లు, సిమెంటు, బిస్కెట్ల ఉత్పత్తులకు సంబంధించి మన రాష్ట్రం అత్యధికంగా లైసెన్సులను పొందింది. వాయుపీడన కంప్రెషర్లు, శిలాతైలము తదితర రసాయన పరిశ్రలకు దేశం మొత్తం మీద హైదరాబాదు శాఖ ఒక్కటే లైసెన్సులను జారీ చేసింది.

హైదరాబాదుశాఖ 350 మంది సభ్యులకు ప్రమాణాలను తెలియజేస్తూ, వాటికి అవసరమైన సమాచారాన్ని పంపిస్తూ తగిన సేవలు చేస్తున్నది.

## ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజీ:

శాస్త్ర, పారిశ్రామిక పరిశోధనా సమితి న్యూఢిల్లీ వారి ప్రోత్సాహంతో శాస్త్ర పారిశ్రామిక పరిశోధనకు ఒక కేంద్రీయ పరిశోధనా శాలను హైదరాబాదులో 1944 సంవత్సరంలో నిజాం ప్రభుత్వం స్థాపించింది. స్వాతంత్ర్యానంతరం 1956 ఏప్రిల్‌లో దానిని ప్రాంతీయ పరిశోధనా శాలగా మార్చి శాస్త్ర పారిశ్రామిక సమితివారి ఆధ్వర్యంలోకి తేవడం జరిగింది.

రసాయనిక సాంకేతిక పరమైన ప్రత్యేకాంశాల పై ఉత్పత్తి విధాన, డిజైనింగుకు సంబంధించి నవకల్పనలను రూపొందించడం, వాటికై పరిశోధన చేయడం, వాటిని అభివృద్ధి పరచడం, సమీప ప్రాంతంలో లభిస్తున్న రసాయన మూలకాల వినియోగంపై పరిశోధన - వాటి అభివృద్ధి, ఈ పరిశోధనా శాల రూపొందించిన సంకల్పనల ఆధారంగా ప్రారంభమైన రసాయన పరిశ్రమలకవసరమైన సాంకేతిక రసాయనిక యూనిట్ల సామర్ధ్యాన్ని అభివృద్ధి పరచటానికై

తగిన పథకాలను సూచించటం, ప్రభుత్వ ప్రయివేటు రంగంలో నడుస్తున్న రసాయనిక పరిశ్రమలకు తగిన సాంకేతిక సలహాలు సూచనలను అందివ్వటం, రసాయనిక పరిశ్రమలను శాస్త్ర సాంకేతిక పరంగా అత్యున్నత స్థాయిలో రూపొందించడం – ముఖ్య లక్ష్యాలుగా ఈ ప్రాంతీయ పరిశోధనా శాల పనిచేస్తోంది.

ఈ లక్ష్యాల కనుకూలంగా ఔషధాలు, అగ్రో కెమికల్స్, బొగ్గు, నూనెలు, క్రొవ్వుపదార్థాలు, ఆర్గానిక్ తదితర విభాగాలతో ఈ ప్రాంతీయ పరిశోధనా శాల తన లక్ష్యాలను కార్యక్రమాలను జాతీయ అవసరాల కనుగుణంగానూ, దేశం శాస్త్ర సాంకేతికంగా మరింత ముందుకు పోయే విధంగానూ రూపొందించుతోంది.

ఈ పరిశోధనా శాల కృషి ఫలితంగా ఎటువంటి పొగరాని మంటకు ఉపయోగించే బొగ్గును సింగరేణి కాలరీస్ ఉత్పత్తి చేస్తోంది. సిక్కోకోల్ అనే పేరుతో వస్తున్న దీని, ప్రస్తుత సంవత్సరం ఆదాయం 5 కోట్లకు మించి వుంది.

క్రిమి సంహారక మందుల తయారీలో ఈ పరిశోధనా శాల అద్వితీయమైన కృషి సల్పి మోనో క్లోరాఫాస్, క్వినల్ ఫాస్, డియాజనన్, డి.డి.వి.పి. వంటి ఎన్నో అత్యవసరమైన వాటిని తయారు చేయడం జరిగింది. అదే విధంగా ఆర్గానిక్ రసాయనికాల ఉత్పత్తిలో ముఖ్యంగా బెంజిన్ గ్రూపు రసాయినాలలో గణనీయమైన విధానాలను రూపొందించింది. ఆముదం, ప్రత్తి, సన్‌ఫ్లవర్, సోయాబీన్, గింజలనుండి నూనెల తీసే ప్రత్యేక పద్ధతులను రూపొందించింది.

రసాయనిక ఎరువులు ఉత్పత్తి చేసే అనేక పరిశ్రమలలో ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టింది. ఈ పరిశోధనా శాల వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి తెగుళ్ళ ద్వారా వచ్చే నష్టాన్ని తగ్గించడానికి అంతర్జాతీయపరంగా అందుబాటులో వున్న సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించి తగిన క్రిమి సంహారక మందులను ఉత్పత్తి చేసే కృషి సాగిస్తోంది.

బొగ్గును ద్రవ ఇంధన రూపంగానూ, రసాయనాలుగాను మార్చేందుకు తగిన పరిశోధనలను జరుపుతోంది. ఇక్కడ జరిగిన పరిశోధనల మూలంగా నూనె, క్రొవ్వు పదార్థాల పరిశోధనకు భారతదేశంలో పెద్ద కేంద్రంగా ప్రాంతీయ పరిశోధనా శాల రూపు దిద్దుకుంది. వీటితో పాటుగా అనేక రసాయనికాల ఉత్పత్తిలోనూ, వాటిని అభివృద్ధి పర చడంలోనూ, మెరుగైన పద్ధతులను రూపొందించడంలోనూ శ్లాఘనీయమైన కృషి చేస్తూ జాతిని శాస్త్ర సాంకేతిక పరంగా అత్యున్నత శిఖరాలకు పయనింపచేస్తోంది, ఈ ప్రాంతీయ పరిశోధనాశాల. ఆర్.ఆర్.లాబ్స్‌గా ప్రఖ్యాతిగాంచిన ఈ పరిశోధనశాల పేరును ఐ.ఐ.సి.టి. అంటే ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజీ అని మార్చారు.

## జాతీయ పోషకాహారసంస్థ – హైదరాబాదు:

జీవనానికి ఆహారంయొక్క అవసరాన్ని మానవుడు అనాది కాలంలోనే గుర్తించాడు. అందుకనే ఆహార సేకరణే తన ముఖ్య దైనిక కార్యక్రమంగా పెట్టుకొని జీవనయాత్ర సాగించాడు. అయినప్పటికీ శాస్త్రీయంగా ఆహారంయొక్క విలువను, ఆహారం, ఆరోగ్యాలకు గల సంబంధాన్ని తెలుసుకోవటం ఇటీవలి కాలంలో జరిగిందనే చెప్పాలి.

భారతదేశంలో పోషణ విజ్ఞానశాస్త్ర పరిశోధన 1918వ సంవత్సరంలో కూనూరు (తమిళనాడు)లో "బెరిబెరి యూనిట్" స్థాపనతో మొదలైందనటం సమంజసం. క్రమేపీ అభివృద్ధి చెందుతూ వచ్చిన ఈసంస్థ 1958లో హైదాబాదుకు మార్చబడి, ప్రస్తుతం జాతీయ పోషకాహారసంస్థ (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్)గా రూపొందింది. పోషణ లోపం కారణంగా ప్రజల్లో వచ్చే వేరువేరు జబ్బులు, వాటి తీవ్రత, నివారణోపాయాలు వీటిని గురించిన పరిశోధనలు జరపటమేకాక ఈ సంస్థ ప్రజల్లో పోషణ విజ్ఞానాన్ని విస్తరిం పజేసి, వాళ్ళ ఆహారం పుష్టికరమైనదిగా మార్పుచెందటానికి తగిన ప్రయత్నాలు చేస్తుంది.

వైద్య శాస్త్రజ్ఞులేకాక, బయోకెమిస్ట్రీ, బయోఫిజిక్స్, అనటికల్ కెమిస్ట్రీ, పేథాలజీ, ఎండ్రోకెనాలజీ ఇతర శాఖలకు చెందిన అనేక శాస్త్రజ్ఞులు ఈసంస్థలో పనిచేస్తున్నారు.

అప్పుడప్పుడూ మనం తినే ఆహారం విషపూరితం కావచ్చు. ఈ సమస్యను సమగ్రంగా పరిశీలించి, ఆరోగ్యాన్ని రక్షించుకొనే పద్ధతులను కనుగొనేందుకై ఈ సంస్థలో 'టాక్సి కాలజీ' విభాగం ఏర్పాటు చేయబడింది. ఇక ఆహారలోపం యొక్క ప్రభావం శరీరంలోని వేర్వేరు భాగాలపై వివిధంగా పనిచేస్తుందో తెలుసుకునేందుకు జంతుశాల తోడ్పడుతుంది. పేథాలజీ విభాగం ఇందుకు తగిన ఏర్పాట్లను కలిగివుంది.

సంస్థలోని 'బయోఫిజిక్స్' విభాగం, పోషకాహార పరిశోధనకు అవసరమయ్యే అధునాతన శాస్త్రీయ సాధనాలను తగిన స్థితిలో వుంచి, వాటిని సక్రమంగా ఉపయోగించటంలో తోడ్పడుతుంది.

పోషకశాస్త్రంలోని అధునాతన విషయాలను, మెళ కువలను అందజేసే నిమిత్తం సంస్థ, దేశంలోని వైద్య కళాశాలల్లో పనిచేసే ప్రొఫెసర్లకు, ప్రజారోగ్యశాఖలోని ఉన్నత సిబ్బందికి తగిన తర్ఫీదు ఇస్తుంది. మన దేశంలోని వేర్వేరు రాష్ట్రాలనుండే కాక ఆగ్నేయాసియా, ఇతర మండలాలలోని దేశాల నుండి కూడా వైద్య సిబ్బంది వచ్చి ఇక్కడ శిక్షణ తీసుకుంటారు.

ఇలాగే ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన రెండు జబ్బుల విషయంలో కూడా సంస్థ పరిశోధనలు ప్రగతిని సాధించాయి. నల్గొండ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో పళ్లు, ఎముకలకు సంబంధించిన "ఫ్లోరోసిస్" జబ్బు; త్రాగే బావినీటిలో "ఫ్లోరైడ్" అన్న పదార్థం ఎక్కువ మోతాదులో వున్నందువల్ల వస్తుంది. చుట్టుప్రక్కల లభించే సేద్యానికి ఉపయోగించే నాగార్జునసాగర్ కాలువ నీటిని త్రాగటానికి కూడా లభింపజేస్తే ఈ ప్రాంతంలో 'ఫ్లోరోసిస్'ను ఎదుర్కొన వచ్చునని జాతీయ పోషకాహారసంస్థ సూచించింది.

**పోషకాహార లోప నిరోధానికి పరిష్కారాలు:**

మనదేశంలో రోగాలు రావటానికి – సరిపడా ఆహారం లేకపోవటం, పోషకాహారం సక్రమంగా తీసుకొనకపోవటం కారణంగా చెప్పవచ్చు. పిల్లలు తీసుకొనే ఆహారంలో ప్రోటీనులు లేకపోవటం వల్ల చూపు మందగించటం, రక్తహీనత వస్తున్నాయి. ఈ సంస్థ చేస్తున్న పరిశోధన మూలంగా వాటి పరిష్కారానికి తగిన మార్గాలు కనుగొంటున్నారు. స్థానికంగా లభించే అనేక రకరకాల సాంప్రదాయ ఆహారాల నుండి తగిన ఔషధాలను ఈ సంస్థ రూపొందించింది. పోషకాహార లోపం లేకుండా, శరీరానికి అవసరమైన ప్రోటీనులు అందేందుకు అవసరమైన ఆహారాన్ని తెలియజేసే అనేక జాతీయస్థాయి పథకాలను రూపొందించారు.

పిల్లలు తీసుకొనే ఆహారంలో విటమిన్ 'ఎ' లోపించటం వల్ల ఏర్పడే దృష్టిమాంద్యం నివారణకు అదే విధంగా ఐరన్ లోపంవల్ల రక్తహీనత నివారణకు ఈసంస్థ కేంద్ర ప్రభుత్వ సహాయంతో అనేక పథకాలు రూపొందించి అమలుపర్చింది.

**ఆహారంలోని పోషక విలువలు:**

ఈ సంస్థ వల్ల హరిత విప్లవాన్ని, పోషక విలువలనే మరో కోణం నుండి చూడటం జరిగింది. ఈ సంస్థ పరిశోధించిన సమాచారాన్ని వ్యవసాయ పరిశోధనా కేంద్రానికి అందించటం వల్ల నూతన పోషకాహార ధాన్యాలు రూపొందించటం జరుగుతున్నది.

ఈ మధ్య కాలంలో ప్రోటీనులు అధికంగా ఉన్న అనేక రకాల నూనె విత్తనాలలో అధిక దిగుబడి వస్తున్నది. వేరుశెనగ, అవాలు, నువ్వులు, కుసుమపువ్వు, కొబ్బరి మొదలైన వాటిలో ధాన్యంలో కంటే ఎక్కువ వనరులున్నట్లు కనుగొన్నారు. వీటిలో ఉండే పోషకాహార, వైద్య విలువల కొరకు ఇంకా పరీక్షలు కొనసాగుతున్నాయి. నూనె ప్రోటీనులకు సంబంధించిన వివిధ రకాలను గుర్తించటం జరిగింది. మామిడి గుజ్జు, పిస్తా మొదలగు వాటిలో ప్రోటీన్లపై కూడా పరిశోధనలు కొనసాగుతున్నాయి.

**ఆహారంలోని విషపదార్థాలు:**

**ఫంగస్ విషపదార్థాలు:**

ఆహారపదార్థాలను సరైన వాతావరణంలో నిల్వ చేయకపోవడంవల్ల బూజుపట్టి విషపదార్థాలుగా కలుషితమయ్యే ప్రమాదం వుంది. ఫంగస్ విషపదార్థాలను, ఏ ఏ రకాల ఆహార పదార్థాలు నిరోధించగలవో ఈ సంస్థ పరిశోధనల వల్ల గుర్తించటం జరిగింది.

**లాథరిజమ్:**

కేసరి పప్పును ముఖ్య ఆహారంగా తినే మధ్య భారత దేశంలో కాళ్లు చేతులు పక్షవాతానికి దారితీసే 'లాథరిజమ్' అనే వ్యాధి చాలా ఏళ్లుగా వుంది. ఈ సంస్థ జరిపిన పరిశోధనల ఫలితంగా కేసరి పప్పులో గల విష స్వభావాన్ని తొలగించే పద్ధతులు రూపొందాయి.

అతిసార వ్యాధిని నిరోధించటానికి, ఓరల్ రీహైడ్రేషన్ సొల్యూషన్ తయారుచేయడానికి ఈ సంస్థ అనేక పరీక్షలను జరుపుతోంది.

విటమిన్లు, ప్రోటీన్లు, లవణాల రహితంతో బాధపడ్తున్న వ్యక్తులకు వాటి నిరోధానికై వాడబడే ఔషధాల వల్ల జరిగే మార్పులు, వాటి పరిమాణం మొదలైన విషయాలపై ఈ సంస్థ ఇటీవలి కాలంలో పరీక్షలు నిర్వహిస్తోంది.

**పోషకాహారం – పెరుగుదల:**

పోషకాహార లోపంవల్ల శిశువుల పెరుగుదలలో వచ్చే తేడాలను గుర్తించేందుకు ప్రమాణాలను గురించి అలాగే పోషకాహార పదార్థాలు మనిషిలో పని సామర్థ్యాన్ని పెంచడంపై కల్గించే ప్రభావాలను పరిశోధించింది.

**ప్రచార కార్యక్రమాలు:**

జాతీయ పోషకాహార సంస్థ తను నిర్వహించిన పరిశోధనలు, పరీక్షలు వాటి ఫలితాలను ప్రజలకు చేరవేసేందుకు 'న్యూట్రిషన్' అనే త్రైమాసిక ఆంగ్ల పత్రికను 'పోషణ్' అనే తెలుగు మాసపత్రికను నిర్వహిస్తోంది. వీటితో పాటుగా 'న్యూట్రిషన్ న్యూస్' వార్తాలేఖను, నూతనంగా జరుగుతున్న పరిశోధనలపై అనేక కరపత్రాలను ప్రచురించి పంపిణీ చేస్తోంది. ఇంతే కాకుండా టి.వి., రేడియోల ద్వారా ప్రజలకు విజ్ఞాన వ్యాప్తి కోసం కార్యక్రమాలనూ నిర్వహిస్తోంది.

## నివారణ వైద్య సంస్థ:

హైదరాబాదు నారాయణగూడాలో నెలకొల్పబడిన 'నివారణ వైద్య సంస్థ' వివిధ రోగాలను అరికట్టే మందులు తయారుచేయడము ప్రధానోద్దేశంగా ఏర్పాటు చేయబడింది.

ఇందులో వివిధ రకాల టీకాలు తయారీ విభాగం,

నీటి పరీక్ష విశ్లేషణల విభాగం, రోగ నిర్ధారణ విభాగాలు, ఔషధ ప్రామాణిక నియంత్రణ విభాగం, కేంద్ర రక్తనిధి, ఆహార ప్రయోగశాల, ఆహారకల్తీ నిరోధక చట్టం అమలు పర్చే విభాగం మొదలైన శాఖలుగా ఈ నివారణా వైద్య సంస్థ పనిచేస్తోంది.

ఈ సంస్థ కలరా, రబీస్, టైఫాయిడ్, మశూచి ఇంకా అనేక ఇతర వ్యాధులు రాకుండా వుండేందుకు కావలసిన టీకాలను ఉత్పత్తి చేస్తోంది. ఈ సంస్థ కృషి మూలంగా మన రాష్ట్రావసరాలు తీరడమే కాకుండా ఇతర రాష్ట్రాలకు కూడా కావలసిన టీకాలను పంపిణీ చేయగలుగుతోంది. ప్రపంచ ఆహార సంస్థ సూచన మేరకు, ఈ సంస్థ ఉత్పత్తి చేసిన 'క్రోసోల్' పౌడర్ ఉదరకోశ సంబంధిత వ్యాధిని నివారించడంలో ప్రశస్తి పొందింది. పిల్లల డీహైడ్రేషన్ థెరపీకి ఇది ఎంతో మేలైన ఔషధంగా వినియోగిస్తున్నారు. నీరును శుభ్రపరచి స్వచ్ఛమైన నీరును అందివ్వడంలో ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో వున్న వివిధ పరిశ్రమలకు, దేవస్థానాలకు, రైల్వే, ఆసుపత్రులకు సాంకేతిక సలహాలు సూచనలు యీ సంస్థ అందిస్తోంది. ఏ నీరు ఎంతవరకు త్రాగుటకు అనువైనదీ, పరిశ్రమలకు అనువైనదీ నిర్ధారించటానికి తగిన పరీక్షలు యీ సంస్థ చేస్తోంది.

ఫ్లోరోసిస్ వ్యాధి నివారణకై విస్తృతస్థాయిలో పరిశోధనలను యీ సంస్థ నిర్వహించింది. గృహోపకరంగా డీఫ్లోరైడ్ పథకాన్ని ఒకదానిని యీ సంస్థ రూపొందించింది.

యీ సంస్థ విభాగాల్లో ఒకటైన కేంద్ర రక్తనిధి అరుదుగా వుండే రక్తాన్ని వివిధ వ్యక్తుల నుండి సేకరించి ప్రాణాపాయ స్థితిలో వున్న వారికి ప్రభుత్వ, ప్రైవేటు ఆసుపత్రుల ద్వారా పంపిణీ చేస్తుంది.

### ఔషధ చరిత్ర సంస్థ:

సిద్ధ, అయుర్వేద వైద్య పద్ధతులలో పరిశోధనకు కేంద్రసమితివారు 1969లో హైదరాబాదులో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్ అనే సంస్థను నెలకొల్పారు.

### ఆయుర్వేద పరిశోధనా శాఖ:

ఆయుర్వేద వైద్య పద్ధతిలో పరిశోధన సాగించేందుకు 1979లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ శాఖను దృఢతరం చేసింది. విజయవాడలో మండలస్థాయి కేంద్రం నెలకొల్పారు. గుండెజబ్బులు, చక్కెరవ్యాధి, పక్షవాతం వంటి వ్యాధుల చికిత్సపై పరిశోధనలు చేయిస్తున్నారు.

## కేంద్ర యునానీ వైద్య పరిశోధనా సంస్థ:

గ్రీసులో ఆవిర్భవించిన యునానీ వైద్య పద్ధతి కాలక్రమేణా అరబ్బుల ఆదరణలో అభివృద్ధిచెంది 17వ శతాబ్ది అంతానికి భారతదేశానికి వచ్చింది. ప్రసిద్ధిపొందిన ప్రాచీన వైద్య పద్ధతులలో యునానీ వైద్యం ముఖ్యమైంది.

యునానీ వైద్య పద్ధతులను మెరుగుపరచి అభివృద్ధి చేయడానికి భారత ప్రభుత్వం 1971లో హైదరాబాదులో ఒక కేంద్ర యునానీ పరిశోధనా సంస్థను నెలకొల్పింది.

ఈ సంస్థ లక్ష్యాలు:-

* సుదీర్ఘ మొండి వ్యాధులకు మేలైన, చౌకైన నివారణో పాయాలను కనుగొనడం.
* వివిధ వ్యక్తులు, సంస్థలు కనుగొన్న పద్ధతులను పరిశీలించడం.
* యునానీ వైద్య సూత్రాల ఆధారంగా వైద్య శాస్త్రాభివృద్ధికి కృషి చేయడం.
* అధునిక శాస్త్ర సాంకేతికాభివృద్ధి వెలుగులో ఈ యునానీ వైద్య భావాన్ని పరిశీలించడం.
* వివిధ చికిత్సా పద్ధతులు, థెరపీ పద్ధతులలో పరిశోధన చేయడం.

ఈ లక్ష్యాలను సాధించేందుకు వీలుగా 13 విభాగాలను ఈ పరిశోధనా సంస్థ ఏర్పాటు చేసుకుంది.

1. ఔట్ పేషెంట్ విభాగం, 2. ఇన్ పేషెంట్ (150 పడకలతో), 3. పేథాలజీ లేబరేటరీ, 4. బయో కెమిస్ట్రీ, 5. ఫార్మకాలజీ లేబరేటరీ, 6. ఎక్స్‌రే యూనిట్, 7. ఫార్మసీ విభాగం, 8. ఫోటోగ్రఫీ విభాగం, 9. సంచార చికిత్సాలయం, 10. ఔషధ వృక్ష పరిశీలనా విభాగం, 11. ప్రవృత్తి సిద్ధాంత పరీక్షా విభాగం, 12. గ్రంథాలయం, 13. ఔషధ ఉద్యానవనం.

ఈ వివిధ విభాగాలతో యునానీ వైద్య పరిశోధనా సంస్థ తన కార్యకలాపాలను కొనసాగిస్తోంది.

సాంఘిక, జాతీయ ప్రాముఖ్యత కలిగిన వైద్య సమస్యలకు ప్రాముఖ్యతనిస్తూ ఈ సంస్థ యునానీ పద్ధతిలో పరిశోధన కావిస్తోంది.

ప్రస్తుతం బొల్లి, మలేరియా, తెల్లబట్ట, కామెర్లు, సిన్యూనిసిటస్, పెప్టిక్ అల్సర్, రెంటల్‌బ్లాడర్ కాలిక్యులస్ వ్యాధులపై పరిశోధనలు చేస్తోంది.

2,000 సంవత్సరానికి అందరికీ ఆరోగ్యం అందివ్వడానికి వివిధ వ్యాధుల నివారణకు తగిన కృషి ఈ సంస్థ చేస్తోంది. వ్యాధులపై పరిశోధనే కాకుండా చికిత్సను కూడా చేయడం ఈ సంస్థ ప్రత్యేకత. అందుకొరకు 50 పడకలు వున్న ఇన్ పేషెంట్ వార్డు కూడా వుంది. భారతదేశంలో యునానీ వైద్యంపై పరిశోధన చేస్తున్న ఏకైక సంస్థ యిది.

బొల్లి (ల్యూకోడెర్మా) వ్యాధి నిర్మూలనకు ఈ సంస్థ చేసిన చికిత్స అత్యంత పేరు ప్రఖ్యాతులు గడించింది. దేశ

విదేశాల నుండి పదులవేల మంది బొల్లి వ్యాధిగ్రస్తులకు చికిత్స జరిపింది. 70–80 శాతం మందికి పూర్తిగా వ్యాధి నయమవడం గమనించవలసిన విషయం.

ఈ సంస్థ ఆధ్వర్యంలో వున్న సంచార చికిత్సాలయం మారుమూలల వున్న గ్రామ ప్రజలకు ముఖ్యంగా వెనుకబడిన వర్గాలకు వైద్య సౌకర్యాలను అందిస్తోంది.

ఉస్మానియా వైద్య విద్యాలయం సహకారంతో కాలేయపు వాపు పెప్టిక్ అల్సర్ వ్యాధులపై పరిశోధన చేస్తోంది. 1976 లో బొల్లి వ్యాధిపై సంస్థ కనుగొన్న చికిత్సా పద్ధతులపై వివిధ వైద్య సంస్థలతో కలిసి సదస్సును నిర్వహించింది.

వివిధ వైద్య సంస్థలలో పనిచేస్తున్న వారికి వైద్య పరిశోధనా పద్ధతులు మొదలగు అంశాలపై ఇక్కడ శిక్షణ ఇస్తున్నారు.

## ఆంధ్రప్రదేశ్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు:

రాష్ట్రంలోని శాస్త్రవేత్తలు, శాస్త్రీయ పరిశోధకులకు ఒక వేదిక వుండాలనే సంకల్పంతో 1963 మార్చిలో రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తును (ఎకాడమీ ఆఫ్ సైన్స్) ఏర్పరచింది. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం కేంపస్‌లో దీని కార్యాలయం పనిచేస్తోంది. రాష్ట్రస్థాయిలో ఇలా ఏర్పడిన విజ్ఞాన శాస్త్ర అకాడమీలలో దేశం మొత్తం మీద ఇదే మొదటిది.

### ఆశయాలు, లక్ష్యాలు:

శాస్త్ర విజ్ఞాన పరిషత్తు ప్రధాన ఆశయాలు, లక్ష్యాలు యివి: 1. ఆంధ్రప్రదేశ్‌లో శాస్త్రీయ విజ్ఞానాన్ని అభివృద్ధి చేయడం, 2. ఉపన్యాసాలు, గోష్ఠులు, సదస్సులు, ప్రదర్శనల ద్వారా రాష్ట్ర ప్రజలలో శాస్త్రీయ విజ్ఞానాన్ని పెంపొందించటం, 3. శాస్త్రీయ విషయాల ప్రదర్శనశాలను స్థాపించటం, 4. శాస్త్రీయ విషయాల గ్రంథాలయాన్ని స్థాపించటం, 5. శాస్త్రీయ విషయాలపై గ్రంథాలు, పత్రికలు ప్రచురించడం, 6. శాస్త్రీయ విషయాలతో సంబంధం గల సంస్థలను ప్రోత్సహించటం, 7. శాస్త్రరంగం అభివృద్ధికి విధానాలు సమకూర్చడం.

1974 నుంచి హైస్కూలు స్థాయిలో సైన్సు పాఠ్యాంశాల నిర్ణయానికి ప్రభుత్వం ఏర్పాటు చేసిన సంప్రదింపుల కమిటీలో యీ సంస్థకు తగిన ప్రాతినిధ్యం లభించింది.

1963 లో 50 మంది శాస్త్రజ్ఞులతో ప్రారంభమైన ఈ పరిషత్తు మూడు దశకాలను పూర్తి చేసుకుని వందలాది మంది శాస్త్రజ్ఞులను సభ్యులుగా కలిగియుంది. వీరుకాక అనేక మంది అసోసియేటెడ్ సభ్యులు, కంపెనీలు యీ సంస్థ అభివృద్ధికి దోహదం చేస్తున్నాయి.

రాష్ట్రంలో సైన్సు అంశాలను బోధిస్తున్న అనేక వేల మంది ఉపాధ్యాయులకు సమకాలీన శాస్త్రాభివృద్ధి, మారుతున్న పాఠ్యాంశాలకు అనుకూలంగా పునశ్చరణ తరగతులను – యీ పరిషత్తు ప్రాంతీయ కేంద్రాల ద్వారా నిర్వహిస్తోంది. విశాఖపట్నం, తిరుపతి, వరంగల్‌లలో ప్రాంతీయ కేంద్రాలు 1966 నుంచి పనిచేస్తున్నాయి. 1967 నుంచి జర్నల్‌ను ప్రచురిస్తోంది.

1993 నాటికి ఈ సంస్థలో 139 మంది జీవిత సభ్యులతో సహా 187 మంది ఫెలోలు వున్నారు. 28 మంది అసోసియేట్ సభ్యులు వున్నారు. సైన్సుకు సంబంధించిన వీడియో ఫిల్ములు తయారు చేసి వాటి ప్రదర్శనకు అవసరమైన అన్ని వసతులను సమకూర్చుకుంది. ఒక వీడియో వాహనం ద్వారా యీ ప్రదర్శనలను నిర్వహిస్తోంది. జనజ్ఞాన విజ్ఞాన జాత వంటి అనేక కార్యక్రమాలు నిర్వహించింది.

విజ్ఞాన శాస్త్రంలో పరిశోధనలను ప్రోత్సహించేందుకు వీలుగా 35 ఏళ్ళలోపు యువ శాస్త్రజ్ఞులకు, వివిధ అంశాలలో పరిశోధనలు చేసిన వారికి అవార్డులు, బహుమతులను ఈ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు 1976 నుంచి ప్రదానం చేస్తోంది. ఈ సంస్థకు సొంత భవనం లేదు. వనరులు చాలా తక్కువ. అయినా ప్రశంసార్హమైన కార్యక్రమాలును నిర్వహిస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం ఈ సంస్థకు మరిన్ని నిధులు సౌకర్యాలు కల్పించడం అవసరం.

## ఆర్థిక సామాజిక అధ్యయన కేంద్రం, హైదరాబాదు:

అభివృద్ధి సమస్యలు (డెవలప్‌మెంట్ ప్రాబ్లమ్స్)ను అధ్యయనం పరిశోధన చేసే సామాజిక శాస్త్రవేత్తలను సమన్వయ పరిచి, వారి అధ్యయన ఫలాన్ని సామాజికశాస్త్ర వేత్తలకు విధాన నిర్ణయవేత్తలకు అందుబాటులోకి తెచ్చే ముఖ్య ఉద్దేశ్యంతో 1980 సంవత్సరం హైదరాబాదు నగరంలో ఈ ఆర్థిక సామాజిక అధ్యయన కేంద్రం ప్రారంభించబడింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, భారత సాంఘిక పరిశోధనా సమితి సహకారంతో ప్రారంభమైన ఈ కేంద్రం, ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా రూపొందించబడింది. ఈ కేంద్రం ఒక్క పరిశోధనకే పరిమితం కాకుండా బోధనా బాధ్యతను కూడా నిర్వహిస్తోంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక, సాంఘికాభివృద్ధికి సంబంధించిన అంశాలపై పరస్పర ఆధారమైన, పరస్పర సంబంధితమైన పరిశోధన, శిక్షణ కార్యక్రమాలను ఈ కేంద్రం నిర్వహిస్తుంది. ఈ కేంద్ర లక్ష్యాలకనుగుణంగా గణాంక వివరాలను వివిధ అంశాలకు సంబంధించిన విషయ సేకరణను (డాక్యుమెంటేషన్) వర్క్‌షాప్‌లను, శిక్షణ కార్యక్రమాలను నిర్వహిస్తుంది.

అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయ సహకారంతో ఈ కేంద్రం డెవలప్‌మెంట్ స్టడీస్‌లో ఎం.ఫిల్., పి.హెచ్.డి.

పరిశోధన కార్యక్రమాన్ని కూడా నిర్వహిస్తోంది. ఇందిరాగాంధీ ఓపెన్ యూనివర్సిటీ వారి కోర్సులకు సహకారం అందిస్తోంది. ఈ కేంద్రంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి సంబంధించిన ఆర్థిక అంశాలను సేకరించి పదిలపరచే డేటా (డేటా బ్యాంకు) సౌకర్యం కూడా వుంది. విషయ సేకరణకై సర్వేలను కూడా ఈ కేంద్రం నిర్వహిస్తోంది. సామాజిక శాస్త్ర పరిశోధనలో ఆర్థిక సామాజిక అంశాలను ముఖ్యంగా సామాజిక అభివృద్ధి అంశాలపై పరిశోధన చేయడంలో ఈ కేంద్రం ఎంతో కృషి సల్పుతోంది. దీన్ని అభివృద్ధి పర్చడంలో డైరెక్టర్ డా. ఆర్.రాధాకృష్ణ ఎంతో కృషి చేశారు.

## రాష్ట్ర అభిలేఖాగారం: (స్టేట్ ఆర్కైవ్స్)

వందలాది సంవత్సరాల నుంచి వివిధ రాజుల, చక్రవర్తుల తరువాత బ్రిటీషు వారి పాలనలో ఆంధ్రప్రదేశ రాష్ట్ర ప్రజల రాజకీయ, సామాజిక, సాంస్కృతిక చరిత్రను తెలియజెప్పే అమూల్య పత్రాలను సేకరించి భావితరాలవారి కోసం పదిలపరచే అపూర్వమైన ప్రభుత్వశాఖ ఇది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని పత్రాలు ఆంధ్ర జిల్లాలకి సంబంధించిన రికార్డ్సని కర్నూలుకు తరలించి ఒక రికార్డ్ ఆఫీసును ఏర్పరిచారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత చాలా సంవత్సరాలకు 1962 హైదరాబాదులో రాష్ట్ర అభిలేఖాగారంగా దీనిని ఏర్పాటు చేయడం జరిగింది. ఆ సమయంలోనే హైదరాబాదు రాష్ట్ర పత్రాలను కూడా దీనికి జతపర్చారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణలో భవన సముదాయం నిర్మించి అబిడ్స్ నుండి ఈ కార్యాలయాన్ని తరలించారు.

ఈ విభాగంలో బహమనీ, ఆదిల్ షాహి, కుతుబ్‌షాహి మొదలైన మొగలు చక్రవర్తులు పర్షియన్ భాషలో జారీ చేసిన సుమారు వంద ఫర్మానాలు (జి.ఓ.లు) షాజహాన్, ఔరంగజేబు చక్రవర్తుల కాలంలో విడుదలైన దాదాపు లక్షన్నర పత్రాలు భద్రపరచడం జరిగింది.

క్రీస్తు శకం 1724–1850 మధ్యకాలంనాటి హైదరాబాదు సంస్థాన కార్యాలయాల్లో జారీ అయిన పత్రాలు, 1853–1956 మధ్య జరిగిన సెక్రటేరియట్ రికార్డులు, 1920–52 సంవత్సరాల మధ్యనాటి మద్రాసు సచివాలయ రికార్డులు, 1953–59 నాటి మన సచివాలయ అధికార పత్రాలు ఇక్కడ పొందుపరచటం జరిగింది. ఇవేకాక పర్షియన్, ఉర్దూ, కన్నడ, తెలుగు భాషల్లో గల సుమారు ఎనిమిది వందల ప్రాచీన వ్రాతపతులు, తాళపత్ర గ్రంథాలు కూడా ఇక్కడ పదిలపరచడం జరిగింది.

ఆంధ్ర ప్రాంతంలోని స్వాతంత్ర్యోద్యమ కాలానికి సంబంధించి అన్ని రకాల కార్యకలాపాల నివేదికలు ఇక్కడ భద్రపర్చారు. ఆంధ్రదేశంలోని అన్ని రాజకీయ పార్టీల పుట్టుపూర్వోత్తరాలు వాటి ఉద్యమాలు, వివరాలు ఇక్కడ రికార్డు చేయబడి ఉన్నాయి.

స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఆంధ్ర ప్రజలకు సాంఘిక, రాజకీయ స్ఫూర్తికి సంబంధించి ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక వంటి అమూల్యమైన ఎన్నో పత్రికలను ఇక్కడ మైక్రో ఫిల్ముల రూపంలో జాగ్రత్త చేశారు. ఇవికాక గుంటూరు, కర్నూలు జిల్లాలతో సహామొత్తం 762 గ్రామాలకు చెందిన సాంఘిక, ఆర్థిక, చారిత్రక విషయాలు తెలియజేసే మెకంజీ, బ్రౌన్ రికార్డ్సు కూడా ఇక్కడ ఉన్నాయి.

ఈ అభిలేఖాగారంలో ఇంగ్లీషు, తెలుగు, పర్షియన్, ఉర్దూ, మరాఠీ భాషలలో మొత్తం 12 వేల పుస్తకాలు ఉన్న గ్రంథాలయం కూడా వుంది. ఆంధ్రదేశంలో గ్రామ గ్రామానికి చెందిన పటాలతో డాక్యుమెంటేషన్ విభాగం, సేకరించిన పత్రాలను చెడిపోకుండా నిల్వచేయడానికి ఫ్యూమిగేషన్ విభాగం, ఫోటో గ్రాఫిక్ యూనిట్లు కూడా ఇందులో వున్నాయి. ఈ విభాగానికి అనుబంధంగా సెక్రటేరియట్‌కు సంబంధించిన పత్రాలను భద్రపరిచేందుకు ఆర్కైవ్స్ శాఖను ఒక దానిని రాష్ట్ర సెక్రటేరియట్‌లో ఏర్పరిచారు.

రాష్ట్ర చారిత్రక, రాజకీయ, సాంఘిక వాస్తవాలనెన్నిటినో వెలికి తీసే పరిశోధనలను ప్రోత్సహించేందుకు వీలుగా రీసెర్చి స్కాలర్‌షిప్‌లను కూడా ఈ విభాగం కేటాయిస్తుంది. అయితే గత కొన్ని సంవత్సరాలుగా ఈ పథకాన్ని నిలిపి వేశారు. తెలుగులో ప్రారంభ కాలంలో నిర్మించిన చలన చిత్రాలను, కళాత్మక విలువలున్న చిత్రాలను పదిలపరచి ఫిలిం ఆర్కైవ్స్‌ను కూడా ఈ శాఖలో పొందుపరచే పథకాన్ని ఒక దానిని రూపొందించారు. అయితే ఇంతవరకు దానిని అమలు చేయలేదు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చారిత్రక, రాజకీయ, ఆర్థిక అంశాలపై పరిశోధనలను చేస్తున్న అనేకమందికి ఈ రాష్ట్ర అభిలేఖాగారం ఒక బంగారు గని.

## జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థ

దేశంలో పెద్ద ఎత్తున కమ్యూనిటీ డెవలప్‌మెంట్ పథకాన్ని అమలు పరచడం ప్రారంభించడంతో భారత గ్రామీణ సమస్యలు, డెవలప్‌మెంట్ మౌలిక సిద్ధాంతం గురించి పరిశోధన, శిక్షణ కార్యక్రమాలు నిర్వహించాల్సిన అవసరం ఏర్పడింది. వీటి కొరకు ఉత్తరప్రదేశ్‌లోని ముస్సోరీలో కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కేంద్ర అధ్యయన, పరిశోధనా సంస్థను, దీనితో పాటుగా శిక్షకుల శిక్షణా కేంద్రాన్ని ఒకదానిని రాజ్‌పూర్‌లోను 1958లో స్థాపించారు. ఆ తరువాత 1965 నవంబర్ 1న ఈ సంస్థను హైదరాబాదులోని రాజేంద్రనగర్‌కు తరలించి జాతీయ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ సంస్థగా మార్పు చేయడం జరిగింది.

తిరిగి 1977 సంllలో ప్రభుత్వం ఈ సంస్థ పేరును మార్చడంతో జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థగా ఆవిర్భవించింది.

జాతీయ సాంఘిక, ఆర్థిక అభివృద్ధి ప్రవంతికి అనుగుణంగా గ్రామీణాభివృద్ధికి కావలసిన కార్యక్రమాల్ని, ప్రణాళికలను రూపొందించడం ఈ సంస్థ ముఖ్య లక్ష్యం.

### ఈ లక్ష్య సాధన కొరకు:

1. గ్రామీణ ప్రజలు ముఖ్యంగా బలహీనవర్గాలు, స్త్రీల సాంఘిక ఆర్థికాభివృద్ధి.
2. గ్రామీణాభివృద్ధి పరిపాలన యాజమాన్య అవసరాల కనుగుణంగా పంచాయితీరాజ్ వంటి వ్యవస్థలు.
3. గ్రామీణ పౌరులకు ఎక్కువ ఉద్యోగావకాశాలు, ఆదాయం కలిగే విధంగా తగిన ప్రాంతీయ ప్రణాళికలు తయారు చేయడం, స్థానిక పథకాలు అమలు జరిగి విజయవంతం చేయడం.
4. మానవ వనరులు, శిక్షణ సాంఘిక సంస్థల పెంపుదల.
5. గ్రామీణాభివృద్ధికి అనుకూలమైన సాంకేతిక పరిజ్ఞానం రూపొందించడం.
6. గ్రామీణాభివృద్ధికి సంబంధించిన విజ్ఞానాన్ని సమాచారాన్ని ప్రచురణల ద్వారా పంపిణీ.
7. పారిశ్రామిక వ్యవసాయక సమ సమాజ పరిణామానికి సంబంధించిన అంశాలు.
8. పరిసరాల పరిరక్షణ, నిరుపయోగమైన వాటిని తిరిగి ఉపయోగించడం.
9. గ్రామీణాభివృద్ధికి అవసరమైన విధాన నిర్ణయాలు వాటికి ప్రత్యామ్నాయ మార్గాలు.

మొదలైన అంశాలపై కూలంకషంగా అధ్యయనం, పరిశోధనలు ఈ జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థ నిర్వహిస్తుంది.

పై చెప్పిన ప్రతి అంశంలోనూ పరిశోధన చేయవలసిన ప్రత్యేక విషయాలను గుర్తించి ఆయా విషయాలపై శిక్షణా పథకాలను, సదస్సులను, గోష్ఠులను నిర్వహిస్తోంది. ఇందుకొరకు: యాంత్రపాలజీ, ఆర్థిక శాస్త్రం, సాంకేతిక బదలాయింపు, మానవవనరులు, సమాచారం, ప్రణాళికా కేంద్రం, పంచాయితీరాజ్ కేంద్రం, మనస్తత్వ శాస్త్రం, గ్రామీణ పరిశ్రమలు, ఉద్యోగిత, సామాజిక, గణాంక, స్త్రీ అధ్యయన విభాగాలను ఈ సంస్థ ఏర్పరచింది. ఈ విభాగాలన్నీ గ్రామీణాభివృద్ధికి తమతమ అంశాలకు సంబంధించిన పరిశోధన, అధ్యయనం, శిక్షణ, సదస్సులు నిర్వహిస్తాయి.

ఈ విభాగాలు సాగిస్తున్న పరిశోధనలు ఆచరణాత్మకం, క్రియాత్మకం అయినందువల్ల సంస్థ నిర్వహించే శిక్షణా కార్యక్రమాలకే కాకుండా విధాన నిర్ణయాలు తీసుకునేందుకు కూడా ఎంతో ఉపయోగాత్మకంగా ఉన్నాయి.

ప్రతి సంవత్సరం ఈ సంస్థ నిర్వహిస్తున్న శిక్షణా కార్యక్రమాలు గణనీయంగా పెరుగుతూ వస్తున్నాయి. మొదటి 5 సంllలలో 1210 మందికి 36 శిక్షణా కార్యక్రమాలు నిర్వహించిన ఈ సంస్థ, ఆ తరువాత వందల సంఖ్యలో పదులవేల మందికి శిక్షణ నిచ్చింది. ఈ శిక్షణవల్ల గ్రామీణాభివృద్ధి పథకాలను అమలుపరచడం త్వరితగతి అవుతోంది.

ఇంతవరకు ఈ సంస్థ గ్రామీణాభివృద్ధికి సంబంధించిన వందలాది అంశాలపై పరిశోధనలు చేసింది. వందలాది ప్రచురణలు కూడా వెలుగులోకి తెచ్చింది. ఈ సంస్థ జరుపుతున్న పరిశోధనలు, అధ్యయనం మొదలైన విషయాలను ప్రజలకు తెలియచెప్పేందుకు "జర్నల్ ఆఫ్ రూరల్ డెవలప్‌మెంట్" అనే త్రైమాసిక పత్రికను, ఎన్.ఐ.ఆర్.డి. అనే వార్తాలేఖను సంస్థ తరపున ప్రచురిస్తోంది.

80 శాతం ప్రజలు గ్రామాలలో నివసిస్తున్న భారతదేశంలో గ్రామీణాభివృద్ధికి సంబంధించి ఈ సంస్థ నిర్వహిస్తున్న పాత్ర గణనీయమైనది.

### జాతీయ వ్యవసాయ పరిశోధనా, నిర్వహణా సంస్థ:

వ్యవసాయోత్పత్తుల పెంపుదలకు శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించటం మొదలైన దగ్గరనుంచి వ్యావసాయక పరిశోధన నిర్వహణలో శిక్షణావశ్యకత ప్రాధాన్యతను సంతరించుకున్నది. వ్యవసాయాభివృద్ధికి ఇది అత్యంత కీలకమైన విషయంగా శాస్త్రజ్ఞులు, విద్యావేత్తలు, పరిపాలకులు ప్రపంచం మొత్తంగా గ్రహించారు.

భారతదేశంలో దీనికి ఒక వ్యవస్థాపరమైన రూపం కల్పించటానికి భారత వ్యవసాయ పరిశోధనా సమితి భారత కేంద్రప్రభుత్వం డా. జాకబ్ (యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ ఛైర్మన్) ఆధ్వర్యంలో ఒక పరిశీలనా సంఘాన్ని నియమించింది. వారి సిఫార్సుల మేరకు 1976 సెప్టెంబర్ 1న వ్యవసాయ సెంట్రల్ స్టాఫ్ కాలేజీ నొక దానిని హైదరాబాదులోని రాజేంద్రనగర్‌లో ఏర్పరిచారు. దానినే తరువాత మార్పు చేసి జాతీయ వ్యవసాయ పరిశోధనా నిర్వహణ సంస్థగా రూపుదిద్దారు.

### ముఖ్య లక్ష్యాలు:

1. వ్యవసాయ పరిశోధనా సమితిలో కేడర్‌గా నూతనంగా ప్రవేశిస్తున్న వారికి ఫౌండేషన్ కోర్సులను నిర్వహించడం.
2. వ్యవసాయ పరిశోధనా సమితి సంస్థలలో మాధ్యమిక, సీనియర్ శాస్త్రజ్ఞులకు వ్యవసాయ పరిశోధనా నిర్వహణలలో, శిక్షణా కార్యక్రమాలను నిర్వహించడం – అభివృద్ధి పరచడం.
3. వ్యవసాయ పరిశోధనా నిర్వహణకు సంబంధించిన అన్ని అంశాలపై సదస్సులు, మహాసభలు, వర్కుషాపులు నిర్వహించడం.

4. అనుభవం ద్వారా నేర్చుకున్న విషయ పరిజ్ఞానం ఆధారంగా వ్యవసాయ పరిశోధనా నిర్వహణకు కావలసిన నాణ్యమైన వనరులను కల్పించడం.
5. వ్యవసాయ విశ్వ విద్యాలయాలు, వ్యవసాయ పరిశోధనా కేంద్రాలు, వ్యవసాయ పరిశోధనా సమితి సంస్థలలో జరుగుతున్న పరిశోధనలలో తల ఎత్తిన సమస్యల పరిశీలన – అధ్యయనం – పునః పరిశీలన – చేయడం.
6. వ్యవసాయ పరిశోధనా నిర్వహణ రంగంలో అంతర్జాతీయ సహకారానికి అవసరమైన పథకాల సమన్వయం, నిర్వహణ.
7. శిక్షణావసరమైన అంశాలను ప్రచురించే పథకాలను చేపట్టడం.
8. వ్యవసాయ విశ్వ విద్యాలయాలకు, పరిశోధనా సంస్థలకు, శిక్షణా కార్యక్రమాలు, సదస్సులు, వర్క్‌షాపులు పాఠ్యాంశాల బోధనా పద్ధతులను మెరుగుపర్చేందుకు ప్రణాళికలు రూపొందించి అమలుచేయడం.
9. వ్యవసాయ పరిశోధనా నిర్వహణకు సంబంధించి జాతీయ, అంతర్జాతీయపరంగా సమాచార కేంద్రంగా వ్యవహరిస్తూ, అవసగమైన వారికి అట్టి సమాచారాన్ని అందివ్వడం.

ప్రారంభంలో ఈ సంస్థ ఏకీకృత వ్యవస్థగా ఉండేది కాని కాలక్రమేణా లక్ష్యాలు, బాధ్యతలు పెరుగుతూ ఉండడంతో, ఆరు ప్రధాన విభాగాలుగా వ్యవస్థాపరమైన మార్పులు చేసి వ్యవసాయ పరిశోధనా, విద్యా విషయాలు, సాంకేతిక, ప్రాజెక్టు నిర్వహణ, మానవ వనరులు, సమాచార విభాగాలు ఏర్పాటు చేశారు.

వ్యవసాయ పరిశోధనా నిర్వహణలో జరుగుతున్న పరిశోధనలలో కనుగొన్న, కొత్త విషయాలను నూతన పద్ధతులను ఎప్పటికప్పుడు తెలియచేసేందుకు వీలుగా అనేక ప్రచురణలను ఈ సంస్థ వెలువరించింది. వీటితోపాటుగా 'నామ్ న్యూస్' 'అల్లూమెనీ న్యూస్' అనే వార్తా లేఖలను ఈ సంస్థ వెలువరుస్తోంది.

ఫౌండేషన్ కోర్సులో వున్న వారికి శాస్త్ర పరిశోధనలపై, వ్యాస రచనా అవకాశాలను కల్పిస్తూ 'గ్రీవ్ గ్లోరి' అనే మరొక లేబరేటరీ పత్రికను కూడా ప్రచురిస్తోంది.

**భవిష్యత్తు పథకాలు:**

ఐక్యరాజ్యసమితి సంస్థలైన యునెస్కో, ఎఫ్.ఎ.ఓ.ల సహకారంతో ఉన్నత స్థాయి వ్యవసాయక విద్యా, పరిశోధనా కేంద్రాన్ని ఒక దానిని ఏర్పాటు చేసే ప్రయత్నాలలో ఈ సంస్థ వుంది.

రాష్ట్ర స్థాయిలో వ్యవసాయాభివృద్ధి శాఖలో పని చేస్తున్న అధికారులకు పరిశోధన నిర్వహణపై శిక్షణా పథకాలు సదస్సులు నిర్వహించడం.

వ్యవసాయ విశ్వవిద్యాలయాల్లో పని చేస్తున్న ఉపాధ్యాయులకు ప్రత్యేకంగా రెండు వేసవి బోధనా సంస్థలను ఏర్పాటు చేయడం.

ఎఫ్.ఎ.ఓ. సహకారంతో ఒక పాపులేషన్ స్టడీస్ కేంద్రాన్ని ఏర్పాటు చేయడం.

అంతర్జాతీయ సంస్థల సహకారంతో మరిన్ని పథకాలు కార్యక్రమాలను భవిష్యత్తులో ఏర్పాటుచేసే ఉద్దేశంతో ఈ సంస్థ ముందడుగు వేస్తోంది.

## రాష్ట్రంలో భూసార పరీక్షా కేంద్రాలు:

| జిల్లా | భూసార పరీక్షా ప్రయోగశాల స్థలం |
|---|---|
| 1. శ్రీకాకుళం | ఆముదాలవలస |
| 2. విశాఖపట్నం | అనకాపల్లి |
| 3. తూర్పు గోదావరి | సామర్లకోట |
| 4. పశ్చిమ గోదావరి | తాడేపల్లిగూడెం |
| 5. కృష్ణ | గరికపాడు |
| 6. గుంటూరు | గుంటూరు |
| 7. గుంటూరు | బాపట్ల |
| 8. నెల్లూరు | నెల్లూరు |
| 9. కర్నూలు | ఎమ్మిగనూరు |
| 10. చిత్తూరు | తిరుపతి |
| 11. అనంతపురం | అనంతపురం |
| 12. కడప | కడప |
| 13. ఆదిలాబాదు | ఆదిలాబాదు |
| 14. నల్లగొండ | మిర్యాలగూడెం |
| 15. నిజామాబాదు | నిజామాబాదు |
| 16. కరీంనగరు | కరీంనగరు |
| 17. మెదక్ | సంగారెడ్డి |
| 18. ఖమ్మం | ఖమ్మం |
| 19. మహబూబ్‌నగర్ | జడ్చర్ల |
| 20. వరంగల్లు | వరంగల్లు |
| 21. హైదరాబాదు | రాజేంద్రనగరు |

రాష్ట్రంలో రెండు సంచార భూసార పరీక్షా లేబొరేటరీలు కూడా ఉన్నాయి. హైదరాబాదు ప్రధాన కేంద్రంగా పని చేస్తున్న మొబైల్ లేబొరేటరీ–తెలంగాణా ప్రాంతం, కర్నూలు జిల్లాలకు పరిమితమై ఉంది. బాపట్ల ప్రధాన కేంద్రంగా పనిచేస్తున్న మొబైల్ లేబొరేటరీ కర్నూలు మినహాయించి మిగిలిన ఆంధ్ర ప్రాంతానికి పరిమితమై పనిచేస్తున్నది.

## తైల సాంకేతిక పరిశోధనా సంస్థ:

నూనె కలిగిన ముడి పదార్థాల నుండి నూనెను ఉత్పత్తి చేయడంలోను, నూనెల నాణ్యతను మెరుగుపరచ

డంలోనూ సాంకేతిక ప్రయోగాల ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఈ దిశలో భాగంగానే ప్రధానంగా నూనె గింజలు వాటి అనుబంధ పరిశ్రమలకు సంబంధించిన సాంకేతిక సమస్యలను లోతుగా పరిశీలించేందుకు 1949లో అనంతపురంలో ఆయిల్ టెక్నొలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ నెలకొల్పబడింది. సాంకేతికంగా అభివృద్ధి చెందిన అమెరికా ఇతర ప్రాచ్య, పాశ్చాత్య దేశాలలో నెలకొల్పబడిన సంస్థల రూపంలోనే ఇదీ నెలకొల్పబడింది. భారతదేశం మొత్తం మీద తైల సాంకేతిక పరిశోధనలు జరుపుతున్న ఏకైక సంస్థ ఇదే. 1985 వరకు ఈ సంస్థ రాష్ట్ర పరిశ్రమల శాఖ ఆధ్వర్యంలో ఉన్నది. ఆ తరవాత జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలోకి వచ్చింది.

నూనె పరిశ్రమలు స్థాపించే వారికొరకు, ఆయా పరిశ్రమలకు సంబంధించిన కీలకవిషయాలపై ప్రాజెక్టు రిపోర్టులను తయారుచేయడం, పరిశ్రమల యజమానులు సమర్పించే ప్రాజెక్టు రిపోర్టులను పరిశీలించడం, ప్రభుత్వ, ప్రైవేటు రంగ నూనె పరిశ్రమల నుండి వచ్చే సాంకేతిక సమస్యలకు పరిశోధనాధ్యయన ఫలితాలను దృష్టిలో ఉంచుకుని సమాధానాలివ్వడం, ఖాద్య తైల రంగంలో ముడి పదార్థాల వాడుకకు ఉపయుక్తం చేయబడిన పదార్థాలయొక్క, వాటి ఉపఉత్పాదక పదార్థాలయొక్క నాణ్యతను పరీక్షించడం, వాటి పరీక్షల్లో ఇండియన్ స్టాండర్డ్ ఇనిస్టిట్యూట్ (ఐ.యస్.ఐ.)కు సహకరించడం ఈ సంస్థ నిర్వహించే ముఖ్య కార్యక్రమాలు.

ఇంతకు పూర్వం 3,4 దఫాలుగా నువ్వులను ఆడించి మిల్లులలో నూనె తీసేవారు. కాని ఈ సంస్థ పరిశోధన మూలంగా రెండు సార్లలోనే నూనెను సంపూర్ణంగా పొందే పద్ధతి అమలులోకి వచ్చింది. ఈ సంస్థ పరిశోధన మూలంగా తవుడు, ప్రత్తిగింజలు, వరి, పొగాకు విత్తనములు, గోగు గింజలు, కలింగర, కరబూజ, గుగ్గిలపు, నారింజ, నిమ్మ, అడవి ఆముదం, టమోటో, ద్రాక్ష ఉల్లిగడ్డ, విత్తనముల నుండి నూనె తీసే విధానం వాటి ఉపయోగం కనుగొన్నారు. ఇంతేకాకుండా వృధాగా పోతున్న మామిడి టెంకల నుండి కూడా నూనెను తీసే విధానాన్ని ఈ సంస్థ కనిపెట్టింది. ఇందుకు అంతర్జాతీయ ప్రశంసలను పొందింది. పట్టుతీసిన పురుగులలో సబ్బుల తయారీకి అవసరమయ్యే క్రొవ్వు పదార్థాలు కలవని పరిశోధించి ఆ ప్రక్రియను అమలులోకి తెచ్చింది. ఇంతే కాకుండా కాఫీపొడి పిప్పి నుండి నూనె తయారుచేయడం, అదేవిధంగా వాము, కొతిమెర, దవనము, మరువము, పుదీనా, మల్లెపూలు మున్నగు వాటి నుండి సుగంధ తైలములు తీసే పద్ధతిని ఈసంస్థ కనుగొన్నది.

ఈ సంస్థ కృషికి చిహ్నంగా ఇంతవరకు 5 బంగారు పతకాలు, 13 అవార్డులతో సహా అనేక జాతీయ బహుమతులు, అంతర్జాతీయ ప్రశంసలు పొందింది. ఇంతవరకు జాతీయ అంతర్జాతీయ మాగజైనులలో 450 పరిశోధనా పత్రాలను ఈసంస్థ ప్రచురించింది.

## నూనె విత్తనాల పరిశోధన డైరెక్టరేట్

భారతదేశంలోని వాతావరణం, భూసారం, నూనె విత్తనాల పంటలకు ఎంతో అనుకూలంగా ఉంది. అయినా ప్రతిఏటా 800 కోట్ల రూపాయల విలువగల నూనెను దిగుమతి చేసుకుంటోంది. ఈ పరిస్థితిని అధిగమించి దేశంలో ఉన్న భూసారాన్ని, వాతావరణాన్ని వినియోగించుకోవాలి. అంటే నూనె విత్తనాల పంటలపై తగిన అధ్యయనం పరిశోధనా జరగాలి.

ఈ లక్ష్యాన్ని సాధించటానికై 1977లో హైదరాబాదు రాజేంద్రనగర్‌లో ఒక నూనెవిత్తనాల పరిశోధనా డైరెక్టరేట్ నొకదానిని నెలకొల్పారు.

1. దేశంలో జరుగుతున్న నూనెవిత్తనాలపై పరిశోధనను సంయమనం చేయటం.
2. నూనెవిత్తనాల పరిశోధనా పథకాలను ప్రోత్సాహపరిచే విధంగా, సదస్సులు, గోష్ఠులు నిర్వహించడం.
3. నూనెవిత్తనాల సంబంధమైన సాంకేతికపరమైన పరిశోధనలకు వాటి అభివృద్ధి సంస్థలకు మధ్య సరియైన సంబంధ బాంధవ్యాలను ఏర్పరచడం.
4. మౌలికమైన నూనెవిత్తనాలపై పరిశోధన చేయడం.
5. అన్నిరకాల నూనెవిత్తనాల గురించి సమాచార కేంద్రంగా ఉండడంతోపాటు; అవసరమైనవారికి తగిన శిక్షణా కేంద్రంగానూ, పరిశోధనా ఫలితాలను ప్రజలకు తెలియజేసేలాగా వ్యవహరించడం.
6. టి.వి., రేడియో ప్రోగ్రాంలు ఎగ్జిబిషన్‌లు, కృషి మేళాల ద్వారా ప్రజలకు తగిన సమాచారం అందివ్వడం ఈ డైరెక్టరేట్ ముఖ్య ఉద్దేశ్యాలు.

నూనె విత్తనాలకు సంబంధించిన భిన్నసమస్యలను పరిష్కరించేందుకు వీలుగా అగ్రానమీ, సైటో జెనిటిక్స్ అండ్ బ్రీడింగ్, ప్లాంట్ పాథాలజీ, ఎంటమాలజీ, ప్లాంట్ ఫిజియాలజీ, పాయిల్ సైన్స్, బయో కెమిస్ట్రీ, అర్థికశాస్త్రం, గణాంకశాస్త్రం రంగాలలో పరిశోధనలను ఈ డైరెక్టరేట్ నిర్వహిస్తోంది.

ఈ పరిశోధనలన్నిటిని నిర్వహించేందుకు వీలుగా ఆధునిక సాధన సామాగ్రి ఉన్న అనేక రసాయనశాలలను నెలకొల్పటం జరిగింది. దేశంలో వివిధ నూనెవిత్తనాలపై జరుగుతున్న పరిశోధన అభివృద్ధి కార్యక్రమాలను విస్తృతంచేసే ఉద్దేశంతో ఈ డైరెక్టరేట్ ఆధ్వర్యంలో 7 సంస్థలను ఏర్పరచారు.

1. వేరుశెనగపై పరిశోధన – అకోలాలోని పంజాబ్ రేవ్ కృషి విద్యాలయం

2. అవాలుపై పరిశోధన - హిస్సార్‌లోని హర్యానా వ్యవసాయిక విశ్వవిద్యాలయం
3. పెద్ద అవాలు, నువ్వులుపై పరిశోధన - జబల్‌పూర్‌లోని జవహర్‌లాల్ నెహ్రూ కృషి విశ్వవిద్యాలయం
4. అవిశగింజలపై పరిశోధన - కాన్పూరులో ఉన్న చంద్రశేఖర్ అజాద్ వ్యవసాయక విశ్వవిద్యాలయం
5. ఆముదపు విత్తనాలపై పరిశోధన - హైదరాబాదులోని నూనె విత్తనాలు డైరెక్టరేట్
6. కుసుంబా పుష్పంపై పరిశోధన - షోలాపూర్‌లోని మహాత్మాపూలే కృషి విశ్వవిద్యాలయం (సాఫ్ ప్లవర్)
7. పొద్దు తిరుగుడు పువ్వుపై పరిశోధన - బెంగుళూరులో ఉన్న వ్యవసాయ శాస్త్రాల విశ్వవిద్యాలయం

ఇలా వివిధ విశ్వవిద్యాలయాలతో ఈ డైరెక్టరేట్ సమన్వయ కృషి నిర్వహిస్తోంది. మనదేశంలో ఉన్న భూసంపదను, వాతావరణ అనుకూలతను వినియోగించుకొని ఈడైరెక్టరేట్ నూనెవిత్తనాల పరిశోధనలో ముందడుగు వేస్తోంది.

## కేంద్ర పొగాకు పరిశోధనాలయం:

వివిధ రకాల పొగాకుల నాణ్యతను దిగుబడులను పెంపొందించేందుకు నిరంతర పరిశోధనలను జరుపుటకు రాజమండ్రిలో భారతీయ కేంద్ర పొగాకు కమిటీ ఆధ్వర్యంలో కేంద్ర పొగాకు పరిశోధనాలయాన్ని 1949 లో స్థాపించారు.

పొగాకు పండించడంలో రైతులు ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించడమే కాకుండా దేశ విదేశీ పొగాకుకు మార్కెట్టులో ఏ నాణ్యతగల పొగాకుకు గిరాకీ వున్నదో దానికనుగుణంగా పంట పండించడంలో తగిన పరిశోధనలు జరిపి రైతులకు, పరిశ్రమలకు తగిన సలహాలు అందివ్వడం ఈ సంస్థ మరో కార్యక్రమం. కేంద్ర పొగాకు కమిటీ ఆధ్వర్యం నుండి తప్పించి 1965 లో ఈ పరిశోధనా సంస్థను భారతీయ వ్యవసాయ పరిశోధనా మండలికి బదిలీ చేయడం జరిగింది.

ఇంతవరకు ఈ కేంద్ర పరిశోధనా సంస్థకు అనుబంధంగా గుంటూరు, వేదనందూరు, హోనేసూరు, పూనా, దినేహోటా, కందుకూరు, చింతపల్లి, కలపచర్లలలో ఎనిమిది అనుబంధ పరిశోధనా కేంద్రాలను నెలకొల్పారు. ఈ అనుబంధ పరిశోధనా కేంద్రాలతో పాటుగా 1982 సం॥లో రాజమండ్రిలో 15 ఎకరాల విస్తీర్ణంలో $1\frac{1}{2}$ కోట్ల రూపాయల ఖర్చుతో ఒక అధునాతనమయిన పరిశోధనాశాలను నిర్మించారు.

ఈ కేంద్ర పొగాకు పరిశోధనాలయం ఆధ్వర్యంలో సిగిరెట్, నాటు, లంక, బర్లీ, చుట్ట, పట్టీ, హుక్కా, సిగార్‌పిల్లర్, సిగార్‌రేపర్, ఎరోమెటిక్ మొదలయిన రకాల పొగాకులన్నిటిపై అనేకమైన పరిశోధనలు జరుగుతున్నాయి. ఇంతవరకు జరిపిన పరిశోధనల మూలంగా అధికోత్పత్తినిచ్చే అనేకమైన పొగాకు వంగడాలను సాగులోకి తెచ్చింది. అంతేకాకుండా సస్యరక్షణకు వ్యాధి, క్రిమి నిరోధకానికి అనేకమయిన రసాయనాలను కనుగొనడంతో పాటుగా పంటల మార్పిడి, నీటి పారుదల మార్పులు, సాగు పద్ధతులలో మార్పులవల్ల ఏవిధంగా పొగాకు నాణ్యతను - దిగుబడిని పెంచవచ్చునో ప్రయోగాత్మకంగా రైతులకు తెలియజేసి ఆచరణలో పెట్టింది. "ప్రయోగశాల నుండి పంట భూమికి" అనే పథకముల ద్వారా సన్నకారు రైతులకు ఆధునిక క్రిమి, వ్యాధి నిరోధక అధికోత్పత్తి పొగాకు వంగడాలను వాటి సాగుకు అవసరమైన సాధన సామాగ్రిని ఉచితంగా సరఫరా చేయడం జరిగింది.

'కృషి విజ్ఞాన కేంద్రం' అనే విభాగాన్ని 1983 లో ప్రారంభించి, పొగాకు పండించే రైతులకు సదస్సులు, రేడియో ప్రసారాలు, చర్చా వేదికలు, పంటపొలాల సందర్శన, రైతులకు సాహితీ కార్యక్రమాలు మొదలగు వాటి ద్వారా రైతులకు ఆధునిక సమాచారాన్ని అందిస్తూ నాణ్యమైన పొగాకు అధికోత్పత్తికి తోడ్పడుతోంది.

## మెట్ట సేద్యపు కేంద్ర పరిశోధనా సంస్థ:

మెట్ట ప్రాంతాలలో సేద్యం అంటే రుతుపవనాలతో జూదంలాంటిది. ఇది ఒకప్పటి మాట. మెట్ట సేద్యంలో వచ్చిన మార్పులు అధిక దిగుబడినిచ్చే వంగడాలు, అందుకు అవసరమైన రసాయనిక ఎరువులు మొదలైనవి అమలులోకి రావడంతో మెట్ట ప్రాంతపు రైతు, మాగాణి రైతులాగా వ్యవసాయం చేయగలుగుతున్నాడు. ఇది నేటి పరిస్థితి. నేటి ఈ స్థితి వెనుక మెట్ట సేద్య పరిశోధనా సంస్థ జరిపిన కృషి ఎంతైనా వుంది.

1920 దశకంలో ఇంపీరియల్ వ్యవసాయ పరిశోధనా సంస్థ ఆధ్వర్యంలో మెట్ట సేద్యంపై పరిశోధనలు గావించటానికి అంకురార్పణ జరిగింది. మద్రాసు రాష్ట్రంలోని హగారీ (నేటి కర్ణాటక) మహారాష్ట్రలోని షోలాపూర్, పంజాబ్‌లోని రోహతక్, బొంబాయి రాష్ట్రంలోని బీజపూర్ (నేటి కర్ణాటక)లలో మెట్టసేద్యంపై పరిశోధనలు కావించడానికి 5 ప్రాంతీయ కేంద్రాలను నెలకొల్పారు. వీటి కృషి మూలంగా మద్రాసు మెట్ట సేద్యపు పద్ధతి, బొంబాయి మెట్ట సేద్యపు పద్ధతులు అమలులోకి వచ్చాయి. వీటి మూలంగా 15 నుంచి 20 వరకు మాత్రమే ఉత్పత్తి పెరిగింది. దీనికి కారణం ముఖ్యంగా ఆనాడు లభ్యమవుతున్న ఉత్పత్తి కారకాలు.

స్వాతంత్ర్యానంతరం మెట్ట సేద్యపు ప్రాధాన్యతను గుర్తించి బళ్లారి, ఉదకమండలం, కోటా, డెహ్రాడూన్, వాసదే, ఆగ్రా, ఆంధ్రప్రదేశ్‌లో ఇబ్రహీంపట్నంలోనూ మొత్తం ఎనిమిది భూ సంరక్షణ, పరిశోధనా, విపులీకరణ,

శిక్షణా కేంద్రాలను 1950 దశకంలో భారతప్రభుత్వం ప్రారంభించింది.

ఈ ప్రాంతీయ కేంద్రాల కృషి మూలంగా తక్కువ కాలంలో చేతికొచ్చే మెట్ట పంటలును వాటి దిగుబడిని పెంచడానికి తగిన ఎరువుల వాడకం మొదలైనవి వెలుగులోకి వచ్చాయి. వాతావరణంలో వున్న తీవ్ర అసమతౌల్యాలను దృష్టిలో వుంచుకొని దేశంలో వున్న భిన్న వాతావరణ ప్రాంతాలను ఎన్నుకుని అక్కడ పరిపోయే వ్యవసాయానికి తగిన పరిశోధనలు కావించడానికి 1970 లో ఒక ఆల్ ఇండియా కో ఆర్డినేట్ రీసెర్చి ప్రాజెక్టును ప్రారంభించారు. ఇందులో భాగంగానే తెలంగాణాలో ఉన్న ఎర్ర సున్నపు నేలలకు హైదరాబాదులో, రాయలసీమలోని ఎర్రమట్టి నేలలకు, అనంతపురంలోను ప్రాంతీయ కేంద్రాలను స్థాపించారు.

హైదరాబాద్ కేంద్రం కృషి మూలంగా జొన్న, ఆముదపు పంటలలో రెండు, మూడు రెట్లు అధిక దిగుబడిని రైతులు పొందగలుగుతున్నారు. అంతేకాకుండా తక్కువ పెట్టుబడితో సమకూరే సాంకేతిక పరిజ్ఞానంతోనే సరిఅయిన సమయంలో నాట్లు కలుపు నియంత్రణం మూలంగా హెక్టారుకు 3–4 రెట్లు అధిక జొన్నను, హెక్టారుకు 15–20 క్వింటాల అధిక ఆముదాన్ని రైతులు పొందగలరని ఈ కేంద్రాల పరిశోధనలు తెలియజేశాయి. ఇంతేకాకుండా తక్కువ ఖర్చుతో ఫెస్కో అనే సాధనాన్ని హైదరాబాదు కేంద్రం తయారుచేసింది. దీని ఖరీదు 300 రూ. మాత్రమే. ఈ సాధనం మూలంగా తెలంగాణాలోని రైతులు నాట్లు సమయంలో అంతకు ముందు ఎదుర్కొన్న సమస్యలనన్నీ తొలగించుకొనే అవకాశం ఏర్పడింది.

అనేక కారణాల మూలంగా సాగుకు పనికిరాకుండా పోయిన మెట్టభూములను సాగులోకి తెచ్చే పద్ధతులను ఈ ప్రాంతీయ కేంద్రాలు కనుగొన్నాయి. ఇటువంటి భూములను స్టయిలో సాంథీస్ హమేట్ పద్ధతిలో రెండు మూడు సంవత్సరాలలో తగిన పుష్టిని పొంది నైట్రోజన్ ఎరువులు వాడకం లేకుండానే ప్రతి సంవత్సరం సాగవుతున్న భూములకన్నా రెండు మూడు రెట్లు అధిక దిగుబడినివ్వగలవని ఈ కేంద్రాల పరిశోధనలు రుజువుచేశాయి. అంతేకాకుండా 0–30–0 పి2 ఓ5ని కనుక వాడినట్లయితే అత్యధిక దిగుబడిని పొందవచ్చుని పరిశోధనలు చెపుతున్నాయి.

మెరకలతోను, మిట్ట పల్లాలుగా వున్న భూమిలో పంటను పండించడానికి అధిక దిగుబడిని పొందటానికి "ఎల్లీక్రాపింగ్" పద్ధతిని అనుసరించవలెనని ఈ పరిశోధనా సంస్థ తెలియచేస్తోంది. ఈ పద్ధతి వల్ల అధిక దిగుబడి కాక ఎల్లీక్రాప్‌గా ఉపయోగపడే మొక్క, పశువుల మేతకు గూడా పనికి వస్తుందని వానితో పాటు నీటి, భూమి కోతలను కూడా అరికట్టవచ్చని వీరు జరిపిన పరిశోధనల ద్వారా తెలుస్తోంది.

ఈవిధంగా మెట్ట ప్రాంతాలలో సేద్య పద్ధతుల మెరుగుదల తద్వారా అధిక దిగుబడుల కోసం మెట్టసేద్యపు కేంద్ర పరిశోధనా సంస్థ, దాని ప్రాంతీయ కేంద్రాలు కృషి సల్పుతున్నాయి.

### ఎయిర్ క్రిప్ (ఎ.ఐ.ఆర్.సి.ఆర్.ఐ.పి.):

1965 లో రాజేంద్రనగర్ ప్రధానకేంద్రంగా ఐ.సి.ఎ.ఆర్. దానిని నెలకొల్పింది. దానిపేరు అఖిల భారత బియ్యం మెరుగుదల సమన్వయ ప్రాజెక్టు. ఇది పరిశోధనా ఇన్‌స్టిట్యూట్. దేశ వ్యాపితంగా వందల కేంద్రాలలో సాగుబియ్యం, ఇతర ధాన్యాల పరీక్షా కార్యక్రమాలను సమన్వయపర్చడం కోసం దీనిని నెలకొల్పారు. భూ పరిశోధనలు సాగించి ఉత్పత్తిలో వాటి ఫలితాలు అమలు అయ్యేలా కృషిచేయడం దీని లక్ష్యం.

### ఐ.ఎ.ఆర్.డి.:

ఈ సంస్థ పేరు అఖిల భారత మెట్టసాగు సమన్వయీకృత పరిశోధనా ప్రాజెక్టు. కెనడా ప్రభుత్వ సహాయంతో 1970 లో హైదరాబాదులో ఈ సంస్థను నెలకొల్పారు. దేశవ్యాపితంగా 8 రకాల వ్యవసాయ వాతావరణ మండలాలలో 23 సహకార పరిశోధనా కేంద్రాలను ఈ ప్రాజెక్టు క్రింద నెలకొల్పారు. హయత్‌నగర్, గనెగల్‌లలో రెండు పరిశోధనా కేంద్రాలను ప్రయోగాత్మకంగా నెలకొల్పారు. 50 సంవత్సరాల పాటు వర్షాకాలంలో పడిన వర్షపాతమును జాగ్రత్తగా అధ్యయనం చేసి తగిన పంటల పద్ధతులు రూపొందించారు. అనంతపురం జిల్లాలో, రంగారెడ్డి జిల్లాలో పైలట్ క్షేత్రాలు ఏర్పరచారు.

### సి.ఎఫ్.టి.ఆర్.ఐ.:

కేంద్ర ఆహార సాంకేతిజ్ఞత పరిశోధనా ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన ప్రాంతీయ ప్రయోగాత్మక కేంద్రం (మైసూరు) వారు కడపజిల్లా కోడూరులో 1963 లో ఆరంభించిన ప్రయోగశాలను 1968 లో హైదరాబాదుకు మార్చారు. సి.ఎస్.ఐ.ఆర్. అధ్వర్యంలో నడిచే ప్రయోగశాలల్లో ఇది ఒకటి. ముఖ్యంగా ద్రాక్ష తోటలకు రక్షణ కల్పించే పథకాలకు, ఇంకా ఇన్‌స్టెంట్ ఆకరాల తయారీ పథకాలను పరిశీలించడం దీని ప్రధాన కర్తవ్యం.

### కేంద్ర ఆహార సాంకేతిజ్ఞత పరిశోధనా ఇన్‌స్టిట్యూట్:

సి.ఎఫ్.టి.ఆర్.ఐ. ప్రధాన లేబరేటరీ కాంప్లెక్స్ మైసూరులో వుంది. మంగళూరు, హైదరాబాదు, బొంబాయి, నాగపూర్, లక్నో, లూథియానాలలో మొత్తం ఆరు మండలస్థాయి కేంద్రాలున్నాయి. బెంగుళూరులో సమన్వయ కృషికి కార్యాలయం వుంది. మొత్తం 21 శాఖల

ద్వారా ఇన్‌స్టిట్యూట్ పరిశోధనా రూపకల్పనా కార్యకలాపాలు సాగుతాయి. ఫుడ్ టెక్నాలజీ, ఫుడ్ ఇంజనీరింగ్, బయోకెమిస్ట్రీ, న్యూట్రిషనల్, టాక్సికాలజీ, పెస్టిసైడ్స్, కెమికల్ ఎనాలిసిస్, ఫుడ్ పాకేజింగ్, మైక్రోబయాలజీ, మార్కెటింగ్ సమాచార సేవలు తదితర అంశాలలో విశేషమైన జ్ఞానం అనుభవం గల దాదాపు 400 మంది శాస్త్రజ్ఞులు సాంకేతిక నిపుణులు ఈ ఇన్‌స్టిట్యూట్ ఆధ్వర్యాన పరిశోధనా కార్యకలాపాలు సాగిస్తున్నారు. అనేక అంతర్జాతీయ సంస్థలతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకుంటూ అత్యాధునిక అంశాలపై పరిశోధనా కృషిని సాగిస్తుంటారు. సి.ఎఫ్.టి.ఆర్.ఐ. అనేక పుస్తకాలను ఏనోటోటెడ్ బిబ్లియోగ్రఫీలను ప్రచురించింది. ఎప్పటికప్పుడు ప్రచురణ కార్యక్రమం సాగుతుంటుంది. ఒక మాస పత్రికను, రెండు త్రైమాసిక పత్రికలను ఇంగ్లీషులో ప్రచురిస్తున్నది.

భారత ఆహార సంస్థ, మోడర్న్ అండ్ ఇండస్ట్రీస్, స్టేట్ ట్రేడింగ్ కార్పోరేషన్, కైరా పాల ఉత్పత్తిదార్ల యూనియన్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ, పంజాబ్, ఆహార పరిశ్రమల కార్పోరేషన్‌లు, చికోర పండ్లు, కాయగూరల అభివృద్ధి కార్పోరేషన్, కర్నాటక ఆహార దినుసులు కార్పోరేషన్, వివిధ రాష్ట్రాల సహకార మార్కెటింగ్ ఫెడరేషన్లు, గ్లాక్సో లేబరేటరీలు, ఆంధ్రప్రదేశ్ డైరీ డెవలప్‌మెంట్ కార్పోరేషన్, యిలా అనేకానేక సంస్థలకు ఈ ఇన్‌స్టిట్యూట్ ఎన్నో పరిశోధనలు నిర్వహించింది.

350 కు పైగా ప్రాజెక్టు కన్సల్టెన్సీ కార్యక్రమాలను పూర్తి చేసింది.

### వలంతారీ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్:

(వాటర్, లాండ్ మేనేజిమెంట్ ట్రయినింగ్ అండ్ జల, భూ నిర్వహణ శిక్షణా పరిశోధనా సంస్థ.)

ప్రపంచ బ్యాంకు సహాయంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1983 లో ఈ ఇన్‌స్టిట్యూట్‌ను నెలకొల్పింది. సాగునీటి పద్ధతుల్లో రైతు అవసరాలకు అనుగుణంగా రూపొందించి నిర్వహించేందుకు సంస్థాగత కృషిని దృఢతరం చేయడం కోసం జల క్రియ వినియోగించడం ద్వారా ఉత్పత్తి పెంచే పద్ధతులపై రైతుల శిక్షణనివ్వడం కోసం ఈ సంస్థను నెలకొల్పారు. 1992 లో ఈ సంస్థను స్వయంప్రతిపత్తిగల సంస్థగా ప్రభుత్వం ప్రకటించింది. హిమాయత్‌నగర్‌కు, రాజేంద్రనగర్‌కు నడుమ 'ఈసా' నది ఒడ్డున ఈ సంస్థ ప్రధాన కార్యాలయం నెలకొల్పారు. ఇరిగేషన్, కమాండ్ ఏరియా డెవలప్‌మెంట్ శాఖకు, వ్యవసాయంకు చెందిన 4 వేల మంది అధికార్లకు ఈ సంస్థ శిక్షణ ఇచ్చింది. వేలాది మంది రైతులకు పలువిధాలుగా శిక్షణా కార్యక్రమాలు నిర్వహిస్తున్నది.

### అఖిల భారత పౌల్ట్రి (గుడ్ల) ప్రాజెక్టు:

అఖిల భారత స్థాయిలో గుడ్లకోసం పౌల్ట్రీల సమన్వయ పరిశోధనా ప్రాజెక్టును 1971 లో హైదరాబాదులో ప్రారంభించారు. దేశంలోనూ, విదేశాలలోనూ అత్యుత్తమ స్థాయి ప్రమాణము గల గుడ్లను అధిక సంఖ్యలో ఉత్పత్తి చేసే జర్మ్‌ప్లాస్మా రూపొందించిన పరిశోధన దాని ప్రధాన లక్ష్యం.

### ఇక్రిశాట్:

'ఇక్రిశాట్' (ICRISAT) అనగా అంతర్జాతీయ ఉష్ణ మండలపు అల్పవర్ష ప్రాంత పంటల పరిశోధనా సంస్థ. అధికాహారోత్పత్తే ముఖ్యోద్దేశంగా, లాభనష్టములతో నిమిత్తం లేకుండా, అంతర్జాతీయ ప్రాతిపదికపై 1972 వ సంవత్సరంలో దీనిని స్థాపించారు. ఈ సంస్థకు అవసరమైన ఆర్థిక సహాయం అంతర్జాతీయ పరిశోధనా సంప్రదింపుల (CGIAR) సంస్థ నుండి వస్తోంది. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ఆహార వ్యవసాయ సంస్థ (FAO) ఐక్యరాజ్యసమితి అభివృద్ధి కార్యక్రమాల (UNDP) కృషివల్ల; ఎన్నోదేశాల, వివిధ నిధుల, అంతర్జాతీయ సంస్థల సహకారము ఈ సంస్థకు లభిస్తోంది.

వర్షాధార పంటలలో ముఖ్యమైన జొన్న, సజ్జ, కంది, శనగ, వేరుశనగల దిగుబడి పెంచటం, సత్తువలేని నేలలూ, బహుచిన్న కమతములూ, చాలీచాలని నీరూ వీటన్నిటినీ సమర్థవంతంగా వినియోగించుకొనే సస్య పద్ధతులు రూపొందించటంలో కృషి సల్పుతోంది. ఈ మెట్ట వ్యవసాయం చేసుకొనే పేద రైతులు దాదాపు 70 కోట్ల మంది. వరకూ 49 దేశాలలో వున్నారని అంచనా.

'ఇక్రిశాట్'లో పరిశోధనలోవున్న ఐదు పంటలలో వేరుశనగ మాత్రమే వ్యాపారపంట. జొన్న, సజ్జ ముఖ్యమైన చిరుధాన్యాలు, కందులు, శనగలు ముఖ్యమైన పప్పుధాన్యాలు. ఈ నాలుగు పంటలు కుటుంబ పోషణకే పరిమితమైనవి. ప్రపంచంలో పండే మొత్తం పంటలలో 96 శాతం కంది, 90 శాతం శనగ, 80 శాతం సజ్జ, 67 శాతం వేరుశనగ, దాదాపు సగం జొన్న, ఈ 49 దేశాలలో గల మెట్ట ప్రాంతాలలోనే పండుతోంది.

'ఇక్రిశాట్' ముఖ్య కేంద్రంగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిచ్చిన 1394 హెక్టార్ల (3,500 ఎకరములు) భూమిలో 1972 వ సంవత్సరమున ప్రారంభింపబడినది. ఈ కేంద్రము హైదరాబాదుకు ఆగ్నేయదిశగా 25 కిలోమీటర్ల దూరములో బొంబాయి రోడ్డుమీద పటాంచెరు సమీపాన వున్నది. మెట్ట ప్రాంతంలో సాధారణంగా వుండే నల్లనేలలూ, ఎఱ్ఱ నేలలూ దాదాపు చెరిసగం ఈ క్షేత్రంలో వుండటం ఒక

విశేషం. ఈ సంస్థ భవనాలూ, కార్యాలయాలూ, గృహ వసతి అంతా కలిసి 100 ఎకరాల ఆవరణలో ఏర్పాటు చేయబడింది.

'ఇక్రిశాట్' వృక్ష శాస్త్రజ్ఞులు; పంటల నిపుణులు, క్రిమికీటక శాస్త్రజ్ఞులు, శిలీంద్ర రోగనిపుణులు మొదల యినవారు, ఐదు పంటల బీజ నిధినుండి అవసరమయిన రకాలను తీసికొని, వాటినుపయోగించి, పుష్టికరమైనవి, క్రిమికీటకాదులకు తట్టుకొనేవీ, నీటి ఎద్దడిని ఎదుర్కొనగల్గి, ఎరువులూ మందులూ ఎక్కువగా అవసరములేని, అధిక దిగుబడినిచ్చే రకాలను తయారుచేసే కృషిలో నిమగ్నమై వున్నారు.

ఇక భూశాస్త్రజ్ఞులు, రసాయన శాస్త్ర నిపుణులు, వ్యవసాయ ఇంజనీర్లు, తదితర సాంకేతిక నిపుణులతో కలిసి, మెట్ట ప్రాంతాలలో సన్నకారు రైతులకు లాభసాటి సేద్య పద్ధతులను కనుగొనటానికి కృషి సల్పుతున్నారు.

'ఇక్రిశాట్' ఆర్థిక శాస్త్రవేత్తలు – సేద్యపద్ధతుల శాస్త్రజ్ఞులతో సహకరించి పనిచేస్తూ వారి పరిశోధనా ఫలితాలు గ్రామ ప్రాంతాలలో వుండే కర్షకులకు ఎంతవరకూ పనికివస్తాయనే విషయాన్ని పరిశీలిస్తారు.

సన్నకారు రైతులకే ఈసంస్థ పరిశోధనలన్నీ ఉద్దేశింప బడినప్పటికీ, ఆయా దేశాల శాస్త్రజ్ఞులు, విస్తరణ సిబ్బంది ద్వారా మాత్రమే ఈ పరిశోధనా ఫలితాలు రైతులకు చేరతాయి. వివిధ దేశాల శాస్త్రజ్ఞులు ఈసంస్థ రూపొందిం చిన విత్తనాలూ, పరిశోధనా ఫలితాలు అందుకొని వాటిని, వారి ప్రాంతీయావసరాలకు, అనుగుణంగా మార్పులుచేసి రైతులకు అందిస్తారు. ఈ సంస్థ పరిశోధనా ఫలితాలను రైతుల పొలాలలో పరీక్షించినప్పటికీ, ఈ సంస్థ రైతులతో నేరుగా ఎలాటి సంబంధమూ పెట్టుకోదు.

వివిధ దేశాలలోని పలు శాస్త్రజ్ఞులతో 'ఇక్రిశాట్' యిప్ప టికే మంచి సంబంధాలు ఏర్పరచుకొన్నది. భారతదేశంలో కూడా విభిన్న వాతావరణాల్లో పరిశోధనకు అనువుగా ఉత్తర భారతంలో హిస్సార్, గ్వాలియర్‌లోనూ దక్షిణ భారతంలో ధార్వార్, భవానీ సాగర్, అనంతపురంలలోనూ వ్యవసాయ విశ్వ విద్యాలయాల సహకారంతో 'ఇక్రిశాట్' కొన్ని ప్రాంతీయ కేంద్రాలను ఏర్పాటు చేసుకొన్నది. భారత వ్యవసాయ పరిశోధనా మండలితోనూ, దానికనుబంధమైన అనేక జాతీయ వ్యవసాయ కార్యక్రమాలతోనూ 'ఇక్రిశాట్' సన్నిహిత కృషి సల్పుతోంది.

ఆఫ్రికా ఖండంలో కూడ తొమ్మిది దేశాలలో దాదాపు 35 మంది 'ఇక్రిశాట్' శాస్త్రజ్ఞులు ఆయా దేశాల్లో గల ప్రభుత్వ వ్యవసాయ శాస్త్రజ్ఞులతో కలిసి పనిచేస్తున్నారు. ముమ్ముందు ఈ సహకారము విస్తరించుతుంది. భారతదేశంలో సహజంగా సజ్జ పంటకు వచ్చే తెగుళ్ళలో ముఖ్యమైన వెఱ్ఱి తల, మరియు బంక తెగుళ్ళకు తట్టుకొనే రకాలన్నీ మనకు ఆఫ్రికా నుండే వచ్చాయి.

వివిధ జాతీయ వ్యవసాయ కార్యక్రమాల్లో పనిచేస్తున్న యువ శాస్త్రజ్ఞులకు శిక్షణ యిచ్చే కార్యక్రమానికి యిక్కడ ఎక్కువ ప్రాధాన్యత యిస్తున్నారు. ఇంతవరకూ 66 దేశాల నుండి వచ్చిన దాదాపు 850 మంది శాస్త్రజ్ఞులు ఇచ్చట జరిగే పరిశోధనలనూ, సాంకేతి విజ్ఞానాన్ని తెలుసుకొంటూ ఒక నెలనుండీ, రెండు సంవత్సరాల వరకూ గడిపారు. అంతర్జాతీయ సదస్సుల ద్వారా శాస్త్ర విజ్ఞానాన్ని 'ఇక్రిశాట్' ప్రపంచంలోని యితర శాస్త్రజ్ఞులు పంచుకోవటానికీ, వారితో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవటానికీ అవకాశం కల్గుతోంది.

ఇక్రిశాట్ పాలక వర్గంలో అనేక దేశాలకూ, సంస్థలకూ చెందిన 15 మంది సభ్యులున్నారు. ఆస్ట్రేలియా దేశానికి చెందిన ఆర్థిక శాస్త్రవేత్త డా॥ జాన్ L. డిల్లన్ ఈ పాలక వర్గానికి అధ్యక్షులు. న్యూజిలాండ్ దేశానికి చెందిన డా॥ స్విండేల్ ప్రస్తుతం ఈ సంస్థకు డైరెక్టర్ జనరల్‌గా వున్నారు.

ఈ సంస్థలో మొత్తం 1400ల సిబ్బంది వుండగా వారిలో 19 దేశాల నుండి అంతర్జాతీయంగా ఎన్నిక చేయబడిన 82 మంది శాస్త్రజ్ఞులున్నారు. మిగిలిన వారంతా జాతీయంగా ఎన్నిక చేయబడినవారే.

### ఇక్రిశాట్‌కు ధన సహాయం చేసే దాతలు:

ఆస్ట్రేలియా, బెల్జియం, కెనడా, ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ, ఫ్రాన్స్, ఇండియా, ఇటలీ, జపాన్, మెక్సికో, నెదర్లాండ్స్, న్యూజిలాండ్, నైజీరియా, నార్వే, స్వీడన్, స్విట్జర్లాండ్, యునైటెడ్ కింగ్డమ్, యునైటెడ్ స్టేట్స్, ఫోర్డ్‌ఫౌండేషన్, రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్, అంతర్జాతీయ పరిశోధనా అభివృద్ధిసంస్థ, ఆసియా అభివృద్ధి బ్యాంకు, అంతర్జాతీయ ఆహార వ్యవసాయసంస్థ ప్రపంచ బ్యాంకు మొదలైన మొత్తం 30 దాతల నుండి ధనసహాయం అందుతోంది.

### పశురోగ జీవశాస్త్ర పరిశోధనా సంస్థ:

మన ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటిసారిగా 1945 లో "సీరమ్ ఇన్‌స్టిట్యూట్" అను పేరుతో పూర్వపు హైదరా బాదు సంస్థానంలో నేటి వి.బి.ఆర్.ఐ. ఒక అద్దె భవనంలో నెలకొల్పబడినది. మొదట రాష్ట్రంలో తరచుగా వచ్చే పశువులవ్యాధులు గొంతువాపు (హెచ్.యస్.), జబ్బవాపు (బి.క్యూ.) లకు వాక్సిన్‌లను (టీకామందు) తయారు చేసేవారు.

1954–55 సం.లో ఈసంస్థ యిపుడున్న ప్రదేశంలోకి మార్చబడి పశువులలో వచ్చే రకరకాల వ్యాధులకు పరిశోధనా కేంద్రంగా 1956 లో ఏర్పాటుచేయబడి "వి.బి.ఆర్.ఐ." (వెటర్నరీ బయాలజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్)గా నామకరణం చేయబడినది.

ఈ సంస్థ విస్తీర్ణం 11.3 ఎకరాలు. దీనిలో ముఖ్యంగా 2 విభాగాలున్నాయి.

1. వాక్సిన్ తయారీ విభాగం – బయోలాజికల్ ప్రోడక్ట్స్ డివిజన్.
2. రోగ పరిశోధనా విభాగం – డిసీజ్ ఇన్‌వెస్టిగేషన్ డివిజన్.

రోగనిర్ధారణ కొరకు పరీక్షలు నిర్వహించేందుకు, వాక్సిన్‌లను పరీక్షించేందుకు, అవసరమైన చిన్న జంతువులు, (స్మాల్ ఎనిమల్స్) కుందేళ్లు, గినీపందులు, తెల్లఎలుకలు విభాగం కూడా ఏర్పాటు చేయబడినది. దినదినాభివృద్ధి గాంచుతూ ప్రత్యేకంగా పశువులలో వచ్చే "గాళ్ళ" వ్యాధి (ఫుట్ అండ్ మౌత్ డిసీజ్) నిర్ధారణకొరకు, ఐ.సి.ఎ.ఆర్. సహకారంతో గాలికుంటు వ్యాధి పరిశోధనా విభాగం, రాష్ట్రంలో బెడదగా తయారైన "మెదడు వాపు" (జపానీస్ ఎన్‌సిఫాలిటీస్) వ్యాధి నిర్ధారణకొరకు మెడికల్ డిపార్టుమెంటు సహకారంతో ఒకవిభాగం, నెలకొల్పబడి ప్రగతిపథంలో సాగుతున్నాయి. కోళ్ళలో తరచుగా వచ్చే వ్యాధులు కొక్కెరతెగులు, మశూచీ టీకా మందులు తయారుచేయడానికి ఒక కోళ్ళ ఫారం ఏర్పాటు చేయబడింది.

ఈసంస్థలో తయారయ్యే అన్ని వాక్సిన్‌లను (టీకా మందులను) వాటి నాణ్యతను పరీక్షచేసి విడుదల చేయడానికి ఒక ఉప సంచాలకుని పర్యవేక్షణ క్రింద ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం రాజేంద్రనగర్ ఆవరణలో ఒక ప్రత్యేక స్టాండర్‌డైజేషన్ అండ్ టెస్టింగ్ విభాగం పనిచేస్తోంది. ఇచ్చట రకరకాల పరీక్షలు జరిపి వాక్సిన్‌ల నాణ్యతను నిర్ధారిస్తారు.

పశువుల దాణాలో వచ్చే ఫంగస్ (బూజు)లను (ఎఫ్లొటాక్సికోసిస్) పరీక్షించే విభాగం ఫీడ్ అనలిటికల్ లేబరేటరీ 1980–81 సం॥నుండి ప్రారంభించబడినది. ఇక్కడ తయారయే వాక్సిన్‌లు రాష్ట్రంలోని అన్ని జిల్లాలకు సకాలంలో సరఫరా అవుతున్నాయి. కోస్తా జిల్లాలకు సత్వరం అందజేయడానికి 1978–79 సం॥లో సామర్లకోటలో కోళ్ళ వాక్సిన్ తయారీ కేంద్రం ఉపసంచాలకుని పర్యవేక్షణలో స్థాపించబడి 1980–81 నుండి పనిచేస్తోంది.

వి.బి.ఆర్.ఐ. రాష్ట్రంలోకెల్ల పెద్ద సంస్థగా రూపొందింది. రాష్ట్ర అవసరాలు మాత్రమేగాక అవసరమైనప్పుడు ఇతర రాష్ట్రాల అవసరాలకు కూడా సహాయ సహకారాలనందిస్తున్నది.

ఈ సంస్థలో పనిచేసే ఆఫీసర్లకు అవసరం వచ్చినపుడు ట్రైనింగు ప్రోగ్రాములు నిర్వహిస్తోంది. ఈ సంస్థ పర్యవేక్షణతో 5 పశు ఆరోగ్యకేంద్రములు (ఎనిమల్ హెల్త్ సెంటర్స్) విజయవాడ, మహబూబ్‌నగర్, కర్నూలు, కడప, చిత్తూరులలో నెలకొల్పబడి పశు ఆరోగ్య పథకాలను సమర్థవంతంగా అమలుచేస్తున్నాయి. 16 డిస్ట్రిక్ట్ క్లినికల్ లేబరేటరీస్ మిగతా జిల్లాలో వి.బి.ఆర్.ఐ. అజమాయిషీ క్రింద పనిచేస్తున్నాయి.

వి.బి.ఆర్.ఐ. సంస్థలో ఉన్నత విద్యావేత్తలు, సమర్థులు యిద్దరు సంయుక్త సంచాలకులు (జాయింట్ డైరెక్టర్స్) ఏడుగురు ఉపసంచాలకులు (డిప్యూటీ డైరెక్టర్సు) 22 సహాయ సంచాలకులు (అసిస్టెంటు డైరెక్టర్సు) 30 మంది వెటర్నరీ ఆఫీసర్‌లు పనిచేస్తున్నారు.

ఈ సంస్థలో ముఖ్యంగా తయారయే వాక్సిన్‌లు:

1. యాంటిరేబీస్ వాక్సిన్
2. జబ్బవాపు వాక్సిన్ – బి.క్యూ వాక్సిన్
3. గొంతువాపు – హెచ్.యస్.వాక్సిన్
4. కోళ్ళ కొక్కెర తెగులు – రానికోట్
5. కోళ్ళ మశూచికం – ఫోల్‌పాక్స్
6. బాతులలో ప్లేగు వ్యాధి – డక్ ప్లేగు
7. గొర్రెలలో మశూచికం – షీప్‌పాక్స్
8. ఎంటిరోటాక్సేమియా (తిరుగుడు వ్యాధి)
9. దొమ్మవ్యాధి మందు – ఆంత్రెక్స్ స్పోర్
10. పశువులలో పారుడువ్యాధి – ఆర్.పి.టి.సి.ఆర్. యూనిట్ 1
11. " " యూనిట్ 2

పశువులలో పారుడు వ్యాధి:

నిరోధక టీకామందు: (ఆర్.పి.టి.సి.వి.):

పశు వ్యాధులలో పారుడు వ్యాధి అతి భయంకరమైనవ్యాధి. దానిని అరికట్టుటకు అధునాతన పరికరములతో అధునాతన పద్ధతులతో సమర్థవంతంగా 2 విభాగములు ఆర్.పి.టి.సి.వి. తయారుచేయబడి రాష్ట్ర అవసరాలు మాత్రమేగాక అరుణాచలప్రదేశ్, హిమాచలప్రదేశ్, అస్సాం, కాశ్మీర్‌లవంటి దూర రాష్ట్ర అవసరాలు సైతం తీర్చుతూ సమర్థవంతంగా పనిచేస్తున్నది. 46 లక్షల ఖర్చుతో అత్యాధునిక పరికరాలు యంత్రాలు సమకూర్చుకొనబడుతున్నది.

ఈ సంస్థ ప్రతి సంవత్సరం 15 రకాల వాక్సిన్‌లను సుమారు 15 మిలియన్ రూపాయలు విలువగలవి తయారుచేస్తోంది. రాబోవు సంవత్సరాలలో కొత్తరకాల వాక్సిన్‌లు తయారుచేయవలసిన ఆవశ్యకత వుంది. ఇప్పుడున్న పాత యంత్రాలతో సామర్థ్యం పెంపొందించుట అవసరం.

ఎయిర్ కండిషనల్ లేబరేటరీస్, స్మాల్ ఏనిమల్ బిల్డింగ్స్, అధునాతన లైబ్రరీ పరికరాలు ముఖ్యంగా అవసరం.

సమర్థులైన శాస్త్రవేత్తలున్నప్పటికీ తగిన యంత్రసామాగ్రి లేకపోవటం, బిల్డింగ్స్ కొరత సమస్యలను పరిష్కరించిననాడు రాష్ట్ర అవసరాలను తీర్చగలగడమేగాక యితర రాష్ట్రాలను సైతం ఆదుకోగల స్థితిలో ఉంటుందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

## జాతీయ సస్య రక్షణ శిక్షణా సంస్థ

భారతదేశంలోని అధికార్లకే కాకుండా ఆగ్నేయాసియా దేశాలకు చెందిన అధికార్లకు కూడా సస్యరక్షణ పద్ధతులపై శిక్షణనిచ్చే జాతీయ సస్య రక్షణ శిక్షణా సంస్థ రాజేంద్ర నగర్‌లో 1966 నుండి పనిచేస్తున్నది. కేంద్రప్రభుత్వంలోని వ్యవసాయ శాఖ అధీనంలో పనిచేస్తున్న ఈ సంస్థను ఇటీవల కాలం వరకు కేంద్ర సస్యరక్షణ శిక్షణా సంస్థగా వ్యవహరించేవారు. ఇటీవలనే జాతీయ సస్యరక్షణా శిక్షణా సంస్థగా మార్చబడింది. చీడ పీడల నివారణలో సిద్ధహస్తులైన నిపుణులకు, ప్రయోగశాలల్లో కీటక మందులు, సిలీంద్ర నాశకాల నాణ్యతను పరీక్షించే టెక్నిషియన్లకు, విస్తరణ సిబ్బంది వివిధ స్థాయిలో శిక్షణా తరగతులను ఈ సంస్థ నిర్వహిస్తున్నది. కేవలం రసాయన పద్ధతులతోనే కాకుండా సమగ్ర సస్య రక్షణ పద్ధతుల ద్వారా చీడ పీడలను అదుపు చేసే ప్రయత్నాలను పరిశోధిస్తూ, వాటిని రైతుల పొలాల్లో పరీక్షించి, అనుభవాలను శిక్షణలో వినియోగిస్తున్నది.

ఈ సంస్థ సస్య రక్షణలో పది మాసాల పాటు డిప్లొమా కోర్సుని నిర్వహిస్తున్నది. ప్రతి సంవత్సరం జులై మొదటి వారంలో ప్రారంభించబడే ఈ కోర్సు రాష్ట్ర వ్యవసాయ శాఖలో పనిచేస్తున్న వారికి ఉద్దేశించబడింది. వ్యవసాయ పట్టభద్రుల కోసం నడుపుతున్న ఈ కోర్సులో నిరుద్యోగ వ్యవసాయ పట్టభద్రులు కూడ చేరి, సస్యరక్షణను వృత్తిగా కూడా చేపట్టే వీలుంది. ఒక్కొక్కటి 19 వారాలపాటు సాగే రెండు సెమిస్టర్‌లలో ఈకోర్సు ముగుస్తుంది. రెండు సెమిస్టర్‌లకు మధ్య నాలుగు వారాల పాటు స్టడీటూర్ ఉంటుంది. పలు అంశాలపై నేర్చుకొనే విజ్ఞానంతో పాటు ప్రత్యక్ష అనుభవాన్ని కూడా ఈ కోర్సులో చేరేవారు పొందగలుగుతారు. ఈ దీర్ఘకాలిక కోర్సులతో పాటు మూడు నెలలపాటు నడిచే మూడు కోర్సులను కూడా ఈ సంస్థ నిర్వహిస్తున్నది. సస్యరక్షణలో అధునాతన విజ్ఞానం, పెస్టిసైడ్స్ తయారీ, పెస్టిసైడ్స్ అవశేషాలను అంచనా వేయటం అనే విషయాలపై ఈ మూడు మాసాల కోర్సుల్ని నడుపుతున్నది. మొదటి కోర్సులో కనీసం ఐదేళ్ల అనుభవం కలిగిన సీనియర్ ఆఫీసర్లను చేర్చుకుంటారు. సస్యరక్షణ మందుల నియంత్రణ చట్టం క్రింద ఏర్పాటు చేసే ప్రయోగశాలల్లో పనిచేసే వారికి రెండో కోర్సులో ప్రవేశముంటుంది. వారిని దేశంలో పెస్టిసైడ్స్ తయారుచేసే వివిధ ఫ్యాక్టరీలకు తీసుకెళ్లి చూపిస్తారు. మూడో కోర్సులో వ్యవసాయ ఉత్పత్తుల్లో అవశేషాలరూపంలో ఉన్న పెస్టిసైడ్సుని అంచనావేసే పద్ధతుల గురించి శిక్షణనిస్తారు. ఇవికాక ఒక వారంపాటు జరిగే సస్యరక్షణ, నాలుగు రోజులపాటు జరిగే ఎలుకల నివారణ, వారం రోజులపాటుండే కలుపుమొక్కల నివారణ వంటి అనేక స్వల్పకాలిక కోర్సుల్ని ఈ సంస్థ నడుపుతున్నది. హైదరాబాదులో ఉన్న అంతర్జాతీయ పరిశోధనా సంస్థ ఇక్రిశాట్ జరిపే మొక్కల ఎగుమతి, దిగుమతుల్ని పర్యవేక్షిస్తూ, వాటిని పరీక్షించి సర్టిఫికెట్‌లనిచ్చే పనిని కూడ ఈ సంస్థ నిర్వహిస్తున్నది. ఈ కార్యకలాపాలను నిర్వహించటానికి ఎన్నో అధునాతన సౌకర్యాలను ఈ సంస్థ ఏర్పాటు చేసుకున్నది.

## జాతీయ జొన్న పరిశోధనా కేంద్రం

జాతీయ జొన్న పరిశోధనా కేంద్రాన్ని 1987 లో ఏర్పాటు చేశారు. అంతకు ముందున్న భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ ఉపకేంద్రాన్ని, 1964 నుండి పనిచేస్తున్న అఖిల భారత సమన్వీకృత జొన్న అభివృద్ధి పథకాన్ని కలిపి ఈ సంస్థను ఏర్పాటు చేశారు. వరి, గోధుమ తర్వాత జొన్న దేశంలోని మూడవ ప్రముఖ ఆహార పంట. మనుషులకు గింజల్ని, పశువులకు చొప్పని అందిస్తూ, ఇప్పుడిప్పుడే పరిశ్రమల్లో వాడే పిండిపదార్థం తయారీకి కూడ జొన్న ఉపయోగపడుతున్నది. జొన్నలో మేలురకం వంగడాల తయారీకి, ఉత్పత్తిని పెంచే పరిజ్ఞానం అభివృద్ధికీ అఖిల భారత సమన్వీకృత జొన్న అభివృద్ధి పథకం గత ఇరవై ఆరేళ్లగా కృషి చేస్తున్నది. ఈ ప్రయత్నం కారణంగా జాతీయ స్థాయిలో 12 సంకరవంగడాలు, 13 మేలు జాతి వంగడాలు విడుదల చేయబడ్డాయి. ఇవికాక రాష్ట్ర స్థాయిలో మరో 23 వంగడాలు విడుదలయ్యాయి. మంచి చొప్పను అందించే 10 వంగడాలు కూడ రూపొందించబడ్డాయి.

దేశంలో క్రమేపీ జొన్న పంట క్రింద విస్తీర్ణం తగ్గుతున్నది. ఐతే దిగుబడి పెంచటం ద్వారా జొన్న ఉత్పత్తిని ఒకస్థాయికి తగ్గకుండా నిలపటానికి ఈ పరిశోధన కేంద్రం దోహదపడుతున్నది. ఐతే ఇటీవల కాలంలో దిగుబడులు కూడ ఒక స్థాయి వద్ద కనపడటంలేదు. వంగడాలలో మరింత రోగనిరోధక శక్తినీ, వాతావరణ మార్పులకు తట్టుకోగల శక్తినీ పొందుపరచటం ద్వారా దిగుబడుల్ని పెంచే కృషి కొనసాగుతున్నది. జొన్న పరిశోధనా కేంద్రంలో దాదాపు 20 అంశాలపై పరిశోధనలు జరుగుతున్నాయి. దేశ వ్యాపితంగా

16 కేంద్రాల్లో జరుగుతున్న పరిశోధనలను అఖిల భారత సమన్వీకృత జొన్న అభివృద్ధి పథకం పర్యవేక్షిస్తున్నది. ఈ పథకంతో 70 మంది భారత శాస్త్రవేత్తలు, 17 మంది ఇక్రిశాట్ శాస్త్రవేత్తలు సంబంధం కలిగి ఉన్నారు. జొన్న పరిశోధనా కేంద్రంలో 25 మంది శాస్త్రవేత్తలు, 90 మంది ఇతర సిబ్బంది పనిచేస్తున్నారు.

ప్రపంచ వ్యాపితంగా లభ్యమయ్యే జొన్న రకాలను కొన్ని ప్రత్యేక లక్షణాల కొరకు అధ్యయనం చేసి, మంచి లక్షణాలను నూతన వంగడాలలో చొప్పించటానికి ముఖ్యంగా ఈ కేంద్రంలో పరిశోధనలు జరుగుతున్నాయి. ఇవికాక జొన్నకు ప్రత్యామ్నాయ వినియోగాల గురించి కూడ పరిశోధనలు జరుగుతున్నాయి. కొత్త వంగడాలు త్వరగా వ్యాప్తి చెందటానికి 'బ్రీడర్' విత్తనాన్ని తయారుచేసి, విత్తనాల కంపెనీలకు అందించే ప్రయత్నం కూడ ఇక్కడ జరుగుతున్నది. నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని రైతులకు అందించటానికి రైతు దినోత్సవాలను నిర్వహించడం, శిక్షణా కార్యక్రమాలను నడపటం, రైతుల పొలాల్లో ప్రదర్శనలను చేపట్టడం వంటి మార్గాలను ఈ సంస్థ అనుసరిస్తున్నది.

## వరి పరిశోధనా సంచాలనాలయం

హైదరాబాదుకి నైరుతీమూలగా 18 కిలోమీటర్ల దూరంలో ఉన్న రాజేంద్రనగర్‌లో దేశంలోని వరి పరిశోధనలను సమన్వయం చేస్తున్న వరిపరిశోధనా సంచాలనాలయం ఉన్నది. 1965లో స్థాపించబడిన ఈ సంస్థను అఖిల భారత వరిపరిశోధనల సమన్వయ ప్రణాళికా కేంద్రంగా పిలిచేవారు. దేశంలోని వివిధ రాష్ట్రాల్లో జరిగే వరి పరిశోధనల్ని ఈ సంస్థ సమన్వయం చేస్తున్నది. ఏ ప్రాంతంలో రూపొందిన వరి వంగడాలనైనా దేశంలోని పరిశోధనా కేంద్రాలన్నిటిలోనూ పరీక్షించి, ఏయే ప్రాంతాలకది అనువుగా ఉంటుందో నిర్ధారించటానికి ఇటువంటి సమన్వయం అవసరం. జాతీయ స్థాయిలోనూ, ప్రాంతీయ స్థాయిలోనూ ప్రాముఖ్యం కలిగిన సమస్యలను గుర్తించి, వాటిపై పరిశోధనల్ని ప్రారంభించడం కూడ ఈ సంస్థ యొక్క ముఖ్య ఉద్దేశం. ముఖ్యంగా నీటిపారుదల సౌకర్యంతో పండించే వరిపంటకు ఉత్పన్నమవుతున్న సమస్యలపై ఈ సంస్థ ప్రాముఖ్యమిస్తుంది. వర్షాధార పరిస్థితిలో పండించే వరి పంటకు ఎదురవుతున్న సవాళ్ళ గురించి కటక్ (ఒరిస్సా రాష్ట్రం) లోని కేంద్ర వరి పరిశోధనా సంస్థ పరిశోధనలను ఎక్కువగా నిర్వహిస్తున్నది. దేశంలోని వివిధ ప్రాంతాలలో వరిపై పరిశోధనల్ని నిర్వహిస్తున్న శాస్త్రజ్ఞులు పరస్పరం వంగడాలను పరిశోధనా ఫలితాలను ఇచ్చి పుచ్చుకోవటాన్ని ఈ సంస్థ ప్రోత్సహిస్తుంటుంది. సాంకేతిక పరిజ్ఞానం రైతులకు చేరటాన్ని వేగిర పరుస్తూ ఈ సంస్థ శిక్షణ ప్రదర్శన కార్యక్రమాలను కూడా చేపడుతున్నది. వరికి సంబంధించిన అన్ని విషయాలపై సమాచారాన్ని పోగుచేసి, అవసరమైన వారికి దానినందించే బాధ్యతను కూడా ఈ సంస్థ స్వీకరించింది.

వరి పరిశోధనలకు నేతృత్వం వహించటానికీ, పరిశోధనల సమన్వయానికి పథకాలను వేసి, వాటి గురించి సమాచారాన్ని పోగుచేయడానికీ ఈ సంస్థ ఆరు విభాగాలను ఏర్పాటు చేసింది. పంట అభివృద్ధి విభాగం, సస్య విజ్ఞాన విభాగం, భూ విజ్ఞాన విభాగం, కీటకశాస్త్ర విభాగం, తెగుళ్ల పరిశోధనా విభాగం, సాంకేతిక పరిజ్ఞాన బదిలీ విభాగం అని పిలువబడే ఈ ఆరు విభాగాలు పరిశోధనల్ని నిర్వహిస్తున్నాయి. ప్రతి విభాగంలోనూ ఒక ప్రధాన శాస్త్రవేత్త అనేక ఇతర శాస్త్రవేత్తలూ ఉంటారు. మొత్తం ఈ సంచాలనాలయంలో 52 మంది శాస్త్రవేత్తలున్నారు. ఇవికాక లైబ్రరీ, వ్యవసాయ యంత్ర విజ్ఞానం, సస్యపరిజ్ఞానం, పొలాల యాజమాన్యం వంటి విషయాలకు సంబంధించిన అనుబంధ శాఖలున్నాయి.

దేశంలో వరిపై పరిశోధనల్ని నిర్వహిస్తున్న 52 కేంద్రాలు ఈ సంస్థ కార్యకలాపాల్లో పాలుపంచుకుంటున్నాయి. ఈ పరిశోధనా కేంద్రాలు కాక, మరో యాభై పరీక్షా కేంద్రాలున్నాయి. దాదాపు 250 మంది శాస్త్రవేత్తలు ఈ సంస్థ నిర్వహించే కార్యశాలల్లో పాల్గొంటున్నారు. ప్రతిఏటా పరిశోధనా ఫలితాలను చర్చించి, కొత్త పరిశోధనా వ్యూహాలను రూపొందించటానికి ఈ కార్యశాలలు దోహదపడుతున్నాయి. సాంకేతిక పరిజ్ఞాన బదిలీ విభాగంలో ఒక శిక్షణా కేంద్రం, ప్రయోగాత్మక ప్రదర్శనల విభాగం ఉన్నాయి. అన్ని అధునాతన సౌకర్యాలతో నిపుణులతో కూడిన శిక్షణా కేంద్రంలో విజ్ఞానాన్ని మెళకువలను తెలుసుకోవటానికి దేశంలోని అన్ని ప్రాంతాల నుండి ఆఫీసర్లు వస్తుంటారు. భారత ప్రభుత్వంచే ఒక అగ్రగామి శిక్షణా సంస్థగా గుర్తించబడి వరి ఉత్పత్తి పరిజ్ఞానం, సమగ్ర సస్య రక్షణ, వరి ముఖ్య పంటగా కలిగిన పంటల పథకాల గురించి శిక్షణా కోర్సులను ఈ కేంద్రం నిర్వహిస్తున్నది. ప్రయోగాత్మక ప్రదర్శనల విభాగం ద్వారా కొత్తగా రూపొందించబడిన ఉత్పత్తి రక్షణ పరిజ్ఞానాలను రైతులకు పరిచయం చేస్తున్నది.

వరి పరిశోధనా సంచాలనాలయానికి ఫిలిప్పైన్స్‌లో ఉన్న అంతర్జాతీయ వరి పరిశోధనా కేంద్రంతోనూ, కటక్‌లోని కేంద్రీయ వరి పరిశోధనా సంస్థతోనూ, సన్నిహిత సంబంధాలున్నాయి. చైనా అనుభవాన్ని పురస్కరించుకొని దేశంలో వరి అభివృద్ధికి నూతన పరిజ్ఞానాన్ని రూపొందించటానికి ఐక్యరాజ్యసమితి యొక్క అభివృద్ధి కేంద్రంతో కలిసి ఒక ప్రణాళికను అమలుపరుస్తున్నది. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ వరి అభివృద్ధికి చేస్తున్న కృషిని ఈ సంస్థ స్థాయిలో సమన్వయ పరుస్తున్నది.

## ఆం.ప్ర. వ్యవసాయ విశ్వవిద్యాలయం:

వ్యవసాయం, పశువైద్యం, గృహ విజ్ఞాన శాస్త్రం ఈమూడు రంగాలను అభివృద్ధి పరచటానికి అందుకు అవసరమయిన సమర్థవంతమయిన సాంకేతిక నిపుణులను తయారుచేయటానికి వీలుగా 1963 సంవత్సరములో ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ చట్టం రూపొందించి తదనుగుణంగా 1964 మే 4వ హైదరాబాదులోని రాజేం ద్రనగర్‌లో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం స్థాపించడమయినది. ఆనాటికి రాష్ట్రంలోవున్న వ్యవసాయ, పశువైద్య, గృహవిజ్ఞాన కళాశాలలను ఈ విశ్వ విద్యాలయానికి అనుబంధ సంస్థలుగా చేశారు.

వ్యవసాయ విద్య, పశు వైద్య శాస్త్రం, గృహ విజ్ఞానం మొదలైన వాటిలో శిక్షణ యిచ్చి, గ్రామీణ ప్రజల ఆర్థిక పరిస్థితిని, ప్రతిపత్తిని ఇతోధికం చేయడం; అభ్యుదయ కర్షకులకు మరింత విజ్ఞానాన్ని అందజేసే నిమిత్తం సమర్థులయిన సాంకేతిక సిబ్బంది సహాయం సమకూర్చడం ఈ విశ్వ విద్యాలయం ముఖ్య ఆశయాలు. ఈ ఆశయాల ఆచర ణకు వ్యవసాయదారులకు అధికంగా ఉపయోగపడే సేవా కార్యక్రమాలతోపాటు, వ్యవసాయ సంబంధ విషయాలపై అధ్యయన, పరిశోధన, విస్తరణా పథకాలను ఈ విశ్వ విద్యాలయం నిర్వహిస్తోంది.

ఈ విశ్వవిద్యాలయానికి రాజేంద్రనగర్, బాపట్ల, తిరుపతిలలో 3 వ్యవసాయ కళాశాలలు, రాజేంద్రనగర్, తిరుపతిలోని 2 పశువైద్య విజ్ఞాన శాస్త్ర కళాశాలలు, రాజేంద్రనగర్, బాపట్లలోని 2 గృహవిజ్ఞాన శాస్త్ర కళాశాలలు అనుబంధంగా వున్నాయి.

## వ్యవసాయ విద్య:

వ్యవసాయ విద్యా రంగంలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సును (ఎ.జి.బి.ఎస్.సి.) బాపట్ల, తిరుపతి, రాజేంద్రనగర్ లలో బోధించడం జరుగుతోంది. ఈ మూడు కళాశాలలలో కలిపి ప్రతి సంవత్సరం 440 మంది విద్యార్థినీ విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. ఇటీవలి కాలంలో విద్యార్థినుల సంఖ్య క్రమక్రమంగా పెరుగుతోంది. 1986–87 సంవత్సరంలో 37% మంది విద్యార్థినులు అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులో ప్రవేశించారు. ఈ కోర్సుతోపాటుగా వ్యవసాయ విద్యలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సును కూడా మూడు కళాశాలలలోను బోధిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఈ కోర్సులోకి 165 మంది ప్రవేశిస్తున్నారు. రాజేంద్రనగర్‌లోని వ్యవసాయకళాశాలలో వ్యవసాయ విద్యపై పరిశోధన నిర్వహించడానికి తద్వారా పిహెచ్.డి. పట్టాను పొందటానికి తగినన్ని సదుపాయాలు వున్నాయి.

వ్యవసాయ ఆర్థిక శాస్త్రం, కృషి శాస్త్రం, కీటక శాస్త్రం విస్తరణ విద్య, ఉద్యోగ కృషి, మొక్కలు పెంపకం, జన్యు శాస్త్రం, మొక్కల రోగ లక్షణ శాస్త్రం, మొక్కల నిర్మాణ శాస్త్రం, భూసార విజ్ఞాన శాస్త్రం, వ్యవసాయ రసాయన శాస్త్రం మొదలైన అంశాలలో పోస్టు గ్రాడ్యుయేషన్, పిహెచ్.డి. కోర్సులను నిర్వహించడం జరుగుతోంది.

విద్యార్థులకు బోధనా తరగతులతో పాటు, ఆచరణాత్మక నైపుణ్యతను పెంచటానికి వీలుగా "గ్రామీణ వ్యవసాయ పనుల అనుభవ కార్యక్రమాన్ని" (ఆర్.ఎ.డబ్ల్యూ.ఇ.) ఈ విశ్వవిద్యాలయం రూపొందించింది. దీనిని అనుసరించి బి. ఎస్.సి. ఆఖరి సంవత్సరంలోని విద్యార్థులను 4 లేక 5గురిని బృందంగా ఏర్పరచి రాష్ట్రంలోని వ్యవసాయ విద్యాలయ పరిశోధనా కేంద్రాల చుట్టుప్రక్కల వున్న గ్రామాలలో ఒక రైతు వద్ద ఉంటూ ఆచరణాత్మక కౌశల్యాన్ని, పరిజ్ఞానాన్ని పెంచుకుంటారు. ఈ కార్యక్రమం వల్ల విద్యార్థులకు గ్రామీణ వాతావరణం అలవడటమే కాకుండా, రైతు సమస్యలు, సాగు పద్ధతులు, అవగాహనకు వస్తాయి. ఈ కార్యక్రమం ఖరీఫ్ పంటకాలంలో 5 నెలలు పాటు ప్రతి సంవత్సరం సాగుతుంది. ఈ కార్యక్రమంలో పాల్గొనే విద్యార్థులకు ప్రతి నెల రూ.250/– స్టైపెండును చెల్లిస్తారు. విద్యార్థుల పరిజ్ఞానాన్ని పెంచడంలో ఈ కార్యక్రమం గుణాత్మకమైన మార్పును తెచ్చింది.

## పశువైద్యవిద్య:

ఈ విద్యను బోధించడానికి తిరుపతి, రాజేంద్రనగర్‌ల లోని కళాశాలలు నెలకొల్పడం జరిగింది. ఈ కళాశాలలో పశువైద్యంలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులోకి ప్రతి సంవ త్సరం 160 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. అదేవిధంగా ఈ పశు వైద్యంలోని 16 అంశాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సును నిర్వహించడం జరుగుతోంది. ఈ కోర్సులోకి ప్రతి సంవత్సరం 70 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. గత సంవత్సరం తిరుపతి పశు వైద్య కళాశాలలో కొత్తగా జన్యు శాస్త్రం, మొక్కల పెంపకం, ఔషధ శాస్త్రం, విష విజ్ఞాన శాస్త్రం, శరీర నిర్మాణ శాస్త్రంలో కొత్త పోస్టుగ్రాడ్యుయేట్ కార్యక్రమాలను ప్రవేశపెట్టారు. ఈ రెండు కళాశాలలకు అనుబంధంగా ఆధునికమైన పశు వైద్యశాలలు కూడా నిర్మించటం జరిగింది.

విద్యార్థులకు ఆచరణాత్మకమైన పరిజ్ఞానాన్ని అందివ్వడా నికి వీలుగా బి.వి.ఎస్.సి. ఆఖరి సంవత్సరం కోర్సు ముగిసిన పిదప జిల్లాలోని పశు వైద్యశాలలకు పంపి అక్కడ వివిధ రకాల జంతువుల వ్యాధులకు చికిత్సను చేయించడం జరుగుతోంది. విద్యార్థులకు పశువుల పెంపకంలో వాణిజ్యపరంగా శిక్షణ ఇవ్వడానికి "విద్యార్థులుగా సంపాదించండి" అనే పథకం క్రింద పందులు, కోళ్ళ పెంపకంలోనూ శిక్షణ యిచ్చి మోడల్ ఫార్మ్సను నిర్వహిస్తున్నారు.

పశువైద్యంతో పాటుగా పాడి సాంకేతిక శాస్త్రంలో (డైరీ టెక్నాలజీ)లో బి.యస్.సి. కోర్సును 1983-84 సంవత్సరంలో తిరుపతిలోని పశువైద్య కళాశాలలో ప్రవేశ పెట్టారు. ఇందులో ప్రతి సంవత్సరం 20 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. ఈ కోర్సులో మొదటి రెండు సంవత్సరాలు కళాశాలలో బోధించి తరువాత రెండు సంవత్సరాలపాటు, పాల ఉత్పత్తుల ప్రాసెసింగ్ నాణ్యత, నియంత్రణ అనే అంశాలను చిత్తూరులోని పాల పాడి ఫ్యాక్టరీలో బోధిస్తారు. ఈ కోర్సు నిర్వహణకు ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమ అభివృద్ధి సహకార సమాఖ్య ఇతోధిక సహాయ సహకారాలను అందిస్తోంది.

పశువైద్య శాస్త్రంలోని వివిధ అంశాలపై పరిశోధన నిర్వహించి పిహెచ్.డి. పట్టాలను పొందటానికి అనువైన సదుపాయాలను ఈ రెండు కళాశాలలలో ఏర్పాటు చేయడమైంది. ఒకేసారి ఒక్కొక్క కాలేజీలో 10 మంది విద్యార్థులు పరిశోధన చేసే అవకాశాలు వున్నాయి.

## గృహవిజ్ఞాన విద్య:

ఈ విద్యను బోధించడానికి హైదరాబాదులోనూ, బాపట్లలోనూ కళాశాలలను ఏర్పాటు చేయడం జరిగింది. బాపట్లలోని గృహ విజ్ఞాన విభాగం 1983లోనే ప్రారంభించారు. ఇక్కడ అండర్ గ్రాడ్యుయేషన్ కోర్సును మాత్రమే బోధిస్తారు. హైదరాబాదు కళాశాలలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సుతోపాటు ఆహారం, పోషకాహారం, శిశు అభివృద్ధి గృహ నిర్వహణశాఖలలో పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులను నిర్వహిస్తున్నారు. 1986 సంవత్సరములో దుస్తుల పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సును కూడా 6 గురు విద్యార్థులతో ప్రారంభించారు. మొత్తం పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సులలో 20 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. బాపట్ల, హైదరాబాదులలో కలిపి అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులో 140(30+110) ఈ రెండు కోర్సులతో పాటు హైదరాబాదు కళాశాలలో ఆహారం, పోషకాహారం అనే అంశాలపై పరిశోధన చేస్తూ ఇద్దరు పరిశోధకులు కూడా వున్నారు. ప్రస్తుతం హైదరాబాదు కళాశాల, గృహ విజ్ఞానంలోని వివిధ అంశాలపై 4 అఖిల భారత పరిశోధక ప్రాజెక్టులను 3 తాత్కాలిక పరిశోధక ప్రాజెక్టులను చేపట్టి నిర్వహిస్తోంది.

ఈ కళాశాల పరిశోధక శాఖలను రాజేంద్రనగర్‌కు త్వరలోనే మార్చే ప్రతిపాదన ఉంది.

## పరిశోధన:

ఈ వ్యవసాయ విద్యాలయం బోధనతో పాటుగా విస్తృతమైన పరిశోధక కార్యక్రమాలను కూడా చేపట్టింది. రాష్ట్రం మొత్తాన్ని వాతావరణం బట్టి 7 ప్రాంతాలుగా విభజించి ఆయా ప్రాంతాలలో పండే పంటలు, నివసించే పశువులు, ప్రజలు ఆరోగ్య ఆర్థికాభివృద్ధికి అవసరమైన పరిశోధనలను నిర్వహిస్తోంది. వాటి వివరాలను పట్టిక ద్వారా అందిస్తున్నాం. వివిధ పంటలపై ఈ కేంద్రాలు పరిశోధన గావించి అధిక దిగుబడిని అందించే 105 వంగడాలను అందించింది. వరి పంటలో అధిక దిగుబడి వరిగా సాగుచేస్తున్న మసూరి రకం యీ విశ్వ విద్యాలయ కృషి ఫలితమే. పల్నాడు రకం కందిపప్పు, లాం హైబ్రీడ్ -1 ప్రత్తి వంగడం, మంజీరా మామిడి వంగడం, ఎక్స్ - 235° మిర్చి వంగడం, మొదలైనవి యీ విశ్వవిద్యాలయ పరిశోధనల మూలంగా సాగులోకి వచ్చిన అధిక దిగుబడి రకాలు.

ఆంధ్రప్రదేశ్‌లో పంటల దిగుబడి పెంచటానికి అవరోధంగా వున్న జింకు లోపాన్ని కనుగొని జింకు సల్ఫేటు వాడకం వల్ల వరి దిగుబడిని 20 శాతం, జొన్న దిగుబడిని 12.40 శాతం పెంచవచ్చని యీ విశ్వ విద్యాలయ పరిశోధనలు తెలియచేసాయి.

సాధారణ పశువుల కంటే 200 శాతం అధిక పాలనిచ్చే అన్ని విధాల మేలైన ప్రిజియన్ ఒంగోలు జాతి సంకర ఆవులును అభివృద్ధి పరచింది.

నెల్లూరు, మాండ్యాకు చెందిన దేశవాళీ గొర్రెలను డార్సెట్, సఫోక్ రకాల విదేశీ జాతి గొర్రెలతో సంపర్కం చేయించడం ద్వారా అభివృద్ధి చెందిన సంకర జాతి గొర్రెలు పెరుగదలలోనూ, మాంసపు దిగుబడిలోనూ, ఉన్ని ఉత్పత్తిలోనూ మేలైన రకాలుగా కనుగొనడం జరిగింది. వీటితో పాటుగా వివిధ రకాల చేపలు, రొయ్యలపై కూడా అనేక పరిశోధనలు నిర్వహిస్తోంది. వీటితోపాటు సుగంధద్రావ్యాల చెట్లు, ఔషధాల మొక్కలపైన, ఉద్యాన కృషి, కోతల తరువాత సాంకేతిక విజ్ఞానం, వ్యవసాయ అడవుల పెంపకం, క్షేత్ర పరికరాలు, నీటి నిర్వహణ, జంతు పోషకాహారం, వాణిజ్య పంటల నిర్వహణపై పరిశోధనలను నిర్వహిస్తోంది. విస్తృత స్థాయిలో జరిగే యీ పరిశోధనలను సక్రమంగా, సమర్థవంతంగా బహుముఖంగా నిర్వహించటానికి అంతర్జాతీయ బియ్యం పరిశోధనా సంస్థ (ఐ.ఆర్.ఆర్.ఐ.) మెట్ట వ్యవసాయ పరిశోధక సంస్థ (ఇక్రిశాట్) వంటి అంతర్జాతీయ సంస్థల సహకారాన్ని కూడా ఈ విశ్వ విద్యాలయం తీసుకుంటోంది.

ఈ విశ్వవిద్యాలయం బోధనా, పరిశోధనతో పాటు అనేక విధాలైన విస్తరణ కార్యక్రమాలు చేపడుతోంది. అందుకొరకు పాలెం, జగిత్యాల, గుంటూరు, అనకాపల్లి, నంద్యాల, తిరుపతిలలో ఆరు విస్తరణా విద్యా యూనిట్లను ఏర్పాటు చేశారు. ఈ యూనిట్లు ఆకాశవాణిలో వ్యవసాయ సూచనలు

అనే కార్యక్రమాలతో రైతులకు నేరుగా సమాచారాన్ని అందిస్తాయి. దీనితో పాటుగా శిక్షణ ప్రదర్శనలు, సామూహికీకరణ ప్రయోగాలు, క్షేత్ర సందర్శనలు, రైతు దినోత్సవాలు, కిసాన్ మేళాలు, సమావేశాలు, సామూహిక చర్చలు, ముద్రణ సాహిత్యం మున్నగు వాటిద్వారా పరిశోధనా కేంద్రాల పరిసరాలలో ఉన్న రైతులకు సమాచారం అందచేస్తాయి.

వ్యవసాయ, పశు సంవర్థక శాఖలలో పనిచేసే ఉద్యోగులకు తదితర సంబంధిత విస్తరణా ఉద్యోగులకు శిక్షణ కార్యక్రమాలను కూడా విశ్వ విద్యాలయం నిర్వహిస్తోంది. ఇంతవరకు 246 శిక్షణా కార్యక్రమాలు చేపట్టి 4,899 మంది ఉద్యోగులకు శిక్షణ యిచ్చింది. పొలాలలో పనిచేసే రైతులు, స్త్రీలు, యువజనులలో సాంకేతిక నైపుణ్యం పెంపొందించడానికి అనంతపురం, ఆముదాల వలస, రసాకుంటలలో కృషి విజ్ఞాన కేంద్రాలను స్థాపించింది.

రైతుల ఆర్థిక స్థితిని ముఖ్యంగా బలహీనవర్గాల రైతుల స్థితిని మెరుగుపర్చటానికి అందుకు అవసరమైన సాంకేతిక విజ్ఞానాన్ని అందివ్వటానికి రాష్ట్రం మొత్తంలో 72 – 82 కాలానికి 9,250 మందిని, 85 – 84 కాలానికి 8,483 మందిని, 84 – 86 కాలానికి 6,100 మంది రైతు కుటుంబాలను ఎంపికచేసి వారికి తగిన కార్యక్రమాలను రూపొందించి శిక్షణ ఇవ్వటం జరిగింది. ఇంతే కాకుండా వ్యవసాయ ఉత్పత్తి గ్రామీణ ఆదాయం పెరుగుదల సాధించే ఉద్దేశంతో 20 సూత్రాల పథకం క్రింది 42 గ్రామాలను కూడా ఈ విశ్వ విద్యాలయం దత్తత తీసుకుంది. వరంగల్, అనంతపురం, అనకాపల్లిలో ప్రదాన ఆహార పంటలపై జాతీయ ప్రదర్శనను కూడా నిర్వహిస్తోంది.

వ్యవసాయం ప్రధాన వృత్తిగా ఉన్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వ్యవసాయ, పశు, గృహ విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని సాధించటానికి అందుకు అవసరమైన సాంకేతిక నిపుణులును తయారుచేయడంలోనూ, వ్యవసాయంలో సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టడంలోనూ ఈ విశ్వ విద్యాలయం బహుముఖమైన కృషి చేస్తోంది.

### ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం నిర్వహిస్తున్న వివిధ పరిశోధక కేంద్రాలు

| వ్యవసాయ వాతావరణ ప్రాంతం/ఆ ప్రాంతపు జిల్లా | ఆ ప్రాంతంలో వున్న పరిశోధక కేంద్రం | పరిశోధన కావిస్తున్న ముఖ్య పంటలు/విషయం |
|---|---|---|
| (1) | (2) | (3) |
| 1. కృష్ణా–గోదావరి ప్రాంతం గుంటూరు: | ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా కేంద్రం, లామ్ | చిరుధాన్యాలు, ప్రత్తి, జొన్న, మిర్చి, సుగంధద్రవ్యాలు, పశువులు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, చింతలపూడి | పోకచెక్క, తమలపాకు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అమరావతి | ప్రత్తి |
| | వ్యవసాయ పరిశోధనా కళాశాల, బాపట్ల | జీడిపప్పు, వరి, కలుపు నివారణ మేలైన సాగు పద్ధతులు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, మధిర | ప్రత్తి |
| | విత్తనాల ఉత్పత్తి ఫారము | మేలు విత్తనాల ఉత్పత్తి |
| | విత్తనాల ఉత్పత్తి ఫారము, జంగమేశ్వరపురం | మేలు విత్తనాల ఉత్పత్తి |
| కృష్ణా | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ఉయ్యూరు | చెఱకు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, మచిలీపట్నం | వరి |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ఎండుకోడూరు | మురుగు నీటి పారుదల పద్ధతులు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, గరికపాడు | చిరుధాన్యాలు, నూనె విత్తనాలు, నీటి నిర్వహణ |
| పశ్చిమ గోదావరి | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, మారుటేరు | వరి |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, పూళ్ల | వరి |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, కొవ్వూరు | అరటి |
| | విత్తనాల ఉత్పత్తి ఫారమ్ | మేలు విత్తనాల ఉత్పత్తి |
| | వెంకటరమణ గూడెం | పొగాకు |

| | | |
|---|---|---|
| | వ్యవసాయ పరిశోధన కేంద్రం, విజయరాయ్ | మొక్క పెంపకం |
| | రొయ్యల పరిశోధక కేంద్రం, కొవ్వలి | రొయ్యలు |
| తూర్పు గోదావరి | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, రాజోలు | కొబ్బరి మొక్కలు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అంబాజీ పేట | కొబ్బరిమొక్కలు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, పందిరిమామిడి | మొక్కల పెంపకం |
| | మత్స్య పరిశోధక కేంద్రం, కాకినాడ | మంచినీటి చేపలు, రొయ్యలు |
| 2. ఉత్తర కోస్తా ప్రాంతం: | | |
| విశాఖపట్నం | ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన, అనకాపల్లి | చెరకు, రాగి, నువ్వులు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, యలమంచిలి | నువ్వులు |
| శ్రీకాకుళం | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ఆముదాలవలస | జనుమ , చిరుధాన్యాలు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, రాగోలు | వరి |
| విజయనగరం | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, విజయనగరం | రాగి |
| తూర్పు గోదావరి | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, పెద్దాపురం | కర్ర పెండలం |
| 3. దక్షిణ ప్రాంతం: | ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా కేంద్రం, | వేరుశనగ, మొక్కజొన్న, జొన్న, ఎర్ర కందిపప్పు, పచ్చ |
| | తిరుపతి | కందిపప్పు, నిమ్మ, నారింజ మొదలగు ఫలాల పంటలు |
| చిత్తూరు | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, పెరుమాళ్లపల్లి | జొన్న |
| | పశు పరిశోధనా కేంద్రం, పలమనేరు | గొర్రెలు |
| నెల్లూరు | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, నెల్లూరు | వరి |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, కావలి | జీడిపప్పు |
| | పశుపరిశోధనా కేంద్రం, చింతలదేవి, ఎ.ఆర్.యస్. పొదలకూరు | గొర్రె, జొన్న |
| కడప | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అనంతరాజు పేట | మామిడి, నిమ్మ మొదలగు ఫలాలు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ఊటుకూరు | పోకచెట్లు, వరి, తమలపాకు |
| అనంతపురం | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, కదిరి | వేరుశనగ |
| 4. ఉత్తర తెలంగాణా ప్రాంతం: | | |
| కరీంనగర్ | ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా కేంద్రం, జగిత్యాల | నూనె గింజలు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, కరీంనగర్ | జొన్న |
| నిజామాబాద్ | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, రుద్రూరు | చెరకు, వరి, పసుపు |
| ఆదిలాబాద్ | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, బెల్లంపల్లి | మొక్కల పెంపకం |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ఆదిలాబాద్ | ప్రత్తి, చిరుధాన్యాలు, జొన్న రకాలు |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ముధోల్ | ప్రత్తి, జొన్న |
| వరంగల్ | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, వరంగల్ | వరి, చిరుధాన్యాలు, మిర్చి |
| ఖమ్మం | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, వైరా | వరి |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, గరీబ్ పేట | మొక్కల పెంపకం |
| | మత్స్య పరిశోధక కేంద్రం, పాలేరు | చేపలు |

| | | |
|---|---|---|
| 5. దక్షిణ తెలంగాణా ప్రాంతం: | | |
| మహబూబ్ నగరు | ప్రాంతీయవ్యవసాయ పరిశోధనా కేంద్రం, పాలెం | చిరుధాన్యాలు, జొన్న, ఆముదము |
| రంగారెడ్డి | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, రాజేంద్రనగర్ | వరి, కుసుమపువ్వు, పొద్దుతిరుగుడు పువ్వు, ద్రాక్ష వివిధ రకాల మేలైన విత్తనాల అభివృద్ధి, కోళ్ల పెంపకం, ఆహార విజ్ఞానం, పశుగ్రాసం మొక్కల అభివృద్ధి |
| హైదరాబాదు | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అంబరుపేట | మొక్కజొన్న |
| మెదక్ | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, మెదక్ | మామిడి, ద్రాక్ష, సీతాఫలం, కాయగూరలు, వివిధ ఫలాలు |
| 6. అల్పవర్ష ప్రాంతాలు: | | |
| కర్నూలు | ప్రాంతీయ వ్యవసాయ ప.కేంద్రం, నంద్యాల | ప్రత్తి, జొన్న |
| | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, ఆదోని | ప్రత్తి |
| అనంతపురం | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, అనంతపురం | జొన్నలు, చిరుధాన్యాలు, వేరుశెనగ, పశుగ్రాసం, మెట్టసాగు పద్ధతులు |
| 7. అత్యధిక గిరిజనవాస ప్రాంతం: | | |
| విశాఖపట్నం | ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన కేంద్రం, చింతపల్లి | మిరియాలు |
| విజయనగరం | వ్యవసాయ ప. కేంద్రం, రస్తా కుంటబాయి | జొన్న, చిరుధాన్యాలు, మిర్చి, పసుపు |
| శ్రీకాకుళం | వ్యవసాయ పరిశోధనా కేంద్రం, సీతంపేట | గిరిజన సాంఘికాభివృద్ధి |

చిరకాలం జరిగిన మోసం,
బలవంతుల దౌర్జన్యాలూ,
ధనవంతుల పన్నాగాలూ,
ఇంకానా! ఇకపై చెల్లవు. – శ్రీశ్రీ

# సాంకేతికరంగం

కె. విష్ణు

## జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం:

అఖిల భారత సాంకేతిక విద్యా సమితి, 1970లో నిర్వహించిన జాతీయ సెమినార్, భారత దేశంలోని ప్రతి రాష్ట్రంలో బహుళ శాస్త్ర విభాగాలతో కూడిన సాంకేతిక విశ్వవిద్యాలయాలు, దేశ సాంకేతిక శాస్త్ర పురోగతికి అత్యవసరమని పేర్కొంది. ఆ సూచన మేరకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 1971 అక్టోబరు 2న జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయాన్ని స్థాపించింది. సూచనను అమలు జరిపిన మొదటి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ అవడం ఇక్కడ గమనార్హం. ఈ విశ్వవిద్యాలయం ఒక్క సాంకేతిక రంగాలకే పరిమితం కాక కళలు, సామాజిక శాస్త్రాలు, గణిత శాస్త్రం మొదలైన విభాగాలను కూడా కలిగియుంది.

### లక్ష్యాలు:

ఇంజనీరింగ్ సాంకేతిక, భౌతిక, సామాజిక, భవన నిర్మాణ శాస్త్రంతోపాటుగ కళలందు బోధన, పరిశోధన, ప్రయోగ, వాస్తవ శిక్షణా పద్ధతుల ద్వారా ఆధునిక విజ్ఞానాన్ని అందించడం తరగతి లోపల బోధించిన విషయాలను తరగతి బయట తత్సంబంధమైన విజ్ఞాన విద్యార్థులు పొందేటట్లు చేయడం, గ్రహించిన విజ్ఞానాన్ని భిన్న పరిస్థితులలో అమలు పరచటానికి అవసరమైన నూతన భావాలు, పద్ధతులు, నిపుణతలు, ఆలోచనా విధానాన్ని అభివృద్ధి పరచటం.

నూతన విద్యా పద్ధతులను శిక్షణాక్రమాన్ని పరీక్షా విధానాల్ని రూపొందించేటందుకు అవసరమైన వ్యవస్థలు నిర్మాణక్రమాన్ని రూపు దిద్దేందుకు కృషి చేయడం, దేశ ఆర్థికాభివృద్ధికి అవసరమైన పరిశోధన పెంపొందేటట్లు చూడటం, భిన్న రంగాల్లో ఉన్న కళాశాలల్లో పరిశ్రమల సలహా సేవా విభాగాల్ని పెంపొందేటట్లు చేయడం.

అనుబంధిత కళాశాలల విద్యార్థులలో పరిశ్రమలను స్థాపించే ధైర్య సాహసాలు పెరిగేటట్లు చూడటం ఈ విశ్వవిద్యాలయం యొక్క ముఖ్యలక్ష్యాలు.

కాకినాడ, అనంతపురం లలోని ప్రభుత్వ ఇంజనీరింగు కళాశాలలు, వరంగల్లులోని ప్రాంతీయ కళాశాల, హైదరాబాదులోని నాగార్జున ఇంజనీరింగు కళాశాల, లలిత కళలు భవన నిర్మాణ శాస్త్రకళాశాల ఈ విశ్వవిద్యాలయం క్రిందకు తీసుకురాబడ్డాయి. అయితే వరంగల్లు ప్రాంతీయ ఇంజనీరింగు కళాశాల అసోసియేటెడ్ కళాశాలగాను, తక్కిన నాల్గు కళాశాలలు 'కాన్‌స్టిట్యూయంట్' కళాశాలలు గాను విశ్వవిద్యాలయాని కనుబంధించబడ్డాయి.

ఇవిగాక హైదరాబాదులోని పోస్టు గ్రాడ్యుయేట్ స్కూల్ ఆఫ్ కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్ సుదూర విద్యాకేంద్రం (సెంటర్ ఫర్ డిస్టెన్స్ ఎడ్యుకేషను), కంప్యూటర్ సెంటర్ – నీటి వనరులు, నిర్వహణా కేంద్రం (సెంటర్ ఫర్ వాటర్ రిసోర్సె మరియు మేనేజ్‌మెంట్), గ్రామీణాభివృద్ధి కేంద్రం (సెంటర్ ఫర్ రూరల్ డెవలప్‌మెంట్) – ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా వున్నాయి.

ఈ విశ్వవిద్యాలయం నిర్వహించిన ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైనవారిని ఈ విశ్వవిద్యాలయం, దాని అనుబంధిత కళాశాలల్లో వివిధ కోర్సులలోకి తీసుకోవడం జరుగుతోంది. ఈ విధానం 1976 నుంచి అమలులోకి వచ్చింది.

## ఇంజనీరింగ్ కళాశాల, అనంతపురం:

ఈ కళాశాలను రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత 1946లో ప్రారంభించారు. ఇది ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలగా గిండీ, మద్రాస్ ఇంజనీరింగ్ కళాశాలగా మొదట్లో పని చేస్తూ ఉండేది. దీనిని 1948 అనంతపురంకు మార్చడం జరిగింది. మొదట అద్దె భవనాలలో కాలేజీని నిర్వహించేవారు. 1958 లో కళాశాలను సొంత భవనాలకు మార్చారు. ఇక్కడ ప్రారంభించక ముందు మొదటి 25 సం॥లు మద్రాస్, ఆంధ్రా, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా వుండేది. అయితే 1972లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పడిన తరువాత దీనిని ఈ విశ్వవిద్యాలయంలో విలీనం చేయడం జరిగింది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ సాంకేతిక విద్యాశాఖ నిర్వహణలో ఇది పనిచేస్తోంది.

ప్రస్తుతం అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో ఈ క్రిందివిధంగా ఆయా కోర్సులలోకి విద్యార్థులను తీసుకోవడం జరుగుతుంది. సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ అంశాలలో 50 మంది విద్యార్థుల చొప్పున; కంప్యూటర్ సైన్స్ & ఇంజనీరింగ్‌లో 15 మంది విద్యార్థులు; కెమికల్ ఇంజనీరింగ్‌లో 30 మంది విద్యార్థులను బి.టెక్. కోర్సులోనికి రాష్ట్రప్రభుత్వం నిర్వహించే ఎం.సెట్ కామన్ ఎన్‌ట్రెన్స్ ద్వారానూ తీసుకుంటారు. అదేవిధంగా ఎం.టెక్ కోర్సులో గేట్ పరీక్షద్వారా స్ట్రక్చరల్ ఇంజనీరింగ్‌లో 10 మందిని, ఎలక్ట్రికల్ పవర్ సిస్టమ్స్‌లో 10 మందిని రిఫ్రిజిరేషన్ & ఎయిర్ కండిషన్డ్‌లో 10 మందిని తీసుకుంటారు.

ఇంకా ఇంజనీరింగ్ డిప్లమా కోర్సులను కూడా నిర్వహిస్తుంది. ఇందులో బి.టెక్ డిప్లమా కోర్సులో ఈసెట్ (ఇంజనీరింగ్ పరీక్ష) ద్వారా సివిల్‌లో 40 మందిని, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్‌లో 40 మందిని, మెకానికల్‌లో 40 మందిని, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ ఇంజనీరింగ్‌లో 20 మందిని తీసుకోవడం జరుగుతుంది. అదేవిధంగా కంప్యూటర్ అప్లికేషన్‌లో డిప్లమాలో – ప్రవేశ పరీక్ష ద్వారా 30 మంది విద్యార్థులను తీసుకోవడం జరుగుతుంది.

## ఇంజనీరింగ్ కళాశాల, కాకినాడ:

ప్రభుత్వ ఇంజనీరింగ్ కళాశాలగా 1946లో కాకినాడలో స్థాపించటం జరిగింది. అప్పుడు ఇది మద్రాస్, ఆంధ్రా విశ్వవిద్యాలయాలకు అనుబంధంగా వుండేది. కాని 1972లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పాటు అయిన తర్వాత దీనిని ఈ విశ్వవిద్యాలయానికి మార్చటం జరిగింది.

ప్రస్తుతం ఇక్కడ బి.టెక్ & ఎం.టెక్ కోర్సులను జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం నిర్వహిస్తుంది. బి.టెక్ కోర్సులో – సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్‌లలో, ప్రతియేట 50 మంది చొప్పున; కంప్యూటర్ సైన్స్ & ఇంజనీరింగ్‌లో యేటా 15 మంది చొప్పున రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే ఎంసెట్ ప్రవేశ పరీక్ష ద్వారా తీసుకోవడం జరుగుతుంది.

ఎం.టెక్. కోర్సులో సాయిల్ మెకానిక్స్ మరియు ఫౌండేషన్ ఇంజనీరింగ్, హైవోల్టేజ్, మెషీన్ డిజైన్, ఎలక్ట్రానిక్స్ ఇంస్ట్రుమెంటేషన్స్‌లో ప్రతియేట 8 మంది చొప్పున గేట్ పరీక్ష ఆధారంగా తీసుకుంటున్నారు. ఈ కళాశాల డిప్లమా కోర్సులను కూడా నిర్వహిస్తుంది. సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ & ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ లలో యేటా 40 మంది చొప్పున; ఎలక్ట్రానిక్స్ & కమ్యూనికేషన్ ఇంజనీరింగ్‌లో 20 మంది చొప్పున ఈ సెట్ (ఇంజనీరింగ్ ప్రవేశ పరీక్ష) ద్వారా తీసుకోవటం జరుగుతుంది. అంతేకాకుండా ఎంట్రెన్స్ పరీక్ష ద్వారా పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లమా కంప్యూటర్ అప్లికేషన్‌లో ప్రతియేటా 30 మందిచొప్పున తీసుకోవటం జరుగుతుంది.

కాకినాడ ఇంజనీరింగు కళాశాలలో సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్, ఎలక్ట్రానిక్స్ మరియు కమ్యూనికేషన్స్ విభాగాల్లో బి.టెక్ కోర్సులు నిర్వహించబడుతున్నాయి. ఈ విభాగాల్లో శాండ్‌విచ్ కోర్సులుకూడా నిర్వహించ బడుతున్నాయి.

హైదరాబాదులోని నాగార్జున ఇంజనీరింగ్ కళాశాలలో సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్, ఎలక్ట్రానిక్సు మరియు కమ్యూనికేషన్లల్లో బి.టెక్ కోర్సులు నిర్వహించబడుతున్నాయి. మెకానికల్ ఎలక్ట్రికల్ ఇంజనీరింగు విభాగాల్లో పార్టుటైము డిప్లమా కోర్సులు కూడ నిర్వహించబడుతున్నాయి. ఇక్కడ పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులు లేవు. బి.టెక్‌లో 60 మంది విద్యార్థులున్నారు.

హైదరాబాదులోని లలితకళలు – భవన నిర్మాణ శాస్త్ర కళాశాలలో బి.ఆర్క్. డిగ్రీ కోర్సులున్నాయి. ఫోటోగ్రఫీ, ప్రాయోజిత కళలకు సంబంధించి డిప్లమా కోర్సులు నిర్వహించబడుతున్నాయి. 150 మంది బి.ఆర్క్. చదువుతున్నారు. డిప్లొమా కోర్సులకు సంబంధించి ఫోటోగ్రఫీలో 60 మంది ప్రాయోజిక కళల్లో 150 మంది విద్యనభ్యసిస్తున్నారు.

## స్కూల్ ఆఫ్ ప్లానింగ్ & ఆర్కిటెక్చర్, హైదరాబాద్

1940లో స్థాపించబడిన ప్రభుత్వ లలితకళలు & ఆర్కిటెక్చర్ కళాశాలలో ఒక శాఖగా వుండేది. దీనిని 1968 లో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఏర్పాటుచేశారు. 1972లో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పడిన తర్వాత లలిత కళలు & ఆర్కిటెక్చర్ కళాశాలగా అధికారికంగా ఏర్పాటు చేశారు. 1990లో ఈ శాఖను రెండు విభాగాలుగా విభజించి స్కూల్ ఆఫ్ ప్లానింగ్ & ఆర్కిటెక్చర్ అనే ఒక స్కూలును ఏర్పాటుచేశారు. ఈ స్కూలును ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ ఆర్కిటెక్చర్‌లో సభ్యత్వాన్ని కల్పిస్తూ నమోదు చేయటం జరిగింది.

ప్రస్తుతం ఈ స్కూల్ బాచులర్ ఆఫ్ ఆర్కిటెక్చర్, మాస్టర్ ఆఫ్ అర్బన్ అండ్ రీజినల్ ప్లానింగ్ కోర్సులు నిర్వహిస్తుంది. బాచిలర్ ఆఫ్ ఆర్కిటెక్చర్‌లు 60 మందిని, మాస్టర్ ఆఫ్ అర్బన్ అండ్ రీజినల్ ప్లానింగ్‌లో 16 మందిని యేటా తీసుకోవటం జరుగుతుంది.

భిన్న పరిశ్రమల్లో పనిచేస్తూ సివిల్, మెకానికల్ ఎలక్ట్రికల్

ఎలక్ట్రానిక్స్, ఇంజనీరింగ్‌లో డిప్లమా కలిగియున్న వారికి పార్టు టైమ్ బి.టెక్ కోర్సును గత కొద్ది సంవత్సరాలుగా హైదరాబాద్‌లో నిర్వహిస్తోంది.

సివిల్, మెకానికల్ ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్స్ కమ్యూనికేషన్ ఇంజనీరింగులో డిప్లమా కలిగియున్నవారికి 4 సం||ల బి.టెక్. కరస్పాండెన్సు కోర్సును నిర్వహించాలనే ఆలోచన కూడా చేస్తోంది. వీటితోపాటుగా వివిధ రంగాల్లోను పరిశ్రమలలోను పనిచేస్తున్నవారికి వారి అధ్యయన శక్తిని పెంచడానికి, నూతనంగా వస్తున్న అంశాలను వారు తెలుసుకునేందుకు వీలుగా పోస్టుగ్రాడ్యుయేట్ స్కూల్ ఆఫ్ కంటిన్యూయింగ్ టెక్నికల్ ఎడ్యుకేషను – 1976లో – విశ్వవిద్యాలయం స్థాపించింది. ఈ పోస్ట్‌గ్రాడ్యుయేట్ విభాగం కేంద్ర రాష్ట్రప్రభుత్వాల, ఏ ఇతర సంస్థల ఆర్థిక సహకారం లేకుండానే నిర్వహించబడుతోంది.

ఈ విభాగంలో స్ట్రక్చరల్ ఇంజనీరింగ్, రిఫ్రిజిరేషన్ అండ్ ఎయిర్ కండిషనింగ్, ఎలక్ట్రికల్ పవర్ సిస్టమ్, అడ్వాన్సుడ్ ఎలక్ట్రానిక్స్, బిజినెస్ అడ్మినిస్ట్రేషన్, ప్లాంట్ ఇంజనీరింగ్ అండ్ మేనేజిమెంటు, ప్రొడక్షన్ ఇంజనీరింగ్, మెషిన్ డిజైన్, కంట్రోల్ సిస్టమ్స్, ఆర్కిటెక్చర్ మొదలగునవి పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులతోపాటు కంప్యూటర్ ప్రోగ్రామ్ అండ్ న్యూమరికల్ అనాలిసిస్ సేఫ్టీ ఇంజనీరింగ్ అండ్ మేనేజిమెంటు, మేథమేటికల్ ప్రోగ్రామ్ అండ్ ఆప్టిమైజేషన్ టెక్నిక్స్, సిస్టమ్ అనాలిసిస్ అండ్ కోబాల్ ప్రోగ్రామింగ్ మొదలైన వాటిలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ సర్టిఫికెట్ కోర్సులను కూడా నిర్వహిస్తోంది.

ఇంతవరకు ఈ విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు వాస్తవిక శిక్షణ కొరకు వివిధ ప్రాంతాలలో ఉన్న పరిశ్రమలకు వెళ్ళవలసి వస్తోంది. ఉత్పత్తి శిక్షణ లక్ష్యాలకు కొన్ని అత్యవసర పరిశ్రమల సముదాయాన్ని విశ్వవిద్యాలయ పరిసరాలలోనే నెలకొల్పే ఆలోచన చేస్తోంది. దీనివల్ల విద్యార్థులకు శిక్షణతో పాటు వస్తూత్పత్తి చేసే అభ్యాసం లభిస్తుంది. అంతే కాకుండా విద్యార్థులు శిక్షణతో పాటు తాము ఉత్పత్తి చేసిన వస్తువుల ద్వారా కొంత ధనార్జన చేసే అవకాశమూ ఉంటుంది.

జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం క్రమేణా పురోభివృద్ధి చెందుతోంది. 1973 సెప్టెంబరులో "మెథడాలజీ ఆఫ్ ఎవల్యూషన్"పై జాతీయ గోష్టిని నిర్వహించింది. 1974 డిసెంబరులో భారతీయ సాంకేతిక విద్యా సంఘం (Indian Society for Technical Education) యొక్క జాతీయ సదస్సును నిర్వహించింది. పారిశ్రామిక, వాణిజ్య వ్యాపార రంగాలకు చెందిన ప్రముఖులతో తరచుగా సమావేశాలు ఏర్పాటు చేయడంద్వారా, వివిధ విషయాలపై చర్చించుకోవడం ద్వారా యీ రంగాలకు చెందిన సంస్థలకు, విశ్వవిద్యాలయానికి మధ్య సన్నిహిత సంబంధాలను పెంపొందించుకొంటున్నది.

ఢిల్లీలోని భారతీయ మానవ శక్తి పరిశోధనా సంస్థ, ఆంధ్ర విశ్వవిద్యాలయాలతో కలిసి యాక్టివిటీ అనాలిసిస్ పథకాన్ని నెలకొల్పి; రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధికి అవసరమైన విద్యా కోర్సులను రూపొందిస్తోంది.

1974లో సలహాల సేవా విభాగాన్ని ఏర్పాటు చేసింది.

సెంట్రల్ పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంటు, పోస్టు అండ్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు, సెంట్రల్ వేర్ హౌసింగ్ కార్పోరేషన్, ఎ.పి. టెక్స్‌టైల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషన్, నాగార్జున ఫెర్టిలైజర్స్ కాకినాడ, రాయలసీమ పేపరు మిల్స్, స్టేట్. పి.డబ్ల్యు డి. (ఆర్. అండ్ బి.), కర్నూలు పేపరుమిల్స్, నంద్యాల, స్పాంజ్ ఐరన్, ఇండియా [ప్రైవేటు లిమిటెడ్] పాల్వంచ, ఎ.పి. కార్బైడ్స్, కర్నూలు – పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులతో పాటు ఇండో – డచ్ చైల్డ్‌వెల్‌ఫేర్ ప్రాజెక్టు, యన్.యమ్.డి.సి. బైలదిల, మధ్యప్రదేశ్, భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్, సెంట్రల్ యూనివర్శిటీ, హైదరాబాదు, ఆగ్రో ఇండస్ట్రీస్ కార్పోరేషన్, హైదరాబాదు, అర్బన్ డెవలప్‌మెంటు అథారిటీ ఆల్విన్ మెటల్ వర్క్స్, హైదరాబాదు గిరిజన్ కార్పొరేషన్, నిర్మల్ – ఆదిలాబాదు, మక్కా మస్‌జిద్ ఎడ్యుకేషన్ సొసైటీ హైదరాబాదు – మొదలగు సంస్థలకు వివిధ సమస్యల పై సాంకేతిక ఇంజనీరింగ్ సలహాలను అందిస్తోంది.

విశ్వవిద్యాలయం ఏర్పడ్డ తర్వాత, అనంతపురం, కాకినాడ కళాశాలల్లో కూడ సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ విభాగాల్లో పార్టుటైము డిప్లమా కోర్సులు ప్రవేశపెట్టబడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ ప్రొడక్టివిటీ కౌన్సిల్ సహకారంతో హైదరాబాదు కళాశాలలో పార్టుటైము పోస్టుగ్రాడ్యుయేటు, మూడేండ్ల యం.బి.ఏ, డిగ్రీ కోర్సును, "ఇండస్ట్రియల్ ఇంజనీరింగు – మేనేజిమెంటు"లో రెండేండ్ల పార్టుటైము పోస్టుగ్రాడ్యుయేటు డిప్లమా కోర్సును ప్రవేశపెట్టింది.

హైదరాబాదులోని భారతీయ సర్వేకు చెందిన పటముల తయారీ – సర్వే శిక్షణా విభాగంతో కలిసి సర్వే ఇంజనీరింగులో రెండేండ్ల పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లమా కోర్సును త్వరలో ప్రవేశపెట్టబోతున్నది. సర్వే ఇంజనీరింగులో యం.టెక్., పిహెచ్.డి., కోర్సులను కూడా ప్రవేశపెట్టాలనే ప్రతిపాదనలున్నాయి.

విద్యాస్థాయిని పెంచేందుకై 1976–77 నుండి, బి.టెక్‌లో ప్రవేశం కోరే వారికి ప్రవేశ పరీక్షలు నిర్వహించాలనే ప్రతిపాదన లున్నాయి.

## ఆంధ్ర యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్:

1955లో ఆంధ్రా యూనివర్శిటీ కాలేజీలో ప్రొఫెసర్ కె.ఆర్.రావు మొదటి ప్రిన్సిపల్‌గా, కీ॥శే॥ ప్రొఫెసర్ డి.యస్.రావు హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు ఇంజనీరింగ్‌గా, ఇంజనీరింగ్ డిపార్టుమెంటు ప్రారంభించారు. ఈ విభాగం మొదట సివిల్ ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్, మెకానికల్ ఇంజనీరింగ్, శాఖలతో ప్రారంభమైంది.

1966 జూన్‌లో ఆంధ్ర యూనివర్శిటీ కాలేజి ఆఫ్ ఇంజనీరింగ్‌ను, ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రత్యేక కాలేజిగా చేసి, ప్రొఫెసర్ సి.వెంకటరావును మొదటి ప్రిన్సిపాల్‌గా నియమించారు. తరువాత సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్, కెమికల్ ఇంజనీరింగ్ శాఖలతో ఒక ప్రత్యేక ఇంజనీరింగ్ ఫ్యాకల్టీగా మారింది. 1963లో ఇంజనీరింగ్‌లోని అన్ని శాఖలలోను యం.ఇ. డిగ్రీని ఇచ్చు పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు ప్రారంభించబడ్డాయి. ఉద్యోగుల సౌకర్యార్థం సాయం కాలపు కోర్సులు కూడా ప్రవేశపెట్టారు. 1971–72తో ఐదు సంవత్సరముల డిగ్రీ కోర్సులో సెమిస్టర్, ఇంటర్నల్ అసెస్‌మెంట్‌లను ప్రవేశపెట్టారు.

## వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఇంజనీరింగు కళాశాల:

1959లో విశ్వవిద్యాలయ ఇంజనీరింగు కళాశాల శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సంబంధించిన కళాశాలగా స్థాపించబడినది. తిరుమల – తిరుపతి దేవస్థానం, రాష్ట్ర ప్రభుత్వాల సత్సంకల్పంతో విశ్వవిద్యాలయం ప్రారంభింపబడినది. రూ. 25 లక్షలు దేవస్థానం విరాళంగా ఇచ్చింది. విశ్వవిద్యాలయానికి ఈనాటి రూపాన్ని ఇచ్చినది రంగంలో ప్రవేశించిన యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్.

తొలుత అనంతపురం ఇంజనీరింగు కళాశాల, ఈ విశ్వవిద్యాలయంలో ఉన్నది. 1961లో విశ్వవిద్యాలయం పాఠ్యాంశాలకు క్రొత్తదనాన్ని తెచ్చింది. ప్రాథమిక వృత్తి విద్యను ఇంజనీరింగు విద్యతో కలిపి ఇంజనీరింగు కోర్సు పరిమాణాన్ని పెంచింది. ఆ కాలంలో ఇంజనీరింగు పట్టభద్రుల కొరత తీర్చుటకు ఎస్.వి.యూనివర్శిటీ బి.ఎస్.సి. చదివిన విద్యార్థులకు మూడు సంవత్సరముల బి.యి. డిగ్రీ కోర్సు కూడా నడిపింది.

1960–70 మధ్యకాలంలో ప్రధానంగా వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంతంలో, ఇంజనీరుల నిరుద్యోగం శిఖరాలనందుకొన్నది. వారందరూ నిరుద్యోగులే.

1968లో యూనివర్సిటీ తిరిగి సిలబస్ మార్చి సెమిస్టర్, పద్ధతిని ప్రవేశపెట్టింది. అన్ని భాగాలలోను, ఒకేసారిగా, అన్ని తరగతులకు, ఎన్నుకొనబడిన పత్రాలలో క్రొత్త విషయాలను ప్రవేశపెట్టింది.

భారత ప్రభుత్వపు సైన్సు టెక్నాలజీ విభాగపు కార్యదర్శి అయిన డాక్టర్ ఎ. రామచంద్రరావుగారి ఆధ్వర్యాన చతుర్థ ప్రణాళిక గ్రాంట్స్ క్రింద ఒక సమావేశం ఏర్పాటైంది. అది వాటర్ రీ సోర్సెస్, హైడ్రాలిక్స్, ఇండస్ట్రియల్ ఇంజనీరింగు Instrumentation and Control Systems లలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులను 1971 నుండి ప్రవేశపెట్టింది.

పై వానితోపాటు, ఉత్పత్తి – పారిశ్రామిక ఇంజనీరింగు ఎలక్ట్రానిక్స్ మరియు కమ్యూనికేషన్ విభాగాలూ ప్రవేశ పెట్టబడినవి. ప్రొడక్షన్ ఇంజనీరింగును, ప్రత్యేక విభాగంగా ప్రవేశపెట్టుట భారతదేశం మొత్తంలో యీ విశ్వవిద్యాలయంలోనే మొట్టమొదట జరిగింది.

విద్యను కొనసాగించడానికిగాను కొన్ని ప్రత్యేక ప్రణాళికలతోపాటు, ఆ ప్రాంతాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయడానికి చేయూతనిచ్చే ప్రణాళికలు కూడా ఉన్నాయి.

1972లో మొత్తం విద్యా ప్రణాళికనుండి కొన్ని కోర్సులను వేరుచేసి, మార్పు చేయడానికి వీలయిన ప్రత్యేక పద్ధతులను ప్రవేశపెట్టి, తనకొక విలక్షణ స్థానాన్ని సంపాదించుకొన్నది. అధికంగా మార్పులు చేయడానికి వీలుగా యీ కోర్సును తయారుచేశారు. విద్యా ప్రణాళిక ముందుగా తయారుచేసి విద్యార్థులకు ఇవ్వబడుతున్నది. ఆ ప్రత్యేక సెమిస్టర్‌లో ఏ కోర్సు చదవాలనుకుంటాడో విద్యార్థి అది ముందుగా తీసుకుంటాడు. సెమిస్టర్ మధ్యలో తానెన్నుకొన్న కోర్సు కష్టమని భావించితే, దానిని వదలివేయవచ్చును. మరే సెమిస్టర్‌లో అయినా, దానిని ఇచ్చినపుడు అతడు మరల తీసికొనవచ్చును.

### ఇంజనీరింగ్ కోర్సులు: S.V.U

1) M.Tech. సివిల్ ఇంజనీరింగ్‌లో ప్రత్యేక అధ్యయన అంశాలతో కలిసి మొత్తం 10 మందికి ప్రవేశం కలదు. ఇందులో ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగ్‌లో 5 మందికి, హైడ్రాలిక్స్ మరియు వాటర్ రీసోర్స్ ఇంజనీరింగ్‌లో 5 మందికి ప్రవేశం కలదు.
2) M.Tech. మెకానికల్ ఇంజనీరింగ్‌లో ప్రత్యేక అధ్యయన శాస్త్రాలతో కలిసి మొత్తం 20 సీట్లు కలవు. ఇందులో పారిశ్రామిక సంబంధమైన అంశాలలో ఇంజనీరింగ్ కోసం 10 మందికి, ఉత్పత్తికి సంబంధించిన ఇంజనీరింగ్‌లో 10 మందికి అవకాశం కలదు.
3) M.Tech.ఎలక్ట్రికల్ మరియు ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్‌లో మొత్తం 20 మందికి ప్రవేశం కలదు. దీనిలో ఎలక్ట్రానిక్ పరికరాలు మరియు వాటి సమాచార పద్ధతి అంశాలలో 8 మందికి, పరికరాలు మరియు

నియంత్రణ పద్ధతి అంశాలలో 6 మందికి, విద్యుత్ నిర్వహణపద్ధతి మరియు నియంత్రణ అంశాలలో 6 మందికి ప్రవేశం కలదు.

4) M.Tech. కెమికల్ ఇంజనీరింగ్‌లో 10 మందికి ప్రవేశం కలదు.

అదేవిధంగా ప్రస్తుతం బాచులర్ డిగ్రీ కోర్సులలో కూడా ఈ విశ్వవిద్యాలయం వివిధ అంశాలలో ప్రవేశం కల్పిస్తోంది. ముఖ్యంగా B.Tech. కోర్సును రెగ్యులర్ కోర్సుగాను, పార్ట్‌టైం కోర్సుగాను నిర్వహిస్తున్నది. రెగ్యులర్ కోర్సులో కంప్యూటర్ సైన్స్, కెమికల్ ఇంజనీరింగ్, సివిల్ ఇంజనీరింగ్, మెకానికల్ ఇంజనీరింగ్, ఎలక్ట్రికల్ మరియు ఎలక్ట్రానిక్ కమ్యూనికేషన్, ఎలక్ట్రికల్ మరియు ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్ కోర్సులను నిర్వహిస్తుంది.

## ఉస్మానియా విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాల, హైదరాబాదు

ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రారంభమైన పదకొండు సంవత్సరాల పిదప 1929లో సివిల్ ఇంజనీరింగ్‌లో 15 మంది విద్యార్థులతో గ్రాడ్యుయేట్ కోర్సు కళాశాల అధ్యాయం ప్రారంభమైంది. క్రమక్రమంగా మెకానికల్ ఇంజనీరింగు (1940) ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ (1949) మైనింగ్ ఇంజనీరింగ్ (1957) ఎలక్ట్రానిక్సు అండ్ కమ్యూనికేషన్స్ ఇంజనీరింగ్ (1961) కంప్యూటర్ సైన్సు అండ్ ఇంజనీరింగ్ (1981) కోర్సులను ప్రారంభించారు. ఈ కోర్సులలో ఒక్క మైనింగ్ ఇంజనీరింగ్ కోర్సును మాత్రం కొత్తగూడెంలోని మైనింగ్ కళాశాలలో బోధించడం జరుగుతోంది. మిగిలిన కోర్సు లన్నీ ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణలోనే బోధన జరుగుతోంది.

సివిల్ ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్ కోర్సులో ప్రతి సంవత్సరం 80 మంది విద్యార్థుల ప్రవేశానికి సదుపాయం వుంది. అంతే కాకుండా హైడ్రోమెకానిక్సు, వాటర్ మేనేజిమెంట్సు, స్ట్రక్చరల్ ఇంజనీరింగ్, జియో టెక్నికల్ ఇంజనీరింగు ప్రత్యేక అంశాలుగా సివిల్ ఇంజనీరింగ్‌లో పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సును కూడా ఈ కళాశాల నిర్వహిస్తోంది. మొత్తం 10 మంది విద్యార్థులను ఈ పి.జి. కోర్సులోకి తీసుకొనే అవకాశం వుంది.

మెకానికల్ ఇంజనీరింగ్‌లో 60 మంది విద్యార్థులతో కోర్సును, ప్రొడక్షన్ ఇంజనీరింగులో 15 మందితో గ్రాడ్యుయేట్ కోర్సును, ప్రొడక్షన్ ఇంజనీరింగ్ 10 మంది విద్యార్థులతో పార్ట్‌టైమ్, ఫుల్‌టైమ్ పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సును ఈ కళాశాల నిర్వహిస్తోంది. 60 మంది విద్యార్థులతో నిర్వహించబడుతున్న ఎలక్ట్రికల్ ఇంజనీరింగు గ్రాడ్యుయేట్ కోర్సులో ఇన్‌స్ట్రుమెంటేషన్ ప్రత్యేకాంశంగా 3వ సం॥లో బోధించే సదుపాయం వుంది. అయితే ఇందులో 15 మంది మాత్రమే చేరే అవకాశం వుంది. అదేవిధంగా ఎలక్ట్రికల్ ఇంజనీరింగు పోస్టు గ్రాడ్యుయేషను అభ్యసించడానికి 8 మంది విద్యార్థులకు సదుపాయం కలదు.

ఈ కళాశాలలో వున్న ఎలక్ట్రానిక్సు అండ్ కమ్యూనికేషన్ ఇంజనీరింగు విభాగంలో 4సం॥ ఎలక్ట్రానిక్సు అండ్ కమ్యూనికేషన్ ఇంజనీరింగు గ్రాడ్యుయేట్ కోర్సుతోపాటు బయో మెడికల్ ఇంజనీరింగు అనే మరో కోర్సును కూడా 1982–83 నుండి నిర్వహిస్తున్నారు. మొత్తం ఈ రెండు కోర్సులలో 60 (50+10) మంది చదువుకునే అవకాశం వుంది.

ఇదే రంగాలలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను

1. సిస్టమ్స్ అండ్ కంట్రోల్ ఇంజనీరింగ్
2. డిజిటల్ సిస్టమ్
3. మైక్రోవేవ్ అండ్ రాడార్ ఇంజనీరింగ్

మొదలగు ప్రత్యేక అంశాలను కూడా బోధించడం జరుగుతోంది.

1981–82 సం॥ నుండి కంప్యూటర్ సైన్సులో గ్రాడ్యుయేట్ ఇంజనీరింగు కోర్సును 84–85 సం॥ నుండి కంప్యూటర్ రంగంలో ఒక సంవత్సరపు కోర్సును ఈ కళాశాల నిర్వహిస్తోంది.

మొత్తంగా ఉస్మానియా విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాలలో ప్రస్తుతానికి గ్రాడ్యుయేట్ విద్యార్థులు 1232 మంది, పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థులు 109 మంది, పరిశోధకులు 31 మంది ఉన్నారు.

## ఉస్మానియా విశ్వవిద్యాలయ సాంకేతిక కళాశాల, హైదరాబాదు

1943లో విశ్వవిద్యాలయ రసాయనిక శాస్త్ర విభాగంలో ఒక భాగంగా ప్రారంభమైన అనుప్రయుక్త, రసాయనిక శాస్త్ర భాగము 1945 నాటికి ప్రత్యేక విభాగంగా మార్పుచెంది రసాయనిక ఇంజనీరింగ్ విభాగంగా 1951 నాటికి రూపుదిద్దుకుంది. 1953లో అఖిలభారత రసాయనిక శాస్త్ర సాంకేతిక సంఘం సలహా మేరకు రసాయనిక శాస్త్రంలో 4 సం॥ బి.టెక్. బి.ఇ. కోర్సులను ప్రవేశపెట్టింది. ఈ సంఘ సలహా మేరకే 1964లో కొద్ది మార్పులతో రసాయనిక శాస్త్రంలో 2సం॥ పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను కూడా ప్రవేశపెట్టింది. 1969 సెప్టెంబరు 1న అప్పటి వరకు ఒక విభాగంగా మాత్రమే ఉన్న ఈ రసాయనిక సాంకేతిక శాఖను యూనివర్శిటీ కాలేజీ ఆఫ్ టెక్నాలజీగా మార్పుచేయడం జరిగింది.

ప్రస్తుతం ఈ కళాశాల రసాయనిక శాస్త్రంలో 4 సం॥ బి.టెక్. కోర్సును నిర్వహిస్తోంది. ఇందులో ప్రతి సం॥

60 మంది విద్యార్థులు చేరే అవకాశం వుంది. అదేవిధంగా రెండు సం॥ల ఎమ్.టెక్. కోర్సును కెమికల్ ఇంజనీరింగు కెమికల్ టెక్నాలజీలలో నిర్వహిస్తోంది. ఇందులో ప్రతి సం॥ 26 మంది విద్యార్థులు చేరే అవకాశం వుంది. ఈ పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులలో ట్రాన్స్‌ఫర్, ప్రోసెస్, ప్లాంట్ డిజైన్, ప్రోసెస్ డైనమిక్సు అండ్ కంట్రోల్ కెమికల్ రియాక్షన్ ఇంజనీరింగు అనే అంశాలను కెమికల్ ఇంజనీరింగులోనూ; సెరమిక్ ఇంజనీరింగు, మెటీరియలు సైన్స్ అండ్ టెక్నాలజీ, టెక్నాలజీ ఆఫ్ వెజిటేబులు్స, టెక్నాలజి ఆఫ్ ఆర్గానిక్ సర్ఫేస్ కోటింగ్/టెక్నాలజీ ఆఫ్ ఫార్మాస్యూటికల్సు అండ్ ఫైన్ కెమికల్సు అనే అంశాలలో కెమికల్ టెక్నాలజీలోను బోధిస్తున్నారు. ఈ కోర్సులతో పాటుగా అనేక రసాయనిక శాస్త్ర, సాంకేతిక అంశాలపై పరిశోధనలను కూడా ఈ కళాశాల నిర్వహిస్తోంది.

చిన్నతరహా పరిశ్రమలలో పని చేస్తున్నవారికి, ఔత్సాహిక పారిశ్రామికులకు సాంకేతిక విషయాలలో నిపుణతను పెంచి తద్వారా పారిశ్రామికతను పెంపొందించేందుకు కేంద్రప్రభుత్వ పరిశ్రమల మంత్రిత్వ శాఖ, ఇతర సంస్థల సహకారంతో అనేక తక్కువ వ్యవధితో కూడిన కోర్సులను ఈ కళాశాల నిర్వహించింది. ముఖ్యంగా వార్నిష్‌రంగులు, స్టోరేజీ బ్యాటరీలు, సబ్బుల పరిశ్రమలకు సంబంధించిన కోర్సులను నిర్వహించింది. వార్నిష్ రంగంపై ఉన్నత స్థాయి సాంకేతిక కోర్సును కూడా అనేక మార్లు నిర్వహించింది.

ఈ కళాశాల ఆధ్వర్యంలో రసాయనిక ఇంజనీరింగులో ఇటీవల వస్తున్న మార్పులు – గ్రామీణ ప్రాంతాలకు సాంకేతిక బదలాయింపు అనే అంశాలపై 1979 సం॥లో రెండు సెమినార్లను నిర్వహించింది.

## వరంగల్ రీజనల్ ఇంజనీరింగ్ కళాశాల

రెండవ పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించిన ప్రకారం దేశంలో సాంకేతిక విద్యను అభివృద్ధిపరచే నిమిత్తం దేశం మొత్తంలో ప్రారంభించిన 15 రీజనల్ ఇంజనీరింగ్ కళాశాలల్లో మొట్టమొదటిది ఈ వరంగల్ రీజనల్ ఇంజనీరింగ్ కళాశాల.

డా.డి.ఎస్. రెడ్డి అధిపతిగా 1959లో ప్రారంభించిన ఈ ఇంజనీరింగ్ కళాశాల సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ శాఖలలో గ్రాడ్యుయేట్ కోర్సులను బోధించడం జరిగింది. అటు పిమ్మట 1964 నుండి కెమికల్ ఇంజనీరింగ్, మెటలర్జీ గ్రాడ్యుయేట్ కోర్సులను; సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ లలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను ప్రారంభించారు. కాలక్రమేణా దిన దిన ప్రవర్థమానమవుతూ 1971లో ఎలక్ట్రానిక్స్ కమ్యూనికేషన్ ఇంజనీరింగులో గ్రాడ్యుయేట్ కోర్సును ప్రారంభించారు. అత్యంత ఆధునికమైన కంప్యూటర్ ఇంజనీరింగ్‌లో కూడా 1983–84 సం॥లో గ్రాడ్యుయేట్ కోర్సును ప్రారంభించారు.

ఇదికాక ఇండస్ట్రియల్ మెటలర్జీ, ఇంజనీరింగు స్ట్రక్చర్, ట్రాన్స్‌పోర్టు ఇంజనీరింగు, ఎలక్ట్రానిక్ ఇన్‌స్ట్రుమెంటేషన్ ఇంజనీరింగ్‌తోపాటుగా ఇంకా 10 విభాగాలలో పోస్టు గ్రాడ్యుయేట్ ఇంజనీరింగ్ కోర్సులనూ నిర్వహిస్తున్నారు.

ప్రారంభం నుండి 1984 ఫిబ్రవరి వరకు ఈ కళాశాల నుండి 4,463 మంది గ్రాడ్యుయేట్ పట్టాలను, 943 మంది పోస్టుగ్రాడ్యుయేట్ పట్టాలను పొందారు. వీటితోపాటుగా వివిధ అంశాలపై భిన్న శాఖలలో పరిశోధనలను కొనసాగిస్తున్నారు. 1984 వరకు ఈ కళాశాల నుండి పరిశోధనల ద్వారా 94 మంది. పిహెచ్.డి. పట్టాలను పొందారు.

సివిల్ ఇంజనీరింగులో క్వాలిటీ ఇంప్రూవ్ మెంట్ పథకం కోసం దేశంలో ఎన్నుకోబడిన కొద్ది కళాశాలల్లో ఈ వరంగల్ కళాశాల కూడా వుంది. ప్రస్తుతం ఈ కళాశాలలో 37 గురు ప్రొఫెసర్లతోపాటు మొత్తం 139 మంది వివిధ శాఖలలో అధ్యాపకులుగా ఉన్నారు. వివిధ సాంకేతిక కళాశాలల్లో అధ్యాపకులుగా పనిచేస్తున్న వారికి ఫేకల్టీ ఇంప్రూవ్ మెంట్ పథకంగా సివిల్ ఇంజనీరింగ్‌లో ఎమ్.టెక్, పిహెచ్.డి కోర్సులలో ప్రవేశాన్ని ఈ కళాశాల కల్పిస్తోంది. ఇందుకొరకు విద్యా మంత్రిత్వశాఖ చేత దేశం మొత్తంలో ఎన్నిక చేయబడ్డ కొద్ది కళాశాలల్లో ఇది ఒకటి.

అంతర్జాతీయ అభివృద్ధి పథకం క్రింద యునెస్కో సహాయ పథకాన్ని పొందిన భారతదేశ ఏకైక ఆర్.ఇ.సి. కళాశాల ఈ వరంగల్ కళాశాల. ఈ పథకంలో భాగంగా సోవియట్ యూనియన్, అమెరికా, ఇంగ్లాండ్, స్విట్జర్‌లాండ్, నార్వే, యుగొస్లేవియా మొదలైన దేశాల ప్రముఖ ఇంజనీరింగ్ అధ్యాపకులు ఇక్కడ కొంతకాలం బోధిస్తారు. ఈ కళాశాల ప్రారంభమైన దగ్గరనుండి రాష్ట్రంలో గల వివిధ భారీ మధ్యతరగతి ఇంజనీరింగ్ పరిశ్రమలకు సాంకేతిక పరమైన సలహాలను అందించి ఎనలేని సేవ చేస్తోంది. అదేవిధంగా హైదరాబాదు నగర పాలక సంస్థకు ట్రాఫిక్ రద్దీని తగ్గించటానికి, అత్యంత ఎత్తైన కట్టడాల నిర్మాణానికి అవసరమైన సాంకేతిక సలహాలను అందిస్తోంది.

పైన పేర్కొన్న మూడు కళాశాలలతో పాటుగా రాష్ట్రంలో విజయవాడ, వాకాడు, భీమవరం, కడప, వడ్డెవరం, (గుంటూరు జిల్లా) మచిలీపట్నం, వరంగల్, విశాఖపట్నం, గుంటూరు, బాపట్ల, చిలకలూరిపేట, కర్నూలు పట్టణాలలో ఒక్కొక్క కాలేజీ చొప్పునా, హైదరాబాదు నగరంలో 5 కాలేజీలూ ప్రైవేటు సంస్థల యాజమాన్యంలో నిర్వహించబడుతున్నాయి.

## ఇతర సాంకేతిక సంస్థలు

రాష్ట్రంలో సాంకేతిక విద్యా పురోభివృద్ధికి ఇంజనీరింగు కళాశాలలతో పాటుగా పాలిటెక్నికల్ కళాశాలలు, పారిశ్రామిక శిక్షణా సంస్థలు, జిల్లా స్థాయీ శిక్షణా సంస్థలు అనేకం మన రాష్ట్రంలో వున్నాయి.

### పాలిటెక్నికల్ కళాశాలలు:

1946 సం॥లో కాకినాడ, విజయవాడ పట్టణాలలో పాలిటెక్నికల్ కళాశాలలు నెలకొల్పడంతో రాష్ట్రంలో సాంకేతిక విద్యారంగంలో పాలిటెక్నిక్ అధ్యాయం ప్రారంభమైంది. ప్రస్తుతం మన రాష్ట్రంలో 56 పాలిటెక్నిక్ కళాశాలలుండగా అందులో 36 ప్రభుత్వం అధ్వర్యంలోనూ, 20 ప్రైవేటు సంస్థల అధ్వర్యంలోనూ నిర్వహింపబడుతున్నాయి.

ఈ కళాశాలల్లో కాకినాడ, గుంటూరు, భీమునిపట్నం, నెల్లూరు, పలమనేరు, కడప, వరంగల్, నిజామాబాద్, హిందూపూర్, సికింద్రాబాదు పట్టణాలలో మహిళలకే ప్రత్యేకించబడిన ప్రభుత్వ కళాశాలలు కూడా వున్నాయి. ఇదేవిధంగా ప్రైవేటు సంస్థల అధ్వర్యంలో విజయవాడ, తిరుపతి, హైదాబాదులో 2, సికింద్రాబాదు నగరాలలో మహిళలకు కేటాయించబడిన కళాశాలలు కూడా ఉన్నాయి.

ఈ మొత్తం కళాశాలల్లో ప్రతి సం॥ 12,400 మంది విద్యార్థినీ విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. విజయనగరం, విశాఖపట్టణం, విజయవాడ మొదలైన కళాశాలల్లో మెటలర్జీలో; గూడూరు, నర్సీ పట్టణం కళాశాలలో మైనింగు; తిరుపతి, నిజామాబాదు కళాశాలల్లో సుగర్ టెక్నాలజీ వంటి ప్రత్యేకాంశాలతో పాటు దాదాపు అన్ని కళాశాలలలో సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ అంశాలను; 3 సం॥ల పాలిటెక్నికల్ డిప్లమా కోర్సును బోధిస్తున్నారు.

## రాష్ట్రస్థాయి సాంకేతిక సంస్థలు

మన రాష్ట్రంలో మొత్తం 6 రాష్ట్రస్థాయి సాంకేతిక సంస్థలు ఉన్నాయి. వస్త్ర సాంకేతిక కళాశాల గుంటూరులోనూ, ఔషధ సాంకేతిక సంస్థ కర్నూలులోను, చర్మ సాంకేతిక సంస్థ హైదాబాదులోను, ముద్రణా సాంకేతిక సంస్థ సికింద్రాబాదులోనూ, ఎలక్ట్రానిక్స్ సాంకేతిక సంస్థ సికింద్రాబాదులోనూ, శ్రీమతి దుర్గాభాయి స్త్రీల సాంకేతిక శిక్షణా సంస్థ హైదాబాదులోనూ వున్నాయి.

వీటితోపాటుగా ఉన్నత స్థాయి శిక్షణ పోస్టు డిప్లమో ఇచ్చేందుకు – విశాఖపట్టణం, తిరుపతి, హైదాబాదు నగరాలలో ఎడ్వాన్సుడ్ టెక్నికల్ సంస్థలు కలవు. ఇవికాక మోడల్ రెసిడెన్షియల్ పాలిటెక్నికల్ కళాశాలలూ వున్నాయి.

### ఐ.టి.ఐ. అండ్ డి.ఎల్.టి.సి:

క్రింది స్థాయిలో పారిశ్రామిక సాంకేతిక శిక్షణ ఇచ్చేందుకు ఐ.టి.ఐలు, డి.ఎల్.టి.సి.లను నెలకొల్పటం జరిగింది. వీటికి కావలసిన కనీస విద్యార్హత 10వ తరగతి.

రాష్ట్రంలో ప్రతి జిల్లాలో కనీసం ఒకటి చొప్పున ప్రభుత్వ ఐ.టి.ఐలను నెలకొల్పడం జరిగింది. మొత్తం మన రాష్ట్రంలో 45 ప్రభుత్వ ఐ.టి.ఐ.లు వున్నాయి. వీటిలో నల్గొండ, అనంతపురం, రాజమండ్రి, విశాఖపట్టణం, కడప, మహబూబ్ నగర్ పట్టణాలలో బాలికలకు ప్రత్యేకమైన పారిశ్రామిక శిక్షణా సంస్థలు నెలకొల్పారు. ఇవికాక ప్రైవేటు సంస్థల యాజమాన్యంలో 120 పారిశ్రామిక శిక్షణా సంస్థలు రాష్ట్రం మొత్తంమీద వున్నాయి.

వీటితోపాటుగా జిల్లా స్థాయి శిక్షణా సంస్థలను (డి.ఎల్.టి.సి) ఏలూరు, గుంటూరు, గూడూరు, కర్నూలు, కడప, శ్రీకాకుళం, మహబూబ్ నగర్, ముషీరాబాదు (హైదరాబాదు), వికారాబాదు, వరంగల్ లలో నెలకొల్పడం జరిగింది.

*"నాటక కళాభ్యుదయంపైనే ఒక జాతి సంస్కృతి యొక్క ఔన్నత్యాన్ని నిర్ణయించడం జరుగుతుంది." – టాగోర్*

# సాంకేతిక విద్య (ఆంధ్రప్రదేశ్)

- కె. ప్రదీప్‌చంద్ర, ఐ.ఏ.యస్., డైరెక్టర్ - సాంకేతిక విద్య

మన దేశములో సాంకేతిక విద్య మూడు శ్రేణులుగా (Tier) విభజింపబడి, పారిశ్రామిక సంస్థల యందు ఉత్పత్తికి అనుకూలంగా ఈ క్రింద నుదహరించిన పద్ధతులలో బోధింపబడుచున్నది.

1. వృత్తి విద్య నిపుణులు / కర్మకరులు (Skilled Workess / Crafts men.) (వీరికి పారిశ్రామిక శిక్షణాసంస్థల (Industrial Training Institutes) యందు పలురక ములైన వృత్తి విద్యలందు, వివిధ రకముల పారిశ్రామిక సంస్థలలో పని చేయుటకు తగిన విధముగా మరియు కూలంకషముగా శిక్షణ యివ్వబడును. శిక్షణానంతరము వీరికి వృత్తి యందు అర్హత పత్రములు (Certificates) యివ్వబడును.)
2. మధ్యతరగతి సాంకేతిక నిపుణులు (Middle level Technicians) (వీరికి పాలిటెక్నిక్‌లలో పలురకములైన సాంకేతిక విద్యలలో, వివిధ రకముల పారిశ్రామిక సంస్థల (Industries) యందు పని చేయుటకు మరియు పరీక్షించుటకు (Supervision) తగిన విధ ముగా మరియు క్రమ పద్ధతిలో శిక్షణ యివ్వబడును. శిక్షణానంతరము వీరికి సాంకేతిక విద్య యందు డిప్లొమాలు యివ్వబడును.)
3. ఇంజనీర్లు మరియు సాంకేతిక విధి నిర్వాహకులు (Engineers and Managers) (వీరికి సాంకేతిక విద్య కళాశాల లందు (Engineering Colleges,) సాంకేతిక విశ్వవిద్యాలయములందు (Technological universities) మరియు Indian Institutes of Technology (I.I.T.) లందు, దేశ విదేశములలోని పెద్ద పారిశ్రామిక సంస్థలలో, మధ్య మరియు ఉన్నత స్థాయిలలో (Middle and Top Level Managements) సాంకేతిక విధి నిర్వాహకులుగా పనిచేయుటకు విధిగా కావలసిన సాంకేతిక పాఠ్యాంశ ములలో (Technical Subjects) చాలా విపులముగా శిక్షణ యివ్వబడును. శిక్షణాకాలము ముగిసిన తరువాత వారికి తమకు సంబంధించిన కోర్సులో (Concerned Faculty) డిగ్రీలను ప్రదానము చేయుదురు.)

మన భారతదేశములో సాంకేతిక విద్యాభివృద్ధి చాలా వరకు మనకు స్వతంత్రము వచ్చిన తరువాతనే జరిగినదని దృఢముగా చెప్పవచ్చును. మన దేశము ఆర్థిక రంగములో ప్రపంచములోని వర్ధమాన దేశములతో సమాన స్థాయికి చేరుకొనుటకు చేపట్టిన పారిశ్రామిక విప్లవ (Industrial Revolution) కార్యక్రమమందు వివిధ స్థాయిలలో పని చేయుటకు చాలా మంది సాంకేతిక నిపుణుల యొక్క అవసరము చాలావుందని గుర్తించి, అందుకు గాను కావలసిన అన్ని సదుపాయములను మరియు వనరులను సమకూర్చుటకు కృషి చాలా వరకు 1950 మరియు 1960 సంవత్సరములలో జరిగినది.

ప్రక్క పేజీలో నుదహరించిన పట్టిక (Table) నుండి స్వతంత్రము వచ్చిన తరువాత మన దేశములో మరియు ఆంధ్రరాష్ట్రములో "సాంకేతిక విద్యావ్యాప్తి" అంశములో మనము సాగించిన ప్రగతిని క్షుణ్ణముగా అవగాహన చేసుకొనవచ్చును.

ఈ అనూహ్యమైన మరియు అద్భుతమైన (Phenomical) పద్ధతిలో జరిగిన సాంకేతిక విద్యావ్యాప్తి (ఎక్కువ సాంకే తిక విద్యాసంస్థలను స్థాపించుట) కారణముగా సంస్థలలో విద్యాప్రమాణములు తగ్గుట (Degradation in Quality), పాఠ్యప్రణాళిక (Curriculation) పారిశ్రామిక వ్యక్తులకు ఉపయోగపడు పద్ధతిలో లేకపోవుట, విద్యాసంస్థలలో సరి యైన, ఆధునికమైన యంత్రసామాగ్రి మరియు పరికరములు (Modern Equipments) కొరత, కొత్త మరియు అధునాతన మైన టెక్నికల్ కోర్సులను బోధించుటకు సరియైన సాంకేతిక ఉపాధ్యాయులు (Technical Teachers) అందుబాటులో లేకపోవుట మరియు చాలా కాలముగా పనిచేయుచున్న సాంకేతిక ఉపాధ్యాయులు, తమ వృత్తిలో అభివృద్ధి (Career Prospectus) చెందుటకు కావలసిన విద్యా సదుపాయములు లేకపోవుట మొదలగు విషయములు తటస్థించినవి. ఈ లోటు పాటులను సరిదిద్దుటకు సెంట్రల్ గవర్నమెంటు మరియు స్టేట్ గవర్నమెంటు యిదివరలో జరిపిన, ప్రస్తుతము జరుపుతున్న కృషి చాలా ప్రశంసనీయము.

| సాంకేతిక విద్యా సంస్థలు మరియు సీట్లు (సీట్ల సంఖ్య బ్రాకెట్టులో చూపబడినది.) | | | | |
|---|---|---|---|---|
| | 1947 వ సంవత్సరము | | 1993 వ సంవత్సరము | |
| | ఇంజనీరింగు కళాశాలలు | పాలీటెక్నిక్‌లు | ఇంజనీరింగు కళాశాలలు | పాలీటెక్నిక్‌లు |
| (1) | (2) | (3) | (4) | (5) |
| ఇండియా – | 38<br>(2,940) | 53<br>(3,670) | 350<br>(68,000) | 950<br>(1,26,000) |
| ఆంధ్రప్రదేశ్ – | 2<br>(160) | 3<br>(270) | 27<br>(6,600) | 87<br>(13,500) |

దీనివలన పారిశ్రామిక వేత్తలకు కావలసినంత మరియు ఉన్నత ప్రమాణము (Quanitity and Quality)లు కలిగియున్న సాంకేతిక నిపుణులను భవిష్యత్‌లో అందజేయుట గురించి ఎట్టి సందేహము పడనవసరములేదు.

ఆంధ్రప్రదేశ్‌లో సాంకేతిక విద్యాశాఖ (Department of Technical Education) పైనుదాహరించిన కృషిని నిర్విరామముగా డిప్లొమా స్థాయిలో (Polytechnics) జరుపుచున్నది. అంతేకాకుండా ఈ కృషి డిగ్రీస్థాయిలో (Engineering Colleges) సాంకేతిక విద్యాశాఖ ప్రత్యక్ష పర్యవేక్షణలో జరుగుచున్నది. పారిశ్రామిక శిక్షణా సంస్థలందు (Industrial Training Institutes) ఈ కృషి రాష్ట్ర పారిశ్రామిక ఉపాధి కల్పన మరియు శిక్షణ శాఖ (Department of Employment and Training) ఆధ్వర్యములో జరుగుచున్నది.

ప్రస్తుతం రాష్ట్రంలోని 10,000 మంది జనాభాకు ఒక ఇంజనీరింగు సీటు, ప్రతి 5000 మంది జనాభాకు ఒక పాలీటెక్నిక్ సీటు యివ్వడము జరుగుచున్నది.

ఈ క్రిందనుదాహరించిన పట్టిక (Table)లో రాష్ట్రములో ఇంజనీరింగు డిప్లొమా మరియు డిగ్రీ Levelsలో శిక్షణ ఇచ్చే వివిధ రకములైన కోర్సులను పొందుపరచడమైనది.

| కోర్సు వివరములు (Nature of the Course) (1) | నిర్ణయించిన కోర్సుల సంవత్సరములు (Duration in years) (2) | కోర్సుల సంఖ్య (No. of Disciplains) (3) | సం॥ములో ప్రవేశము కల్పించు సీట్లసంఖ్య (Annual Intake) (4) |
|---|---|---|---|
| I. టెక్నీషియన్లు : | | | |
| – పోస్టు మెట్రిక్ డిప్లొమా కోర్సు | 2/3 | 25 | 11905 |
| – పోస్టు డిప్లొమా అడ్వాన్సుడ్ టెక్నీషియన్ కోర్సు | $1\frac{1}{2}$ | 13 | 450 |
| – పార్ట్‌టైము డిప్లొమా కోర్సెస్ ఫర్ ఎంప్లాయిడ్ టెక్నీషియన్సు | 4 | 5 | 680 |
| – కరస్పాండెన్సు కమ్ కాంటాక్టు డిప్లొమా కోర్సెస్ ఫర్ ఎంప్లాయిడ్ టెక్నీషియన్సు | 4 | 5 | 550 |
| II. ఇంజనీరింగు : | | | |
| – పోస్టు ఇంటర్‌మీడియేట్ డిగ్రీ కోర్సులు | 4 | 17 | 6600 |
| – పార్ట్‌టైము డిగ్రీ కోర్సెస్ ఫర్ ఎంప్లాయిడ్/అన్ ఎంప్లాయిడ్ డిప్లొమా హోల్డర్సు | 4 | 8 | 1110 |
| – ఫుల్‌టైమ్ కంప్రెస్డ్ డిగ్రీ కోర్సు ఫర్ డిప్లొమా హోల్డర్సు | | 3 | 480 |
| – కరస్పాండెన్సు – కమ్ – కాంటాక్ట్ కోర్సు ఫర్ ఎంప్లాయిడ్ డిప్లొమా హోల్డర్స్ | 4 | 4 | 480 |

రాష్ట్రములో డిప్లొమా మరియు డిగ్రీ స్థాయిలో ఏర్పడుతున్న కోర్సుల వివరములు ఈ దిగువ నీయబడినవి:

## A. పోస్టు డిప్లొమా కోర్సులు :

1. అడ్వాన్స్‌డ్ టెక్నీషియన్ కోర్సెస్ ఇన్ ఎలక్ట్రానిక్స్
2. కంప్యూటర్ అప్లికేషన్సు
3. ఎయిర్ కండిషనింగ్ మరియు రెఫ్రిజిరేషన్
4. ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగు
5. ఇన్‌స్ట్రుమెంటేషన్ టెక్నాలజీ *
6. ప్లాంటు మెయింటెనెన్సు మరియు మేనేజ్‌మెంటు
7. ఇండస్ట్రియల్ ఇంజనీరింగు

## B. డిప్లొమా కోర్సులు :

1. సివిల్ ఇంజనీరింగు (*)
2. ఎలక్ట్రికల్ మరియు ఎలక్ట్రానిక్స్ (*)
3. మెకానికల్ ఇంజనీరింగు (*)
4. ఎలక్ట్రానిక్స్ మరియు కమ్యూనికేషన్ యింజనీరింగు (*)
5. ఆటోమొబయిల్ ఇంజనీరింగ్
6. ఆర్కిటెక్చరల్ ఇంజనీరింగ్ (*)
7. మైనింగ్ ఇంజనీరింగు (*)
8. కంప్యూటర్ ఇంజనీరింగ్ (*)
9. ఎలక్ట్రానిక్స్ మరియు ఇనస్ట్రుమెంటేషన్ ఇంజనీరింగు (*)
10. ఫార్మసీ (*)
11. కంప్యూటర్ మరియు కమర్షియల్ ప్రాక్టీసు
12. హోటల్ మేనేజ్‌మెంట్, క్యాటరింగ్ మరియు ఫుడ్ టెక్నాలజీ
13. కాస్ట్యూమ్ డిజైన్ మరియు డ్రస్ మేకింగ్
14. మెకానికల్ ఇంజనీరింగు (శాండ్‌విచ్)
15. హోమ్ సైన్సు
16. క్రాఫ్ట్ టెక్నాలజీ
17. ట్రెడిషనల్ స్కల్ప్చర్ మరియు టెంపిల్ ఆర్కిటెక్చర్
18. ఫుడ్ టెక్నాలజీ
19. కెమికల్ ఇంజనీరింగ్ (*)
20. టెక్స్‌టయిల్ టెక్నాలజీ
21. సిరామిక్స్ టెక్నాలజీ
22. ప్రింటింగ్ టెక్నాలజీ (*)
23. లెదర్ టెక్నాలజీ (*)
24. సుగర్ టెక్నాలజీ (*)
25. స్పెషల్ డిప్లొమా ఇన్ ఎలక్ట్రానిక్స్ (కంప్యూటర్ ఇంజనీరింగ్)
26. స్పెషల్ డిప్లొమా ఇన్ ఎలక్ట్రానిక్స్ (కమ్యూనికేషన్ ఇంజనీరింగ్)
27. స్పెషల్ డిప్లొమా ఇన్ ఎలక్ట్రానిక్స్ (ఇండస్ట్రియల్ ఎలక్ట్రానిక్స్)

## C. సర్టిఫికెట్టు కోర్సులు :

1. రిసెప్షన్ బుక్ కీపింగ్
2. కుకరీ
3. హౌస్‌కీపింగ్
4. కానింగ్ మరియు ఫుడ్ ప్రిపరేషన్

## D. డిగ్రీ కోర్సులు :

పైన పువ్వు (*) గుర్తుచే సూచింపబడిన కోర్సులకు డిగ్రీస్థాయిలో శిక్షణ యివ్వబడుతున్నది.

పారిశ్రామికరంగంలో ఇటీవల చోటు చేసుకొని బాగా వృద్ధి చెందుతున్న ఈ క్రింద నుదహరించిన కోర్సులలో డిప్లొమా డిగ్రీ మరియు పోస్టు డిప్లొమా స్థాయిలలో శిక్షణ యిచ్చుట జరుగుచున్నది.

A డిప్లొమా స్థాయి

B డిగ్రీ స్థాయి

C పోస్టు డిప్లొమా స్థాయి

1. లెదర్ టెక్నాలజీ (A)
2. ప్రింటింగ్ టెక్నాలజీ (A మరియు B)
3. సిరామిక్ టెక్నాలజీ (A)
4. టెక్స్‌టయిల్ టెక్నాలజీ (A)
5. కంప్యూటర్ టెక్నాలజీ (A మరియు B)
6. కెమికల్ ఇంజనీరింగ్ (పెట్రోకెమికల్, పాలిథిన్) (A B మరియు C)
7. క్రాఫ్ట్‌టెక్నాలజీ (A)
8. ఎన్విరాన్‌మెంటల్ సైన్సులు (C)
9. ఇనస్ట్రుమెంటేషన్ (A B మరియు C)
10. ప్రొడక్షన్ ఇంజనీరింగు (B)

## పాఠ్యప్రణాళిక మరియు పాఠ్యాంశములు (Curriculum and Course Contents):

పాఠ్యప్రణాళిక మరియు పాఠ్యాంశములు ప్రతి 5 సంవత్సరముల కొకసారి పారిశ్రామిక సంస్థలకు కావలసిన పద్ధతిలో దిద్దిమార్పులు, చేర్పులతో పునర్విమర్శన చేయుట

జరుగును. ఇటీవల 1990 సంవత్సరములో స్వయం ఉపాధిని (Self Employment) ముఖ్యాంశముగా తీసుకొని పాఠ్యప్రణాళికను మార్పు చేయడము జరిగింది. మరియు ప్రతి ఇంజనీరింగు డిప్లొమా విద్యార్థి విధిగా నేర్చుకొనవలసిన అంశములు (Viz) Computers, అన్ని వనరులను సమకూర్చుకొని పరిశ్రమ (Industry)ను ప్రారంభించుటకు కావలసిన మెళకువలు (Skills), వాతావరణ కాలుష్యము దానివలన సంభవించిన ప్రమాదములు, పరిశ్రమలలో తీసుకొనవలసిన తగు జాగ్రత్తలు మొదలయిన వాటిని ముఖ్య పాఠ్యాంశములుగా చేర్చి పాఠ్యప్రణాళికను రూపొందించడమయినది.

### పరిశ్రమతో అవగాహన (Interaction with Industry):

సాంకేతిక విద్యాశాఖకు పరిశ్రమలతో పూర్తి అవగాహన కొరకు (Interaction) మరియు వర్తమానములో పరిశ్రమలో జరుగుతున్న సాధారణ అభివృద్ధి గురించి తెలియజేయుటకుగాను, రాష్ట్రస్థాయిలో ఒక "Industry Liason Board"ను స్థాపించుట జరిగినది. అదియునుగాక తగినంతమంది పారిశ్రామిక వేత్తలను రాష్ట్రసాంకేతిక విద్యా బోర్డు Acadamic Committeeలో ప్రాతినిధ్యము వహించేలా కూడా చేయడమయినది. ప్రపంచ బ్యాంకు ప్రాజక్టు క్రింద ప్రతి పాలీటెక్నికల్‌లో ఒక Industry Institution Interaction Centre (I.I.I.C.)ను స్థాపించుటకు నిర్ణయము తీసుకొనడమయినది.

### ఆధునీకరణము మరియు వాడుకలేని పరికరము ఏరివేత (Modern Section and Removal of obsolus Cence):

త్వరితగతిని మార్పులు పొందుతున్న సాంకేతిక విజ్ఞానమునకు అనుగుణముగా సాంకేతిక విద్యా సంస్థలలో తగు శిక్షణ యిచ్చే నిమిత్తము Laboratoriesకి కూడా ఆధునీకరణము చేయవలసిన అవశ్యకత ఎంతయినా వున్నది. ఇందుకు అనువుగా Laboratoriesకి నూతన పరికరములు మరియు యంత్రసామగ్రిని సమకూర్చుట జరుగుచున్నది. ఇటీవల ప్రపంచ బ్యాంకు ప్రాజక్టునుండి ఈ పని నిమిత్తార్థము ఆర్థిక సహాయమును విరివిగా తీసుకొనుట జరుగుచున్నది.

### అవిచ్ఛిన్నముగా విద్యనభ్యసించుట - దానికి తగిన అవకాశములు (Fecilties of Continuing Education):

పై పట్టిక (Table) లో ఉదాహరించిన కోర్సుల వలన ఉద్యోగము చేయుచున్న సాంకేతిక అభ్యర్థులు (Technical People) వారి విద్యార్హతలను పెంపొందించుకొనుటకు మరియు ఉన్నత స్థానములకు ప్రమోషన్లకు అర్హత పొందుటకు, తగినన్ని అవకాశములు కల్పించబడినవని చెప్పుటకు ఎట్టి సందేహము లేదు. ఐ.టి.ఐ. (I.T.I.) కోర్సులలో ఉత్తీర్ణులయినవారు డిప్లొమా (Diploma) కోర్సులు, డిగ్రీ కోర్సులలో ఉత్తీర్ణులయిన వారు పోస్టుగ్రాడ్యుయేటు (Post Graduate) కోర్సులను జరుపుటకు Part time మరియు Correspondance కోర్సులు కలవు.

### బలహీనవర్గములు - సాంకేతిక విద్య (Technical Education for weaker Sections):

సాంకేతిక విద్య నభ్యసించుటకు షెడ్యూల్డు కులములు (Scheduled Casts), షెడ్యూలు తెగలు (Secheduled Tribes)చట్టపరంగా సంగ్రహపరచిన (Statutary Reservation) సీట్లు కాకుండా, వారు త్వరితగతిని ఈ రంగములో ముందుకు చొచ్చుకొని పోవుటకు రాష్ట్రప్రభుత్వము ఇటీవల కాలములో చాలా కృషిని జరుపుతూ వస్తూ ఉన్నది. ఇందుకు తార్కాణము రాష్ట్రములో 1984-85 సంవత్సరములో ప్రత్యేకముగా షెడ్యూలు తెగల (Schedule Tribes) అభ్యర్థులకు అన్ని వసతులుగల మూడు రెసిడెన్షియల్ పాలీటెక్నిక్‌లు, 1990-91 సంవత్సరములో షెడ్యూలు కులముల (Schedule Castes) అభ్యర్థులకు మూడు పాలీటెక్నిక్‌లు స్థాపించడము జరిగినది. ఈ రెసిడెన్షియల్ పాలీటెక్నిక్‌లలో 75% సీట్లను షెడ్యూలు తెగలు (Schedule Tribes) మరియు షెడ్యూలు కులముల (Sechdule Casts) అభ్యర్థులకు యివ్వబడును. చాలా మంది షెడ్యూలు కులముల (Schedule Casts) మహిళలు సాంకేతిక విద్యపై చూపుతున్న ఆసక్తి కారణంగా 1993-94 సంవత్సరములో వారికి అన్ని వసతులుగల మహిళా మోడల్ రెసిడెన్షియల్ పాలీటెక్నిక్‌ను ప్రభుత్వము స్థాపించినది. పాలీటెక్నిక్‌లో ప్రవేశము (Admission)నకు నిర్వహింపబడు Common Entrance Examination (C.E.E.P.) వ్రాయుటకు రాష్ట్రంలోని కొన్ని Polytechnicsలో షెడ్యూలు తెగల (Schedule Tribes) అభ్యర్థులకు ప్రత్యేకమైన ఉచిత బోధనాతరగతులు (Special Free Coaching Classes) కూడా నిర్వహింపబడుచున్నవి.

### మహిళలు - సాంకేతిక విద్య (Technical Education For Women):

రాష్ట్రంలోని సాంకేతిక విద్యాకళాశాల (Engineering Colleges)లో 30% సీట్లను ప్రత్యేకముగా మహిళలకు సంగ్రహపరచడ(Reserve)మైనది. మరియు 22 మహిళా పాలీటెక్నిక్‌లలో సీట్లతోబాటు పైనుదాహరించిన 30% సీట్లను మహిళలకి భర్తీచేయుటకు సహాధ్యయన పాలీటెక్నిక్‌ల (Co-Education Polytechnics)లోని సీట్లను కూడా మహిళలకు ప్రత్యేకముగా కేటాయించుట జరుగుచున్నది.

## ప్రయివేటు రంగములో సాంకేతిక విద్య (Privatisation in Technical Education):

సాధారణముగ ఉన్నత విద్యను అందులో ప్రత్యేకముగా ఉన్నత సాంకేతిక విద్యను అపేక్షించు ప్రతి అభ్యర్థి, విద్యార్జన కొరకు, అయ్యే మొత్తము ఖర్చును తను చెల్లించవలయునని ఆమోదించుట జరిగినది. బలహీన వర్గముల (Weaker Section)కు చెందిన అభ్యర్థులకు ఇవ్వవలసిన అవకాశములు వారికి కలుగజేయుచు, నిర్ణయింపబడిన బోధనారుసుము (Tution Fee) ను కట్టగలిగిన ఇతర అభ్యర్థుల కొరకు సాంకేతిక విద్యా కళాశాలలు మరియు పాలీటెక్నిక్‌లు స్థాపించుటకు గవర్నమెంటు Private Managementsకి అనుమతి (Permission) యిచ్చుట జరిగినది. తగిన భవనముల (Buildings)ను నిర్మించుటకు, Laboratoriesని స్థాపించుట మొదలగు వాటికి అగు ఖర్చులను Private Management పూర్తిగా భరించవలెను. ఈ కళాశాలలు మరియు పాలీటెక్నిక్‌లలో కూడా చట్టపరంగా సంగ్రహపరచిన (Statutory Reservations) షెడ్యూల్డు కులముల(Schedule Casts), షెడ్యూల్డు తెగల (Schedule Tribes) మరియు వెనుకబడిన వర్గముల (Backward Classes) సీట్లను ఆయావర్గములకు (Categories) చెందిన అభ్యర్థులకు కేటాయించబడును. ఈ అభ్యర్థులు కట్టవలసిన బోధనారుసుము (Tution Fee) మొత్తమును గవర్నమెంటు Private Managementకి చెల్లించును. Private Institutesకి ప్రవేశము (Admission), బోధనారుసుము (Tution Fee) మరియు యితర విషయములు గవర్నమెంటుచే క్రమబద్ధము చేయబడుచున్నవి. యిటీవల Supreme Court యిచ్చిన తీర్పు (Judgement) ప్రకారము Privately Managed Instituteలో ప్రవేశము కోరు విద్యార్థులను ఈక్రింద నుదాహరించిన రెండు విధములుగా వర్గీకరించడ(Categorisation)మైనది

1) నిర్బంధములేని సీట్లు (Free Seats)

2) పారితోషికముపై యిచ్చు సీట్లు (Payment Seats)

పై నుదాహరించిన రెండు వర్గముల (Categories) అభ్యర్థులకు ఒక్కొక్కరికి 50% సీట్లు యివ్వబడును. నిర్బంధములేని సీట్లు (Free Seats) యివ్వబడిన అభ్యర్థి గవర్నమెంటు Instituteలో ఎంత రుసుము (Fee) ఉన్నదో అంత రుసుమును మాత్రమే చెల్లించును. పారితోషికము (Payments) పై యిచ్చు సీటుకి కట్టవలసిన రుసుము (Fee) (కాలేజీని నడుపుటకు అగు మొత్తము ఖర్చుని దృష్టిలో ఉంచుకొని) గవర్నమెంటుచే నిర్ణయింపబడినది.

## సాధారణ అనుష్ఠానములు (General Observations):

నేటివరకు మనకు వివిధ స్థాయిలలో ప్రతి Disciplineలో కావలసిన సాంకేతిక నిపుణుల సంఖ్యపై సరయిన అంచనా లేకపోవుటవలన, విద్యార్థులకు సాంకేతిక విద్యపై ఉన్న మోజు (Crage) మరియు అభిలాష (Aspiration) వలన సాంకేతిక విద్యాభివృద్ధి గవర్నమెంటులో మరియు Private Sector లో చాలా ఎక్కువగా జరుగుచున్నది. ఈ విధమయిన అభివృద్ధి అంత మంచిది కాదు. అదియునుగాక చాలామంది కొన్ని Disciplinesలో నిరుద్యోగ ఇంజనీర్లు (Un-employeed Engineers)గా ఉండుట తటస్థించును. ఉదాహరణకు ప్రస్తుతము డిప్లొమా స్థాయి (Level)లో నేడు ప్రతి విద్యార్థి ప్రథమముగా ఎలక్ట్రానిక్స్ (Electronics)లో కాని లేక మెకానికల్ (Mechanical) ఇంజనీరింగు కోర్సులోగాని సీటు కావలెనని కోరుచున్నారు. కాని నేడు నిజముగా తగిన ఉద్యోగావకాశములు ఎక్కువగా ఉన్న Leather Technology, printing Technologyల వంటి కోర్సులలో సీటు కావలెనని కోరుటలేదు. దీనికి కారణము విద్యార్థులకు ఈ కోర్సుల గురించి, ఉద్యోగావకాశముల గురించి సరిఅయిన అవగాహన లేకపోవుట, తగిన సలహా మరియు కావలసినంత సమాచారము అందుబాటులో లేకపోవుటయే. ఈ పరిస్థితిని చక్కదిద్దవలెనన్న, భవిష్యత్తులో విద్యార్థులకు పై కోర్సుల గురించిన సరిఅయిన అవగాహన కొరకు తగిన సలహా మరియు కావలసినంత సమాచారము అందజేయవలసిన అవసరమెంతయినా ఉన్నది.

ప్రభుత్వము స్వయం ఉపాధి కల్పన (Self Employments) క్రింద అనేకమైన అవకాశములు కల్పించినప్పటికి చాలామంది యింజనీరింగు గ్రాడ్యుయేట్సు మరియు డిప్లొమా అభ్యర్థులు ఆవైపు ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించుట లేదు. దీనికి కూడా సరయిన అవగాహన లేకపోవుట, తగిన సలహా మరియు కావలసినంత సమాచారము అందుబాటులో లేకపోవుటయే. ఈ విషయములో కూడా తగిన సలహా మరియు కావలసిన సమాచారము అందజేయవలసిన అవసరము చాలా ఉన్నది.

ఆంధ్రప్రదేశ్ మన దేశములో అత్యుత్తమ స్థాయిలో సాంకేతిక విద్యను అందించుచున్న కొద్ది రాష్ట్రములలో ఒకటి. అదియునుగాక ఈక్రింద ఉదాహరించిన అంశములను (Items) అమలుపరచుటలో దేశము మొత్తముపై ప్రథమ రాష్ట్రము మనది.

1. చట్టపరంగా స్వతంత్రత గల స్టేట్ బోర్డు ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ మరియు ట్రైనింగ్ (State Board of Technical Education and Training)ను స్థాపించుట.

2. పాలీటెక్నిక్‌లలో చేరుటకు ప్రవేశ పరీక్ష (Common Entrance Examination for Ploytechincs)ను మొదలుపెట్టుట.

3. సాంకేతిక విశ్వవిద్యాలయము (Technological University)ను స్థాపించుట.

4. ప్రయివేటు ఇంజనీరింగు కళాశాలలు మరియు పాలీటెక్నిక్‌లలో ప్రవేశమునకు Capitation Fee రద్దు చేయుట.
5. షెడ్యూలు కులములు (Schedule Casts) మరియు షెడ్యూలు తెగల (Schedule Tribes) అభ్యర్థులకు Model Residential Polytechnicsను స్థాపించుట.
6. షెడ్యూలు కులములు (Schedule Castes) మహిళలకు (Model Residential Polytechnic)ను స్థాపించుట.

పై అంశములను క్షుణ్ణముగా పరిశీలించిన మన రాష్ట్రములో సాంకేతిక విద్యాభివృద్ధి సక్రమమైన మార్గములో పురోగమించుచున్నదని, ఉన్నత ప్రమాణములలో సాంకేతిక విద్య విద్యార్థులకు నేర్పబడుతున్నదని, వారికి మంచి ఉజ్జ్వల భవిష్యత్తు తప్పక వుంటుందని చెప్పుటకు ఎట్టి సందేహము లేదు.



# వైద్యశాస్త్రం

డా॥ వి. బ్రహ్మారెడ్డి

వైద్యం ఒక శాస్త్రం. శాస్త్రంగా వైద్యాన్ని మెడికల్ కాలేజీల్లో బోధించడం బ్రిటీషువారి రాక తర్వాతే ఆరంభమైంది. కాని బ్రిటీషువారి అల్లోపతీ వైద్యవిధానం మన దేశానికి రావటానికి కనీసం మూడువేల సంవత్సరాలకు ముందే మన దేశంలో ఆయుర్వేద వైద్యముండేది. చరకునిపేర 'చరక సంహిత', శుశ్రుతుని పేర 'శుశ్రుత సంహిత' అనే పుస్తకాలు తయారయ్యాయి మన దేశంలో అవే మొదటి వైద్యగ్రంథాలు. వైద్యపరంగా ఉపయోగపడే అనేక మొక్కలూ, లోహాలూ, పదార్థాలూ చరక సంహితలో వివరించారు. శుశ్రుత సంహితలో వివిధరకాల రోగాలకు ఆపరేషన్లు వివరించారు. రాజులు విధించే శిక్షల్లో ముక్కులూ, చెవులూ కత్తిరించబడితే వాటిని ప్లాస్టిక్ సర్జరీ ద్వారా తిరిగి పూర్వరూపాలు తెప్పించటానికుపకరించే ఆపరేషన్లు చరిత్రలోనే మొట్ట మొదటగా శుశ్రుతుడు చేశాడు. కులవివక్ష తీవ్రంగా ఉన్నకాలంలో నిమ్నకులాల వారిని తాకటానికి కూడా సమాజం అనుమతించని రోజుల్లో, వైద్యుల వరకు ఏకులం వారినయినా తాకవచ్చని మినహాయింపు సాధించుకున్నారు. ఇక్కడ ఆయుర్వేదం వికసించినపుడు, మనకీనాడు వైద్యాన్ని ఎగుమతి చేసిన బ్రిటన్‌లో బర్బరులు రాజ్యమేలుతుండేవారు. అమెరికాలో రెడ్‌ఇండియన్ల అటవీ నాగరికత ఉండేది. వైద్యంలో వివిధ దశలయిన రోగనిదానము వైద్యం చేయటానికిచ్చే మందులు తయారు చేయడమూ, ఆపరేషన్లూ చేయడమూ, ఆపరేషన్ పరికరాలు రూపకల్పన చేసుకోటమూ, పరికరాలు తయారుచేసుకోవటమూ అన్నీ 'వైద్యుని' చేతుల్లోనే ఉండేవి. ఇదంతా గత చరిత్ర. మరి ఈరోజు పరిస్థితి ఏమిటి?

యంత్ర నాగరికత వచ్చాక పనిచేసేవాని చేతుల్లోంచి పనిముట్లు మాయమైపోయాయి. పనిముట్లను పెద్ద పెద్ద యంత్రాలు మింగి కూర్చుంటాయి. పనివాడి దగ్గరున్న నైపుణ్యము క్రమేణా యంత్రాల చేతుల్లోకి పోతుంది. ఇదే పరిణామము వైద్యరంగంలో జరిగింది. ఒకప్పుడు వైద్యం చేసేవారే తయారుచేసిన మందులు, మందుల కంపెనీల చేతుల్లో పడ్డాయి. పరీక్ష చేసే పరికరాలు కూడా డాక్టర్లే ఆనాడు తయారుచేసుకుంటే, ఇప్పుడాపరికరాలలో పరీక్షలు చేయటానికుపయోగించే ఖరీదయిన మెషిన్లూ అన్నీ చేతులు దాటాయి. ఏ ఆపరేషను చేయాలన్నా దానికవసరమయిన పరికరాలు వైద్యుడే తయారు చేసుకునే వాడప్పుడు. ఇప్పుడవన్నీ పెద్ద పెద్ద పరిశ్రమలుగా మారాయి. డాక్టరు కేవలం వీటన్నింటినీ వాడే వ్యక్తి మాత్రమే. వాడటం కూడా యితరులమీద ఇతరులకు వీటిని సిఫారసు చేసేవానిగా మాత్రమే మిగిలాడు.

ఈనాడు ప్రపంచంలో అన్నింటికంటే లాభసాటియైన పరిశ్రమ ఆయుధ పరిశ్రమ. దానితర్వాత స్థానాన్ని ఆక్రమించుకున్నది ఆరోగ్య పరిశ్రమ. ఆయుధాల పరిశ్రమకున్న అప్రథ, ఏవగింపూ లేని పరిశ్రమ ఆరోగ్య వ్యాపారం. ఇందులో కీలకపాత్ర వహించే భాగాలు – మందుల పరిశ్రమ పరీక్షాసాధానాలు తయారుచేసే పరిశ్రమ, ఆపరేషను సామగ్రి చేసే పరిశ్రమ, భీమా పరిశ్రమ ఉన్నాయి. వీటన్నింటి దగ్గరా జనం ఆరోగ్యాన్ని కొనుక్కోవాలి. అలా కొనుక్కోమని సిఫార్సు చేయాల్సింది డాక్టర్లు.

## వైద్యసేవలు:

ప్రభుత్వం ఒకవైపూ, ప్రైవేటు వైద్యులు మరోవైపూ వైద్యసేవలు అందిస్తున్నారు. ప్రభుత్వ వైద్యసేవల రూపకల్పన దాదాపు బ్రిటిషు వారినుంచి సంక్రమించింది. ప్రజల ఆరోగ్యం కాపాడటం ప్రభుత్వ బాధ్యత అనేది సారాంశం. కాని మన దేశంలో యిప్పుడిప్పుడే "ఎవరికి రోగంవస్తే వారే వైద్యానికి అయ్యేఖర్చు భరించాలి" అనే వాదన వినబడ్తుంది. ఒక అంటువ్యాధి సోకిన వ్యక్తి వైద్యం చేయించుకోలేని పరిస్థితిలో ఉన్నాడనుకోండి. అతడు వైద్యం చేసుకోకపోవటం వలన ఆ జబ్బును అనేకమందికి అంటించే ప్రమాదముంది. ఇక్కడ సమాజం మొత్తంగానే రోగాన్ని జయించాలి తప్ప

వ్యక్తులకు వైద్యం చేసినా సమస్య పోదు.

సూపర్ స్పెషాలిటీ సౌకర్యాలతోసహా అత్యాధునిక వైద్యసేవల్ని అందించగల జనరల్ ఆస్పత్రులున్నాయి.

జిల్లాస్థాయిలో స్పెషలిస్టుల సేవల్ని అందించుతూ, అన్నిరకాల ఆపరేషన్లూ వైద్యపరీక్షలూ నిర్వహించే జిల్లా ఆసుపత్రులున్నాయి.

ప్రత్యేక వైద్య సదుపాయాన్ని కల్పించటం – తమకంటే క్రిందనుంచి పంపించబడిన రోగులకు వైద్యంచేసే తాలూకా ఆస్పత్రులున్నాయి.

అంతకంటే క్రింద 30–50 వేల జనాభాను చూడడానికి ఉద్దేశించబడిన ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలున్నాయి. ఇందులో ఇద్దరు హెల్త్‌విజిటర్లూ, ఇద్దరు సూపర్‌వైజర్లూ, ఇద్దరు బ్లాకు ఎడ్యుకేషన్ ఆఫీసర్లూ, ఇద్దరు డాక్టర్లూ వీరికి తగినంత నర్సులూ వగైరా ఉంటారు. మొత్తం ఆరోగ్య కార్యక్రమాల పర్యవేక్షణా, ప్రాథమిక వైద్యాన్ని అందించటమూ వీటిపని.

ప్రతి 5 వేల జనాభాకొక సబ్ సెంటర్ ఉంటుంది. ఇందులో మల్టీపర్పస్ హెల్త్‌వర్కర్స్ ఇద్దరుంటారు. ఒకరు స్త్రీ, ఒకరు పురుషుడూ. వీరిద్దరూ ప్రథమ చికిత్సతోసహా అన్నిరకాల వైద్య అవసరాలనూ గ్రామస్థాయిలో చూస్తారు. ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం క్రింద 5–10 సెటర్లుంటాయి.

గ్రామస్థాయిలో ప్రతి వెయ్యి జనాభాకు ఒక హెల్త్‌గైడూ, ఒక శిక్షణ పొందిన మంత్రసాని లేదా నాటు మంత్రసానీ ఉంటారు. వీరు మల్టీ పర్పస్ హెల్త్ వర్కర్ పర్యవేక్షణలో ఉంటారు.

ఇదీ ప్రభుత్వ ఆరోగ్య సేవల నిర్మాణాలు. ఈ నిర్మాణము అభివృద్ధిచెందుతున్న దేశాలకు ఆదర్శవంతమైనదని ప్రపంచ ఆరోగ్యసంస్థకూడా తెలియచేసింది. అయితే ఆ నిర్మాణం ఆశించినంత బాగా పనిచేయడం లేదు.

మరోవైపు ప్రైవేటు రంగంలో వైద్యసేవలు శరవేగంతో పెరుగుతున్నాయి. మరీ ముఖ్యంగా గత పదేళ్ళలో కార్పొరేట్ రంగంలో ఆస్పత్రులు బాగా విస్తరించాయి. పెద్ద నగరాలలో ఫైవ్‌స్టార్ హాస్పిటళ్ళు తయారయ్యాయి. మొత్తం మీద ఆస్పత్రి ఏదయినాసరే రోగం వచ్చాక నయం చేసేదేగాని, ఆరోగ్యాన్ని రోగం రాకముందే జాగ్రత్త చేసేది కాదుకదా! ఈ క్రింద ఆం.ప్ర.లోని వైద్యశాస్త్ర విభాగాల గురించి తెలుసుకుందాం.

## ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య విజ్ఞాన విశ్వవిద్యాలయం:

రాష్ట్రంలో వికేంద్రీకరణమైన వైద్యవిద్యను కేంద్రీకరింప చేసి ఒక సమగ్రరూపం ఇవ్వటానికి, గ్రామీణ ప్రాంతాల్లో ఆరోగ్యవిధానాన్ని సక్రమం చేయడానికి, గ్రామీణ ప్రాంతాలకు వైద్యసేవలను విస్తృతం చేయడానికి, వ్యవసాయ విశ్వ విద్యాలయం మాదిరిగానే వైద్యవిద్యలో విస్తృతరగా పరిశోధనచేసి వాటి ఫలితాలను అందరికీ అందుబాటులోకి తేవటంవంటి ప్రధాన ఉద్దేశాలతో ఏర్పాటుచేసిన "ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య విజ్ఞాన విశ్వవిద్యాలయాన్ని" విజయవాడ పట్టణంలో 1986 ఏప్రిల్ 9 న రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు ప్రారంభించారు.

ఈ విశ్వవిద్యాలయ ప్రధానకేంద్రం విజయవాడ పట్టణంలో వుంటుంది. దేశంలో ఒక వైద్య విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటుచేయడం దీనితోనే ప్రారంభమైంది. రాష్ట్ర ముఖ్యమంత్రి ఈ విశ్వవిద్యాలయానికి చాన్సలర్‌గా వుంటారు.

రాష్ట్రంలోని అన్ని వైద్య కళాశాలల్లోనూ ఒకే విధమైన పాఠ్యాంశాలను ప్రవేశపెట్టడం, వైద్యవిద్య పరిశోధన ప్రమాణాల్ని మెరుగుపరచడం, కామన్ ప్రవేశ పరీక్షలను నిర్వహించడం, ఆధునాతన, భారతీయ వైద్యపద్ధతుల గురించి పరిశోధన శిక్షణ నిర్వహించడం. రాష్ట్రంలోని అన్ని వైద్య కళాశాలలను – అలోపతి, హోమియో, యునానీ, ఆయుర్వేద వైద్య విధానాలకు చెందిన వివిధ వైద్య పద్ధతులను సమన్వయపరచడం ఈ విశ్వవిద్యాలయం యొక్క ముఖ్య కార్యక్రమాలు.

రాష్ట్రంలోవున్న అన్నివిధానాల వైద్య కళాశాలలను దీనికి త్వరలోనే అనుబంధించడం జరుగుతుంది. ఈ విశ్వవిద్యాలయ అభివృద్ధికి రాష్ట్రప్రభుత్వం 1986–90 కాలానికి 3 కోట్ల రూపాయలను కేటాయించడం జరిగింది.

### అలోపతి వైద్యవిద్య:

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అలోపతి వైద్య విద్యకు దాదాపు ఒకటిన్నర శతాబ్దపు చరిత్ర వుంది. నైజాం ప్రభువు ప్రోత్సాహంతో 1845 సంవత్సరంలో ఉస్మానియా వైద్యపాఠశాల హైదరాబాదులో ప్రారంభం కావడంతో మన రాష్ట్రంలో అలోపతి వైద్య విద్యకు బీజాలు ఏర్పడ్డాయి. ఒక శతాబ్ద కాలంలో ఈ వైద్య విద్య ప్రాముఖ్యత, కృషి గణనీయంగా పెరిగి, నేటికి మన రాష్ట్రంలో 9 వైద్య కళాశాలలు నెలకొల్పడం జరిగింది. ఇవి కాక హైదరాబాదులో డెంటల్ కళాశాల కూడా ఒకటి పనిచేస్తోంది. విజయవాడలో నెలకొల్పిన సిద్దార్థ మెడికల్ కాలేజీ 1986, ఏప్రిల్ 9 న ప్రభుత్వ యాజమాన్యమునకు అప్పగించడంతో మొత్తం రాష్ట్రంలో వున్న 9 కళాశాలలు ప్రస్తుతం ప్రభుత్వ యాజమాన్యంలో నడుస్తున్నాయి.

ఒక సిద్దార్థ మెడికల్ కాలేజీలో తప్ప మిగిలిన అన్ని కళాశాలలోనూ ఎం.ఎస్., యం.డి. మొదలగు డిగ్రీలు ప్రదానం చేసే పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులను నిర్వహిస్తున్నారు. ముఖ్యంగా మెడికల్, సర్జికల్, అబ్‌స్టిట్రిక్స్, నాన్‌క్లినికల్ మొదలగు అంశాలలో పోస్టు గ్రాడ్యుయేషన్

బోధన జరుగుతోంది. రాష్ట్రంలో ఈ 9 కళాశాలల్లో కలిపి ప్రతి సంవత్సరం 1060 మంది ఎం.బి.బి.యస్. కోర్సులో ప్రవేశించడం జరుగుతోంది. ప్రవేశార్హతను నిర్ణయించడానికి వీలుగా ఇంటర్మీడియట్ పూర్తి చేసినవారికి ఒక ప్రవేశ పరీక్షను నిర్వహించి అందులో వచ్చిన మార్కులను బట్టి కోర్సులోకి తీసుకోవటం జరుగుతోంది. హైదరాబాదులో పనిచేస్తున్న డెంటల్ కాలేజీ నిర్వహిస్తున్న డిగ్రీ కోర్సులోకి ప్రతి సంవత్సరం 40 మంది ప్రవేశించే అవకాశం వుంది. ఇంతేకాక ఈ కాలేజీలో ప్రతి సంవత్సరం నలుగురు విద్యార్థులు అభ్యసించేందుకు వీలుగా దంత వైద్యంలో పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సును నిర్వహిస్తున్నారు. ఈ కోర్సుతో కలుపుకుని రాష్ట్రంలోని మొత్తం కాలేజీలన్నిటిలోనూ 699 మంది ప్రతి సంవత్సరం పోస్టుగ్రాడ్యుయేట్ వైద్యవిద్యను అభ్యసించడం జరుగుతోంది. దక్షిణ భారతదేశంలో పోల్చిచూసినట్లైతే మన రాష్ట్రంలో అలోపతి వైద్య కాలేజీలు తక్కువేనే చెప్పాలి. కర్ణాటక రాష్ట్రంలో మొత్తం 11 కాలేజీలు, చిన్న రాష్ట్రాలయిన కేరళ, తమిళనాడులలో 5,9 కాలేజీలు వున్నాయి. మన రాష్ట్రంలోని వివిధ అల్లోపతి వైద్య కాలేజీల సీట్ల వివరాలను దిగువ పట్టికద్వారా తెలియజేస్తున్నాం.

| కళాశాల | ఎం.బి.బి.ఎస్. సీట్లసంఖ్య | పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సు సీట్లు మెడికల్ | సర్జికల్ | అబ్‌స్ట్రిక్ట్సు | నాన్‌క్లినిక్ | మొత్తం పి.జి.సీట్లు |
|---|---|---|---|---|---|---|
| 1. ఉస్మానియా మెడికల్ కాలేజీ, హైద్రాబాదు | 150 | 71 | 31 | 30 | 30 | 162 |
| 2. గాంధీ మెడికల్ కాలేజీ, హైద్రాబాదు | 100 | 28 | 13 | 15 | 18 | 74 |
| 3. కాకతీయ మెడికల్ కాలేజీ, వరంగల్ | 100 | 26 | 18 | 12 | 16 | 72 |
| 4. గుంటూరు మెడికల్ కాలేజీ, గుంటూరు | 125 | 31 | 19 | 12 | 16 | 78 |
| 5. రంగరాయ మెడికల్ కాలేజీ, కాకినాడ | 100 | 28 | 17 | 9 | 14 | 68 |
| 6. ఆంధ్రా మెడికల్ కాలేజీ, విశాఖపట్నం | 125 | 43 | 17 | 21 | 16 | 97 |
| 7. ఎస్.వి. మెడికల్ కాలేజీ, తిరుపతి | 100 | 29 | 12 | 12 | 14 | 67 |
| 8. కర్నూలు మెడికల్ కాలేజీ, కర్నూలు | 120 | 29 | 19 | 12 | 17 | 77 |
| 9. సిద్ధార్థ మెడికల్ కాలేజీ, విజయవాడ | 100 | | | | | |
| 10. డెంటల్ కాలేజీ, హైద్రాబాదు | 40 | 4 | | | | 4 |
| మొత్తం | 1060 | | | | | 699 |

## నర్సింగ్ కళాశాలలు:

నర్సు వృత్తిలో ప్రత్యేక శిక్షణ యివ్వటానికి వీలుగా ఆంధ్రప్రదేశ్‌లో మూడు కాలేజీలు హైదరాబాదు, కర్నూలు, విశాఖపట్టణాలలో నెలకొల్పటం జరిగింది. ఈ కోర్సులోకి ఇంటర్‌మీడియట్ పరీక్షలో 40 శాతం మార్కులు వచ్చినవారు అర్హులు. ప్రతి కాలేజీలోను ప్రతి సంవత్సరం 29 మంది నర్సింగ్ కోర్సులో ప్రవేశించడానికి అవకాశం వుంది. ఇందులో 50 శాతం మందికి స్టయిఫెండును కూడా చెల్లిస్తారు. మన రాష్ట్రంలో మొట్ట మొదటి సారిగా 1968 జూన్ 15న "ఫెకల్టీ ఆఫ్ మెడిసిన్" కు అనుబంధ సంస్థగా నర్సింగ్ కాలేజీని హైదరాబాదులో ప్రారంభించారు. తరువాత క్రమక్రమంగా కర్నూలు, విశాఖపట్టణాలలో ఈ నర్సింగ్ కాలేజీలను ప్రారంభించడం జరిగింది.

ఈ నర్సింగ్ కోర్సు కాలపరిమితి 4 సంవత్సరములు. కోర్సు పూర్తి అయిన పిదప అనుభవ శిక్షణను వివిధ ఆసుపత్రులలో పూర్తిచేసిన వారికి బి.ఎస్.సి. నర్సింగ్ డిగ్రీలను ప్రదానం చేస్తారు. ఈ కోర్సులో ఫిజికల్, బయాలాజికల్ సైన్సులలోను క్లినికల్, మెడికల్, సర్జరీ మొదలగు వైద్య శాఖలకు సంబంధించిన వివిధ అంశాలను బోధిస్తారు. వైద్య విద్యలో రోగుల బాగోగులు చూచుటలో ఎంతో సన్నిహిత సంబంధమున్న నర్సింగు విద్యకు ప్రారంభం నుండి ఎంతో ప్రాముఖ్యత ఉంది.

## పారా మెడికల్ కోర్సులు:

శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి త్వరతగతిని సాగడంతో ఇటీవలి కాలంలో వైద్యరంగంలో అనేక అత్యాధునిక పరికరాలు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా ఎలక్ట్రానిక్స్ రంగానికి సంబంధించిన సాధనాలు ఎన్నో వైద్యవిధానంలోకి చొచ్చుకొని రావడం జరిగింది. ఈ పరికరాలన్నీ ఇంజనీర్ల సహకారంతో తయారవుతున్నాయి. ఇవి వైద్యులు, రోగులు వ్యాధి నిర్ధారించడంలోనూ, అపరేషన్ తరువాత వేసే

కుట్లులోనూ, వ్యాధి నివారణ పద్ధతులులోనూ, ఎంతో సహాకరించి మేలు చేస్తున్నాయి.

ఆధునిక పరికరాలను ఉపయోగించే విధానం వేర్వే అనేకరకాల కోర్సులను, బయో మెడికల్ ఎక్విప్‌మెంట్ తయారీ, పరిరక్షణలోనూ, నిర్వహణలోనూ అనేక కోర్సులును ప్రైవేటు సంస్థలు నిర్వహిస్తున్నాయి. ఇటువంటి వాటిలో డెంటల్ హైజినిస్ట్, డెంటల్ టెక్నీషియన్, మెడికల్ లాబ్ అసిస్టెంటు, పాథాలజీ అసిస్టెంటు, లాబ్ టెక్నీషియన్, బయో మెడికల్ టెక్నీషియన్, ఎక్స్‌రే టెక్నీషియన్, హాస్పిటల్ టెక్నీషియన్ మొదలగు కోర్సులు ముఖ్యంగా పేర్కొనదగినవి. ఈ కోర్సులన్నిటికీ ఇంటర్మీడియట్ ఉత్తీర్ణత ప్రథమార్హతగా ఉంటుంది. దాదాపు అన్ని కోర్సులు తక్కువ కాలపరిమితి కలిగియుండి, 6 లేక 12 నెలలు వ్యవధితో కూడినవై ఉన్నాయి. ఈ కోర్సుల విషయంలో గమనించవలసిన అంశం – కేవలం ప్రైవేటు విద్యా సంస్థలు మాత్రమే వీటిని నిర్వహిస్తున్నాయి.

హైదరాబాదులో జనరల్ ప్రాక్టీషనర్ల కాలేజీ పేరుతో ప్రైవేటు సంస్థ ఒకటుంది. రాష్ట్రంలో వివిధ చోట్ల రిఫ్రెషర్ కోర్సులు నడపటం ద్వారా జనరల్ మెడికల్ ప్రాక్టీషనర్లకు వైద్య శాస్త్రంలో వస్తున్న నూతన అభివృద్ధి, పరిశోధనలో శిక్షణ యివ్వబడుతుంది. అస్పత్రులు, డిస్పెన్సరీలు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో పనిచేసే సివిల్ అసిస్టెంటు సర్జన్లతో సహా మెడికల్ కేంద్రాలలో పనిచేసే సివిల్ అసిస్టెంటు సర్జన్లతో సహా మెడికల్ ప్రాక్టీషనర్లందరూ ఈ సంస్థ నిర్వహించే కోర్సులకు హాజరవుతారు. రాష్ట్ర ప్రభుత్వం ఈ నిర్వహణకుగానూ ప్రతి ఏడాది కొంత ధనాన్ని నాన్ – రికరింగ్ గ్రాంటు రూపంలో మంజూరు చేస్తున్నది.

అలోపతి వైద్య విధానంతోపాటుగా ఇతర వైద్య విధానాలైన ఆయుర్వేదం, హోమియోపతి, యునానీ వైద్య విధానాలను ప్రోత్సహించి అభివృద్ధి పరచటానికి వీలుగా ప్రభుత్వం అనేక చర్యలు గైకొంటోంది. అందులో భాగంగా ఆయా వైద్య విధానాలను బోధించే కళాశాలలను స్థాపించటం, నడుస్తున్న కాలేజీలను మెరుగుపర్చటం, ఆయా వైద్య విధానాల ప్రభుత్వ అస్పత్రులను రాష్ట్రం నలుమూలలా నెలకొల్పి, ప్రజల అందుబాటులోకి ఈ వైద్య విధానాలను తీసుకురావడం మొదలైనవి ఉన్నాయి.

## ఆయుర్వేద వైద్య విద్య:

దేశీయ వైద్య విధానాలలో అతి ప్రాచీనమైనది, శతాబ్దాల చరిత్ర కలిగిన ఆయుర్వేద వైద్య విద్య బ్రిటీషు ప్రభుత్వ కాలంలో నిర్లక్ష్యం చేయబడి తిరిగి స్వాతంత్ర్యానంతరం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రోత్సాహంతో అభివృద్ధి చెందుతోంది. ప్రస్తుతం మన రాష్ట్రంలో ప్రభుత్వ ఆయుర్వేద కాలేజీ, ఎర్రగడ్డ, హైదరాబాదు; ఎ.ఎల్. ప్రభుత్వ ఆయుర్వేద కాలేజి వరంగల్; డాక్టర్ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కాలేజి, విజయవాడ; శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేదిక్ కాలేజి, తిరుపతి ఉన్నాయి.

ఈ 4 కాలేజీలలో అయిదున్నర సంవత్సరముల కాలపరిమితి వున్న బి.ఏ.ఎమ్.ఎస్. కోర్సును నిర్వహించడం జరుగుతోంది. ఈ నాలుగు కాలేజీలలోనూ ప్రతి సంవత్సరం 130 మంది విద్యార్థులు చేరే అవకాశం ఉంది. హైదరాబాదులోని కళాశాలలో మాత్రం ఆయుర్వేద వైద్య విద్యలో 3 సంవత్సరముల పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సును కూడా నిర్వహిస్తున్నారు. పైన పేర్కొన్న 4 కాలేజీలలో తిరుపతి కాలేజి మాత్రం తిరుమల – తిరుపతి దేవస్థానం యాజమాన్యంలో ఉంది. మిగిలిన 3 ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్నాయి. ఆయుర్వేద వైద్య విధానాన్ని పెంపొందించేందుకు వీలుగా రాష్ట్రంలో 185 ఆయుర్వేద ఔషధాలయాలను కూడా తెరవడం జరిగింది. అదేవిధంగా ఆయుర్వేద వైద్య విధానంలో పరిశోధనలను నిర్వహించటానికి అనువుగా ఒక పరిశోధనా సంస్థను కూడా ఏర్పరిచారు.

## హోమియో వైద్య విద్య:

జర్మనీ దేశంలో పుట్టి పెరిగిన హోమియో వైద్య విధానం మన దేశంలోనూ – ముఖ్యంగా మన రాష్ట్రంలో ముఖ్య స్థానాన్ని కలిగివుంది. ఇతర వైద్య పద్ధతులతో సంతృప్తి కరమైన ఫలితం రాని జబ్బులు కొన్ని హోమియో వైద్యవిధానంలో నయమవుతాయని అంటారు. గత అర్ధ శతాబ్దకాలంలో ఈ హోమియో వైద్యవిధానం ప్రాముఖ్యతను సంతరించుకుంది. మన రాష్ట్రంలో ఈ హోమియో వైద్య విద్యను బోధించేందుకు నాలుగు కళాశాలలు ఉన్నాయి.

* జయసూర్య పొట్టిశ్రీరాములు ప్రభుత్వ హోమియో మెడికల్ కాలేజీ, హైదరాబాదు.
* డాక్టర్ జి.జి. హోమియో మెడికల్ కాలేజీ, గుడివాడ.
* ప్రభుత్వ హోమియో మెడికల్ కాలేజీ, కడప.

ఈ 3 ప్రభుత్వ కళాశాలలతో పాటు రాజమండ్రిలో మరో ప్రైవేటు కళాశాల కూడా ఉంది. ఈ కళాశాలలో $5\frac{1}{2}$ సంవత్సరముల బి.హెచ్.ఎమ్.ఎస్. గ్రాడ్యుయేట్ కోర్సును నిర్వహిస్తున్నారు. ఈ 4 కళాశాలలలో ప్రతి సంవత్సరం 150 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు. ఈ వైద్య విధానంలో పరిశోధనలు జరపటానికి వీలుగా ఒక పరిశోధనా సంస్థను నెలకొల్పడం జరిగింది.

ఆయుర్వేద, హోమియో వైద్య విధానంతోపాటు యునానీ వైద్య విధానాన్ని అభివృద్ధిపరచటానికి వీలుగా

హైదరాబాదులో ఒక యునానీ వైద్యకళాశాలను ఏర్పరచి 50 మంది విద్యార్థులకు ప్రవేశం కల్పిస్తూ ఒక గ్రాడ్యుయేట్ కోర్సును, పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సును కూడా ప్రారంభించారు. కర్నూల్లో ఉస్మానియా కాలేజీ మేనేజ్‌మెంటు మరొక యునాని కాలేజీని ప్రైవేటు రంగంలో స్థాపించారు. హైదరాబాద్ లాగానే కర్నూల్లోని కాలేజీలో చేరటానికి కూడా దేశం నలుమూలలనుంచి విద్యార్థులు వస్తారు.

అలోపతి వైద్య విద్యతో పోల్చి చూసినప్పుడు ఈ దేశీయ వైద్య విద్యపట్ల విద్యార్థులు అంతగా ఆకర్షితులవటం లేదు. దానికి కారణం ప్రజలలో ప్రస్తుతం ఈ వైద్య విధానాలకున్న పరిమితులు, వీటిపట్ల ప్రభుత్వం తక్కువ భావనతో వ్యవహరించడం ముఖ్య కారణాలు. అలోపతి వైద్యవిధానంలోవలె కాక ఈ వైద్యవిధానాలలో ప్రభుత్వ ఆధ్వర్యంలో అతి తక్కువ ఆస్పత్రులు ప్రభుత్వం నిర్వహిస్తుంది. ఇది ఈ కోర్సులలో చేరే విద్యార్థులను నిరుత్సాహపరిచేవిధంగా వుంది.

మన రాష్ట్రంలో వున్న కొన్ని అలోపతి, ఆయుర్వేద, హోమియోపతి కళాశాలల వివరాలను దిగువ పొందుపరుస్తున్నాం.

## ఉస్మానియా విశ్వవిద్యాలయం

### వైద్య విభాగం:

1926–27 సం॥లో నిజామ్ ప్రభుత్వంలో ఉన్న ఉస్మానియా వైద్య కళాశాలను, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి అప్పగించినప్పటి నుండి M.B.B.S. డిగ్రీలను ఇచ్చుట ప్రారంభమైంది. 1845 లో ఉస్మానియా వైద్యకళాశాల మొదట ఒక వైద్య పాఠశాలగా ప్రారంభించబడింది. డా॥ విలియమ్ మెకలిన్ అను ఆంగ్లేయుడు తనకు ఇచ్చిన క్రమపద్ధతి వైద్య విధానం చూసి ఉత్తేజితుడై నవాబ్ నసీర్ – ఉద్దౌలా బహదూర్ నిజామ్ IV ఈ పాఠశాలను స్థాపించాడు. ఈ పాఠశాలకు డా॥ మెకలిన్‌ను వైద్య అధికారిగా నియమించాడు. డా॥ మెకలిన్ ఆంగ్లములో చేసిన ఉపన్యాసాలను, ఒక అనువాదకుడు ఉర్దూ భాషలో విద్యార్థులకు విశదీకరించెడివాడు. ఈ పాఠశాల ప్రారంభించబడిన మొదటి రోజులలో విద్యార్థులు చాలా తక్కువగా ఉండేవారు. కాని, నిజామ్ ప్రధానమంత్రి అయిన సర్ సాలార్ జంగ్ – 1 యొక్క ప్రోద్బలం వల్ల "మున్‌సబ్‌దారుల" పిల్లలను వైద్య పాఠశాలకు పంప మొదలుపెట్టారు.

ఇందు శిక్షణాకాలం 5–6 సంవత్సరములు ఉండేది. శిక్షణాకాలం చివర, ఒక పరీక్షను నిర్వహించి అందులో ఉత్తీర్ణులైన విద్యార్థులకు డిప్లమాలు ఇచ్చేవారు. ఉత్తీర్ణులైన వారిని 'హకీమ్' లనెడివారు. వీరిచే వివిధ జిల్లాలలో వైద్యశాలలను తెరిపించి, గ్రామీణ ప్రజల సౌకర్యార్థం వైద్యం చేయించెడివారు. రెసిడెన్సీ సర్జనులు మరియు ఇండియన్ అసిస్టెంట్స్ యొక్క పట్టుదల, సహకారముల వలన ఈ సంస్థ అభివృద్ధి చెందింది. "సర్జన్ జనరల్ ఆఫ్ మద్రాస్ ప్రెసిడెన్సీ" వారిచే నియమించబడిన పరీక్షాధికారులచే పరీక్షలు నిర్వహించబడెడివి. 1864 లో శిక్షణా భాష ఆంగ్లమునకు మార్చి, ఉత్తీర్ణులైన విద్యార్థులకు అసిస్టెంట్ సర్జన్, సబ్ సర్జన్ మొదలగు డిప్లొమాలను ఇచ్చెడివారు. ఈ విద్యార్హతలు బొంబాయి, మద్రాస్ ప్రెసిడెన్సీలలోను, భారత సైనిక దళముల చేతను గుర్తించబడినవి. 19 వ శతాబ్దం చివర వైద్య పాఠశాలలో క్లోరోఫోరమ్ యొక్క మత్తులక్షణములపై పరిశోధనలు జరిపారు.

ఈ పరీక్షలను నిర్వహించిన బృందం యొక్క నాయకుడు బ్రిటిషు వైద్యుడైన మేజర్ ఎడ్వర్డు లారి. ఇతను జంతువుల పైనను, మానవుల పైననూ ఈ క్లోరోఫారమ్ యొక మత్తు లక్షణములపై పరిశోధనలు జరిపి, నిరపాయకరమైన మత్తు మందుగా వాడవచ్చునని స్పష్టపరిచాడు. ఈ పరిశోధనల గురించి తెలుసుకొనుటకై నైజామ్ నవాబు అయిన మీర్ మహబూబ్ అలీఖాన్ బహద్దూర్ రెండు సంఘాలను నియమించాడు. మొదటి సంఘమునకు సర్జన్ మేజర్ పి.హేర్‌ను (1988), రెండవ సంఘమునకు సర్జన్ మేజర్ ఇ. లారిని నాయకులుగా నియమించాడు. రెండవ సంఘమునందు "రాయల్ సొసైటీ ఆఫ్ లండన్" తరపున డా॥ టి. లాడర్ బ్రన్‌టన్ ఎఫ్.ఆర్.ఎస్. ఉండెను. ఈ రెండు సంఘములు క్లోరోఫారమ్ మత్తుగుణముల గురించి మేజర్ ఎడ్వర్డ్ లారి జరిపిన పరిశోధనలను సరైనవిగా ధృవీకరించాయి. వీరు "క్లోరోఫారమ్ మాస్క్" అను ఒకదానిని రూపొందించారు. అది ఇంగ్లండ్‌లో "హైదరాబాద్ క్లోరోఫారమ్ మాస్క్"గా పేరు పొందింది.

1920 నుండి అసిస్టెంటు – సర్జన్, సబ్ – సర్జన్‌లకు బదులుగా ఎల్.ఎమ్.ఎల్.ఎస్., ఎల్.ఎమ్.పి. మొదలగు డిప్లొమాలు ఇచ్చుటకు వైద్యకళాశాలవారు నిర్ణయించిరి.

గన్‌ఫౌండరీకి దగ్గరగావున్న ఒక ప్రదేశంలో మొట్టమొదటి వైద్య పాఠశాల స్థాపించబడింది. తరువాత దానిని "రెసిడెన్సీ హాస్పటల్"కు మార్చి, ఆ తరువాత ఖైరతాబాదులోని భవంతిలోనికి మార్చారు. 1886 లో నిజామ్ అఫ్జల్ ఉద్దౌలా బహదూర్ పరిపాలనలో అఫ్జల్‌గంజ్ ఆసుపత్రి ఏర్పాటు అయినది. ఇది హైదరాబాదు నందు మొట్టమొదటి అత్యాధునికమైన వైద్యశాల. 1908 లో మూసీనది వరదలలో ఈ వైద్యశాల కొట్టుకొనిపోగా, మళ్లీ దీనిని పునరుద్ధరించారు. కాని, ఈ వైద్యశాలలో తగినంత స్థల సౌకర్యం లేకపోవుటచే, మరియొక క్రొత్త వైద్యశాల,

"ఉస్మానియా జనరల్ హాస్పిటల్" అను పేరుతో 1925 లో కీ. శే. నిజామ్ నవాబ్ సర్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహద్దూర్‌చే నిర్మించబడినది. అఫ్జల్‌గంజ్ వైద్యశాలను, ఉస్మానియా జనరల్ వైద్యశాలలోనికి మార్చిన పిదప ఆ భవంతిని హైదరాబాద్ వైద్య పాఠశాలకు ఇచ్చారు. అది తరువాత 1920–21 లో ఉస్మానియా వైద్య కళాశాలగా మారింది.

ఉస్మానియా వైద్య కళాశాల డిగ్రీలను, ఉస్మానియా విశ్వవిద్యాలయ మండలివారు ఇచ్చుటకు హైదరాబాదు ప్రభుత్వం అంగీకరించుటచే 1926–27 సంllలలో వైద్యరంగంలో హైదరాబాదు ఖ్యాతి గాంచింది. 1952 వరకు ఈ వైద్య కళాశాల ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఒక శాఖగా ఉన్నది. తరువాత తిరిగి ప్రభుత్వము తీసుకొన్నది. అయినప్పటికి విశ్వవిద్యాలయం యొక్క అధికారం వైద్య కళాశాలపై ఉండేది. తగినంత మంది ఉపాధ్యాయులను, ఎనాటమి, ఫిజియాలజి, ఫార్మాకాలజి, పేథాలజి మొదలగు విభాగములను అభివృద్ధిపరచారు. మొదటి విద్యార్థుల బృందము 1926–27 లో వైద్య తరగతులలో చేరి, 5 సంవత్సరముల శిక్షణా కాలమును పూర్తిచేసుకొని 1931 వ సంవత్సరంలో చేరి, 5 సంత్సరముల శిక్షణా కాలమును పూర్తిచేసుకొని 1931వ సంవత్సరంలో ఎమ్.బి.బి.ఎస్. డిగ్రీలను పొందారు. వైద్య విద్యలో చేరుటకు ఇంటర్మీడియట్, బయాలాజీతో ఉత్తీర్ణులయినవారు అర్హులు. 1949 వరకు బోధనాభాష ఉర్దూలో ఉండేది. తరువాత బోధనా భాషను ఆంగ్లంలోనికి మార్చారు. మొదటి 10 సంవత్సరములలో వైద్యవిద్య మొదటి సంవత్సరంలో చేర్చుకున్నవారి సంఖ్య 26, తరువాత 10 సంllలలో ఆ సంఖ్య 80 కి, 1956 కి ఆ సంఖ్య దాదాపు 100 కి పెరిగింది. 1952 లో "మెడికల్ కౌన్సిల్ అఫ్ ఇండియా" వారు ఈ కాలేజిని పర్యవేక్షించి, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ఇచ్చు ఎమ్.బి.బి.ఎస్. డిగ్రీలను గుర్తించారు. ఈ గుర్తింపు 1926–27 నుండి (అనగా వైద్య విద్య ప్రారంభమైన సంవత్సరంనుండి) చదివినవారికి కూడ వర్తించింది.

1956 వ సంవత్సరంలో మరియొక గొప్ప అభివృద్ధి ఏమనగా, విశ్వవిద్యాలయం వారు పోస్ట్‌గ్రాడ్యుయేట్ డిగ్రీలను, డిప్లొమాలను ఇచ్చుటకు నిర్ణయించారు. ఈ డిగ్రీలు, డిప్లొమాలు ఇచ్చుటకు విశ్వవిద్యాలయం వారు ఒక ప్రత్యేక సంఘమును నియమించారు. పోయిన 10 సంవత్సరములలో 11 విభాగాలలో ఎమ్.డి. డిగ్రీని, 4 విభాగాలలో ఎమ్.ఎస్.డిగ్రీని, 12 విభాగాలలో పోస్టుగ్రాడ్యుయేటు డిప్లొమాలను, 1 విభాగములో ఎమ్.యస్సీ. డిగ్రీని ప్రవేశపెట్టారు.

## పరిశోధనలు:

ఉస్మానియా వైద్యకళాశాలను "మెడికల్ కౌన్సిల్ అఫ్ ఇండియా" వారు పర్యవేక్షించినప్పటి నుండి, ఈ కళాశాల వైద్యరంగంలో పరిశోధనలు చేయుట ప్రారంభించింది. విశ్వవిద్యాలయముల గ్రాంట్స్ కమిషన్ వారి ప్రోత్సాహముతోను – విశ్వవిద్యాలయ సహకారముతోను అధునిక వైజ్ఞానిక పరికరములు, వాటిని గురించిన పుస్తకాలు సేకరించుటతో మేలు కలిగినది. అఫ్జల్‌గంజ్ వైద్యశాలలో స్థలము లేనందున పరిశోధనలు చేయుటకు తక్కువ అవకాశాలు కలవు. కాని, 1962 జూలై 27 న భారత రాష్ట్రపతి డాll ఎస్. రాధాకృష్ణన్ గారిచే ఆవిష్కరింపబడిన భవంతిలోనికి వైద్యశాలను మార్చగానే మళ్ళీ పరిశోధనకు చక్కటి అవకాశం కలిగింది. భారత ప్రభుత్వ సహకారంతో మెడిసన్ సర్జరి, గైనకాలజి, పెడియాట్రిక్స్, రేడియోలజి, అప్తల్మాలజి, ఫిజియాలజి విభాగములు ఏర్పడిన తరువాత పరిశోధనకు మరింత ప్రోత్సహం కలిగింది. "ఇండియన్ కౌన్సిల్ అఫ్ మెడికల్ రీసర్చి" వారి నుండి కూడా పరిశోధనలకు తగినంత ధన సహాయము లభించింది. ఇవికాక అమెరికా ప్రభుత్వము నందలి "నేషనల్ ఇన్‌స్టిట్యూట్ అఫ్ హెల్త్"నుండి కూడా పరిశోధనలకు సహకారము లభించింది. వివిధ విభాగముల నుండి ఈ పరిశోధనా విషయములను సేకరించి ఒక పత్రికను ప్రచురిస్తున్నారు.

## క్రొత్త కళాశాలలు:

ఉస్మానియా వైద్యకళాశాల రాష్ట్రంలో ఒక్కటే ఉండుటవలనను, వైద్యుల కొరత వలనను, 1955 లో "గాంధీ వైద్యకళాశాల" అనే పేరుతో భారత రాష్ట్రపతి డాll రాజేంద్రప్రసాద్ రెండవ వైద్యకళాశాలకు ప్రారంభోత్సవం చేశారు. ఈ కళాశాల సికింద్రబాద్‌లోని గాంధీ వైద్యశాలతో సంబంధములుంచుకొని త్వరలో "మెడికల్ కౌన్సిల్ అఫ్ ఇండియా" యొక్క గుర్తింపు పొందింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయం, గాంధీ వైద్య కళాశాలలోని కొన్ని విభాగములను, పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీలను గుర్తించినది. 1959 లో జిల్లాలలో కూడా ఒక వైద్యకళాశాల ఉండుట మంచిదనే అభిప్రాయం కలిగినది. అందుచే వరంగల్‌లో "రీజినల్ వైద్యకళాశాల" (ప్రాంతీయ)ను స్థాపించారు. అదే తరువాత "కాకతీయ వైద్యకళాల"గా మారింది. ఈ వైద్యకళాశాల కూడా అతి తక్కువ వ్యవధిలో ఒక అధునిక వైద్యకళాశాలగా పేరుపొందింది.

ఈ విధంగా తన తరువాత నెలకొల్పబడిన కళాశాలలకు ఉస్మానియా వైద్యకళాశాల తగినంత ప్రోత్సాహము నిచ్చింది.

ప్రస్తుతము ఉస్మానియా విశ్వవిద్యాలయం మొత్తం మూడు వైద్యకళాశాలలను కలిగియున్నది.

### నర్సింగ్ కళాశాల:

నర్సింగ్ విద్యకు, వైద్య విద్యలో రోగుల బాగోగులు చూచుటకు సన్నిహిత సంబంధము కలదు. చాలా కాలమునుండి నర్సింగ్‌లో ఒక క్రమపద్ధతి శిక్షణను ఇచ్చుటకు ఒక ఆలోచన కలదు. అందుచే 1968, జూలై 15 వ తారీఖున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, "ఫేకల్టి ఆఫ్ మెడిసన్"కు అనుబంధ సంస్థగా ఒక నర్సింగ్ కళాశాలను ప్రారంభించింది. ఈ కళాశాలలో నాలుగు సంవత్సరాలు శిక్షణ పొందిన పిదప నర్సింగ్‌లో బి.యస్.సి. డిగ్రీని ఇస్తారు. ఉస్మానియా వైద్య కళాశాల వారు ఫిజికల్, బైలాజికల్ సైన్సులోను క్లినికల్ మెడిసన్ సర్జరి మొదలగు వైద్యశాలలకు సంబంధించిన విషయాలను బి.యస్సి నర్సింగ్ విద్యార్థులకు బోధిస్తారు.

### డెంటల్ సర్జరీలో డిగ్రీ:

1959 లో ఉస్మానియా వైద్య కళాశాలలో పంటి యొక్క ప్రాముఖ్యత గుర్తించి, ప్రత్యేకంగా ఒక "డెంటల్ విభాగము" (పంటి విభాగము)ను ఏర్పరిచారు. ఈ విభాగం కూడా ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు అనుబంధ సంస్థగా వున్నది. ఇందు శిక్షణాకాలము 5 సంవత్సరముల తరువాత బి.డి.యస్. (డిగ్రీ ఆఫ్ బాచెలర్ ఆఫ్ డెంటల్ సర్జరి) డిగ్రీని ఇస్తారు.

## గుంటూరు వైద్య కళాశాల

రాజధానికి సుదూరంగానున్న మెడికల్ అసోసియేషన్ అనేక విన్నపాలు చేసిన ఫలితంగా రాయలసీమ ప్రజలకు, గుంటూరు జిల్లా తదితర పొరుగు జిల్లాల ప్రజలకు వైద్య సౌకర్యాలను కల్పించే నిమిత్తం అప్పటి ఉమ్మడి రాష్ట్రమైన మద్రాసులో ఆరోగ్య శాఖామంత్రిణిగా నున్న శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి 1946 లో గుంటూరు పట్టణంలో వైద్య కళాశాలకు శంకుస్థాపన చేశారు.

కళాశాల నిర్వహణ ప్రభుత్వ శిక్షణా కళాశాలలోను, లేబొరేటరీ సౌకర్యాలు, ప్రీ క్లినికల్ సబ్జెక్టులు ఆంధ్ర క్రిష్టియన్ కళాశాలలో ఏర్పాటు చేయబడ్డాయి. 1947 నాటికి శిక్షణా కళాశాల భవనాలు అవసరమైన మేరకు నిర్మింపబడినవి. వివిధ డిపార్టుమెంట్లకు చెందిన కెమిస్ట్రి, అనాటమీ, ఫిజియాలజి మరియు బయోకెమిస్ట్రీలు అక్కడ బోధింపబడుతుండేవి. 1954 జూలై వరకు విద్యార్థులకు ప్రీ క్లినికల్ సబ్జక్టులమీద మాత్రమే బోధన వుండేది. విద్యార్థులు పూర్తి వైద్య శాస్త్రాల అధ్యయనం కొరకు ఆంధ్రకళాశాల, మద్రాసులోని కళాశాలలకు పంపబడుతుండేవారు.

గుంటూరు వైద్యకళాశాల అభివృద్ధి కమిటీ అనేక అభివృద్ధికర చర్యలు చేపట్టింది. తర్వాత కళాశాల అభివృద్ధిని ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలో ఒక భాగంగా చేపట్టింది. అప్పటి ఉమ్మడి రాష్ట్రంలో (1953 లో) ఆరోగ్య శాఖా మంత్రిగా నున్నటువంటి శ్రీ ఎ.బి. శెట్టి పాథాలజీ బ్లాక్‌కు శంకుస్థాపన చేశారు. ప్రీ క్లినికల్ సబ్జక్టులలో ఆంధ్ర యూనివర్సిటీకి అనుబంధంగా అప్పటికే సమ్మతించింది. ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ టి. ప్రకాశం పంతులు క్లినికల్ కోర్సుల అధ్యయనానికి 1954 జూలై 6 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

ఆంధ్రరాష్ట్ర ముఖ్య మంత్రిగా వున్న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, ఆచంట రుక్మిణమ్మ మెమోరియల్ భవనాలను 1955 సెప్టెంబరు 19 వ తేదీన లాంఛనంగా ప్రారంభించారు. పాథాలజీ (రోగ విజ్ఞాన శాస్త్రం) ఫోరెన్సిక్, మెడిసిన్ అనాటమి, బయాలజీ, ఫిజిక్సు, ఇంగ్లీషు మైక్రోబయాలజీ, పార్మకాలజీ, రోగనిరోధక వైద్య, పరిపాలనా యంత్రాంగ కార్యాలయం, పరిశోధన ప్రయోగశాలల, మ్యూజియంలకు సంబంధించిన వివిధ శాఖలకు భవనాలుండేవి. అన్నిశాఖలు కూడా పూర్తి సన్నాహ పరికరాలు కలిగివుండేవి. పశువైద్యశాఖ భవనం పునర్నిర్మించి పెంపుచెయ్యడం జరిగింది. విద్యార్థులకు విశ్రాంతిగది, అసోసియేషన్ కార్యాలయాలు, ఎన్.సి.సి. కార్యాలయాలు పూర్తి సౌకర్యాలతో ఏర్పాటు చెయ్యబడినవి. 1960 నుండి కళాశాలలో సంవత్సరానికి 150 మంది విద్యార్థులు చేరుతుండేవారు. ప్రస్తుతం ఈ సంఖ్యను 120కు కుదించారు.

1970 నుంచి ఇంగ్లీషు, ఫిజిక్సు, కెమిస్ట్రీ, బాటనీ, జువాలజీ, బయోఫిజిక్స్‌లు బోధనాంశాలుగా కల్గిన "ప్రీ క్లినికల్ కోర్సు" (ప్రి ప్రొఫెషనల్ కోర్సు)ను రద్దుచేశారు. దానివలన $5\frac{1}{2}$ సం॥లుగా ఉన్న వైద్య విద్యాకాలము $4\frac{1}{2}$ సంవత్సరాలకు తగ్గింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో శిక్షణా తరగతుల నుండి ఎం.డి. కోర్సులు (అన్నిశాఖల్లో) ఎం.ఎస్. కోర్సులు (అన్నిశాఖల్లో) డిప్లొమా కోర్సులు ప్రవేశపెట్టబడినవి.

కళాశాలలో శానిటరీ ఇన్‌స్పెక్టరు కోర్సు, నర్సుల శిక్షణ, కాంపౌండర్లు, రేడియోగ్రాఫర్ల కోర్సులలో శిక్షణ ఇస్తుండేవారు. లేబొరేటరీ అటెండర్లకు టెక్నీషియన్ కోర్సులు కూడా వుండేవి. ఫార్మసీ డిప్లొమా కోర్సు 1956 లో స్థాపించబడింది.

కాలేజీ ఆవరణలో విద్యార్థినీ, విద్యార్థులకు క్లాస్‌రూమ్ సౌకర్యాలు కూడా కల్పించబడినవి.

1959 లో ఇండియన్ మెడికల్ కౌన్సిల్ ఈ కళాశాలకు గర్తింపు తెలిపింది. 1961 నవంబరు 1 వ తేదీ

నుండి సంపూర్ణమైన పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం గుర్తించింది. పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీలకు, డిప్లొమా కోర్సులకు 1966 నుండి ఈ కళాశాలలో పరీక్షలు నిర్వహించబడినవి. విద్యార్థుల ఉపాధ్యాయుల సౌకర్యార్థం కాలేజీ ఆవరణలో ఒక ఓపెన్ ఎయిర్ థియేటరు కూడా నిర్మింపబడింది.

## ఆంధ్ర వైద్య కళాశాల

ఆంధ్ర ప్రాంతం, మద్రాసు ప్రెసిడెన్సీ క్రింద ఉన్న రోజుల్లో 1905 లోనే విశాఖపట్నంలో వైద్య పాఠశాల ప్రారంభించబడింది. 1920 దశకంలో ద్విపక్ష ప్రభుత్వం నడుస్తూ దివాన్ బహదూర్ రాజా పానుగంటి రామ నారాయణంగార్ ముఖ్యమంత్రిగా ఉన్న రోజుల్లో యీ వైద్య పాఠశాల కళాశాలగా రూపొందింది. మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధించబడింది. 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధించబడింది. 1923 జూలై 17 న కళాశాల ప్రారంభించినప్పుడు యం.బి.బి.యస్., ఎల్.ఎం.ఎస్. కోర్సులు ప్రవేశపెట్టబడ్డాయి. తొలుత కేవలం 32 మందితో ప్రారంభించబడింది. కళాశాల సీట్లసంఖ్య 1956 కు 125 కు పెరిగింది. తిరిగి 1963 లో 150 కి పెంచింపబడ్డాయి. ప్రస్తుతం ఈ సీట్లసంఖ్య 125 గా చేయడం జరిగింది. ఈ కళాశాల యం.యస్. డిగ్రీలకు సంబంధించిన కోర్సులు 1934, 1944 సంవత్సరాలలో ప్రవేశపెట్టబడ్డాయి. ప్రస్తుతం యం.డి.లో పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులు క్రింది పది విభాగాల్లో నడుస్తున్నాయి. అవి (1) అనెస్థీషియా (మత్తు మందులకు సంబంధించిన శాస్త్ర విభాగం); (2) ఫిజియాలజీ (శరీర ధర్మశాస్త్రం); (3) బయోకెమిస్ట్రీ (జీవ రసాయనశాస్త్రం); (4) ఫార్మకాలజీ (ఔషధశాస్త్రం); (5) పాథాలజీ (రోగ విజ్ఞాన శాస్త్రం); (6) మైక్రోబయాలజీ (సూక్ష్మ జీవశాస్త్రం); (7) పెడియాట్రిక్స్ (శిశురోగ చికిత్సాశాస్త్రం); (8) గైనకాలజీ మరియు అబ్స్టెట్రిక్స్ (స్త్రీలకు సంబంధించిన రోగాల చికిత్స మరియు మంత్రసాని శాస్త్రం); (9) మెడిసిన్; (10) డెర్మటాలజీ (చర్మశాస్త్ర విభాగం).

(1) అనాటమీ (దేహ నిర్మాణ శాస్త్రం); (2) ఇ.యన్.టి. (చెవి, ముక్కు, గొంతు సంబంధిత రోగ చికిత్స); (3) అప్థల్మాలజీ (నేత్రశాస్త్ర విభాగం); (4) సర్జరీ (శస్త్రచికిత్స); (5) ఆర్థోపెడిక్స్ (ఎముకల రోగశాస్త్రం) విభాగాలలో యం.యస్. కోర్సులు నిర్వహించబడుతున్నాయి.

1033 పడకలతో కూడిన కింగ్ జార్జి ఆస్పత్రి, 300 పడకలతో కూడిన మానసిక వ్యాధులకు సంబంధించిన ప్రభుత్వ ఆస్పత్రి, 120 పడకలతో కూడిన ప్రభుత్వ విక్టోరియా స్త్రీ–శిశు చికిత్సాలయం, 48 పడకలతో కూడిన అంటురోగాల ఆస్పత్రి, 156 పడకలతో కూడిన క్షయ ఆస్పత్రి కళాశాలకు అనుబంధంగా ఉన్నాయి.

## వేంకటేశ్వర మెడికల్ కాలేజి

తిరుపతిలోని వేంకటేశ్వర మెడికల్ కాలేజి 1960 జూలైలో ప్రారంభమైనది. మొదటి బ్యాచి విద్యార్థులు 1966, మార్చిలో ఫైనల్ యం.బి.బి.ఎస్. పరీక్షలకు కూర్చున్నారు. పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీలు – డిప్లొమా కోర్సులు :

1975 అక్టోబర్ 17 న ప్రభుత్వం ఈ కాలేజీలో పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీలను, డిప్లొమాలను ఇచ్చుటకు అంగీకరించింది. ఆ తర్వాత ఈ క్రింది కోర్సులు ప్రారంభించారు:

1. యమ్.డి. – జనరల్ మెడిసిన్.
2. యమ్.డి. – అబస్ట్ మరియు గైనకాలజి.
3. యమ్.యస్. – జనరల్ సర్జరి.
4. యమ్.యస్. – ఆర్థోపెడిక్స్.
5. టి.డి.టి.
6. డి.ఎ.
7. యమ్.యస్. – ఎనాటమి.
8. యం.డి. – ఫార్మకాలజి.

### డిప్లొమా అండ్ సర్టిఫికెట్ కోర్సు ఇన్ ఫామిలీ హెల్త్:

"పాపులేషన్ స్టడీస్" సహకారంతో వేంకటేశ్వర మెడికల్ కాలేజీలో వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు ఈ కోర్సులను ప్రవేశపెట్టారు. 1975 ఏప్రిల్ నుండి డి.సి.యఫ్.హెచ్. ప్రారంభించబడి, చాలామంది డాక్టర్లు ఈ కోర్సులో చేరారు. సి.సి.ఎఫ్.హెచ్. (3 నెలల కోర్సు)లు కూడా ప్రారంభించబడ్డాయి.

### సిద్ధార్థ వైద్య కళాశాల, విజయవాడ:

కోస్తా ప్రాంతానికి వ్యాపార పారిశ్రామిక కేంద్రముగా పేరొందిన విజయవాడ నగరంలో సిద్ధార్థ సాంకేతిక అకాడమీ యాజమాన్యంలో 1980 సంవత్సరంలో సిద్ధార్థ వైద్యకళాశాల ప్రారంభమైంది. దీనితో రాష్ట్రంలో వైద్య కళాశాలల సంఖ్య 10 కి చేరుకోవడమే కాకుండా కోస్తా ప్రాంతంలో వైద్య కళాశాలల సంఖ్య 4 కి పెరిగింది.

సిద్ధార్థ కళాశాలకు అనుబంధంగా అత్యంత ఆధునిక పరికరాలతో 700 పడకలున్న ఆస్పత్రిని నిర్మించడంతోపాటుగా ప్రభుత్వ జనరల్ ఆస్పత్రిలో స్థాయి, సామర్థ్యాన్ని పెంపొందించి అందుకు అవసరమైన సాధన సంపత్తిని కూడా ఈ అకాడమీ సమకూర్చింది. ఈ వైద్య కళాశాలలో

వున్న బోధనవసతులు, ప్రయోగశాలల స్థాయి, సమకూర్చిన పరికరాలు మరి ఏ ఇతర కళాశాలకు తీసిపోనివిధంగా సిద్ధార్థ అకాడమీ వారు సమకూర్చడం జరిగింది. ప్రారంభంలో ఇక్కడ బోధిస్తున్న ఎం.బి.బి.యస్. కోర్సులోకి 110 మంది విద్యార్థులు ప్రవేశించడం జరిగింది. తదుపరి ప్రభుత్వ విద్యావిధానంలో మార్పు రావడంతో ఈ సంఖ్యను 100కు కుదించడము జరిగింది.

ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య విజ్ఞాన విశ్వవిద్యాలయాన్ని రాష్ట్ర ప్రభుత్వం ప్రారంభించడంతో 1986 డిసెంబరు 21 న ఈ సిద్ధార్థ వైద్య కళాశాలను ప్రభుత్వ యాజమాన్యంలోకి బదిలీ చేయడం జరిగింది.

### డా. బూర్గుల రామకృష్ణారావు ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, హైదరాబాదు:

ఈ కళాశాల 1941 లో స్థాపించబడింది. 1984 లో స్వంత భవన సముదాయమును పొంది డా. బూర్గుల రామకృష్ణారావుగారి పేరున కొనసాగుతున్నది. ఈ కళాశాల ఎర్రగడ్డ ప్రాంతమున ప్రభుత్వ భీమా వైద్యశాల కెదురుగా ఎ.జి. కాలనీకి పోవు రోడ్డులో ఎడమవైపు రెండవ కట్టడములో కలదు.

ప్రస్తుతము ఈ కళాశాల పట్టభద్రులకు, స్నాతకోత్తర (పోస్టు గ్రాడ్యుయేట్) విద్యకనువుగానున్నది. $5\frac{1}{2}$ సంవత్సరకాలంగల పట్టభద్రతా వైద్యవిద్య – ఆరుమాసముల హౌస్ సర్జరీ శిక్షణా కాలముతో కలిసి వున్నది. హౌస్సర్జన్సీ శిక్షణాకాలమందు, ఆధునిక వైద్య విద్యార్థులకువలెనే స్టైపెండు కూడ ఇచ్చుట కలదు. అయితే 3 సం॥ల స్నాతకోత్తర వైద్య విద్యాకాలమున ఆధునిక స్నాతకోత్తర వైద్య విద్యార్థులతో సమానంగా స్టైఫండుగా యిచ్చుట కూడా కలదు. ఏటా 50 మంది పట్టభద్రతా వైద్య విద్యలో చేర్చుకొంటారు. దేశభాషయైన హిందీలోనూ, ప్రాంతీయ భాషయైన తెలుగులోనూ బోధించుచున్నారు.

స్నాతకోత్తర వైద్య విద్యలో ప్రస్తుతం కాయ చికిత్సలో 10 మందికి, శల్యశాలక్య ప్రసూతిలో 10 మందికి చొప్పున మొత్తం 20 మందికి ప్రతి సంవత్సరమూ ప్రవేశంకలదు. ఈ కోర్సు 3 సంవత్సరములు.

పాఠ్యాంశములు కేంద్రీయ ఆయుర్వేద మండలి నిర్ణయము మేరకే విద్య గరుపబడుచున్నది. ఈ కళాశాల ఉస్మానియా యూనివర్సిటీకి అనుబంధంగా కలదు. ఈ వైద్య కళాశాలకు అనుబంధముగా 180 పడకలుగల వైద్యశాల గూడా చార్మినార్‌కు సమీపమున ఉంది.

#### పట్టభద్ర విభాగము:

1 కులపతి (ప్రిన్సిపాల్), 5గురు ప్రధాన అధ్యాపకులు, 15 మంది సహాయ అధ్యాపకులు, 6 గురు ఉపన్యాసకులు గలరు. మొత్తం 27మంది కలరు.

అలాగే స్నాతకోత్తర విభాగమున కాయ చికిత్సలో మరియు శల్యశాలక్య ప్రసూతి విభాగమున ఒక్కొక్క ప్రధాన అధ్యాపకులు, ముగ్గురు సహాధ్యాపకులు, ముగ్గురు అధ్యాపకులు మరియు వృత్తి సహాయకులు చొప్పున మొత్తము ఒక్కొక్క విభాగమునకు 10 మంది చొప్పున 20 మంది కలరు. ఈ కళాశాలకు ప్రస్తుతము 60 మందికి ప్రవేశముగల హాస్టలు వసతి కలదు. హాస్టలుయందు తగిన ఉద్యోగులతో విద్యార్థుల సహకార భోజన వసతి యుక్తముగా నున్నది. ఈ కళాశాలకు ఈ మధ్యనే బాలికల వసతి గృహం కూడా నిర్దేశ్యము ప్రభుత్వము ద్వారా జరిగినది.

### ప్రభుత్వ హోమియోపతి వైద్య కళాశాల, కడప:

రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యంలో రాయలసీమ ప్రాంతం కడప పట్టణంలో 1982 అక్టోబరులో ఈ కళాశాల ప్రారంభమైంది. హోమియోపతి వైద్య విధానంలో $5\frac{1}{2}$ సంవత్సరముల బి.హెచ్.ఎమ్.ఎస్. గ్రాడ్యుయేట్ కోర్సును బోధిస్తున్నారు. ప్రతి సంవత్సరము ఈ కోర్సులోకి 36 మంది విద్యార్థులు ప్రవేశిస్తున్నారు.

ఈ కళాశాలలో హోమియోపతి వైద్య విద్యను బోధించడానికి ఒక కులపతి, 3 ప్రధాన అధ్యాపకులు, 7గురు సహాయ అధ్యాపకులు, 6గురు ఉపన్యాసకులు ఉన్నారు.

ఎనాటమీ, ఫిజియాలజీ, మెటీరియా మెడికా, హోమియో థెరప్యూటిక్స్ అండ్ ఫార్మసీ, ఆర్గనాన్ అండ్ ఫిలాసఫీ క్రానిక్ డిసీజస్ సైక్యాట్రీ, ప్రాక్టీస్ ఆఫ్ మెడిసిన్ అండ్ హోమియో థెరప్యూటిక్స్, సోషల్ అండ్ ప్రివెంటివ్ మెడిసిన్ అండ్ పాథాలజీ, సర్జరీ ఇ.ఎన్.టి., ఆప్తాల్మాలజీ హోమియో థెరప్యూటిక్స్ అండ్ ఫోరెన్సిక్ మెడిసిన్స్ అండ్ టాక్సాలజీ అబ్‌స్టెట్రిక్స్ అండ్ గైనకాలజీ హోమియో థెరప్యూటిక్స్ అండ్ పీడియాట్రిక్స్ అనే విభాగాలలో ఈ కళాశాలలో వివిధ అంశాలను బోధించటం జరుగుతోంది.

ఈ కళాశాలకు, అనుబంధంగా 30 పడకలువున్న ఒక హోమియోపతి ఆసుపత్రిని కూడా కడప పట్టణంలో నిర్వహించడం జరుగుతోంది. ఈ ఆసుపత్రిలో హోమియో వైద్య విద్యార్థులకు క్లినికల్ శిక్షణ ఇవ్వటం జరుగుతోంది.

## వైద్య విద్య

వైద్య విద్యలో చేరాలనుకునే విద్యార్థుల సంఖ్య ఈ మధ్యకాలంలో విపరీతంగా పెరిగింది. కాని వైద్య విద్యా ప్రమాణాలు గత పదీ పది హేనేళ్ళకాలంలోనే బాగా క్షీణించాయి. $4\frac{1}{2}$ సంవత్సరాల వైద్యవిద్య పూర్తిచేసిన తర్వాతనయినా ధైర్యంగా వైద్యం చేయగలననే నమ్మకం ఉండడంలేదు.

చాలా సందర్భాలలో గ్రామాల్లో రాణించటానికి దీనికున్న ఆచరణాత్మక తర్ఫీదు చాలడం లేదు.

ఈ సమస్యను సరిగ్గా పరిష్కరించాలంటే వైద్య విద్య సంస్కరించబడాలి. అది ప్రస్తుతం జరగటం లేదు. విద్యార్థులు తమకు తోచిన పరిష్కారాలు వెతుక్కుంటున్నారు. పోస్టుగ్రాడ్యుయేషన్ చేస్తేనన్నా కొంత ధైర్యం వస్తుందనే నమ్మకంతో ప్రవేశపరీక్ష విపరీత సంఖ్యలో రాస్తున్నారు. బోధ నాప్రమాణాలు పడిపోతున్నంతవేగంతో పోస్టుగ్రాడ్యుయేషన్ పరీక్షలు రాసేవాళ్ళు పెరుగుతున్నారు. ఆ రాసేవాళ్ళు కూడా బాగా ఆదాయాన్నివ్వగల క్లినికల్ విభాగాల్లోనే సీట్లు ఆశిస్తున్నారు. శరీర నిర్మాణ శాస్త్రము, శరీర ధర్మశాస్త్రము, వగైరా బేసిక్ సబ్జక్టులు చెప్పేవారిలో తగిన విద్యార్హత గల్గినవాళ్ళ కొరత తీవ్రంగా ఉంది. ఆయా సబ్జక్టులలో పోస్టుగ్రాడ్యుయేషన్ చేయటానికి విద్యార్థులు సుముఖంగా లేరు.

వైద్యవిద్యను బోధించాల్సిన డాక్టర్లు బోధనమీద శ్రద్ధ చూపక, తమ ప్రైవేటు ప్రాక్టీసు మీద కేంద్రీకరించటం విద్యాబోధన పడిపోవటానికి ఒక ముఖ్యమైన కారణమనే వాళ్ళున్నారు. అలిండియా వైద్యవిజ్ఞాన సంస్థలు (ఢిల్లీ, చండీఘర్, పాండిచ్చేరి మొ॥) అక్కడ పనిచేసే డాక్టర్లను ప్రైవేటు ప్రాక్టీసు చేయటం అనుమతించవు. ఫలితంగా అక్కడ చదివి తయారయిన వైద్యుల ప్రమాణాలు మెరుగ్గా తయారవుతున్నాయని పైవిధంగా వాదించే వాళ్ళ ఆధారాలు చూపుతున్నారు.

"విద్యార్థులకు చదువు చెప్పించుకోటంలో ఆసక్తిలేకపోతే మేమేం చేయగలమని వైద్య ఉపాధ్యాయులంటున్నార"ని మరోవైపు వాదన కూడా ఉన్నది.

ఆరోగ్యంగా ఉండటానికి తిండీ, నీళ్లూ, పరిసరాల పరిశుభ్రతా, ఆరోగ్యవిద్యా, సంపాదనా అనేవి కీలక అంశాలని సామాజిక శాస్త్రవేత్తలు అంగీకరిస్తారు. ఆరోగ్యం పోయాక రోగం వస్తుంది. డాక్టర్లు ప్రధానంగా రోగాలు వచ్చాక రంగంలోకి వస్తారు. ఆరోగ్యం నిలవటానికి అవసరమైన తిండీ వగైరా అంశాలను డాక్టర్లు అందించరు. మొత్తంమీద ఆరోగ్యంలో డాక్టర్ల సంఖ్య అనేది చివరవస్తుంది.

ఆరోగ్య సేవల విషయానికి వస్తే గ్రామాల్లో పనిచేసే హెల్త్‌గైడ్లు, మల్టీపర్పస్ హెల్త్ వర్కర్లు (స్త్రీలు), మల్టీపర్పస్ హెల్త్ వర్కర్లు (పురుషులు), ప్రైమరీ హెల్త్ సెంటర్లు, సబ్ సెంటర్లు, కమ్యూనిటీ హెల్త్ సెంటర్లు – యివన్నీకూడా చాలా ముఖ్యమే. ఇవన్నీ చాలినన్ని లేకుండా డాక్టర్ల సంఖ్య మాత్రమే పెరిగినా ఫలితం ఉండదు.

| సంఖ్య | విషయం | మొత్తం అవసరం | ఇప్పటికి ఉన్నవి |
|---|---|---|---|
| 1. | హెల్త్ గైడ్లు | 4,50,000 | 3,50,000 |
| 2. | ప్రైమరీ హెల్త్ సెంటర్లు | 23,000 | 11,000 |
| 3. | సబ్ సెంటర్లు | 1,37,000 | 83,000 |
| 4. | కమ్యూనిటీ హెల్త్ సెంటర్లు | 5,417 | 649 |
| 5. | మల్టీపర్పస్ హెల్త్ వర్కర్ (స్త్రీలు) | 1,30,000 | 80,000 (అంచనా) |
| 6. | మల్టీపర్పస్ హెల్త్ వర్కర్ (పురుషులు) | 1,30,000 | 80,000 (అంచనా) |
| 7. | స్వంత భవనాలు గల ప్రైమరీ హెల్త్‌సెంటర్లు | 23,000 | 8,578 |
| 8. | స్వంత భవనాలు గల ప్రైమరీ సబ్ సెంటర్లు | 1,37,000 | 33,475 |
| 9. | స్వంత భవనాలు గల ప్రైమరీ కమ్యూనిటీ హెల్త్ సెంటర్లు | 5417 | 547 |

వైద్యసేవలు అందించటానికి ఉద్దేశించబడిన ఏ ఒక్క అంశంలోనూ స్వయంసమృద్ధి సాధించలేదు.

## డాక్టర్ల సంఖ్య ఎలా ఉంది?

కాని డాక్టర్ల సంఖ్య మిగిలిన వైద్యసేవల కంటే భిన్నంగా ఉంది. భాత్ కమిటీ, శ్రీవాస్తవ కమిటీ, ముదలియార్ కమిటీ – యివన్నీ ఆరోగ్యాన్ని బాగుపరచటానికి సూచనలు చేశాయి. మన దేశంలో 3500 మంది జనాభాకు ఒక డాక్టరు చొప్పున ఉంటే యిప్పటికి చాలన్నారు. మిగతా అంశాలు (పారామెడికల్ స్టాఫ్, ప్రైమరీ హెల్త్ సెంటర్లు, వగైరా సమస్యలను) పరిష్కరించుకున్నాక డాక్టర్ల సంఖ్యను పెంచుకోవచ్చు. 1987 నాటికి 3,31,630 మంది అల్లోపతి డాక్టర్లు దేశంలో ఉన్నారు. ఇప్పుడా సంఖ్య 4 లక్షలు దాటింది. దేశంలోగల 130 పై చిలుకు మెడికల్ కాలేజీలనుంచి

ఏడాదికి 1300 మంది డాక్టర్లు కొత్తగా వస్తారు. ప్రస్తుత జనాభాకు 2000 మందికి ఒక డాక్టరు చొప్పున ఉన్నట్లుగా భావించవచ్చు. అయుర్వేద, హోమియో, యునాని, సిద్ధ, ప్రకృతి వైద్యులలో మరో 6 లక్షలమందున్నారు. వీళ్ళందరినీ పరిగణనలోకి తీసుకుంటే 800 మంది జనాభాకో డాక్టరు చొప్పున ఉన్నారు. 3,500 మందికో డాక్టరనే సిఫారసు ఎక్కడ? 800 మందికో డాక్టరెక్కడ?

అసలు బాధాకరమైన విషయం ఆ తర్వాత ఉంది. పట్టణాలలో ప్రతి 1000 మందికో అల్లోపతి డాక్టరుంటే, పల్లెల్లో 11,000 మంది జనాభాకో డాక్టరున్నారు. ఇది సరాసరి లెక్కమాత్రమే. కొన్ని పల్లెల్లో అసలు డాక్టరుండే సమస్యేలేదు.

ఇప్పుడున్న మెడికల్ కాలేజీలనూ, సీట్లనూ యికముందు పెంచనక్కరలేదని కేంద్ర ప్రభుత్వమూ హెచ్చరించింది, ప్రపంచ ఆరోగ్య సంస్థా చెప్పింది. అలా పెంచకపోతేనే 2000 సం॥నికి 1800 మందికో డాక్టరుంటారని అంచనా.

అసలు సమస్య "సంఖ్య"ది కాదు - ఆ సంఖ్య జనాభాకు సమతుల్యంగా పంపిణీ జరగలేదనేదే. అందుకే రోగా లెక్కువగా ఉండే చోట్లలో, జనాభా ఎక్కువగా ఉన్న చోట్లలో డాక్టర్లు తక్కువన్నారు. జనం తక్కువగా ఉన్నచోట్ల డాక్టర్లు ఎక్కువున్నారు.

## డాక్టర్లు గ్రామాలకు పోరా?

"పోరని" చాలామంది అంటుంటారు. కాని జనం మొత్తం పట్టణాలవైపు ఎగబడడం చూస్తున్నాము. డాక్టర్లు మాత్రమే గ్రామాలకు వెళ్ళడం లేదని వాదిస్తుంటాము. గ్రామాలకు పోవటానికి సిద్ధంగా ఉన్న డాక్టర్లు ఉన్నారు. వాళ్ళ పేర్లు యింకా ఉద్యోగాలు రానివారి లిస్టుల్లోనే ఉన్నాయి. గ్రామాల్లో డాక్టర్లకు కనీస వసతులుండవు. ప్రైమరీ హెల్త్ సెంటర్లకే స్వంత భవనాలు లేకపోతే, యిక డాక్టర్లకు క్వార్టర్స్ ఉంటాయా? ఎక్కడయినా అలాంటి వసతి ఉంటే, అదికూడా ఊరికి ఒక కిలోమీటరు దూరంలో ఉంటే డాక్టర్లకు రక్షణ ఏమిటి? అసలంత దూరం రోగులు ఎలా రావాలి? డాక్టర్లు, తమ పిల్లలకు చదువు చెప్పించుకోటానికి తగిన వసతులుండవు. గ్రామ కక్షలుకూడా డాక్టర్లను బెదిరిస్తూ ఉంటాయి. చాల ప్రైమరీ హెల్త్ సెంటర్లలో మందులు సరిగ్గా ఉండవు. ఉన్న రెండు మూడు రకాలు పది రంగుల డబ్బాల్లో సర్ది పదిరకాల మందులు యిచ్చినట్లే జనానికి భ్రమ కల్గించాలి. కనీస శస్త్ర చికిత్సలు చేయడానికి తగిన పరికరాలూ వసతులూ ఉండవు. అవి ఉంటే నిపుణులుండరు.

ఎందుకిలా జరుగుతుంది?

పల్లెల్లో జనం ఉంటారు. వాళ్ళంతా సాదాసీదాజనం. వాళ్ళు ఉంటే ఎంత? ఊడితేఎంత? పట్టణాలలో పెద్ద వాళ్ళుంటారు. డబ్బున్న వాళ్ళుంటారు. పలుకుబడి గలవాళ్ళుంటారు. రాజకీయనాయకులు కూడా ఉంటారు. అందువలన వారి వైద్యసౌకర్యాలు బాగా ఉండాలికదా! జనాభాలో నాల్గువంతులు జనం మాత్రమే నివసించే పట్టణాలకు, పల్లెలకంటే నాలుగు రెట్లు ఎక్కువ కేటాయింపులున్నాయి.

డాక్టర్లు గ్రామాలకు పోరనే వాదన చాటున ఈ "అసలు సమస్య" మరుగున పడ్తోంది.

ఏం చేయవచ్చు?

- గ్రామాలమీద సీత కన్ను మానేసి వసతులు కల్పించవచ్చు.
- గ్రామాల్లో పనిచేసే డాక్టర్లకు రూరల్ అలవెన్సు యివ్వవచ్చు.
- గ్రామాల్లో పనిచేసే డాక్టర్లకు అద్దెలేకుండా నివాసవసతి కల్పించవచ్చు.
- ప్రతి డాక్టరూ విధిగా 5 సంవత్సరాలు గ్రామాల్లో పనిచేయాలనే రాతమూలక హామీని మెడికల్ సీటిచ్చేటప్పుడు తీసుకుంటే నిబద్ధత పెరుగుతుంది.
- గ్రామాల్లో పనిచేశాకనే పోస్ట్‌గ్రాడ్యుయేట్ పరీక్ష రాయ టానికి అర్హులని నిబంధన విధించవచ్చు.
- గ్రామాల్లో 5 సంవత్సరాలు పనిచేసినవారిని తాలూకా కేంద్రాలకూ, జిల్లా కేంద్రాలకూ బదిలీ చేస్తామని హామీ యివ్వవచ్చు.
- సాధారణ పరిస్థితుల్లో ఈ మార్గదర్శక సూత్రాలను అతిక్రమించకుండా భరోసా ఉండాలి.

ఇలాంటి ప్రయత్నాలు మొదలుపెడితే గ్రామాల పరిస్థితి మెరుగ్గాక పోదు.

## స్పెషలిస్టులూ - జనరల్ ప్రాక్టీషనర్లూ:

సాధారణ రోగాలు చూడగల జనరల్ ప్రాక్టీషనర్లు ఎక్కడయినా సరే ఎక్కువుండాలి. బ్రిటన్‌లో కూడా అలాంటి ఫామిలీ ఫిజీషియన్ పాత్ర చాలా ఉంది. అన్నిరకాల జబ్బులనూ ప్రాథమిక స్థాయిలో నయం చేయగల్గే సామర్థ్యం వారికుండాలి. దీనికోసం అవసరమైనంత సిలబసూ, తర్ఫీదు మెడికల్ కాలేజీల్లో ఉండాలి. అలా ఉన్నప్పుడే స్పెషలిస్టులమీద వత్తిడి తగ్గేది. ఈ దృష్టి వైద్య విద్యలో సిలబస్ నిర్ణయించేటప్పుడుండాలి. విధాన నిర్ణేతలూ ఈ దృష్టితో ఉండాలి. ప్రస్తుతమున్న సిలబస్ ఆ విధంగా చూస్తే ఎక్కువే. కేవలం స్పెషలిస్టుల సంఖ్యను పెంచుకుంటూ పోవడం ప్రజారోగ్యమనే సమస్యకు పరిష్కారం కాదు.

స్పెషలిస్టులు మరింతగా పట్టణాల మీదే దృష్టి కేంద్రీకరిస్తారు. వారికి తగినంత ప్రోత్సాహమూ, ఆదాయము రావాలంటే మామూలు ఆస్పత్రులు చాలవు. ఫైవ్‌స్టార్

ఆస్పత్రులుండాల్సిందే. ఫైవ్‌స్టార్ ఆస్పత్రులు ఉండాలా లేదా అనే సమస్య కాదిక్కడ. మామూలు జనానికి అవసరమైన కనీస కార్యక్రమం అటకెక్కుతుందేమిటనేదే సమస్య.

ఆరోగ్యంలో ముఖ్యపాత్ర వహించే తిండీ, నీళ్ళూ, పరిసరాల పరిశుభ్రతా వగైరాలన్నీ నేరుగా జనం చూసుకోవాల్సిన అంశాలే. అందుకే ప్రజల ఆరోగ్యాన్ని పంచాయతీ ల ఎజెండాలో చేర్చి ప్రజలను భాగస్వాములుగా మార్చాలి. ఈ అవసరానికనుగుణంలో వైద్యవిద్య తనను తాను మలుచుకోవాలి.

ఎంతో చక్కని ఆరోగ్య విధానం మన దేశంలో ఉంది. కానీ జనం యొక్క ఆరోగ్యం మెరుగుపడటం లేదని నివేదికలు చెప్తున్నాయి. "ఎంతో చక్కని ఆరోగ్య విధానం" ఎందుకని ప్రజలకు జవాబుదారీ వహించడం లేదో జాగ్రత్తగా పరిశీలించాలి.

"అన్యాయం మీద ధ్వజమెత్తడం
అసమ్మతి చూపడం మా పని.....
కొండ శిఖరాలైనా ఢీకొని ఘోరంగా పోరాడవలసిందే
అడవుల్లో ఆకలములు తినైనా అగ్ని ధారలు
కురిపించాల్సిందే." - కుందుర్తి

# ప్రకృతి వైద్య విశిష్టత

డా॥ టి. కృష్ణమూర్తి N.D.

ఆదినుండి మానవుడు ప్రకృతి జీవనం గడుపుతూ స్వతస్సిద్ధంగానే ప్రకృతి చికిత్సను పాటిస్తూ వచ్చాడు. ఆదిమానవుడు ప్రకృతి జీవనం గడిపేవాడు. అందువలన అతడు చాల అరుదుగా రోగగ్రస్తుడవుతూ ఉండేవాడు. నాగరికత అభివృద్ధి జరుగుతూ వచ్చిన కొలది మానవుడు కృత్రిమ లేక అప్రాకృత జీవితానికి అలవాటు పడుతూ, అనగా వేళకు సరిగా ఆహారం భుజించక, రాత్రివేళ, సరియైన టైమునందు నిద్రకుపక్రమించక, శరీరానికి సరిపడు నీళ్ళు త్రాగక, శరీర వ్యాయామము చేయక అనేక మానసిక ఒత్తిడులకు లోనై, కామములో నియమ బద్ధములేక పొగ త్రాగుట, మద్యపానము మొదలగు దుర్వ్యసనాలకు లోనై ప్రకృతికి దూరమైనాడు. తత్ ఫలితంగా అనేక వ్యాధులకు గురి అవుతూ బాధపడుతున్నాడు.

ఈనాడు మానవుడు స్వధర్మాన్ని శరీరధర్మాన్ని కూడ విస్మరించాడు. ఈ నవనాగరికత అభివృద్ధిలో మన ప్రాచీన ప్రకృతి జీవనము, ప్రకృతి చికిత్సా విధానము మరుగు పడిపోయాయి. ఈ పరిస్థితుల్లో మనం యేం చేయాలి? దానికి ఒకటే మార్గము: అది మరల ఆధ్యాత్మికత ఆధారంగల ప్రకృతి జీవనమును, ప్రకృతి చికిత్సను అవలంబించి తద్వారా మానవుల్ని ఆత్మవంతుడుగా చేయడమే.

రెండు మూడు శతాబ్దాల క్రితం ప్రఖ్యాత అల్లోపతీ వైద్యులైన డా॥ లూయిస్ కూనే, డా॥ హెన్రీ లిండ్లహార్ మొదలగువారు మన ప్రాచీన మహర్షులు వివరించిన ప్రకృతి జీవన విధానము అవలంబించి అనేక ప్రకృతి వైద్య గ్రంథములను రచించి, ప్రకృతి వైద్యమును దేశ దేశాలందు ప్రచారము చేసియున్నారు.

భారతదేశంలో ప్రకృతి చికిత్సోద్యమము ఆంధ్ర రాష్ట్రం లోనే ప్రారంభమైనది. ఇది మనందరికి గర్వింపదగిన విషయం. 1886 లో కీ.శే. ద్రోణంరాజు వెంకటా చలపతి శర్మగారు, డా॥ లూయిస్ కూనే గారు రచించిన 'అభినవ ప్రాకృతిక చికిత్స' అను గ్రంథాన్ని తెలుగుభాషలో అనువదించి ఈ వైద్యవిధాన ప్రచారానికి కృషి చేశారు.

మన జాతిపిత మహాత్మ గాంధీ, తనమీద, కుటుంబ సభ్యులమీద, ఆశ్రమవాసులమీద ప్రయోగం చేసి, తరువాతనే ప్రకృతి వైద్యాన్ని తమ నిర్మాణ కార్యక్రమంలో ఈ విధానానికి ప్రముఖ స్థానమిచ్చారు.

## ప్రకృతి చికిత్స అంటే ఏమిటి?

మన శరీరం పంచభూతాలతో తయారైవున్నది. అనగా –

1. గాలి: మన ఊపిరితిత్తులలో వున్నది.
2. నీరు:– రక్తము, జీర్ణరసాల రూపంలో వున్నది.
3. సూర్యరశ్మి:– శరీర ఉష్ణోగ్రత ($98.6^\circ F$) గా జఠరాగ్నిగా వున్నది.
4. మట్టి:– శరీరములోని కండరాలు, ఎముకల రూపంలో వున్నది.
5. ఆకాశతత్వం:– పొట్టలోయుండే ఖాళీ ప్రదేశంగావున్నది.

ఈ పంచభూతాల సహాయంతో చేసే చికిత్స 'ప్రకృతి చికిత్స' ప్రకృతి చికిత్సయందు –

1. సూర్యరశ్మి సహాయంతో ఆదిత్యపేటికా స్నానం, వివిధ రంగుల సహాయంతో చికిత్సలు చేస్తారు.
2. జలము సహాయంతో తొట్టిస్నానం, ఆవిరి స్నానం, అనేక రకాల తడికట్లు ఇవ్వడం జరుగుతుంది.
3. గాలి ప్రాణాయామమందు క్రమ పద్ధతులలో గాలి పీల్చడం జరుగుతుంది.
4. మట్టి మట్టి పట్టీలు, మృత్తికా స్నానము ఇస్తారు.
5. ఆకాశతత్వం జీర్ణశక్తినిబట్టి తగిన పరిణామంలో ఆహారం తీసుకొంటూ, జీర్ణశక్తి లోపించినప్పుడు ఉపవాసం చేసి, పొట్టయందు తగినంత ఖాళీ ప్రదేశం ఉంచడం జరుగుతుంది.

### ప్రకృతి చికిత్స - విధానము

ప్రకృతి వైద్యం సృష్ట్యాదినుండి మానవునితో పాటు అన్ని జీవులు ఆచరిస్తున్న సహజమయిన వైద్య విధానము.

అసలు అస్వస్థతే అస్వాభావికం. ప్రకృతి నియమాలను అనుసరించి జీవిస్తే, అసలు ఏ అస్వస్థతా కలుగదు. అదవా ఎప్పుడయినా అస్వస్థత కలిగితే ఏ ప్రకృతి నియమాలయితే ఉల్లంఘించుట వలన అస్వస్థత కలిగిందో ఆ విషయాన్ని అర్థం చేసుకొని ఆ తప్పుల్ని సరిచేసుకుంటే ఆరోగ్యం సహజంగానే చేకూరుతుంది.

శరీరం, సజీవమైన, సర్వశక్తివంతమయిన స్వాలంబన సిద్ధాంతాలపై ఆధారపడ్డ ఒక యంత్రం. అవకాశమిస్తే తన రోగాన్ని తనే బాగుచేసుకొని ఆత్మరక్షణ చేసుకోగలదు.

ఈ సత్యాన్ని గుర్తించని కారణం చేతనే మానవుడు చీటికి మాటికి అనారోగ్యవంతుడు అవడం, ప్రతి చిన్న రోగాన్ని నయం చేసుకోవడానికి డాక్టర్ల వెనుక తిరగడం మనం ప్రతి నిత్యం చూస్తున్న సత్యమే. పశు పక్ష్యాదులను, గమనిస్తే ఎప్పుడు అస్వస్థత కలిగినా ఆ అస్వస్థత లక్షణాలు తగ్గేవరకు మంచినీళ్లు కూడా త్రాగకుండా ముడుచుకుని పడుకుంటాయి. రెండు, మూడు రోజులలో ఎటువంటి రోగమయినా తగ్గిపోతుంది. ఆ తరువాత మామూలు ఆహారాలు తీసుకుంటూ స్వాభావిక జీవితాన్ని అవి గడుపుతాయి.

అస్వస్థత కల్గినప్పుడల్లా మనం కూడా మన శరీరానికి ఇటువంటి అవకాశాన్ని కల్గిస్తే, నూటికి తొంభై రోగాల్ని ఎటువంటి వైద్య సహాయం లేకుండానే శరీరం తనంతటతాను బాగు చేసుకోగల్గుతుంది.

శ్లో. "అజీర్ణం వినాసరోగం
అజీర్ణే భోజనం విషమ్
లంఖణం పరమౌషదమ్"
అని ఋషి ప్రోక్తమయిన సూత్రము.

'లంఖణం' అంటే 'ఉపవాసము' లంఖన చికిత్స అంటే – 'ఉపవాస చికిత్స'

ఈ సిద్ధాంతాల ఆధారంగానే గత మూడు వందల సంవత్సరాలలో ప్రకృతి వైద్యం ఒక చికిత్సా విధానంగా రూపుదిద్దుకుంది.

పంచభూతాలతో చికిత్సతో పాటు ప్రకృతి సిద్ధాంతాలను అనుసరించి ఆహార – విహార నియమాలు, దినచర్య, ప్రార్థన మొదలైన పద్ధతులను ప్రకృతి వైద్యభాగాలుగా గుర్తించి, వీటి సహాయంతో శారీరక, మానసిక ఆరోగ్యాన్ని పొందడమే గాక, ఆత్మ జ్ఞానాన్ని పొంది, ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవడమే ప్రధానలక్ష్యంగా "ప్రకృతి వైద్యం" గుర్తించింది.

అందుచేతనే పూజ్య బాపూజీ ప్రకృతి చికిత్సాలయాలను ఆశ్రమ పద్ధతులలోనే నడపమని ఆదేశించారు.

"ప్రకృతి వైద్యం, గ్రామసేవ, ఆశ్రమ జీవితం" – ఈ మూడు అవినాభావసంబంధం కలిగి ఉన్నాయి.

## చికిత్సా ప్రక్రియలు

**కటిస్నానము (Hip - Bath):** ప్రకృతి చికిత్సలో అనుసరింపబడు మిక్కిలి ఉపయోగకరములగు స్నానములలో ఇది యొకటి. ఒక తొట్టిలో నీరుపోసి, రోగిని ఆ తొట్టిలో (దిగంబరుడుగా) కూర్చుండ బెట్టుదురు. కాళ్ళు పూర్తిగా తొట్టి బయట ఉండును. తొట్టిలోని నీరు అతని బొడ్డు వరకు ఉండును. తరువాత అతడు ఒక మెత్తని వస్త్రముతో, పొత్తికడుపు యొక్క క్రింది భాగమును, అడ్డముగా, నిలువుగా, ప్రక్కలకు ఆగకుండా 20నిమిషముల కాలము రుద్దవలెను. ఈ స్నానము వలన కటిప్రదేశము, బౌల్స్ (bowels), మూత్రకోశము, గర్భాశయములయందు ఉత్తేజనము కలిగి, రక్త ప్రసరణము చురుకుగా సాగును. మలబద్ధకము, మొలలు (Piles) వ్యాధుల విషయంలో ఇది చాలా ప్రయోజనకారి.

**మట్టిపట్టి (Mud - Pack):** ఒండ్రు మట్టి, మానవశరీరముపై బలవర్ధ కౌషధములా పనిచేస్తుంది. నదీతీరమందలి పరిశుభ్రమైన మట్టిని గాని, చెఱువులలోని పరిశుభ్రమైన ఒండ్రుమట్టిని కాని తీసుకుని, ఒక గుడ్డయందుంచి, దానిని పొత్తికడుపుపై కటిప్రదేశమునకు కొంచెము క్రిందగా వేసి, 15 నిముషముల కాలము ఉంచవలెను. అట్లు చేయుట వలన, శరీర వివిధ భాగములనుండి అంత్ర ప్రదేశమునకు వచ్చు రక్తప్రసరణ వేగము హెచ్చును. రక్తములోగల మలినములు ప్రేవులలో మిగిలిపోవును. అంతేకాకుండా, అందువలన ప్రేగులయొక్క క్రిమిచలనశక్తి సక్రమముగా జరిగి, మల విసర్జనము బాగుగా జరిగి, ప్రేవులు పరిశుభ్రపడును. దీనివలన శరీరములోని వేడి తగ్గి, జీర్ణక్రియ చక్కగా జరుగును.

**మర్దనము (Massage):** ప్రకృతి చికిత్సలో, మర్దనము (Massage) మఱియొక ప్రధాన ప్రక్రియ. మర్దనమునకు పరిశుద్ధమైన నువ్వుల నూనెను ఉపయోగింతురు. ఉత్పాదనము, పీడనము, ప్రహారణము, ఘర్షణము, మర్దనము, స్పందనము అను ఈ మర్దన ప్రక్రియల వలన కండరముల యందలి రక్తనాళములు, టిస్యూలు, వీపు, ఊపిరితిత్తులు, గర్భకోశమందలి రక్తనాళములు మంచి ప్రభావమును కలిగియుండును. కీళ్ళ మర్దన విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపవలెను. మర్దనము వలన శరీరాంతర్భాగమునగల రక్తనాళములు కూడా ఉత్తేజితమగును. కీళ్ళయందు కూడియున్న అన్యపదార్థము కూడ బహిష్కరించబడును. మర్దనము వలన నాడీ మండలము బలపడును. ఊపిరి తిత్తులు కూడా సమర్థవంతంగా పనిచేయును.

**ఆహారము (Diet):** సరియైన ఆహారము భుజించినచో, మనమందరము స్థిర ద్రూపులమై, యువకులవలె శక్తి సంపన్నులమై యుందుము. ఈ మానవ శరీరశోధనా చికిత్స

పొందు సమయమున, సక్రమాహారమును గురించి యెంతయో నేర్చుకొనగలుగుదము. రెండు రోజులు నిమ్మరసము కలిపిన నీరు మాత్రము ఒసంగుదురు. ఒక దినము పండ్ల రసము ఒక రోజు పచ్చికూరలు, పాలు, ఆయా ఋతువులలో లభించు పండ్లు, చివరి నాలుగురోజులు మామూలు భోజనములో ఉడికించిన కూరలు, పుల్కాలు (నూనె గాని, నెయ్యి గాని వేయకుండా కాల్చిన గోధుమ రొట్టెలు), అన్నము, మజ్జిగ ఉండును.

**శరీర వ్యాయామము (Exercise):** నిత్య శరీర వ్యాయామము, చాలా అవసరము. మన శరీరము ఒక యంత్రము వంటిది. యంత్రము ఉపయోగింపబడనిచో త్రుప్పు పట్టును. త్రుప్పు పట్టిన యంత్రము నిరుపయోగమైనది అగుననియు, తేలికగా పాడైపోవుననియు అందరకు తెలిసిన విషయమే. ప్రతి దినము వ్యాయామము చేయనిచో మన శరీరం బిరుసెక్కి వ్యాధిగ్రస్తమగు అవకాశ మేర్పడును. ఈ శోధనా సమయంలో ప్రతి ఒక్కరు యోగాసనములు, సూర్య నమస్కారములు, శ్వాస క్రియకు సంబంధించిన వ్యాయామము, నడక మొదలగువానిని అభ్యసింతురు. ఇవన్నియును శరీర వ్యాయామములోని అంశములే.

**ప్రార్థన (Prayer):** ప్రార్థన మానసిక భోజనము. ఇది మనస్సును స్థిరంగాను, ప్రశాంతంగాను, బలంగాను ఉంచుకొనుటకు ఎంతయో సహాయపడును. ప్రార్థన వలన మానవునిలో ఆధ్యాత్మిక చింతన నెలకొని, స్థాయి వృద్ధి పొందును.

ఆతపస్నానము, వేడినీటి స్నానము, మట్టి పట్టీలు మొదలగునవి; వీటితోపాటు శరీరమునకు ఎక్కువ అలసట కలిగించకుండుట; తగినంత విశ్రాంతి తీసుకొనుట, సంపూర్ణ ఆరోగ్యమున కెంతయో అవసరము.

**ఉపవాసము (Fasting):** ఈ శోధన సమయమున ప్రతి ఒక్కరు రెండురోజులు ఉపవాసము చేయవలెను. ఉపవాసకాలమున నిమ్మరసము, తేనె కలిపిన నీళ్ళు మాత్రము ఒసంగబడును. ప్రతివారును కావలసినంత మంచి నీటిని త్రాగుట మంచిది. మానవ శరీరముపై ఉపవాస ప్రభావము ఎక్కువగా నుండును. ఉపవాసము వలన శరీరము తనలో పేరుకొనియున్న అన్య పదార్థములను, విషములను బహిష్కరించుటకై తన శక్తినంతను కేంద్రీకరించు అవకాశము లభించును. "ఉపవాసము వలన, బలహీనత ఏర్పడును" అనే దురభిప్రాయము కొందరికి కలదు. ఈ భావము పూర్తిగా నిరాధారమైనది. అన్ని మతములు కూడ, కొన్ని ప్రత్యేక దినములలో ఉపవాసమును నిర్దేశించుచున్నవి. ఉపవాసము వలన మానసిక విశ్రాంతి లభించును.

**ఎనిమా (Enema):** ఎనిమాను అంత్ర స్నానము అనవచ్చును. దీర్ఘకాలిక అంత్ర నిష్క్రియత్వమును, జీర్ణక్రియకు సంబంధించిన లోపములను, మలబద్ధకములను తొలగించుటకు ఈ ఎనిమా తగిన చికిత్స. పురీషనాళ మందును, మలకోశమునందును పేరుకొనియున్న వ్యర్థ పదార్థములను తొలగించుటకు ఈ ప్రక్రియ మిక్కిలి ఉపయోగకరమైనది. ఉపవాస సమయమునందు తప్పక ఎనిమా తీసుకొనవలెను. పురీషనాళ స్వస్థతకు ఇది అత్యంత ఉపయుక్తమైనది.

**ఆవిరి స్నానము (Steam Bath):** అన్య పదార్థ బహిష్కరణకు ఉపకరించు ప్రక్రియలలో ఆవిరి స్నానము మిక్కిలి శక్తివంతమైనది, వ్యక్తి వస్త్రములను తీసివేసి కాబిన్‌లో కూర్చొనును. అతని శిరస్సు మాత్రం కాబిన్ (Cabin) పైభాగమున వుండును. మిగిలిన శరీరమునకు ఆవిరి బాగుగా పట్టును. ఈ ఆవిరి శరీరమందున్న అన్య పదార్థమును విషముగా చెమట రూపమున, చర్మ రంధ్రముల ద్వారా బహిష్కరింపజేయును. ఆర్ద్రమైన ఈ ఆవిరి, చర్మము యొక్క పై పొరపై తగులుట వలన అందలి క్రొవ్వు పదార్థము స్వేదగ్రంధుల నుండి తొలగించబడును. ఆవిరి స్నానము తీసుకొనిన తరువాత ఎంతో తేలికగా, హాయిగా ఉండును.

ఈ మానవ శరీర శోధన సమయమునందు స్పైనల్ బాత్ (Spinal - Bath), కటి స్నానము (Hip - Bath), మొదలగు జల చికిత్సలు కూడా చేయబడును.

**కసేరుకా స్నానము (Spinal - Bath):** వెన్నెముక శరీర ముఖ్యాంగాలలో నొకటి. ఈ స్నానం యొక్క ప్రధానాశయము, కేంద్ర నాడీమండలమును పూర్తిగ శక్తివంతమగునట్లు చేయుట.

ఒక తొట్టిలో మీ వీపుభాగము, మీ వెన్నెముక పూర్తిగా నీటిలో మునిగియుండునట్లుగా మిమ్ములను పరుండ చేయుదురు. అట్లు చేయుటవలన నాడీమండలమునందు రక్త ప్రసరణము చురుకుగా సాగును. ఈ స్నానము వలన మొట్టమొదటగా వెన్నుపాములోని రక్తనాళమునందలి రక్తము బలముగా ప్రవహించును. క్రమేపి చర్మమునందలి నాళములుకూడా శక్తివంతములగును. ఈ విధముగ నాడీమండలము నందలి మలినములు తొలగించబడుటవలన నాడీ మండలము దోషరహితమగును.

# ఉన్నతస్థాయి మొక్కల జన్యుపరివర్తనలో కొత్త పోకడలు

జి.యమ్. రెడ్డి
సెంటర్ ఫర్ ప్లాంట్ మాలిక్యులర్ బయాలజీ,
డిపార్టుమెంట్ ఆఫ్ జెనటిక్స్, ఉస్మానియా యూనివర్సిటీ.

మానవాళి పూర్తిగా వృక్షజాతిపై ఆధారపడింది. ప్రపంచానికి 95 శాతం ఆహారాన్ని వృక్షజాతి అందిస్తున్నది. 12000 సంవత్సరాల క్రితమే, స్త్రీలు వృక్షాలను అరణ్యము నుండి సేకరించి వాటిని సాగులోకి తెచ్చి వ్యవసాయానికి నాంది పలికారు. ఉత్పాదకతలో గణనీయమైన సత్వరమైన అభివృద్ధి అన్నది 1900లో మెండిల్ యొక్క అనువంశిక సూత్రాల ప్రతిపాదన తర్వాతనే సాధ్యపడింది.

35000 పైచిలుకు వృక్ష జాతులు గుర్తింపబడినప్పటికీ కేవలము 3000 లను మాత్రము ఆహారయోగ్యంగా గుర్తించడం, వాటిలో 300 కన్నా తక్కువగానే వ్యవసాయపంటలలో ఉపయోగించటం జరిగింది. సుమారు 100 పంటలు ఆహారానికై, సాగులకు అభివృద్ధిపరిచినా వాటిలో 25 పంటలు మాత్రము ఆర్థిక లాభాలిచ్చే వాణిజ్య పంటలుగా గుర్తింపబడ్డాయి. పప్పుదినుసులు ప్రధానంగా బియ్యం అతి ముఖ్యమైన ఆహారపదార్థము. దీనివల్ల 60 శాతము కేలరీలు 50 శాతము ప్రోటీన్లు మానవాళి పొందుతున్నది. 12000 సంవత్సరాల క్రితం రైతులు పప్పుదినుసులు మరియు బీన్సు బటాణీలను పండించుతూ ఉండేవారు. జనాభా విస్ఫోటనము కారణంగా వృక్షజాతులు సంకరీకరణము, పరివర్తనము, విస్తృత సంపర్కాలు, సరికొత్త బలిష్ట సంపర్కాలు వంటి మెలకువలు రూపొందింపబడి ఆచరణలోకి వచ్చాయి. ఆహారం పైనా, వ్యవసాయం పైనా, ఈ జీవ సాంకేతిక శాస్త్రము నవీన పద్ధతులతో సహా ప్రభావం కల్గివుంది. 900 మిలియన్లకు పైచిలుకు జనాభాతో ఇండియా 2000 ల సంవత్సరాల నాటికి సంపూర్ణ ఆరోగ్యం జాతీయ లక్ష్యంగా, దాదాపు రూ. 5000 కోట్ల మేరకు జీవ సాంకేతిక సంబంధమైన ఉత్పత్తుల సేవలను సంతరించుకోబోతున్నది.

పంటలు పశువులు అభివృద్ధి చెందడానికి ముఖ్యకారణము ప్రధానంగా జన్యు సంబంధమైన విస్తృతాలు లభ్యం కావడమే. భారతదేశంలో ముఖ్యంగా హరిత విప్లవంలో సాంప్రదాయ విధానాలు రాజైనప్పటికి ఆర్థిక ప్రాధాన్యత కల్గిన పంటలు అత్యంత ప్రముఖమైన పాత్రను పోషించాయి. సరిక్రొత్త విధానాలు ఉదాహరణకు మొక్కల జీవ సాంకేతిక శాస్త్రము మరియు జీవ పదార్థ వర్ధనము మరియు డి.ఎన్.ఏ. సాంకేతిక పునస్సంయోజనాలు అనేవి సంపూర్ణకాలుగా ఉండి సాంప్రదాయ పద్ధతులకు పరిధిని ఏర్పరిచి జన్యు మార్పిడి, జన్యు సంధాన చాతుర్యం యొక్క సామర్థ్యాన్ని పెంపొందింపజేశాయి. ఈ విధానాలు, మెలకువలు పెరుగుతున్న మిలియన్ల జనాభాకు, తగ్గిపోతున్న భూవనరులకు, పెరుగుతున్న పర్యావరణ వత్తిడికి, కాలానికి, స్థలానికి, ఇతర వనరులకు చెందిన పరిమితులకు అనుగుణంగా వడిని, వేగాన్ని కల్గి ఉన్నాయి.

అభివృద్ధి చెందిన మొక్కలలో జన్యు సంధాన చాతుర్యం అనేది నేటి భావితరాల విషయ ప్రధాన మరియు అనువర్తిత శాస్త్రాలకు అత్యంత సవాలుగా పరిణమించింది. అనువర్తితాలు పరిశ్రమల్లో, వ్యవసాయంలో, తోటల పెంపకంలోనూ, ఆటవిక సంబంధమైన, ఆహార సంబంధమైన, పోషణ నిల్వలు, రసాయనాలు, ఔషధాలు, శక్తిలోహ సంగ్రహణ మొదలయిన రంగాలలో అనేకంగా ఉన్నాయి. అంతేకాక విజ్ఞానాభివృద్ధి పరంగా జీవకణ సాంకేతిక శాస్త్రము, జన్యుశాస్త్రము రోగ నిరోధక శాస్త్రము కణజాలపు పెంపకం మొదలయిన రంగాలలో శక్తివంతంగా దూసుకుపోతూ పెరుగుదల సాధించాయి.

మొక్కల వ్యవస్థలో జరిగిన జీవక్రిమి సంహారాలు, రోగ నిరోధక మొక్కలు, విజాతీయ జన్యు పోకడలలో జరిగిన అభివృద్ధి సరికొత్త సమర్థవంతమైన పంట విధానాలకు క్రొత్త పోకడలు చూపింది. మొక్కల జీవ సాంకేతిక శాస్త్రములో పెల్లుబికిన రంగాలను స్థూలంగా క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

1. వృక్ష మరియు జంతుకణాల వర్ధనాలను ఉధృతపరచడం మరియు వ్యాపార సరళిలో ఉపయోగపడే సమ్మేళనాలను ఉత్పత్తి చేయడం.
2. జీవచర్యలు వాడుతున్న పారిశ్రామిక సాంకేతిక శాస్త్రము.
3. ఆర్థిక ప్రాధాన్యత ఉన్న పంటలను, పండ్ల మొక్కలు, కణజాలాల వర్ధనం విధానం ద్వారా శీఘ్రగతిలో సహజంగా విస్తృతపరచడం – ఇవి కొబ్బరి, తాటి, జీడిమామిడి, మసాలా మొక్కలు మొదలయినవి.
4. జీవద్రవ్య నిల్వ – జీవద్రవ్యాన్ని పోషించడం మరియు నిల్వ చేయడం.
5. అంతర్గత జన్యు పరివర్తనాల కొరకు శీఘ్రగతిలో ఉన్నతశ్రేణి సమయుగ్మజ మరియు ఏకస్థితిక జీవితాల్లో పురుష బీజకణ వర్ధనాన్ని అభివృద్ధిచేయడం.
6. వ్యవసాయ రంగంలో జీవ సాంకేతిక శాస్త్రము, జన్యు మార్పిడి మరియు జన్యు నిర్మాణశాస్త్రము.
7. ఏకస్థితిక మెళుకువల ద్వారా పంట ఉత్పత్తిలో అభివృద్ధి సాధించడం.
8. వృక్ష కణాలు ఉపయోగించి జీవరూపాంతరణ.
9. జీవ మార్పిడి మరియు పులియబెట్టు ప్రక్రియలు.
10. దేహ సంబంధ వైవిధ్యాలలో ఎంపిక ప్రేరణ.
11. సాంప్రదాయేతర సంకరణాలలో మరియు కొత్త జాతుల సంశ్లేషణాలలో విస్తృత దూర సంకరణము మరియు జీవపదార్థ విలీనము చేయడము.
12. అతి చిన్న కణాల స్థాయిలో కూడా పరివర్తకాల ఉత్పత్తి: అనావృష్టి, ఉప్పుమేట, వాతావరణ వత్తిడులు మొదలయిన పరిస్థితుల్లో పరివర్తక కణాలను వేరుచేసి అత్యంత ఆధునికమైన వర్ధనాల మెళకువలను అత్యధిక ఉత్పాదకత కోసం, నాణ్యత కోసం, అవసరమైన అమీనో ఆమ్లాలను హెచ్చుగా పెంపొందింపచేసి ఇతర అమీనో ఆమ్లాలను కల్గినవాటికి సవాలుగా రూపొందించడం.
13. ఆధునిక మెలకువలద్వారా జన్యుచర్య, జన్యు నియంత్రణకు చెందిన అధ్యయనాలు.
14. జన్యు మార్పిడిని రూపాంతరీకరణద్వారా మైక్రో ఇంజెక్షన్, ఎలక్ట్రోపోరేషన్ మొదలగు వాటి ద్వారా చేయడం.

ఉదాహరణలు :

సూర్యకాంతి× ఫ్రెంచ్ గ్రీన్ బీన్ = సన్‌బీన్.

రెండవదావి ఒక జన్యువు మొదటిదానిలో ప్రవేశ పెట్టడం.

అలుగడ్డ×టమోటా = ప్రోటోప్లాస్ట్ విలీనం ద్వారా; పొగాకు×టొమాటో=టొబాక్ట్ లేదా టోమరికో, మినపప్పు×పెసరపప్పు = బ్లిన్ గ్రామ్ లేదా గ్రాక్ గ్రామ్.

15. క్రోమోజోమ్ అస్థిర జన్యు పరివర్తనలో తరలించగల మూలకాలు, జన్యు మార్పిడి మరియు జన్యు అనుసంధానము.

ఉదాహరణకు: ఎసి–డిఎస్, స్పెమ్, ఇన్ మొదలయినవి. ఇందులో 30 శాతం నుండి 50 శాతం మొక్కజొన్న యొక్క ఎమ్‌యు పరివర్తనాలు కూడా వున్నాయి.

సాధారణంగా పప్పు దినుసుల పునరావృత పునరుత్పత్తి శక్తి తర్వాత మాత్రమే కాక, దీర్ఘకాలపు వర్ధనాలలో వాటిని పొగొట్టుకున్నాయి. వర్ధనాలు మరియు పర్యావరణ స్థితికి అదనంగా జన్యురకము, ఆక్టోజెనిటిక్ దశలు, ఇండికా వరిల అభివృద్ధికి సంబంధించిన వినూత్న మెలకువలను జయప్రదంగా వెలికితీయడంలో ప్రముఖపాత్ర వహిస్తాయి.

వృక్షాల జన్యు అభివృద్ధిలో పునస్సంయోజకత డి.ఎన్.ఏ సాంకేతికాలతో జతకూడిన కణ మరియు కణ ద్రవ్య వర్ధన మెలకువలలో పురోభివృద్ధి సరికొత్త పంథాను, ఒరవడిని సృష్టించింది.

సంకరణము, హెటిరోసిస్, ప్లాయిడీ మరియు పరివర్తన, ప్రజననము, జన్యుమార్పిడి, విస్తృత సంకరణాలు వంటి సాంప్రదాయ పద్ధతులు హరిత విప్లవంలో గణనీయమైన పాత్రను పోషించాయి.

కణ మరియు కణజాలాల వర్ధన విధానాలు అభిలషణీయ జన్యువివర్తనాలు ఎంపిక చేయడంలో మరియు ప్రేరణలో అత్యంత శక్తివంతంగా తమ పాత్ర వహించాయి. ఇది సోమోక్లోన్, ప్రోటోక్లోన్ మరియు ఆండ్రోక్లోన్ మొదలగు వాటికన్నా అదనము.

ఈ పద్ధతి కాకుండా శారీరక సంబంధంగా గుడ్డు ఉత్పత్తి అనేది చాలా పంటలలో ప్రమాణీకృతమైనది. ఉదాహరణకు వరి, వేరుశనగ, మొక్కజొన్న, ట్రిటికల్ మరియు అరటి పంటలు.

ఈ గుడ్డులు విడిపడి ఎదగడం జరిగి సోడియం ఆల్జినేట్‌లో కూడి మొలకెత్తుతాయి. ఏ ప్రాప్తి స్థానము నుండి అయినా అభిలషణీయమైన జన్యువును గుర్తించడం దానిని లక్ష్యంగా సాధించవలసిన మొక్కగా పునఃకార్యక్రమం చేయడం అన్నది జన్యు పరివర్తనాలలో నిమగ్నులయిన వృక్షకణ జీవశాస్త్రజ్ఞుల ప్రథమ కర్తవ్యము.

## ఉప్పునీటి సహనశీలతకు ఎంపిక మరియు మినహాయింపులు:

ఉప్పునీటి నేలలు అనేవి అభివృద్ధి చెందుతున్న దేశాలలో ముఖ్యంగా తీరప్రాంతాలలో వరి ఉత్పత్తిలో ఉన్న అతి ముఖ్య అడ్డంకి. ప్రపంచంలో ఉప్పుచే ప్రభావితం అయినట్లుగా

అంచనా వేయబడిన 952 × $10^6$ హెక్టార్లలో 7 × $10^6$ హెక్టార్లు ఇండియాలో ఉన్నట్లు అంచనా వేయడం అయినది.

వరి ప్రాథమికంగా లవణతత్వాన్ని మితంగా సహించగల్గే పంట. మరియు మితంగా సహించే సున్నితత్వ వంగడాలను కల్గినది కూడా.

మూడు అంచెల పద్ధతిని ఉస్మానియా సెంటర్ లో ఉప్పు సహించే వంగడాలలో అభివృద్ధి పరిచారు. కోర్ గుట్, పొక్కాలి, షిటో, అజ్ గో వంటి లవణాన్ని సహించే వంగడాలు, అధిక దిగుబడి ఇస్తున్న సున్నిత రకాలయిన తెల్లహంస, 1ఆర్ 28, 1ఆర్ 36 వంటి వాటిని అధిగమించాయి. ఎఫ్1 మరియు ఎఫ్2 లు టి.హెచ్ ×పొక్కాలి, మరియు టిహెచ్ ×కోర్ గుట్ లు వాటి మాతృ మొక్కల కన్నా లేదా సంకరాల కన్నా అధిక లవణ శీలతను చూపాయి.

ఎఫ్ 3 రకము పునస్సంయోజన రకము ఉత్పత్తి కొరకు మినహాయింపు చేసి హైడ్రోఫోనిక్ ఎంపిక అనేది నిర్వహించడం జరిగింది. ఈ వర్ధనాలతో పాటుగా పి. కోయర్క్టాటా అనేది అత్యంత లవణశీలత గల రకము (2ఎన్=48) దీనిని 0–సటివా (2ఎన్=24) తో సంకరణము చేసి లభించిన సంకరము యొక్క గుడ్లు రక్షించబడింది.

ఈ ఎఫ్ యొక్క సంకరాన్ని క్రోమోజోమ్ యొక్క, జీవరసాయనాల మరియు కణాత్మకపరంగా స్థిరీకరించడమైనది.

కణ మరియు కణజాలాల వర్ధన మెళకువలు కూడా లవణాన్ని సహించే రకాలను అభివృద్ధి చేయడంలో సహాయపడ్డాయి.

బసమతి 370, గోపాల్ భోగ్, పాకిస్తానీ బసమతి, మరియు చిట్టి ముత్యాలు యొక్క పరిణతి చెందిన గుడ్డు కల్లీ (Calli) వత్తిడి నుంచి కొత్తగా రూపొందిన మొక్కలను 1 శాతం ఎన్.ఎ.సి.ఎల్. (Nacl) మరియు 50 శాతం సముద్ర నీటికి గురిచేసినవి. ఈ విధంగా సరికొత్తగా రూపొందించబడినవి. పరిమితులలో ఉండటమే కాకుండా బాగా ఎదిగి వాటి విత్తనము కూడా సంగ్రహించడం అయినది.

మాతృక లవణాన్ని సహించే టిసిఎల్–2 పునరుత్పాదక మొక్కలు టిసిఎల్–1 (కంట్రోలు) కన్నా అధిక వత్తిడికి గురిచేయబడి వ్యవసాయాత్మక సోమోక్లోన్ లలో అతి జాగ్రత్తగా లవణాన్ని సహించే వరి రకాలను అభివృద్ధి చేయడానికి ఎంపిక చేయబడ్డాయి.

మాతృక లవణాన్ని సహించే పునరుత్పత్తి అయిన టిసిఎల్–2 మొక్కలను టిసిఎల్–1 (కంట్రోలు) మొక్కల కన్నా అధికంగా వత్తిడికి గురి చేయబడ్డాయి.

## బ్లాస్ట్ రోగ నిరోధకత కోసం ఎంపిక:

తొలగింపబడ్డ గ్రుడ్డు, సి వి హెచ్ ఆర్ 12 యొక్క కల్లీ మూలము, తెల్లహంస, జెనిత్, జయ మొదలైనవి పైరికులారియా ఒలిచే సిద్ధబీజ అలంబనము (105 ఎమ్ ఎల్ 2–పిక్లోనిక్ ఆమ్లము 125–200 పి.పి.ఎమ్) లో చర్యకు గురికాబడ్డాయి. మొత్తము 104 మొక్కలు విజయవంతంగా విషాన్ని సహించే కల్లీ మరియు 10 శాతము కల్లీ నిరోధక సిద్ధబీజ అలంబన మొక్కలనుండి ఎంపిక అయ్యాయి. నాట్లు రోగాల నుండి ఎదిగేంత వరకు టీకాలతో పరీక్షింపబడ్డాయి. ఇవి 60 నుండి 78 వరకు హెచ్చు నిరోధాత్మకతను ప్రదర్శించగల్గాయి.

## కిలాజల్కాము వర్ధనము (Anther culture):

ఇండికా వరిలోని ఏకస్థితిక ప్రజననము కార్యక్రమంలో సమర్థవంతమైన పచ్చని మొక్క పునరుత్పత్తి అన్నది ప్రధానమైన అడ్డంకిగా ఉండి, ఇండికా వరి వంగడాల కిలాజల్కాములు సి.ఆర్–666–36–4, ఎస్.ఆర్–26–బి, బసమతి ఎస్.డి – 10, మరియు పి+బి 33లు ఛాలెఫ్ యొక్క ఆర్2, ఎన్6 మరియు ఎమ్ఎస్ మధ్యమముతో కల్లుస్ ప్రేరణ వల్ల ఏర్పడ్డాయి. అన్ని జన్య రకాలలో తర్వాత (10పి) పూర్వ ప్రక్రియలను నియంత్రణతో పోల్చిచూడగా దాదాపు 2 నుండి 4 రెట్లు పెరుగుదల గమనించడమైనది. కల్లుస్ ప్రేరణ యొక్క పౌనఃపున్యాన్ని పిటిబి – 33 (40 నుండి 42 శాతం) మరియు బసమతి ఎస్డి–10 (27–30 శాతం) లతో 2.0 $MgL1$ ఎన్ ఏఏ 0.05 $Mg1$, కె ఎన్, రాపి ఎస్ ఆర్–26–బి మరియు సిఆర్–666–36–4లు ఆర్2 మరియు ఎన్6లు కల ఎన్6 మాధ్యమములో గమనింపబడినది. ఎమ్ఎస్ మాధ్యమము మొక్క పునరుత్పత్తికి చాలా ఆధిపత్యాన్ని కల్గినది. మూలము కాండము రెండింటి తేడాను ఎన్ ఏఏ మరియు కె ఎన్ (20. 0ఎమ్జి/1) కలయికతో పరిశీలింపబడింది. మొక్క పునరుత్పత్తి పిటిబి 33లో పౌనఃపున్యము సిఆర్–666–36–4, ఎస్ఆర్–26–బి నుండి 42 శాతంకు విస్తృతి చెందినట్టు గమనింపబడింది. ఎమ్ఎస్ మాధ్యమంలో గ్రీన్ మరియు అల్బినోల అనుపాతము 16:19 కాగా ఆర్2, ఎన్6 మాధ్యమంలో 2:3, పిటిబి–33 జన్యురకము ఎన్ఏఏ; ఐఏఏ (1.0 ఎమ్జి/1 ), బిఏపిసి (2.0 ఎమ్జి/1) తో గల ఎమ్ఎస్ మరియు కెఎన్ (0.6 ఎమ్జిహెచ్)లో 7 శాతము పచ్చని అల్బినో మొక్కలను ఇచ్చింది.

సూక్రోస్ (6 శాతము) పచ్చని మొక్క యొక్క పునరుత్పత్తిని 45 శాతమునకు అల్బినోలను 30 శాతమునకు పెంచింది.

ఈ అధ్యయనం వల్ల స్పష్టంగా అవగాహన ఏర్పడేది ఏమంటే – అనుకూలమైన జన్యురకాలలో వర్ధనము జరిగే పరిస్థితులను చక్కగా మార్చుకున్నట్లయితే సమర్థవంతమైన పచ్చని మొక్క పునరుత్పత్తిని పొందడంలో అది ప్రముఖ పాత్ర వహిస్తుంది.

ఒకానొక ఆండ్రోడోన్ రకము అయిన తెల్లహంస, ట్రిప్లాయిడ్, పోలెన్ వంధత్వముతో (99.1) గుణకము అయి తద్వారా సంపర్కేతర పునరుత్పత్తి మూడు తరాలకు జరిగింది. దున్నేవారికి ఈ మొక్క బహుళ పానికిల్స్‌ను అన్ని మూడు తరాలలోను చూపుతుంది. మూడవ తరంలో అయిదు క్లోన్‌లు లోపించచేయగా, తొమ్మిది క్లోన్‌లు విత్తనం ఫలవంతం కావడం, తొమ్మిది ధాన్యము తరహా విభిన్నాలు మార్ఫాలజీ ప్రయోగాలతోపాటుగా చూపినాయి.

పదకొండు సిపి ఆండ్రోక్లోన్‌లు హాబ్‌గంజ్‌బోరయ్–1, ఒక క్లోన్ మాత్రంగా ఇంకా వికస్థితికాలుగా పరిపూర్ణత వరకు ఉండి వంధత్వానికి గురి అయింది. ఈ మొక్క ఎత్తు తగ్గించుకోవడమే కాక పానికల్ పొడవు, గ్లూమ్ పరిమాణములో కూడా నియంత్రణ పోల్చిచూడగా విస్తృతిని చూపింది.

డి.ఎన్.ఏ యాంత్రిక శాస్త్రాన్ని రెండు వివిధ ధోరణులు ఉపయోగిస్తున్నాయి. ప్రాథమిక కణజీవ శాస్త్రజ్ఞులు డి.ఎన్.ఏ శ్రేణుల మార్పును ప్రధానంగా దాని ప్రమేయాన్ని గూర్చి పట్టించుకుంటున్నారు. అనువర్తిత కణ జీవ శాస్త్రజ్ఞులు జీవ సాంకేతిక శాస్త్రజ్ఞులు ప్రధానంగా జన్య సంధ్యాచాతుర్యంపై శ్రద్ధ వహిస్తున్నారు.

జన్య సంధాన చాతుర్యము అనేది వ్యాపార, వైద్య, ఔషధీయ పదార్థాలు, మందులు టీకాలతో సహా, ఉత్పత్తి చేయడానికి ఉదాహరణకు పరిమిత ఎంజైములు, లైగెనెస్, పాలీమర్‌లు, కొత్త మెళకువల ద్వారా జతపర్చిన కేంద్రకాలు, విద్యుత్ పోరోసిస్, పాలిమర్ఫ్ గొలుసు చర్య (పిసిఆర్) ప్రామిక మరియు అనువర్తిత కణ జీవశాస్త్ర సమస్యలు అర్థం చేసుకోడానికి సహాయపడుతుంది. ప్రస్తుతము పంట మొక్కల రూపాంతరణకు విభిన్న పద్ధతులు లభిస్తున్నాయి.

పట్టిక: 1

| పద్ధతి | అధికతర మొక్కలలోనికి డిఎన్ పంపు పద్ధతులు |
|---|---|
| 1. అగ్రోబాక్టీరియా ట్యూమ్ ఫాసియన్స్ అగ్రోబాక్టీరియం రిజోజెన్ | ప్రోటోప్లాస్టులు (కణాలు) లైఫ్ డిస్కులు (ఏక్స్‌ప్లాస్టు) |
| 2. ఇండ్యూస్‌డ్ డిఎన్ఏ అప్‌టేక్ | |
| (ఎ) పాలికాటయాన్‌లు | |
| (బి) హీట్‌షాక్ | |
| (సి) సిఏహెచ్ పిహెచ్ | ప్రోటోప్లాస్టులు |
| (డి) పిఇజి. | |
| 3. ఎలక్ట్రోపొరేషన్ | ప్రోటోప్లాస్టులు |
| 4. మైక్రోఇంజక్షన్ | ప్రోటోప్లాస్టులు (కణాలు) |
| 5. లైపోసోమ్ మాధ్యమ అప్‌టేక్ | కిలాజల్కము ప్రోటో ప్లాస్టులు (ఎంబ్రియాడ్‌లు) |
| 6. పార్టికల్ గన్ మెథడ్ | ప్రోటోప్లాస్టులు (కణాలు) (ఆర్గాన్స్) కల్చర్. |
| 7. పోలెన్ మాధ్యమిక అప్‌టేక్ | పోలెన్ |
| 8. ప్రత్యక్ష డిఎన్ఏ ఇంక్యుబేషన్ | విత్తనాలు (ఎంబ్రియోలు) |
| 9. మాక్రోఇంజక్షన్ | పరిపూర్ణత చెందని దున్నువారు (ఇన్ ఫోరోసెన్స్) |
| 10. పోలెనట్యూబ్ పాత్‌వే ద్వారా డిఎన్ఎ అప్‌టేక్ | ఓవరీస్ (ఒవల్యూస్) |
| 11. అగ్రసిల్ అప్‌టేక్ | క్లోరోప్లాస్ట్ (మైటోకాండ్రియా) |
| 12. వృక్షతైగలు | మొక్కలు |
| 13. మొక్కల డిఎన్ఏ వైరస్ సిఎమ్‌వి | ప్రోటోప్లాస్టులు |

వ్యవసాయరంగంలో ప్రత్యేకంగా సహన శక్తి సంకరీకరణము అభివృద్ధిలో కీటకాలను తట్టుకోగల్గే రకాలు, వైరస్ రోగాల నిరోధక శక్తి పరంగా మొక్కల జన్యుయాంత్రిక శాస్త్రము ప్రధాన పాత్ర పోషించింది. సాల్మోసెల్లా టైఫి మూరియము నుండి బాక్టీరియా జన్యువును చొప్పించడం ద్వారా గైఫోసేట్ తట్టుకునే శక్తి పోగామ్‌లో అభివృద్ధి పరచడం జరిగింది. జన్యువు రేఖ యొక్క క్రియా శీలతను ఇపిఎస్‌పి సంశ్లేషణ చర్యలో చూడవచ్చు. దీని అధిక ఉత్పత్తి జన్యుమార్పిడి ఉద్భవ (ట్రాన్స్‌జెనిక్) మొక్కలలో గైఫోసేట్ సహనశీలతను నిరూపిస్తుంది.

డిబ్లాక్ (1987) పొడుగైన స్ట్రెప్టోమైసిస్ హైగోస్కోఫికస్ నుండి జన్యువు తీసి పొగాకులో టమోటాలో ఆలుగడ్డలో చొప్పించాడు. జన్య మార్పిడి ఉద్భవ మొక్కలలో పోస్ఫ్రీనోథిస్, సహనశీలతకల సంకరీకరణ స్థాయిలు అధికమయ్యాయి.

బాసిలస్, థరికజెసిసస్ అనే బాక్టీరియా సిద్ధబీజాలపై ప్రోటోనైసియస్ లక్షణాలను విర్పరిచింది. ఈ ప్రోటీన్‌లు లెపిటొటర్న్ క్రిమి తెగలకు అధికస్థాయి విషపూరిత స్వభావాన్ని చూపింది.

క్లోన్ జన్యువు బి+ను టమోటా పొగాకులలో ప్రవేశపెట్టగా క్రిమినిరోధక స్థాయిలు పెరగడం జరిగిందని స్థిరీకరించబడింది. ఫిష్‌హాఫ్ హియల్ విధానము పంట మొక్కలలో పెరుగుతున్న క్రిమి నిరోధకతకు ప్రయోగాత్మక విలువను గల్గినది.

వైరల్ పూత ప్రోటీన్ (సిపి) జన్యువును క్లోన్ చేసి పొగాకు టమోటా అల్ఫాల్ఫా రూపాంతరీకరణ చెందించడమైనది. మార్పిడి చెందించిన జన్యువు వైరల్ రోగ లక్షణాలు అభివృద్ధి చెందడాన్ని జాప్యం చేసింది. పొగాకు మోసయిక్ వైరస్ (టి ఎమ్ యు) కొరకు సిపి జన్యువును పొగాకులోకి ప్రవేశపెట్టగా ఈ వ్యాధి అగుపించడం పూర్తిగా

పోయింది. (ఎబెల్) ఆంటిసెన్స్ ఆర్ఎన్ఏ ను సి ఎమ్. వి యొక్క ప్రోటీన్ కోట్‌ను పొగాకు రూపాంతరణకు వాడటం జరిగింది. (క్యూబ్) ఆకులు మొక్కలు తక్కువ సంఖ్య లెవల్స్‌ను చూపాయి. (బాత్‌కాంబే 1986) ఆర్ఎన్ఏ శాటిలైట్ అయిన డిఎన్ఏ నమూనాలను చొప్పించడం జరిగింది. దీనివల్ల తేలిందేమిటంటే – సిఎమ్‌సి తెగులు ప్రభావానికి శాటిలైట్ ఆర్ఎన్ఏ రక్షిత మరియు వ్యతిరేక పాత్ర వహించింది.

ఆంటిసెన్స్ ఆర్ఎన్ఏ మెలకువ అభివృద్ధి అనేది జన్యు పరివర్తనకు లేదా మార్పుకు లేదా ప్రత్యామ్నాయానికి లేదా తగ్గించడానికీ ఆధారము. ఇది ఉపయోగించిన ఆర్ఎన్ఏ కాంప్లిమెంటి శ్రేణిని కల్గి ఉంటుంది.

జన్యు మార్పిడి మొక్కలకు ఆంటిసెన్స్ ఆర్ఎన్ఓ నిర్మాణము మొక్కల యొక్క జన్యువు మొక్క జన్యు కదలికలపై ఎలా వుంటాయో అధ్యయనం చేయడానికి ఉపయోగిస్తారు. ఇది ముఖ్యంగా పెటూనియాలోని జీవసంశ్లేషణ జన్యువుల అధ్యయనంలో ఉపయోగిస్తారు. (వాన్‌డర్‌కిన్ 1988) స్మిత్ తదితరులు (1988) లో టమాటో పండు నిదానంగా పండు కావడాన్ని, మెత్తబడటాన్ని విజయవంతంగా సాధించారు. అందువల్ల పళ్ళయొక్క నిల్వ సామర్థ్యం పెరిగింది. జాప్యం చేయడానికి ఇది ఎలా సాధ్యపడింది అంటే టమోటా మొక్కల పాలిగలాక్టురానసె అనే ఆంటిసెన్స్ ఆర్ఎన్ఏ పండ్లు పండటానికి కారణమైన ఎంజైము రూపాంతరీకరణచెందడంవల్లనే.

పప్పు దినుసులలో జన్యు మార్పిడి మొక్కల ఉత్పత్తికి ఉపయోగించిన అనేక మెళకువలలో ప్రత్యక్ష డిఎన్ఏ అప్‌టేక్, ఎలెక్ట్రోపోరేషన్, మైక్రోప్రొజెక్టయిల్ తాడనము, పొలెన్ మార్పిడి, పొలెన్ నాళిక మార్గము వున్నాయి.

మొక్కలను జన్యు మార్పిడి ఉద్భవంలో విస్తృతంగా పొందటానికి, వైరల్ డిఎన్ఏ లో అగ్రోఇన్‌ఫెక్షన్, ప్రత్యక్ష డిఎన్ఏ వైపిటింగ్ లేదా అగ్రోబాక్టీరియంను పుష్పించు మొక్కలకు, అగ్రోబాక్టీరియం టుమిఫాసియస్ మందులతో కూడిన రూపాంతరణ, పిఇజి లేదా ఎలక్ట్రోపోరేషన్ ద్వారా ప్రత్యక్ష డిఎన్ఏ అప్‌టేక్ అన్నది ఉపయోగించారు.

60 శాతం కన్నా అధికంగా వివిధ మొక్కల తెగలలో జన్యు మార్పిడి ఉద్భవ అభివృద్ధిని చూపాయి. వాటిలో 60 శాతము పంట పొలాలలో ప్రయోగాత్మకంగా పరీక్షింపబడినది. అగ్రోబాక్టీరియం డిఎన్ఏ మాధ్యమం మార్పిడి సమర్థవంతంగా అగుపడింది.

జన్యు మార్పిడి మొక్కలు 1993

| జన్యుమార్పిడి ప్రక్రియ | ప్రయోగం | పొలము |
|---|---|---|
| అగ్రోబాక్టీరియం | 28 | 16 |
| బయోలిస్టిక్స్ | 9 | 4 |
| డిఎన్ఏ అప్‌టేక్ ప్రోటోప్లాక్టులు | | |
| మైక్రో ఇంజక్షన్ ఎంబ్రియో | 8 | 3 |

ముగింపుగా పునస్సంయోజన డిఎన్ఏ సాంకేతిక శాస్త్రము మానవ పురోభివృద్ధి అవసరాలకు అనుగుణంగా జీవశాస్త్రాన్ని ప్రయోగాత్మక అవసరానికై విప్లవాత్మక మార్పులతో రూపొందించడం జరిగింది.

జన్యుమార్పిడి ఉద్భవ పంట మొక్కల అధిక శక్తి కల్గి పర్యావరణ వత్తిడులు తట్టుకొనే రకాలు వచ్చాయి. క్రిమి సంహారక మందుల తగ్గింపు, అనేక మిలియన్ల కలుపు మొక్కల నివారణ, చివరకు స్పష్టమైన వాతావరణాన్ని, ఆరోగ్య పరిస్థితులను మంచి నాణ్యత గల దిగుబడిని అందించడంలో తోడ్పడుతున్నాయి.

## మొక్కల జీవ సాంకేతిక శాస్త్రములో ఇటీవలి ప్రగతి:

కణము ప్రోటోప్లాస్టు వర్ధనము జన్యు యాంత్రిక శాస్త్రము, డిఎన్ఏ పునస్సంయోజనము వంటి నూతన మెళకువలు మొక్కల తెగలను అంచనా వేయదగినంతగా మరియు మొక్క జీవ సాంకేతిక శాస్త్రము కలిపివేసి పునర్నిర్మాణము చేయడానికి ఆధారము ఏర్పరిచాయి.

సాంప్రదాయ జీవ సాంకేతిక శాస్త్రములో సారా కాచడము, జీవక్రిమిక నియంత్రణ, సాంప్రదాయ టీకా ఉత్పత్తి మొదలయినవి మాత్రమే ఉండేవి. ఆధునిక జీవ సాంకేతిక శాస్త్రము నూతన ప్రక్రియలపై ముఖ్యంగా క్రింది వాటిపై ఆధారపడి వుంది. వాడుకలోని వాటినన్నింటిని కలుపుతుంది. అవి:– నూతన జీవ ప్రక్రియ మెళకువలు కాక అదనంగా –

1. కణ మరియు కణజాలాల వర్ధనము
2. జన్యు సాంకేతిక శాస్త్రము
3. మోనోక్లోనల్ అన్‌టీబాడీలు.

జీవ సాంకేతిక శాస్త్రము అనేది జీవ మన్నది ఎంత పాతదో అంత పాత దృక్పథము. సుమారు 6000

సంవత్సరాల క్రితమే వైను, మరియు బీరు తయారీలో ఈస్టును వినియోగించడం జరిగింది. సుమారు 4000 సంవత్సరాల క్రితం లీవెన్డ్ బ్రెడ్‌ను ఈస్టుసాయంతో ఉత్పత్తి చేశారు. ఏది ఏమయినప్పటికి, 1900 సంవత్సరం ఆదిగా సూక్ష్మజీవకణాలను ఉపయోగించి అతి పెద్ద ఎత్తున మురుగును స్వచ్ఛం చేసే పద్ధతులను అభివృద్ధిపరచడమన్నవి గమనింపదగ్గవి. 19 వ శతాబ్దంలో లూయిస్ పాశ్చర్ పులియుట ప్రక్రియకు కారణం సూక్ష్మజీవ కణాలు అని ప్రతిపాదించాడు. తర్వాత అంతటి పెద్ద సత్య ప్రకటన మరియు అభివృద్ధి అన్నది అలెగ్జాండర్ ఫ్లెమింగ్ ద్వారానే. అలెగ్జాండర్ ఫ్లెమింగ్ మరియు అతని అనుచరులు 1928 లో రూపొందించిన అంటిబయాటిక్ పెన్సిలిన్‌ను పేర్కొనవచ్చు. 1944 ప్రారంభంలో భారీ ఎత్తున పెన్సిలిన్ ఉత్పత్తి ప్రారంభమయింది.

మొక్కల జీవసాంకేతిక శాస్త్రము ఈనాటి, రేపటి శుద్ధ మరియు ఆవర్తిత శాస్త్రాలలో అత్యంత సవాళ్ళు గల రంగము. దీని అనువర్తితాలు అత్యధికంగా పరిశ్రమలోనూ వ్యవసాయరంగంలోనూ క్రింది విధంగా వున్నాయి:

1. సూక్ష్మ తరాల తరబడి ప్రత్యుత్పత్తి: మేలయిన జాతులను శీఘ్రంగా క్లోనల్ తరాల ప్రత్యుత్పత్తి.
2. ఆహార నాణ్యత ప్రాధాన్యత, వ్యాధినిరోధకతను ఇతర అగ్రోనామిక్ లక్షణాలను గల్గిన మొక్కల ఎంపిక.
3. జన్యు మార్పిడి ఉద్భవ మొక్కల ఉత్పత్తి కొరకు జన్యు మార్పిడి.
4. వాణిజ్యపరంగా ఉపయుక్తంగా ఉన్న సమ్మేళనాలను, మందులను, ఔషధాలను మొదలగు వాటిని ఉత్పత్తి చేయడానికి మొక్కల కణాలను అత్యధికంగా వర్ధనం చేయుట.

మొక్కల కణ జీవ శాస్త్రము మరియు కణజాలాల వర్ధన మెలకువల చివరి లక్ష్యము ఏమిటంటే సరికొత్త మొక్కలను అభివృద్ధిపరచి జైవిక, అజైవిక వత్తిడులు, వ్యాధులు, క్రిములు, కీటకాలు అధికంగా ఎదురు చూడని అకస్మిక వాతావరణ మార్పు అంశాలు వంటి సవాళ్ళను ఎదుర్కోవడం. జన్యు విభిన్నత్వము అన్నది జీవితము యొక్క స్పైస్ మరియు సరికొత్త జీవ సాంకేతిక శాస్త్రము పనిముట్లు ఎటువంటివి అంటే జన్యు మార్పిడి విఘటనము వల్ల అంతర తెగల వద్ద అంతర జన్యుపరమైన అడ్డుగోడలను అత్యంత శక్తితో తొలగించగల్గినవి.

ఆప్టిసెన్స్ వంటి ప్రత్యేక సాధనాలు ఉదాహరణకు టమోటాలోని జన్యువు ఎథిలీన్, జీవ సంశ్లేషణలో ముడి పడడము మీది అయోనైన్ అనేది అన్ని పై స్థాయి మొక్కలలో ఎథిలిన్ యొక్క జైవిక ప్రిక్యూసర్. ఇది ఎస్–అడినోసిల్ మీథియొనైన్ (ఎస్ఏఏమ్) 1. అమినో సైక్లోపోపేన్–1–కార్బొసైక్లిన్–ఆమ్లము (ఎసిసి) గానూ అటు పిమ్మట ఎథిలిన్ ($C_2H_4$) గాను మార్చుతుంది. ఎథిలిన్ ఉత్పత్తి తగ్గించడానికి అంటిసెన్స్ జన్యువును విడవని నిర్మించడానికి సాధ్యపడుతుంది. యాంటిసెన్స్ జన్యువు ద్వారా ఎసిసి సంశ్లేషణ తద్వారా ఎథిలిన్ ఉత్పత్తి తగ్గి టమోటా పండు పరిపక్వత జాప్యము చేయడానికి వీలవుతుంది. సెన్స్ సైన్ శీఘ్రగతి వల్ల రవాణాలో సంభవించే అధిక నష్టాన్ని పరిపక్వత నివారణ జన్యువు విల్వ ద్వారా సాధించవచ్చు.

టమోటా పరిశ్రమలోని మరొక అంశం ఏమిటంటే, టమోటా సూప్, కిచప్, స్పగెట్టిలకు గట్టి టమోటా పదార్థము అవసరము. చక్కెర భారాన్ని నిర్ణీత ఉష్ణోగ్రత వద్ద ద్రావణము యొక్క ఘనపరిమాణంతోనూ, 'బ్రిక్' యూనిట్లతోనూ స్థిరత్వాన్ని యూనిట్లలోనూ కొలుస్తారు. కాలిఫోర్నియాకు చెందిన టమోటా ఉత్పత్తి అగ్రగణ్యుడు టమోటా మొక్క 5.2 "బోటోస్టివిక్ బ్రిక్స్"ను మరియు 22 బోస్టవిక్‌లను 6.2 బ్రిక్స్ మరియు 24 బోస్టవిక్‌గా మార్పిడి చేసికొని సాలుకు 50 మిలియన్ల డాలర్ల లాభాన్ని తన పరిశ్రమలో పెంపొందింపచేసుకున్నారు.

ప్రత్యేకంగా భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో మరొక సవాలు ఏమిటంటే – 'లెపిడోథెర్న్ పెస్టు'ల కొరకు కీటక నిరోధ జన్యువులను మార్పిడి చేయడం. పొగాకు, టమాటో, బంగాళదుంప, పత్తి మొదలగు పంట తెగలలో వ్యవసాయ బాక్టీరియాలు రూపాంతరణ అవలంబించడానికి బి+ జన్యువును సమర్ధవంతంగా ప్రవేశపెట్టడం జరిగింది. క్రిముల నియంత్రణ (భాసిలస్ థుర్విజెనిసిస్ కొరకు) ప్రోటీన్ జన్యువు అన్నది బి+ జన్యువుగా ప్రసిద్ధి చెందింది. 60 శాతం పై చిలుకు జన్యు మార్పిడి ఉద్భవ మొక్కలను వివిధ మెళకువల ద్వారా అభివృద్ధి పరచడం, వాటిలో సగభాగము పొలాల్లో ప్రయోగించడం తర్వాత భారీ ఎత్తున సాగును వదలడం జరిగింది.

జీవ సాంకేతిక శాస్త్రము యొక్క అత్యంత ప్రాముఖ్య ప్రభావము వ్యవసాయం, పరిశ్రమ మరియు ఆరోగ్యంపైన ఉంది. 900 మిలియన్ల పై చిలుకు జనాభా కల్గిన ఇండియాలో 2005 నాటికి జీవ సాంకేతిక శాస్త్రము సంబంధిత ఉత్పత్తుల సేవల చైతన్య మార్కెట్ విలువ కనీసం రూ.5000 కోట్లు ఉండగలదని అంచనా. ఇప్పటికి 30 కి పైచిలుకు మందులు టీకాలు వైద్యరంగ ప్రయోగశాలలో ఉన్నాయి. పెరుగుతున్న మిలియన్ల జనాభా కొరకు గత 12000 సంవత్సరాలలో ఉత్పత్తి చేసినంత ఆహారము రాబోయే 30 సంవత్సరాలలో మనకు అవసరము అవుతుంది. మానవాళి భవిష్యత్తు నిస్సందేహంగా మానవాళి అవసరాలకు అనుగుణంగా అభివృద్ధి చెందుతున్న ప్రాథమిక మరియు

అనువర్తిత సాంకేతిక విజ్ఞానంపై ఆధారపడుతుంది.

చిట్టచివరిగా తేల్చి చెప్పగల్గింది ఏమిటంటే జన్యు యాంత్రిక శాస్త్రము అన్నది ప్రత్యక్షంగా జన్యు నిర్మాణ సంధాన చాతుర్యము, ప్రక్రియలకు జన్యు కదలికలకు మహదవకాశాన్ని కల్పించింది.

సరిక్రొత్త డిఎన్ చిత్రపటాలను రూపొందించడానికి అడ్డుపడే ఎంజైమ్ సాంకేతిక శాస్త్రాన్ని వాడటం జరిగింది. ప్రత్యేక జన్యువును విడదీసే మెళకువలలో మొక్కల కణజీవ శాస్త్రము ఎంతో ఉపయోగపడింది. ప్రత్యేక జన్యువును విడదీయడం, జన్యువులో భాగం, అనగా జెనోమ్ యొక్క ప్రాంతం డిఎన్ ఏ ఉత్పత్తి, ఆర్ఎన్ఏ, ప్రోటీన్ల అవసరమైనంత ఉత్పత్తి మొదట్లో సాధ్యపడేది కాదు.

జీవ రసాయనాలయిన ఎంజైములు ఉత్పత్తిలో అభివృద్ధి, మందులు, అవసరాలకు తగినట్లుగా వీటి వ్యాపార సరళిలో కావలసిన లక్షణాలతో వ్యాధి నిరోధక మరియు సరిక్రొత్త ఆర్గానిజమ్స్ అవసరమైనంత ఛిమెరిక్ జన్యువులు ఉత్పత్తి కూడా మొదట్లో సాధ్యపడేది కాదు.

## మొక్కల అభివృద్ధిలో కణాల మరియు ప్రొటోప్లాస్టల మెలకువలు:

ప్రోటోప్లాస్టులు కణాలలో పురోగమనము గత దశాబ్దాలలో కణ జీవ శాస్త్రము, అన్‌ప్రెసిడెంట్ అభివృద్ధిని పొందింది. కణాల మరియు కణజాలాల వర్ధనం మెలకువల వల్ల అభిలషణీయ జన్యు వివర్తనాలు (వేరియన్‌ట్స్ ఎంపికలోనూ) మరియు ప్రేరణలోనూ గణనీయ అభివృద్ధిని సాధించింది. 60 పై చిలుకు వంగడాలు అనగా బియ్యము, మొక్కజొన్న, ట్రిటికల్, వేరుశనగ, చిక్‌పీ మరియు పిగియన్‌పీ రకాలు. మరియు 12 ఎక్స్‌ప్లాంటులు ఏడు రకాల మధ్యమాలు వివిధ రకాల హార్మోను సమ్మేళనాలు వెలువడ్డాయి. కల్యూసింగ్, ఎంబ్రియోజెనిసిస్ మరియు పునరుత్పత్తికొరకు కల్యూసింగ్, ఎంబ్రియోజెనెసిస్ మరియు పునరుత్పత్తులు దాదాపు 100 శాతం నుండి 20 శాతం తక్కువగా మార్పుకు లోనవుతాయి.

మొక్కల అభివృద్ధికి చెంది జన్యు సంధాన చాతుర్యంలో శరీర సంబంధమైన ఎంబ్రియోజెనిసిక్ ట్యూటుటైప్ అన్నది అధిక ప్రాముఖ్యతను పొందింది.

శరీర సంబంధమైన ఎంబ్రియోజెసినిస్ ద్వారా సీన్‌సీడ్స్ సింథెటిక్ సీడ్స్ సస్పెన్‌షన్ వర్ధనాలయిన బీయాయం, కాల్లూస్ వర్ధనం అయిన ట్రిటికల్ మరియు వేరుశనగలోని పరిణతి చెందని అండ వర్ధనములు సోడియం ఆల్టినేట్‌తో కూడి ఉత్పత్తి చేయడం జరిగింది. హార్టికల్చర్ పంట అయిన అరటి యొక్క సిన్‌సీడ్స్‌ను తరాల పునరుత్పత్తి ద్వారా ఉత్పత్తి చేసి వాటిని 6 వారాల పై చిలుకు లిక్విడ్ నైట్రోజన్‌లో నిల్వ వుంచి మరియు చిన్న చిన్న మొక్కలుగా మొలకెత్తేలా చేయడం అన్నది సూక్ష్మతరాల పునరుత్పత్తి ఎంపిక మరియు పంటను పంపిణీ చేయటం విప్లవాత్మకమైనది.

నవీన తరాల పునరుత్పత్తి మెలకువను అభివృద్ధి పరచడం, విస్తృత పరచడం కొన్ని అభిలషణీయ సహజ లక్షణాల కొరకు మొక్కల ఎంపికలో పద్ధతులు సెంటర్ ఫర్ ప్లాంట్ అండ్ కణ జీవశాస్త్రంలో జరిగింది.

## బ్లాస్ రోగ నిరోధానికి ఎంపిక:

సిపిహెచ్‌ఆర్–12, తెల్లహంస, జెనిత్, జయల యొక్క విడదీసిన గ్రుడ్డు మరియు కట్టి మూలాము పైల్యూలాపియా వారిజే సిద్ధబీజ సస్పెన్షన్ ($10^5$ ఎమ్.ఎల్) విష పదార్థము పైకోలోనిక్ అమ్లము 125–200 పిపిఎమ్‌తో పరీక్షించడం జరిగింది. మొత్తము 408 మొక్కలు. విజయవంతంగా ఎంపిక చేసిన విషపదార్థము సహన కల్లీ నుండి పునరుత్పత్తి అయ్యాయి. కల్లీ నుండి 104 మొక్కలు సిద్ధబీజము సస్పెన్షన్‌కు నిరోధకంగా ఏర్పడ్డాయి. రోగం కోసం పరీక్షించిన సీడ్‌లింగ్స్ పెద్దవిగా ఎదిగాయి. విత్తనాలు సేకరించి పొలాల్లో పాథోజైన్ టీకాలతో టిసి2 పునరుత్పత్తి పరీక్షించగా 60 నుంచి 78 శాతం వరకు పెరిగిన నిరోధక శక్తి స్థాయి నియంత్రణలోనే ఉంది.

## అంథర్ వర్ధనము:

అభిలషణీయ రిసెసివ్ ట్రయిట్ ఎంపికలోనూ, స్రీవింగ్ జెనరేషన్స్ అవసరాన్ని పూర్తిగా తొలగించగల్గిన సాంప్రదాయ ప్రజననము అదే విధంగా అభిలషణీయ జన్యు ఎంపిక చేయడంలో ప్రజననము కుదించడం చేయడంలో అంథర్ వర్ధనము అన్నది అత్యంత విశ్వసనీయ మెలకువ. విజయవంతంగా, సమర్థవంతంగా పచ్చని వరి మొక్కలకు అంథర్ వర్ధనం ద్వారా పునరుత్పత్తి చేయడానికి మెలకువలను ప్రమాణీకరించడం జరిగింది. ఇండికా వరి జీన్ మానిపులేషన్‌లో అంథర్ వర్ధనము విజయవంతంగా ఎక్స్‌ప్లాయిట్ హెచ్చు అనేది ప్రధానంగా పచ్చని మొక్క పునరుత్పత్తి హెచ్చు పౌనఃపున్యం పొందడంపై ఆధారపడి ఉంటుంది.

నాలుగు ఇండికా వరి వంగడాలు ఉదాహరణకు సిఆర్ 666–34–3, ఎస్ఆర్–26–బి, బసమతి ఎస్‌డి–10 పి+6.3 అనేది మధ్యమము యొక్క పాత్రను, మొక్క పెరుగుదల నియంత్రణలను మరియు అంథర్ కల్లీస్ ప్రేరణలో చక్కెర మరియు మొక్క పునరుత్పత్తిని అధ్యయనం చేయడానికి రూపొందించబడ్డాయి. రూపొందించబడ్డ (ఇవాల్యుయేటడ్) నాలుగు జీనో టైపులలో పిటిబి 33 అన్నది అత్యధిక పచ్చని మొక్క పునరుత్పత్తి పౌనఃపున్యాన్ని (45 శాతం) ఆల్‌బిన్ 30 శాతాన్ని ఎన్ఏఏఏ ఏఏ మరియు బిఏపి కెఎన్‌ల కలయిక

వల్ల ఏర్పడిన ఎమ్ఎస్ మధ్యమంలో ప్రదర్శించాయి.

అంథర్ వర్ధనం ద్వారా విజయవంతంగా హెచ్చు పౌనఃపున్యంతో పచ్చని మొక్కను పునరుత్పత్తి చేయడం అన్నది అంథర్ వర్ధనము ప్రజననము కార్యక్రమాలలో కూడా గమనించవచ్చు (ఎక్స్‌ప్లాయిటెడ్). పప్పుదినుసులలో జన్యు మార్పిడి ఉద్భవ మొక్కల ఉత్పత్తిని చేపట్టే మెలకువలన్నింటిలో ప్రత్యక్ష డిఎన్ఏ తీసుకోవడం పిఇడి లేదా ఎలక్ట్రో పోరేషన్ సూక్ష్మ ప్రొలెక్టియల్ తాడనము పొలెన్ రూపాంతరణ, పోలెన్ నాళిక పాతవే.

వరి మరియు ఇతర హార్టికల్చర్ పంటలకు అదనంగా జన్యు మార్పిడి ఉద్భవ మొక్కలను పొందటానికి, పైరల్ డిఎన్ఏ వల్ల అగ్రో, ఇన్‌ఫెక్షన్, పుష్పించే భాగాలలో డిఎన్ఏ లేదా అగ్రో బాక్టీరియాను ప్రత్యక్షంగా పైపింగ్ చేయడం అగ్రో బాక్టీరియం కల్గిన రూపాంతరణ ఎస్‌పిఇజి ద్వారా ప్రత్యక్ష డిఎన్ఏ తీసుకోవడం లేదా విడి ప్రోటోప్లాస్ట్‌ల ఎలెక్ట్రోప్రోరేషన్ విస్తృతంగా వాడుతారు. ఇండికా వరి రకాల ప్రోటోప్లాస్టు ద్వారా సమర్థవంతమైన ప్రోటోకాల్ పునరుత్పత్తిని మొదటిసారిగా సోడియం ఆల్జినేట్‌తో కూడిన కారణంగా సాధించడం జరిగింది. ఇండికా వరి (హొరిజా సటివా సివి రాసి) యొక్క అంథర్ ఉత్పన్న సస్పెన్షన్ వర్ధనాల ద్వారా హెచ్చు దిగుబడి ప్రోటోప్లాస్ట్‌లను (25+269+106) ప్రోటోప్లాస్ gr, tr, wt లను పొందడం జరిగింది. విభజిత పౌనఃపున్యాన్ని రూపంలో అధిక పూత సామర్థ్యాన్ని (30–40 శాతం), కాలనీ మరియు మైక్రోకాల్లస్ (4+06%) పొందడం జరిగింది.

ప్రోటోప్లాస్ ఉత్పన్న కల్లస్ ద్వారా మొక్కల పునరుత్పత్తిలో పచ్చనివి (33 శాతం) మరియు ఆల్‌బికో (10 శాతం) అన్నవి 100 ఎమ్‌జి (1ఏవి, 20 ఎమ్‌జి) బిఏపి మరియు 0.6 ఎమ్‌జి కెఐన్‌తో కూడిన సగం గాఢత కల్గిన ఎమ్ఎస్ మధ్యమములో ఉన్నాయి. ఈ టెక్నాలజీ మైక్రో ఇంజక్షన్ ద్వారా జన్యు మార్పిడి ద్వారా ఏర్పడింది. (ఎక్స్‌ప్లాయింటైడ్ మొక్కడొన్న యొక్క జైన్‌క్లోన్‌లోకి పిఏఫ్ 16 ప్లాస్మోడియం ఫాల్సిపారమ్ నుండి వచ్చిన 210 ఆధార జతగా ఛిమెరిక్ జన్యువును 26 శాతం లైసిన్ కోడ్‌లను, 13 శాతం మిథియోనైన్‌లను ప్రవేశపెట్టడం జరిగింది. ఈ ఛిమెరిక్ జన్యువును ప్రొటీన్ నాణ్యతను పెంపొందింపచేసే ఉద్దేశ్యంతో వరి ప్రోటోప్లాస్‌లోకి ప్రవేశపెట్టడం జరిగింది. అంటే వరిని లైసిన్ అధికంగా కల్గిన దానిలా చేయడం. ఈ మెలకువ అగ్రోనిమిక్ విలువ ఉన్న అభిలషణీయ జన్యువులను మైక్రోఇంజక్షన్ ద్వారా జన్యు మార్పిడి ద్వారా చొప్పించడానికి మరియు ట్రాన్స్‌జెనిక్ వారిని పెంపొందింప చేయడానికి ఉపయోగపడుతుంది.

గుడ్డు పరిరక్షించే అంథర్ కల్లీ మొదలగు వాటి ఎంపికతో పాటుగా ఉప్పు సహించే జన్యువులను పోర్‌టేరిసియా కొయర్‌క్టాట ఇతర ఉప్పు సహించే వంగడాల నుండి జన్యు మార్పిడి కార్యక్రమము అభివృద్ధి పథంలో ఉంది.

ఉప్పు సహించే వంగడాలు కోర్‌గట్ మరియు పొక్కాలి, మితంగా సహించే వంగడమైన అజ్‌గో మరియు పస్పెప్టిబిల్ వంగడాలయిన షిటో మరియు తెల్లహంసలను సాధ్యపడే జతలుగా సంకరణం చెందించడం జరిగింది. మాతృకలు మరియు ఎఫ్ ఐ ఎస్ లు సజల మరియు సలైన్ న్యూట్రిమేట్ ద్రావణముతో పోల్చబడ్డాయి.

అదనపు మరియు ప్రధాన జన్యు ప్రభావాలు మొక్కల ధాన్య దిగుబడికి తప్ప ఇతర అన్ని లక్షణాలకు ప్రాధాన్యత వహించాయి. దిగుబడికి చెందిన లక్షణాలు సలైన్ పరిస్థితులలో ప్రధానంగా అగుపడ్డాయి. సాధారణ మరియు ప్రత్యేకంగా కలిసే లక్షణాలు కోర్‌గుట్ మరియు పొక్కాలి మంచి కలయికలు ధ్రువీకరించింది. మొక్కల ఎత్తు దున్నవలసిన సంఖ్య, విత్తు నాటు శాతము, ఫలిత ఉత్పాదకత శాతము, పానికిల్ పొడవు, మొక్కకు ధాన్యము దిగుబడి వంటి లక్షణాలు సలైన్‌టీ పరిస్థితుల్లో అవసరం అనువంశికత విలువలను చూపించాయి. ఈ సహజ లక్షణాలు ఉప్పు సహించే వంగడాల ఎంపికలో వాడుతారు. ప్రస్తుత అధ్యయనము వల్ల తేలిందేమిటంటే – తెల్లహంస పొక్కాలి మరియు తెల్లహంస కోర్‌గుట్ సంకరాలు వాటి మాతృకలకన్నా మెరుగైన సహనశీలతను చూపించాయి.

మూడువారాలపాటు గ్రీన్ హౌస్‌లో సలైనైజ్డ్ వర్ధనము ద్రావణము 16×ఎన్‌సిఎల్: సిఏసిఎల్ 2, ఇసి 12 (డిఎన్1 ఎమ్ఎల్) లో పృథక్కరణము తరాలయిన ఎఫ్3, ఎఫ్4 లు హైడ్రోప్రోనికల్‌గా రెండు వారలలో ఏర్పడ్డాయి. వీటిలో సహించే తత్వంగల ఉత్పత్తిని ఎంపిక చేశారు. ఈ అధ్యయనాలు చిట్ట చివరకు ఉప్పును సహించే వరి వంగడాలను పెంపొందించడానికి, వివిధ సముద్రజలాల మిశ్రమంతో పెరగడానికి దోహదపడుతాయి.

# కంప్యూటర్ రంగంలో ఉపాధి అవకాశాలు

డా. టి.యల్.యన్. స్వామి, రీడర్, అర్థశాస్త్రశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 7.

ఇది కంప్యూటర్ శకం. కంప్యూటర్‌ను మానవ మేధస్సుకు సహజ ప్రత్యామ్నాయంగా పేర్కొనవచ్చును. ఈనాడు మానవుడు తన ప్రయత్నంలో జరుగని ఎన్నో పనుల్ని అతివేగంగా, సమర్థవంతంగా కంప్యూటర్ ద్వారా చేయగలుగుతున్నాడు. పైగా అది వాణిజ్యపరంగా ఎంతో లాభదాయకంగా ఉంటోంది. అందుకే కంప్యూటర్లు నవీన సమాజంలో విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే కంప్యూటర్‌ల వాడకం లేని రంగమే ఈనాడు కనుపించదు. వార్తా పత్రికలు కంప్యూటరైజ్డ్ టైపుసెట్టర్స్ సాయంతో అచ్చవుతున్నాయి. ఆర్కిటెక్టులు ఇళ్ల ప్లాన్లను కంప్యూటర్ సాయంతో రూపొందిస్తున్నారు. టెలిఫోన్ బిల్లులు, కరెంటు బిల్లులు, విద్యార్థుల మార్కుల జాబితాలు, రైల్వే రిజర్వేషన్లు మొదలగునవి అన్నీ కంప్యూటర్ సహాయంతోనే తయారుచేస్తున్నారు. డాక్టర్లు కంప్యూటరైజ్డ్ స్కానింగ్ మెషీన్‌తో ఆరోగ్యాన్ని పరీక్షిస్తున్నారు. పరిశ్రమలలో, హోటళ్లలో, బ్యాంకులలో, విమానాశ్రయాల్లో, టి.వి. స్టూడియోలలో - ఇలా ఒకటేమిటి, ఎన్నో సంస్థలలో కంప్యూటర్లను ఉపయోగిస్తున్నారు. ఇంతగా ప్రాముఖ్యతను సంతరించుకొన్న కంప్యూటర్‌కు చాలా చరిత్రవుంది.

కంప్యూటర్‌ను ఎలక్ట్రానిక్ రంగంలో వచ్చిన విప్లవాత్మకమైన మార్పుకు ప్రతిఫలంగా చెప్పుకున్నా, నిజానికి ఎలక్ట్రానిక్ యుగం ప్రారంభం కావడానికి ముందు నుంచే కంప్యూటర్‌లు వాడకంలో ఉన్నాయి. అయితే, ఈనాటి కంప్యూటర్‌తో పోల్చితే మాత్రం వాటి ప్రయోజనం అంతంత మాత్రమేనని చెప్పవచ్చు. అవి కేవలం లెక్కలు చేయడానికి మాత్రమే పనికి వచ్చేవి. లెక్కలు చేసే యంత్రాన్ని తయారుచేయడానికి కొన్ని వేల సంవత్సరాల కిందటే అంకురార్పణ జరిగింది. చైనీయులు క్రీస్తుపూర్వం 2000 నుండి 5000 ల సంవత్సరాల మధ్యకాలంలో అబాకస్ (Abacus) అన్న ప్రాథమిక గణన పరికరాన్ని తయారు చేసినట్లు చరిత్ర చెబుతోంది. దానిని గ్రీకులు విస్తృతంగా ఉపయోగించినట్లు కూడా తెలుస్తోంది. అబాకస్ అంటే హిబ్రూ భాషలో ధూళి లేదా మట్టి. మొదటగా దానిని మట్టితో చేసినారు కాబట్టి దానికా పేరు వచ్చింది. తర్వాతికాలంలో అబాకస్‌ను చెక్క ఫ్రేముకు పూసలు గుచ్చిన తీగలను బిగించి తయారుచేయడం ప్రారంభించారు. ఈ పూసలు అటు ఇటు కదిలించడానికి అనువుగా ఉండేవి. ఈ అబాకస్‌ను నేటి కంప్యూటర్‌కు తొలి పునాదిగా పేర్కొనవచ్చును.

అబాకస్ ఆవిర్భవించిన నాటి నుండి ఎన్నో పరిశోధనలు జరిగాయి. కంప్యూటర్ విజ్ఞానశాస్త్రం ఆవిర్భావానికి ఎందరో కృషి చేశారు. 1854 - 1874 మధ్య కాలంలో జార్జి బూల్ అనే బ్రిటిష్ గణిత శాస్త్రవేత్త బూలియన్ ఆల్జీబ్రా అనే నూతన గణితశాస్త్ర శాఖను కనుకొనినాడు. ఆ భాషనే ఉపయోగించి ఈనాటి కంప్యూటర్లు పనిచేస్తున్నాయి. జార్జి బూల్ తర్వాత అనేకమంది శాస్త్రవేత్తలు ఈ రంగంలో పరిశోధనలు గావించినారు. వీరిలో హెర్మన్ హోలెరిత్, ధర్మియానిక్, హోర్వర్ హెచ్ ఐకెన్, జాన్ న్యూమన్ మొదలగువారిని ప్రముఖంగా చెప్పుకోవచ్చు. వీరి పరిశోధనల ఫలితంగా ఆధునిక కంప్యూటర్ రూపురేఖల్ని దిద్దుకొంది. అయితే, 1948 కన్నా ముందు తయారైన కంప్యూటర్లు సమాచారాన్ని టైపు చేసి చూపించేవిగా మాత్రమే ఉండేవి. 1948 లో మాంచెస్టర్ విశ్వవిద్యాలయ పరిశోధకులు మాంచెస్టర్ మార్కు - 1 అన్న పేరుతో కంప్యూటర్‌లో పిక్చర్ ట్యూబును అమర్చి తెరపై అక్షరాలు కనుపించేట్టు తయారు చేశారు. దీని తర్వాత 1949 లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ నిపుణులు ఎలక్ట్రానిక్ డిలేస్టోరేజ్ ఆటోమేటిక్ కంప్యూటర్‌ను తయారు చేశారు. ఇది ప్రోగ్రాంను మొత్తం తన మెమొరీలో ఉంచుకొని, అవసరమైనపుడు ప్రోగ్రాంలో మార్పులు చేర్పులు చేయడానికి

వీలు కల్పించింది. దీని ఆవిర్భావంతో కంప్యూటర్ విజ్ఞాన శాస్త్రంలో నూతన శకం ఆరంభమైనట్లయింది. కాలంతో పాటు అనేక మార్పులు కంప్యూటర్‌లో చోటు చేసుకొన్నాయి. ప్రస్తుతం నాలుగవతరం కంప్యూటర్లు అనబడేవి వినియోగంలో ఉన్నాయి. ఈ తరం కంప్యూటర్లు 1971 నుండి అమలులోకి వచ్చాయి. వీటిని భారీ తరహా ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్ టెక్నాలజీ (ఎల్.ఎస్.ఐ) అభివృద్ధి చెందిన కారణంగా ఒక చిన్న చిప్‌లో లెక్కలేనన్ని ట్రాన్సిస్టర్లు, రెసిస్టర్లు, కెపాసిటర్లను ఇమిడ్చి తయారుచేస్తున్నారు.

నాలుగవ తరం కంప్యూటర్లతో ఆగకుండా అయిదవ తరం కంప్యూటర్లను తయారుచేయడానికి జపాన్, అమెరికా, తదితర దేశాలు అప్పుడే ప్రయత్నాలు ప్రారంభించాయి. ఈ తరం కంప్యూటర్లు మనిషి నోటితో చెప్పిన ఆదేశాలను అర్థం చేసుకొని తిరిగి మాట్లాడుతాయని వీరి పరిశోధనల వల్ల తెలుస్తోంది. నిజంగా ఇది మానవ విజ్ఞానానికి పరాకాష్ఠ.

ఇంతటి మహత్తర చరిత్ర గలిగిన కంప్యూటర్ వినియోగంలో భారతదేశం ఏ మాత్రం వెనుకంజవేయలేదు. ప్రస్తుతం మన దేశంలో 5.50 లక్షల వరకు కంప్యూటర్లు ఉన్నాయని అంచనా. ఈ సంఖ్య ప్రతి సంవత్సరం ఎంత లేదన్నా 50 శాతం వరకు పెరుగుతోంది. ఈ లెక్కన 2000 ల సంవత్సరం నాటికి దాదాపు 30 లక్షల కంప్యూటర్లు, పెరిఫెరల్స్ ఉంటాయని నిపుణుల అంచనా. ఇన్నిలక్షల కంప్యూటర్లు వినియోగంలోకి రాబోతున్నందున ఈ రంగంలో ఉపాధి అవకాశాలకు కొదువ లేదు. వీటి దృష్ట్యా ప్రస్తుతం చాలా మంది యువతీ యువకులు కంప్యూటర్ రంగంలోని వివిధ కోర్సులకు ఎగబడుతున్నారు. అయితే, అందుబాటులో ఉన్నటువంటి కంప్యూటర్ కోర్సుల్ని రెండు శాఖలుగా విభజించవచ్చు. అవి:

1. హార్డువేర్ ఇంజనీరింగు.
2. సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగు.

క్లుప్తంగా చెప్పాలంటే – భౌతిక లక్షణాలున్న కంప్యూటర్ భాగాలను లేదా విడిపరికరాలను హార్డువేర్ అంటారు. ఇకపోతే భౌతిక లక్షణాలు లేని విడి పరికరాలను సాఫ్ట్‌వేర్ అంటారు. ఈ రెండూ ముఖ్యమైనవే. కంప్యూటర్ ప్రోగ్రాంలు రన్ అయి రిపోర్టులు పొందటానికి సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగ్ ఎంత కీలకమయినదో –, కంప్యూటర్లు పని చేయడానికి హార్డువేర్ ఇంజనీరింగు అంత ప్రాధాన్యమైనది. అయితే, చాలా మంది గ్లామర్ ఉండే సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగు పట్లనే మోజు చూపుతున్నారు కాని, హార్డువేర్ ఇంజనీరింగు గురించి శ్రద్ధ వహించడం లేదు. ఈ మధ్య కంప్యూటర్ సొసైటీ ఫర్ హార్డువేర్ రీసెర్చి వారు ఓ సర్వేను నిర్వహించారు. ఈ సర్వే ప్రకారం 1995 నాటికి దేశంలో ఉన్న కనీసం 5 లక్షల కంప్యూటర్ ఇంజనీర్ల అవసరం ఉంటుంది. నిజానికి ఇప్పుడు మన దేశంలో ఉన్న హార్డువేర్ ఇంజనీర్లు దేశావసరాల్లో కేవలం 5 శాతం కూడా లేరు. దీనికితోడు దేశంలో కొత్తగా కంప్యూటర్లను తయారు చేసే చిన్నా పెద్ద సంస్థల సంఖ్య కూడా పెరుగుతోంది. రాబోయే సంవత్సరాలలో మార్కెట్లోకి వచ్చే కంప్యూటర్లలో 40 శాతానికి పైగా చిన్న కంపెనీలు ఉత్పత్తి చేసే అవకాశాలున్నాయి. అయితే చిన్న సంస్థలు అంతగా నైపుణ్యం లేనివి కావడం వల్ల ఉత్పత్తి అయ్యే కంప్యూటర్లు కొద్ది కాలంలోనే రిపేర్లకు వస్తుంటాయి. ఈ విషయాలన్నీ లెక్కలోకి తీసుకొంటే హార్డువేర్ ఇంజనీర్లకు అదనంగా పని లభిస్తుందని సర్వే రిపోర్టు వెల్లడించింది. ఈ రిపోర్టు వెలువడిన తర్వాత చాలా కంప్యూటర్ శిక్షణా సంస్థలు హార్డువేర్ ఇంజనీరింగ్‌లో శిక్షణ ఇవ్వడం ప్రారంభించాయి.

**శిక్షణావకాశాలు:**

ప్రభుత్వ సంస్థ అయిన ఈ టి టి హార్డువేర్‌లో డిప్లొమా కోర్సును ప్రారంభించింది. ఈ కోర్సులో ఇంటర్ మీడియట్ (సైన్సెస్) చదివిన వారితో పాటు, ఐటిఐ, పాలిటెక్నిక్ డిప్లొమా చేసినవారు, డిగ్రీ లెవల్‌లో ఇంజనీరింగ్ కోర్సు చేసినవారు ఎవరైనా చేరవచ్చు. ఈ కోర్సులో థియరీతో పాటు అసెంబ్లింగ్, సర్వీసింగ్ అఫ్ గ్రెడేషన్ వంటి వాటిలో శిక్షణ ఇస్తారు. పెరుగుతున్న డిమాండ్ దృష్ట్యా ఈ సంస్థ డిజిటల్ ఎలక్ట్రానిక్స్ అండ్ మైక్రోప్రాసెసింగ్‌లో కూడా కొత్త కోర్సులను ప్రారంభించింది. ప్రైవేట్ విద్యాసంస్థలలో కంప్యూటర్ హార్డువేర్ కోర్సులు పూర్తి చేసినవారు మంచి ఉద్యోగాలు రావాలంటే ప్రభుత్వ గుర్తింపు పొందిన పరీక్షలు రాయడం అవసరం. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎలక్ట్రానిక్స్ అండ్ టెలికమ్యూనికేషన్ ఇంజనీర్స్ (IETE) అను సంస్థ రెండు ప్రభుత్వ గుర్తింపు పొందిన AMIETE, Dip in IETE అన్న కోర్సులను నిర్వహిస్తోంది. AMIETE లో మొత్తం 16 సబ్జెక్టులలో పరీక్షలు రాయాల్సి ఉంటుంది. ఇందుకు అవసరమైన కోర్సు మెటీరియల్‌ను సంస్థే పంపిస్తుంది. అన్ని పరీక్షలలో ఉత్తీర్ణులయితే డిగ్రీ ప్రదానం చేస్తారు. ఈ డిగ్రీ ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్ డిగ్రీతో సమానం. ఇకపోతే Dip in IETE పాలిటెక్నిక్ కోర్సుకు సమానం. AMIETE కోర్సు వివరాలు కావాలనుకుంటే రూ. 40/–లు, Dip in IETE కోర్సు వివరాలు కావాలనుకుంటే రూ. 30/–లు సెక్రటరీ IETE, New Delhi పేరిట DD తీసి Secretary IETE, Institutional Area, Lodi Road, New Delhi - 110003 అనే చిరునామాకు పంపితే అన్ని వివరాలు తెలుపుతారు.

హార్డువేర్ ఇంజనీరింగ్‌లో కోర్సు చేసిన వారికి ఉద్యోగం

రాకపోయినా ఉపాధికి ఎన్నో అవకాశాలున్నాయి. ఈ మధ్యకాలంలో కంప్యూటర్ రంగంలో థర్డ్‌పార్టీ మెయింట నెన్స్ పద్ధతి బహుళ ప్రాచుర్యం పొందుతోంది. థర్డ్‌పార్టీ మెయింటనెన్స్ అంటే కంప్యూటర్ ఉత్పత్తి చేసిన సంస్థ కాకుండా వేరే వాళ్లు దాన్ని నిర్వహిస్తారు. ఈ పద్ధతిలో కన్సల్టన్సీ తీరులో ఓ సంస్థను పెట్టుకొని బోలెడు కంట్రాక్టులు సంపాదించవచ్చును.

## సాఫ్ట్‌వేర్ రంగంలో ఉపాధి అవకాశాలు:

సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగ్‌కు ఈనాడు చాలా గ్లామర్ ఉంది. అందుకనే, చాలా మంది యువతీయువకులు దీనిపట్ల ఆకర్షితులవుతున్నారు. ముఖ్యంగా మహిళలు, యువతులు హార్డువేర్ కంటే సాఫ్ట్‌వేర్ రంగం పట్ల మోజుచూపుతు న్నారు. ఎందుకంటే, ఈ రంగంలో ఉద్యోగం ఒక చోట కూర్చుని చేసుకోవడానికి వీలుంటుంది కనుకా, హార్డువేర్ ఇంజనీరింగ్‌లో లాగా స్క్రూ డ్రైవర్, మల్టీమీటర్ పట్టుకొని పది చోట్లకు పది సార్లు వేర్వేరు వేళల్లో వెళ్లి రావలసిన అవసరం లేదు గనుకా.

సాఫ్ట్‌వేర్ కోర్సులలో వివిధ కంప్యూటర్ భాషలలో ప్రోగ్రాంలు రాయడం నేర్పుతారు. అయితే, ప్రోగ్రాంలు రాయడం నేర్చుకోకుండానే కంప్యూటర్‌ను పని చేయించే పరిజ్ఞానాన్ని సంపాదించవచ్చు. ఇందుకు సుమారు నెల రోజుల కోర్సు చేయాల్సి ఉంటుంది. అనేక ప్రైవేటు విద్యా సంస్థలు ఈ కోర్సును నిర్వహిస్తున్నాయి. ఇకపోతే, ఆంధ్రప్రదేశ్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయంతో సహా అనేక విశ్వవిద్యాలయాలు MCA మరియు DCA కోర్సులను నిర్వహిస్తున్నాయి. వీటికి చాలా డిమాండ్ ఉండటం వలన అడ్మిషన్స్, ప్రవేశ పరీక్ష ఆధారంగా ఇవ్వబడతాయి. అయితే, ప్రైవేటు విద్యాసంస్థలలో కూడా చేరి ఈ కోర్సుల్ని చేయవచ్చు. కాకపోతే ఫీజులు ఎక్కువగా చెల్లించాల్సి యుంటుంది.

కంప్యూటర్ సొసైటీ ఆఫ్ ఇండియా (CSI); భారత ప్రభుత్వ ఎలక్ట్రానిక్స్ శాఖ, మానవ వనరుల అభివృద్ధి శాఖకు చెందిన అఖిల భారత సాంకేతిక విద్యామండలి సహకారంతో నాలుగు స్థాయిలలో కంప్యూటర్ పరీక్షలను నిర్వహిస్తోంది. ఈ నాలుగు స్థాయిలలో మొదటిది 'O' స్థాయి. ఈ స్థాయిలో పరీక్ష రాయాలంటే కనీసం సంవత్సరం పాటు కంప్యూటర్ విద్యను ప్రభుత్వ అనుమతి పొందిన విద్యా సంస్థలలో అభ్యసించి యుండాలి. కనుక సాఫ్ట్‌వేర్ కోర్సుల్లో చేరగోరేవారు ముందుగా ఆ విద్యాసంస్థకు Dept. of Electronics, భారతప్రభుత్వం వారి అనుమతి ఉందో లేదో తెలుసుకోవడం మంచిది. CSI నిర్వహించే అన్ని పరీక్షలకు ప్రభుత్వ గుర్తింపు ఉంది. కనుక ఈ పరీక్షల్లో ఉత్తీర్ణులయిన వారికి మంచి భవిష్యత్తు ఉంది. ఈ పరీక్షల వివరాలు కావలసిన వారు రూ. 10/– లు CSI, New Delhi, పేరిట డిమాండ్ డ్రాఫ్టు తీసి CSI, PHD House, Opposite Asian Games Village, New Delhi -110016 అనే చిరునామాకు పంపితే అన్ని వివరాలు తెలుపుతారు. పరీక్షల అప్లికేషన్ ఫారాలు, ఇతరత్రా వివరాలు కావాలనుకుంటే ఈ కింది చిరునామాకు వ్రాసినట్లయితే పంపించగలరు.

Director of Education. CSI, CPT
Campus, Taramani, Madras - 3

సాఫ్ట్‌వేర్ కోర్సు నిర్వహిస్తున్న ప్రైవేటు విద్యాసంస్థలు కూడా ఈ పరీక్షల వివరాలు తెలుపుతాయి. ప్రైవేటు సంస్థలలో ముఖ్యమైనవిగా నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజి (ఎన్ఐఐటి), యాపెల్, ఇండో ట్రానిక్స్, ఆప్‌ట్రాన్ మొదలగువాటిని చెప్పుకోవచ్చు. ఇవి చక్కని శిక్షణను, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని అందిస్తున్నాయి.

ఇకపోతే, ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్ర ప్రభుత్వం తరపున సిమ్కో (సెట్విన్ ఇన్‌స్టిట్యూట్) అనే సంస్థ బిజినెస్ డెవలప్‌మెంట్, కంప్యూటర్ మెయింటనెన్స్ అండ్ ఆప రేషన్స్, ఇన్‌ఫర్మేషన్ ప్రాసెసింగ్ అండ్ డేటా ఎంట్రీ, కామన్ బిజినెస్ ఓరియంటెడ్ లాంగ్వేజెస్, క్యాడ్‌కామ్, ఒరాకిల్ మొదలగు కంప్యూటర్ కోర్సులను నిర్వహిస్తోంది. వీటిలో ప్రస్తుతం యూనెక్స్ అండ్ సి లాంగ్వేజెస్ చేసినవారికి చాలా ఉద్యోగావకాశాలుంటున్నాయి. అయితే, దీనిని చేయడానికి ముందు బేసిక్, డాస్ ఆపరేటింగ్ సిస్టం కోర్సులు చేయడం చాలా మంచిది. కొన్ని సంస్థలు – ప్రత్యేకించి యన్ఐఐటి, యాపెల్ లాంటివి మంచి శిక్షణ ఇవ్వడమే కాకుండా, తరచుగా పరీక్షలను నిర్వహించి వాటిలో ప్రతిభ కనబరచిన విద్యార్థులకు దేశ విదేశాలలో ఉద్యోగాలను వెతికి పెడుతున్నాయి.

సాఫ్ట్‌వేర్ రంగంలో ఉన్నటువంటి అవకాశాల్ని దృష్టిలో పెట్టుకొని ఈనాడు జంట నగరాలలో అనేక ప్రాంతాలలో ఎన్నో ప్రవేటు శిక్షణా సంస్థలు పుట్టుకొస్తున్నాయి. వీటిపై అదుపుకాని, ప్రామాణికత విషయంలో తనిఖీ కాని లేకపోవ డంతో పలువురు వీటిని స్థాపించడానికి ముందుకు వస్తున్నారు. అందుకని విద్యార్థులు ఈ సంస్థలలో చేరేముందుగా సంస్థయొక్క సామర్థ్యాన్ని, వారందించే కోర్సు మెటీరియల్ని పరిశీలించి చేరడం మంచిది. ఇకపోతే, ఈనాడు విద్యార్థి దశలో కంప్యూటర్‌పై అవగాహన కల్పించడానికి ప్రాథమిక విద్యా బోధనలో భాగంగా తరగతుల వారీగా వివిధ కోర్సులపై శిక్షణ ఈయడం జరుగుతోంది. ఈ శిక్షణ వల్ల ప్రయోజనం అధికంగా ఉన్నట్లు సర్వత్రా వినిపిస్తోంది.

ఉన్నత విద్యావకాశాలు పొందడానికి ఉపయోగపడుతోంది. అందువలన, తల్లితండ్రులు తమ పిల్లల్ని పాఠశాలలో చేర్పించడానికి ముందు అందులో కంప్యూటర్ కోర్సు ఉందో లేదో ఆరా తీసి ఉంటేనే చేర్పిస్తున్నారు. జంట నగరాలలోని అనేక పాఠశాలల్లో తరగతులవారీగా లాక్‌నిల్ ఎలక్ట్రానిక్స్, బ్యూరో ఆఫ్ కంప్యూటర్, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, బ్లూచిప్ తదితర సంస్థలు కంప్యూటర్ కోర్సులను నిర్వహిస్తున్నాయి. వీటిలో లాక్‌నిల్ ఎలక్ట్రానిక్స్ టీ అనే సంస్థ జంట నగరాలలో సుమారు 30 పాఠశాలల్లో కంప్యూటర్‌లో శిక్షణ పొందిన అధ్యాపకుల ద్వారా తరగతుల వారీగా కోర్సుల్ని నిర్వహిస్తోంది. 4, 5 తరగతుల విద్యార్థులకు 'లోగో' (లాజిక్ జామెట్రీ) కోర్సు ద్వారా గణిత శాస్త్రానికి సంబంధించిన చిన్న చిన్న లెక్కల్ని, జామెట్రీకి సంబంధించి బొమ్మల్ని కంప్యూటర్ ద్వారా గీయడం నేర్పుతున్నారు. 6, 7 తరగతులలో బేసిక్ ప్రోగ్రాం, 8, 9 తరగతుల్లో డేటా బేస్, 10 వ తరగతిలో వర్డ్‌స్టార్‌లలో కోర్సులను నిర్వహిస్తోంది.

చివరిగా ఒక్కమాట – నిరుద్యోగం రోజు రోజుకీ పెరిగిపోతున్న ఈ రోజులలో కంప్యూటర్‌లో శిక్షణ – అదీ హార్డువేర్ ఇంజినీరింగ్‌లో కానివ్వండి, సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగ్‌లో అయినా కానివ్వండి – ఎంతో ఉపయోగపడుతుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

"ఏ భాష చెణుకైన ఏ యాస చినుకైన
తనలోన కలుపుకొని తరలింది తెలుగు." – సి. నారాయణ రెడ్డి

# సమాజం - వ్యక్తి

...

ప్రజల పరస్పర చర్య, ప్రతి చర్యల ఫలితంగా ఏర్పడే చారిత్రక ఫలితం సమాజం. సామాజిక కార్యాచరణ భావం సాంఘిక, ఆర్థిక స్వరూపాలన్నిటికీ ప్రాథమిక భావం. సామాజిక కార్యాచరణ పరస్పరాధారితమైనది. నిర్దిష్టమైన దేశ కాలాలలో, ఒకే పరిణామ చట్రంలో భాగంగా, రెండు లేక మూడు సాంఘిక ఘటనల ద్వారా పరస్పరాధారితంగా జరిగేది సామాజిక కార్యాచరణ.

భౌతికవాద దృక్పథాన్ననుసరించి, సాంఘిక చరిత్రలో ఒకదాని తర్వాత ఒకటిగా, సాంఘిక కార్యాచరణ రూపాలు వస్తూ ఉంటాయి. ఆర్థిక అంశం వీనిలో నిర్ణాయక పాత్ర వహిస్తుంది. ఫలితంగా ఇదొక సహజ చారిత్రక పరిణామంగా కనిపిస్తుంది.

అదే సమయంలో ప్రతి సాంఘిక పార్శ్వంలోను అనేకమైన అంశా లుంటాయి. ఈ అంశాలకు సంబంధించిన చర్య, ప్రతిచర్యలు స్వతంత్రంగా జరుగుతున్నట్లుగా అనిపిస్తాయి.

ఆర్థిక సంబంధాలు అంటే ఏమిటో మార్క్స్ - ఏంగెల్స్‌లు ఇలా వివరించారు:

"ఒక సామాజిక రూపంలోని వ్యక్తులు తమ అవసరాలను ఉత్పత్తి చేసుకొని, తమలో తాము మార్పిడి చేసుకునే పద్ధతినే ఆర్థిక సంబంధాలు అంటున్నాం. ఉత్పత్తి, రవాణాకు సంబంధించిన సాంకేతిక విజ్ఞాన సర్వస్వం ఇందులో ఇమిడి ఉంది. ఈ సాంకేతిక విజ్ఞానమే సరుకుల మార్పిడి పద్ధతినికూడా నిర్ణయిస్తుందని మా అభిప్రాయం.......గణ సమాజ విచ్ఛిత్తి తర్వాత వర్గ విభజన, ప్రభువు - బానిస సంబంధాలు, రాజ్యాంగం, రాజకీయాలు, న్యాయశాస్త్రం ఇత్యాదు లన్నిటినీ ఇదే నిర్ణయిస్తుంది."

**పౌర సమాజం:**

చారిత్రకంగా నిర్ణయింపబడిన సామాజిక రూపాలలో నిర్దిష్టమైన దేశ కాలాలలో ప్రజలమధ్య ఏర్పడే సంబంధాలను సామాజిక సంబంధాలని అంటాము. వర్గం, జాతి, గ్రూపు, సాంఘిక, మానసిక, వ్యక్తిగత సంబంధాలు, ఇవన్నీ కలిసి సమాజం యొక్క సాంఘిక స్వరూపం అనబడుతుంది.

మానవుల పరస్పర సంబంధాలు, లక్ష్యం, విలువలు, రూపాలు, విధి నిషేధాలతో కూడి ఉంటాయి. ప్రజల కార్యకలాపాలన్నీ ఏ సామాజిక వ్యవస్థ పరిధిలో జరుగుతూ ఉంటాయో, ఆ వ్యవస్థ ఈ పరస్పర సంబంధాల స్వరూపాన్ని, సారాన్ని నిర్ణయిస్తుంది.

ఉదాహరణకు మధ్య యుగాలలోని శ్రేణుల ద్వారా సంక్రమించే హక్కులు, బాధ్యతలు ఆనాటి ప్రజల సాంఘిక సంబంధాలను నిర్ణయించాయి. అసలీ శ్రేణులు ఏర్పడటం ఆనాటి ఉత్పత్తి శక్తుల, సంబంధాల పరస్పర పొందిక ఫలితం.

సాంఘిక సంబంధాలు, ఆర్థిక సంబంధాలపై ఆధారపడే మాట నిజమే. అదే సమయంలో సాంఘిక సంబంధాలు సైతం చారిత్రక పరిణామాన్ని నిర్ణయిస్తాయి. అంతేకాదు - సాంఘిక పరిణామం అంటే వేలాది, లక్షలాది వ్యక్తుల పరిణామానికి చెందిన సమాహారం. ఉద్దేశ పూర్వకంగానో లేక అనుద్దేశ పూర్వకంగానో ఈ పరిణామం జరగవచ్చు. ఆర్థిక పరిస్థితులు వాటంతటకవి వెన్వెంటనే ఫలితాలు కలిగిస్తాయనుకోవటం పొరపాటు. అవి సామాజిక రూపాలద్వారా, వ్యక్తుల ద్వారా, వారి ఆకాంక్షలు, ఆశయాల ద్వారా ప్రతిబింబిస్తాయి. మానవులు తమ చరిత్రను తామే నిర్ణయించుకుంటారు. అయితే ఒక నిర్దిష్ట పరిస్థితిలో, అంతకు ముందే రూపొంది ఉన్న ఆర్థిక, సామాజిక సంబంధాల పునాది పైన మాత్రమే వారు వ్యవహరించగలరు. మానవుడు అనేక సామాజిక శక్తుల సమాహారం. సామాజిక సంబంధాలు మారితే వ్యక్తి మారతాడు. కాగా, సామాజిక సంబంధాలు సైతం వ్యక్తి కార్యాచరణ ద్వారానే మారతాయి. కనుకనే సమాజం సవ్యంగా పని చేయాలంటే, సమాజంలో సభ్యులైన వ్యక్తుల మధ్య నిర్దిష్టమైన, ఆర్థిక, సాంఘిక, వ్యక్తిగత సంబంధాలు శాస్త్రీయ ప్రాతిపదికపై ఏర్పడి ఉండాలి.

సమాజం అంటే ఏమిటో ఇప్పుడు పరిశీలించుదాం. సామాజిక సంబంధాలు, అనుబంధాలతో కూడిన, ఒక మేరకు స్థిరమైన వ్యవస్థ సమాజం. ఇందులో పెద్దపెద్ద ప్రజా సమూహాలు, చట్టం, ఆచారం, సాంప్రదాయం -

ఇత్యాదుల బలంతో అనుబంధించబడి ఉంటాయి. ఇవి చారిత్రకంగా పరిణామం చెందిన రూపాలు. నిర్దిష్టమైన ఉత్పత్తి సంబంధాలపై ఆధారపడినవి. మానవ సమాజ చరిత్రలో ఒక నిర్దిష్ట దశలో తల ఎత్తినవి.

## వర్గాలు, వర్గ సంబంధాలు:

కొందరు సామాజిక శాస్త్రవేత్తలు ఇలా అంటారు: వర్గాలు, వర్గవిభజన ఇత్యాదులు గత చరిత్రకు వర్తిస్తే వర్తించవచ్చు. కాని, ఈనాడు వాటి ప్రాధాన్యత లేదు. అనేకమైన సామాజిక గ్రూపులతో కూడి ఉన్నది సమాజం. కుటుంబం, స్నేహబృందం, బంధుకోటి, ఉద్యోగ సంఘాలు, జాతి, మత, కుల, ప్రాంతీయ, అనుబంధాలు – ఇత్యాది అనేక గ్రూపులు కలిసినది సమాజం అంటారు.

వర్గం అనేమాటను తొలగించి, దాని స్థానంలో అనేకమైన గ్రూపులు అను భావం వారు ప్రవేశపెడతారు.

గ్రూపు అనే భావం ఎందుకు ఏర్పడుతుంది ? అందుకు వీరు ఇలా సమాధానం చెబుతారు: బాల్యంలో శిశువు తల్లిదండ్రులపై ఆధారపడుతాడు. ఇది అనివార్యం. తల్లిదండ్రులు ద్వారా శిశువుకు తిండి, విశ్రాంతి, భద్రత, ఆనందం ఇత్యాదులన్నీ లభిస్తాయి. అన్నదమ్ములు, అక్క చెల్లెళ్లు ఇత్యాదులద్వారా పరస్పర సహకార సహాయాలు లభిస్తాయి. కనుక శిశువు పుట్టినపుడే ఒక గ్రూపులో సభ్యుడిగా ఉండే కలిగే లాభాలు చవి చూస్తాడు. జీవితాంతం ఈ గ్రూపు భావం వెంటాడుతూనే ఉంటుంది. కనుక గ్రూపు ప్రాథమిక రూపం అని వీరు వాదిస్తారు.

కాగా, కుటుంబం అనేదే చారిత్రకంగా రూపొందిన వ్యవస్థ. అనాది సిద్ధంకాదు. ఒక దశలో కుటుంబం లేదు. ఎంతో కాలానికి గాని కుటుంబ సభ్యుల మధ్య పని విభజన ఏర్పడలేదు. కనుక ఈనాటి కుటుంబ వ్యవస్థలోని పరస్పర సంబంధాలను శాశ్వతమైనవిగా చిత్రించడం సరియేనా? కాదు – అని మార్క్సిస్టు సాంఘిక శాస్త్రజ్ఞులు సమాధానం యిస్తున్నారు.

సాంఘిక గ్రూపులను – ప్రాథమికం, ద్వితీయం అని రెండు విధాలుగా కొందరు సాంఘిక శాస్త్రవేత్తలు విభజిస్తారు. చిన్న సైజులో వ్యక్తిగత సంబంధాల కెక్కువ అస్కారం కలిగించే గ్రూపులు ప్రాథమిక గ్రూపులు. కుటుంబం ప్రాథమిక గ్రూపు. కొందరి దృష్టిలో కులం కూడా ప్రాథమిక గ్రూపు.

ఫ్యాక్టరీలలో, ఆఫీసులలో, పొలాల్లో పని చేసేటపుడు వ్యక్తులు వృత్తిరీత్యా కొత్త తరహా గ్రూపులుగా ఏర్పడతారు. ఇవి ద్వితీయాలు – వీటి అనుబంధం తాత్కాలికం. వృత్తి ఉన్నంతవరకే ఉంటాయి.

వ్యక్తులు గ్రూపులుగా ఏర్పడే మాట నిజం. గ్రూపులు కొన్ని కర్తవ్యాలను నెరవేరుస్తాయి. కొన్ని ప్రభావాలు కలిగిస్తాయి. కాగా, గ్రూపులు నిర్దిష్ట చారిత్రక వ్యవస్థలో ఏర్పడతాయని, ఒక్కొక్క దశలోని గ్రూపులు, ఒక్కొక్క విధంగా ఉంటాయని మరచిపోరాదు.

మధ్యయుగాలలో వృత్తిదారులు శ్రేణులుగా ఏర్పడేవారు. పైకి చూస్తే ఆటవిక యుగంలో వృత్తి సంఘాలకు, వీటికి పోలికలున్నాయి. కాని, కొంచెం నిశితంగా పరిశీలిస్తే రెంటికీ వ్యత్యాసం అధికమని తెలియగలదు.

ఆధునిక యుగంలో వృత్తి సంబంధాలు ఆయా ఉత్పత్తి కేంద్రాలకు మాత్రమే పరిమితమై వుంటాయి. ఆయా వ్యక్తుల, సాంఘిక, వ్యక్తిగత, సాంస్కృతిక, మతపరమైన జీవితాన్ని ఇవి నిర్ణయించటం లేదు. కాని మధ్యయుగాలలో శ్రేణులు అత్యంత బలవత్తరమైనవి. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, మతపరమైన అనేక కట్టుబాట్లలో, ఆ శ్రేణులే, భారతదేశంలో కుల వ్యవస్థకు త్రోవతీశాయి. పాశ్చాత్య దేశాలలో కూడా శ్రేణులు, తమ సభ్యులపై విపరీత ప్రభావాన్ని కల్గించాయి.

కనుక గ్రూపులు అనే భావం, వర్గం అనే భావానికి ప్రత్యామ్నాయంగా కాక, అందుకు లోబడిన అంతర్భాగంగా భావించడమే సమంజసమూ, శాస్త్రీయమూ.

## 'ఉన్నత శ్రేణి' వాదం:

ప్రతి సమాజంలోనూ, ఉన్నత శ్రేణికి చెందిన ఒక మైనారిటీ ఉంటుందని, తమ విద్య, సంస్కారం, ప్రతిభ, ఔన్నత్యాల ఫలితంగా వారు సమాజాన్నంతనూ నడుపు తూంటారని ఒక వాదన ఉంది. ఈ ఉన్నతులు చారిత్రకంగా, ఉత్పత్తి శక్తుల పైన, సంపద పైన ఆధిపత్యం గల వర్గంలో నుండి మాత్రమే ఉద్భవిస్తున్నారని, కదాచిత్తుగా ఒక రిద్దరు క్రింది స్థాయినుండి పైకి ఎగబ్రాకినా, ఆ వర్గ సిద్ధాంతాలను, దృక్పథాన్ని ప్రతిబించినవారే, ఇలా ఉన్నత శ్రేణిగా పరిగణించబడుతున్నారని మనం విస్మరించరాదు. విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ ఈ విషయమై ఇలా అన్నారు:

"యుగయుగాలుగా, నాగరిక సమాజాలలో, లక్షలాది అనామక ప్రజలుండేవారు. వారే అధిక సంఖ్యాకులు. వారే చాకిరీతో జీవం వెళ్ళబుచ్చేవారు. సంపూర్ణ మానవులుగా వికసించే అవకాశమే వారికి లేదు. వారికి తిండి, బట్ట, విద్య, సంపద – అన్నీ కరువే. కాని, చాకిరీ మాత్రం అత్యధికం. తమ నెత్తిన నాగరిక జ్యోతిని మోసే దీపస్తంభం లాంటివారు వారే. జ్యోతి కాంతి దశదిశలకు వ్యాపిస్తుంది. పై వారు ఆ కాంతిలో ప్రజ్వలిస్తారు. కాని, మోసేవారికి మిగిలేది నూనె మరకలు, దీపస్తంభ భారం మాత్రమే."

ఉన్నత శ్రేణి భావం ఫ్యూడల్, కాపిటలిస్టు సమాజాలకు చెందినది. ఇందులో కొద్దిమందికే విద్యా, సంస్కారం,

సంపద లభిస్తాయి. సోషలిస్టు సమాజంలో, యావన్మంది కార్మిక కర్షక ప్రజానీకానికి పనిభారం తగ్గి, విశ్రాంతి కాలం పెరగడంతో, వేలు లక్షల సంఖ్యలో మేధావులు, శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు తయారౌతున్నారు. ఉన్నత శ్రేణిలోకి మెజారిటీ ప్రజలకు ప్రవేశం లభిస్తున్నది. ఉన్నత శ్రేణి వాదం దాంతో నశిస్తున్నది.

పెట్టుబడిదారీ సమాజంలో సైతం క్రింది శ్రేణివారు పై శ్రేణికి ఎగబ్రాకే అవకాశాలు లేకపోలేదు. కాగా ఇవి చాలా పరిమితం. నిరుద్యోగుల సంఖ్య, అమెరికాతోసహా అన్ని పెట్టుబడిదారీ దేశాలలోనూ పెరుగుతోంది. వారికి "సాంఘిక కదలిక" కు అవకాశం లేనేలేదు. ఉద్యోగాలు సంపాదించినవారిలో సైతం, సమతుల కదలిక (Horizontal Mobility) ఎక్కువగా వున్నదని, ఊర్ధ్వ కదలిక (Vertical Mobility) తక్కువగా ఉన్నదని అమెరికన్ నిపుణులే అంగీకరిస్తున్నారు.

సాంఘిక శాస్త్రంలో పెట్టుబడిదారీ సాంఘికవేత్తలు ఎన్నో విపరీతమైన సిద్ధాంతాలు రూపొందిస్తున్నారు.

సమ్మెలు, పోరాటాలు, తిరుగుబాట్లకు కారణం ఆర్థిక పరిస్థితులు కావని, కార్మికులలో కొందరు, 'పెడ మార్గాన నడిచే' ధోరణికి ఆకర్షింపబడుతున్నారని, వారే తిరుగుబాటు, సమ్మెలు, విప్లవాలకు కారణమని ఒక వాదన. ఈ పెడమార్గాన పోవటానికి ఒక ముఖ్య కారణం, "లైంగిక అసంతృప్తి" అనే ఫ్రాయిడ్ వాదాన్ని వీరు పునశ్చరణ చేస్తున్నారు. ఈ అసంతృప్తిని తొలగిస్తే, వీరి తిరుగుబాటు తత్వం అంతరిస్తుందని వారి వాదన. పెట్టుబడిదారీ దేశాలలో – ముఖ్యంగా అమెరికా, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సులాంటి దేశాలలో స్వేచ్ఛా ప్రేమ, స్వేచ్ఛా ప్రణయం, విశృంఖల లైంగిక ప్రవృత్తిని ప్రోత్సహించే సాహిత్యం, పత్రికలు తల ఎత్తుతున్నాయి. ఇది ఏదో యాదృచ్ఛిక ఘటన కాదు. పీడిత ప్రజలలోని సాంఘిక తిరుగుబాటు తత్వాన్ని పెడ మార్గం పట్టించే యత్నం.

**అశాస్త్రీయ వాదనలు:**

ఇలాగే ఎన్నో సిద్ధాంతాలున్నాయి. కాగా, ఇవి అన్నీ అశాస్త్రీయమైనవి. సాంఘిక శాస్త్రాన్ని చారిత్రక భౌతికవాద పరిణామ సూత్రాలకు భిన్నంగా, అతీతంగా, ప్రత్యామ్నాయంగా రూపొందించే యత్నంలో ఏర్పడుతున్న వైరితలు. సాంఘిక శాస్త్రం ప్రత్యేక శాస్త్రం అనడంలో సందేహం లేదు. కాగా, ఇది మార్క్సిస్టు చారిత్రక భౌతికవాద సూత్రాలకు లోబడిన శాస్త్రం. దానికి అతీతమూ కాదు, ప్రత్యామ్నాయమూ కాదు.

ఎంగెల్సు వ్రాసిన "ఇంగ్లండులోని కార్మికవర్గ పరిస్థితులు" అనే గ్రంథం సాంఘిక శాస్త్ర గ్రంథం. పెట్టుబడిదారీ సాంఘిక శాస్త్రజ్ఞులు ఏయే పరిశీలనా పద్ధతులు అవలంబించాలి అంటారో వాటన్నింటినీ ఎంగెల్సు అవలంబించాడు. సాంపుల్ సర్వే, స్టాటిస్టికల్ అవరేజస్, మానసిక, వ్యక్తిగత పరిశీలన, కుటుంబం, సంస్కారం, విద్య – ఇత్యాది పరిశీలనా పద్ధతులన్నీ ఆయన అవలంబించాడు. కాగా, ఒక అదనపు అంశం వుంది. అదే చాలా ముఖ్యమైనదీ, పెట్టుబడిదారీ సాంఘిక శాస్త్రజ్ఞులు ఉద్దేశపూర్వకంగా విస్మరించేదీ. అదేమంటే, నిర్దిష్ట చారిత్రక పరిస్థితులలో ఈ అధ్యయనం జరిగింది.

భూస్వామ్య వ్యవస్థలో కార్మిక వర్గం అనేది లేదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో మాత్రమే కార్మికవర్గం ఏర్పడ్డది. మరొక పరిణామ క్రమంలో అంతరిస్తుంది.

మౌలికమైన ఈ చారిత్రక గతి తార్కిక దృష్టి ఎంగెల్సు పరిశీలనను అత్యున్నత శాస్త్రీయస్థాయికి చేర్చింది. ఈ దృష్టి లోపించినట్లయితే, విస్మరించినట్లయితే, సాంఘిక శాస్త్రం శాస్త్రీయస్థాయినుండి దిగజారి, కుహనా శాస్త్రీయ ధోరణులయిన ఫ్రాయిడ్ లిబిడో వాదం, అనుకరణవాదం, కదలికవాదం, పెడమార్గ వాదం, ఉన్నతశ్రేణి వాదాలకు (Theory of Libido, Imitation Theory, Mobility Theory, Deviation Theory, Elite Theory) దారి తీస్తుంది.

*(జి.అసిసోవ్ రచించిన "సోషియాలజీ" అనే గ్రంథంనుండి.)*

మీ ఇష్టం ఈ ధాత్రిని
చేయవచ్చు స్వర్గంగా
చీల్చవచ్చు నరకంగా! – శ్రీశ్రీ

# సామాజిక పరిణామం

ఏటుకూరు బలరామమూర్తి, ఎం.ఏ.

సమాజానికీ, వ్యక్తికీ అవినాభావ సంబంధమున్నది. ఒకేఒక వ్యక్తి ఏకాకిగా ప్రకృతిలో జీవించిన ఉదంతం లేదు. మొదటి నుండి వ్యక్తులు గుంపులుగానే జీవిస్తున్నారు. ఒంటరిగా జీవించిన వ్యక్తి మానవుడుగా అభివృద్ధి అయ్యే అవకాశం కూడా లేదు. పుట్టిన వెంటనే, తల్లిదండ్రులనుండి, తోటి మానవులనుండి ఏదో కారణాలవలన వేరుపడి, జంతువుల మధ్య పెరిగిన బాలుడు మాటలురాక, నడకరాక, మెదడు అభివృద్ధికాక జంతుప్రాయుడుగా జీవిస్తున్న ఉదంతాలు మనం ఈనాడూ చూస్తున్నాం.

కనుక వ్యక్తికీ, సమాజానికీ మౌలికంగా సజీవ సంబంధమున్నది.

ఇది అతి ప్రాథమిక దశ.

గుంపులుగా, తెగలుగా, గణాలుగా మానవులు వేల సంవత్సరాలు సంచరించారు. ఈ కాలంలోనే, ఈ జీవ సంబంధం క్రమంగా సామాజిక సంబంధంగా రూపొందింది.

సమాజశాస్త్రం చరిత్రలో అంతర్భాగం. ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు కలిసి ఆర్థిక వ్యవస్థ ఔతుంది. ఆర్థిక వ్యవస్థలోని అంతరంగిక ఘర్షణ, చలనం, గతి – సమాజ పురోగతికి మూల కారణం. ఇంకా ఇతర ఉపకారణాలుకూడా ఉన్నాయి. తెగలు, గణాల నిర్మాణం, అవి నివసించిన భౌగోళిక పరిస్థితులు, ఫలితంగా వాటి అంతరంగిక నిర్మాణంలో ఏర్పడే ప్రత్యేకతలు, మానవునికి ప్రకృతికీగల సంబంధాన్ని గురించి అతి ప్రాథమిక దశలో తెగలలో ఏర్పడే భావాలు, భయాలు, భ్రమలు – ఇవన్నీ కలిసి సామాజిక చైతన్యం అవుతుంది. అది ఒక క్రమబద్ధమైన రూపు ధరిస్తే సామాజిక సిద్ధాంతం ఏర్పడుతుంది. ఇవన్నీ సామాజిక పరిణామంపై ప్రభావాన్ని కలిగిస్తూనే ఉంటాయి.

కనుక సమాజ శాస్త్రం, ఇతర అనేక శాస్త్రాలవలె, చరిత్రలో అంతర్భాగం. ఇదొక ప్రత్యేక శాస్త్రం కూడా.

వ్యక్తులు వస్తుతః స్వేచ్ఛాప్రియులని, వారు తమకు తామై ఐచ్ఛికంగా ఏర్పరచుకునే ఒప్పందాల సముదాయం సమాజం అని ఒక వాదన ఉన్నది.

గుంపును, తెగను, గణాన్ని లేదా సమాజాన్ని విడిచి ఒంటరిగా జీవించగల స్థితి లేదు. ఒకటి, రెండు శతాబ్దాలుకాదు. కొన్నివేల సంవత్సరాలు ఇలా గడిచాయి. సమాజంకంటే భిన్నంగా వ్యక్తికి స్వేచ్ఛ అనే భావం అనాడు కలగటానికి అవకాశం లేదు.

## విశ్రాంతి - అభివృద్ధి

కాలక్రమేణ ఉత్పత్తి శక్తులు పెరిగాయి. అదనపు ఉత్పత్తి ఏర్పడ్డది. అది తిని జీవిస్తూ, ఉత్పత్తి క్రమములో కూరుకుని పోకుండా విశ్రాంతిగా జీవించేవర్గం ఒకటి ఏర్పడ్డది. ఈ వర్గమే భాష, సంస్కృతి, సాహిత్యం, మతం, తత్త్వశాస్త్రం – ఇలాంటి ఉపరితల శాస్త్రాలను వృద్ధిచేసింది. ఆ దశలో సమాజంకంటే భిన్నమైనవ్యక్తి ఒకడున్నాడు అనే భావం కలిగింది. ఇది ప్రధానంగా తత్త్వశాస్త్రంలో, మతంలో ప్రతిబింబించింది. పరమాత్మకంటె భిన్నమైన ప్రత్యగాత్మ, బ్రహ్మపదార్థంకంటె భిన్నమైన జీవుడు అనే భావాలు ఏర్పడ్డాయి. గణం కుటుంబాలుగా, కుటుంబం వ్యక్తులుగా చీలిపోయిన దశలో 'అహం'– నేను. అనే భావం ఏర్పడింది. భారతదేశంలో ఈ భావన ఉపనిషత్తుల కాలంలో మొదలైంది. అనగా క్రీ.పూ. 1000.

ఆంధ్రదేశంలో ప్రాచీన మానవుని ఉనికి కొన్నివేల సంవత్సరాలనుండి ఉంది. రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో లభించిన రాక్షసగుళ్లు, ఆటవికుల సమాధులు, అందులోని పరికరాలు – నిర్మాణాలు ఇత్యాదులన్నీ, పాత రాతియుగం, కొత్త రాతియుగం దశకి చెందినవి.

ఆనాడు వ్యవసాయం లేదు. వేట ప్రధాన జీవనాధారం. ఒంటరిగా జీవించడం అసాధ్యం. తెగలు, గుంపులుగానే మనుష్యులు జీవించేవారు. జనాభా పెరుగుదల అతిస్వల్పం. మరణాల రేటు హెచ్చు. తెలుగుభాష ఏర్పడలేదు. పైశాచీ భాష – అస్పష్టమైన ధ్వని ప్రధానమైన భాష – వాడుకలో ఉండేది. చనిపోయిన వ్యక్తి మరోలోకంలోకి వెళతాడనే నమ్మకం ఉండేది. పిశాచిగా తిరుగుతాడని కూడా అనుకునేవారు. అందుకనుగుణంగానే నాటి సమాధులలో

అనేక పనిముట్లు, కుండపెంకులు, ఆహారపదార్థాలు, పరలోక ప్రయాణపు దారిబత్తానికి ఉంచేవారు.

తెగలలో అధిపతి ఉండేవాడు. అనగా వేటలో నిపుణుడు. అతడు చనిపోతే, ఒకరిద్దరు సాధారణ గణసభ్యులను కూడా అతనితోపాటు సజీవ సమాధి చేసేవారు. పరలోకం పోయినా అధిపతి అధిపతిగానే ఉండాలి. మనుష్యులను చంపటమంటే ఆనాడు మంచి నీళ్ళ ప్రాయం. జంతువుల దశనుండి మానవుడు పూర్తిగా విడివడని కాలం అది. జాలి, కరుణ అనే మాటలే లేవు. తాను సుఖంగా బతకగలిగితే గదా, పక్కవాని విషయమై ఆలోచించే తీరిక!

వివాహ వ్యవస్థ లేదు. అందరు స్త్రీలు, అందరు పురుషులకు చెందేవారు. అయితే తెగ పెద్దకు ప్రత్యేక హక్కులుండేవి. బలంగలవాడిదే పెత్తనం.

## గణ వ్యవస్థ

గణంలో సభ్యులు అతిస్వల్పంగా ఉన్న దశలో, అందరి విషయమూ అందరూ శ్రద్ధ వహించేవారు. ఏమంటే, ఒక వ్యక్తి తక్కువైనా, అది కొరతే. ప్రకృతితో జరిపే పోరాటం, శీతోష్ణాదులతో ఘర్షణ, క్రూర జంతువుల వేట – ఆనాడు ప్రధానసమస్య. కాలం గడిచి, రాళ్ళతో రకరకాల ఆయుధాలు, విల్లమ్ములు చేయసాగిన మీదట, అధిపతి – సామాన్యుడు అను విభజన తెగలో ఏర్పడినమీదట ప్రతి వ్యక్తిని గురించి శ్రద్ధవహించే స్థితి పోయింది. బలహీనుడు, రోగిష్టివైన వ్యక్తి ఉంటేనేం, పోతేనేం? వాడికోసం బలిష్టుడైన బకాసురుణ్ణి వదలుకోలేముకదా! జంతుజాలంలోవలెనే, మనుషులలోకూడా బలిష్టుడే జీవించడానికి అర్హుడుగా అమలుజరిగిన కాలమది. ఆ దశలోనే అధిపతితోపాటు సామాన్యుణ్ణి సజీవ సమాధి చేసే ఆచారం ఏర్పడింది. ఆ దశలో వ్యక్తి సమాజానికి బానిస.

వ్యవసాయం చేయుటం మానవుడు నేర్చుకున్న మీదట బానిసల ప్రాధాన్యం హెచ్చింది. జనాభా ఎంత పెరిగితే అంత మంచిది, ప్రతి వ్యక్తీ, బలహీనుడుసైతం ఏదో ఒక పని చేయగలడు. ఉత్పత్తికి తోడ్పడగలడు. తెలుగుదేశంలో ఆదిమజాతివారు నాగులు. వారికి వ్యవసాయం తెలుసు. తెగలోని అందరి వ్యక్తులపట్ల అధిపతి శ్రద్ధ వహించేవాడు. వ్యక్తికి విలువ పెరిగిన కాలం అది.

క్రీ.పూ. 600–700 మధ్యకాలం ఇది. ఈ దశలో బౌద్ధం భారతదేశంలో పుట్టింది. (క్రీ.పూ. 550) తోటి మానవునిపట్ల ప్రేమ బౌద్ధానికి మూలం. ఆనాటి వ్యవసాయాభివృద్ధికి కూడా అది అవసరం. కనుకనే బౌద్ధం బాగా వ్యాపించింది. తెలుగుదేశంలో నాగులు బౌద్ధులయ్యారు. అమరావతి స్థూపాన్ని మొదట ఒక నాగరాజు నిర్మించాడు.

మరొకవైపు నుంచి ఆర్య తెగలు వింధ్యదాటి దక్షిణానికి రాసాగాయి. అపస్తంబుడను బ్రాహ్మణసూత్రకారుడు ఆ తెగలకు నాయకుడు. వారిలో వర్ణ విభజన ఉంది. పని విభజన అందుకు ప్రాతిపదిక.

పని విభజన, వృత్తి విభజన ఉత్పత్తిశక్తులను పెంచటానికి తోడ్పడిన కాలమది. భారతదేశంలో వర్ణ వ్యవస్థకుగల సామాజిక పునాది అదే.

ఆంధ్రదేశంలో క్రీ.పూ. 600–700 ప్రాంతంలో ప్రారంభమైన సామాజిక పరిణామం, క్రీ.పూ. 2 వేల సంవత్సరాలనాటికే ఉత్తరాదిన ప్రారంభమైంది. సామాజిక దశల పరిణామంలో ఉత్తర హిందూదేశం సుమారు 1500 సంవత్సరాలు కాలగతిలో ముందున్నదని చెప్పవచ్చు.

## వేదకాలం

వేదకాలంలో వర్ణ విభజన లేదు. బ్రాహ్మణ, అరణ్య కాల దశలో పురోహితవర్గం ఏర్పడ్డది. వారిదే పెత్తనం. ఆనాటి బ్రాహ్మణుడు, యజ్ఞయాగాది క్రతువులతోపాటు అడవులుకొట్టి, సస్యయోగ్యం చేశాడు. జమదగ్ని, వశిష్టుడు, భరద్వాజుడు ఇత్యాదులందరూ అట్టివారే. ఆశ్రమ ప్రాతిపదికపై వ్యవసాయోత్పత్తిని పెంపుచేశారు. మరొకవైపున చిన్న చిన్న నగరాలు ఏర్పడసాగాయి. క్షత్రియులు ఏర్పడ్డారు. రాచరిక వ్యవస్థ ఏర్పడ్డది. బ్రాహ్మణ, క్షత్రియ ఘర్షణ – గ్రామీణ – పట్టణ పెత్తందార్ల ఘర్షణ. అదే పరశురామయుగం. క్రమంగా బ్రాహ్మణుడు ఓడిపోయాడు. పేరుకు అగ్రవర్ణమవే గుర్తింపు వున్నా రాజ్యాధికారం క్షత్రియులకే స్థిరపడ్డది.

ఉపనిషత్తుల కాలం మొదలైంది. యజ్ఞ యాగాల నిరసనతో, బ్రహ్మవిద్య క్షత్రియుల నుండి ఉద్భవించింది. యజ్ఞయాగాదులలో పశుహింస, ఉత్పత్తి పురోగతికి ఆటంకంగా తయారైంది. యజ్ఞయాగాదులు, గ్రామ జాతర్లవలె, వేలాది పశువులను వధించే బలికేంద్రాలైనవి.

వశిష్టుని హోమధేనువును విశ్వామిత్రుడు అపహరించటం, జమదగ్ని హోమధేనువును కార్తవీర్యార్జునుడు అపహరించటం, ఇలా నాటి కథ లన్నిటిలోనూ పశుసంపదకై బ్రాహ్మణ, క్షత్రియ ఘర్షణ వ్యక్తమౌతుంది. అనగా, ఉత్పత్తి సాధనాలపై ఆధిపత్యం కొరకు రెండు వర్గాలమధ్య, రెండు వర్ణాలమధ్య పోరాటం. ఈ ఘర్షణ కొన్నివేల సంవత్సరాలు సాగింది. ఈ మధ్యలో రామాయణ, భారత గాథలు నడిచాయి. బుద్ధునికాలం నాటికిగాని ఈ ప్రాంతంలో పురోహిత వర్గం పూర్తిగా ఓడిపోలేదు. పాత వైదిక మత పరిధిలో బ్రాహ్మణ పురోహితవర్గం ఓటమి సాధ్యం కాలేదు నూతనమైన, మానవతా పూర్ణమైన, బౌద్ధమత ప్రాతిపదికపై ఇది జరిగింది.

ఈ పరిణామం అంతా ఉత్తర హిందూస్థానానికే పరిమితం. వింధ్యకు దక్షిణాన యక్ష లాంటి తెగలు వర్ణ వ్యవస్థలేని ఆదిమ కమ్యూనిస్టు దశలోనే జీవిస్తూ ఉండేవి. అపస్తంబుని అధ్వర్యాన క్రీ.పూ. 1000 ప్రాంతంలో

ఆంధ్రుల దక్షిణాపథ యాత్ర, ఆ పిమ్మట కొంతకాలానికి బౌద్ధం వ్యాప్తి – ఈ రెంటితో ఉత్తర దక్షిణ ప్రాంతాల విభజన రద్దయింది. ఆంధ్రదేశంలో సామాజిక పరిణామం మొదలైంది.

శాతవాహనయుగంలో బౌద్ధంలోని కరుణ, వైదిక మతం లోని వృత్తి విభజన – రెండూ ఉత్పత్తిశక్తుల పెరుగుదలకు తోడ్పడ్డాయి. కనుకనే శాతవాహన యుగమంతటా బౌద్ధం, వైదికం సహజీవనం చేశాయి.

## కుటుంబ వ్యవస్థ

కుటుంబ వ్యవస్థ ఏర్పడ్డదిగాని, తెగల అలవాట్లు వదల లేదు. స్త్రీ, పురుషులు కామ వ్యాపారాలను, భార్యాభర్తల మధ్య లేక కుటుంబ సభ్యుల మధ్య పరిమితం చేయటానికి కొన్ని వందల సంవత్సరాలు పట్టింది. స్వేచ్ఛా కామ ప్రవృత్తిని చూసీ చూడనట్లు ఊరుకునే స్థితి ఉండేది. శాలివాహన గాథా సప్తశతిలోని అసంఖ్యాకమైన శృంగార గాథల సామాజిక అర్థం ఇదే.

ఆంధ్రులలో – ప్రత్త – అను ఆచారం ఉన్నట్లు వాత్స్యాయన కామ సూత్రాల వల్ల తెలుస్తున్నది. వివాహిత స్త్రీ మొదటిరాత్రి గ్రామాధికారితో గడపాలి. ఆ పిమ్మట భర్తతో కాపురం చేయాలి. అనగా ప్రతి స్త్రీ మీద ప్రతి పురుషునికిగల ఆటవిక తెగల హక్కును వదలుకోటానికి ఇదొక లంచం. ఇదే దశలో గణికావృత్తి ఏర్పడ్డది. అనగా, గణానికంతటికి చెందిన స్త్రీలు, వారు అవివాహితలు ప్రతి గ్రామంలోనూ సగంమంది కులస్త్రీలు అనగా వివాహితులుంటే, సగంమంది గణికలుండేవారు. పురుషులు పెద్ద సంఖ్యలో నిరంతరం యుద్ధాలలో నిమగ్నులై ఉండేవారు. స్త్రీలందరికి వివాహం చేయటం భౌతికంగా అసాధ్యమైన స్థితి. గణికావృత్తికిదొక కారణం. కాలక్రమేణా ఈ గణికలే దేవదాసీలు అయినారు.

వ్యక్తిపై అనువంశికత, పరిసరాల ప్రభావం రెండూ ఉంటాయి. వర్ణవ్యవస్థ కుల వ్యవస్థగా మారి, అనువంశిక ప్రభావం హెచ్చసాగింది. అగ్రవర్ణాల ఆధిపత్యం హెచ్చింది. మానవులందరూ సమానులే అని చెప్పిన బౌద్ధం వెనకడుగు పట్టింది.

విదేశాలనుండి శకులు, యవనులు, కుషాణులు, తది తరులు వేలూ, లక్షల సంఖ్యలో భారతదేశానికి వలస వచ్చిన కాలం అది, శకరాజులకు, శాతవాహనులకు అనేక యుద్ధాలు జరిగాయి. ఒకసారి వారూ, ఒకసారి వీరూ గెలుస్తుండేవారు. ఈ విదేశీయులందరూ క్రమంగా బౌద్ధ, హిందూ సమాజంలో చేరిపోయారు. ఆంధ్రదేశంలోని అన్ని వర్ణాలలోనూ వారందరూ కలిసిపోయారు.

వర్ణాలులేని సమాజంలో వర్ణాలు ఏర్పడటమంటే అర్థం ఏమిటి? అంతా ఒకటిగా ఉన్న గణంలోనుండి కొందరిని కేటాయించి బ్రాహ్మణులని, మరికొందరిని క్షత్రియులని విడదీయుటమన్నమాట. ఇలా చేసిందెవరు? పురోహితవర్గం. ఇందుకు రాజుల అండదండల లుండేవి.

## ఊర్ధ్వగమనం

ఈ కేటాయింపు ఒక్కసారితో పూర్తి అయిందా? ముగిసిందా? లేదు. చరిత్రలో నిరంతరం జరుగుతూనే ఉంది. ఒక కులం వారు గుంపుగా కొత్తప్రాంతానికి వెళ్ళి తమ కులాన్ని పెంచుకుని, క్షత్రియులుగానో, బ్రాహ్మణులు గానో చలామణీ అయ్యేవారు. అందుకు తగినట్లుగా ఆచారవ్యవహారాలు, భోజనం, అలవాట్లు, మాటా మంతీ అన్నీ మార్చుకునేవారు. కానిపక్షం లో బ్రాహ్మణుల సంఖ్య అసలు ఎలా పెరిగింది? చాళుక్య, వైదుంబ, కాకతీయ, బ్రహత్పలాయన, విష్ణుకుండిన, ఆనంద గోత్రిక, శాలంకాయన, పల్లవ, చోళ – ఇత్యాదులందరూ క్షత్రియులెలా అయ్యారు? ఇక్ష్వాకులు, హైహయులు మొదలైన వారంతా ఆంధ్రదేశంలో ఎలా వెలిశారు?

తెగల సంచారం, తమ గొప్పతనాన్ని పెంచుకునేందుకు కొత్తపేరు తగిలించుకోవటం – ఈ రెండూ ఇందుకు కారణాలు. శాతవాహనుల తర్వాత నాగార్జున కొండ ప్రాంతాన్ని పరిపాలించింది ఇక్ష్వాకులు. అనగా శ్రీరాముని సంతతి వారనా? అయోధ్యనుండి దక్షిణానికి దిగి వచ్చారనా? కాదు. స్థానిక ప్రభువులు, సేనానులు శక్తి సంపదలచే అధికారాన్ని కైవసం చేసికొని, తాము ఇక్ష్వాకుల మని దాన శాసనాలు చెక్కించుకున్నారు. క్షత్రియత్వం పొందిన అడవి చెంచులే ఇక్ష్వాకురాజులు అని పరిశోధకులు అంటు న్నారు. శాతవాహనులు మొదట సార్థవాహులు. అనగా వ్యాపారస్తులు, క్షత్రియులయినారు. పిమ్మట బ్రాహ్మణుల మనిపించుకున్నారు.

కులాలు, వర్ణాలు, క్రిందినుండి పైకి ఎగబాకటాన్ని సంస్కృతీకరణ అంటాము. పైనుండి క్రిందికి దిగజారుటను అసంస్కృతీకరణ అనవచ్చు.

ఈ మార్పులు కొన్ని ఉద్దేశ పూర్వకంగానూ, కొన్ని యాదృచ్ఛికంగానూ జరిగాయి. యుద్ధాలు, కరువు కాటకాలు వచ్చి జన నష్టం విపరీతంగా జరిగినపుడు యిట్టి మార్పులు యాదృచ్ఛికంగానే జరిగేవి. ఉన్నవారందరు వారి వారి అభిరుచులను, శక్తి సామర్థ్యాలను బట్టి వేర్వేరు వృత్తులను చేపట్టేవారు. నిర్బంధం అవసరం ఉండేది కాదు. క్రమేణా వృత్తులు స్థిరపడి వర్ణాలు, కులాలు ఏర్పడేవి.

## గోగర్భ వ్రతం

సంపన్నులైన కొందరు పురోహిత వర్గాన్ని ఆశ్రయించి

హిరణ్య గోగర్భవ్రతంచేసి క్షత్రియులుగానూ, బ్రాహ్మణులుగానూ పరివర్తన చెందినవారూ ఉన్నారు. ముఖ్యంగా ఈ రెండు పదవులకే పోటీ ఎక్కువగా ఉండేది. బ్రాహ్మణులవగా మేధావివర్గం. శ్రమ జీవితంతో అవసరం లేదు. అగ్రహారాలు అనుభవించవచ్చు. క్షత్రియులవగా అధికారవర్గం.

చేతివృత్తులవారు వ్యాపారవర్గంగా మార్పు చెందారు. తెలికలవారు, చేనేతవారు వ్యాపార రంగంలో ప్రవేశించి, కొన్ని చోట్ల వైశ్యులుగా చలామణి ఐనారు. మరికొన్ని చోట్ల ఆర్యవైశ్యులయ్యారు.

ఈ విభజన మధ్యయుగం అంతటా జరుగుతూనే ఉంది.

పల్నాటి యుద్ధంలో, బ్రాహ్మణ, వైశ్యుల ప్రస్తావన, మాల, మాదిగల ప్రస్తావన ఉంది. కాని, వ్యవసాయదారులలో కమ్మ, రెడ్డి, వెలమ అను విభజన లేదు. ఉన్న నాలుగు కులాలు కూడా రద్దు చేయాలని బ్రహ్మనాయుడు ప్రయత్నించాడు. చాపకూడు పెట్టించాడు. ఆచరణలో కులాలు రద్దుకాలేదు. కొత్త కులాలు ఏర్పడ్డాయి. బ్రహ్మనాయుడు పద్మవెలమ కులానికి మూల పురుషుడైనాడు.

## పల్నాటి యుద్ధం

పల్నాటియుద్ధంలో అనేక కుటుంబాల పేర్లున్నాయి. గోత్రాల పేర్లున్నాయి. "అట్లూరి వారును, ముట్లూరువారు" అంటూ అనేక కుటుంబాల ప్రస్తావన ఉంది. గ్రామనామాలు కుటుంబనామాలుగా ఉండేవి. క్రమంగా వీనిలో నుండి రెడ్డి, కమ్మ, కాపు కులాలు ఏర్పడ్డాయి.

వృత్తుల ప్రాతిపదికగా కమ్మరి, చాకలి, మంగలిలాంటి కులాల ప్రస్తావన అంతకుముందునుంచీ ఉంది. పండితారాధ్య చరిత్రలోను, బసవ పురాణంలోను ఈ వృత్తుల ప్రస్తావన వివరంగా ఉంది.

నన్నయభట్టుకు పూర్వం బ్రాహ్మణులలో వైదిక, నియోగి విభజన లేదు. ఈ విభజన కాకతీయుల కాలంలో మొదలైంది. గ్రామ కరణాలుగా బ్రాహ్మణులను పెద్ద ఎత్తున, కాకతీయ గణపతి దేవుడు నియమించాడు. వారే ఆరువేల నియోగులైనారు. నాటినుండి ప్రభుత్వోద్యోగాలకు పరిమితమైనవారు నియోగులైనారు. ఇతరులు వైదికులైనారు.

భారతదేశంలో ఇతర ప్రాంతాలలోవలెనే, ఆంధ్రలో కూడా అస్పృశ్యత వర్ణవ్యవస్థ పక్కనే నీడగా పెరుగుతూ వచ్చింది. వ్యవసాయం పెరిగిన మీదట వ్యవసాయ కార్మికులవసరమైనారు. తెగల జీవితంలో ఉన్నవారిని గ్రామ జీవితంలో ప్రవేశపెట్టి, ఏదో ఒక స్థానం కల్పించవలసి వచ్చింది. ఇతరులతో సమానస్థాయి ఇవ్వనిష్టంలేక, వారిని ఊరికి బైటగా అస్పృశ్యులుగా ఉంచారు. కాని, వారి సేవలు లేనిదే వ్యవసాయం నడిచేది కాదు.

## అంతరాలు

కుటుంబం – సంఘం – వ్యక్తి; ఈ మూడింటికి గల సంబంధం ఎలా ఉండేది?

కుటుంబ జీవితం సమాజం అంతటా ఒకరకంగా ఉండేదనుకోవటం పొరపాటు. ఈనాడే అలా లేదు.

సార్వజనీన విద్య, ఓటింగుహక్కు, పత్రికలు, పుస్తకాలు, సినిమాలు ఇత్యాదుల కారణంగా కులాలతో, వర్ణాలతో ప్రమేయం లేకుండా సార్వత్రిక సాంఘిక విలువలు ఏర్పడేందుకు ఈనాడు హెచ్చు అవకాశముంది. ఐనప్పటికీ, ఆర్థిక, సాంఘిక వ్యత్యాసాల ననుసరించి,ఈ కుటుంబ జీవిత పద్ధతుల్లోనూ, నైతిక భావాలలోనూ వివిధ శ్రేణులలో వ్యత్యాసం ఈనాటికీ ఉన్నది.

భూస్వామ్య వ్యవస్థలో ఇది మరీ హెచ్చు. సార్వజనీన విద్య ప్రసక్తే లేదు. వృత్తివిద్య మినహా మరొకవిద్య లేదు. పురాణశ్రవణం వంటి వానిద్వారా ఏర్పడే నైతిక విలువలు వర్ణవ్యవస్థ పరిధిని దాటేవికావు. ఆ పరిధిని దృఢతరం చేసేవి. అవైనా పూర్తిగా అందరినీ ఆవరించలేదు. ఏమంటే, క్రింది వర్ణాలు, వర్గాలు ప్రాచీనకాలంలో సైతం పురాణ కథలద్వారా ప్రభావితులు కాలేదు. బౌద్ధం, జైనం, వీరశైవం, ఆ పిమ్మట అచలాయతనం, బ్రహ్మంగారి తత్వం – ఇలాంటి ఏవేవో ధోరణులు, ఆ పిమ్మట వైష్ణవం – చేతి వృత్తులవారిని, నిమ్నజాతులవారిని ఈనాటికీ ఆకట్టుకునే ఉన్నాయి. పూర్వం మరీని.

ధనికవర్గాల, ముఖ్యంగా వైశ్యుల, క్షత్రియుల కుటుంబ నైతిక జీవితం, వాత్స్యాయన కామసూత్రాల ద్వారా, కొంత తెలుసుకోవచ్చు. బ్రాహ్మణులలో కూడా ఒక విభాగం అలాగే జీవించేది. కామసూత్రాలలో వర్ణించబడిన 64 కళలు, గోష్టి వినోదాలు, ఆటలు, ఉత్సవాలు – ఇవన్నీ కేవలం అత్యంత ధనికులకు మాత్రమే సాధ్యం. అధిక సంఖ్యాకులు అట్టి భోగ లాలసత్వంతో జీవించే అవకాశమే లేదు.

## వ్యక్తి - యంత్రంలో మర

భూస్వామ్య యుగంలో వ్యక్తి కుటుంబం, కులం, వృత్తి, మతం, రాజు – అను వేర్వేరు సాంఘిక వ్యవస్థలకు కట్టుబడి జీవించిన వాడు. వ్యక్తిని ఇవి అనేక కట్టుబాట్లకు, ఆంక్షలకు లోను జేసేవి. ఒక వృత్తికీ – మరో వృత్తికి పోటీ. తెలికలవారు (అనగా నూనె గింజలను గానుగపెట్టి నూనె తీసి అమ్ముకుని జీవించేవారు) కమ్మరులు, కుమ్మరులు, దేవాంగులు – ఇత్యాది వృత్తుల వారిలో ఒకరి కొకరు సహకారంగా జీవించిన కాలం శాతవాహనయుగం. అది బౌద్ధ సంస్కృతి ప్రభావం. వృత్తి ప్రాతిపదికగా ఏర్పడిన కులాలలో హెచ్చు తగ్గులను వారు సృష్టించలేదు. బౌద్ధసంస్కృతి

ప్రాబల్యం తగ్గి, అంతరువులు, దొంతరలు, హెచ్చుతగ్గులపై ఆధారపడిన నైతిక మత పునరుద్ధరణ జరిగిన మీదట, అన్ని కులాలలోను హెచ్చు తగ్గుల భావం ఏర్పడ్డది. ఉద్దేశ పూర్వకంగా సృష్టించబడ్డది. జనాభా పెరుగుదల కూడా ఈ అసమానతల సృష్టికి ఒక కారణం.

గ్రామంలో ఏ ఉత్సవం, జాతర, జరిగినా ముందు ఫలానా కులంవారికి మర్యాద ఇచ్చి, వారి ఎద్దులను ఊరేగించాలి. వారి మేకలను బలి ఇవ్వాలి. వారిపేరు ముందు ప్రస్తావించాలి. ఇలాటి ఆచారాలు వచ్చాయి. ఇందులో ఏ మాత్రం తేడా వచ్చినా కలహాలు, కొట్లాటలు, ఖూనీలు మామూలు. పాలకవర్గం వీటిని ఒక ఆచారంగా భావించేది.

ఈ వివిధ శాఖలు కుల కాఠిన్యాన్ని ఒకమేరకు తగ్గించినవే. కాని, కాలక్రమేణ కుల కట్టుబాట్లు, కట్టడులు పెరగటానికి తోడ్పడ్డాయి.

మతం నాటి సమాజంలో పెద్ద పాత్ర వహించేది. రాజులు తమ మతస్థులను ఆదరించి పదవు లివ్వటం, అన్య మతస్థులను త్రోసిపుచ్చటం ఒక విధానంగా చేపట్టేవారు.

ప్రజలను నిరంతరం ఉద్రేకపరులుగా, ఆవేశపరులుగా ఉంచడం నాటి రాజులకు అవసరం. నిరంతరం యుద్ధ సన్నద్ధతకది అవసరం. జాతరలు, గ్రామదేవతల కొలువులు, ఉత్సవాలు, పండుగలు మొదలైన సామూహిక, ప్రదర్శనలు హెచ్చు. వీనిలో మూక (Crowd)కు వ్యక్తి బానిస ఔతాడు. [illegible] ప్రోత్సహిస్తాడు. కోడిపందాలు, గొర్రెపోతు పందాలు ఈ వినోదాలకు త్రోవ తీసేవి. మత విద్వేషాలు హెచ్చేవి. [illegible] అలాంటివే

అన్ని కులాలలోను పురోహిత వర్గం ఏర్పడేది మాలదాసర్లు, [illegible], వీరాచార్యులు, గణాచార్లు, గ్రామదేవతల పూజారులు వీరంతా తమ తమ అనుచరులను నిరంతరం ఉద్రేకపరులను చేయటమే పనిగా పెట్టుకునేవారు. బుడబుక్కలవాండ్లు, ఎరుకులు, మానెగుడ్డలవారు మొదలైనవారు గూఢచారులుగా పనిచేసేవారు. రాజులు వారిని పోషించేవారు.

## పరాన్న భుక్కులు

ఈ పరాన్న భుక్కులందరినీ శ్రమజీవులైన రైతులు, చేతివృత్తులవారు పోషించాలి.

ఇట్టి సమాజంలో వ్యక్తికి ప్రశాంతంగా తన వ్యక్తిత్వాన్ని పెంచుకునే అవకాశ మెక్కడ? ఒక ఇనుప చట్రంలో నుండి మరొక చట్రంలోకి బదిలీ. మొదట్లో కొంత ఊరట. తిరిగి ఇదే పాత పాట.

శంకరుని అద్వైత సిద్ధాంతం వ్యాప్తిలోకి వచ్చిన మీదట ఆంధ్ర బ్రాహ్మణులు మాంసాహారం విసర్జించారు. యజ్ఞ యాగాలు చేసిన సోమయాజులు మాత్రం ఆ సమయంలో మాంసం భుజించేవారు. మామూలు సమయాలలో మాంసాహారం నిషేధం. కాని, గ్రామాలలో కొలువులు, జాతరలలో జంతుబలులు ఇచ్చేటప్పుడు కరణంగారి వాటాగా మేకపోతును ఇచ్చేవారు. పశుహింసను ఇలా ప్రోత్సహించడంలో ఉద్దేశమేమిటి? గ్రామస్తులను నిరంతర మూక (Crowd) మనస్తత్వంలో ఉంచటం పాలక వర్గాలకు లాభకరం గనుక.

కానిచో వీరశైవ, జైన విద్వేషాలు పెరిగి, జైనుల దేవాలయాలు ధ్వంసం చేయబడి, జైనులు వేలసంఖ్యలలో హత్యచేయబడిన కాకతీయుల కాలంలో బ్రాహ్మణు లేమైనారు? వీరశైవులు, జైనులు ఉభయులు వేదాలను అంగీకరించనివారు. బ్రాహ్మణాగ్ర వర్గ ఆధిపత్యానికి వ్యతిరేకులు. కానీ, వారె వరూ బ్రాహ్మణులపై హత్యాకాండ జరపలేదు. రాజులపైకి రానేలేదు. తమలో తాము నరుక్కొని చచ్చారు. ఇలాటి మతోన్మాద ఉద్యమాల సమయంలో, గాలి ఎటు వీస్తే అటు ఒరిగి, ఆ వెల్లువ తమపైకి రాకుండా తప్పించుకునే నేర్పు బ్రాహ్మణ, క్షత్రియులకుండేది. పైగా రాజ్యాధికారం వారిది.

చాళుక్యుల కాలంలో బ్రాహ్మణులలో చాలమంది జైనులు. పొన్న, రన్న అనే కవులు కోస్తాజిల్లాలకు చెందినవారు. జైనులై, కన్నడాన్ని అభిమానించి, కరీంనగర్ జిల్లా వేములవాడ చేరారు. అది కన్నడ రాజ్యం. మహాభారత అవతరణ తర్వాత వీరంతా శైవులైనారు. కాకతీయుల కాలంలో కొందరు వీరశైవులైనారు. పండితారాధ్యుడు, శ్రీపతి, శివలెంక మంచన – ఇత్యాదులంతా వీరశైవులు. కాని బ్రాహ్మణ కులాన్ని వదలలేదు.

*"భవుని మీద భక్తి బ్రాహ్మ్యంబుతో రక్తి*
*వదలలేను నేను బసవలింగ"*

అని పండితారాధ్యుడు చెప్పుకున్నాడు. తిక్కన హరిహర సమన్వయం చేశాడు. ఆ పిమ్మట వైష్ణవం వచ్చింది.

## మతాల మార్పిడి

కాకతీయులకు పూర్వం విశ్వబ్రాహ్మణులు గ్రామ కర ణాలు. వారందరూ జైనులు. దేవగిరి యాదవులకు, ఓరుగల్లు కాకతీయులకు నిరంతరం యుద్ధాలు జరిగేవి. దేవగిరి యాదవులు జైనులు. ఆంధ్రదేశంలోని గ్రామ కరణాలయిన విశ్వబ్రాహ్మణులు దేవగిరి యాదవులకు చాటు మాటుగా తోడ్పడ్డారు. కొందరు మాత్రమే అలా చేసినా, అందరికీ నింద వచ్చింది. గణపతి దేవుడు విశ్వబ్రాహ్మణులందరినీ కరణీక వృత్తినుండి తొలగించి ఆరువేల మంది బ్రాహ్మణులను గ్రామ కరణాలుగా నియోగించాడు. వారు నియోగులయినారు.

వైశ్యులు మొదట్లో జైనులు. పిమ్మట శైవులు, వైష్ణవులు ఐనారు. ఇలా మూకుమ్మడిగా కులాలు, మత మార్పిడి చెందటం చాళుక్య కాకతీయ యుగాలలో జరిగింది. రాజాదరణ పొందాలనే కాంక్ష ఇందుకు ప్రధాన కారణం.

కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, వండ్రంగి, దేవాంగులు, తెలికలు, రథకారులు ఇత్యాదులైన పంచాననం వారు జైనంనుండి శైవానికి మారారు. తెలుగు లిపిని మొదట సృష్టించింది విశ్వబ్రాహ్మణులు. రాళ్ళు చెక్క వలసిన వారు వారే గదా! ఓం నమఃశివాయ సిద్ధంనమః – ఇందులో సిద్ధుడు – జైన మహావీరుడు. ఆ పిమ్మట శివుడు మధ్యలో దూరాడు. శివుడూ సిద్ధుడే – అనగా యోగి.

ఇలా ఒకదానిపై మరొకటి లేపనం జరిగింది.

కులస్త్రీ వ్యభచరిస్తే దోషం. గణిక వివాహం చేసుకుంటే దోషం. బసివిరాండ్రు, దేవదాసీలు, పసిరికలు, భోగస్త్రీలు ప్రతి పెద్ద గ్రామంలోను ఉండేవారు. బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేయకపోతే దోషం. శూద్రుడు చేస్తే దోషం. బ్రాహ్మణుడు మద్యమాంసాలు సేవించటం నిషేధం. శూద్రుడు సైనికుడిగా యుద్ధంలో చావవలసినవాడు గనుక, మాంసం తినాలి, మద్యం సేవించాలి. చంపుట, చచ్చుట అతని విధి. క్షత్రియులు అన్ని కులాల స్త్రీలను వివాహమాడవచ్చు. లేక భోగకాంతలుగా వుంచుకోవచ్చు. కొందరు క్షత్రియులు బ్రాహ్మణ స్త్రీలకు సైతం మినహాయింపు ఇవ్వలేదు. అట్టి సందర్భాలలోనే క్షత్రియ, బ్రాహ్మణ ఘర్షణలు, అంతఃపుర కుట్రలు జరిగేవి. చాళుక్య రాష్ట్రకూట ఘర్షణలలో, రాష్ట్రకూట రాజులు జైనులు, బ్రాహ్మణుల ప్రత్యేకత ఏమి అని ప్రశ్నించినవారు. చాళుక్య, చోళ, పల్లవ ఇత్యాదులంతా బ్రాహ్మణాధిక్యతను గుర్తించిన క్షత్రియులు. సార్వజనీన విలువల కంటె, ఆనాడు కుల కట్టుబాట్లకే ప్రాధాన్యం.

రాష్ట్రకూటుల ఓటమి, చోళ చాళుక్య విజయంతో మహాభారత గాథ తెలుగులోకి వచ్చింది. వర్ణాశ్రమ ధర్మప్రతిపాదన కుద్దేశింపబడిన పంచమ వేదమది.

## ద్వంద్వ నీతి

కులస్త్రీలకు పాతివ్రత్యం విధి. పురుషులకు 'తిరుగుడు' సహజ లక్షణం. వీరత్వచిహ్నం. "ఆడది తిరిగి చెడ్డది – మగవాడు తిరగక చెడ్డాడు" అను మాట అలా పుట్టిందే. రాజస, తామస ప్రవృత్తులు రాజ్యం చేసిన కాలమది.

ఇందులో అంతర్లీనంగా ఉన్నది ఒకే సూత్రం. భుజబలం, ధనబలం గలవాడి మాట చెల్లుబడి అన్ని వర్గాలలోను అట్టివారే పైకి వచ్చారు. బ్రాహ్మణులలో తామస ప్రవృత్తి ప్రధానమైన పూర్వ మీమాంస, క్రతువులు, పశుయజ్ఞాలు పైకి వచ్చాయి. క్రీ.శ. 800 లో శంకరుని అద్వైతం వ్యాపించినా బ్రాహ్మణాగ్రహారాలలో ప్రతిచోట సోమయాజులు, చైనులు, ద్వివేదులు, త్రివేదులు చతుర్వేదులు, ఉంటూనే వచ్చారు. వీరిది రాజస, తామస ప్రవృత్తి. శైవారాధ్యులు ఈ కోవకు చెందినవారే.

మహాభారతావతరణతో సాహిత్య సృష్టి ప్రారంభమైంది. అన్ని వర్గాలలోనూ తామస ప్రవృత్తి తగ్గి సాత్విక ప్రవృత్తి పెరగటానికి ఆనాడు సాహిత్యమే మూలాధారం. మహాభారతంలో వర్ణ వ్యవస్థ ప్రాధాన్యత ఉగ్గడింపు ఉంది. ఆ మేరకది జైనాన్ని దెబ్బతీసింది. మరోవైపున రాజస, తామస ప్రవృత్తులపై సాత్విక ప్రవృత్తి విజయమూ ఉంది. కీచక, బకాసుర, జరాసంధ, దుర్యోధన, శిశుపాలురపై పాండవుల విజయం సాత్విక ప్రవృత్తి విజయం.

మహాభారతంలో కృష్ణావతారం ప్రాధాన్యత ఎక్కువ. దాంతో వైష్ణవం పెరిగింది. వైష్ణవంలో ద్వేషం తక్కువ. సహనం ఎక్కువ. భక్తి, రక్తి, ముక్తి అన్నీ పెనవేసుకున్న మతం.

ఇదీ – భూస్వామ్య యుగంలో ఆంధ్రదేశంలోని సామాజిక చిత్రణ.

## ఇస్లాం ప్రవేశం

కాకతీయ రాజ్యపతనంతో ఇస్లాం ఆంధ్రదేశంలో అడుగు పెట్టింది. అంతకుముందే హిందూసమాజంలో ఉన్న అరిష్టాలన్నీ దాంతో మరింత పెరిగాయి. అన్నిటికి తోడు భయం. తమ ఉనికికే భద్రత లేదనే భావం తోడైంది. హిందూ సమాజం ముడుచుకు పోయింది. కుంచించుకు పోయింది. కుల కట్టుబాట్లు మరింత హెచ్చాయి. నిమ్నజాతులు, చేతివృత్తులవాడు పెద్ద పెట్టున ఇస్లాం స్వీకరించాడు. ముసలయ్యలు మస్తాన్ ఖాన్ లైపోయినారు. పేరయ్యలు పీరు సాహెబులైనారు. సంఖ్య రీత్యా మరాఠ్వాడా, తెలంగాణాలో ఈ మార్పిడి హెచ్చు. సర్కార్, రాయలసీమలలో తక్కువ.

తెలంగాణాలో బ్రాహ్మణులు – ముఖ్యంగా కరణాలు, పటేలు పట్వారీలై, నవాబులను ఆశ్రయించి, వారి ఆచార వ్యవహారాలను అనుసరించసాగారు. మధు మాంసాదులు వారి ఇండ్లలో ప్రవేశించాయి. బానిసలు, పాపలు, వెట్టివాడు సమకూరారు. అన్ని కులాల ఆచార వ్యవహారాలతో ముస్లిమీకరణ జరిగింది అంతకు ముందు సంస్కృతీకరణ జరిగినట్లే.

భూస్వామ్యయుగంలో దేశం, జాతి అను భావం సామాన్య ప్రజలలో ఏనాడూ ప్రవేశించలేదు. రాజులలో మాత్రం చాళుక్యుల కాలంలో ప్రవేశించింది. "అస్తి ప్రశస్త జాతీనాం, రత్నమానివ వారిధిః జన్మభూమిః చాళుక్యానాం దేశో వేంగీతి విస్తృతః" – చాళుక్యుల జన్మభూమి ఐన వేంగీ దేశం సముద్రంలో జన్మించిన జాతిరత్నంవలె ప్రశస్తమైనది – అని అర్థం.

చాళుక్యుల జన్మభూమి వేంగీ దేశం కాదు. వారు

పశ్చిమం నుండి వచ్చినవారు. ఐనా ఇది తమ దేశం అనే అభిమానం వారు ఏర్పరచుకున్నారు. అదే ముఖ్యం.

ఇది రాజులకే పరిమితం. ప్రజల దాకా వ్యాపించలేదు. ప్రజలకల్లా రాజ.భక్తి మిగిలింది. పిమ్మట భారతావతరణంతో పండితులు, తమ అభిమానాన్ని సంస్కృతం నుండి తెనుగుకు మళ్ళించారు.

*"నానా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు*
*తెనుంగునన్ మహాభారత సంహితారచన*
*బంధురుడయ్యె జగద్ధితంబుగన్"*

హిందూ సాంఘిక దృక్పథంలో వ్యక్తి అంతిమ లక్ష్యం మోక్షం. ప్రపంచమంతా దుఃఖమయం. దీనిని బాగు చేయటం అసాధ్యం. 'సర్వేజనాః సుఖినోభవంతు' అనునది నెరవేరని ఆకాంక్ష. కర్మఫలితాన్ని అనుభవిస్తూ మానవుడు జన్మ పరంపరలో పయనించటమే వాస్తవం. బౌద్ధంలోని "జన్మ దుఃఖం, జరా దుఃఖం, సర్వం దుఃఖమయం జగత్" అను మాటను వైదిక మతం స్వీకరించింది. దుఃఖ నివారణగా బుద్ధుడు చెప్పిన అష్టాంగ మార్గాన్ని వదిలివేసింది. దానికి బదులు కర్మ, పునర్జన్మ సిద్ధాంతం చేపట్టింది.

## సాంఘిక పార్శ్వం - వ్యక్తి పార్శ్వం

ఈ సిద్ధాంతానికి రెండు పార్శ్వాలున్నాయి. ఒకటి సాంఘిక పార్శ్వం, మరొకటి వ్యక్తి పార్శ్వం.

పీడిత వర్ణాలు, పేదలు, తమ బాధలకు తమ పూర్వజన్మే కారణమనుకుని, అంతటితో తృప్తిపడో, హతాశులయ్యో అణగి పడివుంటారు. ఇది సామాజిక పార్శ్వం.

రెండవది వ్యక్తి పార్శ్వం. ప్రతి వ్యక్తి, అతడు ధనికుడైనా, ప్రభువైనా కష్టాలు పొందక మానడు. చావు తప్పదు. ఏవో పెంచ భౌతిక క్లేశాలు అనుభవించక తప్పదుగదా!

వాటికి కారణమేమి? వ్యక్తికి–వర్గానికి, వ్యక్తికి – కుటుంబానికి, వ్యక్తికి–సమాజానికి ఘర్షణ ఉన్నది గదా! ప్రతి వ్యక్తి తన ఆత్మోన్నతి కొరకు, మోక్షం కొరకు ప్రయత్నించుట అంతిమ లక్ష్యమని వైదికమతం ఘోషించుచున్నది గదా!

మరి వ్యక్తి అనుభవించే బాధలకు కారణమేమి? అందుకు పూర్వజన్మ, కర్మే కారణం.

మోక్షమనగా జన్మ రాహిత్యం. పునర్జన్మ భ్రమ – జన్మరాహిత్యం తన్నివారణకు ఏర్పడిన మరో భ్రమ. ఐనా, ఇదే హిందూమత లక్ష్యం. ఈలోగా లౌకిక ప్రపంచంలో జీవించినంతవరకు, వర్ణాశ్రమధర్మ అనుసరణ తప్పదు. ఆశ్రమ ధర్మాలు – బ్రాహ్మణులకు క్షత్రియులకు మాత్రమే. శూద్రులు, వైశ్యులు – వానప్రస్థ, సన్యాసాశ్రమాలకు అనర్హులు. వారు ఆజన్మాంతమూ ఆ లోకవృత్తి నాచరించవలసిందే. ఇక వారికి మోక్షమెట్లు? అగ్రవర్ణాల సేవద్వారా. స్త్రీలకో-వారికీ అంతే – పతిసేవద్వారా.

అనగా, పీడితజాతులకు వర్ణధర్మమే కాని ఆశ్రమ ధర్మం లేదు. బాధ్యతలేగాని హక్కులు లేవు. పై వర్ణాలవారికి శుశ్రూష చేయటం, క్రిందివర్ణాలపై పెత్తనం చేయటం మాత్రమే.

అదృష్టవశాత్తు ఈ సాంప్రదాయక చట్టం అక్షరాలా ఏనాడూ పూర్తిగా అమలు జరగలేదు. బౌద్ధ, జైన, శైవ, చార్వాక, వైష్ణవాది సంస్కరణ మతాల ప్రభావం అందుకు కారణం. వర్ణ పరిధికి మించిన కొన్ని ధర్మాలు – దయయు, సత్యంబు, శౌచంబు – ఇత్యాది ఏర్పడ్డవి. భారత, రామాయణాది ఇతిహాసాలు ఈ సార్వజనీన ధర్మాల వ్యాప్తికి తోడ్పడ్డాయి. ఉరిశిక్ష చట్టంలో ఉన్నా, దానిని రద్దుచేసే అధికారం రాష్ట్రపతి కున్నట్లే, మనుస్మృతిలోని కఠిన శాసనాలు అమలు జరపటం, జరపకపోవటం రాజుల చిత్తవృత్తి, పురోహిత వర్గ సలహాలపై ఆధారపడి ఉండేవి. కనుక, ఈ రెండు వర్గాలలో మానసిక మార్పులు సాంఘిక వ్యవస్థపై ప్రభావాన్ని కలుగజేసేవి. న్యాయస్థానాలు, ధర్మాసనాలలో క్రిందినుండి పైవరకు బ్రాహ్మణులకు ప్రథమస్థానం. వైశ్యులకు ద్వితీయస్థానం. శూద్రులకు స్థానమే లేదు. క్షత్రియులు న్యాయం అమలు జరిపే వర్గం గదా! ఇట్టి సమాజం పరిణామం చెందుతూ వచ్చి వచ్చి, 16 వ శతాబ్దానికి, పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి గురైంది. పిమ్మట అనేక మార్పులు రాసాగాయి.

వ్యక్తిస్వేచ్ఛాభావం ఏర్పడ్డది. హేతువాదం మొదలైంది. మూఢవిశ్వాసాలు తగ్గసాగాయి. శాస్త్రవిజ్ఞాన భాస్కరుని కిరణాలు ప్రసరించసాగాయి. ఇదంతా పరసామ్రాజ్యపీడన, పర్యవేక్షణల క్రింద జరిగాయి. మన సామాజిక ప్రగతిలోని అనేక వైపరీత్యాలకు ఇది ఒక కారణం.

# సామాజిక వర్గీకరణ

కె. రాధాకృష్ణమూర్తి ఎం.ఏ.,

నేటివరకు ప్రతి మానవ సమాజం కొన్ని అసమానతలు, లేదా వ్యత్యాసాలు కలిగి ఉన్న మానవ సంవర్గాలను, సమూహాలను కలిగి ఉంది. అట్టి సంవర్గాలను లేదా సమూహాలను జన్మ ప్రాతిపదికపై గాని; ధనం, అధికారం, పరువు, ప్రతిష్ఠ మొదలైన అంశాల ఆధారంగా కాని వరుస క్రమంలో అనేక రకాలుగా వర్గీకరించవచ్చు. ఈ వర్గీకరణనే "సమాజ వర్గీకరణ" అంటారు. సాంఘిక సమాజంలోని సభ్యులందరికి ఒక క్రమశ్రేణిలో తగుపాత్రలు, అంతస్తులు లభిస్తాయి. మానవ చరిత్రలో ఎప్పుడూ వర్గీకరణ పొందని సమాజం ఉన్నట్లు లేదని సోరోకిన్ అనే సమాజ శాస్త్రవేత్త అభిప్రాయపడ్డారు. కులం, వర్గం–సామాజిక వర్గీకరణ ప్రక్రియకున్న ప్రధాన స్వరూపాలు. కులాలు జన్మ ప్రాతిపదికపై ఏర్పడిన సామాజిక విభాగాలు, కాని వర్గాలు ఆర్థిక నిర్మితి వ్యత్యాసాలపై రూపొందబడతాయి.

కులవ్యవస్థ మన దేశంలో వేలాది సంవత్సరాల నుంచి ప్రబలి ఉంది. సంసారం, కర్మ, ధర్మం మొదలైన భావాలు కులవ్యవస్థలో పెనవేసుకొని ఉన్నాయి. ఈ వ్యవస్థ మానవులకు నిర్ణీతమైన అంతస్థు, పాత్రలను అందించటమే కాకుండా, జీవిత విధానాలకు సంబంధించిన అనేక అవసరాలను నెరవేర్చటంలో నిమగ్నమైంధని శ్రీనివాస్ మొదలైన సమాజ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కుల సభ్యులు తమ అంతస్థును వంశ పారంపర్యంగా పొందుతూ, స్వకుల వివాహాలు చేసుకుంటూ, క్రమశ్రేణిలో ఒక నిర్దిష్టమైన, ప్రత్యేక స్థానాన్ని కలిగివుంటారు. ఇతరులతో కలవక, తమ సమూహంలోనే భోజన, వివాహాదులు జరుపుకుంటూ, సంప్రదాయ సిద్ధంగా వచ్చే వృత్తినే అవలంబిస్తూ, ఇతర సమూహాలతో భిన్నమైన సామాజిక, గౌరవ ప్రవృత్తులు కలిగిన ఒక సవర్ణ ప్రజాసముదాయాన్ని కులం అనవచ్చని దామ్లే అభిప్రాయం.

కుల సభ్యత్వం, సంపాదించనక్కరలేకుండా, జన్మవల్ల ఆపాదితమై ఉంటుంది. కులాలలో గతిశీలత చాలా తక్కువ. ఈ వ్యవస్థలో నిమ్న కులాలవారు ఉన్నతకులాలలో సభ్యత్వాన్ని పొందడానికి సూత్రరీత్యా అనర్హులు. అందువల్లనే కులాలు గతిశీలత లేకుండా జడంగా ఉండిపోతున్నాయి. ప్రతి కులానికి అంతస్థుతోబాటు, వృత్తితోబాటు, కొన్ని ప్రమాణాలు ఉంటాయి. కుల సభ్యులు తమ కుల ప్రమాణాలను తప్పకుండా పాటించాలి. ఏ కుల సభ్యుడైనా తన కుల ప్రమాణాలను ధిక్కరించి ప్రవరిస్తే అట్టి వ్యక్తిని కులంనుండి వెలివేస్తారు. కుల సంప్రదాయాలు కులాంతర వివాహాలను అంగీకరించవు.

కుల సంబంధాలు సామాన్యంగా శుచి – అశుచి ప్రమాణాలపై ఆధారపడి ఉంటాయి. ఈ భాగాలు తెగల సంస్కృతి నుండి వారసత్వంగా సంక్రమించిన మూఢనమ్మకాలు.

ఔన్నత్య, అల్పత్వ ప్రమాణాల ప్రాతిపదికపై కులాలను ఒక క్రమశ్రేణిలో వర్గీకరించడం జరిగింది. దీనినిబట్టి ద్విజులు ఉన్నత అంతస్థును, అస్పృశ్యులు తక్కువ అంతస్థును కలిగి ఉండటం సంభవించింది. ఈరెంటికీ మధ్యనున్న శూద్ర కులాల అంతస్థు స్పష్టంగా నిర్ణయించబడలేదు. అందుచేతనే ఈ శూద్రకులాలవారు తాము ఒకరికంటె ఒకరు గొప్పవారమని అభిప్రాయపడుతుంటారు. అన్నపానాది విషయాలలో కూడా కులాల మధ్య నియమాలు, నిషేధాలు ఉన్నాయి. పై కులాలవారు నిమ్నకులాలవారినుంచి ఆహార పానీయాదులు స్వీకరించరు. అయితే ఈమధ్య కాలంలో ప్రభుత్వ పరమైన ఒత్తిడివల్ల, సంస్కరణ ఉద్యమాలవల్ల, పారిశ్రామీకరణ, నగరీకరణ ప్రక్రియలవల్ల ఆహారపానీయ నియమాలలో ఆంక్షలు కొన్ని సడలిపోయాయి.

కొన్ని కులాలవారికి ప్రత్యేక అర్హతలు, మరికొన్ని కులాలకు అనర్హతలు ఈ కుల వ్యవస్థలో కనిపిస్తాయి. శిక్షలు కూడా అపరాధాన్నిబట్టి కాకుండా, కులాన్నిబట్టి విధించడం పూర్వకాలంలో జరుగుతుండేది. దక్షిణాదిలోని గ్రామాలలో అస్పృశ్య కులాలవారు ఊరికిమధ్యగా నివసించరాదని కులసాంప్రదాయాలు నిర్దేశించబడి ఉన్నాయి. అందుకే హరిజన వాడలు ఊరిబయట ఏర్పడి ఉంటాయి. పూర్వం ఈ హరిజనవాడలలోనికి ఇతర కులాలవారు వెళ్ళకూడదని

నియమాలుండేవి. అయితే ఇటువంటి నియమాలు ఇప్పుడు అంతగా అమలులో లేవు.

### సహకారం :

కులపరంగా విభిన్న సమూహాలు వర్గీకరణ చెంది, నిమ్నోన్నత భావాలు కలిగి ఉన్నప్పటికినీ, గ్రామంలో సామాజిక, ఆర్థిక అవసరాలు మాత్రం కులాలమధ్య పరస్పర సహకారం, సంఘీభావం పెంపొందించడానికి తోడ్పడ్డాయి. ఉదాహరణకు మన ఆంధ్రదేశంలో వివాహాది ప్రత్యేక సమయాలలో నిమ్నకులాల వారికి కొన్ని ప్రధానమైన పాత్రలు ఇచ్చి, తద్వారా వారికి కొంత మానసికమైన సంతృప్తిని ఇవ్వడం జరిగేంది. ఈ విధంగా సమాజంలోని అన్ని కులాలవారు తమ కులవిధులను నిర్వహిస్తూ, తమ ప్రత్యేక కులహక్కులను, అంతస్థులను అనుభవిస్తూ, సమన్వయ జీవితాన్ని గడిపేవారు. కులవ్యవస్థనంగీకరించి, అన్ని కులాలవారు పరస్పర సహకారంతో సహాయాలు చేసుకోవడం కులవ్యవస్థ యొక్క ప్రత్యేక లక్షణం.

కులం కేవలం మతపరమైన భావన మాత్రమే కాదు. ఇది సామాజిక, ఆర్థిక అంతస్థులను కూడా సూచిస్తుంది. పైగా కులాలు గ్రామీణ వ్యవస్థపై అధికమైన ప్రభావాన్ని కలిగివుంటాయి. మన సమాజంలో నిమ్నకులాలవారి గృహనిర్మాణంలోను, ఉన్నత కులాలవారి గృహనిర్మాణంలోను వ్యత్యాసాలు కనబడతాయి. కులాల సంఖ్యనుబట్టికూడా గ్రామాలను వర్గీకరించటం కద్దు. అవి : ఏక కుల గ్రామాలు, బహుళ కుల గ్రామాలు. వివిధ కులాలవారు గ్రామంలో వివిధ ప్రాంతాలలో నివసించడం కన్పిస్తుంది. ఉ॥ బ్రాహ్మణవీధి, గొల్లవీధి మొదలైనవి. వృత్తిపరంగా కూడా నివాస ప్రాంతాల మధ్య పృథక్కరణ, వేరుబాటు, విభజన కనిపిస్తాయి. ఉ॥ చాకలివీధి, మంగలివీధి, కుమ్మరవీధి మొదలైనవి. ఇటువంటి పృథక్కరణ, విభజనధోరణులు కులవ్యవస్థను బలీయంచేస్తూ, కులవ్యత్యాసాలను పెంపొందిస్తాయే కాని, బలహీనం చేయవు. స్పృశ్య, అస్పృశ్య భావనలు, మన గ్రామాలలోని నివాస ప్రాంత వ్యవస్థలో ఈనాటికీ కనిపిస్తాయి. ఆధునీకరణ, లౌకికీకరణ ప్రక్రియలద్వారా కొన్ని మార్పులు జరిగినా, శతాబ్దాల తరబడి పేరుకుపోయిన సంప్రదాయిక అస్పృశ్యతా భావన మాత్రం గ్రామీణ పరిస్థితిక నిర్మితిలో ఇంకా సజీవంగానే వుందని చెప్పాలి.

### కులతత్వం :

ఒక కులానికి చెందిన సభ్యుడు లేదా సమూహం తమ కుల సభ్యులపట్ల అభిమానం ప్రదర్శించి ప్రవర్తించినా, లేదా ఇతర కుల సభ్యునిపట్లా లేదా ఇతరుల కుల సమూహంపట్ల వివక్షను ప్రదర్శించి, ప్రవర్తించినా అట్టి ప్రవర్తనను కులతత్వమని చెప్పవచ్చు. అనగా కులతత్వంలో స్వకులాధిక్యత, పరకుల న్యూనతా ఇమిడి ఉంటాయి. కులతత్వంతో కూడుకొని ఉన్న ప్రవర్తనల వల్ల వ్యక్తులకు, సమాజానికి తీరని నష్టం సంభవిస్తుంది. దీనివల్ల సమాజంలో కులపరమైన వైషమ్యాలు, అసూయలు, సంఘర్షణలు బయలుదేరి సమాజాన్ని బలహీనం చేస్తాయి.

కులతత్వం పెరగడానికి బ్రిటిషు వారి విభజన – పాలన విధానం ఒక ముఖ్య కారణం. భారతీయ ప్రజలు కులపరంగా చీలి ఉండటం వల్ల కులాల మధ్య వ్యత్యాసాలను, సంఘర్షణలను పెంపొందించే విధానాల్ని రూపొందించినట్లయితే వారిలో జాతీయ వాదం అంకురించదని బ్రిటిషువారు భావించారు. అంతేకాదు, బ్రిటిషు విద్యావిధానం ప్రవేశపెట్టి, తద్వారా లాభం పొందిన బ్రాహ్మణ కులాలకు వ్యతిరేకంగా బ్రాహ్మణేతరులను ప్రోత్సహించారు. అటుపిమ్మట కులాల, మతాల ప్రాతిపదికగా ప్రత్యేక నియోజకవర్గాలను రూపొందించారు. వీటన్నిటివల్ల భారతీయ సామాజిక, రాజకీయ రంగంలో కులతత్వ ధోరణులు మరింత అధికమైనాయి. ఈ కాలంలో కులం పేరిట విద్యా సంస్థలు, వృత్తి సంస్థలు అవతరించాయి. పైగా నగరాలలో కుల ద్వేషంతో కూడుకున్న సంఘాలు, పార్టీలు అవతరించాయి. బ్రిటిషువారు ప్రవేశపెట్టిన స్థానిక స్వపరిపాలనా సంస్కరణవల్ల కూడా కులతత్వం పెంపొందింది. అంతవరకు నగరాలకే పరిమితమైన కులతత్వం క్రమంగా గ్రామాలకు ప్రాకింది. జిల్లా బోర్డు ఎన్నికలు, పంచాయతీ బోర్డు ఎన్నికలు గ్రామాలలో ఉన్న ఆధిపత్య కులాల వారి మధ్య సంఘర్షణలు లేవదీశాయి. భారతదేశం స్వతంత్రమైన తర్వాత కులతత్వం పెరిగిందే కాని తగ్గలేదు. ప్రజాస్వామ్య రాజకీయాలు ప్రవేశించడంతో కుల వ్యవస్థ రాజకీయ స్థాయిని సంతరించుకొంది.

### రాజకీయ రంగంలో కులాలు :

రాజకీయ పార్టీలు తమ అభ్యర్థులు గెలుపొందడానికి కులాన్ని ఆశ్రయించాయి. రాజకీయ రంగంలో ఈనాడు కూడా కులపరమైన అభిమానం, విశ్వాసాలు బాహాటంగా ప్రదర్శించటం కద్దు. ఎన్నికలలో కుల ప్రాతిపదికపై అభ్యర్థులను నిర్ణయించడం ఎన్నిక చేయడం జరుగుతోంది. దీనికితోడు పంచాయతీరాజ్ కార్యక్రమం అమలులోకి వచ్చి కులతత్వ భావనను గ్రామీణ ప్రజలలో మరింత నాటుకొనేటట్లు చేసింది. దీనివల్ల సమాజంలో సహకారం, సర్దుబాటు, సఖ్యత సన్నగిల్లి విరోధాలు, వైషమ్యాలు, కక్షలు పెరిగిపోయాయి. ఈ ధోరణులు ప్రజాస్వామ్య జీవితానికి, విధానానికి గొడ్డలిపెట్టు.

ఇట్టి కులతత్వం ఈనాడు కేవలం రాజకీయాలకే పరిమితమై లేదు. కులం పేరిట నడిపే వ్యాపార సంస్థలు, విద్యా సంస్థలు, సహకార సంఘాలు, ధర్మకర్తృత్వ సంస్థలు

సంఖ్యాత్మకంగా ఎక్కువవుతున్నాయి. వీటన్నిటివల్ల కుల సభ్యులు సమాజంలో బాధ్యతాయుతమైన పౌరులుగా కాకుండా, కులాన్ని స్వప్రయోజనాలకు వినియోగించుకునే వారుగా తయారవుతున్నారు. అంతేకాదు. కులసంఘాలు పేరుకు, కులం శ్రేయస్సుకు కృషి చేస్తున్నా, కొంత మంది ఈ సంఘాలను, సంస్థలను తమ స్వంత పలుకుబడికి, తమ వర్గ ప్రాభవానికి ఉపయోగించుకుంటున్నట్లు కొన్ని పరిశోధనా వ్యాసాలవల్ల విదితమవుతోంది. వెనుకబడిన కులాలలో కులతత్వంవల్ల దారుణమైన పరిణామాలు సంభవిస్తున్నాయి. ఉదాహరణకు వెనుకబడిన కులాల వారికి, జాతుల వారికి ఆర్థిక, సామాజిక సౌకర్యాలను ప్రత్యేకంగా సమకూర్చడం జరుగుతోంది. అయితే ఈ కులాల సభ్యులు, నాయకులు ఈ సౌకర్యాలను ఆసరగా తీసుకొని తమ స్థాయిని, అంతస్థును పెంచుకోవడానికి కృషి చేయకుండా, బడుగుతనాన్ని శాశ్వతంగా పరిరక్షించుకోవడానికి ప్రయత్నిస్తున్నారని కొంతమంది సమాజ శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

కులంనుంచి ఉద్భవించిందే కులతత్వం కాబట్టి కులాల మధ్య తరతరాలుగా వస్తున్న సామాజిక, ఆర్థిక అంతరాలు, వ్యత్యాసాలు నశించనిదే కులతత్వం నశించదు. అందుచేత ప్రభుత్వం తన రాజకీయ, సామాజిక విధానాల ద్వారా కులాలలో సమానత్వ ఆకాంక్షను పెంపొందించే చర్యలు తీసుకొని, ఆర్థిక సమానత్వ కృషికి, వర్గ రాహిత్యానికి కృషి చేయాలి.

## పారిశ్రామిక విప్లవ ప్రభావం :

పారిశ్రామిక విప్లవ ప్రభావం భారత సమాజంలోని కులవ్యవస్థపైన అధికంగా ఉంది. ఈ విప్లవం సమష్టి కుటుంబ విచ్ఛిన్నానికి దారితీసింది. కుటుంబ పరిశ్రమలయిన చేతిపనులు క్షీణించాయి. కులవృత్తి చేసేవారు వాటిని వదిలిపెట్టి కర్మాగారాలలో పనిచేయడం మొదలుపెట్టారు. గ్రామాలలోని ప్రజలలో చాలా మంది వారి కులవృత్తులను వదలి పారిశ్రామిక ప్రాంతాలకు వలస పోయారు. పట్టణాలలోని, నగరాలలోని కర్మాగారాలలో అన్నికులాలలకు చెందినవారికి వారివారి సమర్థతను బట్టి, నైపుణ్యాన్ని బట్టి ఉద్యోగాలు లభించాయి. దీనివల్ల కులప్రాధాన్యం కొంత తగ్గింది. రవాణా, తంతి, తపాలా సౌకర్యాలవల్ల ప్రజల మధ్య సంబంధాలు ఎక్కువయ్యాయి. కులపంచాయతీలకు బదులు కార్మిక సంఘాలు అవతరించాయి. ఈ సంఘాలలో ఏ కులానికి చెందిన వారైనా కార్మికులందరు సభ్యులే. కర్మాగారాల్లో అగ్ర కులాల వారు, తక్కువ కులాలవారు కలిసిమెలిసి పనిచేయడం తప్పనిసరి అయింది. పూర్వంకంటే ఇప్పుడు విభిన్న కులాలమధ్య పంక్తి భోజనాలు ఎక్కువయ్యాయి. ఈనాడు అక్కడక్కడ కులాంతర వివాహాలు జరుగుతుండడం మనం చూస్తూనే ఉన్నాం. పారిశ్రామికీకరణ వర్గ చైతన్యాన్ని ఎక్కువచేసింది. ఎప్పుడయితే ప్రజలలో వర్గచైతన్యం ఎక్కువ అవుతుందో, అప్పుడే కులధోరణులు తగ్గిపోవడానికి అవకాశం ఉంది.

## ఆధిపత్య కులాలు :

కులం అంశకం ఆధారం చేసుకొని శ్రీనివాస్ "ఆధిపత్యకులం" అన్న భావనను సృష్టించాడు. ఈ భావన ద్వారా ఆయన గ్రామీణ సమాజంలోని కుల గతిశీలతను స్పష్టీకరించడానికి కృషిచేశాడు. ఆర్థికంగా లేదా రాజకీయంగా లేదా సంఖ్యాపరంగా ఏ కులం అయితే ఆధిక్యతను కలిగి ఉందో, అట్టి కులం ఆధిపత్య కులం అని శ్రీనివాస్ అభిప్రాయం. ఆంధ్రప్రదేశ్‌లో పెక్కు గ్రామాలలో రెడ్లు, కమ్మవారు ఆధిపత్యకులాలవారు. గ్రామీణ సముదాయాలలో ఉన్నత వర్గానికి చెందిన భూస్వాములు ఆధిపత్య కులాలవారే. కౌలుదార్లు, రైతుకూలీలు నిమ్న వర్గాలవారు మాత్రమే కాక, నిమ్నకుల సభ్యులే అయి ఉంటారు. వీరికి రాజకీయ, ఆర్థికస్తోమత, పలుకుబడి చాలా తక్కువగా ఉంటుంది.

స్థానికంగా లభించే సేద్యపు భూమిలో చాలాభాగం స్వంతం చేసుకోవడంవల్లను, అధిక సంఖ్యాకులుగా వుండటంవల్లను స్థానిక క్రమశ్రేణిలో ఉన్నతస్థానాన్ని ఆక్రమించి వుండడంవల్ల ఒక కులం ఆధిపత్య కులమవుతుంది. పాశ్చాత్య విద్య, పరిపాలనా రంగంలో ఉద్యోగాలు, నగర వనరుల నుంచి ఆదాయం, ఇవన్నీ గ్రామాలలో కొన్ని ప్రత్యేకవర్గాలవారి శక్తిస్థితిగతులు పెరగడానికి దోహదం చేశాయి. అయితే స్వాతంత్ర్యానంతరం ప్రవేశపెట్టిన సార్వత్రిక వయోజన ఓటింగు, పంచాయతీరాజ్ వ్యవస్థవల్ల నిమ్నకులాలలో, ముఖ్యంగా హరిజనులలో నూతన స్వయం ప్రతిపత్తి, శక్తి పెంపొందాయి. ఈనాడు గ్రామీణ భారత దేశంలో శక్తి, అధికారాలు అధిక సంఖ్యాకులైన రైతు కులాల హస్తగతమైనాయి. హరిజనులు సంఖ్యాపరంగా బలంగావుండి, వారికోసం కొత్తగా ఏర్పాటుచేసిన తదితర అవకాశాలను సద్వినియోగం చేసుకొనే గ్రామాలలో తప్ప, ఇతరత్రా శక్తి, అధికారాలు ఇంకా కొంతకాలందాకా భూస్వాములైన రైతుకులాలవారి చేతులలోనే వుండవచ్చు.

## సంస్కృతీకరణం :

కుల వ్యవస్థలో రెండు రకాల ధోరణులు ఉంటాయి. ప్రతి కులానికి బహుళమైన సంస్కృతులు, నైతిక, మతపరమైన ప్రమాణాలు ఉంటాయని ఆమోదించటం మొదటిది. నిమ్నకులాలవారు ఉన్నత కులాల వారిని అనుకరించటం రెండోది. ఒక నిమ్నజాతిగాని, కులంగాని, తెగగాని, ఇతర సమూహంగాని ఆచారాలలోను, సంస్కారాలలోను, తాత్విక సిద్ధాంతాలలోను, జీవన విధానాలలోను ఉన్నతమైన అంటే

ముఖ్యంగా ద్విజుల మోస్తరుగా పరివర్తనచెందే ప్రక్రియ సంస్కృతీకరణమని శ్రీనివాస్ అభిప్రాయం. ఈ పరివర్తన జరిగిన తర్వాత ఆ కులం అంతవరకు సంప్రదాయకంగా కులశ్రేణిలో తనకువున్న స్థానం కంటె ఉన్నతమైన స్థానాన్ని పొందినట్లు ప్రకటించుకుంటుంది. ఈ విధంగా ప్రకటించు కొన్న స్థానం అందరిచేత ఆమోదించబడటానికి ఒకటి రెండు తరాల కాలం పట్టవచ్చునని శ్రీనివాస్ అన్నాడు.

అయితే ఒక స్థానిక సముదాయంలో, ఆధిపత్యంలేని ఏ కులమయినా ఆధిపత్యతను పొందిన ఒక కులాన్ని అనుకరించడం కూడా జరిగిందని చరిత్ర తెలుపుతోంది. ఆధిపత్యంలేని ద్విజ వర్గానికి చెందిన కులాలు ఆధిపత్యతను పొంది ఉన్న ఏ నిమ్నకులాన్ని, లేదా ఇతర మత జాతులను అనుకరిస్తున్నప్పుడు, ఆ ప్రక్రియను "విసంస్కృతీకరణ"మని అనవచ్చును. బ్రాహ్మణ, కమ్మకుటుంబాలవారు కొందరు, బ్రిటిషు పరిపాలన మొదటిరోజులలో క్రైస్తవ మతాన్ని స్వీకరించటం ఇందుకొక ఉదాహరణ. మహమ్మదీయ యుగంలో ఇదే విధంగా పెక్కు అగ్రవర్ణాల వారు ఇస్లాంమతం స్వీకరించారు. పశ్చిమ పంజాబులో ఇట్టివారు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు.

క్రింది కులాలవారు సంపదను, రాజకీయశక్తిని సముపార్జించుకొన్నప్పుడు వారు సంప్రదాయకమైన తమ క్రింది అంతస్థును విస్మరించి, సంస్కృతీకరణం చెంది ఉన్నత కులాలలో చేరకలిగినారు. అనగా కులాలు క్రిందికి, పైకి చలించడానికి సంప్రదాయక వ్యవస్థ అవకాశం కల్గించింది. కాని ఈరకమైన గతిశీలతవల్ల సంప్రదాయక కులవ్యవస్థమాత్రం మార్పు చెందలేదని గుర్తించాలి. అనగా కేవలం వ్యవస్థలో స్థాయీపరమైన పరివర్తన లేదా గతిశీలత మాత్రమే జరిగింది. కాని నిర్మితీపరమైన పరివర్తనలు జరగడంలేదు అని గ్రహించాలి.

## పాశ్చాత్యీకరణం :

బ్రిటిష్‌వారి పరిపాలన భారతీయ సమాజం మీద, సంస్కృతి మీద విప్లవాత్మకమైన, శాశ్వతమైన పరివర్తనలు తెచ్చిపెట్టింది. బ్రిటిష్‌వారు తమతోబాటు భారతదేశానికి నూతన సాంకేతిక విధానాన్ని, సంస్థలను, విజ్ఞానాన్ని, విలువలను తీసుకొని వచ్చారు. బ్రిటిష్ పరిపాలనవల్ల భారతీయ సమాజంలోను, సంస్కృతిలోను కలిగిన పరివర్తనలను వివరించడానికి పాశ్చాత్యీకరణం అన్న భావన ఎక్కువ ఉపయోగిస్తుంది. పాశ్చాత్యీకరణం పర్యవసానంగా కలిగే మరో రెండు ప్రక్రియలే పారిశ్రామికీకరణం, నగరీకరణం. ఈ ప్రక్రియ లన్నింటిలో ఇమిడివున్న అతి ముఖ్యమైనది మానవతా వాదం. కులం, మతం, లింగం, వయస్సు, వర్గం మొదలైన వాటితో ప్రమేయం లేకుండా సర్వమానవ సంక్షేమానికి కృషి చేయడం మానవతా వాదం యొక్క లక్ష్యం. సమతావాదం, లౌకికీకరణం అనే ప్రక్రియలు కూడా మానవతావాదంలో ఇమిడి ఉన్నాయి. కులం, మతం, జాతి మొదలైన వాటి ప్రమేయం లేకుండా అందరికీ విద్యాసంస్థలలో సిద్ధాంతరీత్యా ప్రవేశ అర్హతలు కల్పించడం ద్వారాను, బానిసత్వ నిర్మూలనం వల్లను సమానత్వ సూత్రాలను ఆచరణలో పెట్టారు. బ్రిటిషువారి పరిపాలన కొనసాగినకొద్దీ తార్కికవాదం, మానవతావాదం విస్తృతమయ్యాయి. స్వాతంత్ర్యానంతరం ఇవి మరింత ముందంజ వేసి బలపడ్డాయి. స్వతంత్ర భారతదేశంలో అస్పృశ్యతా నివారణోద్యమం దీనికి ఉదాహరణగా చెప్పవచ్చు. సిద్ధాంతపరంగాను, సంస్థాపరంగాను చేసిన బ్రిటిషు పాశ్చాత్య విమర్శలు హిందూమతాన్ని పునఃపరిశీలించడానికి దోహదకారులయ్యాయి. అంతేకాదు – క్రింది కులాలవారిని, ముఖ్యంగా హరిజనులను ఇస్లాం మతంలోనికి, క్రైస్తవ మతంలోనికి కలుపుకోవడంవల్ల శిష్టులైన హిందువులు కులవ్యవస్థపట్ల, అస్పృశ్యతపట్ల తమ వైఖరిని మార్చుకోవడానికి ముఖ్య కారణాలయ్యాయి.

సంప్రదాయక భారత సమాజాన్ని పాశ్చాత్యీకరణం చేయడంలో తోడ్పడినవారినే నూతన శిష్టజనులు అని అంటారు. ఆధునిక విద్య నభ్యసించి, ఉన్నత వృత్తులను చేపట్టి, అభివృద్ధి పొందుతున్న పట్టణాలలో వర్తక వాణిజ్యరంగాలలో ప్రవేశించినవారందరు ఈ వర్గానికి చెందివారు.

పైగా ఉన్నత కులాలకు చెందినవారు మాత్రమే పాశ్చాత్యీకరణం, నగరీకరణం చెందుతున్నారని, క్రింది కులాలకు చెందినవారికి సాధన సంపత్తి, ప్రేరణలు లేకపోవడంవల్ల ఆధునిక ప్రపంచంలో అడుగుపెట్టలేకపోతున్నారని పెక్కు అధ్యయనాలవల్ల తెలుస్తోంది. సాధారణంగా ఉన్నత కులాలవారు మాత్రమే నూతన విద్య నార్జించి తద్వారా గౌరవ ప్రతిపత్తులను ఉన్నతోద్యోగాలను పొందుతున్నారు. ఇది ఉన్నత కులాలవారికి, నిమ్నకులాలవారికి మధ్య ఉన్న సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అంతరాలను మరింత ఎక్కువ చేసింది. క్రింది కులాలవారు తాము కూడా పాశ్చాత్యీకరణ చెందాలని ఈమధ్య వాంఛిస్తున్నారు.

## లౌకికీరణం :

బ్రిటిషు పరిపాలనతో మన దేశ సామాజిక జీవనంలో సంస్కృతిలో లౌకికీకరణ ప్రక్రియ ప్రారంభమైంది. తరువాత భావప్రసార సాధనాల అభివృద్ధివల్లను, నగరీకరణ ప్రక్రియ వల్లను, ప్రాదేశిక గతిశీలత, వలసలు అధికం కావడంవల్లను, విద్యావ్యాప్తివల్లను లౌకికీకరణ ప్రక్రియ క్రమంగా పటిష్టమైంది. భారతదేశాన్ని మత ప్రమేయంలేని లౌకిక రాజ్యంగా ప్రకటించడం, న్యాయరీత్యా పౌరులందరు సమానమని రాజ్యాంగంలో గుర్తించడం, సార్వజనీనమైన ఓటు హక్కును కల్పించడం, ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కార్యక్రమాలను అమలుపరచడం

మొదలైనవాటన్నింటిని లౌకికీకరణను పటిష్టం చేయడానికై తీసుకున్న చర్యలుగా భావించవచ్చు.

సంస్కృతీకరణకంటే లౌకికీకరణమే చాలా సాధారణమైన ప్రక్రియ. సంస్కృతీకరణ ఒక్క హిందువులను మాత్రమే ప్రభావితం చేస్తుంటే లౌకికీకరణ భారతీయులందరినీ ప్రభావితం చేస్తున్నది. నగరవాసులలో, విద్యావంతులలో లౌకికీకరణ ఎక్కువగా కనబడుతోంది. లౌకికీకరణలో వివేచనావాదం ముఖ్యాంశం. వ్యక్తిగత జీవితాన్ని, సామాజిక జీవితాన్ని హేతుబద్ధమైన సూత్రాల ననుసరించి క్రమబద్ధం చేయడం, హేతురహితమైన విషయాలను సాధ్యమైనంతవరకు విస్మరించడం వివేచనావాదం యొక్క లక్ష్యం. సంప్రదాయకమైన విశ్వాసాలకు, భావాలకు బదులుగా ఆధునిక విజ్ఞానాన్ని విస్తరింపచేయడం వివేచనావాదంలోని ముఖ్యాంశం.

భారతదేశంలో ఇతర మత సంవర్గాలకంటే హిందువులే లౌకికీకరణంతో ఎక్కువ ప్రాభావిత మైనారని చెప్పాలి. హిందూమతం ప్రధానంగా కులం, సమష్టి కుటుంబం మొదలైన సంస్థలమీద ఆధారపడి కొనసాగుతూ వచ్చింది. ఎప్పుడైతే ఈ సంస్థలలో అనేక మార్పులు వచ్చాయో, అప్పుడే హిందూ మతం లౌకికీకరణ ప్రభావానికి లోనుకావలసి వచ్చింది.

లౌకికీకరణవల్ల శుచి – అశుచి వంటి మూఢనమ్మకాలు ప్రజలలో సన్నగిల్లుతున్నాయి. జీవితంలో ముఖ్య సంఘటనల సందర్భంగా జరిపే సంస్కారాలు సంక్షిప్తమయ్యాయి. కొన్ని సంస్కారాలను విస్మరించడం, మరికొన్నిటిని సంక్షిప్తపరచడం మాత్రమే కాకుండా, రెండు మూడు సంస్కారాలను కలిపి ఒకేసారి జరిపించడం జరుగుతోంది. వివాహాది సంస్కారాలను సంక్షిప్తీకరించే తీరుకూడ గమనార్హం. ప్రజలలో – ముఖ్యంగా బ్రాహ్మణులలో సంస్కారాలకు వినియోగించే సమయం క్రమంగా తగ్గిపోతున్నది. లౌకికీరణంవల్లనే స్త్రీవిద్య అధికవ్యాప్తి నొంది, స్త్రీలలో ఉద్యోగాలు చేసేవారి సంఖ్య పెరిగిపోతోంది. అన్ని రంగాలలోను లౌకికీకరణవల్ల అనేక పరివర్తనలు ఏర్పడుతున్నాయని చెప్పకతప్పదు.

*జీవిస్తాం! జీవిస్తాం!*
*నవ్య జగత్తును సాధించేందుకు*
*భవ్య జగత్తును నిర్మించేందుకు*
*జీవిస్తాం! జీవిస్తాం! – శ్రీశ్రీ*

# కులాలు - వర్గాలు

రాంభట్ల కృష్ణమూర్తి

కులమంటే ఏమిటి? వర్గం అంటే ఏమిటి? కులానికి, వర్గానికి చెందని మరో మాటవుంది. అది వర్ణం. వర్ణమంటే ఏమిటి? ఈ మాటలకు పరస్పర సంబంధమేమైనా వుందా? ఏమాట కామాటే స్వతంత్రమా? సమాజ శాస్త్రవేత్తల్ని తికమకపెట్టే ప్రశ్నలివి. ఈ మాటలు భిన్న భిన్న కాలాల్లో, భిన్న భిన్న అర్థాలలో పుట్టాయి. ప్రచారం పొందాయి. ఒక మాటకు అలవాటుపడిన తరువాత రెండవ మాట పుట్టినప్పుడు పాతదానికి, కొత్తదానికి సమన్వయం కుదిర్చే యత్నం మన పండితులు చేస్తూ వచ్చారు. వారియత్నాలు కొంతకాలం బహుజనామోదం పొందాయి. తర్వాత వాటిని జనం తిరస్కరించారు. అలా తిరస్కరించినప్పుడే గందరగోళం పుట్టి అయోమయం ఏర్పడింది. కనుక ముందు మూడు పదాలకు శాస్త్రీయ నిర్వచనం చెప్పుకొని ఏయే చారిత్రక దశలలో ఏయే మాటలు పుట్టాయో తెలుసుకుంటే వాటికి పరస్పర సంబంధం ఎంతవరకు వుందో వ్యక్తమవుతుంది.

మన దేశంలో అతి ప్రాచీనమైన పదం వర్ణం. అది వేదకాలం నాడే పుట్టింది. పుట్టి, వేద వాఙ్మయం అంతటా విస్తరిల్లింది. ఆఖరికి 1500 ఏళ్ళ క్రిందటే పుట్టిన భగవద్గీతక్కూడా ఎక్కింది. "గుణ కర్మ విభేదాలనుబట్టి నాలుగు వర్ణాలను నేనే సృష్టించాను" అని గీతాచార్యుడు అంటాడు. మన దార్శనికుల మతం ప్రకారం వర్ణాలు నాలుగు, గుణాలు మూడు. ఈ అంకెలకు పొంతన కుదరదు. ఏ వర్ణం ఏ గుణం నుంచి పుట్టిందంటే ఎవరూ చెప్పలేరు. ఆది శంకరుని దగ్గర్నుంచి, గాంధీ మహాత్ముని వరకు అందరూ గీతకు భాష్యాలు వ్రాశారు. ఇందులో ఒక్కరుకూడా ఫలానా వర్ణానికి ఫలానా గుణం అని చెప్పలేదు. ఇక్కడ గీతావిమర్శ మన ధ్యేయం కాదు. కనుక ఆ ప్రస్తావన ఇంతటితో చాలిద్దాం.

వర్ణం అనే మాటకు రంగు అని ప్రచురితమైన అర్థం వుంది. వేదాలను – అందునా ఆది వేదమైన రుగ్వేదాన్ని పరిశీలించి చూస్తే నాటి మనుష్యులలో నలుపు, తెలుపు రెండు రంగులు కన్పిస్తాయి. రుగ్వేద రుషులలో అధిక సంఖ్యాకులు తెల్లవాళ్ళు. వాళ్ళు నల్లవాళ్ళను అతి నీచంగా చూస్తుండేవారు. వారి భాష కుక్కల మొరుగుల్లా వుందని, వారు కుక్కలకన్నా అధ్వాన్నంగా వున్నారని, వారితోళ్ళు వలవమని, ఆ వొలిచిన తోళ్ళతో సంచులు కుట్టుకుంటామని చేసిన వర్ణనలు రుగ్వేదం ప్రథమ మండలంలోనే కన్పిస్తాయి. నల్లవారిని వారు కృష్ణులని, కృష్ణసారులని పిలిచేవారు. కృష్ణశబ్దం నామమేకాని నామవాచకంకాదు. ప్రస్తావన వచ్చింది కాబట్టి, రుగ్వేదంలోని ఓ కథను స్మరించటం ఇక్కడ అప్రస్తుతం కాదు.

రుగ్వేదకాలం నాటికే బానిసలుండేవారు. ఈ బానిసలు సాధారణంగా నల్లనివారు, బహుశా భారతదేశ స్థానికులై వుండవచ్చు. రుగ్వేద మంత్ర కర్తలైన ఆర్యులు యూరపునుండి దిగుమతైన తెల్లవాళ్ళు. వీరు ఉత్తర ధృవ ప్రాంతం నుంచి వచ్చారని బాలగంగాధర తిలక్ ఒక పెద్ద పుస్తకమే వ్రాశాడు. యజమానుల బాధ భరించలేక ఒకసారి బానిసలు తిరుగుబాటు చేశారు. తిరుగుబాటు నాయకునికి పేరు లేదు. రుగ్వేదం ప్రకారం అతడ్ని కృష్ణుడనే అన్నారు. అంటే నల్లనివాడు అని అర్థం. పోతే అంగీర గణం వాడు కనుక అంగీరస కృష్ణుడు అని ప్రస్తావించారు. అతడొకసారి 10 వేల మంది దాసుల్ని మోహరించి అంశుమతి నదీతీరానికి చేరి బానిసయజమానులపై యుద్ధం ప్రకటించాడు. ఈ సంగతి ప్రథమ మండలంలోనే మనకు కన్పిస్తుంది. యుద్ధ పర్యవసాన మేమైందో మాత్రం అక్కడ తెలియదు. మళ్ళీ రెండు మూడు మండలాలు సాగిన తర్వాత మళ్ళీ అంగీరస కృష్ణుని ప్రస్తావన వస్తుంది. "అంగీరస కృష్ణుడు తేజశ్శాలి, బలశాలి, కవి. అంటే మేధావి. కనుక అతడ్ని జయించటం అంత తేలికకాదు." ఇది ఇంద్రవాక్యంగా అక్కడ కన్పిస్తుంది. దీన్నిబట్టి నల్లవాళ్ళను తెల్లవాళ్ళు ఓడించలేకపోయారని అర్థమౌతుంది. అయితే అది కథకు ముగింపుకాదు. మరో రెండు మూడు మండలాలు దాటిన తర్వాత అంగీరస కృష్ణుడే స్వయంగా కొన్ని మంత్రాలకు ద్రష్టగా కన్పిస్తాడు. అంటే అతడి రచనలు కూడా రుగ్వేద

సంకలనంలో వున్నాయన్నమాట. ఈ కథనుబట్టి మనకు వాస్తవం బోధపడుతుంది.

ఏ ధృవ ప్రాంతం నుంచో, యూరప్‌నుంచో పశువులు తోలుకొని ఆర్యగణాలు భారతదేశంలో ప్రవేశించటా నికి ముందు ఈ దేశంలో చాలామంది ప్రజలుండేవారు. కారణాంతరాలవల్ల అందులో కొందరి రంగు నలుపు. ఇక్కడ అదివరకే నివాసమేర్పరచుకొన్న ప్రజలలో ఆర్యుల్లాగే పశుపాలకులు వుండేవారు. ఆహారోత్పాదన దశకు ఇంకా చేరని ఆహార సంపాదకులు (ఫుడ్ గేదరర్స్) వుండేవారు. నేటికీ వున్నారు. జీవన విధానాలలో విభిన్న దశలవారి మధ్య ఘర్షణలు సాగుతూ వుండేవి. ఈ ఘర్షణల్లోంచే నాటి సమాజం ముందడుగువేసి ఏకీకృతమౌతూ వచ్చింది. వారి సంస్కృతిని వీరు, వీరి సంస్కృతిని వారు అందిపుచ్చుకొని సహజీవనం నేర్చుకున్నారు. ఋగ్వేద కాలం నాటికి కొత్తగా వచ్చిన ఆర్యులది ఒక రంగు, స్థానికులది మరో రంగు అవటంవల్ల ఈ రెండింటికి రెండు వర్ణాలని పేరుపెట్టి వుండవచ్చును. కాని జీవనవిధానానికి ఈ రంగులు అడ్డం వచ్చేవి కావు అని అంగీరస కృష్ణుని గాథ వల్లే తెలుస్తుంది. నాటికి వేదాలసంఖ్య రెండే. ఛందస్సు, యజుస్సు. ఛందస్సంటే పద్యకవిత్వం. యజుస్సు అంటే వచన కవిత్వం. కొత్తగా వచ్చినవారు పాతవారు కలసిపోవడంతో పని విభజన ఎక్కువైంది. పని విభజననుబట్టి సమాజం మూడు అంతరువులుగా చీలింది. ఈ మూడు అంతరువులను సమర్థించడం కోసం ఋగ్వేద కవితకే గానానుగుణమయిన స్వర ప్రస్తారంచేసి సామం పేరుతో కొత్త వేదాన్ని పుట్టించారు. కాని తరువాతి కాలపు వేదాలను పరిశీలిస్తే సామవేదానికి ఎంత మాత్రం గౌరవం వుండేది కాదు. అయినా అది మధ్యకాలంలో పుట్టింది. భగవద్గీత మాత్రం "వేదాలలో సామవేదాన్ని నేనే" అని గీతాచార్యునిచేత అనిపిస్తుంది. కానీ మనువు, యాజ్ఞవల్క్యుడు, వశిష్ఠుడు తమ గృహ్యసూత్రాలలో సామవేదాన్ని నీచంగా వర్ణించారు. సామం పాడుతూ వున్నప్పుడు, గాడిదలు ఓండ్ర పెడుతున్నప్పుడు వేదాధ్యయనం చేయకూడదని శాసించారు. ఆపస్తంభుడు ఇంకొకడుగు ముందుకెళ్ళి – గాడిదలు ఓండ్ర పెడుతున్నప్పుడు, కుక్కలు మొరుగుతున్నప్పుడు, సామగానం చేస్తున్నప్పుడు వేదాధ్యయనం పనికి రాదన్నాడు. దీన్నిబట్టి ఆ వేదానికి పూర్వం ఎంత గౌరవం వుండేదో అర్థం చేసుకోవచ్చు.

అప్పటికి మూడు వేదాల ప్రకారం మూడు వర్ణాలుండేవి. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు. ఈ ముగ్గురికి వేదాధికారం ఉండేది. ముగ్గురూ యజ్ఞాలు చేసేవారు. ఆ రోజుల్లో బ్రాహ్మణులు షట్కర్మ నిరతులు. అవేవంటే – అధ్యయనం, అధ్యాపనం, యజనం, యాజనం, దానం, ప్రతిగ్రహణం. అంటే వేదాలు చదవొచ్చు. ఒకరికి పాఠాలు చెప్పవచ్చు. యజ్ఞాలు చేయవచ్చు, చేయించవచ్చు, దానాలు ఇవ్వవచ్చు. పుచ్చుకోనూ వచ్చు. మిగతా రెండు వర్ణాలవారికీ దీనిలో మూడు అధికారాలే వున్నాయి. అధ్యయనమే కాని అధ్యాపనంలేదు. యజ్ఞాలు చేయడమే కాని చేయించటానికి వీలులేదు. దానం ఇవ్వటమే కాని పుచ్చుకోవటం పనికిరాదు. పోతే క్షత్రియులకు అదనంగా యుద్ధాలు చేయటం, రక్షణ కల్పించటం, బ్రాహ్మణ్యం నిర్ణయించే ధర్మాన్ని కాపాడటం అదనపు బాధ్యత. వైశ్యులకు వ్యవసాయం, పశుపోషణ, నానారకాల వస్తూత్పత్తి, క్రయ విక్రయం అదనపు బాధ్యత. అంటే వర్ణసమాజంలో నేడున్న సకల వృత్తులు వైశ్యులు చేసేవారు. అంతేకాదు, ఏ ఇంట పుట్టినప్పటికీ పెరిగిన తరువాత తనకు తోచిన వర్ణంలోకి వెళ్ళే అధికారం, ఆ వర్ణ వృత్తిని చేపట్టే అధికారం ఎంతోకొంత ప్రతివాడికీ వుండేది. ధర్మశాస్త్రాలకు మూలాలైన గృహ్య సూత్రాలలో ఈ మూడు వర్ణాల ధర్మాలను గురించి వివరాలున్నాయి. నాలుగో వర్ణం ప్రస్తావన లేదు.

సమాజం ఎప్పుడూ మార్పులేకుండా వుండదు. అది పెరిగిన తర్వాత, సొంత ఆస్తి భావన పుట్టిన తర్వాత భారతీయ వర్ణ సమాజానికి పెద్దసంఖ్యలో బానిసల అవసరం ఏర్పడింది. పెరిగే జనాభా అవసరాలు తీరటం కోసం అడవులు కొట్టి ఎక్కువ భూమిని సాగులోకి తేవలసి వచ్చింది. అలా అడవులు కొట్టినపుడు నిర్వాసితులైన గిరిజనులను బానిసలుగా పట్టుకొచ్చి వారిని వ్యవసాయంలోను చేతివృత్తుల్లోను సహాయకులుగా నియమించుకున్నారు. ఇలా కొత్తగా సమాజంలో చేరినవారిని ఏ వర్ణంలో చేర్చాలి అన్న సమస్య పుట్టింది. అదివరకే ఆస్తి విషయంలో స్థిరత్వాన్ని సంపాదించినవారు బానిసలకు ఆస్తిహక్కు ఇవ్వరు. కనుక వీరికోసం ఒక కొత్తవర్ణాన్ని సృష్టించారు. అదే శూద్ర వర్ణం. శూద్ర అంటే బానిస అని అర్థం. మరి ప్రాచీనాచారం ప్రకారం ఈ కొత్త వర్ణాన్ని సమర్థించటం కోసం కొత్తవేదాన్ని కూడా సృష్టించవలసిన అవసరం వచ్చింది. అది ఎక్కడ్నించి వస్తుంది? ఛందోగ్రంథమైన ఋగ్వేదంలోంచే పూర్వం సామవేదాన్ని తయారుచేశారు. ఇప్పుడు కూడా అదే ఆస్కారమైంది. అందులో లౌకిక భావాలు గల మంత్రాలన్నింటిని వేరువేసి అథర్వసంహితపేరుతో కొత్త వేదాన్ని తయారుచేశారు. దాన్నే అథర్వణ వేదం అంటారు. ఇప్పుడు నాలుగు వేదాలు నాలుగు వర్ణాలకు సరిపోయాయి. అదివరకు వున్న వర్ణాల్లో క్షత్రియులకు, వైశ్యులకు మూడే అధికారాలుండేవి. ఈ మూడు అధికారాలను నాలుగో వర్ణానికి లేకుండా చేశారు. ఈ సందర్భంలో పురుషార్థ సారం అన్న రాజకీయ గ్రంథం వ్రాసిన పండితుని అభిప్రాయం గమనార్హం:

ధరణీసురులగు నృపవరులకు
వైశ్యులకు ఆత్మవర్తనములకున్
పరిచరులు లేక నడవమి
సరసిజ సంభవుడు శూద్రజాతి సృజించెన్.

ఈ కొత్త జాతి పుట్టుకతో అన్నోత్పత్తి పుష్కలమైంది. బానిస యజమానులకు తీరిక ఎక్కువైంది. క్షత్రియులు, వైశ్యులు తమ బాధ్యతల్లో కొన్నింటిని కొత్తవర్ణానికి బదలాయించారు. క్షత్రియులు యుద్ధాలను దత్తం చేశారు. వైశ్యులు కృషి, పశుపాలన, చేతివృత్తులను దఖలు పరిచారు. అయితే, దున్నేవాడిదే భూమి, కర్ర గలవాడిదే బర్రె, జయించిన వాడిదే రాజ్యం ఐపోతుందని వారానాడు ఊహించలేదు. ఊహించకపోయినా అదే జరిగింది. ప్రాణాలకు తెగించి యుద్ధభూమిలో ముందుకు పరిగెత్తి, కోటల్ని పేటల్ని స్వాధీన పరచుకున్నవారు అధికారాన్ని ఇతరులకు దత్తం చేస్తారా? వారే సింహాసనం మీద కూర్చున్నారు. భూములు దున్ని బంగారం పండించిన వారు ఆ పంటనంతటిని ఇతరులకు దత్తం చేస్తారా? దున్నేవారే స్వాధీనం చేసుకున్నారు. కష్టపడి పెంచిన ఆలమందల్ని, మేక, గొర్రె మందల్ని తామే సొంతం చేసుకున్నారు. దీనితో భారత సమాజం రూపురేఖలే మారిపోయాయి. చరిత్ర తెలిపిన తొలి మహారాజు బింబిసారుడి దగ్గర్నుంచి వచ్చిన రాజులందరూ ఈ నాల్గో వర్ణానికి చెందినవారే. రాజ్యాధికారంలో వున్న వాడిని కించపరచటం ఎవరి తరమూ కాదు. కనుక సింహాసనం మీద కూర్చున్న వాడికి బంగారు జందాలు వేసి సూర్యవంశం, చంద్రవంశమని వంశాలు లెక్కగట్టి కావ్యాలు వ్రాసి అంకితమిచ్చే అగ్రవర్ణంవారు కైవారం చేయటం మొదలుపెట్టారు.

ఇందుకు చిన్న ఉదాహరణ. కాకతీయ వంశంలో మొదట వాడు బేతరాజు. రెండవవాడు మొదటి ప్రతాపరుద్రుడు. అప్పటికీ రాజ్యం సుస్థిరం కాలేదు. శాంతిభద్రతలు నెలకొనలేదు. కనుక ఆ రాజు లిద్దరిని సోమవంశ క్షత్రియులని పొగుడుతూ శాసనాలు వేశారు నాటి పండితులు. ఆ తరువాత రాజ్యం స్థిరపడింది. గ్రామీణ వ్యవస్థ స్థిరపడింది. రాజ్యాంగ వ్యవస్థ పాదుకున్నది. రాజు పోయినా వ్యవస్థ మాత్రం మారదు అన్న ధైర్యం కలిగింది. దాంతో గణపతి దేవుని దగ్గర్నుంచి అందర్నీ పాదజులని, నాల్గవ జాతియని, శూద్రులని శాసనాల కెక్కించారు. తండ్రి క్షత్రియుడు, తనయుడు శూద్రుడు. ఆ రాజ్యం 14 వ శతాబ్దంలోనే అంతరించింది కాబట్టి సరిపోయింది. లేకుంటే హరిజనులైపోయేవారేమో!

అలాగ 6 వ శతాబ్దంనాటి విష్ణుకుండిన శాసనమొకటి ఏలూరు పరిసరాల్లో దొరికింది. ఆ భూదాన శాసనం "నాల్గువేదాలు చదివిన వాడు, అనేక యజ్ఞాలు చేసినవాడు, సకలశాస్త్ర పారంగతుడు అయిన ఫలానా అధికారునికి ఈ భూమి దానం చేస్తున్నాము" అని వుంది. అధికారుడు అంటే వడ్రంగి. మరి మన కులవ్యవస్థ ప్రకారం వడ్రంగి నాలుగువేదాలు చదివితే, యజ్ఞాలు చేస్తే కుల పీఠాధిపతులు ఒప్పుకుంటారా? ఒప్పుకోరు. ఈ శాసనాన్నిబట్టి అనాటి అధికారుడు వేదాధికారం గల వైశ్యుడై వుండాలి. గృహ్య సూత్రాలకు పూర్వం వుండే సులభ సూత్రాలు, శ్రౌత సూత్రాలు పరిశీలిస్తే తోళ్లు పదను చేయటం, వడ్రంగం, ఇటుకలు, కుండలు తయారు చేయటం, లోహపు వనరులు ఇవి నాటి బ్రాహ్మణులే చేశారు అని విదితం అవుతుంది. ఇదీ సంక్షిప్తంగా వర్ణవ్యవస్థ రూపం.

మరిలాంటి వర్ణాలు కులాలు ఏ దశలో మారాయి? ప్రపంచంలో ఎక్కడా లేని కులాలు ఒక్క మన దేశంలోనే ఎలా పుట్టాయి అన్న ప్రశ్నలు సహజంగానే తలెత్తుతాయి. వాటి సంగతి ఇప్పుడు ముచ్చటించుకుందాం.

## కులాలు :

భారతదేశంలో 12 వేల కులాలున్నాయని ఆధునిక శాస్త్రవేత్తలు లెక్కకట్టారు. బ్రిటీషు వాళ్ళు రాజ్యంచేస్తూ వుండగా 1871 నుంచి 1901 వరకు తీసిన జనాభా లెక్కల్ని ఆధారం చేసుకుని మన కులాల్ని గురించి కొన్ని పుస్తకాలు అచ్చువేయించారు. వాటిలో స్వదేశీ సంస్థానాల ప్రస్తావనకాని, అక్కడి కులాల సంగతికాని లేదు. ఈ పుస్తకాల్లో మదరాసు ప్రెసిడెన్సీకి సంబంధించిన పుస్తకం మాత్రమే ఇటీవల పునర్ముద్రణ పొందింది. తక్కినపుస్తకాలు దొరకవు. దొరికిన పుస్తకాలనుబట్టి చూస్తే కులాల పేర్లలోను, ఆచారాలలోను నాటికీ, నేటికీ చాలా భేదం కన్పిస్తుంది. ఇప్పుడు దేశంలో ఈ కులాలె లా వున్నాయి, అయా కులాచారాలు ఏ తీరులో వున్నాయి అని తెలుసుకోవటానికి ఆధారాలేమీలేవు. కాగా, దొరికిన సమాచారాన్నిబట్టి చూస్తే ఈ కులాలు స్థిరంగా వున్నట్లు కన్పించదు. దక్షిణాది కులాల కైఫియత్ నుబట్టి చూస్తే లక్షమంది పల్లెకారులు ఒక సుముహూర్తాన బ్రాహ్మణులుగా మారిపోయిన వుదంతం కన్పిస్తుంది. అలాగే ఎన్నో కులాలు కాలక్రమాన ఒక కులంలోంచి మరో కులంలోకి పరివర్తన చెందాయి. ఉత్తమ కులాలుగాను చెలామణిలోకి వచ్చాయి. ఇలాంటి మార్పులు ఇప్పుడింకా ప్రచండ వేగంతో జరుగుతున్నాయి. స్థలాభావం వల్ల వాటినన్నింటిని ఇక్కడ వివరంగా చర్చించడానికి వీలుపడదు. కులాలను గురించి మరికొంచెం తెలుసుకునే ముందు కుల నిర్వచనాన్ని అవగాహన చేసుకోవటం ముఖ్యం.

కులం అంటే కంచం పొత్తూ, మంచం పొత్తూ వున్న ఒక మానవ బృందం అని అర్థం. దీన్ని ఇంగ్లీషులో ఎండొగామస్ గ్రూప్ ఆఫ్ పీపుల్ అంటారు. ఉత్తరాది వాళ్ళు ఈ మాటనే రోటీ, బేటీ సంబంధం అంటారు. మనవాళ్ళ

వర్ణవిభజన ప్రకారం ఒక కుల సమూహంలో కంచంపొత్తు వుండవచ్చు కాని మంచంపొత్తు వుండదు. పెట్టుబడిదారీ సమాజం తన వ్యాపార లాభం కోసం హోటళ్ళు, రైళ్ళు, బస్సులు, సినీమాహాళ్ళు వగైరాల విషయంలో కుల భేదాలను చెరిపేసింది. కానీ పెళ్ళిళ్ళ దగ్గర మాత్రం కుల పట్టింపులింకా చాలా తీవ్రంగానే వున్నాయి. కనుక కులం అంటే కంచం పొత్తు, మంచం పొత్తు రెండూ కలిసివున్న మానవ బృందం అని చెప్పకోక తప్పదు. ఆ లెఖ్ఖన చూస్తే తెలుగునాట చాల బ్రాహ్మణుల్లో పాతికకుపైగా కులాలున్నాయి. వర్ణాల లెక్క ప్రకారం అదంతా ఒకే వర్ణం. అలాగే పూర్వ పండితులు శూద్రవర్ణం అని చెప్పిన దాంట్లో కూడా ఎన్నో కులాలున్నాయి. వర్ణవాదులు వీటిని ఉపకులాలంటూ వుంటారు. ఉపకులం అనటం భావ్యం కాదు. అదొక ప్రత్యేక కులం. మానవుడు మూడు దశల్లో ఆచారాన్ని అంటిపెట్టుకుని వుంటాడు. అంటే – కన్జర్వేటివ్‌గా వుంటాడు. అట్టి ఆచారాలు ప్రతి కులానికి మారుతూ వుంటాయి. ఒకటి – జాతక కర్మ అంటే పుట్టినపుడు చేసే కర్మలు, నమ్మకాలు, ఆచారాలు, అలవాట్లు. రెండు – వివాహం. ఆ సమయంలో ఉండే ఆచారాలు, అలవాట్లు, పద్ధతులు, సాంప్రదాయాలు. మూడు – మరణం. అప్పుడు అనుసరించే పద్ధతులు ఆచారాలు, విశ్వాసాలు, అలవాట్లు, భయాలు – ఇందులో మొదటి రెండింటి కన్న మూడోది మనిషిని గట్టిగా అంటి పెట్టుకుంటుంది. ఈ మూడు దశల ఆచారాల్ని జాగ్రత్తగా పరిశీలించి ఇప్పుడింకా ఆదిమదశలోనే మిగిలిన తండాల ఆచారాలతో పోల్చిచూస్తే ఎన్నో వింతలు, విచిత్రాలు గోచరమవుతాయి. అంతేకాదు, ఒక విధంగా కులాల పుట్టుకకు కూడా వాటిలో కూపీలు దొరుకుతాయి. ఇందుకు ఒకటి రెండు ఉదంతాలను పరిశీలిద్దాం.

న్యూజిలాండ్‌ను అనుకొని ట్రోబ్రియాండ్ అనే చిన్న దీవులున్నాయి. ఆ దీవుల్లో వున్నవారిని మలనేషియన్స్ అంటారు. మలనేషియన్స్ అంటే నల్ల ఆసియన్లు అని అర్థం. అది మాతృస్వామిక సమాజం. వారి ప్రధాన ఆహారం దుంపలు. అయినా, మనకు మల్లే విస్తారంగా వ్యవసాయం చేయరు. తోటసాగు (గార్డెన్ కల్టివేషన్) మాత్రమే. మాతృస్వామిక సమాజాల్లో భూమి సౌభాగ్యాన్ని పెంచే మంత్రవేత్తలు పురుషులుకారు స్త్రీలే. తోట వ్యవసాయం చేసేదికూడా స్త్రీలే. ఆ జాతి సౌభాగ్య దేవత (ఫెర్టిలిటీగాడ్) – పేరు పోలేరు. అసామాన్యంగా ప్రాచీన తండాల్లో పిల్లలులేని తల్లికి గౌరవం వుండదు. ఆమె చేతి నీరు కూడా ఎవరూ ముట్టరు. వారిని మొత్తం సమాజం చిన్నచూపు చూస్తుంది. అలాంటప్పుడు కడుపు పండటం కోసం మంత్రగత్తెల సాయం తీసుకుంటారు. ట్రోబ్రియాండ్ వాసుల్లో కూడా అంతే, అక్కడి మంత్రగత్తె, పదిమంది పిల్లల్నిగని కడుపుచలువగల ఇల్లాలు కట్టివిడిచిన గడ్డి లంగా తెచ్చి గొడ్రాలు నెత్తిన కప్పి "ఓ పోలేరు, ఓ పోలేరు! నువ్వొచ్చి ఈమె కడుపు పండించు" అని మంత్రాలు చదువుతుంది. అది మాతృస్వామిక సమాజం కనుక స్త్రీకి ఒకే భర్త వుండడు. ఆమె కిష్టం వచ్చిన ప్రతివాడూ భర్తే. తరువాత ఏ కారణం వల్లనో కడుపు పండుతుంది. మంత్రగత్తె కీర్తి పెరుగుతుంది. పోలేరు మహత్తు ఇనుమడిస్తుంది. ఇది ఆ దేశపు అలవాటు. ఇక్కడినుండి మన రాష్ట్రానికి తిరిగొద్దాం.

మనకు వచ్చే అమావాస్యల్లో పోలాల అమావాస్య అని ఒకటుంది. ఆ రోజున ఛాందస బ్రాహ్మణులు కూడా కంద చెట్టుకు పూజ చేస్తారు. రజకిని పిలిచి తలంటు పోసి పసుపు పారాణి పెట్టి పుష్టిగా భోజనం పెట్టి దక్షిణ తాంబూలం ఇస్తారు. ఇప్పటి కులాల లెక్క ప్రకారం రజకి సవర్ణల్లో ఆఖరిమెట్టు, అంటరానివాళ్ళలో పైమెట్టు మీద వుంటుంది. ఆమెను సబ్రాహ్మణులెందుకు పూజ చేస్తారు? ప్రతి ఇంటా నిత్యం తులసి మొక్కకు పూజచేసే అలవాటు కదా మనది? అయినప్పుడా రోజు కందచెట్టు కెందుకు పూజ చేస్తారు? ఈప్రశ్నలకు జవాబులు వారి దగ్గర దొరకవు. పైగా, మన జాతిలో చాలా కులాల వారు పెళ్ళి కూతురును అత్తవారింటికి పంపించేటప్పుడు ఒడికట్టు బియ్యంతో పాటు కంద పిలకలు కూడా వేస్తారు. కంద పిలకనే ఎందుకు వేయాలి. ఏమో, ఇది మా ఆచారం అంటారు – అంతే. ఇప్పుడు మళ్లీ ట్రోబ్రియాండ్ పదండి. వారి ప్రధానాహారం దుంప అని తెలుసుకున్నాం కదా? 3 గ్రాముల పిలక నాటితే రెండు మూడువేల గ్రాముల దాకా పెరిగే దుంప ఏదీ? కంద. కనుక సౌభాగ్యానికి దుంపల్లో కంద చిహ్నం. కడుపు చలవగల తల్లి కట్టి విడిచిన వస్త్రం ఎవరి చేతిలో వుంటుంది? రజకి ఆధీనంలో వుంటుంది. పోలేరు అంటే ఫెర్టిలిటీ, కనుక పోలాల అమావాస్యనాడు జరిగే పూజలకర్థం ఇప్పుడు స్పష్టమైనట్లే కదా!

ఇంతేకాదు – మన తెలుగునాట పంట పండే మడి చెక్కను పొలం అంటారు. జంతువుల్లో ఎక్కువ సౌభాగ్యం గల పంది పిల్లను పొలం గట్టున పాతి పూర్వం పొలి తొక్కేవారు. ఆ సమయంలో పొలి కేకలు పెట్టేవారు. ఆ విధంగా పొలం సౌభాగ్యాన్ని పెంచి కట్టుకడితే దానికి పొలిమేర అని పేరు పెట్టారు. పంట చేతికొచ్చేముందు రావేలు కలవాడ, రార పోలిగాడ అని రైతులు పాటలు పాడుతారు. దాన్ని షావుకారుకు అమ్మినప్పుడు మొదట మానెడు ఉచితంగా తన సంచీలో పోసుకొని పొలిగలుగు అని పాట మొదలుపెడతాడు. రెండవ మానిక పేరు లాభం. ఆ తరువాతనే రెండు, మూడు లెక్క. సరే, పేర్ల దగ్గర కొచ్చేసరికి పోలమ్మ, పోలయ్య, పోలవరం, జుట్టుపోలిగాడు – తెలుగు నిండా ఈ పోలే కనిపిస్తుంది. ఇవన్నీ చూస్తే

ఒకప్పుడు టోబ్రియాండ్ వాసులు, తెలుగువారు ఒక చోటి నుండి వచ్చినట్లే కనిపిస్తుంది. అక్కడి ఆచారాలు అర్థవంతంగా వున్నాయి. ఇక్కడ అర్థం నశించి కేవలం ఆచారాలుగా మిగిలిపోయాయి. ఆటవిక దశ నుండి అభివృద్ధి చెందిన తరువాత తండాలు, గణాలు, జనాలుగా మారిన తరువాతి ఏ వృత్తి వాళ్ళు ఆ వృత్తిలో సర్దుకున్నారు. మంత్రగత్తెలు, పురోహితులు దక్షిణాది బ్రాహ్మణ వర్ణాలుగా మారిపోయారు. లేకపోతే పోలాల అమావాస్య, కంద పిలక పూజ, రజికి ఆరాధన తెలుగు బ్రాహ్మణులల్లో కన్పించటానికి అస్కారం వుండదు. ఈ పూజల ప్రస్తావన వేదాల్లో లేదు; అర్షమతంలో లేదు.

ఇండోనేషియా ద్వీపకల్పంలో ఒక చిన్న దీవి వుంది. వాళ్ళు ఆదివాసులే; అది కూడా మాతృస్వామిక సమాజమే. అక్కడెవరైనా వేట వల్లనో, మరో కారణం వల్లనో చనిపోతే అందుకు బాధ్యత అతని భార్య వహించాలి. ఆమె దురదృష్టమే అతని మరణానికి కారణమని ఆ తండావారి నమ్మకం. కనుక ఆమెతో ఎవరు సంపర్కం పెట్టుకున్నా వారికి చావు నిశ్చయం అని భయపడుతూ వుంటారు. ఎవరూ ఆమె జోలికి పోకుండా వుండటం కోసమని ఆమె గుండు గొరిగి, ముఖాన్ని వికారం చేసి అడవిలో చిన్న గుడిసె వేసి, అందులో ఆమెనుంచుతారు. ఆమె కాలకృత్యాలకో, మరెందుకో బైటికి రావాలంటే ఒక కర్ర ముక్కతో చెట్లను కొట్టి తానొస్తున్నట్లు తెలిసేలా చప్పుడు చేస్తూ రావాలి. అదైనా ఉదయం చీకటి వుండగానే, సాయంత్రం చీకటి పడిన తర్వాత మాత్రమే. ఆ చప్పుడు విని అందరూ దూరంగా పారిపోతారు. బాగా ముసలి వారైన స్త్రీలు ఆమె గుడిసెకు వెళ్ళి ఇంత అన్నం పెట్టి వస్తుంటారు. ఇదీ అక్కడి ఆచారం, ఇదీ వారి విశ్వాసం.

ఈ ఆచారం మనలో కూడా వుంది. అర్థంమాత్రం అంతరించింది. ఇది ముఖ్యంగా దక్షిణాది బ్రాహ్మల్లో వుంది. భర్త మరణించిన తరువాతి 10 వ రోజున భార్యను ఏ చెరువు గట్టుకో, కాలువ గట్టుకో తీసుకొని వెళ్ళి గుండు చేయిస్తారు. ఆ రోజున గ్రామంలో వారంతా ఇళ్ళలోనే వుంటారు. అయినా ఎవరైనా పొరపాటున చూస్తారేమో ననే భయంతో చేట కొట్టుకుంటూ వృద్ధస్త్రీలు ఆమెను ఇంటికి తీసుకొని పోతారు. ఇక ఇంట్లో ఆర్నెల్ల వరకు ఆమె చీకటి వుండగానో, చీకటి పడిన తరువాతనో బయటికి వస్తుంది. ఆ సమయాల్లో ముందొకరు చేట కొట్టుకుంటూ బయలుదేరతారు. ఆ తరువాత కూడా ఎవరైనా ప్రయాణం చేస్తున్నప్పుడెదురైతే తిట్టి పోస్తారు. స్త్రీని అగౌరవ పరచే ఇట్టి ఆచారం ఆ తెగలో ఎప్పుడు ప్రవేశించిందో తెలియదు.

వేదాల ప్రకారం వైధవ్యమే లేదు. స్త్రీకి వున్నది సౌభాగ్యం, దౌర్భాగ్యం ఈరెండే. పిల్లల్ని కనే శక్తి వున్నంత వరకూ ఆవిడ సౌభాగ్యవతి. శక్తి వుడిగిన తరువాత ఆవిడ దుర్భగ అవుతుంది. ధర్మశాస్త్రాల కాలంలో కూడా వితంతువు కేశ ఖండన లేదు. వారసుడు లేకుండా భర్త చనిపోతే ఆ స్త్రీ భర్త దాయాదుల్లో ఎవరో ఒకడ్ని పెళ్ళాడి కొడుకును కనేవరకు అతనితో సంసారం చేయవచ్చని మనువు అన్నాడు. అలాంటప్పుడు అనార్షమైన కేశ ఖండన ఆచారం దక్షిణాది బ్రాహ్మల్లో ఎందుకుంది, ఎక్కడి నుండి వచ్చింది అంటే ఇండోనేషియా దీవుల్లో ఇప్పటికీ అమల్లో వున్న ఆ తండా, మన వారిలో కొందరు ఒకనాడు కలిసి వుండేవారు అని జవాబు చెప్పుకోవలసి వస్తుంది. ఇలా చూస్తే పోలినీషియా, మెలినీషియా ప్రజల ఆచారాలు మనలో ఎన్నో కన్పిస్తాయి.

వేదాలు చెప్పిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య వర్ణాలలో కూడా ఈ ఆచారాలు నేటికి బతికి వున్నాయి. దీన్నిబట్టి తేలేదే మంటే – ఇప్పుడు వర్ణాల పేరులో చలామణి అవుతున్న మన అగ్ర కులాల వారికి వేదాలకు, వేద సంప్రదాయాలకు సంబంధం లేదని, అనేక గణాలు వచ్చి జనంలో కలిసినప్పుడు ఆయా గణాల ప్రజలు ఆయా వృత్తుల్లో చేరి, కులాలుగా ఏర్పడ్డారని నిర్ధారించుకోవలసివస్తుంది. అలా నిర్ధారించిననాడే ఈ కులాలను అర్థం చేసుకోవటం సాధ్యమౌతుంది.

## వర్గాలు :

పెట్టుబడి దారీ సమాజం అవతరించిన తరువాత, మార్క్సిజం అనే మహాశాస్త్రం పుట్టిన తరువాత వర్గాలు అన్న స్పృహ ఏర్పడింది. వర్గాన్ని మార్క్సిస్టులు ఆర్థిక వర్గం అని కూడా అంటారు. లెక్కల కోసం, రకరకాల విశ్లేషణ కోసం మానవుల్ని అనేక బృందాలుగా వర్గీకరించటం వుంది. విద్యార్థి వర్గం, మహిళావర్గం, ఎన్.జి.వో. వర్గంలాంటివి చాలా చలామణిలో వున్నాయి. వాటిని గణాంక వర్గాలంటారు. మార్క్సిస్టు పరిభాషలో వర్గం అంటే ఆర్థిక వర్గం మాత్రమే. ముందు ఆ వర్గానికి నిర్వచనం చెప్పుకుందాం. 1. సామాజిక ఉత్పత్తి క్రమంలో ఎవరి స్థానం ఏమిటి? 2. ఆ స్థానాన్ని నిర్ణయించేదెవరు? 3. సామాజిక ఉత్పత్తిలో ఎవరి భాగం ఎంత? 4. ఆ భాగాన్ని సంపాదించే పద్ధతి ఏమిటి? ఈ నాలుగు ప్రశ్నలకు వచ్చే జవాబునుబట్టి ఎవరు ఏ వర్గానికి చెందినవారో తేలుతుంది. అలా తేల్చిచూస్తే మన దేశంలో ప్రధానంగా రెండు వర్గాలున్నాయి. 1. పెట్టుబడి దారీ వర్గం. 2. శ్రామిక వర్గం. ఇవి రెండూ ప్రధాన వర్గాలు. ఈ రెండింటి నడుమ మధ్యంతర వర్గాలు చాలా వున్నాయి. వాటి సంగతి ఇప్పుడు అప్రస్తుతం. మన దేశంలో వున్న 12 వేల కులాల్లోను ఏ ఒక్క కులాన్నైనా ఈ రెండు ప్రధాన వర్గాల్లోనైనా సర్దటానికి ఆస్కారముందా అన్నప్రశ్న చాలా మంది మనసుల్ని దొలుస్తూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు

వర్గ ప్రయోజనాలకు, కుల ప్రయోజనాలకు ముడిపెట్టి పాలక వర్గాలు భ్రమలు కల్పిస్తుంటాయి. కనుక ఈ ప్రశ్నకు శాస్త్రీయమైన జవాబు వెతుక్కోనటం చాలా అవసరం.

ఇప్పుడు మన దేశంలో ప్రధానమైన ఉత్పత్తి లక్ష్యం భూమి. దీన్నే అసలైన సిసలైన ఆస్తిగా పరిగణిస్తున్నారు. ఈ భూమి నుండే పంటలు వస్తున్నాయి. పశుగణానికి కావలసిన ఆహారం వస్తోంది. ఈ భూమి మీద వున్న అడవుల నుంచే కలప వస్తోంది. గనుల్లోంచి అనేక లోహాలు వస్తున్నాయి. పంటలు, కలప, లోహాలతో అనేక పరిశ్రమలు వెలుస్తున్నాయి. ఆ పరిశ్రమల నుంచి ఎంతో సంపద పుడుతోంది. పొలాల్లో, అడవుల్లో, గనుల్లో, పరిశ్రమల్లో కోట్లాది జనం పనిచేస్తున్నారు. ఇప్పుడు వర్గ నిర్ణయానికి అవసరమైన నాలుగు సూత్రాలను కొన్నికులాలకు అన్వయించి చూద్దాం. అలా చూస్తే ఏయే కులాలకు, ఏయే వర్గాలతో సమన్వయం కుదురుతుందో తేలుతుంది. ముందు భూమిని – అందునా వ్యవసాయభూమిని తీసుకొని పరిశీలిద్దాం. చాలా కులాలవారు వ్యవసాయ ఉత్పత్తిలో వున్నారు. మొదటి సూత్రం ప్రకారం ఆ ఉత్పత్తిలో ఏయే కులాల స్థానం ఎక్కడ వుంది? అంటే వ్యవసాయ భూమిపై యాజమాన్యం ఏ కులందీ? తెలుగునాడు సంగతే చూద్దాం! యాజమాన్యం ఏ ఒక్క కులానికో గుత్తగా లేదు. అలాగే భూమి మీద, వ్యవసాయ పనిముట్ల మీద యాజమాన్యం లేకుండా పొలాల్లో శ్రమించేవారు కొందరున్నారు. అలాంటి వారిలో అధిక సంఖ్యాకులు మాత్రం రెండు, మూడు కులాల వారున్నారు. ఇతరకులాలవారుకూడా వారిలో లేకపోలేదు.

ఇక రెండవ సూత్రాని కొద్దాం. ఎవరి స్థానం ఏమిటని నిర్ణయించేదెవరు? వ్యవసాయానికి సంబంధించినంత వరకు పొలాల మీద, ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యం గలవారు వ్యవసాయ కూలీలకు పని పురమాయిస్తూ వుంటారు. అలా పురమాయించేవారు కామందులు, పురమాయించే పనిని చేసేవారు కూలీలు. ఇక పంటలో భాగస్వామ్యం కామందు ఎంతిస్తే అంతటితోనే కూలీలు తృప్తిపడాలి. కాని అడిగే హక్కు లేదు. దాన్ని సంపాదించే పద్ధతి పరస్పర ఒప్పందం. ఇదే పద్ధతి మిగతా ఉత్పత్తి లక్ష్యాలకు కూడా వర్తిస్తుంది. కనుక ప్రత్యేకంగా ఒక కులాన్ని ఒక వర్గంలోకి చేర్చి లెక్క కట్టే అవకాశం చాలా తక్కువగా వుంది. మనం ముందే తెలుసుకున్నట్లుగా అధిక సంఖ్యాకులైన ఒకటి, రెండు కులాలవారు వ్యవసాయ కూలీలుగా వుంటున్నారు. కనుక కులమే వర్గంగా ఎవరికైనా వర్తిస్తుందంటే ఒక మేరకు ఆ ఒకటి, రెండు కులాలకు వర్తిస్తుంది. మిగతా వారిని కులం వారీగా వర్గ విభజన చేయటానికి వీలులేదు. ఈ ఒకటి రెండు కులాలైనా వర్గ స్వభావంలో మిగిలిపోవటానికి కారణం ఏమిటి అన్న ప్రశ్న ఉదయించి తీరుతుంది. ఆ ప్రశ్నకు జవాబు చెప్పుకోవటం కోసం మళ్ళీ మనం గత చరిత్రలోకి వెళ్ళవలసి వుంటుంది.

## కొత్త ఉమ్మడి దాసులు :

ఒకప్పుడు భారతదేశ జనాభా రెండు కోట్ల చిల్లర వుండేది. వ్యవసాయం వృద్ధిఅయి సాపేక్ష స్థిరత్వం ఏర్పడిన తరువాత జనాభా కూడా పెరిగింది. పెరిగిన జనాభా అవసరాలు తీర్చటానికి అడవులు కొట్టి ఎక్కువ భూమిని సాగులోకి తేవాల్సి వచ్చింది. అలా కొత్తగా సాగులోకి వచ్చిన భూమి నుంచి ఉత్పత్తి సాధించటానికి అనువుగా గ్రామాలు వెలిశాయి. అలాంటి తొలి గ్రామాల్లో భూమి మీద యాజమాన్యం ఎవరికీ వుండేది కాదు. సాగు చేతనైన వారు వ్యవసాయం చేసేవారు. ఇతరులు వ్యవసాయానికి ఉపాంగాలైన పనుల్లో వుండేవారు. భూమి మీద వచ్చిన పంటను ఆయా వృత్తులవారికి పనినిబట్టి విభజించే వారు. అలాంటి విభజనతో భాగస్వాముల్ని బారాబలూతీలనీ, పనిద్దరాయగార్ లని, జాజమానీలని పిలిచేవారు.

భూమి పెరిగినకొలదీ భూమిమీద పనిచేయడానికి ఎక్కువ చేతులు కావల్సి వచ్చాయి. అదివరకు సమాజం స్థాపించిన ఉమ్మడిదాసులైన శూద్రులు క్షత్రియులై, రాజులై కూర్చున్నారు. ఆ అనుభవంతో మొత్తం సమాజానికి ఒక కొత్తపాఠం అబ్బింది. మళ్ళీ సంపాదించిన ఉమ్మడి దాసుల్ని ఒక్క వ్యవసాయానికితప్ప మరెందుకూ వాడకూడదని నిర్ణయించుకున్నారు. అంతేకాదు, చదువు సంస్కారాలకే కాకుండా సమాజానికి కూడా వారిని చాలా దూరంగా వుంచారు. వారికి అంటరానితనం ఆపాదించారు. పోతే వారికి కూడా ఉత్పత్తిలో కొద్దిభాగం విదిపేవారు. అంతే. ఆవిధంగా వర్ణవాదులు లెక్కప్రకారం ఐదవ వర్ణం అవతరించింది. ఐదవ వర్ణాన్ని సమర్థించటంకోసం సకల పురాణసార సంగ్రహమైన ఐదవ వేదాన్ని – అంటే మహాభారతాన్ని సృజించారు.

అడవులుకొట్టి అడవిభూముల్ని స్వాధీనం చేసుకోవటానికి బౌద్ధం ఎంతగానో తోడ్పడింది. ఆటవికుల ప్రతిఘటన లేకుండా అనాడు వారిని బౌద్ధులు సంఘాల్లోకి ఆకర్షిం చారు. అలాగ అడవి భూములు సులభంగా సమాజానికి స్వాధీనమైనాయి. కానీ ఒక దశ వచ్చేసరికి బౌద్ధ సంఘాలు తామరతంపరగా పెరిగి ఉత్పత్తి చేసే వారు తక్కువ, తినేవారు ఎక్కువ అయ్యారు. సౌభాగ్య తంత్రాలు, మంత్రాలులాంటి అహేతుక ఉత్పత్తి సాధనాలు (ఇర్రేషనల్ ఇన్‌స్ట్రుమెంట్స్ ఆఫ్ ప్రొడక్షన్) గుప్పిట పెట్టుకున్న బ్రాహ్మణ పురోహిత వర్గంతో బౌద్ధులు పోటీపడలేకపోయారు. దాంతో బౌద్ధ బ్రాహ్మణవాదాలు ప్రచండంగా చెలరేగాయి. బౌద్ధారామాలు విధ్వంసమైనాయి. సంఘాలు చెల్లాచెదరైనాయి. అదివరకు సంఘసభ్యులుగా వుండే ఆటవికులందరినీ ఉమ్మడిదాసులుగా

పట్టుకొని పని చేయించసాగారు. అలా సంఘాలలో చేరని ఆటవికులు కూడా చాలామంది దాసగణంలోకి వచ్చారు.

అందుకనే హరిజనులందరూ ఒకప్పుడు బౌద్ధులని అంబేద్కర్ అన్నమాట పూర్తి నిర్ధేతుకంకాదు. అందులో కొంత వాస్తవం వుంది. అందరూ కాకపోయినా బౌద్ధారామాల్లో శ్రవణకులుగా వున్న కొంతమంది ఉమ్మడిదాసులై సమాజ క్రౌర్యానికి గురై వెలివాడలు చేరి ఇప్పటి హరిజనులుగా రూపొందారు. ఇదికూడా ఒక ప్రత్యేకమైన కులం అనటానికి వీలులేదు. వీళ్ళ ఆచార వ్యవహారాలు జాగ్రత్తగా పరిశీలిస్తే అందులో ఎన్నో తండాల అవశేషాలు గోచరిస్తాయి. ఒకప్పుడు భారతదేశంలోని సాగుభూమికి హరిజనుల్లోని మాతంగులు (మాదిగలు) యజమానులని ప్రతీతి. ఆ ప్రతీతికి తగ్గట్లుగానే ఇప్పటికీ కొన్ని ఆచారాలు దక్షిణాదిన కన్పిస్తాయి.

కర్ణాటకలో వీరిని 'హొలయ' అంటారు. తెలుగులోని 'ప' కారం 'హ' కారంగా మారుతుంది. హొలయ అంటే పులయ అని అర్థం. అరవలు పులయన్ అని పిలుస్తారు. వీరు ఒకనాటి భూకామందులు కాబట్టి వీరి చేయిపడితేతప్ప పొలానికి పొలి కలగదని మనవాళ్ళ నమ్మకం. అందుచేత ప్రతిచోట వారికీ భూమికీ మేకుబందీ చేశారు. కర్ణాటకలో ఎంత భూస్వామి అయినా మొట్టమొదటి వెన్ను హొలయ చేతనే కోయిస్తారు. హొలయ అలా కోసిన తర్వాత భూస్వామి ఇంటికి వెళతాడు. ఇంట్లోవాళ్ళంతా ఇల్లు ఖాళీచేసి బయటకొస్తారు. హొలయలు ఇంటిని శుద్ధిచేసి ఆ వెన్నును నలిచి గింజలతో పాయసం వండుతారు. ఏవో మంత్రాలు చదివి పొలిదేవతకు ఉడగరపెట్టి ప్రసాదాన్ని భూస్వామి కుటుంబానికి ఇస్తాడు. భూస్వామి ఆ ప్రసాదాన్ని కళ్ళకద్దుకొని స్వీకరించి మళ్ళీ ఇల్లు శుద్ధి చేసుకొని గృహప్రవేశం చేస్తాడు.

ఈ ఆచారాన్ని బట్టి ఈ మాతంగులే ఒకనాటి భూకామందులు అన్నమాట కట్టుకథ కాదని రుజువౌతుంది. ఏమైనా ఇప్పుడున్న కులాల్లో అర్థబలం, అధికారబలం చూపి మీసాలు దువ్వే అగ్రకులాల వారు ఒకనాడు అధమ కులాలుగా బతికారు. ఈనాడు అధమ కులాలుగా వున్న వారు ఒకనాడు కామందులై భూమినేలారు. నేటి కులాల ఆచారవ్యవహారాన్ని జాగ్రత్తగా పరిశీలించినవారి కెవరికైనా ఈ సత్యం బోధపడుతుంది.

దేశంలో కులనిర్మూలనోద్యమాలు ఎన్నో పుట్టాయి. ఇంకా పుడుతూనే వున్నాయి. కులంగాడికి అంత్యక్రియలు చేయాలన్న కోరిక చాలా మందికి వుంది. ఆ కోరిక నెరవేరే మార్గమేమిటో తెలియదు. 12 వ శతాబ్దంలో బసవేశ్వరుడు వీరశైవ మతాన్ని స్థాపించాడు. మెడలో లింగకాయ కట్టుకొని శివుడ్ని ఆరాధించే వారందరిదీ ఒకే కులం అని ఆయన బోధించాడు. కుల నిర్మూలన కోసమని ఎంతో మంది ఆత్మత్యాగాలు చేశారు. ఆఖరుకు ఆయన స్థాపించిన వీరశైవం ఒక కులంగా మారిపోయింది. ఆ తరువాత మనవాళ్ళ మహాముని కులాలులేని వీరవైష్ణవమతాన్ని స్థాపించాడు. ఆ మత నాయకులంతా ఆఖరుకు ఒక కులంగా మిగిలిపోయారు.

ఆధునిక యుగంలో కూడా దయానంద సరస్వతి, రాజా రామ్మోహన్‌రాయ్ కుల రాహిత్యానికి పాటుపడ్డారు. కానీ అదీ ఫలించలేదు. మన దేశంలో గురునానక్ లేవదీసిన కుల రహిత ఉద్యమం ఒక మతంగా మారింది. భారతదేశంలో కులాలు ఎంత గట్టివంటే – ఈ దేశానికొచ్చిన కులరహిత మతాలు కూడా కులాలతో రాజీపడి బతుకుతున్నాయి. కులంతో రాజీపడటానికి ఇష్టపడని బౌద్ధం అనేక కులాల్లో కలిసిపోయింది. కులాలతో రాజీపడని జైనం బతుకుతోంది. ఇక్కడికి వచ్చిన ఇస్లాం, క్రైస్తవం, ఇక్కడే పుట్టిన సిక్కుమతం కూడా కులాలతో రాజీపడక తప్పలేదు. ఈ మతాలు సిద్ధాంతరీత్యా కులాల నొప్పుకోకపోయినప్పటికీ క్రియలో మాత్రం కులాలకు దాసోహమంటున్నాయి.

ఒక్క ఉత్తరప్రదేశ్ ముస్లింలలోనే 108 కులాలున్నాయని పండితులు అంచనా కట్టారు. అన్నింటిలోకి పెద్దకులం మోమిన్ కులం. మోమిన్‌ల వృత్తి చేనేత. ఇదికాక అనేక చేతివృత్తులవారు ఆయాకులాలుగా చీలిపోయారు. కనుక ఏదో ఒక మతంవల్ల కులాలు చెరిగి పోతాయని ఆలోచించటం, ఊహించటం ఒక భ్రమ. భారతదేశానికి వచ్చిన తరువాత అన్ని మతాలు భ్రష్టమైనాయి. భ్రష్టమై కులాలుగా విడిపోయాయి. కనుకనే అవి ఈ దేశంలో బ్రతక గలుగుతున్నాయి. ఇలాంటి స్థితిలో కులాలకు వర్గాల ప్రతిపత్తిని కల్పించి చూడటం వెర్రితనమే అవుతుంది.

ఏదైనా కులం వర్గానికి సరిపోతుందంటే ఒక కులపు బహుజనులు మాత్రమే వర్గానికి సరిపోయే వారున్నారు. అదే మాతంగకులం. ఏదైనా మొత్తం కులంపాలంగా వర్గానికి సరిపోతుందని చెప్పటానికి వీలులేదు. అందులో బహుళ సంఖ్యాకులు మాత్రమే ఆర్థికంగా, సాంఘికంగా దోపిడీకి గురౌతు మగ్గుతున్నారు. అలాంటివారిని అనేక మతాలవారు దోపిడీనుంచి విముక్తి చేస్తామని భ్రమలలో ముంచుతున్నారు.

మతాలెన్ని మారినా, సాంఘికంగా కులం మారదు. ఆర్థికంగా వర్గం మారదు. పెట్టుబడిదారీ వ్యవస్థ తన లాభానికవసరమైన మేరకు కులాలను రద్దు చేసిందని తెలుసుకున్నాం. ఈ వ్యవస్థకు ఉన్నతస్థాయి అయిన పారిశ్రామికీకరణ ముమ్మరంగా జరిగినపుడు పారిశ్రామిక కార్మిక వర్గం బహుజనంగా పెంపొందినపుడు కులాల గోడలు కూలే అవకాశం ఎక్కువౌతుంది. ఆ పిమ్మట గొప్ప సాంస్కృతిక మహోద్యమం ఒకటి ప్రజ్వరిల్లాలి. అంతవరకు ఈ కులాల బాధ తప్పదనే భావించాలి. కనుక కులనిర్మూలన బాధ్యత పారిశ్రామిక కార్మికవర్గ అగ్రదళం భుజస్కంధాలమీద వుంది.

# సామాజిక అవ్యవస్థ

కె. సింగయ్య, ఎం.ఏ.

అనేకమంది వ్యక్తులు కొన్ని భౌగోళిక పరిసరాల మధ్య కొన్ని సామాజిక సంస్థలను పెంపొందించుకుంటూ (ఆర్థిక) సామాజిక, ఆర్థిక సంబంధాలతో, ఆచార వ్యవహారాలతో, ఆశయాల విలువలతో ఉండే మానవ సమూహాన్ని మానవ సమాజం అంటాం. మానవ సమాజాలు అనేక రకాలు. సమాజం సంక్లిష్టమైంది. అది ఒక నిరంతర ప్రవాహం లాంటిది. అది ఒక ఎడతెగని ప్రక్రియ. సమాజం అనేక భాగాలను కల్గివుండటమేగాక, వివిధ లక్షణాలను కల్గి వుంటుంది. సమాజంలో వుండే అనేక భాగాలు (వ్యక్తులు, వారిమధ్య సంబంధాలు, వివిధ సంస్థలు, ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, సమూహాలు, సముదాయాలు మొదలగునవి) సరిగా పని చేస్తున్నప్పుడు, ఆ సమాజ స్థితిని సామాజిక వ్యవస్థ అంటాం. సమాజంలో ఆయా భాగాలు ఏకారణం వల్లనైనగాని సరిగా పని చేయనపుడు ఆ సామాజిక స్థితిని సామాజిక అవ్యవస్థ అంటాం. సమాజంలో అసమయోజన పరిస్థితులు వాటిల్లినపుడు ఆ స్థితిని సామాజిక అవ్యవస్థ అని అంటాం.

**వ్యక్తి వికలత్వం :** సామాజిక అవ్యవస్థ అనే భావన హెగెల్, మార్క్స్, డార్విన్ మొదలయిన వారు తమ రచనలలో వెలిబుచ్చారు. ప్రత్యేకంగా కార్ల్‌మార్క్స్ తన 'ఎలియనేషన్' భావనద్వారా సామాజిక, వ్యక్తిగత అవ్యవస్థత లాంటి ఆలోచనలకు శ్రీకారం చుట్టారు.

ఎమిల్ దుర్క్‌హైమ్, టాల్కాట్, పార్సన్స్, అగ్‌బర్న్, ఇలియట్, మెరిల్ మొదలగు వారు సామాజిక అవ్యవస్థతను గూర్చి వివరించడానికి ప్రయత్నించారు. కాని, కార్ల్‌మార్క్స్ చేసిన విపుల వివరణ విశిష్టమైనది.

అవ్యవస్థతా సమాజంలో అనేక సమస్యలు ఉద్భవిస్తాయి. ప్రజల సృజనాత్మక శక్తులు అభివృద్ధి గాకుండా, సమాజాభివృద్ధి వివిధ రకాలుగా కుంటుబడి, వ్యక్తులు మానవులుగా ఉండలేని స్థితిగతులు పెరుగుతాయి. ఒక్కొక్క సమాజానికి ఒక్కొక్క రకమైన సమస్యలు ఏర్పడటమే గాక, యుగ యుగానికి కూడా కొత్త సమస్యలు ఏర్పడతాయి. సమస్య పరిష్కార మార్గాన్ని అన్వేషించే సవాలులేని పరిస్థితిని సూచిస్తుంది. సమాజ వ్యక్తుల సంక్షేమానికి అవరోధం కల్గించే పరిస్థితులను, పరిసరాలను సామాజిక సమస్యలుగా చెప్పవచ్చు. సామాజిక సమస్యలు ఆధునిక సమాజాలలో చాలా ఎక్కువవుతున్నాయి. ఈ సమస్యలు ప్రతి సమాజానికి మారుతాయి. సామాజిక సమస్యలు ముమ్మరంగా పెరగటానికి అనేక కారణాలు దోహదం చేస్తున్నాయి. దోపిడీ వ్యవస్థ వర్గవిధానాలు; సరియయిన పారిశ్రామికీకరణ, నగరీకరణ లేకపోవడం, విలువలలో ఘర్షణ, జీవితంలో వేగం హెచ్చు కావడము–మొదలగునవన్నీ సామాజిక సమస్యలను హెచ్చించి సామాజిక అవ్యవస్థా స్థితి గతులేర్పడడానికి కారకాలవుతున్నాయి. ఎలియట్, మెరిల్ ప్రకారం పాత అలవాట్లు, సామాజిక నియంత్రణ రూపాలు శక్తివంతంగా పని చేయలేకపోయినపుడు, సమాజ వ్యవస్థ క్షీణించినపుడు సామాజిక అవ్యవస్థ ప్రస్ఫుటమవుతుంది. మౌరర్ అభిప్రాయంలో సాంస్కృతికస్థితిలో వచ్చినమార్పు సమాజంలో సమన్వయ ధోరణులకు ప్రతిబంధకంగానో లేదా వినాశకారిగానో తయారయినపుడు సామాజిక అవ్యవస్థత ఏర్పడుతుంది.

గిల్లిన్ అను శాస్త్రజ్ఞుని వాదన ప్రకారం సంస్కృతిలో వివిధ అంశాలలో బయలుదేరిన తీవ్రమైన అసమయోజనం ఒక సమూహ అస్తిత్వానికి ప్రమాదంగా తయారయినప్పుడు లేదా వ్యక్తుల మౌలిక వాంఛల పరిపూర్తికి ప్రతిబంధకంగా తయారయినపుడు సమాజంలో ఏకత్వ భావన క్షీణించి అవ్యవస్థకు దారితీస్తుంది.

పై నిర్వచనాలు సామాజిక అవ్యవస్థ దోపిడీ పెరగడానికి ఆర్థిక వ్యవస్థ, వర్గాలు ఎలా దోహదం చేస్తాయనే విషయాన్ని గమనంలోకి తీసుకోలేదు. సామాజిక సమస్యలతో గూడిన అవ్యవస్థా స్థితిగతులను వివరించే కొన్ని విశేష వాదాలు గూడా సమాజ పరిస్థితులమీద ఉత్పత్తి విధానాల పాత్ర, ఆర్థిక రంగం ప్రభావం, పంపిణీ వ్యవస్థ పాత్ర మొదలగు ముఖ్య విషయాలను దృష్టిలో ఉంచుకోలేదు. ప్రధాన సామాజిక సమస్యలను గూర్చి తెలుసుకోవడం చాలా ఉపయోగం అవసరం గూడా.

# పేదరికం

పేదరికం అన్ని సమస్యలలోనూ ప్రధాన సమస్యగా పరిగణించవచ్చు. కలిమిలేములు సాపేక్షపదాలు. పేదరికం అన్ని సమాజాలలో ఒకేరకంగా ఉండదు. ఒక సమాజంలో భాగ్యవంతుడైన వ్యక్తి మరొక సమాజంలో పేదవాడుగా ఉండ వచ్చు. చారిత్రకంగా పేదరికం పారిశ్రామిక విప్లవానంతరం ఒక ప్రధాన సమస్యగా రూపొందింది. అదిమ సమాజంలో లేమి స్థితిగతులున్నప్పటికి, తరతమ భేదాలులేక అదిమ కమ్యూనిజం లాంటిది ఉండటంవల్ల ఆలేమి గుర్తించబడలేదు. ఆనాటి సామాజిక పరిస్థితులు, జీవన ప్రమాణాలు అందరికీ ఒకే విధంగా ఉండటం లేమి గుర్తించబడక పోవడానికి కారణం కావచ్చు. సమాజంలో కొందరు సమస్త భౌతిక సుఖాలలో మునిగి తేలుతుండగా, మరికొందరు కనీసావసరాలు కూడా తీరకుండా బాధపడుతున్నప్పుడు పేదరికం భావన పెరుగుతుంది.

మానవుడు సహజంగా తనను తన ఇరుగు పొరుగువారితో పోల్చుకొంటాడు. కొందరు తనకన్న ఎక్కువ భౌతిక సుఖసంపదలను అనుభవిస్తున్నపుడు, తాను లేమితో భాదపడుతున్నానని భావిస్తాడు. జీవన ప్రమాణాలలో వ్యత్యాసాలు కొట్టవచ్చినట్లు కన్పడుతున్నపుడు పేదరికం ప్రధాన సమస్య కాకమానదు.

**కనీస అవసరాలు:** నిత్యావసరాలకు చాలని అర్థిక స్థితిని పేదరికం అనవచ్చు. ఒక వ్యక్తి తక్కువ ఆదాయం వల్లగాని, అనాలోచిత ప్రవర్తనల వల్లగాని, సామాజిక జీవన ప్రమాణానికి సరితూగేట్లు, తన శారీరక మానసిక శక్తులకు తగినట్లుగా తననూ, తనపైన ఆధారపడిన వాళ్ళనూ సమర్ధవంతంగా పోషించుకోలేని స్థితిని పేదరికం అనవచ్చు.

సమాజంగాని, వ్యక్తిగాని, కుటుంబంగాని దారిద్ర్య వ్యవస్థలో ఉన్నపు డనేక కష్టాలకు లోను కావలసి వస్తుంది. లేమిలో ఉన్న సమాజానికి అంతర్జాతీయంగా విలువ తక్కువ ఉంటుంది. లేమి కుటుంబ సంక్షేమాన్ని నాశనం చేస్తుంది. పేదరికంలోవున్న కుటుంబంయొక్క సభ్యుల శారీరక, మానసిక శక్తులు సరిగా అభివృద్ధి కావు. పిల్లలు సక్రమంగా పెరగరు. లేమి ద్వేషాన్ని పెంచుతుంది. మొత్తంమీద లేమివల్ల జాతి మనుగడ, అభివృద్ధి అనేక విధాల అన్ని రంగాలలో కుంటుబడతాయి. దారిద్ర్యం అసమర్ధతను పెంపొందిస్తుంది. అసమర్ధత దారిద్ర్యాన్ని పెంచుతుంది. ఇది ఒక విష వలయం. ఈ విష వలయంలో చిక్కుకొని సమాజంలోని వ్యక్తులు నిరాశా నిస్పృహలతో జీవచ్ఛవాలవలె జీవితాలు గడుపుతుంటారు.

వేరు వేరు వర్గాల తరగతులమధ్య ఏర్పడిన సంఘర్షణే మానవజాతి చరిత్ర. ఒకజాతి ఆలోచనలను, అభిప్రాయాలను, నమ్మకాలను రూపొందించేవి – ఆ జాతి ఉత్పత్తి విధానం, అర్థిక పరిస్థితులు. పేదరికానికి ప్రధాన కారణం – దోపిడీ విధానంతో కూడిన పెట్టుబడిదారీ అర్థిక వ్యవస్థ. అదిలో వ్యక్తిగత అస్తి లేదు. క్రమేపీ వర్గాలు ఏర్పడ్డాయి.

**వర్గ విభజన:** ఉత్పత్తి శక్తులు కొంతమంది చేతులలోకి వెళ్ళడం వల్ల, దోపిడీ విధానాలవల్ల, కొంతమంది ఉత్పత్తి శక్తులమీద అధిపత్యం లేనివారు– పేదవారు గావడం జరిగింది. ఉత్పత్తి శక్తులమీద అధిపత్యం కల్గినవారు భాగ్యవంతులయ్యారు. ఈ ప్రధాన కారణమేగాక, సమయా సమయాల ననుసరించి మరికొన్ని కారణాలు పేదరికానికి దోహదం చేస్తవి. అవి శారీరక, మానసిక రుగ్మతలు, దుబారా ఖర్చు, కుటుంబ అవ్యవస్థత, చెడు భౌతిక పరిసరాలు, చెడు సామాజిక పరిసరాలు, లోపభూయిష్టమైన విద్యావిధానం, యుద్ధాలు, లోపభూయిష్టమైన ప్రభుత్వ అర్థిక తదితర విధానాలు.

ఏ ప్రమాణాల ప్రకారం చూసినా మన దేశంలో తలసరి ఆదాయం చాలా తక్కువనే విషయం నిర్వివాదాంశం. నూటికి నలభై మంది కటిక దారిద్ర్య స్థితిలో ఉన్నారు.

దారిద్ర్యరేఖ ననుసరించి మన సమాజంలో ఉన్న పేదరికాన్ని సంఖ్యాపరంగా చెప్పడం జరుగుతూ ఉంది. భాగ్యవంతుల రేఖ ద్వారా కలవారి సంఖ్యకూడా చెప్పవచ్చు అనే వాదన కూడా ఉంది.

రోజు గ్రామీణ ప్రాంతంవారు 2400 కేలరీలు కన్నా తక్కువ ఆహారం తీసుకొన్నా, నగర ప్రాంతంవారు 2100 కేలరీల కన్నా, తక్కువ ఆహారం తీసుకొన్నా వారిని దారిద్ర్యరేఖ కన్నా దిగువనున్న వారిగా పేర్కొనడం జరిగింది. కేలరీల ఆధారంగా పేదరికాన్ని కొలవడంతో బాటు, రూపాయల ఆధారంగా కూడా చెప్పబడింది. ఉదాహరణకు 78–79 ధరలలో నెలకు గ్రామీణ ప్రాంతాలలో 76 రూపాయలు, నగర ప్రాంతాలలో 88 రూపాయల కన్నా తక్కువ ఆదాయం కలవారిని దారిద్ర్య రేఖ కన్నా దిగువ ఉన్న వారిగా చెప్పబడింది. 1984–85 ధరవరల ప్రకారం గ్రామీణ ప్రాంతాలవారికి 107 రూపాయలు, నగర ప్రాంతాల వారికి 122 రూపాయలు, దారిద్ర్యరేఖగా గుర్తింపబడింది.

దారిద్ర్యరేఖ కన్నా దిగువనున్న వారి సంఖ్య –

| | గ్రామస్తులు | నగరీకులు | మొత్తం |
|---|---|---|---|
| 1977–78 | 51.2 | 38.2 | 48.3 |
| 1983–84 | 40.4 | 28.1 | 37.4 |
| 1984–85 | 39.9 | 27.7 | 36.9 |
| 1989–90 | 28.2 | 19.3 | 25.8 |

ఎనిమిదో ప్రణాళికాంతానికి దారిద్ర్యరేఖకు దిగువనున్న వారి సంఖ్య ఇంకా తగ్గుతుందని అంచనా.

భారతీయ సమాజంలో శతాబ్దాల తరబడి నగర,

గ్రామీణ ప్రాంతాల మధ్య విపక్ష, వివిధ రంగాలలో తేడా నెలకొంటూ వస్తున్నది. గ్రామీణాభివృద్ధి జరిగితేగాని నిజమైన పురోభివృద్ధి సాధించినట్లుగాదు. ఈ సత్యాన్ని గుర్తించి ఎన్నో గ్రామీణాభివృద్ధి ప్రాజెక్టులు దారిద్ర్య నిర్మూలనకు ప్రవేశ పెట్టబడ్డాయి. అవి:

1) ఇంటిగ్రేటడ్ రూరల్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం.
2) ట్రైసమ్ ట్రెయినింగ్ ప్రోగ్రాం.
3) ఫెయిల్డ్ వెల్ కాంపన్సేషన్ స్కీమ్
4) స్పెషల్ ఫుడ్ గ్రెయిన్స్ ప్రొడక్షన్ స్కీమ్
5) డెవలప్‌మెంట్ ఆఫ్ ఉమెన్, చిల్డ్రెన్ స్కీమ్
6) డ్రాట్ ప్రోన్ ఏరియా ప్రోగ్రాం.
7) జవహర్ రోజ్‌గార్ యోజన.

అయినా, గ్రామీణ ప్రాంతంలో దారిద్ర్యం విలయ తాండవం చేస్తున్నది. ఇంకా వ్యవస్థాపరంగా, విద్యాపరంగా గట్టి కృషి చేయవలసి ఉంది.

## ఆంధ్రప్రదేశ్‌లో

చారిత్రక కారణాలవల్ల ఆంధ్రదేశాన్ని మూడు ప్రాంతాలుగా – సర్కారు జిల్లాలు, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలుగా చెప్పుకోవచ్చు. తూర్పు సర్కారు జిల్లాలు మినహా అన్ని ప్రాంతాలు బాగా వెనుకబడ్డవే. నీటి సదుపాయం ఉండటం వల్ల కొన్ని ప్రాంతాల్లో వ్యవసాయం మీద ఆదాయం పర్వాలేదు. మొత్తంమీద పరిశ్రమలు అభివృద్ధి కాలేదు. నగరాలు, కొద్దిగా పారిశ్రామిక రంగంలో పనిచేసే వారుకూడా కొద్దిమందే. ఆంధ్రదేశంలో ప్రజానీకాన్ని గ్రామవాసులుగా, నగరవాసులుగా విభజించలేం. ఎందుకంటే నగరాలలో ఉండే వారికి గ్రామ సంబంధాలు వున్నాయి. అలాగే గ్రామ వాసులకు నగర సంబంధ బాంధవ్యాలు వున్నాయి. గ్రామంలో పెద్ద రైతులు, మధ్య రైతులు, వ్యవసాయ కూలీలు, వంశ వృత్తిమీద ఆధారపడే వారుంటారు.

పెద్ద రైతుల ఆదాయం బాగున్నా, మధ్య రైతుల, వ్యవసాయ కూలీల, వంశవృత్తులమీద ఆధారపడేవారి ఆదాయం చాల తక్కువ. నగరాలలో నివసించే పెద్ద, పెద్ద వ్యాపారుల ఆదాయం బాగున్నా, పారిశ్రామిక రంగంలోనున్న కార్మికులు, రిక్షా తదితర కార్మికుల, మధ్య తరగతి ఉద్యోగుల ఆర్థిక స్థితి బాగా లేదు.

నూతన ఆర్థిక విధానాలు, భూసమస్యా పరిష్కారం, గృహ, భారీ పరిశ్రమల స్థాపన, ఖనిజ సంపదను వినియోగించుకోవడం, సరియైన విద్యావిధానం – కొత్త టెక్నాలజీని వినియోగించుకోవడం – ఇవి నిరుద్యోగ నిర్మూలన, దారిద్ర్య నిర్మూలనకు తోడ్పడుతాయి.

**నిరుద్యోగం:** మన సమాజంలో నిరుద్యోగ సమస్య స్వైర విహారం చేస్తున్నది. ఉద్యోగం చేయడానికి అవసరాలు, అర్హతలు ఉండి కూడా, ఉద్యోగం లేకుండా వుండడాన్ని నిరుద్యోగం అంటాం. నిరుద్యోగం అనేక రకాలు: అవి 1. నియతకాలిక నిరుద్యోగిత, 2. సాంకేతిక నిరుద్యోగిత, 3. తాత్కాలిక నిరుద్యోగిత, 4. ఐచ్ఛిక నిరుద్యోగిత, 5. చక్రీయ నిరుద్యోగిత, 6. పెట్టుబడి, ఉత్పత్తి పరికరాలు తదితర వనరుల కొరతలో ఏర్పడిన నిరుద్యోగిత, 7. అనైచ్ఛిక నిరుద్యోగిత, 8. అసమగ్ర ఉద్యోగిత.

కారణాంతరాల వల్ల కొన్ని రంగాల్లో సంవత్సరంలో కొన్ని నెలలే ఉధృతంగా పని సాగుతుంది. ఆయా రంగాలలో పనిచేసే వారికి కొన్ని నెలలు మాత్రమే పని ఉంటుంది. మిగతా కాలంలో వాళ్ళు నిరుద్యోగులవుతారు. మన గ్రామాలలో రైతులకు, వ్యవసాయ కూలీలకు పని కొన్నినెలలే ఉంటుంది. దీనినే నియతకాలిక నిరుద్యోగం అంటారు.

పరిశ్రమలు తయారు చేసే వస్తువులకు గిరాకీ తగ్గినపుడు, సదరు పరిశ్రమలు గిరాకీ ఉన్న వస్తువులను ఉత్పత్తి చేయడం మొదలు పెట్టినపుడు, అంతకు పూర్వం వస్తువులను తయారు జేయడానికి మాత్రమే ప్రావీణ్యత పొందిన కార్మికులు నిరుద్యోగులవుతారు. దీన్ని సాంకేతిక నిరుద్యోగం అంటారు. కొన్ని సమయాలలో సాంకేతికాభివృద్ధి నిరుద్యోగాన్ని ఎక్కువ చేయవచ్చు. ఉదాహరణకు కంప్యూటర్లు, ట్రాక్టర్లు ప్రవేశ పెట్టినందువల్ల అంతకుముందు ఆ ప్రదేశాలలో పనిచేసేవారు నిరుద్యోగులవుతారు. ప్రతి పరిశ్రమ, ఆఫీసు, బ్యాంకు అనుభవమున్న వారినే ఎన్నుకోవడానికి ప్రయత్నిస్తుంది. ఇలాంటపుడు చదువు ముగిసిన వెంటనే ఉద్యోగం దొరకదు. ఈ స్థితిని తాత్కాలిక నిరుద్యోగ మంటారు.ఉద్యోగం చేసే శక్తి ఉండికూడా బుద్ధిపూర్వకంగా సోమరితనం అలవాటు చేసుకొని నిరుద్యోగిగా ఉండిపోవడం ఐచ్ఛిక నిరుద్యోగం అంటారు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యాపార సరళిలో ఒడుదుడుకులు ఎక్కువగా వాటిల్లుతూ ఉంటాయి. పరిశ్రమలో తయారయే వస్తువులకు గిరాకీ తగ్గినపుడు ధరలు తగ్గడం, లాభాలు తగ్గడం, పరిశ్రమలు మూతపడటం జరుగుతుంది. అలాంటపుడు ఆయా పరిశ్రమలలో పనిచేసే కార్మికులు నిరుద్యోగులవుతారు. ఇలాంటి నిరుద్యోగాన్ని చక్రీయ నిరుద్యోగం అంటారు.

**వనరుల కొరత:** పరిశ్రమలకు కావలసిన పెట్టుబడి, సాంకేతిక పరిజ్ఞానం, యంత్రాల ఆధునికీకరణ సమాజంలో సమకూరనపుడు ఏర్పడిన నిరుద్యోగాన్ని – వనరుల కొరతతో ఏర్పడినట్టి నిరుద్యోగం అంటారు. అర్హతలకు తగ్గట్టుగా కాక, తక్కువ రకం ఉద్యోగాలు చేస్తున్నపుడు దానిని అసమగ్ర

ఉద్యోగం అంటారు. కొన్ని సమయాలలో ఇది వ్యవసాయ రంగంలో మరొక రూపంలో ఉంటుంది. చిన్న కమతాలు గల్గిన రైతు కుటుంబ సభ్యులందరూ అదే పొలంలో, అవసరం ఉన్నా లేకపోయినా వేరే పనిలేక పని చేస్తున్నప్పుడు అసమగ్ర ఉద్యోగస్థితి అభివృద్ధి చెందుతుంది.

1985 లో 262.70 లక్షల మంది నిరుద్యోగులుంటే, 1992 ఆగష్టు చివరకు 371.20 లక్షల మంది నిరుద్యోగులున్నారు. ఈ నిరుద్యోగులలో 61 శాతం విద్యావంతులు 1993 మే ఏడవ తేదీన కేంద్ర కార్మిక మంత్రి లోక్‌సభకు ఇచ్చిన వివరాల ప్రకారం 1990 డిసెంబరు చివరకు 37,700 మంది డాక్టర్లు; 95 వేల మంది ఇంజనీర్లు నిరుద్యోగులుగా ఉన్నారు.

ఎనిమిదో ప్రణాళిక అంతానికి – 1997 కు ఆరుకోట్ల నిరుద్యోగులుంటారని అంచనా వేయబడింది. 1992 మార్చి నాటికి మన రాష్ట్రంలో ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజీలలో రిజిష్టరు చేసుకున్న నిరుద్యోగులు – 32,13,753 మంది.

| | |
|---|---|
| వీరిలో స్త్రీలు | 4,95,843 |
| ఇంజనీర్లు | 56,812 |
| డాక్టర్లు | 3,756 |

సమాజానికి నిరుద్యోగంవల్ల ఊహ కందని నష్టం వాటిల్లుతుంది. నిరుద్యోగం వ్యక్తి ఆత్మగౌరవాన్ని అగ్ని పాలు చేసి, మర్యాదను మంట గలుపుతుంది. వ్యక్తి మనోస్థయిర్యాన్ని, ఏకాగ్రతను నాశనం చేసి, నిరాశా నిస్పృహలను పెంపొందిస్తుంది. అదొక విషం వంటిది. మన దేశంలో మరో ప్రత్యేకత ఏమిటంటే – చదువుకొన్నవారు తక్కువ. ఆ కొద్దిమందే ఉద్యోగాలు లేక నిరుద్యోగంతో సతమతమవుతున్నారు.

టెక్నికల్ కోర్సుల్లో డిగ్రీలున్నవారు తమంత తాము పరిశ్రమలు నెలకొల్పుకునేందుకు లక్ష రూపాయలు అప్పు ఇచ్చే పథకాన్ని 1993 అక్టోబరు 2 న కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. 740 కోట్లు ఇందుకు కేటాయించింది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో నిరుద్యోగ సమస్య నిర్మూలన పూర్తిగా జరగబోదు. ఎంతో అభివృద్ధిగాంచిన అమెరికా లాంటి సమాజాలు సైతం నిరుద్యోగానికి బలి కావటం తప్పడంలేదు. మంచి విద్యా విధానంతోబాటు, సోషలిస్టు విధానాలు సక్రమంగా అమలు చేసినప్పుడే నిరుద్యోగం నిర్మూలించడానికి వీలవుతుంది.

## భిక్షుక సమస్య

భిక్షుక సమస్య వ్యక్తిగత ఆస్తి సంస్థ అభివృద్ధి చెందిన తరువాత పెంపొందింది. ఆదిమ సమాజాలలో భిక్షుక సమస్య లేదని చెప్పవచ్చు. సామాజిక ఆర్థిక మార్పులకు, యాచక సమస్యకు అవినాభావ సంబంధమున్నది. యాచకులు అనేకమంది సమాజాభివృద్ధికి తోడ్పడక పోగా, సమాజంలో జరిగే ఉత్పత్తిలో భాగం పంచుకుంటారు. ఇతరుల శ్రమనుంచి కొంత ఆశిస్తుంటారు. ఏ వ్యక్తియైనా సమాజంలో తన పాత్రను నిర్వహించక యాచకుడుగా మనుగడ సాగిస్తున్నప్పుడు ఆ స్థితిని వైయక్తిక అవ్యవస్థ అని చెప్పవచ్చు.

గురుకుల విద్యావిధానం బాగా వికసించిన రోజులలో ఆశ్రమ అంతేవాసులు వాళ్ళకు సరిపోయే నిత్యావసర వస్తువులను ఆ ఆశ్రమానికి దగ్గరలోవున్న గ్రామాలనుంచి దానధర్మాలుగా స్వీకరిస్తుండేవారు. అయితే ఒక ఉన్నతమయిన ఆశయ సాధనలో ఈ దానధర్మాలు తీసుకోవడం జరుగుతూ వుండేది. బౌద్ధ భిక్షువులుగూడ వాళ్ళకు సరిపడునంత ఆహారం మాత్రమే గృహస్థుల దగ్గర నుండి స్వీకరిస్తూ ఉండేవాళ్ళు. మన దేశంలో ఈనాడున్న యాచక వృత్తి తీరులో ఆనాటి దానధర్మాలు స్వీకరించే పద్ధతిని పోల్చటానికి వీలులేదు. యెవరు ఇతర వ్యక్తులను యాచన ద్వారాగాని, పాట ద్వారాగానీ, నాట్యం ద్వారాగాని అవయవ లోపాలు చూపించుట ద్వారాగాని సానుభూతి పొంది, దానధర్మాలు స్వీకరిస్తూంటారో, ఆ వ్యక్తులను యాచకులని లేక భిక్షువులని చెప్పవచ్చు. యాచకులను ఈక్రింది విధంగా విభజించవచ్చు:

1. అవయవ సౌష్ఠవం బాగావున్న యాచకులు.
2. యాచక వృత్తిలో ఉన్న బాలబాలికలు.
3. వంశ పారంపర్యంగా యాచక వృత్తి చేపట్టేవాళ్ళు.
4. రోగగ్రస్థులైన యాచకులు.
5. శారీరక అవయవ లోపమున్న యాచకులు.
6. మానసికంగా లోపం యున్న యాచకులు.
7. వయస్సు మీరిన యాచకులు.
8. మత సంబంధమైన వేషాలు ధరించి యాచించేవాళ్ళు.
9. తెగలలో యాచకులు.
10. నిరుద్యోగంవల్ల యాచకవృత్తి చేపట్టేవాళ్ళు.

యాచకులు అనేక పద్ధతుల ద్వారా తమ వృత్తిని కొనసాగిస్తుంటారు. భిక్షుక సమస్యకు ప్రధాన కారణం దారిద్ర్యం. ఇదిగాక మానసిక, మతపరమైన కారణాలుగూడ ఈ సమస్యకు దోహదం చేస్తున్నాయి. స్వాతంత్ర్యానంతరం అన్ని రాష్ట్రాలు భిక్షాటనను నిషేధించాయి. ప్రణాళిక ద్వారా కేంద్ర ప్రభుత్వం ఈ సమస్యను నిర్మూలించటానికి కొంత ప్రయత్నం చేసింది. భిక్షుక గృహాలు నిర్మించటమేగాక, నాల్గవ ప్రణాళికలో రూ. 3 కోట్లు భిక్షాటన నిర్మూలనా కార్యక్రమాలకు కేటాయించారు.

మన రాష్ట్ర ప్రభుత్వం కర్నూలులో, వరంగల్‌లోనూ,

హైదరాబాదులోనూ భిక్షుక గృహాలు నిర్మించింది. సామాజిక ఆర్థిక మార్పులు బాగా జరిగినపుడు భిక్షుక సమస్య నిర్మూలన గావించబడుతుంది.

న్యూఢిల్లీలోని సాంఘిక సంక్షేమ శాఖ భిక్షుక సమస్యను, అత్యంత తీవ్రమైన సమస్యగా గుర్తించి, తక్షణ చర్యలు తీసుకోబడాలని కోరటం గమనార్హం.

1965 లో ప్రణాళికా సంఘం భిక్షుక వృత్తిని, దేశదిమ్మరి వృత్తిని పరిశీలించటానికి ఒక అధ్యయన బృందాన్ని నియమించింది. యాచక వృత్తి నిర్మూలనకు ఈ బృందం అనేక సూచనలను చేసింది. యాచకులను కొన్ని వర్గాలుగా విభజించింది. కేవలం అలవాటు కొద్దీ యాచక వృత్తి కొనసాగించేవారు. అంగవికలురు, జబ్బులతో బాధపడు తున్నవారు, వృద్ధులు, బలహీనులు ఒక వర్గంగా విభజించబడ్డారు. దేశం మొత్తానికి వర్తించేటట్లు ఒక నిర్మాణాత్మకమైన శాసనం చేయటం అత్యవసరమని కూడా సోషల్ డిఫెన్స్ ఇన్‌స్టిట్యూట్ సూచించింది.

ప్రస్తుతం మనం ఆశ్చర్యకరమైన పరిస్థితిని చూస్తున్నాం. ఒక రాష్ట్రం మరో రాష్ట్రంలోకి భిక్షుకుల్ని తరిమివెయ్యటం అనేది కూడా కొన్ని చోట్ల జరుగుతున్నది. ఢిల్లీ ప్రాంతంనుంచి ఉత్తరప్రదేశ్‌కో, తమిళనాడుకో ఆయా రాష్ట్రాలకు చెందిన భిక్షువుల్ని పంపించి వేస్తున్నారు.

## వైయక్తిక అవ్యవస్థ సమస్యలు

వైయక్తిక అవ్యవస్థకు సంబంధించిన సమస్యలు మూడు భాగాలుగా విభజించవచ్చు.

1) అంగవైకల్యానికి సంబంధించిన సమస్యలు
2) బుద్ధిమాంద్యానికి సంబంధించిన సమస్యలు
3) విఘటనకు లేక అసమ యోచనకు లోనైన వ్యక్తుల సమస్యలు.

**అంగవికలురు:** భౌతిక వైకల్యం ఉన్నవారిని ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

1) దృష్టి వైకల్యం గలవారు (గ్రుడ్డివారు)
2) వినికిడి వైకల్యం గలవారు (చెవిటివారు)
3) భాషావైకల్యం గలవారు (మూగవారు)
4) శారీరక అవయవ వైకల్యం గలవారు (కుంటివారు, గూనివారు)

**(1) అంగవికలురు - కారణాలు:** (1) వంశ పారంపర్యం (2) పుట్టుక సమయంలో వచ్చిన లోపాలు (3) ప్రమాదాలు (4) ఆర్జిత లోపాలు (5) పోషక ఆహార లోటు (6) యుద్ధ పర్యవసానాలు (7) అజ్ఞానం (8) పేదరికం (9) చికిత్సా సదుపాయాలు లేకపోవడం (10) విధిని నమ్ముకొని ఉండిపోవడం.

మన దేశంలో 1981 లెక్కల ప్రకారం ఒకటి ఇరవై లక్షల మంది అంగవికలురు ఉన్నారని చెప్పబడింది. సరయిన విధంగా వికలాంగులకు పునరావాసం కల్పించగల్గితే వారు సమాజాభివృద్ధికి తోడ్పడతారు. అంతేగాక, వీరిలో నున్న న్యూనతా భావం పోతుంది; ఇతరులమీద ఆధారపడి సమాజానికి భారం కాకుండా, వారి శక్తి యుక్తులు కూడా సమాజ సౌలభ్యానికి ఉపయోగపడుతాయి.

సాంఘిక సంక్షేమ మండలి వికలాంగుల సంక్షేమ కార్యక్రమాలకు పునాది వేయడమేగాక, వికలాంగులకు సహాయపడే అనేక స్వచ్ఛంధ సేవా సంస్థలకు సహాయ సహకారాలను అందిస్తున్నది. మూడువేలకు పైగా సాంఘిక, ఆర్థిక కేంద్రాలు మనదేశంలో వికలాంగులకు ఉపాధి కల్పిస్తున్నాయి. బొంబాయి నగరంలోనున్న ఫెలోషిప్ ఫర్ ది హాండికాప్డ్, నేషనల్ అసోసియేషన్ ఫర్ బ్లైండ్, అలహాబాద్‌లోని రిహాబిలిటేషన్ సెంటర్ ఫర్ క్రిపుల్డ్, ఆలిండియా ఫెడరేషన్ ఆఫ్ ది డెఫ్, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ ది మెంటల్లీ రిటార్డెడ్ అనే సంస్థలు బహుముఖ కృషి చేస్తున్నవి.

వికలాంగులకు ఉపకార వేతనాలు, ప్రత్యేక ఉపాధి కల్పనా కేంద్రాలు, వికలాంగులకు 3 శాతం ఉద్యోగాలలో రిజర్వేషన్, వాహనాలు వాడే వారికి సగం శాతం ఇంధనం ఖర్చు, వృత్తి విద్యాకేంద్రాలు నడపడం, వికలాంగులకు ఉద్యోగాలిచ్చే పరిశ్రమలకు బహుమతులివ్వడం మొదలగు అనేకానేక సంక్షేమ కార్యక్రమాలు ప్రవేశపెట్టబడ్డాయి.

1981ని అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరంగా గుర్తించబడింది. కేంద్ర ప్రభుత్వం ఒక జాతీయ సంఘాన్ని కూడా ఏర్పాటు చేసింది.

**(2) బుద్ధిమాంద్యం:** అభివృద్ధి కాలంలో ఉద్భవించే అధమ, సగటు, సామాన్య మేధస్సు ప్రక్రియను బుద్ధి మాంద్యం అంటారు. బుద్ధి మాంద్యం కొంతమంది పిల్లలలో పుట్టుకతోనూ, కొంతమంది పిల్లలలో ఎదుగుతున్న వయస్సులోనూ సంభవిస్తుంది. వీరు బాల్యం నుంచి తెలివి తేటలు తక్కువగా ఉండి, మానసిక పెరుగుదల అసంపూర్తిగా ఉండి, సాంఘిక జీవనంలో సర్దుబాట్లు అలవరచుకోలేరు. మన దేశంలో పది మిలియన్ల బుద్ధిమాంద్యంగలవారున్నారని అంచనా వేయబడింది.

**కారణాలు:**

1) మాతృగర్భంలో ఉన్న శిశువుకు సంభవించే దుష్ట పరిణామాల వల్ల శిశువు మెదడు భాగాలు దెబ్బతినడం.
2) గర్భిణీ స్త్రీల విపరీత చెడు అలవాట్లు, జబ్బులు.
3) వాడకూడని మందులు వాడడం.
4) బాల్యంలో సంభవించే కొన్ని వ్యాధులు.
5) కొన్ని సందర్భాలలో మేనరికపు వివాహాలు.

ప్రపంచ వ్యాప్తంగా ఇంటార్డ్ సెంగ్టిన్, డీనొ, మాంటె సాస్యతి మొదలైన నిపుణులు బుద్ధిమాంద్యానికి కారణాలు వాటి నివారణకు చాలా పరిశోధనలు జరిపారు. 1979 లో ఒక నిపుణుల సంఘం బుద్ధి మాంద్యుల సంరక్షణకు తీసుకోవలసిన చర్యల గూర్చి ప్రణాళికా సంఘానికి సిఫారసు చేసింది. 1964 నుండి ఢిల్లీలో, 1987 నుంచి పూనాలో బుద్ధిమాంద్యుల కోసం పాఠశాలలు నడుపుతున్నారు. దాదాపు దేశమంతటా బుద్ధి మాంద్యులకోసం పాఠశాలలు ఏర్పాటు చేయబడ్డాయి. హైదరాబాద్‌లో కూడా ఒక పాఠశాల నడుపుతున్నారు. ఈ పాఠశాలలలో బుద్ధిమాంద్యులకు ప్రత్యేక శిక్షణ ఇస్తారు. ప్రత్యేక శిక్షణ ద్వారా బుద్ధిమాంద్యులు ప్రయోజనకర జీవితాన్ని గడుపగల్గుతారు. ఇలాంటి ప్రత్యేక పాఠశాలల ప్రయోజనాలను గ్రామీణ ప్రాంతాలకు కూడా తెలియజేయడం అవసరం.

**(3) వైయక్తిక అవ్యవస్థ:** వ్యక్తి నడవడిని సమూహం గర్హించినపుడు, వ్యక్తి ప్రవర్తన నియమబద్ధం కానపుడు, సమాజపు అవధులు మించి ప్రవర్తించినపుడు వ్యక్తిలో అవ్యవస్థ ఏర్పడిందని చెప్పవచ్చు. వైయక్తిక అవ్యవస్థ అంటే వ్యక్తి అంతస్తు, పాత్ర లోపభూయిష్టమైన స్థితి, వైయక్తిక అవ్యవస్థ మూలంగా సామాజిక అవ్యవస్థ – తద్వారా సామాజిక సమస్యలు ఉత్పన్నమవుతాయి. అలాగే సామాజిక అవ్యవస్థలో జీవించే వ్యక్తులు అవ్యవస్థాస్థితికి లోనుగావడానికి ఎక్కువ అవకాశాలుంటాయి. సాధారణమైన వ్యక్తి శారీరక మానసిక స్థితిని సామాజిక పరిస్థితులకు తగినట్లుగా సర్దుబాటు చేసుకొంటూ ఉంటాడు. కాని, అవ్యవస్థకు లోనైన వ్యక్తి సామాజిక ప్రమాణాలను అతిక్రమించి సామాజిక అసమ్మతికి గురి అవుతాడు.

కారణాలు:

1) జైవిక కారణాలు,
2) పరిసరాలకు సంబంధించిన కారకాలు
3) భద్రత కోల్పోవడం
4) జీవితంలో సంక్షోభం

మానసికమైన పరిస్థితిని బాగు చేయడానికి మన దేశంలో అనేక క్లినిక్సు పని చేస్తున్నాయి.

## నేరం

అధునిక మానవుడు సమాజంలో వివిధ సమస్యలకు గురి అవుతున్నాడు. ఒక ప్రక్క అనేక రంగాలలో విపరీతమైన అభ్యున్నతి సాధించబడింది. మరో ప్రక్క సామాజిక సంబంధాలలో ఎన్నో విధాల అస్పష్టత స్థితిగతులు ఏర్పడ్డాయి. ఒక విధమైన సామాజిక మానసిక సంక్షోభంలో అధునిక మానవుడు కాలం గడుపుతున్నాడు. ఈ రోజులలో ప్రతి సమాజంలోనూ చికాకు కలిగిస్తున్న ప్రధానమైన సామాజిక సమస్యలలో నేర సమస్య ఒకటి. అధునిక యుగంలోని స్థితిగతులు (జనాభా పెరుగుదల, రవాణా సౌకర్యాలు, నగరాభివృద్ధి, యంత్రాభివృద్ధి) నేర సమస్య మీద ఎంతో ప్రభావాన్ని చూపుతున్నాయి. వివిధ కారణాల వల్ల అధునిక సమాజాలలో నేర సమస్య విపరీతముగా పెరిగిపోవుతున్నది. ఈ నేర సమస్య సమాజంలో వుండటం అనేక విధాల సమాజాభివృద్ధికి నష్టం. నేరస్థులు సమాజాభివృద్ధికి సహకరించకపోగా, రాబందులవలె ఇతరుల శ్రమను దోచుకొని జీవిస్తూంటారు. నేర సమస్య వుండటంవల్ల వ్యక్తులకు స్థయిర్యం, రక్షణ మొదలయినవి ఉండవు. నేర సమస్యను హద్దుల్లో వుంచుటకు కష్టార్జితమైన ప్రజల ధనాన్ని వృథా చేయవలసి వస్తుంది.

**నేర ప్రవృత్తి:** కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం శాసనమును అతిక్రమించుటగానీ, ధిక్కరించుటగానీ, నేరమవుతుంది. సమాజానికి హానికరమయిన పని నేరమని కొంత మంది నమ్ముతున్నారు. వీరి అభిప్రాయం ప్రకారం ఒక చర్య సామాజిక నియమాలను, కట్టుబాట్లను అతిక్రమించినపుడు ఆ చర్యను (ప్రభుత్వము నిషేధించినా, నిషేధించకపోయినా) నేరమనవచ్చు. కొందరు క్రిమినల్ కోడ్‌ను ధిక్కరించే ప్రవర్తననే నేరంగా భావిస్తారు. ఏది నేరం అనే విషయాల మీద అనేక వాదోపవాదాలు వున్నాయి. అలాగే నేరశాస్త్రంలో అనేక సిద్ధాంతాలు నేరాన్ని గూర్చి ప్రతిపాదించబడినవి. వాటిని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు:

1. **మానవశాస్త్ర నేర సిద్ధాంతం :** లోంబ్రోసో మొదలగు వారు నేర స్వభావం జన్మతః వస్తుందని, కొన్ని శారీరక లక్షణాల కారణంగా వ్యక్తులు నేరస్తులవుతారని భావిస్తారు.

2. **దైహిక నేర సిద్ధాంతం :** కొంతమంది శాస్త్రజ్ఞులు శరీరంలో పనిచేసే గ్రంధుల తీరు ననుసరించి వ్యక్తుల మానసిక శారీరక అభివృద్ధి ఉంటుందని భావించారు. మనిషి చెడ్డ చేష్టలన్నీ శరీర గ్రంధులు సరిగ్గా పనిచేయనందువల్లనేనని వాళ్ళ నమ్మకం. థైరాయిడ్, పిట్యూటరీ మొదలైన గ్రంధులు సరిగ్గా పనిచేయనందువల్ల నేర స్వభావం మనిషిలో అభివృద్ధి చెందుతుందని వీళ్ళ సిద్ధాంతం.

3. **వారసత్వ నేర సిద్ధాంతం :** కొంతమంది నేర శాస్త్రజ్ఞులు నేర స్వభావం వంశ పారంపర్యంగా వస్తుందని భావిస్తారు.

4. **మనోవైజ్ఞానిక నేర సిద్ధాంతం :** మానసిక కారణాలవల్ల మనిషి నేరం చేస్తాడని అనేక మంది మానసిక శాస్త్రవేత్తలు నమ్ముతారు.

5. **భౌగోళిక నేరవాదం :** ఈ వాదం ప్రకారం భౌతిక

పరిస్థితులకు, నేరానికి సంబంధం ముంది. హంటింగ్‌టన్ మొదలగు వారు చలికాలంలో నేరాలు ఎక్కువవుతాయని భావించారు.

**6. ఆవరణ నేరవాదం :** ఈ వాదం ప్రకారం ఆయా ప్రాంతాలనుబట్టి నేరాల తీవ్రత మారుతూ వుంటుంది.

**7. సమాజ శాస్త్రీయ నేరసిద్ధాంతం :** ఈ సిద్ధాంతం ప్రకారం నేరం సామాజిక పరిస్థితులవల్ల ఉత్పన్నమవుతుంది.

**పెట్టుబడిదారీ వ్యవస్థ - నేర ప్రవృత్తి:** ఈ సిద్ధాంతాలన్నీ నేర సమస్యను సరిగ్గా వివరించలేక పోయాయి. నేర సమస్యకు, వ్యక్తిగత ఆస్తికి, సమాజంలో అసమానతలకు అవినాభావ సంబంధమున్నది. ఫ్యూడల్, పెట్టుబడిదారీ సమాజాలలో నేరం అభివృద్ధి అవుతుంది. బోంగర్ సిద్ధాంతం ప్రకారం నేరానికి పెట్టుబడిదారీ విధానమే కారణం. దారిద్ర్యం, నిరుద్యోగంవల్ల నేరం పెరుగుతూ ఉంటుంది. కొన్ని ప్రత్యేక నేర లక్షణాలు మినహా, ఎక్కువ నేరాలు ఆర్థిక కారణాల వల్లనే వాటిల్లుతాయి.

నేరం వేరు, బాల నేరం వేరు. 18 సంవత్సరాలలోపు బాలబాలికలు నేరాలు చేస్తే, వాళ్ళని బాల నేరస్తులంటారు. బాలనేరాలకు ముఖ్యమయిన కారణాలు విచ్ఛిన్న కుటుంబం, దారిద్ర్యం, చెడు స్నేహితులు, మురికిపేటల వంటి ప్రదేశాలు, లోపభూయిష్టమైన మానసిక స్థితి, అవయవ లోపం.

సమాజంలో మంచిహోదా, పలుకుబడి, గౌరవంగల వ్యక్తులు తమ వృత్తుల నిర్వహణలో చేసే నేరాన్ని వైట్ కాలర్ నేరంగా చెప్పవచ్చు. వైట్ కాలర్ నేరాలు సామాన్యంగా పై తరగతివాళ్ళు, రాజకీయాలలో ఉన్నవాళ్ళు, పెద్ద వ్యాపారస్తులు, పెద్ద ఉద్యోగాలు చేసేవాళ్ళు చేస్తుంటారు. స్మగ్లింగ్, కల్తీ వ్యాపారం, ఆదాయపుపన్ను ఎగవేయడం, లంచాలు పుచ్చుకోవటం, ప్రభుత్వ డబ్బు దుర్వినియోగ పరచటం వైట్ కాలర్ నేరాలకు ఉదాహరణలు.

నేరం సామాజిక పరిస్థితులు బాగుపడనిదే నిర్మూలన కాదు. కేవలం దండన వలన నేరాన్ని తుడిచి వేయలేము. సమాజంలో ఆర్థిక, తదితర అసమానతలు, దోపిడీ విధానాలు, అన్యాయాలు నిర్మూలించబడినపుడు నేరం తగ్గిపోతుంది. ప్రత్యేక మానసిక స్థితివల్ల నేరం చేసేవాళ్ళను ప్రత్యేకమైన ఆదరణవల్ల, సరిచేయవచ్చు. అలాగే బాల నేరాలనుగూడా సమాజాభివృద్ధితోపాటు నిర్మూలించవచ్చు.

## నేరస్థ జాతులు

ఆంధ్రప్రదేశంలో బ్రిటిషువారి పాలసీల ప్రభావంగా కొంత మంది క్రిమినల్ తెగలయ్యారు. వీరిని బ్రిటిషువారు కొన్ని కొన్ని ప్రాంతాలలో సెటిల్ చేశారు. వీరుగాక, నగరాలలో నూతన పద్ధతులలో నేరాలు చేస్తున్నవారు ఎక్కువవుతున్నారు. కొన్ని ప్రాంతాలలో ఫ్యూడల్ వ్యవస్థ కారణంగా హత్యలు ఎక్కువగా జరుగుతుంటాయి. ఎన్నికలకూ, రాజకీయాలకీ, రౌడీయిజానికీ, దురదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశంలో కొన్ని ప్రాంతాలలో అవినాభావ సంబంధముండటంవల్ల నేరాలు ఎక్కువవుతున్నాయి.

భూస్వామ్య వ్యవస్థ కొందరిని అంటరాని వారిని, కొందరిని వేశ్యలను చేసినట్లే కొన్ని తెగలను నేరస్తులుగా చేసింది. ఈ తెగలను ఆ కాలపు రాజులు తమ స్వప్రయోజనాలకు వాడుకునేవారు. ఎరుకలు, బోయలు, తదితర ఆటవిక తెగలు అట్టివారు.

అట్టివారిని దేశ సరిహద్దులలో ఉంచి, పరరాజులపై ఉసికొల్పుతూ ఉండాలని కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో వ్రాశాడు. భూస్వామ్య వ్యవస్థలో దాదాపు రాజులందరూ ఇదే పని చేశారు. ఈ దుర్లక్షణాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ కొనసాగిస్తున్నది. వెనుకబడిన వర్గాల ప్రజలందరికీ సమాజంలోని ఇతర తరగతులతో సమానంగా అభివృద్ధి అయ్యేట్టు ప్రత్యేక ప్రోత్సాహకాలు కల్పించాల్సి వుంది.

## మురికి పేటలు

ఆంధ్రదేశంలో ప్రతి నగరంలోను మురికి పేటలున్నాయి. నగర జీవితం, నగరాలు భారత దేశానికి క్రొత్తగాదు. ఆనాటి నుంచి మన దేశంలో నగరాలున్నాయి.

ఆధునిక కాలంలో మురికి పేటల సమస్య విపరీతమవుతూ ఉన్నది. పారిశ్రామికీకరణకు, నగరాభివృద్ధికి, లాభాలకు, దోపిడీ విధానాలకు, మురికి పేటల అభివృద్ధికి అవినాభావ సంబంధముంది. మురికి పేటలు పెట్టుబడిదారీ దేశాలలో తప్పకుండా వుంటాయి. అవి సమాజానికి క్షయవ్యాధి లాంటివి.

చమత్కారం ఏమిటంటే - యూరోపియన్ దేశాలలో పరిశ్రమలున్న నగరాలలో మురికి పేట లెక్కువయ్యాయి. మన దేశంలో పరిశ్రమలు ఉన్నా, లేకున్నా, మురికి పేట లెక్కువవుతున్నాయి. పెద్ద పెద్ద గ్రామాల్లో కూడా వివిధ కారణాల వల్ల మురికి పేట లెక్కువవుతున్నాయి. మురికి పేటల నిర్మూలనా కార్యక్రమం వెంటనే ఒక సవాలులాగా తీసుకోవడం మన సమాజానికి ఎంతో అవసరం. శిథిలావస్థలో ఉండి మరుక్షణంలో కూలిపోతాయనిపించే ఇండ్లు, పూరిగుడిసెలు, వాటికి మించి ఉండే అధిక జనాభా, అనారోగ్య పరిస్థితులు మొదలయిన లక్షణాలు వుండి పేదవాళ్లు, కూలిజనం నివసించే ప్రాంతాన్ని మురికి పేటల ప్రాంతమని చెప్పవచ్చు. ఈ పేటల ప్రాంతాలలో ఈ క్రింది లక్షణాలు ఉంటాయి:

1. తక్కువస్థాయిలో ఉండే ఇండ్లు.

2. అధిక జనాభా, అవిద్య.

3. అనారోగ్య పరిస్థితులు.

4. కనీస సదుపాయాలు లేకపోవడం.

5. నగరజీవనంతో వీళ్ళకు సంబంధం లేకపోవడం.

మురికి పేటలు పెరగడానికి ప్రధాన కారణం పేదరికం. సామాజిక, రాజకీయ కారణాలు కూడా ఈ పేటల అభివృద్ధికి దోహదం చేస్తాయి. సమాజానికి మురికి పేటల వల్ల ఎంతో నష్టం జరుగుతుంది. మురికి పేటల సామాజిక స్థితి వాటిలో ఉండేవారి ఉత్పాదక శక్తి, నైతిక విలువలు, జీవన ప్రమాణాలు, కుటుంబ వ్యవస్థ, పిల్లల పెంపకం మొదలగువాటిమీద చెడు ప్రభావం చూపుతుంది. ప్రతి ప్రణాళికలో కోట్లరూపాయలు మురికి పేటల నిర్మూలనకోసం మన దేశంలో వెచ్చించటం జరుగుతూంది. అయినా, సమస్య పరిష్కారం కాలేదు. సమస్య పరిష్కారానికి ఇంకా ఎక్కువ కృషి జరగటమేగాక, నగరాభివృద్ధి, పారిశ్రామికాభివృద్ధి సక్రమంగా, ప్లాను ప్రకారం జరిగేటట్లు చూడాలి.

మురికిపేటలు మూడు రకాలు:

1. పరిశ్రమలను చుట్టుకొని ఉండే మురికి పేట.
2. నగర వ్యాపార కేంద్రాన్ని చుట్టుకొని ఉండే మురికి పేటలు.
3. ఆర్థికంగా పెరిగిన కుటుంబాలు మంచి ఇండ్లను కట్టుకొని వాటిలోకి వెళ్ళినపుడు, ఖాళీ అయిన ఇండ్లను రెండు మూడు భాగాలుగా విభజించి తక్కువ వర్గాలవారికి అద్దెకిచ్చినపుడు ఆ ప్రాంతాలు మురికిపేటలవుతాయి.

ఒక వ్యక్తిని మరొక వ్యక్తీ,
ఒక జాతిని వేరొక జాతీ,
పీడించే సాంఘిక ధర్మం
ఇంకానా ? ఇకపై సాగదు. – శ్రీశ్రీ

# పడుపువృత్తి

టి. సుబ్బారెడ్డి, ఎం.ఎ., ఎం.ఎస్‌సి.

మానవుని మౌలిక, జైవిక అవసరాలలో లైంగిక అవసరము కూడా చాలా ముఖ్యమైనది. లైంగిక వాంఛలను సంతృప్తిపరచుకోవడానికి, తక్కిన జైవికావసరములవలె గాక కొన్ని నియమనిబంధనలు, సాంస్కృతికపరమైన హద్దులు, కొంత గోప్యం మొదలయిన ఆంక్షలను సమాజమే విధించింది. సమాజంలోని వ్యక్తులు ఈ నియమ నిబంధనలను అనేక సందర్భాలలో అతిక్రమించి, ఉల్లంఘించి ప్రవర్తిస్తుంటారు. ఈ లైంగిక నియమావళి ఉల్లంఘన వివిధ సమాజాలలో వివిధ రూపాలలో బహిర్గతమవుతుంది. ఉదా: 1.హస్తమైథునము (Masturbation); 2.సమలింగ రతి (Homosexuality), 3.వివాహేతర లైంగిక సంబంధము (Extramartial sex relations), 4.పడుపువృత్తి (Prostitution) మొదలయినవి. సర్వసాధారణంగా ఈ నాల్గు పద్ధతులు అన్ని సమాజాలలోనూ కొంచెం ఎక్కువగానే సంభవిస్తుంటాయి.

ఈ పైన పేర్కొన్న వాటిలో పడుపువృత్తి అనాదినుండీ సమాజానికి అతి బాధాకరమైన సమస్యగా తయారయింది. పడుపువృత్తి చాలా ప్రాచీనమైనది. భారతదేశంలోని దేవదాసీలు, గణికలు, జపాను దేశంలోని గైషాలు, గ్రీకు దేశంలోని హెటీరియా (Heataerae) పద్ధతులు అతి ప్రాచీనమైనట్టివిగా ఎంచబడుతున్నవి. పడుపువృత్తి సామాజిక సమస్యలన్నింటిలోను అతి జటిలము, దుఃఖదాయకము, సమాజవిచ్ఛిన్నానికి ఎక్కువ దోహదం చేసేదిగాను పరిణమించింది. అందుచేత ఈ సమస్యను అరికట్టి రూపుమాపడానికి మతప్రవక్తలు, సంఘసేవకులు ఎంతో కృషిగావిస్తున్నారు. ఒక సమాజం వ్యవస్థాయుతంగా వర్ధిల్లాలంటే, ఆ సమాజంలో పడుపువృత్తి చాలావరకు నిర్మూలనం గావించబడాలి. లేకపోయినట్లయితే ఆ సమాజంలో అవ్యవస్థ ఏర్పడి సమాజంలోని అన్ని రంగాలను వ్యాధిగ్రస్తం గావిస్తుంది.

పడుపువృత్తి సమాజంలో అవాంఛనీయము, అనర్థదాయకమైనదేగాక, ఎంతో పాపంగాను, హీనంగాను పరిగణించబడింది. సమాజంలో పడుపువృత్తికి పాల్పడిన వేశ్యలపై సమాజంలో అనేక ఆంక్షలను విధించి తిరస్కారభావంతో చూస్తుంది.

### పడుపువృత్తి - నిర్వచనము:

"స్వలాభంకోసం అలవాటుగా గాని, లేక అప్పుడప్పుడు గాని వివాహేతరమైన లైంగిక సంబంధాన్ని కలిగి ఉండుట" అని జాఫ్రీ మే (Geoffrey May) నిర్వచించినాడు. స్వలాభేక్ష, ఇచ్చి పుచ్చుకునే పద్ధతి, స్వైరితము, ఐచ్ఛిక లైంగిక సంబంధం అనే మూడు ముఖ్య లక్షణాలు పడుపువృత్తిలో ప్రస్ఫుటంగా కన్పిస్తాయి.

### పడుపువృత్తి - వివిధరకాలు:

పడుపువృత్తికి పాల్పడేవారిని ముఖ్యంగా రెండు రకాలుగా వర్గీకరించవచ్చును.

1. బాహాటంగా పడుపువృత్తిని అవలంబించేవారు.
2. రహస్యంగా పడుపువృత్తిని అవలంబించేవారు.

### 1. బాహాటంగా పడుపువృత్తిని అవలంబించేవారు:

వీరిలో కొందరు వంశపారంపర్యంగా ఈ వృత్తిని అవలంబిస్తున్నారు. వీరికి తమ వృత్తి యెడల అగౌరవంగాని, అసహ్యభావంగాని, అవమానంగాని ఇసుమంతయినా ఉండదు. వీరిలో చాలా మంది సంగీతం, సాహిత్యం, గానం మొదలైన లలితకళలలో ప్రావీణ్యం సంపాదించి విటులను, రసజ్ఞులను అలరిస్తూ తమవృత్తిని జయప్రదంగా కొనసాగిస్తూ వచ్చారు. భారతదేశంలో ఈ తరగతికి చెందినవారిని ఒక ప్రత్యేక కులంగా పరిగణించారు.

ఉదా: ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వీరు కళావంతులుగాను, భోగంవారిగాను, వేశ్యలగాను పిలువబడుచున్నారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రములో వీరిని నృత్యగత్తెలని పిలుస్తారు.

### వ్యభిచార గృహాల (Brothals) పాత్ర:

పడుపువృత్తిలో విశేషానుభవం గడించి, వయస్సు వళ్లిన వృద్ధస్త్రీలు సామాన్యముగా ఈ వ్యభిచార గృహాలకు ఆధ్వర్యం వహించి నడుపుతుంటారు. వీరు ఈ వేశ్యా గృహాలలోనికి కొంతమంది యువతులను తీసుకొని వచ్చి వారితో వ్యభిచార వృత్తిని కొనసాగిస్తూ వుంటారు. ఉత్తర

భారతదేశంలో వీరిని "ఘర్‌వాలీ" లేదా "చౌదరాని" అనియు, దక్షిణ భారతదేశంలో వీరిని 'నాయిక' లనియు పిలుస్తారు. ఇద్దరు స్త్రీలు గాని, అంతకన్నా ఎక్కువమంది స్త్రీలుగాని ఒక గృహ ఆవరణలో పడుపువృత్తిని కొనసాగిస్తుంటే ఆ గృహాన్ని 'వ్యభిచార గృహం' గా పరిగణించవచ్చును. వేశ్యాగృహాన్ని నిర్వహించేవారు కొత్త యువతులకు శిక్షణనిచ్చి, వారికి కావలసిన సదుపాయాలనుకూడా ఆ గృహంలోనే సమకూరుస్తారు. ఈ గృహాలు శృంగార సంబంధమైన చిత్రపటాలు, ఫోటోలు మొదలైన అన్ని హంగులతో ఉండి విటులను ఆకర్షించే రీతిలో ఉంటాయి. ఈ గృహాలలో వైద్యసదుపాయాలు కూడా ఉంటాయి. కొత్తగా ఈ వృత్తిలోనికి దిగినవారికి శిక్షణయిచ్చి, పడుపువృత్తి వలన వారికి లభించే ఆదాయంలో కొంత శాతం వ్యభిచార గృహ నిర్వాహకులు తీసుకొంటారు.

### కూర్పుగాళ్ల (Procurers) పాత్ర:

వ్యభిచార గృహాలకు యువతులను, వేశ్యలను సరఫరాచేసే వారిని "కూర్పుగాళ్లు" అనవచ్చును. వయస్సులో వున్న అమాయకమైన స్త్రీలను ఉద్యోగాల ఎరతోనో లేక పెళ్ళి ఎరతోనో నమ్మించి వీరు మోసగించి ఈ గృహాలకు అమ్మివేస్తుంటారు.

### తార్పుడుగాళ్ళ (Pimps) పాత్ర:

వేశ్యా సంపర్కంకోసం వాంఛించేవారిని వివిధ రకాలుగా ఆకర్షించి, వారిని కల్లబొల్లి మాటలతో నమ్మించి వేశ్యా గృహాలకు తీసుకొనివచ్చేవారినే తార్పుడుగాళ్లు అంటారు. ఈనాడు నగరాలలో వేశ్యావృత్తి దినదిన ప్రవర్ధనమానమవటానికి ఈ తార్పుడుగాళ్ళు చాలా ప్రధాన పాత్ర వహిస్తున్నారు. టాక్సీలను నడిపేవారు, ఆటోలు, రిక్షాలను తోలుకునేవారిలో కొంతమంది తార్పుడుగాళ్ళుగా వ్యవహరిస్తారు.

### రహస్యంగా పడుపు వృత్తిని అవలంబించేవారు:

ఎ. పెద్దపెద్ద ఫ్యాన్సీ షాపులలోను, కిరాణా, బట్టల దుకాణాలలోనూ పనిచేసే ఉద్యోగినులు తమకు నెలసరి వేతనం ద్వారా లభించే ధనము చాలక, దానికోసం పడుపువృత్తికి పాల్పడుతుంటారు.

బి. సమాజంలో నిరుద్యోగిత, అధికధరలు, పెరుగుతున్న జీవన వ్యయ ప్రమాణాలు మొదలైనవాటిని తట్టుకోలేక కొంతమంది గృహిణులు కూడా ఈ పడుపువృత్తికి పాల్పడతారు.

సి. కొంతమంది స్త్రీలు "ఉంచుకునే" పద్ధతిద్వారా ప్రతి నెలకు కొంత ధనాన్ని ప్రతిఫలంగా తీసుకుంటూ కొంతకాలం కొందరు పురుషులవద్ద ఉంపుడుకత్తెలుగా ఉంటారు.

## భారతదేశంలో పడుపువృత్తి-వివిధ పద్ధతులు:

భారతదేశంలో పడుపువృత్తిని అవలంబిస్తున్న స్త్రీలను ఈ క్రింది వర్గాలుగా విభజించవచ్చును.

### 1. పడుపువృత్తి వంశపారపర్యంగా స్వీకరించిన స్త్రీలు:

భారతదేశంలో ఎన్నోతరాలుగా అనేక కుటుంబాలు పడుపువృత్తినే ముఖ్యవృత్తిగా చేసికొని జీవిస్తున్నాయి. ఇట్టి కుటుంబాలలో తల్లులే తమ కుమార్తెలకు పడుపువృత్తికి కావలసిన శిక్షణ అంతా యిస్తారు. తల్లి తర్వాత కుమార్తెలు ఈ వృత్తిని స్వీకరిస్తారు. వీరిలో కొంతమంది జావళీలు, నృత్యము, సంగీతము మొదలైన లలితకళలలో ప్రావీణ్యాన్ని సంపాదిస్తారు. ఈనాడు వంశపారంపర్యంగా ఈ వృత్తిని చేపట్టే కుటుంబాలు చాలవరకు తగ్గిపోయాయి. సుమారు 25 సంవత్సరాల క్రితంవరకు వారు మేళం కట్టి ఉన్నత కులస్థుల గృహాలలో వివాహ సందర్భాలలో వినోదం కలిగించేవారు. వీరినే భోగంమేళంవారు అంటారు.

### 2. దేవదాసీ పద్ధతి:

ఈనాటి సమాజంలో ఈ దేవదాసీ పద్ధతి చాలవరకు తగ్గింది. సాంప్రదాయ సమాజంలో ఈ పద్ధతి చాలాచోట్ల ఉండేది. ఈ పద్ధతి ప్రకారం, మతాచారాన్ని అనుసరించి కళావంతులు తమ కుటుంబాలకు చెందిన యువతులకు వివాహం గావించక, వారిని దేవాలయాలకు అంకితమిస్తారు. దేవదాసీల పోషణను, వారి నిత్యావసరాలను దేవాలయాల ధర్మకర్తలు, పూజారులు చూచెడివారు. భారతదేశంలో కర్ణాటక, తమిళనాడు, మహారాష్ట్ర మొదలైన రాష్ట్రాలలో ఈ పద్ధతి అమలులో ఉండేది.

### 3. ఆదిమ తెగల ఆచారం:

భారతదేశంలోని హిమాలయ పర్వత ప్రాంతాలలో నివసించే కొన్ని ఆదిమ తెగల ప్రజలు కొంతకాలం ఒక భార్యతో కాపురం చేసిన తర్వాత వారియెడల మోజుతీరగానే మరొక స్త్రీతో సాంగత్యాన్ని కోరే ఆచారాన్ని పాటిస్తున్నారు. వదిలివేయబడిన ప్రథమ భార్యను కొంతమంది కూర్పుగాళ్ళు నగరాలకు తీసికొనిపోయి పడుపువృత్తిలో ప్రవేశపెడతారు.

### 4. కాల్ గర్ల్స్ (Call Girls):

ఈ కాల్ గర్ల్స్ విధానం భారతదేశంలోని పెద్దపెద్ద నగరాలలో జరుగుతూ వుంటుంది. కొంతమంది ఉన్నత వర్గానికి చెందిన, మధ్యవర్గానికి చెందిన యువతులు నూతన అనుభవంకోసంగాని, లైంగికతృప్తికోసంగాని, విలాసవంతమైన జీవితంకోసంగాని, లేదా కొన్ని ఆర్థిక యిబ్బందులవలనగాని

తమతమ పూర్తి చిరునామాలను, ఫోన్ నెంబర్లను విలాసమైన హోటళ్లకు గాని, తదితర వసతిగృహాల యజమానులకుగాని అందచేస్తారు. స్త్రీలోలురు కోరినప్పుడు ఆ చిరునామా ప్రకారం హోటళ్ళ యజమానులు ఈ యువతులను పిలుస్తారు. దీనినే కాల్‌గర్ల్స్ పద్ధతి అంటారు.

## 5. సామాన్య వేశ్యలు:

వీరు వృద్ధ వేశ్యల ఆధ్వర్యాన నడపబడే వేశ్యాగృహాలలో ఉంటూ పడుపువృత్తిని కొనసాగిస్తారు. వీరి సంపాదన చాలా తక్కువగా ఉండటంవలన జీవనపరిస్థితులుకూడా చాలా హీనమైన స్థితిలో ఉంటాయి.

## 6. వసతిగృహాలు:

ఈనాడు వసతిగృహాలలో వేశ్యావృత్తి విపరీతంగా పెరుగుతున్నది. కొన్ని కొన్ని వసతిగృహాలలో వేశ్యలు ప్రత్యేకంగా గదులను అద్దెకు తీసుకొని, అక్కడ మిగతాగదులలో ఉండే వ్యక్తుల కోరికపై వ్యభిచార వృత్తిని కొనసాగిస్తారు కొన్ని కొన్ని సందర్భాలలో, సమాజంలో చాలా పై స్థాయిలో ఉన్న యువతులు, విద్యావతులు, ఉద్యోగాలు చేస్తున్న యువతులు కూడా ఈ విలాస వసతిగృహాలకు వచ్చి పడుపువృత్తిని కొనసాగిస్తారు. ఈ వసతి గృహాలలో పనిచేసే ఉద్యోగస్తులు, మేనేజర్లుద్వారా ఈ వ్యవహారాలు కొనసాగుతాయి.

## 7. వికేంద్రీకృత పడుపువృత్తి:

భారతదేశంలోని నగరాలలో కొన్ని కొన్ని ప్రత్యేక ప్రాంతాలలోను, పేటలలోనూ, అనూచానంగా వర్ధిల్లుతూ వచ్చిన పడుపువృత్తి, వేశ్యావృత్తి నిర్మూలనకు, ప్రవేశపెట్టిన కొన్ని శాసనాల ఫలితంగా నగరంలో అన్ని ప్రాంతాలకూ విస్తరిల్లి, వికేంద్రీకరణం చెందింది. అంటే - శాసనాల వలన పడుపువృత్తి యొక్క తీవ్రత తగ్గలేదు. వికేంద్రీకరణం మాత్రమే చెందింది.

## 8. సాంప్రదాయిక వేశ్యలు:

భారతదేశంలో సంస్థానాధీశులు, జమీందార్లు విలసిల్లిన కాలంలో వారి ఆస్థానాలను ఆశ్రయించుకొని కొంతమంది స్త్రీలు పడుపువృత్తిని అవలంబించెడివారు. వీరిలో చాలా మంది రాజులకు, జమీందారులకు, జాగీర్దారులకు, రాజాస్థానంలో పనిచేసే ఉద్యోగులకు ఉంపుడుకత్తెలుగా ఉండెడివారు. ఈ నాటికీ భారతదేశంలోని పూర్వ రాజరిక నగరాలలో పడుపువృత్తిని అవలంబిస్తున్నవారిని మనము తక్కిన నగరాలలోన్నా ఎక్కువగానే గమనించవచ్చు.

## 9. విదేశీ వేశ్యలు:

మనదేశంలోని పెద్దపెద్ద నగరాలలో జపాను, చైనా, నేపాల్, ఫ్రాన్సు, ఈజిప్టు మొదలైన దేశాల విదేశ వనితలు పడుపువృత్తిని కొనసాగిస్తున్నారు. కొంతమంది ధనికులు ప్రత్యేకంగా విదేశీ స్త్రీలపట్ల మోజుతో వీరి ఆకర్షణకు లోనవుతారు.

## 10. కులస్త్రీలు - పడుపువృత్తి:

కొంతమంది స్త్రీలు జటిలమైన ఆర్థికపరిస్థితులను తట్టుకోలేక గాని, లేదా కొంతమంది వైధవ్యం ప్రాప్తించిన తర్వాత శారీరక, ఆర్థిక వత్తిడులకు తట్టుకోలేకగాని, లేదా కొంతమంది స్త్రీలు భర్త అనాదరణకు గురి అగుట వలన గాని పడుపువృత్తికి పాల్పడతారు.

## భారతదేశంలో పడుపువృత్తి - విస్తృతి (Extent of Prostitution in India):

భారతదేశంలో ఎంతమంది స్త్రీలు ఈ వృత్తిని అవలంబిస్తున్నారని ఖచ్చితంగా అంచనా వేసి చెప్పటం కష్టం. అయితే, భారతదేశంలో పడుపువృత్తి నవలంబించే వారి సంఖ్య సుమారుగా 10 లక్షలదాకా ఉండవచ్చునని అనధికార అంచనా. 13, 14 సంవత్సరాల వయస్సు మొదలు 45 సంవత్సరముల వయస్సులో కూడ పడుపువృత్తిని వ్యభిచార గృహాలలో కొనసాగిస్తున్నారని తెలుస్తున్నది.

# పడుపువృత్తికి కారణాలు

## 1. ఆర్థికపరమైన కారణాలు:

దారిద్ర్యాన్ని పడుపువృత్తికి అతి ముఖ్య కారణంగా పేర్కొనవచ్చును. అనేకమంది నిరుద్యోగినులైన యువతులు తినటానికి తిండిలేని పరిస్థితులలో, ఆకలితో అలమటించి, వేరే సంపాదన మార్గం లేక గత్యంతరం లేని పరిస్థితులలో వేశ్యావృత్తిని చేపడతారు. పేదరికం, గృహంలో జనసమ్మర్ధము, చాలీచాలని కూలి పడుపువృత్తికి ప్రధాన కారణాలని నానాజాతి సమితి సలహా సంఘం నివేదికలో పేర్కొన్నారు. బొంబాయి నగరంలో 72 శాతం మంది స్త్రీలు కేవలం పేదరికం వలననే పడుపువృత్తిని చేపడుతున్నారని డాక్టర్ పునేకర్ తన సర్వేలో పేర్కొన్నారు.

## 2. చెడు సామాజిక పరిస్థితులు:

పిల్లల మూర్తిమత్వాన్ని తీర్చిదిద్దటంలో తల్లితండ్రుల ప్రవర్తన ఎంతో ప్రభావం చూపుతుంది. బాల్యంలో అవినీతికరమైన వాతావరణంలో పెరిగిన పిల్లలు పెరిగి పెద్దవారైన తరువాత కూడా ఆ వాతావరణం నుండి బయటపడలేరు. గృహ వాతావరణం లోపభూయిష్టంగా ఉంటే యువతుల

నైతిక ప్రవర్తన కూడా దెబ్బతినే అవకాశముంటుంది. తల్లిదండ్రులు అవినీతి పనులు చేసినా, లేక ప్రోత్సహించినా, అవినీతికరమైన పనులను చూసి సహించినా అవి పిల్లలపై తమ ప్రభావం చూపుతాయి. తల్లిదండ్రులలో క్రమశిక్షణ లేకపోవడం, తల్లిదండ్రులు నిరంతరం కలహించుకోవడం మొదలైనవి ఆ కుటుంబంలో పెరుగుతున్న యువతులపై దుష్ప్రభావాన్ని చూపుతాయి. వివాహిత యువతులకు భర్తనుంచి నిరాదరణ; అత్త, ఆడబిడ్డల వలన భరించరాని పోరు కలిగినపుడు; పుట్టింటిలో కూడ నిరాదరణకు, అవమానాలకు గురి అయినపుడు విసిగి, వేసారి చివరకు పడుపువృత్తిలోనికి దిగుతారు. కొంతమంది యువతులు ప్రేమ వ్యవహారాలలో వంచనకు గురి అయి పడుపువృత్తిలోనికి బలవంతంగా లాగబడతారు.

### 3. సామాజిక విలువలు:

కొన్ని అనివార్య పరిస్థితులలోగాని, లేదా తెలిసీ తెలియని అమాయకత్వంలో గాని ఒక యువతి ప్రవర్తన నైతికంగా విచలనం చెందినట్లయితే, ఆ యువతి బ్రతికి ఉన్నంతకాలం సమాజం ఆమెను క్షమించకపోగా, ఎప్పుడూ దోషిగానే చూస్తుంది. ఆమెకు తప్పు దిద్దుకునే అవకాశం యివ్వదు. ఇరుగుపొరుగువారు, కుటుంబ సభ్యులు ఆ యువతిని అతి నీచంగా చూస్తారు. ఇట్టి పరిస్థితులకు తట్టుకోలేక ఆ యువతి వేశ్యావృత్తిని చేపడుతుంది.

### 4. మానసిక లోపము:

అమాయకులైన యువతులు, తెలివితక్కువ యువతులు మధ్యదళారీల మాయమాటలు అతి తేలికగా నమ్మి మోసపోయి చివరకు వేశ్యావృత్తిలో చిక్కుకుపోతారు.

### 5. గూడుకట్టుకొన్న స్వార్థపరత్వము (Vested interesrts):

యువతులను మోసం చేసి చేరదీసి, వారి శరీరంతో వ్యాపారం చేసి ధనాన్ని ఆర్జించేవారిని గూడుకట్టుకొన్న స్వార్థపరులకు ఉదాహరణగా పేర్కొనవచ్చును.

### 6. మతపరమైన ఆచారాలు:

దేవదాసీ పద్ధతి వలన కొంతమంది యువతులు ఈ పడుపువృత్తిలోనికి ప్రవేశిస్తారు. కొన్ని కులాలవారు వంశపారంపర్యంగా ఈ వృత్తిని చేపడతారు.

### 7. నూతన అనుభవంపై కోరిక:

కొంతమంది యువతులు లైంగిక విషయాలలో నూతనత్వంకోసం అఱ్ఱులు చాస్తూ ఉండటం వలన ఈ పడుపువృత్తిని అవలంబిస్తారు. మరి కొంతమంది యువతులు జైవికంగా కొన్ని గ్రంథుల ప్రభావం వలన అతి కామోద్రేకానికి గురి అయి పడుపువృత్తిని చేపడతారు.

ఈ పై వివరించిన కారణాలను (for the sake of convenience) సౌలభ్యం కోసం 4 ముఖ్యవర్గాలుగా విభజించవచ్చును. అవి –

### ఎ. వైయక్తిక కారణాలు:

1. విలాస, సుఖమయ జీవితం ఎడల మోజు.
2. అధిక లైంగిక వాంఛ.
3. వివాహం ఎడల అయిష్టత.
4. అమాయకత్వము.
5. పురుషులపట్ల ద్వేషము.

### బి. చెడు సామాజిక పరిస్థితులు, కుటుంబ వాతావరణము:

1. విచ్ఛిన్నకర కుటుంబం. ఉదా: భర్త చనిపోవుట, లేదా భర్త భార్యను వదిలిపెట్టుట.
2. అసంతృప్తికరమైన వైవాహిక జీవితం, భర్త నిరాదరణ, మిగిలిన కుటుంబ సభ్యులు అవమానపరచుట.
3. వంశపారంపర్యంగా సంక్రమించే పడుపువృత్తి. ఉదా: ఆంధ్రప్రదేశ్‌లోని భోగంవారు, లేక కళావంతులు.
4. వరకట్న దురాచారము.
5. భర్త గృహాన్ని వదలి పారిపోవుట, విడాకులు.

### సి. సాముదాయిక కారణాలు:

1. పేదరికము, నిరుద్యోగము.
2. ఆధునిక కాలంలో వెలువడుతున్న అశ్లీల సాహిత్యము, లైంగికోద్రేకాన్ని ప్రకోపింపచేసే అసభ్యకరమైన చలనచిత్రాలు.
3. పట్టణాలలో అధిక జనాభా, చెడు సామాజిక వాతావరణం, మురికిపేటలు.
4. చెడ్డసహవాసము, ఇరుగు పొరుగు వారి ప్రభావము.
5. బాలికలను, స్త్రీలను బలవంతంగా ఎత్తుకొనిపోయి చెరచడం.

### డి) మతపరమైన కారణాలు:

1. మతం పేరిట పూర్వకాలంలో అమలులో యున్న దేవదాసీ పద్ధతి.
2. కొన్ని సమూహాలలోను, ఆదిమతెగలలోను ఆచారంగా ఉన్న బహుభార్యత్వం.
3. బాల్య వివాహాలు, వరకట్న సమస్య, విధవాపునర్వివాహాలపై సామాజిక ఆంక్షలు.
4. స్త్రీలపై అత్యాచారాలు, వేధింపులు.
5. కులాలలో ఉండే విస్తరీకరణ వలన నిమ్నకులాల స్త్రీల ఎడల అగౌరవము.
6. ఉమ్మడి కుటుంబాల విచ్ఛిన్నము.

7. స్త్రీని, పురుషుని లైంగికావసరాలను తీర్చే ఒక విలాసవస్తువుగా పరిగణించుట.
8. నిరక్ష్యరాస్యత.

## పడుపువృత్తి - సమాజంపై దీని ప్రభావము:

ఈనాటి సమాజంలో అనేక సామాజిక సమస్యలకు దారిద్ర్యము ప్రధాన కారణమని చెప్పవచ్చును. పేదరికాన్ని భరించలేక కొందరు యువతులు ఈ పడుపువృత్తిని అవలంబిస్తున్నారు. వారు తమ పిల్లలకు మౌలికావసరములయిన తిండి, బట్ట, విద్య, ఆరోగ్య సదుపాయాలను సమకూర్చలేకపోతున్నారు. కుటుంబ సభ్యులంతా అతి చిన్న గృహాలలో నివసించవలసి వస్తున్నందువలన పెద్దల లైంగిక ప్రవర్తనను పిన్నలు కళ్లారా చూడటం తటస్థించటంతో వీరు నైతిక విచలనం చెందుతున్నారు; కుటుంబ పోషణ నిమిత్తం అవినీతి కార్యకలాపాలకు పాల్పడుతున్నారు.

## సామాజిక పరిణామం:

పురుషులు వేశ్యా లోలురైనంత కాలం ఈ పడుపువృత్తి యొక్క దుష్ఫలితాలు సమాజంపై తీవ్రంగా వుంటాయి; పడుపువృత్తిని చేపట్టిన యువతులయొక్క మూర్తిమత్వం తీవ్ర అవ్యవస్థకు లోనవుతుంది. అందుచేత ఇట్టి యువతుల జీవితం అవినీతికి ఆలవాలంగా యుంటుంది. ఆమె సమాజంలో అందరి స్త్రీలవలె సహజమైన జీవితాన్ని గడపడానికి వీలుండదు. అందుచేత సమాజ కార్యకలాపాలలో పాల్గొనే అవకాశాన్ని కోల్పోతుంది. ఆమె అనేక మానసిక ఒత్తిడులకు, సంఘర్షణలకు తరచుగా లోనవుతుంది. వేళకాని వేళలలో అనేక సుఖవ్యాధిగ్రస్తులయిన విటులకు తన శరీరాన్ని సమర్పించి, వారి వైపరీత్య లైంగికావసరాలను తీర్చవలసి యుంటుంది. కాబట్టి, పడుపువృత్తిని చేపట్టిన యువతులకు కూడా ఆరోగ్యం బాగా క్షీణిస్తుంది. పడుపుగత్తెలు యవ్వనంతోను అందచందాలతోను ఆరోగ్యంగాను ఉన్నంతకాలమే ధనాన్ని సంపాదగించగలుగుతారు. వయస్సు, అందమూ, ఆకర్షణ ఉడిగిపోగానే వీరికి పేదరికం సంప్రాప్తమవుతుంది. అందుచేత చాలా మంది వేశ్యలు తమ చివరిదశలో హీనాతిహీనమైన నికృష్టమైన జీవితాన్ని గడపవలసివస్తుంది.

పడుపువృత్తి వల్ల సిఫిలిస్, గనేరియా వంటి అతి భయంకర వ్యాధులు పురుషులకు సంక్రమిస్తాయి. పురుషుల ద్వారా వారి కుటుంబసభ్యులైన భార్యలకు , వారి సంతానానికి కూడా సంక్రమిస్తాయి. భర్తల వేశ్యాలోలత్వం వలన భార్యాభర్తల మధ్య తీవ్ర కలహాలు సంభవించి, అవి క్రమంగా విడాకులకు, కుటుంబ విచ్ఛిత్తికి దారి తీస్తాయి. అక్రమ సంబంధం ద్వారా కలిగిన సంతానాన్ని సమాజం వేశ్యసంతానంగాను అక్రమసంతానంగాను మాత్రమే పరిగణిస్తుంది. సమాజం వేశ్యలను తిరస్కారభావంతో చూస్తుంది. వేశ్యలను సాధారణ కుటుంబాల మధ్య నివసించడానికి అనుమతించరు. అందుచేత వీరు ప్రత్యేకంగా కొన్ని వాడలలో నివసిస్తారు.

సమాజంలోని కొంతమంది యువతులు విలాస, ఆడంబర జీవితాలపై మోజు ఉండటం వలన అధిక ధనార్జన చేయవలసి రావడంతో ఈ వృత్తికి పాల్పడుతున్నారు. వీరికి లైంగిక జీవితంపట్ల సరైన అవగాహన లేకపోవడంవలననూ, లైంగిక అనుభవంకోసం తొందరపాటు, వైవాహిక జీవితంలో అసంతృప్తి మొదలయినవి స్త్రీ, పురుషులలో ఈ పడుపువృత్తికి ప్రోత్సాహమిస్తున్నాయి. ఇట్టివారి ప్రవర్తన సమాజంపై తీవ్ర దుష్పరిణామాలను కలుగజేస్తుంది.

## పడుపువృత్తి నిషేధము:

పడుపువృత్తి సమాజ వ్యవస్థను తీవ్రంగా దెబ్బతీస్తుందనటంలో ఏ మాత్రమూ సందేహం లేదు. ఇట్టి హానికరమైన సామాజిక సమస్యలను తగిన విధంగా నివారించి, నిషేధించి పరిష్కరించాలి. పడుపువృత్తి నిర్మూలనకు అనేక సంఘ సంస్కర్తలు, నాయకులు చేసిన ప్రయత్నాలు ఆశించినంత ఫలితాన్నివ్వలేదనే చెప్పాలి. పడుపువృత్తి నివారణకు బ్రిటీషువారి కాలంనుండి ఈనాటివరకు అనేక శాసనపరమైన చర్యలను తీసుకోవడం జరిగింది.

పడుపువృత్తి కేవలం ఒక్క భారతదేశాన్నే గాక ప్రపంచమంతటినీ వేధిస్తున్న సామాజిక సమస్య. ప్రపంచంలో సాంఘికంగానూ, నైతికంగానూ ఆరోగ్యకరమైన వాతావరణాన్ని కల్పించడంకోసం "నైతిక సామాజిక ఆరోగ్య సంఘము" (Association for Moral and Social Hygiene) కొన్ని దేశాలలో తమ శాఖలను స్థాపించి పడుపువృత్తి నిర్మూలనకు కృషి చేస్తున్నది. ఈ సంఘము మన దేశంలో కూడా చాలా గొప్ప సేవజేస్తున్నది.

భారతదేశంలో పడుపువృత్తి నిరోధకానికి మొదట్లో ప్రత్యేకమైన శాసనాలు లేకపోయినప్పటికీ, పరిమిత స్థాయిలో ఈ సమస్యను అదుపులో పెట్టటానికి పురపాలక సంఘాల చట్టాలకు , పోలీసు చట్టాలకు అధికారాలుండేవి. ఈ చట్టాలు దేశంలోని ప్రధాన నగరాలలో మాత్రమే అమలులో వుండేవి. పోలీసు చట్ట నిబంధనల ప్రకారం ప్రజోపయోగ ప్రదేశాలలో వేశ్యలతో సంబంధం కల్పించుకోవడానికి ప్రయత్నించడం నేరము. పురపాలక సంఘాల అధికారాల ప్రకారం కొన్ని నిర్ణీత ప్రాంతాలలో పడుపు గృహాలను నడపడం నేరంగా పరిగణించారు.

వయస్సురాని బాలికలను పడుపువృత్తి బారినుండి రక్షించడానికి భారతీయ శిక్షాస్మృతిలో (Indian Penal Code) కొన్ని నియమ నిబంధనలున్నాయి పదహారేళ్ళలోపు

యువతితో ఆమె సమ్మతితోనైనా అక్రమ లైంగిక సంబంధం కలిగియుండటం చెరచడంగా పరిగణించబడింది. పద్దెనిమిదేండ్లలోపు బాలికలను గాని, లేదా యుక్తవయస్సు వచ్చిన స్త్రీనిగాని అక్రమ లైంగిక సంబంధం యేర్పరచుకునే ఉద్దేశంతో బలవంతంగా అపహరించడం నేరము. అంతేగాక, వేశ్యావృత్తిలో ప్రవేశపెట్టడానికి బాలికలను కొనడంకాని, లేదా అమ్మడం కాని, లేదా మరే మిషతోనయినా తమ అధీనంలోకి తీసికోవడం కూడా నేరంగా పరిగణించారు. భారతీయ శిక్షాస్మృతి 372, 373 నిబంధనలలో మైనరు బాలికను పడుపువృత్తి కోసం అమ్మడంగాని, కొనడంగాని కూడా నేరమే. ఇరవై ఒక్క సంవత్సరాల లోపు విదేశీ బాలికలను దిగుమతిచేసి వేశ్యావృత్తిలో ప్రవేశపెట్టడం కూడా నేరంగా పరిగణించబడింది. 1844 విదేశీయుల చట్టం ప్రకారం విదేశీ వేశ్యలను దేశ బహిష్కరణ గావించే అధికారం ప్రభుత్వానికి ఉంది.

పడుపువృత్తి సమస్యను అరికట్టడానికి ఒక ప్రత్యేక చట్టమంటూ భారతదేశంలో అమలులో లేదు. భారతీయ శిక్షాస్మృతి, క్రిమినల్ ప్రోసీజర్ కోడ్, తదితర చట్టాలలో వేశ్యావృత్తి నిర్మూలనకు, నిరోధానికి అక్కడక్కడ ఏవో కొన్ని నిబంధనలను మాత్రమే చేర్చారు. 1923 సంవత్సరంలో బొంబాయిలో ప్రప్రథమంగా ప్రత్యేకంగా వేశ్యావృత్తి నిరోధక చట్టం ప్రవేశపెట్టారు. దీని ప్రకారం ప్రత్యేక న్యాయస్థానాలను ఏర్పాటు చేసి, మాజిస్ట్రేట్‌లను, శిక్షణ పొందిన మహిళా పోలీసులను కూడా నియమించారు.

ఇతర రాష్ట్రాల ప్రభుత్వాలు కూడా ఇట్లాంటి చట్టాలనే ప్రవేశపెట్టాయి. వివిధ రాష్ట్రాలలో అమలు పరచిన చట్టాలు యివి:

1. బొంబాయి వేశ్యావృత్తి నిరోధక చట్టము, 1923. (The Bombay Prevention of Prostitution Act of 1923.)
2. మద్రాసు అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1930. (Madras Suppression of Immoral traffic Act of 1930.)
3. బెంగాల్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1933. (Bengal Suppression of Immoral traffic Act of 1933.)
4. ఉత్తర ప్రదేశ్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1933. ( U.P. Suppression of Immoral traffic Act of 1933.)
5. పంజాబ్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1935. (Punjab Suppression of Immoral traffic Act of 1935.)
6. బీహార్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1948. (Bihar Suppression of Immoral traffic Act of 1933.)
7. మధ్యప్రదేశ్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1936 (M.P. Suppression of Immoral traffic Act of 1936.)
8. మైసూర్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1936 (Mysore Suppression of Immoral traffic Act of 1936.)
9. ట్రావన్‌కూర్ – కొచ్చిన్ అక్రమసంబంధ నిరోధక చట్టము, 1952. (The Travencore-Cochin Suppression of Immoral traffic Act of 1952.)
10. హైదరాబాద్ అక్రమ సంబంధ నిరోధక చట్టము, 1952. (Hyderabad Suppression of Immoral traffic Act of 1952.)
11. సౌరాష్ట్ర వేశ్యావృత్తి నిరోధక చట్టము, 1952. (Saurashtra Prevention of Prostitution Act of 1933.)
12. ఉత్తరప్రదేశ్ నాయక్ బాలికల రక్షణ చట్టము, 1950. (The U.P. Naik girls protection Act of 1950.)
13. ఉత్తరప్రదేశ్ మైనర్ బాలికల రక్షణ చట్టము, 1929. (The U.P. Minor girls protection Act of 1929.)
14. బొంబాయి దేవదాసి రక్షణ చట్టము, 1934. (The Bombay Devadasi protection Act of 1934.)
15. మద్రాసు దేవదాసి రక్షణ చట్టము, 1934. (The Madras Devadasi protection Act of 1934.)
16. పాటియాలా అక్రమ సంబంధ నిరోధక చట్టము, (The Patiala Suppression of Immoral traffic Act.)
17. అజ్మీర్ వేశ్యావృత్తి నిరోధక చట్టము, 1953. (Ajmer Prevention of Prostitution Act of 1953.)

ఈ శాసనాల వల్ల పడుపువృత్తి కోసం బాలికలను తీసికొని రావడం, పడుపువృత్తిపై లభించే ఆదాయంతో జీవించడం, యువతులను వేశ్యావృత్తికి దిగుమతి చేసికోవడం, వ్యభిచార గృహాలను నడపటం మొదలైనవన్నీ నేరచర్యలుగా పరిగణించడం జరిగింది. 1956 సం. లో పార్లమెంటు పడుపువృత్తి నిర్మూలనకు ఒక శాసనాన్ని ఆమోదించింది. దీనినే "Suppression of Immoral Traffic in Women and girls Act 1956", అని పిలుస్తారు. ఈ శాసనం 1958 మే నెల 1 వ తారీఖునుండి అమలులోకి వచ్చింది. దీని ప్రకారం వ్యభిచార గృహాలను నడపడం, పడుపువృత్తిపై ధనార్జన చేయడం, పడుపువృత్తి కోసం యువతులను సేకరించడం, ప్రజోపయోగ ప్రదేశాలకు 200 గజాల సమీపంలో పడుపువృత్తి చేయడం మొదలైన కార్యాలకు పాల్పడేవారు నేరస్థులుగా పరిగణించి శిక్షింపబడుతారు.

ఈ చట్టం ప్రకారం -

ఎ. వేశ్యాగృహాన్ని స్వయంగా నడపటంగాని, తోడ్పడటం గాని చేసిన ఏవ్యక్తికైనా మొదట తప్పిదంగా –

1. 1 సం. నుండి 3 సం.ల వరకు కఠిన జైలుశిక్షతో పాటు 200 రూపాయల జరిమానా విధిస్తారు. మరలా 2వసారి నేరంచేస్తే–
2. 2 సం.ల నుండి 5 సం. ల వరకు కఠిన జైలుశిక్షతో పాటు రు. 2,000/– వరకు జరిమానా విధిస్తారు.
3. ప్రజోపయోగ ప్రదేశాలలో పుడుపువృత్తి చేస్తే ఆ స్త్రీకి మొదటి తప్పిదంగా 6 నెలలు జైలుశిక్షతో పాటు 500/– లు జరిమానా విధిస్తారు.

ఈ చట్టంలో యింకా ఈ క్రింది 3 అంశాలను పొందుపరిచారు.

1. పడుపువృత్తి వల్ల అవ్యవస్థాయుతంగా మారిన యువతుల జీవితాలను పునరుద్ధరించుట.
2. వేశ్యాగృహాల నుండి స్వచ్ఛందంగా బయటపడినవారిని, చట్టరీత్యా పట్టుబడి నేరస్థానాలకు వచ్చిన స్త్రీలను వారికోసం ప్రత్యేకంగా స్థాపించిన సంరక్షక కేంద్రాలకు పంపుట.
3. వివిధ ప్రాంతాలలో సంరక్షక కేంద్రాలను స్థాపించుట.

పై అంశాలను పరిశీలిస్తే పడుపువృత్తి చేస్తున్న స్త్రీని మాత్రమే శిక్షిస్తూ ఆ తప్పులో భాగస్వామి అయిన పురుషునికి శిక్ష లేనట్లుగా తెలుస్తున్నది.

## కేవలం శాసనం మాత్రమే పరిష్కారం కాదు:

దేశంలోని ఏ సామాజిక సమస్యలైనా కేవలం శాసనాలద్వారా మాత్రమే పరిష్కారం కాజాలవు. అదేవిధంగా పడుపువృత్తిని కూడా శిక్ష, జరిమానా శాసనాల ద్వారా మాత్రమే పరిష్కరించలేము. పడుపువృత్తిపై జీవిస్తున్నవారిని నిర్బంధించటం వలన పేదరికం కారణంగా యీవృత్తిలోకి దిగినవారు ఆర్థికంగా మరింత ఒత్తిడులకు గురి అవుతున్నారు. కాని, సమస్య పరిష్కారం కావడం లేదు. న్యాయస్థానం విధించిన జరిమానాను చెల్లించడం కోసం తిరిగి యీ పడుపు వృత్తినే అవలంబించవలసి వస్తుంది. కాని, వారిలో మానసిక పరివర్తన రావటం లేదు.

## పడుపువృత్తి నిరోధానికి సూచనలు:

1. సమాజంలోని పేదవర్గమునకు చెందిన స్త్రీలకు సహకార సంఘాల ద్వారా ఎక్కువగా ఉపాధి సౌకర్యాలను కల్పించాలి. ఉదాహరణకు కుటీర పరిశ్రమలు, చేతిపనులు మొదలగునవి.
2. గ్రామీణ నగర ప్రాంతాలలోని పేద యువతులకు స్వల్పకాలిక సాంకేతిక శిక్షణను యిచ్చి, వారు స్వశక్తితో జీవనం కొనసాగించేటట్లు చూడాలి. దీని ఫలితంగా గ్రామీణ ప్రాంతాల నుండి పట్టణ, నగర ప్రాంతాలవరకు జీవనోపాధి నిమిత్తం వలస రావటం ఉండదు.
3. ఉద్యోగాలు చేసే అన్ని పట్టణాలలోను ప్రత్యేక నివాస గృహాలను (Working Womens Hostels) ఏర్పాటు చేయాలి.
4. అనాథలు, విధవలు, వివాహాత్పూర్వమే మాతృత్వం పొందిన స్త్రీలు పడుపువృత్తిలోకి దిగకుండా వారికి సంరక్షక గృహాలలో రక్షణ కల్పించాలి.
5. సంరక్షక గృహాలలో చేరిన స్త్రీలకు సాధారణ విద్యతోబాటు సాంకేతిక విద్యను కూడా గరపి, వారికి స్వయం ఉపాధి సౌకర్యాలను కలిగించాలి.
6. Suppression of Immoral Trafic in Women and girls Act, 1956 ని ఖచ్చితంగా అమలు జరపాలి. పడుపువృత్తిని అవలంబిస్తున్న స్త్రీలతోపాటు మధ్య దళారీలకు, పురుషులకు కఠిన శిక్ష విధించాలి.
7. విలాసవంతమైన వసతి గృహాలను, విశ్రాంతి గృహాలను, లాడ్జింగులను తరచుగా పోలీసులు తనిఖీచేసి, అవసరమైతే వారి ఆస్తిని స్వాధీనపరుచుకోవాలి.
8. విధవా వివాహాలపై సమాజం విధించిన ఆంక్షలు సడలించి, స్త్రీకి పురుషులతో పాటు ఆస్తిలో సమాన హక్కులు ఇవ్వాలి. స్త్రీలకు నిర్బంధ విద్యావిధానాన్ని ప్రవేశపెట్టాలి.
9. పారిశ్రామిక ప్రాంతాలలోని మురికివాడలలోని పేదరికాన్ని చెడు సామాజిక వాతావరణాన్ని మద్యపానము మొదలైన పరిస్థితులను మెరుగుపరిచి సామాజిక, నైతిక ఆరోగ్యాన్ని పరిరక్షించాలి.
10. నేటి సమాజంలో విచ్చలవిడిగా ప్రచురితమవుతున్న అశ్లీల సాహిత్యాన్ని, అసభ్యకరమైన వాల్‌పోస్టర్లను, అశ్లీల చలన చిత్రాలను ప్రభుత్వం వెంటనే నిషేధించాలి
11. పడుపువృత్తిలో స్త్రీ పురుషులిరువురు సమాన భాగస్థులే. కాబట్టి సమాన నేరస్థులు కూడా. అయితే సమాజం పురుషుని వదిలివేసి స్త్రీకి మాత్రమే శిక్ష విధిస్తున్నది. అంటే – స్త్రీ, పురుషుల విషయంలో ద్వంద్వ ప్రమాణాలను పాటిస్తున్నారన్నమాట. ఇట్లుగాకుండా నైతిక విలువల అమలు విషయంలో స్త్రీ, పురుషులిద్దరికి నిష్పక్షపాతంగా సమానంగా శిక్ష లేదా సంస్కరణలు అమలు జరపాలి.
12. లైంగిక విద్యను ఉన్నతపాఠశాల స్థాయిలో బోధనాంశంగా ప్రవేశపెట్టాలి.

# ఆంధ్రప్రదేశ్‌లో పడుపువృత్తి: నమూనా సర్వే

బోడేపూడి భాస్కరరావు, ఎం.ఏ.,యం.యస్‌సి.,

అతి పురాతన కాలం నాడే మానవ మనుగడకు పట్టిన గ్రహణం పడుపువృత్తి. ఇది సమాజ జీవనంలో బలంగా వేళ్ళూనిన ఓ జుగుప్సాకరమైన వ్యవస్థ. దుర్భర రోగ దుర్గంధాన్ని జాతి శ్వాసలోకి పంపించే భయంకర రోగాలకిది అయువు పట్టు. సమాజంలో దీని ఉనికి అవాటినుంచి యీనాటికి కూడా మౌలికంగా స్త్రీ ఒక భోగపు వస్తువుగా మాత్రమే చూడబడుతుందనటానికి సరైన నిదర్శనం.

## పురాణ భారతంలో వేశ్యావృత్తి:

పురాణ భారతంలో వేశ్యావృత్తి రాజరికానికి సంబంధించిన కొన్ని నిర్దిష్టమయిన బాధ్యతలతో పకడ్బందీగా నిర్వహింపబడిన వ్యవస్థగా వేదాలలో పేర్కొనబడింది.

వేశ్యకు ప్రదక్షిణం చేయడం మంగళప్రదమైన చర్యగా విష్ణు సంహితలోను, ఆమె ఎదురు రావటం శుభ శకునంగా మత్స్య పురాణంలోను చెప్పబడింది. ఈ విధంగా పురాణ భారతంలో వేశ్యజాతికి, వేశ్యా వృత్తికి అపారమైన గౌరవాన్ని అపాదించడం జరిగింది.

విటులతో పడుపు స్త్రీ జరిపే ప్రేమాయణ హావభావ ప్రదర్శన గురించి, ఆమె ప్రయోగించే రతిక్రీడ లాఘవాలను గురించి వాత్స్యాయనుడు తన కామ సూత్రాలలో విశేషంగా వర్ణించాడు. అంతేకాకుండా అమె వృత్తి మూడు పూలు ఆరు కాయలుగా వర్ధిల్లాలంటే అలవర్చుకోవలసిన క్రమశిక్షణ గురించి కూడా వాత్స్యాయనుడు పేర్కొన్నాడు.

యజ్ఞవల్క్యుడు, అలాగే విష్ణు సంహిత రచనాకారుడు తార్పుడు వృత్తిని మహాపాప కృత్యంగా పేర్కొన్నప్పటికీ మానవ విలువలను మొత్తంగా మట్టుబెట్టి తోడి స్త్రీని అతి హేయమైన సాంఘిక హింసకు గురిచేసే పడుపువృత్తిని సమాజానికి పట్టిన చెద పురుగ్గా పురాణ భారతంలో గుర్తించలేదని తెలుస్తున్నది. పైగా యీ వృత్తిని సమాజంలో అత్యవసరమైన భాగంగా భావించి శాశ్వతంగా పెంచి పోషించడానికి వీలుగా బలమైన పునాదులు వేయబడటం నిజంగా దురదృష్టకరమైన విషయం.

## దేవదాసీలు:

మనుషుల అజ్ఞానానికి, మూర్ఖత్వానికి నిదర్శనంగా మతం పేరుతో, మోక్షం పేరుతో దేవుడు కొరకు సృష్టించబడ్డ దేవదాసీ వ్యవస్థ పడుపువృత్తికి భారతదేశ చరిత్రలో శాశ్వతమయిన ప్రాతిపదికగా నిలిచింది.

తమ యిష్టాయిష్టాలతో సంబంధం లేకుండా దేవుళ్ళకు అంకితం చేయబడ్డ దేవదాసీలు తమ ప్రకృతి సహజమైన లైంగికావసరాలను సవ్యంగా తీర్చుకోవటం సాధ్యపడక చాటుమాటుగా తీర్చుకోవలసి వచ్చింది. దీన్ని అసరాగా తీసుకొని కాలక్రమేణా వీళ్ళను ఉంపుడుకత్తెలుగా, పడుపుకత్తెలుగా మార్చటానికి సమాజంలో కొంతమంది వెనుకాడలేదు. దేవాదాయంలో కొంతభాగం దేవదాసీలకు సంక్రమించే అవకాశ మున్నందున, చాలామంది పేద తల్లిదండ్రులు కన్న కూతుళ్ళను దైవానికంకితం చేయటానికి ముందుకొచ్చేవాళ్ళు. చివరకు దేవదాసీల సంతానమంతా అక్రమ సంతానంగా సమాజంనుండి వెలివేయబడి అందులో స్త్రీజాతిని పడుపువృత్తికోసం ప్రత్యేకంగా కేటాయించడం భారతీయ సంస్కృతిలో చోటుచేసుకున్న అమానుషత్వానికి తలమానికం. ఈనాడు దేవదాసీ వ్యవస్థను రద్దు చేసినప్పటికీ దేవదాసీల అడ సంతానాన్ని పడుపుగత్తెల జాబితాలో చేర్చుతూనే ఉన్నారు.

ధనవంతుల వ్యసనాలకు సమిధలుగా ఆడి పాడి అలరించే ఉంపుడుగత్తెల తరగతి ఒకటి అంధ్రదేశంలో కొన్ని ప్రాంతాలలో ఏనాడో భోగంవాళ్ళ పేరుతో కులంగా కుదురుకుంది. ఈ కులంలో పుట్టిన ప్రతి ఆడపిల్ల ఆటపాటలు నేర్చుకోవడంతో పాటు వయసొచ్చి రాగానే కన్నెరికపు సుంకం చెల్లించిన మగవాడికి మొదటి రాత్రి వొళ్ళప్పచెప్పి ఉంపుడుకత్తెగా మారడం కులాచారం. ఆ

తరువాత మొదటి మగవాడు పెట్టి పోషించినంత కాలం అతన్నే నమ్ముకొని మరొక మగాణ్ణి కన్నెత్తి చూడకూడదు. అయితే మొదటి మగవాళ్ళ మోజు మరింతకాలం నిలవక ఈ కులంలో పుట్టిన చాలమంది కన్నె పిల్లలు ఒక పరిధిలో మామూలు పడుపుకత్తెలుగానే జీవితం సాగిస్తున్నారు.

కొంతకాలంగా ఈ కులంలో తలెత్తిన సంస్కారవాదం (కళావంతుల సంస్కార సంఘం ద్వారా) కన్నె పిల్లలు కులాచారాన్ని వ్యతిరేకించి చట్టబద్ధంగా వివాహాలు చేసుకునేందుకు దోహదం చేస్తున్నది.

## బ్రిటిషు వారి అనుమతి పత్రాలు:

బ్రిటిషువారి పాలనలో 1929 వరకు పడుపువృత్తి చేసుకుని బ్రతికేవారికి అనుమతి పత్రాలు జారీచేసే పద్ధతి అమలులో వుండేది. ఈనాడు పడుపు స్త్రీలను పెట్టుబడులుగా వ్యాపారం చేయటం, స్త్రీలను బలవంతంగా పడుపు వృత్తిలోనికి దించటం చట్ట వ్యతిరేకం. హావభావ ప్రకటనల ద్వారా జనాన్ని ఆకర్షించడం కూడా శిక్షింపదగ్గ నేరం. అయితే చట్టం కన్ను కప్పి స్త్రీలను బలవంతంగా పడుపువృత్తిలోకి దింపడం, పడుపు వ్యాపారం చేయటం కూడా సజావుగా సాగుతున్నాయన్నది నిర్వివాదాంశం.

## నమూనా సర్వే:

పడుపు వ్యాపారం గురించి, పడుపు స్త్రీలు మొదట ఈ వృత్తిలోకి దిగవలసివచ్చిన కారణాల గురించి సర్కారు జిల్లాలో కొన్ని ముఖ్య నగరాలలో ఈ వ్యాసకర్త జరిపిన శాంపుల్ సర్వేలో కొన్ని చెప్పుకోదగ్గ విషయాలు వెల్లడైనాయి. (మెథడ్ ఆఫ్ డేటా కలెక్షన్ – పార్టిసిపెంట్స్ అబ్జర్వేషన్.)

ఈ పట్టణాల్లో (విశాఖపట్టణం, విజయనగరం, రాజమండ్రి, గుంటూరు, విజయవాడ) పైకి సామాన్యంగా కనిపించే కొన్ని విశ్రాంతి భవనాలు లాడ్జిలు మామూలు గృహస్థుల ఇండ్ల సరసనే ఇక్కడ పడుపు గృహమా అని ఆశ్చర్యపడేంతగా నిలదొక్కుకొన్న కొన్ని కొన్ని పడుపు గృహాలు, మరికొన్ని విదేశీ పద్ధతులలో ఆడంబరంగా నడిపే ఖరీదైన హోటల్స్ ఈ వ్యాపారానికి కేంద్రాలుగా పనిచేస్తున్నాయి. ఈ మూడు రకాల వ్యాపార కేంద్రాలలోను పడుపు గృహాలు 70 శాతం దాకా ఉన్నాయి. అవి వాటిని నడుపుతున్న అయా వ్యక్తుల పేర్లతో కంపెనీలుగా పిలువబడుతూ, ఆయా నగరాలలో అవి సప్లయి చెయ్యగలిగే సరుకు నాణ్యతను బట్టి (పడుపు స్త్రీల అంద చందాలను, కొత్తదనాన్ని బట్టి) ఆ పరిధిలో పరువు ప్రతిష్టలను చేకూర్చుకున్నాయి. సోల్జర్ పేట చిట్టెమ్మ కంపెనీ, మెరకవీధి మంగమ్మ కంపెనీ, టెన్‌రూట్ చివరి శెట్టి కంపెనీ మొదలైన కంపెనీలను ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

పడుపు వ్యాపారానికి ఆలవాలమై పైకి మాత్రం గౌరవనీయులైన ప్రయాణీకులకు మాత్రమే గదులద్దెకివ్వబడును అని చెప్పబడే కొన్ని లాడ్జిలలో మామూలు ప్రయాణీకులకు గదులసలు ఖాళీలేవని చెప్పబడుతుంది. లాడ్జి రిజిస్టరు మార్చి, వారాని కొకసారి మార్చి వ్రాసే పడుపు గత్తెల పేర్లతో బ్రోకర్ల పేర్లతో గదులద్దె కివ్వబడ్డట్లు ఉంటుంది. పడుపు స్త్రీలతో విటుల రతిక్రీడకు మాత్రమే గదులు కేటాయించబడతాయి. ఈ విశ్రాంతి భవనాల్లో రాత్రింబవళ్ళు కూడ పడుపుగత్తెలు విటులకు అందుబాటులో ఉంటారు. సమాజంలో తమ గౌరవానికి భంగం లేకుండా అతి రహస్యంగా పడుపుతనానికి దిగుతున్న కొంతమంది చదువుకొన్న మధ్యతరగతి యువతులతో (క్లాండెస్టైయిన్ ప్రాసిట్యూట్స్) ఖరీదైన పెద్ద మనుషులు కాలక్షేపం చేయడానికి కొన్ని రహస్య పడుపు గృహాలు, మరికొన్ని విదేశీ పద్ధతులలో నడిపే హోటల్స్ అవకాశాన్ని కల్పిస్తున్నాయి. పడుపు గృహాల మేనేజర్లు సిండికేట్లుగా ఏర్పడి ఈ గృహాలకు రౌడీలతోను మరి కొంతమంది హంగుదార్లతోనూ ఒక అవగాహన కొచ్చి చట్టానికి వ్యతిరేకంగా, రహస్యంగా సాగిస్తున్న వ్యాపారమిది.

## కోస్తా ఆంధ్రలో పడుపు వృత్తి:

కోస్తా ఆంధ్రదేశంలో అభివృద్ధి చెందుతున్న ప్రతి పట్టణంలోను ఈ వ్యాపారం పోటీపడి పెరుగుతున్నది. ఈనాడు పట్టణాలలోనే యీ వ్యాపారం పెరిగి పెద్దవటానికి కారణం – 1. పారిశ్రామికీకరణ కారణంగా వయసొచ్చిన శ్రమజీవుల సంఖ్య పెరిగి వారిలో కొంతమంది సహజ వాంఛలను సరైన మార్గంలో తీర్చుకునేందుకు పరిస్థితులు అనుకూలంగా లేకపోవడం (మిగతా సామాజిక పరిస్థితుల కారణంగా వయసొచ్చిన వెంటనే వివాహమయ్యే అవకాశం లేకపోవడం). 2. నైతికంగా మనిషిని దిగజార్చుతున్న ఉద్రేక సెక్స్ సాహిత్యం, సినిమాలలో చూపించే ఉద్రేకపూరితమైన సెక్స్ దృశ్యాలు కూడా పెళ్ళి కావలసిన యువ ప్రపంచం మీద చెడు ప్రభావాన్ని కలుగజేసి పడుపు గృహాల అవసరాన్ని పెంచుతున్నాయి. 3. ఈనాడు పడుపు గృహాల కొస్తున్న విటులలో దాదాపుగా నూటికి డెబ్బైమంది మద్యాన్ని సేవించి మత్తులో వస్తున్నవారేనని కూడా చెబుతున్నారు. ఇందుకు కారణాలు – ఎ. మద్యపానం. మనిషిలో కృత్రిమ కామభావాన్ని కలుగజేసి ఆ సమయానికి సంఘ నియమాలు వ్యతిరేకించే ధైర్యాన్నివ్వడం. బి. మత్తులో ఉన్న మగవాణ్ణి అసహ్యాభావం కనిపించకుండా ఆహ్వానించి ఆనందాన్ని పంచిపెట్టే ఔదార్యం పడుపుస్త్రీకి మాత్రమే ఉండటం. 4. పల్లెటూళ్ళనుంచి పట్టణాలకు పనిమీద ప్రవాహంలాగా వచ్చి పోయే ప్రజలు

కూడా పడుపు గృహాల అవసరాన్ని పెంచుతున్నారు. 5. రేవుపట్టణంగా పేరు పొందిన విశాఖపట్నంలో విదేశీ ఓడలలో వచ్చే నావికులు పడుపుగత్తెలకు ప్రత్యేకమైన గిరాకీ పెరగటానికి దోహదం చేస్తున్నారు.

అంతకు ముందు స్వంతంగా ఈ వృత్తి చేసుకొనే చాలామంది సామాన్య పడుపుస్త్రీలు ఈనాడు ఈ వ్యాపార కేంద్రాలలో చేరవలసి వచ్చిన కారణాలు – (1) ఒంటరిగా ఈ వృత్తి చేసుకునే స్త్రీ– అప్పుడప్పుడు ఒళ్లు పెంచుకొని పరాన్నభుక్కులుగా బ్రతికే రౌడీల గూండాయిజానికి గురికావటం (2) చీటికి మాటికి పైసలు లేకుండానే పక్కలో చేరుతూ కూడా, అప్పుడప్పుడూ పైసలు పుచ్చుకుంటూనే మళ్ళీ కేసు నమోదుల అవసరం పేరుతో అరెస్టు చేసే కొంతమంది పోలీసు జవానుల జులుంకు తట్టుకోలేకపోవడం.

ఈ సర్వేలో తేలిన చెప్పుకోదగ్గ విషయమేమిటంటే – విశాఖపట్నం, విజయనగరం, రాజమండ్రిలతో పోల్చి చూస్తే విజయవాడ, గుంటూరులలో పడుపు వ్యాపార గృహాలు చాలా తక్కువగా ఉండటమే కాకుండా, స్వంతంగా ఈ వృత్తి చేసుకునే స్త్రీలు ఎక్కువగా ఉన్నారు. ఇందుకు ముఖ్యమయిన కారణం పోలీసులు తరచుగా జరుపుతున్న దాడులేనని అక్కడివారు చెబుతున్నారు.

తమకు తాముగా ఈ పడుపు కేంద్రాలలో చేరిన వాళ్ళు కాకుండా, తార్పుడు వ్యక్తుల మాయమాటలకు ప్రలోభపడి కొంతమంది కన్నెపిల్లలు, పరిస్థితులు వ్యతిరేకించి నమ్మినవాళ్ళతో వంచించబడి దిక్కుతోచని స్థితిలో ఉన్న స్త్రీలు కొందరు బలవంతంగా ఈ కేంద్రాలలో చేర్చబడుతున్నారు. తార్పుడు గాళ్ళు, తార్పుడుగత్తెలు తాము కొత్తగా వెంటబెట్టుకొచ్చిన పడుచుపిల్లలను ఈ పడుపు గృహాలకు అమ్మి డబ్బు చేసుకోవటం ఈ ప్రాంతాలలో జరుగుతున్న అతి మామూలు విషయం.

ఆ నికృష్టశ్రమకు వోర్చి వళ్ళప్పజెప్పే ఈ అభాగ్య స్త్రీలు సంపాదిస్తున్న సరాసరి దినసరి సంపాదనలో 27.5 శాతం మాత్రమే వారికి దక్కుతుంది. 37.75 శాతం పడుపు గృహాల మేనేజర్లకు, 25 శాతం విటులను పడుపు గృహాలకు తీసుకువచ్చే రిక్షావాలాలకు, టాక్సీ డ్రైవర్లకు, తదితర బ్రోకర్లకు చెందుతున్నది. పడుపు గృహాల మేనేజర్లు టౌను రౌడీలకు, తార్పుడు వ్యక్తులకు, పోలీసు డిపార్టుమెంటుకు చెందిన కొంతమంది పై మేతగాళ్ళకు మామూలుగా యిచ్చే కమీషన్‌తోపాటు అప్పుడప్పుడు కొంతమంది పైతరగతికి చెందిన పోలీసు బాబులకు పెద్ద మొత్తాలు చెల్లించడం పరిపాటి. అయినప్పటికి ఈ గృహాలకు మొత్తంగా పోలీసు దాడులనుంచి తప్పించుకోవటం సాధ్యపడదు. బదిలీల మీద వస్తూపోతూఉండే, బాధ్యతను నిక్కచ్చిగా నిర్వహించే పోలీసు ఆఫీసర్లు కొందరు పడుపుగృహాలను కొంత కాలంపాటు మాయంచేసిన ఉదాహరణలు కూడా ఉన్నాయి. అలాగే పడుపుగృహాల మేనేజర్లకు, కొంతమంది పోలీసు బాబులకు యిచ్చి పుచ్చుకోవడంలో తేడాలు వచ్చినప్పుడు కూడా కొన్ని గృహాలు మూసివేయవలసి వస్తుంది. సామాన్యంగా పోలీసు దాడి గురించి పోలీసు డిపార్టుమెంటుకు చెందిన కొందరు వీరికి ముందుగానే సమాచారం అందజేస్తారు. ఆ సమయానికి ఈ గృహాల్లో ఒకరు లేక ఇద్దరు స్త్రీలను మాత్రమే వుంచుతారు. వాళ్లను పోలీసులు అభ్యంతరకరమైన ప్రవర్తన క్రింద అరెస్టు చేసి ఒకటి రెండు రోజులు లాకప్‌లో వుంచి, కోర్టులో హాజరు పరుస్తారు. కోర్టులో వీళ్ళకు సాధారణంగా 25 రూపాయల నుంచి 100 రూపాయల వరకు జూల్మానా విధిస్తారు. అది చెల్లింపలేని పక్షంలో వారంనుండి నెల రోజులదాకా జైలు శిక్ష అనుభవించవలసి వస్తుంది. అయితే జుల్మానాలను పడుపుగృహాల మేనేజర్లు చెల్లించి పడుపుగత్తెలను మళ్ళీ తమ గృహాలకు తీసికెళ్ళడం సామాన్యంగా జరుగుతున్న విషయం. అవసరమైన కేసులలో బెయిలివ్వటం, లాయర్లను పెట్టడం కూడా ఈ మేనేజర్లు చేస్తూంటారు. ఈ ఖర్చంతా పడుపు గత్తెలనుంచి వసూలు చేస్తారు. ఈ మేనేజర్లు పడుపు గత్తెల అవసరానికి డబ్బు అప్పిస్తూ ఉంటారు. ఆ అప్పుల మీద నెలకు 100 కు 10 నుంచి 15 రూపాయల వరకు వడ్డీ వసూలు చేస్తారు. అంతేకాకుండా పడుపు గృహాలకు అమ్మబడు నిర్భాగ్యులు వడ్డీతో సహా తమనుకొన్న ఖరీదును అప్పుగా భావించి, పడుపు వృత్తి చేసి తీర్చాలి.

సామాన్యంగా పడుపు స్త్రీలు సంవత్సరం దాటకుండానే కొత్త మొఖాలుగా కనబడటం కోసం ఒక గృహం నుంచి మరో గృహానికి, ఒక పట్టణం నుంచి మరో పట్టణానికి మార్చబడుతూ ఉంటారు. అయితే ఈ మార్పిడి సిండికేట్లుగా పనిచేస్తున్న పడుపు గృహాల మేనేజర్ల మధ్య కుదిరిన అవగాహన ప్రకారమే జరుగుతుంది. ఈ పడుపు గృహాల మేనేజర్లతో ఏర్పడ్డ కొన్ని సిండికేట్లు ఎంత పకడ్బందీగా పనిచేస్తున్నాయంటే, ఒకసారి ఈ పడుపు గృహాల్లో చిక్కుకొన్న స్త్రీని మరి పడుపువృత్తికి పనికి రాకుండా పీల్చి పిప్పిచేసేవరకూ బయటకు పోనివ్వరు.

పడుపు స్త్రీలలో కొంతమంది వయసు, సొగసు మిగిలి ఉండగానే మెచ్చిన విటులకు ఉంపుడుగత్తెలుగా మారుతున్నారు. సొగసు తగ్గిపోయి, పడుపు గృహాలలో బేరాలు పడిపోయిన పడుపుస్త్రీలలో తెలివైన అతి కొద్దిమంది మాత్రం సొంత కంపెనీలు పెట్టుకుంటున్నారు. మరికొంత మంది తార్పుడుగత్తెలుగా మారుతున్నారు. ఇంకా కొంతమంది పావలాకి, అర్ధరూపాయికి కూడా రోడ్డు ప్రక్కన కొంగు

పరుచుకునే బజారు మనుషులవుతున్నారు. (స్ట్రీట్ వాకర్స్.)

ఐదుగురు స్త్రీలున్న పడుపు గృహాల నుంచి 15 మంది స్త్రీలున్న పడుపు గృహాలు కూడా ఉన్నాయి. పడుపు స్త్రీలను అవసరాన్ని బట్టి బాగా తెలుసుకున్న వారి వెంట బయట బేరాలకు కూడా బ్రోకర్లను తోడిచ్చి పంపిస్తారు.

ఇద్దరు లేక ముగ్గురు స్నేహితులు కలిసి పడుపు స్త్రీని మొత్తం రాత్రికి అద్దెకు తీసుకొని మత్తుపానీయాలు సేవిస్తూ గ్రూప్ సెక్స్ సాగించడం ఈ ప్రాంతంలో అభివృద్ధి చెందుతున్న కొత్త పద్ధతి.

పడుపు స్త్రీల సంఖ్యమీద, వారి అందచందాలమీద, ఆ గృహాలకున్న పేరు ప్రతిష్ఠల మీద వాటికొచ్చే ఆదాయం ఆధారపడి ఉంటుంది. 1980 లో ఒక నెల పరిశీలనలో మూడు తరగతులకు చెందిన 9 పడుపు గృహాలకు వేరు వేరుగా వచ్చిన మొత్తం ఆదాయం (గ్రాస్ ఇన్‌కమ్) ఈ క్రింది విధంగా ఉంది:

5 గురు స్త్రీలున్న గృహాలయొక్క నెలసరి ఆదాయం రు. 8,350/- 7 గురు స్త్రీలున్న గృహాల యొక్క నెలసరి ఆదాయం రు. 10,200/- 9 మంది స్త్రీలున్న గృహాల యొక్క నెలసరి ఆదాయం రు. 12,100/-.

పరిశీలన నిమిత్తం మచ్చుకు కొన్ని పడుపు గృహాలలో పనిచేస్తున్న మొత్తం పడుపు స్త్రీల నుంచి వారి ప్రస్తుత పరిస్థితి గురించి, వారు ఈ వృత్తిలోకి దిగటానికి దోహదం చేసిన కారణాల గురించి తెలుసుకునేందుకు 50 మంది స్త్రీలను ఎంపిక చేయడం జరిగింది. (విజయవాడలో 3 పడుపు గృహాల నుంచి 6 గురు స్త్రీలు, గుంటూరులో 3 గృహాల నుండి 6 గురు స్త్రీలు, రాజమండ్రిలో 3 గృహాల నుండి, ఒక లాడ్జి నుంచి 10 మంది స్త్రీలు; విశాఖపట్నంలో 6 పడుపు గృహాల నుంచి, 4 లాడ్జిలనుంచి 20 మంది స్త్రీలను ఎంపిక చేయడం జరిగింది.)

(గమనిక: మామూలు పడుపుగత్తెల గురించి మాత్రమే సర్వే చేయడం జరిగింది.)

1. నమూనా స్త్రీలందరు 15 సం॥ నుంచి 27 సం॥ల లోపు వయస్సువారే. వీరందరు పేదకుటుంబాలలో పుట్టి పెరిగినవారే.
2. మతపరంగా చూస్తే 70 శాతం మంది హిందువులు, 22 శాతం మంది క్రైస్తవులు, 8 శాతం మంది ముస్లిములు ఉన్నారు.
3. హిందువులలో యిద్దరు బ్రాహ్మణ కులానికి, ఒకరు క్షత్రియ కులానికి, ఒకరు వైశ్య కులానికి, మిగతా 31 మంది వర్ణక్రమంలో తక్కువ కులాలకు చెందినవారు.
4. తక్కువ కులాలకు చెందినవారిలో ఇద్దరు రెడ్డి కులానికి, నలుగురు కమ్మకులానికి, నలుగురు కాపుకులానికి, ఇద్దరు కంసాలి కులానికి, ఒకరు శెట్టిబలిజ కులానికి, ఇద్దరు భోగం కులానికి, ఒకరు దొమ్మరి కులానికి, 15 మంది షెడ్యూల్డు కులాలకి చెందినవారు.
5. నమూనా స్త్రీలలో 36 శాతం మంది పట్టణాలల్లోనూ, 64 శాతం పల్లెటూళ్ళలోను పుట్టి పెరిగారు.
6. 26 శాతం మందికి చదవడం, వ్రాయడం వచ్చు. అందులో ఇద్దరు 8 వ తరగతి వరకు చదువుకున్నారు. ఈ ఇద్దరిలో ఒకరు భోగం కులానికి, మరొకరు క్రైస్తవ మతానికి చెందటం గమనించదగ్గ విషయం.
7. నమూనా స్త్రీలందరు విటుల కోరిక మీద మత్తు పానీయాలు త్రాగేవారే. అయితే 28 శాతం స్త్రీలకు అది అలవాటుగా మారి మత్తుపానీయాలు సొంతంగా కొనుక్కొని కూడా త్రాగుతున్నారు.
8. నమూనా స్త్రీలలో 36 శాతం మందికి చట్టబద్ధంగా పెళ్ళిళ్ళు జరిగాయి. ఇందులో ఇద్దరికి- ఒక్కొక్కరికి ఒక్కొక్క కూతురు కూడాను. ఆ యిద్దరు పిల్లలు కూడా ఈ పడుపు గృహాల్లోనే పెంచబడుతున్నారు.
9. పడుపు స్త్రీలు తాము నమ్మిన, తమను బాగా అభిమానించే అతి కొద్దిపాటి విటులను మినహాయించి, తమ గత జీవితం గురించిన నిజాలను విటుల దగ్గర గుప్తంగా ఉంచుతున్నారు.
10. నమూనా స్త్రీలలో 8 మంది మాత్రం కొంతమంది విటులతో ఒకరకమైన ఆత్మీయత పెంచుకొన్నట్లు చెప్పారు. సామాన్యంగా పడుపుగృహాల మేనేజర్లు పడుపు స్త్రీలకు – విటులకు మధ్య ఆత్మీయత పెరగ టానికి వీలులేకుండా ఒక్కొక్క విటుడు ఒకే స్త్రీతో ఎక్కువసార్లు కలియకుండా జాగ్రత్తపడుతుంటారు.
11. నమూనా స్త్రీలలో 30 మంది స్త్రీలు మంచిగా బ్రతకటానికి అవకాశం కల్పించి చేయూతనిస్తే, ఈ వృత్తినుంచి బయటపడడానికి సిద్ధంగా ఉన్నామన్నారు. విచిత్రమేమంటే – ఈ 30 మందిలో 23 మంది పల్లెప్రాంతాలకు చెందినవారు. 9 మంది స్త్రీలు మాత్రం కుటుంబ బాధ్యతల దృష్ట్యా తాత్కాలికంగా స్వీకరించిన ఈ వృత్తిని, పరిస్థితులు చక్కబడగానే వదలివేయనున్నట్లు చెప్పారు. 11 మంది స్త్రీలకు పాత జీవితం కన్నా ఈ జీవితమే బాగున్నందున, ప్రస్తుతానికి ఈ వృత్తిని విడనాడే ప్రసక్తే లేదన్నారు. అందులో ఇద్దరు సొంతంగా పడుపు గృహాలను నడపాలనే కోరికను వ్యక్తం చేశారు.
12. నమూనా స్త్రీలందరు రెండు, రెండుకన్నా ఎక్కువసార్లు అరెస్టయినవారే.

13. నమూనా స్త్రీలకు వారి దినసరి సంపాదనలో 27.5 శాతం మాత్రమే దక్కుతున్నది. 37.5 శాతం పడుపు గృహాల మేనేజర్లకు, 25 శాతం విటులను పడుపు గృహాలకు తీసుకొచ్చే రిక్షావాలాలకు, తదితర బ్రోకర్లకు దక్కుతున్నది. సర్వేచేసిన మూడు ప్రాంతాలలోను ఈ పంపిణీ ఒకేరకంగా ఉన్నది. అయితే కొంతమంది మేనేజర్లు విటులను తీసుకొచ్చే బ్రోకర్లకు 10 శాతం మాత్రమే యిచ్చి మిగతా 15 శాతం కూడా తామే మిగుల్చుకుంటున్నారు. నమూనా స్త్రీలకు, విటులు సంతృప్తిపడి మెచ్చి 'టిప్పు' ల రూపంలో ఇచ్చే డబ్బు నెలకు సరాసరి 50 నుంచి 150 రూపాయల వరకు వస్తున్నది. పడుపు స్త్రీలు ఈ డబ్బులో వాటాలెవరికీ పంచిపెట్టనక్కరలేదు.

14. నమూనా స్త్రీల నెలసరి నికరాదాయం తరగతుల వారీగా ఈ క్రింది విధంగా ఉంది :

    23 మంది నెలసరి ఆదాయం 250 నుంచి 300 రూ.లు. 14 మంది నెలసరి ఆదాయం రూ. 300 నుంచి రు. 350. 8 మంది నెలసరి ఆదాయం రు. 350 నుంచి రు. 400. 5గురి నెలసరి ఆదాయం రు. 400 నుంచి రు. 450

పడుపు స్త్రీల వయస్సు, సొగసు, లైంగిక కళానైపుణ్యంలో ఉన్న తేడాలు – వారికొచ్చే నికరాదాయంలో కనిపిస్తున్న తేడాలకు ముఖ్య కారణాలుగా చెప్పకోవచ్చు. ఈ నికరాదాయంలో వారికి టిప్పుల రూపంలో వచ్చే మొత్తం కూడ కలిసివుంది.

వీరికి నికరంగా వచ్చే నెలసరి సంపాదనలో సరాసరిన 10 శాతం డాక్టరు ఫీజులకు, మందులకు; 8 శాతం సినిమాలకు; 6 శాతం పౌడర్లకు, అత్తర్లకు; సరాసరిని 8 శాతం కొత్తబట్టలు కొనటానికి; 40 శాతం ఆహారానికి; 10 శాతం కోర్టు ఫైనులకు, పోలీసులకు ఖర్చుపెడుతున్నారు. మిగతా 18 శాతం సంపాదననూ 20 శాతం మంది పొదుపుచేయగా, 12 శాతం మంది తమ మీద ఆధారపడినవారికి పంపిస్తున్నారు. మరి 28 శాతం మంది స్త్రీలు మత్తు పానీయాలకు ఖర్చు పెడుతుండగా, 40 శాతం మంది పాత అప్పుల క్రింద, వడ్డీలకింద పడుపు గృహాల మేనేజర్లకి చెల్లిస్తున్నారు.

నమూనా స్త్రీలలో 8 మంది స్త్రీలు ముందుగా పురుషస్పర్శ తెలియకుండానే వయసు ముదిరిన పడుపుకత్తెల ప్రలోభానికి లొంగిపోయి పడుపు గృహాలకు దారుణంగా అమ్మివేయబడ్డారు. కమ్మని కలలుగా, స్మృతులలో మిగలవలసిన యవ్వనపు తొలి రాత్రులలో భయంతో, నిస్సహాయంగా, మత్తు పానీయాల వెగటు వాసనల మధ్య, విటుల కబంధహస్తాలలో లుంగచుట్టుకుపోయిన వారి తొలి రాత్రుల గుర్తులు హృదయ విదారకంగా ఉన్నాయి. ఇందుకు సీత జీవితం ఒక నిదర్శనం.

రెక్కాడితేనేగాని డొక్కాడని అతి పేద తల్లిదండ్రులకు సీత రెండో కూతురు. పది సంవత్సరాలు నిండకుండానే కుర్ర కూలీల జాబితాలో చేరి తల్లి దండ్రులతోపాటు బ్రతుకు బరువును లాగటం మొదలుపెట్టింది. 15 సంవత్సరాలకు పుష్పవతైన సీత కుందనపు బొమ్మలాగా పొందికగా ఉండేది. తండ్రి తన పరిధిలో మొదటి కూతుర్ని అత్తవారింటికి పంపించి రెండవ కూతురికి మంచి పెళ్ళి సంబంధం కోసం ప్రయత్నం చేస్తున్న దశలోనే అనుకోకుండా కాలం చేశాడు. ఆ రోజుల్లో సీత తోడి స్నేహితులతో కలిసి తమ ఊరికి మూడు మైళ్ళ దూరంలో వున్న పొగాకు కంపెనీకి గ్రేడు పనిచేయటానికి వెళ్తూ ఉండేది. గ్రేడు ముఠా మేస్త్రి దగ్గరకు పట్నంనుంచి అప్పుడప్పుడు వచ్చిపోతూ ఉండే సావిత్రమ్మ సీతతో స్నేహం కలిపి, పట్నవాసపు విలాస జీవితం గురించి కథలు కథలుగా చెప్పేది. పట్నంలో ఎక్కువ సంపాధన ఏర్పాటు చేస్తానన్న సావిత్రమ్మ మాటలు నమ్మి, తల్లిని ఒప్పించి సావిత్రమ్మతో పట్నం వెళ్ళింది. అక్కడ వెయ్యి రూపాయలకు ఓ పడుపు గృహానికి అమానుషంగా అమ్మివేయబడింది. 15 సంవత్సరాలు పూర్తిగా నిండని సీత మొదటి రాత్రే మనసులేని మగవాళ్ళ పక్కలోకి నెట్టబడి పడుపు వ్యాపారానికి బలైపోయింది. ఆ తరువాత యింటికి వెళ్ళటానికి అవకాశం ఉండికూడా కన్న ఊరిలో చెడిపోయిన ఆడదానిగా బ్రతకలేక, వేరే చెయ్యగలిగింది లేక ఈ వృత్తికి, ఈ జీవితానికి అలవాటుపడింది. అప్పుడప్పుడు 'తనకు పెళ్ళయి ఉంటే... సావిత్రమ్మతో స్నేహం చెయ్యకుండా ఉంటే....' అని విటులతో చెప్పకొని విరక్తిగా నవ్వుతుంది.

వీరిలో ఇద్దరు స్త్రీలు కళావంతుల కులానికి చెందినవారు. (భోగం కులం.) వీరిద్దరు కన్నెరికం పెట్టబడి కలవారికి ఉంపుడు కత్తెలుగా మారినవారే. ఇందులో ఒకరు కన్నెరికపు మొగుడి మోజుకు దూరమై, కుటుంబం గడవటానికై అప్పులుచేసి, ఆ అప్పులు తీర్చటానికి ఓ పడుపు గృహం మేనేజరు దగ్గర పెద్ద మొత్తం అప్పు తీసుకున్నది. ఆ అప్పు తీర్చటానికి పుడుపుగత్తెగా శ్రమిస్తున్నది. సుభద్ర మట్టుకు కొన్ని మానసికమైన పరిస్థితులకు లోనై పడుపు గృహంలో చేరింది.

సుభద్ర ఓ కన్నెరికపు తల్లికి కూతురు. కావలసినంత వరకు ఆట–పాట నేర్పటంతో పాటు 8 వ తరగతివరకు చదువుకుంది కూడా. కొంతకాలం గొప్పవారి వినోదాల కోసం ఏర్పాటు చేసే భోగం మేళంలో తోటి కులస్థులతో కలిసి గజ్జెకట్టి ఆడి, పాడింది. పదహారేళ్లు నిండుతూనే కుల పెద్ద లేర్పాటుచేసిన కన్నెరికపు మహోత్సవంలో ఓ వయసు ముదిరిన మగవాడితో తాళిలాంటిది కట్టించుకుంది.

అయితే సుభద్ర ఉంపుడుగత్తెగా ఉంటూనే అప్పుడప్పుడు తనకు మెచ్చిన, తనకునచ్చిన ఒక మగసిరిగల యువకుణ్ణి తనింటి కాహ్వానించి ఆరాధనతో తన్నర్పించుకొని సంతృప్తి పడేది. ఆ ప్రియుడికి పెళ్ళాం పిల్లలు కూడా ఉన్నారు. ఈ సంగతి తెలిసి సుభద్ర ప్రియుణ్ణి చావబాదించాడు కన్నెరికపు మొగుడు. ఈ కొట్లాట ఫలితంగా కుడికాలు పోగొట్టుకున్న ప్రియుడు పెళ్ళాం పిల్లల్ని పోషించలేని నిస్సహాయుడైనాడు. ఈ సంఘటనకు తట్టుకోలేని సుభద్ర పుట్టిన పట్టణం వదలి పెట్టి, విశాఖపట్నం చేరింది. తల్లికి తనగురించి వెతకవద్దని, కొంత మనశ్శాంతి కలిగిన తరువాత యింటికి వస్తానని ఉత్తరం వ్రాసి, విశాఖ కొస్తున్న దార్లోనే పోస్టు చేసింది. అక్కడ ఓ పడుపు గృహం మేనేజరు దగ్గర రూ.1500 అప్పుచేసి తన ప్రియుడికి పంపించిందట! ఆ అప్పు తీర్చడం కోసం ఆ పడుపు గృహం అమ్మాయిలతో తనూ కలిసింది. అప్పుడప్పుడూ సానుభూతితో మాట్లాడే విటులకు, ప్రియుడు కృతజ్ఞతతో వ్రాసిన ఉత్తరాలను చూపించి సంతృప్తి పడుతుంది. ప్రియుడికోసం తన జీవితాన్నంతా ధారపోస్తానని నిష్కల్మషంగా చెప్పుకొనే 20 సంవత్సరాల సుభద్ర మానవకులానికి మణిపూస కాదా? విటుల కౌగిలింతలు ఆమె స్వచ్ఛమైన మనసును మైలపరచగలవా?

నమూనా స్త్రీలలో 12 మంది చిన్నతనంలో నిర్లక్ష్యం చేయబడి ఆత్మీయతకు, అనురాగానికి దూరంగా పెరిగి పెద్దవారైనారు. ఆత్మీయతకోసం ఆరాటపడుతున్న వీరు యవ్వనపు తొలిరోజుల్లోనే కొంతమంది మోసగాళ్లను, మరికొంతమంది చేతగానివాళ్ళను బ్రతుకును పంచుకోబోతున్న భర్తలుగా భ్రమించి వారివెంట లేచిపోయారు. ఇందులో కొందరు కోరుకొన్నవాళ్లతో కాపురం మొదలుపెట్టి కొత్త జీవితపు మత్తులో వుండగానే హఠాత్తుగా, అక్రమంగా నమ్ముకున్న వాళ్లచేతనే పడుపు గృహాలకు పశువుల్లా అమ్మివేయబడ్డారు. మరికొందరు చేతగాని పిరికివాళ్ళు ముచ్చటగా మూడురోజులు ముగియకుండానే నమ్ముకున్న ప్రియురాళ్ళను నగరం నడివీధులలో వదలి ఐపులేకుండా పోగా, నగరం నలుచెరగులా కాపువేసి కాటేసే బ్రోకరు బాబులు దిక్కుతోచని స్థితిలో ఉన్న, వయస్సులోవున్న అమ్మాయిలను బలవంతంగా పడుపుగృహాలకు చేరవేశారు. ఇందుకు ఫతీమా జీవితం మంచి ఉదాహరణ.

ఫతీమా ఎనిమిదేళ్ళు నిండకుండానే తల్లిని పోగొట్టుకుంది. కొద్ది పెట్టుబడితో పండ్లవ్యాపారం చేసే ఫతీమా తండ్రి, రెండో పెళ్ళి చేసుకుని పడుచుపెళ్లాం మోజులో ఫతీమా గురించి పట్టించుకోడం మానేశాడు. పదకొండేళ్ళు నిండకుండానే ఫతీమా ఇంటిపనంతా చేసి కూడా పిన్ని దెబ్బలనుంచి తప్పించుకోలేకపోయేది. పధ్నాలుగేళ్ళకు పుష్పవతైన ఫతీమా అప్పుడప్పుడు పక్కింటి పాలేరు నాగులు దగ్గర పిన్నమ్మ తన్ను పెట్టే కష్టాలు చెప్పుకొని సానుభూతి పొందేది. వాళ్ళిద్దరిమధ్యా రాను రాను పరిచయం పెరిగి కలిసి బ్రతకాలనే తలంపురాగా ఇద్దరూ కలిసి పట్నం పారిపోయారు. పొట్ట పోసుకుందుకు పట్నంలో సంపాదన చేతగాని నాగులు ఫతీమాని నగరం నడివీధుల్లో వదిలేసి అంతులేకుండా పోయాడు. పినతల్లి పెట్టే కష్టాలనుంచి తప్పించుకొని కోరినవాడితో కలిసొచ్చినందుకు పొంగిపోతున్న ఫతీమా నాగులు జాడ తెలియక దిక్కు దిక్కు మంటూ పేవ్‌మెంటుమీద నాగుల్ని గూర్చి వాకబు చేస్తుంటే, యిద్దరు బ్రోకర్లు నాగుల్ని చూపిస్తామని మధ్యపెట్టి పడుపు గృహానికి చేరవేసి ఫతీమాను బలవంతంగా పడుపువృత్తిలోకి నెట్టారు. అయితే ఫతీమా ఈనాటి తన స్థితికి పెద్దగా విచారించటంలేదుగాని, నాగుల్ని తల్చుకుని జాలిపడుతోంది. నాగులు కనపడితే తన్నంగీకరిస్తే అతనితో జీవితం పంచుకోవాలనే కోరిక యిప్పటికీ చావలేదన్నది.

మిగతా 28 మంది స్త్రీలలోనూ 9 మంది కుటుంబ బాధ్యతలను పరువుగా మొయ్యలేని తమ కుటుంబాలకు చేయూతగా పడుపుగత్తెలుగా మారినవారైతే, 7 గురు కాయకష్టానికి ఓర్చుకోలేక పడుపువృత్తే సుఖమయినదను కొన్నవారు. మరి ఎనిమిదిమంది స్త్రీలు పరాయి మగవాళ్లతో పొత్తు పెట్టుకున్నారన్న మిషతో భర్తలు తరిమివేయగా, గత్యంతరంలేక పడుపు గృహాలను వెతుక్కుంటూ వచ్చిన వారైతే, మరి నలుగురు తిండి పెట్టలేని త్రాగుబోతు భర్తలు పెట్టే నరకయాతనలు తట్టుకోలేక పారిపోయి, పొట్టకోసం పడుపు వృత్తిలోకి దిగారు. భర్తలతో గడిపిన రోజులకన్నా ఈ బ్రతుకే సుఖంగా ఉందని సంతృప్తి పడుతున్నారు.

### పడుపు వృత్తిని నిర్మూలించడం ఎలా:

సమాజంనుంచి పడుపువృత్తిని సమూలంగా పెరికివేసిన నాడే – స్త్రీని ఒక భోగవస్తువుగా కాకుండా సాటి వ్యక్తిగా గుర్తించే ప్రయత్నం మొదలవుతుంది. ఇది చట్టాలవలన మాత్రమే అయ్యే పనికాదు. ఇందుకు ఒకవైపునుంచి స్త్రీ పడుపుగత్తెగా మారటానికి దోహదం చేస్తున్న పరిస్థితులలోను, మరొక వైపునుండి సమాజానికి పడుపుగత్తెల అవసరాన్ని పెంచుతున్న పరిస్థితులలోను మౌలికమైన మార్పులు తీసుకురావలసి ఉంది. ఈ మార్పులు, సమాజంలో వ్యవస్థాపరమైన మార్పులు తీసుకురావటం ద్వారా మాత్రమే సాధ్యపడతాయి.

# స్త్రీల సమస్యలు: సిద్ధాంతాలు

మల్లాది సుబ్బమ్మ

"ప్రతి వంటకత్తె ఒక రాజకీయ వేత్త కావాలి" అన్నాడు లెనిన్. భారత స్త్రీకి ఆ స్థాయి వచ్చిననాడు నిజంగా అలా జరిగితే ఈనాటి సామాజిక వ్యవస్థే మారిపోతుంది. అన్యాయాలు, అక్రమాలు, అవినీతి, అసమానత్వం, హెచ్చుతగ్గులు అణగారిపోతాయి. కులమతాల దురభిమానాలు, ఆస్తి అంతస్తుల తేడాలు ఎగిరి పోతాయి. శాంతి, సుస్థిరతలు నెలకొంటాయి. కాని, ఆ స్థితి చూపుమేరలో దృగ్గోచరం కావటం లేదు. అసలు స్త్రీలకు ప్రత్యేక సమస్యలున్నాయా? వుంటే అవి పురుషులకు మాత్రం వర్తించవా? సమాజంలో, కుటుంబంలో ఇద్దరూ భాగస్వాములు అయినప్పుడు సమస్యలు వేరుగా వుంటాయా? ఈనాడు మహిళాభివృద్ధికి అనేక చట్టాలొచ్చాయికదా! దేశంలో స్త్రీల పరిస్థితిని పరిశీలించి స్టేటస్ కమిటీ తన రిపోర్టులో 32 రికమండేషన్సు, కొన్ని సలహాలు ఇచ్చింది. ప్రపంచ మహిళా సంవత్సరం, దశాబ్దం వచ్చి ఆర్థిక సాంఘిక రాజకీయ రంగాల్లో ఎన్నో మార్పులు తెచ్చింది. బాలికా వత్సరంలో బాలికాభ్యుదయం తెచ్చింది. బాలికా దశాబ్దం ఇంకా అమల్లో వుంది. జాతీయ మహిళా కమిషన్ పెట్టారు. మహిళా కోర్టులు వచ్చాయి. మహిళా ప్రొటెక్షన్ సెల్సు పనిచేస్తున్నాయి. ఉమెన్ వెల్ఫేర్, సోషల్ వెల్ఫేర్ శాఖలొచ్చి స్త్రీలకు ఆర్థికంగా, సాంఘికంగా సహాయ సహకారాలందిస్తుంటే ఇంకా స్త్రీల సమస్యలని గగ్గోలు పెడతారెందుకని ప్రశ్నించేవారు కోకొల్లలుగా వున్నారు.

ఈ దేశంలో స్త్రీకి ఇచ్చిన గౌరవం మరే దేశంలోనూ ఇవ్వలేదని కొందరూ, ఆమెను మాతృదేవతగా ఆరాధిస్తున్నామని మరి కొందరూ వాదిస్తున్నారు. నేటి స్త్రీకి చట్టంలో లేని హక్కు లేదు. రాజ్యాంగంలో వివక్ష లేదు. విద్యల్లో, ఉద్యోగాల్లో స్థానాలు పెంచుతున్నారు. 73 వ రాజ్యాంగ సవరణ ద్వారా 20 వేల పంచాయితీల్లో 60 వేల స్థానాలు మహిళలకు రిజర్వు చేశారు. అత్యాచారాలను అరికట్టే చట్టాలూ, శిక్షలూ చాలా వచ్చాయి. కనీస వేతన చట్టం, వ్యభిచార నిరోధచట్టం, స్త్రీకి ఆస్తిహక్కు, దత్తత హక్కులొచ్చాయి. ఇంకా ఈ రోజుల్లో స్త్రీలే మగవారిపై స్వైర విహారం చేస్తున్నారని, ఫెమినిస్టు ఉద్యమాలద్వారా తిరగబడుతున్నారనే వాదనలు విజృంభిస్తున్నాయి. కనుక అసలు స్త్రీలకు వేరే సమస్యలు ఉన్నాయా? వుంటే – వాటి స్వరూప స్వభావాలేమిటి? అనే విషయ పరిశీలన అవసరముంది.

ఈనాటి స్త్రీల సమస్యలు చాలా జటిలంగానూ, క్లిష్టంగాను వుంటున్నాయి. అనాటి సమస్యలు వేరు. నేటి సమస్యలు వేరు. ఆనాడు బాల్య వివాహాలు, బహుభార్యాత్వం, కన్యాశుల్కం, దేవదాసీ వ్యవస్థ వుండేవి. విద్యా విహీనత, అజ్ఞానం, అవిద్య, అవివేకం, రాజకీయ నిరాదరణ, విధవా విధులు, అంటరానితనం అమల్లో వుండేవి. ఈనాడు స్త్రీ వేష భాషలు, నాగరికత, ఆధునిక లక్షణాలు చూచి స్త్రీలకు వేరే సమస్యలు లేవనుకోవటం భ్రమ. ఆమె సమస్యలు వివరించాలంటే అదొక 'ఎన్‌సైక్లోపీడియా'గా తయారవుతుంది. ఆమె పుట్టుకనుండి పోయ్యేదాకా పురుషాధిపత్యం, పితృస్వామ్యం, జండర్ వివక్షల కారణాన కుటుంబంలో హింస ఆమెపై స్వైరవిహారం చేస్తోంది. కొట్టేవాళ్లు, తిట్టేవాళ్లు, పిల్లల్ని లాక్కుని వెళ్లగొట్టేవాళ్లు, మళ్లీపెళ్లాడేవాళ్లు, చిత్రహింసలు పెట్టే భర్తలు లెక్కకు మిక్కుటంగా వున్నారు. ఆమె సొంత ఆస్తిమీద, సంపాదనమీద, ఆమె తెచ్చిన కట్నం డబ్బుమీద పెత్తనం భర్తకే వుంటోంది. ఆర్థికంగా అన్నీ సమస్యలే. కుటుంబ ఆస్తిమీద ఆమెకు ఏ అధికారం వుండదు. ఎంత చదివినా భర్తకు యిష్టమైతేనే భార్య ఉద్యోగం చెయ్యాలి. అదయినా భర్త వున్న వూళ్లోనే చెయ్యాలి. భర్తకన్నా పెద్ద ఉద్యోగం చేస్తే భరించలేడు. ఆలస్యంగా ఇంటికొస్తే వల్లమాలిన అనుమానం. ఇక ఒంటరి జీవితం మహా ఘోరం. అందరూ ఆమెపై అభూతకల్పన చేస్తారు. వెర్రిగా చూస్తారు. విడాకులు పొందిన స్త్రీని

చాలా నీచంగా చూస్తారు. ఏ పురుషుడో దయతో పెళ్లాడినా ఆమెను ఒక పాపిలా చూస్తూ అనుక్షణం సాధిస్తూనే వుంటాడు. ఆమెకు పిల్లలుంటే వారి గతి మరీ ఘోరం. బాలవితంతులైనా మళ్ళీ పెళ్లాడితే ఆమె భర్త, అత్తమామలు, సమాజం ఘోషిస్తూనే వుంటాయి. ఆమెపై దయవుంచి జాలితో స్వీకరించినట్లు చులకనగా చూస్తారు. చట్టం ఇచ్చిన ఆస్తి హక్కు అడిగితే అదేదో నేరమయినట్లు 'ఎంత ధైర్యం! ఎంత ఆశ! ఎంత విఱ్ఱవీగిపోతోంది!' అంటూ అధిక్షేపిస్తారు. కాస్త నీటుగా అలంకరించుకుంటే వింతగా చూస్తూ మనిషి నడతనే శంకిస్తారు. భర్త ఎంత శాడిస్టు అయినా విడిపోకుండా సహించమంటుంది సమాజం. ఇక కుటుంబంలో జరిగే హింసలో ముఖ్యమైనది భర్త, అత్తమామల పేరాశ. కట్నంకోసం జరిగే శారీరకహింస, మానసిక హింసలూ సహించలేక జరిగే ఆత్మహత్యలు రోజుకి 2, 3 వుంటున్నాయి. భార్యవుండగా మళ్ళీ పెళ్లాడే భర్తలు తక్కువేమీకాదు. ఆడపిల్లల్ని కనే భార్యలని అదొక లోపమని తిట్టిపోసే భర్తలెందరో వున్నారు. ఇటీవల ఆరువారాలకే 'ఎమినియోసింథసిస్' ద్వారా అమ్మాయే పుడుతుందని తెలిసి గర్భస్రావాలు చేయించుకుంటున్నారు. సైన్సు ఎన్నో అద్భుతాలను సృష్టించినా – ఆడవారి సమస్యలు రూపాంతరాలు చెందాయేకాని అణగారిపోలేదు అనేది నిత్య సత్యం.

స్త్రీల సమస్యలు అనేకం. వాటిని బహు విధాలుగా అధ్యయనం చేయవచ్చు. అందులో ముఖ్యమైనవి నాలుగు పద్ధతులు. సామాజిక దశలను నిర్ధారణ చేసుకుని ఒక్కొక్క దశలోని స్త్రీల సమస్యలను పేర్కొనటం ఒక విధానం. అలాకాక సమస్యలను అన్నింటినీ చెప్పి ఒక్కొక్కదానిని వివరించటం మరొక పద్ధతి. అదీగాక సమస్యలను సామాజికం, ఆర్థికం, రాజకీయం, సాంస్కృతికం, కౌటుంబికం, లైంగికం, విద్యా విషయకం అని వర్గీకరణ చేసి ఆయా శీర్షికల క్రింద వాటిని విశ్లేషణ చేయడం మూడవది. ఇవేవీ కాక సమస్యలను మరో రకంగా వర్గీకరణ చెయ్యటం, వాటిని సాకల్యంగా వివరించటం మరొక మార్గాంతరం. ఈ పురుషాధిక్య సమాజంలో పురుషులు స్త్రీలను పలు విధాలుగా పరిగణిస్తున్నారు. వస్తువుగా చూడటం, ఆమెను బానిసగా లెక్కకట్టటం, ఆమె ద్వితీయశ్రేణి వ్యక్తి అని భావిస్తూ ఆమెతో అలా వ్యవహరించడం – మూడు రకాల ప్రవర్తనా రీతులుగా చలామణి అవుతున్నాయి. చివరి కోవకు చెందిన సాముదాయక విభజనతో స్త్రీల సమస్యలను పరిశీలించటం జరుగుతుంది.

### వస్తువుగా చూడడం:

స్త్రీజాతి మానవజాతిలో సగం. స్త్రీలుకూడా మేధస్సులో పురుషులకు తీసిపోరు. ఆలోచనాప్రేరిత జీవితాలు గడిపేవారు. విషయాలను పరిశీలించగలరు; జ్ఞాపకం ఉంచుకోగలరు. ఆలోచించగలరు; ఊహించగలరు. సృజనాశక్తి వారికీ వుంది. వారు ప్రాణమున్న జీవులు. మరి వారిని వస్తువులుగా చూడటం ఎలా సబబు అనే సందేహం పొడసూపవచ్చు. ఈ వాదనలో తర్కముంది; బలముంది. కాని, మానవ చరిత్రలో ఆమెను వస్తువుగా చూచిన దశలు, ఘట్టాలు, సమయాలు కోకొల్లలు. ఆదిమసమాజంనుండి యీనాటి వరకు ఆ హేతువ్యతిరేక చర్యలు సాగుతున్నాయి. అన్ని మత సమాజాలు అలాంటి వైఖరిని స్త్రీలయెడ ప్రదర్శించాయి. ఒక్కొక్క సమస్యను చర్చించే సందర్భంగా ఆ వైఖరిని ఉటంకించటం సమంజసం.

### ఓలి లేక కన్యాశుల్కం:

వంద సంవత్సరాల క్రితం 'అగ్రవర్ణాలలో' కన్యాశుల్కం ఉండేది. బాలిక తండ్రి కాబోయే అల్లుడివద్ద పైకం తీసుకుని ఆమెను అతనికి వివాహం చేసేవాడు. ఈ కన్యాశుల్కం వధువు తండ్రికి చెందేది. అందులో ఒక్క పైసా కూడా వధువుకు దక్కదు. ఈ పద్ధతి యీనాడు అమల్లో లేదు. కాని, కొన్ని 'శూద్ర' వర్ణాలలో, గిరిజనులలో యీనాటికీ యీ ఆచారం ప్రబలంగా వుంది. తండ్రి తీసుకునే పైకాన్ని 'ఓలి' అంటారు. ఓలి లేని పెళ్లిని పరువు తక్కువ పెళ్లిగా భావిస్తారు. ఓలి పిల్ల తండ్రికి యిస్తారు; అది అతని ఆస్తి అవుతుంది. దానిపై వధువుకు అధికారం లేదు. అయితే, ఆమె తన భర్తనుండి విడాకులు పొందాలంటే ఓలి పైకాన్ని భర్తకు చెల్లించాలి. ఆమె చెల్లించలేని స్థితిలో ఆమెను పెళ్ళాడదలుచుకునే పురుషుడు ఓలిని ప్రథమ భర్తకు యిస్తాడు. ఈ విధానాన్ని విశ్లేషణ చేస్తే స్త్రీని తండ్రి వరునికి విక్రయించాడన్న మాట. వధువును వస్తువు క్రింద జమకట్టే తీరు యిది.

### కన్యాదానం:

హిందూ వివాహాలలో తల్లిదండ్రులు వధువును వరునకు దానం చేస్తారు. ఆమె వస్తువు అయినట్లు, ఆ వస్తువును వరునికి యిచ్చినట్లు, యికనుండి ఆ వస్తువుపై సర్వాధికారాలు వరునివి అయినట్లు భావన. కన్యాదానాన్ని మహాత్మా గాంధీ కూడా నిరసించాడు. వధువు ప్రాణంవున్న మనిషి. ఆమెను వస్తువుగా పరిగణించడం తగదన్నాడు. అయినా, ఆచారం పేరుతో, వైవాహిక తంతు ఆడంబరంకోసం, విద్యావంతులయిన యువతులు సహితం యీనాడు కన్యాదానం చేయించుకునే పెళ్లాడుతున్నారు. వారికి యీ పద్ధతి ప్రాధాన్యత తెలిసి అలా చేస్తున్నారా లేక తల్లిదండ్రుల ఒత్తిడికి లోనయి అలా సంచరిస్తున్నారా అనేది మీమాంస. ఏదయినా ఆ విధానాన్ని హిందువులలో అత్యధిక సంఖ్యాకులు అనుసరిస్తున్నారు.

## భార్యలపై హింస:

ఇటీవల సమాజంలో భార్యలపై హింస పెచ్చు పెరిగిపోతున్నది. పూర్వం సంప్రదాయబలం వల్లనో, భయం వలననో వివాహిత స్త్రీలు తమ అత్తమామల, భర్తల ఆజ్ఞలను పాలించేవారు. ఆ క్రమంలో తమను తాము హింసించుకునేవారు. అసలు ఆ హింసను వారు హింసగా చూచేవారు కాదు. వారికి అది హింసగా తోచేదికాదు. కాలం మారింది. స్త్రీలలో కొంత తెలివిడి పెరిగింది. దీనిని అత్త మామలు, భర్త సహించే స్థితిలో లేరు. అందుకే భర్తలు భార్యలపై చేయి చేసుకుంటున్నారు; క్రూరమయిన బాధలకు లోను చేస్తున్నారు. ఈ సందర్భంగా ఒక అంశాన్ని ప్రస్తావించక తప్పదు. భార్యను హింసించటానికి తనకు హక్కు వున్నదని భర్త వాదిస్తాడు. భర్త భార్యను కొట్టడా, కొట్టే తప్పేముందని భార్య అంటున్నది. అంటే - భార్యను కొట్టే అధికారం భర్తకు వుందని యిరువురూ అంగీకరిస్తున్నారు. పోలీసుల వైఖరి కూడా మొత్తంమీద అలాగే వుంది; సమాజం ఆమోదిస్తున్నది. ఆమె భర్త తాలూకు వస్తువు అనే భావనే దీనికి కారణం.

## ప్రత్యర్థి పురుషుల స్త్రీలపై హింస:

ప్రపంచ సమాజంలో తగాదాలు, కొట్లాటలు, యుద్ధాలు విపరీతంగా వృద్ధి అవుతున్నాయి. మన దేశం యిందుకు మినహాయింపు కాదు. ముఠాలు, పార్టీలు, గుంపులు కొట్లాడుతూనే వున్నాయి. స్వర్థ, పగ, ద్వేషం విశేషంగా ప్రస్ఫుటమవుతున్నాయి. కసి విలయతాండవం చేస్తున్నది. ప్రత్యర్థి పురుషులపై పగ తీర్చుకునే క్రమంలో అతని తాలూకు స్త్రీలను అంటే - తల్లి, సోదరి, భార్య, కుమార్తెలను అవమానించడం, హింసించడం, మానభంగం చేయడం, హత్య చేయడం జరుగుతున్నది. శత్రు పురుషుల స్త్రీలు ఆ పురుషుల ఆస్తి అని తలపోయడం జరుగుతున్నది. ఆ స్త్రీలను చెడగొట్టే ఆ పురుషులకు నష్టం కలిగించినట్లు ఆలోచించటం జరుగుతున్నది. శత్రువుల స్త్రీలను అవమానపరిచే ప్రయత్నంలో స్త్రీలు కూడా పాల్గొనడం గమనిస్తున్నాం. అంటే - స్త్రీ పురుషులు స్త్రీని పురుషుని తాలూకు ఆస్తిగా గుర్తించి వ్యవహరిస్తున్నారు అన్నమాట. ఇండియా, పాకిస్తాన్ విడిపడ్డప్పుడు వేలమంది ముస్లిం స్త్రీలను హిందువులు, హిందూ స్త్రీలను ముస్లింలు చెరచటం, వారు గర్భాలు ధరించి పిల్లల్నికూడా కనడం చూచాం. చరిత్ర నేర్పిన ఉదాహరణలు ఇలాంటివి కోకొల్లలుగా వున్నాయి.

## పడుపు వృత్తి:

అనాది కాలం నుండి వేశ్యావృత్తి కొనసాగుతున్నది. ఇప్పటికీ అది అన్ని దేశాలలో సాగుతున్నది. ఒకనాడు హిందూ సమాజంలో వేశ్యావృత్తిని కొన్ని కులాలవారికి కేటాయించింది సంఘం. ఆ కులంలోని స్త్రీలు వివాహ మాడరాదని కట్టడి చేసింది. వారిని దేవదాసీలు, జోగినిలు బసివిలు అని పిలిచేవారు. కాలం మార్పును తెచ్చింది. దేవదాసీ వృత్తి నశించింది. కళావంతులు వివాహమాడుతున్నారు; సంసారాలు చేస్తున్నారు. అయితే, పడుపువృత్తి నశించలేదు. ఇప్పుడు అన్ని కులాలవారు ఆ వృత్తిని చేపట్టున్నారు. విటులు పైకం యిచ్చి వేశ్యల సాంగత్యాన్ని అనుభవిస్తున్నారు; వారి కామపిపాసను తీర్చుకుంటున్నారు. విటుల దృష్టిలో వేశ్యలు వస్తువులు. వస్తు విక్రయం - కొనుగోలు జరిగినట్లుగానే వేశ్యల శరీరాలను విటులు కొనుగోలు చేస్తున్నారు. సమాజపు తొలి దశల్లో ఉదయించిన భావం యీనాటికీ ఇంకా అమల్లో వుంది. స్త్రీ భోగ్య వస్తువు; పురుషునికి సుఖాన్ని కల్గించే పనిముట్టు. ఇలాంటి భావన లేకుంటే స్త్రీల శరీరాలను కొనుగోలు చేసే విధానం యీనాటికీ అమల్లో వుండేది కాదు. ఈ ప్రాచీన కాలపు అవశేషం ఈనాడు కూడా కొనసాగడం శోచనీయం.

## లైంగిక వేధింపులు, మానభంగం:

స్త్రీలను లైంగికంగా వేధించడం ఎక్కువవుతున్నది. వారి శరీరాలను తాకడం, వాటిపై ఒత్తిడి చేయటం, వారి జడలను, పైటలను లాగడం, వారు వినేటట్లు అశ్లీల పదాలను పలకడం, బూతు పాటలు పాడటం, అసహ్యకరంగా, అవమానకరమైన సైగలు చేయడం, కన్ను కొట్టడం, దుష్ప్రదర్శనలతో ఆమెను కించపరచడం, యివన్నీ లైంగిక వేధింపు క్రిందనే లెక్క. వీటికి లోనయిన స్త్రీలు సిగ్గుతో క్రుంగిపోతారు; మానసిక వ్యధకు లోనవుతారు. ఈ హింసను భరించలేక ఆత్మహత్య చేసుకున్న స్త్రీలు అనేకమంది వున్నారు. చదువులను, ఉద్యోగాలను వదులుకున్న మహిళలున్నారు. వీధి మొగం చూడడానికి జంకి, ఇళ్ళలో బందీలుగా బ్రతికే వనితలున్నారు. అసలు కొందరు పురుషులు స్త్రీలను ఎందుకు యిలా హింసిస్తున్నారు అనేది ఈనాడు ఆలోచనీయాంశమయింది. మానభంగాల కేసులు పెరుగుతున్నాయి. అమెరికాలో ప్రతి 5 సెకండ్లకు ఒక మానభంగం జరుగుతున్నట్లు లెక్కలొచ్చాయి. మన దేశ స్థితి అంత అధ్వాన్నం కాలేదు. కాని, సమస్య తీవ్ర రూపం దాలుస్తున్నది. కేవలం కామ తృప్తి కోసం యిలా నేరస్థులు వ్యవహరిస్తున్నారని భావించడానికి వీలు లేదు. స్త్రీని భోగ్య వస్తువుగా మాత్రమే చూడటం ప్రధాన ప్రేరకంగా ఉంది. పరాయి స్త్రీని మాతృ సమానంగా పరిగణించే కాలం దాటిపోతున్నది. పాత సమాజపు మంచి విలువలు నశింపు అవుతున్నాయి. క్రొత్త సమాజపు నూతన విలువలు

చోటు చేసుకోవడం లేదు. ఇది సంధికాలం. సంధికాలంలో సమాజ రుగ్మతలు వికృతరూపం దాల్చడం ఆశ్చర్యం కాదు. అయితే, వాటిని సమాజానికి పట్టిన చీడ పురుగులు లాగా యీ దురలవాట్లను, దుశ్చర్యలను గమనించడం అవసరం. ఈ మానభంగాలు స్త్రీకి శారీరకంగానే కాక మానసికంగా కూడా బాధ కలిగిస్తాయి. ఆమెలో న్యూనతా భావం ఏర్పడుతుంది. తన శరీరాన్ని తన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా పురుషుడు వాడుకోవటం ఆమె ఆత్మగౌరవానికి దెబ్బ. దాంపత్యంలో భర్త సాగించే మానభంగాలు, పరాయి పురుషుడు చేసే యిలాంటి దౌర్జన్యం – రెండూ ఒకే స్వభావం కలవి. కాగా, మొదటిది యీనాటి శాసనాల ప్రకారం నేరం కాదు; రెండవది నేరం – అంతే తేడా. లైంగిక వేధింపు విషయంగా, మానభంగంలో యిమిడివున్న అంశంగా ప్రస్ఫుటంగా కన్పించేది స్త్రీ వస్తువు. అందులో పురుషునికి సుఖప్రాప్తినిచ్చే వస్తువు అనే భావం.

## సంతానం కనే యంత్రం:

స్త్రీ పురుషుల కలయిక సంతానోత్పత్తికి దోహదం చేస్తున్నది. అయితే, అందులో ఆమె పాత్ర పెద్దది. పిల్లను తన గర్భంలో నవమాసాలు మోస్తుంది, పిండానికి ఆహారం అందిస్తుంది, పిండపు ఆరోగ్యానికి పాటుపడుతుంది, శ్రమకోర్చి ప్రసవిస్తుంది, పాలు యిచ్చి పెంచుతుంది, పోషిస్తుంది. ఈ కార్యాలలో పురుషుని ప్రమేయం లేదు; పురుషుడు శ్రమించడు. సమాజపు మనుగడకు ఆమె దోహదం చేస్తుంది. ఇంత గొప్పగా కృషి చేస్తున్న స్త్రీని అభినందించి గౌరవించకపోగా ఆమెను పురుషుడు తక్కువ చూపు చూస్తున్నాడు. కేవలం తనకు సంతానాన్ని కని యిచ్చే యంత్రంగా ఆమెను వీక్షిస్తున్నాడు. ఆమె ఎంతమంది సంతానాన్ని కనాలో, ఏ రకపు సంతానాన్ని– మగపిల్లవాడినా లేక ఆడపిల్లనా– అని నిర్ణయించేది పురుషుడు. పురుష ప్రాధాన్య సమాజంలో, పురుషాధిపత్య సమాజంలో పురుషుడు మగ పిల్లవానిని కావాలని కోరుకోవడం పరిపాటి. ఆమెకు మగపిల్లవాడు కలిగే వరకు ఆమె ఎంతమంది పిల్లలనయినా కంటూ పోవలసిందేనని ఆదేశించే భర్తలు లేకపోలేదు. తన రాజకీయ సిద్ధాంత ప్రకారం తన మతపు వారి జనాభా పెరగాలని భార్యను అధిక సంతానం పొందమని శాసించే భర్తలు కూడా వున్నారు. ఈ చర్యల వెనుక వున్న అంతరార్థం ఏమిటి? వారి దృష్టిలో స్త్రీ జీవిత సహచరి కాదు; స్నేహితురాలు అంతకన్నా కాదు. అర్ధాంగికాదు; కనీసం ప్రాణము, ఆలోచనా శక్తి కల జీవికూడా కాదు; కేవలం సంతానం కనే యంత్రం; తనకు సపర్యలు చేసే బుట్టబొమ్మ. ఇదీ మగవారి మనస్తత్వం.

## వ్యభిచార నేరం:

మత సమాజాలు వ్యభిచారాన్ని దోషంగా పేర్కొన్నాయి; నేరంగా లెక్కకట్టి శిక్షలను నిర్దేశించాయి. స్త్రీ పురుషులిద్దరిని నేరస్తులుగా నిర్ణయించాయి. భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలన వచ్చిన తరువాత వారు స్త్రీని కరుణా దృష్టితో చూచి, వ్యభిచార నేరానికి ఆమెను శిక్షాపాత్రురాలను చేయలేదు. వివాహిత స్త్రీతో వ్యభిచరించిన పర పురుషునికి మాత్రం శిక్షను అలాగే వుంచారు. అతనికి యీనాటికీ భారత శిక్షా స్మృతి సెక్షను 497 ప్రకారం 3 సం॥ జైలుశిక్ష వేయవచ్చును. ఈ మార్పు నూతనాంశాన్ని వెలికి తీసింది. పర పురుషునిపై కేసు పెట్టడానికి అర్హత ఆమె భర్తకు ఒక్కనికే వుంది. అదీ కొన్ని పరిస్థితులలోనే. భార్య వ్యభిచారాన్ని భర్త ఆమోదించినా, తెలిసి ఉపేక్షించినా అతనికి కేసు పెట్టే అర్హత పోతుంది. దీనిని బట్టి తేలిన విషయమేమంటే – భార్య శరీరం భర్తది. అతని అనుమతి లేకుండా, అతని ఉపేక్ష లేకుండా మరొక పురుషుడు ఆమె శరీరాన్ని వాడుకోరాదు. అంటే భార్య భర్త వస్తువు అనేది దీని భావం.

## బానిస:

బానిసను ప్రాణిగా, మనిషి గుర్తించటం జరుగుతుంది. బానిస శ్రమ ఫలితం యజమానికి దక్కుతుంది. బానిస యిష్టాయిష్టాలతో యజమానికి పని లేదు. యజమాని ఏ పని చెప్పినా బానిస చేయాలి. అయితే వస్తువుకు, బానిసకు కొన్ని తేడాలున్నాయి. బానిస ఆహారం తీసుకోవచ్చు. సంతానం కనవచ్చు. యజమాని చెప్పిన పని లేనప్పుడు యజమానికి నష్టం కలుగని రీతిలో బానిస తన విశ్రాంతి కాలాన్ని వినియోగించుకోవచ్చు. అతడు/ఆమె జీవించడానికి కావలసిన ఆహారాన్ని అతనికి/ఆమెకు యజమాని సమకూరుస్తాడు. అది వారిద్దరి సంబంధం; వారిద్దరి హక్కు, బాధ్యతలు. యజమాని బానిసను మరొకరికి విక్రయించవచ్చు. అతడి శ్రమను యింకొకరికి అరువుగా యివ్వవచ్చు. ఈ సూత్రాలను గమనించి స్త్రీలను పురుషులు ఎలా బానిసలుగా చూస్తున్నారో పరిశీలిద్దాం.

## బాల్యం ఎరుగని ఆడపిల్ల:

శ్రామిక కుటుంబాలలో, తక్కువ ఆదాయం కలవారిలో బాలికల స్థితి శోచనీయం. వారికి బాల్యం లేదు. ఆటపాటలతో ప్రొద్దుపుచ్చడానికి ఆమెకు అవకాశం లేదు. తల్లిదండ్రులు పొలాల్లో, కార్ఖానాలలో పనిచేయటానికి వెళ్తే చెల్లెళ్ళను తనకన్న చిన్నవారయిన తమ్ముళ్లను – పెంచడం ఆమె బాధ్యత. వంటచేయడం ఆమె విధ్యుక్త ధర్మం. చిదుగులను కంపను ఏరుకొని రావడం ఆమె విధి. ఆమెకు చదువుండదు.

ఆమె ఆరోగ్యం విషయం ఎవరూ పట్టించుకోరు. ఆమెకు సరియైన దుస్తులుండవు. పైగా, విధి నిర్వహణలో ఏమాత్రం పొరపాటు చేసినా చీవాట్లు, తిట్లు, తన్నులు ఆమెకు తప్పవు. ఆడపిల్లలను కట్టుబానిసలుగా చూడటం పరిపాటి.

## గృహిణి:

ఎంత విద్యావంతురాలయినా, ఎంత పండితురాలయినా, ఎంత ప్రతిభావంతురాలయినా స్త్రీకి యింటి పని, వంట పని తప్పదు. ఆమె వివాహిత అయినా, అవివాహిత అయినా యీ రెండు పనులు ఆమెకు కేటాయించబడినాయి. ఈ సూత్రం ఒక్క అమెరికాలో తప్ప సర్వే సర్వత్రా ప్రపంచం అంతటా అమలులో వుంది. చివరకు కమ్యూనిస్టు రాజ్యాలలో సహితం స్త్రీకి యీ శ్రమ విధ్యుక్త ధర్మమయింది. ఒక రకంగా విశ్లేషిస్తే ఆమె ఇంటికి కట్టుబడిన బానిస.

## పాతివ్రత్యం:

"కార్యేషుదాసి, కరణేషుమంత్రి, రూపేషులక్ష్మి, క్షమయాధరిత్రీ, భోజ్యేషుమాతా, శయనేషురంభా షట్కర్మ నిష్ఠా కులధర్మపత్నీ"
(పద్మ పురాణం, అధ్యాయం 47-55)

పని పాటలు చేయటంలో దాసిలాగ, ఆలోచన చేసే టప్పుడు మంత్రి వలె, రూపంలో లక్ష్మివలె, ఓర్మిలో భూమిని పోలి, భర్తకు ఆహారం పెట్టేటప్పుడు తల్లితో సమానంగా, శయనంలో రంభకు దీటుగా షట్కర్మలను చేస్తూ కులధర్మపత్ని సంచరించాలనేదే పాతివ్రత్యం. హిందూ వివాహిత స్త్రీఆదర్శం పతివ్రతాధర్మం. ఉదయాన్నే నిద్రలేచి పతివ్రతల పేర్లను "సీత, దమయంతి, మండోదరి, అహల్య, సుమతి – పంచకన్యా పఠే న్నిత్యం మహాపాప విమోచనం" అంటూ ఆమె స్మరించుకోవాలి. భర్త పనుపున అగ్నిప్రవేశం చేసిన సీత, భర్త చేత అమ్మివేయబడిన చంద్రమతి, కుష్టు వ్యాధిచే బాధపడే భర్తను వేశ్యా మందిరానికి కొనిపోయే సుమతి – వీరు ఆమెకు ఆదర్శమూర్తులు. హిందూ శాస్త్రకారులు, పురాణ గ్రంథకర్తలు పతివ్రతా ధర్మాలను విపులంగా చెప్పారు. వందల పుటలు రాశారు. ఆమెకు భర్త తోడిదే లోకమన్నారు. భర్త ఆయురారోగ్య భాగ్యాలకోసం వ్రతాలను చేయమన్నారు. భర్త వద్దంటే వ్రతాలనుకూడా ఆమె చేయకూడదన్నారు. భర్త వాక్య పరిపాలన ఆమె చేసి తీరాలన్నారు. అతనిని సుఖపెట్టటమే ఆమె కర్తవ్యమన్నారు. అతడు ఊళ్ళో లేకపోతే ఆమె అలంకార విహీనగా ఉండాలట. అతనినే స్మరిస్తూ ఆమె బ్రతకాలి. అతనికి అయిష్టమైన పనులు చేయరాదు. ఆమె అతనిని ఫలహారాదులతో సేవించాలి. శయనంలో అతనికి సుఖాన్ని అందించాలి. ఇంటిలో అందరికన్నా ముందులేచి అందరికన్నా ఆలస్యంగా శయనాగారానికి వెళ్లాలి. ఈ పద్ధతి యిప్పటికీ యించుమించుగా సాగుతున్నది. శయనం విషయంగా ఆమెకు స్వేచ్ఛ లేదు. భర్త కోరినప్పుడు ఆమె అతనికి పొందును అందివ్వాలి. తిరస్కరించడానికి అవకాశం లేదు. ఆమెకు యిష్టం లేకపోయినా అతడు ఆమెను బలవంతంగా కూడితే ఆమె ఫిర్యాదు చేయ వీలు లేదు. ఆమె అతనిపై కేసుపెట్ట వీలు లేదు. ఒకవేళ ఆమెకు సతీపతుల కలయికపై మనసు పుట్టినా అతడు ఆమె కోరికను తృణీకరిస్తే ఆమె చేయగలిగినది లేదు. పైగా, ఆమెకు 'లజ్జావిహీన' అనే బిరుదును యిచ్చి ఈసడిస్తారు తోటి స్త్రీలు కూడా. భార్య కాగానే ఆమె లైంగిక స్వేచ్ఛను కోల్పోతుంది. ఇది ఈనాడు కూడా అమలులో వున్న స్థితే. భర్త చనిపోతే ఆమె తిరిగి వివాహమాడరాదు. చనిపోయిన భర్తను తలుచుకుంటూ కాలం గడపాలి. అలంకారాలను త్యజించి, ఒంటిపూట భోజనం చేస్తూ దేహాన్ని కృశింపచేసుకుని, కఠినమైన నేలమీద శయనిస్తూ ఆమె కాలం గడపాలి.

కాలక్రమేణా కొలది మార్పులు వచ్చాయి. ఏదయినా పునర్వివాహం యీనాటికి గర్హనీయమే. 1856 లో వితంతు పునర్వివాహశాసనం వచ్చినా యీనాటికీ పెళ్లాడదలిచే వితం తువులకు మంచి సంబంధాలు దొరకడం లేదు. సమాజంలో పునర్వివాహం మీద ఏవగింపు యింకా సడలలేదు. పురుషులకు ఆ యిబ్బంది లేదు. వారు ఎన్నిసార్లు పునర్వివాహం చేసుకున్నా పరవాలేదు. స్త్రీకి ఆ హక్కు అనుభవంలోకి రాదు; రావటం లేదు. పూర్వం భర్త చనిపోతే అతని చితిమీద భార్య సహగమనం చేసేది. సతీసహగమనాన్ని మొగలు పాదుషా నిషేధించినా, ఆంగ్లేయులు 1829 లో శాసనం తెచ్చినా, 1987 లో రాజస్థాన్‌లో సతి పేరుతో 'రూప్ కన్వర్'ని సజీవంగా చితికెక్కించి చంపారు. భర్త లేని స్త్రీకి ఆస్తిలో వాటా నిరాకరించడానికి ఇది (సతి) ఒక ఎత్తుగడ కావచ్చు. అందుకోసమే సతీసహగమనం నిషేధ శాసనాన్ని పటిష్టం చేశారు. అయినా, కొన్ని ప్రాంతాలలో – ముఖ్యంగా క్షత్రియులలో ఈ దురాచారానికి గౌరవం తగ్గలేదు. పాతివ్రత్యం పేరుతో హిందూ సమాజం వివాహిత స్త్రీని బానిసగా చేసింది.

## స్త్రీ సంపాదన, ఆస్తి:

ఏదో మధ్యతరగతిలో తప్ప శ్రామిక స్త్రీలు అనాది నుండి శ్రమిస్తూ సంపాదిస్తూనే వున్నారు. ఇటీవల మధ్యతరగతి స్త్రీలు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. నెలసరి ఆదాయాన్ని పొందుతూనే వున్నారు. అయితే, స్త్రీల సంపాదనపై వారికి అధికారం లేదు. దానిని వారు పతిదేవులకు లెక్కచెప్పి ఒప్పచెప్పాలి. వారి సమ్మతి లేకుండా వీరు ఒక్క రూపాయి కూడా ఖర్చు చేయజాలరు. ఆఖరికి ఆమె తన బిడ్డలకు

యిచ్చినా భర్తల అనుమతి ఉండాలి. వారి సంపాదనతో కొనుగోలు చేయబడిన ఆస్తులు భర్తల పేరుమీద ఉండాలి. అథవా వారిపేరుమీదవున్నా వాటిపై యాజమాన్యం భర్తలదే. పేరుకు భార్యలు వాటి స్వంతదారులు. వాటి ఆదాయం భర్తలదే. ఇది సమాజంలో, దరహంమీద నెలకొనివున్న స్థితి. బానిస శ్రమ, శ్రమ ఫలితం యజమానికి దక్కినట్లే స్త్రీల శ్రమ, వేతనాలు, ఆస్తి అన్నీ భర్తలవే.

## ఇష్టాయిష్టాలు చెల్లని వ్యక్తి:

ఆమె కాబోయే భర్తను గురించి ఆలోచిస్తుంది; ఊహా లోకంలో విహరిస్తుంది. కలలు కంటుంది. చిన్నప్పటినుండి తల్లిదండ్రులు నూరిపోసిన విధంగా వివాహమే తన జీవిత గమ్యమని తలచి రాజీ పడుతుంది. అయితే, వరుని ఎంపికలో ఆమె ప్రమేయం బహు స్వల్పం. ఆమె యిష్టాయిష్టాలకు విలువలేదు. తల్లిదండ్రులు తెచ్చిన సంబంధాన్ని తనకు నచ్చినా నచ్చకపోయినా తలవంచి పెళ్లాడటం ఆమెకు తప్పనిసరి. ఈ ఆచారాన్ని తిరస్కరించే స్త్రీలు కొద్దిమంది కన్పించవచ్చు కాని, మొత్తంమీద స్త్రీలకు వరుని ఎంపిక విషయంలో స్వాతంత్ర్యం లేదు. బాల్యవివాహ శాసనం అమలులోవున్నా, బాల్య వివాహం చేయడం నేరంగా చట్టాలు నిర్దేశించినా యింకా హిందువులలో కొన్ని కులాలవారిలోనూ ముస్లింలలోనూ 18 సం॥ నిండక మునుపే బాలికలకు వివాహాలు చేస్తున్నారు. ఆ వివాహాలు చెల్లవని శాసనాలు ప్రకటించకపోవడంతో యుక్తవయస్సు వచ్చేలోగా బాలికలు వివాహితలవుతున్నారు. ఇక వారు ఫలాని వరునితో వివాహం తనకు యిష్టం లేదని చెప్పగల స్థితి లేనే లేదు. 18 సంవత్సరాలు నిండినా, 25, 26 సంవత్సరాల వయస్సు వచ్చినా సంప్రదాయ బలిమిని యువతులు అధిగమించడానికి ఉద్యుక్తులవటం లేదు. అంతేకాదు; తమ ఎంపిక మీదకన్నా తమ తల్లిదండ్రుల ఎంపిక మీద వారికి విశ్వాసం పెరుగుతుంది. పంజరంలో చిరకాలం వున్న చిలుకకు పంజరం తెరిచి వుంచినా ఎగిరిపోలేని స్థితి మాదిరి యువతులుకూడా స్వాతంత్ర్యాన్ని అభిలషించి పొందగల స్థితిలో లేరు. బానిస భద్రతను కోరుతుంది – స్వేచ్ఛను కోరదు. కారణం – స్వేచ్ఛ అంటే తెలియక పోవటమే. స్వేచ్ఛ అంటే భయపడటమే. స్వేచ్ఛగా సంచరిస్తే తమ చర్యలకు తాము బాధ్యత వహించాలి. బానిసలు బాధ్యతను వహించలేరు. అందుకే బానిసలు స్వేచ్ఛను తిరస్కరించి భద్రతను కోరుకుంటారు. భారతదేశ స్త్రీలు అదే స్థితిలో – అంటే బానిస మనస్తత్వంలోనే వున్నారు.

## వోటు హక్కు:

1946 నుండి అక్షరాస్యులయిన స్త్రీలకు వోటు హక్కు వచ్చింది. 1950 నుండి వయోజన స్త్రీలు వోట్లను పొందగలిగారు. అయితే, 1971 లో తప్ప ఏనాడూ వారు తమ స్వబుద్ధిని ఉపయోగించి స్వేచ్ఛగా వోటు చేయలేదు. భర్తలు, తండ్రులు, సోదరులు, తాతలు చెప్పినట్లుగానే తమ వోటు హక్కును వాడారు. నిజానికి వారి వోట్లు వారివి కావు. వారి తాలూకు పురుషునికి రెండు వోట్లు యిచ్చినట్లయింది. స్వరాజ్యం వచ్చి 48 సంవత్సరాలు అయినా, రాజ్యాంగం అమలులోకి వచ్చి 45 సంవత్సరాలు నిండినా సమాజం పెద్దగా మారకపోవటానికి కారణం బాధితులయిన స్త్రీలు తమ వోటును హక్కుగా, సక్రమంగా వినియోగించక పోవటమే. స్త్రీల వోట్లు వారి యజమానులైన పురుషులవి. స్త్రీలలో బానిస భావం అంతరించి పోలేదు.

## సామాజిక వ్యవహారాలలో జోక్యం:

అన్ని మతాలకు చెందిన స్త్రీలు, అన్ని తెగలకు చెందిన స్త్రీలు సామాజిక వ్యవహారాలకు దూరంగా వుంచబడు తున్నారనేది సత్యదూరం కాదు. ఒక స్త్రీ ప్రధానమంత్రి, లేక మంత్రి, లేక న్యాయమూర్తి, లేక అధికారి అయినంత మాత్రాన సమాజ స్వరూపం మారలేదు. మనది సంప్రదాయ సమాజం. ఇప్పటికీ చాలా తగాదాలు, సమస్యలు గ్రామాల్లో రచ్చబండలవద్ద, పట్టణాలలోని బస్తీలలో పరిష్కారమవుతూ వుంటాయి. ఆ పంచాయితీలలోకి స్త్రీలకు ప్రవేశం లేదు. చివరకు స్త్రీయే నిందితురాలిగా వున్న సందర్భాలలో కూడా పంచయితీదార్లు, తీర్పు చెప్పే పెద్దలు స్త్రీలను సభలలోకి రానీయరు. 'స్త్రీలకు ఇక్కడ ఏం పని?' అని స్త్రీలను అదిలించి నెట్టివేస్తారు పురుషపుంగవులు. పూర్వం గ్రీకు రిపబ్లిక్కులలో బానిసలకు, స్త్రీలకు చోటు వుండేది కాదు. భారతదేశ గణ రాజ్యాలలో కూడా అదే స్థితి నెలకొని వుండేది. ఇప్పటికీ అదే ఆనవాయితీ వస్తున్నది. బానిసత్వాన్ని శాసనరీత్యా పారద్రోలాం కాని, సామాజికంగా స్త్రీలు బానిసత్వ దశలోనే వున్నందున వారు సామాజిక వ్యవహారాలలో జోక్యం కల్గించుకోగల తాహతు లేకుండా వున్నారు. స్త్రీ ద్వితీయశ్రేణి వ్యక్తి; భారతదేశం యొక్క విశిష్టత ఏమంటే – అన్ని పూర్వ సమాజాల సంస్కృతి ఛాయలు యీనాటికీ కన్పిస్తున్నాయి. ఒకనాటి సమాజం స్త్రీని వస్తువుగా చూడటం ఆరంభిస్తే, మరియొక కాలపు సమాజం ఆమెను బానిసగా పరిగణిస్తే, యింకొక దశలో సమాజం ఆమెను ద్వితీయ శ్రేణి వ్యక్తిగా లెక్కగడితే పైచెప్పిన అన్ని రకాల వైఖరులు యీనాడు ప్రదర్శితమవుతున్నాయి. పురుషులతో సమానస్తులుగా స్త్రీలు వ్యవహరించిన సందర్భాలు లేకపోలేదు. అంటే, ఏకకాలంలో

యీనాడు ఆమెను వస్తువుగా, బానిసగా, ద్వితీయశ్రేణి వ్యక్తిగా, సమానస్తురాలిగా చూడటం గమనించగలము. స్త్రీ పురుషులు సమానులే కాని, పురుషులు అధికులు అనే ముస్లిం ధర్మశాస్త్రం, భర్త ఆజ్ఞలను పాలించగలను అని ప్రమాణం చేయించే క్రైస్తవ ఆచారం, పాతివ్రత్యం పేరుతో భర్త మాత్రమే తన దేవుడని స్త్రీని నమ్మించే హిందూ పురాణగ్రంథాలు పురుషాధిక్యతను సిద్ధాంతీకరించటమే కాక పురుషుల పెత్తందారీతనాన్ని గట్టి చేస్తున్నాయి. స్త్రీ పురుషులు సమానులే కాని స్త్రీలు గృహిణులుగా గొప్పవారు, శిశుపోషణ వారి నైజానికి తగినది అని వారిని పొగిడినట్లు కన్పడి స్త్రీలను పురుషులకంటే ద్వితీయశ్రేణి వ్యక్తులుగానే ఉంచడం నేటి సమాజపు లక్షణం. ఈ లక్షణం ఏయే సందర్భాలలో ఎలా వ్యక్తీకరించబడుతున్నదో పరిశీలించటం అవసరం.

## గుర్తింపు:

స్త్రీకి వ్యక్తిగా గుర్తింపు లేదు. ఫలానివారి కుమార్తెగా, ఫలానివారి భార్యగా మాత్రమే ఆమెకు గుర్తింపు. అలాకాక పురుషునికి ఫలానా పురుషుని కుమారుడుగా గుర్తింపు వుంటున్నది. సామాజిక వ్యవహారాలలోకాని, రాజకీయ వ్యవహారాలలోగాని స్త్రీ అనగానే భర్త పేరు రాయాలని అంటారు. ఎందుకని? ఆమె వివాహం ఆమె వ్యక్తిగత విషయం. దానితో ఏమి ప్రసక్తి వచ్చింది? పురుషుని విషయంలో భార్య పేరు ఉటంకించటం లేదే! అంటే, ఇది పితృస్వామ్య సమాజం కనుక, పురుషుల ద్వారా ఎక్కువగా ఆస్తి సంక్రమణ జరుగుతూ వచ్చింది కనుక, పురుషులే శాసనాలను నిబంధనలను తయారు చేశారు కనుక యిలాంటి వ్యవహార సరళి అమలులోకి వచ్చింది. అంతేకాదు – వివాహం కాగానే తమ పేరు చివర భర్త పేరు తగిలించుకోవడం, భర్త యింటి పేరును తన యింటి పేరుగా వాడటం రివాజుగా చలామణీ అవుతున్నది. తమ పేరుతో వ్యవహరించాలని, తమ పుట్టింటి పేరును తను యింటిపేరుగా వాడుకోవాలని నేటి స్త్రీలు కోరుతున్నారు. అప్పటికిగాని వారికి సమానత్వం లభించదు.

## వివాహం, దాంపత్యం :

వివాహం స్త్రీకి తప్పనిసరి సంస్కారం అనే అభిప్రాయం ప్రజలలో బలంగా వుంది. అవివాహిత స్త్రీని చులకనగా చూడటం ఆ భావ ఫలితమే. అవివాహిత పురుషుని ఎవరూ హేళన చేయరు; న్యూనతగా చూడరు. కాని, స్త్రీ విషయంలో సమాన వైఖరి ప్రదర్శితం అవటం లేదు. ఈనాడు వరకట్నం స్త్రీల పాలిట శత్రుచిహ్నంగా తయారయింది. విద్యావతి అయిన స్త్రీ, ప్రతిభా వ్యుత్పత్తులు కల మహిళ, ఉద్యోగిని అయిన వనిత, ఆస్తివంతురాలయిన అతివ అందరూ వరకట్నం వరునికో లేక అతని తల్లిదండ్రులకో చెల్లించి వివాహమాడవలసిన దుస్థితి సంభవించింది. పైకం చెల్లించి కొనుగోలు చేసిన పురుషునికి ఆమె బానిసగానో, అణగిమణిగి వుండే జీవిగానో తయారవవలసిరావడం యీ శోచనీయ పరిస్థితి లక్షణం. ఆడపిల్లను కన్నందుకు అల్లుడు వేసే జరిమానా వరకట్నం అని మనం నిర్వచించవచ్చు. త్రాసులో పురుషునితో స్త్రీ సమతూకంలో ఉండక తక్కువ బరువుతో వుంటున్నది కనుక ఇద్దరిని సమానం చేయడానికి వేసే బరువు వరకట్నం అని మరొకరి వాఖ్య. ఏదైనా వరకట్నపు చెల్లింపును స్త్రీని అవమానపరిచే విధంగా చూడటం పొరపాటు కాదు.

వివాహం కాగానే స్త్రీ తన భర్తతో కాపురముండటానికి అత్తమామల యింటికి వెళ్లడం అన్ని మతాల వారి సాంప్రదాయం. పురుషుడు తన భార్య పుట్టింటికి పోడు. ఇల్లరికం అవమానకరమనే అభిప్రాయం చాలామందికి వుంది. అందుకే భారవి అనే కవిని అత్తవారింట్లో వుండమని అదొక శిక్ష క్రింద శాసించాడు తండ్రి. స్త్రీ తనవారినందరిని వదిలి క్రొత్తవారిమధ్య కాపురముండటానికి వెళ్తుంది. ఆడబిడ్డల ఆరళ్లకు, అత్తమామల ఒత్తిళ్లకు ఆమె లోనవుతుంది. పురుషునికి యిలాంటి బాధ లేదు. ఆనాడు ఈనాడు కూడా దాంపత్యంలో స్త్రీది క్రింది చేయి అని చెప్పడం సత్యదూరం కాదు. భర్త యిష్టాయిష్టాలను గమనించి ఆమె ఒద్దికగా నడుచుకోకపోతే ఆమె జీవితం దుఃఖభాజనమవుతుంది. భర్త హింసను, దౌష్ట్యాన్ని, దుర్మార్గాన్ని సహించలేక భార్య విడాకులు తీసుకుంటే – విడాకులు పొందిన స్త్రీని సమాజం ఎంతో చిన్నచూపు చూస్తున్నది. పోనీ, పునర్వివాహం చేసుకుందామంటే విడాకులు పొందిన స్త్రీని వివాహమాడడానికి చాలా కొద్దిమంది పురుషులు మాత్రమే ముందుకు వస్తారు. అవివాహితను, విడాకులు పొందిన స్త్రీని ఆకతాయి పురుషులు అందరి ఆస్తిగా భావించి ఆమెను కష్టనష్టాల పాలుచేస్తున్నారు. స్త్రీ సర్వదా రక్షిత అనే భావం పురుష ప్రపంచంలో పాదు చేసుకున్నది. కన్యగా వున్నపుడు తండ్రి, వివాహమాడగానే భర్త, వృద్ధాప్యంలో కుమారుడు ఆమెకు రక్షకులని – ఆమె స్వాతంత్ర్యానికి అనర్హురాలని చెప్పే మనువు సూక్తి యీనాడు చాలామంది స్త్రీ పురుషుల ఆదరణకు నోచుకుంది.

## సంతానం – మగ సంతానం:

సంతానం లేని స్త్రీని 'గొడ్రాలు' అని పేరుపెట్టి నీచంగా చూస్తుంది సమాజం. ఆమె ముఖం చూస్తే పంచ మహా పాతకాలు చుట్టుకుంటాయనే ప్రచారం సాగుతున్నది. సంతానం కలుగకపోవటానికి లోపం స్త్రీ పురుషు లిద్దరిలో

ఎవరిదైనా కావచ్చును. భార్యనే సర్వదా నిందించడం అసమంజసం. మరో అంశం గమనార్హం. ఆడపిల్లలను కన్న భార్యను భర్త విడనాడిన సందర్భాలు లేకపోలేదు. నిజానికి ఆడపిల్ల కలుగటానికి భార్య బాధ్యత లేదు. స్త్రీ పురుషుల శుక్ల శోణితాల కలయికవల్ల సంతానం ఉద్భవిస్తుంది. పురుషుని శుక్లంలోని ఎక్స్, వై ల విశిష్టతవల్ల పురుష సంతానం లేక స్త్రీ సంతానం కలుగుతుంది. ఈ విషయాలు తెలిసిన రోజుల్లో కూడా ఆడపిల్లలనుకన్న తల్లిని హీనదృష్టితో పరికించడం అవివేకం. అయినా, ఆ దురభిప్రాయం ప్రబలంగా వుంది. స్త్రీలు దానివల్ల బాధలకు, వ్యధలకు లోనవుతున్నారు. అసలు సంతానం కనటమే వివాహ ధ్యేయం కాదు. దాంపత్యజీవితంలో పరస్పర అభిమానం, సాహచర్యం, ప్రేమ, గౌరవం ముఖ్యం. వీటిని మరచిపోయి అప్రధాన విషయానికి ప్రాముఖ్యత యివ్వడంవల్ల స్త్రీలు అష్టకష్టాలు పడుతున్నారు.

## స్త్రీల అనర్హతలు; ఇబ్బందులు:

సమాజంలోను, శాసనాల ఫలితంగాను స్త్రీలు పెక్కు అనర్హతలను అనుభవిస్తున్నారు. తన సంతానానికి ఆమె భర్త బ్రతికి వుండగా ఆమె సంరక్షకురాలు కాదు. కోర్టు నియమిస్తే తప్ప ముస్లిం స్త్రీ ఎప్పుడూ ఏ పరిస్థితిలోనూ సంరక్షకురాలు కానేరదు. అవివాహిత, వితంతువు, విడాకులు పొందిన స్త్రీ మాత్రమే తనకు మగపిల్లవానిని లేక ఆడపిల్లను దత్తు చేసుకోవచ్చును. వివాహిత తన భర్త సమ్మతితోకూడ దత్తు చేసుకోరాదు. ఆస్తి హక్కు విషయంలో స్త్రీ ఎంతో నష్టానికి గురి అవుతున్నది. హిందువులలో సమష్టి కుటుంబాలలో కుమారులకు జన్మతః హక్కు వుంటున్నందున (ఆంధ్రప్రదేశ్ లో కుమార్తెలకు కూడా అలాంటి హక్కు వున్నది) భర్త సమష్టి కుటుంబ ఆస్తిలో ఆమె వాటా చాల తగ్గిపోయింది. తన కుమారులతో (ఆంధ్ర ప్రదేశ్ లో కుమారులతో కుమార్తెలతో) ఆమె భర్త చనిపోయిన రోజున సమానంగా పంచుకున్నట్లుగా ఎంచుకుని అలా వచ్చిన భర్త వాటాను ఆమె కుమారులతో, కుమార్తెలతో, తన భర్త తల్లితో సమానంగా పంచుకుంటుంది. ముస్లిం సమాజంలోని సున్నీలలో – ఆమెకు భర్త ఆస్తిలో ఆరవ వంతు వస్తున్నది. క్రైస్తవ సమాజంలో భర్త ఆస్తిని ఆమె తన సంతానంతో కొద్దిపాటి సవరణలతో సమానంగా పంచుకుంటుంది. ప్రపంచంలోని ఇతర సభ్య దేశాలలో సమష్టి కుటుంబాస్తి లేదు. భార్యకు సగం వాటా యిచ్చి మిగతా సగం ఆస్తిని భర్త సంతానం పంచుకుంటారు. ఇది మౌలికమయిన తేడా. భర్తతోపాటు కష్ట సుఖాలను అనుభవించిన భార్యను భారతదేశ సమాజం, శాసనాలు ఘోరంగా నిరాదరణ చేస్తున్నాయి. తండ్రికి ఉత్తరక్రియలు చేయటానికి కుమారుడే అర్హుడు. కుమార్తెకు తండ్రి దహన సంస్కారాన్ని, శ్రాద్ధాదులను నిర్వహించే హక్కు లేదు. వేదకాలంలో అలాంటి హక్కు ఆమెకు వుండేది. తర్వాత అది పోయింది.

## శాసనాలు, వివక్ష:

భారతదేశంలో అనేక మతాలవారున్నారు. హైందవం, ఇస్లాం, క్రైస్తవం, జొరాస్ట్రియను (పార్సీ), యూదు ముఖ్యమైన మతాలు. యూదుల సంఖ్య బహు స్వల్పం. మొదట నాలుగు మతాలకు చెందిన వారికి వేరు వేరు మతధర్మశాసనాలు (Personal Laws) ఉన్నాయి. ఇది మన దేశ ప్రత్యేకత. వీటిలో తేడాలు అనేకం. అన్ని మత సమాజాలు, మతధర్మ శాసనాలు స్త్రీలకు అన్యాయం చేస్తున్నాయి. వీటి ఉనికిని 'సమానత్వం వైపు' అనే స్త్రీల హోదా కమిటీ నివేదిక (1974) నిరసించింది. దేశానికి ఒకే ఒక వ్యవహార సంహిత కావాలని కోరింది. హిందూ మత ధర్మ శాసనం తతిమ్మా వాటికన్న కొంత మెరుగుగా వున్నా – దానిలోనూ లోపాలు లేకపోలేదు. భార్యకాని, భర్తకాని, తమంత తాముగా హక్కుగా విడాకులు పొందటానికి లేదు. కారణాలను పేర్కొనాలి. ఉదాహరణకు వివాహ రథం కుంటుపడిందని న్యాయస్థానం అభిప్రాయపడినా విడాకులను మంజూరు చెయలేదు. ముస్లిం లా ప్రకారం పురుషుడు ఏక కాలంలో మూడుసార్లు 'తలాక్' అని భార్యకు ఏక పక్షంగా విడాకులు యివ్వవచ్చును. 1939 ముస్లిం వివాహ రద్దు శాసనం ప్రకారం మాత్రమే ఆమె దావా వేసి విడాకులు పొందగలదు. అందులోనూ కారణాలు సమగ్రంగా, న్యాయంగా లేవు. ఇక క్రైస్తవ శాసనం 1872 నాటిది. అది స్త్రీలకు ఘోరంగా అన్యాయం చేస్తున్నది. క్రైస్తవ స్త్రీ రెండు కారణాలను పేర్కొని రుజువు చేస్తే తప్ప (ఉదాహరణకు భర్త వ్యభిచారం + క్రూర హింస లేక భర్త వ్యభిచారం + మరో వివాహం, యిలా) ఆమెకు విడాకులు రావు. ఇది ఆటవిక న్యాయం. మత ధర్మ శాసనాల ఉనికియే ఈ వివక్షకు కారణభూతం. ప్రతి మత ధర్మ శాసనంలో స్త్రీయెడ వివక్ష కొనసాగుతున్నది.

## వంధ్యాకరణ ఆపరేషన్లు; గర్భస్రావపు హక్కు:

కుటుంబ నియంత్రణ, జన్మనిగ్రహ సాధనాలు, గర్భస్రావపు హక్కు స్త్రీలోకానికి విముక్తి కలిగించాయి. ఆమె సర్వదా సంతానం కనే యంత్రంగా వుండకుండా ఆమెకు సహాయం చేస్తున్నాయి. అయితే, ఆమె వంధ్యాకరణ ఆపరేషనుకు హక్కుదారు అయినా సంప్రదాయంలో పెరిగిన వైద్యులు, దానిలో విశ్వాసం వున్న శస్త్ర చికిత్సానిపుణులు స్త్రీలను నిరుత్సాహపరుస్తున్నారు. భర్త సమ్మతి తెమ్మని

ఒత్తిడి చేస్తున్నారు. స్త్రీకి గర్భస్రావపు హక్కును 1971 నాటి 'వైద్యశాస్త్రం రీత్యా గర్భవిచ్ఛిత్తి శాసనం' ఆమెకు యిచ్చింది. అయినా, భర్త అనుమతి అవసరమని వైద్యులు ఆమెపై ఒత్తిడి తెస్తున్నారు. పై అధికారులు చూసీ చూడనట్లు వూరుకుంటున్నారు. శాసనాలు స్త్రీలకు అనుకూలంగా వున్నా సంప్రదాయ సమాజం, దాన్ని అనుకరించేవారు స్త్రీలను యీ రీతిగా బాధిస్తున్నారు.

## సర్వే సర్వత్రా స్త్రీయెడ వివక్ష

కుటుంబంలో పిల్లల చదువు విషయం వస్తే విద్యలో ప్రావీణ్యతను, ప్రతిభను చూపుతున్న కూతురి విద్యను వెనుకకు నెట్టి - పరీక్షలలో తప్పుతున్న లేక తక్కువ మార్కులు వస్తున్న కుమారునికి విద్య చెప్పించటానికి తల్లిదండ్రులు సిద్ధపడుతున్నారు. వివాహిత స్త్రీని ఉద్యోగం చెయ్యనివ్వరు కొందరు భర్తలు. చేయనిచ్చినా తనకన్నా ఎక్కువ ఉద్యోగాన్ని లేక ఎక్కువ వరుమానంవచ్చే ఉద్యోగాన్ని చేయనివ్వరు మరికొందరు. అంతేకాదు - ఆమెకు మరోచోట పెద్ద ఉద్యోగమున్నా ఆమెను దానికి రాజీనామా చేసి తాము నివసించే ప్రదేశంలో తక్కువ ఉద్యోగంలో పనిచేయమంటారు పతిదేవులు. పిల్లలను పెంచాలనే సాకుతో ఉద్యోగాన్ని భార్యను వదులుకోమంటారు యితరులు. ఉద్యోగం చేస్తూ కష్టపడుతున్నదని గ్రహించక ఆమెకు యింటిపని, పిల్లల పెంపకం పూర్తిగా అప్పజెప్పి ఆమెను బాధపెట్టే భర్తలు లెక్కకు మిక్కుటంగా లేకపోలేదు.

## సమానస్తురాలు:

శాసనాలు, రాజ్యాంగం స్త్రీ పురుషుల సమానత్వాన్ని చాటుతున్నాయి. అయితే రాజ్యాంగం 1950 లో అమలులోకి రాకముందు వున్న శాసనాలలో స్త్రీలయెడ వివక్ష వుంది. వాటిని పునః పరిశీలన చేసి వాటిని మార్చటానికి ప్రభుత్వాలు పూనుకోవటం లేదు. అందువల్ల లోపభూయిష్టమయిన, దుష్టమయిన ఆ శాసనాలు యింకా చలామణీలో వున్నాయి. వాటిని న్యాయ స్థానంలో ఎవరయినా వ్యయ ప్రయాసలకు ఓర్చి సవాలు చేస్తే తప్ప, ఉన్నత న్యాయస్థానం అయిన సుప్రీంకోర్టు తీర్పు చెప్పితే తప్ప అవి చెల్లకుండా పోవు. ఈ పరిస్థితివల్ల అన్యాయాలకు మనుగడ కలుగుతున్నది.

వోటు, రాజకీయ పదవులు, సమానమైన పనికి సమాన వేతనం - వీటి విషయంగా సమానత్వం యివ్వబడింది. అయితే, సమానమైన పనికి సమాన వేతనం అనేది ప్రభుత్వ సంస్థలకు, ప్రభుత్వంచే నడుపబడే సంస్థలకు, స్థానిక సంస్థలకు మాత్రమే వర్తిస్తున్నది. కనుక, స్త్రీలు అనేక యిక్కట్లకు గురి అవుతున్నారు. ఇటీవల ప్రభుత్వం చేసే సహాయాలు - ఇళ్లస్థలాలు, పొలాలు, ఇళ్లు, అప్పులు, ప్రోత్సాహక ధన సహాయాలు (Subsidies) వీటి విషయంలో కూడా స్త్రీ పురుష సమానత్వాన్ని ప్రతిపాదించారు. అయితే, శాసనాల తీరు వేరు. అవి పనిచేసే తీరు వేరు. శాసనాలు సమ్మతంగా, సమంజసంగా వున్నా - ఉద్యోగాలలో తోటి పురుష ఉద్యోగుల నిరసన, ఈసడింపు ఉద్యోగినులకు పుష్కలంగా లభిస్తున్నాయి. ఉద్యోగాల్లో చేర్చుకోవటంలో, శిక్షణలో, బాధ్యత కల పదవులు యివ్వటంలో, పై పదవులకు ఎంపిక చేయటంలో అన్నింటా వివక్ష విలయతాండవం చేస్తున్నది. స్త్రీలను ఉన్నతశ్రేణి అధికారులుగా, వ్యాపార పారిశ్రామిక పరిపాల సంస్థలకు అధిపతులుగా నియమించటం లేదు. స్త్రీలకు వ్యతిరేకంగా వివక్ష కొనసాగుతున్నది.

రాజకీయాల విషయంలో స్త్రీల ప్రాతినిధ్యం అత్యల్పం అనక తప్పదు. రాజకీయ పార్టీలలో, శాసన సభలలో, స్థానిక సంస్థలలో, పార్లమెంటులో, మంత్రిమండలులలో స్త్రీల ప్రాతినిధ్యం బహు స్వల్పం; నామమాత్రం. మంత్రి పదవులలో అప్రధానమయిన వాటిని స్త్రీలకు కేటాయిస్తారు. ఈ 48 ఏళ్ల స్వాతంత్ర్యానంతరం 544 పార్లమెంటు సీట్లలో స్త్రీల భాగస్వామ్యం కేవలం 40 మందికి మించలేదు. అలాగే ఆంధ్ర అసెంబ్లీ 294 సీట్లలో 11 మంది స్త్రీలున్నారనేది గమనార్హం. ఈ పద్ధతులు, ఈ తీరు స్త్రీలకు మనస్తాపాన్ని కలిగిస్తున్నాయి.

సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం, కవిత్వం, సినిమాలు, నాటకాల లాంటి సాంస్కృతిక రంగంలోకూడా స్త్రీలయెడ న్యూనతాభావం ఎంతో చోటు చేసుకున్నది. కళా రంగంలో ప్రవేశించే స్త్రీలను వీలయితే ఆయా వృత్తులనుండి నెట్టివేయాలనే దృక్పథం కొట్టవచ్చినట్లు కన్పడుతున్నది. ఇవన్నీ స్త్రీలు సర్వరంగాలలో ప్రతిభావంతంగా భాసిల్లటానికి ప్రతిబంధకాలు. ముఖ్యంగా చెప్పాలంటే స్త్రీల అణచివేత, త్రోసివేత, నిరాదరణలవల్ల మనమెంతో నష్టపోతున్నాం. ఎందరో మేధావులను, సైంటిస్టులను, పరిపాలనాదక్షులను, లలితకళా దురంధరులను, సాహితీవేత్తలను పోగొట్టుకుంటున్నామనేది నిత్యసత్యం. శాసనాల అమలు ఫలితాలు స్త్రీలకు అందడం లేదు. అసలు వాటిని ఎలా అమలు చేయించుకోవాలో స్త్రీలకు తెలియదు. అమలు చేయించే ప్రయత్నాలకు మహిళలు పూనుకున్నా ప్రతిబంధకాలు అనేకం.

పితృస్వామ్య సమాజంలోని పురుషాధిక్యతా భావం మగవారి పెత్తందారీ మనస్తత్వం, అసలు సమాజంలోని జమీందారీ పెట్టుబడీదారీ పద్ధతుల భావజాలాలు, మత సమాజాల దౌష్ట్యం, సంప్రదాయబలిమి, యివన్నీ స్త్రీలను తమ హక్కులను అనుభవించకుండా చేస్తున్నాయి. అయితే, మనం ఆ భావాన్ని కొంత మార్చి ఇలా చెప్పుకోవచ్చు:

దేవతలుగా చూస్తున్నామంటూ బానిసలుగా చూస్తారిక్కడ స్త్రీలను. ఇక్కడ మనం గుర్తుంచుకోవాల్సిన విషయం మరొకటి వుంది – ఏ తల్లి ఒడిలోనుండి పెరుగుతూ వచ్చారో, ఏ తల్లి భావాలతో పెరిగి పెద్దవాళ్ళవుతారో ఆ తల్లుల్ని అజ్ఞానంలో, అవమానంలో వుంచడంవల్ల ఆ నష్టం కేవలం ఆ తల్లులకే పరిమితం కాదు – మొత్తం సమాజం అంతా దానివల్ల నష్టపోతున్నదనేది నగ్నసత్యం.

అమ్మాయి పుట్టింది మొదలు అన్నీ సమస్యలే. అసలు సమస్యలు అనేవి కేవలం ఆడవాళ్లకో, మగవాళ్లకో మాత్రం పరిమితమైనవి కావు. ఒక ప్రత్యేకమయిన దేశానికో, కాలానికో పరిమితమైనవి అంతకన్నా కావు. వివేకం, విజ్ఞానం కలవాళ్లు ఆ సమస్యల్ని ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ, పరిష్కరించుకోగలుగుతారు. కాని, అనేక కారణాలవల్ల స్త్రీల సమస్యలు చాలా సున్నితమైనవి; పరిష్కరించుకోవటానికి చాలా క్లిష్టమైనవిగాను, చిక్కుపడిన దారపు ముడిలా వుంటాయి. ఆ చిక్కుల ముడి విప్పటానికి ఎంతో మెలకువ, నేర్పూ వుండాలి. అంతేకాదు – అసలు స్త్రీలకు సమస్యలే లేనట్లు పైకి కనపడుతూ అవి అంతర్వాహినిలా, నిగూఢంగా వుంటాయి. అందుకే తమ దాస్యానికి తామే ముగ్ధులై "మాకేం, మేము సర్వసౌఖ్యాలు అనుభవిస్తున్నాంగదా" అని అంటున్నారు అజ్ఞానులైన గృహిణులు. తరతరాలుగా ఈ భావదాస్యానికి, పురుషాధిపత్యానికి అలవాటుపడ్డ మహిళలు తమకేమి కావాలో, తామేమి చెయ్యాలో తెలియని అజ్ఞానదశలో పడి కొట్టుమిట్టాడుతున్నారు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో రెండవ తరగతి పౌరులుగా చలామణీ అవుతున్నారు. అయినా, అది న్యాయమేనని, పురుషులు అధికులేనని నమ్ముతున్నారు నాటి స్త్రీలు; నేటి స్త్రీలు కూడా. ఇది అనాటినుండి ఈనాటి వరకు నడుస్తున్న చరిత్ర.

జరిగిపోయినదానికి ఎవరో ఒకరిని తప్పుపడుతూ కూర్చోవడంవల్ల ప్రయోజనం శూన్యమే. అవమానం పొందుతున్నవాళ్లే అవమానాన్ని ఎదిరించాలి. సమాన హక్కులు కావాలి, కావాలి అని కేవలం వాదించటమే కాక, "మనం సంఘంలో ఒక భాగం, మనకూ సంఘ నిర్మాణంలో ఒక బాధ్యత వుంది" అనే ఆత్మవిశ్వాసం కూడా ఆడవాళ్లు అలవరుచుకోవాలి. విజ్ఞానంతో వ్యక్తులు మానసిక వికాసం పొంది ఆత్మగౌరవంతో మెలగగలగాలి. స్వేచ్ఛ, సమాన హక్కులు ఒకరు మరొకరికి ఇచ్చేవి కావు; అందిస్తున్నారని చెయ్యి చాపి మనం అంది పుచ్చుకునేవి అంతకన్నా కావు. నేడు మనం అనుభవిస్తున్న ఈ అసమానతకు, అవమానాలకు కారణం అజ్ఞానం, అవివేకం, భావదాస్యం. ఇది కేవలం ఒక్క స్త్రీలలోనే కాదు – మొత్తం సమాజంలోనే పాతుకుపోయిన అజ్ఞాన లక్షణమేకాక మానసిక జాడ్యం కూడాను. ఈ అజ్ఞానం నుండి విముక్తి పొందటానికి దారి విజ్ఞానవంతులం కావడమే. అంటే – శాస్త్రీయజ్ఞానం పొందడమే. సాంఘికంగా అవమానకరమైన స్థితిలో వున్నవాళ్లు ఎవరైనా చేయాల్సిందిదే.

ఇది చెప్పుకోవడానికి తేలిగ్గా వుంటుంది కాని మూడువేల సంవత్సరాలుగా మనలో జీర్ణించుకుపోయిన సనాతనాచారాలు, మూఢవిశ్వాసాలు మనల్ని ఓ పట్టాన విడిచిపోలేవు. విద్యావంతులైన స్త్రీలు ఎంతమంది మానసిక దాస్య విముక్తి పొందుతున్నారో ఆలోచిస్తే మనకే అర్థమౌతుంది. వ్యక్తి తన జీవితాన్ని సుఖవంతం చేసుకోవటానికి తపిస్తాడు. ఆ లక్ష్యసాధనకై మార్గాన్వేషణాపరుడు అవుతాడు. అయితే, ఆ సుఖం అనే దానికి అర్థం మాత్రం ఆ వ్యక్తుల దృక్పథాలనుబట్టి వుంటుంది. అసలు జీవితంలో ఏమాత్రం స్వేచ్ఛ లేకుండా సుఖపడుతున్నాం అనేదానికి అర్థం లేదు. అలాగే జీవిత సమస్యలు, విలువల పట్ల ఏమాత్రం అవగాహన లేకుండా సుఖపడుతున్నాం అనుకోవడం వట్టి భ్రమే. ఈనాటి భారత సమాజంలో ఆడవాళ్లు ఇలాంటి భ్రమల్లోనే జీవిస్తున్నారు. ఆ భ్రమ అనే ఊబినుండి ఏ ఒక్కరినీ మరొకరు బైటికి లాగలేరు. అలా లాగినందువల్ల బహుశా ఈ సమస్య మరింత గందరగోళం అవుతుంది. కనుక, ఎవరికి వారే వాళ్ల సమస్యలను పరిష్కరించుకోగలిగే వివేకం స్త్రీలలో కలిగించటంవల్లనే ప్రయోజనం వుంటుంది. అది చాలా బాధ్యతతోను, నిజాయితీతోనూ చేయాల్సిన పని. అలా జరిగిననాడే మనలో మార్పు వస్తుంది; మన సమస్యలు అన్నీ సమసిపోతాయి. ఆనాడే తమ హక్కులను కర్తవ్యాలను సైతం స్త్రీలు విస్మరించలేరు.

సమసమాజ ఆవిర్భావానికి, సాంఘిక పురోభివృద్ధికి, రాజకీయ దక్షతకు స్త్రీలు మార్గదర్శకులు కావాలంటే దానికి తగిన విద్య, వివేకం, సామాజిక అవగాహన వారిలో ద్విగుణీకృతం కావాలి. సమస్యలున్నాయని, వాటిని నిర్మూలించుకోవాలనే జాగృతి స్త్రీలలో కలిగిన నాడు సంస్కరించడం సుకరమవుతుంది. వ్యాధిని నిర్ణయించడమే కష్టం. దాని నిర్మూలన చాలా తేలిక. కనుక ముందుగా స్త్రీల పరిస్థితిని వారి సమస్యలను అవగాహన చేసుకోవాలి. చిక్కులను గుర్తించడం ఎంత కష్టమో సంస్కరించడం అంత తేలిక. ఎన్ని రకాలయిన సమస్యలున్నాయో అన్ని విధాలయిన సంస్కరణలు వున్నాయని నిరూపించవచ్చు. బంధాలలో వున్నామని స్త్రీలు నమ్మితే విముక్తికై తామే పోరాడగలరు. అది స్త్రీ చేతిలో పని. విముక్తి కాని, సంస్కరణ కాని చాలా కష్టసాధ్యమే కాని, అసలు దుస్సాధ్యం మాత్రం కాదు. ఇది గొప్ప నిత్య సత్యం.

స్త్రీ పుట్టుక, పెరుగుదల, మనుగడ అన్నీ సమస్యలే. ఆమె జీవితమే ఒక సమస్యాతోరణం. నిరాదరణకు, తిరస్కారానికి, అవమానాలకు, బాధలకు, వ్యధలకు లోనయిన మహిళలపట్ల సానుభూతితో వారి హక్కులను, ఇబ్బందులను, కష్టనష్టాలను గుర్తించి, వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, న్యాయాన్ని చేకూర్చే సమ సమాజ అవిర్భావానికి తోడ్పడటం అభ్యుదయవాదుల, ప్రజాస్వామ్యవాదుల కర్తవ్యం. స్త్రీల సమస్యల అవగాహనకు, పరిష్కారాలకు తోడ్పడే విభిన్నధోరణులను పరిశీలించటం సమంజసం.

**సిద్ధాంతాలు :**

స్త్రీల హోదాగురించి చరిత్ర పుట్టినప్పటినుండి అనేక సిద్ధాంతాలు, వ్యతిరేక వాదాలు ప్రబలంగా వుంటూనే వున్నాయి. సామాజిక వ్యవస్థ మారినా పాతకాలపు భావాలు, ఆదర్శాలు బ్రతుకుతూనే వున్నాయి. మన భావాలు అంత తేలికగా నశించవు. 1966 లో చైనాలో మావో సాంస్కృతిక విప్లవాన్ని ప్రారంభించే సందర్భంగా ఈ వాదనకు బలం వచ్చింది. నాటి కన్‌ఫ్యూషియస్ ఆలోచనావిధానం సమాజంలో ఇంకా వేళ్ళూనికొని వున్నదని మావో అనాడు అంగీకరించక తప్పలేదు. రాజకీయాధికారం, మతాధికారం, పురుషాధిక్యత, జాతీయాధికారం – ఈ నాలుగూ ఫ్యూడల్ పితృస్వామ్య లక్షణాలన్నాడు మార్క్స్. పురుషాధిక్యతను మార్క్స్ ప్రత్యేకంగా పేర్కొన్నాడు. 1917 లో రష్యాలో విప్లవం వస్తే, 1993 లో కూడా రష్యన్ కార్మికుడు గృహిణికి ఇంటిపనిలో సాయపడటం లేదు. స్త్రీ అదనంగా మూడు గంటలు పనిచేస్తోంది. రష్యాలో రాజకీయ, కౌటుంబిక రంగాలలో స్త్రీ వెనుకబడివుంది. ఇక ఇండియాలాంటి దేశాల విషయం సరేసరి. స్త్రీ శారీరక నిర్మాణం, సమాజ నిర్మాణరీతి, చారిత్రక పరిణామం, సాంస్కృతిక పద్ధతులు అన్నీ కలిసి సమాజంలో స్త్రీ పాత్రను నిర్దేశిస్తాయి. అన్ని రంగాలలో స్త్రీ పురుష సమానత్వం కావాలి. ఆ పరిస్థితి ఏ దేశంలోనూ ఇంకా రాలేదు. దానికొరకై మహిళోద్యమాలవారు వివిధ దృక్కోణాలలో పరిశీలించి కార్యోన్ముఖులవుతున్నారు.

సామాజిక పరిణామాలను భావాలు నిస్సందేహంగా ప్రభావితం చేస్తాయి. అలాగే సామాజిక పరిణామం భావాలపై మహత్తర ప్రభావాన్ని చూపుతుంది. సమాజంయొక్క ఆర్థిక చరిత్రకు, భావాలకు, సిద్ధాంతాలకు గల సంబంధాన్ని విలువకట్టడంలో అనేక రకాలుగా ఆలోచన సాగింది. మార్క్స్ సమాజం యొక్క ఆర్థిక వ్యవస్థకు ప్రాముఖ్యతనిస్తే, ఎం.ఎన్.రాయ్ ఆర్థిక వ్యవస్థనూ, భావాలను సమతూకంగా చూచాడు. మార్క్స్‌ను కాదనకపోయినా 'కల్చరల్ రివల్యూషన్' అంటూ మావో భావాలను ఉన్నత స్థానంలో వుంచారు. ఏదైనా ఉపరితలానికి అందరూ ప్రాధాన్యత నిచ్చారు.

ఈ ప్రపంచంలో మహిళోద్యమానికి అనుకూలురూ వున్నారు; ప్రతికూలురూ వున్నారు. అలాగే మహిళోద్యమానికి అనుకూలంగానూ, వ్యతిరేకంగానూ సిద్ధాంతాలు ఉద్భవించి బహుకాలంగా ప్రజల మనస్సులపై పెత్తనం చేశాయి. కనుక, ఈ సిద్ధాంతాలను గాఢంగా అధ్యయనం చేయడం అవసరం. ఒక సిద్ధాంతం వెనుకముఖం పట్టిందనుకున్నా మరో రూపంగా అది తలెత్తడం గమనిస్తూనే వున్నాం. పురుష దురహంకారం అంత తేలిగ్గా చావదు. పాత భావాలు సమసిపోవడానికి కాలం పడుతుంది. అవే మళ్లీ తలెత్తి వ్యాప్తిచెంద ప్రయత్నిస్తాయి. కనుక పాత సిద్ధాంతాలను తరచి చూడడం వృధా ప్రయాస కాదు. నూతనంగా తలెత్తే ప్రమాదాలను, అపాయాలను గుర్తించడం కూడా అవసరమనక తప్పదు. ప్రత్యాఘాతక పాత్ర వహించే స్త్రీ పురుషులు స్త్రీ జన ప్రగతికి అడుగడుగునా అవరోధాలు కల్పించడానికి ప్రయత్నిస్తూనే వున్నారు. మహిళా విముక్తికోసం పోరాడే మహిళల నైతిక ధృతిని చెడగొట్టే నిమిత్తం వారు అనేక సిద్ధాంతాలను అల్లారు. విద్య, ఉద్యోగం, పరిపాలనా, ప్రభుత్వము లాంటి రంగాలలో స్త్రీలు సమానత్వాన్ని కాంక్షించరాదని ప్రచారం చేసే నిమిత్తం ఆమె శరీర నిర్మాణాన్ని, మనస్తత్వాన్ని సున్నితమైన భావాలను ప్రాతిపదికగా తీసుకొని వాదాలను సృష్టించారు.

సమాజ అవిర్భావ కాలంనుండి స్త్రీని ఇంటిలోకి నెట్టివేయడానికి ఆమె శరీర నిర్మాణ స్వభావాన్ని పురుషుడు తన వాదానికి ఆధారభూతం చేసుకున్నాడు. సంతానాన్ని కనగల ఆమె శక్తిని ఆమెకు ప్రకృతి ప్రసాదించిన విశిష్ట వరంగా కాక ఆమెయొక్క అశక్తతా లక్షణంగా పరిగణించాడు. సంతానోత్పత్తికి, మానవజాతిని కొనసాగించడానికి ఆమె ఉద్దేశింపబడినదట. అందువల్ల ఆ పవిత్ర ధర్మ నిర్వహణకే ఆమె తన శక్తినంతా వినియోగించాలట. విద్యలాంటి వ్యాసాంగాలపై ఆమె శక్తిని వృధా చేయరాదట. ఇలా సాగింది ప్రతికూలవాదం మొదట్లో. కాలం జరిగినకొద్దీ స్త్రీలకిచ్చే విద్య పురుషులకన్నా పూర్తిగా భిన్నంగా వుండాలనే వాదన పుట్టుకొచ్చింది. సంతానాన్ని కనడం ఆమె ప్రాథమిక కర్తవ్యం కనుక ఆమె పొందే విద్య అందుకనుగుణంగా వుండాలట. ఈ పై వాదనలన్నింటిని స్త్రీ విమోచనను ఆకాంక్షించే మహిళలు తిప్పికొట్టారు. స్త్రీకి పురుషుడికన్నా హెచ్చు శక్తిని ప్రకృతి ఇచ్చిందనీ, పురుషుడికన్నా పది శాతం నిరోధకశక్తి స్త్రీకి వున్నదని వైద్యశాస్త్రం ఉద్ఘాటిస్తోంది. కనుక, పై వాదనలో పసలేదని తేలింది.

## శారీరక నిర్ణయవాదం (Biological Determinism):

స్త్రీ పురుష సమానత్వాన్ని వ్యతిరేకించేవారు స్త్రీ పురుషుల శరీర నిర్మాణము, మెదడు పరిమాణము మొదలగు వాటి విషయకంగా ఉన్న తేడాను ఆధారం చేసుకొని ఈ వాదాన్ని లేవనెత్తారు. పురుషునికన్నా స్త్రీ యొక్క శారీరక బలం తక్కువ కనుక వారివురువురి మధ్య సమానత్వం అసంభవమని వారి వాదన. మానవుడు చేతితో చేసే పనిని యంత్రాలద్వారాను, మెదడుతో చేసే పనిని కంప్యూటర్ల ద్వారాను జరిపిస్తున్న ఈ శతాబ్దంలో శారీరక బలానికి విలువ లేదని స్త్రీ విమోచన వాదులు జవాబు చెప్తున్నారు. స్త్రీ యొక్క మెదడు పురుషుని మెదడుకన్నా తక్కువ తూగుతుందని ఒక అంశాన్ని వెలికితెచ్చారు ప్రతికూలురు. మెదడు, శరీరము ఈ రెంటి బరువుల నిష్పత్తి విషయంగా స్త్రీ పురుషులలో తేడా లేదని మహిళలు ప్రతివాదన చేశారు. మెదడు పెద్దదిగా వున్నంతమాత్రాన ఏనుగు మనిషికన్నా తెలివికలదని చెప్పలేము కదా! వాస్తవానికి ఈ శారీరక నిర్ణయవాదం స్త్రీల స్వేచ్ఛాపిపాసను వమ్ము చేయడానికి పుట్టిందనేది నిర్వివాదాంశం అనక తప్పదు.

## సామాజిక పరిణామవాదం (Social Darwinism):

తిరోగమన వాదులు తమ అపజయాన్ని తేలికగా అంగీకరించరు. పరిణామవాద శాస్త్ర మూలపురుషుడైన డార్విన్‌ను తమకు అండగా తెచ్చుకోవాలని ప్రయత్నిస్తూ వున్నారు. డార్విన్ సిద్ధాంతాలను వక్రీకరించారు. 'మను గడకోసం పోరాటం, స్త్రీల సాంగత్యం కోసం పోటీ' జాతుల లక్షణమని డార్విన్ చెప్పాడు. జాతిలో బహు సంతానం కలిగిన జీవులు, తమచుట్టూవున్న పరిసరాలకు తట్టుకోగల జీవులు బ్రతుకుతాయని ఆయన చెప్పాడు. డార్విన్ ప్రకృతివరణ సిద్ధాంతాన్ని చెప్తే వీరు లైంగిక వరణ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు. ప్రకృతి స్త్రీ పురుషుల మనస్తత్వాలలో తేడా ఏర్పరచిందని, పరిణామవాదం తమ సిద్ధాంతాన్ని సమర్థిస్తున్నదని వారి వాదన. పురుషుని మేధాశక్తి స్త్రీ మేధాశక్తి కన్న గొప్పదని వారి భావం. మహిళోద్యమ కార్యకర్తలు ఈ వాదాన్ని తిరస్కరిస్తున్నారు. స్త్రీలయొక్క అంతఃకరణ శక్తి పురుషుని శక్తి కన్నా అధికమైనది. మేధస్సును వినియోగించడానికి అవకాశాలను, వెసులుబాట్లను శతాబ్దాల తరబడి స్త్రీకి లేకుండా చేసినందున ఆమె మానసికశక్తి పురుషుని మానసిక శక్తికన్నా తక్కువదిగా కనపడుతున్నది. సామాజిక పరంగా స్త్రీలను వేర్పాటుకు లోనుచేయడం వల్లనూ, వారిని అన్యాయాలకు, అక్రమాలకు, దోపిడీలకు గురిచేయడంవల్లనూ కలిగిన ఫలితమిది. ఈ సామాజిక పరిణామవాద సిద్ధాంతము మహిళోద్యమానికి తీరని నష్టం కలిగించిందని స్త్రీ విమోచనవాదులు విశదీకరించారు.

## సామాజిక జీవశాస్త్రం (Social Biology):

ఈ సిద్ధాంతం ప్రకారం స్త్రీ పురుషులమధ్య పోటీ వుంటుంది. సాధ్యమైనంత మంది స్త్రీలతో పొందు కలుగ జేసుకొని ఎక్కువమంది సంతానాన్ని కనాలని పురుషుడు వాంఛిస్తాడట. గర్భధారణ, ప్రసూతిలాంటి విషయాలలో ఎక్కువ శక్తిని వినియోగిస్తున్న స్త్రీ పురుషుడి శ్రమను, శక్తిని ఆసరాగా వుండాలని కోరుకుంటుందట. అలా స్త్రీ పురుషులు ఒకరినొకరు వాడుకోవాలని చూస్తారట. తమ పిల్లలకు తనే తండ్రినని నిర్ధారణకోసం స్త్రీని పురుషుడు తన సొంతం చేసుకుంటాడట. ఇలా స్త్రీ పురుషులు పోటీ పడతారట. ఈ సిద్ధాంతం అనుభవానికి దూరం. సమాజంలో సహకారం, పోటీ రెండూ ఏకకాలంలో సహజీవనం చేస్తున్నాయి. అలాగే సామరస్యం, సంఘర్షణ మిక్కుటంగా కనపడతాయి. దౌర్జన్యం, దురాక్రమణ, పురుషుల స్వాభావిక లక్షణాలని, అందువల్ల పురుషులు సమాజం మీద పెత్తనం చేయడానికి అర్హులని ఈ సిద్ధాంతకర్తల అభిప్రాయం. పురుషులలో 'టెస్టా స్టెరోన్' అనే హోర్మోను ఎక్కువగా వుండడంవల్ల పురుషస్వభావం అలా వున్నదని వాదన చేస్తున్నారు. దీనికి జవాబుగా పురుషాధిక్యత ప్రదర్శనవల్లనే ఆ హోర్మోను పెరుగుదల పురుషులలో కన్పడుతున్నదని ప్రతివాదన వచ్చింది. సింహాలు వేటాడేటప్పుడు వ్యూహం పన్ని, ఎత్తులువేసి జంతువుమీద లంఘించేది ఆడసింహమేనని గమనించాలి. బాబూన్ కోతులలో మగకోతిని నాయకుడిగా ఎన్నుకోవడం భౌతిక పరిస్థితులనుబట్టి జరుగుతోంది. చారిత్రక, సాంస్కృతిక కారణాలవల్ల భౌతిక పరిస్థితులు మారగలవని గమనించాలి.

## సామాజిక భావనిర్మాణవాదం (Social Constructionism):

స్త్రీ పురుషులమధ్య సంబంధాన్ని జీవశాస్త్రం నిర్ణయిం చదని, జీవశాస్త్రం యెడ సామాజికదృక్పథం నిర్ణాయకపాత్ర వహిస్తుందని ఈ సిద్ధాంతసారం. ఉ॥ బహిష్టు రక్తాన్ని గురించి, బహిష్టయిన స్త్రీ యొక్క అపవిత్రతను గురించి పూర్వం అనేక మూఢవిశ్వాసాలు వుండేవి. ఈ విశ్వాసాలు స్త్రీని న్యూనత పరిచాయి. శాస్త్రీయ విజ్ఞానం పెరిగినతర్వాత ఈ అవాస్తవిక భావాలు పటాపంచలవుతున్నాయి. ఈ సిద్ధాంతం సాంస్కృతిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నది.

### శారీరక మౌలికసార సిద్ధాంతం
### (Biological Essentialism):

పుట్టుకతోనే పురుషునికి పురుష స్వభావం, స్త్రీకి స్త్రీ స్వభావం వస్తుందని దీని భావం. పురుషుని మానసిక ప్రవృత్తి స్త్రీ యొక్క మానసిక ప్రవృత్తికంటే భిన్నమైనదట. ఇంతవరకు పురుషాధిక్య సమాజంలోను, పురుషుని పెత్తనం సాగే వాతావరణంలో స్త్రీలు పెరిగారట. ఇప్పుడు స్త్రీలు చైతన్యవంతులై స్త్రీత్వం యొక్క గొప్పతనాన్ని గుర్తించాలట. గట్టిగా ఆలోచిస్తే ఈ సిద్ధాంతమూ, శారీరక నిర్ణయ వాదమూ బొమ్మా బొరుసూ లాంటివని తేలుతుంది. కాగా, ఈ సిద్ధాంతాన్ని మహిళోద్యమ కార్యకర్తలు ప్రతిపాదిస్తున్నారు. శారీరక నిర్ణయ వాదాన్ని పురుష దురహంకార వాదులు ప్రచారం చేస్తున్నారు. రెండూ స్త్రీ పురుషుల మధ్యనున్న శారీరక విభేదాల ప్రాతిపదికమీదనే ఆధారపడుతున్నాయి.

### స్త్రీ విమోచన సిద్ధాంతాలు:

ఈనాడు ప్రబలంగా వున్న స్త్రీ విమోచన సిద్ధాంతాలు నాలుగు. ఉదారవాద స్త్రీ విమోచన సిద్ధాంతం, మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం, రాడికల్ స్త్రీ విమోచన సిద్ధాంతం, సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం అనే పేర్లతో అవి చలామణి అవుతున్నాయి. ఈ సందర్భంగా హ్యూమనిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని కూడా చర్చించటం అవసరం. స్త్రీ విమోచన సిద్ధాంతాలు వైవిధ్యంగా వున్నా, మార్గాలు వేరయినా లక్ష్యమూ, ధ్యేయమూ ఒకటే. ప్రపంచంలోని ఈ స్త్రీ విమోచనోద్యమ కార్యకర్తలు, అన్ని శాఖలవారు, స్త్రీ విమోచనోద్యమంలో చురుకుగా పనిచేయడం గమనార్హం.

### ఉదారవాద స్త్రీవిమోచన సిద్ధాంతం
### (Liberal Feminism):

జీవితంయొక్క అన్ని రంగాలలోను, అంటే సామాజికార్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలన్నింటా స్త్రీ పురుషులమధ్య సమానత్వాన్ని కోరుతుంది ఈ సిద్ధాంతం. మామూలుగా వోటుహక్కు, విద్యా ఉద్యోగ పరిపాలనా ప్రభుత్వ రంగాలలో సమానస్థాయి ప్రాతినిధ్యం ఆశిస్తారు ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు. ఇప్పటివరకు పురుషులకు మాత్రమే ప్రవేశార్హత ఉన్న ఉద్యోగాలన్నింటిలో పురుషులతోపాటు పోటీ పడమని స్త్రీలను వీరు ఉద్బోధిస్తారు. గర్భస్రావపుహక్కు కోసం వారు ఆందోళన చేస్తారు; కుటుంబ నియంత్రణను ఆమోదించి ఆచరణలో పెట్టారు. సమాజానికి, పరిసరాలకు ప్రాధాన్యతనిచ్చేవారు వీరి వాదనను విమర్శిస్తారు. సామాజిక వాతావరణము లేక సామాజిక వ్యవస్థ మౌలికంగా మారే వరకు స్త్రీల పురోగతి సాధ్యం కాదని విమర్శకుల భావం. ఉదారవాద స్త్రీవిమోచనకారులు సామాజిక వ్యవస్థను మార్చదలచకపోయినా కొంతమేరకు స్త్రీ విమోచనకు వారి కార్యక్రమాలూ, ప్రయత్నాలు తోడ్పడుతున్నాయి; ఆ మేరకు వారు అభినందనీయులు.

### మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం
### (Marxist Feminism):

ఈ సిద్ధాంతం కుటుంబంలో జీవశాస్త్రపు పాత్రను అంగీకరిస్తుంది. ఉత్పత్తి సాధనాల స్వభావంపై (ఉత్పత్తి సంబంధాలపై) సమాజం ఆధారపడుతుందనికూడా చెప్తుంది ఈ వాదం. దీనికి మూలపురుషులు మార్క్స్, ఎంగెల్సులు. స్త్రీ పురుషులమధ్య శారీరక విభేదాలు స్త్రీ పురుషుల పని విభజనకు దారి తీశాయని అంటుంది ఈ వాదం. స్త్రీకి గర్భధారణ, ప్రసూతి సహజ ధర్మాలయినందున అవి పురుషాధిపత్యానికి దారి తీశాయి. మాతృస్వామ్య వ్యవస్థ పోయి పితృస్వామ్య వ్యవస్థ వచ్చింది. పారిశ్రామికీకరణ జరిగి, సోషలిజం వచ్చినతర్వాత పురుషాధిపత్యం సమసిపో తుంది అంటుంది మార్క్సిస్టు ఫెమినిజం. ఈ వాదాన్ని సమర్థించేవారు యిలా స్త్రీలకు విజ్ఞప్తి చేస్తారు "సోషలిజం వచ్చేవరకు పురుషులపై మీ పోరాట ఉధృతిని ఆపకండి". ఆర్థిక స్వాతంత్ర్యం వస్తే దానంతటదే స్త్రీకి సర్వేసర్వత్రా స్వేచ్ఛ లభిస్తుందని వారి ఆశ. ఈ దృక్పథాన్ని సోషలిస్టు స్త్రీ విమోచనోద్యమకారులూ (Socialist Feminists) తదితరులూ ఇలా విమర్శిస్తున్నారు: "సోషలిస్టు దేశాలలో పురుషులు పురుషదురహంకారాన్ని విడనాడుతున్న సూచనలు కానరావడంలేదు. పైగా, పారిశ్రామిక కార్మికులు తమ స్త్రీలను సమాన హోదా కలవారినిగా చూడడం లేదు." సనాతన సంప్రదాయ కమ్యూనిస్టులందరూ ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ వున్నారు. సృజనాత్మక మార్క్సిస్టులు ఈ వాదాన్ని ఆమోదించటం లేదు. ఆచరణలో మావో ఈ వాదాన్ని త్రోసిరాజన్నాడు. ఈ సిద్ధాంతంయెడ విమర్శ ఇలా సాగింది: స్త్రీ పురుషుల మధ్య పని విభజన జీవశాస్త్ర సంబంధంగా జరగలేదు. శారీరకబలం విషయంగా స్త్రీ పురుషుల మధ్యగల తేడా స్త్రీ యొక్క పనిని నిర్ణయించ టంలోగాని, ఆమె అసమానస్థితికిగాని కీలకాంశంగా లేదు. సమాజం పారిశ్రామికీకరణ కాకముందు స్త్రీ ఇంటిలోగాని, పొలంలోగాని బండెడు చాకిరీ చేయక తప్పలేదు; అందుకు ఆమె శారీరక బలహీనత అడ్డు రాలేదు. యాంత్రీకరణ పద్ధతివలన స్త్రీలకు ఉద్యోగాలు పోతున్నాయి. మొదటిదెబ్బ వారికి తగులుతున్నది. స్త్రీలకు తక్కువ వేతనాలు లభిస్తున్నందున వారు పురుషులపై ఆర్థికంగా ఆధారపడటం

తప్పటం లేదు. శ్రామికులలో వారూ సగభాగం ఉన్నా స్త్రీలకు సమానత్వం లభించడంలేదు. స్త్రీల తక్కువ బలాన్ని వారికి తక్కువ వేతనాలు ఇవ్వడానికి కారణంగా చూపిస్తున్నారు.

## సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం (Socialist Feminism):

మార్క్సిస్టు విమోచనవాదం యొక్క లోపాన్ని వీరు సవరించుకుంటారు. వీరికి ఉదారవాద సిద్ధాంతం సరిపడదు; దానితో వారు తృప్తి పడరు. అలాగే మార్క్సిజాన్ని స్త్రీవిమోచనోద్యమానికిగాని, స్త్రీ విమోచనోద్యమాన్ని మార్క్సిజానికి గాని లొంగివుండేటట్లు చేయరు సోషలిస్టు స్త్రీ విమోచనోద్యమకారులు. కుటుంబంలో స్త్రీ యొక్క ప్రతిపత్తి ఉత్పత్తి సాధనాల స్థితిగతులతో సరాసరి ముడిపడి ఉండకుండా సాపేక్షంగా స్వతంత్రంగా నిర్ణయించబడుతుందని వీరి వాదన. లైంగిక అసమానత్వానికి ఆర్థికత ముఖ్యకారణమని వీరు అంగీకరించరు. కాగా, వీరిలో చాలమంది మార్క్సిస్టు బంధాలను విడలేకుండా ఉన్నారు. సోషలిజం పరిధిలోనుండివారు విడిపడదలచుకోలేదు. కాని, మౌలిక సోషలిస్టు భావనకు అదనంగా కొన్ని భావాలను కలిపారు.

గత రెండు దశాబ్దాల ఫెమినిస్టు చరిత్రలో సోషలిస్టు ఫెమినిజం అగ్రభాగాన వుంది. వామ పక్షాలలో, వామ పక్ష ఉద్యమాలలో పనిచేసిన మహిళా కామ్రేడులపట్ల ఆ పక్షాలలోని పురుషులు జండరు వివక్షతో ప్రవర్తిస్తున్నారని తెలిసి ఆ మహిళలు బాధపడ్డారు. స్త్రీల శ్రమను, లైంగికత్వాన్ని పునరుత్పత్తి శక్తిని అదుపులో ఉంచుతున్న పితృస్వామ్య విధానాన్ని పరిశీలించారు రాడికల్ ఫెమినిస్టులు. వ్యక్తిగతం అంతా రాజకీయమేనని వారు నినాదమిచ్చారు. పునరుత్పత్తి సంబంధాలను కూడా పరిశీలించాలని సోషలిస్టు ఫెమినిస్టులు చెప్పారు. స్త్రీలూ పురుషులూ అనే విభజన సాంఘిక విభజనేనని, స్త్రీ పురుషులమధ్య సంబంధాలన్నీ సాంఘికంగా నిర్మించబడ్డవేనని సోషలిస్టు ఫెమినిస్టులు ప్రకటించారు. కేవలం ఉత్పత్తి సంబంధాలనేకాక పునరుత్పత్తి సంబంధాలను గురించీ పట్టించుకోవాలని ఆ ఫెమినిస్టుల ప్రణాళిక పేర్కొంటున్నది. వ్యక్తిగతం అంతా రాజకీయమేనని, రాజకీయం అంతా వ్యక్తిగతమని వారు విశ్వసిస్తున్నారు. అణచివేతకు వ్యతిరేకంగా జరిగే సంఘర్షణ కుటుంబంలో కూడా జరగాలని వారి అభిలాష.

## రాడికల్ స్త్రీ విమోచనోద్యమం (Radical Feminism):

ఉదారవాద స్త్రీ విమోచనోద్యమకారులూ, మార్క్సిస్టు స్త్రీ విమోచనోద్యమకారులూ శారీరకాంశాలకన్న సామాజికాంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. రాడికల్ స్త్రీ విమోచనోద్యమ సిద్ధాంతంలో జీవశాస్త్రం ఎక్కువ ప్రాధాన్యత వహిస్తుంది. పురుషుని శారీరక బలాధిక్యత, సంతానోత్పత్తి విషయంగా స్త్రీయొక్క పాత్ర – ఈ రెండూ స్త్రీని సమానస్థితికి దూరం చేశాయని వారి విశ్వాసం. స్త్రీ పురుషులమధ్య వర్గ విభజన, రాజకీయ విభజన ఉన్నాయని వీరి వాదం. స్త్రీల విప్లవం రావాలని వీరి ఆకాంక్ష. స్త్రీ విమోచనకు ద్వితీయస్థానం ఇచ్చినందుకు మార్క్సిస్టులను వీరు విమర్శిస్తారు. వీరి దృష్టిలో స్త్రీలు ఒక వర్గం. వీరు 'శారీరక మౌలికసార సిద్ధాంతం' పై ఆధారపడతారు.

## సాంస్కృతిక స్త్రీ విమోచన సిద్ధాంతం (Cultural Feminism):

ఈ సిద్ధాంతం రాడికల్ ఫెమినిజానికి చాల దగ్గరగా ఉంటుంది; కాకపోతే కొద్ది తేడాలున్నాయి. ఈ సిద్ధాంతం మహిళాసంస్కృతిని శ్లాఘిస్తుంది. స్త్రీయొక్క సృజనాత్మకశక్తిని, సంతానోత్పాదనలో ఆమె సామర్థ్యాన్ని చూచి పురుషుడు ఈర్ష్య పడుతున్నాడని వీరి అభిప్రాయం. విప్లవ స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని ఇది ప్రతిపాదిస్తూ వుంది. సంతానోత్పాదనలో స్త్రీ పాత్రను పురుషుడు మానసికంగా గ్రహించే విధానంపై ఆమె అణగారినతనం ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని ఆధారపడుతుందని వీరి భావం. ఈ అంశంమీద రాడికల్ ఫెమినిస్టులకూ సాంస్కృతిక ఫెమినిస్టులకూ ఏకీభావమే. స్త్రీ విమోచనకు ప్రధాన శత్రువు పురుషుడేనని వీరి నిర్ణయం. రాడికల్ ఫెమినిస్టు అయిన 'ఫెర్‌స్టోన్' పురుషులతో సంపర్కం లేకుండా కృత్రిమ గర్భధారణకు పూనుకోవలసినదని స్త్రీలకు విజ్ఞప్తి చేస్తున్నది. సాంస్కృతిక ఫెమినిస్టు అయిన 'రిచ్' అనే ఆమె "సంతానోత్పాదన" గురించి గర్వపడవలసిందని స్త్రీలకు ఉద్బోధిస్తున్నది. ఈ రెండు శాఖలవారూ శారీరక మౌలికసార సిద్ధాంతాన్ని ఆమోదిస్తారు. ఈ వాదనను అంగీకరించేవారు పురుషనైజాన్ని ద్వేషిస్తారు. పురుషజాతిని 'పురుష దురహంకార సూకరాలు' (Male Chauvinist Pigs) అని మెక్సికో ప్రపంచ మహిళా సభలో ఎలుగెత్తి నిందించడం జరిగింది. వీరి సిద్ధాంతంలో ముఖ్యమైనది స్త్రీలకు స్త్రీత్వలక్షణాలను ప్రకృతి ప్రసాదించిందని, వాటిని పురుషుల మానసికలక్షణాలకన్నా గొప్పవిగా పరిగణించాలని, అంతగా కాకపోతే సమానంగా లెక్కలోకి తీసుకోవాలని వీరి విశ్వాసం. 'డన్‌బార్' అనే ఆమె సామాజిక విముక్తికి మూలం స్త్రీ విమోచనయే అని ప్రకటించింది. స్త్రీత్వలక్షణాలు – అంటే ఇతరులయెడ శ్రద్ధ, జాగ్రత్త, ఆత్మవిశ్వాసం, పోటీలేని

మనస్తత్వం, సహకారం, ఐహికతత్వం (Materialism) ఇవి ప్రపంచానికి అవశ్యకమని వీరి భావన.

విమర్శ:

స్త్రీ విమోచనను గురించిన ఈ తాత్విక సిద్ధాంతాలన్నీ అర్ధసత్యాలే. వాటిలో కొంత వాస్తవం ఉన్నది; వాటిని పూర్తిగా అంగీకరించటానికి వీలులేదు. స్త్రీ పురుషునికి లొంగి ఉండటం అనే ఈనాటి వాస్తవానికి శారీరక శాస్త్రం, మానసిక శాస్త్రం, సామాజిక శాస్త్రం – వీటిలో ఏ ఒకటి సరియైన సంజాయిషీ యివ్వలేదు. ఏ ఒక్క అంశాన్నో ఆధారం చేసుకుని దానిని వివరించలేము. రాజకీయం, ఆర్థికం, జీవశాస్త్రం, మానసిక శాస్త్రం, సామాజిక భావన అన్నీ స్త్రీలను పురుషులూ, సమాజం దోపిడీ చేయటానికి ఉపకరించాయి. కేవలం మార్క్స్‌గాని, ఫ్రాయిడ్‌గాని స్త్రీల సమస్యలకు పరిష్కార మార్గాలను చూపలేరు. బహుముఖంగా సమస్యను దర్శించవలసి వుంటుంది. సమ్యక్ దృక్పథం నేడు అవసరం. ఏదో ఒక సిద్ధాంతాన్ని ముందుగా ఊహించుకొని తద్వారా పరిష్కారమార్గాన్ని అన్వేషించపూనడం అవివేకం; అలాంటి ప్రయత్నం నిష్ఫలం అవుతుంది. మానవుడు సంక్లిష్టజీవి. మానవ స్వభావాన్ని లేక పెరుగుదల క్రమాన్ని అవగాహన చేసుకోవాలంటే గాఢంగా సునిశితంగా విశ్లేషణాయుతంగా పరిశీలన అవసరం. అదీ మానవవాద ప్రాతిపదికపై జరగాలి. ఈ అంశంపై శాస్త్రీయ భావనను, శాస్త్రీయ దృష్టిని ప్రసరింపచేయాలి. అలాంటి ప్రయత్నానికి మానవవాద దృక్పథంతో కూడిన స్త్రీ విమోచన సిద్ధాంతం ఉపకరించవచ్చును. కనుక హ్యూమనిస్టు ఫెమినిజం స్వరూపస్వభావాలను పరిశీలిద్దాం.

## మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతం (Humanist Feminism):

ఈ సిద్ధాంతం వాస్తవికతపై ఆధారపడి సమగ్ర పరిశీలనవల్ల పుట్టి సమ్యక్ దృక్పథంతో భాసిల్లుతుంది. సంతానోత్పాదన విషయంలో స్త్రీ శక్తి సంపన్నతను గుర్తిస్తుంది. దానిని ఆమె బలహీనతగా పరిగణించదు. కుటుంబ పెంపుదలకు, సామాజిక శాశ్వతత్వానికి ఆమె చేసే అపూర్వ సేవను లెక్కలోకి తీసుకుంటుంది. కనుక ఆమెను అభినందిస్తుంది. గర్భధారణ సమయంలోకాని, ప్రసూతి సందర్భంగా కాని ఆమెకు కలిగే కొద్దిపాటి ఇబ్బందిని, చికాకును సాకుగా తీసుకొని ఆమెకు అన్యాయం చేయదు. ఆ సమయంలో ఆమెకు అండగా నిలబడాలని పురుషుడిని ఉద్బోధిస్తుంది. ఇంటిపని, పిల్లల పెంపకం ఆమెకే కేటాయించడం అక్రమమని వాదిస్తుంది. స్త్రీ పురుషునితో దీటుగా వ్యవహరించగలదని నొక్కి చెప్తుంది. స్వేచ్ఛ సమగ్రమూ, సంపూర్ణమూ కావాలి. స్త్రీకి సామాజిక స్వేచ్ఛ వున్నంతమాత్రాన చాలదు. అలాగే ఆర్థిక స్వేచ్ఛ లభించినంతమాత్రాన ఒరిగేదిలేదు. రాజకీయ సాంస్కృతిక స్వేచ్ఛలూ అవసరమే. ఒక రంగంలో స్వేచ్ఛ అనుభవిస్తూ మరో రంగంలో ఏ వ్యక్తి కట్టుబానిసగా వుండలేడు. ఈ సత్యాన్ని గుర్తించి, సామాజిక వ్యవస్థయొక్క ప్రాధాన్యతనూ దానిపై నిర్మింపబడిన భావ ప్రపంచాన్ని రెంటినీ సమానంగా పరిగణించే ఏ సమస్యనైనా అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించడం అవసరం.

ఈ సిద్ధాంతాన్ని సమర్థించేవారు రాడికల్ ఫెమినిస్టులవలె పురుషద్వేషానికి లోనుకారు. మార్క్సిస్టు ఫెమినిస్టులవలె స్త్రీ విమోచనోద్యమాన్ని ఆర్థిక పోరాటలకు బలిచేయరు. అంటే – పురుషాధిపత్యంమీద జరిపే పోరాటం, సామాజిక వ్యవస్థ మార్పుకై సాగించే ఆందోళన ఏక కాలంలో జరుపుతారు. ఉదారవాద ఫెమిస్టులవలె పెట్టుబడిదారీ సమాజ వ్యవస్థను ఆమోదించి ఊరుకోరు. మార్క్స్, ఫ్రాయిడ్‌లాంటి మహా మేధావుల సిద్ధాంతాలలోని వాస్తవాంశాలను మాత్రం స్వీకరించి జీవితానుభవంతో రంగరించుకొని ముందుకు సాగిపోతారు. భవిష్యత్ ప్రపంచంలో కండబలానికన్నా బుద్ధిబలానికి ప్రాధాన్యత వున్నదన్న అంశాన్ని గుర్తెరిగి, నూతన సమాజ ఆవిర్భావంకోసం భావ విప్లవాన్ని ఆకాంక్షిస్తారు. కేవలం భావాల మార్పులవల్ల సమస్య పరిష్కారం కాదని వారికి తెలుసు. కనుకనే భావ విప్లవాన్ని, సామాజిక పరివర్తనా కార్యక్రమాన్ని ఏక కాలంలో సాగిస్తారు. అలా స్త్రీవిమోచనోద్యమాన్ని, సామాజిక విప్లవ పంథాను సమన్వయం చేస్తారు. ఈ సమస్యను మానవవాద పరిధిలో పరిశీలించి దీన్ని పరిష్కరించటానికి బహుముఖ కృషి జరుగవలసివుంది. సిద్ధాంతాలకన్నా జీవితం వాస్తవమైనది; విలువైనది. జీవితపులోతులను అవలోకనం చేసినకొలది నూతన సత్యాలు గోచరిస్తాయి. నూతన సిద్ధాంతాలు మొలకెత్తుతాయి. కనుక అర్ధసత్యాలైన మొదటి నాలుగు స్త్రీ విమోచన సిద్ధాంతాలను అంటిపెట్టుకొని ప్రాకులాడక స్త్రీని మానవిగా పరిగణించే మానవవాద స్త్రీ విమోచన సిద్ధాంతాన్ని పూర్తిగా రూపొందించటం, ఆదరించటం అవశ్యకర్తవ్యం. అది నూతన సమాజావిర్భావానికి నాంది పలుకుతుంది.

వర్గపోరాటం పేరుతో స్త్రీవిమోచనోద్యమాన్ని అణచి పెట్టటం తప్పు. అలాగే స్త్రీ విమోచన పేరుతో సమాజంలోని దోపిడీ పద్ధతులను గుర్తించకపోవటం పొరపాటు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, కుటుంబిక రంగాలన్నింటా స్త్రీ విమోచనకు అరమరికలు లేకుండా కృషి చేయడం మన కర్తవ్యం. ఈ సందేశాన్ని మానవవాద స్త్రీ

విమోచన సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది. సగభాగమైన స్త్రీల అభివృద్ధిలేని దేశాభివృద్ధి ఎండమావుల లాంటిది. స్త్రీల సమస్యలు నాలుగువేల ఏళ్లుగా పాతుకుని పోయ్యాయి. అలా ఘనీభవించిన మహిళల స్థాయి, హోదా మారి స్త్రీకి స్వేచ్ఛా సమానత్వం కలిగించటం ఈనాటి మన ప్రథమ కర్తవ్యం.

కాని పాత వ్యవస్థను మార్చటం ఎంత కష్టమో అక్కడ ఆధునికతను స్థాపించడం అంతకన్నా కష్టం. అయినా ఈ పని ఎప్పుడో అప్పుడు చెయ్యక తప్పదు. దీనికి ఒకే ఒక మార్గం వుంది. ఎవరైతే సమస్యల విషవలయంలో చిక్కుకుని బాధపడుతున్నారో, ఎవరైతే సంకెళ్లలో బంధింపబడ్డారో వారు ఐక్యతతో కలిసి పోరాడాలి; అడ్డంకులను అధిగమించాలి. అలాంటి స్త్రీశక్తి సంఘటనవల్లే భవిష్యత్ మహిళాలోకం ప్రజ్వరిల్లుతుంది. ఆనాటి మహిళ తనను తాను మాత్రమే ఉద్ధరించుకోదు – సమాజాన్ని కుటుంబాన్ని, దేశాన్ని అభ్యుదయ పథాన నడిపించి తన కర్తవ్యాన్ని శక్తి సామర్థ్యాలను రుజువు చేసుకుంటుంది. ఈ కార్యసాధన పురుషద్వేషం, ఈర్ష్య, అసూయలతో కానేకాదు. సమరసభావం, శాంతి, సహనం, సౌశీల్యాలతో జరగాల్సిన పని ఇది. మరి ఆ ధ్యేయంతో యావత్ స్త్రీ జాతి అభ్యుదయపథాన పయనిస్తుందని ఆశించటం అతిశయోక్తి కాదు.

నిదురించిన యుగచైతన్యం
నిటలనేత్రం తెరుస్తున్నది
నిశాచరులారా జాగ్రత్త – సి. నారాయణ రెడ్డి

# బలహీనవర్గాల సంక్షేమం

- పి. బాలకృష్ణ

భారతదేశంలో శతాబ్దాల పాటు కొనసాగిన రాచరిక వ్యవస్థ అనంతరం ఏర్పడిన భూస్వామ్య వ్యవస్థలకు తోడుగా సమాజంలో నాటుకుపోయిన మత సాంప్రదాయాల మూలంగా దేశ వ్యవస్థలో ప్రత్యేకంగా కొన్ని వర్గాల ప్రజలు సాంఘికంగా, ఆర్థికంగా సాంస్కృతికంగా అభివృద్ధిని సాధించడం అసాధ్యమైంది. సంఖ్యారీత్యా వీరు అత్యధికులయినప్పటికీ కాలానుగతంగా వచ్చే అభివృద్ధి ఫలాలు వీరికి అందుబాటు కాలేదు. తరాలుగా హేయమైన సాంఘిక వెలికి గురి కావడంతో పాటు ఆర్థికంగా దోపిడీ బారిన పడటం కూడా జరిగింది. బ్రిటీషు పాలనలో వచ్చిన విద్యా విజ్ఞానాలు కాని సాంకేతిక మార్పులు కాని వీరి దరిదాపులలోకి చేరలేదు. కనీస మానవ అవసరాలకి కూడా వీరు దూరమవటం జరిగింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా ఏమాత్రం లేదు.

స్వాతంత్ర్యానికి పూర్వం ఈ బలహీన వర్గాల అభ్యున్నతికి కొన్ని సాంఘిక సంస్థలు, వ్యక్తులు మాత్రమే కృషి చేశారు. ప్రభుత్వపరంగా జరిగిన కృషి మృగ్యం.

స్వాతంత్ర్యానంతరం మాత్రమే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఇటువంటి బలహీనవర్గాల ప్రజల అభివృద్ధికొరకు కృషి చేయడం ప్రారంభించాయి. వీరు అభివృద్ధి చెందకుండా సమాజం మొత్తంగా అభివృద్ధి సాధించడం అసాధ్యమని గుర్తించిన రాజ్యాంగ నిర్మాతలు వారి అభివృద్ధి కొరకు కొన్ని ప్రత్యేక ప్రకరణలను రాజ్యాంగంలో పొందుపరచటం జరిగింది. షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతుల ప్రజలను ప్రత్యేకంగా అభివృద్ధి పరచాల్సిన అవశ్యకతను గుర్తించి వారికొరకు రాజ్యాంగంలో

1. షెడ్యూలు కులములు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన తరగతుల వారి విద్యాభివృద్ధికి, ఆర్థికాభివృద్ధి కొరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వారిని ప్రోత్సహించవలెనని రాజ్యాంగ మందు స్పష్టముగా నిర్దేశించబడింది. ఆర్టికల్ 38 ప్రకారం రాష్ట్ర ప్రభుత్వాలు బలహీన వర్గాలలో ముఖ్యంగా షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులలో విద్యాభివృద్ధిని, ఆర్థికాభివృద్ధికై ప్రోత్సహించి, సాంఘిక దురన్యాయములు వారికి కలగకుండా చూడవలెను.
2. ఆర్టికల్ 17, ప్రకారం అంటరానితనం నిషేధించబడ్డది. దీనిని ఉల్లంఘించిన వారు శిక్షార్హులు.
3. ఆర్టికల్ 15 ప్రకారం, బావులు, స్నాన ఘట్టాలు, వీధులు, దుకాణములలోకి, హోటళ్ళలోకి విజ్ఞాన ప్రదర్శనములలోకి వీరు స్వేచ్ఛగా రావచ్చును. అనగా అట్లు వారు వచ్చుట నిరాకరించిన వారు శిక్షార్హులు.
4. ఆర్టికల్ 19 ప్రకారం, ప్రజలకు స్వేచ్ఛగా సంచరించుటకు, స్థిరపడుటకు, కొంత ఆస్తిని సంపాదించుటకు ఇచ్చిన ప్రాథమిక హక్కులు, షెడ్యూలు జాతులవారికి కూడా వర్తిస్తాయి.
5. ఆర్టికల్స్ 16, 335 ప్రకారం షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులవారికి ప్రభుత్వ రంగాలలోనూ, విద్యారంగాలలోనూ ప్రత్యేక కేటాయింపులు కలవు.
6. ఆర్టికల్స్ 330, 332, 334ప్రకారం పార్లమెంటులోనూ, రాష్ట్ర శాసనసభలలోనూ, షెడ్యూలు కులములు, షెడ్యూలు జాతులు ప్రాతినిధ్యము వహించవచ్చును.
7. ఆర్టికల్స్ 164, 338 లలో 5వ షెడ్యూలు జాతులు, షెడ్యూలు కులాల అభివృద్ధిని, రక్షణలను, సంక్షేమమును చూచుటకు రాష్ట్రంలో సలహా సంఘాలను, ప్రత్యేక విభాగములతో ఒక ప్రత్యేక అధికారిని (స్పెషల్ ఆఫీసర్‌ను) నియమించవలెను.

రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రం (ఆర్టికల్ 46) బలహీన వర్గాల విద్య, ఆర్థిక అభివృద్ధికి ముఖ్యంగా షెడ్యూలు కులాలు జాతుల అభివృద్ధికి ప్రభుత్వం కృషి చేయాలని నిర్దేశిస్తోంది.

శతాబ్దాలుగా అన్ని విధాలుగా వెనుకబడిన షెడ్యూలు కులాల, షెడ్యూలు జాతుల వారితో పాటుగా ఇతర వర్గాల ప్రజలు కూడా అనేకమంది దేశం మొత్తంగా ఉన్నారు. ఇటువంటి వారిని వెనుకబడిన తరగతులుగా పేర్కొని అటువంటి వారిని గుర్తించటానికి, వారికి ప్రత్యేకమైన

సదుపాయాలు కల్పించే బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వాలకు అప్పగించింది.

1991 జనాభా లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో 1,05,92,006 మంది షెడ్యూలు కులాల ప్రజలు వున్నారు. జిల్లాల వారీగా చూసినట్లయితే తూర్పు గోదావరి జిల్లాలో అత్యధిక సంఖ్యలో అంటే 8,26,057 మంది షెడ్యూలు కులాలవారు ఉన్నారు. జనాభా శాతం రీత్యా చూసినట్లయితే నెల్లూరు జిల్లాలోని మొత్తం జనాభా (23,92,260) లో 21.85 శాతం షెడ్యూలు కులాల వారు ఉన్నారు. మన రాష్ట్రంలోని మొత్తం జనాభాలో షెడ్యూలు కులాల ప్రజల శాతం 15.93.

షెడ్యూలు జాతుల విషయాన్ని పరిశీలించినట్లయితే 1991 జనాభాలెక్కల ప్రకారం మన రాష్ట్రంలో 41,98,481 మంది షెడ్యూలు జాతుల ప్రజలు ఉన్నారు. మొత్తం రాష్ట్ర జనాభాలో షెడ్యూలు జాతుల ప్రజల శాతం 6.31. జిల్లాలవారీగా చూసినట్లయితే ఖమ్మం జిల్లాలో అత్యధిక సంఖ్యలో అంటే 5,58,958 మంది షెడ్యూలు జాతుల ప్రజలు ఉన్నారు. శాతం రీత్యా కూడా ఖమ్మం జిల్లాలోనే షెడ్యూలు జాతుల ప్రజలు ఎక్కువగా ఉన్నారు. ఖమ్మం జిల్లాలోని మొత్తం జనాభాలో (22,15,809) షెడ్యూలు జాతుల ప్రజలు 25.23 శాతం ఉన్నారు.

వెనుకబడిన తరగతులు, కులాల వారు ఎంతమంది ఉన్నారు అనే విషయానికి సంబంధించి స్పష్టమైన లెక్కలు లేవు. వెనుకబడిన కులాల ఆర్థిక సహకార సంస్థ లెక్కల ప్రకారం రాష్ట్రంలో వెనుకబడిన కులాల వారు దాదాపు 40 శాతం వుండవచ్చునని అంచనా.

షెడ్యూలు కులాల, షెడ్యూలు జాతుల ప్రజలు ప్రాచీన సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సంస్కృతుల ప్రభావం మూలంగా సాధారణ పట్టణ వాసాలకు సుదూరంగా ఉండటం జరుగుతోంది. మొత్తం షెడ్యూలు కులాల జనాభాలో 17.31 శాతం మాత్రమే పట్టణాల్లో వుంటున్నారు. షెడ్యూలు జాతుల వారయితే కేవలం 7.60 శాతం మాత్రమే పట్టణాల్లో నివసిస్తున్నారు. వృత్తి రీత్యా చూసినట్లయితే వీరిలో అత్యధిక మంది వ్యవసాయ కార్మికులుగా వున్నారు. షెడ్యూలు కులాలు వారిలో 34 శాతం మంది వ్యవసాయ కార్మికులు, షెడ్యూలు జాతులవారిలో 20 శాతం మంది వ్యవసాయ కార్మికులుగా వున్నారు. మిగిలిన వారిలో కొద్దిమంది చిన్న చిన్న వ్యవసాయ కమతాలను సాగుచేస్తూనో, ఉపాంత శ్రామికులుగానో వున్నారు. అతి తక్కువ మంది మాత్రమే గృహపరిశ్రమలు, ఉత్పత్తి, సేవా రంగాలలో వున్నారు. అరణ్య ప్రాంతాలలోనూ మారుమూల గ్రామాలలోనూ నివసించేవారు. అడవులలో చింతపండు, కుంకుళ్ళు, సీకాయ, ఉసిరికాయలు మొదలైనవాటిని చెట్లనుండి తీయటం కూడా ఈ జాతుల వారి వృత్తి. కాయధాన్యాలను బగతలు, సవర, గదబలు, ఖోండు మొదలు జాతులవారు సాగుచేస్తూ ఉంటారు. కర్నూలు జిల్లాలోని నల్లమలై అడవులలోనూ, మహబూబ్ నగర్ జిల్లాలోను ఉన్న కొన్ని చెంచు జాతులు పాతకాలం పద్ధతులలో అడవులలో వేటాడి ఆహారం సంపాదించుకుంటారు. చేపలు పట్టడం యానాది జాతి వారి ముఖ్యవృత్తి. భూమి వీరి ముఖ్య జీవనాధారము. ఆంధ్రదేశంలోని షెడ్యూలు ప్రాంతంలో ఎంత భూమి ఈ జాతుల అధీనములో ఉన్నదీ ఇంకా లెక్కవేయలేదు. జనాభా పెరుగుతున్న ఈ రోజులలో సాధారణ జీవన ప్రమాణాలకన్నా తక్కువలో అనిశ్చితంగా, ఆర్థికంగా పేదరికంలో జీవితం గడుపు ఈ జాతులను ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చు. రాష్ట్రం వ్యవసాయక ఉత్పత్తులలోనూ, పారిశ్రామికంగానూ వెనుకబడి వుండటంవలన ప్రయాణ సౌకర్యం తక్కువ అవుట వలనను కొండజాతులవారు (ట్రైబల్స్) ముఖ్యంగా 14 సంవత్సరముల వయసు కలిగినవారు నిరక్షరాస్యతతోనూ, మూఢనమ్మకములు, మూఢ ఆచారములతోనూ, తక్కువ జీవన ప్రమాణాలు కలిగివున్నారు.

## షెడ్యూలు ప్రాంతం :

రాష్ట్రంలో షెడ్యూలు జాతులు అత్యధికంగా నివసించే విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం, తూర్పు, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, అదిలాబాదు, మహబూబ్ నగర్ జిల్లాలలోని కొన్ని ప్రాంతాలను ప్రత్యేకంగా అభివృద్ధి పర చాల్సిన అవసరాన్ని గుర్తిస్తూ రాష్ట్ర ప్రభుత్వం షెడ్యూలు ప్రాంతంగా ప్రకటించింది. మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న షెడ్యూలు ప్రాంతం 6,197 గ్రామాలలో 30,028 చ.కి.మీ. విస్తీర్ణం కలిగి; రాష్ట్ర విస్తీర్ణంలో 11 శాతంగా వుంది. రాష్ట్రంలో వున్న షెడ్యూలు ప్రాంతం మూడు తరగతుల క్రింద విభజించబడింది. 1. ఎగువ ఏజెన్సీ ప్రాంతం, విశాఖపట్నం జిల్లాలోని అరకు, అనంతగిరి, మంచినగుట్ట, పాడేరు, గంగరాజుమ్మడిగోలు, పెద్దబయలు, చింతపల్లి ప్రాంతాల వరకు కలదు. 2. దిగువ ఏజన్సీ ప్రాంతం విశాఖపట్నం జిల్లాలోని కొయ్యూరు, శ్రీకాకుళం జిల్లాలోని సీతంపేట, పచ్చిపెంట, భద్రగిరి, తూర్పుగోదావరి జిల్లాలోని రంపచోడవరం, మారేడుమల్లి, అడ్డతీగెల, రాజవొమ్మంగి ప్రాంతాల వరకు విస్తరించి ఉంది. 3. ఖమ్మం, వరంగల్ జిల్లాలలోని ట్రైబల్ డెవలప్‌మెంట్ బ్లాకులు షెడ్యూలు ప్రాంతంలో మూడవ తరగతివి. ఆంధ్రప్రదేశ్‌లోని షెడ్యూలు ప్రాంతంలో శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, అదిలాబాదు, మహబూబ్ నగర్ జిల్లాలలోని 4,346 గ్రామాల వరకు కలదు. 5.31 లక్షల గిరిజన జనాభాతో ఉన్న 22,212.40 చ.కి.మీ. ప్రాంతం రాష్ట్రంలోని 24 ట్రైబల్ బ్లాకుల క్రింద ఉన్నది.

ట్రైబల్ డెవలప్‌మెంటు బ్లాకుల క్రింద లేకుండా దాదాపు 7.93 లక్షల జాతులు గలవు. వీరిలో 2.90 లక్షల జాతులు రాష్ట్రంలోని అడవులలో చెదురు మదురుగా, 5.03 లక్షల జాతులు మైదాన ప్రాంతంలోనూ ఉన్నారు.

### వెనుకబడిన తరగతులు:

రాష్ట్రంలో వెనుకబడిన తరగతుల ప్రజలను గుర్తించి వారిని సమాజంలో అభివృద్ధి చెందిన వారితో సమానంగా పైకి తేవటానికి అవసరమైన చర్యలను గైకొనటానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 1968వ సంవత్సరంలో ఒక కమీషన్ నియమించింది. వీరి సూచన మేరకు పేదరికం, తక్కువ విద్యా ప్రమాణాలు, తక్కువ జీవన ప్రమాణాలు, నివసించు స్థలం, తక్కువ స్థాయి ఉద్యోగాలు, కులం ఆధారంగా 93 కులాల వారిని వెనుకబడిన తరగతుల వారిగా ప్రకటిస్తూ వారిని నాలుగు గ్రూపులుగా విభజించింది. (గ్రూపు ఏ.లో 37, గ్రూపు బి.లో 21, గ్రూపు సి.లో 1 గ్రూపు డి.లో 33 కులాల వారిని చేర్చడం జరిగింది). అయితే రాష్ట్ర జనాభాలో వీరికి సంబంధించిన లెక్కలను మాత్రం తీయలేదు. సుమారుగా వీరు 40 శాతం ఉంటారని అంచనా వేయడం జరిగింది. వెనుకబడిన తరగతుల వారి స్థితిగతులన్ను, వారి అభివృద్ధి కొరకు చేపట్టవలసిన చర్యల గురించి 1982 జనవరిలో మురళీధర్ కమీషన్‌ను రాష్ట్ర ప్రభుత్వం నియమించింది. ఆ కమీషన్ సూచన మేరకు వెనుకబడిన తరగతుల వారికి విద్యా సంస్థలలో ప్రవేశం, ఉద్యోగ నియామకాలలో కల్పించే సదుపాయాలను పెంచుతూ, 1986 ఆగష్టులో రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. దానిపై రాష్ట్రంలో ఆందోళనలు జరగడం తదుపరి రాష్ట్ర హైకోర్టు ఆ ఉత్తర్వులను కొట్టివేయడంతో ప్రస్తుతం అంతకు పూర్వం 1970 నుంచి అమలులో ఉన్న సదుపాయాలను మాత్రమే వెనుకబడిన తరగతుల వారు పొందుతున్నారు.

### జస్టిస్ పుట్టస్వామి కమీషన్:

రాష్ట్రంలో వెనుకబడిన తరగతులకు చెందిన ప్రజల ఆర్థిక స్థితిగతులను పరిశీలించడానికి, వెనుకబడిన తరగతుల జాబితాలోకి ఏవైనా కులాలను చేర్చవలసిన అవసరాన్ని పరిశీలించడానికి రాష్ట్ర ప్రభుత్వం జస్టిస్ కె.ఎస్.పుట్టస్వామి అధ్యక్షతన ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సంఘాన్ని నియమించింది. ఈ సంఘంలో శ్రీ బి.రామచంద్రరావు (మాజీ ఎం.పి.) శ్రీ కె.మురళీధర్ (రిటైర్డ్ ఐ.ఎ.ఎస్.) శ్రీ ఆర్.హెచ్.హీరామాన్‌సింగ్ (రిటైర్డ్ జిల్లా జడ్జి)లను సభ్యులుగా నియమించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ కార్యదర్శి ఈ సంఘానికి సభ్యకార్యదర్శిగా వ్యవహరిస్తారు. ఈ సంఘం 31-3-94 నుండి పని చేయడం ప్రారంభించింది. వెనుకబడిన తరగతుల జాబితాలో కొత్తగా చేర్చవలసిన కులాలు, జాబితానుండి తొలగించవలసిన కులాలు, గ్రూపు మార్చవలసిన కులాలు, వెనుకబడిన తరగతుల స్థితి గతుల పరిశీలన, వారి సంక్షేమం గురించి చేపడుతున్న కార్యక్రమాలను సమీక్షించడం, ఇందుకు సంబంధించి ప్రభుత్వానికి సలహాలు, సిఫారసులు చేయడం ఈ సంఘం ముఖ్య లక్ష్యాలు. ఇది చట్టబద్ధమైన సంఘం.

### బలహీన వర్గాల వారికి విద్యాపరమైన సహాయ కార్యక్రమాలు:

షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థుల కోసం సాంఘిక సంక్షేమ శాఖ రాష్ట్రంలో 2,209 హాస్టళ్ళను నిర్వహిస్తోంది. వీటిలో 1,690 బాలుర హాస్టళ్ళు కాగా, 519 బాలికల హాస్టళ్ళు. ఈ హాస్టళ్ళలో మొత్తం 2,20,900 మందికి బోర్డింగ్ సదుపాయం కల్పించబడుతోంది. ఈ హాస్టళ్ళలో 70 శాతం స్థానాలు షెడ్యూలు కులాల వారికి, 12 శాతం క్రైస్తవులుగా మారిన షెడ్యూలు కులాలవారికి 9 శాతం వెనుకబడిన తరగతులవారికి, 5 శాతం షెడ్యూలు తెగలవారికి, 4 శాతం ఇతరులకు కేటాయించడం జరుగుతోంది. ఇవి గాక షెడ్యూలు తెగలవారి కోసం రాష్ట్రంలో ప్రత్యేకంగా 504 హాస్టళ్ళు ఉన్నాయి. వీటిలో 65,095 మందికి వసతి కల్పించబడుతోంది. రాష్ట్రంలో షెడ్యూలు తెగలవారి కోసం ప్రత్యేకించి 451 ఆశ్రమ పాఠశాలలు ఉన్నాయి. వీటిలో 73,029 మంది విద్యార్థులు చదువుకుంటున్నారు. 1996-97 సంవత్సరంలో గిరిజనుల అక్షరాస్యత బాగా తక్కువగా ఉన్న ప్రాంతాలలో 15 ఆశ్రమ పాఠశాలలు, బాలికల కోసం ప్రత్యేకంగా 15 ఆశ్రమపాఠశాలలను ప్రభుత్వం ప్రారంభించాలని తలపెట్టింది. వీటివల్ల అదనంగ 6,760 మంది గిరిజన విద్యార్థులకు ప్రయోజనం చేకూరుతుంది. వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖ క్రింద వెనుకబడిన తరగతులవారి కోసం రాష్ట్రంలో 1,330 హాస్టళ్ళను నిర్వహిస్తున్నారు. ఇవి కాకుండా మత్స్యకారుల పిల్లల కోసం 63 ఆశ్రమ పాఠశాలలను, వడ్డెర్లు, గొర్రెల కాపర్ల పిల్లల కోసం 22 ఆశ్రమ పాఠశాలలను, విముక్త జాతులకు చెందిన పిల్లల కోసం 14 ఆశ్రమ పాఠశాలలను వెనుకబడిన తరగతుల సంక్షేమశాఖ నిర్వహిస్తోంది. వీటితో పాటుగా వెనుకబడిన తరగతులకు చెందిన బాలుర కోసం 7 నైవాసిక పాఠశాలలను, బాలికల కోసం 3 నైవాసిక పాఠశాలలను నిర్వహిస్తోంది. 1996-97 సంవత్సరంలో బాలుర కోసం మరో 3 నైవాసిక పాఠశాలలను ప్రారంభించాలని తలపెట్టింది.

సాధారణ విద్యతోపాటుగా సాంకేతిక విద్యవిషయంలో కూడా షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన

తరగతుల వారు ముందంజ వేసేందుకు రాష్ట్రప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ వహిస్తోంది. షెడ్యూలు కులాల వారికోసం నాగార్జునసాగర్, మహబూబ్‌నగర్, కడపలలో నైవాసిక ఐ.టి.ఐ.లను హత్నూరా (మెదక్ జిల్లా)లో ఒక ఆదర్శ ఐ.టి.ఐ.ని, రాజమండ్రి, మదనపల్లిలో నైవాసిక పాలిటెక్నిక్ కళాశాలలను నిర్వహిస్తున్నారు. షెడ్యూలు తెగలవారి కోసం రాష్ట్రంలో ప్రత్యేకంగా మూడు నైవాసిక పాలిటెక్నిక్ కళాశాలలను, ఏడు ఐ.టి.ఐ.లను ప్రభుత్వం నిర్వహిస్తోంది.

## పరోక్ష పూర్వ శిక్షణా కేంద్రాలు:

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్, బ్యాంకింగ్ సర్వీసులు, స్టాఫ్ సెలక్షన్ కమీషన్‌లతో పాటుగా ఎం.సెట్., ఇ.సెట్., గేట్. జి.ఆర్.ఇ. వంటి పోటీ పరీక్షలలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల విద్యార్థులు ఉత్తీర్ణులయ్యేందుకుగాను, వారి విద్యా ప్రమాణస్థాయిని మెరుగు పరచడానికి హైదరాబాద్‌లో ఎ.పి. స్టడీసర్కిల్, ఆంధ్ర, నాగార్జున, ఉస్మానియా, కాకతీయ, శ్రీకృష్ణదేవరాయ, శ్రీవేంకటేశ్వరా విశ్వవిద్యాలయాలలో ప్రత్యేక శిక్షణాకేంద్రాలను, హైదరాబాదులోని జె.ఎన్.టి.యు.లో ఒక ప్రత్యేక శిక్షణా కేంద్రాన్ని 19 జిల్లా కేంద్రాలలో 19 జిల్లా శిక్షణా కేంద్రాలను రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేసింది.

ఈ శిక్షణా కేంద్రాలలో ఇస్తున్న ప్రత్యేక శిక్షణ షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల అభ్యర్థులు వివిధ పోటీ పరీక్షలలో విజయం సాధించడానికి ఎంతగానో తోడ్పడుతోంది. రాష్ట్రంలోని వివిధ శిక్షణాకేంద్రాల ద్వారా ఇప్పటివరకు దాదాపు ఇరవైవేల మంది విద్యార్థులు లబ్ధి పొందారు. సాధారణ విద్యార్థులతో సమానంగా పోటీపడేందుకు, వారితో సమానంగా విద్యాప్రమాణ స్థాయిని పొందేందుకు ఈ శిక్షణాకేంద్రాలు షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల అభ్యర్థులకు ఇతోధికంగా సహాయ పడుతున్నాయి. ఈ కేంద్రాలపై సాలీనా కోటి రూపాయిల చొప్పున ఖర్చు చేస్తున్నారు.

## ఆర్థిక సాంఘికాభివృద్ధి కార్యక్రమాలు:

ఆర్థికంగా, సామాజికంగా బలహీనవర్గాలవారు అభివృద్ధి చెందడానికి వీలుగా వారికి ఉపాధి అవకాశాలను కల్పించేందుకు, వారి ప్రాథమిక అవసరాలను తీర్చేందుకు, అవసరమైన ఆర్థిక సహాయాన్ని అందించేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పలు సంక్షేమ కార్యక్రమాలను చేపట్టింది. నెహ్రూరోజ్‌గార్ యోజన, ప్రధానమంత్రి రోజ్‌గార్ యోజన, ట్రైసెమ్ డ్వాక్రా, ఉపాధి హామీపథకాలు, సమగ్ర గిరిజనాభివృద్ధి పథకం, ఇందిరా ఆవాస్ యోజన మున్నగునవి వీటిలో ముఖ్యమైనవి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేపడుతున్న ఈ పథకాలన్నిటిలోనూ షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల వారికి ప్రత్యేక ప్రాధాన్యాన్ని ఇచ్చి వారి అభివృద్ధికి ఇతోధికంగా చేయూత నిస్తున్నారు

## ఇళ్ళస్థలాలు, ఇళ్ళ కేటాయింపు:

బలహీన వర్గాల వారికి సముచితమైన నివాస సదుపాయం కల్పించేందుకు మొట్టమొదట్లో ఇళ్ళ స్థలాల కేటాయింపు కార్యక్రమాన్ని ప్రభుత్వం 1976 లో చేపట్టింది. 20 సూత్రాలు, 15 సూత్రాల పథకం క్రింద చేపట్టిన ఈ ఇళ్ళ స్థలాల కేటాయింపు కార్యక్రమాల క్రింద నెలకు 500 రూపాయలు, 5,000 రూపాయల విలువకు మించని ఆస్తి కలిగిన వారికి ఇళ్ళ స్థలాలను కేటాయిస్తారు. ఈ కార్యక్రమం ద్వారా రాష్ట్రంలో 24,29,633 మంది బలహీన వర్గాల కుటుంబాలు ప్రయోజనం పొందాయి.

1980 దశాబ్దంలో ఈ కార్యక్రమాన్ని మరింతగా మెరుగుపరచారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణసంస్థ ఆధ్వర్యంలో బలహీనవర్గాల వారికి శాశ్వత గృహనిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టారు. వార్షిక ఆదాయం 11 వేల రూపాయిలు మించని కుటుంబాల వారు ఈ పథకం క్రింద గృహాలను పొందేందుకు అర్హులు. ఇప్పటివరకు ప్రభుత్వం 1,55,457,62 రూపాయలను వెచ్చించి 21,16,857 గృహాలను నిర్మించి ఇచ్చింది. ఈ కార్యక్రమం క్రింద నిర్మించే గృహాలలో 50 శాతం షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల వారికి, 40 శాతం వెనుకబడిన తరగతులవారికి, 10 శాతం ఆర్థికంగా బలహీన వర్గాల వారికి కేటాయించటం జరుగుతోంది. బలహీనవర్గాల వారికి గృహ సదుపాయాన్ని కల్పించడంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దేశంలో ప్రథమ స్థానంలో ఉంది. బలహీనవర్గాల వారికి గృహసదుపాయాన్ని కల్పించడానికి 1983 నుండి ప్రభుత్వం చూపుతున్న ప్రత్యేక శ్రద్ధే దీనికి కారణం. 1983 నుండి బలహీనవర్గాల వారికి గృహసదుపాయం కల్పించడంలో రాష్ట్రం సాధించిన ప్రగతిని ఈ క్రింది పట్టిక ద్వారా స్పష్టమవుతుంది.

### 1983 నుండి సంవత్సరం వారీగా సాధించిన విజయాలు, వ్యయం

| వరుస సంఖ్య | సంవత్సరం | పూర్తయినవి | వ్యయం (రూ.లక్షలలో) |
|---|---|---|---|
| 1. | 1983 కు ముందు | 51,964 | 2006.39 |
| 2. | 1983–84 | 1,03,151 | 6189.06 |
| 3. | 1984–85 | 92,281 | 5866.86 |
| 4. | 1985–86 | 63,039 | 9782.34 |
| 5. | 1986–87 | 1,25,121 | 10502.26 |
| 6. | 1987–88 | 1,38,353 | 10655.52 |
| 7. | 1988–89 | 1,38,593 | 9113.14 |
| 8. | 1989–90 | 97,812 | 7925.90 |
| 9. | 1990–91 | 77,280 | 7877.35 |
| 10. | 1991–92 | 2,03,574 | 2939.90 |
| 11. | 1992–93 | 1,63,613 | 1069.87 |
| 12. | 1993–94 | 2,09,522 | 551.00 |
| 13. | 1994–95 | 2,17,135 | 17370.80 |
| 14. | 1995–96 | 2,80,199 | 23602.05 |
| | మొత్తం | 19,61,637 | 1,15,452.44 |

### ఆర్థిక సహాయ కేంద్రాలు:

బలహీనవర్గాల వారిని ప్రైవేటు ఋణదాతల బారి నుండి రక్షించేందుకు, వారు ఆర్థికాభివృద్ధిని త్వరిత గతిన సాధించేందుకు తగిన ఆర్థిక సహాయంచేసేందుకై ప్రభుత్వం కొన్ని సంస్థలను స్థాపించింది. వీటికి తోడు జాతీయం చేసిన బ్యాంకుల నుండి ఈ బలహీనవర్గాల వారికి ఋణ సౌకర్యం కల్పించబడుతోంది. ప్రధానంగా 1976 నుండి ఈ బలహీనవర్గాల వారికి ఋణ సహాయం అందివ్వడం అధికం చేయడమే కాకుండా ప్రత్యేకమైన రాయితీలను, సదుపాయాలను కల్పించింది. ఆర్థిక సహాయం చేయడమే కాకుండా ప్రైవేటు ఋణదాతల బారి నుండి రక్షించేందుకు ప్రభుత్వం కొన్ని చట్టాలను కూడా చేసింది. వాటిల్లో షెడ్యూల్ ఏరియా ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ యాక్ట్ ఆంధ్రప్రదేశ్ మనీ లెండర్స్ రెగ్యులేషన్ యాక్టు (షెడ్యూలు ట్రైబ్స్) ప్రధానంగా పేర్కొనదగినవి.

ల్యాండ్ ట్రాన్స్‌ఫర్ యాక్ట్ (1959) అనుసరించి షెడ్యూల్డు ప్రాంతంలోని భూములను షెడ్యూల్డు జాతులకు చెందని – సవరణ మూలంగా షెడ్యూల్డు జాతులకు చెందని – వారిపేర ఎటువంటి భూమికి సంబంధించిన రిజిస్ట్రేషన్‌లు చేయకూడదు. దీనికి వ్యతిరేకంగా ప్రవర్తించినట్లైతే 1 సంవత్సరం కారాగారం లేదా 2000 రూపాయల వరకు జరిమానా విధించే అవకాశం వుంది. ఈ చట్టం మూలంగా షెడ్యూల్డు జాతులకు చెందిన భూములు అన్యాక్రాంతమవకుండా నిరోధించే ఏర్పాటు జరిగింది.

1977 లో రూపొందించిన వ్యవసాయ ఋణాల మాఫీ చట్టం అనుసరించి వ్యవసాయ కార్మికులు గ్రామీణ పనివారితో పాటు షెడ్యూల్డు వారి ఋణాలను పూర్తిగా రద్దు చేశారు. ఈ చట్టం క్రిందకు రాని షెడ్యూల్డు జాతుల వారిని ఆంధ్రప్రదేశ్ (షెడ్యూల్డు ట్రైబ్స్) డెట్ రిలీఫ్ రెగ్యులేషన్ చట్టంద్వారా వారికున్న ఋణాలను వాటిపై వడ్డీలను పూర్తిగా రద్దుచేశారు.

ఈ చట్టాల మూలంగా షెడ్యూల్డు జాతుల వారు షెడ్యూల్డు కులాల వారిని వడ్డీ వ్యాపారస్థుల బారి నుండి, అన్యాక్రాంతంగా భూములు ఆక్రమించే వారి నుండి కాపాడడం జరుగుతోంది. ఈ రక్షణలు కల్పించడమే కాకుండా బలహీన వర్గాల వారికి తగిన ఆర్థిక సహాయం చేయటానికి, ఋణసౌకర్యం కల్పించటానికి కొన్ని సంస్థలను నెలకొల్పింది.

### 1. ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు కులాల సహకార ఆర్థిక సంస్థ:

రాష్ట్రంలోని షెడ్యూల కులాల వారికి ఆర్థిక స్వావలంబన కల్పించడానికి, స్వయం ఉపాధి పథకాలకు తగిన ఆర్థిక సహాయాన్ని అందించి తద్వారా వారు ఆర్థికంగా ముందంజ వేయడానికిగాను రాష్ట్ర ప్రభుత్వం 7–2–1974న షెడ్యూలు కులాల సహకార ఆర్థిక సంస్థను హైదరాబాద్‌లో స్థాపించింది. ఈ సంస్థకు అనుబంధంగా రాష్ట్రంలో 23 జిల్లాలలో జిల్లా షెడ్యూలు కులాల సేవా సహకార సంఘాలు ఉన్నాయి. రాష్ట్ర షెడ్యూలు కులాల సహకార ఆర్థిక సంస్థ జిల్లా సంఘాలకు మార్జిను సొమ్మును సమకూరుస్తుంది. బ్యాంకులు, ఇతర ఆర్థిక సహాయ సంస్థల ద్వారా జిల్లా సంఘాలు లబ్ధిదారులకు అవసరమైన ఋణాలను అందించడానికి తగిన సహాయం చేయడమే కాకుండా లబ్ధిదారుల మార్జిను సొమ్మును కూడా విడుదల చేస్తాయి. ప్రభుత్వ నిర్దేశాలకు అనుగుణంగా కొన్ని పథకాలకు సబ్సిడీ ధనాన్ని కూడా షెడ్యూలు కులాల వారికి సమకూరుస్తాయి. ప్రారంభంలో రాష్ట్ర షెడ్యూలు కులాల ఆర్థిక సహకార సంస్థ వాటా మూలధనం 500 లక్షల రూపాయిలు కాగా ప్రస్తుతం ఈ సంస్థ వాటా మూలధనం 250 కోట్లరూపాయలకు చేరుకుంది. రాష్ట్ర షెడ్యూలు కులాల ఆర్థిక సంస్థ ప్రధాన ఉద్దేశాలు లక్ష్యాలు:

వ్యవసాయం అభివృద్ధి, పశుసంవర్ధన, మార్కెటింగు, ప్రాసెసింగు, వ్యవసాయ ఉత్పత్తుల సరఫరా, నిల్వ, లఘు పరిశ్రమ, కుటీర పరిశ్రమ, వర్తకం, వ్యాపారం లేదా ఏదేని యితర కార్యకలాపాలకు సంబంధించిన సహాయ కార్యక్రమాలను రూపొందించి, ప్రోత్సహించి, చేపట్టడం, ఈ కార్యక్రమాలు షెడ్యూలు కులాల సభ్యులకు మంచి జీవనాన్ని సాగించడానికి, వారి జీవన ప్రమాణాలు మెరుగు పరచడానికి సహాయపడతాయి.

తన సభ్యులకు అవసరమైన ద్రవ్యపరమైన పూచీ సమకూర్చడంతో పాటు పై ఆశయాలను సాధించడంలో అవసరమగు సాంకేతిక పరిజ్ఞానం, మేనేజీరియల్, ఆర్థిక సహాయం సమకూర్చడం ద్వారా కుటీర పరిశ్రమలు, లఘు పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు మొదలైన ఉద్యోగ వసతికి దోహదం చేసే కార్యక్రమాలను చేపట్టడం.

షెడ్యూలు కులాల వారికి ఉపాధి సమకూర్చేందుకు, వ్యాపార అవకాశాలను నిర్ధారించేందుకు, కుటీర, గ్రామీణ పరిశ్రమలకు, చిన్నతరహా వ్యాపారానికి సంబంధించిన సమస్యల గురించి పరిశోధన లేదా అధ్యయనం జరపడానికి అవకాశాలు కల్పించడం.

షెడ్యూలు కులాల సభ్యులకు ఋణాలు, నగదు పరపతి మొదలైన వాటిని అందజేయడం ద్వారా నిర్వహణ మూలధనం సమకూర్చడం.

1974 నుండి వివిధ ఆర్థిక సహాయ కార్యక్రమాల క్రింద రాష్ట్ర షెడ్యూలు కులాల ఆర్థిక సంస్థ ఇప్పటివరకు వివిధ సంస్థల ద్వారా షెడ్యూలు కులాల వారికి 146.40 కోట్ల రూపాయలను మార్జిను సొమ్ముగా విడుదల చేసింది. 100 కోట్ల రూపాయలకు పైగా సబ్సిడీల రూపంలో సహాయం చేసింది. వీటన్నిటి ద్వారా మొత్తంగా ఇప్పటి వరకు ఇరవైఏడు లక్షల షెడ్యూలు కులాల కుటుంబాల వారు ప్రయోజనం పొందారు.

కుటీర పరిశ్రమలు, చిన్న చిన్న వ్యాపారాలు చేసుకునే వారికి సహాయం, వ్యవసాయ భూములు కొనుగోలుకు సహాయం, మిగులు భూముల అభివృద్ధికి, సాగునీటి పారుదల అభివృద్ధికి, వ్యవసాయాధార పరిశ్రమలకు సహాయం. బావుల తవ్వకం, నర్సరీల పెంపకం, వ్యవసాయ ఉత్పత్తులు ప్రొసెసింగ్, మార్కెటింగ్‌కు ఆర్థిక సహాయం, తోటలు, వనాల పెంపకానికి సహాయం, పట్టు పరిశ్రమలకు ఆర్థిక సహాయం అందించడంతో పాటుగా విదేశాలలో పై చదువులు, ఉద్యోగాల నిమిత్తం వెళ్ళే షెడ్యూలు కులాల వారికి అవసరమైన ఆర్థిక సహాయాన్ని అందించే కార్యక్రమాలను కూడా రాష్ట్ర షెడ్యూలు కులాల ఆర్థిక సహకార సంస్థ చేపట్టింది. షెడ్యూలు కులాల ఆర్థికాభివృద్ధికై ప్రత్యేక అంశ ప్రణాళిక క్రింద కేంద్రం ఇచ్చే సహాయం, పారిశుద్ధ పని వారల విముక్తికి పునరావాసానికి రూపొందించిన జాతీయ పథకం, దారిద్ర్యనిర్మూలన పథకం మొదలైన వాటికి కేంద్రం ఇచ్చే నిధులను కూడా ఈ సంస్థే లబ్ధిదారులకు అందించి ఆయా కార్యక్రమాల అమలుకు కృషి చేస్తోంది.

## 2. షెడ్యూలు తెగల ఆర్థిక సహకార సంస్థ:

షెడ్యూలు తెగల వారిని ఆర్థికంగా అభివృద్ధి చేసేందుకు అవసరమైన ఆర్థిక వనరులను కల్పించి, తగిన పథకాలను రూపొందించి అమలు చేసేందుకు రాష్ట్రప్రభుత్వం 1976 లో షెడ్యూలు తెగల ఆర్థిక సహకార సంస్థను హైదరాబాద్‌లో స్థాపించింది. వార్షిక ఆదాయం 6 వేల రూపాయలులోపు ఉంటే గిరిజనులకు వ్యవసాయం, నర్సరీల పెంపు, తోటల పెంపకం, వ్యవసాయ సంబంధ కార్యక్రమాలకు కావలసిన ఆర్థిక సహాయాన్ని ఈ సంస్థ అందిస్తుంది. 12 వేల రూపాయలు మించని వార్షిక ఆదాయం కలిగిన గిరిజనులకు స్వయం ఉపాధి, రవాణా రంగాలకు సంబంధించిన కార్యక్రమాలు, కుటీర పరిశ్రమలు మున్నగు వాటికి ఆర్థిక సహాయాన్ని అందిస్తుంది. లబ్దిదారులకు బ్యాంకుల ద్వారా ఋణాలను ఇప్పించి, అందుకుకావలసిన మార్జిను సొమ్మును, సబ్సిడీని ఈ సంస్థ అందిస్తుంది. ఇప్పటి వరకు ఈ సంస్థ 224,13,069 రూపాయల విలువగల పథకాలకు ఆర్థిక సహాయాన్ని అందించింది. వివిధ పథకాల క్రింద 108,95,492 లక్షల రూపాయల సబ్సిడీని షెడ్యూలు తెగల వారికి అందించింది. 44,66,846 లక్షల రూపాయలను మార్జిను సొమ్ముగా వారికి అందించింది. 1976 నుండి షెడ్యూలు తెగల ఆర్థిక సహకార సంస్థ అందిస్తున్న ఆర్థిక సహాయంవల్ల ఇప్పటి వరకు మన రాష్ట్రంలో 5,53,195 షెడ్యూలు తెగల కుటుంబాల వారు ప్రయోజనం పొందారు. ఈ సంస్థకు అవసరమైన ఆర్థిక వనరులను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందిస్తున్నాయి. 1976 నుండి 1996 వరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలనుండి షెడ్యూలు తెగల ఆర్థిక సహకార సంస్థకు 37,50,439 లక్షల రపాయలు అందాయి. గత మూడు సంవత్సరాల కాలంలోనే 13,33,354 లక్షల రూపాయలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి ఈ సంస్థకు ఆర్థిక సహాయం క్రింద అందాయి. షెడ్యూలు తెగల కుటుంబాల ఆర్థిక పురోభివృద్ధికి సహాయం అందించేందుకు ఇటీవల కాలంలో ప్రాధాన్యం పెరిగిందనడానికి ఇది ఒక ఉదాహరణ.

## 3. గిరిజన సహకార సంస్థ:

అడవులలో గిరిజనులు సేకరించే అటవీ ఉత్పత్తులు, వ్యవసాయోత్పత్తులను సేకరించి లాభసాటిగా అమ్మి పెట్టేందుకు, వారికి కావలసిన రుణసౌకర్యం, సాంకేతిక శిక్షణను ఇచ్చేందుకు 1956 లో గిరిజన సహకార సంస్థను ప్రభుత్వం ఏర్పాటు చేసింది: మధ్యదళారులు, వడ్డీవ్యాపారుల నుండి గిరిజనులను రక్షించడం ఈ సంస్థ ముఖ్య లక్ష్యం.

బంక, అడ్డాకులు, చింతపండు, నైగర్‌సీడ్, తేనె, ప్రత్తి, ఫ్రెంచ్ బీన్సు వంటి అటవీ ఉత్పత్తులను, వ్యవసాయోత్పత్తులను, కాఫీ గింజలు, జీడిపప్పు మున్నగు వాటిని సేకరించి, వాటికి సరైన ధరలను నిర్ణయించి మార్కెటింగు సౌకర్యం కల్పించడం;

బియ్యం, కిరోసిన్, నూనె, పంచదార, గోధుములు వంటి నిత్యావసర సరుకులను గిరిజనులకు సరసమైన ధరలకు అందించడం.

గిరిజనులు వడ్డీ వ్యాపారుల బారిన పడకుండా తమ కార్యక్రమాలను కొనసాగించుకోవడానికి వీలుగా తేలిక పద్ధతులలో తక్కువ వడ్డీపై స్వల్పకాలిక ఋణ సదుపాయాన్ని కల్పించడం ఈ సంస్థ లక్ష్యాలుగా ఉన్నాయి.

గిరిజన సహకార సంస్థ గత 5 సంవత్సరాల కాలంలో సాగించిన అటవీ ఉత్పత్తులు, వ్యవసాయోత్పత్తులు సేకరణ, అమ్మకాలు, నిత్యావసర వస్తువుల పంపిణీ, వ్యవసాయ పనిముట్ల పంపిణీ వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| వరుస సంఖ్య | అంశము | 1991–92 | 1992–93 | 1993–94 | 1994–95 | 1995–96 |
|---|---|---|---|---|---|---|
| 1. | సేకరణ | | | | | |
| | చిన్నతరహా అటవీ ఉత్పత్తులు | 1020 | 790 | 1020 | 820 | 989.00 |
| | వ్యవసాయోత్పత్తులు | 670 | 490 | 250 | 210 | 279.00 |
| | మొత్తం | 1690 | 1280 | 1270 | 1030 | 1268.00 |
| 2. | అమ్మకాలు | | | | | |
| | చిన్నతరహా అటవీ ఉత్పత్తులు | 1200 | 970 | 1250 | 990 | 1375.00 |
| | వ్యవసాయోత్పత్తులు | 790 | 340 | 420 | 130 | 109.00 |
| | మొత్తం | 1990 | 1310 | 1670 | 1120 | 1484.00 |
| 3. | నిత్యావసర వస్తువుల పంపిణీ: | 4040 | 4290 | 4680 | 4770 | 3682.47 |
| 4. | వ్యవసాయ పనిముట్లు పంపిణీ | 260 | 640 | 600 | 310 | 235.00 |
| 5. | టర్నోవర్ (వాణిజ్య) (2+3+4) | 6290 | 6240 | 6950 | 6200 | 5401.47 |
| 6. | జమ పద్దు | 700 | 1330 | 930 | 790 | 471.37 |
| 7. | మొత్తము (5+0) | 6990 | 7570 | 7880 | 6990 | 5872.84 |

**స్వల్పకాలిక ఋణాలు:**

గిరిజనుల అవసరాలను తీర్చేందుకు గిరిజన ఆర్థిక సంస్థ 1990 నుండి స్వల్పకాలిక ఋణాలను ఇవ్వడం ప్రారంభించింది. ఇప్పటి వరకు గిరిజనులకు ఇచ్చిన ఋణాల వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

(రూ.లక్షలలో)

| సంవత్సరము | ఋణము పొందిన వారి సంఖ్య | పంచినవి | తిరిగి రాబట్టిన ఋణాలు | తిరిగి రాబట్టిన ఋణాల శాతం |
|---|---|---|---|---|
| 1990–91 | 8,064 | 158.75 | 158.75 | 100 |
| 1991–92 | 40,132 | 538.84 | 538.84 | 100 |
| 1992–93 | 84,819 | 1232.28 | 1083.85 | 88 |
| 1993–94 | 59,500 | 891.27 | 441.25 | 49 |
| 1994–95 | 24,121 | 596.92 | 347.33 | 77 |
| 1995–96 | 16,483 | 471.37 | 235.11 | 50 |
| | | 3889.43 | 2805.13 | 72 |

ఇవికాక భూమి అభివృద్ధి, జలవనరుల అభివృద్ధి, విద్యుత్ పంపుసెట్లు, ఆయిల్ ఇంజన్లు పైపులైన్లు, ఉద్యాన వనముల ద్వారా మొక్కల పెంపకం, వ్యవసాయ పనిముట్లు కొనుగోలు కొరకు ఈ సంస్థ మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాలను కూడా అందిస్తుంది. ఈ కార్యక్రమం క్రింద ఇప్పటి వరకు 691.11 లక్షల రూపాయలను 20,197 గిరిజన కుటుంబాలకు అందించింది. ఇది కాకుండా త్రిఫ్ట్‌సొసైటీల ద్వారా 197 గ్రూపులకు 4,468 సభ్యులు లబ్దిపొందేందుకు 51.94 లక్షల రూపాయలను ఋణాలుగా ఇచ్చింది. గిరిజనులకు సహాయపడేందుకు గిరిజన సహకార సంస్థ అరకులో తేనె పరిశ్రమను, రాజమండ్రి, విశాఖ పట్టణాలలో నూనె, సబ్బుల తయారీ, షీకాకాయ, కుంకుడుకాయ పరిశ్రమలను నిర్వహిస్తోంది.

గిరిజనుల సత్వర అభివృద్ధి కోసం రాష్ట్ర ప్రభుత్వం కాఫీతోటల పెంపకం, ఉద్యాన వనాల పెంపకం, అంతర్జాతీయ

వ్యవసాయ నిధి పథకం, దారిద్ర్య నిర్మూలనా పథకాలను ప్రత్యేకంగా రూపొందించి అమలు చేస్తోంది. వీటితో పాటుగా గిరిజన ప్రాంతాలలో రోడ్డు, రవాణా సదుపాయాల వంటి మౌలిక సదుపాయాల కల్పనకుకూడా రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తోంది.

## 4. ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక సహాయ కార్పోరేషను:

షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలవారితో పాటుగా వెనుకబడిన తరగతుల వారిని కూడా అభివృద్ధి పరిచేందుకు వీలుగా తగిన కార్యక్రమాలను నిర్వహించేందుకు 1974 సెప్టెంబరు 4న ఈ కార్పోరేషనుని హైదాబాదులో స్థాపించారు. రాష్ట్రమంతటికి ఈ సంస్థ కార్యక్రమాలు విస్తరించి ఉంటాయి.

### లక్ష్యాలు, ఆశయాలు:

1. వెనుకబడిన తరగతులవారు ఉత్తమ జీవనాన్ని పొందడం లోనూ, వారు తమ జీవన స్థాయిని పెంపొందించు కోవడంలోను తోడ్పడడానికి వీలుగా వ్యవసాయాభివృద్ధి పశుపోషణ మార్కెటింగ్ ప్రోసెసింగు, వ్యవసాయ ఉత్పత్తుల సరఫరా, నిల్వ, లఘు పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, వాణిజ్యం, వ్యాపారం ఇతర కార్యక్రమాలకు సంబంధించి, ప్రణాళికలు రూపొం దించడం, ప్రోత్సాహ పర్చడం, అమలును చేపట్టడం, సహాయపడటం.
2. సాంకేతిక పరిజ్ఞానం అందజేయడం, యాజమాన్యం నిర్వహణ సహాయం ఆర్థిక సహాయం మొదలైన సహా యాలు అందజేయడం ద్వారా వ్యవసాయ పరిశ్రమలు, కుటీర, లఘు పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలు మొదలైన ఉపాధితో కూడిన పథకాలను పెద్ద ఎత్తున చేపట్టడం.

### జిల్లా సంఘాలు:

దరఖాస్తుల పరిశీలన, బ్యాంకుల తోడ్పాటు పొందడానికి, పథకాలను అమలు చేయడానికి వీలుగా జిల్లా కలెక్టర్లు అధ్యక్షులుగా అన్ని జిల్లాలలో జిల్లా సంఘాలను ఏర్పాటు చేశారు. ఒక ఎగ్జిక్యూటివ్ అధికారి, అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ అధికారి, సీనియర్ అసిస్టెంట్లు, సీనియర్ ఇన్‌స్పెక్టర్లు ఇతర సిబ్బందీ వున్నారు.

### సహాయం పద్ధతి:

ఈ కార్పోరేషను పథకం, పెట్టుబడిలో 20 శాతం మార్జిన్ డబ్బు అందజేస్తుంది. మిగతా 80 శాతం పెట్టు బడిని సంస్థాగత ఆర్థిక సహాయం ద్వారా సమకూరుస్తారు. వెనుకబడిన తరగతుల ప్రయోజనార్థ బ్యాంకు ఋణంతో పాటు మార్జిన్ డబ్బు పెట్టుబడిని జిల్లా సంఘాలకు విడుదల చేస్తారు.

కార్పోరేషన్ అందజేసే మార్జిన్ డబ్బు పెట్టుబడి ఋణముపై సంవత్సరానికి $6\frac{1}{2}$ శాతం వడ్డీ విధిస్తారు. అమలు ఉన్న బ్యాంకుల వడ్డీ రేటును బ్యాంకు ఋణంపై విధిస్తారు.

### నమూనా పథకాలు:

వెనుకబడిన తరగతుల సంక్షేమం నిమిత్తం నమూనా పథకాలను రూపొందించారు. వాటిని అమలు జరపడానికి వీలుగా జిల్లా కలెక్టర్లకు పంపబడినవి. అవి:

#### 1. ఇంజనీరింగ్ పరిశ్రమ:

1. జనరల్ ఇంజనీరింగు వర్కుషాపు
2. గ్యాస్ వెల్డింగ్, గ్రిల్ తయారీ షాపు
3. ఆటోమోబైలు వర్కుషాపు
4. ప్లాస్టిక్ రేన్‌కోట్ల తయారీ
5. సూట్‌కేసులు, ఎటాచ్ కేసుల తయారీ పరిశ్రమ
6. లారీ బాడీల తయారీ
7. ట్యూబ్‌లైటు పిక్చర్, తయారీ
8. దారం రీళ్ళ తయారీ పరిశ్రమ
9. రబ్బరు స్టాంపుల తయారీ
10. కిచన్ పౌడర్ల తయారీ
11. చెక్కబొమ్మల తయారీ పరిశ్రమ
12. వక్కపొడి తయారీ పరిశ్రమ
13. ముద్రణాలయాలు
14. అద్దకం, ప్రింటింగు
15. పవర్ మగ్గాలు
16. చేనేత పనివారలకు ప్యాకేజి కార్యక్రమం
17. బుట్టల అల్లకం, బెత్తం పరిశ్రమ
18. బేబీ ఆయిల్ మిల్లు
19. పడకు యంత్రాలు

#### 2. వృత్తిపరమైన మార్గాలు:

1. టైలరింగ్
2. వడ్రంగం, కమ్మరం
3. పాదరక్షల తయారీ
4. జరీ కామ్‌గారి పనులు
5. నూనె తయారీ
6. నాయీ బ్రాహ్మణుల పథకాలు
7. రజకుల పథకాలు
8. కుమ్మరి పని పథకాలు
9. కమ్మరి పని పథకాలు

10. వడ్రంగం పని పథకాలు
11. చెరువులు, కుంటలు, నదులలో చేపలు పట్టడం పని పథకాలు
12. దుస్తుల తయారీ యూనిట్ల పథకం
13. ఇటుకలు, పెంకులు తయారీ పథకం
14. బెత్తం ఫర్నిచరు పరిశ్రమ

3. వ్యాపారం:

1. జరీ, ఎంబ్రాయిడరీ దుకాణం
2. సైకిల్ షాపు
3. టైపురైటింగు సంస్థ
4. బొగ్గు దుకాణాలు
5. హోటల్ నిర్వహణ
6. పండ్లు, కూరగాయల దుకాణం
7. ఫోటో స్టూడియో
8. ఆటోరిక్షా సర్వీసు
9. సిగరెట్ – పాన్ దుకాణాలు
10. టీ–స్టాల్
11. వంట చెరకు దుకాణం
12. ఊరగాయల తయారీ
13. పిండమర దుకాణం
14. రిక్షావాలా పథకం
15. జనరల్ స్టోర్స్
16. యాంత్రిక రిక్షాలు
17. మందుల దుకాణం
18. కోల్డ్ స్టోరేజీ
19. గచ్చు చిత్రవర్ణాల తయారీ (మొసాయిక్ చిప్స్)
20. పుస్తకాల బైండింగు పథకం

4. వ్యవసాయం:

1. పొగాకు సేద్యం
2. చెరకు పంట సేద్యం
3. ఆముదాల పంట
4. ఆర్–63 అరుణ సేద్యం
5. మిర్చిపంట
6. వరిసేద్యం
7. సేద్యపు బావులకు ఆయిల్ ఇంజనులు, పంపుసెట్ల సరఫరా
8. విద్యుచ్ఛక్తి మోటార్ల సరఫరా
9. సేద్యపు బావుల త్రవ్వకం
10. పట్టు పరిశ్రమ
11. ఎడ్లు, బండ్ల సరఫరా

5. పశుపోషణ:

1. కోళ్ళ పెంపక క్షేత్రం – ఎ (1000 కోళ్లు)
2. కోళ్ళ పెంపకం క్షేత్రం – బి (500 కోళ్లు)
3. గొర్రెల పెంపకం (20+1)
4. పందుల పెంపకం
5. బాతుల పెంపకం
6. మేకల సరఫరా
7. పాడి పశువుల పథకం

ఇంతవరకు రాష్ట్రం మొత్తం మీద ఈ సంస్థ సహాయ మూలంగా 3,43,588 మంది వెనుకబడిన తరగతులకు చెందినవారు లబ్ధిపొందారు.

## సమగ్ర గిరిజనాభివృద్ధి ఏజన్సీ:

షెడ్యూలు తెగలవారి అభివృద్ధిని ఒక క్రమ పద్ధతిలో నిర్వహించేందుకు ప్రత్యేక శ్రద్ధతో కార్యక్రమాలను రూపొందించేందుకు 1972 లో కేంద్ర ప్రభుత్వం ఈ సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాన్ని రూపొందించింది. దీనిని అనుసరించి షెడ్యూలు జాతులు అధికంగా ఉన్న శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, ఆదిలాబాదు, ఖమ్మం, వరంగల్ జిల్లాలకు ట్రైబల్ వెల్ ఫేర్ సబ్ ప్లానును రూపొందించడం జరిగింది.

## గిరిజన డెవలప్ మెంట్ ఏజన్సీ యొక్క కార్యక్రమాలు:

1. వ్యవసాయం: విత్తనాలు ఇచ్చుట, నాగళ్ళు, ఎద్దులు, భూమి అభివృద్ధి చేయుట, ఎరువులు సమకూర్చుట.
2. తోటలను అభివృద్ధి చేయుట
3. పశు సంవర్ధకం – గొర్రెలను, బాతులను, ఎద్దులను, కోడి పిల్లలను అందజేయుట.
4. కమ్యూనికేషన్ – రోడ్లు వేయుట.
5. చిన్న నీటి పారుదల వసతులు – బావులు త్రవ్వుట, విద్యుత్ పంపుసెట్లు అమర్చుట.

దీనితో పాటుగా ప్రిమిటివ్ ట్రైబల్స్‌ను కూడా అభివృద్ధి పరిచేందుకు, మైదానాలలో నివసించే గిరిజనులభివృద్ధిని సాధించేందుకు వీలుగా (యమ్ ఎ.డి.ఎ) సబ్ ప్లానును రూపొందించారు. దీనిని అమలు పరచటానికి వీలుగా వివిధ జిల్లాలలోని 31 ప్రాంతాలను గుర్తించటం జరిగింది. ఇంతవరకు మైదాన ప్రాంతాలలో నివసించే 9.72 లక్షల గిరిజనులు ఈ పథకం క్రింద కేటాయింపులు పొందారు.

వివిధ పంచవర్ష ప్రణాళికలలో షెడ్యూలు కులాల షెడ్యూలు తెగల, వెనుకబడిన తరగతుల అభివృద్ధికై కేటాయించిన మొత్తం

(లక్షల రూపాయలలో)

| | షెడ్యూలు కులాలు | వెనుకబడిన తరగతులు | షెడ్యూలు తెగలు |
|---|---|---|---|
| ప్రథమ ప్రణాళిక * | 384.87 | = | = |
| ద్వితీయ ప్రణాళిక | 196.64 | = | 247.16 |
| తృతీయ ప్రణాళిక | 205.39 | = | 234.61 |
| మూడు వార్షిక ప్రణాళికలు | 29.50 | = | 69.07 |
| నాల్గవ ప్రణాళిక | 257.04 | = | 502.90 |
| ఐదవ ప్రణాళిక | | | |
| ఆరవ ప్రణాళిక | 11,000.00 | 6,000.00 | 3,000.00 |
| ఏడవ ప్రణాళిక | మొత్తంగా | 30,000.00 | |
| ఎనిమిదవ ప్రణాళిక | మొత్తంగా | 48,21,000 | |

* ప్రథమ పంచవర్ష ప్రణాళికలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల వారందరికి కలిపి ఒకే కేటాయింపు జరిగింది. 2వ ప్రణాళిక నుండి 5వ ప్రణాళిక వరకు షెడ్యూలు కులాలు, వెనుకబడిన తరగతులవారికి కలిపి ఒకే కేటాయింపు జరిగింది.

రాష్ట్రంలో బలహీనవర్గాల అభివృద్ధి కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విడి విడిగాను, సంయుక్తంగాను గత నాలుగు దశాబ్దాలుగా పలు సంక్షేమ కార్యక్రమాలను చేపడుతున్నాయి. ఏటా కోట్లాది రూపాయల ధనాన్ని బలహీన వర్గాల అభివృద్ధికై వెచ్చిస్తున్నాయి. అయినా మన రాష్ట్రంలో బలహీన వర్గాల వారు ఆర్థికంగా, సామాజికంగా అనుకున్నంత అభివృద్ధిని సాధించలేకపోతున్నారు. ముఖ్యంగా గిరిజనులు ఇంకా బాగా వెనుకబడే వున్నారు. గిరిజనుల అక్షరాస్యత విషయాన్ని తీసుకుంటే వారి వెనుకబాటు తనం ఎంతగా ఉందో స్పష్టమవుతుంది. సాధారణ జనాభాలో అక్షరాస్యుల శాతం 44.09 శాతం ఉండగా గిరిజనులలో అక్షరాస్యుల శాతం కేవలం 17.16 శాతం మాత్రమే. ముఖ్యంగా గిరిజన స్త్రీలలో అక్షరాస్యతా శాతం బాగా తక్కువగా ఉంది. గిరిజన స్త్రీలలో అక్షరాస్యుల శాతం 8.68 శాతం మాత్రమే. గిరిజనుల సంక్షేమం కోసం ప్రభుత్వాలు చేపడుతున్న పథకాలు సత్ఫలితాలను సాధించడం లేదనడానికి ఇంతకు మించిన ఉదాహరణ ఇంకేం కావాలి. గిరిజనులు ఈ నాటికి ఆర్థికంగా, సామాజికంగా దోపిడీకి గురౌతూనే ఉన్నారు. రోడ్లు, రవాణా సదుపాయాలు విద్యా సదుపాయాలు వంటి కనీస మౌలిక సదుపాయాలు లేకుండా దుర్భర జీవితాన్ని గడుపుతూనే ఉన్నారు. బలహీనవర్గాల సంక్షేమం కోసం ప్రభుత్వం చేపడుతున్న కార్యక్రమాలు వాస్తవానికి వాటి అవసరమున్న వారికి అందుబాటు కావడం లేదు. బలహీనవర్గాల వారిలో పట్టణ ప్రాంతాలలో నివసిస్తున్న వారు, వాళ్ళలో కొంచెం అభివృద్ధి చెందిన వారు మాత్రమే ఆ పథకాలను పదే పదే వినియోగించుకుని లబ్ధి పొందుతున్నారు.

బలహీన వర్గాల అభివృద్ధి కోసం ప్రభుత్వం తొలుత చేపట్టిన పథకాలలోని లోపాలవల్ల కూడా వారి సత్వర అభివృద్ధి సాధ్యం కావడంలేదు. ఏ ప్రయోజనాన్ని ఆశించి సహాయ సంక్షేమ కార్యక్రమాలను చేపడుతున్నారో ఆ ప్రయోజనాలు నెరవేరినా, నెరవేరక పోయినా వాటిని కొనసాగిస్తూ వచ్చారు. అంతేకాకుండా, మొత్తంగా సమాజ అభివృద్ధి పథంలో వారిని భాగంగా చేసేందుకు కాకుండా వారిని ప్రత్యేకం చేసి వేరుగా చూసే ధోరణిని అలవర్చుకున్నారు. బలహీనవర్గాల వారు ఎక్కువగా కేంద్రీకృతమై ఉంది గ్రామీణ ప్రాంతాలలో. ఆ వాస్తవాన్ని మరచి గ్రామీణ ప్రాంతాలలోని బలహీన వర్గాల వారికి అనువుకాని పథకాలను రూపొందించి అమలుచేయ పూనుకున్నారు. ఈ లోపాల వల్ల బలహీన వర్గాల సత్వర అభివృద్ధి మన రాష్ట్రంలో సాధ్యంకాలేదు.

అయితే ఈ లోపాలను సరిదిద్దేందుకు ప్రభుత్వాలు ఇటీవల కాలంలో ముమ్మర ప్రయత్నాలు చేస్తున్నాయి. బలహీన వర్గాల కోసం చేపట్టే కార్యక్రమాలకు గ్రామీణ ప్రాంతాలను కేంద్రాలుగా ఎంచుకుని అమలు చేస్తున్నారు. ఏదో పై నుంచి సహాయం చేస్తున్నాం అన్నట్లుగా కాకుండా వారంతట వారు స్వయంగా అభివృద్ధి చెంది నిలదొక్కుకునేందుకు అవసరమైన పథకాలను, కార్యక్రమాలను రూపొందించి అమలు చేస్తున్నారు. షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల వారి సంక్షేమం కోసం చేపడుతున్న కార్యక్రమాలలో వారిని కూడా పథక రూపకల్పన స్థాయినుండి భాగస్వాములను చేస్తున్నారు. సంక్షేమ పథకాలవల్ల వనగూడే ప్రయోజనాలను విశదపరచి వారికి స్పష్టంగా అర్థమయ్యేలా వివరించి చెప్పడానికి కూడా ప్రభుత్వ సంస్థలు శ్రద్ధ తీసుకుంటున్నాయి.

బలహీనవర్గాల వారిలో ముఖ్యంగా షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల వారిలో విద్యాస్థాయి పెరగనిదే ఎన్ని కార్యక్రమాలను చేపట్టినా ప్రయోజనం ఉండదన్న వాస్తవాన్ని ప్రభుత్వాలు గ్రహించాయి. అందువల్లే ఇటీవల కాలంలో బలహీనవర్గాల వారి విద్యాస్థాయిని పెంపొందించడానికి ప్రభుత్వాలు కేటాయింపులు పెంచి ఆయా కార్యక్రమాలను ముమ్మరం చేసింది.

అంతేకాకుండా ప్రభుత్వం చేపట్టే అన్ని రకాల అభివృద్ధి కార్యక్రమాలలోను బలహీన వర్గాల వారికి, ప్రాధాన్య మిస్తున్నారు. అంతేకాకుండా రోడ్లు, రవాణా సదుపాయాలు, సమాచార సదుపాయాలు కల్పించే విషయంలో కూడా బలహీనవర్గాల వారు నివసించే ప్రాంతాలకు ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఒక కోణం నుంచి కాకుండా బలహీనవర్గాల సర్వతోముఖాభివృద్ధికి ప్రభుత్వ కృషి తీవ్రతరమైందని చెప్పవచ్చు.

# మహిళలు - సమస్యలు

యస్. మనోరమ, ఎం.ఎ.

మన సమాజంలో కొందరు తక్కువ కులాల్లో పుడతారు; మరి కొందరు ఆడవాళ్ళుగా పుడతారని అంటారు కొడవటిగంటి కుటుంబరావుగారు తన ఆడజన్మ కథల్లో. యూరప్, అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండాలన్నింటిలో – అంటే ప్రపంచ మంతటా మహిళలు వివక్షకు, అణచివేతకు గురవుతున్నారు. స్త్రీల హక్కులు మానవ హక్కులలో భాగమని లక్షలాది మంది మహిళల సంతకాలు 1992 లో ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల సంఘానికి సమర్పించబడ్డాయి. 1993 లో వియత్నాంలో జరిగిన మానవ హక్కుల ప్రపంచ సభలో కూడా మహిళల హక్కుల గురించి ప్రముఖంగా ప్రస్తావించబడింది. ప్రపంచ ప్రజల, ప్రభుత్వాల దృష్టి మహిళా దుస్థితిపై కేంద్రీకరింపజేసేందుకు 1975 వ సంవత్సరాన్ని ఐక్యరాజ్య సమితి మహిళా సంవత్సరంగా ప్రకటించింది. స్త్రీ సమస్యల పరిష్కారం సంగతి పక్కకు పెడితే – స్త్రీల సమస్యల పుట్ట ఒక్కసారిగా బయటకు లాగబడింది. 1975 లో మెక్సికోలోను, 1980 లో కోపెన్ హేగన్‌లోను, 1985 లో నైరోబిలోనూ మహిళల సమానత్వంకోసం, హక్కుల కోసం, హోదాకోసం మహిళా ప్రపంచ మహాసభలు జరిగాయి ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో. ఈ నేపథ్యంలో 1995 లో చైనా రాజధాని బీజింగ్‌లో నాలుగవ ప్రపంచ మహిళా మహాసభ జరిగింది. భారతదేశంతోసహా 184 దేశాల అధికార ప్రతినిధులు, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు బీజింగ్ మహాసభలో స్త్రీల హక్కులు, స్థాయి, అక్షరాస్యత, ఆరోగ్యం, జనాభా పెరుగుదల, అభివృద్ధి మొదలైన అంశాలపై చర్చలు జరిపారు. దేశ దేశాల్లో మహిళల హోదా, వారి పట్లగల వివక్ష, అణచివేతలను గురించిన అంశాన్ని చర్చించమని ఐక్యరాజ్యసమితి ఉపసంఘం ఈజిప్టులో జరగనున్న మానవ హక్కుల మహాసభను కోరింది. మనుష్యజాతి ప్రారంభదశలో మగవాడు వేటకి, యుద్ధానికి పోయేవాడు. ఆ పనికి ఉపయోగించే పరికరాలపై అతనిదే ఆధిపత్యం. మరోవైపు స్త్రీ పిల్లల్ని కనడం, పెంచడం, ఇల్లు నిర్వహించడం మొదలైన పనులలో స్థిర పడినట్లు చారిత్రక ఆధారాలు చెబుతున్నాయి. వారసత్వానికి తగినంత ఆస్తి లేనంతకాలమూ తల్లికి పనులరీత్యా తక్కువస్థాయిలేదు. పశువుల పెంపకం, వ్యవసాయం విస్తరించడంవల్ల స్త్రీల హోదాలో మార్పు వచ్చిందన్న ఫ్రెడరిక్ ఏంగెల్స్ అంచనా సమంజసంగా కన్పిస్తుంది. సంపద పెరగడంతో దానిపై ఆధిక్యం గల పురుషుని ఆధిపత్యం సహజంగా పెరిగింది. మగవారు జీవితావసర వస్తువుల్ని సంపాదించే పనికి అత్యంత విలువ లభించింది. అంటే, మహిళ సామాజిక ఉత్పత్తి కార్యకలాపాలనుండి దూరం చేయబడి వెనక్కి నెట్టబడింది. అయితే, స్త్రీలు పిల్లల్ని కనడం, పెంచడం, ఇంటి పనులు, సహజంగా జరిగే పనులుగా గుర్తించారేగాని, సమాజానికి పనికొచ్చే పనులుగా గుర్తించలేకపోయారు. అంటే సంతానోత్పత్తి క్రియలోని శ్రమ విలువను గుర్తించకుండా పిల్లల్ని కనే యంత్రంగా మహిళ మార్చబడింది. మార్క్స్, ఏంగెల్సు, లెనిన్ స్త్రీల పరిస్థితి గురించి, వివాహ వ్యవస్థ గురించి, కుటుంబవ్యవస్థ గురించి కొంతవరకు చర్చించారు. స్త్రీలు ఉత్పత్తి రంగంలోకి – అంటే పబ్లిక్ రంగంలోకి వచ్చి పని చేసినప్పుడే విముక్తి పొందగలరని వారు చెప్పారు. ఆమె ప్రయివేటు రంగంలో నిర్వహించే పనుల విలువను పూర్తిగా గుర్తించలేదనేదే వాస్తవం. మొత్తం మీద స్త్రీలు పిల్లల్ని కనడానికి, పెంచడానికి, ఇంటి పనుల నిర్వహణకు పరిమితం చేయబడ్డారు. మొత్తం మానవ జాతిలో సగభాగంలో మహిళలు ఉత్పత్తి క్రమానికి దూరంగా వుండటంవల్ల సామాజిక ఆర్థిక, రాజకీయ రంగాలలో వెనుకబడ్డారు. స్వేచ్ఛలో, హక్కుల్లో స్త్రీ–పురుషులకు వేరు వేరు కొలబద్దలు ఏర్పడి అమలు జరుగుతున్నాయి. నీతి నియమాలు, సంప్రదాయాలు, మూఢ విశ్వాసాల ఊబిలో స్త్రీలు కూరివేయబడ్డారు. ఈ 20 వ శతాబ్దంలో కూడా ఆడపిల్లగా పుట్టడం బరువు బాధ్యతగా తయారయింది. కొద్దిమంది స్త్రీలు వివక్షనుండి బయటపడినా మొత్తంమీద భార్య స్థితి బానిస స్థితి అని చెప్పక తప్పదు.

స్త్రీ పురుష స్థాన భేదాలు వేల సంవత్సరాల సమాజ

పరిణామక్రమంలో వచ్చినవి తప్ప వేరు కాదు. ఏ మతంలోనైనా – చూడండి ఆ భావాలు కొట్టవచ్చినట్లే కన్పిస్తాయి. హిందూ, ముస్లిం, క్రైస్తవ మతాల్లో చూద్దాం.

హిందువుల పవిత్ర గ్రంథం గీతలో స్త్రీలు – శూద్రులు పాపం యొక్క గర్భంనుంచి జన్మించారని చెప్పబడింది. (9–12) (9–32) బాల్యంలో తండ్రిచే, యుక్తవయస్సులో భర్తచే, వృద్ధాప్యంలో పుత్రుడుచే రక్షించబడాలిగాని, "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్నది మను ధర్మశాస్త్రం నాటి సామాజిక పరిస్థితుల ప్రగాఢ విశ్వాసం.

ఇస్లాం మతం స్త్రీలను జంతువుతోను, దున్నే పొలంతోను పోల్చబడింది. స్త్రీలకు పరదా తగిలించి ప్రపంచ ముఖం చూడకుండా కట్టడి చేశారు.

క్రైస్తవ మతం పవిత్ర గ్రంథం "పాపానికి కారణం స్త్రీయే. భగవంతుడు ముందు పురుషుణ్ణి సృష్టించాడు. అతనికి సేవలు చేయడం కోసం, సంతోష పెట్టడం కోసం అతని యొక్క ప్రక్కటెముకనుండి స్త్రీని సృష్టించాడు" అని ప్రచారం చేస్తుంది.

ఈనాడు పురుష స్వామ్యం అమల్లో వుంది. ఈ సమాజంలో స్త్రీకి పురుషునితో సమానత్వ మన్నది అసాధ్యం. వివాహ వ్యవస్థ గొప్ప మార్పులకు గురి అయితే గాని, స్త్రీ పురుషుల సమానత్వం సాధ్యం కాదు. ఇప్పుడు వారి మధ్య వుండే అసమానత్వం కేవలం వ్యక్తిగతమైంది కాదు; సామాజికమైనదని గురజాడ అప్పారావు గారి భావన చాలా లోతైన విశ్లేషణ.

"సమాజంలో అతినిస్సహాయ స్థితిలో వున్నది. ఆడవాళ్ళు" అని చలం ఏనాడో వ్యాఖ్యానించారు.

"మన దేశంలో సగభాగంగా వున్న మహిళలు విద్య విజ్ఞానాల్లో వెనకబడి వుండగా దేశం ఎలా పురోగమిస్తుంది? మన సంస్కృతి, నియమాలు, సంప్రదాయాలు పురుషుని చేత రూపొందించబడి, అతడు ఉన్నత స్థానంలో వుండడానికి ఉపయోగపడుతున్నాయి. తన స్వప్రయోజనాలకోసం స్త్రీని ఆటవస్తువుగా ఉపయోగించటం వల్ల స్త్రీ ఎదగలేక శక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేసుకోలేని స్థితిలో వుంది. పురుష నిరంకుశత్వం నుండి భారత స్త్రీ తనంతటతాను పోరాటం సాగించాలి, ఎందుకంటే, పురుషుడు ఇందులో వారికి తోడ్పాటు నిచ్చే అవకాశాలు వుండకపోవచ్చు గనుక" అని జవహర్‌లాల్ నెహ్రూ 1930 దశకంలోనే అభిప్రాయపడ్డారు.

ధనిక, మధ్య, పేద తరగతి స్త్రీలు తమస్థాయిననుసరించి చిన్న చిన్న సమస్యలకు లోనౌతున్నారు. సమస్యల యొక్క స్వరూపాలు భిన్నమైనా ప్రతి సమస్యపై పురుషాధిక్య ముద్ర స్పష్టంగా కనిపించి తీరుతుంది. స్త్రీలు ఏ దేశానికి చెందినా సమస్యల స్వరూపాలు భిన్నమయినప్పటికీ స్వభావాలు మాత్రం ఒకటిగానే వుంటాయని చెప్పాలి. మహిళల అనుభవాలు, స్పందనలు, సమస్యలు, హక్కులు, అవకాశాలు భిన్నంగా వున్నప్పటికి వారి స్థాయిలో పెద్దగా తేడాలు కన్పించడం లేదు.

1970 మొదలుకుని పారిశ్రామిక విప్లవం ఆవిర్భావం వల్ల ప్రపంచ వ్యాపితంగా సామాజిక స్థితిగతుల్లోనూ, జనచైతన్యంలోనూ పెనుమార్పులు సంభవించాయి. ఫ్రాన్సు విప్లవం (1789) లో పురుషులతో పాటు స్త్రీలు పాల్గొన్నారు. 1848 లో స్త్రీలకు పురుషులతో పాటు సమానస్థాయి కలిగిన సమాజం కావాలని కమ్యూనిస్టు మానిఫెస్టో వెలువడింది. 1857 లో అమెరికా జౌళిమిల్లు మహిళా కార్మికులు 16 గంటల నుండి 10 గంటలకు పని కాలాన్ని తగ్గించాలని పోరాటాలు చేసి, విజయం సాధించారు. 1908 లో న్యూయార్కులో కుట్టుపని మహిళా కార్మికులు వేతనాలు పెంచాలని చేసిన సమ్మె జయప్రదమైంది. 1915 లో మొదటి ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా 'బ్రసా'లో మహిళలు పెద్ద ఎత్తున ప్రదర్శనలు చేశారు. 1917 రష్యన్ విప్లవంలో స్త్రీలు తమవంతు పాత్రను నిర్వర్తించారు. 1937 లో స్పెయిన్‌లో ఫ్రాంకో ఫాసిస్టు పాలనకు వ్యతిరేకంగా లాపాసనారా నాయకత్వంలో పోరాటాలు జరిపారు. 1979 లో ఇరాన్‌లో ఖొమేనీ మహిళలు తప్పనిసరిగా బురఖాలు తగిలించుకోవాలి లేకపోతే కాల్చి చంపుతాము అన్నప్పుడు 50 వేల మంది మహిళలు టెహరాన్‌లో ప్రదర్శన చేశారు.

ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాల్లో పురుషులతో బాటు సమాన హక్కులు కోరుతూ ఇంగ్లాండ్, అమెరికా దేశాల్లో 20 వ శతాబ్దంలో మహిళా ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఓటుహక్కు కోసం దీర్ఘకాలం పోరాటం తర్వాత ఇంగ్లాండులో 1928 లో, అమెరికాలో 1920 లో స్త్రీలు ఆ హక్కును పొందారు. మార్గరెట్ థాచర్‌ను మినహాయిస్తే మొత్తం యూరోపియన్ దేశాల్లో రాజకీయాల్లో మహిళల పాత్ర చాలా స్వల్పంగా వుంది. అదే సమయంలో శ్రీలంకలో (బండారు నాయకే) సిరిమావో, ఇండియాలో ఇందిరాగాంధి, పాకిస్థాన్‌లో బెనజీర్ బుట్టో, బంగ్లాదేశ్‌లో ఖలీదా జియా, రంగూన్‌లో సూక్యీ, ఫిలిప్పైన్స్‌లో కోరజాన్ మొదలైన మహిళలు రాజకీయ రంగంలో కీలక స్థానాలను పొందగలిగారు. ప్రత్యక్ష ప్రజాస్వామ్య పద్ధతులకు కాణాచియైన స్విడ్జర్లాండులో 1971 వరకు మహిళలకు ఓటుహక్కు లేనేలేదు. స్త్రీలకు ఓటుహక్కు ఇవ్వడమంటే ఇస్లామిక్ మత సంప్రదాయాన్ని ఉల్లంఘించినట్లుగా కొన్ని ముస్లిం దేశాలు ఈనాటికీ భావిస్తున్నాయి. అభివృద్ధి చెందిన అనేక పెట్టుబడిదారీ దేశాల్లో స్త్రీ పురుష వేతనాల్లో వివక్షత కొనసాగుతుంది.

సోషలిస్టు సమాజంలోని స్త్రీల స్థితిగతులు చర్చిస్తే అనేక విషయాల్లో స్త్రీకి రాయితీలు, ఉపాధి సౌకర్యాలు, విద్యా అవకాశాలు కల్పించగలిగారే తప్ప, పూర్తిగా స్త్రీని పురుషునితో సమాన స్థాయికి చేర్చలేదనిపిస్తోంది. మానవ స్వభావంలో మౌలికమైన మార్పులొస్తే తప్ప మహిళా సమస్యలు చిన్న చిన్న మార్పులతో పరిష్కారం కావు. అయితే, దానికి ముఖ్యంగా మహిళల చైతన్యమే మార్గం తప్ప, సిద్ధాంతాలు కావనిపిస్తోంది. మహిళాస్థాయిని గురించి, వారి పాత్రను గురించి మనుధర్మశాస్త్రం, ఖురాన్, బైబిల్ సానుకూలంగా చెప్పిన అనేక అంశాల్ని పక్కకు నెట్టి పురుష ఆధిపత్యానికి కావలసిన సంప్రదాయాన్ని మాత్రమే స్త్రీలపై రుద్దుతున్నారు. ఈ మత గ్రంథాలను స్త్రీ సమస్య దృష్టితో అధ్యయనం చేయవలసిన అవసరమెంతో ఉన్నది.

19 వ శతాబ్దంలో భారత దేశంలో స్త్రీజాతి విముక్తికి సంఘ సంస్కరణోద్యమాన్ని రాజారామమోహన్‌రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, దేవేంద్రనాథ టాగోర్, గోవింద రనడే, పూలే మొదలైనవారు నిర్వహించారు. సతీ సహగమనము, బాల్య వివాహాలు, శిశు హత్యలు నిషేధించడం, వితంతు వివాహాన్ని, స్త్రీ విద్యను ప్రోత్సహించడం, స్త్రీలకు ఆస్తి హక్కును కల్పించడము ఈ ఉద్యమాల ప్రధాన లక్ష్యంగా వుండేవి. బెంగాల్లో రాజా రామమోహన్‌రాయ్ సతీ సహగమనాన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమం నడిపి, చివరకు దాన్ని నిషేధించే వరకు పోరాడి సాధించారు. ఆయన ప్రభావంతో ఆంధ్రదేశంలో అనేక సంఘ సంస్కర్తలు ఉత్తేజితులై మహిళా ఉద్ధరణకు ముందుకొచ్చారు. 19 వ శతాబ్దం మధ్యభాగంలో ఆంధ్ర ప్రాంతంలో తరిగొండ వెంకమాంబ వైధవ్యం పేరిట జరిగే కేశ ఖండనకు నిరాకరించారు. 1869, 1871, 1874 లలో విశాఖపట్నం, కాకినాడ, ధవళేశ్వరంలలో వరసగా బాలికా పాఠశాలలు నెలకొల్పారు. ఆంధ్రదేశంలో బ్రహ్మ సమాజంలో మన్నవ బుచ్చయ్య పంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు ప్రముఖ పాత్ర వహించి స్త్రీల ఉన్నతికి కృషి చేశారు.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్రదేశపు సంఘ సంస్కరణోద్యమంలో వైతాళికులు, అగ్రగణ్యులు. ఆయన మొట్టమొదట ఆంధ్రప్రాంతంలో వితంతు వివాహాన్ని 1881 లో రాజమండ్రిలో చేశారు. 1856 లో ఇండియాలో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఆధ్వర్యంలో బెంగాల్లో జరిగింది. ఆయన స్త్రీవిద్య కోసం, స్వేచ్ఛకోసం, ఉద్ధరణ కోసం అపారంగా కృషి చేశారు. వితంతు వివాహాల్ని, వ్యభిచార వృత్తికి వ్యతిరేకంగా ఎన్నో కష్టనష్టాలకోర్చి ఒక మహోద్యమాన్ని నడిపారు. ఆయన సతీమణి రాజ్య లక్ష్మమ్మగారు మహిళాభ్యుదయానికి భర్తతో పాటు చేసిన ఎనలేని కృషి చిరస్మరణీయము.

వీరేశలింగంగారిది సంస్కరణ ఉద్యమం అయితే, ఆయనతో బాటే నవ్యాంధ్ర సాహిత్యయుగ వైతాళికుడు గురజాడ అప్పారావుగారిది సంస్కరణ హృదయం. ఆయన కన్యాశుల్కం సంస్కరణ పరంగా, సాహిత్య పరంగా నేటికీ సంచలనాన్ని కల్గిస్తూనే వుంది. ఏనుగుల వీరాస్వామయ్య, సామినేని ముద్దు నరసింహ నాయుడు, జియ్యర్ సూరి మొదలైన వారు కూడా స్త్రీ విముక్తికి పాటుపడ్డారు.

సంఘ సంస్కరణోద్యమ వెల్లువ, జాతీయోద్యమ ప్రభావము కలిసి ఆంధ్ర దేశంలో స్త్రీలు జాతి స్వాతంత్ర్య పోరాటంలో చురుగ్గా పాల్గొనేలా చేశాయని చెప్పాలి. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలోకి దేశమంతటా గల మహిళల్ని తీసుకురావటంలో మహాత్మా గాంధీ పాత్ర, దూరదృష్టి అద్వితీయమైనవి. గాంధీజీ పిలుపు నందుకొని వేలాది ఆంధ్రమహిళలు దేశ మహిళలతో బాటు స్వాతంత్ర్య ఉద్యమంలో తమ వంతు పాత్రను ప్రముఖంగా నిర్వర్తించారు. 1919 లో మాంటేగు - చెమ్స్‌ఫర్డు కమీషన్‌కు స్త్రీలకు ఓటింగ్ హక్కు ఇవ్వవలసిందిగా సరోజినీ నాయుడు, కజన్స్ సతి విజ్ఞాపన పత్రం సమర్పించారు. అంతకుముందు అనీబిసెంట్ 'హోంరూలు' ఉద్యమానికి నాయకత్వం వహించారు. 1920 లో శాసన సభకు మహిళలు పోటీ చేయడానికి ఆమోదం లభించగానే మద్రాసు శాసన సభకు ముత్తులక్ష్మిరెడ్డి ఎన్నికయి, లెజిస్లేటివ్ కౌన్సిల్ ఉపాధ్యక్షులుగా కూడా పనిచేశారు.

బాలాంత్రపు శేషమ్మగారు 'హిందూసుందరి', పులుగుర్త లక్ష్మి నరసమాంబగారు 'సావిత్రి', వింజమూరి వెంకటరత్నమ్మగారు 'అనసూయ', కనుపర్తి వరలక్ష్మమ్మగారు 'శారదా లేఖలు' ఇంకా ఎందరో స్వయంగా పత్రికలు నడిపి స్త్రీ చైతన్యాన్ని రగులగొల్పారు. బండారు అచ్చమాంబ, కొటికలపూడి సీతమ్మగార్లు ఉపన్యాసాలద్వారా స్త్రీ విద్యను ప్రోత్సహించారు. గాంధీజీ ఆంధ్రదేశ పర్యటన జరిపినప్పుడు ఆయన ఉపన్యాసాలను దుర్గాబాయ్‌గారు తెలుగులోకి అనువదించారు. మాగంటి అన్నపూర్ణమ్మ, యలమంచిలి సత్యవతిలాంటివారు గాంధీజీ అడిగిన వెంటనే నగలన్నింటిని వలిచి, స్వాతంత్ర్య పోరాట నిధికి సమర్పించారు. దువ్వూరి సుబ్బమ్మ బ్రిటిష్ వారి లాఠీ దెబ్బలు తిని జైలుకెళ్ళిన మొదటి ఆంధ్ర మహిళ అని చెప్పాలి. ఆచంట రుక్మిణమ్మ, పొణకా కనకమ్మ, ఉన్నవ లక్ష్మిబాయమ్మ, వల్లభనేని సీతా మహాలక్ష్మమ్మ, మూల్పూరి చుక్కమ్మ, దుగ్గిరాల కమలాంబ, సత్తిరాజు మంగమ్మ, చెరుకూరి సౌభాగ్యం, స్వరాజ్యలక్ష్మి, కొప్పలి కనకమ్మ, కంఠంపాటి మాణిక్యాంబ మొదలైన

ఎందరో ఆంధ్ర వనితలు దేశదాస్య శృంఖలాలు ఛేదించడానికి శాయశక్తుల కృషిచేసిన చిరస్మరణీయులు.

తెలంగాణా ప్రాంతంలో సరోజినీదేవి ఉమన్స్ అసోసియేషన్ 1927 లో అఖిల భారత మహిళా మహాసభలో విలీనమై ఆ ప్రాంత వనితల అభివృద్ధికి ప్రాతిపదిక కల్పించింది. మాడపాటి హనుమంతరావు, ఆయన సతీమణి మాణిక్యాంబ, ఆరుట్ల రామచంద్రారెడ్డి, ఆయన సతీమణి కమలాదేవి, పద్మజా నాయుడు, ఎల్లా ప్రగడ సీతాకుమారి, మసుమా బేగం, సుమిత్రాదేవి, సంగం లక్ష్మీబాయమ్మ మొదలైనవారు తెలంగాణాలో ముఖ్యపాత్ర వహించారు.

1934 నుండి ఆంధ్రప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి, మహిళా సంఘాలు నిర్మించబడి, మరింత ప్రగతిశీల ఉద్యమాలను నిర్మించి, దేశస్వాతంత్ర్య పోరాటంలో భాగమయింది. ఈ ప్రాంతమంతా కార్మిక, కర్షక, మధ్యతరగతి మహిళల్ని విస్తృతంగా సమీకరించి పోరాటాల్లోకి తెచ్చిన ఘనత రాజకీయ పార్టీలలో ముఖ్యంగా భారత కమ్యూనిస్టు పార్టీకి దక్కుతుంది. మూఢ నమ్మకాలకు, ఘోషాకు వ్యతిరేకంగా బ్రహ్మాండమయిన ప్రచారం చేసింది. మరుగుదొడ్లు, ప్రసూతి సౌకర్యాలు, ఆస్తిలో వాటా, వరకట్న నిర్మూలన, బాల్య వివాహాల రద్దు కోసం అనేక ఆందోళనలను ఆంధ్రప్రాంత నలుచెరగులా ప్రచారం చేసి, నిర్వహించింది. మహిళలకు రాజకీయ శిక్షణా తరగతుల్ని నడిపింది. 1942 లో స్త్రీల హక్కుల పరిశీలన నిమిత్తము ప్రభుత్వం నియమించిన రావు కమిటీకి వివాహాలు, విడాకులు, దత్తత, వారసత్వం మున్నగు అంశాలపై మహిళలకు న్యాయం కలిగించాలని 50 వేల సంతకాలతో విజ్ఞప్తిని సమర్పించింది. స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారాన్ని మహిళలు నిర్వహించారు. 1946 నుంచి నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటంలో ఆరుట్ల కమలాదేవి, బ్రిజ్‌రాణి గౌడ్, చంద్ర సావిత్రమ్మ, మల్లు స్వరాజ్యం ఇంకా అనేక వీర వనితలు ధైర్యసాహసాలతో పాల్గొన్నారు. 1917 లో అనీబిసెంటు, మార్గరేట్ కజిన్స్ ఇండియన్ అసోషియేషన్ ను స్థాపించారు. అదే అఖిల భారత మహిళా సభగా రూపొంది, స్వాతంత్ర్య పోరాట సమయంలో మహిళలను సమీకరించింది. ఈ అఖిల భారత మహిళా సభలో అన్నిరకాల మహిళలు – అంటే మహా రాణులనుండి శ్రామిక మహిళ వరకు వుండేవారు. మితవాద భావాలు కలవారి నుండి అతివాద భావాలు కలవారివరకు వుండేవారు. సరోజినీ నాయుడు, కమలాదేవి చటోపాధ్యాయ, విజయలక్ష్మీ పండిట్, బేగం హమీ అలీ, రేణు చక్రవర్తి, పార్వతీ కృష్ణన్, హాజరా బేగం, విమలా ఫరూఖి, ఉషాతాయి డాంగే మొదలైన వారు యీ మహిళా సభలో నాయకులు.

1941 డిసెంబరులో కాకినాడలో అఖిల భారత మహిళా మహాసభ విజయలక్ష్మీ పండిట్ అధ్యక్షతన సమావేశమయింది. ప్రగతిశీల భావాలు కల మహిళల తీర్మానాలు ఓడిపోయాయి. మూడు రూపాయల సభ్యత్వ రుసుము తీర్మానం ఓడించబడింది. పైతరగతి, మధ్య తరగతికి మాత్రమే పరిమితమయిన దానిలో ఇమడలేక అతివాదవర్గాలమహిళలు బయట కొచ్చి భారత మహిళా సమాఖ్య, భారత మహిళా సంఘం మొదలైనవి తర్వాతి కాలంలో ఏర్పాటు చేసుకున్నారు. దుర్గా భాయ్ దేశ్‌ముఖ్, కొమర్రాజు అచ్చమాంబ, మోటూరి ఉదయం, మానికొండ సూర్యావతి, లక్ష్మీరఘురామయ్య, గుజ్జుల సరళాదేవి మొదలైనవారు ఆంధ్రప్రాంత్రంలో స్త్రీ సమానత్వానికి ఎనలేని కృషి జరిపారు.

భారత పౌరులకు సామాజిక న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం మొదలైన లక్ష్యాలు సాధించడానికి కట్టుబడిన భారత రాజ్యాంగం అన్నింటా మహిళలకు సమాన అవకాశాలను, హోదాను చట్టపరంగా కల్పించింది. స్వాతంత్ర్యానికి ముందు, తర్వాత కూడా భారత మహిళ స్థితిగతుల్ని మార్చేందుకు అనేక చట్టపరమైన హామీలు లభించాయి. 1829 లో సతీ సహగమనాన్ని నిషేధించారు. 1921 లో మద్రాసు రాష్ట్రంలో మొదటిసారిగా ఓటుహక్కు కల్పించారు. 1929 లో బాల్య వివాహాల (రద్దు) చట్టం చేశారు. 1955 లో హిందూ వివాహ చట్టం చేయబడింది. 1956 లో హిందూ వారసత్వ చట్టం అమల్లో కొచ్చింది. 1961 లో వరకట్న నిషేధ చట్టం చేయబడింది. (ఇది తర్వాత మూడుసార్లు సవరించబడింది) 1976 లో పురుషునితో పాటు సమాన పనికి సమాన వేతన చట్టం చేశారు. 1984 లో స్త్రీలపై లైంగిక దాడులు, వరకట్న హత్యలు ఆపేటందుకు చట్టం వచ్చింది. 1986 లో మహిళల్ని కించపర్చడాన్ని నిషేధించే చట్టం, 1973 లో గర్భస్రావం చేయించుకునే చట్టం, 1988 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్త్రీలకు పురుషునితో బాటు సమాన ఆస్తి హక్కు చట్టం తెచ్చింది.

రాజ్యాంగరీత్యా సమానహక్కులు, స్థాయి మహిళలకున్నప్పటికీ ఆచరణలో మాత్రం అన్ని రంగాల్లోనూ రెండోస్థాయికి నెట్టివేయబడింది. తమకు జరుగుతున్న అన్యాయాలను, అత్యాచారాలను, దాష్టీకాన్ని అనుభవిస్తున్న స్త్రీలు పరిష్కార మార్గాల గురించి విస్తృతంగా చర్చిస్తున్నారు. తమ ఉనికిని నిరూపించుకోవడానికి ఉద్యమిస్తున్నారు.

స్త్రీల సమస్యల్లో చర్చించవలసిన అంశాలు ఎక్కువగానే వున్నాయి. భ్రూణహత్యలు, వరకట్న వేధింపులు, హత్యలు, ఆత్మహత్యలు, అత్యాచారాలు, అన్నింటా అసమానతలు, నిరక్షరాస్యత, ఆరోగ్యం, ఉపాధి అవకాశాలు, వ్యభిచారం,

వివాహసమస్యలు, ఆడపిల్లల పట్ల వివక్ష, అశ్లీలంగా చూపబడే స్త్రీ, ఇంటి చాకిరి, మూఢ నమ్మకాలు, స్త్రీని కించపరిచే మతం, పునరుత్పత్తి, శిశుపోషణ చట్టాలు అమల్లోకి రాకపోవడం, భర్తచే వదిలివేయబడటం, ఆర్థిక సామర్థ్యం లేకపోవడం, అన్ని తరగతుల మహిళలకు ప్రత్యేక తరహా సమస్యలుండటం మొదలైనవి.

మన దేశంలో ప్రభుత్వం మహిళకొసం 1992 లో ఒక జాతీయ మహిళా కమిటీని నియమించింది. స్త్రీలకు స్వయం ఉపాధి పథకాలు, అసంఘటిత రంగంలో పనిచేస్తున్న వారికోసం కమిటీని నియమించింది. దేశంలో స్త్రీల సమస్యల్ని గురించి ఆలోచించే మేధావులకు కొరత లేదు. స్త్రీలకు శిక్షణ, రుణసహాయం ఇచ్చి అభివృద్ధిలోకి నడిపించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ఉద్యోగినులకు వసతిగృహాలు, గర్భిణీ స్త్రీలకు సహాయం, ఉద్యోగాలలో 30% రిజర్వేషన్లు మొదలైన ఏర్పాట్లు జరుగుతూనే వున్నాయి. ఇన్ని ఉండికూడా ఈనాడు స్త్రీల పరిస్థితి ఏమిటి?

కాలక్రమంలో బాల్య వివాహాలు పోయాయి. అమ్మాయి పెళ్ళి కావటమే కష్టం నేడు. అనాడు కన్యాశుల్కం వుండేది. నేడు వరకట్నం వికృతరూపం దాల్చింది. సతి నిషేధించబడింది. స్త్రీలలో విద్య పెరిగింది కాని సమాజం రోజు-రోజుకు మూఢ విశ్వాసాల్లో కూరుకుపోతూనే వుంది. ఆస్తిహక్కు పేరుకు సమానం, ఆచరణలో పూజ్యం. సంపాదించే దానిపై స్వేచ్ఛలేని పరిస్థితితో ఇంటి చాకిరీ, పిల్లల బాధ్యతతో బాటు కొంతమంది బయటిపని చేయడం.

ప్రపంచం మొత్తంమీద జరుగుతున్న పని గంటలలో మూడింట రెండు వంతులు స్త్రీలు చేస్తున్నారని ఐక్యరాజ్యసమితి అధ్యయనంలో తేలింది. అయినప్పటికీ మూడవ వంతు పనిచేస్తున్నట్లు నమోదు అయింది. ప్రపంచ ఆదాయంలో మహిళలు పొందుతున్నది ఏడోవంతు మాత్రమే. ప్రపంచ ఆస్తిలో ఒకవంతు మాత్రమే స్త్రీలకు చెంది వున్నదంటున్నారు.

తన అస్తిత్వానికి అన్ని విధాల భంగం కలుగుతున్న పరిస్థితులలో సామాజిక స్వేచ్ఛ కోసం, ఆర్థిక స్వాతంత్ర్యం కోసం, ఆత్మ గౌరవాన్ని నిలుపుకోవటం కోసం ఆధునిక మహిళ తప్పటడుగులు వేస్తోంది. తన వ్యక్తిత్వం కోసం తపనపడి, రాజీకి తలొగ్గకుండా ప్రశ్నిస్తోంది. పురుషుని ఆస్తిలో పూర్వం వలె తాను భాగం కాదని స్పష్టంచేయడానికి ప్రయత్నిస్తుంది.

## పెచ్చు పెరుగుతున్న అత్యాచారాలు:

భారత ప్రజానీకానికి మాయని మచ్చ మహిళలపై జరుపుతున్న రకరకాల అత్యాచారాలు – ఆటవిక సమాజాన్ని గుర్తుకు తెస్తున్నాయి. గర్భస్థ స్త్రీ శిశు హత్యలు, బాలికల్ని అమ్మడం, ఎగుమతి చేయడము, వ్యభిచార గృహాలు, మానభంగాలు, మాతంగినీ, జోగినీ, దేవదాసీల విధానం, రికార్డు డాన్సర్లు, కాల్ గరల్స్, వెట్టిచాకిరీలు, వేధింపులు, వివక్ష, అణచివేత మొదలైనవన్నీ స్త్రీలపట్ల జరుగుతున్న అత్యాచారాలు. ఈ అకృత్యాలకు గుండాలు, రౌడీలే కాకుండా అధికారులు, హాస్టల్ వార్డెన్స్, రక్షకభటులు, నేరస్థులు పాల్పడుతున్నారు. స్త్రీలపట్ల జరిగిన నేరాల్లో అధిక శాతం రుజువు కావు, సాక్ష్యాలు దొరకవు. వైద్య నివేదికలు తారుమారవుతూనే వున్నాయి. అధికార పలుకుబడి, డబ్బు నేరస్థులు విచ్చలవిడిగా తప్పించుకోవడానికి మార్గాలుగా వున్నాయి. నేరాలు రుజువు చేయడానికి అవస్థలు వ్యక్తులు పడటం అసాధ్యం.

1991 లో కేంద్ర మానవ వనరుల శాఖ, హోంశాఖ మహిళలపై జరుగుతున్న అత్యాచారాల నేరపూరిత ధోరణులు చర్చించడానికి ఒక సభను ఏర్పాటు చేసింది. ఆ సంవత్సరం రిపోర్టు అయిన కేసులు ఆధారంగా జాతీయ నేర పరిశోధనా విభాగం తయారుచేసిన లెక్కలను ఆ సభలో నాటి ప్రధానమంత్రి ఉటంకించారు. ఆ సమాచారం ప్రకారం ప్రతి 54 నిమిషాలకు దేశంలో ఒక మహిళ మానభంగానికి గురవుతోంది. ప్రతి రెండుగంటలకు ఒక వనిత వరకట్నం చావుకు లోనవుతోంది. ప్రతి 43 నిమిషాలకు ఒక స్త్రీ కిడ్నాప్ చేయబడుతోంది. ప్రతి 52 నిమిషాలకు ఒక యువతి ఈవ్ టీజింగ్ కు గురవుతోంది. ప్రతి 33 నిమిషాలకు ఒక స్త్రీ హింసకు లోనవుతోంది. రోజూ పేపర్లలో వార్తలు చూస్తుంటే ఆ లెక్కలు చాలా తక్కువని అనిపిస్తోంది. పైగా, లెక్కకుమించిన అత్యాచారాలు మన పల్లెపట్టులలో జరుగుతూనే వున్నాయి. అవి ఎక్కడా రిపోర్టు కావడంలేదు.

1993 ఫిబ్రవరిలో లోక్ సభలో హోంశాఖ 1992 లో జరిగిన అత్యాచారాల వివరాలు ఈ రకంగా ఇచ్చింది: మానభంగాలు 8718, అపహరణలు 8724, వరకట్నపుహత్యలు 4171, హింసలు 114721, బలత్కారాలు 16916, వేధింపులు 8979.

ఈ పెచ్చు పెరుగుతున్న అత్యాచారాల్ని అరికట్టడానికి స్త్రీలకు సంబంధించిన చట్టాలను పటిష్టవంతంగా అమలు జరపాలి. లంచగొండి పోలీసులు, డాక్టర్లు, న్యాయాధికారులు, రాజకీయనాయకుల జోక్యాన్ని నిరోధించగలగాలి. అత్యాచారాలకు గురయ్యేది ఎక్కువగా పల్లెపట్టున వుండే అట్టడుగు వర్గ మహిళలు, పట్టణ పేద వర్గాలకు చెందినవారు. ఈ దోపిడికి కారణం నిరక్షరాస్యత, పేదరికమే!

## గ్రామీణ శ్రామిక మహిళలు:

మన దేశంలోని అత్యధికులు శ్రామిక మహిళలు, పొలంలో

కూలీలుగా ఎక్కువగా పనిచేస్తారు. వ్యవసాయరంగం అసంఘటిత రంగం. దేశంలో పనిచేసే మహిళల్లో 94 శాతం అసంఘటిత రంగంలోనే వున్నారు. విత్తనాలు నాటడం, కలుపు తీయటం, నీరు పెట్టడం, నాట్లు వేయటం, కోతలు కోయటం, ఎరువులు, క్రిమిసంహారక మందులు చల్లడం మొదలైన వ్యవసాయపనులు 50–60 శాతం వరకు స్త్రీలు చేస్తున్నట్లు అధ్యయనంలో తేలింది. వ్యవసాయదారులు, వ్యవసాయ కూలీలుగా వ్యవసాయరంగానికి చెందిన సంబంధిత పనులలో మహిళలు సంవత్సరానికి 160 నుంచి 170 రోజుల వరకు పనిచేస్తారని కూడ వెల్లడయింది. జలుబు, వడగాల్పులు, పోషక పదార్థాలు లేని ఆహారం, నిరక్షరాస్యత, తగినన్ని రోజులు పని దొరక్కపోవడం, సాంఘిక పీడన, అసంతృప్తి మొదలైనవాటితో బాధలు పడుతుంటారు. వీటికితోడు పిల్లల్ని కనడం, పెంచడం, వంట, ఇంటి నిర్వహణ, రకరకాల వృత్తులను గ్రామీణ మహిళలు చేస్తుంటారు. పాడిపరిశ్రమలో కూడా మహిళల పాత్ర గణనీయమైనదే. గ్రామీణ ప్రాంత మహిళలకి తగినంత వైద్య సదుపాయాలు, ప్రసూతి సౌకర్యాలు, పారిశుద్ధ్య ఏర్పాట్లు, మంచినీటి వసతులు లేవు.

ఈ స్త్రీలకు ప్రభుత్వం చేస్తున్న చట్టాల సంగతి తెలియదు. మూఢనమ్మకాలు ఎక్కువ. నేటి వ్యవసాయరంగంలో కూడా నూతన సాంకేతిక పరిజ్ఞానం అవసరమవుతున్న తరుణంలో అక్షరం ముక్కలేని గ్రామీణ పేద స్త్రీలు ఈ రంగంనుంచి క్రమంగా తొలగించబడే ప్రమాదముంది. వ్యవసాయరంగానికి చెందిన యంత్రాలను వాడే విధానం, వ్యవసాయరంగానికి చెందిన సాంకేతిక పరిజ్ఞానానికి పల్లెలలో పారిశ్రామిక శిక్షణాలయాలను ఏర్పాటు చేయవల్సిన అవసరం ఎంతయినా వుంది. స్త్రీలకు కుట్లు, అల్లికలు, కూరగాయలు, పళ్ళు నిల్వపెట్టడం, పిల్లల పెంపకం, శుభ్రత మొదలైనవి మాత్రమే నేర్పాలనుకుంటున్నారు గాని వృత్తి నైపుణ్యానికి సంబంధించి శిక్షణ ఇవ్వడానికి ప్రయత్నాలు జరగకపోవటం నష్టదాయకం. పళ్ళతోటల పెంపకం, పుట్ట గొడుగుల పెంపకం, పట్టు పురుగుల పరిశ్రమ, తేనెటీగల పెంపకం, డైరీ, కోళ్ళపరిశ్రమ, సోలార్ శక్తి, బేకరి మొదలైన అన్నింట్లో మహిళలకు శిక్షణ ఇస్తే చాలా ప్రయోజనకరంగా వుంటుంది. వ్యవసాయ విశ్వవిద్యాలయాలు, హోం సైన్సు సంస్థలు, కృషి విజ్ఞాన కేంద్రాలు పల్లెసీమల్లో వుండే మహిళలకు నిత్య జీవితంలో ఉపయోగపడే విద్యను అందిస్తే ఉత్పత్తి పెరిగి, ప్రజల అవసరాలు తీరతాయి.

వ్యవసాయరంగంలోనే కాకుండా రాళ్ళు కొట్టడం, భవననిర్మాణ పనుల్లో, తమలపాకు తోటల్లో, పుగాకు – బీడీలను చుట్టడంలో, చేనేత పనిలో, అగ్గిపుల్లల తయారీలో, కాఫీ – టీ తోటల్లో అసంఖ్యాక మహిళలు పనిచేస్తున్నారు. విషాదకరమైన విషయమేమంటే – పై అన్నిరంగాల్లో పురుషునితో సమానంగా, ఒక్కోసారి అధికంగా పనిచేస్తున్నా, సమానవేతనం ఇవ్వాలని చెప్తున్నా తక్కువ వేతనాలను స్త్రీలు పొందుతున్నారు. దుర్భర దారిద్ర్యం వల్ల స్త్రీలు హీనస్థాయి పనులు, తక్కువ వేతనానికి అసంఘటిత రంగాల్లో పనిచేయడం వల్ల అత్యధిక దోపిడికి గురికావడమే కాకుండా, సామాజిక భద్రత కూడా కరువవుతుంది. నూటికి 25 శాతం గల పట్టణ ప్రాంత మహిళల సమస్యలే ప్రధానం అని అనుకోకుండా గ్రామీణస్త్రీల సమస్యల్ని మహిళా సంఘాలు, ప్రభుత్వం మరింత శ్రద్ధతో పరిష్కరించాలి. అనేక సంక్షేమ పథకాలు, ఉపాధి పథకాలు – అంటే డ్వాక్రా, మహిళా రోజ్‌గార్ యోజన లాంటివి మరిన్ని కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వాలు మహిళలకు అందించి, దారిద్ర రేఖకు దిగువగా వున్న 40 శాతం ప్రజలను అభివృద్ధి పరచాలి. డెన్మార్క్ దేశపు ఆర్థిక సహాయంతో మహిళలకు వ్యవసాయంలో శిక్షణ ఇవ్వడానికి ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయంతో 'వైటప్' పథకం కర్నాటక రాష్ట్రంలో 1982 నుంచి అమలు జరగటం వల్ల మహిళలు ఎంతో ప్రయోజనం పొందారు.

1980 నాటికి దాదాపు 5 కోట్ల మంది వ్యవసాయ రంగంలో పనిచేసే మహిళలుండగా 1990 నాటికి 9 కోట్ల మంది వున్నారని అధ్యయనంలో వెల్లడయింది. వ్యవసాయ కార్మికస్త్రీల స్థితి గతుల్ని మెరుగు పర్చేందుకు మహిళా సంఘాలు మరింత కృషి చేయవలసిన అవసరం ఎంతయినా వుంది. 81 జనాభా లెక్కల ప్రకారం అసంఘటిత రంగంలో స్త్రీలు 89.5 శాతం వీరిలో 82.3 వ్యవసాయ రంగంలో పనులు చేస్తున్నారు.

## సంఘటిత రంగంలో:

గవర్నర్‌లు, మినిస్టర్‌లు, శాసన సభ్యులు, పోలీస్ అధికారులు, డాక్టర్లు, ఇంజనీర్లు, న్యాయమూర్తులు, న్యాయవాదులు, శాస్త్రవేత్తలు, పారిశ్రామికవేత్తలు, పరిపాలకులు – ఒకటేమిటి ఇంకా అనేక రంగాల్లో స్త్రీలు ముందంజ వేస్తున్నారు నేడు. సంఘటితరంగంలో 13.3 శాతం మహిళలు పనులుచేస్తుండగా పబ్లిక్ రంగ సంస్థలలో 11 శాతం మహిళలున్నారు. ప్రయివేటు రంగంలో 17.8 శాతం పనులు చేస్తున్నారు. సీనియర్ మేనేజర్ ఉద్యోగాలలో 994 మహిళలుండగా అదేసమయంలో 15,993 మంది మగవారు ఆ ఉద్యోగాలు చేస్తున్నారు. అఖిల భారత సర్వీసులలో 5.8 శాతం మహిళా ఉద్యోగులున్నారు. 21 మంది మహిళా పోలీస్ ఆఫీసర్లున్నారు. అదేసమయంలో 2415 పురుష పోలీస్ అధికారులున్నారు. పరిపాలనారంగంలో 339 మంది

మహిళలుండగా – అదే సమయంలో 4209 మంది మగవారున్నారు. అంటే 7.5 శాతం.

ఉద్యోగ విషయాలలో కూడా మహిళల పట్ల వివక్ష కొనసాగుతుంది. ఇండియన్ ఫారిన్ సర్వీస్‌కు చెందిన సి. ముత్తమ్మ తన డిపార్టుమెంటులో సెక్రటరీ పదవిని పొందడానికి కోర్టు కెళ్ళినప్పటికీ, అర్హతను కోర్టుద్వారా పొందినప్పటికీ ఆ డిపార్టుమెంటు సెక్రటరీ కాలేకపోయారు. ఐ.ఎ.ఎస్. కాడర్‌కు చెందిన మహిళల్ని కూడా కాబినెట్ సెక్రటరీలుగా ప్రమోట్ చేయటం లేదు అని చెప్పటానికి రోమా మజుందార్ ఒక ఉదాహరణ. ఆమెను కాబినెట్ సెక్రటరీగా ప్రమోట్ చేయకుండా రాయబారిగా నియమించి దేశం బయటకు పంపడం వల్ల టి.ఎన్. శేషన్‌కు ఆ పదవి లభించింది. పత్రికారంగంలో కూడా ప్రతిభ కనబరచిన మహిళల పట్ల కూడా ప్రమోషన్ల విషయంలో చిన్న చూపు చూపిస్తున్నారని ఉషారాయ్ 'ఉమన్ అండ్ మీడియా' అనే వ్యాసంలో ఆవేదన వెలిబుచ్చారు.

ముక్తానంద సరస్వతినుండి రంగనాథమిశ్రా వరకు స్త్రీలు వంటిల్లు భర్తా పిల్లల పరిధిలో జీవించాలని ప్రబోధించడం మహిళల్ని మరింత వెనక్కి నెట్టే ప్రయత్నాలుగా గ్రహించాలి. దేశమంతటా ఇటీవల పెచ్చరిల్లిన మతోన్మాదం మహిళల స్వేచ్ఛా హక్కుల పట్ల ముంచుకొస్తున్న ప్రమాదకర పరిణామంగా గుర్తించాలి. మత ధర్మాలు, ఆచారాల పేరిట అనేక దేశాల్లో ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న స్త్రీలస్థాయిని శైశవ దశలోనే పీకనులమాలని అనేక ప్రయత్నాలు జరుగుతున్నాయి. షాబాను కేసులో సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పును ఇస్లాం మత వ్యవహారాలలో కోర్టు జోక్యంగా చూస్తున్నారే తప్ప స్త్రీలకు నిత్యం జరుగుతున్న అన్యాయాల పట్ల ఆలోచించడానికి ప్రయత్నించడంలేదు. బంగ్లాదేశ్ రచయిత్రి, ఫెమినిస్టు తస్లీమా నస్రీన్ వ్యక్తంచేస్తున్న స్త్రీవాదభావాలను సహించలేని మతగురువులు ఆమె అంతు తేల్చడానికి ఒక మహిళ ఆధ్వర్యంలో నడిచే ప్రభుత్వంచే ఉత్తర్వు జారీ చేయించగలిగారంటే మహిళల స్థితిగతులకు మరొక ఉదాహరణ అక్కర్లేదు.

## వరకట్న వివాహ సమస్యలు:

ప్రస్తుత వ్యవస్థలో ఎక్కువమంది ఆడపిల్లలు వేధింపులకు, హత్యలకు, ఆత్మహత్యలకు గురి కావడానికి ప్రధాన కారణం వరకట్నం. నేడు అన్ని మతాలలోను, వర్గాలలోను మొత్తం భావ సమాజంలోని ఆడపిల్ల యీ సమస్యను ప్రధానంగా ఎదుర్కొంటున్నది. ఆడపిల్ల గుండెల మీద కుంపటి అనే దానికి వరకట్న సమస్యే ప్రధానం. పురుషునికి స్త్రీ అవసరం, స్త్రీకి పురుషుడు అవసరం. అది లేకుండా అమ్మాయి అర్థనాపరురాలయినా కూడా కట్నం సమస్యగా వుంది. డాక్టరయినా, లాయరయినా అమ్మాయికి పెళ్ళికావాలంటే కట్నం చెల్లించాల్సిందే! వ్యక్తుల సంస్కారం పెరగనందున వరకట్న నిషేధ చట్టం ఏమాత్రం అమల్లోకి రాకుండా పోయింది. ఆడపిల్ల చైతన్యంతో ఎదగక పోవడం వల్ల వ్యక్తిత్వం లోపించడం వల్ల, చదువుకున్నా వరకట్న సమస్య నానాటికి జటిలం కావడం మనందరకూ తెలిసిందే. దీనికి ప్రధానంగా తల్లి తండ్రులే కారణం. కట్నకానుకలు పెట్టి పెళ్ళిచేయడంలోగల శ్రద్ధ, పట్టుదల అమ్మాయిని సజీవ వ్యక్తిగా తీర్చిదిద్ద లేకపోతున్నారు. చాలామంది తల్లిదండ్రులు చదివించి, ఆర్థిక అవకాశం కల్పించడం ప్రధానంగా భావించినపుడు ఈ సమస్య కొలిక్కి వస్తుంది. అంతేకాని, అమ్మాయి లక్ష్యం పెళ్ళి చేసుకోవడమేనన్న జీవిత పరమార్థాన్ని బోధిస్తున్నంత కాలం ఆడపిల్ల అస్వతంత్రురాలు. తల్లితండ్రులు ఆదరించని మహిళలే హత్యలకు, ఆత్మహత్యలకు గురవుతున్నారు.

అన్నీ సాఫీగా జరిగినంత కాలం స్త్రీ జీవితం బాగానే వుంటుంది. భర్త వదిలివేసినప్పుడు , అకాల మృత్యువుకు లోనయినపుడు, విడాకులు పుచ్చుకున్నప్పుడు, వేరొక స్త్రీతో సంబంధం ఏర్పరచుకున్నప్పుడు స్త్రీకి జీవిత బరువు బాధ్యతలు మీద పడతాయి. ఆర్థిక స్వాతంత్ర్యముంటే ఈ నష్టాన్ని చాలావరకు అధిగమించవచ్చు. స్త్రీ ప్రేమను పంచడమే కాకుండా, తనను తాను ప్రేమించుకోవడం నేర్చుకోవాలి. పతియే దైవం, పిల్లలే సర్వస్వమనే భావన నుంచి బయటపడాలి. "తనమీద తన శరీరం మీద, తన మనస్సుమీద సంపూర్ణ అధికారము ఆమెకుండాలి", అని బొంబాయికి చెందిన రచయిత్రి, ఫెమినిస్టు ఫ్లెవియా ఏగ్నెస్ అభిప్రాయపడ్డారు.

భర్త వ్యసనపరుడు కావడం, త్రాగుడు, పేకాట, ఇతర స్త్రీలతో సంబంధాలు పెట్టుకోవడం వల్ల కుటుంబాలలో అశాంతి, కీచులాటలు, హింస, చివరకు చావడమో, విడిపోవడమో సర్వసాధారణంగా జరుగుతుంది. ఆనంద ప్రదమైన వైవాహిక జీవితానికి సమానస్థాయి, సర్దుబాట్లు భార్య భర్త లిద్దరిలో అవసరము. అత్త, ఆడపడుచు అనవసర జోక్యం వల్ల, పెత్తనం వివాహ జీవితం స్త్రీకి దుర్భరమయే కారణాలలో ముఖ్యమైనవి. స్త్రీకి స్త్రీయే శత్రువు కాకుండా మిత్రునిగా మారాల్సి వుంది.

## సినిమా, టీ.వీ, వాణిజ్య ప్రకటనలు, వాల్ పోస్టర్లలో అశ్లీలంగా చూపబడుతున్న స్త్రీలు:

సినిమా, టీవీలకు మించిన ప్రభావాన్ని కలుగచేసే ప్రచార సాధనాలు లేక వినోద సాధనాలు మరొకటి లేనే లేవు. సంవత్సరానికి రమారమి 900 సినిమాలు

తయారవుతున్నాయట. సబ్బులకు, షాంపూలకు, పౌడర్లకు, బ్రష్‌లకు అమ్మాయిలను అసభ్యంగా చూపనిదే అమ్ముడు కావన్న స్థితికి చేరింది వ్యాపార రంగం. అర్ధ నగ్నంగా బాత్‌రూంనుంచి వచ్చి భర్తకు మంచం దగ్గర కాఫీ అందిస్తున్న భార్య అందమైన ప్రతిమ. పురుషులు వాడే వస్తువులకు, త్రాగే పానీయాలను, ధరించే వస్త్రాలకు అసభ్యకరంగా స్త్రీని వ్యాపార ప్రకటనల్లో చూపించడం అత్యంత శోచనీయం. సినిమాల్లో బూతు డైలాగ్స్, దృశ్యాలు, టైటిల్స్, పాటలు – ఒకటేమిటి, అన్నిరకాలుగా సెక్స్, హింస తప్ప మరేది కన్పించడం లేదు మన నిర్మాతలకి. ఈ రకం సినిమాలు చూస్తున్న యువతరం కాలేజీల్లో కానివ్వండి, బయట కాని వ్వండి, చివరకు హైస్కూళ్ళ విద్యార్థుల ప్రవర్తనలోనూ ఆడపిల్లను అందమైన సెక్సు బొమ్మగా చూడడానికి అలవాటు పడుతున్నారు. కో ఎడ్యుకేషన్ కాలేజీలలో అబ్బాయిలు అతిగా ప్రవర్తించడం వల్ల అమ్మాయిలు మానసికంగా దెబ్బతింటున్నారు. కొన్ని సందర్భాలలో తల్లిదండ్రులు అమ్మాయిల చదువులు మాన్పిస్తున్నారు.

కేంద్ర సమాచార మంత్రి, 94 మే నెలలో మహిళా పార్లమెంటు సభ్యుల్ని, మహిళా జాతీయ కమీషన్ సభ్యుల్ని, సినిమా విమర్శకుల్ని పిలిచి బొంబాయిలో సమావేశపరిచారు. స్త్రీలను సినిమాలలో చూపిస్తున్న తీరు తెన్నులకు అందరూ ఆవేదన వ్యక్తంచేశారు. అర్ధనగ్నంగా చూపడం, ఆధారపడిన వ్యక్తిగా చూపడం లేదా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేని మూస పాత్రలలో చూపడాన్ని కూడా నేషనల్ విమెన్స్ స్టడీస్ కాన్ఫరెన్స్ గర్హించింది. మహిళా పాత్రల్ని సరైన రీతిలో చిత్రించేందుకు జాతీయస్థాయిలో స్పష్టమైన ఆచరణ సూత్రాలను రూపొందించాలని వారు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. మహిళల్ని అబలలుగా, ఆట బొమ్మలుగా, నిస్సహాయంగా, చూపే తత్వాన్ని విడనాడాలని స్పష్టం చేశారు.

బడికి వెళ్ళే పాపను మొదలుకొని, గుడికి వెళ్లే బామ్మ వరకు అంటే 6 నుంచి 60 సంవత్సరాల తేడా కూడా తెలియకుండా మానభంగాలు జరిపే పుణ్యభూమి నేడు ఇది. అర్ధరాత్రి ఏమోకాని – పగలే బయటికి రాలేని స్థితి. గాంధీజీ అన్నట్లు స్వాతంత్ర్యం రాలేదందరకూ – వచ్చిన స్వాతంత్ర్యం పైశాచిక వికృత వెర్రి చేష్టలకు, భావాలకు లోనయిందా?

## నీచమైన వేశ్యావృత్తి మహిళలు:

పూర్వం వేశ్యావృత్తి అన్ని వృత్తులతోపాటు ఒక వృత్తిగా రాజ పోషణ క్రింద ఉండేది. ఆంధ్ర మహాభారతంలో, శైవ వైష్ణవ వాఙ్మయంలో వేశ్యావృత్తి ప్రస్తావన కన్పిస్తుంది. విజయ నగర సామ్రాజ్యంలో కొందరు వేశ్యలు మహా పండితులై కావ్యాలు వ్రాశారు. మధురవాణీ, రంగాజమ్మ, ముద్దుపళని మొదలైనవారు శృంగార కావ్యాలు రచించారు. వ్యభిచారం ప్రధానంగా రెండు రకాలు (1) సంప్రదాయ బద్ధమయినది. (2) ఆధునికమైనది. దేవదాసి, మాతంగి, జోగిని మొదలైన సంప్రదాయ వేశ్యావృత్తి గలవారు అనేక సంస్కరణ ఉద్యమాల మూలంగా స్వల్ప సంఖ్యలో వున్నారు. ఈనాడు లక్షలాది సంఖ్యలో వేశ్యావృత్తి చేస్తున్నవారు పేదవారు, మోసపోయినవారు, తేలిగ్గా డబ్బు సంపాదించాలనే కోరిక గలవారు. దేశమంతటా ఆడపిల్లల్ని మోసగించి, ఎత్తుకుపోయి వేశ్యా గృహాలకు అమ్మడం నిరంతరం జరుగుతూనే వుంది. అనాదరణ కారణంగా, ప్రేమ వివాహాలు విఫలం కావటం వల్ల, మానభంగాల వల్ల, భర్తలచే వదిలివేయటం వల్ల కూడా ఈ వేశ్యా వృత్తిలోకి దించబడుతున్నారు. స్త్రీని అన్ని రకాల వ్యాపార వస్తువుగా వాడుకోవడం, సాహిత్యంలో, చలనచిత్రాలలో స్త్రీని అశ్లీలంగా చిత్రీకరించడం, జాతర్లలో జరిగే అసభ్యకర రికార్డు డాన్సులు, స్త్రీని సెక్స్ సింబల్‌గా ఉపయోగించుకునే నైట్ క్లబ్బులు మొదలైనవి స్త్రీని కేవలం కామరూపిణిగా ప్రదర్శిస్తూ, మానవునిలోని పశుత్వాన్ని రెచ్చగొట్టి, మొత్తం సామాజిక రుగ్మతకు కారకులవుతున్నారు. బాలికల్ని విదేశీయులకు అమ్మివేయడం కూడా జరుగుతుంది. అమీనాలాంటి అమ్మాయి లెందరో! ఆటవస్తువుగా, అడ్వర్టయిజ్‌మెంటు బొమ్మగా చూపడం సామాజిక కాలుష్యానికి దారి తీస్తుందని వేరుగా చెప్పనక్కర్లేదు. వ్యభిచార వృత్తి వల్ల భయంకరమైన గనేరియా, సిఫిలిస్, ఎయిడ్స్ వ్యాధులు సోకి, సామాజిక ఆరోగ్యం ప్రమాదానికి గురవుతుంది.

పేద స్త్రీలకు వివిధ వృత్తులలో శిక్షణ ఇచ్చి, ఉపాధి కల్పించడం ద్వారా పురాతనమయిన వేశ్యావృత్తిని చాలావ రకు నిరోధించవచ్చు. అనాధలకు వితంతువులకు పెళ్ళికాని తల్లులకు 'రెస్క్యూ హోమ్' లు కట్టించి ఆదుకోవాలి. బలవంతంగా స్త్రీలను వ్యభిచారంలోకి దింపేవారిని ప్రభుత్వం కఠినంగా శిక్షించాలి. వ్యభిచారం నడిపే గృహాలు, లాడ్జీలను పోలీసులు తనిఖీ చేస్తూ, లంచాలకు లొంగకుండా వారితో వ్యవహరించాలి. వ్యభిచారం చేస్తూ పట్టుపడిన స్త్రీలనే కాకుండా, పురుషులనూ చట్టపరంగా శిక్షించాలి. ఈనాడు గ్రామీణ ప్రాంతాల్లో కూడా అతి విలాసమైన వేశ్యాగృహాలు వెలుస్తూ, గ్రామీణ జీవితాన్నిగూడా విష కలుషితం చేస్తున్న పరిస్థితిని చూస్తుంటే ఎంతటి విశ్వరూపాన్ని వ్యభిచార వృత్తి ప్రదర్శించగలదో అర్థం అవుతుంది. మహిళలు, స్వచ్ఛంద సంస్థలు ఈ సమస్యపై కొంతయినా దృష్టి పెట్టాలి.

## విముక్తి కోసం అక్షరాస్యత:

> అక్షరంబు తల్లి అఖిల విద్యల కెల్ల
> అక్షరంబు లోక రక్షణంబు
> అక్షరంబు లేని అబలుల కెందున
> భిక్ష పుట్టపోదు పృథ్వి లోన - వేమన.

1991 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో అక్షరజ్ఞానం కలిగినవారు మొత్తం జనాభాలో 52.21 శాతం. ఇందులో పురుష అక్షరాస్యుల శాతం 64.13. మహిళా అక్షరాస్యులు 39.29. 1991 జనాభా లెక్కల ప్రకారం మొత్తం అక్షరాస్యులు 44.09 శాతం. ఇందులో పురుషుల అక్షరాస్యత 55.13; స్త్రీల అక్షరాస్యత 32.72. గ్రామీణ ఆంధ్రలో మొత్తం అక్షరాస్యులు 35.74 శాతం. పురుష అక్షరాస్యులు 47.28; స్త్రీ అక్షరాస్యులు 23.92. పట్టణ ఆంధ్రలో అక్షరాస్యులు 66.35. స్త్రీ అక్షరాస్యులు 56.41, పురుషులు 75.87 శాతం.

2000 సంవత్సరం నాటికి ప్రపంచ నిరక్షరాస్యులలో సగం మంది మన దేశంలోనే వుంటారని నిపుణులు అంచనాలు వేశారు. 5000 సం||ల నాగరికత మనకుంది. ఒకప్పుడు ప్రపంచంలో తలమానికలుగా పేరుగాంచిన గొప్ప విద్యా క్షేత్రాలయిన తక్షశిల, నలందా, నాగార్జున కొండ ఈ దేశంలో విలసిల్లాయి. ఆసియా ఖండానికే గొప్ప కీర్తి ప్రతిష్టల నార్జించిన గౌతమ బుద్ధుని దేశమిది. ఇంతటి ఘనకీర్తిగల దేశం ఈనాడు ప్రపంచ నిరక్షరాస్యులకు నాయకత్వం వహించటం భారత జాతికే గొప్ప అవమానం. అంతేకాకుండా శైశవ దశలో ఉన్న మన ప్రజాస్వామ్యం నిలదొక్కుకుని, విజయవంతం కావాలంటే అక్షరాస్యత అతి ప్రధానమైన అంశం. అందులో మహిళా అక్షరాస్యత దేశాభివృద్ధికి అత్యంత అవసరమైనదిగా గుర్తించబడింది.

1988 లో అప్పటి ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ 'జాతీయ సాక్షరతా మిషన్' ను నిరక్షరాస్యత నిర్మూలన దేశంలో యుద్ధ ప్రాతిపదికపై జరగాలని ఏర్పాటు చేశారు. ఈ మిషన్ పిలుపు నందుకొని దేశంలోని అనేక జిల్లాలలో అక్షరాస్యత కార్యక్రమం ముమ్మరంగా కొనసాగుతోంది. 8 వ ప్రణాళిక అంతానికి 345 జిల్లాలలో సంపూర్ణ అక్షరాస్యతను సాధించడానికి ప్రయత్నాలను ప్రభుత్వం, ప్రజలు ఉమ్మడిగా ప్రయత్నిస్తున్నారు. కేరళ రాష్ట్రంలో కొట్టాయం జిల్లా దేశంలోని మొదటి అక్షరాస్యతా జిల్లాగా ప్రకటించబడింది. కేరళ రాష్ట్రంలో మొత్తం అక్షరాస్యులు 89.81. 1991 లెక్కల ప్రకారం. అదే సమయంలో బీహారు రాష్ట్రంలో 38.48. కేరళలో మహిళా అక్షరాస్యులు 86.17. అదే సమయంలో రాజస్థాన్‌లో మహిళా అక్షరాస్యులు 20.44 శాతం. కేరళ రాష్ట్రంలో స్త్రీలపై అత్యాచారాలు చాలా తక్కువ, శిశుమరణాలు తక్కువ. జనాభా నియంత్రణలో దేశంలో అన్ని రాష్ట్రాలకంటే ముందున్న కారణం మహిళా చదువరులే అనటంలో ఎలాంటి సందేహం అక్కర్లేదు. ఒక పురుషుడు చదువుకుంటే, ఆ చదువు ఒక వ్యక్తికి చెందినది మాత్రమే కాని, ఒక స్త్రీ చదువుకుంటే మొత్తం కుటుంబం లాభపడుతుందనే నానుడి కేరళ రాష్ట్రంలోని మహిళా అక్షరాస్యుల్ని గమనిస్తే స్పష్టపడుతుంది.

మహిళల విద్య దేశాభ్యుదయానికే అత్యంత కీలకమైనదని అందరూ గుర్తించినదేను! అయితే, ఆడపిల్ల చదువు ఈ దేశంలో దండగ అని అనేక కారణాల వల్ల నేటికీ భావిస్తూనే వున్నారు. పేదరికం, సంప్రదాయాలు, వరకట్నం, ప్రధాన ఆటంకాలు అమ్మాయి చదువుకు. దేశంలో ఆడపిల్లలకు 13, 14 సంవత్సరాల వయసప్పుడే 70 శాతం పెళ్ళిళ్ళు జరిగిపోతున్నాయి. ఆడపిల్ల పెళ్ళి కోసం మాత్రమే పుట్టింది అనే భావం ప్రజల మనస్సుల్లో చెరిగినప్పుడే మహిళాభ్యుదయానికి మార్గం సుగమమం కాగలదు.

అక్షరాస్యత అంటే చదవటం, వ్రాయటం మాత్రమే కాదు - నాలుగుగోడల మధ్య కుదించబడిన స్త్రీ పుస్తకాల సహాయంతో అద్భుత ప్రపంచాన్ని చూడ గల్గుతుంది. సమాజాన్ని, తన పరిస్థితుల్ని అర్థం చేసుకుంటుంది. బ్రతకడానికి వ్యవహారిక పరిజ్ఞానాన్ని అలవరచుకుంటుంది.

## మహిళా అక్షరాస్యత లక్ష్యాలు:

1. చదవడము, వ్రాయడము, అంకెలు లెక్కించడము 2. తాను గురవుతున్న అణచివేతకు కారణాలు తెలుసుకోవడము, సంఘటితము కావడము, అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొనడము 3. ఆర్థిక స్తోమతను పెంచుకోవడానికి అవసరమయిన నైపుణ్యాన్ని సంపాదించడం, జీవన ప్రమాణాలను మెరుగుపరుచుకోవడము. 4. పరిమిత కుటుంబాన్ని, పర్యావరణాన్ని మహిళా సమానత్వ అవసరాన్ని గుర్తించడము, అనుగుణంగా వ్యవహరించడం.

1993 డిసెంబరులో ఢిల్లీలో 'అందరికీ విద్య' అనే నినాదంతో 9 దేశాల శిఖరాగ్ర సమావేశం జరిగింది. ఈ 9 దేశాలలో ప్రపంచ నిరక్షరాస్యులలో 70 శాతం వున్నారు. ఈ శతాబ్దం అంతానికి ప్రపంచంలో నిరక్షరాస్యులు లేకుండా చేయాలని, ముఖ్యంగా బాలికలకు, మహిళలకు విద్య గరిపే విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలని ఢిల్లీ శిఖరాగ్ర సమావేశం పిలుపు నిచ్చింది.

"మహిళల్ని విద్యావంతుల్ని చేయడానికి అయ్యే ఖర్చు కంటే వారిని నిరక్షరాస్యులుగా వుంచడానికి ఎక్కువ ఖర్చు దేశం భరించాలి " అని NCERT కి చెందిన డాక్టర్

ఉషా నాయర్ చేసిన వ్యాఖ్య ఎంతో అర్థవంతమైనది. భారతదేశ అభివృద్ధిని పరిశ్రమతో పోలిస్తే, ఇందుకు అత్యంత అవసరమైనది చదువుకున్న తల్లి. అత్యంత ఆధునిక యంత్రాలు, మేలు రకమైన ముడిసరుకు, ప్రతిభావంతమైన యాజమాన్యం కంటే అధిక ఉత్పాదకతకు స్ఫూర్తి, శిక్షణ, మంచి వేతనంగల కార్మికులు ఏరకంగా ఆవశ్యకమో అదే విధంగా సమగ్ర దేశాభివృద్ధికి చదువుల తల్లి అత్యంత అవసరం

కొత్త వ్యవసాయ, పారిశ్రామిక పద్ధతులలో శిక్షణ గ్రామీణ, పట్టణ పేద మహిళలకు నేటి సరళీకృత ఆర్థిక పరిస్థితులలో కొంతవరకు 'Safty Net' ను ఏర్పరచగలదు. ఈ శిక్షణ శిబిరాలను విరివిగా దేశమంతటా మహిళలు ఉపాధి అవకాశాలు పోగొట్టుకొనకుండా వుండటానికి ఎంతయినా తోడ్పడుతాయి. అభివృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థకు నైపుణ్యం, శిక్షణ గల మానవ వనరులు అంటే మహిళా వనరులు కూడా ఎంతో ఆవశ్యకము. మహిళా మానవ వనరులు అభివృద్ధి అయినప్పుడే భారత అభివృద్ధి చక్రాలు సంపదను సృష్టించగలవు. మహిళాభ్యుదయానికి చదువు ఎంత అవసరమో, దేశాభివృద్ధికి మహిళ అంతే అవసరమని గుర్తించాలి.

"మానవ విజ్ఞానం అంతా పురుషుల ప్రయోజనాలకు అనుగుణంగా మలచబడింది. స్త్రీలకు విద్యా అవకాశాలు కల్పించబడి నప్పటికీ అది కూడా స్త్రీలను పురుషుల ప్రయోజనాలకు సమర్థవంతంగా వినియోగపడే ద్వితీయ పాత్రధారులను చేయడానికి మాత్రమే" అని ఫ్రీమన్ చేసిన వ్యాఖ్య అక్షర సత్యం.

విద్యావంతులైన మహిళలు తోటి స్త్రీల సమస్యల పట్ల స్పందించాలి. పాత కాలపు ఆదర్శ గృహిణి మూస నుంచి బయటపడగలగాలి. తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పట్ల మహిళలు ఆసక్తి చూపించనంతకాలం చదువు, ఆర్థిక స్వాతంత్ర్యం పెద్దగా వారి జీవితాల్లో మార్పు తీసుకొని రాలేవు.

### గ్రామీణ మహిళల సారా వ్యతిరేకోద్యమం:

"స్వరాజ్య సాధనను వాయిదా వేయడానికి నేను అంగీకరిస్తాను గాని మద్యపానానికి, అంటరానితనానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాలను నేను వాయిదా వేయలేను". - గాంధీజీ.

స్వాతంత్ర్య ఉద్యమంలో నిర్మాణాత్మక కార్యక్రమంలో భాగంగా కల్లు అంగళ్ళవద్ద అసంఖ్యాక మహిళలు పికెటింగ్ చేయటం అనాటి మాట. మరి ఈనాడు అసంఘటిత రంగంలో పనిచేస్తున్న అసంఖ్యాక పేద మహిళలపై గృహ దౌర్జన్యాలు చేయడానికి మగవారికి సారా ఒక పరికరంలా ఉపయోగపడుతుంది. భార్యా భర్తలు రోజంతా కష్టపడి సంపాదించే వేతనంలో అత్యధిక భాగం సారా అంగళ్ళకే సమర్పించబడటం మన రాష్ట్రంలో సర్వసాధారణమయింది. సారా తాగి ఇంటికొచ్చే మగవారిని చూసి చూసి కడుపు మండిన మహిళలు స్వచ్ఛందంగా ఎవరికివారు, ఏవూరి కావూరులో బ్రహ్మాండమయిన సారా వ్యతిరేక పోరాటం నడిపి, మహిళా ప్రభంజన శక్తిని లోకానికి చాటారు. మన రాష్ట్రంలో మద్యపాన వినియోగంలో 75 శాతం సారా వుండేది. నిషేధించే నాటికి 18 కోట్ల లీటర్ల మద్యపాన వినియోగంలో 13.5 కోట్ల లీటర్లు సారానే! వారుణవాహిని పథకంలోని సౌలభ్యంవల్ల సారా త్రాగిన మగవారి దౌర్జన్యాలకు విసిగిపోయిన మహిళల కడుపుమంటలనుంచి స్వచ్ఛందంగా వచ్చిన ఉద్యమం ఇది. 'మగువ తెగింపు మద్యానికి ముగింపు' అని మహిళలు గ్రహించారు. నెల్లూరు జిల్లా మహిళలు సాక్షరతా కార్యక్రమాలలో 'సీతమ్మ కథ' చదివి ఉత్తేజితులై, ముందడుగు వేసి, సారా మహమ్మారిని దూబగుంటలో నేల మట్టం చేసి అందరి కళ్ళు తెరిపించారు. వేలాదిమంది మహిళలు సంఘటితమై కలెక్టర్ ఆధ్వర్యంలోని సారా వేలంపాటలను 32 సార్లు వాయిదా వేయించారు. నెల్లూరు జిల్లా మహిళల పోరాటం ఇతర జిల్లాల మహిళల్ని కూడా చైతన్యవంతుల్ని చేసి సారా నిషేధానికి ఉద్యమాన్ని నడిపించింది. చివరకు ప్రభుత్వం దిగివచ్చి, ముందుగా నెల్లూరు జిల్లాలో, '93 అక్టోబరు 1 నుండి రాష్ట్రమంతటా సారాను నిషేధించింది. దొంగ సారా రాకుండా మహిళాచైతన్యానికి రాష్ట్ర సారా నిషేధ కమిటీ వావిలాల గోపాలకృష్ణయ్య, భాట్టం శ్రీరామమూర్తి గార్ల నాయకత్వంలో కొంత కృషి చేసింది. ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ అనేకమంది మహిళా ప్రతినిధులు ఆ కమిటీకి రాజీనామా చేశారు. గవర్నర్ కృష్ణకాంత్, సుమన్ కృష్ణకాంత్‌లు కూడా మహిళల కష్టాలు, కన్నీళ్ళకు కారణమయిన సారా వ్యతిరేక ప్రచారంలో విశేషమైన కృషిని కొనసాగించారు. మద్యపాన అలవాటు పూర్తిగా పోకపోయినా ఒక సారాను నిషేధించటం వల్ల సానుకూల పరిణామాలు మన రాష్ట్రంలో గోచరిస్తున్నాయి. సారాను నిషేధించిన తర్వాత అనేక మంది మహిళలు కడుపునిండా అన్నం తింటున్నాం అని వెల్లడించడం. రాష్ట్రంలో నేరాల సంఖ్య తగ్గిందని పోలీసు డిపార్టుమెంటు రిపోర్టులు, 1993 లో ప్రధాని నరసింహారావుగారు ప్రకటించిన మహిళా సమృద్ధి యోజన పథకం మన రాష్ట్రంలో 2.63 లక్షల అక్కౌంట్సుతో మూడుకోట్ల రూపాయలు డిపాజిట్‌తో దేశంలోనే ప్రథమ స్థానంలో వుందని ఆంధ్రా సర్కిల్ పోస్టుమాష్టర్ జనరల్ వెల్లడించిన వివరాలు - అన్నింటికన్నా మహిళలు మానసిక శాంతిని సారా నిషేధం వల్ల కొంతవరకు పొందగల్గుతున్నారంటే, ఒక చట్టం ఎంత సామాజిక మార్పును తీసుకురాగల శక్తి కలిగి వుంటుందో అర్థమవుతుంది. ఈ సారా నిషేధ

చట్టం అమల్లోకి రావడానికి గల కారణం సామూహిక మహిళా చైతన్యం. అదే మహిళా విముక్తి మార్గం. "మా వూరికి సారా వద్దు" అనే ఉద్యమానికి ఏ వూరి కావూరి మహిళలు ఏ రకంగా సంఘటితమయ్యారో అదే విధంగా బ్రాందీ షాపులు, ఇతర సామాజిక రుగ్మతల విషయంలోనూ దృష్టిసారించినప్పుడు - అంటే, బయట సామాజిక విషయాల్లో పాత్రవహించటం వల్ల మహిళా సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. సారాను నిషేధించినా దొడ్డిదారిన చవకరకం మత్తుపానీయాల ఉత్పత్తిని అధికారం చెలాయిస్తున్న రాజకీయనాయకులు అనుమతిస్తున్నారన్న విమర్శలు వస్తున్నాయి. నిరసనలు వెల్లడవుతున్నాయి. అమలులో ప్రభుత్వానికి చిత్తశుద్ధి అవసరమని అనేక ఘటనల వల్ల వెల్లడవుతోంది. ఆంధ్రప్రదేశ్‌లోని మహిళా సంఘాలు అన్నికలిసి ఒక కొత్త ఉద్యమాన్ని ఆరంభించేందుకు 1994 నుండి సదస్సులు, గోష్ఠులు సాగుతుండడం శుభసూచకం.

## సమాజంలో ఆడపిల్లపట్ల వివక్ష:

బొంబాయి, ఢిల్లీ వంటి మహానగరాల్లో, స్త్రీ శిశువు గర్భవిచ్ఛిత్తి ఎక్కువ జరుగుతున్నదని తెలిసినప్పుడు పుట్టే ఆడపిల్లపట్ల కూడా సమాజం ఎంతటి క్రౌర్యాన్ని ప్రదర్శిస్తుందో అని అనిపిస్తుంది. 1991 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో స్త్రీల నిష్పత్తి తగ్గింది. ప్రతి 1000 మంది పురుషులకీ 927 మంది స్త్రీలు మాత్రమే వున్నారు. 1901 లో 1000 మంది పురుషులకు 929 మంది స్త్రీలున్నారట. ఆంధ్రప్రదేశ్‌లో 1000 మంది పురుషులకు 972 మంది స్త్రీలు వున్నారు. స్త్రీ పురుషుల మధ్య నిష్పత్తి తగ్గితే భవిష్యత్తులో ఎన్నో ప్రమాదాలను ఎదుర్కోవాలి. ఐక్యరాజ్యసమితి, సార్క్ దేశాలు ఆడపిల్లల పట్ల గల సామాజిక వివక్ష అంతానికి నేడు ఎన్ని ప్రకటనలు వెలువడుతున్నా, చర్యలు తీసుకుంటున్నా ఆచరణలో మాత్రం 'మగ మాణిక్యం - ఆడ చెల్లే' అనేది చెల్లుబడిగా వుంది. లావుగా వున్నా, పొడుగ్గా వున్నా, నల్లగా వున్నా, ఎక్కువ చదువుకున్నా, ఎక్కువ స్వేచ్ఛా సౌకర్యాలు కోరుకున్నా ఆడపిల్ల మరిన్ని సమస్యలు ఎదుర్కోవాల్సిందే!

ఆడపిల్ల నెత్తిమీద ఇంత మూట పెడితేగాని వెళ్ళదు, ఆడపిల్లమీద చేసే ఖర్చు వృధా అనే కాలంచెల్లిన నాటి వివక్ష పోతేగాని ప్రాణమున్న వ్యక్తిగా ఆడపిల్ల బ్రతకలేదు. ఎదగలేదు. వరకట్నం చావులకి మూలం తల్లిదండ్రుల నిరాదరణ అనేది చాలా వాస్తవం. కుటుంబాలలో ఆడపిల్ల పట్ల ముందుగా వివక్ష అంతం కావాలి, అప్పుడే ఆమె జీవితం గొప్ప మార్పులకు గురవుతుంది.

స్త్రీలు 15-45 సంవత్సరాల మధ్యకాలంలో ఎక్కువ మంది పిల్లల్ని కనడమే ప్రధానంగా వున్న ప్రాచీన సమాజాలలో వారెక్కువగా ఇంటికి పరిమితమయ్యారని వివిధ శాస్త్రాలకు, మహిళా సమస్యలకు గల సంబంధాన్ని పరిశీలించిన 1992 నోబుల్ బహుమతి గ్రహీత గారి బెకర్ అభిప్రాయపడ్డారు. స్త్రీలు ఇంటికి మాత్రమే పరిమితం కావాలన్న వాడుక ఎప్పుడు ఎలా ఆచరణలోనికి వచ్చినప్పటికి అది స్త్రీలను బయటి ప్రపంచానికి వేరు చేసిందని, దానివల్ల స్త్రీలు నాలుగు గోడల మధ్య కూరుకుపోయి వంచించబడ్డారు. ఈ ఆధునిక కాలంలో మహిళలు ఇంటికి పరిమితం కావడమన్నది వారికి వారే విధించుకుంటున్నారా? లేక పురుషులే ఇంటా-బయటా స్త్రీలకు గల సంబంధాన్ని త్రెంచుతున్నారా అనే ప్రశ్నను మహిళా సమస్యలను అధ్యయనం చేస్తున్నవారు పరిశోధించవలసిన ముఖ్యాంశము.

## మహిళలు - జనాభా ఆరోగ్యం:

1991 జనాభా లెక్కల ప్రకారం 1000 పురుషులుంటే 927 మంది స్త్రీలున్నారట. 1901 లో 1000 పురుషులుంటే 929 మంది స్త్రీలున్నారు. మన రాష్ట్ర జనాభా 1981 లో 5.30 కోట్లు, 1991 లెక్కల ప్రకారం 6.63 కోట్లు. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు మనం 35 కోట్లు. ఈ నలభై ఆరేళ్లలో 86 కోట్లకు జనాభా ఎగబాకింది. 2025 నాటికి భారత జనాభా 149 కోట్లకు చేరుకుంటుందని పాపులేషన్ రిఫరెన్సు బ్యూరో అనే సంస్థ పేర్కొంది. సెకనుకు ఇద్దరు చొప్పున ఏడాదికి 1 కోటి 87 లక్షలు జనాభా భారతీయ సంతతికి జమ అవుతున్నారు. దేశం మొత్తంలో పురుషులకంటే స్త్రీలు 3 కోట్ల 12 లక్షలమంది తక్కువున్నట్లు ఒక నివేదిక ప్రకటించింది. 22 కోట్లమంది దరిద్ర రేఖకు దిగువన మన దేశంలో నివసిస్తున్నారు. 'మంది ఎక్కువైతే మజ్జిగ పల్చన' - అభివృద్ధి ఎంత సాధిస్తున్నా దాన్ని తలతన్నేలా జనసంఖ్య పెరగటంతో కృషి బూడిదలో పోసిన పన్నీరు చందంగా తయారైంది. అణ్వస్త్రం కన్నా శక్తివంతమైన జనాభా బాంబు విస్ఫోటనం నేడు మన దేశాన్ని గడగడలాడిస్తోంది. 1952 లో ప్రపంచంలో జనాభా నియంత్రణ విధానాన్ని ప్రవేశపెట్టిన మొదటి దేశం మనది. జనాభాను అదుపు చేయడంలో విఫలమయింది మనమేను! చైనావలె బలవంతంగానయినా ఒక్కబిడ్డ పద్ధతిని ఆచరించేలా చేయడం మినహా జనాభాను ఆపే గత్యంతరం కనపడ్డం లేదు. మహిళా సమస్యకు, జనాభా పెరుగుదలకు ప్రత్యక్ష సంబంధముంది. మహిళలు నిరక్షరాస్యులుగా, పేదలుగా వున్నంతకాలం ఈ జనాభా సమస్యను పరిష్కరించలేం. ఈజిప్టు రాజధాని కైరోలో 1995 సెప్టెంబరులో అంతర్జాతీయ జనాభా అభివృద్ధి

సదస్సు జరుగుతుంది. అందులో మహిళలకు సకల విద్య, ఆరోగ్య సదుపాయాల కల్పనే ధ్యేయంగా కుటుంబనియంత్రణ కార్యక్రమాన్ని విశాల దృక్పథంతో అమలు పరచాలనే పథకాన్ని సిద్ధం చేస్తున్నట్టు వార్తలు వస్తున్నాయి.

జనాభాను వర్ణించడంలో స్త్రీలపాత్ర గురించి ఐక్యరాజ్య సమితి, సార్క్ దేశాలు అనేకసార్లు ప్రకటనలు చేస్తున్నాయి. యునిసెఫ్ ఇటీవల విడుదలచేసిన నివేదిక అభివృద్ధి చెందుతున్న దేశాలలో పౌష్టికాహారం, విద్య, కుటుంబ నియంత్రణ, మహిళా అభివృద్ధి మొదలైన విషయాలలో నివేదికను ప్రకటించింది. స్త్రీలలో రక్తహీనతవల్ల తల్లిపాలు బిడ్డలకు లభించడం లేదట. పిల్లల్ని పెంచడంలో స్త్రీలకు పరిజ్ఞానం లేకపోవడం వల్ల అనేక పొరబాట్లు జరుగుతున్నాయట. చాలినంత పోషకాహారం (ఖరీదయినది కానక్కర్లేదు) లభించనందున పిల్లల్లో రకరకాల వ్యాధులు వస్తున్నాయని తెలియజేసింది. తక్కువ మోతాదులో ఎక్కువసార్లు పిల్లలకు ఆహారం ఇవ్వడం ఆరోగ్యమని తెలియని తల్లులు ఒకేసారి కడుపునిండా కూరేస్తారు. పిల్లల పెంపకం గురించి పరిజ్ఞానం స్త్రీలకు లేకపోవడంవల్ల కంటిచూపు పోవడం, అంగవైకల్యం సంభవిస్తున్నాయని ఆ నివేదిక స్త్రీల పరిజ్ఞానం గురించి నొక్కి వక్కాణించింది. తల్లుల ఆరోగ్యం బాగా లేకపోవడం వల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలలో దాదాపు మూడవ వంతు పిల్లలు తక్కువ బరువుతో పుట్టి జబ్బులకు లోనవుతున్నారు. అందుకని పేద మహిళలు కుటుంబ నియంత్రణ పద్ధతుల్ని పాటించడంలేదు. పిల్లలు బ్రతుకుతారో, లేదో తెలియక పిల్లల్ని కనడంలో స్వేచ్ఛ లేకపోవడం కూడా జరుగుతుంది.

మహిళలకు రాజ్యాంగం ప్రసాదించిన సామాజిక, ఆర్థిక అవకాశాలు అమల్లోకి రాకపోయినా రాజకీయ హక్కులలో ఒకటయిన ఓటుహక్కును మాత్రం ఉపయోగించుకుంటు న్నారు. అయితే, సరైన రాజకీయ పరిజ్ఞానం లేని మహిళల ఓటుహక్కు మగవారి రెండవ ఓటుగా కొంతవరకు చెలామణి అవుతున్నది వాస్తవం. ఈ మధ్యనే భారత ప్రభుత్వం 72, 73 రాజ్యాంగ సవరణల ద్వారా స్థానిక సంస్థల ప్రాతినిధ్యంలో అన్ని స్థాయిలలో 3 వ వంతు స్థానాలను మహిళలకు కేటాయింపుకు ఏర్పాటు చేయడం ముదావహం. ఈ మార్పుల వల్ల లక్షలాది మహిళలు రాజకీయ ప్రక్రియలో నిర్ణయాధికారం కలిగి వుంటారు. ఈ రాజకీయ పాత్ర మహిళాస్థాయిని పెంచగలదనటంలో సందేహం లేదు. అయితే మహిళలు ఈ సంస్థలలో భాగస్వాములు కావడానికి సీట్ల రిజర్వేషన్‌తో సరిపెట్టుకోకుండా అన్ని స్థాయిలలో పూర్తిగా రాజకీయాలలో పాల్గొన్నప్పుడే ఏ చట్టమయినా స్త్రీలకు మేలు చేయగలదు. పశ్చిమ బెంగాల్లో స్త్రీలకు మూడవ వంతు స్థానిక సంస్థలలో కేటాయించి పంచాయితీ ఎలక్షన్లను జరిపించింది. అలాగే అన్ని రాష్ట్రాల్లో మహిళాభివృద్ధికి మహిళామండళ్ళు ఏర్పడినాయి. కాని, ఇవి మహిళల్లో బయట ప్రపంచానికి సంబంధించిన చైతన్యాన్ని, పరిజ్ఞానాన్ని కలిగించలేకపోతున్నాయి. ఉమన్ స్టడీస్, స్త్రీ శిశు సంక్షేమ శాఖలు, అనేక పార్టీలకు అనుబంధంగా వున్న మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు ఈ మహిళా మండలులకు కొత్త ఎజెండాను ఇవ్వటం చారిత్రక అవసరం. దేశమంతటా గ్రామ గ్రామాలకు విస్తరించిన మహిళా మండలులు మహిళా విముక్తికి భూమిక కాగలగాలి. అప్పుడే నేటి ప్రజాస్వామ్యానికి అయువుపట్టయిన స్వేచ్ఛా సమానత్వాలను, 72, 73 రాజ్యాంగ రిజర్వేషన్లను మహిళలు అనుభవించగలరు. ఎంత ఎక్కువగా రాజకీయ రంగంలో మహిళలు ప్రవేశించగలిగితే వారి కంతటి స్థానం బయట ప్రపంచంలో లభించగలదు. మన పార్లమెంటులో ఈనాటికీ 10 శాతం మహిళా సభ్యులు లేకపోవడం మహిళల రాజకీయ వెనుకబాటుతనాన్ని ప్రతిబింబిస్తోంది.

మహిళ స్థితి గుతుల్ని మరింత పరిశీలించి తగిన సహాయాన్ని అందించేందుకు కేంద్ర ప్రభుత్వం 1992 లో జాతీయ మహిళా కమీషన్‌ను జయంతి నటరాజన్ చైర్మన్, గా ఏర్పరచింది. కేంద్రంలో కొన్ని రాష్ట్రాలు కూడా ఇలాంటి కమీషన్‌లను ఏర్పాటు చేశాయి. మహారాష్ట్ర ప్రభుత్వం 1993 లో మహిళా కమీషన్‌ను ఏర్పాటు చేయడమేకాకుండా 1994 జూన్‌నెలలో మహిళల కోసం రూపొందించిన వాస్తవాధికార విధానానికి రిపబ్లిక్ ఉపాధ్యక్షులు కె.ఆర్. నారాయణన్ చేత బొంబాయిలో ప్రారంభోత్సవం జరిపించింది. రాష్ట్ర స్త్రీ శిశు సంక్షేమ శాఖ సెక్రటరీ చంద్రా అయ్యంగార్ ఆధ్వర్యంలో 40 మహిళా గ్రూపులు, నిపుణులు, అధికారుల సహాయంతో మహిళా అభివృద్ధికి, అధికారానికి సంబంధించి ఒక కొత్త వాస్తవ అధికార విధాన పత్రం రూపొందించారు. మహిళలకు కుటుంబ ఆస్తిలో సమాన వాటా, గ్రామ పంచాయితీ ఆదాయంలో 10 శాతం మహిళల అవసరాలకు ఖర్చు చేయటం, గ్రామానికి చెందిన 10 శాతం భూమి మహిళలకు కేటాయించడం, గవర్నమెంటు ఇచ్చే సహాయంగాని, అప్పుగాని భార్యా భర్తలు ఇద్దరి పేరుమీదగా ఇవ్వటం, సగంమంది మహిళా టీచర్లను నియమించడం, 30 శాతం ప్రభుత్వ ఉద్యోగాలు స్త్రీలకు రిజర్వు చేయటం, మూడవ వంతు పోలీస్ స్టేషన్లు మహిళా పోలీసులకు కేటాయించడం, గ్రామంలో 75 శాతం మహిళలు బ్రాందీ షాపును తీసివేయాలని తీర్మానిస్తే దాన్ని రద్దు చేయటం కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు. ముఖ్యమంత్రి శరద్‌పవార్ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని చేశాడనే విమర్శ వున్నప్పటికి మహిళలకు సంబంధించి ఒక కొత్త తరహా

విధాన పత్రాన్ని విడుదల చేయటం ముమ్మాటికి శుభ పరిణామం. ఈ విధాన పత్రంలో చాలా సానుకూలమైన, ఆచరణ సాధ్యమయిన అంశాలు పొందుపరచబడ్డాయి. ఆ రాష్ట్ర ప్రభుత్వం తన అధికారాల పరిధిలో స్త్రీలు రాజకీయ, ఆర్థిక, పరిపాలనారంగాలలో నిర్ణయాలు తీసుకునే క్రమంలో శక్తివంతుల్ని చేయడానికి ఈ విధాన పత్రం లాంటివి; 72, 73 రాజ్యాంగ సవరణలు తోడ్పడతాయనటం కొంతవరకు వాస్తవం.

మహిళల చదువు, ఉపాధి, పెళ్ళి, పిల్లల్ని కనడం, పెంచడం విడాకులు, వివాహేతర సంబంధాలు, శరీరంపై పూర్తి హక్కు వంటి వివిధ సమస్యలను ఒక వర్గ సమస్యగా చిత్రిస్తూ స్త్రీ వాద ఉద్యమాలు, రచనలు దేశమంతటా పట్టణ ప్రాంతాల్లో అమల్లో వున్నాయి. స్త్రీ సమస్య పరిష్కారానికి ఇవి చాలవు.

ప్రపంచంలోని దేశదేశాల స్త్రీల సమస్యలు వేరయినా, ఒక దేశంలోని అనేక వర్గాల స్త్రీల సమస్యలలో భేదాలున్నా, గ్రామీణ, పట్టణ ప్రాంత స్త్రీల సమస్యలు వేరయినా, – స్త్రీగా పుట్టడమే ఒక తక్కువతనంగా మొత్తం మానవ సమాజం పరిగణించడాన్ని ఆధునిక మహిళ నేడు ప్రశ్నిస్తోంది. తన అస్తిత్వానికి అనేక రకాలుగా భంగం కలుగుతున్న ఈ తరుణంలో తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, ఆత్మ గౌరవాన్ని నిలుపుకోవడం కోసం తీవ్రంగా మహిళ పెనుగులాడుతోంది.

"స్త్రీలకు సముచిత స్థానం లభిస్తేనే సమాజప్రగతి సాధ్యం; అన్ని జీవనరంగాలలో జాతీయంగా, అంతర్జాతీయంగా మహిళలు మరింత సానుకూల క్రియాశీల పాత్ర వహించడం అందరి ప్రయోజనాల దృష్ట్యా అత్యంత ఆవశ్యకం" అని ఇందిరా గాంధి 1984 లో ఒక మహిళా సదస్సులో అభిప్రాయపడ్డారు.

స్త్రీజాతి విముక్తి పోరాటం అంటే నేడు సమాజంలో ఉన్న పురుషాధిక్యతను ఎదుర్కొని పోరాడడం మాత్రమే కాదనీ, పురుషాధిక్యతకు పునాది అయిన ఆర్థిక, సామాజిక వ్యవస్థలో మార్పు తీసుకు రావడానికి జరిపే పోరాటమని ప్రధానంగా గుర్తించాలి. 21 వ శతాబ్దమయినా స్త్రీల సమస్యల పరిష్కారానికి మార్గం సుగమం చేస్తుందని ఆశిద్దాం.

ఏ శిల్పం? ఏ సాహిత్యం?
ఏ శాస్త్రం? ఏ గాంధర్వం?
ఏ వెల్గుల కీ ప్రస్థానం? ఏ స్వప్నం? ఏ దిగ్విజయం? – శ్రీశ్రీ

# ఆంధ్రప్రదేశ్‌లో బాలల వికాస కార్యక్రమాలు

- శారద అశోకవర్ధన్

బాలలు ముందు తరానికి వారసులు మాత్రమే కాదు, సమాజం తీర్చిదిద్దుకొనే భావి భారత పౌరులు. కష్టాలు కల్లోలాలను ఎదిరించి దేశాన్ని కాపాడుకొనే రేపటి పౌరులు, ధీరులు; ఆకుచాటు పిందెల్లా ఉంటూనే స్వంత గుబాళింపులతో ఇంపు నింపగలవారు. వీరిని కాపాడుకోవాల్సిన బాధ్యత వ్యక్తిగతంగాను, సమష్టిగతంగానూ ఈ సమాజానికి ఉంది.

దేశానికి భవిష్యత్ నిధి అనదగ్గ పిల్లలను మనం నిజంగా జాగ్రత్తగా చూస్తున్నామా? సమగ్రంగా ఎదిగేందుకు అవకాశం కల్పిస్తున్నామా? ఇది అనుదినం, అనుక్షణం వేసుకోవలసిన ప్రశ్న. మనిషి జీవితంలో బాల్యం స్వర్ణకాలం లాంటిది. ఆటపాటలతో, చిలక పలుకులతో ఎంతటి గుండె బరువునైనా ఇట్టే మాయం చేసే చిన్నారులు క్రమంగా ఈ సమాజంలో ఒంటరివారైపోతున్నారు. పట్టణాలలో తల్లిదండ్రులు ఇద్దరూ ఉద్యోగులైతే పిల్లలు మానసిక వ్యథతో మగ్గుతున్నారు.

మరికొద్దిమంది పిల్లలు తమ బంధువుల దగ్గర పెరిగి అమ్మనాన్నల ఆప్యాయతకు దూరం అవుతున్నారు. మానసిక వ్యథతో పెరిగే పిల్లలు ఒక పద్ధతి, ఒక తరహా అని లేకుండా అన్ని రకాల శక్తుల ప్రభావాలకు లోనవుతున్నారు.

ఈనాటి చదువు పిల్లలను అక్షరాస్యులను చేస్తున్నదే తప్ప సంస్కార సంపన్నులను చేయలేకపోతున్నది. విద్యార్థులలో దృఢమైన వ్యక్తిత్వం, బుద్ధి కుదురు, చక్కని సంస్కారం ఈ చదువులతో పాటు నేర్పవలసిన అవసరం ఉంది. తలలు బోడులైన తలపులు బోడులు కానట్లే బండెడు పుస్తకాలు మోస్తూ తిరిగినంత మాత్రాన విజ్ఞానం వచ్చేయదు. దానికి సామర్థ్యం, సహృదయతగల ఉపాధ్యాయులు కావాలి. పిల్లలు ఎక్కువ సేపు గడిపేది పాఠశాలలోనే కనుక అక్కడ ఆరోగ్యకరమైన వాతావరణం నెలకొల్పటం అత్యవసరం.

బాలలకు సంబంధించిన వివిధ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని బాలల మానసిక వికాసానికీ, సంక్షేమానికీ, వారి ఆరోగ్యరక్షణకు, అభ్యున్నతికి కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వాలు అనేక పథకాలను రూపొందించాయి. ఎన్నెన్నో కార్యక్రమాలను చేపడుతున్నాయి. అంతేకాక, అనేక స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా తమ వంతు సేవలను అందిస్తున్నాయి. అలాంటి వాటిలో 'యునిసెఫ్' సేవలను ప్రత్యేకంగా పేర్కొనవచ్చు.

వివిధ దేశాల్లోని పిల్లలకు ఆహారం, విద్య, వైద్య, సదుపాయాలు అందించటంలో ఆయా దేశాలకు సహాయ సహకారాలు అందించటం కోసం ఐక్యరాజ్యసమితి 1946 డిసెంబర్‌లో అంతర్జాతీయ పిల్లల అత్యవసర నిధి (UNICEF) ని ఏర్పాటు చేసింది. అప్పట్లో యుద్ధంవల్ల బాగా నష్టపోయిన దేశాలలోని పిల్లలకు ఆహారం, వైద్య సదుపాయాలు అందించటమే ప్రధాన ధ్యేయంగా ఆ సంస్థ ఏర్పాటు అయింది. అయితే, 1950 వ సంవత్సరం తర్వాత నుంచి అంతగా అభివృద్ధి చెందని దేశాలలోనూ అత్యవసర పరిస్థితుల్లో ఇతర దేశాలలోనూ పిల్లల సంక్షేమానికి, వికాసానికీ కృషి చేసే విధంగా సంస్థకు సమకూరుతున్న నిధులను ఖర్చు చేయటం మొదలుపెట్టింది. అప్పటినుంచి ఈ సంస్థ పేరును "అంతర్జాతీయ పిల్లల అత్యవసరనిధి" నుంచి "పిల్లల నిధి" గా పరిగణిస్తున్నారు. పిల్లల్లో ఎక్కువగా వచ్చే వ్యాధులను నిర్మూలించటంలోనూ, చికిత్సలు అందజేయడంలోనూ, వారికి అవసరమైన పౌష్టికాహారం అందించటంలోనూ ఈ సంస్థ విశేషంగా కృషి చేస్తోంది.

దీనివల్ల ఆయా దేశాల్లోని పిల్లలకు తగిన సమయంలో వైద్య సదుపాయాలను అందించటంవల్ల పిల్లల్లో సంభవిస్తున్న మరణాలను కొంతవరకు అరికట్టగలిగింది. వివిధ దేశాలలో వైద్య సదుపాయాలను అభివృద్ధిపరచటం, వైద్య సిబ్బందికి శిక్షణ ఇవ్వడం, విద్యా సంబంధమైన సౌకర్యాలు కల్పించడం, ఉపాధ్యాయులకు శిక్షణ నందించటం, ఇతర సేవలను

చేయడంలో ఈ సంస్థ గణనీయమైన కృషి చేస్తోంది.

కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు బాలల వికాసానికి అనేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో మహిళాభివృద్ధి శిశుసంక్షేమశాఖ, విద్యాశాఖ, సాంఘిక సంక్షేమ శాఖలు బాలల వికాసానికి అనేక పథకాలను రూపొందించి విజయవంతంగా అమలుపరుస్తున్నాయి.

'యునిసెఫ్' సహకారంతో కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు 1974 లో సమగ్ర శిశు అభివృద్ధి పథకం క్రింద మహిళాభివృద్ధి శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో అంగన్ వాడీలను ప్రవేశ పెట్టింది. 3–6 సంవత్సరాల వయసు గల పిల్లలతోపాటు, గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు వ్యాధి నిరోధక టీకాలు, మందులు, వైద్య సహాయం అందించటంతోపాటు వారి బరువులను నెలనెలా తూకం వేసి రికార్డు చేయటం, మూడు సంవత్సరాల పిల్లలకు ఆట పాటలద్వారా విద్య నేర్పడం వల్ల వారికి జీవితంలో విద్యపట్ల ఆసక్తిని కలిగించి చదువులో ఎక్కువ మందిని ప్రోత్సహించే వీలుందనేది 'అంగన్‌వాడీ' కేంద్రాల ప్రధాన లక్ష్యం.

దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న కుటుంబాలకు చెందిన తల్లిదండ్రులు పనులకు వెళ్ళేటప్పుడు తమ పిల్లలను అంగన్‌వాడీ కేంద్రాలలో అప్పగిస్తారు. సాయంత్రం వరకు పిల్లలకు విద్య నేర్పడం, ఆరోగ్య పరిరక్షణ, పౌష్టికాహారం అందించటంలాంటి అతి ముఖ్యమైన పనులను పూర్తిచేసి, తిరిగి వారి తల్లి దండ్రులకు అప్పగించటం అంగన్‌వాడీ కార్యకర్తల ప్రధాన కర్తవ్యం.

పసిపిల్లలకు కోరింతదగ్గు, గొంతువాపు, ధనుర్వాతం, పోలియో, పొంగు, పసితనంలోనే క్షయ, కొన్ని సమయాలలో ప్రాణాలను బలి తీసుకొనే బాలారిష్టాలు పౌష్టికాహారలోపంవల్ల సంభవిస్తున్నాయి. ఈ పథకాలు ఈ విషయంలో తగిన శ్రద్ధ తీసుకొని పిల్లలకు సరైన పోషకాలు కలిగిన ఆహారాన్ని అందేలా చేయటంలో కృషి చేస్తున్నాయి.

### అనాథబాలల వికాసం:

కన్నవారెవరో తెలియక, తెలిసినా వారి ఆదరణకు నోచుకోక, సమాజం చేత ఛీత్కారింపులకు, చీదరింపులకు లోనవుతూ పసితనంనుంచే మసిబారిన జీవితాన్ని గడుపుతున్న వీధి బాలలు ఎందరో ఉన్నారు. అడుగడుగునా అవమానాలు దిగమింగుతూ, నిరాశా నిస్పృహలతో భారంగా బతుకుబండి లాగుతూన్న ఇలాంటి అనాథ బాలల్ని ఆదుకొనేందుకు స్వచ్ఛంద సంస్థలు కొన్ని ముందుకు వచ్చి తమ సేవలను అందిస్తున్నాయి. అటువంటి వాటిలో హైదరాబాద్ నగర పాలక సంస్థలోని అర్బన్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ (యు.సి.డి) తో పాటు "వై.ఎం.సి.ఎ. ఫోరం ఫర్ స్ట్రీట్ చిల్డ్రన్" వంటి సంస్థలు ముఖ్యమైనవి.

ఆదరించేవారు లేక, నిలువ నీడలేక, పార్కులను ఫుట్‌పాత్‌లను ఆశ్రయిస్తూ, ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ, చలిలో బిగదీసుకుపోయి జీవచ్ఛవాల్లా బతుకుతున్నవారిని ఈ సంస్థలు భుజం తట్టుతున్నాయి. 'అప్నాఘర్' పేరుతో నీడలేని ఈ బాలల కోసం 'నైట్ షెల్టర్' లను ఏర్పాటు చేస్తున్నాయి. జంటనగరాలలోని చుడీ బజార్, ఖైరతాబాద్, న్యూ బోయిగూడ, గ్యాస్ మండి ప్రాంతాలలో నాలుగు షెల్టర్లు ప్రారంభించారు. ఒక్కొక్క షెల్టర్‌లో దాదాపు నలభైమంది వీధి బాలలు తలదాచుకుంటారు.

వీరు అంటురోగాల బారిన పడకుండా ఆరోగ్య శిక్షణ తరగతులు నిర్వహించటం జరుగుతుంది. అదే విధంగా ఈ బాలలకు అవసరమైన ఆహారాన్ని వారే స్వయంగా తయారు చేసుకొనేందుకు అనువుగా వంట పాత్రలను, పొయ్యిలను సమకూర్చటం జరుగుతోంది. అయితే, ఈ బాలల జీవితాలను మెరుగుపర్చే ఉద్దేశంతో వడ్రంగం, పెయింటింగ్, భవననిర్మాణం, తదితర రంగాల్లో వృత్తి శిక్షణా తరగతులను నిర్వహిస్తూ, శిక్షణ పూర్తయిన బాలలకు పని కల్పించేందుకు ఈ సంస్థలు కృషి చేస్తున్నాయి.

నిరాశ్రితులైన అనాథబాలురను చేర్చుకొని, భారతీయ సంస్కృతిని అలవరుస్తూ, ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దటానికి డాక్టర్ హెడ్గేవార్ శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని 1989 లో సేవా భారతికి అనుబంధమైన కేశవ సేవా సమితివారు ఆనంద్‌బాగ్‌లో "వాత్సల్యసింధు" అనే సంస్థను అనాథ బాలలను ఆదుకొనేందుకు స్థాపించారు.

యావత్ భారతదేశంలో సుమారు పదివేల సంస్థలను సేవా భారతివారు నిర్వహిస్తున్నారు. ఆరు సంవత్సరాల నుంచి పన్నెండు సంవత్సరాల మధ్య వయసు కలిగి ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన కుటుంబాలకు చెందిన తల్లిదండ్రులు లేని అనాథ పిల్లలకు "వాత్సల్య సింధు" ఆశ్రయాన్ని కల్పిస్తోంది.

పాఠశాల విద్యాభ్యాసం, శారీరక వ్యాయామం, చేతి పనులు, తోట పనులలో శిక్షణతోపాటు వారివారి అభిరుచులకు అనుగుణంగా వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు ఇక్కడి బాలుర దైనందిన చర్యలో భాగంగా ఉంటాయి.

పురుషాధిక్య సమాజంలో వంచనకు గురై, పండులాంటి బిడ్డకు తల్లిగా మారినా 'సభ్య సమాజం' ఆమెను పతితగానే వేలెత్తి చూపి, కాకుల్లా పొడుచుకు తింటోంది. ఆ భయంతోనే కన్న బిడ్డ అనే కనికరం లేకుండా చెత్తకుప్పల మాటునో, ఆస్పత్రుల ద్వారాల దగ్గరనో వదిలి వెళుతున్నారు. అన్యాయాలకు, అత్యాచారాలకు బలై, మూఢ విశ్వాసాల నడుమ నలిగిపోతున్న మహిళలను జాగృతం చేసి, విధివంచి

తులను చేరదీసి, అనాథలైన బాలలను అక్కున చేర్చుకొని మమతానురాగాలను పంచి పెడుతోంది "రాధాకిషన్ బాలికా సదన్"

1955 లో శ్రీమతి తమినాబాయి మెహిదీపట్నంలోని నావల్ నగర్‌లో స్థాపించిన ఈ అభాగ్యుల సేవా సంస్థలో – పుట్టిన పసికందునుంచి అయిదు సంవత్సరాలలోపు వారికి రాధాకిషన్ హోమ్‌లోనూ, అయిదు నుంచి పన్నెండేళ్ళలోపు వారికి రాధాకిషన్ చిన్నపిల్లల గృహంలోనూ, పద్దెనిమిది సంవత్సరాలలోపు వారికి "రాధాకిషన్ బాలికా సదన్" లోనూ ఆశ్రమం కల్పిస్తున్నారు.

రాధాకిషన్ హోమ్‌లోనే బాల్వాడీతోపాటు మొదటి రెండు తరగతులలో చిన్నారులకు చక్కని శిక్షణ ఇచ్చి మూడో తరగతి నుంచి మరో పాఠశాలలో చదివిస్తారు. బాలికా సదన్‌లో బాలురను ఏడో తరగతి వరకు చదివించి తరువాత శివరాం పల్లిలోని వేజ్‌బాయి బాలవికాస్‌లో చేర్పించి పదో తరగతి ఆ పైన చదివిస్తారు. ఇక బాలికలు బాలికా సదన్‌లోనే ఉండి డిగ్రీ చదువులు కూడా చదువుతున్నారు.

యాచారం మండల కేంద్రానికి రెండు కిలోమీటర్ల దూరంలో హైదరాబాద్ – నాగార్జున సాగర్ ప్రధాన రహదారి పక్కన 1987 లో ప్రారంభించిన "బాలగ్రామ్" ముఖ్య ఉద్దేశం కుష్ఠువ్యాధితో బాధపడుతున్న పిల్లలను, సంఘానికి దూరంగా ఉంచబడ్డవారిని, ఏ దిక్కూలేనటువంటి అనాథ పిల్లలను చేరదీసి, వారికి విద్య, భోజన సదుపాయాలు కల్పించి, వారిని సంఘంలో ఒకరిగా తీర్చిదిద్దటం. ఇందులో మూడునుంచి పది సంవత్సరాల వయసు గల బాలలను మాత్రమే చేర్చుకుంటారు. పిల్లల కోసం ప్రత్యేకంగా పాఠశాలను ఏర్పాటుచేసి పదో తరగతి వరకు చదువుకొనే అవకాశం కల్పిస్తున్నారు. చదువుతోపాటు వృత్తి విద్యలలో శిక్షణ ఇవ్వటానికి సౌకర్యాలు కల్పించారు.

### బాలకార్మికుల సంక్షేమం:

బాల కార్మికులకు విద్యా బోధనతోపాటు సాంకేతిక శిక్షణ ఇవ్వడానికి "శ్రామిక విద్యాపీఠం" ఎంతో కృషి చేస్తోంది. బాలకార్మికులు, అర్ధాంతరంగా చదువుకు స్వస్తి చెప్పిన పిల్లలు, అసలు పాఠశాల ముఖమే చూడని పిల్లల్ని అనియత విద్యా కేంద్రాలలో చేర్చుకొని చదువు చెపుతున్నారు. ప్రభుత్వ స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా మురికివాడల పిల్లలకు వైద్య సేవలు అందిస్తున్నారు. మురికి వాడలలో బుక్ బైండింగ్, షాంపూ తయారీ, కొవ్వొత్తుల తయారీ తదితర ఇరవై అయిదు రకాల ట్రేడ్‌లలో శిక్షణ ఇస్తున్నారు.

సాటి బాలబాలికల్లా ఆనందంతో బడికి వెళ్ళి పాఠాలు వల్లెవేస్తూ, ఆటపాటలతో గడపాల్సిన చిన్నారులు పేదరికం, దీనావస్థలను ఎదిరించలేక బాల కార్మికులుగా శక్తికి మించిన స్థాయిలో శ్రమిస్తూ యాజమాన్యాల కాఠిన్యానికి గురవుతున్నారు. బాలలను కార్మికులుగా మలచి వెట్టిచాకిరీ చేయించే దుస్థితి నుంచి కాపాడేందుకు ప్రభుత్వపరంగా అనేక చట్టాలు రూపొందించటంతోపాటు అనేక స్వచ్ఛంద సేవా సంస్థలు బాలకార్మికుల సంక్షేమం కోసం ఎన్నో పథకాలను నిర్వహిస్తున్నాయి.

కాటేదాన్ పారిశ్రామికవాడలోని బిస్కెట్ పరిశ్రమలలో జీవచ్ఛవాలుగా బతుకుతున్న బాల కార్మికుల జీవితాలలో వెలుగులు నింపేందుకు "మామిడిపూడి వెంకట రంగయ్య ఫౌండేషన్" కృషి చేస్తోంది. అధిక సంతానం, పేదరికంతో కుటుంబ నిర్వహణ భారమై తమ పిల్లలను బాల కార్మికులుగా మారుస్తున్న తల్లి దండ్రుల ఆలోచనా సరళిలో మార్పుతెచ్చేందుకు ప్రయత్నిస్తోంది యం.వి. ఫౌండేషన్. యునిసెఫ్ విభాగమైన 'ఐపెక్' సహకారంతో ఈ ఫౌండేషన్ బాల కార్మికుల చేత పనులు మాన్పించి చదువుకొనే విధంగా తీర్చిదిద్దుతోంది. పరిశ్రమల్లో పనిమానేసినందువల్ల ఆదాయం తగ్గినప్పటికీ పిల్లల చదువుల కోసం తల్లి దండ్రులు ఖర్చుచేయనవసరం లేకుండా ఏర్పాట్లు చేస్తున్నారు. ఫౌండేషన్ నిర్వహించే శిబిరాలలో బాలకార్మికులను చేర్చుకొని ఆటపాటల్లో తర్ఫీదునిస్తారు. పిల్లల ఆలోచనా విధానం, ఆసక్తి, చురుకుదనం, పరిజ్ఞానాన్ని ఆసరాగా చేసుకొని వివిధ తరగతులుగా వేరు చేసి విద్యాబోధన చేస్తారు.

ఎండనకా, వాననకా, పట్టెడన్నం కోసం నానా పాట్లు పడుతున్న బాలకార్మికులను చేరదీసి వారికి చదువు సంధ్యలపై ఆసక్తి కలిగిస్తూ ప్రోత్సహిస్తోంది "సోషల్ యాక్షన్ ఫర్ ఇంటిగ్రేటెడ్ డెవలప్‌మెంట్ సర్వీసెస్" (సెయిడ్స్) సంస్థ.

రామంతాపూర్‌లోని ఈ సంస్థ అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ.ఎల్.ఓ.) జెనీవా సంస్థల సహకారంతో నడుస్తూ బాల కార్మికులకు అక్షరజ్ఞానంతోపాటు వివిధ వృత్తి విద్యా సంబంధమైన అంశాల్లో శిక్షణ ఇస్తున్నది. అంతేకాదు, ఆయా వయసులకు తగినట్లు వారికి కుట్లు, చేతి అల్లికలు, డ్రాయింగ్స్, పేపర్ బ్యాగ్స్ తయారీ తదితర అంశాలలో శిక్షణ ఇస్తున్నది. చదువులో ఉచిత శిక్షణతోపాటు పలకలు, పుస్తకాలు, బట్టలు ఇస్తున్నారు.

ఇంకా బాలకార్మికుల సంక్షేమం కోసం తార్నాకలోని ఆనందభారతి; బాలికలకు, బాలకార్మికులకు చదువుచెప్పటంలోనూ డక్కన్ డెవలప్‌మెంట్ సొసైటీ, కాంపెయినింగ్ ఎగెనెస్ట్ చైల్డ్ లేబర్ (సి.ఎ.సి.ఎల్.) మొదలైన సంస్థలు కృషి చేస్తున్నాయి.

### మానసిక వికలాంగ బాలల వికాసం:

మానసిక వికలాంగులను చూస్తే ఎవరికైనా సానుభూతి

కలుగుతుంది. ముఖ్యంగా ఆ స్థితిలో ఉన్న చిన్నారుల్ని చూస్తే కఠిన పాషాణ హృదయులైనా కదిలిపోతారు. లోకం తెలియని బాలలు వీరు. పాపం పుణ్యం ప్రపంచ మార్గం అన్నీ ఒకటని తలచే అమాయకులు వీరు. ఆకలిని, ఆవేదననీ దేన్నీ నోరు విప్పి చెప్పలేరు. నవ్విస్తే నవ్వుతారు. కొడితే ఏడుస్తారు. ఇలాంటి పసివారి సంరక్షణ తలకు మించిన భారమే! ఇలాంటివారిని చేరదీసి మానసిక స్థయిర్యాన్ని నూరిపోస్తూ, భవిష్యత్తుకు పునాదులు వేయడానికి ప్రయత్నించే అరుదైన సంస్థలలో ఒకటి 'ది హైదరబాద్ పబ్లిక్ స్కూల్' (స్వీకార్) అనే స్వచ్ఛంద సేవా సంస్థ.

మానసిక వికలాంగులను పెంచి పోషించటంలో శిక్షణ పొందిన ప్రత్యేక ఉపాధ్యాయులతో 'స్వీకార్' సంస్థ సికింద్రాబాద్‌లో ఒక ప్రత్యేక పాఠశాలను నడుపుతోంది. తడబడే అడుగులతో వెర్రిగా నవ్వుతూ, ఏడుస్తూ ఉండే చిన్నారులను, మూగ, బధిర, అంధ, బుద్ధి మాంద్యత గల పిల్లలను చేరదీసి "స్వీకార్" ప్రత్యేక పాఠశాలలో శిక్షణ ఇస్తోంది. ప్రత్యేక వైద్యనిపుణులు – బాలబాలికలను తరచుగా పీడియాట్రిస్ట్, సైకియాట్రిస్ట్, స్పీచ్ థెరపిస్ట్ వంటివారు పరీక్షిస్తుంటారు. బాలల్లో నూతన శక్తిని పెంపొందించటానికి ఈత, వ్యాయామం, క్రీడలు నేర్పిస్తుంటారు. అంతేకాకుండా, "వొకేషనల్ కోర్సు" లలో శిక్షణ ఇచ్చే అంశాలలో కొవ్వొత్తులు, ప్లాస్టిక్ బొమ్మలు, ఎన్వలప్, చాక్‌పీస్‌ల తయారీ, వైర్లతో కుర్చీలు అల్లడం తదితరాలు నేర్పిస్తారు.

'స్వీకార్' అనుబంధ సంస్థ "ఉపకార్" పలు సేవా కార్యక్రమాలు నిర్వహిస్తోంది. వీటిలో కృత్రిమ అవయవాల తయారీ కేంద్రం ఒకటి. ఈ రెండు సంస్థలను భారత ప్రభుత్వ సంక్షేమ శాఖ ఆర్థిక సహకారంతో 1977 లో నెలకొల్పారు.

ఇదేవిధంగా వికలాంగులు, మానసిక వికలాంగుల బంగారు భవిష్యత్ కోసం 1993 లో పేరెంట్స్ అసోసియేషన్ ఆఫ్ ఎ.జి. ఆఫీస్ ఎంప్లాయిస్ "లేఖాదీప్" అనే పేరుతో వికలాంగుల పునరావాస కేంద్రాన్ని స్థాపించారు. 'లేఖాదీప్'లో వికలాంగ విద్యార్థులకు ఫైల్ బోర్డులు తయారీ, కవర్‌ల తయారీ [illegible]తున్నారు.

[illegible]ంకా ఠాకూర్ వి. హరిప్రసాద్ హేండికాప్డ్ రిహేబిలి[illegible] సెంటర్, పద్మావతి వేగేశ్న మెంటల్లీ రిటార్డెడ్ చిల్డ్రన్ రిహేబిలిటేషన్ సెంటర్ మొదలైనవి కూడా వికలాంగ బాలల వికాసానికి నిర్విరామ కృషి సల్పుతున్నాయి.

## విద్యావిధానంలో వినూత్న ప్రయోగాలు:

తాతలకాలంనాటి విద్యావిధానాలను సమూలంగా మార్చి కొత్త పుంతలు తొక్కించాలని, ఆధునిక సమాజానికి అనుగుణంగా భావి భారత పౌరుల్ని తీర్చిదిద్దాలని మేధావులు చేసిన సూచనలు కార్యరూపంలోకి రావటం లేదు. ఫలితంగా మన విద్యారంగం గుమాస్తాల్ని ఉత్పత్తి చేయడానికి తప్ప మరెందుకూ దోహదం చేయటం లేదు. పాఠశాల అంటే జైలులాకాక సృజనాత్మక వికాసానికి తోడ్పడే పవిత్ర వేదికగా రూపుదిద్దితేనే ఫలితాలు ఆశాజనకంగా మారతాయి. ఆటపాటలతో చిన్నారుల్ని అలరిస్తూ నేర్పించే విద్య కలకాలంపాటు వారి మస్తిష్కంలో నిలబడి యోగ్యులుగా తీర్చిదిద్దుతుంది. ఇలాంటి ఆశయంతో కొన్ని విద్యా సంస్థలు పనిచేస్తూ ఆదర్శప్రాయంగా నిలుస్తున్నాయి. అలాంటి వాటిలో "చిరెక్" సంస్థ ఒకటి.

1989 లో చిల్డ్రన్స్ రిక్రియేషన్ సెంటర్‌గా ప్రారంభమైన ఈ సంస్థ అనతికాలంలోనే ఒక ప్రత్యేక తరహా విద్యాసంస్థగా రూపొందింది. మూడేళ్ళనుండి అయిదేళ్ళలోపు పిల్లలు తాము ఆడుకోవాలనీ, పరుగెత్తాలనీ, కనిపించిన ప్రతివస్తువునీ స్పృశించాలని అనుకుంటారు. వారి మనస్తత్వానికి తగినట్టుగా వారికి అన్నిరకాల ఆటపాటలు నేర్పి, స్కూలంటే సహజంగా ఉండే భయాందోళనలు పిల్లల మనసులనుండి దూరం చేస్తారు. ఈ దశలో వాళ్ళకు పండ్లు, కూరగాయల పేర్లు, వాటి రంగులు, అక్షరాలను నేర్పించి, వాటిని కంప్యూటర్‌పై గుర్తించేలా శిక్షణ ఇస్తారు. ఇక్కడ జరిపే విద్య బోధన అంతా ఆధునిక పద్ధతిలో ఉంటుంది.

పూర్వ ప్రాథమిక స్థాయి బాలల విద్యావికాసం కోసం ఆంధ్రమహిళాసభ వారు నిర్వహిస్తున్న "సెంటర్ ఫర్ ఎర్లీ చైల్డ్ ఎడ్యుకేషన్" బాలలకోసం బోధనోపకరణాలను రూపొందించటంతోపాటు విద్యావిధానంలో అనేక నూతన పద్ధతులను ప్రవేశపెట్టారు.

అదేవిధంగా హైదరాబాద్‌లో సాగర్ రోడ్డులోని "వికాస భారతి" సంస్థ, బండ్లగూడలోని "శారదాధామం", బోయినపల్లి నెల్లూరులలోని "సెంటర్ ఫర్ లెర్నింగ్", విజయవాడలోని "వికాస విద్యావనం", విశాఖపట్టణం జిల్లా యలమంచిలిలోని 'భాగవతుల చారిటబుల్ ట్రస్ట్', మదనపల్లిలోని "రుషీవాలీ రూరల్ ఎడ్యుకేషన్ సెంటర్", కరీంనగర్‌లోని "బాలవికాస సమితి", ఎస్.సి.ఇ.ఆర్.టి. వారు నిర్వహిస్తున్న "ఓపెన్ స్కూల్ సొసైటీ", హైదరాబాద్‌లోని "క్రై", మరియు "క్రిస్టియన్ చిల్డ్రన్స్ ఫండ్" మొదలైన సంస్థలు బాలల విద్యా వికాసాలకు నిర్విరామ కృషి చేస్తున్నాయి.

## బాలల సాంస్కృతిక వికాసం:

బాలల్లో అణగి మణగి ఉన్న సృజనాత్మక కళా ప్రతిభను వెలికితీసి ప్రోత్సహించటానికి రాష్ట్ర విద్యాశాఖ ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న సంస్థ జవహర్ బాలభవన్. హైదరాబాద్

పబ్లిక్‌గార్డెన్స్‌లో ఉన్న బాలభవన్‌లో బాలబాలికలకు గాత్ర సంగీతం, మృదంగం, తబలా, వీణ, సితార, వయొలిన్, భరతనాట్యం, కూచిపూడి, కథక్, జానపద నృత్యం, నటన, చిత్రకళ, మట్టిబొమ్మలు, గుడ్డబొమ్మల తయారీ, టైలరింగ్, సైన్స్ ప్రయోగాలు, స్కేటింగ్, కరాటే మొదలైన అంశాలలో శిక్షణ ఇస్తారు.

అంతర్ పాఠశాల బాలల ప్రతిభాపాటవ పోటీలు నిర్వహించి బహుమతులు, యోగ్యతా పత్రాలు ఇచ్చి బాలలను ప్రోత్సహించటం జరుగుతోంది. ఏడాదికి 12 రూపాయల నామమాత్రపు సభ్యత్వ రుసుముతో బాలలు తమకు అనుకూలమైన సమయాల్లో బాలభవన్‌కు వచ్చి తమకు ఇష్టమైన అంశంలో శిక్షణ పొందే అవకాశం కల్పించటం జరిగింది.

జవహర్ బాలభవన్ తన సేవలను మరింత విస్తృతపరచటానికి రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ బాలభవన్‌లు, బాలకేంద్రాలు—అని తన శాఖలను ఏర్పాటుచేసి బాలల్లోని సృజనాత్మక కళల వికాసానికి మరింత కృషి చేస్తున్నది.

జవహర్ బాలభవన్ సంచాలకుల ప్రత్యక్ష పర్యవేక్షణలో నిర్వహింపబడుతున్న సంస్థ "ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి." బాలల్లో విజ్ఞాన, వినోద వికాసాలు పెంపొందించేందుకు 1976 లో స్థాపించబడి రాష్ట్రంలో ప్రతి జిల్లా లోనూ బాలల ప్రతిభాపాటవ పోటీలను నిర్వహిస్తూ బాలల ప్రతిభా వ్యుత్పత్తులను ప్రోత్సహిస్తోంది. పిల్లలకోసం "బాలచంద్రిక" మాసపత్రికను ప్రచురించి, రాష్ట్రంలోని 40 వేల పాఠశాలలకు సరఫరా చేసేది. పిల్లలకు మంచి సాహిత్యం అందించేందుకు 100 పైగా రంగుల బొమ్మల పుస్తకాలను ప్రచురించింది. "ఇంద్రధనుస్సు" పేరుతో పిల్లల వీడియో పత్రికను ప్రారంభించి 7 సంచికలు విడుదల చేసింది. "చిలకపలుకులు" అనే పిల్లల కథలు, పాటలతో ఆడియో కేసెట్లను రూపొందించింది. వయసుకి మించి ప్రతిభను కనపరిచే విశేష బాలలకు "బాలరత్న" అవార్డులిచ్చి సత్కరిస్తోంది. బాలసాహిత్యంలో లబ్ధ ప్రతిష్ఠులైన ప్రముఖులకు "బాలబంధు" అవార్డులిచ్చి గౌరవిస్తోంది. బాలల వికాస కార్యక్రమాల నిర్వహణలో జవహర్ బాలభవన్, ఆం.ప్ర. బాలల అకాడమీల కృషి అమోఘం.

క్లిష్టమైన శాస్త్ర సాంకేతిక విషయాలను సులువుగా అవగతం చేసుకోవటానికి వీలుగా వింతగొలిపే పలు అంశాలు దర్శిస్తూ హాయిని పొందే చిత్ర విచిత్ర లోకమే ఆదర్శనగర్‌లోని బి.ఎం. బిర్లా సైన్స్ మ్యూజియం, సైన్స్ సెంటర్. బాలలకు ఆసక్తినీ, ఆశ్చర్యాన్నీ కలిగించే అనేక విజ్ఞానశాస్త్ర పరికరాలు అక్కడ ప్రదర్శించి, వివరిస్తారు.

గ్రామీణ బాలల్లో అణగారి ఉన్న సృజనాత్మక శక్తిని వెలికి తీయడానికి ఆవిర్భవించిన సంస్థ "సంస్కృతి," "యంగ్ ఎన్వాయిస్ ఇంటర్ నేషనల్" సంస్థద్వారా చిత్రకళ అభిరుచిని బాలల వరకు విస్తరింపజేయాలనే ఉద్దేశంతో హైదర్‌గూడ రాధాకృష్ణనగర్‌లో "సంస్కృతి"ని స్థాపించారు. ప్రతి ఆదివారం, సెలవురోజుల్లో బాలబాలికలకు చిత్రలేఖనంలో ఉచిత శిక్షణతోపాటు కాగితాలు, పెన్సిళ్ళు, రంగులు ఉచితంగా ఇస్తారు.

బాలల వికాసానికి అవసరమైన సాహిత్యాన్ని ప్రచురించటంలో బాలసాహితీ, ఓరియంట్ లాంగ్మన్, ఎన్.బి.టి., సి.బి.టి., రామకృష్ణ మఠ్ మొదలైన సంస్థలు కూడా ఎంతో కృషిచేస్తున్నాయి. పిల్లల సినిమా ప్రదర్శనకూ, రాష్ట్రబాలల వికాసానికీ హైదరాబాద్‌లోని "చిల్డ్రన్స్ ఫిలిం సొసైటీ" కూడా నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపడుతోంది.

బాలల మానసిక వికాసానికి, వినోదానికి దూరదర్శన్, టెలిస్కూలు, ఆకాశవాణి చక్కటి బాలల కార్యక్రమాలను రూపొందించి ప్రసారంచేసి తమ వంతు పాత్రను నిర్వర్తిస్తున్నాయి.

అలాగే వేసవిలో బాలలు సమయాన్ని వృథా చేయకుండా తమకిష్టమైన కళల్లో శిక్షణపొంది తమ ప్రతిభకు పదును పెట్టుకోవటానికి వీలుగా అనేకమంది ప్రైవేటు పాఠశాలలవారు వేసవి శిక్షణా శిబిరాలను నిర్వహిస్తున్నారు. అలాంటి వాటిలో హిమాయత్‌నగర్‌లోని క్రియేటివ్ చైల్డ్ సెంటర్, రిషీ పబ్లిక్ స్కూల్, సిస్టర్ నివేదిత పాఠశాల మొదలైనవి చెప్పుకోదగినవి. అలాగే బాలానంద సంఘాలు కూడా వివిధ సందర్భాలలో బాలల వికాస కార్యక్రమాలు నిర్వహిస్తూ ప్రోత్సహిస్తున్నాయి.

రాష్ట్రంలో బాలల వికాస కార్యక్రమాలు ప్రభుత్వ సంస్థల పరంగానే కాక ప్రైవేటు పాఠశాలలు, స్వచ్ఛంద సేవాసంస్థలు నిర్వహిస్తున్నాయి. వ్యక్తిగత శ్రద్ధతో ఎంతోమంది బాలల వికాస కార్యక్రమాలు చేపడుతున్నారు. అవి ఎంతో ఆదరణ పొందుతున్నాయి. కొన్ని స్వచ్ఛంద సంస్థలు గిరిజన ప్రాంతాల బాలలకోసం వికాస కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. ఈ కృషి చాలదు. ఇంకా అన్నిరంగాలవారు బాలల మానసిక, శారీరక వికాసానికి మరెంతో కృషి చేయవలసి ఉంది.

# వృద్ధాప్య సమస్యలు

అట్లూరి వెంకటేశ్వరరావు

వృద్ధాప్యమంటే చాలమందికి భయం. వృద్ధాప్యం ఎప్పుడో ఒకసారి అకస్మాత్తుగా మీదపడే జాడ్యం కాదు. వృద్ధాప్యం రోజురోజుకు మనలో కలిగే పరిణామాల పరాకాష్ట. మన శరీరంలో పుట్టిన దగ్గరనుండి చనిపోయేదాక నిరంతరం మార్పులు జరుగుతూ వుంటాయి. ఈ పరిణామాలకు కొంతవరకు మన అభిప్రాయాలు, నమ్మకాలు, వైఖరులు, విశ్వాసాలు, విలువలు, వాంఛలు, కోరికలు, భావావేశాలు, జీవనవిధానం కారణమని అనేక పరిశోధనలలో తేలింది. మానసిక సంక్షోభానికి లోనయినవారు అకాలవార్ధక్యానికి గురౌతారు. వృద్ధాప్యంలో ఎదురయ్యే బాధలు ఎక్కువభాగం మానసిక సంబంధమైనవి. శరీరంలో వచ్చే మార్పులు కొందరిలో తొందరగా కన్పిస్తాయి. ఈ పరిణామాలు మన ఆరోగ్యం, అనువంశిక లక్షణాలు, పరిసరాల ప్రభావం లాంటి అనేక అంశాలపై ఆధారపడి వుంటాయి. మన శరీరంలో కొన్ని అమూల్య రసాయనాలు పరిమిత మయిన స్థాయిలో వుంటాయి. వాటిని జాగ్రత్తగా వినియోగించుకొంటే వృద్ధాప్యంలో ఎదురయ్యే బాధలు తగ్గుతాయి. మానసిక వత్తిడులు ఈ పరిమితమయిన అమూల్య రసాయనాలను యధేచ్ఛగా వినియోగించుకొంటాయి. అందువల్లే అకాల వార్ధక్యం వస్తుంది.

చిరకాలంగా, పెద్దలను పోషించే బాధ్యత వారి సంతానంపై వుంటుందనే అంశాన్ని పురాణాల ద్వారా సంస్కృతిగా వుండిపోయింది. సమష్టి కుటుంబాలు ఈ అంశానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చాయి. అందువల్లే పిల్లల పెంపకం ఒక పెట్టుబడిగా కొందరు ఊహించుకొంటారు. పిల్లల మీద పెట్టే ఖర్చును ఇన్‌స్యూరెన్సు ప్రీమియం అనుకొంటూ అనేకులు జీవిస్తున్నారు. చివరకు తాము ఎదురు చూసిన ప్రయోజనం లభించకపోతే మానసిక సంక్షోభానికి లోనయి బాధపడ్తున్నారు. మారుతున్న సాంఘిక, ఆర్థిక, సంస్కృతి పరమయిన, సాంకేతిక పరమైన, మతపరమయిన, రాజకీయ పరిస్థితులు మన జీవన విధానంలో ఎదురు చూడని పరిస్థితులను సృష్టించాయి. పర్యవసానంగా యువతరం వృద్ధులపట్ల అశ్రద్ధను అభివ్యక్తం చేస్తోంది. తత్ఫలితంగా వృద్ధులు తమ పెట్టుబడి అంతా వృధా అయిపోయిందనుకొని బాధపడ్తున్నారు. శాస్త్రజ్ఞానంలో జరిగిన పురోభివృద్ధి మన సగటు జీవితకాలాన్ని పెంచింది. తత్ఫలితంగా వృద్ధాప్యదశలో గడపవలసిన కాలం కూడ ఎక్కువయింది. అందువల్ల మారుతున్న పరిస్థితులలో వృద్ధాప్యం ఒక శాపమనే భావం అనేకులకు కలుగుతోంది. వృద్ధాప్యంలో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకోవడానికి ప్రతి ఒక్కరు వృద్ధాప్యం రాకముందే అవసరమయిన నైపుణ్యాన్ని సంతరించు కోవాలి. అట్లాగే యువతరం కూడ తామూ ఒక్కప్పుడు వృద్ధులమవుతామనే సత్యాన్ని దృష్టిలో పెట్టుకొని, వృద్ధుల సమస్యలను సానుభూతితో అర్థం తెలుసుకొని వ్యవహరించాలి.

మనం విదేశాలకు వెళ్ళవలసి వుంటే ఆ దేశాన్ని గూర్చిన వివరాలను సేకరించుకొంటాం. అచ్చట చూడవలసిన ప్రదేశాలను గూర్చి చదివో, వినో తెల్సుకొంటాము. అచ్చటి ఆచారవ్యవహారాలు, ఆహారపు అలవాట్లు, ప్రయాణపు సదుపాయాలు లాంటి అనేక విషయాలను ముందుగానే అధ్యయనం చేస్తాం. అటువంటి ప్రయాణానికి ముందు ఎంత ఎక్కువ శ్రమపడి కార్యవిధానాన్ని రూపొందించుకుంటే అంత ప్రయోజనం వుంటుందని మనందరికి తెల్సు. వృద్ధాప్యదశలో కొంతజీవితాన్ని గడపాలని అందరికి తెల్సు. కాని, వృద్ధాప్యం వచ్చేదాకా ఆ దశలో ఎదురయ్యే సమస్యలను గూర్చి ఆలోచించుకోవాలనే ఉద్దేశ్యం చాలమందికి కలుగట లేదు. అందువల్లే వృద్ధాప్యంలో సహజంగా ఎదురయ్యే సమస్యలను కూడ సంతృప్తికరంగా పరిష్కరించుకోలేకపోతున్నారు. వృద్ధాప్యంలో ప్రతి ఒక్కరికి ఎదురయ్యే సమస్యలను గూర్చి పరిశీలిద్దాం:

ఒక వ్యక్తియొక్క వయస్సును మూడువిధాలుగా అంచనా కట్టవచ్చు. ఒకటి కాలాన్నిబట్టి, రెండోది భౌతిక స్థితిని బట్టి మూడోది మానసికస్థితినిబట్టి నిర్ణయించవచ్చు. పుట్టినప్పటి నుండి లెక్కపెట్టుకొంటూ వస్తే వయస్సు సంవత్సరాలలో తెల్పుతుంది. శరీరంలోని వివిధ అంతర భాగాలు పని

ఒత్తిడిని బట్టి మార్పు చెందుతాయి. అందరికి ఒకే రకమయిన అరుగుదల కన్పించదు. ఉదాహరణకు మన హృదయం రోజుకు లక్షసార్లు స్పందిస్తూ సుమారు 6 టన్నుల రక్తంతో మన శరీరంలోని దాదాపు లక్ష కిలోమీటర్ల నిడివిగల రక్తనాళాల ద్వారా మనని పోషిస్తోంది. అట్లాగే ఊపిరితిత్తులు రోజుకు 25 వేల సార్లు సంకోచవ్యాకోచాలకు లోనై, మన కవసరమైన ప్రాణవాయువును సరఫరా చేస్తున్నాయి. మనం ఉద్రేక, ఉద్వేగాలకు లోనైనప్పుడు హృదయంపైన, ఊపిరితిత్తులపైన పని భారం పెరుగుతుంది. రోజు అనేకసార్లు అతిగా చలించి వ్యతిరేక ధోరణులలో స్పందిస్తే హృదయం, ఊపిరితిత్తులు త్వరగా అరిగిపోతాయి. పర్యవసానంగా వాటి సామర్ధ్యం తగ్గుతుంది. అనారోగ్య లక్షణాలు బహిర్గతమౌతాయి. అందరిలోని శరీరాంతర్భాగాలు దాదాపు ఒకేవిధంగా పనిచేస్తున్నప్పటికి వాటి మధ్య .- సామర్ధ్యంలో గుణాత్మకమయిన వ్యత్యాసం కనిపిస్తుంది. అదేవిధంగా వైఖరిని బట్టి, దృక్కోణాన్నిబట్టి ఆలోచనా సరళిలో కూడ వ్యక్తుల మధ్య వ్యత్యాసాలు కన్పిస్తాయి. ఉదాహరణకు వృద్ధులలో కొందరు చలాకీగా, మధ్యవయస్కులు లాగా కన్పిస్తారు. అట్లాగే మధ్యవయస్కులలో కొందరు ముసలివారమై పోయామని విచారిస్తూ వుంటారు. అందువల్ల వార్ధక్యం అందరికీ ఒకేరీతిలో ఒకేసారి రాదు.

శాస్త్రవిజ్ఞానం గణనీయంగా వృద్ధిచెందటం మూలంగా సగటు ఆయుఃప్రమాణం రోజురోజుకి పెరుగుతోంది. అట్లాగే జననాల సంఖ్య రోజురోజుకి తగ్గుతోంది. తత్ ఫలితంగా జనాభాలో వృద్ధుల నిష్పత్తి క్రమక్రమంగా పెరుగుతోంది. పందొమ్మిదో శతాబ్దంలో 65 సంవత్సరాల పైబడ్డవారు మొత్తం జనాభాలో సుమారు 1 శాతం వుండేవారు. ఈనాడు వారి నిష్పత్తి 6.5 శాతం. ఈ నిష్పత్తి 21 వ శతాబ్దంమధ్య భాగంలో సుమారు 20 శాతం వుండవచ్చునని శాస్త్రవేత్తలు అంచనా కట్టుతున్నారు. వివిధదేశాల మధ్య ఈ నిష్పత్తిలో ఎంతో వ్యత్యాసం వుంది. అమెరికాదేశంలో ఆ దేశపు జనాభాలో వృద్ధులు ఇప్పుడు 12.5 శాతం వుండగా చైనాలో 6.5 శాతం వున్నారు. 21 వ శతాబ్దం మధ్యలో వృద్ధుల శాతం రెట్టింపవవచ్చునని అంచనా. అనగా, అప్పటికి అమెరికా దేశంలో నివసించే ప్రతి 4 గురు వ్యక్తుల్లోను ఒకరు 65 సంవత్సరాలకు పైబడి వుండవచ్చునని అంచనా కట్టుతున్నారు. అనాటికి చైనాలో వృద్ధులు 20 శాతం వుండవచ్చునని అనుకొంటున్నారు. అనగా, ప్రతి 5 గురులో ఒక వ్యక్తి 65 సంవత్సరాలకు పైబడి వుంటాడు. సగటు ఆయుఃప్రమాణం పురుషులకంటే స్త్రీలకు సుమారు 6, 7 సంవత్సరాలు ఎక్కువని ప్రపంచవ్యాప్తంగా జరిగిన సర్వేలో తేలింది. అందువల్ల ఏ దేశంలోనైనా 65 సంవత్సరాలపై బడ్డ వృద్ధులలో స్త్రీలు ఎక్కువ వుంటారు. అందువల్ల ఇప్పటినుండే వృద్ధుల సమస్యలను పరిష్కరించటానికి సమాజం సమాయత్తం కావాలి.

మారుతున్న పరిస్థితులను ఇముడ్చుకోలేని వృద్ధులు నేటి సమాజం తమని నిర్లక్ష్యం చేస్తోందని ప్రభుత్వాన్ని, కుటుంబ సభ్యులను నిందిస్తున్నారు. వృద్ధులను అర్థం చేసుకోలేని యువతరం వృద్ధుల అవసరాల ప్రాధాన్యతను పరిగణలోకి తీసుకొని వ్యవహరించలేకపోతోంది. అందువల్లే ప్రతి గృహం ఒక రణరంగంగా కన్పిస్తోంది. వృద్ధులు తమ పిల్లలను శత్రువులుగా చూస్తున్నారు. యువతరం వృద్ధులను నిర్లక్ష్యం చేస్తోంది. పరస్పర నిందారోపణలతో కక్షలు పెరుగుతున్నాయి. పర్యవసానంగా మానసిక ఒత్తిడులు ఇటు వృద్ధులకు అటు యువతరానికి శారీరక రుగ్మతలను కలుగజేస్తున్నాయి.

అభివృద్ధి చెందిన దేశాలలో వృద్ధుల పోషణకొరకు కొంత మూల్యాన్ని ప్రభుత్వం వెచ్చిస్తుంది. ప్రభుత్వం నిర్వహించే వృద్ధుల హాస్టలులలో ఎక్కువమంది తమ శేష జీవితాన్ని గడుపుతున్నారు. అక్కడ వృద్ధుల కవసరమైన అనేక సౌకర్యాలున్నప్పటికీ వారు కుటుంబ సభ్యుల ఆప్యాయతకు నోచుకోలేరు. మానవ సంబంధాలు నాలుగు పేటలుగా పెనవేసుకొని వీడని బంధంగా ఏర్పడ్డాయి. వాటిలో ప్రధానమైనవి ఆప్యాయత, అనురాగం. భౌతికంగా ఎన్ని సౌఖ్యాలు అనుభవిస్తున్నా మానసికమైన ఉల్లాసం లేనప్పుడు సుఖ సంతోషాలకు దూరమౌతారు. మానసిక బంధంతో పాటు ఉద్రేక ఉద్వేగాలను పంచుకొనే ఆత్మీయులు కావాల నిపిస్తుంది. ఉదాహరణకు – భావావేశానికి లోనైనప్పుడు కష్టాలను ఆత్మీయులతో పంచుకొన్నప్పుడు మనస్సుపై వున్న భారం తగ్గుతుంది. అట్లాగే ఆనందాన్ని ఆత్మీయులతో కలసి అనుభవిస్తున్నప్పుడు సంతోషం ద్విగుణీకృతమైన భావం కలుగుతుంది. అందువల్లే కొందరు తరచూ కలహిస్తున్నా తమ వునికిని కుటుంబ సభ్యులు గుర్తిస్తున్నారనే భావంతో వృద్ధులు తృప్తిగా జీవిస్తున్నారు. ఈ తృప్తి వృద్ధుల హాస్టలులలో నివసించే వారికి లభించటం లేదని అనేక పరిశోధనలలో తేలింది. ప్రతి ఒక్కరు తమలో అంతర్గర్భితంగా వున్న సృజనాత్మకతను వెలికి తీసుకువచ్చి ఇతరుల మెప్పును పొందాలని ఆశిస్తారు. ముఖ్యంగా ఆత్మీయులు తమలో వున్న సృజనాత్మకతను గుర్తిస్తే వృద్ధులు సంతోషిస్తారు. ఉదాహరణకు – కొంతమంది మేధావులు దూరదేశాలలో ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించి అనేక పురస్కారాలను అందుకొన్నప్పటికీ తమ జన్మస్థలంలో తమ గొప్పతనాన్ని గుర్తించాలని వాంఛిస్తారు. ఎక్కడో సంపాదించిన డబ్బును తమ వూరిలో ఖర్చుపెట్టి తమ ఘనతను ప్రకటించుకొంటారు. అందువల్ల వృద్ధులకు భౌతికావసరాలతోపాటు మానసిక, భావాత్మక, సృజనాత్మక వాంఛలు కూడ వుంటాయి. మనది సాంప్రదాయక సమాజం. అందువల్ల వృద్ధులు

అభివృద్ధి చెందిన దేశాలలో లాగా వృద్ధుల హాస్టలులలో నివసించటానికి ముందుకు రావటం లేదు. ముఖ్యంగా ఆర్థిక ఇబ్బందుల వల్ల కూడ వృద్ధులు వేరుగా జీవించలేక పోతున్నారు. బీదవారు తమతోపాటే తమ తల్లిదండ్రులను పోషిస్తున్నారు. మధ్యతరగతి కుటుంబాలలోనే వృద్ధులు అనేక ఇబ్బందులను ఎదుర్కొనవలసివస్తోంది. ముఖ్యంగా వృద్ధులకూ యువతరానికీ సంప్రదాయాలమీద ఘర్షణ లేర్పడుతున్నాయి. పెద్దలను గౌరవించాలని వృద్ధులు ఎదురు చూస్తున్నారు. కాలం చెల్లిన నైతిక విలువలను త్యజించాలని యువతరం ప్రయత్నిస్తోంది. రోజూ ఇట్టి ఘర్షణలతో జీవితాన్ని దుఃఖమయం చేసుకోవడంకంటే వృద్ధుల హాస్టలులో జీవించడం మేలనే భావం వృద్ధులలో ఇప్పుడిప్పుడే కలుగుతోంది. అభివృద్ధి చెందిన దేశాలలో లాగా వృద్ధుల హాస్టళ్ళను నిర్మించి, నిర్వహించగల ఆర్థికస్తోమత మన ప్రభుత్వానికి లేదు. కొన్ని స్వచ్ఛంద సంస్థలు అట్టి హాస్టళ్ళను నడపటానికి ముందుకు వస్తున్నాయి. వృద్ధుల హాస్టళ్ళలో సంతృప్తిగా జీవించటానికి అవసరమైన వనరులు సమకూర్చటానికి అనేక ఇబ్బందులు ఎదురౌతున్నాయి. అందువల్ల అందుబాటులో వున్న వనరులతో వృద్ధుల హాస్టళ్ళల్లో సర్దుకొని జీవించటానికి వృద్ధులు సమాయత్తం అవ్వాలి. ముఖ్యంగా భార్యా భర్తలిద్దరిలో ఒకరు ముందుగా చనిపోతారు. రెండవవారు వృద్ధుల హాస్టలులో జీవిస్తూ తమ శేష జీవితాన్ని గడపవలసి వుంటుంది. అట్టి పరిస్థితులలో అనేక సర్దుబాటులవసరం.

పర్యావర్ణంలో ఎన్నో మార్పులు వస్తున్నాయి. సహజ వనరులపై ఒత్తిడి ఎక్కువవుతోంది. జనాభా అదుపుతప్పి వృద్ధిచెందుతోంది. ప్రజలు గ్రామాలనుండి పట్టణాలకు వలస వెళ్ళుతున్నారు. పట్టణాలలోని వసతులు పెరుగుతున్న అవసరాలకు సరిపడాలేవు. పట్టణ జీవితం వృద్ధులకు అనేక ఇబ్బందులను కలుగజేస్తోంది. తరుగుతున్న వసతులతో జీవితాన్ని గడపటానికి వృద్ధులు సమాయత్తం అవ్వాలి. అసౌకర్యాలను, ఇబ్బందులను ఓర్చుకునే నేర్పును సంతరించుకోవాలి.

సముద్రంలో పయనించే ఓడ కొన్ని సందర్భాలలో తుఫానులో చిక్కుకొంటుంది. అప్పుడు బయట ఉధృత మయిన గాలి, అలల తాకిడి ఓడను కుదిపేస్తాయి. ఓడలో వున్న ప్రయాణికులకు అసౌకర్యం కలగకుండా వుండటానికి, ఓడ లోపల స్థిరమయిన వాతావరణం కలుగజేయడానికి ఓడ కెప్టెను తన చాకచక్యాన్ని ఉపయోగించి కృషి చేస్తాడు. ఓడ కెప్టెనుయొక్క సామర్థ్యాన్నిబట్టి ప్రయాణికుల ప్రయాణం సాగుతుంది. అట్టి పరిస్థితులలో ఓడను ఎడారిలో ఓయాసిస్సుగా పరిగణించవచ్చు. ఈనాడు మారుతున్న విలువలవల్ల అనేక తుఫానులు వస్తున్నాయి. ఆ తుఫానులను ఎదుర్కొనే శక్తి సామర్థ్యాలు వృద్ధులకు వున్నాయి. వయస్సు మళ్ళిన ప్రతి ఒక్కరు తమ అంతర్గత శక్తిని సద్వినియోగపర్చుకొని ఎడారిలో ఒయాసిస్సులాగా ప్రశాంతంగా జీవించటానికి అల వాటు పడాలి. మన అదుపులో అనేక వనరులు వున్నాయి. వాటి సహాయంతో మనం అదుపులేని పరిస్థితులతో సహ జీవనం చేయటానికి అలవాటుపడాలి. మనం అదుపులో వున్న వనరులను సద్వినియోగం చేసుకోలేకపోతే తుఫానులో చిక్కుకొన్న ఓడ మునిగిపోయినట్లుగా మునిగిపోక తప్పదు. ఇతరులపై ద్వేషంతో వున్నప్పుడు మన అధీనంలో వున్న వనరులలో అధిక భాగం మన అదుపు తప్పుతాయి. అప్పుడు ఓడ మునిగిపోయినట్లు మునిగిపోవాల్సివుంటుంది. ద్వేషాన్ని తగ్గించుకొని ప్రేమతో వ్యవహరిస్తే మన అదుపులో వున్న వనరులు సద్వినియోగంలోకి వస్తాయి. అప్పుడు బయట తుఫాను ఉన్నా లోపల సుస్థిరత వుటుంది. ఎన్ని తుఫానులనయినా ధైర్యంతో ఎదుర్కోవచ్చు.

వయస్సు మళ్ళినవారు అదే ప్రక్కమీద అనేక సంవత్సరాలుగా పడుకొంటారు కాబట్టి పరుపు ముడతలు పడి అసౌకర్యాన్ని కలుగజేస్తుంది. మంచం కుక్కి అయి, సరిగ్గా నిద్రపట్టదు. క్రొత్త మంచం, పరుపు అమర్చుకోవడానికి ఖర్చు అవుతుంది. అందువల్ల కొంత అసౌకర్యాన్ని ఓర్చుకొనే శక్తిని అలవర్చుకోవాలి. అట్లాగే తమ అవసరాల ప్రాధాన్యతలను పరిస్థితులకు అనుగుణంగా నిర్ణయించుకోవాలి. ప్రతి పనిని పూర్వం మాదిరిగా తొందరగా చేయాలనుకోకూడదు. ముఖ్యంగా వయస్సు మళ్ళినవారు ప్రక్కమీద నుండో, లేక తూలుడువచ్చో పడిపోవడం సహజం. ఎముకలు పెళుసుగా వుంటాయి కాబట్టి కొద్దిపాటి ఒత్తిడికి కూడ విరిగిపోతాయి. విరిగిన ఎముకలు తొందరగా అతుక్కోవు. అందువల్ల తగు జాగ్రత్తలు తీసుకొని తమకు, ఇతరులకు కష్టనష్టాలు కలుగకుండా వ్యవహరించే నేర్పు, ఓర్పు కలిగి వుండటానికి కృషి చేయాలి.

వయస్సు మళ్ళిన కొద్దీ మూత్రపిండాల పనితీరులో క్రమేపి మార్పు వస్తూవుంటుంది. 60 లేక 70 సంవత్సరాలు వచ్చేటప్పటికి మూత్రకోశ పరిమాణం 30 సంవత్సరాల ప్రాయంలో వున్నదానికి సగమవుతుంది. అందువల్ల తరచుగా మూత్ర విసర్జన చేయవలసివస్తుంది. మూత్రవిసర్జన నాళానికి మధ్యలోవున్న ప్రాస్ట్రేట్ గ్రంధి హార్మోన్ల ప్రభావంవల్ల మార్పు చెందుతుంది. అనేక సందర్భాలలో శస్త్రచికిత్స కూడ అవసరం అవుతుంది. వయస్సు మళ్ళినవారికి మధుమేహవ్యాధి వచ్చే అవకాశం వుంది. వ్యాయామం ద్వారాను, ఆహారాన్ని నియంత్రించటం ద్వారాను ఈ వ్యాధివల్ల కలిగే నష్టాలను తగ్గించవచ్చు.

శరీరంలోని ఒక్కొక్క భాగం ఒక్కొక్కవిధంగా వ్యవహరిస్తుంది. ముఖ్యంగా కంటిచూపు, పళ్ళపటిష్టత, వినికిడి సామర్థ్య లక్షణాలు ఒక్కొక్కరికి ఒక్కొక్కవిధంగా తగ్గుతూ వస్తాయి. పర్యవసానంగా వృద్ధాప్య సమస్యలు వ్యక్తి

వ్యక్తికి భిన్నంగా వుంటాయి. శరీరంలోని కండరాలు భూమ్యాకర్షణ శక్తికి లోనై వయస్సు మళ్ళిన కొద్దీ సంకోచం చెందుతాయి. కండరాల పటిష్టత తగ్గిన కొద్దీ భూమ్యాకర్షణ ప్రభావం ఎక్కువవుతుంది. తత్ఫలితంగా వెన్నెముక కూడ కుదించుకుపోతుంది. అందువల్లే వార్ధక్యంలో ఎత్తు తగ్గినట్లు కనిపిస్తారు. చర్మం – వయస్సు మళ్ళిన కొద్దీ పలుచనైపోగుతుంది. అందువల్ల ముడుతలు కనిపిస్తాయి. చర్మం మృదుత్వాన్ని కోల్పోయి రంగు మారుతుంది. వయస్సు మళ్ళిన వారిలో వ్యాధి నిరోధక శక్తి క్షీణిస్తుంది. అందువల్ల తరచు అనారోగ్యానికి గురికావలసివస్తుంది. వృద్ధాప్యంలో మెదడులోని కణాలమధ్యవున్న పూర్వసంబంధాలు తెగిపోతాయి. అందువల్ల జ్ఞాపకశక్తి తగ్గుతుంది. వృద్ధులకు పూర్వవిషయాలు బాగా జ్ఞాపకం వుంటాయి. కాని నిన్నా, మొన్నా జరిగిన సంగతులు మర్చిపోవడం జరుగుతుంది. అందువల్ల కొంతమంది వృద్ధులు ఈ మధ్య పరిచయమయిన వ్యక్తులను గుర్తించలేరు. వారి పేర్లను తరచు మర్చిపోతారు. చిన్నప్పుడు జరిగిన సంగతులను వివరంగా గుర్తుపెట్టుకోగలిగినవారు కొద్దిరోజుల క్రితం జరిగిన సంఘటనలను మర్చిపోవడం నమ్మశక్యంకాదని వారిపై అభాండాలు వేస్తారు. అది వారి లోపం కాదు. సహజసిద్ధంగా జ్ఞాపకశక్తిలో వచ్చే మార్పువల్లే కలుగుతోంది.

కళ్ళకు, పళ్ళకు, చెవులకు వాటి శక్తిని తిరిగిపొందటానికి అనేక ఉపకరణాలు వున్నాయి. కాని, జ్ఞాపకశక్తిని వృద్ధిచేసుకోవడానికి అట్టి ఉపకరణాలు లేవు. సామాన్యంగా వృద్ధులు మతిమరుపుతో బాధపడ్తూ వుంటారు. అట్టి పరిస్థితులలో వృద్ధులు గ్రుడ్డివారిని ప్రేరణగా తీసుకోవాలి. గ్రుడ్డివారు ప్రతి వస్తువును నిర్ణీత ప్రదేశంలో పెట్టుకొంటారు. తమకు కళ్ళు కనపడవు కాబట్టి ఇతరుల సహాయం లేకుండా తమ పనులను తాము చేసుకోవడానికి ఉపయుక్తంగా వుండే పథకాలను చేపట్టి అమలు జరుపుతారు. అట్లానే వృద్ధులు తమ అశక్తతను పరిగణలోనికి తీసుకొని, మర్చిపోతామనుకొనే అంశాలను పుస్తకంలో వ్రాసుకోవాలి. తమ కార్యక్రమాన్ని నియమబద్ధంగా నిర్వహించటానికి కార్యప్రణాళికను తయారు చేసుకోవాలి. తమకు తెలియని విషయాలను గూర్చి ఎక్కువగా మాట్లాడకూడదు. నైతిక విలువలు మారుతున్నాయి. కాబట్టి, వాటిని అర్థం చేసుకొని వ్యవహరించాలి. వయస్సు మళ్ళిన కొద్దీ శారీరక బాధలు ఎక్కువవుతాయి. కాబట్టి, వాటిని ఓర్చుకోవడానికి అలవాటుపడాలి. మందులు కూడ ఎక్కువ ఉపశమనము ఇవ్వలేవు. పూర్తినివారణలు కావాలనుకోవడంవల్ల ప్రయోజనం వుండదు.

వృద్ధాప్యంతోపాటు సృజనాత్మకత కోల్పోతాం అనే అపోహ చాలమందిలో వుంది. అనేకులు వయస్సు మళ్ళిన తరువాత సృజనాత్మకతను బహిర్గతం చేస్తున్నారు. ఉదాహరణకు నోబుల్ పురస్కారాలను అందుకొనే వారిలో ఎక్కువమంది 60 సంవత్సరాలు పైనవారే. తగిన కృషి చేస్తే వృద్ధాప్యంలో కూడ సృజనాత్మకతను వెలికి తీసుకురావచ్చునని అనేక పరిశోధనలలో తేలింది. చాలమంది చిత్రకారులు, శిల్పులు, సంగీత విద్వాంసులు, కవులు, రచయితలు తమ జీవితాంతంలో చేసిన నూతన ప్రక్రియలే. వారిని చిరస్మరణీయులుగా చేసాయి. అందువల్ల ప్రతి ఒక్కరు జీవితాంతంవరకు తమ అభిమాన ప్రక్రియలను కొనసాగించవచ్చు. ముఖ్యంగా ఉత్సాహంతో సవాలును ఎదుర్కొనేటప్పుడు శరీరంలోని రసాయన గ్రంథులు ఎండార్ఫిన్ అనే పదార్థాన్ని ఉత్పత్తిచేసి అలసటను పోగొడ్తాయి. ఏ పని చేయకుండా నిరాశతో విచారంగావుంటే శరీరంలోని రసాయన గ్రంథులు హానికరమయిన రసాయనాలను ఉత్పత్తి చేసి ఆరోగ్యాన్ని చెడగొడ్తాయి. అందువల్లే ఆశావాదంతో జీవితాన్ని సవాలుగా తీసుకొన్న వృద్ధులు ఆరోగ్యంగా వుంటారు. నిరాశావాదంతో వ్యవహరించే వృద్ధులు అనారోగ్యంతో బాధ పడ్తారు. వృద్ధులు నిరాశావాదాన్ని పారద్రోలి ఆశావాదంతో స్పందించటం నేర్చుకోవాలి.

వృద్ధాప్యంలో స్పర్శజ్ఞానాన్ని కోల్పోతాం. ఒక వస్తువును ఎంతగట్టిగా పట్టుకున్నా తెల్సుకోలేం. అందువల్లే వస్తువులను తరచు జారవిడుస్తూ వుంటాం. ఈ అశక్తతను గుర్తించి విలువైన వస్తువులను అతి జాగ్రత్తతో రెండు చేతులతో పట్టుకోవాలి. వృద్ధాప్యంలో ఎదురయ్యే స్పర్శలోపాన్ని ముందుగానే తెల్సుకొంటే అనేక నష్టాలను నివారించవచ్చు. ముఖ్యంగా గుడ్డగ్లౌసును చేతికి తగిలించుకొని వస్తువులను పట్టుకొంటే వృద్ధాప్యంలో ఎదురయ్యే అనుభవాన్ని ముందుగానే తెల్సుకోవచ్చు. అట్లాగే చెవిలో దూదిని పెట్టుకొని ఎదుటివారు చెప్పేమాటల వింటే వినికిడి లోపాన్ని అంచనా కట్టవచ్చు. కళ్ళ అద్దాలపై పొడరు జల్లి మసకదృష్టిని అనుభూతిగా పొందవచ్చు. ఇట్లా ముందుగానే జ్ఞానేంద్రియాల పనితీరులో ఏర్పడే అవాంతరాలను తెల్సుకోగలిగితే వృద్ధాప్యాన్ని ఓపికతో భరించే స్థోమత కలుగుతుంది.

అన్ని జ్ఞానేంద్రియాలలో నాలుక అతి చలాకీ అయినది. దాని శక్తి సామర్థ్యాలు చివర దాకా పటిష్టంగానే వుంటాయి. అందువల్లే జీర్ణాశయం తన శక్తిలో కొంతభాగాన్ని కోల్పోయినప్పటికి నాలుక మాత్రం ఎక్కువ తినాలనే ప్రేరణను కలుగజేస్తుంది. ఒక అంచనా ప్రకారం మన జీర్ణాశయం జీవితకాలంలో సుమారు 50 టన్నుల ఆహారాన్ని శక్తిగా మార్చి మనకు ఉపయోగపడటానికి అనువుగా ఏర్పాటు చేయబడింది. కాని, నాలుక ప్రేరణవల్ల మన కవసరమైన ఆహారం కంటే రెండు, మూడురెట్లు ఎక్కువ భుజిస్తూ వుంటాం. అట్లాగే మన ఆరోగ్యాన్ని విచ్ఛిన్నంచేసే ఉప్పు, కారం, మసాల లాంటి అనేక హానికరమైన పదార్థాలను

ఎక్కువ మోతాదులో నాలుక ప్రేరణవల్ల తింటూవుంటాం. మధుమేహ వ్యాధితో బాధపడేవారు నాలుక ప్రేరణవల్ల తీపి పదార్థాలను, హానికరమైన ఆహార పదార్థాలను తరచూ భుజించి అనేక కష్టనష్టాలను ఎదుర్కొంటున్నారు. అందువల్లే నాలుక మన శరీరంలో అంతర్భాగమైనప్పటికీ దానిని డాక్టరుయొక్క ఏజెంటుగా కొందరు చమత్కరిస్తూ వుంటారు. అనారోగ్యంతో బాధపడేవారు డాక్టరు దగ్గరకు వెళ్ళగానే నాలుకను జూపమని పరీక్షిస్తాడు. అప్పుడు నాలుక డాక్టరుకి అనేక విషయాలను తెలియజేస్తుంది. నాలుక ప్రేరణవల్లే వృద్ధులకు అనేక జబ్బులు కలుగుతున్నాయని అందరికి తెలుసు కాని నాలుకను అదుపుచెయ్యటానికి చాలమంది ప్రయత్నించరు. ముఖ్యంగా వృద్ధులు నాలుకను అదుపుచేసుకొంటే అనారోగ్యంవల్ల వచ్చే బాధలను కొంతవరకు తగ్గించుకోవచ్చు. అట్లాగే నాలుక వ్యక్తుల మధ్యవున్న అంతఃసంబంధాలను విచ్ఛిన్నం చేస్తుంది. వృద్ధులకు ఎక్కువ మాట్లాడాలనే వాంఛ వుంటుంది. మాట్లాడుతున్నప్పుడు నాలుక పళ్ళకు దొరకకుండా నాట్యం చేస్తుంది. అట్లా నాట్యం చేసేటప్పుడు దౌడకండరాలకు, నాలుకకు ఉల్లాసం కలుగుతుంది. నాలుకకు ఉల్లాసం కలుగ చేయాలనుకొనప్పుడల్లా ఇతరులకు విసుగు కలిగించే విధంగా మాట్లాడుతూ వుంటాం. ఇట్టి ధోరణి వృద్ధులలో ఎక్కువగా కన్పిస్తుంది. వృద్ధులు కనుక నాలుక మూలంగా కలిగే కష్టనష్టాలను తెల్సుకో గలిగితే వాటిని నియంత్రించటానికి కృషి చేయవచ్చు. కాని, ఇంతకాలం అధికారం చెలాయించిన నాలుక ఒక్కసారే నియంత్రణలను పాటించదు. అందువల్ల వృద్ధాప్యం రాకముందే నాలుకను నియంత్రించే చాకచక్యాన్ని ప్రతి ఒక్కరు సంతరించుకోవాలి.

వృద్ధులు తాము అనుభవించే మానసిక వత్తుడులను ఎవరో కలిగిస్తున్నారనే అపోహతో వుంటారు. ఒత్తిడి అనగానే బాహ్యశక్తియొక్క ప్రభావం అనే భావం సహజంగా కలుగుతుంది. ఒక బంతిని ఒత్తితే దాని ఆకారంలో మార్పు వస్తుంది ఆ మార్పు రావటానికి బాహ్యశక్తియొక్క ప్రమేయం వుంటుంది. బంతిని చేతిలోనుంచి వదలి వేస్తే దాని సహజ ఆకారాన్ని సంతరించుకొంటుంది. అనగా, బంతిలోని అంతర్గత శక్తి బహిర్గత ఒత్తిడిని నిరోధిస్తుంది. ఆ వత్తిడి ప్రభావం తగ్గగానే అంతర్గత శక్తి ఆ బంతియొక్క సహజ ఆకారాన్ని పునఃప్రతిష్టిస్తుంది. బంతిలో సహజసిద్ధంగా వున్న వాయుపీడనం బహిర్గత ఒత్తిడులను నిరోధించే స్థోమత కలిగివుంటుంది. ఒకవేళ బాహ్యఒత్తిడి ప్రభావం కనుక బంతిలోని శక్తికంటే ఎక్కువైతే బంతి పగిలిపోతుంది. బంతియొక్క అంతర్గత శక్తి తన పరిమితిలో బంతిని తన సహజ స్వరూపాన్ని పరిరక్షించటానికి ఉపయోగపడ్తుంది. బంతిలో మొదటవున్న వాయుపీడనం బయటనుంచి ఎదురయ్యే ఒత్తిడులకు నిర్ణీత పద్ధతిలో మారుతుంది. అనగా, ఎక్కువ ఒత్తిడి చేస్తే అంతర్గత వాయుపీడనం ఎక్కువ స్థాయిలో వుంటుంది. ఒక మోస్తరుగా నొక్కితే ఇంతకుముందు కంటే తక్కువ స్థాయిలో వుంటుంది. అసలు నొక్కకపోతే సహజంగా వుంటుంది.

మానవుల ప్రవర్తన బాహ్యప్రేరణలకు స్పందనగా వ్యక్తమౌతుంది. బంతి విషయంలో ఎంత ప్రేరణ వుంటే అంత స్పందన వుంటుంది. కాని, మానవుల స్పందన ప్రేరణకు భిన్నంగా వుంటుంది. ఉదాహరణకు ఒక వ్యక్తిమీద కోపాన్ని ప్రదర్శించినప్పుడు ఎదుటవ్యక్తియొక్క స్పందన అతిగా వుండవచ్చు. తగుపాళ్ళలోను వుండవచ్చు. లేక కుంచించుకుపోయి కోపాన్ని దిగమ్రింగుకొనవచ్చు. వస్తువులకు ఇట్టి ప్రత్యామ్నాయ స్పందన సాధ్యపడదు, మానవులకు ఆలోచనాశక్తి వున్నది కాబట్టి ప్రేరణను ఆకళింపు చేసుకొని, పరిస్థితులను అవగాహన చేసుకొని సమయోచితంగా స్పందించే అవకాశం వుంది. స్పందించటానికి అవసరమైన శక్తి అంతర్గతంగా లభిస్తుంది. ఆ శక్తిని ఎట్లా మల్చుకోవాలో వ్యక్తి తన విచక్షణా జ్ఞానంతో నియంత్రిస్తాడు – అందువల్ల స్పందనలో వ్యక్తుల మధ్య గుణాత్మకమయిన వ్యత్యాసం కన్పిస్తుంది.

ఒకే సన్నివేశాన్ని భిన్నవ్యక్తులు, వివిధ రీతులలో అర్థం చేసుకొని తమ స్పందనలను రూపకల్పన చేసుకొంటారు. ఒక వ్యక్తి అతిగా చలించవచ్చు లేక కుంచించుకుపోవచ్చు, లేక సహజంగా స్పందించవచ్చు. సహజస్పందనకు, అసహజ స్పందనకు బాధ్యత వ్యక్తి పరమైనదే, అందువల్ల ప్రతి ఒక్కరికి తాము స్పందించే పద్ధతిని నిర్ణయించుకొనే అవకాశం వుంది. ఒక వ్యక్తి కనుక అతిగా చలిస్తూ కోపతాపాలను ప్రదర్శిస్తూ వుంటే ఆలోపం ప్రేరణలో లేదని తెల్సుకోవాలి. అట్లాగే ఇంకొక వ్యక్తి తరచు కుంచించుకుపోయి తగువిధంగా స్పందించకపోతే ఆ వ్యూహం ఆ వ్యక్తిపరమైనదే. ఆ వ్యూహానికి ప్రేరణ కారణం కాదు. ఇంకొక వ్యక్తి భిన్న ప్రేరణలకు సహజంగా స్పందిస్తుంటే అది అతని వ్యక్తిత్వ లక్షణం. అతిగా చలించటానికి, సహజంగా స్పందించటానికి అంతర్గతశక్తి అవసరం. ఆ శక్తి వ్యక్తియొక్క అందుబాటులో వుంటుంది. ఆ శక్తిని ఎట్లా ఉపయోగించుకోవాలో వ్యక్తే నిర్ణయించుకొంటాడు. ఇతరులకు ఆ శక్తిపై అజమాయిషీ లేదు. అందువల్ల అంతర్గత మానసిక ఒత్తిడిని ఎవరికి వారే కలిగించుకొంటారు. ఇతరులు కారణం కాదు. అయినప్పటికి సామాన్యంగా వృద్ధులు తమ అంతర్గత మానసిక ఒత్తిడులను ఇతర్లు కలిగిస్తున్నారనే అపోహతో వుంటారు. అంతర్గత మానసిక ఒత్తిడి మన మనుగడకు అవసరం. దాని ప్రభావం వల్లనే మనం విజయాలను సాధించ కలుగుతాం. ఎక్కువ పనిచేయాలంటే ఎక్కువ ఒత్తిడిని భరించే స్థోమత కలిగివుండాలి.

ఎవరయితే అధిక అంతర్గత మానసిక ఒత్తిడికి అతిగా చలించకుండాను కుంచించుకుపోకుండాను స్పందించ గలుగుతారో వారు ఎక్కువ ఉత్పాదకతను సాధించ కలుగుతారు. అనగా అంతర్గత మానసిక ఒత్తిడి ఉత్పాదకతకు అవసరం. ఉత్పాదకత సమర్థతకు కొలమానం. ప్రతి ఒక్కరు ఎక్కువ అంతర్గత మానసిక ఒత్తిడిని అదుపు తప్పనీయకుండా అజమాయిషి చేసే నైపుణ్యాన్ని సంతరించుకోవటానికి కృషిచేయాలి. అంతర్గత మానసిక ఒత్తిడి మన కృషికి తోడ్పడితే విజయావకాశాలు మెరుగౌతాయి. అంతర్గత మానసిక ఒత్తిడిని అజమాయిషీచేసే స్థోమత లేనప్పుడు అతిగా చలించటమో, కుంచించుకు పోవటమో చేస్తారు. ఈ రెండు ప్రక్రియల ద్వారా అంతర్గత శక్తి వృధా అయిపోతుంది. ఉత్పాదక క్రియలో సద్వినియోగం అవ్వదు. అందువల్ల మన విజయానికి అంతర్గత మానసిక ఒత్తిడి అవసరం చాలావుంది. మన పరాజయాలకు కూడ అంతర్గత మానసిక ఒత్తిడే కారణం. మనం ఎంత అంతర్గత మానసిక ఒత్తిడిని ఓర్పుతో భరించగలమో అంత సమర్థత కలిగి వుంటాం. మన అంతర్గత మానసిక ఒత్తిడిని మనమే నియంత్రించుకొంటాం.

వృద్ధులకు ఎదురయ్యే మానసిక ఒత్తుడుల ప్రభావం ఇతరుల వల్ల కలగటం లేదని ఇంతకుముందు తెల్సుకొన్నాం. వృద్ధులకు సహజంగా ప్రేరణలు కుటుంబ సభ్యులనుండి సమాజంనుండి, పరిసరాలనుండి అందుతాయి. వృద్ధులకు మానవ సంబంధాలు ప్రేరణలుగా అందుతాయి. ఉదాహరణకు మనవడి పట్ల ప్రేమగా వుంటే మనవడు చేసే పనులు సంతోషాన్ని చేకూర్చుతాయి. ఒకవేళ మనవడు తన మాట వినటం లేదని ద్వేషభావం కలిగి వుంటే మనవడు మాట్లాడే ప్రతిమాట, చేసే ప్రతి పని భరించలేని మానసిక ఒత్తిడిని కలుగచేస్తుంది. తాత అనుభవించే సంతోషం లేక బాధ మనమడికి తాతకు వున్న మానవ సంబంధాల నేపథ్యంపై ఆధారపడి వుంటుంది. వృద్ధులు కనుక మానవ సంబంధాలను తగురీతిలో రూపొందించుకొంటే మానసిక ఒత్తుడులు వారికి అండగా వుండి సత్ సంబంధాలను వృద్ధి చేస్తాయి. లోపభూయిష్టమైన మానవ సంబంధాలు కలవారు తరచూ ఘర్షణలకు దిగటమో లేక కుంచించుకుపోయి అసంగతంగా ప్రవర్తించటమో చేస్తారు. ఆ దశలో వారి అంతర్గత మానసిక ఒత్తిడి మానవ సంబంధాల విచ్ఛిన్నతకు కారణభూతమతుంది.

వాతావరణం అనేక ఇబ్బందులను కలుగజేస్తుంది. ఉదాహరణకు వేడి, చలి, వాన సహజంగానే ఇబ్బందులను తెచ్చిపెడతాయి. వాటి ప్రభావానికి మనం స్పందిస్తాం. ఇబ్బందులను ఓర్చుకొనే నేర్పువున్న వారు సహజంగానే స్పందిస్తారు. ఓర్చుకోలేని వారు అసంగతంగా ప్రవరిస్తారు. అట్లాగే వృద్ధాప్యంలో ఎదురయ్యే శారీరక బాధలు వారి స్పందనలకు రూపకల్పన చేస్తాయి. వయస్సు మళ్ళిన కొద్ది శరీరం తన పటుత్వాన్ని కోల్పోతుంది. ఆ ఇబ్బందులకు సహజంగానే స్పందించే పద్ధతిని ఎవరికి వారే రూపకల్పన చేసుకొంటారు. వారి స్పందన ఇతర కుటుంబ సభ్యులకు ప్రేరణ అవుతుంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఇతర కుటుంబ సభ్యులను ఇబ్బంది పెట్టకుండా వుండే రీతిలో స్పందిస్తే మానవ సంబంధాలు పటిష్టంగా వుంటాయి. కాని, ప్రతి చిన్న అసౌకర్యానికి అతిగా స్పందించి కుటుంబ సభ్యులకు ఇబ్బందులను కలిగిస్తే వారి ఓర్పు క్రమక్రమంగా క్షీణిస్తుంది. చివరకు మానవ సంబంధాలలో విఘాతం ఏర్పడ్తుంది.

పై చెప్పిన అంశాలతోపాటు బాహ్యప్రేరణలు ఎదురౌతాయి. ఉదాహరణకు ఎప్పుడో కొడుక్కో, కోడలో అన్న విషయాలు జ్ఞాపకం వచ్చి ఆ సంఘటనను ఆలోచనలలో తిరగదోడ్తారు. అట్టి సందర్భాలలో భరించరాని మానసిక ఒత్తుడులకులోనై బాధను అనుభవిస్తారు. ఎక్కువగా అపసవ్య ఆలోచన్లతో సతమతమౌతున్న వృద్ధులు తమ ప్రేరణలకే తాము స్పందిస్తూ కన్పిస్తారు. తమకు మానసిక ఒత్తిడిని కలిగించే సన్నివేశాలుకాని, వ్యక్తులుకాని దగ్గర లేనప్పటికి ఆ పరిస్థితులను మనోఫలకంపై చిత్రించుకొని యదార్థ పరిస్థితులకు స్పందించినట్లుగానే వ్యవహరిస్తారు. తమకు తామే తమ మానసిక ఒత్తిడిని భరించరాని స్థాయికి పెంచుకొన్నప్పటికి దానికి కారణం ఇతర్లని వూహించుకొని, వారిపై ద్వేషాన్ని పెంచుకొంటారు. అనేక సందర్భాలలో వృద్ధులు ద్వేషించే వ్యక్తులకు తాము వారి ద్వేషానికి గురౌతున్నామని తెల్సుకొనే అవకాశం లేదు. అయినా వృద్ధుల ఊహలలో మాత్రం వారు మెదలుతూ వుంటారు. ఎప్పుడో తగిలిన మానసిక గాయాలను కొంతమంది వృద్ధులు మాననీయరు. తరచు రేపుతూ వుంటారు. కొన్ని సందర్భాలలో నెత్తురును కూడ కారనిస్తారు. అప్పుడు అనుభవించే బాధను ఇతర్లు కలుగజేస్తున్నారని వూహించుకొంటారు. ఇట్లా మానసిక ఒత్తుడులకు గురౌతున్నామని చెప్పకొని ఇతరుల సానుభూతి కొరకు ఎదురుచూస్తారు. భౌతిక ప్రేరణలతో సంబంధం లేకుండా ఎవరికి వారే ఇష్టం వచ్చినప్పుడు మానసిక ఒత్తుడులను కలుగజేసుకొని ఇతరులను నిందిస్తారు.

మానసిక ఒత్తిడిని అనుభవించే వృద్ధులు తమ స్పందనను, దానికి కారణభూతమైన ప్రేరణను విశ్లేషించుకోవాలి. తమ మానసిక ఒత్తిడికి తాము కూడ కారణమనే సత్యాన్ని విస్మరించకూడదు. తమ లోపాన్ని ఇతర్లకు ఆపాదించి సమర్థించుకోకూడదు. మానసిక ఒత్తుడులను సృష్టించుకొనేది తామే కాబట్టి దానిని నివారించుకొనే బాధ్యత కూడ తామే చేపట్టాలి. ఎవరి ఆలోచనలకు వారు బాధ్యత వహించాలి. ఆలోచన్లను సవ్యమార్గంలోనో లేక

అపసవ్యమార్గంలోనో ప్రసరింపచేయవచ్చు. ఆ ఆలోచన్లను సవ్యమార్గంలో మళ్ళించితే అంతర్గత ఒత్తిడులు అదుపులో వుంటాయి.

వృద్ధులు భరించలేని మానసిక ఒత్తిడులను అనుభవిస్తు న్నప్పుడు తలపై పెద్దభారం వున్నట్లు భావిస్తారు. ఆలోచన్లు మెదడులో రసాయన మార్పులు కలుగజేస్తాయి. ఆ రసాయన మార్పులు భౌతిక భారాలుగా వుండిపోతాయి. ఉదాహరణకు కొడుకుపై కోపం, కోడలిపై ద్వేషం, మనవడి భవిష్యత్తుని గురించి ఆందోళన, భార్యయొక్క ఆరోగ్యం గురించి విచారం సమష్టిగా పెద్దభారంగా వుంటాయి. భౌతిక భారమైతే ఎవరైన సహాయపడి కొంత పంచుకోవచ్చు. ఎవరికి వారే తమ ఆలోచన్లపై ఆధారపడి తలపై మోయలేని భారాన్ని ఎత్తుకొంటే ఆ బరువును తామే మోయాలి. ఆ బరువు రూపకల్పనలలో ఇతర్ల ప్రమేయం లేదు. ఆలోచన్లు బరువును రూపొందించాయి. కాబట్టి ఆలోచనల ద్వారానే బరువును తగ్గించుకోవాలి. మోయలేని బరువును మోస్తూ ఆలోచనా శక్తినంతా ఆ బరువును సృష్టించుకోవటానికే వినియోగిస్తే జీవితంలో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకోవటానికి అవసరమైన ఆలోచనా శక్తి లభించదు. ఉద్రేక, ఉద్వేగాలకు లోనైనప్పుడు సమస్యా పరిష్కార శక్తి లోపభూయిష్టంగా వుంటుంది. పర్యవసానంగా తగు నిర్ణయాలను సమయ బద్ధంగా చేయలేకపోతారు. అందువల్ల అనేక ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుంది. తత్ఫలితంగా మోకాళ్ళనొప్పులు, రక్తపోటు, నరాల సంబంధమైన వ్యాధులు, అజీర్తిలాంటి అనేక రోగాలు సంక్రమిస్తాయి. వార్ధక్యదశలో ఎదురయ్యే అనారోగ్యంలో ఎక్కువ శాతం ఇట్టి మానసిక భారం యొక్క ప్రభావం వల్లే. తమ ఆరోగ్యాన్ని తామే క్షీణింప చేసుకొంటున్నామనే సత్యాన్ని గుర్తించలేని వృద్ధులు తమ రోగాలకు ఎన్నో కారణాలు చెప్తూ మందులు తింటున్నారు. మానసిక ఒత్తిడుల వల్ల ఉత్పన్నమయిన రోగాలు మందులద్వారా తాత్కాలికంగా తగ్గినట్లు కన్పించినా వాటి మూలకారణాలను నివారించలేవు. కాబట్టి మళ్ళీమళ్ళీ భిన్నరూపాలలో తమ ప్రభావాన్ని చూపిస్తాయి. తలపై వున్న మానసిక భారాన్ని తగ్గించుకోవటానికి ఎవరికి వారు అంతర్‌దృష్టిద్వారా కృషి చెయ్యాలి. ముఖ్యంగా అనేక వ్యక్తిత్వ లోపాలు అలవాట్లుగా వుండిపోతాయి. ఉదాహరణకు ముక్కుమీదకోపం వుండేవారు ప్రతి చిన్న విషయానికి అతిగా చలిస్తారు. తమ శరీరంలోని రసాయనిక గ్రంథులను తరచూ ప్రేరేపించి రసాయనాలను రక్తప్రసరణ వ్యవస్థలోనికి పంపిస్తారు. రసాయన గ్రంథులు విడుదల చేసిన ఆమ్లాలతోను, క్షారాలతోను శరీరానికి అవసరం లేదు. పర్యవసానంగా అవి శరీరాంతర్భాగాలను తొలిచి ఆరోగ్యాన్ని విఛ్ఛిన్నం చేస్తాయి. అప్పుడు ఏదో రూపంలో అనారోగ్య లక్షణాలు బహిర్గతమౌతాయి. ఆ లక్షణాలను మాత్రమే పరిగణనలోనికి తీసుకొని మందులు వాడితే జబ్బు ఇంకొక లక్షణంతో బయటపడ్తుంది. ఎప్పటి కప్పుడు లక్షణాలను ఉపశమనం కలిగించే ప్రక్రియలను చేపడితే అసలు మూల కారణాన్ని నివారించే సావకాశం వుండదు. ఆ వ్యక్తి యొక్క ముక్కుమీద కోపం మూలంగానే వివిధ అనారోగ్య లక్షణాలు బయటపడ్తున్నాయనే విషయాన్ని తెల్సుకొంటే, వ్యక్తిత్వంలో మార్పుకు కృషిచెయ్యవచ్చు. అప్పుడు అనారో గ్యాన్ని శాశ్వతంగా నివారించవచ్చు. చాలమంది వృద్ధులు తమ కోపాన్ని అభివ్యక్తంచేస్తే తప్ప తమపట్ల కుటుంబ సభ్యులు శ్రద్ధ చూపరనే అపోహతో వుంటారు. అట్టి వృద్ధులు తమ అనారోగ్యానికి తమ కోపమే కారణమని తెల్సుకొన్నా మార్పుకొరకు ప్రయత్నించరు. అప్పుడు మందుల అవసరం ఎక్కువవుతుంది. కొంతకాలానికి మందులు కూడ పనిచెయ్యవు.

వృద్ధులకు తమని గూర్చి తమకు కొన్ని అభిప్రాయా లుంటాయి. ఈ అభిప్రాయాలను ఇతర్లు సమర్థించాలని ఎదురుచూస్తారు. ఇతర్ల స్పందనలో వృద్ధులు ఎదురుచూచిన వత్తాసు లభించకపోతే ఆ లోపం ఇతర్లది అనుకొని తమ వూహాలను మార్చుకోరు. ఉదాహరణకు ముక్కుమీద కోపం వున్న వృద్ధుడు తన కోపాన్ని ఇతర్లు ప్రేరేపిస్తున్నారని సమర్థించుకోవటానికి ప్రయత్నిస్తాడు. తను శాంతస్వభావుడని ఇతరులపై కోపాన్ని ప్రదర్శించాల్సిన అవసరం తనకు లేదని తన మంచితనాన్ని ఎవ్వరు గుర్తించకపోవటం మూలంగానే తాను కోపంతో వ్యవహరించవల్సి వచ్చిందని సమర్థిం చుకొంటాడు. పరిచయంలేని వ్యక్తులతో కూడ అలవాటు ప్రకారం కోపంతో స్పందిస్తాడు. భిన్న సన్నివేశాలలో వివిధ వ్యక్తులతో అనేక సందర్భాలలో తన అలవాటు అసంకల్పితంగా బహిర్గత మౌతుంది. ఎంతమంది ఎన్నివిధాలుగా నచ్చచెప్పినా తనలోపాన్ని సరిదిద్దుకోవటానికి కృషి చెయ్యడు. ఇతర్లు మారితే తాను మారతానంటాడు. తన ప్రవర్తన ఇతర్ల స్పందనకు ప్రతిస్పందన అని నిరూపించటానికి నిర్విరామ కృషి చేస్తాడు. అందరితో విభేదాలు ఏర్పడినా, ఆరోగ్యం పూర్తిగా క్షీణించినా తన వ్యక్తిత్వలోపాన్ని మాత్రం సరిదిద్దుకోడు. ఇట్టి విషవలయంలో చిక్కుకొని కొట్టుమిట్టాడే వృద్ధులు తమ మానసిక ఒత్తిడులను తామే సృష్టించుకొంటారు.

కోపంలాగానే, ఆందోళన, భయం, దోష మనస్తత్వం, ఈర్ష్య, ద్వేషంలాంటి వ్యతిరేక భావావేశాలు వృద్ధులకు మానసిక ఒత్తిడులను కలుగజేస్తాయి. వాటిని గుర్తించి నివారించటానికి వృద్ధులు కృషి చేయాలి. అనేక వ్యక్తిత్వ లోపాలు ఇటువంటి భావావేశాలవల్ల వృద్ధులకు అలవాట్లుగా

స్థిరపడ్తాయి. ఎంతోకాలంగా చెడు అలవాట్లు వ్యక్తిత్వంలో భాగంగా వృద్ధులలో వుండిపోతాయి. కాబట్టి వాటిని గుర్తించటంకూడ కష్టం. అయినా, వాటివల్ల కలిగే కష్టనష్టాలు మాత్రం కన్పిస్తాయి. ఇతర్ల స్పందనల నుండి తమ లోపాలను వృద్ధులు గుర్తించటానికి సావకాశం వుంది. ఇతరులు చెప్పే మాటలను వృద్ధులు శ్రద్ధగా వింటున్నప్పుడు వారి భావాలలో అంతర్లీనంగావున్న అభిప్రాయాలు తెలుస్తాయి. ప్రత్యక్షంగా చెప్పలేని అంశాలను పరోక్షంగా అభివ్యక్తం చేస్తారు. భిన్న వ్యక్తులనుండి లభించే స్పందనలలో మనను గూర్చిన సామాజిక దృక్పథం వ్యక్తమౌతుంది. ఏ మాటలలో చెప్పినా, ఏ ధోరణిలో చెప్పినా ఎటువంటి పదజాలాన్ని వాడినా అంతర్లీనంగా వున్న భావం స్పష్టంగా కన్పిస్తుంది. అందువల్ల అభివృద్ధిని కాంక్షించే వృద్ధులు తమ మానసిక ఒత్తిడులను తగ్గించుకోవటానికి కృషి చెయ్యాలి. మానసిక ఒత్తిడులు వ్యక్తిత్వ లోపాలవల్లే కలుగుతాయనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, వృద్ధులు తమ లోపాలను కనుగొనటానికి ప్రయత్నించాలి. ముఖ్యంగా వృద్ధులు కుటుంబ సభ్యుల శ్రేయస్సును కాంక్షించి తమ లోపాలను సరిదిద్దుకోవాలి.

చాలమంది వృద్ధులు తమకు తగినరీతిలో మర్యాదలు జరగటం లేదని విచారిస్తూ వుంటారు. ఇతరులు తమను కించపరుస్తున్నారనుకొనే వృద్ధులు ఇతరు లిచ్చే విలువలకొరకు ఎదురు చూస్తున్నారని తెల్సుకోవాలి. తమకు తాము సరైన విలువకట్టుకోలేనప్పుడు ఇతరులిచ్చే విలువలనుబట్టే తమను తాము మదింపు చేసుకోవలసి వుంటుంది. అందరూ ఒకేరకమయిన కొలమానాలను కలిగి వుండరు. కాబట్టి తమకొలమానాలయందు నమ్మకం వున్నవారు ఇతరులు తప్పుడు కొలమానాలను ఉపయోగించినప్పటికీ అతిగా స్పందించవలసిన అవసరం లేదు. ఆత్మవిశ్వాసంతో స్పందించే వృద్ధులు ఇతరుల మదింపుపై ఆధారపడి తమ విలువలను నిర్ణయించుకోరు. తమయందు తమకు నమ్మకం లేనివారు మాత్రమే ఇతరుల మద్దతు కొరకు ఎదురు చూస్తారు. అసలు మన అనుమతి లేకుండా ఎవ్వరు మనను కించపర్చలేరు. ఇతరులు కించపరుస్తున్నారనుకొనే వృద్ధులు తమ ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవాలి.

వృద్ధులు భౌతికంగాను, మానసికంగాను, ఆధ్యాత్మికంగాను అభివృద్ధి చెందటానికి నిర్విరామ కృషి చెయ్యాలి. తాము ఆనందిస్తూ ఇతర్లకు ఆనందం చేకూర్చాలంటే ఎంతో కష్టపడాలి. తేనేటీగ తేనెను సేకరించే ప్రక్రియలో పరపరాగ సంపర్కాన్ని కూడ చేసి తనకు ఆహారం చేకూర్చే చెట్టుకు ప్రత్యుపకారం చేస్తుంది. 1 కే.జి. తేనెను సేకరించటానికి కోట్లాది పువ్వులమీద వాలవలసివుంటుంది. అట్లాగే వృద్ధులు నిస్వార్థంగా తమ ఆనందాన్ని ఇతర్లకు పంచిపెట్టగలగాలి.

తమ కష్టాన్ని మనస్సు విప్పి ఆత్మీయులతో చెప్పుకొంటే బాధ సగం తగ్గుతుంది. అందువల్ల వృద్ధులు కష్టంలోవున్నవారితో ఆప్యాయతగా వ్యవహరించి వారి బాధను తగ్గించటానికి సహాయపడాలి. ముఖ్యంగా ఆందోళన చెందుతున్న వారు తమకు ఎదురవ్వబోయే అవాంతరాలను గురించి అవాస్తవంగా వూహించుకొని బాధపడ్తారు. అట్టివారితో అనుభవజ్ఞులైన వృద్ధులు మనస్సు విప్పి మాట్లాడితే మానసిక ఒత్తిడి చాలవరకు తగ్గుతుంది. అట్లాగే సంతోషాన్ని ఇతర్లతో పంచుకొంటే ఆనందం ద్విగుణీకృతం అవుతుంది. అందువల్ల వృద్ధులు తమ కాలాన్ని సద్వినియోగపర్చుకోవటానికి కష్టాలలో వున్నవారికి సానుభూతితో సలహాలను అందజేయాలి. తమ సంతోషాన్ని ఇతర్లకు పంచిపెట్టి, వారికి కూడ ఆనందం కలుగజేయాలి.

ద్వేషంతో వ్యవహరించే వృద్ధులు తమ భావావేశం ఇతర్లకు కష్టం కలిగించడంతో పాటు తమకు కూడ నష్టం కలిగిస్తుందని తెల్సుకోవాలి. ఒక వ్యక్తిని కనుక చెరువు అడుగు భాగంలో నొక్కిపెట్టి వుండాలంటే, ఆ వ్యక్తితోపాటు నొక్కే వ్యక్తికూడ నీటిలో మునిగేవుండాలి. అందువల్ల ఇతర్లను ద్వేషించటంవల్ల వృద్ధులు కూడ కష్టనష్టాలను అనుభవించవలసి వస్తుంది. ద్వేషాన్ని ప్రేమగా మార్చినప్పుడు వృద్ధులు, ఇతర్లు కూడ ఆనందించటానికి సావకాశం వుంది. ప్రేమ వృద్ధులకు అదనపు శక్తినిస్తుంది. భయాన్ని పోగొడ్తుంది. విజయావకాశాలను పెంచుతుంది. ముఖ్యంగా ఇతర్ల వుద్దేశ్యాలను సాదరంతో స్వీకరించ కలిగే వృద్ధులు ద్వేషాన్ని తేలికగా త్యజించవచ్చు. ప్రేమతో స్పందించవచ్చు. పరాజయాలను పారద్రోలవచ్చు.

వృద్ధులు ఇతర్లు చేసే పనులలో శ్రద్ధవహిస్తే వారి విజయాలను అభినందించవచ్చు. ఇతర్లను ప్రోత్సహించటం వల్ల వృద్ధులు విజయావకాశాలను మెరుగుపర్చుకోవచ్చు. విశాలహృదయంతో ఇతర్ల పురోభివృద్ధిని కాక్షించి, వీలైనప్పుడల్లా ప్రోత్సహించ కలిగితే వృద్ధుల శేష జీవితం సద్వినియోగమౌతుంది. కాని, చాలమంది వృద్ధులు ప్రోత్సహించటానికి బదులు విమర్శిస్తూ ఇతర్ల ఉత్సాహాన్ని క్షీణింపజేస్తారు. అట్టి వ్యతిరేక ధోరణి వ్యక్తిత్వలోపం. ముఖ్యంగా ఇతర్లలోపాన్ని మదింపు చేసేటప్పుడు తక్కెడను వ్రేలుతో నొక్కినట్లుగా వ్యవహరిస్తారు. అట్లా వ్యవహరించేటప్పుడు వృద్ధులు తమ గొప్పతనం ఇతర్లకు కన్పడ్తుందనే అపోహతో అనౌచిత విమర్శలు చేస్తారు. ఒకవేళ ఏదైనా సలహాలను ఇవ్వాలనుకొంటే ముందు – ప్రోత్సహించి వారి నమ్మకాన్ని చూరగొని వృద్ధులు తమ అభిప్రాయాన్ని సూచనగా తెలియజెయ్యాలి. ఒకవేళ ఒక వ్యక్తి తప్పుచేస్తున్నా అతను చేసే పనిని అతని దృక్కోణంనుంచి చూసి మదింపు చెయ్యాలి. అట్లా మదింపు చేసేటప్పుడు వ్యక్తిని అతను చేసే పనిని విడదీసి

చూడాలి. పనిలోని లోపాన్ని మాత్రమే సరిదిద్దటానికి ప్రయత్నించాలి. పనిలోని తప్పును వ్యక్తికి ఆపాదించి వృద్ధులు విమర్శించకూడదు. సహజంగా విమర్శ ఎదుటవారిని వివశులను చేస్తుంది. సొంతంగా ఆలోచించుకోలేకపోతారు. ఆ దశలో వారి శ్రేయస్సుకొరకు అందజేసే సలహాలను, సహాయాన్ని సద్వినియోగం చేసుకోలేకపోతారు. అందువల్ల వృద్ధులు విమర్శించటం మాని ప్రోత్సాహధోరణిలో తమ సహాయసహకారాలను అందించగలగాలి. మాటలతో చెప్పటం కంటే చేసి చూపించితే ఇంకా ప్రయోజనం వుంటుంది. అనుభవజ్ఞులైన వృద్ధులు యువతరానికి మార్గదర్శకులుగా వుండటానికి వారు చేసేపనులలో పాలు పంచుకొని తమ ప్రజ్ఞాపాటవాలను వారికి అందజేయాలి. యువకులు చేసే పనిని విమర్శిస్తూ వృద్ధులు తమ అహంకారాన్ని ప్రదర్శించి యువకుల ప్రయత్నానికి అడ్డు తగిలితే ప్రయోజనం వుండదు. అందువల్ల ప్రోత్సహిస్తూ సహకరించటానికి ప్రయత్నించాలి.

వృద్ధులు తమను ఇతర్లు గుర్తించాలని తమ సహాయ సహకారాలను కోరాలని ఎదురు చూస్తారు. తామందించే సహాయ సహకారాలకు తగిన ప్రచారం లభించాలని ఆశిస్తారు. తత్ఫలితంగా ఘర్షణలు ఎదురౌతాయి. ఘర్షణలను నివారించటానికి వృద్ధులు సమష్టిగా కార్యక్రమాలను చేపట్టాలి. అప్పుడు వృద్ధులు త్యాగశీలతను ప్రదర్శించి సమష్టిగా సాధించిన విజయాలను సభ్యులందరికి చెందినవిగా ప్రకటించాలి. తాము పెద్దలం కాబట్టి తమకే ప్రశంసలు చెందాలని వృద్ధులు స్వార్థచింతనతో వ్యవహరిస్తే ఇతరుల సహకారం లభించదు. అందువల్ల విశాల హృదయంతో ఇతర్లను ప్రోత్సహిస్తూ వారిని ఇంకా ఎక్కువ పనిచేసేటట్లు చూడవలసిన బాధ్యత వృద్ధులపై వుంది. ఆలోచనలు తనవైనా సమష్టి ప్రయోజనాన్ని కాంక్షించి బృందంలో సభ్యులను ఉత్తేజపరిచే, విధంగా వృద్ధులు వ్యవహరించాలి. ఇతర్లలోని మంచిని చూడకలిగే నేర్పును సంతరించుకొంటే సహకారం అయాచితంగా లభిస్తుంది. అప్పుడు సమష్టి కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించవచ్చు. మంచిపనులు చేయటానికి మంచి ఆలోచన్లు రావాలి. మంచి ఆలోచన్లు రావటానికి సానుకూలంతో స్పందించగలగాలి. సానుకూలంగా స్పందించటానికి ఆశావాదం కావాలి. ఆశావాదాన్ని వృద్ధి చేసుకొవటానికి సాత్విక భావాలు కలిగి వుండాలి. సాత్విక భావాలు కలిగి వుండటానికి సత్సంగం అవసరం. అందువలన మంచిని కాంక్షించే మిత్రులతో వృద్ధులు ఎక్కువ సమాలోచనలు జరపాలి.

ఏదయినా సాధించాలంటే నిర్విరామకృషి అవసరం. వైఫల్యాలను ఎదుర్కొనప్పుడు వృద్ధులు కలత చెందకూడదు. ప్రముఖుల జీవిత చరిత్రలు చూస్తే ఎన్నో పరాజయపరంపరల తరువాతే విజయాలను సాధించారని తెల్పుతుంది. ఉదాహరణకు విద్యుత్ దీపాన్ని కనిపెట్టిన థామస్ ఆల్వా ఎడిసన్ కొన్ని వేల వైఫల్యాల తరువాత విజయాన్ని సాధించాడు. ఆ వైఫల్యాలకు అతను చలించలేదు. అతని వైఫల్యాలను విమర్శించిన వారికి "నేను అన్నిసార్లు వైఫల్యం చెందటం మూలంగా ఇతర్లు మళ్ళీ అటువంటి వైఫల్యాలను చెందే అవకాశం లేకుండా చేశాను" అని అన్నాడు. అతని సమాధానంలో లక్ష్యసాధన కొరకు అతను చేసిన కృషి స్పష్టంగా కనిపిస్తుంది. అందువల్ల అడ్డంకులను సవాళ్ళగా తీసుకొని కృతనిశ్చయంతో ముందుకు సాగటానికి వృద్ధులు ప్రయత్నించాలి. తమ శేష జీవితాన్ని కుటుంబ సభ్యుల సుఖసంతోషాలకు వినియోగించటానికి పథకాలు రూపొందించి అమలు జరిపితే వృద్ధులు ఆనందించవచ్చు. వారి కుటుంబ సభ్యులు కూడ వృద్ధులను గౌరవిస్తారు.

తమలో పుట్టే సృజనాత్మకమయిన ఆలోచనలను వృద్ధులు మంత్రసానులలాగా జాగ్రత్తగా వెలికి తీసుకురావాలి. ఆశావాదంతో పురోగమిస్తే మనస్సు సవ్యమయిన ఆలోచనలను పుట్టిస్తుంది. బాహ్యమనస్సును సాత్విక భావాలతో నింపితే అవి క్రమక్రమంగా అంతర్‌మనస్సులోకి చొచ్చుకుపోతాయి. అప్పుడు అంతర్‌మనస్సులో ఉన్న అపసవ్య ఆలోచనల ప్రభావం తగ్గిపోతుంది. సమస్యను సవ్యంగా నిర్వచించి అంతర్ మనస్సులోకి చొప్పించాలి. అంతర్‌మనస్సులోని విజ్ఞత సమస్యను తనలో ఇముడ్చుకొని పరిష్కారానికి జననం ఇస్తుంది. వృద్ధులకు భావ దారిద్ర్యం లేదు. కాబట్టి సృజనాత్మకతను పుట్టించటానికి ఇబ్బంది ఉండకూడదు. కాని, అహంకారం అపసవ్యంగా ఆలోచింపజేస్తుంది. అప్పుడు విజ్ఞత వృద్ధులకు అండగా వుంటే వృద్ధులలోని అపారశక్తిని వెలికి తీసుకురావచ్చు. ఆ దశలో భయం, వాయిదా వేసే అలవాటు, సోమరితనం వృద్ధుల విషయ నిర్ణయ శక్తిని క్షీణింపజేస్తాయి. అప్పుడు నిరాశావాదం వృద్ధులను వశం చేసుకొంటుంది. అట్టి సందర్భాలలో ఆత్మవిశ్వాసం వృద్ధులకు అండగావుంటే ఆశావాదంతో ముందుకు పోవచ్చు. ఇట్లా అంచలవారిగా అడ్డంకులను అధిగమించి సృజనాత్మకతను వెలికి తీసుకు రావాలి.

అపారశక్తి అవ్యక్తంగా వృద్ధులలో వుంది. ఉదాహరణకు బీజంలో చెట్టుయొక్క శక్తి అవ్యక్తంగా వుంది. ఆ శక్తిని వెలికి తీసుకురావడానికి అనువయిన పరిసరాలు, పరిస్థితులు కావాలి. వాటిని వెలికి తీసుకు రావడానికి వృద్ధుల విజ్ఞత తోడ్పడాలి. వృద్ధులు తమ ఉద్దీపనాశక్తిని చైతన్యవంతం చేసే ఆలోచనలను పుట్టించాలి. ఆలోచనలు కార్యవిధానాలుగా భౌతిక రూపంలో బహిర్గతం అవుతాయి. అవ్యక్తంగా వున్న శక్తికి భౌతిక రూపం కల్పించటానికి వృద్ధుల స్వయం కృషి అవసరం.

# ఆంధ్రలో సంఘ సంస్కరణోద్యమాలు

ఏటుకూరు బలరామమూర్తి, ఎం.ఏ.

ఆధునిక భారతదేశంలో సంఘ సంస్కరణోద్యమానికి మూలపురుషుడు రాజా రామమోహనరాయ్. ఆంధ్రలో మూలపురుషుడు శ్రీ కందుకూరి వీరేశలింగం.

శ్రీ వీరేశలింగానికి పూర్వమే పెక్కుమంది సాంఘిక దురాచారాలపై తమ దృష్టిని కేంద్రీకరించిన వారున్నారు. ఆంగ్ల భాషతోపాటు పాశ్చాత్య నాగరికతలోని హేతువాదం, సమానత్వ భావాలతో ప్రేరితులైన వీరు ప్రప్రథమంగా హిందూ సమాజంలో స్త్రీల దుస్థితిపై తమ దృష్టి కేంద్రీకరించారు.

మద్రాసులో జీవించిన శ్రీ ఏనుగుల వీరాస్వామి, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళైగారలు ఇందులో ముఖ్యులు. వీరిలో ఏనుగుల వీరాస్వామి ఆ రోజులలో అతి కష్టభరితమైన కాశీయాత్రను సకుటుంబంగా జరిపారు. వివిధ ప్రాంతాలలో స్త్రీల సామాజిక పరిస్థితిని ఎంతో సానుభూతితో, సంస్కార దృష్టితో వర్ణించారు. భారతదేశంలోని వివిధ ప్రాంతాల సాంఘికాచారాలు తెలుసుకునేందుకు వీరి గ్రంథం ఎంతగానో తోడ్పడుతుంది.

శ్రీనివాస పిళ్ళైగారు మద్రాసులో బాలికా విద్యాలయానికై డెభైవేల రూపాయల విరాళం ఇచ్చారు. గాజుల లక్ష్మీనరసుచెట్టి అను మరొక మహనీయుని స్మరించవలసి ఉంది. వీరు మద్రాసులో గొప్ప పదవిని నిర్వహించేవారు. వెట్టిచాకిరి, క్రూరమైన కొరడా దెబ్బలవంటి శిక్షలు నిర్మూలించడానికి కృషిచేశారు. దక్షిణ భారతదేశంలో సంఘసంస్కరణతోపాటు రాజకీయ చైతన్యాన్ని కూడా కలిగించటంలో వీరికి గొప్ప పాత్ర ఉంది.

1862 లో సామినేని ముద్దు నరసింహం అనువారు హేతువాద దృక్పథాన్ని ప్రచారం చేయుటకుగాను "హితసూచని" అను గ్రంథం వ్రాశారు. కన్యాశుల్కం, అంటరానితనం, కులభేదాలు, శకునాలు, వేశ్యావృత్తి, మంత్ర తంత్రాలపట్ల మూఢ నమ్మకాలను నిరసిస్తూ ఇందులో ఎన్నో భావాలు వెలిబుచ్చారు.

నెల్లూరు ప్రాంతంలో పుదూరు అనంతరామశాస్త్రి గారు హరిజనోద్ధరణకు కృషిచేసి, అగ్రవర్ణాల ఆగ్రహానికి గురి అయినారు. విశాఖపట్టణం ప్రాంతాలలోని పరవస్తు వెంకట రంగాచార్యులుగారు స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతమని నిరూపిస్తూ ఒక కరపత్రం ప్రకటించారు.

## వీరేశలింగం యుగం

పైన చెప్పిన వారందరూ సంఘసంస్కరణ భావాల ప్రచారానికి మాత్రమే పరిమితమైనారు. వారి వారి ప్రాంతాలలో మాత్రమే వారి భావాలు వ్యాపించాయి. వీరందరూ వీరేశలింగం గారికి మార్గం సుగమం చేశారని చెప్పవచ్చు. కాని, వీరెవ్వరూ సంఘ సంస్కరణ కార్యక్రమాలను అమలుజరపలేదు. ఆ ఘనత వీరేశలింగంగారిదే. కనుకనే ఆంధ్రలో సంఘ సంస్కరణానికి వీరేశలింగంగారు ఆద్యులు అని చెప్పటం.

శ్రీ వీరేశలింగంగారు 1840 లో రాజమండ్రిలో ఒక పేద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొంటూ మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైనారు. చదువులో అగ్రశ్రేణిలో ఉండేవారు. తెలుగు, సంస్కృతాలలో పాండిత్యం సంపాదించారు. ఆ పిమ్మట F.A. పరీక్ష ప్యాసైనారు. ఆ రోజుల్లో ఆ మాత్రం ఇంగ్లీషు చదువుకున్నవారు ఆంధ్రదేశంలో పదుల సంఖ్యలో మాత్రమే ఉండేవారంటే అతిశయోక్తి కాదు.

మంత్రాలు, తంత్రాలు, మూఢనమ్మకాల ఫలితంగా ప్రజలు ఎంతగా పురోహితులకు, భూతవైద్యులకు లోబడి; ధన, ప్రాణనష్టాలకు గురవుతున్నారో స్వయంగా చూశారు. విద్యావిహీనలైన స్త్రీలు ఇండ్లను నరకతుల్యాలు చేయటం, పురుషుల వేశ్యా సంపర్కం, బాల వితంతువుల కడగండ్లు, ఇత్యాది సమస్యల పట్ల దృష్టి సారించారు.

అధికారులలో లంచగొండితనం, పీఠాధిపతుల అవినీతి

ప్రవర్తన – ఒకటేమిటి హిందూ సమాజాన్ని పట్టి పీడిస్తున్న సర్వ విధాలైన దురాచారాలపైన దండెత్తారు.

వివేకవర్ధని పత్రిక స్థాపించి తన భావాలను ప్రచారం గావించారు. స్వయంగా ఆచరించి చూపాలనే పట్టుదలతో మొట్టమొదటి వితంతు వివాహాన్ని 1881 లో తన ఇంట్లో జరిపించారు. అనా డదొక విప్లవంకంటె తక్కువైనదికాదు.

మొత్తం తన జీవితకాలంలో 50 కి పైగా వితంతు వివాహాలు జరిపించారు. 200 వివాహాలకు ఆధ్వర్యం వహించారు. సాహిత్యాన్ని, సంఘసంస్కరణ సాధనంగా స్వీకరించి వందలాది గ్రంథాలు రచించారు. బ్రహ్మసమాజమతాన్ని స్వీకరించి, బ్రాహ్మణకుల చిహ్నమైన జందాన్ని విసర్జించి, కులవ్యవస్థ నిర్మూలనకు కృషిచేశారు.

ఉపాధ్యాయుడుగా, రచయితగా తాను సంపాదించిన లక్షలాది ఆస్తిని 'హితకారిణీ సమాజం' పరం చేసి, సంఘ సేవకు అర్పించారు. కనుకనే వారిపై వారి శిష్యులు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు చెప్పిన ఈ పద్యం అక్షరాల నిజం:

"తన దేహము, తన గేహము
తన కాలము, తన ధనంబు, తన విద్య, జగ
జ్జనులకై వినియోగించిన
ఘనుడీ వీరేశలింగ కవి––"

ఆధునికాంధ్ర జాతి పునర్వికాసానికి వీరేశలింగంగారు మూల పురుషులు.

## రఘుపతి వెంకటరత్నం

వీరేశలింగం ప్రభావం ఆనాడు ఆంధ్రదేశంలోని విద్యాధికులందరిపైన పడ్డది. ప్రతి ఒక్కరూ ఏదోవిధంగా ప్రభావితులైన వారే. ఒక్కొక్కరూ ఒక్కొక్క రంగంలో సంస్కరణ కృషిని కొనసాగించారు.

అట్టివారిలో రఘుపతి వెంకటరత్నం గారు ముఖ్యులు. వీరు మచిలీపట్నం ప్రాంతంలో జన్మించి, ఉన్నత విద్య నభ్యసించి, బందరు, కాకినాడ కళాశాలలలో ప్రిన్సిపాల్ పదవి నిర్వహించి, మద్రాసు విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గా గూడా పనిచేశారు.

వీరేశలింగంగారు వేశ్యావృత్తి నిర్మూలనకు కృషి చేయగా, వీరు వేశ్యలకు వివాహం చేసి, గౌరవప్రదమైన కుటుంబీకులుగా చేసేందుకు తమ జీవితమంతా ధారపోశారు. కాకినాడలో, పిఠాపురం రాజాగారి ధన సహాయంతో అందుకుగాను అనేక సంస్థలను స్థాపించారు. అస్పృశ్యతా నిర్మూలనకు తీవ్రకృషి చేశారు. వారి ప్రోత్సాహంతోనే ఆనాడు కాకినాడలోని పిఠాపురం రాజా కళాశాలలో అంటరాని వారని పిలవబడే వారికి ప్రవేశం కల్గింది. అనేకమంది అనాథ బాలికలను పెంచి, పెద్దచేసి, వివాహాలు చేశారు. వేశ్యలను అనేకమంది ఉన్నత కులస్థులు వివాహం చేసుకొనేందుకు, వర్ణాంతర వివాహాలకు ప్రోత్సాహమిచ్చారు.

బ్రహ్మ సమాజం పట్ల – ముఖ్యంగా అందులోని భక్తి, ప్రేమ, కరుణ ధోరణులపట్ల అత్యంత విశ్వాసం కలవారు. వీరేశలింగంగారు కర్మ వీరులయితే, వెంకటరత్నంగారు ధర్మ వీరులు. స్వచ్ఛమూ, అతి పవిత్రమూ ఐన జీవితాన్ని గడిపి, ఆంధ్రదేశ బ్రహ్మ సమాజానికి మూల పురుషులైనారు. వీరేశలింగంగారి మరణానంతరం హితకారిణీ సమాజానికి అధ్యక్షులై, ఆ సంస్థ కార్యకలాపాలు కొనసాగించారు.

కాకినాడకు చెందిన పైడా రామకృష్ణయ్యగారు వీరేశలింగంగారు జరిపిన వితంతు వివాహాలన్నింటికీ ధన సహాయాన్ని చేసి, ఆ కుటుంబాలకు ఉపాధి కల్పించటంలో ఎంతో సహాయ పడ్డారు. రాజమండ్రికి చెందిన బసవరాజు గవర్రాజుగారు ప్రతి విషయంలోనూ వీరేశలింగంగారికి కుడిభుజంగా నిలిచారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వీరేశలింగంగారికి శిష్యులుగా మొదలై, స్వయంగా హరిజన పాఠశాలలు ప్రారంభించారు. సంఘ సంస్కరణ ప్రచారానికై పెక్కు నవలలు, కథలు వ్రాసి, గురువుతో సమానమైన ఖ్యాతి గడించారు.

బాపట్లకు చెందిన దేశిరాజు పెదబాపయ్యగారిని ప్రత్యేకంగా ప్రస్తావించాలి.

వారు విద్యను పూర్తి చేసి చేయక మునుపే బ్రహ్మ సమాజంతో ప్రేరితులై జందాన్ని విసర్జించారు. అందుకుగాను ఇతని మామ తన కుమార్తెను అల్లునితో సంసారం చేయటానికి కూడా పంపలేదు. ఐనా పెద బాపయ్యగారు తమ పట్టువిడవలేదు. రాజమండ్రి వచ్చి, వీరేశలింగంగారికి కుడిభుజంగా వారి సంఘ సంస్కరణ కార్యక్రమాలలో పాల్గొనసాగారు.

వ్యక్తిగత జీవితంలో ఇన్ని కష్ట నష్టాలకు గురైన ఫలితంగా శ్రీ బాపయ్యగారు తీవ్ర అనారోగ్యానికి గురయ్యారు. క్షయవ్యాధితో అకాల మృత్యువుకు గురైనారు.

సంఘ సంస్కరణ ఉద్యమం కొరకు తన జీవితాన్నే బలిపెట్టిన బాపయ్యగారి వంటి మహాత్యాగులు అరుదు.

తన తర్వాత సంఘ సంస్కరణోద్యమాన్ని కొనసాగించగలరని ఎంతో ఆశపెట్టుకున్న శ్రీ బాపయ్యగారు అకాల మరణానికి గురి కావటం వీరేశలింగంగారికి అశనిపాతమైంది. అదేవిధంగా మరో యువ సంస్కర్త శ్రీ సత్తిరాజు మృత్యుంజయరావుగారు కూడా వీరేశలింగంగారి కంటే ముందే మరణించారు.

వీరేకాక, గుంటూరుకు చెందిన శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు వీరేశలింగంగారి అడుగుజాడలలో నడిచి పెక్కు వితంతు వివాహాలు చేయించారు. బాలికల విద్యా ప్రచారానికై శారదా నికేతనమను గొప్ప విద్యాలయం స్థాపించి నిర్వహించారు.

వీరేశలింగంగారి ఉద్యమాలకు అనాటి విద్యాధికులైన యువకులు తోడ్పడేవారు. అట్టివారిలో పెక్కుమంది ఆ పిమ్మట రాజకీయ రంగంలో ప్రసిద్ది చెందినవారున్నారు. డాక్టరు పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, టంగుటూరు ప్రకాశంగారలు వీరిలో ముఖ్యులు.

వీరేశలింగంగారి సంఘ సంస్కరణకు సాహితీసేవను జోడించి, విజ్ఞాన పురోభివృద్ధికి, సాంస్కృతిక పునరుజ్జీవనానికి కృషి చేసినవారు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు. వీరు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని స్థాపించి, అందులో భాగంగా వీరేశలింగంగారి స్వీయచరిత్రను ప్రకటించారు. శ్రీ లక్ష్మణరావుగారి నివాసమైన మద్రాసులోని వేదవిలాసంలో, కవుల చరిత్రను సంస్కరిస్తూ వీరేశలింగంగారు మరణించారు.

వీరేశలింగంగారికి సంతానం లేదు. సంఘసంస్కర్తలందరినీ తమ పుత్రులుగా వారు భావించారు. అట్టివారిలో తమకు అతిసన్నిహితులయిన శ్రీ లక్ష్మణరావుగారి ఇంట్లో వీరేశలింగంగారు మరణించటం యాదృచ్ఛికమే ఐనా, సంస్కృతీ వారసత్వానికి ప్రతీకగా ఉంది. ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించిన మాలపల్లి నవల, నవలాసాహిత్యంలో తెలుగుదేశంలో నాటికీ, నేటికీ ప్రథమ గణ్యమైనది. అస్పృశ్యతా నివారణ, హరిజనుల ఆర్థిక సమస్యలు, భూస్వాముల దౌర్జన్యాలు, అందుకు పరిష్కారం లాంటి ఎన్నో సమస్యలను చర్చించిన ఈ నవల, సంస్కరణోద్యమానికి గొప్ప ఆయుధంగా ఉపయోగపడ్డదంటే ఆశ్చర్యంలేదు.

గురజాడ అప్పారావుగారు తమ రచనలద్వారా, ముఖ్యంగా "కన్యాశుల్కం" ద్వారా సంఘ సంస్కరణోద్యమానికి గొప్ప సేవ చేశారు. వీరేశలింగం మహాపురుషుడని కీర్తించారు.

వీరేకాక, మరి పెక్కుమంది కూడా సంఘ సంస్కరణకై కృషి చేసినవారున్నారు. మంగిపూడి వెంకట శర్మగారు హరిజనోద్ధరణను ప్రబోధిస్తూ ఎన్నో రచనలు చేశారు.

తెలంగాణాలో అరిగె రామస్వామిగారు అస్పృశ్యతా నివారణకు, వర్ణాంతర వివాహాలకు కృషి చేసి, ప్రత్యక్షంగా వివాహాలు చేయించారు. వీరు స్వాతంత్ర్యానంతరం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో సాంఘిక సంక్షేమ మంత్రిగా పనిచేశారు.

## త్రిపురనేని రామస్వామిగారు

పైన చెప్పిన సంస్కర్తలందరూ సంఘ సంస్కరణకు కృషి చేయగా, సంఘ సంస్కరణతో పాటు భావ విప్లవానికి కూడా కృషి చేసినవారు శ్రీ త్రిపురనేని రామస్వామిగారు.

వీరు రెండో తరానికి చెందినవారు. అనగా 1930–50 ప్రాంతాలలో వీరి కృషి సాగింది. వీరేశలింగంగారు 1919 లోనే మరణించారు. హిందూపురాణాలలోని కట్టుకథలన్నిటినీ అవహేళన చేస్తూ శ్రీ రామస్వామిగారు సూతపురాణం అను ఉద్గ్రంథం రచించారు. మూఢ విశ్వాసాలను పారద్రోలుటలో ఇది ఎంతో తోడ్పడ్డది. మూఢాచారాలను కొనసాగించుటలో తమ స్వప్రయోజనంకూడా అనాదిగా కలిగివున్న పురోహిత వర్గంపై వీరు ప్రత్యేకంగా దాడి చేశారు. ఒక దశలో ఈ దాడి బ్రాహ్మణేతర ఉద్యమ రూపం ధరించినా, ప్రధానంగా వీరి విమర్శ పురోహిత వర్గం, వారు ఉద్దేశపూర్వకంగా సృష్టించి – ప్రచారంలో పెట్టిన కట్టుకథలపైన. తెనాలిలో సూతాశ్రమం స్థాపించి, అస్పృశ్యతా నివారణకు కృషిచేశారు. వివాహ విధిని తెలుగులో నిర్వహించే సాంప్రదాయం వీర్పరచారు. నాస్తికోద్యమానికి అత్యంత సన్నిహితంగా ఉండే సంశయ వాదాన్ని వీరు తమ రచనల ద్వారా వ్యాప్తి చేశారు. సంశయవాదంనుంచి మరొక అడుకు ముందుకు వేసి పూర్తి నాస్తికోద్యమాన్ని ప్రచారం చేసినవారు గోరాగారు. వారు 1975 జులైలో మరణించారు. వారి కుటుంబ సభ్యులందరూ, ముఖ్యంగా వారి పెద్ద కుమారులు లవణంగారు తండ్రిగారి ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారు. నాస్తిక భావాలను ప్రచారం చేయడంతో గోరాగారు తృప్తిపడలేదు. వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించి, తమ కుటుంబంలోనే అనేక వర్ణాంతర వివాహాలు జరిపించి, ఆదర్శప్రాయులైనారు.

కుల నిర్మూలనోద్యమాన్ని మరింత ముందుకు తీసుకు పోయేందుకై, ఆంధ్రప్రదేశ్ కుల నిర్మూలన సంఘం వీర్పడి కృషి చేస్తున్నది. ఈ సంఘానికి శ్రీ వీరాస్వామిగారు అధ్యక్షులు. వీరు కొంతకాలం పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో సభ్యులు.

వారి ఆధ్వర్యాన అనేక వర్ణాంతర వివాహాలు జరిగినవి. కులాంతర వివాహాలు చేసుకున్న దంపతులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నగదు బహుమతులిచ్చే పథకం ప్రవేశపెట్టింది. ఇది నిస్సందేహంగా ఒక ప్రోత్సాహక చర్య.

ఈ విధంగా, దాదాపు ఒక శతాబ్దంగా ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమం సాగుతున్నది. భూస్వామ్య వ్యవస్థలో అంతర్భాగమైన వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా అస్పృశ్యతా నిర్మూలనకు, స్త్రీలపట్ల అసమానత్వం తొలగించుటకు పైన పేర్కొన్న సంస్కర్తలందరూ యథాశక్తి కృషిచేశారు. చేస్తున్నారు.

ఐనా, ఇంకా చేయవలసింది చాలా ఉంది.

ఈ వాస్తవం నిరూపించడానికి, గాంధీజీ ప్రారంభించిన హరిజనోద్యమం (1934) ఒక తార్కాణం. అంటరానితనం నిర్మూలన, హరిజన దేవాలయ ప్రవేశం, హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలుండకుండా జనరల్ నియోజక వర్గాలలో వారు భాగం కావాలి – అనే రాజకీయ కార్యక్రమంతో గాంధీజీ 1934 నుండి అఖిల భారత స్థాయిలో ప్రారంభించిన

మహోద్యమం ఎంతో ప్రభావాన్ని కలిగించింది. ఆంధ్రదేశంలో హరిజనోద్యమం అంతకుముందెన్నడూ లేనంత విస్తృతిని పొందింది.

డాక్టర్ అంబేద్కర్ ఆధ్వర్యాన సాగిన అస్పృశ్యతా నిర్మూలనోద్యమం మరో గొప్ప ప్రవాహం. అస్పృశ్యులలో ఆత్మచైతన్యం, ఆత్మ విశ్వాసం కలిగించి, ఎవరో తమరిని ఉద్ధరిస్తారని ఎదురు చూడక తమను తామే ఉద్ధరించుకోవాలనే ఆకాంక్షను ఈ ఉద్యమం కలిగించింది.

ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమం సంఘసంస్కరణోద్యమాన్ని తన కార్యక్రమంలో సహజంగానే అంతర్భాగంగా చేసుకున్నది. గతితార్కిక భౌతికవాదం కమ్యూనిస్టు ఉద్యమానికి సిద్ధాంత ప్రాతిపదిక. నాస్తికవాదం కంటే, యాంత్రిక భౌతికవాదంకంటే ఉన్నతమైన శాస్త్రీయ దృక్పథం ఇది.

ఈ దృక్పథాన్ని ప్రజలలో ప్రచారం చేయటంతోపాటు 1942–46 సంవత్సరాలలో సాంస్కృతిక పునరుజ్జీవనంలో భాగంగా వీరేశలింగం, గురజాడ, గిడుగు, లక్ష్మణరావు వర్ధంతులను కమ్యూనిస్టు ఉద్యమం చేపట్టింది. గురజాడ గ్రంథాలను మొట్టమొదటిసారిగా ప్రచురించింది.

అంతర్వర్ణ వివాహాలను, పూలదండల పెండ్లిండ్లను విస్తృతస్థాయిలో జరిపించింది.

ఇన్ని చేసినా, ఇప్పటికీ హరిజనుల ఆర్థిక, సాంఘిక సమస్యలు పరిష్కారం కాలేదు. మహిళలకు సంపూర్ణమైన సమాన ప్రతిపత్తి రాలేదు. కులవ్యవస్థ కొనసాగటమేకాక, కొన్ని కొన్ని రంగాలలో మరింత తీవ్రరూపం ధరిస్తోంది.

మత మౌఢ్యాలు, నూతన రూపంలో, బాబాలు, మహత్యాలు, భజనలు, తిరుపతి మొక్కుల రూపంలో విస్తరిస్తున్నాయి.

సంఘ సంస్కరణోద్యమానికి, సామాజిక మౌఢ్యానికి వ్యతిరేకంగా పోరాటం సాగుతూనే ఉంది. భూస్వామ్య, ఆర్థిక వ్యవస్థ పూర్తిగా నశించనిదే సాంఘిక అసమానత్వాలు తొలగిపోవు.

సంఘ సంస్కరణోద్యమానికి అంతర్లీనంగా, రాజకీయ, ఆర్థిక పార్శ్వాలు కూడా ఉన్నాయి. కనుకనే రాజకీయ స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసుకుంటూ, సామ్రాజ్యవాద ఆర్థిక విష కౌగిలి నుండి బైటపడి, నూతన ప్రగతిశీల ఆర్థిక వ్యవస్థ స్థాపనకై సాగుతున్న మహోద్యమంలో అంతర్భాగంగా సంఘ సంస్కరణోద్యమం కొనసాగాలి.

వీరేశలింగంగారితో మొదలుకొని నేటివరకు సంస్కరణోద్యమాలలో కృషి చేస్తున్న మహనీయులందరూ ఈ మహాసౌధ నిర్మాణానికి పునాదిరాళ్ళను వేసినవారే. వారందరూ తెలుగువారికి చిరస్మరణీయులు.

సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహసమెట్టిది?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్, అది మోసిన బోయీలెవ్వరు? – శ్రీశ్రీ

# జాతీయ సేవాపథకం

డా॥ మురళీధర్ రావు, ఎం.ఎ., యం.ఫిల్.,పిహెచ్.డి., (పి.జి.డి.యు.యం.పి.)
జె. బాలకొమరయ్య, ఎం.ఎ.,యం.ఫిల్., (పిహెచ్.డి.)

ఆధునిక కాలంలో ఏ సమాజ భవిష్యత్తు అయినా అచటి విద్యా విధానం మీద, ఆ సమాజంలోని యువతీ, యువకులకు తమ సృజనాత్మకత, క్రియాశీలత నిరూపించుకునేందుకు లభించే అవకాశముల మీద ఆధారపడి ఉంటుంది. భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్య వాద పాలకులు తమ అధికారం నిరాటంకంగా కొనసాగుటకు వీలైన విద్యా విధానాన్ని రూపొందించారు. అది అక్షర జ్ఞానాన్ని, కొంత విషయ జ్ఞానాన్ని పెంపొందించిందే కానీ, సంఘ దృష్టిని, మానవ సంస్కారాన్ని, జాతీయ భావాన్ని, సేవాదృక్పథాన్ని, శ్రమనిష్టలను పెంపొందించలేకపోవడమే కాక, వ్యక్తిత్వాన్ని కూడా వికసింపనివ్వలేదు. అందుచేతనే భారత జాతీయోద్యమంలో భాగంగా విశ్వకవి రవీంద్రుడు, విద్యారంగంలో సృజనాత్మకతను సాధించుటకు శాంతినికేతనాన్ని ప్రారంభించారు. మరొక ప్రక్క మహాత్మా గాంధీ శ్రమనిష్టను పెంపొందించుటకు, సేవా భావాన్ని అలవరచుటకు, జీవితార్జన వృత్తి, విషయజ్ఞాన సముపార్జన పరస్పరం పెనవేసుకొని విద్యార్థిని ఉత్తమ పౌరుడుగా తీర్చి దిద్దుటకు బేసిక్ విద్యావిధానాన్ని రూపొందించారు.

స్వాతంత్ర్యానంతరం దేశం ఎదుర్కొంటున్న ఎన్నో పెద్ద సమస్యలతో మునిగిపోయి మన ప్రభుత్వం విద్యారంగంలో విప్లవాత్మక మార్పులు తీసుకు వచ్చుటకు తగినంతగా కృషి చేయలేక పోవడంవల్ల, పాత బ్రిటిషు విద్యా విధానాన్ని తరువాత కూడా కొనసాగించడం వల్ల జాతీయ పునర్నిర్మాణానికి తోడ్పడవలసిన పాత్రను విద్యారంగం నిర్వర్తించలేకపోవడమే కాక, జాతీయ ప్రయోజనాలకు అడ్డంకులు ఏర్పరచింది. ఆర్థికాభివృద్ధికి, సామాజిక చైతన్య వికాసానికి అవసరమైన పెట్టుబడిగా రూపొందవలసిన విద్య కేవలం ఉద్యోగాన్వేషణే ధ్యేయంగా గల ఒక తరాన్ని తయారు చేసింది. ఆశలకు – యదార్థాలకు మధ్య పెద్ద అఘాతం ఏర్పడి నిరాశ–నిస్పృహలు పెరగడానికి దోహదం చేసింది.

## రాధాకృష్ణన్ కమిషన్:

విద్యా రంగంలో కావలసిన సంస్కరణలను సూచించుటకు కొన్ని కమీషన్లు వేయబడినాయి. వీనిలో తొలుత ప్రముఖ విద్యావేత్త డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి అధ్యక్షతన ఏర్పడిన కమిషన్. ఆ తర్వాత డా॥ కొఠారి అధ్యక్షతన ఏర్పడిన కమిషన్ చాలా ముఖ్యమైనవి. ఫలితంగా ఒక ప్రక్క విద్యార్థుల మానసిక స్థాయిని, విద్యా ప్రమాణాలను పెంచుతూ, మరొక ప్రక్క నూటికి డెబ్బై మందికి పైగా నిరక్షరాస్యులుగా ఉన్న సామాన్య ప్రజలకు – విద్యావంతులకు మధ్య ఉండే దూరాన్ని తగ్గించే బాధ్యత కూడా విద్యారంగంమీద పడింది.

ఒక ప్రక్కన స్కౌట్సు, గైడ్సు ఉద్యమం విద్యార్థులలో సేవాభావాన్ని పెంపొందించి, విద్యాలయాలకు బయట కూడా వారు క్రమశిక్షణతో మెలిగేటట్లు చేయడమే కాక, వారి ప్రభావం ఉన్న ఇతరులను కూడా క్రమశిక్షణ దృష్టిని మరల్చే విధంగా దోహదం చేయడం జరిగింది. మరొక ప్రక్క క్రీడలు విద్యార్థులకు ఉల్లాసాన్నే కాక, శరీర ధారుఢ్యాన్ని క్రమశిక్షణను కూడా ఇచ్చాయి. అయితే ఒక స్వతంత్ర దేశానికి భావి పౌరులగు విద్యార్థినీ, విద్యార్థులకు అవసరమైనంత శిక్షణను అటు పాఠ్యక్రమంగానీ, ఇటు ఈ అతి రిక్త కార్యక్రమాలుగానీ ఇవ్వలేకపోయాయి.

అందుచేతనే 1958లో అప్పటి ప్రధాన మంత్రి పండిత జవహర్ లాల్ నెహ్రూ ముఖ్యమంత్రుల సమావేశంలో ఒక సూచన చేశారు. 19–32 సంవత్సరాల మధ్య వయస్సుగల యువతీ యువకుల నందరినీ జాతీయ సేవా కార్యక్రమంలో విధిగా నిమగ్నులయ్యేటట్లు చేయాలని ఆయన భావించారు. అయితే, దేశంలోని జనాభా దృష్ట్యా అది వెంటనే సాధ్యం కాదు గనుక, ముందుగా విశ్వవిద్యాలయ విద్యార్థులకు వర్తింప జేసి, డిగ్రీ తీసుకునేముందు ఒక నిర్ణీత కాలం జాతీయ సేవా కార్యక్రమంలో వారిని పాల్గొనేటట్లు చేయాలని సూచించారు. డా॥ సి.డి. దేశ్‌ముఖ్ అధ్యక్షులుగా ఈ విషయాలను పరిశీలించుటకు ఆగష్ట్ 28, 1959 సంవత్సరంలో ఒక సంఘం నియమించబడింది. తొమ్మిది నెలల నుండి ఒక సంవత్సరం వరకు హైస్కూలు విద్య పూర్తి చేసుకొని కాలేజీలో చేరేముందు, విద్యార్థినీ, విద్యార్థులు

జాతీయ సేవలో తప్పనిసరిగా పాల్గొనడం బాగుంటుందని ఆ సంఘం సూచించింది. అప్పుడు తయారయిన ప్రణాళిక ప్రకారం కొంత సైనిక శిక్షణ, కొంత సమాజసేవా కార్యక్రమం, కొంత శరీర శ్రమ, కొంత సామాన్య జ్ఞానం అందులో పొందుపరచబడ్డాయి. అయితే, దానికి అయ్యేఖర్చు భరించగలిగే స్థితిలో విద్యామంత్రిత్వశాఖ లేకపోవడం చేతనూ, పైగా దీనిని నిర్బంధం చేయడం వల్ల, ప్రజలలో కొంత వ్యతిరేకత రావడంవల్ల అప్పట్లో దానిని నిలిపి వేశారు.

కానీ దేశ రక్షణకు ప్రమాదం వాటిల్లే పరిస్థితులు యేర్పడటం చేత ముందుగా, ఐచ్ఛికంగా జాతీయసైనిక శిక్షణను విద్యార్థులకు ప్రవేశపెట్టారు. అయితే విద్యా మంత్రిత్వ శాఖకు అప్పట్లో (1960) కార్యదర్శిగా ఉన్న ప్రొఫెసర్ ఎ.జి.సయ్యదీన్‌ను ప్రపంచంలోని వివిధ దేశాలలోని జాతీయ సేవా పథకాలు అమలు జరుగుతున్న రీతులను పరిశీలించి, మన దేశానికి తగిన ప్రణాళికను సూచించమని ప్రభుత్వం కోరింది. ఆయన యుగోస్లావియా, జెకోస్లావేకియా, జర్మనీ, నార్వే, స్వీడన్, ఇంగ్లాండ్, అమెరికా, జపాన్, ఫిలిప్పీన్స్ మొదలైన దేశాలలో పర్యటించి, అచటి విద్యార్థుల జాతీయ సేవా పథక కార్యక్రమాలను పరిశీలించి "National Service for the youth" అను పేరుతో ఒక రిపోర్టును ప్రభుత్వానికి సమర్పించడం జరిగింది. ఇందులో మన దేశంలో ఏమేమి కార్యక్రమాలు చేయగలమో వివరంగా సూచిస్తూ, వానిని విద్యార్థులకు నిర్బంధం చేయరాదని, ఐచ్ఛికంగా అమలు జరపాలని సూచించారు.

డా॥ సి.డి. దేశముఖ్ కమిటీ (1959) చేసిన సూచనలు అమలు కాలేకపోవడం, ఈలోగా సయ్యదిన్ (1960) సూచనలు కూడా రావడంతో, జాతీయ సేవా పథకం 3 సంవత్సరాల డిగ్రీ కోర్సులో మొదటి రెండు సంవత్సరాలు చదువుతోపాటు తీరిక సమయంలో ఐచ్ఛికంగా అమలు జరపాలని అదికూడా ప్రత్యేకంగా ఎన్నుకోబడిన కొన్ని కళాశాలల్లో నిర్ణయించారు.

### జాతీయ సైనిక శిక్షణ:

డా॥ డి.యస్. కొఠారి (1964-69) విద్య కమిషన్ చేసిన సూచనల ప్రకారం అన్ని స్థాయిలలోని విద్యార్థులు సంఘ సేవలలో పాల్గొనవలెనని సూచించింది. ఈ సూచనను అన్ని రాష్ట్రాల విద్యామంత్రుల సమావేశంలో (1967) ఆమోదించి, విశ్వవిద్యాలయాల స్థాయిలలో జాతీయ సైనిక శిక్షణలతో విద్యార్థుల ప్రవేశాన్ని అనుమతించడం జరిగింది. అప్పటికే చైనాతో యుద్ధం రావడం వల్ల, పాకిస్తాన్ కయ్యానికి కాలు దువ్వుతూ ఉండటం వల్ల దేశ భద్రతను దృష్టిలో పెట్టుకొని జాతీయ సైనిక శిక్షణను నిర్బంధం చేయడం జరిగింది. కొంత మంది గాంధేయులు, సర్వోదయ వాదులు నిర్బంధ సైనిక శిక్షణను హర్షించలేకపోయారు. ఇందుకు ప్రత్యామ్నాయంగా జాతీయసేవకు అవకాశం కలిగించాలని గట్టిగా కోరడం ప్రారంభించారు. అప్పటి సర్వోదయోద్యమంలో భాగంగా శాంతిసేన, తరుణ శాంతిసేన నిర్వహించిన శిబిరాల అనుభవం ముందు ఉన్నది. ఈ ఆందోళన కూడా జాతీయ సేవా పథకం త్వరగా రూపొందుటకు కొంత తోడ్పడింది.

భారతదేశ శాంతి కాముకత్వం ప్రపంచానికి వెల్లడి కావడం వల్లనూ, శాస్త్రీయ దృక్పథం, విషయ విజ్ఞానం, సేవా భావం కలిగి భావి భారత నిర్మాణానికి శాయశక్తులా కృషిచేసే సుశిక్షితులైన పౌరులను తయారు చేయడం విద్యారంగం యొక్క ప్రధాన ప్రయోజనం కావడం వల్లనూ, నిర్బంధ సైనిక శిక్షణ ఎక్కువకాలం జరుగలేదు. జాతీయ సైనిక శిక్షణకూడ మరల ఐచ్ఛికం చేయబడింది. ఈ పరిస్థితులలో జాతీయ సేవా పథకం యొక్క ప్రాముఖ్యత రాను రాను పెరుగుతూ వచ్చింది.

భారతదేశం జనాభా శీఘ్రగతిన పెరగడంతో, అభివృద్ధి చెందుతున్నప్పటికీ, జనాభా పెరుగుదల శాతానికి తగినట్లుగా అభివృద్ధి జరుగలేదు. మన దేశం ప్రధానంగా వ్యవసాయ దేశం కావడం చేత, పెద్ద పెట్టున పారిశ్రామికీకరణ చెందే అవకాశం లేదు. దీనితో ఉద్యోగావకాశాలు సన్నగిల్లి విద్యార్థులలో నిరాశా, నిస్పృహలు పెరిగి అశాంతి, అలజడులు ఎక్కువైనాయి. విద్యా విధానం ఉత్పాదక శ్రమ శక్తితో సంబంధం లేని, ఉద్యోగాన్వేషణాపరులుగా మాత్రమే యువతను తయారు చేయడంతో ప్రభుత్వంపై, సమాజంపై, ఈ స్థితిని మార్చవలసిన బాధ్యత మరింత ఎక్కువైంది.

విద్యార్థులకు దేశంలోని యదార్థ పరిస్థితులను తెలుపవలసిన అవసరం, దేశంలో జరిగే అభివృద్ధి కార్యక్రమాలలో వారుకూడా భాగం పంచుకునే అవకాశం కల్పించడం మొదలైన వాటి ప్రాముఖ్యత పెరిగింది. అంటే - విద్యార్థులు విశ్వవిద్యాలయాలు వదిలి ప్రజల మధ్యకు వెళ్ళాలి. వారి సమస్యలను తెలుసుకోవాలి. వారి అవసరాలను గుర్తించాలి. వ్యక్తిగా, విద్యార్థిగా తాను సంపాదించిన విజ్ఞానం ప్రజల అభివృద్ధికి ఎలా ఉపయోగపడుతుందో పరిశీలించుకోవాలి. సమాజానికి సేవ చేయడంద్వారా తనను కూడా తాను అభివృద్ధి చేసుకుంటాడు. ఈ విధంగా యవతకు - సమాజానికి అన్యోన్య సంబంధం ఏర్పడి విద్యార్థి దశలోనే జీవితానికి గల ప్రయోజనము, ఆదర్శమూ తెలుసుకోగలిగే అవకాశం యేర్పడుతుంది. క్లుప్తంగా జాతీయ సేవా పథకం వెనుక ఉన్న తత్వం ఇది.

మన దేశంలో నిరుద్యోగ సమస్య రోజు రోజుకూ స్థైర

విహారం చేస్తున్నది. ప్రస్తుతం కోట్లాది మంది నిరుద్యోగులుగా ఉన్నట్లు అంచనా. విచారకరమైన విషయం ఏమిటంటే, ఈ విద్యాధికులైన నిరుద్యోగులు స్వయంగా ఉపాధి కల్పించుకునే శక్తిగానీ, నిపుణతగానీ లేకుండా ఉన్నారు. అందుచేత జాతీయ సేవా పథకంలో పాల్గొనే విద్యార్థులు భవిష్యత్తును శోచనీయ స్థితినుండి మార్చుటలో కొంతవరకైనా తోడ్పడగలరని ఆశ. మన దేశంలో 12–25 సం॥ మధ్య వయస్సులో ఉన్నవారిలో నూటికి 10% కూడా విశ్వ విద్యాలయాలకు రాలేక పోతున్నారు. అందుచేత ఈ యువతకు నాయకత్వం వహించవలసిన బాధ్యత నేటి విద్యార్థినీ, విద్యార్థులపై ఉన్నది. జాతీయ సేవా పథకం అందుకు తగు శిక్షణను ఇవ్వగలదని ఆశ.

అన్ని రాష్ట్రాల ముఖ్య మంత్రుల సహాయ – సహకారాలను కోరుతూ, అప్పటి కేంద్ర విద్యాశాఖ మంత్రి డా॥ వి.కె.ఆర్.వి. రావు జాతీయ సేవా పథకాన్ని సెప్టెంబరు 24, 1969 సం॥లో, అన్ని రాష్ట్రాలలోని 37 విశ్వవిద్యాలయాల పరిధిలో ప్రవేశపెట్టడం జరిగింది. అందువల్లనే ఈ పథకంను గాంధీజీ శత జయంతి సంవత్సరంలో ప్రారంభించడం జరిగిందని చెప్పవచ్చును.

జాతీయ సేవా పథకం యొక్క ఉద్దేశాలను స్థూలంగా యిలా నిర్వచించారు:

"జాతీయ సేవలో పాల్గొన్న విద్యార్థులు, ఒక ప్రక్క జాతీయ అభివృద్ధి కార్యక్రమాలలో తాము కూడా పాల్గొంటున్నామని భావించడం జరుగుతుంది. మరొక ప్రక్క ఉత్తరోత్తరా స్వయం ఉపాధి కల్పించుకొనుటకు వీలైన అనుభవాన్ని కూడా పొందగలుగుతారు. ఇలాగ తమ విశ్వ విద్యాలయం చదువు పూర్తి చేసుకున్న తరువాత కేవలం ఉద్యోగాన్వేషణపరులుగా మిగిలిపోక, స్వయం ఉపాధిని సంతరించుకోగలుగుతారు."

స్థూలంగా జాతీయ సేవా పథకం యొక్క ఉద్దేశం విద్యా సంబంధమైనదే. సమాజానికి సేవ చేయడం ద్వారా తమ విద్యను అభివృద్ధి చేసుకోవడ మనే ఆశయాన్ని వారు సాధించుకోగలుగుతారు.

### కార్యక్రమాలు:

దీనిలో రెండు రకాల కార్యక్రమాలు ఉంటాయి. రోజువారి కార్యకలాపాలు మరియు ప్రత్యేకమైన శిబిరాలు. దీనిలో పర్యవేక్షించుచు ఒక రకమైన నిర్మాణాత్మకమైన పనులు నిర్వహింపబడతాయి. N.S.S. కార్యక్రమంలో పేరు నమోదు చేయించుకున్న ప్రతి ఒక కార్యకర్త సంవత్సరంలో 120 గంటలు రోజువారి కార్యకలాపాలలో మరియు ఒక పది రోజులు ప్రత్యేక శిబిరాలలో పాల్గొని సేవలు అందించాలి. మరియు ప్రతి ఒక N.S.S. కార్యకర్త రెండు సంవత్సరాలు వరుసగా పని చేయాలి.

### కార్యకలాపాల రకాలు:

N.S.S. నిర్వహిస్తున్న కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు, వాటి సహాయ సహకార ఉద్దేశ్యములు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

#### (1) గ్రామీణ కార్యక్రమాలు:

N.S.S. కార్యకర్తలు ప్రజా సంక్షేమం కొరకు కొన్ని పథకాలను గ్రామీణ ప్రాంతాలలో నిర్వహిస్తున్నారు. అందులో కొన్ని ముఖ్యమైనవి. (a) నిరక్షరాస్యత నిర్మూలనం. (b) చిన్న నీటి పారుదల పథకం (c) వ్యవసాయ నిర్వహణ పథకాలు (d) పరిసరాల పరిరక్షణ, శుభ్రపరచటం. (e) ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం మరియు పోషకాహార పథకాలు. (f) గ్రామీణ సహకార అభివృద్ధి పథకాలు (g) గ్రామాలలో రోడ్ల నిర్మాణము మరియు ఇండ్లు లేనివారికి ఇండ్ల నిర్మాణ పథకాలు.

#### (2) పట్టణ కార్యక్రమాలు:

నగరాలలోని మురికి వాడల ప్రాంతాలలో, సాంఘికాభివృద్ధి కార్యక్రమాలను N.S.S. కార్యకర్తలు నిర్వహిస్తున్నారు. ముఖ్యంగా –

(a) వయోజన విద్యాకార్యక్రమాల నిర్వహణము.
(b) పరిసరాల పరిరక్షణ.
(c) మత్తుపదార్థాల నిర్మూలనం.
(d) పరిశుభ్రత మరియు ఆరోగ్య విద్య., ఎయిడ్స్ (AIDS) పైన సృజనాత్మక కార్యకలాపాలను మురికి వాడలలో అమలుపరుస్తున్నారు.
(e) సమాజ చైతన్యంపై ప్రచారం మరియు సలహాలు మొదలగునవి ఇవ్వటం.

#### (3) సంస్థాగత కార్యక్రమాలు:

విద్యార్థులు తమ తమ విద్యా సంస్థలలో కొన్ని కార్యక్రమాలు నిర్వహిస్తారు. ఉదా: చెట్లు నాటడం, పాఠశాల ఆవరణలను శుభ్రపరచడం మొదలైనవి.

#### (4) సంఘం యొక్క పనులు:

విద్యార్థులు తమ విద్యాసంస్థల దగ్గరలో ఎన్ను కొన్న ప్రాంతాలలో స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా సమాజ అభివృద్ధి పనులలో పాల్గొనడం జరుగుతుంది.

### గ్రామీణ మురికివాడల దత్తత:

+2 మరియు కాలేజిలలోని ప్రతి N.S.S. యూనిట్ దగ్గరలోని ఒక గ్రామములోని మురికి వాడను దత్తత

తీసుకొని దాని బహుముఖాభివృద్ధి కొరకు పాటుపడడం జరుగుతుంది. అందులో భాగంగా అక్కడ ప్రజలలోని నిరక్ష్యరాస్యతను నిర్మూలించడం, మొదలైనవి. రోజువారి కార్యక్రమాల ద్వారా, ప్రత్యేక సేవా శిబిరాల ద్వారా దత్తత తీసుకొన్న మురికి వాడను అభివృద్ధి పర్చడం జరుగుతుంది. వీటి అభివృద్ధి కొరకు కొన్ని సేవాసంస్థల ఆర్థిక సహాయంతో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం ఉచిత పశు చికిత్సా శిబిరం మొదలైనవి ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఒక కాలేజీలో ఒకటికంటే ఎక్కువ ఎన్.ఎస్.ఎస్. విభాగాలు ఉన్నప్పుడు ఒక్కొక్క విభాగం విడివిడిగా లేదా కలిసికట్టుగా ఒక గ్రామాన్ని దత్తత తీసుకోవడం జరుగుతుంది.

## నిర్వహణ:

జాతీయ స్థాయిలో మానవ వనరుల అభివృద్ధి శాఖ మరియు అందులోని యువజన సర్వీసులు మరియు క్రీడల శాఖ దీని యొక్క అభివృద్ధి పథకాలు, నిర్వహణ ఖర్చులు మొదలైనవి రూపొందిస్తుంది. రాష్ట్ర స్థాయిలో 15 ప్రాంతీయ కేంద్రాలకు ఒక ఉప లేదా అసిస్టెంట్ కార్యక్రమాల సలహాదారుడు అధికారిగా వుండి, ప్రాంతీయ మండలుల కార్యక్రమాల నిర్వహణ చేస్తుంటాడు. రాష్ట్రంలో కూడా ఒక సలహా సంఘం రాష్ట్రంలోని యూనివర్సిటీలు, కాలేజిల యొక్క కార్యక్రమాలను సమన్వయపరచడం, మార్గదర్శనం చేయడం, ఆర్థిక కేటాయింపులు మొదలగు బాధ్యతలను నిర్వహించడం జరుగుతుంది.

## శిక్షణ:

16 శిక్షణా, వృత్తికి సంబంధించిన కేంద్రాలు మరియు శిక్షణా వృత్తి పరిశోధనా సంస్థలు, ఎన్.ఎస్.ఎస్. యొక్క శిక్షణా పరిశోధనల అభివృద్ధి బాధ్యత వహిస్తాయి.

## క్రొత్త పోకడలు:

1) N.S.S. కార్యక్రమాల విస్తరణలో భాగంగా నేడు జాతీయ సమైక్యత, యువజన ప్రదర్శనలు, సాహసకృత్యాలు, ప్రజలలో నూతన చైతన్యం తేవడం, నిరక్ష్యరాస్యతను నిర్మూలించడం మొదలగు కార్యక్రమాలను ప్రత్యేక శిబిరాల ద్వారా నిర్వహించడం జరుగుతున్నది. ఈ కార్యక్రమాలకు భారత ప్రభుత్వం ద్వారా ఆర్థిక సహాయం లభిస్తుంది. ఎన్.ఎస్.ఎస్.ను ఇంకా బలోపేతంగా చేయడానికి 'జాతీయ సేవా కార్యకర్తల పథకం' యొక్క కార్యక్రమాలు కూడా నిరక్షరాస్యతను పారదోలడం, కమ్యూనిటీ అభివృద్ధి కొరకు కృషి చేయడం వంటి కార్యక్రమాలలో ఎన్.ఎస్.ఎస్.కి సహకరిస్తాయి.
2) దేశం నలుమూలల నుండి ఎన్.ఎస్.ఎస్. కార్యకర్తలు 1988 సం॥ నుండి గణతంత్ర దినోత్సవ సైనిక కవాతులో పాల్గొనడం జరుగుతున్నది.
3) ప్రతి ఎన్.ఎస్.ఎస్. విభాగం అక్షరాస్యతను పెంపొందించడానికి తప్పనిసరిగా ఒక గ్రామాన్ని ఎన్నుకోవలసి యుంటుంది.
4) ప్రతి ఎన్.ఎస్.ఎస్. కార్యకర్తపై రోజువారి కార్యక్రమాల కొరకు రూ. 80/- నుండి రూ. 200/- వరకు ప్రతి సం॥నికి ఖర్చు చేయబడుతుంది.
5) నవంబర్ 1991 నుండి 'ప్రపంచ ఆరోగ్య సంస్థ' (W.H.O.) సహకారంతో 'ఎయిడ్స్'పై జనజాగరణ కొరకు దేశంలోని 59 విశ్వవిద్యాలయాలలో 'యూని వర్సిటీస్ టాక్ ఎయిడ్స్' (U.T.A) అనే పథకాన్ని ప్రారంభించడం జరిగింది.
6) ప్రత్యేక శిబిరాల నిర్వహణ యొక్క ముఖ్య ఉద్దేశ్యం జాతీయ సమైక్యత, భిన్నత్వంలో ఏకత్వంను సాధించడమే.

## జాతీయ సేవా పథకం యొక్క గుర్తు:

ఒరిస్సాలోని కోణార్క సూర్యదేవాలయంలో ఉన్న 'రథచక్రం' ఆధారంగా జాతీయ సేవాపథకం గుర్తును రూపొందించడం జరిగింది. ఈ గుర్తు సృజనాత్మకతను, భద్రతాభావనను, విముక్తిని తెలుపుతుంది. అభ్యుదయం ద్వారా యువత తన కాళ్ళమీద తాను నిలబడే చైతన్యాన్ని సూచిస్తుంది.

## జాతీయ సేవా పథకం చిహ్నము:

N.S.S. గుర్తు N.S.S. బ్యాడ్జ్ మీద ఉంటుంది. N.S.S. కార్యకర్తలు దీనిని ధరించినంత కాలం అనేక రకాల ప్రయత్నంతో సంఘం కోసం కార్యక్రమాలను నిర్వహించి సేవలు అందిస్తారు. బ్యాడ్జ్ మీద ఉండే ఎరుపు రంగు N.S.S. కార్యకర్త యొక్క చురుకు తనమును మరియు పూర్తి జీవన స్థైర్యమును తెలుపుతుంది. ఊదా, (నీలి)రంగు N.S.S. మానవ సంక్షేమంకోసం తనవంతు బాధ్యతగా ఎల్లప్పుడు కలిసి పని చేయడాన్ని తెలియజేస్తుంది.

# ఆంధ్రప్రదేశ్‌లో సాక్షరతా ఉద్యమం

వి. లక్ష్మారెడ్డి, వి. బాల సుబ్రహ్మణ్యం

## పూర్వరంగం:

సంపూర్ణ అక్షరాస్యత సాధన కోసం నేడు దేశవ్యాప్తంగా 218 జిల్లాలలో కృషి జరుగుతోంది. అందులో 20 జిల్లాలు ఆంధ్రప్రదేశ్‌కి చెందినవి. అక్షరాస్యత ఉద్యమం ప్రజా ఉద్యమంగా, స్వచ్ఛంద స్ఫూర్తితో జరగాలనే లక్ష్యంతో 1988 మే 5 వ తేదీన అప్పటి ప్రధాని కీ.శే. రాజీవ్‌గాంధీ జాతీయ అక్షరాస్యతా ఉద్యమాన్ని ప్రారంభించారు. గతంలో ఉపాధి కల్పనా కార్యక్రమాలుగా జరిగిన వయోజన విద్యా కార్యక్రమాలు ఇప్పుడు సంఘసేవకులు, స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వ యంత్రాంగం కలసి నిర్వహించే బృహత్తర ప్రజా ఉద్యమంగా మారి ఊపందుకున్నాయి.

అక్షరాస్యత సాధించకుండా మన దేశంలో పేదరికం, మూఢవిశ్వాసాలు, జనాభా పెరుగుదల, తదితర సమస్యలను పరిష్కరించలేమనే ఉద్దేశంతో భారత జ్ఞాన విజ్ఞాన సమితి వంటి అనేక సంస్థలు, ప్రజాసైన్సు సంస్థలు కలసి ప్రభుత్వ సహకారంతో మొదట కేరళలోని ఎర్నాకుళంలో 1988 సెప్టెంబరులో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమాన్ని చేపట్టాయి. 1.35 లక్షల మంది నిరక్షరాస్యుల్లో 1.23 లక్షల మందిని అక్షరాస్యులుగా చేసి, అక్షరాస్యతా ఉద్యమానికి శ్రీకారం చుట్టాయి. అనంతరం కేరళ ప్రభుత్వం మిగిలిన జిల్లాలలోనూ ఉద్యమం చేపట్టింది. 1989 నాటికి 22.82 లక్షలమంది నిరక్షరాస్యుల్లో చైతన్యాన్ని రేకెత్తించి, వారిలో 12.22 లక్షల మందిని అక్షరాస్యుల్ని చేయగలిగారు.

కేరళ అనుభవం ప్రపంచ వ్యాప్త అనుభవమే. ఒక వెనకబడిన దేశంలోని కోట్లాదిమందిని ఒక నిర్ణీత వ్యవధిలో అక్షరాస్యుల్ని చెయ్యాలంటే అది ప్రజాఉద్యమంగా సాగితేనే సాధ్యమవుతుందనేది ఈ అనుభవం. దుర్మార్గమైన మౌన సంస్కృతిని బద్దలు చేసి, ప్రజల్ని ఏకోన్ముఖంగా కదిలించి వ్యక్తికీ, జాతికీ ఇది తక్షణావసరం అనే వాతావరణాన్ని స్పృహను కల్గించాలి. అధికార యంత్రాంగమైనా, అట్టడుగు కార్యకర్త అయినా స్వచ్ఛందతతో – జనం ముందుకు రావాలి. అప్పుడే జనం అంగీకరిస్తారు, కదులుతారు.

కేరళ స్ఫూర్తితో నేడు దేశవ్యాప్తంగా దాదాపు అన్ని రాష్ట్రాల్లోనూ 218 జిల్లాల్లో జరుగుతున్న అక్షరాస్యతా ఉద్యమంలో దాదాపు 8 కోట్ల మంది అక్షర కేంద్రాలకు హాజరవుతున్నారు. స్వాతంత్ర్యానంతరం ఇంత పెద్ద ఎత్తున ప్రజా ఉద్యమంగా జరిగినది అక్షరాస్యతా ఉద్యమమే. దాదాపు 80 లక్షల మంది విద్యావంతులు ఎలాంటి ఆర్థిక ప్రతిఫలాన్ని ఆశించకుండా, స్వచ్ఛందంగా నిరక్షరాస్యుల చీకటి జీవితంలో అక్షర వెలుగుల్ని ప్రసాదిస్తున్నారు.

## అక్షరాస్యతలో ఆంధ్రప్రదేశ్ స్థానం:

1991 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో 6 కోట్ల 65 లక్షల జనాభా ఉండగా, అందులో 3 కోట్ల 37 లక్షల 25 వేల మంది పురుషులు, 3 కోట్ల 27 లక్షల 84 వేల మంది స్త్రీలు ఉన్నారు. మన రాష్ట్ర జనాబాలో ఒక కోటి అయిదు లక్షల తొంభై రెండువేల మంది (15.83 శాతం) హరిజనులుండగా, వారిలో 7 లక్షల (6.61 శాతం) మంది మాత్రమే అక్షరాస్యులు. మన రాష్ట్ర జనాభాలో నలభై ఒక్క లక్షల తొంభై తొమ్మిది వేలమంది (6.31 శాతం) గిరిజనులుండగా, వారిలో చాల తక్కువ శాతం మంది మాత్రమే అక్షరాస్యులు.

ఆంధ్రప్రదేశ్‌లో 7 సంవత్సరాలు పైబడిన జనాభా అయిదు కోట్ల యాభై అయిదు లక్షల నలభై నాలుగువేల మంది ఉండగా, అందులో మూడు కోట్ల పది లక్షల యాభై ఏడువేల మంది నిరక్షరాస్యులున్నారు. అంటే, రెండుకోట్ల నలభై నాలుగు లక్షల ఎనభై ఏడు వేల మంది మాత్రమే అక్షరాస్యులు.

30 శాతం కన్నా తక్కువ అక్షరాస్యతగల జిల్లాలు దేశంలో 27 ఉండగా, అందులో మన మహబూబ్‌నగర్ జిల్లా 29.58 శాతం అక్షరాస్యత మాత్రమే కలిగి ఉంది. 20 శాతం కన్నా తక్కువ మహిళా అక్షరాస్యత గల జిల్లాలు దేశంలో 73 ఉండగా, మన రాష్ట్రంలో మహబూబ్‌నగర్ జిల్లా 18.03 శాతం, మెదక్ జిల్లా 19.25 శాతం మాత్రమే మహిళా అక్షరాస్యుల్ని కలిగి ఉన్నాయి.

**ఆంధ్రప్రదేశ్‌లో 7 సంవత్సరములు పైబడిన జనాభాలో నిరక్షరాస్యులు**
**(స్త్రీ, పురుష, గ్రామీణ, పట్టణ వివరాలు – 1991)**

నిరక్షరాస్యులు – వేలలో

| ప్రాంతం | జనాభా – వేలలో మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|---|---|---|
| మొత్తం | 55,544 | 28,173 | 27,371 | 31,957 | 12,641 | 18,416 |
| గ్రామీణ | 40,397 | 20,437 | 19,960 | 25,959 | 10,774 | 15,185 |
| పట్టణ | 15,147 | 7,736 | 7,411 | 5,098 | 1,867 | 3,231 |

ఆధారం: వయోజన విద్యా జాతీయ సంస్థ (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడల్ట్ ఎడ్యుకేషన్) ప్రచురించిన అక్షరాస్యతా లెక్కలు (స్టాటిస్టికల్ డేటాబేస్ ఫర్ లిటరసీ) నుండి.

**ఆంధ్రప్రదేశ్‌లో 7 సంవత్సరముల పైబడిన జనాభాలో అక్షరాస్యులు, అక్షరాస్యతా శాతం**

| ప్రాంతం | అక్షరాస్యులు – వేలలో | | | అక్షరాస్యతా శాతం | | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు |
| మొత్తం | 24,487 | 15,532 | 8,955 | 44.09 | 55.13 | 32.72 |
| గ్రామీణ | 14,438 | 9,663 | 4,775 | 35.74 | 47.28 | 23.92 |
| పట్టణ | 10,049 | 5,869 | 4,180 | 66.35 | 75.87 | 56.41 |

ఆధారం: నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడల్ట్ ఎడ్యుకేషన్ ప్రచురించిన అక్షరాస్యతా లెక్కలు (స్టాటిస్టికల్ డేటాబేస్ ఫర్ లిటరసీ పుస్తకం) నుండి.

**ఆంధ్రప్రదేశ్ 7 సంవత్సరముల పైబడిన జనాభాలో నిరక్షరాస్యులు స్త్రీ, పురుషులు, పట్టణ, గ్రామీణ జిల్లాల వారీగా**

| క్రమసంఖ్య | జిల్లా పేరు | ప్రాంతాలు | జనాభా (వేలలో) | | | నిరక్షరాస్యులు (వేలలో) | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు |
| 1) | శ్రీకాకుళం | మొత్తం | 1932 | 958 | 974 | 1232 | 487 | 745 |
| | | గ్రామీణ | 1683 | 834 | 849 | 1137 | 455 | 682 |
| | | పట్టణ | 248 | 124 | 125 | 95 | 32 | 63 |
| 2) | విజయనగరం | మొత్తం | 1777 | 888 | 889 | 1169 | 480 | 689 |
| | | గ్రామీణ | 1465 | 733 | 732 | 1049 | 438 | 611 |
| | | పట్టణ | 312 | 155 | 157 | 120 | 42 | 78 |
| 3) | విశాఖపట్టణం | మొత్తం | 2774 | 1406 | 1368 | 1511 | 617 | 894 |
| | | గ్రామీణ | 1649 | 827 | 822 | 1178 | 499 | 679 |
| | | పట్టణ | 1125 | 579 | 546 | 333 | 118 | 215 |
| 4) | తూర్పుగోదావరి | మొత్తం | 3801 | 1902 | 1899 | 1947 | 850 | 1097 |
| | | గ్రామీణ | 2877 | 1440 | 1437 | 1628 | 724 | 904 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | పట్టణ | 924 | 462 | 462 | 319 | 126 | 193 |
| 5) | పశ్చిమ గోదావరి | మొత్తం | 2967 | 1486 | 1481 | 1383 | 598 | 785 |
| | | గ్రామీణ | 2339 | 1173 | 1166 | 1180 | 519 | 661 |
| | | పట్టణ | 628 | 313 | 315 | 203 | 79 | 124 |
| 6) | కృష్ణా | మొత్తం | 3133 | 1590 | 1543 | 1467 | 627 | 840 |
| | | గ్రామీణ | 1997 | 1015 | 982 | 1107 | 484 | 623 |
| | | పట్టణ | 1136 | 575 | 561 | 360 | 143 | 217 |
| 7) | గుంటూరు | మొత్తం | 3496 | 1775 | 1721 | 1875 | 771 | 1104 |
| | | గ్రామీణ | 2476 | 1259 | 1217 | 1480 | 619 | 861 |
| | | పట్టణ | 1020 | 516 | 504 | 395 | 152 | 243 |
| 8) | ప్రకాశం | మొత్తం | 2324 | 1179 | 1145 | 1387 | 552 | 835 |
| | | గ్రామీణ | 1932 | 981 | 951 | 1237 | 499 | 738 |
| | | పట్టణ | 392 | 198 | 194 | 150 | 53 | 97 |
| 9) | నెల్లూరు | మొత్తం | 2032 | 1022 | 1010 | 1061 | 425 | 636 |
| | | గ్రామీణ | 1544 | 779 | 765 | 907 | 372 | 535 |
| | | పట్టణ | 488 | 243 | 245 | 154 | 53 | 101 |
| 10) | చిత్తూరు | మొత్తం | 2781 | 1415 | 1366 | 1397 | 529 | 868 |
| | | గ్రామీణ | 2221 | 1128 | 1093 | 1237 | 474 | 763 |
| | | పట్టణ | 560 | 287 | 273 | 160 | 55 | 105 |
| 11) | కడప | మొత్తం | 1924 | 985 | 939 | 998 | 363 | 635 |
| | | గ్రామీణ | 1460 | 748 | 712 | 836 | 309 | 527 |
| | | పట్టణ | 464 | 237 | 227 | 162 | 54 | 108 |
| 12) | అనంతపురం | మొత్తం | 2645 | 1361 | 1284 | 1530 | 600 | 930 |
| | | గ్రామీణ | 2011 | 1036 | 975 | 1281 | 512 | 769 |
| | | పట్టణ | 634 | 325 | 309 | 249 | 88 | 161 |
| 13) | కర్నూలు | మొత్తం | 2418 | 1239 | 1179 | 1451 | 579 | 872 |
| | | గ్రామీణ | 1780 | 911 | 869 | 1188 | 482 | 706 |
| | | పట్టణ | 638 | 328 | 310 | 263 | 97 | 166 |
| 14) | మహబూబ్‌నగర్ | మొత్తం | 2485 | 1260 | 1225 | 1750 | 746 | 1004 |
| | | గ్రామీణ | 2201 | 1114 | 1087 | 1646 | 710 | 936 |
| | | పట్టణ | 284 | 146 | 138 | 104 | 36 | 68 |
| 15) | రంగారెడ్డి | మొత్తం | 2094 | 1082 | 1012 | 1066 | 428 | 638 |
| | | గ్రామీణ | 1087 | 557 | 530 | 739 | 305 | 434 |
| | | పట్టణ | 1007 | 525 | 482 | 327 | 123 | 204 |
| 16) | హైదరాబాద్ | మొత్తం | 2643 | 1371 | 1272 | 753 | 289 | 464 |
| | | గ్రామీణ | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| | | పట్టణ | 2643 | 1371 | 1272 | 753 | 289 | 464 |
| 17) | మెదక్ | మొత్తం | 1856 | 943 | 913 | 1254 | 517 | 737 |
| | | గ్రామీణ | 1586 | 804 | 782 | 1159 | 485 | 674 |
| | | పట్టణ | 270 | 139 | 131 | 95 | 32 | 63 |
| 18) | నిజామాబాద్ | మొత్తం | 1692 | 835 | 857 | 1114 | 440 | 674 |
| | | గ్రామీణ | 1351 | 663 | 688 | 974 | 390 | 584 |
| | | పట్టణ | 341 | 172 | 169 | 140 | 50 | 90 |
| 19) | అదిలాబాద్ | మొత్తం | 1692 | 855 | 837 | 1135 | 470 | 665 |
| | | గ్రామీణ | 1300 | 654 | 646 | 965 | 407 | 558 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | పట్టణ | 392 | 201 | 191 | 170 | 63 | 107 |
| 20) | కరీంనగర్ | మొత్తం | 2558 | 1288 | 1270 | 1607 | 634 | 973 |
| | | గ్రామీణ | 2042 | 1025 | 1015 | 1413 | 568 | 845 |
| | | పట్టణ | 516 | 263 | 253 | 194 | 66 | 128 |
| 21) | వరంగల్ | మొత్తం | 2337 | 1193 | 1144 | 1419 | 573 | 846 |
| | | గ్రామీణ | 1876 | 957 | 919 | 1276 | 529 | 747 |
| | | పట్టణ | 461 | 236 | 225 | 143 | 44 | 99 |
| 22) | ఖమ్మం | మొత్తం | 1831 | 935 | 896 | 1089 | 467 | 622 |
| | | గ్రామీణ | 1452 | 743 | 709 | 967 | 424 | 543 |
| | | పట్టణ | 379 | 192 | 187 | 122 | 43 | 79 |
| 23) | నల్గొండ | మొత్తం | 2354 | 1203 | 1151 | 1460 | 595 | 864 |
| | | గ్రామీణ | 2068 | 1054 | 1014 | 1374 | 567 | 807 |
| | | పట్టణ | 286 | 149 | 137 | 86 | 28 | 57 |

## ఆంధ్రప్రదేశ్‌లో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం:

ఆంధ్రప్రదేశ్‌లో భారత జ్ఞాన విజ్ఞాన సమితి ఆధ్వర్యంలో, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహకారంతో 1990 అక్టోబరు 2 నుండి నవంబరు 7 వరకు అన్ని జిల్లాల్లోను అక్షర కళాయాత్రల ద్వారా సామాన్య ప్రజలకి అర్థమయ్యే రీతిలో సాంస్కృతిక ప్రదర్శనలు నిర్వహించారు. పల్లెసుద్దులు, వీధినాటకాలు, జానపదరూపాలు, సంగీతరూపకాలు, పాటల్లాంటి కళారూపాల ద్వారా వేలాది ప్రదర్శనలు ఇచ్చారు. 8 లక్షల మంది నేరుగా ఈ ప్రదర్శనలు తిలకించగలిగారు. ఈ కళా ప్రదర్శనలు విద్యావంతుల్లో స్వచ్ఛందంగా చదువు నేర్పాలనే కుతూహలాన్ని, నిరక్షరాస్యుల్లో చదువు నేర్చుకోవాలనే తపనను కలిగించాయి.

తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముందుకు వచ్చి చిత్తూరు, పశ్చిమ గోదావరి, హైదరాబాద్ జిల్లాల్లో సంపూర్ణ అక్షరాస్యత కార్యక్రమానికి జాతీయ అక్షరాస్యతా మిషన్ సహకారంతో నిర్వహించడానికి పూనుకొంది. అక్షరాస్యత కార్యక్రమాన్ని చేపట్టే జిల్లాల్లో జిల్లా సాక్షరతా సమితి అనే పేరుతో స్వచ్ఛంద సంస్థను ఏర్పాటు చేసి, అందులో అన్ని రాజకీయ పార్టీల ప్రతినిధుల్ని, ప్రజా ప్రతినిధుల్ని, జిల్లా అధికారుల్ని, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధుల్ని, భాగస్వాముల్ని చేసి, అక్షరాస్యతా ఉద్యమాన్ని చేపట్టారు. ఈ జిల్లా సాక్షరతా సమితి నాయకత్వంలో అక్షర కళాయాత్రలు, పాదయాత్రలు, ర్యాలీలు, సదస్సులు, బహిరంగ సభలు, గోడ రాతలు, వాల్ పోస్టర్లు, కరపత్రాలు, బ్యానర్లు, స్టిక్కర్లు మొదలైన వాటి ద్వారా అక్షర వాతావరణాన్ని కల్పించడం, ఇల్లిల్లూ తిరిగి సర్వేలు నిర్వహించి నిరక్షరాస్యుల్ని గుర్తించడం, చదువు నేర్పే స్వచ్ఛంద కార్యకర్తల్ని గుర్తించడం; గ్రామ, మండల, జిల్లా స్థాయిల్లో సాక్షరతా కమిటీలను ఏర్పాటు చేయడం; వాలంటీర్లను అభ్యాసకుల్ని జతపరచడం; అక్షర కేంద్రాల్ని ప్రారంభించడం; నిరక్షరాస్యులకి కావలసిన అభ్యసన సామగ్రి (వాచకాలు, పలకలు, నోటు పుస్తకాలు, పెన్సిళ్లు, రబ్బర్లు, బలపాలు) సమకూర్చడం; బోధకులకు, బోధనా సామగ్రి అందించడం; అక్షర కేంద్రాల్ని సందర్శించి వాలంటీర్లని, అభ్యాసకుల్ని ఉత్తేజపరచడం తదితర కార్యక్రమాలు పెద్ద ఎత్తున ప్రజల భాగస్వామ్యంతో రాష్ట్రంలోని 20 జిల్లాల్లో జరిగాయి, ఇంకా జరుగుతున్నాయి.

ఈ పథకానికయ్యే వ్యయంలో 2/3 వ వంతు కేంద్ర ప్రభుత్వం, 1/3 వ వంతు రాష్ట్ర ప్రభుత్వం భరిస్తాయి. ప్రతి జిల్లాలో వేల సంఖ్యలో చదువుకున్న, సామాజిక స్ఫూర్తిగల వాలంటీర్లు అంకిత భావంతో ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు, పాల్గొంటున్నారు.

## అక్షరాస్యతానంతర ఉద్యమం:

మన రాష్ట్రంలో చిత్తూరు, కడప, నెల్లూరు, విశాఖపట్టణం, నిజామాబాద్, పశ్చిమ గోదావరి, కరీంనగర్, నల్గొండ, శ్రీకాకుళం జిల్లాల్లో సంపూర్ణ అక్షరాస్యత ఉద్యమం మొదటి దశ పూర్తయింది. 37 లక్షల మందిని అక్షరాస్యులుగా ప్రకటించి, అక్షరాస్యతానంతర కార్యక్రమాలు చేపట్టారు. ఇందులో భాగంగా నూతన అక్షరాస్యులు తాము నేర్చుకున్న చదువును కొనసాగించడానికి వీలుగా 20–30 మంది నూతన అక్షరాస్యుల్ని ఒకటిచేసి వారికి జన చైతన్య కేంద్రాలు ఏర్పాటు చేసి, దినపత్రికలు, నూతన అక్షరాస్యుల పక్షపత్రిక, చిన్న చిన్న పుస్తకాలు అందించడం జరుగుతోంది. దీంతోబాటు అనేక జిల్లాల్లో లక్షలాది మొక్కలు నాటారు. వ్యాధి నిరోధక టీకాలు వేయించారు. మెడికల్ క్యాంపులు నిర్వహించారు. ప్రభుత్వ పాఠశాలలు బాగు చేయించడం,

రోడ్లు వేయడం తదితర సేవా కార్యక్రమాలు సైతం స్వచ్ఛంద కార్యకర్తలు చేపట్టారు.

దాదాపు 200 గ్రామాల్లో ప్రజలు ముందుకు వచ్చి ప్రజా గ్రంథాలయాలు ఏర్పాటు చేశారు. ఇల్లిల్లూ తిరిగి పాత పుస్తకాలు సేకరించారు. కొందరు పెద్దల్ని అడిగి దిన, వార, పక్ష, మాస పత్రికలు తెప్పిస్తున్నారు. ఆయా గ్రామాల్లో ఉన్న ప్రభుత్వ భవనాల్లో ప్రజా గ్రంథాలయాలు నెలకొల్పి, చురుకైన స్వచ్ఛంద కార్యకర్తల ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నారు.

**సాధించిన ఫలితాలు:** ప్రస్తుతం హైదరాబాద్, కర్నూలు, మహబూబ్‌నగర్, ఖమ్మం, మెదక్, వరంగల్, రంగారెడ్డి, విజయనగరం, ప్రకాశం, తూర్పుగోదావరి, ఆదిలాబాద్ జిల్లాల్లో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం నడుస్తోంది. ఈ ఉద్యమంలో 1993 సెప్టెంబరు నాటికి ఒక సర్వే ద్వారా రాష్ట్రంలో తొంభై ఒక్క లక్షల ముప్పై మూడు వేల అయిదు వందల పదకొండు మంది నిరక్షరాస్యుల్ని గుర్తించగా, వారిలో డెబ్బై రెండు లక్షల ఎనభై ఆరువేల నూట అరవై ఏడు మంది మొదట అక్షర కేంద్రాలకు హాజరయ్యారు. వీరిలో 34,75,639 మంది 3 వాచకాలు పూర్తిచేసి సంపూర్ణ అక్షరాస్యులుగా ప్రకటించబడ్డారు. ఈ క్రింది పట్టిక ద్వారా వివిధ జిల్లాల పరిస్థితి విశదమవుతుంది:

| | జిల్లా పేరు | నిరక్షరాస్యులు (లక్షలలో) | కేటాయించిన మొత్తము (కోట్లలో) | సాధించిన ప్రగతి (లక్షలలో) |
|---|---|---|---|---|
| 1. | చిత్తూరు | 6.07 | 6.11 | 5.12 |
| 2. | కడప | 6.47 | 4.87 | 3.21 |
| 3. | హైదరాబాదు | 4.30 | 3.66 | 1.37 |
| 4. | నెల్లూరు | 4.77 | 3.94 | 1.78 |
| 5. | విశాఖపట్టణం | 6.68 | 3.80 | 1.66 |
| 6. | కర్నూలు | 5.89 | 4.00 | 2.54 |
| 7. | మహబూబ్‌నగర్ (6 మండలాలు, 2 మున్సిపాల్టీలు) | 0.75 | 0.57 | 0.16 |
| 8. | ఖమ్మం | 5.96 | 3.41 | 0.27 |
| 9. | నిజామాబాద్ | 4.50 | 2.22 | 2.70 |
| 10. | పశ్చిమగోదావరి | 7.31 | 3.59 | 5.06 |
| 11. | కరీంనగర్ | 7.09 | 4.95 | 5.22 |
| 12. | నల్గొండ | 7.81 | 4.20 | 2.03 |
| 13. | మెదక్ | 8.43 | 4.83 | అక్షరాస్యతదశ |
| 14. | వరంగల్ | 7.00 | 4.30 | " |
| 15. | శ్రీకాకుళం | 6.54 | 5.24 | 3.27 |
| 16. | రంగారెడ్డి | 2.25 | 1.46 | అక్షరాస్యతదశ |
| 17. | విజయనగరం | 5.50 | 3.57 | " |
| 18. | అదిలాబాద్ | 5.50 | 4.49 | " |
| 19. | తూర్పుగోదావరి | 8 | 5.59 | అక్షరాస్యతదశ |
| 20. | ప్రకాశం | 6.50 | 4.10 | " |
| 21. | 9 మండలాలు (భారత జ్ఞాన విజ్ఞాన సమితి పేరుపై వివిధ జిల్లాలలో) | 1.76 | 1.44 | 0.35 |
| 22. | కృష్ణా | 5.00 | 3.90 | – |

గణాంక వివరాల నటుంచి సాంఘికంగా సాక్షరతా ఉద్యమం ఏమి సాధించిందనే వైపు చూస్తే మంచిది. దాదాపు గడ్డ కట్టుకున్న ఒక చీకటి ప్రపంచంలో వెతుకులాటగా ఈ ఉద్యమం ప్రారంభమైంది. సాంఘికంగా మన దేశ గ్రామ సీమల్లోని పరిస్థితులు ఎంత సంక్లిష్టమైనవనే సంగతి మనకు తెలుసు. అలాగే చదువుకొన్న వారిలో నిరాశా నిస్పృహలే తప్ప ఉత్సాహం, ఉత్తేజం కొరవడిన పరిస్థితి వుంది. దీనికి తోడు ఇప్పటిదాకా బడుగువర్గాల కోసం చేపట్టిన అన్ని పథకాలు అంతంత మాత్రంగానే విజయవంతమైన నేపథ్యం మనకుంది. ఈ పరిస్థితుల్లో ఏం చేయగలిగామన్న దానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది.

## అక్షరాస్యతా ఉద్యమం ఏమి సాధించింది?

1) చదువు అవసరాన్ని మన దేశ ప్రజలందరికీ అర్థమయ్యే రీతిలో తెలియచెప్పగలిగింది. 1990 అక్టోబరులో జరిగిన అక్షర కళాయాత్రలో మన రాష్ట్రంలోనే 8 లక్షలమంది ప్రత్యక్షంగా పాల్గొన్నారు. కళాప్రదర్శనలు, రేడియో – టి.వి. సాధనాలు, ఇంటింటా ప్రచారాలు, ర్యాలీలు, అడ్వర్ టైజ్ మెంట్లు, పోస్టర్లు, కరపత్రాలు తదితర సాధనాల ద్వారా విస్తృత ప్రచారం జరిగింది.

   మన అధోజగత్సహోదరులు "మేము చదువుకొంటాం, మేమూ చదువుకోగలం" అనే ఆసక్తితో ఆత్మ విశ్వాసాన్ని ప్రదర్శించేలా చేయగల్గడమే ఇది సాధించిన మొదటి విజయం.

2) లక్షలాది స్వచ్ఛంద కార్యకర్తలను, వేలాది రిసోర్స్ పర్సన్స్‌ను, కళాకారులను తయారు చేయగలిగాం. ఏలాంటి ఆర్థిక ప్రతిఫలం ఆశించకుండా ఒక సాంఘిక సమస్యపై ఇంత మందిని భాగస్వాముల్ని చేయడం స్వాతంత్ర్యానంతరం ఇదే మొదటిసారి.

3) స్వాతంత్ర్యానంతరం మొదటిసారిగా పెద్ద ఎత్తున ప్రజల్ని, రాజకీయ పార్టీల్ని, ప్రభుత్వ యంత్రాంగాన్ని, ప్రజాప్రతినిధుల్ని అందర్ని కదిలించి ఇందులో భాగస్వాములు చేయగలిగింది. అంటే, తన గురించి కాకుండా సమాజాన్ని గురించి ఆలోచించే అంకిత భావంతో పని చేయగల లక్షలాది గాంధీజీలని అందించింది.

4) కోట్లాది మంది మొదటిసారిగా పలకా, బలపం పట్టారు. పుస్తకాలు పట్టుకొన్నారు. వీరిలో లక్షలాది మంది నూతన అక్షరాస్యులయ్యారు. మిగిలిన వారు పాక్షిక అక్షరాస్యులుగా రూపొందారు.

5) ప్రతి గ్రామంలో 20 నుంచి 50 మంది వరకూ స్వచ్ఛంద కార్యకర్తలు ఆవిర్భవించారు. వీళ్ళు భవిష్యత్తులో గ్రామీణ అభివృద్ధి కార్యక్రమంలో భాగస్వాములు కాగల అవకాశం ఏర్పడింది. గ్రామ సీమల్లో ఒక నూతన సంస్కృతికి ఇలా పునాది పడింది.

6) మట్టిలో మాణిక్యాలు జన్మించారు. చదువు అవసరాన్ని తెలియచేసే వేలాది రచనలు, గేయాలు, పాటలు, నాటకాలు, జానపద రూపాలు రూపొందాయి. వేలాది మంది రచయితలు, కళాకారులు ముందుకు వచ్చారు. ఇది సరికొత్త సాంస్కృతిక వికాసానికి దోహదపడింది.

7) గతంలో చదువులేని, నిరక్షరాస్యులైన తల్లిదండ్రులు నేడు అక్షర కేంద్రాలకి హాజరవడం ద్వారా చదువు ప్రాముఖ్యతను గుర్తించారు. తమ పిల్లల్ని బడికి పంపడం ప్రారంభించారు. తద్వారా ప్రాథమిక పాఠశాలల్లో పిల్లల హాజరు శాతం గణనీయంగా పెరిగింది. మధ్యలో బడి మానివేయడం కొంతమేరకు తగ్గింది.

8) ప్రాథమిక పాఠశాలల పనితీరులో మార్పు వచ్చింది. బడిని గురించి తల్లిదండ్రులు పట్టించుకోవడం మొదలైంది. ప్రశ్నించడం ప్రారంభమైంది.

9) చైతన్యవంతమైన నూతన అక్షరాస్యులు ప్రభుత్వ అధికారుల్ని ప్రశ్నించడం, వివిధ ప్రభుత్వ పథకాల గురించి తెలుసుకోవడం ప్రారంభమైంది. అధికార్లు కూడా జనానికి చేరువయ్యారు.

10) సమాజంమీద నిరాశ నిస్పృహలతో ఉన్న అనేక మంది ఆదర్శవంతమైన ఉపాధ్యాయులు, అధికారులు, ప్రభుత్వోద్యోగులు ఒక బృహత్తర కార్యక్రమంలో భాగస్వాములవడానికి అవకాశం కలిగింది. పేద ప్రజానీకంతో ఏకమై పనిచేసే వీలు ఏర్పడింది. ప్రజల సమస్యల్ని మరింతగా అవగాహన చేసుకునేందుకు వీలయింది.

11) వాలంటీర్లు, అభ్యాసకుల్లో 75 శాతం మహిళలు ముందుకు వచ్చారు. వీరిలో కూడా అధిక సంఖ్యలో హరిజన, గిరిజన, వెనుకబడిన వర్గాల్లో ఎక్కువగా ముందుకు వచ్చారు. తత్ఫలితంగా పేద వర్గాల్లో ఒక కొత్త కదలిక ప్రారంభమైంది.

12) కుల, మత, ప్రాంతీయ, భాషాభేదాలకు అతీతంగా ప్రజలందర్నీ ఒక బృహత్తర కార్యక్రమంలో కనీసం ఒక సంవత్సరం పాటు భాగస్వాముల్ని చెయ్యడం ఇదే ప్రథమం.

## సాంఘికోద్యమాలకు శ్రీకారం:

సహజంగానే ఈ సరికొత్త వాతావరణం సమాజపు పొరల్లో కదలిక తెచ్చింది. ప్రతీ గ్రామానా వందలాది మంది పదేసి మంది వంతున ఒకచోట చేరడం, చేరి – నెలల తరబడి ఏదో ఒకటి నేర్చుకొంటూ చర్చించుకోవడం, వారికి ఒక కార్యకర్త ఆలంబనంగా దొరకడం అనే ప్రక్రియకు ఎంతో బలముంది. ఒక సమస్య పరిస్థితుల్లో జనం మధ్య నలిగితే ఒక ఉద్యమం రూపం తీసుకొనడం అత్యంత సహజం. సారా వ్యతిరేకోద్యమం ఇలా వచ్చిందే!

అలాగే పుదుక్కోట్టై జిల్లాలో వచ్చిన క్వారీ కార్మిక మహిళల ఉద్యమం, సుమారు 70 వేల మంది మహిళలు సైకిళ్ళు తొక్కడం నేర్చుకొని, జీవితాన్ని మరింత "వేగవంతం" చేసుకోవడమూ ఇలాంటివే.

ఇప్పుడిప్పుడే గ్రంథాలయోద్యమం ప్రారంభమవుతోంది. ఏ ప్రభుత్వ సహకారం లేకుండా చదువు నేర్పిన కార్యకర్తలే గ్రూపులుగా తయారై ఇల్లిల్లూ తిరిగి పుస్తకాలు సేకరించి ఊరి ప్రజల సహకారంతో గ్రంథాలయాలు నెలకొల్పడం ఒక ఉద్యమ రూపంలో మొదలవుతోంది. ఇప్పటికే 200 గ్రంథాలయాలు ఇలా వెలిశాయి.

## అవరోధాలూ, అప్రశుతులూ:

ఇలాంటి అనేక ప్రయోజనాలను సాధించిన ఉద్యమం ప్రారంభంలో ఆశించిన 100 శాతం అక్షరాస్యతని సాధించ లేకపోవడానికి అనేక కారణాలున్నాయి.

1) ప్రతీ 10 మంది అభ్యాసకులకి ఒక స్వచ్ఛంద కార్యకర్త కావాలని భావించాము. అయితే, పదవ తరగతి పాసైన వాలంటీరు ఒక్కరుకూడా లేని ప్రాంతాలు కొన్ని ఉన్నాయి. మరికొన్ని ప్రాంతాల్లో 6,7,8,9 తరగతులు చదువుతున్న, చదువు మానేసిన బాలబాలికలే అధిక సంఖ్యలో ఉపాధ్యాయులుగా మారారు. ఆ గ్రామాల్లోనే ఉన్న డిగ్రీ, పోస్టు గ్రాడ్యుయేట్ విద్యార్థులు ఈ కార్యక్రమంలో భాగస్వాములు కాలేదు. ఒక గ్రామంలో వెయ్యిమంది నిరక్షరాస్యులుంటే వంద మంది స్వచ్ఛంద కార్యకర్తలు అవసరం. అభ్యాసకులకి ఆసక్తిదాయకంగా, సృజనాత్మకంగా చదువు నేర్పగలిగినవారు వందమంది దొరకలేదు. ఇలా తగినంత మంది కార్యకర్తలు దొరక్కపోవడానికి – వాళ్లను కదిలించవలసిన తీరులో కదిలించక పోవడం ముఖ్యకారణం. ఉద్యమ స్వభావం కార్యక్రమానికి లేకపోతే కార్యకర్తలు ముందుకు రారు. రెండో కారణం – కొన్నిచోట్ల అసలు చదువుకొన్నవారే లేకపోవడం.

2) సహాయ సహకారాలు లభిస్తాయని భావించిన రాజకీయ పార్టీల నుండి ఆశించిన సహాయం లభించలేదు. గ్రామాల్లోని రాజకీయ పార్టీలు ఆశించిన సాయం అందించలేదు. గ్రామాల్లోని కొందరు రాజకీయ ప్రతినిధులు మాత్రం కొద్దిమేరకు సహకారం అందించారు. మండల, జిల్లా, రాష్ట్రస్థాయి నాయకులు, ప్రజా ప్రతినిధులు ఈ కార్యక్రమంలో పాల్గొనలేదు. అప్పుడప్పుడు ఉపన్యాసాలివ్వడం మినహా దీన్నొక రాజకీయ కర్తవ్యంగా ఏ పార్టీ గుర్తించలేదు. గ్రామ గ్రామానా కార్యకర్తలు కలిగి జనానికి చెప్పి నడిపించగల రాజకీయశక్తులు కరువయ్యాయి.

3) స్వచ్ఛంద కార్యక్రమంగా, ప్రజా ఉద్యమంగా జరగాలనే ఉద్దేశంతో జాతీయ అక్షరాస్యతా మిషన్ ప్రతి జిల్లాలోనూ జిల్లా సాక్షరతా సమితులను ప్రభుత్వ యంత్రాంగంతో పాటు స్వచ్ఛంద సంస్థల్ని, వివిధ సంఘసేవకుల్ని, రాజకీయ పార్టీ ప్రతినిధులని కలిపి ఏర్పాటు చేయాలని భావించింది. ఈ ఆశయానికి భిన్నంగా అత్యధిక జిల్లాల్లో జిల్లా కలెక్టరు అధ్యక్షతన, ఆయన కింద పనిచేసే ఇతర జిల్లా అధికారులతో మాత్రమే జిల్లా సాక్షరతా సమితులు ఆవిర్భవించాయి. తత్ఫలితంగా ఏక వ్యక్తి నిర్ణయాలు అయ్యాయి. కలెక్టరు చెప్పిందే వేదవాక్కు అయింది. జిల్లా కలెక్టరుకు సరయిన అవగాహన లేనిచోట మొత్తం ఉద్యమం దెబ్బతింది. మంచి అవగాహన ఉన్న జిల్లా కలెక్టరు బదిలీ అయిన చోట్ల కూడా ఉద్యమం దెబ్బతింది.

ప్రభుత్వ యంత్రాగం స్వచ్ఛందతతో పనిచేసి, స్వచ్ఛంద సంస్థలు దానికితోడై, రెండూ సమపాళ్ళతో సమన్వయంతో పనిచేసిన చోట సత్ఫలితాలు వచ్చాయి. జిల్లా మండల, గ్రామస్థాయిల్లో టీములు ఏర్పడి ఐక్యంగా కృషి చేసిన ప్రాంతాల్లో కూడా సత్ఫలితాలు వచ్చాయి. బ్యూరోక్రటిక్‌గా, ప్రభుత్వ పథకంగా చేసిన చోట ఫలితాలు రాలేదు.

4) పూర్తికాలపు కార్యకర్తలు, రిసోర్స్‌పర్సన్స్, గ్రామ కోఆర్డినేటర్ల ఎంపిక సక్రమంగా జరగకపోవడం, వారి పనివిధానాన్ని సమీక్షించుకోలేకపోవడం మరో కారణం. వీరందరూ ఎక్కడైతే చురుకుగా, సృజనాత్మకంగా ఎక్కువ కాలాన్ని కేటాయించి పనిచేశారో అక్కడ సత్ఫలితాలు వచ్చాయి

5) బోధనాసామగ్రిని సరైన సమయంలో శాస్త్రీయ దృక్పథంలో రూపొందించి పంపిణీ చేయలేకపోవడం ఇంకో కారణం. కొన్ని జిల్లాల్లో మొదటి వాచకం, పలకలు – బోధన ప్రారంభమైన కొన్ని నెలలకు వచ్చాయి. తరువాత కూడా రెండు, మూడు వాచకాలు స పంపిణీ చేయలేకపోవడం జరిగింది.

6) బోధనాంశాలపై శిక్షణ సక్రమంగా ఇవ్వలేకపోవడం – గ్రామస్థాయి దాకా లక్షలాది కార్యకర్తలకి శిక్షణ ఇవ్వడం చాలా క్లిష్టమైన పని. వారి స్థాయికి తగ్గి చెప్పడం మరింత క్లిష్టమైన పని. ఈ శిక్షణ ఆర్గనైజ్ చేయడంలోనూ, అర్థవంతంగా అందించడంలోనూ చాలా చోట్ల వైఫల్యం చెందడంజరిగింది.

7) పట్టణ ప్రాంతాల్లో సాంఘిక జీవనం తగ్గిపోయింది. తత్ఫలితంగా తోటివారికి సాయం చేయాలనే దృక్పథం కరువైపోయింది. పనివత్తిడి, విరామసమయం లేకపోవడం, నిరక్షరాస్యులున్న ప్రాంతానికి స్వచ్ఛంద కార్యకర్తలున్న ప్రాంతం చాలా దూరంగా ఉండటం – ఇలాంటి అనేక సమస్యల ఫలితంగా పట్టణ ప్రాంతాల్లో అక్షరాస్యతా ఉద్యమం బాగా దెబ్బతింది. పట్టణ ప్రభావం ఉన్న ప్రాంతాల్లో కూడా కార్యక్రమం అమలు కాలేదు. విద్యావంతులు ఎక్కువగా ఉన్న, వెనుకబడిన ప్రాంతాల్లో బాగా అమలు జరిగింది.

8) అగ్రకులాలు ఎక్కువగా ఉన్న ప్రాంతాల్లో అక్షర కేంద్రాలు అవసరమైన మేరకు నిర్వహించబడలేదు. హరిజన, గిరిజన, వెనుకబడిన వర్గాలవారున్న ప్రాంతాల్లోనే ఎక్కువ సంఖ్యలో అక్షర కేంద్రాలు ప్రారంభమయ్యాయి.

ఈ ప్రాంతాల్లో, నైపుణ్యంగల కార్యకర్తలు ఎక్కువగా లభించినచోట ఎక్కువ ఫలితాలు వచ్చాయి. నైపుణ్యం లేని కార్యకర్తలున్నచోట మొదటి నెలలోనే ఎక్కువ కేంద్రాలు మూతపడ్డాయి.

9) పురుషుల కేంద్రాల కన్నా స్త్రీల కేంద్రాలు బాగా నడిచాయి. పురుషులు స్త్రీలతో కలిసి చదవడానికి సిగ్గుగా భావించడం, త్రాగుడు, ఇతర వ్యసనాలు కలిగి ఉండటం, ఇతర వ్యాపకాలు ఎక్కువగా ఉండటం – తదితర కారణాలవల్ల పురుషుల కన్నా స్త్రీలే అధిక సంఖ్యలో అక్షర కేంద్రాలకు తరలి వచ్చారు.

10) సాంఘికంగా రాజకీయంగా, సాంస్కృతికంగా వేలాది సంవత్సరాలుగా ఎవరైతే అణచివేతకి గురయ్యారో, వెనుకబడిపోయారో వాళ్లే ప్రస్తుతం ఈ కార్యక్రమంలో ఎక్కువ సంఖ్యలో పాల్గొంటున్నారు. అయితే, వీళ్లనుండి నైపుణ్యంగల స్వచ్ఛంద కార్యకర్తలు అధిక సంఖ్యలో లభించకపోవడంతో అవసరమైన మేరకు అక్షర కేంద్రాలు ప్రారంభం కాలేదు. అలాగే 35 సంవత్సరముల పైబడినవారు కేంద్రాలకు రాలేదు.

11) స్వచ్ఛందంగా జరిగే ఈ కార్యక్రమంలో క్రింది స్థాయిలో పర్యవేక్షణ, రిపోర్టులు ఇవ్వడం – ఆచరణలో - ఆశించిన మేరకు జరగడం లేదు.

12) సంపూర్ణ అక్షరాస్యతా కార్యక్రమం అనే బదులు మాస్ లిటరసీ ప్రోగ్రాం అని దీన్ని పిలవడం మంచిది. కొన్ని ప్రాంతాల్లో తప్ప మరెక్కడా సంపూర్ణ అక్షరాస్యత (100 శాతం) సాధించడం లేదు. పైగా, అనేక జిల్లాల్లో క్రింది ఉద్యోగులు తప్పుడు రిపోర్టులు అందించడం ద్వారా వాస్తవంగా జరిగిన దానికన్నా ఎక్కువగా జరిగినట్లు ప్రకటించడం జరిగింది. ఒక అంచనా ప్రకారం 50 శాతానికి మించి అక్షరాస్యత సాధించినట్లుగా ప్రకటించిన జిల్లాల వివరాల్లో వాస్తవికతను పరిశీలించవలసివుంది.

13) అనేక జిల్లాల్లో సంపూర్ణ అక్షరాస్యతా కార్యక్రమం మొదటి దశ, రెండవ దశల మధ్య వ్యవధి ఎక్కువగా ఉండటం వల్ల, కొంత నష్టం జరిగింది.

14) జిల్లా వ్యాప్తంగా అక్షరాస్యతా కార్యక్రమం చేపట్టకుండా కొద్ది మండలాలకే పరిమితమైన జిల్లాల్లో ఆశించిన ఫలితాలు రాలేదు.

15) సారా వ్యతిరేకోద్యమం తర్వాత బ్యూరోక్రటిక్ ధోరణి బాగా పెరిగింది. లిటరసీ వల్ల వచ్చిన ప్రయోజనంగా కాక తమ ప్రయోజనాలకు ప్రమాదకరంగా పరిణమిస్తున్న చైతన్యంగా కొందరు దీన్ని గుర్తించడమే ఇందుకు కారణం.

16) ఒక దశ దాటిన తర్వాత స్వచ్ఛందంగా పనిచేసిన లక్షలాది కార్యకర్తలతో గ్రామస్థాయిలో ఒక 'నిర్మాణం' అవసరం. చురుకైన వారిని గుర్తించి కమిటీలుగా చేసి – వారికి మొత్తం బాధ్యత అప్పగించాల్సిన పరిణామక్రమాన్ని పట్టించుకోలేదు. ప్రజలు తమ చేతుల్లోకి బాధ్యత, అధికారం తీసుకోవడానికి సిద్ధమే. కానీ ఇవ్వడం అంత సులభం కాదుగదా?

17) ఇక చివరగా చదువుకున్న వారి చదువు నిలబెట్టేందుకు ఏం చేశారన్నది ప్రశ్న. ప్రపంచ వ్యాప్తంగా కూడా ఇది చాలా చేదు అనుభవం.

ఒక వ్యూహ రచన, సంకల్పశుద్ధి, నిర్మాణం, యంత్రాంగం, ఏర్పాట్లు సంగతి అలా ఉంచితే, కనీసం నూతనాక్షరాస్యుల కవసరమైన సాహిత్యాన్ని శాస్త్రీయంగా, ఆచరణాత్మకంగా తయారుచేసి, సకాలంలో అందించడంలో వైఫల్యం కనిపించింది.

సాక్షరతా ఉద్యమం అపురూపమైన అనుభవాల్నే గాదు. గుణపాఠాల్ని కూడా మన కందించింది. అందులో ముఖ్యమైంది – మన అధోజగత్సహోదరుల్లో చదువుపట్ల, తమ అభివృద్ధి పట్లగల తపన ఎంత గాఢమైందో తెలుసుకొనే అవకాశం కల్గడం. రెండోది – మన గ్రామసీమల్లో స్వచ్ఛందంగా ముందుకొచ్చే యువతీ యువకులు ఎంతటి అద్భుతాలు సృష్టించగలరో మన కళ్లముందు కన్పించడం. మూడోది – ఒక నూతన సాంస్కృతిక విప్లవానికి సమాజం ఎంత పరిపక్వమై ఉందో తెలిసిరావడం.

అయితే, ఈ వాతావరణాన్ని గుర్తించి, ఈ శక్తుల్ని పట్టుకొని ఒక నూతన సాక్షరత సమాజం 2000 సంవత్సరం నాటికి అవతరించేలా చేసేందుకు మన ముందున్న పథకమేమిటి అనేదే ప్రశ్న.

# తెలుగుజాతి - విద్య

కీ.శే. కొత్తపల్లి కేశవరావు, బి.ఏ. (ఆనర్స్)

ఏ జాతి స్థితి గతులనైనా తీర్చిదిద్దగల సాధనం విద్య. అయితే దాని లక్ష్యాలను, పద్ధతులను నిర్ణయించేది సమాజంలో ఆధిక్యతగల ప్రయోజనాలు, భావాలు. సమాజం ఏర్పరచుకొన్న జీవిత విధానాన్ని తరతరాలకు నూరిపోసి, దాని ప్రకారం ఆయా కాలాలలో సమాజ సభ్యులు తగు విజ్ఞానాన్ని, శీలాన్ని, ప్రవర్తనను అలవరచుకునేటట్లు చేయడం విద్యా విధాన కర్తవ్యం. వ్యక్తులుగా లేక పౌరులుగా వారి వైఖరులు, అలవాట్లు, నైపుణ్యాలు దాని ప్రభావానికి గురికాక తప్పదు.

## బౌద్ధానికి పూర్వం:

అతి ప్రాచీన కాలంలో భారతదేశం అంతటా వేద వేదాంగాలను ఆశ్రమాలలో, పరిషత్తుల్లో గురువులు సామాన్యంగా అగ్రవర్ణాలకు లేక ఉన్నత వంశాలకు చెందిన విద్యార్థులకు అర్థ తాత్పర్య వ్యాఖ్యాన సహితంగా వాగ్రూపంలో బోధిస్తుండేవారు. విద్యార్థులు నేర్చుకున్న దాన్ని కంఠస్థం చేసి, జ్ఞాపక శక్తికి పదును పెట్టడం జరిగేది. ఆ చదువులో ముందుకు సాగినవారు కొత్తగా విద్యారంభం చేసినవారికి పాఠాలు చెప్తుండేవారు. గురువులు శిష్యులను ప్రేమాభిమానాలతో చూడగా, శిష్యులు గురువులను దైవ సమానులుగా పరిగణించడం ఆ కాలంలో పరిపాటి. విద్యాభ్యాసం ముగిశాక విద్యార్థులు ఇచ్చే "గురుదక్షిణ" అనేక రూపాలలో ఉండేది.

## బౌద్ధయుగం:

ఆంధ్రదేశంలో విద్యా వ్యవస్థ బౌద్ధయుగంలో కొత్త రూపు రేఖలను సంతరించుకొన్నది. బౌద్ధ సంఘారామాలలో, విహారాల్లో అన్ని వర్ణాలవారు విద్యాభ్యాస అవకాశాలు పొందడం ఆ కాలపు విశేషం. శాతవాహన రాజధాని ధాన్యకటకంలో, శ్రీ పర్వతం (నాగార్జున కొండ) వద్ద, వేగి లేక వేంగిలో గల సంఘారామాలు దేశంలో అన్ని ప్రాంతాలు ఇతర దేశాలనుంచి వచ్చిన విద్యాపిపాసువులతో నిండి ఉండేవి. ధాన్యకటక సంఘారామం క్రీ॥శ॥ 1 వ శతాబ్దినుంచి, చైనా యాత్రికుడు యువాన్‌చాంగ్ 7 వ శతాబ్దిలో దాన్ని సందర్శించిన కాలం వరకూ వేలాది బౌద్ధ భిక్షువులతో, ఆరు కళాశాలలతో అలరారుతుండేదట. శ్రీ పర్వత సంఘారామానికి విశ్వవిఖ్యాత మహాయాన బౌద్ధ సిద్ధాంత కర్త, అద్వితీయ ప్రతిభాశాలి అయిన ఆర్య నాగార్జునుడు ప్రధానాచార్యుడుగా ఉండేవాడు. ఈ విద్యాపీఠంలో పెద్ద పుస్తక భాండాగారం; ఆచార్యులకు, శిష్యులకు వేర్వేరు నివాస భవనాలు, భోజనశాలలు, పఠన మందిరాలు ఉండేవని పురాతత్త్వ పరిశోధకులు తెలియజేశారు. ప్రత్యేకంగా రాజమందిరాల్లో రాకుమారులు, రాకుమార్తెలు రాజ్య – యుద్ధ తంత్రాలతో సహా అన్ని విద్యలలో, కళలలో శిక్షణ పొందుతూండేవారట. వేంగీ సంఘారామాధ్యక్షుడు సుప్రసిద్ధ మహాయాన బౌద్ధవాది అగు దిఙ్నాగాచార్యులు. పెక్కు అంతస్థులుగల సుందర హర్మ్యాలు ఆ ఆరామంలో ఉండేవట.

## హిందూయుగం:

ఆంధ్రదేశంలో బౌద్ధమత ప్రాబల్యం క్రీ.శ. 5, 6 శతాబ్దుల నాటికి క్రమంగా తగ్గి, వైదిక మతం తలయెత్త నారంభించింది. అప్పటికి పురాణేతిహాసాలు, ధర్మశాస్త్రాలు, దర్శనాలు, వేదాంగాలు, కళలు రూపుదాల్చాయి. విద్యాభ్యాస కార్యక్రమం అంతా బ్రాహ్మణాచార్యుల ఆధ్వర్యంలో సంస్కృత భాష ద్వారా కొనసాగుతూ వచ్చింది. అగ్రకులజులు వేద వేదాంతాలతో కూడిన 'అష్టాదశ విద్యలు' – గురుకులవాసం చేసి, బ్రహ్మ చర్య వ్రతాన్ని పాటిస్తూ, 12 నుంచి 48 సంవత్సరాల వయస్సు వరకూ నేరుస్తూండేవారు. ఈ వైదిక విద్యావ్యాప్తికి ఘటికా స్థానాలు, అగ్రహారాలు, దేవాలయాలు, మఠాలు మిక్కిలి ఉపయోగకరంగా ఉండేవి.

క్రమేపీ విద్యలే గాక 'చతుష్షష్టి కళలు' ఏర్పడినాయి. వాటిలో ముఖ్యమైనవి వృత్తి లేక పారిశ్రామిక విద్యలు. వీటిని బ్రాహ్మణేతరులు – ముఖ్యంగా తమ తండ్రులనుంచి గాని, నిపుణులైన ఇతరుల కర్మశాలల్లో గాని పనిచేస్తూ

నేర్చుకొనేవారు. ఒక్కొక్క కులానికి చెందిన వారు వంశ పారంపర్యంగా ఒకే వృత్తివిద్యను గడించేవారు. ప్రధానంగా గ్రామప్రాంతాల్లో కమ్మరం, వడ్రంగం, కంచరం, స్వర్ణకారం, శిల్పం అనేవి గ్రామీణ జీవిత స్వయం సమృద్ధికి తోడ్పడు తూండేవి. ఆయా వృత్తుల్లో వారికి కట్టుబాట్లతో కూడిన 'వృత్తి సంఘాలు' జీవన భృతికోసం 'భట వృత్తి మాన్యాలు' లేక 'జాతికట్టు మాన్యాలు' ఏర్పడటం సర్వసామాన్యం.

ఆంధ్రదేశంలో వైదిక మత ప్రాధాన్యం గల విద్యకు క్రీ.శ. 2 వ శతాబ్దినుంచే జైన మత విద్య పోటీగా ఉండేది. శాతవాహన చక్రవర్తుల కాలంలో మలకాపురం, జయనులపాడు, పెనుగంచిప్రోలు (కృష్ణాజిల్లా) 'జైన బస్తీలు' గా ప్రసిద్ధికెక్కాయి. తూర్పు చాళుక్య రాజులు, రాణులు అనేకులు జైనమతాన్ని ఆదరించి జినాలయాలకు దాన ధర్మాలు చేశారు. బెజవాడ, ధర్మవరం (గుంటూరు జిల్లా), రామతీర్థం (విశాఖపట్టణం), హనుమకొండ (వరంగల్), దానవులపాడు (కడప) వంటి స్థలాలు జైన మత పీఠాలు, విద్యా కేంద్రాలుగా ప్రసిద్ధికెక్కాయి. ఆయా జైన 'బస్తీల'లో 'పళ్ళీల'లో జైన మత గురువులు అసంఖ్యాక తాళపత్ర, భూర్జపత్ర మత గ్రంథాలతో కూడిన పుస్తక భాండాగారాలను నెలకొల్పుతూండేవారు.

తరువాత క్రీ.శ. 11, 12, 13 శతాబ్దాలలో ఆంధ్రదేశం శైవ మతవ్యాప్తికి ఆలవాలమైనది. శైవులలో "కాలాముఖులు" అమ్మరాజు విజయాదిత్యుని వంటి తూర్పు చాళుక్యరాజుల అలంబనలో తమ మతాన్ని, విద్యనుకూడ వ్యాప్తి చేశారు. వీరు ఆచార్యులు, విద్యా సంపన్నులై శ్రీశైలం ఇత్యాది మఠాలద్వారా తమ కార్యకలాపాలను కొనసాగిస్తూండేవారు. "పాశుపత" శైవులకు పుష్పగిరి (కడప జిల్లా), త్రిపురాంతకం (కర్నూలు జిల్లా), మందడం (గుంటూరు జిల్లా)లలో గోళకీ మఠశాఖలు ఉండేవి. మందడంలోని విశ్వేశ్వర గోళకీ మత స్థాపకునికే కాకతీయ చక్రవర్తుల ప్రాపకం లభించింది. అవేకాక ఆలంపురం, ఓరుగల్లు (తెలంగాణా) మొదలగునవి కూడా విద్యాకేంద్రాలుగా వర్ధిల్లినట్లు చారిత్రకాధారాలున్నాయి. ఈ కాలంనాటికి శైవ సంప్రదాయ భాగమగు "ఓం నమః శివాయ" అనే మంత్రంలో బౌద్ధ జైన సంప్రదాయాలకు చెందిన "సిద్ధం నమః" అనే దాన్ని చేర్చి, సర్వమత సమ్మతమగు "ఓనమాలు" తయారుచేశారు. ఇప్పటికీ సాంప్రదాయక అక్షరాభ్యాసం దానితోనే ప్రారంభం అవుతుంది.

పిమ్మట రెడ్డిరాజుల పాలన మధ్య కాలంనుంచి ఆంధ్రదేశంలో ఎక్కువగా వ్యాపించిన వైష్ణవ మతానికి రాజాదరణ లభించింది. ఆ మతానుయాయులలో ఆయుర్వేదం, జ్యోతిష్యం, సంగీతం, నాట్యం మొదలగు శాస్త్ర విద్యాపారంగతులకు అనేక అగ్రహారాలు దక్కాయి.

అయితే, వైష్ణవ మతం శ్రీకృష్ణదేవరాయలు మొదలు శ్రీరంగ దేవరాయల వరకూగల విజయనగర రాజులకాలం లోనే విజృంభించింది. రాజులేగాక సేనానులు, సామంతులు కూడ దాన్ని ఆదరించారు. వారందరి అభిమాన పాత్రులైన వైష్ణవ మతాచార్యులు, మఠాధిపతులు మత శాస్త్ర విద్యా బోధనద్వారా ఆంధ్రదేశంపై చెరగని ముద్ర వేశారని చెప్పాలి. సంస్కృత విద్యనే గాక తెలుగు సాహిత్యాన్ని కూడ బోధించి, వారు తెలుగు భాషాభివృద్ధికి కారకులయారు. తిరుపతి వారి కార్యకలాపాలకు ముఖ్యకేంద్రం వైష్ణవంతో బాటు శైవ, జైన మతాలు కూడ మఠాలద్వారా, బస్తీలద్వారా విజయనగర సామ్రాజ్యంలో విద్యావ్యాప్తికి దోహదం చేశాయి. ఆనాడు సంగీతం, నాట్యం, ఆయుర్వేదం రాజపోషణకు నోచుకున్న విద్యలలోనివి. రాకుమార్తెలు తమ మందిరాలల్లో సంగీతనృత్యాలు అభ్యసించెడివారు. ఈ కళలే గాక సాముగరిడీలను కూడా నేర్చే స్త్రీలు ముఖ్యంగా గణికలలో ఉండేవారు.

## 16-19 శతాబ్దుల మధ్య కాలం:

విజయనగర సామ్రాజ్యం వుండగా 1518 నుంచి దక్కనులోను, 1565-1687 సంవత్సరాల మధ్య ఆంధ్ర దేశంలోనూ హెచ్చుభాగం ఏలింది గోల్కొండ సుల్తానులు. వారి కాలంలో పర్షియన్, ఉర్దూ భాషలతో బాటు తెలుగు భాషకు కూడ రాజాదరణ లభించింది. ఇబ్రహీం కుతుబ్షా హిందువులకు, మహమ్మదీయులకు పాఠశాలలు ఏర్పరచి, విద్యావ్యాసంగానికి తోడ్పడ్డాడు. శిల్పం, నాట్యం గోల్కొండ సుల్తానులు ఎక్కువగా అభిమానించిన కళలు. పదకర్త క్షేత్రయ్య, కూచిపూడి భాగవతులు వారిచే సన్మానితులు.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము గోల్కొండ నవాబుల ఫర్మానాల ద్వారా ఆంధ్రదేశంలో వెంకటగిరి, కార్వేటి నగరం, కాళహస్తి, నూజివీడు, చల్లపల్లి, పెద్దాపురం, పిఠాపురం, బొబ్బిలి, విజయనగరం, జయపురం మొదలయిన సంస్థానాలు వెలిశాయి. ఈ సంస్థాన ప్రభువులు తెలుగు కవులకు, వేద శాస్త్ర పండితులకు అగ్రహారాలు, భూములు దానమిచ్చి, వార్షికాలు వసతులు ఏర్పాటు చేసి తెలుగు విద్యా సంప్రదాయాన్ని నిలబెట్టారు. తిరుపతిలో, దివిసీమలో వేదాలు, వేదాంత వేదాంగాలు నేర్చిన విద్వాంసులు అనేకమంది ఉండేవారు. ఇదే కాలంలో గ్రామీణ ప్రాంతాలలో వీధి బళ్ళు ఏర్పడినాయి. ఊరి వారు పోషించే ఉపాధ్యాయులు మగపిల్లలకు చదవనూ, వ్రాయనూ నేర్పుతుండేవారు. ఇసుక, తాటాకులు, గంటాలు, పీచు కాగితాలు, మసి, సిరా, బాతుకలాలు, పలకలు, బలపాలు వారి చదువులకు ఉపకరణాలు. భారత - భాగవతాలు, శతకాలు, పురాతన రాజ చరిత్రలు, పెద్ద బాలశిక్ష, లౌకిక వ్యవహారానికి కావలసిన ముసాయిదాలు ఆనాటి చదువులలోని అంశాలు.

"దండం", "కోదండం", "గోడకుర్చీ" ఉపాధ్యాయులు ఇచ్చే శిక్షలలో ముఖ్య స్థానాన్ని ఆక్రమిస్తుండేవి.

ఆ విధంగా బ్రిటీషు పాలన ఏర్పడక ముందు ఆంధ్ర దేశంలో సాగిన విద్యా వ్యాసంగం చాలా వరకు మతం ఆమోదించిన వర్ణాశ్రమ ధర్మాలకు, భూస్వామ్య ఆర్థిక ప్రయోజనాలకు అనుగుణమైనది. మత శాస్త్ర విద్యలు కొందరికీ, వృత్తి లేక కుల విద్యలు మిగతావారికీ అనే విభజన దాని ప్రధాన లక్షణం.

# బ్రిటీషు మహాయుగం

## 1. ఆంధ్ర ప్రాంతం:

ఈస్టిండియా కంపెనీ వ్యాపారస్తులుగా భారతదేశములో కాలిడిన బ్రిటీషువారు 1823 నాటికి ఫ్రెంచివారిని ఓడించి, నైజాం నవాబును లొంగదీసి, టిప్పుసుల్తానును గెలిచి యావదాంధ్ర దేశాన్ని తమ అధికారం క్రిందకు తెచ్చుకొని, మద్రాసు రాష్ట్రంలో చేర్చారు. కంపెనీ ఉద్యోగులలో కర్నల్ కాలిన్ మెకంజీ తెలుగుదేశ చరిత్రకు, సి.పి. బ్రౌను తెలుగు భాషా సాహిత్యాలకు మహత్తర సేవ చేశారు. సర్ థామస్ మన్రో మద్రాసు గవర్నరుగా వున్న 1822–27 సంవత్సరాల్లో రాష్ట్రంలోని ప్రతి జిల్లాకు ఒక హిందూ పాఠశాల, ఒక మహమ్మదీయ పాఠశాల ఏర్పాటయ్యాయి. కాని, అవి నేర్పిన ప్రాచ్య విద్యకు స్థానికాధికారుల ఆదరణ లభించలేదు. విదేశాల నుంచి వచ్చిన క్రైస్తవ మత ప్రచారకులు సామాన్య ప్రజలకు లౌకిక విజ్ఞాన సంసర్గం కల్గించేటందుకు ఆంధ్రప్రాంతంలో పాఠశాలలు నెలకొల్పారు. ప్రభుత్వం 1826 లో ఇచ్చిన ఆదేశం ప్రకారం గోదావరిజిల్లా కలెక్టర్‌గా ఉన్న బేయార్డ్ కాకినాడ, నరసాపురం, రాజమండ్రిలలో పాఠశాలలు స్థాపించాడు. వెల్లూరులో ఫ్రీ చర్చి మిషన్ 1840 లో ఒక పాఠశాలను, బందరులో రాబర్టు నోబుల్ 1841 లో ఒక పాఠశాలను, నరసాపూర్‌లో రాజమండ్రి సబ్ కలెక్టరుగాఉన్న జి.ఎన్. టేలర్ పూనికతో 1852 లో ఒక కేంద్ర పాఠశాలను, రాష్ట్ర ప్రభుత్వమే 1853 లో రాజమండ్రిలో ఒక పాఠశాలను స్థాపించడం జరిగింది.

తర్వాత క్రైస్తవ మత ప్రచారకుల తీవ్రకృషివలన ఈస్టిండియా కంపెనీ 1854 లో విద్యావిషయకంగా 'వుడ్స్ డిస్పాచ్' అనే ఆజ్ఞను జారీ చేసింది. దాని ప్రకారం 1855 లో అలెగ్జాండర్ అర్బుత్‌నాట్ డైరెక్టర్‌గా మద్రాసు రాష్ట్రంలో విద్యాశాఖ ఏర్పడింది. ఇది పాఠశాల విద్య సువ్యవస్థితం కావడానికి అవసరమైన చర్యలు కొన్ని తీసుకొన్నది. క్రైస్తవ మత ప్రచారకులు, ఇతర వ్యక్తులు స్థాపించిన పాఠశాలలకు ద్రవ్యసహాయం (గ్రాంట్స్–ఇన్–ఎయిడ్) ఇచ్చే పద్ధతి అమలులోకి వచ్చింది. మద్రాసు విశ్వవిద్యాలయ స్థాపన 1857 లో జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో తెలుగు, ఇంగ్లీషు భాషలలో విద్యగరపు పాఠశాల లనేకం – ముఖ్యంగా క్రైస్తవ మతప్రచారకులు ఏర్పాటు చేశారు. ఆయా పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయుల శిక్షణకు రాజమండ్రి మొదలైన స్థలాల్లో 'నార్మల్ స్కూల్స్', స్త్రీ విద్యా విస్తరణకు కొన్ని చర్యలు రూపొందాయి. తర్వాత 1882 నాటికి భారత విద్యా (విలియం హంటర్) కమిషన్ నివేదిక – వ్యక్తుల చొరవ ద్వారా విద్యాసౌకర్యాల అభివృద్ధి జరగాలని సూచించింది. కాగా 'ప్రాథమిక విద్య', 'మాధ్యమిక విద్య', 'ఉన్నత లేక కళాశాల విద్య', అనే విభజనతో విద్యా వ్యవస్థ 1920 వరకూ ఆంధ్రప్రాంతంలో ఎట్లా వృద్ధి అయిందో తెలుసుకొందాం.

ప్రాథమిక విద్యారంగంలో పాఠశాలల అభివృద్ధికి మొదటి 'ద్రవ్యసహాయ పద్ధతి' తోడ్పడనందున 1868 లో ప్రాథమిక పాఠశాలల్లో విద్యార్థుల పరీక్షా ఫలితాలనుబట్టి వాటికి ద్రవ్య సహాయం చేయాలని రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టింది. అందువలన పురపాలక సంఘాలు మొదలయిన సంస్థలద్వారా పట్టణ ప్రాంతాల్లో ఏర్పాటయినన్ని ప్రాథమిక పాఠశాలలు గ్రామ ప్రాంతాల్లో ఏర్పడలేదు. ప్రభుత్వం 1904–05 వరకూ విరివిగా డబ్బు ఖర్చుపెట్టనందున, గ్రామీణులు తమ పిల్లలను బడులకు పంపడానికి శ్రద్ధ వహించనందున రాష్ట్రంలో ప్రాథమిక విద్యావ్యాప్తి కుంటుపడింది.

విశ్వవిద్యాలయం జరిపే 'మెట్రిక్యులేషన్' పరీక్షతో అంతమయ్యే మాధ్యమిక విద్యకు 1854–1920 సంవత్సరాల మధ్యకాలంలో హెచ్చు ప్రోత్సాహం లభించింది. ఈ చదువు ద్వారా కళాశాల ప్రవేశం, ప్రభుత్వోద్యోగం, సంఘంలో గౌరవం సంపాదించవచ్చనే అభిప్రాయాలు అందుకు కారణం. మాధ్యమిక విద్యాబోధన మాతృభాషకంటే ఆంగ్లభాష ద్వారా ఎక్కువగా కొనసాగింది. లోయర్, అప్పర్, సెకండరీ స్థాయిలుగా విభజన పొందిన మాధ్యమిక విద్య, న్యాయవాద, ఉపాధ్యాయ వృత్తులలో ప్రవేశించడానికి సోపానం అయింది. ప్రాథమిక ఉపాధ్యాయ శిక్షణకు 1888 లో గోదావరి జిల్లా బోర్డు రాజమండ్రిలో ఒక నార్మల్ స్కూల్‌ను ఏర్పాటు చేయగా, దాన్ని రాష్ట్ర ప్రభుత్వం స్వాధీనం చేసుకొని, 1892 లో మాధ్యమిక స్థాయి శిక్షణ శాలగా వృద్ధిచేసింది. అంతేగాక 1902–21 సంవత్సరాలలో ప్రభుత్వం గుర్తింపు పొందని మాధ్యమిక పాఠశాలలకు స్వస్తిజరిగి, మాధ్యమిక విద్యాసంస్థలకు కట్టుదిట్టమైన షరతులు, నిబంధనలు ఏర్పాటయ్యాయి. ఉపాధ్యాయులకు జీత భత్యాలు, విద్యార్థులకు శాస్త్ర విజ్ఞానం, చేతి పనులలో శిక్షణ మొదలైన అంశాలలో కొంత అభివృద్ధి సాధించారు. మెట్రిక్యులేషన్, ఎఫ్.ఏ. పరీక్షలలో ఉత్తీర్ణులైన ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చే పాఠశాలలు (సెకండరీ ట్రైనింగ్ స్కూల్స్) కొన్ని ఏర్పడినాయి. రాష్ట్ర

ప్రభుత్వం 1910 లో మాధ్యమిక పాఠశాల విద్య అంతాన ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్ష ప్రవేశపెట్టగా, త్వరలో అది బహుళ జనామోదం పొందింది. అయితే, ఉన్నత పాఠశాలల్లోని వృత్తి విద్యాంశాలపట్ల విద్యార్థులు శ్రద్ధవహించక, ప్రభుత్వోద్యోగాల ఆశతో సాధారణ విద్యా కళాశాలలకు ఎగబడేవారు. ఇంగ్లీషు భాషాభ్యసన ప్రమాణాలు క్రమేపీ పడిపోయి, మాధ్యమిక పాఠశాలల్లో తెలుగులో విద్యాబోధన జరుగుతూండేది. పాఠ్యాంశ ప్రణాళికల్లో విద్యాశాఖ వీలును బట్టి మార్పులు చేస్తుండేది. ఆంధ్ర ప్రాంతంలో 1902-21 సంవత్సరాల మధ్య సాంఘిక, రాజకీయ చైతన్యం పెరిగి, మాధ్యమిక ఉన్నత పాఠశాలల సంఖ్య పూర్వం కంటే 4, 5 రెట్లు హెచ్చింది.

కళాశాల విద్యారంగంలో ఆదినుంచే సంపన్న వర్గాల ప్రాబల్యం ఉండేది. వారి పిల్లలతో గోదావరి, కృష్ణ, పెన్న ఆనకట్టలు కల్గించిన స్థిర అధికాదాయాలు అనుభవించే మధ్య తరగతి రైతు కుటుంబాల పిల్లలు, 19 వ శతాబ్ది 2 వ అర్ధభాగంలో పోటీకి వచ్చారు. వారి ఉన్నత విద్యావసరాలకు తగ్గట్లు 1855 లో బందరులో నోబుల్ కళాశాల, 1873 లో రాజమండ్రిలో ప్రభుత్వ కళాశాల కాక, 1878 లో విశాఖపట్నంలో మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాల, 1879 లో విజయనగరంలో మహారాజా కళాశాల, 1884లో కాకినాడలో పిఠాపురం రాజా కళాశాల, 1885లో గుంటూరులో ఆంధ్ర క్రైస్తవ కళాశాల ఏర్పడినాయి. ఇవేకాక 1894 లో ప్రభుత్వం రాజమండ్రిలో పట్టభద్ర ఉపాధ్యాయ శిక్షణ కళాశాలను స్థాపించింది. అది 1910 లో రద్దయి, 1916 లో తిరిగి బోధనా కళాశాలగా అవతరించింది. స్థానికంగా కలిగి కళాశాల విద్యావకాశాలవలన పెక్కు ఆంధ్ర విద్యార్థులలో యోచనాశక్తి, హేతుబుద్ధి, శాస్త్రవిజ్ఞానం జనించాయి. ఉన్నత విద్య వారిలో ఉద్యోగ కాంక్ష, వ్యాపార లాభకాంక్షలను పెంచింది. పిమ్మట 1902 లో ఉన్నత విద్యారంగ పరిశీలనకు ఏర్పాటయిన భారతీయ విశ్వవిద్యాలయాల (రాలీ) కమిషన్ నివేదిక ఫలితంగా భారతీయ విశ్వవిద్యాలయాల చట్టం 1904 లో అమలులోకి వచ్చింది. దాని ప్రకారం విశ్వవిద్యాలయ నిర్వాహక సంస్థలు, వాటి బాధ్యతలు, కళాశాలల స్థాపన కట్టుదిట్టమైన నిబంధనలకు లోనైనాయి. వీటిపై వచ్చిన విమర్శలను పురస్కరించుకొని ఏర్పాటయిన కలకత్తా విశ్వవిద్యాలయ (మైఖేల్ శాడ్లర్) కమిషన్ తన నివేదిక 1917 లో ఇచ్చింది. ఆ నివేదిక దేశంలో విశ్వ విద్యాలయాల సంఖ్య, వాటి బోధనా కార్యక్రమాలు వృద్ధి చెందడానికి ప్రాతిపదిక కావడం గమనార్హం.

మొత్తంమీద 1920 వరకూ ఆంధ్ర ప్రాంతం మద్రాసు రాష్ట్రంలోని మిగతా ప్రాంతాలకంటే వెనుకబడి వున్నట్లు ఆంధ్రోద్యమ నాయకులు భావించేవారు. రాష్ట్రంలోని 32,000 ప్రాథమిక పాఠశాలల్లో 14,500, 31 కళాశాలల్లో 8, 82 సాంకేతిక విద్యాలయాల్లో 12 మాత్రమే 1917 లో ఆంధ్ర ప్రాంతంలో ఉన్నట్లు అధికార సమాచారం తెలియజేసింది.

మాంటేగ్-చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల క్రింద రాష్ట్రాల్లో ద్వంద్వపాలన (డయార్కీ) 1921 లో అమలులోకి వచ్చింది. అప్పటికే 1920 నాటి మద్రాసు ప్రాథమిక విద్యా శాసనం, పురపాలక సంఘాలు కొన్ని షరతులపై నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టడానికి అనుమతించింది. తరవాత రాష్ట్ర విద్యాశాఖ నిర్వహణను చేపట్టిన రాష్ట్ర మంత్రులు ఆ శాసనాన్ని కొన్ని మార్పులతో అమలుచేస్తూ ప్రాథమిక విద్యావ్యాప్తికి "జిల్లా విద్యా సంఘాల" (డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ కౌన్సిల్స్)ను నిర్మించారు. ప్రతి గ్రామంలో ఒక ప్రాథమిక పాఠశాల ఏర్పాటు చేసి, బాలబాలికలను నిర్బంధంగా చదువుకు పంపడానికి తయారైన కార్యక్రమం 1927-37 సంవత్సరాల మధ్య వచ్చిన ఆర్థిక మాంద్యం వలన సరిగా అమలు కాలేదు. పాఠశాల విద్యకు పట్టిన దుస్థితిని పరిశీలించి దాన్ని మెరుగుపరచడానికి 1927 లో ఏర్పాటయిన "హార్టాగ్ కమిటీ" సిఫార్సులు బుట్టదాఖలు అయినాయి. పిమ్మట 1937 లో గాంధీ మహాత్ముడు ప్రతిపాదించిన మౌలిక (బేసిక్) విద్యా విధానం 1946 లో మద్రాసు రాష్ట్రంలో అమలుచేయ సంకల్పించారు. స్వావలంబన జీవితాన్ని గడపటానికి కావలసిన చేతిపనులతో సహా మాతృభాషలో 14 ఏండ్ల వయస్సువరకు పిల్లలకు ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను గరపడం ఆ విధాన ఉద్దేశ్యం. అందుకు అవసరమైన ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చే కేంద్రాలు కావూరు (గుంటూరు జిల్లా) వినయాశ్రమంలో, పెంటపాడు (పశ్చిమ గోదావరి జిల్లా)లో, పిమ్మట ఇతరచోట్ల ఏర్పాటయినాయి. శిక్షణ పొందిన ఉపాధ్యాయుల సహకారంతో అనేక ప్రాథమిక పాఠశాలలను మౌలిక పాఠశాలలుగా మార్చి, వ్యయకర్తన కోసం 1953-54 లో వాటిలో విద్యాభ్యాస పద్ధతిని, ఒకపూట బడిలో "విద్యాభ్యాసం", రెండవ పూట తల్లిదండ్రులవద్ద కులవృత్తిలో తర్ఫీదు విద్యార్థులు పొందేటట్లు సవరించారు. అయినా, దేశ స్వాతంత్ర్యం రాక పూర్వం సంఖ్యాత్మకంగా, గుణాత్మకంగా తగినంత ప్రగతిని సాధించినది ప్రాథమిక విద్యాస్థాయియే.

మాధ్యమిక విద్యారంగంలో 1921-34 సంవత్సరాల మధ్య మాధ్యమిక ఉన్నత పాఠశాలల సంఖ్య బాగా పెరిగింది. చాలా గ్రామాల్లో జిల్లా బోర్డులు, వైయక్తిక యాజమాన్యాలు వాటిని స్థాపించడం, ఆ విధంగా ఏర్పడిన పాఠశాలల్లో కొన్ని నిమ్నజాతులకు, స్త్రీలకు ప్రత్యేకించినవి కావడం ప్రశంసార్హం. ప్రభుత్వం 1925 లో 9, 10, 11 పాఠశాల తరగతుల్లో కూడ మాతృ భాషలో విద్యాబోధన

జరుగవలెనని నిర్ణయించింది. కాని, 1937 నాటికి 50 శాతం పాఠశాలలు మాత్రమే ఆ నిర్ణయాన్ని అమలు చేశాయి. పాఠశాలల సంఖ్యాభివృద్ధినిబట్టి ఆంధ్ర ప్రాంతంలో సుశిక్షితులైన ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు చాలామంది కావలసి వచ్చారు. ఉపాధ్యాయవృత్తిలోవారికి 'ప్రావిడెంటు ఫండ్ సౌకర్యాలు' 1923 లో కల్గాయి. ఈ కమిషన్ సిఫార్సుల ననుసరించి 1924 లో 'భారతీయ విద్యా సర్వీసు' స్థానే 'మద్రాసు విద్యా సర్వీసు' ఏర్పాటయి, దీనికి సంబంధించిన ఉద్యోగులను రాష్ట్ర ప్రభుత్వం నియమించుకొనగల్గింది.

ఉన్నత విద్యారంగంలో రాష్ట్ర మంత్రులు శాసన మండలిచే ప్రత్యేక చట్టం చేయించి, 1926 ఏప్రిల్‌లో బెజవాడ పరిపాలన కేంద్రంగా "ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని" ఏర్పాటు చేశారు. దాని అధికార పరిధినుంచి 1929 లో రాయలసీమ జిల్లాలను మినహాయించి, 1930 లో దాని కార్యాలయాన్ని వాల్తేరు (విశాఖపట్టణం)కు తరలించవలసి వచ్చింది. రాయలసీమ జిల్లాలలోని కళాశాలలు 1954 వరకూ మద్రాసు విశ్వ విద్యాలయానికి అనుబంధంగా ఉన్నాయి. కొత్తగా అవతరించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం పోస్టు గ్రాడ్యుయేట్ విద్యా బోధన కర్తవ్యాన్ని చేపట్టింది. దానికి అనుబంధంగా ఉన్న కాకినాడలోని పిఠాపురం రాజా కళాశాల, గుంటూరులోని ఆంధ్ర క్రైస్తవ కళాశాల డిగ్రీ కళాశాలలుగా మారినాయి. ఇంటర్మీడియట్ విద్యా బోధనకు నెల్లూరులో వెంకటగిరి రాజా కళాశాల (1920) బందరు, గుంటూరు పట్టణాల్లో హిందూ కళాశాలలు (1928-1935), విజయవాడలో శ్రీ రంగయ్యప్పారావు కళాశాల (1937), గుంటూరులో ప్రభుత్వ స్త్రీల కళాశాల (1944) లు ఏర్పడినాయి.

బ్రిటిష్ పాలనా కాలంలో కుల మత వర్గ విచక్షణ లేని విద్యావ్యవస్థ పరిమిత ప్రయోజనాలకోసం ఏర్పడింది. అది పరాయి ప్రభుత్వ అవసరాలకు, సమాజంలోని ఉన్నతవర్గ ప్రయోజనాలకు అంకితమైనది కనుకనే ప్రజాస్వామ్యానికి కావలసిన ప్రాథమిక విద్యను నిర్లక్ష్యం చేసింది. కాగా 1947 నాటికి దేశంలో అక్షరాస్యులు 18 శాతం మాత్రమే ఉన్నారు. అన్ని విద్యాస్థాయిల లోనూ దేశ పరిస్థితి కంటే ఆంధ్ర ప్రాంతస్థితి తక్కువగానే ఉండేది. దీనికి ఆంధ్రప్రాంతంలో 1951 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యుల శాతం 13.06 కావడం తగిన రుజువు.

## 2. తెలంగాణా:

తెలుగు జాతిలో ఒక భాగం 1724 నుంచి నైజాం ఉల్‌ముల్క్ పాలనక్రింద దక్కన్‌లోని 9 తెలంగాణా జిల్లాల్లో జీవించింది. నైజాం పాలనలో అధిక సంఖ్యాకులైన హిందువులు 'వీధి బడుల'లో చదువుకొంటూండేవారు. రాజమతానుయాయులైన మహ్మదీయులు పర్షియన్, ఉర్దూ భాషలను అదే విధంగా నేర్చుకొంటూండేవారు.

రాజధాని హైద్రాబాద్‌లో చర్చ్ ఆఫ్ ఇంగ్లండుకు చెందిన మత ప్రచారకుడు 1834 లో నెలకొల్పిన సెయింట్ జార్జెస్ గ్రామర్ పాఠశాల, దీని తర్వాత, 1855 లో రోమన్ కాథలిక్ నిర్వహణ క్రింద ఏర్పడిన 'ఆల్ సెయింట్స్ పాఠశాల' ఆంగ్ల విద్యా బోధన సాగిస్తుండేవి. అప్పుడే సంస్థాన సామంత ప్రముఖుడు ఫక్రుద్దీన్ ఖాన్ పర్షియన్, అరబ్బీ భాషలు కట్టుదిట్టంగా నేర్పడానికి ఒక పాఠశాల ఏర్పరచాడు. సంస్థాన ప్రభుత్వం 1854 లో దారుల్ ఉలూం (విద్యలకు నిలయం) అనే పాఠశాలను జిల్లా కేంద్రంలో, తాలూకాలో ఒక పర్షియన్ పాఠశాల, ఉర్దూ మొదలైన దేశ భాషలకు ఒక పాఠశాల స్థాపించాలని ప్రభుత్వం సంకల్పించింది. ఈ పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా పని చేయడానికి, 'దారుల్ – ఉలూం'లో శిక్షణ పొందినవారే అర్హులు. వాటిలో, హిందువులతో సహా, రాజ్య భాషలైన పర్షియన్, ఉర్దూ నేర్చుకొనేవారు హెచ్చుగా ఉండేవారు. ఆ పాఠశాలలను అజమాయిషీ చేసే కమిటీలలో రెవిన్యూ, పోలీసు ఉద్యోగుల పాత్ర హెచ్చుగా ఉండేది. హైదరాబాద్ సంస్థాన ప్రభుత్వంలో విద్యా వ్యవహారాలు 1871 లో దేశ భాషా పాఠశాలల డైరెక్టర్‌ను నియమించేవరకూ, నానావిధ వ్యవహారాలశాఖ (మిసిలేనియస్ డిపార్టుమెంట్) పర్యవేక్షణలో ఉండేవి. మొదటి బాలికల పాఠశాలగా 1871 లో 'సెయింట్ అన్స్ కాన్వెంట్'ను క్రైస్తవ మతప్రచారిణులు ఆరంభించారు.

హైదరాబాద్ నగరం, దాని పరిసరాల్లో 1872 లో 16 పాఠశాలలు, తెలుగు జిల్లాల్లో దాదాపు 75 పాఠశాలలు పని చేస్తుండేవి. ప్రత్యేకంగా విద్యాశాఖాధికారి నియామకం జరిగాక, 1875 లో జిల్లాల్లో పాఠశాలల తనిఖీకి ముగ్గురు 'ఇన్‌స్పెక్టర్లు' నియమితులైనారు. ప్రభుత్వ పాఠశాలా విద్యార్థులనుంచి 'రుసుములు' వసూలు చేయాలనే ప్రభుత్వ ఉత్తర్వు 1878 లో వచ్చింది. అంతకుముందు ఏర్పాటయిన చాదర్ఘాట్ పాఠశాల 1880 లో రెండవ తరగతి కళాశాలగా మారి, మద్రాసు విశ్వ విద్యాలయానికి అనుబంధ సంస్థ అయింది.

తర్వాత అది డిగ్రీ కళాశాల అయి, 1887 లో నిజాం కళాశాల అనే నామాంతరం పొంది, 1946 వరకూ మద్రాసు విశ్వవిద్యాలయముతో ఉన్న సంబంధాన్ని తెంచుకోలేదు. ఈ 1880 దశాబ్దిలోనే సంపన్న కుటుంబాల పిల్లలకు 'మద్రసా ఆలియా' అనే ప్రభుత్వ పాఠశాల, వారికంటే కొంచెం తక్కువమెట్టు ముస్లిం కుటుంబాల పిల్లలకు 'మద్రసా ఐజా' అనే వైయక్తిక పాఠశాలలు ఏర్పాటయినాయి. హైదరాబాదు

సంస్థానంలో 1883 వరకూ సెయింట్ జార్జెస్ గ్రామర్ పాఠశాల, అల్ సెయింట్స్ ఉన్నత పాఠశాలకి, మద్రసా ఐజా, మహబూబ్ కళాశాల (వాస్తవానికి పాఠశాల) అనే ఇంగ్లీషు భాషా బోధన చేసే వైయక్తిక సంస్థలు ఉండేవి. అక్కడక్కడ బాలికలకోసం ఆంగ్ల మాధ్యమిక పాఠశాలలు కూడ స్థాపించారు. సంస్థానంలో ప్రాథమిక పాఠశాలల సంఖ్య 90. అందలి విద్యార్థులు విద్యోచిత వయస్సు గలవారిలో 0.5 శాతం మాత్రమేనంటే ఆశ్చర్యం కలుగకమానదు.

హైదరాబాద్ సంస్థాన విద్యాశాఖ 1883లో $2\frac{1}{2}$ లక్షల రూపాయల వ్యయనిధితో ఆరంభమయింది. తర్వాత 4, 5 సంవత్సరాలలో రెండు ఉన్నత పాఠశాలలు, అనేక మాధ్యమిక పాఠశాలలు, వందలాది ప్రాథమిక పాఠశాలలు అవతరించాయి. ఈ విద్యాభివృద్ధి ప్రాతిపదికపై 1891 నుంచి ప్రభుత్వం 'మాధ్యమిక పరీక్ష' నిర్వహించసాగింది. దానిలో ఉత్తీర్ణులైన వారికి తహశీల్దారు మొదలైన పదవులు, వైద్య పాఠశాల ప్రవేశం లభిస్తుండేవి. ఒక పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘం, ఒక విద్యావిషయక బోర్డుకూడ 1891 లో ఏర్పాటయినాయి. అంతకుముందు స్థాపించిన ఉపాధ్యాయ శిక్షణ పాఠశాల అప్పుడే సక్రమంగా పనిచేసే స్థితిలోకి వచ్చింది. సంస్థానంలో 1901 నాటికి షుమారు 10 ఉన్నత పాఠశాలలు, 80 మాధ్యమిక పాఠశాలలు ఉన్నట్లు తేలింది.

మరి 2 దశాబ్దాలలో సాంకేతిక పాఠశాలలు ఇంజనీరింగ్, వైద్య, న్యాయ కళాశాలలు ఏర్పడి, విద్యాశాఖ ఆధీనంలో పనిచేస్తూ వచ్చాయి. రెండు బాలికోన్నత పాఠశాలలు 1909 లో సమర్థులైన ఉపాధ్యాయినులతో ఏర్పాటయినాయి. సంస్థాన ప్రభుత్వం ఉన్నత పాఠశాల విద్య అభివృద్ధికి 1910 లో ఎస్.ఎస్.ఎల్.సి. బోర్డును స్థాపించింది. విద్యాశాఖ సిబ్బంది అయిదుగురు ప్రధాన ఇన్‌స్పెక్టర్లు, జిల్లాలవారీగా ఇన్‌స్పెక్టర్లు, ఉప ఇన్‌స్పెక్టర్లు మొదలగువారి నియామకంతో వృద్ధి అయింది.

పిమ్మట క్రమేపీ పాఠశాలల సంఖ్య అధికమయింది. వాటిలో హెచ్చు భాగం ప్రభుత్వ యాజమాన్యంలోనివి. ప్రభుత్వ పాఠశాలల్లో ముందు ప్రాథమిక విద్య, తర్వాత మాధ్యమిక విద్య ఉచితంగా లభ్యంకాసాగాయి. వైయక్తిక పాఠశాలలకు పూర్వం పలుకుబడినిబట్టి, తర్వాత విరివిగా ప్రభుత్వం ధన సహాయం (గ్రాంట్లు) ఇస్తుండేది. నిర్బంధ ప్రారంభ విద్య 1947 అంతంనుంచి నిర్ణీత కేంద్రాలలో ప్రవేశపెట్టారు. అయినా, సంస్థాన జనాభాలో హెచ్చుగా ఉన్న హిందువుల్లో రాజాదరణలేక విద్యావ్యాప్తి సరిగా జరుగలేదు. తెలుగు నేర్వడానికి సౌకర్యాలు దాదాపు మృగ్యంగా ఉండేవి. సాధారణ మహమ్మదీయులు ఉర్దూ బోధనా భాషగా గల 'ఉస్మానియా ఉన్నత పాఠశాల'ల్లో చదువుకొని, సంస్థాన ఉద్యోగాలు హెచ్చుగా పొందుతుండేవారు. సంపన్న ముస్లిం కుటుంబాలకు చెందిన పిల్లలు ఆంగ్లం బోధనాభాషగాగల క్రైస్తవ పాఠశాలల్లో చేరుతుండేవారు. హైదరాబాద్ సంస్థానంలో విద్యాభివృద్ధి 1918 సంవత్సరంలో మీర్ ఉస్మాన్ అలీఖాన్ ఫర్మానా ద్వారా 'ఉస్మానియా విశ్వవిద్యాలయం' స్థాపనతో అత్యున్నత స్థాయికి చేరింది. రాజభాష అయిన ఉర్దూ ఈ విశ్వవిద్యాలయ బోధనాభాష అయింది. దీనికి స్వంత తాత్కాలిక భవనాలు 1937 వరకూ ఏర్పడలేదు. శాశ్వత భవనాల్లో మొదటిది 1939 లో ఆర్ట్సు కళాశాలకు దక్కింది. స్త్రీలకు కళాశాల విద్య 1924 లో నాంపల్లి (హైదరాబాదు) బాలికల ఉన్నత పాఠశాలలో ఇంటర్‌మీడియట్ తరగతుల ఏర్పాటుతో మొదలైంది. తర్వాత 1926 లో ఆ పాఠశాల స్త్రీల డిగ్రీ కళాశాల అయింది.

తెలంగాణాలో విద్యాభివృద్ధి కార్యక్రమాలు 1948 లో భారత సైన్యాలు సంస్థానంపై 'రక్షక చర్య' తీసుకొని, దాన్ని భారతదేశంలో చేర్చిన తర్వాతనే ముమ్మరంగా సాగినాయి.

# జాతీయ ప్రభుత్వ యుగం

## 1. ఆంధ్ర ప్రాంతం:

దేశానికి పరిపాలన విముక్తి జరిగాక, మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో 1953 వరకూ ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వ విధానాలు చెల్లుబడి అయినాయి. అన్ని పాఠశాలల్లోనూ చరిత్ర, భూగోళ విషయాల స్థానే సాంఘిక విజ్ఞానం బోధించుట ఆరంభమైంది. ఆంధ్ర రాష్ట్రావతరణ 1953 లో జరిగినప్పుడు ప్రాథమిక పాఠశాలల్లో 'ఒంటిపూట' విద్యాబోధన జరుగుతున్నది. 'మౌలిక విద్యా పద్ధతి' క్రింద రాష్ట్రంలో గల జూనియర్, సీనియర్ పాఠశాలల, శిక్షణ పాఠశాలల సంఖ్య 1954–56 నాటికి పెరిగింది. ప్రాథమిక విద్యా విధాన పరిశీలనకు 1954 లో రాష్ట్ర ప్రభుత్వం కుప్పుస్వామి కమిటీని ఏర్పాటు చేసింది. ఆ కమిటీ సిఫార్సులలో ప్రాథమిక విద్యాసంస్థల నిర్వహణ బాధ్యతను ప్రభుత్వమే స్వీకరించాలనేది, ప్రాథమిక తరగతుల పాఠ్య గ్రంథాలను జాతీయం చేయాలనేది ముఖ్యమైనవి. ప్రాథమిక విద్యా వ్యాప్తికి అవసరమైన పాఠశాలల స్థాపనకు ముందు చర్యగా 1956 లో రాష్ట్రవ్యాప్తంగా ఒక 'సర్వే' ఆరంభమైంది.

రాష్ట్రంలోని సెకండరీ పాఠశాలల పైతరగతులలో వృత్తి విద్యాబోధనకు ఏర్పాట్లు చేశారు. సెకండరీ విద్యారంగంలో తగు సంస్కరణలు సూచించడానికి ఏర్పాటయిన లక్ష్మణ స్వామి మొదలియార్ కమిషన్ 1952–53 దర్యాప్తుచేసి సమర్పించిన నివేదిక రాష్ట్రంలో కొన్ని సెకండరీ పాఠశాలలు 12 తరగతులతో కూడిన 'హయ్యర్ సెకండరీ పాఠశాలలు'గా, కొన్ని 'బహుళార్థ సాధక పాఠశాలలు'గా మార్చడానికి దారి చూపింది.

రాష్ట్ర ఉన్నత విద్యారంగ ప్రమాణాల పెంపుదలకు ఉపకరించగల సూచనలు 1948-49 లో డాక్టర్ యస్. రాధాకృష్ణన్ నాయకత్వాన పనిచేసిన 'విశ్వవిద్యాలయ కమిషన్' చేసింది. చట్టరీత్యా 1954 ఆగస్టులో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపన ఈ రంగంలో ఒక ముఖ్య పరిణామం. నెల్లూరు, రాయలసీమ జిల్లాలలోని కళాశాలల్ని దీనికి 1956 లో అనుబంధించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం 1953 లో రజతోత్సవం జరుపుకొని, స్వీయ కళాశాలల్లోని పోస్టు గ్రాడ్యుయేట్ విద్యాసౌకర్యాల విస్తరణ, అనుబంధ కళాశాలల సంఖ్య పెంపుదలతో ముందడుగువేస్తూ వచ్చింది.

2. తెలంగాణా:

హైదరాబాద్ సంస్థానంలోని 9 తెలంగాణా జిల్లాల్లో, 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడేవరకూ, నిరంకుశపాలన క్రమేపీ బాధ్యతాయుత ప్రజాపాలనగా మారింది. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా 1952 లో ఎన్నికల అనంతరం మంత్రివర్గం ఏర్పడి ఉన్నత, సెకండరీ, ప్రాథమిక విద్యల అభివృద్ధికి కృషి చేసింది. కాగా గ్రామప్రాంతాల్లో ప్రాథమిక పాఠశాలల సంఖ్య పెరిగి, వాటిలో పనిచేసే ఉపాధ్యాయులు ప్రాంతీయ భాషాజ్ఞానం సంపాదించవలెననే నిబంధన జారీ అయింది. పట్టణ ప్రాంతాల్లో పసివారి పాఠశాలలు (కిండర్ గార్డెన్ స్కూల్స్) వెలిశాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం 1948 లో ఇంగ్లీషును బోధనాభాషగా స్వీకరించి, 1956 లో ప్రీయూనివర్సిటీ కోర్సును ప్రారంభించి, 'రాధాకృష్ణన్ కమిషన్' '3 సంవత్సరాల డిగ్రీ' 'సాధారణ విద్యాబోధన' మొదలయినవాటికి సంబంధించి చేసిన సిఫార్సుల అమలుకు 1957 లో చర్యలు తీసుకొన్నది. దాని స్వీయ కళాశాలల, అంతర్భాగ కళాశాలల, అనుబంధ కళాశాలల సంఖ్య పెరగనారంభించింది. చివరకు తెలుగుజాతి జీవితంలోని విద్యారంగ పరిస్థితులు, ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు ఏకంకాగా 'ఆంధ్రప్రదేశ్' అవతరించిన సంవత్సరం (1956-57)లో ప్రభుత్వ సమాచారాన్నిబట్టి ఈ క్రింది విధంగా ఉన్నాయి:

| | సంస్థలు | విద్యార్థులు | ఉపాధ్యాయులు |
|---|---|---|---|
| 1. పసివారి పాఠశాలలు | 17 | 1,283 | 56 |
| 2. ప్రాథమిక పాఠశాలలు | 29,076 | 24,81,329 | 77,065 |
| 3. అప్పర్ ప్రాథమిక పాఠశాలలు | 329 | 98,142 | 4,421 |
| 4. హైస్కూళ్ళు, హయ్యర్ సెకండరీ స్కూళ్లు | 773 | 1,69,563 | 16,166 |
| 5. సాధారణ విద్య, ప్రాచ్యవిద్యా కళాశాలలు | 55+14 | 46,202+148 | 2,797 |
| 6. విశ్వ విద్యాలయాలు | 3 | | |

ఆధారం: విద్యలో 2 దశాబ్దాల అభివృద్ధి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ ప్రచురణ - 1976.

తారీఖులు, దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్రకర్థం. - శ్రీ శ్రీ

# అక్షరాస్యతా ఉద్యమం చరిత్ర

## అక్షరాస్యతా సాధనలో ఆంధ్రప్రదేశ్

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

భారత జాతికి లిపి సమకూర్చడంలో బౌద్ధుల కృషి ఎంతో ఉన్నట్లుగానే, విద్యాప్రచారంలో క్రైస్తవుల కృషి ఎనలేని విధంగా ఉంది. గత శతాబ్దం తొలిపాదంలోనే క్రైస్తవ మిషనరీలు తెలుగు ముద్రణను ప్రోత్సహించి, విద్యావ్యాసంగానికి బాటలు వేశారు. తెలుగు ప్రజలలో అపారంగా గల నిరక్షరాస్యతను నిర్మూలించదలచి గుంటూరుకు చెందిన క్రైస్తవ మిషనరీలు 1848 లోనే వయోజన విద్యాతరగతులు నిర్వహించినట్లు తెలుస్తుంది. ఈ కార్యక్రమం - తదుపరి వయోజన విద్యాకార్యక్రమాలు నిర్వహించడానికి దోహదపడింది.

స్వాతంత్ర్యానికి పూర్వం మన దేశంలో అక్షరాస్యతా శాతం యీ తీరుగా ఉంది:

| సం. | జనాభా (కోట్లలో) | అక్షరాస్యతా శాతం |
|---|---|---|
| 1881 | 23.50 | -- |
| 1891 | 23.60 | 5.35 |
| 1901 | 24.70 | 5.92 |
| 1911 | 25.20 | 5.92 |
| 1921 | 25.13 | 7.16 |
| 1931 | 27.89 | 9.50 |
| 1941 | 31.86 | 16.67 |

ఈ పరిస్థితిని గమనించి నాటి బ్రిటీషు ప్రభుత్వం, అంతకుముందుగల ఈస్టిండియా కంపెనీ అక్షరాస్యత శాతాన్ని పెంచడంలో కొంతవరకు తోడ్పడ్డాయి. దీనికి తోడుగా జాతిపిత మహాత్మా గాంధీ పిలుపు మేరకు 'నిరక్షరాస్యతా నిర్మూలన' జాతీయోద్యమంలో ఒక అంశంగా జాతీయోద్యమ కార్యకర్తలు చేపట్టారు. తత్ఫలితంగా అనేక పాఠశాలల్లో, గ్రామీణ గ్రంథాలయాలలో "రాత్రి పాఠశాలలు" వెలిశాయి. ఆనాడు గ్రంథాలయోద్యమ కార్యకర్తలు చదువురాని పెద్దలకు వార్తాపత్రికలు చదివి వినిపించి, వారిలో సామాజిక స్పృహను పెంచి స్వాతంత్ర్య సమరయోధులుగా తీర్చిదిద్దారు.

### ఉపాధ్యాయులకు శిక్షణ:

ఏ ఉద్యమమైనా నిలబడడానికి చిత్తశుద్ధిగల కార్యకర్తలు, వారికి తగిన శిక్షణ అవసరం. 1929-1931 సం.లలో పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన శనివారపు సుబ్బారావు అనే ఉపాధ్యాయుడు పెద్ద యెత్తున ఉపాధ్యాయులకు శిక్షణా కార్యక్రమాలు నిర్వహించారు. వీటిని "వసంత ఋతు విద్యాలయాలు" అనేవారు. ఇందువలన వందలాది ఉపాధ్యాయులు వయోజన విద్యాబోధనలో శిక్షణ పొంది, తదుపరి వయోజన విద్యాకార్యక్రమాలను ముమ్మరంగా సాగించారు. పశ్చిమ గోదావరి జిల్లా చాగల్లు గ్రామంలో 1937 లో ఆంధ్ర వయోజన విద్యా మహాసభ జరిగింది. సభానంతరం డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య అధ్యక్షులుగాను, ఆచార్య ఎన్.జి. రంగా ఉపాధ్యక్షులుగానూ, గరిమెళ్ళ సత్యనారాయణ, శనివారపు సుబ్బారావు కార్యదర్శులుగా ఆంధ్ర వయోజన విద్యా సంఘం ఏర్పడింది. ఈ సంఘం వయోజన విద్యావ్యాప్తికి బాగా తోడ్పడింది.

నిజాం పరిపాలనలో తెలుగువారు బాగా వెనుకబడ్డారు. సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా నీరస పడిపోయారు. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు ప్రభృతులు 1921 లో ఏర్పాటు చేసిన ఆంధ్రజన సంఘం 1926 నుంచి వయోజన విద్యా కార్యక్రమాలను నిర్వహించే రాత్రి పాఠశాలలను ప్రోత్సహించింది. 1931 నాటికి యీ పాఠశాలల సంఖ్య 53 కు పెరిగింది. అప్పటి వరకు నత్తనడక సాగుతున్న వయోజన విద్యాకార్యక్రమాలకు నిజాం ప్రభుత్వం 1941లో ఊపిరి పోసింది. మొట్టమొదటిసారిగా రు. 10 వేలు కేటాయించి, 43 వయోజన విద్యాకేంద్రాలను తెలంగాణా వ్యాప్తంగా ప్రారంభించింది. 1945 నాటికి కేటాయింపు రెట్టింపయి, పాఠశాలల సంఖ్య 77 కు పెరిగింది. ఇది శుభ సూచకం.

### వయోజన విద్యపై ఆంక్షలు:

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో వయోజన విద్యా

కార్యక్రమాలు ఇతోధికంగా జరుగుతూవుండగా, ఈ కేంద్రా లలో ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలు జరుగుతున్నాయనీ, ప్రజలలో సామాజిక స్పృహ పెంచుతున్నాయనీ పసిగట్టి 1941 జూన్ 11 వ తేదీ ప్రభుత్వ ఉత్తర్వుల ద్వారా వయోజన విద్యాకార్యక్రమాలను నిషేధించింది. ఈ నిషేధం ప్రకారం మద్రాసు నగరంలో పోలీసు కమీషనర్ అనుమతి లేకుండా, జిల్లాలలో జిల్లా కలెక్టరు అనుమతి లేకుండా వయోజన విద్యాతరగతులుగాని, కార్యకర్తల శిక్షణతరగతులుగాని నిర్వహించ రాదు. ఈ ఉత్తర్వులు ఉల్లంఘిస్తే మూడేళ్ళ వరకు జైలు శిక్ష, జరిమానా ఉండవచ్చు. ఈ నిషేధపు ఉత్తర్వును ఉపసంహరించుకోవలసిందిగా వయోజన విద్యాకార్యకర్తలు పెద్దయెత్తున ఆందోళన చేశారు. 1941 లో తెనాలిలో జరిగిన ఆంధ్రదేశ వయోజన విద్యామహాసభ ఈ నిషేధాజ్ఞలు సామాన్య పౌరుని పౌరసత్వ హక్కులకే భంగం కలిగిస్తున్నవనీ, ఈ నిషేధాజ్ఞలను ఉపసంహరించుకోవలసినదనీ నాటి మద్రాసు ప్రభుత్వాన్ని కోరింది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి నాయకత్వంలో ఒక ప్రతినిధివర్గం ప్రభుత్వాన్ని కలిసింది. ప్రజాందోళన పెరిగింది. ఎట్టకేలకు ప్రభుత్వం ఈ నిషేధపు టుత్తర్వును ఉపసంహరించక తప్పలేదు.

## తెలంగాణాలో మరొక పథకం:

హైదరాబాదు ప్రభుత్వం వయోజన విద్యా ప్రచారంపట్ల శ్రద్ధ చూపి, 1946లో ఒక ప్రణాళిక సిద్ధం చేసింది. ఒక క్రమబద్ధమైన పద్ధతిని అనుసరించి ఐదేళ్ల కాలంలో 24 శాతం మందిని అక్షరాస్యులుగా చేయతలపెట్టింది. తొలిదశలో 101 కేంద్రాలను ప్రారంభించారు. క్రమంగా వీటిసంఖ్య 2000 లకు పెరిగింది. వీటిలో 27 కేంద్రాలను స్త్రీలకోసం ప్రత్యేకించారు. రెండేళ్ళ పాటు ఈ కార్యక్రమం చాలా బాగా జరిగింది. 1948 లో తెలంగాణాలో జరిగిన రాజకీయ అలజడులవలన యీ కార్యక్రమం క్రమంగా కుంటుపడింది. వయోజనా విద్యాకేంద్రాలు చెల్లాచెదరై పోయాయి. రెండేళ్లకాలంలో అక్షరాస్యత సాధించినవారు – అక్షరాస్యతానంతర సాహిత్యం తగినంత లేక క్రమంగా నిరక్షరాస్యతలోకి ఒరిగిపోయారు.

## స్వాతంత్ర్యానంతర కృషి:

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక అవిభక్త మద్రాసు రాష్ట్రంలో 1948 ఏప్రిల్ మాసంనుంచి వయోజన విద్యా ప్రచార కార్యక్రమం తిరిగి ప్రారంభమైంది. గాడిచర్ల హరిసర్వోత్త మరావుగారిని వయోజన విద్యాకార్యక్రమాలు నిర్వహించడానికి ఆనరరీ డైరెక్టరుగా నియమించారు. వీరు ఆపదవిలో 1955 వరకు కొనసాగారు. స్వచ్ఛంద సంస్థల పరంగా, స్థానిక సంస్థలపరంగా వయోజన విద్యాకార్యక్రమాల నిర్వహణను గాడిచర్ల వారు ఎంతో ప్రోత్సహించారు. శ్రీయుతులు అయ్యంకి వెంకటరమణయ్య, గోపరాజు రామచంద్రరావు, కె.జె.జి. సుందరం, నార్ల చిరంజీవి, హరి ఆదిశేషువు ప్రభృతులు ఈ రంగంలో అపూర్వమైన కృషి చేశారు. ముఖ్యంగా 1948–55 ప్రాంతాలలో వయోజన విద్య ఒక ఉద్యమంగా సాగింది. ప్రజల భాగస్వామ్యం బాగా ఉంది. అనేక పాఠశాలలూ, గ్రామీణ గ్రంథాలయాలు రాత్రి పాఠశాలలను నిర్వహించాయి. చివుకుల శేషశాస్త్రిగారి గేయం—

"నిరక్షరాస్యత నిర్మూలింపుడు
విద్యాప్రాప్తిని చేయండోయ్
గుడులే బడులు, గోడలే పలకల్
పాపలే పాఠాల్, మాటలే చదువు
వార్తాపత్రిక కాలక్షేపం"

– అనాడు వయోజన విద్యాకేంద్రాలలో మారుమ్రోగింది. దక్షిణ భారత వయోజన విద్యాసంఘం ఆనాటి అవసరానికి అవసరమైన చిన్న పుస్తకాలు, కరపత్రాలు, పోస్టర్లు ప్రచురించి, ఉద్యమవ్యాప్తికి దోహదం చేసింది.

## పోలీస్ యాక్షన్ తరువాత తెలంగాణాలో:

తెలంగాణాలో 1948 పోలీసు యాక్షన్ పిదప ఊపిరి పీల్చుకోడానికి వీలైంది. అభివృద్ధి కార్యక్రమాలలో ఒక భాగంగా వయోజన విద్యాకేంద్రాలు మరల ప్రారంభమయ్యాయి. 1951 లో హైదరాబాదు ప్రభుత్వం డి.ఎల్. ఆనందరావుగారివి వయోజన విద్యాసలహాదారుగా నియమించింది. ఈ కార్యక్రమం అమలు జరుపవలసిన తీరుపై వీరు ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించారు. "సమాజ విద్యను మధ్యవర్తిగా పెట్టుకుని వివిధ రంగాలలో కృషిని దాని చుట్టూ వలయంగా ఏర్పరచి ముందుకు సాగడం" ఈ నివేదిక సారాంశం. ఇంతలో 1952 నుంచి దేశవ్యాప్తంగా సమాజాభివృద్ధి కార్యక్రమం (Community Development Programme) ప్రారంభమైంది. ఈ కార్యక్రమంలో ఒక భాగంగా మండలాల నేతృత్వంలో వయోజన విద్యాకార్యక్రమాలు జరిగాయి. ఈ దశలో కర్షక వృత్తివిద్యా పథకం మహబూబ్ నగర్ జిల్లా షాద్‌నగర్ సమితిలో ఆంధ్రమహిళాసభ నేతృత్వంలో జరిగింది. 1966 నుంచి 1978 వరకు యీ కార్యక్రమం సాగింది. రైతులకు అక్షరాస్యతతోబాటు వ్యవసాయంలో మెలకువలు చెప్పడం యీ పథక లక్ష్యం. ఈ పథకం మహబూబ్ నగర్ జిల్లాలో మంచి ప్రభావాన్ని చూపింది.

## జాతీయ వయోజన విద్యా కార్యక్రమం:

భారత వయోజన విద్యాకార్యక్రమాలలో ప్రత్యేకంగా చెప్పకోదగినది 1978 నుంచి దేశవ్యాప్తంగా పటిష్టంగా అమలు

చేసిన జాతీయ వయోజన విద్యాకార్యక్రమం (National Adult Education Programme). ఈ కార్యక్రమం ప్రకారం దేశంలోపల 15–35 వయసుగల 10 కోట్ల మంది యువకులను అక్షరాస్యులుగా చేయదలచారు. ఇందుకు కారణం ఏమంటే – యువజనులలో నేర్చుకునే శక్తి బాగా ఉంటుంది. వారిలో మంచి పనులు చేయాలనే తపన ఉంటుంది. దేశాభివృద్ధి కార్యక్రమాలలో కీలకపాత్ర నిర్వహించడానికి వీరు అన్ని విధాల యోగ్యులుగా ఉంటారు. పారిశ్రామిక ప్రగతినీ, వ్యవసాయ ఉత్పత్తులు పెంచడానికీ వీరు తగిన శక్తి సామర్థ్యాలు కలిగి ఉంటారు. ఈ వయస్సు అనగా 15–35 మధ్యగలవారు 1978 లో మన రాష్ట్రంలో 1 కోటి, పది లక్షలున్నారు. వీరిని అక్షరాస్యులుగా చేయడానికి కార్యక్రమం 1980–1990 మధ్యకాలంలో మన రాష్ట్రంలో 26 కేంద్ర ప్రాజెక్టులలో సాగింది. ప్రభుత్వరంగ ప్రయత్నానికి తోడుగా ఈ దిగువ ఉదాహరించిన స్వచ్ఛంద సంస్థలు వయోజన విద్యాకార్యక్రమాలను నిర్వహించాయి:

1. ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య, హైదరాబాదు.
2. ఆంధ్రమహిళాసభ, హైదరాబాదు.
3. ఆరోగ్యవరం డెవలప్‌మెంట్ సొసైటీ, మదనపల్లి.
4. క్రాస్, భువనగిరి.
5. గాంధీక్షేత్రం, అవనిగడ్డ.
6. గ్రామాభ్యుదయ సంస్థ, పొద్దుటూరు.
7. గ్రామీణాభివృద్ధి సంస్థ, గుంటూరు.
8. దళిత సమాజాభివృద్ధి సంఘం, కడప.
9. ప్రజాప్రగతి ట్రస్టు, తిరుపతి.
10. బైసాన్ వెల్ఫేర్ అసోసియేషన్, సికింద్రాబాదు.
11. భాగవతుల ఛారిటీస్ ట్రస్టు, యలమంచిలి.
12. రాయలసీమ సేవాసమితి, తిరుపతి.
13. సేవామందిర్, హిందూపురం.

– ఇంకా మరికొన్ని సంస్థలూ ఉన్నాయి.

## జాతీయ అక్షరాస్యతా ఉద్యమం:

జాతీయ వయోజన విద్యాకార్యక్రమం జరుగుతున్న దినాలలో నూతన విద్యావిధానాన్ని (1986) అనుసరించి, 1988 మే 5 వ తేదీన జాతీయ అక్షరాస్యతా ఉద్యమం (National Literacy Mission) ప్రారంభమైంది. ఈ ఉద్యమానికి నాటి భారత ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ ప్రేరణ ఉందని చెబుతారు. ఈ పథకం ప్రకారం 15–35 మధ్య వయస్సుగల వారిని మొదటి మూడేళ్లలో 3 కోట్లు, తరువాత 5 ఏళ్లలో 5 కోట్లమందిని అక్షరాస్యులుగా చేయాలని తలచారు. ఇందులో స్త్రీలకు; షెడ్యూల్డు కులాలు, తెగలవారికి అధిక ప్రాధాన్యం యివ్వాలనీ ఊహించారు. ఈ ఉద్యమం ఆచరణలోకి వస్తున్న తరుణంలో సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం (Total Literacy Mission) అనే మరో పథకం వ్యాప్తిలోకి వచ్చింది.

## సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం:

ఈ నూతన ఉద్యమం 1990 ఆగస్టు నుంచి మన దేశంలోను, మన రాష్ట్రంలోనూ కొన్ని ఎంపిక చేసిన జిల్లాలలో ప్రారంభమైంది. ఇందుకు నేపథ్యాన్ని కూడ మనం పరిశీలించాలి. సోవియట్ రష్యా, బర్మా, క్యూబా, వియత్నామ్, నికరాగువా, టాంజానియా, ఇథోపియా మొదలైన దేశాలలోని ప్రజలు ఎలాటి పారితోషికం లేకుండా స్వయంకృషి పట్టుదల పెట్టుబడిగా అనతికాలంలో సంపూర్ణ అక్షరాస్యత సాధించారు. మన రాష్ట్రంలో 1980–90 మధ్యకాలంలో కోట్లాది రూపాయలు ఖర్చుచేసినా పది లక్షల జనాభాను మించి అక్షరాస్యులుగా చేయలేకపోయారు. ఈ లెక్కన మిగిలిన కోటిమందిని అక్షరాస్యులుగా చేయడానికి మరోవంద సంవత్సరాలు కావాలి. మరిపెరిగే జనాభా మాటేమిటి? ఈ దృష్ట్యా పథకం ఆలోచనా, ఆచరణ విధానం, శిక్షణకాలం అన్నీ మార్చారు. దేశంలో 180 జిల్లాలలో ఈ ఉద్యమం అమలు జరిగితే ఆంధ్రప్రదేశ్‌కు చెందినవి 18 ఉండటం ఒక ప్రత్యేకత. మన రాష్ట్రంలో ఈ ఉద్యమం యీ దిగువ ఉదాహరించిన జిల్లాలలో అమలు జరిగింది:

| వ.సం. | జిల్లా | కార్యక్రమం పేరు | ప్రారంభించిన తేది |
|---|---|---|---|
| 1. | కడప | అక్షరరశ్మి | 16–2–1991 |
| 2. | కరీంనగర్ | అక్షర ఉజ్వల | 14–4–1991 |
| 3. | కర్నూలు | అక్షరజ్యోతి | 2–1–1991 |
| 4. | కృష్ణా | అక్షరకృష్ణ | 1–11–1993 |
| 5. | ఖమ్మం | అక్షరదీపం | 26–2–1991 |
| 6. | చిత్తూరు | అక్షర తపస్మాన్ | 2–10–1991 |
| 7. | నల్గొండ | చదువు వెలుగు | 2–10–1991 |
| 8. | నిజామాబాద్ | అక్షరకిరణం | 1–5–1991 |
| 9. | నెల్లూరు | అక్షరదీపం | 20–1–1991 |
| 10. | పశ్చిమగోదావరి | అక్షరదీక్ష | 4–3–1991 |
| 11. | ప్రకాశం | అక్షరప్రకాశం | 1–1–1994 |
| 12. | మహబూబ్‌నగర్ | అక్షరకిరణం | –7–1991 |
| 13. | మెదక్ | మంజీర అక్షరప్రభ | 8–9–1991 |
| 14. | తూర్పుగోదావరి | అక్షరగోదావరి | 1–11–1993 |
| 15. | వరంగల్ | కాకతీయ అక్షరప్రభ | 1–12–1991 |
| 16. | విశాఖపట్నం | విశాఖ అక్షరజ్యోతి | 1–11–1991 |
| 17. | శ్రీకాకుళం | అక్షరక్రాంతి | 1–11–1991 |
| 18. | హైదరాబాదు | అక్షరజ్యోతి | 8–9–1990 |

మిగిలిన జిల్లాలలో జిల్లాకు ఒక మండలం చొప్పున ప్రయోగాత్మకంగా యీ కార్యక్రమం అమలు జరుగుతున్నది. ఈ కార్యక్రమంలో పది మాసాల కాలంలో మూడు

పుస్తకాలు పూర్తిచేస్తారు. తదుపరి అక్షరాస్యతానంతర వాచకం నాలుగోపుస్తకం ప్రారంభిస్తారు. ఈ నాలుగు పుస్తకాలు సక్రమంగా పూర్తిచేస్తే - అభ్యాసకుడు తన దైనందిన జీవితానికి సంబంధించిన అన్ని కార్యకలాపాలూ - అనగా దినపత్రిక చదువుకోవడం, చిన్న చిన్న పుస్తకాలు చదువుకోవడం, బంధుమిత్రులకు ఉత్తరాలు రాసుకోవడం, ఫారాలు పూర్తిచేయడం, దరఖాస్తులు పెట్టడం మొదలైన పనులు చేయగలుగుతాడు.

అయితే, మనం అంగీకరించవలసిన అంశం ఒకటుంది. ఈ కార్యక్రమం నాలుగేళ్ళ నుంచి అమలు జరుగుతున్నా ఒక్క జిల్లాకూడ అక్షరాస్యత 100% సాధించినట్లు ప్రభుత్వం యింతవరకు ప్రకటించలేదు. అయితే, చాల జిల్లాలలో కార్యక్రమం బాగా జయప్రదం అయిందనీ - అధిక శాతం అక్షరాస్యత సాధించారనీ వింటున్నాము. ఆంధ్రప్రదేశ్ మిగతా జిల్లాలలో కూడ ఈ కార్యక్రమం అమలు జరిగి, అనతికాలంలో పూర్తికాగలదు.

## మార్పుకు నాంది:

అయితే, అక్షరాస్యత సాధించినంత మాత్రాన రాత్రికి రాత్రి రాష్ట్ర స్వరూపం మారిపోదు. అధిక జనాభాను ఆవరించిన పేదరికం, అనారోగ్యం, శక్తికి మించిన చాకిరీ వారిని వదలిపెట్టిపోదు. ఆకలిబాధ, నిరుద్యోగం వారి నుంచి హఠాత్తుగా దూరం కావు. కాని, చదువు అనేది పేదవారి బతుకులు బాగుపడడానికి మార్గం చూపుతుంది. సరైన సమాచారం తెలుపుతుంది. ఆధునికతవైపు, నిపుణతవైపు మొగ్గు చూపుతుంది. స్వావలంబన వైపు ఆలోచన మళ్లిస్తుంది. వెట్టిచాకిరికి గండి కొడుతుంది. ఇది జీవితానికి తొలిమెట్టు. ఇదంతా పునరుజ్జీవన విధానంలో ఒక భాగం.

సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం అంతటితో ఆగిపోదు. అది వ్యాధి నిరోధక టీకాల ఉద్యమంగానూ, గర్భిణీ స్త్రీల రక్షణ ఉద్యమంగానూ, చిన్నకుటుంబం, పరిసరాల పరిరక్షణ, సంప్రదాయేతర యింధన వనరుల వినియోగం మొదలైన అనేక జీవనరంగాలవైపు చొచ్చుకుపోతుంది. ఈ ఉద్యమం రెండో దశలో బాల్యవివాహాలను అరికట్టడం, మద్యపాన నిరోధం, వర్గకలహాల నిర్మూలనం, జాతీయ సమైక్యత మొ. అనేక కార్యక్రమాలను కలుపుకుని, సాంఘిక జీవితంలో విప్లవాత్మకమైన మార్పులు రావడానికి తోడ్పడుతుంది.

సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమం తాలూకు మరో ప్రత్యేకత ఏమంటే - ఈ కార్యక్రమం జిల్లా కలెక్టర్ల పర్యవేక్షణలో, జిల్లా యంత్రాంగం సహకారంతో జరుగుతూఉంది. అనధికారులు, ప్రజాప్రతినిధులు, ప్రజల భాగస్వామ్యం బాగా ఉంది. దీనివెనుక క్రమబద్ధమైన ఒక ప్రణాళిక, ఒక సదుద్దేశం ఉంది. ఈ కారణాల వలన ఈ కార్యక్రమం జయప్రదమై, అక్షరాస్యతలో ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా ఉంటుందనీ, అక్షరక్రమంలోవలె తొలిస్థానంలో ఉండగలదనీ ఆశిద్దాం.

మతలబులూ, కైఫీయతులూ
ఇవి కావోయ్ చరిత్రసారం - శ్రీశ్రీ

# పాఠశాల విద్య

అప్పరుసు శ్యామసుందర రావు, అధ్యక్షుడు,
అఖిల భారత సెకండరీ ఉపాధ్యాయుల సమాఖ్య

## 1. అక్షరాస్యత

ఆంధ్రప్రదేశ్ భారతదేశంలో విద్యా విషయకంగా వెను కబడిన తొమ్మిది రాష్ట్రాల్లో ఒకటి, దక్షిణ భారతంలో అన్నింటికన్న వెనుకబడిన రాష్ట్రం ఇది. 1991 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రంలో సగటు అక్షరాస్యత శాతం 44.09. పురుషుల అక్షరాస్యత 55.13 శాతం కాగా స్త్రీలలో కేవలం 32.72 శాతం అక్షరాస్యులు. జాతీయ అక్షరాస్యత 52.21తో పోలిస్తే మన రాష్ట్రం 26వ స్థానం ఆక్రమిస్తుంది.

1956 నుండి ఈనాటి వరకు ఆంధ్రప్రదేశ్‌లో పాఠశాలల వ్యవస్థ విద్యా పరిపాలన మరియు విద్యా వ్యాప్తి క్రమ క్రమంగా మెరుగు పడుతూ వస్తున్నప్పటికీ సాధించగలిగిన ఫలితాల్ని సాధించలేకపోయాం. ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి కోస్తా మరియు రాయలసీమ జిల్లాలు విద్యావిషయకంగాను, ఆర్థి కంగాను తెలంగాణా జిల్లాల కన్నా అభివృద్ధి చెందియున్నవి. ఇరు ప్రాంతాలలోగల అసమానతలను తొలగించి వానిని క్రమంగా ఒకే త్రాటి పైకి తీసుకు రావలసిన అవసరం ఏర్పడింది. ఆంధ్ర (కోస్తా మరియు రాయలసీమ) జిల్లాల్లో అక్షరాస్యత 15 శాతానికి పైగా వుండగా తెలంగాణా జిల్లాల్లో 10 శాతానికి మించిలేదు. ఇరు ప్రాంతాల ప్రజల సామాజిక, ఆర్థిక స్థాయిల్లో కూడా వ్యత్యాసాలు వున్నవి. పాఠశాలల వ్యవస్థలోనూ, పాఠశాల యాజమాన్య విధానంలోనూ పాఠ్యప్రణాళిక, బోధనాంశాలలోను భేదాలు వుండి వున్నవి. ఆకారణంగా విద్యావ్యాప్తికై సమగ్రమైన విధానం అంతటా సమంగా అమలు పరచటం సాధ్యం కాలేదు. చట్టాల్లోనూ, విధానాల్లోనూ మార్పులు తీసుకు రావలసి వచ్చింది. ఆ కారణంగా అక్షరాస్యత పెరుగుదల కార్యక్రమం అమలు, బాల బాలికలకు విద్యా సౌకర్యాలు కల్పించటంలో ఆలస్యం జరిగింది. 1951 నుండి 1991 వరకు రాష్ట్రంలో అక్షరాస్యత పెరుగుదల క్రింద పట్టిక–Iలో యివ్వబడింది.

### 1.1 ఈనాటి పరిస్థితి:

రాష్ట్రంలోని 23 జిల్లాల్లో రాజధాని నగరమైన హైదరాబాద్‌లో మాత్రమే అక్షరాస్యత అత్యధికంగా, అంటే 71.52 శాతం వుంది. మెట్రోపాలిటన్ పట్టణం కావటం వల్ల కేంద్ర ప్రభుత్వ కార్యాలయాలు, పారిశ్రామిక కేంద్రాలు, వ్యాపారం సంస్థల్లో పని చేస్తున్నవారు ఈ పట్టణ జనాభాలో వున్నందున అక్షరాస్యతా శాతం సహజంగానే ఎక్కువగా వుంది. ఇతర జిల్లాలలో అత్యధిక అక్షరాస్యత 53.37% కలిగిన జిల్లా పశ్చిమ గోదావరి. అన్నింటికన్న తక్కువ

పట్టిక–I : 1951 నుండి 1991 వరకు అక్షరాస్యత పెరుగుదల క్రమం

| సంవత్సరం | అక్షరాస్యత | | సగటు |
|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | |
| 1951 | 22.67 | 7.62 | 15.21 |
| 1961 | 30.19 | 12.03 | 21.19 |
| 1971 | 33.18 | 15.75 | 24.57 |
| 1981 | 39.26 | 20.39 | 29.94 |
| 1991 | 55.13 | 32.72 | 44.09 |

మూలం: రాష్ట్ర విద్యాశిక్షణ పరిశోధనమండలి.

అక్షరాస్యత గల జిల్లా మహబూబునగర్. కోస్తా మరియు రాయలసీమ జిల్లాల కన్నా తెలంగాణా జిల్లాల్లో అక్షరాస్యత ఈనాటికీ తక్కువే. శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలను వదిలితే కోస్తా మరియు రాయలసీమ జిల్లాలన్నీ తెలంగాణా జిల్లాల కన్న అధికమైన అక్షరాస్యత కల్గియున్నవి.

జిల్లాల వారి అక్షరాస్యత పట్టిక IIలో ఇవ్వబడింది.

పట్టిక–II : జిల్లాల వారి అక్షరాస్యత

| క్రమసంఖ్య | జిల్లా | పురుషుల అక్షరాస్యత | స్త్రీల అక్షరాస్యత | సగటు |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 49.14 | 23.52 | 36.22 |
| 2. | విజయనగరం | 45.93 | 22.47 | 34.19 |
| 3. | విశాఖపట్టణం | 53.13 | 34.60 | 45.51 |
| 4. | తూర్పుగోదావరి | 55.32 | 42.26 | 48.79 |
| 5. | పశ్చిమగోదావరి | 59.75 | 46.98 | 53.37 |
| 6. | కృష్ణా | 60.54 | 45.54 | 53.16 |
| 7. | గుంటూరు | 56.54 | 35.85 | 46.35 |
| 8. | ప్రకాశం | 53.14 | 27.06 | 40.30 |
| 9. | నెల్లూరు | 58.40 | 36.99 | 47.76 |
| 10. | అనంతపురం | 55.92 | 27.61 | 42.18 |
| 11. | కర్నూలు | 53.24 | 26.04 | 39.97 |
| 12. | కడప | 63.14 | 32.35 | 48.12 |
| 13. | చిత్తూరు | 62.61 | 36.44 | 49.75 |
| 14. | హైదరాబాద్ | 78.90 | 63.56 | 71.52 |
| 15. | రంగారెడ్డి | 60.43 | 36.91 | 49.07 |
| 16. | నిజామాబాద్ | 45.15 | 19.25 | 32.41 |
| 17. | మెదక్ | 47.33 | 21.35 | 34.18 |
| 18. | మహబూబ్ నగర్ | 40.80 | 18.03 | 29.58 |
| 19. | నల్లగొండ | 50.53 | 24.92 | 38.00 |
| 20. | వరంగల్లు | 51.98 | 26.08 | 40.50 |
| 21. | ఖమ్మం | 50.04 | 30.53 | 37.17 |
| 22. | కరీంనగర్ | 50.97 | 23.37 | 37.17 |
| 23. | అదిలాబాద్ | 45.04 | 20.60 | 32.96 |
|  | ఆంధ్రప్రదేశ్ | 55.13 | 32.72 | 44.09 |

మూలం: రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణామండలి.

షెడ్యూలు కులాలు మరియు షెడ్యూలు తరగతులలో అక్షరాస్యత మరింత తక్కువగా వుంది. పట్టిక III చూస్తే ఆ విషయం విదితమౌతుంది.

పట్టిక–III : షె. కులాల, తరగతుల అక్షరాస్యత - 1991

|  | పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| షె.కులాలు | 41.88 | 20.92 | 31.59 |
| షె.తెగలు | 25.25 | 8.68 | 17.16 |
| అందరు | 55.13 | 32.72 | 44.09 |

మూలం: రాష్ట్ర విద్యాశిక్షణ పరిశోధన మండలి.

స్త్రీలలో అక్షరాస్యత చాలా తక్కువగా - 32.72 వుండటం గమనించాల్సిన విషయం. షెడ్యూలు తెగలు మరియు షెడ్యూలు కులాల స్త్రీలలో అక్షరాస్యత అత్యల్పం. స్త్రీ, పురుషుల జనాభా నిష్పత్తి (ప్రతి 1000 పురుషులకు 972 స్త్రీలు)ని బట్టి చూస్తే వారి మధ్య అక్షరాస్యత శాతంలో తేడా కొట్టొచ్చినట్లుగా కనబడుతుంది. అయితే స్త్రీలలో అక్షరాస్యత శాతం క్రమంగా పురుషులలో కన్నా ఎక్కువగా పెరుగుతూండటం గమనించవల్సిన అంశం. 1951లో కేవలం 7.62 శాతం స్త్రీలు అక్షరాస్యులుండగా ఈనాడు 32.72 శాతం అక్షరాస్యులు, అంటే దాదాపు $4\frac{1}{2}$ రెట్లు పెరిగింది. పురుషుల అక్షరాస్యత $2\frac{1}{2}$ రెట్లే పెరిగింది.

అక్షరాస్యత తక్కువగా వుండటానికి ప్రధానమైన కారణం గ్రామీణ ప్రాంతాల వెనుకబడినతనం, ఆర్థిక బలహీనత మరియు విద్య ఆవశ్యకతను గురించి సరియైన అవగాహన లేకపోవడంగా చెప్పవచ్చు.

# 2. పాఠశాల విద్య

## 2.1. పూర్వరంగం:

పైన చెప్పినట్టుగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత పాఠశాల విద్యావ్యవస్థలో యిరు ప్రాంతాల్లోగల వ్యత్యాసాలను తొలగించి ఒకే త్రాటి మీదికి తీసుకురావడం విద్యాశాఖ యొక్క మొదటి కర్తవ్యమైంది.

కోస్తా మరియు రాయలసీమ జిల్లాల్లో పాఠశాలలు జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలచే నిర్వహింపబడుతూ వుండేవి. ప్రైవేటు యాజమాన్యాలు కూడా బహుళంగానే వున్నాయి. ప్రభుత్వ పాఠశాలలు, వేళ్ళమీద లెక్కింప వీలగు బాలికల పాఠశాలలు, మైనారిటీ భాషల పాఠశాలలు తప్ప. అంటే 1956 నాటికి విద్యాయాజమాన్య బాధ్యత స్థానిక సంస్థల మరియు ప్రైవేటు సంస్థల చేతుల్లో వుంది. ఇలా పరోక్షంగానైనా ప్రజలు వారి ప్రతినిధుల ద్వారా పాఠశాలలను నిర్వహించటంలో భాగస్వామ్యము కలిగియున్నారు. అంటే విద్యాపరిపాలన కొద్దిగానైనా వికేంద్రీకృతమై వున్నది. అందుకు భిన్నంగా తెలంగాణా ప్రాంతంలో దాదాపు అన్ని పాఠశాలలు ప్రభుత్వమే నిర్వహిస్తూ వుండేది. ప్రై. పాఠశాలలు కూడా హైదరాబాద్ మరియు వరంగల్లులో తప్ప మరెక్కడా లేవు. ఆ పట్టణాల్లో కూడా ఆ పాఠశాలల సంఖ్య చాలా తక్కువ. కేంద్రీకృతమైన విద్యా పరిపాలన వ్యవస్థవుంది.

తెలంగాణా ప్రాంతంలో 1956 సంIIనాటికి 'హెచ్. యస్.సి.' (హైస్కూలు సర్టిఫికేటు) 11 సంవత్సరాల పాఠశాల విద్య అమలులో వుండినది. 'హెచ్.యస్.సి.' తర్వాత ఒక సంవత్సరపు 'ప్రియునివర్సిటి' కోర్సులో ప్రవేశావకాశం ఉండేది. రాయలసీమ మరియు కోస్తా జిల్లాల్లో అదే పదకొండు సంవత్సరాల పాఠశాల కోర్సు 'యస్. యస్.యల్.సి.' (సెకండరీ స్కూలు లీవింగ్ సర్టిఫికేటు)గా పిలువబడేది.

పాఠశాల పాఠ్యప్రణాళికలో యిరు ప్రాంతాల్లో మాతృ భాష, ఇంగ్లీషు, హిందీ, గణితము, సామాజిక శాస్త్రం మరియు విజ్ఞానశాస్త్రం వుండినప్పటికీ పాఠ్యాంశాల్లో తేడాలు వుండి నవి. తెలంగాణా ప్రాంతంలో 'ఉర్దూ' బోధనా మాధ్యమం గల విద్యార్థులకు వారి మాతృభాష ఉర్దూతో పాటు హిందీ కూడా చదవాల్సి వచ్చేది. తెలుగు బోధనా భాషగల వారు హిందీని రెండవ భాషగా చదివారు.

కోస్తా, రాయలసీమ జిల్లాల్లో బోధనా మాధ్యమం తెలుగు. తెలంగాణా ప్రాంతంలో 1951-52కు ముందు అన్ని పాఠశాలల్లో ఉర్దూ బోధనా మాధ్యమంగా ఉండేది. ఆ విద్యా సంవత్సరం నుండి ఉర్దూతో పాటు తెలుగును బోధనామాధ్యమంగా ప్రవేశపెట్టారు.

దరిమిలా సెకండరీ ఎడ్యుకేషన్ కమీషన్ (డా. లక్ష్మణస్వామి మొదలియార్ కమిషను) చేసిన సిఫారసుల ఆధారంగా అటు అప్పటి ఆంధ్రరాష్ట్రంలోను యిటు తెలంగాణా ప్రాంతంతో సహ హైదరాబాద్ రాష్ట్రంలోను బహుళార్థసాధక (మల్టిపర్పస్) పాఠశాలలు నెలకొల్పబడినవి. పాఠశాల విద్యాకాల పరిమితిని 12 సంవత్సరాలుగా మార్చి, డిగ్రీకోర్సుకు 3 సంవత్సరాలుగా నిర్ణయించారు. ఒకరకంగా సెకండరీ విద్యాకమీషన్ సిఫారసుల అమలు వల్ల అప్పటి ఆంధ్రరాష్ట్రం మరియు హైదరాబాద్ రాష్ట్రంలో సమాన పాఠశాల స్వరూపానికి శ్రీకారం చుట్టినట్లైంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి పాఠశాలల నిర్వహణ, సిలబసు, పరీక్షల నిర్వహణ వ్యవస్థలాంటి వాటిల్లో తేడాలున్నప్పటికి పాఠశాల విద్యాస్వరూపంలో సమానతలు ఏర్పడ్డాయి.

## 2.2. ఒకే విద్యా స్వరూపం:

ఇరు ప్రాంతాల్లో ఏకీకృత పాఠశాల విద్యను 1960లో ఒకటవ తరగతి నుండి అమలు జరపటం ఆరంభించారు. క్రమానుగతంగా ఈ విధానం 1969-70 విద్యా సంవత్స రాంతం వరకు పదవ తరగతి వరకు ఇరుప్రాంతాలలోని విద్యార్థులు మొదటిసారిగా యస్.యస్.సి. (సెకండరీ స్కూలు సర్టిఫికేటు) పరీక్ష రాశారు.

ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లో పాఠశాల విద్యా వ్యవస్థలో 10 సంవత్సరాల సెకండరీ విద్య, 2 సంవత్సరాల జూనియర్ కళాశాల విద్యతో కూడివున్నది. 2 సంవత్సరాల జూనియర్ కళాశాల విద్య వాస్తవంగా మొదటి సెకండరీ విద్యా కమీషను సిఫారసుల ఆధారంగా ఆ తరువాత జాతీయ విద్యాకమీషను (కొఠారి కమీషను) సిఫారసుల ఆధారంగా, చివరకు 1986

నాటి జాతీయ విద్యా విధానాన్ననుసరించుకొని సెకండరీ విద్యలో భాగంగా వుండాల్సివుంది. 10 సంవత్సరాల పాఠశాల విద్య, తరువాత 2 సంవత్సరాల విద్యను హైయర్ సెకండరీ విద్యగా నిర్వచించారు. కాని 1969–70 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము హైయర్ సెకండరీ పాఠశాలల స్థానంలో జూనియర్ కళాశాలలనుస్థాపించింది.ఈ కళాశాలలను ఉన్నత విద్య (హైయర్ ఎడ్యుకేషన్)తో జోడించి వాని నిర్వహణకై బోర్డు ఆఫ్ ఇంటర్మీడియేట్ ఎడ్యుకేషన్ అనే స్వతంత్ర సంస్థను స్థాపించింది. ఏమైనా జాతీయ విద్యా విధానాన్ననుసరించి మన రాష్ట్రంలో 10+2+3 వ్యవస్థ అమలులో వుంది.

ఈనాడు 1–5 తరగతి వరకు ప్రాథమిక విద్యగాను, 6,7 తరగతుల విద్యను ఉన్నత ప్రాథమిక విద్యగాను, 8 నుండి 10 తరగతుల వరకు సెకండరీ విద్యగాను, ఆ తరువాత 2 సంవత్సరముల విద్యను ఇంటర్మీడియేట్ విద్యగాను పిలుస్తున్నారు.

జాతీయంగా అంగీకరించిన విధానానికి, మన రాష్ట్రంలో ఏర్పడిన విధానానికి ఒక భేదం వుంది. జాతీయ విధానం ప్రకారం ఒకటవ తరగతి నుండి ఎనిమిదవ తరగతి వరకు ప్రైమరీ విద్యగా నిర్వచించారు. మన రాష్ట్రములో ఒకటవ తరగతి నుండి ఏడవ తరగతి వరకు ప్రైమరీ విద్యగాను, ఎనిమిది నుండి పదవ తరగతి వరకు సెకండరీ విద్యగాను పరిగణిస్తూ, ఏడవ తరగతి అంతంలో ఒక కామన్ పరీక్ష, పదవ తరగతి అంతంలో యస్.యస్.సి. పబ్లిక్ పరీక్ష నిర్వహిస్తున్నారు. మరొక తేడా ఏమిటంటే, జాతీయంగా మొదటి తరగతిలో ప్రవేశానికి కనీస వయసు ఆరు సంవత్సరాలు కాగా మన రాష్ట్రంలో అది ఐదు సంవత్సరాలే.

## 2.3. విద్యా విధానం - ఒక పరిశీలన:

భారతదేశం ఫెడరల్ రాజ్యాంగం కలిగి యున్నప్పటికీ, విద్యావిధాన నిర్ణయం మరియు దాని నిర్వహణలో రాష్ట్రాలకు గల స్వాతంత్ర్యము చాలా స్వల్పం. 1975 వరకు విద్య రాష్ట్ర జాబితాలో వున్నా కూడా రాష్ట్ర ప్రభుత్వాలు – మన రాష్ట్ర ప్రభుత్వం కూడా విధాన నిర్ణయంలో స్వతంత్ర వైఖరి అవలంబించ లేదు. 1975లో విద్య ఉమ్మడి జాబితాకి బదిలీ చేసిన తరువాత రాష్ట్ర ప్రభుత్వాలు మరింతగా కేంద్ర ప్రభుత్వంపై ఆధార పడాల్సి వచ్చింది. పాఠశాల విద్యా వ్యాప్తిలో, బాలబాలికలకు గుణాత్మక విద్య నందించటంలో, క్రొత్త కోర్సులు ప్రవేశ పెట్టటంలో, నూతన పద్ధతులు అవలంబించటంలో, పాఠశాలలకు భవనాలు, బోధనా సౌకర్యాలు కల్పించటం వంటి పలు అంశాలకై కేంద్రంపై ఆధారపడటం జరుగుతున్నది.

మన దేశంలో జాతీయ విద్యా విధానం అంటూ ఒకటి రూపొందించటం 1966లో జాతీయ విద్యా కమీషను (దీనినే కొఠారి కమీషను అంటారు) తన సిఫారసులను అందచేసిన తరువాతనే. ఆ సిఫారసులను అనుసరించి 1968లో జాతీయ విద్యా విధానం రూపొందించబడింది. అయితే కొఠారి కమీషను చేసిన కొన్ని ముఖ్యమైన సిఫారసులు జాతీయ విధానంలో చోటు చేసుకోలేదు, చేసుకొన్నా అమలుపరచబడలేదు. కమీషను చేసిన ఒకానొక ముఖ్యమైన సూచన 'కామన్ స్కూలు' వ్యవస్థ. మరొక ముఖ్యమైన సిఫారసు క్రమంగా విద్యపై పెట్టే ఖర్చు జాతీయ ఆదాయంలో 6% వుండాలని. ఈ సిఫారసులను అమలుపరచలేదు సరికదా, కామన్ స్కూలు వ్యవస్థను పూర్తిగా విస్మరించారు. విద్యపై పెట్టే ఖర్చు జాతీయ ఆదాయంలో కేవలం 3.9% మాత్రమే వుంది.

అసలు పాఠశాల విద్యకు సంబంధించిన మౌలిక సమస్యలను అటు కేంద్ర ప్రభుత్వం కాని, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కాని మొన్న మొన్నటి దాకా నిర్దిష్టంగా గుర్తించ లేకపోయాయి. ఆ సమస్యలలో కొన్ని యివి:

1) విద్యావకాశాలను విస్తరించడంతోపాటు అందరికీ గుణాత్మకంగా మెరుగైన విద్య నందించటం.
2) విద్యను శ్రమ శక్తితో జోడించి విజ్ఞానం మరియు శ్రమను సంధానపరచటం.
3) సార్వత్రిక ప్రాథమిక విద్యను సాధించటం.
4) విద్యా వ్యాప్తికి అవసరమైన సామాజిక ఆర్థిక పునాదులను బలపరచడం.
5) జాతీయత, మానవత్వం మరియు ప్రకృతి పట్ల గౌరవం వంటి విలువలకు పాఠశాల విద్యా ప్రక్రియలో చోటు కల్పించడం.

పై సమస్యలు అటు కేంద్ర స్థాయిలో కాని, యిటు రాష్ట్ర స్థాయిలో కాని సమగ్రంగా నేటికీ సాధించబడలేదు.

1986లో నూతన జాతీయ విద్యా విధానం అమలులోకి వచ్చింది. అందులో పై సమస్యలు పరోక్షంగా ఉల్లేఖించ బడినప్పటికీ కేంద్ర, రాష్ట్ర విద్యా పరిపాలనల యంత్రాంగం అందుకు సంసిద్ధం కావటంలో విఫల మయ్యాయి. నిధుల కొరత మరో అడ్డంకి అయ్యింది. రాష్ట్ర ప్రభుత్వాల వద్ద కొత్త స్కీములకు కాని, విద్యపై యితర పెట్టుబడులకు కాని ధనం లేనికారణాన సమస్యలు సమస్యలుగానే వుండిపోయినవి.

1986 విద్యా విధానం రూపొందించిన తరువాత దాని నమలు పరచడానికి కార్యక్రమావలిని రూపొందించారు. ఈ కార్యక్రమావళిలో మెచ్చుకోదగిన అంశం ప్రాథమిక పాఠశాలల భౌతిక, బోధనా సౌకర్యాలు మెరుగుపరిచేందుకు ఒక స్కీము ప్రవేశపెట్టడం. అది 'ఆపరేషన్ బ్లాక్ బోర్డు'. ప్రతి ప్రాథమిక పాఠశాలకు కనీస సౌకర్యాలు గల భవనం

నిర్మించటం, ఉపాధ్యాయినిని (మహిళను) నియమించటం మరియు పాఠశాలకు అవసరమైన బోధనోపకరణాలు సమకూర్చటం ఈ స్కీము లక్ష్యం. ఈ స్కీము నత్త నడకగా నైనా (ధనాభావం వల్ల) అన్ని ప్రాథమిక పాఠశాలలకు విస్తరించడం జరిగింది.

1986 విధానంలో సెకండరీ విద్యకు సంబంధించిన ఒక స్కీము 'నవోదయ విద్యాలయాల' స్థాపన. ఈ స్కీముకు అందరి ఆమోదం పూర్తిగా లభించలేదు. అయినా జిల్లాకొక నవోదయ పాఠశాల నెలకొల్పబడుతోంది. యీ పాఠశాలల్లో గ్రామీణ విద్యార్థులకు ప్రవేశం లభిస్తుంది.

1986 విద్యా విధానంలో సెకండరీ పాఠశాలల్లో విజ్ఞాన శాస్త్రం మరియు గణితం బోధించడానికి మెరుగైన సౌకర్యాలను సమకూర్చాలని సూచించబడింది. ఈ సూచనల అమలు సంపూర్ణంగా జరగడంలేదు.

దరిమిలా కేంద్రంలో జనతా ప్రభుత్వం అధికారంలోకి రాగానే 1986 విధానంలో ఆమూలాగ్రం మార్పు తేవాలనే లక్ష్యంతో ఆచార్య రామమూర్తి అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. ఈ ఈ కమిటి తన అభిప్రాయాలను వ్యక్తపరుస్తూ ఒక పత్రాన్ని ప్రజాభిప్రాయ సేకరణకై ప్రచురించింది. ఆ పత్రంపై దేశంలో పలువర్గాల మధ్య చర్చలు జరిగాయి. ఆచార్య రామమూర్తి కమిటీ తన నివేదికను రూపొందించే లోపల కేంద్రంలో అధికారం తిరిగి కాంగ్రెసు పార్టీ చేతుల్లోకి రావటంతో ఆ కమిటీ సిఫారసులు కాగితాలలోనే మిగిలిపోయినవి. జూలై 1991లో కేంద్ర విద్యా సలహా మండలి (సెంట్రల్ అడ్వైజరీ బోర్డు ఆఫ్ ఎడ్యుకేషన్) శ్రీ యన్. జనార్దనరెడ్డి (అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి) అధ్యక్షతన ఒక రెవ్యూ కమిటీని నియమించింది. ఈ రెవ్యూ కమిటి చేసిన సిఫారసుల ఆధారంగా క్రొత్త కార్యక్రమావళి (ప్రోగ్రామ్ ఆఫ్ యాక్షన్, 1992) రూపొందించబడింది.

1992 కార్యక్రమావళిలో సూచించబడ్డ అంశాలను కార్యక్రమాలను అమలుపరచడానికి ప్రతి రాష్ట్రంలో రాష్ట్ర స్థాయి కార్యక్రమావళి రూపొందించబడాలని సిఫారసు చేయబడింది. విద్యా నిర్వహణ పద్ధతులను మెరుగుపరచాలని, నిర్వహణ ప్రక్రియలో ప్రజలకు మరింత ఎక్కువ భాగస్వామ్యం యివ్వాలని, రాష్ట్రస్థాయి విద్యా సలహామండలులు ఏర్పరచాలని , గ్రామీణ విద్యా కమిటీలను నియమించాలని, జిల్లా విద్యా బోర్డులను స్థాపించాలని కార్యక్రమావళి పేర్కొన్నది.

1992 కార్యక్రమావళి చేసిన సూచనలు మన రాష్ట్రంలో అమలు జరుగటం లేదు. రాష్ట్ర విద్యా సలహా మండలి స్థాపించబడలేదు.

# 3. ప్రైమరీ విద్య

3.1 పైన చెప్పినట్టుగా ఒకటి నుండి ఐదు తరగతుల వరకు ప్రైమరీ విద్యగాను, 6,7 తరగతుల విద్యను ఉన్నత ప్రాథమిక (అప్పర్ ప్రైమరీ) విద్యగాను పిలుస్తున్నారు. అయినప్పటికీ మొత్తము 1–7 తరగతుల విద్య ప్రైమరీ విద్యగానే పిలువబడుతున్నది. విద్యా నిచ్చెనలో యీ ఏడు సంవత్సరాల విద్య ఒక దశగా భావింపబడుతున్నది. ఏడవ తరగతి చివర విద్యార్థులు రాష్ట్ర మంతటా సమానస్థాయిలో నిర్వహింపబడే 'కామన్ పరీక్ష'లో కూర్చోవాలి. క్రమబద్ధమైన పాఠశాలల్లో చదవని బాల బాలికలు స్వంతంగా చదువుకొని కాని, అనియత విద్యాలయాల్లో చదువుకున్న వారు కానీ ఈ పరీక్షలో ప్రైవేటు అభ్యర్థులుగా కూర్చోవచ్చు. 7 వ తరగతి కామన్ పరీక్షలో ఉత్తీర్ణులైనవారే సెకండరీ పాఠశాలల్లో 8 వ తరగతిలో చేరడానికి అర్హులు.

ప్రైమరీ పాఠశాలల్లో 1–5 తరగతి వరకు బోధనా విషయాలు మాతృభాష, సామాన్య శాస్త్రం, సామాజిక శాస్త్రం, గణితము; ఇంగ్లీషు బోధన 5 వ తరగతి నుండి ఆరంభమవుతుంది.

అప్పర్ ప్రైమరీ తరగతులలో పై విషయాలతో సహా హిందీ కూడా బోధిస్తారు. ఇది రెండవ భాషగా బోధింపబడుతుంది.

సామాన్యంగా బాల బాలికలు ఒకటవ తరగతిలో ప్రవేశం పొంది చదువు సాగించినప్పటికీ 5 వ తరగతి వరకు నేరుగా ఏ తరగతిలోనైనా (చిన్న తరగతిలో చదువు కొన్నప్పటికీ) చేరే అవకాశం వుంది. 6 వ తరగతిలో కూడా నేరుగా విద్యార్థులు చేరవచ్చు. అయితే, జిల్లా విద్యాధికారి విద్యా సంవత్సరం ఆరంభంలో నిర్వహించే ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులై వుండాలి.

1956–57లో రాష్ట్రమంతటా 29,076 ప్రైమరీ పాఠశాలలు మరియు 329 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు వుండగా ఈనాడు మొత్తం 49,247 ప్రైమరీ పాఠశాలలు, 6,341 అప్పర్ ప్రైమరీ పాఠశాలలు వెలసివున్నాయి.

1956–57 నుండి 1993–94 వరకు ప్రైమరీ మరియు అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య పెరుగుదల క్రింది పట్టికలో యివ్వబడి వుంది:

పట్టిక–IV :

1956 నుండి 1994 వరకు ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య పెరుగుదల

| సంవత్సరం | ప్రైమరీ పాఠశాలలు | అప్పర్ ప్రైమరీ పాఠశాలలు | మొత్తము |
|---|---|---|---|
| 1956–57 | 29,076 | 329 | 29,405 |
| 1965–66 | 37,320 | 2,578 | 39,898 |
| 1974–75 | 36,895 | 3,702 | 40,597 |
| 1982–83 | 41,203 | 5,079 | 46,282 |
| 1993–94 | 49,247 | 6,341 | 55,588 |

మూలం: రాష్ట్ర విద్యాశిక్షణ పరిశోధన మండలి.

1989–90 మరియు 1993–94 మధ్యకాలంలో ప్రైమరీ మరియు అప్పర్ ప్రైమరీ తరగతుల్లో చేరిన బాల బాలికల సంఖ్య క్రింది పట్టికలో యివ్వబడింది.

పట్టిక–V :

1989-90 నుండి 1993-94 వరకు విద్యార్థుల నమోదు పెరుగుదల క్రమం

| సంవత్సరం | తరగతులు | షె.కులాలు | | షె.తెగలు | | అందరు | |
|---|---|---|---|---|---|---|---|
| | | బాలురు | బాలికలు | బాలురు | బాలికలు | బాలురు | బాలికలు |
| | 1–5 | 8,17,913 | 6,08,610 | 2,97,531 | 1,83,797 | 41,85,506 | 31,02589 |
| 1989–90 | 6,7 | 1,52,567 | 86,088 | 41,774 | 18,848 | 9,30,604 | 5,37,415 |
| | 1–5 | 8,54,307 | 6,29,323 | 3,23,015 | 1,99,312 | 42,80,824 | 32,01,631 |
| 1990–91 | 6,7 | 1,63,165 | 92,661 | 43,797 | 18,728 | 9,49,835 | 5,66,614 |
| | 1–5 | 92,834 | 52,789 | 25,392 | 12,525 | 5,25,941 | 3,31,620 |
| 1991–92 | 6,7 | 1,74,679 | 1,02,908 | 46,140 | 22,684 | 10,02,011 | 6,22,448 |
| | 1–5 | 8,77,534 | 6,77,033 | 3,46,278 | 2,23,408 | 43,89,474 | 34,01,306 |
| 1992–93 | 6,7 | 1,78,882 | 1,02,757 | 51,851 | 23,761 | 9,87,582 | 6,29,430 |
| | 1–5 | 8,08,974 | 6,45,811 | 3,20,466 | 2,05,245 | 38,87,158 | 32,54,304 |
| 1993–94 | 6,7 | 1,55,218 | 91,762 | 43,243 | 16,147 | 9,04,397 | 6,17,684 |

మూలం: పాఠశాల విద్యా సంచాలకులు.

1993–94 సంత్సరములో ప్రైమరీ మరియు అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య జిల్లాల వారీగా క్రింది పట్టిక (VI)లో యివ్వబడింది. అదే పట్టికలో విద్యార్థుల సంఖ్య కూడా యివ్వబడింది.

పట్టిక–VI

1993-94లో ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య, విద్యార్థుల సంఖ్య

| క్రమసంఖ్య | జిల్లా | ప్రైమరీ | విద్యార్థులు | అప్పర్ ప్రైమరీ | విద్యార్థులు | మొత్తం పాఠశాలలు | మొత్తం విద్యార్థులు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 2521 | 2,38,252 | 182 | 49,990 | 27,03 | 2,88,242 |
| 2. | విజయనగరం | 2085 | 2,10,793 | 151 | 37,146 | 2236 | 2,47,939 |
| 3. | విశాఖ | 2315 | 2,52,860 | 210 | 73,327 | 2525 | 3,26,187 |
| 4. | తూ.గోదావరి | 2957 | 3,91,799 | 337 | 1,07,994 | 3294 | 4,99,793 |
| 5. | ప.గోదావరి | 2358 | 3,27,447 | 216 | 71,115 | 2574 | 3,98,562 |
| 6. | కృష్ణా | 2345 | 2,81,516 | 350 | 1,01,054 | 2695 | 3,82,570 |

| 7. | గుంటూరు | 2677 | 3,43,933 | 251 | 77,193 | 2928 | 4,21,126 |
|---|---|---|---|---|---|---|---|
| 8. | ప్రకాశం | 2597 | 2,91,422 | 222 | 62,234 | 2819 | 3,53,656 |
| 9. | నెల్లూరు | 2757 | 2,38,368 | 237 | 54,098 | 2994 | 2,92,466 |
| 10. | కర్నూలు | 1844 | 2,89,428 | 209 | 62,714 | 2053 | 3,52,142 |
| 11. | అనంతపురం | 2750 | 2,96,593 | 215 | 52872 | 2965 | 3,49,465 |
| 12. | కడప | 2616 | 2,36,048 | 226 | 49,292 | 2842 | 2,85,340 |
| 13. | చిత్తూరు | 3976 | 3,22,467 | 351 | 76,573 | 4327 | 3,99,040 |
| 14. | హైద్రాబాద్ | 481 | 85,906 | 296 | 95,575 | 777 | 1,81,481 |
| 15. | రంగారెడ్డి | 1181 | 1,60,406 | 298 | 91,667 | 1479 | 2,52,073 |
| 16. | మెదక్ | 1406 | 1,61,702 | 237 | 62,998 | 1643 | 2,24,690 |
| 17. | నిజామాబాద్ | 959 | 1,17,543 | 231 | 61,794 | 1190 | 1,79,337 |
| 18. | మహబూబ్ నగర్ | 1982 | 1,88,321 | 407 | 95,337 | 2389 | 2,83,658 |
| 19. | నల్లగొండ | 1855 | 2,08,286 | 355 | 87,889 | 2210 | 2,96,175 |
| 20. | వరంగల్లు | 1949 | 1,83,945 | 407 | 1,01,666 | 2356 | 2,85,611 |
| 21. | ఖమ్మం | 1638 | 1,55,778 | 260 | 62,617 | 1898 | 2,18,395 |
| 22. | కరీంనగర్ | 1540 | 1,71,323 | 419 | 1,05,648 | 1959 | 2,76,971 |
| 23. | ఆదిలాబాద్ | 2458 | 1,74,541 | 274 | 67,602 | 2732 | 2,42,143 |
| | మొత్తం | 49,247 | 53,28,677 | 6,341 | 17,08,385 | 55,588 | 70,37,062 |

మూలం: పాఠశాల విద్యా విభాగం : ఆం.ప్ర.

### 3.2 బాలికల ప్రాథమిక విద్య:

బాలికలకు విద్యావకాశాలు కల్పించటంలో మన రాష్ట్రం శ్రద్ధ కనబరిచినప్పటికి వారు పాఠశాలలో నమోదు కావటంలో కాని, నమోదై చదువు పూర్తి అయ్యేవరకు కొనసాగించటంలోకాని చెప్పుకోదగిన అభివృద్ధి జరగలేదు. 1978–79లో ప్రత్యేక బాలికల పాఠశాలల సంఖ్య 210 వుండగా 1987–88 నాటికి వాటి సంఖ్య 283. ఈ చిన్న పెరుగుదల మన రాష్ట్రంలో కో-ఎడ్యుకేషన్ పైగల మొగ్గును సూచిస్తుంది. అయినప్పటికి బాలికలు పాఠశాలల్లో నమోదు కావటంలో బాలురకన్న వెనుకబడి వున్నారు. కాగా డ్రాప్ అవుట్ శాతము బాలికల్లో ఎక్కువగా వుంది. ఏ జిల్లాలోనూ శత శాతం బాలికలు ప్రాథమిక పాఠశాలల్లో నమోదు కాలేదు. అన్నింటికన్న ఎక్కువ బాల బాలికల నమోదు శాతం గల పశ్చిమ గోదావరి జిల్లాలో కేవలం 74.40 శాతం బాలికలు ప్రాథమిక పాఠశాలల్లో నమోదు పొందారు. చాలా జిల్లాల్లో బాలికల నమోదు శాతం 80 కన్న ఎక్కువగా లేదు. తెలంగాణా జిల్లాల్లో బాలికల నమోదు శాతం 45 నుండి 66 మధ్యనవుంది. 1983–84 నుండి 1993–94 మధ్య కాలంలో ఒకటవ తరగతిలో బాల బాలికల నమోదు పెరుగుదల క్రింది పట్టిక (VII)లో యివ్వబడింది.

**పట్టిక–VII :**
**1983 నుండి 1994 వరకు ఒక తరగతిలో బాల బాలికల నమోదు పెరుగుదల**

| సంవత్సరం | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| 1983–84 | 12,09,814 | 9,04,497 | 21,14,311 |
| 1985–86 | 12,40,445 | 9,55,385 | 21,95,830 |
| 1987–88 | 12,99,977 | 10,04,803 | 23,04,780 |
| 1989–90 | 13,08,595 | 10,17,868 | 23,26,463 |
| 1991–92 | 12,93,522 | 9,96,371 | 22,89,893 |
| 1993–94 | 11,80,969 | 10,30,072 | 22,11,041 |

మూలం : రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణామండలి

1993–94లో 1–5 తరగతుల బాల బాలికల నమోదు శాతం కింది పట్టిక (VIII)లో యివ్వబడింది.

**పట్టిక–VIII :**

**1993-94లో 1 నుండి 5 తరగతుల్లో బాల బాలికల నమోదు శాతం**

| క్రమ సంఖ్య | జిల్లా | బాలుర నమోదు శాతం | బాలికల నమోదు శాతం | సగటు శాతం |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 89.01 | 75.13 | 82.03 |
| 2. | విజయనగరం | 85.76 | 72.01 | 78.89 |
| 3. | విశాఖ | 73.85 | 63.59 | 68.78 |
| 4. | తూ.గోదావరి | 72.74 | 73.41 | 73.07 |
| 5. | ప. గోదావరి | 72.83 | 74.40 | 73.61 |
| 6. | కృష్ణా | 68.18 | 67.68 | 67.94 |
| 7. | గుంటూరు | 70.65 | 65.31 | 68.02 |
| 8. | ప్రకాశం | 91.74 | 76.91 | 84.44 |
| 9. | నెల్లూరు | 83.99 | 77.43 | 80.74 |
| 10. | కర్నూలు | 89.11 | 68.50 | 79.05 |
| 11. | అనంతపురం | 80.02 | 65.98 | 73.20 |
| 12. | కడప | 88.40 | 79.41 | 84.01 |
| 13. | చిత్తూరు | 81.91 | 77.26 | 79.63 |
| 14. | హైదరాబాద్ | 68.81 | 73.81 | 71.22 |
| 15. | రంగారెడ్డి | 89.05 | 73.52 | 81.52 |
| 16. | మెదక్ | 82.19 | 57.38 | 69.98 |
| 17. | నిజామాబాద్ | 74.02 | 57.03 | 65.45 |
| 18. | మహబూబునగరం | 76.56 | 45.99 | 61.49 |
| 19. | నల్లగొండ | 78.26 | 59.91 | 69.27 |
| 20. | వరంగల్లు | 83.54 | 65.88 | 74.88 |
| 21. | ఖమ్మం | 74.27 | 62.02 | 68.27 |
| 22. | కరీంనగర్ | 68.78 | 57.48 | 63.17 |
| 23. | ఆదిలాబాద్ | 81.49 | 66.16 | 76.93 |
| | ఆం.ప్ర. | 78.67 | 67.75 | 73.29 |

మూలం: రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణామండలి.

రాష్ట్ర మొత్తంలో బాలికల నమోదు శాతం మహబూబ్ నగరంలో అత్యంత తక్కువగా వుండటం గమనించవచ్చు. అన్నింటికన్న ఎక్కువ నమోదు శాతం కడపలో వుంది. బాలుర నమోదు శాతంలోనూ, మొత్తం బాల బాలికల నమోదు శాతంలోనూ ప్రకాశం అగ్రగామిగావుంది.

అప్పర్ ప్రైమరీ తరగతులు అంటే 6,7 తరగతులలో బాలుర సగటు నమోదు శాతం 38.83 వుండగా బాలికల నమోదు శాతం కేవలం 14.90 వుంది. ఈ తరగతులలో రాష్ట్రం మొత్తంపై బాల బాలికల సగటు నమోదు శాతం 27.02. ఈ తరగతులలో బాలుర, బాలికల నమోదు శాతం అత్యధికంగా (105.86 మరియు 75.95) హైదరాబాదులో వుంది. బాలుర అత్యల్ప నమోదు శాతం (24.52) నెల్లూరులో, బాలికల అత్యల్ప నమోదు శాతం (5.74) మహబూబునగర్‌లో వుంది.

## 3.3. డ్రాప్ అవుట్ సమస్య:

ప్రాథమిక విద్యకు సంబంధించి మన రాష్ట్రం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య విద్యార్థులను పాఠశాలలో నమోదు చేశాక వారు మధ్యంతరంగా చదువు వదిలి

పెట్టకుండా చూడటం. బడిలో చేరిన విద్యార్థులందరూ కనీసం ప్రైమరీ విద్య పూర్తి చేయటం అవసరం. అలా జరగక పోతే వారు తిరిగి నిరక్షరాస్యతలో మునిగి ప్రాథమిక విజ్ఞానం మరియు కుశలతలను కోల్పోయి ఉత్పత్తికి తోడ్పడలేని వారుగా మిగిలిపోయే ప్రమాదం వుంది.

1977 మరియు 1988 మధ్యకాలంలో ఒకటినుండి నాల్గవ తరగతుల్లో చదువు వదిలిన బాలుర మరియు బాలికల శాతం క్రమంగా తగ్గినప్పటికీ ఈ నాటికీ అలాంటి వారి (డ్రాపవుట్సు) శాతం జాతీయ సగటు శాతంకన్నా ఎక్కువే. మొదటి తరగతిలోనే డ్రాపవుటు అయ్యేవారి సంఖ్య అధికం. 1977–1988 మధ్యకాలంలో ఒకటవ తరగతినుండి నాల్గవ తరగతివరకు డ్రాపవుట్ అయిన బాలుర మరియు బాలికల సగటు శాతం క్రింది పట్టిక (IX)లో యివ్వనైనది.

పట్టిక–IX: 1977 మరియు 1988 మధ్యకాలంలో
బాల బాలికల డ్రాపవుట్ శాతం

| తరగతి | బాలురు | బాలికలు |
|---|---|---|
| I | 35.32 | 35.99 |
| II | 11.36 | 12.07 |
| III | 7.08 | 7.61 |
| IV | 3.85 | 4.86 |
| సగటు | 57.61 | 60.53 |

1993–94 సంవత్సరం అంచనాల ప్రకారం ఒకటి నుండి ఐదవ తరగతి వరకు బాలురలో 55.50 శాతం డ్రాపవుట్ కాగా, బాలికలలో ఈ శాతం 55.91. అదే సంవత్సరం ఒకటినుండి ఏడవ తరగతివరకు డ్రాపవుట్ అయిన బాలురు 65.98 శాతం మరియు బాలికలు 70.25 శాతం. 1–5 తరగతుల్లో బాలబాలికల సగటు డ్రాపవుట్ రేటు 55.68 మరియు 1–7 తరగతుల్లో బాలబాలికల సగటు డ్రాపవుట్ రేటు 67.81. అంటే, 100 బాల బాలికలు ఒకటవ తరగతిలో చేరితే, 32.19 మంది మాత్రం సెకండరీ విద్యకు అర్హులౌతారన్న మాట. జాతీయంగా సగటు డ్రాపవుట్ రేటు 51.0. అంటే మన రాష్ట్రంలో డ్రాపవుట్ రేటు జాతీయ సగటు కన్న 16.81 శాతం ఎక్కువ.

షెడ్యూలు కులాలు మరియు షెడ్యూలు తెగల విద్యార్థులలో డ్రాపవుట్ రేటు మరింత ఎక్కువగా వుంది. షెడ్యూలు కులాల విద్యార్థులలో ఈ రేటు 75.97 వుండగా షెడ్యూలు తెగలవారిలో అది 84.72

1993–94లో అన్ని వర్గాల విద్యార్థుల డ్రాపవుట్ శాతాలు క్రింది పట్టిక (X)లో యివ్వబడింది.

పట్టిక–X:
1993-94లో వివిధ వర్గాల బాలబాలికల డ్రాపవుట్ శాతం

| తరగతులు | షె.కులాలు | | | షె.తెగలు | | | అందరు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | సగటు | బాలురు | బాలికలు | సగటు | బాలురు | బాలికలు | సగటు |
| 1 నుండి 5 | 59.27 | 63.94 | 61.34 | 72.48 | 78.08 | 74.63 | 55.50 | 55.91 | 55.68 |
| 1 నుండి 7 | 73.00 | 79.83 | 75.97 | 82.06 | 89.20 | 84.72 | 65.98 | 70.25 | 67.81 |

## 3.4. నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టం:

సార్వజనీన ప్రాథమిక విద్యా లక్ష్యాన్ని సాధించేందుకు 1961లో నిర్బంధ ప్రాథమిక విద్యా చట్టాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టింది. దీనివల్ల కొంత మంచి జరిగింది. ఒక వైపు పాఠశాలల సంఖ్య పెరిగింది. మరోవైపు విద్యార్థుల నమోదు శాతం కూడా పెరిగింది. 1960–61లో 29.76 లక్షల విద్యార్థులు ప్రైమరీ పాఠశాలల్లో నమోదై వుండగా 1965–66 కల్లా అది 37.69 లక్షలైంది. అదే కాలంలో బాల బాలికల సగటు నమోదు శాతం 68.3 నుండి 76.5కు పెరిగింది. అయితే, విద్యార్థులు పాఠశాలల్లో చేరి వున్నప్పటికి 6–11 సంవత్సరాల బాల బాలికల సగటు నమోదు శాతం 83.8 మాత్రమే. నిర్బంధ ప్రాథమిక విద్యాచట్టంలోవున్న లొసుగులు మరియు దానిని అమలుపరచటంలో ఎదురైన పలు సమస్యలు యీ చట్టంద్వారా సాధించదలచిన లక్ష్యాల్ని సాధించలేక పోవడానికి కారణాలయ్యాయి.

## 3.5. అనియత విద్య - ప్రాథమిక విద్య ప్రత్యామ్నాయం:

రాజ్యాంగంలోని 45 వ అధికరణాన్ననుసరించి రాజ్యాంగం అమలులోకి వచ్చిన 10 సంవత్సరాలలో 6–14 సంవత్సరాల బాల బాలికలకు సార్వజనీన ప్రాథమిక విద్య అందింప చేయాల్సి వుండగా ఆ లక్ష్యం నెరవేరలేదు.

బాల బాలికల్ని పాఠశాలలకు రప్పించి, వారికి విద్య నందించడానికి ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకోలేక

పోయింది. తగినన్ని పాఠశాలలు తెరవలేకపోవటం, ఉపాధ్యాయుల్ని నియమించలేకపోవటం, పాఠశాలల్లో వసతులు సమకూర్చలేకపోవటం ఒకవైపు కారణాలు కాగా, మరోవైపు పాఠశాలల్లో విద్యార్థులు నమోదు చేయలేక పోవటం మరియు నమోదైన విద్యార్థులు మధ్యంతరంగా చదువు మానివేయడం ఈ పరిస్థితికి కారణాలయ్యాయి.

సార్వజనీన ప్రాథమిక విద్యా లక్ష్యాన్ని సాధించటం కొరకు ప్రభుత్వం ప్రత్యామ్నాయ పద్ధతిని రూపొందించింది. అదే అనియత విద్యా పద్ధతి. పాఠశాలల్లో నమోదు కాలేని బాల బాలికలు, నమోదై మధ్యంతరంగా చదువు వదిలిన వారిని సాయంసమయాల్లో ఒక దగ్గర చేర్చి విద్యాభ్యాసం చేయించడం ఈ పద్ధతి ఉద్దేశం. మామూలుగా ఉదయపు సమయాల్లో నడిపే బదులు పాఠశాలల్ని సాయంకాలం కాని, రాత్రి సమయాల్లోకాని నడిపితే బాల బాలికలు చేరి చదువగలరని ప్రభుత్వం ఆశించి సాయం పాఠశాలల్ని నడిపే ప్రయోగం చేసింది. ఈ ప్రయోగం సఫలమైంది. అధికారికంగా 1979-80లో కేంద్ర ప్రభుత్వం అనియత విద్యా పథకాన్ని ఆరంభించింది. మన రాష్ట్రంలో 1976 లో కృష్ణా మరియు ఖమ్మం జిల్లాల్లో సాయం పాఠశాలలు నెలకొల్పారు. ప్రయోగం సఫలం కావటం, కేంద్రం అనియత విద్యా పద్ధతిని అమలు జరుపటంతో మనరాష్ట్రంలో 1979–80 నుండి అనియత విద్యా కేంద్రాలు స్థాపించారు. ప్రభుత్వ నిర్వహణలోనే కాక వాలంటరీ సంస్థలు కూడా ఈ కేంద్రాలను నడుపుతున్నవి. 1979 నుండి 1993–94 మధ్యకాలంలో రాష్ట్రంలో అనియత విద్యా కేంద్రాల సంఖ్య క్రింది పట్టిక (XI)లో యివ్వబడింది.

పట్టిక–XI :
1979-80 మరియు 1993-94 మధ్యకాలంలో అనియత విద్యాకేంద్రాల సంఖ్య

| సంవత్సరం | మొదటి దశ | | | రెండవ దశ | మొత్తం |
|---|---|---|---|---|---|
| | ఉమ్మడి కేంద్రాలు | బాలికల కేంద్రాలు | మొత్తం | | |
| 1979–80 | 2,640 | – | 2,640 | – | 2,640 |
| 1980–81 | 4,020 | – | 4,020 | – | 4,020 |
| 1981–82 | 4,020 | – | 4,020 | – | 4,020 |
| 1982–83 | 6,780 | – | 6,780 | – | 6,780 |
| 1983–84 | 6,780 | – | 6,780 | – | 6,780 |
| 1984–85 | 16,440 | 1,012 | 17,452 | – | 17,452 |
| 1985–86 | 16,440 | 1,012 | 17,452 | – | 17,452 |
| 1986–87 | 20,760 | 1,012 | 21,772 | 2800 | 24572 |
| 1987–88 | 20,760 | 1,012 | 21,772 | 2800 | 24572 |
| 1988–89 | 15,398 | 6,202 | 21,600 | 2800 | 24,400 |
| 1989–90 | 16,398 | 6,202 | 22,600 | 2800 | 25,400 |
| 1990–91 | 16,398 | 6,202 | 22,600 | 2800 | 25,400 |
| 1991–92 | 16,398 | 6,202 | 22600 | 2800 | 25,400 |
| 1992–93 | 16,398 | 6,202 | 22600 | 2800 | 25,400 |
| 1993–94 | 16,398 | 6,202 | 22600 | 2800 | 25,400 |

మూలం: రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణా మండలి.

1993–94లో రాష్ట్రం మొత్తం పై మొదటి దశ అనియత విద్య నభ్యసిస్తున్న బాలుర సంఖ్య 3,15,927 కాగా, బాలికల సంఖ్య 2,74,589. రెండవ దశలో చదువుతున్న బాలుర సంఖ్య 39,515 మరియు బాలికల సంఖ్య 21,290.

1993–94లో జిల్లాల వారీ అనియత విద్యా కేంద్రాల సంఖ్య మరియు అందులో చదువుతున్న విద్యార్థుల సంఖ్య పట్టిక XIIలో యివ్వబడింది.

పట్టిక–XII:
1993-94లో జిల్లావారీ కేంద్రాల సంఖ్య మరియు విద్యార్థుల సంఖ్య

| క్రమసంఖ్య | జిల్లా | మొదటి దశ | | రెండవదశ | |
|---|---|---|---|---|---|
| | | కేంద్రాలు | విద్యార్థులు | కేంద్రాలు | విద్యార్థులు |
| 1. | శ్రీకాకుళం | 1031 | 24,290 | 110 | 1,956 |
| 2. | విజయనగరం | 934 | 22,794 | 110 | 2,690 |
| 3. | విశాఖ | 1112 | 23,610 | 120 | 2,174 |
| 4. | తూ.గోదావరి | 1104 | 28,120 | 120 | 2,927 |
| 5. | ప.గోదావరి | 1123 | 27,921 | 120 | 2,876 |
| 6. | కృష్ణా | 1105 | 30,771 | 120 | 2,738 |
| 7. | గుంటూరు | 1206 | 30,514 | 130 | 2,736 |
| 8. | ప్రకాశం | 1082 | 27,543 | 120 | 2,978 |
| 9. | నెల్లూరు | 1049 | 26,052 | 120 | 2,807 |
| 10. | కర్నూలు | 990 | 27,626 | 120 | 4,779 |
| 11. | అనంతపురం | 1053 | 27,608 | 120 | 2,300 |
| 12. | కడప | 819 | 21,428 | 120 | 3,010 |
| 13. | చిత్తూరు | 1103 | 30,892 | 130 | 3,247 |
| 14. | హైద్రాబాద్ | 730 | 17,852 | 170 | 3,586 |
| 15. | రంగారెడ్డి | 717 | 23,796 | 170 | 1,441 |
| 16. | మెదక్ | 824 | 22,492 | 120 | 4,139 |
| 17. | నిజామాబాద్ | 741 | 22,753 | 110 | 2,676 |
| 18. | మహబూబునగర్ | 1041 | 30,515 | 120 | 1,005 |
| 19. | నల్లగొండ | 984 | 29,454 | 130 | 1,326 |
| 20. | వరంగల్లు | 1027 | 19,596 | 120 | 2,108 |
| 21. | ఖమ్మం | 972 | 26,367 | 120 | 1,845 |
| 22. | కరీంనగర్ | 1014 | 26,400 | 120 | 2,904 |
| 23. | ఆదిలాబాద్ | 839 | 21,722 | 120 | 2,514 |
| | మొత్తం | 22,600 | 5,90,516 | 2,800 | 60,805 |

మూలం: రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణామండలి.

అనియత విద్య పాఠ్యప్రణాళిక దాదాపు నియత విద్య ప్రణాళికతో సమానంగా వున్నప్పటికీ ప్రణాళిక విభజన మరియు బోధన సామగ్రి భిన్నంగా వుంటుంది. తరగతులు వారీగా కాక ఎప్పటికప్పుడు మూల్యాంకనం చేసి విద్యార్థుల స్థాయిని నిర్ణయించుతారు. ఒకటి నుండి ఐదు తరగతుల విద్యను మొదటి దశగాను, ఆరు మరియు ఏడు తరగతుల విద్యను రెండవ దశగాను విభజించారు. అనియత విద్య చదువుతున్న బాల బాలికలను నియత విద్య యొక్క వివిధ దశలలోని స్థాయిలతో సమానంగా పరీక్షించి, ఉత్తీర్ణులైన వారిని మామూలు పాఠశాలలో చేర్చడం లేక ఓపెన్ స్కూలు ద్వారా సెకండరీ విద్య నందించడం ప్రభుత్వం యొక్క లక్ష్యం.

స్థానికంగానే. నివసించే విద్యావంతులను బోధకులుగా నియమించడంవల్ల విద్యార్థుల మరియు బోధకుల మధ్య సత్సంబంధాలు ఏర్పడి, బోధనా లక్ష్యాలను సాధించటం సులభమౌతుంది. అనియత విద్యా కేంద్రము విద్యార్థుల సమయానుకూలంగా నడపడంవలన వారు విద్య పట్ల ఎక్కువ శ్రద్ధాసక్తులు కనబరుస్తున్నారు.

# 4. సెకండరీ విద్య

4.1 ముందు చెప్పినట్టుగా మన రాష్ట్రంలో సెకండరీ విద్య ఎనిమిదవ తరగతి నుండి పదవ తతరగతి వరకు

సాగుతుంది. అంటే సెకండరీ విద్యా కాలం 3 సంవత్సరాలు. పదవ తరగతి చివర సెకండరీ స్కూలు సర్టిఫికేటు పరీక్షలు జరుగుతాయి. కమీషనర్ ఫర్ గవర్నమెంటు ఎగ్జామినేషన్స్ ఈ పరీక్షలను రాష్ట్రమంతటా నిర్వహిస్తారు.

సెకండరీ పాఠశాలల్లో మాతృభాష (మొదటి భాష), హిందీ (రెండవ భాష), ఇంగ్లీషు (మూడవ భాష), సామాన్య శాస్త్రము, సామాజిక శాస్త్రము మరియు గణితము బోధనా విషయాలు. కొన్ని పాఠశాలల్లో వృత్తి విద్యా కోర్సులు ప్రవేశపెట్టివున్నారు. అలాంటి పాఠశాలల్లో ఆయా కోర్సులు తీసుకున్నవారు ప్రాక్టికల్ పరీక్షల్లో ఉత్తీర్ణులవ్వవలసి వుంటుంది.

సెకండరీ పాఠశాల మొదటి సంవత్సరం, అంటే ఎనిమిదవ తరగతిలో చేరడానికి ఒక విద్యార్థి ఏడవ తరగతి కామన్ పరీక్షలో ఉత్తీర్ణుడై వుండాలి. కనీస వయస్సు 12 సం॥లకు పైబడి వుండాలి. యస్.యస్.సి. పరీక్షలో కూర్చోవడానికి కనీస వయస్సు 15 సంవత్సరాలు.

సెకండరీ తరగతులలో 8 మరియు 9 తరగతుల చివర జిల్లా కామన్ పరీక్షల కమిటీ జిల్లా స్థాయి పరీక్షలను నిర్వహిస్తుంది. అయితే, పరీక్షలలో ఏ విద్యార్థిని కూడా ఫెయిల్ చేయరు. ప్రైమరీ విద్యలో లాగానే 8,9 తరగతులకు నాన్ డిటెన్షన్ పద్ధతి అమలుపరుస్తారు.

సెకండరీ పాఠ్యప్రణాళిక 1986 జాతీయ విద్యా విధానంలో సూచించిన మరియు జాతీయ విద్యా పరిశోధన శిక్షణా మండలి (యన్.సి.ఇ.ఆర్.టి.) రూపొందించిన మౌలిక ప్రణాళిక (కోర్ కర్రికులమ్)కు లోబడి రూపొందించబడింది. కోర్ కర్రికులమ్‌లోని అంగాలు యివి:

భాషలు (మాతృ భాష, హిందీ, ఇంగ్లీషు)
గణితము

సామాజిక శాస్త్రం (చరిత్ర, భూగోళ శాస్త్రం, పౌరశాస్త్రం మరియు ఆర్థిక శాస్త్రము.)
పని అనుభవము
కళలు

## ఆరోగ్య మరియు వ్యాయామ విద్య:

భాషల బోధన త్రిభాషా సూత్రం అమలులో భాగంగా జరుగుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో గణితము మరియు విజ్ఞాన శాస్త్రములో సిలబసు మిగిలిన రాష్ట్రాల కన్నా ఉన్నతమైనది మరియు మెరుగైనది. ఈ రెండు బోధనాంశాలలో ఒకటవ తరగతి నుండి పదవ తరగతి వరకు మెరుగైన సిలబసు ప్రవేశ పెట్టారు. పని అనుభవము ద్వారా సామాజికంగా ఉపయోగపడే ఉత్పత్తులు మరియు సేవలను సాధించటం జరగాలని జాతీయ విధానం నిర్దేశించింది. అయితే, అలాంటి విద్య చాలా పాఠశాలల్లో జరగటం లేదు. పని అనుభవంలో భాగంగా వృత్తి విద్యా కోర్సులు కూడా ఆరంభించవచ్చు. ఈ సూచన ఆధారంగానే మన రాష్ట్రంలో కొన్ని పాఠశాలల్లో వృత్తివిద్యా కోర్సులను ఎనిమిదవ తరగతినుండి ఆరంభించారు.

1956–57లో రాష్ట్రం మొత్తం మీద 733 సెకండరీ పాఠశాలల్లో 1,69,653 విద్యార్థులు చదువుతూండగా, 1993–94 నాటికి 7,145 పాఠశాలలు వెలిశాయి. అందులో 30,86,972 విద్యార్థులు చేరి వున్నారు. అంటే, పాఠశాలల సంఖ్య దాదాపు 10 రెట్లు అయింది. విద్యార్థుల సంఖ్య 20 రెట్లు అయింది. ఈ కాలంలో సెకండరీ విద్యా వ్యాప్తి బాగానే వున్నట్టు కనబడినా ప్రైమరీ పాఠశాలల్లో చేరియున్న విద్యార్థులు డ్రాప్ కాకుండా వుండి వుంటే యీ పెరుగుదల సరిపోయి వుండేది కాదని తేలిగ్గానే అర్థం చేసుకోవచ్చు. 1956–57 నుండి 1993–94 వరకు సెకండరీ పాఠశాల సంఖ్య మరియు విద్యార్థుల సంఖ్యలో పెరుగుదలను క్రింది పట్టిక (XIII)లో చూడవచ్చు.

పట్టిక–XIII:
1956-57 మరియు 1993-94 మధ్య
సెకండరీ పాఠశాలల పెరుగుదల

| సంవత్సరం | పాఠశాలల సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| 1956–57 | 733 | 1,69,563 |
| 1965–66 | 2297 | 9,73,114 |
| 1974–75 | 3276 | 11,16,330 |
| 1982–83 | 4036 | 17,40,265 |
| 1993–94 | 7145 | 30,86,972 |

మూలం: రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణామండలి.

1993–94లో జిల్లాల వారీ సెకండరీ పాఠశాలల సంఖ్య మరియు వానిలో నమోదైన విద్యార్థుల సంఖ్య క్రింది పట్టిక (XIV) లో యివ్వబడింది.

పట్టిక-XIV:
1993-94లో జిల్లాల వారీ సెకండరీ పాఠశాలలు మరియు విద్యార్థుల సంఖ్య

| క్ర.సం. | జిల్లాలు | యాజమాన్యాలవారి పాఠశాలలు | | | | | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| | | ప్రభుత్వ | స్థానిక సంస్థలు | ప్రైవేటు ఎయిడెడ్ | ప్రైవేటు అనెయిడెడ్ | మొత్తం | |
| 1. | శ్రీకాకుళం | 38 | 158 | 1 | 4 | 201 | 88,516 |
| 2. | విజయనగరం | 25 | 142 | 12 | 6 | 185 | 74,395 |
| 3. | విశాఖ | 49 | 133 | 26 | 25 | 233 | 1,43,296 |
| 4. | తూ.గోదావరి | 37 | 264 | 51 | 30 | 382 | 1,87,029 |
| 5. | ప.గోదావరి | 25 | 243 | 40 | 9 | 318 | 1,33,533 |
| 6. | కృష్ణా | 22 | 231 | 61 | 22 | 336 | 1,41,784 |
| 7. | గుంటూరు | 21 | 245 | 81 | 23 | 370 | 1,65,794 |
| 8. | ప్రకాశం | 30 | 200 | 44 | 23 | 297 | 1,00,200 |
| 9. | నెల్లూరు | 29 | 227 | 20 | 21 | 297 | 1,04,815 |
| 10. | కర్నూలు | 34 | 172 | 36 | 29 | 271 | 1,08,266 |
| 11. | అనంతపురం | 28 | 235 | 13 | 15 | 291 | 1,17,703 |
| 12. | కడప | 19 | 216 | 26 | 29 | 290 | 96,005 |
| 13. | చిత్తూరు | 31 | 284 | 19 | 28 | 362 | 1,35,431 |
| 14. | హైదరాబాద్ | 107 | – | 128 | 217 | 452 | 3,58,228 |
| 15. | రంగారెడ్డి | 15 | 174 | 18 | 135 | 342 | 1,90,265 |
| 16. | మెదక్ | 26 | 184 | 18 | 25 | 253 | 98,447 |
| 17. | నిజామాబాద్ | 28 | 196 | 5 | 9 | 238 | 96,843 |
| 18. | మహబూబునగర్ | 39 | 263 | 19 | 37 | 358 | 1,13,810 |
| 19. | నల్లగొండ | 33 | 289 | 32 | 43 | 397 | 1,21,923 |
| 20. | వరంగల్లు | 52 | 234 | 25 | 93 | 404 | 1,78,770 |
| 21. | ఖమ్మం | 54 | 168 | 21 | 15 | 258 | 93,672 |
| 22. | కరీంనగర్ | 39 | 248 | 12 | 92 | 391 | 1,52,697 |
| 23. | ఆదిలాబాద్ | 53 | 131 | 10 | 25 | 219 | 85,550 |
| | మొత్తం | 834 | 4638 | 718 | 955 | 7,145 | 30,86,972 |

మూలం: రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణామండలి.

ముఖ్య పట్టణమైన హైదరాబాద్‌లో సెకండరీ పాఠశాలల సంఖ్య 452. అందులో నమోదైన విద్యార్థుల సంఖ్య 3,58,228 రాష్ట్రంలో కల్లా అత్యధికంగా వుండటం సహజంగానే చూడవచ్చు. అత్యల్పమైన పాఠశాలల సంఖ్య, అలాగే అందులో విద్యార్థుల సంఖ్య విజయనగరంలో వున్నవి.

పాఠశాలల విద్యార్థుల సౌకర్యాన్ననుసరించి వారి నివాస స్థలాల నుండి నడువగల దూరంలో వుండకపోవడం పట్టణాల్లో గుంపుగా వెలసియుండటం వంటి కారణాలవల్ల వారికి ఇబ్బందిగా వుంటూ వుంది. గ్రామీణ ప్రాంతాల్లో విద్యార్థులు నడువగలిగిన దూరంలో పాఠశాలలు స్థాపింపబడక పోవటం వల్లనూ, నగరాల్లో పాఠశాలలు ఒకే పరిధిలో క్రిక్కిరిసి గుంపులుగా వుండటం వల్లనూ యిబ్బందులు ఏర్పడుతున్నవి.

రాష్ట్రంలో ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ పాఠశాలల మరియు సెకండరీ పాఠశాలల నిష్పత్తి 7.7:1 గా వుంది. ప్రతి 1.86 అప్పర్ ప్రైమరీ పాఠశాలలకు ఒక సెకండరీ పాఠశాల వుండాలని లక్ష్యం పెట్టబడింది. కానీ, మన రాష్ట్రంలో ఈ లక్ష్యం సాధింపబడలేదు.

### 4.2. సార్వత్రిక విద్యావ్యవస్థ - ఓపెన్ స్కూళ్ళు:

ప్రైమరీ స్థాయిలో చేరిన బాల బాలికలలో సగానికి పైగా చదువు పూర్తికాకుండానే పాఠశాలలు వదిలి పెడ్తారని చెప్పుకున్నాము. ఒకటి నుండి 5 వరకు గల విద్యార్థులలో 55.68%, ఏడవ తరగతి చివర 67.81% విద్యార్థులు డ్రాపవుట్ అవుతున్నారు. డ్రాపవుట్ రేటు బాలికల్లో చాలా ఎక్కువగా వుంది. షెడ్యూలు కులాలు మరియు షెడ్యూలు తెగల విద్యార్థులలో మరీ ఎక్కువగా వుంది. ఇలా చదువు పూర్తిచేయకుండా వదిలిపెట్టున్న బాల బాలికలు చదువు కొనసాగింప గలగటానికి సార్వత్రిక విద్యావ్యవస్థను రూపొందించారు.

1991లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 'ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విద్యాపీఠం' అనే సంస్థను నెలకొల్పింది. చదువు మానేసిన బాల బాలికలు యింటిలో వుండి చదువుకొనే అవకాశం కల్పించటం యీ సంస్థ లక్ష్యం. ప్రస్తుతం ఈ పద్ధతి విద్య 5 జిల్లాలకు (నిజామాబాద్, మెదక్, చిత్తూరు, నెల్లూరు, మరియు విశాఖ) పరిమితం.

ఓపెన్ స్కూలు వ్యవస్థ వాస్తవంగా ప్రైమరీ స్థాయిలో అమలు పరుస్తున్న అనియత విద్య యొక్క విస్తరణ. పరోక్షబోధన మరియు విలేఖన పాఠాల ద్వారా బడి మానేసిన బాల బాలికలు తమ తీరిక వేళల్లో చదువు సాగించడం ఈ వ్యవస్థ లక్ష్యం. 12 సం॥ వయసు పూర్తయిన, స్వయం కృషితో కొంత చదువు నేర్చుకున్నవారు లేక, 6,7 తరగతులతో చదువు చాలించినవారు ఈ పద్ధతి ప్రారంభ కోర్సుకు అర్హులు. ఈ కోర్సులో ప్రవేశం పొందటానికి గరిష్ఠ వయోపరిమితి ఏదీ లేదు. ప్రారంభ కోర్సు 2 సంవత్సరాలది. ప్రారంభ కోర్సు పూర్తి చేసిన వారు 7 వ తరగతి పూర్తి చేసినవారితో సమానముగా గుర్తించబడతారు. ఈ కోర్సును మొదటి స్థాయి కోర్సుగా పిలుస్తారు. రెండవ స్థాయి కోర్సు 8,9,10 తరగతులకు సంబంధించినది. ఇది మూడు సంవత్సరాల కోర్సు. ఇలా మొత్తం ఏడు సంవత్సరాలలో బాల బాలికలు సెకండరీ స్థాయి విద్యను పూర్తి చేయగలుగుతారు. రెండవ స్థాయి కోర్సు చివర పబ్లిక్ పరీక్ష వుంటుంది.

ఈ విద్యా పద్ధతిని స్వీకరించిన వారి సౌకర్యం కొరకు వారు నివసిస్తున్న గ్రామము లేక వార్డులో ఓపెన్ స్కూలు అధ్యయన కేంద్రములు నెలకొల్పుతారు. ఈ కేంద్రాలు పాఠశాలల్లో వుంటుంది. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు లేక అనుభవం కల ఉపాధ్యాయుడు కౌన్సెలర్‌గా వ్యవహరిస్తూ అధ్యయన కార్యక్రమానికి తోడ్పడుతాడు. విద్యార్థులను పరీక్షలకు పంపే ఏర్పాట్లు ఓపెన్ స్కూలు విద్యార్థులందరికీ ప్రత్యేకంగా వ్రాయించిన పాఠాలు టీచర్ కౌన్సెలర్ ద్వారా సరఫరా చేయబడతాయి. అధ్యయన కేంద్రాలలో వారానికి మూడు సార్లు విద్యార్థులకు అభ్యసన సౌకర్యాలు అందిస్తారు. అయినా, విద్యార్థులు,కౌన్సెలర్ తమ తమ సమయానుసారము ఎప్పుడైనా కలుసుకోవచ్చును. అయితే సంవత్సరంలో 40-45 రోజులు అధ్యయన కేంద్రాలలో కాంటాక్టుప్రోగ్రాం నిర్వహింపబడుతుంది. దసరా, సంక్రాంతి, క్రిష్టమస్ శలవులలో జరిగే ఈ కాంటాక్టు ప్రోగ్రాంలో విద్యార్థులు తప్పనిసరిగా హాజరు కావాలి. బోధనామాధ్యమం తెలుగు.

ఓపెన్ స్కూలు విద్యా పద్ధతి రాష్ట్రంలోని జైళ్ళలో బందీలుగావున్న వారికికూడా విస్తరింపచేస్తారు. నాలుగు సెంట్రల్ జైళ్ళలో ప్రస్తుతం మొత్తం 510 బందీలు ఈ పద్ధతి ద్వారా విద్యను కొనసాగిస్తున్నారు. రాష్ట్రంలో ఓపెన్ స్కూల్ పద్ధతిలో ఈనాడు మొత్తం 7477 బాల బాలికలు విద్యను కొనసాగిస్తున్నారు.

## 5. పూర్వ ప్రాథమిక విద్య (ప్రిప్రైమరీ విద్య)

5.1 నిరక్షరాస్యత పూర్తిగా తొలగింపబడని మన సమాజంలో, విద్యపట్ల సరియైన అవగాహన లేని జనసందోహంలో ప్రిప్రైమరీ విద్య అత్యంత ప్రముఖ స్థానం వహిస్తుంది. ప్రిప్రైమరీ విద్య వల్ల ప్రైమరీ పాఠశాలల్లో బాల బాలికల నమోదు పెరుగుతుంది. పిల్లల్లో విద్యపట్ల శ్రద్ధ, ఆసక్తి పెరుగుతుంది. ప్రైమరీ విద్య సాధనకై వారు సుమనస్కులౌతారు.

1956-57లో మన రాష్ట్రంలో కేవలం 17 ప్రిప్రైమరీ పాఠశాలలు వుండినవి. 1965-66 కల్లా వీటి సంఖ్య 112 ఐంది. ఆ తరువాత వాని సంఖ్య తగ్గుతూ వచ్చింది. 1982-83లో తిరిగి 210కి పెరిగింది. కాని 1987-88లో కేవలం 35కి తగ్గింది. వాస్తవంగా ప్రిప్రైమరీ విద్యకు సంబంధించి పాఠశాలల విషయంలో కాని, అందలి విద్యార్థుల విషయంలోకాని సంఖ్యా వివరాలు తెలుపటం కష్టం. కారణమేమిటంటే, యీ స్థాయి విద్య ప్రభుత్వపరిధిలో లేదు. సంఖ్యా వివరాలు సేకరించగల యంత్రాంగమూ లేదు.

ప్రిప్రైమరీ పాఠశాలలు నెలకొల్పుటకు, నిర్వహించుటకు ప్రభుత్వ అనుమతి అవసరం లేదు. ఆ కారణం చేత యీ పాఠశాలలు ప్రైవేటు యాజమాన్యాల చేత స్థాపించబడుతున్నవి. ఈ యాజమాన్యాలు విద్యార్థుల నుండి అధిక ఫీజులు వసూలు చేస్తాయి. ప్రిప్రైమరీ పాఠశాలల్లో పని చేసే ఉపాధ్యాయులు శిక్షణ పొంది వుండాలనే నిబంధన ఏదీ లేదు. కాబట్టి వృత్తిపరంగా శిక్షణ కాని, అనుభవం కాని లేని వ్యక్తులు బోధకులుగా పని చేసే దుస్థితి వుంది.

ఈ ఉపాధ్యాయులకు తగిన శిక్షణ యిచ్చే సంస్థలు కూడా మన రాష్ట్రంలో లేవు.

ప్రి-ప్రైమరీలో చేరే బాలబాలికలు 3 నుండి 5 సంవత్సరాల వయసు వారై వుంటారు. వారి మానసిక ప్రవృత్తి, సౌకుమార్యము మరియు సున్నిత దేహావసరాలకనుగుణంగా ఆటలు, పాటలు, చిత్ర పరిశీలన వంటి కార్యక్రమాల ద్వారా వారిని విద్యార్జనకై సిద్ధం చేయాలి. కాని, అలా కాక యినాడు ఆ చిన్న వయస్సులోనే బాలబాలికలకు అక్షరాభ్యాసం చేయించి, సంఖ్యామానం నేర్పించి, మానసికంగా భారానికి గురి చేస్తున్నారు. దురదృష్టం ఏమిటంటే యీ పాఠశాలల్లో విద్యార్థులకు ఇంగ్లీషు నేర్పటం, ఇంగ్లీషు వాతావరణం కల్పించటం ద్వారా సహజ వాతావరణం నుండి వారిని దూరం చేస్తున్నారు.

ఈ స్థాయి విద్యను ప్రభుత్వ పరిధిలోకి తీసుకవచ్చి, అందులో పనిచేసే ఉపాధ్యాయులకు ప్రత్యేకమైన వృత్తిశిక్షణ యివ్వటం ద్వారా ప్రి-ప్రైమరీ విద్యను మెరుగు పరచటం అవసరం.

# 6.మూల్యాంకనము-పరీక్షా విధానము

## 6.1 మూల్యాంకనము:

ముందు చెప్పినట్టుగా విద్యార్థులు 7వ తరగతి చివర కామన్ పరీక్షలో మరియు 10వ తరగతి చివర యస్.యస్.సి. పబ్లిక్ పరీక్షలో కూర్చోవాలి. అటు 7వ తరగతి చేరేవరకు యిటు తిరిగి 10వ తరగతి చేరేవరకు విద్యార్థులు ఏ తరగతిలోనూ ఫెయిలే చేయబడరు. రాష్ట్రంలో నాన్ డిటెన్షన్ పద్ధతి అమలులో వుంది. ఈ పద్ధతి భారతదేశంలో మొదటిసారిగా 1970లో మన రాష్ట్రంలో ప్రవేశపెట్టబడి అమలు జరుగుతూంది. 10 సంవత్సరాల పాఠశాల విద్యలో విద్యార్థులు 7వ తరగతి చివర మరియు 10వ తరగతి చివర 'వడబోత' కు గురౌతారు.

అన్ని తరగతుల్లో విద్యార్థుల విద్యాస్థాయిని అంతర్గత మూల్యాంకనం ద్వారా అంచనా వేస్తారు. ప్రతి విద్యా సంవత్సరంలో విద్యార్థులు నాలుగు యూనిట్ టెస్టులకు హాజరు కావాలి. బోధకుడు లేక బోధకురాలు తాను స్వయంగా యూనిట్ టెస్టు పేపరు తయారు చేసి విద్యార్థులను పరీక్షించాలి. ఈ టెస్టులో విద్యార్థి సాధించిన మార్కులు ప్రోగ్రెస్ రిపోర్టులో నమోదు చేయాలి. సంవత్సరంలో మూడు సామాన్య పరీక్షలు పాఠశాలలో నిర్వహిస్తారు. అవి ____ హాఫియర్లీ మరియు వార్షిక పరీక్షలు. యూనిట్ పరీక్షల మార్కులు క్వార్టర్లీ మరియు హాఫియర్లీ పరీక్షలలోని మార్కులను ఒక ఫార్ములా ప్రకారం జతపరచి వాటిని వార్షిక పరీక్ష మార్కులలో కలిపి విద్యార్థి స్థాయిని నిర్ణయిస్తారు. ప్రతి విద్యార్థి కనీసం 80% హాజరు నమోదు చేయాలి. ప్రత్యేక పరిస్థితిలో 60% హాజరు కల్గివున్నా పై తరగతులకు పంపుతారు.

## 6.2 జిల్లా పరీక్షల బోర్డులు:

ప్రతి జిల్లాలో జిల్లా కామన్ పరీక్షల బోర్డు ఏర్పరచారు. ఈ బోర్డులు ఆయా జిల్లాల్లో 6వ తరగతికి మరియు 8 మరియు 9వ తరగతులకు క్వార్టర్లీ, హాఫియర్లీ మరియు వార్షిక పరీక్షలు నిర్వహిస్తవి. ఆయా తరగతులకు జిల్లా మొత్తానికి ఒకే ప్రశ్నాపత్రాలు తయారు చేస్తవి. పరీక్షలు విద్యార్థులు చదువుతున్న పాఠశాలలోనే అచటి ఉపాధ్యాయులు అజమాయిషీ చేస్తారు. జిల్లామొత్తంపైన సమానమైన విద్యాస్థాయి వుండాలనే లక్ష్యంతో యీ కామన్ పరీక్షల పద్ధతి ప్రవేశ పెట్టారు.

యస్.యస్.సి. పబ్లిక్ పరీక్షల నిర్వహణ-పరీక్షల కమీషనరు అధీనంలో వుంటుంది. రాష్ట్రమంతటికీ ఒకే ప్రశ్నాపత్రాలు తయారు చేయటం విద్యార్థుల హాల్ టికెట్ల సరఫరా, పరీక్షా కేంద్రాల ఎంపిక, పరీక్షల నిర్వహణ, జవాబు పత్రాలు దిద్దించటం, ఫలితాల ప్రకటన బాధ్యతలు పరీక్షల కమీషనర్ నిర్వహిస్తారు. కమీషనరు కార్యాలయంలో అవసరమైన సిబ్బంది వుండగా ప్రతి జిల్లాలో పరీక్షల అసిస్టెంటు కమీషనరు ఒకరు నియమింపబడ్డారు. యస్.యస్.సి. జవాబు పత్రాలు వివిధ కేంద్రాలకు పంపబడతాయి. ఆ కేంద్రాలలో స్పాట్ వాల్యుయేషను చేస్తారు. పరీక్ష జవాబు పత్రాలు దిద్దటానికి అర్హులైన ఉపాధ్యాయులను నియమించటం జరుగుతుంది. వాల్యుయేషన్ సెంటరు ఆయా జిల్లాలకు చెందిన జిల్లా విద్యాశాఖాధికారి అజమాయిషీలో నిర్వహింపబడుతాయి.

1985 - 1992 మధ్యకాలంలో
యస్.యస్.సి. పరీక్షా ఫలితాలు

| సం॥ | హాజరైన విద్యార్థులు | ఉత్తీర్ణులైన వారు | శాతం |
|---|---|---|---|
| 1985 | 4,59,307 | 1,71,915 | 37.42 |
| 1986 | 4,97,496 | 1,94,499 | 39.09 |
| 1987 | 5,62,516 | 2,11,415 | 37.58 |
| 1988 | 6,00,748 | 2,06,251 | 34.33 |
| 1989 | 6,23,758 | 2,04,848 | 32.84 |
| 1990 | 7,05,858 | 2,45,708 | 34.80 |
| 1991 | 7,33,494 | 2,80,273 | 38.20 |
| 1992 | 7,81,712 | 2,90,056 | 36.25 |

1985 నుండి 1992 వరకు ప్రతి సంవత్సరం మార్చి/ఏప్రిల్ నెలలో జరిగే యస్.యస్.సి. పబ్లిక్ పరీక్షలలో

హాజరైన మరియు ఉత్తీర్ణులైన విద్యార్థుల సంఖ్యా వివరాలు పై పట్టికలో యివ్వబడ్డాయి.

# 7. పాఠశాలల యాజమాన్యము మరియు విద్యాపరిపాలనా వ్యవస్థ

## 7.1 యాజమాన్యం:

ఏ వ్యవస్థ ప్రతిభ అయినా దానిని నిర్వహించే పద్ధతులు మరియు బాధ్యతల నిర్వహణ సామర్థ్యంపై ఆధారపడి వుంటుంది. విద్యాప్రణాళికారచన, విద్యా కార్యక్రమాల రూపకల్పన వంటి అంశాలు మొదలుకొని పాఠశాల నిర్వహణ, బోధనాభ్యసన కార్యక్రమాలు, సరియైన సమయంలో బోధన పూర్తి చేయటం పరీక్షలు నిర్వహించటం వంటి పనులు విద్యా వ్యవస్థ యొక్క సామర్థ్యాసామర్థ్యాలను సూచిస్తుంది. మన దేశంలో (మన రాష్ట్రంతో సహా) విద్యావ్యాసంగము బడ్జెటుకు లోబడి ఎంత సొమ్ము ఖర్చు చేయవలసి వుంది అనే దానిపై ఆధారపడి జరుగుతుంది తప్ప కార్యక్రమం అమలు విధానం, వాని ఫలితాలతో సంబంధం వుండదు. విద్యా కార్యక్రమాల ఫలితాలు, వాని నిర్వహణ పద్ధతులు మూల్యాంకనం చేసే యంత్రాంగము ఏదీ లేదు.

విద్యా క్షేత్రంలో పనిచేసే వివిధ అధికారుల మరియు ఉపాధ్యాయుల సామర్థ్యం నిర్ణయించే విధానమేదీ లేదు. ఎవరికి వారు నిర్లక్ష్యం, నిస్సహాయత వ్యక్తం చేస్తారు. విద్యా వ్యవస్థ సమాజానికి జవాబు దారి కావాలి. ఆ వ్యవస్థలో పనిచేసే ప్రతి వ్యక్తి ప్రజలకు జవాబు యివ్వగల వాడై వుండాలి. కాని అలాంటివేవీ విద్యావ్యాసంగంలో చోటు చేసుకోలేదు.

విద్యా పరిపాలనలో పేరుకొని పోయిన పలు లోపాల్లో వ్యక్తులపై అశాస్త్రీయమైన, అభ్యంతరకరమైన అధికార ప్రదర్శన ఒకటి: ఉపాధ్యాయుల, తదితర అధికారుల నియామకం మొదలు వారి బదిలీల విషయం వరకు – చివరికి సమస్యల పరిష్కారంలో కూడా అధికార రాజకీయ ప్రాబల్యమే పని చేస్తుంది.

విద్యా వ్యవస్థ నిర్వహణలో ప్రజల భాగస్వామ్యం చాలా తక్కువ. కేంద్రీకృత ప్రణాళికా రచన పద్ధతిలో రాజకీయ నాయకుల మరియు అధికారుల ప్రమేయమే ఎక్కువ. విద్యార్థులకు కాని, ఉపాధ్యాయులకు కాని యిందులో ఎలాంటి భాగస్వామ్యమూ లేదు. కాబట్టి విద్యపట్ల ప్రజల సానుభూతి, విద్యాభివృద్ధిలో ప్రజల చొరవ, ఆసక్తి దాదాపు శూన్యం.

పైన పేర్కొన్న విషయాలు మన రాష్ట్రంలో విద్యా నిర్వహణ పద్ధతులకు పూర్తిగా వర్తిస్తాయి. చివరకు జాతీయ విధానం సూచించినట్లుగా రాష్ట్ర విద్యా సలహా మండలిని కూడా మన రాష్ట్రం ఏర్పాటు చేయలేదు. విద్యా ప్రణాళికారచన కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన చట్రంలో అధికారులే చేస్తారు. క్రిందిస్థాయిల్లో పనిచేసే అధికారులకు గాని, ఉపాధ్యాయులకు గాని యీ ప్రక్రియలో ఎలాంటి భాగస్వామ్యము లేదు. వారు కేవలం కార్యక్రమాలను అమలుపరిచేవారుఅంతే.

**7.2.** 1956కు ముందు కోస్తా మరియు రాయలసీమ జిల్లాల పాఠశాలలు జిల్లా బోర్డుల అధీనంలో వుండేవి. జిల్లా బోర్డుల ద్వారా పాఠశాలల దైనందిన నిర్వహణలో పరోక్షంగానైనా ప్రజల భాగస్వామ్యము వుండినది. ప్రజలనుండి పాఠశాలల అవసరాలకు ధన వస్తు సహాయం కూడా లభించేది. విద్యా వ్యాప్తికూడా జరుగుటకు వీలైనది.

తెలంగాణా ప్రాంతములో పాఠశాలలన్నీ ప్రభుత్వయాజమాన్యంలో నిర్వహింపబడేవి. కేంద్రీకృత నిర్వహణ మరియు ప్రభుత్వ నిరంకుశ విధానం వలన అవసరమైనన్ని పాఠశాలలు తెరువబడలేదు. విద్యావ్యాప్తికి పూనుకోలేదు. పాఠశాల నిర్వహణలో ప్రజల భాగస్వామ్యము ఏ మాత్రము లేదు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఒకవైపు ముందు చెప్పినట్టుగా పాఠశాల వ్యవస్థ, కరికులం, సిలబసు, పరీక్షలు వగైరాలలో సామ్యము ఏర్పరచే ప్రయత్నం జరుగుతూండగా మరోవైపు వాని యాజమాన్యము మరియు పరిపాలనలోగల భేదాలు తొలగించటం కూడా జరిగింది. ఇరు ప్రాంతాల్లో ఏర్పడి యున్న వ్యవస్థను యథాతథంగా వుంచుతూనే నియమాలు, నిబంధనలను మరియు పరిపాలనా యంత్రాంగాన్ని క్రమంగా రాష్ట్రమంతటికి వర్తించే ప్రయత్నాలు జరిగాయి. ఈ ప్రయత్నాల్లో భాగంగానే ఒకటి నవంబరు 1959 నుండి పంచాయితీ రాజ్ సంస్థలను ఏర్పాటు చేసి, గ్రామీణ ప్రాంతాలలో గల ప్రాథమిక మరియు సెకండరీ పాఠశాలలను ఆ సంస్థల స్వాధీనం చేయటం జరిగింది. కోస్తా రాయలసీమ జిల్లాల్లో లాగా తెలంగాణా ప్రాంతంలో మునిసిపాలిటీలు బలంగా లేని కారణం చేత పట్టణ ప్రాంతాలలో పాఠశాలలను అచ్చటి మునిసిపాలిటీలకు యివ్వలేదు. ఆ పాఠశాలలు ప్రభుత్వ పాఠశాలలుగానే వుండి పోయాయి.

అటు కోస్తా రాయలసీమ జిల్లాల్లోను యిటు తెలంగాణా జిల్లాల్లోను ప్రైవేటు పాఠశాలలు ఆయా ప్రైవేటు సంస్థలక్రింద వుండి పోయాయి. ప్రయివేటు పాఠశాలల్లో ముఖ్యమైనవి క్రిష్టియన్ మిషనరీలు స్థాపించి నిర్వహిస్తున్నవి. ఈ మధ్య ముస్లిం సంస్థలు కూడా పాఠశాలలు స్థాపించి నిర్వహిస్తున్నవి. రాజ్యాంగంలోని ఆర్టికల్ 30(1) పరిధిలో భాష మరియు మతపరమైన అల్ప సంఖ్యాక వర్గాలకు తమ పాఠశాలలు స్థాపించి నిర్వహించే హక్కు వుంది. ఇలాంటి పాఠశాలల్లో విద్యార్థులు మరియు ఉపాధ్యాయుల

పట్ల న్యాయం జరుగుతోందా? పాఠశాలల నిర్వహణ సరిగా జరుగుతోందా? ఉపాధ్యాయులకు ఈ సంస్థలు న్యాయం చేస్తున్నాయా? యిలాంటి ప్రశ్నలు వున్నవి.

పాఠశాలల దైనందిన నిర్వహణ, సిబ్బంది పరిపాలనా ఆయా యాజమాన్యాలు నిర్వహిస్తాయి. అయినా అలాంటి నిర్వహణ మరియు పాలన రాష్ట్ర ప్రభుత్వం జారీ చేసిన నియమ నిబంధనలకు లోబడి జరుగుతుంది. అన్ని పాఠశాలలు ప్రభుత్వం నిర్దేశించిన కర్రికులం, సిలబసును పాటిస్తాయి. పరీక్షా పద్ధతి అన్నింటికీ ఒకే విధంగా వుంటుంది. ఏ యాజమాన్యంలోని పాఠశాలలైనా ప్రభుత్వ అధికారుల అజమాయిషీ (Supervision)కి లోబడి వుండాలి. ప్రాథమిక పాఠశాలలు మండల ప్రజాపరిషత్తుల యాజమాన్యంలోను, సెకండరీ పాఠశాలలు జిల్లా ప్రజాపరిషత్తుల యాజమాన్యంలోనూ వున్నవి. మునిసిపాలిటీలు ప్రాథమిక మరియు సెకండరీ పాఠశాలలను నిర్వహిస్తున్నవి.

1993-94లో వివిధ యజమాన్యాలచే నిర్వహింపబడు తున్న ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ మరియు సెకండరీ పాఠశాలల సంఖ్య పట్టిక XVలో యివ్వబడింది.

## 7.3 పంచాయతీరాజ్ సంస్థలలో విద్యావ్యాప్తి:

పంచాయతీ రాజ్ సంస్థలకు విద్యా యాజమాన్యము అప్పచెప్పటం వల్ల విద్యా వ్యాప్తి విస్తృతంగా జరిగింది. 1956-57తో పోల్చితే ప్రైమరీ పాఠశాలల సంఖ్య దాదాపు 8000, అప్పర్ ప్రైమరీ పాఠశాలలలో 2000కు పైగా మరియు సెకండరీ పాఠశాలల్లో 1500కు పైగా పెరుగుదల జరిగింది. అదేకాలంలో విద్యార్థుల సంఖ్య కూడా గణనీయంగా పెరిగింది. 1956-57లో మొత్తం 29,076 ప్రైమరీ పాఠశాలల్లో కేవలం 37.8% స్థానిక సంస్థల క్రింద వుండగా 1965-66లో మొత్తం 37320 ప్రైమరీ పాఠశాలల్లో 92.12% స్థానిక సంస్థల అధీనంలోకి వచ్చాయి. ప్రభుత్వ యాజమాన్యం క్రింద కేవలం 2.5% పాఠశాలలు మిగిలి పోయాయి. 1987-88 నాటికి 46086 ప్రైమరీ పాఠశాలల్లో 89% పంచాయితీ సంస్థల క్రింద వుండగా 4.8% ప్రభుత్వం క్రింద వున్నవి.

1956-57లో ప్రైమరీ తరగతులలో 24.5 లక్షల బాల బాలికలు చదువుతూండగా 1965-66 కల్లా వారి సంఖ్య 37.7 లక్షలైంది. 6-11 సంవత్సరాల వయసుగల బాల బాలికల్లో 1956-57లో 59.1% పాఠశాలల్లో నమోదై వుండగా 1955-56 కి ఈ శాతం 76.5 కి పెరిగింది. పంచాయితీ రాజ్ సంస్థల క్రింద విద్యావకాశాలు మెరుగుపడి విద్యార్థుల నమోదు శాతం కూడా మెరుగైంది. కాని విద్యాప్రణాళికల రచనలో అందుల కవసరమైన ధనాన్ని సమీకరించు కోవటంలో వానికి ఎలాంటి స్వేచ్ఛ గాని, అధికారం కాని లభించలేదనే చెప్పాలి. పంచాయతీ సంస్థల యాజమాన్యంలోని పాఠశాలల్ని గ్రాంట్ యిన్ ఎయిడ్ – అంటే ప్రభుత్వం నుండి ధన సహాయం పొందుతున్న – పాఠశాలలుగానే పరిగణించారు.

ఈ సంస్థలు విద్యా పరిపాలనలో రాజకీయ అధికారం ప్రదర్శించటం వల్ల తమ ప్రతిష్ఠను కోల్పోయాయి. ఉపాధ్యాయుల నియామకం జిల్లా సెలక్షను కమిటీలద్వారా జరుగుతుంది. జిల్లా పరిషత్తు ఛైర్మను మరియు అతని రాజకీయ అనుయాయులనాశ్రయించినవారిపట్ల పక్షపాతం సర్వత్రా ద్యోతకం అయింది. బదిలీలలో కూడా రాజకీయ పక్షపాతానికి ఉపాధ్యాయులు బలి అయ్యారు. కొన్ని సంవత్సరాల అనుభవం తరువాత ప్రభుత్వం బదిలీలకు సంబంధించి ఆదేశిక సూత్రాలను జారీ చేయటం మరియు వాని నమలుపరచటం వల్ల పరిస్థితి మెరుగుపడింది.

## 7.4. ప్రైవేటు యాజమాన్యాలు:

ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేటు యాజమాన్యాలు విద్యా క్షేత్రంలో గణనీయమైన పాత్ర వహిస్తున్నవి. ప్రభుత్వము మరియు స్థానిక సంస్థల బలహీనతలను పురస్కరించుకొని ప్రైవేటు యాజమాన్యాలు పాఠశాలలను నెలకొల్పుతున్నవి. క్రైస్తవ మిషనరీలు, అల్పసంఖ్యాక వర్గాలే కాక చాలా ప్రైవేటు సంస్థలూ విద్యావ్యాసంగాన్ని చేబట్టాయి. 1956-57లో 10549 ప్రైమరీ పాఠశాలలు ప్రైవేటు యాజమాన్యంలో వుండగా 1965-66లో 1972 పాఠశాలలు మాత్రమే ఆ యాజమాన్యంలో వున్నవి. ఈ కాలం లోపల ప్రైవేటు పాఠశాలలు పంచాయతీ సమితుల అధీనంలోకి బదిలీ అయ్యాయి. ఆ తరువాత వాని సంఖ్య క్రమంగా పెరిగి 1987-88 నాటికి 270కి చేరింది. 1993-94కి ఇది 4889 అయింది. అలాగే సెకండరీ పాఠశాలల సంఖ్య కూడా ప్రైవేటు యాజమాన్యం క్రింద క్రమక్రమంగా 1993-94లో 1673కి పెరిగింది.

1993-94లో మొత్తం 4924 ప్రైమరీ పాఠశాలల్లో 3624 అంటే 70%కి పైగా ప్రైవేటువి. అదే సంవత్సరం మొత్తం 7145 సెకండరీ పాఠశాలల్లో 1673 అంటే దాదాపు 23.4% ప్రైవేటు సంస్థలచే నిర్వహింపబడుచున్నవి. ప్రైమరీ పాఠశాలలకన్న సెకండరీ పాఠశాలల క్షేత్రంలో ప్రైవేటు యాజమాన్యాలు ఎక్కువ చొరవ చూపుతూండటం గమనించవచ్చు. ఈ మధ్యకాలంలో వాని సంఖ్య మరింత ఎక్కువ అయ్యింది.

ప్రైవేటు పాఠశాలల్లో కొన్ని ప్రభుత్వ ధన సహాయంతో (గ్రాంట్ యిన్ ఎయిడ్) నడుస్తుండగా, మిగిలినవి అలాంటి సహాయం లేకుండా నడుపబడుతున్నాయి. ఈ పాఠశాలలు విద్యార్థులనుండి డొనేషన్లు, అధికరేట్ల ఫీజులు తదితర

పట్టిక–XV:

వివిధ యాజమాన్యాలలో పాఠశాలలు

| క్ర.సం. | జిల్లా | పాఠశాలలు | | | | | | | | | | | | | | | | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ప్రభుత్వం | | | | స్థానిక సంస్థలు | | | | ప్రైవేట్ ఎయిడెడ్ | | | | ప్రైవేటు అన్ఎయిడెడ్ | | | | |
| | | ప్రా. | ఉ.ప్రా | సె | మొ | ప్రా | ఉ.ప్రా. | సె. | మొత్తం | ప్రా | ఉ.ప్రా | సె | మొత్తం | ప్రా | ఉ.ప్రా. | సె | మొత్తం | |
| 1. | శ్రీకాకుళం | 250 | 11 | 38 | 299 | 2242 | 162 | 158 | 2562 | 25 | 5 | 1 | 31 | 4 | 4 | 4 | 12 | 2904 |
| 2. | విజయనగరం | 381 | 6 | 25 | 412 | 1609 | 137 | 142 | 1888 | 77 | 5 | 12 | 94 | 18 | 3 | 6 | 27 | 2421 |
| 3. | విశాఖ | 548 | 35 | 49 | 632 | 1632 | 151 | 133 | 1916 | 99 | 12 | 26 | 137 | 36 | 12 | 25 | 73 | 2758 |
| 4. | తూ.గోదావరి | 308 | 20 | 37 | 365 | 2386 | 237 | 264 | 2887 | 128 | 37 | 51 | 216 | 135 | 43 | 30 | 208 | 3676 |
| 5. | ప.గోదావరి | 95 | 8 | 25 | 128 | 2001 | 190 | 243 | 2434 | 279 | 12 | 40 | 331 | 33 | 6 | 9 | 48 | 2941 |
| 6. | కృష్ణా | 3 | – | 22 | 25 | 1734 | 276 | 231 | 2241 | 589 | 71 | 61 | 721 | 19 | 3 | 22 | 44 | 3031 |
| 7. | గుంటూరు | 20 | 1 | 21 | 42 | 2381 | 196 | 245 | 2822 | 250 | 46 | 81 | 387 | 16 | 8 | 23 | 47 | 3298 |
| 8. | ప్రకాశం | 23 | 7 | 30 | 60 | 2396 | 172 | 200 | 2768 | 153 | 34 | 44 | 231 | 25 | 9 | 23 | 57 | 3116 |
| 9. | నెల్లూరు | 7 | 2 | 29 | 38 | 2622 | 190 | 227 | 3039 | 76 | 24 | 20 | 120 | 52 | 21 | 21 | 94 | 3291 |
| 10. | కర్నూలు | 34 | 2 | 34 | 70 | 1633 | 145 | 172 | 1950 | 88 | 20 | 36 | 144 | 89 | 42 | 29 | 160 | 2324 |
| 11. | అనంతపురం | 9 | – | 28 | 37 | 2656 | 195 | 235 | 3086 | 30 | 2 | 13 | 45 | 55 | 18 | 15 | 88 | 3256 |
| 12. | కడప | 7 | 1 | 19 | 27 | 2470 | 162 | 216 | 2848 | 57 | 27 | 26 | 110 | 82 | 36 | 29 | 147 | 3132 |
| 13. | చిత్తూరు | 40 | – | 31 | 71 | 3806 | 312 | 284 | 4402 | 38 | 5 | 19 | 62 | 92 | 34 | 28 | 154 | 4689 |
| 14. | హైదరాబాద్ | 206 | 92 | 107 | 405 | – | – | – | – | 32 | 57 | 12.8 | 217 | 243 | 147 | 217 | 607 | 1229 |
| 15. | రంగారెడ్డి | 30 | 1 | 15 | 46 | 1011 | 206 | 174 | 1391 | 1 | 11 | 18 | 30 | 139 | 80 | 135 | 354 | 1821 |
| 16. | మెదక్ | 29 | 9 | 26 | 64 | 1352 | 215 | 184 | 1751 | – | 2 | 18 | 20 | 15 | 11 | 25 | 51 | 18864 |
| •17. | నిజామాబాద్ | 54 | 13 | 28 | 95 | 819 | 174 | 196 | 1189 | 4 | 9 | 5 | 18 | 82 | 35 | 9 | 126 | 1428 |
| 18. | మహబూబ్ నగర్ | 60 | 18 | 39 | 117 | 1843 | 347 | 263 | 2453 | 3 | 7 | 19 | 29 | 76 | 35 | 37 | 148 | 2747 |
| 19. | నల్లగొండ | 58 | 20 | 33 | 111 | 1692 | 262 | 289 | 2243 | 17 | 19 | 32 | 68 | 88 | 54 | 43 | 185 | 2607 |
| 20. | వరంగల్లు | 216 | ·27 | 52 | 295 | 1622 | 266 | 234 | 2122 | 15 | 12 | 25 | 52 | 96 | 102 | 93 | 291 | 2760 |
| 21. | ఖమ్మం | 226 | 26 | 54 | 306 | 1341 | 212 | 168 | 1721 | 41 | 10 | 21 | 72 | 30 | 12 | 15 | 57 | 2156 |
| 22. | కరీంనగర్ | 28 | 8 | 39 | 75 | 1398 | 312 | 248 | 1958 | 2 | 1 | 12 | 15 | 112 | 98 | 92 | 302 | 2350 |
| 23. | అదిలాబాద్ | 911 | 44 | 53 | 108 | 1474 | 204 | 131 | 1809 | 8 | 5 | 10 | 23 | 65 | 21 | 25 | 111 | 2951 |
| | మొత్తం | 3543 | 351 | 834 | 4828 | 42130 | 4723 | 4635 | 51488 | 2022 | 433 | 718 | 3173 | 1602 | 834 | 955 | 3391 | 62780 |

వసూళ్ళు చేస్తున్నవి. ప్రైవేటు సంస్థలు విద్యార్థుల బోధనకై ఖర్చయ్యే సొమ్ము మొత్తమేకాక అదనంగా వారినుండి సొమ్ము వసూలు చేసి లాభాలు గడిస్తున్నవనేది నిర్వివాదమైనది. ఈ యాజమాన్యాలు ఉపాధ్యాయులకు జీతాలు కూడా సరిగ్గా యివ్వవు.

ప్రైవేటు యాజమాన్యంలో కల పాఠశాలలను గురించి మరొక విషయం గమనించాల్సి వుంది. ఈ పాఠశాలలు చాలా మటుకు ఇంగ్లీషు బోధనా మాధ్యమంగా బోధనకు పూనుకున్నవి. రాష్ట్రం అవలంబించిన విద్యా నీతికి భిన్నంగా మాతృభాష ద్వారా కాక ఇంగ్లీషు ద్వారా బోధించటం జరుగుతున్నప్పటికీ ఈ పాఠశాలలకు ప్రభుత్వ మద్దతు, గుర్తింపు లభిస్తున్నవి.

## 7.5. విద్యా యాజమాన్యం - కేంద్ర ప్రభుత్వ విధానం:

1986 విద్యా విధానం విద్యాయాజమాన్యంలో ప్రజలకు అధిక భాగస్వామ్యము యివ్వాలని నిర్దేశించింది. విద్యార్థుల తల్లి దండ్రులు, విద్యావేత్తలు, సమర్థులైన ఉపాధ్యాయులు, పరిశ్రమల ప్రతినిధులు మరియు ఆర్థిక సంస్థలకు విద్యా యాజమాన్యంలో భాగస్వామ్యము కల్పించాలని ఆ విధానం నిర్దేశించింది. జిల్లా విద్యా బోర్డులు ఏర్పరచి, జిల్లా విద్యా శిక్షణా సంస్థలు స్థాపించి పాఠశాలల నిర్వహణకు బోధనా ప్రక్రియను మెరుగుపరచాలని సూచించింది.

కేంద్రం రాజ్యాంగ సవరణ చట్టాలు (73 మరియు 74) ఆమోదించటంలో విద్యను పంచాయితీ రాజ్ సంస్థల పరం చేయటం తద్వారా ప్రజలకు ఎక్కువ భాగస్వామ్యం కల్పించటం దేశమంతా జరుగుతున్నది. మన రాష్ట్రంలో విద్య యీ పాటికే పంచాయితీ రాజ్ సంస్థల చేతుల్లో వున్నప్పటికీ అవసరమైన జాగ్రత్తలు తీసుకోవటానికి మెరుగైన సేవలు లభింప చేయగల అవకాశాలకు వీలౌతాయి. 1993లో కేంద్ర విద్యా సలహా మండలి ఒక ఉపసంఘాన్ని నియమించి, విద్యా యాజమాన్య వికేంద్రీకరణపై సూచన లివ్వాలని కోరింది. ఆ ఉప సంఘం చేసిన సిఫారసుల మేరకు విద్య యాజమాన్యం వికేంద్రీకరించే చర్యలు తీసుకొంటున్నారు. మన రాష్ట్రంలో ఆమేరకు పంచాయితీరాజ్ చట్టాన్ని సవరించారు. ఉపసంఘం చేసిన సిఫారసుల ననుసరించి గ్రామపంచాయితీ, మండల పంచాయతీ మరియు జిల్లా పరిషత్తు స్థాయిలలో ఎడ్యుకేషన్ స్టాండింగ్ కమిటీలు ఏర్పాటు చేస్తారు. ఈ స్టాండింగ్ కమిటీలలో స్త్రీలకు, షెడ్యూలు కులాలు మరియు తెగలవారికి ప్రాతినిధ్యం వుంటుంది. ఉపాధ్యాయుల ప్రాతినిధ్యము పాఠశాల ప్రధానోపాధ్యాయుని ద్వారా వుంటుంది. తల్లి తండ్రులకు, స్థానిక విద్యా వేత్తలకు యిందులో ప్రాతినిధ్యం వుండాలని సూచించబడింది. స్టాండింగు కమిటీలు విద్యా ప్రణాళికలు తయారు చేస్తాయి. పాఠశాలల సక్రమ నిర్వహణకు తోడ్పడతాయి. విద్యకై అవసరమైన సొమ్ము ప్రభుత్వం సమకూరుస్తుంది. స్థానికంగా సొమ్ము సమకూర్చే అధికారం ఈ కమిటీలకు వుంటుంది.

## 7.6. విద్యా పరిపాలన:

రాష్ట్రంలో పాఠశాల విద్యా పరిపాలన మొత్తం పాఠశాల విద్యా సంచాలకుని నియంత్రణలో జరుగుతుంది. సంచాలకుడు వాస్తవంగా పరిపాలన మరియు విద్యాపరమైన అజమాయిషీ (అకాడెమిక్ సూపర్‌విజన్) విధులకు సంబంధించి అత్యున్నతమైన అధికారి.

పాఠశాలల్లో నియమనిబంధనల పాలన మరియు విద్యా ప్రక్రియపై అజమాయిషీ వివిధ విద్యాధికారుల ద్వారా అతడు నిర్వహిస్తాడు. రాష్ట్ర పాఠశాల విద్యా సంచాలకుడు రాజధానిలో వుండి కార్యాలయంలోని సిబ్బంది ద్వారానూ, జిల్లా కేంద్రాల్లో జిల్లా విద్యాశాఖాధికారి ద్వారానూ, మండల కేంద్రాల్లో మండల విద్యాధికారి ద్వారాను పర్యవేక్షణ మరియు నిబంధనల పాలనను సాగిస్తాడు. జిల్లా ప్రజాపరిషత్తులలో పాఠశాల సంచాలకుడి ప్రతినిధిగా పరిషత్తు విద్యాధికారి వుంటాడు. పరిషత్తు మరియు మండల విద్యాధికారులు తమ తమ ప్రాంతాల్లో (పరిషత్తు విద్యాధికారి సెకండరీ విద్య మరియు మండల విద్యాధికారి ప్రైమరీ విద్యకై) విద్యా ప్రణాళికలను తయారు చేస్తారు.

జిల్లాలో మొత్తం విద్యాభివృద్ధి, పరిపాలన మరియు అజమాయిషీ జిల్లా విద్యాశాఖాధికారి బాధ్యత.

విద్య సంబంధమైన అజమాయిషీకై సెకండరీ పాఠశాలల కొరకు జిల్లా ఉప విద్యాధికారులు నలుగురు లేక ఐదుగురు వుంటారు. వీరు అన్ని యాజమాన్యాలలోని సెకండరీ పాఠశాలలను తనిఖీ చేస్తారు. విద్యాప్రక్రియను అజమాయిషీ చేస్తారు. జిల్లా ఉప విద్యాధికారులకు మామూలుగా పరిపాలనా బాధ్యతలు వుండవు. ప్రభుత్వ మరియు, పట్టణ ప్రాంతాలలోని ప్రైవేటు యాజమాన్యంలో గల ప్రైమరీ పాఠశాలల అజమాయిషీ బాధ్యత పాఠశాలల ఉప పర్య వేక్షణాధికారి (డెప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్) నిర్వహిస్తాడు. జిల్లాలో ఒక ఉప పర్యవేక్షణాధికారి వుంటాడు. ప్రాథమిక పాఠశాలల పర్యవేక్షణ మండల విద్యాధికారి చేస్తాడు. సెకండరీ పాఠశాలల్లో జిల్లా ఉప విద్యాధికారి చేస్తాడు. అయితే సెకండరీ పాఠశాలల్లో ప్రతి విషయములో బోధనను పర్యవేక్షించేందుకు ఆ జిల్లాలలో కల సీనియరు ప్రధానోపాధ్యాయుల (వారు ఆ విషయం బోధనలో సమర్థులై వుండాలి)తో కూడిన ప్యానెల్ ఏర్పరచి, దానితో అజమాయిషీ జరిపిస్తారు.

1965 వరకు విద్యా పరిపాలన మరియు అజమాయిషీ బాధ్యతలు జిల్లా విద్యా శాఖాధికారియే నిర్వహించేవాడు. 1965లో పరిపాలన బాధ్యతలు మరియు అజమాయిషీ బాధ్యతలు విడదీసి జిల్లా విద్యాధికారి స్థాయిని పెంచి, పరిపాలనలో సహాయపడడానికి జిల్లా కార్యాలయంలో ఒక పరిపాలనాధికారిని నియమించారు. పర్యవేక్షణ బాధ్యతలను విద్యాధికారులకు అప్పచెప్పారు.

రాష్ట్రంలోని విద్యా పరిపాలన మరియు అజమాయిషీ వ్యవస్థ క్రింది పటంలో చూపనైనది.




ప్రాజెక్టు డైరెక్టరు ఆం.ప్ర. ప్రా.వి.ప.

డైరెక్టరు యస్.సి.ఇ.ఆర్.టి

జాయింట్ కమీషనరు పరీక్షలు

ప్రిన్సిపాల్స్(3) శిక్షణా కళాశాలలు రాజమండ్రి, నెల్లూరు, హైదరాబాద్

ప్రాంతీయ జాయింట్ డైరెక్టర్లు (5) కాకినాడ, గుంటూరు, వరంగల్లు, హైదరాబాద్

జాయింట్ డైరెక్టరు అనియత విద్య

జాయింట్ డైరెక్టరు ప్రాథమిక విద్య

జాయింట్ డైరెక్టరు సెకండరీ విద్య

జాయింట్ డైరెక్టరు వృత్తివిద్య

డెప్యూటీ డైరెక్టర్లు (5)

ప్రిన్సిపాల్ ఉపాధ్యాయ శిక్షణ కళాశాల

ప్రిన్సిపాల్ వ్యాయమ విద్యాకళాశాల

జిల్లా విద్యాశాఖాధికారులు (23) ట్రైబల్ ప్రాంతాల జిల్లా విద్యాధికారులు (4)= 27

పరిషత్తు విద్యాధికారి

అనియత విద్య సహాయ సంచాలకుడు

పాఠశాల ఉపపర్యవేక్షణాధికారి మండల విద్యాధికారి

ఉప విద్యాధికారి

జిల్లా మానిటరింగ్ అధికారి

ప్రిన్సిపాల్ డి.ఐ.ఇ.టి.

పరిపాలన అధికారి

పరీక్షల స. సంచాలకుడు

అనియత విద్య ప్రాజెక్టు అధికారి

ప్రాథమిక పాఠశాలలు

సెకండరీ పాఠశాలలు

మూలం: ప్రభుత్వ విద్యాశాఖ.

పాఠశాలల సంఖ్య పెరగటంతో విద్యార్థుల సంఖ్య మరియు ఉపాధ్యాయుల సంఖ్య పెరిగింది. అందుచేత ప్రాంతీయ డైరెక్టరు పదవులను కల్పించారు. అలాగే డైరెక్టరు కార్యాలయంలోను, ప్రాంతీయ డైరెక్టర్ల కార్యాలయాల్లోనూ, డెప్యూటి డైరెక్టర్లను మరియు అసిస్టెంటు డైరెక్టర్లను నియమించారు.

పరిపాలనా యంత్రాంగం; అధికారులు మరియు సహాయక సిబ్బందితో నిండిపోయినప్పటికీ విద్యా సమస్యల పరిష్కారంలోను ఉపాధ్యాయుల సర్వీసు సంబంధమైన సమస్యల పరిష్కారంలోను జాప్యం జరుగుతోంది. ఆధునిక మేనేజిమెంటు పద్ధతులు ఏవీ అమలుపర్చబడటంలేదు.

ఆమధ్య నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషనల్ ప్లానింగ్ అండ్ అడ్మినిస్ట్రేషన్ డైరెక్టరు ప్రొ. సత్యభూషణ్ అధ్యక్షతన రాష్ట్రంలో విద్యా పరిపాలన యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరణ చేసేందుకు ఒక కమిటీని ఏర్పాటు చేసింది ప్రభుత్వం. కాని ఆ కమిటీ సిఫారసులు మరుగున పడిపోయాయి.

## 8. ఉపాధ్యాయులు-వారి స్థితిగతులు:

ఏ విద్యావ్యవస్థలోనైనా ఉపాధ్యాయులు బోధన, విద్యార్థుల తర్ఫీదు, వారి మూర్తిమత్వం పెంపు మరియు విజ్ఞానం, కుశలతలు అందించటంలో కీలక పాత్ర వహిస్తారు. విద్యా విస్తరణ జరిగిన కొలదీ, విద్యార్థుల సంఖ్య పెరిగిన కొలదీ ఉపాధ్యాయుల నియామకం సహజంగానే ఎక్కువ ఔతూ వచ్చింది.

1956-57 నుండి 1993-94 వరకు ఉపాధ్యాయుల సంఖ్య పెరుగుదలను క్రింది పట్టిక (XVI)లో చూపనైనది.

పట్టిక-XVI:

1956-57 నుండి 1993-94 వరకు ఉపాధ్యాయుల సంఖ్య పెరుగుదల

| సంవత్సరం | ప్రైమరీ | | | అప్పర్ ప్రైమరీ | | | సెకండరి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| 1956-57 | 63306 | 13759 | 77065 | 3408 | 1013 | 4421 | 13959 | 2207 | 16166 |
| 1960-61 | 60524 | 13362 | 73886 | 10134 | 3218 | 13352 | 20798 | 4138 | 24937 |
| 1965-66 | 63253 | 16670 | 79923 | 15499 | 4710 | 20209 | 36656 | 8167 | 44823 |
| 1968-69 | 61236 | 16502 | 77738 | 17123 | 5449 | 22572 | 43899 | 10332 | 54231 |
| 1973-74 | 61446 | 18230 | 79676 | 22710 | 7961 | 30671 | 43596 | 11213 | 54809 |
| 1977-78 | 59728 | 19837 | 79565 | 24300 | 9571 | 33871 | 47520 | 14294 | 61814 |
| 1982-83 | 61851 | 22519 | 84370 | 26593 | 11256 | 37849 | 49636 | 17080 | 66716 |
| 1987-88 | 71022 | 26521 | 97543 | 29596 | 13266 | 42862 | 52669 | 21353 | 74022 |
| 1993-94 | 73170 | 32944 | 106114 | 24386 | 14516 | 38902 | 62790 | 33728 | 96518 |

1993-94లో జిల్లాలవారీగా ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ మరియు సెకండరీ పాఠశాలల్లో పని చేస్తున్న ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయుల సంఖ్య క్రింది పట్టిక (XVII)లో యివ్వబడింది.

పటిక-XVII :

| క్ర.సం. | జిల్లా | ప్రైమరీ | | | అప్పర్ ప్రైమరీ | | | సెకండరి | | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | పు | స్త్రీ | మొ | పు | స్త్రీ | మొ | పు | స్త్రీ | మొ | పు | స్త్రీ |
| 1. | శ్రీకాకుళం | 3817 | 554 | 4371 | 738 | 214 | 952 | 2025 | 390 | 2415 | 6580 | 1158 |
| 2. | విజయనగరం | 3501 | 868 | 4369 | 635 | 221 | 856 | 1687 | 470 | 2157 | 5823 | 1559 |
| 3. | విశాఖ | 2925 | 1551 | 4476 | 732 | 572 | 1304 | 2264 | 1639 | 3903 | 5921 | 3762 |
| 4. | తూ.గోదావరి | 4501 | 2476 | 6977 | 1428 | 844 | 2272 | 3726 | 1730 | 5456 | 9655 | 5050 |
| 5. | ప.గోదావరి | 3475 | 1899 | 5374 | 903 | 672 | 1575 | 2954 | 1307 | 4261 | 7332 | 3878 |
| 6. | కృష్ణా | 2550 | 1901 | 4451 | 1063 | 1363 | 2426 | 2942 | 2045 | 4987 | 6555 | 5309 |
| 7. | గుంటూరు | 3292 | 2915 | 6207 | 931 | 777 | 1708 | 3413 | 1820 | 5233 | 7636 | 5512 |
| 8. | ప్రకాశం | 3363 | 1458 | 4821 | 940 | 336 | 1276 | 2523 | 600 | 3123 | 6826 | 2394 |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 9. | నెల్లూరు | 3328 | 1929 | 5257 | 771 | 574 | 1345 | 2190 | 1037 | 3227 | 6289 | 3540 |
| 10. | కర్నూలు | 2920 | 1878 | 4798 | 810 | 620 | 1430 | 2693 | 954 | 3647 | 6423 | 3452 |
| 11. | అనంతపురం | 3716 | 1615 | 5331 | 623 | 309 | 932 | 2572 | 784 | 3356 | 6911 | 2708 |
| 12. | కడప | 4029 | 1689 | 5718 | 822 | 351 | 1173 | 2410 | 796 | 3206 | 7261 | 2836 |
| 13. | చిత్తూరు | 5143 | 2645 | 7788 | 1081 | 690 | 1771 | 2919 | 1245 | 4164 | 9143 | 4580 |
| 14. | హైదరాబాద్ | 477 | 1978 | 2455 | 616 | 2315 | 2931 | 2442 | 8048 | 10490 | 3535 | 12341 |
| 15. | రంగారెడ్డి | 1893 | 1315 | 3208 | 975 | 1089 | 2064 | 2386 | 3568 | 5954 | 5254 | 5972 |
| 16. | మెదక్ | 2597 | 507 | 3104 | 1035 | 240 | 1275 | 2293 | 638 | 2931 | 5925 | 1385 |
| 17. | నిజామాబాద్ | 1921 | 548 | 2469 | 1056 | 377 | 1433 | 2401 | 765 | 3166 | 5378 | 1690 |
| 18. | మహబూబ్ నగర్ | 3724 | 1034 | 4758 | 1695 | 501 | 2196 | 3012 | 739 | 3751 | 8431 | 2276 |
| 19. | నల్లగొండ | 3331 | 858 | 4189 | 1637 | 459 | 2096 | 3653 | 788 | 4441 | 8621 | 2105 |
| 20. | వరంగల్లు | 3289 | 876 | 4165 | 1838 | 687 | 2525 | 4089 | 1520 | 5609 | 9216 | 3038 |
| 21. | ఖమ్మం | 2519 | 1030 | 3549 | 923 | 423 | 1346 | 2028 | 1095 | 3123 | 5470 | 2548 |
| 22. | కరీంనగర్ | 3032 | 682 | 3714 | 2033 | 545 | 2578 | 4011 | 1077 | 5088 | 9076 | 2304 |
| 23. | ఆదిలాబాద్ | 3827 | 738 | 4565 | 1101 | 337 | 1438 | 2150 | 673 | 2823 | 7078 | 1748 |
| | | 73170 | 32944 | 1,06,114 | 24386 | 14516 | 38902 | 62790 | 33728 | 96518 | 160139 | 82145 |

ఉపాధ్యాయులలో ఏ స్థాయిలోను స్త్రీల సంఖ్య చెప్పుకో తగినట్టుగా లేకపోవడం పై పట్టికలో చూడవచ్చు. ప్రైమరీ పాఠశాలల్లో మహిళా ఉపాధ్యాయులే సమర్థవంతంగా ఓపిగ్గా పని చేస్తారని పరిశీలనలో తేలినప్పటికి మన రాష్ట్రంలో ప్రైమరీ స్థాయిలో స్త్రీలకన్నా పురుషులే ఎక్కువ. మొత్తం మీద మహిళా ఉపాధ్యాయుల శాతం 33.9 మాత్రమే ఉద్యోగాలలో స్త్రీలకు రిజర్వేషను వున్నప్పటికీ వారికి తగిన ప్రాతినిధ్యం ఉపాధ్యాయ వర్గంలో లేకపోవడానికి గల కారణం రాష్ట్రంలో నిరుద్యోగ సమస్య తీవ్రత. జిల్లాల వారీగా పరిశీలిస్తే కేవలం హైదరాబాదు (రాజధాని) మరియు దాని ప్రక్కన గల రంగారెడ్డి జిల్లాలో తప్ప అన్ని జిల్లాల్లో. ఉపాధ్యాయినుల కన్న ఉపాధ్యాయులే ఎక్కువ. మహిళా ఉపాధ్యాయులు గ్రామీణ ప్రాంతాలలోకి వెళ్ళకపోవడం (వారు వెళ్ళడానికి గ్రామాల్లో సురక్షిత సామాజిక పరిస్థితులు లేనికారణం చేత కావచ్చు.) ఈ పరిస్థితికి కారణమవచ్చు.

ఉపాధ్యాయులను గురించి చర్చించేటప్పుడు విద్యార్థులను బట్టి ఉపాధ్యాయుల సంఖ్య అనగా ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి, వారి పనిభారం, వారి బాధ్యతల నిర్వహణ తీరు గమనించడానికి ఒక సూచనగా భావించాల్సి వుంటుంది. మన రాష్ట్రంలో ప్రైమరీ పాఠశాలల్లో ఉపాధ్యాయ – విద్యార్థి నిష్పత్తి 1:50, అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో 1:44 మరియు సెకండరీ పాఠశాలల్లో 1:32. విద్యార్థి ప్రధానమైన బోధన జరగాలని జాతీయ విద్యావిధానం సూచించిన నేపథ్యంలో ఈ నిష్పత్తులు ఎక్కువ. మరింత ఎక్కువ సంఖ్యలో ఉపాధ్యాయులను నియమించాల్సిన అవసరం వుంది.

## 8.1 సర్వీసు స్థితి గతులు:

ఉపాధ్యాయులు రాష్ట్రంలో యాజమాన్య పరంగా విభజింపబడి వున్నారు. ప్రభుత్వ ఉపాధ్యాయులు, పంచాయతీ రాజ్ ఉపాధ్యాయులు, మునిసిపల్ ఉపాధ్యాయులు, ప్రైవేటు ఉపాధ్యాయులు. అన్ఎయిడెడ్ ప్రయివేటు పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులకు ఎలాంటి నిర్దిష్టమైన వేతన వ్యవస్థ కాని సర్వీసు నిబంధనలుకాని లేవు. ఆ పాఠశాలల్లో పని చేసే ఉపాధ్యాయులు ఆయా యాజమాన్యాల దయా దాక్షిణ్యాలపై బ్రతకాల్సిన పరిస్థితి వుంది. పాఠశాలలకు గుర్తింపు యిచ్చేందుకు ఉపాధ్యాయులు ప్రభుత్వ వేతనాలు పొందాలని నిబంధన వున్నప్పటికీ అది కాగితం పైనే మిగిలి పోయింది. కాగా 1–1–94 న జారీ చేసిన ప్రభుత్వ ఉత్తర్వు (జి.ఓ.నెం.1 విద్య. పి యస్.2.) ప్రకారం ఏ యాజమాన్యానికి ఆ యాజమాన్యం – తనవద్ద పనిచేస్తున్న ఉపాధ్యాయుల వేతనాలను నిర్ణయించే వీలు కల్పించబడింది.

పంచాయతీ రాజ్, ప్రభుత్వ, మునిసిపల్ మరియు ఎయిడెడ్ ప్రైవేటు పాఠశాలల ఉపాధ్యాయులకు ప్రభుత్వ వేతన స్కేళ్ళ ప్రకారం జీతభత్యాలు లభిస్తవి.

రాష్ట్ర ప్రభుత్వము 1981లో పంచాయతీ రాజ్ ఉపాధ్యాయుల సర్వీసును రాష్ట్రీకరణ (ప్రొవెన్షియలైజ్) చేసింది. అప్పటి నుండి ఈ ఉపాధ్యాయుల సర్వీసును

ప్రభుత్వ ఉపాధ్యాయుల సర్వీసుతో మిళితం చేసే ప్రక్రియ ఆరంభం అయినప్పటికీ ఒకవైపు ప్రభుత్వ ఉత్తర్వులలోగల లొసుగులు మరోవైపు ప్రభుత్వ ఉపాధ్యాయుల సందేహాల సమస్యల ఊబిలో పడి ఆ ప్రక్రియ పూర్తికాక మిగిలిపోయింది. ఈ మధ్యనే ప్రభుత్వం అన్ని అడ్డంకులు తొలగించి యిరు వర్గాల ఉపాధ్యాయుల సర్వీసులను కలిపేందుకు నిబంధనలను రూపొందించింది. వీని ప్రకారం ప్రభుత్వ, పంచాయతి రాజ్ ఉపాధ్యాయులు కలిసి ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్యా సర్వీసులోకి వస్తారు. అందరికి సమాన పదోన్నతుల అవకాశాలు లభిస్తాయి. పంచాయతి రాజ్ పాఠశాల నుండి ప్రభుత్వ పాఠశాలకు, అలాగే ప్రభుత్వ పాఠశాల నుండి పంచాయతి రాజ్ పాఠశాలకు ఉపాధ్యాయులను బదిలీ చేయగల అవకాశం లభిస్తుంది.

అన్ ఎయిడెడ్ పాఠశాలల్లోని ఉపాధ్యాయులకు తప్ప మిగిలిన యాజమాన్యాలలోని ఉపాధ్యాయులకు ఒకే విధమైన సర్వీసు స్థితిగతులు వర్తిస్తాయి. పదవీ విరమణ వయస్సు 58 సం॥లు. ఫించను స్కేలు అందరికీ సమానము. సర్వీసులో వున్నప్పుడు ఆకస్మిక సెలవు, మెడికల్ సెలవు, ఆర్జిత సెలవు నిబంధనలు అందరికీ ఒకే విధంగా వర్తిస్తాయి. లీవు ట్రావెల్ కన్సెషన్, ఐచ్ఛిక పదవీ విరమణ వంటి సౌకర్యాలు అందరికి సమానం.

ఉపాధ్యాయులందరికీ గ్రూపు ఇన్స్యూరెన్సు పథకం, ప్రావిడెంటు ఫండు పథకం ఒకే మాదిరి వర్తిస్తాయి.

ఉపాధ్యాయులలో పలు క్యాడర్లు వుంటూ వుండేవి – సెకండరీ గ్రేడు టీచరు, గ్రాడ్యుయేటు ట్రైన్డ్ టీచరు, భాషా పండితులు, వ్యాయామ ఉపాధ్యాయులు, క్రాఫ్టు టీచరు, ప్రధానోపాధ్యాయులు వగైరా. 1980లో ఈ క్యాడర్లన్నింటిని తొలగించి మూడు కెటగిరీలుగా మిళితం చేశారు. ఈనాడు ఉపాధ్యాయులు, వారి తరగతి గదుల్లో బోధించినా, క్రాఫ్టుపని నేర్పినా, వ్యాయామ శిక్షణ యిచ్చినా అందరూ పై మూడు కేటగిరీలలో చేర్చబడ్డారు. సెకండరీ గ్రేడు టీచర్లు మరియు తత్సమానమైన వారందరూ కేటగిరీ 3లో, ట్రైన్డ్ గ్రాడ్యుయేటు మరియు తత్సమానమైన ఉపాధ్యాయులు కేటగిరీ 2లో, సెకండరీ పాఠశాల ప్రధానోపాధ్యాయులు, తత్సమానమైనవారు 1వ కేటగిరీలో చేర్చబడ్డారు.

ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా ఉపాధ్యాయులకు ఆటోమేటిక్ ప్రమోషన్ స్కీము అమలు జరిపారు. దాని ప్రకారం విద్యార్హతలలో మెరుగుదల సంబంధం లేకుండా ప్రతి ఉపాధ్యాయుడు 10 సంవత్సరాలకు మెరుగైన స్పెషల్ గ్రేడుకి ప్రమోషన్ పొందుతాడు.

15 సం॥ల సర్వీసు వుండి, పై కేటగిరీకి అవసరమైన విద్యార్హతలు కల్గివుంటే ఆ కేటగిరీకి వర్తించే స్కేలులోకి ప్రమోషన్ లభిస్తుంది. 22 సం॥ల సర్వీసువుంటే మరో ప్రమోషన్ లభిస్తుంది. ఈ ఆటోమెటిక్ ప్రమోషను స్కీము ఉపాధ్యాయులకు చాలా ఉపశమనం కలిగించింది.

ఈనాడు ఉపాధ్యాయులు పొందుతున్న వేతన స్కేళ్ళు క్రింద యివ్వబడినవి.

| | | |
|---|---|---|
| కేటగిరి I | : | 1975–4010 |
| కేటగిరి II | : | 2525–5390 |
| కేటగిరి III | : | 3110–6380 |

# 9. ఉపాధ్యాయుల శిక్షణ

9.1 రాష్ట్రంలో ఏ పాఠశాలలోనైనా ఉపాధ్యాయ శిక్షణ పొందిన వ్యక్తి మాత్రమే బోధకుడుగా వుండాలనే నిబంధన వుంది. ఒకప్పుడు శిక్షణ పొందిన వ్యక్తుల కొరత ప్రత్యేకంగా తెలంగాణా ప్రాంతంలో వుండేది. కాని ఇపుడు అలాంటి సమస్య లేదు. గత 15–20 సంవత్సరాలలో రాష్ట్రంలో సెకండరీ మరియు ప్రాథమిక పాఠశాలలకు కావలసిన ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చే ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలు మరియు ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు వెలసినవి. ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలు గ్రాడ్యుయేటు వ్యక్తులకు బి.యిడి. శిక్షణ అందజేస్తవి. ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు ఇంటర్మీడియేటు విద్య పూర్తి చేసిన వారికి సెకండరీ గ్రేడు ట్రైనింగ్ అందజేస్తవి. జాతీయ విద్యా విధానాన్ననుసరించి ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను జిల్లా విద్యా శిక్షణా సంస్థ (డి.ఐ.యు.టి.)లుగా మార్చబడినవి.

ఈనాడు రాష్ట్రంలో 7 ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలు, 23 డి.ఐ.యి.టి.లు వున్నవి. ఇవికాక విశ్వ విద్యాలయాల క్రింద మరియు ప్రైవేటు యాజమాన్యంలో 40 కి పైగా శిక్షణా కళాశాలలు వున్నాయి. ప్రతి ప్రభుత్వ శిక్షణా కళాశాలకు 150 సీట్లు నిర్ధారించారు. ఈ సీట్లు సైన్సు మరియు హ్యూమానిటీస్ అభ్యర్థుల మధ్య సముచితంగా కేటాయిస్తారు. రాష్ట్రంలోని అన్ని శిక్షణా కళాశాలల్లో అభ్యర్థుల ఎంపిక కేంద్రీకృత ప్రవేశ పరీక్షల్లో వారు సాధించిన మెరిట్ ఆధారంగా జరుగుతుంది. విశ్వవిద్యాలయాలు సమిష్టిగా ఒక విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసరును ప్రవేశ పరీక్ష నిర్వహణకై నియమిస్తారు. అతడు తన సిబ్బంది సహాయంతో పరీక్ష నిర్వహించటం, మెరిట్ నిర్ధారించటంతో సహా అభ్యర్థులను వివిధ శిక్షణా కళాశాలలకు కేటాయిస్తాడు. ప్రైవేటు విద్యాకళాశాలల్లో ప్రవేశం కూడా పైన చెప్పిన ప్రవేశ పరీక్షల్లో మెరిట్ ఆధారంగానే జరుగుతుంది.

సెకండరీ గ్రేడు శిక్షణా ప్రభుత్వ డి.ఐ.ఇ.టి. లలో జరుగుతుంది. ఈ శిక్షణను ప్రైవేటు యాజమాన్యాల పరిధినుండి తప్పించారు. ప్రతి ప్రభుత్వ డి.ఐ.ఇ.టి. ఆ జిల్లాకు చెందిన 150 అభ్యర్థులకు శిక్షణ ఇస్తుంది. ఇవి కాక షెడ్యూలు

తెగల అభ్యర్థులకై విశాఖ పట్నంలోని 'అరకులోయ'లో ఒకటి, ఆదిలాబాద్ జిల్లాలోని 'ఉట్నూర్'లో మరొకటి ప్రత్యేక ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు వున్నవి.

రాష్ట్రంలో ప్రతి సంవత్సరం దాదాపు 7000 ఉపాధ్యాయ శిక్షణ పొందిన పట్టభద్రులు, 3500 సెకండరీ గ్రేడు శిక్షణ పొందిన వారు ఆయా సంస్థల నుండి బయట పడుతున్నారు. గత 4,5 సంవత్సరాలనుండి యిలా శిక్షణ పొందినవారికి ఉద్యోగాల్లో నియామకం దొరకక ఆందోళన చెందుతున్నారు. ఉపాధ్యాయుల వేతన వ్యవస్థ మెరుగైన కారణంగా ప్రతి సంవత్సరం వేలాది పట్టభద్రులు ఉపాధ్యాయ శిక్షణకై నిర్వహించే ప్రవేశ పరీక్షకు హాజరవుతున్నారు. సర్వీసుకు పూర్వం శిక్షణ యివ్వటం వల్ల ఉపాధ్యాయ వృత్తిలో సుశిక్షితులైన ఉపాధ్యాయులు ప్రవేశిస్తున్నారు. అయితే సెకండరీ గ్రేడు టీచర్లుగా పనిచేస్తున్న ఉపాధ్యాయులు తమ విద్యార్హతలు పెంచుకున్నపుడు వారు పట్టభద్రులై వుంటే విశ్వవిద్యాలయాలు ఒకేషన్ కోర్సు ద్వారా వారికి బి.యిడి. శిక్షణ అందజేస్తవి.

## 9.2 సర్వీసు అంతర్గత శిక్షణ:

రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణా మండలి ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలు మరియు డి.ఐ.ఇ.టి లు ఉపాధ్యాయులు కాదలుచుకున్న వారికి సర్వీసుకు పూర్వం శిక్షణ ఇస్తవి. వృత్తిలో ప్రవేశించాక ఉపాధ్యాయులకు సర్వీసు అంతర్గత శిక్షణనూ యివ్వటం అవసరం. ఈ శిక్షణ అన్ని కేడర్ల ఉపాధ్యాయులకు అన్ని విషయాలు బోధించే వారికి అవసరాన్నిబట్టి అడపా దడపా అందివ్వాల్సి వుంటుంది. సెకండరీ పాఠశాల ఉపాధ్యాయులకు ఈ శిక్షణ రాష్ట్ర విద్యా పరిశోధన మరియు శిక్షణా సంస్థ అందజేస్తుంది. ప్రైమరీ పాఠశాల అధ్యాపకులకు డి.ఐ.ఇ.టి.లు అందజేస్తాయి.

రాష్ట్ర విద్యా పరిశోధన మరియు శిక్షణా మండలి (యస్.సి.యి.ఆర్.టి.) 1967లో స్థాపించబడింది. అంతకు ముందున్న స్టేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్, స్టేట్ బ్యూరో ఆఫ్ ఎడ్యుకేషనల్ అండ్ ఒకేషనల్ గైడెన్సు, స్టేట్ సైన్సు ఎడ్యుకేషన్ యూనిట్ మరియు స్టేటు ఎవాల్యుయేషన్ యూనిట్‌లను కలిపి యస్.సి.ఇ.ఆర్.టి.ని నెలకొల్పారు. ఇది పాఠశాల విద్యాశాఖ యొక్క అకడెమిక్ శాఖగా పనిచేస్తున్నది. ప్రైమరీ మరియు సెకండరీ విద్య పాఠ్యప్రణాళిక (కర్రికులం) సిలబసు మరియు బోధనా సామాగ్రి తయారు చేయటం ఈ మండలి విధుల్లో ఒకటి. ఉపాధ్యాయులకు సర్వీసు అంతర్గత శిక్షణ అందజేయటంతో పాటు ఈ మండలి – వారికి తరగతి గదుల్లో బోధనకు సంబంధించిన సమస్యలపై మార్గదర్శకత్వం మరియు విజ్ఞానం అందజేస్తుంది. వివిధ బోధనా పద్ధతులు అవలంబించటంలో సహకరిస్తుంది. బోధనా శాస్త్రానికి సంబంధించిన సమాచారం, పరిజ్ఞానం సమకూరుస్తుంది. విద్యాక్షేత్రంలో పరిశోధనలు జరిపి వాని ఫలితాలను ప్రజలకు, ఉపాధ్యాయులకు, విద్యా పరిపాలకులకు తెలియజేస్తుంది. అంతేకాక, విద్యాక్షేత్రంతో సంబంధం గల వివిధ సంస్థలకు సాంకేతిక పరిజ్ఞానాన్ని, మార్గదర్శకత్వాన్ని సమకూరుస్తుంది.

ఉపాధ్యాయుల వృత్తినైపుణ్యం పెంచుటకు సెమినార్లు, వర్కు షాపులు, చర్చావేదికలు నిర్వహించటం, వారికి సరమైన హ్యాండ్‌బుక్స్, బోధనా పరికరాలు మరియు ఇతర ప్రచురణలను సమకూర్చడం కూడా ఈ మండలి విధుల్లో చేరియున్నవి.

యన్.సి.ఇ.ఆర్.టి.లో ఈ విధులు నిర్వహించటానికి మొత్తం పది శాఖలున్నవి. అవి 1) ఎడ్యుకేషనల్ ఫౌండేషన్ శాఖ 2) సైన్సు మరియు మాథమేటిక్స్ శాఖ 3) ఎవాల్యుయేషన్ శాఖ 4) కర్రికులం మరియు టెక్స్టుబుక్స్ శాఖ 5) ఆడియో విజువల్ ఎడ్యుకేషన్ శాఖ 6) పాపులేషన్ ఎడ్యుకేషన్ శాఖ 7) నాన్ ఫార్మల్ ఎడ్యుకేషన్ శాఖ 8) వొకేషనల్ ఎడ్యుకేషన్ శాఖ 9) స్టాటిస్టిక్స్ శాఖ. ఇవి కాక మండలిలో కంప్యూటర్ సెల్ కూడా వుంది.

# 10. విద్యపై ఖర్చు

10.1. విద్య మానవ వనరుల అభివృద్ధి సాధనము. విద్యపై పెట్టే ఖర్చు మానవ వనరుల అభివృద్ధికై పెట్టే పెట్టుబడి. ఈ పెట్టుబడి వల్ల మానవుల ఉత్పత్తి శక్తి పెరుగుతుంది. దాని వల్ల జాతీయ ఉత్పత్తి వృద్ధి అవుతుంది. అంతేకాక విద్యవల్ల ప్రజల ఆరోగ్య స్థాయి పెరగటం, మృత్యురేటు – ముఖ్యంగా బాల్యదశలో – తగ్గటం, సామాజిక స్పృహ, వివేచన వంటివి సాధించటం వీలౌతుంది. అభివృద్ధి చెందిన దేశాలు విద్యకు అత్యంత ప్రాముఖ్యత నిచ్చి, పుష్కలంగా పెట్టుబడులు పెడుతున్నవి. ఈజిప్టులాంటి తక్కువ ఆదాయంగల దేశం కూడా తన జాతీయ ఆదాయంలో 6.7% ఖర్చు పెడుతున్నది.

మన దేశంలో విద్యకు కేటాయిస్తున్న ధనం కేవలం కొనసాగింపు (Current) బడ్జెట్టు రూపంలో ఖర్చులను భర్తీచేయడానికి సరిపోతుంది. విద్యావకాశాల పెంపు, దాని ఆవశ్యకత మరియు దాని అభివృద్ధి ప్రణాళికలో ఒక భాగంగానూ ప్రాధాన్యత పొందలేదు. పాఠశాలకు అవసరమైన భవనాలు, ఆటస్థలాలు, గ్రంథాలయాలు, ప్రయోగశాలలు వంటివి విద్యాభివృద్ధికి అవసరమైన 'పెట్టుబడి' అంశాలుగా గుర్తింపురాలేదు.

విద్యార్థులపై తలసరి ఖర్చు మన దేశంలో చాలా తక్కువ. తలసరి ఖర్చును బట్టి మన దేశం ప్రపంచంలో

115 వ స్థానంలో వుంది. సంవత్సరం, సంవత్సరం నగదు కేటాయింపులు పెరిగినప్పటికి ధరల పెరుగుదల, ఉపాధ్యాయుల జీతాల పెంపువల్ల నికరంగా పెరుగుదల వుండటం లేదనే చెప్పాలి. విద్యా ప్రణాళిక ఖర్చుల్లో చాలా భాగం కేంద్రమే భరిస్తుంది. చాలా ప్రణాళికలు కేంద్రం ఆరంభించి రాష్ట్రానికి అందజేస్తుంది. వాని అమలుకు డబ్బు మంజూరు చేస్తుంది. రాష్ట్రం స్వయంగా విద్యా ప్రణాళికను రూపొందించి, దానికి అవసరమైన వనరులు సేకరించి అమలు పరచటం అరుదు. రాష్ట్ర ప్రభుత్వం కేవలం కొనసాగింపు ఖర్చుకై సొమ్ము కేటాయిస్తుంది. పరిశ్రమలు, వాణిజ్య సంస్థలు యితర ప్రభుత్వేతర సంస్థలనుండి విద్యకై ధన సేకరణ చేసే ఏర్పాటు ఏదీ మన రాష్ట్రంలో లేదు. విద్యాశిస్తువల్ల సమకూరే సొమ్ము చాలా తక్కువ.

ప్రభుత్వము విద్యకు చేసే కేటాయింపులు విద్యార్థుల తలసరి ఖర్చును చాలా తక్కువ స్థాయిలలో ఉంచుతున్నవి. 1991-92లో విద్యార్థులపై తలసరి ఖర్చు సంవత్సరానికి రూ.225/- మాత్రమే.

గత ఐదు సంవత్సరాలలో మన రాష్ట్రం బడ్జెట్టులో విద్యకు చేసిన కేటాయింపులు క్రింది పట్టికలో యివ్వనైనది.

పట్టిక-XVIII:

| సంవత్సరం | ప్రణాళిక | ప్రణాళికేతర |
|---|---|---|
| 1990-91 | 96,902 | 96,902 |
| | 7.763 | 89.628 |
| 1990-91 | 96,90,22 | 702,41,26 |
| 1991-92 | 89,62,85 | 776,38,00 |
| 1992-93 | 115,08,54 | 895,33,15 |
| 1993-94 | 113,02,59 | 956,63,67 |

1993-94లో విద్యా బడ్జెట్టు వివరాలు క్రింది పట్టికలో చూపబడినవి.

పట్టిక-XIX :
1993-94లో విద్యాబడ్జెట్టు వివరాలు
(కోట్లు)

| అంశము | ప్రణాళిక | ప్రణాళికేతర |
|---|---|---|
| ప్రైమరీ విద్య | 26.49 | 551.75 |
| సెకండరీ విద్య | 4.97 | 393.23 |
| వయోజన విద్య | 11.00 | - |
| యితరములు | 0.23 | 224.05 |
| ఉన్నతవిద్య | 3.90 | 310.02 |
| మొత్తం | 46.59 | 1479.05 |

మూలం: రాష్ట్ర విద్యాపరిశోధన మరియు శిక్షణామండలి.

ప్రైవేటు యాజమాన్యాలు వాస్తవంగా విద్యపై ఎలాంటి ఖర్చు చేయవు. ఆ యాజమాన్యాల్లో విద్యార్థులే తమ విద్యకై అయ్యే ఖర్చును తాము భరిస్తారు. అధిక ఫీజులు, డొనేషన్లు తదితర పేర్లతో సొమ్ము వసూలు చేసి ఆ యాజమాన్యాలు తమ లాభాలు గడిస్తవి. విద్య పేర యివి బిజినెస్ చేస్తవి, విద్యాలయాలను వాణిజ్య సంస్థలుగా మారుస్తవి.

పట్టిక-XX:
1994-95లో సంవత్సరం విద్యాబడ్జెట్టు ప్రతిపాదనలు
(రూ.వేలు)

| అంశము | ప్రణాళిక | ప్రణాళికేతర | మొత్తం |
|---|---|---|---|
| ప్రాథమిక విద్య | 110,09,17 | 564,46,28 | 674,55,45 |
| సెకండరీ విద్య | 3,01,40 | 397,09,05 | 400,10,45 |
| భాషల అభివృద్ధి | 4,00 | 5,07,71 | 5,11,71 |
| యితరములు | 2,54,33 | 8,57,63 | 11,11,96 |
| మొత్తం | 115,68,90 | 975,20,67 | 1,090,89,57 |

మూలం: ప్రభుత్వ విద్యాశాఖ.

## 11. ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యా పథకం (APPEP)

11.1 సార్వత్రిక ప్రాథమిక విద్యాలక్ష్యాలను సాధించే దిశలో ప్రాథమిక పాఠశాల భౌతిక అవసరాలు తీర్చటం మరియు బోధనా స్థాయిని మెరుగు పరచేందుకు రాష్ట్ర ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ ప్రైమరీ ఎడ్యుకేషనల్ ప్రాజెక్టు పేర ఒక పథకం చేబట్టింది. బ్రిటిషు ప్రభుత్వ ఆర్థిక సంస్థ ఓవర్‌సీస్ డెవలప్‌మెంట్ అడ్మినిస్ట్రేషన్ (ఓ.డి.ఏ.) మరియు భారత ప్రభుత్వం మధ్య జరిగిన ఒప్పందం మేరకు ఈ పథకం ప్రవేశ పెట్టబడింది. ఈ పథకంలో రెండు అంశాలు చేరివున్నవి. ఒకటి, ఉపాధ్యాయుల సమర్థత పెంచటం కొరకు వారికి శిక్షణ ఇవ్వడం, మూల్యాంకన పద్ధతులను ప్రవేశ పెట్టటం మరియు విద్యా పరిశోధనలు జరుపటం ఈ అంశంలో చేరివున్నవి. ప్రాథమిక విద్యలో మానవ వనరుల అభివృద్ధిని సాధించటం.

రెండవ అంశం - పాఠశాలలకు మెరుగైన తరగతి గదుల నిర్మాణం చేయటం. 1984-87 మధ్య ఈ పథకం మొదటి దశలో రాష్ట్రంలోని 11 జిల్లాల్లో ఎంపిక చేసిన 328 పాఠశాలల్లో అమలు పరిచారు.

ఈ మూడు సంవత్సరాల్లో ఆ పాఠశాలలకు చెందిన 795 ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చారు. 199 తరగతుల నిర్మాణం జరిగింది. 34 ఉపాధ్యాయ కేంద్రాలు స్థాపింపబడినవి. 1987 మరియు 1989 మధ్యకాలంలో మొదటి దశ

కార్యక్రమాన్ని సుస్థిరం చేయటంతోపాటు రాష్ట్రమంతటా ఈ పథకాన్ని చేపట్టే కార్యక్రమము అమలుజరిపారు. జాతీయ విద్యావిధానంలో సూచించిన ఆపరేషన్ బ్లాక్ బోర్డు (ఓ.బి.బి.) పథకంతో ఎ.పి.పి.ఇ.పి.ని సంధానపరిచారు.

ఈ పథకం రెండవ దశ 1989లో చేబట్టారు. ఈ దశ కార్యక్రమం ఆరంభమయ్యేనాటికి కేంద్ర ప్రభుత్వ పథకాలైన ఓ.బి.బి., డి.ఐ.ఇ.టి.ల స్థాపన, ప్రైమరీ తరగతులకు మెరుగైన పాఠ్యప్రణాళిక రచనవంటి కార్యక్రమాలు అమలుపరచటం ఆరంభం కావటం వల్ల ఎ.పి.పి.ఇ.పి. పథకం అమలు సులభం అయ్యింది. ఈ రెండవ దశ పథకానికి ఐదు సంవత్సరాలకై ఓ.డి.ఎ. 279 లక్షల పౌన్ల సహాయం అందజేసింది.

ఈ పథకం క్రింద 1989–90 నుండి 1994–95 మధ్య కాలం రాష్ట్రంలో ఎంపిక చేసిన జిల్లాల సముదాయంలో ఒక్కొక్క జిల్లాలో 20% మండలాలలో కల ఉపాధ్యాయుల శిక్షణా కార్యక్రమం చేపట్టారు.

1989–90 నుండి 1993–94 వరకు : విశాఖ, కృష్ణ, నెల్లూరు, చిత్తూరు, కడప, హైదరాబాదు, రంగారెడ్డి, మహబూబ్‌నగరు మరియు నల్గొండ (9 జిల్లాలు)

1990–91 నుండి 1994–95 వరకు : శ్రీకాకుళం, తూ.గోదావరి, ప్రకాశం, కర్నూలు, అనంతపురం, ఆదిలాబాదు, కరీంనగరం మరియు మెదక్ (8 జిల్లాలు)

1991–92 నుండి 1994–95 వరకు : విజయనగరం, ప.గోదావరి, గుంటూరు, ఖమ్మం, వరంగల్లు మరియు నిజామాబాదు (6 జిల్లాలు)

ఈ విధంగా 1994–95 సంవత్సరాంతం వరకు పైన పేర్కొన్న కాల పరిమితిలో ప్రతి సంవత్సరం 20% మండలాల చొప్పున అన్ని జిల్లాలలోని అన్ని మండలాలలో ఈ పథకం క్రింద ఉపాధ్యాయుల శిక్షణ, టీచర్స్ సెంటర్ల స్థాపన, ఉపాధ్యాయుల కరదీపికలు మరియు ఇతర సాహిత్య ప్రచురణ పూర్తి అవుతుంది.

1994–95 కల్లా 1,57,826 ఉపాధ్యాయులకు మరియు మండల విద్యాధికారులకు శిక్షణ యివ్వాలని లక్ష్యం నిర్దేశించబడింది.

జూన్ 1994 నాటికి 3,393 తరగతి గదుల నిర్మాణము, 1,102 టీచర్స్ సెంటర్ల నిర్మాణం పూర్తి అయ్యింది.

ఆంధ్రప్రదేశ్ ప్రైమరీ ఎడ్యుకేషన్ పథకంవల్ల రాష్ట్రంలో విద్యా స్థాయిని పెంచటంలో ఉపాధ్యాయులను మరింత ఉత్తేజపరచటంలో పాఠశాలల భౌతిక అవసరాలు తీర్చటంతో గణనీయమైన ఫలితాలు వచ్చే అవకాశాలు వున్నవి. ఈ పథకం క్రింద కొన్ని సమస్యలపై పరిశోధనలు కూడా జరిపారు. డ్రాప్ అవుట్‌కి గల కారణాలు విద్యార్థులు పాఠశాలలకు సరిగా హాజరు కాకపోవటానికి కారణాలు, బహుళ తరగతి బోధనా సంబంధమైన సమస్యలపై పరిశోధనలూ జరిగినవి.

## 11.2 జిల్లా ప్రాథమిక విద్యా పథకం (DPEP):

ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం రాష్ట్రం అంతటికి వర్తించే పథకం. ఆ పథకంద్వారా ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చి వారి ప్రతిభను పెంచటం, వారి బోధనాకుశలతను మెరుగు పరచడం, విద్యార్థులకు ఆధారమైన బోధన ...సన కార్యక్రమాలను రూపొందించం వంటివి సాధించాలని ఉద్దేశించారు. అందులో భాగంగా పాఠశాల భవనాలు, టీచర్స్ సెంటర్ల భవనాలు కూడా నిర్మించటం ఆ పథకం లక్ష్యం. మొత్తంమీద గుణాత్మకమైన బోధన ఆ పథకం యొక్క ముఖ్య ఉద్దేశము.

సార్వత్రిక ప్రాథమిక విద్యా లక్ష్యాలు నెరవేరటంకొరకు ప్రతి జిల్లాలోని అన్ని గ్రామాల్లో కల బాల బాలికలను పాఠశాలలకు రప్పించి వారి చదువు పూర్తి అయ్యేవరకు వదలకుండా వుండటం జరగాలి. అలా జరగాలంటే స్థానిక పరిస్థితులు, సామాజిక స్థితిగతులు, పాఠశాల వసతులు వగైరాపై ఆధారపడిన పథకం స్థానికంగానే తయారు చేయటం అవసరం. ప్రజల భాగస్వామ్యంలో తయారుచేసిన యిలాంటి పథకం, వారిచేతనే అమలుజరిపించే కార్యక్రమం అవసరమని ప్రభుత్వం తెలుసుకొంది. జిల్లా ఆధారంగా యిలాంటి పథకం తయారుచేయ నిర్ణయించారు. ఈ జిల్లా ఆధారమైన, ప్రజల ప్రత్యక్ష భాగస్వామ్యంలో ఆ జిల్లాలో సార్వత్రిక ప్రాథమిక విద్య నుద్దేశించిన పథకం జిల్లా ప్రాథమిక విద్యా పథకంగా రూపొందించబడింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సహజంగా తాము కేటాయించే ధనంతో సహా బ్రిటిష్ సంస్థ (ODA) కూడా పథకానికి ఆర్థిక సహాయం అందచేస్తుంది. 1994–95 సం॥నుండి ఈ పథకం విజయనగరం, నెల్లూరు, కర్నూలు, కరీంనగరం మరియు వరంగల్లు జిల్లాల్లో అమలు పరుస్తారు.

# విద్యావిధానం - కొత్త పోకడలు

వి.పి.రాఘవాచార్యులు, ఎ.శ్యామసుందరరావు

విద్యకు సమాజానికి అవినాభావ సంబంధముంది. విద్య సమాజ పరిణామాన్ని నిర్దేశించేది కాకపోయినా ఆ పరిణామాన్ని గాఢంగా ప్రభావితం చేస్తుంది. సమాజం పరిణామ శీలమైనది. దానిననుసరించి విద్యావ్యవస్థ కూడా పరిణామం చెందుతూ వుండడం సహజమైన విషయం. సమాజ పరిణామదశలో ఆయాకాలాలలో సమాజ ఆశయాలకు ఆశలకు విద్య పోషకంగా వ్యవహరిస్తుంది, వ్యవహరించాలి కూడా. ఈ భూమికలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో విద్యా విధాన ప్రగతిని, సంస్కరణలను పరిశీలించాల్సి వుంటుంది.

నవంబరు 1, 1956 న ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగినపుడు మాజీ హైదరాబాదు రాష్ట్రానికి చెందిన తెలంగాణము మరియు ఆంధ్రరాష్ట్రానికి చెందిన కోస్తా రాయలసీమ ప్రాంతాల వికాసస్థాయి మరియు పరిపాలన విధానం విభిన్న దశలలో వుండినవి. విద్యాప్రగతి మరియు అక్షరాస్యత స్థాయిల్లో కూడ ఉభయ ప్రాంతాల్లో అంతరాలు వుండినవి. రెండు ప్రాంతాల్లో అంతకు పూర్వము ప్రజాస్వామికాలు వుండి వున్నప్పటికీ, తెలంగాణంలో నిరంకుశ నిజాం రాష్ట్ర పరిపాలన నుండి బయటపడి ప్రజాస్వామ్యం కొనసాగిన కాలం అతిస్వల్పమైనది. రెండు ప్రాంతాల ఏకీకరణలో రాజకీయ పరిస్థితి కూడా ప్రతిఫలించింది. విద్యావ్యవస్థకూడా దీనికి మినహాయింపుకాదు. ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం విద్యా సంస్కరణలు చేబట్టడానికి పూర్వం రెండు ప్రాంతాల్లో వున్న విభిన్న విద్యా వ్యవస్థలను ఏకీకృతం చేయడం ఆనాటి ప్రభుత్వం యొక్క కర్తవ్యమైనది. తదనుగుణంగా ఏకీకృత పాఠ్యప్రణాళిక ప్రవేశపెట్టడం జరిగింది. ఆ తరువాత విద్యకు ఒక జాతీయ దృక్పథం కల్పించే ప్రయత్నాలు కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో సాగినవి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కూడా చాలా మట్టుకు ఆ ఒరవడిలోనే సంస్కరణలను కొత్తపోకడలను అనుసరిస్తూవచ్చింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విద్యావ్యవస్థలోనూ తన ప్రయోగాలు ప్రారంభించటంలో దేశంలోని మిగిలిన రాష్ట్రాల కన్నా ఒకడుగు ముందున్నదనే చెప్పాలి. ఈ ప్రయోగాలన్నీ సత్ఫలితాల్ని యిచ్చినవనికాని వానివలన విద్యావ్యాప్తి ఆశించినంతవేగంగా సాగిందనికాని విద్యా సంపద ప్రమాణం గణనీయంగా పెరిగిందనికాని చెప్పలేము. అయినా వాని వల్ల కొన్ని అనుభవాలు - మంచివి, చెడువి - కలిగాయి. దేశ విద్యా విధానంలో అడపాదడపా చోటు చేసుకున్న కొత్త పోకడలను అమలు జరుపటంలో కూడా ఆంధ్రప్రదేశ్ ముందుగానే వుంటూ వచ్చింది. దేశంలో విద్యావ్యవస్థ నిర్మాణ విధానం (Structure of Education)లో 10 సంవత్సరాల పాఠశాలవిద్య, రెండు సంవత్సరాలు ఇంటర్మీడియట్ విద్య, మూడు సంవత్సరాలు మొదటి డిగ్రీ కోర్సు (దీనినే 10+2+3 నిర్మాణం అంటారు) మొదట ప్రవేశ పెట్టిన ఘనత ఆంధ్రప్రదేశ్‌కే దక్కినది. సార్వత్రిక విశ్వవిద్యాలయం ద్వారా అనియత పద్ధతిలో ఉన్నత విద్య అందజేయ మొదలెట్టిన మొదటి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్‌యే. వ్యవస్థాగతంగా గురుకుల పాఠశాలల స్థాపన, అభ్యుదయ ప్రాథమిక పాఠశాలల వ్యవస్థ ప్రారంభించిన అనుభవాలు యీ రాష్ట్రానివే. పరీక్షా సంస్కరణలో భాగంగా నాన్ డిటెన్షన్ పద్ధతి ప్రవేశపెట్టిన మొదటి రాష్ట్రం కూడా ఆంధ్రప్రదేశ్‌యే. అలాగే పాఠ్యపుస్తకాల జాతీయకరణ చేసిన మొదటి రాష్ట్రం మనదే. ఏమైనా, రాష్ట్రంలో విద్యాక్షేత్రం పలుప్రయోగాలకు, పోకడలకు గురి చేయబడినది. ఈ ప్రయోగాలు సిద్ధాంతపరంగా నిర్దిష్టమైన దిశ కలిగి వున్నప్పటికీ ఆచరణలో చెప్పుకోదగిన ఫలితాలు కనిపించలేదు.

## 1. గురుకుల పాఠశాలలు:

1.1 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము బాలబాలికలకు విద్యావకాశాలు విస్తరింపచేయటంతో పాటు గుణాత్మక విద్యనందజేసే ప్రయత్నం కూడా చేసింది. గురుకుల పాఠశాలల స్థాపన దీనికి ఉదాహరణగా చెప్పవచ్చు.

గ్రామీణ ప్రాంతాల్లోని ప్రతిభావంతులైన బాలబాలికలకు మెరుగైన విద్యాసౌకర్యాలు కల్పించే ఉద్దేశంతో 1971లో రాష్ట్ర ప్రభుత్వము గ్రామీణ ప్రాంతాలలో గురుకుల పాఠశాలలను నెలకొల్ప నిశ్చయించింది. బీహారులో నిదర్‌హాట్ పాఠశాల పని

తీరుతో ప్రేరణపొందిన అప్పటి అనాటి రాష్ట్రముఖ్యమంత్రి, నేటి భారత ప్రధానమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు యీ పాఠశాలల స్థాపనకు అంకురార్పణ చేశారు. 25 సెప్టెంబరు, 1971న నల్లగొండ జిల్లా సర్వేలు గ్రామం (హైద్రాబాద్ నుండి దాదాపు 60 కి.మీ.)లో మొట్టమొదటి గురుకుల పాఠశాలను ప్రారంభించారు. గ్రామీణ విద్యార్థులకు సామాజిక న్యాయం కల్పించడం, వారిలోని ప్రతిభను ప్రోత్సహించడం, అన్ని భౌతిక సౌకర్యాలుగల పాఠశాల వ్యవస్థద్వారా మెరుగైన బోధనావకాశాలు సమకూర్చడం యీ పాఠశాలల లక్ష్యాలు. విద్యార్థులు కులమత విభేదాలు విస్మరించి పాఠశాల ఆవరణలోనే కలిసికట్టుగా వుంటూ, అదే ఆవరణలో వుంటూ విద్యార్థుల అభ్యసనకు తోడ్పడే ఉపాధ్యాయుల మార్గదర్శకత్వంలో పఠనా కార్యక్రమాన్ని సాగించటం యీ విద్యాలయాల ఉద్దేశం.

సర్వేలలోని గురుకుల పాఠశాల తెలంగాణా ప్రాంతపు విద్యార్థులకు ప్రత్యేకించారు. 1972 ఆగష్టులో తాడికొండ (గుంటూరు జిల్లా) మరియు కొడిగెనహళ్ళి (అనంతపురం జిల్లా)లో ఒక్కొక్క గురుకుల పాఠశాలను కోస్తా మరియు రాయలసీమ విద్యార్థులకై స్థాపించారు. 1975లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గిరిజన విద్యార్థులకై ఖమ్మం జిల్లా యానంబైలు (పాల్వంచ దగ్గర) గ్రామానికి సమీపాన కిన్నెరసాని ఆనకట్టవద్ద మరో గురుకుల పాఠశాలను స్థాపించారు. ఈ పాఠశాలను రాష్ట్రంలో అన్ని ప్రాంతాల గిరిజన విద్యార్థులకు ప్రత్యేకించారు. అదే సంవత్సరంలో ప్రభుత్వం గుంటూరు జిల్లా నాగార్జునసాగర్ వద్ద గురుకుల జూనియర్ కళాశాలను, కర్నూలు పట్టణంలోని సిల్వర్ జూబిలీ డిగ్రీ కళాశాలను ప్రతిభగల విద్యార్థుల నందజేయగలందుకు స్థాపించింది. ఇలా ఒకటి తరువాత ఒకటి గురుకుల పాఠశాలలు, జూనియర్ కళాశాలలు, డిగ్రీ కళాశాలలు స్థాపింపబడ్డాయి. ప్రస్తుతం రాష్ట్రంలో మొత్తం 114 గురుకుల విద్యాలయాలు వెలసివున్నవి. వాని వివరాలు యివి:

| | | |
|---|---|---|
| 1. | బాలుర గురుకుల పాఠశాలలు | 23 |
| 2. | బాలికల గురుకుల పాఠశాలలు | 24 |
| 3. | మిశ్రమ గురుకుల పాఠశాలలు | 2 |
| 4. | గిరిజన ఆశ్రమ పాఠశాలలు | 36 |
| 5. | వెనుకబడిన తరగతుల వారి గురుకుల పాఠశాలలు | 10 |
| 6. | ఉర్దూమీడియం గురుకుల పాఠశాలలు | 4 |
| 7. | జూనియర్ కళాశాలలు | 13 |
| 8. | డిగ్రీ కళాశాలలు | 2 |

మూలం : ఆం.ప్ర. గురుకుల విద్యాలయాల సంస్థ.

మొత్తం 114 విద్యాలయాల్లో పాఠశాలలు 99. వీనిలో 23 పాఠశాలల్లో 3 వ తరగతి నుండి, 76 పాఠశాలల్లో 5 వ తరగతి నుండి బోధన జరుగుతుంది. అన్ని పాఠశాలల్లో పదవ తరగతి వరకు బోధిస్తారు. 2 మిశ్రమ పాఠశాలల్లో వృత్తివిద్యా కోర్సులు ప్రవేశపెట్టారు. గురుకుల పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య పెరుగుదల క్రింది పట్టికలో యివ్వబడింది.

**గురుకుల పాఠశాలలో విద్యార్థుల సంఖ్య**

| సంవత్సరం | బాలికలు | బాలురు | మొత్తం |
|---|---|---|---|
| 1991–92 | 8,235 | 23,087 | 31,322 |
| 1992–93 | 9,104 | 25,994 | 35,098 |
| 1993–94 | 9,706 | 25,572 | 35,278 |

మూలం : ఆం.ప్ర. గురుకుల విద్యాలయాల సంస్థ.

### 1.2 గురుకుల విద్యాలయాల్లో విద్యార్థుల ప్రవేశ పద్ధతి:

గురుకుల పాఠశాలలో చేరదల్చుకున్న విద్యార్థులు 3 వ తరగతి లేక 5 వ తరగతి లేక 8 వ తరగతి మాత్రమే నేరుగా చేరవచ్చు. 3 లేక 5 వ తరగతిలో చేరదల్చుకున్న విద్యార్థులు రెండు దశలలో ప్రవేశ పరీక్షలకు హాజరుకావల్సి వుంటుంది. మొదటి దశలో ముందు స్థాయిలో జరిగే ప్రవేశ పరీక్షలో హాజరై ఉత్తీర్ణత సాధించాలి. అలా ఉత్తీర్ణులైన విద్యార్థులు రెండవ దశలో జిల్లాస్థాయిలో జరిగే ప్రవేశ పరీక్షకు హాజరవాలి. జిల్లా స్థాయి పరీక్షలో ఉత్తీర్ణులైన బాలబాలికలను మెరిట్ ఆధారంగా ఎంపిక చేసి గురుకుల పాఠశాలల్లో ప్రవేశము కల్పిస్తారు. ప్రవేశ పరీక్షకు ముందు కనీసం 2 వ లేక 4 వ తరగతి వరకు గ్రామీణ పాఠశాలలో చదువుతూ వుండి ఆయా తరగతుల్లో ఉత్తీర్ణులైవుండాలి. 8 వ తరగతిలో చేరదల్చుకున్న విద్యార్థులు జిల్లా స్థాయిలో జరిగే ప్రవేశపరీక్షకు హాజరై ఉత్తీర్ణత సాధించాల్సి వుంటుంది. అయితే యీ ప్రవేశ పరీక్షలో అందరూ కూర్చోవటం వీలుకాదు. ప్రతి మండలంలో 7 వ తరగతి కామన్ పరీక్షలో అత్యధిక మార్కులు సాధించిన 13 మంది బాలురు మరియు 13 మంది బాలికలు యీ ప్రవేశ పరీక్షకు కూర్చోవటానికి అర్హులు.

జూనియర్ కళాశాలల్లో మొదటి సంవత్సరం యింటర్మీడియట్‌లో ప్రవేశం కొరకు గురుకుల విద్యాలయాల సంస్థ ప్రవేశ పరీక్ష నిర్వహిస్తుంది. ఈ ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు వారు సాధించిన మెరిట్ ఆధారంగా కులాలవారి 'రిజర్వేషను సూత్రాన్ననుసరించి ప్రవేశం కల్పించటం జరుగుతుంది. డిగ్రీ కళాశాలల్లో మొదటి సంవత్సరం డిగ్రీ కోర్సులో ప్రవేశానికై కూడా ఈ విద్యాలయాల సంస్థ ప్రవేశ పరీక్ష నిర్వహిస్తుంది.

ఈ పరీక్షల్లో ఉత్తీర్ణులైన విద్యార్థులకు మెరిట్ ఆధారంగా డిగ్రీకోర్సులో ప్రవేశం లభిస్తుంది.

### 1.3 గురుకుల విద్యాలయాల్లో పాఠ్యప్రణాళిక, బోధనా మాధ్యమం మరియు పరీక్షల పద్ధతి:

గురుకుల పాఠశాలల్లో యితర సామాన్య పాఠశాలల పాఠ్యప్రణాళికలనే పాటిస్తారు. జూనియర్ కళాశాలల్లో ఇంటర్మీడియేట్ బోర్డు నిర్ణయించిన పాఠ్యప్రణాళిక మరియు డిగ్రీ కళాశాలల్లో ఆయా విశ్వవిద్యాలయాలు నిర్దేశించిన పాఠ్యప్రణాళికలను అమలు పరుస్తారు. అన్ని పాఠశాలల్లో బోధనా మాధ్యమం తెలుగు. అయితే ఉర్దూ పాఠశాలలు నాల్గింటిలో ఉర్దూ బోధనామాధ్యమం. జూనియర్ కళాశాలలో తెలుగుతో సహా యింగ్లీషు కూడా బోధనా మాధ్యమంగా ప్రవేశపెట్టారు. నాగార్జునసాగర్ డిగ్రీ కళాశాలలో కేవలం ఇంగ్లీషు మాధ్యమంకాగా కర్నూలు సిల్వర్ జూబిలీ డిగ్రీ కళాశాలలో తెలుగు మరియు ఇంగ్లీషు బోధనా మాధ్యమంగా వుంది.

గురుకుల పాఠశాలల విద్యార్థులు పదవ తరగతి చివర ప్రభుత్వ పరీక్షల కమీషనరు నిర్వహించే యస్.యస్.సి. పరీక్షలకు హాజరుకావాల్సి వుంటుంది. అలాగే జూనియర్ కళాశాలల విద్యార్థులు ఇంటర్మీడియేటు బోర్డు నిర్వహించే పరీక్షలలోను, డిగ్రీ కళాశాలల విద్యార్థులు ఆయా విశ్వ విద్యాలయాలు నిర్వహించే పరీక్షలలో కూర్చుంటారు. అంటే గురుకుల విద్యాలయాలు విద్యార్థులు యితర సామాన్య విద్యాలయాల విద్యార్థుల వలె ఆయా సంస్థలు నిర్వహించే పరీక్షలకు హాజరై తమ ప్రతిభను రుజువు చేస్తారు. గురుకుల విద్యాలయాల విద్యార్థులకు వేరుగా పరీక్షా విధానమంటూ ఏదీలేదు. పాఠశాల విద్యార్థుల అంతర్గత పరీక్షలకై సంస్థ అధీనంలో రాష్ట్రస్థాయి పరీక్ష బోర్డును ఏర్పాటు చేశారు.

గురుకుల పాఠశాలల విద్యార్థులు సాధారణంగా క్రమం తప్పకుండా మెరుగైన సామర్థ్యం కనబరుస్తూ వుండటం హర్షించాల్సిన అంశం. సాధారణంగా యస్.యస్.సి. పరీక్షల్లో మొదటి శ్రేణిలో అత్యున్నత స్థానాల్ని గురుకుల పాఠశాల విద్యార్థులు కైవసం చేసుకుంటూ వస్తున్నారు. 1993 మార్చిలో జరిగిన యస్.యస్.సి. పరీక్షలో 31 గురుకుల పాఠశాలలు శత శాతం ఉత్తీర్ణతను సాధించాయి. వీనిలో 17 పాఠశాలల విద్యార్థులు అందరూ మొదటి శ్రేణిలో పాస్ అయ్యారు. అయినా యీ గుణాత్మక స్థాయి తరువాతి కాలంలో వచ్చిన అన్ని గురుకుల పాఠశాలల్లో పెరగకపోవడం గమనించాల్సిన విషయం. విద్యార్థుల ప్రవేశం, ఉపాధ్యాయుల నియామకం మరియు పాఠశాలల నిర్వహణలో చోటు చేసుకున్న సడలింపులు దీనికి కారణాలుగా పేర్కొనవచ్చు.

### 1.4 జూనియర్ మరియు డిగ్రీ గురుకుల కళాశాలలు:

రాష్ట్రంలో 13 గురుకుల జూనియర్ కళాశాలలు, రెండు గురుకుల డిగ్రీ కళాశాలలున్నవని యిదివరకే చెప్పటం జరిగింది. 13 జూనియర్ కళాశాలల్లో అన్ని గ్రూపులు అంటే బి.పి.సి., యం.పి.సి., సి.ఇ.సి. మరియు యం.ఇ.సి. కోర్సులు బోధిస్తారు. ఒక జూనియర్ కళాశాలలో మాత్రం వృత్తి విద్యాకోర్సులు ప్రవేశపెట్టారు. నాగార్జునసాగర్, నిమ్మకూరు మరియు కొడిగెనహళ్ళిలో గల జూనియర్ కళాశాలలో అన్ని ప్రాంతాల విద్యార్థులకు ప్రవేశ అవకాశాలున్నవి. కాని భద్రాచలం జూనియర్ కళాశాలను కేవలం ఖమ్మం జిల్లా విద్యార్థులకు, చింతపల్లి జూనియర్ కళాశాలను శ్రీకాకుళం, విజయనగరం మరియు విశాఖ జిల్లా విద్యార్థులకు, మారెడుమిల్లి జూనియర్ కళాశాలను తూర్పు మరియు పశ్చిమ గోదావరి జిల్లాల విద్యార్థులకు మరియు ఉట్నూరు జూనియర్ కళాశాలను ఆదిలాబాద్ మరియు వరంగల్లు జిల్లాల విద్యార్థులకు కేటాయించారు.

రెండు డిగ్రీ కళాశాలలలో బి.ఏ., బి.కాం, మరియు బి.యస్.సి. కోర్సులు బోధిస్తారు. వీనిలో ప్రవేశం అన్ని ప్రాంతాల వారికి ప్రవేశ పరీక్షలో సాధించిన మెరిటు ఆధారంగా లభిస్తుంది.

### 1.5 గురుకుల విద్యాలయాల్లో విద్యార్థుల సౌకర్యాలు:

గురుకుల విద్యాలయాల్లో చదివే బాలబాలికలు ఎలాంటి ఫీజు చెల్లించాల్సిన అవసరం లేదు. భోజన మరియు నివాస వసతులు కూడా ఉచితం. విద్యార్థులందరికీ ఆరోగ్య రక్షణ తదితర వ్యక్తిగత సౌకర్యాలు కూడా ఉచితంగా కల్పించారు. పాఠశాలల్లో చిన్నతరహా ఆరోగ్యశిబిరాలు స్థాపించారు. వానిలో అత్యవసర ఔషధాలు అందుబాటులో వుంటవి. దగ్గరి ప్రభుత్వ ఆస్పత్రినుండి డాక్టరు వారానికి మూడుసార్లు వచ్చి విద్యార్థుల ఆరోగ్య పరిస్థితి పరీక్షించి రోగ నివారణోపాయాలను సూచిస్తారు.

గురుకుల పాఠశాలల్లో విద్యార్థులకు మెరుగైన గుణాత్మక విద్య నందజేయటంకొరకు ఉపాధ్యాయులు పాఠశాల ప్రాంగణంలోనే బసచేసే సౌకర్యాలు కల్పించారు. తరగతి గదిలో బోధనతో పాటు పాఠశాల సమయం అయిపోయాక ఉపాధ్యాయులు విద్యార్థుల పఠనంలో సహాయపడ్తారు, ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు. కాబట్టి గురుకుల పాఠశాల అధ్యాపకులు వేతనస్కేళ్ళు సామాన్య పాఠశాల ఉపాధ్యాయుల స్కేళ్ల కన్నా హెచ్చుగా నిర్ధారించారు. శిక్షణ పొందిన పోస్టు గ్రాడ్యుయేటు ఉపాధ్యాయుడికి రూ.3,310–6,840స్కేలు మరియు శిక్షణ పొందిన గ్రాడ్యుయేటు ఉపాధ్యాయుడికి రూ.2,930–5,960 స్కేలు యిస్తున్నారు. ఉపాధ్యాయుల నియామకం అత్యంత శ్రద్ధతో వారి కౌశల్యాలు అనుభవం మరియు

మనోవైఖరులను పరిశీలించిన తరువాతనే జరుగుతుంది.

### 1.6 గురుకుల విద్యాలయాల సంస్థ మరియు ఆర్థిక వనరులు:

రాష్ట్రంలోని అన్ని గురుకుల విద్యాలయాల యాజమాన్యం స్వతంత్ర ప్రతిపత్తిగల గురుకుల విద్యాలయాల సంస్థ (Andhra Pradesh Residential Educational Institutions Society: APREIS) వహిస్తుంది. 1972లో ఈ సంస్థను స్థాపించటం జరిగింది. ఈ సంస్థ నిర్వహణ, పరిపాలనకై బోర్డ్ ఆఫ్ గవర్నర్స్ నొకదానిని నెలకొల్పారు. దైనందిన పరిపాలన మరియు విధానాల అమలును సంస్థ కార్యదర్శి చూస్తారు. బోర్డ్ ఆఫ్ గవర్నర్స్ అధ్యక్షుడు రాష్ట్ర పాఠశాల విద్యామంత్రి, ఉపాధ్యక్షుడు రాష్ట్ర ప్రభుత్వ విద్యా శాఖ కార్యదర్శి మరో 18 మంది అధికారులు – మొత్తం 20 మంది బోర్డు సభ్యులుగా వుంటారు.

గురుకుల విద్యాలయాలపై అయ్యే ఖర్చు మొత్తం రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తుంది. సిబ్బంది వేతనాలు, విద్యాలయాల్లో బోధనాసామగ్రి తదితర సదుపాయాలు, భవనాలు, వాని మరమ్మత్తు వగైరాలపై పెట్టుబడి యావత్తు ప్రభుత్వమే సమకూరుస్తుంది.

### 1.7 అభ్యుదయ ప్రాథమిక పాఠశాలలు:

ప్రాథమిక పాఠశాల విద్యలో నూతన ప్రయోగంగా 1978–79 లో అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ మర్రి చెన్నారెడ్డి "అభ్యుదయ ప్రాథమిక విద్యా సంస్థ" నొక దానిని స్థాపించి, కొన్ని ప్రాథమిక పాఠశాలలను ఆ సంస్థకి అప్పజెప్పి ప్రాథమిక విద్యలో మార్పులు చేయాలని సంకల్పించారు. ఈ సంస్థ ఏర్పడి ప్రాథమిక పాఠశాలలు (ఎంపిక చేసినవి) అభ్యుదయ ప్రాథమిక పాఠశాలలుగా నామకరణం చెంది పని చేయనారంభించినవి. అయితే ఆ తరువాత యీ సంస్థ మూసివేయబడింది. పాఠశాలలు తిరిగి పంచాయతి సమితి యాజమాన్యంలోకి తరలించబడినవి.

కాగా తిరిగి 1990 లో రాష్ట్ర ప్రభుత్వము ప్రతి జిల్లాలో 5 పాఠశాలల చొప్పున మొత్తం 115 ప్రాథమిక పాఠశాలలను అభ్యుదయ ప్రాథమిక పాఠశాలలుగా ప్రకటించింది. ఎంపిక చేసిన యీ పాఠశాలల్లో గురుకుల పాఠశాలలు కావు. కాని వానిలో విద్యార్థులు ఎక్కువ కాలం గడప వీలు కల్గించేందుకు ప్రొద్దున అల్పాహారంతో పాటు మధ్యాహ్న భోజనం మరియు సాయంకాలం బిస్కట్లు తేనీరు సదుపాయాలు కల్పించారు. ప్రొద్దున సకాలంలో బడికి వచ్చి సాయంకాల వరకు అభ్యసన, వ్యాయామం తదితర కృత్యాల్లో చురుగ్గా పాల్గొని సాయంకాలం తమ తమ యిళ్ళకు వెళ్ళే వీలు కల్గించే ప్రణాళిక ఈ పాఠశాలల్లో అమలు జరుగుతోంది. ఈ పాఠశాలలు మొదట జిల్లా విద్యాశాఖాధికారి యాజమాన్యంలో వుండినవి. తరువాత కాలంలో వీనిని గురుకుల పాఠశాలల సంస్థకు అప్పజెప్పారు.

1992–93 లో ఈ పాఠశాలల్లో మొత్తం 27,994 విద్యార్థులు చదివేవారు. 1993–94 విద్యార్థుల సంఖ్య 29,121కి పెరిగింది. 1994–95 లో 32,000 విద్యార్థులను యీ పాఠశాలల్లో చేర్చుకోవాలని ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకుంది.

## 2. సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలలు:

గ్రామీణ షెడ్యూలు కులాల మరియు యితర బలహీన వర్గాల బాలబాలికలకు మెరుగైన విద్యా సౌకర్యాలు అందజేసి వారిలో ప్రతిభను పెంపొందించే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 1983–84 లో సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలలను స్థాపించింది. ప్రభుత్వ ఉత్తర్వు (జి.ఓ.) 118 (సాం. సం) తేది. 17.11.83 ద్వారా ఈ పాఠశాలల మంజూరు చేయటం జరిగింది. ఒక్కొక్క జిల్లాలో 2 చొప్పున ఆ సంవత్సరం 46 సంక్షేమ పాఠశాలలు తెరువబడ్డాయి. ఈ పాఠశాలలు గురుకుల పద్ధతిన విద్యా బోధనను సాగిస్తవి. ఈనాడు మొత్తం 120 సాంఘిక సంక్షేమ గురుకుల విద్యాలయాలు వెలసియున్నవి. వీనిలో 6 జూనియర్ కళాశాలలు. 114 పాఠశాలలలో 52 బాలికల పాఠశాలలు, 62 బాలుర పాఠశాలలు. జూనియర్ కళాశాలల్లో 3 బాలికలవి, 3 బాలురవి.

విద్యాబోధన పట్ల వ్యక్తిగత శ్రద్ధ వహించటానికి వీలుగా ప్రతి తరగతికి రెండు సెక్షన్లు మాత్రమే వుండాలని, ప్రతి సెక్షనులో 40 విద్యార్థులకు మించకుండా ప్రవేశము యివ్వాలని నిర్ణయించటం జరిగింది. ఈ పాఠశాలలన్నింటిలో 5 వ తరగతి నుండి పదవతరగతి వరకు విద్యాబోధన జరుగుతుంది. 5 వ తరగతిలోమాత్రమే ప్రవేశ సౌకర్యం వుంటుంది. సాంఘిక సంక్షేమ గురుకుల విద్యాలయాల సంస్థ జిల్లాస్థాయిలో నిర్వహించే ప్రవేశ పరీక్షలో అభ్యర్థులు సాధించిన మెరిటు ఆధారంగా 5 వ తరగతిలో ప్రవేశం మంజూరు చేస్తారు. అయితే ఈ పాఠశాలల్లో ప్రవేశార్హతకై తల్లిదండ్రుల ఆదాయం రూ.12,000 కు మించి వుండరాదు. ఈ పాఠశాలల్లో క్రింద తెలిపిన విధంగా వివిధ వర్గాల విద్యార్థులకు ప్రవేశం యివ్వబడుతుంది:

| | | |
|---|---|---|
| షె.కులాలు | : | 75% |
| షె.తెగలు | : | 6% |
| హరిజన క్రిష్టియన్లు | : | 12% |
| వెనుకబడిన తరగతులు | : | 5% |
| యితరులు | : | 2% |

1994–95 విద్యాసంవత్సరంలో యీ గురుకుల పాఠశాలల్లో విద్యనభ్యసిస్తున్న వారి సంఖ్య క్రింద తెలిపాము.

| 52 | బాలికల పాఠశాలల్లో | 24,960 |
|---|---|---|
| 62 | బాలుర పాఠశాలల్లో | 29,760 |
| 6 | జూనియర్ కళాశాలల్లో | 1,710 |
| | మొత్తం | 56,430 |

సాంఘిక సంక్షేమ హాస్టళ్ళను క్రమానుగతంగా గురుకుల పాఠశాలలుగా మార్చే విధానాన్ని ప్రభుత్వం అమలు పరుస్తున్నది.

### 2.2 పాఠ్యప్రణాళిక, పరీక్షలు ఫలితాలు:

సాంఘిక సంక్షేమ పాఠశాలలన్నింటిలో సామాన్య పాఠశాలలో పాఠ్య ప్రణాళికనే పాటిస్తారు. ఏడవతరగతి చివర జిల్లా కామన్ పరీక్షలోను పదవతరగతి చివర పరీక్షల కమీషనరు నిర్వహించే పబ్లిక్ పరీక్షలోను యీ పాఠశాలల విద్యార్థులు హాజరు కావలసి వుంటుంది. మిగిలిన తరగతుల వార్షిక పరీక్షలు సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాల వ్యవస్థలో ఏర్పడియున్న పరీక్షా విభాగం నిర్వహిస్తుంది. ఉపాధ్యాయులు పాఠశాల ఆవరణలోనే వుంటూ విద్యార్థుల అభ్యసనలో తోడ్పడుతారు. వ్యక్తిగతశ్రద్ధ వహిస్తారు. విద్యార్థులు యస్.యస్.సి. పరీక్షలో ఉన్నత ప్రతిభను సాధించటం గమనించాల్సిన విషయం. 1994 యస్.యస్.సి. పరీక్షలో యీ పాఠశాలల విద్యార్థుల ఉత్తీర్ణతా శాతం 73. తొమ్మిది పాఠశాలలు శతశాతం ఉత్తీర్ణతను సాధించాయి. 1987 నుండి 1994 వరకు ఈ పాఠశాల విద్యార్థుల ఉత్తీర్ణతా శాతాలు క్రింద నివ్వనైనవి:

| | | |
|---|---|---|
| 1987 | – | 73% |
| 1988 | – | 76% |
| 1989 | – | 66% |
| 1990 | – | 74% |
| 1991 | – | 77% |
| 1992 | – | 78% |
| 1993 | – | 63% |
| 1994 | – | 73% |

1992లో ఈ పాఠశాలలకు చెందిన 195 విద్యార్థులు యస్.యస్.సి. పరీక్షలో 100 లోపు ర్యాంకులను సాధించారు.

ఈ పాఠశాలల్లో బోధనా మాధ్యమము తెలుగు అయితే కొన్ని పాఠశాలల్లో 8 వ తరగతి నుండి ఇంగ్లీషు కూడా బోధనా మాధ్యమంగా ఉపయోగిస్తున్నారు. 17 పాఠశాలల్లో కంప్యూటర్ విద్యను ప్రవేశపెట్టారు. కాని వృత్తివిద్యాకోర్సులు యింతవరకు పాఠశాలల్లో కాని, జూనియర్ కళాశాలల్లోకాని ఆరంభించడం జరుగలేదు. ప్రతిభగల బాల బాలికలకు యింజనీరింగు, వైద్య కోర్సులలో ఉన్నత విద్య నభ్యసించేందుకు ప్రోత్సహించే ఉద్దేశంతో సంస్థ EAMCET పరీక్షకై విద్యార్థులకు ప్రత్యేక కోర్సులను నిర్వహిస్తుంది. ఈ కోర్సులు వేసవి సెలవుల్లో ఏర్పాటు చేస్తారు.

### 2.3. విద్యార్థులకు సౌకర్యాలు, ప్రోత్సాహకాలు:

సాంఘిక సంక్షేమ గురుకుల విద్యాలయాల్లో చేరిన విద్యార్థు లందరికీ ఉచితంగా భోజన మరియు ఆవాస సౌకర్యాలు లభిస్తవి. ప్రతి విద్యా సంవత్సరంలో ఒక్కొక్క విద్యార్థికి 3 జతల దుస్తులు, పడక సామగ్రి, భోజన సామగ్రి (ప్లేటు వగైరా) ఉచితంగా సరఫరా చేయటం జరుగుతుంది. విద్యార్థులందరికీ పాఠ్యపుస్తకాలు, నోటు పుస్తకాలు కూడా ఉచితంగా అందజేయటం జరుగుతుంది. ఆరోగ్యసౌకర్యాలు, పారిశుద్ధసౌకర్యాలు అందరికీ సమకూరుస్తారు.

పరీక్షలల్లో ప్రతిభను కనబరిచే విద్యార్థులకు ప్రోత్సాహకరంగా నగదు బహుమతులు సర్టిఫికేట్లు అందజేసే పథకాన్ని అమలు పరుస్తున్నారు. మొదటి 25 ర్యాంకులో ప్యాసైన విద్యార్థులకు మెరిట్ సర్టిఫికేటుతో పాటు రూ.3,000/– నగదు బహుమతి అందజేస్తారు. 25 మంది 50 ర్యాంకు సంపాదించిన విద్యార్థులకు సర్టిఫికేటు మరియు రూ.2,000/– బహుమతి నిస్తారు. 50 నుంచి 100 మధ్య ర్యాంకు సంపాదించిన వారికి రూ.1,000/– నగదు బహుమతి లభిస్తుంది.

### 2.4 సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలల యాజమాన్య వ్యవస్థ మరియు ఆర్థిక వనరులు:

సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలల యాజమాన్యము ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ విద్యాలయాల సొసైటీ (A.P. Social Welfare Residential Educational Institutions Society: APSWREIS)) వహిస్తుంది. ఈ సొసైటీకి రాష్ట్ర స్థాయిలో సాంఘిక సంక్షేమ శాఖ కార్యదర్శి అధ్యక్షుడు, జిల్లా స్థాయిలో జిల్లా కలెక్టరు యీ పాఠశాలలకు యాజమాన్యము వహిస్తాడు. పాఠశాలల దైనందిన పరిపాలనా సంబంధమైన అంశాలను కలెక్టరు అజమాయిషి చేస్తారు. రాష్ట్ర స్థాయిలో సొసైటీ విధాన నిర్ణయాలు తీసుకుంటుంది. మరియు ఆర్థిక వనరులను సమకూర్చే బాధ్యత వహిస్తుంది.

సొసైటీ ఉపాధ్యాయుల మరియు యితర సిబ్బంది యొక్క సర్వీసు నిబంధనలను, వారి నియామక పద్ధతులను, క్రమశిక్షణా నిబంధనలను రూపొందించి అమలు జరుపుతుంది.

సొసైటీ కార్యాలయ సిబ్బంది ఖర్చుతో సహా పాఠశాలల్లో విద్యార్థులపై, సిబ్బందిపై మరియు నిర్వహణకై అయ్యే మొత్తం ఖర్చు రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తుంది. ఒక్కొక్క

విద్యార్థిపై దాదాపు రూ. 10,000/– ఏటా ఖర్చవుతుందని అంచనా. అంతేకాక భవనాల నిర్మాణం, పాఠశాలలో శాశ్వత సదుపాయాల (వంటగది, సామగ్రి, సిబ్బందికి ఆవాసగృహాలు వగైరా)కై ప్రభుత్వం అదనంగా నిధులు సమకూరుస్తుంది. బోధన మరియు బోధనేతర సిబ్బంది జీతాలు, బోధనోపకరణాలకై ఖర్చు, ఆటసామగ్రి ఖర్చు వగైరాలాంటి ప్రతి సంవత్సరం అయ్యే మొత్తం ఖర్చుతో సహా అన్ని ఖర్చులు ప్రభుత్వం భరిస్తుంది.

గడచిన ఆరు సంవత్సరాలలో యీ పాఠశాలలపై చేసిన ఖర్చు వివరాలు క్రింది విధంగా వున్నాయి.

| | | |
|---|---|---|
| 1989–90 | : | రూ.1135.50 లక్షలు |
| 1990–91 | : | రూ.1379.50 లక్షలు |
| 1991–92 | : | రూ.1472.56 లక్షలు |
| 1992–93 | : | రూ.3286.05 లక్షలు |
| 1993–94 | : | రూ.3621.80 లక్షలు |
| 1994–95 | : | రూ.4648.54 లకలు |

1994–95 సంవత్సరంలో అదనంగా రూ.52 కోట్లు భవనాల నిర్మాణం కొరకు ఖర్చు చేయాలని ప్రతిపాదనలున్నవి.

## 2.5 ఉపాధ్యాయులు, యితర సిబ్బంది:

సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలల ఉపాధ్యాయులను సంస్థయే నేరుగా నియమిస్తుంది. ప్రతి పాఠశాలకు ఒక ప్రిన్సిపాలు, 9 మంది శిక్షణ పొందిన పోస్టుగ్రాడ్యుయేటు ఉపాధ్యాయులు, 9 మంది శిక్షణ పొందిన గ్రాడ్యుయేటు ఉపాధ్యాయులు నలుగురు ప్రత్యేక ఉపాధ్యాయులు (వ్యాయామ, ఆర్టు, క్రాఫ్టు, సంగీత ఉపాధ్యాయులు) ఒక లైబ్రేరియన్ మరియు ఒక నర్సు వుంటారు. వీరుకాక క్లర్కులు, బంట్రోతులు మొత్తం 20 మంది బోధనేతర సిబ్బంది వుంటారు.

ఉపాధ్యాయులకు సామాన్య పాఠశాల ఉపాధ్యాయుల కన్న మెరుగైన వేతన స్కేళ్లు వర్తింప జేశారు. ప్రతి పాఠశాలలో గల సిబ్బందికి ఏటా దాదాపు 23 లక్షల రూపాయలు అవసరమౌతవని అంచనా వేయబడినది.

ఉపాధ్యాయులకు ఉద్యోగాంతర్గత శిక్షణను ప్రతి ఏటా నిర్వహించాలని సంస్థ నిర్ణయించింది. ఇప్పటికి 14 శిక్షణా కోర్సులు నిర్వహించటం జరిగింది.

# 3. విద్యాక్షేత్రంలో సాంకేతిక ప్రయోగాలు:

శాస్త్ర సాంకేతిక ప్రగతి యితర క్షేత్రాల వలె విద్యాక్షేత్రాన్ని కూడా ప్రభావితం చేసింది. సాంకేతిక పరికరాలు విద్యాక్షేత్రంలో అన్ని విభాగాల్లో విస్తృతంగా ఉపయోగ పడుతున్నవి. విద్యాపరిపాలన, పాఠశాల యాజమాన్యము బోధనాప్రక్రియ, పరీక్షల నిర్వహణ మరియు వాని ఫలితాల ప్రకటన వగైరాలలో సాంకేతిక పరికరాలు ఉపకరిస్తున్నవి. అంతేకాక విద్యావకాశాల వ్యాప్తిలో, బోధనాభ్యసన ప్రక్రియలో యీనాడు సాంకేతిక ప్రగతి చాలా ఉపయుక్తమైన పాత్ర వహిస్తున్నది. పాఠ్యప్రణాళికలో నూతన విజ్ఞాన శాస్త్ర అంశాలు చోటు చేసుకుంటున్నవి. సాంకేతిక పరికరాల ఉపయోగంలో శిక్షణ అవసరమౌతున్నది. విద్యార్థులలో సాంకేతిక పరిజ్ఞానం పెంచవలసి వస్తున్నది.

విద్యాపరిపాలనను సమర్థవంతంగా నిర్వహించటానికి, సంఖ్యా వివరాలు ఎప్పటికప్పుడు సేకరించి, నిలువ చేసి విశ్లేషించటానికి, పాఠశాలల నిర్వహణను మెరుగుపరచటానికి, ఉపాధ్యాయుల వివరాలు, వారి సర్వీసు స్థితిగతులను మరియు బదిలీలను క్రమబద్ధం చేయటానికి కంప్యూటర్ ఉపయోగంలోకి తెచ్చారు. రాష్ట్రవిద్యా సంచాలకుల కార్యాలయంలో మరియు జిల్లా విద్యాశాఖాధికార్ల కార్యాలయాల్లో కంప్యూటర్లను నెలకొల్పి వానిని సంధానపరిచే ప్రతిపాదనలున్నవి.

పరీక్షల నిర్వహణ మరియు ఫలితాల నిర్ణయంలో గత కొంతకాలంగా కంప్యూటర్ ఉపయోగించటం జరుగుతున్నది.

## 3.1 కంప్యూటర్ విద్య:

విద్యార్థులలో కంప్యూటర్ పరిజ్ఞానం కల్గించి, వారికి దాని వాడుకలో తరఫీదు యిచ్చే వుద్దేశంతో 1984–85 లో CLASS (Computer Literacy and Studies in Schools) పథకాన్ని ప్రవేశపెట్టింది. కంప్యూటర్లను గురించి వాని వివిధ ఉపయోగాల గురించి విద్యార్థులకు తెలియజేయడం, వివిధ రంగాల్లో కంప్యూటర్ల ఉపయోగం గురించి అవగాహన కలిగించడం, సమాచార సేకరణ మరియు కంప్యూటర్లలో దానిని నిలవ చేయడం విషయంలోని విద్యార్థులకు కౌశల్యము అందజేయడం యీ పథకం లక్ష్యాలు. ఈ పథకం క్రింద 23 జిల్లాల్లోని 556 ఉపాధ్యాయులకు ముందుగా శిక్షణ నిచ్చారు. ఉపాధ్యాయుల శిక్షణ, కంప్యూటర్ల సరఫరాతో సహా ఈ పథకం అమలుకు అయ్యే మొత్తం ఖర్చు కేంద్రమే భరిస్తుంది.

1984–85 నుండి 1989–90 వరకు క్రింది పట్టికలో చూపిన విధంగా 139 పాఠశాలల్లో CLASS పథకం అమలులోకి వచ్చింది.

పట్టిక–3:

1984–85 నుండి 1989–90 వరకు కంప్యూటర్ కోర్సు వ్యాప్తి.

| సంవత్సరం | కంప్యూటర్ విద్య ప్రారంభించిన పాఠశాలల సంఖ్య | సం॥రం చివరి వరకు కోర్సు ప్రవేశపెట్టిన పాఠశాలల సంఖ్య |
|---|---|---|
| 1984–85 | 8 | 8 |
| 1985–86 | 16 | 24 |
| 1986–87 | 34 | 58 |
| 1987–88 | 40 | 98 |
| 1988–89 | 24 | 122 |
| 1989–90 | 17 | 139 |

మూలం: ప్రభుత్వ విద్యా బడ్జెట్టు ప్రతిపాదనలు.

1989–90 తరువాత కొత్తగా కంప్యూటర్ విద్య ఏ పాఠశాలలోను ప్రవేశపెట్టకపోవడం గమనార్హం.

### 3.2 దృశ్యశ్రవణ యంత్రాలద్వారా బోధన:

తరగతి గదిలో బోధన ప్రభావవంతంగాను, అర్థవంతం గాను జరగాలంటే ఉపాధ్యాయుడు కొన్ని ఉపకరణాలను ఉపయోగించి తీరాలి. కేవలం నల్లబల్ల, సుద్దముక్క మరియు పాఠ్యపుస్తకమే ఉపాధ్యాయుడికి బోధనకుపకరించే సాధనాలు కావు. విద్యార్థుల్లో అభ్యసనాసక్తి పెరిగి బోధనాలక్ష్యాలు నెరవేరాలంటే చిన్నవో పెద్దవో బోధనోపకరణాలు అవసర మౌతవి. పాఠశాలలో చాలాకాలంగా బోధనోపకరణాల ఉపయోగం జరుగుతునే వున్నది. చిత్రపటాలు, మ్యాపులు, మాడెల్సు వంటి ఉపకరణాలు చాలా కాలంగా ఉపయోగంలో వున్నవి. దాదాపు రెండు దశాబ్దాల పూర్వం నుండి అన్ని పాఠశాలల్లో దృశ్యశ్రవణ యంత్రాలు ఉపయోగించటం ఆరంభమైంది. 16 మి. మీ. సినిమా ప్రొజెక్టరు, ఫిల్మ్‌స్ట్రిప్ ప్రొజెక్టరు, టేపు రికార్డు వంటివి పాఠశాలల్లో సమకూర్చారు. దృశ్యశ్రవణ విద్యా విభాగం ఏర్పాటు చేసి విద్యార్థులలో ఆ యంత్రాలపట్ల ఆసక్తి, అభిరుచిని పెంచే చర్యలు తీసుకున్నారు. అయినా ఆ యంత్రాల విస్తృత ఉపయోగం ఈ మధ్యనే పెరిగింది. వీడియో కాసెట్ల ద్వారా భాషాబోధన, ఫిల్మ్‌ప్రొజెక్టరు మరియు స్ట్రిప్ ప్రొజెక్టరు ద్వారా విజ్ఞానశాస్త్ర, సామాజిక శాస్త్ర బోధన క్రమక్రమంగా ఎక్కువ ఉపయోగంలోకి వచ్చాయి. రేడియో ద్వారా పాఠాలబోధన కొన్ని సంవత్సరాలుగా జరుగుతోంది.

రేడియో పాఠాల ప్రసారం ఆకాశవాణి ద్వారా జరుగు తున్నది. ఒకవైపు విద్యార్థులకు పాఠ్యప్రణాళికలోని అంశాల బోధన జరుగుతున్నది. మరోవైపు ఉపాధ్యాయులకై రేడియో ద్వారా బోధనాకార్యక్రమాలు ప్రసారమౌతున్నవి. ఈ రేడియో పాఠాలను తరగతిలో జరిగే బోధనాభ్యసన ప్రక్రియకు సంపూరకంగా వుంటూవున్నవి. అయితే రేడియో పాఠశాల ప్రసార సమయాలు పాఠశాల సమయాల్లో అంతరం వుండటం వలన విద్యార్థులు యీ ప్రసార కార్యక్రమాలతో లాభం చెందటం లేదనే విమర్శ వుంది.

బోధనా ప్రక్రియలో వీడియో కాసెట్ల ఉపయోగం ఒక వినూత్న ప్రయోగం, అత్యంత ప్రతిభావంతమైందికూడా. టి.వి., వి.సి.పి.ల ఉపయోగం విద్యార్థులల్లో అమితమైన ఆసక్తి, అభిరుచిని కల్గిస్తవి. పాఠశాలల్లో టి.వి. అమర్చటం, వీడియోలో బోధనా ప్రక్రియను రికార్డుచేసి టి.వి. ద్వారా విద్యార్థులముందు ప్రదర్శించటం వల్ల బాలబాలికలు చదువు వదిలిపోయే పరిస్థితి దూరమౌతుందని పరిశీలనల వల్ల తేలింది.

1986–87లో రాష్ట్ర ప్రభుత్వం ప్రాథమిక పాఠశాలల్లో దృశ్య – శ్రవణ యంత్రాల ద్వారా బోధించే పథకాన్నొకదానిని ప్రవేశపెట్టింది. విద్యార్థులను పాఠశాలలకు ఆకర్షించి, వారికి మెరుగైన ఆకర్షణీయమైన పద్ధతుల ద్వారా బోధనగరిపి వారు చదువుకొనసాగించే విధంగా బోధన, అభ్యసన కార్యక్రమాల్లో చురుకైన భాగస్వామ్యము కల్పించటం యీ పథకం యొక్క లక్ష్యం. ఈ పథకంలో భాగంగా పాఠశాలలకు టి.వి.లు, వి.సి.పి.లు మరియు వీడియో కాసెట్లు తదితర పరికరాలు సరఫరా చేశారు. పాఠశాల భవనాలకు విద్యుత్సరఫరా సౌకర్యాలు సమకూర్చారు. 1993–94 సంవత్సరాంతంవరకు పాఠశాలలకు సరఫరా చేసిన పరికరాల వివరాలు క్రింద యివ్వబడినవి:

| | | | | |
|---|---|---|---|---|
| రంగు టి.విలు | : | 9,912 | పాఠాలు టేప్ చేసిన | |
| ఆర్.సి.సి.పి.లు | : | 6,195 | వీడియో కాసెట్లు: | 2,78,350 |
| వి.సి.పి.లు | : | 6,197 | టి.వి. అంటెనాలు: | 2,883 |
| స్టెబిలైజర్లు | : | 9,871 | | |

1994–95 లో మరో 1,538 టి.వి.లు కొనే ప్రతిపాదనలున్నవి. పరికరాల సరఫరాలో ఒక నిర్దిష్ట పద్ధతి లేకపోవటం గమనించవచ్చు. పరికరాలు సమకూర్చిన కొన్ని పాఠశాలల్లో విద్యుత్సరఫరా లేకపోవటం, టి.వి. లన్నింటికీ అంటెనాలు సమకూర్చకపోవటం, టి.వి.లున్న పాఠశాలలన్నింటికి వి.సి.పి.లు సరఫరా చేయకపోవటం వంటి కారణాల వల్ల ఈ పథకం అమలులో యిబ్బందులు ఏర్పడినవి.

దృశ్యశ్రవణ యంత్రాల ద్వారా బోధన పథకానికి అయ్యే ఖర్చులో 75% కేంద్రం భరిస్తుంది. మిగిలిన 25% ఖర్చు రాష్ట్రప్రభుత్వం భరిస్తుంది.

### 3.3 రాష్ట్ర విద్యా సాంకేతిక సంస్థ

**(State Institute of Educational Technology):**

ఆంధ్రప్రదేశ్‌లో చాలా కాలం నుండే విద్యా సాంకేతికం ఉపయోగంలో వుంది. విద్యా సంబంధమైన ఫిల్ములు, రేడియో ప్రసారాలు పాఠశాల విద్యలో ఎక్కువగా వాడడం జరిగింది. రాష్ట్రంలో దృశ్యశ్రవణ విద్యా వికాస కేంద్రం నెలకొల్పి అందులో విద్యా సంబంధమైన ఫిల్ముల లైబ్రరీని ఏర్పరచారు. ఫిల్ము ప్రొజెక్టరు గల పాఠశాలకు ఆ ఫిల్ములను వాడుకకై యిచ్చేవారు. 1975-76 లో మొట్ట మొదటి సారి ఉపగ్రహం ద్వారా విద్యా కార్యక్రమాలు ప్రసారం చేసే పథకాన్ని కేంద్ర ప్రభుత్వం అమలు జరిపింది. ఆంధ్రప్రదేశ్, గుజరాత్, బీహారు, ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్ర మరియు ఒరిస్సాలోని 2,400 ప్రాథమిక పాఠశాలలు యీ ప్రసారాల పరిధిలో వుండినవి. ఈ ప్రసారాలు Satellite Instructional Television Experiment (SITE)గా పిలువబడేవి. ఈ కార్యక్రమాలు అమలు జరుగుచుండగా ఆంధ్రప్రదేశ్‌తో సహా పైన పేర్కొన్న 6 రాష్ట్రాలలో విద్యా సాంకేతిక విభాగాల (E.T. Cells)ను స్థాపించి SITE కార్యక్రమాల మూల్యాంకన బాధ్యతను అప్పజెప్పారు. SITE ప్రయోగం చాలా ఫలవంతమైనదని పరిశీలనల వల్ల తెలిసింది.

ఈలోగా మన దేశం తన స్వంత ఉపగ్రహాల్ని అంతరిక్షంలోకి పంపింది. ఈ ఉపగ్రహాల ద్వారా విద్యా కార్యక్రమాలు ప్రసారం చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. INSAT ఉపగ్రహం ద్వారా యీ కార్యక్రమాలు ప్రసారం చేయనారంభించారు. ఉపగ్రహం సాయంతో విద్యాకార్యక్రమాలను పాఠశాల విద్యార్థుల కందజేయడం, అలాగే అనియత విద్యలో కూడా ఈ కార్యక్రమాలు ఉపయుక్తం కావడం విద్యాసాంకేతిక విభాగం ప్రత్యేకంగా ఏర్పాటు చేయటానికి దారితీసింది. 1985లో విద్యాసాంకేతిక కేంద్రాన్ని మన రాష్ట్రంలో నెలకొల్పారు. మొదట యీ కేంద్రం ప్రభుత్వ విద్యాశాఖలో భాగంగా పని చేసింది. అంతకుముందు నెలకొని యున్న E.T. cellను యీ కేంద్రంతో కలిపేశారు. 1987 నుండి ఈ కేంద్రం (SIET) పూర్తిగా పని చేయటం ఆరంభించింది. 1992 డిసెంబరులో ఈ కేంద్రాన్ని స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా రిజిస్టరు చేశారు. యిపుడు ఈ సంస్థ స్వతంత్రంగా పని చేస్తున్నది.

SIET ఒక సొసైటీగా, స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా రూపొందించటంలో ప్రధాన ఉద్దేశం విద్యాక్షేత్రంలో సాంకేతిక విజ్ఞానాన్ని విస్తృతంగా ఉపయోగించటానికి సహాయ పడడం మరియు విద్యా కార్యక్రమాల అమలులో సాంకేతిక ప్రయోగాలను అమలు జరుపడం.

SIET ఈ క్రింది కార్యక్రమాలను చేబట్టి అమలు జరుపుతున్నది:

i) 5 నుండి 11 సంవత్సరాల వయస్సుగల బాలబాలికల విద్యా అవసరాలను నిర్ణయించేందుకు అనుకూలమైన పరిశోధనలు, పరిశీలనలు మరియు మూల్యాంకన ప్రక్రియలు చేబట్టటం.

ii) ఉపాధ్యాయుల ఉద్యోగాత్పూర్వ మరియు ఉద్యోగాంతర్గత శిక్షణను గుణాత్మకంగా మెరుగుపరచటానికి సాంకేతిక మరియు దృశ్యశ్రవణ యంత్రాలను సమర్ధవంతంగా ఉపయోగించటం.

iii) టి.వి. ద్వారా బోధనకు అవసరమైన కార్యక్రమాలను తయారు చేసి ప్రసారం చేయించటం.

iv) ఆడియో కాసెట్ల ద్వారా విద్యా బోధన కార్యక్రమాలు తయారు చేయటం.

విద్యా సాంకేతిక సంస్థ (SIET) 10 సెప్టెంబరు 1985 న మొట్టమొదటి టెలివిజన్ పాఠం 'కర్మ శిక్షణ' దూరదర్శన్ హైద్రాబాద్ కేంద్రం ద్వారా ప్రసారం చేయబడింది. ఈ సంస్థ టెలిస్కూలు కార్యక్రమం ద్వారా ప్రసారమయ్యే పాఠాలను తయారు చేస్తుంది. ప్రతివారం సోమవారం నుండి శనివారం వరకు ప్రతి రోజు 45 నిమిషాలు టి.వి.లో ఈ కార్యక్రమాలు ప్రసారమవుతవి. 5 నుండి 11 సంవత్సరాల బాలబాలికలకు – అంటే ప్రాథమిక విద్యనభ్యసించే వయసు వారికి – ఈ కార్యక్రమాలు ఉద్దేశించబడినవి. ఇవి కేవలం పాఠ్యప్రణాళికలోని అంశాలకే పరిమితం కాక సామాన్యంగా ప్రాథమిక విద్యకు సంపూరకంగా వుంటవి.

SIETలో విద్యా సాంకేతిక విభాగానికి చెందిన నిపుణులు విద్యా కార్యక్రమాలను ఎన్నుకుని ప్రసారాలకు అనువైన అంశాల్ని అవసరమైన భాషారచన మరియు తదితర వివరాలను నిర్ణయిస్తారు. కార్యక్రమం ప్రసారయోగ్యమైందా లేదా అని నిర్ణయించేముందు 'ప్రివ్యూ' చేస్తారు. అవసరమైన మార్పులు చేర్పులు చేస్తారు. ఇలా విషయాల అంశాల ఎంపిక చేసేందుకు ముందు ఉపాధ్యాయులు విషయ ప్రవీణులు, శిక్షణా కళాశాలల అధ్యాపకులు తదితర అనుభవజ్ఞులతో సమావేశాలు, కార్యశిబిరాలు ఏర్పాటు చేస్తారు.

SIET ఉపాధ్యాయులకు, ప్రధానోపాధ్యాయులకు, పరిపాలనాధికారులకు విద్యా సాంకేతిక క్షేత్రంలో శిక్షణా కార్యక్రమాల్ని కూడా చేపడుతుంది.

1986 నుండి 1993 వరకు , SIET 845 టెలివిజన్ విద్యా కార్యక్రమాలను తయారు చేసింది. 1990 నుండి 1992 వరకు 32 రేడియో కార్యక్రమాలు రేడియో పాఠశాలకై తయారు చేసి యిచ్చింది. 1993-94 లో 200 టెలివిజన్ విద్యా కార్యక్రమాల్ని తయారు చేయటం జరిగింది.

SIET కార్యక్రమాలు ఎలా వుంటున్నవి? వానిలో ఎలాంటి మెరుగులు అవసరం? యితర అంశాలు ఏవైనా చేర్చాలా? కార్యక్రమాల ప్రసారాలు ఎలా వున్నవి? అనే వివిధ ప్రశ్నలకు సమాధానాలు ఉపాధ్యాయులనుండి, విద్యా వేత్తల నుండి, అధికారులనుండి సేకరించి కార్యక్రమాల్లో అవసరమైన మార్పులు చేస్తారు.

SIET జాతీయ స్థాయిలో గల (Central Institute of Educational Technology (CIET))తో అనుబంధంగా పని చేస్తుంది. దాని నుండి సాంకేతిక పరిజ్ఞానం, మార్గదర్శకత్వం స్వీకరిస్తుంది.

SIET ఆర్థిక భారమంతా కేంద్ర ప్రభుత్వమే వహిస్తుంది. సంవత్సరానికి దాదాపు రూ. 80 లక్షలు ఖర్చు అవుతవని అంచనా.

## 4. ప్రాథమిక విద్యకు సంబంధించిన కొన్ని అంశాలు:

ప్రాథమిక విద్యలో నూతన ప్రయోగంగా అభ్యుదయ ప్రాథమిక పాఠశాలల వ్యవస్థ గురించి యీవరకే చెప్పటం జరిగింది. ప్రాథమిక విద్యను గుణాత్మకంగా మెరుగుపరచాలని, విద్యార్థులు బడి వదలకుండా చదువు కొనసాగించాలని, ఆ దశ విద్య పూర్తి అయ్యే నాటికి వారిలో పరిజ్ఞానం కుశలతలు ఏర్పడాలని లక్ష్యంగా ప్రాథమిక విద్యా బోధనలు మెరుగు పరచేందుకు రాష్ట్ర,కేంద్ర ప్రభుత్వాలు కొన్ని కార్యక్రమాలను చేబట్టినవి.

### 4.1 ఆపరేషన్ బ్లాక్ బోర్డు (OBB) పథకం:

ప్రాథమిక విద్యను పటిష్టం చేసేందుకు ప్రతిప్రాథమిక పాఠశాలలో అత్యవసరమైన భౌతిక మరియు బోధనా సౌకర్యాలు కల్పించటం అవసరమని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గుర్తించినవి. 1985 లో కేంద్ర ప్రభుత్వము ప్రచురించిన Challenge of Educaton పత్రములో దేశంలోని అత్యధిక ప్రాథమిక పాఠశాలలకు భవనాలు లేవని, చాలా పాఠశాలల్లో బోధన కవసరమైన కనీస సౌకర్యాలు కూడా లేవని పేర్కొనబడినది. అత్యధిక పాఠశాలలు ఏకోపాధ్యాయ పాఠశాలలు కావటంవల్ల వానిలో బోధన క్రమబద్ధంగాను గుణాత్మకమైనదిగాను వుండటం లేదని ఆ పత్రంలో పేర్కొనబడినది. ఈ అంశాలను దృష్టిలో వుంచుకొని 1986 జాతీయ విద్యా విధానం ప్రాథమిక పాఠశాల స్థితిగతులను మెరుగుపరిచే ఉద్దేశంతో Operation Black Board (OBB) పేరుతో ఒక పథకాన్ని అమలు పరచాలని సూచించింది. ఈ పథకం ప్రకారం ప్రతి ప్రాథమిక పాఠశాలకు కనీసం రెండు గదులు నిర్మించాలి. ఏకోపాధ్యాయ పాఠశాలలన్నింటిలో కనీసం మరొక ఉపాధ్యాయుని (మహిళా ఉపాధ్యాయురాలు) నియమించాలి మరియు అన్ని ప్రాథమిక పాఠశాలలకు పేర్కొనబడ్డ బోధనోపకరణాలను సమకూర్చాలి. ప్రాథమిక విద్యను మెరుగుపరచటానికి సూచించబడ్డ ఒక నూతన అంశంగా ఈ పథకాన్ని పేర్కొనవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో యీ పథకం 1987–88 నుంచి అమలుపరచటం ఆరంభించారు. కేంద్ర ప్రభుత్వమే మొత్తం ఖర్చు భరించే యీ పథకం క్రింద యిప్పటివరకు 42,315 పాఠశాలలకు ప్రాథమిక సౌకర్యాలు పరికరాలతో సహా సమకూర్చారు. 20,286 ఉపాధ్యాయ పోస్టులు మంజూరు చేశారు. 19,968 తరగతి గదుల నిర్మాణం పూర్తి చేశారు. అయితే మంజూరు చేసిన ఉపాధ్యాయ పోస్టులలో యింతవరకు కేవలం 15,847 పోస్టు భర్తీ చేయటం జరిగింది. వీరిలో మహిళా ఉపాధ్యాయినుల సంఖ్య ఎంతో వివరాలు తెలియరాలేదు.

### 4.2 జిల్లా విద్య మరియు శిక్షణా కేంద్రాలు:

ప్రాథమిక విద్యను గుణాత్మకంగా మెరుగు పరిచేందుకై జాతీయ విద్యా విధానంలో ప్రతిపాదించిన మరో కార్యక్రమం అన్ని జిల్లా కేంద్రాల్లో ఉపాధ్యాయుల శిక్షణకై కేంద్రాలను నెలకొల్పడం. ఈ కేంద్రాలను జిల్లా విద్యాశిక్షణా సంస్థలు (District Institute of Education and Training : DIET)గా నామకరణం చేశారు. వీని స్థాపనకయ్యే మొత్తం ఖర్చు కేంద్రమే భరిస్తుంది. ఈ కేంద్రాలలో ప్రాథమిక ఉపాధ్యాయుల వృత్తిపరమైన శిక్షణ, ఉద్యోగాంతర్గత శిక్షణ, వివిధ విద్యా సంబంధమైన అంశాలపై పరిశోధన తదితర కార్యక్రమాలు జరుగుతవి. ఈ కేంద్రాల కార్యక్షేత్రం ప్రాథమిక విద్య. ఆ క్షేత్రంలో యీ కేంద్రాలు విశేషంగా గుణాత్మకమైన ప్రగతిలో నేతృత్వము వహించాలని కూడా ఉద్దేశించబడినది. ప్రతి కేంద్రంలో 150 అభ్యర్థులకు ఉద్యోగాత్పూర్వ శిక్షణ యిచ్చే సౌకర్యాలున్నవి.

పై కార్యక్రమంలో భాగంగా మన రాష్ట్రంలో 1987–88 లో 9 జిల్లాల్లో, 1988–89 లో 8 జిల్లాల్లో మరియు 1989–90 లో మిగిలిన 6 జిల్లాల్లో యీ కేంద్రాలు స్థాపించబడినవి. అంతకు పూర్వం ఆయా జిల్లాలలో గల ఉపాధ్యాయ శిక్షణా సంస్థల స్థానంలో యీ కేంద్రాలు వెలసినవి. ఈ కేంద్రాలలో అనియత విద్య, వయోజన విద్య సంబంధమైన బోధనా సిబ్బందికి కూడా శిక్షణా సౌకర్యాలు కల్పించారు. ఉపాధ్యాయుల శిక్షణతో పాటు యీ కేంద్రాలలో పాఠ్యప్రణాళికా రచన, విద్యా సాంకేతిక శాస్త్రం తదితర విషయాలలో పరిశోధన మరియు పరిశీలనా సౌకర్యాలు కలవు. ఉపాధ్యాయులకు ఉద్యోగాంతర్గత శిక్షణ నిచ్చే బాధ్యత కూడా యీ కేంద్రాలు నిర్వహిస్తవి.

ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యా పథకం క్రింద యీ కేంద్రాలను మరింత పరిపుష్టం చేయగల సౌకర్యాలు సమకూర్చబడుతున్నవి.

### 4.3 ప్రాథమిక పాఠ్యప్రణాళికలో మెరుగులు:

ప్రాథమిక విద్యను పరిపుష్టం మరియు ప్రయోజనకరం చేసే దిశలో పాఠ్యప్రణాళికలో మార్పులను చేబట్టారు. బాల బాలికలకు కేవలం అక్షర జ్ఞానం, సంఖ్యా జ్ఞానం, చదువు, వ్రాత వంటి సామాన్య కౌశల్యాలు అందజేయటం సరిపోదు. వారికి తమ దైనందిన జీవితంలో ఎదురయ్యే సమస్యలను సాధించగల సామర్థ్యం అందజేయాలి. అంతేకాదు. సామాజిక, విజ్ఞాన శాస్త్ర రంగాల్లో వస్తున్న మార్పులను అవగాహన చేసుకుని వానిని తమ జీవనాన్ని మెరుగుపరిచే విధంగా ఉపయోగించగల సామర్థ్యం విద్యార్థులకు అందజేయాలి. నైతిక, సామాజిక విలువలు, సామాజిక స్పృహ, శ్రమపట్ల గౌరవం, జాతీయ భావంలాంటి వైఖరులు వారిలో చోటు చేసుకోవాలి.

ఈ దృష్టితో ప్రాథమిక విద్య పాఠ్యప్రణాళికలో కొత్త అంశాలు చేర్చటాన్ని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు చేబట్టినవి. పాఠ్యపుస్తకాల్లో కొత్త అంశాలపై పఠనాంశాలు చేర్చబడ్డాయి. ప్రాథమిక స్థాయిలో సామాజికోపయోగ ఉత్పాదక కృత్యాలను చేర్చారు. సామాజిక శాస్త్రంలో సమాజము, వ్యక్తి హక్కులు, సమాజానికి వ్యక్తికి గల సంబంధాలు, పౌరశాస్త్రం మౌలిక అంశాలు, కుటుంబము – కుటుంబ సభ్యుల మధ్య సంబంధాలు వంటి అంశాలు చేర్చబడ్డాయి. విజ్ఞాన శాస్త్ర పాఠ్యప్రణాళికలో నూతన అంశాలు చోటు చేసుకున్నవి. జనాభా విద్య, వాతావరణ విద్య అలాంటి నూతన అంశాలే.

విద్యార్థులలో వాతావరణ పరిరక్షణ, కాలుష్య నివారణకు సంబంధించిన ప్రాథమిక విజ్ఞానం కలుగజేసేందుకు ప్రాథమిక దశనుండి ఆ విజ్ఞాన అంశాలు యితర బోధనాంశాలతో జోడించి బోధించటం, అందుకు సంబంధించిన కార్యకలాపాలు సాగించటం అవసరమని జాతీయ విద్యా విధానం (1986) సూచించింది. 1989–90 నుండి యీ కార్యక్రమాన్ని ఆంధ్రప్రదేశ్‌లోని ప్రాథమిక పాఠశాలల్లో అమలుపరచటం మొదలెట్టారు. రంగారెడ్డి జిల్లాలోని 149 ప్రాథమిక మరియు ఉచ్ఛ ప్రాథమిక పాఠశాలల్లోను, విశాఖపట్టణంలోని 439 పాఠశాలల్లోను వాతావరణ విజ్ఞాన కార్యక్రమం అమలు జరుపుతున్నారు. 1991–92 నుండి తూర్పు గోదావరికి చెందిన 337 పాఠశాలల్లో మరియు 1992–93 నుండి చిత్తూరులోని 547 పాఠశాలల్లో ఈ కార్యక్రమాన్ని విస్తరింప చేశారు. ఈ కార్యక్రమానికి సంబంధించి ఉపాధ్యాయులకు శిక్షణ మరియు బోధనా సామగ్రి తయారీకై ప్రత్యేక కోర్సులు కార్యశిబిరాలు నిర్వహించారు.

ఐదవ తరగతి నుండి పదవ తరగతి వరకు విద్యార్థులకు యోగవిద్య గరపాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఆమేరకు ముందుగా ప్రభుత్వ పాఠశాలల్లో యోగాభ్యాస కార్యక్రమం ఆరంభించారు. ఈ కార్యక్రమంలో భాగంగా 715 ఉపాధ్యాయులకు వేమన యోగ పరిశోధనా కేంద్రంలో 30 రోజులు యోగవిద్యలో తరిఫీదుయివ్వనున్నారు. అలా తరిఫీదు పొందిన ఉపాధ్యాయులు పాఠశాలల్లో విద్యార్థులకు యోగవిద్య గరపుతారు. ఈ కార్యక్రమానికి కేంద్ర ప్రభుత్వం ఏటా 6 లక్షల రూపాయలు సహాయం అందజేస్తుంది.

### 4.4 సెకండరీ విద్యకు సంబంధించిన అంశాలు:

సెకండరీ విద్యను పరిపుష్టం చేసే ప్రక్రియలో విజ్ఞాన శాస్త్రం మరియు గణితం బోధనను మెరుగు పరచాలని ప్రభుత్వం సంకల్పించింది. ఈ దశ విద్యలో వృత్తివిద్యను కూడా కొన్ని పాఠశాలల్లో చేర్చారు. (వృత్తి విద్యను గురించిన వివరాలు మరో వ్యాసంలో పొందుపరచటం జరిగింది.) అలాగే మిగిలిన బోధనా విషయాలలోని అంశాలను మెరుగుపరచాలని ప్రభుత్వం యొక్క ఉద్దేశం. జాతీయ విద్యా పరిశోధన మరియు శిక్షణా సంస్థ (NCERT) నిర్దేశించిన మౌలిక పాఠ్యప్రణాళిక (Core Curriculum)కు లోబడి వివిధ బోధనాంశాలలో తగు మార్పులు చేయ సంకల్పించారు.

విజ్ఞాన శాస్త్రం మరియు గణితంలోని పాఠ్యాంశాలలో అధునీకరించిన మొదటి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్‌యే. మన రాష్ట్రంలో యీ రెండు విషయాల్లో బోధనాంశాలు ఉన్నత స్థాయి కల్గియున్నవి. శాస్త్ర సాంకేతిక ప్రగతిని దృష్టియందుంచుకొని నూతన అంశాలను చేర్చటం జరిగింది. అధునీకరణలో భాగంగా ఒకవైపు విజ్ఞాన శాస్త్ర బోధన కవసరమైన ప్రయోగశాలల స్థాపన, పరికరాలను మరియు రసాయనాల సరఫరా చేయడం జరుగుతుండగా మరో వైపు ఉపాధ్యాయులకు నూతన అంశాలపై అవగాహన కల్గించి బోధనా పద్ధతులపై శిక్షణనిచ్చే కార్యక్రమం కూడా ఆరంభించారు. దాదాపు 12,000 మంది సెకండరీ స్థాయి శాస్త్ర మరియు గణిత ఉపాధ్యాయులకు శిక్షణ నివ్వనున్నారు. 1994–95లో 600 మంది ఉపాధ్యాయులకు శిక్షణ నివ్వాలని ప్రతిపాదించారు.. అదే సంవత్సరం 302 సెకండరీ పాఠశాలల్లో విజ్ఞాన శాస్త్రం మరియు గణితం బోధనకు సంబంధించిన భౌతిక మరియు పరికరాల వసతులు సమకూర్చనున్నారు.

నైతిక, సామాజిక మరియు వ్యక్తిగత విలువలను, వైఖరులను పెంపొందించేందుకు వివిధ పాఠ్యాంశాలలో భాగంగా యీ విలువలను బోధిస్తారు.

## 4.5 అభ్యసన ప్రమాణాలు:

ప్రాథమిక దశలో విద్యార్థులు కొన్ని కనీస ప్రమాణాలను సాధించాలని, అవి అందరు విద్యార్థులకు దాదాపు సమానంగా వుండాలని విద్యా విధాన కర్తల అభిప్రాయం. మొదటి తరగతి నుండి ఆరంభించి ప్రాథమిక విద్య పూర్తి అయ్యేవరకు ప్రతి తరగతి చివర విద్యార్థులు ఆ తరగతికై నిర్ణయించిన కనీస ప్రమాణాలు సాధించాలని, అపుడే విద్యా ప్రమాణాలు మెరుగవుతవని వారి ఉద్దేశం. సామాన్య పాఠశాల స్థితిగతులు, విద్యార్థుల సగటు అభ్యసనా సామర్థ్యం, పాఠ్యప్రణాళికలోని వివిధ అంశాలను దృష్టియందుంచు కొని ఒకోతరగతి చివర విద్యార్థులు సాధించాల్సిన కనీస ప్రమాణాలను స్థూలంగా నిర్ణయించారు. వీనినే Minimum Levels of Learning (MLLs) అంటారు. మన రాష్ట్రంలో యీ ప్రమాణాలు సాధించాల్సిన కార్యక్రమాన్ని 1991-92 నుండి శ్రీకాకుళం, విజయనగరం, కడప, అనంతపురం, మహబూబ్‌నగరం మరియు రంగారెడ్డి జిల్లాల్లోని ఎంపిక చేసిన ఒక్కొక్క మండలంలో అమలుపరచనారంభించారు. ఆ కనీస ప్రమాణాలు సాధించటానికి బోధనా పద్ధతులలో అవసరమైన మెరుగులు తేవటం, నూతన మూల్యాంకనా పద్ధతుల ననుసరించడం, పాఠ్యప్రణాళిక రచన వంటి చర్యలు తీసుకోవటం జరుగుతున్నది. క్రమ క్రమంగా యీ కనీస ప్రమాణాల సాధన అన్ని పాఠశాలలకు వర్తింపజేస్తారు. ఇప్పటి వరకు జరిగిన మధ్యంతర పరిశీలనలవల్ల తేలిందేమంటే యీ కార్యక్రమం అమలుపరచిన పాఠశాలల్లో విద్యార్థుల అభ్యసనా ప్రమాణాలు దాదాపు 31% పెరిగినవి.

## 5. పరీక్షా విధానం సంస్కరణలు:

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పరీక్షా విధానాన్ని సంస్కరించే ప్రయత్నంలో దేశంలో మిగతా రాష్ట్రాలకన్న ముందున్నదనే చెప్పాలి. అట్టి ప్రయత్నాలలో నూతన ప్రయోగం ప్రతి తరగతి చివర విద్యార్థులలో పరీక్షల ద్వారా వడబోత చేసే పద్ధతిని ఆపివేయడం. దీనినే Nondetention System అంటారు. కేవలం వార్షిక పరీక్షా ఫలితాల్ని ఆధారం చేసుకుని విద్యార్థులను పై తరగతులకు పంపడమో లేక ఫెయిల్ అయిన వారిని అదే తరగతిలో కొనసాగించడమో అనే పూర్వ పద్ధతిని విడనాడి విద్యార్థులను ఫెయిల్ చేసే పద్ధతిని తొలగించి, విద్యార్థి పాఠశాలకు సక్రమంగా హాజరై, 80% హాజరు కనబరుస్తే అతనిని పై తరగతికి పంపించే పద్ధతే నాన్‌డిటెన్షన్ పద్ధతి. ఈ పద్ధతిలో శాస్త్రీయమైన సిద్ధాంతం యిమిడి వున్నది. పాఠశాలకు సక్రమంగా హాజరైన విద్యార్థి తరగతి గదిలో ఉపాధ్యాయుడు జరిపే బోధనాభ్యసన కార్యక్రమంలో భాగస్వామి కాగలడు. కాబట్టి ఆ విద్యార్థి విజ్ఞానం, కౌశల్యం సంపాదిస్తాడు. అభ్యసన అలవర్చుకుంటాడు. సంవత్సరం చివరపెట్టే పరీక్షలో తగు మార్కులు సాధించలేకపోతే అందుకు మానసిక లేక కుటుంబ సంబంధమైన కారణాలుండవచ్చు తప్ప విద్యార్థి అభ్యసనలో, అతని విజ్ఞానంలో, తదితర కుశలతల్లో చెప్పుకోదగ్గ కొరత వుండజాలదు. కాబట్టి కేవలం వార్షిక పరీక్షల్లో సాధించిన మార్కులు ఆ విద్యార్థి అభ్యసనా ప్రమాణాన్ని కొలువ జాలవు. అందుకై విద్యార్థి అభ్యసన ప్రమాణాన్ని ఎప్పటి కప్పుడు మూల్యాంకనం చేయటం అవసరం. కాబట్టి నాన్‌డిటెన్షన్ విధానంలో భాగంగా విద్యార్థి స్థాయిని యూనిట్ పరీక్షల ద్వారా మూల్యాంకనం చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. ప్రతి విద్యాసంవత్సరంలో కనీసం నాలుగు యూనిట్ పరీక్షలు నిర్వహించాలని, ఆ యూనిట్ పరీక్షలలో విద్యార్థి సాధించిన మార్కులను వార్షిక పరీక్షల మార్కులతో జోడించి విద్యార్థి ప్రమాణాన్ని నిర్ణయించాలని ప్రభుత్వం ఉత్తర్వులు చేసింది.

నాన్‌డిటెన్షన్ పద్ధతిని అధికంగా ఉపాధ్యాయులు వ్యతిరేకించటం గమనించవలసిన విషయం.

తరువాతి కాలంలో 7 వ తరగతి చివర కామన్ పరీక్షలు నిర్వహించటం, జిల్లా స్థాయిలో కామన్ పరీక్షా బోర్డుల ద్వారా 5,6,8 మరియు 9 తరగతులకు పరీక్షలు నిర్వహించే పద్ధతిని ప్రవేశపెట్టారు. మొదటి తరగతి నుండి 4 వ తరగతి వరకు నాన్‌డిటెన్షన్ పద్ధతి అమలులో వుంది.

1980-81 లో ప్రభుత్వం పుస్తకాలతో పరీక్షలు వ్రాసేపద్ధతి ప్రవేశపెట్టే వేపు కూడా ఆలోచనలు చేసింది. కాని అది సర్వామోదితం కాలేదు. కాబట్టి ఆ ఆలోచనను వదులుకోవడం జరిగింది.

## 6. సమగ్ర విద్యాచట్టం:

ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి అటు ఆంధ్ర ప్రాంతంలో కాని యిటు పూర్వపు నిజాం రాష్ట్రంలోకాని విద్యకు సంబంధించి సమగ్ర చట్టపరమైన నియమ నిబంధనలు ఏవీ లేవు. విద్యాపరిపాలన పాఠశాలల నిర్వహణ, అజమాయిషీ వగైరా పరిపాలనాపరమైన ఉత్తర్వుల ఆధారంగానే జరుగుతూ వుండేవి. కీ.శే. పి.వి.జి. రాజు విద్యామంత్రిగా ఉన్నపుడు విద్యావ్యవస్థకు చట్టపరమైన ప్రతిపత్తిని కల్పించాలని సంకల్పం వ్యక్తమైంది. ఈ సంకల్పాన్ననుసరించి చిత్తు చట్టం చేసే కృషి ఆరంభమైంది. కీ.శే. శ్రీ యం. వి. రాజగోపాల్ అప్పటి పం. రా. కార్యదర్శి అధ్యక్షతన ఒక కమిటీని నియమించి విద్యా బిల్లును తయారు చేసే బాధ్యతనప్పజెప్పారు. ఆ కమిటీ చిత్తు బిల్లుకు సంబంధించిన అంశాలపై వివరమైన నివేదిక సమర్పించింది. ఈ వ్యాస రచయితలలో ఒకడైన వి.పి. రాఘవాచార్యులు ఆ కమిటీలో సభ్యుడుగా ఉన్నాడు.

బిల్లుకు సమగ్ర రూపం యిచ్చే ప్రయత్నంలో కాలం గడుస్తూ వచ్చింది. ఈలోగా ప్రభుత్వాలు మారటంవల్ల బిల్లు ముసాయిదా రూపంలోనే వుండిపోయింది. చివరకి 1981 లో బిల్లు శాసన సభ ముందు పెట్టారు. ఉభయ శాసన సభలలో మార్పులు చేర్పులతో ('ఆంధ్రప్రదేశ్ విద్యా విషయక చట్టం' AP Education Act) చివరకి జూన్ 1981 లో బిల్లుకు ఆమోదం లభించింది. 1982 జనవరిలో రాష్ట్రపతి ఆమోదం లభించటంతో అది చట్టమైంది.

విద్యావ్యవస్థకు చట్టపరమైన ప్రతిపత్తి నిచ్చిన అతి తక్కువ రాష్ట్రాలలో మన రాష్ట్ర మొకటి. శ్రీ పి.వి.జి. రాజు నుండి మొదలెట్టి ఆ తరువాత విద్యాశాఖను నిర్వహించిన మంత్రులు (యిప్పటి భారత ప్రధాన మంత్రి పి.వి. నరసింహారావుతో సహా) యీ చట్టాన్ని రూపొందించటంలో శ్రద్ధాసక్తులు ప్రదర్శించారు. పాఠశాల విద్య మాత్రమే ఈ చట్టపరిధిలోకి తెచ్చారు. రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు, డిగ్రీ కళాశాలలు, ఇంటర్మీడియెటు విద్య యీ చట్టపరిధినుంచి మినహాయించారు. ఈ చట్టానికి ముందు అమలులోనున్న ఆంధ్ర ఎలిమెంటరీ విద్యా చట్టం (1920), ఆంధ్రప్రదేశ్ ప్రైమరీ విద్యాచట్టం (1961) మరియు ప్రైవేటు పాఠశాలలకు సంబంధించిన మూడు చట్టాలు యీ చట్టం వల్ల రద్దు చేయబడ్డాయి. వీనికి సంబంధించిన అంశాలన్నీ యీసమగ్ర చట్టంలో చేర్చబడినవి.

### చట్టంలోని ప్రధాన అంశాలు:

1982 విద్యా చట్టం విద్యా విధాన లక్ష్యాలను నిర్దేశించటం అత్యంత ప్రధాన అంశంగా చెప్పుకోవచ్చు. విద్య ద్వారా క్రింది నాలుగు లక్ష్యాలు సాధించాలని చట్టం నిర్దేశించింది:

i) జాతీయ విధానాన్నిఅనుసరించి సోషలిస్టు లౌకిక ప్రజాస్వామ్య సమాజస్థాపన మరియు జాతీయ సమగ్రతను పెంపొందించటంలో విద్య ఒక సాధనం కావాలి.

ii) విద్యను అన్ని స్థాయిల్లో శాస్త్ర విజ్ఞానం మరియు సాంకేతికంతో సంధాన పరచాలి.

iii) విద్య ద్వారా బాలబాలికల్లో నైతిక, సామాజిక మరియు మానవ విలువలను పెంపొందించాలి. మరియు వారిలో శ్రమపట్ల గౌరవము, దేశభక్తి మరియు క్రమశిక్షణ పెంపొందించాలి.

iv) విద్యార్థుల మూర్తిమత్వం సమగ్రంగా వికాసం చెందాలి.

ప్రాథమికవిద్య నమలుపరచేందుకు అవసరమైన చర్యలు, పాఠశాలల నిర్వహణ పద్ధతులు, పరీక్షా విధానం, ప్రైవేటు పాఠశాలల స్థాపన, నియమాలనుల్లంఘించే ప్రైవేటు యాజమాన్యాలకు విరుద్ధంగా తీసికోవలసిన చర్యలు, పాఠశాలలకు గ్రాంట్లు, పాఠశాలల అజమాయిషీ తదితర విషయాలే కాక విద్యా పరిపాలన, స్థానిక సంస్థలలో పాఠశాలల నిర్వహణకు సంబంధించిన అంశాలు ఈ చట్టంలో చేర్చబడినవి.

ఈ చట్టాన్ని తరువాతి కాలంలో శాసన సభ రెండు సార్లు స్వల్పంగా సవరించింది. అలా సవరించబడిన చట్టం ప్రస్తుతం అమలులో వుంది.

## 7. విద్యార్థుల ఉపకార వేతనాలు:

రాష్ట్రంలో వివిధ వర్గాల పాఠశాల విద్యార్థులకు ప్రోత్సాహకంగాను సహాయకంగాను పలురకాల విద్యార్థి ఉపకార వేతనాలు మంజూరు చేయటం జరుగుతున్నది. వాటి వివరాలు యివి:

i) ప్రభుత్వ ఉద్యోగంలో వుంటూ మరణించిన ఉద్యోగుల పిల్లల సహాయార్థం ఏటా రూ. 22.00 లక్షలు ఉపకార వేతనాలకై మంజూరు చేస్తారు.

ii) తెలంగాణా ప్రాంతపు విద్యార్థులకు 6 వ తరగతి నుండి పదవ తరగతిలో చదివేవారికి 'రియాయతి' స్కాలర్‌షిప్ పేర ఉపకార వేతనం మంజూరు చేస్తారు. పూర్వపు సంవత్సరపు వార్షిక పరీక్షలో 55%కి తక్కువ కాకుండా మార్కులు సంపాదించి యుండి తల్లిదండ్రుల నెలసరి ఆదాయం రూ. 500 కు మించకుండా వున్న విద్యార్థులకు యీ ఉపకార వేతనం లభిస్తుంది.

iii) వికలాంగులైన తల్లిదండ్రుల పిల్లలకు, విధవల పిల్లలకు, తల్లిదండ్రులను కోల్పోయిన పిల్లలకు మరో పథకం క్రింద ఉపకార వేతనాలు లభిస్తవి.

iv) సంవత్సరాంతం పరీక్షలో మొదటి మరియు రెండవ స్థానంలో ఉత్తీర్ణులై 8 నుండి 10 వ తరగతిలో చదువుతున్న విద్యార్థులకు మెరిటు స్కాలర్ షిప్పు మంజూరు చేస్తారు.

v) ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థులకు యి.బి.సి. స్కాలర్ షిప్పు అందుతుంది.

vi) రాజకీయ బాధితులైన తల్లిదండ్రుల పిల్లలకు 6 నుండి 10 వ తరగతిలో చదువుతున్న వారికి స్కాలర్ షిప్ మంజూరు చేస్తారు.

పై రకాల ఉపకార వేతనాలు చాలా కాలంగా అమలులో వున్నవి. కాగా 1985-86 నుండి 'ఉత్తమ విద్యార్థుల ఉపకార వేతనం' పేర కొత్తరకమైన ఉపకార వేతన పథకం ప్రవేశపెట్టారు. ఈ పథకం క్రింద ప్రతి జిల్లాలో 7 వ తరగతి కామన్ పరీక్షలో అత్యున్నత స్థానాల్ని సంపాదించిన 150 మంది విద్యార్థులకు వారు 8,9 మరియు 10 వ తరగతిలో చదువుకునేందుకు 3 సంవత్సరాల వరకు ఏటా రు. 500/- స్కాలర్ షిప్పులు సమకూరుస్తారు.

1994-95 సంవత్సరానికి పై వివిధ రకాల స్కాలర్ షిప్పులకై మొత్తం రూ.135 లక్షలు కేటాయించటం జరిగింది.

## పాఠ్యపుస్తకాల జాతీయకరణ:

స్వలాభమే ఆశయముగా గల ప్రవేటుపుస్తక వ్యాపార స్థుల కబంధ హస్తాలనుండి విడదీసి పాఠశాల విద్యార్థుల పాఠ్యపుస్తకాలను జాతీయం చేసిన మొదటి రాష్ట్రం ఆంధ్ర ప్రదేశ్. 21-11-57 తేదీనాటి ప్రభుత్వ విద్యాశాఖ ఉత్తర్వు ప్రకారము పాఠ్యపుస్తకాల ముద్రణాలయం రాష్ట్ర ప్రభుత్వం హైదరాబాదులో నెలకొల్పింది. ప్రైవేటు వ్యాపారస్తులు ప్రచురించిన పాఠ్య పుస్తకాలను ఎంపిక చేసే పద్ధతికి స్వస్తిచెప్పి రాష్ట్ర ప్రభుత్వం స్వయంగా నిర్ణీత పాఠ్యప్రణాళిక ప్రకారము వివిధ తరగతులకు, వివిధ పాఠ్య విషయములకు చెందిన పుస్తకాలను వ్రాయించి పాఠ్య పుస్తకాల ముద్రణాలయములో ముద్రింపించి జిల్లా విద్యాశాఖాధికారుల ద్వారా ప్రభుత్వం నిర్ణయించిన వెలకు పాఠ్య పుస్తకాలను పంపిణీ చేసే వ్యవస్థ రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేసింది. ప్రతి జిల్లాలో దీనికై పంపిణీకి కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. ప్రతి పాఠశాల ప్రధానోపాధ్యాయుడు తన పాఠశాల విద్యార్థులకు కావలసిన పాఠ్య పుస్తకాల వివరాలు ముందుగానే ఈ కేంద్రాలకు అందజేస్తాడు. వాటి ప్రకారము పుస్తకాలు ముద్రించి నిల్వ జేస్తారు. హరిజన గిరిజన మరియు వెనుకబడిన విద్యార్థులకు ఉచితంగా పుస్తకాలు పంపిణీ చేసే బాధ్యత సాంఘిక సంక్షేమ శాఖ వహిస్తుంది. ప్రధానోపాధ్యాయులు వెల చెల్లించి తమకు కావలసిన పుస్తకాలను తెప్పించుకుంటారు. ప్రధానోపాధ్యాయులకు పంపిణీ కేంద్రాలకు రాకపోక ఖర్చులు మొదలగువాని క్రింద కొంత కమీషన్ చెల్లిస్తారు. విద్యార్థులు నేరుగా పంపిణీ కేంద్రాలకు వెళ్ళి పుస్తకాలు కొనుగోలు చేసే సౌకర్యం కల్గించబడినది. మొట్టమొదట పంపిణీ వ్యవస్థలో వచ్చిన కొన్ని యిబ్బందులను క్రమంగా తొలగించి పంపిణీ వ్యవస్థను యిప్పుడు చాలమట్టుకు క్రమబద్ధం జేయడం జరిగింది. 1957 నుండి గత 38 సంవత్సరాలుగా పాఠ్యపుస్త కాలు జాతీయకరణ కార్యక్రమము అమలుజరుపబడుచున్నది. సకాలానికి పుస్తకాలు అందవనే ఫిర్యాదులున్నా రాష్ట్ర వ్యాప్తంగా కోట్లకొలది పుస్తకాలు పంపిణీ చేసే వ్యవస్థ అభ్యుదయకరమైనది, సాహసోపేతమైనదనే చెప్పాలి.

## వెల నిర్ణయించే పద్ధతి:

వివిధ తరగతుల పాఠ్యపుస్తకాల వెల దిగువ పద్ధతి ప్రకారము నిర్ణయించబడుతుంది:

1) **I to V**

మొదటి తరగతులనుండి ఐదవ తరగతి వరకు ప్రతి పేజీకి - 2 పైసల చొప్పున -

ఆరు, ఏడు తరగతులకు - ప్రతి పేజీకి 2.5 పైసల చొప్పున -

ఏనిమిది నుండి పదవ తరగతికి ప్రతి పేజీకి 4 పైసల చొప్పున -

ప్రతి పాఠ్య పుస్తకము వెల ప్రభుత్వం నిర్ణయిస్తుంది. 1995-96 సంవత్సరానికి మొదటి తరగతి నుండి 10 వ తరగతి వరకు 336 పాఠ్యపుస్తకాలు ముద్రింపబడినవని పాఠశాల విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయం ద్వారా తెలియ వచ్చినది. ఈ తరగతుల అన్ని పుస్తకాలు మొత్తము 5.27 కోట్ల ప్రతులు ముద్రించబడినవని కూడా భోగట్టా.

## రచయితలను ఎంపిక చేసే పద్ధతి:

ప్రతి పాఠ్యపుస్తకాల రచనకై రచయితలను, సంపాదకు లను, చిత్రకారులను ఎంపిక చేసే పద్ధతి కూడా ఏర్పాటు చేయబడినది. అనుభవజ్ఞులైన తరగతి గది ఉపాధ్యాయులు, బోధనా అభ్యసన కళాశాలలు మరియు జిల్లా విద్యా మరియు శిక్షణా సంస్థల ఉపాధ్యాయులు కళాశాలలు మరియు విశ్వవిద్యాలయాలలో ఆయా విషయాలలో ప్రవీణులైన అధ్యాపకులనుంచే రచయితలను సంపాదకులను ప్రతి సంవ త్సరము ప్రభుత్వము ఎంపిక చేస్తుంది. తయారైన చిత్తుప్రతులను ఆయా విషయాల సంపాదక బృందం పరిశీలించి ధ్రువపరుస్తుంది. పుస్తకాలలో చేర్చవలసిన చిత్రాలు చిత్రకారుల నియామకం కూడ ఈ బృందమే ధ్రువపరు స్తుంది. రచయితలు మున్నగువారి ఎంపికలో సాధారణముగా రాష్ట్రములో అన్ని ప్రాంతాల వారికి మహిళా రచయితలకు ప్రాతినిధ్యం లభించేటట్లు ప్రయత్నిస్తారు.

# హయ్యర్ సెకండరీ విద్య మరియు వృత్తివిద్య

అప్పరుసు శ్యామసుందర రావు, అధ్యక్షుడు, అఖిల భారత సెకండరీ ఉపాధ్యాయుల సమాఖ్య

## 1. విద్యావిధానం

### 1.1. హయ్యర్ సెకండరీ విద్యాస్థానము:

కీ.శే. డా॥ డి.యస్.కొఠారి అధ్యక్షతన ఏర్పడిన జాతీయ విద్యాకమీషన్ (1964-66) దేశం మొత్తానికి ఒకే విధమైన విద్యావ్యవస్థ (Educational Structure) ను సూచించినది. పాఠశాల విద్య మొత్తం 12 సంవత్సరాలు ఉండాలని, ఆ తరువాత డిగ్రీ మూడు సంవత్సరాలదిగా ఉండాలని ఆ కమీషను సిఫారసు చేసింది. 12 సంవత్సరాల పాఠశాల విద్యను రెండు భాగాలు చేసి సెకండరీ (ప్రైమరీతో సహా) విద్య 10 సంవత్సరాలుగాను, ఆ తరువాత హయ్యర్ సెకండరీ విద్య 2 సంవత్సరాలుగాను వుండాలని సూచించింది. 1968 జాతీయ విద్యావిధానం ద్వారా ఈ ఏర్పాటు అంటే 10+2+3 వ్యవస్థ అమలులోకి వచ్చింది. 1986 విద్యావిధానం కూడా ఈ ఏర్పాటును కొనసాగించింది. అయితే, దానినే మరింత వివరిస్తూ 5 సంవత్సరాలు ప్రైమరీ విద్య, 3 సంవత్సరాలు అప్పర్ ప్రైమరీ విద్య, 2 సంవత్సరాల సెకండరీ విద్య మరియు 2 సంవత్సరాల హయ్యర్ సెకండరీ విద్యగా నామకరణం చేశారు. పై వివరణ ననుసరించి పాఠశాల విద్యా వ్యవస్థ 5+3+2+2 గా భావించాల్సి వస్తుంది.

కొఠారి కమీషను సూచన ప్రకారం చివరి 2 సంవత్సరాల విద్య పాఠశాల విద్యలో అంతర్భాగం. హయ్యర్ సెకండరీ విద్యగా పిలువబడే ఈ దశకు చేరుకునేటప్పటికి విద్యార్థి 17 నుండి 18 సంవత్సరాల వయసు కల్గి వుంటాడు. అతని మానసిక స్థితి, శారీరక పరిణామ దశ సెకండరీ స్థాయిలో అవలంబించే బోధనా పద్ధతులనుండి వేరు చేయరానివిగా వుంటవని కమీషను అభిప్రాయపడింది. హైయర్ సెకండరీ తరగతులను పదకొండవ మరియు పన్నెండవ తరగతిగా పేర్కొనడం జరిగింది.

1968 మరియు 1986 విద్యావిధానాల్లో హయ్యర్ సెకండరీ విద్యకు ప్రత్యేక స్థానం ఇవ్వబడింది, ఆ స్థాయిలో విద్యార్థులకు ఉన్నత విద్య, సాంకేతిక విద్యకై తయారు చేయాలని వారు ఉపాధి సాధనకై తయారు కావాలని పాలసీ నిర్మాతల ఆశయం. కాబట్టి ఈ దశలో విద్యార్థులు భాషలు, శాస్త్రవిజ్ఞానం, గణితం, మానవశాస్త్రంతో సహా పని అనుభవంలో కూడా తగిన కుశలతలు సంపాదించాలని జాతీయ విధానముయొక్క ఆశయం.

### 1.2. రాష్ట్రంలో హయ్యర్ సెకండరీ విద్య:

1968 జాతీయ విద్యా విధానాన్ననుసరించి అప్పటి రాష్ట్రంలో అమలు వున్న పి.యు.సి.(ప్రి యూనివర్సిటి కోర్సు) మరియు మొదలియార్ కమీషను మేరకు స్థాపింప బడియున్న మల్టిపర్పస్ మరియు హయ్యర్ సెకండరీ పాఠశాలల స్థానంలో రెండు సంవత్సరాల ఇంటర్మీడియేటు విద్యాలయాలను 1969-70 లో ఆరంభించారు. ఈ విద్యాలయాలకు జూనియర్ కళాశాలలుగా నామకరణం చేశారు. అప్పటి మల్టిపర్పస్ మరియు హయ్యర్ సెకండరీ పాఠశాలలను యథాతథంగా జూనియర్ కళాశాలలుగా మార్చారు. అదనంగా కొన్ని సెకండరీ పాఠశాలలను జూనియర్ కళాశాలలుగా అప్‌గ్రేడ్ చేశారు. మరియు అప్పటి పి.యు.సి. తరగతులు గల డిగ్రీ కళాశాలల్లో కూడా జూనియర్ కళాశాల తరగతులు నెలకొల్పారు. ఇలా 1969-70 సంవత్సరంలో ప్రత్యేక జూనియర్ కళాశాలల్లో మరియు డిగ్రీ కళాశాలల్లో జూనియర్ కళాశాల మొదటి సంవత్సరపు కోర్సులు ఆరంభమయ్యాయి. ఆ సంవత్సరం రాష్ట్రంలో 86 ప్రత్యేక జూనియర్ కళాశాలలు వెలిశాయి. 1975-76 కి ఈ సంఖ్య 300 అయింది.

1985-86లో ప్రత్యేక జూనియర్ కళాశాలల సంఖ్య ఇలా వుంది:

పట్టిక-1: 1985-86 లో జూనియర్ కళాశాలలు

| యాజమాన్యం | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| ప్రభుత్వ | 360 | 36 | 396 |
| ప్రైవేటు | 196 | 44 | 240 |
| మొత్తం | 556 | 80 | 636 |

సెకండరీ విద్య వ్యాప్తి చెందుతూండటంతో జూనియర్ కళాశాలల సంఖ్య పెంచాల్సి వచ్చింది. ప్రతిమండలంలో ఒక జూనియర్ కళాశాల స్థాపించాలని ప్రభుత్వం యొక్క లక్ష్యం. ఈ లోగా ప్రైవేటు యాజమాన్యాలు కూడా ముందుకు వచ్చి జూనియర్ కళాశాలల్ని స్థాపించాయి. ప్రతి సంవత్సరము వీని సంఖ్య పెరుగుతోంది. 1993-94 మరియు 1994-95 లో వివిధ యాజమాన్యాల క్రింద గల జూనియర్ కళాశాలల సంఖ్య పట్టిక 2 లో ఇవ్వనైనది.

పట్టిక-2:
1993-94 మరియు 94-95 లో జూనియర్ కళాశాలలు

| యాజమాన్యం | 1993-94 | 1994-95 |
|---|---|---|
| ప్రభుత్వ జూనియర్ కళాశాలలు | 414 | 419 |
| జూనియర్ కళాశాల తరగతులు గల ప్రభుత్వ డిగ్రీ కళాశాలలు | 39 | 39 |
| ప్రైవేట్ ఎయిడెడ్ జూనియర్ కళాశాలలు | 195 | 199 |
| జూనియర్ కళాశాల తరగతులున్న ఎయిడెడ్ డిగ్రీ కళాశాలలు | 81 | 81 |
| అన్ఎయిడెడ్ జూనియర్ కళాశాలలు | 394 | 565 |
| సహకార జూనియర్ కళాశాలలు | 149 | 149 |
| ఎ.పి.ఆర్. ఇ.ఐ.యస్. జూనియర్ కళాశాలలు & సాంఘిక, సంక్షేమ | 10 | 13 |
| మొత్తం | 1282 | 1465 |

మూలం: ఆం.ప్ర. విద్యా బడ్జెట్టు పత్రము 1993-94 మరియు 1994-95.

1985-86 మరియు 1994-95 మధ్య 9 సంవత్సరాల లో జూనియర్ కళాశాలల సంఖ్య 13% పెరిగింది. జూనియర్ కళాశాలల్లో నమోదైన విద్యార్థుల సంఖ్య కూడా క్రమంగా పెరిగింది. 1994-95 లో వారి సంఖ్య 6.5 లక్షలు. ఇందులో బాలురు 4.41 లక్షలు కాగా, బాలికలు 2.09 లక్షలు.

1981-82 నుండి 1994-95 వరకు నమోదైన విద్యార్థుల సంఖ్య పట్టిక 3 లో ఇవ్వనైనది.

పట్టిక-3:
1981-82 నుండి 94-95 కాలంలో నమోదైన విద్యార్థులు (లక్షల్లో)

| సంవత్సరం | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| 1981-82 | 1.40 | 0.40 | 1.80 |
| 1982-83 | 1.60 | 0.52 | 2.12 |
| 1983-84 | 1.90 | 0.63 | 2.53 |
| 1984-85 | 1.80 | 0.63 | 2.43 |
| 1985-86 | 1.80 | 0.67 | 2.47 |
| 1986-87 | 2.00 | 0.72 | 2.72 |
| 1987-88 | 2.11 | 0.81 | 2.92 |
| 1988-89 | 2.14 | 0.82 | 2.96 |
| 1989-90 | 2.25 | 0.89 | 3.14 |
| 1990-91 | 2.44 | 0.99 | 3.43 |
| 1991-92 | 3.88 | 1.70 | 5.58 |
| 1992-93 | 4.19 | 1.94 | 6.13 |
| 1993-94 | 3.38 | 1.62 | 5.00 |
| 1994-95 | 4.41 | 2.09 | 6.50 |

మూలం: ప్రభుత్వ విద్యాశాఖ 1994-95 బడ్జెటు పత్రం.

### 1.3 హయ్యర్ సెకండరీ విద్యలో బోధనాంశాలు:

ఇంటర్మీడియేట్ తరువాత బాలబాలికలు ఉపాధి సాధనకు అర్హులౌతారు. వారిలో చాలామంది ఉన్నత మరియు సాంకేతిక విద్యకు వెళుతారు. కాబట్టి ఇంటర్మీడియేటులో వారు భాషలతో పాటు ప్రత్యేక సబ్జెక్ట్సు కూడా చదవాలని, అలాగే వృత్తి విద్యను కూడా అభ్యసించాలని జాతీయ విధానంలో సూచించబడింది. దానిననుసరించి విజ్ఞానశాస్త్రము, గణితము, అర్థికశాస్త్రము, పౌరశాస్త్రము, రాజకీయ శాస్త్రము, చరిత్ర, భూగోళ శాస్త్రము వగైరా వివిధ గ్రూపులుగా జతపరిచి ఐచ్ఛిక అంశాలుగా బోధించే వీలు కల్పించారు.

ఉన్నత మరియు సాంకేతిక విద్యకు అర్హులవటానికి వీలుగా విద్యార్థులు ముున్ముందు ఆయా బోధనాంశాలలో తగు పరిజ్ఞానం సంపాదించగలగటం బోధనా లక్ష్యాలుగా వుంటాయి. పైన చెప్పిన అకడెమిక్ అంశాలతో పాటు వృత్తి విద్య కూడా ఈ దశలో ప్రవేశపెట్టారు.

వ్యాయామ విద్య కూడా విద్యార్థుల కందిస్తారు. అందుకు ఫిజికల్ ఎడ్యుకేషన్ టీచర్‌ను నియమిస్తారు.

## 1.4 హయ్యర్ సెకండరీ విద్య యాజమాన్యము, పరిపాలన మరియు పరీక్షలు:

ఇంటర్మీడియేటు విద్యను మన రాష్ట్రంలో ఆరంభం నుండే ఉన్నత విద్యతో జతపరచడం జరిగింది. మొదటి రెండు సంవత్సరాలు ఉన్నత విద్యా శాఖాధికారి పరిపాలనలో ఈ దశ విద్య కొనసాగింది. 1971 లో ఇంటర్మీడియేటు విద్యాబోర్డు "బోర్డు ఆఫ్ ఇంటర్మీడియేట్ ఎడ్యుకేషన్" అనే ప్రత్యేక సంస్థను చట్టంద్వారా స్థాపించి, ఈ విద్యను ఆ సంస్థకు అప్పజెప్పారు. ఇంటర్మీడియేటు విద్యకు సంబంధించి, సిలబస్ నిర్ణయం మొదలుకొని జూనియర్ కళాశాలల పరిపాలన అజమాయిషీ మరియు పరీక్షల నిర్వహణ, ఫలితాల ప్రకటన వరకు అన్ని విధులు ఈ బోర్డు అధీనంలోకి తెచ్చారు. ఉన్నత విద్యా శాఖామంత్రి ఈ బోర్డు అధ్యక్షుడుగా వుంటాడు. బోర్డు డైరెక్టరు ఈ విద్యకు సంబంధించిన అత్యున్నత అధికారి. బోర్డు పరిపాలన వ్యవస్థ క్రింది పటములో చూపబడింది:




ఇంటర్మీడియేట్ బోర్డు రాష్ట్రంలో +2 స్టేజి విద్యా వ్యాప్తి, దాని అభివృద్ధి మరియు పరిపాలనా బాధ్యతలు వహిస్తుంది. ప్రైవేటు యాజమాన్యాలకు అనుమతి నివ్వడం, అవి పని చేసే విధానం వగైరా కూడా బోర్డు పరిధిలోనే వున్నాయి. అన్ని జూనియర్ కళాశాలల్లో బోధన, విద్యా స్థాయి పెరుగుదల, పాఠ్యపుస్తకాల నిర్ధారణ వంటి బాధ్యతలు ఈ బోర్డు నిర్వహిస్తుంది. అంతేకాక, బోధనా మరియు బోధనేతర సిబ్బంది నియామకం, వారి సర్వీసు స్థితిగతుల నిర్ధారణ, ప్రమోషన్లు వంటి మానవ వనరుల నిర్వహణకు బోర్డు బాధ్యత వహిస్తుంది.

## 1.5. బోధనా సిబ్బంది:

జూనియర్ కళాశాలల్లో ప్రతి విషయ బోధనకు ఒక అధ్యాపకుడు వుంటాడు. ప్రతి భాష బోధనకు ఒక అధ్యాపకుడు ఒక ఐచ్ఛిక బోధనాంశాలలో ఒక్కొక్క దానికి వేరుగా అధ్యాపకుడు నియమింప బడతారు. వారిని 'జూనియర్ లెక్చరర్' అంటారు. ప్రతి జూనియర్ లెక్చరర్ తాను బోధించే విషయంలో కనీసం రెండవ శ్రేణిలో పాసైన పోస్టుగ్రాడుయేటు అయి వుండాలి. పాఠశాల ఉపాధ్యాయుల వలె వీరికి ఉపాధ్యాయ శిక్షణ అవసరం లేదు. ప్రతి ప్రత్యేక జూనియర్ కళాశాలకు ఒక ప్రిన్సిపాల్ వుంటాడు.

1993–94 లో మొత్తం 12,258 జూనియర్ లెక్చరర్లు పని చేస్తున్నారు. వీరిలో 9711 పురుషులు మరియు 2547 స్త్రీలు.

1980–81 నుండి 1993–94 వరకు జూనియర్ లెక్చరర్ల సంఖ్య పెరుగుదల పట్టిక 4 లో చూపబడింది.

పట్టిక–4:
1980-81 మరియు 1993-94 మధ్యకాలంలో జూనియర్ లెక్చరర్ల సంఖ్య పెరుగుదల క్రమం (వేలల్లో)

| సంవత్సరం | జూ.లె. పురుషులు | జూ.లె. స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| 1980–81 | 4.8 | 1.1 | 5.9 |
| 1981–82 | 6.4 | 1.2 | 7.6 |
| 1982–83 | 8.5 | 1.4 | 9.9 |
| 1983–84 | 8.3 | 1.6 | 9.9 |
| 1984–85 | 7.1 | 1.7 | 8.8 |
| 1985–86 | 7.4 | 1.9 | 9.3 |
| 1986–87 | 7.4 | 1.9 | 9.3 |
| 1987–88 | 7.4 | 1.9 | 9.3 |
| 1988–89 | 7.4 | 1.9 | 9.3 |
| 1989–90 | 8.3 | 2.2 | 10.5 |
| 1990–91 | 8.3 | 2.2 | 10.5 |
| 1991–92 | 8.7 | 2.3 | 11.0 |
| 1992–93 | 8.8 | 2.3 | 11.1 |
| 9193–94 | 9.8 | 2.4 | 12.2 |

మూలం: ఇంటర్మీడియేటు బోర్డు.

1993 వేతన స్కేళ్ళ ప్రకారం జూనియర్ లెక్చరర్ల వేతన స్కేలు 3110–6380. మరియు ప్రిన్సిపాల్ స్కేలు 4140–8140. జూనియర్ లెక్చరర్లను గజిటెడ్ సిబ్బందికి చెందిన వారుగా ప్రభుత్వం ప్రకటించింది.

జూనియర్ లెక్చరర్ల ఖాళీలను సెకండరీ పాఠశాల ఉపాధ్యాయులలో నిర్ణయించిన విద్యా అర్హత గల వారిని ప్రమోట్ చేసి భర్తీ చేస్తారు. పబ్లిక్ సర్వీస్ కమీషను ద్వారా నేరుగా కొత్తవాళ్ళనుకూడా రిక్రూట్ చేసుకొంటారు.

ఇతర ప్రభుత్వ ఉద్యోగుల వలే వీరి పదవీ విరమణ వయస్సు 58 సంవత్సరాలు. జూనియర్ లెక్చరర్లను వారి సీనియారిటీ ప్రకారం ప్రిన్సిపాల్స్‌గా ప్రమోట్ చేయటం జరుగుతుంది.

## 1.6. ఇంటర్మీడియేటు విద్యపై ఖర్చు:

1992–93 మరియు 1993–94 లో ఇంటర్మీడియేటు విద్యపై పెట్టిన ఖర్చు మరియు 1994–95 సంవత్సరానికి మంజూరైన బడ్జెట్ వివరాలు పట్టిక 5 లో యివ్వనైనది.

పట్టిక–5: ఇంటర్మీడియేటు విద్యపై ఖర్చు (రూ.కోట్లలో)

| సంవత్సరం | ఖర్చు ప్రణాళిక | బడ్జెట్ | ప్రణాళికేతర | మొత్తం |
|---|---|---|---|---|
| 1992–93 | 1.205 | | 87.637 | 88.572 |
| 1993–94 | 1.205 | | 95.365 | 96.567 |
| 1993–94 | 1.205 | | 103.953 | 105.158 |

మూలం: ప్రభుత్వ విద్యాశాఖ బడ్జెటు పత్రాలు.

## 1.7 ఇంటర్మీడియేటు విద్య - ప్రైవేటు యాజమాన్యాల ప్రాబల్యం:

ఇంటర్మీడియేటు విద్యలో ప్రైవేటు యాజమాన్యాలు బహుళ ప్రాబల్యం సంపాదించాయి. పట్టిక 1 మరియు 2 పరిశీలిస్తే ఈ యాజమాన్యాలు ఎలా ప్రాబల్యం సంపాదించాయో తెలుస్తుంది.

1985–86 లో 240 ప్రైవేటు జూనియర్ కళాశాలలు వుండగా, 1994–95 వీని మొత్తం సంఖ్య 994 కు పెరిగింది. అంటే 754 కళాశాలలను ఆ యాజమాన్యాలు అదనంగా స్థాపించాయి. అదే కాలంలో ప్రభుత్వ జూనియర్ కళాశాలల సంఖ్య 396 నుండి 419 అయింది. అంటే ప్రభుత్వ యాజమాన్యం కేవలం 33 కళాశాలలను ఈ కాలంలో స్థాపించింది. 1992–93 లో 201 ప్రైవేటు

జూనియర్ కళాశాలలను అనుమతించింది. అదే సంవత్సరం కేవలం 3 ప్రభుత్వ జూనియర్ కళాశాలలు తెరిచారు. 1993-94 లో 186 ప్రైవేటు జూనియర్ కళాశాలలను అనుమతించగా 5 ప్రభుత్వ యాజమాన్యంలో తెరువబడ్డాయి. ప్రైవేటు యాజమాన్యం లోని జూనియర్ కళాశాలలకు ఎయిడ్ అందజేయడంలో కూడా ప్రభుత్వం ఉదారనీతిని అవలంబించింది. 1988 లో అమలు తెచ్చిన ఒక చట్టం (చట్టం 22) ప్రకారం ఎయిడ్ కోరే ప్రైవేటు యాజమాన్యాల దరఖాస్తులు ఒక ఉన్నతాధికార కమిటీకి నివేదిస్తారు.

ఈ నాడు రాష్ట్రంలో గల 1465 జూనియర్ కళాశాలల్లో 994 అంటే దాదాపు68 % ప్రైవేటు యాజమాన్యంలోనే వున్నవి.

### 1.8. నూతన ప్రయోగము:

సెకండరీ స్థాయిలో ఓపెన్ స్కూల్స్ పద్ధతి వలెనే ఇంటర్మీడియేటు స్థాయిలో ఓపెన్ కాలేజి తెరిచే నూతన ప్రయోగం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేసింది. 1989-90 లో తూర్పు గోదావరి జిల్లాలోని ధర్మాజి గూడెంలో హ్యూమానిటీస్ విషయాల్లో విద్యనందించే ఓపెన్ అడ్మిషన్ జూనియర్ కాలేజి తెరువబడింది. ప్రొద్దుటి సమయాలు ఉపాధి సంపాదనలో గడిపేవారు. ఈ కళాశాలలో చేరి ఇంటర్మీడియేటు విద్యను కొనసాగించ వచ్చును. ఇక్కడ ముందుగా టేప్ చేసిన పాఠాలు, దృశ్యశ్రవణ యంత్రాలు మరియు టి.వి ద్వారా బోధన సదుపాయాలు సమకూర్చారు.

### 1.9. ఇంటర్మీడియేటు పరీక్షలు ఫలితాలు:

ముందు చెప్పినట్టుగా ఇంటర్మీడియేటు పరీక్షల నిర్వహణ, సమాధాన పత్రాలు దిద్దటం మరియు ఫలితాల ప్రచురణ అంతా బోర్డు ఆఫ్ ఇంటర్మీడియేటు ఎడ్యుకేషన్ చేస్తుంది. పరీక్షలు మొదటి సంవత్సరం మరియు రెండవ సంవత్సరం వేరు వేరుగా జరుగుతవి. రెండవ సంవత్సరం పరీక్షలో మార్కుల ఆధారంగా ఉత్తీర్ణతను నిర్ణయిస్తారు.

1991 నుండి 1994 మధ్య పరీక్షలలో విద్యార్థుల ఫలితాలను పట్టిక 6 లో చూడవచ్చు.

*పట్టిక-6:*

1991 మరియు 1994 మధ్య యింటర్మీడియేటు ఫలితాలు

| సం॥ | హాజరైన విద్యార్థులు | ఉత్తీర్ణులైన వారు | ఉత్తీర్ణతా శాతం |
|---|---|---|---|
| 1991 | 3,02,199 | 62,994 | 20.82 |
| 1992 | 3,48,222 | 77,873 | 22.36 |
| 1993 | 3,73,767 | 96,808 | 25.90 |
| 1994 | 3,71,402 | 1,08,725 | 29.20 |

మూలం: ఇంటర్మీడియేటు బోర్డు.

# 2. వృత్తివిద్య

### 2.1. వృత్తివిద్య ప్రాముఖ్యత:

విద్య జాతియొక్క ఆర్థిక వికాసానికి కారణము. అలాగే జాతి ఆర్థిక వికాసం యొక్క ఫలితము విద్యా వ్యాప్తి మరియు గుణాత్మకమైన విద్య. మన దేశ విద్యా వ్యవస్థకు గల ఒక ప్రత్యేక లక్షణం ఏమంటే – ఉన్నత శ్రేణి విద్యనభ్యసించిన వారిలో చాలామంది 'సర్వీసెస్' శాఖల్లోకి వెళతారు. 'ఉత్పత్తి' శాఖల్లోకి వెళ్ళేవారు చాలా తక్కువ. విద్యను శ్రమతో బోధించక పోవటమే ఇందుకు కారణం. చాలామంది విద్యావంతుల్లో 'తెల్లచొక్కా' వైఖరి పేరుకొని పోతున్నది. శ్రమ మరియు ఉత్పత్తిదాయక పనుల్లో అభిరుచి మరియు కుశలతలు కల్గించడం జరగాలి. విద్యను శ్రమతో సంధాన పరచడం జరగాలి. వృత్తివిద్య పాఠ్యప్రణాళికలో అవిచ్ఛిన్న భాగంగా వుండాలి.

పాఠశాల విద్యలో వృత్తి విద్యకు స్థానం కల్పించే మొదట అధికార సిఫారసు చేసిన ఘనత మొదలియార్ కమీషనుదే. ఆ సిఫారసుననుసరించి బహుళార్థసాధక పాఠశాలలు – 'మల్టిపర్పస్ స్కూల్స్' – ఆవిర్భవించాయి. ఆ పాఠశాలల్లో 11,12 తరగతుల్లో వ్యవసాయం, ఇంజనీరింగు, కామర్సు వంటి శాఖల్లో విద్యార్థులకు తరిఫీదు నిచ్చే పనులను నేర్పించడం మొదలుపెట్టారు. మన రాష్ట్రంలో శ్రమతో కూడిన ఈ పాఠ్య ప్రణాళిక నాటి పరిస్థితుల్లో బాగానే అమలు జరిగిందని చెప్పాలి. అయినా అకడెమిక్ కోర్సుల పట్ల వ్యామోహం పోలేదు. డా॥ డి.యస్ కొఠారి అధ్యక్షతన ఏర్పడిన జాతీయ విద్యా కమీషన్ (1964-66) మొదటిసారిగా పాఠశాల విద్యను శ్రమతో జోడించడం అవసరమని, సెకండరీ విద్యతో 'పని అనుభవం' కలించి హాయ్యర్ సెకండరీ విద్యలో వివిధ వృత్తులకు సంబంధించిన నిర్దిష్టమైన కోర్సులు ప్రవేశపెట్టాలని ఖచ్చితమైన సిఫారసు చేసింది.

1968 విద్యావిధానంలో ఈ సిఫారసు మేరకు 'పని అనుభవం' మరియు వృత్తి కోర్సులు ప్రవేశపెట్టడానికి చర్యలు సూచించబడ్డాయి. కాని అవి అమలు జరుగ లేదనే చెప్పాలి. సెకండరీ స్థాయిలో పని 'అనుభవం' అంశానికి ఎలాంటి ప్రాధాన్యత లభించ లేదు. దరిమిలా 1977 లో ఈశ్వరభాయ్ పటేల్ కమిటి 'పని అనుభవం' అంశాన్ని 'సామాజికోపయోగ ఉత్పాదక' (యస్.యు.పి.డబ్ల్యు) గా పేరు మార్చి విద్యార్థులు తమకు పాఠశాల వెలుపల సామాన్య ప్రజలకుపయోగపడే వస్తు సామగ్రి తయారు చేయటం, సమాజానికి ఉపయోగపడే పనులు చేయటం వంటివి ప్రవేశపెట్టాలని సూచించింది. ఇదికూడా తగిన శ్రద్ధతో అమలు జరుపలేదు. ఆ కారణంగా హాయ్యర్ సెకండరీ స్థాయిలో వృత్తి విద్యను స్వీకరించిన

వారికి ఉపాధి సౌకర్యాలు కల్పించబడలేదు. అసలు వివిధ వృత్తి కోర్సులను బోధించడానికి తగిన పరికరాలు సమకూర్చ బడలేదు. బోధనా సిబ్బందిని నియమించడం జరగలేదు. వృత్తివిద్యను సంబంధిత పరిశ్రమలతో సమన్వయ పరచలేదు.

వృత్తి విద్యకు సంబంధించి ఒక ప్రధానమైన అంశం పట్ల శ్రద్ధ చూపబడలేదు. వృత్తి కోర్సులకు బలహీన వర్గాల విద్యార్థులను, ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారిని ఎంపిక చేయడం వల్ల ఈ కోర్సులు ఆర్థికంగాను, విద్యా విషయకంగాను వెనుకబడినవారికి ఉద్దేశించబడినవనే తప్పు భావన ప్రబలింది. చురుకైనఆర్థికంగా మెరుగైనవారికి ఈ కోర్సులకు వెళ్ళగల అవకాశాలు కల్పించకపోవడంవల్ల ఈ తప్పుడు అభిప్రాయం మరింత బలపడింది. దానితో ఈ కోర్సులు స్వీకరించే విద్యార్థులు కరువయ్యారు.

1986 విద్యా విధానంలో వృత్తి విద్య ప్రాధాన్యతను పునరుద్ధాటించడం జరిగింది. ఒకటి నుండి 5 తరగతుల వరకు 'పని అనుభవము' తప్పనిసరిగా ప్రవేశపెట్టాలని 6,7 తరగతులలో సామాజికోపయోగ ఉత్పాదక పనిని బోధించాలని మరియు సెకండరీ తరగతుల్లో విద్యార్థులు వృత్తివిద్య పట్ల ఆసక్తి కలిగి ముమ్ముందు వృత్తి విద్యా కోర్సులను నేర్చుకొనే పనికుశలతలు అబ్బినట్లుగా వివిధ ప్రాథమిక వృత్తి కోర్సులు ప్రవేశపెట్టాలని విద్యా విధానం ప్రతిపాదించింది.

హయ్యర్ సెకండరీ స్థాయిలో ప్రత్యేక వృత్తి కోర్సులు ఆరంభించి, ఆ కోర్సులు చదివినవారికి ప్రొఫెషనల్ మరియు సాంకేతిక విద్యలో చేరేందుకు సౌకర్యాలు కల్పించాలని సూచించడం జరిగింది. 1988 నుండి ఈ కోర్సులు ఆరంభం చేసి, ప్రతి సంవత్సరం 10% విద్యార్థులు వృత్తి కోర్సులను స్వీకరించేట్టు, క్రమంగా 5 సంవత్సరాల కాలంలో కనీసం 50% విద్యార్థులు వృత్తి కోర్సులలో చేరేందుకు చర్యలు తీసుకోవాలని సూచించడం జరిగింది.

## 2.2. ప్రాథమిక స్థాయిలో పని అనుభవం:

ప్రైమరీ స్థాయిలో 'పని అనుభవం' అంశం నామ మాత్రంగానే వుంది. చేతి పనులు, శ్రమ ఆధారంగా ఇతర ఏ పని కూడా ప్రాథమిక దశలో అమలుపరచబడలేదు. అప్పర్ ప్రైమరీ తరగతులకు 'సామాజికోపయోగ ఉత్పాదక విద్యకై, ఒక పీరియడు కేటాయించాలని ఉత్తర్వులేమో వున్నవి. కాని ఆపీరియడులో అలాంటి పని చేయడం అరుదు. యన్.సి.యి.ఆర్.టి సామాజికోపయోగ ఉత్పాదక కృత్యాలను సూచిస్తూ పుస్తకం ప్రచురించింది. సాధారణ ఉపాధ్యాయులకు ఈ కృత్యాలు చేబట్టడంలో శిక్షణ ఇచ్చింది. కాని, పాఠశాలల్లో అలాంటి కృత్యాలు చేయించటంపై శ్రద్ధ లేదని చెప్పాలి. క్రాఫ్టు ఉపాధ్యాయుడు, కుట్టు పని ఉపాధ్యాయురాలు, ఇతర చేతి వృత్తుల ఉపాధ్యాయులు పాఠశాలలో వుంటే ఆ పనులు విద్యార్థులకు నేర్పిస్తారు. కాని వానిలో శ్రద్ధ, ఆసక్తి కల్గించే విధంగా జరగదు. వృత్తి విద్య పరీక్షా అంశము కాకపోవటం విద్యార్థుల అనాసక్తికి ఒక కారణంగా చెప్పవచ్చు. విద్యాబోధనలో శ్రమ పట్ల గౌరవం,శ్రద్ధ కల్గించే ప్రయత్నం జరగకపోవడం మరో కారణం.

## 2.3. సెకండరీ స్థాయిలో వృత్తివిద్య:

1984 లో రాష్ట్ర ప్రభుత్వం సెకండరీ స్థాయిలో వృత్తికోర్సులు ప్రవేశపెట్టే ఉద్దేశంతో అందుకు తగిన సూచనలు చేయాల్సిందిగా, అపుడు అమలులో వున్న పాఠ్య ప్రణాళికలో అవసరమైన మార్పులు ప్రతిపాదించవలసిందిగా కోరుతూ శ్రీ వి.ఆర్.రెడ్డి (అప్పటి రాష్ట్ర అభివృద్ధి మండలి సభ్యులు) అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ 8,9,10 తరగతుల్లో వృత్తి విద్యాకోర్సులు తక్షణం ప్రవేశపెట్టాలని, సాధారణ విద్యా సిలబసును తగ్గించకుండా ఈ కోర్సులు ప్రారంభించాలని సూచించింది. సెకండరీ విద్య అనంతరం చదువు మానుకొనే బాలబాలికలు జీవనోపాధి సంపాదిచగలిగేలా ఈ కోర్సుల లక్ష్యం అయివుండాలని సూచించబడింది.

వృత్తి విద్యవల్ల విద్యార్థుల్లో టీమ్‌వర్క్‌కు అలవాటు పడాలని; వారిలో శ్రమపట్ల గౌరవం, సహనము, సహకారము వంటి లక్షణాలు అభివృద్ధి కావాలని వారు స్వయంపోషకత్వం పట్ల విశ్వాసం పెంచుకోగలగాలని సూచించింది ఆ కమిటీ.

పాఠశాలల్లో ప్రవేశపెట్టే కోర్సులు స్థానిక సాంఘిక ఆర్థిక పరమైన కృత్యాలకు సంబంధించి వుండటం అవసరమని కమిటీ అభిప్రాయపడింది. ఈ కోర్సులను అభ్యసించిన విద్యార్థులు అప్రెంటిస్‌షిప్ పొందిన తరువాత స్వయం ఉపాధి కాని, వేతన ఉపాధి కాని అవసరమైన నైపుణ్యం పొందగలగాలి. పాఠశాలలో మొత్తం బోధనా సమయంలో 20% వృత్తి విద్యలలో శిక్షణకు కేటాయించాలని కమిటీ సిఫారసు చేసింది.

వి.ఆర్.రెడ్డి కమిటి సిఫారసుల ననుసరించి 1984–85 వ సంవత్సరం హైదరాబాదు, ఖమ్మం, కృష్ణా, విశాఖపట్నం, కర్నూలు మరియు వరంగల్లులో ఎంపిక చేసిన 105 సెకండరీ పాఠశాలల్లోని 8 వ తరగతిలో వృత్తి విద్యా కోర్సులు ప్రవేశపెట్టారు. 1985–86 ఈ 105 పాఠశాలల్లోని 9 వ తరగతిలో కోర్సులు కొనసాగించారు. అదే సంవత్సరం మరో 240 పాఠశాలల్లో 8 వ తరగతి కోర్సులు ప్రవేశపెట్టారు. దశల వారీగా రాష్ట్రంలోని అన్ని సెకండరీ పాఠశాలల్లో 8,9,10 తరగతుల్లో ఈ కోర్సులు ప్రవేశపెట్టాలనే అప్పటి నిర్ణయం తరువాతి కాలంలో అమలు కాకుండానే వుండి

పోయింది. 1985–86 వరకు ఈ కోర్సులు ప్రవేశపెట్టిన 345 పాఠశాలల్లోనే ఇప్పటివరకు కోర్సులు సాగుతున్నవి. మిగిలిన పాఠశాలల్లో ఈ కోర్సులు ప్రవేశపెట్టబడలేదు.

ఈనాడు 345 పాఠశాలల్లో క్రింద ఉదహరించిన కోర్సులలో ఆయా పాఠశాలల వసతులు ఇతర సౌలభ్యాల ననుసరించి ఎంపిక చేసిన కోర్సులు కొనసాగుతున్నవి. మొత్తం మీద వృత్తి విద్యా కోర్సులు ప్రవేశపెట్టిన తరగతుల సంఖ్య 15.

1. కోళ్ళ పెంపకం.
2. తోటలు మరియు పుష్పాల పెంపకం.
3. గొర్రెల పెంపకం.
4. పట్టుపురుగుల పెంపకం.
5. వడ్రంగం.
6. వ్యవసాయ పనిముట్లు రిపేరు మరియు ఇతర మెకానికల్ పనులు.
7. భవనాలలో విద్యుత్ వైరింగ్ మరియు సాధారణ ఇళ్ళలో ఉపయోగించే విద్యుత్ పరికరాల రిపేరింగ్.
8. రేడియో, ట్రాన్సిస్టర్ మరియు టి.వి సర్వీసింగ్ మరియు రిపేరింగ్.
9. నీటి సరఫరా సంబంధమైన పనులు మరియు రిపేరింగ్.
10. సెక్రెట్రియల్ ప్రాక్టీసు.
11. కంప్యూటర్ కోర్సు.
12. కంపోజింగ్, ముద్రణ, బైండింగ్.
13. అల్లిక, దుస్తుల తయారీ, శుభ్రత, కుట్టు మరియు డ్రై క్లీనింగ్.
14. ప్రథమ చికిత్స మరియు సామాన్య ఔషధాలు, మెడికల్ షాపుల నిర్వహణ మరియు ఆహార శాస్త్రము.
15. రెఫ్రిజిరేషన్ మరియు ఏర్ కండిషనింగ్.

వృత్తి కోర్సులలో 8,9,10 తరగతులలో అంతర్గత పరీక్షలు థియరీలోను ప్రాక్టికల్స్ లోను నిర్వహించి ఆ పరీక్షలలో విద్యార్థులు సంపాదించిన మార్కులను కూడా రికార్డులో నమోదు చేస్తారు. యస్.యస్.సి పరీక్షలో ఈ విద్యార్థులు సామాన్య విద్యార్థులతో సహా అన్ని సబ్జక్టులలో పరీక్షలు వ్రాయడంతో పాటు తమ వృత్తి కోర్సులలో వేరుగా పరీక్షలు వ్రాయాలి. ఈ పరీక్షలు రాష్ట్ర వృత్తి విద్యా బోర్డు (స్టేటు బోర్డు ఆఫ్ ఒకేషనల్ ఎడ్యుకేషన్) నిర్వహిస్తుంది. థియరీకి 40 మరియు ప్రాక్టికల్సుకు 60 మార్కులుంటవి. మొత్తం మీద కనీసం 40% మార్కులు సంపాదిస్తే ఆ కోర్సులో పాసైనట్లు ప్రకటించి సర్టిఫికేటు ఇస్తారు. రాష్ట్రంలోని అన్ని పాఠశాలలో వృత్తి కోర్సులు ప్రవేశపెట్టేంతవరకు వృత్తి కోర్సులలో పాసైనా ఫైల్ అయినా యస్.యస్.సి పరీక్షలో సంపాదించిన మార్కుల ఆధారంగానే విద్యార్థి పాస్ లేక ఫెయిల్ అయినట్టుగా ప్రకటిస్తారు.

1987–88 నుండి పాఠశాలల్లో వృత్తి విద్యాబోధన మరియు శిక్షణను మెరుగు పరిచే కార్యక్రమం చేబట్టారు. ఈ కార్యక్రమంలో భాగంగా ప్రతి మండలంలో 'మండల వృత్తి విద్యా కేంద్రము' స్థాపించాలని ప్రభుత్వం సంకల్పించింది. ప్రతి వృత్తి విద్యా కేంద్రంతో 3–4 సెకండరీ పాఠశాలలను జోడించి విద్యార్థులు ఆ కేంద్రంలో కుశలతలు సంపాదించాలని ప్రతిపాదించారు. ఇప్పటికి 48 మండల వృత్తి విద్యా కేంద్రాలు స్థాపించబడ్డాయి. ఈ కేంద్రాల స్థాపనకు కేంద్ర ప్రభుత్వము ఆర్థిక సహాయాన్ని అందజేసింది.

1994–95 లో రాష్ట్రంలో సెకండరీ స్థాయిలో వృత్తి విద్యకు సంబంధించిన వివరాలు 7 వ పట్టికలో యివ్వనైనవి.

పట్టిక–7:

1994-95లో సెకండరీ స్థాయిలో వృత్తి విద్య వివరాలు

| | |
|---|---|
| వృత్తివిద్య ప్రవేశపెట్టిన పాఠశాలలు | 296 |
| మండల వృత్తివిద్యా కేంద్రాలు | 48 |
| వృత్తివిద్యా కేంద్రాలతో సంధానపరచిన పాఠశాలలు | 105 |
| కోర్సుల సంఖ్య | 15 |
| కోర్సులలో చేరిన విద్యార్థులు | 1,55,500 |
| అ) షెడ్యూలు తరగతి విద్యార్థులు | 25,700 |
| ఆ) షెడ్యూలు తెగల విద్యార్థులు | 13,950 |

మూలం: ఆం.ప్ర. ప్రభుత్వ 1994–95 విద్యా బడ్జెట్టు పత్రము.

పాఠశాలల్లో వృత్తి విద్య బోధించే వారు పూర్తి కాలపు ఉద్యోగులు కారు. వారంతా పార్ట్‌టైం బోధకులు. ఈ బోధకుల సంఖ్య మొత్తం 1003. వీరిలో 870 తగిన అర్హతలు గలవారు. మిగిలినవారు అవసరమైన అర్హతలు లేనివారు. వృత్తివిద్యాబోధకులందరూ పూర్తికాలపు బోధకులుగా వుండటం అవసరం.

## 2.4. హయ్యర్ సెకండరీ స్థాయిలో వృత్తి విద్య :

జూనియర్ కళాశాలల్లో వృత్తి విద్యా కోర్సుల ప్రధాన లక్ష్యాలు రెండు. మొదటిది ఈ కోర్సులు స్వయం సమృద్ధమై ఉండాలి. అంటే యీ కోర్సులు చదివిన విద్యార్థులు ఇంటర్మీడియేటు తరువాత అవసరమనుకుంటే స్వతంత్రంగా ఉపాధి చేపట్టగలగాలి. రెండవ లక్ష్యం యీ కోర్సులు చదివినవారికి మధ్యంతర శిక్షణ యిచ్చి – వారు ఉన్నత స్థాయి విద్యను (ఆయా వృత్తికి సంబంధించిన) అభ్యసించగల సామర్థ్యం అందజేయాలి. వృత్తి కోర్సు తీసుకొన్నవారు అందుకు సంబంధించిన ఉన్నత విద్యలో చేరడానికి అవకాశం కల్పించడం యీ లక్ష్యం యొక్క సారాంశం. హయ్యర్

సెకండరీ స్థాయి వృత్తి విద్యకై కేంద్ర ప్రభుత్వం ఆర్థిక సహాయము అందజేస్తున్నది.

ఇంటర్మీడియేటులో 7 రంగాలకు చెందిన 21 కోర్సులు ప్రవేశపెట్టారు. ఆ రంగాలు వ్యవసాయము, పశు వైద్యము, వ్యాపార వాణిజ్య నిర్వహణ, యింజనీరింగు, అడవుల పెంపకం, ప్యారా మెడికల్ మరియు హోం సైన్సు.

## 2.5 ఇంటర్మీడియేటులో ప్రవేశపెట్టిన వృత్తి కోర్సులు:

మన రాష్ట్రంలో ఇంటర్మీడియేటులో వృత్తి విద్య 1979–80 సంవత్సరంలో ప్రవేశ పెట్టబడినది. 1987–88 వరకు 120 జూనియర్ కళాశాలల్లో 22 కోర్సులలో శిక్షణ జరుగుతూ వుండినది. 1986 జాతీయ విద్యా విధానంలోని ప్రతిపాదనలననుసరించి 1987–88 వ సంవత్సరం నుండి కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయంతో మరికొన్ని కోర్సులు మరిన్ని కళాశాలల్లో ప్రవేశపెట్టబడ్డాయి. 1994–95లో 580 జూనియర్ కళాశాలల్లోని 1480 తరగతుల్లో 26 కోర్సులు అమలుచేయబడుతున్నవి.

వృత్తి విద్యా కోర్సులను 5 విభాగాలుగా విభజించారు. ఆ విభాగాలు మరియు ప్రతి విభాగంలోని కోర్సులు క్రింద ఇవ్వనైనవి.

| క్ర.స. | విభాగం | కోర్సులు |
|---|---|---|
| 1. | యింజనీరింగ్ మరియు టెక్నాలజీ | i) సర్వేయర్ మరియు ఎస్టిమేటర్<br>ii) రహదారి మరియు భవనాలు<br>iii) నీటి సరఫరా మరియు శానిటేషన్<br>iv) విద్యుత్ పరికరాలు మరియు యింటిలోని విద్యుత్ వైరింగ్<br>v) ఎలక్ట్రికల్ రివైండింగ్<br>vi) గ్రామీణ యింజనీరింగ్<br>vii) వాహనాల రిపేర్ మరియు యింజనీరింగ్<br>viii) రేడియో మరియు టి.వి.<br>ix) కంప్యూటర్ సైన్సు మరియు కంప్యూటర్ యింజనీరింగ్<br>x) భవన నిర్మాణ శాస్త్రము (ఆర్కిటెక్చర్)<br>xi) ఎయిర్ కండిషనింగ్ మరియు రిఫ్రిజిరేషన్ |
| 2. | వ్యవసాయం మరియు పశు సంరక్షణ | i) వ్యవసాయ పంట<br>ii) పట్టుపురుగుల పెంపకం<br>iii) కూరగాయలు మరియు పళ్ళ రక్షణ మరియు ప్రాసెసింగ్<br>iv) పాల ఉత్పత్తి (డైరీ మిల్క్)<br>v) మత్స్య ఉత్పత్తి రక్షణ (ఫిషరీ)<br>vi) చక్కెర ఉత్పత్తి |
| 3. | వాణిజ్యము మరియు వ్యాపార యాజమాన్యము | i) ఆఫీసు నిర్వహణ<br>ii) అకౌంటింగ్ మరియు టాక్సేషన్ |
| 4. | బాల సంరక్షణ మరియు హోంసైన్సు | i) క్రచి మరియు ప్రిస్కూల్ నిర్వహణ<br>ii) దుస్తుల తయారీ<br>iii) బేకరీ మరియు కన్ఫెక్షనరీ |
| 5. | ఆరోగ్యము మరియు పేరా మెడికల్ | i) వైద్య ప్రయోగశాల (మెడికల్ లేబరేటరి టెక్నిక్)<br>ii) దంత శుభ్రత మరియు దంత వైద్యము<br>iii) ఎక్స్‌రే టెక్నీషియన్<br>iv) ఆప్తాల్మిక్ టెక్నీషియన్ |

కార్యాలయ నిర్వహణ మరియు అకౌంటింగ్ మరియు టాక్సేషన్ తప్ప మిగిలిన కోర్సులలో బోధనా మాధ్యమం ఇంగ్లీషు. కార్యాలయ నిర్వహణ మరియు అకౌంటింగ్ బోధనలలో తెలుగు మరియు ఇంగ్లీషు అవసరాన్ని బట్టి వాడుతారు. వృత్తి విద్యా కోర్సుల బోధనా కాలములో 15% ఇంగ్లీషు బోధనకు, 15% ఆ వృత్తికి సంబంధించిన విజ్ఞాన శాస్త్రము మరియు గణితమునకు, మిగిలిన 70% వృత్తి విద్య థియరీ మరియు ప్రాక్టికల్స్‌కి కేటాయిస్తారు.

వృత్తి విద్యా కోర్సులు అమలులో వున్న కళాశాలల సంఖ్య మరియు ఆ కోర్సులు చదువుతున్న బాల బాలికల సంఖ్య పట్టిక 8 లో యివ్వనైనది. ప్రతి కోర్సులో 20 విద్యార్థులను చేర్చుకొనే అవకాశం కల్పించారు.

పట్టిక–8:

**1989-90 నుండి 1993-94 వరకు వివిధ సంవత్సరాలలో యింటర్మీడియేటులో ఆరంభించిన వృత్తివిద్య కోర్సుల సంఖ్య మరియు అందులో చేరిన బాల బాలికల సంఖ్య**

| సంవత్సరం | వృత్తి విద్యను అమలు పరచిన కళాశాలల సంఖ్య | వృత్తి విద్య ఆరంభించిన తరగతుల సంఖ్య | | | కోర్సులలో చేరటానికి అవకాశం | వాస్తవంగా చేరిన వారు | మొత్తం యింటర్ లో విద్యార్థుల సంఖ్య | వృత్తివిద్య తీసుకున్న వారి శాతం |
|---|---|---|---|---|---|---|---|---|
| | | బాలికలకు | బాలబాలికలకు | మొత్తం | | | | |
| 1989–90 | 182 | 45 | 280 | 325 | 6370 | 3715 | 2,27,348 | 1.6 |
| 1990–91 | 171 | 60 | 254 | 314 | 12,440 | 5821 | 2,56,340 | 2.2 |
| 1991–92 | 184 | 42 | 298 | 340 | 19,130 | 4523 | 2,65,430 | 1.7 |
| 1992–93 | --- | --- | --- | --- | 19,130 | 5,506 | 2,77,188 | 1.9 |
| 1993–94 | 46 | 60 | 441 | 501 | 29,030 | 10,000 | 2,82,190 | 3.5 |
| మొత్తం | 583 | 207 | 1273 | 1480 | | | | |

మూలం: ఆం.ప్ర. ఇంటర్మీడియేటు బోర్డు.

జాతీయ విద్యా విధానంలో యింటర్మీడియేటులో 10 శాతం విద్యార్థులు వృత్తివిద్య కోర్సులకు విడదీయబడాలని (డైవర్సిఫై) సూచించబడివుండగా ప్రస్తుతం కేవలం 3.5 శాతం విద్యార్థులు ఆ కోర్సులను తీసుకొని వున్నారు. 1989–90లో ఈ కోర్సులు చదివే విద్యార్థులు 1.6% మాత్రమే.

## 2.6. వృత్తివిద్య కోర్సుల ఎంపిక మరియు ఆధునికీకరణం:

హెయ్యర్ సెకండరీ స్థాయిలో ప్రవేశపెట్టిన వృత్తివిద్య కోర్సులు విద్యార్థులను స్వయంపోషకులుగా సిద్ధం చేయాలంటే ఆ కోర్సులు స్థానికంగా ఉన్న పరిశ్రమలు, స్థానిక పరిస్థితులు మరియు డిమాండుకు అనువైనవిగా వుండాలి. 1983–85 లో యింటర్మీడియేటు బోర్డు కోర్సుల ఎంపిక మరియు వానిలో ఎలాంటి శిక్షణ అవసరమో నిర్ణయించేందుకు ఒక సర్వేను చేబట్టింది. కాని అది పూర్తి కాలేదు. కాని కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయంతో ఈ మధ్య మరో సర్వే చేపట్టారు. ఈ సర్వే జిల్లాల వారీగా జరిగింది. ఎంపిక చేసిన కొందరు జూనియర్ లెక్చరర్లు మరియు ప్రిన్సిపాల్స్‌కు యీ బాధ్యత అప్పచెప్పి శిక్షణ యిచ్చి శాస్త్రీయ పద్ధతిలో ప్రతి జిల్లాలో యీ సర్వే నిర్వహించారు. జిల్లా వృత్తి విద్య అధికారుల అజమాయిషీలలో జరిగిన యీ సర్వేలవల్ల ప్రస్తుతం ప్రవేశపెట్టియున్న కోర్సులు ఆయా ప్రాంతాల స్థానిక పరిస్థితులకు, అచటి అవసరాలకు అనువైనవిగా లేవని తేలింది. అలాంటి కోర్సులను అవసరమున్న ప్రాంతాలలోని కళాశాలలకు మార్చే ప్రయత్నాలు జరుగుతున్నవి.

వృత్తి కోర్సుల సిలబసుపై ప్రజలు, ఉపాధ్యాయులు, శిక్షకులు, మరియు పారిశ్రామిక సంస్థల విమర్శను పురస్కరించుకొని ఆ కోర్సుల సిలబసును ఆధునికీకరణం చేసే పనిని ఈ మధ్య పూర్తి చేశారు. పరిశ్రమల ప్రతినిధులు, వివిధ వృత్తి శాఖల అధికారులు మరియు విశ్వవిద్యాలయాల ప్రతినిధులతో కూడిన కమిటీల ద్వారా నూతన సిలబసు తయారు చేయించటం జరిగింది. ఆధునికం చేయబడిన సిలబసు ననుసరించి ఆయా కోర్సులకు సంబంధించి పాఠ్యపుస్తకాలు కూడా రచించే కార్యక్రమానికి బోర్డు పూనుకున్నది. ఇప్పటి వరకు 13 కోర్సులకు సంబంధించిన 25 పాఠ్యపుస్తకాలు ప్రచురించడం జరిగింది.

## 2.7. వృత్తివిద్య కోర్సులు ఉపాధి సోపానాలు:

ఇంటర్మీడియేటులో వృత్తి కోర్సులు అంటే ఆ కోర్సులు పూర్తి చేసినవారికి ఉపాధి అవకాశాలు వుంటవి. అయితే విద్యార్థులకు ప్రభుత్వ రంగంలో ఉద్యోగ అవకాశాలను నిర్ణయించేందుకు నిపుణుల కమిటీ నియమించారు. ఆ కమిటీ సిఫారసులను పరిశీలించిన మీదట ప్రభుత్వం వివిధ కోర్సులను గుర్తించి ఆ కోర్సులు పూర్తి చేసినవారు ఏయే శాఖల్లో, ఏయే ఉద్యోగాల్లో చేరేందుకు అర్హులో వివరిస్తూ ప్రభుత్వం 23.9.85 న ఉత్తర్వులు (జి.ఓ.యం.యస్.నెం.428)

జారీ చేసింది. అలాగే 1991 లోనూ 1992 లో కూడా ఉద్యోగావకాశాలను ఉల్లేఖిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చింది. వివిధ ఉద్యోగాల్లో ప్రవేశార్హతలు నిర్ధారించటంవల్ల వృత్తివిద్యా కోర్సులు చదివినవారికి ఉద్యోగ అవకాశాలు మెరుగైనవి.

ఈ కోర్సులు చదివిన విద్యార్థులకు అప్రెంటిస్‌షిప్ ట్రైనింగ్ కూడా యిచ్చే నిర్ణయం తీసుకున్నారు. ఆరు నెలల అప్రెంటిస్‌షిప్ ట్రైనింగ్ యిచ్చే యీ స్కీము 1983-84 నుండి అమలు జరుగుతున్నది. రీజనల్ బోర్డు ఆఫ్ అప్రెంటిస్‌షిప్ ట్రైనింగ్ (బి.ఓ.ఎ.టి) ద్వారా నిర్వహించే యీ ట్రైనింగుకై 60 కోర్సులను ఎంపిక చేశారు. ఆ కోర్సులు పూర్తి చేసినవారికి ట్రైనింగ్ లభిస్తుంది. ఈ ట్రైనింగ్ పొందినవారు స్వయం ఉపాధి సాధించగలుగుతారు. అయితే యీ ట్రైనింగు పొందిన విద్యార్థుల సంఖ్య చాలా తక్కువ.

## 2.8 వృత్తివిద్యా కోర్సులు చదివినవారికి ఉన్నత విద్య అవకాశాలు:

వృత్తివిద్యా కోర్సుల ప్రధాన ఉద్దేశం విద్యార్థులకు వేతనం లేక స్వయం ఉపాధి అవకాశాలనందించటం ఐనప్పటికీ చాలామంది విద్యార్థులు పై చదువులకు ప్రాకుతున్నారు. వృత్తి కోర్సులు చదివిన విద్యార్థులకు సాధారణ యింటర్మీడియేటు చదివిన వారితో సమానంగా గుర్తింపు ఉన్నది. అందువల్ల ఆ విద్యార్థులు యీనాటికీ బహుళ సంఖ్యలో బి.ఏ., బి.కాం., బి.యస్.సి. లేక బి.టెక్ లో చేరుతున్నారు. వృత్తివిద్యా కోర్సులు చదివిన విద్యార్థులు పాలిటెక్నిక్ కోర్సు 2 వ సంవత్సరం లో నేరుగా చేరే వీలు కల్పింపబడింది. వీరికై పాలిటెక్నిక్ లో 10% సీట్లు ప్రత్యేకంగా కేటాయించబడియుంటవి. వైద్య మరియు ఇంజనీరింగు కళాశాలలో చేరటానికి యిలాంటి సదుపాయం ఏదీ లేదు. ఈ కళాశాలల్లో చేరడానికి అందరి మాదిరిగా సెంట్రల్ ఎంట్రెన్సు పరీక్షల్లో కూర్చుని మెరిటు సంపాదించాల్సి వుంది.

## 2.9 వృత్తివిద్యా కోర్సుల ఉపాధ్యాయులు మరియు వారి శిక్షణ:

వృత్తివిద్యా కోర్సులను బోధించటానికి అవసరమైన శాశ్వత పూర్తికాలపు బోధకుల నియామకం పద్ధతిని ప్రభుత్వం యింతవరకు చేపట్టలేదు. యిప్పటివరకుకూడా అన్ని వృత్తి విద్యా కోర్సుల బోధకులు పార్ట్ టైమ్ బోధకులే. కాగా యీ కోర్సులు ప్రవేశపెట్టిన కళాశాలల్లో ఒక ల్యాబ్ అటెండర్ మాత్రం పూర్తికాలపు ఉద్యోగి. బోధకులు మరియు ల్యాబ్ అటెండర్ జీతాలు కేంద్రం మరియు రాష్ట్ర ప్రభుత్వాలు 75:25 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రతి కోర్సుకు ఒక శాశ్వత పూర్తికాలపు బోధకుడిని జూనియర్ లెక్చరర్ క్యాడర్‌లో నియమించాలనే ప్రతిపాదనలపై ప్రభుత్వం ఆలోచిస్తున్నది. వృత్తి విద్య బోధకులకు ప్రత్యేక శిక్షణ నిచ్చే కార్యక్రమాన్ని ప్రభుత్వం 1988-89 నుండి ఆరంభించింది. కంప్యూటర్ విద్య, సివిల్ యిజనీరింగ్, మెకానికల్ యింజనీరింగ్, ఎలక్ట్రికల్ యింజనీరింగ్ మరియు బిజినెస్ మేనేజిమెంటు బోధకులకై యిప్పటికి 12 శిక్షణా కోర్సులు నిర్వహించబడ్డాయి.

## 2.10 వృత్తి విద్యా కోర్సుల నిర్వహణ యంత్రాంగం:

వృత్తి విద్య వ్యవస్థను నిర్వహించటానికి రాష్ట్ర వృత్తి విద్యా పరిషత్తు (స్టేటు కౌన్సిల్ ఆఫ్ ఒకేషనల్ ఎడ్యుకేషన్ - యస్.సి.వి.యి.) నొకదానిని ప్రభుత్వం స్థాపించింది. రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అధ్యక్షుడుగాను, ఉన్నత విద్యకు సంబంధించిన ప్రభుత్వ కార్యదర్శి ఉపాధ్యక్షుడుగాను వుండే యీ కౌన్సిల్‌లో వివిధ శాఖలకు చెందిన 20 సభ్యులు ఉంటారు. ఇంటర్మీడియేటు బోర్డు కార్యదర్శి ఈ కౌన్సిలుకు కార్యదర్శిగా వ్యవహరిస్తాడు. జాతీయ స్థాయిలో ఏర్పరచిన జాయింట్ కౌన్సిల్ ఆఫ్ ఒకేషనల్ ఎడ్యుకేషన్ మాదిరిగా యీ కౌన్సిలు కూడా రాష్ట్రంలో వృత్తి విద్యకు సంబంధించిన విధానం, పరిశోధన, నిర్వహణ మరియు పరీక్షలకవసరమైన నిర్ణయాలు తీసుకుంటుంది.

రాష్ట్రంలో స్టేటు యిన్స్టిట్యూట్ ఆఫ్ ఒకేషనల్ అనే మరో సంస్థను నెలకొల్పారు. జిల్లాల్లో జిల్లా వృత్తి విద్యాకౌన్సిళ్ళను ఏర్పరచారు. జిల్లా స్థాయి కౌన్సిల్‌కు కార్యదర్శి, దీనికి జిల్లా కలెక్టరు అధ్యక్షుడు. వివిధ శాఖల జిల్లా అధికారులు యిందులో సభ్యులు.

ఇంటర్మీడియేటు బోర్డులో మేనేజిమెంట్ ఇన్ఫర్మేషన్ సిస్టమ్స్‌కై కంప్యూటర్ సహాయంతో వృత్తి విద్యకు సంబంధించిన సమాచారం సేకరించటం, నిలువ చేయటం వంటి కార్యక్రమం చేపట్టబడింది.

# రాష్ట్రంలో ఉన్నత విద్య

- జి. బాలస్వామి

స్వాతంత్ర్యానికి పూర్వం ఉన్నత విద్య యొక్క లక్ష్యాలు బ్రిటిష్ సామ్రాజ్య పటిష్టతకు, పరిపాలనా సౌలభ్యానికి, అనుగుణ్యంగా అభివృద్ధి పరుచుటకు ప్రయత్నించబడినది. 1919 Act ప్రకారం విద్య కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాల అధీనంలోనే కాక ఆంగ్లోఇండియన్ మరియు ఐరోపా వాసులకొరకై ప్రత్యేకించబడిన అంశముగా యున్నటువంటి వివక్షతతో కూడిన పరిస్థితి 1935 Act ద్వారా తొలగించబడి కేంద్ర మరియు ప్రాంతీయ ప్రభుత్వాల అధీనములోకి తేబడినది.

1937–47 మధ్య కాలంలో Quit India ఉద్యమ పర్యవసానంగా జన బాహుళ్యములో కల్గిన జాగృతి Awakening వల్ల యుద్ధ పరిణామంగా ఏర్పడిన Urbanisation, సాంకేతిక శిక్షణ పొందిన శిష్టుల యొక్క ఉన్నత విద్యా వ్యాప్తి యొక్క అవసర ఫలితంగా నాల్గు నూతన విద్యాలయాలు మరియు అనేక కళాశాలలు ఏర్పడుటయే కాక పూర్వపు విశ్వవిద్యాలయాల్లో మరియు కళాశాలల్లో విద్యార్థుల సంఖ్య గణనీయంగా పెరిగింది.

యుద్ధానంతరం పరిస్థితి పర్యవసానంగా జాతీయ విద్యా విధాన రూపకల్పనకై Central advisory Board చే 1944 Sergent report రూపంలో వెలువడింది. దీని ప్రకారం 40 సంవత్సరాలలో ఇంగ్లాండ్‌తో సమానంగా విద్యా ప్రమాణాలను అభివృద్ధి పర్చాలనే లక్ష్యాన్ని నిర్దేశించబడినది. హయ్యర్ సెకండరీ తరువాత మూడు సంవత్సరాల విశ్వవిద్యాలయం కోర్సు ఉండాలనే అంశం ఉన్నత విద్యకు సంబంధించినంతవరకు ఈ రిపోర్టులోని ముఖ్యాంశం.

స్వాతంత్ర్యానంతరం మన జాతీయ ఆదర్శాలైన సామ్యవాదం, లౌకికవాదం, ప్రజాస్వామ్యం సాధించటానికి వివిధ రంగాలలో శిష్టులను, ప్రజాపరిపాలనా రంగాలకు వైయక్తిక రంగాలకు కావలసిన ఉన్నతోద్యోగులను తయారుచేయుటకు, ఉన్నత ప్రమాణాలతో కూడిన బోధన, విజ్ఞాన విస్తరణకు నిరంతరం పరిశోధనలో నాణ్యత పెంచుటకు ఈ దశలో అధ్యాపకులు విద్యార్థులు శ్రేష్ఠతను పొందుటకై ఉన్నత విద్య ఒక సాధనం కావాలనేది ప్రధాన లక్ష్యంగాను ఏర్పడింది. అభివృద్ధి చెందిన దేశాలలోని విశ్వవిద్యాలయాల ప్రమాణాల స్థాయికి మన ఉన్నత విద్యా ప్రమాణాలను పెంచాలనే ఉద్దేశంతో భారత ప్రభుత్వం 1948లో డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి అధ్యక్షతలో విశ్వవిద్యాలయాల కమీషన్‌ను నియమించింది. విశ్వవిద్యాలయాల ఉన్నత విద్యకు సంబంధించిన అనేక మౌలిక అంశాలపై ఈ కమీషన్ చేసిన సిఫారసులలో ముఖ్యమైనవి:

(i) విశ్వవిద్యాలయ విద్యను Concurrent list లోకి తేవాలి.

(ii) విశ్వవిద్యాలయాల ఆర్థిక వనరులను, నూతన పాఠ్యాంశములకు కావలసిన వసతులను సమన్వయ పరచుట, జాతీయ విధానాలను రూపొందించుట, నిర్వహణలో కనిష్ఠ ప్రమాణాలను సాధించుట, విశ్వవిద్యాలయాలకు జాతీయ పరిశోధనా కేంద్రాలు మరియు పరిశీలన (Surveys) మొదలగు వాటి మధ్య సమన్వయాన్ని సాధించుటకై కేంద్ర ప్రభుత్వం బాధ్యత వహించుట.

(iii) విశ్వవిద్యాలయ విద్యకై కావలసిన నిధులను కేటాయించుటకై కేంద్ర గ్రాంట్ల కమీషన్ ఏర్పాటు చేయాలి.

వృత్తి విద్యా కోర్సులను పెట్టాలని, పునశ్చరణ తరగతులను ఏర్పాటు చేయాలని, విద్యార్థుల సంఖ్యను స్థిరీకరించి పని దినాలను 180కి పెంచాలని, బోధనా పద్ధతులను మెరుగు పర్చాలని, మంచి పాఠ్యపుస్తకాల ప్రచురణ, సాయం కళాశాలల ఏర్పాటు, Seminars, Tutorial పద్ధతి ప్రవేశ పెట్టుట, కళాశాలలలోని ప్రయోగశాలలను గ్రంథాలయాలను, బిల్డింగ్స్‌ను అభివృద్ధిపర్చుట, మొదలుగాగల అనేక అంశాలపై రాధాకృష్ణన్ కమీషన్ విస్తృత సిఫారసులు చేసినది.

ఆ తర్వాత 1952లో లక్ష్మణస్వామి మొదలియార్ గారి ఆధ్వర్యములో నియమించబడిన సెకండరీ కమీషన్ ఉన్నత విద్యను గూర్చి చేసిన సిఫారసులలో ముఖ్యమైనవి, ఇంటర్‌మీడియేట్ రెండు సంవత్సరాలలో ఒక సంవత్సరాన్ని

సెకండరీ దశలో చేర్చి 4 సంవత్సరాల ఉన్నత సెకండరీ దశను; ఒక సంవత్సరాన్ని డిగ్రీస్థాయికి చేర్చి 3 సంవత్సరాల డిగ్రీదశగా చేయాలని, మరియు ఉన్నత సెకండరీ దశలోనే Diversified courses ను ప్రవేశపెట్టాలి.

1966లో కొఠారి కమీషన్ ఈ దిగువ సిఫారసులు చేసింది.

1) దేశవ్యాపితంగా 10+2+3 విద్యావ్యవస్థను ప్రవేశపెట్టాలి.
2) డిగ్రీ స్థాయిలో అధ్యయన విషయాల పునర్నిర్మాణము జరగాలి, పోస్టుగ్రాడ్యుయేట్ విద్యకోసం పరిశోధనలు చేయడంకోసం 'అడ్వాన్స్‌డ్ స్టడీస్' కేంద్రాలను స్థాపించి వివిధ రంగాలలోని నిష్ణాతులను ఈ కేంద్రాలకు ఆకర్షించాలి.
3) కొద్దికాలములో క్రమంగా యూనివర్సిటీ స్థాయిలో ప్రాంతీయ భాషలలో విద్యాబోధన జరగాలి.
4) ప్రవీణులను ఈ వృత్తిలోకి ఆకర్షించుటకై అధ్యాపకుల యొక్క ఆర్థిక, సాంఘిక, వృత్తిపరమైన స్థాయిని పెంచుటకై నిరంతర కృషి జరగాలి. అధ్యాపకుల వృత్తిపరమైన పెరుగుదల విద్యాభివృద్ధి యొక్క కృషిలో ప్రధాన భాగంగా గుర్తించాలి.

జాతీయ లక్ష్యాలను నెరవేర్చుటకై ఆయా విద్యాకమీషన్‌ల సిఫార్సులను, లభ్యం కాగల వనరులను దృష్టిలో ఉంచుకొని భారత ప్రభుత్వం 1958 లో 'శాస్త్ర విజ్ఞాన విధాన' తీర్మానాన్ని, 1968లో "జాతీయ విద్యా విధాన" తీర్మానాన్ని పార్లమెంటుచే ఆమోదింప చేసింది. ఉన్నత విద్యారంగంలో వాటిని అమలు చేయడానికి కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ, 1953 లో స్థాపించబడిన "విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్" అనేక చర్యలను తీసుకొన్నాయి. 1968 లో పార్లమెంటుచే ఆమోదించబడిన విధాన తీర్మానం తర్వాత దేశంలోని విద్యారంగంలో గణనీయమైన వ్యాప్తి మరియు మార్పు జరిగినది. ముఖ్యంగా జాతీయ విద్యా విధానము 10 ఏండ్ల సెకండరీ కోర్సు తర్వాత 2 ఏండ్ల హయ్యర్ సెకండరీ (లేక Intermediate) కోర్సు, ఆ తర్వాత 3 సంవత్సరాల మొదటి డిగ్రీ కోర్సులు (10+2+3), చివరకు 2 సంవత్సరాల పోస్టుగ్రాడ్యుయేషన్ కోర్సులుగా ఉండాలని దాదాపు అన్ని రాష్ట్రాలు అంగీకరించి అమలు జరుపుతున్నాయి. ఈ విధానానికి అనుగుణంగా బోధన, పరీక్షా విధానాలు రూపొందించి అమలు చేయుచున్నారు. డిగ్రీ స్థాయిలో పరిమితులతో అధ్యయన విషయాల కోర్సులు ప్రవేశ పెట్టబడినవి (restructured) పోస్టు గ్రాడ్యుయేట్ మరియు పరిశోధనకై Centres of Advanced studies స్థాపించబడి మనకు కావలసిన Educated Man Power (విద్యావంతులైన మానవశక్తి) అవసరాలను తీర్చుకోకలిగింది.

ఆ తర్వాత 18 సంవత్సరాలకై ఈ విధాన తీర్మానంపై "విద్యా విధానం – విధాన దృక్పథం" పేర ఒక పరిశీలనా పత్రం ఆధారంగా దేశంలో విస్తృత చర్చలు జరిగిన తదుపరి 1986 లో నూతన "విద్యా విధాన పత్రాన్ని" పార్లమెంట్‌చే ఆమోదించబడినది.

ఈ విధాన పత్రంలో ఉన్నత విద్యకు సంబంధించినంత వరకు గల ముఖ్యాంశాలు:-

1) దేశంలో ఉన్న 150 విశ్వవిద్యాలయాలు, 500 కళాశాలలలో సమగ్రాభివృద్ధి సాధించుటకై సదుపాయాలను పటిష్ఠం చేసే విస్తృత పర్చాలి.
2) విశిష్ట శిక్షణా అవసరాలను తీర్చుటకై కోర్సులలో కార్యక్రమాలలో మార్పుచేసి భాషా సామర్థ్యానికి అధిక ప్రాధాన్యత ఇచ్చుట.
3) దృశ్య శ్రవ్య బోధనోపకరణాల ద్వారా, విద్యుత్ పరికరాల ద్వారా బోధనా పద్ధతులను రూపాంతరీకరించాలి.
4) శాస్త్ర, సాంకేతిక, ప్రణాళిక పరికరాల అభివృద్ధి, పరిశోధన, ఉపాధ్యాయ శిక్షణ వంటి రంగాలకు ప్రాధాన్యం ఇవ్వాలి.
5) ప్రతిభపై ఆధారపడి అన్ని పోస్టులను భర్తీ చేయాలి.
6) విశ్వవిద్యాలయాలలో పరిశోధనకు అధిక ప్రోత్సాహమిచ్చి పరిశోధన స్థాయి ఉన్నతంగా ఉండేటట్లు చూడాలి.
7) కళాశాలలను స్వయం ప్రతిపత్తి గలవిగా రూపొందించాలి.
8) వృత్తులకు సంబంధించిన ఒక జాతీయ ఉన్నత విద్యా సంస్థను నెలకొల్పాలి.
9) సార్వత్రిక విశ్వవిద్యాలయ వ్యవస్థను ప్రారంభించాలి.
10) ఉద్యోగాలను, డిగ్రీ అర్హతలను వేరు చేయాలి.
11) గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికై గ్రామీణ విశ్వవిద్యాలయాలను స్థాపించాలి.
12) రాష్ట్రస్థాయి యోజనకు, ఉన్నత విద్యకు ఉన్నత విద్యాపరిషత్తుల ద్వారా సమన్వయం జరపాలి.

1956 కు పూర్వపు హైదరాబాద్ రాష్ట్రం మరియు ఆంధ్ర రాయలసీమ ప్రాంతాలు ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి వేరై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగా ఏర్పడియుండెను.

పూర్వపు నైజాం సంస్థానంలో హైదరాబాదు నగరం యందు 1887 లో మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా నైజాం కళాశాల స్థాపనతో ఉన్నత విద్యావకాశాలు ప్రారంభమైనవని చెప్పవచ్చును. ఆ తర్వాత 1918 లో నైజాంగారి ఫర్మానాద్వార ఉస్మానియా విశ్వవిద్యాలయం రెసిడెన్షియల్ యూనివర్సిటీగా స్థాపించబడి, 1948 నాటికి వరంగల్, గుల్బర్గా, ఔరంగాబాద్‌లలో 3 అనుబంధ కళాశాలలను

స్థాపించుకున్నది. 1947 లో నైజాం కళాశాల కూడా మద్రాస్ యూనివర్సిటీ-నుండి విడివడి ఉస్మానియా విశ్వ విద్యాలయానికి అనుబంధ కళాశాలగా ఏర్పడినది. ప్రభుత్వ యాజమాన్యంలో city కళాశాల మరియు Aliya కళాశాలలు ఇంటర్మీడియట్ కోర్సులను కల్గియుండి పాఠశాల డైరెక్టర్ అధీనంలో యుండెను. హైదరాబాద్ సంస్థానం భారత యూనియన్లో చేరిన తర్వాత అనుబంధ కళాశాలలు క్రమంగా పెరిగి, 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడునాటికి తెలంగాణా జిల్లాలలో వీటి సంఖ్య 21కి పెరిగింది.

ఆంధ్రప్రాంతం మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు విజయనగరంలో మొట్టమొదటి మహారాజా కాలేజి, మద్రాస్ విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాలగా ఏర్పడినది. ఆ తర్వాత రాజమండ్రిలో ప్రభుత్వ కళాశాల, కాకినాడలో P.R. కళాశాలలు ఏర్పాటు చేయబడినవి. 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ చట్టం ద్వారా బెజవాడ కేంద్రంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడి 1930 లో వాల్తేరుకు తరలి పోయింది. 1942 లో తాత్కాలికంగా గుంటూరు మారి తిరిగి 1946లో వాల్తేరులో నివాసం ఏర్పరచుకొంది. 1926 లో విశ్వవిద్యాలయ కళాశాలలుగా 12 అనుబంధ కళాశాలలను కలిగి యుండెను. వీటి సంఖ్య 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడునాటికి 22 ప్రథమ శ్రేణి, 3 ద్వితీయశ్రేణి అనుబంధ కళాశాలలుగా పెరిగింది.

## 1956 తర్వాత:

భారత రాజ్యాంగం రీత్యా విద్య 1975 వరకు రాష్ట్ర జాబితాలోని అంశం. కనుక ఉన్నత విద్య నిర్వహణ రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యతయే. కాని 1975 లో విద్యను కాంకరెంట్ జాబితాలో చేర్చుట ద్వారా ఈ అంశం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఉమ్మడి అధీనంలోకి తేబడినది. దీనిని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 నుంచి కేంద్ర ప్రభుత్వం మరియు కేంద్ర విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం యొక్క నిర్ణయాలకు అనుగుణంగా ఉన్నత విద్యా వ్యాప్తికి కృషి జరుపుచున్నది.

(1) రాధాకృష్ణన్ కమీషన్, లక్ష్మణ స్వామి మొదలియార్ కమీషన్ మరియు కొఠారి కమీషన్ల యొక్క సూచనల ప్రకారం 1957-58లో 2 సంవత్సరాల ఇంటర్మీడియట్ విద్యా విధానం స్థానములో ఒక సంవత్సరం పి.యు.సి. విధానాన్ని ప్రవేశపెట్టారు. తిరిగి 1964 లో 10 ఏండ్ల సెకండరీ కోర్సు అమలు చేయుటకై రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించుటకు అనుగుణంగా 1969-70 లో రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ కోర్సును ప్రవేశపెట్టి హయ్యర్ సెకండరీ స్థానంలో జూనియర్ కళాశాలలను ప్రారంభించుటయే కాక డిగ్రీ కళాశాలలలో కూడా ప్రవేశపెట్టారు.

(2) అట్లే 1958-59 లో 2 సంవత్సరాల డిగ్రీకి బదులు 3 సంవత్సరాల డిగ్రీ కోర్సును రాష్ట్రమంతట అమలు జరిపారు. దానితో సమాన ప్రాధాన్యం గల 3 విజ్ఞాన విషయాలతో బాటు సమగ్ర విజ్ఞాన సముపార్జనకై సాధారణ విద్య (జనరల్ ఎడ్యుకేషన్ జతపర్చుట జరిగి ఇంగ్లీషు మరియు దేశభాషలలో కొంత అభ్యాసన భాగాన్ని తగ్గించారు. కాని 1968-69 లో విద్యార్థుల ఆందోళన ఫలితంగా సాధారణ విద్యాంశాన్ని తొలగించారు. మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సులో మామూలు (జనరల్) మరియు ప్రత్యేక (స్పెషల్) రకాలు ఏర్పడినవి. పూర్వం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డిగ్రీ విద్యార్థులు ఒక ప్రధాన విషయం (మెయిన్), 2 సహాయ విషయాలు (అక్షిలరీలు) పద్ధతి అమలులో ఉండేది. దానిని 1971 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రవేశపెట్టారు. కాని రాష్ట్రములోని అన్ని విశ్వవిద్యాలయాలలో ఒకే రకమైన (Common Core Syllabus) ఉండాలని ఉన్నత విద్యామండలి ఆధ్వర్యంలో జరిగిన Conference లో నిర్ణయించబడి నాటి నుండి అమలు జరుపబడినది.

(3) ఆంధ్రప్రదేశ్ లోని విశ్వవిద్యాలయాలలో 3 సంవత్సరాల "ఆనర్సు కోర్సు"కు బదులు 2 సంవత్సరాల "పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సు"ను వివిధ, భౌతిక, ప్రకృతి, మానవీయ, సాంఘిక విజ్ఞాన విషయాలలో 1956-57 నుంచి 1960-61 సంవత్సరాల మధ్య ప్రవేశపెట్టబడినది. పిమ్మట రాష్ట్రంలో నానాటికి పెరుగుతున్న పోస్టు గ్రాడ్యుయేట్ విద్యావసరాలను తీర్చడానికి 1967-68 లో గుంటూరు, వరంగల్, అనంతపురంలలో - విశ్వవిద్యాలయాలే పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రాలను స్థాపించుటయేగాక, ఆ తర్వాత అనేక అనుబంధ కళాశాలలలో వివిధ విజ్ఞాన విషయాలలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను ప్రారంభించింది.

(4) మాతృభాషలో ఉన్నత విద్యా బోధన జరగాలనే రాధాకృష్ణన్ సిఫార్సులను పురస్కరించుకొని, మనరాష్ట్ర సాఫల్యాన్ని కాంక్షించి 1969-70 లో ఇంటర్మీడియట్ కోర్సుకు, 1971-72 లో డిగ్రీ కోర్సుకు, ఇంగ్లీషుతో బాటు తెలుగును కూడ బోధనా భాషగా ప్రవేశపెట్టారు. ఈ రెండు కోర్సులకు అవసరమైన పాఠ్యగ్రంథాలు తెలుగులో తయారు చేసే కృషిని 1968 లో హైదరాబాద్లో స్థాపించబడిన "తెలుగు అకాడమీ" చేసినది.

(5) విశ్వవిద్యాలయ డిగ్రీ, జూనియర్ కళాశాలల్లో చెప్పే చదువుల్లో బోధన, పరీక్షా పద్ధతుల్లో కూడా మార్పులు వస్తున్నాయి.

విశ్వవిద్యాలయ పోస్టు గ్రాడ్యుయేట్ తరగతులలో ప్రతి సంవత్సరాన్ని రెండు సెమిష్టర్లుగా విభజించి సెమిష్టరు ఆఖరులో పరీక్షలు జరుపుటను ప్రవేశపెట్టారు. విద్యార్థులలో స్వయం కృషిని పెంపొందించటానికి గోష్టులు నిర్వహించి ఎస్సైన్‌మెంట్లు, పరిశోధన వ్యాసాలు మొదలైనవి వ్రాయిస్తున్నారు. ఈ కృషికి కొన్ని మార్కులు కేటాయించి తర్వాత వ్రాత, మౌఖిక ప్రయోగ పరీక్షలు జరుపుతున్నారు.

కళాశాలల్లో డిగ్రీ తరగతుల పాఠ్యప్రణాళికల్లో నానాటికి పెరుగుతున్న విజ్ఞానాంశాలను కొంతవరకు చేరుస్తున్నారు. కొన్ని కళాశాలల్లో భౌతిక, ప్రకృతి, విజ్ఞాన శాస్త్రాల బోధన, అభ్యసన పద్ధతులలో మార్పుతేవడానికి "కాసిప్" కార్యక్రమాన్ని, మానవాయి, సాంఘిక విషయాల బోధన, అభ్యసన పద్ధతులలో మార్పు కోసం "కాహిప్" కార్యక్రమాన్ని విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్ సహాయంతో అమలు చేస్తున్నారు. వీటివలన అధ్యాపకులు ఉపన్యాసాలు ఇవ్వడం ద్వారానేకాక, గ్రంథాలయాల సద్వినియోగం, బాహ్య ప్రపంచ అధ్యయనం ఇత్యాది పద్ధతుల ద్వారా విద్యార్థులలో చదువుపట్ల ఆసక్తిని, స్వయంగా విజ్ఞానార్జన చేసే అలవాటును పెంపొందించగలరు.

విద్యార్థులు ఉపాధి పొందే శిక్షను పొందేకొరకై సాధారణ విద్యతో బాటు వృత్తి విద్యా కోర్సులను 1979–80 లో 22 ప్రభుత్వ జూనియర్ కళాశాలలు, 1984–85 నుంచి డిగ్రీ కళాశాలలలో ప్రారంభించారు. ఇంటర్ స్థాయిలో అగ్రికల్చర్, యనిమల్ హజ్బెండరీ, బిజినెస్ మ్యానేజ్‌మెంట్ & కామర్స్, ఇంజనీరింగ్ టెక్నాలజీ, హోమ్‌సైన్స్ & హెల్త్ ప్యారామెడికల్ – మొదలగు రంగాలలో కోర్సులు ప్రవేశపెట్టి 1994–95 వరకు వాటిని 30 కి పెంచారు. డిగ్రీ విద్యార్థులకు 35 వొకేషనల్ సబ్జెక్టులు; ఆంధ్రా, నాగార్జున, కాకతీయ మరియు ఉస్మానియా యూనివర్సిటీ అధీనంలోని 49 డిగ్రీ కళాశాలలలో ప్రవేశపెట్టారు. వీటిలో టాన్స్‌ప్రొసీజర్ ప్రాక్టీస్, కంప్యూటర్ అప్లికేషన్స్, ట్రావెల్ మ్యానేజ్‌మెంటు, అడ్వర్‌టైజింగ్ & సేల్స్ ప్రమోషన్, ఇండ్రస్ట్రియల్ కెమిస్ట్రీ, ఇండస్ట్రియల్ బయాలజీ, మాస్ కమ్యూనికేషన్స్, ఎలక్ట్రానిక్ ఎక్విప్‌మెంట్ మెయింటెనెన్స్, ఫారిన్ ట్రావెల్ ప్రాక్టీసెస్ & ప్రొసీజర్స్, సీడ్ టెక్నాలజీ, ఇన్‌స్ట్రుమెంటేషన్ మొదలగునవి ముఖ్యమైనవి.

(6) రాష్ట్రంలోని అన్ని సాంఘిక, వృత్తి, వయో వర్గాల్లోను – ప్రగతి కోసం ఉన్నత విద్యా భ్యాస కాంక్ష పెరుగుచున్నది. అయితే అది పెరిగినంత వేగంగా – ఆర్థిక వనరుల, సుశిక్షితులైన ఉపాధ్యాయుల కొరత వలన, సంస్థాగత విద్యా సౌకర్యాలు పెరుగుటలేదు. అందుచేత కొఠారి విద్యా కమీషన్ 1966 లో సూచించిన విధంగా రాష్ట్రములోని విశ్వవిద్యాలయాలు, ఇంటర్‌మీడియట్ బోర్డు, తాము నిర్వహించే పరీక్షలలో కొన్ని షరతులకు లోబడి, స్వయంగా చదువుకొనేవారు (ప్రైవేట్ కాండిడేట్స్) పాల్గొనేందుకు చాలా కాలంగా అనుమతి ఇస్తున్నారు. విశ్వవిద్యాలయాల భౌగోళిక పరిధులు, దిగువ స్థాయి పరీక్షలలో ఉత్తీర్ణత మొదలగు వాటికి సంబంధించిన నిబంధనలను ఇటీవల సడలించగా హెచ్చుమంది ఉన్నత విద్యార్హతలు పొందటానికి వీలు కలుగుతున్నది. పనిచేస్తూ తీరిక వేళల్లో పై చదువులు సాగించ దల్చినవారికి సాయంకాల కళాశాలలు కరస్పాండెన్స్ కోర్సులు అన్ని విశ్వవిద్యాలయాలు విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్ సహాయంతో అందిస్తున్నాయి. మొదట డిగ్రీ స్థాయికి పరిమితమైన కరస్పాండెన్స్ కోర్సులు ఇప్పుడు పోస్టు గ్రాడ్యుయేట్ స్థాయికి విస్తరించబడినాయి. 1986 లో నూతన విద్యా విధాన పత్రంలోని సూచన ఆధారంగా రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలు, సార్వత్రిక విద్యా విధానానికి ప్రాముఖ్యత నిచ్చి, కరస్పాండెన్స్, కోర్సులకై ప్రత్యేక సంచాలక వ్యవస్థలను ఏర్పాటు చేసినవి. మన రాష్ట్రప్రభుత్వం, దేశంలోనే మొట్టమొదటి సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని 1982 లో స్థాపించి, తదుపరి డా॥ Babasaheb Ambedkar విశ్వవిద్యాలయంగా నామకరణము చేసినది. ఈనాడు సార్వత్రిక విద్యావిధాన కేంద్రాలలో సాధారణ విద్యతో పాటు బ్యాంకింగ్, లేబర్‌లాస్, Financial Management, Journalism, ఇంగ్లీషు బోధన, Library Science, Nutrition మొదలుగాగల diversified కోర్సులు కూడా ప్రవేశపెట్టారు.

(7) రాష్ట్ర ప్రభుత్వం ఉన్నత, ఇతర విద్యా సంస్థలు సక్రమంగా పని చేసేటట్లు చూడటానికి 1975 లో ద్వాదశ సూత్ర కార్యక్రమాన్ని ప్రకటించింది. విద్యా సంస్థలలో హాజరు, విద్యా బోధన, పరీక్షల నిర్వహణ, అధ్యాపకుల పరస్పర సహకారం, అధ్యాపక – విద్యార్థి సంబంధాలు, అధ్యాపకుల తల్లిదండ్రుల సంబంధాలు, విద్యా సంస్థల పర్యవేక్షణ మొదలైన వాటిలో అభివృద్ధి సాధించి, విద్యా ప్రమాణాలు పెంచడం, ఈ కార్యక్రమం యొక్క ఆశయం.

(8) ఉన్నత విద్యారంగంలో పనిచేస్తున్న విశ్వవిద్యాలయ డిగ్రీ, జూనియర్ కళాశాలల అధ్యాపకుల సంక్షేమానికి, సామర్థ్యం పెంపుదలకు అనేక చర్యలను కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్ తీసుకొంటున్నాయి.

విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్ 2,3,4,5,6 – పంచ వర్ష ప్రణాళికల క్రింద అధ్యాపకుల జీతభత్యాలు పెంచాలని నిర్ణయించి, వాటిని అమలు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రత్యేక ధన సహాయాన్ని అందచేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అన్ని ప్రణాళికా కాలాల్లోను విశ్వవిద్యాలయ గ్రాంట్ల

సంఘం నిర్ణయించిన జీత భత్యాలను కొన్ని షరతులపై విశ్వవిద్యాలయ, ప్రభుత్వ వైయక్తిక డిగ్రీ కళాశాలల అధ్యాపకులు పొందేటట్లు చూసింది.

వైయక్తిక డిగ్రీ కళాశాలలలోని అధ్యాపకులకు జీతభత్యాలు సక్రమంగా అందేటట్లు చేయడానికి "డి.యస్.రెడ్డి కమిటి" సిఫారసులను అనుసరించి 1963–64 నుంచి, వాటికి ఆమోదించిన వ్యయాధిక్యం వల్ల కలిగేలోటును పూర్తిగా భరిస్తూ ధన సహాయ గ్రాంట్లు ఇస్తున్నది. ఆ తర్వాత 1979 నుండి బ్యాంకుల ద్వారా పేమెంటు పద్ధతి ప్రవేశపెట్టబడినది. వారికి ఉద్యోగ భద్రత కలిగిస్తూ 1975 లో ఆంధ్రప్రదేశ్ గుర్తింపు పొందిన వైయక్తిక విద్యా సంస్థల నియంత్రణ చట్టం చేయబడినది. ప్రభుత్వ కళాశాల అధ్యాపకులకు వర్తించే R.P.S. 1980 ప్రకారం, పూర్వపు ఉదార పెన్షన్ స్థానములో 50% పెన్షన్ సౌకర్యాలను అమలు పరుస్తున్నారు.

ఉన్నత విద్యా సంస్థలలోని అధ్యాపకుల సామర్థ్యం పెంచడానికి విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్, భారత సాంఘిక శాస్త్ర పరిశోధనామండలి, భారత విశ్వవిద్యాలయాల అసోసియేషన్, రాష్ట్ర ఉన్నత విద్యా పరిషత్ మొదలైన సంస్థలు పరిశోధనావకాశాలు, వేసవి కాలపు తరగతులు, కర్మశాలలు (Workshop), గోష్ఠులు ఏర్పాటు చేస్తున్నాయి. విశ్వవిద్యాలయ గ్రాంట్ల కమీషన్‌చే ఎంపిక చేయబడిన ఉస్మానియా, ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర, సెంట్రల్ యూనివర్సిటీలలో Academic training colleges ఏర్పాటు చేసి, డిగ్రీ కళాశాలలలో పని చేయుచున్న అధ్యాపకులందరికి వంతులవారిగా 30 నుండి 40 రోజుల పునశ్చరణ తరగతులను నిర్వహించుచున్నారు. 1986 సంవత్సర జీతాలు పొందే వారందరూ ఈ ట్రైనింగ్ తప్పనిసరిగా పొందవలసి యున్నది.

(9) ఉన్నత సాధారణ విద్యారంగంలోని విద్యార్థులలో క్రమశిక్షణ, శరీర సౌష్ఠవం పెంపొందించడానికి "జాతీయ సైనిక శిక్షణ" (N.C.C.) కార్యక్రమాన్ని, వారు జాతి నిర్మాణ కార్యకలాపాల్లో పాల్గొనేటట్లు చేయడానికి జాతీయ సాంఘిక సేవా (N.S.S.) కార్యక్రమాల్ని అమలు చేస్తున్నారు.

(10) నిన్న మొన్నటి వరకూ ఉన్నత, సాధారణ విద్యా సౌకర్యాలు సంపన్న, మధ్యతరగతి వర్గ విద్యార్థులకు, అగ్రవర్ణాల విద్యార్థులకు మాత్రమే అందుబాటులో ఉండేవి. ఇటీవల ఆర్థిక, సాంఘిక అభ్యున్నతి కోసం ఉన్నత విద్యను అభ్యసించడానికి ముందుకు వచ్చే; ఆర్థికంగా బలహీన పడినా, సాంఘికంగా వెనుకబడిన, నిమ్న జాతులకు చెందిన విద్యార్థుల సంఖ్య క్రమేపి పెరుగుచున్నది. వారిని ప్రోత్సహించడానికి కేంద్ర రాష్ట్ర, ప్రభుత్వాలు, జాతీయ బ్యాంకులు సాంఘిక ప్రవృత్తి, తల్లిదండ్రుల ఆదాయం, పరీక్షలలో మార్కులవంటి ప్రాతిపదికలపై రకరకాల ఉపకార వేతనాలు (స్కాలర్‌షిప్స్) రుణాలు ఇస్తున్నాయి. పాఠ్యపుస్తకాలు కొనలేనివారి ఉపయోగార్థం కళాశాలలలో పుస్తక బ్యాంకులు ఏర్పాటు చేస్తున్నారు. చదువులో వెనుకబడిన విద్యార్థులకై ప్రత్యేక బోధనా ఏర్పాట్లు (రెమిడియల్ టీచింగ్) మరియు ఎంట్రెన్స్ పరీక్షలకై ఉచిత ప్రత్యేక శిక్షణా తరగతులను ఏర్పాటు చేయుచున్నారు.

## పాలక సంస్థలు:

ఆంధ్రప్రదేశ్‌లో సాధారణ విద్యకు సంబంధించిన అధికారాలను, బాధ్యతలను, సచివాలయ (సెక్రటేరియట్) విద్యాశాఖ, ఉన్నత విద్యా పరిషత్తు, కార్యనిర్వాహక ఉన్నత విద్యా కమీషనరేటు, డైరెక్టరేట్ ఆఫ్ ఇంటర్‌మీడియట్ ఎడ్యూకేషన్, ఇంటర్‌మీడియట్ బోర్డు, సాధారణ విశ్వ విద్యాలయాలు, డిగ్రీ కళాశాలలు, జూనియర్ కళాశాలలు, ప్రాచ్యవిద్యా కళాశాలలు పంచుకొంటున్నాయి.

(1) సచివాలయ విద్యాశాఖ: ఉన్నత విద్యను గురించి ప్రభుత్వ విధాన నిర్ణయంలో రాష్ట్ర విశ్వవిద్యాలయ వ్యవహారాలను సమన్వయం చేయడంలో సచివాలయ విద్యాశాఖ ప్రధాన పాత్ర వహిస్తుంది. దీనికి రాజకీయ అధిపతి రాష్ట్ర ఉన్నత విద్యాశాఖామాత్యులు. ఆయనకు ప్రధాన సహాయకుడు, సలహాదారు – విద్యాశాఖ ముఖ్య కార్యదర్శి. ముఖ్యమైన ఉన్నత విద్యారంగ సమస్యలపై రాష్ట్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుల సమావేశాలు జరిపించి వారి అభిప్రాయాలు సేకరిస్తుంది. ఉన్నత విద్యా విధాన నిర్ణయాలే కాక నిర్వహణ, అభివృద్ధులకు కావలసిన ద్రవ్యం సమకూర్చే విషయమై సచివాలయ ఆర్థిక ప్రణాళిక శాఖతో సమన్వయం కల్గియుండును.

(2) ఉన్నత విద్యా కమిషనరేటు: 1975 కు పూర్వం ఉన్నతవిద్య, పాఠశాల విద్య, కార్యనిర్వహణ ఒకే విద్యాశాఖ డైరెక్టరేటు అధీనంలో యుండేది. 1975 లో ఉన్నత విద్య కార్యనిర్వహణకై ప్రత్యేక ఉన్నత విద్యా డైరెక్టరేటు అధీనంలో యుండేది. తదుపరి దీనిని ఉన్నత విద్యా కమీషనరేటు స్థాయికి మార్చారు. ప్రభుత్వ ఉన్నత విద్యా విధానాలను అమలు చేయడానికి, ముఖ్యంగా ప్రభుత్వ డిగ్రీ కళాశాలలపై నియంత్రణ, వైయక్తిక డిగ్రీ కళాశాలలు, ప్రాచ్య విద్యా కళాశాలలపై ఆర్థిక నియంత్రణ దీని అధీనములోకే తేబడినవి. కొంతకాలంవరకు జూనియర్ కళాశాలలు కూడ దీని అధీనములోనే పని చేయుచుండెను. ఆ తర్వాత జూనియర్ కళాశాలల డైరెక్టరేటు ఏర్పాటు చేయబడినది. ఉన్నత విద్యా కమీషనరేట్ అధీనంలో కడప, రాజమండ్రి, గుంటూరు, హైదరాబాద్‌లలో నల్గురు జాయింట్ డైరెక్టర్లు, ఆయా ప్రాంతాలలోని డిగ్రీ మరియు జూనియర్ కళాశాలలపై పర్యవేక్షణ చేయుదురు.

(3) ఇంటర్‌మీడియట్ డైరెక్టరేటు: ఇంతవరకు ఉన్నత విద్యా కమీషనరేటు కార్యనిర్వహణలో ఉన్న ఇంటర్ మీడియట్ విద్యకు, పరిపాలనా సౌలభ్యంకొరకు ప్రత్యేకమైన డైరెక్టరేట్ ఏర్పాటు చేయబడినది. ఇంటర్‌మీడియట్ విద్యా విధానాలను అమలుపర్చుట, రాష్ట్రములోని ప్రభుత్వ వైయుక్తిక జూనియర్ కళాశాలల యొక్క ఆర్థిక నియంత్రణ, కార్యనిర్వహణ దీని అధీనంలో యుండును. ఒక సంచాలకుడు, సంయుక్త సంచాలకుడు దీని కార్యనిర్వాహకులుగా ఉందురు. కడప, రాజమండ్రి, గుంటూరులలో గల ఉన్నత విద్యా ప్రాంతీయ సంయుక్త డైరెక్టరేట్‌లే జూనియర్ కళాశాలలకు సంబంధించిన అంశాల బాధ్యతను చూచుచున్నారు. ఈ బాధ్యతల నిర్వహణకై ప్రత్యేక సంయుక్త డైరెక్టరేట్ కార్యాలయాలను ఏర్పాటు చేయాలనే ఆలోచనగలదు.

(4) బోర్డ్ ఆఫ్ ఇంటర్‌మీడియట్ ఎడ్యుకేషన్: 1969 లో మల్టిపర్పస్ హయ్యర్ సెకండరీ విద్యాస్థానంలో ఇంటర్‌మీడియట్ విధానాన్ని వైస్‌ఛాన్స్‌లర్స్ ఆధ్వర్యంలో ఏర్పాటు చేయబడిన ఇంటర్‌మీడియట్ బోర్డుక్రింద, డిగ్రీ మరియు జూనియర్ కళాశాలల్లో స్థాపించబడినది. 1971 లో ఆంధ్రప్రదేశ్ ఇంటర్‌మీడియట్ చట్టం క్రింద బోర్డ్ ఆఫ్ ఇంటర్‌మీడియేట్ ఎడ్యుకేషన్‌గా మార్చారు. ఈ చట్టం ప్రకారం ఉన్నత విద్యాశాఖామాత్యులు అధ్యక్షులుగా, ఉన్నత విద్యాశాఖ కార్యదర్శి ఉపాధ్యక్షులుగా ఉంటారు. డైరెక్టర్ హోదాగల ఒక కార్యదర్శి ఉంటారు. ఇంటర్‌మీడియట్ కోర్సుకు సంబంధించిన నిబంధనలు, పాఠ్యప్రణాళికలు, పరీక్షలు మొదలైన అంశాలపై అధికారాన్ని కల్గియున్నది. నూతన జూనియర్ కళాశాలలు స్థాపించుటకై అఫిలియేషన్ ఇచ్చు అధికారం కూడా ఈ బోర్డుకు అప్పగించారు.

(5) ఉన్నత విద్యా పరిషత్: కేంద్రంలో విశ్వవిద్యాయ గ్రాంట్ల కమీషన్ మాదిరిగా రాష్ట్రాలలో ఉన్నత విద్యాకమీషన్‌లను ఏర్పాటు చేయాలని నూతన విద్యా విధాన పత్రంలో సూచన ప్రకారంగా; ప్రతిభను వెలికి తీసే ఉద్దేశంతో విద్యా ప్రమాణాలను మెరుగు పరిచేందుకు 1988 లో 16 వ చట్టం ద్వారా ఉన్నత విద్యా పరిషత్ ఏర్పాటు చేయబడినది. ఈ పరిషత్‌లో ఒక ఛైర్మన్, వైస్ ఛైర్మన్ ఉంటారు. వారిని ప్రభుత్వమే నియమిస్తుంది. వారి పదవీకాలం మూడు సంవత్సరాలు. వీరుకాక ఒక సెక్రటరీ, ఒక అకెడెమిక్ డిప్యూటీ డైరెక్టర్ మరియు వివిధ ప్రభుత్వ శాఖల నుండి 10 మంది సభ్యులను ప్రభుత్వం నియమిస్తుంది.

ప్రొఫెసర్ జి.జె.వి.జగన్నాథరాజుగారు మొదటి ఛైర్మన్‌గా 1988–91 వరకు పనిచేశారు. ఆ తర్వాత 1991–94 వరకు శ్రీ దొరస్వామి (I.A.S.) గారున్నారు. తిరిగి 1994 నుండి ప్రొఫెసర్ జి.జె.వి. జగన్నాథ రాజుగారు నియమించబడినారు.

ఉన్నత విద్యను క్రమబద్ధంగా అభివృద్ధి చేసేందుకు, ప్రభుత్వ ప్రైవేటు కళాశాలలు, యూనివర్సిటీల పరిపాలన క్రమబద్ధం చేయుటకు, వాటికి ప్రభుత్వ నిధులు మంజూరు చేసేందుకు నివేదికలను రూపొందించేందుకై ఈ పరిషత్ ఏర్పాటు. ఉద్దేశించబడినది. విద్యా పథకాలను రూపొందించి ఉన్నత విద్యలో గుణాత్మక మార్పుకు ఇది కృషి చేస్తుంది. ఉన్నత విద్యకు అవసరమైన అదనపు నిధులు సమకూర్చుకొనుటకై వనరులను సూచిస్తుంది. అధ్యాపకులకు ఇన్‌సర్వీస్ శిక్షణ, పరీక్షల సంస్కరణలు, ఎంట్రెన్స్ పరీక్షలు, నూతన కళాశాలల స్థాపనకై పాఠ్యపుస్తకాల ముద్రణ, అధ్యాపకుల పోస్టుల భర్తీకి సంబంధించిన కార్యకలాపాలు – ఈ పరిషత్ ఆధ్వర్యంలో జరుగును. ఉపాధ్యాయుల వేతనములు, పని పరిస్థితులకు సంబంధించిన మార్పుల కోసం ప్రభుత్వానికి సూచనలు ఇస్తుంది.

(6) సాధారణ విశ్వవిద్యాలయాలు: పోస్టు గ్రాడ్యుయేట్ మొదటి డిగ్రీ స్థాయి కోర్సులను నిర్వహించటానికి ఆయా విజ్ఞాన విషయాలలో పరిశోధనా కార్యకలాపాలు కొనసాగించడానికి ఈ విశ్వవిద్యాలయాలు పని చేస్తున్నాయి. వీటిలో చాలా రాష్ట్ర విశ్వవిద్యాలయాలు, ఒకటి కేంద్ర విశ్వవిద్యాలయం. రాష్ట్ర విశ్వవిద్యాలయాలలో మూడింటి సంస్థాపక చట్టాలను 1959 లో, 1976 లో సవరించి వాటి ఉపాధ్యక్షులను, కార్యనిర్వాహక సంస్థలను రాష్ట్ర ప్రభుత్వమే నియమించు పద్ధతిని ప్రవేశపెట్టారు. మిగిలిన విశ్వవిద్యాలయాల స్థాపక చట్టాలు 1976 లో మరియు ఆ తర్వాత తయారైనాయి. రాష్ట్రంలోని ప్రతి విశ్వవిద్యాలయంలో కార్య నిర్వహణ పరిషత్ (Executive Council) అనే నిర్వాహక సంస్థలు, విశ్వవిద్యాలయ కళాశాలలు, పోస్ట్ గ్రాడ్యుయేట్ కేంద్రాలు, అనుబంధ కళాశాలలు అనే విద్యా బోధక సంస్థలు ఉన్నాయి.

(i) ఉస్మానియా విశ్వవిద్యాలయం: రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నగరంలో నైజాం నవాబు యొక్క ఫర్మాన్ ద్వారా 1918 అక్టోబరున ఉర్దూ బోధనామాధ్యం గల్గి ప్రభుత్వ అంగంగా ఏర్పడిన, రాష్ట్రములోని అతి పురాతన విశ్వవిద్యాలయం. 1948 నుండి ఇంగ్లీషు బోధనామాధ్యంగా స్వయం ప్రతిపత్తి కల్గిన సంస్థగా అభివృద్ధి చెందుచు 1978లో డైమండ్ (వజ్రోత్సవాన్ని) జుబిలీని, 1994లో ప్లాటినమ్ జుబిలీ జరుపుకొన్నది.

దీని మొదటి ఉపాధ్యక్షుడు మౌలానా హబీబుర్ రహ్మాన్ ఖాన్ షెర్వానీ. ఆ తర్వాత వచ్చిన ఉపాధ్యక్షులలో నవాబు ఆలియావర్‌జంగ్ బహద్దూర్, డా॥ సూరిభగవంతం, ఎమ్. ఎస్.దొరైస్వామి, డా॥ డి.యస్.రెడ్డి, పి.జగన్ మోహన్‌రెడ్డి, ప్రొ. జి.రామ్‌రెడ్డి మొదలగు వారు ముఖ్యులు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం కళాశాలల్లో మొదటి దగు ఆర్ట్సు కళాశాల 1919 లో 29 మంది అధ్యాపకులు, 225 మంది ఇంటర్‌మీడియట్ విద్యార్థులతో ఆరంభమై 1923 లో సైన్స్ కళాశాల, 1924 లో ఇంజనీరింగు, మెడికల్ 1928 లో ఎడ్యుకేషన్ కళాశాలలను ఏర్పరుచుకొని, 1938 లో అడిక్‌మెట్‌లోని 600 ఎకరాల విశాలమైన స్థలంలో నూతన campus ను ఏర్పరుచుకొని, క్రమంగా స్వంత భవన సముదాయమును ఏర్పరుచుకొని, క్రమంగా అభివృద్ధి చెందుతు; 1956-57 నాటికి 6 విశ్వవిద్యాలయ కళాశాలలను, 10 అంతర్భాగ కళాశాలలు, 14 అనుబంధ కళాశాలలను కలిగి ఉన్నది. 1919 లో రంగాపూర్‌లో స్థాపించబడిన అంతర్జాతీయ ప్రఖ్యాతిగాంచిన నిజామియా అబ్సర్వేటరీని, 1959 లో స్థాపించబడిన అస్ట్రానమి విభాగము అధీనములోకి తేబడి ఈనాడు అస్ట్రానమి మరియు అస్ట్రోఫిజిక్స్ యొక్క అడ్వా న్స్‌డ్ స్టడీస్ కేంద్రంగా రూపొందించబడినది. 1967-68 లో వరంగల్లులో స్థాపించబడిన పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రం 1976 లో కాకతీయ విశ్వవిద్యాలయంగా అవతరించింది. ఇప్పుడు దీని పరిధి తెలంగాణాలోని హైదాబాద్, రంగారెడ్డి, మెదక్, నల్గొండ, మహబూబ్‌నగర్, నిజామాబాద్ జిల్లాలకు వ్యాపించినది. 1976 తర్వాత ఉస్మానియా యూనివర్సిటీ ఇంజనీరింగు, లా మరియు ఎడ్యుకేషన్ తప్ప మిగిలిన అన్ని యూనివర్సిటీ కాంపస్‌లోని విభాగాలలో పి.జి. కోర్సులతో పాటు పరిశోధన ప్రధాన అధ్యయన కేంద్రాలుగా ఉన్నాయి. దాదాపు 1200 విద్యార్థులు వివిధ విభాగాలలో ఎం.ఫిల్., పిహెచ్.డి. ప్రోగ్రాములలో పని చేస్తున్నారు. పరిశోధన రంగంలో అడ్వాన్స్‌డ్ స్టడీస్ ఇన్ అస్ట్రానమి మరియు అస్ట్రోఫిజిక్స్ కేంద్రం, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ జెనిటిక్స్, నావిగేష్నల్ ఎలక్ట్రానిక్స్ కేంద్రం, ప్లాంట్ మాలిక్యులార్ బయాలజి కేంద్రం, ఆడియో విజువల్ రీసర్చ్ కేంద్రం, సెంటర్ ఫర్ ఏరియా స్టడీస్, సంస్కృత అకాడమీ, అర్బన్ అండ్ ఎన్‌విరాన్‌మెంటల్ స్టడీస్ కేంద్రం, అడ్వాన్స్‌డ్ స్టడీస్ ఇన్ లింగ్విస్టిక్స్ కేంద్రం మొదలగునవి ముఖ్యమైన కేంద్రాలుగా పేర్కొనదగినవి. 94-95 విద్యా సంవత్సరం నుండి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అప్లైడ్ సైన్స్‌ను ఏర్పాటు చేసి మైక్రోవేవ్ టెక్నాలజీ, ఎలక్ట్రానిక్స్ సిస్టమ్స్ టెక్నాలజీ ఫోటోనిక్స్ మరియు ఆప్టికల్ కంప్యూటింగ్, మైక్రోబియల్ టెక్నాలజీ, మెడికల్ టెక్నాలజీ మొదలగు ఎం.టెక్ కోర్సు లను జాతీయ పరిశోధనా కేంద్రాలైన డి.ఎల్.ఆర్.ఎల్., డి.ఇ.ఆర్.ఎల్., డి.ఎం.ఆర్.ఎల్., డి.ఆర్.డి.ఓ., ఐ.ఐ.సి.టి. మొదలగు వాటి భాగస్వామ్యంతో ప్రవేశపెట్టబడినవి. ఈ నాడు యూనివర్సిటీ కాంపస్‌లో పదిహేను హాస్టల్స్‌లో 4500 మంది విద్యార్థులకు వసతి కల్పించబడినది.

1948 వరకు ఉన్న అనుబంధ కళాశాలలు 1956 నాటికి వాటి సంఖ్య 21 కి (తెలంగాణాలో - 14) 1975-76 లో 97 కు, 1885-86 నాటికి 89 కి పెరిగినవి. 1994-95 నాటికి పి.జి. సెంటర్స్‌తో కలుపుకొని విశ్వవిద్యాలయ కళాశాలలను, 9 అంతర్భాగ కళాశాలలను, 300 లకి పైబడిన ప్రభుత్వ ప్రైవేట్ అనుబంధ కళాశాలలను కలిగి రాష్ట్రములో కెల్ల అతి పెద్ద విశ్వవిద్యాలయంగా రూపొందింది.

1976 నుండి మొత్తం 11 పి.జి. సెంటర్స్ ఏర్పాటు చేయబడి ఎం.సి.ఏ., ఎం.బి.ఏ., ఎం.ఎస్.సి. (మెడిసినల్ కెమిస్ట్రీ), బి. ఫార్మసి, బి.పి.ఎడ్. మొదలగు గల వృత్తి విద్యా కోర్సులు ప్రవేశపెట్టబడినవి.

ఈ కళాశాలలన్నింటిలో దాదాపు 1,12,137 మంది విద్యార్థులు విద్యనభ్యసించుచున్నారు. వీరిలో మూడవ వంతు మహిళలు కావటం ఒక విశేషము. ఇది కాక, 3,700 మంది డిగ్రీ స్థాయిలో, 1,000 మంది పి.జి. స్థాయిలో దూర విద్యా స్కీమ్ ద్వారా విద్య నభ్యసించుచున్నారు. ఎక్స్‌టర్నల్ పరీక్షలలో 3,000 మంది డిగ్రీ పరీక్షలకు, 15,500 మంది పి.జి. పరీక్షలకు నమోదైనారు.

(ii) ఆంధ్ర విశ్వవిద్యాలయము: ఆంధ్ర ప్రాంతము మద్రాస్ రాష్ట్రంలో ఉన్నప్పుడు అటు మద్రాస్, ఇటు ఉస్మా నియా విశ్వవిద్యాలయాలు తప్ప ఆంధ్రులకంటూ ఒక విశ్వవిద్యాలయంలేదనే భావంతో ఆనాటి పెద్దలు చేసిన కృషి ఫలితముగా 1925 లో మద్రాసు శాసన మండలిలో ఆమోదించబడిన “ఆంధ్ర విశ్వవిద్యాలయ చట్టం” ప్రకారం 1926 ఆగస్టులో బెజవాడ పరిపాలన కేంద్రంగా తొలి రెసిడెన్షియల్ విశ్వవిద్యాలయంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పడి, 1930 లో వాల్తేరు (విశాఖపట్నం)కు తరలి పోయింది. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతుండగా 1942 లో గుంటూరులో తాత్కాలికంగా తలదాచుకొని తిరిగి 1946 లో వాల్తేరుకు వెళ్ళింది. ఇది 1953 లో రజతోత్సవం 1977 లో స్వర్ణోత్సవాన్ని జరుపుకొన్నది. దీనికి తొలి వైస్‌చాన్స్‌లర్ డా॥ రామలింగారెడ్డి. ఆ తర్వాత డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్, డా॥ వాసిరెడ్డి శ్రీకృష్ణ, డా॥ ఎ.ఎల్.నారాయణ, శ్రీ రామకృష్ణారావు, ప్రొ. శ్రీనివాస అయ్యంగార్, లంకపల్లి బుల్లయ్య, ఎం.ఆర్.అప్పారావు, ఆవుల సాంబశివరావు, ప్రొ. రామకృష్ణారావు, ప్రొ. కె.వి.రమణ వంటి ప్రముఖ విద్యావేత్తలు దీనికి ఉపాధ్యక్షులుగా ఉన్నారు. డా॥ ఎం.గోపాల కృష్ణారెడ్డి 1991 నుండి ఉపాధ్యక్షులుగా ఉన్నారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం మొదట 20 పరిశోధకులు 6 గురు అధ్యాపకులతో ప్రారంభమై పోస్టు గ్రాడ్యుయేట్ విద్యా బోధనకు 1931 లో ఆర్ట్సు కళాశాలను, 1932 లో

సైన్స్ టెక్నాలజీ కళాశాలను, 1941 లో ప్రకృతి శాస్త్ర కళాశాలను, 1945 లో లా కళాశాల, 1955 లో ఇంజనీరింగ్ కళాశాలను ఏర్పాటు చేయబడినాయి. తెలుగు, చరిత్ర, ఆర్థిక శాస్త్ర బోధనా విషయాలలో, ఆనర్స్‌కోర్సులతో ఆరంభమైన ఈ విశ్వవిద్యాలయం ప్రస్తుతం వివిధ పోస్టు గ్రాడ్యుయేట్, డిప్లమా కోర్సులు నిర్వహించే బోధనా శాఖలు 61 ఉన్నాయి. దేశంలోనే తొలిసారిగా కామర్స్‌లో ఆనర్స్ కోర్సును 1934 లో ఈ విశ్వవిద్యాలయంలో ప్రారంభించబడినది. భౌతిక, ప్రకృతి శాస్త్ర పరిశోధనలకు ఆంధ్రవిశ్వవిద్యాలయం దేశ దేశాంతరాలలో ప్రఖ్యాతి గాంచింది. విశ్వవిద్యాలయ కళాశాలలతో పాటు 1967-68 లో గుంటూరులో స్థాపించబడిన పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రమే 1976 లో "నాగార్జున విశ్వవిద్యాలయంగా" రూపొందింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయానికి [విశ్వవిద్యాలయ కళాశాలలను మినహాయించి] 1926 లో 12 అనుబంధ కళాశాలలు, 1956-57 లో 22 ప్రథమశ్రేణి, 3 ద్వితీయశ్రేణి అనుబంధ కళాశాలలు, 1974-75 లో 84 అనుబంధ కళాశాలలు గలవు. 1994-95 లో 5 విశ్వవిద్యాలయ కళాశాలలు, 146 అనుబంధ కళాశాలలు గలవు. నూజివీడు, కాకినాడ, శ్రీకాకుళంలలో 3 పి.జి. కేంద్రాలతో పాటు, అనకాపల్లి, రామచంద్రాపురం, రాజమండ్రి, ఏలూరు, భీమవరం, గుడివాడ, బందరులో గల అనుబంధ కళాశాలలు కొన్ని విజ్ఞాన విషయాలలో పోస్టు గ్రాడ్యుయేట్ తరగతులు నిర్వహించుచున్నాయి. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలోని కళాశాలలన్నింటిని ఈ విశ్వవిద్యాలయ పరిధిలో చేర్చబడినవి. ఈ కళాశాలలన్నింటిలో ఒక లక్షకు మించి విద్యార్థులు నమోదై యున్నారు. వీరుకాక దూర విద్యా కార్యక్రమం ద్వారా అనేక వేలమంది డిగ్రీ మరియు పోస్టు గ్రాడ్యుయేట్ విద్యనభ్యసించుచున్నారు. విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ఆర్ట్స్, కామర్స్ కళాశాలలకు, సైన్స్ & టెక్నాలజీ, ఇంజనీరింగ్ మహిళలకు పరిశోధకులకు వేరు వేరుగా విద్యార్థి వసతి గృహాలు కలవు.

**(iii) శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం:** ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి విడివడిన ఆంధ్ర రాష్ట్రంలోని రాయలసీమ జిల్లాల ఉన్నత విద్యావసరాలు తీర్చడానికి రాష్ట్ర శాసనం ద్వారా 1954 సెప్టెంబర్‌లో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపించబడినది. "తిరుపతి" కార్యస్థానంగల ఈ విశ్వవిద్యాలయానికి మొదటి నుంచి "తిరుమల తిరుపతి" దేవస్థానం అనేక రూపాలలో సహాయం అందజేస్తోంది. మద్రాసు విశ్వవిద్యాలయంతో దీర్ఘకాల సంబంధం కలిగి, పరిపాలనా దక్షుడుగా పేరొందిన డా॥ ఎస్.గోవిందరాజులు నాయుడు దీని ప్రథమ ఉపాధ్యక్షుడు. తదుపరి ప్రముఖ విద్యావేత్త ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి, డా॥ జయరామిరెడ్డిగారు, ఉపాధ్యక్షులుగా విశ్వవిద్యాలయ అభివృద్ధికి కృషి సల్పారు.

ఈ విశ్వవిద్యాలయం 1954-55 లో బి.ఏ., బి.యస్.సి., ఆనర్స్‌లతో 6 తరగతులలో 30 మంది విద్యార్థులతో ఆరంభమైంది. తర్వాత 1959 లో విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాల ప్రారంభమైంది. క్రమాభివృద్ధి చెందుతూ ఈ విశ్వవిద్యాలయం 1974-75 నాటికి 30 బోధనా శాఖలతో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులతో కూడిన 2 విశ్వవిద్యాలయ కళాశాలలను కలిగియున్నది. 1967-68 లో ఈ విశ్వవిద్యాలయం పర్యవేక్షణలో, 8 విద్యా బోధనాశాఖలుండేవి. 1994-95 నాటికి 48 బోధనాశాఖలతో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను, యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ & సైన్స్ మరియు తిరుపతి, కావలి, కడప, నెల్లూరు, మదనపల్లి, వీరపనాయిని పల్లిలో పి.జి. సెంటర్లు మరియు అనుబంధ కళాశాలలు ఏర్పాటు చేయబడినవి. 1966 జూన్‌లో నెల్లూరు, రాయలసీమ జిల్లాలలోని 11 డిగ్రీ కళాశాలలను ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధించారు. వాటి సంఖ్య 1974-75 నాటికి 34 కు, 85-86 కు 67 కు చేరుకుంది.

**(iv) కాకతీయ విశ్వవిద్యాలయం:** ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిధిలో 1967 లో వరంగల్ పట్టణములో స్థాపించబడిన పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రమే 1976 ఆగస్టులో 44 వ రాష్ట్ర శాసనము ద్వారా "కాకతీయ విశ్వవిద్యాలయం"గా మారింది. ప్రొఫెసర్ వెంకటరామయ్యగారు దీని ప్రథమ వైస్ ఛాన్స్‌లర్‌గా నియమించబడినారు. ఆ తదుపరి ప్రొఫెసర్ జాఫర్ నిజాం, డా॥ జయశంకర్ దీనికి వైస్‌ఛాన్స్‌లర్‌గా (ఉన్నారు) పనిచేశారు. ప్రస్తుతము ప్రొ॥ వైకుంఠంగారు వైస్‌ఛాన్స్‌లర్‌గా కొనసాగుతున్నారు. 1985-86 సంవత్సరం వరకు దీని పరిధిలో 9 కళాశాలలు మాత్రమే యుండేవి. 1988 లో ఉత్తర తెలంగాణా జిల్లాలగు అదిలాబాద్, కరీంనగర్, ఖమ్మం మరియు వరంగల్‌కు దీని పరిధిని విస్తరించుట వలన ప్రభుత్వ ప్రైవేట్ కళాశాలలన్నింటిని కలిపి 54 కు 1992-93 లో వీటి సంఖ్య 76 కు పెరిగింది. ఖమ్మం మరియు నిర్మల్‌లలో ప్రభుత్వంచే స్థాపించబడిన రెండు పోస్టుగ్రాడ్యుయేట్ కళాశాలలను 1991లో దీని అధీనములోకి తేబడినవి. కొత్తగూడెం నందలి మైనింగ్ కళాశాలను ఉస్మానియా పరిధి నుండి దీని పరిధిలోకి మార్చుటకు ప్రభుత్వంచే ఉత్తర్వులు జారీ అయినవి. డిగ్రీ, పోస్టు గ్రాడ్యుయేట్, డిప్లమా కోర్సులలో దాదాపు 32 బోధనాశాలలలో 40,000 మంది విద్యార్థులు అధ్యయనము చేస్తున్నారు. ఈ విశ్వవిద్యాలయం మెటీరియల్ సైన్స్, బయోటెక్నాలజీ, సైటోజెనిటిక్స్, మాలిక్యులార్ బయోలజీ హెచ్.ఆర్.డి., మార్కెటింగ్, రూరల్ & ట్రైబల్

డెవలప్‌మెంట్ మొదలగు అంశాలతో శ్రేష్ఠతా కేంద్రాలుగా రూపొందుటకు కృషి జరుగుచున్నది.

రెగ్యులర్ కోర్సులు కాకుండ ఎక్స్‌టర్నల్ ఎగ్జామినేషన్స్‌తో పాటు కరస్పాండెన్స్–కమ్–కాంటాక్ట్ కోర్సులను స్కూల్ ఆఫ్ డిస్టెన్స్ లెర్నింగ్ ద్వారా సర్టిఫికెట్, డిప్లమా, డిగ్రీ, పి.జి. మరియు ఎం.ఫిల్. నందు 25,000 లకు పై బడిన విద్యార్థులు అధ్యయన సౌకర్యాలను పొందుచున్నారు. 1992–93 సంవత్సరం నుండి నూతనంగా స్థాపించబడుతున్న కళాశాలలలో కంప్యూటర్ అప్లికేషన్స్, మేనేజ్‌మెంట్ సైన్స్, మైనింగ్, ఎలక్ట్రానిక్స్, బయో కెమిస్ట్రీ, మైక్రోబయాలజీ, లైబ్రరీ సైన్స్ మొదలుగాగల స్కిల్డ్ – ఓరియంటెడ్ మరియు రీస్ట్రక్చర్డ్ కోర్సులు ప్రారంభించబడినవి.

**(v) నాగార్జున విశ్వవిద్యాలయం:** ఆంధ్ర విశ్వవిద్యాలయం 1967–68 లో గుంటూరులో స్థాపించిన పోస్టు గ్రాడ్యుయేట్ కేంద్రమే 1976 సెప్టెంబర్‌లో రాష్ట్ర శాసనం ద్వారా 10 బోధనా శాఖలతో "నాగార్జున విశ్వవిద్యాలయం"గా గుంటూరు విజయవాడ మధ్యలో నంబూరు వద్ద కార్యస్థానంగా అవతరించి బోధన పరిపాలన కార్యకలాపాలకు కావలసిన భవన సముదాయాన్ని ఏర్పరచుకొన్నది. ప్రొఫెసర్ వి.బాలయ్యగారు దీని ప్రథమ ఉపాధ్యక్షుడుగా నియమించబడినారు.

మొదట గుంటూరు, విజయవాడ చుట్టు 20 కిలోమీటర్ల పరిధిలోని కళాశాలలను దీనికి అనుబంధించారు. 1984 లో గుంటూరు, కృష్ణా, ప్రకాశం జిల్లాలలోని 24 కళాశాలలను దీని పరిధిలోకి తెచ్చారు. 1991–92 నాటికి ఈ విశ్వవిద్యాలయ పరిధిలో 108 అనుబంధ కళాశాలలు, 18 వృత్తిపరమైన కళాశాలలు ఏర్పడినాయి.

ఈనాడు విశ్వవిద్యాలయంలో శాస్త్రీయ సోషలిజం, మహిళా అధ్యయనం (ఉమెన్ స్టడీస్), వ్యవసాయ, పరిశోధన మరియు అధ్యయనం, మహాయాన బుద్ధిజం, డిసాస్టర్ మిటిగేషన్ (Disaster Mitigation) అంశాలకు చెందిన అయిదు అధ్యయన కేంద్రాలు స్థాపించబడినవి. విశ్వవిద్యాలయ కళాశాల, నూజివీడు మరియు ఒంగోలులోని పి.జి. కేంద్రాలతో పాటు 17 అనుబంధ కళాశాలలలో 31 బోధనా విభాగాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులను అందిస్తున్నారు. ఈ విశ్వవిద్యాలయ పరిధిలో దాదాపు 75,000 కు పైబడి విద్యార్థులు విద్యనభ్యసిస్తున్నారు. ఈ విశ్వవిద్యాలయంలో కరెస్పాండెన్స్ కోర్సులలో ఎక్స్టర్నల్ పరీక్షలను వ్రాయడానికి సౌకర్యం కూడా కలిగించబడినది.

**(vi) శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం:** 1968 వరకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం క్రింద పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్‌గా ఉన్న అనంతపురం కళాశాల 1981 రాష్ట్ర శాసనం ద్వారా బోధనా విశ్వవిద్యాలయంగా అవతరించింది. తదుపరి అనంతపురం కేంద్రంగా 30 కి.మీ. వరకు దీని పరిధి విస్తరించింది. డాక్టర్ ఎమ్. ఎబెల్ దీనికి ప్రథమ ఉపాధ్యక్షులుగా ఉన్నారు.

ఈ విశ్వవిద్యాలయం నందు 25 విభాగాలలో దాదాపు 1,200 పైబడి విద్యార్థులు పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులతో పాటు, ఎం.ఫిల్ మరియు పిహెచ్.డి. కై విద్యాభ్యాసం చేయుచున్నారు. సెరికల్చర్ లేబర్‌లాస్, టాక్సేషన్, డి.పి.ఎ. మెడికల్ టెక్నాలజి, జర్నలిజం, మొదలగు వృత్తి విద్యా డిప్లమా కోర్సులు కూడా కలవు. దాదాపు 50,000 మంది విద్యార్థులు విశ్వవిద్యాలయ మరియు అనుబంధ కళాశాలలలో విద్యనభ్యసించుచున్నారు. విశ్వవిద్యాలయ ప్రాంగణములో పురుషులకై నాలుగు, స్త్రీలకై రెండు హాస్టల్స్ గలవు.

**(vi) పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం:** మహిళల సంపూర్ణ అభివృద్ధి, వికాసానికై, ఉన్నత విద్యా సౌకర్యాలు అధికంగా కలిగించుటకు 1983 లో రాష్ట్ర శాసనం ద్వారా తిరుపతి కార్యస్థానంగా తిరుమల, తిరుపతి వెంకటేశ్వర స్వామి వారి అర్ధాంగి, పద్మావతిదేవి పేరుతో పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం స్థాపించబడినది. ఇందులో ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రాంతాలలోని మహిళలకు 42 : 36 : 22 నిష్పత్తిలో ప్రవేశము కల్పించబడినది. డిగ్రీ కోర్సుల బోధన భాష తెలుగు. డిప్లమా మరియు పి.జి. కోర్సులను ఇంగ్లీషులో బోధిస్తున్నారు. విశ్వవిద్యాలయ కళాశాల టి.టి.డి. డైరీ ఫార్మ్ ప్రక్కన 138 ఎకరాలలో 8–8–83 నాడు స్థాపించబడినది. దీనియందు డిగ్రీ స్థాయిలో ఫిజికల్ ఎడ్యుకేషన్, ఆరోగ్యం మరియు స్పోర్ట్స్, బి.ఇడి., చెవిటి వారి శిక్షణకై బి.ఇడి స్పెషల్, పి.జి. స్థాయిలో మైక్రో బయాలజీ, సెరికల్చర్, కంప్యూటర్ సైన్స్, హోం సైన్స్, జర్నలిజం, మహిళాభ్యున్నతి అధ్యయనము మొదలుగాగల 20 కి పైబడిన బోధనా అంశాలలో దాదాపు 500 విద్యార్థినులకు అవకాశము కలదు.

**(viii) డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ సార్వత్రిక యూనివర్సిటీ:**

సాంప్రదాయ కళాశాలల మరియు విశ్వవిద్యాలయాల క్యాంపస్‌లలో గల విద్యావకాశాలను పొందలేని వారికి ఉన్నత విద్యావకాశాలు కల్పించుటకై రాష్ట్ర శాసనం ద్వారా 1982 ఆగస్టులో భారతదేశంలోనే మొట్టమొదటైన ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపించబడినది. తదుపరి 1991 లో దీని పేరు డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయంగా మార్చబడినది. దీని వ్యవస్థాపక కులపతి ప్రొఫెసర్ రాంరెడ్డి గారు. వృత్తి, నివాసము, పూర్వ విద్యార్హత, లింగ భేదము యొక్క ప్రమేయం లేకుండా 18 ఏళ్ళ యువతీ

యువకులనుండి 70 ఏళ్ళ వృద్ధుల వరకు అందరికి ఉన్నత విద్యావకాశము కల్గించుటయే ఈ విశ్వవిద్యాలయము యొక్క ఆశయము. ప్రవేశము కొరకై వయో పరిమితి, కోర్సుల యొక్క ఎంపిక, అధ్యయన పద్ధతులు, పరీక్షా విధానము, విద్యా కార్యక్రమాల అమలు చేయు విధానము మొదలగు అంశములలో (Flexibility) అనుసరించబడినది. వివిధ కోర్సుల అధ్యయనము కొరకై కౌన్సిలింగ్ తరగతులు, ప్రాక్టికల్స్‌తోపాటు, ప్రింటెడ్ మెటీరియల్, ఆడియో కాసెట్స్, ఫిల్మ్‌లు, రేడియో మరియు టి.వి. ప్రోగ్రాములు మొదలుగాగల విభిన్న పద్ధతుల ద్వారా విద్యాభ్యాసము చేయుటకు అవకాశాలు కల్పించబడినవి. విద్యా కార్యక్రమాల అమలుకై హైదరాబాద్ పట్టణముతో పాటు అన్ని జిల్లా కేంద్రాలలో మరియు ముఖ్యమైన పట్టణాలలో దాదాపు 107 అధ్యయన కేంద్రాలు (స్టడీ సెంటర్స్) ఏర్పాటు చేయబడినవి. జైళ్ళలో శిక్ష అనుభవిస్తున్న ఖైదీల కొరకై హైదరాబాద్, వరంగల్ రాజమండ్రి జైళ్ళలో మూడు అధ్యయన కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. బోధనకై రెగ్యులర్ కాలేజీల నుండి కౌన్సిలర్స్ ఎంపిక చేయబడతారు. ఈ కేంద్రాలలో విద్యార్థులకొరకై గ్రంథాలయాలు, ప్రయోగశాలలు, ఎ.వి. పరికరాలు ఏర్పాటు చేయబడినవి. విశ్వవిద్యాలయం ప్రారంభించిన మొదటి సంవత్సరంలో విద్యార్థుల సంఖ్య 6,500 వుండగా ప్రస్తుత విద్యా సంవత్సరములో 80 వేల మందికి పైగా ఉన్నారు. ఇంతవరకు 20 వేల మందికి పైగా పట్టాలు పొందారు. ఈ విశ్వవిద్యాలయములో సాధారణ బి.ఏ., బి.కాం., బి.ఎస్.సి. మూడు సంవత్సరాల డిగ్రీతోపాటు, ఎం.ఏ., ఎం.ఎస్.సి., ఎం.కాం., ఎం.బి.ఏ., ఎం.బి.ఎఫ్. మొదలగు రెండు సంవత్సరాల పి.జి. కోర్సులేకాక బి.ఎల్.ఐ.ఎస్.సి., మార్కెటింగ్, ట్రాన్స్‌లేషన్, సేల్స్‌మేనేజ్‌మెంట్, ఫుడ్ & న్యూట్రీషన్, రైటింగ్ ఫర్ మాస్ మరియు బిజినెస్ ఫైనాన్స్, పర్యావరణ అధ్యయనము, పుట్ట గొడుగుల పెంపకము, కంప్యూటర్ సైన్స్ మొదలగు వాటిలో డిప్లమా కోర్సులు కూడా కలవు. కొన్ని ఆర్ట్స్ సోషల్ శాస్త్రాలలో మరియు పరిశోధన అవకాశాలు కూడ కల్పించబడినవి. తెలుగు మరియు ఇంగ్లీషులో అధ్యయనానికి అవకాశము గలదు.

### (ix) పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం:

తెలుగు భాషా, సాహిత్య, సంస్కృతి, చరిత్ర రంగాల అధ్యయనం, బోధన, పరిశోధనలలో సమగ్రాభివృద్ధి సాధించుటకై 25 శాఖలతో కూడిన అయిదు విద్యాపీఠాలను స్థాపించుటకై ఆస్కారం కలిగిస్తూ ఆంధ్రప్రదేశ్ శాసనం 27 నెం. 11 చట్టం ద్వారా 1985 డిసెంబర్ 2వ తేదీన తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది. రాష్ట్ర రాజధాని నగరమైన హైదరాబాదులో పబ్లిక్‌గార్డెన్స్‌లో "లలిత కళాక్షేత్రం" భవనంలో ప్రధాన పరిపాలనా కార్యాలయం గలదు. ఆచార్య తూమాటి దోణప్పగారు దీని మొట్టమొదటి కులపతిగా నియమించబడినారు. ఆ తర్వాత డా॥ సి.నారాయణరెడ్డిగారు పనిచేశారు. ప్రస్తుతం నాయని కృష్ణకుమారి గారు వైస్‌ఛాన్స్‌లర్‌గా ఉన్నారు.

మొదటి మూడు సంవత్సరాల కాలములో పదకొండు శాఖలను, రెండు పీఠాల (కేంద్రాలు)ను స్థాపించింది. అంతకు పూర్వంగల వివిధ అకాడమీలు, అంతర్జాతీయ తెలుగు సంస్థ ఈ విశ్వవిద్యాలయానికి బదిలీచేయబడిన కారణంగా ప్రచార కార్యక్రమాలకై విస్తృత సేవాకార్యక్రమాలు అందించుటకై రెండు విభాగాలు కూడా స్థాపించబడినవి. 1995 నాటికి వివిధ కార్యస్థానాలలో 5 పీఠాలను స్థాపించి 25 అధ్యయనాంశాలలో బోధన జరుపుచున్నది. హైదరాబాద్‌లోని లలిత కళాక్షేత్రంలోని లలిత కళాపీఠంలో కర్ణాటక సంగీతం, జానపద కళలు, శిల్పం, చిత్రలేఖనం, నాటక కళాకోర్సులను నిర్వహిస్తున్నారు. ఈ భవనంలోనే తులనాత్మక సాహిత్య అధ్యయనం విజ్ఞాన సర్వస్వం, అంతర్జాతీయ తెలుగు అధ్యయనం, జ్యోతిష శాస్త్రం యొక్క శాఖలు నిర్వహిస్తున్న విజ్ఞాన వికాస పీఠం కలదు. హైదరాబాద్‌లో విద్యానగర్‌లో గల తెలుగు భవన సముదాయంలో ప్రణాళిక నవీకరణ శాఖ, నిఘంటు నిర్మాణ శాఖ భాషాశాస్త్ర శాఖ మరియు జర్నలిజం శాఖలను కల్గిన భాషాభివృద్ధి పీఠం కూడా కలదు. గోదావరి తీరానగల రాజమండ్రి దగ్గర బొమ్మూరులో సాంప్రదాయ సాహిత్య శాఖ, దేశీయ సాహిత్యం శాఖ, ఆధునిక సాహిత్య శాఖతో కూడిన సాహిత్య పీఠం కలదు. ఇందులోనే అన్నమాచార్య అధ్యయన సంస్థ కూడా గలదు. దక్షిణ కాశీగా పేరొందిన శ్రీశైల క్షేత్రంలో చరిత్ర, సంస్కృతి శాఖ, పురావస్తు శాఖ మరియు శాసనలేఖన శాఖ ఉన్నాయి. 1995 జూన్ మాసంలో దక్షిణాత్య సంగీత కళాశాలలో, వాగ్గేయకారుడు మంగళంపల్లి బాలమురళీకృష్ణ పేరట సంగీత కళాపీఠాన్ని స్థాపించబడుచున్నట్లు ముఖ్యమంత్రిచే ప్రకటించబడినది. వివిధ శాఖలలో బి.ఏ.; ఎం.ఏ., ఎంఫిల్., పిహెచ్.డి. కోర్సులను నిర్వహిస్తున్నారు. వీటిలో కొన్ని పూర్తి కాలిక కోర్సులుగాను, కొన్నింటిని అంశకాలిక (Part time) కోర్సులుగా నడుపుచున్నారు. అన్ని కోర్సులు కలిపి 430 సీట్లు మాత్రమే గలవు. వీటిలో ప్రవేశ పరీక్ష ద్వారా ప్రవేశం లభిస్తుంది.

ఈ విశ్వవిద్యాలయం అధ్యయనం, పరిశోధన కార్యక్రమాలతో పాటు, సాహిత్య, నృత్య, శిల్ప కళలు మొదలగు రంగాలలో అనేక కార్యక్రమాలను నిర్వహించుచున్నది. తెలుగు అధ్యయన శాఖ వివిధ రాష్ట్రాలు, దేశాలలోని తెలుగు వాళ్ళకి విద్యా సాంస్కృతిక రంగాల్లో అవసరమైన సహకారాన్ని

అందిస్తున్నది. ప్రవాసాంధ్ర సంఘాల పాఠశాల భవనాలకు, గ్రంథాలయాలకు ఆర్థిక సహాయం అందిస్తున్నది. సాంస్కృతిక బృందాలను వివిధ ప్రాంతాలకు పంపి తెలుగు సంస్కృతీ వైభవాన్ని చాటుచున్నది. విజ్ఞాన సర్వస్వం శాఖ ద్వారా వివిధ అంశాలలో 35 సంపుటాలుగా విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించుటకు నిర్ణయించి ఇంతవరకు నాల్గింటిని పూర్తి చేసినారు. నాలుగు సంపుటాలు, సంకలన దశలో ఉన్నాయి.

## శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్:

ఈ విద్యా సంస్థను పుట్టపర్తి శ్రీసత్యసాయి బాబా 1981 నవంబర్ 22న స్థాపించారు. ఇది భారత ప్రభుత్వం మరియు యు.జి.సి.చే గుర్తించబడిన స్వయం ప్రతిపత్తిగల (Deemed) విశ్వవిద్యాలయం. అనంతపురంలోని ప్రశాంతి నిలయంలో, బెంగుళూరు నందుగల వైట్‌ఫీల్డ్‌లో పురుషుల కొరకు మరియు అనంతపురంనందు స్త్రీల కొరకు మొత్తం మూడు రెసిడెన్షియల్ క్యాంపస్‌లు గలవు. ప్రొఫెసర్ సంపత్‌గారు వైస్–ఛాన్స్‌లర్‌గా ఉన్నారు. ఈ విశ్వవిద్యాలయం నందు డిగ్రీ, పి.జి. మరియు పరిశోధనకై 21 బోధనాంశాలలో 259 మంది విద్యార్థులకు మాత్రమే ప్రవేశ పరీక్ష ద్వారా అవకాశం కల్పించబడును. వీరినుండి ఎలాంటి ఫీజు తీసుకోబడదు. కాని విద్యార్థులందరికీ హాస్టల్‌లో తప్పని సరిగా ఉండాలి. దాని నిమిత్తం లాడ్జింగ్, బోర్డింగ్ ఛార్జీలు సంవత్సరానికి రూ.4,500/– చెల్లించాలి. బోధనాంశాలతోపాటు యోగా సన, ఆటలు, శీలం, సామాజిక సేవ, హాజరీ అంశాలలో గ్రేడ్స్ ఇవ్వబడును. తద్వారా విద్యార్థులను విజ్ఞాన తృష్ణతో బాటు సమాజంపట్ల కర్తవ్య నిర్వహణను, వివిధ రంగాలలో నాయకత్వం వహించే విధంగానూ తీర్చిదిద్దుతారు.

ఇచ్చట కంప్యూటర్ కంట్రోల్‌తో పనిచేయునట్టి ఒక ప్లానిటోరియంను ఏర్పాటు చేశారు. ఇది అస్ట్రానమి, మాథ మాటిక్స్, సైన్స్ మరియు ఇతర బోధనాంశాలలో మంచి అవగాహన ఏర్పడుటకు ఎంతగానో ఉపయోగపడుచున్నది.

## సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ అండ్ ఫారిన్ లాంగ్వేజెస్:

హైదరాబాద్ కార్యస్థానంగా దేశంలో ఇంగ్లీషు బోధనా స్థాయిని అభివృద్ధి పరచుటకై భారత ప్రభుత్వం 1958లో హైదరాబాద్ కార్యస్థానంగా సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్‌ను అటానమస్ విద్యా సంస్థగా ఏర్పాటు చేయబడి, 1972లో ముఖ్యమైన అంతర్జాతీయ భాషల అధ్యయనాన్ని కూడా దీని పరిధిలోకి తేబడి, 1973లో డీమ్డ్ యూనివర్సిటీగా పరిగణించబడినది. షిల్లాంగ్ మరియు లక్నోలలో రెండు ప్రాంతీయ కేంద్రాలు దీని ఆధ్వర్యంలో పని చేయుచున్నవి.

ఈ కేంద్రమునందు ఇంగ్లీషు బోధనలో ఒక సంవత్సర సర్టిఫికేట్ మరియు పి.జి. డిప్లమా కోర్సులతో పాటు, అరబిక్, ఫ్రెంచ్, జర్మన్ మరియు రష్యన్ భాషలలో పి.జి., ఎం.ఫిల్., మరియు పిహెచ్.డి. కోర్సులతో దాదాపు 2000 మంది విద్యార్థులకు అధ్యయన అవకాశాలు గలవు.

ఈ విద్యాకేంద్రమునందు పాఠశాల మరియు విశ్వవిద్యా లయ విద్యార్థుల కొరకై ఇంగ్లీషు పాఠ్యాంశాలలో రేడియో పాఠాలు తయారు చేయబడును. యు.జి.సి. సహకారముతో విద్యా విషయాలకు సంబంధించిన వీడియో, ఆడియో కార్యక్రమాలు తయారుచేయుటకై ఎడ్యుకేషనల్ మీడియా రీసర్చ్ సెంటర్ ఏర్పాటు చేయబడినది. అరబిక్, ఫ్రెంచ్, జర్మన్, రష్యన్ మరియు స్పానిష్ భాషలలో ఈ కేంద్రాన్ని నోడల్ ఏజెన్సీగా యు.జి.సి. పరిగణించి బహుభాషా నిఘం టువులను (డికనరీలు), తర్జుమా, దూరవిద్య, అవసరమైన కోర్సుల తయారి మొదలగు ప్రాజెక్టులను చేపట్టింది.

కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహకారముతో ఇంగ్లీషు భాషోపాధ్యా యులకు షార్ట్ టర్మ్ మరియు లాంగ్ టర్మ్ కరస్పాండెన్స్ కోర్సుల ద్వారా బోధనా శిక్షణను అందించుచున్నది.

## డిగ్రీ కళాశాలలు:

రాష్ట్రంలో మొదటి డిగ్రీస్థాయి ఉన్నత విద్యావసరాలు తీర్చడానికి రాష్ట్ర ప్రభుత్వం, వైయక్తిక యాజమాన్యాలు, విశ్వ విద్యాలయాలు నిర్వహించే డిగ్రీకళాశాలల సంఖ్య 1956–57 నుండి క్రమేపీ పెరుగుతున్నది.

| సం॥ | డిగ్రీ కళాశాలలు | | | విద్యార్థులు | అధ్యాపకులు |
|---|---|---|---|---|---|
| | పు | స్త్రీ | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1956–57 | 50 | 5 | 55 | 46,202 | 2,797 |
| 1960–61 | 56 | 9 | 65 | 45,866 | 3,404 |
| 1965–66 | 85 | 18 | 103 | 64,357 | 4,921 |
| 1969–70 | 137 | 25 | 162 | 1,53,122 | 7,093 |
| 1974–75 | 181 | 32 | 213 | 1,91,937 | 9,545 |
| 1985–86 | 267 | 46 | 313 | 2,88,699 | 12,886 |
| 1992–93 | – | – | 512 | 3,71,331 | 14,086 |
| 1995–96 | 627 | 141 | 768 | 3,83,226 | 15,535 |

రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ఏర్పడిననాడు 7 డిగ్రీ కళాశాలలను మాత్రమే నిర్వహిస్తూ వుండగా, నేడు వాటి సంఖ్య 167 వరకు పెరిగింది. వాటిలో ఆర్థికంగా వెనుకబడిన గిరిజన ప్రాంతాల్లో ప్రభుత్వము పూనుకొని, ఏర్పాటు చేసిన వాటి సంఖ్య హెచ్చు. ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో దేశ

స్వాతంత్ర్యం వచ్చిన 25 ఏండ్లు పూర్తయిన సందర్భం (1972-73)గా ప్రతిభగల విద్యార్థుల శిక్షణ కోసం కర్నూలులో ఏర్పాటు చేసిన 'రజతోత్సవ కళాశాల' విశిష్టమైనది. 1995లో దీనిని Model college and resource Centre for Collegiate గా నామకరణము చేశారు. 1996-97 ఈ కళాశాల రజతోత్సవాన్ని జరుపుకొనుచున్నది.

వైయక్తిక యాజమాన్యాలు 1955-56 లో 37 డిగ్రీ కళాశాలలను నిర్వహిస్తుండేవి. వాటి సంఖ్య 1975-76 లో 154 వరకు పెరిగింది. 1985-86 లో 180 వరకు పెరిగాయి. 1995-96 లో 583 వరకు చేరింది. ఈ కళాశాలలలో చాలా భాగం కుల మత వర్గ ప్రాతిపదికలపై ఏర్పాటు చేసినవే. వ్యక్తిగత లేక ముఠా రాజకీయ ప్రయోజనాలు వాటి నిర్వహణను ప్రభావితం చేస్తాయి. వీటిని ప్రారంభించడానికి ప్రజలు విరివిగా విరాళాలు, అభివృద్ధి చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం, విశ్వ విద్యాలయ గ్రాంట్ల కమీషన్ ధన సహాయం ఇవ్వడం గమనార్హం. వైయక్తిక కళాశాలల్లో విద్యార్థుల నుంచి వసూలు చేసే రుసుములు, సామాన్యముగా బోధన ప్రమాణాలు హెచ్చుగా ఉంటాయి.

### జూనియర్ కళాశాలలు:

ఇంటర్మీడియట్ విద్యా బోధనకు ప్రభుత్వం వైయక్తిక యాజమాన్యాలు ప్రత్యేకంగా జూనియర్ కళాశాలలను స్థాపించడం 1969-70లో ఆరంభమై క్రమంగా వాటి సంఖ్య పెరిగింది.

| సం॥ | జూనియర్ కళాశాలలు | | | విద్యార్థులు | అధ్యాపకులు |
|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | మొత్తం | | |
| 1 | 2 | 3 | 4 | [illegible] | 6 |
| 1969-70 | 155 | 15 | 170 | 15,505 | 1,154 |
| 1974-75 | 236 | 22 | 258 | 90,406 | 3,195 |
| 1985-86 | 415 | 50 | 465 | 1,68,306 | 6,872 |
| 1995-96 | 1,456 | 299 | 1,755 | 6,76,455 | |

రాష్ట్రంలోని జూనియర్ కళాశాలల్లో 1969-70 లో 116 ప్రభుత్వం యాజమాన్యం క్రింద, 28 వైయక్తిక యాజమాన్యాల క్రింద ఉంటే, 1985-86 లో 285 ప్రభుత్వ యాజమాన్యం క్రింద, 180 వైయక్తిక యాజమాన్యాల క్రింద ఉన్నాయి. నాగార్జున సాగర్ వద్దగల నైవాసిక జూనియర్ కళాశాల ప్రతిభావంతులయిన విద్యార్థులకు ఉద్దేశించింది.

జూనియర్ కళాశాలలను 1969-70 లో రాష్ట్రంలోని సాధారణ విశ్వవిద్యాలయాలకు అనుబంధించి, 1971 లో ఇంటర్మీడియట్ బోర్డు ఆధ్వర్యం క్రింద ఉంచారు. ఆదిలో తలపెట్టినట్లు జూనియర్ కళాశాలల్లో "వ్యాపార విద్య" "ఉపాధ్యాయ శిక్షణ" వంటి వృత్తి అభిముఖ కోర్సులను ప్రవేశపెట్టి, డిగ్రీ కళాశాలల్లో రద్దీని తగ్గించే కార్యక్రమం కొన్ని జూనియర్ కళాశాలల్లో 1975-76 లో మొదలైంది.

### ప్రాచ్య విద్యా కళాశాలలు:

"విద్యా ప్రవీణ," "భాషా ప్రవీణ" వంటి ప్రాచ్య విద్యా కోర్సులను బోధించే కళాశాలలను ఆంధ్రప్రాంతంలో విజయనగరంలోని మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాల (1860), తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య కళాశాల (1920), తెలంగాణా ప్రాంతం (హైద్రాబాద్ జిల్లా)లోని ఆల్వాల్ లో గల వేదాంత వర్ధనీ మహా విద్యాలయం (1929)ల స్థాపనతో ఆరంభ మయ్యాయి. వాటి అభివృద్ధి 1956-57 నుంచి ఈ క్రింది విధంగా ఉంది:

| సం॥ | కళాశాలలు | విద్యార్థులు | అధ్యాపకులు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 1956-57 | 14 | 448 | - |
| 1965-66 | 27 | 1,973 | 201 |
| 1974-75 | 53 | 5,370 | 447 |
| 1984-85 | 52 | 6,091 | 474 |
| 1993-94 | 51 | 4,440 | 407 |

రాష్ట్రంలోని ఆయా ప్రాంతాలలో గల ప్రాచ్యవిద్యా కళాశాలలను సాధారణ విశ్వవిద్యాలయాలకు అనుబంధిస్తారు.

విద్యా వ్యవస్థ మొత్తం కమీషనరేట్ ఏర్పాటు వల్ల కేంద్రీకృతమై పోతున్నది. అధికార మంతా ఒకే చోట కేంద్రీకరించబడటం వల్ల లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం లాంటి పెడ ధోరణులు పెరుగుతాయి. విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తిని ఈ కమీషనరేట్ దెబ్బతీస్తుందనే అభిప్రాయం ఉంది. ఈ కమీషనరేట్‌ను ప్రజాస్వామ్య బద్ధంగా నిర్వహించేందుకు వీలైన మార్పులు తేవాలని ఆయా సంఘాలు, పార్టీలు కోరుతున్నాయి.

### కాలేజీ సర్వీస్ కమీషన్:

ప్రైవేటు కళాశాలల్లోని అధ్యాపకుల పోస్టుల ఖాళీలను భర్తీ చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం 1985 సెప్టెంబర్ 6న కాలేజీ సర్వీస్ కమీషన్‌ను ఏర్పాటు చేసింది. మైనారిటీలకు సంబంధించిన విద్యా సంస్థలు, మత పరంగా ఏర్పాటైన విద్యా సంస్థలకు ఈ చట్టం నుంచి మినహాయింపు ఉంది. అధ్యాపకుల నియమాకాలకు సంబంధించి ప్రభుత్వం రూపొందించిన నియమ నిబంధనలకు లోబడి ఈ కమీషన్ అధ్యాపకుల్ని నియమిస్తుంది. ఈ కమీషన్ సూచనల మేరకే ప్రైవేటు విద్యా సంస్థలన్నీ అధ్యాపకుల్ని నియమించాల్సి ఉంటుంది. ఈ కమీషన్ చైర్మన్‌ను ప్రభుత్వం నియమిస్తుంది. ఆయన

పదవీకాలం మూడు సంవత్సరాలు, కళాశాలల్లోని అధ్యాపకుల నియామకాలకు సంబంధించి ఏవైనా లోటుపాట్లు ఉన్నవని కమీషన్ భావించినట్లయితే ఆ కళాశాల రికార్డులను తనిఖీ చేసే అధికారం కమీషన్‌కు ఉంది. 62 సంవత్సరాల లోపు వయసు గల వ్యక్తిని చైర్మన్‌గా నియమించవచ్చు. ఈయనపై ఏవైనా అవినీతి ఆరోపణలు, విధి నిర్వహణలో లోపాలు ఉన్నాయని భావిస్తే తొలగించే అధికారం ప్రభుత్వానికి ఉంది. డిప్యూటీ సెక్రటరీ స్థాయి గలవారిని ఈ కమీషన్‌కు కార్యదర్శిగా నియమిస్తారు. వైస్‌ఛైర్మన్, మిగిలిన సభ్యులను ప్రభుత్వం నియమిస్తుంది.

ఈ కమీషన్ ఏర్పాటును వ్యతిరేకిస్తూ కొందరు వ్యక్తులు కోర్టులో రిట్ వేయటం జరిగింది.

## సమస్యలు:

రాష్ట్రంలోని ఉన్నత విద్యారంగం సమాజ జీవితంలోని అవకతవకలకు ప్రతి బింబంగా ఉంది. శాస్త్రీయ, ప్రగతిశీల పరిష్కారాలకు ఇంతవరకు నోచుకోక, సమస్య లెన్నింటినో అది ఎదుర్కొంటున్నది.

1. అంకెల్లో చెప్పాలంటే, భారతదేశంలో 1000 మందికి 6 గురు ఉన్నత విద్యాభ్యాసం చేస్తుంటే, ఆంధ్రప్రదేశ్‌లో 1000 మందికి 4 గురు మాత్రమే విద్యనార్జిస్తున్నారు. పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు చదివేవారు భారతదేశంలో 10 లక్షలకు 250 మంది ఉంటే, ఆంధ్రప్రదేశ్‌లో ఈ సంఖ్య పది లక్షలకు 110 మాత్రమే. పరిశోధనా వ్యాసంగంలో భారతదేశం మొత్తంమీద 10 లక్షలకు 22 మంది ఉంటే ఆంధ్రప్రదేశ్‌లో 13 మంది మాత్రమే వున్నారు.
2. ఉన్నత విద్య ఈ నాటికీ దాదాపు కలవారి పిల్లల గుత్త హక్కుగా ఉంది. సామాన్య కుటుంబాలకు చెందిన పిల్లలకు అది అరుదుగా లభ్యమయ్యే పండులాంటిది.
3. మన ఉన్నత విద్యలో "రాశి" పెరిగినంతగా "వాసి" పెరగలేదు. ఇటు లోతైన విజ్ఞాన సముపార్జనకు, అటు వైయక్తిక సాంఘిక జీవిత సమస్యల పరిష్కారానికి అది కొరగానిది.
4. మన ఉన్నత విద్యా విధానాలకు వాటి ఆచరణకు మధ్య అన్ని స్థాయిలలోను గల అఖాతం బోలెడు.
5. కుల, మత, వర్గ ప్రాతిపదికలపై కళాశాలలు ఏర్పాటు కావడం, వాటిలో నియామకాలు మొదలైనవి అవే ప్రాతిపదికలపై జరగడం, ఉన్నత విద్యా ప్రమాణాలు అందుకోలేక పోవడానికి ముఖ్యకారణాలు.
6. ఉన్నత విద్యాసంస్థల నిర్వహణలో "ప్రజాస్వామ్యం" లోపించింది. వాటిలోని అధ్యాపకులను, విద్యార్థులను, ముఖ్యమైన సమస్యల విషయంలో సంప్రదించరు.
7. ఉన్నత విద్యాబోధన, పరీక్షా పద్ధతులలో, పాఠ్యప్రణాళి కల్లో, పాఠ్యగ్రంథాల్లో తగిన మార్పులు ఇంతవరకు రాలేదు. మానసికశ్రమ, ధనవ్యయం తక్కువ అవసర మయ్యే పాతకాలపు పద్ధతులే ఇప్పటికి అనుసరిస్తున్నారు. ముఖ్యంగా విద్యార్థుల్లో స్వయం కృషిపట్ల ఆసక్తిని – అమలులో ఉన్న పద్ధతులు – పెంపొందించడం లేదు.
8. విద్యార్థులలో చాలా మంది కేవలం పరీక్షార్థులుగా, అధ్యాపకులలో చాలామంది వృత్తి ప్రమాణాలు, విలువలు పాటించని వారుగా ఉండడం ఈ రంగం దుస్థితికి ఒక ముఖ్య కారణం.
9. దేశంలోని ఇతర రాష్ట్రాలలో వలెనే మన రాష్ట్రంలో కూడా, అనేక రాజకీయ, సాంఘిక ఒత్తిడులకు లోనై విచక్షణా రహితంగా ఉన్నత విద్యాసంస్థల స్థాపనను అనుమతించడం కూడా మన ఉన్నత విద్యలో నాణ్యత లోపించడానికి దోహదం చేస్తోంది. తగిన భౌతిక సాధ నాలు, సిబ్బంది, చివరకు తగినంతమంది విద్యార్థులు కూడా లేకుండా వెలసిన కళాశాలలు మన మధ్యలో అనేకం.
10. ప్రభుత్వ నిర్వాహకులు ఉన్నత విద్యపై పెట్టిన పెట్టుబడికి తగిన ఫలితాలు రావడంలేదని భావిస్తుంటే, ఉన్నత విద్యారంగంలో పని చేస్తూ, వారు దానిపై ప్రభుత్వ వ్యయం చాలినంతగా లేదని అనుకుంటారు.

## పరిష్కారం:

ఉన్నత విద్యారంగంలో తలయెత్తిన ఆయా సమస్యలకు పరిష్కారాలు ఆర్థిక – సామాజిక పరివర్తన, జాతీయ ఆదర్శాలకు అనుగుణమైన ఉన్నత విద్యా వ్యవస్థ స్థాపన, విద్యా సంబంధమైన దీర్ఘకాలిక, సంస్థాగత ప్రణాళికారచన ఉన్నత విద్యా ప్రమాణాల పట్ల అధ్యాపకుల, విద్యార్థుల శ్రద్ధాభక్తుల వల్లనే లభిస్తాయి.

[1964లో కొత్తపల్లి కేశవరావు గారు మరణించటం వల్ల అదే వ్యాసాన్ని రివైజ్ చేసి, కొత్త సమాచారం చేర్చటం జరిగింది.]

# స్త్రీ విద్య

డా. వి. కోటేశ్వరమ్మ, ఎం.ఎ.,పిహెచ్.డి.

ఆంగ్లేయుల పరిచయం వల్ల, ఆంగ్ల విద్యా ప్రభావంవల్ల ఆయా దేశాలలోని అభివృద్ధికరమయిన విధానాల నవగతం చేసికొన్నారు విద్యాధికులు. ఆంగ్లేయుల సంస్కృతీ ప్రభావం విద్యాధికులయిన భారతీయుల్లో మానసిక మార్పు తెచ్చింది. సంఘ సంస్కరణలో, మత సంస్కరణలో మేధావంతులు ఆసక్తిని చూపనారంభించారు. ఆనాటి సమాజంలోని మూఢ నమ్మకాలు, మూఢాచారాలు వారి నెంతగానో కలవరపరచి, వాటిని సమూలంగా సమాజాన్నుండి తొలగించాలన్న అభిప్రాయం బలపడింది. వెంటనే ఆ అభిప్రాయానికి కార్యరూపంకూడా వచ్చింది. ఆనాడు విపరీతంగా జరుగుతున్న సతీ సహగమనాలు, శిశు హత్యలు, నరబలుల వైపుకు వారి దృష్టి మరలింది. రాజా రామమోనరాయ్ ఆ దురాచారాలను అపడానికి ఎడతెగని కృషి చేసిన మహానుభావుడు. 1820 వ సంవత్సరంలో ఆంధ్రదేశంలో గుంటూరులో తూము పాపయ్యగారు మరణించగా ఆయన భార్య సహగమనం చేయడం చూచానని వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారు ఆయన స్వీయ చరిత్రలో ఉదాహరించారు. వీరేశలింగంగారి జననానికి సుమారు పాతిక సంవత్సరాలకు ముందు ఈ భయంకర దురాచారం మన ప్రాంతాలవరకు వ్యాపించిందనడానికిదొక తార్కాణం.

ఈ విధంగా పంతులుగారి జననానికి ముందు ఆంధ్ర ప్రదేశం సాంఘికంగా, రాజకీయంగా మత, విద్యావిషయ కాల్లోకూడా ఒక పరిణామ దశకు చేరుతూ ఉంది. ఒక వంక క్రైస్తవ మిషనరీలు వారి మత ప్రచారం - విద్యాలయాలు, వైద్యశాలలు స్థాపించడం ద్వారా సాగిస్తోండగా, రాజా రామ మోహనరాయలు, వారి అనుయాయులు దేశీయుల మత విశ్వాసాల్లోను, ఆచారవ్యవహారాలలోను, సంప్రదాయాలలోను గొప్ప మార్పును కలుగజేశారు. ఆయన యావద్భారతం లోను సాంస్కృతిక పునరుజ్జీవనానికి మూలపురుషుయ్యాడు. వంగదేశంలో విద్యారంగంలో గణనీయమైన కృషి చేశాడు.

ఆయన మరణించిన పదిహేను సంవత్సరాలకు మన వీరేశలింగంగారు ఆంధ్రదేశంలో జనించారు. ఆయన పెరిగి ఒక విశిష్టమైన వ్యక్తిత్వాన్ని పెంపొందించుకొనే నాటికి ఆంధ్రదేశంలో పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం స్థిరపడిపోయింది. సమాజంలోని విద్యాధికులు, సంస్కరణాభిలాషులు స్త్రీ విద్య ఆవశ్యకతను గుర్తించారు. పాశ్చాత్యుల ననుసరించి ప్రజా సంఘాలను, సంస్కరణ సంఘాలను నెలకొల్పుకున్నారు. సాహితీ సమితులను స్థాపించారు. ప్రప్రథమంగా ఆంధ్రదేశంలో విశాఖపట్టణంలో బాలికా పాఠశాల స్థాపించారు. లింగం లక్ష్మాజీగారు ఆ సందర్భంలో మాట్లాడుతూ, ప్రజలీవిధంగా సంఘ సంస్కరణాభిలాషులయి సంస్థలను స్థాపించుకోడానికి ముందడుగు వేసినట్లయితే స్త్రీ పునర్ వివాహాలను చేయించాలనే అభిప్రాయాన్ని కూడా పెంపొందించుకోగలుగుతారన్న భావాన్ని వ్యక్తపరచారు.

మద్రాసులో 1852 కు పూర్వమే శ్రీనివాసపిళ్ళే, గాజుల లక్ష్మీనరసుచెట్టి, వెంబాకం రాఘవాచార్యులు మొదలయినవారు స్త్రీ విద్యాభివృద్ధికి గట్టి కృషి చేశారు. శ్రీనివాస పిళ్ళేగారు బాలికా పాఠశాలను కూడ స్థాపించారు.

మత సంస్థలకు వ్యతిరేకంగా మత ప్రమేయంలేని ప్రాతిపదిక మీద - భారతీయులలో - పాఠశాలలు నిర్వహించబడిన గాని స్త్రీ విద్య అభివృద్ధి జెందదన్న అభిప్రాయాలతో ఉదారులయిన కొందరికి పాశ్చాత్యులు దానికి ప్రోత్సాహమిచ్చి నడిపించారు కూడ. అలాంటి వారిలో ఎల్ఫిన్‌స్టన్ కళాశాల ప్రొఫెసర్ పాట్టన్‌ను పేర్కొనవచ్చు. స్టూడెంట్సు లిటరరీ సైంటిఫిక్ సొసైటీ నేర్పరచి, 1849 లో అనేక బాలికా పాఠశాలలు స్థాపించాడు. బొంబాయిలో ఆ కళాశాల వలన మత రహితమయిన విద్యావిధానం బాలురలో విజయవంతమయిన వెంటనే ఆ లాభాన్ని బాలికలు కూడా పొందాలన్న కోరిక క్రమంగా బలపడింది. రాజధానీ నగరానికి సుదూర ప్రాంతాలలో కూడ స్త్రీ విద్య నభిమానించడం గమనార్హం. మున్సిపాల్టీలను స్థాపించి సెస్సును ఏర్పరచటం ప్రారంభవిద్యలో ప్రముఖ ఘట్టమయింది. అది బాలికా విద్య,

స్త్రీ విద్యకు ఎంతో ప్రోత్సాహ మిచ్చింది. మునిసిపాలిటీలలో దేశీయ ప్రతినిధులుండేవారు. వారు బాలికా పాఠశాలలను నిర్వహించడానికి అయ్యే వ్యయానికి వెనుకాడలేదు. దీని ఫలితంగానే 1870–72 మధ్య స్త్రీ విద్య ఆనాటి పరిస్థితులలో బాగానే అభివృద్ధి చెందిందనవచ్చు.

ఈ దశలోనే ప్రముఖ ఇంగ్లీషు సంస్కర్త మేరీ కార్పెంటెల్ కన్య భారతావనికి రావడం చరిత్రాత్మకం. రామమోహన్‌రాయ్ ప్రభావంవల్ల భారత స్త్రీ విద్యాభివృద్ధికి నూతనమార్గంలో నాయకత్వం వహించడానికి ప్రయత్నించింది. ఉపాధ్యాయినులను తయారుచేయడమే ఆ మార్గాని కాటంకాన్ని తొలగించగల ఏకైక పద్ధతి అని గ్రహించి, స్త్రీలకు బోధనలో శిక్షణాలయాలను నెలకొల్పాలన్నదామె.

క్రమంగా బాలురకు విద్యవిజయవంతమై, ఉద్యోగావకాశాలు కలగడం చూచిన ప్రాంతాలలో, బాలికల విద్యనుకూడ అభిమానించారన్న విషయం మనం ప్రత్యేకంగా గుర్తుంచుకోవాలి. భవిష్యత్తులో మాతృమూర్తులు కాబోయే వారిని మానసికంగా ఉన్నత స్థాయిగలవారిని చేయాలన్న కోర్కెలు ప్రజల్లో ఉరక వేస్తూ విజృంభించాయి.

1854 నుండి 1881 వరకు ఉన్న విద్యాస్థితిని పోల్చి చూస్తే విద్యాలయాలకు వెళ్ళే బాలికల సంఖ్య బాగా పెరిగింది. అయినా, విద్యావంతులయిన స్త్రీ పురుషుల మధ్య అగాధమింకా విస్తృతంగానే ఉంది. ప్రతి వేయిమంది పాఠశాల విద్యార్థుల్లో 46 మంది మాత్రమే బాలికలున్నారు.

1892 లోని భారతీయ విద్యాకమీషన్ స్త్రీ విద్యను అంతర్దృష్టితో పరిశీలించింది. నూటికి తొంభయి ఎనిమిది మంది దేశం మొత్తంమీద ఇంకా పాఠశాలలకు పోవడంలేదని కమిషన్ కనుగొంది. బోధనాంశాలు బాలుర కనుకూలంగా వున్నాయన్న విషయమూ పరిశీలనలో కనబడింది. గ్రాంట్లసూత్రాలను బాలికా విద్యాలయాలకు సడలించాలని, వారికి ఉపకార వేతనా లధికం చేయాలని, జీతాలు రాయితీ చేయాలని, బహుమతుల నేర్పరచాలని, స్త్రీలకు ట్రైనింగ్ పాఠశాలల నేర్పరచాలని, స్త్రీ విద్యాలయాలను తనిఖీ చేయడానికి స్త్రీ అధికార్లనే నియమించాలని, పాఠ్యాంశాలను కూడా బాలికలకు కొంత ప్రత్యేకంగా వుంచాలని కమిషన్ సూచించింది.

ఈ కాలంలో సెకండరీ పాఠశాలల సంఖ్య కూడ పెరిగింది. మద్రాసు రాష్ట్రంలో అన్నిటికంటె బాగా పెరిగింది. ప్రభుత్వ సహాయమింకా స్వల్పమయినా ప్రయివేటు సంస్థలు బాగా విస్తృతమవడం వల్ల పందొమ్మిదో శతాబ్దాంతానికి స్త్రీ విద్య బాగా అభివృద్ధి గాంచింది.

అయినా, నాటి బాలికల పాఠశాల జీవనాన్ని గురించి స్వల్పంగానే చెప్పగలం. కొన్ని సందర్భాల్లో కొన్ని గంటలు బోధనలో తక్కువగా నుండేది. డ్రిల్లు, కసరత్తు వంటి శరీర దారుఢ్యాన్ని కలుగజేసే ప్రత్యేక శిక్షణ బాలికల కుండేది. జలంధర్‌లో కన్యామహావిద్యాలయం బాలికలకు ప్రత్యేక వ్యాయామ శిక్షణ నీయడంలో ప్రత్యేక శ్రద్ధ వహించిన ఏకైక సంస్థ. బాలికల కోసం ఒక ప్రత్యేక వ్యాయామ అభ్యాసాన్ని రూపొందించింది. అప్పటికి స్త్రీలకు ఉన్నత విద్యలో కూడ ప్రోత్సాహం లభించింది. అభివృద్ధి మాత్రం అతి నెమ్మదిగా జరుగుతూ వచ్చింది. ఆర్ట్సు కళాశాలల్లో విద్యార్థినుల సంఖ్య క్రమంగా పెరిగింది. మదరాసు రాష్ట్రంలో మూడు కళాశాలలు స్త్రీల కోసం స్థాపించబడ్డాయి. సామాన్య విశ్వ విద్యాలయ కోర్సులనే వారూ అనుసరించేవారు. ఒక్కొక్కప్పుడు పురుషుల కంటె అభిమాన విషయాలు వారి కెక్కువగా వుండేవి. భౌతిక శాస్త్రం బదులు వృక్షశాస్త్రాన్ని (కలకత్తా), ప్రాచీన భాషకు మారు ఆధునిక భాషలను (లాహోర్) తీసికోని వచ్చేవారు. 1807 నుండి 1902 వరకు నలుగురు స్త్రీలు మాత్రం ఎం.ఏ. పట్టాని పొందారు. ఆ సమయంలో కౌంటెస్ డఫ్రిన్ సతి భారత స్త్రీలకు వైద్య సహాయాన్నందించే ఉద్యమాన్ని ప్రారంభించింది. ఈ ఉద్యమం అనతి కాలంలోనే అతి వేగంగా విస్తరించడం వల్ల యించుమించు అన్ని రాష్ట్రాలలో స్త్రీలకు వైద్యతరగతులు కూడా ప్రారంభింపబడ్డాయి. ఆచరణలో అతి ప్రధానమయిన అంశాన్ని నేర్చుకోగలగడం, ఒక వృత్తిని కూడా తమంతట తాము ఎన్నుకోగలగడం, వారిని ప్రోత్సహించడానికి డఫ్రిన్ సతిగారి నిధి నుండి ఉపకార వేతనాలు ఏర్పరచబడడంతో బాలికల విద్యాసంస్థలతో పాటు బాలికల సంఖ్య కూడా క్రమంగా పెరిగింది.

ప్రభుత్వం స్త్రీ విద్యను కొనసాగించడానికి 1904 లో, 1908 లో బాలికలకు సహాయమందిస్తామన్నది; 1913 లో ప్రసిద్ధిగాంచిన ప్రభుత్వ తీర్మానంలో ముఖ్య అంశాలివి:

1. బాలికల విద్య సమాజంలో వారాక్రమించు స్థానాన్ననుసరించి, ఆచరణీయంగా వుండాలి.
2. బాలుర విద్యావిధానాన్ననుసరించే విధంగా వుండరాదు. కేవలం పరీక్షలే ప్రధానంగా వుండరాదు.
3. ఆరోగ్య రక్షణ శాస్త్రాన్ని గురించి ప్రత్యేకశ్రద్ధ బాలికా విద్యాలయాలలో చూపాలి.
4. స్థానిక ప్రభుత్వాలు స్త్రీ విద్యకొరకు చేసే వ్యయాన్ని భరించడానికి ప్రభుత్వం సిద్ధపడుతుంది.

అక్టోబరు 12 – 1915 లో స్త్రీ విద్యను గురించి భారతదేశ కార్యదర్శికి కొంతమంది ప్రముఖులు ఒక విజ్ఞప్తిని చేశారు. వారిలో ముఖ్యులు ఆంగ్లేయ, భారతీయ వనితలు. ఆ విజ్ఞాపనలోని అంశాలు ప్రభుత్వానికి ఆందోళన కలిగించే విధంగా నున్నవని ప్రభుత్వం పేర్కొంది. వానిలో ఈ

క్రిందివి కొన్ని:

1. పాఠశాలకు వెళ్ళే బాలికల సంఖ్య అత్యల్పంగా వుంది. చెప్పుకో దగ్గదిగా లేదు.
2. స్త్రీ పురుష జనాభాబట్టి మరింత తక్కువగా నుండడం వల్ల భారతీయ సామాజిక క్షేమానికి కూడా దెబ్బ తగులుతుంది.

ప్రభుత్వం ఈ సూచనలను హర్షించింది. స్త్రీవిద్యాభి వృద్ధికి వారు తయారుచేసిన పథకంతో ఏకీభవిస్తూ, దాని నమలుపరచే బాధ్యతను భారత ప్రభుత్వానికి వదలింది.

బాలికా పాఠశాలల్లో ప్రమాణాలను పెంచడానికి, ప్రాథ మిక విద్యాలయాలలోని ఉపాధ్యాయినుల స్థాయి నభివృద్ధి పరచడానికి తీసుకొన్న జాగ్రత్తల్లో మొదటిది గృహ విజ్ఞాన శాస్త్రానికి సంబంధించినంతవరకు బాలికల అవసరాలు, అభిరుచులు కనుగొని బోధించడం, దానికి స్త్రీలనే ఏర్పాటు చేయడం. స్త్రీల నాకర్షించడాని కవసరమైన జీతంగాని, సాంఘిక స్థాయిగాని, ఉండడానికి ఇల్లుగాని, పెన్షనుగాని నామమాత్ర మవడం వల్ల స్త్రీలు ముందుకు రావడం కష్టమయింది. ఇందుకు అంగీకరించినవారి శీలాన్ని సమాజంలో అనుమానించి, అవమానంగా చూడడంవల్ల కూడా దానికి కొంత కష్టమై, ఆంగ్లేయ వనితలు, క్రైస్తవులు మాత్రం దొరికేవారు.

క్రమంగా స్త్రీ, బాలికల విద్యపై అంతకుముందున్న మూఢ విశ్వాసాలు సడలిపోవడం, క్రమేపీ అదృశ్యమై పోవడం జరిగింది. మధ్యతరగతి కుటుంబాల్లో బాలికలు స్వతంత్రంగా జీవించడానికి అవసరమయిన వృత్తిని స్వీకరించడాని కంగీకరింప నారంభించినారు.

ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినులుగా శిక్షణ పొందిన బాలికల సంఖ్య 1917 లో 2757 కాగా, 1921 లో 4391 కి పెరిగింది. దీనితోపాటు అనేక పారిశ్రామిక పాఠ శాలలు కూడా ప్రారంభించబడ్డాయి; విజయవంతమవుతూ వచ్చాయికూడా. ఎంబ్రాయిడరీ, లేసు అల్లిక శిక్షణ మన రాష్ట్రంలో బాలికలకు చేపట్టారు. వితంతువులకు, భర్తలచే మోసగింపబడిన అభాగినులకు 5 పారిశ్రామిక సంస్థలు నిర్వహించబడేవి. వాటిలో విద్యార్థినులకు ఉపకార వేతనాలు లభించేవి. ఉత్పత్తిని అమ్మడంద్వారా ఆ సంస్థలు చాలావరకు నిర్వహణా వ్యయాన్ని సంపాదించేవి.

క్రమక్రమంగా సామాన్య విద్య వల్ల పొందే సాంస్కృతిక లాభాలను తలిదండ్రులు లభినందించడం ఎక్కువవుతూ వచ్చింది. ప్రాథమిక విద్యతోపాటు సెకండరీ, ఉన్నత విద్యపట్లకూడా ప్రజాభిమానాన్ని పెంపొందించడానికి విద్యార్థినులకు అనేక రాయితీలు కల్పించింది ప్రభుత్వం.

మద్రాసులోని స్త్రీల క్రైస్తవ కళాశాలలో అధ్యాపక వర్గానికి, విద్యార్థినులకు వసతి గృహాలను నిర్మించారు. క్వీన్ మేరీ కళాశాల భవనాలను విస్తృతపరచారు. జయపూర్ మహారాజా దీనికోసం లక్ష రూపాయలు వెచ్చించారు.

వైద్యవిద్యపట్లకూడ ప్రభుత్వం శ్రద్ధ వహించింది. లేడీ హార్డింగ్ కృషి వల్ల నర్సులకు, మంత్రసానులకు శిక్షణా లయం కోసం పథకం రూపొందించబడింది. బ్రిటిషురాణి భారతదర్శన జ్ఞాపకార్థం ఈ పథకాన్నమలుపరచాలమకొంది ప్రభుత్వం. రాజపుత్రులనేకులు ధనవంతులు ఉదారంగా విరా ళాలిచ్చారు. అనేకమంది సంఘసంస్కర్తల ప్రభావంవల్ల అనేక వితంతు శరణాలయా లేర్పడ్డాయి దేశంలో. మన వీరేశలింగంగారు రాజమండ్రిలో కూడా ఏర్పరచారొకదాన్ని. వివాహితులయిన స్త్రీలుకూడా విరామ సమయంలో ఈ సేవకు పూనుకోనారంభించి ఎనలేని అభివృద్ధిని సాధించారు విద్యారంగంలో.

బాలికల వివాహ వయస్సును పెంచడం, సమాజంలో సమష్టి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కావడం స్త్రీ విద్యాభివృద్ధికి సహాయపడ్డాయి. మారుతోన్న సమాజంలో విద్యావంతుల యిన పురుషులు విద్యావంతులయిన భార్యలు కావాలని కోరడంకూడ కొంత స్త్రీ విద్యకు దోహదమిచ్చింది.

| | బాలికల విద్యాసంస్థలు | విద్యార్థినులు |
|---|---|---|
| 1916–17 | 19,124 | 1,136,010 |
| 1921–22 | 23,517 | 1,319,214 |

1921 లో రాష్ట్రాలలో ద్వంద్వపరిపాలన వచ్చి, భారతీ యులకు విద్యాశాఖ అప్పగించబడింది. 1937 లో స్వయం పరిపాలన ప్రవేశపెట్టబడింది.

అప్పుడు మన ప్రభుత్వాలు స్త్రీవిద్యను పెంపొందింప జేయ డానికి చురుకుగా పూనుకున్నాయి. స్వాతంత్ర్యోద్యమంతో బాపూజీ నాయకత్వంలో స్త్రీజాతికూడ నిద్రావస్థనుండి మేల్కొంది. నవ చైతన్యం వారిలో పెల్లుబికింది. అఖిల భారత మహిళా సమావేశాల్లో విద్యాసంస్కరణలను గురించి చర్చించడంవల్ల భావ వికాసం చెంది, ఆత్మవిశ్వాసం కలిగిన స్త్రీజాతి ఉద్భవించింది. పూనాలో అఖిల భారత మహిళాసభ సమావేశం ఈ నిర్ణయం తీసుకొంది. ఆ సమావేశానికి భారతదేశమంతటినుండి, అన్ని భాషలు మాట్లాడే ప్రాంతాల నుంచి స్త్రీ విద్యావేత్తలు హాజరయ్యారు. ప్రథమంలో వీరి సమావేశాలు విద్యా విషయక ప్రశ్నలకు, వాటి కార్యకలాపాలకు మాత్రమే అంకితమైపోయినా అనతికాలంలోనే ఆ కార్యకలా పాలు గణనీయంగా పెరిగిపోయాయి. తరువాత రెండుగా విభజించుకొన్నారు విధులను: (1) విద్యా విషయకశాఖ, (2) సాంఘికశాఖ. ఇది భారతప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వాలకు కూడ ఈ విషయంలో సహాయపడేది. స్త్రీ విద్య కోసం ఈసభ ఎనలేని కృషి చేసింది. దానిలోని సాంఘికశాఖ

కృషివల్లనే 'శారదాచట్టం' అమలులోకివచ్చి వివాహ వయస్సును పెంచింది. అదికూడ బాలికల విద్యకు తోడ్పడింది. స్త్రీలు, పిల్లలపట్ల ఈ సభ తీసికొన్న ప్రత్యేకశ్రద్ధ పరోక్షంగా సమాజాభివృద్ధికి కూడ తోడ్పడిందన్నమాట. స్త్రీలను పురుషులతో సమానస్థాయికి తేవడానికి అవరోధాలయిన అసమానతలను, అనర్హతలను తొలగించాలని వీరు కోరారు.

| పాఠశాలలలోని బాలికల సంఖ్య | |
|---|---|
| 1921–22 | 1,319,214 |
| 1946–47 | 4,297,785 |

ఉన్నత విద్య, సెకండరీ విద్యలో కూడ గణనీయమైన మార్పువచ్చి, అభివృద్ధి కనబడింది. అన్ని దశలలోను విద్యావకాశాలు స్త్రీలకు ఇప్పటికి లభించాయి.

స్వాతంత్ర్యానికి ముందు కేంద్ర విద్యా సలహా సంఘం నిర్బంధ ఉచితవిద్య నేర్పరచాలన్న విషయాన్ని గురించి ఆలోచించింది. స్వతంత్ర భారతంలోని ప్రప్రథమ విద్యామంత్రి అబుల్ కలాం ఆజాద్ 1948 లో అఖిల భారత విద్యాసమావేశాన్నేర్పరచి, 16 సంవత్సరాలలో ఉచిత నిర్బంధ బాలికల విద్యా పథకం అమలు పూర్తి చేయాలని ఆదేశించారు. రాజ్యాంగంలోని 16 వ ఆర్టికల్ ద్వారా ఈ ఆదేశం, రాష్ట్ర ప్రభుత్వాలతో కలసి రానున్న 10 సంవత్సరాలలోనే ప్రతి శిశువుకు 14 ఏళ్ళు వచ్చేవరకు నిర్బంధ ఉచిత విద్య నివ్వాలని రాజ్యాంగబద్ధంగా కొంచెం మార్చారు.

### దుర్గాబాయి కమిటీ:

స్వాతంత్ర్యానంతరం బాలికల, మహిళల విద్య గణనీయంగా పెరిగిందనే చెప్పాలి. అయినా, ప్రథమ పంచవర్ష ప్రణాళికాంతంలోని ప్రాథమిక దశలో మొత్తం విద్యార్థుల్లో బాలురు 70.5 శాతం వుండగా, బాలికలు 30 శాతం వున్నట్టు తేలింది. ఉపాధ్యాయినుల కొరత ఇందుకు కొంత కారణమని తేలింది. స్త్రీలకు కళాశాల విద్య అందుకు అవసరం. అన్ని స్థాయిలలో స్త్రీ విద్య పెంపొందించే మార్గాలను సూచించేందుకు 1955 లో భారత ప్రభుత్వం శ్రీమతి దుర్గాబాయి గారి ఆధ్వర్యంలో ఒక సలహా సంఘాన్ని ఏర్పరచింది.

ఈ కమిటీ చేసిన ముఖ్య సూచనలలో ఈ క్రిందివి ఉన్నాయి: ప్రాథమిక స్థాయిలో బాల బాలికలకు ఒకేవిధమైన విద్య నివ్వాలి. మాధ్యమిక దశలో బాలికలకు గృహవిజ్ఞాన శాస్త్రాన్ని చేర్చి, వివిధ చేతి పనుల్లో ప్రత్యేక శిక్షణను యివ్వాలి. సెకండరీ దశలో లలిత కళలు, గృహవిద్యకు సంబంధించిన అంశాలు చేర్చాలి. ఉపాధ్యాయినులకు శిక్షణావకాశాలు కల్పించే బాధ్యతను విశ్వ విద్యాలయాలు, రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకోవాలి.

1958–59 లో జాతీయ స్త్రీ విద్యాసంఘం విద్య విషయంలో రాజ్యాంగం చేసిన నిర్ణయాలను దృష్టిలో పెట్టుకొని సమస్యను పరిశీలించింది. 1965–66 నాటికి బాలికలకు నిర్బంధవిద్య అమలు చేయాలని ప్రభుత్వం అప్పటికి నిర్ణయించింది.

అప్పర్ ప్రైమరీ దశలో బాలికలకు ప్రత్యేక పాఠశాలలను సాధ్యమైనన్నిచోట్ల ఏర్పాటు చేయడం, గృహకృత్యాలలో సహాయపడేందుకు వీలుగా 11 నుంచి 13 ఏళ్ళ బాలికలకు పాక్షిక కాల విద్యా సౌకర్యం కల్పించాలనే సూచనలు జాతీయ స్త్రీ విద్యా సంఘం చేసింది. సెకండరీ దశలో మాత్రం సహవిద్యకు ప్రజాభిప్రాయం అనుకూలంగా లేదు గాబట్టి బాలికలకు ప్రత్యేక పాఠశాలలు అవసరమని, గ్రామాల్లో ఉపాధ్యాయినులను మాత్రం తప్పక వేయాలని జాతీయ స్త్రీ విద్యా కమిటి సూచించింది. ప్రీ ప్రైమరీదశలో ఉపాధ్యాయినుల సంఖ్య గణనీయంగానే వుంది. ఇతరదశల్లో సైతం స్వాతంత్ర్యానంతరం ఉపాధ్యాయినుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. విద్యార్థినుల సంఖ్యతోబాటే ఉపాధ్యాయినుల సంఖ్య కూడా పెరగడం అవసరమైంది. జాతీయ స్థాయిలోను, రాష్ట్రస్థాయిలోను ప్రభుత్వం నియమించిన అనేక కమిటీలు, కమిషన్‌లు, కౌన్సిళ్ళు స్త్రీ విద్యాభివృద్ధికి చేసిన సూచనలు కొన్నయినా అమలుగావడంవల్లనే ఈమాత్రం ఫలితాలు లభించాయి.

### హంసా మెహతా కమిటీ:

అన్నిస్థాయిల్లో బాలికల పాఠ్యప్రణాళికల పరిశీలనకు మహిళ విద్యాకమిటి అధ్యక్షురాలు రక్షా శరణ్ 1961 నవంబరు 1 న ఒక కమిటీని నియమించారు. దాని అధ్యక్షురాలు హంసా మెహతా. లింగభేదం కారణంగా బాలబాలికల విద్యా పాఠ్యాంశాల్లో తేడాలుండరాదని ఈ కమిటీ ఉద్ఘాటించింది. స్త్రీలను పురుషులకన్నా తక్కువగా చూడటం అనే దుస్సంప్రదాయాన్ని తొలగించాలని కమిటీ పేర్కొంది. ప్రాథమిక స్థాయిలో సహవిద్యను సామాన్యంగా అనుసరించాలి. సెకండరీ, కళాశాలల స్థాయిలో బాలికలకు ప్రత్యేక సంస్థల నేర్పరచే స్వేచ్ఛ మేనేజిమెంట్లకు వుండాలి. సెకండరీ, విశ్వవిద్యాలయ స్థాయిల్లో బోధకులుగా స్త్రీలను నియమించడం, అలానే ప్రత్యేక మహిళా సంఘాలలో కొందరు పురుషులను నియమించ వచ్చునని పేర్కొంది.

"అంతిమలక్ష్యమైన ప్రజాస్వామ్యయుతమైన సోషలిస్టు సమాజంలో విద్య వ్యక్తిగత సంబంధమైన శక్తి సామర్థ్యాల ననుసరించి ఉండాలని ఆశిస్తున్నాం. అభిరుచులు, ఆసక్తులు వాటికి లింగ భేదంతో సంబంధం లేదు. అందువల్ల పాఠ్య ప్రణాళికలను లింగ భేదాన్ననుసరించి ఏర్పాటు

చేయాల్సిన అవసరం లేదు " అని ఈ కమిటీ నివేదిక స్పష్టపరచింది. అయితే ప్రస్తుత దశలో మధ్యంతర కాలంలో సమాజంలో వున్న వాస్తవ పరిస్థితులు దృష్టిలో పెట్టుకుని బాలబాలికల కోర్సులు తయారుచేయాల్సి వుందని ఈకమిటీ భావించింది. ప్రాథమిక, మాధ్యమిక స్థాయిల్లో సామాన్య విద్యా ప్రణాళిక బాలబాలికలకు సమానంగానే వుండాలి, మాధ్యమిక పాఠశాలల్లో బాల బాలికలు కలసి చదువు కుంటున్నప్పుడు స్త్రీలను తప్పనిసరిగా ఉపాధ్యాయులుగా నియమించాలి; మాధ్యమిక స్థాయి అనంతరం ఒకటినుంచి మూడు సంవత్సరాల కోర్సులుగా వృత్తి విద్యా పాఠశాలలు వుండాలని ఈ కమిటీ సూచించింది. ఇవి సెకండరీ విద్యలోని సామాన్య కోర్సులకు ప్రత్యామ్నాయంగా వుండాలి. గ్రామీణ ప్రాంతాలలో ప్రాథమిక స్థాయిని కూడా పూర్తి చేయని బాలికలను సైతం వీటిలో చేర్చుకోడం వాంఛనీయం.

పాఠ్యగ్రంథాలలో – ముఖ్యంగా మహనీయులైన మహిళా మణుల జీవిత చరిత్రలను చేర్చాలి. స్త్రీ పురుష సమానత్వ భావన, పరస్పర గౌరవ భావాలు పెంపొందించే విధంగా పాఠాలు వుండాలి.

సెకండరీ స్థాయిలోను, ఉన్నతస్థాయిలోను కూడా పార్ట్ టైమ్ పద్ధతిలో ఉద్యోగాలు లభించగల ఎన్నిరకాల వృత్తివిద్యలు స్త్రీలకు నేర్పే అవకాశం వుందో అన్వేషించాలని ఈ సంఘం సూచించింది. గృహ ఆర్థిక పరిస్థితి అంశాన్ని శాస్త్ర విషయంగా బోధించాలని సూచించింది. బాలికలు ఇష్టపడి నేర్చుకునే సంగీతం, ఇతర లలితకళలను పాఠశాల స్థాయిలో కోర్సులాగా నేర్పేందుకు ఆకర్షవంతమైన వేతనాలతో టీచర్లను నియమించాలని కోరింది. మాధ్యమిక, సెకండరీ పాఠశాలల్లో తగిన బోధనాసామర్థ్యంగల ఉపాధ్యాయులుంటేనే సెక్స్ విద్యాబోధన ప్రవేశపెట్టాలని కోరింది.

1963 ఏప్రిల్‌లో జాతీయ మహిళా విద్యాకమిటీ సమావేశంలో స్త్రీవిద్యకు ప్రజల తోడ్పాటు – ముఖ్యంగా వెనకబడిన ప్రాంతాలు, గ్రామీణ ప్రాంతాలలో ఎలా సమీకరించాలి అని చర్చించారు. ఆ విషయం పరిశీలించేందుకు ఒక చిన్న ఉపసంఘం వేయాలనుకున్నారు. మే నెలలో అలాంటి కమిటీని అప్పటి మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ భక్తవత్సలం ఆధ్వర్యంలో నియమించారు.

స్త్రీ విద్యా ప్రణాళికల అమలుకోసం, అవసరమైతే ప్రణాళిక కేటాయింపులను మించికూడ నిధులు మంజూరు చేయాలనే విద్యా నిపుణుల అభిప్రాయంతో ఈ కమిటి ఏకీభవించింది. దాని సూచనల్లో ముఖ్యమైనది: ప్రాథమిక దశలో ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చి నియమించడానికి కేంద్రం సహాయం చేయాలి. పుస్తకాలు, దుస్తులు ఉచితంగా సరఫరా చేయాలి. ఉపాధ్యాయినులకు గృహవసతి నివ్వాలి. సెకండరీ దశలో బాలికల కోసం స్థానిక సంస్థలు, ప్రత్యేక పాఠశాలలు ఏర్పాటు చేయాలి. పుస్తకాలు, దుస్తులు విద్యార్థినులకు ఉచితంగా యివ్వడానికి, శిక్షణ పొందిన ఉపాధ్యాయినులను నియమించడానికి కేంద్రప్రభుత్వం సహాయం చేయాలి.

అనాటి లెక్కలుచూస్తే ప్రాథమికస్థాయి బాలుర విద్యా సమస్య పరిష్కారమైనట్టు కనబడుతుంది. ఆ వయసు బాలురలో 90 శాతం హాజరు వుంది. బాలికలలో 50 శాతం మాత్రమే హాజరు వుంది. సెకండరీ దశలో బాలికల హాజరు యింకా తక్కువ వుంది. 100 కి 40 గా బాలుర బాలికల హాజరు దామాషా వుంది. స్వాతంత్ర్యానంతరం సెకండరీ విద్యావ్యాప్తి గణనీయంగా జరిగింది. అయితే చదువుకున్న బాల బాలికల మధ్య సంఖ్యలో అగాథం అలాగే వుంది. ప్రజల ప్రత్యక్ష సహకారాన్ని ఈ క్రింది విషయాలలో సమీకరించాలని అభిప్రాయం వ్యక్తమైంది:

ప్రయివేటు పాఠశాలల్ని నెలకొల్పడం; పాఠశాల భవనాల నిర్మాణం; ఈ కృషిలో ప్రజల శ్రమదాన సమీకరణ; విరాళాల సేకరణ; భవనాల నిర్వహణ; సహవిద్యకు ప్రజామోదం సమీకరణ; ఉపాధ్యాయినులపట్ల సమాజంలో గౌరవం వుండే వాతావరణం నెలకొల్పడం; పాఠశాల అభివృద్ధి కమిటీలు; మధ్యాహ్న భోజనాలు; పేద పిల్లలకు ఉచితంగా యూనిఫారాలు, పాఠ్యపుస్తకాలు అందించడం. జిల్లాలస్థాయిలో మహిళా మండలులు, ఇతర స్వచ్ఛంద సేవకులు సేవికలు అందరూ కలసి బాలికల విద్యాభివృద్ధికి కృషి చేయాలని రాష్ట్ర ప్రభుత్వాలు ఇతర ప్రభుత్వ ప్రసార యంత్రాంగం అందుకు అన్ని విధాలా తోడ్పడాలని ఈ సంఘం కోరింది. 300 మంది జనాభా వున్న ప్రతి చిన్న గ్రామంలోను స్థానిక ప్రజలను ఉత్సాహపరిచి, ప్రాథమిక పాఠశాల ఏర్పాటు చేయించాలి. కొండప్రాంతాలవంటిచోట ఎంత తక్కువ జనావాసమైనా పాఠశాల ఏర్పడాలి. 1500 మంది జనాభా వున్నచోట మాధ్యమిక పాఠశాల మూడు మైళ్ళకొకటి చొప్పున ఏర్పరచాలి. అయిదుమైళ్ళకొక సెకండరీ పాఠశాల వుండాలి. గ్రామీణ ప్రాంతాల్లో శిశు విద్యాలయాలు ఏర్పరచి, పాఠశాలకు వెళ్ళే అలవాటు కలిగేలా చేయాలి. స్త్రీలు ఉపాధ్యాయ వృత్తిని చేపట్టేట్టు ప్రోత్సహించేందుకు ప్రత్యేక సౌకర్యాలు – వయోపరిమితి సడలింపు వంటివి కల్పించాలి. గ్రామీణ ప్రాంతాల్లో వివాహిత స్త్రీలు పార్ట్ టైంగా నైనా ఉపాధ్యాయ వృత్తి చేపట్టేట్టు ప్రోత్సహించాలి. ప్రాథమిక సెకండరీ స్థాయి ఉపాధ్యాయులలో ప్రాథమిక స్థాయిలో 50 వేల గృహాలు, సెకండరీస్థాయిలో లక్ష గృహాలు కట్టించాలని జాతీయ మహిళా విద్యాసంఘం కోరింది. పాఠశాల భవనాలు, బోధన సామగ్రి వంటి విషయాలబాధ్యత స్థానిక సంస్థలకు అప్పగించాలని ఈ కమిటీ సూచించింది.

రాష్ట్ర ప్రభుత్వాల ప్రణాళికల్లో బాలికల విద్యకోసం నిధుల్ని ప్రత్యేకించి కేటాయించాలి. మహిళా విద్యాసంఘాలు అన్ని రాష్ట్రాలలో ఏర్పడాలి. నిర్బంధ విద్యా చట్టాలు అన్ని రాష్ట్రాలలో చేయాలి. పాఠశాలల పనిగంటలు గ్రామాల్లో పిల్లల తల్లిదండ్రులకు సౌకర్యవంతంగా వుండేట్లు చూడాలి. పొలం పనులు వంటివి ఎక్కువగా వుండే రోజుల్లో బడులకు సెలవు యివ్వడం మంచిది.

బీహార్, జమ్ము – కాశ్మీర్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో గల ప్రత్యేక సమస్యలు ఈ కమిటి పరిశీలించి అనేక సూచనలు చేసింది.

ఈ విధంగా (1) దుర్గాబాయి దేశ్‌ముఖ్ అధ్యక్షతన ఏర్పడిన జాతీయ మహిళా విద్యాసంఘం, (2) శ్రీమతి హంసా మెహతా ఆధ్వర్యాన బాలబాలికల పాఠ్యప్రణాళికలో వివక్షతలు పరిశీలించిన కమిటీ, (3) ఆరు రాష్ట్రాలలో వెనకబడిన ప్రాంతాల్లో బాలికల విద్య స్థితిగతులను పరిశీలించిన భక్తవత్సలం కమిటీ – ఈ మూడు సంఘాలు చేసిన పరిశీలనలు, నివేదికలు ప్రభుత్వం ముందు వున్నాయి. 1964–66 మధ్యకాలంలో విద్యాసంఘం ఈ పై కమిటీలు చేసిన నిర్ణయాలను, సూచనలను మరోసారి బలపర్చింది. కేంద్రంలోను, రాష్ట్రాల్లోను కూడ బాలికా విద్యాభివృద్ధి బాధ్యతలు వహించే ప్రత్యేక యంత్రాంగాలుండాలని విద్యా సంఘం కోరింది. స్త్రీలకు పార్ట్‌టైం ఉద్యోగావకాశాలు, అవివాహిత వివాహిత స్త్రీలకు – ముఖ్యంగా పిల్లలు పెద్దవారైన స్థితిలో తల్లులకు పూర్తికాల ఉద్యోగావకాశాలు కల్పించాలి. అప్పటికి వున్న పరిస్థితినుంచి మాధ్యమిక స్థాయిలో 1 కి 2, సెకండరీ స్థాయిలో 1 కి 3 దామాషాన బాల బాలికల సంఖ్య పెరిగేటట్టు కృషి సాగించాలి. విశ్వవిద్యాలయాల్లో 1 కి 4 గా వున్నదానిని 1 కి 3 దామాషా వుండేట్టు పెంచాలి.

ఆర్ట్స్ సబ్జక్టులు విద్యార్థినులకు బాగా అందుబాటులో వుండాలి. హోంసైన్స్, నర్సింగ్, విద్యారంగం, సంఘసేవ మొదలైన కోర్సుల్ని పెంపొందించాలి. కరస్పాండెన్స్‌ద్వారా విద్యను నేర్చుకొనే అవకాశాలు కల్పించాలి. వయోజన మహిళలకు కోర్సులను నిర్వహించేందుకు మహిళా స్వచ్ఛంద సంఘాలు తగు సౌకర్యాలను కేంద్ర సాంఘిక సంక్షేమశాఖ కల్పించాలి.

## ప్రొ. శ్రీదేవి కమిటీ సూచనలు:

1975 అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్త్రీవిద్యపై రాష్ట్రస్థాయి ఉపసంఘాన్ని ఒకదాన్ని నియమించింది. రాష్ట్రంలోని అన్ని స్థాయిలలోను స్త్రీల విద్యా విస్తృతిని, స్థాయిని పెంచడానికి సూచనలు చేసేందుకు ఏర్పడిన ఈ ఉప.సంఘానికి ప్రొ. ఎన్. శ్రీదేవి అధ్యక్షులు.

(1) ప్రాథమికస్థాయినుంచి కళశాల స్థాయివరకు బాలికల, మహిళల విద్యాపరిస్థితి, (2) రాష్ట్రంలో బాలికల, మహిళల విద్యావ్యాప్తి దానిని మరింతగా పెంచేందుకు మార్గాలు, (3) మహిళల ప్రస్తుత విద్యాస్థాయి నాణ్యత, దానిని మరింత పెంచడానికి గల అవకాశాలు– ఈ అంశాలను పరిశీలించి సూచనలు చేయవల్సిందిగా ప్రభుత్వం ఈ కమిటీని కోరింది.

కమిటీ సభ్యులు రాష్ట్రమంతటా మహిళా పాఠశాలలను, కళాశాలలను సందర్శించి ప్రభుత్వానికి నివేదిక సమర్పించారు. అందులో కొన్ని సూచనలను ప్రభుత్వం ఆమోదించింది. ధనాభావ కారణంగా మిగిలిన సూచనలను అమలు జరపలేకపోయింది. ప్రభుత్వం ఆనాడు అంగీకరించిన సూచనల్లో ఈ కిందివి ఉన్నాయి:

1) మెక్సికోలో ప్రపంచ మహిళా మహాసభ ఐక్యరాజ్యసమితి నిర్ణయాలమేరకు మహిళ దశాబ్దకాలంలో ఆర్థికవసతి అనుమతించిన మేరకు బాలికల విద్యకు ప్రాధాన్యతనివ్వాలి.
2) మహిళల విద్యను పురుషుల విద్యనుంచి వేరుచేసి కనీసం ఐదేండ్ల కాలానికి, ఉన్నత విద్యావంతురాలైన మహిళను డైరెక్టరుగా వేయాలి.
3) ప్రతి జిల్లాలో మహిళా విద్యకోసం ఒక ప్రత్యేక కార్యాలయం, ఒక మహిళాధికారి బాధ్యులుగా ఏర్పాటు చేయాలి.
4) పూర్వ ప్రాథమిక పాఠశాలలను స్థిరీకరించి బోధకుల జీతాలను క్రమబద్ధం చేయాలి.
5) మహిళల విద్యా పురోగతి సమీక్షలకోసం ఉపాధ్యాయులు తల్లిదండ్రులు పౌరుల ప్రతినిధులతో ఉన్నతాధికార కమిటీని ఏర్పరచాలి.
6) బాలబాలికలు కలిసి అధ్యయనం చేసే ప్రాథమిక, ఉన్నత పాఠశాలల్లో సాధ్యమైనంతవరకు మహిళల్నే ఉపాధ్యాయులుగా వేయాలి.
7) ప్రావీణ్యత, ప్రతిభ కనబర్చిన బాలికలకు ప్రత్యేక బహుమతులు విరివిగా యివ్వాలి.
8) బాలికలు మధ్యలో చదువు ఆపకుండా చర్యలు తీసుకోవాలి.
9) విద్యార్హతగల మహిళలకు కొద్దికాలం పనిచేసే ఉద్యోగాలు కల్పించాలి.
10) బాలికల ఉపాధికల్పనకు ప్రత్యేక కేంద్రం (ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి) ఏర్పరచాలి.
11) ఉపాధ్యాయినులకు స్వల్పకాలిక పునశ్చరణ తరగతులు నిర్వహించాలి.
12) అన్ని మతాలలోని నైతిక సూత్రాలను బోధించే నీతి విద్యాబోధన తరగతులు మహిళలకు నిర్వహించాలి.

13) ప్రత్యేక ప్రతిభగల విద్యార్థినులు ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్ వంటి అఖిల భారత సర్వీసులకు వెళ్ళే అవకాశాలలో ప్రత్యేక శిక్షణ కల్పించాలి.
14) అన్ని మహిళా కళాశాలల్లో నర్సింగ్ కోర్సులను ప్రారంభించాలి.
15) ఫ్యాక్టరీలలో పనిచేసే మహిళా కార్మికులపట్ల వివక్ష ప్రదర్శించే ఆంక్షలను తొలగించాలి.
16) అంగ వైకల్యంగల బాలికలకు విద్యాబోధన నిమిత్తం ఉపకార వేతనాలు, తదితర సౌకర్యాలనిచ్చి ప్రోత్సహించాలి.

## ఏడవ ప్రణాళికలో:

ఏడవ పంచవర్ష ప్రణాళిక (1985 – 90) మధ్యకాలంలో స్త్రీల అభివృద్ధికి దీర్ఘకాలిక కార్యక్రమం తలపెట్టారు. ఇంటర్మీడియట్ స్థాయివరకు బాలికలకు ఉచిత విద్యనియ్యాలని ప్రతిపాదించారు. వయోజన విద్యాకార్యక్రమంలో పాఠ్యప్రణాళికలు మార్చి, కొత్త విలువలను సమాజంలో నెలకొనేట్టు చేర్చాలన్నారు. బాలికలకు అనియత విద్యాకేంద్రాలు పెరగాలన్నారు. ఐ.ఆర్.ఇ.పి., ఎన్.ఆర్.పి.సి., టి.ఆర్.వై. ఎస్.ఇ.ఎం. వంటి గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలద్వారా ఆచరణాత్మక అక్షరాస్యత శిక్షణ లభింపచేయాలన్నారు. ఓపెన్ లెర్నింగ్ పద్ధతి, బాలికలకు పాలిటెక్నిక్‌లు, షెడ్యూల్డు కులాలు జాతులు యితర వెనకబడిన బలహీనవర్గాల స్త్రీలకు, బాలికలకు విద్య లభించేలా ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలి. నార్వే సంస్థ, అంతర్జాతీయ అభివృద్ధి సంస్థలద్వారా వృత్తి శిక్షణలు నిర్వహించాలి. వయోజన మహిళలకు సంక్షిప్త వృత్తి విద్యాకోర్సులు నిర్వహించేందుకు మహిళా స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయం అందించాలి.

## జాతీయ విద్యావిధానం (1986):

జాతీయ విద్యావిధానంలో నాల్గవ భాగానికి "సమానత్వం కోసం విద్య" అని పేరు పెట్టారు. రెండు పేరాలను మహిళల సమస్యలపై కేంద్రీకరించారు. స్త్రీల స్థాయిలో మౌలికమైన మార్పును తెచ్చే సాధనంగా విద్యను వినియోగించాలని నిర్దేశించారు. వృత్తివిద్యారంగంలో సాంకేతిక రంగంలో స్త్రీలు పాల్గొనేట్టుగా విద్యావిధానం వుండాలని అన్ని విధాలైన వివక్షలు తొలగించాలని పేర్కొన్నారు. కేంద్ర ప్రభుత్వ మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ 1986 లో ఒక క్రియాశీలక కార్యక్రమాన్ని రూపొందించింది.

1951 – 81 మధ్యకాలంలో స్త్రీలలో అక్షరాస్యత 7.93 శాతంనుంచి 24.82 శాతానికి పెరిగింది. అయితే, నిరక్షరాస్యులైన స్త్రీల సంఖ్యమాత్రం 15 కోట్ల 87 లక్షలనుంచి 24 కోట్ల 17 లక్షలకు ఈ మధ్యకాలంలో పెరిగింది. (అస్సాం మినహా.) పాఠశాల మొగం అయినా చూడనోచుకోని మొత్తం 70 శాతం నిరక్షరాస్యుల్లో మహిళలే 57 శాతం వున్నారు.

## నిర్దేశిత లక్ష్యాలు:

1990 నాటికి బాలికలందరికీ విద్యలభించేలాగ, 15–55 మధ్య వయస్కులైన యువతులు, మహిళలందరికీ 1995 నాటికి విద్య లంభించేలాగ కృషి సాగించాలని నిర్దేశించారు.

"స్త్రీ అధ్యయనం" అనే అంశాన్ని ఒక ప్రత్యేక కోర్సుగా అభివృద్ధిపర్చేందుకు మహిళాసంస్థల్ని ప్రోత్సహించాలని జాతీయ విద్యావిధానం ఆకాంక్షించింది.

స్త్రీలు సామూహికంగా ఆలోచించడం, నిర్ణయాలు తీసుకోవడంవల్ల శక్తిని సముపార్జించుకొంటారు. దానికి కొలమానాలు (1) సానుకూల వ్యక్తిత్వం, ఆత్మవిశ్వాసాలు పెంచుకోవడం, (2) విమర్శనాత్మకంగా ఆలోచించగల శక్తిని అభివృద్ధి చేసుకోవడం, (3) సంఘీభావంతో క్రియాశీల కార్యక్రమాలలో పాలు పంచుకోవడం, (4) సామాజిక మార్పును సాధించడంలో పురుషులతో సమానస్థాయిలో పాల్గొనేట్టు అభివృద్ధి చెందడం (5) సామాజిక మార్పు తేగల సామూహిక కార్యక్రమాలకు ప్రోత్సాహం, (6) ఆర్థిక స్వాతంత్ర్య సంపాదనకు అవకాశాల కల్పన.

1995 నాటికి ప్రతి విద్యాసంస్థ స్త్రీ అభివృద్ధికోసం నిర్దిష్ట కార్యక్రమాలు చేపట్టాలి; ఉపాధ్యాయులు, అనియత విద్యాబోధకులు అందరికీ స్త్రీలకు శక్తిసామర్థ్యాలు పెంపొందించడంలో శిక్షణనియ్యాలి. NCERT, RIEIPA, DAE, డైరెక్టరేట్, SCERT (SRCS), UGC– యివన్నీ కలిసి ప్రత్యేక శిక్షణా కార్యక్రమాలను రూపొందించాలి. ఉపాధ్యాయినులు, మహిళాబోధకులు, వయోజన, అనియత కార్యక్రమాల్లో పాల్గొంటున్న స్త్రీలలో ప్రత్యేక చైతన్యం కల్గించాలి. వీధి నాటకాలు, గోడ వార్తాపత్రికలు, తోలు బొమ్మలాటలు, రేడియోలు, టీవీలు, పత్రికలలో – యిలా అనేక విధాల సామాన్య స్త్రీలలో చైతన్యాన్ని కల్గించే అంశాలను ప్రచారం చేయాలి.

'స్త్రీ అధ్యయనం' అనే కోర్సు బోధన, పరిశోధన, శిక్షణ, సేవాకార్యక్రమాలు అనే నాలుగు భాగాలుగా వుంటుంది. స్త్రీ సమస్యలను అండర్ గ్రాడ్యుయేట్ కోర్సుల్లో చేర్చేట్టు యు.జి.సి. ప్రతిపాదించాలి. గోష్ఠులు, వర్క్‌షాపులు. ఉపాధ్యాయులకు పునశ్చరణ తరగతులు, పాఠ్య పుస్తకాలను పునర్వ్యవస్థీకరించే వర్క్‌షాపులు నిర్వహించాలి. వయోజన విద్యా కార్యక్రమాల్లో చట్టాలను చదవగల అక్షరాస్యత వంటివి వుంటాయి. బాలికల కోసం అనియత విద్యాకేంద్రాలు చాలా తక్కువగా వున్నాయి. వాటిని పెంచేందుకు తగు నిధుల నందించాలని నిర్దేశించారు.

వృత్తి, ఉద్యోగ సాంకేతిక విద్యాసంస్థలలో మహిళలకు లభిస్తున్న అవకాశాలను ప్రత్యేకించి అధ్యయనం చేయాల్సి వుంది. స్త్రీలకు ప్రత్యేకించి 104 పారిశ్రామిక శిక్షణా సంస్థలున్నాయి. 197 పారిశ్రామిక శిక్షణా సంస్థల్లో సాధారణ శిక్షణాసంస్థల్లో మహిళా విభాగాలు ప్రత్యేకించారు. వాటిని ఆయా వృత్తులు, ప్రాంతీయ అవసరాలు దృష్టిలో వుంచుకుని బాలికలకు ప్రత్యేకించి తోడ్పడే విధంగా వాటిని విభజించాలని 1987 – 90 లలో తలపెట్టారు. DCE & T ఆఫీసు మహిళావృత్తి శిక్షణా డైరెక్టరేట్‌ను వేరుపర్చాలని కోరారు. NCERT లో స్త్రీ కేంద్రాలను వ్యవస్థీకరించాలని, యు.జి.సి. లో స్త్రీ కేంద్రాన్ని మరింత పటిష్టపరచాలని NIEP వయోజన డైరెక్టరేట్ల స్త్రీల శిక్షణా కేంద్రాలను, రూపొందించాలని ఆదేశించారు. రాష్ట్రాల స్థాయిలలో స్త్రీ కేంద్రాలు నెలకొల్పి, కనీసం జాయింట్ డైరెక్టర్ స్థాయి అధికారిని దాని నిర్వహణకు నియమించాలి.

## ఇలా ఆర్ భట్ కమిటీ:

స్వయంగా వృత్తులు నిర్వహించుకునే ఉద్యోగినుల సమస్యలను పరిగణించేందుకు జాతీయ స్థాయిలో 1987 జనవరి 5 న ఒక కమిటీని ప్రభుత్వం నియమించింది. ఇలా ఆర్ భట్ ఈ కమిటీ అధ్యక్షురాలు. 1988 జూన్‌లో ఆమె నివేదిక సమర్పించారు. రక్షణ లేని కార్మికస్త్రీల సమస్యలను ఈ కమిటీ ప్రత్యేకించి పరిశీలించింది. షిఫ్ట్ పద్ధతిలో బాలికలకు విద్యావకాశాలు కల్పిస్తే స్వయం ఉపాధి కల్పించుకున్న కార్మికస్త్రీల కుటుంబాలలోనివారి బాలికలు చదువుకోడానికి అనుకూలంగా వుంటుందని ఈ కమిటీ అభిప్రాయపడింది. ఇంటిదగ్గర తల్లికి పనిపాటల్లో సాయం చెయ్యాల్సి వున్నందున, చిన్నపిల్లలను ఆడించాల్సి వున్నందున ఈ కుటుంబాల బాలికలను పాఠశాలలో చేర్చడం తక్కువగా వుంటుందని కమిటీ గమనించింది. మధ్యాహ్న సమయాలలో బడిని నిర్వహించి, గౌరవవేతనం యిచ్చి ఒక సహాయకురాలుని నియమించి, ఆమె బాలికలను పాఠశాలకు సురక్షితంగా తీసుకువచ్చేట్టు చేయాలి. బడిసమయంలో చిన్న పిల్లలను ఆడించటానికి షెడ్డుగాని, వేరే ఏర్పాటు గాని వుండాలి. హర్యానావంటి రాష్ట్రాలలో నెలకింత పారితోషికం, ఉచిత యూనిఫారాలు షెడ్యూలు తెగల బాలికలకు యిచ్చి విద్యార్జనకు ప్రోత్సాహమిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాల విద్యలో పశుపోషణ, పాడిపరిశ్రమ, పంటపనులు, సామాజిక అడవులు వంటివి బోధనాంశాలుగా చేసి, చరిత్ర, భూగోళం, ఆధునిక శాస్త్రాలు వంటివి బాలికలు ఐచ్ఛికంగా ఎంచుకునే అంశాలుగా చేయవచ్చు. పైతరగతుల కోర్సు మాత్రం పెద్ద పట్టణాల్లో విద్యార్థులతో సమంగావుండి, కొన్నిస్థాయిల్లో ఉద్యోగాలు సంపాదించడానికి అనువుగా వుండాలి.

గ్రామీణ ప్రాంతాలలో ఆశించినంతమేరకు వారి స్వగ్రామాల్లోనే ఉపాధ్యాయులను నియమించాలి. 20 కిలోమీటర్లలోపు దూరంలోనే వారిని నియమించాలి. గ్రామీణ ప్రాంతాల్లో చాలినంతమంది శిక్షణ పొందిన ఉపాధ్యాయినులు లేరు. అందువల్ల ప్రాథమిక సెకండరీ పాఠశాల విద్య పూర్తిచేసిన బాలికలకు ఒక సంవత్సరం పాటు ఉచిత శిక్షణ విచ్చి స్వగ్రామాలు లేదా సమీప గ్రామాల్లో నియమించాలని ఈ కమిటీ సూచించింది.

వయోజనవిద్యా కార్యక్రమాల్లోని ప్రాథమిక పాఠ్యపుస్తకాలలోని అంశాలు మహిళా కార్మికులకు ఆసక్తి కల్గించేవిధంగా వుండటం లేదు. అందువల్ల వాటిని తిరిగి పరిశీలించి కొత్తగా రాయించాలని కమిటీ సూచించింది.

బాలికలకు వృత్తి విద్యలో శిక్షణ లభించేటట్లు ప్రత్యేకించి కేంద్రీకరించాలి. ఆ శిక్షణా వ్యయాన్ని భరించేందుకు వారికి అప్పురూపంలో సహాయపడి వారు ఉద్యోగం చేస్తూ తీర్చుకొనే సౌకర్యం కల్పించాలి. శిక్షణ పూర్తయిన బాలికలకు ఉద్యోగాలు లభించేందుకు తోడ్పడాలి. నిరుపేద స్త్రీల మౌలిక సమస్యకు అక్షరాస్యత ఒక్కటే పరిష్కారం కాదని; పరపీడన, ఆకలి మొదలైన సమస్యల పరిష్కారానికి వీలుగా సామాజిక న్యాయం సాధించేందుకు స్త్రీలు ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగే విధంగా పాఠ్యాంశాల బోధన వుండాలని ఈ కమిటీ భావించింది.

## జాతీయ సమగ్రదృక్పథం:

2000 వ సంవత్సరం నాటికి స్త్రీలు అన్ని రంగాలలో ముందంజవేసే విధంగా విద్యాప్రణాళికలను విభిన్న సంస్కృతులు, భౌగోళిక, సాంఘిక, ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా జిల్లా, బ్లాకుస్థాయిలలో రూపొందించి అమలుపర్చాల్సి వుంది.

1984–85 వరకు ప్రచురితమైన విద్యారంగ గణాంకాలను బట్టి 6–11 సంవత్సరాల బాలికలలో ప్రాథమిక స్థాయిలో బడిలో ప్రవేశించినవారి సంఖ్య, అంతకుముందు కంటే 25 శాతం పెరిగినట్టు కనబడుతోంది. అంటే – మొత్తం 47 శాతం అభివృద్ధి సాధించినట్టు చెప్పవచ్చు.

1984 – 85 నాటికి దేశం మొత్తంపై ఈ వయసు బాలికలు 1 కోటి 76 లక్షలమంది పాఠశాలల్లో ప్రవేశించారని అంచనా. అయితే, జనాభాలో వీరి సంఖ్య 4 కోట్ల 22 లక్షలుంటారని అంచనా. అంటే – 40.7 శాతం మందికి మాత్రమే పాఠశాల ప్రవేశం లభించింది. అలాగే 11–14 సం॥ మధ్య బాలికలు 48 లక్షల 10 వేల మంది పాఠశాలల్లో ప్రవేశించారు. 2 కోట్ల 49 లక్షల 90 వేలు వీరి మొత్తం సంఖ్య అని అంచనా. అంటే, 19.2 శాతం మాత్రమే పాఠశాలల్లో ప్రవేశించారు. 1989–90 నాటికి 6–11 సం॥

మధ్య బాలికలు 4 కోట్ల 62 లక్షలు, 11–14 సం॥ మధ్య బాలికలు 2కోట్ల 67 లక్షల్లో వుంటారని అప్పటికి అంచనా వేశారు. అంటే, వరసగా 2 కోట్ల 96 లక్షలు, 2 కోట్ల 19 లక్షల మందికి, అంటే సమారు 5 కోట్ల మందికి పైగా బాలికలకు విద్యాసౌకర్యం కల్పించాల్సి వుంటుంది.

నిరక్షరాస్యత నిర్మూలన, పాఠశాలలో చేరిన బాలికలు మానకుండా విద్యార్జన కొనసాగించేట్టు ప్రోత్సహించడం వృత్తివిద్యలందించి ఆర్థికావకాశాలు పెంచడం ప్రధాన కర్తవ్యాలు కావాలి. ఇందుకు అన్ని విధాల చర్యలు తీసుకోవాలి. ఉపాధ్యాయుల సంఖ్యను పెంచడం ఏకోపాధ్యాయ పాఠశాలల్లో స్త్రీలనే ఉపాధ్యాయినులుగా నియమించడం. ఇద్దరు ఉపాధ్యాయులుంటే వారిలో ఒకరు తప్పనిసరిగా మహిళై వుండటం అవసరం. ఒరిస్సాలో ప్రాథమిక ఉపాధ్యాయ ఉద్యోగాలన్నింటినీ స్త్రీలకే ప్రత్యేకించడం గమనార్హం.

ఏమైనా, ఎలిమెంటరీ పాఠశాలలో 50 శాతం ఉద్యోగాలను స్త్రీలకు కేటాయించాలి. గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే వారికి తగు వసతి కల్పించాలి.

మహారాష్ట్రలో సావిత్రిబాయి పూలే పథకం అంటే పెంపుడు తలిదండ్రుల పథకం ఇతర రాష్ట్రాలలోనూ, కేంద్ర పాలిత ప్రాంతాల్లో కూడా ప్రవేశపెట్టవచ్చు. నిరుపేద బాలికలు ప్రాథమిక విద్యనైనా పూర్తిచేయటానికి ఈ పథకం వీలు కల్పిస్తుంది. ధనవంతులు లేదా ఇతర స్వచ్ఛంద సంస్థలు ఒక్కో పాఠశాలలోని కనీసం ఒకరు లేదా హెచ్చుమంది బాలికలను ఎంపిక చేసుకుని నగదు వస్తు రూపాలలో ఆ బాలికల విద్యార్జనకు తోడ్పడటం ఈ పథకం ప్రత్యేకత. బాలికల తలిదండ్రులకు ఆర్థికంగా సాయం చేయడానికి సైతం ఆ నిధులు వినియోగించవచ్చు. జిల్లా పరిషత్, బ్లాక్ లేదా మండల విద్యాధికారి, పాఠశాల ప్రధానోపాధ్యాయులు ఈ పథకాన్ని అమలుపర్చడంలో ముఖ్య పాత్ర వహించాలి. ముఖ్యంగా గిరిజన ప్రాంతం బాలికల విద్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలి.

వెనుకబడిన 9 రాష్ట్రాల్లో 90 శాతం నిధులను కేంద్రం యిస్తూ, అనియత విద్యా పథకాలు బాలికలకు అమలు పరుస్తున్నారు. దేశంలోని ఏ రాష్ట్రంలోనైనా పాఠశాలల్లో బాలికల హాజరు తక్కువగా వున్న ప్రతిచోట ఈ పథకాలు అమలు పర్చాలి. 15 నుంచి 30 సం॥ మధ్య వయసుగల వారిలో కనీసం రెండున్నర లక్షల మంది మహిళల పైన సంక్షిప్త వృత్తికోర్సులు అందించాల్సి వుంది. సామాన్యవిద్యలో పది సంవత్సరాల కోర్సు పూర్తిచేసి, ఏదో ఒక వృత్తిలో జీవన భృతిని పొందేవిధంగా శిక్షణ పొందే సౌకర్యం కల్పించాలి. సెకండరీ విద్యకు సమాంతరంగా డైవర్సిఫయిడ్ కోర్సులు యిందుకు తోడ్పడతాయి.

కరస్పాండెన్స్ కోర్సులు, దూరాధ్యయన తరగతులు, ఓపెన్ స్కూలు పద్ధతులు విస్తరింపజేయడం అవసరం.

సెకండరీ విద్యాలయాల్లో సైన్సును అభిమానంగా తీసుకున్న బాలికలను ప్రత్యేక ఉపకారవేతనాలిచ్చి ప్రోత్సహించాలి.

బాలికల కోసం ప్రత్యేకించి పాలిటెక్నిక్‌లు ఏర్పరచాలి. డిగ్రీ డిప్లమో కోర్సులతోబాటు స్వల్పకాలపు ప్రత్యేక కోర్సులు ద్వారా వారి ప్రతిభా పాటవాలు పెంచుకునే అవకాశం కల్పించాలి.

సామాజిక సమస్యలు, ఆరోగ్య సంరక్షణ, పోషకాహారం గురించి చెప్పే కార్యక్రమాలు, చట్టరీత్యా స్త్రీల హక్కులను తెలియజెప్పే కార్యక్రమాలు నిర్వహించాలి.

పరిశ్రమల్లో లేక ఇతర చోట్ల పనిచేసే స్త్రీలందరినీ అక్షరాస్యులను చేయాలి. పనిచేసే సమయంలోనే వారి చదువుకోసం యాజమాన్యాలు కొంత సమయం కేటాయించాలి. దీన్ని చట్టబద్ధంగా యజమానుల బాధ్యతగా చేయాల్సి వుంది.

ఉపాధ్యాయ శిక్షణా సంస్థలన్నిటిలో 50 శాతం సీట్లను ప్రీసర్వీసు కోర్సులలో స్త్రీలకు కేటాయించాలి. గ్రామీణ ప్రాంతాల స్త్రీలను ఉపాధ్యాయినులుగా ఎంపిక చేసే ప్రత్యేక పథకాలు రూపొందించాలి.

అయితే, స్త్రీ విద్యాభివృద్ధి మహిళల సహకారంతోనే సాధ్యపడుతుంది. ప్రభుత్వము, స్వచ్ఛంద సేవాసంస్థలూ సమష్టిగా కృషిచేసి, విద్యపట్ల స్త్రీలు ఆకర్షితులయేట్టు నిర్విరామంగా కృషి చేయాలి.

"ఒక స్త్రీ విద్యావంతురాలైతే కుటుంబమంతా విద్యావంతులైనట్లే" అనే నానుడిని నిజం చేసేందుకై స్త్రీలందరూ చదువుపట్ల ఆసక్తి చూపాలి. దేశాభివృద్ధి కోసం పాటుపడేందుకు స్త్రీలు విద్యావంతులై, తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. అందుకు ప్రభుత్వం తన సహాయ సహకారాల ద్వారా వారికి ప్రోత్సాహమందించాలి.

## ఆంధ్రప్రదేశ్‌లో:

రాష్ట్ర స్త్రీ విద్యా కౌన్సిలు రాష్ట్రంలో స్త్రీ విద్య విషయమై అనేక సూచనలు చేసింది. వాటిలో ముఖ్యమైనవి ఇవి:

పాఠశాలలకు వెళ్ళే బాల బాలికలమధ్య సంఖ్యాపరంగా అగాధం హెచ్చుగా వుంది. అందువల్ల ఆ సంఖ్య సరిసమానం అయ్యేవరకు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఉన్నతాధికారిగా ప్రతిభా సామర్థ్యాలుగల ఒక అధికారిని నియమించాలి. విద్యాశాఖ డైరెక్టరుతో సమానమైన అధికారాలు యిచ్చి, వివిధ స్థాయిలలో స్త్రీవిద్యాభివృద్ధి బాధ్యత అప్పగించాలి. ప్రతి జిల్లాలో బాలికల విద్యాభివృద్ధికి ఒక అధికారి వుండాలి.

సేవాసంస్థల ఆధ్వర్యంలో వయోజన విద్యా కేంద్రాలు స్థాపించి, స్త్రీలలో అక్షరాస్యుల సంఖ్య పెంచాలి. శిశు విద్య విషయంలో ప్రభుత్వం పూర్తి బాధ్యత వహించి, ఫీజులను స్థిరపరచాలి. కొఠారి కమిషన్ సూచన మేరకు ప్రతి జిల్లా కేంద్రంలో శిశు విద్యాభివృద్ధి కేంద్రం స్థాపించి ప్రీ ప్రైమరీ ఉపాధ్యాయినులకు శిక్షణ ఇవ్వాలి. స్త్రీ విద్యా డైరెక్టర్ రాష్ట్రస్థాయిలో స్త్రీవిద్య పై ఒక బృహత్ ప్రణాళిక రూపొందించాలి. విద్యార్థినుల సంఖ్య పెరుగుతుందా లేదా – తగ్గితే కారణమేమిటి అని ఎప్పటికప్పుడు పరిశీలించి తగు చర్యలు సూచించాలి. ఉపాధ్యాయినులు, తలిదండ్రులు, సంఘంలో పెద్దలతో ఉన్నతస్థాయి కమిటీలను ఏర్పరచి, బాలికల విద్యాభివృద్ధిని అంచనా వేస్తుండాలి. ఆంధ్రప్రదేశ్ లో ప్రాథమిక అప్పర్ ప్రైమరీ దశల్లో మిక్సెడ్ పాఠశాలలున్నందున సాధ్యమైనంతవరకు ఉపాధ్యాయినులను నియమించాలి.

పాడై కూలిపోయేస్థితిలో ఉన్న పాఠశాల భవనాల్ని మరమ్మతు చేయించాలి. చెట్ల కింద తరగతులు నిర్వహిస్తున్న దుస్థితి తప్పించాలి. ప్రాథమిక దశలో బాలికలు బడి మానకుండా, వారు ఎత్తుకోవల్సిన చంటిపిల్లలకు క్రెచ్ లు ఏర్పాటు చేయడంలో సాంఘిక సంక్షేమ శాఖ తోడ్పడాలి. ప్రతిభగల బాలికలకు ఉపకార వేతనాలు, బహుమతులు యిచ్చి ప్రోత్సహించాలి. సెకండరీ విద్య ప్రోత్సాహానికి బాలికలకు అన్ని ప్రాంతాలలో ఉన్నత బాలికా పాఠశాలలు ఏర్పాటు చేయాలి. ప్రతి తాలూకా కేంద్రంలో బాలికా పాఠశాలలు, వసతిగృహాలు వుండాలి. పాఠశాలల కొరత వుంటే షిఫ్ట్ పద్ధతిలో బాలికలకు అవే పాఠశాలల్లో విడిగా తరగతులు నిర్వహించాలి. కళాశాలల విద్యార్థినులు ఎంప్లాయిమెంట్ ఎక్ఛేంజిలో నమోదు చేయించుకొన్నప్పుడు మోసాలు జరగకుండా విద్యాధికారులు హటాత్తుగా తనిఖీలు చేసి, రికార్డులు సరిగా వున్నదీ లేనిదీ పరీక్షించాలి.

పాఠ్యప్రణాళికలు, పాఠ్యగ్రంథాల తయారీపై ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహించాలి. యుగయుగాలుగా సంస్కృతి వారసత్వం నిలబెడుతోంది స్త్రీలే కనుక ప్రాచీన ఆధునిక విలువలను వారు కాపాడగలిగే విధంగా మతాతీత నైతిక బోధన వుండాలి.

కళాశాలస్థాయిలో గణితం, ఆధునిక విజ్ఞానశాస్త్రాలలో ప్రతిభ చూపిన బాలికలకు ప్రత్యేక ప్రోత్సాహాలుండాలి. ఐ.ఎ.ఎస్. వంటి పోటీ పరీక్షలలో పాల్గొనేవిధంగా ప్రతిభగల బాలికలకు ప్రోత్సాహం, ప్రత్యేక బోధనా సౌకర్యం ఏర్పాటు చేయాలి. మహిళా కళాశాలలన్నిటిలోను నర్సింగ్ కోర్సులు ప్రవేశపెట్టడం అభిలషణీయం. స్త్రీలకోసం మరిన్ని పాలిటెక్నిక్ కళాశాలలు ఏర్పాటు చేయాలి. కార్మిక స్త్రీలకు సమానమైన పనికి సమాన వేతనం లభించేలా రాష్ట్రప్రభుత్వం చూడాలి. మూగ బధిర బాలికలకు ఉచితవిద్యతోబాటు ఉపకార వేతనాలు యివ్వాలి. మహిళా కళాశాలల్లో ప్రిన్సిపాల్ స్గా మహిళలను నియమించాలి.

### పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం :

1983 ఏప్రిల్ 14 న విద్యాకేంద్రమైన తిరుపతిలో కేవలం మహిళలకోసం శ్రీ పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం ప్రారంభించారు. తొట్టతొలి వైస్‌ఛాన్సలర్‌గా శ్రీమతి వనజా అయ్యంగార్ పని చేశారు.

సంగీతం, సోషల్ వర్క్స్, అప్లయిడ్ మాథమేటిక్స్, ఇంగ్లీషు లాంగ్వేజ్ అండ్ లిటరేచర్, కమ్యూనికేషన్ అండ్ జర్నలిజంలలో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులతోబాటు, సెరీకల్చర్, కంప్యూటర్ ప్రోగ్రామింగ్, సెక్రటరీషిప్‌లలో డిప్లమా కోర్సులను – అలాగే చైల్డ్ కేర్, కార్టోగ్రఫీ, ఫాషన్ క్రాఫ్ట్స్, డిజైన్ అండ్ ఇంటీరియల్ డెకరేషన్, స్పోకెన్ అండ్ ఫంక్షనల్ ఇంగ్లీషు, ప్రీ స్కూలు ఎడ్యుకేషన్, న్యూట్రిషన్‌లలో సర్టిఫికెట్ కోర్సులను, వాటితోబాటు బి.ఇడి, డి.సి.జి.ఎల్. కోర్సులను ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది.

# సంప్రదాయేతర విద్య

డా॥ కేతు విశ్వనాథరెడ్డి, డా॥ కె.యెస్. రమణ

సంప్రదాయ విద్యకు మరొక పేరు నియత విద్య. నియత విద్యకు కొన్ని కట్టుదిట్టమైన సంప్రదాయాలున్నాయి. అవి: 1. తరగతి గదుల చదువులు, 2. అధ్యాపకులు, విద్యార్థుల మధ్య నియతకాలంలో ముఖాముఖి సాన్నిహిత్యం, సంబంధాలు, 3. ప్రయోగశాలలు, 4. క్షేత్రశిక్షణ, 5. నియత కాల బోధన, 6. నియతమైన రోజుల్లో హాజరు మొదలైనవి. సంప్రదాయ విద్య అంటే ఒక్కమాటలో చెప్పాలంటే తరగతి గదుల్లో సాగే నియమబద్ధ కాలం చదువులు. ప్రాథమిక విద్య, ప్రాథమికోన్నత విద్య, ఉన్నత పాఠశాల విద్య, జూనియర్ కళాశాల విద్య, డిగ్రీకళాశాల విద్య, వృత్తి, సాంకేతిక విద్య,· ఈ కోవకు చెందుతాయి. అయితే ఇవి మాత్రమే తమ సమాజాల్లోని విద్యావసరాలను అన్నిటిని తీర్చలేవనీ, విద్యను ప్రజాస్వామికం చేయలేవనీ ప్రపంచదేశాలు ఈనాడు గుర్తించాయి. వర్ధమాన దేశాలు విద్యారంగంలో సాధించదలచుకున్న ప్రధాన లక్ష్యాలు; విద్యా ప్రణాళికల్లో ఎదుర్కొంటున్న సమస్యలు, కొత్త కొత్త వృత్తులూ, ఉపాధి అవకాశాలు, ఉద్యోగాల కనుగుణంగా విద్యాభిలాషుల్లోని సంశ్లిష్టతకు అనుగుణంగా విద్యాక్రమాలను విస్తరింప జేయటం. వైజ్ఞానిక, సాంకేతిక ప్రగతికీ, సామాజిక పురోగతికీ గల సంబంధాన్ని గుర్తించి, విద్యా ప్రమాణాల అభివృద్ధికి దోహదం చేయటం. మానవ వనరుల అభివృద్ధికి తోడ్పడటం. స్వయం విద్య, నిరంతర విద్య, ప్రాధాన్యాన్ని గుర్తించటం – మొదలైన అవసరాల్ని కలిగిన దేశాలన్నీ తరగతి గది బయట చదువులను విస్తరింప చేయగలిగిన విద్యా ప్రణాళికలనూ, వ్యూహాలనూ రూపొందించుకుంటున్నాయి. తరగతి గదుల చదువులే సర్వస్వం అనుకోకుండా విద్యను అందించే పద్ధతినే సంప్రదాయేతర విద్య అని మనం పిలుచుకుంటున్నాము. సంప్రదాయేతర విద్య అంటే గురు బోధ – గురు శిష్య సంవాదం కాదు. తరగతి బోధనా కాదు. వ్యక్తి సొంతంగా స్వచ్ఛందంగా తన వెసులు బాటును బట్టి విద్యను అభ్యసించే పద్ధతి ఇది. అనియత విద్య, వయోజన విద్య, విస్తరణ విద్య, కరస్పాండెన్స్ విద్య, ప్రయివేటు విద్య, రేడియో విద్య, ఉపగ్రహ విద్య, దూరవిద్య – ఈ మాటలన్నీ సంప్రదాయేతర విద్యను సూచించేవే. ఇవి సంప్రదాయేతర విద్యను సాధించటానికి ఏర్పడిన వివిధ పద్ధతులు, వ్యవస్థలు. ఈ పద్ధతుల, వ్యవస్థల మధ్య, వీటి లక్ష్యాల మధ్య లక్ష్య సాధన కోసం వాడే బోధన, ఉద్దేశించిన విద్యాభిలాషుల మధ్య కూడా తేడాలున్నాయి. కొన్ని సందర్భాలలో ఒకదాని కొకటి సహాయ కారకులుగా ఉన్నాయి. ఈ పద్ధతులను అమలు జరిపే వ్యవస్థల మధ్య తేడాలున్నాయి. ఈ వ్యవస్థల లక్ష్యాల మధ్య భేదాలున్నాయి. ఉద్దేశించిన విద్యాభిలాషుల సముదాయాల మధ్య తేడాలున్నాయి. బోధనా అధ్యయన పద్ధతుల్లో భేదాలున్నాయి. అధ్యయన పరికరాల రూపకల్పనల్లో భేదాలున్నాయి.

భారతదేశం సంప్రదాయేతర విద్య వ్యూహాన్ని అనుసరించక తప్పదని గుర్తించింది. అక్షరాస్యత విషయంలోని వెనుకబాటు తనాన్ని గుర్తించటంవల్లా, విద్యనూ, విద్యాప్రమాణాలనూ మానవ వనరుల అభివృద్ధికి అనుగుణంగా పెంచవలసిన అగత్యాన్ని గుర్తించటం వల్లా ఈ వ్యూహాన్ని ప్రోత్సహిస్తోంది. జాతీయ విద్యా విధానంలో భాగంగా సంప్రదాయేతర విద్యను ప్రోత్సహిస్తోంది. జాతీయ విద్యా విధాన లక్ష్యాలకు అనుగుణంగా ఆంధ్రప్రదేశ్ కూడా సంప్రదాయేతర విద్యా వ్యాప్తికి ప్రయత్నిస్తోంది. ప్రయత్నించక తప్పని పరిస్థితి అటు కేంద్రానికీ, ఇటు రాష్ట్రానికీ ఏర్పడింది.

భారత జనాభాలో ఏడుసంవత్సరాలు ఆపైన అక్షరాస్యులైన వారి శాతం 52.11 (పురుషుల్లో 64 శాతం, మహిళల్లో 39 శాతం). పట్టణ గ్రామీణ ప్రాంతాల మధ్య, మైదాన గిరిజన ప్రాంతాల మధ్య అక్షరాస్యత శాతంలో తేడాలు కన్పిస్తాయి. భారతీయ సమాజం ఆర్థికంగా వెనుకబడిందే. వ్యవసాయం, పశుపోషణ, అడవులు, మత్స్యపరిశ్రమ వంటి ప్రధాన రంగంలో 69 శాతం పని చేస్తున్నారు. 13 శాతం గనులు, నిర్మాణాలు, ఉత్పత్తుల రంగంలో పనిచేస్తున్నారు. 18 శాతం వ్యాపారం, వాణిజ్యం, రవాణా కమ్యూనికేషన్ల

వంటి వాటిలో పని చేస్తున్నారు. భారతదేశంలో రాజ్యాంగ VIII షెడ్యూలు గుర్తించిన 18 భాషలున్నాయి. 29 మిలియన్ల ప్రజలు మాట్లాడే మరికొన్ని ముఖ్యమైన భాషలు 90 దాకా ఉన్నాయి.

ఇంతటి జనాభా, సంక్లిష్టస్థితి ఉన్న దేశంలో పాఠశాలల్లో నమోదైన వారు 1991–92 గణాంక వివరాల ప్రకారం 157 మిలియన్లు. కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో నమోదైన వారు 4.33 మిలియన్లు. 8,11,022 పాఠశాలలూ, 8,111 కళాశాలలూ, 196 విశ్వవిద్యాలయాలు, 887 పాలిటెక్నికులూ ఉన్నాయి. 5 మిలియన్ల అధ్యాపకులు బోధనలో ఉన్నారు. ప్రసార సాధన వ్యవస్థలో పెద్ద మార్పులు వచ్చినా భారతీయ సంప్రదాయ విద్యారంగ చిత్రం ఇది.

ఆంధ్రప్రదేశ్ పరిస్థితి మరీ ఘోరం. అక్షరాస్యత విషయంలో ఆంధ్రప్రదేశ్ మనదేశంలో 23వ స్థానంలో ఉంది. భారతదేశంలో విద్యా విషయంలో వెనుకబడిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఇక్కడి జనాభాలో అక్షరాస్యులు 45.11 శాతం మాత్రమే. ప్రతి వంద మందిలోను అక్షరాస్యులైన పురుషులు 55 మంది. ప్రతి వంద మందిలోను అక్షరాస్యులైన స్త్రీలు 33 మంది ఉన్నారు. కొన్ని జిల్లాల్లో మరీ తక్కువ. ఉదాహరణకు మహబూబ్ నగర్‌లో అక్షరాస్యులైన ప్రతి వంద మందిలోను స్త్రీలు 18 మంది, మెదక్‌లో 19, హైదరాబాద్‌లో 20 మంది మాత్రమే. ఇక గ్రామీణ ప్రాంతాలలో స్త్రీలు నూటికి 76 మంది నిరక్షరాస్యులే. ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాల్లో 20 జిల్లాల అక్షరాస్యత జాతీయ సగటు అక్షరాస్యత కంటే తక్కువ.

విద్యారంగంలో ఆంధ్రప్రదేశ్‌లో 2000 సంవత్సరం నాటికల్లా ప్రాథమిక విద్యను అభ్యసించే వారి సంఖ్య కోటికి చేరవచ్చని అంచనా. అందులో 60 శాతం మంది ప్రస్తుతం ఉన్న ప్రాథమిక విద్యారంగంలో చేరుతారు అనుకున్నా, మిగిలిన 40 లక్షల మంది విద్యార్థులు చేరి చదువుకోటానికి అనువుగా అనియత విద్యాపథకాలూ, ప్రణాళికలూ ప్రభుత్వం సిద్ధం చేసుకోవాలి. 1997 నాటికి నూటికి నూరు శాతం అక్షరాస్యతను సాధించాలని ప్రభుత్వం తలపెట్టింది. వీటికి తగినట్లు ప్రభుత్వం చేపట్టిన అనేక ప్రణాళికల్లో సంస్కరణల్లో ప్రధానమైనవి: అనియత విద్యా విధానం, వయోజన విద్యావిధానం.

## అనియత విద్యావిధానం :

పాఠశాలల్లో చేరడం, చేరి నియమిత వేళల్లో, నిర్ణీతదినాల్లో, పద్ధతుల్లో చదవడం, అందుకోసం అవసరమయ్యే వ్యయాన్ని భరించడంవంటి నియత విద్యా పద్ధతులకు భిన్నంగా 9–14 సంవత్సరాల వయసు ఉండేవాళ్ళు ప్రాథమిక విద్య అభ్యసించే పద్ధతి ఇది. ఆర్థిక, సామాజిక కారణాలవల్ల బడుల్లో చేరలేకపోయిన పిల్లలకూ, చేరి మానుకున్న పిల్లలకూ వారికి అనుకూలమైన వేళల్లో రోజుకు రెండుగంటల్లో బోధించే పద్ధతి ఇది. ప్రాథమిక విద్యను నాలుగు స్థాయిల్లో రెండు సంవత్సరాలు బోధిస్తారు. ఒక్కొక్క స్థాయి 6 నెలల్లో పూర్తి అవుతుంది. ఈదశ తర్వాత మరి 2 సంవత్సరాల్లో 6,7 తరగతుల స్థాయి బోధన ఉంటుంది. (ప్రాథమిక స్థాయి 9–11 మాధ్యమికస్థాయి 11–14) అనియత విద్యా పాఠశాలలకు ప్రత్యేక భవనాలూ, ఆటస్థలాలు ఉండవు. నియత విద్యా పాఠశాలల్లోనో, సమాజాభివృద్ధి కేంద్రాల్లోనో, గ్రామ పఠనాలయాల్లోనో, గ్రంథాలయాల్లోనో, వీధిలైట్ల క్రిందో, చెట్టుక్రిందో, ఉపాధ్యాయుని ఇంట్లోనో జరుపాలని రాష్ట్రప్రభుత్వ ఆశయం. స్వచ్ఛంద సేవాసంస్థలు నిర్వహించాలని కేంద్ర ప్రభుత్వ ఆకాంక్ష. ఆరో పంచవర్ష ప్రణాళికాకాలంలో ఈ పద్ధతి అమలులోకి వచ్చింది.

అనియత విద్యాకేంద్రాల్లో 1 నుంచి 4 స్థాయిల్లో దేనికి చెందినవారినైనా 25 మందిని చేర్చుకుంటారు. ఒక ఉపాధ్యాయుడు వుంటాడు. కనీసం 10వ తరగతి ఉత్తీర్ణుడైన అనియత విద్యా కేంద్రం ఉండే గ్రామవాసినే ఉపాధ్యాయునిగా నియమిస్తారు. ఈ పద్ధతికి తగినట్లు పాఠ్యపుస్తకాలనూ, ఉపాధ్యాయ కరదీపికలనూ, మూల్యాంకన సామాగ్రిని సిద్ధంచేసి కేంద్రాలకు ప్రభుత్వం అందిస్తోంది. బోధనోపకరణాలను ఉచితంగా పంచిపెడుతుంది.

6–14 వయో వర్గంలో పాఠశాలల్లో ప్రవేశించని పిల్లలు 80% పైగా ఉన్న తొమ్మిది రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్ ఒకటి. విద్యామంత్రిత్వశాఖ ఈ రాష్ట్రాలకు అనియత విద్యా వ్యాప్తి కోసం ప్రత్యేక కేంద్ర సహాయాన్ని అందిస్తోంది. ఈ పథకం 79–80లో మొదలైంది.

ఆంధ్రప్రదేశ్‌లో 84 లక్షల మంది పాఠశాల విద్యార్థులున్నారు. ఈ శతాబ్ది అంతానికి వీరి సంఖ్య కోటికి చేరవచ్చని అంచనా. ఇందులో 40 నుంచి 45 శాతం మంది మధ్యలోనే చదువు మానేస్తున్నారు. అటువంటి వారికోసమే 'ఓపెన్‌స్కూల్' ప్రయోగాన్ని ప్రారంభించారు. విద్యను సార్వత్రికం చెయ్యడం, సమాజంలో సమానత్వాన్ని, న్యాయాన్ని పెంపొందించడం, సమాజంలో అందర్నీ అక్షరాస్యులుగా తీర్చిదిద్దడం వంటివి 'ఓపెన్ స్కూల్' లక్ష్యాలు. 'సార్వత్రిక అధ్యయనం ద్వారా విద్య' శీర్షికన జాతీయ సార్వత్రిక పాఠశాల 1990లో సమర్పించిన నివేదనలో ఓపెన్‌స్కూల్ ఎలా ఉండాలో సవివరంగా చర్చించారు. ఆ సూచనల స్ఫూర్తితో 'ఓపెన్‌స్కూల్' వెలుగు చూసిందని చెప్పాలి.

రాష్ట్రంలో ప్రాథమిక విద్యారంగంలో వివిధ పథకాల కింద అనేక ప్రయోగాలు జరిగాయి. వాటిలో షెడ్యూల్డు

కులాలు, తెగలకు ప్రత్యేకించిన ప్రైమరీ నాన్ ఫార్మల్ సెంటర్లు, స్కూల్స్ 'ఇంటర్ ఓవర్సీస్ డెవలప్‌మెంట్ అథారిటీ', 'కో ఆపరేటివ్ అమెరికన్ రిలీఫ్ ఎవ్విరివేర్' (కేర్)ల పాఠశాలలు, అభ్యుదయ ప్రాథమిక పాఠశాలలు, మొదలైనవెన్నో ఉన్నాయి. వాటికి పరిమిత లక్ష్యాలూ, పరిధులూ ఉన్నాయి. ఈ నేపథ్యంలో సార్వత్రిక విద్యా పీఠం పనితీరును సమీక్షించుకోవాలి. ప్రాథమిక, సెకండరీ కోర్సులే కాక వ్యవసాయం, పశుపోషణ, ఆరోగ్యం, పరిసరాల శుభ్రత, గ్రామీణ, వ్యవసాయ ఉత్పాదక, అటవీ ప్రాతిపదిక, సేవా పారిశ్రామిక వృత్తులకు సంబంధించిన వృత్తివిద్యా కోర్సులెన్నింటినో విద్యా పీఠం ప్రారంభించాలనుకుంటోంది. పాఠశాలల్లో బోధనకు 'కొరుకుడు పడని' అనేక అంశాలను విద్యాపీఠం ద్వారా సాధించడానికి కృషి జరుగుతోంది. ముఖాముఖి బోధన, పాఠ్యపుస్తకాలే ప్రాతిపదికగా నియత విద్యావిధానం ఆసక్తికరంగా లేదని, అందువల్లనే అనేకమంది బాలబాలికలు చదువుకు మధ్యలోనే మంగళం పాడుతున్నారని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. వాస్తవిక దృష్టితో సార్వత్రిక విద్యాపీఠం, బోధనా పద్ధతుల్లో పెద్ద ఎత్తున మార్పులు ప్రవేశపెడుతోంది. దృశ్య, శ్రవణ విధానాలు వీటిలో కీలకమైనవి. పుస్తకాల ద్వారా నేర్పే విషయాలను దృశ్య శ్రవణ మాధ్యమాల ద్వారా మరింత మెరుగ్గా చెప్పవచ్చునన్న విశ్వాసంతో ఈ విధానాన్ని ఎన్నుకొన్నారు.

రాష్ట్రంలో చిత్తూరు, నిజామాబాద్, విశాఖపట్నం జిల్లాల్లో సార్వత్రిక విద్యాపీఠం 'ఓపెన్‌స్కూల్' కార్యకలాపాలను ప్రారంభించింది. దీనిని ఇతర జిల్లాలకు విస్తరించే ముందు పటిష్టమైన అంచనాలను రూపొందించాల్సి ఉంది.

చదువు మధ్యలో మానుకున్న పిల్లలకూ, పాఠశాలలు తమ గ్రామాల్లో లేని పిల్లలకూ, పనిపాటలు చేయక తప్పని పిల్లలకూ, రోజంతా పాఠశాలల్లో గడపలేని ఇబ్బందులున్న ఆడపిల్లలకూ ఈ అనియత విద్యను అందించాలనీ, ఆధునిక ప్రసార సాధనాలను కూడ వినియోగంలోకి తేవాలనీ, అనియత విద్యా విధానంలోనుండి బయటికి వచ్చే పిల్లలకు నియత విద్యాసంస్థల్లో ప్రవేశం కల్పించాలనీ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సంకల్పిస్తున్నాయి. ఆచరణలో ఈ అనియత విద్యా విధాన ఫలితాలు మనకింకా తెలియవు.

## వయోజన విద్యా విధానం :

నిరక్షరాస్యత నిర్మూలన కార్యక్రమాల్లో భాగంగా 15–35 వయో వర్గానికి ఆరో ప్రణాళిక కాలంలో ఉద్దేశించిన విద్యా విధానం ఇది. ఈ వయోవర్గానికి చెందినవారు మన రాష్ట్రంలో 80–81 నాటికి కోటి 10 లక్షల మంది ఉన్నారు.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, రాజకీయ పక్షాలు వాటి ప్రజా సంఘాలు, విద్యా సంస్థలు, స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రసార సాధనాలు మౌఖిక, లిఖిత, దృశ్య, శ్రవణ పద్ధతులద్వారా వయోజనులలో విద్యావ్యాప్తికి ఉద్దేశించిన విద్యా విధానం ఇది. ఒకవైపు అక్షరాస్యతా కార్యక్రమం, మరొకవైపు వయోజనుల వృత్తి శిక్షణ సాంఘిక చైతన్యం, సాంస్కృతికాభివృద్ధి ధ్యేయంగా సాగే వయోజనవిద్య మహారాష్ట్రతో పోల్చి చూసినపుడు మన రాష్ట్రం వెనుకబడి ఉంది. మహారాష్ట్రలో 6 విశ్వ విద్యాలయాలు 160 కళాశాలలు 1910 కేంద్రాలు వయోజన విద్యకు తోడ్పడుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం (1964) వ్యవసాయ పద్ధతులనూ, జాతీయ పోషకాహార సంస్థ (1958) పోషకాహార ఆవశ్యకతనూ వయోజనులకు తెలియచేసే కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి. రేడియోను, టెలివిజన్‌ను ఇందుకోసం వినియోగించుకుంటున్నాయి.

వయోజన అక్షరాస్యత కార్యక్రమాలు రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలు అంతటా విస్తరించాయని చెప్పలేము.

1985–86లో 23 జిల్లాలలో గ్రామీణ వయోజన అక్షరాస్యత కార్యక్రమాల్లో 3.66 లక్షల మంది చేరారు. రాష్ట్ర వయోజన విద్యా కార్యక్రమాల్లో 3.69 లక్షల మంది చేరారు.

6వ ప్రణాళికా కాలంలో ఈ కార్యక్రమాలు 13.63 లక్షల వయోజనులను అక్షరాస్యులను చేశాయి. ఈ మొత్తంలో స్త్రీలు 4.04 లక్షలు. షెడ్యూలు కులాలు 3.54 లక్షలు. షెడ్యూలు తెగలు 1.83 లక్షలు. 1986–87 సంవత్సరం ఈ కార్యక్రమాలకు రాష్ట్ర బడ్జెటులో 4 కోట్లు కేటాయించబడింది. ఉన్న 15కు అదనంగా మరో 22 కొత్త ప్రాజెక్టులను ఆరంభించి 15–35 వయోవర్గానికి చెందిన 3.33 లక్షల మంది నమోదు చేసుకోవాలనీ వయోజన విద్యా డైరెక్టరేటు నిర్ణయం.

మన రాష్ట్రంలో జరిగే వయోజన విద్యా కార్యక్రమాలకు అవసరమైన సాంకేతిక, ఇతర వనరులను అందజేసే వయోజన విద్యా వనరులకేంద్రం 1988 మార్చి నుంచి సాక్షరతా భవన్, ఆంధ్ర మహిళా సభ ఆధ్వర్యంలో నడుస్తోంది. జాతీయ అక్షరాస్యతా ఉద్యమ లక్ష్యాలకు అనుగుణంగా అభ్యాసకుల అవసరాలకు, పరిస్థితులకు తగినట్లుగా వ్యవహారిక భాషలో బోధనా సామగ్రి తయారుచేయటం, జిల్లా వనరులకేంద్ర సిబ్బందితో సహా వయోజన విద్యారంగంలో కృషిచేసే అన్ని సంస్థల క్షేత్ర కార్యకర్తలకు భిన్నస్థాయిలలో శిక్షణా కార్యక్రమాలను నిర్వహించటం, నూతన అక్షరాస్యులకు పఠన సామగ్రిని తయారుచేయడం ఈ కేంద్రం విధులు. రాష్ట్ర వయోజన విద్యా వనరుల కేంద్రం నిర్వహణకు అయ్యే ఖర్చును కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం యాజమాన్యం

వహించే స్వచ్ఛంద సంస్థ 80:15:5 నిష్పత్తిలో భరిస్తాయి. రాష్ట్ర వయోజన విద్యావసరాల కేంద్రం వయోజన విద్యా డైరెక్టరేట్, న్యూఢిల్లీ, వయోజన విద్యా డైరెక్టరేట్, ఆంధ్ర ప్రదేశ్ వారి సహకార సంపత్తితో రాష్ట్రంలోని వయోజన విద్యా వ్యాప్తికి కృషి చేస్తుంది.

ఎడ్యుకేషన్ ఫర్ ఆల్ స్టేట్ అడ్వకసీ ఫోరం ప్రాథమిక విద్యను సార్వత్రికం చేయటానికి కావలసిన సాధన సంపత్తి, వనరుల సమీకరణ, నూతన భావనల వ్యాప్తి, వివిధ కార్యసంస్థల మధ్య సమన్వయం మొదలైన బహుళవ్యూహాత్మక ఆచరణ పథకాలను రూపొందిస్తూ అక్షరాస్యతకు, విద్యావ్యాప్తికి కృషి చేస్తోంది.

## కరెస్పాండెన్సు విద్యా పద్ధతి :

నియత విద్యా విధానం మీద ఒత్తిడి తగ్గించడానికి విశ్వ విద్యాలయ పరీక్షలకు ప్రైవేటుగా కూర్చునే సదుపాయాలను భారత దేశంలోని నియత విశ్వవిద్యాలయాలు 1960–70 మధ్యకాలంలో సమకూర్చడం ఆరంభించాయి. ఒత్తిడి మాత్రమే కాదు ఉన్నత విద్యావకాశాలను సమాజంలోని చాలామందికి కల్గించడానికి ఈ పద్ధతి ఏర్పడింది. ఎందుకంటే రాష్ట్ర జనాభాలో ఉన్నత విద్యావంతుల శాతం 0.5 కూడా లేదు కాబట్టి. 1985 లెక్కల ప్రకారం దాదాపు 6 కోట్ల జనాభా ఉన్న రాష్ట్రంలో మొత్తం 354 కళాశాలల్లో చదువున్న వాళ్ల సంఖ్య 3,18,000 మాత్రమే. కాబట్టి కరెస్పాండెన్సు విద్య అవిచ్ఛిన్న విద్యాపద్ధతిగా రూపొందక తప్పలేదు.

ధనాభావం వల్ల మధ్యలో చదువు మానుకొన్న వాళ్ళకూ, నియత విద్యా సంస్థలకు చాలా దూరాల్లో ఉన్న వాళ్లకూ, తగిన ప్రేరణలేక చదువు మానుకొని, ఆ తర్వాత చదువుకోవాలనే ప్రేరణ జనించిన వాళ్లకూ, నియత కళాశాలల్లో విశ్వ విద్యాలయాల్లో ప్రవేశం లభించక పోయిన వాళ్లకూ, జీవితాంతం విద్యాసక్తిగల వాళ్లకూ ఈ విధానం ఉద్దేశించబడింది. ఈనాడు భారతదేశంలో 20 విశ్వ విద్యాలయాల్లో కరెస్పాండెన్సు విద్యా సౌకర్యాలున్నాయి. 1985–86 లెక్కల ప్రకారం కరెస్పాండెన్సు విద్యా సంస్థల్లో 3 లక్షలకు పైగా విద్యార్థులు నమోదయ్యారు. 31 కరెస్పాండెన్సు సంస్థలు వివిధ పాఠ్య విషయాల్లో ఉన్నత విద్యను అందిస్తున్నాయి.

మన రాష్ట్రంలో ఆంధ్ర విశ్వ విద్యాలయం (1972) శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం (1972) ఇంగ్లీషు విదేశ భాషల అధ్యయన కేంద్ర సంస్థ (1973) ఉస్మానియా విశ్వ విద్యాలయం (1977) కాకతీయ విశ్వ విద్యాలయం కరెస్పాండెన్సు కోర్సులను నిర్వహిస్తున్నాయి.

ఈ కోర్సుల విద్యార్జన వ్యవధి, ప్రవేశార్హతలో నమ్యత (ఫ్లెక్సిబిలిటీ) తక్కువైనప్పటికీ అవిచ్ఛిన్న విద్యాకార్యక్రమాలుగా ఇవి ఉన్నత విద్యాభిలాషులకు మన రాష్ట్రంలో తోడ్పడుతున్నాయి. ఈ విశ్వ విద్యాలయాలకు తోడు వ్యవసాయ విశ్వ విద్యాలయం, జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వ విద్యాలయం సైతం కొన్ని అవిచ్ఛిన్న విద్యాకార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి.

## సార్వత్రిక విద్యా విధానం :

సమాజంలోని అత్యధికులకు ఉన్నత విద్యావకాశాలను కల్పించే నిమిత్తం విద్యను ఒక ప్రజాస్వామిక సాధనంగా భావిస్తూ, బహుళ ప్రసార సాధనాలను బోధనలో వినియోగించుకుంటున్న విద్యా విధానం ఇది. కరెస్పాండెన్సు కోర్సుల లక్ష్యాలను మరింత విస్తృతంగా నమ్యమాన దృష్టితో ముందుకు తీసుకెళ్ళడానికి ఉద్దేశించిన ప్రజాతంత్ర విద్యా విధానం ఇది.

ఆంధ్రప్రదేశ్‌లో ఒక సార్వత్రిక విశ్వ విద్యాలయాన్ని స్థాపించాలనే ప్రయత్నాలు 1978లో జరిగాయి. ఇందుకు 1968లో ఏర్పడిన బ్రిటీషు సార్వత్రిక విశ్వవిద్యాలయం స్ఫూర్తినిచ్చింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఒక సార్వత్రిక విద్యా కళాశాలను ఆరంభించాలని అనుకున్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం అభ్యర్ధన మేరకు, బ్రిటీషు సార్వత్రిక విశ్వ విద్యాలయానికి చెందిన గ్రేవిల్ రంబుల్ ఒక సంప్రదింపు నివేదికను రూపొందించారు. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో భాగంగా ఉంటూనే ఆరంభించబోయే సార్వత్రిక విద్యా కళాశాల స్వయం నిర్ణాయక సంస్థగా ఉండి దూర విద్యా బోధనకు తోడ్పడాలనీ, డిగ్రీలు మాత్రం ఉస్మానియా విశ్వ విద్యాలయమే ఇవ్వాలనీ ప్రతిపాదనలు వచ్చాయి.

సార్వత్రిక విద్యా కళాశాల ఆరంభించడానికి ప్రయత్నాలు జరుగుతున్న తరుణంలో, రాష్ట్ర మంత్రివర్గం సార్వత్రిక విశ్వవిద్యాలయ స్థాపన పట్ల ఆసక్తి చూపింది. ప్రొ. జి. రాంరెడ్డి అధ్యక్షతన ఒక కమిటీని ప్రభుత్వం నియమించింది. ఆ కమిటీ 1982 ఆగష్టులో తన నివేదికను రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించింది. 1982 ఆగష్టు 26వ తేదీ రాష్ట్రపతి ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వ విద్యాలయానికి ప్రారంభోత్సవం చేశారు. 1991లో భారత రాజ్యాంగ రూపశిల్పి డా. బి.ఆర్. అంబేద్కర్ స్మారకార్థం విశ్వవిద్యాలయం పేరును "డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం"గా మార్చడం జరిగింది. 1983లో బి.ఎ., బి.కాం., బి.ఎస్.సి. డిగ్రీ కోర్సులను ప్రారంభించిన సార్వత్రిక విశ్వవిద్యాలయం ప్రధాన లక్షణాలు స్థూలంగా ఇవి:

1. నియత విద్యా విధానంలోని ప్రత్యక్ష ఉపాధ్యాయ బోధన

కాకుండా ఈ విశ్వ విద్యాలయంలో అధ్యాపక అధ్యాయి సంబంధం అర్థ శాశ్వతంగా మాత్రమే ఉంటుంది. అంటే సంసర్గ సలహా తరగతుల్లో పాల్గొనే విద్యార్థులు చర్చల ద్వారానే విద్యార్థుల పాఠ్యాంశ అధ్యయానికి తోడ్పడతారు. కానీ, ఏక ముఖంగా ఉపన్యాసాలిస్తూ, గడపరు. మౌఖిక చర్య కంటే లిఖిత చర్య, దృశ్య చర్య ఈ విధానంలో ప్రాధాన్యం వహిస్తాయి.

2. విద్యార్థుల అధ్యయన పాఠ్య సామగ్రిని రూపొందించ డంలో బోధనా శాస్త్ర పరిణామాలను దృష్టిలో ఉంచుకుంటారు. అంటే ఆయా పాఠ్య విషయ నిపుణులు విద్యార్థుల అవగాహనకు అనుకూలమైన ప్రణాళిక మేరకు వివిధ స్థాయిలలో విశ్వ విద్యాలయ పర్యవేక్షణలో అచ్చు పాఠాలను సిద్ధం చేస్తారు. ఇందువల్ల గుణాత్మకమైన బోధనా సామాగ్రికి/అధ్యయన సామాగ్రికి అవకాశం లభిస్తుంది. గుణాత్మకమైన బోధన సామాగ్రి గుణాత్మక విద్యకు తొలిమెట్టు.

3. కరెస్పాండెన్సు కోర్సులలో మాదిరి కేవలం పాఠాలను అందించి చేతులు దులుపు కోవడం కాకుండా విద్యార్థి దోహద సేవలు ఉంటాయి. పాఠ్య ప్రణాళికల రూపకల్పన, బోధనా సామాగ్రి తయారీ, పరీక్షల నిర్వహణ, మూల్యాంకనం – వీటి విషయంలో విశ్వ విద్యాలయానికి స్వయం నిర్ణయాధికారాలుంటాయి. కరెస్పాండెన్సు కోర్సుల సంస్థల్లాగా నియత విద్యా సంస్థల గుత్తాధిపత్యంలో ఉండవు.

4. సాంకేతిక మాధ్యమాల వినియోగం అంటే ముద్రణ, ఆడియో, వీడియో, కంప్యూటర్ మొదలైన సాధనాల వినియోగం ఉంటుంది. ఇవి అధ్యాపకుని/అధ్యాయిని సన్నిహితం చేసే సాధనాలు. పాఠ్య విషయాన్ని అధ్యాయికి చేరవేసే మార్గాలు ముద్రణ దృశ్య శ్రవణ పాఠాలు. ఒక సమీకృత పథకం మేరకు అందించే అధ్యయన సామాగ్రి – స్వయం అధ్యయానికి వీలైన రీతిలో రూపొందించబడిన పాఠ్య సామాగ్రి.

5. విశ్వ విద్యాలయ ప్రవేశం నమ్యమానమైంది. విద్యార్థులు తమ వీలును బట్టి చదువుకోవచ్చు. పాఠ్య విషయాల ఎంపికలు సైతం అనమ్యతకు ఈ విధానం వ్యతిరేకం. (ఉదాహరణకు డిగ్రీ కోర్సులో ఐచ్ఛికాంశాల ఎంపిక విద్యార్థి అభిరుచి భవిష్యదాకాంక్షల మీద ఆధారపడి వుంటుంది, ఉండాలి.)

6. సంప్రదాయ విద్య కంటే చౌకగా లభించే విద్య ఇది. లభించాలి కూడా. నియత విద్యా సంస్థల్లో విద్యార్థికి అయ్యే సగటు ఏడాది ఖర్చు దాదాపు ఆరువేలు – అది ప్రభుత్వ ఖజానా ద్వారా స్కాలర్ షిప్పుల రూపంలో లభించినా, సొంత ఖర్చు అయినా సార్వత్రిక విశ్వ విద్యాలయంలో ఏడాదికి అయ్యే సగటు ఖర్చు 1500 మాత్రమే. అంటే ఈ విధానం వ్యయ సమర్థమైనది అన్నమాట. అభివృద్ధి చెందుతున్న సమాజాలలో అవిచ్ఛిన్న విద్యా వ్యాప్తికి దోహదం చేసే విద్యా కార్యక్రమం అన్నమాట.

7. నియత విశ్వ విద్యాలయాల కంటే నమ్యత ఉండే విద్యా విధానం కాబట్టి సామాజిక అవసరాలకు అనుగుణమైన కోర్సుల ఆరంభానికి ఈ వ్యవస్థ ఎక్కువ తోడ్పడుతుంది. మరొక రకంగా చెప్పాలంటే నియత విద్యా వ్యవస్థ నిరంకుశమైంది. సార్వత్రిక విద్యా వ్యవస్థ వస్తుతః ప్రజాతంత్ర స్వభావం కలిగింది. నియత, అనియత విశ్వ విద్యాలయ పరిపాలనా యంత్రాంగాలలో మౌలికమైన తేడాలు పెద్దగా లేనప్పటికీ, అవి ప్రాతినిధ్యం వహించే వ్యవస్థలలోని స్వభావికమైన భేదాలవల్ల వారి ఫలితాలుకూడా భిన్నమైనవిగా నిరూపిత మవుతాయి.

ఈ లక్ష్యాలతో సార్వత్రిక విశ్వ విద్యాలయం 1983లో 28 అధ్యయన కేంద్రాలను ఆయా కళాశాల భౌతిక మానవ వనరులను ఉపయోగించుకుంటూ తెరచించి. 1986–87లో అదనంగా మరో 23 కేంద్రాలను రాష్ట్రంలోని మారుమూల ప్రాంతాల్లో సైతం తెరచింది. 1995 నాటికి ఈ కేంద్రాల సంఖ్య 107కు చేరింది.

### డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం అధ్యయన కేంద్రాలు: 107

ఆదిలాబాద్, అనంతపూర్, కడప, ఏలూరు, గుంటూరు, కరీంనగర్, ఖమ్మం, కర్నూలు, మహబూబ్ నగర్, నల్గొండ, నెల్లూరు (2), నిజామాబాద్, ఒంగోలు, రాజమండ్రి, సిద్ధిపేట్, శ్రీకాకుళం, తిరుపతి, విజయవాడ, విశాఖపట్నం, విజయనగరం, వరంగల్(2), హైదరాబాద్ (18 కేంద్రాలు), భద్రాచలం, మిర్యాలగూడ, పుత్తూరు, తిరుపతి, చీరాల, టెక్కలి, భీమవరం, మెట్ పల్లి, శ్రీకాళహస్తి, మహదేవ్ పూర్, మంథని, హుజూరాబాద్, సిరిపూర్ కాగజ్ నగర్, హిందూపూర్, పోలవరం, పెద్దపల్లి, గోదావరిఖని, కొత్తగూడెం, షాద్ నగర్, ఆలేరు, కావలి, భాన్స్వాడ, పిఠాపురం, కాకినాడ, సంగారెడ్డి, చిత్తూరు, కుప్పం, సత్యవేడు, మచిలీపట్నం, ఎలమంచిలి, ములుగు, వికారాబాద్, ఖమ్మం, మార్టూర్, విజయవాడ, రాజమండ్రి, హనుమకొండ, గుంతకల్, ప్రొద్దుటూర్, పులివెందుల, జగిత్యాల్, నంద్యాల్, ఆదోని, వింజమూర్, ఇచ్ఛాపురం, మదనపల్లి, నందిగామ, నూజివీడు, జనగాం, శ్రీశైలమ్, రాయచోటి, కనిగిరి, నర్సరావ్ పేట్, పార్వతీపురం, మధిర, కామారెడ్డి, గద్వాల్, సూర్యాపేట,

మెదక్, వనపర్తి, తెనాలి, ధర్మవరం, నిర్మల్, బోధన్, మహబూబాబాద్, గుడివాడ, సెంట్రల్ జైళ్ళు (రాజమండ్రి, విశాఖపట్టణం, హైదరాబాద్, వరంగల్).

1995 నాటికి డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో నమోదులో వున్న విద్యార్థుల సంఖ్య 1,80,000 మందికి చేరుకుంది. వివిధ అధ్యయన కేంద్రాల్లో అకడమిక్ కౌన్సిలర్లు 3,245 మంది పనిచేస్తున్నారు. ఇటీవలి గణాంక వివరాల ప్రకారం నియత అనియత విధానాలనుండి ప్రవేశించిన వారి సంఖ్య, వెనుకబడిన వర్గాల వారి విద్యార్థుల సంఖ్య స్త్రీ, పురుషుల సంఖ్య (1988 నుంచి 1995 వరకు) కింద చూడవచ్చు.

## నియత, అనియత విధానాలనుంచి విద్యార్థుల నమోదు

| క్రమసంఖ్య | సం॥ | అనియత | నియత | మొత్తం |
|---|---|---|---|---|
| 1. | 1988–89 | 11859 | 4990 | 16849 |
| | | (70.38) | (29.62) | (100.00) |
| 2. | 1989–90 | 9675 | 6747 | 16422 |
| | | (58.91) | (41.09) | (100.00) |
| 3. | 1990–91 | 18266 | 9230 | 27496 |
| | | (66.43) | (33.57) | (100.00) |
| 4. | 1991–92 | 24627 | 7820 | 32447 |
| | | (75.90) | (24.10) | (100.00) |
| 5. | 1992–93 | 24602 | 10911 | 35513 |
| | | (69.28) | (30.72) | (100.00) |
| 6. | 1993–94 | 18823 | 10432 | 29255 |
| | | (64.34) | (35.66) | (100.00) |
| 7. | 1994–95 | 22671 | 9403 | 32074 |
| | | (70.68) | (29.32) | (100.00) |

## సామాజిక స్థాయి బట్టి విద్యార్థుల నమోదు వివరాలు

| క్రమసంఖ్య | సం॥ | బిసి–ఎ | బిసి–బి | బిసి–సి | బిసి–డి | ఎస్‌సి | ఎస్‌టి | ఇతరులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 1988–89 | 976 | 2415 | 335 | 1571 | 1551 | 235 | 9766 | 16849 |
| | | (5.79) | (14.33) | (1.99) | (9.32) | (9.21) | (1.39) | (57.97) | (100.00) |
| 2. | 1989–90 | 926 | 2526 | 294 | 1668 | 1445 | 208 | 9355 | 16422 |
| | | (5.60) | (15.38) | (1.79) | (10.16) | (8.80) | (1.27) | (57.00) | (100.00) |
| 3. | 1990–91 | 1568 | 4547 | 521 | 2922 | 3048 | 582 | 14308 | 27496 |
| | | (5.70) | (16.54) | (1.90) | (10.63) | (11.09) | (2.10) | (52.04) | (100.00) |
| 4. | 1991–92 | 1932 | 5750 | 589 | 3561 | 3899 | 643 | 16073 | 32447 |
| | | (5.95) | (17.72) | (1.82) | (11.00) | (12.02) | (1.98) | (49.54) | (100.00) |
| 5. | 1992–93 | 2345 | 6338 | 576 | 4174 | 4361 | 676 | 17043 | 35513 |
| | | (6.60) | (17.85) | (1.62) | (11.75) | (12.28) | (1.90) | (48.00) | (100.00) |
| 6. | 1993–94 | 1931 | 5133 | 598 | 3315 | 4186 | 672 | 13420 | 29255 |
| | | (6.60) | (17.55) | (2.04) | (11.33) | (14.31) | (2.30) | (45.87) | (100.00) |
| 7. | 1994–95 | 2522 | 5337 | 542 | 3585 | 4915 | 807 | 14366 | 32074 |
| | | (7.86) | (16.64) | (1.69) | (11.18) | (15.32) | (2.52) | (44.79) | (100.00) |

## నమోదైన విద్యార్థుల్లో స్త్రీ - పురుషుల వివరాలు

| క్రమసంఖ్య | సం॥ | పురుషులు | స్త్రీలు | మొత్తము |
|---|---|---|---|---|
| 1. | 1988–89 | 11503 | 5346 | 16849 |
| | | (68.27) | (31.73) | (100.00) |
| 2. | 1989–90 | 11374 | 5048 | 16422 |
| | | (69.26) | (30.74) | (100.00) |
| 3. | 1990–91 | 19978 | 7518 | 27496 |
| | | (72.66) | (27.34) | (100.00) |
| 4. | 1991–92 | 23739 | 8708 | 32447 |
| | | (73.16) | (26.84) | (100.00) |
| 5. | 1992–93 | 26332 | 9181 | 35513 |
| | | (74.15) | (25.85) | (100.00) |
| 6. | 1993–94 | 21158 | 8097 | 29255 |
| | | (72.32) | (27.68) | (100.00) |
| 7. | 1994–95 | 23195 | 8879 | 32074 |
| | | (72.32) | (27.68) | (100.00) |

మారుతున్న పరిస్థితులనూ, సామాజిక అవసరాలనూ దృష్టిలోవుంచుకుని సార్వత్రిక విశ్వవిద్యాలయం ఎప్పటికప్పుడు కొత్తకొత్త అధ్యయన కార్యక్రమాలను రూపొందిస్తూవస్తోంది. వ్యవస్థీకృతమైన బోధనాయంత్రాంగం ఈ విశ్వవిద్యాలయానికి వుంది. బహుళ మాధ్యమ విధానం ద్వారా వినూత్న బోధనా పద్ధతి దీని ప్రత్యేకత. ఇంతవరకు విశ్వవిద్యాలయం రూపొందించిన విద్యాకార్యక్రమాలు ఇవి:

### డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం - అధ్యయన కార్యక్రమాలు

| కార్యక్రమం పేరు | స్థాయి |
|---|---|
| **సాధారణ విద్యా కార్యక్రమాలు** | |
| 1. పిహెచ్.డి. డెవలప్‌మెంట్ స్టడీస్ (Ph.D. DS) | పరిశోధన |
| 2. ఎం.ఫిల్.డెవలప్‌మెంట్ స్టడీస్ (M.Phil.DS) | పరిశోధన |
| 3. ఎం.ఏ. చరిత్ర (MAHI) | పి.జి. స్థాయి |
| 4. ఎం.ఏ. అర్థికశాస్త్రం (MAEC) | పి.జి. స్థాయి |
| 5. ఎం.ఏ. ప్రభుత్వ పాలనా శాస్త్రం (M.A.P.A.) | పి.జి. స్థాయి |
| 6. ఎం.ఏ. రాజనీతి శాస్త్రం (M.A.PS) | పి.జి. స్థాయి |
| 7. ఎం.ఎస్‌సి. గణిత శాస్త్రం (M.Sc. MT) | పి.జి. స్థాయి |
| 8. బి.ఏ. కళల విభాగం/సామాజిక శాస్త్రాల విభాగం (B.A.) | డిగ్రీస్థాయి |
| 9. బి.కాం. వాణిజ్యశాస్త్రం (B.Com) | డిగ్రీస్థాయి |
| 10. బి.యస్.సి. విజ్ఞాన శాస్త్రం (B.Sc.) | డిగ్రీస్థాయి |
| 11. ఆహారం పోషణ (CPFN) | సర్టిఫికెట్ కోర్సు |
| 12. పర్యావరణ అధ్యయనం (PGDES) | పి.జి. డిప్లొమా |

# వృత్తివిద్యా కార్యక్రమాలు

| | |
|---|---|
| 13. వ్యాపార నిర్వహణ (MBA) | పి.జి. స్థాయి |
| 14. గ్రంథాలయ సమాచార శాస్త్రం (BLISc) | డిగ్రీస్థాయి |
| 15. ప్రజా సంబంధాలు (BPR) | డిగ్రీస్థాయి |
| 16. మార్కెటింగ్ నిర్వహణ (PG DMM) | పి.జి. డిప్లొమా |
| 17. వ్యాపార విత్తం (PG DBF) | పి.జి. డిప్లొమా |
| 18. ప్రసార మాధ్యమాలకోసం రాయడం (PGDWMT) (తెలుగు) | పి.జి. డిప్లొమా/ డిప్లొమా |

డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం భారతదేశంలో ఆరంభకాల దృష్ట్యా మొదటి విశ్వ విద్యాలయం. ఈ విశ్వ విద్యాలయం సాధించిన ఫలితాల స్ఫూర్తితో రాష్ట్ర ప్రభుత్వం సార్వత్రిక జూనియర్ కళాశాలలను ప్రయోగాత్మక ప్రాతిపదిక మీద ఆరంభించాలని తలపెడుతోంది. మారుమూల ప్రాంతాల్లో నివసిస్తూ, ఇప్పుడున్న సంప్రదాయక జూనియర్ కళాశాలల్లో ప్రవేశం లభించని విద్యార్థుల అవసరాలను తీర్చడానికి +2 దశలో ఆర్ట్స్ సబ్జెక్టులలో ఈ సార్వత్రిక విద్యాకోర్సులను ప్రారంభించడానికి ప్రభుత్వం సన్నాహాలు చేస్తోంది. ఈ విధానంలో దృశ్య శ్రవణ పాఠాలున్న, పాఠ్య ప్రణాళికలూ, పుస్తకాలూ సంప్రదాయ పద్ధతిక చెందినవే. బోధన దూర విద్యా పద్ధతులకు చెందినది. పాఠ్యసామాగ్రి నియత విద్యకు దూర విద్యా పద్ధతులకు చెందినది. పాఠ్యసామాగ్రి నియత విద్యకు చెందింది. ఇది ఒక వైవిధ్యం. బహుళ ప్రసార సాధన సంవిధానాన్ని విద్య బోధనలలో సమన్వయించడానికి అయత్తమవుతుంది. ప్రాథమిక పాఠశాలల్లో శ్రవ్య దృశ్య సాధనాలను తరగతి బోధనలో ప్రవేశ పెట్టడానికి కూడా నిర్ణయించింది.

అయితే భారతదేశంలాంటి అభివృద్ధి చెందుతున్న సమాజాల్లో నూతన సాంకేతిక విధాన ఫలితాలను విద్యా విధానంతో సమన్వయించుకోవడం అత్యధిక వ్యయంతోనే కూడుకున్న పని. నూతన సాంకేతిక ·విజ్ఞాన ఫలితాలైన దృశ్య శ్రవణ యంత్రాలు పారిశ్రామిక యుగానికి – అందులోనూ కంప్యూటర్లు మొదలైనవి పారిశ్రామిక యుగ ఉత్తర దశకు సంబంధించినవి. దేశీయ సాంకేతిక విజ్ఞానాభివృద్ధి భారత దేశంలోనూ, ఆంధ్ర దేశంలోనూ ఒక భౌతిక యదార్థత అయితే తప్ప, సార్వత్రిక విద్యా విధాన భవిష్యత్తు ఆశాజనకంగా ఉండబోదు. అంతేగాదు. నియత విద్యా సంస్థలలోని విద్యా కార్యక్రమాలను మాత్రమే సార్వత్రిక విశ్వవిద్యాలయాల్లో ప్రవేశ పెట్టడం వల్ల పెద్ద లాభమేమీ ఉండదు. ఈ పద్ధతిలో అనియత విద్యా కార్యక్రమాలు, విస్తరణ విద్యా కార్యక్రమాలు ఒక విడదీయరాని భాగం కావాలి. దానికి తోడు సంప్రదాయ విద్యలో ఉపయోగించే పాఠాల నిర్మాణంలోనూ, దూర విద్యలో ఉపయోగించే పాఠాల నిర్మాణంలోనూ తేడాలు ఉన్నాయి. సంప్రదాయ విద్యలో బోధకుడు మార్గదర్శి, దూరవిద్యలో స్వయం అధ్యయనమే కరదీపిక, ఈ తేడాలు రాష్ట్రంలోని విద్యా ప్రణాళికా కర్తలు తెలుసుకున్నప్పుడు లక్ష్యాలు దెబ్బ తినవు.

సంప్రదాయేతర విద్యా విషయకంగా భారతదేశమూ, దేశంలోని ఒక భాషా ప్రయుక్త రాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్ సాధించవలసిన రంగాలు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా భారతీయ సమాజం ముందుకు పోవడానికి అవసరమైన మానవ వనరుల అభివృద్ధి ఇప్పటి పరిస్థితుల్లో సంప్రదాయేతర విద్యా విధానం ద్వారా మాత్రమే సాధ్యమవుతుందని గుర్తించుకోవాలి. అయితే ఈ గుర్తింపు ఒక్కటే చాలదు. మానవ వనరుల అభివృద్ధి విద్య ద్వారా జరగాలంటే ఆర్థికాభివృద్ధికి దోహదం చేసే వైజ్ఞానిక సాంకేతిక శాస్త్రాల వృద్ధిని సంప్రదాయేతర విద్యా విధానం ద్వారా సాధ్యం చేసుకోగలిగినపుడు మాత్రమే మన కలలు ఫలిస్తాయి. భౌతికాభివృద్ధి మానవ సంస్కారాభివృద్ధికి తప్పక దోహదం చేస్తుంది. ఆ దిశగా మన రాష్ట్రంలోని వనరులను కూడా మలచుకోగలగాలి. సోషలిస్టు వ్యవస్థకు అనుగుణమైన పద్ధతుల్లో రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా, సాంస్కృతికంగా మలచుకుంటే తప్ప విధాన నిర్ణయాలు మాత్రమే మన సమాజాన్ని మౌలికంగా మార్చలేవు.

# తెలుగు విశ్వవిద్యాలయం:
# తెలుగు సంస్కృతి వ్యాప్తిలో కొత్త అధ్యాయం

- ఆచార్య పేర్వారం జగన్నాథం, మాజీ వైస్‌ఛాన్సలర్, తెలుగు విశ్వవిద్యాలయం.

తెలుగు భాష, సాహిత్యం సంస్కృతి, లలితకళలు, జానపదకళలు తదితర రంగాల్లో సమగ్రమైన వికాసంకోసం కృషిచేయడానికి ప్రత్యేకంగా ఒక సంస్థ అవసరమనే అభిప్రాయం మనవారిలో చాలాకాలంనుంచీ ఉంది. భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు పూర్వం అంటే - విశాలాంధ్ర రాష్ట్రావతరణకు ముందునుంచీ ఆంధ్ర మహాసభలు వంటి వేదికలమీద పై అభిప్రాయం వ్యక్తమైంది. ఇది 1985 వ సంవత్సరం డిసెంబరు 2 వ తేదీనాటికి ఫలించింది. తెలుగు భాష, సాహిత్యం సంస్కృతి, లలితా కళా రంగాల్లో వికాసానికి ఉన్నతస్థాయి శిక్షణ, పరిశోధన, ప్రచురణ కార్యక్రమాల ద్వారా కృషి సాగించడానికి శాసన సభ ప్రత్యేక చట్టం ద్వారా 1985 డిసెంబర్ 2 వ తేదీన తెలుగు విశ్వవిద్యాలయం అవతరించింది. రాష్ట్రంలో అంతకు ముందు కార్యక్రమాలు చేపడుతున్న ఐదు అకాడమీలు, అంతర్జాతీయ తెలుగు సంస్థ, ఎ.పి. థియేటర్ ఇన్‌స్టిట్యూట్ అండ్ రిపర్టరీల సమాహారంగా ఉన్న తెలుగు విజ్ఞానపీఠం తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనమైంది.

## నేపథ్యం:

1956 వ సంవత్సరంలో 'సంగీత నాటక అకాడమీ' గా ఏర్పడి 1981 లో సంగీత, నృత్య నాటక అకాడమీలు (మూడు)గా విడిపోయి ఆ రంగాల్లో కార్యక్రమాలు చేపడుతూ ఉన్న అకాడమీలను రద్దు చేస్తూ 17.5.1985 నాడు ఒక జి.ఓ. ద్వారా అప్పటి ప్రభుత్వం తెలుగు విజ్ఞానపీఠంలో విలీనం చేసింది. 1957 లో రిజిస్టర్డ్ సొసైటీగా ఏర్పడి సాహిత్యరంగంలో కృషిసాగించిన సాహిత్య అకాడమీని రద్దుచేసి 21.6.85 నాడు తెలుగు విజ్ఞానపీఠంలో విలీనం చేశారు. 1981 లో ఏర్పడిన లలితకళా అకాడమీని, ఎ.పి. థియేటర్ ఇన్‌స్టిట్యూట్ అండ్ రిపర్టరీని అదే సంవత్సరంలో రద్దుచేసి విజ్ఞాన పీఠంలో విలీనం చేశారు. ప్రవాసాంధ్ర, విదేశాంధ్రుల విద్యా, సాంస్కృతికావసరాలకోసం 1975 లో జరిగిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆమోదించిన తీర్మానాన్ని అనుసరించి ఏర్పాటు చేసిన అంతర్జాతీయ తెలుగు సంస్థ (ఐ.టి.ఐ) ను 7.8.85 న విజ్ఞానపీఠంలో విలీనం చేశారు.

తెలుగు భాష, సాహిత్య, సాంస్కృతిక - లలితకళా రంగాల్లో ఉన్నతస్థాయి సంస్థ అవసరాన్ని అధ్యయనం చెయ్యడానికి జస్టిస్ ఆవుల సాంబశివరావు నేతృత్వంలో ప్రభుత్వం నలుగురు విద్యావేత్తలతో కూడిన ఒక కమిటీని ఏర్పాటు చేసింది. ఆ కమిటీ సమర్పించిన నివేదికను ఆమోదిస్తూ తెలుగు విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేస్తూ అంతకు ముందు ఐదు అకాడమీలు, అంతర్జాతీయ తెలుగు సంస్థ, నటశిక్షణ సంస్థల సమాహారంగా వెలసిన తెలుగు విజ్ఞానపీఠం ఆస్తులు, సిబ్బందితో సహా విశ్వవిద్యాలయంలో విలీనం చేసింది. 1947 లో ఏర్పడి తెలుగు విజ్ఞాన సర్వస్వ రంగంలో కృషి చేస్తూ వచ్చిన తెలుగు భాషా సమితిని ఆ సమితి వారు అప్పటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుగారి చేతులమీదుగా తెలుగు విశ్వవిద్యాలయానికి ధారాదత్తం చేశారు.

## తెలుగు విశ్వవిద్యాలయం రూపురేఖలు:

తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతి, లలితకళారంగాల్లో వికాసానికి ఉన్నతస్థాయి శిక్షణ, పరిశోధన, ప్రచురణల ద్వారా కృషి చేయడానికి డిసెంబర్ 2, 1985 న హైదరాబాదు కేంద్రంగా తెలుగు విశ్వవిద్యాలయం అవతరించింది. ఈ

విశ్వవిద్యాలయానికి రాజమండ్రిలో, శ్రీశైలంలో ప్రాంగణాలు ఏర్పడ్డాయి. ప్రాంతీయస్థాయిలో ఒక భాషను, ఆ భాషలో సుసంపన్నమైన సాహిత్యం, సంస్కృతి, లలితకళలు, జానపద విజ్ఞానం, కళలువంటి అంశాలను ప్రాతిపదికగా చేసుకొని దేశంలో ఏర్పడ్డ రెండవ విశ్వవిద్యాలయం ఇది. తమిళ విశ్వవిద్యాలయం మొదటిది. మౌలిక లక్ష్యాలకోసం సంస్థ ఏర్పాటయ్యింది. లక్ష్యాలు నెరవేరే దిశగా వ్యవస్థ ప్రారంభమైంది. రాష్ట్ర రాజధాని హైదరాబాదులో భాషాభివృద్ధి పీఠం, లలితకళాపీఠం; తెలుగు సాహిత్యానికి ప్రధాన కేంద్రంగా వర్ధిల్లిన రాజమండ్రిలో సాహిత్యపీఠం; ప్రసిద్ధ శైవక్షేత్రం శ్రీశైలంలో చరిత్ర, సంస్కృతి, పురావస్తు శాస్త్ర పీఠం నెలకొల్పారు. భాష, సాహిత్యం, సంస్కృతి, లలితకళా రంగాల్లో బోధన, పరిశోధన కార్యక్రమాలకు ఉద్దేశించినవి ఈ పీఠాలు, వానిలోని శాఖలు. అంతకు ముందు అకాడమీలు నిర్వహించిన కార్యక్రమాల నిర్వహణ కోసం విశ్వవిద్యాలయంలో విస్తరణ సేవా విభాగాన్ని, ప్రచురణలకోసం ప్రచురణల విభాగాన్ని ఏర్పాటు చేశారు. కృష్ణాజిల్లాలో కూచిపూడి నాట్యం వర్ధిల్లిన కూచిపూడి గ్రామంలో స్వచ్ఛంద సంస్థగా ఉన్న శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని కూడ తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం చేశారు. పూర్వపు అంతర్జాతీయ తెలుగు సంస్థ, విశ్వవిద్యాలయంలో అంతర్జాతీయ తెలుగు కేంద్రంగా అవతరించింది. పూర్వపు తెలుగు భాషా సమితి ఈ విశ్వవిద్యాలయంలో కొమర్రాజు వెంకట లక్ష్మణరావు విజ్ఞాన సర్వస్వ కేంద్రంగా రూపు దాల్చింది.

అలా ప్రస్థానం ప్రారంభించిన తెలుగు విశ్వవిద్యాలయం క్రమక్రమంగా కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తున్నది. 1986-87 విద్యా సంవత్సరంలో విద్యా కార్యక్రమాలను ప్రారంభించిన, అనంతరకాలంలో విస్తరిస్తూ వచ్చి - భాషా, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో బోధన, పరిశోధనల ప్రచురణ, కార్యక్రమాలను విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. తెలుగు విజ్ఞానపీఠం ప్రత్యేకాధికారిగా నియామకమై, విశ్వవిద్యాలయ అవతరణలో దానికి తొలి ఉపాధ్యక్షునిగా పదవీ స్వీకారం చేసిన ఆచార్య తూమాటి దొణప్ప విశ్వవిద్యాలయానికి ఒక అకృతినిచ్చారు. ఆచార్య సి.నారాయణరెడ్డి 1989-92 సంవత్సరాల మధ్యకాలంలో విశ్వవిద్యాలయాన్ని విస్తరింపజేశారు. 1992 నవంబర్ 5 న తృతీయ ఉపాధ్యక్షులుగా పదవిని స్వీకరించిన ఆచార్య పేర్వారం జగన్నాథం అతి స్వల్పకాలంలో విశ్వవిద్యాలయ పునర్వ్యవస్థీకరణ, పునర్నిర్మాణ కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. ఇందులో భాగంగా ఆచార్య జగన్నాథం విశ్వవిద్యాలయానికి మరిన్ని ప్రాంతాలకు ప్రాతినిధ్యం కల్పించే చర్యలు చేపట్టారు. ఫలితంగా వరంగల్లులో జానపద, గిరిజన అధ్యయన పీఠం; నెల్లూరులో భారతీయ మతాలు, దర్శనాల శాఖ ఏర్పాటుకు మార్గం సుగమమైంది.

## విశ్వవిద్యాలయ స్వరూపం:

1986-89 మధ్య కాలంలో భాషాభివృద్ధి పీఠం, లలితకళాపీఠం (హైదరాబాదు), చరిత్ర, సంస్కృతి, పురావస్తు శాస్త్ర పీఠం (శ్రీశైలం), సాహిత్యపీఠం(రాజమండ్రి) ఏర్పడ్డాయి. భాషాభివృద్ధి పీఠంలో నిఘంటు నిర్మాణశాఖ, భాషాశాస్త్రశాఖ, భాషాప్రణాళిక, నవీకరణశాఖ, జర్నలిజం శాఖ ఏర్పాటయ్యాయి. లలితకళాపీఠంలో కర్ణాటక సంగీత (గాత్రం) శాఖ, వాద్య సంగీతశాఖ, నృత్యశాఖ, జానపద కళలశాఖ, శిల్పశాఖ, రంగస్థలకళలశాఖ ఏర్పాటయ్యాయి. చరిత్ర - సంస్కృతి, పురావస్తు శాస్త్రపీఠంలో తెలుగువారి చరిత్ర - సంస్కృతిశాఖ, శాసనలేఖనశాఖ, పురావస్తు, వాస్తుశాస్త్రశాఖ, ప్రాంతీయ చరిత్రశాఖ ఏర్పడ్డాయి. సాహిత్య పీఠంలో భక్తిపదకవితాశాఖ, జానపద, గిరిజన విజ్ఞానశాఖ ఏర్పడ్డాయి. ఇవిగాక తులనాత్మక అధ్యయన కేంద్రం తొలిసారిగా ప్రారంభించారు. జ్యోతిషశాఖ, అంతర్జాతీయ తెలుగు కేంద్రం, విజ్ఞానసర్వస్వ కేంద్రం, ప్రచురణల విభాగం, విస్తరణాసేవా విభాగం, కూచిపూడిలోని సిద్ధేంద్ర కళాక్షేత్రం ఉన్నాయి. విశ్వవిద్యాలయం ఏర్పాటుకు నేపథ్యంగా నిలిచిన లక్ష్యాలను మరొకసారి మననం చేసుకొని వాటి సాధ్యదిశగా కార్యక్రమాలకు మరింత పదును పెట్టేందుకు ఇటీవల చర్యలు తీసుకోవడం జరిగింది. పలువురు పండితులు, విద్వాంసులతో ఒక ఉన్నతస్థాయి విద్యాత్మక సంఘాన్ని ఏర్పాటు చేసి విశ్వవిద్యాలయం పునర్నిర్మాణ పునర్వ్యవస్థీకరణకు అధ్యయనం చేయవలసిందిగా కోరడం జరిగింది. సంఘం హైదరాబాదు, రాజమండ్రి, శ్రీశైలంల లోని ప్రాంగణాలను దర్శించి వివిధ బోధన, బోధనేతర విభాగాల పనితీరును క్షుణ్ణంగా అధ్యయనం చేసి అవసరమైనచోట్ల బోధన, బోధనేతర సిబ్బంది అభిప్రాయాలు కూడ విని, 1993 లో విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులకు ఒక నివేదిక సమర్పించింది. ఆ నివేదికను పరిశీలించి సంబంధిత ఉప సంఘాలతో చర్చలు జరిపిన మీదట సిఫారసులను నిర్వహణమండలి ఆమోదించింది. ఉన్నతస్థాయి సంఘం సిఫారసులను ఆమోదిస్తూ - విశ్వవిద్యాలయ పునర్నిర్మాణ, పునర్వ్యవస్థీకరణ చేపట్టడం జరిగింది. ఈ చర్యల్లో విశ్వవిద్యాలయ విస్తరణ కూడ ఒక భాగంగా పరిణమించింది. ఇదివరకు ఉన్న పీఠాల్లో కొన్ని శాఖల్ని పునర్వ్యవస్థీకరించడం ద్వారా అదనంగా కొన్ని పీఠాల ఏర్పాటు అవసరమైంది. కొన్ని కొత్త శాఖలు కూడ ప్రతిపాదితమయ్యాయి. పునర్వ్యవస్థీకరణ, పునర్నిర్మాణం

ఫలితంగా విశ్వవిద్యాలయంలో ఇదివరకు ఉన్న భాషాభి వృద్ధిపీఠం, లలితకళాపీఠం, చరిత్ర, సంస్కృతి, పురావస్తు శాస్త్రపీఠం, సాహిత్య పీఠంలకు తోడు వాటిల్లోంచి కొన్ని శాఖల్ని వేరుపరచి, కొన్ని శాఖలు చేర్చడం ద్వారా జానపద, గిరిజన అధ్యయనపీఠం, విజ్ఞాన వికాసపీఠం, ప్రసార, సమాచార విజ్ఞానపీఠంగా విస్తరింపజేయడం జరుగుతున్నది. వరంగల్లులో ఒక పీఠం, నెల్లూరులో ఒక శాఖ ఏర్పాటుకూడ ఇందులో ఉన్నాయి.

విశ్వవిద్యాలయం అవతరణ తెలుగు సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో ఒక నూతన అధ్యాయమే. మొదట్లో పూర్వపు అకాడమీల కార్యక్రమాలు తీసివేస్తే తెలుగు విశ్వవిద్యాలయానికి ప్రత్యేక ఉనికి అంటూ లేదనే అభిప్రాయాలు వ్యక్తమైనా క్రమంగా తనకంటూ సుస్థిరస్థానాన్ని, వైలక్షణ్యాన్ని నిలుపుకోవడం కోసం బోధన, పరిశోధన, ప్రచురణ కార్యక్రమాలను విశ్వవిద్యాలయం రూపకల్పన చేసుకొన్నది. రాష్ట్రంలోని పది ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాలలు, పాఠశాలలు విద్యాత్మకంగా విశ్వవిద్యాలయానికి అనుబంధమయ్యాయి. ఇదొక సమగ్రమైన వ్యవస్థగా రూపొందింది. సాంస్కృతిక వ్యవహారాల శాఖ ద్వారా సంగీత, నృత్య కళాశాలల్ని, పాఠశాలల్ని ప్రభుత్వం నిర్వహించేది. సంగీతంలో, నృత్యంలో ఇతర లలితకళల్లో డిగ్రీ, పి.జి. స్థాయిలో కోర్సులు తెలుగు విశ్వవిద్యాలయంలో ఉండేవి. వీటిల్లో పై స్థాయిపై మాత్రమే విశ్వవిద్యాలయానికి పట్టు ఉండేది. సంగీత, నృత్య, కళాశాలలు, పాఠశాలలు కూడ తెలుగు విశ్వవిద్యాలయానికి విద్యాత్మకంగా అనుబంధం కావడం వల్ల; నృత్యం, సంగీతం కోర్సులకు విశ్వవిద్యాలయమే పాఠ్యాంశాన్ని నిర్ణయించి ఆ ప్రకారం బోధన, అభ్యాసాలు జరిపించి పరీక్షలు జరపడానికి అవకాశం ఏర్పడింది. ఇందువల్ల నృత్యంలోగాని, సంగీతంలోగాని ప్రాథమికస్థాయినుండి స్నాతకోత్తరస్థాయి వరకు బోధన, అభ్యాస ప్రమాణాల సమన్వయాన్ని సాధికారికంగా సాధించి కొనసాగించే అవకాశం విశ్వవిద్యాలయానికి కలిగింది. ఇది మొత్తం సంస్కృతికే లాభిస్తుంది. ఇంకొక గణనీయమైన పరిణామమేమిటంటే – దేశంలో ఇప్పటివరకు ఔత్తరాహులకుగాని, దాక్షిణాత్యులకు గాని నృత్య సంగీతాది కళల్లో అభ్యాసం ఒకవైపు, సాధారణ విద్యార్జన వేరొకవైపు రెండూ రెండు రైలుపట్టాల్లా ఉండేవి. ఒకదానితో వేరొకదాని స్థాయిప్రమాణాలకు సంబంధం ఉండేదికాదు.

మన రాష్ట్రంలో ఇప్పటి పరిస్థితి ఇలా ఉంది. ప్రభుత్వ సంగీత, నృత్య విద్యా సంస్థల్లో సర్టిఫికెట్ కోర్సు 2,4 ఏళ్ళ పాటు అభ్యసించి, అందులో ఉత్తీర్ణత పొందినమీద డిప్లొమా. సంగీత, నృత్య కోర్సుల్లో ఇది సరిగానే ఉన్నా వీటిలో చేరడానికి కనీస సాధారణ విద్యార్హత ఇంత అని లేదు. తెలుగు విశ్వవిద్యాలయం స్వయంగా ప్రవేశపెట్టి నిర్వహిస్తున్న బి.ఎ., ఎం.ఎ, (నృత్యం, సంగీతం, జానపదకళలు) కోర్సులకు సాధారణ విద్యార్హత విషయంలో శ్రద్ధ తీసుకున్నది. బి.ఎ. నృత్యంలోనో, సంగీతంలోనో చేరాలంటే నృత్యప్రవేశార్హత తోపాటు ఇంటర్మీడియట్ ఉత్తీర్ణత తప్పనిసరి. ఎం.ఎ. లో చేరడానికి ఆ అంశంలో బి.ఎ. ఉత్తీర్ణత ఉండాలి. దీనితో ఇదివరకు లేనివిధంగా సంగీతంలోనూ, నృత్యంలోనూ బి.ఎ., ఎం.ఎ., పూర్తిచేసి ఎం.ఫిల్., పిహెచ్.డి., పరిశోధనావకాశం కలిగింది. సంగీతం, నృత్యంలాంటి అంశాల్లో కళలుగా వాటి అభ్యాసం, శాస్త్రంగా అధ్యయనం, వినూత్న విషయాల ఆవిష్కరణకు పరిశోధన.......వీటికి అరుదైన రీతిలో తెలుగు విశ్వవిద్యాలయం అవకాశాలు విస్తృతపరచడానికి ముందు ముందు మరింత కృషి చేస్తుంది.

గడచిన ఎనిమిదేళ్ళలో విశ్వవిద్యాలయం తన కార్యక్షేత్రాలైన తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతి రంగాల్లో ఎన్నెన్నో కార్యక్రమాలు నిర్వహించింది. ప్రధానంగా నృత్య, నాటక, సంగీతాల్లో రాష్ట్రానికి వన్నె తేగల రీతిలో ఉత్సవాలు; భాషా, సాహిత్యాల్లో సదస్సులు; జాతి వైభవానికి తమ త్యాగాల అలంకృతు లందించిన మహనీయుల శత జయంతి ఉత్సవాలు ఏర్పాటు చేసింది. తెలుగు సంస్కృతి, సాహిత్యం, కళల విశిష్టతను ఇతర రాష్ట్రాలవారికి తెలియజేయడంతో పాటు – రాష్ట్రేతర ప్రాంతాల్లో తెలుగు అధ్యయనానికి, పరిశోధనకు అవకాశాలు కల్పించే దృష్టితో వివిధ సంస్థలు, విశ్వవిద్యాలయాల్లో తెలుగు విశ్వవిద్యాలయం తెలుగు పీఠాల నేర్పాటు చేస్తూ వస్తున్నది.

### కోర్సుల నిర్వహణ:

బి.ఎ. (మూడు సంవత్సరాల రెగ్యులర్ కోర్సు), కర్ణాటక సంగీతం (గాత్రం/వాద్యసంగీతం–వీణ, వయొలిన్, మృదంగం), బి.ఎ. నృత్యం (కూచిపూడి), బి.ఎ. జానపదకళలు, బి.ఎ. శిల్పం, బి.ఎ. (నాటకం), బి.సి.జె. (బ్యాచిలర్ ఆఫ్ కమ్యూనికేషన్ అండ్ జర్నలిజం), ఎం.ఎ. (నృత్యం), ఎం.ఎ. (సంగీతం గాత్రం/వాద్యసంగీతం–మృదంగం, వీణ) ఎం.ఎ. (తెలుగు), ఎం.ఎ. (అప్లయిడ్ లింగ్విస్టిక్స్) ఎం.ఫిల్. (భాషాశాస్త్రం), ఎం.ఫిల్. (సాహిత్యం), ఎం.ఫిల్. (తులనాత్మక అధ్యయనం), ఎం.ఫిల్. (చరిత్ర, సంస్కృతి, పురావస్తు శాస్త్రం) పిహెచ్.డి.(భాషాశాస్త్రం), పిహెచ్.డి.(సాహిత్యం), పిహెచ్.డి. (తులనాత్మక అధ్యయనం), పిహెచ్.డి.(చరిత్ర, సంస్కృతి, పురావస్తుశాస్త్రం);

1994 వ సంవత్సరం నుంచి ఎం.సి.జె. (మాస్టర్ ఆఫ్ కమ్యూనికేషన్ అండ్ జర్నలిజం), ఎం.ఎ. (జానపదకళలు), పి.జి.డిప్లొమా (ప్రాకృతభాష) కోర్సులు ప్రవేశపెట్టడం

జరుగుతున్నది. ఇంకా జానపదకళల్లో రెండేళ్ళ కళాప్రవేశిక (డిప్లొమా) కోర్సు, జ్యోతిషంలో ఏడాది సర్టిఫికెట్, ఏడాది డిప్లొమా కోర్సులున్నాయి. ఇవి పార్ట్ టైం కోర్సులు. ప్రతి సంవత్సరం జూన్/జూలై మాసాల్లో నోటిఫికేషన్ జారీచేసి దరఖాస్తులు ఆహ్వానించి ప్రవేశపరీక్షలు/మౌఖిక పరీక్షలద్వారా ప్రవేశాలు నిర్వహించడం జరుగుతుంది. తగిన స్థలం, భవనం లేకపోయినా అద్దె భవనంలో విశ్వవిద్యాలయం హోస్టలును నడుపుతున్నది.

## విస్తరణ సేవా విభాగం:

పూర్వపు అకాడమీల వారసత్వంగా సాహిత్య, సాంస్కృతిక, లలితాకళా రంగాల్లో విశేష కార్యక్రమాలను రూపకల్పనచేసి నిర్వహిస్తూ, మరోవైపు ఆ రంగాల్లో జరుగుతున్న కార్యక్రమాలను గుర్తించి ప్రోత్సహిస్తూ వస్తున్నది. సాహిత్య, సంగీత, నృత్య, నాటక, లలితకళా అకాడమీలు ఉన్న రోజుల్లో నిర్వహించిన కార్యక్రమాలను – అవి రద్దయి తనలో విలీనమైన తర్వాత – తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. తెలుగులోగాని, తెలుగు భాష, సాహిత్యం సంస్కృతిని గురించి ఇతర భాషల్లోగాని రచించిన గ్రంథాలు ప్రచురించుకొనేందుకు ఏటా ఆర్థిక సహాయం అందిస్తున్నది. గతంలో కవిత్వం, కథ, నవల, నాటకం వంటి ప్రక్రియల్లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహూకరించి సత్కరించిన పద్ధతిలోనే ఏటా సాహితీ అవార్డుల ప్రదానోత్సవాన్ని ప్రతిష్ఠాకరమైన రీతిలో విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. పలువురు ప్రముఖులు స్థాపించిన నిధినుంచి ఏటా కొంత మొత్తాన్ని మల్లిస్తూ ప్రతిభాపురస్కారాల పేరిట మరో సత్కార కార్యక్రమం (గతంలో ధర్మనిధి పురస్కారాలుగా వ్యవహరించేవారు) నిర్వహిస్తున్నది. సాహిత్యంలోనో, ఇతర లలితకళారంగాల్లోనో దశాబ్దాలపాటు అవిరళ కృషి చేసిన ప్రముఖులను 50 వేల రూపాయల నగదు బహుమతితో సత్కరించేందుకు ప్రవేశపెట్టిన విశిష్ట పురస్కార ప్రదానోత్సవం జరుగుతున్నది. ఇవిగాక విశ్వవిద్యాలయం అవతరణ దినోత్సవమైన డిసెంబర్ 2 వ తేదీన పదిమంది సాహితీ కళామూర్తులను సత్కరించడం జరుగుతున్నది. ఆయా రంగాల్లో ఎన్నదగిన కృషిచేసి మరుగునపడిన మహనీయులను గుర్తించి సత్కరించడంలో లోపం జరగకుండా తగు శ్రద్ధ వహించడమవుతున్నది. నాటక రంగానికి సంబంధించి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో దశలవారీగా పౌరాణిక, సాంఘిక నాటకోత్సవాలు, నాటక రచనలో పోటీలు, నటీనటులకు సత్కారాలు విశ్వవిద్యాలయం ఆవిర్భవించినప్పటి నుండే జరుగుతున్నాయి. పద్యనాటకానికి పూర్వప్రభావాన్ని సంతరించిపెట్టే లక్ష్యంతో ఇటీవలి కాలంలో 10 లక్షల రూపాయలు ఖర్చుచేసి జిల్లా స్థాయినుండి రాష్ట్రస్థాయివరకు పోటీలు నిర్వహించి ప్రోత్సాహకంగా 30 వేలు, 20 వేలు, 10 వేల రూపాయలు చొప్పున నగదు బహుమతులు అందజేయడం జరిగింది. రాష్ట్రస్థాయి పోటీల్లో ప్రదర్శించిన నాటకాల్లో ప్రతిభావంతంగా నటించిన 30 మంది నటులను ఎంపిక చేసి సంప్రదాయానుసరణంతో పాటు శాస్త్రీయ అవగాహనతో పద్యనాటకాలు ప్రదర్శించడానికి సంబంధించి రెండు నెలలపాటు సాంస్కృతిక వ్యవహారాలశాఖ సౌజన్యంతో శిక్షణ శిబిరం నిర్వహించడం జరిగింది. సుమారు 300 మంది వృద్ధకళాకారులకు నెలనెలా పెన్షన్ చెల్లించడం జరుగుతున్నది. ఈ విధంగా నాటక రంగానికి సంబంధించి కార్యక్రమాలు నిర్వహిస్తూ; దాన్ని ఈ తరానికి ఒక బోధనాంశంగా, అభ్యాసాంశంగా నాటకశాఖద్వారా శిక్షణనిచ్చే కోర్సులను విశ్వవిద్యాలయం కొనసాగిస్తున్నది.

నృత్యకళకు సంబంధించి కూడ విలక్షణమైన రీతిలో బి.ఎ., ఎం.ఎ, కోర్సులు నిర్వహిస్తూనే నృత్యవ్యాప్తికి దోహదం చేసే కార్యక్రమా లనేకం నిర్వహిస్తున్నది. కూచిపూడి గ్రామంలో ఎంతో వైభవంగా రాష్ట్రస్థాయి కూచిపూడి నృత్యోత్సవాలు జరిపి ఆ వేదికమీద ఆ నర్తనరీతిలో సుప్రసిద్ధులైన నర్తకీ, నర్తకులతోపాటు వర్ధమాన కళాకారులకు కూడ నాట్యంచేసే అవకాశం కలిగించడం జరిగింది. రూపుమాసిపోతున్న అనేక కళారూపాల్లో శిక్షణాశిబిరాలు నిర్వహించడం జరిగింది. పగటివేషాలు, చెక్కభజన, డోలు, నాదస్వరం, వీధినాటకం, డముకుల కథ, జముకుల కథ, ఒగ్గుకథ, ఇంద్రజాలం, హరికథ, బుర్రకథ, డప్పు, జానపద గేయాలు తదితర అంశాల్లో కూడా శిబిరాలు రెండు నెలల పాటు పెద్ద ఎత్తున జరిగాయి. ఈ శిబిరాల్లో ఆయా కళారూపాల్లో శిక్షణ పొందినవారు వాటిని ఇతరులకు నేర్పడం ద్వారా ప్రదర్శించడం ద్వారా ఆ కళారూపాలకు ప్రాణప్రతిష్ట చేయడానికి అవకాశాలు కల్పించడం జరిగింది. తెలంగాణ, రాయలసీమ, ఆంధ్రప్రాంతాల జానపదకళారీతుల సమైక్య సమన్వయాలకోసం జానపదసమైక్య లహరి కార్యక్రమం జరిగింది. మూడురోజులపాటు రాష్ట్రస్థాయిలో జానపదనాటక పోటీలు జరిగాయి. చిత్ర, శిల్పకళారంగంలో అనేక కార్యక్రమాలు నిర్వహించడంతో పాటు శిల్పం అంశం ప్రధానంగా బి.ఎ. కోర్సు ప్రవేశపెట్టడం జరిగింది. శిల్పానికి తోడు ఇకనుంచి చిత్రకళకు ప్రాధాన్యం ఉండేలా ఆ శాఖనూ, కోర్సునూ పునర్వ్యవస్థీకరించేందుకు చర్యలు తీసుకోవడమైంది. ఇతర రాష్ట్రాల్లో చిత్ర, శిల్పకళలు అభ్యసిస్తున్న మన విద్యార్థులకు ఏటా ఉపకారవేతనాలు మంజూరు చేస్తున్నారు. తొలినుంచి పాత, కొత్తతరం చిత్రకారులు చిత్రించిన చిత్రాల్ని ప్రదర్శించడానికి ఎగ్జిబిషన్స్ ఏర్పాటు

చేయడమైంది. జూనియర్, సీనియర్ అనే తేడా లేదు. మంచి చిత్రాలు గీసి ఉండీ వాటిని ప్రదర్శించడానికి ఆర్థికంగా ఇబ్బందిపడే చిత్రకారులకు తమ చిత్రప్రదర్శనల నిర్వహణకు విశ్వవిద్యాలయం ఏటా ఆర్థిక సహాయం అందిస్తోంది.

విశేష సాంస్కృతిక సాహిత్య కార్యక్రమాలు ఏర్పాటు చేసే సంస్థలకు యథోచితంగా ఆర్థికసహాయం అందిస్తున్నది. అంతర్రాష్ట్ర సాంస్కృతిక వినిమయ కార్యక్రమంకింద ఇతర రాష్ట్రాలవారికి తెలుగు కళల వైభవాన్ని పరిచయం చేయడానికి ఇక్కడి సాంస్కృతిక బృందాలను పంపడం, ఇతర రాష్ట్రాలనుంచి వచ్చే సాంస్కృతిక బృందాల కార్యక్రమాలను రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో ప్రదర్శింప జేయడం జరుగుతున్నది. కేంద్ర సంగీత, నాటక అకాడమీ సహకారంతో ఈ కార్యక్రమం అమలుజరుగుతున్నది. సంగీతానికి సంబంధించి విశ్వవిద్యాలయం విశాఖలో రాష్ట్రస్థాయి వాద్య సంగీతోత్సవాలు, చిత్తూరులో గాత్రసంగీతోత్సవాలు ఏర్పాటు చేసింది. శాస్త్రీయ, గాత్ర, వాద్య సంగీత విద్వాంసు లెందరో ఈ ఉత్సవాల్లో కచేరీలు ఇచ్చారు. కర్ణాటక సంగీతంతోపాటు హిందుస్థానీ సంగీతామృతం కూడ రసజ్ఞులకు పంచిపెట్టే అవకాశం ఇందువల్ల కలిగింది. ఇంకా తెలుగు భాష, సాహిత్యం, సంస్కృతి రంగాల్లో ప్రామాణిక రచనలను ప్రోత్సహించడానికి శీర్షికలు ప్రకటించి పోటీలు నిర్వహించి, ఉత్తమ రచనలకు బహుమతులు ప్రదానం చేయడం జరుగుతున్నది.

## ప్రచురణలు:

విశ్వవిద్యాలయం తన ఆవిర్భావానికి నేపథ్యంగా నిలిచిన లక్ష్యాల దృష్ట్యా ప్రచురణల విభాగం ప్రధానమైనది. తెలుగు సాహిత్యం, భాష, సంస్కృతి, లలితకళలకు సంబంధించిన ప్రామాణిక పరిశోధన గ్రంథాలు, శాస్త్ర గ్రంథాలు, నిఘంటువులు ప్రచురించడంతోపాటు వివిధ ప్రక్రియల్లో తెలుగులోని ప్రతిభావంతమైన గ్రంథాలను ఇతర భాషల్లోకి అనువదింపజేసి ప్రచురించడం ప్రతిష్ఠాకరమైన కార్యక్రమం. ఇందులో ప్రధాన భాగం పూర్వ సాహిత్య అకాడమీ వారసత్వంగా వచ్చింది. విశ్వవిద్యాలయం దాని పరిధిని మరింత విస్తృతపరచి నిర్వహిస్తున్నది. గత ఎనిమిదేళ్ల కాలంలో సుమారు 145 ఉత్తమ, ఉపయుక్త గ్రంథాలను ప్రచురించింది. కాశీయాత్ర చరిత్ర, మనోధర్మ సంగీతం, తెలుగువారి జానపదకళారూపాలు, ఆంధ్రుల జానపద విజ్ఞానం, మాండలిక వృత్తిపదకోశాలు, లలిత కళాపదకోశం, రౌండ్ టేబుల్ రాయబారం, అనర్ఘరాఘవమ్ వ్యాఖ్యానం, గరిమెళ్ల వ్యాసాలు, కందుకూరి వీరేశలింగం మొదలయినవి వాటిల్లో కొన్ని మాత్రమే. విశ్వవిద్యాలయం ప్రచురించిన విజ్ఞాన సర్వస్వాల్లో 'మతములు – దర్శనములు' అనే సంపుటాన్ని గత సంవత్సరంలో భారత ప్రధాని మాన్య శ్రీ పి. వి. నరసింహారావుగారు ఢిల్లీలో ఆవిష్కరించారు. ఇవిగాక రాష్ట్ర ప్రభుత్వ సూచనపై, ప్రభుత్వం కేటాయించిన 18 లక్షల రూపాయలతో ఆంగ్లంలోని డా॥ బి. ఆర్. అంబేద్కర్ రచనలు, ప్రసంగాలను తెలుగులోకి అనువదించి ప్రభుత్వ పరంగా ప్రచురింప జేస్తున్నది.

## డాక్యుమెంటేషన్:

తెలుగువారికి – ముఖ్యంగా రాబోయే తరాలవారికి ఎంతో ప్రయోజనకరంగా పరిణమించే డాక్యుమెంటేషన్ ప్రాజెక్టును తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తుంది. ఇది వివిధ రంగాల్లో జీవితమంతా ధారపోసి నేటికీ నిలిచిఉన్న తెలుగు వైతాళికులపై వీడియో డాక్యుమెంట్లు తీసి ముందు తరాలకు ఒక సంపదగా అందజేయడానికి ఉద్దేశించింది. ఆయా మహనీయ వ్యక్తులు తమ జీవితంలో సాధించిన విజయాలు, అందుకోసం వారికి ప్రేరణగా ఉన్న అంశాలు, యువతరానికి వారిచ్చే సందేశం నిక్షిప్తపరచుకొనే ఈ స్వల్పనిడివి వీడియో డాక్యుమెంటేషన్ ప్రాజెక్టుకు రాష్ట్రప్రభుత్వం 20 లక్షల రూపాయలు కేటాయించింది. ఇప్పటివరకూ రావి నారాయణరెడ్డి, బోయి భీమన్న, జంధ్యాల పాపయ్యశాస్త్రి, మోటూరి సత్యనారాయణ, వావిలాల గోపాలకృష్ణయ్య, రాజ్‌బహదూర్‌గౌడ్, సరిదె మాణిక్యమ్మ, సమ్మోట అంబాప్రసాద్, షేక్ దావూద్, కములాకర కామేశ్వరరావు, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, కాళోజీ నారాయణరావు, మరుపూరి కోదండరామిరెడ్డి, సాలూరు రాజేశ్వరరావు, దేవులపల్లి రామానుజరావు, బి. రామరాజు, టేకుమళ్ల కామేశ్వరరావు, బెజవాడ గోపాలరెడ్డి, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, మహీధర రామ్మోహనరావు, జస్టిస్ ఓబుల్‌రెడ్డి, గుమ్మడి వెంకటేశ్వరరావు, కాసు బ్రహ్మానందరెడ్డి, ఎన్.జి. రంగా – మొత్తం 32 మంది ప్రముఖులపై డాక్యుమెంటేషన్ జరిగింది.

## ప్రవాసాంధ్రులకోసం కార్యక్రమాలు:

ఇతర రాష్ట్రాలల్లోను, విదేశాల్లోనూ ఉన్న ప్రవాసాంధ్రుల విద్యా, సాంస్కృతికావసరాలను తీర్చేందుకు అనేక కార్యక్రమాలను విశ్వవిద్యాలయంలోని అంతర్జాతీయ తెలుగు అధ్యయన శాఖ (గతంలో అంతర్జాతీయ తెలుగు కేంద్రంగా వ్యవహరించేవారు) 1990 మార్చి 10, 11 తేదీల్లో బెంగుళూరులో అఖిల భారత తెలుగు మహాసభల్ని వైభవోపేతంగా నిర్వహించడం జరిగింది. అదే సంవత్సరం డిసెంబర్ 10 నుండి 13 వ తేదీవరకు మారిషస్‌లో మూడవ ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. వివిధ దేశాల్లోని తెలుగు వారితోపాటు ఆంధ్రప్రదేశ్ నుంచి 30

మందిగల సాంస్కృతిక బృందం అప్పటి ఉపాధ్యక్షులు డా॥ సి. నారాయణరెడ్డిగారి సారథ్యంలో ఆ మహాసభలకు వెళ్లింది.

ఇతర రాష్ట్రాలు, విదేశాల్లోని తెలుగువారికి మాతృభాషా సంస్కృతుల విషయంలో తగిన సహాయానికి 1975 వ సం॥లో హైదరాబాదులో జరిగిన ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల వేదిక ఆమోదించిన తీర్మానాన్ని అనుసరించి అంతర్జాతీయ తెలుగు సంస్థ ఏర్పడింది. అనంతరం 1985 లో మలేషియాలోని కౌలాలంపూర్‌లో ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. సంస్థ విశ్వవిద్యాలయంలో విలీనమైన తర్వాత ప్రవాసాంధ్రులకోసం, విదేశాంధ్రులకోసం విశ్వవిద్యాలయం ద్విగుణీకృతంగా కార్యక్రమాలు చేపడుతున్నది. ఇతర రాష్ట్రాల్లోని సుమారు 400 తెలుగు సంఘాలు, విదేశాల్లోని సుమారు 20 తెలుగు సంఘాలు విశ్వవిద్యాలయంలో నమోదై ఉన్నాయి. కర్ణాటక, తమిళనాడు, మహారాష్ట్ర, పశ్చిమబెంగాల్, ఒరిస్సావంటి రాష్ట్రాల్లో; అమెరికా, మలేషియా, మారిషస్, దక్షిణాఫ్రికా, కెనడా, బ్రిటన్, బర్మా తదితర దేశాల్లో తెలుగు సంఘాలు ఎంతో ఉత్సాహంగా తెలుగు విశ్వవిద్యాలయం చేపట్టే కార్యక్రమాల్లో పాలు పంచుకుంటున్నాయి. ఇతర రాష్ట్రాల్లో పనిచేస్తున్న పాఠశాలల్లో తెలుగు బోధిస్తున్న అధ్యాపకులకు శిక్షణ నివ్వడంకోసం బొంబాయి, ఒరిస్సా రాష్ట్రంలోని బరంపురం, పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలోని టిటాఘర్, కర్ణాటకలోని గంగావతి తదితర ప్రాంతాల్లో పునశ్చరణ తరగతులు నిర్వహించడం జరిగింది. ఇతర రాష్ట్రాల్లోని తెలుగు సంఘాల గ్రంథాలయాలకు, తెలుగు పాఠశాలలకు, వాటి భవన నిర్మాణం, ఫర్నిచర్ వంటి వాటికి ఏటా నిధులు కేటాయించడం జరుగుతున్నది. పాఠశాలలకు పఠనసామగ్రి, బోధనోపకరణాలు అందజేయడంతోపాటు; ఇతర రాష్ట్రాలు, విదేశాల్లోని తెలుగువారి పిల్లలు ప్రాథమిక స్థాయిలో తెలుగు సులభంగా నేర్చుకోవడానికి వీలుగా రాష్ట్రప్రభుత్వం ఆధ్వర్యంలో బాపూ, రమణలు రూపొందించిన 14 కేసెట్లుగల వీడియో పాఠములను ఉచితంగా బహూకరించడం జరుగుతోంది. తెలుగులో ప్రసిద్ధకవులు, కథకుల రచనల్ని వారితోనే చదివించి రికార్డు చేసిన ఆడియో కేసెట్లను తెలుగు సంఘాలకు పంపుతున్నారు. రాష్ట్రేతరప్రాంతాల్లోని తెలుగు సంఘాల విజ్ఞప్తిని పురస్కరించుకుని ఆయా సందర్భాల్లో రాష్ట్రం నుంచి సాంస్కృతిక బృందాలను పంపుతున్నారు. రాష్ట్రేతరాంధ్రుల పిల్లలకోసం విశ్వవిద్యాలయం రాష్ట్రంలో బి.ఎస్సీ (అగ్రికల్చర్), బి.ఎస్సీ (హోంసైన్స్), కోర్సుల్లో కొన్ని సీట్ల రిజర్వేషన్ సౌకర్యాన్ని విశ్వవిద్యాలయం ప్రతిసారీ రాష్ట్రప్రభుత్వంతో సంప్రదిస్తూ ప్రవాసాంధ్రులకు తెలియజేస్తూ కల్పిస్తోంది. రాష్ట్రేతరాంధ్రుల పిల్లలు తెలుగు విశ్వవిద్యాలయంలో చేరదలిస్తే వారికోసం సూపర్ న్యూమరీ సీట్లు కల్పించి ఇవ్వడంతోపాటు ఫెలోషిప్స్‌కూడ మంజూరు చేయడం జరుగుతున్నది. మధురై, హర్యానా, అండమాన్ – నికోబార్ దీవుల్లో తెలుగు అధ్యాపకులకోసం స్వల్పకాలిక శిక్షణ శిబిరాలు నిర్వహించాలని విశ్వవిద్యాలయం సంకల్పిస్తున్నది. ఇతర రాష్ట్రాల్లో తెలుగు బోధిస్తున్న శిక్షణ పొందని ఉపాధ్యాయులకోసం కరస్పాండెన్స్ పద్ధతిలో 10 నెలల శిక్షణ కోర్సు ప్రారంభిస్తున్నది. విదేశాల్లోని తెలుగువారికి కరస్పాండెన్స్‌ద్వారా తెలుగులో బి.ఎ. కోర్సు నిర్వహించాలని కూడ విశ్వవిద్యాలయం సంకల్పిస్తోంది. ఇతర రాష్ట్రాలు, విదేశాల్లోని తెలుగువారి పిల్లల్లో మాతృభాషలోగల సృజనాత్మకతను ప్రోత్సహించడానికి పోటీలు నిర్వహించి బహుమతులు ఇస్తున్నది.

రాష్ట్రేతర ప్రాంతాల్లో తెలుగు భాషా, సాహిత్యాల వ్యాప్తికి కృషిచేసిన మహనీయ వ్యక్తుల గురించి ఆయా ప్రాంతాల్లో స్మారకోపన్యాసాలు ఏర్పాటు చేయనున్నది. అలాగే రాష్ట్రేతర ప్రాంతాల్లో తెలుగు భాషా, సాహిత్యాల విషయంలో జరిగిన కృషిని గురించి లఘుగ్రంథాలు వెలువరించే ప్రయత్నం జరుగుతున్నది.

విశ్వవిద్యాలయంలో తులనాత్మక అధ్యయనశాఖ పేరిట ఒక శాఖ ఉంది. తెలుగు తదితర భారతీయ భాషలతోపాటు ఇంగ్లీషు భాషాసాహిత్యాల్లోని వివిధ ప్రక్రియలు, ధోరణులతో సమన్వయ పూర్వకంగా, తులనాత్మకంగా ఈ శాఖ అధ్యయనం చేస్తోంది. ఆమేరకు ఆ శాఖలో ఎం.ఫిల్., పిహెచ్.డి. పరిశోధన కోర్సులు నిర్వహిస్తోంది. విస్తృతమైన కార్యక్షేత్రంతో ఈ శాఖ ముందు ముందు మరింత విలక్షణమైన రీతిలో పరిశోధన సాగిస్తుంది. తెలుగులో విజ్ఞాన సరస్వాన్ని కూర్చి ప్రచురించడంలో విశ్వవిద్యాలయంలోని విజ్ఞాన సర్వస్వ కేంద్రం కృషి చేస్తున్నది.

తెలుగులో 14 అంశాల్లో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను వెలువరించాలని ప్రణాళిక రూపొందింది. 'తెలుగు సంస్కృతి' పై మూడు సంపుటాలు సంకలనం చేసి ప్రచురించాలని సంకల్పించి రెండు సంపుటాలు ప్రచురించడం జరిగింది. మూడవది సిద్ధమవుతోంది. నాలుగవ సంపుటం 'మతములు – దర్శనములు'ను ప్రధానమంత్రి ఆవిష్కరించారు. ఐదవ సంపుటం 'విశ్వసాహితి,' ఆరవ సంపుటి 'భారతభారతి,' ఏడవది తెలుగువారి చరిత్ర, సంస్కృతిని గురించిన ఆంగ్ల సంపుటం 'హిస్టరీ కల్చర్ ఆఫ్ ఆంధ్రాస్' త్వరలో వెలువడనున్నాయి. ఇంకా 'భౌతికశాస్త్రం,' 'రసాయనశాస్త్రం' సంపుటాలు సంకలనంలో ఉన్నాయి.

విశ్వవిద్యాలయ మొదటి స్నాతకోత్సవంలో శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు; రెండవ

స్నాతకోత్సవంలో శ్రీ నండూరి రామమోహన్‌రావు, శ్రీ కొంగర జగ్గయ్య, మూడవ స్నాతకోత్సవంలో శ్రీ ఆవంత్స సోమసుందర్, శ్రీ ముళ్లపూడి వెంకటరమణ, శ్రీ గోపాలరాజ్ భట్ గార్లను గౌరవ డి.లిట్.లతో సత్కరించింది.

1989 సెప్టెంబర్‌లో జరిగిన విశ్వవిద్యాలయ తొలి స్నాతకోత్సవానికి ముఖ్య అతిథి అప్పటి ఉప రాష్ట్రపతి, ప్రస్తుత రాష్ట్రపతి మాన్య డా॥ శంకరదయాళ్ శర్మ; 1991 జూలైలో జరిగిన రెండవ స్నాతకోత్సవంలో భారత ప్రధాని శ్రీ పి.వి. నర్సింహారావుగారు ముఖ్య అతిథి. ప్రధాని తెలుగులో స్నాతకోపన్యాస మిచ్చారు. భారత ప్రధాని తెలుగులో ఉపన్యసించడం చరిత్రలో అదే తొలిసారి. 1992 సెప్టెంబర్‌లో ప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులు డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ ముఖ్య అతిథి.

విశ్వవిద్యాలయం త్వరలో పాఠ్యగ్రంథ నిర్మాణ శాఖ, అనువాద శాఖ అనే రెండు ముఖ్యమైన శాఖల్ని ప్రారంభించబోతుంది. స్నాతకోత్సవ స్థాయిలో కోర్సులకు తెలుగులో బోధన సాగించడానికి తెలుగులో పాఠ్యపుస్తకాల్ని తగినంతగా అందుబాటులోకి తేవాలనే లక్ష్యం ఇందువల్ల నెరవేరుతుంది. గతంలో తెలుగు అకాడమీ ఆధ్వర్యంలో సాగిన పాఠ్యగ్రంథనిర్మాణ కార్యక్రమాన్ని రాష్ట్రప్రభుత్వం తెలుగు విశ్వవిద్యాలయానికి అప్పగిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. ఉత్తమ గ్రంథాలను తెలుగునుంచి ఇతర భాషల్లోకి, ఇతర భాషల్లోని గ్రంథాలు తెలుగులోకి అనువదించి ప్రచురించడానికి అనువాద శాఖ ఏర్పాటవుతున్నది. భావ వినిమయాన్ని సుసంపన్నం చేసే ప్రధాన లక్ష్యాన్ని స్వీకరించి ఈ కేంద్రం పని చేస్తుంది. తెలుగులో వివిధ ప్రక్రియల్లో వచ్చిన ఉత్తమ రచనల్లోని భావ జాలాన్ని, తెలుగు సాహిత్య విశిష్టతను, ప్రతిభావంతులైన కవులు, రచయితల గొప్పతనాన్ని ఇతర భాషలవారికి తెలియజెప్పడానికి అనువాద శాఖ కృషిచేస్తుంది.

రాజమండ్రిలోని సాహిత్యపీఠంలో ఇదివరకు భక్తిపదకవితశాఖ పని చేసింది. పీఠాన్ని మరింత విస్తృతపరచి తెలుగు సాహిత్యాధ్యయనం, బోధన పరిశోధన కార్యక్రమాల్లో సమన్వయసాధన ఉద్దేశంతో పీఠంలో సంప్రదాయ సాహిత్యశాఖ, దేశిసాహిత్యశాఖ, ఆధునిక సాహిత్యశాఖ ఏర్పాటు చేయడం జరిగింది.

తెలుగు విశ్వవిద్యాలయం గడచిన ఎనిమిదేళ్లకాలంలో అనేక కార్యక్రమాలు చేపట్టింది. శిక్షణ శిబిరాలు, సదస్సులు, పురస్కార ప్రదానోత్సవాలు, కళోత్సవాలు, ప్రముఖుల శత జయంత్యుత్సవాలు, సంస్మరణోపన్యాసాల్ని నిర్వహించింది. విశ్వవిద్యాలయం ఏర్పడ్డ తొలినాళ్లలో వరుసగా రెండు మూడేళ్లపాటు 'విశాలాంధ్రావతరణోత్సవాల్ని,' 'తెలుగు సంవత్సరాది ఉత్సవాల్ని' ఎంతో వైభవంగా జరిపింది. సంప్రదాయసిద్ధంగా పచ్చనితోరణాలు కట్టి, మంగళతూర్యారవాల సందడిలో తెలుగు భాషని, సాహిత్యాన్ని, కళల్ని పునీతం చేసిన మహనీయుల్ని యథోచితంగా సత్కరించింది. అతిశయోక్తి కాదుగాని, భాషా సాహిత్యాలు, లలితకళలైన సంగీత, నృత్య, నాటకాది రంగాల్లో విశిష్ట సేవలందించిన ప్రముఖులు అధిక సంఖ్యలో ఏదోవిధంగా విశ్వవిద్యాలయ సత్కారం అందుకొన్నారు. సాహిత్యానికి, కళామతల్లికి ముద్దుబిడ్డల నెవరినైనా వారికృషిని గుర్తించడంలో లోపం జరగకూడదనే ఉద్దేశంతో మారుమూల ప్రాంతాలవైపు కూడ దృష్టి సారించడం జరుగుతున్నది. తెలుగు భాష, సాహిత్యం, లలితకళా రంగాలను వైభవోజ్వలం చేసినవారిని సత్కరించుకోడానికి ఇప్పుడున్న ఏకైక అధికార సంస్థ తెలుగు విశ్వవిద్యాలయమనే విషయాన్ని విస్మరించకుండా దానిని మననం చేసుకుంటూ, బాధ్యతను నిర్వర్తిస్తూ విశ్వవిద్యాలయం ముందుకు సాగుతున్నది.

విశ్వవిద్యాలయం నిర్వహించిన కార్యక్రమాలు అది చేసిన కృషికి ప్రతిబింబాలుగా నిలుస్తాయి. ఇప్పటివరకూ జరిగిన కార్యక్రమాల్ని పరిశీలిద్దాం. 1986 లో దేశ రాజధాని ఢిల్లీలో 'తోలుబొమ్మలాట' ప్రదర్శన – తెలుగువారి అతి ప్రాచీనమైన కళారూపాన్ని అక్కడ దేశ విదేశాలవారు చూసే అవకాశం కలిగించింది. ఆ సంవత్సరంలో ఇంకా 'చిత్రకళాప్రదర్శన,' 'సాహిత్యం, భాష, జానపదవాఙ్మయం వర్క్‌షాప్,' 'కర్ణాటక సంగీతోత్సవం,' 'ఉత్తమ నాటక రచనల పోటీ,' బహుమతుల ప్రదానంవంటి కార్యక్రమాలు జరిగాయి.

1987 లో రాష్ట్రం వెలుపల పాఠశాలల్లో తెలుగు బోధించే ఉపాధ్యాయులకు 'స్వల్పకాలిక శిక్షణ శిబిరం,' ఆయా పాఠశాలలకు 'బోధనోపకరణాల పంపిణీ,' 'సాంఘిక నాటకోత్సవాలు,' 'తెలంగాణా, ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల సమైక్య జానపద లహరి,' 'ఇంద్రజాల శిక్షణశిబిరం,' 'డోలు,' 'నాగస్వరం,' 'వీధినాటకా'ల్లో శిక్షణా శిబిరాలు జరిగాయి. 1988 లో తెలుగులో సుప్రసిద్ధమైన గద్య, పద్య నాటకాల్లో జనావళికి. కరతలామలకమైన పిట్టలదొర, దుర్యోధన, బాహుకుడు, కైకేయి, మాయలఫకీరు, హరిశ్చంద్ర, తిమ్మరుసు వంటి పాత్రలను – ఆ పాత్రలను అభినయించడంలో ఒరవడిపెట్టిన కళాకారులచేత అరుదైన 'అభినయోత్సవాన్ని' నిర్వహించారు. 'అవధానమంజరి,' 'జానపద నాటకోత్సవం,' 'తెలుగు సంస్కృతి – కుతుబ్‌షాహీల సేవ' సదస్సు, 'వేటూరి ప్రభాకరశాస్త్రి శతజయంతి,' 'సాంఘిక, పౌరాణిక నాటకోత్సవాలు,' 'హరికథా పోటీలు,' 'తెలుగు ప్రతిభా ప్రభాత రేఖలు' (వర్ధమాన చిత్రకారుల చిత్రప్రదర్శన,) 'తులనాత్మక అధ్యయనం' పై జాతీయ సదస్సు, 'ఇంద్రజాలం,

ధ్వన్యనుకరణ' శిక్షణశిబిరం తదితర కార్యక్రమాలు జరిగాయి. 1989 లో 'గేయకవితా సదస్సు,' 'అఖిల భారత తెలుగు మహాసభలు' (బెంగుళూరు), 'వాద్య సంగీతోత్సవాలు' (విశాఖ), 'రాష్ట్రస్థాయి జానపద కళోత్సవాలు' (కరీంనగర్) వంటి కార్యక్రమాలు పెద్దెత్తున జరిగాయి. ఒక్కో ఉత్సవం మూడు రోజులు ఎడతెరిపి లేకుండా ఆయా కళల్లో రాష్ట్రస్థాయిలో, జాతీయ స్థాయిలో సుప్రసిద్ధులైన వారి ప్రదర్శనలు వాటిలో చోటు చేసుకుని అశేష జనాన్ని అలరించాయి. 1990 లో 'గ్రామీణ విలేఖరులకు శిక్షణ,' డిగ్రీ కళాశాలల తెలుగు ఉపన్యాసకులకోసం యు.జి.సి. 'పునశ్చరణ తరగతులు' (రాజమండ్రి), 'సాహితీ సమన్వయం' సదస్సు, 'వేంగీ చాళుక్యులు' సదస్సు (శ్రీశైలం), 'తృతీయ ప్రపంచ తెలుగు మహాసభలు' (మారిషస్), 'గరిమెళ్ల సత్యనారాయణ 98 వ జయంతి,' 'బండారు తమ్మయ్య' శత జయంతి, 'చిలుకూరి నారాయణరావు శత జయంతి,' 'కార్టూన్ ఎగ్జిబిషన్,' 'బుర్రకథ,' 'డప్పు,' 'హరికథ,' 'జానపద గేయ' శిక్షణ శిబిరాలు (రెండు నెలలపాటు), 'సిద్ధేంద్రయోగి ఆరాధనోత్సవాలు' (కూచిపూడి), 'కొమర్రాజు లక్ష్మణరావు జయంతి,' 'భారతీయ భాషల్లో విజ్ఞాన సర్వస్వాల కూర్పు' జాతీయ సదస్సు తదితర కార్యక్రమాలు జరిగాయి. 1991 లో 'శబ్దార్థ విజ్ఞానం' జాతీయ సదస్సు, 'పునశ్చరణ తరగతులు' (రాజమండ్రి), 'ఆంధ్రప్రదేశ్ నేటి ఎల్లలు నాటివా?' సదస్సు (శ్రీశైలం), 'జానపద విజ్ఞానం–పరిశోధన ప్రక్రియలు' సదస్సు (రాజమండ్రి), 'శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి శత జయంతి' (రాజమండ్రి),'కొమర్రాజు లక్ష్మణరావు 114 వ జయంతి,' 'గాత్ర సంగీతోత్సవాలు' (చిత్తూరు), 'జానపదకళల్లో శిక్షణ శిబిరం,' 'రాష్ట్రస్థాయి కూచిపూడి నృత్యోత్సవాలు' (కూచిపూడి), 'జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత గోకాక్ పై సదస్సు,' 'మల్లంపల్లి సోమశేఖరశర్మ శతజయంతి,' 'నిఘంటు నిర్మాణం' పై జాతీయ సదస్సు, 'కోరాడ రామకృష్ణయ్య శతజయంతి,' 'కాకతీయుల వాస్తు, శిల్పకళలు' జాతీయసదస్సు (శ్రీశైలం), పునశ్చరణ తరగతులు (హైదరాబాదు), 'జానపద విజ్ఞానం' జాతీయ సదస్సు తదితర కార్యక్రమాల్ని విశ్వవిద్యాలయం నిర్వహించింది. 1992 వ సంవత్సరంలో అహ్మదాబాద్‌లో మహాత్మా గాంధీ నెలకొల్పిన గుజరాత్ విద్యాపీఠ్‌లో 'గురజాడ పేరిట తెలుగు పీఠం' ప్రారంభోత్సవం, 'దక్కన్ యువకవితోత్సవం,' 'రాయప్రోలు సుబ్బారావు శతజయంతి,' 'సాహిత్యం, లలితకళలు– అంతస్సంబంధాలు' గోష్ఠి, 'క్విట్ ఇండియా రూపకం,' 'గరిమెళ్ల శత జయంతి,' 'అనువాద కవితాగోష్ఠి,' విశ్వవిద్యాలయంలో ఏటా 'మోతీలాల్ నెహ్రూ,' 'నాయని సుబ్బారావు,' 'రాణీ భవానీదేవి,' 'రావూరి కాంతమ్మ,' 'మాటేటి రామప్ప' గార్ల స్మారకోపన్యాస కార్యక్రమాలు ఏర్పాటవుతున్నాయి.

1993 లో అంతర్జాతీయ స్థాయిలో తెలుగువారికి కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ కె. రాజయ్యకు 50 వేల రూపాయల నగదుతో తెలుగు విశ్వ విద్యాలయ విశిష్ట పురస్కారమిచ్చి సత్కరించడం జరిగింది. ఇంతకు ముందు ఈ పురస్కారాన్ని కళాప్రపూర్ణ బోయి భీమన్నగారందుకొన్నారు. 1992 డిసెంబరు 2 న జరిగిన విశ్వవిద్యాలయం అవతరణోత్సవంలోనూ, 1993 మే 31 వ తేదీన జరిగిన సాహితీ పురస్కారాల ప్రదానోత్సవంలోనూ, జూలై 17 వ తేదీన జరిగిన ప్రతిభా పురస్కారాల ప్రదానోత్సవంలోనూ తెలుగు భాష, సాహిత్యం, సాంస్కృతిక రంగాల్లో నిష్ణాతులైన సుమారు 50 మంది కవి, పండితులను, కళాకారులను విశ్వవిద్యాలయం సముచితరీతిలో సత్కరించింది. జూలై 13, 14 తేదీల్లో శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ శత జయంతిని, అక్టోబర్‌లో మైసూరులో రాళ్లపల్లివారి సంస్మరణోపన్యాస కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది. 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు,' 'సరస్వతీ నారదవిలాపం,' 'ముసలమ్మ మరణం,' 'నేటికాలపు కవిత్వం' వంటి అరుదైన అలభ్య అముద్రిత గ్రంథాలను ముద్రించి అందించే కార్యక్రమాన్ని విశ్వవిద్యాలయం చేపట్టింది.

విద్వాంసులతో కూడిన ఉన్నతస్థాయి సంఘం సమర్పించిన అధ్యయనాంశం ప్రాతిపదికన 1993–94 లో తెలుగు విశ్వవిద్యాలయ పునర్నిర్మాణ పునర్వ్యవస్థీకరణ బృహత్ కృషికి ఒక రూపం ఏర్పడింది. విశ్వవిద్యాలయ అవతరణకు నేపథ్యంగా నిలిచిన అంశాలు లక్ష్యాలమేరకు అనేక కార్యక్రమాలను రూపొందించారు. విశ్వవిద్యాలయ కార్యకలాపాలను తెలుగునాట అంతటా విస్తరింపజేసే ఆశయంతో తెలుగు వైతాళికుల ఉత్సవాలు సాగుతున్నాయి. మహబూబ్‌నగర్‌లో సురవరం ప్రతాపరెడ్డి ఉత్సవం, ప్రొద్దుటూరులో పుట్టపర్తి నారాయణాచార్యుల ఉత్సవం, భీమవరంలో అడవి బాపిరాజు ఉత్సవం, పాలకుర్తి (వరంగల్ జిల్లా)లో పాల్కురికి సోమనాథుని ఉత్సవం నిర్వహించారు. అలాగే భద్రాచలంలో రామదాసు ఉత్సవం, హైదరాబాదులో మాడపాటి హనుమంతరావు ఉత్సవం నిర్వహించాలని సంకల్పించారు.

విశ్వవిద్యాలయంలో అంతర్భాగంగా ఉన్న పూర్వపు అంతర్జాతీయ తెలుగు కేంద్రం, విజ్ఞాన సర్వస్వ కేంద్రం, విశ్వవిద్యాలయం ప్రారంభించిన తులనాత్మక అధ్యయన కేంద్రం ఈ మూడు కేంద్రాలను శాఖలుగా మార్చి వాటిల్లోవున్న డైరెక్టర్, డిప్యూటీ డైరెక్టర్, అసిస్టెంట్ డైరెక్టర్ పోస్టులను సిద్ధాంతకంగా ప్రొఫెసర్, రీడర్, లెక్చరర్‌గా చేయడం జరిగింది. వాటిల్లో తగిన ప్రాజెక్టులు చేపట్టడానికి చర్యలు తీసుకోవడం జరుగుతోంది. కంప్యూటర్ వంటి ఆధునిక సాంకేతిక పరికరాలను సమకూర్చడం జరిగింది.

జానపద కళల శాఖలో ఎం.ఎ. కోర్సు ప్రవేశపెట్టడానికి, తులనాత్మక అధ్యయన శాఖలో, ప్రాకృతంలో పి. జి. డిప్లొమా కోర్సు ప్రవేశపెట్టడానికి నిర్ణయించారు. వచ్చే విద్యాసంవత్సరంలో లైబ్రరీ, ఇన్‌ఫర్మేషన్ సైన్స్‌శాఖలను ప్రారంభించి అందులో డిగ్రీ కోర్సును ప్రవేశపెట్టనున్నారు.

తెలుగు జర్నలిజంలో డిగ్రీ కోర్సు నిర్వహిస్తూ తెలుగు పత్రికా రంగానికి విద్యాత్మకంగా తోడ్పాటు నందిస్తున్న తొలి విశ్వవిద్యాలయం యిది. ఎం. సి. జె. కోర్సుకూడ ఆరంభం కాబోతున్నది. వేటపాలెం వంటి ప్రసిద్ధ గ్రంథాలయాల్లో వున్న అరుదైన ప్రాచీన తెలుగు భాషా సాహిత్య గ్రంథాలు దాదాపు 600 మేరకు గుర్తించి, వాటిని జిరాక్స్ చేయించి భద్రపరుస్తున్నారు. నిధులు సమకూరుతున్నకొద్దీ దశలవారిగా వాటిని ముద్రించి అందించాలని విశ్వవిద్యాలయం నిర్ణయించింది. సిద్ధేంద్ర కళా క్షేత్రాన్ని ప్రతిష్ఠాత్మకమైనదిగా తీర్చిదిద్దేందుకు చర్యలు ప్రారంభించారు. కర్ణాటక సంగీతంలో జాతీయ స్థాయిలో ఉన్న విద్వాంసులను, కళాకారులను ఒకచోట చేర్చి సదస్సు నిర్వహించే సన్నాహాలు సాగుతున్నాయి.

## ఆదాయ వ్యయాలు - ముఖ్యమైన పద్దులు:

1991-92 తెలుగు విశ్వవిద్యాలయం ఆదాయం 247.46 లక్షల రూపాయలు, వ్యయం 290.99 లక్షల రూపాయలు ఉంది. 48.48 లక్షల రూ॥ల లోటు బడ్జెట్ వుంది. 1992-93, 93-94 సంవత్సరాల బడ్జెట్ అంచనాలలో ఆదాయం వరసగా 336.11 లక్షలు, 295.05 లక్షలు కాగా, వ్యయం అంచనాలు 397.75 లక్షలు, 343.54 లక్షలుగా వున్నాయి. ప్రభుత్వం నుంచి వచ్చిన బ్లాక్ గ్రాంట్‌లు 1991-92 లో 1,39,27,800 రూ॥ కాగా, 92-93 లో 2,07,11,000 రూ॥లు, 93-94 లో 23,70,000 రూ॥ వున్నాయి. వీడియో రికార్డింగ్ నిమిత్తం 1992-93లో ప్రభుత్వం 20 లక్షల రూ॥ గ్రాంటు నిచ్చింది. విజ్ఞానసర్వస్వ ప్రచురణల నిమిత్తం మానవ వనరుల అభివృద్ధి నిధినుంచి 1 లక్షా 17 వేల రూ॥ 93-94 లో లభిస్తుందని అంచనా. యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ నుంచి 93-94 లో 2,34,000 రూ॥ లభిస్తుందని అంచనా. పుస్తక ప్రచురణల ద్వారా వచ్చే ఆదాయం 91-92 లో 6.90 లక్షలు కాగా, 92-93 లో 15 లక్షలు, 93-94 లో 10 లక్షలు అంచనా వేశారు. హాస్టల్ నిర్మాణానికి నిర్వహణకు 92 -93 సంవత్సరానికి 3 లక్షలు, 93-94 సంవత్సరానికి 5.50 లక్షలు కేటాయింపులు చేశారు. ప్రచురణల నిమిత్తం వ్యయాలు 91-92 లో 7.81 లక్షలు కాగా, 92-93 కు 10.41 లక్షలు, 93-94 కు 12.64 లక్షలు కేటాయింపులున్నాయి. గ్రంథాలయ నిర్వాహకశాఖకు 1991-92 లో 7.17 లక్షలు వ్యయంకాగా 1992-93 లో 15.11 లక్షలు 93-94 లో 14.56 లక్షలు కేటాయింపులున్నాయి.

విస్తరణ సేవా కార్యక్రమాలకు 91-92 లో 18.74 లక్షలు వ్యయం కాగా, 92-93 కు 27.90 లక్షలు, 93-94 సంవత్సరానికి 26.85 లక్షలు కేటాయింపులున్నాయి.

విశ్వవిద్యాలయం సంకల్పిస్తున్న బృహత్తర కృషికి తగిన ఆర్థిక సహాయాన్ని ప్రభుత్వం, హార్దిక సహాయాన్ని ప్రజలూ అందించవలసిన అవసరం వుంది.

*నైలునదీ నాగరికతలో*
*సామాన్యుని జీవన మెట్టిది?*
*తాజమహల్ నిర్మాణానికి*
*రాళ్లెత్తిన కూలీలెవ్వరు? - శ్రీ శ్రీ*

# విద్యావిధానం - సైద్ధాంతిక పునాది

ప్రొ॥ వి. వి. కృష్ణారావు, ఎం.ఎస్‌సి.,బి.యల్ అమెరికా సిగ్మాజై శాస్త్ర పరిశోధనాసంస్థ సభ్యులు

సామాజిక పరివర్తనానికి ఒక సాధనంగా నేడు విద్య సర్వత్రా అంగీకరించబడుచున్నది. ప్రపంచ విద్యావేత్తలు దశాబ్దాలుగా సాగించిన చర్చల ఫలితంగా ఇట్టి గుర్తింపు లభించింది. సాంఘిక జీవితంలో శాస్త్ర విజ్ఞానం, టెక్నాలజీలు కలిగించిన వేగవంతమైన మార్పుల ఫలితంగా విద్యావేత్తలు విద్యయొక్క సాంఘిక ప్రయోజనాన్ని నేటికి అంగీకరించక తప్పిందికాదు.

అయితే, ఈ సందర్భంలో కొన్ని మౌలిక ప్రశ్నలు తలఎత్తుతున్నాయి. సమాజం మారవలసివస్తే, ఆ మార్పు ఏ దిశగా జరగాలి? సామాజిక పరివర్తనము సాధించగల సిద్ధాంతం ఏది కావాలి? అట్టి సిద్ధాంతాన్ని విద్యా విధానంలో జోడించవలెనా, లేదా?- ఇవీ ఆ ప్రశ్నలు; ఇట్టివే మరికొన్ని ప్రశ్నలకు స్పష్టమయిన సమాధానాల నన్వేషించాలి.

## పూర్వకాలపు విద్యావిధానం - దాని సైద్ధాంతిక పునాది:

ఆదికాలం నుంచీ విద్య సమాజంతోనూ, సమాజ అవసరాలతోనూ సన్నిహిత సంబంధం కల్గివుంటూనే వచ్చింది. మొదటినుంచీ విద్య ఒక సాంఘిక పక్షం వహిస్తూ తాత్విక పరంగాను, ఆర్థికపరంగాను ఏదో ఒక దృక్పథం కల్గివుంటూనే వచ్చింది.

ప్రాచీన కాలంనాటి గ్రీసుదేశంలో ప్లేటో, అరిస్టాటిల్ వంటి ప్రముఖ తాత్వికులు "అకాడమీ"లు "లైసియం"లు అని పిలువబడే విద్యాశాలలను ప్రారంభించారు. నాడు వారు బోధించిన విద్యకుకూడా స్పష్టమయిన సైద్ధాంతిక పునాది వుండేది. ఆనాడు సమాజానికి బానిసత్వం అవసరమైనదనీ మానవులలోని అసమానత సహజసిద్ధమైనదని వాదించబడు తుండేది. రాజులతోను, నిరంకుశ ప్రభువులతోను కూడిన అల్పసంఖ్యాకవర్గం అధిక సంఖ్యాకులైన ప్రజలపై చలాయించే పెత్తనానికి ఆనాడు సాంఘిక ఆమోదం లభించింది.

వస్తూత్పత్తికి అవసరమైన విద్య, కుటుంబంలోనే ఆనాడు గరపబడుతుండేది. బానిసలు సృష్టించిన భౌతిక సంపద నంతటినీ బానిస యజమానులే అనుభవిస్తూండేవారు. ఈ యజమానులు తమ బానిసలకు కనీస జీవనభృతిని మాత్రమే దక్కనిచ్చేవారు.

పురాతన భారతదేశంలో కూడా గురుకులాల రూపంలో యిట్టి విద్యా విధానమే ఉంటుండేది. మహాభారత కాలం నుంచీ మన దేశంలో అమలులోవున్న విద్యావిధానపు లక్ష్యం రాజభక్తిని ప్రబోధించటమే. అదేవిధంగా వర్ణ వ్యవస్థను నాటి విద్యావిధానం సమర్థిస్తుండేది.

మధ్యయుగాలనాటికి యూరపులో బానిస వ్యవస్థ స్థానంలో భూస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. చర్చి (క్రైస్తవ మతం) ఒక పెద్ద భూయాజమాన్య సంస్థగా తయారయి భూస్వామ్య వ్యవస్థ రక్షకుడుగా ముందుకొచ్చింది. క్రైస్తవమతం అనేక విద్యాసంస్థలను స్థాపించి, ప్రజలకు ఐహిక జీవితంకంటె పరలోక జీవితం ప్రధానమని బోధిస్తూండేది. ఈ ధోరణిని క్రైస్తవ మతం నేటికీ కొనసాగిస్తున్నది. ఇతర మతాలుకూడా ఈ ధోరణిని అనుసరిస్తున్నాయి. హిందూమతం భౌతిక అవసరాలను పూర్తిగా నిర్లక్ష్యం చేసే ఆధ్యాత్మిక విలువలకు ప్రాధాన్యతనీయటం మనకు సుపరిచితమే.

మధ్యయుగాలందంతటా విజ్ఞానం మత ప్రాబల్యానికి లోబడే కొనసాగింది. విద్యాలయాలలో మతం ఆమోదించిన దృక్పథాలు, సిద్ధాంతాలు మాత్రమే బోధించబడుతూండేవి. అరిస్టాటిల్ ప్రవచించిన అనేక దృక్పథాలు, అవి అసంగతాలని ఋజువైనా, వాటి సత్యాసత్యాలతో నిమిత్తం లేకుండా మతం ఆమోదం ఉన్నది కనుక విద్యాలయాలలో బోధింపబడ్డాయి. ఇది సామాన్యమయిన విషయమే. ఎందుకంటే, అధికారంలో ఉన్న వర్గాలు సాంప్రదాయాన్ని ధిక్కరించుటకు ఇష్టపడవు.

అట్లా జరిగితే తమ ప్రయోజనాలకే భంగం కలుగుతుంది. మధ్యయుగాలనాటి విద్యయొక్క సైద్ధాంతిక దృక్పథం ఎంత దృఢమైనదంటే – బ్రూనో, గెలీలియో మున్నగు శాస్త్రజ్ఞులు హేతుబద్ధమైన, శాస్త్రీయ ఆలోచనా ధోరణులను ప్రవేశ పెట్టుటకుగాను మూఢవిశ్వాసాలను వ్యతిరేకించినందుకు తమ జీవితాలను బలిపెట్టవలసి వచ్చింది.

## ఆధునిక కాలపు విద్యావిధానం - దాని సైద్ధాంతిక పునాది:

ఆధునిక యుగపు విద్యావిధానం మిక్కిలి నిగూఢమైనది. శాస్త్ర విజ్ఞానం, టెక్నాలజీ అభివృద్ధి చెంది మధ్యయుగాలనాటి అజ్ఞానాన్ని, పాండిత్య ప్రాధాన్యత చదువులను నిరసిస్తూ – హేతువాదం – ఒకవైపున బలోపేతం చేస్తుంటే, వేరొకవైపున, వున్న వ్యవస్థను సంరక్షించే ప్రయత్నాలు కూడా అనేకరీతులలో కొనసాగుతున్నాయి. పెట్టుబడిదారీ విధాన ప్రచారకులు తాము అన్ని విధాలయిన తాత్త్విక రీతులకు వ్యతిరేకమన్నట్లుగానూ, మేధోజనితమయిన ఒకానొక సమ చిత్తతను అలవరచుకున్నట్లుగానూ పోజు పెడుతుంటారు. వీరు సమస్త సాంఘిక సమస్యలకు తాటస్థ్యాన్ని, ఆలోచనా స్వేచ్ఛనీ (Open mindedness) ప్రతిపాదిస్తుంటారు. వీరి ఈ తాటస్థ్యం మేకవన్నె పులివంటిది. ఈ తాటస్థ్యం సాంప్రదాయం వేసుకున్న సరికొత్త ముసుగు మాత్రమే. సమస్యల విషయంలో తాటస్థ్యం ప్రదర్శించడమంటే యథాతథస్థితి కొనసాగించటమూ, ఉన్న వ్యవస్థను ఇట్లాగే ఉంచాలని ప్రయత్నించడమూ, ప్రస్తుత వ్యవస్థయొక్క లోపాలను చూడకపోవడం మాత్రమేగాక సమాజ పరి వర్తనానికి కృషి సలిపే శక్తులను నిర్లక్ష్యం చేయటమే కాగలదు. ఏ ఒక్క సిద్ధాంతాన్ని తాటస్థ్యమనే పేరుతో అంగీకరించకపోవటం సాంఘిక పరిస్థితుల స్వభావాన్నిబట్టి అసాధ్యం.

సోవియట్ యూనియన్‌లోను, అమెరికా సంయుక్త రాష్ట్రాలలోను గల విద్యా విధానాల సైద్ధాంతిక పునాది పరస్పర విరుద్ధమైనట్టిది. అయితే, ఆ దేశాల విద్యా విధానంలో సైద్ధాంతిక దృక్పథము మిక్కిలి ఉన్నతమైన రీతిలో బోధించబడుతున్నది.

సోవియట్ రష్యాలోని విద్యా విధానం సామాజిక యాజమాన్యభావన ప్రధానమైనది. కాగా, అమెరికాలోని విధానము Private Enterprise భావనను బలోపేతం చేయునట్టిది. సామాజిక పరిణామ చరిత్రను గనుక మనం గమనంలోకి తీసుకుంటే విద్య అనేది ఏ యాజమాన్యంద్వారా అది అందించబడినప్పటికీ సైద్ధాంతిక ప్రధానమైనదిగానే గాక ఒకానొక సిద్ధాంతంగానే కొనసాగటం చూస్తాం. అయితే ఈ రూపం ఒక్కొక్కమారు బహిరంగంగా కనపడితే ఒక్కొక్కమారు అజ్ఞాతంగా ఉంటుంది.

సైద్ధాంతిక పునాదిలేని విద్య చుక్కానిలేని నావ వంటిది. ఎట్టి సైద్ధాంతిక పునాది లేని కారణంగానే స్వాతంత్ర్యానంతరము మన విద్యా విధానం లక్ష్య రహితముగా సాగుతున్నది. అందుచేతనే అది ఎట్టి సత్ఫలితాలను యివ్వలేక పోయింది. భారతదేశం తన పూర్వపాలకులైన బ్రిటిషువారి నుంచి విద్యాసంబంధంగాను యితరంగాను అవాంఛనీయమైన విషయాలనేకం గ్రహించింది. మెకాలే విద్యా విధానాన్ని రూపొందించినపుడు భారతదేశంలోని బ్రిటిషు సామ్రాజ్య రక్షణయే దాని లక్ష్యంగా ఉంది. బ్రిటిషు సామ్రాజ్య పతనంతో భారతదేశంలో విద్యావిధానం అంతకు పూర్వపు లక్ష్యం అంతర్ధానమైంది. అయితే ఆ ఖాళీని నూతన విద్యా విధానంతో భర్తీ చేయడం జరుగలేదు.

## విద్య - వర్గ స్వభావం:

విద్య కేవలం విద్య కోసమే ఉద్దేశించబడినట్టిది కాదు. అన్నియుగాలలోను విద్యకు ఒక స్పష్టమైన లక్ష్యం ఉంటూనే వచ్చింది. కాని, విద్య పైకిమాత్రం వ్యక్తి వికాసమునకు తోడ్పడే సాధనంగా చూడబడుతున్నది. ధనిక వర్గాలలో విద్య కేవలం జ్ఞానార్జనా లక్ష్యం కల్గినట్టిది అనే భావన అంతిమంగా చోటుచేసుకున్నది. దీని పర్యవసానం కొద్ది స్వార్థపరవర్గాలకు విద్యా విధానం తోడ్పడుతుందనే వాస్తవాన్ని కప్పి పుచ్చడం కోసమే. ఆ విధంగా ఈ స్వార్థపరవర్గాలుగా విద్యయొక్క సాంఘిక స్వభావాన్ని సంకుచిత మొనర్చి, వ్యక్తిగత అవసరములను తీర్చు సాధనంగా విద్యకు అపార్థములు కల్పించారు. ఆ విధంగా విద్య ఎట్టి పరిస్థితులలోను మారని శాశ్వత స్వభావమును కల్గివున్నట్లు అపాదించడంతో సామాజిక పరివర్తనా సాధనకై ఉపకరించే పనిముట్టుగా నిర్వహించే పాత్ర నివారింప బడినది. కాని, విద్యనుగూర్చి సామాన్య ప్రజలకు బోధన, పరిశోధన, పఠనములతో కూడినదిగాను, శీల నిర్మాణమునకు తోడ్పడునదిగాను ఉద్బోధించబడి వారిని లోబరుచుకొను శక్తిగా విద్య కొనసాగుతూ వస్తున్నది.

ఇట్టి విద్య పురాతన గ్రీసు దేశంలో ప్రభుత్వ సంస్థల లోను, ప్రభుత్వేతర సంస్థలలోను నిర్వహింపబడుతుండేది. ఇప్పటిలాగే విద్య ఆనాడు వ్యక్తుల ఆధ్వర్యంలోను లేదా కొన్ని సంస్థల ఆధ్వర్యంలోను నిర్వహించబడుతుండేది. ఇట్టి వ్యక్తులు అధికార వర్గాలతో కుమ్మక్కయి తమ ప్రయోజనాలను తీర్చుకుంటారు. విద్యారంగంలో ప్రభుత్వానికి మద్దతుగా ప్రైవేటు సంస్థలు నిర్వహించిన పాత్ర వలన మధ్య యుగాలలో మత విశ్వాసాల వ్యాప్తి ఎక్కువగా జరిగింది. కాని, క్రమక్రమంగా రాచరికం, చర్చి (మతం ) ఘర్షణపడ నారంభించాయి. రాజులు మత ప్రభావమునకు వ్యతిరేకంగా

తమ స్థితిని పదిల పరచుకోజొచ్చారు. ఇందువలననే రాజులు విద్యా విధాన నిర్వహణలో ప్రభుత్వ పాత్రను అధికం చేసుకొనుటకుగాను విద్యాలయాల నిర్వహణపై అధికంగా ధనవ్యయం చేయజొచ్చారు. చివరకు ప్రైవేటు సంస్థలు విద్యాలయాల నిర్వహణకు ప్రభుత్వ ధనసహాయం పొందే స్థితి ఏర్పడినది. ఇందుకు కారణం ఈ ప్రయివేటు సంస్థల లక్ష్యములు ప్రభుత్వ లక్ష్యములతో ఏకీభవించటమే. ఈ ఉభయులకు గల ఉమ్మడి లక్ష్యం తమ వర్గ ప్రయోజనాల పరిరక్షణమే. ఇట్టి ప్రయివేటు సంస్థలు యీనాడు సామాజిక మార్పును గట్టిగా వ్యతిరేకించే స్థితికి వచ్చాయి. పై పెచ్చు ఈ సంస్థలు ప్రభుత్వ విధానాలను తమకు అనుకూలంగా మార్చడంకోసం ప్రయత్నం చేస్తున్నాయి. ఈ పరిస్థితి మతసంస్థల విషయంలో మరింత వాస్తవంగా కనపడుతోంది. ఈ సంస్థలు - మైనారిటీల రక్షణ పేరుతో సాధారణ విద్యా నిబంధనల నుండి తమకు ప్రత్యేక మినహాయింపులు కావాలని కోరుతున్నాయి.

## విద్య - ఉత్పత్తికి తోడ్పడాలి:

ఉత్పత్తికి అవసరమైన విద్యాశిక్షణలో అభివృద్ధి కూడా ఇదే క్రమంలో కొనసాగింది. సాంకేతికంగాను, వైవిధ్య పరంగాను చూస్తే పూర్వకాలపు ఉత్పత్తి విధానం చాలా సామాన్యమైన రీతిలో సాగుతుండేది. ఉత్పత్తికి అవసరమైన శిక్షణ ఆనాడు కుటుంబంలోనే లభిస్తుండేది. ఆయా వృత్తులకు సంబంధించిన నైపుణ్యములు కుటుంబంలోనే, తండ్రులనుంచి కుమారులకు అనువంశికంగా సంక్రమిస్తుండేవి. ఆనాటి విద్య సైద్ధాంతిక పునాదియే ఇందుకు కారణం. అది అవిచ్ఛిన్నంగా సాగుతూ సంప్రదాయంగా స్థిరపడిపోయింది. ఆ రోజులలో బానిసలకు జంతువులుగా పనిచేయటం వినా మార్గాంతరం లేదని చెప్పబడుతుండేది.

భూస్వామ్య వ్యవస్థలో ఉత్పత్తిక్రమం మరింత వైవిధ్యం సంతరించుకున్నది. కాని, అనువంశికంగా నైపుణ్యములు, కుటుంబంలో నేర్చుకొనడం కొనసాగుతూనే వచ్చింది.

ఆధునిక విజ్ఞానం, దాని ననుసరించి వచ్చిన టెక్నాలజీ అధికంగా అభివృద్ధి కావటం మొదలవటంతో పరిస్థితి మారజొచ్చింది. ఫలితంగా ఉత్పత్తిక్రమం ఎంతో వైవిధ్యతనూ, సంక్లిష్టతనూ సంతరించుకొన్నది. ఉత్పత్తి టెక్నిక్‌లో అభివృద్ధి వచ్చింది. 17 వ శతాబ్దంలో ఆర్థిక, సాంకేతిక పరిస్థితులు అభివృద్ధి చెందిన ప్రభావంవలన అనువంశిక సంప్రదాయాలు విచ్ఛిత్తి చెందడంతో ఉత్పత్తికి సంబంధించిన నైపుణ్యములను కుటుంబంనుంచే గ్రహించుట మందగించింది. ఇందువలన విద్యా విధానంలో మార్పులు అవసరమయ్యాయి. శాస్త్ర విజ్ఞాన ఫలితంగా ఆవిర్భవించిన నూతన యంత్రాలు, సాంకేతిక పరిజ్ఞానం మూలంగా విద్యకు అర్థం కేవలం సాధారణ జ్ఞానసముపార్జన గాక, సాంకేతిక పరిజ్ఞాన సముపార్జన కూడా అయింది. ఆధునిక టెక్నాలజీ అభివృద్ధి చెందడంతో వస్తూత్పత్తి భారీ ఎత్తున సాగజొచ్చింది. ఇందుకుగాను శిక్షణ పొందిన టెక్నీషియనుల అవసరం హెచ్చింది. ఈ డిమాండు నూతనంగా విద్యాలయాలను ఏర్పరిస్తేగాని తీరనిది. పర్యవసానంగా విద్యావిధానం నుంచి విడదీయరాని భాగములుగా ఇంజనీరింగు, టెక్నాలజీ, తదితర శాస్త్ర విషయాలు రూపొందాయి. టెక్నాలజీ క్లిష్టమౌతున్న కొద్దీ సాంకేతిక నిపుణుల కిచ్చిన శిక్షణ ఆ మోతాదులోనే ఖర్చుతో కూడినదవుతున్నది. అందుచేత యిట్టి నిపుణుల బాధ్యత ప్రభుత్వాలో లేదా ప్రముఖ పారిశ్రామిక సంస్థలో మాత్రమే నిర్వహించగల్గుతున్నాయి. ఆర్థిక ప్రణాళిక అనేది ఇరవైయవ శతాబ్దపు ప్రత్యేక లక్షణం. ఇట్టి ఆర్థిక ప్రణాళికలు పారిశ్రామిక అవసరములను - నిపుణుల శిక్షణను సమన్వయం చేస్తాయి. అందువలన సాంకేతిక శిక్షణకు ప్రభుత్వమే మరల పూచీపడవలసి వస్తున్నది. ఇట్టి పరిస్థితులలో విద్య ఇంతకు ముందుకంటే అధికంగా ప్రభుత్వాధీనం క్రిందకు వస్తోంది.

## విద్యావిషయమందలి మార్పు:

పరిశ్రమలు అభివృద్ధి కావడం, ఉత్పత్తి పెరుగుదల, వివిధ దేశాలమధ్య వార్తాసౌకర్యాలు - ప్రయాణ సౌకర్యాల అభివృద్ధి ఇవన్నీ ఆర్థిక వ్యవస్థ రూపురేఖలను గుర్తు పట్టడానికి వీలులేనంతగా మార్చివేశాయి. ఈ మార్పుల పర్యవసానంగా సాంఘిక వ్యవస్థలోను, ఆర్థిక వ్యవస్థలోను మార్పులు వచ్చాయి. ఆర్థిక రంగమునకు సంబంధించినంతవరకు అంతర్జాతీయ వ్యాపారం , ప్రభుత్వ పెట్టుబడులు, బ్యాంకింగ్ విధానం, వ్యాపార నిర్వహణవంటి నూతన శాఖలు అమలులోకి వచ్చాయి. విద్యా ప్రణాళికలలో నేడు సాంప్రదాయంగ వస్తున్న చరిత్ర, రాజనీతి శాస్త్రం మున్నగు సామాజిక శాస్త్రములతోపాటు ఆధునిక శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానములు కూడా చోటు చేసుకున్నాయి. విజ్ఞానశాస్త్రం గుర్తు పట్టడానికి వీలులేనంతగా అభివృద్ధి చెందుతున్నది. ఇది ప్రతి పది ఏండ్లకు రెండింతలుగా అభివృద్ధి అవుతూ ఉన్నతమైన ప్రత్యేక పరిశోధనకు దారితీస్తున్నది. అద్భుతమైన ఈ అభివృద్ధి ఫలితంగా నూతనశాస్త్రాలు ఆవిర్భవిస్తున్నాయి. పర్యవసానంగ నేటి విద్యా విధానం గ్రీకు కాలంనాటి సామాన్య స్థితినుంచి బహుళశాఖలతో పరిఢవిల్లుతున్నది. దీనిని వివిధములైన ఫలపుష్పములతోను, ఏకీకృతమైన కాండంతోను గూడిన ఒక పెద్ద వట వృక్షంతో పోల్చవచ్చు. అయితే, ఇది గతమునందు వేరూనికొని వుండుట కాంచగలం. ఈ విద్యా విధానం పారిశ్రామిక విప్లవ ఫలితంగా ముందుకొచ్చిన మార్పులవలన జనించిన వివిధ సాంఘిక కార్యక్రమములను ప్రతిఫలిస్తోంది. సాంఘిక

జీవితం యుగ యుగమునకు మార్పునకు గురౌతున్నది. దీనికనుగుణముగ విద్యా విషయములందు కూడా మార్పులు తరచుగా సంభవించాలి. అంటే, విద్య సాంఘిక జీవిత దర్పణంగా వుండాలి. ఆ విధంగా ఒకవైపున మానవుడు ప్రకృతితో చేసే పోరాటాన్ని, వేరొకవైపు మానవ సమాజంలోని వివిధ వర్గముల పోరాటాలను ప్రతిఫలించేదిగా విద్య రూపొందాలి.

## విద్య సామాజిక పరిస్థితులను - ప్రతిబింబించాలి:

మార్పులేని విద్యా విధానమంటూ ఏదీ లేదు. మారుతున్న సమాజంలో మారలేని సంస్థలు మనలేవు. సాంఘిక సంస్థలు సమాజంనుంచి ప్రేరణను పొంది, సాంఘిక పరిస్థితులకు ప్రతిస్పందించే సాధనాలు. విద్యకూడా ఒకానొక సాంఘిక సంస్థే. అందుచేత యిది కూడా సామాజిక పరిస్థితుల కనుగుణంగా ప్రతిస్పందించి తీరుతుంది. సాంఘిక దృక్పథముల విశ్లేషణద్వారా, ఉత్పత్తి శక్తులను అవగాహన చేసికొనటం ద్వారా, సాంఘిక జీవితంలోని వేర్వేరు అంశములను గుర్తించటం ద్వారా, తొలుదొల్త ఆనాటిపరిస్థితిని విద్య ప్రతిబింబించాలి. అంటే విద్య - విద్యార్థులకు, సాంఘిక జీవితమునకు చెందిన వివిధ విషయములలో అవగాహన కలుగచేయాలి. ఈవిధంగా చేయలేని విద్యావిధానం సాంఘిక జీవితానికి దూరమై నిర్జీవమౌతుంది. ఫలితంగా విద్యా విధానం కొన్ని మూఢ సిద్ధాంతముల సముదాయంగా; మార్పునకతీతమైన కొన్ని దృక్పథాల కూడలిగా, కొన్ని కఠినమైన సూత్రీకరణల సమూహాముగా దిగజారగలదు. అటువంటి విధానంవల్ల ఎట్టి సాంఘిక ప్రయోజనం నెరవేరదు.

శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక విజ్ఞానం వలన మరికొన్ని అదనపు ఆర్థిక రాజకీయ అంశములు ముందుకు వచ్చాయి. ఉత్పత్తి అయిన వస్తువుల పంపిణీ ప్రధాన సమస్యగా రూపొందింది. ఎన్నికలు, శాసన సభలు, పరిపాలనా సంస్థలు మున్నగు రాజకీయ సంస్థల నిర్వహణ అన్ని దేశాల వారికి నాగరికతా ప్రయోజనములను పొందు నమూనా సాధనాలుగా తయారయినాయి. ఇట్టి అనేక సమస్యలను అధికారంలోనికి వచ్చిన ప్రభుత్వాలు ఎదుర్కొంటున్నాయి. ఇందుకు ఆ ప్రభుత్వాలు తమ తక్షణ లక్ష్యములను, దీర్ఘకాలిక పథకములను రూపొందించుకొని వాటిని అమలు పరచుటకు స్పష్టమైన సైద్ధాంతిక పునాది కలిగివుండాలి.

ఈ విధానములను అమలు పరచుటకు ఆ సిద్ధాంతములందు శిక్షణ పొందిన తగుపరిపాలనా యంత్రాంగం నేర్పరచుకోవాలి. అయా ప్రభుత్వాలు తమ పరిపాలనను సుస్థిర మొనర్చుకొనటానికి, ప్రజలకు - ముఖ్యంగా యువతరానికి శిక్షణ నీయాలి. ఈ శిక్షణ తాము ఏర్పరచుకొనిన గమ్యములను, లక్ష్యములను నెరవేర్చేదిగా వుండాలి. అందుచేత ఏ ప్రభుత్వమైనా ప్రజలను పై చెప్పిన రీతిలో విద్యావంతులను చేసే మహత్తర కర్తవ్యాలను ప్రైవేటు సంస్థల దయా దాక్షిణ్యాలకు వదలకూడదు. అందుచేతనే విద్యా లక్ష్యాలు - విధానాల అమలునకుగాను ప్రభుత్వాలు గట్టి అజమాయిషీ కలిగి వుండాలి. ఈ లక్ష్యములతోనే ఆధునిక రాజ్యాలలో నేరుగా ప్రభుత్వ ఆధీనంలో వుండుటకు విద్య ప్రైవేటు సంస్థల యాజమాన్యమునకు ద్రవ్యసహాయం చేయుటగానీ జరుగుచున్నది. ఇట్టి పరిస్థితులలో సైద్ధాంతిక పునాదిలేని విద్యావిధానంగాని, పాఠ్యప్రణాళికలుగానీ కొనసాగించుట తలపశక్యంకాని విషయం.

విద్యావిధానం సమకాలీన సాంఘిక స్థితిగతులను ప్రతిబింబిస్తేనే చాలదు. విద్యా లక్ష్యములలో అది ఒక లక్ష్యం మాత్రమే. విద్యా విధానపు మరియొక ముఖ్య లక్ష్యం ప్రజలకు విద్య నందించుటలో సామాజిక మార్పుల అవసరమును గుర్తించటం, ఇట్టి సామాజిక మార్పులు ఏ దిశగా జరగవలయునో సూచించటం మిక్కిలి ముఖ్యం. అనగా విద్యాసంస్థలు సమాజమునకు భవిష్యత్తును చూపవలెను. అట్లు భవిష్యద్దర్శనం కలిగించలేని సంస్థలు నిష్ప్రయోజనములు. సమాజపు భవిష్యత్ నాయకత్వమునకుగాను శిక్షణ నీయలేని పాఠ్యప్రణాళికలు నిరుపయోగములే కాక, అట్టివాటికి మారుతున్న సమాజంలో స్థానంలేదు.

సాంఘిక పరిస్థితులకు అనుగుణంగా ప్రతిస్పందించలేని సంస్థలు మనలేవని అనేక ఉదాహరణలు చరిత్రలో లభ్యమౌతున్నాయి. అందుచేత సమాజపు అవసరములకు అనుగుణంగ తరచు మార్పుగలిగినదీ, అవసరమైన సైద్ధాంతిక దిశలో పరిణామం చెందగల్గినదీ మాత్రమే సరియైన విద్యావిధానం కాగలదు.

మార్పు ప్రకృతిసిద్ధమైనది. ప్రకృతిలో జరుగు ప్రతి మార్పు ఏదో ఒక న్యాయాన్ని అనుసరించియే జరుగును. అందుచేత విద్యా స్వరూపమూ, పాఠ్యప్రణాళికా విషయాలు కూడా ఆయా సమయాలకు తగిన సాంఘిక సూత్రముల ననుసరించి తప్పనిసరిగా మారితీరాలి. సరియైన విద్యావిధానం నిరంతర ప్రవాహం వంటిది. ఈ ప్రవాహంలో నూతన అంశాలు చేరటం పూర్వ అంశాలు మారటం సహజమైనదే.

## విద్యావిధానం - సైద్ధాంతిక పునాది:

ప్రతి విద్యావిధానంలో అంతర్గతంగాగాని బాహ్యంగాగాని సైద్ధాంతిక ప్రాతిపదిక ఇమిడి ఉంటుందని పైన వివరించాం. ఈప్రాతిపదిక సాధారణంగా అధికారంలో ఉన్నవర్గానికి అనుకూలంగా ఉంటుందని కూడా చెప్పాం. అసలు సైద్ధాంతిక ప్రాతిపదికలేని విద్యావిధానం లక్ష్య శూన్యమైన కృషిగా నీరుగారి పోతుంది. కాబట్టి, లక్ష్యమనేది సైద్ధాంతిక ప్రాతిపదికనేది విద్యావిధానానికి అవసరం అనివార్యం.

అయితే, ఈ సందర్భంలో ఒక ముఖ్యమైన సమస్య ఉత్పన్నమౌతుంది. విద్యావిధానాన్ని పాలక వర్గప్రయోజనాల

కనుగుణ్యంగా మార్చితే విజ్ఞానపు అధ్యయనం ఏకపక్షంగా మారిపోయి క్రమంగా అవాస్తవికంగాను కృత్రిమంగాను తయారయ్యే ప్రమాదం ఉంది. ముందుగా తయారుజేసిన మూసలో కరిగించి పోసిన పోతవస్తువులాగ అధ్యయనం ఆలోచనా ధోరణులు మారిపోతాయి. తత్ఫలితంగా భిన్నమైన ఆలోచనలు అణిగిపోతాయి. పరిస్థితులు మారినా ఆలోచనలు మారవు. చరిత్రను బలవంతంగా ముందుగా తయారు చేసివుంచిన చట్రంలోకి ఇమడ్చడం జరుగుతుంది. చరిత్ర అధ్యయనమే మౌలికంగా దెబ్బతింటుంది. వాస్తవానికి, అనగా ఆచరణకు సిద్ధాంతానికి మధ్య అఘాతం ఏర్పడి, సిద్ధాంతం మార్గదర్శిగా ఉపయోగపడకపోగా, చరిత్ర అవగాహనకు అవరోధంగా ఏర్పడుతుంది. ఇలాంటి ప్రమాదం నుండి విద్యావిధానాన్ని రక్షించడం కూడా విద్యా విధానం యొక్క లక్ష్యాలలో ఒకటని అందరూ అంగీకరించే విషయమే.

అసలు విద్యావిధానం సమాజ పరిస్థితులకు భిన్నంగా ఉండి అవరోధంగా తయారయ్యే ప్రమాదం ఏర్పడుతుందా అనే సంశయం రావచ్చు. అలాంటి ప్రమాదం తప్పకుండా ఉంది; గతంలో అలా జరిగింది కూడా.

ఇలాంటి ప్రమాదం నియంతృత్వధోరణులు గలిగిన ప్రభుత్వాలు వచ్చినపుడు ఏర్పడుతుంది. హిట్లరు ఫాసిష్టు ప్రభుత్వాన్ని ఏర్పరచి ఆర్యులు అందరికన్నమిన్న అని యూదులను నిర్మూలించాలనే నాజీ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి విద్యా విధానంలో ప్రజలను – ముఖ్యంగా యువకులను జాత్యహంకార ధోరణులతో హింసాపూరిత వాతావరణాన్ని సృష్టించి, అణుశాస్త్రజ్ఞులనందరిని యూదులనే నెపంతో దేశ బహిష్కరణజేసి అణుబాంబుని తాను తయారుజేసే అవకాశాన్ని పోగొట్టుకున్నాడు. ప్రజాస్వామిక విలువలుగల ప్రభుత్వాల చేతిలో అణువిజ్ఞానం ఫలప్రదమై ఫాసిజంయొక్క నిర్మూలనానికి దోహదపడింది.

అంతేగాదు, సోషలిష్టు ప్రపంచంలో కూడ ఇలాంటి ప్రమాదమే జరిగింది. చరిత్రను, చరిత్ర పరిణామాలను కృత్రిమంగా ఏర్పరచుకున్నటువంటి, మార్క్సిజాన్ని పొరపాటుగా అవగాహన చేసుకోవడం వల్ల ఏర్పడిన దోషాల ఫలితంగా విద్యావిధానం, విద్యాలక్ష్యాలు, అధ్యయన ధ్యేయాలు పూర్తిగా దెబ్బతిన్నాయి. దాని ఫలితంగా వడివడిగా మారుతున్న సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉత్పత్తి రంగంలో ఇముడ్చుకోలేక పోయింది. ఆర్థిక శక్తుల పరిణామాన్ని కృత్రిమ దిశలో మళ్లించడానికి ప్రయత్నం జరిగింది. రాజకీయ అధికారంతో సామాజిక పరిణామదిశను మార్చవచ్చుని, పరిణామం వడిని త్వరితం చెయ్యగలమని సోవియెట్ నాయకులు భ్రమపడి చివరకు మరొక పంథాను ఎంచుకున్నారు.

గత చరిత్రలో కూడా సైద్ధాంతిక పునాది ప్రాబల్యం అభేద్యంగా ఉన్నప్పుడు సమాజ పురోగమనం ఎంతో దెబ్బతింది. గ్రీకు తత్త్వవేత్తల కాలంలో బానిస వ్యవస్థ ఉండేది. శారీరక శ్రమ చెయ్యడం న్యూనతగా భావించేవారు. అందుచేత శాస్త్ర పరిశోధనలో ప్రయోగాలు చెయ్యడం అధమస్థాయి అధ్యయనమని, రేఖాగణితం (Geometry) లాంటి వాటికి అధిక ప్రాధాన్యత నిచ్చేవారు. దానివలన సుమారు క్రీస్తు శకము 1500 సం.లు. అనగా 15 వ శతాబ్దం చివరి వరకు మూఢనమ్మకాలతో ప్రయోగాంశం లేకుండా శాస్త్ర విజ్ఞానం ముందుకు పోకుండా నిలిచిపోయింది. ఈ చీకటి యుగం స్వేచ్ఛాధ్యయనం సాధ్యమైన తర్వాతే అంతరించి, ఈనాటి హేతువాదయుగానికి దారితీసింది.

కాబట్టి, విద్యా విధానంలో సైద్ధాంతిక అంశాలను ప్రవేశపెట్టడానికి కూడా కొన్ని పరిమితులున్నాయని మనం ఆమోదించాలి. ఆలోచనాప్రక్రియ అధ్యయనం సరళరేఖ మాదిరిగా జరగదు. విభిన్న అభిప్రాయాల కెల్లపుడు తావుంటుంది. ఒకే సంఘటనకు అనేక అవగాహనా మార్గాలు వివరణలు ఉంటాయనేది గమనించాలి. ఈ భావాల ఘర్షణలోనే నిజమైన ప్రగతి మార్గం బహిర్గతమౌతుంది. భావఘర్షణను నివారించే ప్రయత్నం ఎప్పటికైనా విఫలంగాక తప్పదు. ముఖ్యంగా సమాజం ఎప్పటికప్పుడు కొత్త పరిస్థితులకు అనుగుణంగా మారాలంటే ఆలోచనాధోరణి నియంతృత్వ సంకెళ్లలోగాక స్వేచ్ఛా వాతావరణంలో జరగాలనేదికూడా విద్యావిధానానికి కావలసిన సైద్ధాంతిక అంశం అని మనం గుర్తించాలి. ఇటీవలి సోషలిష్టు దేశాలలో వచ్చిన పరివర్తన నుండి నేర్చుకోవలసిన పాఠాలలో ఇదొకటి.

# నూతన విద్యావిధానం- పరిశీలన

ప్రొ॥ వి. వి. కృష్ణారావు, ఎం.ఎస్‌సి., బి.యల్. అమెరికా సిగ్మాజై శాస్త్ర పరిశోధనాసంస్థ సభ్యులు

కేంద్రప్రభుత్వం – మే, 1985లో ఒక నూతన విద్యాప్రణాళికను రూపొందించి దేశ వ్యాపిత చర్చకు విడుదల చేసింది. ఈ ప్రణాళికపై విద్యారంగంలో ఆసక్తి ఉన్నవారంతా చర్చించి, కొన్ని సూచనలను రూపొందించి రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలకు పంపారు. ఈ చర్చలు అధికార సంస్థల చొరవ ద్వారా, అంతకంటే అధికంగా అనధికార సంస్థల కృషి ద్వారా జరిగినాయి. రాష్ట్ర ప్రభుత్వాలు వాటి స్థాయిలో కూడా ఈ చర్చలను నిర్వహించాయి. కొన్ని రాష్ట్రాలు ఈ కొత్త ప్రణాళికను విమర్శించాయి కూడా. భేద భావాలను, ప్రత్యామ్నాయాలను కూడ సూచించాయి. భేద భావాలు, ప్రత్యామ్నాయ సూచనలు అనధికార సంస్థల నుండి ఎక్కువగా వెలువడినవి.

ఈ పథకం మీద జాతీయ చర్చ పూర్తిగా జరగక ముందే ఈ పథకంలోని కొన్ని అంశాలను అమలు చేయ నారంభించింది ప్రభుత్వం. అంతేగాక, వచ్చిన సూచనలను అంతగా పట్టించుకోకుండా ముసాయిదా తయారు చేశారు. జాతీయ అభివృద్ధి మండలి (NDC) లోనూ కేంద్ర విద్యా సలహా సంఘంలోను ముసాయిదాను చర్చించారు. ఈ ముసాయిదా విధాన పత్రంపై జరిగిన చర్చలలో భిన్నాభిప్రాయాలు వ్యక్తమైనప్పటికీ ఎలాంటి మార్పులు లేకుండానే పార్లమెంటు ముందు ప్రవేశ పెట్టటం జరిగింది. మే, 1986 లో పార్లమెంటు దీనికి ఆమోద ముద్ర వేసింది.

ఈ శతాబ్దంలో మానవాళి సాధించిన శాస్త్ర సాంకేతిక విజ్ఞానం సమాజంలో మౌలిక మార్పులను ప్రవేశ పెట్టింది. కొత్త ఆలోచనా విధానావశ్యకతను ఏర్పరచింది. ఈ కొత్త పరిస్థితులను సృజనాత్మకంగా ఎదుర్కొని, 21 వ శతాబ్దంలోకి ఆత్మస్థైర్యంతో ప్రవేశించడానికి దేశాన్ని ముందుకు దూకించడానికి ఈ పథకం ప్రవేశ పెట్టబడిందని ప్రభుత్వం ప్రకటించింది. ఈ విధమైన ఉత్తమాశయాలను వ్యక్తం చేసినందుకు, వాటిని సాధించడానికి ఒక ప్రణాళికను ప్రవేశ పెట్టినందుకు, ప్రభుత్వాన్ని అభినందించాల్సిందే. కాని, ఇంత అట్టహాసంతో ప్రవేశ పెట్టిన ఈ నూతన విధానం ఎంతవరకు దేశాన్ని 21 వ శతాబ్దంలోకి సక్రమంగా ప్రవేశ పెట్టగలదు అనేదే ముఖ్య సమస్య. ఈ పథకం కొన్ని విషయాల్లో వాంఛనీయంగా వున్నా ముఖ్యమైన అంశాల్లో హానికరమైన ఫలితాలకు దారి తీస్తుందని పలువురి అభిప్రాయం.

ఇంతవరకు ఆచరణలో వున్న విద్యావిధానము 1968 లో రూపొందించబడ్డ కొఠారి కమిషన్ నివేదిక ప్రాతిపదికపై ఆధారపడి వుంది. ఆ పథకం ద్వారా కొంత ప్రగతిని సాధించాము. కాని, ఆశించిన దానిలో సాధించినది చాలా స్వల్పమని అంగీకరించాలి. ఈ విషయాన్ని ఈ కొత్త పథకం కూడ అంగీకరించింది. నిధుల కొరత ముఖ్యాంశంగా పేర్కొన్నారు. కాని, ప్రభుత్వం పరంగా ఏర్పడిన పరిపాలనా వైఫల్యాలు, ప్రభుత్వ యంత్రాంగంలో దీక్షాదక్షతల లేమి సరిగా గుర్తించినట్లు లేదు. స్థూలంగా వైఫల్యానికి గల కారణాలను వివరించడం జరిగింది.

ఈ వివరణ చాలా అవసరం. వర్తమాన పరిస్థితిలో లోపాలు తెలిసినపుడే వాటి నివృత్తి సాధ్యం. గుణాత్మకంగాను, పరిమాణాత్మకంగాను ప్రగతిని సాధించడానికి రూపొందించిన నూతన ప్రణాళిక అంశాలను పరిశీలించి, ఆశించిన ఫలితాలను ఏ మేరకు సాధించగలమో బేరీజు వేసుకోవాలి.

ప్రజలు సాంస్కృతికంగాను, వైజ్ఞానికంగానూ పురోగమించడానికి విద్య అవసరం. ప్రజాస్వామ్యంలో విద్య ఆవశ్యకత నిర్వివాదం. సాంకేతికాభివృద్ధికి; పారిశ్రామిక, ఆర్థిక ప్రగతికి కూడా విద్య మూలకందం. అనగా, విద్య సామాజికావసరాలను బట్టి ఉండాలి. ఈ విషయాన్ని నిర్ద్వంద్వంగా ఈ ప్రణాళిక వివరించింది; అంగీకరించింది. అంతేగాకుండా, సామాజిక న్యాయం, నైతిక విలువలు, దేశ సమగ్రత మత సహనము, సహజీవనము మొదలైన జాతీయ ఆశయాలుకూడ నిర్దిష్టంగా వ్యక్తం చేయబడ్డాయి.

శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని సంతరించుకుని శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకుని మన యువతరం సామాజిక విప్లవాన్ని సాధించాలనే ఆకాంక్షను కూడా ఈ పథకం వెలిబుచ్చింది. స్థూలంగా విద్యాలక్ష్యాలు ఈ ప్రణాళికలో ఆధునిక దృక్పథంతో వివరించబడ్డాయి.

"విద్యా విధానంలో మౌలికమైన మార్పు రావాలన్నది అంగీకారమైన పక్షంలో, దానికి ఆచరణాత్మకమైన రూప మివ్వడానికి, దానికి సమానమైన మౌలిక సాధనాలు, వ్యవస్థా నిర్మితులు రూపొందించవలసిన అవసరం కూడా ఉంది" అని సూచించబడింది. ఆచరణ వ్యూహాన్ని తీర్చి దిద్దడం లోనే సాధారణంగా లోపాలు జరిగి, ఆశయాలు విచ్ఛిన్న మౌతాయి. ఈ సందర్భంలో కూడా ఇదే ఆశాభంగం కలిగే ప్రమాదముంది.

విద్య గుణాత్మకంగాను, పరిమాణాత్మకంగా పరిమితం కావటానికెన్నో కారణాలున్నాయి. బీదరికం వల్ల, బలహీనవ ర్గాల వారు చదువుకు నోచుకోలేకపోతున్నారు. వారికి ఆర్థిక, స్తోమతను చేకూర్చడానికి గట్టి పథకాన్ని ఈ ప్రణాళిక సూచించలేదు. సార్వత్రిక విశ్వవిద్యాలయాలు కొంతవరకు విద్యాసదుపాయాలను సామాన్యులకు అందుబాటులోకి తేగలిగినా పూర్తిపరిష్కారంమాత్రంకాదు. ఉద్యోగార్థులకు ఉద్యోగం కలిగించ గలిగితే విద్యాభిమానం అన్నివర్గాలలో పెరిగి, ఆసక్తితో అందరు విద్య నభ్యసించడానికి శక్తివం తమైన ప్రయత్నం చేస్తారు. నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించ వచ్చు. నిరుద్యోగ సమస్యకు సంతృప్తికరమైన పరిష్కారం లేనంతకాలం సార్వజనవిద్యావ్యాప్తి కాగితంమీదే మిగిలి పోతుంది.

గుణాత్మకంగా పాఠశాలలో వాతావరణాన్ని అభివృద్ధి చెయ్యడానికి వస్తుసామగ్రి, భౌతిక సదుపాయాలను పెంపొం దించాలి. వీటికి నిధులు కావాలి. కొత్త బోధనాపద్ధతులను ప్రవేశ పెట్టడానికి టెలివిజన్, కంప్యూటర్లు మాదిరి నవీన సాధనాలను సేకరించడానికి నిధుల కొరత ఒక పెద్ద అవరోధం. ఉపాధ్యాయుల బోధనా సామర్థ్యం పెంచడానికి వారికి తరచు యివ్వవలసిన శిక్షణ, వర్కుషాపులకు నిధులు కేటాయించాలి. లైబ్రరీలు, లేబరేటరీలను అభివృద్ధి చేయడానికి శాస్త్ర సాంకేతిక విద్యలను గుణాత్మకంగాను, పరిమాణాత్మకంగాను అభివృద్ధి చేయడానికి నిధులు చాల పెద్ద ఎత్తున అవసరం. ప్రాథమిక స్థాయిలో బలహీన వర్గాలను విద్యవైపుకు ఆకర్షించడానికి పాఠ్య పుస్తకాలు, మధ్యాహ్న భోజన పథకాలు నిధులు లేకుండా సమకూర్చలేరు; అమలు జరపలేరు. ఈ నిధులను సమకూర్చుటకు బడ్జెటులో మామూలు అంకెల గారడీ తప్ప కొత్త సూచనలు, నిర్దిష్టమైన వనరులు ఏర్పరచుకునే యోచనలు ఇప్పటి వరకు వెలువడలేదు.

పరీక్షా విధానంలో మార్పులు, బోధనా పద్ధతులను మెరుగుపరచడానికి విద్యార్థులలో ఆసక్తిని పెంచడానికి ఉపా ధ్యాయులలోని అలసత్వాన్ని, మేధావుల జడత్వాన్ని నివారించి మార్పులను ప్రవేశపెట్టి విద్యావ్యవస్థను విస్తృత స్థాయిలో సంస్కరించి మెరుగు పరచాలనే ఆశయం తప్ప దానిని సాధిం చడానికి కావలసిన చర్యలను స్పష్టంగా రూపొందించలేదు. అదేవిధంగా పట్టణ గ్రామీణ ప్రాంతాల మధ్య ప్రబలుతున్న విద్యావిభేదాలను, ప్రమాణ వ్యత్యాసాలను, సదుపాయాల అసమానతలను నివారించడానికి అస్పష్టమైన అభిప్రాయాలు తప్ప సుస్పష్టమైన చర్యలను ఈ పథకంలో వివరించలేదు. ఈ పత్రంలో వివరించిన చర్యలలో దిగుమతుల మీదే సెస్సు, ఇళ్ళ పన్నుల మీద సర్చార్జీలు, వృత్తిపరమైన రంగాల్లో ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహించడమనే సూచన స్పష్టంగా లేదు. ఇది కేపిటేషన్ ఫీజులకు దారి తీసి, విద్యను వ్యాపారంగా మార్చి, విద్యను ఉద్యోగాలను ధనవంతుల సొత్తుగా మార్చి, ప్రమాణాలను నీరుగార్చి సామాజిక న్యాయాన్ని మరుగు పరచి మొత్తం పథకాన్నే నిర్వీర్యం చేసే ప్రమాదముంది.

## కొన్ని నిర్దిష్ట సూచనలు:

లక్ష్యాలను సాధించడానికి కొన్ని నిర్దిష్ట సూచనలు ప్రభుత్వం విడుదల చేసిన పత్రంలో ఉన్నవి. ప్రాథమిక స్థాయిలో "సమీకృత శిశు పథకం" ద్వారా అందరి పిల్లలను పాఠశాల ప్రాంగణాలలోకి తేవచ్చని ఆశిస్తున్నారు. మాధ్యమిక స్థాయిలో స్పష్టమైన పథకం లేదని ఆ పత్రంలోనే అంగీకరించారు. సంచార విద్యా విధానాన్ని స్థాపించితే బాగుండుననే అభిప్రాయం వ్యక్తమైంది. వయోజన విద్య సంగతి అగమ్యంగా వుందన్నారు. ఉన్నత విద్య మీద వత్తిడి తగ్గించడానికి సాంకేతిక విద్యను విస్తృత పరచడం అవసరమన్నారు గాని, దానిని నిర్ధారించినట్లు కనిపించదు.

డిగ్రీలను ఉద్యోగాల నుండి విడదీయాలని, పనిచేస్తూ నేర్చుకోమనే అవకాశాలుండాలనే సూచనలు కూడా ఉన్నవి. లక్ష్య సాధనకు స్వచ్ఛంద విద్యాసంస్థలను ప్రోత్సహించా లనే సూచన కూడా కలదు. ఈ సూచన కొండను త్రవ్వి ఎలుకను బట్టినట్లుగా వుంది. ఈ సూచనలో అతి ప్రమాదకరమైన పరిణామాలు అంతర్లీనంగా వున్నవి. స్వచ్ఛంద సంస్థలు వ్యాపార దృష్టితోనో, మత ప్రచార దృష్టితోనో వ్యవహరించుతాయి. వ్యాపార దృష్టివల్ల సాంఘిక న్యాయమనేది నశించుతుంది. మత దృష్టి మన రాజ్యాంగానికి ప్రాణ ప్రదమనుకునే లౌకిక దృష్టిని భూస్థాపితం చేస్తుంది. స్వచ్ఛంద సంస్థలు యిప్పుడు పని చేస్తున్న తీరుని బట్టి యీ విషయాలు స్పష్టంగా అందరికీ గోచరిస్తాయి. ఈ సూచనే అమలు పరచితే యిప్పుడు తలెత్తిన విచ్ఛిన్నకర శక్తులు ఇంకా కొనసాగి దేశసమగ్రతను దెబ్బతీసే ప్రమాదాన్ని

ఉధృతం చేస్తాయనడంలో సందేహం లేదు. ఆశయాలు కలిగి, లక్ష్యాలను సాధించాలని, గమ్యాన్ని చేరాలనుకొనే ప్రభుత్వమేదీ విద్యను స్వచ్ఛంద సంస్థలకుగాని, ప్రైవేటు యాజమాన్యాలకుగాని అప్పగించదు.

విద్యా వ్యవస్థ స్వరూపాన్ని మార్చడానికి కొన్ని సూచనలు చేయబడినవి. పని ప్రాధాన్యతను నేర్పుటకు, పాఠ్యాంశాలలో చిన్న చిన్న వృత్తిపరమైన నైపుణ్యాలను యిమడ్చడం అవసరమని సూచించారు. విద్యాయంత్రాంగ స్వరూపాన్ని మార్చి ప్రణాళికా రచనా కార్యక్రమాన్ని వికేంద్రీకరించడానికి జిల్లా, తాలూకా స్థాయిలో కొత్త సంస్థలను యేర్పాటు చెయ్యాలని నిర్దేశించారు. ఉపాధ్యాయ శిక్షణను అభివృద్ధి చేసి బోధనా కృషి సామర్థ్యాన్ని పెంచాలన్నారు. ఇంకెన్నో వాంఛనీయమైన మార్పులు, కూర్పులు ఈ కొత్త పత్రంలో చోటు చేసుకున్నవి.

## స్థూల పరిశీలన:

స్థూలంగా పరిశీలించినపుడు ఈ పథకం విద్యా విధానాన్ని సమూలంగా పునర్వ్యవస్థీకరించాలని ఆశించుతోంది. ఈ కృషికి కావలసిన ఆచరణ పథకం కూడా రూపొందించబడింది.

బాహ్యంగా యీ సూచనలు, చర్యలు ఆకర్షణీయంగా వున్నా అంతర్గతంగా కొన్ని లోపాలున్నవి. పై మెరుగుల లోపల తిరోగామిక అంతర్వాహిని గోచరిస్తుంది. అందుచేత ఈ నూతన విద్యా ప్రణాళిక దేశానికి ఏమాత్రం ఉపయోగం? అనే సందేహం కలుగుతుంది.

నవోదయా పాఠశాలలు, ఉత్తమతా కేంద్రాలు (సెంటర్సు ఆఫ్ ఎక్సలెన్సు), ప్రైవేటు రంగంలోని సంస్థలకు ప్రోత్సాహం, కళాశాలల స్వయం ప్రతిపత్తి మొదలైన అంశాలు చాల ప్రమాదకరమైనవని చెప్పక తప్పదు. అవి అసలు పథకాన్నే పూర్తిగామార్చి, ఆశించిన ఫలితాలను అణచివేసి, పూర్తిగా వ్యతిరేకమైన సామాజిక వాతావరణాన్ని సృష్టించవచ్చు. అదే విధంగా ఆధునికీకరణ, వాసి పెంపుదలకు ప్రవేశపెట్టాలనుకునే చర్యలకు కావలసినన్ని నిధులనుకూడా కేటాయించలేదు.

మౌలికమైన అంతర్గత లోపాలెన్నో యింకా వున్నవి. ఉపాధ్యాయుల ఎన్నిక వారి బోధనాభిరుచినిబట్టి ఉండాలి. బోధనతో తాదాత్మ్యంచెంది, సామాజిక ప్రగతికి చైతన్యానికి వారికృషి మూలకందమనే గ్రహింపు వారిలో కలిగే విధంగా వారి వేతనాలు పని పరిస్థితులను మెరుగుపరచాలి. అలాంటి వాతావరణం లేనినాడు మొత్తం పథకమే పేకమేడవలె కూలిపోవచ్చు. అంతేగాకుండా, బోధనా కృషిని నిరంతరం మెరుగుపరుచుకోడానికి ఆయా స్థాయిలలో ప్రాజెక్టు పని పరిశోధనా కృషిగా తన అనుభవసారాన్ని ప్రతి ఉపాధ్యాయుడు వ్యక్తంచేసే అవకాశాలు, వేదికలు, ఆ కృషికి ప్రోత్సాహకాలను ఏర్పాటు చెయ్యాలి. ఇప్పుడున్న ఉపాధ్యాయులందరికి ఈ వైఖరిని అలవర్చడానికి కూడా కృషి చెయ్యాలి.

జాతీయ సమైక్యతా భావాన్ని గాఢంగా యువతరంలో నాటడానికి చేసిన సూచనలు ఏమాత్రం చాలవు. వేసవి సెలవుల్లో – యువతకు భారతదేశం నలుమూలలను చూపి జాతీయ ప్రాజెక్టుల వద్ద వుండి వాటిలో పాల్గొని దేశమంతా తమదేనన్న ఉద్వేగాన్ని పొందే అవకాశాలను కలుగజెయ్యాలి. మార్పిడి పథకాల రూపంలో రాష్ట్రాంతరాల్లో విద్యాభ్యాసం చేసే అవకాశం వీలైనంత ఎక్కువ మందికి కలిగించాలి. దేశ సమైక్యతాభావాన్ని పెంపొందించడానికి ఈ సమస్య ప్రాధాన్యతకు సరితూగే కార్యక్రమాన్ని యిప్పటి వరకు చేపట్టలేదు. ఈ నూతన ప్రణాళికలో కూడ కావలసిన మేరకు రూపొందించలేదు.

అదేవిధంగా దేశానికి కావలసిన అనుసంధాన భాషను కూడా రూపొందించ లేకపోయింది ప్రభుత్వం. హిందీని బలవంతంగా రుద్దాలని ప్రయత్నించి, ఆ భాషమీద వ్యతిరేకతను మాత్రం సృష్టించడం జరిగింది. ఆ భాషను సంస్కరించి యితర భాషలతో సారూప్యాన్ని కలిగించి ప్రజలలో నేర్చుకోవాలనే కుతూహలాన్ని కలిగించాలి. ఈ కృషిలో కూడ ప్రభుత్వం ఘోరంగా విఫలమైంది.

మన విద్యావిధానాన్ని పీడిస్తున్న సమస్యలు మన ఆర్థిక విధానాన్ని ఆవరించివున్న సమస్యలతో ముడి బడి వున్నాయి. బీదరికము, అజ్ఞానము, నిరుద్యోగము మొదలైనవి తప్పుడు ఆర్థిక విధానాలవల్ల కలిగే దుష్ఫలితాలు, వీటిని తొలగించకుండా విద్యావ్యవస్థను సరిదిద్దాలనుకోవడం మంత్రాలతో చింతకాయలు రాల్చాలనుకోవడమే. ఆర్థిక విధానంలో వున్న రుగ్మతలను ముందు సరిజెయ్యాలి. జీవన ప్రమాణాన్ని పెంచేవిధంగాను అందరికి ఉద్యోగావకాశాల్ని కల్పించిననాడు అందరూ అక్షరాస్యులవడానికి ముందుకొస్తారు. అందరికీ విద్య, అందరికీ వుద్యోగం అనే ఆశయాన్ని సాధించే దిక్కులో మన ప్రణాళికలను రూపొందించుకున్న నాడే మనం మన దేశం 21 వ శతాబ్దంలోకి ధైర్యంగా నూతనోత్సాహంతో ప్రవేశించగలం.

## నూతన విద్యా విధానం - ఒక పరిశీలన:

స్వర్గీయ రాజీవ గాంధీ 1985 సం.లో ప్రవేశపెట్టిన నూతన విద్యావిధానం ఆచరణలో ఎంతవరకు ఆశించిన ఫలితాలను సాధించిందో ఈ 7,8 సం.ల చరిత్ర మనకు సూచిస్తుంది.

కొన్ని ముఖ్యమైన విషయాలలో ఈ నూతన విధానం ఆశించిన ఫలితాలను సాధించలేకపోయింది. ఈ నిరాశ ఎక్కువగా ప్రాథమిక రంగంలోను, సెకండరీ స్థాయిలోను కనిపిస్తోంది. కళాశాల స్థాయిలో అంత తీవ్రంగా లేదనే చెప్పాలి. ప్రాథమిక, సెకండరీ దశల్లో ప్రభుత్వం వెచ్చించవలసిన

ధనాన్ని వెచ్చించలేకపోవడమే దీనికి కారణం. ఆశించిన వనరుల నుండి నిధులు రాకపోవడం, వచ్చినమేరకు కూడ సక్రమంగా వినియోగించకపోవడంవల్ల ఈ లోపాలు జరిగినాయి. సార్వత్రిక ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టలేకపోయాం. సరైన వాతావరణాన్ని పాఠశాలల్లో ఏర్పరచలేకపోయాం. బోధన సామాగ్రినిగాని, ఉపాధ్యాయుల సామర్థ్యాన్నిగాని మెరుగుపరచడం జరగలేదు. ఎప్పటివలె నిధుల కొరతవల్లే ఈ లోపాలను సరిదిద్దలేకపోయింది ప్రభుత్వం. గణనీయంగా ప్రాథమిక, సెకండరీ విద్య అభివృద్ధి లేకుండా ఎప్పటి మాదిరిగా నీరసంగానే కొనసాగుతోంది. ఉపాధ్యాయులలో మాత్రం బోధన మీద ఆసక్తి సన్నగిల్లుతోంది. వారి సేవలను గట్టిగా ఉపయోగించుకోగల స్థితిలో ప్రభుత్వం లేదు.

కళాశాల స్థాయిలో కాలేజీలకు స్వయం ప్రతిపత్తి (autonomy)ని ఇచ్చింది. దీనికి యు.జి.సి. నుండి నిధులు కూడ సమకూర్చడం జరిగింది. స్వయం ప్రతిపత్తివల్ల కొన్ని కాలేజీలు ప్రమాణాలను బోధనా సరళిని అభివృద్ధి చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. కొంత వరకు ఫలితాలను కూడ సాధించగలుగుతున్నాయి. కాని, ఉపాధ్యాయులలో మాత్రం స్వయం ప్రతిపత్తి పథకాన్ని ప్రవేశపెట్టాక పని భారం పెరిగిందనే అసంతృప్తి వ్యక్తమౌతోంది. వారి వేతనాలు వారు ఆశించిన మేరకు లభిస్తున్నా వారి కృషి రాశిలోగాని, వాశిలోగాని అభివృద్ధి చెందలేదు. ఈ సందర్భంలో కూడ ప్రభుత్వం అధ్యాపకుల సేవలను పూర్తిగా వినియోగించుకోలేక పోతోంది. ఇది ప్రభుత్వం యొక్క అసమర్థతకు పరాకాష్ట.

విద్యారంగాన్ని పటిష్టం చేసే బాధ్యత ప్రభుత్వంమీదేగాక ఉపాధ్యాయులపై కూడ ఉంది. కాని, ఈ విషయాన్ని ఉపాధ్యాయులు విస్మరిస్తున్నారు. ఇది చాల శోచనీయం.

నూతన విద్యావిధానంలో విద్యార్థులు ప్రైవేటుగా చదివే అవకాశాలు కలిగించాలనేది ఒక ముఖ్యాంశం. ఈ విషయంలో మాత్రం గణనీయమైన సత్ఫలితాలనువిద్యారంగం సాధించిందనే చెప్పాలి. ప్రభుత్వానికి ఆదాయం వచ్చే అవకాశాలుండటం ఒక కారణం కావచ్చు. అంతేగాక, ప్రైవేటు యాజమాన్యాలు ఈ విద్యార్థుల కోసం సంస్థలను స్థాపించి బోధన జరపడంవల్ల ప్రమాణాలు కొంత వరకు మెరుగవడం కూడా జరిగిందని చెప్పాలి. సైన్సు కోర్సులలో తప్ప మిగిలిన కోర్సులలో ప్రైవేటుగా చదివే విద్యార్థులలో విజ్ఞాన స్థాయి తగ్గిందనే చెప్పాలి.

విశ్వ విద్యాలయాల్లో పరిస్థితి రోజురోజుకి దిగజారుతోంది గాని మెరుగవ్వడం లేదు. ఇది చాల దయనీయమైన పరిస్థితి.

స్వాతంత్ర్యం వచ్చి నాలుగున్నర దశాబ్దాలయినా ఒక నిర్దిష్టమైన విద్యావిధానాన్ని రూపొందించుకోలేకపోవడం మనకు ఒక జాతీయ లక్ష్యం అంటూ లేనట్లుగాదా? ఈ లోపాన్ని సవరించుకోవాల్సివుంది.

*అణు జాలం నుండి*
*అమృతం పిండిననాడే*
*మానవా! నీకు విముక్తి!!* – సి. నారాయణ రెడ్డి

# విద్యావిధానంలో ప్రైవేటీకరణ ధోరణులు

జి. సుదర్శనం, రీడర్, దేవత బాపురావు, రీసెర్చి స్కాలర్

"విద్య అనేది మనిషి నుంచి వేరుచేయలేని సంపద" అని ఎపిక్యూరస్ చక్కగా వర్ణించారు. ఎందుకంటే మానవజాతి వివిధ రంగాల్లో శోధించి, సాధించిన మహా విజ్ఞానాన్ని ఏ వ్యక్తి అయినా విద్య ద్వారానే సమగ్రంగా అవగాహన చేసుకోగలడు. అంతేగాక ఒక దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ గమనాన్ని విద్యా వ్యవస్థ ప్రతిబింబిస్తుంది. అందుచేతనే జాతిరక్షణకు పెట్టని కోటగా అభివర్ణించబడిన విద్యావ్యవస్థ తరచుగా రకరకాల చర్చలకు, సంస్కరణలకు ప్రతిపాదించ బడుతూ వుంటుంది. అయితే, భారతదేశం లోగల విద్యా వ్యవస్థపై చర్చలు జరిగినంత తీవ్రంగా మౌలిక సంస్కరణలు జరగలేదన్నది నిర్వివాదాంశం.

విద్య అనేటటువంటి విషయాన్ని ఎప్పటినుండి అయితే చరిత్ర మనకు తెలుసో అప్పటినుండి దీన్ని గురించి ఆలో చిస్తున్నారు. ఇప్పటికి కూడా మన ప్రభుత్వాలు అన్నింటి కంటే ఎక్కువ విద్యకే ప్రాధాన్యం ఇచ్చినట్లుగా, దీనికోసం విశేషమయిన కృషి చేస్తూ కోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నట్లు మనకు చెబుతుంటారు. "భారతదేశపు భవిష్యత్తు తరగతి గదుల్లో రూపుదిద్దుకుంటుందని" డాక్టర్ D.S. కొఠారి తన నివేదికలో ముందు మాటగా పేర్కొన్నాడు. అట్లాంటి ప్రాధాన్యం కలిగిన విద్యారంగం నేడు తీవ్ర దుస్థితిలో వుంది. ఆర్థిక సంక్షోభాన్ని అధిగమించటానికి ఆయుధం కావలసిన విద్యారంగమే సంక్షోభంలో కూరుకుపోయి "ప్రైవేటీకరణ" అనే కోరల్లో చిక్కుకుంది. ఇది ఉన్నతస్థాయికి చేరి ఆకలిగొన్న పులివలె "ప్రైవేటు యూనివర్సిటీల బిల్లు" రూపంలో వికృత రూపం దాల్చింది. దీనిలో భాగమే ఇటీవల భారత విద్యారంగంలోని పరిణామాలు.

సమకాలీన, ఆర్థిక, సామాజిక మరియు రాజకీయ పరిస్థితులకు అనుగుణంగా ప్రభుత్వ విధానాలు రూపుదిద్దుకుంటున్నాయి. కాబట్టి ఏ ఒక్క ప్రభుత్వ విధానము వీటికి అతీతంగా మనజాలదు. అలాగే విద్యావిధానం కూడా. ప్రస్తుత విద్యావిధానాన్ని పైన ఉదహరించిన వాటితో బాటు అంతర్జాతీయ పరిణామాలు కూడా ప్రభావితం చేస్తున్నాయి. సరళీకృత ఆర్థిక, రాజకీయ విధానాలు ప్రైవేటురంగంలో విద్యా సంస్థల పెరుగుదలకు దోహదం చేస్తున్నాయి.

స్వాతంత్ర్యానంతరం, భారత రాజ్యాంగ రూపకల్పన, తద్వారా ప్రణాళికాబద్ధమయిన మిశ్రమ ఆర్థిక వ్యవస్థ ప్రభుత్వ రంగంలో విద్య అభివృద్ధి చెందటానికి దోహదం చేస్తుంది. కాని మొదట్లో ఉన్న ఉత్సాహం తరువాత తగ్గిపోయి విద్యారంగాన్ని విస్మరించడం మొదలయింది. 1950 నుండి అమలులోకి వచ్చిన రాజ్యాంగంలో పొందుపరచబడిన నిర్దేశిక సూత్రాలను అనుసరించే 10 ఏళ్ళలో 14 సం॥ల వయసువున్న దేశంలోని బాల బాలికలందరికీ కనీసం ప్రాథమిక విద్యనందించి సంపూర్ణ అక్షరాస్యత సాధించాలని Act 45 ద్వారా రాజ్యాంగ నిర్మాతలు తమ నిబద్ధతను చాటుకున్నారు. కాని తరువాత వచ్చిన పాలకులు క్రమంగా రాజ్యాంగ లక్ష్యానికి విరుద్ధంగా తర్వాత పంచవర్ష ప్రణాళికల్లో విద్యారంగానికి ఆర్థికవనరుల్ని ముఖ్యంగా ప్రాథమిక విద్యకు తగ్గిస్తూ వచ్చారు. అదే స్థాయిలో రాజ్యాంగ విలువలకు తరువాతి తరం పాలకులు కట్టుబడివుంటే "సంపూర్ణ అక్షరాస్యతా భారతం" మన తరంలోనే ఎప్పుడో ఆవిష్కరింపబడేది. దీనికి నిదర్శనమే ప్రణాళికలో విద్యకు కేటాయించబడిన ఆర్థిక వనరులు, మొదటి పంచవర్ష ప్రణాళికలో విద్య కొరకై మొత్తం బడ్జెటులో 7.9 శాతం కేటాయింపగా ఆరవ ప్రణాళిక కాలం వచ్చేసరికి ఇది 2.6 శాతంగానూ, ఎనిమిదవ ప్రణాళిక కాలంలో ఇది 3.0 శాతంగాను వుంది. తద్వారా ప్రభుత్వ నిర్వహణలో స్థాపించబడే విద్యా సంస్థల సంఖ్య గణనీయంగా తగ్గినది.

ప్రభుత్వ విధానాలలో వచ్చిన ఈ మార్పు పాఠశాల, ప్రాథమిక విద్యనుండి ఉన్నత విద్య పైకి కేంద్రీకృతం

కాబడింది. ఈ మార్పు అప్పటి పరిస్థితుల నుండి ఉద్భవించినదనే ఒక వాదన ఉంది. అప్పటి మానవ వనరుల అవశ్యకత, ఇతర రంగాలలో ఉన్నత విద్యావంతులకై డిమాండ్, ఉన్నత విద్యారంగాన్ని విస్తృత పరచటానికి దోహదపడింది. ఇది సమకాలీన జాతీయ అవసరాలను దృష్టిలో పెట్టుకునే జరిగిందని విద్యావేత్తల అభిప్రాయం.

కాని 4వ పంచవర్ష ప్రణాళిక వచ్చేసరికి ప్రభుత్వ విధానకర్తలు ఆత్మ విమర్శలు చేసుకుని విద్య నందించ టంలో ప్రైవేటు సంస్థల వ్యక్తుల అవసరం కూడా వుందని గుర్తించి అవసరమయినచోట వారిని అనుమతించటం జరిగింది. ఫలితంగా, ఒక్క ప్రభుత్వరంగంలోనే కాకుండా ప్రైవేటు రంగంలో కూడా విద్యాసంస్థల సంఖ్య పెరగటం ప్రారంభమయింది. అదే సమయంలో ఊహించని విధంగా జనాభా విస్ఫోటనను ప్రభుత్వం విషమ సమస్యగ పరిగణించి విద్యాసంస్థల స్థాపనను ప్రైవేటు సంస్థల వ్యక్తుల అభీష్టానికి వదిలి వేసింది. ఈ సందర్భంగా వినిపించే వాదన ఏమంటే ప్రభుత్వం చేయగలిగేటంత చేస్తుంది. కాని జనాభా పెరగటం వలన సౌకర్యాలు సరిపోవటంలేదని తరుచు వింటుంటాము. కాని ఇది పూర్తి నిజం మాత్రం కాదు. 1947లో మనకు స్వాతంత్ర్యం వచ్చినపుపుడు ఆహార ధాన్యాల ఉత్పత్తి 44 మిలియన్ టన్నులు, జనాభా 36 కోట్లు. 1986లో ఆహార ధాన్యాలు ఉత్పత్తి 160 మిలియన్ టన్నులు, జనాభా 80 కోట్లు. ఆహార ధాన్యాల ఉత్పత్తి దాదాపు 4 రెట్లు పెరిగితే జనాభా $2\frac{1}{2}$ రెట్లు మాత్రమే పెరిగింది. కాబట్టి జనాభా పెరుగుదల వల్ల ఉత్పత్తి పెరుగుతుండే కాని తగ్గడం జరగదు. కాబట్టి "జనాభా పెరిగినందుకే ఆహారం సరిపోక పోవటం కాదు. దారిద్ర్యమే జనాభా పెరుగుదలకు కారణం" అని ప్రముఖ చరిత్ర కారుడు మరియు సామాజికవేత్త డి.డి. కోశాంబి పేర్కొన్నారు.

ప్రభుత్వ నిష్క్రియాప్రియత్వం వలన మరియు రాజకీ యంగా కావలసిన స్ఫూర్తికొరవడటం వలన పెరుగుతున్న ప్రజల అవసరాలకు అనుగుణంగా రాజ్యాధినేతలు, విధాన రూప కర్తలు స్పందించలేక పోవటం వలన విద్యా సంస్థల కొరత తీవ్రతరమయింది. ఇలాంటి వాతావరణాన్ని అదను చేసుకుని ప్రైవేటు యాజమాన్యంలోని విద్యా సంస్థలు అతివేగంగా విస్తరించటం ప్రారంభించినవి. ఇక్కడ గమనింపదగిన ముఖ్య విషయం ఏమంటే పాఠశాల విద్యారంగం విస్తరణ కంటె ఉన్నత విద్యారంగంలో ఈ విస్తరణ అతి వేగంగా పెద్దమొత్తంగా జరిగింది అని ప్రముఖ విద్యావేత్త J.P. Naik అభిప్రాయం వ్యక్తం చేశారు. ఈ విషయంలో కేరళ రాష్ట్రం మిగతా రాష్ట్రాల కంటె కొంతముందుంది. 1948–68 సంవత్సరాల మధ్యకాలంలో స్థాపించబడిన 93 సైన్స్ మరియు ఆర్ట్స్ కాలేజీలలో కేవలం 4 మాత్రమే ప్రభుత్వ యాజమాన్యం క్రింద స్థాపించబడినవి. ఈ రకమైన విస్తరణపై అప్పుడు పాలిస్తున్న అధికార కమ్యూనిస్టు ప్రభుత్వ విధానాలకు మరియు ఆ రాష్ట్ర సాంస్కృతిక, సాంఘిక పరిస్థితులకు మధ్యగల అవినాభావ సంబంధాన్ని విస్మరించగూడదు.

ఈ విధంగా స్థాపించబడినటువంటి కాలేజీలు దేశ మంతటా ఒకే సారూప్యతను కలిగివున్నవి. అత్యధికశాతం పట్టణ ప్రాంతాలలోనే స్థాపించబడి ముఖ్యంగా పట్టణవాసుల అవసరాలు తీర్చటమే లక్ష్యంగా ఈ ప్రైవేటు విద్యా సంస్థలు వెలిశాయి. ఇందులో అధిక శాతం విద్యాసంస్థలు తగిన సౌకర్యాలు లేకుండా ధనార్జనే ధ్యేయంగా పుట్టగొడుగుల్లా పుట్టుకొని వచ్చాయి. దీనికి ప్రభుత్వపు లోపాయికారీ గ్రాంట్–ఇన్–ఎయిడ్ విధానం మరింత ఊపునిచ్చింది.

ఇదే సమయంలో అతి తక్కువ సంఖ్యలోనయినా ప్రాముఖ్యం కలిగిన విద్యాసంస్థలు, సంఘసేవాధ్యేయంతో, మిషనరీలు, పరిశ్రమాధిపతుల నేతృత్వంలో దేశంలోని పెద్దపెద్ద నగరాలలో వెలిశాయి. ఇవి సాధారణంగా చెప్పుకోదగ్గ సౌకర్యాలు, రాశికంటే వాసికి ప్రాధాన్యత నిచ్చేవిగా కాలక్రమంలో పలువురి మన్ననలు పొంది ఖ్యాతి నార్జించినవి.

ప్రైవేటు యాజమాన్యంలో నిర్వహింపబడే సంస్థలు ఈ విధంగా విస్తృతంగా విస్తరించి వుండటం వల్లనూ, అధికా రులు ప్రయత్నపూర్వకంగా వాటి సంఖ్యను మరుగున పరచి గణాంకాలలో చేర్చకపోవటం వల్లనూ ప్రైవేటు విద్యాసంస్థల సంఖ్యను నిర్ధారింప బూనుకోవటం నేతిబీరకాయలో నెయ్యి కొరకు వెదకటం లాంటి అనుభవమయింది.

మనదేశం స్వాతంత్ర్యం సాధించినప్పటినుండి ప్రభుత్వం నియమించి నటువంటి వివిధ విద్యా కమిటీలు కూడా ప్రైవేటు రంగంలో విద్య విస్తరణకు దోహదం చేసినవి. 1966 సం॥లో ఏర్పాటు చేసిన కొఠారి కమీషన్ మాటల్లో ఇది స్పష్టంగా వ్యక్తమయింది. కమీషన్ మాటల్లో చెప్పాలంటే "ప్రైవేటు సంస్థలకు ప్రభుత్వం ఇచ్చే గ్రాంట్ల విషయమై ప్రభుత్వ విధానాలను సులభతరం చేయాలి. అందువలన ఈ విద్యాసంస్థలకు నిధులు సమకూర్చటం సులభతరమవుతుంది". ఇరవై సంవత్సరాల తరవాత 1986 లో ఏర్పాటు చేసిన కమిటీ బహిరంగంగానే తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. "ప్రజలకు విద్యనందించటం ఒక్క ప్రభుత్వం వల్లనే నెరవేరదని, మొత్తం సమాజం బాధ్యత వహించాలని" ఒక్క వాక్యంలో తన మనసులో ఇన్నాళ్ళు ప్రభుత్వం దాచుకున్న మాటను చెప్పి ప్రైవేటు యాజమాన్యానికి పచ్చజెండా ఊపింది.

1986 నూతన విద్యావిధానం, 1854 లో రూపొందించిన వుడ్స్ డిస్పాచ్ నుండి 1978 నాటి మాల్కం ఆదిశేషయ్య నివేదిక వరకు గల అనేక నివేదికలతో పోల్చిచూసినపుడు ఈ

డాక్యుమెంట్ ఏ విధంగానూ పరిగణించదగినది కాదు. ఈ విధాన పత్రంలో చెప్పిన నూతన విషయాలేవీ లేకపోగా మొత్తం విద్యారంగాన్ని మరింత నష్టపరిచే ప్రతిపాదనలు మాత్రం పొందు పరచ బడినవి. అలాంటి వాటిల్లో విద్యను ప్రైవేటు పరం చేయటం, మోడల్ పాఠశాలలను నెలకొల్పటం, కాంపిటేషన్ విద్యాలయాలను అనుమతించటం, ప్రాథమిక, మాధ్యమిక విద్యను సార్వత్రిక మనిపించు కోవటానికి అనియత విద్యాకేంద్రాలను స్థాపించటం, మరియు ఒపెన్ యూనివర్సిటీలను, దూరవిద్యను పెద్ద ఎత్తున స్థాపింప పూనుకోవటం ఇందులోని కొన్ని ముఖ్యాంశాలు.

భారతదేశంలో 1857లో మూడు యూనివర్సిటీలతో ప్రారంభమయిన ఉన్నత విద్యా వ్యవస్థ ఈనాడు 212కు చేరుకుంది. 1950 దశాబ్ది మధ్యకాలంలో UGC స్థాపించి నప్పటి నుండి అంతవరకు వివిధ శ్రేణుల్లో రూపాలలో ఉండినటువంటి ఉన్నత విద్యను అంతటినీ UGC స్థాపనతో ఒక్కగొడుగు క్రిందకు తీసుకు వచ్చినట్టయింది. అప్పటినుండి దాదాపు అన్ని విద్యా సంస్థలను సమన్వయ పరుస్తూ ఆర్థిక సహాయాన్నందిస్తూ వాటి అభివృద్ధికి దోహదం చేస్తూ వచ్చింది. ఫలితంగా ఉన్నత విద్యా సంస్థల సంఖ్య గణనీయంగా పెరుగుతూ వచ్చింది. అయితే ఈ పెరుగుదల ఒక పథకం ప్రకారం జరగలేదు. ఇలా ఇబ్బడి ముబ్బడిగా పెరగటం వలన అన్నింటికి ఆర్థిక సహాయం చేయటం సాధ్యం కావటం లేదని ప్రస్తుత ప్రభుత్వ వాదన. కానీ ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే ఒకవైపు విద్యా సంస్థలను కొంతమేరకు పెంచుతూనే, విద్యారంగానికి కేటాయించవలసిన ఆర్థిక వనరులకు కోతపెడుతున్నారు. వీటికి తోడు కేంద్ర మరియు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు తమ ప్రణాళికా వ్యయాన్ని, ఇందులో విద్యారంగ వాటాను క్రమంగా తగ్గిస్తూ వస్తున్నవి.

అందువలన కొత్తగా విద్యాలయాలను స్థాపించటం చాలా కాలం క్రిందటే ఆపివేసింది. ఆంధ్రప్రదేశ్ విషయమే తీసుకుంటే, ఇంజనీరింగ్ విద్య చాలా ఎక్కువగా ప్రభుత్వ యాజమాన్యంలో స్థాపించబడింది. 1929లో ఉస్మానియా ఇంజనీరింగ్ కాలేజీతో ప్రారంభమై 1965 సంllలో ఇవి 11 కు పెరిగాయి. నాటి నుండి ప్రభుత్వాధిపత్యంలో ఇంజనీరింగ్ కాలేజీల స్థాపన జరగలేదు. అప్పటినుండి ప్రైవేటు యాజమాన్యంలోనే ఇంజనీరింగ్ కాలేజీలు స్థాపించబడుతు న్నాయి. అక్కడక్కడ కంటితుడుపు చర్యగా అరకొర వసతులతో ఇంటర్, డిగ్రీ కాలేజీలు నెలకొల్పుతున్నా వీటికి కొన్నిరెట్లు ఎక్కువ సంఖ్యలో సమాంతరంగా ప్రైవేటువి వెలుస్తున్నాయి. పెరుగుతున్న విద్యార్థుల సంఖ్యకు దీటుగా ప్రభుత్వ విద్యాలయాలు పెరగకపోవటం, వున్నవి దీనావస్థలో వుండటంతో ప్రైవేటు విద్యాసంస్థలు పుట్టుకొస్తున్నాయి. దీనికి తోడు చాపక్రింద నీరులా ప్రభుత్వ చేయూత తోడై వివిధ రూపాలలో వివిధ రంగాలలో ప్రైవేటు రంగంలో విద్యాసంస్థలు పరిఢవిల్లుతున్నవి.

ఉపాధి ఒక్కటే లక్ష్యం కాకుండా వివిధ విషయాలపై పరిశీలనలు చేయవలసిన కర్తవ్యం ఉన్నత విద్యపై వుండటంతో సహజంగానే ఖర్చుకూడా అధికంగా వుంటుంది. ప్రస్తుతం విద్యారంగానికి ఆర్థిక సంక్షోభాన్ని విశ్లేషిస్తూ ప్రముఖ విద్యావేత్త ఉపేంద్రబక్షి ఈ విధంగా వివరించారు. "ఈ సంక్షోభం ప్రధానంగా రెండు రూపాల్లో వుంది. ముందుగా విదేశీ మారక ద్రవ్యాల కొరత, ద్రవ్యోల్బణం, అదే విధంగా ఆర్థిక వ్యవస్థ సంక్షోభం".

అసోసియేషన్ ఆఫ్ ఇండియన్ యూనివర్సిటీస్ సంస్థ ఆధ్వర్యంలో జరిపిన అధ్యయనంలో అనేక ఆసక్తికర విష యాలు వెలువడ్డాయి. దేశంలోని 80 ఎంపిక చేయబడిన యూనివర్సిటీలను అధ్యయనం చేయగా 45 యూనివర్సిటీలు తీవ్ర ఆర్థిక ఇబ్బందుల్లో కొట్టుమిట్టాడుతున్నాయి. ఇంకా 30 యూనివర్సిటీలు 2–10 శాతం నిధుల కొరతతో ఇబ్బందులను ఎదుర్కొంటున్నాయి. ఈ పరిస్థితుల్లో యూనివర్సిటీలను అధిక వడ్డీరేట్లకు బ్యాంకుల నుండి ఋణం తీసుకునేలా ప్రోత్సహిస్తున్నాయి.

ఇతర దేశాలతో ఉన్నత విద్యను పోల్చి చూసినట్టయితే ఇతర ఆసియాదేశాలలో 12 శాతం, యూరోప్‌లో 15–20 శాతం, వరకు ఉన్నత విద్య వుంటే మన దేశంలో ఇది 5 శాతం మాత్రమే విస్తరించి వుంది. ఉన్నత విద్యారంగంపై నిర్లిప్తత వలన ఈ రంగంలో సహజంగానే ప్రణాళికలో కేటాయింపులు కూడా తగ్గుదలను సూచిస్తున్నాయి. మొదటి ప్రణాళికలో ఉన్నత విద్యకు ఆర్థిక వనరుల కేటాయింపు 20.89 శాతం వుండగా ఏడవ ప్రణాళిక వచ్చేనాటికి 17.06 శాతానికి తగ్గి ఇది ఎనిమిదో ప్రణాళికా కాలానికి 11.02 శాతానికి పడిపోయింది. ఇది బలహీనమయిన ఆర్థిక వ్యవస్థ మరియు సరళీకృత ఆర్థిక విధానాల ఫలితమే. ఇందువలన దేశంలోని చాలా విశ్వవిద్యాలయాలు నిధుల కొఱతతో ఊగిసలాడుతున్నాయి.

ఉన్నత విద్యకై ప్రాముఖ్యం – ముఖ్యంగా సాంకేతిక, వైద్య, బోధనా రంగాలలో పెరుగుతున్నప్పటికీ ప్రభుత్వపు నిర్లక్ష్య ధోరణి ప్రైవేటు సంస్థలకు/వ్యక్తులకు ప్రోత్సాహాన్నిచ్చి పెంచి పోషిస్తుంది. ఇందులో చేరుతున్నటువంటి విద్యార్థులు 15–20 శాతం అదనంగా ఫీజులు చెల్లించవలసి వస్తుంది. ప్రముఖ విద్యావేత్త ప్రొఫెసర్ అమ్రిక్‌సింగ్ మాటలలో చెప్పాలంటే, "ప్రైవేటు కళాశాలల స్థాపన అవినీతి పెరుగుదలకు మార్గం వేశాయి. సుప్రీంకోర్టు జోక్యం వల్ల ఈ అవినీతి ప్రమాదం చాలా వరకు అదుపులోకి వచ్చింది. అయితే ప్రైవేటు విశ్వవిద్యాలయాల స్థాపనవల్ల అవినీతి

ఎక్కువ అవుతుందా?" అని జవాబు ఆలోచించుకొమ్మని ప్రజలకే వదిలి పెట్టారు.

ఇందుకను గుణంగా, ఈ విద్యాసంస్థలకు విరాళాలు ఇచ్చేదాతలకు 100 శాతం పన్ను రాయితీని ప్రభుత్వం ప్రకటించింది. ఈ రాయితీ ఎవరికోసం ఉద్దేశించినదో ఊహించుకోవటం సులభం. అలాగే ప్రభుత్వ ఆధ్వర్యంలోని వివిధ యూనివర్సిటీ మరియు కాలేజీలను తమ నిధులను తామే సమకూర్చుకోవాలని ఉత్తర్వులు జారీచేసింది. సహజంగానే ఈ విద్యాలయాలు ఈ నిధులు సమకూర్చుకున్న లేక నిధుల కొరకు విచక్షణారహితంగా ఫీజులు పెంచటం, కరస్పాండెన్సీ మరియు వృత్తి విద్యా కోర్సులను ప్రవేశపెడుతున్నాయి. ఇది విద్యారంగంలో విలువల క్షీణతకు దారితీసి, ఫీజులు పెంచటం వలన సామాన్య విద్యార్థులకు చదువుకొనలేనటువంటి పరిస్థితి ఏర్పడింది.

సండే అబ్జర్వర్ పత్రిక విశ్లేషణ దేశంలోని విద్యా వ్యాపార సంస్కృతిని తేటతెల్లం చేసింది. ఈ పత్రిక ప్రకారం బీహారులోని 500 కాలేజీలలో 20% పేపరుపైన ప్రభుత్వ లెక్కల్లో పేరుకు మాత్రమే వుండి, అవి భౌతికంగా వున్నటువంటి దాఖలాలు లేవు. మరియు సుమారు 250 మంది శాసనసభ్యులు, 20 మంది పార్లమెంటు సభ్యులు ఈ విద్యావ్యాపారంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో భాగస్వాములని తేల్చింది. ఒక మాజీ బీహారు గవర్నరుగారు "హిందూ" పత్రికకు ఇచ్చిన (June 12, 1990) ఇంటర్వ్యూలో బీహారులోని యూనివర్సిటీలు అవినీతితో, అరాచకత్వంతో కొట్టుమిట్టాడుతున్నాయి. అందుకు ఆయన 3 కారణాలను చెప్పినారు. (1) ఆర్థిక క్రమశిక్షణ లేకుండుట, (2) విద్యారంగంలో మాఫియా ప్రాబల్యం బలంగా వుండటం, (3) రాజకీయ మయంకావటం మరియు స్వయం ప్రతిపత్తి లేకపోవటం గా ఆయన పేర్కొన్నారు.

ఈ పరిస్థితులు కొంచెం కుడి ఎడమలతో, కొద్దో, గొప్పో జరిగే మార్పులతో అన్ని రాష్ట్రాలలోను వున్నాయి. మహారాష్ట్రలో తక్కువగా జరిగే మార్పులకు – కుంభకోణాలూ, సీట్లు, గారడీలు దేశంలో విద్యారంగంతో పరిచయమున్న వారందరికీ సుపరిచితము. ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాలయిన కేరళ, కర్ణాటక, ఆంధ్ర మరియు తమిళనాడులలో ఈ విద్యా వ్యాపారం ఉచ్ఛస్థాయిలో వుంది. కర్ణాటకలోని వైద్య, ఇంజనీరింగ్ కాలేజీలలో కాపిటేషన్ ఫీజు ఉదంతం సుప్రీంకోర్టు కలుగచేసుకునేంత వరకు వెళ్ళిందంటే, ఈ వ్యాపారం ఎంత ప్రాబల్యాన్ని సంతరించుకుని, ఎంతబలంగా విద్యా వ్యాపార ముఠాలు ఎదిగాయో సులభంగా గ్రహించవచ్చు.

పాలిటెక్నిక్, ఇంజనీరింగ్, వైద్య కళాశాలల్లో ఫీజులు భారీగా పెంచటం, బి.ఎడ్., లా వంటి కోర్సులలో విద్యా సంవత్సరంపూర్తికావస్తున్నా సీట్లు పెంచటం ఉన్నత పాఠశాల నుండి యూనివర్సిటీ స్థాయివరకు ఫీజుల పెంపుదలతోపాటు విచక్షణారహితంగా వృత్తి విద్యాకోర్సులకు అనుమతినివ్వటంలో ప్రస్తుత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నిమగ్నమై వున్నాయి. దీనికి సరికొత్త ఉదాహరణ ఆంధ్రప్రదేశ్‌లో 1995 లో కొత్తగా ఏర్పడిన ప్రభుత్వం పాఠశాల విద్యా సంస్కరణల నిమిత్తం, 1995 మార్చిలో ఏర్పాటు చేసిన కోనేరు రామకృష్ణారావు కమిటీ.

ఈ కమిటీ ప్రస్తుత పాఠశాల విద్యపై అసంతృప్తిని వ్యక్తం చేస్తూ, ప్రాథమిక విద్యను సార్వజనీనం చేయుటం, విద్యారంగంలో యాజమాన్య వికేంద్రీకరణ, సమీకృత పాఠ్య ప్రణాళిక, దృశ్యశ్రవణ విద్యావిధానం ద్వారా ప్రాథమిక విద్యను సమర్థవంతం చేయటం, ఉన్నత పాఠశాల స్థాయిలో వృత్తి విద్యా బోధన అనే నాలుగు కీలక అంశాలపై సూచనలు చేసింది. ఈ కమిటీ తాము ప్రైవేటు విద్య గురించి సూచించలేదని చెబుతూనే విస్తృతమైన సూచనలను ప్రైవేటీకరణ నిమిత్తం చేసింది.

ప్రాథమిక విద్యను గ్రామాల్లో గ్రామపంచాయితీలకు, పట్టణాల్లో మునిసిపాలిటీలకు అప్పగించాలని సిఫారసు చేసింది. ఇందుకు వనరులు సమీకరించే నిమిత్తం "విద్యారుసుము" వసూలు చేయాలని చెబుతూ ఈ అధికారాన్ని వీటికి ఇచ్చింది. దీనివలన పాఠశాలలకు ఎలాంటి అభివృద్ధి సౌకర్యాలు కావాలన్నా ఆ నిధులు విద్యార్థుల నుండి అంటే ప్రజల నుండి వసూలు చేస్తారు. ప్రైవేటు పాఠశాలలు ప్రస్తుతం వసూలు చేస్తున్న డొనేషన్లు, వ్యవస్థాపక రుసుము మొదలగు అనేక రకాల ఫీజులు ఇకనుండి "విద్యారుసుము" పేరుమీద ప్రభుత్వ పాఠశాలలకు చెల్లించవలసి వస్తుంది. ఇంకా స్థానిక సంస్థల పరిధిలోనికి ఉపాధ్యాయుల సర్వీసు నిబంధనలు కూడా చేర్చటం వలన రాజకీయజోక్యం పెరిగి వ్యక్తిగత కక్షలు తీర్చుకోవటం జరుగుతుంది. అందువల్ల ఉపాధ్యాయులకు ఉద్యోగ భద్రత వుండక, హక్కులను కోల్పోయే ప్రమాదం వుంది.

భవిష్యత్తులో ప్రభుత్వం నిర్వహించే పాఠశాలలు ఉండబోవని ఈ నివేదిక స్పష్టం చేసింది. ఇందుకనుగుణంగా ప్రభుత్వ ఖజానాకు భారం పడకుండా వుండని పక్షంలో విద్యాశాఖ నుండి ఇకమీద అనుమతి పొందనవసరం లేకుండానే ప్రాథమిక పాఠశాలలను స్థాపించటాన్ని అనుమతించాలని ఈ కమిటీ ప్రభుత్వానికి సూచించింది. ఇందువల్ల ఇదివరకే లెక్కకు మించి ప్రభుత్వానుమతి లేకుండా విలసిల్లుతున్న పాఠశాలలన్నింటినీ చట్టబద్ధం చేసినట్టవుతుంది.ఈ సూచనలన్నింటినీ ఉన్నదున్నట్టుగా ప్రభుత్వం ఆమోదించటం ప్రభుత్వ రంగంలోగల విద్యకు మరో విఘాతం.

పాఠశాల విద్యలో చేపట్టినటువంటి సంస్కరణలే ఉన్నత

విద్యలో కూడా చేయాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1986 లోనే శ్రీకారం చుట్టింది. ఇందుకోసం రాష్ట్రంలోని నాలుగు విశ్వవిద్యాలయాలకు చెందిన ఉపాధ్యక్షులు సభ్యులుగా ఒక కమిటీని నియమించింది. ఇది ఉన్నత విద్యను కొందరికే పరిమితం చేసే సూచనలెన్నో చేసి ఉన్నత విద్య కేంద్రీకరణకు సూచనలు చేసింది.

ప్రస్తుతం ఉన్నత విద్య పేరుమీద అమలు జరుగుతున్న విద్యావిధానం పాతబడిపోయి నిష్ఫలమైందని పాశ్చాత్య ధోరణులు ఎక్కువై మనల్ని విదేశీయులుగా తయారు చేస్తుందని పేర్కొంది. ఇందుకని గాంధీ కలలుకన్న బేసిక్ విద్యావిధానాన్ని ప్రతిబింబించే విలువలతో కూడిన విద్యావిధానాన్ని సూచించింది. ఇందులో భాగంగా పాఠశాల విద్య తరవాత విద్యనందించే 3 భిన్నమైన విధానాలను సూచించింది. మొదటిది, జాతికి ఉపయోగపడే అత్యంత ప్రతిభగల వారికోసం, రెండు, తమ విద్యార్జనకు పెట్టుబడి పెట్టే స్తోమతగల వారికోసం, మూడవది, పై రెండు విధాలైన విద్యలో చేరాలని వున్నా చేరలేని వారికోసం దూరవిద్య.

ఈ రకంగా విద్యను విభజించటం వల్ల, కమిటీ సహజంగానే గ్రామీణ, పేద విద్యార్థులను ఉన్నత విద్యనుండి మినహాయించింది. ప్రతిభను ప్రభావితం చేసే, ఆర్థిక, సామాజికాంశాలను విస్మరించింది. ఇందువలన ఉన్నతమైన విద్య, శక్తిమంతులైన, శ్రేష్ఠ సమూహాలకు పరిమితంచేసి ఉన్నత విద్య ఉన్నతులకే పరిమితం చేసింది. పెట్టుబడి పెట్టి విద్యను పొందగోరే వారికోసం, అవకాశం కల్పించి, విద్యను మార్కెటులో సరుకుగా, ధనం వున్నవారే పొందేటట్టు చేసింది. అంతేకాకుండా ఉన్నత విద్యావిధాన పరిషత్తును స్థాపించి రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలను దీని పరిధిలోనికి తీసుకరావాలని సూచించి వీటి స్వయం ప్రతిపత్తిని తొలగించింది.

1986 లో వైస్‌ఛాన్స్‌లర్స్ కమిటీ విధాన సూచనల ఎలాగయితే ప్రైవేటు విద్యా ధోరణులను కలిగివున్నవో అదే పద్ధతిలో పాఠశాల విద్య కమిటీ (1995) కూడా అలాంటి సూచనలే చేయటం గమనించదగిన విషయం. ఇందువలన స్పష్టం అవుతున్నదేమిటంటే పాఠశాల విద్య మొదలుకొని ఉన్నత విద్యవరకు విద్యను కొందరికే పరిమితం చేయటం, విద్యకోసం అయ్యేటటువంటి వ్యయాన్ని, పొందేవారినుండి రాబట్టటం. తరవాత వచ్చిన విద్యావిధానాలు ముఖ్యంగా ఉన్నత విద్యలో మరింత ప్రైవేటైజేషన్ ధోరణిని కనబరిచినవి.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వ విద్యారంగ విధానాలు ఎక్కువగా వైద్య, ఇంజనీరింగ్, ఉపాధ్యాయ విద్య మరియు న్యాయవిద్య వంటి కోర్సుల చుట్టూ వున్నవి.

ఆంధ్రలోని కోస్తాజిల్లాల్లో బ్రిటిష్‌వారి కాలంనుండి విశాఖ, గుంటూరులలో వైద్య కళాశాలలున్నవి. తెలంగాణా ప్రాంతంలో నైజాం కాలంలోనే ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని, వైద్యకళాశాలను స్థాపించాయి. భాషా ప్రాతిపదికన రాష్ట్రాల పునర్విభజనలో భాగంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరవాత కర్నూలులో, తిరుపతిలో, హైదరాబాదులో గాంధీ వైద్య కళాశాలలు ఏర్పాటు చేశారు. ఇవన్నీ ప్రభుత్వాధీనంలో ఏర్పాటయినవే.

1956–57 లో ప్రైవేటురంగంలో వరుసగా కాకినాడలో రంగరాయ, వరంగల్‌లో కాకతీయ వైద్య కళాశాలల్ని స్థాపించారు. వీటిలో మొదట వరుసగా ఏడు, ఆరువేల రూపాయల క్యాపిటేషన్ ఫీజు వుండేది. అది క్రమంగా 12 వేల రూపాయలకు పెరగటానికి 20 సంవత్సరాలు పట్టింది. అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు అప్పటి రాజకీయ పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని ఆ రెండు కళాశాలలను జాతీయం చేసి డొనేషన్ విధానాన్ని రద్దుచేశారు.

1980 సెప్టెంబరులో ప్రైవేటు యాజమాన్యం కొరకు లక్షన్నర డొనేషన్లతో, విజయవాడలో సిద్దార్థ వైద్య కళాశాలకు చెన్నారెడ్డి ప్రభుత్వం అనుమతినిచ్చింది. దీనిని 1986 లో ప్రభుత్వానికి అప్పగించారు. దీనిని ఆ తరువాత 1987 లో వైద్య విశ్వవిద్యాలయంగా రూపొందించటం జరిగింది. అయితే ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే 1980 లో ఏర్పాటు చేసిన ఈ కళాశాలకు 1989 లో యూనివర్సిటీ ప్రతిపత్తి లభిస్తేనేగానీ వైద్య విధానపరిషత్ గుర్తింపు పొందలేదు. 1984 ఆగష్టులో అప్పటి ముఖ్యమంత్రి ఎన్.భాస్కరరావు హైదరాబాద్‌లో దక్కను మెడికల్ కాలేజీకి అనుమతినిచ్చారు. మైనారిటీ సంస్థ కావటంవల్ల దానిలో క్యాపిటేషన్ ఫీజు తొలగించటానికి న్యాయస్థానం అంగీకరించలేదు. వీటికి తోడు ప్రభుత్వం 1992 జూలైలో 12 వైద్య కళాశాలలు, 6 ఇంజనీరింగ్ కళాశాలల్ని అనుమతిస్తే కోర్టు కలుగజేసుకొని వాటి స్థాపనను ఆపేయటం వలన అవి స్థాపించబడలేదు. అయినా, ప్రస్తుత ప్రభుత్వం వీటిని పునరుద్ధరించే ప్రయత్నాలు చేస్తోంది. ఈ కాలేజీలు స్థాపించేవారు ప్రభుత్వ ప్రాపకంలో, అయిన వారందరికీ అర్హతలున్నా లేకపోయినా విద్యా వ్యాపారం చేసుకోవటానికి లైసెన్సులు ఇస్తున్నారు. ఉదార ఆర్థిక విధానాల పేరుతో, స్వేచ్ఛా వాణిజ్యాన్ని విద్యారంగానికి వర్తింపచేసి లాభాలు పొందగోరుతున్నారు.

ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమంటే ప్రైవేటు కాలేజీల పెరుగుదల ఎక్కువగా లాభసాటిగా వున్నటువంటి కోర్సులకే పరిమితమైంది. మరోవైపు మామూలు సాంప్రదాయ కోర్సులతో ఆర్ట్సు, కామర్సు, సైన్సు కాలేజీలను స్థాపించి, సొసైటీలుగా గుర్తింపు పొంది, తరవాత తమ సంస్థ తరపున లాభసాటి అయిన వృత్తి విద్యాకోర్సులను ప్రారంభిస్తున్నారు.

ఇందులో భాగంగానే వైద్య, ఇంజనీరింగ్, బి.ఎడ్. లేక న్యాయ విద్యలను ప్రైవేటు రంగంలో ఏర్పాటు చేయటానికి వివిధ ప్రభుత్వాలు అత్యంత ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం 1992 అంచనాల ప్రకారం 17 ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలలు వున్నాయి. ఒక్కొక్క కళాశాలలో సుమారు 1200 మంది విద్యార్థులున్నారు. వీరి ద్వారా సంబంధిత యాజమాన్యాలకు ఒక్కొక్కరికి ఒక కోటి రూపాయలపైనే ఒక సంవత్సరానికి ఆదాయం వస్తుంది. సుప్రీంకోర్టు తీర్పు ద్వారా ప్రతీ కాలేజీలోని సగం సీట్లను బహిరంగ మార్కెట్‌లో అమ్మచూపటం ద్వారా యాజమాన్యాలు మరో కోటి రూపాయలు లబ్దిపొందుతారు. ఈ కళాశాలలన్నింటిలో కౌన్సిల్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ వారి అనుమతిపొందినది ఒక్క ఏలూరు ఇంజనీరింగ్ కళాశాల మాత్రమే.

సాంప్రదాయ విద్యనందించే కాలేజీల విషయం పరిశీలించినట్లయితే 1956 లో గల 47 కాలేజీలలో 21,200 ల విద్యార్థులుండేవారు. 1985 లో ఈ కాలేజీల సంఖ్య 354 కు పెరిగి విద్యార్థుల సంఖ్య 3,18,000 లకు చేరింది. 1956 లో వీటికి పెట్టుబడి 92 లక్షలయితే ఇప్పుడు అది 100 కోట్లకు చేరుకుంది. ఇది 8.66 శాతం నుండి 20 శాతానికి పెరిగింది. ఈ అంచనాలు జూనియర్ మరియు డిగ్రీ కాలేజీలకు సంబంధించినవి.

ప్రస్తుతం 1994 లెక్కల ప్రకారం 425 జూనియర్ కళాశాలలున్నాయి. కానీ విద్యాశాఖ మంత్రి అంచనా ప్రకారం 1989–94 మధ్యకాలంలో 1,500 జూనియర్ కాలేజీలను అనుమతించటం జరిగింది. ఇందులో అత్యధికం ప్రైవేటు రంగంలోనని వారి అంచనా. 1989 అంచనాల ప్రకారమే 365 డిగ్రీ కాలేజీలున్నాయి. వీటిలో 3 లక్షల 20 వేల మంది విద్యార్థులకు ప్రవేశం లభిస్తున్నది. ఇందులో 200 ప్రైవేటు కళాశాలలు. 1989–94 మధ్యకాలంలో రాష్ట్రంలో డిగ్రీ కాలేజీల సంఖ్య హఠాత్తుగా 715 వరకు పెరిగింది. ఒక కేంద్రీయ విశ్వవిద్యాలయంతో కలిపి ఆంధ్రలో 17 విశ్వవిద్యాలయాలున్నాయి.

ఉపాధ్యాయ శిక్షణకు (బి.ఎడ్.)కు సంబంధించి కూడా విచక్షణారహితంగా కాలేజీలకు అనుమతినిస్తున్నారు. ఇందుకు ఉదాహరణగా ప్రభుత్వం – కాలేజీల యాజమాన్యాల ఒత్తిడికి దిగివచ్చి కోర్సు కాలవ్యవధి పూర్తికావచ్చినప్పటికీ కళాశాలల్లో సీట్లు పెంచుకోవటానికి అనుమతించటాన్ని చెప్పకోవచ్చు. ఇలా అనుమతించటం వెనుక విద్యా వ్యాపార శక్తుల ప్రాబల్యం ఎంత వుందో గమనించవచ్చు. ఎందుకంటే దాదాపు 80 శాతం బి.ఎడ్. కళాశాలలు ప్రైవేటు రంగంలోనే వున్నాయి. ఇంజనీరింగ్, వైద్య విద్యకు సమానంగా బి.ఎడ్. సీట్లకొరకై విపరీతమైన పోటీ పెరగడం అనేది ఈ మధ్యకాలంలో కొత్తగా వస్తున్నటువంటి పరిణామం.

ఉన్నత విద్యకై డిమాండు పెరుగుతున్న నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం ప్రైవేటు యూనివర్సిటీ బిల్లును 1995లో రాజ్యసభలో ప్రవేశపెట్టి తనదైన శైలిలో ప్రతిస్పందించింది. దీని ప్రకారం ప్రైవేటు యాజమాన్యం క్రింద యూనివర్సిటీ స్థాపనకు, నిర్వహణకు అనుమతి లభిస్తుంది. క్రమబద్ధీకరణ మాత్రం ప్రభుత్వం చేతుల్లో వుంటుంది.

ఈ బిల్లుగానీ, ఆమోదింపబడి చట్టమై వస్తే భారత దేశంలోని ఉన్నత విద్య మార్కెటులో సరుకుతో సమానంగా దిగజారుతుంది. విదేశీయులకు, విదేశాలలో స్థిరపడిన భారతీయులకు వేరువేరు ఫీజులు నిర్ణయింపబడటం వలన స్థానికంగా నివసించే భారతీయులు వారితో విద్యార్జనకు పోటీ పడలేరు. కాబట్టి వారికి విద్యావకాశాలు సన్నగిల్లుతాయి. ప్రభుత్వం నుండి వీటికి ఏ విధమైన ఆర్థిక సహాయం అందకపోవటం వలన సహజంగానే వీటిలో ఫీజులు అధికం. కాబట్టి దేశంలో అధిక సంఖ్యాకులయిన బలహీన వర్గాలకు చోటుండదు.

ఇలాంటి సమయంలోనే, బాబాలు, మతసంస్థలు, వివిధ మతశాఖల ఆధ్వర్యములో లేక వారి యాజమాన్యంలో యూనివర్సిటీలు స్థాపించబడినా ఆశ్చర్యపోనవసరం లేదు. ఎందుకంటే దేశంలో చాలా విద్యాసంస్థలు ఇప్పటికే ఇట్లాంటి వారి ఆధిపత్యంలో వుండటం వలన, ఈ ప్రైవేటు యూనివర్సిటీ బిల్లు అలాంటి మతఛాందసవాదుల పట్టును విద్యారంగంపై మరింత పెంచటానికి దోహదకారి అవుతుంది. మతపరమయిన క్రమశిక్షణ పేరుతో యువతలో భూస్వామ్య లక్షణాలను, అధికారదాహాన్ని పెంపొందించటానికి ఉపకరిస్తుంది. ఈ బిల్లు ప్రభుత్వపు బాధ్యతారాహిత్యానికి మరియు విద్యను ఒక మార్కెట్ సరుకు చేయటానికి పారిశ్రామిక వేత్తలతో కలిసి ప్రభుత్వనేతలు పన్నినటువంటి ప్రణాళికా బద్దమైన వ్యూహం.

ఇవన్నీ ప్రభుత్వానికి తెలియక చేస్తుందనుకోవటం పొరపాటు. కావాలని ప్రభుత్వ విద్యాలయాలను నిర్లక్ష్యం చేసి ప్రైవేటు విద్యాలయాలు తప్ప గత్యంతరం లేదనే వాతావరణాన్ని తయారుచేసింది. ప్రైవేటీకరణ జరిగితే ఆర్థిక ప్రాబల్యం పెరిగి అన్ని రకాల రిజర్వేషన్లు రద్దు చేయబడతాయి. ఒక ప్రాంతంలోనే విద్యాభివృద్ధి జరిగి, ప్రాంతీయ అసమానతలు పెరుగుతాయి. స్త్రీలు, వికలాంగులు తీవ్రంగా నష్టపోతారు. యాజమాన్యాల దయా దాక్షిణ్యాలపై విద్యా నిర్మాణం ఆధారపడి వుంటుంది. సామాజిక స్పృహకోల్పోయి వ్యక్తి ప్రయోజనాలు విజృంభించి సమాజ

వినాశనానికి దారితీస్తాయి. ఏ రీత్యా చూసినా ప్రైవేటీకరణ ప్రమాదానికి సూచికే.

సమకాలీన విద్యావిధానం, విద్యాబోధన ఒకప్పుడు సాంఘిక బాధ్యతగా విలసిల్లిన విద్యాబోధన ఇప్పుడు ధనార్జనకు కీలక సాధనంగా మారిపోయింది. ప్రాథమిక విద్యాస్థాయినుండి ఉన్నత విద్యాలయాలవరకు, పుట్టగొడుగుల్లా వెలుస్తున్న ప్రైవేటు పాఠశాలలు, ప్రశ్నాపత్రాల లీకేజీ, సమకాలీన అవ్యవస్థకు వెర్రితలలు వేస్తున్న విద్యా వ్యాపారానికి నిలువుటద్దాలు. విద్యా సంస్థల్లో బోధనాస్థాయి గణనీయంగా కుదించుకుపోవటం అధ్యాపకులు సమర్థంగా బాధ్యతలు నెరవేర్చకపోవటం, అనేవి అధ్యాపకుల బాధ్యతారాహిత్యానికి ప్రతీక. కనుక ఈ రకమైన పెడధోరణులను ప్రభుత్వం క్రమబద్ధీకరించాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

చైనా, అమెరికాలలో అధ్యాపకుల బోధనాసామర్థ్యాన్ని పరిశోధన కృషిని నిశితంగా పరిశీలించి ప్రమోషన్లు ఇంక్రిమెంట్లు సిఫారసు చేసే నిపుణుల సంఘాలు పనిచేస్తున్నాయి అనేవి అంతుచిక్కని వైనం.

కనీస సదుపాయాలు కల్పించటంలోనూ పాలకుల నిర్లక్ష్యం, పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పటంకన్నా అన్యవిషయాలకే ఎక్కువ ప్రాధాన్యత కనబరచే గురువుల గర్హనీయ వైఖరులు దుష్పరిణామాలకు దోహదపడుతున్నాయి. ప్రైవేటు విద్యాసంస్థల్లో డబ్బుకు, పలుకుబడికి పెద్దపీట లభించి, విద్యార్థుల తెలివితేటలకు ప్రతిభాపాటవాలకు సముచితస్థానం లభింపక కులాల లంపటాలు ప్రాముఖ్యం సంతరించుకోవటం దుర్భరం.

విద్యారంగంలో ప్రమాణాల పతనానికి ఇప్పటికైనా అడ్డుకట్ట వేయకపోతే పర్యవసానాలు ఊహించటమే కష్టమవుతుంది. అధ్యాపకుల్లో స్ఫూర్తి రగిలించి, విద్యారంగ సమూల ప్రక్షాళనకు పూనుకోవాలి. భావితరాలకు తీరని నష్టం కలగకుండా, ఉన్నత ప్రమాణాలతో విద్యను అందించాలంటే నిపుణులూ, విద్యావేత్తల సహాయ సహకారాలతో విద్యారంగపు పునర్నిర్మాణం తక్షణావసరం.

**References:**


1. D. Bapu Rao, School Education in Private Sector: A Comparative study, M phil Dissertation, Dept. of Pol. Science, University of Hyderabad, Hyderabad, 1992.
2. G. Haragopal & G. Sudershanam, A Note on Privatisation in Higher Education, A paper presented to the 25th Heads of Dept. Meeting, MIDS, Madras, Dec., 1995.
3. G. Haragopal, Gradual Surrender of Universities: Trends in Higher Edu. in A.P., RPW, Sept. 1986.
4. National Policy on Education - 1986, Ministry of Human Resource Development (Dept. of Edu.). Govt. of India, New Delhi, May, 1986.
5. Reforming School Education, Report of the Ramakrishna Rao Committee, Govt. of A.P. Hyd., Ugadi, 1995.
6. Frontline (Fortnightly) Vol. 13. No.12 June, 28, 1996, Madras.


"చరిత్ర నైజాన్ని అవగాహన చేసుకునే సామర్థ్యం కల్గియుండటం రచయిత ప్రతిభకు అత్యంతావసరం." – ఇల్యా ఎహ్రెన్ బర్గ్

# విద్యా సంస్కరణలకై ప్రజాతంత్ర ఉద్యమం

పి. శ్రీరామమూర్తి, బి.ఏ.,బి.కాం.,బి.యిడి.,

ఆంధ్రప్రదేశ్‌తో సహా భారతదేశం యావత్తూ, విద్యారంగంలో తీవ్ర సంస్కరణలకై తహతహలాడుతోంది.

'తీవ్ర సంస్కరణలు' లేక 'విప్లవకర మార్పులు' వగైరా పదజాలమేదయినా ప్రాథమిక విద్య దశ నుండి యూనివర్సిటీ విద్య వరకు విద్యారంగంలో సమూలమైన మార్పులు రావాలనీ, వీటివల్ల భావి భారత పౌరుడైన నేటి విద్యార్థి తన భవిష్యత్తును చక్కగా ఏర్పరచుకోడానికి, సమాజము, దేశము ప్రగతి పథాన పయనించడానికి, కృషి చేయుటకవసరమగు శక్తియుక్తులను సముపార్జన చేసుకోగలగాలనీ అందరం కోరుకుంటున్నాం. మొత్తం ఆర్థిక, సాంఘిక, అభ్యుదయానికి జరిగే కృషిలో భాగంగానే విద్యా రంగంలోని మార్పులు జోడించబడినపుడే మనమాశించే సత్ఫలితాలు చేకూరగలవు.

## ప్రస్తుత పరిస్థితి:

భారతదేశంలో 1971 మరియు 1981 జనాభా లెక్కల ననుసరించి అక్షరాస్యుల శాతము వరుసగా 29.4 మరియు 36.23 మాత్రమే. బడి ఈడుగల బాలబాలికలనందరినీ పాఠశాలల్లోకి తీసుకువచ్చి విద్య తప్పనిసరిగా, ఉచితంగా 1962 నాటికి గరపాలనే రాజ్యాంగహామీ అమలు జరుగలేదు. స్త్రీ విద్య ఘోరంగా నిర్లక్ష్యం చేయబడింది. 1986 జాతీయ విద్యా విధానంలో మన దేశంలోని 6-14 సంవత్సరముల బాలబాలికలందరినీ 1995 నాటికి అక్షరాస్యులని చేయుట పూర్తి చేస్తామన్న లక్ష్యం ఎంత వరకు నెరవేరుతుందో ఎవరు హామీ నివ్వగలరు?

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు అనేక విద్యా కమిటీలను కమీషన్లను నియమించినా, వాటి సిఫార్సులు ఆయా ప్రభుత్వాలకందినా, వాటిపై సత్వర నిర్ణయాలు చేయుటకుగాని, వాటి అమలుకు నిధులు కేటాయించుటగాని, తదితర విద్యా విషయక పరిపాలనా సంబంధమైన చర్యలు తీసుకొనుట గాని ఆయా ప్రభుత్వాలు చేయలేదు. ఖచ్చితంగా తొలగించాల్సిన మూల చట్టాన్ని మాత్రం అలాగే వుంచి కేవలం కొన్ని చిన్న చిన్న సంస్కరణలు తెచ్చే ప్రయత్నం మాత్రమే ప్రభుత్వాలు చేశాయి. డాక్టరు యస్. రాధాకృష్ణన్ కమీషన్ (1949) డా॥ లక్ష్మణ స్వామి మొదలియార్ కమీషన్ (1952-54) డాక్టరు డి.యస్. కొఠారి కమీషన్ (1964-66) యొక్క సిఫార్సులను దాదాపు గాలికి వదలినట్లే అయింది. 1977లో మన కేంద్ర ప్రభుత్వం నియమించిన ప్రొఫెసరు ఈశ్వరభాయ్ పటేల్ కమిటీ సిఫార్సు చేసిన 'సాంఘిక ప్రయోజనం గల ఉత్పత్తి కృషి' పాఠశాల విద్యలో అంతర్భాగం చేయబడాలన్న విధానముగాని, 1984లో మన రాష్ట్ర ప్రభుత్వం నియమించిన శ్రీ వి. ఆర్. రెడ్డి కమిటీ సిఫార్సు చేసిన 'సెకండరీ - ఇంటర్మీడియట్ దశల్లో వృత్తి విద్యా కోర్సుల బోధన జరగాలి' అన్న విధానము గాని సక్రమంగా - సంతృప్తిగా అమలు జరుపబడుటలేదు. 1986 జాతీయ విద్యా విధానంలో చెప్పబడిన 'వృత్తి విద్యా విధానం' లాంటి కొన్ని అంశాలు ఎన్నేండ్లలో పూర్తిగా అమలు చేయబడతాయో ఎవరు చెప్పగలరు?

## ఏమీ అభివృద్ధి లేదా?:

అయితే, స్వాతంత్ర్యానంతరం భారతదేశ విద్యారంగంలో ఏమీ అభివృద్ధి లేదనడం సరికాదు. బ్రిటిషు పాలనతో పోలిస్తే రాశిలోను, గుణంలోను అభివృద్ధి లేక పోలేదు. ప్రాథమికంగా ఈ నాటి విద్యా విధానం భారత బూర్జువా వర్గ ప్రయోజనాలను తీర్చేటట్టిదే. అందువల్ల ఈ అభివృద్ధి కూడ ఆ పరిమితుల్లోనే జరిగింది.

పాఠశాలల్లో విద్యార్థులు చేరడమే సూచికంగా మనం గమనంలోకి తీసుకుంటే ప్రాథమిక విద్యారంగంలో (6-11 సం.ల వయసుగల వారిలో) ఈ అంకె 1946-47లో

భారతదేశ వ్యాప్తంగా 1కోటి 41లక్షల 10వేల నుంచి 1973–74లో 6కోట్ల 37లక్షల 54వేలకు పెరగటం చూస్తాం. మాధ్యమిక విద్యారంగంలో (11–14 సంవత్సరాల వయసుగల వారిలో) ఈ అంకె ఇదే కాలంలో 29 లక్షల 40 వేల నుండి 1 కోటి 50 లక్షల 29 వేలకు పెరగటం చూస్తాం. హయ్యర్ సెకండరీ దశ (14–17 సంవత్సరాల వయస్సు గలవారిలో) లేక ఇంటర్మీడియట్ దశలో 1949–50లో ఈ అంకె 10 లక్షల 83 వేలుంటే, 1973–74లో 85 లక్షలైంది. ఉన్నత విద్యాదశలో (17–23 సంవత్సరాల వయసు వారిలో) 1946–47లో విద్యార్థుల ప్రవేశం 2 లక్షల 56 వేలుంటే 1973–74లో 30 లక్షలకు పెరిగింది. 6 వ ప్రణాళిక (1980–85) ఆఖరుకు ఈ సంఖ్యలు యింకా పెరిగినాయి.

పై అంకెలు ఉన్న వాస్తవానికి ఒక పార్శ్వం చూపెడితే రెండో పార్శ్వం అంధకార భూయిష్టమైన నిరాశ కల్గిస్తున్నది. సాధించగలమని చెప్పుకునే అనేక భారీ అంచనాలకు భిన్నంగా 6–11 సంవత్సరాల వయసు గల 1 నుంచి 5 వ తరగతి చదివే విద్యార్థులను చేర్చుకునే సంఖ్య 67 శాతం కంటే తక్కువే ఉందని అధికారికంగా గుర్తింపబడినది. అందులో కూడా 12–14 సంత్సరాల వయసు గల విద్యార్థులలో మూడింట రెండు వంతుల మంది మాధ్యమిక పాఠశాలల్లో చేరనేలేదు. 14–17 సంవత్సరాల వయసు గలవారిలో హయ్యర్ సెకండరీ లేక ఇంటర్మీడియట్ స్థాయికి చేరుకున్నవారు ప్రతి అయిదుగురిలో ఒకరు కూడా లేరు.

ఉన్నత విద్య గరపే కాలేజీలలోకి ఇంజనీరింగు టెక్నాలజీ, వైద్య, వ్యవసాయ, వెటర్నరీ సైన్సు విద్యార్థుల సంఖ్య 1950–51లో 1 లక్ష 60 వేల 367 ఉంటే 1970–71లో 13 లక్షల 42వేల 568కి పెరిగింది. అయితే ఈ సంఖ్య 17–23 వయసు గ్రూపు వారిలో 4 శాతం కంటే మించలేదు.

మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర లెక్కలను గమనించినా విద్యారంగంలో సంఖ్యాపరంగా అభివృద్ధి కన్పిస్తుంది. ఒక ఉదాహరణగా ప్రైమరీ దశలోని ఈ క్రింది అంకెలు గమనించండి:

| సంవత్సరం | పాఠశాలలు | విద్యార్థులు | ఉపాధ్యాయులు |
|---|---|---|---|
| 1956–57 | 29076 | 24,54,054 | 77,065 |
| 1965–66 | 37320 | 37,69,174 | 79,923 |
| 1980–81 | 40611 | 40,42,273 | 80,953 |
| 1985–86 | 42054 | 52,41,531 | 93,894 |

అలాగే మిగతా దశల్లోనూ అంకెల్లో పెరుగుదల వున్నది. కాని పెరగాల్సినంత మోతాదులో ఈ పెరుగుదల లేదు. అక్షరాస్యతా శాతం చూడండి. 1981లో అఖిల భారత అక్షరాస్యతా శాతము 36.23 మాత్రమే. మన రాష్ట్రంలో యిది 29.94 మాత్రమే!

చాలా రాష్ట్రాలలో బోధన – పాఠశాల స్థాయిలో పూర్తిగానూ, యూనివర్సిటీలలో చాలా వాటిలో గ్రాడ్యుయేషన్ – కొన్నింటిలో పోస్టు గ్రాడ్యుయేషన్ పూర్తి అయ్యేవరకు ప్రాంతీయ భాషలోనే జరుగుచున్నది. ఆంధ్రప్రదేశ్‌లో పోస్టు గ్రాడ్యుయేషన్ కోర్సు ప్రథమంగా 'హ్యూమానిటీస్'లో (చరిత్ర, రాజకీయ శాస్త్రం) తెలుగులో బోధన జరుగుతున్నది. మిగతా కొన్ని సబ్జెక్టులను తెలుగులో బోధించుటకు రాష్ట్ర ప్రభుత్వమూ – యూనివర్సిటీలు ప్రయత్నిస్తూ ఇంతకు పూర్వం లేని అనేక శాస్త్రీయ, సాంకేతిక కోర్సులను ప్రవేశ పెట్టడం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ విశ్వవిద్యాలయం, జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీ మరియు ఇటీవల మెడికల్, ఉమెన్, ఓపెన్, తెలుగు యూనివర్సిటీలు ఏర్పడ్డాయి. ఉత్పత్తి నైపుణ్యత – ఆధునిక విజ్ఞానము పెంపుదలకు, వైద్య విద్య – స్త్రీవిద్య – అనియత విద్య – తెలుగు భాషా సంస్కృతుల అభివృద్ధికి తోడ్పడుతున్నాయి. ఐ.టి.ఐ.లు., పాలిటెక్నిక్స్, ఇంజనీరింగు, మెడికల్ కాలేజీలు మొ॥ వాటి సంఖ్య పెరుగుటతో బాటు కొన్ని కొత్త కోర్సులు కూడా ఏర్పాటు చేయబడుచున్నాయి.

## విద్యావిధానంలోని లోపాలు:

ప్రస్తుత విద్యా విధానం ముఖ్యంగా పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలను తీర్చేందుకు ఉద్దేశించబడినట్టిది. ఈ ఉన్నత వర్గాల 'ప్రభావ' ధోరణి ప్రాథమిక విద్యావ్యాప్తిని, స్త్రీ విద్యా వ్యాప్తిని, నిరక్షరాస్యతా నిర్మూలనను ఘోరంగా నిర్లక్ష్యం చేయుటలో ద్యోతకమవుతున్నది. డబ్బున్నవారు తమ బిడ్డలను ప్రభుత్వ ప్రోత్సాహంతో నడిచే పబ్లిక్ పాఠశాలలకు ఇంగ్లీషు మీడియం పాఠశాలలకు పంపేందుకు తహతహలాడటంలో కూడా ఈ ధోరణి వ్యక్తమవుతున్నది. కొఠారి విద్యా కమిషన్ సిఫార్సు చేసిన 'కామన్ స్కూలు పద్ధతి' మరియు బ్రిటీషు వారసత్వమైన "పబ్లిక్ స్కూలు పద్ధతి" సహజీవనం చేస్తున్నాయి. ఇది అన్యాయమూ, అసంబద్ధమూ అయినట్టిది. 'కామన్ స్కూలు'కు పరికరాల సప్లయి, భవనాల ఏర్పాటు వగైరా నిర్లక్ష్యం చేయడంలోనే సామాన్య ప్రజలకు మంచి విద్యను అందించుటకు వెనుకంజ ద్యోతకమవుతున్నది.

మన రాష్ట్ర ప్రభుత్వం 'కామన్ స్కూలు' విధానాన్ని అమలు జరుపుతామని అంటూనే 'గురుకులాల'ను ప్రోత్సహించుటకు 3.4.72న ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్

ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషన్స్ సొసైటీని స్థాపించి, యిప్పటి వరకు 67 గురుకుల హైస్కూళ్ళను, 3 గురుకుల జూనియర్ కాలేజీలను ప్రారంభించింది. సాంఘిక సంక్షేమ శాఖ కూడా యిట్టి గురుకులాలను ప్రారంభిస్తున్నది.

పబ్లిక్ స్కూళ్ళు - గురుకులాల విధానము వల్ల - అందరికీ సమాన విద్యావకాశాలను కల్గించుటలో యిదివరకే గల అసమానతలు - ఇంకా పెంపొందుచున్నాయి. 1986 జాతీయ విద్యా విధానంలోని 'నవోదయ విద్యాలయాలు' కూడా యిదే స్పెషల్ స్కూళ్ళ కోవకు చెందినవిగా వున్నాయి. కాన వీటన్నింటిని రద్దు చేయాలనటంలో సాంఘిక న్యాయమున్నది.

## శారీరక - మానసిక శ్రమలు:

ప్రస్తుత విద్యా విధానం ప్రధానంగా శారీరక శ్రమకూ మానసిక శ్రమకూ గల అగాధాన్ని అధికం చేస్తున్నది. శ్రామిక వర్గ వ్యతిరేకమైన భావాల పెంపుదలకు దోహదం చేస్తున్నది.

విద్యా విధానం ఉత్పత్తి ప్రధానమైన ధోరణి కలది కాకపోవడంతో ఆచరణలో ఉత్పత్తిక్రమంనుంచి వేరు చేయబడింది. అంతేగాక ఫలప్రదమైన సృజనాత్మక కృషి గల విద్యావంతమైన జాతిని తయారుచేసే దిశలో సాగటంలేదు. పరీక్షలే ప్రధానమన్న ధోరణి కొనసాగుతూనే వుంది.

ఈ విద్యావిధానం ద్వారా తయారయ్యే విద్యార్థులకు ఉత్పత్తి కృషిలో తర్ఫీదు మరియు ప్రమేయం లేనందున, ఉత్పత్తి నైపుణ్యతలు వీరికి అలవడనందున, స్వయం ఉపాధికిగాని జీతంపై ఉపాధికిగాని అవకాశాలు లేనందున, తెల్లచొక్కా ఉద్యోగాలు లభించనందున - చదువుకున్న నిరుద్యోగులుగా విద్యార్థులు ఉండిపోతున్నారు.

ఇలా భారత విద్యారంగం తీవ్రమైన సంక్షోభంలో వున్నది. ఇది మన దేశం అనుసరిస్తున్న పెట్టుబడిదారీ పంథా ప్రతిబింబం మాత్రమే. 1986 జాతీయ విద్యా విధాన ఫలితమూ యిందుకు భిన్నంగా వుండబోదు.

## విద్యారంగంలో సంక్షోభం:

విద్యారంగంలోని ఈ సంక్షోభం విద్యావంతులైన నిరుద్యోగ సైన్యం అధికం అవడంలో మనకు కొట్టొచ్చినట్లు కనబడుతున్నది. పర్యవసానంగా విద్యావంతులైన యువజనులలో, విద్యార్థులలో తీవ్రమైన అసంతృప్తి, కోపం అధికమవుతున్నాయి. తమ బంగారు భవిష్యత్తు కొరకు ఆరాటపడుతున్నారు.

విద్యారంగంలో అవినీతి తాండవిస్తున్నది. వ్యాపార ధోరణులు పెరిగిపోవడంతో నిజమైన విలువలు మరుగుపడిపోతున్నాయి. కులతత్వం, మతతత్వం, ప్రాంతీయతత్వం, సిఫార్సులు రాజ్యమేలుతున్నాయి. విద్యా వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయి.

విద్యా కోర్సులు హెచ్చు భాగము నిర్జీవమై సాంఘిక జీవన అవసరాలకు గాని, మానవ శక్తికి శిక్షణ విచ్చుటకు తగినట్లుగా లేవు. పాఠ్యాంశాలు ఇప్పటికీ అశాస్త్రీయమూ, అప్రయోజనమూ, ప్రజాతంత్ర రహితమూ, జాతీయ దురహంకార పూరితమూ వగైరా అభివృద్ధి నిరోధక అంశాలతోనే నిండి వున్నాయి. ఇది మతతత్వ వాదులకూ, అభివృద్ధి నిరోధకులకూ దేశ సమగ్రత - ఐక్యతా విచ్ఛిన్నకులకు సారవంతమైన పరిస్థితులను కల్పించుటకేగాక, ఫాసిస్టుల అనుకూల భావాలను వ్యాప్తిజేస్తూ, విద్యార్థి లోకాన్ని పెడత్రోవలు పట్టిస్తున్నాయి. బోధనాంశాలిలా వుంటే, బోధనా పద్ధతులు మొద్దుబారి, విద్యార్థుల సృజనాత్మక శక్తికిగాని, హేతువాద ఆలోచనల అభివృద్ధికిగాని తోడ్పడునట్టివి చాలా స్వల్పం. పరీక్షలు విద్యార్థుల జ్ఞానాన్ని, మేధాశక్తిని మదింపు చేయుటకు వీలైన విశ్వసనీయ సాధనాలుగా గాని, బోధనా అభ్యసనలను మెరుగుపరచే సాధనాలుగా గాని లేవు. అందువల్ల విద్యా వ్యాసంగంలో గుణాత్మక అభివృద్ధిని తీసుకురావడానికి ఈ పరీక్షావిధానం తోడ్పడుట లేదు.

పై కారణాలన్నింటి కలయిక ఫలితంగా నేటి విద్యారంగంలో సంక్షోభం అంతిమ దశకు చేరుకున్నది. విద్యారంగాన్నే గాక మన భారతదేశాన్నే అన్ని సంక్షోభాల నుండి రక్షించుకోవాల్సి వుంది. ఈ పవిత్ర బాధ్యతను నిర్వర్తించే భావి పౌరులను తీర్చిదిద్దే విద్యారంగంలో శాస్త్రీయమైనట్టి - ప్రజాతంత్రమైనట్టి, దేశభక్తియుతమైనట్టి విధానాలు చోటు చేసుకుని, బలోపేతం కావాల్సి వున్నది.

## శాస్త్రీయ విద్యావిధానమంటే:

విద్యా లక్ష్యాలు - విద్యా విషయాలకు సంబంధించి ప్రస్తుత విద్యా విధానంలో సమూలమైన మార్పులు తెచ్చుటకు మనం పూనుకోవాల్సి వుంది. పరిస్థితులందుకు అనుగుణంగా వున్నాయి. ప్రస్తుతం సాగుతున్న విద్యా విధానం స్థానంలో జాతీయ ప్రజాతంత్ర శాస్త్రీయ విద్యా విధానం రూపొందించబడాలి. అమలు జరుపబడాలి. దాని స్వరూపమిలా వుండవచ్చు.

## జాతీయ స్వభావం గలట్టిది:

విద్యా విధానం తప్పని సరిగా జాతీయ స్వభావం కలిగి ఉండాలనీ అంటే, జాతీయ అవసరాలు - ఆకాంక్షలు తీర్చేదిగా విద్య వుండాలనీ, తత్ఫలితంగా దేశంలో ఉత్పాదకశక్తి అభివృద్ధి అయ్యే దిశలో ప్రయాణం సాగుతుందనే - మన విశ్వాసం.

## ప్రజాతంత్ర స్వభావం గలట్టిది:

**విద్యా విధానం** ప్రజాతంత్ర స్వభావం కలిగి వుండాల నటమంటే ఈ దేశంలోని ప్రతి పౌరునికి వారి హోదా, సంఘంలో స్థితి, కులం, మతం వర్గం మొదలగు వాటితో సంబంధం లేకుండా సమాన విద్యావకాశాలు ఈ విద్యా విధానం ద్వారా లభించాలనడమే. ఇందుకు 'విద్య' జాతీయం చేయబడాలి.

## శాస్త్రీయమైనట్టిది:

ఈ విద్యా విధానం శాస్త్రీయమైనదిగా ఉండాలనడ మంటే – సాంకేతికంగా, శాస్త్ర బోధనలకు తగినంత ప్రాముఖ్య మివ్వాలనీ, తద్వారా విద్యార్థులు శాస్త్రీయ దృష్టిని అలవరచుకొని జీవితానికి సమన్వయించుకొని, బానిస భావాల నుండి ప్రాంతీయ ధోరణుల నుండి జాతీయ దురహంకార ధోరణుల నుంచి విముక్తి కావడమే గాక, మనిషికి మనిషికీ మధ్య ఉండాల్సిన సౌభ్రాతృత్వాన్ని, సమానత్వాన్ని, గౌరవాన్ని పెంపొందించేదిగా ఉండటమే.

## సిద్ధాంతపరమైన విద్యావిధానం:

విద్యా విధానం ద్వారా తర్ఫీదు పొంది మార్పులు చెందే భావిపౌరుడు ఎట్టి భావాలు, శక్తులు గలవాడుగా తయారు కావాలి? అనేది ప్రధానమైంది. మన భారతదేశం సెక్యులర్ డెమోక్రటిక్ సోషలిస్టు రిపబ్లిక్ కాగా మొత్తం విద్యారంగ సిద్ధాంతాలు, విధానాలుకూడా ఇట్టి సెక్యులర్, డెమోక్రటిక్, సోషలిస్టు భారతదేశం నిర్మాణమగుటకు – బలపడుటకు ఉపకరించేవిగా వుండాలి. ఒక జాతి ఉన్నత లక్ష్యాలకు భిన్నంగా ఆ జాతి విద్యారంగ లక్ష్యాలు ఉండజాలవు; ఉండరాదు.

భారతదేశంలో వాస్తవ జీవితం నుండి వేరు చేయబడిన వ్యక్తులను విద్యారంగం తయారు చేయరాదు. శ్రమపట్ల గౌరవ భావము కలిగిన యువతీ యువకులు తయారు కావాలి. వీరు దేశభక్తి, సామ్రాజ్యవాద వ్యతిరేకత, అంతర్జాతీయత, లౌకిక తత్వము, నైతిక విలువలు, జాతీయ సమైక్యత, ప్రజాస్వామ్యం, సోషలిజం లాంటి జాతీయ లక్ష్యాలుగా అంగీకరించబడిన భావాలతో ఉత్తేజితులు కావాలి. వీరు ప్రాంతీయ ధోరణులకు, కుల మత తత్వాలకు, జాతీయ వ్యతిరేక భావాలకు, ఛాందస – పిడివాద – బానిస బూర్జువా భావాలకు వ్యతిరేకంగా పోరాడేవారుగా తయారుకావాలి!

అందుకు వెంటనే జరుగవలసినది – అశాస్త్రీయ అభివృద్ధి నిరోధక మూఢాచార, జాతీయ వ్యతిరేకత, ప్రజాస్వామిక – లౌకిక తత్వ వ్యతిరేక సోషలిస్టు వ్యతిరేక – సోవియట్ వ్యతిరేక భావాలను విద్యార్థుల్లో చొప్పించే పాఠ్యాంశాలను, సహా పాఠ్యాంశాలను పుస్తకాలనుండి తొలగించి, శాస్త్రీయ దృక్పథాన్ని, దేశభక్తిని – దేశ సమగ్రత – రక్షణ పట్ల బాధ్యతలను – డెమోక్రసీ సెక్యులరిజం – సోషలిజం భావాలను వ్యాప్తి చేసే పాఠ్యాంశాలను, స్వాతంత్ర్య సమర చరిత్రను చేర్చవలసి వున్నది. ఉన్నత విద్యా దశలో గాంధీయిజంతో పాటు మార్క్సిజంను బోధించే రెగ్యులర్ కోర్సులను ఏర్పరచేందుకు వీలును కలిగించాలి. పాఠ్య పుస్తకాలు చౌకగా విద్యార్థుల కందాలి. మన రాష్ట్రంలోపలే వీటి రచన, ప్రచురణ, అమ్మకము దేశమంతటా అవసరమైన అన్ని రాష్ట్రాల్లో జాతీయకరణ జరగాలి.

## ఉత్పత్తి పరమైన విద్య:

విద్యను వీలైనంత ఎక్కువగా ఉత్పత్తిక్రమమునకు సన్నిహితంగా చేయాలి. ఇంకా ఎక్కువగా శాస్త్ర, సాంకేతిక విద్యను రూపొందించడం, విద్యాలయాలను సమాజానికి సన్నిహితం చేయడం, పని అనుభవము, వృత్తి విద్య, జాతీయ సేవ మొదలగు అంశాలను పాఠ్య ప్రణాళికలో ప్రధాన భాగాలుగా చేయడం అవసరం.

దీని అర్థం విద్యార్థులకు కేవలం కొన్ని వృత్తులను నేర్పడమేగాక, 'పని అనుభవం' ద్వారా విద్యార్థులను వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో ఆధునిక ఉత్పత్తి క్రమానికి సన్నిహితం చేయడమే – ఇది బృహత్కార్యం. అట్లాగే విద్యార్థులను, కార్మికులను, కర్షకులను సన్నిహితం చేయాలి. ఇలా, శారీరక శ్రమ నుంచి విద్యను వేరుపరచే ధోరణిని అరికట్టి, ప్రజాస్వామ్య ప్రయోజనాలు, తమ ప్రయోజనాలను ఒకటేననే భావం విద్యార్థుల్లో కలిగించబడాలి.

పాఠశాల విద్య, ఇంటర్మీడియట్ విద్యలో ప్రస్తుతం బోధింపబడుతున్న సామాన్యశాస్త్రం, జీవశాస్త్రం యొక్క లక్ష్యాలు మారాలి. ఈ మార్పు చేయబడిన లక్ష్యాల సాధనకనువైన పాఠ్యాంశాలు ప్రవేశ పెట్టబడాలి. విద్యుత్తు, మోటార్లు, ట్రాక్టర్లు రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందులు, కొత్త విత్తనాలు వగైరా అనేక నూతనాంశాలు వ్యవసాయంలో ప్రవేశపెట్టబడుతున్నాయి. వ్యవసాయంలో యంత్రాల ఉపయోగం పెరుగుతున్నది. ఉమ్మడి వ్యవసాయ క్షేత్రాలు అచ్చటచ్చటా అమల్లోకి వస్తున్నాయి. క్రమంగా వ్యవసాయం ఒక పరిశ్రమగా మారబోతుంది. విద్యార్థుల పాఠ్యాంశములలో వీటిని చేర్చాలి.

వ్యవసాయ విద్య ప్రాతిపదికగా జీవశాస్త్రం, పారిశ్రామిక విద్య ప్రాతిపదికగా సామాన్య శాస్త్రం మార్చబడాలి. సెకండరీ, హయ్యర్ సెకండరీ లేదా ఇంటర్మీడియట్ దశల్లో వృత్తివిద్యాకోర్సులను ఏర్పాటు చేయాలి.

## సామాన్య ప్రజలకు విద్య:

విద్యను ప్రస్తుత వర్గ పునాది నుండి తప్పించి దానిస్థానంలో ప్రజాతంత్ర శాస్త్రీయ, ప్రజానుకూల ధోరణి గల విధానం ఏర్పరచటానికి మొదట చేయవలసిన కర్తవ్యం – ప్రాథమిక విద్యను విస్తృతం చేసి బలోపేతం చేయడం, ప్రైవేటు యాజమాన్యాన్ని డొనేషన్ల పద్ధతిపై సీట్లు అమ్మబడటాన్ని – డబ్బున్న వారికే ఉపయోగపడే పబ్లిక్ స్కూలు విధానాన్ని పూర్తిగా రద్దు చేయడం, విద్యార్థులకు సౌకర్యాలు, బోధనకు వసతులు, ఉపాధ్యాయుల పరిస్థితులు మెరుగుపర్చడంలాంటివి జరిగి తీరాలి.

సార్వజనీన ఉచిత ప్రాథమిక విద్యను విజయవంతం చేయడమంటే వ్యవసాయక – పారిశ్రామిక, శ్రామిక జనాలికి విద్యను నేర్పడమే. అందువల్ల దీని విజయానికి గల అడ్డంకు లన్నిటినీ అధిగమించడం ప్రజాతంత్ర ఉద్యమంలో ప్రముఖ భాగమే కాగలదు. పేద ప్రజల బిడ్డలు 'బాల కార్మికులు'గా పని చేసి కుటుంబానికి ఆదాయాన్ని సమకూర్చే వారుగా, అనగా వారి తిండిని వారే సంపాదించుకునే దౌర్భాగ్య ఆర్థిక పరిస్థితులలో మునిగి తేలుతున్నారు. అందువల్ల వీరు పాఠశాలల్లో చేరడంలోనూ, మధ్యలో ఆపకుండా 8 తరగతుల వరకు విద్యను కొనసాగించడంలోనూ విఫలమవుతున్నారు. పెట్టుబడిదారుల, భూస్వాముల, యితర పరాన్న భుక్కుల వద్ద మూలుగుతున్న డబ్బును సేకరించడం, నల్లడబ్బును వెలుపలకు తీయడం, భూసంస్కరణలు చేసి – ఆదాయ పరిమితులను అమలు జరిపి, పన్నులను సక్రమంగా వసూలు చేసి ఈ ప్రాథమిక విద్యావ్యాప్తి పథకాలను ప్రభుత్వం అమలు జరిపి తీరాలి. తల్లులు పనులకు వెళ్లినపుడు పిల్లలకు విశ్రాంతి మందిరాల సౌకర్యాల నేర్పరచాలి.

డాక్టరు డి.యస్. కొఠారి అధ్యక్షతన ఏర్పాటైన 'జాతీయ విద్యా కమిషను' సిఫార్సు చేసినట్లుగా ఇరుగు పొరుగు పిల్లల పాఠశాల విధానం లేక కామన్ పాఠశాలల విధానం అమలు జరిగి తీరాలి. ఈ స్కూళ్లలో బోధనా వనర్లను పెంచితీరాలి.

'విద్య' ప్రజా సామాన్యానికి చెందాలి అనే దృష్టితో సుస్పష్టమైన రీతిలో స్కాలర్‌షిప్పు, స్టయిపెండు విధానాన్ని అన్ని విద్యా దశల్లోనూ ఏర్పరచాలి. షెడ్యూల్డు కులాల, జాతుల విద్యార్థుల విద్యా సౌకర్యాలను పెంచాలి. తక్కువ ఆదాయం తెచ్చుకునే యితర తరగతుల వారికి కూడా విద్యా సౌకర్యాలు కలుగజేయాలి, పెంచాలి.

అక్షరాస్యతా కార్యక్రమాలు నియత, అనియత (నాన్ ఫార్మల్), వయోజన విద్యా పథకాల ద్వారా కార్మికులకు, రైతులకు – అక్షరాస్యత, సంఖ్యామానము మాత్రమే గాక వారి సాంఘిక రాజకీయ విజ్ఞానం వ్యాప్తి చేసే విధంగా కొనసాగాలి. ఉపాధ్యాయులు, ఉద్యోగులు, విద్యార్థులు యువజనులు, మహిళలు ఈ కార్యక్రమాల అమలులో పాలుపంచుకోవాలి. 1986 జాతీయ విద్యా విధానంలోని ఈ లక్ష్య సాధనకు పూనుకుందాం.

## మానవశక్తి వినియోగం:

ఉత్పత్తి క్రమం నుండి వేరుపడిన విద్యావిధానం ఫలితంగా లక్షలాది విద్యావంతులైన నిరుద్యోగులు మన దేశంలో ఏర్పడ్డారు. నిరుద్యోగాన్ని నిర్మూలించాలంటే సాంఘిక–ఆర్థిక వ్యవస్థనే మూలమట్టంగా మార్చాలి.

అయితే, ఈ చట్రంలోనైనా నిరుద్యోగ నివారణకు మార్గాల నన్వేషించడం అవసరం. వివిధ రంగాల మధ్య వనరులను సరిగా కేటాయించుకోవాలి. సార్వజనీన ఉచిత నిర్బంధ విద్యా పథకాల అమలుకు, లక్షలాది ఉపాధ్యాయులు, యితర ఉద్యోగులు అవసరమవుతారు. వీరి నియామకం వల్ల నిరుద్యోగం కొంతవరకు నిర్మూలనం కాగలదు. విద్యా ప్రణాళికలు – మానవశ్రమ వినియోగ ప్రణాళికలు సమన్వయ పర్చబడాలి. చిన్న తరహా పరిశ్రమలు – వ్యవసాయ ఉత్పత్తులతో కుటీర పరిశ్రమల ఏర్పాటులతో సహా స్వయం ఉపాధి పథకాలకుగాను, ఈ నిరుద్యోగులకు బ్యాంకులు మొదలగునవి అప్పులు, గ్రాంట్లు, సబ్సిడీలు యిచ్చే విధానాలను ప్రభుత్వాలు చేపట్టాలి; వున్న ఈ విధానాలను సులభతరం చేసి, సంఖ్యను – మొత్తాలను పెంచాలి.

## బోధనాభాష:

విద్యను ప్రజాతంత్రీకరణ చేయడమంటే అన్ని దశల్లోనూ బోధనా భాషగా మాతృభాషను (ప్రాంతీయ భాషను) కొనసాగించడమే. ఈ కృషిలో గల అడ్డంకులను అధిగమించే ప్రయత్నమే చేయాలి గాని వెనుకంజ వేయరాదు. ఆయా ప్రాంతాలలో తగినంత సంఖ్యలో గల భాషా మైనారిటీలకు కూడా బోధన మాతృభాషలో సాగాలి. మన రాష్ట్రంలో 'ఉర్దూ' భాష మాట్లాడే వారి సంఖ్య గణనీయము. తెలుగు, ఉర్దూ భాషల అభివృద్ధి యింకా జరగాలి.

ఈ క్రమం అంతా నిర్వహించడానికి ఏకీకృత అంతర్జాతీయ పరిభాషను, అంకెలను అన్ని భారతీయ భాషల్లోని పాఠ్యపుస్తకాలలో వాడాలి.

ఆధునిక శాస్త్ర పురోగతిని అందుకునే వీలు కలిగించుటకై లైబ్రరీ అంతర్జాతీయ భాషగా ఇంగ్లీషు కొనసాగించాలి. హిందీని లింకు, జాతీయ భాషగా అభివృద్ధి పర్చాలి.

## పరీక్షా సంస్కరణ:

ప్రస్తుతం అమలులో వున్న పరీక్షా విధానం నిష్ప్రయోజనమైనట్టిది. ఇది ఒక ప్రహసనంగా తయారైంది. విద్యార్థుల

కృషి, నైపుణ్యం, విజ్ఞాన అభిరుచులు ఆధారంగా పరీక్షా విధానం క్షుణ్ణంగా సంస్కరించబడాలి. ఇంటర్నల్ ఎసెస్‌మెంటుకు మానసికంగా, నైతికంగా విద్యార్థులు – ఉపాధ్యాయులు సిద్ధం కావాలి. వల్లె వేయడానికి ప్రాధాన్యతను పరీక్షా విధానంలో తగ్గించాలి. సెమిస్టర్ సిస్టం – మార్కులకు బదులు గ్రేడ్ల నుపయోగించడం – నాన్ డిటెన్షన్ స్కీములపై చర్చలు జరగాలి. సత్వర నిర్ణయాలు చేయబడాలి – అమలు జరుపబడాలి.

## జాతీయకరణ – ప్రజాతంత్రీకరణ:

విద్యాలయాల జాతీయకరణ అంటే నిరంకుశోద్యోగుల పెత్తనం అని అర్థం కాదు. విద్యాపాలన – విద్యావేత్తల, ఉపాధ్యాయ, విద్యార్థుల ప్రతినిధుల, తల్లిదండ్రుల, నాన్ టీచింగ్ ఉద్యోగుల, ప్రజల ప్రతినిధులతో కూడిన సర్వ స్వతంత్ర సంస్థల పరం కావాలి.

సర్వ స్వతంత్ర యూనివర్సిటీలేగాక సర్వ స్వతంత్ర ప్రాథమిక మాధ్యమిక వయోజన అనియత విద్యా బోర్డులు కూడా ఏర్పడాలి. వీటిమధ్య సమన్వయముండాలి. రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణ సంస్థలకూ స్వయం ప్రతిపత్తి అవసరం.

ప్రైవేటు విద్యా సంస్థలను రద్దుపరచే సందర్భంలోనే 'మైనారిటీ' మతాలకు – భాషలకు చెందిన విద్యా సంస్థలను వశపర్చుకోవడంలో వారి మతపరమైన – భాషాపరమైన సున్నిత భావాలకు రాజ్యాంగ హక్కులకు భంగం కలుగని రీతిగా జాగ్రత్త వహించాలి. మైనారిటీ మతమనేది విద్యార్థులనుబట్టే వుండాలిగాని విద్యాలయ మేనేజిమెంటులోని వ్యక్తుల మతమునుబట్టి కాదనేది రాజ్యాంగంలో స్పష్టం చేయబడాలి. వీటిలోని విద్యార్థుల– ఉపాధ్యాయుల హక్కులు, సౌకర్యాలు, బాధ్యతలు కూడా స్పష్టం చేయబడాలి.

యూనివర్సిటీలకు సంబంధించిన సెనేట్ లేక సిండికేట్‌లో ఉపాధ్యాయులకు, విద్యార్థులకు మెజారిటీ ప్రాతినిధ్యం యివ్వబడాలి. ఈ సంస్థలో నాన్ టీచింగు స్టాఫ్‌కు కూడా స్థానమివ్వాలి. ఎన్నికైన ప్రతినిధులే ఈ సంస్థల్లో మెజారిటీ సంఖ్యలో వుండాలి. శాసన సభ్యులకు, వివిధ ప్రజాసంఘాలకు ఈ సంస్థల్లో ప్రాతినిధ్యముండాలి. ఆంధ్రప్రదేశ్‌లో ప్రభుత్వ మేర్పరచిన 'ఉన్నత విద్యా కమిషనరేట్'ను ఉపసంహరించాలి. 1986 జాతీయ విధానంలోని అభివృద్ధి నిరోధక విధానాలు ఉపసంహరించబడాలి.

## రాజకీయ హక్కులు:

విద్యార్థులకు, ఉపాధ్యాయులకు పూర్తిగా రాజకీయ హక్కులుండాలి. డెమోక్రసీ, సెక్యులరిజం, సోషలిజం భావాల పరిధికి లోనుగా ఈ రాజకీయ హక్కులుండాలనుట రాజ్యాంగ బద్ధమే. శాసన మండలి ఎన్నికలలో ప్రాథమిక ఉపాధ్యాయులకు కూడా ఓటు హక్కు వుండాలని అఖిలభారత ఉపాధ్యాయ ఉద్యమం కోరుచున్నది. (1985లో ఆంధ్రప్రదేశ్ శాసనమండలి రద్దు చేయడమైంది.)

## సౌకర్యాలు:

మొత్తం విద్యావ్యాసంగంలో ప్రధానపాత్ర వహించువిద్యార్థులకు ఉపాధ్యాయులకు సౌకర్యాలు పెరగాలి. ఉపాధ్యాయులకు 'లివింగ్ వేజ్' వృత్తిభద్రత, ఇన్ సర్వీసు రిటైరుమెంటు సౌకర్యాలు – ఇవి అన్ని మేనేజ్‌మెంట్లలోను అభ్యుదయ కరంగా సమానంగా వుండాలి. పాఠశాల వసతి, ఆరోగ్య పరిస్థితి, బోధనోపకరణములు వగైరా సదుపాయాలుండాలి. మధ్యాహ్న భోజనం, దుస్తులు ఉచితంగానూ, పౌష్టికాహారం – స్కాలర్ షిప్పులు హెచ్చుగానూ విద్యార్థుల కివ్వబడాలి.

## నూతనవిధానంకోసం పోరాటం:

పైన నూతన విద్యా విధాన మూల సూత్రాలు – వాటి సాధనకు కార్యక్రమం సూచించబడ్డాయి. ఇవి కేవలం ఒక గ్రూపుకు గాక జాతి అంతటికీ చెందినవిగాన కార్మిక, కర్షక, యువజన, మహిళ, ప్రజాసంఘాలు – ముఖ్యంగా విద్యార్థి, ఉపాధ్యాయ సంఘాల ఆచరణకు సంబంధించిన ఒక ఉమ్మడి వేదికనేర్పాటు చేసుకుని ఉద్యమించాలి.

నూతన సమాజ నిర్మాణానికి అందులో భాగంగా నూతన ప్రయోజనకరమైన విద్యా విధానానికి పోరాటం, త్యాగం నేడు కోరబడుతున్నవి. వీటిని పూరించుటకు మనం కష్టపడి కృషిచేయాలి. సమర్థవంతమైన ప్రజాతంత్ర ఉద్యమాన్ని నిర్మించాలి.

# మతాలు - దర్శనాలు

ఏటుకూరు బలరామమూర్తి, ఎం.ఏ.

నవీన శిలాయుగ దశ క్రీ.పూ. 1000 వరకు ఆంధ్రదేశంలో వున్నదని చరిత్రకారుల సిద్ధాంతం. ఆ కాలంలో ప్రజలు ప్రకృతి శక్తులైన, చెట్టు, పుట్ట, గుట్ట, పాము, పశువు లను ఆరాధించేవారు. మరణానంతరం ప్రాణి ఏమౌతుంది అనే ప్రశ్న ఉద్భవించింది. జీవి మరణానంతరం కొంతకాలం జీవిస్తుందని, మరొక లోకమునకు ప్రయాణిస్తుంది అనే విశ్వాసా లుండేవి. ఇవి నాటి మానవుని అజ్ఞాన ఫలితం.

మృతుని శరీరాన్ని అన్ని హంగులతోను సమాధిచేసే ఆచారం, పై విశ్వాస ఫలితమే. ఇట్టి సమాధిగౌరవం సైతం తెగలోని అందరికీ లేదు. తెగ అధిపతులకు మాత్రమే ఉండేది.

ఈ మత భావాల కనుగుణమైన దర్శనమేది? ఏదీ లేదు. మతము నుండి దర్శనమును వేరుచేయగల మానసిక స్థాయి ఆనాడు లేదు. ఇది ప్రాథమిక దశ.

క్రీ. పూ. 800 ప్రాంతంలో ఉత్తర భారతం నుండి ఆంధ్రులు అను పేరుగల తెగ దక్షిణ దిశగా వచ్చారు. మహా భారత యుద్ధానంతరం ఉత్తర హిందూ స్థానంలో ఏర్పడిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక కల్లోలాలు ఈ తెగల కదలికకు కారణం – ఈ తెగలకు ఆపస్తంబుడను ఋషి అధిపతి. ఆవిధంగా వైదిక సంస్కృతి దక్షిణాదిన అడుగు పెట్టింది.

వైదికమతంలోని సూత్రము లేవి?

యజ్ఞ యాగాదులు, వర్ణ విభజన. వారి దర్శన మేమి? ఆత్మ, పరమాత్మలు మాత్రమే శాశ్వత పదార్థములు. జన్మరాహిత్యం, అనగా దైహిక బంధనముల నుండి ఆత్మ శాశ్వతంగా విముక్తి చెందడం అత్యుత్తమ లక్ష్యం. అదే మోక్షం. యజ్ఞయాగాది క్రతువుల ద్వారా అది సాధ్యం. ఈ క్రతువులు బ్రాహ్మణ క్షత్రియులకు మాత్రమే పరిమితం. తదితరులు మోక్ష సాధన ఎలా చేయాలి? బ్రాహ్మణ సేవ, కుల ధర్మ నిర్వహణ ద్వారా.

దర్శనశాస్త్రం మతము నుండి కొంత వేరుపడి స్వతంత్రరూపం ధరించసాగింది.

వేదములు అపౌరుషేయములు. ఇది చేయుము, యిది చేయవలదు అని వేదములలో చెప్పిన భాగమే ముఖ్యం. సిద్ధాంతపరముగా ఆత్మ, పరమాత్మలను గురించిన చర్చ వేదాలలో లేదు. ఉన్నా ప్రధానం కాదు. పరిగ్రాహ్యం కాదు. కర్మ అనిన యజ్ఞకర్మ యజ్ఞంలో చదివే మంత్రములు సర్వశక్తిమంతాలు. శబ్దములద్వారా అన్నియు సాధించబడును. అర్థముతో పనిలేదు. దేవునితో పనిలేదు. జ్ఞానముతో పనిలేదు. లౌకికముగా – వర్ణవ్యవస్థ, పార లౌకికముగా మంత్రకర్మలు ముఖ్యములు. ఇదీ పూర్వ మీమాంసపారం.

ఈ పూర్వమీమాంస, ప్రకృతిశక్తుల ఉపాసనకు మరొక రూపం. గ్రామ దేవతల ప్రీత్యర్థం "హ్రాం, హ్రీం" అని జంతుబలుల నిచ్చువారికి, మంత్రయుక్తముగా యజ్ఞ గుండంలో జంతువులను బలియిచ్చువారికి వ్యత్యాసము లేదు. ఇద్దరి మానసిక, తాత్విక స్థాయి ఒక్కటే. అధర్వణ వేదములో తంత్ర ప్రయోగాలు కలవు. పూర్వమీమాంసలో, మంత్రమూ, తంత్రమూ రెండూ ఉన్నవి. ఆపస్తంబుని ద్వారా ఈ దర్శనం ఆంధ్రప్రదేశంలో ప్రవేశించింది.

అంతస్తులు, విభజనపై ఆధారపడిన వైదికమతం సహ జంగానే కొద్దిపాటి అగ్రవర్ణాలలో మాత్రమే వ్యాప్తి చెందింది. అత్యధికులైన, తెలుగు, నాగ, యక్ష, తదితర తెగలవారు సమానత్వం బోధించే బౌద్ధం కొరకు ఎదురు చూడసాగారు. బౌద్ధం క్రీ. పూ. 300 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో వ్యాపించసాగింది. బుద్ధుని ఆరాధించే ఉపాసన, కులభేద, వర్ణభేద నిరసన, కర్మకాండ ఖండన, అష్టాంగ మార్గ బోధన – ఇవి అత్యధికులైన తెగలను ఆకర్షించాయి. అప్పుడీ దేశం పేరు శాతవాహన హార లేక శాతవాహన పథం. ఆంధ్రదేశం అను మాట ఇంకా వాడుకలోకి రాలేదు.

ఆదిబౌద్ధంలో లేని విగ్రహారాధన మహాయానంతో మొద లైంది. ఇది మతరీత్యా పతనం. కాని, జనాకర్షణకు సాధనం. వందలు, వేల సంఖ్యలో బౌద్ధ భిక్షువులు చేసే సమతాధర్మ ప్రచారం, మానవతా పూర్ణమై, అమానుష శక్తులకు, శబ్దమునకు, ధ్వనికి, భూత, ప్రేత, పిశాచములకు ప్రాధాన్య తనిచ్చే జానపద విశ్వాసాలను, పూర్వ మీమాంసాపరమైన కర్మకాండను రెంటినీ వెనుకకు నెట్టింది. కొంతవరకు

రాజీపడ్డదికూడ. బౌద్ధంలో ఆ తర్వాతికాలంలో యేర్పడిన మహాయానం, వజ్రయానాలు ఇందుకు తార్కాణాలు.

## బౌద్ధ దర్శనం

నిరర్థకమైన, అవ్యక్తమైన ప్రశ్నలను గురించి చర్చలతో కాలం వృథా చేయవద్దు. చరాచర సృష్టి యావత్తూ కార్యకారణ చోదితం. పుట్టుక – పెరుగుదల, నశించుట, తిరిగి పుట్టుట లోకధర్మం. ఈ ధర్మమునకు లొంగని దేదీ లేదు. ఆదిమధ్యాంత రహితమైనది సృష్టి. ఆత్మ పరమాత్మలు లేవు. అవి కేవలం కల్పన – ఇది బౌద్ధ దర్శనం.

ఆదిబౌద్ధం ఆత్మను, ఈశ్వరుని నిరాకరించింది. వేద ప్రామాణ్యతను త్రోసిపుచ్చింది. కనుక నాస్తికమతం. ఐతే చార్వాకమునకు, బౌద్ధమునకు వ్యత్యాసమేమి?

భావము, పదార్థము – ఈ రెంటిలో పదార్థము ప్రాథమికము, భావము తత్పరిణామ జనితము అని చార్వాకం నిర్ద్వంద్వంగా చెప్పింది. అది స్వచ్ఛమైన ప్రాథమిక భౌతిక వాదం.

బౌద్ధం అలా చెప్పదు. పదార్థము, భావము రెండూ పరస్పరాధారాలు. ఏది ముందు, ఏది వెనుక అని ప్రశ్నించుట నిరర్థకం. ఈ దృష్ట్యా యిది సాంఖ్యాన్ని పోలిన ద్వైతమన వచ్చును.

స్థితి, లేక గతి ఏది ప్రాథమికం అను మరొక ప్రాథమిక సమస్యపై మాత్రం బౌద్ధం, గతి ప్రాథమిక మని నిస్సందేహంగా చెప్పింది. ఇందులో రాజీ లేదు. అస్పష్టత లేదు. గతి ప్రాథమికతను, గతి వాస్తవికతను చెప్పిన ఏకైక భారతీయ దర్శనం బౌద్ధం. దీనినే వీరు ప్రతీత్యసముత్పాద వాదమన్నారు. అనేక కారణాల ఫలితంగా ఒక కార్యము జనిస్తుందన్నారు. అనగా, పరిమాణాత్మక మార్పులు గుణాత్మక మార్పుకు త్రోవతీయును అని సూచించారు. గతి చలనము, అంతః సంఘర్షణ, భావములోనూ, పదార్థములోను, ఆలోచనలోను, అనుభూతిలోను సర్వత్రా వ్యక్తమగు అంతస్సూత్రమన్నారు.

ఆధునిక గతితార్కిక దృష్టికి బీజప్రాయమైన ప్రాథమిక రూపం ఇది. ప్రకృతి, సమాజం, ఆలోచనాక్రమం అను మూడు రంగములలోనూ, ఆంతరంగిక సంఘర్షణల ద్వారా ప్రగతి అను గతితార్కిక సూత్రము వర్తిస్తుందని మార్క్సిస్టు సిద్ధాంతం చెపుతుంది.

గతిశీలమైన భావనను బౌద్ధులు దుఃఖం అన్నారు. జన్మ దుఃఖం, జరా దుఃఖం . . . సర్వం దుఃఖమయం జగత్ – అనేది వారి సూక్తి. దుఃఖమన కేవలం శోకం, విచారం అని కాదు. కార్యకారణ జనితమైన ప్రతిదీ దుఃఖమే. ఆధునిక పరిభాషలో ఈ మాటను విరుద్ధ శక్తుల సంయోగం అనవచ్చు.

దుఃఖమునకు కారణముంది. దానిని నిరోధించవచ్చును. అందుకొక మార్గముంది. అదే అష్టాంగమార్గం. సత్ప్రవర్తన, భూతదయ, సత్యవాక్పాలన, తృష్ణా నిరోధం – ఇత్యాదులు ఈ ఎనిమిది మార్గాలు.

పునర్జన్మవాదం బౌద్ధ తాత్త్విక దృష్టిలో ప్రధానమైన లోపం. ఇది ఆదిబౌద్ధంలో లేదు. మహాయానంతో వచ్చింది. ప్రతి కర్మకు ఫలితం అనుభవించాలి. దుష్కర్మలకు ఫలితం అనుభవించకుండానే వ్యక్తులు మరణించవచ్చు. వారేమి కావాలి? కనుక పునర్జన్మలో అనుభవించాలి.

ఈ భావం వైదికమతానికి, మహాయాన బౌద్ధానికి సామాన్యధర్మం. తత్వశాస్త్రంలో మతవిశ్వాసాలను జోడించి, స్వర్గ, నరకాలను సృష్టించి, భౌతిక సమస్యలకు ఆధ్యాత్మిక పరిష్కారాన్నిచ్చేందుకు చేసిన వృథాయత్నం.

బౌద్ధంలోని మరోలోపం – భిక్షుశ్రేణుల నిర్మాణం. సన్యాసాశ్రమం, గృహస్థాశ్రమంపై విరక్తికి చిహ్నం. ఈ విరక్తి కేవలం ఆత్మాశ్రయధోరణిని చేపట్టకుండా, భిక్షువులకు, సాంఘిక దృష్టి, అష్టాంగమార్గ ప్రవర్తన బౌద్ధం యేర్పరచింది. అయినా సన్యాసం సర్వవ్యాప్తం యేనాడు కాజాలదు. బౌద్ధ సన్యాసులు క్రమంగా ధనికులపై ఆధారపడి పరాన్న భుక్కులయ్యారు.

గృహస్థ జీవితంలో వుంటూ బౌద్ధ ధర్మ మెలా అనుసరించాలి. కరుణ, భూతదయలను అనుసరించాలి అని మాత్రమే బౌద్ధం విధించింది. వర్ణవ్యవస్థ కాఠిన్యాన్ని తగ్గించింది. పూర్తి నిర్మూలన బౌద్ధ ఆరామాలలో మాత్రం సాధ్యం.

తాత్త్విక, బలహీనతలు బుద్ధుని మరణానంతరం బౌద్ధంలో చీలికకు కారణమైనవి. సౌత్రాంతిక వైభాషికులు పదార్థము వైపు మొగ్గగా, మాధ్యమిక యోగాచారవాదులు భావమువైపు మొగ్గారు.

క్రీ. శ. 150 లో విజయపురివద్ద నివసించిన నాగార్జునాచార్యులు మాధ్యమిక వాదులలో అగ్రగణ్యులు. ఇతని వాదాన్ని శూన్యవాద మంటారు. కార్యకారణ సంజనితమైన ప్రతిభావము, ఘటన లౌకికంగా మాత్రమే సత్యం. సంవృత్తి అను ఆవరణ వున్నంతవరకే అది సత్యం. మౌలికంగా అది నిస్స్వభావం. అనగా శూన్యం. కనుక పారమార్థికంగా ప్రతిదీ శూన్యమే.

గతి ప్రాథమికమూ, వాస్తవమూ కాదా? మౌలికంగా అది కూడా శూన్యమే.

శూన్యవాదం సర్వ సాపేక్షవాదం. ఇది సంపూర్ణ భావవాదానికి ఒక్క అంశ మాత్రమే తక్కువ!

నాగార్జుని సంవృత్తి, శంకరుని మాయ సమానములు. నాగార్జునుని వలెనే శంకరుడు కూడా వ్యావహారిక, పార మార్థిక సత్యములనే విభజన చేశాడు. శూన్యవాదం ఇటు అద్వైతమునకు, అటు దిఙ్నాగుని విజ్ఞానవాదమునకు త్రోవ

తీసింది. సర్వమూ శూన్యమని నాగార్జునుడు అంటే, కాదు – పదార్థము మాత్రమే శూన్యం, విజ్ఞానం, లేక అలయ విజ్ఞానం సత్యమూ శాశ్వతమూ అని విజ్ఞానవాదులన్నారు. దానినే పరబ్రహ్మం అని శంకరుడన్నాడు.

ఇలా బౌద్ధం దార్శనిక రీత్యా భావవాద ఛాయలకు పోవడంతో పాటు వజ్రయాన, తంత్రయానాది హీన శాఖలకు తోవ తీసినది; వైదిక మతమునకు రెండవ ముఖమున శాక్తేయ, గాణాపత్య, కాపాలికాది హింసా ప్రధాన ధోరణులు తలఎత్తినట్లే.

క్రీ. శ. 400 నాటికే ఈ పరిణామం ప్రారంభమైంది. ఇక బౌద్ధం పతనం గాక ఎలా నిలుస్తుంది? దీనికితోడు, ఉత్పత్తి శక్తుల పెంపుదలకు తోడ్పడిన వృత్తి విభజన ఘనీభవించి, అనువంశిక కుల విభజన రూపం ధరించింది.

బౌద్ధ భిక్షువులు ఆదిలో సంఘ సేవకులు. క్రమేపి పరాన్న భుక్కులుగా అయ్యారు. ఈ పరిణామం అనివార్యం. ఉత్పత్తి క్రమంలో భాగస్వాములుకాని ప్రతి వర్గం, వర్ణం, శ్రేణి విభాగం ఇలా కాక తప్పదు. ఇదొక అంతర్గర్భిత వైరుధ్యం. యజ్ఞ యాగాది క్రతువులు చేసే పురోహితవర్గం వలెనే బౌద్ధ భిక్షుక శ్రేణికూడా సమాజమున కొక బరువుగా తయారైంది.

క్రీ. శ. 400 తర్వాత వారికి రాజాశ్రయం నశించింది. బౌద్ధస్తూపాలు హిందూ దేవాలయాలుగా బలాత్కార పరివర్తన పొందాయి. అమరావతి స్తూపంలోని బౌద్ధ సన్యాసులను నెలరోజులపాటు వైదిక బ్రాహ్మణులు దిగ్బంధనం చేసి, చివరకు విష్ణుకుండిన రాజుల అండతో, ఆ స్తూపం తమది అని, దానిని దేవాలయంగా మార్చే హక్కు తమకు కలదని తీర్పు సంపాదించారు. వందలాది బౌద్ధులు దేశ నిర్వాసితులైనారు.

బౌద్ధం సాత్విక ప్రధానం. మౌర్యుల కాలంలో, శాతవాహనుల కాలంలో దానికి రాజాదరణ వుండేది. ఆ సమయంలో సైతం వారు రాజస తామస ప్రవృత్తులను, హింసామార్గాన్ని చేపట్టలేదు.

విదేశాలలో స్థిరపడిన బౌద్ధులు సాత్విక ప్రవృత్తిని వదలి రాజస, తామస ప్రవృత్తులతో రాజకీయాలలోను అంతఃపుర కుట్రలలో సైతం పాల్గొనసాగారు. ఒకచోట బహిష్కృతులై, మరొకచోట అవిష్కరించేవారు. వివిధ ప్రాంతాలకు, దేశాలకు విస్తరించారు. వేలసంఖ్యలో, తూర్పురేవుల ద్వారా బౌద్ధ భిక్షువులు ఇండోనీషియా ద్వీపసముదాయము చేరారు. సింహళం వెళ్ళారు. హిమాలయాలు దాటారు. టిబెట్, చీనా, జపాన్‌లకు విస్తరించారు.

ప్రతి దర్శనము, ఏదో ఒక మతానికి అనుబంధంగా నిలచింది. ప్రతి మతం, ఒక వర్గం, లేక వర్ణం ప్రాపుతోనే బ్రతికింది. ఏదేని ఒక రాజు అండతోనే వ్యాపించింది. ఈ పరస్పర సంబంధాన్ని గుర్తించకపోతే ప్రాచీన చరిత్ర బోధ పడదు.

వీటన్నిటికి మించి మరొక సత్యముంది. వర్ణవ్యవస్థపై ధ్వజమెత్తిన బౌద్ధ, జైన, చార్వాకములు యావద్భారతంలో వలెనే ఆంధ్రదేశంలో సైతం, క్రింది వర్ణములు పైకి, పై వర్ణులు క్రిందికి పరివర్తన చెందుటలో తోడ్పడ్డాయి. విశ్వ బ్రాహ్మణులు ఆదిలో బ్రాహ్మణులు. శిల్పవృత్తిని చేపట్టారు. క్రిందికి జారారు. పిమ్మట జైనులయారు. చివరకు వీరశైవులయారు. ఎన్ని మతములు మారినను, వృత్తిరీత్యా గల పరిమితుల నధిగమించబడటం సాధ్యము కాలేదు. ఆట వికులను, తెగలను, విదేశీయులను పెద్దసంఖ్యలో స్థిరసమాజ సభ్యులుగా చేర్చుకొనుటలో, బౌద్ధ వైదిక మతములు పోటీలు పడ్డాయి. యవనులు, హూణులు మొత్తంగా బౌద్ధులయారు. శకులు, పహ్లవులు మొత్తంగా హిందువులై, క్షత్రియులైరి. చేతివృత్తుల వారందరు శాతవాహనయుగంలో బౌద్ధులే. కాని, బౌద్ధభిక్షువులు కారు. గృహస్థులు సన్యాసులు కాలేరు కదా! సాంస్కృతికంగా బౌద్ధం, ఆచార వ్యవహారాదులలో వైదికమతం పక్కపక్కనే నివసించ సాగాయి. కులవిభజన కాఠిన్యత తగ్గింది. కులమార్పిళ్ళు జరిగాయి. క్రిందివారు పైకి, పైవారు క్రిందికి మారారు.

సామాజికంగా, బౌద్ధం వెనుకడుగు పట్టిన మీదట తాత్విక చర్చలలో బౌద్ధులను ఓడించడానికి ఒక పెద్ద ఉద్యమం ప్రారంభమైంది. సాలంకాయన, బృహత్పలాయన, విష్ణుకుండిన, పల్లవ రాజుల కాలంలో ఇట్టి చర్చలు అనేకం, రాజ భవనాలలోనూ, దేవాలయాలనూ, పండిత గోష్ఠులలోనూ జరిగాయి.

ఈలోగా మరొక పరిణామం జరిగింది. బౌద్ధ గాథలు, సంస్కృతి ప్రజల నావహించాయి. వాటిని అధిగమించగల కథలు, గాథలు, ఇతిహాసాలు అవసర మయ్యాయి. మతము కంటే, దర్శనముకంటె ప్రజల మనస్సులను ఆకట్టుకొనడానికి ఇట్టి ఇతిహాసాలు, అవతారాలు అవసరమయ్యాయి.

రామాయణ గాథ ప్రస్తావన భారతములో వుంది. బౌద్ధగాథలలో దశరథ జాతకమున్నది. జైనుల మత కథలలో ఉన్నది. కనుక రామాయణ మొక ప్రాచీన గాథ. కాని, ఆ గాథకు శాశ్వతత్వం కల్పించిన రామాయణ కావ్యం క్రీ. శ. 200 ప్రాంతంలో విరచితమైనది. ఆంధ్రదేశాన్ని ఇక్ష్వాకులు పాలించిన కాలమది.

చారిత్రకంగా రామగాథ వింధ్య ఉత్తర ప్రాంతానికే పరిమితం. లంక మధ్య ప్రదేశంలోని ఒక ఆటవిక నగర మని చరిత్రకారులు భావిస్తున్నారు. కాని, రామాయణ గాథ శాతవాహనుల కాలంలోనే దక్షిణాదికి వ్యాపించింది. సీతారామలక్ష్మణుల ప్రస్తావన శాలివాహన గాథా సప్తశతి కథలలో ఉన్నది. ఆపస్తంబుని ఆచార్యత్వమున ఆంధ్రుల

దక్షిణాపథ యానముతో ఈ గాథ వ్యాపించి ఉంటుంది.

సముద్ర గుప్తుని దండయాత్రతో రామాయణ గాథా ప్రచారకులు దక్షిణానికి దిగారు. రామేశ్వరము వరకు ఈ గాథను కొనిపోయి, రామాలయాలను నిర్మించి, బౌద్ధ, జైన స్థూపాలను, కొండలను, గుట్టలను, నదులను అన్నిటినీ గాథాస్థలములుగా చేశారు. ఇందుకు వాల్మీకి కావ్యం అవసరమైన సాహితీ సంపదను చేకూర్చింది.

రాముడు దక్షిణాదికి రాకుండా రామాయణ గాథ ఎట్లా వచ్చింది? బుద్ధుడు రాకుండానే బౌద్ధం రాలేదా? మహమ్మదీయ, క్రైస్తవ మతాలు ఆ పిమ్మట వ్యాపించలేదా? వీటన్నిటికి లేని విశేషమొకటి రామాయణానికి వున్నది. యావద్భారతదేశ నైసర్గిక స్వరూపం తెలిసిన మహాకవులు, రామాయణ గాథను రచించారు. అందులో వాల్మీకి ఒకడు. రామున్ని, దండ కారణ్యంలో తిప్పి, గోదావరి దాటించి, వారధి కట్టించి, లంకను ధ్వంసం చేయించి, పుష్పకవిమానంలో అయోధ్యకు తిరిగి పంపారు. కవుల కల్పనకు అతీతమైన దేముంది?

సంగీత సాహిత్యాలకు మత వ్యాప్తిలో గొప్ప స్థానముంది. భారతదేశంలో ఇది మరీ నిజం.

ఋగ్వేదం మొదటిది. అది సాహిత్యం. కొంతకాలానికి సంగీతం తోడైంది. సామవేదం ఏర్పడ్డది. రెంటిలోను సూక్తులు ఒకటే. సంగీతం మాత్రమే అదనం. లిపి ఆవశ్యకత తగ్గింది. కంఠోపాఠ కౌశలం హెచ్చింది.

గీతం పోను పోను మంత్రమైంది. శబ్దమే బ్రహ్మానది. యజుర్వేదం ఏర్పడ్డది. అది మంత్ర ప్రధానం. ఆ పిమ్మట అధర్వణ వేదం. అది తంత్ర ప్రధానం. రుగ్వేద సూక్తులు స్వీయస్వరూపం కోల్పోయి, భూత శక్తులను పొంది, మంత్ర తంత్ర వాఙ్మయముగా వృద్ధి అవటానికి సంగీతమే కారణం.

బౌద్ధ యుగానంతరం, నామమాత్రావశిష్టమైన వైదిక మతం కొత్త రూపంతో విజృంభించడానికి సంస్కృత సాహిత్యం ప్రధాన కారణం. అష్టాదశ పురాణాలు, రామాయణ, భారత ఇతిహాసాలు, భగవద్గీత అవిర్భవించాయి. ఈ మహా సాహిత్య సృష్టి ముందు ప్రాకృతమైన బౌద్ధ గాథ లెలా నిలువగలవు? షడ్దర్శనములు – ఈ దర్శనములకు వందల సంఖ్యలో వెలువడిన టీకలు, కారికలు, వ్యాఖ్యలు, భాష్యములు రాజాదరణతో, బ్రాహ్మణాగ్రహారాలలో శతాబ్దాల తరబడి సాగిన ఈ సాహిత్య సృష్టి బౌద్ధ, జైన దర్శనాలను పరాభూతం చేశాయి.

## జైనం

జైన మత స్థాపకుడైన మహావీరుడు, బుద్ధునికి సమకాలికుడు. వయస్సులో కొద్దిగా పెద్ద. అతని జీవితము కూడా త్యాగ మయమైనది. వర్ణ విభజన ఖండన, భూతదయ, కర్మకాండ నిరసన, వేద ప్రామాణ్య తృణీకారం బౌద్ధ జైనాలకు సమానం. కాని, తాత్వికంగా జైనం బౌద్ధానికి పూర్తి విరుద్ధమైనది.

బౌద్ధం ఆత్మను నిరాకరించింది. జైనులు ప్రతి వస్తువునకు ఒక ఆత్మ ఉన్నదన్నారు. జడపదార్థములైన చెట్టు, పుట్టలకు సైతం ఆత్మ ఉన్నదని చెప్పే అనేకాత్మవాదం జైనం.

ఆత్మ మార్పు లేనిది, మరణం లేనిది, శాశ్వతమైనది అని కూడా జైనుల వాదన.

ఈశ్వరుని ప్రస్తావన జైనంలో లేదు. కాలక్రమేణ వర్ధమాన మహావీరుని అంతకుముందే అతని పూర్వీకులుగా చెప్పబడిన 24 గురు తీర్థంకరులను జైనులు పూజింపసాగారు. వారందరు అర్హతులు అనగా మోక్షము సాధించినవారు.

ప్రతి వ్యక్తి అహింసా మార్గమును అనుసరించుట ద్వారా అర్హత్వమును సాధించవచ్చు.

జీవము అనగా ఆత్మ. ఇది శరీరంకంటె భిన్నము కాదు; అభిన్నము కాదు. జీవము సర్వవ్యాప్తి. ఇది అణువు కాదు. శరీరమెంత వుంటుందో జీవమంత వుంటుంది. ఏనుగులోని జీవము ఏనుగ అంత పెద్దది, చీమలోని జీవము చీమ అంత చిన్నది. జీవము నీడలాంటిది.

పుట్టడం, చావడం, తిరిగి పుట్టడం అనేది కర్మ ఫలితం. తపస్సంయమాదులచే కర్మను ఛేదించుకొన్నవారు ముక్తులు.

జీవులన్నిటికి చైతన్యముండదు. వృక్షాదులలోని జీవులకు కదలిక లేదు. చైతన్యము లేదు. మనుష్యాదులలోని జీవులకు మాత్రమే కదలిక, చైతన్యం కలవు.

భౌతిక పదార్థమును పుద్గలమంటారు. పదార్థము అణురూపములో ఉంటుంది. అణువుల సంఘాతమువలన, కలయికవలన మన శరీరము ఏర్పడుతుంది. సృష్టి జరుగుతుంది.

పదార్థము, భావము – వీనిలో ఏది ప్రాథమికం? దీనికి జైనులు సమాధానం చెప్పరు. ఆ ప్రశ్న వారికి రాదు. ఈ రెంటికి వ్యత్యాసము కూడా వారు చూడరు. కర్మకూడ వారి దృష్టిలో పుద్గలమే, భౌతిక పదార్థమే.

క్రోధ, మోహ, లోభాది దుర్గుణముల నుండి విముక్తులయ్యేందుకు కృషి చేయుట ముఖ్యం. ఇదే జైన ధర్మంలోని కీలకాంశం.

వీరి ఆలోచనా పద్ధతిని తెలుపునది స్యాద్వాదం.

ప్రతి వస్తువునకు అనంతధర్మము లుంటాయి. వాటి నన్నిటిని తెలుసుకొనుట అసాధ్యం. ఏ విషయాన్ని ఇది ఇంతేను అని చెప్పరాదు.

ఇది ఉన్నది, ఇది లేదు అని నిక్కచ్చిగా చెప్పలేము. బహుశా ఇది ఉన్నది, బహుశా ఇది లేదు అని చెప్పవలెను. స్యాత్ అనగా బహుశా, కావచ్చును అని అర్థం. కనుక ఈ వాదమును స్యాద్వాద మంటారు.

తాత్వికంగా జైనం చాలా బలహీనమైనది. దానిపట్టు కేవలం సాంఘికం. ఇందునా ఒక చిక్కున్నది. జైనులలో దిగంబరులు, శ్వేతాంబరులు అని రెండు తెగలు. దిగంబరులు వస్త్రములను ధరించరు. పూర్తి నగ్నరూపంలో వుంటారు. నగ్నంగా యేలుండరాదు? అందులో జుగుప్స ఉన్నదనుకొనుట మన దృష్టిలోపం వల్ల కలుగు భావం. కనుక అత్యున్నత మానసిక స్థాయినందినవారు దిగంబరులు కావలెను.

అహింసను అతి కఠినంగా ఆచరించవలెను. మాంసా హారం ఏ పరిస్థితులలోనూ చేయరాదు. దీపం వెలిగించరాదు. నడుచునపుడు చీమలు, ఇతర క్రిమికీటకాదులు నశించకుండా నడువవలెను. భూమిని దున్నరాదు – అందులోని జీవరాసులు చనిపోతాయి గనుక.

ఇట్టి విపరీత ధోరణుల ఫలితంగా జైనం పెద్దగా వ్యాప్తిచెందలేదు. దిగంబర ధోరణి నశించి, శ్వేతాంబర ధోరణి, అనగా తెల్లటి వస్త్రముల ధరించవలెను అను ధోరణి తలఎత్తినది.

ఆంధ్రదేశములో జైనం చంద్రగుప్త మౌర్యుని కాలంలో ప్రవేశించింది. ఇతడు తన నిర్యాణకాలంలో శ్రీశైలంలో నివసించాడంటారు.

బౌద్ధం వెనుకడుగు పట్టిన మీదట ఆంధ్రదేశంలో జైనం వ్యాపించింది. క్రీ. శ. 400–1000 మధ్య తూర్పు చాళుక్యులు ఆంధ్రను పాలించారు. వీరు పశ్చిమ చాళుక్యుల నుండి చీలిపోయిన శాఖ. పశ్చిమ చాళుక్యులు జైనులు, పిమ్మట వచ్చిన రాష్ట్రకూటులు జైనులు. పిమ్మట వచ్చిన యాదవులు జైనులు, కళ్యాణిని పాలించిన కాలచూరి వంశస్తుడైన బిజ్జలుడు జైనుడు. కన్నడ, మహారాష్ట్రలు జైన మయం. అక్కడినుండి యిది ఆంధ్రకు వ్యాపించింది.

తెలంగాణాను పాలించిన కాకతీయ రాజులు మొదట్లో జైనులు. నల్గొండ జిల్లా కొలనుపాక పెద్ద జైన కేంద్రం. విజయవాడ మరొక జైన వసతి రామతీర్థం మరొకటి.

జైనులలో కుల భేదములు లేవు. కాని, వైదిక మతంతో జరిగిన ఘర్షణలో జైనులు క్రమంగా వర్ణ వ్యవస్థతో రాజీపడ సాగారు. మీ బ్రాహ్మణత్వాన్ని కాపాడుకుంటూనే, జైనమతం స్వీకరించవచ్చు నన్నారు. పెక్కు బ్రాహ్మణ కుటుంబాలు జైనాన్ని స్వీకరించాయి. చాళుక్యులలో ఒకడైన గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగడు, జైన బ్రాహ్మణుడు. వేములవాడ చాళుక్యుల ఆస్థానంలోనూ పెక్కుమంది జైన బ్రాహ్మలుండేవారు. పంప మహాకవి వారిలో ఒకడు.

కృష్ణా, గోదావరి జిల్లాలకు చెందిన కోస్తా ప్రాంతాల్లో నూనె గానుగుల వారు (తెలికులు), వైశ్యులు పెద్ద ఎత్తున జైన మతాన్ని ఆదరించినట్లు ఆధారాలున్నాయి. చాళుక్య రాణులలో చామెకాంబ అను జైన మహిళ ఒకరున్నారు.

## పూర్వమీమాంస - ఉత్తరమీమాంస

విష్ణుకుండినులు యజ్ఞ యాగాదులను పునరుద్ధరించారు. ఇక్ష్వాకురాజులు సైతం అశ్వమేధయాగం చేసినట్లు, నాగార్జున కొండ శిథిలాలలోని యాగ ఘట్టం సూచిస్తున్నది. రాణులు బౌద్ధాన్ని, రాజులు వైదికాన్ని అభిమానించిన కాలమది. ఇక్ష్వాకు రాజుల చివరి రోజులలో మత ద్వేష వహ్ని రగిలినట్లున్నది. శివలింగమును కాలితో అణచివేసే క్షత్రియుని శిల్పమొకటి విజయపురిలో లభించింది.

రాజవంశాల అంతఃకలహాలు మత స్పర్థల రూపంలో సాగటం, ఒకటి మరొకదానిని పెంపుచేయటం ఆ కాలంలో సామాన్య లక్షణం. ఆ సాంప్రదాయాన్ని బలీయులైన విష్ణుకుండినులు కొనసాగించారు. నరమేధ, వాజపేయాది పెక్కు యజ్ఞములను విష్ణుకుండిన మాధవ వర్మ జరి పించినట్లు శాసనాలున్నాయి. ఆ కాలంలోనే విజయవాడ కొండపై అంతకు ముందున్న ఆటవిక శక్తి విగ్రహం, కనకదుర్గగా రూపాంతర మెత్తింది. తెలంగాణా, దక్షిణ బస్తర్, మధ్యప్రదేశ్‌లను ఆనాడు పాలించిన రాజులు, వాకాటకులు. వింధ్య వాసినీదేవి వీరి ఉపాస్య దేవత. నరబలులు, జంతుబలులు విరివిగా సాగించు ఆటవిక రాజులు వీరు. వీరికీ విష్ణుకుండినులకు స్పర్థ, బంధుత్వం రెండూ ఏర్పడ్డాయి. స్పర్థ పెరిగి ఒక దశలో బంధుత్వం ఏర్పడటం, బంధుత్వంతో మొదలై కాలక్రమేణ స్పర్థ, తత్ఫలితంగా కక్షలు, యుద్ధాలు జరగటం ఆనాడు పరిపాటి. వాకాటకుల ఆటవిక జంతు బలులకు పోటీగా విష్ణుకుండినులు నరమేధాది యజ్ఞాలు చేశారు. మత కలహములతో వీధులలో రక్తం పారిన కాలమది.

క్రీ. శ. 600 ప్రాంతంలో పశ్చిమ చాళుక్యులు ఆంధ్రదేశంపై దండయాత్ర చేశారు. వారు జైన మతాభి మానులు. కాని, యుద్ధాలు చేయుటలో వెనుకాడలేదు. పూజా పురస్కారాదులలో మాత్రం జంతు బలులు, నర బలులు లేవు.

పిమ్మట 400 సంవత్సరములు ఆంధ్రదేశము నిరంతర యుద్ధముల కాలవాలమైంది. ఈ మహా కోలాహలంలో పెక్కు వృత్తులవారు పైకెక్కారు. మరికొందరు క్రిందికి దిగారు. యుద్ధనైపుణ్యం కలిగినవారు, రాజనీతిలో పైచేయి సంపాదించినవారు, మత విశ్వాసాలను స్వప్రయోజనములకు, రాజ్యప్రయోజనములకు వాడుకొనగల తెంపరులు పైకెగ బ్రాకారు. బౌద్ధం రంగంనుండి విష్క్రమించింది. అక్కడ క్కడ ఆరామాలలో కొందరు పండితులుండేవారు. జైనము, శైవము ఆధిపత్యమునకై పెనగులాడాయి.

క్రీ. శ. 700 ప్రాంతంలో కుమారిలభట్టు, ప్రభాకర పండితులనే ఇద్దరు పూర్వమీమాంసా ప్రవర్తకులు ఆంధ్రలో అవతరించారు. కళింగదేశంలోని విజయమంగళం వీరి గ్రామం.

జైమిని పూర్వమీమాంస సూత్రములకు వీరు వ్యాఖ్యలు వ్రాశారు.

మీమాంసాశాస్త్రం అనేక విచిత్రములతో కూడినది.

వీరు దేవుని నిరాకరిస్తారు. వైదిక మంత్రములకు మరెవ్వరూ ఇవ్వని ప్రాముఖ్యము నిస్తారు.

ఆత్మను వీరంగీకరిస్తారు. కాని, వీరి ఆత్మకు శరీర సంబంధిగా ఉన్నప్పుడే వ్యక్తిత్వం. స్వయం వ్యక్తిత్వం లేదు. సాంఖ్యుల పురుషుని వంటిది వీరి ఆత్మ.

వైదిక కర్మలకు వీరు అత్యధిక ప్రాధాన్య మిస్తారు. ఈ కర్మలు రెండు రకములు. కామ్య కర్మలు, నిత్యకర్మలు. కామ్య కర్మలద్వారా స్వర్గము లభిస్తుంది. కాని, పునర్జన్మ తప్పదు. జన్మరాహిత్యమునకు, అనగా మోక్షము లేక నిశ్రేయసమునకు నిత్యకర్మలు అవసరం.

యజ్ఞ యాగాదులన్నియు కామ్య కర్మలే. వాటినే పూర్వమీమాంసకులు చేశారు. ప్రాధాన్యమిచ్చారు. నిత్య కర్మలు నిశ్రేయసమని చెప్పారేగాని, అవి ఏ కర్మలు, ఎలా అని చర్చించలేదు.

యజ్ఞ యాగాదులు చేయాలంటే అపారమైన సంపద అవసరం. అందుకు రాజాశ్రయము, అగ్రహారములు అవసరం. బ్రాహ్మణులకు అగ్రహారముల నిచ్చి, పోషించే ఆచారము విష్ణుకుండినుల కాలం నుండి ప్రారంభమైంది. చాళుక్యులు ఈ పద్ధతిని కొనసాగించారు. కృష్ణా, గోదావరీ తీరములలోని బ్రాహ్మణాగ్రహారములకన్నిటి కానాడే పునాది ఏర్పడింది.

బ్రాహ్మణులు యజ్ఞ యాగాదులతోపాటు వ్యవసాయము చేశారు. లౌకిక కర్మలన్నిటా కుశలులయారు. వర్ణ వ్యవస్థలో తమ ఆధిపత్యాన్ని కాపాడుకొనుటకై చివరివరకు పోరాడారు. కత్తి పట్టారు. యుద్ధములు చేశారు. కాటమరాజు కథలో ఉభయ పక్షములలోను సేనానులు బ్రాహ్మణులే. చాళుక్యుల కాలంలో పెక్కుమంది సైనికవృత్తిని, మంత్రి పదవులు నిర్వర్తించారు. కర్మ ప్రధానమైన పూర్వమీమాంసకులు రాజస, తామస ప్రవృత్త ప్రధానులు. సాత్విక ప్రవృత్తి లేనేలేదు. జ్ఞానప్రధానమైన అద్వైతం ఆవిర్భవించిన మీద టనే బ్రాహ్మణులు కొందరిలో సాత్విక ప్రవృత్తి ఏర్పడింది. కవులలోనూ ఇది కన్పిస్తుంది. శ్రీనాథుడు రాజస ప్రవృత్తికి చిహ్నం. పోతన సాత్విక ప్రవృత్తి మూర్తీభవించిన కవి.

పూర్వ మీమాంస సహజంగా బ్రాహ్మణులకే పరిమిత మయింది. యజ్ఞ యాగాదులకు వారికే అర్హత. మిగతా వారేమి చేయాలి? వారు జైనులయారు. శైవులయారు. వీరశైవులయారు. వైష్ణవులయారు. అగ్రవర్ణములకు, మిగతా వర్ణములకు సాంస్కృతిక సయోధ్య లేదు. తెలుగుభాష శాసనముల కెక్కినది. క్రీ. శ. 600 నాడే ఇది ప్రారంభమైంది. కాని, తెలుగులో గ్రంథములు లేవు. సంస్కృతం మాత్రమే వేదభాష, దేవభాష. అందులోనే అన్ని శాస్త్రములూ ఉండాలి. తెలుగు త్యాజ్యం.

ఈ స్వయం కల్పిత నిషేధం తెలుగు మహాభారత అవతరణతో కాని బద్దలు కాలేదు. కనుకనే భారతం కేవలం కావ్యం కాదు – అది ధర్మశాస్త్రం, పంచమ వేదం, పురాణం, సర్వమూ. నాటి నుండే దేవాలయాలలో భారతమును పురాణంగా చెప్పే సాంప్రదాయ మేర్పడింది. వైదిక సంస్కృతి సామాన్యులలో వ్యాపించసాగింది. జైన, వీర శైవాది మతాలమ పార్రదోలుటలో ఈ సాహిత్యం పెద్ద పాత్ర వహించింది.

## అద్వైతం

క్రీ. శ. 788 ప్రాంతంలో మలబార్ జిల్లా కాలడిలో జన్మించిన శంకరుడు అద్వైత మతస్థాపకుడు. ఇతడు ఆంధ్రదేశమున కూడా పర్యటించెను. నాగార్జున కొండవద్ద దుర్గగుడి శంకరాచార్యుడు స్థాపించిన దంటారు.

సృష్టికంతా మూలం బ్రహ్మ. అతడు నిరాకారుడు. నిర్గుణుడు. శుద్ధ చైతన్య స్వరూపుడు. అతనికి సృష్టి చేయవలెననే కాంక్ష ఏల కలిగెను? అదొక లీల. ఈ లీలలో నిరాకారుడైన ఈశ్వరుడు సాకారుడయ్యెను. కనుక వ్యావహారి కంగా అసంఖ్యాకమైన దేవతా రూపములను పూజించవచ్చు, పూజించవలెను.

శరీరము నశ్వరము, ఆత్మ శాశ్వతం. ఆత్మవల్లనే శరీరమునకు ప్రాధాన్యం. ఆత్మకు వస్తుతః సుఖదుఃఖములు, పాపపుణ్యములు లేవు, కాని, శరీర సంబంధము వలన ఇవి కలుగును. ఇవి పోనంతవరకు జన్మ పరంపరలో ఆత్మ పరిభ్రమిస్తూనే వుంటుంది.

ఈ పరిభ్రమణ నుండి విముక్తి సాధించడమే మోక్షము. ఆత్మ పరబ్రహ్మ కంటే భిన్నమైనది కాదు. దాని కాంతి శకలం మాత్రమే. ఇది గ్రహించినవాడు ముక్తుడు.

ఇందుకు జ్ఞానమార్గం ముఖ్యం. కర్మలు చేయవచ్చును. కాని, జ్ఞాని ఐనవాడు చేయనక్కరలేదు. యజ్ఞయాగాదులు – అందులోని పశుహింస, ఇత్యాదులు తక్కువస్థాయికి చెందినవి. సన్యాసం ఉన్నతస్థాయి.

జగత్తు మాయ. వాస్తవం కాదు. వైరుధ్యమూ, ఘర్షణలతో కూడుకున్నదేదీ వాస్తవం కాదు. అవిద్య ఫలితంగా ఇది నిజమని భ్రమిస్తున్నాము. ఇదే రజ్జు సర్ప భ్రాంతి.

అవిద్య ఎలా తొలగుతుంది? విజ్ఞాన సాధన ద్వారా. అందుకు మార్గమేమిటి? తర్కం నిరుపయోగం. తర్కము ద్వారా బ్రహ్మను గుర్తించలేము. శబ్ద ప్రమాణం అనగా వేదప్రామాణ్యము మాత్రమే నిజమైన జ్ఞానమార్గం.

"బ్రహ్మ సత్యం, జగ న్మిథ్య
జీవో బ్రహ్మైవ నాపరః"
— ఇది అద్వైత సారం.

ఈ వాదం వ్యాపించినకొద్దీ యజ్ఞ యాగాది కర్మకాండ వెనుక పట్టు పట్టింది.

మహాకవి తిక్కన - సోమయాజి అనగా యజ్ఞము చేసినవాడు. మతరీత్యా హరిహర భేదము పాటించక, హరి హరనాథునకు భారతమును అంకితమిచ్చినవాడు. జ్ఞానమార్గ ప్రాధాన్యమును తన కృతులలో చెప్పినవాడు. కర్మమార్గంనుండి జ్ఞానమార్గానికి పయనించినవాడు.

మహాభారత గాథ కర్మ వైఫల్యాన్ని, జ్ఞాన ప్రాధాన్యాన్ని వివరిస్తుంది.

ధర్మరాజు యుద్ధం చేశాడు. రాజ్యం సాధించాడు. కాని ఆదినుండి అంతంవరకు తను చేస్తున్నపని దోషమేమో అనే శంక అతనిని వెంటాడుతూనే ఉంది. అదే జిజ్ఞాస. పదేపదే కృష్ణుడు, వ్యాసుడు, ఇంకెందరో మునులు పారలౌకికంగానూ; సోదరులు, ద్రౌపది ఐహికంగానూ యుద్ధానికి ప్రోత్సాహం కలిగిస్తూ వచ్చారు. కాని, ధర్మరాజు సహజ లక్షణం నిర్వేదం, జిజ్ఞాస. కర్మ చేసినా అతడు నిమిత్తమాత్రుడు. జ్ఞానపిపాస హెచ్చు.

మాయోపాయముల ద్వారా భీష్మద్రోణాదులను, కర్ణుని, శత్రువులందరినీ పాండవులు సంహరించారు. అది రాచ యుద్ధధర్మం. అనివార్యం. కాని, ఇది దోషము అనే చైతన్యం ధర్మరాజును వెంటాడుతూనే ఉంది. కనుకనే అతనొక్కడే స్వర్గమునకు పోయినట్లు భారత కథ అంతమైంది.

అద్వైతం వ్యాపించిన తీరు ఇది. కర్మ చేయక తప్పదు. ఐనా అదే సర్వస్వమని తలచవద్దు. జ్ఞానము ముఖ్యము. ఈ బోధను భారత భాగవతాదులు వ్యాప్తి చేసినవి.

*"లోకములన్నియున్ గడియలోన*
*జయించిన వాడవు, ఇంద్రియా*
*నీకము చిత్తమున్ గెలువ నేరవు,*
*నిన్ను నిబద్ధుచేయు నీ*
*భీకర శత్రులార్వుర ప్రభిన్నుల*
*చేసిన ప్రాణికోటిలో*
*నీకు విరోధి లేడొకడ నేర్పున*
*చూడుము దానవేశ్వరా!"*

అని ప్రహ్లాదుని నోట, పోతన అద్వైత జ్ఞాన మార్గాన్ని బోధించాడు.

ఈ మేరకు అద్వైతము సాత్త్విక ప్రవృత్తిని పెంచింది.

## వీరశైవము

అద్వైతము సైతం అగ్రవర్ణములకు పరిమితమైంది. సామాన్యుల సమస్యలు వేరు, బాధలు వేరు. వర్గవివక్ష కుల విభేదాలు - ఇవి హిందూ సమాజంలోని దీర్ఘకాల రుగ్మతలు. ఈ రుగ్మతలకు పదే పదే గురి అవుతున్నవారు సామాన్యులు. చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి, మాల, మాదిగ, సాలె, వడ్రంగి, రైతు, వ్యాపారి - ఇలా అసంఖ్యాకులైన చేతివృత్తులవారు, కృషీవలులు తమ వృత్తే సర్వస్వమనుకుని జీవించేవారు. వారికి వృత్తి విద్య మినహా వేరే విద్య లేదు. బ్రాహ్మణులు చెప్పే పురాణగాథలు వినీ వినీ వారి కెప్పుడో ఒకవాడు చిరాకు పుడుతుంది. రాజులు, బ్రాహ్మణులు ఏకమై సాగించే పెత్తందారీ ధోరణిపై ఎప్పుడో ఒకప్పుడు వెష్ట కలుగుతుంది. కాని, పరిష్కార మేది? మార్గాంతర మేది? తమ అసంతృప్తి తీరే మార్గ మేది? రాజకీయ, ఆర్థిక చట్రమును మార్చే శక్తి వారికి లేదు. సాంఘిక నియమాలను మాత్రం కొంత మార్చవచ్చు. అందుకేదో ఒక నాయకత్వం కావాలి. కొత్త మతం, కొత్త సిద్ధాంతం, కొత్త ప్రవక్త కావాలి.

కనుకనే, మన దేశంలో సాంఘిక కల్లోలాలు తరచు మతరూపంలో జరిగాయి. వీరశైవం అట్టి మహాకల్లోలాలలో ఒకటి.

కర్ణాటక దేశములో పన్నెండవ శతాబ్ది ఆఖరులో, కల్యాణి నగరమును బిజ్జలుడను రాజు పాలిస్తుండేవాడు. అతడు జైనుడు. అతనివద్ద కోశాధికారి బసవయ్య. ఇతడు వీరశైవ మత స్థాపకుడు.

ఈ మతమునందు శివుడు ఈశ్వరుడు. అతనిని లింగాకారంలో పూజించవలెను. శివభక్తులలో కులభేదములు కూడదు. అన్యమతస్థులను ద్వేషించవలెను. హింసించవలెను. మతవ్యాప్తికి ఏమి చేసినను తప్పులేదు.

వేదములు ప్రమాణాలు కావు. వానిని విశ్వసించువారు మూర్ఖులు. బ్రాహ్మణులు వేదభరాక్రాంతులు. వేదముల బరువుతో ఆక్రమించబడినవారు. ఆత్మ వేరు, శివుడు వేరు. భక్తిద్వారా ఆత్మ శివసాయుజ్యమును పొందవలెను.

ఇందు దర్శనభాగము స్వల్పము, మతభాగము హెచ్చు. యజ్ఞయాగాదులవంటి కర్మకాండపై తీవ్రఖండన మున్నది. అందుకు ప్రత్యామ్నాయంగా భక్తి ప్రధానమూ రాజస ప్రధానమూ ఐన మతావేశమును ప్రవేశపెట్టారు.

వీరశైవ ఉధృతములో పూర్వమీమాంస, యజ్ఞయాగ ములు వెనుకబడినవి. దేవాలయములు వెలసినవి. చాళుక్య రాజు నరేంద్ర మృగరాజు 101 శివాలయములను కట్టించె నట. ఉభయ గోదావరులలోని ప్రాచీనమైన శివాలయాలన్నీ ఆనాటివే. చాళుక్యులు మొదట జైనమును, పిమ్మట శైవమును అభిమానించారు. కాని, వారిది వీరశైవం కాదు. దక్షిణాది ఆది శైవము.

కాకతీయులు జైనం నుండి వీరశైవమునకు మారారు. గణపతి దేవునికాలంనాటికి ఉధృతం తగ్గి, హరిహరనాథ భక్తులయారు.

జైనముపై వీరశైవము దండయాత్ర చేసింది. మత

యుద్ధములు జరిగాయి. జైన వసతులను ధ్వంసం చేసి, జైనులను చంపించి, బలవంతంగా వారిని శైవులుగా మార్చి వీరశైవము ఆచరణలో రాజులకు గొప్పసాయము చేసింది.

బ్రాహ్మణులు సైతం వీర శైవము చేపట్టారు. పండితారాధ్య చరితము, బసవపురాణము వ్రాసిన పాల్కురికి సోమనాథుడు అట్టివారిలో ఒకడు. శ్రీపతి పండితుడు, పండితారాధ్యుడు, శివలెంక మంచన అను ముగ్గురు మహా పండితులు వీర శైవులైరి. కాని, బ్రాహ్మణ కులమును వదలలేదు.

*"భవునిమీద భక్తి, బ్రాహ్మ్యంబుపై రక్తి*
*వదలలేను నేను బసవలింగ"*

అని పండితారాధ్యుడు వీర శైవ మతాన్ని వర్ణ వ్యవస్థతో రాజీ పరచాడు. బ్రాహ్మణులలో ఆరాధ్యులను ఒక శాఖ ఏర్పడింది. లింగాయతులు, జంగాలు, ఇత్యాదులంతా వీరశైవులు. పల్నాటి యుద్ధమునకు వీరశైవ – వైష్ణవ విభేదాలొక కారణం.

మతము – రాజ్యాధికారము చేదోడు వాదోడుగా సాగినవి. రెడ్డిరాజులు వీరశైవులు. కాని, అన్యమత సహనం కొంత హెచ్చినవారు. దేవరకొండ వెలమ ప్రభువులు వైష్ణవులు. విజయనగర రాజులు మొదట శైవులు, పిమ్మట వైష్ణవులు. తిరుపతి దేవస్థానం జైనస్తూపం. పిమ్మట శివాలయం, ఆ పిమ్మట వైష్ణవ క్షేత్రం. ఇలా ఎన్నో మార్పులు జరిగాయి.

రాజకీయోద్యమములుగా సాగిన మతోద్యమముల తీరు ఇది.

## విశిష్టాద్వైతము

రామానుజాచార్యులు విశిష్టాద్వైత ప్రచారకులు. విష్ణుభక్తి ప్రధానం. కుల భేదములు అప్రధానము. ఇతని కాలం 1017–1100.

జీవుడూ, ఈశ్వరుడూ ఎన్నడూ ఒకరుకారు, భిన్నులూ కారు. విశిష్టమైన రూపంలో కలిసి ఉంటారు. జీవుడెప్పటికీనీ దాసుడే. తక్కువస్థాయివాడే. పరమేశ్వర సాన్నిధ్యంలో సైతం పూర్తి తాదాత్మ్యం లేదు.

జగత్తు వాస్తవమైంది. ఇది మాయకాదు. "యథార్థం సర్వ విజ్ఞానం". పదార్థం అనాది. ఇది పరబ్రహ్మలో భాగం. సాంఖ్యుల ప్రకృతివలె సర్వ స్వతంత్రం కాదు.

అవయవి – అవయవముల మధ్య ఐక్యత, విభేదం రెండూ ఉంటాయి. విభేదం ఉన్నంత మాత్రాన సత్తుకు భంగం రాదు.

జ్ఞానానికి గీటురాయి ఆచరణ. రజ్జు సర్పభ్రాంతి, మరీచికా జల భ్రాంతి ఇత్యాదులకు పరిష్కారం ఆచరణ.

అద్వైతం కంటె విశిష్టాద్వైత దర్శనములో వాస్తవికాంశం హెచ్చు.

శైవ, వైష్ణవములు దర్శన భేదములవల్ల కాక, ప్రధానంగా ఆచార భేదముల ద్వారా సామాన్యులచే గుర్తించబడుతున్నవి. వైష్ణవుల మత కర్మ లన్నింటికీ మూలం ద్రావిడ ఆగమములు. శైవుల మతకర్మలకు శైవాగమములు మూలం. అద్వైతులు, స్మృతి విహిత కర్మల ననుసరించేవారు. కనుక స్మార్తులైనారు.

మధ్వాచార్యుని ద్వైతవాదం కన్నడ దేశంలో జన్మించి, ఆంధ్రలో – ముఖ్యంగా రాయలసీమ ప్రాంతంలో వ్యాపించింది. జీవుడు, ఈశ్వరుడు ఎల్లప్పుడూ విడి విడిగా, ప్రత్యేకంగా వుండి తీరుతారు అను ద్వైత ధోరణి ఇది.

## ఇస్లాం

క్రీ. శ. 1303 లో అల్లా ఉద్దీన్ సేనాని మాలిక్ కాఫర్ దండయాత్రతో ఆంధ్రదేశంలో ఇస్లాం ప్రవేశించింది. బహమనీ రాజ్యస్థాపనతో స్థిరూపం ధరించింది. ఢిల్లీ నుండి సైనికులుగా వచ్చి స్థిరపడినవారు, పర్షియా నుండి వచ్చి స్థిరపడినవారు కాక, హిందూ సంఘంలోని పీడిత కులాల వారు పెద్ద సంఖ్యలో ఇస్లాం స్వీకరించారు.

బహమనీ రాజ్యం అయిదుగా చీలి, తెలంగాణా ప్రాంతమును ఆవరించిన గోల్కొండ రాజ్యం ఏర్పడ్డది. ఇస్లాం మతస్థులు తెలంగాణాలో మాత్రమే కాక యావదాంధ్రలోను ఉన్నారు.

ఇస్లాంలో కుల విభేదాలు లేవు. సాంఘిక సమానత్వం గొప్ప ఆకర్షణ. పైగా, రాజ్యాధికారంతో వచ్చినవారు ముస్లిములు. తెగల స్థాయికి చెందిన ప్రజలలో గల తీవ్రత వారిలో ఉన్నది. ఈ అన్ని కారణాలు ముస్లిం మత వ్యాప్తికి కారణాలు.

మహమ్మద్ ప్రవక్తతో ముస్లిం మతం ప్రారంభమైంది. ఇతని కాలం క్రీ.శ. 622.

ఈశ్వరుడు నిర్గుణుడు. అతనిపేరు అల్లా. మంచికి అంతకు అతడే కారణం. అతడు అన్యాయం చేయలేడు. అంతా ప్రకృతి నియమముల ననుసరించి జరుగుతుంది. ఈశ్వరుడు అనాది. ప్రపంచము, ఖురాన్ అనాదులు కావు. ఈశ్వరుడు ఇచ్చిన బుద్ధిని ఉపయోగించి మానవులు మంచి చెడ్డలను నిర్ణయించుకొనవలెను.

ఈ మతములో అయిదు సూత్రములున్నవి. 1. మహమ్మద్‌పై పూర్తి విశ్వాసము. 2. ప్రతి దినము ఐదు పర్యాయములు నమాజు చేయాలి. 3. తన ధనంలో కొంత భాగము రంజాన్ నెలలో దానము చేయాలి. 4. రంజాన్ మాసములో ఉపవాసం వుండాలి. 5. మక్కాయాత్ర చేయాలి.

మహమ్మద్ మరణానంతరం ఇస్లాంలో రెండు విభాగము లేర్పడ్డాయి. మహమ్మద్ పదవి వంశానుగతంగా రావాలనేవారు షియాలు. ఎన్నిక ద్వారా పదవీనియామకం జరగాలనేవారు సున్నీలు.

ఉత్తర భారతదేశంలో సున్నీలు అధిక సంఖ్యాకులు. వీరికి మతావేశం హెచ్చు. గోల్కొండ రాజ్యంలో షియాలు హెచ్చు. వీరికి మత సహనం హెచ్చు.

ఇస్లాం మతవ్యాప్తిలో దౌర్జన్యం ఉన్నమాట వాస్తవం కాగా, అంతకు పూర్వం, ఆ తర్వాత కూడా అన్ని మత శాఖలు రాజుల ప్రాపుతో ఎంతో కొంత దౌర్జన్యముతోనే విస్తరించిన సంగతి విస్మరించరాదు. ఇస్లాం వ్యాప్తిలో ఈ శాతం ఎక్కువ. ఎందుకంటే, వారు విజేతలుగా వ్యాపించారు. పైగా, వారి భాష వేరు, తామొక ప్రపంచ మతోద్యమ వారసులుగా భావించారు గనుక.

వీరిలో సూఫీలనే మరొక శాఖ ఉన్నది. వీరు మార్మిక వాదులు, మత సామరస్యమును బోధించినవారు. హిందూమార్మికవాదుల బోధలవలెనే వీరిబోధలు ఇతరులకు అర్థంకావు. బహుశా వారికీ అర్థంకావు. అర్థంకాని అజ్ఞేయత్వం ఈ మతవ్యాప్తికి మరొక కారణం. అన్ని మతశాఖలలో అజ్ఞేయత్వం ఎంతో కొంత మోతాదులో ఉంటూనే ఉన్నది.

## క్రైస్తవ మతం

క్రీ. శ. 18 వ శతాబ్ది ప్రారంభంలో ఆంధ్రదేశంలో క్రైస్తవ మతం వ్యాపించసాగింది. మిషనరీలు మతముతో పాటు విద్యను, చికిత్సాలయములను, సేవా కేంద్రములను స్థాపించారు.

ఏసుక్రీస్తు బోధలు ఈ మతమునకు పునాది. జెరూసలెంలో రోమన్ సామ్రాజ్య దోపిడీకి గురిఔతున్న పీడిత ప్రజలకు మత పరమైన అశ్వాసం కల్గించినవాడు క్రీస్తు. రోం సామ్రాజ్యంలోని బానిసలందరూ క్రైస్తవమతం స్వీకరించారు. ఎన్నో బాధలకు గురి అయినారు. కాలక్రమేణ ఫ్యూడల్ వ్యవస్థ ఏర్పడిన మీదట దాని ప్రాపుతో బ్రతికే పోపు వ్యవస్థ ఏర్పడింది. నాటినుండి క్రైస్తవమతం ఫ్యూడల్ నిరంకుశత్వానికి అండదండల నిచ్చింది.

పారిశ్రామిక విప్లవానంతరం బ్రిటిష్, ఫ్రెంచి, డచ్ వ్యాపారస్తులు ఆసియా, అమెరికా, ఆఫ్రికా ఖండము లకు వ్యాపించారు. వారితోపాటు క్రైస్తవమతం కూడా వ్యాపించింది.

ఈశ్వరు డొక్కడే. ఏసుక్రీస్తు అతని కుమారుడు. అతని బోధలు శిరోధార్యములు. జీవుడు, శరీరము వేరు. మరణానంతరం పునర్జన్మ లేదు. జీవులందరూ వారి వారి కృత్యముల ననుసరించి స్వర్గమునకో, నరకమునకో పోతారు. అంతిమ న్యాయము దేవుని సమక్షములో జరుగుతుంది. క్రీస్తు జీవించి ఉండగా దర్శనశాస్త్రం అంటూ లేదు. కాలక్రమేణ క్రైస్తవ గురువులు ఈ శాస్త్రమును వృద్ధిచేశారు. ఈశ్వర మీమాంస విజ్ఞానమున కందని విషయం. అది కేవలం క్రీస్తు బోధనలపై విశ్వాసం ద్వారా మాత్రమే సాధ్యం. ఇది తర్కమున కతీతము.

క్రైస్తవ మతం కరుణ ప్రధానం. మానవ సేవ పరమ లక్ష్యం. కుల భేదములు లేవు. ఈ కారణము వలన క్రైస్తవ మతం ఆంధ్రదేశంలోని నిమ్నజాతుల వారిలో హెచ్చుగా వ్యాపించింది. కొన్ని ప్రాంతములలో అగ్రవర్ణాలవారు సైతం క్రైస్తవమును స్వీకరించారు. వర్ణ విభజనను మాత్రం వదలలేదు. క్రైస్తవమతంలో సైతం ఈ విధంగా కులభేదములు పరోక్షంగా ప్రవేశించాయి.

ఆంధ్రదేశంలో ఆంగ్ల విద్యావ్యాప్తికి క్రైస్తవ మిషనరీలు చేసిన సేవ ప్రశంసనీయం. బందరు నోబుల్ కాలేజీ, గుంటూరులో ఆంధ్రక్రైస్తవ కాలేజీ ఇందు కుదాహరణలు.

విజయవాడలోని లయోలా కాలేజీ శాఖోపశాఖలుగా విస్తరించి, విద్యాబోధన చేస్తున్నది.

## బ్రహ్మసమాజ, ఆర్యసమాజములు

రాజా రాంమోహన్‌రాయ్ (1772–1833) ఆధునిక భారతీయ పునరుజ్జీవన జనకుడు. బ్రహ్మసమాజ మతస్థాపకుడు.

ఉపనిషత్తుల సారము, క్రైస్తవ ప్రార్థనల పద్ధతిని కలిపి ఆయన బ్రహ్మ సమాజమును స్థాపించారు. కులభేదములు కూడదు. విగ్రహారాధన పనికిరాదు. ఏకేశ్వరోపాసన, నైతిక ప్రవర్తన ముఖ్యం.

ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారల ద్వారా ఈ మతం వ్యాప్తి చెందింది. రాజమండ్రి, కాకినాడ, బందరు, గుంటూరు వంటి ప్రాంతాలలో ప్రార్థనా సమాజము లేర్పడ్డాయి. విద్యాధికులు, సంస్కారభావాలు గల యువకులు ఈ మతమును ఆదరించారు.

ఆర్య సమాజ స్థాపకులు దయానంద సరస్వతి (1824–1833), వీరికి వేదములు మాత్రమే ప్రమాణములు. కాని, యజ్ఞయాగాదులు కూడదు. కుల భేదములు వుండవు. స్త్రీ పురుష సమానత్వం అవసరం. అందరికీ ఉపనయనము చేయవలెను. ఇస్లాం మతం స్వీకరించిన హిందువులకు తిరిగి హిందూమత దీక్షనివ్వడం వీరి ప్రత్యేకత.

పిఠాపురంలో ఆదిపూడి సోమనాథరావు, తెనాలిలో ఆచార్య గోపదేవ్, తెలంగాణాలో రామానంద తీర్థ వంటి ప్రముఖులు ఈ మతమును వ్యాపింపచేశారు. నైజాం నిరంకుశత్వములో మ్రగ్గిన హైదరాబాద్ సంస్థానంలో ఈ మతం హిందూయువకులలో ఆత్మవిశ్వాసం కలిగించుటకు తోడ్పడ్డది. వీరిలో పెక్కుమంది తమ ఆలోచనా క్రమమును మరింత ముందుకు సాగించి, మార్క్సిజంవైపు ఆకర్షితులయారు.

# నాస్తికవాదం

భావ విప్లవం రానిదే భౌతిక విప్లవం రాదని, కనుక నాస్తికవాద ప్రచారం ప్రథమ కర్తవ్యమని విశ్వసించిన గోరాగారు ఈ ఉద్యమానికి ఆద్యులు. తమిళనాడులోని రామస్వామి నాయకర్ ఉద్యమంతో వీరికి భావసారూప్యత ఉన్నది. కాని, వారిలో ఉన్న కులద్వేష, జాతిద్వేష ధోరణులు వీరిలో లేవు.

యం.యన్. రాయ్ అనుచరులు కొందరు మానవతా ఆరాధకులుగా మారి, హేతువాద ప్రచారం సాగిస్తున్నారు. ఇది నాస్తిక వాదమునకు సన్నిహితమైనది. కాని, స్వల్పమైన భేదం కలదు.

యం.యన్. రాయ్ మార్క్సిస్టుగా ప్రారంభమై, వ్యక్తివాద ధోరణికి మారిన మేధావి.

ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం కలిగించిన సాంస్కృతిక పునరుజ్జీవనంలో ఒక భాగం గతి తార్కిక భౌతికవాద ప్రచారం.

ఆర్థిక, రాజకీయ విప్లవాలకు ప్రథమ ప్రాధాన్యమున్నది. ఆ తర్వాతనే జాతి మొత్తంమీద సాంస్కృతిక విప్లవం సాధ్యం. దాని అర్థం – ఈలోగా శాస్త్రీయ, సిద్ధాంత ప్రచారం చేయనక్కరలేదనీ కాదు, అప్రధానమనీ కాదు.

గతి తార్కిక భౌతికవాదాన్ని వివరిస్తూ తెలుగులో అనేక గ్రంథాలు వెలువడ్డాయి. భారతీయ తత్త్వశాస్త్రాన్ని గతి తార్కిక భౌతిక దృష్ట్యా పరిశీలన చేస్తూ కూడా కొన్ని గ్రంథాలు వెలువడ్డాయి.

పదార్థం మౌలికం, భావం ద్వితీయం; చలనం మౌలికం, స్థితి ద్వితీయం; చలనశీలమైన పదార్థంయొక్క విరాట్ స్వరూప సందర్శన ఈ జగత్ పరిణామం – ఇవి నిత్య నూతనం. నిరంతర ఆవిష్కరణ దాని స్వభావం.

ఈ అధ్యయనానికి తోడ్పడేవి భౌతిక విజ్ఞాన శాస్త్రాలు.

అత్యున్నత వైజ్ఞానిక పరిశోధనలన్నీ ప్రకృతిలో అంతర్లీనమైన గతి తార్కిక సూత్రాలను నిరూపిస్తున్నాయి. రాజకీయ, ఆర్థిక, చారిత్రక, సాంఘిక, తాత్త్విక పరిణామాలలోనూ ఈ సూత్రాలు అంతర్భూతంగా ఉన్నాయి.

ప్రాచీన తత్త్వశాస్త్రంలోని జీవ లక్షణాలన్నిటినీ హేతువాద, శాస్త్రీయభావ ప్రవంతులన్నింటినీ సోపానాలుగా గతి తార్కిక భౌతికవాదం స్వీకరిస్తుంది. నాస్తికవాదం వలెనో, శూన్యవాదంవలెనో గతాన్నంతా నిరాకరించదు.

సాంప్రదాయం పేరుతో గతంలోని మూఢ విశ్వాసాలను; అశాస్త్రీయ, జడవాద, భావవాద ధోరణులను తవ్వి తలకెత్తి, ఇదే భారతీయ సంస్కృతి అని ప్రజలను మభ్యపెట్టే తిరోగమన వాదుల ప్రచారాన్ని గతి తార్కిక భౌతికవాదం తీవ్రంగా, నిరంతరాయంగా ప్రతిఘటిస్తుంది.

కనుకనే ఆంధ్రదేశంలో పునరుజ్జీవనోద్యమ వైతాళికులైన కందుకూరి, గిడుగు, గురజాడల కృషిని ఒక మహోద్యమంగా కమ్యూనిస్టుపార్టీ నిర్వహించింది, నిర్వహిస్తున్నది.

"తన తోటి పౌరులకన్నా, సమకాలికుల కన్నా బాగా
రచయిత తెలుసుకోవలసిన రంగం యింకొకటి వుంది,
అది మానవుని అంతరంగిక ప్రపంచం." – ఇల్యా ఎహ్రెన్ బర్గ్

# తెలుగు లిపి పరిణామం

డాక్టర్ తిరుమల రామచంద్ర

"కన్నులు దీర్ఘముల్, నగుమొగం
బవురా తలకట్టు తమ్మి పూ
పున్నమ చందమామలకు,
పొక్కిలి చక్కదనంబు చెప్పగా
నున్నదె! మేలు బంతులు పయో
ధరముల్, మరికొను సున్నయొను,
ఎన్నిక కెక్కు వ్రాత ఫలము –
ఇవ్వరవర్ణినికిన్ జగంబునన్ –" (2–104) అని చేమకూర వెంకటకవి మన వర్ణమాలను సుందర వరవర్ణినితో పోల్చాడు. జన్నయకుమారుడైన సిద్దయశౌరి –

"ఆణిముత్యముల సోయగము మించిన వ్రాలు
వరుసతో నిరుకేల వ్రాయనేర్చె"

అని జక్కన విక్రమార్క చరిత్రలో పొగిడాడు. ఇక పాండురంగసుకవి వేదాద్రి మంత్రి అక్షరశాస్త్రజ్ఞుడని వర్ణిస్తూ తనకాలపు తెలుగు లిపి స్వరూపాన్ని చాలవరకు వివరించాడు.

"పట్టి వట్రువయును పరిపుష్టి తలకట్టు
గుడిసున్న కియ్యము సుడియు ముడియు
ఐత్వంబు నేత్వంబు నందంబమందంబు
గిలుకయు బంతులు నిలుపు పొలుపు
. . . . . . . . . . . . . . . .
లలితముక్తా ఫలాకార విలసనమున
మతి మీరున్మంత్రి వేదాద్రి మంత్రివరుడు"

మన దస్తూరి గుండ్రంగా ఉండడానికి మన పూర్వులెవరో గోసాయి చిట్కా ఒకటి చెప్పారు:–

"య ర ల వ మ ద న స యనుచును
పరువడి నీ యక్షరములు భయనయతతులన్
నిరతమును వ్రాయనేర్చిన
వరకరుణా వాని వ్రాలు వట్రువలమరున్."

ఇప్పటి మన లిపి స్వరూపాన్ని చూచి, ఇది మొదటినుంచి ఆణిముత్యాల కోవ అని, రత్నాల రాజి అని ఎవ్వరూ భ్రాంతి పడనక్కరలేదు. ఇది ఈ ముత్యాల కోవ కావడానికి కనీసం రెండువేల అయిదు వందల యేళ్ళయాయి. అంతకు ముందు ఇవి అడ్డపు, నిలువుగీతలే. ఈ గీతలు రాతి బండల మీద, రాగిరేకులమీద, తాటాకులమీద, కాగితాలమీద రాపాడగా, రాపాడగా నేటి ఈ గుండ్రటి రూపం ఏర్పడింది.

భాష ధ్వని రూపమని, ఈ ధ్వనికి సంకేతాలే లిపులు వర్ణసమామ్నాయమని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఈ లిపి ప్రాచీనతా చర్చకు, మనదేశంలోనే ఇది పుట్టిందా, పరాయి వారినుంచి వచ్చిందా అనే చర్చకు పోక, మన లిపి, మనదేశ లిపులేకాక, పెక్కు ఆసియా లిపులు బ్రాహ్మి అనే ప్రాచీన లిపి నుంచి వచ్చాయని, ఈ బ్రాహ్మిలిపి కొన్నివేల ఏళ్ళనుంచి మన దేశంలో ఉండి వివిధ లిపి సమామ్నానికి మూల భూతమయిందని చెబితే చాలు. కాని, ఈ లిపి, వ్రాత ప్రజాసామాన్యంలో ప్రచురంగా లేకపోవడం వాస్తవం. ఇంతకూ, ఇంత ప్రచారం జరుగుతున్నా ఇప్పుడు మాత్రం ఎంతమంది అక్షరాస్యులు?

మనదేశంలో చదువు, వ్రాత అతిప్రాచీనకాలం నుంచే ఉన్నప్పటికీ, విశేష ప్రచారం పొందింది బౌద్ధ, జైనుల వల్లనే అనడం నిస్సందేహం. వీరు తమ ఉపదేశాలను ప్రజాసామాన్య భాష అయిన పాలీ–ప్రాకృత భాషలలో చెప్పడం, వాటిని శిష్యులు, అభిమానులు లిఖితం చేయడం వల్ల వ్రాత, చదువు ప్రజాసామాన్యంలో బాగా విస్తరించాయి. ఆడవారు కూడా చదువను, వ్రాయను నేర్వాలని బుద్ధుడు ఆదేశించాడు. జైనులలో మహిళలలో చదువు, వ్రాత వ్యాపించాయి.

ఈ వ్రాత బుద్ధుని కాలంలో వుందనడానికి ప్రమాణంగా బింబిసారుని కుమారుడైన అజాత శత్రువు ప్రతిమమీద వ్రాసిన ఆయనపేరును ఉదహరించవచ్చు. ఈ ప్రతిమ నేడు మధుర మ్యూజియంలో ఉన్నది. ఇదే మనకు లిఖిత రూపంలో లభిస్తున్న తొలి లిపి. ఇతని వంశం వారయిన అజ ఉదయనుడు, అతని కుమారుడైన నందివర్మ ప్రతిమలు రెండు వారి పేర్లతో లభించాయి. వీరిద్దరూ అజాతశత్రువు తర్వాత ముప్పై ఏళ్ళు గడచినంక రాజ్యమేలినవారు. వీరి ప్రతిమలు కలకత్తా మ్యూజియంలో ఉన్నాయి. తర్వాత

బుద్ధుని వంశీయులు నేపాల్ అడివారంలోని పిప్రావా అనేచోట బుద్ధుని అస్థికల కరండంపై వ్రాసిన 'ఇయం సమ విధాన్ బుధస భగవతే సకియానాం సుకుతి భటినాం సభగనికనం సపుతదలనం' అనే క్రీస్తు శకం 487 నాటి వ్రాత, అజ్మీర్ జిల్లా బడలీగాంవ్‌లోని మహావీరుని సమాధిపైని 'వీరాయ భగవతే, చతురా సీతివ (స)' అనే వ్రాత, ఆకాలపు మరికొన్ని శాసనాలు మన లిపి ప్రాచుర్యాన్ని సూచిస్తున్నాయి.

**అశోక శాసనం:**

ఈ వ్రాతలు మౌర్య చంద్రగుప్తుని మనుమడయిన అశోకుని కాలంలో చాలా విస్తరించాయి. ఈయన బుద్ధధర్మం స్వీకరించి, దేశంలోని నాలుగంచులా 30 చోట్ల శాసనాలు వేయించాడు. వాటిలో ఒక్కటి మన రాష్ట్రంలోని ఎర్రగుడిలో వుంది. అశోకుని శాసనాలు గాక దక్షిణాపథంలో, ముఖ్యంగా భట్టిప్రోలులో కొన్ని శాసనాలు, లిపులున్న కరండాలు దొరికాయి. భట్టిప్రోలు గుంటూరు జిల్లాలోనిది. బుద్ధుని సంస్మరణార్థం కుబిరకుడనే రాజు ఆదేశంపై ఒక స్థూపం కట్టారు. ఈ స్థూపంలో మూడు రాతి భరిణెలు, స్ఫటికపుముక్క దొరికాయి. ఈ భరిణెలలో చితాభస్మం, అస్థికలు, బంగారుపూవులు, నవరత్నాలు ఉన్నాయి. భరిణెల మూతలమీద, భరిణెల కంఠం చుట్టు భరిణెలు చేయించి స్థాపించిన వారి పేర్లు ఉన్నాయి. ఒక భరిణె మీద వ్రాత యిది. మూతమీదిది.

**భట్టిప్రోలు శాసన ప్రతిబింబం:**

నేగమా
వచో చఘో
జేతో, జభో తిసో,
రేతో అఖినో, షభికో,
అఖిఘె, కేలో, కేసో, మాఘో
సేఠీ, ఛదికో, ఓఖబాలో,
సేణుతరో, సమణో
సమణదాసో, సానుకో,
కాముకో, చేతకో

భరిణె కంఠంచుట్టూ అరహ వినానం గోఠియా మజూసచ షముగమ్ తేగకదు మేక కుబరకో రాజో అది.

పైన పేర్కొన్న పేరుగలవారు ఈ మంజూగనుషముగాన్ని (పెట్టెను) దత్తం చేశారు. కుబిరకుని ఆజ్ఞ పొందినవారు ఈ పనిచేయించారు. అశోకుని శాసనం తర్వాత స్పష్టమయిన వ్రాత వున్నవి భట్టిప్రోలు కరండాలు. ఇటీవల పురాతత్త్వ శాస్త్రజ్ఞులు శ్రీ ఇంగువ కార్తికేయశర్మ అమరావతిలో త్రవ్వకాలు జరిపి, ప్రాచీన శాసనాలు కొన్నిటిని కనుగొన్నారు. వీటినిబట్టి తెలుగుదేశంలో లిపి అశోకుని ముందునుంచే వున్నదని స్పష్టమవుతుందని ఆయన తెలిపారు. ఈ లిపి అశోకలిపికి సన్నిహితంగా ఉన్నది. భట్టిప్రోలులిపికి, అశోకలిపికి చాలా పోలికలు ఉన్నా, ఘ చ ద ధ మ ల శ ష అనే అక్షరాలు పూర్తిగా వేరుగా వుండడం వల్ల, గుణింతాలలోను భేదం కనిపించడం వల్ల తెలుగు దేశంలో లిపి అశోకునికి రెండు మూడు శతాబ్దాలకు ముందునుంచే భిన్నరీతిలో వున్నట్లు స్పష్టం.

ఈ అశోక లిపికి బ్రాహ్మీ అని పేరు వచ్చింది. ఈ పేరు రావడానికి స్పష్టమైన కారణం తెలియడంలేదు. తర్వాతివారికి స్పష్టంగా తెలియనందున బ్రహ్మలిపి లాగ అనూహ్యంగా ఉందని వేళాకోలానికో, గౌరవభావంతోనో బ్రాహ్మీ అన్నారు. దక్షిణాపథపు భట్టిప్రోలు భరిణెలపైన ఇతరత్రాను వున్న లిపిని ద్రావిడీబ్రాహ్మీ, దక్షిణబ్రాహ్మీ అన్నారు. ఈ దక్షిణ బ్రాహ్మీనుంచే తెలుగు లిపి ఆవిర్భవించింది.

మన తెలుగునాడును పెక్కు రాజవంశీయులు పాలించారు – శాతవాహనులు, ఇక్ష్వాకులు, పల్లవులు, బృహత్ఫలాయనలు, వైంగేయులు (శాలంకాయనులు), కందారులు (ఆనందగోత్రికులు), విష్ణుకుండినులు, చోళులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు మున్నగువారు. వీరు కొందరు ప్రాకృతంలోనూ తక్కినవారు తెలుగులోనూ శిలా శాసనాలు, తామ్ర శాసనాలు వేయించారు. ఆయా శాసనాల లిపులు ఆయా రాజుల పేరుతో శాతవాహన లిపి, ఇక్ష్వాకులిపి, శాలంకాయన (వేంగీ) లిపి, విష్ణుకుండిన లిపి, చాళుక్య లిపి, కాకతీయ లిపి, రెడ్డిరాజుల లిపి, విజయనగర లిపి – అనే పేరున ప్రచారానికి వచ్చాయి. ఈ పేర్లు రావడానికి కారణం ఆయా రాజులకాలంలో లిపులలో జరిగిన మార్పులు. ఈ మార్పులనుబట్టి మనం లిపి పరిణామాన్ని విజయనగరకాలం వరకు పది దశలుగా విభజించవచ్చు. విజయనగర కాలం తర్వాత, అచ్చు వరకు కూడ పెద్ద మార్పులు లేక స్థిరపడిపోయింది. అచ్చువచ్చిన తర్వాత లిపి స్వరూపం మరింత సుందరమయి స్థిరపడింది.

**శాతవాహన శాసనం:**

శాతవాహనులు, మౌర్యరాజ్య పతనానంతరం దేశంలోని ఎక్కువ భాగాన్ని 500 ఏళ్లు పాలించినవారు. వీరు చాలాచోట్ల శాసనాలు వేయించినారు. వీరు ప్రాకృత భాషాభిమానులు కావడం వల్ల ప్రాకృత భాషలోనే శాసనాలు వేయించినారు. లిపి బ్రాహ్మీ. తెలుగులో శాసనాలు పడకపోవడానికి కారణం రాజుల దృష్టి దానిమీద ప్రసరించకపోవడమే. కాని, ప్రాకృత శాసనాలలో వేపూరు వంటి తెలుగు గ్రామాల పేర్లు, నాగబు (నాగము) వంటి వ్యక్తుల పేర్లు చేరకపోలేదు.

భట్టిప్రోలు, శాతవాహన లిపులకు కొన్ని అక్షరాలలో భేదం వున్నా, తక్కిన అక్షర స్వరూపంలో మార్పులు కలుగలేదు.

క్రీస్తుశకం రెండువందల సంవత్సరాల తర్వాత ఇక్ష్వాకుల కాలంలో కలిగిన మార్పు అందమైన ఘట్టమనుకోవచ్చు. శిల్పులు (ఇక్ష్వాకుల పాలన అర్ధశతాబ్దమే అయినా) అక్షరాలకు ఒంపులు వయ్యారాలు చేకూర్చారు. అక్షరాల నిలువు గీతలు అడుగున పొడవై ఎడమ వైపునకు వంపు తిరిగాయి.

వీరి తర్వాత పల్లవులు కొంతకాలము బృహత్ఫలాయనులు కొంతకాలము తెలుగునాడును పాలించిన మీదట కందారులు – ఆనందగోత్రికులు కొంతభాగాన్ని పాలించగా, పెదవేగి (వేంగీపురం) రాజధానిగా శాలంకాయనులు (వైంగేయకులు) క్రీస్తుశకం మూడవ శతాబ్దంలో ప్రబలులై నూటయాభై సంవత్సరాలు కృష్ణా గోదావరి మధ్య ప్రాంతాన్ని పాలించారు. అప్పటికి బౌద్ధమతం క్షీణింపసాగినది. భాషలోను, సంఘంలోను మార్పువచ్చింది. సంస్కృత ప్రాకృతాలు రెండింటికీ ప్రాధాన్యం వచ్చింది. లిపిలోను మరికొన్ని మార్పులు వచ్చాయి. దీనిని వేంగీలిపి అన్నారు. ఇది తెలుగు – కన్నడలిపికి పూర్వరూపం. ఇదే ఇండోచైనా, మలేషియా, జావా, ఇండోనేషియాలోని భారతీయ ప్రవాసరాజ్యాలలోను తొలిసారిగా వాడుకలోకి వచ్చింది. ఇక్ష్వాకుల కాలంలో అక్షరాల క్రింది భాగం పెరగడం, కొసఎడమవైపు మెలితిరగడం వంటిమార్పులు కలుగగా, శాలంకాయనులకాలంలో కొన్ని అక్షరాల తలపై చిన్ని అడ్డుగీత స్పష్టంగా ఏర్పడింది. కొన్ని అక్షరాలు గుండ్రతనం వదలి కోణాకారం దాల్చాయి. వీరిశాసనాలలో మరొక విశేషం తెలుగు వ్యక్తుల, గ్రామాల పేర్లు, సరిహద్దు గుర్తులు – కంబురాంచెరువే, గొల్లతెంకిః, చెరుకు మద్లుశ్చ, పోతురాయః లాంటివి సంస్కృతవేషం ధరించడం. మార్పులో ఇది రెండవ ఘట్టం.

శాలంకాయనుల తర్వాత వినుకొండ, దెందులూరు పట్టణాలు రాజధానిగా తెలుగుదేశాన్ని 5 వ శతాబ్దిమధ్యనుండి రెండువందల ఏళ్లపాటు ఏలిన విష్ణుకుండినుల కాలంలో మన లిపి నిర్దిష్టస్థాయిని అందుకొంది. శాలంకాయనుల కాలంలో కొన్ని అక్షరాల తలపై కనిపించిన చిన్న అడ్డుగీత విష్ణుకుండినుల కాలంలో అన్ని అక్షరాల మీద కనిపించసాగింది. మరొక విశేషం, అప్పుడు తెలుగుభాషలో ఉన్న "ఱ" (ఞ) అనే వింత అక్షరం కనిపించడం. రెండు సున్నాలు నిలువుగా పక్కన పక్కన పెట్టినట్టుంటుంది ఈ స్వరూపం. ఈ వింత అక్షరం నన్నయకాలం దాకా ఉంది. వివిధ రూపాలతో అటు తర్వాత అంతరించింది. దీనికి కారణం ఈ ఉచ్చారణ ద, ర, ల, శ, ర, అ, ఒడలుగా మారిపోవడమే. దీనితో ఉచ్చారణ, తత్సూచకమైన వర్ణమూ మరుగియాయి. అక్షరాలపై అడ్డుగీతకు కారణం వాకాట రాజులతో వియ్యమందుకున్న విష్ణుకుండినులు వాకాట రాజుల శాసనాలలోని లిపి తలపై పెట్టెల లాంటివి పెట్టడం చూడడం వల్ల కాబోలు! ఇది మూడవ ఘట్టం.

విష్ణుకుండినుల తర్వాత తెలుగు దేశాన్ని 7 వ శతాబ్దంలో చాళుక్యులు ఆక్రమించుకొన్నారు. వీరు స్వదేశాభిమానులు కనుక వీరికాలంలో తెలుగుకు ఆదరం కలిగింది. తెలుగులో శాసనాలు వెలయసాగాయి. వీరు మనదేశంవారు కారు. నేడు కర్ణాటకలో వున్న బాదామి– వాతాపి – వీరి రాజధాని. సత్యాశ్రయ పృథ్వీవల్లభ మహారాజు వేంగీ కళింగాలను 7 వ శతాబ్దంలో జయించి, తన తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుని రాజప్రతినిధిగా నియమించాడు. ఇతడు స్వతంత్రుడై పూర్వ చాళుక్యవంశానికి మూల పురుషుడయ్యాడు. ఈ చాళుక్య రాజులు వేయించిన శాసనాలలో ప్రాచీన తమమైన శాసనం కుబ్జ విష్ణువర్ధనునిది. ఈ కాలపు లిపిని వేంగీ చాళుక్య లిపి అన్నారు. ఈ లిపిని మనం తెలుగు – కన్నడలిపి అనవచ్చు. ఈ లిపి మార్పులు చెందుతూ 10 వ శతాబ్దానికి సంపూర్ణంగా వికసించి, నేటి తెలుగు – కన్నడ లిపిగా పరిణమించింది. ఇది నాల్గవ ఘట్టం.

చాళుక్యులు వేంగీదేశాన్ని ఆక్రమించుకొన్న కాలంలోనే, పశ్చిమాంధ్ర ప్రాంతాన్ని తెలుగు చోళులు పాలించేవారు. వీరు మొదట పల్లవులకు సామంతులయినా తర్వాత స్వతంత్రులయ్యారు. వీరు తెలుగులో శాసనాలు వేయించారు. వీరిలో రేనాటి చోళరాజయిన ఎరికల్ ముత్తురాజు శాసనమొకటి కడపజిల్లా కమలాపురం తాలూకా ఎర్రగుడిపాడు గ్రామం చెన్నకేశవాలయం పక్కన రాతిపై చెక్కినది. దీనికాలం క్రీస్తుశకం 575. తెలుగులో మనకు లభిస్తున్న తొలి శాసనం ఇదే.

ఎఱుకల్ ముత్తురాజ శాసన ప్రతిబింబం:

స్వస్తిశ్రీ ఎఱిక
ల్ముతురాజుల్ల
కుండి కల్లు నివఋక
ను ఇచ్చిన పన్నస
దుజయ రాజుల
ముతు రాజులు నవ
ప్రియ ముత్తు రాజులు
పల్లవ దుకరాజులు స్వాక్షి
కను ఇచ్చి (న) పన్నస్స
కొట్టంబున పా
ఱకు కుండి కాల్లు
ళ ఇచ్చిన పన్నస
ఇరువది యదినా
ల్ము మఱుంతు నేల.

ఎఱికల్ ముత్తురాజు రాజ్యంలో కుండికాల్లు అనే పెద్దమనిషి ప్రోత్సాహంతో, పన్నసమేర భూమి దానమివ్వబడింది. అని దీని సారాంశం. దీనికి దుజయరాజుల ముత్తరాజులు, నవప్రియ ముత్తరాజులు, పల్లవదుక (యువ) రాజు సాక్షులు. ఈ పన్నసకుండి కాల్లల్ 24 మరుతుర్ల మేర

నేలను కొట్టంబులోని పాఱకు ఇచ్చినాడు. సత్యాశ్రయుడనే రేనాటిచోళరాజు శాసనమొకటి కడపజిల్లా పొట్లదుర్తి - మాలెపాడు గ్రామంలో దొరికింది. మనకు దొరికిన ప్రాచీన శాసనాలలో ఇది రెండవది. బాదామి చాళుక్య లిపి కుడి వైపునకు మొగ్గి వుంటుంది. వేంగీ చాళుక్య లిపి చక్కగా, నిలువుగా ఉంటుంది.

ఈ వేంగీ చాళుక్యలిపికి క్రీస్తుశకం 10,11,12 శతాబ్దాలు పరివర్తనకాలం - దీనిని బర్నెల్ సంధికాలమన్నారు. ఈ మార్పు 14 వ శతాబ్దంనుంచి మరింత స్పష్టమయింది. ఇదే ఇప్పటి తెలుగు కన్నడ లిపుల ప్రాచీన స్వరూపం. ఇది ఐదవ, ఆరవ ఘట్టాలు.

నన్నయ్య భట్టారకుడు ఆంధ్రమహాభారతం వ్రాసినది ఈ వేంగీ చాళుక్య లిపిలోనే. కాని, నన్నయ నాటి లిపికీ, మొదటి వేంగీ చాళుక్య లిపికీ పోలిక ఏమీలేదు. నన్నయ కాలానికి లిపి బాగా తలకట్టు దిద్దుకొని చతికిలబడింది. నన్నయ రచించిన భారతం ప్రతి మనకు లభించకపోయినా, ఆయన రాజరాజనరేంద్రుని విద్యాధికారిగా చెక్కించిన నదంపూడి శాసనం, ఆ కాలపు మరికొన్ని శాసనాలు లభించాయి.

నన్నయ కాలంనుంచి వేంగీ చాళుక్య లిపిలో మార్పులు ప్రారంభమై, రెండువందల ఏళ్లకు కన్నడ తెలుగు లిపులు విడిపోయాయి. అంతవరకు బాదామి చాళుక్య లిపుల కలగలుపుగా వున్న లిపి ఆంధ్ర కన్నడ దేశాలలో ఇటు తూర్పు కోస్తానుంచి అటు పడమటి కోస్తా వరకు ప్రచారంలో వుండేది. నన్నయ కాలంలో మార్పులు ప్రారంభమయి రెండువందల ఏళ్లకు పూర్తిగా భేదం ఏర్పడింది. ఈ కాలాన్ని సంధి కాలమన్నారు. క్రమంగా తెలుగు మరీ గుండ్రనైపోయింది; కన్నడ లిపి కోణాకారమయింది. కాకతీయుల కాలానికి ఈ మార్పు స్థిరపడింది. కనుకనే 13 వ శతాబ్దం వాడయిన మంచన -




"వాచకత్వ లేఖనోచితంబును నంధ్ర లిపియట్ల మహి సర్వ లిపుల యందు" అని,

జక్కన - "ఆత్మీయ లిపులట్టు లన్యదేశ్యంబుల లిపులను జదువంగ నిపుణుడయ్యె", అని అనడం వల్ల అప్పటికి తెలుగు లిపి ప్రత్యేకత స్థిరపడిందనవచ్చు. ఈ మార్పు వరకు లిపి పరిణామాన్ని పై విధంగా చెప్పవచ్చు:

ఈ సంధికాలంలో లిపిలో చాల మార్పులు వచ్చాయి. చకారానికి తలకట్టు వచ్చింది. ఛకారం ఎడమభాగం గుండ్రనయింది. డ, థ, ధ లకు తలకట్లు వచ్చాయి. పకారం ఎడమ పక్కన సుడిని అంటిపెట్టుకొన్న తలకట్టు ఎప్పుడెప్పుడు విడిపోదామా అన్నట్టు అయింది. ఫ, భలు మారాయి. అనుస్వారం గుండ్రంగా వర్తులాకారంలో చూపినా, బిందురూపంలో చూపినా, అక్షరం పైభాగంలోనో, అక్షరానికి ఎగువ కుడి భాగంలోనో చూపే అలవాటు మారి అక్షరం పక్కన పంక్తిలో పెట్టడం అలవాటయింది. మహాప్రాణాలకు ఒత్తులు, పొల్లులు ఏర్పడ్డాయి. ఒత్తు గుర్తు మొదట్లో బోరగిల వేసిన అర్ధచంద్రుని లాగా వుంది. క్రమంగా పొక్కిలిలో నిలువుగీతగా నిలిచింది. ఇది ఏడవ ఘట్టం.

నన్నయ కాలపు అక్షరాలకు మధ్యన అడ్డంగా గీతగీస్తే తలకట్టు దగ్గర తెగుతుంది. అంటే తలకట్టు సగమూ, తక్కిన అక్షరం సగమూను. కాకతీయుల అక్షరాలలో తలకట్టు చిన్నదై, తక్కిన భాగం పెద్దది కావడంతో అక్షరాలు పొంకంగా, దీర్ఘవర్తులంగా అయి అందం వచ్చింది. ప హ లు తలకట్టు విదిల్చుకొన్నాయి. బండిరలోని అడ్డగీత వదలి వ్రాస్తున్న జ అనే వింత అక్షరం మాసిపోయింది. బోర్లించిన గంధపు గిన్నె లాగ వున్న శ కారం శంఖాకారం దాల్చింది. ఇది ఎనిమిదవ ఘట్టం.

రెడ్డిరాజుల - శ్రీనాథుని - కాలానికి ఒకటి రెండక్షరాలు మినహాగా అన్నీ మారాయి. ఇప్పటికి తెలుగు లిపి ప్రపంచంలో పడ్డామనిపిస్తుంది. మన కాలపు తెలుగు లిపికి సన్నిహిత దశ ఏర్పడింది. 'క' పూర్తిగా మారి ఇప్పటి రూపానికి వచ్చింది. షస్పష్టంగా నేటిరూపమే. కన్నడచ్ఛాయలు తొలిగాయి. ఇది తొమ్మిదవ ఘట్టం.

రెడ్డిరాజుల కాలంలో ప్రారంభమయిన మార్పులు విజయ నగర సామ్రాజ్య కాలంలో 16 వ శతాబ్ది చివరకు స్థిర పడిపోయాయి. విజయనగర చక్రవర్తులు తమ శాసనా లన్నిటినీ తమ ఏలుబడిలోని ప్రాంతాలలో ఈ తెలుగు లిపిలోనే వేయించారు. ఈ అక్షరాల సుస్థిరకాలం పదవఘట్టం. అచ్చు కూటాలు ఆరంభమయ్యింతర్వాత జరిగిన కొన్నిమార్పులను పదకొండవ ఘట్టంగా భావించవచ్చు.

మనకు త్స, జ్స, అనే వింత ఉచ్చారణ వుంది. చాప, జెల్లెడ వంటి వాటిలో దీనిని తెలుపడానికి చ జ లపైన త

ఒత్తు వంటి గుర్తు— పూర్వపు అచ్చు పుస్తకాలలో వున్నది. దీనిని 19 వ శతాబ్దంలో సి.పి. బ్రౌను పెట్టించాడు. దీనిని రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు తమ తెలుగు వ్యాకరణం లోను పొందుపరచారు. ఇది తెలుగు రెండంకె గుర్తు. చ పైన ౧ తెలుగు ఒకటవ అంకె వేస్తే, తాలవ్య చకారమని, రెండవ అంకె ౨ వేస్తే దంత్య చకారమని అలాగే తాలవ్య జకారము, దంత్య జకారమని సూచన. ఈ ఉచ్చారణకు తగిన అక్షరాలు పూర్వం లేవు. ఱ, ళ, క్ష లకు సంకేతాలు పెట్టుకొన్నవారికి ఈ రెండు ఉచ్చారణలకు సంకేతాలు పెట్టుకోడం కష్టం కాదు. కాని, 17 వ శతాబ్దపు గొప్ప లక్షణకారుడైన కాకునూరి అప్పకవి "దంత్య చజ గురు రలలకు తనరు బొట్లు" అని ఈ ఉచ్చారణ సూచించడానికి అక్షరం పైన చుక్కలు పెట్టాలని సూచించాడు. అలాగే బండిర, ళలను సూచించడానికి ర ల లపై చుక్కలు పెట్టాలన్నాడు. అప్పయ్యకు ముందు శాసనాలలోగాని, తాటాకులలోగాని ఈ బొట్లు పద్ధతి లేదు. శకాది రేఫ, గురులలకు విడిగ అక్షరాలే వున్నవి. స్పష్టంగా విడిగా అక్షరాలు, ఉచ్చారణ వున్నా లేఖకులు వీటి భేదం పాటించక ఇష్టం వచ్చినట్టు వాడారు. "దంత్యచజౌ గురు రళౌచ బిందుయుతౌ" అనే ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రం కూడ చింత్యంగానే కనిపిస్తుంది.

మనకు మరొక వింత అక్షరం అరసున్న. ఇదికూడ వ్రాతలో 16 వ శతాబ్దికి ముందు కనిపించదు. 12 వ శతాబ్ది నాటిదని చెప్పే అధర్వణ కారికావళి "పూర్ణేందు సదృశః పూర్ణః అర్ధస్త్వర్ధేందు సన్నిభః" అని పూర్ణార్ధ బిందువులను సూత్రీకరించింది. కొన్ని సమకాలపు శాసనాలలో గాని, అంతకుముందున్న శాసనాలలోగాని అరసున్న కనిపించదు. బిందువును నన్నయకాలం వరకు చుక్కగానే సూచించారు గాని, పూర్ణేందు సదృశంగా కాదు. పదమధ్యానునాసికాలను అవసరమైతే ఊదిపలకడం, అవసరం కాకపోతే తేల్చిపలకడం అలవాటు. వ్రాయడం మాత్రం అనునాసికమధ్యమయిన దానిని నేణ్ణే, కూన్తులు లాగా ద్విత్వాక్షరంగానే వ్రాసేవారు. అనునాసికానికి అనుస్వారం వాడడం ప్రాకృత భాషా ప్రభావం బట్టి అలవాటయిన తర్వాత అనునాసికయుత సంస్కృతపదోచ్చరణలో చిక్కు కలుగలేదుగాని, తెలుగు పదాల ఉచ్చారణలో చిక్కు వచ్చింది – ఏది తేల్చి పలకాలో, ఏది ఊది పలకాలో అని. దీనికి శాసనాలలో ఒక పద్ధతి అనుసరించారు. రాముండ్డుదయాలలో అనే దానిని ఒత్తి పలుకాలి. రాముండు అనే దానిని తేల్చిపలుకాలి. దీర్ఘం మీది నేంటి, ముందువంటి పదాలలోని అనునాసికాన్ని తేల్చిపలుకాలి. దీనికి కారణమేమిటో? కాని వీటిని కూడ ఒత్తి పలకడం మూండ్డు, కూంత్తురులాగ (s114, 476) వుంది. ఈ ఉచ్చారణ గూండు పేండు, వాండు ఇత్యాదులలో నేటికీ దక్షిణాదిన మిగిలింది. అనునాసికాలకు అనుస్వారం వ్రాయడం అలవాటయిన తర్వాత కొన్నిమాటలను తేల్చి పలకడం కోసం తర్వాతి వైయాకరణులు అరసున్నాను సృష్టించారు. ఒకప్పుడు వాడుకలో ఉండి కాలక్రమాన లోపించిన అక్షరాల, అనునాసికస్వరాల జ్ఞాపక చిహ్నంగా ఇది అర్థాంతరంగా వచ్చింది.

ముఖ్యాక్షరాలు ఎంతగా మారాయో గుణింతాల గుర్తులు అంతకు రెండింతలుగా మారాయి.

తలకట్టు అక్షరం మారుతూ వచ్చినప్పుడు ఏర్పడిన ఆకారమేగాని, విడిగా చేరిందికాదు. కాని తలకట్టు అకారానికి చిహ్నమనే భావం తర్వాత స్థిరపడిపోయింది.

ఆకారం సూచించడానికి చిన్న అడ్డుగీత అక్షరంపైన కుడి చివర పెట్టేవారు. ఇది కొంచెం పొడుగై శ్రీనాథునికి ముందు కొంచెంగా వంగినకుడి కొస అతని కాలానికి సుడిదేరింది. విజయనగర కాలానికి ఈ సుడి పైగీతతో కలిసి సున్నలాగ తయారయింది.

ఇకారం సూచించడానికి అక్షరం పైచివర చిన్న అడ్డుగీ తమీద చిన్న నిలువు గీత అశోక భట్టిప్రోలు శాసనాలలో కనిపిస్తుంది. ఇది శాతవాహనుల కాలానికి తురాయి లాగ లేచింది. చాళుక్యుల కాలానికి తురాయి కొస కుడి వైపునకు వంగి సున్నగా మారింది. శ్రీనాథుని కాలానికి పెద్ద కమానులాగ అయి, విజయనగర కాలానికి కమాను ఎడమ కొస లోపలికి సుడితిరిగి నేటి గుడికి మూలమయింది.

ఈ గుణింతం సూచించడానికి పైన రెండు నిలువు గీతలు పెట్టేవారు. ఈ రెండు గీతలూ క్రమంగా వర్తులాకారం పొంది ఎడమ వైపునకు సుడిదిరిగి విజయనగర కాలానికి నేటి రూపానికి సమీపించింది.

ఉ గుణింతం అశోక భట్టిప్రోలు శాసనాలలో అక్షరం క్రింద అడ్డుగీత. నన్నయ కాలానికి అక్షరం కుడిపక్కన అంటుకుంది. శ్రీనాథుని కాలానికి కొన పైకి వెళ్ళింది. విజయనగర కాలానికి ఇప్పటి రూపం దాల్చింది.

ఊ తెల్పడానికి అక్షరం కింద రెండు అడ్డగీతలు ఇవి భట్టిప్రోలు శాసనంలో హంసపాదులా మారాయి. ఇక్ష్వాకుల కాలానికి కుడివైపునకు వాలాయి. క్రమంగా ఇది ఒరిగిపడిన ఇంగ్లీషు S లాగ మారి, విజయనగర కాలానికి ఇప్పటి స్వరూపం వచ్చింది. ప ఫ వలకు ఉకార, ఊకారం గుణింతాలు అక్షరం పక్కనే వ్రాసేవారు. ఇలా వ్రాయడం వల్ల ఘకార మకార భ్రాంతి కలుగుతుందని కాబోలు – రెడ్డి రాజుల కాలంనుంచి ఈ అక్షరాల పొక్కిలిలో వ్రాయడం ప్రారంభమయింది.

ఋకారాన్ని ప్రాచీన సంస్కృత శాసనాల్లో అక్షరం కింద కుడివైపున ఐ మూలాగా ఒక వంపుతో సూచించేవారు. ఋకారోచ్చరణ ప్రాకృతంలో లేనందున అశోక శాతవాహ నేక్ష్వాకు శాసనాలలో కనిపించదు. సంస్కృత శాసనాలు

పడడం ప్రారంభమయిన తర్వాత ఉషవదాత శాసనాలలో చూడవచ్చు. నన్నయ కాలానికి వట్రువసుడిగా అక్షరం కింద కనిపిస్తున్నది. రెడ్డిరాజుల కాలంవరకు ఇది అక్షరాన్ని అంటి పెట్టుకున్నది. విజయనగర కాలానికి మారింది. ఋకార రేఫలకు ఉచ్చారణలో గల సన్నిహితత్వం వల్ల ప్రిధ్వీవల్లభ (S114.433) మహోపాత్ర్యండు (S11 4.197) వంటి పొరపాట్లు చాలా జరిగాయి. ఈ ఋకారం 6 వ శతాబ్దినాటి ఉష్ణీష విజయ ధారిణి అనే గ్రంథం వ్రాతప్రతిలో తొలిసారిగా ఇప్పటి దేవనాగరి అకార రూపంలో కనిపిస్తుంది. దీనిని నిలువుగీతగా వున్న ర కు పక్కన కొమ్ము ఇచ్చేవారు. ర నిలువు గీతనుంచి నిలువు గడిలాగ మారింది. దీనికి కొమ్ము వ్రాసే తొందరలో మొదటి గడి చిన్నదై బ అనేభ్రాంతి కలిగింది. దీనికి మరొక కొమ్ము ఇచ్చారు. అయినా ఋ అనే భ్రాంతి కలిగింది. ఈ భ్రాంతి పోగొట్టడానికి మరొక కొమ్ము ఇచ్చారు. 11 వ శతాబ్ది గంగరాజుల శాసనాలలో ఇది నేటి దేవనాగరి పక్కన కొమ్ము ఇచ్చినట్టు కనిపిస్తుంది. రెడ్డిరాజుల కాలానికి ఇప్పటిరూపంలో వుంది.

ఈ వట్రువ సుడికి చివర మరొక అడ్డుగీత పెడితే ౡ దీర్ఘం గుణింతమయింది.

ఏ కారం సూచించడానికి అశోక భట్టిప్రోలు లిపులలో అక్షరం ఎడమవైపు ఎగువన అడ్డుగీత పెట్టారు. వేంగీ చాళుక్యలిపిలో ఈ గీత కొన ఎడమకు వాలింది. కాకతీయుల కాలంలో కొక్కెం లాగా మారింది. విజయ నగర కాలానికి ఇప్పటికి దగ్గరయింది. సంస్కృతప్రాకృతాలలో హ్రస్వ ఎ ఒ లు లేవు గనుక తెలుగు పదాలను సందర్భానుగుణంగా చదివేవారు. తర్వాత ఈ దీర్ఘ ఏ కార ఓకారాలను హ్రస్వాలుగా భావించి, వీటికి సుడి, సుడిమీదికి అల లాగ మరొక గుర్తు చేరాయి. ఎ ఉచ్చారణను తమిళ తోల్ కాప్పియంలో త్రికోణాకారంగా వున్న ఏకారంలో ఒక చుక్క పెట్టడంతో తెలిపినట్టు బిర్లా మ్యూజియం సూపరిండెంటెంటు శ్రీ వి.ఎన్. మోహన్‌దాస్ తెలిపారు.

ఐ గుణింతాన్ని అక్షరానికి ఏ గుణింతం ఇచ్చిన మీదట అక్షరం కుడి పక్కన కిందుగా అరసున్నా వంటి గుర్తుపెట్టేవారు. ఇది అరసున్నను అంటిపెట్టుకొని వుండేది. కాకతీయుల కాలానికి అంటిపెట్టుకోడం మానింది. శ్రీనాథుని కాలానికి మొదటి కొన సుడి తిరిగింది.

ఓ గుణింతం అశోక శాసనాలలో అక్షరంపై రెండు అడ్డుగీతలు ఒకదాని పక్కన ఒకటి వీటిమధ్య రెండు కొసలు ఎగుడు దిగుడుగా వుండేవి. శాతవాహనుల కాలానికి అక్షరానికి కొసనో, మధ్యనో అటూ ఇటూ అడ్డుగీతలు. నన్నయ కాలానికి విచ్చిన పక్షి రెక్కలు లాగా మారాయి. ఓత్వాన్ని రెండు విధాలుగా ఇవ్వడం నన్నయ కాలానికే వుంది. అంటే – ఎ గుణింతం ఇచ్చి పక్కన కొమ్ము ఇవ్వడం, దానికి దీర్ఘ మివ్వడం. ఇది మ య హలలో నేటికీ మిగిలింది. దీనిని హ్రస్వ మనుకొని ఓ గుణింతానికి తురాయి లాగ కుడివైపున చెక్కారు. ఓ దీర్ఘమయింది.

ఔ గుణింతం ప్రాచీన ప్రాకృత శాసనాలలో లేదు. పశ్చిమ చాళుక్యుల కాలంలో ఏదో ఒంటెమెడ లాగా ఉంది. నన్నయ కాలానికి నేటి ల వత్తును అక్షరం మీద ఏటవాలుగా మోపినట్లుంది. శ్రీనాథుని కాలానికి ముఖ్యాక్షరానికి మించి నేటి ణ వర్ణాన్ని తలమీద మోపినట్టుంది. మ య హ వర్ణాల ఉత్వసూచకమైన కొమ్ములకు ఔత్వమిచ్చే పద్ధతి ఏర్పడింది.

గుణింతాలు మూలాక్షరాల స్వరూపానికి సన్నిహితంగా వుండాలి గదా, వాటి పోలికలు లేవే? అనే సందేహం కలుగుతుంది. నిజం. ఇది మూలాచ్చులకు ప్రతినిధులైనా వాటినుంచి పుట్టినవికావు. ఈ చిహ్నాలను పెట్టుకొనడంలో మనస్తత్త్వం పనిచేసిందని నా అభిప్రాయం. ఈ అచ్చుల ఉచ్చారణ సమతలంలో ముఖయంత్రంలో కలిగే మార్పులకు అనుగుణంగా ఈ సంకేతాలు రూపొందాయి. ఆ అన్నప్పుడు నోరుతెరచి ఏదో పొడిగించడానికి, ముందుకు పోవడానికి యత్నిస్తున్నట్టు వుంటుంది. దీనికి గుర్తుగా అక్షరం పైకొసను అడ్డుగీత. ఇ అనేటప్పుడు దవడలూ నెలవులు వెనక్కు కుంచించుకుంటాయి. కనుక అడ్డుగీతపైన నిలువుగీత – సంకోచానికి చిహ్నంగా. ఇది క్రమంగా వెనక్కు సుడిదిరగడమూ సంకోచానికి గుర్తే. ఉ అన్నప్పుడు పెదవులు ముందుకు సాగుతాయి. లోపలికి అదిమినట్టు ఉంటుంది. దీనికి సూచన అక్షరం కింద, మధ్యన అడ్డుగీతలు. ఊఅన్నప్పుడు దానిని పొడిగించారు. ఋ అన్నప్పుడు నాలుక చివరిభాగం మలుపు తిరుగుతుంది. దీని గుర్తే వట్రువసుడి, ఏ అన్నప్పుడు పైకి, లేదా వెనక్కు వెళ్లి నట్టవుతుంది. కనుక అక్షరం పైభాగం వెనుక దానిని పైకి లేపుతున్నట్టు గుర్తు. ఐ అన్నప్పుడు పైకిలేచి, వెనక్కు వెళ్లి కిందికి పడినట్టవుతుంది. కనుకనే ఐత్వం గుర్తు వెనుక, కింద వున్నది. ఓ అన్నప్పుడు పైకి తేలిపోయినట్టవుతుంది. మరి దీని గుర్తు అక్షరం మీద తరంగాల లాగ, రెక్కలలాగ కాక మరేమవుతుంది? ఔ అన్నప్పుడు పైకితేలిపోయి కిందికి తిష్టవేసి నట్టు అనిపిస్తుంది. కనుక పైకిపోయి కిందికి వంగినట్టు గుర్తు.

మనమిప్పుడు అనుస్వారాన్ని అక్షరం పక్కన వరుసలో వ్రాస్తున్నాము. ఇది మొదట్లో అక్షరం పైన మకారానికీ బిందువు, బొట్టు అని దీనికి పర్యాయాలు. స్వరాన్ని అనుసరించేది గనుక అనుస్వారం. దీనిని మరొకదానికి తక్కిన అనునాసికాలకు సమానమని భావించిన పిదప వాటికి మారుగా వాడే అలవాటు వచ్చింది. ఈ అనుస్వార బిందువును పైన వ్రాసేవారు – అ బ జ

లాగ నన్నయకాలానికి అక్షరం పక్కన పంక్తిలో వ్రాయడం అలవాటయిపోయింది. ఈ చుక్క క్రమంగా పూర్ణేందు సదృశమయింది.

మనం ద్విత్వాక్షరాలను ఒత్తులు అంటున్నాము. అశోక భట్టిప్రోలు లిపులలో ద్విత్వాక్షరాలను సూచించడానికి ఒక అక్షరం కింద మరొక అక్షరం పెట్టేవారు. వీటిలో పైది అప్రధానం క్రిందిది ప్రధానం. గుణింతాలు ప్రధానమైన కింది అక్షరానికే ఇవ్వాలి. కాని, పైదానికే చెక్కేవారు. ఇది అశోకుని శాసనాలలోనే వుంది. ద్రవ్యతవ్యం. కొంతకాలానికి ఈ పొరబాటును లిపికారులు గ్రహించి కింది అక్షరానికే గుణింతాలిచ్చేవారు. ఎరికల్ముత్తరాజు శాసనంలో సరిగా వుంది. తల కట్టు స్థిరపడిన తర్వాత పై అక్షరానికే గుణింతాలు ఇవ్వడం అలవాటయింది. ఇది నన్నయ కాలపు శాసనాలలో కనిపిస్తుంది. ఇది శ్రీనాథుని కాలానికి స్థిరపడింది.

ఈ ఒత్తులు ఇవ్వడంలో మరొక విచిత్రం వుంది. తలకట్టు అకారానికి చిహ్నమనే భావం రూఢమయిన తర్వాత తలకట్టు లేనివి అర్ధాక్షరాలనే భావంతో, తలకట్టు కలవాటికి తలకట్టు తొలగించి, లేనివాటిని యథాతథంగాను పంక్తికి దిగువన చిన్న సైజులో వ్రాయడం అలవాటయింది. క త న యరలవ ఒత్తులు ఇప్పుడు కొత్తవిగా, మూలాక్షరాలకు భిన్నంగా కనిపించినా నిజానికి పాత అక్షరాల స్వరూపాలే. య ఒత్తును కియవడి, క్రావడి అనీ అంటారు. య ఒత్తుకు పూర్వపు క ఒత్తుకు భేదం తెలియడానికి ఈ వ్యవహారం ఏర్పడివుంటుంది. ఇలాగే ర ఒత్తును క్రావడి అనీ అంటారు. తెలుగు కన్నడ లిపుల సంధియుగపు కవర్ల అడుగుభాగం వంటి ఆకారంగల ర ఒత్తు అని కాబోలు! క్రారావడి మరొక్కరూపం వలపలగిలక. కర్మ అని వ్రాయడానికి కమ్ఱ అని వ్రాసేవారు. ఈ ర ఒత్తు అశోక శాసనాల నుంచి పై చివరన ఏటవాలుగా వుంది. ఇదే కుడివైపున క్రమంగా గిలకలాగ వ్రాయడం వల్ల వలుపల గిలకయింది. నిజానికిది రేఫమే. నన్నయ కాలానికి మొదటి సుడివున్న మూల గీత శ్రీనాథునికాలానికి విడిపోయినది. విజయనగరకాలానికి విడిపోయి పక్కన గిలకలాగ అయింది.

భట్టిప్రోలు లిపి నుంచే మన నేటి తెలుగు లిపి పరిణమించింది గనుక దానినుంచి కలిగిన క్రమ పరిణామాన్ని తెలిపే లిపి పట్టికను పక్క పేజిలో చూపిన విధంగా చూపవచ్చు.

"చరిత్రలోని ప్రతి మలుపుకూ
ప్రత్యక్షంగానో, పరోక్షంగానో
వొక స్త్రీ కారణం కావటం అనివార్యం." - ఎంగెల్సు

**అంకెలు:**

అంకెల చరిత్ర లిపిచరిత్రకన్న ఆశ్చర్యకరం. అంకెల పుట్టుపూర్వాల సంగతి వదలి తెలుగు అంకెల సంగతి మాత్రమే చూద్దాం. క్రీస్తుపూర్వపు ఆంధ్రరాజుల శాసనాలలో సంఖ్యలు వ్రాసే అలవాటు కనిపించదు. ఒక్క శాసనంలో మాత్రం నాలుగుకు X గుర్తు కనిపిస్తుంది. సామాన్యంగా మాటలతోనే సంఖ్యలు తెలిపేవారు. నానేఘాట్ గుహ శాసనాలలో తొమ్మిదివరకు సంఖ్యలు స్పష్టంగా వున్నాయి. మూడు వరకు అడ్డుగీతల్లు, నాలుగింటి నుండి విడి గుర్తులూ ఉన్నాయి. ఈ గుర్తులు ఖరోష్ఠీ వర్ణమాలలోని అక్షరాలని, సంఖ్యా వాచకాలయిన సంస్కృత పదాల మొదటి అక్షరాలని కొందరంటున్నారు. అంటే చత్వారి అంటే చ, పంచ అంటె ప, షట్ అంటే ష – ఈ విధంగా.

నానేఘాట్ అంకెలనుంచే కన్నడ-తెలుగు అంకెలు పుట్టాయి. ఒకటి, రెండు, మూడు సంఖ్యలను సూచించే అడ్డుగీతలు '–, =, ≡ చెక్కడానికి మారు అడ్డుగీతలను నేటి ల వత్తు ~ – లాగ చెక్కేవారు, కళాత్మకంగా, ఈ ఒకటిక్రమంగా – తలకట్టులేని గకారంలాగ, గుమ్మటంలాగ మారింది. నేటి రూపం వ్రాయగావ్రాయగా, వ్రాసే తొందరలో ఏర్పడింది. దాని పరిణామాన్ని నేను ఊహించిన తీరు ఇది.

చార్టు–3:

1 2 3 4 5 6 7 8 9 10

పదిహేనో శతాబ్దంవరకు కన్నడ-తెలుగు సంఖ్యలలో మార్పేమీలేదు. తర్వాత కొద్దిగా మార్పు వచ్చింది. శాసనాలలో కనిపించే సంఖ్యలు ఇవి.

చార్టు–4:

క్రీస్తుశకం 5,6 శతాబ్దం కన్నడ తెలుగు సంఖ్య

1 2 3 4 5 6 7 8 9 0

15వ శతాబ్దం కన్నడ తెలుగు సంఖ్య

ముద్రణవల్ల కొన్ని అక్షరాలు మారినా, వర్ణమాల స్థిరపడిపోయింది. మన దేశానికి ముద్రణ పోర్చుగీసు పాదిరీలవల్ల వచ్చింది. మన దేశంలో ముద్రితమైన మొదటి భారతీయ భాషాగ్రంథం. 'సెయింట్ పీటర్ చరిత్ర.' ఇది మరాఠీ భాషలో రచితమైంది. 1565 లో ముద్రితం. పిదప 1577 లోను, 1598 లోను చెరి ఒక తమిళ గ్రంథాన్ని జెస్యూఇట్ మిషన్‌వారు ముద్రించారు. చెన్న రాష్ట్రంలో అచ్చు యంత్రాల స్థాపన 1577 లోనే అయినా, చెన్నపురిలో అచ్చు యంత్రాల స్థాపన హెన్రీ కాటన్ అనే వ్యాపారస్థుడు 1772 లో చేశాడు. 1778 లో కలకత్తాలోను, పిదప పద్నాలుగు సంవత్సరాలకు బొంబాయిలోను అచ్చు యంత్రాలు వెలిశాయి. మొదటి సారిగా తెలుగు పుస్తకాన్ని కొని బెంజమిన్ షూల్ట్జ్ అనే పాదిరీ 1746–47 లో ప్రష్యా దేశంలోని (నేడు జర్మనీ) హ్యాలీ పట్టణంలో ముద్రించారు. మనదేశంలో ముద్రితమైన తొలి తెలుగు పుస్తకం తెలుగు వ్యాకరణం. ఇది 1807 లో కలకత్తా సమీపంలోని శ్రీరామ్‌పూర్‌లో అచ్చయింది. శ్రీరామ్‌పూర్ క్రైస్తవ మిషన్ పాదరీ డాక్టర్ క్యారీ చెన్నపురి, విశాఖపట్టణం, బళ్లారి నగరాలలో ముద్రణశాలలు నెలకొల్పారు. 1817 లో సి.పి.బ్రౌన్ తెలుగు వ్యాకరణం ముద్రితమైంది.

ఈ విధంగా తెలుగు లిపి 23 వందల సంవత్సరాలలో ఎన్నో మార్పులు పొంది నేటి రూపానికి వచ్చింది. ప్రస్తుత యంత్రయుగంలో ఎన్నో మార్పులు పొందవచ్చు. లోహాక్షరాలు చేతితో పేర్చుకొనే అవసరం పోయి ఆంగ్లంలో లాగ మోనో టైప్ యంత్రాలలోను, లైనోటైప్ యంత్రాలలోను టైప్‌లాగ కొట్టే వరకు అభివృద్ధి చెందింది. అక్షరాలను విడగొట్టి కలిపే పద్ధతిలో స్వరూపాలు గూడ ముందు కన్నా మారాయి. కంప్యూటర్ ద్వారా కంపోస్ చేసే పద్ధతి ప్రస్తుతం గొప్ప విప్లవం. ఒక చోట వాడిన మాట పలుచోట్ల అక్షరరూపం దాల్చే పద్ధతి కూడా వచ్చింది. శ్రమ తగ్గించుకొని లాఘవం కోరే మానవుని బుద్ధి ఈ వర్ణమాలలోను ఎన్నో మార్పులు తలపెట్టవచ్చు.

మూడు సంవత్సరాల క్రితం కర్నాటక గవర్నర్ శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య గారు ఆంధ్ర-కర్నాటక లిపి ఏకీకరణకు బెంగళూరు విశ్వవిద్యాలయం కన్నడ శాఖాధ్యక్షుడు శ్రీ డాక్టర్ సచ్చిదానందమూర్తి గారి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించారు. అది లిపిలో ఎలాంటి మార్పు చేయకుండా రెండిటిని ఆదానప్రదాన పద్ధతిలో కలిపింది. ఈ వివరాలను విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రచురించిన 'మన లిపి పుట్టుపూర్వోత్తరాలు'లో చూడవచ్చు. దీనిని విజయలిపి అన్నారు.

# ఆంధ్రభాషా చరిత్ర

డా. తమ్మారెడ్డి నిర్మల, ఎం.ఏ., పిహెచ్.డి.

తెలుగు ద్రావిడ భాష. ద్రావిడ భాషలను వ్యవహరించే వారిలో తెలుగు భాషా వ్యవహర్తలు అధిక సంఖ్యలో వున్నారు. ఈనాడు విశాలాంధ్రలోనేకాక ప్రపంచంలో అనేక ప్రాంతాలలో మాట్లాడబడుతున్న తెలుగు భాషకి, ఈ విషయంలో భారతదేశపు భాషలలో ద్వితీయ స్థానం వుంది. 1991 జనసంఖ్య లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు మాట్లాడే వాళ్ళ సంఖ్య 6.64 కోట్లు. ఇతర రాష్ట్రాలలోను, ఇతర దేశాలలోను ఉన్నవారిని కలుపుకుంటే సుమారు 9 కోట్లుండవచ్చు.

తెలుగు భాషకి చాల ప్రాచీన సాహిత్యం, చరిత్ర వున్నాయి. క్రీ॥శ॥ 6 వ శతాబ్ది నుండి, తెలుగులో శాసనాలు, 11 వ శతాబ్ది నుండి సాహిత్య రచనలు లభ్యమవుతున్నాయి. మనకు లభ్యమైనంత వరకు 1050 ప్రాంతం నాటి నన్నయ విరచిత మహాభారతం ఆదికావ్యం. కాని అంతకు పూర్వం కొన్ని శతాబ్దుల నుండి తెలుగుభాషా సాహిత్యాలు వర్ధిల్లి వుండాలి. లేకపోతే హఠాత్తుగా ఒకనాడు నన్నయ భారతంవంటి ఉత్కృష్ట గ్రంథం ఆవిర్భవించటం సాధ్యమయ్యే విషయం కాదు. నన్నయ్య భారత రచన ప్రారంభించే నాటికి తెలుగులో కావ్యశైలి ఏర్పడివున్నదనే విషయం ప్రాఙ్నన్నయ యుగంలోని కొన్ని తెలుగు శాసనాల వలన తెలుస్తుంది.

రెండువేల సంవత్సరాల చరిత్రగల తెలుగు భాషకి ఆంధ్రము, తెనుగు, తెలుగు అని మూడు పేర్లు వ్యవహారంలో ఉన్నాయి. ఇందులో ఆంధ్రపదానికి జాతి పరంగాను, దేశ వాచకంగాను, భాషావాచిగాను కూడా ప్రాచీన కాలంనుండి ప్రయోగాలు కన్పిస్తాయి. తెనుగు, తెలుగు శబ్దాలను భాషా పరంగా నన్నయ నుండి తెలుగు కవులు ప్రయోగించారు. త్రిలింగ అనే పదం కూడ తెలుగు కావ్యాలలో భాషాపరంగా ప్రయోగించబడింది. ఏకార్థ బోధకాలైన ఈ పదాల చరిత్రని స్థూలంగా పరిశీలిద్దాం.

ఆంధ్ర: ఆంధ్రశబ్దం సంస్కృతంలో ప్రాచీనకాలంలో జాతిపరంగా ప్రయోగించబడింది. శునశ్శేఫుని తమ జ్యేష్ఠ భ్రాతగా అంగీకరించటానికి నిరాకరించిన మొదటి యాభైమంది పుత్రులను విశ్వామిత్రుడు అనార్యజాతులైన ఆంధ్ర, పుండ్ర, శబర, పుళింద, మూతిబాది దస్యులలో కలసి పొమ్మని శపించినట్లు ఐతరేయ బ్రాహ్మణంలో (క్రీ.పూ. 600) ఒక ఐతిహ్యం వుంది. ఇప్పటికి తెలిసినంత వరకు ఆంధ్ర శబ్దానికి సంస్కృతంలో మొదటి ప్రయోగం ఇదే. పైన చెప్పిన అయిదు జాతులవారు ద్రావిడులో, ముండా జాతివారో అయి వుండవచ్చు. భారతదేశానికి ఆర్యులు ఆగంతుకులనీ; ముండా ప్రజలు, ద్రావిడులు వారికి పూర్వమే ఈ దేశంలో వుండిన ఆదిమ వాసులనీ చారిత్రకుల నిర్ణయం. కాబట్టి ఆంధ్రులు ఆర్యేతరులైన ద్రావిడులలో ఒక తెగవారని భావించవచ్చు. ఆంధ్రుల ప్రసక్తి వ్యాసభారతంలో కూడ వుంది. మయసభలో అంగ, వంగ, పుండ్రక, పాండ్య, ఓఢ్ర, ఆంధ్రరాజులు ధర్మరాజుని కొలిచినట్లు వర్ణింపబడింది. మనుస్మృతిలో కారావరస్త్రీకి, వైదేహునకు జన్మించిన నిషాదులు ఆంధ్రులని చెప్పబడివుంది. క్రీస్తు శకారంభంనాటి నాట్య శాస్త్రంలో ఆంధ్రశబ్దం జాతిపరంగా వాడబడి వుంది. వాయుపురాణంలో ఆంధ్ర రాజులైన ఆంధ్ర భృత్యుల పేర్లూ, వారి పరిపాలనా కాలం వివరించబడి వున్నాయి. ఈ ఆంధ్రభృత్యులే శాతవాహన రాజులు. వారి పరిపాలనా కాలం క్రీ.పూ. 230 – క్రీ.శ. 225 అని చారిత్రకుల నిర్ణయం. ఇంకా సంస్కృత భాగవతంలోను, అశోకుని 13 వ ధర్మలిపి శాసనంలోను ఆంధ్రుల ప్రసక్తి కనిపిస్తుంది. ఈ విధంగా ప్రాచీనకాలం నుండి ఆంధ్ర శబ్దం జాతి వాచకంగా కనిపిస్తుంది.

వ్యాస భారతంలోను, భాగవతాది పురాణాలలోను అంధక, ఆంధ్రక జాతుల ప్రసక్తి కూడ కనిపిస్తుంది. "అంధక" అనేదాని సంస్కృత రూపమే అంధ్ర లేక ఆంధ్ర అని బరో (T. Burrow) అభిప్రాయం.

ఈ గ్రంథస్థాధారాలనుబట్టి ఆంధ్రులు ఆర్యేతరులనీ, ఆర్యులలో కొందరికి వీరితో సాంకర్య మేర్పడిందనీ చెప్పవచ్చు. ఆర్యుల ప్రాబల్యాన్ని ఎదుర్కోలేని ఆంధ్రులు దక్షిణాపథానికి తరలివచ్చి రాజ్యాన్ని స్థాపించుకొని వుండవచ్చు. పాలకులైన

వారి పేరే ఆ దేశానికీ ప్రజలకూ, భాషకూ కాలక్రమంలో ఏర్పడి వుండవచ్చు.

ఆంధ్రశబ్దం దేశవాచకంగా ప్రాచీన సంస్కృత వాఙ్మయంలోను, శాసనాలలోను కనిపిస్తుంది. వాల్మీకి రామాయణంలోను, వ్యాస భారతంలోను, భాగవత పురాణంలోను ఆంధ్ర శబ్దం దేశపరంగా వాడబడింది. బౌద్ధ వాఙ్మయంలోని అంధరట్ట (ఆంధ్రరాష్ట్ర) అనే పదం ఆంధ్రదేశ సూచకమే. క్రీ.శ. 234 నాటి శివస్కంధవర్మ మైదవోలు శాసనంలో "అంధా పధీయోగామో విరిపరమ్" అనే వాక్య భాగంలోని అంధపదం దేశవాచకం. క్రీ.శ. 340 ప్రాంతపు మల్లిదేవ నందివర్మ దానశాసనంలోను, క్రీ.శ. 600 ప్రాంతపు వరాహమిహిరుని బృహత్సంహితలోను ఆంధ్రపదం దేశవాచిగా వాడబడింది. ఇంకా అనేక గ్రంథాల్లోనూ, శాసనాల్లోనూ ఆంధ్రపదం దేశపరంగా కనిపిస్తుంది. కాబట్టి మొదట జాతివాచకమైన ఆంధ్రశబ్దం తరువాత దేశవాచకంగా ప్రయుక్తమైందనీ, అది క్రీస్తు శకానికి పూర్వమే దేశవాచకంగా కూడ వ్యాప్తిలోనికి వచ్చిందనీ చెప్పవచ్చు.

ఇక భాషావాచిగా సంస్కృత వాఙ్మయంలో క్రీ.శ. 11 వ శతాబ్దికి పూర్వం ప్రత్యక్ష ప్రయోగం లేదు. కాని, భరతుని నాట్యశాస్త్రంలో నాటకంలో ఉపయోగించదగిన 'విభాషలు' ఏడు విధాలనీ, అవి శకార, అభీర, చండాల, శబర, ద్రమిల, ఆంధ్ర, వనచరుల వ్యవహారంలోనివనీ చెప్పబడి వుంది. నన్నయ రచించిన నందంపూడి శాసనంలో ఆంధ్ర శబ్దం భాషావాచిగా ప్రయోగించబడింది. దీన్నిబట్టి ఆంధ్రశబ్దం 11 వ శతాబ్దినాటికి భాషాపరంగా రూఢి కెక్కిందని తెలుస్తుంది. ఆంధ్రశబ్ద చింతామణికర్త నన్నయ అని అంగీకరిస్తే ఆంధ్రశబ్దాన్ని గతంలో కూడ ప్రయోగించాడని చెప్పవచ్చు. నన్నయ తరువాతి తెలుగు కవులుకూడ ఈ శబ్దాన్ని తమ గ్రంథాలలో భాషాపరంగా ప్రయోగించారు. తెలుగులో గ్రంథరచన ప్రారంభమైనప్పటి నుండి ఆంధ్రశబ్దం భాషాపరంగా వాడబడింది. ఈవిధంగా మొదట జాతివాచకమైన ఆంధ్రశబ్దం తరువాత దేశవాచకం గాను, ఆ తరువాత భాషావాచిగాను వ్యాప్తిలోనికి వచ్చిందని తెలుస్తోంది. ఈనాడు కూడా ఆంధ్ర శబ్దం జాతినీ, దేశాన్నీ, భాషనీకూడ సూచించటానికి వాడబడుతోంది.

## తెనుంగు, తెనుఁగు, తెనుగు; తెలుంగు, తెలుఁగు, తెలుగు

తెనుంగు, తెనుఁగు అనేవి రెండూ రూపాంతరాలు. తెలుగు భాషా ధ్వని పరిణామంలో హ్రస్వం మీది పూర్ణబిందువుకు లోపం విభాషగా కావ్యభాషలో కనిపిస్తుంది. ఈ రెండు రూపాలు భాషాపరంగా మొదటిసారిగ నన్నయ భారతంలో కనిపిస్తాయి. నన్నెచోడుని కుమారసంభవంలో తెనుంగు పద ప్రయోగముంది. నన్నయ, నన్నెచోడు లిద్దరూ తెలుంగు, తెలుఁగు రూపాలను ప్రయోగించలేదు. పాల్కురికి సోమన తెనుంగు, తెలుఁగు పదాలను భాషాపరంగా ప్రయోగించాడు. తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో తెలుఁగు, తెలుగు పదాలను, భారతావతారికలో తెనుంగు, తెనుఁగు పదాలను ప్రయోగించాడు. తెలుంగు, తెలుఁగు రూపాలు తెనుంగు, తెనుఁగువలె రూపాంతరాలు. క్రీ.శ. 13 వ శతాబ్ది నుండి భాషాపరంగా వీటి ప్రయోగం కావ్యాలలో కనిపిస్తుంది.

భాషా వాచియైన తెలుఁగు, తెనుఁగు పదాలు ధ్వనుల మార్పు వలన ఏర్పడిన ఒకేపదం యొక్క రూపాంతరాలు.

తెనుఁగు: తెనుఁగు శబ్దవ్యుత్పత్తిని గురించి అనేకాభిప్రాయాలు పండిత లోకంలో వ్యాపించివున్నాయి. తెనుఁగు త్రినగ శబ్దభవమని చిలుకూరి నారాయణరావుగారి వూహ. ఇది దేశ్య పదమనీ, దిగ్వాచి అనీ గంటి జోగిసోమయాజిగారి అభిప్రాయం. తెనుంగు, తెనుఁగు పదాలలోని –ంగు, ఁగు ప్రత్యయ భాగమనీ తెన్ శబ్దం దిగర్థమున్న ద్రావిడ పదాంశమనీ D.E.D. (Burrow T. and Emeneau, M.B., A Dravidian Etymological Dictonery, Oxford: Oxford University Press, 1961) వలన తెలుస్తుంది. తెలుగు భాషలో నేటి వ్యవహారం నుండి తెన్ శబ్దం తొలగిపోయినా తెమ్మెర, టెంకాయ, తీరూ తెన్నూ, దిక్కూ తెన్నూ వంటి సమాసాల్లో మాత్రం నిలచివుంది. ప్రాచీన ద్రావిడ భాషా సమాజంలోని వారు తమకు దక్షిణ ప్రాంతంలో వున్నవారిని దక్షిణ దిగ్వాచియైన 'తెన్' శబ్దంతో వ్యవహరించి వుండవచ్చు. కాలక్రమంలో ఆ ప్రాంతపు మాండలికం ప్రత్యేక భాషగా పరిణమించి నప్పుడు ఆ ప్రజలను నిర్దేశించిన తెనుంగు వారి భాషకు పేరుగా ఏర్పడి వుండవచ్చు. ద్రావిడులు ప్రాచీన కాలంలో భారత దేశమంతటా వ్యాపించి వుండినవారే. కాబట్టి, ఉత్తర ద్రావిడులు దక్షిణ ద్రావిడులను 'తెన్' శబ్దంతో నిర్దేశించి వుండి వుంటారని జి. యన్. రెడ్డిగారి అభిప్రాయం.

తెలుఁగు: తెలుఁగు అనే పదం భాషాపరంగా సంస్కృత వాఙ్మయంలో కనిపించటం లేదు. తెలుగు దేశానికి త్రిలింగ దేశమనే పేరున్నట్లు క్రీ.శ. 13 వ శతాబ్దికి చెందిన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో వ్రాశాడు. తెలుగు త్రిలింగ శబ్దభవమని కూడ విన్నకోట పెద్దన అభిప్రాయపడ్డాడు. త్రిలింగ పదం దేశవాచకంగా బ్రహ్మాండ, స్కాంధ పురాణాలలో ఉన్నట్లు చిలుకూరి వీరభద్రరావుగారు తెలియజేశారు. తెలుగు త్రిలింగ శబ్దభవంకాదనీ, తెలుగు యొక్క సంస్కృతీకృత రూపమే త్రిలింగమనీ కొమర్రాజు లక్ష్మణరావు గారు నిరూపించారు.

తెలుగు త్రికలింగ శబ్దభవమనీ, ధ్వని పరిణామం వలన త్రికలింగ > తిఅలింగ > తెలింగ > తెలుంగుగా మారిందనీ

గంటి జోగిసోమయాజిగారి ఊహ. ఇది సహేతుకం కాదు. తెలుగు త్రిలింగ, త్రికలింగ పదాలనుండి పుట్టినది కాదనీ, త్రిలింగ పదం ప్రాచీనమైనది కూడ కాదనీ, కళింగము తప్ప మిగిలిన నేటి తెలుగు దేశాన్ని కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి పరిపాలించటం వలన శివక్షేత్రాలైన శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామాలను సరిహద్దులుగా చెప్పి, ఆ క్షేత్రాలలోని శివ లింగాల వలన ఈ దేశానికి త్రిలింగమనే పేరు వచ్చినట్లు విద్యానాథుడు చమత్కరించాడనీ, అంతకుపూర్వ మీ దేశానికి త్రిలింగమనే పేరున్నట్లు కానరాదనీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అభిప్రాయం.

తెనుగు, తెలుగు పదాలు రూపాంతరాలే కాని భిన్న ధాతుజములు కావు. ద్రావిడ భాషలలో న/ల ల వినిమయం జరుగుతుంది. ఉదా. ములగ–మునగ, చాలా–చానా మొదలైనవి. కాబట్టి, తెలుగు త్రిలింగ శబ్దభవం కాదనీ, దేశ్యమైన 'తెనుఁగు యొక్క రూపాంతరమే అనీ, ఈ తెనుగు, తెలుగు రూపాలు రెండూ ప్రాచీనకాలం నుండీ తెలుగుదేశంలో వ్యవహారంలో ఉన్నాయనీ నిర్ణయించవచ్చు.

పరిణామ దృష్టితో పరిశీలిస్తే రెండువేల సంవత్సరాల తెలుగు భాషా చరిత్రని మూడు ప్రధాన యుగాలుగా విభజించవచ్చు. క్రీ॥శ॥ 200 నుండి 1000 వరకు ప్రాఙ్నన్నయ యుగం లేదా ప్రాచీన యుగం. క్రీ॥శ॥ 1000 నుండి 1500 వరకు మధ్యయుగం. క్రీ॥శ॥ 1500 నుండి నేటి వరకు ఆధునిక యుగ మనవచ్చు. వీటిలో కొన్ని అవాంతర దశ లున్నాయి.

నన్నయకు పూర్వమే తెలుగు భాషలో కావ్యశైలి ఏర్పడి వున్నదనటానికి ఆధారాలు కన్పిస్తున్నాయిగాని నన్నయ గ్రంథస్థం చేసిన భారత భాష మాత్రమే గ్రాంథికమై తరువాతి కవులకు అనుసరణీయమైంది. కాని నన్నయకి తరువాతి వారైన శివకవుల రచనలలో మాత్రం నన్నయకు భిన్నము వ్యావహారికానికి కొంత సన్నిహితమూ అయిన భాషా లక్షణాలు కొన్ని కన్పిస్తాయి.

కావ్య భాష పరిణామాన్ని పరిశీలించటానికి క్రీ॥శ॥ 11 వ శతాబ్ది నుండి 16 వ శతాబ్ది వరకు గల కాలాన్ని ఒక యుగంగాను, 16 వ శతాబ్ది నుండి నేటి వరకు గల కాలాన్ని ఇంకో యుగంగాను విభజించవచ్చు. క్రీ॥శ॥ 11–14 శతాబ్దుల కాలం కవిత్రయ యుగం. శ్రీనాథుడు 15 వ శతాబ్దిలోని వాడు. కావ్యభాషలో 14, 15 శతాబ్దుల మధ్య ఎక్కువ భేదం కనపడదు. అందువలన 1500 వరకు గల కాలాన్ని ఒక యుగంగానే భావించి భాషా పరిశీలన చేయవచ్చు.

ఆంధ్ర భాషా సాహిత్యాల చరిత్రలో 1600–1900 కాలం ఒకవిధంగా పరిణామాత్మకమైనది. ఈ కాలంలో సాహిత్యంలో నూతన ప్రక్రియలు, వాటికి తగిన భాష ఏర్పడ్డాయి. ఈ కాలపు కవుల రచనలలో ఆయా ప్రాంతాల మాండలికాలు కన్పిస్తాయి. కొందరు పాత్రోచిత భాషను కూడ వ్రాయటం వలన ఆనాటి శిష్ట వ్యావహారికమూ, శిష్టేతర వ్యావహారికమూ ఏవిధంగా ఉండేవో కొంతవరకు తెలుస్తుంది. ఆ యా కవులు వాడిన అన్యదేశ్యాల వలన తెలుగులో లేని వర్ణాలు కొన్ని కన్పిస్తాయి. ఆ యా అన్య దేశ్య ధ్వనులకు సన్నిహితంగా ఉండే మన లిపి సంకేతాలనే వాళ్ళు వాడారు.

నన్నయకు పూర్వపు భాషని గురించి తెలుసుకోటానికి కేవలం ఆ కాలపు శాసనాలే ఆధారం. వీటి ఆధారంగా ఆనాటి తెలుగు భాషా స్వరూపాన్ని, దాని పరిణామ రీతినీ గ్రహించవచ్చు. క్రీస్తు శకారంభం నుండి మొదటి అయిదారు శతాబ్దులకాలం వరకు వేయబడిన తెలుగుదేశపు శాసనాలు ప్రాకృత సంస్కృత భాషలలోనే వున్నాయి. ఆ ప్రాకృత సంస్కృత శాసనాల నడుమ తెలుగు గ్రామనామాలు, వ్యక్తి నామాలు మాత్రమే కనిపిస్తాయి. వాటి ఆధారంగా నాటి తెలుగు భాషా స్వరూపాన్ని కొంతవరకు ఊహించవచ్చు. క్రీ॥శ॥ 7 వ శతాబ్ది నుండి తెలుగు చోళ చాళుక్య రాజాదులు వేయించిన తెలుగు శాసనాలు లభిస్తున్నాయి. వీటిలో క్రీ॥శ॥ 9 వ శతాబ్ది వరకు ఉన్నవి గద్య శాసనాలు. తొమ్మిదో శతాబ్ది నుండి గద్య పద్యాత్మక శాసనాలు కనిపిస్తున్నాయి.

పద్యశాసన కాలపు భాష నన్నయ భాషకు దగ్గరగా ఉన్నట్లు కనిపిస్తుంది. నన్నయకు పూర్వపు తెలుగు శాసనా లలో ఉన్న పద్యాలన్నీ దేశీయ ఛందస్సులోనే రచించబడ్డాయి. లభించినంతవరకు శాసనాలలోని మొదటి పద్యం తరువోజ. ఇది చాళుక్య గుణగ విజయాదిత్యుని సేనా నాయకుడైన పండరంగని అద్దంకి శాసనంలో ఉంది.

ఈ శాసనాలలోని భాష ఆధారంగా తెలుగు భాషా స్వరూపం ప్రాక్సాహిత్య దశలో ఏ విధంగా ఉన్నదో కొంతవరకు ఊహించవచ్చు. ఆ తరువాత కాలపు శాసనాలనుబట్టి ఆయా కాలాలలోని భాషా పరిణామ రీతులు వ్యక్తమవుతాయి. నన్నయ నుండి గ్రంథస్థ సాహిత్యం కూడ లభ్యమవుతుంది. కాబట్టి, కావ్య భాషా పరిణామం కూడ ఏవిధంగా జరిగిందో తెలుస్తుంది. శాసన భాషనీ, కావ్య భాషనీ పరిశీలించి చూస్తే ఆయా కాలాలలో శాసన భాష, కావ్య భాష కూడ పరస్పరం ప్రభావితం అయినట్లుగాను, ఆ కారణంగా కొన్ని కావ్య భాషా ప్రయోగాలు శాసన భాషలోనికి, కొన్ని శాసన భాషా ప్రయోగాలు – అంటే, వ్యవహార భాషా రూపాలు కావ్యభాషలోనికి ప్రవేశించినట్లు తెలుస్తుంది. ప్రాక్సాహిత్య దశనుండి నేటి వరకు తెలుగుభాష ఏవిధంగా క్రమ పరిణామాన్ని పొందిందో, ఏవిధంగా వికాసాన్ని పొంది నేటి ఈ స్థితికి వచ్చిందో కూడ స్పష్టమవుతుంది.

స్థలనామ ప్రత్యయాలు: తెలుగు దేశపు గ్రామనామాలు ఊరు, పట్టు, కొన్త, కోడు, చెఱువు, పల్లి మొదలైన తెలుగుపదాలు అంతమందు కలిగినవి – అంతుకూరు,

పెనుకపట్టు, తాన్టికొన్ట, ఒంగోడు, చెంచెఱువు, ఉరువుపల్లి వంటివి ప్రాఙ్నన్నయ్య కాలపు శాసనాలలో కనిపిస్తాయి. ఇంకా మ్లావిండి, అత్తిలి, కొడికంకి, కన్దేఱు, నిడుంగట్ట, పులికల్లు, గారలగుణ్ట, కడాకుదురు, నన్దిగామ, కారమిచేడు, పల్లినాణ్టి, విరిపర, దూౠద్రుపాక, అమ్మలపూణ్డి, చెఱువూరు, ఇన్నుటో లి, పెనుమన్ల, రావిరేవు, గణ్ఠశాల, కొల్లికుఱ్ఱు, తామరకొలని మొదలైన గ్రామనామాలు శాసనాలలో కనిపిస్తాయి.

ఱ కారం: ప్రాఙ్నన్నయ కాలపు భాషలో ద్రావిడ భాషా వర్ణమైన ఱ కారం కనిపిస్తుంది. ఇది పదాదిన, పదమధ్యంలోను, సంయుక్తంగాను కూడా కనిపిస్తుంది. ఉదా: ఱెం దులూర, ఇన్నుటో లి, ట్టొ లనాఱ్ఱు. క్రీ.శ. 1000 తరువాత ఇది కొన్ని సంజ్ఞావాచకాలలోనే కన్పిస్తుంది. ఉదా: నిఱు వెర్పు చోట గంగ. 13 వ శతాబ్దిలో "ఋ త్తిక" ప్రయోగమొక్కటే వుంది. ఈ శతాబ్దులలో నైనా కేవలం వ్రాతలో నిలిచి వున్నదనీ ఉచ్చారణలో ఆ ధ్వని లేదనీ చెప్పవచ్చు. నఱం గలవాడు, విహారవా ఱ వంటి రూపాలలో డ కారానికి బదులు ఱ కారం 12 వ శతాబ్దానికి చెందిన శాసనాలలో వ్రాతలో కన్పిస్తోంది. కాబట్టి ప్రాచీన లేఖన పద్ధతి నిలిచి వుందని చెప్పవచ్చు. 14 వ శతాబ్దిమండి ఈ ఱ కారం అసలు కన్పించదు.

కావ్యభాషలో ఱ కారం నన్నయ నాటికే లేదు. అది డ, ర లతో కలసిపోయింది.

అనుస్వారం: క్రీ.శ. 4 వ శతాబ్దిమండి వర్గ పంచ మాక్షరం గాని, దానికి బదులు అనుస్వారం వ్రాయటంగాని కనిపిస్తుంది. ఉదా. పణ్బూర, కంగూర. పదాంతంలో ఏళన్, ప్రవర్తమానం అనేవిధంగా ద్రుతంగాను, బిందువుగాను కనిపిస్తుంది. ఒకేపదంతో అనుస్వారమూ వర్గపంచమాక్షరమూ కూడా వ్రాసినవి వున్నాయి. ఉదా. నాంణ్డు. 4 వ శతాబ్దినాటికి అనుస్వారం వ్రాసే పద్ధతి వచ్చినా 7, 8 శతాబ్దుల నాటికి మాత్రమే ఇది నిలదొక్కుకొంది. అయినా గాని, అనుస్వారం కంటె వర్గ పంచమాక్షర పద్ధతే ప్రాచుర్యంలో ఉండేది. 11 వ శతాబ్దిమండి అనుస్వారం వ్రాయటం అధికమైంది గాని పూర్వపు పద్ధతి పూర్తిగా తొలగిపోలేదు. వర్గ పంచమాక్షరాలకు బదులు అనుస్వారం వ్రాయటం 12 వ శతాబ్దిమండి అధికమైంది. 14వ శతాబ్ది నాటికి పూర్తయిందనవచ్చు. కాని ట వర్గాక్షరాలకి పూర్వం మాత్రం ఆ వర్గానునాసికం తరచుగా కనిపిస్తోంది. ఉదా. మణ్డలేశ్వర. ఇటువంటి చోట్ల అనుస్వారం గాక ణ కారమే తరచుగా వ్రాయబడేది.

అర్ధానుస్వారానికి శాసనాలలో ప్రత్యేక లిపి సంకేతం లేదు. మొదట బిందువు (చుక్క) గా ఉండి తరువాత సున్నగా మారిన సంకేతం పూర్ణార్ధ బిందువులను రెంటినీ సూచించేది. ఛందస్సునిబట్టి మాత్రమే అది అర్ధానుస్వారమో కాదో నిరూపించటానికి వీలయ్యేది. పూర్ణానుస్వారంగా పఠించినప్పుడు ఛందోభంగం జరిగితే దాన్ని అర్ధానుస్వారంగా పఠించాల్సి వస్తుంది. మొత్తంమీద అనుస్వారం అనునాసిక వర్ణాలకు ప్రత్యామ్నాయ సంకేతంగా ఉంది.

క్రీ॥శ॥ 17 వ శతాబ్ది నుండి పూర్ణానుస్వారం నిలచిన చోట్ల అనుస్వారం పైన హల్లు ద్విరుక్తంగా వ్రాయబడటం శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. సుంక్కము. అనుస్వారం జారిపోయి అర్ధానుస్వారాన్ని సూచించటానికి పూర్ణాను స్వారం పైన హల్లు ద్విరుక్తంగా కనపడక పోవటము వుంది. ఉదా. మేంకలు, మామిండి.

ద్విత్వాను నాసికాలకు పూర్వం తరచుగా అనుస్వారం రావటం 15-19 శతాబ్దుల శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. కాచంన్నంగారు, పుచుకొంన్న గ్రామాలు, దుంన్ని, తిరుమలంమ్మవారు, మింమ్మ.

సంస్కృతంనుండి వచ్చిన ఎరవు పదాలలో అనుస్వారం వున్న పదాలు వివిధ రీతులుగా వ్రాయబడ్డాయి. ఉదా. సంగ్వత్సరంబు, సమంత్సరంబు, సహ్వస్వర, సంహ్వత్సర, సంమ్వత్సరంబు (సంవత్సరం), సింహ్వ, సింహ్వ, సిహ్వ, సింఘ (సింహం), నరసిహ్మ, నరసింహ్మ (నరసింహ), బ్రాంహ్మణ, బ్రాంహాల (బ్రాహ్మణ).

పదాంతంలో అనుస్వారం, నకారపు పొల్లు ప్రాఙ్నన్నయ కాలంనుండి ఆధునిక కాలం వరకు కనిపిస్తుంది. అనుస్వారం తరచుగాను, నకారపు పొల్లు క్వాచిత్కంగాను 12-14 శతాబ్దులలో కనిపిస్తుంది. ఉదా. రక్తం, మాసం, చంద్రమౌళికిన్. ఈ విధంగా ము ప్రత్యయం అనుస్వారంగా వ్రాయబడటం తరువాతి శాసనాల లోను ఉంది. ఉదా. గ్రామం, సమర్పింంచినారం.

కావ్యభాషలో వర్గాక్షరానికి పూర్వం వచ్చే అనునాసి కాన్ని అనుస్వారంగా వ్రాసేవారు గాబట్టి దేశ్య శబ్దాలలో అనుస్వారానికి వర్గాను నాసికం విలువయే వుంది. తద్భి న్నోచ్చారణ సంస్కృత శబ్దాలలో కనిపిస్తుంది. ఉదా. సంయమి, సంహారము. దేశ్య శబ్దాలలో నన్నయ భాషలో దీర్ఘంపైన అనునాసిక వ్యంజనోచ్చారణ కనపడదు. స్వరానికి అనునాసికోచ్చారణ వుంది. ఉదా. వాఁడు. శివకవులలో మాత్రం దీర్ఘాచ్చుపైన అనునాసిక వ్యంజనోచ్చారణ కలిగిన రూపాలు కొన్ని కనిపిస్తాయి. ఉదా. పోండిగ, మూండు. దీన్నిబట్టి కొన్ని మండలాలలో దీర్ఘం మీది అనుస్వారాన్ని పలుకుతూ వుండేవారని భావించవచ్చు. ఈవిధంగా దీర్ఘం మీది అనుస్వారాన్ని పలకటం, దీర్ఘాచ్చుకి అనునాసికోచ్చారణ వుండటం అనే రెండు పద్ధతులు ఆ కాలంలో ఉన్నాయని తెలుస్తుంది.

ఋ > రి, ఋ > రు: అచ్చులలో ఋ ప్రత్యేక వర్ణంగా శాసన భాషలో కనపడదు. ఇది రి గాను, రు

గాను వ్రాయబడేది. ఉదా. రిషభ, పిత్రుస్థానము, ప్రుదివి, రుతు. ప్రాఙ్నన్నయ కాలం నుండి 19 వ శతాబ్ది వరకు శాసనభాషలో ఈ విధంగానే వుంది. 17 వ శతాబ్దినుండి రి ఉచ్చారణ తక్కువగా వుండి, రు ఉచ్చారణ అధికమైనట్లు కనిపిస్తుంది. వ్రిత్తి, పౌత్రుడు, శూద్రులు మొదలైన పదాలలోని విలోమ లేఖనం వలన రు ఉచ్చారణ అధికంగా ఉండేదని తెలుస్తుంది.

నన్నయ భారతంలోని ఋ-రి యతి రికారోచ్చారణని సూచిస్తుంది. తరువాత కవులు నన్నయ ననుసరించారు. 12 వ శతాబ్దికి చెందిన పాల్కురికి సోమనలోను, 13 వ శతాబ్దికి చెందిన తిక్కనలోను ఋ-రు యతి కనిపిస్తుంది. దీన్నిబట్టి 12 వ శతాబ్దినుండి ఋకారానికి రుకారోచ్చారణ అధికమైందని వూహించవచ్చు. సంస్కృత సమాసాలలో మాత్రం రావలసిన ఋకారాన్ని అహోబలపతి దేశ్యపదంలో కూడ వాడాడు. బ్రుంగి అనే రేఫయుక్త పదాన్ని బృంగి అని ప్రయోగించాడు. దీన్నిబట్టి ఋకారోచ్చారణ రుకారోచ్చారణతో సమానమైందని భావించాలి.

అ>ఎ, ఎ>అ: పదాదిన య కారం క్రీ.శ. 5 వ శతాబ్దినుండి, పదాదిన వ కారం క్రీ.శ. 9 వ శతాబ్దినుండి లేఖనంలో కనిపిస్తున్నాయి. ఉదా. యళ్ళులూరు, యల్లమ్మ, వుద్దిని. ఈ విధంగా ఎ కారానికి య కారం వ్రాయటం శాసనభాషలో ప్రాఙ్నన్నయ కాలంనుండి 19 వ శతాబ్దివరకు కనిపిస్తూనే వుంది. ఉదా: యవ్వరు, యట్లు (<ఎట్లు) యనక < యెనక < వెనుక. తాలవ్య హల్లులకి పరమైన అ కారం తత్సమ పదాలలో ఎ కారంగా మారటం శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. విజెయువాడ, శెంఖు, యెథోచిత, ఆచెంద్రార్క్కస్థాయిగాను, హరిశ్చెంద్ర, సెనివారానను. ఇటువంటి 'ఎ' కారం తెలుగు పదాలలోని 'య' కారం మీద రావటం 16 వ శతాబ్ది శాసన భాషలో కనిపిస్తుంది. ఉదా. ఊరుం గాయెల తోడను. దేశి పదాలలో తాలవ్య హల్లులకి పరమైన ఎ, ఏ లు క్రమంగా అ, ఆ లుగా మారటం 15 వ శతాబ్దినుండి తరచుగా కనిపిస్తుంది. ఉదా. సమర్పించను (చెను), చేశను (చేసెను), పండితుల చాత (చేత), కుచ్చళ్ళు. కుచ్చెళ్ళు అనే రూపమూ వుంది. ఈ మార్పునిబట్టి తాలవ్య హల్లుల తరవాత అ/ఎ ల భేదం పోయినట్లూ ఆ అ/ఎ లకు బదులుగా ఎ (ఐ) వ్యవహారంలో ఉండినట్లూ చెప్పవచ్చు.

ఆది సంధ్యక్షరంగా ఇ ఈ ఎ ఏ లు య కారాన్ని, ఉ ఊ ఒ ఓ లు వ కారాన్ని ఉచ్చారణలో గ్రహిస్తాయి. అందువలననే శాసన భాషలో పదాది యకార వకారాలతో కూడిన తెలుగు పదాలు కూడ కొన్ని కనిపిస్తాయి. కావ్యభాషలో మాత్రం ఈ విధమైన రూపాల నెవరూ వాడలేదు. అయినా లాక్షణికులు ఈ ప్రమాదం వుందని గుర్తించి కవులను హెచ్చరించారు. యకారంబును, వు వూ వొ వో లును తెలుగు మాటలకు మొదట లేవని చిన్నయసూరి సూత్రించటంలో ఉద్దేశం ఇదే.

ఎ>అ గా మారిన వ్యవహార రూపాలు 17 వ శతాబ్ది నుండి కావ్యభాషలో ప్రవేశించాయి. ఉదా॥ చాటంత మబ్బు, ఎక్కడ బోయవో, దయచాత. అ>ఎ గా మారిన వ్యవహార రూపాలూ కనిపిస్తాయి. ఉదా. చెరించే విధము.

సాధు శకట రేఫలు: క్రీ॥శ॥ 4 వ శతాబ్దికి చెందిన చెఴ్చెఱువ కమ్మురాఴ్చెరువ వంటి శాసన ప్రయోగాలను బట్టి సాధు శకట రేఫల భిన్నవర్ణత్వం క్రీ॥శ॥ 7 వ శతాబ్దికి పూర్వమే పోయిందని తెలుస్తుంది. సంయుక్తాక్షర గతమైన శకట రేఫ కూడ ఆ కాలంలోనే సాధురేఫగా మారింది. ఉదా. తూఱ్పు > తూర్పు. 'ఴ్ణ' కారం ఴ్డ, ణ్డ, ణ్డ్రి లుగా మారటం కూడా అప్పుడే జరిగింది. ఉదా. తాఴ్తికొఴ్త, కొణ్డ, పణ్డ్రెణ్డు, వాణ్డ్రి.

శకట సాధు రేఫలు శాసన భాషలో తారుమారవ తూనే వున్నాయి. అయినాగాని శకట రేఫ రూపాలు 1100-1400 ప్రాంతపు శాసనాలలో చాలవరకు సక్రమంగానే వ్రాయబడ్డాయి. బాల వ్యాకరణంలో సాధురేఫగా చెప్పబడిన కూతురు శబ్దంలోను, - రాలు ప్రత్యయంలోను కూడ నాటి శాసనాలలో తరుచుగా శకట రేఫ వ్రాయబడి వుంది. ఉదా. కూతుఱు, నాయకుఱాలు. 15, 16 శతాబ్దుల శాసనాలలో శకటరేఫ వ్రాతలో ఉందిగాని దానికి బదులు సాధురేఫను వాడటం అధికమయింది. శకట సాధు రేఫల మధ్య భేదం పోయినట్లే అని చెప్పవచ్చు. విరుగమొత్తి, మనుమరాలు, తాటిపరు. చెరువులు అని చాలచోట్ల శకట రేఫకు బదులు సాధురేఫ కనిపిస్తుంది. చెఱువువంటి శకటరేఫ రూపాలు కొన్ని కేవలం వ్రాతలో వుండేవనీ ఉచ్చారణలో ర, ఱల భేదం పోయిందనీ చెప్పవచ్చు. శకట సాధు రేఫలను ఒకదానికొకటి వ్రాయటం 17-19 శతాబ్దుల శాసనాలలో కూడ కనిపిస్తుంది. ఉదా. చెరువు, చెఱువు. తుఱక అనే అన్యదేశ్యంలో కూడ శకట రేఫ కనిపిస్తుంది. మర్ఱి చేనికి వంటి ద్విరుక్త రేఫరూపాలూ వున్నాయి.

రేఫ శకట రేఫలు నన్నయ భాషలో భిన్నవర్ణాలు గానే వున్నాయి. నన్నయ, నన్నెచోడుల గ్రంథాలలో ఈ రెంటికి సాంకర్యం లేదు.

కాలక్రమంలో ర, ఱల కలయిక అధికమైంది. లాక్షణికులు రేఫ ఱకార నిర్ణయాన్ని గురించి వ్రాయటమే దీనికి నిదర్శనం.

ఴ>ల, ఩>న: ప్రాచీన ద్రావిడ భాషలోని *ఴ వర్ణము క్రీ॥శ॥ 600 వరకు తెలుగు శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. ఏఴూరు. ఇది లవర్ణంతో కలిసిపోవటం 7 వ శతాబ్దిలో మొదలయి 9 వ శతాబ్దికి పూర్తయినట్లు తెలుస్తుంది.

ఇదేవిధంగా మూలద్రావిడ *ణ వర్ణం కూడ తెలుగులో న వర్ణంతో కలిసిపోవటం అదే సమయంలో జరిగింది. 7 వ శతాబ్దినాటి శాసనంలో 'అణతి' అనే ణ కారయుక్త రూపమూ, 'పని' అనే నకారయుక్త రూపమూ కూడ లభించాయి. 'పని' అనేదానికి ప్రాచీనరూపం 'పణి' అనేది. ప్రాచీన శాసనాలలో ఈ రూపమూ కనిపిస్తుంది. ఉదా. పణిసేసిన.

**తాలవ్యీకరణము:** పదాది ద్రావిడ *క వర్ణం తాలవ్యాచ్చులు పరమైనపుడు తెలుగులో చ కారంగా మారుతుంది. ఈ ధ్వని పరిణామాన్ని తాలవ్యీకరణం అంటారు. పెదవేగి శాసనం (క్రీ॥శ॥ 395–410) లోని చెఞ్చె ఉవు, కమ్బురాఞ్చె ఉవు అనే పదాలలోని చెఞుపునిబట్టి ఆనాటికి తెలుగులో తాలవ్యీకరణం స్థిరపడిందని చెప్పవచ్చు. కాని 8 వ శతాబ్దివరకు 'చేయు' ధాతువుకి పూర్వరూపమైన 'కెయ్' ధాతువుతో కూడిన రూపాలు పనికేసిన, కేసిరి, కేసి వంటివి కనిపిస్తాయి. తాలవ్యీకరణం జరగని ఈ రూపాలు ప్రాచీన లేఖన సంప్రదాయంగా మాత్రమే నిలిచాయనీ, ధ్వనిపరిణామం జరగటం మాత్రం అప్పటికే పూర్తయిందనీ భావించాలి.

**డ్ల>ళ్ళ:** ప్రాచీన శాసన భాషల్లో డ్ల రూపా లధికం. ళ్ళ రూపాలు క్వాచిత్కం. 12 వ శతాబ్ది తరువాత ళ్ల రూపాలు క్రమంగా అధికమవుతూ డ్ల రూపాల స్థానాన్ని ఆక్రమించాయి. ఉదా. మూడ్లు, మూళ్లు, గుళ్ళు. 15, 16 శతాబ్దులలో డ్ల రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి. ఉదా. గుడ్లు కట్టించి. ళ్ల రూపాలే అంటే, సమీకరణం చెందిన రూపాలే అధికం. ఉదా. దేవుళు, నీళు, కవుళ్లు, అడువాళ్లు.

**డ>ద:** వర్ణవ్యత్యయం వలన ఏర్పడిన పదాది డ కారం ద కారంగా మారటం శాసన భాషలో 10 వ శతాబ్దిలోనే ప్రారంభమైంది. అయినాగాని డ కారాది రూపాలు 1100 తరువాత కూడ చాలవరకు శాసన భాషలో నిలిచి ఉన్నాయి. ఉదా: డాయు, డున్ను. దకారంగా మారిన రూపాలు స్వల్పంగా కనిపిస్తాయి. ఉదా. దుత్తిక>డుత్తిక> ఉతిక, దున్ను.

దేశ్య పదాలలోని ఈ పదాది డ కారం కావ్యభాషలో నన్నయ కాలం నుండి ద కారంగా మారటం జరిగింది. నన్నయ నన్నెచోడుల కావ్యాలలో డ/ద తో కూడిన రూపాలు కనిపిస్తాయి. ఉదా. నన్నయలో డప్పి–దప్పి, డాచు–దాచు. నన్నెచోడునిలో డాయన్–దాయన్, డాగి–దాపక. క్రమంగా ద గా మారిన రూపాలే కావ్యభాషలో అధికమైనాయి.

**స>శ:** తాలవ్యాచ్చు పరమైనప్పుడు సకారం శకారంగా మారటం శాసన భాషలో కనిపిస్తుంది. 13 వ శతాబ్ది నుండి ఇది అధికం. ఉదా: పడశిన, శీతాదేవి, చేశెను. ఈ విధంగా స>శ గా మారిన తరువాత దానికి పరమైన ఎ, ఏ లు అ ఆలుగా మారటం 15 వ శతాబ్దినుండి శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. శలవు, చేశను, శావ (సేవ). దీనినిబట్టి ఈ కాలంలో తాలవ్య హల్లులపై నున్న ఎ, ఏలు ఎ, ఏ ( ᴂ·ᴂ̄ ) లుగా ఉచ్చరించబడేవని చెప్పవచ్చు.

శ, స లు తారుమారుగా వ్రాయటం కావ్యభాషలో కనిపించదు. అయినా నాటి వ్యవహార రూపాలను దృష్టిలో పెట్టుకుని కావచ్చు – అప్పకవ్యాదులు సకలము, సకృత్తువంటి పదాలను శకలము, శకృత్తులుగా వ్రాయవద్దని హెచ్చరించారు.

**పదాది సంయుక్తాక్షరాలు:** వర్ణవ్యత్యయ అజ్సంకోచాల కారణంగా తెలుగులో పదాదిన ఏర్పడిన సంయుక్తాక్షరాలు క్రీ॥శ॥ 4, 5 శతాబ్దులనుండి శాసన భాషలో కనిపిస్తాయి. ఉదా: క్ణొచ్చె, ప్ఱోలనాణ్డు. ఈ రూపాలు 7 వ శతాబ్ది నాటికి రేఫయుక్త రూపాలుగా మారాయి. ఉదా: క్రొచ్చె, వ్రచ్చిన. ఇంటువంటి పదాది సంయుక్తాక్షరంలోని సాధు రేఫ 12 వ శతాబ్దిలో రాలిపోయి వుంటుందని భద్రిరాజు కృష్ణమూర్తిగారి అభిప్రాయం. ఈ రేఫరహిత రూపాలు గొచ్చి, పోలము, పప్పవంటివి కొన్ని 7 వ శతాబ్దినుండి శాసనాలలో కనిపిస్తాయి. దీనిని బట్టి మార్పు 7 వ శతాబ్దిలోనే మొదలైందనీ, అప్పుడది విరళంగా వుండేదని ఊహించవచ్చు. 16 వ శతాబ్దివరకు ఈ రేఫ రహిత రూపాలు శాసనాలలో కన్పిస్తాయి. కాని 15, 16 శతాబ్దులలో ఇవి చాల అధికం. ఉదా. కొత్త, పెగ్గడ, కింద. 17–19 శతాబ్దుల శాసనాలలో ఈ రేఫ జారిపోని రూపాలే చాల కనిపిస్తాయి. అవి కావ్యభాషా రూపాలైనా కావాలి. లేదా ఉచ్చారణ రేఫ రహితంగానే వున్నా లేఖనంలో రేఫను వ్రాసైనా వుండాలి. ఉదా. క్రొత్త, ప్రాత, క్రింద, ప్రగ్గడు.

కావ్యభాషలో ఈ రేఫ రహిత రూపాలు ప్రవేశించ లేదు. ఇటువంటి రూపాలను కేతన గ్రామ్యాలన్నాడు.

**ఇయ>య:** ఇ యాంత నామాలలోని 'ఇ' లోపించి, సంయుక్తాక్షరం ఏర్పడటం 11 వ శతాబ్ది శాసన భాషలో కనిపిస్తుంది. ఉదా. దివ్య. ఇది దీప శబ్ద భవమైన దివియ నుండి ఏర్పడినది. తిక్కన కవితలో ఇటువంటి రూపాలున్నాయి. 13 వ శతాబ్దినుండి శాసన రూపాలలో 'ఇ'గాని 'ఇయ్'గాని లోపించటం కనిపిస్తుంది. ఉదా. చెల్యలు (చెలియలు), మూన్య (మూనియ), మూన. ఇయకు మారుగా ఎత్వం కూడ కనిపిస్తుంది. ఉదా. మూనె, చెల్లెలు. ఇంకా గొఱియలు, గొఱ్యలు, గొఱ్రెలు, గొఱ్ఱులు – గొర్లు అనే రూపాలు ఈ శాసనాలలో కనిపిస్తాయి. తత్సమ పదంలో కూడా ఈ మార్పు కనిపిస్తుంది. ఉదా. హత్య>హత్తె. ఈ ఇయాంత నామాలు ఎ కారాంతాలుగా, ఇ కారాంతాలుగా కూడ 17 వ శతాబ్దినుండి శాసనాలలో కనిపిస్తాయి. ఉదా. గొఱె, గొఱి.

కావ్యభాషలో నన్నయ, నన్నెచోడుల గ్రంథాలలో

ఇయాంతాలు, ఎత్వ రూపాలు కూడ కనిపిస్తాయి. ఉదా. గద్దియ>గద్దె, పల్లియ>పల్లె. కన్నియ, పక్కియ, లొట్టియ, అనేవి నన్నయ భారతంలోని ప్రయోగాలు. నన్నెచోడుడు తేనియ, తేనె, ఎడకత్తియ, చెలికత్తె, మల్లియ వంటివి ప్రయోగించాడు. కేతన ఆంధ్ర భాషా భూషణంలో ఇయాంతాలనే కావ్యాలలో ప్రయోగించాలన్నాడు. అప్పటికి ఎత్వరూపాలను వ్యావహారికాలుగానే భావించారనవచ్చు. తరువాతి లాక్షణికులు అహోబలుడు, కూచిమంచి తిమ్మకవి ఎత్వరూపాలను అంగీకరించారు.

అన్యదేశ్యాలలోని 'హ' లోపించడం 16 వ శతాబ్దాది నుండి శాసనాల్లో కనిపిస్తుంది. ఉదా. అత్య–హాత్య, మొల్లా–మొహల్లా. సాహెబు, సాయిబు అనే రెండు రూపాలు 17వ శతాబ్ది శాసనాలలో ఉన్నాయి.

దక్షనీ ఉర్దూ నుండి తెలుగులో ప్రవేశించిన ఫ (దంత్యోష్ఠ్యోష్మం) తో కూడిన అన్యదేశ్యాలు ఫరుమానా, పరుమానా, ఫౌజుదారువంటి రూపాలు 17 వ శతాబ్దినుండి శాసన భాషలో కనిపిస్తాయి.

కావ్యభాషలో శ్రీనాథుని కాలంనుండి అరబ్బీ, ఫార్సీ భాషా పదాలు అధిక మవుతూ కనిపిస్తాయి. ఈ అన్యదేశ్యాలలో వచ్చే *f*, *x*, *y*, *z* అనే ఊష్మాలకు ఫ,క,ఖ,గ,జ వర్ణాలనే తెలుగు కవులు సంకేతాలుగా వాడారు. వేరే గుర్తులు వీటికి ఏర్పరచలేదు. ఇందులో *f* దంత్యోష్ఠ్యం శ్వాసోష్మం. దీనిని ఫ తోనే సూచించారు. ఉదా. ఫౌజు, ఫిరంగీలు. *x* అనేది కంఠ్య శ్వాసోష్మం. దీనిని క తోను, ఖ తోను సూచించారు. ఉదా. కపురు, ఖబురు, *y* కంఠ్య నాదోష్మం. దీనిని గతో సూచించారు. ఉదా. మొగలీ పజ్రీడు, గరీబు, గలీబు, గలీజు. *z* నాదాత్మక దంతమూలీయోష్మం. దీనిని జ తో సూచించారు. ఉదా. వజీరు, బాజారు, జులుము, హుజూరు.

సంస్కృత పదాల కారణంగా కావ్యభాషలో విసర్గ ప్రవేశించింది. ఉదా. తపఃఫలము, అంతఃకరణము, దుఃఖము. ఇది ప్రత్యేక వర్ణం కాదు.

సంధి: తెలుగు వ్యాకరణాలలోని నియమాలు శాసన ప్రయోగాలకు అన్వయించవు. శాసన భాషలో సంధి చేసిన రూపాలు, చేయని రూపాలు, యడాగమ రూపాలు కూడా కనిపిస్తాయి. ఏ నియమంలేకుండ రెండచ్చులనడుమ యడాగమం రావటం, రాకపోవటం లేదా సంధి జరగటం, గసడదవాదేశం రావటం లేదా రాకపోవటం, ద్రుతసంధి జరగటం లేదా జరగక పోవటం అనేది శాసన భాషలో అన్ని కాలాలలోనూ కనిపిస్తుంది.

అచ్సంధులలో ఉత్వసంధి నిత్యంగాకాక వైకల్పికముగా శాసన భాషలో కనిపిస్తుంది. ఉదా. ఊడ్లందు అవిది సంధి జరిగిన రూపం. విసంధికి – రేనాణ్డు ఏళన్, యడాగమానికి – వారు యిఛ్ఛకాను.

వ్యవహారభాషలో సంధి ఐచ్ఛికంగా ఉంటుంది. శాసన భాషలోనూ అంతే. కావ్య భాషకి సంబంధించిన విధానాన్ని వైయాకరణులు వివరంగా చెప్పారు.

రెండచ్చులు పక్కపక్కన వచ్చినప్పుడు కావ్యభాషలో పూర్వస్వరమైనా లోపిస్తుంది లేదా ఆ రెండచ్చుల నడుమ సంధ్యక్షరమైనా చేరుతుంది. ఆ సంధ్యక్షరం తెలుగు కావ్యభాషలో 'య' కారం.

కావ్యభాషలో పూర్వపదాంత స్వరం ఉత్వమైతే దానికి లోపం నిత్యంగా జరుగుతుంది.

ఇత్వసంధిలో క్రీ॥శ॥ 6,7 శతాబ్దులలో విసంధి రూపాలు, యడాగమ రూపాలు శాసన భాషలో కనిపిస్తాయి. ఉదా. విసంధికి–ఇరుపతి యదివీను. యడాగమానికి–ఇరుపతి యదినాల్కు. 9, 10 శతాబ్దులనుండి సంధి జరిగిన రూపాలున్నాయి. ఉదా. శ్రీకెల్లన్, మహాదేవైన.

కావ్యభాషలో పూర్వపదాంత స్వరం ఇత్వమైనప్పుడు మధ్యమ పురుష క్రియలలోని ఇత్వం నిత్యంగా లోపిస్తుంది. నన్నయలో మధ్యమపురుష ఇ కారానికి నిత్యంగాను ప్రథమోత్తమ పురుషలలోని ఇ కారానికి వైకల్పికముగాను లోపం జరుగుతుంది. తరువాత గ్రంథాలలో మధ్యమ పురుషలోను లోపించని రూపాలు కనిపిస్తాయి. ఏమ్యాది గణంలోని ఇకారానికి వైయాకరణులు వైకల్పిక లోపం చెప్పారు. కాని నన్నయలో అచ్చులోపించటంలేదని చిలుకూరి నారాయణ రావుగారి అభిప్రాయం. దీన్నిబట్టి వైకల్పిక సంధి తరువాత కాలంలో ఏర్పడిందని భావించాలి.

నామాలలోని ఇ కారం లోపించిన రూపాలు కూడా కొన్ని కావ్యభాషలో కనిపిస్తాయి. ఇది కవిత్రయంలోకంటె శివకవులలో అధికం. ఉదా. రాతిరెల్ల (భార. ఆది), చెఱొక్క, తెలివెందునున్ (భార. ఉద్యోగ), వా వెఱుగని (పండితారాధ్య చరిత్ర).

క్త్వార్థక ఇకారానికి షష్ఠ్యర్థక ఇకారానికి లోపం జరిగిన రూపాలు నన్నయలో లేవుగాని తరువాతి కవులలో కనిపిస్తాయి. ఉదా. పొంగెరగెడు (కుమార సంభవం), వితెంచారగించె (బసవ పురాణం), వెఱచిట్లు (తిక్కన నిర్వ), అందిమ్ము (భార. విరా) (శబ్ద పల్లవమని కొందరు), ఎఱింగెఱింగి (భాగవతం). షష్ఠీఇకార లోపానికి ఉదాహరణలు నరునునికి (భార. ఆది), కృష్ణునల్లుడు (భార.. ద్రోణ), దీనంఘ్రులు (శృం.నై).

ఇటువంటి సందర్భాలలో అర్థ భంగాన్ని నివారించటానికి వ్యవహారభాషలో ఊత తోడ్పడుతుంది. వ్యవహార బలాన్నిబట్టి కావ్యభాషలో ఈ ప్రయోగాలను గ్రహించారని చెప్పవచ్చు. ఇటువంటి ప్రయోగాలు ప్రబంధయుగం తరువాతి గ్రంథాలలో

ఎక్కువగా కనిపిస్తాయి. ఉదా. దీవించి + అక్షత = దీవించక్షత పుష్ప. మెంతి + ఆకు = మెంతాకు, తంౘ్రడి + అవ= తంౘ్రడాన. బుద్ధి + ఇది = బుద్దిది, తెచ్చి + ఇమ్ము = తెచ్చిమ్ము. పెట్టి + ఉసిరికాయలు = పెట్టుసిరికాయలు.

అత్వసంధి జరగని విసంధి రూపాలు క్రీ. శ. 6 వ శతాబ్ది శాసనాలలో కన్పిస్తాయి. ఉదా. పన్నస ఇరవది. యడాగమం గల రూపాలు 7 వ శతాబ్దినుండి కనిపిస్తాయి. ఉదా. కలయన్త. సంధి చేసిన రూపాలు 9 వ శతాబ్దినుండి కనిపిస్తాయి. ఉదా. ఇడ్డట్లు, తమన్న (తమ+అన్న). అరుదుగా వడాగమం కూడా కనిపిస్తుంది. ఉదా. ఎఱ్ఱ వుమ్మయును.

అత్వసంధికి సంబంధించి నన్నయాది ప్రాచీన కవుల గ్రంథాలలో యడాగమరూపాలే అధికంగా వుండి, కాలక్రమంలో సంధి జరిగిన రూపాలు వ్యవహారబలం వలన కావ్యభాషలో ప్రవేశించాయి. చింతాకు, చేయకుండెను వంటివి అటువంటి రూపాలే. స్త్రీ వాచక పదాలలోను, షష్ఠీ రూపాలలోను అత్వం లోపించక పోవటం సామాన్య విధి. కాని, లోపించిన రూపాలు కవిత్రయ యుగం నుండి కనిపిస్తాయి. ఉదా. అంతవమానము (భార. సభా.), దేహేంద్రియంబు లిచ్చులు (కు.సం), భక్తులిండ్లు (బ.పు.), తమమ్మ (తమ+ అమ్మ), కాన + అందు = కానందు, ఇంక + ఆ దేవిని = ఇంకా దేవిని (చేమ. వెం. సారంగ).

క్రీ.శ. 12–14 శతాబ్దుల శాసనాలలో ఈశ్వర శబ్దం పరమైనప్పుడు గుణసంధికి బదులు తెలుగు పరరూప సంధి జరగటం కనిపిస్తుంది. ఉదా. భీమీశ్వర, నీలీశ్వర, మల్లీశ్వర గుణసంధి జరిగిన రూపాలూ ఉన్నాయి. ఉదా. భీమేశ్వర, నీలేశ్వర, మల్లేశ్వర.

తత్సమ పదాలకు తెలుగు పద్ధతిలో సంధి చేసిన రూపాలు కొన్ని కావ్య భాషలోకూడ కనిపిస్తాయి. నిజౌషధి అనే వృద్ధి సంధి రూపానికి బదులు నన్నెచోడుడు నిజోషధి అనే తెలుగు సంధి రూపాన్ని ప్రయోగించాడు. చెంగల్వ కాళ కవి రచించిన రాజగోపాల విలాసంలో కథ+ అనుసరణ= కథనుసరణ అనే రూపం కనిపిస్తుంది.

గసడదవాదేశం క్రీ. శ. 8 – 11 శతాబ్దుల మధ్య నిత్యంగాను, అంతకుపూర్వం వైకల్పికంగాను శాసన భాషలో కనిపిస్తుంది. ఈ ఆదేశం సంప్రదాయ వ్యాకరణాలు నిర్దేశించినదానికంటె అధిక వ్యాప్తిలో వుండేది. కాని, మొత్తం శాసన భాషలో ఈ ఆదేశం విరళంగానే వుందని చెప్పాలి. 12 వ శతాబ్ది తరువాత కూడ ఈ ఆదేశం వైకల్పికంగానే వుంది.

ప్రథమమీది పరుషాలు గసడదవలుగా మారటం ప్రాచీన కావ్యభాషలో సాధారణంగా జరుగుతుంది. ఉదా. ఏమి సేయుదు, ధర్మజుండు దవంబు సేసిన, పెద్దవోయె (ఇవి భారత ప్రయోగాలు). క్రమంగా దీని వ్యాప్తి తగ్గిపోయింది. తిక్కన కాలంనుండి చతపలకు సదవలు ఆదేశంగా రాని రూపాలు కొన్ని కావ్య భాషలో ప్రవేశించాయి. ఉదా. అప్పాచెల్లెంద్రు (నిర్వ.), రాకపోకలు (భాగ.). అవ్యయా లమీద, క్రియాపదాలమీద, ఇతర నామపదాలమీద వచ్చే గసడదవాదేశం తరువాతి కాలంలో తగ్గిపోయింది.

ద్రుతసంధి క్రీ.శ. 6–9 శతాబ్దుల మధ్య వైకల్పికంగా శాసన భాషలో కనిపిస్తుంది. కాలక్రమంలో బహుళంగా మారినా 11 వ శతాబ్దిలో కూడ నిత్యసంధి కాలేదు. 9–10 శతాబ్దాలలోని పద్య శాసనాలలో మాత్రం ద్రుతసంధి నిత్యంగా వున్నట్లు కనిపిస్తుంది. ద్రుతసంధి జరగని రూపాలు కూడ 7–14 శతాబ్దుల శాసనాలలో కనిపిస్తాయి. ద్రుతంపైన యడాగమ, వడాగమాలు చేసిన రూపాలు కూడ 7–14 శతాబ్దుల మధ్య కనిపిస్తాయి. ఉదా. పఞ్చమియు యాదిత్యవారంబు, విషయంబుయేళు, రట్టగుడియు వృద్దిని, పుష్పాలకు యిచ్చిన.

ప్రాచీన కావ్యభాషలలో ద్రుత ప్రకృతికాలుగా ఉన్న రూపాలు కొన్ని తరువాత భాషలో కళలుగా మారాయి. నన్నయ కళలుగా వాడిన శబ్దాలు కొన్ని తరువాతి కాలంలో ద్రుత ప్రకృతికాలుగా మారాయి. ఉదా. ఎల్లయందు (భార.), ఏను వోయెద (బ.పు.). కొన్ని ఏక కాలంలోనే ద్రుతప్రకృతికం గాను, కళగాను కూడ వాడబడ్డాయి. ఉదా. ఎందేని నుండి, ఎయ్యేనియు నొక్క. ఈ రెండూ భారత ప్రయోగాలు.

పదాంత హల్లుకి అచ్చుపరమైనప్పుడు హల్లు ద్విత్వం కావటానికి ఉదాహరణలు ప్రాచీన కాలంనుండి కావ్యభాషలో కనిపిస్తాయి. ఇదే ద్రుత ద్విత్వసంధి. ఉదా. అన్నిష్టసఖి (భార), నవ్వులన్నరులకిచ్చె (కు.సం.).

ద్రుతానికి పరుషం పరమైనప్పుడు ఆ పరుషం సరళంగా మారుతుంది. అందువలన క చ ట త ప లు – గ జ డ ద బ లుగా మారతాయి. కావ్యభాషలో ఇది సాధారణం.

ద్రుతానికి మకారం పరమైనప్పుడు సమీకరణం జరిగిన రూపాలు కావ్యభాషలో కనిపిస్తాయి. ఉదా. కమ్మని లతాంతములకున్ + మొనసి > కుమ్మొనసి.

కర్మధారయంలో ము వర్ణకానికి పుంప్వాదేశం జరగని ప్రయోగాలు, టుగాగమం జరుగుతుందని వ్యాకరణాలు చెప్పిన చోట్ల జరగని రూపాలు కావ్యభాషలో కొన్ని కనిపిస్తాయి. ఉదా. బొక్కసమిండ్లు, పసరంపెమ్ము.

వ్యవహారానికి మరీ దగ్గరగావుండే హల్సంధులను అర్వాచీన కవులు తమ కావ్యాలలో చేశారు. ఉదా. అడుక్కొని, ఇంట్లోకి, ముప్పదిరెంద్రాగములు (రెండు+రాగములు), రెన్నాళ్ళు, మూన్నెల్లు, రెణ్ణెల్లకు, మెణ్నూలు (మెడ+నూలు), ఏళ్నూరు (ఏడు+నూరు), నెల్లాళ్ళు (నెల+

నాళ్ళు). లాక్షణికు లంగీకరించని యడాగమాలు కూడ ఆధునిక కవుల రచనల్లో కనిపిస్తాయి. ఉదా. బదులుకు బదులు యనుచు.

నామపదాలు: తెలుగుభాషలో ప్రాఙ్నన్నయ కాలము నుండి నేటివరకు దేశ్యపదాలతోపాటు తత్సమ, తద్భవనామ పదాలు కనిపిస్తాయి. ఈ అన్య దేశ్యాలలో సంస్కృతంనుండి ప్రాకృతము నుండి వచ్చినవి మాత్రమే క్రీ.శ. 12 వ శతాబ్దివరకు కనిపిస్తాయి. ఆ తరువాత అరబ్బీ, ఫార్సీ, ఆంగ్ల భాషాపదాలుకూడ తెలుగులో చేరాయి.

మహద్వాచకం (ఏకవచనం): ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో మహద్వాచక నామములు చాలవరకు లింగ బోధక ప్రత్యయాలు లేకుండానే ప్రయోగించబడ్డాయి. ఉదా. అణ్ణ, రాజు, కొడుకు, కమ్మరి. కొన్ని నామాలు ప్రథమైక వచన ప్రత్యయంతో కూడి వున్నవీ. లేనివీ కూడ కనిపిస్తాయి. ఉదా. గణ్ణ, గణ్ణణ్డు. సంప్రదాయ వ్యాకరణాలు డుమం తాలని చెప్పే తత్సమరూపాలు కొన్ని ప్రత్యయరహితంగా కనిపిస్తాయి. ఉదా. పాతకు, పణ్డరంగు. ప్రత్యయాలతో కూడివున్న మహద్వాచక నామాలు ఉ, న్తు, ణ్డు, ణ్ట్, న్ ప్రత్యయాలతో కనిపిస్తాయి. ఉదా. ధనంజయఉ, ఉత్తమోత్తమున్తు, వాణ్డు, సంయుక్తుణ్ట్, కుళ్ళమ్మన్. ప్రాచీన ద్రావిడ ప్రత్యయమైన *న్ట్/న్త్, నుండి పరిణమించిన రూపాలే ఇవి. యిందులో -న్తు ప్రత్యయం క్రీ. శ. 7 వ శతాబ్దినాటికి -ణ్డుగా మారింది. కాని, లేఖన సంప్రదాయములో 10 వ శతాబ్దివరకు నిలిచివుంది. 12-14 శతాబ్దుల భాషలో ం ఉ, ణ్డు, డు అనేవి మహద్వాచక ఏకవచన ప్రత్యయాలుగా కనిపిస్తాయి. ఉదా. ప్రిత్తికాంఉ, అల్లుణ్డు, తమ్ముడు. 15-19 శతాబ్దుల భాషలో ం డు/డు ప్రత్యయం స్థిరపడింది. ఉదా. ఉద్దండ భానుండు, కుమారుణ్డు, రజబుఖానుడు.

ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలోని కొన్ని వ్యక్తినామా లలో అన్న, అప, అయ్య, పిడుగు, పోతు అనేవి పురుష బోధక శబ్దాలుగా కనిపిస్తాయి. ఉదా. మన్న్యణ్ణ, కొమ్మన, విట్టప, మారయ్య, కొచ్చియ, మఱున్త పిడుకు, మాఱ్పిడుగు, అణపోతులు. కొన్ని నామపదాలలో ప్రాఙ్నన్నయ కాలంలో లేని లింగబోధక ప్రత్యయం నన్నయ కాలానికి కావ్యభాషలో చేరింది. ఉదా. పాఱ అనేది ప్రాఙ్నన్నయ కాలపు శాసన ప్రయోగం. ఇది నన్నయభారతంలో పారుఁడుగా కనిపిస్తుంది. తరువాతి కవులు కూడ ఇదేవిధంగా ప్రయోగించారు.

వ్యాకరణం ప్రకారం మహదేక వచన ప్రత్యయమైన డుజ్ రావలసినచోట్ల రాని ప్రయోగాలు కొన్ని 16 వ శతాబ్ది తరువాత కావ్యభాషలో కనిపిస్తాయి. ఉదా. చందు మున్నగు గ్రహోచ్చయములు. డుజ్వర్ణకం రాగూడని చోట్ల రావటం కూడ కనిపిస్తుంది. అదీ అన్యదేశ్యాలలో రావటం విశేషం. ఉదా. వజీరుండు, మొగలీ వజ్రీడు.

మహతీ వాచకం (ఏకవచనం): మహతీవాచక ఏకవచన బోధకాలుగా అమ్మ, అవ్వ, ఆలు, పోటి అనేవి 12 వ శతాబ్దివరకు శాసన భాషలో కనిపిస్తాయి. ఉదా. కుట్టమ్మ, బిజ్జేకవ్వ. మన్మఱాళు, వసన్తి పోటి. ఱాలు, ఆలు, త్య అనే ప్రత్యయాలు 12 వ శతాబ్దినుండి కనిపిస్తాయి. ఉదా. నాయకుఱాలు, కోడలు, ప్రిత్తికత్త్య. 15-19 శతాబ్దుల శాసనాలలో రాలు ప్రత్యయం కనిపిస్తుంది. కావ్యభాషలోను ఈవిధంగానే వుంటుంది.

సంస్కృత సమమైన 'అంబా' ప్రత్యయం గల మహతీ ఏకవచన రూపం ఒక్కటి మాత్రమే 10 వ శతాబ్ది శాసనంలో కనిపిస్తుంది. ఉదా. మేలంబా.

స్త్రీ పురుషోభయ వాచకాలైన శబ్దాలుగా అమ్మ, అవ్వ, ఆలు, పోటి అనేవి 12 వ శతాబ్ది వరకుగల శాసనాలలో కనిపిస్తాయి. ఉదా. పురుష: తాతమ్మ, వేణవోజన్వు, పడాలు, కూచపోటి. స్త్రీ: కుట్టమ్మ, బిజ్జేకవ్వ, మన్మఱాళు, వసన్తి పోటి.

అమహత్తు (ఏకవచనం): అమహద్వాచక నామము లలో ప్రథమైక వచన ప్రత్యయంలేని రూపాలు కొట్టూరు, తాన్లికొన్ల, అణతి వంటివి ఎన్నో ప్రాచీన శాసనాలలో కనిపిస్తాయి. ద్రమ్మ ద్రమ్మము వంటివి ప్రత్యయ రహితం గాను, ప్రత్యయ సహితంగాను కూడ కనిపిస్తాయి. నాగబు, కొట్టంబున, దేశము, పురస్సరం, సాసనవు, కిరనమ్ము వంటి ప్రత్యయ సహిత రూపాలూ వున్నాయి. ఇందులో 'వు' ప్రత్యయం 8 వ శతాబ్దినుండి మాత్రమే కనిపిస్తుంది. కొన్ని నామములు ము, వులు రెంటితోను కనిపిస్తాయి. ఉదా. పరిహారము, పరియారువు, ప్రాకారంబు, ప్రాకారువు. అమహదేక వచన ప్రత్యయమైన-ంబు 7-8 శతాబ్దుల నాటికి 'ము'గా మారింది. ఇది వర్ణ సమీకరణం వలన 9 వ శతాబ్దినాటికి 'మ్ము'గా పరిణమించింది. 12-19 శతాబ్దులలో కూడ ము, మ్ము, ంబు, ం (అనుస్వారం) లతో కూడిన రూపాలు కనిపిస్తాయి. ఉదా. కూటము, సంకమ్ము, దేశంబు, రక్తం, శాసనం.

తత్సమాల విషయంలో నన్నయ వాకు, జగము, మిత్రుడు వంటి రూపాలనేకాని వాక్కు, జగత్తు, మిత్ర మువంటి రూపాలను ప్రయోగించలేదు. నన్నెచోడుడు వాక్కు, మిత్రము రూపాలను వాడాడు. ఇంకా దాసి (దాసుడు), వాల్మీకుడు (వాల్మీకి), ద్రోహుడు (ద్రోహి), బాలకి (బాలిక), ఉత్పలల్ (ఉత్పలముల్), కరవాలు (కరవాలము), మాధుర్యత, సౌభాగ్యత వంటి రూపాలను ప్రయోగించాడు.

తత్సమ పదాలు చాలవరకు లింగబోధక ప్రత్యయాలను కలిగివుంటాయి. దేశ్యాలలో కొన్నిటికి మాత్రమే చేరతాయి.

'కూతు' అనే దేశ్య పదానికి ప్రథమైక వచనంలో 'కూతురు' అని, ఇతర విభక్తులలో కూతు–అని రూపాలున్నాయి. దీనికి ప్రథమా బహువచనం కూతు–లు అనే రూపం. నన్నయ, నన్నెచోడుడు ఈ విధంగానే ప్రయోగించారు. తిక్కన కాలానికి 'రు' వర్ణంతో కూడిన 'కూతురు' రూపంమీదనే బహువచన ప్రత్యయం, ప్రథమేతర విభక్తిప్రత్యయం చేరింది. అందువలన కూతుండ్రు, కూతురులు, కూతురిని వంటి రూపాలు తరువాత ఏర్పడ్డాయి. తిక్కన ఇటువంటి రూపాలను ప్రయోగించాడు. చిన్నయసూరి వీటిని అంగీకరించలేదు.

బహువచన రూపాలలో 'ము' వర్ణ లోపం, పూర్వస్వర దీర్ఘం కలిగినవి నన్నయలో లేవు. తిక్కన, శ్రీనాథులు వీటిని వాడారు. ఉదా: ముత్యాలు.

ప్రాచీన కావ్యాలలో 'సయ్యాట' అని ము ప్రత్యయ రహితంగా ప్రయోగించబడిన రూపం ప్రబంధ కాలం నుండి 'సయ్యాటము'గా కూడ కనిపిస్తుంది. పులకలు అనవలసినచోట పులకములు అని 'ము' ప్రత్యయం చేరటం కూడ అర్వాచీన కావ్యభాషలో కనిపిస్తుంది. ఈ అమహ దేకవచన ప్రత్యయం లోపించిన పదాలు వశ (వశము), సంసర్గ (సంసర్గము) వంటివి ఈ కాలపు కావ్యభాషలో కనిపిస్తాయి.

తత్సమ పదాలలో నిత్యమైన వుగాగమం లోపించిన రూపాలు కూడ అర్వాచీన కావ్యభాషలో కన్పిస్తాయి. ఉదా. అంబు (అంబువు). ఉదంత అమహచ్ఛబ్దానికి వుగాగమం వచ్చిన 'పోతువు' అనే రూపం అనాటి కావ్యభాషలో కనిపిస్తుంది.

వచనం: ప్రాతిపదికకు 'రు' ప్రత్యయం చేరి మహన్మహతీ బహువచన రూపం ఏర్పడటం శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. వేవురు, మల్లుర, మలినుర్, సంయుక్తర్. కొన్ని సందర్భాలలో మహదేక వచనంపైన 'రు' ప్రత్యయం చేరి బహువచన రూపం ఏర్పడుతుంది. ఉదా. వాణ్ణురు.

మహదమహత్తులకు సాధారణ బహువచన ప్రత్యయంగా 'లు' కనిపిస్తుంది. ఉదా. కన్న్యళ్, రాజుల్ల, గుళ్లువు, బ్రాంకుల, తమ్ములు, కరణాలు, పుట్లు, ఇండ్లు, వేలు, రాత్రుళ్ళు. ఇందులో 'ళు' పూర్వరూపం. 'లు' తరువాతి రూపం. ఏడో శతాబ్దినాటికి ళ కారం ల కారంగా మారింది. ఇది ప్రాచీన బహువచన ప్రత్యయమైన 'కళ్'కి రూపాంతరం. కుల్ కూడ అంతే. ఈ శాసన ప్రయోగాలనుబట్టి క్రీ.శ. 1100 వరకు రు, లు అనేవి బహువచన ప్రత్యయాలుగా కనిపిస్తున్నాయి. 1400 వరకుగల శాసనభాషలో రు, ఌ, ండ్రు, ంఌ, అనేవి మహన్మహతీ బహువచన ప్రత్యయాలుగా కనిపిస్తాయి. ఉదా: అల్లురు, దీనురు, వాద్యకాఌ – మద్దెలకాండ్రు, ఒత్తుకాంఌ, వాస్యకాంఌ.

నన్నయ, నన్నెచోడుల భాషలోను, 12 వ శతాబ్ది వరకు గల శాసనాలలోను, 'కాఌ' మాత్రమే కనిపిస్తుంది. 'కాండ్రు' అనేది 13 వ శతాబ్దినుండి కనిపిస్తుంది. ఇది క్రమంగా అధికమవుతూ 14 వ శతాబ్దిలో 'కాఌ' దాదాపు లోపిస్తుంది.

15, 16 శతాబ్దుల శాసనాలలో ళు/లు అనేది బహువచన ప్రత్యయంగా ఉంది. దేవళ్లు, ఆడవాళ్లు, దేవుళు, సీళు, ఏండ్లు, అయినవాండ్లు. ఇంతకు పూర్వం ఆాయి శబ్దానికి బహువచనం ఆాలుగా వుంటే ఈ కాలపు శాసనాలలో రాళ్లు అనే రూపం కూడ కనిపిస్తుంది. కూతురు శబ్దానికి కూతుఌ, కూంతులు అని రెండు రకాల రూపాలు కనిపిస్తాయి.

17–19 శతాబ్దుల శాసనాలలోను 'లు' అనేదే సాధారణ బహువచన ప్రత్యయంగా కనిపిస్తుంది. ఉదా. గొల్లలు, దోశెలు, జాగాలు, మొఖాసీలు, కరణాలు, పాలెగాండ్లు, దేవళ్ళు, దొమ్మర్లు, నూతులు. మహన్మహతీ బహువచన 'రు' ప్రత్యయం ఈ కాలపు శాసనాలలో కనిపించదు. పెకండ్ర అనే 'డ్రుతో'తో కూడిన రూపం ఒకటి కనిపిస్తుంది.

పూజ్యార్థంలో బహువచన 'లు' ప్రత్యయాన్ని అధికంగా వాడటం ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో కనిపిస్తుంది. ఇంకా అయ్యరు, ఆరు, కాలు, గార్/వార్ కూడా కనిపిస్తాయి. ఉదా. ఛేయ మయ్యరు, కణమయారు (ఇది అవర్ నుండి పరిణమించినది కావచ్చు), రేవణకాలు, కుణ్డికాళ్లు (కుణ్డిపాదాః వంటి సంస్కృతపదానికి ఇది అనువాదం కావచ్చు), పోతయ్యంగార్, విట్టపరడ్డి వారికి. పూజ్యార్థంలో బహువచన ప్రత్యయం చేరటం 12–19 శతాబ్దుల శాసన భాషలో కూడ అధికంగా కన్పిస్తుంది. ఉదా. గురులు, గుండమదేవులు, దేవరు గారు, వారు కూడ చేరుతాయి. ఉదా. నంబిగారు, జియ్యరువారు, అమ్మవారు, అమ్మంగారలు, నాయనింగారు

కావ్యభాషలో లు రు అనే బహువచన ప్రత్యయాలు సామాన్యంగా కనిపిస్తాయి. గారు/వారు పూజ్యార్థంలో వస్తుంది. బహువచన రూపంపైన మరల బహువచన ప్రత్యయం రావటం కూడ కనిపిస్తుంది. ఉదా. వీరలు.

వ్యవహార భాషకు సన్నిహితంగా ఉన్న అమహద్బహు వచన రూపాలు కొన్ని అధునిక కావ్యభాషలో కనిపిస్తాయి. ఉదా. మాళ్లు (మాడలు), బీళ్ళు, వాళ్లు, గుళ్లు, దాసళ్లు (దాసరులు), పైళ్లు (పైరులు), ఆాళ్లు (ఆాలు).

**విభక్తి:** తెలుగులో నామమే ప్రథమైక వచన రూపంగా వుంటుంది. నామపదాలే వాడబడటం వలన ప్రథమావిభక్తికి ప్రత్యేకంగా ప్రత్యయాలు లేవు.

ద్వితీయ: ను/ని/న్ అనేది ద్వితీయావిభక్తి ప్రత్యయంగా శాసన భాషలో కన్పిస్తుంది. ఉదా. కన్న్యళను, రడ్డిని, దీనిన్, కవిలం, వధించి, ధర్మాన్ని.

నన్నయలో 'గుఱించి' రూపం కనిపిస్తుంది. గుఱించి, కూర్చి అనేవి తరువాతి కవులలోను కనిపిస్తాయి. కావ్యభాషలో 'ను' ప్రత్యయంతోపాటు గుఱించి, కూర్చి అనే పదాలు ద్వితీయా విభక్త్యర్థంలో వున్నాయని చెప్పవచ్చు.

**తృతీయ:** నకారం తృతీయా ప్రత్యయంగా 9, 10 శతాబ్దుల నుండి మాత్రమే కనిపిస్తుంది. ఉదా. పరాక్రమంబు నన్. 11 వ శతాబ్దివరకు దీనికి ప్రాచుర్యం కనిపించదు. చేత, చేతం, తో, తోన్, తోడ, తోడం, తోటన్ అనే అనుబంధాల నుపయోగించి ప్రాఙ్నన్నయకాలంలో తృతీయావిభక్త్యర్థాన్ని తెలిపేవారు. ఉదా. బోళచేత, పదువతో, చోడుళతో, నలరామ విభుతోటన్. ఇందులో తో, తోడలు సహార్థకాలు. చేత, చేతన్ కర్తృబోధకాలు.

న్/అన్/నన్, తోడన్/తోన్, మెయిన్ అనేవి తృతీయా విభక్తి ప్రత్యయాలుగా క్రీ.శ. 1400 వరకు శాసన భాషలో కనిపిస్తాయి. ఉదా. కాలం దుడిచెను, ధర్మువునం జేసి; భక్తితోడ దయతోనిచ్చె; సచ్చరిత్రమెయిని. ఇందులో 'మెయిన్'అనేది పద్యశాసనాలలోనే కనిపిస్తుంది. ఇది 13 వ శతాబ్ది తరువాత కనిపించదు.

15–17 శతాబ్దుల శాసనాలలో చేతన్/చేన్, తోడన్/తోన్ అనే ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. చిన్నా దేవమ్మ చేతను, ఊరుంగాయల తోడను ఆరగించి. ఈ కాలంలో 'తోటి' అనే ఆధునిక రూపం మొదటిసారిగా కనిపిస్తుంది. ఉదా: ఖండికల తోటి మరియాదా, మణికలా తోటి సమస్య. ఈ రెండు రూపాలూ 15 వ శతాబ్ది నాటివి.

న, తో అనేవి తృతీయా విభక్తి ప్రత్యయాలుగా 17–19 శతాబ్దుల శాసనాలలో కనిపిస్తాయి. ఉదా. సుఖాన ఉండేది, వీండ్లతోపాటు. కావ్యభాషలో చేసి, తోడ, మెయిన్ అనేవి తృతీయా విభక్త్యర్థంలో కనిపిస్తాయి. నన్నయ వీటిని ప్రయోగించాడు. 'తోడ' ప్రత్యయానికి రూపాంతరమైన 'తోడి'కి వ్యావహారిక రూపం 'తోటి' అనేది ఆధునిక యుగంలోని కావ్యభాషలో కనిపిస్తుంది. ఉదా: హరియించును తోటి హాలహలముం బోలెన్.

**చతుర్థి:** ప్రాఙ్నన్నయ కాలపు శాసన భాషలో కిన్/కున్ అనే ప్రత్యయం, పొంటె అనే అనుబంధం ఈ విభక్త్యర్థాన్నిస్తున్నాయి. సంప్రదాయ వ్యాకరణాలు కిన్/కున్ అనే ప్రత్యయాన్ని షష్ఠీ ప్రత్యయంగా పరిగణించాయి గాని ఆ అర్థంలో శాసన ప్రయోగం కనిపించదు. ఉదా. చేనుకు, తేనికిన్, వసన్తీశ్వరంబునకు, పరోపకారంబు పొత్తే. 11 వ శతాబ్ది తరువాత శాసనాలలో కిన్/కున్/నకున్ అనేది చతుర్థీ విభక్తి ప్రత్యయంగా కనిపిస్తుంది. ఉదా. రిషి పెద్దికీ, నాథునికి, అరదివియకు, కోమట్లకు, దీపానకుం, గ్రామానకు.

కొఱకు అనేది చతుర్థీవిభక్త్యర్థంలో 14 వ శతాబ్ది భాషలో రెండుచోట్ల కనిపిస్తుంది. ఉదా. అభీష్టసిద్ధికొఱకు, చేయించి కొఱకై. ఇది 15, 16 శతాబ్దుల భాషలో తరచుగా కనిపిస్తుంది. ఉదా. అక్షయఫలంకొఱకు. 17–19 శతాబ్దుల శాసనాలలో కొఱకు అనేది కనిపించదు.

కావ్యభాషలో కి/కు, కై ప్రత్యయాలు కనిపిస్తాయి. 'కొఱకు' నన్నయ, నన్నెచోడులలో లేదు. ఇది 13 వ శతాబ్ది నుండి కనిపిస్తుంది. 'పొంటె' అనే అనుబంధాన్ని ఈ విభక్త్యర్థంలో నన్నయ ప్రయోగించాడు.

**పంచమి:** ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో మిన్ద/మీన్ద, మీద, కడ, పై, వలన, ఉండి అనే అనుబంధాలు పంచమీ విభక్త్యర్థాన్ని తెలుపుతాయి. ఉదా. మహిమిన్ద, గుడిమీన్ది, భూపాదిత్యులకడాన్, భూఃసతిపై, గద్యంబులవలన, చేంబ్రో లనుణ్డి. ఇందులో 'పై' అనేది స్వతంత్రపదంగా కూడ ప్రయోగించబడింది. ఉదా. పై లేచిసేన, పయ్యారల.

12–14 శతాబ్దుల శాసనాలలో చేతన్/చేన్, వలనన్/వల్లన్, నుండి, కంటెన్ అనేవి పంచమీ ప్రత్యయాలుగా కనిపిస్తాయి. ఉదా. స్థానాపతుల చేతవిబ్చి, దేవరచే కృపంగొని జీతాల వలనం, సుఖంబువల్లను, గంగకఱుతనుండి. 'నుంచి'అనేది ఈ కాలంలో కనిపించదు. కంటెన్ కూడ క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఉదా. నాకాధీశపురంబుకంటె నిదిమేలు. ఈ విధంగా దీన్ని పోల్చే సందర్భంలో వాడతారు.

చేతన్, వలనన్, నుండి అనేవి 15, 16 శతాబ్దుల శాసనాలలో కూడ కనిపిస్తాయి. ఉదా. సదాశివునిచేతాను. ఏలానదివల్ల నుండి. 17–19 శతాబ్దుల శాసనాలలో వల్ల, నుండి, పట్టి అనేవి కనిపిస్తాయి. ఉదా. కాసులవల్ల, పరివులనుండి, యేండ్లబట్టి.

'ఉండి' అనేది ప్రాచీన కావ్యాలలో వాడబడింది. అర్వాచీన గ్రంథాలలోను వుంది. దీనికి వ్యవహార రూపమైన 'నుంచి' అర్వాచీన కావ్యభాషలో కనిపిస్తుంది. ఉదా. భూములనుంచి. వలనకు వ్యావహారిక రూపమైన 'వల్ల' కూడ ఆధునికయుగంలోని కవులు చాలమంది వాడారు. ఉదా. 'కల్ల నావల్ల గోరంత కలిగెనేని' అని చేమకూర వెంకటకవి ప్రయోగం. 'కంటె'కి వ్యవహార రూపం 'కన్నన్' అనేది కూడ అర్వాచీన కావ్యాలలోనే కనిపిస్తుంది.

**షష్ఠి:** దీనికి ప్రత్యేకమైన విభక్తి ప్రత్యయం లేదు. ద్వితీయాది విభక్త్యంగ రూపమే వాడబడుతుంది.

**సప్తమి:** ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో 'న' అనే ప్రత్యయం – అందు, ఒఌళన/లోన/లోన, లోపలి అనే అనుబంధాలు సప్తమీ విభక్త్యర్థంలో కనిపిస్తాయి. ఉదా.

అవ్వయుంబున ఊఢ్లందు, రాజొల్లోళన, కయ్యంబులోన, భూమిలోన, డొంకలోపలి. 11–16 శతాబ్దుల శాసనాలలో న్/అన్/నన్, లోన్/లోనన్/లోపలన్, అందు/నందు/నయందు అనేవి సప్తమ్యర్థంలో కనిపిస్తాయి. ఉదా. కేటిపల్లిని, శ్రీకూర్మమున, ఉత్తరసీమలో, చెల్లావలోన. పోరకినాంటిలోపలం, చెఱువందు, భోగమునందు, ఉత్తరాయణమునయందు. ఈ అందు శబ్దానికి ఉల, అలి ప్రత్యయాలు చేరి విశేషణం అవుతుంది. ఉదా. అందుల గొల్లమంత, అందలి మాడూరి సోమయ. ఈ ప్రత్యయాలేకాక. క్రిందన్, మీదన్, పైన్, ఒద్దన్, కడన్ మొదలైనవి కూడ సప్తమ్యర్థంలో కనిపిస్తాయి. ఉదా. చెఱువుక్రింద, ధాత్రిమీంద, ఈ ధర్మువుపై, ఉయ్యారిఒద్ద, తూమువద్ద, తాడేకుంటకడ, పోలెన్, వలెన్, మాడ్కి, వంటి మొదలైన పోలిక ప్రత్యయాలు కూడ కనిపిస్తాయి. ఉదా. గురుంపోలెన్, మాణయ వలెన్, అఱిగాంపుల మాడ్కి, లెంకవంటి కోకన. 17–19 శతాబ్దుల శాసనాలలో న్/న, లో, /అందు/నందు ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. రణావనింగొట్టి, మఠాన, పొలంలో, రాజ్యమంద్దు, ధర్మవరమునంద్దు. ఇవికాక క్రింద, మీంద అనేవి కూడ సప్తమ్యర్థంలో కనిపిస్తాయి. ఉదా. చెరువుల క్రింద, చెరువుల మీంద.

ఒక విభక్తికి చెందిన ప్రత్యయాలు వేరొక విభక్త్యర్థంలో వాడటం శాసన భాషలోను, కావ్య భాషలోను కూడ అన్ని కాలాలలోను కనిపిస్తుంది.

ఔపవిభక్తికాలు: ఇ, త్, ట్, అ అనేవి ఔప విభక్తిక ప్రత్యయాలుగా శాసన భాషలలో అన్ని కాలాలలోను కనిపిస్తాయి. ఇవి చేరిన పదాలు, చేరని పదాలు కూడ ఆ భాషలో ఉన్నాయి. ఉదా: చెఱువుంబూరి, విత్పత్తి, నూఱింటికి, ధర్మువుల. నీరునేల, వాకిలికి, నూయిని వంటి రూపాలు ఔప విభక్తిక ప్రత్యయాలు చేరనివి కూడ శాసనాలలో కనిపిస్తాయి.

మహద్వాచక రూపాలలో '–డు' లోపించి '–ని'చేరిగాని, చేరకుండా గాని విభక్తి ప్రత్యయాలు చేరటం కావ్యభాషలోని పద్ధతి. ఈ పద్ధతి ప్రాచీన శాసనాలలోను వుంది. ఉదా. సోముకు, భీమునకు, కాని, –డు లోపించకుండానే 'ఇ' అనే ఔప విభక్తికం చేరిన రూపాలకు విభక్తిప్రత్యయాలు చేరటం కూడ 12 వ శతాబ్ది నుండి శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. దేవుడికి '–డు' లోపించిన రూపాలూ కనిపిస్తాయి. ఉదా. పరమాత్మునిచే. –'డు' లోపించని రూపాలు 1400–1600 కాలపు శాసనాలలో మరింత అధికంగా కనిపిస్తాయి. ఉదా. కూర్మనాథుడి, గోపీనాథుంణ్ని.

కావ్యభాషలలోను ఇ, త్, ట్, అ అనేవి ఔప విభక్తిక ప్రత్యయాలుగా కనిపిస్తాయి. ఔప విభక్తిక శబ్దాలు కొన్ని అనౌప విభక్తికాలుగాను, అనౌప విభక్తిక శబ్దాలు కొన్ని ఔప విభక్తికాలుగాను వాడటం జరిగింది. ఉదా. కన్నీరుధారలు (కు.సం.) కన్నీటి ధారలు (ఉత్తర హరివంశం). ఏక కాలంలోనే ఒకే శబ్దం రెండు విధాలుగాను కనిపిస్తుంది. ఉదా. నీరి/నీటి (నన్నయ–భారతం). ఈ విధమైన వాడుక కావ్య భాషలో ప్రాచీన కాలం నుండి అర్వాచీన కాలం వరకు కనిపిస్తుంది.

సర్వనామాలు: ఏ, నే, నా, నాకు అనే ఉత్తమ పురుష బోధక సర్వనామ రూపాలు; నీవు, నీ అనే మధ్యమ పురుష సర్వనామాలు; నాన్డు, వాణ్డు, వాని, అతణ్డ్, అతని, వీని, వీన్ని, వారు, వారల, వీరి, వీరల, అది, దానిక, ఇది, దీని, దేని, తేని అనే ప్రథమ పురుష సర్వనామరూపాలు; తాన్, తన, తన్ను, తారు, తముకు, తమ, తమ్ము అనే ఆత్మార్థక సర్వనామ రూపాలు; ఎవ్వణ్డ్, ఎవ్వర్, ఎవ్వి అనే ప్రశ్నార్థక సర్వనామాలు ప్రాఙ్నన్నయ కాలపు భాషలో కనిపిస్తాయి. ఇందులో తేని, దేని అనే రూపం దీని అనే అర్థంలోనే వాడబడింది. ఈ రూపం కాలక్రమంలో తొలగిపోయింది.

12–14 శతాబ్దుల భాషలో, ఏను, ఏము, నేను, మేము అనే ఉత్తమ పురుష సర్వనామాలు కనిపించవు. తాను శబ్దానికి బహువచన రూపమైన 'తారు' మాత్రం ఈ శాసనాలలో ఉంది. కాని 'తాము' కనిపించదు. నన్నయ, నన్నెచోడుడు 'తారు' రూపాన్నే ప్రయోగించారు. 15, 16 శతాబ్దుల భాషలో తాము, తారు అనే రెండు రూపాలు కనిపిస్తాయి. ఈ కాలపు భాషలో మేము, మీరువంటి ఉత్తమ, మధ్యమ పురుష సర్వనామాలు అనునాసికాలతో ప్రారంభమయ్యేవే కనిపిస్తాయి గాని స్వరంతో ప్రారంభమయ్యే 'ఏము' వంటివి కనిపించవు. 17–19 శతాబ్దులలోను ఏను, ఏము, ఈవు, ఈరు వంటి రూపాలు కనిపించవు. ఈ శాసనాలలో వాండి, వాంద్లు, వారి, మీ, నేను, మేము, నేము, మంమ్ము, మా, తన, తాము, తమ, యెవండు, యెవరు, ఆయన అనే సర్వనామరూపాలు కనిపిస్తాయి.

ఉత్తమ, మధ్యమ పురుష సర్వనామాలలో ఏక, బహువచనాలలో రెండేసి రూపాలు ప్రాచీన కావ్యాలలో వాడబడ్డాయి. ఏను–నేను; ఏము–మేము; ఈవు–నీవు; ఈరు–మీరు. క్రమంగా అజాది రూపాలు తగ్గిపోయాయి. ఉత్తమ పురుష బహువచన రూపం 'నేము' భారతంలో ఒక చోట కనిపిస్తుంది. అర్వాచీన కావ్యాలలో ఒకటి రెండు ప్రయోగాలు కనిపిస్తాయి. శాసనాలలోను వీనికి ప్రయోగాలున్నాయి.

ప్రాచీన కాలంలో కావ్యభాషలో ఆత్మార్థక రూపం మూడు పురుషులలోను వాడబడింది. ఉదా. తన్ను బంపుదేవ (కు.సం.). ఇది ఉత్తమ పురుషలోవుంది.

వాడు, వీడు, అది, ఇది వంటి ప్రథమ పురుష

రూపాలు కావ్య భాషలో వున్నాయి. నన్నయ 'వారు' అనే బహువచన రూపాన్ని వాడాడు. సమకాలీన శాసనాలలో 'వాం(డ్రు' రూపం వుంది. వాం(డ్రు అనే రూపాన్ని నన్నయకి తరువాత కవులు వాడారు. దీని కంటె అర్వాచీన రూపం వాండ్లు > వాళ్లు.

సంఖ్యా వాచకాలు: నన్నయకు పూర్వం శాసనాలలో ఒకొటి, వకొట్టి, ఒక, ఒణ్డు, ఒరుల్ అనే రూపాలున్నాయి. 11, 14 శతాబ్దుల శాసనాలలో ఒక్కొణ్డు, ఒక్కణ్డు, ఒకణ్డు, ఒక్కడు, ఒక్కటి, ఒకటి అనే రూపాలున్నాయి. ఔప విభక్తిక రూపమైన ఒకటి ప్రథమా రూపంగా వాడబడటం ప్రాచీన కాలం నుండి వున్నదని తెలుస్తుంది. దీని వాడుక 12 వ శతాబ్దినుండి అధిక మవుతూ వచ్చింది. 15 వ శతాబ్దినాటికి ఈ రూపం స్థిరపడిందనవచ్చు.

ఈ సంఖ్యావాచక విశేష్య రూపం నన్నయ నన్నెచోడు లలో 'ఒక్కండు'గా కనిపిస్తుంది. దీని ఔప విభక్తిక రూపం ఒక్కంటి, ఒకటి. కుమార సంభవంలో 'ఒకటి' ప్రయోగం ప్రథమలో ఒక్కచోట కనిపిస్తుంది. మహద్వాచక రూపంగా నన్నయలో 'ఒకరుఁడు' కనిపిస్తుంది. నన్నెచోడుడు ఒకఁడు/ ఒక్కండు రూపాన్ని మహదర్థంలోను, అమహదర్థంలోను కూడ వాడాడు. మహతీ వాచకంలో నన్నయ ఒక్కత, ఒక్కటి, ఒక్కతె, ఒక్కర్తు అనే రూపాలను వాడాడు.

రెణ్డు, రెంటికి, ఇన్మడి, ఇరవది, ఇరువదియది, ఇద్దరు. ఇరువురు అనే రూపాలలో రెండు సంఖ్యా వాచకం, మూన్డు, మూను, మూణ్డు, మూడ్, మూటికి, మూణ్టికి, మున్నూఱు, మూనూర, ముమ్మడి, ముప్వర అనే రూపాలలో మూడు సంఖ్యా వాచకం శాసన భాషలో కనిపిస్తుంది. నాల్కు, నాలుగు, నాలువు, నాలు, నల్వురు అనే రూపాలు నాలుగు సంఖ్యా వాచకానికి కనిపిస్తాయి.

ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో ఏను రూపమొక్కటే కనిపిస్తుంది. 11–14 శతాబ్దులలో ఏను, ఐదు అనే రెండు రూపాలున్నాయి. 15, 16 శతాబ్దులలో ఏను క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఐదు స్థిరంగా నిలిచినట్లు తెలుస్తుంది. 17–19 శతాబ్దుల శాసన భాషలో ఏను అనేది కేవలం విశేషణంగా మాత్రం కనిపిస్తుంది. ఉదా. యాంభది. యేందుము.

నన్నయ, నన్నెచోడులు 'ఏను' రూపాన్నే వాడారు. కావ్యభాషలో 12 వ శతాబ్దినుండి 'అయిదు' కూడ కనిపిస్తుంది. ఆఱు, అరవాద్యది, అఱువది, అర్వురు అనే రూపాలలో ఆరు సంఖ్యావాచకం; ఏఱు, ఏడు రూపాలతో ఏడు సంఖ్యావాచకం శాసనభాషలో కనిపిస్తాయి.

ఎణ్బొది, ఎణుంబొది, ఎనుబొది, ఎణ్మ, ఎన్మిది, ఎనమణ్ణకును అనే రూపాలు ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో కనిపిస్తాయి. ఈ విధంగా ప్రాచీన శాసనాలలో అనేక రూపాలతో కనిపించే ఈ సంఖ్యా వాచకం 11–14 శతాబ్దుల నడుమ ఎనిమిది, ఎన్మిదిగా స్థిరపడినట్లు తెలుస్తుంది. ఎన్మం(డ్రు అనే రూపం కూడ ఈ కాలంలో కనిపిస్తుంది.

తొంభ, తోంభ అనే రూపాలే ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో కనిపిస్తాయి. 11–14 శతాబ్దుల శాసనాలను బట్టి అప్పటికి ఇది తొమ్మిదిగా స్థిరపడినట్లు తెలుస్తుంది. తొమ్మం(డ్రు రూపంకూడ ఈ కాలంలో కనిపిస్తుంది.

పది, పదునూఱ్ఱు అనే రూపాలు ప్రాఙ్నన్నయ కాలంలో కనిపిస్తాయి. సమాస పదాలలో ఈ సంఖ్యావాచకానికి అనేక రూపాంతరాలున్నాయి. ఇరవది, ఏబది, ముప్పది, ఇరుభది, ఎణ్బది, నళ్వాద్యది, నల్వొది, ఎన్మిది, ఏంభయ్, పణ్డ్రెణ్డు, పదేను మొదలైనవి. 11–14 శతాబ్దుల శాసనాలలో ఇరువది, ఇర్వయి, ముప్పది, ముప్పై, నలువది, నల్వది, నల్వయి, ఏంబది, అరువది, అఱువై, డెబ్బది, ఎనభై, తొంబయి వంటి రూపాలు 12 వ శతాబ్దినుండి క్రమంగా అధికమవుతూ కనిపిస్తాయి. ఈ రూపాల లోని చివరిది > యిగా మారటం 15 వ శతాబ్దినాటికి స్థిరపడినట్లు ముప్పయివంటి శాసనరూపాలనుబట్టి తెలుస్తుంది. ఏంబది వంటివి కూడ క్వాచిత్కంగా కనిపిస్తాయి.

నూర, నూఱు, నూట, నూఱింటికి, నూర్వురు అనే రూపాలు శాసన భాషలో కనిపిస్తాయి. 15, 16 శతాబ్దుల శాసనాలలో నూంటపది వంటి 'ంట'తో కూడిన రూపాలు అధికం.

వెయి, వేయి, వెయ్యి, వేయు, వేల్, వేవురు, వేవ్రు, వేగురు, వేగవిలాఱు అనే రూపాలతో వేయి శబ్దం శాసన భాషలో కనిపిస్తుంది.

ఇవి కాక సంఖ్యా వాచకాలు సంస్కృత ప్రాకృత భాషల నుండి వచ్చిన ఎరవు పదాలు కొన్ని నన్నయకు పూర్వపు శాసనాలలో కనిపిస్తాయి. దువ (రెండు), తిణ్ణి (మూడు), చౌ (నాలుగు), బారస (పన్నెండు), సత్తిగ (ఇరవైఒకటి), పాతిక (ఇరవై అయిదు), వంద (నూరు) వంటివి ప్రాకృతం నుండి వచ్చాయి. త్రి (మూడు), నవ (తొమ్మిది), షష్ఠి (అరవై), నవతి (తొంభై), సహస్ర, కోటి అనేవి సంస్కృతం నుండి వచ్చాయి. అడ్డ, అద వంటి ప్రాకృత పదాలతోను, అర్ధ అనే సంస్కృత పదంతోను, అర అనే దేశ్య పదంతోను సగభాగాన్ని నిర్దేశించేవారు.

పూరణార్థంలో వచ్చే ప్రత్యయంగా 'అగు' ప్రాఙ్నన్నయ కాలపు భాషలో కనిపిస్తుంది. ఇది 'అవు'గా నన్నయ భాషలో వుంది. తరువాత దీనికి విశేషణత్వ 'అ' కారం చేరి 'అవ' ఏర్పడింది. కావ్యభాషలో అధికంగా కనిపించే రూపం ఇదే. ఈ అవ 12 వ శతాబ్దినాటికి వ్యవహారంలో 'ఓ'గా మారినట్లు అప్పటి శాసన భాషవలన తెలుస్తుంది.

ప్రబంధ యుగంలోని కవులు కొందరు 'ఓ' రూపం వాడారు. ఉదా. పందొమ్మిదో.

**విశేషణాలు:** విశేషణాలు ఏర్పడే పద్ధతిలో శాసన భాషకి, కావ్యభాషకి భేదం అంతగా కనపడదు.

ఒక నామం మరో నామానికి పూర్వం వుండటం వలన విశేషణం అవుతుంది. ఉదా. ఉరువుపల్లి, చిట్టేరు, కలుగాడి. గుణవాచక విశేషణాలు విశేష్యాలకు పూర్వం వస్తాయి. ఉదా. నల్లరాయి, పచ్చిపాలు. ము వర్ణకాంత పదాలలోని 'ము' ప్రత్యయస్థానంలో 'పు' చేరి అవి విశేషణాలుగా ప్రవర్తిస్తాయి. ఉదా. వేపూరు, కట్టెపు దుర్గము, ఇనుప కవదివియ, దక్షిణపువలను. ఈవిధంగా 'పు' రావటం 12 వ శతాబ్ది తరువాత అధికంగా కనిపిస్తుంది. 'ంపు' రావటం చాల అరుదు. ఉదా. వజ్రంపు రా కోట. అజంత నామం మీద అజాది నామానికి పూర్వం 'టు'గాగమం వచ్చి విశేషణ రూపం ఏర్పడుతుంది. ఉదా. ఇరుకుటూరి. ఇంకా ఇచ్చిన, ఉపేక్షించిన వంటి భూత కాలిక ధాతుజ విశేషణాలు; మనువాణ్డు వంటి తద్ధర్మార్థక విశేషణాలు పెట్టనివారు, కొలదిలేని వంటి వ్యతిరేకార్థక విశేషణాలు శాసనభాషలో కనిపిస్తాయి. ఇవికాక నామవాచకానికి 'అగు' ధాతు భూతకాలిక విశేషణ రూపమైన 'అయిన' చేర్చిన విశేషణాత్మక పదబంధాలు కూడా కనిపిస్తాయి. ఉదా. ఉత్తమోత్తముస్తయిన.

అదంత పదాలుగాని, ఉదంత పదాలుగాని విశేషణా లయ్యేటప్పుడు అనుస్వారం తరచుగా రావటం 11–17 శతాబ్దుల శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. తెల్లంబ్రాలు, తూర్పుంబొలము, ఉత్తరపుం బొలము, కంచుంబ్రతిమ, ఊరుంగాయెలు.

అగు, అవు చేరి పూరణార్థకాలైన సంఖ్యావాచక విశేషణాలు కనిపిస్తాయి. ఉదా. పదియేడగునేణ్డు, మూణ్డవు నడవు. 'అవ' ప్రత్యయం క్వాచిత్కంగా కనిపిస్తుంది. ఉదా. రెండవ నడపు, మూడవ పాలివారు. 'ఓ' ప్రత్యయం 12 వ శతాబ్దిలో ఒక్కచోట కనిపిస్తుంది. ఉదా. మూండో నడపు. 15, 16 శతాబ్దుల నాటికి ఇది చాల ప్రచారంలోకి వచ్చింది. 19 వ శతాబ్ది వరకుకూడ శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. రెండో, మూడో.

ఒకేరూపం విశేషణంగాను, విశేష్యంగాను కూడ వాడ బడటం కావ్యభాషలో కనిపిస్తుంది. విశేషణ 'అ' ప్రత్యయంతో కూడిన 'నల్ల' రూపాన్ని నన్నయ విశేష్యంగా వాడాడు.

అ, ఇ, ఎ అనే సర్వనామ ప్రాతిపదికలతోపాటు మధ్యస్థాన్ని బోధించే 'ఉ' ప్రాతిపదిక ఒకటి వుండేది. దీనినుండి ఏర్పడిన 'ఉల్ల' అనే విశేషణ రూపానికి నన్నయ శ్రీనాథుల ప్రయోగాలునవాయి.

**సమాసాలు:** శాసనాలలో క్రీ.శ. 7 వ శతాబ్దినుండి మిశ్రసమాసాలు లేక వైరి సమాసాలు అనబడే మిశ్రమపదాలు కనిపిస్తాయి. ఈవిధమైన పదమిశ్రణం గద్య శాసనాలలో అధికంగాను; పద్యశాసనాలలో, కావ్యభాషలో అల్పంగాను వుంది. కణ్ణసామి, మొగమాడవ్ వంటి దేశ్య తద్భవ మిశ్రరూపాలు, అమృతపడి, పోర్ముఖరాము వంటి దేశ్య తత్సమ మిశ్రరూపాలు; ఘనరాచమణి, సవఙబాద పరియారువు వంటి తత్సమ తద్భవ మిశ్రరూపాలు ప్రాచీన శాసన భాషలో కనిపిస్తాయి.

11–14 శతాబ్దుల భాషలో దేశి, తత్సమ, మిశ్ర, వర్ణలోప సమాసాలున్నాయి. ఉదా. చలిపందిరి, ఆంబోతు, ఆనపాలు (ఆవుపాలు), ఇనుపెద్దు (నల్లని గృహజంతువులు) మొదలైనవి దేశిపదాలతో ఏర్పడినవి. దేశి సమాసాలలో తలిదండ్రులు, కూరకాయలు వంటి ద్వంద్వ సమాసాలు కనిపిస్తాయి. ఏకవచనాంతమైన ద్వంద్వ సమాస రూపాలు కూడ వున్నాయి. ఇటువంటివి 13 వ శతాబ్దంనుండి కనిపిస్తాయి. ఉదా. తల్లితండ్రి, కాయకూర. సహస్ర నామార్చన, జలధారవంటి సంస్కృత రూపాలు, తత్సమ సమాసాలున్నాయి. మిశ్ర సమాసాలలో వెంజామర (తె+సం), చామరకొలుపు (సం+తె) వంటివి కనిపిస్తాయి. మంజితెర (మంజిష్మతెర), హావిలి (హవిబలి) వంటి వర్ణలుప్త సమాస రూపాలు కనిపిస్తాయి.

15, 16 శతాబ్దులలో అన్నందమ్ములు, మాతా పితాళ్లు, తల్లిదండ్రాదులవంటి ద్వంద్వ సమాసాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి.

17–19 శతాబ్దుల శాసనాలలో వెల్లనూలు, మద్ది చెక్కవంటి దేశి సమాసాలు; శిశుహత్య, నిత్యనైవేద్యాలు వంటి తత్సమ సంస్కృత సమాసాలు; మడిస్థలం, గడప్రమాణంవంటి మిశ్రసమాసాలు ఉన్నాయి. ఇంకా మెరకపల్లాలు, గొఱెమేంకలు వంటి ద్వంద్వ సమాసాలు; పెద్దగుంపులువంటి కర్మధారయ సమాసాలు; మూడుపాళ్లు, నలుతుమువంటి ద్విగుసమాసాలు; మామిడితోపు, గంగా తీరమువంటి తత్పురుష సమాసాలు; విప్పలఙ గోత్రులు వంటి బహువ్రీహి సమాసాలు కనిపిస్తాయి.

కావ్యభాషని పరిశీలిస్తే కవిత్రయ భాషలో ప్రాణగొడ్డము వంటి ఒకటి రెండురూపాలు మాత్రమే వైరి సమాసాలు కనిపిస్తాయి. నన్నెచోడుని కుమార సంభవంలో ఇవి కొంచెం అధికంగా కనిపిస్తాయి. ఉదా. మంత్రకాటుక, ఇతర వేల్పులు, మజ్జనబావి, సురగజ్జెలు.

ఆధునికయుగపు కావ్య భాషలో వైరిసమాసాలు మధ్య యుగంలోకంటె అధికంగా కనిపిస్తాయి. ఉదా. శూద్రబిడ్డ, వీటీ సంబళులు, మూలబొక్కసంబు.

**క్రియ:** శాసనభాషలో క్రియా ప్రాతిపదికలు మూడు విధాలుగా కనిపిస్తాయి.

1. **సామాన్య క్రియలు:** ఏకధాతుమైన 'అగు' వంటివి. ఇవన్నీ దేశ్యాలే. ఉదా. అగు, అమ్ము.

**2. సంకీర్ణ క్రియలు:** నామ ప్రాతిపదికపైన క్రియా కారక ప్రత్యయం చేరి ఏర్పడినవి. ఇవి దేశ్యాలలోను, ఎరవు పదాలలోను వున్నాయి. ఉదా. కట్టించి, చెల్లించు, అనుభవించు, ఉదయించు.

**3. సమస్త క్రియలు:** ఇవి క్రీ.శ. 8 వ శతాబ్దినుండి కనిపిస్తాయి. వీటిలో క్రియా ప్రాతిపదికమీద మరో క్రియా పదాంశం చేరి ప్రత్యేకార్థాల నిచ్చేవి ఒక రకం. ఇవి కేవలం దేశ్యాలే. ఉదా. ఏలుచున్ని, నడపంగల, కట్టబడిన. నామ ధాతువుమీద అనుబంధ క్రియచేరి ఏర్పడినవి ఇంకోరకం. ఉదా. చేకొని, దయసేయు, మతికెక్కు.

**సమాపక క్రియలు:** సమాపక క్రియారూపంలో ధాతువుపైన కాలబోధక ప్రత్యయం, దానికి పురుషబోధక ప్రత్యయం చేరుతుంది. ఉదా. వచ్చెను, వచ్చును.

**భూతకాలిక క్రియ:** ఇ, ఇతి, ఇన్, ⊘, (శూన్య పదాంశం) ఇయె, ఎ అనే సపదాంశాలు భూతకాలిక ప్రత్యయాలుగా శాసనభాషలో కనిపిస్తాయి. ఉదా. ఇచ్చిరి, ఇచ్చితిరి, ఇచ్చినాణ్డు, ఏరి, పడియె, నిల్పెన్. ఇచ్చితమి, ఇస్తిమి అనే రూపాలు 12 వ శతాబ్ది శాసనాలలో కనిపిస్తాయి. చేస్తిని, చేస్తిమి, కట్టిస్తిమి, మన్నింస్తిమి, సమర్పింస్తిమి వంటి రూపాలు 13 వ శతాబ్దంనుండి శాసనభాషలో అధికమై – ఇచ్చితిమి, సమర్పించితిమి వంటి రూపాలు క్వాచిత్కంగా కనిపిస్తాయి. చేసుకొన్నారు, వుంటిమి వంటి భూతకాలిక రూపాలు 17 వ శతాబ్ది శాసనాలలో వున్నాయి.

భూతకాలిక ప్రత్యయాలు శాసన భాషలోను కావ్య భాషలోను ఒకేవిధంగా కనిపిస్తాయి.

**వర్తమాన క్రియ:** శత్రర్థ క్రియలకు 'ఉండు' ధాతు రూపాలను చేర్చి వర్తమాన క్రియలను నిర్మిస్తారు. ఉదా. ఏలుచున్ని, చేయుచున్న, వార్ధిఁల్లుచునుణ్డు. 15వ శతాబ్దినుండి "చున్" ప్రత్యయ రూపాలు తగ్గి "తున్" ప్రత్యయ రూపాలు అధికమైనాయి. ఉదా. సేవ సేస్తున్నాండు. దీన్నిబట్టి చేస్తున్నాడు వంటి రూపాలు వర్తమానార్థంలో వ్యవహారంలో వుండేవని భావించవచ్చు.

**భవిష్యత్క్రియ:** ధాతువుయొక్క తుమర్థక రూపాన్ని ప్రాతిపదికగా తీసుకొని దానికి "కల"ను చేర్చి భవిష్య త్క్రియలను నిర్మించేవారు. ఈ విధమైన క్రియలు 11 వ శతాబ్దికి తరువాతి శాసనాలలో మాత్రమే కనిపిస్తాయి. ఉదా. పొయ్యగల, పాలింపంగల ఈ "కల" స్వతంత్ర క్రియగా కూడా శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. కలయంతకును.

**తద్ధర్మార్థకం:** తు, దు, డు, ⊘, ఉన్–అనే సపదాంశాలు తద్ధర్మార్థక ప్రత్యయాలుగా కనిపిస్తాయి. ఉదా. కాన్తురు, ఉణ్డుదురు, కొణ్డు, కలరు, వలయుం, ఎడి, ఎడు, ఏ, ఏటి అనే సపదాంశాలు, తద్ధర్మార్థక విశేషణ ప్రత్యయాలు శాసన భాషలో కనిపిస్తాయి. ఉదా. వణ్డెడి, ఏలెడు, చేసేవాండు, అనేటి. చేసువాండు, శేతురు, చేస్తారు వంటి తద్ధర్మ రూపాలు కూడ శాసనాలలో కనిపిస్తాయి.

నన్నయకు పూర్వపు శాసనాలలో ఉత్తమపురుష ఏకవచన క్రియారూపాలు లభించలేదు. ఇచ్చితిమి, పరిహరించితిమి వంటి బహువచన క్రియారూపాలు మాత్రం లభించాయి. 12–14 శతాబ్దుల శాసనాలలో ఇచ్చితిమి వంటి రూపాలతో పాటు ఇస్తిమి, చేస్తిని వంటి రూపాలు కూడ కనిపిస్తాయి. మధ్యమ పురుష ఏకవచన రూపం ప్రార్థనార్థకంలో మాత్రమే లభించింది. ఉదా. కొమ్ము. బహు వచన రూపం ఒక్కటే లభించింది. ఉదా. ఇచ్చితిరి. మధ్యమ పురుష ఏకవచన రూపాలు 12–14 శతాబ్దుల శాసనాలలో కనిపించవు. ప్రథమ పురుష రూపాలు కలణ్డు, ఇచ్చినాణ్డు (ఇది కావ్యభాషలో 13 వ శతాబ్ది నుండి మాత్రమే కనిపిస్తుంది. అంతకు పూర్వం ఇచ్చినవాడు అనే వుండేది), ఇచ్చినది, చనదు, లేదు, కలయది వంటివి ఏకవచన రూపాలున్నాయి. బహువచనంలో కేసిరి, కొణ్డు, తాగిరి, కలర్, పోదురు, పోవుదురు, ఇచ్చినవి వంటివి కనిపిస్తాయి. భూత భవిష్యత్క్రియా విశేషణాలపై వాణ్డు, వారు అనే సర్వనామాలు చేరేటప్పుడు 'వ' కారం లోపించటం 12 వ శతాబ్ది నుండి తరచుగా కనిపిస్తుంది. ఉదా. వచ్చినారు, నడపంగలాణ్డు, నడపం గలరు. ఇటువంటి రూపాలు 12 వ శతాబ్దిలో క్వాచిత్కంగాను, తరువాత అధికంగాను కనిపిస్తాయి. వీటికి 'అది, అవి' అనే సర్వనామాలు చేరేటప్పుడు 'అ' లోపించటం కూడ తరచుగా కనిపిస్తుంది. ఉదా. కొన్నది, చెల్లకలది.

భూత, తద్ధర్మార్థక సంపూర్ణ క్రియలలో పురుషబోధక ప్రత్యయాలు చేరని రూపాలు నన్నయ, నన్నెచోడులలో తరచుగ కనిపిస్తాయి. ఉదా. జడుఁడె వైతెట్లు బ్రాహ్మణ జాఁతిబుట్టి (కు.సం.)

'చు' వర్ణాంత ధాతువుకి చేరే తద్ధర్మార్థక 'దు' ప్రత్యయం 'త' కారంగా మారడం గ్రాంథిక భాషా పద్ధతి, ఉదా. చూచు+దు+రు> చూతురు. ఈ విధమైన మార్పు పొందని రూపాలు వ్యావహారికాలు. వీటిలోని ధాత్వంత 'చ' కారం 'ప' కారంగా మారటం వ్యావహారికంలో కనిపించే మరో మార్పు.

కవిత్రయంలో ఇటువంటి రూపాలు లేవు. తరువాతి కవులలో కనిపిస్తాయి. ఉదా. ఆకర్ణింపుదురు (భాగవతం). 'యు' కారాంత ధాతువులలో 'ద'కు 'త' ఆదేశం కావటంకూడ వ్యావహారిక రీతి. చేయు–చేయుదురు/చేతురు. ఇటువంటి రూపాలు నన్నయలో లేవు. శివకవుల దగ్గర నుండి కనిపిస్తాయి. ఉదా. చేతున్ (కు.సం.). చిన్నయసూరి చేతురు, కోతురు ఇత్యాదు లసాధువు లన్నాడు.

భూత, తద్ధర్మ, వర్తమాన, భవిష్యత్క్రియాజన్య

విశేషణాలకు తచ్ఛబ్దం చేరిన విశేష్యరూపాలే క్రియార్థాన్ని పొందాయి. వండినవాడు అనేది విశేష్యము, క్రియ. తరువాత తచ్ఛబ్ద 'వ' కారం లోపించి ఇది వండినాడుగా మారి కేవలం క్రియగానే ప్రయుక్తమైంది. ఇదేవిధంగా వండుచున్నవాడు–వండుచున్నాడు, వండగలవాడు–వండగలాడు, వండగలడుగా మారాయి. ఈవిధంగా తచ్ఛబ్ద వ కారం లోపించిన రూపాలు నన్నయలో లేవు. తిక్కన కాలం నుండి కావ్యభాషలో ప్రవేశించాయి.

ద్విరుక్త, అద్విరుక్త చ కారాంత ధాతువులకు సకారాంత రూపాలు కావ్యభాషలో నిషిద్ధాలే కాని వ్యవహారంలో ప్రాచుర్యాన్ని పొందాయి. ఇటువంటి రూపాలను 17 వ శతాబ్దికి తరువాతి కవులు వాడారు. ఉదా. వస్తాడు, తెస్తాడు, ఇస్తాడు, చస్తాడు. అప్పకవి వీటిని గ్రామ్యోక్తులన్నాడు.

భవిష్యత్క్రియలలో ఎద, ఎడి, ఎడు అనే అగమాలు రావటం కావ్య భాషా పద్ధతి. పెట్టెదము, తెచ్చెదము అనే విధంగా రూపాలుంటాయి. ఇవి వ్యవహారంలో పెట్టేము, తెచ్చేముగా మారాయి. ఇటువంటి రూపాలు అర్వాచీన కావ్యభాషలో కనిపిస్తాయి. ఉదా. ఇచ్చేము, చేసేము, చెడేవు, మొక్కేను, గుండెయదరీని, ఇంద్రుడేమిచ్చీని.

ఎడి/ఎడు అనే తద్ధర్మార్థక ప్రత్యయానికి వ్యవహారంలో ఏ(టి) అనే రూపముంది. ఇదికూడ అర్వాచీన కావ్య భాషలో చోటు చేసుకుంది. ఉదా. వారిజాడల మెలగే, తిరిపెంబెత్తేవానికి, విటకోటి నెనసేటి.

ఆత్మనేపదార్థంలో భూతకాలిక అసమాపక క్రియా రూపాలలో వచ్చే 'కొని'కి క/కు/కొ అనే రూపం వ్యవహారంలో ఉంది. అర్వాచీన కావ్యాలలో ఇటువంటి వ్యవహార రూప ప్రయోగాలున్నాయి. ఉదా. ఎత్తుకపోయి, పూనుక, బుద్ధితెచ్చుకు, చూరుబట్టుకు, కాముడు కోపించి యిటకు గదుముకొ రాగా. వీటిలో 'క'తో కూడిన రూపాలే అధికం.

వ్యతిరేకార్థకం: క్రియ ప్రాతిపదికకు "అ" అనే వ్యతిరేక బోధక ప్రత్యయంచేరి వ్యతిరేకార్థక క్రియారూపం ఏర్పడుతుంది. దీర్ఘాంతం ధాతువులలో మాత్రం ఇది లోపిస్తుంది. ఉదా. లేదు, కావు, చనదు, పడయదు. ధాతువుకు "లేదు" చేర్చితే వ్యతిరేక భూతకాల క్రియ ఏర్పడుతుంది. ఉదా. చేయలేదు ధాతువుకు "అని" ప్రత్యయం చేరి వ్యతిరేకార్థక విశేషణాలు ఏర్పడతాయి. ఉదా. పెట్టని, లేని. ధాతువుకి "అక" ప్రత్యయం చేరి వ్యతిరేక క్త్వార్థక క్రియ లేర్పడతాయి. ఉదా. ఓపక, లేక.

కావ్యభాషలో కూడ వ్యతిరేకార్థక రూపాలు ఇదేవిధంగా వుంటాయి. ధాత్వంత మందలి "చ" కారం వ్యతిరేకార్థకంలో "ప" కారంగా కావ్యభాషలో మారుతుంది. ఉదా. ఒనర్చు–ఒనర్పడు. కవిత్రయ కాలం తరువాత ఈవిధంగా 'ప' కారంగా మారని రూపాలు కూడ కన్పిస్తాయి.

అసమాపక క్రియలు: క్త్వార్థక, చేదర్థక, శత్రర్థక, విధ్యర్థక, తుమర్థక, ప్రార్థనాద్యర్థక రూపాలు శాసన భాషలో కనిపిస్తాయి.

'ఇ' ప్రత్యయం చేరిన క్త్వార్థక రూపాలు పొడుచి, చేసి, కొట్టి వంటివి శాసనాలలో కనిపిస్తాయి. కావ్యభాషలోను క్త్వార్థక రూపాలిదేవిధంగా ఉన్నాయి.

ప్రాతిపదికకు "ఇనన్" చేరితే చేదర్థక రూపా లేర్పడటం ప్రాచీన శాసనాలలో కనిపిస్తుంది. ఉదా. కట్టినన్. 13 వ శతాబ్ది నుండి ఇతే/తే ప్రత్యయం కూడా కనిపిస్తుంది. ఉదా. పోయితేను, చేస్తే. 15 వ శతాబ్దినుండి ఇతే/తే తో కూడిన రూపాలే అధికంగా కనిపిస్తాయి. 17 వ శతాబ్దినుండి శాసనాలలో ఇనన్/ఇనా, ఇతే/తే చేదర్థంలో కనిపిస్తాయి. ఉదా. వచ్చినను, చేసినా, అవధరించితే, పంపిస్తే.

కావ్యభాషలో చేదర్థక ప్రత్యయం 'ఇనన్'. దీనికి వ్యవహారం రూపం "ఇతే". అర్వాచీన కావ్యాలలో ఇటువంటి వ్యవహార రూపాలు చాల కనిపిస్తాయి. ఉదా. అంపించితే, చూచితే, నొక్కితే, మీటితే.

ధాతువుకి "చు" ప్రత్యయం చేరి శత్రర్థక రూపం ఏర్పడుతుంది. ఉదా. ఏలుచు, పరగుచును. 16 వ శతాబ్ది నుండి ఈ ప్రత్యయం "తు"గా కూడ శాసన భాషలో కనిపిస్తుంది. ఉదా. చేస్తుండి, పాలిస్తున్ను. 17 వ శతాబ్దినుండి తూ/తా కూడ కనిపిస్తుంది. ఉదా. చేస్తూ, భక్షిస్తా.

విధ్యర్థక రూపం 'నడపునది' అనే దొకటి మాత్రమే నన్నయకు పూర్వపు శాసనాలలో కనిపిస్తుంది. 12 వ శతాబ్దినుండి జరిగించుము, విచ్చేయుడి వంటి రూపాలు కనిపిస్తాయి.

అకర్మక సకర్మక క్రియలు: అకర్మక ధాతువుపైన "చు" ప్రత్యయంగాని 'ఇంచు' ప్రత్యయంగాని చేరి సకర్మక క్రియ లేర్పడతాయి. అకర్మక ధాతువులోని చివరి 'చు' 'పు'గా మారటంవలన కూడ సకర్మక క్రియలేర్పడతాయి. ఉదా. చెడు (అకర్మక ధాతువు) + చు > చెఱిచిన, వచ్చు (అకర్మకం) + ఇంచు > రావించి, చచ్చు (అకర్మకం)లోని చు > పుగా మారి, 'చమ్పు' అనే సకర్మక ధాతువు ఏర్పడింది. ఉదా. చమ్పిన.

కావ్యభాషలోను ఇదేవిధంగా అకర్మక రూపాలుంటాయి. కొన్ని ధాతువులు ఏవిధమైన రూపభేదం లేకుండా అకర్మకంగాను, సకర్మకంగాను కూడ వాడబడటం నన్నయాది ప్రాచీన కవులలో కనిపిస్తుంది. ఉదా. కురియు, పూను. ఇటువంటి ధాతువులను నన్నయ అకర్మక, సకర్మక క్రియలుగా ప్రయోగించాడు. తర్వాత ఈ ధాతువులలో అకర్మక, సకర్మక భేదాన్ని తెలియజేయటానికి ప్రత్యయాలు చేరాయి. కురియు – కురియించు/కురిపించు, పూను– పూన్చు.

ప్రేరణార్థకాలు: సకర్మక ధాతువులకు 'ఇంచు' ప్రత్యయం చేరటంవలన ప్రేరణార్థకాలు ఏర్పడతాయి. ఉదా. కట్టిఇచ్చి, కావిఇచ్చి. సకర్మక ధాతుగతమైన 'చ' కారానికి 'ప' కారాదేశం వచ్చికూడ ప్రేరణ రూపా లేర్పడతాయి. ఉదా. పనుచు – పంపు, నడచు–నడిపించు, ఇచ్చు–ఇప్పించు.

కావ్యభాషలోను ప్రేరణార్థకరూపా లిదే విధంగా కనిపిస్తాయి. చు, పు, ఇంచు ప్రేరణ ప్రత్యయాలలో 'ప' కార రూపాలకు క్రమంగా వ్యాప్తి కలిగింది. విడు–వించు/వింపు, చినుగు–చించు/చింపు, మాయు – మాయించు/ మాపు. మెచ్చించు అనే ప్రయోగం కుమార సంభవంలో కనిపిస్తుంది. తరువాతి కాలంలో మెప్పించుగా మారింది.

కృతులు: కృత్ప్రత్యయాలు, తద్ధిత ప్రత్యయాలు అని నిష్పాదక ప్రత్యయాలు రెండు రకాలు. క్రియాధాతువులకు కృత్ప్రత్యయాలు చేరి అర్థాంతరాన్ని తెలిపే కృదంత రూపాలు ఏర్పడతాయి. ప్రాచీన శాసనాలలో అము, ఇక, డ్, పు, వు అనే కృత్ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. కూటము, వాడిక, నంజుడ్లు, తూఱ్పు, కొల్వు. 12–16 శతాబ్దుల శాసనాలలో ఇకి/ఇక, అపు/ఉపు/పు, అవు/ఉవు/వు, ఉవ/వ, ఇమి/మి, అలి/ఇలి అనే కృత్ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. కానిక, కాన్కి, అడపు, కొలుపు, కాంపు, తొడవు, తెరువు, పూవు, విలువ, త్రోవ, కూరిమి, పేర్మి, కూడలి, డిగ్గిలి. 17–19 శతాబ్దుల శాసనాలలో పు, అడ, బడి, ఇమి ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. కాంపు, కట్టడ, యేలుబడి, బలిమి.

తద్ధిత రూపాలు: నామధాతువులకు తద్ధిత ప్రత్యయాలు చేరటంవలన అర్థాంతరాన్ని తెలిపే తద్ధిత రూపాలు ఏర్పడతాయి. ప్రాఙ్నన్నయ కాలపు శాసనాలలో అరి, ఇక, ఇకము, కాఱు, గార్ అనే తద్ధిత ప్రత్యయాలు కనిపిస్తాయి. చేసేవాడు అనే అర్థంలో 'అరి' ప్రత్యయం వస్తుంది. ఉదా. మానిక. సమూహార్థంలో 'ఇకము' వస్తుంది. ఉదా. రట్టడికము. కలవాడు అనే అర్థంలో కాఱు, [illegible] చేసేవాడు అనే అర్థంలో 'గార్' ప్రత్యయం కనిపిస్తుంది. ఉదా. కఞ్చుగార్. 12–16 శతాబ్దుల శాసనాలలో కాడు, కత్తె, అరి/ఆరి /ర /ఆఱు, అఱి, ఇ, కము, తనము అనే తద్ధిత ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. అవజకాండు, వ్రిత్తికత్త్య, కొట్టరి, కోనారి, భడర, తలాఱు, సుంకఱి, భండారి, రడ్డికము, రడ్డికం, స్థానాపతితనము, తలారితనము. 17–19 శతాబ్దుల శాసనాలలో అరి, కాడు అనే తద్ధిత ప్రత్యయాలు కనిపిస్తాయి. ఉదా. దొమ్మరి, సాలెగాండ్లు.

వాక్యరచన: వాక్యరచనా విధానంలో శాసన భాషకి, కావ్యభాషకి, ఆధునిక వ్యవహార భాషకి భేద మంతగా కనిపించదు. సమాపకక్రియాసహిత వాక్యాలు, క్రియారహిత వాక్యాలు కూడ శాసన భాషలో కనిపిస్తాయి. క్రీ.శ. 7 వ శతాబ్దికి చెందిన శాసనాల నుండి కొన్ని ఉదాహరణలు: కమ్మరి వినియణ వ్రాసె. కుమార శర్మార్కెరికి ఉదకా పూర్వఞ్జేసి ఇచ్చిరి. ఇన్దోఱు దీనికి సక్షి. నీవు నా ప్రాణ సమానుణ్ణవైనచెలివి. శాసన భాషలో అన్ని కాలాలలోను ఇటువంటి వాక్యాలు కనిపిస్తాయి. ఈ వాక్య నిర్మాణం కర్త, కర్మ, క్రియ అనే క్రమంలోనే వున్నదని చెప్పవచ్చు.

సంస్కృత భాషా ప్రభావం వలన తెలుగులోనికి వచ్చిన యత్తదర్థక కర్మణ్యర్థక ప్రయోగం గల వాక్యాలు చాల విరళంగానే అయినా ప్రాచీన శాసన భాషలో కనిపిస్తాయి. ఉదా. నీకేమి వలయు దానివేణ్డి కొమ్మనిన. ఇటువంటి యత్తదర్థక ప్రయోగాలు 9, 10 శతాబ్దుల నుండి శాసనాలలో కనిపిస్తాయి. పట్టం కట్టబడిన వాన్డువంటి కర్మణి ప్రయోగాలు 9 వ శతాబ్ది నుండి కనిపిస్తాయి. ఈ కర్మణ్యర్థక ప్రయోగాలు 17 వ శతాబ్దినుండి శాసనాలలో అరుదు.

నన్నయభాషలో కర్మణ్యర్థక ప్రయోగాలు అధికంగానే కనిపిస్తాయి. ఇతర కవులలో ఇవి విరళమనే చెప్పవచ్చు.

సముచ్చయార్థకం: ప్రాచీన శాసన భాషలో సముచ్చయార్థక పదాంశం అనేక రూపాలలో కనిపిస్తుంది. ఉదా. అన్నియు, కళాకఞ్డుగుమ్, గుళ్ళువు, నాలును, కోటియు, గుడియుని, గుడియుంని, దేవొనొఞ్జలకూ, ఎప్పుడూను, మఱియును, ఐయుము. వీటిలో 'ఉము' అనేది ప్రాచీనం. ఇది 'ఉను'గా మారటం 7 వ శతాబ్దిలో ప్రారంభమైంది. 15–19 శతాబ్దుల శాసనాలలో ను/న్ని/న్ను గా కనిపిస్తుంది. ఉదా. కొమ్మనాను, పుత్రులును, నందిన్ని, ఏంటికెన్ని, ప్రోలున్ను.

కావ్యభాషలో సముచ్చయార్థక ప్రత్యయం ఉన్. ను/ని గా కూడ ఇది కనిపిస్తుంది. ఉదా. తన కిష్టుడున్ (భారతం). ఈ సముచ్చయ 'న' కారం లోపించి పూర్వ స్వరానికి దీర్ఘం రావటం శాసనాలలో 11 వ శతాబ్దినుండి, కావ్యభాషలో 13 వ శతాబ్ది నుండి కనిపిస్తుంది. ఉదా. నమ్మీనమ్మని [illegible] లోపించి పూర్వస్వరం దీర్ఘం కావటం వ్యవహార భాషలో జరుగుతుంది. ఈ పద్ధతి అర్వాచీన కావ్యాలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా. మఱీ మించె, ఎగాదిగ, లక్షాయాభైవేలు, పదివేలయినా, బాపనికేమయినాను తెల్పునా.

అతిశయమూ ఆధిక్యమూ చెప్పే సందర్భంలోనూ ఈ విధంగా దీర్ఘం రావటం ఆధునికకావ్యాలలో కనిపిస్తుంది. ఉదా. మిగులానుప్పొంగెడిన్, చాలా వంచకుడు.

పదజాలం: తెలుగు భాషలో ప్రాచీన కాలంనుండి అన్య భాషాపదాలు, సంస్కృత ప్రాకృత భాషల నుండి వచ్చినవి చేరటం కనిపిస్తుంది. దీన్ని దృష్టిలో పెట్టుకొనే సంప్రదాయ వ్యాకరణాలు తెలుగులోకి పదజాలాన్ని తత్సమ, తద్భవ, దేశ్యాలని మూడు భాగాలుగా విభజన చేశాయి.

తెలుగులో ఇమిడిపోయిన ఎరవు మాటలు శాసన భాషలో కూడ కనిపిస్తాయి. ఇవి 6–10 శతాబ్దులలోకంటె 10–11 శతాబ్దుల శాసనాలలో అధికం. కావ్యభాషా ప్రభావమే ఇందుకు కారణం.

సంస్కృతంనుండి వచ్చిన ఎరవు పదాలలో అర్థ విపరిణామం, సంస్కృత వ్యాకరణ విరుద్ధతా కనిపిస్తాయి. ఉదా. వక్రమ్బు (అడ్డు), కరణమ్ (గ్రామాధికారి), జీవితంబు (జీతం) మొదలైనవి అర్థ విపరిణామాన్ని పొందాయి. మనోవల్లభి, వనజనేత్రి వంటివి వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు.

12–14 శతాబ్దుల శాసనాలలో భూమివంటి సంస్కృత పదాలు; ఠక్కురు, డేరా వంటి ప్రాకృత భాషా పదాలు కూడ కనిపిస్తాయి. ఇవిగాక పిరాట్టి, వళిక వంటి అన్యదేశ్యాలు కూడ క్వాచిత్కంగా కనిపిస్తాయి.

15, 16 శతాబ్దులలో దక్కనీ ఉర్దూనుండి ఎరవు మాట లనేకం తెలుగులోకి వచ్చి చేరాయి. ఉదా. హవలాదారు, ఠాణేదారు, ఖబురు, మక్తా మొదలైనవి. ఇవికాక ప్రాకృతంనుండి వచ్చిన దఖబడులు (దధివడలు) వంటివి ఈ కాలంలోని వింత ప్రయోగాలు. వీటితోపాటు సంస్కృత పదాలుకూడ కనిపిస్తాయి.

17–19 శతాబ్దులలో సంస్కృత ప్రాకృత పదాలేకాక ఉర్దూ పదాలు అనేకం తెలుగు శాసనాలలో కనిపిస్తాయి. ఉదా. మొఖాసా, తనఖా, సాయిబు. ఇవికాక 'తిరువళికలు' వంటి తమిళ పదాలు కూడ కనిపిస్తాయి. 19 వ శతాబ్దినాటికి ఆంగ్ల పదాలనేకం చేరాయి. ఉదా. ఆగొష్టు, కలకటరు.

కావ్యభాషలో సంస్కృత ప్రాకృత భాషాపదాలు చేరటం నన్నయ కాలం నుండి కనిపిస్తుంది. సంప్రదాయ వ్యాకరణాలు వీటిని తత్సమ తద్భవాలుగ విభజించి, తెలుగు సాహిత్య భాషలో స్థానాన్ని కల్పించాయి. శ్రీనాథుడి కాలంనుండి అరబ్బీ, పార్శీవంటి అన్య భాషా పదాలు చేరటం ప్రారంభమై క్రమంగా అధికమైనాయి. ఉదా. వజీరు, కుల్లాయి, జమాఖరచులు, బాజారు, సెబాసు, తేజీ, శికారు, జులుము, పౌజు, నకసీపని, బందిఖానా, ఖబురు మొదలైనవి. అర్వాచీన కాలంలో ఆంగ్లభాషాపదాలు కూడ గ్రంథాలలో చేరాయి.

వ్యవహార భాషా లక్షణాలు కలిగిన కొన్ని ప్రయోగాలు కావ్యభాషలో కనిపిస్తాయి. పదంలోని ఒక అక్షరం లోపించి దాని పూర్వపు అచ్చుకి దీర్ఘం వచ్చిన రూపాలు ప్రాఙ్నన్నయ కాలంలోనే ప్రారంభమై క్రమంగా వ్యాప్తి చెందినట్లు శాసనాలనుబట్టి తెలుస్తుంది. మొదట్లో ఇటువంటి రూపాలు కేవలం వ్యావహారికాలై శిష్టభాషలో ప్రవేశం పొందలేకపోవటం వలన కావచ్చు, నన్నయ వీటిని వాడలేదు. వ్యవహార ప్రాచుర్యాన్ని బట్టి తిక్కనాదులు క్వాచిత్కంగా వాడారు. ఉదా. మరాకుము<మరువకుము, నమ్మీ నమ్మక < నమ్మియు నమ్మక. ధాతుజ విశేషణాల మీది తచ్ఛబ్ద 'వ' కార లోపంలోను ఈ విధమైన ధ్వని పరిణామమే కనిపిస్తుంది. నన్నయనాటి 'వండినవాడు' వంటి రూపం తిక్కననాటికి 'వండినాడు'గా మారి కావ్యభాషలో అంగీకృతమైంది. దేశినాదరించిన శివకవుల రచనలలో ఇటువంటివి ఎక్కువగా కనిపిస్తాయి. ఉదా. సాము<సగము, గ్రాము<గ్రహము, వైరాన<వైరమున, మాజనము<మహాజనము, మరాకు<మరువకు. ఇటువంటి రూపాలు ప్రబంధ యుగంనుండి తెలుగు కావ్యాల్లో అధికంగా కనిపిస్తాయి.

వ్యవహారబలం వలన శిష్టవ్యవహార రూపాలు కొన్ని, మాండలిక రూపాలు కొన్ని ఆధునికయుగంలో కావ్యభాషలో చేరాయి. ఈ కాలపు కవులు కొందరు పాత్రోచిత భాషను వ్రాయటం వలన కూడ ఇటువంటి ప్రయోగాలు అధికంగా కనిపిస్తాయి. 'మెఱయు' ధాతువుకి 'మెఱచు' అనే రూపం కనిపిస్తుంది. ఉదా. మిసమిస మెఱచుచు లోపల. 'వెడలు' ధాతువులో వర్ణసమీకరణం జరగటంవలన ఏర్పడిన 'వెళ్ళు' రూపం ప్రయోగించబడింది. ఉదా. వెళ్ళగొట్టింపదలచి, వెళ్ళదోలిన.

తెలియు, విరుచు, చంపు, చూడు అనే కావ్యభాషా రూపాలకు తెలుసు, విరుసు, సంపు, సూడు అనేవి వ్యవహారరూపాలు. ఇందులో 'తెలుసు' అనేది శిష్టవ్యవహారంలోను, మిగిలినవి పామర వ్యవహారంలోను వున్నాయి. ఈ రూపాలను ఆధునికయుగపు కవులు ప్రయోగించారు.

రెండు పదాలకు సంధి జరిగినప్పుడు రెండోపదం 'వ' కారాది అయితే అదులోని 'వ' లోపించి సంధి జరగటం వ్యవహార భాషా లక్షణం. ఇటువంటి ప్రయోగాలు ఆధునిక యుగపు కావ్యభాషలో కనిపిస్తాయి. ఉదా. ముసుగు+వేసికొని = ముసుగేసుకొని, చేతి+వెంట=చేతెంట.

లక్షణ విరుద్ధమైన ప్రయోగాలు పూటమ్ము (పూవుటమ్ము), తానంబు (స్నానంబు), యువ్వన (యౌవన), ప్రాణనాయకి వంటివి కొన్ని ఆధునిక కవులలో కనిపిస్తాయి. ఇంకా ఎన్నో మాండలిక పదాలు, వ్యాకరణ విరుద్ధమైన వ్యవహార రూపాలు కూడ కనిపిస్తాయి. ఉదా. మంగళార్తులు, కడేలు, చౌలు (చెవులు), ఒళ్ళు (ఒడలు), ఏడకు, ఏంది, ఈన (ఈయన), ఈబిడ, ఈలాగు, ఉండ్రా (ఉండుమురా).

కావ్యభాషలో సరళాలతో కనిపించే కొన్ని పదాలు ఈ కాలపు కావ్యాలలో పరుషాలతో కనిపిస్తాయి. ఉదా. చింక (జింక), తెకటార్చు (తెగటర్చు), ముసుకు (ముసుగు).

ఈ విధంగా పరిణామాన్ని పొందిన తెలుగు శాసన భాషనీ, కావ్యభాషనీ పరిశీలించి చూస్తే కొన్ని విషయాలు తెలుస్తాయి.

నన్నయకు పూర్వపు శాసనాలలోనే కావ్యభాషా శైలి కనిపిస్తుంది. నన్నయ కాలానికే కావ్యభాష వ్యవహార భాషకు దూరమవుతున్నట్లు తెలుస్తుంది. కావ్యభాషకు

కవిత్రయ రచనలు ఒరవడి అయితే – వ్యవహార భాష సామాజిక వ్యవస్థలో వచ్చే మార్పులనుబట్టి, ప్రజల ఉచ్చారణా పరిణామాలను బట్టి మారుతూ వచ్చింది. వ్యవహార భాషపై కావ్యభాషా ప్రభావం అన్ని శతాబ్దులలోను కనిపిస్తుంది. సమకాలీన వ్యవహార భాషా ప్రభావం కావ్యభాషపైన 15 వ శతాబ్ది వరకు తక్కువగాను, ఆ తరువాత అధికంగాను కనిపిస్తుంది. ఆధునిక వ్యవహార భాషా రూపాలు కొన్ని 11–14 శతాబ్దుల కాలంలోనే వ్యవహారంలో వున్నట్లు ఆ నాటి శాసన భాషనిబట్టి తెలుస్తుంది. ఆ వ్యవహార రూపాలు బహుళ ప్రచారంలో వున్నట్లు కేతన, అప్పకవి మొదలైన వ్యాకర్తల హెచ్చరికలవలన తెలుస్తుంది. 11 వ శతాబ్ది నాటికే వనం, రక్తం వంటి బిందువు అంతమందుగల రూపాలు, 13 వ శతాబ్ది నాటికి వస్తాడు, తెస్తాడు వంటి వ్యవహార రూపాలు; కొత్త, పాతవంటి రేఫ లోపించిన రూపాలు; 11, 12 శతాబ్దుల నుండి ఇరవయ్, ముప్పయ్ వంటి సంఖ్యావాచక రూపాలు శాసనాలలో కనిపిస్తాయి. ఇంకా ఎన్నో వ్యవహార రూపాలు ఆయా కాలాలలోని శాసనాలలో కన్పిస్తాయి. కావ్యభాష పైన వ్యవహార భాషా ప్రభావం క్రమంగా అధికమవుతున్నట్లు కూడ తెలుస్తుంది. 16 వ శతాబ్ది తరువాత ఇది మరీ అధికమైంది.

19 వ శతాబ్ది వరకు తెలుగులో వచన సాహిత్యం పెరగలేదు. కైఫీయత్తులు, స్థలచరిత్రలలో మాత్రం వచన రచన కనిపిస్తుంది. 16 వ శతాబ్దికి చెందిన రాయవాచకం వచన రచనలలో మొదటిది. ఇటువంటి వాటిలో లక్షణ విరుద్ధమైన భాషకు స్థానం దొరికింది. కావ్యాలకు, లక్షణ గ్రంథాలకు పండితులు వ్రాసిన వ్యాఖ్యానాలలో క్రమంగా వ్యావహారికానికి స్థానం లభిస్తూ వచ్చింది. 1850కి పూర్వపు పాఠ్యగ్రంథాలు శిష్టభాషలోనే ఉన్నట్లు ఆనాడు తెలుగు అధికార భాషగా వున్నట్లు తెలుస్తోంది.

1853 లో చిన్నయసూరి నీతిచంద్రిక, 1858 లో బాలవ్యాకరణం అచ్చయిన తరువాత కావ్యభాషా వ్యాకరణాన్ని వచన భాషకి కూడ ప్రవర్తింపజేయాలనే సాంప్రదాయిక పండితులు, శిష్ట వ్యావహారిక భాషని గ్రంథాలలో వ్రాయటానికి అంగీకరించలేదు. ఆధునిక విజ్ఞాన వ్యాప్తి సమకాలీన భాషలోనే తప్ప ప్రాచీన కావ్యభాషలో సాధ్యం కాదని గురజాడ, గిడుగు వ్యవహార భాషోద్యమానికి సారథులైనారు. గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలు 1909 నుండి 1915 వరకు సాగాయి. విద్యావిధానంలో గ్రాంథికమే నిలిచింది.

1940 నుండి వార్తా పత్రికల వలన, మేధావులైన రచయితల రచనలవలన ఆధునిక వ్యవహార భాషకు ప్రాపకం వచ్చింది. అప్పటినుండి నవల, కథానిక, వ్యాసం, ఏకాంకిక మొదలైన రూపాలలో వెలువడిన వచన సాహిత్యం; పత్రికలు, రేడియో సినిమాల వలన మాండలికాలకు అతీతమైన ఆధునిక ప్రమాణ భాషను ఏర్పరచుకోగలిగింది.

1966 లో తెలుగు అధికార భాష అయ్యింది. 1967 లో ఏర్పడిన తెలుగు అకాడమీ వ్రాయించిన గ్రంథాలు ఆధునిక భాషలోనే వున్నాయి. 1969 నుండి ఉన్నత విద్య తెలుగులోనే బోధించబడుతోంది. విశ్వవిద్యాలయాలలో తెలుగు సాహిత్యం ప్రధానాంశంగా తీసుకొని చదివే విద్యార్థులు పరిశోధనా వ్యాసాలు, పరీక్షాపత్రాలకి సమాధానాలు ఆధునికభాషలో వ్రాయటానికి అంగీకరించటం జరిగింది.

క్రీ.శ. 2 వ శతాబ్ది నాటికి పండితులచే ఆదరించబడక సాధారణ జన వ్యవహార మాత్రంగా వుండి, సంస్కృత పాకృత శాసనాల నడుమ కొన్ని తెలుగు పదాలకి మాత్రమే స్థానాన్ని కల్పించుకో గలిగిన తెలుగు భాష 20 వ శతాబ్ది చివరిభాగంలో ప్రభుత్వపు అధికార భాషగా గౌరవించబడి విశ్వవిద్యాలయాలలో సముచిత స్థానాన్ని పొంది అంతర్జాతీయ తెలుగు సంస్థని ఏర్పరచుకో గలిగిన స్థితికి వచ్చింది.

ఈ 14 శతాబ్దుల ఆంధ్ర భాషా పరిణామం, ఒక బృహత్ గ్రంథంగా వ్రాయదగినది – ఈ వ్యాసంలో సంగ్రహంగా ప్రదర్శించబడింది.

## ఆధార గ్రంథాలు


1. గంటి జోగి సోమయాజి, ఆంధ్ర భాషా వికాసము, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు, 1947.
2. భద్రిరాజు కృష్ణమూర్తి (సం.), తెలుగు భాషా చరిత్ర, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, సైఫాబాదు, హైదరాబాదు–4, 1974.

# ప్రాచీన సాహిత్యం

నిడమర్తి ఉమారాజేశ్వరరావు

ఆంధ్ర వాఙ్మయంలో మనకు దొరికిన తొలి గ్రంథాలలో మొట్టమొదటిది నన్నయ రచించిన ఆంధ్ర మహాభారత భాగం. ఇంత బాగా పరిణతి చెందిన గ్రంథం ఒకే మారు ఊడిపడటం అసహజమైన విషయం. అంతకు ముందు కొంత వాఙ్మయం ఉండే ఉండాలి. కానైతే, యీనాటి వరకు అది లభ్యం కాలేదు. అంతకు పూర్వపు ఆంధ్ర వాఙ్మయ స్వరూపం తెలుసుకోవడానికి వున్న ఆధారమల్లా శాసనాలు మాత్రమే.

## ప్రాఙ్నన్నయ యుగం

పూర్వ చాళుక్య గుణగ విజయాదిత్యుని సేనా నాయకుడైన పండరంగడు క్రీ.శ. 849–50 లో అద్దంకిలో ఒక శాసనం వేయించాడు. తెలుగు పద్యము– తరువోజ– కనిపించిన మొట్టమొదటి శాసనం యిదే.

850 నాటి కందుకూరు శాసనంలో సీస పద్యముంది.

క్రీ.శ. 950 నాటి యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో మధ్యాక్కర లున్నాయి.

క్రీ.శ. 1000 ప్రాంతం నాటిదని పరిశోధకుల చేత నిర్ణయింపబడిన మిరియాల కామసాని గూడూరు శాసనంలో మూడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలు ఉన్నాయి.

నన్నయ తర్వాత కాలం వాడైన పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో తుమ్మెద పదాలు, ప్రభాత పదాలు, పర్వత పదాలు, ఆనంద పదాలు, గొబ్బి పదాలు, వెన్నెల పదాలు మొదలైన వాటిని పేర్కొన్నాడు. ఇవి, యిటువంటివే మరికొన్ని పదాలూ నన్నయకు పూర్వం తెలుగు నాట పల్లె ప్రాంతాల్లో ప్రచారంలో ఉండి ఉండాలి. తీరిక వేళల్లో, ఉత్సవాలలో ఉత్సాహంగా, పనుల క్రమంలో శ్రమ తోచకుండా స్త్రీలు, పురుషులూ వీటిని పాడుకొంటూ ఉండి ఉండాలి. స్త్రీల పాటలు, బాల బాలికల క్రీడా గీతాలు, భక్తి గేయాలు, జానపద యువతీ యువకుల గీతాల రూపంలో జానపద సాహిత్య మెంతో వుండి ఉంటుంది.

అయితే, నన్నయ్య పూర్వపు ఆ సాహిత్య సంపద అంతా లక్షణ వ్యవస్థిత, పండితాదరణ లేక గ్రంథ రూపంలో మనకు అందలేదు. అలాగే, నన్నయకు పూర్వం తెలుగు భాషలో గ్రంథ రచన సాగి వుంటుంది. కాని అవేవి లభ్యం కాలేదు.

కాగా, తెలుగు భాషలో ఆదిగ్రంథం నన్నయ భారతమే నని ఇప్పటికి మనం అనుకోవాల్సి వుంటుంది. అయితే, నన్నయ మహాభారతమే ఎందుకు రాయాల్సి వచ్చింది? ముందు చూద్దాం.

## మహాభారత రచన

1022 లో రాజరాజ నరేంద్రుడు సింహాసనాన్ని అధిష్ఠించే నాటికే కన్నడంలో 'విక్రమార్జున విజయ'మనే పేరుతో పంప భారతం, 'గదాయుద్ధం' అనే మరో కావ్యం భారత కథను ప్రచారంలోకి తెచ్చాయి. తమిళంలో కూడా 'వెణ్బా' గీతాలలో క్రీ.శ. 7, 8 శతాబ్దాలలో పెరిందేవనార్ కవి రచించాడు. సంస్కృత భారతాన్నే దేవాలయాల్లో పురాణంగా చెప్పేవారు. అది యే కొద్దిమందికో తప్ప జనసామాన్యానికి అందుబాటులో ఉండేది కాదు. రాజరాజు కాలానికి వెయ్యేళ్ళకు ముందే తెలుగునాట జైన, బౌద్ధ మతాలు కాళ్ళు నిలదొక్కుకున్నాయి. ఆ మతాలు జనసామాన్యపు భాషలలో ప్రబోధాలు చేసేవి. అందరికీ తెలిసేవిధంగా పాటలు, గాథలు ప్రచారంలో ఉండేవి. జనమంతా ఆ మతాలవైపు ఎగబడుతూండేవారు. రాజరాజు శైవమతాను యాయి. బ్రాహ్మణ భక్తి కలవాడు. వర్ణాశ్రమ ధర్మాలపై ఆధారపడే మతాన్ని ఉద్ధరించదలచాడు. అందుకు పంచమ వేదమైన మహాభారతమే ప్రయోజనకారి అనీ, వర్ణాశ్రమ ధర్మాలకు శత్రువులయిన బౌద్ధులు, జైనులు ఏ దేశ భాషా ప్రకటనాస్త్రాన్నైతే చేబట్టారో శైవుడైన రాజరాజు కూడా అదే అస్త్రాన్ని చేబట్టి ప్రజల్లో తన మతాన్ని విస్తృతంగా ప్రచారంలోకి తేదలచి వుంటాడు. కన్నడ సాహిత్యం గురించి, తమిళ సాహిత్యం గురించి తెలిసినవాడు కాబట్టి తెలుగులో ఉద్గ్రంథ రచన చేయిస్తే తప్పులేదని భావించి వుంటాడు.

నన్నయను భారతాంధ్రీకరణకు పూనుకోవలసిందిగా కోరి వుంటాడు.

మరే యితర గ్రంథాన్ని కాకుండా మహాభారతాన్నే ఎందుకు అనువదింప చేశాడన్నదానికి కారణాన్ని మరింత లోతుగా పరిశీలిద్దాం.

9–11 శతాబ్దాలమధ్య దక్షిణాదిన ఫ్యూడలిజం స్థిరపడింది. ఫ్యూడల్ యుగంలో నిర్ణయాత్మకమైన సామాజిక చైతన్యరూపం మతం. హిందూ మతానికి రెండు పాదాలున్నాయి:

ఒకటి: వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ.

రెండు: శ్రుతి, స్మృతి, పురాణేతిహాస వాఙ్మయం.

శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాల సార సంగ్రహం మహాభారతం. అది పంచమ వేదం. ధర్మశాస్త్రం. మహాపురాణం. రాజవంశావళుల ఇతిహాసం. అందుకని భూస్వామ్య సంస్కృతీ సమర్థనకు ఉపకరించే ఏకైక గ్రంథం కాబట్టి మహాభారతాన్నే ఆనాడు అనువదించారు.

నన్నయ్య ప్రారంభించిన తర్వాత 200 సంవత్సరాలకు గాని ఆంధ్ర మహాభారతానువాదం పూర్తికాలేదు. క్రీ.శ. 1200 ప్రాంతంలో తిక్కన దాన్ని పూర్తిచేశాడు.

*"గాసట బీసటే చదివి గాథలు త్రవ్వు తెలుంగు వారికిన్ వ్యాసముని ప్రణీతమైన"* మహాభారత గాథను వివరిస్తున్నానని నన్నయభట్టును, తిక్కనను గురించి ఎర్రాప్రగడ ఒకచోట చెప్పాడు.

అలా గాసట బీసటగా ఆయన ఈసడించినది అంతకు పూర్వపు ప్రజా వాఙ్మయమై వుండాలి. ప్రజా వాఙ్మయంపట్ల ఈ నిరసన వైఖరిపై తిరుగుబాటుగానే తదనంతర కాలంలో వీరశైవ వాఙ్మయం తలయెత్తింది.

నన్నయ భారతాంధ్రీకరణ మారంభమైన తర్వాత దేశంలో తెలుగుపై గౌరవ మేర్పడింది.

భారత ప్రభావంతో నీతిభూషణం, ముద్రామాత్యము మొదలైన నీతిశాస్త్ర గ్రంథాలు కొన్ని వచ్చాయి.

వీరాచార్యుడు సంస్కృతంలో రచించిన గణితశాస్త్రాన్ని పావులూరి మల్లన తెనిగించాడు.

శాపానుగ్రహ సమర్థుడని, జ్యోతిషము, రాఘవ పాండవీయము, నృసింహపురాణము, శతకంధర రామాయణము, బసవపురాణము, హరవిలాసము మొదలైన అనేక గ్రంథాలకు కర్తగా లోకమున వాడుకగల వేములవాడ భీమకవి ఏ కాలపువాడో యిదమిద్ధంగా యింకా నిర్ణయం కాలేదు. కవి జనాశ్రయం తప్ప యితని కావ్యాలేవి లభ్యమూ కాలేదు.

రాజరాజ నరేంద్రుని కొడుకైన రాజేంద్ర చోళుడు కులోత్తుంగ చోళుడనే పేరుతో క్రీ.శ. 1070 లో వేంగీ చాళుక్య, చోళ రాజ్యాల కధిపతియై తన రాజధానిని తమిళదేశానికి మార్చుకున్నాడు. దానితో ఆంధ్రదేశంలో తమిళ ప్రాబల్యం పెరిగి, ఆంధ్ర సారస్వత పోషణ అడుగంటింది. రాజ్యం కన్నడిగులైన పశ్చిమ చాళుక్యుల వశమైంది. దానితో తెలుగు సారస్వతాభివృద్ధికి రాజాదరణ లేకపోయింది.

ఆంధ్రదేశంలోని వివిధ మండలాధిపతులు స్వతంత్రులవడం, కొందరు వైష్ణవాన్నీ, మరి కొందరు శైవాన్నీ అభిమానించడం, పరస్పర వైషమ్యాలతో పోరాటాలు ప్రబలడంతో దేశంలో అల్లకల్లోల పరిస్థితి ఏర్పడింది. వీరశైవం అటువంటి అదనులో తలెత్తి, శీఘ్రవ్యాప్తి పొందింది.

## శివకవులు

శైవంలో పాశుపత, శైవసిద్ధాంత, కాలాముఖ, ప్రత్యభిజ్ఞా, వీరశైవం – అనే 5 శాఖలున్నాయి.

వీటిలో ప్రత్యభిజ్ఞా శైవం (కాశ్మీర శైవం) తప్ప మిగిలినవన్నీ దక్షిణ భారతంలోని శైవమత శాఖలే. క్రీ.శ. 12 వ శతాబ్దిలో మిగిలిన శాఖలన్నీ వీరశైవంలో విలీనమయ్యాయి. శైవ సిద్ధాంతంలో వున్న వర్ణవ్యవస్థ; నిరుపయోగమూ, అర్థరహితమూ అయిన కర్మకాండ వీరశైవ మత స్థాపకుల అసంతృప్తికి కారణమైందని చెప్పవచ్చు.

పెరియ పురాణము అనే తమిళ గ్రంథంలో అరువది ముగ్గురు నాయనార్ల జీవిత చరిత్ర చదివితే అప్పటి శైవ మత సాంఘిక జీవిత విధానం తెలుస్తుంది.

క్రీ.శ. 13 వ శతాబ్దంలో వీర శైవం ఆంధ్రదేశానికి వచ్చింది. "శైవుడు కాని కవి, వారిదృష్టిలో భవి కవి." భవి కవుల ప్రస్తావన కూడా శివకవుల రచనలలో కనిపించదు.

శివకవులు కళను కళ కొరకు గాక, శైవమత ప్రచారం కోసం వినియోగించారు. కాబట్టి వీరి రచనలలో కళాత్మకత, సౌందర్యారాధనలకన్నా ప్రచార ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది.

శివకవుల రచనలన్నీ క్రీ.శ. 12 వ శతాబ్దంలోనూ 13 వ శతాబ్ద ప్రథమార్ధ భాగంలోనూ వచ్చాయి.

శివతత్వసారకర్త మల్లికార్జున పండితుడు (12 వ శతాబ్ది చివరి భాగంలోవాడు) మన కంటికి స్పష్టముగా కనిపించే ఈ జగత్తును మిధ్య అని, రజ్జు సర్పభ్రాంతి వంటిది అని శంకరుడు అద్వైత మతంలో స్థాపించిన సిద్ధాంతాన్ని ఒప్పుకోవడానికి వీల్లేదన్నాడు. పాశుపతం ఆత్మ–పరమాత్మ అయిన శివుడు. జగత్తూ యీ తత్వాలను ఒప్పుకుంటుందా?

## కాలాముఖ శివకవులు

యావజ్జీవ బ్రహ్మచర్యం, శివ – శక్తుల అవినాభావ సంబంధం, అహింసావలంబనం, శాకాహారం, యజ్ఞయాగాదుల నిరసనం – వీరి ప్రత్యేకతలు.

వీరిలో శక్తిపూజ చేసే తెగవారు ఉత్సవ సమయాల్లో మద్యమాంసాలను గ్రహిస్తారు. వీరిలో పరమత సహనం, వర్ణ వ్యవస్థపై గౌరవం కనిపిస్తాయి.

శివకవుల్లో అగ్రగణ్యుడు, కవిరాజ శిఖామణి నన్నె చోడుడు. ఇతను క్రీ.శ. 1125 ప్రాంతాన పాకనాటి ప్రాంతము నేలిన తెలుగు చోళరాజు. జన్మచే బ్రాహ్మణులైన కాలాముఖులు బ్రాహ్మణజాతిని గౌరవించారు.

నన్నెచోడుడు తన కావ్యంలో బ్రాహ్మణులను పొగిడాడు.

జ్ఞానమూ జ్ఞేయంవలె, శబ్దార్థాల వలె, ప్రకృతి పురుష స్వరూపులైన పార్వతీ పరమేశ్వరులు అవినాభావ సంబంధం కలవారని నన్నెచోడుడు తన కుమార సంభవంలో వర్ణించాడు.

పార్వతీ పరమేశ్వర కల్యాణోత్సవ సందర్భంగా 'మండలార్చనం' అనే విధి సందర్భంలో స్త్రీ పురుషులు స్వేచ్ఛగా మద్యమాంసాలు సేవించే విధానాన్ని నన్నెచోడుడు వర్ణించాడు.

## వీరశైవ కవిత

క్రీ.శ. 1162 లో భూలోకమల్లుని మంత్రి బిజ్జలుడు చాళుక్య సామ్రాజ్యాన్ని ఆక్రమించాడు. అతని మంత్రియే వీరశైవ మత ప్రతిపాదకుడైన బసవేశ్వరుడు. వీరశైవం యితని ప్రాపున వృద్ధిచెంది, దేశాన్ని ఉగ్రూత లూపింది. ఈ మత ప్రభావం సారస్వత రంగంపై ఎక్కువగా ప్రసరించి, నూతన వాఙ్మయశాఖాసృష్టికి తోడ్పడింది.

ఈ శైవ కవితను - వర్ణాశ్రమ వ్యవస్థకూ, బ్రాహ్మణాధిక్యతకూ వ్యతిరేకంగా వాటి ఉపరి నిర్మాణమైన వేద వేదాంగాల పైనా, శృతి-స్మృతి పురాణాలపైనా జరిగిన తిరుగుబాటుగా పరిగణించవచ్చు.

ఈ సైద్ధాంతిక పోరాటంలో వారు చూపిన ప్రజాస్వామ్య భావా లేమిటో చూద్దాం.

1. భాష: పండిత భాషకు విరుద్ధంగా సకల జనానికీ అందుబాటులో వుండే "జాను తెనుగు."

2. ఛందస్సు: సంస్కృత ఛందస్సుల ద్వారా తప్పనిసరిగా వచ్చిన సంస్కృత పదబంధురమైన భాషను వదలించుకొనడం కోసం తెలుగు ఛందస్సులను, రకరకాల ద్విపదలు, రగడలు, పదాలు, వచనాలను తీసుకొన్నారు.

3. ప్రజాతంత్ర సాంఘిక భావాలు: కుల వ్యవస్థపై తిరుగుబాటు. సంస్కృతంలో వున్న శాస్త్రాలపై తిరుగుబాటు. స్వభాషలో ఆరాధన, స్వయం పౌరోహిత్యం.

4. ప్రజాతంత్ర రాజకీయ భావాలు: చేతివృత్తుల వారికి సంపూర్ణ స్వేచ్ఛ, ఫ్యూడల్ నిగళాలనుంచి విముక్తి వగైరా.

నన్నె చోడుని గురించి యీ సందర్భంగా మరికొన్ని విషయాలు చెప్పుకొందాం.

తెలుగులో తొలిసారిగా మహా కావ్య రచనకు పూనుకొన్నవాడు, రాజకవి నన్నెచోడుడు. ఇతడు శైవకవులలో మొదటివాడు.

నన్నయ దృష్టి ప్రధానంగా పౌరాణికం, అనుషంగికంగా కావ్య సంబంధికాగా, నన్నెచోడుని దృష్టి భిన్నమైనది. శైవమత దృష్టి. రసమార్గం, వర్ణనా మార్గం, కథా ప్రాధాన్యం, జానుతెనుగు రచన యిన్ని దృక్పథాలనూ మేళవించుకొని కుమార సంభవాది కావ్య రచన చేసినవాడు నన్నెచోడుడు.

"సరళముగాగ భావములు, జాను తెనుంగున నిపు పెంపుతో బిరిగొన వర్ణనల్" కుమార సంభవ కావ్యం తను రచించినట్లు అవతారికలో నన్నె చోడుడు చెప్పుకొన్నాడు. సర్వజన సుబోధకము, యింపు పెంపుగల 'జాను తెనుగు' పేరుతో తెనుగులో తొలిసారిగా భాషా విషయకమైన ఒక సిద్ధాంతాన్ని లేవదీసి, తరువాతి కవుల్లో కొందరికి మార్గదర్శకుడయ్యాడు నన్నెచోడుడు. ఇతని కవితను తిక్కన చెప్పకయే పాటించాడు; చెప్పి సోమనాథుడు సాధించాడు.

నన్నెచోడుడు తన కవితను వస్తు కవితయని పేర్కొన్నాడు. భావాలు, వర్ణనలు, అర్థాలు, గుణాలు, రసం, సూక్తులు, జానుతెలుగు, మార్గం, అలంకారాలు మొదలైన దశవిధ కావ్యవస్తువులతో కూడినది ప్రబంధ కవిత అనుకుంటే, తొలిసారిగా ప్రబంధానికి తెలుగు మాగాణిలో బీజావాపము చేసినవాడు నన్నెచోడుడు. పురాణాంధ్రీకరణ జరుగుతున్న ఆ రోజుల్లో దీన్ని గొప్ప ప్రయోగంగా పరిగణింపవచ్చు.

షష్ఠ్యంతాలను, కావ్యాన్ని అంకిత మివ్వడాన్ని, చిత్ర, గర్భ కవిత్వాలను తెలుగులో మొదటిసారిగా ప్రవేశపెట్టినవాడు కూడ నన్నెచోడుడే.

కాబట్టి ప్రబంధపరమేశ్వరుడనే బిరుదు ఎర్రన కన్న నన్నెచోడునికే న్యాయంగా వర్తిస్తుందేమో.

## పండితత్రయం

శైవ మతవ్యాప్తికి జీవితాలను అంకితం చేసి, రచనలు సాగించిన వారిలో శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, మంచన పండితుడు ముఖ్యులు.

శ్రీపతి పండితుడు తెలుగులో శివభక్తి దీపిక రాశాడని చెప్తారు.

మల్లికార్జునుడు బసవనకు సమకాలికుడు. తెలుగులో శివతత్త్వసారం రచించాడు. అందులో అతను ప్రతిపాదించిన సూత్రాలు ఇవి:

శివ భక్తులను చూచి, జాతి మొదలైనవి అడగడం మానెయ్యాలి.

రొంపిలో పుట్టినా పద్మం చాలపూజ్యమైనట్టు ఎలాంటి హీనకులంలో పుట్టినా శివభక్తుడు గొప్పవాడే.

కులం తక్కువవాడే శివభక్తుడైనందువల్ల గొప్పవాడవుతున్నప్పుడు, కులమున్నవాడైతే యిక చెప్పేదేముంది?

బంగారానికి తావి అబ్బినట్లే! – దీన్నిబట్టి శివకవులు కులవ్యవస్థకు యింకా కొంత గౌరవం యిస్తూనే వున్నట్లు తెలుస్తుంది.

భర్త శివభక్తుడు కాకపోతే అవమని భార్య బుద్ధిచెప్పాలి. అతడు అలా కానిపక్షంలో అతణ్ణి వదిలెయ్యాలి.

శివనిందచేసే పాపులను ఆలోచించకుండా చంపెయ్యాలి. శివనిందచేసే అవమానకరమైన పుస్తకాలను తగులబెట్టెయ్యాలి. ఆ పుస్తకాలు రచించినవాణ్ణి చంపెయ్యాలి. – ఈవిధంగా వీరశైవం కొంత క్షుద్రరూపం ధరించింది. తెలుగుదేశంలో కొన్ని యితర మతాల పుస్తకాలను తగలబెట్టించిన అపకీర్తి పండితయ్యకు దక్కింది.

బ్రాహ్మణులు ఎలాగైతే వధకు అనర్హులో, శివభక్తులు కూడ అనర్హులే.

శివుణ్ణి పూజించే భార్య, భక్తుడు కానట్టి భర్త చిత్తం వచ్చినట్లు నడచుకోవలసిన అవసరంలేదు. పురుష ప్రతికూలత్వం వల్ల ఆ సతికి దుర్గతి లేదు.

శివభక్తులు కానివాళ్ళకు – ఎంత పెద్దవాళ్ళయినా – దండం పెట్టకూడదు. వాళ్ళు నమస్కరించినా దాన్ని స్వీకరించరాదు.

శివభక్తులు కానివాళ్లవద్ద అప్పు చెయ్యకూడదు; వాళ్ళకు అప్పు ఇవ్వకూడదు. వాళ్లను చూడకూడదు; వాళ్లతో సరదాగా మాట్లాడకూడదు.

వాళ్ళతో సమానంగా ఒకదగ్గర పడుకోగూడదు. వాళ్ళ సహవాసం చెయ్యకూడదు.

శివభక్తుడు చేసిన పాపమైనా పుణ్యమే అవుతుంది. శివభక్తులు కానివాళ్లు చేసిన పుణ్యమైనా పాపమే అవుతుంది.

శివభక్తుల దుర్గుణాలను వెదికేవాడు చండాలుడు.

పోతే, మూడవ వాడైన మంచన కావ్యకర్తగా ప్రసిద్ధికెక్కిన వాడు కాదు.

## పాల్కురికి సోమన

తర్వాత ప్రముఖ వీర శైవ కవి పాల్కురికి సోమన. ఈయన బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు కవితాంశతో నిండివున్నాయి.

వృషాధిప శతకము, చెన్నమల్లు సీసాలు, బసవ రగడలు, అనుభవసారము, బసవోదాహరణము మొదలైనవి యితని యితర రచనలు. శిష్ట వ్యావహారిక భాషను, లోకంలో వున్న శక్తివంతములైన పలుకులను యధేచ్ఛగా వాడి తన రచనలకు చైతన్యాన్ని కూర్చుకున్నాడు. రోకటి పాటగా వున్న ద్విపదను నవరస పోషకంగా, లయ సమన్వితంగా, భావ వైవిధ్యవాహికగా చేసి దానికి తెలుగు కావ్య జగత్తులో స్వర్ణాసనాన్ని సమకూర్చి పెట్టాడు సోమనాథుడు. ఇతని తర్వాత నవనాధ చరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానం, పల్నాటి వీర చరిత్ర మొదలైన చక్కని ద్విపద కృతులు వెలువడ్డాయి.

మల్లికార్జున పండితుడు. –

"తెలుగు మాటలనంగవలదు
వేదములకొలది యవి" అన్నప్పటికీ,
"భక్తిమీద తలపు
బ్రాహ్మ్యంబుతో పొత్తు
బాయలేను నేను
బసవలింగ" అని చెప్పుకొన్నాడు.

బ్రాహ్మ్యంతో పొత్తును వదలుకోలేక పోయిన మల్లికార్జున పండితునివలె కాక, పాల్కురికి సోమన బ్రాహ్మణాధిక్యతను, వైదిక కర్మ సిద్ధాంతాలను నిశితంగా అవహేళన చేశాడు.

పండితారాధ్య చరిత్రలోని యీ క్రింది వాక్యాలు చూడండి:

"అసమాక్షు గొలువని అగ్రజుండైన
వసుధ మాలల మాలవాడ కాకెట్లు"
"వేద భరాక్రాంతు లనగబడిన
బ్రాహ్మణ గార్దభంబుల తోడ
బ్రతిసేసి యాడిన పాపంబు వచ్చు"

కళను కళ కోసమే అన్నట్లుకాక మతప్రచారం కోసమే తన రచనలను వాడుకున్నప్పటికీ సోమనాథుని కవిత జాను తెనుగు సరణికి, మాటల పొదుపుకు ప్రసిద్ధి చెందింది; పద కవితకు సాహిత్య గౌరవం సంపాదించి పెట్టింది. ఆనాటి సాంఘిక పరిస్థితులను తెలుసుకోవడానికి కూడా ఎంతో వుపయోగపడుతోంది. శివ కవితలు ద్విపదలో వ్రాయబడ్డాయి. సంస్కృత ఛందస్సును వదిలి, దేశీయ ఛందస్సును స్వీకరించడమే కాకుండా, భావ ప్రకటనకు ఆటంకంగా వుండే అనేక నియమాలను కూడా శివకవులు ఉల్లంఘించారు. తెలుగు సాహిత్యంలో ఒక కొత్త మార్గాన్ని సృష్టించారు.

ఈయన 'బసవ పురాణము', 'పండితారాధ్య చరిత్ర' తెలుగు నుండి కన్నడంలోనికి అనువదింపబడ్డాయి.

సోమనాథునితో యిట్టి శివకవుల పరంపర ముగిసిందనే చెప్పవచ్చు.

తిరిగి క్రీ.శ. 15 వ శతాబ్దిలో పిడపర్తి వంశంవారు యీ సంప్రదాయాన్ని ఉద్ధరించి, శివ కవులుగా ప్రసిద్ధిగాంచారు.

## తిక్కన హరిహరనాథతత్వం

12 వ శతాబ్దంలో ఒకవైపు బసవని వీరశైవం, మరొక వైపు రామానుజుని వైష్ణవమతం దక్షిణదేశంలో విజృంభించి కల్లోలాలకూ, రక్తపాతానికీ దారితీస్తూండేవి. 13 వ శతాబ్దిలో మధ్వాచార్యుల ద్వైతమత ఝుంఝు బయల్దేరి,

అప్పటికే ప్రజ్వలిస్తున్న మత వైషమ్య మహోగ్ని మరింత రెచ్చింది. అటువంటి సమయంలో శివకేశవుల అభేదాన్ని ప్రకటించే హరిహరనాథ తత్వ ప్రతిపాదనతో సాహిత్యలోకానికీ, ఆధ్యాత్మికలోకానికీ నవ్యమార్గాన్ని చూపాడు తిక్కన.

నన్నెచోడుడు ప్రతిపాదించిన 'జాను తెనుగు' సిద్ధాంతాన్ని తిక్కన పాటించాడు. పలుకుబడిలో, ఊహలో, సంభాషణలలో అచ్చమైన దేశిత్వాన్ని చూపాడు.

"తెనుగుబాస వినిర్మింప దివ్యరుటరయ భవ్య పురుషార్థ తరు పక్వఫలము కాదె" అని చెప్పకున్నాడు.

"జాత్యము కాని నొప్పయిన సంస్కృత మెన్నడు జొన్ప" నని నిర్వచనోత్తర రామాయణంలో తిక్కన అన్నాడు.

అలాగే శైలి విషయంలో "అలతి అలతి తునియల కాహల సంధించిన విధంబున" రచన సాగించాడు.

"ఆది కాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన, ఆధునిక యుగంలో గురజాడ నా కవిత్రయం" అని శ్రీశ్రీ తిక్కనను ప్రస్తుతించడం కూడా యీ సందర్భంగా గుర్తుచేసుకోవడం సముచితం.

తిక్కన కాలపు రాజకీయ పరిస్థితిని కొంత పరిశీలించడం అవసరం. క్రీ.శ. 1176–1182 మధ్య జరిగిన పల్నాటి యుద్ధ ఫలితంగా వెలనాటి చోళులు పూర్తిగా బలహీనపడిన పిమ్మట కాకతీయులు క్రమంగా బలపడి, తమ సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసుకున్నారు.

శాతవాహన రాజుల తర్వాత యావదాంధ్ర దేశాన్నీ పాలించిన వారు కాకతీయ రాజులే. కాకతీయులు నాల్గవ వర్ణానికి చెందిన కర్షకులు. రెడ్డి, వెలమ, కమ్మ, బ్రాహ్మణ కులాలతో వివాహ సంబంధ బాంధవ్యాలు పెట్టుకున్నారు. తద్వారా, వీరికి దేశమంతటా సంపన్నులైన భూస్వాములు బంధువు లయ్యారు. ఆంధ్రదేశాన్ని జయించడంతోబాటు సాంఘిక, సాంస్కృతిక రంగాలలో కూడా ఆంధ్రైక్యత కెంతో సహాయపడ్డారు.

నెల్లూరు జన్మస్థలమైన తిక్కన సోమయాజి ఓరుగల్లు వెళ్ళి కాకతీయ గణపతి దేవుని ఆస్థానంలోనే తన మహాభారతం పూర్తిచేశాడని కొందరు పండితుల అభిప్రాయం. తెలంగాణా ఆంధ్ర ప్రాంతాలను సాంస్కృతికంగా ఐక్యపరచిన సాహిత్య సృష్టికి తిక్కన మూలపురుషుడని చెప్పవచ్చు.

కాకతీయ యుగంలో సాహిత్యం, సంగీతం, శిల్పం, చేతిపనులు బాగా వృద్ధిచెందాయి. రుద్రమ పాలననుబట్టి స్త్రీలకు సమాజంలో సమానమైన ప్రాముఖ్యం వున్నట్లు తోస్తుంది.

ఆంధ్రదేశంలో ఆనాడు వీర శైవానికి ప్రత్యర్థిగా అక్కడక్కడ వీర వైష్ణవం తలెత్తసాగింది. 1182 లో జరిగిన పల్నాటి యుద్ధానికి రాజ్య భాగమే ప్రధాన కారణమైనా, ఆ వైరాన్ని ప్రజ్వలింప చేసినది ఆ రాజ్యంలో పుట్టిన మత వైరుధ్యమే.

పలనాటి వీరాగ్ర గణ్యుడైన బ్రహ్మనాయుడు వీర వైష్ణవుడు. అతడు చాపకూటిని ప్రవేశపెట్టి, వీర వైష్ణవ సంఘ వ్యవస్థను స్థాపించాడు. అతని ఎదిరి పక్షపు నాయకురాలైన నాగమ్మ శైవ మతస్తురాలు. దాని ఫలితంగానే అపర భారత యుద్ధమనదగిన పలనాటి యుద్ధం జరిగింది.

వీరశైవానికీ, యీ వీరవైష్ణవానికీ వ్యతిరేకంగా కూడా తిక్కన మహాభారతానువాదానికి పూనుకొని వుండవచ్చు.

## అభినవదండి కేతన

అభినవదండి కేతన తిక్కన సమకాలికుడు. దశకుమార చరిత్ర గద్యకావ్యాన్ని చంపూ కావ్యంగా రచించి, తిక్కన కంకిత మిచ్చాడు. ఔచితిని చక్కగా పాటించినవాడు. అంగాంగ వర్ణనకు దిగక, పాత్రల మానసిక ప్రవృత్తులనే వర్ణించినవాడు.

ఇతడు రచించిన ఆంధ్రభాషాభూషణము తెలుగులో మొదటి వ్యాకరణ గ్రంథం.

అలాగే, యితని విజ్ఞానేశ్వరీయం తెలుగులో వెల్వడిన మొదటి ధర్మశాస్త్ర గ్రంథం. తిక్కన కవితలో వలెనే యితని కవితలో కూడ కందము లెక్కువ.

## మారన

తిక్కన శిష్యుడైన మారన మార్కండేయ పురాణ కర్త. ఇది ప్రౌఢము, హృదయంగమమైన గ్రంథం.

## మంచన

రాజశేఖర కవి రచించిన సంస్కృత సాలంభంజికా నాటికను అనుసరించి ఇతను కేయూరబాహు చరిత్రను రచించాడు. ఔచితీ శోభితములైన వర్ణనలతో అలరారే ప్రసన్నమైన రచన యిది.

## కృష్ణమాచార్యుడు

తెలుగులో మొదటి వచన కావ్యకర్త. ఇతని వచనాలకు సింహగిరి వచనాలని పేరు. వీటికి చూర్ణికలని పేరని తాళ్ళపాక అన్నమయ్య పేర్కొన్నాడు. ఈ వచన వాఙ్మయ మంతా మధుర భావ విలసితము. భగవంతుని ప్రియునిగా పరిగణించి నాయికా భావనతో భక్తుడు ఆత్మార్పణ చేసికొనుట యిందులోని యితివృత్తం. ఈయన ద్రావిడ వేదమును తెనిగించినట్లు ప్రతీతి.

బద్దెన సుమతీశతకము, అప్పన మంత్రి చారుచర్య, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకములు యీ కాలానివే.

## ఎర్రన

అద్దంకిరాజు ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి ఎర్రాప్రెగడ. హరి వంశము, భారతంలో అరణ్య పర్వోత్తర భాగం, నృసింహ పురాణములను యితడు రచించాడు. ఈయన రామాయణము కూడ రచించాడన్న ప్రతీతి వుంది.

నాదసౌందర్యము, అర్థపుష్టి కలిగిన హరివంశము భారతానికి అనుబంధ రచన.

ప్రపంచ మహాకావ్యాల్లో ఉన్నతస్థానాన్ని పొందిన మహాభారతంలోని అరణ్య పర్వోత్తర భాగాన్ని నన్నయ, తిక్కనలతో సరిదీటుగా రచించి కవిత్రయంలో ఒకడుగా ప్రసిద్ధి చెందిన వాడు ఎర్రన.

నృసింహపురాణం పేరుకు పురాణమైనా, రచనా విధానాన్ని బట్టి రసవత్కావ్యం. వర్ణన బాహుళ్యం, ఉక్తి వైచిత్రి, అలంకార ప్రాధాన్యం, అపరిపుష్ట కథాంశం మొదలైన ప్రబంధ లక్షణాలు యీ కావ్యంలో స్పష్టంగా కన్పించిన కారణంగానే ఎర్రనకు ప్రబంధ పరమేశ్వరుడనే బిరుదు లభించి వుంటుంది.

## నాచన సోమన

మహా పండితుడు, మహాకవి అయిన నాచన సోముడు ఎర్రన కించుమించు సమకాలికుడు.

హరివంశమునే మరొక విధంగా రచించి, ఎర్రనతో పోటీగా ప్రబంధ మార్గమున మరోమెట్టుపైకి వెళ్ళినవాడు సోమన. తిక్కన వలెనే యితను కూడ హరి హరుల మధ్య అభేదమును పాటించాడు. ఇతని ప్రతి పద్యంలోనూ ఏదో ఒక విశిష్టత, భావ తీవ్రత, భావావేశం కనిపిస్తాయి. శబ్దార్థాలంకారముల ఆడంబరముతో కూడిన రచన యితనితోనే ప్రారంభమైంది.

## రామాయణానువాదం

రెడ్డి రాజధాని అద్దంకిలో ఎర్రాప్రెగడ రామాయణాన్ని రచిస్తున్నాడన్న వార్త విన్న సాహిణి మారన ప్రోత్సాహముచే భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవులు రామాయణ రచనకు పూనుకొన్నారు. ఈ రామాయణము 1390 ప్రాంతాన అయ్యలార్యునిచే పూర్తి చెయ్యబడింది. ఈ రెండు రామాయణములకు పూర్వమే రంగనాథ ద్విపద రామాయణం వెలిసింది.

భాస్కర రామాయణ కర్తలు నలుగురిలో భాస్కరుడు మేటి. అతని తర్వాత చెప్పదగినవాడు అయ్యలార్యుడు. రుద్ర దేవుడు, మల్లికార్జున భట్టు తర్వాత చెప్పదగినవారు.

భాస్కర రామాయణము పండితుల ఆదరానికి పాత్రమైంది. దీనితర్వాత శ్రీనాథుని కాలందాకా చెప్పుకోదగిన కావ్యాలు వెలువడలేదు. ఈ యుగంలో పేర్కొనతగిన యితర కవుల్లో చిమ్మపూడి అమరేశ్వరు డొకడు.

దోనయామాత్యుడు సస్యానందము, సర్వలోకాశ్రయము అనే గ్రంథాలు రచించాడు.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి అనే లక్షణ గ్రంథాన్ని రచించాడు. తెలుగు సంస్కృతం నుంచి పుట్టిందన్న అభిప్రాయాన్ని ప్రతిపాదించినవారిలో ముఖ్యుడు.

వెన్నెలకంటి జన్నమంత్రి దేవకీ నందన శతకం రచించాడు.

రావిపాటి త్రిపురాంతకుడు – త్రిపురాంత కోదాహరణము, అంబికా శతకము, చంద్ర తారావళీ, మదన విజయం అనే తెలుగు గ్రంథాలు, ప్రేమాభిరామమనే సంస్కృత గ్రంథమూ రచించాడు. శ్రీనాథుని క్రీడాభిరామానికి ఈ ప్రేమాభిరామమే మూలం.

### ప్రబంధ పూర్వ యుగం
### (క్రీ.శ. 1400 – క్రీ.శ. 1500)

ఈ ప్రబంధ పూర్వయుగాన్నే శ్రీనాథ యుగం అని కూడా పిలుస్తారు. క్రీ.శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నమై పోయాక అద్దంకి రాజధానిగా రెడ్డి రాజ్యం, విజయనగరం రాజధానిగా విజయనగర రాజ్యం స్థాపితమయ్యాయి. రెడ్డి రాజధాని అద్దంకి నుండి కొండవీటికి మారాక శ్రీనాథుడు రెడ్డిరాజుల ఆస్థాన కవి అయ్యాడు. శ్రీనాథుడు కవి సార్వభౌముడనే సార్థక బిరుదనామంతో ఈ "క్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీ నాటి కాలమ్మునన్" అని రాజులచేతా, మంత్రులచేతా కొనియాడ బడుతూ, సింహాచలం నుండి దక్షిణాదిన కంచివరకు పర్యటించి, ఆంధ్రదేశైక మహాకవిగా ప్రసిద్ధి చెందాడు. శ్రీనాథుడు క్రీ.శ. 1380 నుండి 1460 వరకు జీవించినట్లు పరిశోధకులు భావిస్తున్నారు.

శ్రీనాథుడు శృంగార పోషకుడు.

తెలుగులో విడివిడిగా బహు కావ్యములు రచించినవాడు.

శృంగార రచనలు: శృంగార నైషధము, హరవిలాసము, క్రీడాభిరామము మొదలగునవి.

భక్తిప్రధాన కావ్యాలు: భీమఖండము, కాశీఖండము. వీటిలో కూడ రక్తిస్పర్శ లేకుండా పోలేదు.

ఈయన చాటువులు శృంగార రసపేటికలు.

శ్రీనాథుని రచనల్లో శృంగార రసము శిఖర స్థానమధిష్ఠించింది.

శ్రీనాథునితోనే కథాప్రాధాన్యం తగ్గిపోయి, రసప్రధానమైన రచనలు వెలువడ నారంభించాయి. శృంగార నైషధము, హరవిలాసము అట్టి రచనలే.

తెలుగు నుడికారానికి, సీస పద్యాల చిత్రవిచిత్ర గతులకు, ఒకే విషయాన్ని పెక్కుభంగుల సాగదీసి చెప్పే ధోరణులకు

శ్రీనాథుడే శ్రీకారం చుట్టాడు.

తెలుగులో వీరగాథాకావ్యము పల్నాటి వీర చరిత్రను రాసిన మొదటికవి శ్రీనాథుడే.

సమకాలీన జీవితాన్ని సమగ్రంగా చిత్రించడంలో శ్రీనాథుడు ప్రత్యేకత కనబరచాడు. క్రీడాభిరామంలో ఓరుగంటి సాంఘిక జీవనానికి అద్దం పట్టాడు. కాకతీయులనాటి వృత్తులు, వర్ణాలు, కులాలు, క్రీడా వినోదాలు, పూటకూళ్ళ భోజనాలు, అనాటి ప్రజల ఆచార వ్యవహారాలు చక్కగా చిత్రించాడు. దీనిలో అధిక్షేప కావ్యలక్షణాలు సైతం గర్భితంగా కనిపిస్తాయి. మంచనశర్మ పాత్ర ద్వారా ఆనాటి వేశ్యాలోలత్వాన్ని ఎత్తి చూపాడు. ఇది అనువాదమన్న సంగతి గమనార్హం.

భీమఖండంలో మధ్యాంధ్రదేశాన్ని వాస్తవికంగా చిత్రించాడు.

శ్రీనాథ మహాకవి చాటు పద్యాలకు బాటలు తీసి ఆంధ్రసాహితిని రాచనగరాల నుండి రచ్చపట్టులదాకా ప్రసరింపచేశాడు. కవిత్వాన్ని మహోద్యమంగా నడిపినవారిలో యితడు మొదటివాడు.

డిండిమభట్టు మొదలైన సంస్కృత పండితులను ఓడించి, తెలుగుభాషకు ఎనలేని గౌరవాన్ని చేకూర్చాడు.

## పోతన

శ్రీనాథుని సమకాలికుడైన పోతన మహాభాగవతాంధ్రీకరణం ద్వారా అంత్యప్రాస రచనకు కొత్తదారులు తొక్కాడు.

నన్నయ ప్రారంభించిన శబ్ద సంగీతాన్ని తారాస్థితికి తీసుకుపోయాడు.

దండకమనే కావ్య ప్రక్రియకు పరాకాష్ట కలిగించిన గౌరవం పోతన్నకే దక్కింది.

భోగినీ దండకం శృంగారాత్మకంగా వెలువడిన తొలి దండకం.

దండకాన్ని కావ్యంలో అంతర్భాగంగా కాక విడిగా రచించడం, శృంగార రస ప్రధానంగా రచించడం పోతన ప్రత్యేకతలు.

కావ్యాన్ని నరాంకితం చెయ్యనని కంఠోక్తిగా చెప్పడం, మాతృదేవతాస్తవం చేయడం, మధుర భక్తికి పూలపందిళ్ళు వేయడం పోతన ప్రత్యేక గుణాలు.

వంగదేశంలో కృష్ణ తత్త్వాన్ని ప్రబోధించిన చైతన్యుని కంటే ఏబదేండ్లు పూర్వుడు పోతన. అందుచేత వంగదేశం కంటె ముందు ఆంధ్రదేశానికి కృష్ణతత్త్వ విజ్ఞాన మందించిన ఘనత పోతనకు దక్కింది.

సాధారణ ప్రజల సంస్కారానికి, మనోగతికి అనుగుణమైన, హితమైన మార్గాన్ని చూపించిన గ్రంథం అయినందువనే భాగవతానికి విశేష వ్యాప్తి కలిగింది.

ఈ యుగంలో శ్రీనాథ పోతనల పిమ్మట పేర్కొనదగిన కవి పిల్లలమర్రి పిన వీరభద్రుడు. ఇతను అవతార దర్పణము, నారదీయ పురాణము, మాఘ మాహాత్మ్యము, మానసోల్లాసము, శృంగార శాకుంతలం, జైమినీ భారతము రచించాడు. శకుంతల అనుసరణలో పిన వీరభద్రునికి శ్రీనాథుని పట్లగల గురుభావం కనిపిస్తుంది. శృంగార శాకుంతలంలో ప్రబంధ లక్షణాలు కనిపిస్తాయి. జైమిని భారతానువాదం శృంగార శాకుంతలం కంటే ప్రౌఢమయింది.

నంది మల్లయ – ఘంట సింగయలు వరాహ పురాణం, ప్రబోధ చంద్రోదయం అనే రెండు గ్రంథాలు రచించారు.

కృష్ణ మిశ్రుడు సంస్కృతంలో రచించిన ప్రబోధ చంద్రోదయ మనే నాటకాన్ని ప్రబంధంగా యీ జంట కవులు తీర్చిదిద్దారు.

ప్రదర్శన సౌకర్యాలు లేని నాటకం కంటె యిటువంటి ప్రబంధాలు వాఙ్మయంలో సుస్థిరంగా ఉంటాయన్న తలపే యీ కృషికి కారణమై యుండవచ్చు.

శ్రీనాథుని యుగంలో పురాణాలపై ఆదరం తగ్గి ఖండపురాణాలపై అభిరుచి హెచ్చింది.

ఈ యుగంలో చరిత్రాత్మకములైన చిత్రకథా కావ్యాలు కూడ వెలువడ్డాయి. జక్కన విక్రమార్క చరిత్రము, అనంతామాత్యుని భోజరాజీయము యిటువంటివే.

శబ్ద సంఘటన, వర్ణనా విన్యాసం, శయ్యా సౌభాగ్యం, ఊహాసంపద, ఆలంకారిక శైలి జక్కన కవితలో ప్రత్యేకతలు. శిల్పప్రౌఢి, భావనకంటే స్వాభావికత, అర్థ గాంభీర్యం, శిల్ప విన్యాసం అనంతామాత్యుని ప్రత్యేకతలు. అనంతామాత్యుడు ఛందోదర్పణం, రసాభరణం అనే ఛందోలంకార గ్రంథాలు కూడా రచించాడు.

శ్రీనాథ యుగంలో ద్విపద కవితను పునరుద్ధరించిన ఘనత గౌరనకు దక్కింది. విసుగు పుట్టని రీతిగా ద్విపదను నడిపిన శక్తిమంతుడు రంగనాథ రామాయణకర్త తర్వాత గౌరనయే. ఇతడు హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్ర కూడా రచించాడు. లక్షణ దీపిక అనే సంస్కృత లక్షణ గ్రంథం కూడా రచించాడు.

కథాగుచ్ఛ మనదగిన సింహాసన ద్వాత్రింశిక రచించిన కవి కొరవి గోపరాజు. సాలభంజికలు భోజునకు చెప్పే కథల రూపంలో పెక్కు విజ్ఞానదాయకములైన లౌకిక విషయాలు యీ కావ్యంలో చెప్పబడ్డాయి.

గేయ కవితా శాఖను ఉన్నత శిఖరాలకు తీసుకెళ్ళిన పద కవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు ఈ యుగంవాడే. ఈయన ముప్పది రెండువేల ఆధ్యాత్మిక

కీర్తనలు రచించాడు. సంకీర్తన లక్షణమనే లక్షణ గ్రంథాన్ని సంస్కృతంలో రచించి, దాని కనుగుణంగా అన్నమయ్య యీ కీర్తనలు రచించాడు.

మొత్తం మీద నూరేళ్ళ ఈ ప్రబంధ పూర్వయుగ ప్రత్యేక విశిష్టతలు, కావ్య ప్రక్రియా వైవిధ్యం, శైలిలో అలంకారికత, భావాల్లో శృంగారార్ద్రత లనవచ్చు. ప్రబంధయుగానికి బలమైన పునాది ఈ యుగంలో పడిందని కూడ చెప్పవచ్చు.

ఈ యుగానికి ప్రారంభదశలో కొండవీడు, రాచకొండలు; మధ్యకాలంలో రాజమహేంద్రవరం; అటు తర్వాత ఉదయగిరి; చివర విజయనగరమూ సాహిత్య పీఠాలయ్యాయి.

## ప్రబంధ యుగం
## (క్రీ. శ. 1500 – క్రీ. శ. 1875)

ఆంధ్ర వాఙ్మయంలో ప్రబంధ శాఖకున్న ప్రాధాన్యం, ప్రాచుర్యం మరే శాఖకూ లేవు.

ఏకనాయకాశ్రయత్వం, వస్త్వైక్యం, అష్టాదశ వర్ణనలు, శృంగార రస ప్రాధాన్యం, అలంకారికమైన శైలీ, అనువాదంకాక స్వతంత్ర రచన అయ్యుండటము ప్రబంధలక్షణాలు.

నన్నెచోడుడు, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమన, శ్రీనాథులు ప్రబంధానికి పాదులు పెట్టారు. అయినా పెద్దనాదులనే ప్రబంధకర్తలని అనడానికి కారణం మనుచరిత్ర మొదలైనవి స్వతంత్ర రచనలు కావడమే.

ఆంధ్ర వాఙ్మయంలో కృష్ణరాయల యుగం–ఆంగ్ల చరిత్రలో ఎలిజబెత్ యుగంవంటి స్వర్ణయుగం. ఎలిజబెత్ యుగంలో షేక్స్పియర్ మొదలైన నాటక కర్తలు స్వతంత్రములైన 'రొమాంటిక్' నాటకాలను రచించినట్లే రాయల యుగంలో పెద్దనాదులు స్వతంత్ర నూతన కావ్య సృష్టి చేయడం చేత ఒక నవ్య కవితోద్యమం ('రొమాంటిక్ మూమెంట్') ప్రవర్తిల్లిందని చెప్పవచ్చు. రాయల ఆస్థానంలోని అష్ట దిగ్గజాల్లో అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన, ధూర్జటి మాత్రమే తెలుగుకవులు. తక్కిన ముగ్గురూ యితర భాషా కవులు. రాయల ఆస్థాన కవుల్లోని అల్లసాని పెద్దన, నంది తిమ్మనలు; తదితరుల్లో పింగళి సూరన, రామరాజ భూషణులు విశేష ఖ్యాతి నార్జించుకున్నారు.

అలాగే, సమకాలీన ప్రజా జీవితాన్ని రాయలు తన 'ఆముక్త మాల్యద'లోను, తెనాలి రామకృష్ణుడు తన పాండురంగ మాహాత్మ్యంలోను చక్కగా వర్ణించాడు.

రాయల యుగ మనదగిన నూరేండ్లలో (క్రీ. శ. 1500–'60) నంది తిమ్మన పారిజాతాపహరణము, పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములు ప్రబంధ రూపమును తాల్చిన నాటకాలు.

శైలీరామణీయకతకు పెద్దన మనుచరిత్ర; కళా కౌశలానికి తిమ్మన పారిజాతాపహరణము; కల్పనా చాతురికి సూరన కళాపూర్ణోదయము; పద్య రచనలో నేర్పుకు, లయకు, శ్లేషకు రామరాజభూషణుని వసుచరిత్రా పేరుపొందాయి.

అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయం తదుపరి ప్రబంధాల్లో కనిపించే కృత్రిమాలంకారాలకు మార్గదర్శి అయింది.

ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము ప్రబంధ శైలిలో రచింపబడిన స్థల పురాణం.

1530 లో రాయల మరణానంతరం మాదయగారి మల్లన రాజశేఖర చరిత్ర, తెనాలిరామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, చింతలపూడి యెల్లనార్యుని రాధా మాధవము, సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనము, కందుకూరి రుద్రయ నిరంకుశోపాఖ్యానము, సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసం, చదలవాడ మల్లయ్య విప్రనారాయణ చరిత్ర, పొన్నెగంటి తెలగన్న యయాతి చరిత్ర (అచ్చ తెలుగు కావ్యం), శంకరకవి పద్య హరిశ్చంద్రోపాఖ్యానం వెలువడ్డాయి.

ఈ ప్రబంధాల్లో అధికాంశం శృంగార రస ప్రధానాలే. ఆంధ్రసాహిత్యంలో శృంగార రసానికి అగ్రతాంబూలం కలగడానికి హేతువులను చూద్దాం.

16 వ శతాబ్దిలో ఆంధ్రదేశంలో మహమ్మదీయులు విజృంభించారు. నన్నయ తిక్కనలతో పెంపొందిన వైదిక మతం, పాల్కురికితో వేరూనిన వీరశైవం క్రమంగా శిథిలమై పోయాయి. మహమ్మదీయ పాలకుల రాజవైభవం హైందవ సమాజంలో భోగాభిలాషను రేకెత్తించింది. విజయనగర ప్రభువులపై ఆనాటి మహమ్మదీయ ప్రభువుల ప్రభావం సోకడంవల్ల వారు శృంగార రస ప్రధానాలైన కావ్యాలనే అభిమానింప సాగారు. క్షుద్ర శృంగారం సైతం ప్రభువుల మెచ్చికోలుకు పాత్రమయ్యేది.

ఆంధ్ర సాహిత్యంలో అంతకు పూర్వం గతానుగతికంగా నడుస్తున్న అనువాద పద్ధతిని త్రోసిరాజనడం ప్రబంధయుగ ప్రత్యేకత. వస్తువుతోపాటు, కల్పితేతి వృత్తాలకు గౌరవం లభించింది.

పదహారవ శతాబ్ది ముగిసే నాటికి విజయనగర సింహాసనం ఆత్మ రక్షణార్థం మొదట పెనుగొండలోను, ఆ తర్వాత చంద్రగిరిలోను తలదాచుకొనవలసిన దుస్థితి ఏర్పడింది.

అపర కృష్ణదేవరాయలైన తంజావూరు రఘునాథ రాయల ఆస్థానంలో ఆంధ్ర సరస్వతి వలసరాజ్య మేర్పరచుకొంది.

## దక్షిణాంధ్ర యుగం

దక్షిణాంధ్ర యుగంలో సాహిత్య రంగంలో చెప్పుకోతగిన నూత్నప్రక్రియలు వెల్వడలేదు. వచన గ్రంథాలు విస్తా

రంగా వెలువడ్డాయి. శతకాలు, యక్షగానాలు, గేయరచనలు ప్రబలంగా వెలిశాయి. మనుచరిత్రతో ప్రారంభమైన ప్రబంధ కావ్య ప్రక్రియ ఈ కాలంనాటికి వెర్రితలలు వేసింది. శృంగారం అంగ పరిమితమై, అంతస్సారాన్ని కోల్పోయి క్షుద్రమైనది. చేమకూర వెంకట కవి "విజయ విలాసం" వంటి ఒకటి రెండు ప్రబంధాలుతప్ప చెప్పుకోదగిన ప్రబంధము లీయుగంలో లేవు.

శేషము వేంకటపతి తారాశశాంకము, సముఖము వెంకట కృష్ణప్ప నాయకుని అహల్యా సంక్రందనము, రాధా మాధవ సంవాదము, ముద్దుపళని రాధికా సాంత్వనము–లజ్జా విహీనతకు, కామ పరాయణత్వానికి ప్రతీకలై, ఆ కాలపు సంఘ స్థితిని ప్రతిబింబిస్తున్నాయి.

ఆ రోజుల్లోనే ఆంధ్రులకు తంజావూరు, మధుర మొదలైన సామంత రాష్ట్రములైనా లేకుండా, పాశ్చాత్యు లాక్రమించుకున్నారు. జాతి కళ క్షీణించినట్లే సారస్వత కళలూ క్షీణించాయి. జాతి దారిద్ర్య పరాధీనతలే కవితలలోని భావదాస్య పరాధీనతలకు కారణమయ్యాయి.

ఈ కాలంలో ఒకే ఒక్క సుగుణం – గేయ కవితా పట్టాభిషేకం. రఘునాథరాయలు, విజయరాఘవ నాయకుడు స్వయంగా గేయరచనలు చేశారని చెప్తారు. అనేక గేయకృతుల నాదరించారు. విజయరాఘవుడు కర్ణాటక భాషలో సాంగత్యమనే ఛందస్సుతో శృంగార సాంగత్యం, సంపంగి మన్నారు సాంగత్యమనే రెండు గ్రంథాలు రచించి, ఛందస్సులో కొత్త రీతిని ప్రవేశపెట్టాడు.

ఈ కాలంలో వెలువడ్డ మిగిలిన కావ్యాలన్నీ గతాను గతికాలే.

### వేమన ప్రయోగాలు

వేమన ప్రజాకవి, మహాకవి. తననాటికి జడీభవించిన వైదిక ధర్మమార్గాన్ని, సాంఘిక దురాచారాలను అధిక్షేపించడానికి పద్యాన్ని వజ్రాయుధంలా ప్రయోగించాడు.

పాత ఛందస్సులోనే అయినా వస్తువులో గొప్ప వైవిధ్యాన్ని కనబరిచాడు. అధిక్షేప కావ్యరీతికి వేమన పద్యాలు శ్రీకారం చుట్టాయి. తనచుట్టూ జరిగే విషయాన్ని సూటిగా ఎత్తిచూపడం, సంఘసంస్కారార్థమై కవిత్వాన్నుపయోగించడం, ప్రజల భాషలో పద్యాల్ని రచించడం వేమన చేసిన విశిష్ట ప్రయోగాలు. భాషలో, భావంలో, శైలిలో అచ్చమైన తెలుగుదనం కలిగిన పద్యాలు వేమనవి. వేమన ఆధునిక యుగపు కవుల్లో పలువురిపై ప్రభావం ప్రసరించిన ప్రజాకవి. తెలుగు కవితను జానపదుల రసనాగ్రాలపై నర్తింపచేసిన కవి.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారన్నట్టు, 'ఇరుప్రక్కలందును మరుగులేని మంచి పదునుగల చురకత్తివంటి కవితాశక్తి, దానికి మెరుగిచ్చునటువంటి సంకేత దూషితంకాని ప్రపంచ వ్యవహారములందలి సూక్ష్మదృష్టి, గాయపు మందు కత్తికే పూసి కొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్య కుశలత' – ఇవన్నీ వేమన ప్రత్యేకతలు.

### రామాయణానువాదాలు

14–18 శతాబ్దాల మధ్య రామాయణానువాదాలు భారత దేశమంతటా జరగటం గమనార్హం. కృత్తివాస రామాయణం (బెంగాలీ), సారంగ రామాయణం (ఒరియా), తులసీ రామాయణం (హిందీ), కంబ రామాయణం (తమిళం), మొల్ల, రంగనాథ, భాస్కర, రఘునాథ రామాయణాదులు (తెలుగు) – ఇవన్నీ దాదాపు ఒకేకాలంలో వెలువడడానికి కారణం ఏమైవుంటుందో పరిశీలించడం అవసరం.

14–18 శతాబ్దాల మధ్య భారతదేశంలో వివిధ ప్రాంతాల్లో సరుకుల ఉత్పత్తి (Commodity Production) పెంపొందింది. ఫ్యూడల్ శృంఖలాలను పగలగొట్టవలసిన అవసరం చేతివృత్తుల వారికి వచ్చింది. అందుకని ఆ తర్వాత ఉధృత రూపంలో బయల్వెడలిన భక్తి – సూఫీ – జానపద – వేదాంత ఉద్యమాలకు పూర్వరంగంగా భక్తి సముచ్చయం, భక్తి సర్వస్వంగా రామాయణం వెలువడింది. ఈ భక్తి ఉద్యమాన్ని క్రింది వర్గాలకు, కులాలకు బాగా వ్యాపింప చెయ్యటంలో రామాయణం విశేషంగా తోడ్పడింది. రామాయణంలో కూడా శంబుక వధలాంటి వర్ణ వివక్షవున్నా, అది అనువాదాల్లో లేదు. అనువాదాల్లో భక్తి ప్రాధాన్యత మాత్రమే ఉంది.

## క్షీణ యుగం

క్రీ. శ. 1775 తర్వాత ఒక శతాబ్దం మన వాఙ్మయ చరిత్రలో క్షీణయుగంగా పరిగణింపబడుతోంది. ఈ యుగంలో కూడా సాహిత్య సృష్టి విరివిగానే జరిగింది. రాసియేగాని వాసి కనిపించదు. చోళ, పాండ్య రాజ్యాలు ఛిన్నాభిన్నమవడంతో నామమాత్రావశిష్టాలైన జమీలు మాత్రం మిగిలాయి.

విదేశీయుల రాక కారణంగా దేశంలోని ప్రజాతంత్ర సంప్రదాయాలు నాశనమయ్యాయి. క్షీణ జమీందారీ విధానం పొడుకుంది. దానికి అనుగుణంగా క్షీణ జమీందారీ సాహిత్యం తంజావూరు మొదలైనచోట్ల వెర్రితలలు వేసింది.

నృత్య, సంగీత ప్రియత్వమనే పేర భోగ ప్రియత్వం ముదిరింది. అల్లసాని పెద్దన ఎంతటి శృంగార ప్రబంధం రచించినా ధర్మ ప్రబోధాన్ని విస్మరించలేదు. ఇప్పుడలాకాక ఐహిక సుఖవాంఛలకు దోహదం చేసే, కామ శృంగార ప్రేరకాలైన ప్రబంధాలే కుప్పలు తెప్పలుగా రాసాగాయి. అనుకరణ శీలం పెరిగింది. చిత్ర కవిత్వంపై మమకారం హెచ్చింది. పిల్ల వసు చరిత్రలు పెచ్చుమీరాయి. ప్రబంధ కవిత్వం బంధకవిత్వంగా దిగజారింది. ఆంధ్రసాహిత్య రంగంలో

ఏ యుగంలోనూలేని రాధికా సాంత్వనమువంటి క్షుద్ర శృంగార కావ్యాలు, చంద్రరేఖా విలాపం వంటి బూతు కావ్యాలూ, శ్లేష కావ్యాలూ బయలుదేరాయి. వాటిలో కొన్ని త్ర్యర్థులు, చతురర్థులుకూడ వెలిశాయి. 19 వ శతాబ్ది మధ్యభాగంవరకు యిట్టిస్థితే కొనసాగింది. ప్రబంధాలకు వసు చరిత్ర, ద్వ్యర్థి కావ్యాలకు రాఘవ పాండవీయము మాతృక లయ్యాయి. అదే ఎత్తుగడ, అవే సన్నివేశాలు, అవే పాత్రలు, అదే కథా శరీరం, అదే నిర్వహణం – ఇలా గతాను గతికంగా రచనలు సాగాయి.

వీరేశలింగం పంతులుగారి అవతరణంతో ఆంధ్ర సాహితి, గ్రహణం నుండి తొలగి వెనుకటి కాంతితో కలకల లాడింది.

## భారతదేశంలో సాంఘిక స్థితి

18 వ శతాబ్దంలో విద్యావికాసం మృగ్యం. 'కుంపినీ' పరిపాలన కాలంలో దేశీయులు అజ్ఞానాంధకారంలో కొట్టు మిట్టాడారు.

## రాజా రామమోహనరాయ్

భారతదేశంలో ఇంగ్లీషు విద్య ప్రబలడానికి ఇతడే మూలపురుషుడు. 1885 లో మెకాలే ఇంగ్లీషు విద్యావిధానం అమల్లోకి వచ్చింది. బ్రహ్మ సమాజ స్థాపనం, సహగమన నిర్మూలనం, సంఘదురాచార నిరసనం, ఆధునిక విజ్ఞాన వ్యాపకం, అసంఖ్యాక గ్రంథ రచనలు సాగాయి.

రామమోహనరాయ్ 'సంవాద కౌముది' పత్రిక నిర్వ హించాడు.

సంఘ సంస్కరణకోసం, ఆధునిక భావవ్యాప్తికోసం, ఆంగ్ల, సంస్కృత, వంగ, పారశీకాది భాషల్లో అసంఖ్యాకంగా వ్యాసరచన చేశాడు.

## ఆంగ్ల విద్యావ్యాప్తి - జాతీయ చైతన్యం

ఆంగ్ల విద్యావ్యాప్తి ఫలితంగా దేశీయుల్లో స్వదేశోద్ధరణ సంకల్పం బలపడసాగింది. వినూత్న హేతువాద దృక్ప థంతో ప్రాచీన సంస్కృతగ్రంథాల పరిశీలన ప్రారంభమైంది. మాతృదేశ భాషలతోబాటు ఇంగ్లీషులో కూడ రచనలు చెయ్యసాగారు.

మద్రాసులో 1812 లో కళాశాల స్థాపన జరిగింది. ఈ కళాశాలలో తెలుగు నేర్చుకున్నవారే క్యాంబెల్, విలియం బ్రౌన్, సి.పి. బ్రౌన్ మొదలైనవారు. వీరు తెలుగు వ్యాకరణాన్ని ఇంగ్లీషులో రాసి సారస్వతాని కెంతో సేవచేశారు.

1833 లో ఏనుగుల వీరాస్వామయ్య, వైంబాకం రాఘవాచార్యులు, శ్రీనివాసపిళ్ళే కలసి హిందూ లిటరరీ సొసైటీని స్థాపించారు. దాని తరఫున యిప్పించబడిన ఉపన్యాసాలతో మద్రాసు పౌరుల్లో, దక్షిణాది ప్రజల్లో అపూర్వ రాజకీయ చైతన్యం వెల్లివిరిసింది.

1844 లో 'చెన్నపట్టణం స్వదేశ సంఘం'

1846 లో మహజరు.

1857 లో మద్రాసు యూనివర్శిటీ స్థాపన.

1875 నాటి భారతదేశంలో అన్ని ప్రాంతాల్లో రాజకీయ చైతన్యం.

1878 లో హిందూ పత్రిక స్థాపన.

1885 లో హ్యూమ్ దొరచే భారత జాతీయ కాంగ్రెసు స్థాపన.

19 వ శతాబ్ది చివరి భాగంలో భారతీయ విద్యాధికుల్లో విశేషంగా వైజ్ఞానిక సంచలనం.

1893 లో చికాగోలో వివేకానందుని ఉపన్యాసం. వివేకానందుని యితర ఉపన్యాసాలు, లేఖలు – నాటి జాతీయ చైతన్యస్ఫూర్తికి దోహదం చేశాయి.

## బ్రౌను భాషాసేవ

క్రైస్తవమత ప్రచారకుల కోసం తెలుగు భాషలో నిఘంటు నిర్మాణం జరిగింది. కాంబెల్ నిఘంటువు కన్న సమగ్రమైన రెండు నిఘంటువులను బ్రౌను 1852 లో ప్రచురించాడు (ఆంధ్రాంగ్ల–ఆంగ్లాంధ్ర). 1833 లో తెలుగు సాహిత్యంపై వ్యాసం, 1844 లో తెలుగు వ్యాకరణం రచించాడు. తెలుగు భాషకు బ్రౌను దొర అమరసింహుని వంటివాడు. వేమన శతకాన్ని ఇంగ్లీషులోకి అనువదింపచేసి ప్రచురించాడు. మను చరిత్ర,వసుచరిత్ర, శ్రీమదాంధ్రభాగవతములను తొలిసారిగా ముద్రింపచేసిన వాడు బ్రౌను. ఈనాడు అచ్చులిపిలో వున్న కొన్ని 'వత్తు'లను ఆయనే కనిపెట్టాడు.

### వచన రచనా పరిణామం

తెలుగులో వచనం ముఖ్యంగా మూడు శాఖల్లో వికాసాన్ని పొందింది.

1. ప్రాఙ్నన్నయ యుగంనుంచి నాయకరాజుల యుగం వరకు ఆయావంశాలరాజులు ప్రకటించిన శిలా, తామ్ర శాసనాలు.
2. చంపూ (గద్యపద్యాత్మక) కావ్యాలు.
3. వచనైక రచనలు.

### శాసనాలు

మనకు లభించిన శాసనాల్లో గద్య శాసనాలే మొదటివి.

చోళ మహారాజు క్రీ. శ. 7 వ శతాబ్ది నాటి 'ఉరుటూరు' శాసనం, క్రీ. శ. 9 వ శతాబ్దంనాటి చాళుక్య భీముని 'కొరవి' శాసనం వచనంలో ఉన్నాయి.

కాకతీయ యుగ శాసనాలు గద్యపద్యమయంగా ఉన్నాయి. వీటికి ఉప్పరపల్లి శాసనం ఒక ఉదాహరణ.

14–15 శతాబ్దాలనాటి చీమకుర్తి శాసనం వ్యావహారిక వచనంలో వుంది.

పెక్కు విజయనగర రాజ్యశాసనాలు వ్యావహారిక వచనంలో ఉన్నాయి. ఈ శాసనాల్లో చూర్ణికలు, ఉత్కళికాప్రాయాలు, ఒక్కొక్కసారి పద్యగంధులు అనే వచన వైవిధ్యాలు కూడ ఉన్నాయి.

వ్యావహారికభాష తెలుగులో ఒక పరిణతిని పొంది పరిపూర్ణత్వాన్ని, ప్రయోజనాన్ని పొందడం విజయనగర యుగశాసనాల్లో కన్పించే ప్రత్యేకత.

విజయరాఘవ నాయకుడు రజత పత్రంపై వేయించిన 'నమ్మిక' శాసనము ఇండోనేషియాలోని బటేవియా మ్యూజియంలో భద్రపరచబడింది.

ఈ నమ్మిక శాసనం డచ్చివారికి వ్యాపార నియమాలను విధిస్తూ ప్రకటించిన శాసనం. ఇది దానపత్రం కాదు; నమ్మిక పత్రం (అగ్రిమెంటు) మాత్రమే. ఇందులో వొలందా, కుంపునీ, పరంగి మొదలైన అన్యభాషా పదాలు కనిపిస్తాయి.

ఈ శాసనాలన్నింటిలోనూ నాటి సాంఘిక, రాజకీయ, భాషా విశేషాలు స్పష్టంగా ప్రతిబింబిస్తున్నాయి.

## ఆంధ్ర మహాభారతం - వచన రచన

సలక్షణమయిన గద్యానికి కూడా ఆద్యుడు నన్నయ భట్టే. మహాభారతం చంపూ కావ్యము. నన్నయ భారత భాగంలో మూడవ వంతు గద్యము వుంది.

కథచెప్పేచోట్ల సంభాషణలు – అందునా చిన్నవి చెప్పేచోట్ల నన్నయ వచనాన్నే ఉపయోగించాడు.

నన్నయ కవిత్వంలోని ప్రసన్న కథాకలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థసూక్తినిధిత్వం అనే లక్షణాలు ఆయన వచనంలోకూడా కనిపిస్తాయి.

తిక్కన భారతభాగంలో వచన పరిమాణం యిరవై శాతం మాత్రమే కనిపిస్తుంది. తిక్కన వచనంలో దేశ్యపదాలు అధికంగా కనిపిస్తాయి.

ఎర్రన అంగవర్ణన వచనం, స్తంభోద్భవ వచనం అనే శీర్షికలతో ప్రత్యేక వచనాలను రచించాడు.

## పోతన-శ్రీనాథులు

పోతన స్తుతివచనాలు రచించాడు. పోతన పద్యాలకు వలెనే వచనాలకు కూడా ఆలంకారిక రచన కారణంగా ఒక వింత సొగసు సమకూడింది.

శ్రీనాథుడు కూడా తన గ్రంథాలను చంపువులుగానే రచించాడు. శ్రీనాథుడు తన వచన రచనపట్ల విశేషమైన శ్రద్ధ కనబరచి, వచనాన్ని సముచితంగా వినియోగించాడు.

## ప్రబంధాలు

16 వ శతాబ్దంలో ప్రారంభమైన ప్రబంధాల్లో వచనం పది పదిహేను శాతం మాత్రమే కనిపిస్తుంది. ప్రబంధకర్తలు వచన రచనలో కఠిన శైలినే అవలంబించారు. వారు తమ వచన రచనను తమ పాండితీ ప్రకర్షా ప్రదర్శనానికే వినియోగించారు. మొత్తంమీద ప్రబంధ కర్తల చేతుల్లో తెలుగు వచనం శైలీ పరిపుష్టిని సంతరించుకుంది.

## వచనైక రచనలు - స్తుతి వచనాలు

కన్నడ, సంస్కృత భాషల్లో వెలువడ్డ శైవ, వైష్ణవ స్తుతి వచనాలు తెలుగులో వెలువడ్డ స్తుతి వచనాలకు మార్గదర్శకాలైనాయి. స్తుతి వచనాలు వేటికవే స్వతంత్రంగా ఉంటాయి. వీటన్నిటిలోనూ భక్తి ప్రధానంగా ఉంటుంది.

ఓరుగల్లు పాలకుడైన రెండవ ప్రతాపరుద్రుని కాలంలో జీవించిన కృష్ణమాచార్యులు రచించిన సింహగిరి వచనాలు సుప్రసిద్ధమైనవి. ఈయన రచించిన వచనాలు నాలుగు లక్షలదాకా వున్నట్లు ప్రతీతి.

తాళ్లపాక పెదతిరుమలాచార్యులు వేంకటేశ్వర వచనాలనే పేర కొన్ని వచనాలను రచించాడు.

ఈ వచన రచయితలు పోతనవంటి రచయితలను, తాళ్లపాక అన్నమాచార్యులవంటి గేయ రచయితలను ప్రాభావితం చేశారు. శఠకోప విన్నపాలు, శేషగిరినాథ విన్నపాలు ఈ రకమైనవే.

శైవ సంబంధమైన వచనాల్లో భవానీ మనోహర వచనాలు, గంగాధరయ్య వచనాలు, కాశికాధీశ్వర వచనాలు మొదలైనవి పేర్కొనదగినవి.

## చారిత్రక రచనలు

చరిత్ర రచనకు పద్యం కంటే వచనమే అనువైనది. క్రీ. శ. 16 వ శతాబ్దంలో ఏకామ్రనాథుడు అనే రచయిత "ప్రతాప చరిత్ర" అనే తొలి వచన చారిత్రక గ్రంథాన్ని రచించాడు. దీనిలోని అంశాల్లో చాలవరకు చారిత్రకంగా యథార్థాలని చారిత్రకులు విశ్వసిస్తున్నారు.

ఈ రకమైన మరో పుస్తకం "రాయవాచకం." 16 వ శతాబ్దమునాటి విశ్వనాథ నాయకుని స్థానాపతి యీ గ్రంథాన్ని రచించాడు. వ్యావహారిక భాషలో రచింపబడిన ఈ గ్రంథంలో మాండలికాలు, అనేక అన్యభాషా పదాలు వాడబడ్డాయి. "కర్నాట రాజ వృత్తాంతము", "తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర" – నాటి భాషా స్వరూపాన్ని తెలిపే చక్కని వచన గ్రంథాలు.

# దక్షిణాత్య యుగం

విజయనగర రాజ్యపతనానంతరం ఆంధ్ర సాహిత్యరంగం తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు మొదలైన దక్షిణాది రాజ్యాలకు మారింది. క్రీ. శ. 17, 18 శతాబ్దాల్లో ఈ ప్రాంతాల్లో వచన వాఙ్మయం బహుముఖాలుగా వికాసం చెందింది.

## క్షేత్ర మాహాత్మ్యాదులు

క్షేత్ర మాహాత్మ్యాలే స్థల పురాణాలు. శ్రీరంగ మాహాత్మ్యం అనే వచన కావ్యాన్ని విజయరంగ చొక్కనాథుడు (1706–32) రచించాడు. ఈయనే మాఘ మాహాత్మ్యం కూడా రచించాడు. లింగనమఖి శ్రీ కామేశ్వరకవి ధేను మాహాత్మ్యాన్ని రచించాడు. వ్యావహారిక పద ప్రయోగాలు దీని ప్రత్యేకత. కళువె నంజరాజు రచించిన 'హాలాస్య మాహాత్మ్యం' యిటువంటి వచన కావ్యమే. ఈయనే 'కాశీ మహిమార్థ దర్పణం' కూడా రచించాడు. కాశీనగర క్షేత్ర విశేషాలు శిష్ట వ్యావహారిక భాషలో యీ గ్రంథంలో వర్ణింపబడ్డాయి. ఇవికాక గజారణ్య మాహాత్మ్యం, వెంకటాచల మాహాత్మ్యం, వైశాఖ మాహాత్మ్యం అనేవి కూడ అదేకాలంలో వెలువడ్డ వచన గ్రంథాలు.

## పౌరాణిక వచన కావ్యాలు

దాక్షిణాత్యయుగంలో పలు రకాల పురాణాలు వచనములో రచింపబడ్డాయి.

ఎల్లకర నృసింహకవి రచించిన భారత సావిత్రి అనే వచన గ్రంథం బహుళ ప్రచారం పొందింది.

సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు తన జైమినీ భారతంలో శృంగార వీర భయానక రసాలనే కాక హాస్యాన్ని కూడ చక్కగా పోషించాడు.

క్రీ. శ. 17 వ శతాబ్దంలో మైసూరును పాలించిన చిక్కదేవరాయల కాలంలో నివసించిన కళువె వీరరాజు రచించిన వచన భారతం, తుపాకుల అనంతభూపాలుని అనుశాసనిక పర్వం, నారాయణీయమనే వచన శాంతి పర్వం భారత సంబంధియైన వచన రచనలు.

విజయరంగ చొక్కనాథుడు మధురను పాలించిన కాలంలో శ్యామరాయకవి రామాయణాన్ని వచనంలో రాశాడు.

తుపాకుల అనంత భూపాలుడు రచించిన విష్ణు పురాణము, మార్కండేయ కథ; పుష్పగిరి తిమ్మన రాసిన భాగవతసారము; మాచనామాత్యుని 'బ్రహ్మాండ వచనము' పౌరాణిక వచన గ్రంథాలు.

## తత్వశాస్త్ర గ్రంథాలు

తెలుగులో తత్వశాస్త్ర గ్రంథాలు అనేకం వ్యావహారిక వచనంలో రచింపబడ్డాయి. 'సాత్విక బ్రహ్మ విద్యా విలాసం', 'వేదాంత సార సంగ్రహం', 'అజ్ఞాన ధ్వాంత చండ భాస్కరం', 'సిద్ధాంత సారం', 'వాసుదేవ మననం' మొదలైన అనేక వచన గ్రంథాలు వాడుక భాషలో ఉండేవి.

వివిధ శాస్త్రగ్రంథాలు కూడా 19 వ శతాబ్దంలో ప్రచారంలో ఉండేవి. అల్లాడి రామచంద్ర శాస్త్రిగారి 'సిద్ధాంత శిరోమణి' (క్రీ. శ. 1837), భూగోళ దీపిక (క్రీ. శ. 1843), పథ్యం వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రులవారి జాన్ ఫ్రైయర్టామ స్మూపాలీయమనే 'వ్యవహార దర్పణం' (క్రీ. శ. 1851) మొదలైన అనేక వచన శాస్త్రగ్రంథాలు ప్రచారంలో ఉండేవి.

అలానే దత్తాత్రేయ యోగి 'వేదాంత వ్యవహార సార సంగ్రహం', దాసగోస్వామి 'పరమానంద బోధ ప్రకరణం', పెద్దరామకవి 'ప్రభుదేవర వాక్యం', కాశీ బసవేశ్వరుని 'వివేకసింధువు', వివేక చింతామణి, క్రిస్టియన్ వేదకథాసంక్షేపం, సృష్టిరహస్యం అనే క్రైస్తవ మత గ్రంథాలు 17, 18 శతాబ్దాల్లో ప్రచారంలో ఉండేవి.

తెలుగుదేశంలో ఇంగ్లీషు విద్య ప్రారంభంతో కథా వాఙ్మయం ప్రారంభమైంది. క్రీ. శ. 1881 లో యెర్రమిల్లి మల్లికార్జునుడు 'చార్ దర్వేష్' కథలు వ్యావహారిక భాషలో అనువదించాడు.

క్రీ. శ. 1819లో 'విక్రమార్కుని కథలు', క్రీ. శ. 1834 లో 'పంచతంత్ర కథలు' రావిపాటి గురుమూర్తి శాస్త్రి రచించాడు. కాంభోజరాజు కథలు, తెనాలి రాముని కథలు, శుకసప్తతి కథలు, భేతాళ పంచ వింశతి, పలుకని పద్మాక్షి కథలు విస్తృత వ్యాప్తిని పొందాయి. వీటిలో చాలవరకు వాడుకభాషలో ఉండటం గమనార్హం.

క్రీ. శ. 1820 – క్రీ. శ. 1856 మధ్య పుదూరు సీతారామశాస్త్రిగారి 'పెద్ద బాలశిక్ష' మొదలుకొని పెద్ద తరగతుల్లో బోధించే అనేక బడి పుస్తకాలు వెలువడ్డాయి.

క్రీ. శ. 1856 లో 'జాను బన్యను చరిత్ర', 'అమెరికాను కనిపెట్టిన చరిత్ర', 'మహమ్మదు చరిత్ర' మొదలైనవి వెలువడ్డాయి.

దాదాపు అదేకాలంలో సి.పి. బ్రౌనుదొర పెక్కుమంది పండితుల సాయంతో తెలుగు భాషా వాఙ్మయాల విషయంలో విశేష పరిశోధన చేసి, ప్రాచీన గ్రంథాలను సేకరించి, పరిష్కరించి, ప్రచురింపచేశాడు. వాడుకభాషలో నిఘంటువులు ప్రచురించాడు.

## వీరేశలింగంగారు – సంఘ సంస్కరణోద్యమం

ఫ్రాన్సు దేశంలో వాల్టేరువలె ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణ కోసం తన కలాన్ని ఖడ్గ సదృశంగా వాడిన మహాపురుషుడు వీరేశలింగం. సాంఘిక దురాచార నిర్మూలనంలో, బహుముఖ సాహితీ ప్రక్రియ సృష్టిలో, ఆంధ్ర జాతీయతా ప్రచారంలో ఆయనే పితామహులు.

తెలుగు భాషలో మృదువైన, సరళమైన, సలక్షణ వచన రచనకు ఆద్యులు. 1881 లో నాటక సమాజ స్థాపన చేశారు. 1881 డిసెంబరు 1 న రాజమహేంద్రవరంలో మొదటి వితంతు వివాహం చేశారు.

సంఘ సంస్కరణోద్యమంతో బాటు, తెలుగు సాహిత్యంలో కొత్త పుంతలు తొక్కినందున కావ్యనాటకాలే కాక తెలుగులో ప్రకృతి శాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, శారీరక శాస్త్రము, పదార్థ వివేచనా శాస్త్రము, భౌతిక భూగోళ శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలు, అలంకార సంగ్రహము, ఆంధ్ర తర్క సంగ్రహం మొదలైన బహువిధ వాఙ్మయ సృష్టి చేసిన మహామనీషి ఆయన.

ఆయన అయిదవ వాచకం మొదలుకొని ఆంధ్ర కవుల చరిత్రవరకు రచించిన బహుముఖ ప్రజ్ఞాశాలి.

"తెనుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదట నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని" అన్నారాయన.

## 19 వ శతాబ్దిలో కొందరు కవులు - వారి కవితారీతులు

19 వ శతాబ్ది రచయితల్లో ప్రథమగణ్యుడు చిన్నయసూరి. 1816–73. మతుకుమల్లి నరసింహ కవి "అజ చరిత్ర"మను ప్రౌఢ ప్రబంధం రచించాడు.

1860 లో "చెన్నపురీ విలాసం" రచించి, కోకొల్లలుగా ఆంగ్ల పదములను ప్రయోగించాడు. సమకాలిక సమాజ స్థితిగతులను చిత్రించిన కావ్యమిది.

మండపాక పార్వతీశ్వర శాస్త్రి "ఆత్మచర్య" అనే పద్యబద్ధమైన స్వీయచరిత్ర రాశారు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి జాతక చర్యకు దారిచూపిన కావ్యమిది.

### మాడభూషి వెంకటాచార్యులు

"భారతాభ్యుదయ" మనే ప్రౌఢ ప్రబంధం రచించారు. అవధానాలను బహుళ ప్రచురితాలుగా చేశారు.

### కొక్కొండ వేంకటరత్నం పంతులు

భాషా విషయకంగాను, రచనా విషయకంగాను అత్యంత సాంప్రదాయకులు. బిల్వేశ్వరీయం, కుమార నృసింహం, వెండి, బంగారం మొదలైన పేర్లతో కొత్త వృత్తాలను సృష్టించారు.

### ఆదిభట్ల నారాయణదాసు

"ఉమరు ఖయ్యాము" తొలి తెలుగు అనువాదం చేశారు. అనేక హరికథలు, యక్షగానాలు రచించారు.

### వావిలాల వాసుదేవ శాస్త్రి

మొత్తం గీత పద్యాల్లో "నందక రాజ్యం" అనే నాటకం రాశారు.

### వేదం వెంకటరాయ శాస్త్రి

కవిత్వంలో కొత్త ప్రయోగ మేమీ చేయకపోయినా, నాటకరచనలో గొప్ప స్వేచ్ఛ కనపరిచారు. "ప్రతాప రుద్రీయం" రచించారు. వ్యావహారిక భాషకు తొలిసారిగా "గ్రాంథికత" కల్పించారు. వీరి తర్వాతనే గురజాడ వ్యావహారిక భాషలో "కన్యాశుల్కం" రచించారు.

### దేవులపల్లి సుబ్బరాయ కవి

"మహేంద్ర విజయం" రచించారు.

### శొంఠి భద్రాద్రి రామశాస్త్రి

"చిత్రసీమ" రచించారు.

### మేడేపల్లి వెంకటరమణాచార్యులు

"దేవవ్రత చరిత్ర" రచించారు. నాటకీయత దీని ప్రత్యేకత.

### దాసు శ్రీరాములు

"తెలుగునాడు" రచించారు.

'చంద్రశేఖర శతకము'లో వ్యావహారిక భాషను అధిక్షేపంగా ప్రయోగించారు.

### ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మ

1892 లో ఆంధ్ర పద్యావళి. సంఘ సంస్కరణకోసం కవిత్వం వ్రాసిన 19 వ శతాబ్ది రచయితల్లో ఈయన గణనీయుడు.

19 వ శతాబ్దిలో వెలువడిన కవిత్వం చాలావరకు నలిగిన బాటలోనే నడిచింది. ఆ వెలువడిన కావ్యాలలో ముప్పాతిక మువ్వీసము వసుచరిత్రాదులను ముందుంచుకొని వెలువడినవే.

### చిన్నయసూరి

క్రీ. శ. 1857 వ సంవత్సరం రాజకీయంగానే కాక, సాంస్కృతికంగా కూడా భారతదేశానికి ముఖ్యమైంది. 1857 లో మద్రాసు విశ్వవిద్యాలయ స్థాపన జరిగింది. అందులో తెలుగు భాష పఠనీయమైంది. అప్పటికి ప్రభుత్వ కళాశాలలో పండితుడుగా, ఉపయుక్త గ్రంథకరణ దేశభాషా సభకు అధ్యక్షుడుగా పలుకుబడి కలిగివున్న పరవస్తు చిన్నయసూరి మిత్రలాభం, మిత్రభేదం అనే రెండు భాగాలను ఒక రకమైన కృతక గ్రాంథిక శైలిలో రచించాడు. వాటికి పాఠ్యాంశాలుగా ఉండే అవకాశం లభించింది. దానితో ఆ రకమైన కృతక వచనానికి గిరాకీ ఏర్పడింది. రాజధాని కళాశాలలో ప్రధాన పండితులైన కొక్కొండ వేంకటరత్నంగారు గ్రాంథిక

భాషోద్యమాన్ని స్థిరీకరించారు. వీరి 'విగ్రహం' 1872 లో పాఠ్యగ్రంథంగా నిర్ణయింపబడింది.

ఆవిధంగా విశ్వవిద్యాలయంలో ఒకవంక 'గ్రాంథిక వచన గ్రంథాలు' ప్రాబల్యం సంపాదించుకొంటే, ప్రజాసామాన్యంలో పరమానంద శిష్యుల కథలు (1861), తడకమళ్ళ వెంకటకృష్ణారావు రాసిన అరేబియన్ నైట్స్ కథలు (1862), కంబుధర చరిత్ర (1866), ఎర్రమిల్లి మల్లికార్జునుడి చారు దర్వీషు కథలు (1881), చదలవాడ సీతారామశాస్త్రి దక్కను పూర్వ కథలు వ్యావహారిక భాషలో వెలువడి విశేష ప్రచారం పొందాయి.

మరోవంక సులభ గ్రాంథికంలో సుబ్బరాయలు, నాయని వారి దశావతార సంగ్రహం (1861), తిమ్మరాజు లక్ష్మణ రాయకవి మార్కండేయ పురాణ సార సంగ్రహం (1876), శ్రీ కూర్మపురాణ సంగ్రహం (1877) మొదలైన గ్రంథాలు వెలువడ్డాయి.

రావిపాటి గురుమూర్తి శాస్త్రి క్రీ. శ. 1834లో వ్యావహారిక భాషలో రచించి ప్రచురించిన "పంచతంత్రం" క్రీ. శ. 1870 వరకు అనేక ముద్రణల్లో వ్యావహారికంలో వుండి, తర్వాత కావ్య భాషలోకి మారిపోయి అచ్చుపడింది.

విశ్వవిద్యాలయంలో గ్రాంథిక వచన రచనకు చోటు దొరకడంతో నోట పలికే మాటకూ, చేతి వ్రాతకూ ఉండవలసిన సాన్నిహిత్యం విచ్ఛిన్నమై పోయింది.

## వీరేశలింగం

"సంధి"ని గ్రాంథికంలో రచించిన వీరేశలింగం పంతులు గారు వచన రచనకు గ్రాంథికం ఎంత మాత్రం పని కిరాదని గ్రహించి, తన తదుపరి రచనల్లో సరళ గ్రాంథికాన్ని, ప్రహసనాదుల రచనలో శిష్ట వ్యావహారిక భాషనూ వాడనారంభించారు.

1890 లో వీరేశలింగంగారి రచనలు వెలువడి నప్పటి నుండి తెలుగు రచనలపై ఆంగ్ల భాషా ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. 1899 నాటికి వీరేశలింగంగారి రచనలన్నీ సంపుటాలుగా వెలువడ్డాయి. వీరి రచనల్లో శైలీ కాఠిన్యం లేదు. వీరేశలింగంగారితో ప్రారంభమైన ఆధునిక వచన వాఙ్మయం నవల, నాటకం, కథ, వచన సాహిత్యం, శాస్త్ర గ్రంథాలు, చరిత్రవ్యాసం, పత్రికా రచన మొదలైన అనేక శాఖలుగా విస్తరించింది.

నవలా ప్రక్రియలో కొక్కొండ వెంకటరత్నం మహాశ్వేత (1867), నరహరి గోపాల కృష్ణయ్యసెట్టి రంగరాయ చరిత్ర (1872), వీరేశలింగంగారి రాజశేఖర చరిత్ర, ఖండవల్లి రామచంద్రుడు ధర్మవతీ విలాసం, తల్లాప్రగడ సూర్యనారాయణరావు సంజీవరాయ చరిత్ర, చిలకమర్తి లక్ష్మీనరసింహం రామచంద్ర విజయం, అహల్యాభాయి (1897), కర్పూర మంజరి (1898) మొదలైనవి వెలువడ్డాయి.

చారిత్రక వచన గ్రంథాల్లో బుక్కపట్టణం రాఘవాచార్యుల తెలుగు రాజుల చరిత్ర (1881), ఒడయరు వీరనాగయ్య బెండపూడి అన్నమంత్రి చరిత్ర (1881), చాణక్య చరిత్ర (1885), తిమ్మరసు చరిత్ర (1898) లు వెలువడ్డాయి.

వీరేశలింగంగారు తెలుగు వచన వికాసానికి విశేషంగా తోడ్పడ్డారు. సులభ గ్రాంథికంలో ఉండే తన రచనలను సంఘ సంస్కారోద్యమానికొక ఆయుధంగా వినియోగించారు. తాను "సంధి" .రచనకు ఉపయోగించిన కృతక గ్రాంథికం వచన రచనకు అనువైనదికాదని గ్రహించిన వీరేశలింగంగారు సులభగ్రాంథికాన్ని గ్రహించి, తరువాత ప్రారంభమైన వ్యావహారిక భాషోద్యమానికి పూర్వరంగం తయారుచేశారు.

---

ఈ వ్యాస రచనలో తోడ్పడిన గ్రంథాలు:

1. థాంప్సన్ రచించిన "Marxism and Poetry."
2. డా॥ పింగళి లక్ష్మీకాంతంగారి "ఆంధ్ర సాహిత్య చరిత్ర."
3. తెలుగు భాషా సమితి వారి "తెలుగు సంస్కృతి" – (3) సంపుటం.
4. శ్రీ సి. నారాయణరెడ్డి : "ఆధునిక ఆంధ్ర కవిత్వము – సంప్రదాయములు– వుపయోగములు. "
5. శ్రీ ఆరుద్ర : "సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర" సంపుటాలు.
6. శ్రీ ఏటుకూరు బలరామమూర్తి : "ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర."
7. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రచురించిన వ్యాస సంపుటి.
8. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి "తెలుగులో రామాయణాలు."
9. డా॥ కులశేఖరరావు : "తెలుగు వచన వికాసం."
10. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి "వేమన."

ఇంకా యితర పుస్తకాలు, వ్యాసాలు; మిత్రులు శ్రీరాంభట్ల సూచనలు.

# వీరేశలింగం నుండి భావకవిత్వం వరకు

కుందుర్తి ఆంజనేయులు, బి.ఏ.

ఈ శతాబ్దం తొలిభాగంలో నవ్య కవిత్వం పేరుతో ప్రారంభమై, భావకవిత్వంగా చెలామణి అయిన కవితా ఉద్యమం దాదాపు పాతిక సంవత్సరాలు రాజ్యం చేసింది. ఇది ఆధునిక తెలుగు సాహిత్యాకాశంలో మెరుపు తీగలాగా తళుక్కున మెరిసిపోయిన ఒక కొత్త ఉద్యమం. భావ కవిత్వం ఒక సాహిత్య ఉద్యమంగా ప్రజలనూ, పండితులనూ చాలా స్వల్పకాలం మాత్రమే ప్రభావితం చేయగల్గింది. ఇప్పుడు వెనుదిరిగి చూసుకుంటే, ప్రజల్లోకి బాగా చొచ్చుకు పోవడానికి తగినంత గట్టి పునాదులు లేకపోవడమే దానికి కారణం అని స్పష్టంగా తెలుస్తుంది. కావ్య వస్తువులోగాని, భావనలోగాని, రచనా శిల్పంలోగాని దానికి తత్కాల ప్రజలతోనూ, వారి నిత్య జీవిత పరిస్థితులతోనూ, వారికిగల పాండిత్యంతోనూ, వారి అవగాహన పరిధితోనూ సంబంధం లేనందువల్లనూ, ఆ కవిత్వం తనకు తానుగా ప్రత్యేకమైన కల్పనా లోకాన్ని సృష్టించుకుని, అందులోనే నివసించాలని కలలు కన్నందువల్లనూ అది ఎంత ఉధృతంగా వచ్చిందో అంత గట్టిగా నిలబడలేకపోయింది. ఇప్పుడు మారిన విలువలనుబట్టి, మారిన మన ఆలోచనా సరళినిబట్టి అది ఒక కృత్రిమ విప్లవంగా కనిపించినా, చారిత్రకంగా భావ కవిత్వానికి మన సాహిత్య చరిత్రలో ఒక ప్రముఖ స్థానం వుంది. ఆనాటి పరిస్థితులను, ఆనాటి కవులపైబడిన పాశ్చాత్య, దేశీయ సాహిత్య ప్రభావాలనూ, దృష్టిలో వుంచుకుని పరిశీలించినప్పుడే భావకవిత్వాన్ని గురించిన సరియైన అంచనా మనకు లభిస్తుంది.

అప్పటికి దేశంలో ఆంగ్ల విద్యా ప్రభావం బాగా పడింది. విద్యావంతులైన వారిలో అధిక సంఖ్యాకులను పాశ్చాత్య నాగరికతా ప్రభావం ముంచివేసింది. విదేశాలలోని సాహిత్యం, కళలు, ఆచారాలు, జీవన పరిస్థితులు దేశీయుల మీద గాఢమైన ముద్ర వేస్తున్న రోజులు. రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో తరతరాలుగా పాతుకుపోయిన విలువలు మారుతున్న సమయం. ఆంగ్ల భాషా ప్రభావితులైన యువకులు పాశ్చాత్య సాహిత్యరీతులను అధ్యయనం చేస్తున్న కాలం. ఆంగ్ల సాహిత్యంలో పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభంలో విజృంభించిన కాల్పనికోద్యమ ప్రభావం, యిరవయ్యో శతాబ్దపు తొలిభాగంలో మన యువసాహిత్యవేత్తల మీద పడింది. కీట్స్, షెల్లీ, బైరన్, బ్రౌనింగ్ మొదలైన ఆంగ్లకవుల రచనా రీతులు తెలుగుసాహిత్యంలో చోటు చేసుకోడానికి అవకాశం ఏర్పడింది. దీనికితోడు 'బెంగాల్ షెల్లీ'గా ప్రసిద్ధుడయిన రవీంద్రుని భావాల ప్రభావం తెనుగు యువకుల మీద పడింది. కాల్పనిక సాహిత్యోద్యమ ఆచార్యులు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రవీంద్రుని ప్రభావానికి ప్రత్యక్షంగా లోనైనవారు. అటు ఆంగ్లకవుల ప్రభావమూ, యిటు రవీంద్రుని ప్రభావమూ – యీ రెండూ కలిసి మన తెలుగులో భావకవిత్వంగా రూపురేఖలు దిద్దుకున్నది. పందొమ్మిదవ శతాబ్దపు మధ్యభాగంలో ఎన్నో మార్పులకు దారితీసే సంఘటనలు కొల్లలుగా జరిగాయి. ప్రపంచస్థాయిలో చూసుకుంటే సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థను కూకటి వ్రేళ్ళతో సహా కూల్చివేయడానికి సమర్థవంతమైన కమ్యూనిస్టు మేనిఫెస్టో ప్రకటించబడింది. భారతదేశంలో 1857 లో వలస రాజ్యాధిపతులపై తిరుగుబాటుగా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం జరిగింది. ఆంధ్రదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమానికి నాంది పలకడానికి మహాపురుషుడు వీరేశలింగంగారు ఉద్భవించిన కాలం అది. ముఖ్యంగా పందొమ్మిదవ శతాబ్దం చివరి భాగం తెనుగు సాహిత్య, సాంస్కృతిక చరిత్రలో స్వర్ణయుగం వంటిది. అప్పుడే తెలుగుదేశంలో వెలిగిన వీరేశలింగ దీపం క్రమంగా అఖండ జ్యోతిగా మారి, నలుమూలలా వెలుగులు ప్రసరింపజేసింది. తెలుగు దేశపు మూఢ విశ్వాసాలమీది కెత్తిన కత్తిగా వీరేశలింగం గారు ప్రజల్లో సామాజిక చైతన్య వ్యాప్తికి ప్రారంభోత్సవం చేశారు.

శతాబ్దాలుగా అలవాటుపడిన అభిప్రాయాలమీదా, విశ్వాసాల మీదా ధ్వజమెత్తారు. జీవితమంతా సంఘంలోని దురాచారాల మీద యుద్ధం చేస్తూ, ప్రజల్లో నూతన విజ్ఞాన రోచిస్సులను వెదజల్లుతూ మన చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలకు వీరేశలింగంగారు కొత్త వ్యాఖ్యానాలు చేశారు. అంతవరకు ఆంధ్రదేశాన్ని ఆవరించుకుని వున్న కారుచీకట్లు వీరేశలింగం సూర్యోదయంతో పటాపంచలై పోయాయి. చదువుకున్న మధ్యతరగతి మేధావుల మనస్సుల్లో పేరుకున్న సంకుచిత భావాల మంచుబిందువులు కరిగిపోయాయి. వీరేశలింగంగారు ఆంధ్రులకు చూపిన కొత్తదారిలో యిప్పుడు విద్యుద్దీపాల కాంతి ధగద్ధగాయమానంగా ప్రకాశిస్తున్నది. అందరూ ఆ దారిలో నడుస్తున్నారు. క్రమంగా తెలుగు ప్రజల్లో కొత్తభావాలు, కొత్త కొత్త ఆలోచనా రీతులు వెలిశాయి. వీరేశలింగంగారి కృషివల్ల తెలుగు ప్రజలకు అంతకుముందు శతాధికంగా వుంటూ వస్తున్న మూఢవిశ్వాసాలు పటాపంచలై పోయాయి. స్త్రీలకు విద్యార్హత, పునర్వివాహార్హత,పురుషునితో సమానత్వం మొదలైన నూతన భావాలు తెలుగు ప్రజల మనస్సులో పాదులు చేసుకున్నాయి. కుళ్ళు కంపు కొడుతున్న సంఘాన్నీ, సమాజాన్నీ ఆయన ప్రక్షాళనం చేసి, తెలుగు ప్రజల ఆలోచనారీతి ప్రయాణం చేయడానికి ఒక కొత్త మార్గాన్ని కనిపెట్టాడు. అంతకుముందు పండితుల దృష్టిలోనూ, ప్రజల దృష్టిలోనూ మహాపాపాలుగా చెలామణీ అవుతున్న విషయాలను ఆయన తన పాండితీ ప్రతిభ చేతనూ,ముందుచూపుతోనూ, అభ్యుదయ దృక్పథంతోనూ వివరించి చెప్పి, వాటిని సమాజోద్ధరణకు అనుసరించదగిన సత్కార్యాలుగా రాణింపజేశాడు. కలానికి కూడా కత్తిలాగా పదునున్నదనే సత్యాన్ని ఆయన తన సాహిత్య కృషిద్వారా నిర్ద్వంద్వంగా రుజువుచేశాడు. ఫ్రెంచి విప్లవానికి కారణభూతులని చెప్పబడుతున్న ప్రసిద్ధ రచయితలవలే ఆంధ్రదేశంలో సాంస్కృతిక విప్లవానికి ఆయన ఆదిపురుషుడు. భారత దేశానికి రామమోహనరాయలు ఎట్టివాడో – ఆంధ్రదేశానికి వీరేశలింగంగారు అట్టివారు. బ్రిటిష్ ప్రభుత్వ పరిపాలనా యుగంలో దేశాన్ని ఉద్ధరించాలనే ప్రయత్నం రామమోహన రాయలతో ప్రారంభమైనట్లు ఆంధ్రదేశంలో సమాజోద్ధరణ కార్యక్రమం వీరేశలింగంగారితో ప్రారంభమైంది. అదేవిధంగా, ఆ కాలంలోనే గిడుగు రామమూర్తిగారితో – తెలుగు భాషకు పడిన సంకెళ్ళు త్రెంచుకున్నవి. సాహిత్యంమీద పండితులు వెలిగిస్తున్న అధికారాన్ని పటాపంచలుచేసి, భాషను ప్రజలకు సన్నిహితంగా తెచ్చిన మహానుభావుడు ఆయన. అనాడు గ్రామ గ్రామాన తనకూ, తన సిద్ధాంతానికి ఎదురొడ్డి నిలిచిన గ్రాంధిక భాషావాదులను చిత్తుచేసి ప్రజల భాషను సృష్టించిన ఘనత ఆయనది. తాను స్వయంగా ఉద్దండపండితుడై, పండితులు చేస్తున్న దోషాలపై యుద్ధం ప్రకటించి, భాషామతల్లిని పండితుల చెరనుండి విడిపించి, స్వేచ్ఛ ప్రసాదించాడు ఆయన. ఈనాడు సర్వజనాదరణీయమైన వ్యవహార భాషకు రూపురేఖలు దిద్ది, దాని సిద్ధాంతాన్ని సభల్లో, సమావేశాల్లో ప్రచారంచేసి, దానికి అజరామరమైన స్థితిని కల్పించి, తెలుగు భాషకూ, ప్రజలకూ మహోపకారం చేసినవారు గిడుగువారు. గిడుగు రామమూర్తిగారు చెప్పిన లక్షణానికి లక్ష్యంగా గురజాడ అప్పారావుగారు వ్యవహారిక భాషకు కావ్యత్వ గౌరవం లభింపజేశారు. పాండిత్య ప్రకర్షతో గడ్డకట్టుకుపోయిన కవిత్వానికీ, నాటకానికీ ఆయన బంధ విముక్తి కలిగించాడు. ప్రజల భాషలో కవిత్వం చెప్పి, నాటకం రాసి ఆయన ప్రజల చేతనే కాకుండా పండితులచేత కూడా ఒప్పించాడు. ఈ ముగ్గురు మహాపురుషుల కృషిచేత పందొమ్మిదవ శతాబ్దం చివరకు తెనుగు సాహిత్యంలో వచ్చిన అభ్యుదయ మార్గం బాగా స్థిరపడింది. భారతదేశంలో భూస్వామ్య వ్యవస్థను త్రోసిరాజని, పెట్టుబడిదారీ వ్యవస్థకు బీజావాపనం చేసిన ఆంగ్ల ప్రభువుల రాజకీయాధికార వ్యవస్థతో సమాన ఉజ్జీగా యీ అభ్యుదయ భావ వికాసం దేశమంతటా ఏర్పడి, తెనుగు సాహిత్యంలో కూడా చోటు చేసుకున్నది. చిన్నయసూరికూడా పందొమ్మిదవ శతాబ్దపువాడే. ఆయన తనకు ముందు వ్యావహారిక భాషలో రచనలు సాగుతున్నప్పటికీ వాటిని లెక్కచేయకుండా సల్లక్షణమైన నూతన భాషకు రూపురేఖలు దిద్దాలనే ఆలోచనతో భాషకు వ్యాకరణం చేసి గ్రాంధికమతాన్ని స్థాపించినా, ప్రజల్లో కలుగుతున్న భావ వికాసానికి అది వ్యతిరేకంగా వుండడంచేత ఎంతోకాలం ఆయన భావాలు నిలబడలేకపోయాయి. ఆయన నిర్వచించిన సల్లక్షణ భాష కేవలం పాఠ్యగ్రంథాలు, తెలుగు పండితుల ఊహలకు మాత్రమే పరిమితమైపోయి, ప్రజోద్యమశీలం కలిగిన వ్యావహారిక భాషోద్యమమే విస్తృతంగా ప్రచారమై, చివరకు నెగ్గింది. వీరేశలింగం, గిడుగు, గురజాడ మూర్తిత్రయం ఆంధ్ర సాహిత్యంలో భావ, భాష, కవితా విప్లవాలకు నాయకులయ్యారు. అంటే, సాహిత్యంలో కావ్యవస్తువు, దానిని ప్రకటించే రీతి – అనే రెండు ముఖ్యాంశాలలోనూ యీనాడు మనం వెనుదిరిగి చూసి ఆశ్చర్యపోయే విధంగా విప్లవ బీజాలను వారు వెదజల్లారు.

పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభకాలంలో తెనుగు సాహిత్యంలో క్షీణప్రబంధయుగలక్షణాలే యింకా రాజ్యం చేస్తుండేవి. అప్పటికి ద్వ్యర్థి కావ్యాలు, శ్లేషకావ్యాలు, పిల్ల వసుచరిత్రలు, ఆశుకవిత్వాలు, చిత్రకవిత్వాలు, సమస్యా పూరణలు, చాటువులు మొదలైనవి కొల్లలుగా వుండేవి. సమకాలికమైన సమాజ పరిస్థితుల చిత్రణ అవసరమనే స్పృహ ఎవరికీ వుండేది కాదు. పైగా, అటువంటి ప్రయత్నాలు ఎవరయినా చేయబోయినా

అవి హేళనకు పాత్రమవుతుండేవి. మొత్తంమీద చూస్తే 19 వ శతాబ్దపు తెలుగు సాహిత్యమంతా అంతకుముందు తీర్చిదిద్దిన ప్రబంధయుగ మార్గంలోనే నడిచిందికాని, కొత్తపుంతలు తొక్కలేదనేది యథార్థం. అందువల్లనే తెలుగు సాహిత్యం ప్రజలకు దూరమైపోయి, కేవలం పండిత ప్రకాండుల ఆదరణపరిధిలోనే కాలం వెళ్ళబుచ్చవలసి వచ్చింది. తెనుగు కవిత్వాన్ని యీ దుర్గతి నుండి తప్పించి, వీరేశలింగం, గురజాడ, గిడుగులు ప్రతిపాదించిన పద్ధతిలో కాకున్నా, దానికి చాలా దగ్గర మార్గంలోనే ప్రజలవద్దకు తీసుకుపోయి ప్రదర్శించిన ఘనత తిరుపతి వెంకటకవులది. వీరు వ్రాసిన చాలా కావ్యాలు పూర్వ ప్రబంధ ఫక్కీలో నడిచి, ప్రజలకు దూరంగానే వున్నప్పటికీ వీరు ప్రచారం చేసి ప్రదర్శించిన అవధాన కవితారీతి కొంతవరకు ప్రజలదగ్గరకు వెళ్ళడానికీ, ప్రజల్లో కవిత్వంపట్ల నూతనోత్సాహం కలిగించడానికీ, కవిత్వం ప్రజల అవగాహన పరిధిలోకి వెళ్ళడానికి పనికివచ్చింది. వీరు చెప్పిన ఆశుకవిత్వంలో చాలా భాగం సరళంగా వుండడంచేతనూ, అవధాన ప్రదర్శనలలో పృచ్ఛకులు సాధారణంగా తత్కాల సాంఘిక పరిస్థితులకు సంబంధించిన ప్రశ్నలే అడిగే ఆచారం ఏర్పడినందువల్లనూ, తిరుపతి వేంకటకవులు ఆంధ్రదేశంలో చేసిన కవితాక్షేత్రయాత్రలవల్ల ప్రజాకవిత్వం అనేదానికి అంకురార్పణ జరిగింది. వారి పాండవోద్యోగ విజయాలలోని పద్యాలు తెనుగువారి నాలుకలమీద తాండవం చేశాయంటే, ఆ నాటకాలు యీనాటికీ ప్రజలను ఆకర్షిస్తున్నాయంటే కథావస్తువు విషయం ఎలావున్నా, వాటిలోని సారళ్యమూ, తెలుగు ప్రజల సంభాషణస్థాయికి దగ్గరగా వచ్చిన గుణమే ప్రధాన కారణాలు. కవిత్వం అంటే, వేదాంతం లాగా 'అమ్మో! యిది మనకు సాధ్యపడని విషయం' అని ప్రజలు అనుకునే పరిస్థితిని వారు తప్పించారు. తమ ఆశు కవితా ధాటిచేత, లోకజ్ఞాన విశేషంచేత వారు నాగరికులయిన ప్రజలను కవిత్వానికి దగ్గరగా చేరదీశారు. అవధాన ప్రదర్శనలవల్ల తిరుపతి వేంకటకవులకు కీర్తివచ్చినా, ధనంవచ్చినా – అది వేరే సంగతి. వారి లక్ష్యం ఏమిటి అనేదికూడ వేరేవిషయం. వారు చేసిన కృషివల్ల సాహిత్యాన్నీ, కవిత్వాన్నీచూసి ప్రజలు భయపడి పారిపోవలసిన అవసరంలేదనే విషయం రుజువై, వారివల్ల ఎందరో ఆధునిక కవులు ప్రభావితులై, ప్రజలు వారికీ, కవిత్వానికీ దగ్గరగా వచ్చారనేది ఫలితాంశం. వారి కృషివల్ల తెలుగుదేశంలో ఒక నూతన సాహిత్య చైతన్యం కలిగింది.

భావకవితాయుగంలో ప్రసిద్ధులైన కవులలో చాలామంది చెళ్ళపిళ్ళవారికి శిష్యులూ, వారి ప్రభావానికి లోనైనవారే. ఆయన పద్యం చదవడంలోనూ, రాయడంలోనూ చాలా మందికి మార్గదర్శకులై – తమ సహజ వాక్చాతుర్యంచేత, పాండిత్యంచేత ఆనాటి వర్ధమాన కవులను ఆకట్టుకున్నారు, అయితే, అధిక సంఖ్యాకులు ఆయనకు శిష్యులూ, శిష్యప్రాయులూ అయినా, చెళ్ళపిళ్ళ వారి తర్వాత వచ్చిన భావకవితా యుగలక్షణాలలో ఆయన కవిత్వానికి సంబంధించినవి లేకపోవడం గమనార్హం. పైన పేర్కొన్నట్లు వారిలో చాలామంది మీద ఆంగ్లకవుల ప్రభావం, రవీంద్రుని ప్రభావం కూడా బాగా పడినందువల్ల చెళ్ళపిళ్ళవారి సరళ కవితారీతి మరుగున పడిపోయింది. భావకవులు ఎన్నుకున్న కవితావస్తువులు, కవితారీతులు ప్రజలకు దూరమై పోవడానికి వీలు కలిగింది. భావకవితాయుగంలో కవితకు సంబంధించిన సిద్ధాంతచర్చ ఎక్కువగా జరిగింది. నూతన విలువలను స్థాపించడానికి ప్రయత్నం జరిగింది.

పురాణాలు వస్తుప్రధాన కవితలు కావ్యవస్తువులకు పురాతనమైనా అవి నిత్య నూతనంగా భాసిస్తాయని ఆనాటి భావన. వస్తువులో నూతనత్వం కంటే చెప్పే రీతికే ప్రాధాన్యం ఉన్నదని పూర్వ కవులు విశ్వసించారు. రామాయణ, భారత, భాగవతాదులు ఈనాటికీ వ్రాయడానికి ఈ భావమే ప్రధాన కారణం. అలాగే ప్రబంధాలు రీతి ప్రధానమైన రచనలు. వీటిలో వస్త్వైక్యం, ఏకనాయకాశ్రయత్వం, రస ప్రాధాన్యం, వర్ణనాచమత్కృతి మొదలైన లక్షణాలు వుంటాయి. ఈ రెండూ కాని ఒక కొత్తదనం సృష్టించాలని భావకవులు ఉద్దేశించారు. వీరి కవితకు భావం ప్రధానం. వస్తు ప్రాధాన్యం లేదు. పవిత్రమైన పురాణ కావ్యవస్తువులే స్వీకరించాలనే నియమంపోయి, ఏ వస్తువైనా స్వీకరించవచ్చుననే అభిప్రాయం ఏర్పడింది. భావకవి గడ్డిపరక మీద రాసినా, అగ్గిపుల్లమీద రాసినా అతను ఆ విషయం గురించి ఎంత ఎక్కువగా భావించగలిగాడనేదే అక్కడ ముఖ్యం. దీనివల్ల ప్రయోజనమేమిటనే ప్రశ్నకు తావు లేదు. ఆశు కవుల రోజుల్లో గుండుసూది మొదలైన స్వల్ప వస్తువులమీద పెద్దపెద్ద పద్యాలు అంటే సీసాలు, వృత్తాలు చెప్పమని కోరడం, వారు చెప్పడం వుండేది. అలా పృచ్ఛకులు అడిగేవారు. ఆ విధంగా కవులు చెప్పారు. అంటే, ఈ ధోరణి వారి కాలంలోనే ప్రారంభమైంది. వస్తువును మనస్సులో భావించుకోవడంవల్ల వచ్చిన ఆలోచనలకే ప్రాధాన్యం కలిగింది. అంటే, కల్పనా ప్రతిభకు–– అందుకే దీనిని కాల్పనిక కవిత్వం అని కూడా అంటున్నాం. ఇది ఆంగ్లభాషా సాహిత్య సంపర్కంవల్ల వచ్చిందనే చెప్పాలి. తరువాత శ్రీశ్రీ చెప్పిన అగ్గిపుల్లా, కుక్కపిల్లా, సబ్బుబిళ్ళా – ప్రతీదీ కవితా వస్తువనే భావనకుకూడా యిదే మూల బీజమని చెప్పవచ్చు.

1940 కి ముందు కలం పట్టిన కవులందరూ యీ భావకవితోద్యమ ప్రభావానికి లోనై రాసినవారే. ఈ భావ కవిత్వశాఖలో ప్రధానంగా చెప్పుకోదగినవారు – అబ్బూరి, రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, వేంకట పార్వతీశ్వర

కవులు, దువ్వూరి, బసవరాజు, నండూరి, వేదుల, నాయని, పింగళి, కాటూరి, తల్లావఝ్ఝుల, తుమ్మల, బాపిరాజు మొదలైనవారు. అబ్బూరి రామకృష్ణారావుగారు 'జలాంజలి' కావ్యం 1909లో వ్రాసినట్లు "అబ్బూరి రామకృష్ణారావు కృతులు" అనే గ్రంథంలో పేర్కొనబడింది. రాయప్రోలు వారి 'తృణ కంకణం' 1910 లో. వీరుభయులు సుమారుగా ఏకకాలంలో యీ ఉద్యమానికి ప్రారంభకులయినారు. కాని రాను రాను రాయప్రోలు వారికి ఆచార్యత్వం లభించింది.

రాయప్రోలువారి "లలిత", "జడ కుచ్చులు", "కష్ట కమల", "స్వప్నకుమారి", "తెనుగుతోట", "తృణకంకణం", "స్నేహలత" కావ్యాలు; విశ్వనాథవారి "గిరికుమారుని ప్రేమ గీతాలు", "కిన్నెరసాని పాటలు"; కృష్ణశాస్త్రిగారి "కృష్ణ పక్షము", "ఊర్వశి", "ప్రవాసము"; వేంకట పార్వతీశ్వర కవుల "ఏకాంత సేవ"; దువ్వూరి వారి "నలజారమ్మ అగ్ని ప్రవేశం", "కృషీవలుడు", "జలదాంగన", "పానశాల"; బసవరాజుగారి "సెలయేటి గానం", "ప్రేమ తత్త్వము", "కోకిల"; నండూరివారి "యెంకి పాటలు"; వేదులవారి "పూర్ణిమ", "దీపావళి", "ముక్తఝరి"; నాయనివారి "సౌభద్రుని ప్రణయయాత్ర", "ఫలశ్రుతి", "మాతృగీతాలు"; పింగళి, కాటూరివారి "సంక్రాంతి", "తొలకరి", "పౌలస్త్య హృదయం"; తల్లావఝ్ఝుల "హృదయేశ్వరి", "ఆవేదన", "పుష్య పూర్ణిమ"; తుమ్మలవారి "రాష్ట్రగానం"; బాపిరాజుగారి "వరద గోదావరి", "గంగిరెద్దు" మొదలైన కావ్యాలన్నీ భావకవితా యుగలక్షణాలకు ప్రతీకలుగా నిలిచే కావ్యాలు.

రాయప్రోలు వారిని భావ కవితోద్యమానికి ఆద్యులుగా పేర్కొనవచ్చు. తెలుగునాట పల్లెసీమలను, ప్రకృతి చిత్రములను కావ్యాలలో ప్రవేశపెట్టి, స్త్రీని భోగ్య, వర్ణ్య వస్తువుగా గాక పూజ్య వస్తువుగా గ్రహించి, ఆమెకు ఉన్నత స్థానాన్ని కల్పించారు. వీరు కవిగానే గాక, భావ కవితకు లక్షణాన్ని రాసిన లక్షణ కర్తగా కూడా నవ్యులకు ఆద్యులు. వీరి "రమ్యాలోకం", "మాధురీ దర్శనం" రెండు విలక్షణమైన కృతులు. ఇవి భావ కవితా లక్షణ నిరూపణ ధోరణిలో సాగాయి. భావకవిత ప్రధాన లక్షణం ప్రకృతిని ఆరాధించడం, ఉపాసించడం, దానిని మానవ జీవితాని కన్వయించుకొని అనుభవించటం. ఇందులో అకామ భావనతో కూడిన సౌందర్యారాధన, భాష – అనేవి రెండు ప్రధానాంశాలనీ, భాషకంటే నవ్యులకు తపస్సు లేదనీ రాయప్రోలువారు "రమ్యాలోకం"లో వివరించారు. భామహుడు నిర్వచించిన రీతుల్లోని వైదర్భీ రీతివల్లనే 'రమ్యత' ఏర్పడుతుందని వీరి "రమ్యాలోకం"లో భావించబడింది. "రమ్యాలోకం"లో ప్రేమ, భాష, ప్రకృతి గురించిన 'రస' విషయం గురించి సూత్రప్రాయంగా విపులీకరించారు. "మాధురీ దర్శనం"లో సృష్టి రహస్యం, రతి, రసము, భావము, సంయోగాంశాలను విశదీకరించారు. వీరి దృష్టిలో ప్రేమ, వాత్సల్యం, మోహం, ప్రణయం – సమానార్థకాలే. ఇవన్నీ ప్రేమ పరిణామ దశలని వీరు అభిప్రాయపడ్డారు. వీరు ప్రేమను పత్నీపరంగా, మాతృపరంగా, మిత్రపరంగా విశ్లేషించారు. వీరు అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఇది శారీరక సంభోగ శృంగారం కాదనీ, ఆత్మ సౌందర్యసమార్చన మనీ అన్నారు.

"సురత సంస్పర్శలేని ఈ శుచిమదమల
జీవి తానురాగాదులన్ చిలకరించు
కానరాని శృంగారము --" (రమ్యాలోకం)

ప్రాచీనులు "రతి"ని సంభోగ శృంగారానికి స్థాయిభావం అన్నారు. దానిని అంగీకరించక రాయప్రోలు వారు రతి వేరు, సురతి వేరు అన్నారు. సురతి స్త్రీ పురుష లైంగిక సంబంధమనీ, రతి అంటే ఆనందించడం అనీ, యోగులు ఆత్మరతి కలవారని – ఆ అర్థంలో వీరు 'రతి'ని గ్రహించి యీ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

శృంగారంలో సంయోగ–వియోగాలలో వీరు వియోగానికే అధిక ప్రాధాన్యం యిచ్చారు. వియోగమునందే ప్రేమ రసోచితమై ద్విగుణీకృతం అవుతుందనే కాళిదాసుని అభిప్రాయాన్ని బలపరుస్తూ వీరు--

"సరస సాంగత్య సుఖ వికాసముల కన్న
దుస్సహ వియోగభరమె మధురము సకియ" అని

"తృణ కంకణం"లో చెప్పారు. కాళిదాసాదులు వియోగం సంయోగానికి దారితీయించారు. కాని వీరు వియోగానికే చరమస్థాయి కల్పిస్తూ---

"కనుల నొండొరులను జూచుకొనుట కన్న
మనసు లన్యోన్య రంజనల్ గొనుట కన్న
కొసరి 'యేమోయి'యని పిల్చుకొనుట కన్న
చెలుల కిలమీద నేమి కావలయు సఖుడ"యని

"తృణకంకణం"లో నాయికచేత అనిపించారు. వీరి ప్రేమ శరీర స్పర్శలేనిది. చక్షూరాగము, మనస్సమాగము, ప్రలాపములు కలిగినది. వీరు ప్రతిపాదించిన ఈ వియోగ శృంగారాన్ని తరువాత కృష్ణశాస్త్రిగారు విరహదుఃఖంగా స్వీకరించి, దానిలోనే ఆనందాన్ని ప్రతిపాదించారు. కృష్ణశాస్త్రిగారికి విరహమే ఆనందమూ, మనోరంజకమూ అయింది.

ఈ యుగంలో హిమవన్నగ శిఖరప్రాయంగా ఎత్తుగా పెరిగి, యావద్భారత ఖ్యాతి నార్జించిన వారు విశ్వనాథ సత్యనారాయణగారు. ఆధునిక సాహిత్య ప్రక్రియలలో వారు చేపట్టనిది లేదు. ఆరంభంలో వీరూ భావకవిత్వం రాసినా, రానురాను పూర్వకవితా మార్గానికి మారిపోయారు. శ్రీమద్రామాయణ కల్పవృక్షం తెలుగు రామాయణా లన్నింటిలో మేటి. ఆయన శైలిలో నవ్యసాహిత్యోద్యమంలో వచ్చిన కొన్ని చిత్రమైన నూతన పోకడలు, మెళకువలు, తళుకులు

వున్నాయి. కేవల ప్రబంధ యుగపు కవి రాయలేని భావ ప్రకటనలు చాలా కనిపిస్తాయి. భావకవులందరూ చాలావరకు మంచి వ్యుత్పత్తి గలవారే. వీరిలో విశ్వనాథవారు తమ వ్యుత్పత్తి ప్రదర్శనంచేత ప్రథమ స్థానాన్ని అధిష్ఠించారు. ప్రేమనే మరింత ప్రౌఢంగా పలుకుతూ "గిరికుమారుని ప్రేమగీతాలు" ఆలపించారు. వీరి "కిన్నెరసాని"లో పూర్వపు కథల పోలికలు కొన్ని వున్నాయి. శుక్తిమతీ నదిని స్త్రీ మూర్తిగా భావించిన రామరాజ భూషణుని వలె విశ్వనాథవారు కిన్నెరసానిని తీర్చిదిద్దారు. ఇందులో తెలుగు గడ్డపైన భార్యాభర్తల ప్రేమను, లోకవృత్తాంతాన్ని సాంకేతికంగా చూపారు. వీరు అనేక ప్రాచీన సాంప్రదాయ స్ఫోరకములైన ధోరణులను స్పృశించారు. "వారలు పోయిన తెన్నున మెరుగులను తీర్చిదిద్దుచు పోదున్" అన్నట్లుగా కవిత రాశారు. ఆత్మాశ్రయ కవితను ఆధునికుల్లాగానూ, పూర్వులలాగానూ కూడా పలికించారు. గొట్టు సమాసాల కవి అని పేరు తెచ్చుకున్నా, అనేకచోట్ల తెనుగు పలుకుల సోయగాన్ని ఆవిష్కరించారు.

భావకవిత్వం అనగానే తొలుదొల్తగా స్ఫురించేది కృష్ణశాస్త్రి గారే. వారు భావకవిత్వానికి సంకేతమైనారు. వేషభాషలలో, పద్యరచన, పద్యపఠనాలలో విలక్షణతను, విశిష్టతను చూపి, తెనుగువారి హృదయాలను అకట్టుకున్నారు. ఊరూరా తిరిగి, తనవే కాక ఇతరుల కవితలు కూడా చదివి వినిపించి భావకవితోద్యమానికి దేశమంతటా గొప్పవ్యాప్తి కలిగించినారు. నిజానికి ఆయన వ్రాసిన భావకవిత్వం చాలా కొద్ది. శతాధిక గ్రంథాలు రాసిన వారున్నారు. అయినా శైలిలో ఓగునుచేత కృష్ణశాస్త్రిగారు తన ప్రతిభను చాటి, ఆ ఉద్యమానికి నాయకు లనిపించుకున్నారు. విరహోన్ని దుఃఖంతో, మాధుర్యంతో మేళవించి ఒక నూతన పంథాను సృష్టించినంత పని చేశారు. భావకవిత్వం మీద వచ్చిన విమర్శలలో అందరి లక్ష్యమూ కృష్ణశాస్త్రిగారే. భోగ రాజు నారాయణమూర్తి, పొక్కులూరి లక్ష్మీనారాయణ పోలూరి సుబ్రమణ్యం ప్రభృతులు భావకవిత్వంమీద – ముఖ్యంగా కృష్ణశాస్త్రిగారి మీద దుష్ప్రచారం సాగించారు. కృష్ణపక్షానికి శుక్లపక్షం అనే సంపూర్ణ (హేళన) కావ్యం అనంతపంతుల రామలింగేశ్వరస్వామిగారు రాసి గేలి చేశారు. ఉమాకాంత విద్యాశేఖరుల "నేటికాలపు కవిత్వం"లో కూడా కృష్ణశాస్త్రిగారి అనేక సమాసాలను అర్థరహితంగా వున్నాయని ఎదుర్కోవడం జరిగింది.

భావకవితాయుగాన్ని పూర్తిగా పరిశోధించినట్లయితే ఆ పేరుతో వచ్చిన కావ్యాలలో ప్రకృతి కవిత్వం, ప్రణయకవిత్వం, దేశభక్తి కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, భక్తి కవిత్వం, స్మృతికావ్యాలు అని విభజించుకోవచ్చు.

ప్రకృతి కవిత్వంలో ప్రకృతిమీద ప్రీతి, ప్రకృతి ఆరాధన కనిపిస్తాయి. భావకవి ప్రకృతిని మానవులకన్న మిన్నగా భావించి, దానిని తన కవితకు ప్రేరణగా, ప్రణయానికి ఉద్దీపనగా భావించాడు. అందులో లీనం చెందేందుకు ఆరాటపడ్డాడు – "ఆకులో ఆకునై, పూవులో పూవునై, కొమ్మలో కొమ్మనై" అని కృష్ణశాస్త్రిగారు భావించినట్లు.

ప్రణయ కవిత్వావిర్భావానికి వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సు మొదలగు ఆంగ్లకవుల రచనలు ప్రేరణలైనాయి. ప్రణయ కవిత్వంలో కూడా వస్త్వాశ్రయరీతి, ఆత్మాశ్రయరీతి అనే రెండు మార్గాలున్నాయి. భావకవిత్వం వస్తు ప్రధానమైనది కాకపోయినా, వస్తురహితమైనది కాదు. ఆరంభకాలంలో ఈ వస్త్వాశ్రయ రీతిలో సాగిన కావ్యాలలో రాయప్రోలువారి "తృణకంకణం", అబ్బూరివారి "మల్లికాంబ", దువ్వూరివారి "కడపటి వీడ్కోలు", వేంకట పార్వతీశ్వరుల "జలజ మాలిక" కావ్యాలు పేర్కొనదగినవి. వీనిలో ప్రధాన వస్తువు ప్రణయమే. క్రమంగా భావకవిత్వంలో వస్త్వాశ్రయత సన్నగిల్లి, ఆత్మాశ్రయ రీతిలో కవి తన ప్రేయసి బాహ్య సౌందర్యం కాక ఆత్మసౌందర్యాన్ని దర్శించి ఆరాధించే తత్వం బలపడింది.

ఈ యుగంలో దేశభక్తి కవిత్వం భారత జాతీయా భిమానంగానూ, ఆంధ్రాభిమానంగానూ రెండు విధాలుగా సాగింది. జాతీయాభిమాన కవిత్వానికి నాటి పరాయి ప్రభుత్వ పాలన దోహదం చేసింది. ఈ విభాగంలో కూడా వస్త్వాశ్రయ రీతిలో, ఆత్మాశ్రయ రీతిలో అనేక కావ్యాలు వెలువడ్డాయి. ఆంధ్రాభిమాన పూరితంగా వెలువడిన కవిత మళ్ళీ మూడు విధాలుగా కొనసాగింది. జాత్యభిమానం, దేశాభిమానం, భాషాభిమానం. జాత్యభిమానంలో ఆంధ్ర వీరుల శౌర్యం, ఆంధ్రజాతి పురాప్రాభవం, కళాప్రశస్తి మొదలగు వస్తువులను తీసుకొని కవులు తన్మయులై కవితలు అల్లారు. దేశాభిమానంలో క్షేత్ర ప్రశస్తి, నదీ ప్రశస్తి మొద లైనవి కావ్యవస్తువులైనాయి. భాషాభిమానంలో అన్యభాష మనపై అధికారం చేస్తూ మాతృభాషను మరుగున పడవేసే దుస్థితినుంచి మన భాషను ఉద్ధరించి, దాని ఉత్కృష్టతను తెలియజేసే తపనను ప్రతిబింబింపజేసే రచనలు వెలువడ్డాయి. దేశభక్తి కవితలు దాదాపు భావకవులందరూ రాశారు. విశ్వనాథవారి "ఆంధ్ర పౌరుషము", "ఆంధ్ర ప్రశస్తి"; రాయప్రోలువారి "ఏ దేశ మేగినా ఎందు కాలిడినా" గీతాలు ప్రఖ్యాతములైనవి. ఎక్కువ భాగం వీటివల్లనే భావకవులకు ప్రజల మనస్సుల్లో కొద్దో గొప్పో చోటు దొరికింది.

సంఘ సంస్కరణ కవిత్వంలో సంఘంలోని దురాచారా లను ప్రతిఘటించి, కుల, మత, వర్గ, వర్ణ నిర్మూలనంచేసి సర్వులు సమానమనే మానవీయ దృక్పథం ప్రధానంగా కనిపిస్తుంది.

భక్తికవిత్వం పరమాత్మికంగా, మధుర భక్తిగా, తాత్త్వికంగా సాగింది.

స్మృతి కావ్యాలు ఆత్మీయుల మృతిపట్ల దుఃఖాన్ని వ్యక్తపరుస్తూరాసినవి. ఇవి ప్రధానంగా దేశనాయకుల స్మృతి, సతీస్మృతి, ఆప్తస్మృతి, పుత్రస్మృతి - అనే నాలుగు విభాగాలుగా పరిగణించవచ్చు. దేశనాయకుల స్మృతిలో గురజాడ నిర్యాణానంతరం కృష్ణశాస్త్రిగారు రాసిన గేయం, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి మృతిపట్ల బసవ రాజు అప్పారావుగారు రాసిన స్మృతి గీతాలు, గాంధీగారిపట్ల జాషువాగారి 'బాపూజీ' పేర్కొనదగినవి.

సతీ స్మృతిలో విశ్వనాథ వారి "వరలక్ష్మీ త్రిశతి", దువ్వూరివారి "భగ్న హృదయము" ఎన్నదగినవి. "వరలక్ష్మీ త్రిశతి" ఒక విధంగా తెలుగులో వచ్చిన స్మృతి కావ్యాలన్నిం టిలోనూ శిరోమణి వంటిది. అందులో ఆయన చూపిన ప్రౌఢిమ ప్రసిద్ధులైన పూర్వ కవులను స్మృతికి తెస్తుంది. దువ్వూరి రామిరెడ్డిగారు "శిశు వియోగం", బసవరాజు అప్పారావుగారు "నిర్యాణ సుఖము" అనే స్మృతి కావ్యాలు వెలువరించారు. నాయని సుబ్బారావుగారి "మాతృగీతాలు" చదువుతుంటే ఆయన పొందిన దుఃఖానుభూతి పాఠకుని గుండెల్లో సూటిగా వచ్చి గుచ్చుకుంటుంది. అది సరళ సుందరమై, గీత పద్యాలతో కూడిన లఘుకావ్యమైనా, పూర్తిచేసిన తర్వాత అదొక మహాకావ్యంగానే మన ముందు సాక్షాత్కరిస్తుంది.

ఈనాడు మనం అనుకుంటున్న ఖండకావ్యం అనే దానిని మొదట్లో లఘుకావ్యం అనే అర్థంలోనే పరిగణించేవారు. ఈ ఖండ కావ్యం భావకవిత్వ యుగంలో బాగా ప్రచారం లోకి వచ్చింది. కవి తన భావాలనూ, తన అనుభూతులనూ ఒకటో, రెండో పాత్రల మీద ఆరోపించి లఘుకావ్యం సిద్ధం చేసేవాడు. నూరు, నూటయాభై పద్యాల పరిమితిలో యీ కావ్యాలు వచ్చాయి. కాని, రానురాను ఖండకావ్యం అనే దానికి అర్థం మారిపోయింది. మరీ జాషువాగారు వచ్చిన తర్వాత ఖండకావ్యం అంటే 10-20 పద్యాల ఖండిక అనే అర్థం రూఢమైపోయింది.

ఇన్ని రకాల కావ్యవస్తువులు వున్నప్పటికీ ఈ యుగంలో ప్రధానంగా ప్రణయ తత్వమే రాజ్యం చేసింది. అందుకే భావ కవితకు ప్రేమ కవిత్వమనే పర్యాయపదం ఏర్పడింది. ప్రేమ 'రసాతిరేక పరిపూర్ణత'తో వర్ధిల్లునని రాయప్రోలువారు అంటారు. సృష్టిలో ఏదీ ఏకాంతంగా వుండదనీ, అందువల్ల స్త్రీ పురుషుల సంయోగం కూడా సహజమైనదనీ, సంభోగ శృంగారం కంటే వియోగ శృంగారమే ప్రధానమైనదనీ యీ యుగంలోని కవులు భావించారు. వీరి కావ్యాలలో యీ తత్వాన్నే నిరూపించారు. "తృణ కంకణం"లో యీ తత్వమే ప్రతిపాదించబడింది. చివరిలో నాయికా-నాయకులు విడిపోయేముందు వారిపై పూలు "వకుళ సుకుమార తరుమ తల్లికల నుండి అమృతాక్షతల విధాన" కురిసినవి అని వర్ణించబడింది. అంటే యిక్కడ వారి స్నేహమయ జీవితానికి ప్రకృతి సైతం సానుభూతి చూపిందనీ, అక్షతలంటే క్షతి లేనివనే అర్థంలో యిక్కడ వారి స్నేహం అమృతమని తెలియజేశాడు. అబ్బూరివారి "మల్లికాంబ"లో కమలకు, మల్లికాంబకు జరిగిన సంభాషణలో ప్రణయ తత్త్వం చెప్పబడింది. ప్రణయం అనే మాటలో స్నేహం కూడా భావించబడింది. ఇందులో విశ్వప్రేమ కూడా యిమిడివుంది. ఇంత బహుళార్థంలోనే శృంగారం అనే పదం వాడారు. శృంగారానికి సంభోగం చరమస్థాయి అనే వాదాన్ని త్రోసిరాజని స్త్రీకి పూజ్యస్థానం కల్పించి, ఆమె అంగ సౌందర్యాన్నికాక, ఆత్మసౌందర్యాన్ని ఆరాధించారు. ప్రబంధ కవులకు శృంగారం అంటే సంభోగ శృంగారమే. అందుకే విరహంలో చంద్రాదులను దూషించేవారు. భావ కవులు అందుకు భిన్నంగా వియోగంలో మాధుర్యం చవి చూశారు. కాబట్టే అటువంటి దూషణలు చేయలేదు. భావకవులు చర్మచక్షువులకు కనిపించే ప్రకృతినేకాక, మనో నేత్రాలతో భావించిన ప్రకృతిని దర్శించి ప్రేయసి బాహ్యసౌందర్యం గురించి కాక ఆమె అంతఃసౌందర్యాన్ని గురించి గానం చేశారు. మేఘ సందేశాది పూర్వకావ్యాలు వీరి భావనకు ఒరవడి పెట్టాయని చెప్పవచ్చు.

ఇక భావకవులు సృష్టించిన ప్రేయసులు, ప్రబంధ నాయికలలా కచకుచ వర్ణనలతో సాక్షాత్కరించక, ఆత్మ సౌందర్యారాధనను పొందారు. కృష్ణశాస్త్రిగారి ఊర్వశి, బాపిరాజుగారి శశికళ, ఊహాకస్పష్టులు, తల్లావఝ్ఝుల వారి "హృదయేశ్వరి"లోని నాయిక, నాయని వారి "సౌభద్రుని ప్రణయ యాత్ర"లోని వత్సల వాస్తవిక మూర్తులు. నండూరి వారి "ఎంకి" లౌకిక వ్యవహార జనితమైన పాత్ర. విశ్వనాథవారి "కిన్నెర" నది మనుష్యత్వాన్ని పొందిన కాల్పనిక పాత్ర.

"ఎంకి పాటలు" భావకవిత్వ శాఖలోనే ఒక విలక్షణమైన శైలిని తెచ్చిపెట్టాయి. ఆ రోజుల్లో అదొక శైలీవిప్లవం, భాషావిప్లవం. కావ్యంలో గ్రామ్యభాష ఉపయోగం గురించి వాదోపవాదాలు జరిగాయి. ఒకవిధంగా 'ఎంకి పాటలు' భావకవుల వ్యుత్పత్తి సంస్కారాలపై తిరుగుబాటు. భాషా విషయకంగా గ్రామ్యభాషలో సాగి, జానపదగేయ సరళిలో నడిచాయి. ఆ రోజుల్లో పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రివంటి మహాపండితులు సైతం వీటిని మెచ్చుకున్నారు. బెల్లంకొండ రాఘవరావుగారు సభల్లో ఎంకి పాటలకు వేదాంతార్థాన్ని కల్పించి వ్యాఖ్యానిస్తూండేవారు.

ఈ భావకవులు - వారు ఏడ్వటమే కాదు - పరితలను కూడా ఏడిపించారు. ఈ దుఃఖోద్వేగం మృత్యు స్థితిదాకా పోయి బీభత్సంగా పరిణమించే ప్రమాదం కూడా ఏర్పడింది.

"ఎవ్వరను కొంటిరో నన్ను ఏ ననంత
శోక భీకర తిమిర లోకైక పతిని" అని
"కంటక కిరీటధారియై కాళరాత్రి
మధ్యవేళల జీమూత మందిరాల"అని

కృష్ణశాస్త్రిగారు "కృష్ణపక్షం"లో విలపించారు. నైరాశ్యాన్ని తన జీవిత సర్వస్వంగా ఎంచుకొని, విషాద విషయములోనే ఆనందామృతాన్ని ఆస్వాదించగలగడం యిందులో కనిపిస్తుంది.

అప్పటికే కొంచెం కొంచెం ప్రారంభమవుతున్న వచన కవితా రూపంలో మల్లవరపు విశ్వేశ్వరరావుగారు –

"ఓ నవ యువతీ
ఎవతెవు
నీ వీ రాత్రి నన్ను మేల్కొల్పావు" అని,
"ఈలోనే నీ కాంతి తనువు నా దేహం దరిసి
అలపుగొన్న నా స్వప్న జీవితావరణం మేలుకొలిపి
నా హృదయోద్భవనంలో దీపం నిలిపితివే
విలసిత లావణ్య శ్రీవై – స్త్రీవై – నీవై
నీవెవరైనా నీ పేరేమైనా కానీ
నవ నిత్య యౌవనానంద ప్రాణీ"

అని గానం చేశాడు. ఈయన భావ కవుల్లో దాదాపు చివరివాడు.

ఈ కాలంలోనే జాషువా యీ పరిస్థితులకు దూరంగా వుండి అభ్యుదయ భావన చేశాడు. ఆయన ఏనాడు భావ కవిగా లేడు. కాని, భావకవిత్వ శాఖలోని "సంఘ సంస్కరణ కవిత్వము" అనే శాఖకు ఈయన "గబ్బిలము", "స్వప్నకథ" వంటి కావ్యాలను గ్రహించవచ్చు. జాషువాగారు సమకాలీన, సామాజిక పరిస్థితులకు హృదయం కరిగి, తన చుట్టూ వున్న సమాజాన్ని నిశితంగా విమర్శిస్తూ, తరువాత కాలంలో వచ్చిన అభ్యుదయ కవిత్వానికి తొలిబీజాలు నాటుతున్నాడా అన్నట్లుగా రచనలు చేసి, ప్రజల ఆమోదం పొందిన ప్రజాకవి. భావ కవిత్వంపట్ల ఆయన తనకుగల నిరాదరణను కవిత్వ రూపంలో కూడా వెల్లడించాడు.

"భావా వేశ సమయమున
ఏవేవో వ్రాసినాడ యిపు డడుగగనే
నే విధి తెల్పుదు మీరా
భావావేశంబు పొంది భావింపదగున్"

అని హేళన చేశాడు. 'నీ ప్రేయసి పాడుకాను, ఆ బురదలో నుంచి బయటకు రాండయ్యా'– అని భావ కవులను ప్రబోధించాడు. జాషువాగారు అన్నట్లు భావ కవిత్వంలో కొంత అయోమయం, అర్థంకాని తత్వం వుండబట్టే అది ప్రజానీకం దగ్గరకు పోలేకపోయింది.

నిజానికి కృష్ణశాస్త్రిగారే––
"అపూర్వ మధుర రక్తిస్ఫురియించునుగాని
అర్థమ్ముగాని భావగీతమ్ములివి" అని పేర్కొన్నారు.

ఆవిధంగా అయోమయత్వం కొంత వుండడంవల్ల దీనికి ప్రజాకర్షణ, ప్రజాదరణ అంతగా రాలేదు.

భావకవితా వ్యవస్థను ఎంత సానుభూతితో పరిశీలించినా, దానిని తెలుగు సాహిత్యంలో ఒక నిజమైన విప్లవంగా గుర్తించడం కష్టం. నిజమైన విప్లవంగా పేర్కొనదగిన అభ్యుదయ యుగం ప్రారంభం కావడానికి పూర్వరంగంగా మాత్రమే యిది ఉపయోగపడింది. అభ్యుదయ కవిత్వం నిజానికి క్షీణ ప్రబంధయుగం మీదా, దాని లక్షణాలతోనే కొత్తరూపంలో అవతరించిన భావ కవితాయుగం మీదా జరిగిన తిరుగుబాటు. భావ కవులు కూడా ఆంగ్లభాషాభ్యసనం, ఆధునిక జీవిత తత్వ పరిశీలనం కలవారే అయినప్పటికీ, వారు తేదలచిన విప్లవం పరిధి చాలా సంకుచితం కావడంతో దానికి ప్రజల్లో తగినంత పరిగణన రావడానికి అవకాశం లేకపోయింది. తరువాత వచ్చిన అభ్యుదయ సాహిత్య యుగం తెలుగు సాహిత్యంలో సంపూర్ణ విప్లవం. అప్పటివరకు వున్న సాహిత్యపు విలువలను తారుమారుచేసి, సర్వమానవజాతి క్షేమానికి సంబంధించిన కొత్త సాహిత్యపు విలువలను అది నిర్వచించింది. ప్రజా జీవితానికి సంబంధం లేకుండా ఏవో అతి స్వచ్ఛమైన కవిత్వపు విలువలు (ప్యూర్ పొయట్రీ) వున్నాయనే భ్రాంతి యీ నాడు ఎవరికీ లేదు. ఒకవేళ భావ కవిత్వ ప్రతిధ్వనులుగా చెలరేగుతున్న ఒకరిద్దరు సాహిత్య వేత్తలున్నా – వారిని ఈనాడు ఎవరూ పట్టించుకోరు.

# తెలుగులో నవ్య కవిత్వం - ప్రారంభ వికాసాలు

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డి

కవిత్వం ఎంత పురాతనమో అంత అధునాతనం. అది ప్రధానంగా మానవుని అనుభూతులపై ఆధారపడిన కళ. అందుచేత మానవుడున్నంత కాలం కవిత్వానికి క్షతి లేదు. ఋక్కుల కాలం నుండి స్పుత్నిక్కుల కాలం వరకు అది జీవనదిలా ప్రవహిస్తూనే ఉంది.

నన్నయ మొదలుగా నేటివరకు జీవ స్రవంతిగా సాగి వస్తున్న ఆంధ్ర సాహిత్యంలో పరిణామ రమ్యమైన ప్రగతే కనిపిస్తుంది. నన్నయ్య, తిక్కన, పోతన సంస్కృత పురాణేతిహాసాలను అనువదించడంలో ప్రధానంగా కథా దృష్టినే, విశ్వశ్రేయో దృష్టినే కలిగి ఉన్నారే కానీ విచిత్ర కథా కల్పనలకు, విన్నూత వర్ణనలకు అంతగా పాల్పడలేదు. క్రమంగా కావ్యదృష్టి, రసదృష్టి ప్రాధాన్యత సంతరించుకున్నాయి. శ్రీనాథుడు, పినవీరభద్రుడు మొదలైన ప్రబంధ యుగ పూర్వ కవుల చేతుల్లో శృంగార స్ఫుటరేఖలను తీర్చుకుంది. ప్రబంధ యుగంతో అది జ్వాజ్వల్యమానంగా ప్రకాశించింది. ప్రబంధ ప్రక్రియ మనుచరిత్రలో సమగ్రాకృతి వహించింది. కథా వరణంలో, రచనా సంవిధానంలో, పాత్ర చిత్రణలో, రసపోషణలో, వర్ణనా బాహుళ్యంలో ఈ ప్రక్రియ సరికొత్త దారులు వేసుకుంది. దక్షిణాంధ్ర యుగంలో ఇది వెర్రితలలు వేసింది. శృంగారం అంగాలకెక్కి అంతరంగాన్ని విస్మరించింది. విజయ విలాసం లాంటివి ఒకటి రెండు తప్ప చెప్పుకోదగ్గ ప్రబంధాలు ఈ యుగంలో వెలువడలేదు. అయితే ఈ యుగంలోని గణనీయ గుణం గేయకవితా పట్టాభిషేకం. నన్నయ నాటి నుండి పురాణ ప్రబంధ కవుల దాటికి తట్టుకోలేక మరుగున పడిపోయిన మాత్రా ఛ్చందస్సులు ఈ కాలంలో అందలాలెక్కినాయి. ఈ కాలంలోనే ఆటవెలది ద్వారా సమకాలీన సమాజాన్ని ఒక్క ఆటాడించిన వేమన్న గొంతు వినిపించింది. తన నాటికి జడీభవించిన వైదిక సంప్రదాయాలను, సాంఘిక దురాచారాలను తుత్తునియలు చేయడానికి పద్యాన్ని వజ్రాయుధంగా ప్రయోగించాడు. ప్రజల పలుకుబడిలో ప్రజల భావాలకు పట్టం కట్టించాడు. ఆధునిక యుగంలోని ప్రజా కవులకు వేమన్న వేగుచుక్క లాంటివాడు.

19 వ శతాబ్ది మొదటి సగం ఆంధ్రసాహిత్య చరిత్రలో క్షీణయుగం, నాడు జాతి జీవనంలాగే సారస్వత రంగం కూడా నిస్తేజంగా ఉండిపోయింది. అనుకరణ శీలం పెరిగింది. పిల్ల వసుచరిత్రలు పెల్లుబికాయి. ప్రబంధ కవిత్వం క్రమంగా బంధ కవిత్వంగా మిగిలిపోయింది. బూతు కావ్యాల పుట్టలు, శ్లేష కావ్యాల కట్టలు బయలుదేరినాయి. 19 వ శతాబ్దం మధ్య భాగం వరకు ఇదే పరిస్థితి. కందుకూరి వీరేశలింగం పంతులు అవతరణతో ఆంధ్ర సాహితి గ్రహణ విముక్తమై ఎప్పటిలా కలకలలాడింది.

ఫ్రాన్స్ దేశంలో వాల్టేర్ లాగా ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణల కోసం తన కలాన్ని కరవాలంగా ఝళిపించిన యుగ పురుషులు వీరేశలింగం పంతులు గారు. సాంఘిక దురాచార నిర్మూలనలోనేమి, బహుముఖ సాహితీ ప్రక్రియా సృష్టిలోనేమి, ఆంధ్ర జాతీయతా ప్రచారంలోనేమి వీరేశలింగం గారే అద్యులు.

సాంఘిక సంస్కరణ రంగంలో ఎంతో ముందు చూపున్న వీరేశలింగం గారి కలం కవిత్వ విషయంలో మాత్రం వెనక చూపే కలిగి వుంది. సాంఘిక విషయాలలో ఆయన చూపిన విప్లవావేశాలను కవితా రంగంలో చూపివుంటే 19 వ శతాబ్ది ఉత్తరార్థంలోనే కవితా సతికి బంధ విముక్తి కలిగి స్వేచ్ఛా వాయువులను పీల్చేది. పంతులుగారు ఆంగ్ల సాహిత్యంతో గట్టి పరిచయం గలవారే. అయినా వారి దృష్టి ఆంగ్లంలోని గద్యరచయితల మీద ప్రధానంగా ప్రసరించింది. 1892 లో గోల్డ్‌స్మిత్ కావ్యాన్ని 'పథిక విలాసము' అనే పేర తెనిగించారు. వర్డ్స్‌వర్త్ మొదలైన కాల్పనికోద్యమ కవుల వినూత్న పథాలపై వీరేశలింగం గారి దృష్టి పడినట్టు లేదు. 1887 నాటికి నానాటికి

దిగజారిపోతున్న తెలుగు కవిత్వం దుస్థితి పంతులు గారికి కడుపులో చేయివేసి కలచినట్లనిపించింది. ఆ గర్భవేదనే "సరస్వతీ నారద విలాపము" గా వెలిజిమ్ముకొని వచ్చింది. గర్భ బంధ చిత్ర కవిత్వాలను, వ్యర్థ పదాడంబరాలను, రసహీన పద సంపుటాలను అలంక్రియలు కాక శృంఖలాలని ఆయన అందులో ఎలిగెత్తి చాటారు. కేవల బాహ్యాడంబర జృంభితమై అంతశ్శోభారహితమై వున్న ఆంధ్ర కవిత్వంలో కలగవలసిన మార్పును ఆయన అనాడే వ్యక్తం చేశారు. వీరేశలింగం గారి నవ్యతా ప్రీతికి రేఖామాత్రమైన ఆకృతి కలిగించిన కవి కట్టమంచి రామలింగా రెడ్డిగారు.

## ముసలమ్మ మరణము :

కాలరీత్యా ఈ కావ్యం భావకవిత్వ ప్రాదుర్భావానికి దాదాపు రెండు దశాబ్దాల ముందుగా పుట్టింది. రెడ్డిగారి ఆంగ్ల సాహిత్య పరిచయమే ఈ సరికొత్త కావ్యాన్ని రచింపజేసింది. బ్రౌన్ దొర ప్రకటించిన "అనంతపుర చరిత్రము" అనే గ్రంథం నుండి రెడ్డి గారు ఈ కావ్య వస్తువును గ్రహించారు. సమష్టి కోసం వ్యష్టి ఆత్మాహుతి చేసుకున్న కరుణరసాత్మకమైన గాథ ఇది. ఈ కావ్యంలో నవ్యత రెండంశాలలో వుంది. (1) అచ్చమైన సాంఘిక ఇతివృత్తంతో ఒక స్వతంత్ర కావ్యాన్ని రచించడం. (2) కథ మరణాంతంగా సమాప్తి కావడం. అంతమాత్రాన ఇది నవ్య కావ్యమనడానికి వీలు లేదు. ప్రాయికంగా ఇది ప్రబంధ మార్గంలో నడిచిన లఘుకావ్యం. దీనిలోని నాయికా నాయకులు ప్రభు వంశాల నుండి కాక సామాన్యుల కుటుంబాల నుండి గ్రహింపబడడం వలన ఈ కావ్యాన్ని 'సంధి' కావ్యం అనవచ్చును. పింగళి లక్ష్మీకాంతం గారన్నట్లు రానున్న నవ్య కవితా ప్రభాతానికి ఇది వేగుచుక్క లాంటిది.

## తిరుపతి వెంకటకవులు :

19 వ శతాబ్ది చివరి పాదం నుండి 20 వ శతాబ్ది మధ్య భాగం వరకు అష్టావధాన శతావధాన ఆశు కవిత్వాది ప్రక్రియలలో ఆంధ్ర సాహితీ లోకానికి పులకలు వెలార్చిన కవిధీరులు తిరుపతి వెంకటకవులు. దీర్ఘ సమాస భూయిష్టమూ, కృత్రిమ పద భ్రష్టమూ అయిన వచన ప్రక్రియను వీరేశలింగం గారు సరళ సుందరంగా మార్చినట్టే, అనవసర భాషాభేషజంతో అర్థంలేని పదడిండిమార్భటులతో ఉక్కిరిబిక్కిరవుతున్న కవితా సరస్వతికి వీరు సహజ రామణీయకాన్ని ప్రసాదించారు. చిరకాలంగా ఘనీభవించి వ్యవహార దూరమైన వ్యాకరణ సూత్రాలు కొన్నిటిని ఉల్లంఘించారు. గ్రాంథికతా ముద్రకు వెలియై అస్పృశ్యాలుగా పరిగణింపబడుతున్న వ్యావహారికపు పలుకుబడులను కావ్యాలలో యథేచ్ఛగా ప్రయోగించారు. రాజాస్థానాలకే పరిమితమనుకున్న కవితా సంపదను రచ్చ పట్టులకెక్కించారు. శ్రీనాథుని తర్వాత తెలుగు కవిత్వానికి బహుళ వ్యాప్తి కలిగించిన కవులు వీరే. వీరేశలింగం గారు ప్రారంభించిన వేశ్యావృత్తి వ్యతిరేకోద్యమ ప్రభావంతో 'శ్రవణానందము', 'పాణిగ్రహీత' కావ్యాలు రచించారు. కాలాన్ని బట్టి భాష మారుతుందని ఉద్ఘాటించి, గిడుగు వారి సిద్ధాంతాలను బలపరిచారు. అయితే ఆ సిద్ధాంతాలకు అక్షరాకృతి గురజాడ వారి కవిత్వంలోనే సమగ్ర సుందరంగా లభించింది. ఏమైనా దక్షిణాంధ్ర యుగంలో క్షీణదశ పాలైన పద్య కవిత్వం తిరుపతి వెంకటకవుల చేతి చలువ వల్ల పునర్వికాసం పొందింది. పింగళి లక్ష్మీకాంతం గారన్నట్లు "ఈ మహాకవుల వాక్కు ప్రాచీన సరణికి భరతవాక్యము. నవీన సరణికి నాందీ వాక్యము."

## మొదటి ముత్యాల సరం :

1909 లో "ఆంధ్ర భారతి" సంచికలో "మేలుకొలుపు" అనే శీర్షికతో ఒక గేయం ప్రచురితమైంది. కవి పేరు లేదు. ఆ సంచికలోనే గురజాడ వారి నీలగిరి పాటలలో ఒకటైన "వూటి చోద్యమేమి చెపుదు" అనేది ప్రచురింపబడింది. 'మేలుకొలుపు' గేయం మిశ్రగతిలో వుంది.

"మేలుకొనుమీ సుజన పుత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనుమీ భరత పుత్రుడ
మేలుకొనవయ్యా – వత్సా మేలుకో
వేడుకను జాతీయతను వేగుచుక్క పొడిచెనదుగో
కూడి వందేమాతరమ్మను కుక్కుటములరచెన్ – వత్సా
మేలుకో."

ఇలా సాగిన గేయమిది. గురజాడ వారు ఇంతకంటే ముందుకు పోయి ప్రాసనియమాన్ని విసర్జించి వ్యావహారిక పదాలను ప్రయోగించి అపూర్వమైన నవ్యతను సాధించారు. అయితే గురజాడ వారి ముత్యాల సరాల (1910) కంటే ఒక సంవత్సరం ముందుగా ఈ గేయం వెలువడడం గమనించదగిన అంశం. భారత జాతీయోద్యమాన్ని ముఖ్యంగా 'వందేమాతరం' ఉద్యమాన్ని గేయ రూపంలో ప్రకటించిన మొదటి రచన కూడా ఇదే అని చెప్పాలి. 'ఆంధ్ర భారతి' భాద్రపద సంచికలో 'మాలవాంద్ర పాట' అనే గేయముంది. కర్త పేరు లేదు. అది వ్యావహారిక భాషలో కింది తరగతులు వాడుకునే గ్రామ్య భాషలో వ్రాయబడిన ప్రథమ గేయం. అలనాడే అస్పృశ్యతకు వ్యతిరేకంగా గొంతెత్తిన గేయమైన ఇది గణనకెక్కపోవడానికి కారణం ఇందులో కవితా గుణం లోపించడమే.

1909 లో రాయప్రోలు వారి 'లలిత' ప్రచురితమైంది. 1910 లో గురజాడ వారి 'ముత్యాల సరాలు' సంపుటిగా వెలువడి పాఠకులను సమ్మోగ్ధ మొనర్చాయి. ఆంధ్ర

భారతితో పాటు ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు, 1915 లో ప్రారంభమైన 'గ్రంథాలయ సర్వస్వం' పత్రిక ఆనాటి యువ కవీంద్రుల తరుణ కవితలకు అరుణ కాంతులను ప్రసాదించాయి. 1909 లో నాటిన నవ్య కవిత్వ బీజం 1920 నాటికి అంకుర పల్లవాది దశలను అధిగమించి కుట్మలించి కుసుమించింది. నవ్య కవితోద్యమానికి ప్రధాన హేతువులు అయిదు:

(1) సంఘ సంస్కరణోద్యమం (2) ఆంగ్ల విద్యా వ్యాప్తి (3) పత్రికా వ్యాప్తి (4) వ్యావహారిక భాషోద్యమం (5) స్వదేశీయోద్యమం.

నవ్య కవిత్వానికి స్థూలంగా ఎనిమిది లక్షణాలను పేర్కొనవచ్చును. అవి (1) ఖండకావ్య ప్రక్రియ (దానికి ప్రధాన హేతువు ఇంగ్లీషు కవిత్వ పరిచయమే). (2) ఆత్మాశ్రయ రీతి. ఈ రకమైన కవిత్వంలో కథాపూరణ యత్నం వుండదు. అనవసరమైన వర్ణనలు దిగుమతి చేసే అవసరం వుండదు. అయితే ఆత్మాశ్రయ కవిత్వానికి కవి వ్యక్తిత్వానికి ఒకవేళ కొన్ని పోలికలున్నా అభిప్రాయ అభేదం ఊహింపరాదు. కవిత్వంలోని అనుభూతులతో, భావనలతో, కల్పనలతో మాత్రం కవికీ ఆత్మాశ్రయ కవిత్వానికీ అభేదాధ్యవసాయం చూడవచ్చును. (3) వస్తు నవ్యత : కింది వర్గాలకు చెందిన పాత్రలు నాయికా నాయకులు కావడం నవ్య కవిత్వంలో వచ్చిన గొప్ప మార్పు. అంగ వర్ణన కన్నా అంతరంగ వర్ణనకే ప్రాధాన్యం ఇచ్చారు. అనుభూతి గాఢత్వాన్ని ప్రకటించడానికే తమ ఆలోచనాశక్తిని అధికంగా ఉపయోగించారు. (4) భావ నవ్యత : నవ్య కవులు భావనా బలాన్ని ఎక్కువగా ప్రదర్శించారు. అష్టాదశ వర్ణనల నిర్బంధాలకు తిలోదకాలిచ్చారు. ప్రాచీన కావ్యాలనుండి ఎరవు తెచ్చుకున్న కవి సమయాలను చాలా వరకు పక్కకు నెట్టారు. అవసరమని తోచినపుడు, ఔచిత్య భంగం లేనప్పుడు సరికొత్త కవి సమయాలను ప్రయోగించారు. విన్నవియద్గంగలకు బదులు కన్నులారగన్న "కిన్నెర సాను"లను కమనీయ భావనా బలంతో వర్ణించి కవితాసతికి కమనీయ భూషలు అలంకరించారు. (5) శైలీ నవ్యత: నవ్య కవిత్వ లక్షణాలలో శైలీ సారళ్యం గణనీయమైంది. గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, బసవరాజు, నాయని, దువ్వూరి మున్నగు కవుల రచనలన్నీ వైదర్భీ రీతిలో సంస్కృతాంధ్ర సరళ పదాల సముచిత సమ్మేళనంతో అనేకులకు అర్థమయ్యే ధోరణిలో రచింపబడినాయి. (6) పదప్రయోగ నవ్యత: నవ్య కవులు వ్యవహారం నుంచి తొలగిపోయిన పదాలను విసర్జించారు. ప్రాచీనులు పాదపూరణం కోసం వాడిన పదాలను వీలు తిరస్కరించారు. సమకాలిక సమాజంలో చలామణిలో వున్న పదాలకు, పట్టం కట్టారు. గిడుగు పిడుగు హుంకృతితో, గురజాడ చూపెట్టిన సరికొత్త జాడతో వ్యావహారిక పదాలకు కావ్య ప్రవేశ యోగ్యత కలిగింది. (7) దేశి కవిత : నవ్య కవిత్వానికి మరో లక్షణం దేశి కవితకు దేవిడీ లభించడం. మాత్రాఛ్ఛందస్సులో మహనీయ భావాలు వెల్లడించవచ్చనీ, దేశి కవితలో అన్ని రసాలూ నిర్వహించవచ్చనీ నిరూపించారు గురజాడ వారు. క్రమంగా రాయప్రోలు, బసవరాజు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నండూరి ప్రభృతులు దేశి మార్గంలో రసవత్తర కావ్యాలూ గీతాలూ రచించి నవ్యతకు శ్రీకారం చుట్టారు. (8)ప్రక్రియా బాహుళ్యం : ఇది నవ్య కవిత్వానికి ప్రత్యేక లక్షణం. ఒక్క భావ కవిత్వంనే తీసుకుంటే-ప్రకృతి కవిత్వం, ప్రణయ కవిత్వం, పల్లీజన కవిత్వం, దేశభక్తి కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, స్మృతిగీతాలు, బాలగేయాలు మున్నగు అనేక ప్రక్రియలు భాసిస్తాయి.

**యుగకర్త :**

రచనలోని నవ్యత, గ్రంథ ప్రచురణ, తరువాతి కవులపై ప్రభావం అనే మూడంశాలను బట్టి పరిశీలిస్తే నవ్య కవిత్వ మహోదయానికి గురజాడ, రాయప్రోలు ఏక కాలంలో అరుణోదయ తపనోదయాల వంటి వారని తేలుతుంది. డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు సూచించినట్లుగా ఈ ఇరువురి మార్గదేశి కవిత్వాలకు భావకవిత్వ యుగంలో అనుయాయులు ఏర్పడ్డారు. అభ్యుదయ కవిత్వ యుగంలో మాత్రం శ్రీశ్రీ అవతరణతో గురజాడ ఆధిక్యం మరింత పెరిగింది. పిల్ల వసుచరిత్రల పెంజీకట్లు ముసురుకున్న రోజుల్లో దేశి కవితారశ్మిని ప్రసరించిన కవిభాస్కరుడాతడు. సాహిత్యం ఏ కొందరి సొత్తో అనుకుంటున్న కాలంలో అది ప్రజల సొమ్మని ఉదారంగా పంచిపెట్టిన సొమ్యశీలి ఆయన. కందుకూరి సాంఘిక విప్లవాన్ని గిడుగు భాషా విప్లవాన్ని తనలో సమన్వయించుకుని సరికొత్త సాహిత్య విప్లవాన్ని తెచ్చిన నవయుగ వైతాళికుడాతడు. ఆంధ్ర నాటక రంగంలో ఆయన కన్యాశుల్కం గొప్ప ప్రయోగం. అది వ్యావహారిక భాషకు పట్టం కట్టిన ప్రథమ దృశ్య కావ్యం. సమాజంలోని అన్ని తరగతులకు చెందిన అభిప్రాయాలను, వారి కష్టసుఖాలను సజీవమైన వ్యావహారిక భాషలో రసపుష్టికి రవ్వంత కొరత కలగకుండా అభివ్యక్తం చేసిన ప్రప్రథమ నాటకం కన్యాశుల్కమే.

ప్రాచీన కవులలో తిక్కన్న, వేమన్న తెలుగు నుడిని తీర్చిదిద్దడంలో అగ్రసరులు. వారి ఒరవడిలో నడిచినా వారికి భిన్నమైన రీతిని సాధించాడు గురజాడ. ఆ మార్పు వాడుక పదాలకూర్పు. అది కత్తి మీద సాము లాంటిది. పర్యాయ పదాల గారడికి ఇందులో వీలులేదు. పదాలపటాటోపంతో భావదారిద్ర్యాన్ని కప్పిపుచ్చుకునే అవకాశం లేదు. మామూలు వ్యావహారిక పదాలతో విశ్వ మానవ గీతం

కాదగిన జాతీయ గీతం రచించాడు. పూర్ణమ్మ వంటి కరుణ రసాత్మకమైన గేయగాథ ప్రవచించాడు. కవిత్వంలో వాస్తవికతను ప్రవేశపెట్టిన మహా కవి గురజాడ. వాస్తవికత అంటే నీరసమైన భావ ప్రదర్శనమని అనుకోకూడదు. అది ఫోటోగ్రఫీ కాదు. శ్రీశ్రీ అన్నట్లుగా ఎక్స్‌రే ఫోటోగ్రఫీ. అది కూడా ప్రధానంగా హృదయసంబంధి. గురజాడ చేసిన అత్యంత వినూత్న ప్రయోగాలలో ముత్యాలసరం ఒకటి. పద్యం నుండి గేయానికి తిరిగిపోవడమే గొప్ప ప్రయోగం. అందులోనూ ఒక్క మాత్రా నియమం తప్ప యతిప్రాసల నియమం లేని గేయాన్ని చేపట్టడం, పైగా వాడుక మాటలు ప్రయోగించడం, ఆ గేయాన్ని ఉబుసుపోకకు కాకుండా ఉదాత్త విషయాలను భావబంధురంగా వ్యక్తీకరించడానికి సాధనంగా చేయడం ఒక దాని కంటే ఒకటి అపూర్వ ప్రయోగాలు. ఏడు మాత్రల గణాలతో సాగిపోయి మిశ్ర గతిలో ఉన్న గీతాన్ని ముత్యాల సరమని గురజాడ వారు నామకరణం చేశారు. పాదాలు తుంచడంలోనూ, పాద సంఖ్య నియతిలోనూ, వాడుక భాషను ఆ ఛందస్సులో పొదగడంలోనూ ఎప్పటికప్పుడు కొత్త ప్రయోగాలు చేసి సత్ఫలితాలు సాధించాడు. "నా ముత్యాల సరాల గేయాలను క్రమానుగతంగా మీరు పరిశీలించినట్టయితే ఒక దానిలో కంటే ఇంకోదానిలో నేను సాధించిన అభివృద్ధి మీకు స్పష్టపడుతుందని" 1912 లో గన గున్నయ్య శాస్త్రి గారికి రాసిన లేఖలో గురజాడే అన్నాడు.

ముత్యాల సరాలలోని మనిషి అనే గేయం మానవతా వాదానికి ప్రతినిధి రచన. 'మనిషి చేసిన రాయిరప్పకు మహిమ కలదని' మొక్కుతూ మనుషులనే రాయి రప్పల కంటే కనిష్టంగా చూసేవారిని ఈ గేయంలో ఆయన నిరసించాడు. మానవతా వాదంలో మరో అంశమైన సంఘసంస్కరణ దృష్టి వీరి గేయాలలో అనేక సందర్భాలలో వజ్రధార ధాళధళ్యాన్ని వెలారుస్తున్నది.

ముత్యాల సరాలలోని మొదటి గేయం తోకచుక్క పొడవడం వల్ల అనర్థం సంభవిస్తుందనే మూఢ విశ్వాసాన్ని ఖండించడానికి రాసింది. గాంధీజీ హరిజనోద్యమం ప్రారంభించక ముందే గురజాడ వారు "లవణరాజు కల"లో

"మలిన దేహాలు మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మ మధర్మ ధర్మంబే"

అని, కులాల అనే భేదం కులాన్ని బట్టి కాక మనస్సును బట్టి కలగాలని ప్రతిపాదించి ప్రాచీన వర్ణ వ్యవస్థను ఖండించారు.

"మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి అన్నది మాలయైతే మాలనే అగుదున్"

అని హరిజన సమస్యకు అస్పృశ్యత సమస్యకు అనాడే కావ్యత్వాన్ని కలిగించారు. గురజాడ ప్రతిపాదించిన ప్రేమ రెండు విధాలుగా వుంది: (1) పవిత్ర దాంపత్య రక్తి (2) విశ్వ మానవ ప్రేమపటములో పవిత్ర దాంపత్య రక్తిని ప్రతిపాదించారు. "ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును. ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును" అని ప్రవచించారు. తోటి మనిషిని మనసిచ్చి ప్రేమించడం కన్న ఘనకార్యం లేదని వారు భావించి విశ్వమానవ ప్రేమను ముత్యాల సరాలలోని మొదటి గేయంలోనే –

"ఎల్లలోకము లొక్క యిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేలనెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ–" అని ఉద్ఘాటించారు.

"దేశమనియెడు దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నియు మెలగవలెనోయ్" అని విశ్వమానవ ప్రేమను గానం చేశారు. వారిది ప్రాంతాల ఎల్లలను, దేశ సీమలను, జలధులను దాటిన విశాల దృష్టి. ఆయన దేశభక్తిలో అంతర్వాహిని "విశ్వమానవ ప్రేమ". "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్న పంక్తులలో ఈ మహత్తర సత్యమే ఇమిడి వున్నది. గురజాడ వారి దేశభక్తి గేయం వంటిది భారత సాహిత్యంలోనే లేదని చెప్పవచ్చును. సాధారణముగా ఏ దేశం జాతీయ గీతమైనా ఈ ధోరణిలో వుంటుంది. గురజాడ వారి గేయంలోని విశేషం ఏమిటంటే – ఇది ఒక వైపు స్వదేశీయులలో జాతీయాభిమానాన్ని నూరి పోస్తూనే ఎల్లలు దాటి ఎగిసిపోయి సమస్త జాతులను విశ్వమానవ కోటిని పలకరిస్తున్నది. అందువల్లనే ఏ జాతీయ గీతానికి లేని విశిష్టత దీనికి అలవడింది.

కిళాంబిరంగాచార్యులన్నట్లుగా "ప్రజాసామాన్య రక్త ధ్వజాన్ని" పైకెత్తిన కవీంద్రుడాతడు. "నాది ప్రజల ఉద్యమం, దానిని ఎవరిని సంతోష పెట్టడానికైనా వదులుకోలేను" అన్నంత వజ్ర సంకల్పంతో నవ్య సాహిత్య పథాలలో ప్రస్థానం చేసిన ప్రవక్త ఆయన.

## రాయప్రోలు సుబ్బారావు :

క్షీణ ప్రబంధ యుగంలో వెర్రి తలలు వేసిన రీతి ప్రాధాన్యానికి, శబ్దచిత్ర లౌల్యానికి, నిర్వేల శృంగారానికి, నీరస సంప్రదాయ పాలనకు విరుగుడుగా రసగుళికల వంటి రమ్యకావ్యాలను సృష్టించిన వారు రాయప్రోలు సుబ్బారావు గారు. వీరు గురజాడ వారి వలె ఒక్కుమ్మడిగా సంప్రదాయానికి ఎదురీదిన వారు కాదు. అంత మాత్రాన సంప్రదాయంలో

పడి కొట్టుకుపోయిన వారూ కాదు. 1909లో గంటి లక్ష్మన్న పంతులుగారి ప్రేరణతో గోల్డ్‌స్మిత్ 'హెర్మిట్'ను లలితగా రూపొందించినారు. 1914 అనంతరం రవీంద్రుని అంతే వాసులయ్యారు. ఆ తర్వాత కొమర్రాజు వారి సాహచర్యం, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి సౌహార్దం లభించింది. ఈ ప్రభావాలన్నీ కించిత్ కాల వ్యత్యాసంతో కలగలసి రాయప్రోలు వారి నవ్యభావుకతకు కవాటాలు తెరిచాయి. 1909లో ఆయన రచించిన లలిత 1921 లో పునర్ముద్రణ జరిగేటంత వరకు సాహితీ పిపాసువుల దృష్టిని అంతగా ఆకర్షించలేదు. ఆయన 1911లో టెన్నిసన్ రచించిన 'డోరా' అనే లఘు కావ్యాన్ని 'అనుమతి' అనే పేర తెనిగించారు. 1912లో 'తృణకంకణం' వెలువరించారు. రాయప్రోలు వారి కావ్యాలలో ఇది అగ్రేసరమైంది. లలిత, తృణకంకణం, కష్టకమల, స్వప్న కుమారము ప్రణయం ప్రధాన వస్తువుగా కలవి. అమలిన శృంగారం వీటిలోని ప్రధాన రసం. రాయప్రోలు వారు కరుణ శృంగారాలు రెండే రసవికాసానికి సమర్థమైనవని అభిప్రాయపడ్డారు. పూర్ణానంద స్వాదనకు శృంగార రసం, మనోదోష శుద్ధికి కరుణ రసం ఉపయుక్తమైనవని అభిప్రాయం. శృంగార రసానికి సంభోగం అవధి అన్న పూర్వుల సిద్ధాంతాన్ని త్రోసి పుచ్చారు. సంభోగ శృంగారం ఉపాధి మాత్రం కాబట్టి క్షయమైనదనీ, వియోగ శృంగారం అనుపాధికం కాబట్టి అక్షయమైనదనీ, ఇదే శ్రేష్ఠమని వీరి సిద్ధాంతం. వియోగ శృంగారంలోని సరికొత్త సిద్ధాంతాన్ని స్థాపించారు. తృణకంకణం ఈ అమలిన శృంగారానికి లక్ష్యగ్రంథం. స్త్రీలోని మాతృ మూర్తిత్వాన్ని దైవతాంశను దర్శించి తన కావ్యాల ద్వారా రూపకల్పన చేశారు. కమల భ్రమరాల ప్రేయసీ ప్రియ సంబంధాన్ని త్రోసి వేసి దానిని వాత్సల్య సూత్రంతో ముడివేయడం అపూర్వం. ఏ లాక్షిణికులూ ఈ సంబంధం ఊహింపలేదు. ఆధునికాంధ్ర కవిత్వంలో స్త్రీ సమారాధన తత్వానికి రాయప్రోలు వారే మొట్ట మొదటి ఆచార్యులు. వారి దృష్టికి సృష్టిలోని అనేక పదార్థాలు వాత్సల్య మూర్తులుగా కనిపిస్తాయి. పూలలోని తేనెను పూలపాలుగా భావించారు. వసంతంలో కుసుమ వికాసాన్ని "పూలు పసుపాడిన" వని వర్ణించారు. 'సుమములు బాలెంతరాండ్ర పోల్కి' అగుపించిన వన్నారు. పండిన దానిమ్మ పండ్లకు పగడాల కానుపు కల్గినట్లు చమత్కరించారు.

ప్రసాద మాధురీ గుణాలు గంగా యమునలవలె సంగమించిన మధురశైలి వీరిది. ప్రాచీన కావ్య రీతిని వదలక వృత్త రచన చేసినా సరికొత్త పదబంధాలను సృష్టించి నవ్యత ప్రీతిని కనబరిచారు. తెలుగు నుడికారానికి, పలుకుబడికి పదును కలిగించారు. ఆంధ్రావళి, జడకుచ్చులు వంటి ఖండ కావ్య సంపుటులలో అనేక దేశీయ ఛ్చందస్సులను ప్రయోగించారు. మాత్రాచ్ఛందస్సులో కూడా వినూత్న ప్రయోగాలు చేశారు. భావకవులు పలువురికి వీరి పద్య రచనతోపాటు గేయ రచన కూడా ఆదర్శమూ అనుకార్యమూ అయింది.

## దేశభక్తి :

దేశభక్తి కవిత్వంలో రాయప్రోలు వారు అగ్రస్థానం అలంకరించారు. 1914లో "అమరావతి పట్టణమువ" మున్నగు పద్యాలు రచించి ఆంధ్రదేశాన్ని ఉగ్రూతలూగించారు. రెండు మూడు దశాబ్దాల పాటు వారి దేశభక్తి కవిత్వం బహుముఖంగా విజృంభించింది. 'ఏ దేశమేగినా ఎందుకాలిడినా' వంటి గేయాలలో వీరు భారత జాతీయతను ప్రబోధించారు. 'చావ లేదు చావ లేదాంధ్రుల మహోజ్వల చరిత్ర' అని ఆంధ్రాభిమానాన్ని వ్యక్తం చేశారు. తెలుగు తల్లి అనే శీర్షికతో భిన్న ప్రాంతాలలో విడివడి వున్న ఆంధ్రుల సమైక్యతను సూచించారు. 'తెలుగు తల్లి' అనే పదాన్ని మొదట ప్రయోగించింది వీరే. తెనుగు వాణి, తెనుగు కత్తి, తెనుగు భూమి మొదలైన వాటి వెనక వున్న ఆంధ్ర జాతీయావేశానికి దారి చూపింది వీరే. తెలుగు నదులను, తెలుగు రాజుల శౌర్య పరాక్రమాలను, తెలుగు సిరిని ప్రస్తుత రూపాలలో చిత్రించిన ప్రముఖులు వీరే. నా దేశం, నా జాతి, నా భాష అన్న 'అహంకార దర్శనము' ను ఆంధ్రులలో కలిగించి దేశభక్తి కవిత్వాన్ని వెలయించి, ఆ శాఖకు ఆచార్యత్వం వహించారు రాయప్రోలు వారు. ప్రకృతి కవిత్వం ద్వారా అన్యాపదేశంగా జాతీయ ప్రబోధం చేసే కావ్యాలను కూడా రచించి తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు. వస్తు భావ రచనలలో అనేక నవ్యమార్గాలు చూపి ఇంగ్లీషు కాల్పనిక కవిత్వంలోని కొన్ని రీతులకూ, వంగ వైష్ణవ సంప్రదాయాలకూ, అమలిన శృంగారాది నూత్న సిద్ధాంతాలకూ, లఘుకథా కావ్యాది బహువిధ ప్రక్రియలకూ బాటలు వేసిన అభినవాంధ్ర కవితాపితామహులు రాయప్రోలు సుబ్బారావుగారు.

## భావకవిత్వం :

భావకవిత్వం అనే పదాన్ని గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు గారు ఆంధ్రపత్రికలో సహాయ సంపాదకులుగా వున్నప్పుడు సృష్టించారని డా. గిడుగు సీతాపతిగారు పేర్కొన్నారు. గాడిచెర్ల వారు ఈ పదాన్ని మాటి మాటికీ ప్రకటించగా ఇది నవ్యకవిత్వానికి పర్యాయ పదమైపోయింది. ఈ రకమైన కవిత్వం రాసేవారిని భావ కవులని పిలిచేవారు. కట్టులో, జుట్టులో, నడకలో, పలుకులో భావకవులు తమ ప్రత్యేకతను కనబరిచారు. భావ కవిత్వమంటే వస్తు భావ రచనలలో భావానికి ప్రాధాన్య మిచ్చిన కవిత్వం. అంతర్ముఖత్వం దీని ప్రధాన లక్షణం. ఇది కేంద్ర బిందువుగా పరిశీలిస్తే ఈ క్రింది ఛాయలు అగుపిస్తాయి:

1) స్త్రీ పురుష బాహ్య సౌందర్యానికి బదులుగా ఆత్మ సౌందర్యం, గుణ సౌందర్యం ఈ కవిత్వంలో వర్ణింపబడినాయి.
2) కవి తన సుఖ దుఃఖాలను తెరమరుగు లేకుండా వెర్రిగా వెల్లడించుకున్నాడు.
3) ఒక్కొక్కప్పుడు అవస్థా భేదాన్ని బట్టి అతనికి కొండంత సహానం అలవడింది. అందుకు తోడుగా దార్శనిక దృక్పథం ఏర్పడింది.
4) ప్రకృతి వర్ణనలలో బాహ్య విషయాలకు బదులుగా సుకుమారమైన సౌందర్య తత్వం నిర్దేశించబడింది. అనగా చర్మ చక్షువుకు కనిపించే ప్రకృతి కాక మనో నేత్రానికి భాసించే ప్రకృతి వర్ణ్యమైంది.
5) జాతికి సర్వాంగ వికాసం కలిగించే సంప్రదాయ సిద్ధమైన సంస్కార దృష్టి ఏర్పడింది. "పూర్వ జన్మ వాసనలు" మళ్లీ ఊపిరిపోసుకున్నాయి.
6) కవి తాను విన్న కన్న ఏ చిన్న సంఘటనైనా హృదయతంత్రులను ఝుమ్మనిపించి కవిత్వ రూపంలో వెలిజిమ్ముకొని వచ్చింది.
7) ఆత్మార్పణతత్వం, ఆరాధన తత్వం వేళ్లు దన్నుకున్నాయి. అంతశ్చేతనలోని చైతన్యం హద్దులు దాటి వెలువడింది.
8) సామాన్యమైన లౌకిక సంతోషానికి బదులుగా సర్వే సర్వత్ర అలౌకికానందం అంచులు తీర్చుకున్నది. చిత్ర కవిత్వాన్ని భావకవి నిరసించడంలో ఈ అంతర్యమే ఉన్నది.
9) కవి తన కొలమానాలతో కొలవడం మాని, తన వ్యక్తిత్వాన్ని విస్మరించి, ఇతరుల సుఖ దుఃఖాలతో లీనమై పోయే స్థితి ఏర్పడింది. దీనినే కీట్స్ "నెగెటివ్ కేపబిలిటీ" అన్నాడు.

భావ కవిత్వం లోని శాఖలు (1) ప్రణయ కవిత్వం (2) దేశభక్తి కవిత్వం (3) ప్రకృతి కవిత్వం (4) సంఘ సంస్కరణ కవిత్వం (5) భక్తి కవిత్వం (6) స్మృతి కావ్యాలు. వీటిలో ఒక్కొక్క శాఖ అనంత వైవిధ్యం కలది. వాటిలో ప్రక్రియా బాహుళ్యం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. ఈ ప్రక్రియలన్నీ ఇంగ్లీషు రొమాంటిక్ కవిత్వ ప్రభావం ఉన్నవి కావు. వీటిలో ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం ప్రాయికంగా ఆంగ్ల కాల్పనిక కవితా ముద్ర ఉన్నవే. దేశభక్తి కవిత్వంపై దీని ప్రభావం అంతగా లేదు. సమకాలీన పరిస్థితులను బట్టి రాజకీయోద్యమాలను బట్టి పెకిలి వచ్చిన కవిత్వమిది. సంఘసంస్కరణ కవిత్వం కూడా సాంఘిక స్థితిగతులను బట్టి ఉద్భవించిందే. భక్తి కవిత్వంపైన కొంత సాంప్రదాయక ముద్ర, కొంత రవీంద్రుని ఛాయ, కొంత బ్రహ్మ సమాజం ప్రభావం అగుపిస్తాయి. ఈ రీతిగా కొత్త పాతల మేలి కలయికతో సంప్రదాయ ప్రయోగాల సముచిత మేళనంతో తెలుగు నాట వెలుగులు చిమ్మింది భావకవిత్వం.

1930 వరకు ఆంధ్రకవితా రంగంలో భావ కవిత్వం అప్రతిహతమైన ప్రభావం కలిగి వుంది. కవిత్వం రాయనేర్చిన యువకులందరూ ఆ రోజుల్లో దీని ప్రభావానికి లోనైన వారే. 1930 నుంచి ఈ కవితా శాఖకు ఎదుగుదల ఆగిపోయింది. రాయప్రోలు, కృష్ణశాస్త్రి ప్రభృతుల రచనలకు అంధానుకరణం ప్రబలింది. శబ్ద వ్యక్తీకరణకే ప్రాధాన్యమేర్పడి అర్థగాంభీర్యం అడుగంటింది. జిలుగుపలుకుల సన్నపోగారు తనంమీదనే దృష్టి కేంద్రీకృతం కావడం వల్ల భావనా బలం సన్నగిల్లింది. వైయక్తిక ఆత్మవ్యక్తీకరణ ధోరణి నానాటికి ముదిరిపోయి సంఘ దృష్టి మరుగుపడిపోయింది. ఈ స్థితిలో భావ కవిత్వంపైన తిరుగుబాటు చేసి సరికొత్త ప్రయోగాలను చేసిన కవులు శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీరంగం శ్రీనివాసరావు, శ్రీరంగం నారాయణ బాబు, పఠాభి. వీరితో గొంతు కలిపిన వారు ముద్దు కృష్ణ, పురిపండా అప్పలస్వామి. అయితే ఈ తిరుగుబాటు దారులు ఒక్కుమ్మడిగా జూలు దులుపుకుని, గళమెత్తి గర్జించిన వారు కాదు. ఆ తరంలోని కవులందరి వలెనే వీరు కూడా ప్రథమ దశలో భావకవితా పథాలలో పయనించినవారే. ప్రేయసి కొరకు అంగలార్చినవారే. శిష్ట్లా విష్ణుధనువులోని ప్రధాన వస్తువు ప్రణయమే. అయినా దాన్ని వ్యక్తీకరించే వైఖరిలో మార్పుంది. పురిపండా, ముద్దు కృష్ణ మొదట్లో భావగీతాలు రాసిన వారే. నారాయణ బాబు వలపు చెలమలు, సంధ్యావేగం మున్నగునవి అచ్చమైన భావగీతాలే. శ్రీశ్రీ ప్రథమ కావ్య సంపుటి "ప్రభవ" అధికాంశం భావ కవిత్వమే. వీరందరూ తమకు ముందున్న భావకవి ప్రముఖుల ప్రభావంతో తొలినాళ్ళలో అనుకరణ శీలమున్న రచనలు చేసినా వీరి ప్రతిభ నివురుగప్పిన నిప్పులాగా ప్రజ్వలనావకాశం కోసం ఎదురుచూస్తూ వున్నది. భావ కవిత్వం పట్ల వీరిలో సహజంగా కలిగిన విముఖత, కొత్తదనం కావాలనే కాంక్ష, పాశ్చాత్య సాహిత్యంలోని అతి నవ్య కవితా రీతుల ప్రభావం, భారత దేశ రాజకీయ సాంఘిక రంగాలలో జరుగుతున్న మార్పులు, ప్రపంచ రాజకీయ పరిణామాలు – ఇన్ని ప్రభావాలు కలిసి ఈ కవుల హృదయాలతో పెనవేసుకుని కొంత కాలానికి కొంగ్రొత్త ప్రయోగాల రూపంలో వెలువడ్డాయి. ఈ కవులలో ఏ ఒక్కరూ మొదటి దశలో ఒక ప్రత్యేక కవితోద్యమానికి చెందిన వారు కారు. అలజడే ఊపిరిగా, తిరుగుబాటే ధ్యేయంగా రచనలు చేసినవారు. ముఖ్యంగా ఛందస్సులో శిష్ట్లా, పట్టాభి; వస్తువులో శ్రీశ్రీ, నారాయణ బాబు తిరుగులేని తిరుగుబాటు లేవదీశారు.

ఛందస్సు విషయంలో శిష్ట్లా అద్భుతమైన ప్రయోగాలు చేశాడు. విష్ణుధనువులో ప్రయత్నపూర్వకంగా ఛందస్సును వికృతం చేశాడు. కొన్ని పద్యాల తునకలను, కొన్ని మాత్రాబద్ధ గేయఖండాలను, కొన్ని వచనపు తుంటలను ఇష్టం వచ్చినట్టు పేర్చి విశృంఖల మనస్తత్వాన్ని ప్రదర్శించాడు. భాష విషయంలో కూడా కొంత నిర్లక్ష్యతను విశృంఖలతను కనబరిచాడు. సింబాలిజంలో శబ్దార్థం కంటే వాతావరణ కల్పనయే ప్రధానం. అపప్రయోగాలు అర్థరహితాలైన ఒక విచిత్రార్థ స్ఫురణం కలిగిస్తాయి కదా అనే భావంతో శిష్ట్లా ఈ చమత్కారాలు చేసివుంటాడు. పురాణ సంబంధ పాత్రలను తీసుకొని నవీన భావాలను వెల్లడించడంలో ఈ కవిపై టి.ఎస్. ఇలియట్ ప్రభావం వుంది. వచన గేయంలో సమగ్ర కావ్య సంపుటిని ప్రకటించడంలో ఇతడే ప్రథముడు. వచన గేయ ప్రక్రియ విషయంలో ఒక రకంగా శ్రీశ్రీ ప్రభృతులకు ఇతడే మార్గదర్శి అని చెప్పాలి. తన నూతన కవిత్వానికి ప్రహ్లాద కవిత్వమని పేరు పెట్టుకున్నాడు.

పఠాభి పూర్తి పేరు పట్టాభి రామిరెడ్డి. అతని కవితా సంపుటి "ఫిడేలు రాగాల డజన్". పాశ్చాత్య వాద్యమైన ఫిడేలుపై ఆధునిక కాలంలో కర్ణాటక సంగీతం పలికించినట్లుగా ఇంగ్లీషు కవితారీతులను తెలుగు భాషలో ప్రయోగించ వచ్చనే ఉద్దేశంతో కవి ఈ నామకరణం చేసి వుంటాడు. తనకు విచిత్ర భావాలున్నాయనీ, తన కన్నుల్లో టెలిస్కోపులు వున్నాయని విచిత్రంగా చెప్పుకున్నాడు. "నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల నడుముల విరగదంతాను" "చిన్నయసూరి బాల వ్యాకరణాన్ని చాల దండిస్తాను" అంటూ తెలుగు వ్యాకరణాలపై, ఛందస్సుపై దాడి చేశాడు. "అనుసరిస్తాను నవీన పంథా కానీ భావ కవిని మాత్రము కాన్నేనహంభావ కవిని" అంటూ అహంకారాన్ని, విశృంఖలత్వాన్ని ప్రదర్శించాడు. ఈ కవి పద్యాల నడుములేకాక గేయాల నడుములను కూడా విరగిదన్నాడు. వచన గేయాలను నడిపించడంలో ఇతనికొక పద్ధతి ఉన్నట్టు లేదు. అంతర్లయ, ఊపు, విసురు మొదలైన వచన గేయ గుణాలు ఈ సంపుటిలో కొరవడ్డాయి. భాషకూడా ఒక పద్ధతిలో లేదు. వచనంలోని కర్త కర్మ క్రియలను తలకిందులు చేసి గేయ రూపంలో పేర్చాడు. శ్రీశ్రీ దీని ఇంట్రోలో అన్నట్లుగా "అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశం మధ్యలో ఊగ వచ్చును. విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును." అనే మాటలను అక్షరాలా నిరూపించాడీ కవి. నగర జీవన చిత్రణానికి నాంది పలికినవాడు ఇతడే. అత్యాధునిక జీవితంలోని వివిధ ఘట్టాలకు సంబంధించిన కవిత్వం రాయడంలోనూ ప్రథముడితడే. శబ్దార్థ వైచిత్రిలో నవ్యత తీసుకొచ్చిన వాడూ ఇతడే.

## అతి నవ్య ధోరణులు:

1940 ప్రాంతంలో శ్రీశ్రీ, నారాయణ బాబు, పఠాభి ప్రభృతులు అతి నవ్య కవితా ధోరణులకు పునాది వేశారు. పాశ్చాత్య కవులలో అతి నవ్యులు జరిపిన ప్రయోగాలన్నిటిని తెలుగులో దిగుమతి చేయడానికి ప్రయత్నించారు. 20 వ శతాబ్దంలో ఫ్రెంచిలో, ఇంగ్లీషులో వెలువడ్డ విచిత్ర కవితా ధోరణులను వీరు ఆకళించుకున్నారు. ఇమేజిజం, సర్రియలిజం, రియలిజం, డాడాయిజం మొదలైన కవిత్వోద్యమాల స్వరూపాన్ని పరిశీలించి వాటి జాడలలో తమ కవిత్వాన్ని పరిగెత్తించారు. దాని పర్యవసానంగా తెలుగులో అధివాస్తవికత, అహంభావ ప్రకటన, బీభత్స చిత్రణ, వస్తుభావ వైచిత్రి, అరాజకవాదం, నిరాశావాదం మొదలైన వింత వింత ధోరణులు మొలకెత్తాయి. ఈ ధోరణుల్లో ఏదీ తెలుగు నేలలో పుట్టింది కాదు. భావ కవిత్వంలాగా, అభ్యుదయ కవిత్వం లాగా తెలుగు గడ్డను అంటిపెట్టుకున్నదీ కాదు. ఫ్రెంచి కవులు, ఇంగ్లీషు కవులు చేసిన వినూత్న ప్రయోగాలకు వీరు తెలుగు దుస్తులు మాత్రం తొడగగలిగారు. అందువల్ల ఇవి తెలుగునాట బలంగా నిలవలేక పోయాయి. ఇవి సంపాదించిన ప్రజాదరణ కూడా అంతంత మాత్రమే. అయితే శ్రీశ్రీ ప్రభృతులు ఛందో భావ వ్యక్తీకరణంలో, శబ్ద ప్రయోగంలో గొప్ప మార్పులు తేగలిగారు. తెలుగు కవితకు అపూర్వమైన వైవిధ్యం సంపాదించగలిగారు. ముఖ్యంగా వీరి కృషి వల్ల వచన గేయానికి బలమైన స్థానమేర్పడింది.

భావ కవిత్వంలోని ఆదర్శవాదానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసి వాస్తవికతావాదం ప్రతిపాదించిన కవి నారాయణ బాబు. భావ కవిత్వంలోని అతీంద్రియ కల్పనలకూ, లలితశైలికీ, మధుర పద సమ్మేళనానికీ, అభూత సౌందర్యదృష్టికీ విరుద్ధంగా ఈ కవి తిరుగుబాటు చేశాడు. ఇంద్రియ గోచరమైన చైతన్యమంతా కవికి వర్ణ్యమనీ, సౌందర్యం ఒక్కటే ఆరాధ్యం కాదనీ, అసుందర వస్తువులను కూడా కవితా వస్తువులుగా స్వీకరించవచ్చునని ఈతడు నిరూపించాడు. భావ కవితా రంగంలోని ప్రణయ కవితా శాఖను నిరసించాడు. యదార్థ జీవిత చిత్రణను బలపరిచాడు. ప్రకృతిలోని బీభత్సాన్ని గమనించిన కవి దానిని చిత్రించాలి గాని ఇసుకలో తల దూర్చిన ఉష్ట్రపక్షిలా పరిస్థితులను విస్మరించి వుండకూడదని ఉద్ఘోషించాడు. వాస్తవికతనూ అధి వాస్తవికతనూ సమన్వయ పరచుకున్న అతినవ్యుడు నారాయణ బాబు. ఇంగ్లీషు కవిత్వంలోని ఇమేజిజం ప్రభావం కంఠదఘ్నంగా వున్న చాలా కొద్దిమంది తెలుగు కవులలో ఈతడు ప్రముఖుడు.

భావ కవిత్వంపై తిరుగుబాటు చేసిన వారిలో అగ్రేసరుడు శ్రీశ్రీ. శ్రీశ్రీకి, మిగిలిన తిరుగుబాటు దార్లకూ వున్న భేదమేమిటంటే – వారు తిరుగుబాటు చేశారే కానీ సరికొత్త బాట వేయలేదు. అయితే 1928లో ఆయన రచించిన భావగీతాలు, పద్యాలు కవితా సమితి తొలి ప్రచురణగా 'ప్రభవ' రూపంలో వెలువడ్డాయి. ఆనాటికి ఆయనింకా శ్రీరంగం శ్రీనివాస రావుగానే ఉన్నాడు. వస్తు వరణంలోనే గాక భావనలో, పద ప్రయోగంలో, పద్య సంధానంలో శ్రీశ్రీ తన సమకాలిక కవి ప్రముఖులైన కృష్ణశాస్త్రి, విశ్వనాథ మున్నగు వారిని అనుకరించినా ఈ సంపుటిలో కూడా శ్రీశ్రీ మౌలిక ప్రతిభ తటిత్తులా భాసింపక పోలేదు. 1928లో శ్రీశ్రీకి కొంపెల్ల జనార్దనరావు సహవాస మేర్పడింది. 'ప్రభవ' లోని పద్యాలన్నీ రెండవ శ్రేణికి చెందిన ప్రతిధ్వనులని శ్రీశ్రీ నిర్ణయించుకున్నాడు. అప్పటి నుంచి కొత్తదనం కోసం కోరిక ఈరికలెత్తడం ప్రారంభమైంది. 1929లో 'సుప్తాస్థికలు' అనే కవితా ఖండిక వెలువడింది. ఆరుద్ర అన్నట్లుగా సుప్తాస్థికలతో శ్రీశ్రీ కుబుసం విడిచాడు. 1933లో శ్రీశ్రీ రాసిన విద్యున్మాలికలు అతని మొదటి వచన గేయం. అంతవరకు పద్య ఛందస్సునో గేయఛందస్సునో ఆశ్రయించుకున్న శ్రీశ్రీ ఛందోనియమోల్లంఘనం చేసి ఈ గేయాన్ని రచించడం సాహసోపేతమైన ప్రయోగం. ఆయనలోని అంతర్మథనం ఫలితంగా 'జయభేరి' వెలువడింది. "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అని ఆలపించాడు. ఇది ఆత్మాశ్రయ రీతిలో రాసిన గేయమైనా దీనిలోని వ్యక్తి చైతన్యం సామాజిక చైతన్యంలో భాగస్వామి. ఇది శ్రీశ్రీ సొంత గొంతుకను లోకానికి చాటిన ప్రప్రథమ గేయం.

1934 ఏప్రిల్ 12 వ తేదీన "మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది" అనే చరిత్రాత్మక గేయాన్ని సృష్టించాడు శ్రీశ్రీ. ఈ గేయమే అతని 'మహా ప్రస్థానం' గేయ సంపుటికి మకుటాయమానంగా నిలిచిపోయింది. ఇదే రానున్న తరంలో ఒక ఉద్యమంగా వెలువడిన అభ్యుదయ కవిత్వానికి పాదులు వేసింది. 1940 వరకు శ్రీశ్రీ రచించిన మహా ప్రస్థానం సంపుటిలోని గేయాలలో అధిక భాగం మార్క్సిజాన్ని గర్భీకరించుకున్న రచనలే. ఈ గీతాలు అభ్యుదయ కవిత్వ యుగానికి నాందీ ప్రస్తావనలు; భావ కవిత్వ యుగానికి భరత వాక్యాలు.

మార్పు అన్నది తప్పదంటూ
నేర్పుతున్నది చరిత పాఠం
పరిణమించే కాలగమనం
ప్రగతి బాటే పట్టే తీరును – కె. రాజేశ్వరరావు

# అభ్యుదయ సాహిత్యం: ఆరంభవికాసాలు

తుమ్మల వెంకటరామయ్య

"సంస్కారి, సంఘాభిమాని, స్వార్థ రహిత జీవనుడు అయిన వీరేశలింగంపంతులు లక్ష్యీకరించిన నూత నాదర్శాలు అనే తెలిరేకలు, సారస్వత విహాయస ప్రాగ్దిశా ముఖాన యెప్పుడు తోచినవో, అప్పటితో అంధయుగం ముగిసిపోయింది. భావ సంచలనం తీవ్రంగా కలిగించి, సంఘానికి నూతన లక్ష్యాలను నిర్దేశించి వీరేశలింగంపంతులు యుగకర్త అయినప్పటికీ, సారస్వత చరిత్రలో నవయుగస్థాపనాచార్యులుగా యెన్నదగినవారు గిడుగురామమూర్తి పండితుడూ, గురజాడ అప్పారాయకవిన్నీ.

"దేశ కాల పరిస్థితులలో ఇంకొక మార్పు వచ్చింది. వెనుకటి ఏ యుగంలోనూ లేని కొత్త సమస్యలు, ఆవేశం ప్రతిదేశంలోనూ ఈనాటి కవులను కలవర పెడుతూవున్నవి. ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, వ్యుత్పన్నతాపరంగా, తీవ్రమైన మార్పు ప్రపంచమంతటా జరుగుతూన్నది." (1935 లో "వైతాళికులు" పీఠికలో ముద్దుకృష్ణ.) అలాంటి పరిస్థితులలో అభ్యుదయ కవిత్వమూ, అభ్యుదయ సాహిత్యమూ ఆవిర్భవించాయి.

ఒక్కొక్క చారిత్రక పరిస్థితులలో సమకాలీన విశ్వ పరిణామ ప్రభావంతో ఒక్కొక్క ఉద్యమానికి ప్రేరణ కల్గుతుంది. తెలుగునాట అభ్యుదయ రచయితల ఉద్యమం సంఘ స్వరూపం ఏర్పరచుకొన్న కాలానికి (1943) ఒక దశాబ్దం పూర్వం ఇలాటి ప్రేరణకు పరిస్థితులు సానుకూలమయ్యాయి.

ప్రపంచాన్ని ఆర్థిక మాంద్యం ఆవరించింది. జర్మనీలో ఫాసిజం తలయెత్తింది. రచయితలు, మేధావులు, శాస్త్రజ్ఞులు – నాజీల వేటకు గురియైనవారు గురికాగా, మిగతావారు పరాయి దేశాలలో తలదాచుకున్నారు. ఫ్రాన్సులో ఫాసిజాన్ని నెలకొల్పే ప్రయత్నాన్ని ఫ్రెంచి కార్మికవర్గం వీరోచితంగా ఎదుర్కొని వమ్ముచేసింది. ఆస్ట్రియాలో కార్మికవర్గ విప్లవం విఫలమైనా, అదొక చరిత్రాత్మక ఘటన.

ఈ వాతావరణంలో లండన్‌లోని భారతీయ రచయితలు, మేధావులు, మార్క్సిజాన్ని అధ్యయనం చేయసాగారు. ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ (భారతీయ అభ్యుదయ రచయితల సంఘం) ఏర్పరచారు. లండన్, ఆక్స్‌ఫర్డు కేంబ్రిడ్జిలలో ఈ సంఘం గురించి ప్రచారం చేయ నారంభించారు.

ఐతే, భారత దేశంలోని వివిధ భాషలలో ఈ ఉద్యమ ఆవశ్యకతను గుర్తించిననాడే, భారతీయ రచయితలు ఈ ఉద్యమ లక్ష్యాలను ఆమోదించిననాడే, ఈ ఉద్యమం ఫలప్రదం కాగలదని వీరు నమ్ముతూ వచ్చారు.

ఇదే సమయంలో సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత హెన్రీ బార్బూస్ కృషిఫలితంగా 1935 లో పారిస్‌లో "సంస్కృతీ పరిరక్షణకై ప్రపంచ రచయితల మహాసభ" జరిగింది. ఈ మహాసభకు విభిన్న దేశాలనుండి విభిన్న దృక్పథాలుగల రచయితలు వచ్చారు. స్వేచ్ఛనే, ఆలోచనా, భావప్రకటనా స్వాతంత్ర్యాలను సంరక్షించుకోవాలని ఈ మహాసభ నిశ్చయించింది. పారిస్‌లో అంతర్జాతీయ అభ్యుదయ సాహిత్య కేంద్రం నెలకొల్పబడింది. లండన్‌లోని భారతీయ అభ్యుదయ రచయితల సంఘాన్ని కూడ దీనికి అనుబంధం చేయాలని నిర్ణయించబడింది. ఇవీ భారత దేశంలో అభ్యుదయ రచనా వ్యాసంగానికీ, సంఘ సంస్థాపనకూ దోహదం చేసిన అంతర్జాతీయ పరిస్థితులు.

ఆంధ్ర సాహిత్యరంగంలో కూడా ఈ కాలంలోనే తీవ్రమైన మార్పులు వచ్చాయి. ప్రపంచ వ్యాపితంగా ఏర్పడిన ఆర్థిక మాంద్య దుష్ఫలితాలు తెలుగు ప్రజలను ఆవహించాయి.

"దారిద్ర్యం, దురవస్థ – ఇవే 1930–40 మధ్యకాలంలో మన దేశాన్ని, ముఖ్యంగా ఆంధ్రదేశాన్ని గూర్చి చెప్పవలసిన మాటలు. మధ్యతరగతివారు క్రమంగా పేదవారైపోతున్నారు. నిరుద్యోగం విశ్వరూపం దాల్చి తాండవమాడుతోంది." (50

సంవత్సరాల 1900–1950 తెలుగు సారస్వతం –శ్రీశ్రీ – ఆంధ్రదర్శిని 1954–718 వ పేజీ.)

రాజకీయంగా సత్యాగ్రహ ఉద్యమాలు ఎంతో చైతన్యం కల్గించినా, స్వాతంత్ర్యం సమకూరలేదు. నిరాశా నిస్పృహలు, తీవ్ర అసంతృప్తి యువ మేధావులలో ఏర్పడ్డాయి. బ్రిటిష్‌వారి దమనకాండ, భగత్‌సింగ్‌లాంటి వీరుల ఉరి, కార్మికోద్యమ నాయకులపై కుట్రకేసులు బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక చైతన్యాన్ని రగుల్కొల్పాయి. స్వాతంత్ర్య ఉద్యమ సారథుల నేతృత్వంపై కూడ – బ్రిటిష్ వారితో రాజీపడినందుకు అసంతృప్తి హెచ్చింది. శ్రీరంగం నారాయణబాబు రాసిన "భగత్‌సింగ్ శాపము" – రచనాకాలం తెలియదుగాని – ఆనాటి యువతలోని అసంతృప్తికీ, తిరుగుబాటు తత్వానికీ ప్రతీక.

"క్రతువంటూ – పశువంటూ
నిను బలియిచ్చిన
ఋషులంతా పటాపంచలైనారు
నీ గళమ్మున
నిరాకరణ సూత్రం – వైచి
నిలువున ఉరితీశారా – నా తండ్రీ!"

("రుధిరజ్యోతి")

ఈ పరిస్థితులలో నిరుద్యోగం, దారిద్ర్యం, ఆర్థికమాంద్యం లేక ప్రణాళికా బద్ధంగా పురోగమించుతున్న సోవియట్ యూనియన్‌లోని పరిస్థితులు రచయితలకు ఆదర్శప్రాయా లయ్యాయి. మార్క్సిస్టు భావాలు వ్యాపింపసాగాయి. జమీందారీ వ్యవస్థకు వ్యతిరేకంగా రైతాంగాన్ని ప్రబోధించే గేయాలు, కార్మికుల దుస్థితిని వర్ణించే పాటలు, కష్టజీవులలో వర్గచైతన్యం కలిగించే సాహిత్యమూ వెలువడసాగాయి.

"మహాప్రస్థానం" గేయం వెలువడిన సమయంలోనే (12–4–34) జమీందారీ రైతులను ప్రబోధించే "రైతు భజనావళి" ఆచార్య గోగినేని రంగనాయకులుగారి సంపాదకత్వాన వెలువడింది. (22–4–34.) "రాగిదమ్మిడి రత్నమాయెను" అనే శీర్షికతో విద్వాన్ విశ్వం రైతు దైన్యాన్ని చిత్రిస్తూ "పెలల [illegible]యెను, కాసు యొక్కటి కానరాదుగ, రాగిదమ్మిడి రత్నమాయెను" అంటూ ఆనాటి ఆర్థిక సంక్షోభాన్ని కనులకు గట్టినట్లు చిత్రించారు. శ్రీ తుమ్మల సీతారామమూర్తి కాపుల (రైతుల) కష్టాలు వర్ణించాడు. వడ్డీ వ్యాపారులు, లంచగొండి అధికారులు, వర్తకులు, దారుణమైన పన్నులు విధించే రాజులూ రైతుల్ని ఎలా పీడించుతున్నారో వర్ణించాడు. "ధరలు పడియె, సేద్యంబు తక్కువాయె, శిస్తు మెండాయె" అని ఆవేదన పడ్డారు. శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావుగార్ల "ఆగునా జీవాలు, సాగునా లోకాలు", కుసుమ ధర్మన్నగారి హరిజన శతకము, నెల్లూరి వెంకట రామానాయుడి (ఆనాటి జమీన్ రైతు సంపాదకులు) గారి "మా కొద్దీ జమీందార్ల పొందు", బొబ్బిలి, వెంకటగిరి ఎస్టేటు రైతుల దుస్థితిని వర్ణించే పాటలు ఈ భజనావళిలో చోటుచేసుకొన్నాయి. ఇవి పేద రైతులను, కూలీలను జాగృతం చేయసాగాయి.

1935 లో గద్దె లింగయ్యగారి సంపాదకత్వాన వెలువడిన పక్ష పత్రిక "ప్రభ"లో వాసిరెడ్డి నాగేశ్వరరావు అనే రైల్వే కార్మికుడు రాసిన "కూలోడ", పెండ్యాల లోకనాథంగారి "కూలీలందరు ఏకమైతే కూటికీ తరుగేమిరా", తుమ్మల వెంకటరామయ్య రాసిన "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజండా", బాలాంత్రపు నళినీకాంతరావు గారిచే అనువదింపబడిన అంతర్జాతీయ గీతం "ఆకలిమంటచె మలమలలాడే అనాథలందరు లేవండోయ్" ప్రచురింపబడి, విశేష ప్రాచుర్యాన్ని పొందాయి. "మాకొద్దీ తెల్లదొరతనము" రాసిన గరిమెళ్ళ సత్యనారాయణ గారి "అన్యాయకాలంబు దాపురించిందిపుడు" అనే గేయం కూడా ఈ కాలం లోనిదే.

ఆనాటి గేయ వాఙ్మయాన్ని గూర్చి డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిగారు ఇలా రాశారు:

"..........కోరుగింజలు కొంగులోకి తెచ్చుకొని అన్నీ పండించే కాపే అన్నానికి కరువున పడిపోతున్న ఈ కాలంలో, కర్షకుల కష్టాలు పోవాలనీ, ఏ కొద్ది మంది ధనదాహం తీర్చు ఇప్పటి దౌర్భాగ్యపు ధన ధాన్య విభజన పద్ధతి నశించాలనే ఉన్నత ఆశయములు ప్రజా హృదయములలో నాటుక పోయినవి. కష్ట నివారణమునకో ఉల్లాసమునకో ఉదయించే కవిత్వములోను, నేటి కవిత్వ జీవితములోను, కొత్త కొత్త భావములు ఉదయించి, నూత్నాదేశమును సృష్టించిన భావములే చిత్ర చిత్రములై రసాకృతులతో ఆ కవుల కావ్యములలో సుమిస్తున్నవి . . . . . . . . రైతు భజనావళి, క్రాంతి గీతాలు, గేయ గుచ్ఛము మొదలైన ఇవి."

* * * * *

"....... పైన పేర్కొనినవారు గాక తుమ్మల వెంకటరామయ్య, నార్ల వెంకటేశ్వరరావు, శెట్టిపల్లి వెంకటరత్నం, చిరుమామిళ్ళ విజయపార్థసారధి, దువ్వూరు రామిరెడ్డి, ప్రయాగ కోదండ రామశాస్త్రి......... మొదలగువారు 'ఆకలి మంటలు, అర్ధగంభీరత, కూలీరాజ్యం, ఆవేదనాగ్ని' అనే శీర్షికల క్రింద అనేక పదములు ప్రకటించారు. వీరి రచనలన్నిటిలోను ఆవేశము, సృజనాశక్తి ప్రస్ఫుటంగా కన్పిస్తుంది." (మాగంటి బాపినీడు గారి సంపాదకత్వాన వెలువడిన "ఆంధ్ర సర్వస్వము" 319 వ పేజీ – 1942.)

ఈ దశాబ్దం (1933–43) లోనే సంప్రదాయంపై తిరుగుబాటు, కులమత వ్యవస్థలపై దాడి, హేతువాద దృష్టి కవిత్వంలో కనపడసాగింది. నవ్య సాహిత్యయుగంలోనూ, అంతకుముందూ విగ్రహారాధన నిరసించే కవిత వచ్చిందేగాని దేవుని అస్తిత్వాన్నే ప్రశ్నించలేదు. బీదా బిక్కల పాలిటగాక

ధనికుల పట్ల అభిమాని అని దేవుని నిందించినవారు లేరు. కాని, 1934 ప్రాంతంలో దేవుడు "కలడో లేడో" అనే సంశయం కల్గింది.

"సర్వసముడయ్యే సర్వేశుడుంటే,
కొందరు కోట్లతో కులుకగనేలా?
ఎందరో కూటికి కుందగనేలా?"

అని వార్ల వెంకటేశ్వరరావు దేవుని ఉనికిని ప్రశ్నించాడు. బహుశా అంతకుముందే "నిను నమ్మెడు వారలుందురా"యని త్రిపురనేని రామస్వామి చౌదరి ప్రశ్నించాడు. కారణం "ఇదేమి ప్రపంచమెల్ల దుర్భరతర దుఃఖభారమున గ్రుగ్గుచు నుండగ గాంచి యెంతయో ముటిసెదవా" – అని దేవుణ్ణి నిగ్గదీశాడు.

"గుడివిడిచి రావోయి! మడివిడిచి రావోయి
గుడిలోని రాతిలో ముడిపడ్డ దేవుడా
గుడిమైలపడ్డదోయి / యింకేల /
గుడి నంటియుందువోయీ
మడత గోచులవారి / పిడివాదములవారి /
చెడు తిట్ల జల్లులో
గుడిమైల పడ్డదోయీ"

అని పింగళి నాగేంద్రరావు అర్థించాడు.

ఇక పురిపండా అప్పలస్వామి –
"మానవ శవాల మంటపాలపై
ప్రభువుల పతాక లెగిరే భువిలో
రాతి విగ్రహం రక్షిస్తుందా?
పూజామంత్రం బువ్వెడుతుందా?" అని ప్రశ్నించి,
"గుడిలోని దైవమా అలింపవోయి
గుడిలోని దయ్యమా పైకిరావోయి"

అని ఆజ్ఞాపించాడు.

"దేవాలయంబులో
నిర్జీవ ప్రతిమలో
లేడురా! దేవుండు
లేడురా! లేడురా"

అని శ్రీనివాసచక్రవర్తి ఘంటాపథంగా చెప్పేశాడు.

"చచ్చు దేవుడు పుణ్యమతమూ
హెచ్చు తగ్గుల కుల విభాగము
చచ్చిపోయేదాక నూరట
జెందనే లేనోయ్"

అని గొట్టిపాటి సుబ్బారాయలు తన సంకల్పం ప్రకటించారు.

1930 వరకు ఆంధ్ర కవితారంగంలో అద్వితీయ ప్రభావం కల్గిన భావకవిత్వం క్షీణదశకు చేరిన తర్వాతి సాహిత్యరంగ వాతావరణాన్ని కొంతవరకు పైన తెలుసుకున్నాం.

భావ కవిత్వంపై తిరుగుబాటు చేసి, కొత్త ప్రయోగాలను, కొత్త ధోరణులను, కొత్త రూపాలను ప్రవేశపెట్టిన ప్రయోగ వాదులగురించి కొంత చెప్పాలి. భావకవిత్వంపై తిరుగుబాటు చేసిన వారిలో ఒక పాయ అభ్యుదయ కవిత్వంవైపు మళ్ళింది. మరొకపాయ పాశ్చాత్య దేశాలలోని నిరాశ, నిస్పృహ, అసంతృప్తి, మానసిక అవ్యవస్థల పర్యవసానంగా కవితా ప్రయోగ ప్రభావంతో జరిపిన తిరుగుబాటు. ఈ కోవకు చెందిన వారిలో శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణ బాబు, పఠాభి మొదలైనవారున్నారు. 1931 నాటికే శిష్ట్లా వచన పద్యరీతికి అంకురార్పణ చేశాడు. అంతేకాక, కొన్ని కొత్త ప్రయోగాలు చేశాడు. శ్రీశ్రీ ఛందో బందోబస్తులన్నీ ఛట్ ఫట్‌మని త్రెంచివేయాలని నినదించాడు. ఐతే, పూర్తిగా తెంచలేకపోయాడు. 1939 లో పఠాభి (తిక్కవరపు పట్టాభిరామరెడ్డి) ఫిడేల్ రాగాల డజన్ "నా యీ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో, పద్యాల నడుములే విరగదంతాము" అని "వచన పద్యాలు"గా నామకరణం చేశాడు. అదే తర్వాత "వచన కవిత్వం"గా ప్రచారంలోకి వచ్చింది. ఈ ధోరణులను పురిపండా అప్పలస్వామి, ముద్దుకృష్ణ, రుక్మిణీనాథశాస్త్రి మొదలైనవారు బలపరచారు. 1909 నాటి నుండీ, ముఖ్యంగా ప్రథమ ప్రపంచ సంగ్రామం తర్వాత పాశ్చాత్య దేశాలలో ఫ్యూచరిజం, డాడాయిజం, సర్రియలిజం, ఇమేజిజం, సింబాలిజం మొదలైన కవితోద్యమ ధోరణులు వీరిని ప్రభావితం చేశాయి.

శిష్ట్లా 1931 నుండి రచనలు సాగించినా "విష్ణుధనువు", "నవమిచిలుక" 1938 లో గాని గ్రంథ రూపంలో రాలేదు. అతి నవ్యకవులను గురించి ప్రస్తావించుతూ శ్రీరంగం నారాయణబాబు, ఇలా అన్నాడు: "శ్రీశ్రీ, నేనూ, శిష్ట్లా, రుక్మిణీనాథశాస్త్రి – మేమంతా వంశ పురుషులం. మొదటితరంవాళ్ళం. శిష్ట్లా విషయంలో ఇక్కడ కొంత చెప్పవలసి వుంది. శిష్ట్లా అతి నవీనుల్లో కడు ప్రాచీనుడు. శిష్ట్లా చేసిన సాహితీ సేవ ఏమిటీ అంటే, వేలకొలది సంవత్సరాల నుండి అందరి నోటాపడి అరిగిపోయి, వాటం చెడిన నిస్సారమైన మాటలను పునస్సృష్టి, (re- creation of words) చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు." (రెంటాల గోపాలకృష్ణగారు రచించిన "సంఘర్షణ"కు రాసిన పీఠిక 'ప్రవర'.)

"నవమి చిలుక మున్నుడి"లో శిష్ట్లా తన కవిత్వం గురించి ఇలా నిర్వచించాడు:

"... ఇది పూర్వ కవిత్వంగాదు, ఇది నవ్య కవిత్వంగాదు. ఇది భావ కవిత్వంగాదు."

తన కవిత్వానికి "ప్రహ్లాద కవిత్వ"మని పేరు పెట్టి, "ప్రాహ్లాద కవిత్వం ఆరిపోయే దీపాన్ని రగుల్చుతుంది. పరుగెత్తే పామరుణ్ణే నిలేస్తుంది" అని అన్నాడు. ఇంకా "ప్రాహ్లాద

కవిత్వంలో ప్రౌఢత్వమున్నది, పామరత్వమున్నది, దేశ విదేశిక వేషమున్నది"– ఈ విధంగా రూప విషయంలో పామరులను జాగృతం చేయాలనే కాంక్షను వెలిబుచ్చాడు.

ఛందస్సు విషయంలో అనేక ప్రయోగాలు చేశాడు శిష్ట్లా. పద్యం, గేయం, వచనం అన్నీ ఒకేదానిలో కూర్చివేశాడు. వచన గేయంలో సమగ్ర కావ్యం రాసిన ఆద్యుడన్న కీర్తి శిష్ట్లాకు వచ్చినా, వచన కవితకు ఆద్యు డెవరనేది వివాదాస్పదమే.

*"బీదమందు" అనే గేయంలో శిష్ట్లా –*

*"తూర్పు తెల్లారింది, వాన వెలిసింది! అమ్మ*
*పోయే మందెట్టుకు రాయే!*
*కాండబ్బైనాలేదు, కాసైనాలేదు. కాత్తె*
*కూత్తైకైతే డాక్టేరు రాడే!*
*సందేళ సలిజరం ఊర్కోపోదే! సందొచ్చిన*
*పిల్లోడు ఉలుకుతుండాడే!*
*ఏ యాకో తింటుంది గజ్జెట్టిన కుక్క! నేపాళం*
*మాత్రెయ్యే, లేత్తాడు పిల్లోడు!*
*పాతాళం బలిసెక్రవర్తీ! సంకురాంతి పండక్కు*
*నేపాళం సెట్టెక్కిరా! జబ్బులన్నీ పోతాయి!"*

("కల్పన" కవితా సంపుటి, పేజీ 66)

బీదల దైన్యాన్ని వర్ణించాడు శిష్ట్లా. బహుశా దీనిని దృష్టిలో పెట్టుకొని కాబోలు, గోపీచంద్ ఈ కవి కావ్యం శ్రామికవర్గ సంబంధి కాదని, ఈ కవిత్వంలో బూర్జువా వాసన, ప్రొలిటేరియన్ యాస కన్పించుతుందని రాశాడు. అందుచేతనే శిష్ట్లాలో ప్రగతివాద అంశంకన్నా ప్రయోగవాద అంశం పాళ్ళే ఎక్కువున్నాయి.

"ఫిడేలు రాగాల్ డజన్" రాసిన పఠాభి "వచన పద్యాలనే దుడ్డు కర్రల్తో పద్యాల నడుముల్ విరగదంతాను, చిన్నయసూరి బాల వ్యాకరణాన్ని నిలదీసేస్తాను" అని చెప్పడమేగాక "అనుసరిస్తాను నవీన పంథా; కానీ భావకవి ని మాత్రము కాన్నే నహంభావ కవిని" అని తిరుగుబాటు ప్రకటించాడు. విశృంఖలత్వము, వైచిత్రి, గ్రాంథిక భాషను అవహేళన చేసే సందర్భంలో బుద్ధిపూర్వకంగా గ్రాంథిక భాషను వ్యావహారికంతో కలిపి వాడటం; ఇంగ్లీషు, తెలుగు పదాల కలయికతో సమాసాలు–ఇలా భాషాఛ్ఛందస్సులలో ప్రయోగం చేశాడు. ఇక వస్తు విషయంలో నగర జీవితాన్ని తీసుకొని "సెక్స్"ను ప్రవేశపెట్టాడు. "వీరి రచన అంతా ఆధునిక నగరవాసి, ధనికస్వామి కళ్ళజోడు ధరించి చూచి రచించినట్టిది" అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు వ్యాఖ్యానించారు. "ఫిడేల్ రాగాల డజన్" పునర్ముద్రణలో 34 ఏండ్లక్రింతం అనే పరిచయ వాక్యాలలో పఠాభి ఇలా అన్నారు: "విదూషకత్వం, అహంభావం, సెక్స్ నా ఆయుధాగారం లోని భాగాలు. అంతేగాదు –

"Debunking of established values was essential before a new order could be built. I wanted to pear behind the sunny mask that society wears."

(నూతన వ్యవస్థ నిర్మించడానికి ముందు ఇప్పుడములులో నున్న విలువలను అప్రతిష్ట పాలు చేయాలి. సమాజం వేసుకున్న ఛద్మ వేషాన్ని చించివేయాలనుకొన్నాను.)

తిరుగుబాటు కవులలో మరో ప్రముఖుడు శ్రీరంగం నారాయణబాబు.

"ఊరవతల" అనే కావ్యంలో భావకవిత్వ ధోరణులపైన అపహాస్యం చేస్తూ దాడి చేశాడు.

*"కలల పొదరిళ్ళలో*
*సౌఖ్యంపు నిదురలో*
*కనిపించి*
*ఒక తన్వి*
*మేనక నా పేరు*
*మేఘాలకు వెనుక ప్రక్క*
*మా ఊరని, మాయమయ్యె*
*చిరునామా తెలిసీ కూడ*
*చేసేదేమీ లేక*
*ఊహాగానం శాయగ*
*ఊరవతల కెళ్ళాను."*

అలాగే భావ కవిత్వములోని ప్రణయ కవితా ధోరణులను నిరసించాడు.

*"కొమ్మలు తలలూపగ*
*కమ్మని కోకిల*
*కూజితాలకు*
*వెన్నెల విహారములకు*
*కన్నెగాలి కౌగిళ్ళకు*
*ఇది కాలం కాదందది!"*

తమలో వచ్చిన మార్పును "సంఘర్షణ" కావ్యానికి రాసిన పీఠిక "ప్రవర"లో నారాయణబాబు ఇలా వివరించాడు:

"అంతవరకూ భావకవులతో పాటు మేము కూడా జీవిత గ్రీష్మాన్ని దర్శించేందుకు మనోనేత్రానికి తగిలించిన 'గాగుల్స్' నేల విసిరి కొడుదుం కదా! హృదయంలో పగలూ, సెగలూ రేగి వీధికాలువ నీటిలో బురదలో అపసోపాలు పడిపోతున్న శ్వానాథుడు ఊరిబైట పొలంలో ఇనకిరణాలు, క్రౌర్యంతో కాయక్లేశ పడుతున్న సేద్యగాని శరీరంమీద పండివస్తున్న ఘర్మమౌక్తికాలతో ఒక తాజ్‌మహల్ కట్టాలని బుద్ధి పుట్టింది. మా కవిత్వంలో ఉండకూడని వస్తువూ, వాడకూడని భాషా లేనేలేదు. పలాయనత్వం పనికిరాదు. నల్లమందు నిషా పనికిరాదు. జీవితం ఎంత సహారా ఎడారి ఐనా, మేము మాత్రం మరి ఉష్ట్రపక్షులమై సంచరించలేము.

జీవితం మాలిన్య భూయిష్టం అని చెప్పుకొంటాము. వేలెత్తి చూపిస్తాము. జీవితంలో మాలిన్యాన్ని గాలించి క్షాళితం చేస్తాము."

ఈ దృక్పథాన్ని అంటే వస్తువును సామాజిక విమర్శనాదృష్టితో తరచి చూడడం వాస్తవిక వాద లక్షణమని నారాయణ బాబు "రుధిర జ్యోతి" కావ్యాన్ని ప్రస్తావించుతూ శ్రీ రోణంకి అప్పలస్వామి పేర్కొన్నారు వాస్తవికతనేగాక అధివాస్తవికతను, బీభత్సాన్ని, సెక్స్‌నీ స్ఫురించే కవితలు రాశాడు. కదన కుతూహలరాగం, గడ్డిపరకలు, జ్వలన, భగత్ సింగ్ మొదలైన కవితలలో విప్లవ ఛాయలు, దళితవర్గాలను వస్తువుగా స్వీకరించే అభ్యుదయ ధోరణి కనపడతాయి.

ఈ తిరుగుబాటు కవులకు కొంత ముందుగా ముద్దుకృష్ణ, ఇంచుమించు అదే కాలంలో "పాప" మొదలైనవారున్నారు.

భావ కవిత్వంపై తిరుగుబాటుచేసిన కొందరి కవుల ప్రస్తావన వచ్చినపుడు సహజంగానే శ్రీశ్రీ ప్రథమంగా స్ఫురిస్తాడు. శ్రీశ్రీ భావకవిత్వ కుబుసం విడిచిన తర్వాత అతని కవిత్వాన్ని రెండు దశలుగా విభజించవచ్చు. ఒకటి "మహాప్రస్థానం"; రెండవది 1940 తర్వాత రాసిన అధి వాస్తవికతాది ప్రయోగ కవితలు. భావ కవిత్వంపై తిరుగుబాటు చేసిన వారిందరుండగా శ్రీశ్రీనే ఆంధ్రాభ్యుదయ సాహిత్యానికి మూలవిరాట్టని ఎందుకు నిర్ణయించారు? దీనికి కుందుర్తి ఇచ్చిన సమాధానం సవ్యమనిపించుతూంది:

"కవితా రూపంలో కొత్తకోసం తాపత్రయపడి ఓం ప్రథమంగా కొన్ని ప్రయోగాలు చేసి చూపినవాడు శిష్ట్లా ఈ విషయం శ్రీశ్రీయే చాల సందర్భాలలో అంగీకరించాడు. అయితే, యీ యుగకర్తృత్వం శిష్ట్లాకు రాక శ్రీశ్రీకి రావడానికి కారణం కావ్యవస్తువులో శ్రీశ్రీ తెచ్చిన విప్లవమే. ఆయన చెప్పిన కొత్త సిద్ధాంతాలు, చూపిన కొత్త ఆదర్శ లోకాలు, భావించిన అభ్యుదయ పథాలు ప్రజలను బాగా ఆకర్షించినవి. ఏ కవితా రూపములో చెప్తున్నాడు అనే స్పృహ మనకు లేకుండా చేసి, శ్రీశ్రీ తన నూతన కావ్యవస్తు మార్గాన్ని తీర్చిదిద్దాడు. గురజాడ ఆరంభించిన యీ మార్గం ఆయన తరువాత వచ్చిన కవులు అనతికాలంలోనే మరచిపోయి ప్రకృతి, ప్రేయసుల వ్యవహారాలతో కావ్యాలను నింపుతున్న రోజుల్లో శ్రీశ్రీ మార్గం కొట్టవచ్చినట్లు కనిపించి, నిజంగా యిది కొత్తది అనే అభిప్రాయం కల్పించినందువల్ల పాఠకులందరూ ఆ నూతన యుగప్రవక్తవైపు ఆకర్షితులు కాక తప్పలేదు" (విశ్వసాహితి, 1967 ఆగస్టు).

"మహాప్రస్థానం"లోని గేయాలన్నీ 1933-41 సంవత్సరాల మధ్య రాసినవే ("నీడలు" అనే గేయం తప్ప). ఈ కావ్య అవతరణ కాలంనాటి పరిస్థితులను ఇంతకు ముందొకసారి ప్రస్తావించాను. ఈ కాలంలోనే మార్క్సిస్టు గ్రంథ పరిచయమూ, గోర్కీ మొదలైన వారి రచనల అనువాదాలూ, శ్రామికవర్గ పార్టీల జననం సంభవించాయి. అంతర్జాతీయ రంగంలో అభ్యుదయ రచయితల ఉద్యమం ఆవిర్భవించింది. మన దేశంలో కూడా అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. 1936 ఏప్రిల్‌లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన ప్రథమ మహాసభ జరిగింది. 1932 లో ఆంగ్లసాహిత్యంలో New Signatures (కొత్త సంతకాలు) ఉద్యమం ప్రారంభమైంది. ఫ్రెంచి జాతీయ గీతం, హరీన్ ఛటోపాధ్యాయ 'షురూ హువా హై జంగ్', నజ్రుల్ ఇస్లాం విప్లవ గీతాలు, ఎడ్గార్ ఎలన్‌పో, గురజాడ కవికొండల గేయాలు మహాప్రస్థాన గేయానికి ప్రేరకాలని శ్రీశ్రీయే ఒక చోట చెప్పుకొన్నాడు. 1937 లో రాసిన "ప్రతిజ్ఞ" గేయాన్ని మెచ్చుకుంటూ అభ్యుదయ రచయితల లండన్ మేనిఫెస్టో సారాంశాన్ని అంతా 'ఇందులో దించేశావోయ్' అని అబ్బూరి రామకృష్ణరావు గారన్నారు. ఆనాటి ప్రపంచ వాతావరణం మన దేశంలో కమ్యూనిస్టు రాజకీయాలను సృష్టిస్తూ ఉంటే, శ్రీశ్రీ ప్రతిభ సంపూర్ణ వికాసానికి, అభ్యుదయ కవితకు దోహదం చేశాయి.

శ్రీశ్రీ మహాప్రస్థానంలో ఛందో బందోబస్తులన్నీ ఛట్ ఫట్ మని తెంచివేయాలని నినాద మివ్వడమే కాదు. కవితను ప్రజాదృక్పథంతో ఆవాహన చేశాడు. స్థూలంగా మార్క్సిజంచే ప్రభావితుడయ్యాడు. వర్తమాన సమాజాన్ని, చరిత్రను విశ్లేషించిన మార్క్సిస్టు తత్వం ఆలంబనగా కొన్ని గేయాలు, చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో వివరించే లాంటివి కొన్ని ఉన్నాయి, ఇతఃపూర్వం నవ్య కవులు కూడ గ్రహించని కవితా వస్తువులను తీసుకొని వస్తువులో నవ్యత సాధించాడు. భావనలో, శబ్దశక్తిలో, ఛందస్సులో కొత్త పుంతలు తొక్కినాడు. వీటన్నిటితోపాటు ఎన్నుకొన్న వస్తువు శ్రీశ్రీని అభ్యుదయ కవితోద్యమానికి వైతాళికునిగా చేసింది. 1936 లోనే భారతదేశంలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడినా - 1943 నాటికిగాని తెలుగు నాట కాలూనలేదు. 1933-43 మధ్య తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేసిన మరి కొన్ని అంశాలున్నాయి. మార్క్సిస్టు శాస్త్రీయ గ్రంథాల అనువాదాలే గాక, సోషలిస్టు దృక్పథంతో రాసిన నవలల, కవితల అనువాదాలు వెలువడ సాగినవి. విదేశాలలోని వామపక్ష సాహిత్యోద్యమాల ప్రభావం మనపై పడుతోంది.

తెలుగు సాహిత్యంలో వచ్చిన కవితా పరిణామాన్ని ఇదివరకే చూశాం. వచన రచనలో గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషోద్యమం విజయ ప్రాంగణంలో నిలబడింది. తాపీ ధర్మారావుగారి లాంటి పండితులు పాతపాళీ వదలి కొత్తపాళీ ధరించారు.

గ్రాంథికభాష కొన్ని కావ్యాలలోను, యూనివర్సిటీల లోనూ మాత్రమే తలదాచుకొంటూ ఉంది.

ఈ పరిస్థితులలో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం శ్రీ తాపీ ధర్మారావుగారి అధ్యక్షతను 1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో తెనాలిలో ప్రథమ మహాసభ జరుపుకొంది.

ప్రారంభ దశలో ఉండే కొన్ని సాధారణ సమస్యలే ఈ ఉద్యమాన్ని కూడా ఎదుర్కొన్నాయి. "అభ్యుదయం" అంటే ఏమిటి? ఇందులో కొత్తదనం ఏమిటి? అని కొందరు ప్రశ్నించితే, కొందరు గతాన్నంతా అభ్యుదయం పూర్తిగా నిరసించుతుందనే దురభిప్రాయాన్ని వెలిబుచ్చారు. గత చరిత్ర అధ్యయనానికి మార్క్సిజం తోవ చూపుతుంది. గతంలోని మంచిని స్వీకరించి, చెడును తొలగించుతుంది. అందుచేతనే ఆనాటి అభ్యుదయ సంఘ ప్రణాళిక సాహిత్యాన్ని ప్రజలకు సన్నిహితం చేయాలనీ, హేతువాద బుద్ధితో పాత నమ్మకాల్ని, ఆచారాల్ని పరిశీలించి చూడాలనీ కోరింది. భారతీయ సంస్కృతిలోని సుసంప్రదాయాలను పరిరక్షించడంతోపాటు, సమాజంలోని క్షీణ ధోరణులను నిర్దాక్షిణ్యంగా విమర్శించాలని కోరింది. నిస్తబ్ధత, నిష్క్రియాపరతనూ నిరసించింది. జాతి మత కక్షలను, జాతి విద్వేషాన్ని, వర్గ దోపిడీని ప్రేరేపించే రచనా ధోరణులను ప్రతిఘటించాలని కోరింది. అభ్యుదయకరమైన మార్పులకు దోహదం చేసే ప్రతి రచనా అభ్యుదయకరమని నిర్వచించింది.

అభ్యుదయ కవిత్వం శబ్ద శిల్పాన్ని విస్మరిస్తుందనే విమర్శ ఒకటి వుంది, కాని, అది నిజంకాదు. వస్తువుకు అగ్రస్థానమిచ్చి, సరళత స్పష్టత సాధ్యమైనంతవరకు ప్రజలకు సన్నిహితంగా ఉండటం అభ్యుదయ కవితోద్యమం తన లక్ష్యంగా పెట్టుకొంది.

అభ్యుదయ రచయితల సంఘం రాజకీయ సంఘం కాదు. కాని, రాజకీయాలను స్పృశించడమే మహాపరాధంగా భావించదు. ఆనాటి అభ్యుదయ రచయితల లక్ష్యం దేశానికి స్వాతంత్ర్యం సముపార్జించడం, ఫాసిస్టు విషదంష్ట్రల నుండి ప్రపంచాన్ని, సంస్కృతిని, సాహిత్యాన్ని పరిరక్షించుకోడం, వర్గదోపిడీకి గురియైన పీడితప్రజలను జాగృతం చేయడం.

ఇందులో అనేక అంశాలతో ఏకాభిప్రాయం ఉన్నందునే అనేకమంది పండితులు, నవ్య సాహిత్య పరిషత్ కార్యదర్శితోసహా ఇతర ప్రముఖులు, భావకవితా జగత్తులో మకుటాయమానంగా నిలిచిన కృష్ణశాస్త్రి మొదలైనవారు ఈ ఉద్యమంలోకి వచ్చారు.

అభ్యుదయ రచయితల సంఘం మీద ప్రాథమిక దశలో వెలువడిన అనేక కుశంకలకు దాని ఆచరణే సమాధానమిచ్చింది. సాహిత్య పాఠశాల నిర్వహించింది. చిలకమర్తి స్వీయచరిత్రను ప్రచురించింది. ఒక విమర్శకు డన్నట్లు గురజాడ, గిడుగు, కందుకూరికి అంతకుపూర్వం లేని స్థానం లభించింది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో అభ్యుదయ రచయితలు నిర్వర్తించిన పాత్ర ప్రముఖమైనది.

జపాను, మన సరిహద్దుల్లో తొంగిచూస్తున్నపుడు, సోవియట్ పై దాడిచేసిన నాజీజర్మని స్వైరవిహారం చేస్తున్నపుడు, ఫాసిజాన్ని ప్రతిఘటించడం, స్వాతంత్ర్యాన్ని సాధించడం లక్ష్యంగా అభ్యుదయ రచయితల సంఘమూ, ప్రజానాట్యమండలీ అపూర్వ కృషి చేశాయి. జానపదరీతులను సముద్ధరించి ప్రబోధ గేయాలు, నాటికలు, బుర్రకథలు, వీధిభాగవతాలు మొదలయినవాటిద్వారా ప్రజలను జాగృతం చేశాయి. సుంకర సత్యనారాయణ, ముక్కామల నాగభూషణం, కోగంటి గోపాలకృష్ణయ్య, లక్ష్మీకాంత మోహన్, బొల్లిముంత శివరామకృష్ణ, నార్ల చిరంజీవి, కోసూరి పున్నయ్య. నాజర్, కొనకళ్ల వెంకటరత్నం, అయ్యపు వెంకటకృష్ణయ్య, వేములపల్లి శ్రీకృష్ణ, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, పీసా లక్ష్మణరావు, వట్టికొండ రామకోటయ్య, కొత్తపల్లి రంగారావు విద్వాన్ ప్రయాగ, మహీధర రామమోహనరావు, అనిశెట్టి ఈ రచనలు చేసినవారిలో ముఖ్యులు.

ఇదేకాలంలో సాహితీరంగంలో అద్భుత సంచలనాన్ని సృష్టించినవారు "నయాగరా" కవులు. వీరి రచనలు కొన్ని అభ్యుదయ రచయితల సంఘం నిర్వహించిన పత్రికలలో ప్రచురించబడినా, అవి 1944 లోనే "నయాగరా" పేరిట కవితా సంపుటిగా వెలువడ్డాయి. సీతారామరాజు మన్య విప్లవం, విప్లవ నాయకుడు ఠాకూర్ చంద్రసింగుని కీర్తించడమేకాదు – వీరి కవిత్వ పరిధి పసిఫిక్ యుద్ధరంగంనుండి బర్మా, పారిస్, మాస్కో, చైనా వరకు; సోల్జర్లు, పైలట్లనుండి సామాన్య కార్మిక కర్షకులు, బిచ్చగాళ్లు, దిక్కుమాలిన కన్యలవరకు వ్యాపించింది.

బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం ఈ నయాగరా కవులు.

మహాప్రస్థానంలో నిర్దిష్టంగా కన్పించని కావ్య వస్తువు ఈ కావ్యంలో కనపడిందని చెప్పవచ్చు. "అభ్యుదయ కవిత్వ వికాసదశలో గమనింపదగిన మజిలీ 'నయాగరా' కవితా సంపుటి" అని సి. నారాయణరెడ్డి గారన్న వాక్యాలతో ఏకీభవించనివారుండరు.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలోనే బెంగాల్, విశాఖ, రాయలసీమ కరువుల బీభత్స విలయతాండవం అభ్యుదయ కవులను ఆర్ద్రమొనర్చింది. ఆనాడు సామాన్య ప్రజలు పడుతున్న దైనందిన కష్టాలు కావ్య వస్తువులైనాయి. ఆనాటి అభ్యుదయ కవులను అర్థం చేసుకోవాలంటే ఈ క్రింది ఉదాహరణ చాలు – 1945 సెప్టెంబరులో మచిలీపట్టణంలో జరిగిన అభ్యుదయ సారస్వతోత్సవాల సందర్భంగా వాగ్గేయకారక శ్రీహరి నాగభూషణం గారిలా అన్నారు :

"మన దేశం యెలా బాగుపడాలి? మన సంస్కృతి

ఎలా ఔన్నత్యం పొందాలి? అని అభ్యుదయ రచయితలు కృషి చేస్తున్నారు. శాశ్వత ధర్మాలను నూతన రీతులతో, నూతన భాషలో అభ్యుదయ రచయితలు చెబుతున్నారు. మనం పరిణామం పొందుతూ వచ్చాం. పాశ్చాత్య విద్యతో పరిశీలనా దృష్టి మనకు హెచ్చింది.

"జన సామాన్యం చాలా బాధలు పడుతోంది. బ్రహ్మజ్ఞాని మొదలు సాధారణ మానవుని వరకు అనేక ఇబ్బందులు పడుతున్నారు. ఈ ఇబ్బందులను పరిష్కరించుకోవాలి. పరిష్కారమార్గాలను వెదకడానికి అభ్యుదయ రచయితలు కృషి చేస్తున్నారు."

నైజాముకు, తెలంగాణా గ్రామీణ ప్రాంతాలలోని ఫ్యూడల్ నిరంకుశ వర్గాలకు, రజాకార్లకు వ్యతిరేకంగా సాయుధ సంఘర్షణ జరిగిన కాలంలో అటు తెలంగాణాలోను, ఇటు ఆంధ్ర ప్రాంతంలోను అపూర్వ చైతన్యం వెల్లివిరిసింది.

ఆనాటి సంఘర్షణను నాటక రూపంలో సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు "మా భూమి" నాటకం ద్వారా, వీరకంకణం మొదలైన నాటికలద్వారా చిత్రించారు. 'మా భూమి'కి లభించిన ప్రాచుర్యం, ఆదరణ, అది కల్గించిన చైతన్యం అపారమూ, అపూర్వమూ. పొట్లపల్లి రామారావుగారు తెలంగాణా జీవితాన్ని సమర్థవంతంగా చిత్రించారు. కొన్ని బుర్రకథలు వెలువడ్డాయి. సంగ్రామంలో పాల్గొనే సమరయోధులే ఎన్నో గేయాలు స్వయంగా రచించారు. ఆనాడవి కావ్యరూపంగా ముద్రితం గాకున్నా ఇటీవల అవి పుస్తక రూపాన ప్రకటింపబడ్డాయి. ఇక తెలంగాణాలో పుట్టిపెరిగి, తెలంగాణా విముక్తి ఉద్యమంలో జైలుపాలైన దాశరథి, "నా తెలంగాణ కోటి రత్నాల వీణ"యని మాతృస్తవంతోనే సంతృప్తిపడలేదు. "మా నిజాం రాజు జన్మజన్మాల బూజు" అన్నాడు. "ముసలి నక్కకు రాచరికమ్ము దక్కునే" అని ప్రశ్నించాడు. "రైతుదే, తెలంగాణము రైతుదే" అని ఉద్ఘాటించాడు. పొట్లపల్లి రామారావు, కాళోజీ, అద్దూరి అయోధ్య రామకవి తెలంగాణా విముక్తికై కవితల నాలపించినవారు. తెలంగాణా విముక్తి సంగ్రామ సమయంలో వెలువడినదే సోమసుందర్ 'వజ్రాయుధం', 'ఖబడ్దార్ నిజాం పాదుషాహే', 'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు'లాంటి గేయంలోని చరణాలు ఆనాటి చరిత్రలో ఒక భాగమయ్యాయి. అనిసెట్టి, రెంటాల, రమణారెడ్డి, అవసరాల మున్నగువారు కూడ తమ తమ కావ్యాలలో తెలంగాణా విముక్తి ఉద్యమాన్ని చిత్రించారు. తెలంగాణా విముక్తమై, భారతదేశంలో లీనమైన తర్వాత గంగినేని వీర తెలంగాణా యోధుల జీవితాలను రచించాడు. అంతకుముందు తెలంగాణా గురించి గేయాలను రచించాడు. కుందుర్తి "తెలంగాణా"ను సమగ్ర కావ్యంగా రచించాడు. భారతగాథలోని పర్వ విభజనను పోలిన అధ్యాయాలుగా విభజించాడు. కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన తెలంగాణాలో "సంగం" (సంఘం) నిర్వర్తించిన అద్వితీయ ప్రతిఘటనకు అమరత్వం కల్గించాడు. వస్తురీత్యానే గాక భావ వ్యక్తీకరణలో కూడ విన్నూతమైన పోకడలను సృష్టించాడు.

తెలంగాణా ఇతివృత్తాన్నే ఆరుద్ర "త్వమేవాఽహమ్"గా రూపొందించాడు. 1948 లో రజాకార్లచే చెరచబడ్డ స్త్రీ కథనం కృష్ణాపత్రికలో చదివి ఈ కావ్యాన్ని మొదలెట్టాడు ఆరుద్ర. ఐతే, ఈ కావ్యం చెప్పినతీరు "కొరకరాని కొయ్య" ఐనందున ఆశించినంత ప్రయోజనం చేకూరలేదు. తర్వాత దాశరథి, ఆరుద్రల ఉత్తర ప్రత్యుత్తరాలు "కవి హృదయం", "వ్యాఖ్య"గా అనుబంధంగా చేర్చబడినాయి. ఇవి పఠితకు కొంత సాయం చేశాయి. ఆర్. సుదర్శనం వంటి విమర్శకుడు 'త్వమేవాఽహం' పై జరిగిన తర్జన భర్జనలను ఆధారం చేసుకొని, "అభ్యుదయ ఉద్యమ పరిసమాప్తికి ఇది ప్రారంభం" అని పొరబడ్డాడు.

వీరేగాక తెలంగాణా పోరాటంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాల్గొన్న కవులు, ఈ పోరాటస్ఫూర్తితో కవులైనవారు ఎందరో ఉన్నారు. దీని ఫలితంగానే జానపదరీతులలో పాటలు, బుర్రకథలు, వొగ్గు కథలు, గేయాలు అనేకం రచింపబడ్డాయి. సుద్దాల హనుమంతు, యాదగిరి, తిరునగరి రామాంజనేయులు మొదలైనవారు తెలంగాణ పోరాటరంగంలో ఉన్నవారే.

తెలంగాణా సాయుధ ప్రతిఘటనోద్యమాన్ని చిత్రించే కథలు, ఆ ఉద్యమ కాలంలోని సామాజిక సంఘటనలను చిత్రించే కథలు ఈ కాలంలోనే వచ్చాయి. కాళోజీ, వట్టికోట ఆళ్వారుస్వామి, పొట్లపల్లి రామారావు, తెన్నేటి సూరి, లక్ష్మీకాంతమోహన్, సి.వి. కృష్ణారావు, తుమ్మల వెంకట రామయ్య మున్నగువారీ కథలు రాశారు.

గంగినేని వెంకటేశ్వరరావు ఉద్యమ విరమణ అనంతరం "ఎర్రజండాలు" పేరిట మూడు సంపుటాలుగా తెలంగాణా అమరవీరుల జీవితగాథలను ప్రచురించాడు. అభ్యుదయ రచయితల సంఘంతో నిర్మాణరీత్యా సంబంధంలేని రచయితలు కూడా కథలు రాశారు. ఇందుకు ఉదాహరణ గోపీచంద్.

నవలల విషయం చూస్తే, తెలంగాణాలో నిజాం నవాబు తొత్తులైన రజాకార్లను, భూస్వామ్యవ్యవస్థను, స్థానిక పెత్తందార్లైన "దొర"లనూ ఎదిరించి సాయుధ పోరాటం సాగించిన కాలంలో తెలంగాణా గురించిన మొట్ట మొదటి నవల బొల్లిముంత శివరామ కృష్ణగారు రచించిన "మృత్యుంజయులు". ఆ తర్వాత 1947 ప్రాంతంలో మహీధర రామమోహనరావుగారి నవలలు "ఓనమాలు", "మృత్యువు నీడల్లో" ప్రచురించబడ్డాయి. 1934–40 మధ్య కాలంనాటి తెలంగాణా జీవితాన్ని చిత్రించే వట్టికోట ఆళ్వారుస్వామిగారి "ప్రజల మనిషి", 1940–45 నాటి తెలంగాణా జీవితాన్ని చిత్రించే "గంగు" తెలంగాణా సాయుధ పోరాట విరమణా

వంతరం. వెలువడిన నవలలు. భాస్కరభట్ల కృష్ణరావు నవల 'యుగసంధి' కూడా ఇదే కాలంలో వెలువడింది. అలాగే లక్ష్మీకాంత మోహన్ "సింహగర్జన", గొల్లపూడి నారాయణ రావుగారి నవల "తెలుగుగడ్డ", దాశరథి, రంగాచార్యులుగారు రచించిన "చిల్లర దేవుళ్లు", "మోదుగుపూలు", "మాయ జలతారు", "జనపదం" అనే నవలలు కూడా. 1986 లో ఒక మాసపత్రికలో సీరియల్‌గా వెలువడి, పుస్తకరూపంలో వచ్చిన నవల తిరునగిరి రామాంజనేయులుగారి "సంగం."

అభ్యుదయ రచయితలు సమకాలీన సంఘటనలకు స్పందించారు. స్వాతంత్ర్యేచ్ఛ, మతోన్మాద వ్యతిరేకత, హిందూ ముస్లిం సఖ్యత, ఫాసిస్టు ప్రాతికూల్యం, బెంగాల్, రాయలసీమ, విశాఖ కరువులు, తెలంగాణా సాయుధపోరాటం, భారత నావికా తిరుగుబాటు మొదలైనవెన్నో ఇందుకు ఉదాహరణంగా తీసుకోవచ్చు.

ఐతే, అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి ఆవిర్భావాలకు తెలంగాణా విమోచనోద్యమం కారణమంటూ పొరపడినవారు లేకపోలేదు. తెలంగాణా విమోచనోద్యమంతో అభ్యుదయ రచయితలు మమేకమైన మాట నిజమేకాని, అభ్యుదయ రచయితల సంఘ ఆవిర్భావానికి తెలంగాణా పోరాటం కారణమనడం చరిత్ర రీత్యా పొరపాటు.

"విరసం" ప్రముఖులలో ఒకడైన వరవరరావు "తెలంగాణ విమోచనోద్యమం – తెలుగు నవల, సమాజ సాహిత్య సంబంధాలు ఒక విశ్లేషణ" అనే గ్రంథంలోని పరిచయంలో ఇలా రాశారు:

"తెలంగాణా విమోచనోద్యమం అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్య మండలి వంటి సాహిత్య సంస్థల పుట్టుకకు కారణమైనట్లుగానే నక్సలబరీ శ్రీకాకుళాలు విప్లవ రచయితల సంఘం, జననాట్యమండలి వంటి సాహిత్య సాంస్కృతిక సంస్థల ఆవిర్భావానికి కారణమైనవి." (పేజీ – 7.)

ఇది పూర్తిగా పొరబాటు. 1943 లోనే అభ్యుదయ రచయితల సంఘం ఆంధ్రదేశంలో ఏర్పడింది.

1945–55 మధ్యకాలంలో దాశరథి, సోమసుందర్, రాంషా, అనిసెట్టి, నారపరెడ్డి, రెంటాల, గంగినేని, రమణారెడ్డి, కుందుర్తి, శశాంక, కాళోజీ మొదలగువారు తమ అభ్యుదయ గేయాలను సంపుటీకరించి ప్రకటించారు.

1953 నాటికి కవిగా సాక్షాత్కరించిన సి. నారాయణరెడ్డి ప్రతిభ తొలి కావ్యాలలోనే వెల్లడయింది. ఖండకావ్యాలే వ్యాప్తిగా ఉన్న రోజుల్లో "కావ్యా"లకు తిరిగి ప్రాణం పోశాడు. ఈయన ఖండకావ్యా లనేకంలో అభ్యుదయ దృక్పథం ప్రస్ఫుటంగా బలీయంగా హృద్యంగా చిత్రింపబడింది.

వచన కవితకు రూపంలోనూ, వస్తువులోనూ, సౌందర్యంలోనూ మాన్యత కల్గించిన వారిలో బాలగంగాధర తిలక్ ప్రథమ శ్రేణిలోకి వస్తాడు.

అభ్యుదయ రచయితల సంఘం 1943–48 మధ్య తెలుగు తల్లి, అభ్యుదయ పత్రికలను నిర్వహించింది. 1955 లో తిరిగి అభ్యుదయను పునరుద్ధరించి, 1959 వరకు నిర్వహించింది.

ఈ కాలంలోని కొందరు అభ్యుదయ రచయితలను ప్రస్తావించాలి. కొడవటిగంటి కుటుంబరావు – జీవిత సత్యాన్ని అన్వేషించే కథలతోపాటు, గల్పికల ద్వారా సమాజంలోని క్షీణ శక్తులను దుయ్యబట్టాడు. అభ్యుదయ సాహిత్యాన్ని వివరించే అనేక వ్యాసాలు రాశాడు. అభ్యుదయ పత్రిక, ఉద్యమాలకు దన్నుగా ఉన్నాడు.

అభ్యుదయ రచయితల సంఘ స్థాపననుండీ, ఆ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించుతూ వచ్చిన చాగంటి సోమయాజులు (చాసో) తమ కథానికల ద్వారా అభ్యుదయ సాహిత్యోద్యమంలో ప్రముఖస్థానం వహించాడు.

నవయుగ వైతాళికులలో ఒకరైన గురజాడ రచనలను వెలుగులోకి తీసుకురాడానికి కారకులూ, ఆద్యులలో ఒకరైన సెట్టి ఈశ్వరరావు అభ్యుదయ సాహిత్యోద్యమంపై రాసిన వ్యాసాలూ అరుదుగానైనా రాసిన కథలూ, గేయాలూ, గురజాడ రచనలను పునఃపరిశోధించి రాసిన పీఠికా వ్యాసాలూ అభ్యుదయ సాహిత్యానికి పరిపుష్టి సమకూర్చాయి.

ఈ సందర్భంగా ఎన్నో ఇబ్బందులకులోనై, ఒంటరిగా గురజాడ రచనలను పరిశోధించి ప్రచురణకు తయారుచేసిన అవసరాల సూర్యారావును ప్రత్యేకించి ప్రశంసించాలి. ఆ కృషిలో కొన్ని పొరపాట్లు జరిగినంత మాత్రాన, సూర్యారావు పరిశ్రమను విస్మరించలేము.

కె.వి. రమణారెడ్డి 'మహోదయం' గురజాడ సాహితీ కృషిని, బహుముఖంగా విశ్లేషించిన విశిష్టరచన.

విద్వాన్ విశ్వం అభ్యుదయ గేయాలెన్నోరాసినా "పెన్నేటి పాట" చాలా కాలానికిగాని వెలువడలేదు. రాయలసీమ జీవితాన్ని, దాని "కన్నీటి పాట"ను వినిపించాడు.

అభ్యుదయ ఉద్యమంలో కొంత ఆలస్యంగా చేరినా, గజ్జల మల్లారెడ్డి కడపంక్తిలో కూర్చోలేదు. 'శంఖారావం' ఊదాడు. ఆయన వ్యంగ్యం కొందరికి ఊపిరి సల్పనీయదు. "రేపటి కవి" అని శ్రీశ్రీ ప్రశంసించాడు. శ్రామికజన పక్షపాతాన్నేగాక, ప్రస్తుత వ్యవస్థలోని కుటిలత్వాన్నీ కుళ్ళునూ అతి నిశితమైన వ్యంగ్య రూపంలో విమర్శిస్తూ మల్లారెడ్డి కవిత్వం పరవళ్ళు తొక్కుతుంది.

రాంభట్ల కృష్ణమూర్తి రచయిత, చిత్రకారుడు, కవితను కార్టూన్‌లుగా చిత్రించి "శశ విషాణం" పట్టి సాధించినవాడు. ప్రబోధ గేయాలేగాక చక్కని వ్యంగ్యస్ఫోరకమైన రచనలెన్నో జానపద రీతుల్లో రాశాడు. అభ్యుదయ ప్రాచీన, ఆధునిక,

సాహిత్యం ధోరణులను విపులీకరించే వ్యాసాలనేకం రాశారు. ఈయన రచనలింకా పుస్తకరూపంలో రావలసి వున్నాయి.

1955–70 మధ్య అభ్యుదయ సాహిత్యరంగం ఆటు పోటులకు లోనైంది.

వర్తమాన సమాజంలో కుళ్ళునూ దుర్గంధాన్నీ, అన్యాయాలనీ, అక్రమాలనీ నిరసించేందుకు ఆక్రోశం, అధిక్షేపణ, దూషణలతో కూడిన కవితా ప్రక్రియలకు సి. విజయలక్ష్మి ఒక రకంగా ఆద్యులేమో! ఆ ధోరణిలోనే తర్వాత దిగంబర కవితోద్యమం బయలుదేరింది. 1970 లో అభ్యుదయ రచయితల సంఘం నుండి విడిపోయి, విప్లవ రచయితల సంఘం వెలసినప్పుడు ఈ దిగంబర కవులు అందులో చేరిపోయారు.

విరసంలో లబ్ధప్రతిష్ఠులైన కవులు, రచయితలు మొదట్లో చేరినప్పటికీ, దానికి స్థిరత్వం ఏర్పడలేదు. క్రమంగా విరసం నిర్మాణరీత్యానేగాక, సిద్ధాంతరీత్యాకూడా అనేక చీలికలకు లోనైంది.

సమకాలీన రాజకీయ సంఘటనలకు సాహితీపరులు స్పందించడం సహజమే. కాని, ఆ రాజకీయ ఉద్యమం తప్పొప్పుల ధోరణులకు గుడ్డిగా తలఒగ్గడం పనికిరాదు.

ఆంధ్రప్రదేశ్ సమగ్రతను విచ్ఛిన్నంచేసే "ప్రత్యేక ఆంధ్ర", "ప్రత్యేక తెలంగాణా" రాష్ట్రోందోళనలపట్ల విరసం వహించిన వైఖరి ఇందుకు ఒక ఉదాహరణ. వేర్పాటువాదాన్ని సహించలేని శ్రీశ్రీ విరసం అధ్యక్ష పదవికి రాజీనామా చేయడం, క్రమశిక్షణకుగాను ఆ రాజీనామాను ఉపసంహరించుకోడం ఈ సందర్భాన చెప్పాలి.

1973 లో గుంటూరు మహాసభలో అభ్యుదయ రచయితల సంఘం పునరుద్ధరింపబడింది. దీర్ఘకాల వ్యవధి పిమ్మట జరిగిన ఈ పునర్నిర్మాణ కృషిలో మొదట కొన్ని ఒడుదుడుకులు ఏర్పడినా, క్రమంగా అవి చక్కబడి ఐక్యప్రవంతి రూపొందుతున్నది. మౌలికంగా సరైన పంథాను చేపట్టిన ఫలితంగానే ఈ ఏకీకరణ సాధ్యమౌతున్నది.

సామాజిక వాస్తవికత, అభ్యుదయ దృక్పథంగల రచయితలతో రూపొందిన మరోశాఖ వచన కవితా ఉద్యమం. అభ్యుదయ రచనకు వచన రూపమే శిరోధార్యమని వీరి విశ్వాసం.

నూతన రూపాల స్వీకరణను అభ్యుదయ సాహిత్యోద్యమం ఎప్పుడూ హర్షిస్తుంది. కాగా, ఏదో ఒక్క రూపం మాత్రమే అనుసరణీయమని భావించదు. రూపంకంటె వస్తువు ప్రధానం. వస్తువుకు అనుగుణమైన రూపాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ రచయిత కున్నది. ఆయా రచయితల ప్రతిభా సామర్థ్యాల ననుసరించి, వస్తు రూప అనుసంధానం జరిగి కవితా ప్రవంతి జాలువారుతుంది.

ఈ విశాల దృక్పథంతో దేశం లోపల, వెలుపల, ప్రజాతంత్ర ఉద్యమాలకు స్పందిస్తూ, అభివృద్ధి నిరోధక ఫాసిస్టు ఉద్యమాలను ఖండిస్తూ, నేడు జీవన్మరణ సమస్యఅయిన అణుయుద్ధ నివారణ, ప్రపంచశాంతి రక్షణలకై ప్రబోధ కవితకు నూతన వస్తు సముదాయాన్ని చేరుస్తూ నవ ప్రపంచ నిర్మాణానికి అభ్యుదయ సాహిత్యోద్యమం ముందుకు సాగుతున్నది. (1985)

[గమనిక: ఈ వ్యాస రచనకు అభ్యుదయ రచయితల సంఘ పత్రికలూ, ప్రచురణలుగాక డాక్టర్ సి.నారాయణ రెడ్డి "ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు, ప్రయోగములు", ఆయా రచయితల గ్రంథాలు తోడ్పడ్డాయి. వారికి కృతజ్ఞతలు.]

# తెలుగు సాహిత్యంలో 'విరసం'

డా॥ కె. రామమోహనరాయ్

తెలుగు సాహిత్యంలో 'విప్లవ రచయితల సంఘం' 1970 జూలై 4 వ తేదీన ప్రారంభమైంది. 1970–80 మధ్యకాలంలో తెలుగుసాహిత్యంలో ఉజ్జ్వలమైన పాత్రను నిర్వహించింది. 1980 తర్వాత ప్రముఖ రచయితలు చాలమంది 'విరసం' నుండి తప్పుకున్నప్పటికీ తెలుగు సాహిత్యంలో క్రియాశీలకమైన పాత్రను నిర్వహిస్తూనేవున్నది.

## 'విరసం' స్థాపన - నేపథ్యం:

1943–1955 సంవత్సరాలమధ్య అభ్యుదయ రచయితల సంఘం తెలుగు సాహిత్యాన్ని ప్రగతిమార్గంలో నడిపించింది. 1955 ఎన్నికలలో ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ పరాజయం పొందడంతో అభ్యుదయ రచయితల సంఘకార్యకలాపాలు మందగించాయి. జీవితపోరాటంలో అలసిపోయిన అభ్యుదయ రచయితలు జీవికకై వివిధవృత్తులను ఆశ్రయించారు. కొందరు సినిమారంగంలో ప్రవేశించి, ధనార్జనలో నిమగ్నమైనారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణ (1956) తర్వాత హైదరాబాదు కార్యరంగంగా వచనకవిత్వం విస్తరించింది. శ్రీ కుందుర్తి ఆంజనేయులు నాయకత్వాన 'ఫ్రీవర్స్' ఫ్రంట్ ఏర్పడి, వచన కవిత్వంలో వైవిధ్యానికి, అభ్యుదయ భావప్రచారానికి కృషి చేసింది.

ఒకప్పటి అభ్యుదయ కవులు క్రమంగా పాలక వర్గాన్ని సమర్థిస్తూ, ప్రజాస్వామ్య సోషలిజాన్ని కీర్తిస్తూ కవితలు రచించసాగారు. ఆరుద్ర, దాశరథిగారలు వీరిలో ప్రముఖులు "అభ్యుదయ కవుల ధర్మమా అని వర్గచైతన్యం గురించిపాడితే తప్ప మిగతాది కవిత్వం కాదేమోనన్న అపోహ ఆంధ్రదేశంలో అనవసరంగా ఊపిరి పీలుస్తోంది" అని ఆరుద్ర అభ్యుదయ రచనకు వర్గచైతన్యానికి సంబంధం లేదన్నంతగా మారారు. (ఉదయించని ఉదయాలు పీఠిక 1961.) ఆధునిక కవిత్వవైతాళికులు దురదృష్టవశాత్తూ ఒక పార్టీకి 'తాళికులై' పోవటం కవిత్వానికి శ్రేయస్కరం కాదనికూడ ఆరుద్ర అభిప్రాయపడ్డారు. "జండాలను నమ్మి పుండాకోర్ వికావద్దంటూ శ్రీ దాశరథి ప్రభుత్వ సంస్కరణలను, ప్రణాళికలను పొగడారు.

1962లో చైనా భారతదేశంపై దాడి చేసినప్పుడు జాతీయత పేరిట అభ్యుదయ కవులు పాలకపక్షాన్ని పూర్తిగా సమర్థించారు.

భారత కమ్యూనిస్టుపార్టీ సి.పి.ఐ., సి.పి.ఐ(ఎం) అని రెండుగా చీలిపోయింది. అంతర్జాతీయ కమ్యూనిస్టుల వైఖరిని సమర్థించడంలో అభ్యుదయ రచయితలలో భిన్నాభిప్రాయాలు పొడసూపాయి.

## దిగంబరకవుల తిరుగుబాటు:

1960 తర్వాత ప్రపంచ దేశాలు పెక్కింటిలోని యువ తరంలో తిరుగుబాటు ఉద్యమాలు తలెత్తాయి. మారుతున్న విలువలు అమిత తొందరగా మారిపోయి, నూతన వ్యవస్థ యేర్పడాలనే కోరిక యీ ఉద్యమాలకు కారణం.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత అన్ని జిల్లాలనుండి, ఎన్నో కుటుంబాలు జీవికకోసం రాజధాని హైదరాబాదు చేరుకున్నాయి.

తెలుగు వచన కవిత్వం కొద్దిమంది కవులు, సహృదయుల మధ్యనే పరస్పర ప్రశంసలు, చర్చలతో వుండిపోయింది. ఈ స్థితిలో యువకవులు కొందరి మనస్సుల్లో అలజడి తీవ్రరూపం ధరించసాగింది. "వచనకవిత్వానికి లక్షణాలుండాలా? వద్దా?" అన్న చర్చలతో, "భావగణం, భావలయ, అంత్యప్రాస నియమాలు" బాగోగులు వీటి చర్చలతో పొద్దుపుచ్చటం దుర్భరంగా తోచింది. ఆరుగురు యువకులు తెలుగు కవిత్వంలో ఏర్పడిన స్తబ్ధతను తొలగించటానికి 'షాక్ ట్రీట్‌మెంట్' పద్ధతిలో, తమకు నచ్చని వాటిని బూతు మాటలతో ఆక్షేపిస్తూ కవితలు రచించారు.

నగ్నముని (ఎం.హెచ్. కేశవరావు), నిఖిలేశ్వర్ (యాదవ రెడ్డి), చెరబండరాజు (బద్దం భాస్కరరెడ్డి), మహాస్వప్న (కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు), జ్వాలాముఖి (వీర రాఘవాచార్యులు), భైరవయ్య (మన్‌మోహన్‌సహాయ్)

అనేవారు దిగంబర కవులుగా మొదటికావ్య సంపుటి 1965 లో వెలువడింది. 1968 వరకు సాగిన వీరి తిరుగుబాటు మూడు కావ్య సంపుటాల ప్రచురణ తర్వాత ఆగిపోయింది.

స్వేచ్ఛా మానవుడికోసం తపించిన దిగంబర కవులు ప్రస్తుత సమాజం కుష్టు వ్యవస్థగా మారిందనీ, దీన్ని నాశనం చెయ్యాలనీ భావించారు. వ్యవస్థను మార్చాలంటే దాన్ని అసహ్యించుకోవడం సరియైన మార్గం కాదని; ప్రజల్లో కలిసిపోయి, ప్రజలను విప్లవానికి సమాయత్తం చేయాలని వీరిలో కొందరు గుర్తించి, విప్లవ రచయితల సంఘ స్థాపనకు తోడ్పడ్డారు.

దిగంబర కవుల ధర్మక్రోధాన్ని, తిరుగుబాటు స్వరూపాన్ని కొందరు అభ్యుదయ కవులు, విమర్శకులు సరిగా అర్థం చేసుకోలేదు. – "వీళ్ళు ఆరుమంది, అరిషడ్వర్గం లాగ... యీ సంపుటిలో దిక్ లు చాలానే వున్నాయి. కవిత్వం మాత్రం యెక్కడా లేదు" అని శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి దిగంబర కవులను విందించారు.

దిగంబర కవులు రాకపోతే అభ్యుదయ సాహిత్యోద్యమం నిస్తేజమైపోయిన తర్వాత ఏర్పడిన స్తబ్దత చెదిరిపోయేదికాదు.

## రాజకీయ నేపథ్యం:

పశ్చిమబెంగాల్ రాష్ట్రంలోని 'నక్సల్ బరీ' జిల్లాలో రైతులు, కూలీలు భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటం సాగించ సాగారు. తమ కష్టాన్ని దోచుకోజూస్తున్న భూస్వాములను వధించటం మొదలుపెట్టారు. దేశంలో అతివాద రాజకీయాలు తీవ్రరూపం పొందాయి. సి.పి.ఐ.(ఎం)లో చీలిక వచ్చి 'మార్క్సిస్టు–లెనినిస్టు పార్టీ' ఒకటి కొత్తగా ప్రారంభమైంది. ఈ పార్టీవారు నక్సల్ బరీలో ప్రారంభమైన వ్యవసాయ విప్లవాన్ని ఇతర ప్రాంతాలకూ వ్యాపింపజెయ్యటానికి పూనుకున్నారు. చారుమజుందార్, కానుసన్యాల్ గారలు వీరికి నాయకత్వం వహించారు. ఈ పోరాటం ఆంధ్రప్రదేశ్ లో శ్రీకాకుళం జిల్లా గిరిజన ప్రాంతాలకు వ్యాపించింది. అడవుల్లో జీవించే అమాయక ప్రజలను, ఇతర ప్రాంతాలనుండి వచ్చిన వ్యాపారస్తులు మోసం చెయ్యటాన్ని ఆ పార్టీవారు వ్యతిరేకించారు. వీరి పోరాటాలు హింసాత్మకంగా సాగాయి. భూస్వాములు కొందరిని హత్యచేసి; న్యాయాన్ని, చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకొని; దోపిడీదారులని తాము భావించిన వారిని పోలీసులకు పట్టివ్వటంగాక, ప్రజాకోర్టుల ద్వారా తామే విచారణ జరిపి, క్రూరంగా మరణశిక్షణలను అమలుజరిపారు. ప్రభుత్వం యీ పోరాటాన్ని అణచటానికి తీవ్రచర్యలు తీసుకున్నది.

విప్లవంపై ఆశలు పెంచుకొని, ఆంధ్రప్రదేశ్ లో మిగిలిన ప్రాంతాలనుండి మేధావులు, విద్యాధికులు శ్రీకాకుళం జిల్లాకు వెళ్ళి, అడవుల్లో రహస్య జీవితం గడుపుతూ ప్రజలకు రాజకీయాలు బోధించసాగారు. ఉద్యమాన్ని అణచేప్రయత్నంలో ప్రభుత్వం తీసుకున్న తీవ్రమైన చర్యల్లో అనేకమంది యువతీయువకులు ప్రాణాలు కోల్పోయారు. శ్రీకాకుళ రైతాంగ పోరాటానికి ఆదిభట్ల కైలాసం, వెంపటాపు సత్యం, సుబ్బారావు పాణిగ్రాహి నాయకత్వం వహించారు.

## మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి:

1970 ఫిబ్రవరి 1, 2 తేదీలలో మహాకవి శ్రీశ్రీకి షష్టిపూర్తిచేసి, ఆయన రచనలన్నీ తెలుగువారికి అందివ్వాలని సాహిత్యాభిమానులు భావించారు. శ్రీకాకుళ పోరాట నేపథ్యంలో విశాఖపట్టణంలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సభకు ప్రసిద్ధ సాహిత్యవేత్తలు చాలమంది హాజరయ్యారు.

శ్రీశ్రీని ప్రశంసిస్తూ ఉపన్యాసాలు సాగుతుండగా సాహిత్యవేత్తల మధ్య 'బాంబు'లాగా 'రచయితలకు సవాల్' అని విశాఖ విద్యార్థుల కరపత్రం ఒకటి తీవ్రసంచలనం కలిగిస్తూ వెలువడింది. ఆ కరపత్రంలో అభ్యుదయ రచయితలను విద్యార్థులు "మిమ్మల్ని మీరు తిరిగి చూసుకోండి. దొంగలంజకొడుకులసలే మెసిలే ఈ లోకంలో మీరు కూడ భాగస్వాములై వెళ్తున్నారు జాగ్రత్త" అని హెచ్చరించారు. "స్పానిష్ విప్లవంలో ప్రాణాలు పోగొట్టుకున్న క్రిస్టఫర్ కాడ్వెల్ లాగ, తాను రాసిన ప్రతిపద్యం గిరిజనుల నోటి ఊతపదంగా చేసి శ్రీకాకుళ విప్లవ పోరాటంలో వీరమరణం చెందిన సుబ్బారావు పాణిగ్రాహిగా సాహిత్యం జీవితాన్ని మార్చేశక్తిలా మీరెందుకు చెయ్యలేదు?" అని అభ్యుదయ కవులను నిలదీసి అడిగారు. "చేతనయితే రండి. నిజాన్ని నిర్భయంగా రాయండి. మేం ఉన్నాం. మీవల్ల ఉత్తేజితులై, మీరు చూపించేదారి పట్టి మీరూహించే మరోప్రపంచాన్ని వాస్తవం చేస్తాం" అని తమ సంకల్పాన్ని, దీక్షను ప్రకటించారు. అభ్యుదయ కవులు తమ స్థితికి కలవరపడ్డారు. దిగంబర కవులలో పెద్ద మార్పే వచ్చింది.

## తిరుగబడు కవుల తిరుగుబాటు:

దిగంబర కవులకున్నంత ఆవేశమూ వుండి, అశ్లీలాలు లేకుండ కవిత్వం రాసిన వారు తిరుగబడు కవులు. వీళ్ళు పదిమంది (వరవరరావు, అశోక్, లోచన్, కిషన్, ఎక్స్–రే, ఐ, సంజీవరావు, సుధాకర్, సుదర్శన్, యాదగిరిరావు). సమాజంలో దోపిడి తొలగిపోవాలంటే అన్యాయానికి గురి అవుతున్న వాళ్ళు తిరగబడాలని, అది సాయుధంగా జరగటం అవసరమని వీరు తలచారు. అణగారిన ఆర్తులందరినీ తిరుగబడమని కోరటమే వీరి కవిత్వ లక్ష్యం.

## అభ్యుదయ సాహిత్య సదస్సు బహిష్కరణ:

1970 జూలై 4, 5 తేదీలలో సెవెన్‌స్టార్స్ సిండికేట్ వారు అభ్యుదయ సాహిత్యసదస్సు జరపాలని నిశ్చయించారు. ఆ సదస్సుకు కవులతోపాటు మంత్రులను, సినిమానటులను కూడ ఆహ్వానించి, మహాకవి శ్రీశ్రీకి ఘనసన్మానం తలపెట్టారు. ఈ సదస్సుకు మంత్రులు, సినిమానటులను ఆహ్వానించటం తీవ్రవాదులకు నచ్చలేదు.

సన్మాన సంఘం ఇచ్చే డబ్బు తీసుకోనని ముందుగానే ప్రకటించి శ్రీశ్రీ మద్రాసునుండి హైదరాబాద్ వెళ్ళారు. అక్కడ విప్లవ రచయితల సంఘం స్థాపించటానికి కృతనిశ్చయులై వున్న రచయితల అభిప్రాయాలకు సమ్మతించి ఆయన ఆ సంఘం అధ్యక్షులయ్యారు.

## విప్లవ రచయితల సంఘం:

"సాయుధ విప్లవ బీభత్సుని సారధినై / భారత కురుక్షేత్రంలో / నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తాను / మంటలచేత మాట్లాడించి / రక్తంచేత రాగాలాపన చేయిస్తాను" (ఝంఝు) అని శ్రీశ్రీ విప్లవరచయితల సంఘం అధ్యక్షులుగా తన దీక్షను ప్రకటించారు.

"సంస్కరణ వాదానికి కాలం చెల్లిపోయింది. సాంస్కృతిక వ్యవహారాల్లో స్తబ్దత పేరుకొని ఉంది. అభ్యుదయ రచయితల ఉద్యమం కూడా శవప్రాయమైపోయింది. ఈ దుస్థితిని తొలగించుకొని జాతిని సమగ్ర విమోచనం వైపు నడిపించేందుకు విప్లవ రచయితలు సంఘం ఏర్పడుతున్నది" అని విప్లవ రచయితల ప్రకటించారు. విప్లవ రచయిత సంఘ స్థాపన ఒక చారిత్రక అవసరంగా వీరు తలచారు.

1971 సెప్టెంబరులో విప్లవ రచయితలసంఘం ప్రథమ మహాసభ జరుపుకున్నది. 1970 అక్టోబర్‌లో అధికారికంగా అవిర్భవించిన విప్లవ రచయితల సంఘానికి శ్రీశ్రీ అధ్యక్షులు. కొడవటిగంటి కుటుంబరావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి ఉపాధ్యక్షులు, కె.వి.రమణారెడ్డి ప్రధాన కార్యదర్శి. దిగంబర కవులలో నగ్నముని, చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు 'విరసం'లో చేరారు. ప్రజానాట్యమండలి కళాకారుడు నాజర్ కూడ విరసం సభ్యులైనారు. వరవరరావు, శ్రీపతి, చలసాని ప్రసాద్, కృష్ణాబాయి, అశోక్, లోచన్, యం.వి. రమణారెడ్డి మొదలైనవారు సభ్యులుగా విరసం సాహిత్యరంగంలో చైతన్యవంతమైన పాత్రను నిర్వహించింది.

"మార్క్సిస్టు దర్శనం పునాదిగా వెలువడే భావాలను ప్రచారం చేస్తూ రచయితలు సామాజిక చైతన్యాన్ని ఉద్దీపింపజెయ్యాలి... ప్రజల దీర్ఘకాలిక విమోచన పోరాటాలను సమర్థిస్తూ విప్లవ రచయితల సంఘం సాహిత్యకృషి సాగిస్తుంది" అని 'విరసం' తన ప్రణాళికలో పేర్కొన్నది.

"విప్లవ రచయితల సంఘం ఒక రాజకీయ పక్షాన్ని అనుసరించి వెళ్లటానికి నాకు అభ్యంతరం ఉన్నది. రాజకీయ పార్టీలు తిరిగే మెలికలన్నీ సాహిత్యం తిరగటం సాధ్యం కాదు. సాహిత్యం ప్రజలకూ ప్రజా జీవితానికి సంబంధించినది" అని కొడవటిగంటి 'విరసం' ప్రారంభంలోనే హెచ్చరించారు. (సృజన-1970 ఆగస్ట్, అక్టోబర్). కాని, ఆచరణలో విరసం సి.పి.ఐ.(ఎం.ఎల్) పార్టీ చీలికలలో ప్రధానపక్షమైన పీపుల్స్‌వార్ గ్రూప్‌కి అనుకూలంగా ఉంటూవచ్చింది.

'సాహితీమిత్రులు' నిర్వహించిన 'సృజన' పత్రిక 13 సంచికల తర్వాత విరసం వాణిగా మారింది. ఇంకా "అరుణతార, ప్రభంజనం, చిద్విల్లత, పిలుపు" పత్రికలు విప్లవభావ ప్రచారానికి తోడ్పడ్డాయి. వీటిలో అరుణతార వొక్కటే ఇప్పటి విరసం అధికార పత్రికగా నిలిచింది.

'ఝంఝు', 'మార్చ్', 'లే' కవితా సంకలనాలు యువ తరంలో విప్లవభావాలను రగుల్కొలిపాయి. 'శివుడు' రచించిన "నరుడో భాస్కరుడా!" గేయం విప్లవకవిత్వాన్ని మరొక మలుపు తిప్పి, విప్లవభావ ప్రచారానికి పాట మహత్తర సాధనమన్న సత్యాన్ని తెలియజెప్పింది. గద్దర్, వంగపండు ప్రసాదరావు, చెరబండరాజు, సుబ్బారావు పాణిగ్రాహి, శివసాగర్‌ల గేయాలు విప్లవోద్యమానికి చైతన్యాన్ని సమకూర్చాయి.

## ఎన్నికలను బహిష్కరించండి:

1971 జనరల్ ఎన్నికలముందు ఎన్నికలను బహిష్కరించమని విరసం ప్రజలకు విజ్ఞప్తి చేసింది. ఎన్నికల ద్వారా ప్రజాస్వామ్యం నిలబడేది కల్ల అనీ సాయుధ పోరాటమే దోపిడికి విముక్తి మార్గమని విప్లవ కవులు ప్రబోధించారు. 'విరసం' ఇప్పటికీ ఎన్నికలపై విశ్వాసం ప్రకటించలేదుగాని 'విరసం' నుండి విడిపోయిన రచయితల సంఘాలు ఎన్నికల అవసరాన్ని కొంతమేరకు గుర్తించాయి.

## విప్లవ రచయితలపై ప్రభుత్వ ఆగ్రహం:

'విరసం' ఏర్పడిన మొదటి సంవత్సరంలోనే ప్రభుత్వం చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లను అరెస్టు చేసింది. ఇంకా కె.వి. రమణారెడ్డి, వరవరరావు, ఎం.వి. రమణారెడ్డి, మరికొందరిని వేర్వేరు సందర్భాలలో ప్రభుత్వం నిర్బంధించింది. కాని, కోర్టులో ప్రభుత్వం పెట్టిన కేసులు నిలవలేదు. "విశ్వాసాలు అదుపులో పెట్టబడేవి కావు, అతనికున్న విశ్వాసాలు గురించి జైల్లో పెట్టటానికి వీలులేదు" అని అప్పటి హైకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ఓ. చిన్నపరెడ్డి, జస్టిస్ డి.వి. రెడ్డి తీర్పుచెప్పారు.

విప్లవ రచయితలపై ప్రభుత్వం బనాయించిన పార్వతీపురం కుట్రకేసు, సికిందరాబాదు కుట్రకేసు కూడ నిలవలేదు.

రచయితలు నిర్దోషులని కోర్టులు తీర్పు చెప్పాయి. విప్లవ రచయితల హక్కులను, పౌరుల భావస్వాతంత్ర్య హక్కులను కాపాడటానికి పౌరహక్కులసంఘం కృషి చేస్తున్నది.

## విరసంలో చీలిక:

1975 జనవరిలో విరసం అయిదవ మహాసభలు అనంతపురంలో జరిగాయి. విరసంలో మెజారిటీ సభ్యులు భావిస్తున్నదానికి భిన్నంగా జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, కొత్తపల్లి రవిబాబు మొదలైనవారు విప్లవ పోరాటంలో వర్గశత్రు నిర్మూలనను వ్యతిరేకించారు. "మార్క్సిస్టేతరులతో ఐక్య సంఘటన"ను ప్రతిపాదించారు. శ్రీ తరిమెల నాగిరెడ్డి ప్రతిపాదించిన రాజకీయ కార్యాచరణను వీరు ఆదర్శంగా తలచారు. జనతా ప్రజాతంత్ర విప్లవ సాధనకు సాయుధ పోరాటమే మార్గమని నమ్మిన విరసం జ్వాలాముఖి ప్రభృతులను విరసంనుండి తొలగించింది. కొత్తపల్లి రవిబాబు మొదలైన వారు 'జనసాహితి' సంస్థను స్థాపించి, 'ప్రజాసాహితి' మాసపత్రికను ప్రారంభించారు. 'జనసాహితి'లో విభేదాల కారణంగా జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, రంగనాయకమ్మగారలు ఆ సంస్థనుండి వైదొలిగారు.

1975 జూన్‌లో భారతదేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించినప్పుడు ప్రభుత్వం శ్రీశ్రీ, కొడవటిగంటి వంటి ఒకరిద్దరిని తప్పించి మిగిలిన వారందరినీ జైళ్ళలో నిర్బంధించింది. ఈ నిర్బంధకాలంలో విప్లవరచయితల్లో కొందరికి మనస్థైర్యం చెదిరిపోయింది. విరసానికి రాజీనామా లిచ్చారు. తామిక క్రియాశీల కార్యకలాపాలలో పాల్గొనబోమని హామీ పత్రాలిచ్చారు. వీరిలో రాచకొండ విశ్వనాథశాస్త్రి ప్రముఖులు.

విరసం అధ్యక్షులు శ్రీశ్రీ ప్రభుత్వాన్ని సమర్థించారు. అత్యవసర పరిస్థితి తర్వాత విరసం శ్రీశ్రీని అధ్యక్షపదవి నుండి తొలగించింది. విరసానికి క్షమాపణ చెప్పి, శ్రీశ్రీ తనను సాధారణ సభ్యునిగా కొనసాగనిమ్మని కోరారు. విరసం శ్రీశ్రీ కోరికను మన్నించింది. 1980 లో శ్రీశ్రీ మళ్ళీ విరసం కార్యకలాపాలను విమర్శించి, వారి ఆగ్రహానికి గురి అయినారు. 1983 లో శ్రీశ్రీ మరణించేవరకు "నా శాశ్వత చిరునామా విరసం" అని పల్కటం విరసం వారికి గర్వకారణమే.

అత్యవసర పరిస్థితి తర్వాత కొడవటిగంటి, కాళీపట్నం విరసంలో చురుకైన పాత్రను నిర్వహించలేదు. కారణాంతరాల వలన నగ్నముని తప్పుకున్నారు. విరసం నానాటికీ బలహీనపడుతూవచ్చి, 1980 తర్వాత ఒక 'ఫోర్స్'గా మిగలలేదు.

'ప్రత్యేక తెలంగాణ'కోసం జరిగిన ఆందోళనలో విరసం వైఖరిని ప్రజలు హర్షించలేదు. స్వార్థపరశక్తుల ఆందోళనను ప్రజోద్యమంగా విరసం వక్రంగా వ్యాఖ్యానించింది.

'బంగ్లాదేశ్ విముక్తి' సందర్భంలో కూడ విరసం వైఖరి జాతీయవాద కవుల వైఖరికంటే భిన్నమైనది. జాతీయతను విడనాడిన వీరి అంతర్జాతీయ వైఖరి సహృదయులకు వచ్చలేదు.

## విరసంలో మరోసారి చీలిక:

విప్లవ పోరాటంలో చారుమజుందార్ ప్రవేశపెట్టిన వర్గశత్రునిర్మూలనా కార్యక్రమాన్ని విరసం ఏదోఒకరూపంలో బలపరుస్తూ వచ్చింది. "ఈ క్రమంలో విరసం ఒక విప్లవ ప్రజాసంఘ స్వభావాన్ని, నిర్మాణాన్ని కోల్పోయి; స్వేచ్ఛాయుత, ప్రజాస్వామిక చర్చలకు తావు లేకుండా చేసింది. విరసంలో కొనసాగటం అంటే అతివాద దుస్సాహసికవాద పెడధోరణికి ఉమ్మడి గుర్తింపు యివ్వడమే అయింది. ప్రజాసాహిత్యోద్యమానికి ప్రమాదకరమైన ఈ పెడధోరణినుండి బైటపడే ప్రయత్నంలో భాగంగా" 1985 సెప్టెంబరు 9 వ తేదీన 'ప్రజా రచయితల సమాఖ్య' ఏర్పడింది. 'నమ్ము', హెచ్చార్కె, సతీశ్‌చందర్, కానూరి వెంకటేశ్వరరావు తోట మహాదేవ, తిర్మల్, ఏ. నారాయణ యీ సమాఖ్యలో ప్రముఖులు.

'పీపుల్స్‌వార్' గ్రూపువారు 1984 లో కవి శివసాగర్‌ను, కేంద్రకార్యవర్గ కమిటీ సభ్యుడ్ని తమసంస్థనుండి తొలగించారు. శ్రీ కొండపల్లి సీతారామయ్య పీపుల్స్‌వార్‌కు ఎస్టాబ్లిష్‌డ్ లీడర్‌గా ప్రకటించుకున్నారు. అజ్ఞాతవాసం నుండి బయటకు వచ్చిన శివసాగర్ పీపుల్స్‌వార్ గ్రూప్‌పైన, విరసంపైన పెక్కు ఆరోపణలు చేసి, విప్లవ కార్మిక సమాఖ్యను స్థాపించారు. ఇటీవల (1994) 'శివసాగర్' (కె.జి. సత్యమూర్తి) 'బహుజన సమాజ్ పార్టీ'లో చేరారు.

'పీపుల్స్‌వార్'లో, విరసంలో దళితుల పట్ల వివక్ష ఉన్నదనే భావాన్ని శ్రీసత్యమూర్తి, శ్రీ సాహు తమ రచనలలో, ఇంటర్వ్యూలలో తెలిపారు.

'ఎస్టాబ్లిష్‌డ్ లీడర్'గా ప్రకటించుకున్న శ్రీ కొండపల్లి సీతారామయ్య పీపుల్స్‌వార్ గ్రూప్‌వారి అంతర్గత పోరాటంలో 'గణపతి'వర్గం చేతిలో ఓడిపోయారు. తర్వాత ఆయన అరెస్ట్ అయ్యారు. సిద్ధాంత పోరాటంలో ఎవరి వైఖరి ఏమిటో విరసం స్పష్టం చెయ్యలేదు.

పీపుల్స్‌వార్ గ్రూప్‌వారు కాకతీయ ఎక్స్‌ప్రెస్‌కి నిప్పంటించిన ఘోరదుస్సంఘటనలోపెక్కుమంది చనిపోయినప్పుడు విరసం మౌనం వహించింది. నక్సలైట్లు తమ పొరపాటును అంగీకరించిన తర్వాత కూడ ఆ దుశ్చర్యను ఖండించలేని బలహీనతలో పడిపోయింది. రహస్యోద్యమంలో స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలకు, సరళ హత్యలాంటి

ఘోరసంఘటనలకు విరసం స్పందించలేదు.

ఉత్తర తెలంగాణలో, తూర్పుగోదావరి జిల్లాలో విప్లవోద్యమం బలంగా ఉండటంచేత 'విరసం' ఉనికి విప్లవాన్ని అభిమానించేవారికి అవసరంగా కన్పిస్తున్నదేగాని, అభివృద్ధి పథంలో ఉన్నదని చెప్పలేం. తెలుగు సాహిత్య చరిత్రలో 1970–80 మధ్యకాలాన్ని 'విరసం దశాబ్దం'గా భావించవచ్చు.

### వివిధ సాహిత్య ప్రక్రియలలో విరసం వెలువరించిన ఉత్తమ రచనలు:

విరసం అన్ని సాహిత్య ప్రక్రియలను ఆదరించే సంఘమే అయినా కవిత్వం, కథ ప్రాముఖ్యం వహించాయి. నవలలు కొద్దిగా వచ్చాయి. నాటకం శక్తిమంతమైనదేదీ రానేలేదు. జననాట్యమండలివారి కళారూపాలు, పాటలు విరివిగా వచ్చాయి.

**కవిత్వం:** 'విరసం' సభ్యుల రచనలతో ప్రచురించిన కవితా సంకలనాలు 'ఝంఝు', 'మరోఝంఝు' విప్లవభావాలను వెల్లడించిన ఉత్తమ సంకలనాలు.

"విప్లవ రచయితలు విప్లవభావాలకు నిబద్ధులేగాని విప్లవ కార్యక్రమాలలో నిమగ్నులుకాదు" అని చెప్పే విప్లవకవిత వొకటి (తెరవెనుక – ఎక్స్‌రే) ఝంఝు సంకలనంలో ఉన్నది. నిబద్ధత, నిమగ్నత అనే మాటల వెనుక దాక్కొని, పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన వారిపై, ఎన్‌కౌంటర్‌లకు ఆహుతి అయిన వారిపై 'ఎలిజీలు' రాసే అవకాశవాదులను సహృదయులు ఏవగించుకున్నారు. 'సైన్యంలో చేరకు' (జి.సోమయ్య) గీతం ఈ సంపుటి నిషేధింపబడటానికి కారణమైంది.

1946–51 సంవత్సరాల మధ్య జరిగిన తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట, పాటలను రెండు సంపుటాలలో సంకలనం చేసి విరసం చరిత్రకు, సాహిత్యానికి మహోపకారం చేసింది.

శ్రీశ్రీ, సుబ్బారావు పాణిగ్రాహి, శివుడు, చెరబండరాజు, నగ్నముని, గద్దర్, వంగపండు ప్రసాదరావు, కె.వి. రమణారెడ్డి, వరవరరావు, అల్లం నారాయణ, సౌదా, శివారెడ్డి, శ్రీనివాస్, విమల కవితలతో విప్లవ కవిత తెలుగు సాహిత్యాన్ని సంపన్నం చేసింది.

"మరోప్రస్థానం, ఎరుపు, ఉద్యమం నెలబాలుడు, నెలవంక, దిక్సూచి, ముట్టడి, గమ్యం, కాంతియుద్ధం, గౌరమ్మ కలలు, జన్మహక్కు, పల్లవి, తూర్పుగాలి, కొయ్యగుర్రం, గద్దర్ పాటలు, పొలికేక, జజ్జనకరిజనారే, ఎర్రపిడికిలి, జైలుకోకిల, సముద్రం, భవిష్యత్తు చిత్రపటం, ముక్తకంఠం, జగిత్యాల పల్లె, జైలునుండి ప్రేమలేఖ, నేత్రధనుస్సు, ఆసుపత్రిగీతం, భారమితి మోహనా ఓ మోహనా!, రహస్యోద్యమం, అడవి ఉప్పొంగిన రాత్రి" కావ్యసంపుటాలు తెలుగు కవిత్వ గౌరవాన్ని ఇనుమడింపజేశాయి. రాజకీయంగా విప్లవకవులతో ఏకీభవించని వారుకూడ చదివి ఆనందించగలిగే ఉత్తమ కవిత్వం యీ రచనల్లో ఉన్నది. భూమయ్య, కిష్టాగౌడ్‌లనే నక్సలైట్లను ఉరి తీసినప్పుడు మహాకవి శ్రీశ్రీ రాసిన 'భూమ్యాకాశాలు' ఊగరా, ఊగరా, ఊగరా! ఉరికొయ్య అందుకొని ఊగరా! (తుది పయనం: తొలి విజయం) గీతాలు విప్లవ కవిత్వపు ఔన్నత్యాన్ని వేనోళ్ళ చాటగలవి.

**కథానిక:** సమాజంలో దోపిడి ఏ రూపంలో జరుగుతున్నదో, ఏ మనిషి ఎటువంటి వారో తెలియజెప్పటానికి కథానిక బాగా ఉపయోగిస్తుంది. విరసం ప్రారంభ దశలో వచ్చిన "ఇపుడు వీస్తున్నగాలి", 'పోరు', 'తూరుపు' సంకలనాలు తర్వాతవచ్చిన 'భూమిక', 'నేల తల్లి విముక్తికోసం' సంపుటాలు విప్లవరచయితల సామర్థ్యాన్ని తెల్పగలవి.

నగ్నముని (నగ్నముని కథలు, విలోమకథలు), అల్లం రాజయ్య (మనిషిలోపలి విధ్వంసం), వుప్పల నరసింహం (తిరగబడ్డభూమి), బి.ఎస్.రాములు (పాలు, అడవిలో వెన్నెల), భూషణం (అడివి అంటుకుంది), సాహు (రక్తపింజెర, పోరాటమే ఊపిరి), తుమ్మేటి రఘోత్తమరెడ్డి (చావువిందు), జాకంటి జగన్నాథం (వలస), ఎన్నెస్ ప్రకాశరావు (కాగతపు పులి), జంపని పెద్దిరాజు (ఫౌల్ ఫౌల్), చక్రవేణు (కసాయి కరువు కువాయిట్ సావిత్రమ్మ), కాలువ మల్లయ్య (వెలి) కథలు విప్లవోద్యమకాలంలో వెలువడి, పోరాట ప్రాంతాలలో ఇతర ప్రాంతాలలో దోపిడి జరుగుతున్న తీరును తెలియజెప్పాయి.

శ్రీకాళీపట్నం రామారావు శ్రీకాకుళ పోరాటానికి పూర్వమే 'యజ్ఞం' కథ రాసి, చరిత్ర సృష్టించారు. తిరుగుబాటు తప్పని పరిస్థితులలో మనిషి ఆత్మహననానికో, ప్రతిహింసకో పూనుకోవడం తప్పదని కాళీపట్నం భావించారు. ప్రతిహింస అనివార్యమని చరిత్ర ఋజువు చేసింది. వీరి "భయం, శాంతి, చావు, ఆర్తి" కథలు యీ శతాబ్దపు కథల స్థాయిని పెంచాయని చెప్పవచ్చు.

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి "పిపీలికం, షోకుదిల్లి, సృష్టిలో, ది స్మోకింగ్ టైగర్, బల్లచెక్క, వేతన శర్మ కథ, తప్పు" మొదలైన కథల్లో తెల్పిన భావాలు విప్లవోద్యమానికి నైతికభావాన్ని సమకూర్చాయి.

**నవల:** కవిత, కథానికల లాగా 'విరసం' వారి రచనల్లో నవలలు ఆదరం పొందలేదు. భూషణం, 'కొండగాలి' చెరబండరాజు 'ప్రస్థానం, మా పల్లె, నిప్పురాళ్ళు', సాహు, పులి ఆనందమోహన్ 'వసంతగీతం, సాధన, సరిహద్దు', అల్లంరాజయ్య 'కొమురం భీం, అగ్నికణం, సాధన' 'రాగో' నవలలు విప్లవ రచయితలు రాసిన నవలల్లో విశిష్టమైనవి.

**నాటకం – నాటిక:** జనసామాన్యంలో విప్లవాన్ని

గురించి ఆలోచింపజేయగల నాటకాలు, నాటికలు అంతగా రాలేదు. అభ్యుదయ రచయితలకాలంలో వచ్చిన 'మా భూమి' 'ముందడుగు'లాంటి నాటకాలు విప్లవ రచయితలు రచించలేకపోయారు. ఈ కొరతను గద్దర్, వంగపండు ప్రసాదరావులాంటి జననాట్యమండలి కళాకారులు పాటలు, ఇతర కళారూపాలద్వారా కొంతవరకు తీర్చగలిగారు.

వ్యాసం: శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, శ్రీశ్రీ, శ్రీ కె.వి. రమణారెడ్డి రచించిన వ్యాసాలు మార్క్సిస్టు సిద్ధాంతాల సారాన్ని అందించాయి. సాయుధ పోరాటం తప్పనిసరి అనే అభిప్రాయాన్ని వీరి వ్యాసాలు కలిగించాయి.

1994 జనవరిలో విరసం 14 వ మహాసభలను రాజమండ్రిలో జరుపుకొన్నది. దళితులకు, స్త్రీలకు విప్లవోద్యమం పట్లగల అనుమానాలను తొలిగించి, ఉద్యమాన్ని కొనసాగించటానికి పూనుకున్నది.

తెలుగు సాహిత్యంలో విప్లవోద్యమం తర్వాత స్త్రీ చైతన్యవాదమూ, దళితరచయితలు మేధావులు కళాకారుల ఉద్యమావేశమూ కన్పించినా అవి విరసంలోని లోపాలను వెల్లడించినవేగాని ప్రత్యామ్నాయాలు కావు.

విప్లవోద్యమం వెనుకంజవేసినప్పుడల్లా విరసంలో నిస్తబ్ధత కన్పిస్తున్నది. రచయితలు ఉద్యమానికి బాసటగా నిలుస్తున్నారేగాని నాయకస్థానంలో లేరు. విప్లవోద్యమం ఉన్నన్నాళ్లూ 'విరసం' ఉంటుంది.

ఏ దేశ సంస్కృతి అయినా
ఏనాడూ కాదొక స్థిర బిందువు
నైకనదీ నదాలు అదృశ్యంగా
కలిసిన అంతస్సింధువు – తిలక్

# తెలుగులో దళితసాహిత్యం

- డాక్టర్ యస్వీ సత్యనారాయణ

తెలుగులో-'దళిత సాహిత్యం'... అంటే దళితుల సమస్యలను చిత్రించిన సాహిత్యం – చాలా కాలం నుండి వెలువడుతున్నది. అయితే దళిత రచయితలే దళిత సాహిత్యాన్ని సృష్టించడం యిటీవలి పరిణామం. దళితేతరులు దళితుల పక్షాన్ని వహించి రాయడం 'ఉదార వాదం.' దళితులే తమ సమస్యలకు ప్రతిస్పందించి రాయడం 'ఆత్మాభిమాన వాదం.'

ఇంతకూ. దళితులంటే ఎవరు?

సాంఘిక దోపిడికి గురవుతున్నవారు, అస్పృశ్యులుగా పరిగణింపబడుతున్నవారు, నీచవృత్తులుగా భావించబడుతున్న వృత్తులు చేసుకుంటున్నవారు, శారీరక శ్రమపై ఆధారపడి బతుకులు గడుపుతున్నవారు – దళితులు.

శతాబ్దాలుగా విద్యకు, విజ్ఞానానికి, వికాసానికి దూరం చేయబడిన దళితులు నేడు విద్యావంతులౌతున్నారు. ఆలోచిస్తున్నారు. సంఘటితు లౌతున్నారు. చైతన్యవంతులౌతున్నారు. ఉద్యమిస్తున్నారు. సాటి దళిత సోదరులను చైతన్య పరచటానికి సాహిత్యాన్ని ఆయుధంగా ఉపయోగిస్తున్నారు. వీరి ఉద్యమాన్ని 'దళిత సాహిత్యం'గా పరిగణిస్తున్నాం.

దళిత ఉద్యమం : జాతీయోద్యమ కాలంలో 'అస్పృశ్యత'కు వ్యతిరేకంగా విస్తృత ప్రచారం జరిగింది. వామపక్ష ఉద్యమంలో భాగంగా కూడా 'కులతత్వం'పై పోరాటం జరుగుతున్నది. వర్ణ దురహంకారాన్ని తీవ్రంగా ప్రతిఘటించడం కొనసాగుతున్నది. అయితే యీ ఉద్యమాలు వర్ణవ్యవస్థపై ప్రత్యక్ష పోరాటానికి పిలుపు నివ్వలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయోద్యమ యోధులు పోరాడారు. పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా వామపక్షాలు ప్రజా ఉద్యమ రూపాలు చేపడుతున్నాయి.

వీటికి భిన్నంగా డా॥ బి.ఆర్. అంబేద్కర్ 'వర్ణపోరాటానికి' పిలుపు నిచ్చారు. చాతుర్వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా 'సాంఘిక విప్లవం' కొనసాగాలన్నారు. 'సామాజిక న్యాయం' కోసం త్రిముఖ పోరాటాన్ని నిర్దేశించారు. సర్వ మానవ సమానత్వం, సుఖమయ జీవితం, మానవ విలువల పరిరక్షణ కాంక్షించారు.

దళితులకు రాజ్యాంగ పరమైన రక్షణలు, సౌకర్యాలు కల్పించడం; పార్లమెంటులోనూ, అసెంబ్లీల్లోనూ కొన్ని స్థానాలను గెలిచి, దళితులు సాంఘిక న్యాయంకోసం కృషి చేయడం; రిజర్వేషన్ల సక్రమ అమలుకు పాటుపడటం – వంటి ప్రధాన ఆశయాలు డా॥ అంబేద్కర్ ప్రబోధించారు. ఆ మహనీయుని సిద్ధాంతాల ప్రాతిపదికపై నడుస్తున్న ఉద్యమాన్ని 'దళిత ఉద్యమం' అంటున్నాం.

డా॥ బి.ఆర్. అంబేద్కర్‌కు ముందే చాలా మంది సాంఘిక విప్లవకారులు సాగించిన వివిధ పోరాటాలు యీ ఉద్యమానికి కావలసిన నేపథ్యాన్ని సమకూర్చిపెట్టాయి.

నిమ్న వర్గాల ఉద్ధరణ కోసం మహారాష్ట్రలో మొదటిసారిగా 'జ్యోతి బాపూలే' (1827 – 1890) తిరుగుబాటుకు పిలుపు నిచ్చాడు. 1874 లో 'సత్య శోధక్ సమాజ్' అనే సంస్థను స్థాపించి, దళితులను జాగృత పరచడానికి విశేషమైన కృషి చేశాడు. 1910 నాటికి దళితుల సమస్య ఒక 'ఆందోళన' రూపం దాల్చింది. శివరామ్ కాంబ్లే 'నిమ్న జాతుల వారి మహాసభ'ను ఏర్పాటు చేశాడు. 'సోమవంశీయ మిత్ర' అనే మాస పత్రికను వెలువరించాడు. అదే కాలంలో కర్మవీర్ షిందే దేశం నలుమూలాలా పర్యటించి, నారాయణ్ గణేశ్ చందావర్కర్ సహకారంతో 'దళిత జాతుల సేవా సంఘం' స్థాపించాడు.

కలకత్తా కాంగ్రెస్ సమావేశం (1917) దళితుల అభివృద్ధిని కోరుతూ, అస్పృశ్యతను నిరసిస్తూ తీర్మానాలు చేసింది. అదే సంవత్సరం 'మాంటేగ్' కమిటీ దేశంలోని వివిధ రాజకీయ వర్గాల ప్రతినిధుల అభిప్రాయాలతోబాటు అస్పృశ్యుల ప్రతినిధుల అభిప్రాయాలను కూడా సేకరించడానికి భారతదేశం వచ్చింది. దీనితో దళిత జాతుల ప్రతినిధులు మొదటిసారిగా దేశ రాజకీయ రంగంలోకి రాగలిగారు.

1918 మార్చి 23, 24 తేదీల్లో బొంబాయిలో మొదటిసారిగా 'అఖిల భారత దళిత జాతుల సమావేశాలు'

జరిగాయి. 1919 నాటి బ్రిటీష్ చట్టం ద్వారా పరిపాలనా వ్యవస్థలో మొట్టమొదటిసారిగా దళితుల ఉనికి కానవచ్చింది. కేంద్ర అసెంబ్లీలోని 14 మంది అనధికార సభ్యుల్లో ఒక దళిత జాతి ప్రతినిధికి అప్పటి ప్రభుత్వం అవకాశం కల్పించింది.

దళిత జాతుల జనాభాను అనుసరించి వారికి కేంద్ర అసెంబ్లీలోనూ, శాసన సభల్లోనూ కొన్ని సీట్లు కేటాయించాలనీ, సవర్ణ హిందువులు దళితుల పట్ల తమ వైఖరిని మార్చుకోవాలనీ, స్వపరిపాలన సిద్ధించడానికి ముందు సాంఘిక సమానత్వం సమకూరాలనీ – డా॥ బి.ఆర్. అంబేద్కర్ వాదించారు. తమ అభిప్రాయాలను అటు ప్రభుత్వానికి, ఇటు ప్రజలకు తెలియజేయడానికి 'మూక్ నాయక్' పత్రికను ప్రారంభించారు.

1924 మార్చిలో డా॥ అంబేద్కర్ అస్పృశ్యతా నివారణోద్యమాన్ని మొదలుపెట్టారు. మార్చి 9న బొంబాయిలోని దామోదర్ హాల్‌లో 'దళితుల సమావేశం' జరిగింది. అక్కడ బహిష్కృత హితకారిణీ సభ రూపొందింది.

'దళితులు తమ స్థితిని తాము గుర్తెరిగి తమను తామే ఉద్ధరించుకోవాలి. తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలగాలి. సవర్ణులకన్నా తాము ఎందులోనూ తక్కువ కాదని గ్రహించాలి' – అనే చైతన్యయుతమైన ప్రబోధాన్ని డా॥ బి.ఆర్. అంబేద్కర్ దళిత జాతులకు అందించారు. 'శూద్రులంటే ఎవరు?,' 'అస్పృశ్యులెవరు?,' 'కులనిర్మూలన,' 'భారతదేశంలో కులాలు,' 'రాముడు ఆదర్శపురుషుడా?' మొదలైన పుస్తకాలను, వందలాది వ్యాసాలను వ్రాశారు.

డా॥ అంబేద్కర్ సిద్ధాంతాల వెలుగులో యీనాడు దేశంలోని అనేక ప్రాంతాల్లో 'దళిత ఉద్యమం' విస్తరిస్తున్నది.

దళిత సాహిత్యం : దళితుల నుండి రచయితలు ఉద్భవించి, దళితుల కోసం రచనలు చేయడం ఈ ఉద్యమానికి గీటురాయి.

వర్ణవ్యవస్థ వేల యేళ్ళుగా దళితులకు విద్యను నిషేధించింది. అందుకే దాని నిర్మూలనకు దళితులు పోరాడుతున్నారు. బ్రాహ్మణ్యం దళితుల హక్కులను కాలరాచిందనే భావం ప్రబలింది. అందుకే వాళ్ళు దాన్ని వ్యతిరేకిస్తున్నారు.

దళితుల సమస్యను చిత్రించిన తొలి భారతీయ నవల – ముల్కరాజ్ ఆనంద్‌గారి 'అన్‌టచబుల్.'

మున్షీ ప్రేమ్‌చంద్, రవీంద్రనాథ్ ఠాగూర్ వంటి రచయితలు తమ రచనల్లో అస్పృశ్యతను నిరసించారు.

తెలుగులో దళితుల సమస్యలను; ముఖ్యంగా అస్పృశ్యతను వేర్వేరు కోణాల్లో చిత్రించిన ప్రముఖ నవలలుగా యీ క్రింది వానిని పేర్కొనవచ్చును:

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారి 'హేలావతి' (1913), వెంకట పార్వతీశ్వర కవుల 'మాతృ మందిరము' (1919), ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి' (1922), ఆచార్య రంగనాయకులు గారి 'హరిజన నాయకుడు' (1933), అడవి బాపిరాజుగారి 'నరుడు' (1946), ఇలింద్ర రంగనాయకుల 'మల్లిక' (1950), వట్టికోట ఆళ్వార్ స్వామిగారి 'ప్రజల మనిషి' (1955), ముప్పాళ రంగనాయకమ్మగారి 'బలిపీఠం' (1962), మహీధర రామ్మోహన రావుగారి 'కొల్లాయి గట్టితేనేమి?' (1965), మల్లాది వసుంధర 'త్రివర్ణ పతాక' (1965), వాచస్పతిగారి 'అంతస్తులు – అంతఃకరణాలు' (1965), దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు' (1970), డా॥ కేశవరెడ్డిగారు రాసిన 'బానిసలు' (1971), 'శ్మశానం దున్నేరు' (1979), 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' (1979), ఇల్లిందల సరస్వతిగారి 'నీ బాంచను కాల్మొక్కుతా' (1976) మొదలైనవి.

అలాగే హరిజనుల సమస్యలను కొన్నింటిని చిత్రించిన నవలల్లో 'ఆదర్శం' (1946), 'అంటరాని జంట' (1973), 'విరిగిన కెరటాలు' (1977), 'మిసెస్ కోకిల' (1978), 'చివరి మజిలీ' (1978), 'వేర్లు' (1979), 'మోహనరాగం' (1979), 'కోటిగాడు' (1980), 'చీకటి చెదిరింది' (1981), 'తపోభంగం' (1981), 'చీకట్లో కాంతిరేఖలు' (1983), 'నైమిశారణ్యం' (1984), 'కులకన్య' (1984), 'అంతులేని అమావాస్య' మొదలైన వాటిని విధిగా పేర్కొనవలసి వుంటుంది.

దళితుల్లో 'దళిత చైతన్యాన్ని' మేల్కొల్పిన మొదటి రచయిత 'జ్యోతి బాపూలే.' దళితులను విద్యావంతులను చేయడానికి తన సాహిత్యాన్నీ, జీవితాన్ని, మేధస్సునూ అంకితం చేసిన మేధావి డా॥ అంబేద్కర్.

జీవితంలోని అన్ని రంగాలతోబాటు సాహిత్య రంగంలోనూ దళితులు నిరాదరణకు గురయ్యారు. గత వేలాది సంవత్సరాలుగా వెలువడుతున్న సాహిత్యంలో దళితుల్ని బానిసలుగా, బెస్తవాళ్ళుగా, ఉరితీసే తలారులుగా, నీచులుగా చిత్రించడం జరిగింది. దళిత వనితలను దాసీలుగా, భోగించుటకు పనికివచ్చే విలాస వస్తువులుగా వర్ణించడం జరిగింది. వీళ్ళను మనుషులుగా పరిగణించలేదు. వ్యక్తిత్వం వున్న వాళ్ళుగా చిత్రించలేదు. దళితేతరులను మాత్రమే శక్తివంతంగా చిత్రించడం జరిగింది.

ఈ వివక్షను ప్రతిఘటిస్తూ – దళితుల సంవేదనలను, బాధలను, అనుభవాలను, అనుభూతులను చిత్రించడంతో బాటు దళితులపై జరుగుతున్న అత్యాచారాలను శక్తివంతంగా అభివ్యక్తం చేయడానికి 'దళితుల సాహిత్యం' ప్రారంభమయింది.

'దళిత ఉద్యమం'లోని సిద్ధాంత విభేదాలు, అంతర్గత వైరుధ్యాలుకూడా అనివార్యంగానే 'దళిత సాహిత్యం'లోనూ ప్రతిబింబిస్తున్నాయి.

1967 దాకా 'దళిత సాహిత్యం' తన సైద్ధాంతిక పునాదిని పటిష్టపరుచుకుంటూ వచ్చింది. జ్యోతి బాపులే, శాహూ మహరాజ్, డా॥ అంబేద్కర్, కారల్ మార్క్స్‌ల సిద్ధాంతాలు; నీగ్రో సాహిత్యంలోని తిరుగుబాటు దృక్పథం – తన తాత్త్విక పూర్వరంగంగా స్వీకరించింది. అదే సంవత్సరం ఔరంగాబాద్‌లో 'మిళింద సాహిత్య పరిషత్' ఏర్పడింది. దళితుల అభివ్యక్తి కోసం 'అస్మిత' అనే త్రైమాసిక పత్రిక ప్రారంభమయింది. 1967 నుండి యీనాటి దాకా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న ఆ పత్రిక పేరు యిప్పుడు 'అస్మితాదర్శ.' 1969 నుండి 'దళిత సాహిత్యం' అనే పదం విస్తృత వ్యవహారంలోకి వచ్చింది.

1920 లోనే బెంగాలీ భాషలో దళిత పత్రిక వెలువడింది. ఆ తరువాత వివిధ భాషల్లో – ప్రబుద్ధభారత్, అస్మిత, అస్మితాదర్శ, మూక్‌నాయక్, భీం పత్రిక, జనతా, ప్రమేయ, నికాయ, బాయజా, సింహగర్జన, శ్రమిక్ విచార్ మున్నగు పత్రికలు దళిత సాహిత్య వ్యాప్తికి విశేషమైన కృషి చేశాయి. వీటిలో కొన్ని పత్రికలు నేటికీ వెలువడుతూనే వున్నాయి.

1981 లో ఢిల్లీలో 'భారతీయ దళిత్ సమాచార పత్రికా సంపాదకుల సమ్మేళనం' జరిగింది. 1984 ఆగస్టు 18 న ఢిల్లీలో 'భారతీయ దళిత సాహిత్య అకాడమీ' స్థాపింపబడింది. అదే సంవత్సరం యీ అకాడమీ పక్షాన "డా॥ అంబేద్కర్ జాతీయ అవార్డు," "డా॥ అంబేద్కర్ అంతర్జాతీయ అవార్డు" కమిటీలను నెలకొల్పి ప్రతి సంవత్సరం జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో దళితుల వికాసానికి విశేషమైన కృషి చేసిన వారికి యీ అవార్డులను ఇవ్వడం జరుగుతున్నది.

ఈ కేంద్ర సాహిత్య అకాడమీతోపాటు అనేక రాష్ట్రాలలో రాష్ట్రస్థాయి 'దళిత సాహిత్య అకాడమీ'లు ఏర్పాటయి దళిత రచయితలను ప్రోత్సహించడానికీ, దళిత సాహిత్య వ్యాప్తికీ కృషి చేస్తున్నాయి.

1987 అక్టోబర్ 8, 10 తేదీల్లో హైదరాబాద్ నగరంలో 'అఖిల భారత దళిత రచయితల ప్రథమ మహాసభలు' జరిగాయి. దాదాపు 17 రాష్ట్రాల నుండి 528 మంది ప్రతినిధులు పాల్గొన్న యీ మహాసభలు 'అఖిల భారత దళిత రచయితల సంఘాన్ని' ఏర్పాటు చేసుకున్నాయి. ఒక నిర్దిష్టమైన ప్రణాళికను రూపొందించుకున్నాయి.

**దళిత కవిత్వం:** దళితుల సమస్యలను కవిత్వంలో ప్రతిబింబింపజేసిన గుర్రం జాషువాను తొలి తెలుగు దళితకవిగా భావించవచ్చు. 'గబ్బిలము,' 'అనాధ' వంటి పద్యకావ్యాల ద్వారా 'అస్పృశ్యత' సమస్యను చిత్రించిన 'జాషువా' దళిత సాహిత్యంలో ప్రతిఘటన చైతన్యానికి ప్రతీకగా నిలుస్తాడు.

'కలడంబేద్కరు నా సహోదరుడు మాకై యష్ట
కష్టాలకుం
బలియై సీమకు వోయి, క్రమ్మరిన విద్వాంసుండు
వైస్రాయి మే
ల్కొలు వందుంగల దొడ్డవాడతడు నీకుం స్వాగతం
బిచ్చి పూ
వుల పూజల్ పొనరించెనే యతని మెప్పుల్ నీ
జయారంభముల్.'

అనే పద్యంలో అంబేద్కర్ ప్రతిభా వ్యుత్పత్తులను జాషువా కొనియాడారు. అంబేద్కర్‌ను ప్రశంసించడమంటే దళితులు తమను తాము ప్రశంసించుకోవడమే నన్నారు.

జాషువా తరువాత పేర్కొనదగిన దళిత కవులు – జాలా రంగకవి, కుసుమ ధర్మన్నకవి, నక్కా చిన వెంకయ్య, నూతక్కి అబ్రహాం, ప్రేమయ్య మొదలగువారు. జాతీయోద్యమ కాలంలో 'అస్పృశ్యత'ను నిరసిస్తూ యీ కవులు కవిత్వాన్ని వ్రాశారు.

ఆ తరువాతితరం దళితకవి బోయి భీమన్న

'కూలగొట్టుడు కులమత కుటిలతలను
సమము చేయుడు మానవ సామ్యములను
పీడిత జనమ్ము న్యాయము వీడెనేని
మకర కుండలమ్ములు మిమ్ము మనుపగలవే?' –

అని ప్రశ్నిస్తున్న భీమన్న సాంఘిక సమానత్వాన్ని ప్రబోధిస్తూ అనేక కావ్యాలు రచించారు. అస్పృశ్యుల ప్రతినిధిగా నిలిచిన డా॥ బి.ఆర్. అంబేద్కర్ మేధాసంపత్తిని చూసి మేధావులే ఆశ్చర్యపోయారన్న అభిప్రాయాన్ని భీమన్న వ్యక్తం చేస్తూ...

'చదువు లేనివాడు, సంస్కార హీనుడు
మురికి పేటలందు మురుగువాడు
పొట్టకూటివాడు, వెట్టిచాకిరివాడు
వాయి తెరువ ద్విజు లవాక్కులైరి'

అంటూ అభివర్ణించారు. తరతరాలుగా సంస్కార హీనుడుగా పరిగణింపబడిన దళితుడు తన తెలివితేటలను ప్రదర్శిస్తే ఎవరికీ తీసిపోడని ప్రకటించారు.

ఆంధ్రదేశంలో దళిత ఉద్యమ రథ సారథుల్లో ఒకరైన బొజ్జా తారకం కూడా యీ రంగంలో కృషి చేస్తున్నారు. దళితులను చైతన్యపరిచే వీరి కావ్యం 'నదిపుట్టిన గొంతుక'లో....

'పుట్టుకనే పెట్టుబడి పెట్టి
బ్రతుకులను విపణివీధిలో పెట్టిన
వ్యాపారారణ్యాన్ని నరుక్కుంటూ
మనిషి మనిషికి తేడా తీసిన
కులమతాల గోతులు పూడ్చుకుంటూ
నీ కోసం బాటలు వేసుకొస్తున్నాను
తూర్పు నుంచి చరచరా పైకి వస్తున్న.

సూర్యుడివా నువ్వు...?' – అంటున్న 'తారకం' దళితుల్లో ఆత్మ విశ్వాసాన్ని, తిరుగబడే చైతన్యాన్ని, పోరాడే స్పృహను తమ రచనల్లో పలికిస్తున్నారు.

అలాగే దళిత వచన సాహిత్యాన్ని పరిశీలిస్తే – కొలకలూరి ఇనాక్ గారి 'ఊరబావి' కథలు, బోయ జంగయ్య గారి 'జాతర' నవల, హైదరాబాద్ బుక్ ట్రస్టువారు ప్రచురించిన అనువాద కథల సంకలనం 'దళిత కథలు,' ఇనాక్‌గారిదే 'మునివాహనుడు' నాటకం విధిగా పేర్కొనవలసిన రచనలు.

పైన పేర్కొన్న కవులు, వచన రచయితలు చాలామంది కులతత్వానికి వ్యతిరేకంగా ప్రబోధించేది వర్ణపోరాట మార్గం. ఇందులో పోరాడే సామాజిక శక్తులు దళితులు మాత్రమే.

ఇక వర్ణపోరాటాన్ని వర్గపోరాటంలో భాగంగా కొనసాగించాలని ప్రబోధిస్తున్న మరోరకం దళితకవులు కూడా సాహిత్య రంగంలో కనబడుతున్నారు. వారి సాహిత్యంలో కనబడుతున్న పోరాటశక్తులు పీడితులు.

దళిత చైతన్యంతో కలం పట్టకపోయినా, నక్సలైట్ ఉద్యమ ప్రేరణతో కవిత్వం రాసిన 'సుబ్బారావు పాణిగ్రాహి' రచనలు దళితకవిత్వంలో వర్గ దృక్పథంతో రాస్తున్న యువకవులకు ఉత్ప్రేరకాలుగా పనిచేస్తున్నాయి.

*'కొండల పక్కన బండలు కొట్టే*
*గిరిజనుడా! ఇటు రావయ్యా*
*ఓ గిరిజనుడా! ఇటు రావయ్యా!*
*పుట్టల పక్కన కట్టెలు కొట్టే*
*గిరిజనుడా! ఇటు రావయ్యా!*
*ఓ గిరిజనుడా! ఇటు రావయ్యా!'*

అంటూ ఎలుగెత్తి పిలిచిన 'ఏజన్సీలో ఎర్రజెండా' గీతం, 'జనత మేలుకొన్నది' 'మేలుకో' 'తూర్పు జెండా' మొదలైన గీతాలద్వారా ఆదివాసీ ప్రజల ఆలోచనలను పదునుబెట్టి కదనరంగానికి నడిపించిన కవి సుబ్బారావు పాణిగ్రాహి.

పాణిగ్రాహి తరువాత గిరిజనుల్లో వర్గపోరాట స్పృహను వేడెక్కించిన దళితకవి 'శివసాగర్.'

*'తోటరాముని తొడకు కాటా తగిలిందాని*
*చిలుక చీటి తెచ్చారా! ఓ విలుకాడ!*
*మైనా మతలబు చేసెరా! ఓ చెలికాడ!*
*మైనా మతలబు చేసెరా!'*

అని ప్రారంభమయ్యే గీతంలో శివసాగర్ సృష్టించిన వాతావరణం, గ్రహించిన ప్రేరణ, సంకేతించిన పిట్టలు – గిరిజనుల జీవితాలనుండే స్వీకరించారు.

ప్రస్తుతం దళిత సాహిత్య వ్యాప్తికై జీవితాన్ని అంకితం చేసి కృషి చేస్తున్న దళిత వర్గపోరాట కవి 'శివసాగర్' (కె.జి. సత్యమూర్తి).

ఈ బాటలో పాటలల్లి, బలమైన గొంతుతో దళిత గర్జన వినిపించిన కవి 'గద్దర్.'

*'యాలరో ఈ మాదిగ బతుకు – ఎంత*
*మొత్తుకుంటె దొరకదురా మెతుకు'*

అంటూ గద్దర్ వేసిన పొలికేక దళిత కవిత్వంలో నూతన శకాన్ని ప్రారంభించింది.

*'బంగారు పంటలిచ్చే – భరత గడ్డ మనది*
*గంగమ్మ ప్రవహించే – పుణ్యభూమిరా మనది*
*గంగ యమునా బ్రహ్మపుత్ర – కృష్ణా, పెన్న, కావేరి*
*ఎన్నెన్నో జీవనదులు – ప్రవహించే జీవగడ్డ*
*మాల మాదిగన్నలకే – మంచినీళ్ళు కరువాయె*
*యాలరో ఈ మాదిరి బతుకు*
*మొత్తుకుంటే దొరకదురా మెతుకు'*

అనే గీతంలో సకల సంపదలను సృష్టించే శ్రమజీవులైన దళితులకు ఆ సంపదపై ఎలాంటి అధికారంలేని వర్గ సమాజ స్థితిగతులను యధాతథంగా ఎత్తిచూపారు గద్దర్.

1977 లో దళితులపై జరుగుతున్న దౌర్జన్యాలను ఖండిస్తూ సెప్టెంబర్ ఒకటిన ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం పక్షాన 'హరిజన, గిరిజన, బలహీన వర్గాలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా రాష్ట్ర మహాసభ' జరిగింది. ఆ సందర్భంగా 'అభ్యుదయ రచయితల సంఘం' (అరసం) సభ్యులు వ్రాసిన గీతాల సంకలనం 'ఉప్పెన' అనే శీర్షికతో అచ్చయి వెలువడింది. ఈ సంకలనంలోని అనేక గీతాలు యీనాటికీ దళితుల నాలుకలపై నాట్యం చేస్తూ, వారిలో నూతన ఉద్యమ చైతన్యాన్ని ప్రసరింపజేస్తున్నాయి.

*'ఆగిన మీ గుండెలలో అగ్నిజ్వాలలున్నవిలే*
*మూసిన మీ కన్నులలో మూగబాధలున్నవిలే*
*ఆకలి మంటలతో అలమంటించే బిడ్డలూ*
*మానం కప్పుకునే మార్గం తెలియని తల్లులూ*
*కన్నీరు కార్చితే కరగి రగిలి కనలిపోయి*
*॥ఆగిన మీ గుండెలలో ॥'*

అనే గీతంలో శ్రీ వై. విజయకుమార్ దళితుల గుండెల్లో దాగిన దావానలాన్ని రగిలించారు.

*'మమ్మడిగె వారెవరురా? – ఓరన్నా!*
*మాదేటి బతుకాయెరా – ఓరన్నా!*
*మాలంట – మాదిగంట ముట్టరానోళ్లమంట*
*అరిజనుడా – గిరిజనుడా అంటారానోళ్లమంట*
*ఎద్దోలె పనిజేసిన ఎగిసెగిసి తంతన్నరు*
*జండాలు మారితేమిరా – ఓరన్నా!*
*గుండెల్లు మారాలెరా'*

అనే గీతంలో ఊరిబయట పూరిగుడిసెల్లోనే వుంటూ, కష్టపడి పని చేస్తున్నప్పటికీ కష్టాలు తీరని దళితుల కోసం, ఎన్ని చట్టాలు వచ్చినా, ప్రజల చిత్తాలు మారకపోతే ప్రయోజనం లేదంటూ ఈ వ్యాసకర్త దళితుల బతుకు పాటను ఆలపించారు.

'కులం కులం అనీ
కుత్సితాలు పెంచుకోకోయ్
కూటికి లేనివాడా!'

అనే సందేశాత్మక ప్రబోధాన్ని శ్రీమతి విజయలక్ష్మి వినిపించారు.

'కొసగాలులు విసిరేసిన నుసి బతుకులు మావీ
కసిగా సంఘం కరచిన మసి బతుకులు మావీ
చరిత్రలో అంటరాని - మానిసులం మేమూ
దరిత్రిలో ధనస్వామ్యపు - బానిసలం మేమూ'

అంటూ దళితుల స్థితిగతులను వర్ణిస్తూనే తుదిసమరం కోసం శ్రీ వీటుకూరి ప్రసాద్ దళితులకు పిలుపు నిచ్చారు.

'ఎలి వీసిన మేమంతా కలిశాములా
బలి పశువులు మేమింకా కాలేములా'

అంటూ శ్రీ లలితానంద్ హెచ్చరించారు.

'అంటరాని వాళ్ళన్నది ముట్టరాని వాళ్ళన్నది
ఈ మచ్చ యెక్కడిదీ? యెవ్వడురా పెట్టినదీ?'

అంటూ శ్రీ కాంచనపల్లి చిన వెంకట రామారావు కులవ్యవస్థను నిలదీసి ప్రశ్నించారు.

'ఈ హింసలు ఇక సహించము
ఈ బాధలు ఇక భరించము
ఇది దళితవర్గ హృదిని
ప్రజర్విల్లు ప్రతిన'

అంటూ శ్రీ మల్లిక్ దళితుల హృదయంలో రగిలే ప్రతిజ్ఞను తమ గీతంలో ప్రతిబింబించారు. శ్రీ జి.వై. గిరి పీడితజ్వాల, జి. వై. గిరి పాటలు, అక్షరం, బంధనాల్లో బ్రతుకులు, సంగం (బుర్రకథ) మంత్రాల పేరుతో చిత్రహింసలు మొదలైన రచనల్లో దళితజన పక్షపాతాన్ని ప్రదర్శించారు.

దాదాపు పదిహేను సంవత్సరాల క్రితమే దళితుల సమస్యలపై అభ్యుదయ రచయితల ప్రతిస్పందన ఇది.

అలాగే ఉ. సాంబశివరావు, క్రాంతి కిరణ్ వంటి యువ కవులు కూడా వర్గపోరాటంలో భాగంగానే దళిత ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలని తమ కవితల్లో ప్రబోధిస్తున్నారు.

'మన్నెం పితూర్లిలోన-మరణించిన రామరాజు
తెలంగాణా పోరులోన - తొలి అమరుడు కొమరన్న
శ్రీకాకుళం పోరులోన - కోరన్నా-మంగన్నా
కొండా మొదలు పోరులోన-రాజుల్దొర, లచ్చుందొర
చంపేస్తే భూమి పోరు - చావదని చాటినారు
మళ్ళీ మన గుండెల్లో-పోరు మొక్క నాటినారు.'

అంటున్న సాంబశివరావు మొక్కవోని భూమిపోరులో అమరులైన దళితులు రాజుల్దొర, లచ్చుందొరలకు నివాళు లర్పించారు.

ఇక దళితకవుల్లో కనబడుతున్న మరోరకం కవులు - మార్క్సిస్టు సిద్ధాంతాలు నిర్దేశిస్తున్న ఆర్థిక పోరాటాన్ని; డా॥ అంబేద్కర్ సిద్ధాంతాల సాంఘిక పోరాటాన్ని మిళితం చేసి 'సామాజికార్థిక పోరాటాన్ని' దళితులు కొనసాగించాలని సూచిస్తున్నారు. కత్తి పద్మారావు, మాష్టార్జీ యీ కోవకు చెందుతారు.

కత్తి పద్మారావు వ్రాసిన 'జనగీతం,' 'దేశం డైరీ' వంటి కవితా సంపుటాలు దళిత ఉద్యమాన్ని వర్గపోరాట స్ఫృహతో నడిపే దిశను సూచిస్తున్నాయి.

దళిత గీతాల రచనలో, బలమైన గొంతు వినిపిస్తున్న యువకవి 'మాష్టార్జీ.' తన కలాన్నీ, గళాన్నీ దళిత ఉద్యమానికి అంకితం చేసిన యీ దళిత కవి గీతాలు అప్పుడే మరాఠీ, కన్నడ భాషల్లోకి అనువదింపబడ్డాయి.

'దోపిడీ కాబడేవారే దళితులు' అంటున్న మాష్టార్జీ వ్రాసిన ముప్పై గీతాలను 'దళిత గీతాలు'గా సాహిత్య మిత్రమండలి, హైదరాబాద్ వారు ప్రచురించారు. వీటిలో 'అందుకో దండాలు బాబా అంబేద్కరా!' గీతం విశేష ప్రాచుర్యాన్ని పొందింది.

'అందుకో దండాలు-బాబా అంబేద్కారా!
అంబరాన ఉన్నట్టి-సుక్కలు గురువంగో
ముందుగా నినుదలచి-పాటలు పాడేము
సీకటి మా బతుకుల్లో-సూర్యుడు పొడవంగో.'

ఈ పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో డా॥ అంబేద్కర్ గుణగణాలను, ఆదర్శాలను చక్కని ప్రజల బాణీలో మాష్టార్జీ వర్ణించారు.

'మాది కాదు మాది కాదు-ఈ వ్యవస్థ మాది కాదు
దొంగలది దళారులది-దోపిడీ దుర్మార్గులది
దళితుల రక్తం తాగే-దగాకోరు రాయులది.'

అనే 'దళిత స్ఫృహ'తో మాష్టార్జీ రాస్తున్న గీతాలు దళిత ఉద్యమానికి కొత్త రక్తాన్ని ఎక్కిస్తున్నాయి. భవిష్యత్తుపై ప్రగాఢ విశ్వాసాన్ని, సమకాలీన సామాజిక వ్యవస్థపై అంతులేని ఆగ్రహాన్ని ప్రతిధ్వనిస్తున్నాయి.

జాతీయోద్యమ కాలంలో అస్పృశ్యతను నిరసించిన 'దళిత కవిత,' వామపక్ష ఉద్యమాలలో పీడితవర్గ పోరాటంలో భాగంగా దళిత పోరాటాన్ని ప్రబోధించింది. ఇప్పుడు దళిత ఉద్యమం దళితుల ప్రతిఘటనకు పిలుపు నిస్తున్నది.

ఇవ్వాళ దళితులు విద్యావంతులౌతున్నారు. ఆలోచిస్తున్నారు. సంఘటితులౌతున్నారు. చైతన్యవంతులౌతున్నారు. ఉద్యమిస్తున్నారు. సాటి దళిత సోదరులను చైతన్యపరచడానికి సాహిత్యాన్ని ఒక బలమైన సాధనంగా ఉపయోగిస్తున్నారు. పాఠకుల నుద్దేశించి రాస్తున్న దళిత సాహిత్యంకన్నా, శ్రోతల నుద్దేశించి రాస్తున్న దళిత గీతాల్లోనే దళితుల ఆవేదన, ఆందోళన, ఆక్రందన, ఆవేశం ప్రబలంగా వినబడుతున్నది.

బొజ్జా తారకం, కత్తి పద్మారావు, గుంటూరు ఏసుపాదం వంటి దళిత కవులు వచన కవితద్వారా దళిత చైతన్యాన్ని జాగృత పరుస్తుంటే; మాష్టార్జీ, గద్దర్, శివసాగర్, జి. అంజయ్య, ఉ. సాంబశివరావు, ఒడ్డయ్య, క్రాంతి కిరణ్, నీలంకవి, పాడేటి జాన్సన్, వెంకన్న, సాహూ, జి. వై. గిరి, కొలకలూరి స్వరూపరాణి మొదలైన దళిత కవులు పోరాట గీతాల ద్వారా 'దళిత కవిత'ను వేడెక్కిస్తున్నారు. దళితుల భాషను, బాణీలను, భావాలనూ తమ గీతాలకు ప్రాణవాయువులుగా వినియోగించుకుంటున్నారు.

దళితుల గుర్తింపు కోసం, ఆత్మ గౌరవం కోసం, వ్యక్తిత్వ వికాసం కోసం, ఉద్యమ స్ఫూర్తి కోసం నేడు 'దళిత కవిత' రెక్కలు విప్పుకుంటున్నది. జూలు విదిలిస్తున్నది. గర్జిస్తున్నది. సాంఘిక వాస్తవికత అయిన 'కులవ్యవస్థ'పై పోరాట మార్గాన్ని నిర్దేశిస్తున్నది. కుల నిర్మూలన పూర్తికానిదే సామాజిక న్యాయం సమకూరదన్న స్పష్టమైన, నిర్దిష్టమైన భావజాల పునాదిని ఏర్పరచుకుంటున్నది.

దళిత కవులు – బుద్ధుడు, జ్యోతి బాపూలే, అంబేద్కర్, మార్క్స్, మావో, లోహియా ఆలోచనల సమన్వయ విచారధారను తమ తాత్త్విక పునాదిగా గ్రహిస్తున్నారు. మరీ ముఖ్యంగా గమనిస్తే మార్క్సిజం, అంబేద్కరిజంల సమన్వయాన్ని సాధించే ప్రయత్నం చేస్తున్నారు.

1972 నాటి దళిత పాంథర్ల ప్రణాళిక దళిత కవులకు ఒక నూతన ఉత్తేజాన్ని కలిగించిందనవచ్చు.

'దళితుల విముక్తి పోరాటం ఒక సమగ్రమైన విప్లవం కోరుకుంటున్నది. పాక్షికంగా అది అసాధ్యం. అది మాకొద్దు. మాకు సమగ్రమైన విప్లవాత్మకమైన మార్పు కావాలి. మొదట మాకు జరుగుతున్న సాంఘిక అన్యాయాలను ఎదిరించడంతో తృప్తిపడినా, తర్వాత ఆర్థిక, రాజకీయ రంగాలలో అధికారాన్ని మేమే చేపట్టాలి. మేము ఇక ఏమాత్రం లొంగి ఉండం. దేశాన్నంతా మేమే పరిపాలించాలి. మాకు వ్యక్తులపై ద్వేషం లేదు. మా కసి అంతా ఈ వ్యవస్థపైనే. హృదయ పరివర్తన, ఉదారమైన విద్యావిధానాలు – అన్యాయాన్ని గానీ, దోపిడీని గానీ రూపుమాపలేవు. దళిత ప్రజానీకంలో చైతన్యం కలిగించి, వాళ్ళను కూడగడతాం. విప్లవజ్వాల ఈ విస్తృతమైన పోరాటాలనుంచే రాజుకుంటుంది. ఎన్నికల ద్వారా, సత్యాగ్రహాల ద్వారా, రాయితీల ద్వారా సాంఘిక వ్యవస్థ విప్లవీకరింపబడదు. మా సాంఘిక విప్లవ ఆలోచన ఈ నేలలో మొలకెత్తి, ప్రజల మనస్సులో పెరిగి, చివరికి తపనతో జ్వలిస్తున్న ఉక్కులా, మెరుపులా ఆచరణలోకి వస్తుంది' అంటున్న ప్రణాళిక దళితుల సాంఘిక విప్లవాలోచన ఒక సమగ్రమైన విప్లవాన్ని సాధించాలంటున్నది.

అలాగే ఆంధ్రప్రదేశ్‌లో 'దళిత మహాసభ,' కర్నాటకలో 'దళిత సంఘర్ష సమితి,' మహారాష్ట్రలో 'దళిత పాంథర్స్,' తమిళనాడులో 'దళిత కల్చరల్ ఫ్రంట్' మొదలైన సంస్థలు ఒక వైపు; 'వన్నియార్ల పార్టీ,' 'రిపబ్లికన్ పార్టీ,' 'బహుజనసమాజ్ పార్టీ' మొదలైన రాజకీయ పక్షాలు మరో వైపు దళితకవితకు నూతన ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్నీ కలిగిస్తున్నాయి.

'మనం మన శత్రువును ప్రేరేపించాలి. కుల వైరుధ్యాలను పెంచాలి. సంక్షోభాన్ని సృష్టించే కారణాలను అన్వేషించాలి' అనే ఎత్తుగడతో దళిత కవిత పురోగమిస్తున్నది. 'ప్రపంచమంతా శ్రమవిభజనను మాత్రమే చూసింది. కానీ భారతదేశంలో మాత్రం శ్రామికుల విభజన జరిగింది. శారీరక శ్రమపై ఆధారపడినవారు శూద్రులుగా, పంచములుగా, దళితులుగా పరిగణింపబడ్డారు' అని విశ్లేషించి చూపిన డా॥ బి.ఆర్. అంబేద్కర్ సిద్ధాంతాలను; 'పీడితులు ఆర్థిక, సామాజిక, రాజకీయ దోపిడికి వ్యతిరేకంగా వర్గ పోరాటాన్ని కొనసాగించాలి' అనే విప్లవ పథాన్ని నిర్దేశించిన మార్క్స్, లెనిన్‌ల కార్యాచరణను సమన్వయించే దృక్పథాన్ని నేటి 'దళిత కవిత' ప్రధానంగా ప్రదర్శిస్తున్నది.

> 'నేను అస్పృశ్యుణ్ణి / నా ఒళ్ళంతా మట్టివాసన
> నా బ్రతుకునిండా వెట్టివేదన / నా కళ్ళనిండా ఎండవేడిమి
> ఎండకు ఎండి వానకు తడిసి / బిగుసుకు పోయిన మర్రి ఊడల్లా నా తల'
> 'నాకై కవితలేదు / నాకు చరితలేదు
> నాలుగు వేదాలలోంచి / నాలుగు పాదాలలోంచి
> నన్ను తొలగించారు / కట్టెలోంచి జారిన కట్టెలా
> ఒక్కణ్ణే ఎక్కడో ఎండిపోయాను'

అంటూ 'నది పుట్టిన గొంతుక'లో దళిత ఉద్యమకారుడు శ్రీ బొజ్జా తారకం దళితుల స్థితిగతులను వర్ణించారు. కావ్యాంతంలో...

> 'నేను ధూళిని గాలిని / మట్టిని మేరువును
> ఉరుమును మెరుపును / అగాధాన్ని సముద్రాన్ని
> ప్రవాహాన్ని ప్రళయాన్ని / అనలాన్ని ప్రభావాన్ని
> అంబువును స్వయంభువును / నేను వస్తున్నాను.'

అంటూ దళితుల విప్లవ విశ్వరూపాన్ని ఆవిష్కరించారు.

దళిత ఉద్యమంలో ఒక బలమైన కావ్యకర్తగానూ, కార్యకర్తగానూ కొనసాగుతున్న కత్తి పద్మారావు 'దేశం డైరీ, కవితా సంపుటిలోని 'స్వాగతం,' 'ప్రతిభ,' 'తెలుగువారి

హోచిమిన్ శివసాగర్,' 'ఎర్ర నక్షత్రం,' 'శంకరాచారి' మొదలైన కవితలు దళితచైతన్య ప్రతీకలుగా వెలుగుతున్నాయి.

'పదిరికుప్పం, కారంచేడు / తాడిపర్తి కొత్తకోట
నీరుకొండ, దొంతలి / శివలూరు, బండ్లపల్లి
దేశవ్యాప్తంగా రక్తతర్పణం / చేసిన దళితుల పీడనల
విముక్తి పోరాటాలకు / స్వాగతం – సుస్వాగతం'

అంటూ విప్లవాహ్వానం పలుకుతున్నాడు కత్తి పద్మారావు.

విప్లవోద్యమంలో భాగంగా దళితుల దయనీయమైన జీవితాలను చిత్రిస్తూ, దళితుల్లో విప్లవ చైతన్యాన్ని రగిలించడానికి ప్రయత్నిస్తున్నవారు శివసాగర్, గద్దర్, జి. అంజయ్యలు.

'ఊరు మనదిరా – ఈ వాడ మనదిరా' అనే ప్రఖ్యాత గీతంలో...

'బండి మనదిరో – బండెడ్లు మనయిరా
ఈ కంచెకాడ మనం – ఆ మంచెకాడ మనం
ఈ పాడికాడ మనం – ఆ పసులకాడ మనం
మట్టికాడ మనం – ఆ ఎట్టికాడ మనం
ఈ నాటుకాడ మనం – ఆ మోటకాడ మనం
సాకిరేవుకాడ మనం – సారెలు దింపేది మనం
సావుకాడ మనమే – సాన్నాయికాడ మనమే.'

అంటూ జి. అంజయ్య గ్రామీణ జీవితంలో అవినాభావంగా ముడిపడి ఉన్న దళిత జీవితాన్ని ప్రతిభావంతంగా చిత్రించారు.

'బాంచెన్ బాంచెన్ అంటూ/గులాపాన్ని దొర అంటూ
ఎన్నాళ్ళు బతుకుతారురా – మాలన్నా
ఎదురు తిరగవేమిరా – మాదిగన్నా //బాంచెన్//
నువ్ మతం మార్చుకున్న/నీ బతుకుమారదన్న
నువ్ కులం మార్చుకున్న/నీకు కూడు దొరకదన్న
నీవు రాజ్యమేలకుండ/నీ రాత మారదన్న
రాజ్యాధికారానికి – మాలన్న/నీవు రైఫోలందుకోరో మాదిగన్న'

అంటూ సాయుధపోరాటం ద్వారా దళితులు రాజ్యాధికారాన్ని సాధించాలని గద్దర్, తమ గీతాల ద్వారా ఉద్యమ గర్జన వినిపిస్తున్నారు.

తెలుగులో దళిత గీతాలకు ఒక ఊపును కలిగించిన దళిత యువకవి 'మాష్టార్జీ'/

'ఒకనాడు అమీబానైతే/అయివుండవొచ్చునేమో కానీ
నేడు స్థిరమైన అస్తిత్వం కలిగిన/అడవి సింహాన్ని నేను
ఒకనాడు జడివానకు/ఒడితిరిగి పడిపోయే
తుంగతోపునేమో కానీ/నేడు ఉత్తుంగ జల తరంగాలను
ప్రచండ వాయువేగాలను/తట్టుకుని
సగర్వంగా నిలిచే గడ్డిపరకను నేను'

అంటున్న మాష్టార్జీ ఇటీవలి కవితల్లో 'మూలవాసీ సిద్ధాంతం' (The theory of originism) ప్రభావం ఎక్కువగా కనబడుతున్నది.

ఆస్ట్రేలియాలో ఎబోరిజన్స్, ఆఫ్రికాలో నల్లజాతి వారు, (నీగ్రోడ్స్) అమెరికాలో రెడ్ ఇండియన్స్ వలె దక్షిణ భారతంలోని అనార్యులైన ద్రవిడులు ఈ నేలతల్లి బిడ్డలు, మూలవాసులు. ఈ మూలవాసులకు రాజ్యాధికారం కావాలనేది మూలవాసీ సిద్ధాంతసారం.

'ఈ దేశ వాసులం – ఈ భూమి పుత్రులం
మేం మూల వాసులం – అది అసలు జాతులం
భారతాది జనుల బట్టి – బానిసలు మీరంటూ
వీళ్ళు దోపిడేందిరో – వీళ్ళు దగా ఏందిరో
వీళ్ళు నీల్గుడేందిరో – వీళ్ళు నిక్కుడేందిరో'

అంటూ మాష్టార్జీ ప్రశ్నించడంతోబాటు దళితుల ఆత్మగౌరవం కోసం నిరంతరం పోరాడాలని తమ కవితల ద్వారా తమ జాతిజనులను ఉత్తేజపరుస్తున్నారు.

దళితుల్లో ప్రతిఘటన పోరాట చైతన్యాన్ని ప్రదీపింపజేయడానికి 'ఎదురీత' అనే రాజకీయ మాస పత్రికకు సంపాదక బాధ్యతను వహించి, వెలువరిస్తున్న ఉ. సాంబశివరావు రాసిన 'దళిత యువత,' 'దళిత మాత,' 'కార్చిచ్చు' మొదలైన గీతాలు 'దళిత కవిత' పయనిస్తున్న దిశను సూచిస్తున్నాయి.

'అంటరాని పల్లెల్లో/మంట రాజుకుందిరో
నివురుగప్పిన నిప్పు గుప్పునంటుకొందిరా, మా
ఆత్మ గౌరవాన్ని మీరు గౌరవించకుంటే, ఈ
అంటరాని మంటే మీ ఎంట దగులుతుందిరో'

అని హెచ్చరిస్తున్న ఉ. సాంబశివరావు –

'రక్తమైన చిందిస్తాం ప్రాణమైన అర్పిస్తాం
ఆత్మగౌరవాన్ని మేము హక్కుగానె సాధిస్తాం.'

అనే దృఢ దీక్షను తమ కవితల్లో ప్రకటిస్తున్నారు.

ఇంకా క్రాంతి కిరణ్, చెరుకు సుధాకర్, ఎ. గవర్రాజు, ప్రసాద్, మిత్ర, కృష్ణ, వసంత్, సతీష్ చందర్, మరియమ్మ తదితర దళిత రచయితల కవితలు, గేయాలు 'దళిత కవిత'ను సుసంపన్నం చేస్తున్నాయి. 'నలుపు,' 'ఎదురీత,' 'దళిత్‌వాయిస్' మొదలైన పత్రికలు ఈ కవితా వికాసానికి కృషి చేస్తున్నాయి.

అలాగే దేశ వ్యాప్తంగా దళిత కవితను రాసిన, రాస్తున్న రచయితల్లో ప్రముఖంగా పేర్కొనదగినవారు శ్రీయుతులు శంకర్రావు ఖరాత్, నామ్‌దేవ్ డసాళ్, రాజాధాలే, దయాపవార్, నారాయణ్ సుర్వే, శరణకుమార్ లింబాళే, అరుణ్ కాంబ్లే, లక్ష్మణమానే, చంద్రమోహన్ వ్యాగ్, శ్రీమతి పద్మాపవార్ (మహారాష్ట్ర); జతిన్‌బాగ్చీ, బి.కె. బిశ్వాస్, సురేందర్ శిక్దా (పశ్చిమ బెంగాల్); గోమాస్తో ప్రసాద్

సోరంగ్ (పశ్చిమ బెంగాల్ సంతాలీ రచయిత); చంద్రకాంత్ పోస్తే, శాంతకుమార్ (కర్నాటక); కె. ఆర్. పటార్కర్ (భోపాల్); సీతారాం (రాజస్థాన్); కుమార్ హసన్, తిరువళ్ళువార్, కె.కె. ఎస్టా (కేరళ); మోహన్ (మద్రాస్) మొదలైనవారు దళితజన జాగృతి కోసం అంకితమై సాహిత్య సృజన చేస్తున్నారు.

సమకాలీన దళిత కవులు దాదాపు అందరూ వర్గ పోరాటంలో భాగంగానే దళిత పోరాటాన్ని చిత్రిస్తున్నారు. దళితుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ పీడనను ప్రతిఘటిస్తున్నారు. దోపిడీ సమస్త రూపాలనూ వ్యతిరేకిస్తున్నారు. పీడితుల రాజ్యాధికారంకోసం పిలుపు నిస్తున్నారు. సామాజిక రుగ్మతలపై తీవ్రమైన స్వరంతో తమ ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నారు. ఇదీ నేటి 'దళిత కవిత' నడుస్తున్న గమనం; దాని గమ్యం.

అయితే, దళిత సాహిత్యం ఈనాడు దానికదే ప్రత్యేకమైన స్రవంతివలె కాకుండా విస్తృత ప్రగతిశీల ఉద్యమ స్రవంతిలో భాగంగానే ప్రవహించవలసి ఉంది. దళిత సాహిత్యాన్ని సృష్టిస్తున్న రచయితలు పుట్టినకులం ప్రాతిపదికన కాకుండా, వారి ఓరియంటేషన్ ప్రాతిపదికన దీనిని అంచనా కట్టవలసి ఉంది. దళిత సాహిత్యం అన్యకుల విద్వేషాన్ని ప్రబోధించేదిగా కాకుండా, కుల నిర్మూలన దిశను సూచించేదిగా ఎదగాల్సి ఉంది. దళితుల ఆవేదనలు, పోరాటాలు, త్యాగాలు విస్తృత పీడితుల ప్రయోజనాలను పరిరక్షించడానికి ఉపయోగపడాలి. స్వాతంత్ర్యానంతర కాలంలో పరిమితంగానే అయినా ప్రభుత్వం కల్పించిన రాయితీలు, సబ్సిడీలు, రిజర్వేషన్లు, రిజర్వ్డ్ నియోజక వర్గాల మూలంగా నేటి భారతీయ సమాజంలో ఒక నూతన ధనిక దళితవర్గం ఆవిర్భవించి ఉంది. ఇదొక చారిత్రక యదార్థం. దళితుల పోరాటాల ఫలితాలను ఈ నూతన ధనిక దళితవర్గం హస్తగతం చేసుకునేందుకు పొంచి చూస్తున్నది.

దళిత ఉద్యమానికీ, దళిత సాహిత్యోద్యమానికీ నిర్దిష్టమైన వర్గదృక్పథం లేనట్లయితే, ధనిక దళిత వర్గం ప్రయోజనం పొందే ప్రమాదాన్ని దళిత రచయితలు గుర్తిస్తున్నారు. పీడిత దళితవర్గాన్ని చైతన్య పరుస్తూ, సమరశీల పోరాటాలవైపు వారిని ప్రేరేపిస్తూ రచనలు చేస్తున్నారు. సామాజిక న్యాయం, సమసమాజ నిర్మాణం ఆశయాలుగా సాహిత్యాన్ని ఒక పదునైన ఆయుధంగా ప్రయోగిస్తున్నారు.

చరిత మనది భవిత మనది
జగతిని శాసించు మహా
చైతన్యం మనదేనని
సాగవోయి మును ముందుకు – చందు సుబ్బారావు

# స్త్రీవాద సాహిత్యం - ఒక పరిశీలన

డా॥ రావి భారతి

ప్రపంచ జనాభాను ఆక్రమించిన దాదాపు 50 శాతం స్త్రీలు ఏదో ఒక రూపంలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ, నైతిక సమస్యల్ని ఎదుర్కొంటున్నారు. శ్రామికవర్గ స్త్రీలు - మధ్య తరగతి స్త్రీలు - ఫ్యూడల్ సంస్కృతికి సంబంధించిన స్త్రీలు - ఇలా వర్గస్థాయి ననుసరించి భిన్న భిన్న సమస్యలకు లోనౌతున్నారు. గమనించవలసిన అంశమేమిటంటే సమస్యలయొక్క స్వరూపాలు భిన్నమైనా, ప్రతీ సమస్యపై పురుషాధిక్యత యొక్క ముద్ర స్పష్టంగా కనిపించి తీరుతుంది.

అంతర్జాతీయంగా కూడా స్త్రీలు పురుషులతో పాటు మానవ హక్కుల కోసం, ఓటుహక్కు కోసం, వేతన క్రమంలో సమానత్వం కోసం పోరాటాలు చేశారు, చేస్తూ ఉన్నారు.

సాంఘికంగా కూడా ప్రపంచ వ్యాప్తంగా స్త్రీ వంచింపబడుతూనే ఉన్నది. చట్టాలు చేసేదీ, మతగ్రంధాలు రాసేదీ మగవాళ్ళే కనుక క్రైస్తవ గ్రంధాలు, ఇస్లాం మత గ్రంథాలు స్త్రీని చాలా నీచంగా చిత్రించాయి. మన వాఙ్మయంలో మనుస్మృతి మొదలు మహాభారతం దాకా స్త్రీని తక్కువ చూపుతో చూసినట్లు సోదాహరణంగా చెప్పొచ్చు. గమనించదగిన అంశమేమిటంటే స్త్రీలు ఈనాడు ఏదేశంలో వున్నా సమస్య స్వరూపాలు భిన్నమైనప్పటికీ స్వభావాలు మాత్రం ఒకటిగానే ఉంటాయి. ఎందుకంటే స్త్రీలయొక్క అనుభవాలు, అనుభూతులు, సెంటిమెంట్లు, స్పందనలు వీటిలో తేడాలుండవు. వివాహం, కుటుంబం, మాతృత్వం, ఆర్థికావసరాలు, సాంఘిక సంబంధాలు, ఇవి ఎక్కడ ఉంటాయో అక్కడ సమస్యలు సహజంగానే ఉత్పన్నమౌతాయి. సమస్యల యొక్క పరిపక్వ పరాకాష్ట దశను సూచించే చైతన్యం - ప్రతిఘటన - ఈ రెండూ ఎక్కడ ఉంటాయో అక్కడే ఉద్యమాలు ఊపిరిపోసుకుంటాయి. ఫెమినిష్టు ఉద్యమం అట్లా పుట్టిందే.

ఆంగ్లంలో 'ఫెమినిజం' అన్నపదానికి సమానార్థకంగా స్త్రీవాదం అనీ, స్త్రీ విముక్తి ఉద్యమం అనీ, స్త్రీ స్వేచ్ఛా ఉద్యమం అనీ, స్త్రీవిమోచనోద్యమం అనీ వ్యవహరిస్తున్నా "స్త్రీవాదం" అన్న పదం బహుళ ప్రాచుర్యం పొందింది.

ఈ స్త్రీవాదాన్ని ఎందరో ఎన్నో విధాల నిర్వచిస్తున్నారు. ఫెమినిష్టు స్టడీ సర్కిల్ వారు స్త్రీ వాదాన్ని విస్తృతార్థంలో ఇలా అంటారు. "సమాజంలోనూ, కుటుంబంలోనూ, పనిలోనూ స్త్రీలు గురౌతున్న అణచివేత, దోపిడీకి సంబంధించిన అవగాహన కలిగి ఉండి ఈ పరిస్థితి మార్చడానికి స్త్రీలు, పురుషులు చేపట్టే చైతన్యవంతమైన కార్యక్రమం". మరికొందరి నిర్వచనం వివరణాత్మకంగా ఇలా కనిపిస్తుంది. "సమాజంలోని అన్ని రంగాలలోనూ ఆడదానికి సమాన భాగస్వామ్యం ఉండాలనీ, ఆడవాళ్ల వ్యక్తిత్వమూ జీవితమూ కొందరి చెప్పుచేతలకి లోబడి తీర్చిదిద్దబడే పరిస్థితి మారాలనీ, ముఖ్యంగా స్త్రీ తల్లిగా, భార్యగా మాత్రమే ముద్రవేయబడే ఒక లేబిల్ నుంచి మనిషిగా గుర్తింపబడే స్థితికి రావాలని, దానికోసం సాంస్కృతికంగానూ, సామాజికంగానూ, సాహిత్య పరంగానూ మర్రిఊడలై విస్తరించి ఉన్న పురుష స్వామ్యపు భావజాలం పోవాలనీ, ఈ భావాలతో సాగుతున్న ఉద్యమమే ఫెమినిజం". - ఇలా ఎన్నో నిర్వచనాలు మన పరిశీలనకు వస్తాయి.

తమ అణచివేతకు వ్యతిరేకంగా కేవలం స్త్రీలు మాత్రమే తీసుకునే రాజకీయ చర్యగా ఫెమినిజాన్ని పాశ్చాత్యుడైన Henrittal L. Moore పేర్కొన్నాడు. అలాగే ప్రొఫెసర్ Olive Banks ఫెమినిజాన్ని సమాజంలోగా స్త్రీల యొక్క స్థితిని మార్చే సామాజిక ఉద్యమంగా నిర్వచించాడు. ఫెమినిజాన్ని ఒక సిద్ధాంతంగా కాక ఒక విశ్లేషణా పద్ధతిగా జీవితాన్నీ రాజకీయాలనూ అర్థం చేసుకునే పద్ధతిగా స్త్రీల

గురించి సిద్ధంగా ఉన్న రాజకీయ పరిష్కారాలు ఇవ్వటంకాక ప్రశ్నలు అడగటానికి, సమాధానాలు వెతకటానికి ఉన్న ఒక మార్గంగా నాన్సీ హార్ట్‌సాక్ తెలిపింది. కార్యాచరణ రూపంలో అంతర్జాతీయంగా స్త్రీల హక్కుల కోసం పోరాటం మొదలైనప్పుడే ఫెమినిజం ఊపునందుకున్నది.

- 1789లో ఫ్రెంచి విప్లవం అన్నివర్గాల ప్రజానీకానికి స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం అన్న పిలుపు ఇవ్వకముందే ఫ్రాన్స్ మహిళలు తమ హక్కుల ఉద్యమాన్ని ప్రారంభించారు. 1889లో పారిస్ రెండవ ఇంటర్‌నేషనల్‌లో స్త్రీ పురుషులకు సమానహక్కుల సమస్య అంతర్జాతీయ వేదికపై ప్రస్తావించబడింది.
- బూర్జువా పునర్వికాస ఉద్యమంగా వీచిన కొత్తగాలితో యూరప్‌లో మానవహక్కుల సమస్య ముందుకు వచ్చింది. స్త్రీ విద్య, మహిళా హక్కులు, స్త్రీలకు సామాజిక స్వేచ్ఛ – వీటికి సంబంధించిన ఉద్యమాలలో ఇంగ్లండు అగ్రగామిగా నడిచింది. 1830 సంవత్సరపు ఛార్టిస్టు ఉద్యమంలో చాలా మంది మహిళలు పాల్గొన్నారు.
- అమెరికాలో 1841లో స్త్రీలు ఫ్యాక్టరీలలో వాళ్ళకున్న శక్తియుక్తుల్ని మొదటి సారిగా గుర్తించి సామూహికంగా తీసుకునే కార్యక్రమాల ప్రభావాన్ని అర్థం చేసుకోవడం ప్రారంభించారు. 1966లో "స్త్రీల జాతీయ సంస్థ" ప్రారంభమైంది. "బెట్టీ ఫ్రైడన్" అందులో ముఖ్య సభ్యురాలు. ఉద్యోగావకాశాల్లో స్త్రీలపట్ల వివక్షత చూపించడానికి వ్యతిరేకంగా ఎన్నో వందల కోర్టుకేసుల్ని ఆమె ఫైలు చేసింది. గర్భస్రావానికి చట్టరీత్యా మార్పులు చేయాలని ఉద్యమం ప్రారంభించింది. యూనివర్సిటీలలో స్త్రీ విముక్తి గ్రూపులు ప్రారంభమైనాయి. భర్తలను వదిలేసిన భార్యలకు, వితంతువులకు ఆశ్రయాలు ఏర్పాటు చేసే ప్రయత్నాలు కొనసాగాయి. 1970లో గృహిణులందరితో ఇంటి చాకిరీకి జీతం, గుర్తింపు కావాలనే నినాదంతో ఉద్యమం కొనసాగింది. ఫ్యాక్టరీలలో స్త్రీ కార్మికులు సమ్మెలు ప్రారంభించి, తమలో కలిగిన చైతన్యాన్ని చాటుకున్నారు.
- 1870 రష్యన్ విప్లవం వ్యక్తి స్వాతంత్ర్యానికీ విముక్తికీ చాలా ప్రాధాన్యత నిచ్చింది. అందులో భాగంగా స్త్రీ విముక్తిని కూడా లక్ష్యంగా పెట్టుకుంది. రష్యన్ విప్లవం స్త్రీల చైతన్య చరిత్రకు ఒక గీటురాయి.
- 1911 నాటి చైనా విప్లవంతో స్త్రీలు ధైర్యంగా బహిరంగంగా బయటకు వచ్చి కార్మిక పోరాటాల్లో పాల్గొనడం జరిగింది. 1912లో చదువుకున్న అమ్మాయిలు గుంపులుగా పార్లమెంటు మీద దాడిచేసి అసమానతలకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శించారు. 1921 నాటికి ఉద్యమం పల్లెటూళ్ళకి విస్తరించింది.

ఇలా ప్రపంచవ్యాప్తంగా స్త్రీ స్వేచ్ఛకోసం అనేక మహిళా సంస్థలు ఉద్యమం ప్రారంభించాయి.

స్త్రీవాదంలో మనకు కొన్ని విభిన్న ధోరణులూ, దృక్పథాలూ కనిపిస్తాయి. ఉదారవాద స్త్రీవాదం, రాడికల్ స్త్రీవాదం, మార్క్సిస్టు స్త్రీవాదం, సోషలిస్టు స్త్రీవాదం, సాంస్కృతిక స్త్రీవాదం, మానవతావాద స్త్రీవాదం ముఖ్యమైనవి.

వ్యవస్థ మారనవసరంలేకుండానే ఉన్న వ్యవస్థలోనే ఆడవాళ్ళకు సమానహక్కులూ, అధికారాలు, ప్రయోజనాలు నెరవేరితే చాలనేది ఉదారవాద ఫెమినిజం. జీవితం యొక్క అన్నిరంగాల్లోనూ అంటే సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలన్నింటిలో స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని కోరుతుంది ఈ ధోరణి.

రాడికల్ స్త్రీవాదం మొత్తం పురుషాధిక్య సమాజాన్ని వ్యతిరేకిస్తుంది. స్త్రీ సహజంగా బలహీనురాలనే వాదాన్ని ఆమోదించకుండా పితృస్వామిక సమాజమే స్త్రీపైన అసహజమైన పరిమితుల్ని విధించిందని ఈవాదం యొక్క విశ్వాసం. స్త్రీ పురుషుల మధ్య వర్గ విభజన – రాజకీయ విభజన ఉన్నాయని వీరు నమ్ముతారు.

స్త్రీల సమస్యలన్నీ సోషలిస్టు సమాజ ఆవిర్భావంతో తొలగిపోతాయన్నది మార్క్సిస్టు స్త్రీవాద విశ్వాసం. స్త్రీ సమస్య ఒక చారిత్రక సాంస్కృతిక ఆర్థిక అంశమనీ వర్గభేదాలతో స్త్రీ సమస్య ముడిపడి ఉన్నదనీ, సమాజంలో వర్గదోపిడి పోయినప్పుడే. జాతుల మధ్య అంతరాలు నశించినప్పుడే స్త్రీ విముక్తికి మార్గం ఏర్పడుతుందనీ, ఒక్కమాటలో చెప్పాలంటే సంపూర్ణ సామాజిక విముక్తిలో స్త్రీ విముక్తి ఒక భాగమని మార్క్సిస్టు స్త్రీవాదుల సిద్ధాంతం.

సోషలిస్టు స్త్రీవాదులు – స్త్రీల సమస్యల్ని పైపై సమస్యలుగా కాకుండా చాలా లోతుగా సమాజపు పునాదుల్లోకి పాతుకొని పోయిన వాటిగా గుర్తిస్తారు. సమాజ రాజకీయార్థిక వ్యవస్థలో సంతానోత్పత్తి లైంగికత్వం అనేవాటిని ముఖ్యమైన నిర్ణాయకాంశాలుగా గుర్తిస్తారు. సంతానోత్పత్తి, లైంగికత్వం మొదలైన విషయాలు కూడా ఆర్థిక విషయాలే అని వీరి నమ్మకం. వీటిని కూడా రాజకీయ అర్థశాస్త్రంలో భాగంగా చూస్తారు. మొత్తం మీద పురుషాధిపత్యాన్ని సమాజ ఆర్థిక పునాదిలో భాగంగా పరిగణిస్తారు.

సాంస్కృతిక స్త్రీ విమోచన సిద్ధాంతం మహిళా సంస్కృతిని శ్లాఘిస్తుంది. స్త్రీ యొక్క సృజనాత్మక శక్తినీ, సంతానోత్పాదనలో ఆమె సామర్థ్యాన్ని చూచి పురుషుడు ఈర్ష్య చెందుతున్నాడని వీరి భావన. స్త్రీ విమోచనకు

ప్రధాన శత్రువు పురుషుడే అని వీరి నిర్ణయం. రాడికల్ ఫెమినిస్టయిన "ఫైర్‌స్టోన్" పురుషులతో సంపర్కం లేకుండా కృత్రిమ గర్భధారణకు పూనుకోవలసిందని స్త్రీలకు విజ్ఞప్తి చేసింది. "డన్‌బార్" అనే స్త్రీవాది సామాజిక విముక్తికి మూలం స్త్రీ విమోచనమే అని ప్రకటించింది.

స్త్రీ, పురుషుడికి లొంగి ఉండటం అనే వాస్తవానికి శారీరక శాస్త్రం, మానసిక శాస్త్రం, సామాజిక శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, సామాజిక పరిణామ వాదం – వీటిలో ఏ ఒక్కటీ సరైన సంజాయిషీ ఇవ్వలేదు. రాజకీయం, ఆర్థికం, జీవశాస్త్రం మొదలైనవన్నీ స్త్రీలను – పురుషులూ, సమాజమూ దోపిడి చేయటానికి ఉపకరించాయి. కనుక సమస్యను పాక్షికంగా చూడకుండా బహుముఖంగా దర్శించవలసి ఉంటుంది. సంఘంలో వ్యక్తి సంక్లిష్ట జీవి. మానవ స్వభావాన్ని లేక పెరుగుదల క్రమాన్ని అవగాహన చేసుకోవాలంటే ఒక మానవతావాద ప్రాతిపదికపై సునిశితంగా విశ్లేషణాత్మకంగా, ఒక శాస్త్రీయ అవగాహనతో సమస్యలపై వెలుగును ప్రసరింప జేయవలసి ఉంటుంది. – ఇది మానవతా స్త్రీవాద సిద్ధాంత సారాంశం.

## స్త్రీవాదం - కొన్ని ఆలోచనలు:

స్త్రీల సమస్యల్ని కేవలం సమస్యలుగానే చూడకుండా వాటి యొక్క మౌలిక రాజకీయతత్వాన్ని విశ్లేషణాత్మకంగా గుర్తించి మౌలికమైన ప్రశ్నల్ని రేకెత్తించడమే తమ ధ్యేయంగా స్త్రీవాదులు చెబుతూ ఉంటారు. సమాజంలోని సాంఘిక సంబంధాలను, ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాలను కుటుంబంలో అమలులో ఉన్న, పురుషాధికారాన్ని మౌలికంగా ప్రశ్నించడం ఈ వాదం యొక్క ముఖ్యోద్దేశం. విశ్లేషణ – విమర్శనాత్మకత – ఈ రెండు ఫెమినిజానికి రెండు కళ్లు. నిర్వచన రూపంలో చెప్పాలంటే "ఫెమినిజం ఒక విశ్లేషణా పద్ధతి. జీవితాన్నీ రాజకీయాలనూ అర్థం చేసుకునే ఒక విధానం. స్త్రీ యొక్క వ్యక్తిగత అనుభవాల ద్వారా కలిగిన అవగాహనతో రాజకీయ పరిష్కారాన్ని సూచించే ఒక సాధనం. అంటే ఈ విశ్లేషణ నింగినుంచి కాక నేలనుంచి మొదలౌతుంది. ఒకే ఒక వాక్యంలో చెప్పాలంటే సమాజంలో స్త్రీపరంగా ఆర్థిక రాజకీయ నైతికరంగాలలో మౌలికమైన మార్పుల్ని కోరడమే ఈ ఉద్యమంయొక్క పరమోద్దేశం".

ఎప్పుడైతే మనం సమస్యల యొక్క మౌలికాంశాల్లోకి వెళతామో వాటికొక ఛారిత్రక నేపథ్యం తప్పని సరిగా ఉంటుంది. వాటికొక సిద్ధాంతమూ ఉంటుంది. అది ఉద్యమానికి కరదీపిక లాంటిది. ప్రపంచ వ్యాప్తమైన ఈ ఫెమినిస్టు ఉద్యమానికి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, ఎల్.హెచ్. మోర్గన్, షీలారూడోతమ్, ఎలిసన్, ఎమ్. జగ్గర్, గైల్‌రూబిన్ వంటి ఆర్థిక సాంఘిక రాజకీయ శాస్త్రవేత్తల సిద్ధాంతాలే ఆయువుపట్టులు. ఇవి సాంఘిక ఆర్థిక జీవితాన్ని నడిపించే శక్తుల్ని విశ్లేషించి తద్వారా ఒక కార్యక్రమాన్ని ఉద్యమాలకు అందిస్తాయి. ఇలాంటి చారిత్రక సిద్ధాంతాల వెలుగులో, శాస్త్రీయ అవగాహనతో సమస్యల్ని విశ్లేషించి విమర్శించే విధానంపై ఫెమినిజం యొక్క శక్తి ఆధారపడి ఉంటుందని వాళ్ళు నమ్ముతారు.

## స్త్రీవాద ధోరణిలోని ప్రధానమైన కొన్ని ఆలోచనలు:

1. పితృస్వామ్య వ్యవస్థలోని స్త్రీల పతనాన్ని పురుషాధిక్యతను నిర్మాణపరంగానూ, భావజాలపరంగానూ చారిత్రక నేపథ్యంలో గుర్తించిన ఫెమినిస్టులందరూ పురుషాధిపత్యాన్ని నిర్మూలించాలని కోరుతారు. వారికి కసి పురుషులపైన కాదు, పురుషాధిక్య వ్యవస్థపైన. ఆ భావజాలంద్వారా, పెట్టుబడి మానవులను విభజించి పాలిస్తున్నది. ఒక సమాజ ఆర్థిక వ్యవస్థ సోషలిస్టు ఆర్థిక వ్యవస్థగా మారినప్పుడు జరిగే సాంస్కృతిక విప్లవం ద్వారా పురుషాధిపత్యం పోతుందని మార్క్సిజం చెబుతుంది.
2. సెక్సుకూ, జండర్‌కూ మధ్య ఉన్న తేడాను తేటతెల్లం చేయడం. సెక్స్ అన్నది శారీరకంగా ఆడ మగ భేదాలను గుర్తించి చెబుతుంది. కాబట్టి అది సహజమైనది. జండర్ అన్నది సాంఘికంగా, సాంస్కృతికంగా స్త్రీత్వ లక్షణాలనూ, స్వభావాలనూ; పురుషత్వ లక్షణాలనూ స్వభావాలను – వేరువేరుగా ఏర్పరచి పురుషుల్ని పురుషులుగా, స్త్రీలను స్త్రీలగా తయారు చేస్తుంది.
3. లైంగికత్వం యొక్క రాజకీయ స్వభావాన్ని నొక్కి చెప్పడం. రాజకీయ తత్వవేత్తలందరూ నిర్లక్ష్యం చేసిన సంతానోత్పత్తి, లైంగికత్వం అన్న విషయాలను ఫెమినిస్టులు గుర్తించి పట్టించుకున్నారు. లైంగికత్వం, సంతానోత్పత్తి, ఇంటి చాకిరి – ఇవన్నీ స్త్రీల వ్యక్తిగత విషయాలు కావు. రాజకీయాలతో ముడిపడ్డ విషయాలు. లైంగిక సంబంధాలలోని అసమానతలయొక్క రాజకీయ స్వభావాన్ని గుర్తించి దానికి పోరాట రూపాన్నివ్వాలని రాడికల్ ఫెమినిస్టులంటారు. సమాజ రాజకీయ ఆర్థిక వ్యవస్థలో సంతానోత్పత్తి, లైంగికత్వం అనేవి ముఖ్యమైన నిర్ణాయకాంశాలుగా గుర్తిస్తారు. "వ్యక్తిగతం కూడా రాజకీయమే" అన్న నినాదమే దీని సారాంశం.
4. కుటుంబాన్ని ఒక ప్రైవేట్ యూనిట్‌గా కాకుండా సాంఘికపరమైన యూనిట్‌గా పరిగణించడం. భౌతిక వాదం ప్రకారం ఉత్పత్తి అనగానే ఆహారం, బట్టలూ, ఇల్లూ మొదలైనవే గుర్తింపబడుతున్నాయి. కాని లైంగికతృప్తి,

సంతానోత్పత్తి, పిల్లల పెంపకం, ఇంటి చాకిరీ మొదలైన వాటిని ఉత్పత్తిలో భాగంగా చేర్చడం లేదు. కనుక స్త్రీవిముక్తి అసాధ్యమౌతున్నది. స్వేచ్ఛా సమాజానికి ఉత్పత్తి మీద శ్రామికుల కంట్రోలు మాత్రమే సరిపోదు. సంతానోత్పత్తిలో కూడా ప్రజాతంత్రవిధానం ఉండాలి. పునరుత్పత్తి ప్రజాస్వామ్యం కావాలంటారు సోషలిస్టు ఫెమినిస్టులు.

ఇలాంటి ఆలోచనలు సిద్ధాంతాలు ప్రజల్లోకి వెళ్ళడానికి సాహిత్యం ఒక శక్తివంతమైన సాధనంగా ఉపయోగిస్తుంది. ఒకవైపు సిద్ధాంతపరమైన సాహిత్యాన్ని ప్రచారం చేస్తూనే మరోవైపు తమ భావాభివ్యక్తీకరణకు ప్రచారానికి ముఖ్యంగా కవిత్వాన్ని సాధనంగా గ్రహిస్తున్నారు. తమ కలాలనూ గళాలనూ విప్పుతున్నారు. పెన్నునే ఒక గన్నులాగా పురుషాధిక్య సమాజంపై గురిపెడుతున్నారు. స్త్రీల సమస్యలకు భిన్నమైన పద్ధతిలో ప్రతిస్పందిస్తూ కొందరు కవయిత్రులు ఒక నూతన దృక్కోణం నుండి కవిత్వం రాస్తున్నారు. స్త్రీమాత్రమే చెప్పగలిగిన విషయాలను కవితా వస్తువులుగా గ్రహించి స్త్రీ దృష్టినుండి కనిపించే స్త్రీ ప్రపంచాన్ని ఏమీ దాపరికం లేకుండా ప్రదర్శిస్తున్నారు. చాలా కవితా ఖండికల్లో ఆర్తి ఉంది. ఆర్ద్రత ఉంది. ఆవేదన ఉంది. ఆవేశముంది. అన్నిటినీ మించి సాంఘిక ప్రయోజన ముంది. భాషాపరంగా చూస్తే శబ్దప్రయోగంలో శక్తీ, భావవ్యక్తీకరణంలో యుక్తీ, శబ్దశిల్పం మీద రక్తీ కనిపిస్తాయి.

మరొక్క విషయం కూడా మనం గమనించాలి. లోకంలో పురుష ఫెమినిస్టులు కూడా ఉన్నారన్నమాట మరిచి పోకూడదు. చాలా వరకు వీరంతా అభ్యుదయ వాదులు, జీవితంపట్ల శాస్త్రీయమైన అవగాహన కలవారు. అటు సామాజికపరంగానూ ఇటు స్త్రీ విముక్తి పరంగానూ మౌలికమైన మార్పుల్ని కోరేవారు. మొదటి తరంలో ముఖ్యంగా చెప్పుకోదగిన వాళ్లు చలం, కొడవటిగంటి కుటుంబరావు. కుటుంబరావు గారి స్త్రీ వాదం ఈనాటి రచయిత్రుల్లో చాలా మంది పుట్టకముందే పుట్టింది. వీరి స్త్రీవాదం ఆనాడు చాలామందికి మింగుడు పడలేదు. ఒక్క వ్యాసంలోని ఉదాహరణాన్ని మచ్చుకు చూద్దాం. "ఆడది తన భర్త మీద ప్రేమకొద్దీ, తన పిల్లల మీద ప్రేమ కొద్దీ వాళ్ళకు చాకిరి చేస్తుందనడం ఒక కుంటి సాకే. పై పెచ్చు చాలావరకు అబద్ధం. తమ తల్లిదండ్రులను దివాళా ఎత్తించి కట్నం గుంజి తనను పెళ్ళిచేసుకున్నవాడిని ఏ స్త్రీగానీ ప్రేమించవలసిన అవసరం లేదు. పెళ్ళి చేసుకోకుండా స్త్రీ స్వేచ్ఛగా బ్రతికే అవకాశాలు దాదాపు శూన్యంగా ఉన్న ఈ వ్యవస్థలో స్త్రీ తన భర్తను హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నదీ అంటే; పోలీసు – అనుమానితుల్ని చిత్రహింసలు పెట్టి తాము నేరం చేశావని ఒప్పించడం లాంటిది. ఆడది స్వేచ్ఛా వాతావరణంలోనే ప్రేమించి పెళ్ళిచేసుకుంటుంది. పెళ్ళి అనేది నిర్బంధంగా జరిగినంత కాలం ప్రేమ ప్రస్తావన అప్రస్తుతం" (1975 ఫిబ్రవరి ఆంధ్రజ్యోతి మాసపత్రిక).

కవితా రూపాలు: ఇకపోతే స్త్రీవాద కవిత్వాన్ని మనం పరిశీలించినప్పుడు అది వ్యక్తిగతంగా పురుషాధిపత్యాన్ని ప్రశ్నించే ధోరణి నుండి వ్యవస్థాగత రాజకీయాలతో సంఘర్షించే వరకూ విభిన్న దశల్లో ప్రతిబింబిస్తున్నది. అలాగే పసితనం మొదలు పండబారిన వయసు దాకా వివిధ దశల్లో ఒక స్త్రీ – పొందే అనుభూతులు ఆవేదనలు వ్యక్తీకరింపబడుతున్నాయి.

ఒక ఆడపిల్ల జీవితంలో వివాహమనేది ఒక మధుర భావన. అయితే ఈ పురుషాధిక్య వ్యవస్థలో అవన్నీ కల్లలనీ – కలలనీ గ్రహిస్తుంది. వివాహమంటే ఒక విచ్చుకత్తుల బోనులాగా, పెళ్లంటే పెనుమంటల్లోకి దూకడంలాగా ఊహించుకునే పరిస్థితులు చుట్టూరా ఉన్న సమాజం కల్పిస్తున్నది. ఒక ఆడపిల్ల స్వగతం కవయిత్రి సావిత్రి కవితలో ఇలా వినిపిస్తుంది.

"పాఠం ఒప్పజెప్పకపోతే
పెళ్లిచేస్తానని
పంతులుగారన్నప్పుడే భయం వేసింది.
ఆఫీసులో నామొగుడున్నాడు
అవసరమున్నా సెలవివ్వడని
అన్నయ అన్నప్పుడే
అనుమానం వేసింది.
వాడికేం మహారాజని
ఆడామగా వాగినప్పుడే
అర్థమైపోయింది
పెళ్ళంటే పెద్ద శిక్షనీ,
మొగుడంటే స్వేచ్ఛా భక్షకుడనీ,
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తుందని"

ఈ పురుషాధిక్య సామాజిక పరిభాషలో "పెళ్లి" "మొగుడు" పదాల అర్థాలు ఎలా వ్యాకోచం చెందాయో మనం గమనించవచ్చు.

తరతరాలుగా వంటయింటికే అంటుకొనిపోయి వండుతూ, వారుస్తూ, వడ్డిస్తూ ఏమాత్రం సామాజిక ఉత్పత్తిలో భాగం పంచుకోలేని యాంత్రిక జీవనం స్త్రీ గడిపింది. అయితే ఆధునిక యువతి మారుతున్న విలువలకు అనుగుణంగా ప్రతిస్పందిస్తూ తన స్థానం కేవలం వంటయింట్లో కాదనీ, సామాజిక చైతన్యపు వెలుగులోకే తన ప్రయాణమని గుర్తించింది. కవయిత్రి విమల కవితలో వినాలంటే,

"మా అమ్మొక ప్రేతంలా తేలుతూ ఉంటుందక్కడ
అసలు మా అమ్మే నడుస్తున్న వంటగదిలా ఉంటుంది"
కమక మనపిల్లల కోసం వంటరి వంట గదులు కూల్చేందుకు రండి అంటూ వంటింటి సంస్కృతి పై యుద్ధం ప్రకటిస్తున్నది.

గజ్జెల మల్లారెడ్డి గారు కూడా ఈ సమస్యకి స్పందించారు.

"వంటయిల్లే ఖైదు కొట్టయి
పడకటిల్లే పంజరమ్మై
అందరికీ తలవంచి బతికే
అబల సబలగ మారినప్పుడె" స్త్రీయొక్క బానిస సంస్కృతి బ్రద్దలౌతుందన్నారాయన.

స్త్రీవేధింపు చర్యలు ఈనాడు అనేక విధాలుగా సాగుతున్నాయి. సంఘ వ్యతిరేక శక్తులు రౌడీలు, ఆకతాయి ముఠాలు ఈ దుశ్చర్యలకు పాల్పడుతున్నారు. దీనికి కారణం స్త్రీ కేవలం భోగ్యవస్తువనే అనారోగ్య భావనే. ఈ వస్తువు ఆధారంగా కొన్ని కవితలు వెలువడ్డాయి. కొల్లూరి "స్త్రీ" అనే ఒకవచన కవితా ఖండికలో

"అడవి మృగాల మధ్యనుండి
నిలువునా చూపులతో పొడుచుకుతినే కాకులనుండి
ఈ విషనాగరిక ప్రపంచపు అంచులపై బ్రతుకు" సాగిస్తూనే ఉంటుందని సమస్యను ఒక సమస్యగానే మనముందుంచారు. అయితే కవయిత్రి జయప్రభ మరో అడుగుముందుకు వేసి ఆ చూపుల్లోని వికృతిని భయంకృతిని, అసహ్యాన్ని ఎదుర్కొని ఎలా ప్రతిఘటించాలో కూడా ఆమె సూచించారు.

"ఇప్పుడు అకళ్లని వెంటాడడానికి
కళ్లతోనే యుద్ధం చేస్తాను
కళ్లకే కాదు
ఈ దేశంలోని ఆడదాని
వళ్లంతా ముళ్లుండే రోజు
ఎప్పుడొస్తుందా" అని ఎదురు చూస్తున్నానని తన ఆవేదన వ్యక్తం చేశారు.

లింగ నిర్ధారణ పరీక్షను మూలంగా చేసుకొని ఈ వ్యవస్థలోని స్త్రీ యొక్క అస్తిత్వ వేదనను ఈశ్వరి, పాటిబండ్ల రజని – వీరిద్దరు భావించిన తీరు అద్భుతంగా ఉంది. ఒక మాతృమూర్తి నోట ఆవేదన ఇలా అక్షర రూపం దాల్చింది.

"నీకు మంచి రోజులొస్తున్నాయిరా కన్నా
ఆడదిగా పుట్టానని
అడవిలో మానైనా కాలేదని
విలపించే రోజులు
పోతున్నాయిలే తల్లీ, ఎందుకంటే
నీవు అమ్మ పొట్టలోంచి
బైటకే రావుగా" (ఈశ్వరి)

– కడుపుచుమ్మలు చుట్టించే ఆ మాతృమూర్తి ఆర్తి మన సంస్కృతిని ఆకాశానికెత్తే నాగరిక సమాజం సిగ్గుపడేటట్లు చేస్తున్నది. మాతృహృదయాన్ని విలవిలలాడించే గర్భవిచ్ఛిత్తి గురించి పాటిబండ్ల రజని కవితలో ఆక్రోశం కనిపిస్తుంది.

"కంసుడి కత్తిలాంటి ప్లాస్టిక్ బకెట్ మింగిన
ప్లాస్టర్ ఆఫ్ పారిస్ ముద్దలాంటి నిన్ను చూసి
మళ్లీ నా పొత్తిళ్లలో పొదువుకోవాలని
పాలకై తడువుకునే పెదవులుగా
అమ్మకై వెదుక్కునే చూపులుగా చెక్కుకోవాలనీ
ఇంత సుఖంగా నిన్ను చంపుకునే మార్గం
కనిపెట్టిన వీళ్ళముఖాలపై
ఉమ్మనీళ్ళతో ఉమ్మేయాలనీ వెర్రి ఆవేశంగానూ ఉందిరా!"

– ఒకే సన్నివేశానికి సంబంధించిన ఈ రెండు కవితల్లో, మొదటిదాంట్లో ఆలోచనను ప్రేరేపించే శక్తి ఉంది. గాంభీర్యముంది. రెండో దాంట్లో ఆవేశమూ, దానితోపాటు ఈ వ్యవస్థపై కసీ, ఆక్రోశం కనిపిస్తాయి.

ఈ వ్యవస్థయొక్క అనేక వికృత రూపాల్లో వేశ్యా వృత్తి ఒకటి. ఈ సామాజిక రుగ్మతను అతి శక్తివంతంగా వ్యక్తీకరించగలిగిన కవయిత్రులు ఘంటసాల నిర్మల, ఓల్గా వీరిద్దరూ కూడా సజీవ సంఘటనలకు స్పందించి తమ తమ స్వగతాలకు అక్షర రూపాన్నిచ్చారు.

ఓ సాయంత్రం విజయవాడ సెంటర్లో వేశ్యల మెడలో బోర్డుకట్టి ప్రదర్శించిన సంఘటనకు బలంగా స్పందించిన నిర్మల ఇలా రాశారు.

"వేలవేల వీర్యాల వర్షాల్ని
కళ్ళుమూసుకునైనా భరిస్తున్నదాన్ని
రంగులు చిట్లిన. రతిరోతకు జ్వలిస్తున్న దాన్ని"
అంటూ ఒక పడుపు కత్తె తన బతుకులోని జుగుప్సతో పాటు తనపై తనకున్న విశ్వాసాన్ని కూడా ప్రకటిస్తుంది.

హైదరాబాదులోని మెహందీ బజారులో ఒకనాడు ఒకడు ఒక అమ్మాయి వద్దకు వచ్చి పడిపోయి ఆ తరువాత ఆస్పత్రిలో ప్రాణాలు వదిలాడు. ఆనెపంతో పోలీసులు ఆవాడలో బీభత్సాన్ని సృష్టించిన సందర్భంలో వాళ్లను పరామర్శించడానికి వెళ్ళిన రచయిత్రి శ్రీమతి ఓల్గా ఆ స్త్రీల విజ్ఞప్తి మేరకు పత్రికలో ఆ వార్తకు కవితా రూపాన్నిచ్చి ఇలా ప్రకటించారు.

"ఓ మగ మద మృగాల్లారా
మీరు మీ ఇళ్ళలో చావండి
మీరు మీ భార్యల ఒళ్ళలో చావండి
మీ తల్లుల గుండెలపై చావండి

మీరు చావటానికి మాదగ్గరకు రాకండి
బతకటానికి నానా చావూ చస్తున్నవాళ్ళం"

– ఈ కొస మెరుపు ఎంత శక్తివంతంగా ఉందో గమనించాలి. అలాగే శారీరకంగా, మానసికంగా గాయపడ్డ వేశ్యల గుండెల చప్పుళ్ళు స్వగతాలను కవి బి. మల్లికార్జున్ గారు కూడా వినిపించారు.

ఈ యాంత్రిక యుగంలో ఆత్మీయతలు అనుబంధాలు తలక్రిందులౌతున్న ఈ వ్యవస్థలో తల్లికున్న స్థానం ఎలాంటిది? తన జీవితాన్నంతా మురిపాల బిడ్డల కోసం ముడుపుకట్టి కష్టపడి పెంచి పెద్దచేసి యోగ్యులుగా తీర్చి దిద్దాననుకుంటుంది. అయితే జీవన సంధ్యా సమయంలో శారీరకంగా మానసికంగా అలసిపోయిన దశలో ఎవరికీ అక్కరలేని అమ్మ మానసిక క్షోభ సునీత కవితలో –

"కడుపునకన్న వాళ్లు
కసురు కున్నందుకు
పేగు చించుకు పుట్టినవాళ్లు
ప్రేమ భిక్షరాల్చనందుకు
ఎదిగిన బిడ్డల మధ్య
ఏకాకి అయినందుకు
పసిపిల్ల చేష్టలా
అమ్మ అలిగింది".

ఒకనాడు విసుగూ విరామంలేకుండా వండి, వార్చి వడ్డించి తినిపించిన అమ్మ ఈనాడు తినక అలిగినా అడిగే నాథుడే లేడు. ఆ తల్లి ముఖాన్ని జయప్రభగారు "పూర్తిగాముడతలు పడిపోయిన తీపి ఖర్జూరపు పండు"తో పోల్చి, ఆ భావ చిత్రాన్ని మనమనసులో శాశ్వతంగా అచ్చొత్తించారు. త్యాగమూర్తి తల్లి ఉనికిని విస్మరించే కృతఘ్నుల నుద్దేశించి చిత్రదీపాలకవి ఆచార్య గోపి –

"భ్రష్టుడా
అమ్మ ఋణం తీరదురా
అమ్మకు అమ్మవై పుడితే తప్ప" అని హెచ్చరించాడు.

సామాన్య ప్రజానీకంలో నుండి ఉద్యమమే ఊపిరిగా పుట్టిన కవిత్వం మహా శక్తివంతంగా ఉంటుంది. ఉద్యమాల్లాగే ఉద్యమ కవిత్వం కూడా అట్టడుగు వర్గాల నుంచే ఉబికి వస్తుంది. నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాట కాలం నుంచీ ఈనాటి దాకా ప్రజాసాహిత్యం ఒక కొత్త ఒరవడికి నాంది పలికింది. గ్రామీణ వ్యవస్థ యొక్క విషపుపొరల్లో చిక్కుకున్న స్త్రీలు అటు మగవాళ్ల ఆధిపత్యానికీ, అత్యాచారాలకూ, ఇటు భూస్వామ్య దోపిడీకి ద్విముఖంగా బలైపోతున్న ఘట్టాలెన్నో కవితారూపాన్ని పొందాయి. ఇలాంటి పోరాట కవిత్వ రచనలో స్త్రీలు ఎక్కువగా పాలుపంచుకున్నట్లు కనిపించదు. వాటిలో శివసాగర్ రాసిన చెల్లీ చెంద్రమ్మ అన్న గీతం, గద్దర్ రాసిన పాటల్లోని "సిరిమల్లె చెట్టుకింద" అన్న పాట బాగా ప్రాచుర్యాన్ని పొందాయి. అత్యాచారాలు అవధిమించిపోయిన స్థితిలో పోరాటాలు పుట్టుకొస్తాయన్న నిజాన్ని "చెల్లీ చెంద్రమ్మ" నిరూపిస్తుంది. అలాగే గ్రామీణ జీవనంలోని దుర్భర దారిద్ర్యం వల్ల స్త్రీ బ్రతుకు ఎలా భారంగా పరిణమిస్తుందో గద్దర్ రచన చెబుతుంది. ప్రజల గుండె చప్పుళ్లనే డప్పులుగా మార్చి దండోరా వేసిన కవి గద్దర్!

అలాగే రాజకీయ పోరాట అవగాహనతో రాసిన కవిత "అనామిక గీతం". ఇందులో సమిష్టి పోరాటాలకు ప్రాధాన్యం కనిపిస్తుంది. ఈ కవితలోని "కాంక్రీటు పంజరాలకు కట్టిన కుట్ర" అన్న వాక్యంలో దోపిడీ స్వభావమంతా ఇమిడి ఉన్నది. ఇది శ్రామిక సంఘటిత శక్తి నాశ్రయించిన కవిత. అలాగే మార్క్సిస్టు పోరాట చైతన్యంతో విప్లవాత్మకమైన స్త్రీవాద కవితల్ని రాసిన వాళ్ళలో కవయిత్రి విమలను పేర్కొనవచ్చు. "అడవి ఉప్పొంగిన రాత్రి" కవితా సంపుటిలోని ప్రధాన విషయం వర్గపోరాటం.

ఈ స్త్రీవాద దృష్టి ఇతర ప్రక్రియల్లోకి కూడా విస్త రించింది. శ్రీమతి ఓల్గా రాసిన "ఆకాశంలో సగం" అన్న నవల, శ్రీమతి జయప్రభ రాసిన భావ కవిత్వంలో స్త్రీ అన్న సిద్ధాంత వ్యాసం, తెలుగులో అధునిక నాటకంపై విమర్శ ఈ దృక్పథంతో వెలువడ్డవే. భావకవిత్వం కూడా పురుషాధిక్య సమాజపు భావజాలంనుండి పుట్టిందేనని భావకవి స్త్రీపట్ల ఎంత ప్రేమను ఒలకబోసినా ఆమెను మార్చడంపట్ల ఆసక్తి చూపలేదన్న అంశాన్ని ఒక ఫెమినిస్టుగా ఒక కొత్త వెలుగులో స్త్రీని చూపడానికి జయప్రభ సాహసించింది. "నాలుగో గోడ, తెలుగులో ఆధునిక నాటకం" అన్న విమర్శనా గ్రంథంలో తెలుగునాటక రంగం కప్పుకున్న బూటకపు ముసుగుల్ని నిర్మొహమాటంగా తొలగిస్తూ చేసిన రచన అంటున్నారు సమీక్షకులు. "కథ 91" సంకలనంలో కూడా ఈ స్త్రీవాద ధోరణి కొన్ని కథానికల్లో కనిపిస్తుంది. ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి "రెక్కలు", అర్.ఎం. ఉమామహేశ్వరరావు రాసిన "బిడ్డలుగల తల్లి" కవన శర్మ "విడాకులు" ఈ కోవకు చెందినవి.

స్త్రీవాద సాహిత్యంపై ముఖ్యంగా కవిత్వంపై వార్తా పత్రికల్లో వస్తున్న అనుకూల ప్రతికూల విమర్శలు చాలామంది పాఠకుల్లో ఆసక్తిని పెంచుతున్న విషయం విదితమే.

ప్రతికూల వాదాలు ఇలా ఉన్నాయి:

ఈ కవయిత్రులు పాఠకులకు చైతన్యం కలిగించడానికి రాస్తున్నారా? లేక సంచలనం సృష్టించడానికి రాస్తున్నారా? స్త్రీల వర్గ చైతన్యాన్ని దెబ్బకొడుతూ, కేవలం వైయక్తిక

వికారాలకు కవిత్వాన్ని పరిమితం చేస్తున్నారు. ఈ కవితలు మొత్తం స్త్రీ జాతికి ప్రాతినిధ్యం వహించడంలేదు. అవయవ ప్రతీకలు శరీర ధర్మాలు సృష్టి చర్యలు నీలి కవితల్ని సృష్టిస్తున్నాయి. ప్రపంచ క్రమాన్ని సెక్సుపరంగా చూచేధోరణి ఆత్మ న్యూనతా భావం నుండి పుట్టిన వికృత ఆవేశానికి, నిరాశా నిస్పృహలకు సంబంధించింది. శరీర దృష్టితో సామాజిక ధర్మాన్ని తిరస్కరిస్తున్నారు. సామాజిక స్పృహకంటే శారీరక స్పృహ పెరుగుతున్నది. వీళ్ళు తమ కవితల్లో సామూహిక సమస్యలకు ప్రాధాన్యమివ్వకుండా వైయక్తిక అనుభవాలను జుగుప్సాకరమైన పదజాలంతో వర్ణిస్తున్నారు. సామాజిక భూమికకు దూరమౌతున్నారు. ఈ ఉద్యమం లింగవివక్షకు పరిమితమౌతున్నది. ఈ రచనలు స్త్రీల ఆర్థిక సామాజిక రాజకీయ దోపిడీని ప్రతిబింబించడం లేదు.

– ఇక అనుకూల విమర్శల్ని చూద్దాం:

- ఈనాడు కవయిత్రులు నిస్సంకోచంగా రాయడానికి కావలసిన సాహిత్య వాతావరణాన్ని ఎన్నడో దిగంబర కవులే సృజించారు.
- కవయిత్రుల గాఢమైన స్వానుభవ పూర్వకమైన ఆర్తి, ఆక్రోశం, ఆగ్రహాలు, నిర్భయత్వం, నిజాయితీలను అపార్థం చేసుకుంటున్నారు.
- అనివార్యంగా ఉపయోగించబడే లైంగిక పరిభాష అశ్లీలంకాదు. లైంగిక ప్రేరణను కలిగించనంతవరకు, ఆ సమస్యపట్ల సానుభూతి కలిగించనంత వరకు లైంగిక పరిభాష, ప్రతీకలు ప్రయోగించడంలో తప్పులేదు.
- మొత్తంమీద ఈ సాహిత్యంపై జరుగుతున్న చర్చ విమర్శయొక్క ప్రమాణాలను పడగొట్టే దిశగా ప్రయాణం చేస్తున్నది. ఇది అంత ఆరోగ్యదాయకం కాదని కొందరు అభిప్రాయ పడుతున్నారు. అయితే ఒక్క మాట మాత్రం నిజం. ఈ వాదోపవాదాలు పాఠకుల్లో ఎంతగా ఆసక్తిని పెంచుతున్నాయో, అంతగా ఆలోచనల్ని రేకెత్తించడం లేదు. విమర్శ వ్యక్తిగత స్థాయికి దిగజారిపోయి గంభీరమైన స్త్రీ సమస్యనే పక్క దారిపట్టిస్తున్నాయి.

ఏ సాహిత్యం ఎంత కాలం నిలుస్తుంది. ఏ ఉద్యమం ఎంత కాలం జీవిస్తుంది అని జోశ్యం చెప్పేది వ్యక్తులు కాదు. ప్రజలు నిర్ణయిస్తారు. పాఠకులు నిర్ణయిస్తారు. ఒక్కమాటలో కాలం నిర్ణయిస్తుంది. కవితారంగంలో కొత్త ధోరణులు తలెత్తినప్పుడు విమర్శ, ప్రతి విమర్శలు ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లాగా కవిత్వాన్ని చైతన్యవంతం చేస్తాయి. నిగ్గు తేలుస్తాయి.

అయితే ఆ విమర్శ వ్యక్తిగత స్థాయికి దిగజారకూడదు. స్త్రీలు కవిత్వం రాస్తున్నారంటేనే "ఏ పనీ పాటా లేని ఆడవాళ్ల సమాన హక్కులగోల" అని ప్రవచించడం తిరోగమన మార్గంలో ప్రయాణం చెయ్యడమే ఔతుంది. కవిత్వం రాసే ఆడవాళ్లంతా గయ్యాళులు అనడం సమస్యయొక్క గంభీరతను ఎగతాళి చెయ్యడమే. కనుక ఒక రచన స్త్రీదా పురుషునిదా అని కాకుండా రచనని రచనగా విమర్శించాలి. సిద్ధాంత సమన్వయంలో ఉన్న లోటుపాట్లేమిటి? కవితా వ్యక్తీకరణలో ఉన్న అవకతవక లేమిటి? అవి సామూహిక ప్రయోజనాన్ని ఎలా దెబ్బతీస్తున్నాయి అని నిష్పక్షపాతంగా – కుతర్కాలకు తావులేకుండా పాఠకుల్ని వక్రమార్గం పట్టించకుండా చేసే విమర్శ ఆరోగ్యవంతమైనదీ, ఆహ్వానించదగ్గదీ.

నిజానికి ఏ రచయిత్రి కూడా కేవలం ఋతు ధర్మాలకూ అవయవ ప్రతీకలకూ, సృష్టి చర్యలకూ మాత్రమే పరిమితం కాలేదు. మొత్తం రచనల్లో ఒక అయిదు శాతం ఈ నీలి కవితలనబడేవి కనిపిస్తాయి. కవిత్వీకరణలో అనివార్యంగా ఒక సామాజిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఒక ప్రత్యామ్నాయ పదమేదీ అందుబాటులోలేని సందర్భంలో అలాంటి పదప్రయోగం చేయడంలో తప్పులేదు. "వేలవేల వీర్యాల వర్షాలు" అన్న ప్రయోగం ఒక వేశ్యా వ్యవస్థలోని రుగ్మతకు అద్దం పడుతున్నది. మన సంస్కృతికి మారు పేరుగా చెప్పుకుంటున్న మహాభారతంలోనే ద్రోణాచార్య, కృపాచార్య జన్మ వృత్తాంత సందర్భంలో వీర్యం, శుక్లపాతం, రేత స్ఖలనంలాంటి పదాలు ఎన్నో చోటుచేసుకున్నాయి. అక్కడలేని అభ్యంతరం ఇక్కడ కూడా అవసరం లేదు.

ఇకపోతే స్త్రీవాద కవిత్వంలో స్వల్ప శాతమే అయినప్పటికీ ఋతు ధర్మాల్ని శారీరక ధర్మాల్ని సృష్టి చర్యల్ని అతిగా వర్ణించడంపట్ల కొన్ని అభ్యంతరాలు తప్పవు. కవిత్వంలో ఆవేశం ఉండాలి. కాని ఆ ఆవేశం ఆలోచనను మింగివేసి జుగుప్స కలిగించకూడదు. ఋతు ధర్మ సమయంలో దూరాన్ని పాటించడం కాలం చెల్లిన మాట. ఏ వర్గ స్త్రీలు కూడా ఇప్పుడు పాటించడం లేదు. అలాగే లైంగిక సంబంధ రుగ్మతలకు స్త్రీ పురుష భేదంలేదు. నిజం చెప్పాలంటే ఈపద ప్రయోగానికి అంతగా ప్రాముఖ్యమియ్యవలసిన అవసరంలేదు. సిద్ధాంత అవగాహనలో లోపాలు సమన్వయంలో అవకతవకలు వ్యక్తిగత నిందలు, సెంటిమెంట్లకు లోనుకావడం, ఒక కమిట్‌మెంట్ అంటూ లేకపోవడం – ఇవి అంతకంటే ప్రమాదకరం. ఇవి స్త్రీవాదాన్నే పక్కతోవ పట్టిస్తాయి. ఒకవైపు ఫ్యూడల్ వ్యవస్థను దుయ్యబడుతూనే మరోవైపు చకోరాలు, హంసలు జలతారు ముసుగులు, రుద్ర నృత్యం (జయప్రభ) లాంటి పదజాలాన్ని ప్రయోగించడం, ఒకవైపు పురుషాహంకార స్వభావాన్ని చిత్రిస్తూనే, మరోవైపు సెంటిమెంట్లకు తలవంచడం – ఇలాంటి పరస్పర విరుద్ధ భావవ్యక్తీకరణ కనిపిస్తుంది. ఉదాహరణకు "ప్రకృతిలో

ప్రళయం" అన్న కవితలో ఒకచోట

"కపటపు వాగ్దానాలతో
నీ జీవితాన్ని బంధించి
మోసంతో విన్నాక బానిసగా మార్చి
పెళ్లి అనే ఊబిలోకి దింపినా
క్షమిస్తావు దేనికి?" అని స్త్రీని ఒక వైపు

"పెళ్లి" అనేది ఎలా Exploit చేస్తుందో చెబుతూనే మరోచోట –

"భర్తగా స్నేహితునిగా
నీ ప్రేమ అపురూపం
నీతో జీవితం కవితాగీతం" అంటూ ఆ భావజాలానికి తలవంచడం చూస్తే కొందరు స్త్రీ వాదులకు ఒక కమిట్ మెంటు ఉందా? అనిపిస్తుంది. ఇలాంటి రాతలకు పాఠకులు అయోమయంలో పడిపోతారు. ఎంత ఫెమినిస్టయినా వ్యక్తిగతాను భూతులు, అనుభవాలు ఎవరికీ తప్పవు. వాటిని మనసులోనే భద్రపరచుకోవాలి కాని రాతల్లో కెక్కించి రాజకీయం చేయడం ఉచితం కాదు. పరిశీలించి చూస్తే ఇలాంటి అవకతవకలు కొన్ని కనిపిస్తాయి.

### ఆచరణ - అభియోగాలు - విమర్శలు:

ఈనాడు స్త్రీవాదంపై సిద్ధాంత పరంగానూ కవితా భివ్యక్తీకరణ పరంగానూ కొన్ని అభియోగాలు విమర్శలు వినవస్తున్నాయి. అవి ఇవి:

1. వర్గపోరాటాలతో సంబంధం లేకుండా స్త్రీవాద ఉద్యమం స్వయం ప్రతిపత్తితో పురుషాధిక్యతకు వ్యతిరేకంగా ఒంటరిగా పోరాడాలంటున్నది. మరోవిధంగా చెప్పా లంటే ఉమ్మడి శత్రువును ఉమ్మడిగా ఎదుర్కోవడం పట్ల వీరికి విశ్వాసం లేదు. చాలామంది స్త్రీవా దులు శత్రువైరుధ్యానికి మిత్రవైరుధ్యానికీ మధ్య ఉన్న అంతరాన్ని గమనించడం లేదు. బలవంతులకూ, బలహీనులకూ మధ్యగల శత్రువైరుధ్యాన్ని పరస్పరం నాశనం కావించడం ద్వారా, కూలద్రోయడం ద్వారా ఆధిక్యత సంపాదించాలని ప్రయత్నం చేస్తుంది. స్త్రీ పురుష సంబంధాలు అలాంటివికావు. అవి సమ న్వయాన్ని సంతరించుకోవలసినవి. దోపిడీ సామాజిక వ్యవస్థ, అందులోని శత్రువైరుధ్యాలు ఆ పునాదిపైగల స్త్రీపురుష సంబంధాలను బాగా ప్రభావితం చేస్తాయి. అయితే వీరి మధ్య ఉండవలసిన మిత్రవైరుధ్యం పట్ల చాలామంది స్త్రీవాదులకు విశ్వాసంలేదు. మొక్కపాటి సుమతి "మిత్ర వైరుధ్యమా" అన్న కవితాఖండికలో ఇలా అంటారు.

"వర్గ శత్రువు నాశ్రమనే దోచుకుంటాడు
ఈ దుష్ట శత్రువు నాబ్రతుకే దోచుకుంటాడు
వాడు నాకు కలలైనా కల్పిస్తాడు
వీడు నాకలలన్నీ చెరిపేస్తాడు
వాడికి నేను మరను తిప్పే మనిషిని
వీడికి నేను మనిషి రూపంలోని మరని
ఎవడు అన్నది ఇది మిత్ర వైరుధ్యమని?"

అయితే ఇక్కడ తన బతుకు దోచుకున్నవాడు, కలల్ని చెరిపిన వాడు, మనిషిని మరగా మార్చిన ఆ పురుషుడు ఆ భర్త తర తరాల దోపిడీ వ్యవస్థ యొక్క అనేక వికృత రూపాల్లో ఒక్కడే అన్న విషయం కవయిత్రి విస్మరించారు. పురుషాధిపత్యం కూడా ఒక సంపూర్ణమైన దోపిడీ వ్యవస్థలో ఒక విడదీయరాని భాగం. కుళ్లిపోయిన శరీరాన్ని మొత్తంగా పాతిపెట్టకుండా ఒక అవయవాన్ని మాత్రం పాతివేయడం అనుచితం అశాస్త్రీయం.

ఈనాడు పెట్టుబడిదారీ విధానం, భూస్వామ్య వ్యవస్థ – ఈ రెండూ కలిసి స్త్రీ పురుష లిద్దరినీ అణగ దొక్కుతున్నాయి. సమాజంలో నెలకొన్న పురుషాధిక్యత మూలంగా స్త్రీలు రెండు విధాలా అణచివేతకు గురౌతున్నారు. కనుక స్త్రీలు ఇటు దోపిడీ వ్యవస్థతో పురుషులతో కలిసి, అటు పురుషాధిక్యతతోనూ సమాంతరంగా పోరాడవలసి ఉన్నది. ఈ అంశాలను విస్మరించి కేవలం పురుషాధిక్యతపై ధ్వజమెత్తడం ఎలా ఉంటుందంటే జ్వరం వచ్చినప్పుడు మౌలికమైన రోగ లక్షణాన్ని కనిపెట్టకుండా ఉపేక్షిస్తూ తాత్కాలిక నివారణోపాయాలైన "క్రోసిన్" బిళ్లలు మింగుతూ ఉండడం లాగా ఉంటుంది. అన్నిటినీ మించి ఈ పురుషాధిక్యతపై జరిపే పోరాటం యొక్క స్వరూపమేమిటో, మానిఫెస్టో ఏమిటో అగమ్యగోచరం. ఆచరణలోని అనుభ వాలు ఎంత గొప్పవైనా వాటిని ఘనీభవింపజేయకపోతే, సామాజిక విలువలకు అనుగుణంగా పరివర్తన చెందించక పోతే అవి ద్రవరూపంలాగే ఉండి చేతి సందుల్లోంచి జారిపోయే ప్రమాదముంటుంది.

2. స్త్రీవాద రచయిత్రులు దాదాపు సమాజాన్ని 80 శాతం ఆక్రమించి ఉన్న శ్రామిక రైతాంగ కూలీ స్త్రీల సమస్యల్ని విస్మరిస్తున్నారు అన్నది రెండవ అభియోగం. అంతర్జాతీయ, జాతీయ పోరాటాలవైపు ఒక్కసారి దృష్టిసారిస్తే 1775లో అమెరికాలో జరిగిన స్వాతంత్ర్య పోరాటంలో గానీ, 1789 నాటి ఫ్రెంచ్ విప్లవంలో గానీ, 1917 నాటి రష్యన్ విప్లవంలో గానీ, చైనా, వియత్నాం పోరాటాల్లోగానీ, భారతదేశంలోని ముఖ్యంగా పంజాబు ఉద్యమంలోగానీ, 1948 నాటి తెలంగాణా సాయుధ పోరాటంలో గానీ, పాల్గొని విజయంలో పాలుపంచుకున్నవారు చాలా భాగం కార్మిక కర్షక స్త్రీలే అన్నమాట మనం విస్మరించకూడదు.

సమాజంలో అత్యధిక సంఖ్యాకులెవరైతే ఉంటారో వాళ్ళ సమస్యలే నిజమైన సమస్యలు. గ్రామీణ జీవనంలో పాతుకుపోయిన పేదరికం, అమాయికత్వం అవిద్య, అజ్ఞానం, మూఢాచారాలు, మద్యపానాలు, మారుమనువులు, భర్తల హింసాప్రవృత్తి – ఒక్క మాటలో చెప్పాలంటే ఆర్థిక సాంఘిక నైతిక దోపిడీ ఇవేవీ ప్రధానంగా స్త్రీవాదుల దృష్టిలో ఉన్నట్లు కనిపించడంలేదు.

3. స్త్రీవాద కార్యక్రమాలు చాలావరకు సాహిత్యోద్యమా నికే పరిమిత మౌతున్నట్లుగా కనిపిస్తున్నది. మంచి కవితలొస్తున్నాయి. కథా సంపుటాలొస్తున్నాయి. నవల లొస్తున్నాయి. వాటిపైన విమర్శలొస్తున్నాయి. దీనివల్ల సాహితీ రంగంలో స్త్రీవాదులకు ఒకగొప్ప Image ఏర్ప డుతున్నది. ఇది హర్షించ దగ్గ అంశమే. అయితే కేవలం సాహిత్యం సృష్టించినంత మాత్రాన కవితలు రాసినంత మాత్రాన పురుషాధిక్యత సమాజంలో తుడిచిపెట్టుకొని పోతుందా? కేవలం సాహిత్యోద్యమాలు స్త్రీలను చైతన్యవంతం చేస్తాయేమోగాని సామాజికోద్యమాలను సృష్టించవు. పటిష్ఠమైన నిర్మాణ కార్యక్రమాలుకూడ చేపట్టకపోతే స్త్రీవాదం కాగితాలకే అంకితమౌతుంది. కవిత్వంలో కనిపించే "మెరుపుల పిడికిళ్లు", "పోరాట ప్రచండ ఘోష" ఆచరణలో కనిపించి, వినిపించినప్పుడే స్త్రీవాద ఉద్యమం ముందుకు కదులుతుంది. లేకపోతే గత చరిత్రలో ఒక భాగంగా మిగిలిపోతుంది.

4. స్త్రీవాద కవిత్వాన్ని, సాహిత్యాన్ని కొంత పరిశీలనా దృష్టితో చూస్తే కొన్ని లోపాలు కనిపిస్తున్నాయం టారు విమర్శకులు. సిద్ధాంత అవగాహనారాహిత్యం, సమన్వయంలో అవతకతవకలు, వ్యక్తిగత నిందలు, సెంటిమెంట్లకు లోనుకావడం, కాలం చెల్లిన సమస్యల్ని తీవ్రంగా పరిగణించడం, చారిత్రక పరిణామ దశల్లోని చట్రాలలో మాత్రం పరిశీలింపదగిన స్త్రీని ఈనాటి స్త్రీ వాదపు రంగుటద్దాలలో దర్శించడం, ఫ్యూడల్ సంస్కృతిని ఒకవైపు తిరస్కరిస్తూనే మరోవైపు ఆ పదజాలాన్ని కవిత్వంలో చొప్పించడం, ఆత్మాశ్రయ భావాల్ని చిత్రించడం – ఇలాంటి పరస్పర విరుద్ధ భావ వ్యక్తీకరణ పాఠకుల్ని అయోమయంలో పడవేస్తుంది. "ఆత్మహత్య నానిరసన" లాంటి కవితల్లో సిద్ధాంత బలం లేదు. "నామది పూరేకు, నేను నిస్సహాయురాల్ని, నన్ను నేను, చంపుకోవడం ద్వారా మాత్రమే నానిరసన ప్రపంచానికి తెలియజేశాను" అనడం సిద్ధాంత అవగా హన లోపమేకాదు, తిరిగి పితృస్వామిక సంస్కృతిలోకి జారిపోవడమే ఔతుంది.

5. స్త్రీవాద కవిత్వంలో వస్తు వైవిధ్యం కొరవడుతున్నది అన్న విమర్శ కూడా వినిపిస్తున్నది. చాలా కవితాఖం డికలు పునరుక్తి దోషానికి గురౌతున్నాయి. సంఘంలో చేరుదాం, ఆదిమానవిని, తాగొద్దు తాగొద్దన్నా, పెద్దవ్వనీ చెప్తా, తరతరాల శత్రువు, అమ్మ అలిగింది, అమ్మ బొమ్మ, బందిపోట్లు వంటి కవితా ఖండికల్లో చాలా శక్తివంతమైన వస్తువైవిధ్యం కనిపిస్తున్నా; అవయవ పత్రికలు, శరీర ధర్మాలు, సృష్టి చర్యలు, ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచ క్రమాన్ని అవయవపరంగా సెక్సుపరంగా చూచే సందర్భంలో కవితలు పునరుక్తి దోషానికి గురౌతున్నట్లుగా మనం గ్రహించవచ్చు. ఇలా ఒకే విధమైన భావజాలాన్ని పొదువుకున్న పదజాలం పాఠకుల్లో మొనాటనీ కలిగించే ప్రమాముంది. ప్రతీ వస్తువుని అవయవ పరంగా, లైంగిక పరంగా చూచే వైఖరిని ఆత్మ న్యూనతా భావం మంచి పుట్టిన వికృతావేశంగా భావించడానికి విమర్శకులకు వీలు కలిగిస్తున్నది. ఉదాహరణకు "జుగల్ బందీ" అన్న కవితా ఖండిక అటు భాషాశక్తికీ ఇటు భావ వ్యక్తీకరణలోని యుక్తికీ మచ్చుతునకగా విమర్శకులు ప్రశంసిస్తున్నా; రతి సుఖానంతరం ఎదురయ్యే యదార్థ సమస్యలు కవితకు వాస్తవిక సమస్యాత్మకమైన గొప్పతనాన్ని అపాదించినా పాఠకులను కవితలో ఆకర్షించేవి – భావోద్వేగానికి కారణమయ్యే రతి వర్ణన చేసిన పంక్తులు మాత్రమే – అన్న చేదు నిజాన్ని విస్మరించలేము.

6. స్త్రీవాదుల్లో కొందరు రచయిత్రులు ఈనాడు ప్రపం చంలో ఏ నాగరిక వ్యవస్థకూ సరిపడదని వివాహ రహిత, కుటుంబ రహిత సమాజాన్ని గురించి కలలుకంటున్నారు. పురుషాధిక్యత రద్దుకావాలంటే వివాహాల్లో కూడా అవ సరమైతే వ్యాపార సంబంధాలు చొప్పించవచ్చునని ఊహిస్తున్నారు. ఇది అంత ఆరోగ్యదాయకం కాదు.

ఆరంభంలో ఏ కొత్త భావజాలాన్నీ సమాజం అంత త్వరగా అంగీకరించదని చరిత్ర చెబుతున్నది. ఎన్నో అభియోగాలను విమర్శకులను స్త్రీవాదం ఎదుర్కోక తప్పదు. ఆ విమర్శలే ఆత్మ విమర్శకు ఆధారాలౌతాయి. దేశకాల పరిస్థితులకు అనుగుణంగా సిద్ధాంతాలను మలుచుకుంటూ, ఎప్పటికప్పుడు ప్రజల పాఠకుల నాడిని గమనిస్తూ, ఎప్పటికప్పుడు ఆత్మ విమర్శ చేసుకుంటూ పురోగమించడంపైనే దాని భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది.

సంప్రదించిన గ్రంథాలు:


1. మాకు గోడలు లేవు – ఫెమినిస్టు స్టడీ సర్కిల్
2. భారతదేశంలో స్త్రీ విముక్తి – కనక ముఖర్జీ
3. కొన్ని దినపత్రికలు –
4. నీలిమేఘాలు – కవితా సంకలనం.

# తెలుగులో బాలలను అలరించే సాహిత్యం

- చొక్కాపు వెంకటరమణ

"బాల సాహిత్యం తియ్యని మామిడిపండులా ఆపాత మధురంగా ఉండాలి. చెప్పవలసిన విషయం పండు ఒలిచి చేతిలో పెట్టినట్లుండాలి. తికమకలు పనికిరావు. సూటిగా ఉండాలి. భాష సరళంగా, లలితంగా ఉండాలి" అని బాల సాహిత్యంపై పరిశోధన చేసిన డాక్టర్ వెలగా వెంకటప్పయ్య అన్నారు.

"శిశువు జన్మించింది మొదలు బాల్యదశ వీడే వరకు వాని మనసుకు రంజకంగా ఉండేది బాలసాహిత్యం" అని బాలసాహిత్య పరిధిని వివరిస్తూ చింతా దీక్షితులు అన్నారు.

మౌఖిక రూపంలో ప్రచారంలో ఉన్న బాలగేయాలు, కథలు చిరకాలంగా ఉన్నాయి. గ్రంథస్థరూపంలో సరళమైన రచనలు 19 వ శతాబ్ది ఆరంభంనుంచే వచ్చాయి. అనుశ్రుతంగా ప్రచారంలో ఉన్న కొన్ని ప్రక్రియలను చేర్చి వేటూరి ప్రభాకరశాస్త్రి "బాలభాష" పేరుతో సంకలనం చేశారు. తొలిదశలో గజ్జెల రామానుజనాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు, వెంకట పార్వతీశ కవులు, వావిలికొలను సుబ్బారావు, గిడుగు వెంకట సీతాపతి, చింతా దీక్షితులు మొదలైనవారు పిల్లలకోసం మంచి రచనలు చేశారు.

## పత్రికలు - బాలసాహిత్యం:

వాస్తవానికి పిల్లలను అలరించే రచనలు మొదటగా గ్రంథస్థమైంది పత్రికలలోనే. తెలుగులో బాలసాహిత్యాన్ని తొలిసారిగా ప్రచురించింది "జన వినోదిని" (1875–1885) పత్రిక. దీనిని మద్రాసు స్కూల్ బుక్ సొసైటీవారు ప్రచురించారు. ఆ తరువాత క్రైస్తవ మిషనరీలు గుంటూరు నుంచి నిర్వహించిన "వివేకవతి" (1908–1910) అనే మాసపత్రికలో సరళమైన భాషలో పిల్లలకోసం కథలు ప్రచురించారు. కాకినాడనుంచి వింజమూరి వెంకటరత్నమ్మ ప్రచురించిన "అనసూయ" (1914–1919), బొంబాయినుంచి 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు 1908 నుంచి ప్రచురించిన "ఆంధ్రపత్రిక" వారపత్రికలో పిల్లలకు సంబంధించిన రచనలు చాలా ప్రచురితమయ్యాయి. 1924 నుంచి వెలువడిన "బాలభారతి" విద్యావిషయక మాసపత్రిక, 1925 లో ప్రచురింపబడిన "నవ్వులతోట", 1923 లో నాగేశ్వరరావు పంతులు గారు ప్రారంభించిన "భారతి", కాశా రామశాస్త్రి నిర్వహించిన "శారద" (1923–24), కె.ఎస్. కేసరి 1928 లో స్థాపించిన "గృహలక్ష్మి" మాసపత్రికలు బాలసాహిత్య రచనలు ప్రచురించి ప్రోత్సహించాయి. ఈ పత్రికలు బాలలకోసం శీర్షికలు ప్రారంభించి బాలసాహిత్య ప్రగతికి చక్కని పునాదులు వేశాయి.

## పిల్లలకోసం పత్రికలు:

పిల్లలకోసం ప్రత్యేకంగా తెలుగులో ఒక పత్రిక లేని కొరతను తీర్చేందుకు 1940లో మేడిచర్ల ఆంజనేయమూర్తి "బాలకేసరి" అనే మాసపత్రికను ప్రారంభించారు. ఇదే తెలుగులో మొట్టమొదటి పిల్లల పత్రిక. 'రేడియో అన్నయ్య'గా ప్రసిద్ధిగాంచిన న్యాయపతి రాఘవరావు 1945 లో "బాల" సచిత్ర మాసపత్రికను ప్రారంభించి బాలసాహిత్యంలో అనేక ప్రయోగాలు చేశారు.

తెలుగు పిల్లలకోసం 1946లో ప్రారంభమైన అంద చందాల పత్రిక "చందమామ." నాగిరెడ్డి, చక్రపాణి జంట ప్రారంభించిన 'చందమామ' కుటుంబ సభ్యులందరి పత్రికగా మారింది. చందమామ వెలుగులో ఆ తర్వాత బాలమిత్ర, బొమ్మరిల్లు, బుజ్జాయి వంటి అనేక పత్రికలు వెలిశాయి. పిల్లల్లో, పెద్దల్లో చదివే అలవాటును, పిల్లల పత్రికలంటే అభిమానాన్ని పెంచాయి. పత్రికల పెరుగుదల బాలసాహిత్యానికి కొండంత బలాన్ని ఇచ్చింది. అంతేకాదు, భారతదేశంలో పిల్లల పత్రికల పెరుగుదలకు, తద్వారా బాలసాహిత్య అభివృద్ధికి దోహదం చేసింది.

బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించే లక్ష్యంతో 1976 లో స్థాపించబడిన ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి అంతర్జాతీయ బాలల సంవత్సరం 1979 లో "బాలచంద్రిక" పిల్లల మాసపత్రికను ప్రారంభించి ఎన్నో కొత్త ప్రక్రియలను ప్రవేశపెట్టి, బాలసాహిత్యంలో అనేక ప్రయోగాలు చేసింది.

ఆంధ్రజ్యోతి సంస్థ ఆధ్వర్యంలో 1980 లో ప్రారంభమైన "బాలజ్యోతి", విశాలాంధ్ర అధ్వర్యంలో 1985 లో "చిన్నారిలోకం", ఆంధ్రపత్రిక సంస్థ 1985 లో ప్రారంభించిన "బాలరంజని" పిల్లల మాసపత్రికలు మరిన్ని నూతన ప్రక్రియలు ప్రవేశపెట్టి పిల్లలను అలరించాయి.

"బాల" ప్రారంభమైన తరువాత ఈ నలభై ఎనిమిదేళ్ళ లోనూ యాభై అయిదుకి పైగా పిల్లల పత్రికలు వచ్చాయి. వాటిలో కొన్నిమాత్రమే ఇప్పుడు వెలువడుతున్నాయి.

### తెలుగు పిల్లల పత్రికలు

| | | |
|---|---|---|
| బాలకేసరి | ... | 1940 |
| బాల | ... | 1945 |
| చందమామ | ... | 1946 |
| బాలమిత్ర | ... | 1949 |
| పాపాయి | ... | 1949 |
| బొమ్మరిల్లు | ... | 1949 |
| బాలవినోదం | ... | 1950 |
| బాలప్రభ | ... | 1952 |
| మనసంఘం | ... | 1952 |
| ఉదయబాల | ... | 1952 |
| బాలానందం | ... | 1956 |
| బాలప్రభ | ... | 1958 |
| బాలబంధు | ... | 1962 |
| చంద్రభాను | ... | 1962 |
| బాలరాజ్యం | ... | 1963 |
| బాలానందం | ... | 1964 |
| నందన | ... | 1965 |
| రఘుబాల | ... | 1965 |
| పసిడిబాల | ... | 1969 |
| బాలప్రపంచం | ... | 1970 |
| ఆనందబాల | ... | 1970 |
| గురుకులం | ... | 1971 |
| బొమ్మరిల్లు | ... | 1972 |
| వసంతబాల | ... | 1974 |
| పాలవెల్లి | ... | 1974 |
| పొదరిల్లు | ... | 1974 |
| బుజ్జాయి | ... | 1975 |
| స్నేహబాల | ... | 1976 |
| బాల | ... | 1977 |
| బేబి | ... | 1977 |
| చంపక్ | ... | 1978 |
| బాలభారతి | ... | 1978 |
| ప్రమోద | ... | 1978 |
| మా బడి | ... | 1978 |
| పాఠశాల | ... | 1978 |
| బాలచంద్రిక | ... | 1979 |
| బాలవాణి | .. | 1979 |
| విద్యాబాల | ... | 1979 |
| మిలియన్ జోక్స్ | ... | 1979 |
| బాలజ్యోతి | ... | 1980 |
| జాబిల్లి | ... | 1982 |
| బాల | ... | 1982 |
| బాలభాను | ... | 1982 |
| యంగ్ హీరో | ... | 1983 |
| బాలరంజని | ... | 1985 |
| చిన్నారిలోకం | ... | 1985 |
| చిన్నారి | ... | 1986 |
| చంద్రబింబం | ... | 1986 |
| చిరుమువ్వలు | ... | 1986 |
| సరదాబడి | ... | 1989 |
| చెకుముకి | ... | 1990 |
| బాలచెలిమి | ... | 1990 |
| బాలమందిరం | ... | 1990 |
| బాలవెన్నెల | ... | 1992 |
| బాలప్రపంచం | ... | 1993 |

### బాలసాహిత్యం - నీతిశతకాలు:

తెలుగులో పిల్లలకోసం రాసిన పద్యకావ్యాలు చాల తక్కువ అయినప్పటికీ అవి 'గంగిగోవుపాలు' వంటివి. దాదాపు వెయ్యి సంవత్సరాల నుంచి కనిపిస్తున్న తెలుగు శతకాలు వేలసంఖ్యలో ఉన్నాయి. పిల్లలకు చిన్నతనం నుంచీ జీవిత సూత్రాలను చక్కని నీతులద్వారా చెపుతారు. భావాలతోపాటు వారికి మంచి భాషా పరిజ్ఞానం అలవడాలని వేమన శతకం, సుమతీ శతకం, దాశరథీ శతకం, కుమారీ శతకం మొదలైనవి ముందుగా ప్రారంభిస్తారు.

చిల్లరిగె యోగానందం "బాలశతకం" (1915), చిల్కా వెంకట కృష్ణయ్య "కుమార శతకం" (1915), సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి "కుమారీ శతకం" (1920), ముళ్ళపూడి వెంకటరమణ "బాలశతకం" (1946) మొదలైనవి చెప్పుకోదగ్గవి.

తెలుగు సంస్కృతితోపాటు అనేక విషయాలు సరళంగా పిల్లల మనసులకు హత్తుకొనేటట్లు నార్ల చిరంజీవి రాసిన "తెలుగుపూలు" (1954) బాలసాహితికి సుమ సౌరభాలు సమకూర్చుతాయి. ఈ శతకంలో ప్రతి పద్యం ఒక ఆణిముత్యం.

కరుణశ్రీ "తెలుగుబాల" (1953), ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి "తెలుగుబిడ్డ" (1954), బృందావనం

రంగాచార్య "తెలుగుబోధ" (1954) శతకాలను రాశారు. బాల వాఙ్మయంలో అత్యంత శోభాయమానంగా వెలుగులోకి వచ్చిన శతకాలు కవిరావు "ముద్దుపాప" (1956), రెడ్డి రాఘవయ్య "బాలనీతిమాల" (1979) మంచి రచనలని చెప్పవచ్చు.

## బాలసాహిత్యం - గేయాలు, గేయకథలు:

పిల్లలకోసం తెలుగులో రచింపబడిన పండుగ పాటలు, పద్యాలు, గేయాలు, గేయకథలను గురించి చెపుతూ "పిల్లలకు పాటలు రాయడమంటే సామాన్యమైన పనికాదు. మహాకవి కావడం దానికన్న సులభం" అన్నారు చలం.

పిల్లలంటేనే పండుగ. పిల్లలుంటేనే పండుగ. వాస్తవానికి పండుగలు, పబ్బాలు, వేడుకలు మన సంప్రదాయానికి చెరగని గుర్తులు. హరివిల్లులాంటి తెలుగువారి సాంఘిక జీవితంలో ఎన్నో పండుగలున్నాయి. పండుగలనుబట్టి పాటలు, ప్రాంతాలనుబట్టి ఆచారవ్యవహారాలు మారతాయి. తరతరాలుగా ఈ పాటలన్నీ అనుశ్రుతంగా ప్రచారంలో ఉన్నవే. నందిరాజు చలపతిరావు, కృష్ణశ్రీ, నేదునూరి గంగాధరం, ఎల్లోరా – వందల సంఖ్యలో ఈ పాటలను సేకరించారు.

బాల గేయ సాహితీ నందన వనంలో పరిమళ పుష్పాలను పూయించిన కవులు ఎందరో ఉన్నారు. చింతా దీక్షితులు, ఓకుమళ్ళ కామేశ్వరరావు, న్యాయపతి రాఘవ రావు, కామేశ్వరి, ఏడిద కామేశ్వరరావు, కవిరావు, వేదెండ్ల సాంబశివరావు, మిరియాల రామకృష్ణ, కె. సభా, బి. వి. నరసింహారావు, అలపర్తి వెంకట సుబ్బారావు, బాలాంత్రపు రజనీకాంతరావు, కవుల ఆంజనేయశర్మ, గాలి ప్రభావతి, తంగెళ్ళ పాండురంగ శర్మ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, దాశరథి, మహీధర నళినీ మోహన్, కాగితాల రాజేశ్వరరావు, వాణీ రంగారావు, డి. సుజాతాదేవి – ఇలా ఎంతోమంది ఉన్నారు.

పిల్లలకు గేయాలంటే ఎంతో ఇష్టం. కథలను గేయాలలో మలిస్తే మరింత ఇష్టపడతారు. గిడుగు సీతాపతి రాసిన "చిలకమ్మ పెళ్ళి", "ఎలుక–పిల్లి", "సాలెపురుగు–ఈగ" కథలు మనోజ్ఞంగా ఉంటాయి. మహాకవి శ్రీశ్రీ పిల్లలకోసం "కప్పవైద్యుడు" అనే మంచి గేయకథను రాశారు. ఆలూరి బైరాగి "వేటగాని సాహసం", "స్నేహధర్మం", "కలవారి కోడలు" మొదలైన గేయకథలు అనేకం రాశారు.

బాలాంత్రపు రజనీ కాంతరావు "జేజీ మామయ్య పాటలు", బి. వి. నరసింహారావు "ఆవు–హరిశ్చంద్రుడు". మహీధర నళినీ మోహన్ "కోతి తపస్సు" గేయకథా సంకలనాలలో పేర్కొనదగినవి.

## పిల్లల కథలు–నవలలు:

పిల్లలు కథలు, నవలలు ఎంతో ఆసక్తిగా చదువుతారు. కల్పన ప్రధానంగా గల కథలు, నవలలు కల్పనా సాహిత్య వర్గానికి చెందుతాయి. "కథ మొదట్లో కుతూహలాన్నీ, చివరగా ఆలోచనల్నీ కలిగించాలి. మధ్యలో చెప్పేది రక్తి కట్టిస్తూ చెప్పుకుపోవాలి" అంటారు ఆరుద్ర.

కథలు 5–14 మధ్య వయసుగల వారు చదవటానికే ఉద్దేశింపబడినవి. ఆ దృష్టితోనే అవి రాయబడ్డాయి. నేడు ప్రచురణలో లభ్యమవుతున్న కథలను పురాణకథలు, నీతికథలు, అద్భుత కథలు, చరిత్ర కథలు, హాస్య కథలు, విజ్ఞాన కథలు – మొదలైన విభాగాలుగా ఉన్నాయి.

1900–1948 మధ్యకాలంలో పురాణ కథలను అనేక మంది ప్రచురించారు. మాగంటి బాపినీడు 1948లో పిల్లల బొమ్మల భారతం సచిత్రంగా ప్రచురించారు. ఆ తరువాత వారు చూపిన మార్గంలో బొమ్మలతో రామాయణ, భారత, భాగవతాలు అనేకం వచ్చాయి. అమృతకవి అన్నపూర్ణాదేవి (1957) అనసూయాదేవి, దమయంతి, శకుంతల, సావిత్రి మొదలైనవారి కథలు రాశారు. జయంతి జగన్నాథరావు నారదుని కథలు (1950) ప్రచురించారు. నండూరి విఠల్ బైబిల్ కథలు (1955) రాశారు. పిల్లల్లో సంప్రదాయం విజ్ఞానం పెంపొందడానికి ఇవి తోడ్పడ్డాయి.

తెలుగు బాలసాహిత్యంలో నీతికథలకు సమున్నతస్థానం ఉంది. కందుకూరి వీరేశలింగం పంతులు "ఈసఫ్ కథ"లను నీతి కథా మంజరి పేరుతో పిల్లలకోసం రెండు భాగాలలో రాశారు. వావిలికొలను సుబ్బారావు "ఆర్యకథానిధి" రాశారు. ఇలాగే వెంకట పార్వతీశ్వరకవులు, కనుపర్తి వరలక్ష్మమ్మ, గిడుగు వెంకట సీతాపతి, నార్ల చిరంజీవి, భమిడిపాటి కామేశ్వరరావు మొదలైనవారు నీతికథలను అందించారు. ఇవి కాలాతీతమైన నీతిని బోధిస్తున్నందునే కలకాలం నిలిచి ఉన్నాయి. ఇంకా ఉంటాయి కూడా!

అద్భుత కథలంటే పిల్లలకు మరీ ఇష్టం. వీటిలో వాస్తవం కంటే చిత్రమైన ఊహ ప్రధానం. అద్భుత కథల వలన పిల్లల ఆలోచన పైమెట్టుకు ఎదగడానికి వీలుంది. అందుచేత బాలమనోవిజ్ఞానవేత్తలు పిల్లలచేత అద్భుత కథలు ఎక్కువగా చదివించమని సలహా ఇస్తారు. తెలుగులో అద్భుత కథలు పత్రికలలో వేలసంఖ్యలో వచ్చాయి. కానీ పుస్తకరూపంలో వచ్చినవి తక్కువ. మండవ రఘునాథ్ రాసిన "మహేంద్రమణి" (1953), లక్ష్మీకాంత మోహన్ "పేదరాశి పెద్దమ్మ కథలు" (1953), ఎం.ఎస్. మూర్తి ఇంద్రజాల కథలు," సత్యవోలు రాజశేఖరం "అల్లా ఉద్దీన్ అద్భుత దీపం" (1958), జంధ్యాల సుబ్రమణ్యశాస్త్రి "ఆలీబాబా నలుబది దొంగలు" (1959), కె. రమేష్ "మాయగంట"

(1960), వేదగిరి రాంబాబు "చిన్నికథలు" (1992), రావూరి భరద్వాజ "ఉడతమ్మ ఉపదేశం" (1992), ఆర్. సత్యమూర్తి "గారడీ అంకెలు" (1992) ప్రసిద్ధమైనవి.

సాంఘిక కథలలో ఇల్లు, బడి రంగస్థలంగా ఉంటుంది. కథ ఎంత చిన్నదిగా ఉత్సుకతతో కూడుకొని ఉంటుందో అది పిల్లలకు అంత బాగా నచ్చుతుంది. ఇల్లిందల సరస్వతీదేవి "మూడు పిల్లి కూనలు" (1958), తురగా జానకిరాణి "బొమ్మల పెళ్ళి" (1979), నార్ల చిరంజీవి "ఆటాపాటా", "ముగ్గురు స్నేహితులు" (1961), చింతా దీక్షితులు "సూరి, సీతి, వెంకి" (1956), మునిమాణిక్యం "గాలిపిల్లలు" (1956), మద్దులూరి రామకృష్ణ "నాన్నకోసం" (1954), మండా సూర్యనారాయణ "బహుమతి", పాలంకి వెంకట రామచంద్రమూర్తి "దొంగలున్నారు జాగ్రత్త" (1956), రావూరి భరద్వాజ "పితృహృదయం"(1959), అలపర్తి వెంకటకృష్ణ సుబ్బారావు "గాలిపటం" (1956), చాపరాల సరళాతిలక్ "చిన్నారి గూఢచారి" చెప్పుకోదగినవి.

తరువాత పిల్లలకు హాస్య రచనలంటే చాలా ఇష్టం. హాస్యం వారిని ఆనందలోకాల్లో ముంచెత్తుతుంది. తెనాలి రామకృష్ణుని కథలు, పరమానందయ్య శిష్యుల కథలు మనకు చాలకాలంగా ఉన్నాయి. న్యాయపతి రాఘవరావు సృష్టించిన పొట్టిబావ - చిట్టిమరదలు, కొంటెకృష్ణయ్య పాత్రలు, ముళ్ళపూడి వెంకటరమణ "బుడుగు", బుజ్జాయి "డుంబు" పాత్రలు బాలసాహిత్యంలో మరుపురానివిగా నిలిచిపోయాయి.

## పిల్లల నవలలు:

ఆధునిక యుగంలో పిల్లల, పెద్దల ఆదరణ పొందిన ప్రక్రియ నవల. బాలసాహిత్యంలో మాత్రం ఈ ప్రక్రియ పెద్దగా ఆదరణ పొందలేదనిపిస్తోంది. వచ్చిన నవలల్లో బాగా ప్రచారంలోకి వచ్చినవి చాలా తక్కువ. వస్తురీత్యా పిల్లల నవలలు సాంఘిక నవలలు, అద్భుత నవలలు, చారిత్రక నవలలు అని మూడు విధాలుగా విభజించవచ్చు. కాని పిల్లలు విశేషంగా చదివి ఆనందించే హాస్యనవలలు, శాస్త్రీయ నవలలు అంతగా రాలేదనిపిస్తోంది.

సాంఘికాలలో కె. సభా "చంద్రం" (1954), గీతా సుబ్బారావు "పారిపోయిన బఠానీ"(1970), న్యాయపతి రాఘవరావు "పిల్లదొంగ" (1970), నార్ల చిరంజీవి "వీధిగాయకుడు"(1955), కొమ్మూరి వేణుగోపాలరావు "పిల్లదొంగ" (1954), ముద్దంశెట్టి హనుమంతరావు "వాసుచదువు" (1955), మట్టెగుంట రాధాకృష్ణ "బడిపిల్లలు" (1955), చొక్కాపు వెంకటరమణ "అల్లరిసూర్యం" (1975), సి. కనకాంబరరాజు "చింటూ తెచ్చిన తంటా" (1975), పాలంకి "బంగారుతల్లి" (1975), కె. రామలక్ష్మి "స్నేహబంధం" (1992), ఎన్. మంగాదేవి "పింకు టింకు"(1992) మొదలైనవి తెలుగు పిల్లల సాంఘిక జీవితాన్ని చవి చూపాయి.

అద్భుత నవలల్లో చింతా దీక్షితులు "గోపీమోహిని" (1955), శ్రీవాత్సవ "జలతారు జాబిలి", దిగవల్లి వెంకట శేషగిరిరావు "విచిత్రలోకం"(1961), కె. సభా "మత్స్యకన్యలు"(1957), అంతటి నరసింహం "కోటవీరన్న సాహసం", నండూరి రామమోహనరావు "మయూర కన్య"(1961), కె. రాజేశ్వరరావు "చిట్టిరాజు – గూనిగుర్రం" (1975), రావూరి భరద్వాజ "మాయలోకం" (1977), వాసిరెడ్డి సీతాదేవి "దెబ్బకు ఏడుప్రాణాలు"(1991), చల్లా శ్రీనివాస్ "ఆకాశరాకాసి"(1993) – ఈ నవలలు పిల్లల్లో ఆలోచనా శక్తిని, ఊహాశక్తిని పెంచి ఉన్నత పథాలవైపు పయనించటానికి తోడ్పడతాయి.

ఇక చారిత్రక నవలల్లో శార్వరి "నాగార్జున"(1960), కొణిపాకం లింగన్న "శాంతిచక్రం"(1976), జీరెడ్డి చెన్నారెడ్డి "దక్షిణతార"(1954) మొదలైన కొన్ని చారిత్రక నవలలు పిల్లల్లో చారిత్రక దృష్టి పెరగటానికి తోడ్పడతాయి. ఈ నవలలు మరిన్ని రావలసి ఉంది. జీవిత చరిత్ర గ్రంథాలలో డి. రామలింగం "విశ్వకవి", "నేతాజీ," శారదా అశోకవర్ధన్ "జాతిరత్నం", ఎస్ మంగాదేవి "చుక్క", కోడూరి లీలావతి దేవి "ఇంద్రధనుస్సు" చెప్పుకోదగ్గవి.

## పిల్లల నాటికలు - నాటకాలు:

పిల్లలకోసం ప్రత్యేకంగా రాసిన నాటికలు, నాటకాలు, ఏకపాత్రలు, బుర్రకథలు దృశ్యసాహిత్యం కిందకు వస్తాయి. బాలల నాటికలలో అలంకారికులు చెప్పిన లక్షణాలన్నీ ఉండటానికి వీలులేదు. ఇవి ఇతివృత్త ప్రధానంగా రచింపబడతాయి.

దాదాపు 1925 నుంచి బాలల కోసం రచనలు ప్రచురించిన పత్రికలలో పిల్లల నాటికల జాడ కనిపించలేదు. న్యాయపతి రాఘవరావు 1939 లో మద్రాసు రేడియో కేంద్రంలో బాలల కార్యక్రమాల నిర్వహణ నిమిత్తం చేరాక బాలల నాటికల రచన, ప్రదర్శన ప్రారంభమైనట్లు ఆధారాలున్నాయి. 1945 లో 'బాల' పత్రిక పెట్టాకే తొలిసారిగా పిల్లల నాటికల ప్రచురణ భాగ్యం కలిగింది. తొలినాటిక జనమంచి రామకృష్ణ "యమునా తీరం" అనే కృష్ణకథ, ఆ తరువాత రేడియోలో ప్రసారమైన అనేక నాటికలు 'బాల' పత్రికలో ప్రచురించబడ్డాయి, ప్రచారంలోకి వచ్చాయి.

గురజాడ "పుత్తడిబొమ్మ పూర్ణమ్మ" బాలగేయనాటికగా చోటుచేసుకుంది. న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి, బాలాంత్రపు రజనీ కాంతరావు, దాశరథి, సి.నారాయణరెడ్డి, బోయి భీమన్న, జె. బాపురెడ్డి, బి. వి. నరసింహారావు,

కొలకలూరి ఇనాక్ , పైడిపాటి సుబ్బరామశాస్త్రి, మిరియాల రామకృష్ణ, తెన్నేటి సూరి, నండూరి సుబ్బారావు, సోమంచి రామం, కె. సభా, అలపర్తి, కె. ఎల్. నరసింహారావు, ఏడిద కామేశ్వరరావు, అనపర్తి, గీతా సుబ్బారావు, సేతు మాధవరావు, మద్దిపట్ల వెంకటరావు, తురగా జానకీరాణి, డి. వి. రమణమూర్తి, చెరుకుమిల్లి భాస్కరరావు, సి. బద్రీనాథ్, లలితాచలం, ఎం. రమేష్ మొదలైనవారు బాల నాటికలు రాసిన వారిలో ఎన్నదగినవారు. పిల్లలకు నాటకాలు అంతగా రాలేదనే చెప్పాలి.

## పిల్లలకు విజ్ఞాన సాహిత్యం:

తెలుగులో పిల్లల కోసం వెలువడిన విజ్ఞానశాస్త్ర రచనలలో ఎక్కువభాగం ఖగోళశాస్త్రానికి చెందినవి. ఎ.వి.ఎస్. రామారావు "విశ్వరహస్యం" (1965), "అంతరిక్షయానం", "సూర్యకుటుంబం"; వసంతరావు వెంకటరావు "చంద్రుని కథ", విస్సా అప్పారావు "ఆకాశం" (1960), వేమరాజు భానుమూర్తి "చక్రవర్తి లేఖలు, సైన్స్ కథ, భూమికథ" (1957) మొదలైనవి ఉన్నాయి.

ఇంకా గిడుగు వెంకట రామమూర్తి "కనపడని శత్రువులు", వెలగా వెంకటప్పయ్య "రేడియో కథ, టెలిఫోన్ కథ," రెడ్డి రాఘవయ్య "విజ్ఞానోదయం", చొక్కాపు వెంకటరమణ "చెట్టుమీద పిట్ట" వేదగిరి రాంబాబు "అలవాట్లు - పొరపాట్లు" చెప్పుకోదగినవి. విజ్ఞానశాస్త్ర రచనలు చేసేవారిలో కె.ఆర్.కె. మోహన్, కె. బి. గోపాలం, గిరిజానారాయణ్, పి. చంద్రశేఖర ఆజాద్, చల్లా శ్రీనివాస్, దుర్గం రవీందర్, వి. వి. స్వామి ప్రసిద్ధులు. డా॥ మహీధర నళినీ మోహన్ బాలలకోసం విజ్ఞాన రచనలు చేయటంలో విశేషమైన కృషి చేశారు.

## బాలసాహిత్య కృషీవలులు:

బాలసాహితీ రచనలో ఎంతో కృషి చేసిన, చేస్తున్న రచయితలు ఎందరో ఉన్నారు. వారిలో కొందరిని ప్రత్యేకంగా పేర్కొనక తప్పదు.

ఏటుకూరి వెంకటనర్సయ్య, న్యాయపతి రాఘవరావు, కామేశ్వరి, చింతా దీక్షితులు, టేకుమళ్ళ కామేశ్వరరావు, ఏడిద కామేశ్వరరావు, నార్ల చిరంజీవి, కవిరావు, వేజెండ్ల సాంబశివరావు, ముళ్ళపూడి వెంకటరమణ, వెలగా వెంకటప్పయ్య, అలపర్తి వెంకట సుబ్బారావు, బి. వి. నరసింహారావు, మద్దులూరి రామకృష్ణ, కె. సభా, మసూనా, ఎల్లోరా, రావూరి భరద్వాజ, గీతా సుబ్బారావు, మహీధర నళినీమోహన్, తురగా జానకీరాణి, పాలంకి వెంకట రామచంద్రమూర్తి, గోవిందరాజు రామకృష్ణారావు, మద్దిపట్ల వెంకట్రావు, గాలి ప్రభావతి, కె.ఆర్.కె. మోహన్, శారదా అశోకవర్ధన్, నదీరా, రెడ్డి రాఘవయ్య, పి.చంద్రశేఖర్ ఆజాద్, మొండా ప్రభాకరరావు, మాచిరాజు కామేశ్వరరావు, ముదుమారు వెంకటేశ్వరరావు , గంగిశెట్టి శివకుమార్, చొక్కాపు వెంకటరమణ, దుర్గం రవీందర్, చల్లా శ్రీనివాస్, డి. సుజాతాదేవి, కె. రాజేశ్వరరావు, వాణీ రంగారావు, ఎ. లక్ష్మీరమణ, శశికాంత్ శాతకర్ణి ఇంకా అనేకమంది ఉన్నారు.

## బాల సాహిత్యం - చిత్రకారులు:

బాల సాహిత్యం పిల్లలకు ఆకర్షణీయంగా ఉండాలంటే బొమ్మల ప్రాధాన్యత ఎంతో ఉంది. అభినయించటానికి అనుకూలంగా లేని నాటికలు, పాటలు; బొమ్మలు లేని పుస్తకాలు పిల్లల్ని ఆకర్షించవు.

పిల్లల పుస్తకాలలో చక్కని రేఖా చిత్రాలు తగు మోతాదులో ఉంటేనే బాగుంటుంది. బొమ్మలు బాలల ఊహలను పోలి ఉండాలి. ముఖచిత్రం ఆకర్షణీయంగా రంగులలో ఉండాలి. పిల్లల పుస్తకాలకు బొమ్మలు వేసేవారికి బాలల మనస్తత్వం తెలిసి ఉండాలి. వారి అభిరుచికి అనుకూలమైన బొమ్మలు వేయగలగాలి.

పిల్లల పుస్తకాలకు చక్కని బొమ్మలు వేయగల చిత్రకారులు బాపు, బుజ్జాయి, వడ్డాది పాపయ్య, చిత్ర, శంకర్, బి.వి. సత్యమూర్తి, గీతా సుబ్బారావు, ఎం. కనకసూరిబాబు, గోలి శివరామ్, పి.ఎస్. బాబు, చంద్ర, మోహన్, గోపీ, శ్రీకర్, చందు, కరుణాకర్, బాలి, వాసు, త్రిగుణ్, గంగాధర్ – టి, విమ్మి, లక్ష్మణ్ మొదలైన అనేకమంది చిత్రకారులున్నారు.

బాలల మనస్తత్వాన్ని బాగా అవగాహన చేసుకున్న చిత్రకారుడు ఎ.వి.బి.ఎస్. ఆనంద్ సుమారు వంద పిల్లల పుస్తకాలకు పైగా రేఖా చిత్రాలు, ముఖచిత్రాలు వేశారు. బాలల్లో చిత్రకళ పట్ల గల ఆసక్తిని ప్రోత్సహించేందుకు తోడ్పడేవిధంగా "పిల్లలూ ! బొమ్మలు వేయటం ఎలా? " పుస్తకాన్ని కూడా రాశారు.

## బాలసాహిత్యం - ప్రచురణసంస్థలు:

ఆంధ్రప్రదేశ్‌లో బాలసాహిత్యం అభివృద్ధికి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలు పెంపొందించేందుకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి 1976 లో స్థాపించబడింది. 'బాలచంద్రిక' పిల్లల మాసపత్రిక ప్రచురణ, పిల్లల పుస్తకాల ముద్రణ కార్యక్రమాలు చేపట్టి బాలసాహిత్యాభివృద్ధికి ఎంతో కృషి చేస్తోంది.

ఎనిమిదేళ్లలోపు బాలల కోసం 25 శాతం కథ, 75 శాతం బొమ్మలు ఉండేలా బుజ్జికథల సీరీస్‌లో రంగులబొమ్మల పుస్తకాలు ప్రచురించింది. 8–11 ఏళ్ళు మధ్యవయసుగల బాలల కోసం 50 శాతం కథాంశం, 50 శాతం బొమ్మలు ఉండేలా కథలు, పాటల పుస్తకాలు ప్రచురించింది.

పన్నెండేళ్ళు పైబడినవారి కోసం 75 శాతం కథాంశం, 25 శాతం బొమ్మలు ఉండేలా జీవితచరిత్రలు, నవలలు, నాటికలు, విజ్ఞానరచనలు ప్రచురించడం జరిగింది.

ఇంతవరకు ఆం.ప్ర. బాలల అకాడమీ 100 పైగా పిల్లల పుస్తకాలను ప్రచురించింది. పిల్లలు పాడుకోవడానికి వీలుగా పాటలు, కథలతో 'చిలక పలుకులు' పేరుతో ఆడియో కేసెట్లను రూపొందించింది. "ఇంద్రధనుస్సు" పేరుతో పిల్లల వీడియో పత్రికను విడుదల చేసింది.

నేషనల్ బుక్ ట్రస్ట్ వారు 'నెహ్రూ బాల పుస్తకాలయ' శ్రేణిలో తెలుగులో అనేక పుస్తకాలు వెలువరించారు. ఇండియా బుక్ హౌస్ వారు 'అమర చిత్రకథ', 'టింకిల్' శ్రేణిలో పిల్లలకోసం తెలుగులో కూడా బొమ్మల కథల పుస్తకాలు విడుదల చేశారు.

ఇంకా తెలుగులో పిల్లల పుస్తకాలను ప్రచురించే సంస్థలు – విశాలాంధ్ర ప్రచురణాలయం, నవోదయ, బాలసాహితీ, సృజన ఎడ్యుకేషనల్ కిట్స్, ఎం.వి. ఫౌండేషన్, 'రాదుగ' ప్రచురణలు, హైదరాబాద్ బుక్ట్రస్ట్ – ఇంకా అనేక సంస్థలు మంచి బాలసాహిత్య గ్రంథాలను ప్రచురిస్తున్నాయి.

## బాల సాహిత్య - శిక్షణ శిబిరాలు:

గిడుగు వెంకట సీతాపతి ఆధ్వర్యంలో మొదటిసారిగా 1956లో రాజమండ్రిలో బాలసాహిత్య శిక్షణ శిబిరం నిర్వహించారు. తరువాత 1958, 1959, 1961 లలో హైదరాబాద్‌లో జరిగాయి. ఆ శిక్షణ శిబిరాలలో అనేకమంది రచయితలు పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి ఆధ్వర్యంలో 1979లో అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా నాగార్జున సాగర్‌లో వెలగా వెంకటప్పయ్య పర్యవేక్షణలో బాల సాహిత్య రచయితల శిక్షణ శిబిరం నిర్వహించారు. ఈ శిక్షణా శిబిరంలో రాష్ట్రంలోని అన్ని జిల్లాలనుండి రచయితలు, రచయిత్రులు పాల్గొన్నారు. 1988లో రుషీవాలీ రూరల్ ఎడ్యుకేషన్ సెంటర్ వారి ఆధ్వర్యంలో వెలగా వెంకటప్పయ్య పర్యవేక్షణలో బాలసాహిత్య రచయితల శిక్షణా శిబిరం జరిగింది.

## బాల సాహిత్య గ్రంథాలకు బహుమతులు:

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఏర్పడిన 'తెలుగు భాషా సమితి' 1948 – 49 నుండి బాలల గ్రంథాలకు బహుమతులు ఏర్పాటు చేసింది. తొలిగా మాగంటి బాపినీడు "బొమ్మల భారతం"కు, గిడుగు సీతాపతి గారి "బాలానందం"కు బహుమతులు వచ్చాయి.

1953 లో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం పిల్లల పుస్తకాలకు బహుమతులు ప్రకటించింది. చింతా దీక్షితులు గారి "లీలాసుందరి" మొదటి నవల.

1953–54 లో భారత ప్రభుత్వం బహుమతుల సంప్రదాయం నెలకొల్పింది. కవిరావుగారి "బొమ్మరిల్లు" బహుమతి గెల్చుకుంది.

1955 లో దక్షిణ భారత పుస్తక సంస్థ ఏర్పడి తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషలలోని బాలసాహిత్యంలో ఉత్తమమైనవాటికి పోటీలు, అనువాదాల ప్రచురణ చేపట్టారు. ఎం.ఎల్. నరసింహారావు "జంతుదర్శనం " తొలిగా బహుమతి పొందింది.

1957లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఏర్పడింది. 1966 నుండి పిల్లలకు ఉపయోగపడే గ్రంథాలకు ప్రత్యేకంగా రచయిత్రులకు పోటీలు నిర్వహిస్తోంది.

ఇవేకాక ఆంధ్రజ్యోతి వారపత్రిక, స్వాతి వారపత్రిక, 'బాలజ్యోతి' మరియు ఆంధ్రభూమి వారపత్రిక, బాలల అకాడమీ సంయుక్తంగా నిర్వహించిన పిల్లల నవలల పోటీలలో బహుమతులు ఇచ్చి రచయితలను ప్రోత్సహించటం జరిగింది.

## బాలసాహిత్యంలో పరిశోధన:

వెలగా వెంకటప్పయ్య "బాల సాహితీ వికాసం" స్వయం శోధిత పరిశోధనా గ్రంథానికి ఆంధ్ర విశ్వ విద్యాలయం పిహెచ్.డి. డిగ్రీని త్రిపురనేని గోపీచంద్ మెమోరియల్ స్వర్ణపతకాన్ని, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డును ఇచ్చి గౌరవించాయి.

"తెలుగులో బాలగేయ సాహిత్యం – సవిమర్శక సమీక్ష" సిద్ధాంత వ్యాసరచనకు ఎం.కె.దేవకికి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసింది.

గంగిశెట్టి శివకుమార్ "బాలసాహిత్యంలో కథలు" సిద్ధాంత వ్యాస రచనకు డాక్టరేట్ వచ్చింది.

## బాలల విజ్ఞాన సర్వస్వాలు:

తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని పోలిన రచన " పెద్దబాలశిక్ష" (1845). దీని రచయిత పుదూరు సీతారామశాస్త్రి కొద్దిమార్పులతో రచయిత పేరు లేకుండా ముద్రించారు. ఇది ఇప్పటికీ ప్రచురింపబడుతూనే ఉంది.

మాగంటి బాపినీడు గారు పిల్లలు తెలుసుకోవలసిన చరిత్ర, భూగోళం, సాంఘిక విజ్ఞానం మొదలైన విషయాలతో "తెలుగుతల్లి" 1944లో సంగ్రహంగా ప్రచురించారు.

ఒద్దిరాజు రామచంద్రరావుగారు "బాల విజ్ఞాన మంజూష" (1953) వెలువరించారు. మహీధర జగన్మోహనరావు (1908–1977) "యక్షప్రశ్నలు"లో శాస్త్రీయ దృక్పథంతో సమాధానాలు వివరించారు.

తెనాలిలో ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ మొహమ్మద్ ఖాసిం ఖాన్ సంపాదకత్వంలో "బాల విజ్ఞాన సర్వస్వం" (1956) తొలి సంపుటం అసంపూర్తిగా ప్రచురించబడింది.

బుడ్డిగ సుబ్బరాయన్ సంపాదకత్వాన అభినందన ప్రచురణ సంస్థ "బాలల విజ్ఞాన సర్వస్వం"(1990) ఒక సంపుటాన్ని వెలువరించింది.

ఓరియంట్ లాంగ్‌మన్ లిమిటెడ్ వారు "సచిత్ర విజ్ఞాన సర్వస్వం" (1991) తెలుగు అనువాదం ప్రచురించారు.

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ "బాలప్రపంచం" పేరుతో తెలుగులో బాలల విజ్ఞాన సర్వస్వాన్ని 12 సంపుటాలలో ప్రచురించటానికి సన్నాహాలు చేస్తోంది.

బాలసాహిత్యరచయిత, జర్నలిస్టు దుర్గం రవీందర్ కేంద్ర మానవ వనరుల శాఖ, మరికొన్ని సేవాసంస్థల సహకారంతో తెలుగులో "బాలల విజ్ఞాన సర్వస్వం" 13 సంపుటాలుగా తీసుకువచ్చేందుకు కృషి చేస్తున్నారు.

## 'బాలబంధు' అవార్డులు:

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ బాల సాహిత్యంలో అవిరళకృషి సల్పిన లబ్ధప్రతిష్ఠులైన ప్రముఖులకు "బాలబంధు" అవార్డులు ఇచ్చి సత్కరిస్తోంది. ఈ అవార్డులు మొదటిసారిగా 1976లో ఆరుగురికి ఇచ్చారు.

1. న్యాయపతి రాఘవరావు 2. న్యాయపతి కామేశ్వరి 3. ఇల్లిందల సరస్వతి 4. డా॥ పి. తిరుమలరావు 5. పాలంకి వెంకట రామచంద్రమూర్తి 6. బి.వి. నరసింహారావు. మధ్యలో కొంతకాలం బాలబంధు అవార్డుల ప్రదానం జరగలేదు. తరువాత 1991 లో 1. ఏడిద కామేశ్వరరావు 2. మద్దులూరి రామకృష్ణ 3. వేజెండ్ల సాంబశివరావు 4. డా॥ వెలగా వెంకటప్పయ్య 5. కవిరావు 6. అలపర్తి వెంకటసుబ్బారావులకు ఇచ్చారు.

1992లో 1. బాపు 2. ముళ్ళపూడి వెంకటరమణ 3. బుజ్జాయిలకు 'బాలబంధు' అవార్డులు ఇవ్వటం జరిగింది.

1993లో 1. ఉత్పల సత్యనారాయణాచార్య 2. బి. ఎ.రెడ్డి 3. మునిరత్నంనాయుడులకు 'బాలబంధు' ప్రదానం జరిగింది.

## బాలసాహిత్యం - ప్రభుత్వ సహకారం:

బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలు పెంపొందించేందుకు 1976 లో రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఏర్పడింది. పిల్లలకోసం "బాలచంద్రిక" మాసపత్రికను ప్రచురించి రాష్ట్రంలోని 40 వేల పాఠశాలలకు ప్రతి నెలా పంపేది. పిల్లలకోసం వివిధ వయోవరాల బాలల స్థాయికి తగినట్టు 100 పైగా రంగుల బొమ్మల పుస్తకాలు ప్రచురించింది. "చిలకపలుకులు" ఆడియో కేసెట్లు, ఇంద్రధనుస్సు పిల్లల వీడియో పత్రికను రూపొందించి అందిస్తోంది. బాలసాహిత్యంలో విశేషకృషి సల్పినవారికి 'బాలబంధు' అవార్డులను ఇచ్చి సత్కరిస్తోంది. బాలసాహిత్య శిక్షణా శిబిరాలు, సభలు, సమావేశాలు, పిల్లల పుస్తకాల ప్రదర్శనలు నిర్వహిస్తూ బాలసాహితీ వికాసానికి కృషి చేస్తోంది ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి.

## బాల సాహిత్యం - జరగవలసిన కృషి:

బాలసాహితీ వికాసానికి మరింత కృషి జరగవలసి ఉంది. సాహితీరంగంలో బాలసాహిత్యం పట్ల ఇంకా చిన్న చూపే ఉంది. పిల్లల కోసం రాయటం తేలిక కాదు. బాలల మనస్తత్త్వం తెలుసుకోవాలి. భాషను బాగా అవగాహన చేసుకొని రాయాలి. పిల్లలను ఆకర్షించేలా వారికి రాయాలి. వారికి చెప్పకూడని విషయాలు జాగ్రత్తగా పరిహరించి రాయాలి. అంచేత అన్ని పత్రికలలోనూ పిల్లల కోసం ప్రత్యేక శీర్షికలు ఉండేలా, అవి సమర్థవంతంగా నిర్వహింపబడేలా చేయాలి. అప్పుడు బాలసాహిత్యం రచయితలకు మంచి ప్రోత్సాహం ఉంటుంది.

బాలసాహిత్యం రచయితలు పుస్తకాలు ప్రచురించుకునేందుకు ప్రభుత్వం ఆర్థిక సహకారం అందజేయాలి. వారి పుస్తకాలు గ్రంథాలయాలు కొనుగోలు చేయాలి. పిల్లల పుస్తకాల ప్రదర్శనలను ప్రభుత్వం ప్రోత్సహించాలి. పిల్లల పుస్తకాల ప్రచురణకు కాగితాన్ని సబ్సిడీ ధరపై ఇచ్చే ఏర్పాటు చేయాలి.

తల్లిదండ్రులు తమ పిల్లలు మంచి బాలసాహిత్యం చదివే అభిరుచిని ప్రోత్సహించి తోడ్పడాలి. బాలసాహిత్యాన్ని ప్రచురించేందుకు రచయితలతోపాటు ప్రచురణకర్తలూ ముందుకు రావాలి. అప్పుడే బాలసాహిత్యానికి స్వర్ణయుగం వస్తుందని ఆశించవచ్చు.

# ఆధునిక నవలా సాహిత్యం

డా. వాసిరెడ్డి సీతాదేవి

సాహిత్యం నిరంతరం ప్రవహించే ఒక జీవనది వంటిది. కొత్తనీరు రావడం పాతనీరు కొట్టుకుపోవడం ప్రవాహం యొక్క సహజగుణం. అలాగే సాహిత్యంలో కొత్తప్రయోగాలు వస్తుంటే పాత ప్రయోగాలు మరుగున పడిపోతూ వుంటాయి. "సాహిత్యం ఎందుకు మారుతుంది?" అని ఎవరైనా ప్రశ్నిస్తే "జీవితం ఎందుకు మారుతుంది?" అని ఎదురు ప్రశ్న వేయాలనిపిస్తుంది. మారేది జీవితం మారనిది జీవితం కాదు.

పరిణామం ప్రకృతి ప్రథమ లక్షణం. ప్రకృతి పరిణామం చెందుతుంది. కనుకనే జీవితం కూడా పరిణామం చెందుతుంది. సాహిత్యం జీవితంలోనుంచే పుడుతుంది. అందువల్ల పరిణామం చెందడం దాని లక్షణం. వ్యక్తిజీవితంలో వచ్చినంత త్వరగా సమాజ జీవితంలో మార్పురాకపోవచ్చును. కాని సమాజంలో వచ్చినమార్పు సాహిత్యంలో ఇమిడిపోక తప్పదు. మన చుట్టూవున్న ప్రపంచంలో మనం చూసే జీవిత పోకడల్ని, సాహిత్యజగత్తులో కూడా చూస్తాం.

రాజులూ - మహారాజులూ ఏలిననాడు సాహిత్యం కొద్దిమంది చేతుల్లో కీలుబొమ్మగా వుండిపోయింది. తెలుగులో నన్నయ్యభట్టు భారతరచనకు పూనుకోవడం ఒకరాజు అభీష్టాన్ని నెరవేర్చడానికే అన్న విషయ తెలుసుకుంటే, ఆనాడు సాహిత్యం రాజుల కనుసన్నలలో మెలుగుతూ వారికి మనోరంజనాన్ని కలుగజేస్తూ ముడుచుకు పోయిందనే విషయం స్పష్టం అవుతుంది. ఆనాటి సాహిత్యం చాలా వరకు అంతఃపురాలలోని అంగనల వలెనే కొందరికి వినోదాన్ని కలిగించేది.

భారతదేశంలో భూస్వామ్యవ్యవస్థ స్వైరవిహారం చేస్తున్న రోజుల్లో, పాశ్చాత్య దేశాల్లో విజ్ఞానతృష్ణ పెరిగింది. ప్రజల దృష్టి శాస్త్రీయ పరిశోధనల వైపుకు మళ్ళింది. మేధావుల నిరంతర పరిశోధనల ఫలితంగా, ఆవిరియంత్రాన్ని కనుగొనడం జరిగింది. ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవం వచ్చింది. ఈ విప్లవం, సామాన్యుని జీవితాన్ని కొత్త మలుపు తిప్పింది. ఉత్పత్తి పరికరాల్లో కనీవినీ ఎరుగనంతటి మార్పు వచ్చింది. ఈ మార్పు ప్రజల జీవితాలను ప్రభావితం చేసింది. అచ్చుయంత్రం కనుక్కోవడం జరిగింది. సాహిత్య చరిత్రలో మరే ఉద్యమం తేలేనంత విప్లవం ఈ అచ్చుయంత్రం తెచ్చింది. అచ్చువేసిన విషయం కేవలం కొందరికే కాకుండా అక్షరం ముక్క వచ్చిన ప్రతివాడికి ఉపయోగించేదిగా వుండాల్సివచ్చింది. సాహిత్యంలోకి సామాన్యుడు చొరబడ్డాడు.

ఇంగ్లీషువారు మన దేశానికి సరుకులతో పాటు తమ సంస్కృతిని కూడా మోసుకుని వచ్చారు. ప్రగతిశీలమైన వారి ఆలోచనావిధానం, క్రమశిక్షణ, శాస్త్రీయపరిజ్ఞానం, మనమేధావులను ఎంతగానో ప్రభావితం చేశాయి. ఇంగ్లీషువారికి మన సామాజిక స్థితిగతులను తెలుసుకోవడానికి అవసరమైన ఒక సాహిత్య ప్రక్రియ కావాల్సివచ్చింది. సజీవమైన జగత్తును ప్రతిబింబింప చేయగల్గిన సాహిత్య ప్రక్రియ నవల. "యదార్థ దృష్టితో అధ్యయనం చేయబడిన వాస్తవాలను వ్యక్తం చేస్తుంది నవల" అని అన్నాడు రిచర్డ్ క్రాస్. నవలను ఒకరకంగా మానవజీవితానికి వ్యాఖ్యానం అని చెప్పవచ్చును. అందువల్లనే 1872వ సంవత్సరంలో 'లార్డ్ మేయో' బెంగాల్ గెజెట్ లో ఒక ప్రకటన చేశాడు. బెంగాలీల ఆచారవ్యవహారాలను, జీవిత విధానాన్ని తెలియచేసే నవలకు బహుమతిని ప్రకటించాడు ఆ గెజెట్ లో.

ఆ ప్రకటనే తెలుగునవల ఆవిర్భావానికి నాంది కావటం చిత్రమైన విషయం. నరహరి గోపాలకృష్ణమ్మ శెట్టిని ఆ ప్రకటన ఆకర్షించింది. ఆయన డిప్యూటీ కలెక్టరు. "శ్రీరంగరాజచరిత్రము" అనే నవలను వ్రాశాడు. దానికి మరోపేరు "సోనాబాయి పరిణయము". అయితే ఈ నవలను స్వయంగా శెట్టిగారే హిందువుల ఆచారములను తెలుపు నవీన ప్రబంధం అన్నారు. ఈ రచన కులమతాలకు అతీతంగా ఉండి ప్రేమకు ప్రాధాన్యతను ఇచ్చింది. శెట్టిగారు పెద్ద పండితుడేమీకాదు. వాస్తవానికి దగ్గరగా సమాజంలోని వ్యక్తుల అనుభూతులను అనుభవాలను ఆశలను నిరాశలను కష్టాలను సుఖాలను చిత్రించటం నవలయొక్క ప్రధాన లక్ష్యం.

'శ్రీరంగ రాజచరిత్రము' 1872 లో ప్రచురించబడింది. ఈ విధంగా తెలుగు నవలకు అంకురార్పణ జరిగింది. అంటే తెలుగు నవల వయస్సు 123 ఏళ్ళన్న మాట. ఈ ప్రక్రియలోని విశిష్టత కారణంగా నూరేళ్ల కాలంలోనే మఱ్ఱి వృక్షంలా తెలుగు సాహిత్యాన్ని ఆక్రమించుకుంది. నవల నేలవిడిచి సాముచెయ్యదు. ఈ ప్రక్రియ నేలమీదపుట్టి, నేలమీద పెరిగి, నేలనే అంటిపెట్టుకొని జీవిస్తుంది. సమాజ జీవితం వ్యక్తి జీవితం ఈ ప్రక్రియలో యిమిడి పోయినంతగా మరే ప్రక్రియలోనూ యిమడలేదు. అందువల్లనే అశేష ప్రజల ఆదరాభిమానాలను అనతి కాలంలోనే ఈ నవలా ప్రక్రియ చూరగొన్నది. ఈనాటి సాహిత్యానికి పరిపూర్ణమైన ప్రాతినిధ్యం వహిస్తున్నది నవలే.

'శ్రీరంగరాజచరిత్ర' తర్వాత కందుకూరి వీరేశలింగం పంతులు 1878లో 'రాజశేఖరచరిత్ర' వ్రాశాడు. కొందరు ప్రతిభావంతంగా వ్రాయబడిన ఈ నవలనే తెలుగులో ప్రథమ నవలగా భావిస్తారు. ఈ నవలకు 'వివేక చంద్రిక' అనే మరోపేరు కూడా వుంది. ఈ నవల వివేకవర్ధిని అనే మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించబడింది. 1880లో పుస్తకంగా వెలువడింది. ఈ నవల "వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్" అనే ఇంగ్లీషు నవలకు అనుసరణ అని స్వయంగా వీరేశలింగంగారే చెప్పుకున్నారు. ముందు ఇంగ్లీషు నవలకు అనుసరణ వ్రాసి ఈ ప్రక్రియలో చేయితిరిగిన తర్వాత, మౌలిక రచన చేయ సంకల్పించానని ఎవరో ప్రశ్నించగా వీరేశ లింగం సమాధాన మిచ్చారు. అయితే ఆంగ్లనవలను అనుకరించినా వీరేశలింగం పంతులు ఈ నవలను తెలుగు జీవితానికి దగ్గరగా రచించారు. విచిత్రమైన విషయమేమిటంటే ఈ నవల ఇంగ్లీషులోకి అనువదింపబడి ఇంగ్లీషు వారి మన్ననలను పొందటం. వీరేశలింగం పంతులుగారు విద్వాంసులు, అష్టావధానం చేసిన దిట్ట. అన్నింటికంటే గొప్ప సంస్కర్త. మంచికవి ఆయన తన ఆశయాల, ఆదర్శాల ప్రచారానికి వచనారచననే ఆయుధంగా స్వీకరించారు. 1883లో "సత్యవతీ చరిత్రం" వ్రాశారు. దీనికి కూడా "గలివర్స్ ట్రావెల్స్" అనే ఇంగ్లీషు గ్రంథం ఆధారం. "లంకాద్వీపం", "ఆడమళయాళం" అనే పేర్లతో ఈ నవలను రెండు భాగాలుగా వ్రాయడం జరిగింది. "ఆడమళయాళం" చదివితే వీరేశలింగంగారు ఎంతటి గొప్ప అభ్యుదయవాదో అర్థమవుతుంది. ఆ "ఆడమళయాళం" ఆధారంగా ఆధునిక రచయితలెవరైనా నవల వ్రాస్తే అనేక మందిని ఆకట్టుకొనగలరని ఖచ్చితంగా చెప్పవచ్చు. వీరేశ లింగంగారి ఆడమళయాళం చదివి ఆనాడు ఎందరో పురుషులు లబలబలాడే వుంటారని చెప్పకనే తెలుస్తోంది. ఆ నవలలో 'స్త్రీలు ఉద్యోగాలు చేస్తారు. పురుషులు ఇల్లు చూసుకుంటారు. భార్య చస్తే ఆమెతోపాటు భర్తను పూడ్చిపెడతారు. నోములు నోయటం, పూజలు చేయటం, జన్మజన్మలకూ ఆ భార్యలే తమకు లభించాలని కోరు కోవటం, తనుపత్నీవ్రతుడుగా నిరూపించుకోవటం వగైరా పనులు పురుషులు చేస్తారు. మన సమాజంలో స్త్రీలు ఎలాంటి దుస్థితిలో ఉన్నారో సామాజిక దురన్యాయాలకు గురవుతున్నారో పురుషులకు తెలియచెప్పటమే రచయిత ధ్యేయం అని వేరుగా చెప్పనక్కరలేదు.

వీరేశలింగం పంతులుగారి కాలంలో దాదాపు నవలలన్నీ సాంఘిక, చారిత్రక ఇతి వృత్తాలతో నడచినవే. పౌరాణిక ఇతి వృత్తాలు కూడా స్వీకరించబడ్డాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు, కేతవరపు వెంకటశాస్త్రి, ఖండవల్లి రామచంద్రుడు మొదలైనవారు వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్ర'నే ఆధారంగా పెట్టుకొని అనేక నవలలు వ్రాసి పాఠకుల ఆదరణను పొందారు. అప్పటికి వీటిని వచన ప్రబంధాలుగానే చెప్పటం జరిగింది. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, రాజశేఖర చరిత్రకు పీఠిక వ్రాస్తూ, ఈ ప్రక్రియకు 'నవల' అన్న పేరును స్థిరపర్చాడు.

ఏ ప్రక్రియకూ లభించనంత ప్రజల ఆదరణ నవలకు లభించింది. ఈ సత్యాన్ని గురించి 'చింతామణి పత్రిక' వారు ఉత్తమ నవలలకు బహుమతిని ప్రకటించారు. నవలల కుండవలసిన లక్షణాలను కూడా ఆ ప్రకటనలో నిర్దేశించటం జరిగింది. 1894వ సంవత్సరంలో చిలకమర్తి లక్ష్మీనర్సింహం పంతులుగారు ఈ ప్రకటనకు ఆకర్షితుడై "రామచంద్ర విజయం" అనే నవల వ్రాశారు. ఈ నవలకు చింతామణి ప్రథమ బహుమతి లభించింది. రెండవ బహుమతి గోటేటి కనకరాజు రచించిన "వివేక విజయం" అనే నవలకు లభించింది. చిలకమర్తివారు "హేమలత", "కర్పూర మంజరి", "గణపతి" అనే మరికొన్ని ప్రజాదరణ లభించిన నవలలుకూడా రచించారు. కేతవరపు వెంకటశాస్త్రి "లక్ష్మీ ప్రసాదం" అనే నవలలో ఇంగ్లీషువారి ప్రభావం, ఇంగ్లీషు చదువు ప్రభావం తెలుగువారి సంస్కృతిమీద ఎంతగా పడిందో ఈ నవలలో చర్చించారు. ఆనాటి నవలల్లో చాలావరకు ప్రబోధాత్మకాలుగా ఉండేవి. నవలా రచనకు ప్రగతిశీలమైన దృక్పథం అవసరమనే దాన్ని తల్లాప్రగడవారి "హేలావతి" వెంకట పార్వతీశ్వర కవుల "మాతృమందిరం" నిరూపిస్తాయి. ఈ నవలల్లో హరిజన సమస్యలను చిత్రీకరించడం చూస్తే ఆ రచయితలు కాలం కంటె ఎంత ముందున్నారో తెలుస్తుంది. అప్పటికింకా గాంధీజీ హరిజనోద్యమం కూడా మొదలుకాలేదు. ఆ రచయితలు ఎంత పురోగాములో ప్రగతిశీల దృక్పథం కలవారో తెలుసుకోవచ్చు. ఖండవల్లి రామచంద్రుడు చింతామణి బహుమాన ప్రకటన ప్రేరితుడై "ధర్మవతీవిలాసం" అనే నవలను వ్రాసి ప్రథమ బహుమతిని గెల్చుకున్నాడు. ఆ కాలంలో వచ్చిన నవలల్లో వ్యక్తుల ఔన్నత్యాన్ని చిత్రించేవి ఎక్కువగా ఉండేవి. ఆనాటి

సామాజిక చిత్రణకూడా ఆ నవలల్లో కన్పించేది.

నవల జాతి జీవనంలో భాగంగా పరిగణించబడింది. ఈ గౌరవం మరో ప్రక్రియకు లేదంటే అతిశయోక్తి ఏమాత్రం కాదు. తెలుగుదేశంలో వచ్చిన అన్ని ఉద్యమాలలోను నవల తన పాత్రను నిర్వహించింది. 1910లో ఆంధ్రోద్యమం తలెత్తింది. ఆ సమయంలో తెలుగుజాతి ఔన్నత్యాన్ని చాటి చెప్పటానికి నవల ఉపయోగపడింది. జాతీయ భావాలను ప్రజల్లో ప్రచారం చేయటానికి వారిలో భావవిప్లవాన్ని రేకెత్తించటానికి నవలలు ఎంతగానో ఉపకరించాయి. భోగరాజుగారి "ఆంధ్రరాష్ట్రం" అనే నవల తెలుగు జాతి ఔన్నత్యాన్ని చాటిచెప్పింది. ఆంధ్రుల చారిత్రక వైభవాలను నవలల్లో ఘనంగా చిత్రించినవారు అడివి బాపిరాజు.

1900 నుంచి 1920 వరకు వెలువడిన నవలల్లో వెంకటశాస్త్రిగారి నవలలు ప్రత్యేకంగా చెప్పుకోదగినవి. వారు సాంఘిక నవలలు, చారిత్రక నవలలు, అపరాధ పరిశోధక నవలలు కూడా వ్రాశారు. ఆ సమయంలోనే ఇంగ్లీషునుంచి, బెంగాలీనుంచి అనేక అనువాదాలు వచ్చాయి. ప్రజల ఆదరణ కూడా ఈ అనువాద నవలలు చూరగొన్నాయి. ముఖ్యంగా శరత్ సాహిత్యం తెలుగు జన జీవితంలోకి అనాయాసంగా చొచ్చుకుపోయింది.

భారతదేశంలో జాతీయోద్యమం పెల్లుబికింది. తెల్లవాళ్ళను తరిమికొట్టాలనే నినాదం దేశం నలుమూలలా ప్రతిధ్వనించింది. ఆ ప్రతిధ్వనికి ఉన్నవవారి హృదయం స్పందించింది. ఆయనలోని రచయిత కదిలాడు. ప్రతిఫలంగా "మాలపల్లి" వంటి మహోన్నత నవల తెలుగుజాతికి లభించింది. 20వ శతాబ్దపు మహోత్కృష్టమైన నవలగా నాటికీ, నేటికీ మేధావుల మన్ననలు పొందింది. ఆ మహారచయిత ఎత్తుకు సరితూగగల రచయిత ఇంకా రాలేదని చెప్పడం అతిశయోక్తికాదు. సాహసం అంతకంటె కాదు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఉన్నత విద్యావంతుడు, గొప్ప పండితుడు, అకళంక దేశభక్తుడు, గొప్పమేధావి. ప్రజాజీవితాన్ని ప్రజా ఉద్యమాలను సమగ్రంగా తెలుసుకుని, కూలంకషంగా పరిశీలించి తన నవలలో చిత్రీకరించారు ఉన్నవ. మాలపల్లి వంటి సంపూర్ణ నవల అంటే ప్రజా ఉద్యమాలను, ప్రజాజీవితాన్ని నాటి సాంఘిక వ్యవస్థ రూపురేఖల్ని సమగ్రంగా చిత్రించిన ఘనత ఉన్నవ వారికే దక్కింది. ఉన్నవ వారు ఈ నవలలో ప్రజల భాషనే వాడటం గమనార్హం. ఈ నవల పృష్ఠభూమి ఆంధ్రదేశం నడిగడ్డిగా గుర్తించబడిన గుంటూరు జిల్లా మెట్టప్రాంతం. గుంటూరు జిల్లా మాండలికాన్ని ఈ నవలలో ఉపయోగించారు. హరిజనున్ని నాయకుడిగా చిత్రీకరించటం గొప్పవిశేషం. నవల ప్రజలలో భావ విప్లవాన్ని రగిలించే జ్వాలాముఖివంటిదని ఉన్నవవారు నిరూపించారు. ప్రజల్లో చైతన్యాన్ని రేకెత్తించి ప్రజల్ని ఉద్యమాలకు ఆయత్తం చేయగల శక్తి సాహిత్యానికి ముఖ్యంగా నవలకు ఉన్నది అనే సత్యాన్ని స్పష్టంచేశారు ఉన్నవవారు. ఈ నవలలోని చౌదరయ్య, రామదాసు, తక్కెళ్ళ జగ్గడు మొదలైన పాత్రలు సమాజంలో ఈనాటికీ సజీవంగా కన్పిస్తాయి. రామదాసు చనిపోతూ అన్నమాటలు చూడండి. "అందరూ పనిచేయాలి. అందరికీ ఒకటే భోజనం. ఒకే మోస్తరు గుడ్డలు. రేపనే దిగులులేదు. పోటీలు లేవు. అదుర్దాలేదు". ఈనాడు కావాలనే సోషలిస్టు సమాజం ఇదేకదా. సమసమాజం కావాలనే రచయితలు చెప్పేదికూడా ఇదేగదా. బ్రిటిషు ప్రభుత్వం ఈ నవలను చూసి బెదిరిపోయింది. నవల ప్రతులను జప్తు చేయించింది. నవల ప్రచురణమీద ఆంక్ష విధించింది.

అడివి బాపిరాజు కళాకారుడు. భావకవి. ఆయన వ్యక్తిత్వం ఆయన రచనలన్నింటిలోనూ స్పష్టంగా కన్పిస్తుంది. ఆయన నవలల్లో కథానాయకులు, కథానాయకీమణులు అందరూ మంచివారే. "నారాయణరావు" నవలకు విశ్వనాథ సత్యనారాయణగారి "వేయిపడగలు"తో పాటుగా ఆంధ్రా యూనివర్శిటీ బహుమానం లభించింది. తెలుగు తనం ఈయన నవలలకు ప్రాణం. ప్రకృతి వర్ణనలతో పేజీలకు పేజీలు నింపేశారు. బాపిరాజుగారి నవలలన్నిటిలో "గోన గన్నారెడ్డి" నా దృష్టిలో గొప్ప నవల. వీరి నవలలు జనసామాన్యాన్ని ఆకర్షించలేకపోయాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మంచి తేటతెలుగులో రచనలు చేశారు. "వీరపూజ", "విష భుజంగం", "మిథునరాగం" మొదలైన నవలికలు వ్రాశారు. "వడ్లగింజలు" అనే వీరి నవలిక ప్రతీ తెలుగువాడు తప్పక చదవవలసి ఉత్కృష్ట గ్రంథం. తెలుగుభాష తియ్యదనం తెలుసుకోవాలంటే శ్రీపాదవారి కథలు, నవలలు చదివి తీరాల్సిందే.

ఈ నవలా సాహిత్యోద్యమంలో దాదాపు ఒకేసారి ఇద్దరు ప్రతిభావంతులైన రచయితలు తమ కలాలను ఆయుధాలుగా చేపట్టి రంగంలోకి దుమికారు. ఇద్దరిలోనూ తీవ్ర అన్వేషణ కన్పిస్తుంది. వారు ఎవ్వరితోనూ రాజీపడరు. తమ తమ అభిప్రాయాలమీద స్పష్టమైన అవగాహన, ఎనలేని విశ్వాసం ఉన్నవారు. ఇద్దరికీ భాష మీద అమోఘమైన అధికారం ఉంది. కాని ఇద్దరి మార్గాలు వేరు. వారి మార్గాలు కాని, వారు ఉపయోగించిన భాష కాని – పొరపాటున కూడా ఎక్కడా కలవవు. భాష దగ్గరనుంచి భావాలవరకూ ఒకరికొకరు ప్రత్యర్థులు – వారే – విశ్వనాథ సత్యనారాయణ, గుడిపాటి వెంకటచలం.

అప్పటికే జనబాహుళ్యంలో నవలకు ఆదరణ, ఆకర్షణ పెరిగిపోయాయి. పాశ్చాత్య నాగరికతా ప్రవాహంలో మన ఆర్షసంప్రదాయం కొట్టుకుని పోతున్నదంటూ విలవిలలాడిపోయినవాడు విశ్వనాథ సత్యనారాయణ, ప్రాచీన భారతీయ సంస్కృతి చాలా చాలా గొప్పదనీ, కాగడావేసి గాలించినా

అలాంటి సంస్కృతి మరేదేశంలోనూ కన్పించదని విశ్వనాథ దృఢ విశ్వాసం. విశ్వనాథ మేధావి. మహాపండితుడు. వివాహ వ్యవస్థమీద అచంచలమైన విశ్వాసము కలవాడు. చతుర్వర్ణాలను సమర్థిస్తాడు. అవసరమైతే మాంగల్యానికి మూడు ముళ్ళతోపాటు మరో ముప్పై ముళ్ళు కూడా వేయమని బోధించగలవాడు. అయన జనాన్ని వెనక్కి తిరిగి చూడమనే సందేశం ఇచ్చాడు. ఇక్కడ మనం ఒక చిత్రమైన విషయాన్ని గమనించాలి. పాశ్చాత్య నాగరికతను తెగడటానికి పాశ్చాత్యుల నుంచి తెచ్చుకున్న నవలా ప్రక్రియనే ఉపయోగించుకున్నాడు. ఒకవైపు సాహిత్యం ప్రచార సాధనం కాదంటూనే తన భావాల ప్రచారానికి సాహిత్యాన్ని, ముఖ్యంగా నవలలను వాడుకున్న గడుసువాడు. "వేయిపడగలు", "చెలియలి కట్ట", "స్వర్గానికి నిచ్చెనలు" మొదలైన నవలలు తన భావ ప్రచారం కొరకే రచించాడు. ఇందుకు భిన్నంగా ఉన్న నవలలు "ఏకవీర", "మాబాబు". 1932 ప్రాంతాల్లో రచించిన "ఏకవీర" నవల చారిత్రక నవల అన్నారు. కాని ఇందులో చరిత్ర కంటె కల్పనే అధికంగా ఉంది. విశ్వనాథవారి కథా కథన చాతుర్యానికి ఏకవీరను ప్రతీకగా తీసుకోవచ్చు. ఈనవల చదువుతుంటే ఒక రసవత్తరమైన కావ్యం చదువుతున్న అనుభూతి కల్గుతుంది. "వేయిపడగలు" ఆంధ్రా యూనివర్సిటీ బహుమతి పొందిన రచన. సంప్రదాయవాది అయిన విశ్వనాథవారు సనాతన ధర్మ విశిష్టతను చాటే ప్రయత్నం దాదాపు ఆయన అన్ని నవలల్లోనూ కన్పిస్తుంది. సామాన్యునికి కొరుకుడు పడని విశ్వనాథవారి భాష అనితరసాధ్యం అంటారు ఆయన భక్తులు.

విశ్వనాథ సత్యనారాయణకు బలమైన ప్రతిద్వంది‌గా నిల్చిన వారు గుడిపాటి వెంకటచలం. ఇద్దరూ తాము నమ్మిన విషయాలను జంకు గొంకు లేకుండా బయట పెట్టారు. విశ్వనాథ తన భావాల ప్రచారం కొరకు తన పాత్రలను చెప్పుచేతల్లో పెట్టుకొని కీలు బొమ్మల్లా ఆడించాడనడంలో అతిశయోక్తి ఎంతమాత్రం లేదు.

గుడిపాటి వెంకటచలానికి వివాహ వ్యవస్థమీద గౌరవం లేదు. స్త్రీని బానిసగా తయారుచేసిన ఈ సమాజంమీద అతనికి అంతులేని ద్వేషం. పాత సంప్రదాయాలను కూకటి వ్రేళ్ళతో పెకలిస్తేగాని స్త్రీకి విముక్తి లేదనే నమ్మకం కలవాడు. ఉప్పెనలా పొంగి పాత భావాలను ముంచివేసినవాడు. చలం ఘోష, చలంభాష అసమానమైనవి. అయనలోని భావతీవ్రతే అయన కలాన్ని కత్తిగా మార్చింది. ఆకత్తితో కుళ్లు సమాజపు కుహనా సంప్రదాయాలమీద దండెత్తిన మొట్టమొదటి సాహిత్యయోధుడు గుడిపాటి వెంకటచలం. ఈ కుళ్లు సమాజపు దుర్గంధం చలాన్ని నుంచున్న చోట నిల్వనివ్వలేదు. అతను స్త్రీ జాతిని బంధించిన సంకెళ్లను తెంచడానికి ఉవ్వెత్తున లేచిన ఒక సాహిత్య కెరటం. ఆ కెరటాన్ని చూసి సంప్రదాయవాదులు లబోదిబోమంటూ నోళ్లు బాదుకుంటూ పరుగులు తీశారు. ఆ కెరటం ప్రజల్ని తాకకుండా అడ్డుకోడానికి విశ్వప్రయత్నంచేసి విఫలు లయ్యారు. ఛాందసులకు చలం రాక్షసుడుగా కన్పించాడు. అతన్ని వెలివేశారు. అతని పుస్తకాలను చదవవద్దన్నారు. తెలుగు సాహిత్యంలో చలం ఒక రచయిత కాదు – ఒక ఉద్యమం.

సమాజానికి షాక్ ట్రీట్‌మెంట్ ఇవ్వాలనుకున్నాడు. ఇచ్చాడు. నవలా సాహిత్యాన్ని ఒక మలుపు తిప్పాడు. చలం స్వేచ్ఛా ప్రణయాన్ని బోధించాడు. సెక్స్ ఫ్రీడమ్ కావాలన్నాడు. కొండల్లో, కోనల్లో, సముద్రతీరాల్లో స్వేచ్ఛా ప్రణయాన్ని అనుభవించే జంటల్ని సృష్టించాడు. ఇలా వ్రాసేటప్పుడు కుటుంబ వ్యవస్థ గురించిగాని, పిల్లల భవిష్యత్తు గురించిగాని, ముఖ్యంగా ఇటువంటి జీవితాల పర్యవసానం గురించిగాని, ఆర్థిక, సాంఘిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని కాని చలం ఆలోచించలేదని విమర్శకులంటారు. అతడి రచనలను అర్థం చేసుకోవాలంటే ఆనాటి సాంఘిక వ్యవస్థలో మగ్గిపోయిన స్త్రీల జీవితాలను అర్థం చేసుకోవాలి. అంత ఘాటుగా, అంత సూటిగా, అంత తీవ్రంగా, విచ్చలవిడిగా చెప్పకపోతే చలం సాహిత్యం సమాజాన్ని అంతగా కదిలించి వుండేదికాదు. చలిజ్వరానికి "క్వినైన్"నే వాడాలి. క్వినైన్ ఎఫెక్టు గురించి ఆలోచించాల్సింది జ్వరం తగ్గాక. చలం సమాజాన్ని దాని బూజుపట్టిన సంప్రదాయాల్ని ఒక్క ఊపుఊపి కదిలించి వేయాలనుకున్నాడు. అనుకున్నది సాధించిన మహామనీషి గుడిపాటి వెంకటచలం. అతని రచనలు "దైవమిచ్చిన భార్య", "అమీనా", "మైదానం", "హంపీ కన్యలు" ముఖ్యమైనవి.

ఈతరంలోనే మునిమాణిక్యం నరసింహారావు తెలుగు సాహిత్యంలో విశిష్టమైన పాత్ర కాంతాన్ని ప్రవేశపెట్టారు. వారు "రుక్కుతల్లి", "దీక్షితులు", "తిరుమాలిగ" అనే నవలలు వ్రాశారు. వారి రచనలు హాస్యప్రాధాన్యతను కల్గి వుంటాయి. కాంతం తెలుగువారి మధ్యతరగతి ముగ్ధ ఇల్లాలు. మొక్కపాటి నరసింహశాస్త్రిగారి "బారిష్టరు పార్వతీశం" అనే హాస్యప్రధాన నవల తెలుగులవారి ఆదరణను చూరగొన్నది. వీరు "ఏకోదరులు" అనేమరో నవలకూడా వ్రాశారు.

తెలుగు నవలా సాహిత్యంలో ఈ కాలానికి చెందిన మరో ప్రతిభావంతుడయిన నవలా రచయిత నోరి నరసింహ శాస్త్రి. ఈయన పండితుడు. ఈయన చారిత్రక నవలలు మాత్రమే వ్రాశారు. "రుద్రమదేవి", "నారాయణభట్టు", "కవిద్వయము", "ధూర్జటి" మొదలైన ఎన్నో నవలలు వ్రాశారు. వీరి శైలి రమణీయంగా ఉంటుంది. కమనీయమైన కథనంతో నాటి సామాజిక వాతావరణాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించారు నోరివారు తమ నవలల్లో.

1940 తర్వాత వచ్చిన నవలా సాహిత్యం ఇతి వృత్తంలో,

శిల్పంలో, కథనంలో నవీన పంథాలో నడిచింది. ఈ నవలల్లో ప్రముఖంగా మనో విశ్లేషణ, తాత్విక చింతన, రాజకీయ సిద్ధాంత అవగాహన మొదలైన గుణాలు విశేషంగా కన్పిస్తాయి. ఈ కాలంలో ప్రముఖంగా చెప్పుకోదగిన వారు కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్, జి.వి. కృష్ణారావు, బుచ్చిబాబు. కొడవటిగంటి కుటుంబరావుగారు మధ్యతరగతి జీవితాలను యథాతథంగా చిత్రీకరిస్తూ అనేక నవలలు వ్రాశారు. ఆయన సృష్టించిన పాత్రలు రచనలలోకి సజీవంగా నడిచి వచ్చాయా అన్నంత సహజంగా వుంటాయి. ఆయన శిల్పాని కంటె విషయానికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. కుటుంబరావుగారి రచనలలో హేతువాదం, మానవతావాదం, మనస్తత్వ నిరూపణ ముఖ్యంగా కన్పిస్తాయి. కుటుంబరావు గారు మార్క్సిస్టు. మార్క్సిస్టు దృక్పథం నుండి సమస్యలను ప్రతిపాదిస్తారు. అయినా ఆయన తన పాత్రల చేతగాని, లేక అకస్మాత్తుగా తను కథ మధ్యలో జొరబడిగాని మార్క్సిజాన్ని గురించి ఉపన్యాసాలు ఇప్పించలేదు. ఇవ్వలేదు. కుటుంబరావు సామాజిక సిద్ధాంతాలను గూర్చిన విస్పష్టమైన విశ్వాసాలున్న రచయిత. వర్గ సంఘర్షణ, ఆర్థికమైన విలువలు, సామాజిక పరమయిన మిగతా విలువలన్నింటికీ పునాది అని స్పష్టంగా తన రచనలలో చెప్పటం జరిగింది. కుటుంబరావు రచనలలో ఎక్కువగా మధ్య తరగతి కుటుంబాల కుహనా విలువలు. భేషజాలు, ఆత్మవంచనలు, పరవంచనలు, ఆశా నిరాశలు, ఇతివృత్తాలుగా వున్నాయి. వారి రచనలలో సున్నితమైన వ్యంగ్యం కన్పిస్తుంది. చెప్పదల్చుకున్న విషయం సూటిగా చెప్పటం ఆయన స్వభావం. భాషా సౌందర్యం కోసం భావ సౌందర్యం కోసం ఆయన వెంపర్లాడ లేదు. తాను ప్రతిపాదించ దల్చుకున్న సిద్ధాంతానికి సంబంధించిన లోతుపాతులన్నింటినీ వివిధ కోణాల్నుంచి చర్చించి అరటి పండు వల్చినట్లు పాఠకుల చేతికందిస్తాడు. విషయ ప్రతిపాదన ఆయన చేసినంత స్పష్టంగా మరేరచయితా చేయలేదేమోననిపిస్తుంది. కుటుంబరావు నవలల్లో "చదువు", "కురూపి", "లేచిపోయిన మనిషి" మొదలైనవి ఆయన ఆలోచనాశక్తికి నిదర్శనాలు. మధ్య తరగతి మనిషి మనస్తత్వాన్ని చిత్రించడంలో అప్పటికీ, ఇప్పటికీ కూడా కుటుంబరావుని మించిన రచయిత లేరని ఖచ్చితంగా చెప్పవచ్చు.

జి.వి. కృష్ణారావు రచన "కీలుబొమ్మలు" ఒక విశిష్టమైన నవల. మానవుని అంతర్బాహ్య ప్రవృత్తులు, వాటి సంఘర్షణ చక్కగా చిత్రీకరించబడ్డాయి. ఈ నవలలో ఆధునిక నాగరికతా ప్రభావం పల్లె సీమలలోని సాంఘిక రాజకీయ జీవితాన్ని ఎలా ప్రభావితంచేసిందో చక్కగా చిత్రీకరించారు రచయిత. ఒక వ్యక్తి జీవితంలో ఒక అబద్ధం ఆడినప్పుడు దాని ప్రభావం అతడి జీవితం చుట్టూ ఎలా పెనవేసుకు పోతుందో, ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో ఒక్కసారి చదివితే మరపురాని విధంగా బలంగా చెప్పారు. ఈ ఒక్క నవలతో జి.వి. కృష్ణారావు గారికి సాహిత్యంలో ప్రముఖ స్థానం లభించింది. "పాపికొండలు" అనే పేరుతో ఒక నవలను ప్రారంభించి ఎందు చేతనో పూర్తిచేయలేక పోయారు.

గోపీచంద్ దృక్పథమే విలక్షణమైనది. ఆయన శైలి మరీ విలక్షణమైనది. హేతువాద దృక్పథంతో మొదలైన ఆయన సాహిత్య సృష్టి-తాత్విక చింతనతో ముగుస్తుంది. ఆయన ఆలోచనా సరళిలో క్రమంగా ఎంతో మార్పు కన్పిస్తుంది. గోపీచంద్ శైలిలో పాండిత్య ప్రదర్శనగాని, జిలుగులు మెరుగులు గాని వుండవు. అయినా ఆయన తన తీక్షణమైన చూపులతో మానవుని మనస్సులోని అట్టడుగు పొరలలో దాగివున్న విషయాలను సైతం వెలికి లాగి మనముందుంచి మనల్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతాడు. అంతేకాదు, మానవ మనస్తత్వ పరిశీలన ఆయన చేసినంత లోతుగా మరొక రచయిత చెయ్యలేదేమో అనిపిస్తుంది. తెలుగు నవలాసాహిత్య చరిత్రలో ఎప్పటికీ మసక బారని ఒక విశిష్టమైన పాత్రను ప్రవేశపెట్టిన ఘనత ఒక్క గోపీచంద్‌కే దక్కుతుంది. ఆ పాత్ర పేరు సీతారామారావు. "అసమర్థుని జీవయాత్ర" అనే విలక్షణమైన నవలలోని విలక్షణమైన పాత్ర సీతారామారావు. సీతారామారావులో కనిపించే మానసిక ఘర్షణ అప్పుడప్పుడు మనందరిలోనూ కన్పిస్తూనే వుంటుంది. సీతారామారావు భూస్వామ్య వ్యవస్థ నుండి పారిశ్రామిక వ్యవస్థలోకి మారుతున్న సంధి యుగంలో ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కోలేని అసమర్థుడు. మారుతున్న సమాజంలో మారలేని మనిషి అనుభవించే మానసిక సంఘర్షణను కళ్ళకు కట్టినట్లు చిత్రించడం జరిగిందా నవల్లో. గోపీచంద్ తన నవలల్లో పాత్రలుగా అన్ని వర్గాలవారినీ ఎన్నుకొన్నారు. గోపీచంద్ రచించిన "అసమర్థుని జీవయాత్ర" నుంచి అసంపూర్ణంగా వదిలివేసిన "చీకటిగదులు" వరకు ఆయన నిశితమైన మేధా సంపత్తి, తార్కిక ప్రజ్ఞ, పాత్రల మానసిక సంఘర్షణ ప్రదర్శిస్తాయి. అసమర్థుని జీవయాత్రలోని సీతారామారావువలె "మెరుపులు మరకలు"లోని రాధారాణి పాత్ర కూడా మరపురానిది. ఈ సమాజంలో జీవిత విలువల్ని తెలుసుకోవడానికి చేసిన ప్రయత్నంలో ఆయన పడిన వేదన, తపన, మానసిక సంఘర్షణ, రాగద్వేషాలు ఆయన నవలల్లో స్పష్టంగా చూడవచ్చు. మెరుపులు మరకలు, శిథిలాలయం, పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా, యమపాశం, చీకటి గదులు మొదలైన గొప్ప నవలలు ఆయన రచించారు. తెలుగు నవలా మణిహారంలో గోపీచంద్ ప్రతీ నవల కూడా ఒక మణిలాగే ప్రకాశిస్తుంది.

ఒకే ఒక్క నవల వ్రాసి తెలుగు నవలా సాహిత్యంలో చాలా పెద్ద పీటను వేయించుకున్న ఘనత ఒక్క బుచ్చిబాబుకే దక్కుతుంది. ఆ నవల పేరు "చివరకు మిగిలేది". బుచ్చిబాబుగారు మానవతావాది, సౌందర్య పిపాసి. ప్రేమ రాహిత్యం వల్ల జీవితం నిస్తేజంగా మారుతుందని చూపించాడు బుచ్చిబాబు ఆ నవల్లో. ఫ్రాయిడ్ నిర్వచించిన "ఈడిపస్ కాంప్లెక్స్" అనే చిత్త ప్రవృత్తిని ఈ నవలలోని నాయకుడు దయానిధి పాత్ర చిత్రణ ద్వారా నిరూపించడానికి ప్రయత్నించారు. మనిషిని అతడి లోపాలను చూసి అగౌరవించకూడదనీ, ఎన్ని దుర్వ్యసనాలున్నా మేధా సంపత్తిగల వ్యక్తిని గౌరవించాలనీ బుచ్చిబాబు సిద్ధాంతం.

రావూరి వెంకట సత్యనారాయణరావు 'నెలవంక' మొదలైన కొన్ని మంచి నవలలు వ్రాశారు. ఈ దశాబ్దంలోనే పిలకా గణపతిశాస్త్రి, ధూళిపాళ శ్రీరామమూర్తి, మల్లాది వసుంధర మొదలైనవారు చారిత్రాత్మక నవలలు రచించారు. పిలకా గణపతిశాస్త్రి రచించిన విశాలనేత్రాలు మేధావుల మన్ననలను పొందింది. ఈ శతాబ్దం ఉత్తరార్థంలో తెలుగు నవలకు ప్రాముఖ్యత వచ్చింది. వార పత్రికలలో ధారావాహికంగా ప్రచురించడంచేత నవలారచయితలకు ప్రోత్సాహం లభించింది. వారపత్రికలలో "మినువాక", "నాకబలి" వంటి రచనలను ప్రచురించారు. ఒక్కమాటలో చెప్పాలంటే స్వాతంత్ర్యానంతర సాహిత్యంలోకి వైవిధ్యం ప్రవేశించిందనే చెప్పాలి.

నవలా సాహిత్యంలో చలం ఒకరకమైన విప్లవాన్ని సృష్టించారనే చెప్పాలి. సంప్రదాయాలపైన ఈ సాంఘిక వ్యవస్థపైన తన రచనలద్వారా రాచకొండ తిరుగుబాటు చేశాడు. సంఘంలోని అట్టడుగుకు నెట్టవేయబడిన సామాన్యులు, దళిత వర్గాలకు చెందిన పీడితుల పాత్రలు స్వీకరించి వారి కష్టసుఖాలను, వారి మనస్తత్వాలను కళ్లు మిరుమిట్లు గొలిపేలా మనముందుంచుతారు. రాచకొండ శైలి అనితరసాధ్యం. ఈనాటివరకు ఏ రచయితా సాధించలేని అద్భుతశైలి ఆయనది. ఈయన రచనలోని ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క రచన కావ్యం అనవచ్చు. ఏ పుస్తకంలో నించి ఏ ఒక్క వాక్యాన్ని వెలికితీసి తెలుగు పాఠకుడిచేత చదివించినా ఇదెవరి వాక్యం అని ప్రశ్నిస్తే అలాంటి వాక్యం రాచకొండ ఒక్కరే వ్రాయగలరని ఠక్కున చెప్పగలరు. ఆయన రచనా శైలి ఎందరినో ప్రభావితం చేసింది. ఇంకెందరో ఆయన శైలిని అనుకరించడానికి ప్రయత్నించారు. "అల్పజీవి" ఈయన తొలి నవల. ఈ నవలలో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడేపాత్ర సుబ్బయ్య. చాలా భయస్థుడు పిరికివాడు. అవమానాలను, బాధల్ని కిక్కురుమనకుండా సహించటం అతని సహజ లక్షణం. లంచాలు తీసుకోవడం కూడా అతనికి చేతకాదు. తలెత్తి వీధివైపు చూడలేడు సరికదా, భార్యముందుకూడా తిన్నగామంచివి ధైర్యాన్ని ప్రదర్శించలేడు. ఇందులోని పాత్రలన్నీ-వెంకట్రావు మొదలైన పాత్రలు శిథిలమైపోతున్న ఫ్యూడల్ వ్యవస్థ తాలూకు చిన్న చిన్న స్తంభాల్లాంటివి. ఈ నవల '50 ల తర్వాత వచ్చింది. ఆ తర్వాత 20 సంవత్సరాల తర్వాత '70 తర్వాత "రాజు-మనిషి" అనే ఒక నవలను వ్రాశారు. ఈ నవలను ఆధునిక భారతం అని చెప్పవచ్చు. భారతదేశంలో వలెనే అనేక పాత్రలు, రకరకాల వ్యక్తిత్వాలు దర్శనమిస్తాయి. శ్రీశ్రీ ఈ నవలను 20 శతాబ్దపు క్లాసిక్‌గా నిలుస్తుందని అభివర్ణించారు.

చైర్‌మన్ భీమసేనరావు, మందుల భీముడు, గేదెల రాజమ్మ, జమీందారు పురుషోత్తమరావు, ప్రసాద్, మిస్‌ప్రేమ మొదలైన పాత్రలు ప్రపంచంలోని చిత్రవిచిత్ర ప్రవృత్తులకు ప్రతీకలనవచ్చు. వీరి కలంనుంచి సారాసీసాలు అమ్మే వాళ్ళ దగ్గర్నుంచి లాయర్లు, రాజకీయనాయకులు, సానులు, దొంగలు, దోపిడీదార్లు, ఎన్.జి.ఓలు ఎవ్వరూ తప్పించుకు పోలేరు. రాచకొండ విశ్వానాధశాస్త్రి గారి ఒక్కొక్క వాక్యం, ఒక్కొక్క వ్యక్తి పరిచయం చదువుతూ మనం ఆనందంతో ఉప్పొంగిపోతాం. ఆశ్చర్యంలో తలమునకలవుతాం. ఆయన మార్క్సిస్టు మేధావి. ఈ వ్యవస్థమీద బొత్తిగా గౌరవంలేని విప్లవభావాలు కలవాడు. "గోవులొస్తున్నాయి జాగ్రత్త" మొదలైన కొన్ని గొప్ప నవలలు వ్రాశారు.

ఆనాటి రచయితల్లో మధ్యతరగతి జీవితాల్లోని ఆశాని రాశల్ని బాధల్ని చిత్రిస్తూ గొప్ప నవలలు వ్రాసిన రచయిత కీర్తిశేషులు శారద. శారద అసలు పేరు నటరాజన్. అతని మాతృభాష అరవం. తెనాలిలో హోటల్ సర్వర్‌గా పనిచేస్తూ "మంచీ- చెడూ", "ఏది సత్యం ఏదసత్యం", "అపస్వరాలు" అనే నవలలు వ్రాశారు. చిన్న వయస్సులోనే అకస్మాత్తుగా చనిపోకపోతే అతని కలం నుంచి మరెన్నో మంచి నవలలు వచ్చివుండేవి.

పోతుకూచి సాంబశివరావు - '60కి ముందు వ్రాసిన రచయితల్లో-"ఉదయ కిరణాలు" అనే నవలద్వారా మంచి రచయితగా పాఠకులకు పరిచయమయ్యారు. జంటనగరాల సామాజిక సాంస్కృతిక జీవితాన్ని సాంబశివరావు అతి నేర్పుగా చిత్రీకరించారు అన్వేషణ అనే నవల్లో. "ఏడురోజుల మజిలీ" మొదలైన మంచి నవలలు వ్రాశారు. ఆర్.ఎస్. సుదర్శనంగారి "అనుబంధాలు", "అసుర సంధ్య", "మళ్ళీ వసంతం" మొదలైన నవలల్లో తాత్వికచింతన, మనోవిశ్లేషణ ఉంటాయి. ఈ నవలలు మేధావుల మన్ననలను పొందాయి.

భాస్కరభట్ల కృష్ణారావు 'వింతప్రణయం', 'యుగసంధి', 'వెల్లువలో పూచిక పుల్లలు' వంటి మంచి నవలలు వ్రాశారు. ఆయన నవలల్లో 'స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్'

(చైతన్య ప్రవంతి)ను శిల్పంగా ఉపయోగించారు. 'వెల్లువలో పూచికపుల్లలు' అధివాస్తవిక రచనకు ప్రతీక. పాశ్చాత్య సాహిత్యంతో లోతైన పరిచయమున్న రచయిత ఈయన.

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుగారి 'పెంకుటిల్లు' 1960కి ముందే వచ్చిన ఒక మంచి నవల. అప్పటినుంచి ఇప్పటివరకు ఎడతెరిపి లేకుండా వ్రాస్తున్న ఘనత వీరికి దక్కుతుంది. వైద్యవృత్తిని ఇతివృత్తంగా తీసుకొని వేణుగోపాలరావు '70 తర్వాత "హౌస్‌సర్జన్" అనే మంచి నవల వ్రాశారు. ఈయనకు పాఠకుల్లో మంచి ఆదరణ వుంది. '60కి ముందువచ్చిన మరో గొప్పనవల శ్రీరావూరి భరద్వాజ రచించిన 'పాకుడురాళ్లు'. ఇందులో సినీ జీవితాన్ని అన్నికోణాలనుంచి లోతుగా పరిశీలించి చిత్రించటం జరిగింది. ఇందులో సినీతారలు సినీ జర్నలిస్టులు ఎక్‌స్ట్రాలు ఎక్‌స్ట్రా సప్లైయర్స్ ప్రొడ్యూసర్స్, డైరెక్టర్స్ – ఇలా ఎందరో సినీ జీవితానికి సంబంధించిన వ్యక్తులు మన కళ్ళకు కట్టినట్లు కన్పిస్తారు.

పురాణం సూర్యప్రకాశరావు వ్రాసిన 'జీవనగంగ' వీరాజీ వ్రాసిన 'విడీవిడని చిక్కులు', 'ప్రేమకు పగ్గాలు' యువతీయువకుల సమస్యల్ని చిత్రించే నవలలు.

తాళ్ళూరి నాగేశ్వరరావు "కొత్తయిల్లు", మంజుశ్రీ "మారుశరత్ లు", వినుకొండ నాగరాజుగారి "ఊబిలో దున్న", ఎన్.ఆర్. నందిగారి "నైమిశారణ్యం", పాలగుమ్మి పద్మరాజుగారి "నల్లరేగడి", వసశ్రీ "కురుక్షేత్రం", పురాణ సుబ్రహ్మణ్యశర్మ "చంద్రునికో నూలుపోగు", పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి "కౌసల్య"– '60 తర్వాత వచ్చిన నవలల్లో చెప్పుకోదగ్గ నవలలు. బలివాడ కాంతారావు "గోడమీద బొమ్మ", "దగాపడిన తమ్ముడు" మొదలైన మంచి నవలలు వ్రాశారు. ఇటీవల "వంశధార" అనే చాలా మంచి నవల వ్రాశారు. ఇందులో రయిత సృష్టించిన పాత్రలు దేశమంతటా వున్నాయి. నేటి భారతీయుడి మానసిక ప్రపంచంలో చెలరేగే ఆలోచనలను, అతడెదుర్కొంటున్న సమస్యలను, అతడి భయాందోళనలను, అతడు అనుసరిస్తున్న నీతిని, అవినీతిని చక్కగా కళ్ళకు కట్టినట్టు చిత్రించిన గొప్పనవల ఇది. ఎన్నో రచనలు వ్రాసిన రచయిత అనుభవం ఈ నవలలో శిల్పరూపంలో స్పష్టంగా కన్పిస్తుంది. తాళ్ళూరి నాగేశ్వరరావు ఇటీవల రచించిన "రాజకీయ రమణి" పాఠకులలో సంచలనాన్ని రేకెత్తించింది. మంజుశ్రీ మానవతావాది. అర్ధవంతమైన సుకుమారమైన భావన చేయగల రచయిత.

ఎన్.ఆర్. నంది "నైమిశారణ్యం"లో హరిజనులను అగ్రకులాలవారు ఈ నాటికీ ఎలా హింసిస్తున్నారో చక్కగా, చిత్రించారు. వినుకొండ నాగరాజుగారు రచించిన "ఊబిలో దున్న" ప్రయోగాత్మక నవల. శ్రీ శీలా వీర్రాజు చిత్రకారుడు. ఒకే ఒక నవల "మైనా" అనే పేరుతో రచించి ప్రముఖ రచయితల ప్రక్కన స్థానాన్ని పొందగలిగారు. ఇతని నవల చదువుతూవుంటే ఒక అందమైన చిత్రాన్ని చూస్తున్నంత మధురమైన అనుభూతి కల్గుతుంది. ఒక పోలీసు కానిస్టేబుల్ జీవితం విశిష్టమైన శైలిలో గొప్పగా చిత్రించాడు రచయిత. హితశ్రీ రచించిన చిన్న నవలల్లో "అంతర్వాహిని", "సామాన్యునికామన" పేర్కొనదగినవి. వీరి శైలి మధురంగా, హుందాగా వుంటుంది. మధ్యతరగతి కుటుంబపు విలువలు వీరి నవలల్లో ప్రముఖపాత్రను వహిస్తాయి.

వసశ్రీ తన "కురుక్షేత్రం" అనే నవలలో విద్యావంతు లయిన యువకుల సమస్యలతోపాటు ఎన్.జి.ఓ. జీవితాన్ని తన విలక్షణమైన శైలిలో చెప్పారు. ఈ నవల తెలుగులో వచ్చిన అతి కొద్ది గొప్పనవలల్లో ఒకటిగా భావించవచ్చు. ఇచ్ఛాపురపు జగన్నాథరావు "గులాబి ముళ్ళు", "సుఖము – సుందరి" మొదలైన అనేక నవలలు వ్రాశారు. మధ్యతరగతి కుటుంబాలలో ఆంతరికమైన ఉద్వేగాలు, ఈర్ష్యా ద్వేషాలు, ప్రేమలు, నిట్టూర్పులు కనిపిస్తాయి వీరినవలల్లో . వీరికి మంచి పరిశీలనాశక్తి ఉంది.

ఈతరం రచయితల్లో రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానంతో నవలలు వ్రాసిన వారిలో ముఖ్యంగా చెప్పుకోదగినవారు మహీధర రామమోహన్‌రావుగారు. "ఓనమాలు", "రథ చక్రాలు", "దావానలం", తెలంగాణాలో జరిగిన భూస్వామ్య వ్యతిరేక ఇతి వృత్తాన్ని ఎన్నుకొని రాసిన నవలలు. శ్రమజీవుల దయనీయ పరిస్థితుల నర్థంచేసుకొని ఫ్యూడల్ వ్యవస్థలోని భయంకరమైన లక్షణాలను సమర్థవంతంగా చిత్రీకరించిన ఘనత మహీధర రామమోహనరావుకి దక్కింది.

తెలంగాణా భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని చూసి ఆ పరిస్థితుల ప్రభావాన్ని స్వయంగా అనుభవించి రెండు గొప్ప నవలలు వ్రాసిన గొప్పరచయిత వట్టికోట ఆళ్వార్‌స్వామి. ఆ నవలలు "ప్రజలమనిషి", "గంగు". అనాటి నవాబు పరిపాలనలోని తెలంగాణా జీవితాన్ని కళ్ళకు కట్టినట్టు తన నవలల్లో చిత్రీకరించారు. తెలంగాణా మాండలీకం ఎంత మధురంగా వుంటుందో తెలుసుకోవాలంటే ఆళ్వార్‌స్వామి నవలలు చదవాలి. అంతేకాదు ఆనాటి సామాన్యుని జీవితాన్ని సమగ్రంగా తెలుసుకోవాలన్నా "ప్రజలమనిషి", "గంగు" చదవాలి.

తెలంగాణా భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని గురించి మరో మంచినవల వ్రాసిన ఘనత బొల్లిమంత శివరామకృష్ణకు దక్కుతుంది. ఆ నవల పేరు "మృత్యుంజయుడు". లక్ష్మీకాంత మోహన్ రచించిన "సింహగర్జన" కూడా తెలంగాణా ప్రజాపోరాటాన్ని గురించి వ్రాయబడిన నవల.

1950 లలో వెలువడిన మరో గొప్ప నవల ఉప్పల లక్ష్మణరావుగారు వ్రాసిన "అతడు - ఆమె". రెండవ భాగం ఇటీవలే ఆంధ్రజ్యోతి వారపత్రికలో వచ్చింది. మొదటి భాగంలో ఆ నాటి భారతదేశపు రాజకీయ వాతావరణం, జనజీవితం, గాంధీజీ ఉద్యమ ప్రభావం మొదలైన విషయాలు ఎంతో అవగాహనతో చర్చించబడ్డాయి. ఈ నవలకు ఉపయోగించిన టెక్నిక్ కొత్త రకమైనది. బారిష్టర్ చిదంబరశాస్త్రి క్వీన్ మేరీస్ కళాశాల లెక్చరర్ శాంత ప్రేమించుకుని పెళ్ళిచేసుకున్నారు. వారిద్దరి దృక్కోణం నుంచి డైరీల పద్ధతిలో ఈ నవల నడిచింది. ఈ నవల చదివిన వారికి ఉప్పల లక్ష్మణరావు గారి బహుముఖ ప్రజ్ఞా పాటవాలు స్పష్టంగా గోచరిస్తాయి.

తెలుగులో మాలపల్లి తర్వాత మేధావులు ఎంతగానో మెచ్చుకున్న మరో గొప్ప నవల తెన్నేటి సూరిగారి "చెంఘిజ్ ఖాన్". ఆ నవలలో వారు వాడిన భాష, శిల్పచాతుర్యం, శైలి అనితర సాధ్యం అనిపిస్తుంది. నరహంతకుడు, నరరూప రాక్షసుడు, మహాక్రూరుడు అని చరిత్రకారులు అభివర్ణించిన చెంఘిజ్ ఖాన్ ఎడల ఏర్పడిన అభిప్రాయాలు ఈ నవల చదివాక తారుమారవుతాయి.

శ్రీ సింగరాజు లింగమూర్తి "ఆదర్శాలు అంతర్యాలు" "రంగులమేడ" మొదలైన మంచి నవలలు వ్రాశారు.

కొందరు గొప్పవాళ్ళంటారు. కొందరిని చుట్టూ ఉన్న వాళ్ళు గొప్పవారిగా చేస్తారు. తాడిగిరి పోతరాజు మనకున్న అతి కొద్ది మంది గొప్పరచయితల్లో ఒకరుగా గణించదగినవారు అనేది ఆయన నవల "మట్టిబొమ్మలు" చదివితే తెలుస్తుంది. గ్రామీణ జీవితం, ఫ్యూడల్ వ్యవస్థ అవశేష లక్షణాలు ఈ నవలలో అద్దం పట్టినట్లు కన్పిస్తాయి. '40 - '60 మధ్యలో వచ్చిన రచయితల్లో ధనికొండ హనుమంతరావు గొప్ప రచయిత. వారు అనేక రచనలు చేశారు.

1960వ సంవత్సరం వచ్చేసరికి పత్రికలు పెరిగాయి. పాఠకులు పెరిగారు. అంతవరకు మందకొడిగా సాగిన తెలుగు నవలా రచన వేగాన్ని అందుకుంది. పత్రికలు పెరగటము, ప్రచురణకర్తల ప్రోత్సాహం అనేకమంది కొత్త రచయితలను రచయిత్రులను రంగంలోకి దింపాయి. రాశి పెరిగిపోయింది గాని వాశి తరిగిపోయిందని మేధావులు, విమర్శకులు ఘోషిస్తున్నారు. ఈ రాశిలో నుంచే వాసి గలవి ఎన్నో వస్తున్నాయన్న సంగతి గమనించకుండానే ఈ పెద్దమనుషులు వచ్చేదంతా చెత్తంటూ స్టేట్ మెంట్స్ పారేస్తున్నారు. మనకు నిష్పక్షపాతంగా, నిజాయితీతో విమర్శించే నవలా విమర్శకులు లేకపోవటం బాధాకరమైనవిషయం. ఓపికగల పాఠకులు కొందరు మేధావులు అనంతంగా వచ్చే ఈ నవలల రాశిలో కొన్ని ఆణిముత్యాలు ఉన్నాయనేది గ్రహిస్తూనే ఉన్నారు. అయితే వాటి గురించి ప్రత్యేకంగా విమర్శలు రానందువల్ల సామాన్య పాఠకుని దృష్టినుంచి ఆ నవలలు తప్పుకుంటున్నాయి.

ఒకరకంగా చెప్పాలంటచే 1960 నుంచి నవలా ప్రక్రియ వ్యాపార ప్రక్రియగా మారింది. పత్రికల అమ్మకాలు పెరగడానికి సీరియల్స్ ప్రచురించడం ప్రారంభం అయింది. ప్రజలలో నవలకు ఎన్నడూ లేనంత ఆదరణ లభించింది. ఈ రెండు దశాబ్దాల కాలంలో వచ్చిన నవలల్లో అధిక శాతం స్త్రీలు రచించిన నవలలు కావడం విశేషం.

'60 - '80 మధ్య దాదాపు 15 సంవత్సరాలు నవలలు నవలా యుగంగా పేర్కొనవచ్చు. రచయిత్రుల నవలల వల్లనే "నవల" జనప్రియ సాహిత్య ప్రక్రియగా మారిందంటే ఎవ్వరూ జుట్టు పీక్కోనవసరం లేదు. 40వ దశాబ్దపు పూర్వార్ధంలోనే అశేష తెలుగు పాఠకుల దృష్టిని నవలవైపుకు తిప్పిన ఘనత కొవ్వలి లక్ష్మీనరసింహారావుకు, జంపని చంద్రశేఖరరావుకు దక్కుతుంది. ఇందులో కొవ్వలికి ప్రథమస్థానం ఇవ్వక తప్పదు. '60కి ముందే శ్రీమతి మాలతీచందూర్ కు కాల్పనిక సాహిత్యాన్ని తెలుగు సీమలో ఇంటింటికీ పరిచయం చేసిన ఘనత దక్కుతుంది. స్త్రీ పాఠకుల్ని అశేష సంఖ్యలో తయారుచేసినవారు మాలతీ చందూర్ గారు. వీధిలో కలం పట్టిన మాలతీచందూర్ గారు ఈనాటివరకూ రచనలు చేస్తూనే వున్నారు, పాఠకులను పెంచుతూనే వున్నారు. శ్రీమతి మాలతీచందూర్ రచించిన "చంపకం", "చెదపురుగులు" నుంచి రాగరక్తిమ ఎన్నిమెట్లెక్కినా 'సద్యోగం' వరకు 'ఆలోచించు' నుండి నిన్నటి 'భూమిపుత్రి' వరకు ఎన్నో మంచి నవలలు వ్రాశారు. మాలతీచందూర్ ఒక విజ్ఞానఖని ప్రతిభావంతురాలయిన రచయిత్రి. ఆమె మార్గమే వేరు, ఆమె రచనావ్యాసంగమే వేరు. తెలుగు నవలా సాహిత్య చరిత్రలో ఆమె పేరు ప్రత్యేకంగా కన్పిస్తూ వుంటుంది.

రచయిత్రుల గురించి ఇక్కడ ఒక విషయం చెప్పటం అనౌచిత్యం కాదని భావిస్తున్నాను. ఈ సాంఘిక వ్యవస్థలో పురుషాధిక్యతకు అణిగి మణిగి నిన్న మొన్నటివరకు బానిసగా ఉన్న స్త్రీలు కలం పట్టడాన్ని చాలా మంది పురుషులు ఈనాటికీ సహించలేక పోవటం కన్పిస్తూనేవుంది. పండితులు, మేధావులు, తోటి రచయితలు కూడా స్త్రీల సాహిత్యాన్ని గురించి బాధ్యతారహితంగా మాట్లాడటం స్త్రీల కించపరుస్తూ వ్రాయటం చూస్తుంటే నామట్టుకు నాకు నవ్వొస్తుంది. పాపం పురుషుడు తన పురుషాధిక్యతకు దెబ్బతగలడం వలన కల్గిన బాధను కుళ్లును నిర్భయంగా నిర్లజ్జగా వెళ్ళగక్కుతున్నారనిపిస్తోంది. అసలు స్త్రీలు రాసిన రచనలు అనటమే తప్పు. రచనలు రెండే రకాలు. బాగావ్రాసినవి. బాగా వ్రాయనివి. సమాజానికి ఉపయోగపడేవి, సమాజానికి ఉపయోగపడనివి. సమాజ

శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని అభ్యుదయ దృక్పథంతో వ్రాసినవి. సమాజాన్ని సంప్రదాయం పేరుతో వెనక్కి నడిపించే ప్రయత్నం చేసేవి. ఈనాటి సాంఘిక సమస్యలను చిత్రించే నవలలు విరివిగా రావాలనేది అందరూ అంగీకరించేదే. అయితే అందుకు రచయితలకు ఆర్థిక వ్యవస్థను గురించిన అవగాహన వుండాలి. పెట్టుబడిదారీ విధాన వ్యవస్థలో అమలు జరిగే ఆర్థిక సూత్రాలు తెలిసి వుండాలి. పెట్టుబడి ద్వారా శ్రమశక్తిని దోచి దాన్ని రూపాయలలోనికి ఎలామారుస్తున్నారో తెలియాలి. ఇవేవీ తెలియకుండా సమస్యలకు సంబంధించిన శాస్త్రీయ అవగాహన లేకుండా అభ్యుదయ రచనలు చేస్తున్నామనుకోవటం భ్రమ మాత్రమే. ఇవేవీ తెలియకుండా రచనలు చేసేది రచయిత్రులు మాత్రమే కాదు. రచయితలు కూడా ఎందరో వున్నారు.

ప్రపంచ ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను గూర్చిన అవగాహన, మానవ మనస్తత్వ పరిశీలన, శాస్త్ర పరిజ్ఞానం ఇవేవీ లేకుండా ఈనాడు ఎందరో రచయితలు, రచయిత్రులు పుంఖాను పుంఖాలుగా నవలలు వ్రాసి పేరు తెచ్చుకుంటున్నారు. అందువల్ల మేధావులైన వారు, విమర్శకులు, నిజాయితీతో ఋషిలా విషయాన్ని తరచి విమర్శలు చేసినట్లయితే తెలుగు సాహితీ పాఠక లోకానికి ఎంతో సేవచేసిన వారవుతారు.

స్వర్గీయ శ్రీదేవి రచించిన 'కాలాతీత వ్యక్తులు' గొప్ప నవలగా తెలుగు సాహిత్యంలో నిలుస్తుంది. ఉద్యోగాలు చేసుకుంటున్న మహిళల సమస్యలు ఆర్థికంగా చితికిపోయిన కుటుంబాలను అంటిపెట్టుకుని వుండే కుహనావిలువలు ఈ నవలలో శక్తివంతంగా చిత్రీకరించబడ్డాయి. శైలిలో నూతనత్వం భావవ్యక్తీకరణలో లోతులు కన్పిస్తాయి.

శ్రీమతి రంగనాయకమ్మ తిరుగుబాటు రచయిత్రి. ఆమె కలం బలం ఆమె నిజాయితికి నిదర్శనం. ఆమె నవలల్లో స్త్రీ పక్షపాతం స్పష్టంగా కన్పిస్తుంది. 'బలిపీఠం', 'పేకమేడలు', 'అంధకారంలో', 'స్వీట్ హోమ్' మొదలైన మంచి నవలలు ఎన్నో వ్రాశారు. ఈమెను వెర్రిగా అభిమానించే పాఠకులు ఎందరో యిప్పటికీ వున్నారు. ఇటీవల ఆమె రచించిన 'విముక్తి' అనే నవలను కొందరు గొప్ప నవలగా భావిస్తే మరికొందరు నవలేకాదు పొమ్మన్నారు. ఆమె తను నమ్మిన సిద్ధాంతాలను నిర్భయంగా నీట్ గా కుండ బ్రద్దలు కొట్టినట్టు తన నవల్లో చెప్పారు.

ద్వివేదుల విశాలక్షి 'గ్రహణం విడిచింది', 'గోమతి', 'వారధి' మొదలైన మంచి నవలలు వ్రాశారు. ఈమె రచనలకు ప్రాణం ఆమె సంయమనం. ఆమె చెప్పదల్చుకొన్న విషయాన్ని సరళంగా, మధురంగా, రమణీయంగా చెప్తారు.

బీనాదేవి (ఇది పెన్ నేమ్) రచించిన నవలలు "హేంగ్ మీ క్విక్", "భూమి గుండ్రంగా వుంది", "కెప్టెన్ కథ" మేధావి పాఠకుల్ని ఆకర్షిస్తాయి. వీరిశైలి చూస్తే (వారుకాదన్నా) రాచకొండ వారి శైలికి పూర్తిగా అనుకరణ అనిపిస్తుంది.

శ్రీమతి మాలతీచందూర్ తర్వాత తెలుగు పాఠక లోకాన్ని రెండింతలు మూడింతలుగా – కాదు – ఎన్నింతలుగానో – పెంచిన ఘనత కోడూరి కౌసల్యాదేవికి, యద్దనపూడి సులోచనారాణికి దక్కుతుంది. కోడూరి కౌసల్యాదేవి "చక్రభ్రమణం" ద్వారా అరవైల్లో పాఠకులకు పరిచయమై ఈనాటికీ అవిశ్రాంతంగా రచనలు చేస్తున్నారు. "చక్రనేమి", "చక్రవాకం", "ధర్మచక్రం", "ప్రేమనగర్", "సత్యం శివం సుందరం", "హైందవి" మొదలైన చాలా నవలలు ప్రచురించారు. మన సంస్కృతి అన్నా సంప్రదాయాలన్నా ఆమెకు గల మక్కువ ఆమె నవలల్లో కన్పిస్తాయి. కొన్ని మధ్యతరగతి కుటుంబాల సమస్యల గురించి తనకు తెలిసినంత పరిధిలో చక్కగా చెప్తారు. యద్దనపూడి సులోచనారాణిగారు తనమొదటి నవల "సెక్రటరీ" తోనే చాలా చాలా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకున్నారు. ఎందరో పాఠకుల అభిమాన రచయిత్రి అయ్యారు. ఆమెను ఆంధ్రుల ఆరాధ్య రచయిత్రి అని కూడా అంటూ ఉంటారు. ఆమె రచనలలో సెక్రటరీ తర్వాత 'జీవనతరంగాలు', 'కీర్తి కిరీటాలు', 'అగ్నిపూలు', 'విజేత', 'పార్థు' మొదలైన ఎన్నో నవలలు అశేష పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్నాయి. ఆమె నవలల్లో ఎక్కువగా కాల్పనిక జగత్తు సాక్షాత్కరిస్తుంది. మృదుమధురంగా నేర్పుగా చెప్తారు.

కె. రామలక్ష్మి చాలాకాలంగా వ్రాస్తున్న మంచి రచయిత్రులలో ఒకరుగా గర్తింపబడుతున్నారు. 'కరుణకథ', 'కొత్తపొద్దు', 'ప్రేమించు ప్రేమకై' మొదలైన నవలలు మంచి నవలలు.

'లత' తిరుగుబాటు రచయిత్రి. తన రచనలతో చలం తర్వాత కొంతవరకు ఆంధ్రదేశంలో దుమారం లేపగల్గిన రచయిత్రి. ఈమె చాలా నవలలు వ్రాసింది. ఇతి వృత్తంలో వైవిధ్యం, భావప్రకటనలో బలం, శైలిలో విలక్షణత ఈమె నవలల్లో కన్పిస్తాయి. ఆమె రచించిన "మోహనవంశి" మేధావుల నుండి సామాన్య పాఠకుల వరకు మెచ్చిన నవల. నవలా సాహిత్యంలో ఆ నవలకొక ప్రత్యేకత లభించింది. "వారిజ", "ఎడారిపూలు", "గాలిపడగలు–నీటిబుడగలు", "చరిత్రశేషులు", "పిచ్చివాళ్ళస్వర్గం" మొదలైన ఎన్నో మంచి నవలలు వ్రాసింది.

శ్రీమతి మాదిరెడ్డి సులోచన దాదాపు 70 నవలలు కొద్ది కాలంలోనే వ్రాశారు. ఆమె రచనావేగం సాహితీపరులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తేది. ఎన్ని నవలలు వ్రాసినా విషయ వైవిధ్యం వుండటం గొప్ప విషయం. ఆమె రచనలు పాఠకుల్ని అధిక సంఖ్యలో ఆకట్టుకున్నాయి.

పి. ఆనందరామం 'శారద', 'భాష్యం', 'తుఫాన్', 'ఆత్మబలి', 'తపస్వి', 'జాగృతి' మొదలైన మంచి నవలలు చాలా వ్రాశారు. ఆమె శైలిలో చురుకుదనం ఇతివృత్తంలో వైవిధ్యం కన్పిస్తాయి.

"వాసిరెడ్డి సీతాదేవి గ్రామీణ జీవితాన్ని, ఆధునిక సమాజ సమీకరణాన్ని సమర్థవంతంగా చిత్రించగల రచయిత్రి. 'సమత', 'మట్టిమనిషి' మొదలైన నవలలు ఈమెకు గల సామాజికావగాహనను ప్రకటిస్తాయి" అని మంజుశ్రీ తమ తెలుగు నవల అనే సమీక్షా వ్యాసంలో అన్నారు.

పి. సత్యవతి సామాజిక స్పృహతో మంచి నవలలు 'బ్రతుకుబాట', 'మంత్రినీడ', 'గొడుగు' మొదలైన రచనలు చేశారు. తెలుగు నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన రచయిత్రులు ఎందరో వున్నారు. ఇల్లిందల సరస్వతీదేవి, పరిమళా సోమేశ్వర్, తురగా జానకీరాణి, కోమలాదేవి, కావలిపాటి విజయలక్ష్మి, అరవింద, ఉన్నవ విజయలక్ష్మి, కొలిపాక రమామణి, వేదుల శకుంతల, డి. కామేశ్వరి, జొన్నలగడ్డ లలితాదేవి, కె.వి. కృష్ణకుమారి, గంటి వెంకట రమణ, గోవిందరాజు సీతాదేవి, చిట్టారెడ్డి సూర్యకుమారి మొదలైన వారెందరో వున్నారు. వీరందరూ వార, పక్ష, మాసపత్రికల ద్వారా తెలుగు పాఠకలోకానికి సుపరిచితులే.

'70 తర్వాత నవలా రచనల్లో రాజకీయ, సామాజిక చైతన్యం అంతకుముందు కంటే ఎక్కువగా కన్పిస్తుంది. ఈ కోవకే రాచకొండ "గోవులొస్తున్నాయి జాగ్రత్త", ముప్పాళ "అంధకారంలో", నవీన్ "చీకటిరోజులు", "ముళ్ళపొదలు", మల్లికార్జునరావు 'పక్షులు', భూషణం "కొండగాలి", రంగాచార్య "చిల్లరదేవుళ్ళు", "మోదుగుపూలు", "జనపదం", సీతాదేవి "సమత", "మరీచిక", అలేటి నాగమణి "పుత్లీ", అల్లం రాజయ్య "కొలిమి అంటుకుంది", చెరబండరాజు "ప్రస్థానం" మొదలైన నవలలు వచ్చాయి.

1970లో చక్కని తెలంగాణా పలుకుబడితో తెలంగాణా ప్రజాజీవితాలను దాశరథి రంగాచార్య "చిల్లరదేవుళ్ళు" వ్రాశారు. ఆ నవల ప్రగతి వారపత్రికలో ధారావాహికంగా వస్తున్నప్పుడు అశేష పాఠకుల ఆదరాభిమానాల్ని చూర గొన్నది. మేధావుల దృష్టిని కూడా ఈ నవల తనవైపుకు త్రిప్పుకున్నది. తెలంగాణాలో భూస్వాముల దురహంకారాన్ని, అప్పటి ప్రజల వైఖరిని, ప్రజాపోరాటాన్ని తన నవలల్లో చాలా గొప్పగా చిత్రించారు దాశరథి రంగాచార్య.

నవీన్ తన "అంపశయ్య" అనే నవలలో చైతన్య స్రవంతి శైలి ఆంధ్ర పాఠకులకు మొదటిసారిగా అందించిన రచయితగా కొందరంటారు. అతని భావాల్లో ఉద్వేగం, భాషలో వేగం, శిల్పంలో విలక్షణత ఆయన నవలల ప్రత్యేకతలు.

భూషణం "కొండగాలి", చెరబండరాజు "ప్రస్థానం", అల్లం రాజయ్య "కొలిమి అంటుకుంది", రాచకొండ "గోవులొస్తున్నాయి జాగ్రత్త" నక్సలైట్ ఉద్యమ ప్రభావంతో వచ్చిన సాహిత్యంగా గుర్తించాలి.

తెలుగు హాస్యానికి వన్నెతెచ్చినవాడు ముళ్ళపూడి వెంకటరమణ. ఇప్పటికీ ఆయనను అనుకరిస్తూ ఎంతోమంది సంభాషణలు వ్రాస్తున్నారు. ఆయన వ్రాసిన సంభాషణలు మేధావుల మధ్య జరిగే సంభాషణలలో దొర్లుతూ వుంటాయి. వ్యంగ్యంతో కూడిన సునిశితమైన హాస్యం ఆయన స్వంతం. ఆయన వ్రాసిన "ఇద్దరమ్మాయిలు ముగ్గురబ్బాయిలు", "రాజకీయ భేతాళ పంచవింశతి", "బుడుగు" (ఇది చిన్నపిల్లల వలె అయినా పెద్దవాళ్ళే ఎక్కువగా అందులోని హాస్యాన్ని అనుభవించి హాయిగా నవ్వుకోగలరు.) ప్రఖ్యాతిగాంచిన ఆయన రచనలు.

1980 వచ్చింది. సాహిత్యంలో గొప్ప మలుపు తెచ్చింది. తారురోడ్డు మీద వందమైళ్ళ స్పీడుతో పోతున్న కారుకు సడెన్‌బ్రేక్ పడ్డట్టు, సాహిత్యానికి కుదుపువచ్చింది. ఆ కుదుపుతో సాహిత్యం మామూలు మార్గానికి దూరంగా మరో జారుడు మార్గంలోకి పోయి పడింది. పాకుడు పట్టిన రోడ్డు మీద కాలుపెడితే మనిషి జారతాడు. అలా జారిన మనిషి తన ప్రమేయం లేకుండానే ఎంత దూరం జారుతూ పోతాడో చెప్పలేము. సాహిత్యాన్ని అలాంటి జారుడు రోడ్డు మీదకు ఎక్కించిన ఘనత యండమూరి వీరేంద్రనాథ్‌కే దక్కింది. వీరేంద్రనాథ్ 1980లో ఆంధ్రభూమిలో "తులసిదళం" అనే సీరియల్ వ్రాశాడు. మంత్రాలు, తంత్రాలు, పిశాచాలు, దయ్యాలు, క్షుద్ర దేవతలు, క్షుద్ర పాత్రలు, క్షుద్ర సంఘటనలు వ్రాసేసి తెలుగు పాఠకలోకాన్ని మంత్రముగ్ధుల్ని చేశాడు. అంతవరకు సాహిత్యంలో చొరబడని క్షుద్రులంతా "తులసిదళం"తో జొరబడ్డారు. క్షుద్ర శక్తుల ప్రభావాన్ని మూఢంగా నమ్మే మన జనం ఆడా మగా పిల్లా పెద్దా వెర్రిగా చదివారు. ఎవరి నోటవిన్నా వీరేంద్రనాథ్ పేరే. కొందరు తెగిడేవాళ్ళు, మరెందరో పొగిడేవాళ్ళు. ఒక సారిగా ఆకాశంలో కెగిరిన వీరేంద్రనాథ్‌ను యువతరం రచయితలంతా కళ్ళు నోరు తెరుచుకుని చూశారు. కొందరు సీనియర్ రచయితలు కూడా ఆ ప్రభావానికి లోనయ్యారు. తేలిగ్గా కీర్తి ప్రతిష్టలు సంపాదించుకోవాలనుకున్నారు. వాళ్ళ దృష్టిలో పాఠకులు వెర్రివాళ్ళు అంతే. రచయితలంతా పిశాచాల మీదకు, స్మశానాలకు ఎగబడ్డారు. యండమూరి స్పష్టంగా దయ్యాలున్నాయని చెప్పక పోయినా ఆయనను అనుకరిస్తున్న రచయితలు అచ్చం దయ్యాల కథలు, స్మశానాల కథలు, ప్రేతాత్మలకథలు వ్రాయడం మొదలెట్టారు. అలా వ్రాసిన వారిలో అప్పటికే పేరు ప్రఖ్యాతులు ఆర్జించినవారు కూడా వుండటం శోచనీయం. వారిలో ఎన్.ఆర్. నంది,

చిట్టారెడ్డి సూర్యకుమారి, చందు సోంబాబు, హరికిషన్ మొదలైన వారున్నారు.

దయ్యాలకు, పిశాచాలకు ప్రజల్లో పరపతి తగ్గిందని తెలిశాక సస్పెన్స్ థ్రిల్లర్స్ వైపు రచయితల, పాఠకుల దృష్టి మళ్ళింది. ఇలాంటి రచనలకు గిరాకీ పెరిగింది. సైంటిఫిక్ ఫిక్షన్ పేరుతో ఎంతో చెత్తా చెదారాన్ని పోగేస్తున్నారు రచయితలు. అదీ చేతకానివాళ్ళు స్టంట్ పిక్చర్లను యధాతథంగా నవలల్లోకి దింపేసినంత గొప్పగా వ్రాస్తున్నారు. మధ్య మధ్య పునర్జన్మల కథలు కూడా వస్తున్నాయి. ఇందులో కొందరు యువరచయితలు, మంచి మేధాశక్తి వుండి చక్కని శైలి కలిగి సస్పెన్స్ థ్రిల్లర్స్ వ్రాస్తున్నారు. అదేమని అడిగితే పత్రికల వారడుగున్నారు. మేము వ్రాస్తున్నామంటారు. పాఠకులు అడుగుతున్నారు గనుక మేము ప్రచురిస్తున్నామంటున్నారు పత్రికలవాళ్ళు. ఏ పాఠకుల్ను పత్రికల ఆఫీసుల ముందు బారులుతీరి నుంచుని మాకు సస్పెన్స్ థ్రిల్లర్స్ కావాలని అడుగుతున్నారో ఆ పత్రికలవాళ్ళకే తెలుసు. ధోరణి ఏదయినా ప్రతిభావంతులయిన యువ రచయితలు కొందరు ఉన్నారు. వారి మంచి కొంతకాలం తర్వాతయినా మంచి నవలలు వస్తాయని ఆశించవచ్చు. కొమ్మనాపల్లి గణపతిరావు, మైనంపాటి భాస్కర్ మొదలైన ప్రతిభావంతులయిన యువ రచయితలు ప్రయత్నిస్తే ఈ ఊబి నుంచి బైటపడి మంచి నవలలు వ్రాయవచ్చు. యువ రచయితల్లో ఈ ధోరణుల ప్రభావం నుంచి దూరంగా వుండి తమ ధోరణిలో తాము వ్రాసుకుంటూ పోయేవారు లేకపోలేదు. మల్లాది వెంకటకృష్ణమూర్తి, యర్రం శెట్టిశాయి, వి. రాజరామమోహనరావు మొదలైనవారు ఈ కోవలోకి వస్తారు. వీరుగాక కొండముది శ్రీరామచంద్రమూర్తి, వసుంధర, కప్పగంతుల మల్లిఖార్జునరావు మొదలైన వాళ్ళు మంచి నవలలు వ్రాస్తున్నారు.

వీరుగాక కొత్త రచయితలు, రచయిత్రులు ఎందరో నవలలు వ్రాస్తున్నారు. అచ్చవుతున్నాయి. పాఠకుల సంగతేమోగాని వాళ్ళేంరాస్తున్నారో వాళ్ళకే తెలియదు. ఎందుకు వ్రాస్తున్నారో అంటే ఏం చెప్పడానికి వ్రాస్తున్నారో అంతకంటే తెలియదు. వారికి ప్రపంచ పరిస్థితులను గురించిన అవగాహన బొత్తిగా వుండదు. పట్టుమని పదిపుస్తకాలు చదివిన పరిజ్ఞానమైనా వుండదు. అయినా వ్రాస్తున్నారు. పాఠకులు చదువుతున్నారు. విమర్శకులు క్షుద్ర రచయితలను కూడా పొగుడుతూ రచయిత్రుల మీద కామెంట్స్ విసురుతూ తమ తెలివి తేటలకు తామే మురిసిపోతున్నారు. ఇంతకంటే ఆత్మవంచన పరనింద మరొకటి వుండదు.

తెలుగు నవల స్మశానంలో క్షుద్ర శక్తుల చేతుల బిగి నుంచి ఎప్పటికి బైటపడుతుందో వేచి చూద్దాం. తెలుగు నవలకు క్షుద్ర కలాలనుండి విముక్తి త్వరలోనే పాఠకులే కల్గిస్తారని ఆశిద్దాం. •

*"నాటక కళాభ్యుదయంపైనే ఒక జాతి సంస్కృతి యొక్క ఔన్నత్యాన్ని నిర్ణయించడం జరుగుతుంది." – టాగోర్*

# కథానికా వాఙ్మయం

పెద్దిభొట్ల సుబ్బరామయ్య, ఎం.ఏ.

కథ తెలుగువారి జీవితంలో ఒక భాగం. తరతరాలుగా మానవుడు సాధించిన విజయాలు అతని శక్తులు, బలహీనతలు, ఆశయాలు, అపజయాలు, చిత్త ప్రవృత్తులు, చిత్ర ప్రకృతులు అన్నీ రకరకాల 'వృత్తాంతాలు' గా ప్రజలు చెప్పుకోవడంతో ప్రారంభమై, కాలం గడిచే కొద్దీ 'కథ'లుగా రూపొందడం జరిగింది. మనకు అసలు సిసలైన చరిత్ర రచన అనేది లేకపోవడం వల్ల ప్రసిద్ధ పురుషులను గురించి కథలు వ్యాప్తిలోకి వచ్చాయి. మనకు వాస్తవం కంటే కల్పన మీద మోజు ఎక్కువ గదా! అందువల్ల మనం అభిమానించి ఆరాధించే గొప్పవాళ్ళను గురించి గొప్పగానే చెప్పుకుంటాం. కాలంగడిచేకొద్దీ ఆ కథలు, ఆ నోటా ఆ నోటా పడి గాథలుగా ప్రచారం పొందాయి. చెప్పే వాళ్ళ కల్పనాశక్తినిబట్టి వాటిలో అవాస్తవాలు, అభూత కల్పనలు, అతిశయోక్తులు బాగా చోటు చేసుకొని, 'వాస్తవం' మరుగునపడి, అద్భుత గాథలుగా రూపొందుతాయి. ఇటీవలి కాలానికి చెందినవారిని గురించి కూడా ఏ మాత్రమూ సంశయించకుండా అభూత కల్పనలు చేసి కథలుగా చెప్పడం మన వారికి వెన్నతో పెట్టిన విద్య. పోతన, త్యాగయ్య వంటి ప్రసిద్ధ పురుషులను గురించి ప్రచారంలోకి వచ్చిన గాథలు ఇందుకు ఉదాహరణలు.

వేదాలలో, ఉపనిషత్తులలో, పురాణాల్లో రకరకాల కథలున్నాయి. రామాయణం, మహాభారతం అసంఖ్యాకమైన ఉపాఖ్యానాలతో నిండి తరతరాలుగా భారతీయుల జాతీయ జీవితంలో ముఖ్యమైన భాగమైనాయి. జాతక కథలు, పంచ తంత్రం, భేతాళ పంచ వింశతి, సింహాసన ద్వాత్రింశిక, కథా సరిత్సాగరం, శుకసప్తతి వంటివి బహుళ ప్రచారం పొందిన కథా మాలికలు.

తెనాలి రామలింగడిని గురించిన కథలు, కాశీ మజిలీ కథలు తెలుగు ప్రజలలో విపరీతంగా ప్రచారం పొందినవి.

కాశీ మజిలీ కథలు ఒకానొక సమయంలో తెలుగు పాఠకులను ఎంతగానో అలరించి ప్రాచుర్యం పొందాయి. అవి రచయిత కల్పనాశక్తికి, ఆద్యంతం విడవకుండా చదివించే కథన చాతుర్యానికీ గొప్ప ఉదాహరణలు. మిత్రలాభం, మిత్రభేదంలోని కథలు అనేక దశాబ్దాలపాటు పాఠ్యాంశాలుగా ఎన్నిక చేయబడి విద్యార్థులను అలరించాయి. తెలుగుదేశంలో సంఘ సంస్కరణ పతాకాన్ని ఎగురవేసిన మహనీయుడు వీరేశలింగం. తెలుగులో అంతకుముందు లేని ఎన్నో కొత్త ప్రక్రియలను తెలుగులో ప్రారంభించి, తెలుగువారి సర్వతోముఖాభివృద్ధికి బీజాలు వేసిన ప్రవక్త ఆయన. అప్పటి సమాజంలో పాతుకుపోయివున్న మూఢాచారాలను, అంధవిశ్వాసాలను రూపుమాపేందుకు వివిధ ప్రక్రియలను ఉచితంగా ఎన్నుకొని అప్పటి విద్యావంతుల ఆలోచనా పద్ధతిలోనే ఒక గొప్ప విప్లవాన్ని సృష్టించిన ఘనత కందుకూరికి దక్కుతుంది.

అయితే ఆధునిక 'కథానిక' అనే ప్రక్రియకు అప్పటికి సరైన రూపురేఖలు అమరలేదు.

## గురజాడ శ్రీకారం

సంఘంలోని మౌఢ్యాన్ని, దురాచారాలను, దుష్ట సంప్రదాయాలను రూపు మాపి, కొత్త ఊపు ఇచ్చిన మహా వ్యక్తి గురజాడ. 'కన్యాశుల్కం'తో తెలుగు పాఠకులకు షాక్ ఇచ్చిన గురజాడ ఆధునికమని చెప్పదగిన కథ వ్రాసిన ఆద్యుడు, ఆరాధ్యుడు అయినాడు. 'దిద్దుబాటు' అనే అప్పారావు గారి కథవంటిది తెలుగు సాహిత్యంలో అపూర్వమూ, అశ్రుతపూర్వమూ అని చెప్పవచ్చు.

వేశ్యాకర్షణకు లోనై, విషయలోలుడైన భర్తకు బుద్ధిచెప్పి అతనిలో పరివర్తనం తెచ్చిన అచ్చమైన తెలుగు ఆడబడుచు కథ యిది. 'మీ పేరేమిటి?', 'సంస్కర్త హృదయం', 'మెటిల్డా' కథలు సంఘంలోని విభేదాలను, అంధత్వాన్నీ ఎగతాళిచేసి, తూర్పార పట్టే రచనలు. ఆయన ముత్యాలసరాలు, కన్యాశుల్కం మాత్రమేకాక కథలు కూడా తెలుగు వారు అవశ్యం స్మరించుకోదగినవి, అధ్యయనం చేయదగినవి.

ఆ రోజులలోనే కొన్ని సాహితీ పత్రికలు వెలువడి, కథా సాహిత్యానికి పాఠకులలో ప్రచారం తెచ్చాయి.

తెలుగులో కథానికా రచనకు ఆ విధంగా శ్రీకారం

చుట్టబడిన తర్వాత ఎందరో ప్రతిభావంతులైన రచయితలు ఈ ప్రక్రియ ఆకర్షణకు లోనైనారు. క్రమంగా పత్రికల సంఖ్య పెరిగే కొద్దీ, జన బాహుళ్యంలో విద్యావ్యాప్తి జరిగేకొద్దీ, ప్రచురణ కర్తల సంఖ్య పెరిగేకొద్దీ తెలుగులో కథానిక రూపురేఖలే మారిపోయాయి. ఈనాడు తెలుగువారు ఇతర ఏ రంగాన్ని గురించికానీ, ఇతర విజయాలను గురించి గానీ గర్వంగా చెప్పుకోలేకపోవచ్చు. లేక ఇతర భాషల వారితో పోల్చి చూస్తే కొంత వెనుకబడి ఉండవచ్చు. ఇతర ప్రక్రియలలో గమనించదగిన అభివృద్ధి సాధించి ఉండకపోవచ్చు. కాని తెలుగు రచయితలు తెలుగు కథను గర్వించదగిన స్థాయికి తీసుకు వెళ్లారు. ఈ ప్రక్రియ విషయంలో మాత్రం ఎవరితో పోల్చినా మనం వెనుకబడిలేము అనే వాస్తవం సాహితీ ప్రియులకు ఎంతో ఆనందం కలిగిస్తుంది.

తెలుగు కథ సాధించిన ఈ అభివృద్ధికి కారకులైన వారెందరో మహా రచయితలు. వందలాది రచనలు చేసి పాఠకుల మన్ననలు పొందిన వారూ వున్నారు; మెరుపు మెరిసినట్టుగా ఒకటీ, రెండు కథలతోనే పాఠకుల మనస్సుల నాకట్టుకున్న వారూ వున్నారు.

కందుకూరి, గురజాడ, చిలకమర్తి, పానుగంటి వంటి ప్రసిద్ధుల తర్వాత ప్రతిభా సంపత్తిలోనూ, కథన చాతురిరిలోనూ, జీవిత పరిశీలనలోనూ నిష్ణాతులైన రచయితలెందరో కథా రచనకు పూనుకొని, తెలుగు కథాసరస్వతికి అమూల్యాలంకారాలు సమకూర్చారు.

చింతా దీక్షితులు రచించిన కొన్ని కథలతో పాటుగా ఆయన సృష్టించిన "సూరీ, సీతీ, వెంకి" పాత్రలను తెలుగువారు మరువలేరు. స్వాతంత్ర్య పోరాటంలో అతి సామాన్య కుటుంబాలకు చెందిన స్త్రీ పురుషులు, పిల్లలు సైతం పాల్గొన్న తీరును, వారు ప్రదర్శించిన ధైర్య సాహసాలను 'సూరీ, సీతీ, వెంకి' కథలలో మనం చూస్తాము. హంగు ఆర్భాటం లేని అతి సామాన్యమైన శైలి ఆ కథలకు ప్రాణం పోసింది. ఇటీవలి పాఠకులకు లభ్యం కాకుండా పోతున్న 'సూరీ, సీతీ, వెంకి' కథలను ప్రచురణకర్త లెవరైనా పూనుకొని మళ్ళీ అచ్చు వేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

## సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథా రచనకు పూనుకొనడం తెలుగువారి అదృష్టమని చెప్పవచ్చు. అచ్చమైన తెలుగు జీవితాన్ని – అందునా గోదావరీ ప్రాంతపు మధ్యతరగతి, తక్కువ మధ్యతరగతి జీవితాన్ని అద్భుతమని చెప్పదగిన సులభశైలిలో తన రచనలలో ఆయన చిత్రించారు. జన జీవితాన్ని – పరిశీలించడంతోపాటుగా జనం భాషను, అందులోని అందాలను, చమత్కారాలను ఆయన ఆకళింపు చేసుకొని, రమణీయ మయిన రచనలు చేశారు. రాచపీనుగు తోడు లేకుండా వెళ్ళదు, తల్లిప్రాణం, గుర్రప్పందాలు, వడ్లగింజలు, ఇల్లుపట్టిన విధవాడపడుచు, కలుపుమొక్కలు, యావజ్జీవం హోష్యామి మొదలైనవి తెలుగునాట మధ్యతర గతి జీవితాన్ని అత్యంత రమణీయంగా, నిసర్గ సుందరంగా చిత్రించిన రచనలు. సంభాషణలతో కథను అద్భుతంగా నడిపించగల శక్తి ఆయన సొమ్ము.

ఆనాటి సాహితీలోకంలో దిగ్గజం అనదగిన కవి, పండితులు వేలూరి శివరామశాస్త్రిగారు. తన్మయత, పిత్తల్ కా దర్వాజా, డిప్రెషన్ చెంబు వంటి ఎన్నదగిన రచనలు చేశారు. ఇటీవల ప్రచురణకర్తలొకరు పూనుకొని ఆయన రచనలను వెలుగులోకి తేవడం హర్షణీయం.

'బారిస్టర్ పార్వతీశం' పాత్ర సృష్టించి హాస్యప్రియుల మన్ననలను పొందిన మొక్కపాటి నరసింహశాస్త్రిగారు 'భారతి' సాహిత్య మాసపత్రికలోను, ఇతర పత్రికలలోను అడపా దడపా వ్రాసిన చిత్రం, భిక్షువు వంటి కొన్ని కథలు ఇటీవల మళ్ళీ ప్రచురింపబడ్డాయి.

ఆధునిక తెలుగు సాహిత్యంలో విషయపరంగాను, శైలి విషయంలోను గొప్ప విప్లవం తెచ్చిన రచయిత చలం. తాను నమ్మిన విషయాన్ని నిర్మొహమాటంగా సూటిగా శక్తివంతంగా చెప్పగల ధైర్యంవున్న రచయిత. ఆయన భావాలు నచ్చనివారిచేత సైతం చదివించగల అద్భుతమైన శైలీ, వాక్యవిన్యాసం ఆయన ప్రత్యేకతలు. 'ఓ పువ్వు పూసింది' తెలుగు కథా సాహిత్యంలో చిరకాలం నిలిచిపోయే రమ్యమైన రచన.

విశ్వనాథ సత్యనారాయణగారు ప్రసిద్ధ పండితులు. సంప్రదాయ సిద్ధమైన ఛందస్సు సాహితీసృష్టికి అత్యవసరమనీ ఛందస్సులేని, ఛందస్సుకు కట్టుబడని రచన ఏదయినా అది ప్రాణంలేని శరీరమనీ నమ్మే వ్యక్తి. కథారచనకు అంత ప్రాముఖ్యం ఈయకపోయినా, 'కవిత్వమే అచ్చమైన సాహిత్యం, మిగిలిందేదీ కాదు' అని నమ్మే వ్యక్తి అయినా, ఆయనకు కథలు వ్రాయక తప్పలేదు. 'కథ లేక కథానిక ఈ యుగపు ప్రక్రియ' అనే సత్యాన్ని ఒప్పుకున్నందువల్లనే కాబోలు బహుళ సంఖ్యలో నవలలతోపాటుగా, కావ్యాలతోపాటుగా కొన్ని కథలు కూడా వ్రాశారు. వాటిలో 'నీ ఋణం తీర్చుకున్నా', 'మాక్లీ దుర్గంలో కుక్క' ఎన్నదగినవి.

అడివి బాపిరాజు గారి కథలలో రమణీయమైన కథనంతో పాటుగా ఆదర్శజీవిత చిత్రణ కనబడుతుంది. లలిత మన స్కులను, సుకుమార భావ సంపదగల వారిని, కళాప్రియులను ఆయన పాత్రలుగా తీసుకుని రచనలు చేశారు.

మునిమాణిక్యం హాస్య రచయితల పరంపరలో నిజంగా మాణిక్యమే. మూరుపైసల తెలుగు పడుచు కాంతం పాత్ర సృష్టితో ఆయన అజరామరమైన కీర్తి దక్కించుకున్నారు.

తక్కువ మధ్య తరగతికి చెందిన ఉపాధ్యాయుడు, ఏది వున్నా లేక పోయినా గృహ జీవితంలో వెన్నెలలు పండించగల గృహిణి కాంతం, పిల్లలు, చుట్టాలు, స్నేహితులు – అంతా ఒక రమణీయమైన వాతావరణం. మునిమాణిక్యం రచనలు చదవని, చదివి చిరునవ్వులు నవ్వని తెలుగుపాఠకులు అరుదు. పాఠకుల మనస్సుల నలరించే కల్పన, సంభాషణాచాతురి ఆయన ప్రత్యేకతలు.

నెల్లూరు మండలానికి చెందిన 'కరుణకుమార' తెలుగులో సామాజిక స్పృహతో, శ్రమజీవుల వాస్తవ జీవిత చిత్రణకు పూనుకొని విజయవంతంగా రచనలు వెలువరించినవారిలో ప్రథమగణ్యులు. 'సన్నజీవాలు' అనే సంపుటంలోని కథలన్నీ పఠితల మనస్సులను ద్రవింపజేస్తాయి. కిర్రుచెప్పులు మోతుబరి ఆసామికోసం చెమటోడ్చి, శ్రమపడి కుట్టియిస్తాడు. బక్కచిక్కిన మాదిగవాడు. వాడికి అన్యాయం జరిగిపోయింది. కాని, మోతుబరి ఆసామికి ఆ చెప్పులే మృత్యుకారణం అవుతాయి. శ్రామికవర్గం వారి చెమటను దోచుకొనే పెద్దలకు గుండెదడ పుట్టించే అద్భుతమైన విప్లవ రచన అది. ఆర్థిక అసమానతలు లేని సమసమాజం కోరే రచయితలు, ఆ ధ్యేయంకోసం కలం పట్టిన రచయితలు ఇటీవలి కాలంలో చాలామంది వున్నారు. 'కరుణకుమార' ఆ తరహా రచనలు చేసిన మహారచయిత. రాశిలో తక్కువ అయినా గుణంలో మిన్న అయిన ఆయన కథలను తెలుగు పాఠకులు అధ్యయనం చెయ్యవలసిన అవసరం ఎంతయినా వుంది.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారి అనేక కథలలో తెలుగు నుడికారం, తెలుగు జాతీయత, శుభ్రశైలి ప్రత్యేక లక్షణాలు. వీరికథల సంపుటాలు పునఃప్రచురణకు నోచుకొని పాఠకులను అలరించాయి.

తెలుగునాట ప్రఖ్యాత సంపాదకులుగా పేరుపొందిన నార్ల వెంకటేశ్వరరావుగారు బహుళ గ్రంథకర్త. ఆయన కొన్ని కథలు, కథలుగా అనిపించని కొన్ని గల్పికలు, వ్యాసాలు వ్రాశారు.

## కుటుంబరావు

కొడవటిగంటి కుటుంబరావుగారు ఆధునిక తెలుగు రచయితలలో అగ్రశ్రేణికి చెందినవారు. ఆయన వ్రాసిన అసంఖ్యాక కథలలో సామాజిక దృక్పథం, నిశిత పరిశీలనాదృష్టి, రాజీలేని సామ్యవాదం, విప్లవ దృష్టి గోచరిస్తాయి. ఇతివృత్తం స్వీకరించడంలోను, సమస్యను పరిష్కరించడంలోను, వాక్యరచనలోను తెలుగు కథకు కొత్త రూపురేఖలు, కొత్త జవసత్వాలు ఇచ్చిన ఘనత కుటుంబరావుగారికి చెందుతుంది.

బంగారిమామ పాటల రచయితగా ప్రసిద్ధికెక్కిన కొనకళ్ళ వెంకటరత్నంగారి కథలను ఇటీవల విశాలాంధ్ర ప్రచురణాలయంవారు పుస్తకం రూపంలో వెలువరించారు. అందులో రచనలన్నీ సహృదయ హృదయరంజకాలే.

పాలంకి వెంకటరామచంద్రమూర్తిగారు చిరకాలంగా వివిధ పత్రికలలో రచనలు ప్రచురించారు, ప్రచురిస్తున్నారు. పిల్లల కోసం ఆయనచేసిన రచనలేకాక కొన్ని కథలు కూడా ఉన్నాయి. దేశి కవితా మండలివారు ప్రచురించిన వివిధ రచయితల కథా సంపుటాలలో వీరిది కూడా ఒకటి. త్రిపురనేని గోపీచంద్ రాశిలోను, రమ్యతలోను ఎన్నదగిన అనేక కథలు వ్రాశారు. నిశిత దృష్టితో సమాజాన్ని పరిశీలించి, సమాజాన్ని పీడిస్తున్న అనేక సమస్యలను పఠనీయమైన శైలిలో చిత్రించారు. ఆర్థిక, రాజకీయ, సంసారిక సమస్యలు మధ్యతరగతి జీవితాన్ని అతలా కుతలం చేసే తీరును ఆయన తన నవలలోనేకాక కథలలో కూడా నేర్పుగా చిత్రించారు. ప్రముఖ హాస్య రచయిత రావూరి సత్యనారాయణరావు గారు "వడగళ్లు", "అషామాషీ" వంటి శీర్షికలతో పఠితలను ఆకర్షించారు. వారు వ్రాసిన "మధుపర్కాలు" అందమైన కథ.

తెలుగు కథకు అంతర్జాతీయ గుర్తింపును తెచ్చినవారు పాలగుమ్మి పద్మరాజుగారు. వారి "గాలివాన" కథకు ఒక అమెరికన్ పత్రిక ద్వితీయ బహుమతి లభించింది. అదీకాక "పడవ ప్రయాణం" అనే వారి కథ పఠితల మన్ననలు పొందింది. ఇటీవల వెలువడిన నేషనల్ బుక్ ట్రస్టు వారి తెలుగు కథల సంపుటిలో ఇది పునర్ముద్రించబడింది. వట్టికోట ఆళ్వార్ స్వామి ప్రజలకోసం, ప్రజల భాషలో, ప్రజలను గురించి కథలు వ్రాసిన రచయిత. దీనులు, ఆర్తుల జీవితాన్ని చిత్తశుద్ధితో చిత్రించిన ప్రతిభాశాలి.

బుచ్చిబాబు తెలుగులో తనదైన స్వంత ధోరణిగల రచయిత. అప్పటికి ప్రాచుర్యంలో వున్న పాశ్చాత్య రచనలను చదివి కొత్త తరహా కథన ధోరణి అలవరచుకున్నారు. చైతన్య స్రవంతి (స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్‌నెస్) అనబడే అంతరంగ ఆలోచనల కథనం అలవరచుకొని తెలుగు నవలా సాహిత్యంలో చిరకాలం నిలిచిపోగల "చివరకు మిగిలేది" నవలను రచించారు. ఆయన కథల మీదనే మక్కువ చూపించారు. ఆమె నీడ, గాజుమేడ, రస్సెల్ కంకితమైన కథలు, అడవికాచిన వెన్నెల, కాలచక్రం నిలిచింది, మూడు కోతులు వగైరాలు. ఆయన కథల సంపుటిలో "నన్ను గురించి కథ వ్రాయవూ" అనేది పాఠకుల మెప్పుపొందిన రచన. నిశిత మనస్తత్వ పరిశీలనతో మంచి అభిరుచులుగల పాఠకులను అలరించిన "తడి మంటకు పాడి నీళ్లు" వగైరా కథలు ఆయన కథాకథనంలో ఉన్న నవ్యతకు, రమ్యతకు ఉదాహరణలు. మా గోఖలే గుంటూరు మాండలికంలో "బల్లకట్టు పాపయ్య" వంటి స్మరణీయమైన కథలు వ్రాశారు.

ధనికొండ హనుమంతరావుగారి "గుడ్డివాడు" వగైరా కథలు పెద్దవే అయినా, చిన్న నవల లనిపించుకోదగినవి

అప్పటిలో ఆయన సంపాదకులుగా వెలువడిన "అభిసారిక," "జ్యోతి" పత్రికలలో, రసవత్తరమైన కథలుకూడా వ్రాశారు.

చెరుకుపల్లి జమదగ్ని శర్మగారు కళాశాలాధ్యాపకులు. "జమదగ్ని" పేరుతో శిష్ట పాఠకులను అలరించిన కథలు– అన్నదమ్ములు, చిలకా గోరింకా మొదలైనవి వ్రాశారు. మద్దిపట్లసూరి కొన్ని ఆంగ్ల నవలలను ఆంధ్ర సచిత్రవార పత్రికలో అనువాదం చేశారు. వారి "పాపి కొండలు" కథల సంపుటి.

అంగర వెంకట కృష్ణారావుగారు తెలుగు పాఠకులు గుర్తుంచుకోదగిన రచయిత.

## 1950 తర్వాత

క్రమంగా పత్రికల సంఖ్య పెరగడంతో, పఠితల సంఖ్య పెరగడంతో కథలు అసంఖ్యాకంగా రావడం మొదలైంది. 1950 తర్వాత ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక వెలువడడంతో, కొన్ని మాసపత్రికలు కూడ రంగంలోకి రావడంతో కథల సంఖ్య అపరిమితంగా పెరుగుతూ వచ్చి, ఆనాడు కొన్ని ప్రసిద్ధ పత్రికలు 'మా కార్యాలయంలో కథలు పేరుకు పోయి వున్నాయి. దయచేసి రచయిత లెవరూ కొంత కాలం పాటు తమ కథలు పంపవద్దని విజ్ఞప్తి చేస్తున్నాము' అని ప్రకటించేంతగా రచయితల సంఖ్య, రచనల సంఖ్య పెరిగిపోయాయి. అంత పోటీలోనూ, రద్దీలోనూ, తెలుగుజాతి గర్వించదగిన ఉత్తమ రచనలు చేసి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మహా రచయితలెందరో ఉన్నారు. ఏ భాషలోకి అనువదించినా 'శభాష్' అనిపించుకోగల స్థాయికి తెలుగు కథ ఎదిగింది. కథనంలో, శిల్పంలో, శైలిలో, ఇతివృత్తంలో తెలుగు కథ సాధించిన అభివృద్ధి నిజంగా గణనీయమైనది.

బాల గంగాధర తిలక్ తెలుగు జాతి గర్వించదగిన ఆధునిక కవీ, రచయితాను. ఆయన కథలు ఆయన మరణానంతరం 'తిలక్ కథలు' పేరుతో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు వెలువరించారు. ఆ కథలన్నీ ఆయన సంఘ దృష్టినీ, నిశిత పరిశీలనను, పాత్ర చిత్రణలోని ప్రత్యేకతను చాటి చెబుతాయి. 'దొంగ' చాలా మంచి కథ. 'ఊరి చివరి ఇల్లు' 'నల్లజర్లరోడ్డు' ఆయనకు పేరు తెచ్చిన మంచికథలు.

## రా.వి. శాస్త్రి

తెలుగు కథా సాహిత్యాకాశంలో 'మెరుపు'లా మెరిసి, ధ్రువతారగా నిలిచిపోగల కథకుడు రాచకొండ విశ్వనాథ శాస్త్రి. 'జాస్మిన్' పేరుతో భారతిలో సాక్షాత్కరించిన రా.వి. శాస్త్రి తెలుగు సాహిత్యంలో తనకు తానై ఒక మహోద్యమం లాటివాడు. కథకు సామాజిక బాధ్యత ఉందనీ, కేవలం కాలక్షేపం కథలు ఇక చాలుననీ, రచయిత తన చుట్టూ వున్న సమాజంయొక్క రూపురేఖలను చిత్రించి, అది ఉన్న దుస్థితిని వివరించి, దాన్ని బాగుచేయడానికి పరిష్కారం సూచించాలనే విశ్వాసంతో తెలుగులో చిరకాలం నిలిచిపోగల హృదయస్పందులైన రసవత్తర రచనలు చేశాడు.

ఈ దోపిడి వ్యవస్థలో హక్కులన్నీ ఉన్నవారికే. లేనివారికి జీవితం దుర్భరంగా ఉంది. శ్రమజీవుల కష్టంమీద బ్రతికే పరాన్నభుక్కులు సుఖంగా క్షేమంగా ఉండే వ్యవస్థ మనది. దీన్ని మార్చాలి; ఇప్పటికిప్పుడే మార్చాలి – ఇదీ ఆయన రచనకు ప్రాణం పోసిన సందేశం.

దగాపడిన తమ్ముళ్ల బాధామయ జీవితాన్ని అత్యంత నిశితంగా పరిశీలించి శక్తివంతమైన కథనంతో చిత్రించిన ప్రతిభావంతులు. ఆయన వ్రాసిన ప్రతి కథా ఆయన విశిష్ట శైలికీ, నిశిత పరిశీలనా దృష్టికీ, వ్యవస్థమీద విమర్శకూ ఉదాహరణగానే నిలుస్తుంది. ఆఖరిదశ, విలువలు, కార్నర్‌సీట్, జరీఅంచు తెల్లచీర, మామిడిచెట్టు మొదలైనవి మొదటిదశలోని కథలు. తర్వాత వచ్చిన 'ఆరుసారా కథలు' తెలుగు ప్రజలు కలకాలం చదివిమెచ్చే అద్భుత కళా ఖండా లనదగ్గవి. విశాలాంధ్ర దినపత్రిక ఆదివారం అనుబంధంలో మొదటిసారిగా యివి ప్రచురించినప్పుడూ, ఆ తర్వాత పుస్తకరూపంలో వెలువడినప్పుడూ ఇవి మంచి అభిరుచున్న పాఠక ప్రపంచంలో సంచలనం రేకెత్తించాయి. తర్వాత వెలువడిన వివిధ సంపుటాలలో ఆయన విశిష్టత చెక్కుచెదరకుండా నిలిచి చివరివరకూ ఆయన ఏంవ్రాసినా పాఠకుల హృదయాలను ఆకర్షిస్తూనే వున్నాయి. రచనలో నిజాయితీ, నైశిత్యం, పదును, నిర్భీకత – యివి ఆయన విశిష్ట గుణాలు. ఆయన అక్షరాలా కమిటెడ్ రచయిత.

విజయనగరంలో గురజాడ వారసత్వాన్ని కొనసాగించిన చాగంటి సోమయాజులు (చాసో) 'వాయులీనం' వంటి కథలు వ్రాసి, పఠితల మన్ననలు పొందారు. వీరి యితర కథలు కూడా "చాసో కథలు" పేరుతో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ప్రచురించారు. నాలుగు దశాబ్దాలలో 40 కథలే రాసినా అభ్యుదయ కథలు వెలార్చి తరువాతి తరాలకు ఆదర్శంగా నిల్చి ఇటీవలే కన్నుమూశారు.

ప్రతిభ, వ్యుత్పన్నతలలో; తీక్షపరిశీలనా దృష్టిలో, కథన శక్తిలో నాన్యతోదర్శనీయ మనదగిన అద్భుత రచనలు చేసిన మరొక మహారచయిత కాళీపట్నం రామారావు. పాఠకుల మనస్సులలో కలకాలం నిలిచిపోయే 'చావు', 'యజ్ఞం' మొదలయిన రచనలు సంఖ్యలో తక్కువ అయితేనేమి – గుణములో అత్యంత మిన్న అయినవి.

## మధురాంతకం రాజారాం

రాయలసీమకు చెందిన మధురాంతకం రాజారాం కథకులే మెచ్చిన కథల నేకం వ్రాశారు. ఆయనకు కథ ఒక్కటే

అత్యంత ప్రీతిపాత్రమైన ప్రక్రియ అనిపిస్తుంది. ఆయన వ్రాసిన కమ్మెతెమ్మెర, మాతృసప్తకం, తాను వెలిగించిన దీపాలు మొదలైన కథలన్నీ ఆహ్లాదకరంగా, చక్కని కథన ధోరణితో విలసిల్లుతూ వుంటాయి. వారి కథలకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించడం హర్షణీయం.

అవసరాల రామకృష్ణారావుగారి దొక ప్రత్యేక బాణీ. వ్యంగ్యం, హాస్యం మిళాయించి పఠితలను ఆకర్షించే చక్కని శైలిలో ఆయన రచనలు చేశారు. 'అయిదు రకాల ఆత్మహత్యలు' సంపుటిగా వెలువడి పాఠకుల మన్ననలను పొందింది.

ముళ్ళపూడి వెంకటరమణ పేరుచెప్పగానే చదువరుల పెదవులమీద చిరునవ్వులు వికసిస్తాయి. 'జనతా ఎక్స్‌ప్రెస్' సంపుటిలో ఉన్న రచనలన్నీ హాస్యకథలే కాక ఆలోచింపచేసే కథలుకూడా. 'బుడుగు' పేరుకు బాలల రచనే అయినా దాన్ని చదివి ఆనందించిన వారందరూ పెద్దలే. 'రాజకీయ బేతాళ పంచవింశతిక' నేటి మన ఎన్నికల పద్ధతిమీద అద్భుత వ్యాఖ్యానమని చెప్పవచ్చు.

పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి 'నీలి' కథ తెలుగు పాఠకులందరికీ సుపరిచితమే. ఒక అమెరికన్ పత్రికవారు నిర్వహించిన పోటీలలో తెలుగులో ఉత్తమమైనదిగా ఎన్నికైనది 'నీలి'. పదునైన వ్యాఖ్యలూ, నిశిత పరిశీలనా దృష్టి, సామాజిక స్పృహ ఈయన రచనలలోని ప్రత్యేకతలు. ప్రసిద్ధ రచయిత వాకాటి పాండురంగారావుగారితో కలిసి నేషనల్ బుక్‌ట్రస్ట్ వారి తెలుగు కథల సంపుటానికి సంపాదకులుగా వ్యవహరించారు. ఆయన కథలన్నీ పఠితల నాకర్షించి, ఆలోచింపజేసే శైలీబలంతో అలరారుతూ వుంటాయి.

కొమ్మూరి వేణుగోపాలరావుగారికి పాఠకులలో మంచి నవలా రచయితగానేకాక, కథారచయితగా కూడా పేరున్నది. 'భారతి' పత్రికలో ఆయన చాలా కథలు వ్రాశారు. 'సూర్యోదయం' మొదలైన కథలు భారతిలో వచ్చినవే.

రావూరు భరద్వాజగారు 'పాకుడు రాళ్లు' వంటి నవలలేకాక ఉత్తమ కథలు కూడా వ్రాసి పేరు గడించారు. ఒక అమెరికన్ పత్రికవారు నిర్వహించిన పోటీకోసం తెలుగులో ఎన్నిక చేయబడిన ఎనిమిది కథలలో వీరి 'పగిలిన పచ్చి కుండలు' ఒకటి. చాలా విలువైన కథ. సంఘసంస్కర్తలమనీ, పీడిత ప్రజలను ఉద్ధరిస్తామనీ చెప్పే కుహనా సంస్కారులపైన గట్టిచురక ఈ రచన.

మంజుశ్రీ (అక్కిరాజు రమాపతిరావు) సున్నితమైన కథలు రచించారు. 'మైథిలి' పేరుతో వీరి సంపుటి వెలువడింది. ఉదాత్తమైన కథన ధోరణి ఆయన ప్రతి కథలోనూ కనిపిస్తుంది.

వాకాటి పాండురంగారావుగారు హాస్యంతో కూడిన మంచి కథలు రచించారు. ప్రభుత్వ కార్యాలయాల్లో సమాజ జీవితంలో సామాన్యులు ప్రవర్తించే తీరును వ్యంగ్యంగా చిత్రిస్తారు. పత్రికలు నడిపిన కథల పోటీలలో బహుమతులు సంపాదించారు. వీరాజీ 'తొలిమలుపు' తొలి నవల ద్వారా పేరు తెచ్చుకొన్న రచయిత. ఈయన బహుళ సంఖ్యలో వ్రాసిన కథలలో 'ప్లాట్‌ఫారం', 'లక్ష' వంటివి మిక్కిలి స్మరణీయమైనవి.

శీలా వీర్రాజుగారు "పగా మైనస్ ద్వేషం" సంపుటిలో గుర్తుంచుకోదగిన విలక్షణమైన కథలు వ్రాశారు.

"ఆదివిష్ణు", 'అగ్గిబరాటా' కథతో రచనా వ్యాసంగం ప్రారంభించి, 'సగటుమనిషి' నవలతో పరిణతి చెంది, 'ఇది ఆత్మహత్య' వంటి నాటకాలతో ప్రాచుర్యం పొందిన రచయిత. "కలెక్టరూ క్షమించు", "పాలు", తార, ఉద్యోగంవంటి కథలలో ఆయన పనివాడితనం గోచరిస్తుంది. స్నేహం, అనుబంధం, ఆర్ద్రత ప్రధాన అంశాలుగా ఎన్నదగిన కథలు చాలా వ్రాసి, అనేక పర్యాయాలు బహుమతులు గెలుచుకున్న రసవద్రచయిత. తాడిగిరి పోతరాజుగారు గుంటూరు మాండలికంలో ఎన్నదగిన కథలు చాలా వ్రాశారు. 'గాజు కిటికీ' పేరుతో వెలువడిన (విశాలాంధ్ర ప్రచురణాలయం) కథల సంపుటిలోని కథలన్నీ సామాన్యుల, దీనుల జీవితాలకు ప్రతిబింబాలు. 'గాజు కిటికీ' అన్న రచన ఒక ప్రముఖ వారపత్రిక పోటీలో బహుమతి పొందింది. అది చిరకాలం పఠితల మనసులలో నిలిచిపోయే కథ.

తక్కువ సంఖ్యలో కథలు వ్రాసినా కథా ప్రియుల మనసులలో స్థానం సంపాదించుకొన్న రచయిత అరిగే రామారావు. 'అల్పజీవులు'వంటి అత్యుత్తమ కథలు వ్రాసిన రామారావుగారిని సమీక్షకులు చాలా మంది విస్మరించడం ఆశ్చర్యం కలిగిస్తుంది. తక్కువ మధ్య తరగతి, బడుగు జీవుల సమస్యలను, వారి నిస్సహాయతను ఏ హంగులూ ఆర్భాటాలు లేకుండా అత్యంత వాస్తవికంగా సూటిగా చిత్రించే నేర్పు ఆయన సొమ్ము. కొండముది శ్రీరామచంద్రమూర్తి 'పాములాటి బ్రతుకు' పేరుతో కథల సంపుటి వెలువరించారు. 'పాములాటి బ్రతుకు' గుండెలను ద్రవింపజేసే చక్కని కథ.

గొల్లపూడి మారుతీరావుగారి 'రోమన్ హాలిడే' సంపుటిలో ఎడనెడ పత్రికలలో వచ్చిన కథలున్నాయి. తనదైన, అరుదైన శైలిలో ఆయన చక్కని కథలు చాలా వ్రాశారు.

వర్తమానంలో రచనా వ్యాసంగం విరమించినట్లు కనిపిస్తున్న సింగరాజు రామచంద్రమూర్తిగారు వందకు పైగా కథలు వ్రాశారు. హాస్యంతో కూడిన చమత్కార కథన ధోరణితో మధ్యతరగతి జీవితాన్ని రమణీయంగా చిత్రించిన ఈ రచయిత ఎన్నిక చేసిన కథల సంపుటి ఒకటి వెలువడింది.

'శ్రీపతి' తన 'మంచుపల్లకి– మరి తొమ్మిది' కథల సంపుటితో ప్రసిద్ధులైనారు. నిశితమైన సాంఘిక విమర్శ, సమాజంలోని దోపిడీ శక్తులపట్ల అసహనం ఉన్న 'కమిటెడ్' రచయిత. వీరి 'చేతుల కుర్చీ' కలకాలం నిలిచే ఉత్తమ కథ.

రంధి సోమరాజుగారి "సోమరాజు కథలు" పాఠకుల మెప్పుపొందిన కథల సంపుటి. బలహీన వర్గాలవారు ఉనికి కోసం, మనుగడకోసం చేసే ధర్మయుద్ధం వీరి రచనలలో కనిపిస్తుంది. రిక్షా తొక్కి కుటుంబాన్ని పోషించే వ్యక్తి చనిపోతే, భార్య ఎందుకు రిక్షా తొక్కి బ్రతక గూడదు? ఆమెకు ఎదురయ్యే చిక్కులు, ఆమెను చిక్కులపాలు చేసి ఎగతాళి చేసే వ్యక్తుల గురించిన వీరి కథ స్మరణీయమైనది.

సి.యస్.రావుగారు సమాజంలో దోపిడీకి గురి అవుతున్న నిస్సహాయ వర్గాలవారి నికృష్టపు బ్రతుకులను, వారు ఎదురుతిరిగే పద్ధతిని రసవత్తరంగా, బలంగా చిత్రిస్తారు. "ఊరుమ్మడి బ్రతుకులు", కొరడా, ఇప్పుడు వీస్తున్న గాలి, 'పావులు పాములుగా మారిన వేళ' మొదలైన కథలన్నీ పత్రికలలో వచ్చి విమర్శక పాఠకుల మెప్పు పొందాయి.

వి. రాజా రామమోహన్‌రావుగారి 'వరద' సంపుటి ఇటీవలే వెలువడింది. బలమైన కథనం, సామాజిక స్పృహతో గుర్తుంచుకోదగ్గ కథలు వీరివి.

సత్యం శంకరమంచిగారి "కార్తీకదీపాలు" గొప్పరచన. అలతి అలతి పదాలతో అందమైన చిత్రాలు అందించగల రచయిత. 'అమరావతి కథలు' పాఠకులలో విపరీతంగా సంచలనం రేకెత్తించాయి. ఆ కథలన్నీ ఆణిముత్యాలే. ముఖ్యంగా 'పూర్ణకుంభం' ఆయన కల్పనాశక్తికీ, రక్తికట్టించే రచనా శైలికీ మంచి ఉదాహరణ.

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావుగారు ఉత్తమ రచయితలలో పరిగణింపదగినవారు. ఒక అమెరికన్ పత్రిక నిర్వహించిన పోటీల నిమిత్తం తెలుగులో ఎన్నుకోబడిన ఎనిమిది కథలలోను వీరి కథ 'దొంగలున్నారు జాగ్రత్త' ఒకటి. ఒకసారి చదివినవారు మరచిపోలేని అద్భుతమైన కథ అది.

"కొత్త యిల్లు" రచయిత తాళ్ళూరి నాగేశ్వరరావుగారు శర పరంపరగా కథలు వ్రాసిన రచయిత, మధ్యతరగతివారి కోరికలు, తాపత్రయాలు, సమస్యలు వీరి ఇతివృత్తం.

నార్ల చిరంజీవి తెలుగు కథా సాహిత్యంలో చిరంజీవి. 'మర్రినీడా – మల్లెతీగా' ఒక ప్రముఖ పత్రిక నిర్వహించి పోటీలో మొదటి బహుమతి పొందింది. అంతకుముందే మరొక ప్రముఖ పత్రిక నిర్వహించిన పోటీలో బహుమతి పొందిన 'కర్రా–చెప్పులు' అద్భుతమైన కథ.

బలివాడ కాంతారావుగారు పాఠకులు గర్వంగా చెప్పుకోదగ్గ రచయిత. అప్పుడప్పుడు పత్రికలలో వచ్చిన వీరి కథలు సంపుటాల రూపంలో వచ్చాయి.

అహ్లాదకరమైన, అచ్చమైన జాతీయ పలుకుబడితో నిండిన కథా శైలి 'ఉషశ్రీ' 'సొత్తు'. 'మల్లెపందిరి' సంపుటంలోని కథలు పాఠకుల మన్ననలు పొందాయి. అట్లూరి పిచ్చేశ్వరావుగారి 'పిచ్చేశ్వరరావు కథలు' ఎన్నతగిన సంపుటి. అవసరాల సూర్యారావు, కాంచనపల్లి చినవెంకటరామారావు, (మనవూళ్ళో కూడానా?) రాజకీయ అవగాహనతో రచనలు సాగించారు. తెలంగాణా రైతు పోరాటాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు రచయిత. సోదుం జయరాం సత్తాగల రచయిత. సమాజ స్వరూపాన్ని అర్థం చేసుకొని, వర్గదృక్పథం జీర్ణించుకొని ప్రయోజనకరమైన రచనలు చేశారు. వీరి కథలు 'వాడిన మల్లెలు', 'సింహాద్రి – స్వీట్‌హోమ్' సంపుటిగా వచ్చాయి. "విహారి–శాలివాహన" గారలు జంట రచయితలు. పుష్కలంగా కథలు వ్రాసి, సంపుటాలు వెలువరించి కథా ప్రేమికుల నలరించిన జంట యిది. యర్రంశెట్టి శాయి చమత్కారంతో కూడిన శైలిలో మధ్యతరగతి మనుషుల జీవితాలను చిత్రించారు. సున్నితమైన హాస్యం వీరి రచనలో గల గుణం. మల్లాది వెంకట కృష్ణమూర్తి చిన్న కథలు చాలా వ్రాశారు, వ్రాస్తున్నారు. కొసమెరుపు, ఉత్కంఠ, చదివించే గుణం వీరి స్కోరింగ్ పాయింట్లు. "నగ్నముని" కథలు సంపుటాలుగా వచ్చాయి. సమాజంలోని దోపిడిని చిత్రించటంలో, ఖండించటంలో, నిశితమైన పదునైన ప్రతిభ చూపించారు "నగ్నముని" తన కథల్లో. తక్కువ సంఖ్యలో వ్రాసినా, వ్రాసిన కొద్ది కథలు పాఠకుల, విమర్శకుల అశేష ఆదరణ పొందిన రచనలు చేసినవారు కొందరున్నారు. ఇస్మాయిల్ (వల, సముద్రం, ఖాళీ సీసాలు), త్రిపుర (పాము), పూసపాటి కృష్ణంరాజు (దివాణం–సేరీవేట) సి. రామచంద్రరావు (వేలుపిళ్ళై, నల్లతోలు, ఏనుగులరాయి), దుత్తా దుర్గాప్రసాద్ (దానిమ్మపండు, షిఫ్టు మారింది) గంగినేని వెంకటేశ్వరరావు (ఎర్రజండాలు), భమిడిపాటి జగన్నాథరావు (జాజిపూలు) ద్విభాష్యం రాజేశ్వరరావు, శ్రీరంగం రాజేశ్వరరావు, రాంభట్ల కృష్ణమూర్తి, మల్లిక్ (సుడి), కేతు విశ్వనాథరెడ్డి (వానకురిస్తే), కొండముది హనుమంతరావు, కొలకలూరి ఇనాక్, శ్రీ సుభా, దాశరథి రంగాచార్య, కప్పగంతుల మల్లికార్జునరావు, పులికంటి కృష్ణారెడ్డి, వల్లంపాటి వెంకటసుబ్బయ్య, పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, హవిస్ (మమత, ముళ్ళకిరీటం), ఎస్. కాశీ విశ్వనాథం, గండికోట బ్రహ్మాజీరావు, ఆర్.ఎస్. సుదర్శనం, మురయా, పి.యస్. నారాయణ, డి. వెంకటరామయ్య, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, ఇచ్ఛాపురపు రామచంద్రం, ఇసుకపల్లి దక్షిణామూర్తి, పోరంకి దక్షిణామూర్తి, ప్రయాగ రామకృష్ణ, మహీధర్, నవీన్, కవన శర్మ, ముక్కామల వెంకటేశ్వరరావు, శారద అనే కలం పేరుతో నవలా రచనలో సంచలనం వంటి దాన్ని సృష్టించిన నటరాజన్,

మునిపల్లె రాజు, వై. రఘునాథరావు (ఊరు నిద్రపోయింది), రుద్రాభట్ల నరసింగరావు, డి. లోకానందమూర్తి గారలు కొన్ని మంచి కథలు వ్రాశారు.

చలసాని ప్రసాదరావుగారు చిత్రకళ మీదనే అథారిటి అనుకొన నక్కరలేదు. ఆయన 'కథలు–కీకరకాయలు' పలువురు మెచ్చిన సంపుటి. సమగ్ర రాజకీయ సాంఘిక అవగాహనతో రచనను సీరియస్‌గా తీసుకొని, సంఖ్యలో తక్కువ అయినా ఎన్నదగిన రచనలు చేసినవారు బొల్లిముంత శివరామకృష్ణగారు. వీరి సంపుటి "అంతరాత్మ అంత్యక్రియలు," (బాంబులు పడ్డనాడు) కాటూరి విజయసారథి, (భవిష్యతి సుప్రభాతమ్) సెట్టి ఈశ్వరరావు, సి. కనకాంబ రాజు (ఆకాశ దీపాలు), గుంటూరు శేషేంద్ర శర్మ (విప్వాల), హరికిషన్, నండూరి సుబ్బారావు, సుమన్, వైసి.వి. రెడ్డి, "చంద్రమౌళి" కలం పేరుతో హరి వెంకట సుబ్బారావు, (ఆశాలత), రాఘవ, వేదుల కామేశ్వరరావు, గోపాల చక్రవర్తి (నీతికథలు–నాతికథలు), పంతుల శ్రీరామశాస్త్రి (కథలు), రాచమల్లు రామచంద్రారెడ్డి (అలసిన గుండెలు), పురాణం సూర్యప్రకాశరావు (కాకులు వగైరా), పి. లక్ష్మీకాంతమోహన్ (తెలంగాణా కథలు), మసూనా (బాలల కథలు), కేశవగోపాల్ గారలు చిరకాలం గుర్తుండే రచయితలు.

అల్లం రాజయ్య గొప్ప ప్రతిభావంతుడైన రచయిత. సామాజిక వాస్తవికత గమనించ దగిన అంశం. ప్రత్యేకమైన శైలీ విన్నాణం, సవిమర్శక వాస్తవజీవిత చిత్రణ, తీవ్రమైన భావప్రకటన వీరి ప్రత్యేకతలు.

అర్నాథ్ మంచి రచయిత. వీరి కథలు ఒక సంపుటిగా వెలువడి సహృదయ విమర్శక పాఠకుల మన్ననలు పొందాయి.

ఆర్.ఎస్. సుదర్శనంగారు భావుకులు, తత్త్వవేత్త, గ్రంథ విమర్శకులు, నవలారచయిత. వీరి కథలు సంపుటాలుగా వచ్చాయి. 'మధుర మీనాక్షి' పేరుతో వెలువడిన సంకలనం విమర్శక, పాఠకుల మెప్పు పొందింది.

'హితశ్రీ'గారు చాలాకాలం నుంచి తెలుగు పాఠకులు మెచ్చిన విలక్షణమైన కథలు వ్రాసిన ఉత్తమ రచయిత.

'భరాగో'గా ప్రసిద్ధులు భమిడిపాటి రామగోపాలం. సున్నితమైన హాస్యంతో మేళవించిన సాంఘిక విమర్శ వీరి రచనలలో కనిపిస్తుంది. పాఠకులచేత చదివింపజేసే గుణం వీరి సొత్తు. వెన్నెలనీడ, వంటొచ్చిన మొగాడు, ఇట్లు మీ విధేయుడు వీరి ప్రసిద్ధి కథల సంపుటాలు.

చందు సుబ్బారావు రచనలు చమత్కార భరితంగా సామాజిక విమర్శతోకూడి పాఠకులు మెచ్చిన గుర్తుంచుకొన్నవి.

స్థూలంగా రచయితలందరూ తమ సమకాలీన సమాజాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. మన కథా సాహిత్యంలో యెక్కువ భాగం పాఠకులను అహ్లాదపరచి అలరించేవి. కాలక్షేపానికి మాత్రమే పనికివచ్చే రచనలు ఎక్కువభాగం. తమాషాగా చదువుకొని మరచిపోదగినవి కొన్ని. విపరీత సంఖ్యలోపుష్కలంగా వస్తున్న ఈనాటి కథలలో సామాజిక దృష్టి, వర్గస్వభావాన్ని గుర్తింపజేసే గుణం; దోపిడీశక్తులకు, మౌఢ్యానికి వ్యతిరేకంగా పాఠకుల ఆలోచనలు తీర్చిదిద్దేగుణం; మార్పును కోరే శక్తులకు దోహదంచేసే గుణం ఉన్న రచనలను ఏరి ఎప్పటికప్పుడు సంపుటులుగా వెలువరించవలసిన అవసరం ఎంతయినా ఉంది. లేకపోతే పత్రికలలో పడిన కథలు పత్రికలలోనే అంతరించిపోయే ప్రమాదం ఉంది. కొన్ని అత్యుత్తమ రచనలు ఆవిధంగా ఈ పాటికే మరుగున పడిపోయాయి. వాటిలో కొన్ని జాతీయస్థాయిలో విలువ గలిగినవి. తెలుగు విశ్వవిద్యాలయంవంటి సంస్థలు పూనుకొని సంవత్సరానికి ఒకసారి అన్ని పత్రికలలో వచ్చిన అన్ని కథలను అవలోకనంచేసి ,ఉత్తమ ప్రమాణాలతో ఎన్నిక చేసి కథలను సంపుటాలుగా వెలువరించడం అభిలషణీయం. అలా చేయని పక్షంలో ఆణిముత్యాలవంటి కథలు పాఠకులకు లభించకుండా పోయే ప్రమాదం వుంది.

ఇస్మాయిల్‌గారి వల, సముద్రం, ఖాళీసీసాలు; దుత్తా దుర్గా ప్రసాద్‌గారి దానిమ్మపండు, షిఫ్టు మారింది; అరిగె రామారావు అల్పజీవులు; అలాగే ఇతరుల ఒకటీరెండూ అయినాసరే కలకాలము నిలిచే కథలు – నేటి పాఠకులకు లభించకపోవడం దురదృష్టకరమైన విషయం.

జోరుగా వ్రాసిన రచయితల పేరునుబట్టి సగటు కథలు పాఠకులలో చెలామణి కావడంకంటే చిరకాలం నిలిచే విలువైన రచనలు తక్కువ చేసినా – ఆ రచనల పేరుతో ఆ రచయితలు చెలామణి కావడం అభిలషణీయం కదా!

తెలుగులో ఇది కాల్పనిక సాహిత్యయుగం. నవల, కథ ఈ యుగంలో ప్రచురమైన ప్రక్రియలు. ఈ విషయం చెప్పేందుకుకాని, ఒప్పుకునేందుకుగాని ఎవరూ సందేహించ నక్కరలేదు. ఏ యుగానికి అవసరమయిన ప్రక్రియలు, ఏ యుగానికి సరిపడిన ప్రక్రియలు ఆ యుగంలో ప్రాచుర్యం పొందుతూ వుంటాయి. ఇప్పటికీ కథారచన "ఆఫ్టరాల్" అనుకునే పండిత ప్రకాండులు ఉంటే ఉండవచ్చునుగాక – అదివేరే విషయం. 'నవలలూ కథలూ ఆడవాళ్ళూ రాసేస్తున్నారే' అనీ, 'అవి ఆడవాళ్ళు మాత్రమే వ్రాయదగినవనీ' అనుకునే వారూ ఉన్నారు.

అంటే – రచయిత్రుల ప్రాబల్యం అంతగా పెరిగిందన్నమాట! నవల సంగతి ఎలా వున్నా, కథా రచనలో మాత్రం స్త్రీలు కాస్త ముందే నడుం కట్టిన దాఖలా లున్నాయి. ప్రారంభించిన తర్వాత మాత్రం రచయిత్రులు కూడా అందమైన కథలు వ్రాశారు, వ్రాస్తున్నారు.

'కొండమల్లెలు', 'ముత్యాల మనసు' మకుటంతో ఇల్లిందల సరస్వతీదేవిగారి కథలు వచ్చాయి. 'పండుగ బహూమానం', 'బలీయసీ కేవల మీశ్వరాజ్ఞ' అనేవి వీరి ప్రముఖ కథలు. కొమ్మూరి పద్మావతీదేవిగారు 'పొగడదండ' పేరుతో సంకలనం వెలువరించారు. కొత్త లక్ష్మీరఘురాం గారు కొన్ని కథలు వ్రాశారు. నాయని కృష్ణకుమారి కొన్ని అనువాదాలూ, కొన్ని స్వతంత్ర రచనలూ చేశారు.

గుణ పరంగా రచయిత్రులలో ఎన్నదగిన రచనలు చేసిన వారు కళ్యాణ సుందరీ జగన్నాథ్‌గారు. చక్కని వాక్య విన్యాసం, మనోహరమైన శైలీ వీరి సొత్తు. 'అలరాస పుట్టిళ్ళు' అద్భుతమైన కథ. పున్నమి మసకలు, సాయంకాలే వనాంతే, అగ్నిపుష్పం, చిరుచెమటలు–చందనం వంటి మనోహరమైన రమణీయ రచనలు చేశారు.

లతగారు కథలు ఎక్కువ వ్రాయలేదు. కాని, వ్రాసిన 'మదరిండియా'వంటివి గణించదగ్గవి. వీరికి కథ కంటే నవల పట్ల మక్కువ ఎక్కువ అనేది స్పష్టం. కృష్ణడిపైన ఆమె 'జ్యోతి' మాసపత్రికలో వెలువరించిన కథ రమణీయమైనది.

తురగా జానకీరాణి కథలు సంపుటిగా వచ్చాయి. 'మనసులోని బొమ్మ', క్షణంలో పెరిగిన గోపాలంవంటి కథలు ఆమెకు పఠితల ఆదరణను సంపాదించిపెట్టాయి.

శివరాజు సుబ్బలక్ష్మి వివిధ పత్రికలలో కథలు వ్రాశారు. గంభీరమైన కథన శిల్పంతో అలరారే వీరి కథలు సంపుటాలుగా వెలువడ్డాయి.

జ్యోతి, బహుమతి పేరుతో యుద్దనపూడి సులోచనా రాణిగారి కథలు రెండు సంపుటాలుగా వెలువడి పాఠకులలో సంచలనాన్ని కలిగించాయి. తొలి మజిలీ, పెళ్ళి ప్రయాణం, 'ఐ లవ్ యు' వంటి రసవత్తరమైన కథలు పత్రికలలో వెలువడి, పాఠకులను విపరీతంగా ఆకర్షించాయి.

రంగనాయకమ్మగారి కథలు అమ్మ, శోభనంరాత్రి, నాకు చచ్చిపోవాలని ఉంది వగైరా సంపుటాలుగా వెలువడ్డాయి. 'అమ్మ' సున్నితమైన మానసిక సమస్యను, స్థితిని అద్భుతంగా చిత్రించిన కథ.

కౌసల్యాదేవిగారి కథలు సంఖ్యలో తక్కువే అయినా 'కల్పన'పేరుతో ఆమె కథలు సంపుటిగా వెలువడినాయి.

అభ్యుదయ దృక్పథంతో, రాజకీయచైతన్యం, ఆలోచన రేకెత్తించే రచనలు చేసిన తక్కువ మంది రచయిత్రులలో వాసిరెడ్డి సీతాదేవిగారిది ఉన్నతస్థానం. వర్గ స్వభావం తెలిసి, సమాజంలోని వాస్తవ పరిస్థితులను అత్యంత ప్రతిభావంతంగా చిత్రించారీమె.

పి.సత్యవతి, అచ్యుతవల్లిగారి కథలు సంపుటిగా వెలువడి పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నాయి. "అరవింద", ఎ.ఎస్. మణిపేర్లతో అల్లుడి మంచితనం, ఎదురుచూచినది, నీరజపెళ్ళి, రాగవైరాగ్యాలు వంటి కథలు వ్రాసిన ఎ.సు గుణమణి ఎన్నదగిన రచయిత్రి. "చాగంటి తులసి" కొన్ని అనువాదాలు, కొన్ని స్వతంత్ర రచనలూ చేశారు.

మాలతీ చందూర్ పత్రికలలో వెలువరించిన "లజ్ కార్నర్"వంటి కథలు సంపుటాలుగా వచ్చాయి.

పి. భానుమతి, అత్తగారి కథలతో రచయిత్రులలో ప్రత్యేక స్థానాన్ని పొందారు. అతి మామూలుగా, మామూలు వాక్యాలతో చక్కని హాస్యాన్ని అందించిన రచయిత్రి భానుమతి. వీరి సృష్టి "అత్తగారు" తెలుగు సాహిత్యంలో బారిష్టర్ పార్వతీశం, కాంతం పాత్రలవలె చిరకాలం నిలిచిపోగలదు.

ఆచంట శారదాదేవి గారి కథలు "పగడాలు" అనే సంపుటిలో వచ్చాయి. మరీచిక, ఆనాటి అతిథి – వీరి అందమైన కథలలో కొన్ని.

పరిమళా సోమేశ్వర్ "గాజు పెంకులు – క్రోటన్ మొక్కలూ" సంపుటిగా వచ్చాయి.

అబ్బూరి ఛాయాదేవిగారు తమ మంచికథలను ఇటీవలే సంపుటిగా వెలువరించారు. సి. ఆనందరామం అప్పుడప్పుడు పత్రికలలో "సృష్టిరహస్యం"వంటి కథలు వ్రాశారు.

పోలాప్రగడ రాజ్యలక్ష్మి, ద్వివేదుల విశాలాక్షి గారల కథలు సంపుటులుగా వెలువడ్డాయి. వేదుల శకుంతల "అసమర్థుడు", "వరలక్ష్మి"వంటి కథలు వ్రాశారు.

కె. రామలక్ష్మి వివిధ పత్రికలలో వ్రాసిన కథలు సంపుటాలుగా వచ్చాయి.

యశోదారెడ్డిగారు తెలంగాణా మాండలికంలో మంచి రచనలు చేశారు.

పవని నిర్మల ప్రభావతి చాలా చక్కని కథలు వ్రాశారు. వీరి కథలలో ఆర్ద్రత, మానవ స్వభావపు చిత్రణ, మానసిక చిత్రణ, హొందా అయిన వాక్య విన్యాసం ఉండి, పఠితలను ఆకర్షిస్తాయి.

డి. కామేశ్వరి, విమలారామం, తేజోవతి, అరవింద, పి. రామలక్ష్మి, ఆదూరి సావిత్రి అప్పుడప్పుడూ కథలు వ్రాస్తున్నారు.

"రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది" అనే కథతో రచనా వ్యాసంగం ప్రారంభించిన బీనాదేవిగారు అనతి కాలంలోనే అద్భుతమైన కథలు వ్రాశారు. అభ్యుదయ దృక్పథంతో వర్తమాన సమాజంలో ధనస్వామిక వ్యవస్థలో సామాన్యులు నలిగిపోతున్న తీరు, దోపిడీకి గురి అవుతున్న తీరు చిత్రిస్తారీమె. రాధమ్మ పెళ్ళి ఆగిపోయింది. ఎ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్, థ్యాంక్స్ ఫర్ పి.యం, రిబ్బనుముక్క – వంటి అద్భుతమైన కథలు సంపుటాలుగా వెలువడ్డాయి.

శ్రీమతి డి. సుజాతాదేవి సున్నితభావాలు వ్యక్తం చేయగల ప్రతిభావంతురాలు. వీరు కవయిత్రి కూడా. 'వేకువ రేకలు', 'గెలుపు' కథల సంపుటులు స్పందన

సాహితీవారు ప్రచురించారు. 'గెలుపు' సంపుటిలోని రచనలు వివిధ పత్రికలలో ప్రచురితమైనవి. చాలామందిలో అరుదుగా కనిపించే సాంఘిక, వాస్తవిక జీవిత చిత్రణం వీరిలో ప్రత్యేకత.

'వసుంధర' అరుదైన సాహిత్య విలువలుకల కథలు వ్రాశారు. మనస్తత్వ చిత్రణతోపాటుగా కొత్త కథన ధోరణి, రచనారీతి వీరి ప్రత్యేక గుణాలు.

స్త్రీవాద రచయిత్రి ఓల్గా ప్రతిభకల రచయిత్రి. వీరి కథలు సంపుటంగా వచ్చాయి. కవయిత్రి కొండేపూడి నిర్మల స్త్రీవాద దృక్పథానికి ప్రాధాన్యం యిస్తూ కొన్ని కథలు రాశారు.

పోటీలలో బహుమతులు పొందిన కొందరు మంచి శక్తిగల రచయితలు తరచుగా వ్రాయకపోడానికి కారణం అంత బాగా మళ్ళీ వ్రాయలేమనే జంకు కావచ్చు.

మొత్తంమీద రచయిత్రులు ఎక్కువమందికి ఈనాడు నవలా రచన మీదఉన్న ఆసక్తి, ఆకర్షణ కథారచన మీద లేదని అనిపిస్తుంది. నవలా రచనలో ఆ గ్లామరున్నదని అనిపిస్తుంది. లేక నవల వ్రాయడం కథ వ్రాయడం కంటే తేలిక, మరింత గిట్టుబాటు అవుతుందేమో కూడా తెలియదు.

ఇక ఇటీవలి కాలానికి వస్తే... యువతరం రచయితలు కొందరు జీవితావగాహనతో విశిష్టమైన శైలీ విన్యాసంతో అతి సామాన్య ప్రజల జీవిత దర్శనం తమ కథల్లో చేయిస్తున్నారు. తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలోని మానవజీవితాలలోని సంఘర్షణమూ, శ్రామిక జీవన సౌందర్యాన్నీ, అతి సామాన్యుల ఆలోచనలు తాపత్రయాలు ఆశలు ఆశయాలు వంటి వాటినీ సమర్థంగా శక్తిమంతంగా చిత్రిస్తున్నారు. కేతు విశ్వనాథరెడ్డి, మధురాంతకం నరేంద్ర, మహేంద్ర, సదానంద్ శారద, అల్లం రాజయ్య, బి.ఎస్. రాములు, బండి నారాయణస్వామి, సింగమనేని నారాయణ, 'దేవపుత్ర' మొదలైన రచయితలు ఉత్తమ విలువలున్న కథలు వ్రాశారు.

ఇన్ని దశాబ్దాలుగా తెలుగు కథ ఎంతో అభివృద్ధి సాధించింది. ఈ అభివృద్ధి ఇతివృత్తంలోనూ రచనా విధానంలోనూ కూడా ఉంది. సామాజిక సమస్యలను, సమాజ నిర్మాణాన్ని, వర్గస్వభావాన్ని - వర్గపోరాటాన్ని చిత్రించేందుకు కథ అద్భుత సాధనం. మంచి నవల మన సమాజానికి ఒక టానిక్ సీసా వంటిదని అనుకుంటే మంచి కథ ఒక విటమిన్ మాత్ర వంటిది. కేవలం కాలక్షేప కథలు, పాఠకులను ముగ్ధులను చేసి ఆనందింపచేసే కథలు మాత్రమే కాక, సమాజ స్వభావాన్ని, అందులో వర్గ స్వభావాలనూ, బడుగుజీవుల శ్రమజీవుల బ్రతుకుపోరాటాన్ని చిత్రించే కథలు ఇంకా రావాలి. అలాఅంటే అందమైన కథలు వద్దనిగాని, ఇక చాలనికాని కాదు. ఈనాడు ప్రజలలో సామాజిక స్పృహ, చైతన్యం కలిగించవలసిన అవసరం మునుపటి కంటే ఎక్కువగా ఉంది. ప్రపంచ పరిస్థితులు, రాజకీయ పరిస్థితులు వేగంగా మారిపోతున్నాయి. అభ్యుదయ శక్తులకు ఆశావహమైన పరిణామాలు వస్తున్నాయి. అనభ్యుదయ సిద్ధాంతాలకు, దోపిడీ శక్తులకు కాలం చెల్లే రోజులు వచ్చాయి. మంచో చెడో మన దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ స్థిరపడిందనే చెప్పాలి. మిలిటరీ నియంతృత్వాల బెడద రాకుండా ఉన్నంతలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కాపాడబడుతూనే వున్నాయి. కాని, ఇటీవలి పరిణామాలు అంత ఆనందదాయకంగా లేవు. దేశాన్ని ముక్కలు చేయడానికి విదేశీ శక్తులు కుట్రలు పన్నుతూనే వున్నాయి. లోపల కుల మతవాద శక్తులు, మితవాద శక్తులు, ప్రాంతీయ దురభిమానాలు, వేర్పాటు ధోరణులు మితిమీరుతున్నాయి. వీటికి వ్యతిరేకంగా రచయితలు తమ కలాలను వినియోగించవలసి వుంది.

కథ జనబాహుళ్యంలోకి చొచ్చుకుపోయిన ప్రక్రియ కాబట్టి దానితో ప్రజలను మరింత చైతన్యవంతులనుగా తీర్చిదిద్దవచ్చు. ఆ ప్రయత్నం మన రచయితలు ద్విగుణీకృతోత్సాహంతో చేస్తారని, విజయం సాధిస్తారనీ ఆకాంక్ష. చిరకాలంగా మానవ జాతి కలలు కంటున్న సమ సమాజ ఆవిర్భావంలో రచయితలు తమ వంతు పాత్ర తాము నిర్వహిస్తారని ఆశిద్దాం.

"ఏ దేశ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పర పీడన పరాయణత్వం." - శ్రీశ్రీ

# తెలుగు ముద్రణ-వికాసం

డాక్టర్ వి. లక్ష్మణరెడ్డి

తెలుగు ముద్రణ వికాసం గురించి తెలుసుకునే ముందు, ముద్రణ రంగంలో అనుసరిస్తున్న పద్ధతులలో ముఖ్యమైన వాటిని గురించీ, ఆ రంగంలో కాలక్రమంలో వచ్చిన మార్పులను గురించీ స్థూలంగా తెలుసుకుందాం.

## లిథోగ్రఫీ (శిలాముద్రణ):

రసాయన ద్రవ్యాలు పట్టించిన కాగితంమీద ఒక రకం సిరాతో; ముద్రించాలనుకున్న చిత్రాలూ, అక్షరాలూ మొదలైనవాటిని రాస్తారు. ఆ కాగితాన్ని రాతిపలకమీద పరచి ఒక యంత్రంలో పెట్టి నొక్కుతారు. అప్పుడు ఆ కాగితంమీద లిఖితమైన అక్షరాలూ, చిత్రాలూ; రసాయన ద్రవ్యాలు పూసిన ఆ రాతిమీద అంటుకుంటాయి. మళ్ళీ దానిపై కాగితాన్ని పరచి యంత్రంలో పెట్టి నొక్కితే రాతిమీద ఉండే విషయం కాగితంలో ముద్రితమవుతుంది. కాలం గడిచేకొద్దీ రాతిపలకకు బదులు అల్యూమినియమ్ ప్లేటు ఉపయోగించటం ప్రారంభించారు. చిత్రాలను రాయడం మానేసి ఫోటోలను ప్రతిరూపాలు చేయటం ప్రారంభించారు. లిథోగ్రఫీ ముద్రణకోసం ప్రత్యేకంగా యంత్రాలు వచ్చాయి. ఈ పద్ధతిలో గ్రంథాలనూ, చిత్రపటాలను ముద్రించటం మొదలుపెట్టారు. రవివర్మ రాసిన చిత్రాలను లిథోగ్రఫీ పద్ధతిలో ముద్రించారు. నిన్నమొన్నటిదాక ఉత్తర భారతంలో లిథోగ్రఫీ పద్ధతిలోనే గ్రంథ ముద్రణ కొనసాగింది. ముఖ్యంగా ఉర్దూ భాషాగ్రంథాలూ, వార్తాపత్రికల ప్రచురణలో ఈ పద్ధతి బాగా ప్రాచుర్యం పొందింది. తర్వాతికాలంలో గ్రంథముద్రణ విషయంలో ఈ పద్ధతి ప్రాధాన్యాన్ని కోల్పోయినప్పటికీ రంగు చిత్రాల ముద్రణ విషయంలో విశేష ప్రాచుర్యాన్ని సంతరించుకుంది. ముఖ్యంగా సినిమా వాల్ పోస్టర్లు మొదలైన వాటి ముద్రణకు ఈ పద్ధతినే ఉపయోగిస్తూవచ్చారు.

## ఆఫ్ సెట్ ముద్రణ:

తర్వాతి కాలంలో లిథోగ్రఫీ పద్ధతిలో ఆఫ్ సెట్ ప్రింటింగ్ ప్లేట్లను తయారుచేయటం ప్రారంభించారు. ప్రోసెస్ కాగితం, ప్లాస్టిక్ ద్రవ్యం కలిసి ఇది తయారవుతుంది. ఇది ఎటు వంచితే అటు వంగేటంత మృదువుగా నున్నగా ఉంటుంది. ముద్రించవలసిన విషయమంతా ప్రెస్‌ప్లేటుమీదికి పరివర్తనం పొందుతుంది. ఈ ప్లేటు మీద పరివర్తితమైన విషయం కాగితాల మీద ముద్రితమవుతుంది. ఒక్కొక్కప్పుడు ముద్రణ యంత్రంలో ఈ ప్లేటుకు పేపరుకు మధ్య రబ్బరు రోలర్‌ను ప్రవేశపెడతారు. సిరాపూసిన ప్లేటు నుంచి ప్రతిరూపం రబ్బరు రోలరుకు బదిలీఅయి ఆ తర్వాత పేపరుమీదికి వస్తుంది. అచ్చక్షర ముద్రణలో రబ్బరు రోలరు ఉండదు.

ఫోటో ద్వారా ప్రింటింగ్ ప్లేటును రూపొందించటం ఈ పద్ధతిలో వచ్చిన పెద్దమార్పు. తర్వాతికాలంలో ఫెటిటైపు సెట్టింగ్, కంప్యూటర్ సెట్టింగ్ మొదలైనవి రూపొందటానికి ఈ పద్ధతే పునాది వేసింది. అయితే, ఫోటో ఆఫ్ సెట్ ప్లేటు తయారుకావటానికి ఎక్కువ సమయం పట్టేది. 1960 ప్రాంతాల్లో ఈ పద్ధతి ద్వారా గంటకు 25,000 ప్రతులకన్నా ఎక్కువ ముద్రించటానికి వీలుపడలేదు.

ప్రతిరూపాన్ని ఆమ్లం సహాయంతో ప్రింటింగ్ ప్లేటుకు అచ్చాదించే పద్ధతికూడా తర్వాతికాలంలో రూపొందింది. ఇందులో కూడా ప్లేట్లను తయారు చేయటానికి ఎక్కువ సమయం పట్టేది. తర్వాతికాలంలో ఆమ్లాన్ని చేతితో కాకుండా యంత్రంద్వారా పట్టించటం ప్రారంభించారు.

## విడివిడి అచ్చక్షర ముద్రణ (లెటర్ ప్రెస్ ప్రింటింగ్):

ఒక్కొక్క అక్షరాన్ని ఒక్కొక్క సీసపు కడ్డీ నెత్తిమీద ఉబ్బెత్తుగ నిర్మిస్తారు. వీటినే టైపు (types) లంటారు. ఆ టైపు (అచ్చక్షరాలు)లను కంపోజిటర్లు (అచ్చక్షరాలను కూర్చేవాళ్ళు) రాతప్రతిలోని విషయాన్ని అనుసరించి కూరుస్తారు. కంపోజిటరు 'స్టిక్' సాయంతో అచ్చక్షరాలను ముందుగా కొన్ని పంక్తులలో కూర్చుకుని వాటిని గ్యాలీలోనికి (ఇత్తడి తట్ట) మార్చుతూ ఉంటాడు. అచ్చక్షరాలు కేసు (ముద్రాక్షర మంజూష)లలో ఉంటాయి. వాటినుంచి కావలసిన అచ్చక్షరాలను ఏరుకుంటూ కూర్చుసాగిస్తాడు. అలా కూర్చిన

అచ్చక్షరాలను ఒక చట్రంలో బిగించి ముద్రణకు సిద్ధం చేస్తాడు. ఆ చట్రాన్ని ముద్రాయంత్రం (మెషీన్)లో అమర్చి ముద్రణ కొనసాగిస్తాడు.

పందొమ్మిదో శతాబ్దంలోనే అచ్చుకూర్పును త్వరితం చేయటంకోసం కూర్పుపనిని యంత్రాలతో నిర్వహించే ప్రయోగాలు చేశారు. అందులో భాగంగా టైప్ పోతపోసే యంత్రాలు (Type cast Machines) కనుగొనే ప్రయత్నాలుచేశారు. ఆ కృషి ఫలితంగా మోనో, లైనోటైప్ యంత్రాలు వచ్చాయి.

## మోనోటైప్ యంత్రం (Mono Type Machine):

ఈ యంత్రాన్ని 1899 లో లండన్ నగరంలో టాల్‌బోట్ లాన్‌స్టన్ రూపొందించారు. ఇందులో కీ బోర్డు, కేస్టర్ – అనే ప్రత్యేక భాగాలుంటాయి. ఆపరేటర్ కీ బోర్డు నడిపిస్తాడు. కీ బోర్డు అతనిచ్చే సూచనల ననుసరించి పేపర్ రోల్‌కు రంధ్రాలు చేస్తుంది. కీ బోర్డు రూపొందించిన రంధ్రాల కాగితంలోని సందేశాలమేరకు కాస్టరు విడివిడిగా ముద్రాక్షరాలు పోతపోసి, క్రమంలో కూర్చిపెడుతుంది. ఒక్కొక్క పంక్తి కూర్పు అయిన తర్వాత ఆ పంక్తి గ్యాలీలోనికి నెట్టబడుతుంది. ఈవిధంగా ఈ యంత్రంలో టైపింగు, కంపోజింగు కూడా జరుగుతాయి. మామూలు ప్రెస్సులలో అచ్చక్షరాలు అరిగిపోతూ ఉంటాయి. కానీ ఈ మోనోపద్ధతిలో ఎప్పటికప్పుడే అచ్చక్షరం తయారై నిత్యనూతనంగా ఉండే ముద్రణను రూపొందిస్తుంది.

## లైనోటైప్ యంత్రం (Lino Type Machine):

దీన్ని బ్రిటన్‌లోని లైనోటైప్ మెషినరీ సంస్థ 1886 లో రూపొందించింది. ఇందులో టైప్‌రైటర్‌లో ఉండే కీ బోర్డులాంటి ఒక కీ బోర్డు ఉంటుంది. రాత ప్రతి ననుసరించి లైనోటైప్ ఆపరేటర్, కీ బోర్డు మీద కావలసిన 'కీ'లను ఒత్తుతూ లోహపు టైపుమాతృక (మేట్రిక్స్)లను కూరుస్తాడు. ఒక్కొక్క పంక్తి వరుసగా కూర్పు అయిన వెంటనే ఆపరేటరు లీవర్‌ను నొక్కుతాడు. అప్పుడు లైనోటైప్ యంత్రం అచ్చక్షరపంక్తిని పోత పోస్తుంది. ఇందులో పంక్తిగా ఏర్పడే అచ్చక్షరాలన్నీ ఒక కడ్డీగా రూపొందుతాయి. ఎక్కడైనా పంక్తిలో ఏ అక్షరమైనా తప్పు పడిందంటే పంక్తి అంతా తీసి వేయవలసిందే. మోనోలో ఈ క్లిష్టత లేదు.

ఇటీవలి కాలంలో లైనో టైపుయంత్రాల్లో ఎలక్ట్రాన్–1, ఎలక్ట్రాన్–2, ఎలక్ట్రాన్–3 – అనే వాటిని ప్రవేశపెట్టారు. ఇందులో మ్యాట్రిక్స్ కూర్పు త్వరితంగా జరిగి, పంక్తి పూర్తి అయిన వెంటనే వెలుపలకు పంపబడుతుంది. ఆ విధంగా అచ్చుకూర్పు త్వరితగతిని జరుగుతుంది.

## టెలిటైపు సెట్టర్:

ముద్రణరంగంలో – ముఖ్యంగా అచ్చక్షరాల కూర్పు – లో వచ్చిన అధునాతనమైన మార్పుల్లో మొదటిదిగా పేర్కొనదగింది టెలిటైప్ సెట్టర్ (టి.టి.ఎస్.). మోనోటైపు యంత్రం పనిచేసే సూత్రం దీనికి పునాది. ఇందులో కీ బోర్డు సహాయంతో కాపీ సిద్ధం చేయబడుతుంది. ఇందులో ఒక యంత్రం పంచ్ టేప్‌ను రూపొందిస్తుంది. దాన్ని ఉపయోగించి మరో యంత్రం సహాయంతో పంక్తులను రూపొందిస్తారు.

పంచ్‌టేప్‌మీద ఉన్న విషయాన్ని సరాసరి ప్రపంచంలోని వివిధ కేంద్రాలకు టెలిగ్రాఫ్ పద్ధతిలో ఒకేసారి అందించవచ్చు. ఒకచోట కాపీ తయారుచేసి వివిధ కేంద్రాలల్లో ఒకేసారి ముద్రించుకోవటానికి అవకాశం ఉన్న కారణంగా ఈ పద్ధతిని వార్తాపత్రికలు అనుసరిస్తున్నాయి. బ్రిటన్‌లో 'స్కాట్స్‌మేన్' అనే పత్రిక 1934 లో తొలిసారి ఈ పద్ధతిని ప్రవేశపెట్టింది. ఇందులో రూపొందించిన పంచ్‌టేప్‌లను తర్వాతికాలంలో ఉపయోగించుకోవటానికి వీలుంది. ఆవిధంగా ఈ పద్ధతి అచ్చుకూర్పే కాలాన్నీ, ఖర్చునూ తగ్గించింది.

## ఫోటోటైపు సెట్టింగ్ (ఫిల్మ్ సెట్టింగ్):

ఇది ముద్రణ చరిత్రలో ఒక మైలురాయి. అతి తక్కువకాలంలో, త్వరితగతిని ముద్రించే పద్ధతికి ఇది పునాదులు వేసింది.

ఈ పద్ధతిలో ఎలక్ట్రిక్ టైపురైటర్‌లోని కీ బోర్డు లాంటి కీ బోర్డునుంచి ఒక ఎలక్ట్రానిక్ సాధనం కావలసిన సంకేతాలను స్వీకరించి అచ్చక్షరాలను ఫిల్మ్‌పైన ఫోటోగ్రాఫిక్ పాజిటివ్స్‌గా రూపొందించుతుంది. ఆ తర్వాత ఫోటో మెకానికల్ ప్రాసెస్ ద్వారా ముద్రణకు అనువైన ప్లేటును తయారుచేస్తారు.

## కంప్యూటర్ టైప్ సెట్టింగ్:

ఫోటోగ్రఫీ ద్వారా టైపుసెట్టింగ్ గత శతాబ్దిలోనే ప్రారంభమైంది. అయితే, 1960 నుంచి ఫోటో టైప్‌సెట్టింగ్‌ను డిజిటల్ కంప్యూటర్‌తో కలుపబడటంవల్ల అది బాగా ప్రాచుర్యం పొందింది.

కంప్యూటరైజ్డ్ ఫోటో కంపోజింగ్‌లో అక్షరాలను టైప్ చేస్తున్నప్పుడు అవి వీడియో తెరమీద కనిపిస్తాయి. దీనివల్ల విషయంలో పొరబాటు రాకుండా సవరించటానికి అవకాశం కలిగింది. కంప్యూటర్‌లో అక్షరాల రకరకాల టైపులను నిక్షిప్తం చేసి ఉంచుతారు. కాబట్టి టైపు చేసిన అక్షరాలను కావలసిన టైపులో, పరిమాణంలో రప్పించుకోవచ్చు. మామూలు ఫోటోగ్రఫీలో వాడే బ్రొమైడ్ పేపరుపై ఈ

అక్షరాలు లేజర్ డాట్స్ రూపంలో కంపోజ్ అయివస్తాయి. ఇందులో అక్షరాలను కావలసిన పరిమాణంలో కుదించటం, లేదా పెంచటం చేయవచ్చు. ఈ పద్ధతి ఖరీదైంది.

## డెస్క్‌టాప్ ప్రింటింగ్ (డి.టి.పి.):

తక్కువఖర్చుతో కంపోజింగ్‌చేసే మరోపద్ధతి డెస్క్‌టాప్ ప్రింటింగ్ (డి.టి.పి.) విధానం. డి.టి.పిలో అక్షరాలను కీ బోర్డు ద్వారా టైపు చేస్తారు. టైపు చేసిన అక్షరాలు వీడియో తెరమీద కనిపిస్తాయి. ఫోటో కంపోజింగ్‌లో ఉండే అన్ని సౌకర్యాలు ఇందులోనూ ఉన్నాయి. అదనంగా కావలసినచోట గ్రాఫిక్స్ (చిత్రాలను) కంప్యూటర్ చిత్రీకరిస్తుంది. ఆ తర్వాత విషయం, చిత్రాలు మొదలైనవాటిని పెద్ద కెమెరాల సహాయంతో పాజిటివ్ ఫిల్మ్ మీదికి మారుస్తారు. ఈ ఫిల్మ్‌పై వచ్చిన ప్రతిరూపాన్ని ప్లేట్‌మీదికి బదిలీ చేస్తారు. ప్లేట్‌ను ప్రింటింగ్ మిషన్‌కు అమర్చి ప్రింట్ చేస్తారు. ఈ కార్యక్రమం మొత్తం అరగంటలో పూర్తి అవుతుంది.

కీ బోర్డు ద్వారా వీడియో స్క్రీన్ మీదికి విషయాన్ని తెప్పిస్తారు. స్క్రీన్‌మీద కనిపిస్తున్న అక్షరాలను పదాలుగా, పేరాలుగా కావలసిన స్థలంలోకి మార్చవచ్చు. కావలసిన సైజులకు కుదించటంగానీ, పెంచటంగానీ చేయవచ్చు. ఫోటోల రంగులను మార్చుకునే అవకాశం కూడా ఉంది.

ముద్రణ కార్యకలాపాలను వేగంగా నిర్వహించటం కోసం కంప్యూటర్లను ఉపయోగించటం నానాటికీ అధికమవుతోంది. ముద్రణరంగంలోని సమస్తమైన కార్యకలాపాలకూ కంప్యూటర్లను జోడిస్తున్నారు. లోహంతో పోతపోసే అచ్చక్షరాల కూర్పుకూ, ఫిల్మ్‌సెట్టింగ్ మొదలైన వాటికి గూడా కంప్యూటర్లను వినియోగిస్తున్నారు. పూర్వం అచ్చుకూర్పరి చేసే అన్నిపనులు ఈనాడు కంప్యూటర్లు నిర్వహిస్తున్నాయి. విషయాన్ని పంచ్‌డ్ కంప్యూటర్ టేప్‌మీద తక్కువ స్థలంలో, కావలసినంత కాలం స్టోర్ చేయవచ్చు. కాబట్టి, టెలిఫోన్ డైరెక్టరీలూ, రైల్వేటైమ్ టేబిల్స్ మొదలైన వాటిముద్రణలో కంప్యూటర్ టైప్‌సెట్టింగ్ ప్రాముఖ్యం వహిస్తుంది. విషయంలో సవరణలు చేయటానికి ఈ పద్ధతిలో సౌలభ్యం ఎక్కువ.

బ్రిటిష్ ప్రావిన్షియల్ వార్తాపత్రికలు – ముఖ్యంగా థామ్సన్ ఆర్గనైజేషన్, షార్ప్ షైర్ స్టార్ గ్రూప్ – కంప్యూటర్ టైప్ సెట్టింగ్ పద్ధతినే ఉపయోగిస్తున్నాయి. అమెరికాసంయుక్త రాష్ట్రాలలో కూడా వార్తాపత్రికల ముద్రణలో ఈపద్ధతి ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చింది.

## వీడియో డిస్ప్లే టెర్మినల్ (వి.డి.టి.):

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ముద్రణరంగంలో అనేకమైన మార్పులకు సహాయపడింది. కంపోజింగ్, ప్రాసెసింగ్, ప్రింటింగ్ మొదలైన ప్రక్రియలన్నీ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంవల్ల త్వరితంగా పూర్తిచేయటానికి వీలైంది. మోర్స్ టెలిగ్రాఫ్, గ్రాహంబెల్ టెలిఫోన్‌లు కనుగొనటం ముద్రణ రంగానికి కూడా దోహదపడింది. తర్వాతికాలంలో శబ్దాలను విద్యుదయస్కాంత తరంగాలుగా మార్చి వాయుతరంగాల మధ్యగా తీగలు లేకుండా ఒకచోటినుండి మరోచోటికి పంపే పద్ధతి వచ్చింది. దీంతో రేడియో, వైర్‌లెస్, టెలిప్రింటర్లు, కమ్యూనికేషన్ ఉపగ్రహాలు వచ్చాయి. ఇవన్నీ ముద్రణ రంగంలో ఎన్నో మార్పులకు కారణాలయ్యాయి. ఆధునిక సౌకర్యాలను సమకూర్చాయి. అందులో అత్యాధునాతనమైన పద్ధతి వీడియో డిస్ప్లే టెర్మినల్ (వి.డి.టి.). వి.డి.టి.లో టైపురైటర్ కీ బోర్డులాంటి కంప్యూటర్‌కీబోర్డూ, టెలివిజన్ పిక్చర్ ట్యూబూ ఉంటాయి. ఒక వ్యక్తి ఆ కీ బోర్డుమీద ఏదో సుదూర ప్రాంతంనుంచి విషయాన్ని టైపుచేస్తాడు. అలా టైపు అయిన ఆ విషయం మరోప్రదేశంలో ఆ కంప్యూటర్‌కు అనుబంధంగా ఉండే వీడియో స్క్రీన్ మీద కనిపిస్తుంది. అంటే, కంప్యూటర్‌కు అమర్చబడి ఉన్న కీ బోర్డుపై టైపు చేయబడిన అంశాలు మరోచోట దానికి అనుబంధంగా ఉండే వీడియో స్క్రీన్ మీద కనిపిస్తాయి. వాటికి అక్కడ మార్పులూ చేర్పులూ చేసే మెకానిజం చాలా సులభమైనది. చిత్రాలను చిత్రీకరించటంలో కూడా ఈ వి.డి.టి.లను ఉపయోగిస్తారు. ఈ మార్పులవల్ల బ్రోమైడ్లను అంటించే ఆర్టిస్టులు, ప్రూఫ్‌రీడర్లు కనుమరుగయ్యారు.

ఈ విధానం అమెరికాలో చాలా ప్రాచుర్యం పొందింది. లండన్‌లోని ఫ్లీట్‌స్ట్రీట్‌లో (ముఖ్యమైన పత్రికలన్నీ ప్రచురితమయ్యే వీధిపేరు) ఇప్పుడిప్పుడే ఈ పద్ధతి ప్రవేశించింది. ఇటీవలే డైలీ మిర్రర్, టైమ్స్‌లాంటి పత్రికలు ఈ విధానాన్ని ఆహ్వానించాయి. మన దేశంలో కంప్యూటర్ సహాయంతో విలేకరినుంచి నేరుగా వార్తలను అందుకునే ఏర్పాటు చేసిన మొదటి ఆంగ్ల దినపత్రిక 'ఇండియన్ పోస్ట్'. ఇంతవరకూ ఏ తెలుగు పత్రికా ఈ విధానం ప్రవేశపెట్టలేదు.

## ఫాక్సిమిలీ పద్ధతి:

ఈ విధానంలో పరాకాష్ఠ ఫాక్సిమిలీ. ఇందులో అక్షరాలూ, చిత్రాలూ మొదలైనవి చిన్నచిన్న బిందువులుగా స్కాన్ అవుతాయి. స్కానరులోని లేజర్‌బీమ్ విషయాన్ని చదువుతుంది. కాంతి ఎలక్ట్రానిక్స్‌గా పరివర్తన చెంది ఉపగ్రహంద్వారా ఇంకోచోటికి ప్రసారం అవుతుంది. ఆ కేంద్రంలో స్కానర్ తిరిగి వాటిని నెగెటివ్ రూపంలో అందిస్తుంది. ఇదంతా సెకనులలో జరిగిపోతుంది. విద్యుత్

వేగంతో విషయం అవతలి వారికి చేరుతుంది. ఈ పద్ధతిలోనే ఒక కేంద్రంనుంచి మరో కేంద్రానికి రూపొందించిన (మేకప్ చేసిన) పేజీని నిమిషాల్లో పంపుతున్నారు.

ఫాక్సిమిలీ పద్ధతి వాడకంలో 'ది హిందూ' ఆంగ్ల దినపత్రిక అనేకమైన ప్రయోగాలు చేసింది. మద్రాసులోని 'ది హిందూ' కేంద్ర కార్యాలయానికి వివిధ ప్రచురణ కేంద్రాలనుంచీ, దేశవ్యాప్తంగా ఉన్న విలేకరుల నుంచీ టెలిప్రింటర్లు, టెలిఫోను, టెలిగ్రాం, పోస్టు మొదలైన వాటిద్వారా వార్తలు అందుతుంటాయి. మద్రాసులో ఆ వార్తలన్నింటిని కంప్యూటర్ సహాయంతో ఫోటోటైపు సెట్టింగ్ చేయించి పేజీలు రూపొందిస్తారు. ఆ పేజీలను ఫాక్సిమిలి పద్ధతిలో ఇతర నగరాలలోని తమ ప్రచురణ కేంద్రాలకు క్షణాలలో చేరవేస్తారు. 1986 సెప్టెంబరు నుంచి 'ది హిందూ' తమ ఢిల్లీ ఎడిషన్‌కోసం ఉపగ్రహ సౌకర్యాన్ని వాడుకోవడం ప్రారంభించింది. మద్రాసులో రూపొందించిన 'ది హిందూ' పేజీలను ఇన్‌సాట్–బి ద్వారా ఢిల్లీ ప్రచురణ కేంద్రానికి చేరవేస్తారు. 'ఈనాడు' దినపత్రిక యాజమాన్యంవారు హైదరాబాద్‌నుంచి ప్రచురిస్తున్న ఆంగ్లదినపత్రిక 'న్యూస్‌టైమ్' పేజీలను ఫాక్సిమిలీ పద్ధతిలో విజయవాడకు చేరవేస్తున్నారు.

### స్కానింగ్:

నీలి, పసుపు, మెజంటా, నలుపు – అనే నాలుగు ప్రాథమిక రంగుల కలయికతో కాగితం మీద ప్రింట్ అయ్యే ప్రతిరంగుల చిత్రం ఏర్పడుతుంది. రంగుచిత్రాన్ని లేదా ఫోటోను స్కానింగు చేయటంవల్ల ఆ రంగులు విడిపోయి ఒక్కోరంగుకు ఒక నెగిటివ్ లభిస్తుంది. రంగుల వారీగా ప్లేట్లను తయారుచేసి మల్టికలర్ ఆఫ్‌సెట్ మిషన్‌కు అమర్చి రంగుల చిత్రాలను ప్రింట్ చేస్తారు. స్కానింగ్ చేసే క్రమంలో కంప్యూటర్ ద్వారా మాతృకలో లేని రంగులను నెగెటివ్స్‌లోకి రప్పిస్తారు.

ఈవిధంగా స్కానింగ్ ప్రక్రియ రంగుల ముద్రణలో మార్పుకు కారణమైంది.

ఇంతవరకూ అక్షరాల కూర్పులో వచ్చిన మార్పులను స్థూలంగా వివరించటం జరిగింది. ముద్రాయంత్రాలలో వచ్చిన మార్పులను గురించి కూడా స్థూలంగా తెలుసుకుందాం. విల్లెం జేన్స్‌జన్ బ్లో (Willem Janszion Blaew – 1571–1638) కొయ్యదిమ్మతో ఒక ముద్రాయంత్రాన్ని నిర్మించాడు. అది బ్లోగారి దారుమయ హస్త ముద్రాయంత్రం. (Blaeu's wooden hand press) గా పేరుగాంచింది. తర్వాతి కాలంలో అల్బియన్ (1753–1816), కొలంబియన్ అనేవారు బ్లోగారి ముద్రాయంత్రానికన్నా మెరుగైన వాటిని నిర్మించారు. ఈ యంత్రాలలో సిరా పట్టించటం, కాగితాలను పరచటం, ముద్రించటం మొదలైన పనులన్నీ చేతితోనే నిర్వహించేవారు. ఈ కారణంగా అతి తక్కువ సంఖ్యలో మాత్రమే ప్రతులు ముద్రించటానికి వీలుపడేది. గంటకు 2000 ప్రతుల వరకు ముద్రించేవారు.

స్వల్పకాలంలో అధికసంఖ్యలో ప్రతులు ముద్రించే యంత్ర నిర్మాణం చేయవలసిన అవసరం ఏర్పడింది. జర్మనీకి చెందిన ఫ్రెడ్రిక్ కోనిగ్ (Friedrich Konig) సిలిండరు ముద్రాయంత్రం (Cylinder Machine) కనుగొన్నారు.

తర్వాతి కాలంలో ముద్రాయంత్రాలకు సంబంధించిన పరిణామక్రమంలో సంభవించిన మార్పుల స్థూల వివరణ:

1. చిన్న తరహా ప్లేటను యంత్రాలు (Small Platen Machines):

వీటిని కాలితోగానీ, విద్యుచ్ఛక్తితోగాని నడుపుతారు. ఈ యంత్రసహాయంతో చిన్నచిన్న కరపత్రాలూ, బిల్లులూ మొదలైన వాటిని ముద్రించేవారు.

2. ఒంటి సిలిండరు యంత్రాలు (Single Cylinder Machines):

వీటిని వార్ఫడేల్సు (Wharfedales) అంటారు. పని వేగంగా సాగటానికి ఈ యంత్రాలు బాగా తోడ్పడ్డాయి. కాని, ఈ ముద్రాయంత్రాలద్వారా కాగితంలో ఒకపక్క మాత్రమే ముద్రించ వీలు కలిగింది.

3. రెండు సిలిండర్ల పరిపూరక యంత్రాలు (Perfecting Machines):

ఈ యంత్రాలద్వారా విభిన్న కార్యాలు చాలా వేగవంతంగా నిర్వహించబడతాయి. వీటిలో ప్రవేశించిన కాగితాలు రెండు పక్కల ముద్రించబడిన తర్వాతనే వెలుపలికి వస్తాయి. ఒకేసమయంలో కాగితానికి రెండువైపుల ముద్రిస్తాయి. కాబట్టి వీటిని పరిపూరక యంత్రాలన్నారు.

4. ద్విపరిభ్రమణ యంత్రాలు (Two revolution machines):

ఇందులో ఒకే సిలిండరు ఉన్నప్పటికీ, ఎక్కువ సంఖ్యలో ప్రతులను ముద్రించే ఏర్పాటు ఉండటంవల్ల రెండు సిలిండర్ల పరిపూరక యంత్రాల కన్నా ప్రాచుర్యం పొందాయి.

5. వలయగతి యంత్రాలు (Rotary Machines):

ఇవి చాలా పొడవైన కాగితం చుట్టలు ఉపయోగించి ముద్రణ నిర్వహించటానికి అనువైన రోటరీ మెషిన్లు. ఎక్కువసంఖ్యలో అమ్మకం అయ్యే వార్తాపత్రికలు, వార, పక్ష, మాసపత్రికలు మొదలైన వాటిని అధికసంఖ్యలో ముద్రించటానికి ఈ రోటరీ యంత్రాలు ఉపకరిస్తాయి. నిర్విరామంగా అతివేగంగా పనిచేసే రోటరీ యంత్రంలో ఎనిమిది కిలోమీటర్ల పొడవైన కాగితం చుట్టలను ముద్రించటానికి అవకాశం కలిగింది. ఈ రోటరీయంత్రంతో గంటకు 70,000 ప్రతులు ముద్రించవచ్చు.

6. ద్వివర్ణక యంత్రాలు (Two Colour Machines):

ఇందులో ఒక సిలిండరు ఉంటుంది. ముద్రాయంత్రం రెండు కొసలలో ఒక ముద్రణ తలమూ, వర్ణకోపకరణమూ అమర్చబడి ఉంటాయి. కొన్నిటిలో రెండు సిలిండర్లు కూడా ఉంటాయి. ఒకే సమయంలో రెండు రంగులను ముద్రించటానికి ఈ యంత్రంలో అవకాశం ఉంది.

ఒకే సమయంలో అనేక రంగులు ముద్రించటానికి అనువైన మల్టికలర్ ఆఫ్‌సెట్ యంత్రాలు కూడా తర్వాతికాలంలో వచ్చాయి.

ఇటీవలికాలంలో అనేక మార్పులతో ముద్రాయంత్రాలు అభివృద్ధిచెందాయి.

ముద్రాక్షరా (టైపు)లను గురించిన స్థూల వివరణ ముద్రణ వికాసాన్ని తెలుసుకోవటానికి ఉపయోగిస్తుంది. ముద్రాక్షరాల పరిమాణాలు (Bodies) పాయింట్ (Point) అనే కొలతను బట్టి నిర్ణయిస్తారు. ఒక పాయింట్ పైకా (Pica) అనే అక్షరప్రమాణంలో $\frac{1}{12}$ భాగం. పాయింట్స్‌ను ఆధారంగా తీసుకుని గ్రేట్ ప్రయిమర్ (Great Primer), ఇంగ్లీషు బాడీ (English body), లాంగ్‌ప్రయిమర్ (Long Primer) లాంటి అనేకరకాల అక్షర పరిమాణాలు నిర్ణయించబడ్డాయి. ఆ విధంగా 96 పాయింట్స్ పరిమాణంవరకు అచ్చక్షరాలు నిర్మించబడ్డాయి. అమెరికా, ఐరోపాల కొలతలను బట్టి పాయింట్ ప్రమాణం కొద్దిగా మారుతుంది.

అచ్చక్షరాల ముఖనిర్మాణంలో కూడా రోమన్ టైపులు (Roman types), ఆన్టిక్ టైపులు (Antique types), ఇటాలిక్ టైపులు (Italic types) అనే విధంగా రకరకాల తేడాలున్నాయి.

రోమన్ టైపులలో అక్షర ముఖాలు పలచగా ఉండి, సన్నని ఊర్ధ్వరేఖలు (Up stroke lines), కొద్దిపాటి స్థూల అధోరేఖలు (Down stroke lines) ఉంటాయి.

ఆన్టిక్ టైపులలో అక్షర ముఖాలు స్థూల ఊర్ధ్వరేఖలు, మరింత స్థూలాలైన అధోరేఖలు ఉంటాయి.

ఇటాలిక్ టైపులలో అక్షరముఖాలు కొద్దిపాటి వీటవాలుగా కుడివైపుకుగానీ, ఎడమవైపుకుగానీ ఒరిగి ఉండేటట్లుంటాయి.

పై మూడు రకాల భేదాలను పాటిస్తూ రకరకాల అక్షరముఖాలు కల్పించారు. ఒక్కొక్కరకంతో ఉన్న ముద్రాక్షర సముదాయం ఒక్కొక్క పేరుకు చెందిన అక్షర పరంపరగా (Type series) సూచించబడుతుంది. అలెక్జాండ్రా, అగస్టన్, చాట్సువర్తు, చెల్టనుహోం, క్లారెండన్, కొలంబియన్, డివైన్, జియార్జియన్, మెకాలె, సాక్సన్, షేక్స్‌పియర్, వేవర్లి లాంటి అచ్చక్షర పరంపర లెన్నో ఉన్నాయి. ఒక్కొక్క పరంపరలో $4\frac{1}{2}$ పాయింట్స్‌నుంచి 96 పాయింట్స్ వరకూ అచ్చక్షరాలు ఉన్నాయి.

ఇక తెలుగు ముద్రణ వికాసం గురించి స్థూలంగా తెలుసుకుందాం.

సి. పి. బ్రౌన్, తెలుగువాళ్ళ మధ్య 1806 ప్రాంతంలో ముద్రణ మొదలైనా 1830 దాకా అంతగా అభివృద్ధి సాధించలేదంటారు. తెలుగువారిమధ్య కాకపోయినా తెలుగు ముద్రణ పద్దెనిమిదో శతాబ్దం పూర్వార్ధంలోనే ప్రారంభమైంది. ఫోర్టు సెయింట్ జార్జి పుస్తక భాండాగారంలో 1719 నాటి పుస్తకాల జాబితాలో ఏ బైబిల్ ఇన్ జెంటూ పేర్కొనబడి ఉంది. జెంటూ అనే మాట తెలుగుకు పర్యాయంగా వాడతారు. కాబట్టి, అనాటికే తెలుగు బైబిల్ ముద్రితమైందని కొందరూహించారు.

ఆ రోజుల్లో తెలుగులో ముద్రణ సౌకర్యాలు లేవనీ, బహుశా తెలుగు బైబిలు రాతప్రతి ఆ పుస్తక భాండాగారంలో ఉండవచ్చుననీ, కాకుంటే జెంటూ తమిళభాషకు గూడా పర్యాయంగా వాడేవారనీ కాబట్టి, ఆ బైబిలు ట్రాంకుబార్‌లో అంతకు పూర్వమే అచ్చయిన తమిళభాషా బైబిలు కావచ్చని డాక్టరు జె. మంగమ్మగారు భావిస్తున్నారు.

## బెంజమిన్ షూల్జి కృషి:

డెన్మార్కు రాజు పంపిన జర్మనీదేశస్థులైన ప్రొటెస్టెంటు మతాచార్యుల రెండో జట్టులో బెంజమిన్ షూల్జి ఒకరు. ఈయన మొదటి తొమ్మిది సంవత్సరాలు ట్రాంకుబార్‌లో పని చేశారు. తరువాత 1728 లో మద్రాసుకు వచ్చారు. రెవరెండ్ బెంజమిన్ షూల్జి తెలుగు, తమిళం, హిందీ భాషలు అధ్యయనం చేశారు. మధురలో జెసూయిట్ మిషన్‌కు చెందిన రాబర్ట్ డినొబిలి అనే అయన 1606 ప్రాంతంలోనే సంస్కృతాంధ్ర తమిళాది భాషలు నేర్చిన ఐరోపీయుడు. తెలుగు మొదలైన భాషల్లో రోమన్ లిపిలో కొన్ని క్రైస్తవ మతగ్రంథాలు రచించాడు. అయితే తెలుగు భాషలో, తెలుగు లిపిలో గ్రంథ రచనకూడా చేయగల్గిన మొదటి ఐరోపీయుడనే కీర్తి బెంజమిన్ షూల్జిగారికి దక్కింది. ఈయన మద్రాసులో ఒక దశాబ్దంపాటు పని చేశారు. 1742 లో జర్మనీ వెళ్లారు. అనాటికి తెలుగులో ముద్రణ ప్రారంభం కాలేదు. ఈ విషయం గుర్తించిన షూల్జి తెలుగులో కొన్ని క్రైస్తవ మత పుస్తకాలు ముద్రించాలనే నిశ్చయానికి వచ్చాడు. ఆయన బైబులులోని కొన్ని భాగాలు, కొత్త నిబంధన, కొన్ని క్రైస్తవ ప్రార్థనా పుస్తకాలు తెలుగులోనికి అనువదించాడు. లాటిన్‌భాషలోని గ్రంథాలనుంచే ఈ అనువాదాలు కొనసాగించేవారు.

1742 ప్రాంతానికి భారతదేశంలో తెలుగు ముద్రణ సౌకర్యాలు లేకపోవటంవల్ల జర్మనీ దేశంలోని హాలీ పట్టణంలో తెలుగు పుస్తకాలు ముద్రించటానికి షూల్జి నిశ్చయించారు. ఆయన జర్మనీకి చేరుకున్న నాలుగు సంవత్సరాల తర్వాత

– అంటే 1746 లో హాలీ నగరంలో తెలుగు పుస్తకాలు ముద్రించారు. ఆయన ఆరు తెలుగు పుస్తకాలు అక్కడ ముద్రించారు. ఒక్కొక్క పుస్తకం ముఖపత్రం లాటిన్, తెలుగు – రెండు భాషల్లోనూ ముద్రించారు. హాలీ నగరంలో ప్రచురితమైన ఆరు పుస్తకాలు.

1. మోక్షానికి కొంచ్చుపోయే దోవ.
   (ఈ శీర్షికతో రెండు వేర్వేరు పుస్తకాలున్నాయి)
2. సత్యమైన వేదంలో వుండే జ్ఞానవుపదేశాల యొక్క సంక్షేపం.
3. బుద్ధి కలిగిన ... నూరు జ్ఞాన వచనాలయొక్క చిన్న పుస్తకం.
   (ఈ శీర్షికతో రెండు వేర్వేరు పుస్తకాలున్నాయి)
4. వక గురువు అఇదు బ్రాహ్మలయొక్క నడుమన పెద్ద–స్వామి మీద ప్రసంగించిన తఱ్ఱమితె.

ఈ పుస్తకాలన్నీ బ్రిటీషు మ్యూజియం లైబ్రరీలో ఉన్నాయి. సెరాంపూర్ లైబ్రరీలో గూడా రెండు పుస్తకాలు ఉన్నాయి. ఇందులో ఐదింటిని షూల్జి అనువదించారు. ఆరో గ్రంథం ఆయనే రచించారు.

పై పేర్కొన్న ఆరు పుస్తకాలలో మూడింటిని 1746లోనూ, తక్కిన మూడింటిని 1747 లోనూ ముద్రించారు. ఈ విధంగా తెలుగులో ముద్రణ జర్మనీదేశంలో హాలీ నగరంలో రెవరెండ్ బెంజమిన్ షూల్జి అనే మతాచార్యుడు ప్రారంభించాడు. అంతకు పూర్వం జాన్ ఫ్రెయరు అనే పాశ్చాత్యుడు 1698 లో మొదటిసారిగా తెలుగు లిపి ఉపయోగించాడు.

పై పుస్తకాలే కాక, షూల్జి రోమన్ లిపిలో గూడా కొన్ని తెలుగు పుస్తకాలు హాలీ నగరంలోనే ముద్రించారు.

బెంజమిన్ షూల్జి తర్వాత తెలుగు ముద్రణ విషయంగా సెరాంపూర్ మిషనరీల కృషి పేర్కొనవలసి ఉంది. విశాఖ పట్టణంలోని లండన్ మిషన్ సొసైటీకి చెందిన డెన్ గ్రేంజన్ అనే మతాచార్యుడు, జార్జి క్రాన్ – ఆనంద రాయల్ మొదలైన వారి సహాయంతో మత్తయి, లూకా, మార్కు సువార్తలు తెలుగులోనికి అనువదించారు. ఈ సువార్తలు సెరాంపూర్ ముద్రశాలలో 1812 లో ముద్రితాలయ్యాయి. విలియమ్ కారీగారు రచించిన తెలుగు వ్యాకరణం, 1814 లో సెరాంపూర్‌లో ముద్రితమైనది. 1812 లో జరిగిన అగ్నిప్రమాదంలో కారీగారు రచించిన తెలుగు వ్యాకరణం రాతప్రతి కాలిపోయింది. మరల ఒక ఏడాది కాలంలో కారీగారు సుభాశాస్త్రి సహాయంతో తెలుగు వ్యాకరణం రచించి, 1814 లో సెరాంపూర్ ముద్రణశాలలోనే ముద్రించారు. వీటి ప్రతులు బ్రిటీషు మ్యూజియం లైబ్రరీలోనూ, కలకత్తా జాతీయ పుస్తక భాండాగారంలోనూ లభిస్తాయి. 1818 లో "ఈశ్వరుని అన్ని మాటలు.... ఇదే ధర్మ పుస్తకము" అనే కారీగారు రచించిన 960 పుటల కొత్త నిబంధన సెరాంపూర్‌లో ముద్రితమయింది. ధర్మ పుస్తక! ఈశ్వరుడు:మె సమస్తవాక్యములను ప్రకాశము చేస్తున్నాడో! ఆ వాక్యములు, మోశహాని వ్యవస్థా మొ॥.... అనే పుస్తకం సెరాంపూర్‌లో ముద్రితమైన చివరి తెలుగు పుస్తకం. మెడ్రాస్ ఆక్సిలియరి బైబిల్ సొసైటీవారు దక్షిణ భారత భాషల్లో క్రైస్తవ మత గ్రంథాలు ముద్రించటం ప్రారంభించారు. సెరాంపూర్ మిషనరీలు తెలుగుముద్రణబాధ్యత పై సొసైటీ వారికి అప్పగించటానికి నిశ్చయించారు.

ఈవిధంగా తెలుగుదేశానికి సుదూర ప్రాంతమైన సెరాంపూర్‌లో తెలుగు ముద్రణ విషయమైన కృషి మహత్తరంగా జరిగింది. కలకత్తాలో గూడా తెలుగు ముద్రణ విషయంగా కొంత కృషి జరిగినట్లు తెలుస్తుంది. బ్రిటీష్ ఫారిన్ బైబిల్ సొసైటీవారు కలకత్తాలోని రాధా బజారులో కొనుగోలుకు లభించే భారతీయ భాషల మత గ్రంథాలలో "తెలింగా గాస్పెల్స్" రు. 4 లకు లభిస్తాయని ప్రకటించారు. దీన్నిబట్టి కలకత్తాలో తెలుగు ముద్రణలో కృషి జరిగి ఉండవచ్చని భావిస్తున్నారు.

## మద్రాసులో తెలుగు ముద్రణ:

సెరాంపూర్ తర్వాత తెలుగు ముద్రణ విషయంగా పేర్కొన వలసింది మద్రాసు. క్రీ.శ. 1812 లో మద్రాసులో ఫోర్టు సెయింట్ జార్జి కాలేజీ స్థాపించారు. 1816 కి పూర్వం చెప్పకోదగ్గ పుస్తకం ఏదీ మద్రాసులో ముద్రితం కాలేదు. ఫోర్టు సెయింట్ జార్జి కాలేజి తరఫున 1816 లో ఏ. డి. కాంబెల్ రచించిన తెలుగు వ్యాకరణం కాలేజీ ముద్రాశాలలో ముద్రితమైంది. 1817 లో విలియం బ్రౌన్ రచించిన తెలుగు వ్యాకరణం కూడా మద్రాసునుంచే ప్రచురితమైంది. 1819 ప్రాంతంలో మద్రాసులో మొదటిమారుగా తెలుగు ముద్రాక్షరాలు పోతపోసే పనులు చేపట్టారు. 1818 లో కాన్‌స్టైంటైన్ శాంపీ అనే ఆయన విలయం బ్రౌను రచించిన తెలుగు శబ్దావళి ముద్రించారు. 1819 లో ఫోర్టు సెయింట్ జార్జి కాలేజీలో అధ్యాపకులైన రావిపాటి గురుమూర్తిగారు రచించిన విక్రమార్క కథలు కాలేజి ముద్రాశాలలో ముద్రించారు. ఇది 104 పుటల గ్రంథం. ఏ. డి. కాంబెల్ రచించిన తెలుగు నిఘంటువు కాలేజి ముద్రాశాలలోనే 1821 లో ముద్రించారు. 1818 లో మెడ్రాస్ రిలిజియన్ సొసైటీ ప్రారంభమై 10 లక్షల పై చిలుకు క్రైస్తవ బోధనా పుస్తకాలు ప్రచురించింది. కారీ రచించిన కొత్త నిబంధన 1818 లో సెరాంపూర్‌లో ముద్రిత మయింది. అది ముద్రితమయిన కొంతకాలానికి గ్రీకు మూలంనుంచి ప్రిట్‌చెట్ అనువదించిన కొత్త నిబంధన మద్రాసులో బ్రిటీషు అండ్ ఫారిన్ బైబిలు

సొసైటీవారు మెడ్రాస్ కమర్షియల్ ప్రెస్‌లో ముద్రించారు. ఇది 891 పుటలతో రెండు సంపుటాలుగా ఉంది. 1818 లో మద్రాస్‌లో, మెడ్రాస్ ట్రాక్ట్ సొసైటీ స్థాపితమై లక్షల సంఖ్యలో పెక్కు భాషల్లో క్రైస్తవ బోధనా పుస్తకాలు ముద్రించింది.

వీటిలో తెలుగు భాషా పుస్తకాలు గూడా చాలా వున్నాయి. 1820 లో మెడ్రాస్ స్కూల్ బుక్ సొసైటీ స్థాపితమై, ఒక దశాబ్ద కాలంలో అనేక వాచకాలు, ఛందోగ్రంథాలు, వేమన పద్యాలు, పంచతంత్రం, విక్రమార్క కథలులాంటి వాటిని ప్రచురించింది. అంతకు పూర్వం తెలుగు బడుల్లో రాతప్రతుల రూపంలో సభాపర్వం, భాగవతంలో సప్తమ స్కంధం, నలోపాఖ్యానం, సుమతీ శతకం, అమరకోశంలాంటివి ఉపయోగంలో ఉండేవి. జె. సి. మోరిస్ రాసిన తెలుగు వాచకం 1823 లో ప్రచురితమైంది. ఇది కాలేజి ముద్రాశాలలో ముద్రితమైంది. సి. పి. బ్రౌన్ దొరగారి సంస్కృతాంధ్ర భాషల ఛందోగ్రంథం 1827 లో ముద్రితమైంది. జాన్ గార్డన్ రచించిన కొత్తనిబంధన 1829 లో మద్రాసులో చర్చిమిషన్ ముద్రాశాలవారు ముద్రించారు. ఇది 540 పుటల గ్రంథం. సి. పి. బ్రౌన్ ఇంగ్లీషు అనువాదంతో చేర్చి వేమన పద్యాలు 1829 లో కాలేజీ ముద్రాశాలలో ముద్రించారు. 1831 లో ప్రభుత్వ ముద్రాశాల ఫోర్టు సెయింట్ జార్జి గజెట్ ముద్రించటంకోసం స్థాపితమైంది. 1832 జనవరి నాలుగో తేదీన ఫోర్టు సెయింట్ జార్జి గజెట్ వెలుగు చూచింది. విలియం బ్రౌన్, కాంబెల్, జె. సి. మోరిస్, సి. పి. బ్రౌన్ అనే నలుగురు ఇంగ్లీషు దొరలు తెలుగు ముద్రణ విషయంగా ఎక్కువ శ్రద్ధ చూపారు.

## బళ్ళారిలో తెలుగు ముద్రణ:

మద్రాసు తర్వాత తెలుగు ముద్రణ విషయంగా పేర్కొనదగింది బళ్ళారి. బళ్ళారి మిషన్ 1812 లో స్థాపితమైంది. 1815 లో బళ్ళారి ట్రాక్ట్ సొసైటీ ప్రారంభమైంది. వీరు 1825 లో ముద్రాశాల స్థాపించారు. అంతకుముందే స్థాపించాలనుకున్నారుగాని ప్రభుత్వం అనుమతించలేదు. ఏ. డి. కాంబెల్ బళ్ళారి జిల్లా అధికారిగా ఉన్నకాలంలో ముద్రాశాల స్థాపించటానికి అవకాశం లభించింది. ఈ స్థాపన విషయంలో ఆయన ఎంతగానో సహాయ పడ్డారు. ఇక్కడ అనేక క్రైస్తవ బోధనా పుస్తకాలు ముద్రితమయ్యాయి.

మొదటి తెలుగు పత్రిక సత్యదూత బళ్ళారిలో ముద్రితమయ్యేదంటారు. కొందరు – ఈ పత్రిక ఇక్కడ అచ్చయి మద్రాసునుంచి ప్రచురిత మయ్యేదంటారు. సత్యదూత ప్రతులు ఎక్కడా లభించటంలేదు. కాబట్టి, అది ఎక్కడనుంచి ప్రచురితమయ్యేదీ చెప్పటం కష్టం. ఆ కాలంలో ట్రూత్‌ఫుల్ మెసింజర్ అనే పత్రిక ప్రచురితమయ్యేదని మిషనరీ రికార్డులలో పేర్కొనబడింది. ట్రూత్‌ఫుల్ మెసింజర్‌ను అనువదిస్తే సత్యదూత అవుతుంది. ఆ క్రైస్తవ పత్రాలు ఈ పత్రిక తెలుగుభాషలో వెలువడేదని ఖచ్చితంగా పేర్కొనటంలేదు.

బళ్ళారి మిషన్ ముద్రాశాల తీరికలేక ఎప్పుడూ ముద్రణ కార్యక్రమం కొనసాగిస్తూ ఉండేది.

## విశాఖపట్టణంలో తెలుగు ముద్రణ:

బళ్ళారి తర్వాత విశాఖపట్టణంలో తెలుగు ముద్రణ విషయంగా జరిగిన కృషి కొంత ప్రస్తావించవలసి ఉంది. 1804 లో లండన్ మిషన్ సొసైటీ మిషనరీలు విశాఖపట్నం వచ్చారు. అగస్టస్ డెస్ గ్రేంజస, జార్జి క్రేన్ అనేవారు తెలుగు నేర్చుకొని మత్తయి, మార్కు, లూకా సువార్తలు అనువదించారు. ఈ పుస్తకాలు తొలిదశలో సెరాం పూర్‌లో ముద్రితమయ్యాయి. విశాఖపట్టణం మిషన్‌కు చెందిన జాన్ గార్టన్, ఎడ్వర్ ప్రిట్చెట్ కొత్త నిబంధనను ఆంధ్రీకరించారు. ఇది 1818 లో మద్రాసులో ముద్రితమైంది. దీని రెండో ముద్రణ 1829 లో జరిగింది. మెడ్రాస్ ఆక్సిలియరీ బైబిల్ సొసైటీవారికిగాను విశాఖపట్టణంలో పాత నిబంధన ముద్రిత మయ్యింది. విశాఖలోని లండన్ మిషన్‌సొసైటీవారు తెలుగులో అనేక క్రైస్తవ బోధనలకు సంబంధించిన పుస్తకాలు ప్రచురించారు. విశాఖ పట్టణంలో లండన్ మిషన్‌వారు ముద్రాశాల స్థాపించారు.

తొలిదశలో క్రైస్తవ మతాచార్యులూ కుంఫిణీ ఉద్యోగులూ, తెలుగుముద్రణ విషయంలో విశేషమైన కృషి చేశారు. 1830 నుంచి తెలుగులో ముద్రణ బహుముఖంగా అభివృద్ధిపొందింది.

1835 నుంచి పాశ్చాత్యులేకాక దేశీయులు కూడా ముద్రాశాలలు నిర్వహించారు. తెలుగు, సంస్కృతం మొదలైన భాషలలో గ్రంథాలు ముద్రించటం ప్రారంభించారు. మద్రాసు మౌంట్‌రోడ్డులో సయ్యద్ రహిమతుల్లా ఒక చాపాఖానా నిర్వహిస్తుండేవారు. 1842 జూన్ 8 వ తేదీనుంచి ప్రారంభమైన 'వర్తమాన తరంగిణి' అనే తెలుగు వారపత్రికను ఈ ముద్రాశాలలోనే ముద్రించేవారు. కొంతకాలానికి ఈ పత్రికకు, ముద్రాశాలకు పువ్వాడ వెంకటరావు సర్వాధికారి అయ్యారు. 1852 నాటికి మద్రాసులో ఆంగ్లేయులు నిర్వహిస్తుండినముద్రాశాలలు కాక అధమపక్షం ఎనిమిది తెలుగు ముద్రాశాలలు భారతీయుల నిర్వహణలో పనిచేస్తుండినట్లు సి. పి. బ్రౌన్ దొర రాతలనుబట్టి తెలుస్తుంది. వాటిలో తెలుగు, తమిళ పత్రికలను ముద్రిస్తుండేవారని ఆయన, 1852 లో ప్రచురించిన తెలుగు – ఇంగ్లీషు నిఘంటువులో పేర్కొన్నారు.

కొన్ని తెలుగు ముద్రాక్షరాలు అచ్చుకూర్పరులకు చాలా విసుగు పుట్టించేవి. తెలుగు లిపిలో ఉన్న క్లిష్టతవల్ల తెలుగులో అచ్చుకూర్చటానికి (కంపోజింగుకు) చాలా ప్రయాసపడేవారు. ఉదాహరణకు అనాడు అచ్చులో ఉపయోగిస్తూవుండిన అర్ధచంద్రాకారంలో వేరొక వర్ణానికి కిందరాస్తూ ఉండిన రావడి (u) కూర్పు చాలా శ్రమ కలిగించేది. దీన్ని సి. పి. బ్రౌన్ తెలుగు శాసనాలలో ఉన్న గుర్తును నమూనాగ గ్రహించి "ౖ" "ౄ" ఇలాంటి రెండు రూపాలు కల్పించారు. ఈ సంస్కరణవల్ల కూర్పరులకు శ్రమ కొంతవరకు తగ్గింది. అచ్చుకూర్పు కొంతమేరకు వేగవంతమైంది. ఈ కొత్త రూపాలకు 'బ్రౌను రావళ్లు' అనే పేర్లు కల్గాయి.

ఇలాగే ప, వ, న, స ల విషయంలో లిపిలో ఉన్న సామ్యాన్నిబట్టి పొరపాటు పడటానికి అవకాశం ఉన్నదని గ్రహించి, కన్నడంలో ఉన్నట్లు ఈ అక్షరాలలో స్ఫుటంగా మార్పు కనపడే విధంగా టైపులు పోతపోయించి, సి. పి. బ్రౌన్ వాటిని వాడుకలోనికి తెచ్చారు. కాని, ఇవి తెలుగులో నిలిచినట్లు కనబడదు.

1860 – 70 మధ్యకాలంలో తెలుగు పుస్తకాలలో పుటలకు సంఖ్యలు వేయటం, పుటల ఉపరిభాగాల్లో పుస్తకాల పేర్లు ముద్రించటం, అవిధంగానే ఫుల్‌స్టాప్ (.), కామా (,), సెమీకోలన్ (;), కోలన్ (:), ప్రశ్నాచిహ్నం (?), రాగచిహ్నం (!) మొదలైన విరామ చిహ్నాలను ఉపయోగించి ముద్రించటం ప్రారంభించారు. ఫుట్‌నోట్సును సూచించే నక్షత్రం (*), బాకు (†) మొదలైన చిహ్నాలను ముద్రించటం కూడా పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్ధంలోనే ప్రారంభమైంది. పుస్తకాలలో అధ్యాయ విభజనలు చేయటం, పదాలమధ్య ఎడం (space) ఇచ్చి ముద్రించటంలాంటి కొత్త పద్ధతులు ఈ కాలంలోనే బాగా వాడుకలోనికి వచ్చాయి. తర్వాత కాలంలో ఈ విషయాలన్నీ చాలా ప్రాచుర్యం పొందాయి. తెలుగు ముద్రణ వికాసానికి బ్రౌన్ దొర చేసిన సేవ అపారమైంది.

బ్రౌన్ కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టినా, తెలుగు ముద్రణ పెక్కు లోపాలతో సాగుతూ వచ్చింది. గ్రేటు ప్రయిమరు హెడింగు, టూలైను ఇంగ్లీషు బాడీ, ఇంగ్లీషు బాడీ, లాంగు ప్రయిమరు – అనే అయిదు రకాలైన అచ్చక్షరాలే (Types) చాలా కాలంవరకు తెలుగు ముద్రణకు ఉపయోగిస్తూవచ్చారు. వీటిలో కూడా గ్రేటు ప్రయిమరు, ఇంగ్లీషు బాడీ అనే రెండు రకాల టైపులే తెలుగు గ్రంథముద్రణకు ఎక్కువ ఉపకరిస్తూ వచ్చాయి. కొంతకాలం తర్వాత వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు తెలుగు టైపులో గ్రేటు ప్రయిమరు పరిమాణంలో ఆంటిక్కులు (Antique types) – అంటే స్థూలాక్షరాలు ప్రవేశపెట్టారు. వీటితో బాలవ్యాకరణ సారస్య సర్వస్వ పేటిక, మేఘసందేశంలాంటి గ్రంథాలలోని సూత్రాలనూ, శ్లోకాలనూ ముద్రించటంవల్ల మూలాన్ని, వ్యాఖ్యానాన్ని గుర్తించటం తేలికైంది.

పై పేర్కొన్న టైపుల సహాయంతోనే మొన్నమొన్నటి వరకూ తెలుగు ముద్రణ సాగుతూవచ్చింది. 1935, 37, 38 సంవత్సరాలలో మద్రాసులోని కొన్ని టైపు ఫౌండ్రీల (ముద్రాక్షర నిర్మాణ సంస్థల)వారు 10 పాయింట్లనుంచి 108 పాయింట్లవరకూ పరిమాణాలు వున్న అచ్చక్షరాలు పోత పోశారు. వాటికి శంకర్, భవాని, మారుతి, రంగనాథ్ మొదలైన పేర్లు పెట్టారు. అవిధంగానే నెల్సన్ సీరీసులు (Series), నెల్సను ఆర్నమెంటల్ – అవుట్ లైన్ స్టార్‌లు (Ornamental types), ఆరుముగం సీరీసులు మొదలైనవి వెలువడ్డాయి. వ్యాపార ప్రకటనలకు అనుకూలించే పెద్దపెద్ద అచ్చక్షరాలను గూడా పోత పోయటం ప్రారంభించారు. పాయింట్ల పరిమాణ పద్ధతి ననుసరించి టైపుఫౌండ్రీలవారు రకరకాల టైపులను పోత పోశారు.

టైపు ఫౌండ్రీలవారు తెలుగు అచ్చక్షరాల సంఖ్యను తగ్గించటానికి ప్రయత్నించారు. ఒక టైపు ఫౌండ్రీవారు 14 పాయింట్లనుంచి 54 పాయింట్లవరకు అక్షరపరిమాణం ఉన్న తెలుగు అచ్చక్షరాల సంఖ్యను 428 కి వచ్చేటట్లు పోత పోశారు. మరొకరు 24 పాయింట్ల నుంచి 72 పాయింట్లవరకూ అక్షర పరిమాణం ఉన్న తెలుగు ముద్రాక్షరాల సంఖ్యను 266 కు కుదించారు. ఇంకొకరు 10 పాయింట్లనుంచి 24 పాయింట్లవరకు అక్షర పరిమాణం ఉన్న ముద్రాక్షరాల సంఖ్యను 405కు తెచ్చారు. ఇంకో ఫౌండ్రీవారు 30 పాయింట్లనుంచి 108 పాయింట్లవరకు అక్షర పరిమాణం ఉన్న ముద్రాక్షరాల సంఖ్యను 140 కి వచ్చేటట్లు అచ్చక్షర నిర్మాణ పద్ధతిలో కొంత మార్పు చేశారు. ఈవిధంగా తెలుగులో అచ్చక్షర సంఖ్యను కొంతవరకు తగ్గించే ప్రయత్నాలు టైపుఫౌండ్రీల వారూ – ముఖ్యంగా వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులులాంటి ప్రముద్రణకర్తలూ చేస్తూవచ్చారు.

కాని, 10 పాయింట్ల నుంచి 30 పాయింట్ల వరకు అక్షర పరిమాణం ఉన్న ముద్రాక్షరాల సంఖ్యను మాత్రం 405 కన్నా తగ్గించటం ఎవ్వరికీ సాధ్యం కాలేదు. ఇటీవల కాలంలో ముద్రణ సౌకర్యాలను దృష్టిలో ఉంచుకుని బందరులోని కళ్యాణీ టైప్ ఫౌండ్రీ అధిపతి కె.వి. కొండయ్యగారు తెలుగు అక్షరాల సొంపు చెడకుండా ముద్రణ యంత్రానికి ఒదిగే విధంగా టైపు తయారీ (Type casting) లో సాంకేతికమైన మార్పులు చేసి, 350కి తెలుగు లిపి రూపాలను కుదించారు. దీన్ని 'కళ్యాణీ టైపు' అన్నారు. నన్నయ, తిక్కన, ఎర్రన, శ్రీనాథ, పోతన మొదలైన మహాకవుల పేర్లతోనూ తనపద్ధతిలో అనేక రకాలైన ముద్రాక్షర పరంపరలు (Type

series) ముద్దులొలికే మోములతో రావలసిన అవసరం ఎంతైనా ఉంది.

సాంకేతికరంగం సాధించిన ప్రగతివల్ల స్వల్ప ప్రయాసతో తక్కువ వ్యయంతో పుస్తక ముద్రణ జరిగే పరిస్థితులు సమకూరాయి. ఫలితంగా తక్కువ వ్యవధిలో అచ్చుకూర్చి తక్కువ వ్యయంతో తెలుగు పుస్తకాలను ముద్రించవలసిన అవసరం ఏర్పడింది. దీనికి తెలుగులిపి ప్రతిబంధకమైంది. అది ముద్రణకు అనుకూలంగా లేదు. గుణింతపు గుర్తులు (తలకట్టులు, గుడులు, సుడులు) మొదలైనవి అక్షరానికి పైనా కిందా ఉండటం, సంయుక్తాక్షరాలు, ద్విత్వాక్షరాలూ, వీటి గుర్తులు కొన్ని సూటిగా అక్షరం కింద ఉండటం, అక్షరాలు అధికంగా ఉండటం అనే అంశాలు తెలుగులిపిలోని క్లిష్టతకు ముఖ్యమైన కారణాలు. ఇలాంటి క్లిష్టతల వల్లే తెలుగులో పుస్తకముద్రణ వేగంగా జరగటంలేదు. లోపాలను తొలగించి తెలుగు లిపి సంస్కరణ తప్పనిసరిగా జరగవలసిఉంది.

మనమీనాడు కంప్యూటర్ యుగంలో పురోగమిస్తున్నాం. పరిణామాలను ఆహ్వానిస్తున్నాం. సంప్రదాయాలలో సార వంతమైన వాటిని నిలబెట్టుకోవటానికి కృషి చేస్తున్నాం. వేగం నేటి యుగధర్మం. ఈ వేగానికి తట్టుకోలేనిదేదీ నిలవదు. మందకొడిగా అక్షరాలు కూడా నడకసాగించలేవు. తెలుగుభాషకు ఇదొక సంధియుగం. మద్రాసులో మురళీకృష్ణ అనే యువకుడైన ఇంజినీర్ బాపు అక్షరాలతో సహా అందంగా అక్షర స్వరూపాలకు కంప్యూటర్ ప్రింటింగ్‌కి అనువుగా కీ బోర్డులు రూపొందించారు. లిపిని ఇంకా సంస్కరించి తెలుగుభాషా స్వరూపాన్ని ఆధునికీకరించటానికి ప్రయత్నించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

*"కళ ప్రజలది. ప్రజల జీవితపు లోతుల్లోకి దాని వేళ్లు విస్తరింపచేయాలి. ప్రజల మనోభావాలకు, ఆవేశాలకు, కాంక్షలకు సమన్వయాన్ని సాధించి, సమైక్యపరచి వారిని సముద్ధరించాలి."* – లెనిన్

# ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం (1839 - 1950)

కళాప్రపూర్ణ పాతూరి నాగభూషణం

ఆంధ్ర – తెలంగాణా ప్రాంతాలలో గ్రంథాలయోద్యమం వేరు వేరుగా ప్రజా ఉద్యమంగా సాగినది. ప్రజల సామూహిక శక్తిని సమీకరించి వ్యవస్థాగతమైన మార్పుకోసం దీర్ఘకాలం జరిపిన పోరాటాన్ని సాంఘిక ఉద్యమం అంటారు. పూర్తిగా ప్రజల భాగస్వామ్యంతో నడిచిన గ్రంథాలయోద్యమం ఇలాటిదే. గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకట రమణయ్యగారు చెప్పినట్లు ఈ ఉద్యమం "స్వయంభువు" గా ప్రజల్లో నుంచి పెల్లుబికి పైకి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమ దినాలలో తెలుగు జాతి జీవితాన్ని ప్రభావితం చేసింది. తెలుగునాట వెలసిన అనేక ప్రజా ఉద్యమాలు కాలగర్భంలో కలసి పోగా ఇది నేటికీ నిలిచి ఉంది. ప్రజాహితంగా పనిజేస్తూ ఉంది.

## 1886 లో మొదటి గ్రంథాలయం:

అభివృద్ధికరమగు పనులలో ఆంధ్రదేశం వెనుకబడటం ఉండదు. అయితే ఇక్కడ ప్రజల క్షేమాన్ని గురించి ఆలోచించే ప్రభుత్వం లేదు. నాడు మనం పరాధీన స్థితిలో ఉన్నాము. కనుక ఈ పనికి ప్రజలే నడుము కట్టినారు. వారికివారే దేశంలో అక్కడక్కడ గ్రంథాలయాలను స్థాపించుకొని నడిపినారు. వేళ్లమీద గ లెక్కబెట్టదగినవైనప్పటికీ 19 వ శతాబ్దంలోనే ఆంధ్రదేశంలో గ్రంథాలయాలు బయలుదేరినవి. ఇవి ఎక్కడెక్కడ బయలుదేరినదీ తెలిసికొనుటకు మనకు ఖచ్చితమైన ఆధారాలు లభించవు. ఇంతకు పూర్వం 1886 సం॥ లో విశాఖపట్నంలో ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసిన శ్రీ మంథిన ఆదినారాయణమూర్తి స్థాపించిన సరస్వతీ గ్రంథాలయం ఆంధ్రదేశపు మొట్టమొదటి పౌర గ్రంథాలయంగా పెద్దలు నిర్ణయించినారు. దీనికి ముందే 1839 సం॥లోనే బ్రిటిష్ జడ్జి జేమ్స్ థామస్ రాజమండ్రి పట్టణంలో ఒక రీడింగు రూమును స్థాపించినట్లును, దీనిలో దినసరి 100 మంది పాఠకులు హాజరై చదువుకొంటూ వుండినట్లును తెలుస్తున్నది. ఇప్పటికి దీనినే మన తెలుగునాటి మొదటి పౌర గ్రంథాలయంగా పరిగణించవలసియున్నది. పై రెండు గ్రంథాలయాలకు పిమ్మట 19 వశతాబ్దంలో పులివెందుల (కడప జిల్లా), ఒంగోలు, విజయనగరం, ఉండి, కుముదపల్లి, (ప.గో.జిల్లా) రాజమండ్రి మున్నగు స్థలాలలో గ్రంథాలయాలు నెలకొల్పబడినవి. వీటికి బయటవారి ప్రోత్సాహం గాని, ప్రమేయం గాని ఉన్నట్లు కానరాదు. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క పనిపట్ల ప్రజలెక్కువ మక్కువ చూపుచుండుట మన కనుభవమే. ఆ రోజులలో తెనుగులో దినపత్రిక కూడ ఉన్నట్లు తెలియదు. రేడియో యంత్రమింకా మన దేశానికి దిగుమతి కాలేదు. దూర ప్రయాణానికి తగిన యాన సౌకర్యాలు కూడా ఎక్కువగా లేవు. చదువుల విషయంలో కూడ ఎక్కువ కృషి జరగలేదు. అందుచేత అధిక సంఖ్యలో గ్రంథాలయాలు దేశవ్యాప్తంగా బయలుదేరలేదు. వ్రేళ్ళమీద లెక్కపెట్టదగినన్ని మాత్రమే యేర్పడినవి.

20 వ శతాబ్ది ఆరంభంలో హైద్రాబాదులో శ్రీకృష్ణదేవ రాయాంధ్రభాషా నిలయం (1901), ఏలూరులో హిందూ యువజన సమాజ గ్రంథాలయం (1904), హనుమకొండలో రాజ రాజ నరేంద్ర ఆంధ్రభాషా నిలయం, వరంగల్లులో శబ్దానుశాసన ఆంధ్ర గ్రంథాలయం, తెనాలి తాలూకా పెదపాలెంలో ఆర్యబాల సమాజం (1905) నెలకొన్నవి. అప్పటికి ఆంధ్రదేశం మొత్తంపై 21 గ్రంథాలయాలు మాత్రం లెక్కకు వచ్చినవి.

శ్రీ వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమం ఆ రోజులలో బయలుదేరినది. బంగాళా విభజనతో విజృంభించిన వందేమాతరోద్యమం ఆంధ్రదేశంలో గొప్ప సంచలనాన్ని కలి

గించినది. దీనితో మాతృభాషపై అభిమానం మొలకెత్తినది. తెలుగులో పుస్తకాలు, పత్రికలు విరివిగా వెలువడినవి. వీటి ప్రచురణ గ్రంథాలయాల స్థాపనకు దోహదం చేసింది. క్రమంగా గ్రంథాలయాల సంఖ్య పెరిగినది. 1913 వ సం॥ నాటికివి 123 ఏర్పడినవి. 1910 వ సం॥ బెజవాడలో బయలుదేరిన శ్రీ రామమోహన ధర్మ పుస్తక భాండాగార కార్యకర్తలైన గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకట రమణయ్య, సూరి వెంకట నరసింహశాస్త్రి గారలు ఆంధ్రదేశంలోని గ్రంథాలయాల నిర్వాహకు లందరినీ సమావేశపరచుటకు సంకల్పించుకున్నారు. 10-4-1914 వ తేదీన ఆంధ్రదేశ గ్రంథ భాండాగారులను బెజవాడలో సమావేశపరిచినారు. దీనికి కవిశేఖర శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారిని అధ్యక్షులుగ ఆహ్వానించారు. ఈ సభకు గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలలోను; హైదరాబాదు సంస్థానంలోను గల 60 గ్రంథాలయాల నుండి 200 మంది ప్రతినిధులు హాజరైనారు. ఈ సభలో జరిగిన ప్రసంగాలు, సభాధ్యక్షులు తన ఉపన్యాసాంతమున ప్రవచించిన దిగువ సూక్తులు సభలో నున్నవారి నుత్తేజపరచినవి.

"వాయు వెల్లవారికి నెట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడా అట్లు స్వాధీనము కావలయును
ఉదక మెల్లవారికి నెట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానము అట్లు సేవ్యమై ఉండవలెను
సూర్య చంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగ నున్నదో
జ్ఞానమును అట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును"

దీనిపై వారి ఆదర్శాన్ని అమలు చేయుటకు సంఘము నొకదానిని స్థాపించుటకు నిర్ణయించుకొన్నారు. దీనికి "ఆంధ్ర దేశ గ్రంథ భాండాగార సంఘ" మని పేరు పెట్టుకు న్నారు. ఈసంఘానికి వీరొక కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. దీనికి శ్రీమోచర్ల రామచంద్రరావు పంతులు అధ్యక్షులు. శ్రీయుతులు చిలకమర్తి లక్ష్మీనరసింహం, సూరి వెంకట నరసింహశాస్త్రి ఉపాధ్యక్షులు. శ్రీయుతులు అయ్యంకి వెంకట రమణయ్య, నాళం కృష్ణారావు కార్యదర్శులుగా ఎన్నికైనారు.

ఈ సంఘ స్థాపనతో ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి చక్కని చేయూత చిక్కినది. శ్రీయుతులు సూరి వెంకట నరసింహ శాస్త్రి, అయ్యంకి వెంకట రమణయ్య గార్ల నాయకత్వాన ఈ సంఘం ఆంధ్రదేశంలో గ్రంథాలయాల వ్యాప్తికి గొప్పగా కృషిచేసినది.

## దేశోద్ధారకుని తోడ్పాటు:

ఈ ఉద్యమానికి తోడ్పడిన వారిలో దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రముఖులు.

వీరు 'ఆంధ్ర గ్రంథమాల'ను ప్రారంభించి, దీని పక్షాన ఎన్నో ఉత్తమ గ్రంథాలను వెలువరించినారు. 'భారతి' మాస పత్రికను కూడా ప్రారంభించినారు. తమ పత్రికలను, పుస్తకాలను వీరు అనేక గ్రంథాలయాలకు తగ్గింపు రేట్లకు, ఉచితంగా కూడా కొంతకాలం సరఫరా చేసినారు. వీరు ఎన్నో గ్రంథాలయాలను దర్శించి, వాటి వార్షికోత్సవాల కధ్యక్షత వహించి చక్కటి తమ సందేశాల ద్వారా ప్రజానీకంలో గ్రంథాలయాల పట్ల మక్కువను పెంచినారు. వారి సేవలో గణనీయమైనది 'ఆంధ్ర వాఙ్మయ సూచిక' ప్రచురణ. దీనిలో సాహిత్య సృష్టి ఆరంభం నుండి 1927 సం॥ వరకు తెలుగులో బయలుదేరిన లిఖిత ప్రతుల, అచ్చు పుస్తకముల పట్టికను అకారాదిగా కూర్చినారు. దీనిలో పుస్తకం పేరు, గ్రంథకర్త, విషయం, ఛందస్సు, ముద్రణ సంవత్సరం వగైరా వివరాల నిచ్చినారు.

బరోడాలో మహారాజు తోడ్పాటుతో ప్రారంభమైన ఉద్యమం మనకు కొంతవరకు ప్రోత్సాహాన్ని ఇచ్చింది.

గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషోద్యమం గ్రంథాలయోద్యమానికి ఎంతగానో తోడ్పడినది.

## ఇతర ఉద్యమాలకు చేయూత:

వ్యావహారిక భాష, పుస్తకాలు, పత్రికల ప్రచురణ వ్యాప్తి చెందటంతో గ్రంథాలయాలు వృద్ధి చెందుట కవకాశం కలిగినది. ఈ గ్రంథాలయాలు తిరిగి ఎన్నో ఉద్యమాలకు చేయూత నిచ్చినవి. కనుకనే దీనిని మన పెద్దలు ఉద్యమాలన్నిటికీ మూలకందమని, జీవదాయిని యని, జ్ఞాన దాయిని యనీ పేర్కొన్నారు. అనిబీసెంటు, లోకమాన్య బాలగంగాధరతిలక్ సాగించిన హోంరూల్ ఉద్యమానికి, మహాత్మా గాంధీ నాయకత్వాన నడచిన సహాయ నిరాకరణం, సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలకు గ్రంథాలయాలు చాలా దోహదం చేసినవి. సంఘ సంస్కరణాన్ని, సాంఘిక సేవను ఇవి ఎంతో ప్రోత్సహించినవి. రాజకీయోద్యమాలు విజృంభించిన సమయాలలో గ్రంథాలయ నిర్వాహకులు అధికంగా వీటిలో పాల్గొనడం జరిగినది. దీనివలనను, కార్యకర్తలు కొందరిలో ఉత్సాహం సన్నగిల్లటంతోను కొన్ని గ్రంథాలయాలు మూతపడినప్పటికీ, మరికొన్ని తావులలో నూతన గ్రంథాలయాలు బయలుదేరుతూ వచ్చినవి.

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం కృషి:

గ్రంథాలయోద్యమ వ్యాప్తి నిమిత్తం ఏర్పాటు చేయబడిన

ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘం కొంతకాలానికి తన పేరును ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘముగా మార్చుకొన్నది. దీని పక్షమున నడచిన కార్యకలాపాల వివరాలను తెలుసుకోవడమవసరం.

మహాసభలు : బెజవాడలో జరిగిన ఆంధ్రదేశ గ్రంథ భాండాగారుల సభ ఫలితంగా ఏర్పడిన ఈ సంఘం ఏటేటా జరిపిన మహాసభల ద్వారా ప్రజలలో జరిగిన ప్రచారం ఎన్నదగినది. కార్యకర్తలు అప్పుడప్పుడు కలుసుకొని, తమ తమ అనుభవాలను పరస్పరం తెలుపుకొని, తమ సమస్యలకు పరిష్కార మార్గాలను అన్వేషించడం ద్వారా కూడా ఉపయోగం జరిగింది. ఇటీవలి కాలంలో మహాసభల నిర్వహణంలో మంద గమనం ఏర్పడినందున గత 70 సంవత్సరాలలో మొత్తం 34 మహాసభలు మాత్రమే జరిగినవి. ఈ సభలతోపాటు చాల తావులలో గ్రంథాలయ ప్రదర్శనలు కూడ నిర్వహించినారు.

పత్రికలు : ఈ సంఘ పక్షమున 1915 సంవత్సరములో ప్రారంభింపబడిన "గ్రంథాలయ సర్వస్వము" త్రైమాసిక పత్రికగా ప్రారంభింపబడి, తదుపరి కొంతకాలం ద్వైమాసిక పత్రికగా సాగి, చివరకు మాస పత్రికగా రూపొందినది. 1939–41 సంవత్సరాల మధ్య ఈ పత్రిక ప్రచురణ నిలిచిపోయినప్పుడు "ఆంధ్ర గ్రంథాలయం" పేరుతో 2 సంపుటములు ఆంధ్రాంగ్లభాషల్లో త్రైమాసిక పత్రిక నడచినది. ఈ పత్రికలలో గ్రంథాలయ, వయోజన విద్యలకు సంబంధించిన వార్తలు, వ్యాఖ్యలు, వ్యాసములతోపాటు సాహిత్య చారిత్రక విషయములు, ఆధునిక కవితలు, నిర్మాణ కార్యక్రమమునకు సంబంధించిన రచనలు, ఆధ్యాత్మిక విషయములు, గ్రంథసమీక్షలు ప్రచురించబడినవి.

### సంఘ ఇతర ప్రచురణలు:

సంఘ పక్షమున పై పత్రికలే గాక 23, 24, 25, 26, 27, 28 గ్రంథాలయ మహాసభల సంచికలు 1915, 1916 సంవత్సరములలో ఆంధ్ర దేశంలోని గ్రంథాలయాల చరిత్రలు, కొన్ని సంవత్సర నివేదికలు ప్రత్యేకంగా వెలువరించబడినవి. గ్రంథాలయాలకు సంబంధించిన చిరుపొత్తములు 5 సంఘ స్థాపకులు శ్రీ అయ్యంకి వారి షష్టిపూర్తిని పురస్కరించుకొనియు, 6 గ్రంథములు సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారి షష్టి పూర్తి సమయమునకు ప్రకటించబడినవి. సంఘ స్వర్ణోత్సవ సందర్భమున "గ్రంథాలయ ప్రగతి" శీర్షికతో 3 భాగములు ప్రచురించబడినవి. గ్రంథాలయములు, వయోజన విద్యలకు సంబంధించిన పై గ్రంథములతోపాటు డా॥ కట్టమంచి రామలింగారెడ్డి రచన "ముసలమ్మ మరణము", శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారి రచన "తెలుగు నుడిదండలు", ఆంధ్ర గ్రంథములు – మొదటి జాబితా, ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ సూచిక (సంపాదకుడు పాతూరి నాగభూషణం) శ్రీ సర్వోత్తమ జీవితము (కర్త: మాదాల వీరభద్రరావు) వయోజన విద్య మొదటి పుస్తకము శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావు తిలక్ మహాశయుని వేద కాల నిర్ణయము, వయోజన విద్య – ప్రబోధ గీతాలు (కర్త : కోగంటి దుర్గా మల్లికార్జునరావు), గ్రంథాలయ శాస్త్ర సంబంధమైన పుస్తకాలు 7 సంఘ పక్షమున ప్రచురింపబడినవి.

### గ్రంథాలయ శిక్షణ:

సుశిక్షితులైన కార్యకర్తలు ఏ ఉద్యమానికైనా అవసరం. ఈ సంగతిని గ్రహించిన సంఘ నిర్వాహకులు 1920 వ సంవత్సరములో వేసవిలో మొదటిసారిగా 20 మంది గ్రంథాలయ సేవకులకు ఒక నెలపాటు శిక్షణ యిచ్చినారు. తిరిగి 1934 వ సంవత్సరము వేసవిలో విజయవాడలో మరియొక శిబిరాన్ని నెలరోజులపాటు నిర్వహించినారు. మూడవ పర్యాయం 1941 వేసవిలో పడమటలోని శ్రీ అచ్చయ్య ధర్మ గ్రంథాలయంలో గ్రంథాలయ ప్రవేశిక తరగతి జరిగినది. ఆ పైన రేవేంద్రపాడు, పెద్దపాలెం (తెనాలి తాలూకా), గరికపర్రు (కృష్ణాజిల్లా) మున్నగు ప్రదేశాలలో కూడ ఈ తరగతులను నిర్వహించినారు. దీనికి పైన 'గ్రంథాలయ విశారద' తరగతిని పెదపాలెంలోనూ, విజయవాడ శ్రీ సర్వోత్తమ భవనములోను నడిపినారు. ఇవిగాక వివిధ ప్రాంతాలలో 3 రోజుల నుండి వారం రోజుల పాటు తాత్కాలిక శిక్షణ శిబిరాలు అప్పుడప్పుడు నిర్వహించబడినవి.

### గ్రంథాలయ యాత్రలు:

ప్రచార కార్యక్రమాలలో ఇదియొక విశిష్టమైనది. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు దీనిని ప్రవేశపెట్టినారు. ఒక ఫిర్కానుగాని, తాలూకానుగాని ఎన్నుకొని, ఒక వారంనుండి నెల రోజుల పర్యంతం సుమారు 12 మంది కార్యకర్తలు 6 జట్లుగా ఏర్పడి ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. మొదటి జట్టువారు ముందుగా తామెంచుకున్న గ్రామానికి పోయి యాత్రికుల రాకను గ్రామస్థులకు తెలిపి వీరి స్వాగతానికి వారిని సన్నద్ధులను చేస్తారు. రెండవ జట్టువారు వారి గ్రామంలో ప్రవేశించి 'నగర సంకీర్తన' చేస్తారు. 3 వ జట్టు సమావేశ స్థలంలో ప్రదర్శన ఏర్పాటు చేస్తారు. నాల్గవ జట్టువారు ప్రజలను ఆకర్షించుటకై గ్రామ్‌ఫోను సంగీతం, ఇతర కాలక్షేపాలు నిర్వహిస్తారు. 5 వ జట్టువారు సభ నిర్వహణ ఏర్పాటు చేస్తారు. 6 వ జట్టువారు మ్యాజిక్ లాంతరు సహాయంతో ప్రసంగాలు చేస్తారు. దీనితో చక్కని ప్రబోధం జరిగి, గ్రంథాలయ స్థాపనకు, పునరుద్ధరణకు, అభివృద్ధికి గ్రామంలో వాతావరణం ఏర్పడుతుంది. దీనికి అవసరమైన చర్యలు గైకొని పిమ్మట తదుపరి చేరవలసిన గ్రామానికి యాత్రికులు తరలిపోతారు. ఈ కార్యక్రమం

పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో హెచ్చుగా నడిచింది. మంచి ఫలితాలను ప్రసాదించింది.

### సలహాలు, సమాచారం:

పైన పేర్కొన్న కార్యకలాపాలేగాక సంఘ కార్యాలయం జరిపే ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా యీ సంఘం గ్రంథాలయాలకు తోడ్పడుతూ వుంటుంది. గ్రంథాలయాలను నడుపుటలో నిర్వాహకు లెదుర్కొను చిక్కులకు పరిష్కారాలను సూచిస్తూ వారి సందేహాలను తీరుస్తూ వుంటుంది. గ్రంథాలయ స్థాపనకు, సొసైటీల చట్టం క్రింద వీటిని రిజిస్టరు చేయుటకు, గ్రంథాలయాలు ప్రభుత్వ సహాయం పొందేందుకు అవసరమైన సమాచారాన్నిస్తున్నవి.

### కార్యాలయమునకు స్థిర వసతి:

వదాన్యులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారి తోడ్పాటుతో 1933 వ సంవత్సరములో సంఘానికి ఒక ఎకరం స్థలం బెజవాడలో కొని, 1941 సంవత్సరములో వారు స్థాపించిన గ్రంథాలయ ట్రస్టుతో ఒడంబడిక వ్రాసుకొని, వారిద్వారా పైస్థలంలో 1949 సంవత్సరములో కార్యాలయ భవనాన్ని నిర్మించుకొనుట జరిగింది. దీని నిర్మాణానికి దిగువ దాతలు మూడేసి వేల చొప్పున విరాళాల నొసంగి సాయపడినారు: శ్రీ వాసిరెడ్డి శక్తీశ్వరుడు, పెదపాలెం, తెనాలి తాలూకా; శ్రీ వాసిరెడ్డి వెంకటప్పయ్య, పెదపాలెం, తెనాలి తాలూకా; శ్రీ నాగినేని వెంకయ్య, దేనువకొండ, ఒంగోలు తాలూకా; శ్రీ పాములపాటి బుచ్చినాయుడు, వారి సతీమణి శ్రీమతి వెంకటసుబ్బమ్మ నిడుబ్రోలు, గుంటూరు జిల్లా; శ్రీ రామినేని అప్పయ్య, పటమట, విజయవాడ తాలూకా; ది విజయవాడ ఉత్పత్తి కొనుగోలుదారుల సంఘం.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి 1936 వ సంవత్సరము నుండి జీవితాంతం (1960 ఫిబ్రవరి 29 వ తేదీ) వరకు అధ్యక్షులుగా వుండి, అమోఘంగా సేవ చేసిన మహనీయులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి గౌరవార్థం ఈ భవనానికి శ్రీ సర్వోత్తమ భవనమని నామకరణం చేసినారు. వీరి షష్టి పూర్తి సన్మానాల ద్వారా లభించిన కానుకల మూలంగా లభించిన మొత్తం రు. 5000/- భవన నిర్మాణానికి వెచ్చించినారు. 1958 వ సంవత్సరములో ఈ భవనం పై అంతస్తు నిర్మాణానికి కేంద్రప్రభుత్వం రు. 8,375/- గాంధీ స్మారకనిధి , ఢిల్లీవారు రు. 5000/-, విజయవాడ కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకివారు రు. 2000/- శ్రీ సుగ్గుల అక్షయలింగం గుప్త, శ్రీమతి సుగ్గుల వరలక్ష్మి (ఖమ్మం) ఒక్కొక్కరు రు. 1111/- లు. పాతూరి సోదరులు (పెదపాలెం), శ్రీ పాతూరి విజయకుమార్ (గుంటూరు) ఒక్కొక్కరు రు. 1001/- విరాళంగా ఇచ్చినారు. పోర్టికోకు శ్రీ పాతూరి నాగభూషణం రు. 1000/- లు విరాళంగా యిచ్చినారు. ఒకే హాలుగా కట్టి బాపూజీ మందిరమని దీనికి నామకరణం చేయడం జరిగింది. ఈ ఆస్తుల నిర్వహణకు 1946 లో ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు ఏర్పడినది.

### ప్రభుత్వ సహాయం:

ఉద్యమవ్యాప్తికి పై విధంగా జరిపిన ప్రచార ప్రబోధములు, సలహాలతోపాటు, ప్రభుత్వ సహాయానికై చేసిన ప్రయత్నాలు కొన్ని ఫలించినవి. స్థానిక సంస్థలు గ్రంథాలయాలకు ఏవిధంగాను తోడ్పడజాలని పరిస్థితిని తప్పించడమేగాక, అవి స్వయంగా గ్రంథాలయాలను నెలకొల్పి పోషించుటకు ప్రభుత్వ మంగీకరించునట్లు సంఘం కృషి చేసినది. గ్రంథాలయాలకు ప్రభుత్వం ఏటేటా విరాళాల నిచ్చు ఏర్పాటును సాధించినది. ఈ విరాళాలను పొందుటలో గ్రంథాలయా లెదుర్కొను చిక్కులను ప్రభుత్వ దృష్టికి తెచ్చి, ఈ అడ్డంకులను చాలవరకు తొలగించినది. గ్రంథాలయాల రిజిస్ట్రేషను కవసరమైన రుసుమును గవర్నరు ఆర్డరుద్వారా తగ్గించు అవకాశమును సంపాదించినది.

### గ్రంథాలయములు పెరుగుదల:

గ్రంథాలయ సంస్థ కృషి ఫలితంగా ఆంధ్రదేశంలో పౌర గ్రంథాలయాల సంఖ్య కాలక్రమేణ అభివృద్ధి చెందుతూ వచ్చింది. 1913 నాటికి 100 కి పైగా వున్న గ్రంథాలయాలు 1920 నాటికి 600, 1940 నాటికి 840, 1958 నాటికి 1360 వరకు పెరిగినవి. ఈ అంకెలు లెక్కకు వచ్చినవి మాత్రమే. ఇంకా లెక్కకురాని గ్రంథాలయాలు కూడ వుండవచ్చు. వేలసంఖ్యలో ఏర్పడిన ఈ గ్రంథాలయాలు వివిధ యాజమాన్యముల క్రింద నడుపబడుచున్నవి. వీటన్నింటినీ ఒకేత్రాటిపై నడుపవలసిన అవసరాన్ని గుర్తించిన గ్రంథాలయ శాస్త్రవేత్త డాక్టర్ యస్. ఆర్. రంగనాథన్ కృషి ఫలించింది. 1948 వ సంవత్సరంలో మద్రాసు ప్రభుత్వం పౌర గ్రంథాలయ చట్టం వేసింది. ఇది 1950 ఏప్రిల్ నుండి అమలులోనికి వచ్చింది.

### ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం:

ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు, సర్వోత్తమ ప్రచురణలు, సేవాశ్రమ గ్రంథమాల వగైరాల ప్రచురణల అమ్మకమునకు గ్రంథాలయ పుస్తకశాల సోల్ ఏజంటుగా వ్యవహరిస్తున్నది. ఈ సంస్థ ట్రస్టు ఏర్పడకముందే 1944 వ సంవత్సరములో ప్రారంభింపబడినది. దీని స్థాపకులు శ్రీ పాతూరి నాగభూషణం. తెలుగులోని ఉత్తమ గ్రంథముల ప్రచారం ప్రధాన ఆశయంగా ఇది బయలుదేరినది. దీని పక్షమున శ్రీ మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారి భూమి-రైతు-

రాజు, శ్రీ వీరేశలింగం గ్రంథావళి 3 సంపుటములు, శ్రీ గోరాగారి "మా పాతాలు–2 భాగములు", డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి "ముసలమ్మ మరణము"–ఇత్యాదులు గ్రంథాలయ పట్టికలు (రిజిష్టర్లు) ప్రచురింపబడినవి. ఇటీవల దీని యాజమాన్యము ట్రస్టు కప్పగించడమైనది.

## తెలంగాణాలో జరిగిన కృషి:

ఆంధ్ర గ్రంథాలయోద్యమంలో ఆదినుండి కొంచెమో గొప్పయో తెలంగాణపు పాలు కూడా ఉన్నది. 1914 వ సంవత్సరములో బెజవాడలో జరిగిన ప్రథమ గ్రంథాలయ మహాసభకు హైదరాబాదు రాజ్యం నుండి కూడ ప్రతినిధులు వచ్చినారు. ఆంధ్ర పితామహులు శ్రీ మాడపాటి హను మంతరావు గారు తెలంగాణాలో గ్రంథాలయోద్యమానికి మూల పురుషులు. శ్రీ రావిచెట్టు రంగారావు దంపతుల కృషితో 1901 వ సంవత్సరంలో హైదరాబాదులో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం ప్రారంభించబడినది. 1904 లో వరంగల్లులో శ్రీ రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయం బయలుదేరినది. 1905 లో సికింద్రాబాదులో ఆంధ్ర సంవర్ధన గ్రంథాలయం స్థాపించబడినది. తర్వాత ఖమ్మం, ఎర్రుపాలెం, నల్గొండ, సూర్యాపేట మొదలైనచోట్ల మరికొన్ని గ్రంథాలయాలు వెలసినవి. ఈ గ్రంథాలయాలు తెలంగాణ యువకులలో భాషాభిమానాన్ని, దేశాభిమానాన్ని రేకెత్తించి, విజ్ఞానాన్ని వెదజల్లినవి. వందేమాతర ఉద్యమ ప్రభావం; ఆ రోజులలో బయలుదేరిన శ్రీ వీరేశలింగం పంతులు, చిలకమర్తి, పానుగంటి, తిరుపతి వెంకట కవుల గ్రంథాలు; విజ్ఞాన చంద్రిక మున్నగు గ్రంథమండలుల ప్రచురణలు; సత్యవాదిని, ఆర్యమతబోధిని, మనోరమ, దేశమాత, ఆంధ్రకేసరి, కృష్ణా పత్రిక మున్నగు పత్రికలు తెలంగాణా గ్రంథాలయాలను అలంకరించి, వాటి చదువరులకు ఉత్తేజమును కలిగించినవి. బ్రిటీషాంధ్రలో బయలుదేరిన ఆంధ్రరాష్ట్రోద్యమం, గ్రంథాలయ ఉద్యమం, హోంరూల్ ఉద్యమాల మూలంగా 1917 నుండి ఇచ్చట గ్రంథాలయోద్యమంలో మార్పు కలిగింది. అంతకు పూర్వం ప్రభుత్వోద్యోగులు, ఉపాధ్యాయులు, న్యాయవాదు లను మాత్రమే యీ ఉద్యమం ఆకర్షించింది. అప్పటినుండి వర్తకులదృష్టికూడ దీనిపై పడింది. దీనితో వర్తక సంఘాలు హెచ్చుగా బయలుదేరినవి. ఈ సంఘాలు గ్రంథాలయాల కార్యక్రమాన్ని చేపట్టినవి. దీనికి కారణాన్ని శ్రీ మాడపాటి వారు చక్కగా వివరించారు. ఆ కాలంలో సంఘ సంస్కార విషయం జనానికి రుచించలేదని, రాజకీయాల జోలికిపోతే ప్రభుత్వం ఆగ్రహానికి గురి కావలసి వస్తుందనీ, మత విషయా లలో ప్రవేశిస్తే ప్రభుత్వంవారి కనుమానం కలుగుతూందనీ, యీ కారణాల మూలంగా అందరి అభిమానాన్ని చూరగొన గలిగినది, భేదములకు తావీయనిది, మాతృ భాషాభిమాన మునకు మార్గమేర్పరచునదీ అయినట్టి గ్రంథాలయోద్యమం వైపుకు మరలుట జరిగినదనీ తమభిప్రాయపడుతున్నట్లు వారు సెలవిచ్చినారు. నిరపాయకరమైన యీ ఉద్యమాన్ని గూడ ప్రభుత్వాధికారులు అనుమానించి, కార్యకర్తలను అనేక విధములుగా వేధిస్తూ ఉండేవారు. ప్రభుత్వానుమతి లేకుండా స్థాపించినారను నెపంతో కొన్ని తావులలో వారు గ్రంథాలయాలను మూయించిన సంఘటనలు కూడ ఉన్నవి. కాలక్రమాన కొన్ని నిర్బంధాలు తగ్గినప్పటికీ ఉద్యమ విజృంభణకివి అవరోధములుగా నుండినవి. వార్షికోత్సవాల నిర్వహణకు సహితం అధికారుల అనుమతి తీసుకొనవలసి వచ్చేది. గ్రంథాలయాలను విప్లవ కేంద్రాలుగా అనుమానించి అధికారులు అడుగడుగున వీటికి నిరోధాలు కల్పిస్తూ వచ్చారు.

ఈ అవరోధాలను ఎదుర్కొంటూ కార్యకర్తలు తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తూ వచ్చినారు. దీనితో 1925 వ సంవత్సరం నాటికి తెలంగాణాలో 100 గ్రంథాలయాల వరకు వెలసినవి. 1926 వ సంవత్సరంలో నిజాం రాష్ట్రాంధ్ర గ్రంథాలయ మహాసభ ఆంధ్ర జన కేంద్ర సంఘ సమావేశంతో పాటు మధిరలో జరిగినది. దీనికి పింగళి వెంకట్రామారెడ్డి అధ్యక్షత వహించారు. 28 గ్రంథాలయాల ప్రతినిధులీ సభలో పాల్గొన్నారు. ఆ కాలంలో నిజామాబాదు జిల్లాలో, మారుమూలనున్న ఆర్మూరు తాలూకాలో శ్రీ టి. కె. బాలయ్య అను యువకుడు సంచార గ్రంథాలయాన్ని నిర్వహిస్తున్నట్లు తెలుగు పత్రిక ప్రకటించింది. 1925–1937 సంవత్సరం మధ్యకాలంలో అనేక గ్రంథాలయాల వార్షికో త్సవాలలో దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు గారి వంటి దేశ నాయకులు, శ్రీ పానుగంటి, చెల్లపిళ్ళ మున్నగు పండితులు పాల్గొన్నారు.

## ప్రభుత్వ దమనకాండ:

ఒకవైపు ఉద్యమ నిర్వాహకులు దీక్షతో కార్యక్రమం కొనసాగిస్తూ వుంటే, వేరొకవంక ప్రభుత్వం తన దమన నీతిని పెంచుతూ వచ్చింది. 1930 వ ఫసలీలో గ్రంథాలయాలను ప్రైవేటు పాఠశాలలను ఒక కంట కనిపెట్టి వుండవలసిందిగా ప్రభుత్వోద్యోగులకు ఉత్తరువులు జారీయైనవి. అప్పుడే గస్తీ–నిషాన్ –53 అనే ఫర్మానాను ప్రభుత్వం ప్రకటించింది. దీనితో ఎన్నో సభలను ఆపుకోవలసి వచ్చింది. 1935 ఫసలీలో సూర్యాపేటలో జరుగవలసిన ద్వితీయ నిజాం రాష్ట్ర ఆంధ్ర గ్రంథాలయ మహాసభ జరుపుకొనుటకు ఆటంకమేర్పడినది. ఈ ఫర్మానా ననుసరించి సూర్యాపేటలో జరుగవలసిన గ్రంథాలయ మహాసభను ప్రభుత్వం ఆపివేయగా ప్రజలు హైకోర్టులో దావాచేసి దానిని జరుపుకొనుటకు అనుమతి సంపాదించినారు. అతికష్టం మీద 1937 వ ఫసలీలో ఈ

సభను జరుపుకొన్నారు. దీనికి శ్రీ వామన్ నాయక్ అధ్యక్షత వహించారు. వీరు నెలకు రు. 25/- చొప్పున విరాళమిచ్చి గ్రంథాలయ ప్రచార కార్యక్రమాన్ని కొంతకాలం నడపినారు. ప్రజలలో ఉత్సాహం చల్లబడటంతో యీ పని కూడ నిలచిపోయింది.

పై మహాసభ జరిగిన పిమ్మట కొన్నాళ్ళకు తెలంగాణా ఆంధ్రోద్యమ స్వరూపంలో మార్పు వచ్చింది. ఇది ఆంధ్ర మహాసభ క్రింద మారింది. ఈ మహాసభ రాజకీయాల వైపు మొగ్గి నిర్మాణ కార్యక్రమ విషయమై తగిన శ్రద్ధ చూపలేదు. దీనిని గమనించిన మాడపాటి హనుమంతరావు పంతులుగారు 1937 వ ఫసలీలో కేంద్ర సంఘంలో గ్రంథాలయ శాఖను నెలకొల్పి, దీనికి ప్రత్యేకంగా ఒక కార్యదర్శిని నియమించు ఏర్పాటు గావించారు. అయితే యీ శాఖకూడా పనిచేయలేదు. అందుచేత మరల మామూలు శాఖ ద్వారానే పనిచేస్తూ వచ్చినారు.

నిజామాబాదులో జరిగిన 6 వ ఆంధ్ర మహాసభలో శ్రీయుతులు ఇల్లిందల సీతారామారావు, ఖండవల్లి లక్ష్మీరంజనం గార్లు, నిజాంరాష్ట్రాంధ్ర గ్రంథాలయ సంఘాన్ని స్థాపించారు. ఈ సంఘం కూడా ఏమీ పనిచేయలేదు. ఇట్లుండగా 1942 వ సంవత్సరంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపించబడినది. హైదరాబాదులో తెలుగు దినపత్రికలు రెండు బయలుదేరినవి. ఈ పత్రికలలో గ్రంథాలయాల వృత్తాంతాలు తరచు వెలువడుచుండినవి. దీనితో ప్రజలలో నూతన జాగృతి వెల్లివిరిసినది.

ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘములో చాలాకాలం నుండి తెలంగాణాకు ప్రాతినిధ్యం ఉంటూ వచ్చింది. శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు, వామన్ నాయక్ గార్లు మధ్యలో కొంతకాలం యీ సంఘ కార్యవర్గం సభ్యులుగా ఉండినారు. 1941 నుండి నేటి వరకు యీ సంఘ కార్యవర్గంలో తెలంగాణాకు అవిచ్ఛిన్నంగా ప్రాతినిధ్యం ఉంటున్నది. శ్రీ వేదాల తిరుమల రామానుజస్వామి, శ్రీ వట్టికోట అళ్వారు స్వామిగార్లు కూడ కొన్నాళ్ళు సంఘ కార్యవర్గ సభ్యులుగా ఉండినారు. 1944 జూన్ నెలలో తెనాలిలో జరిగిన సంఘ సర్వ సభ్య సభలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు సంఘ ఉపాధ్యక్షులుగాను, శ్రీ కోదాటి నారాయణరావు గారు సహాయ కార్యదర్శిగానూ, శ్రీ అకుల లక్ష్మీనారాయణ గారు పాలకవర్గ సభ్యులుగానూ ఎన్నికైనారు.

1944 అగష్టు మాసంలో సింగరేణి కాలరీస్ (ఇల్లెందు) లో 25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ తొలిసారి తెలంగాణాలో జరిగినది. ఇది విశాలాంధ్రోద్యమాన్ని ఆచరణలో చూపెట్టిన తొలిచర్యయని చెప్పవచ్చు. ఈ మహాసభ తెలంగాణాలో గొప్ప ప్రబోధాన్ని కలిగించింది. దీనికి పిమ్మట సంఘ సమావేశములు అప్పుడప్పుడు ఇక్కడ జరుపుట కవకాశ మేర్పడినది. తెలంగాణాలో ఐదు మహాసభలు (26, 27, 29, 34) క్యాతూరు, సూర్యాపేట, జనగామ, ఖమ్మం, వరంగల్లులో నిర్వహించబడినవి.

1957 లో హైద్రాబాదు గ్రంథాలయ సంఘం హైదరాబాదులో నెలకొల్పబడినది. ఆంగ్ల, హిందీ భాషలలో "గ్రంథాలయ" మాసపత్రికను నిర్వహించుట, గ్రంథాలయ శాస్త్ర సంబంధమైన పుస్తకాల ప్రచురణ, గ్రంథాలయ శాస్త్రంలో సర్టిఫికెట్, డిప్లొమా కోర్సుల ఏర్పాటు, మహాసభలు జరుపుట ఈ సంఘం ముఖ్య కార్యక్రమాలు. హైద్రాబాదు పౌర గ్రంథాలయాల శాసన నిర్మాణానికి యీ సంఘ కార్యకర్తలే కారకులు. వీరు హైదరాబాదు స్టేట్ లైబ్రరీ కౌన్సిలులోను, నగరంలోని స్థానిక గ్రంథాలయ సంస్థలోనూ ప్రాతినిధ్యం సంపాదించారు.

## ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘం పేరు మార్పు:

ప్రభుత్వాలు వేరుగా నున్నందున అన్య రాష్ట్రానికి చెందిన ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘం ప్రత్యక్షంగా హైదరాబాదు రాజ్యంలో పనిచేయుట సాధ్యపడదని సంఘం వారు 3-10-54 తేదీన హైదరాబాదులో తెలంగాణా గ్రంథాలయ కార్యకర్తల సమ్మేళమును ఏర్పాటు చేసినారు. దీనికి హాజరైన సభికుల సూచనల మేరకు డాక్టరు యం. చెన్నారెడ్డి అధ్యక్షులుగా, శ్రీ కోదాటి నారాయణరావు కార్యదర్శిగా తెలంగాణాలో గ్రంథాలయోద్యమ నిర్వహణకు తాత్కాలిక కమిటీ నేర్పాటు చేశారు. ఈ కమిటీకి నియమావళి రూపొందించు ప్రయత్నం జరుగుతున్నంతలో కేంద్రప్రభుత్వం హైదరాబాదు రాజ్యాన్ని విభజించి తెలంగాణా ప్రాంతాన్ని ఆంధ్ర రాష్ట్రంలో చేర్చి ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పాటు చేయడం సంభవించింది. హైదరాబాదు గ్రంథాలయ సంఘంవారు ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘంతో చేరిపోయి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం రూపొందుటకు ఏర్పాటు జరిగినది. సంఘ ప్రధాన కార్యస్థానాన్ని హైదరాబాదుకు తరలించుటకును, గ్రంథాలయ సర్వస్వమును తెలుగులోను, గ్రంథాలయ పత్రికను హిందీ, ఇంగ్లీషు భాషలలోను ప్రకటించుటకును, శిక్షణా తరగతుల నిర్వహణ విషయం ఉభయ సంఘాల విలీనీకరణ పూర్తియైన పిమ్మట నిర్ణయం చేయుటకును తీర్మానాలు జరిగినవి. ఈ తీర్మానాల ననుసరించి సంఘం పేరును మార్చి, దీని కార్యస్థానమును కొంతకాలం హైదరాబాదులో ఉంచినారు. అచ్చట దీని బాధ్యతను వహించువారు లభించనందున తిరిగి దీనిని ముందున్న ప్రకారం విజయవాడకు మార్చినారు. 1860 వ సంవత్సరపు సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టములో సంఘం పేరు మార్చుటకు స్పష్టమైన ఆదేశం ఇవ్వబడనందున ఇంతకు

పూర్వం "ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము"గా రిజిస్టరైన గ్రంథాలయ సంఘాన్ని తిరిగి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘముగా రిజిస్టరు చేయవలసి వచ్చింది.

## కార్యకర్తలలో తగ్గిన ఉత్సాహం:

ఆంధ్ర గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ప్రధానంగా కృషిసల్పిన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ఏర్పడిన తొలిదినాలలో దేశం నలుమూలల స్వచ్ఛంద సేవకులు ముందుకు వచ్చి నడుం కట్టి పనిచేసిన కారణం చేత ప్రారంభంలో ఈ ఉద్యమం చాలా ఉత్సాహంగా నడిచింది. దీనికి జిల్లాలలోనూ, కొన్ని తాలూకాలలోనూ, ఒకటి రెండు పట్టణాలలోనూ శాఖలేర్పడి ఉద్యమవ్యాప్తికి వివిధ రీతుల తోడ్పడినవి. ప్రభుత్వ రంగంలో ప్రవేశించి శాసనాన్ని ఏర్పాటు చేసినప్పటినుండి స్వచ్ఛంద సేవకు అవసరం, అవకాశం తగ్గుముఖం పట్టినవి. వెనుకటి కార్యకర్తలలో పలువురు దివంగతులైవారు. మిగిలియున్న వారిలో హెచ్చుమంది వయసు చెల్లినవారు, తక్కినవారు ఉత్సాహముడిగినవారు. గ్రంథాలయ చట్టం ఏర్పడిన తరవాత కార్యకర్తలు అంకిత భావంతో కృషి చేస్తే ఉద్యమానికి వెనుకటి వైభవం సాధించడానికి వీలుంది. అందుకు కార్యకర్తలు నడుం బిగిస్తారని ఆశిస్తాము. ★

*"ఏక శిలా నగరంలో*
*తెలుగు వెలుగులను చూడు*
*ఉక్కు పోగరలు మలిచిన*
*శిల్ప సంపదలు చూడు."– శ్రీ శ్రీ*

# ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయాల నిర్వహణ

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

రాష్ట్రంలో గ్రంథాలయాల నిర్వహణ మూడు తీరులుగా – అంటే ప్రభుత్వ పరంగా, జిల్లా గ్రంథాలయ సంస్థల ద్వారా (ఇంతకు పూర్వం వీటిని లోకల్ లైబ్రరీ అథారిటీలు అనేవారు). ప్రైవేటు సంస్థలు, పంచాయితీల ద్వారా జరుగుతోంది. మార్చి 1993 నాటికి రాష్ట్రంలో 4703 గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి.

| వివిధ గ్రంథాలయాలు | వాటిసంఖ్య |
|---|---|
| 1. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం | 1 |
| 2. ప్రాంతీయ గ్రంథాలయాలు | 6 |
| 3. ప్రభుత్వ సంచార గ్రంథాలయం | 1 |
| 4. నగర కేంద్ర గ్రంథాలయం | 1 |
| 5. జిల్లా కేంద్ర గ్రంథాలయాలు | 23 |
| 6. శాఖా గ్రంథాలయాలు | 1422 |
| 7. గ్రామీణ గ్రంథాలయాలు | 337 |
| 8. పుస్తక పంపిణీ కేంద్రాలు | 592 |
| i) పంచాయితీ గ్రంథాలయాలు | 1536 |
| ii) ప్రైవేటు గ్రంథాలయాలు | 717 |
| iii) సహకార గ్రంథాలయాలు | 67 |
| మొత్తం: | 4703 |

## గ్రంథాలయ చట్టం

రాష్ట్రంలో సమగ్రమైన రీతిలో గ్రంథాలయ సేవజేసే ఉద్దేశంతో 1950 నుంచి మద్రాసు గ్రంథాలయ చట్టం (1948) అమలులోనికి వచ్చింది. 1952 నుంచి రాష్ట్రవ్యాప్తంగా ప్రతిజిల్లాలో లోకల్ లైబ్రరీ అథారిటీలు ఏర్పడ్డాయి. వీటి ఆధ్వర్యంలో జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, వనరులున్నంతవరకు శాఖాగ్రంథాలయాలు ఏర్పడ్డాయి. చట్టపరమైన గ్రంథాలయసేవకు అంకురార్పణ జరిగింది.

ఇలాగే 1955 లో హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టం ఆమోదింపబడి, అదే సంవత్సరం అమలులోకి వచ్చింది. ఈ దశలో భాషాప్రయుక్తరాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ప్రత్యేకరాష్ట్రం 1956 లో ఏర్పడింది. ఈ పరిస్థితిలో ఆంధ్రప్రాంతంలో మద్రాసు చట్టం, తెలంగాణాలో హైదరాబాద్ చట్టం అమలులో ఉన్నందున పరిపాలనాపరమైన చిక్కులు ఏర్పడ్డాయి. ఇందుకు పరిష్కారంగా పై రెండు చట్టాలను విలీనం చేసుకొని మరికొన్ని మెరుగులు దిద్దుకొని, లోటులను కొన్ని సవరించుకొని 1960 లో ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టం వెలుగులోకి వచ్చింది. అదే సంవత్సరం ఏప్రిల్ నుంచి అమలులోకి వచ్చింది. ఈ చట్టం 1964, 1969, 1987, 1989 – నాలుగుసార్లు సవరించడం జరిగింది.

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషత్:

గ్రంథాలయ చట్టానికి 1989 లో చేసిన సవరణ ఫలితంగా ఆం.ప్ర. గ్రంథాలయ పరిషత్ 1989 లో ఏర్పడింది. రాష్ట్రవ్యాప్తంగా గ్రంథాలయ సేవ నిర్వహించుట, పెంపొందించుట, సమర్థవంతమైన గ్రంథాలయ సేవకు తగిన వనరులు సమకూర్చుట, గ్రంథాలయాలలో తగిన పుస్తకాలు, పత్రికలు ఏర్పడుటకు తోడ్పడుట, సంస్థల బడ్జెట్ ఆమోదించుట, పరిపాలన అనుమతి మంజూరు చేయుట, గ్రంథాలయ సేవలు మెరుగుపరచడానికి దీర్ఘకాలిక, స్వల్పకాలికప్రణాళికలను రూపొందించుట, ఆమోదించినవాటి పనితీరు పర్యవేక్షించుట ఈ పరిషత్ విధులు. పరిషత్ అధ్యక్షులు, సభ్యులను ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. ఇది అధికార సంస్థ. పరిషత్ ఆవిర్భావంతో ఇంతకుముందున్న స్టేట్ లైబ్రరీ కమిటీ సలహా సంఘం రద్దవుతుంది. జిల్లాస్థాయి గ్రంథాలయ నిర్వహణ వ్యవహారాలు చూసేందుకు జిల్లా గ్రంథాలయ సంస్థలుంటాయి. స్థానిక సంస్థల నుంచి ఆస్తిపన్ను, ఇంటిపన్ను పై రూపాయికి ఎనిమిది పైసల వంతునవచ్చే గ్రంథాలయ సెస్సు ఈ సంస్థలకు ప్రధాన ఆదాయం. సంస్థ

ఖర్చులన్నీ ఈ ఆదాయం నుంచి చెల్లిస్తారు. సిబ్బంది జీతాలు మాత్రం ప్రభుత్వం చెల్లిస్తుంది. రాష్ట్రంలో గ్రంథాలయాల పాలన, నియంత్రణ పని పౌరగ్రంథాలయ శాఖ చూస్తుంది. చట్టం అమలులోకి వచ్చాక పౌరగ్రంథాలయ వ్యవస్థ ఈ తీరుగా ఉంటుంది.

ఈ వ్యవస్థాపరంగా 1992–93 నాటికి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం 1, ప్రాంతీయ గ్రంథాలయాలు 6, ప్రభుత్వ సంచార గ్రంథాలయం 1, నగర కేంద్ర గ్రంథాలయం 1, జిల్లా కేంద్ర గ్రంథాలయాలు 23, శాఖాగ్రంథాలయాలు 1422, గ్రామీణ గ్రంథాలయాలు 337, పుస్తక పంపిణీ కేంద్రాలు 592 పనిచేస్తున్నాయి. ఇవిగాక ప్రభుత్వ పరంగాకాని, జిల్లా గ్రంథాలయసంస్థల పరంగాకాని సహాయం పొందుతున్న ప్రయివేటు గ్రంథాలయాలు మరో రెండు వేలుంటాయి.




## గ్రంథాలయ సేవ:

జాతి, కుల, మత, వర్గ విచక్షతలేక సమాజంలోని అన్ని వర్గాలవారికి సమానస్థాయిలో గ్రంథాలయ సేవ జరుగుతున్నది. చదువరుల నుంచి ఎలాటి రుసుం వసూలుచేయడంలేదు. సాధారణంగా గ్రంథాలయ సంస్థల ఆధ్వర్యంలోని గ్రంథాలయాలలో చాలవరకు ఈ దిగువ ఉదహరించిన విభాగాలుంటున్నాయి.

1. పుస్తకాలు అరువిచ్చు విభాగం.
2. రెఫరెన్సు, పాఠ్యగ్రంథాల విభాగం
3. పిల్లల, మహిళల విభాగం
4. పత్రికల, సమాచార విభాగం
5. సాంస్కృతిక విభాగం

## మరికొన్ని అంశాలు:

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమానికి సుదీర్ఘమైన చరిత్ర ఉంది. ఈ ఉద్యమానికి సంబంధించిన అన్ని అంశాలు వివరించడం సాధ్యం కాదు. అందుచేత కొన్ని అంశాలను కేవలం సూచన ప్రాయంగా ఈ దిగువ వివరించడం జరుగుతున్నది.

1. ఈ ఉద్యమానికి తోడ్పడిన సంఘాలలో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం పాత్ర గురుతరమైనది. శ్లాఘనీయమైనది.

2. ఇదిగాక ఈ ఉద్యమానికి చేయూతనిచ్చిన సంఘాలలో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సేవక మహాసంఘం, అఖిల భారతీయ పౌర గ్రంథాలయ సంఘం, అకాడెమీ ఆఫ్ లైబ్రరీ సైన్స్ అండ్ డాక్యుమెంటేషన్, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ సంఘం సేవలు తక్కువకాదు.

3. ఆంధ్రపత్రిక, గోల్కొండ పత్రిక, ఆణా గ్రంథమాల, ఆంధ్ర గ్రంథమాల, దేశోద్ధారక గ్రంథమాల, ఆంధ్రసారస్వత పరిషత్ ఈ ఉద్యమానికి ఎంతో సేవచేశాయి.

4. ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు గ్రంథాలయాల కుపకరించే కొన్ని పుస్తకాలు ప్రచురించింది. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘానికి అవసరమైన భవనాలు నిర్మించింది. వల్లూరి సూర్యనారాయణ ట్రస్టు కొన్ని మంచి గ్రంథాలను ప్రచురించి గ్రంథాలయాలకు ఉచితంగా పంచింది. సరస్వతీ సామ్రాజ్యమ్ గ్రంథాలయ ప్రచారానికి తోడ్పడింది. రాజా రామమోహన రాయ్ లైబ్రరీ ఫౌండేషన్ పౌర గ్రంథాలయాలకు ఉత్తమ గ్రంథాలను అందజేసి పఠనాభ్యాసం పెంపుదలకు కృషిచేస్తూంది. భవనాలకు గ్రాంట్లు ఇస్తూంది.

5. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం విజయవాడ లోను, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీసైన్స్ హైదరాబాద్‌లోనూ, రాయలసీమ గ్రంథాలయ సంఘం కడపలోనూ, గ్రంథాలయశాఖ క్రింద ఒక సంస్థా గ్రంథాలయ శాస్త్రంలో సర్టిఫికెట్ కోర్సు నిర్వహిస్తున్నాయి. ఆంధ్ర, ఉస్మానియా, శ్రీవెంకటేశ్వర, శ్రీకృష్ణదేవరాయ, కాకతీయ, డా.బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయాలు డిగ్రీకోర్సు, ఆంధ్ర, ఉస్మానియా, శ్రీవెంకటేశ్వర, శ్రీకృష్ణదేవరాయ మాస్టర్సు డిగ్రీకోర్సు నిర్వహిస్తున్నాయి.

6. గ్రంథాలయ సర్వస్వము – ఈ పత్రిక 1915 నుంచి నేటికీ ప్రచురింపబడుతూంది. మధ్యకాలంలో ధర్మగ్రంథాలయ పత్రిక (1924–26), సమాచారలేఖ (1970–73), గ్రంథాలయజ్యోతి (1979–83) మొదలగు పత్రికలు వెలువడ్డాయి. గ్రంథాలయ శాస్త్ర వాఙ్మయం తెలుగులో భారతీయ భాషలన్నిటికంటే మిన్నగా, అంటే సుమారు 200 పుస్తకాలదాకా ప్రచురితమైనాయి. అందు డాక్టరు వెలగా వెంకటప్పయ్య రచనలు 60కి పైగా ఉంటాయి. పాతూరి విజయకుమార్ గారి రచనలు 20 ఉంటాయి.

7. రాష్ట్రంలో అచ్చయిన ప్రతి పుస్తకం మూడు ప్రతులను ప్రెస్సువారు పుస్తకాల రిజిస్ట్రారుకు పంపవలసి ఉంటుంది. ఇందులో ఒక ప్రతి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంకూ, ఒక ప్రతి రిజిస్ట్రారు ఆఫీసుకు, ఒక ప్రతి పార్లమెంటు గ్రంథాలయానికి పంపిస్తారు. ఇలావచ్చిన పుస్తకాల జాబితా గజెట్‌లో మూడు మాసాలకొకసారి ప్రచురింపవలసి ఉంది. ఆ పని జరగడంలేదు.

8. రెండవది 1954 డెలివరీ ఆఫ్ బుక్స్ చట్టం. ఈ చట్టంవలన దేశంలో అచ్చయిన ప్రతి పుస్తకం, పత్రిక ఒక్కొక్క ప్రతిని కేంద్ర ప్రభుత్వం నిర్దేశించిన నాలుగు గ్రంథాలయాలకు అనగా –

1. జాతీయ గ్రంథాలయం, కలకత్తా
2. కన్నెమరా పౌర గ్రంథాలయం, మద్రాసు
3. కేంద్ర గ్రంథాలయం, బొంబాయి
4. ఢిల్లీ పౌర గ్రంథాలయం, ఢిల్లీకి అచ్చయిన మాసం రోజులలోగా పంపాల్సి ఉంటుంది. కలకత్తా చేరిన ప్రతి సాయంతో సెంట్రల్ రెఫరెన్సు గ్రంథాలయంలో భారత జాతీయ గ్రంథసూచి తయారౌతుంది. ఈ సూచీ 1958 నుంచి వార్షికంగా రోమన్‌లిపిలో కలకత్తానుంచి ప్రచురింపబడుతూ వుంది.

9. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ చట్టం ద్వారా జరుగుతున్న కృషి సమీక్షించడానికి, చట్టానికి సవరణలు సూచించడానికి గోపాలరావు ఎక్బోటే ఆధ్వర్యంలో ఏర్పాటైన సంఘం తమ సిఫారసులను 1977 లో ప్రభుత్వానికి అందజేసింది. దీనిపై జరిగినపని తక్కువ.

10. ప్రయివేటు గ్రంథాలయాల అభివృద్ధికి సూచనలు చేసేందుకు ప్రభుత్వం నియమించిన వావిలాల గోపాల కృష్ణయ్య సంఘం 1978 లో తమ సిఫారసులను ప్రభుత్వానికి అందజేసింది. దీనిపైగూడ ప్రభుత్వ చర్య ఏమీలేదు.

11. గ్రంథాలయసేవలో విశిష్టమైన సేవ చేసిన ప్రముఖ కార్యకర్తకు 1979 నుంచి "అయ్యంకి లైబ్రరీ అవార్డు"ను గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకట రమణయ్యగారి పేర ఇస్తున్నారు. ఇవిగాక ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అయ్యంకి వెంకటరమణయ్య స్వర్ణపతకం, ఉస్మానియాలో, శ్రీవెంకటేశ్వరలో, శ్రీ రాఘవరెడ్డి స్వర్ణ పతకం ఉత్తమ విద్యార్థికి అందజేయబడుతున్నాయి. 1993 నుంచి తెలుగు యూనివర్సిటీ గ్రంథాలయ పితామహ అయ్యంకి వేంకట రమణయ్య శతజయంతి అవార్డును ఉత్తమ గ్రంథాలయ కార్యకర్తలకు ప్రదానంచేస్తూ ఉంది.

12. ఆంధ్రులు స్థాపించిన అఖిల భారత గ్రంథాలయ సంఘం తొలి మహాసభ జరిగినరోజు అనగా నవంబరు 14 తేదీని – భారత గ్రంథాలయ సంఘం "జాతీయ గ్రంథాలయదినం"గా గుర్తించింది. ఆరోజు నుంచి వారం దినాలు 1969 నుంచి గ్రంథాలయ వారోత్సవాలు జరుగుతున్నాయి.

13. ఆంధ్రులు స్థాపించి నిర్వహించిన అఖిల భారత పౌరగ్రంథాలయ సంఘం (1919–1934) భారత గ్రంథాలయోద్యమానికి పునాదులు వేసింది. ఈ సంఘం ఇండియన్ లైబ్రరీ జర్నల్ అనే పత్రికను నడిపింది. ఈ సంఘ కేంద్రస్థానం విజయవాడ; ప్రధాన కార్యకర్త అయ్యంకి వెంకట రమణయ్య.

14. 1986 నుంచి సమాచార పౌర సంబంధాల శాఖ మండల కేంద్రాలన్నిటిలో ప్రభుత్వ సమాచారాన్ని

సాధికారంగా అందించే తెలుగు సమాచారవిజ్ఞానకేంద్రాలను ప్రారంభించింది.

ఇలాగే మరికొన్ని అంశాలు లేకపోలేదు. ఏమైనప్పటికీ తెలుగుదేశంలో నిర్వహింపబడిన గ్రంథాలయోద్యమం ఒక ప్రత్యేకత గలది. మానవుని సర్వతోముఖవికాసానికి తోడ్పడే అపూర్వ ఆశయం గలది. అందరి బాగును కోరేది. అందుచేత అనేక ఆటుపోటులను తట్టుకొని నేటికీ నిలబడగలిగింది. కలకాలం నిలబడడానికి తగిన ఆసరా కలిగి ఉంది.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ, ప్రాంతీయ గ్రంథాలయ విధులు:

రాష్ట్రంలో ప్రచురింపబడే అధికార, అనధికార ప్రచురణలను సేకరించటం, సమాచార విభాగ నిర్వహణ, గ్రంథాలయ సహకారానికి కేంద్రంగా నిలబడటం, వికలాంగులకు గ్రంథాలయం సేవ చేయటం, రాష్ట్రంలో ప్రచురింపబడిన ఉర్దూ, మరాఠీ, కన్నడ భాషలకు గ్రంథసూచీ తయారుచేయడం, సాంఘిక విద్యా కార్యక్రమాలు నిర్వహించటం మొదలైనవి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ విధులు. జిల్లా, నగర కేంద్ర గ్రంథాలయాలస్థాయిలో జరుగుతున్న కేంద్రీకృత సూచీకరణ, వర్గీకరణ విధానాన్ని చేపట్టే ఆలోచన ఉంది.

ప్రాంతీయ గ్రంథాలయాలు కొద్దిస్థాయిలో జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు పుస్తకాలు అందజేస్తాయి. పరిపాలనా సౌలభ్యంకోసం, పనిలో నిపుణతకోసం రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం నిర్వహించవలసిన గ్రంథసూచీల నిర్మాణం, బాలల వివరణాత్మక గ్రంథసూచీ మొదలైనవి ప్రాంతీయ గ్రంథాలయాలకు అప్పజెప్పటం జరిగింది.

ప్రభుత్వం ఈ ప్రాంతీయ గ్రంథాలయాలకు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయానికి సలహా ఇచ్చేందుకు వేరుగా సలహా సంఘాలను ఏర్పాటు చేసింది. పలుభాషలలో పుస్తకాలు ఎంపిక చేసేందుకు పుస్తకాల ఎన్నికల సమితులు నియమింపబడ్డాయి. కొత్త పుస్తకాలు కొనే సందర్భంలో చదువరుల సలహాలను గమనంలోకి తీసుకోవటం జరుగుతుంది. లభించే నిధుల ననుసరించి గ్రంథాలయాల అభివృద్ధికి తగిన ప్రతిపాదనలు పరిశీలించడం జరుగుతుంది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం అతి పురాతనమైనది. 1891 లో దీన్ని స్థాపించారు. అసఫియా గ్రంథాలయాన్ని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ అనంతరం రాష్ట్ర కేంద్ర గ్రంథాలయంగా గుర్తించటం జరిగింది. 1936 లో దీనికి భవనాన్ని నిర్మించారు. అనంతరం 1961 లో డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్, రిజిస్ట్రార్ ఆఫ్ పబ్లికేషన్స్ కార్యాలయాల నిమిత్తం కొంత విస్తరించటం జరిగింది. ఈ గ్రంథాలయంలో 3 లక్షలపైగా గ్రంథాలు ఉన్నాయి. పాఠకుల సౌకర్యార్థం రోజుకు 12 గంటల పాటు ఈ గ్రంథాలయం పనిచేస్తుంది. పాఠ్యగ్రంథాల విభాగం 16 గంటలు పనిచేస్తుంది. అంధులకొరకు బ్రెయిలీ లిపిలో వెయ్యిగ్రంథాలు కూడా ఉన్నాయి.

గుంటూరు, విశాఖపట్నం, రాజమండ్రి, తిరుపతి, వరంగల్, నిజామాబాద్‌లలో ప్రాంతీయ గ్రంథాలయాలున్నాయి. ఆంధ్ర రాష్ట్ర గ్రంథాలయం పేరుతో మొదట గుంటూరులో ప్రారంభమైన గ్రంథాలయాన్ని అనంతరం ప్రాంతీయ గ్రంథాలయంగా మార్చడం జరిగింది. అలానే రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయం పరిశోధనా కేంద్రంగా వినియోగపడుతున్నది. సగటున ఒక్కొక్క ప్రాంతీయ గ్రంథాలయంలో 40 వేల గ్రంథాలు ఉన్నాయి. గౌతమీ గ్రంథాలయంలో 405 తాళపత్ర గ్రంథాలు కూడా ఉన్నాయి.

## నగర, జిల్లా కేంద్ర గ్రంథాలయాలు:

నగర కేంద్ర గ్రంథాలయంతో కలుపుకుని జిల్లా కేంద్రాలలో 23 జిల్లాల కేంద్ర గ్రంథాలయాలు నడుస్తున్నాయి. శాఖా గ్రంథాలయాల పనివిధానం సమన్వయంచేసే బాధ్యత జిల్లాకేంద్ర గ్రంథాలయంపై వుంటుంది. జిల్లాకు ఒకటి చొప్పున గ్రంథాలయ సంస్థలు ఏర్పడ్డాయి. నగర జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులను, సభ్యులను ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. గ్రంథాలయ, విద్యారంగంలో కృషిచేసిన ప్రముఖులు, మునిసిపాలిటీలు, కార్పొరేషన్, మండల ప్రజాపరిషత్, గ్రంథాలయ ప్రతినిధులు, అధికారులు ఇందులో సభ్యులుగా ఉంటారు. జిల్లాకేంద్ర గ్రంథాలయ సంస్థ పాలకులు ఈ సంస్థకు కార్యదర్శిగా వుంటారు. గ్రంథాలయ శాస్త్రం చదువుకొన్నవారిని జిల్లా గ్రంథాలయసంస్థకు కార్యదర్శులుగా నియమించిన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ ఒక్కటే. 22 జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు స్వంత భవనాలు వున్నాయి. మిగిలిన జిల్లాలలో కూడా స్వంత భవనాల నిర్మాణానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. మహిళలు, బాలల కొరకు ప్రత్యేకంగా కొన్ని గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి.

## సంస్థల విధులు - అధికారాలు:

ప్రతి గ్రంథాలయ సంస్థ ఆయా జిల్లాల్లో ఒక అధికార సంస్థ. ఇది కార్పొరేట్ బాడీ హోదా కలిగి వుంటుంది. ఈ సంస్థ ఆస్తిని సంపాదించవచ్చు. స్వాధీనంలో వుంచుకోవచ్చు. అమ్మవచ్చు. కరారు పరచవచ్చు. అంతేగాక, ఈ సంస్థ ఎవరిపైనైనా దావా వేయవచ్చు. ఎవరైనా దానిపై దావా వేయవచ్చు. మొత్తంమీద ఈ సంస్థ తన పరిధిలో శాశ్వత అధికారాలను కలిగి వుంటుంది. తమ అధికార ప్రాంతంలో సేవ చేయటం ఈ సంస్థ విధి. చట్టప్రకారం గ్రంథాలయ సెస్సు విధించటానికి ఈ సంస్థ అధికారం కలిగివుంటుంది. నూతనంగా గ్రంథాలయాలను ప్రారంభించవచ్చు - మూయవచ్చును - ప్రైవేటు గ్రంథాలయాలకు గ్రాంట్లు

ఇవ్వవచ్చును. ఈ సంస్థలు గ్రంథాలయ నిధిపేర ఖాతా నిర్వహించవచ్చు. దీనినుంచి చట్టనిర్వహణకు అవసరమైన జమలు—ఖర్చులు అమలు పరచబడును.

నగర/జిల్లా గ్రంథాలయ సంస్థలు తమ అధికార ప్రాంతంలో ఇంటిపన్ను, ఆస్తిపన్నుపై చార్జి రూపంలో గ్రంథాలయ సెస్సు విధిస్తాయి. స్థానిక సంస్థలనుంచి పాత బాకీలను వసూలుచేయడంలో వసూళ్ళు పెరగగలవని ఆశిస్తున్నారు.

### శాఖా గ్రంథాలయాలు:

రాష్ట్రంలో జిల్లా గ్రంథాలయసంస్థల అధ్వర్యంలో 1422 శాఖా గ్రంథాలయాలు పనిజేస్తున్నాయి. 337 గ్రామీణ గ్రంథాలయాలు, బుక్ డిపాజిట్ సెంటర్లు పనిచేస్తున్నాయి. స్వంత భవనాలలో 380 గ్రంథాలయాలు ఉన్నాయి. సుమారు 500 గ్రంథాలయాలకు పంచాయితీలు అద్దెలేకుండా భవనాలను ఏర్పాటుచేశాయి. అయినప్పటికీ అనేక శాఖాగ్రంథాలయాలు వున్న భవనాలు గ్రంథాలయ సేవకు అనువైనవికావు. జిల్లా గ్రంథాలయ సంస్థలు పథకాలను రూపొందించి శాఖా గ్రంథాలయాలకు భవనాలను సమకూర్చాల్సి ఉంది. శాఖాగ్రంథాలయాల్లో దాదాపు ఎనభై శాతం గ్రంథాలు తెలుగులోను, స్థానిక భాషలలోను వున్నాయి. ఇటీవలి కాలంలో చేసిన ఆలోచనల ఆధారంగా గ్రంథాలయాల్లో కాల్పనిక సాహిత్యం కంటే పాఠ్యపుస్తకాలకు అధికతర ప్రాధాన్యత నివ్వాలని నిర్ణయించుకోవటం జరిగింది. గ్రంథాలయ శాస్త్రంలో సర్టిఫికెట్ కోర్సు పూర్తిచేసినవారు, రికార్డ్ అసిస్టెంట్లు శాఖా గ్రంథాలయాలకు బాధ్యత వహిస్తారు. త్వరలో అన్ని శాఖాగ్రంథాలయాలకు టెలివిజన్ సౌకర్యాలను కూడా కల్పించేందుకు జిల్లా గ్రంథాలయ సంస్థలు ప్రయత్నిస్తున్నాయి. ఒక్కొక్క శాఖా గ్రంథాలయానికి సగటున రోజుకు వందమంది వరకు హాజరవుతున్నారు. రోజుకు ఆరుగంటలపాటు శాఖాగ్రంథాలయాలు తెరచి వుంటాయి. గ్రామీణ గ్రంథాలయాలు మాత్రం మూడు గంటలు పనిచేస్తాయి. పార్ట్‌టైం ఉద్యోగి దానికి బాధ్యత వహిస్తారు.

### సంచార గ్రంథాలయాలు:

పౌరగ్రంథాలయశాఖ తరఫున ఏలూరులో సంచార గ్రంథాలయం 1956 లో ప్రారంభించారు. రాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న మొదటి సంచార గ్రంథాలయం ఇది. పశ్చిమ-గోదావరి జిల్లాలోని ఏలూరు, చింతలపూడి, తాడేపల్లిగూడెం, పోలవరం ప్రాంతాలలోని 87 గ్రామాలకు ఈ సంచార గ్రంథాలయం సేవ చేస్తున్నది. అంతేకాక గ్రంథాలయాలు లేని 115 కేంద్రాలకు కూడా తగిన సేవ చేస్తున్నది. ఈ గ్రంథాలయానికి దృశ్య, శ్రవణ యంత్రం కూడా ఉంది.గ్రామీణ ప్రాంత ప్రజలకు వయోజన విద్య, కుటుంబ నియంత్రణ, వ్యవసాయాభివృద్ధి తదితర అంశాలను బోధించేందుకు ఇది ఎంతో ఉపకరిస్తుంది. దీన్ని మరింతగా అభివృద్ధి చేస్తే గిరిజన ప్రాంతాల ప్రజలను చైతన్యవంతుల్ని చేసేందుకు తోడ్పడుతుంది.

### సమాచార భారతి:

నగర గ్రంథాలయ సంస్థ మూడు సంచార గ్రంథాలయాలను ఏర్పాటు చేసింది. నగర ప్రాంతంలో ఇటీవల మరిరెండు సంచార గ్రంథాలయాలను నగర గ్రంథాలయ సంస్థ ఏర్పాటుచేసింది. ఈ గ్రంథాలయాలను సంచార భారతి అనే పేరుతో నిర్వహిస్తున్నారు. ఒక్కొక గ్రంథాలయం సగటున ఏడాదికి 280 రోజులు పనిచేస్తుంది.

### రిక్షాలద్వారా సంచారగ్రంథాలయములు:

జిల్లాల్లోని వివిధ పట్టణాలలో జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్వర్యంలో – గ్రంథాలయాలకు రాజాలని స్త్రీలకు, పెద్దలకు రిక్షాల ద్వారా పుస్తకాలను పంపించటం జరుగుతున్నది. ఇంటింటికీ తిరిగి పుస్తకాలను అందజేస్తారు. 15 జిల్లాల్లో ఈ పద్ధతి అమలు జరుగుతున్నది. ఈ గ్రంథాలయాలు 39 పట్టణాల్లో, 364 గ్రామాల్లో సేవ చేస్తున్నాయి. కృష్ణాజిల్లాలో దాదాపు 315 గ్రామాలకు గ్రంథాలయ సేవ అందుతున్నది.

### సహాయక (ఎయిడెడ్) గ్రంథాలయాలు:

పంచాయితీలు, సహకార సంస్థల అధ్వర్యంలో ఎయిడెడ్ గ్రంథాలయాలను నిర్వహిస్తున్నారు. గ్రంథాలయ పరిపాలనా వ్యవస్థలో ఇవి భాగంగా లేకపోయినప్పటికి 2320 గ్రంథాలయాలు స్వతంత్రంగా నిర్వహింపబడుతున్నాయి. వాటిలో కొన్ని వంద సంవత్సరాలుగా పనిజేస్తున్నాయి. గ్రంథాలయోద్యమానికి అవి ఎంతో స్ఫూర్తినిస్తున్నాయి. వావిలాల కమిటీ నివేదిక ఆధారంగా వీటికి ఆర్థిక సహాయం అందజేయటం జరుగుతున్నది.

### నిధులు-ప్రభుత్వ విరాళం:

నేడు రాష్ట్రప్రభుత్వం పౌరగ్రంథాలయాలకోసం ఏటా సుమారు పదికోట్లు ఖర్చు పెడుతోంది. ప్రభుత్వ గ్రంథాలయాల ఖర్చు పూర్తిగా భరిస్తుంది. నగర/జిల్లా గ్రంథాలయ సంస్థలకు లైబ్రరీ సెస్సు ద్వారా ఏటా సుమారు మూడు కోట్ల రూ. మేరకు ఆదాయం వస్తుంది. ఈ ఆదాయంతో పుస్తకాలు, పత్రికలు కొనుగోలు, భవనాల నిర్మాణం, రిపేరు చేస్తారు. కార్యాలయ నిర్వహణ ఖర్చులు భరిస్తారు. సంస్థలలో పనిజేసే సిబ్బందికి ప్రభుత్వం జీత భత్యాలు, పెన్షన్ మొ. భరిస్తుంది. రాజా రామ్మోహనరాయ్ లైబ్రరీ ఫండ్‌ను

రాష్ట్రంలోని గ్రంథాలయాలకు పుస్తకాల రూపంలో సాయం చేస్తోంది. ఫర్నిచర్, భవన నిర్మాణానికి గ్రాంటు యిస్తుంది.

## ప్రాచ్య లిఖిత ప్రతుల గ్రంథాలయం, పరిశోధనా సంస్థ:

ఈ శాఖను 1975 జనవరి ఒకటవతేదీన హైదరాబాద్‌లో ఏర్పాటుచేశారు. వ్యక్తులనుంచి, ఇతరరాష్ట్రాలనుంచి, విదేశాలనుంచి ప్రతులను సేకరించటం, కొనటం, వాటిని ఆధునిక శాస్త్రీయ పద్ధతుల్లో భద్రపరచటం, దేశంలో అన్నిభాగాల నుంచి అరుదైన రాతప్రతులకు మైక్రోఫిల్ము నకళ్ళు తీయటం, రాతప్రతులను, రాతప్రతుల మైక్రోఫిల్ములను విద్యార్థులకు అందుబాటులో ఉంచటం, విద్యార్థుల ప్రయోజనం నిమిత్తం ప్రచురితంకాని ముఖ్యమైన రాతప్రతులను ప్రచురించటం ఈ సంస్థ ముఖ్యలక్ష్యాలు.

## అభివృద్ధి పథంలో ఆంధ్రప్రదేశ్:

భారత గ్రంథాలయపటంలో ఆంధ్రప్రదేశ్ గర్వించదగిన స్థానంలో ఉంది. దానికి సమగ్రమైన గ్రంథాలయ వ్యవస్థ, క్రమబద్ధమైన గ్రంథాలయాలు ఉన్నాయి. పటిష్టంగాను, ఆధునికంగానూ పనిచేస్తున్నాయి. స్థాయిలోను, సంఖ్యలోను మంచి అభివృద్ధి కన్పిస్తున్నది. ఇంకా గ్రంథాలయాల అభివృద్ధికి కృషిచేయవలసినది ఎంతో ఉంది. అందుకు మరిన్ని వనరులను సమకూర్చుకోవలసిన అవసరమెంతైనా ఉంది. తమ సంస్థలను అభివృద్ధిచేయడంలో ప్రజలు, స్వచ్ఛంద సంస్థలు ముందుకు రావలసి ఉంది.

*"లేపాక్షి బసవయ్యా లేచి రావయ్యా*
*కైలాస శిఖరిలా కదలి రావయ్యా"*
*అంటూ ఉప్పొంగి తన కవితలో గానం చేశారు – అడవి బాపిరాజు*

# అందరూ వినియోగించవలసిన సాధారణ సమాచార నిధి

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

ఒకప్పుడు ఒక దేశంలోగల ఆయుధ సామాగ్రి, మిలిటరీ దళాలు ఆ దేశ ప్రతిష్టకు చిహ్నాలుగా ఉండేవి. మరొకప్పుడు ఒక దేశంలోగల ఖనిజసంపద, పరిశ్రమలు, ఉత్పత్తులు ఆ దేశపు అత్యున్నత స్థితికి గుర్తుగా ఉండేవి. నేడు ఒక దేశంలోగల సర్వసమగ్ర సమాచార సంపద, దాని భూరివనరులు ఆ దేశ ప్రతిష్టకు, ఆ దేశపు సర్వతోముఖ ఔన్నత్యానికీ ప్రతీకగా నిలచివుంటున్నాయి. దేశంలో శాస్త్ర, సాంకేతికరంగాలూ, పారిశ్రామికరంగాలలో పెరుగుతున్న అభివృద్ధికి తోడుగా జన జీవనంలో సమాచార ప్రాధాన్యం పెరుగుతూ వచ్చింది. తగినంత సమాచారం ప్రజలవద్ద లేకపోతే సుఖప్రదమైన జీవనం లేదు. తగినంత పని లేదు. ఆశించిన అభివృద్ధి లేదు. శక్తిమేరకు ఉత్పత్తులు ఉండవు. కనుక నేడు శాస్త్రవేత్త నుంచి సామాన్య ప్రజలవరకు లభిస్తోన్న సమాచారాన్ని పూర్తిగా వినియోగించుకుని తమ పనిలో నిపుణత సాధించవలసి ఉంది. సామాజిక స్పృహ పెంచుకోవలసి ఉంది. సుఖప్రద జీవితం సాధించవలసి ఉంది. కనుక ఒకనాడు "జ్ఞానమే శక్తి" అనే స్లోగన్ నేడు "సమాచారమే శక్తి"గా మారిపోయింది. మారుతున్నకాలంలో ఇదో పెద్ద మార్పు.

### సమాచార సమాజం:

20 వ శతాబ్ద మధ్యభాగం నుంచీ సమాచారం దేశాభివృద్ధికి కీలకమైన అంశంగా గుర్తింపబడింది. సమాచారాన్ని సద్వినియోగం చేసుకున్నందువలననే అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, సోవియట్ యూనియన్, జపాను మొదలైన దేశాలు గణనీయమైన అభివృద్ధి సాధించాయి. ఇందుకోసం ప్రత్యేకంగా సమాచార వ్యవస్థలను ఏర్పాటు చేసి తద్వారా తగిన ప్రయోజనం పొందుతున్నాయి. ఈ రంగంలో ప్రధానమైన మార్పు ఏమంటే సమాచార రంగం – ముద్రణ మాధ్యమం నుంచి క్రమంగా అత్యంతాధునికమైన దృశ్య, శ్రవణ మాధ్యమంలోకి మారిపోయింది. ఈ మార్పు సమాజంలో ఎనలేని మార్పు తెచ్చి, సమాచార సమాజం (Information Soceity) కాగితంలేని సమాజం (Paperless Society) అనే నూతన ఆలోచనా విధానానికీ, భావాలకూ తావిస్తూంది. సమాచారానికి దూరమైతే పేదరికానికీ, అశక్తతకూ దగ్గరయ్యే ప్రమాదం ఉందనీ, స్వావలంబనకు దూరమయ్యే పరిస్థితి ఉందనీ గుర్తు చేస్తూ అభివృద్ధి చెందుతున్న దేశాలకు హెచ్చరికకూడ చేస్తూ ఉంది.

### సమాచార వ్యవస్థలు:

భారతదేశంలో 1980 దశకంనుంచి సమాచార వ్యవస్థల ఆవిర్భావం ప్రారంభమైంది. విజ్ఞానశాస్త్ర సాంకేతిక రంగాలలో సమాచార సేకరణ, క్రోడీకరణ, భద్రత, వినియోగంపై శాస్త్ర, సాంకేతిక రంగాలలో విజ్ఞాన శాస్త్ర సాంకేతిక జాతీయ సమాచార వ్యవస్థ (National Information System for Science and Technolgy) ని భారత ప్రభుత్వం స్థాపించి ఆయారంగాలలో ఎనలేని కృషి చేస్తూవుంది. దీనికి తోడుగా వ్యాపార, వాణిజ్యరంగాలు, రైల్వేలు, విద్య, బయోటెక్నాలజీ, విమానయానం, ఉక్కు – మొదలైన రంగాలలో సమాచార వ్యవస్థలు వెలసి తగిన సమాచారాన్ని భారత ప్రజలకు అందిస్తున్నాయి. ఈ నేపథ్యంలో సాధారణ ప్రజలకు అవసరమైన సమాచారం అందించే ఉద్దేశంతో భారత ప్రభుత్వం – ప్లానింగ్ కమీషన్ నేతృత్వంలో National Informatic Center అనే సమాచార వ్యవస్థ వెలిసింది. దీనితరఫున సాధారణ సమాచార ప్రసారంకోసం టెర్మినల్ ఏర్పడింది. దీన్ని జాతీయ సూచన విజ్ఞాన కేంద్రం అంటున్నారు. 1982–84లో ఈ కేంద్ర సేవలు ఢిల్లీ నగరానికి పరిమితం చేయబడ్డాయి. తదుపరి రెండవ దశలో పూనె, హైదరాబాదు, భువనేశ్వర్ నగరాలలో ప్రాంతీయ కేంద్రాలను ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి వీటిని 32 రాష్ట్ర రాజధానులు, పట్నాలకు, 450 జిల్లా కేంద్రాలకు అనుసంధానం చేయడం జరిగింది. త్వరలో ఈ కేంద్రాలను మండల కేంద్రాల వరస విస్తరించే ఆలోచన కేంద్రప్రభుత్వంలో ఉంది.




## ప్రపంచంలో అతిపెద్ద నెట్వర్క్

ప్లానింగ్ కమీషన్ ఏర్పాటు చేసిన ఈ సమాచార వ్యవస్థ ప్రపంచం మొత్తంమీద పెద్దది. ఇంత భారీ కంప్యూటరు నెట్వర్క్ స్వీడన్, డెన్మార్క్, బెల్జియం వంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడ లేదు. ఎలాటి వాతావరణంలోనైనా సరే – యీ వ్యవస్థ అవలీలగా పనిచేయడం ఒక విశేషం. యాంటెన్నా పాడైయితేతప్ప వ్యవస్థ కార్యకలాపాలు ఆగిపొయ్యే అవకాశం లేదు. ఇందుకోసం ప్రాంతీయ కేంద్రాలలో NEC 1000 కంప్యూటర్ సిస్టమ్, రాష్ట్ర కేంద్రాలలో ND 550 సిస్టమ్ లేదా తత్సమానమైన సిస్టమ్‌లను, జిల్లాకేంద్రాలలో సూపర్ పి.సి. ఏ.టి.లను ఏర్పాటు చేయడం జరిగింది. అంతేగాక, కేంద్రంలో సమాచార నిధులతోబాటు, రాష్ట్రకేంద్రంలో, జిల్లా కేంద్రాలలో స్థానిక అవసరాలకు సరిపడా సమాచార నిధులను ఏర్పాటు చేయడం, వీటిని ఎప్పటికప్పుడు తాజాపరచడం జరుగుతూ ఉంది. ఇందుకోసం దేశ, విదేశాలలోని అనేక సంస్థలూ, ఐక్యరాజ్యసమితి, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి మొదలైన సంస్థలనుంచి సమాచారం క్రోడీకరించడం జరుగుతూ ఉంది.

## ఈ కేంద్రం అందించే సేవలు

జాతీయ సూచనా కేంద్రంలో ఒక భాగమే General Informatic Service Terminal. దీన్ని "జిస్టినిక్" అంటున్నారు. ప్రపంచ వ్యాప్తంగా అనేక వ్యవస్థలూ, సంస్థలనుంచి సాధారణ సమాచారాన్ని సేకరించి – యీ దిగువ ఉదాహరించిన రంగాలతో ఒక సమాచార నిధి ఏర్పాటు చేస్తుంది.



"జిస్టినిక్" అందిస్తున్న సమాచార వివరాలు –

1. భారతదేశ గణాంకాలు.
2. జిల్లాస్థాయి ఆర్థికసూచికలు.
3. జిల్లా స్వరూపాలు, గ్రామాల సమాచారం.
4. యూనివర్సిటీలు అందించే విద్యావ్యాసంగం.
5. యాత్రాదర్శిని.
6. రైల్వే టైం టేబుల్సు.
7. హోటళ్ళదర్శిని
8. రాష్ట్రాల, జిల్లాల, తాలూకాల సాధారణ సమాచారం.
9. ఆస్పత్రుల సమాచారం.
10. వివిధ దేశాల వివరాలు.
11. ప్రపంచ ఆర్థిక వివరాలు.
12. భారత పారిశ్రామిక సూచిక.
13. ఉద్యోగదర్శిని.
14. పెట్టుబడుల సూచి.

పై అంశాలపై ఈ కేంద్రంలో భద్రపరచిన సమాచారాన్ని కావలసిన వారు పొందవచ్చు.

## గ్రామీణ సాంకేతిక విజ్ఞానం:

ఇటీవలి కాలంలో యీ వ్యవస్థ గ్రామీణ ప్రజానీకానికి అవసరమైన సమాచార సంపదను రూపొందించింది. అందరికీ అవసరమైన సౌరశక్తి సాధనాలు, జలశక్తి సాధనాలు, గోబర్ గ్యాసు, గాలి మరలు మొదలైన అత్యంతాధునికమైన సుమారు వెయ్యికిపైగా అంశాలలో ఒక నిధి ఏర్పాటు చేయడం జరిగింది. ప్రయోగశాలలో రూపొందించిన విజ్ఞాన ఫలాలను సామాన్య ప్రజలకు అందించడం – ప్రజల

సామాజిక ఆర్థిక స్థాయి పెంచి వారి జీవన పరిస్థితులను మెరుగుపరచడం ఈ సమాచార నిధి లక్ష్యం. ఈ నిధిలో ప్రతి జిల్లాకు, ప్రతి ప్రాంతానికి సరిపడిన అంశాలు తగినన్ని ఉండడం ఒక విశేషం.

## సంప్రదాయక విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం:

తరతరాలుగా సంస్కృతీవిజయపరంపరను సంపుటీ. కరించుకున్న భారతదేశంలో చిరకాలంగా శాస్త్ర, సాంకేతిక రంగాలలో ప్రాచ్యవిజ్ఞానం తగినంత ఉంది. దీన్ని వెలికిదీసి సామాన్యులకు అందించడం కోసం యిటీవల కాలంలో – ఈ దిగువ ఉదాహరించిన అంశాలలో ఒక సమాచార నిధి ఏర్పాటు చేసింది.

1. సంప్రదాయక వైద్యం, ఆరోగ్య జాగ్రత్తలు, యోగ, తత్సంబంధ వ్యవస్థలు.
2. సంప్రదాయక వాస్తు, భవన నిర్మాణం.
3. సంప్రదాయక లోహ విజ్ఞానం, గనులు, భూగర్భశాస్త్రం.
4. సంప్రదాయక చేనేత, చేతిపనులు.
5. సంప్రదాయక నీటిపారుదల, నీటి వనరుల నిర్వహణ, భూగర్భ జల నిధుల వినియోగం.
6. సంప్రదాయక వ్యవసాయం, పరికరాలు.



7. సంప్రదాయక చేతివృత్తులలో పవితనం.
8. ప్రాచీనశాస్త్ర, సాంకేతిక విజ్ఞానాలు.
9. సంప్రదాయక యాజమాన్యం, పాలన, ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థలు.
10. నౌకాయానం, చేపలు, పశుసంపద, తేనెటీగలు, యుద్ధ తంత్రం, వినోదం, జానపద వైద్యం మొదలైన అంశాలు.

పైన వివరించిన పది ప్రధాన అంశాలలో సుమారు వంద ఉప విషయాలు యిమిడి ఉన్నాయి. ప్రస్తుతం 2500 అంశాలలో సమాచారం ఉంది. 1995 అంతానికి 5000 అంశాలలో సమాచారం సిద్ధంచేసే ప్రతిపాదన పరిశీలనలో ఉంది. అంతేగాక, యీ సమాచారంలో మధ్యమధ్య అవసరమైన కొటేషన్లు – సంస్కృతం, హిందీ, తెలుగు, తమిళ భాషలకు సంబంధించినవి చేర్చే ఆలోచనుంది. అంతేగాక విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాలలో లభించే సంస్కృత రాత ప్రతులను కూడ సమాచార నిధిలో చేర్చే అవకాశాలు పరిశీలనలో ఉన్నాయి.

## ఈ కేంద్ర ప్రత్యేకతలు:

జాతీయ సూచనా విజ్ఞానకేంద్ర ప్రత్యేకత ఏమంటే – భారత రాజధాని నగరం ఢిల్లీలో ఉండే వ్యక్తికి ఏ సమాచారం అందుబాటులో ఉంటుందో ఆ సౌకర్యం, ఆ సమాచారం అంతా వెనుకబడిన ప్రాంతంలో, మారుమూల ప్రాంతంలో ఉండే వ్యక్తికయినా అందుబాటులో ఉండే అవకాశం ఉంది. ఇదొక పెద్ద విశేషం – నేడు ఈ సమాచారం రాష్ట్ర కేంద్రంలోనూ, జిల్లా కేంద్రాలలోనూ లభ్యమవుతుంది. అంతేగాక, హైదరాబాదులోని జాతీయ సూచనా విజ్ఞాన కేంద్రంలో ఒక పబ్లిక్ బూత్ కూడ ఏర్పాటు చేయడం జరిగింది. ఇలాటి పబ్లిక్ బూత్స్ రాష్ట్ర సచివాలయంలో రాష్ట్ర విధాన సభలో, గ్రంథాలయాలలో, విమానాశ్రయాలలో, పెద్దహోటళ్లలో ఏర్పాటుచేసే ఆలోచన ప్రభుత్వంలో ఉంది. అంతేగాక, ఈ బూత్స్ ద్వారా స్థానిక భాషలలో సమాచారాన్ని సామాన్యులకు అందించాలనే ఆలోచనకూడ ప్రభుత్వ పరిశీలనలో ఉంది.

ఇచట గమనించాల్సిన మరొక ముఖ్యఅంశం ఏమంటే – ఇచట సమాచారం అంతా ఉచితంగా అందజేస్తారు. దీన్ని ఉపయోగించుకొని జీవితాలను మరింత సుఖవంతంగా, ప్రయోజనకరంగా తీర్చిదిద్దుకోవడం మనందరి బాధ్యత. ఈవిధంగా లభించే సమాచారాన్ని సద్వినియోగ పరచుకున్నపుడే ప్రభుత్వం ఆశించిన లక్ష్యం నెరవేరే అవకాశం వుంది.

"ఏ భాష చెణుకైన ఏ యాస చినుకైన
తనలోన కలుపుకొని తరలింది తెలుగు." – సి. నారాయణ రెడ్డి

# తెలుగువారి సామాజిక వికాసంలో చరిత్ర సృష్టించిన తొలి పత్రికలు

- డా. అక్కిరాజు రమాపతిరావు

సమాజ చేతనను ప్రభావితం చేయడానికి పత్రిక నడపడం అనేది ఆధునిక కాల పరిణామమే. పూర్వకాలం ఏ దేశంలోనూ పత్రికలుండేవి కావు. చదువుకున్న వాళ్ళ సంఖ్య అప్పట్లో అతి తక్కువగా ఉండేది. విద్యుత్తును కనుక్కోవడం, పారిశ్రామిక యుగ ప్రభావం విస్తరించడం, అచ్చు యంత్రాలు కనుక్కోవడం ద్వారా గ్రంథాలు ప్రకటించాలనే అభిలాషా, పత్రికలు నడపాలనే కోరికా సమాజంలో శిష్టవర్గంలో కల్గి ఉండవచ్చు. అంతే కాకుండా తంతి, తపాలా సౌకర్యాలు కూడా పత్రికా ప్రచురణకు ప్రోత్సాహం కలిగించి ఉంటాయి.

భారతదేశంలో భారతీయుడిగా పత్రికా ప్రచురణకు శ్రీకారం చుట్టింది రాజారామమోహన్‌రాయ్. ఎన్నో కారణాలు చూపి ఈయన్ను నవీన భారతదేశ సాంస్కృతిక సామాజిక వికాసోద్ధారకుడనవచ్చు. రామమోహన్‌రాయ్‌కి ముందు ఇంగ్లీషు మిషనరీలు కొందరు భారతీయ మత, సాంఘికాచారాలను నిరసించటానికి, క్రైస్తవమతం మంచితనం చెప్పటానికీ, కొన్ని పత్రికలు నడిపారు. వాళ్ళ ఆ ప్రయత్నాలు ఖండించడానికే రామమోహనరాయ్, సంవాద కౌముది అనే బెంగాలీ వారపత్రికను మిరాత్-ఉల్-అక్బర్ అనే పారశీ పత్రికను ప్రారంభించాడు.

భారతీయ భాషలలో భారతీయుడు ప్రకటించిన తొలి పత్రికలు ఇవే అయి ఉంటాయి. తెలుగునాట 1835వ సంవత్సరం వరకు పత్రికలు వెలువడలేదు. ఆ సంవత్సరంలో బళ్ళారి నుంచి క్రైస్తవ మిషనరీల యాజమాన్యంలో సత్యదూత అనే పత్రిక వెలువడిందని కొన్ని ఆధారాలతో కొందరు ప్రతిపాదించగా అవునూ, కాదు అని కొందరు వివరించారు.

ఇటు తర్వాత చెప్పవలసిన పత్రిక వృత్తాంతిని. పేరు బట్టే లోకవార్తలకు ప్రాధాన్యం ఇచ్చేది యీ పత్రిక అని తెలుస్తుంది. 1840 మొదటి సంవత్సరాలలో ఇది ప్రారంభమైంది. పెళ్ళిళ్లల్లో దుబారా ఖర్చు చేయడం మంచిది కాదంటూ ఒక పాఠకుడు ఈ పత్రికలో ఒక లేఖ ప్రకటించాడు. మనకు లభిస్తున్నంత వరకు తెలుగు పత్రికలలో వెలువడ్డ మొదటి లేఖ ఇదే అనుకోవాలి. పెళ్ళిళ్ళు చేసేప్పుడు గృహస్థు పనికిమాలిన ఖర్చులు చేయరాదనీ, ముఖ్యంగా భోగం మేళాలవల్ల కలిగే అనర్థం ఇంతింత కాదనీ సుదీర్ఘమైన లేఖ వ్రాశాడు ఆ పాఠకుడు. ఈ లేఖ పూర్తి పాఠం గిడుగు రామమూర్తి పంతులుగారు గద్య చింతామణి అనే సంకలనంలో ఉదహరించాడు. ఈ పత్రిక ఒకటి రెండు సంవత్సరాల కంటె ఎక్కువ కాలం వచ్చినట్లు లేదు. దీని తర్వాత వెలువడ్డ వర్తమాన తరంగిణి అనే పత్రిక వృత్తాంతినిని ప్రశంసించింది. వర్తమాన తరంగిణి ఏడెనిమిది సంవత్సరాలు వెలువడింది. ఈ పత్రికలో వాణిజ్య ప్రకటనలు కూడా వుండేవి. 1842 జూలై 28వ తేదీతో ఉన్న పత్రికలో అప్పటికి అచ్చైన తెలుగు పుస్తకాలు, వాటి ధరలు ప్రకటించడం జరిగింది. ఇది వార పత్రిక. అప్పట్లోనే వసుచరిత్ర 8 రూపాయల ఖరీదుండేది. వేమన పద్యాలు మూడు భాగాలు 2 రూపాయలట. పది, పదిహేను శతకాలు కూడా ఈ ప్రకటనలో చేరాయి. ఒక్కొక్క శతకం వెల 8 అణాలు. తమ నిఘంటువు అర్థ వివరణంలో బ్రౌన్ దొరగారు ఈ పత్రికను ప్రమాణంగా ఉదహరించారు. ఆ తర్వాత 'సంవాదకౌముది' అనే పత్రిక చాలా కొద్ది కాలమే వచ్చింది. దీన్నికూడా బ్రౌన్‌దొరగారు 1854లో ప్రకటించిన తమ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులలో ఉదహరించారు. అటు తర్వాత దినవర్తమాని అనే పత్రిక వెలువడింది. పేరును బట్టి చూస్తే ఇది దినపత్రిక ఏమో అనే భ్రమ కలుగుతుంది. కాని వారపత్రిక. అయితే విశేషం ఏమంటే ఆ వారం రోజుల సమాచారం ఏ రోజుది ఆరోజు ఈ పత్రికలో చోటు చేసుకుంటుంది. క్రైస్తవుల యాజమాన్యంలో వెలువడ్డది ఈ పత్రిక. ఆ తర్వాత హితవాది అనే పత్రిక వచ్చింది. దీన్నికూడా క్రైస్తవ మిషనరీలే నడపారు. హితవాది

మద్రాసులో అచ్చైనా బందరు నుంచి ప్రకటితమయ్యేదేమో ననిపిస్తున్నది.

ఇంతవరకు పేర్కొన్న పత్రికలన్నీ మద్రాసు నుంచే ఆ రోజుల్లో అచ్చయ్యేవి. ఏమంటే తక్కిన ప్రాంతాలలో ఆ సౌకర్యం ఉండేది కాదనుకోవాలి. మద్రాసు నుంచి కాక ఆనాటి చెన్న రాష్ట్రంలో వెలువడ్డ మొదటి తెలుగు పత్రిక బళ్ళారి నుంచి వెలువడ్డట్లు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాశారు. ఈ పత్రిక పేరు శ్రీ యక్షిణి. ఇది కూడా క్రైస్తవ మిషనరీల యాజమాన్యం కిందనే వెలువడింది. ఇప్పుడీ పత్రికలు ఏవీ దొరకవు. శ్రీ యక్షిణి 1863లో మొదలై 67 వరకు వచ్చింది.

ఇక కిందటి శతాబ్ది ఉత్తరార్ధంలో వెలువడి కుతూహలం ఉంటే కష్టపడి గవేషించి చూడటానికి అవకాశమున్న పత్రికలు సుజనరంజని, తత్త్వబోధిని, వివేకవర్ధని, పురుషార్థ ప్రదాయిని మొదలైనవి. ఈ పత్రికలు చూస్తే నూరు, నూట ఏభై ఏళ్ళనాటి తెలుగువారి సాంఘిక, సాంస్కృతిక జీవన సరళిని గూర్చి ఆసక్తికరమైన విషయాలు తెలుస్తాయి.

సుజనరంజని అచ్చం సాహిత్య పత్రిక. అప్పట్లో ది మెడ్రాస్ జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్ అనే మాసపత్రిక వస్తుండేది. విద్యాశాఖాధికారులు నడిపేవారు. ఆ ఇంగ్లీష్ పత్రికను ఆదర్శంగా పెట్టుకొని సుజనరంజని వెలువడింది. 'ఎ ఫ్రెండ్ ఆఫ్ యూనివర్సిటీ స్టూడెంట్స్' అని ఇంగ్లీష్ పత్రిక తనను వర్ణించుకుంటే యూనివర్సిటీ విద్యార్థులకు ఉపకారకము అని సుజనరంజని తనను గూర్చి చాటుకొనేది. సుజనరంజనిలో చిన్నయసూరి నీతి చంద్రికకు టిప్పణం, విశేషాంశ వివరణం వెలువడేది. సుజనరంజని పత్రికను బహుజనపల్లి సీతారామాచార్యులు, కారుమంచి సుబ్బరాయలు నాయుడు, వింజమూరి కృష్ణమాచార్యులు అనే వారు నడిపేవారు. అయితే 1853 నాటికే చిన్నయసూరి కూడా వాణీ దర్పణ ముద్రాక్షరాశాల అనే అచ్చు యంత్రం సొంతంగా స్థాపించుకొన్నాడు. బ్రౌన్ దొరగారు అప్పట్లో మద్రాసులో హిందువులవి ఎనిమిది ముద్రాక్షరశాలలున్నాయి అని 1854లో ప్రస్తావించారు.

చాలా ఆసక్తికరమైన విషయం ఏమంటే తెలుగు కవుల చరిత్ర అనే ఆలోచన సుజనరంజనికే మొదటిసారి కలిగినట్లనిపిస్తున్నది. పోతన్నను గూర్చి, పెద్దనను గూర్చి, అయ్యలరాజుల రామభద్రుణ్ణి గురించీ ఈ పత్రిక కవి కాలకర్తృత్వాల గూర్చి ప్రస్తావించింది. వ్యాకరణం, ఛందస్సు, సమాస ప్రకరణం మొదలైన విషయాలు ఈ పత్రికలో ఉండేవి.

ఇక సంఘ సంస్కరణమూ, మత సంస్కరణమూ ఉద్దేశించి ప్రకటితమైన తెలుగు పత్రిక తత్త్వబోధిని. దక్షిణ భారతదేశంలో బ్రహ్మ సమాజ ప్రభావంతో వెలువడ్డ పత్రిక ఇది.

అప్పట్లో కలకత్తాలో అక్షయకుమార్ దత్తు గారి సంపాది కత్వంలో బ్రహ్మసమాజం వారి పత్రిక ఇదే పేరుతో వెలువడుతుండేది. 1864లో కేశవ చంద్రసేన్ మద్రాసు వచ్చారు. అప్పుడు మద్రాసులో బ్రహ్మసమాజానికి అంకురార్పణం జరిగింది. అప్పట్లో వేద సమాజమని వ్యవహ రించేవారు. కా. శ్రీధరులు నాయుడు, మన్నవ బుచ్చయ్య పంతులు మొదలైనవారు దక్షిణదేశంలో బ్రహ్మసమాజ స్థాపన సభ్యులు. తత్త్వబోధినిలో బాల్య వివాహనిరసనం, వితంతు వివాహ ప్రోత్సాహం, ఏకేశ్వరోపాసన, స్త్రీ విద్య మొదలైన సంస్కరణ భావాలు ప్రచారమయ్యేవి. శైలి చాలా సులభంగా ఉండేది. ఇంచుమించు వ్యవహారికమనే చెప్పాలి. అనాడు భారతదేశంలో సాంఘిక దురాచారాలను గూర్చీ ముఖ్యంగా స్త్రీల విషయంలో జరుగుతున్న అన్యాయాలను గూర్చీ తత్త్వబోధిని తెలుగువారిని ప్రబోధించేది. టేకుమళ్ళ రాజగోపాలరావుగారి 'హిందూ సంఘ సంస్కార చరిత్రం'లో తత్త్వబోధిని నుంచి ఉదాహరణలున్నాయి. ఈ గ్రంథం 1901లో అచ్చైంది. అప్పటి కాయన దగ్గర ఆ పత్రిక సంపుటాలు ఉండి ఉంటాయి. రాజగోపాలరావు గారు వీరేశలింగం పంతులు గారి వివేకవర్ధని నుంచి కూడా కొన్ని భాగాలు ఈ గ్రంథంలో ఉదాహరించారు. తత్త్వబోధిని ప్రభావం వీరేశలింగం నడిపిన వివేకవర్ధనిపై ఉండేది.

తత్త్వబోధిని తర్వాత పేర్కొనవలసిన పత్రిక కొక్కొండ వేంకటరత్నం పంతులు గారి ఆంధ్రభాషా సంజీవని. ఈ పత్రిక సాహిత్య విషయంగానే ఎక్కువ కృషిచేసినా సాంఘిక విషయాలు కూడా ఉండేవి. ఆ రోజుల్లో చాలా గొప్ప పండితులలో వీరొకరు. అందువల్ల సమకాలిక పండితుల స్పర్ధకు వీరెక్కువగా గురి అయినట్లు కన్పిస్తున్నది. మద్రాసు రాజధానీ కళాశాల పండిత పదవి కూడా ఇతర పండితుల మాత్సర్యానికి కారణం కావడం వింతకాదు. ముఖ్యంగా వేదం వేంకటరాయశాస్త్రిగారు వీరిని చాలా అనుచితంగా విమర్శించారు. వేంకటరత్నం పంతులు గారు సుమారు 20 సంవత్సరాలు ఈ పత్రిక నడిపారు. గ్రంథ విమర్శలు, సమీక్షలు కొక్కొండ వారే ప్రారంభించారు.

వీరేశలింగం పంతులుగారి వివేకవర్ధని తెలుగునాట కలి గించిన భావపరివర్తనం అందరికీ తెలిసిందే. ఆయనకు జాతీయ భావాలు లేవని ఇటీవల కొందరు అసత్యప్రచారాన్నీ కుతర్కాన్నీ లేవనెత్తారు. 1875 ఫిబ్రవరి వివేకవర్ధిని సంచికలో వృత్తాంతములు అనే విభాగంలో పంతులుగారు ఒక వార్తనిట్లా ప్రచురించారు.

'స్వతంత్ర జీవనము – విశేష సంఖ్యగల మహారాష్ట్రులు

దొరతనము వారి యొద్ద కొలువు కుదరక, స్వచ్ఛందమైన జీవనమును జేయుటకు నిశ్చయించుకొని అందువకై పునహా పట్టణములో నొక సమాజమును స్థాపించిరి. ఆ సంఘము వారి యుద్దేశము దేశము యొక్క భాగ్యమును వృద్ధి చేయుటయు, పాటుపడుటయు వర్తకమును ప్రోత్సాహము చేయుటయు. ఇట్టి సమాజములు తక్కువ స్థలములలో గూడ స్థాపించబడి, జనులందరు ఐకమత్యము గలిగి పాటుపడిన, శీఘ్రకాలములోపలనే జనుల యొక్కయు దేశము యొక్కయు స్థితి మంచి దశకు రావచ్చును.

వివేకవర్ధని సుమారు 20 సంవత్సరాలు నడిచింది. పత్రికా సంపాదకత్వంవల్ల వీరేశలింగం ఎన్నో చిక్కులను ఎదుర్కోవలసి వచ్చింది. బలవద్విరోధం ఎదుర్కోవలసి వచ్చింది.

సంఘంలోని వేశ్యాప్రియత్వం, లంచగొండితనం, అవినీతి ఆశ్రిత పక్షపాతం, తన పత్రిక ద్వారా వెల్లడించి దోషులను తలవంచుకొనేట్లు చేశాడు. రాజమండ్రిలోని ఒక పబ్లిక్ ప్రాసిక్యూటర్ అవినీతిని వివేకవర్ధని వెల్లడించడంతో ప్రభుత్వం విచారణ జరపాల్సి వచ్చింది. నేరం వెల్లడి కావడంతో ఆ పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఆత్మహత్య చేసుకోవడం జరిగింది. ఈ వృత్తాంతం ఆంధ్రదేశమంతా కార్చిచ్చులా వ్యాపించి పెద్ద సంక్షోభం కలిగించిందని కొండా వెంకటప్పయ్య పంతులు స్వీయచరిత్రలో రాశారు. వివేకవర్ధని సామాజిక సమస్యలకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చింది. అందువల్ల ఆయన సతీహిత బోధిని, సత్యసంవర్ధని, చింతామణి వంటి ఇతర పత్రికలు నడిపి మహిళాభ్యుదయం, మతప్రబోధం, సాహిత్య కృషికి పూనుకొన్నాడు. తర్వాత కాలంలో గాంధేయ రాజకీయాలలో ప్రసిద్ధుడైన న్యాపతి సుబ్బారావు పంతులు చింతామణి పత్రిక నిర్వహణలో ప్రముఖపాత్ర నిర్వహించారు. తొలిరోజుల్లో పట్నం నుంచి సకల విద్యాభివర్ధని అనే సారస్వత మాసపత్రిక వచ్చేది. గూడూరి వేంకట కృష్ణారావు పంతులనే ఆయన యాజమాన్యం వహించినా మహామహోపాధ్యాయ, సర్వ స్వతంత్ర, షడ్దర్శనీసార మొదలైన ప్రశస్తి వహించిన పరవస్తు వేంకటరంగాచార్యుల వారి సారధ్యం ఉండేది ఈ పత్రికకు. శ్రీ రంగాచార్యుల వారి శాకుంతలానువాదం ఈ పత్రికలోనే ప్రకటితమైంది. ఇదే రోజుల్లో బందరు నుంచి పురుషార్థప్రదాయిని అనే మాసపత్రిక వెలువడింది. సుమారు 20 సంవత్సరాలకాలం వచ్చింది పత్రిక. సాహిత్య విషయాలకన్నా సామాజిక సమస్యలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేది ఈ పత్రిక. స్థానిక ప్రభుత్వం లోపాలను నిర్భయంగా విమర్శించేది ఈ పత్రిక.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో ఏదో ఒక పత్రిక ఏ కొంత కాలమో నడపని పండితుడంటూ లేడు. లోకానికేదో బోధించాలని తాపత్రయ పడ్డవే ఈ పత్రికలన్నీనూ. అయితే ఆ పత్రికల పేర్లు మనకీనాడు కొంత వినోదం కలిగించ వచ్చు. సన్మార్గ ప్రదర్శిని, సుజన మనోల్లాసిని, యథార్ధవాది, విబుధరంజని, జనవినోదిని, బ్రహ్మాండరంజని, లోకరంజని, కల్పవల్లి, స్వధర్మ ప్రకాశిని, బుద్ధివిధేయి, రత్నాకరము – ఈ మొదలైన పేర్లతో వచ్చేవి ఈ పత్రికలు.

అయితే జాతీయ కాంగ్రెసు ఆవిర్భావం పొందిన సంవత్సరంలోనే పుట్టిన రెండు తెలుగు పత్రికలను ముఖ్యంగా పేర్కొనాలి. హిందూ జనసంస్కారిణి, అముద్రిత గ్రంథ చింతామణి అనేవి ఆ రెండు పత్రికలు. ఈ రెండు పత్రికలు సమాజానికి సారస్వతానికి చేసిన సేవ ఇంతింతన లేము. హిందూజన సంస్కారిణిలో ఋగ్వేదం అర్థతాత్పర్య సహితంగా ప్రకటితమయ్యేది. అట్లానే ఉపనిషత్తులు, స్మృతి గ్రంథాలు ఎన్నో సరళమైన తాత్పర్యంతో సహా వెలువడేవి. వార్తలు – వివరణలు అనే శీర్షిక కింద అంతర్జాతీయ ఆర్థిక రాజకీయ సంఘటనలను కూడా ఈ పత్రిక ప్రకటించేది. విమర్శ తీవ్రంగా ఉండేది. అముద్రిత గ్రంథ చింతామణి పూర్తిగా సాహిత్య పత్రిక. ఈ రెండు పత్రికలు సుమారు 18 సంవత్సరాలు వెలువడ్డాయి.

పందొమ్మిదో శతాబ్ది చివరి దశకంలో వచ్చిన పత్రికలన్నీ సారస్వతం, మతం, సంస్కృతి, సామాజిక సంస్కరణలకు ప్రాధాన్యం ఇచ్చేవి. జాతీయోద్యమం, రాజకీయ సమస్యలు అప్పటికింకా అంత ప్రాముఖ్యం సంతరించుకోలేదు.

ఇరవయ్యో శతాబ్ది ఆగమనంతో తెలుగువారి సర్వతో ముఖమైన చైతన్య ప్రదీపకంగా కృష్ణాపత్రిక ప్రభవించింది.

– *(ప్రతిభా వైజయంతికి కృతజ్ఞతలతో)*

# తెలుగు పత్రికారంగం

పరకాల పట్టాభి రామారావు

భారత జాతీయ విముక్తి పోరాటంలో భాగంగానే మన దేశంలో వాస్తవమైన పత్రికారచన, పత్రికారంగం ఉద్భవించాయి.

అంతకు ముందు క్రైస్తవ మిషనరీలు మతప్రచారానికి పత్రికలు ప్రారంభించాయి. వానితోబాటే దేశీయులు కూడా కొన్ని పత్రికలు నెలకొల్పారు.

సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో దేశప్రజలను మేల్కొలిపి, వారిలో జాతీయాభిమానాన్ని, దేశభక్తిని రగుల్కొలిపి, దేశస్వాతంత్ర్య పోరాటంలో అంతర్భాగమైనప్పుడే పత్రికలు ప్రజలలో బాగా వ్యాపించాయి.

జాతీయ విముక్తి పోరాటంలో ఒక భాగంగానే మన దేశంలో సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు కూడా ప్రభవించాయి. ఈ ఉద్యమాల నిర్వహణలో కూడా పత్రికలు మహోజ్వల పాత్ర ధరించాయి.

ఈ విధంగా జాతీయ స్వాతంత్ర్యోద్యమం, జాతీయ పునరుజ్జీవనోద్యమం, ఒకదాని నొకటి ప్రభావితం చేసుకుంటూ భారత జాతీయ విముక్తి పోరాటం మహోవెల్లువగా రూపొందడంలో పత్రికలు చరిత్రాత్మక పాత్ర వహించాయి.

ఈ జాతీయ లక్ష్యాలచే ఉత్తేజితులైనవారు పత్రికారచనను ఒక దేశభక్తియుత కర్తవ్యంగా, నిస్వార్థ కృషిగా స్వీకరించి అనేక త్యాగాలకు, కష్టాలకు సంసిద్ధమై, జాతీయ విముక్తి పోరాటానికి పత్రికలను ఒక ప్రధాన సాధనంగా చేసుకున్నారు.

1857 లో ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం జరిగింది. ఆ తరువాత సుమారు అర్ధ శతాబ్దకాలం తదుపరి 1905 లో ప్రారంభమై, 1947 ఆగష్టునాటికి సుమారు నాల్గు దశాబ్దాల కాలం జాతీయ పోరాట మహోవెల్లువ వివిధ దశలుగా ముందుకు సాగింది. 1947 లో స్వాతంత్ర్య సంపాదన, 1947 నుండి జాతీయోద్యమ లక్ష్యాల పరిపూర్తికి ఆర్థిక, సామాజిక న్యాయాల కోసం కొనసాగుతున్న భారత ప్రజల పోరాటం పురోగమనం – ఇవి నవభారత చరిత్ర ప్రధాన ఘట్టాలు.

భారత జాతీయ విముక్తి పోరాటంలోని ఈ అన్ని దశలూ భారతీయ పత్రికారంగంలో కూడా విస్పష్టంగా కానవస్తాయి. ఈ అన్ని దశలలోను తెలుగు పత్రికారంగంలో వచ్చిన పరిణామాలను రేఖామాత్రంగా పరిశీలించడం మాత్రమే ఈ వ్యాసంలో సాధ్యం.

## 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాట పూర్వాపరాలలో:

పరాధీనతకు గురి అయిన ఇతర దేశాల వలెనే, భారతదేశంలోనికి సామ్రాజ్యవాదులు ఒక చేతిలో తుపాకి, మరొకచేతిలో బైబిలు పట్టుకుని దిగారు. శిథిలావస్థలోనున్న భారతదేశ ఫ్యూడల్ వ్యవస్థ, బ్రిటిషు పెట్టుబడిదారీ నూతన ఆర్థిక వ్యవస్థ ముందు లొంగిపోయింది. వలస ఆర్థిక దోపిడీని సుస్థిరం చేసుకోవడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో రైళ్ళు, టెలిగ్రాఫ్, ఇతర ఆధునిక రవాణా, వార్తా ప్రసార సాధనాలు, ఇంగ్లీషు విద్యా విధానం ప్రవేశపెట్టారు.

"భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనా భవిష్యత్ పరిణామాలు" అని 1853 లో కారల్ మార్క్స్, న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌కు వ్రాసిన వ్యాసంలో– "చరిత్ర పనిముట్లుగా" బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, తమను కూలద్రోసే సాధనాలను తామే భారత దేశంలో ప్రవేశపెడుతున్నారని ఎంతో ప్రతిభావంతంగా వ్యాఖ్యానించారు. రైళ్లు, టెలిగ్రాఫ్‌లద్వారా దేశంలో నలుమూలల్లో ఏర్పడిన సంబంధాల పర్యవసానంగా జాతీయ భావ అంకురార్పరణ, ఇంగ్లీషు విద్యా విధానం వలన తలెత్తిన నూతన మధ్య తరగతి మేధావి వర్గం; క్రైస్తవ మిషనరీల ద్వారా ప్రవేశపెట్టిన ప్రింటింగ్ ప్రెస్‌లు – ఇవీ మార్క్స్ చెప్పిన చరిత్ర పనిముట్లు. భారతదేశంలో పత్రికారంగం అవతరించడానికి దారితీసిన చారిత్రక పరిణామాలు –ఇవే.

1747 లో మొదట తెలుగు బైబిలు, 1831 లో మొదట తెలుగు, క్రైస్తవ పత్రిక వెలువడ్డాయి. 1835 లో బళ్ళారి

నుండి 'సత్యదూత,' 1818 లో బందరునుండి 'హితవాది' మరికొన్ని క్రైస్తవ తెలుగు పత్రికలు వెలువడ్డాయి.

మతాంతరీకరణకు క్రైస్తవ మిషనరీల వత్తిడులు, కుంపిణీ పరిపాలకుల (తూర్పు ఇండియా కంపెనీ) పన్నుల వసూళ్ళ కిరాతక చర్యలు, దేశీయులలో కల్గించిన ఆగ్రహావేశాలు, అలజడులే ఆనాటి తొలి తెలుగు పత్రికలకు ప్రేరణలు.

ఇంగ్లీషులోనే అయినప్పటికి మద్రాసు నుండి గాజుల లక్ష్మీనరసుచెట్టి 1844 లో నెలకొల్పిన 'క్రెసెంట్' పత్రిక, నిర్బంధ మతాంతరీకరణకు, పన్నుల వసూళ్ళ కిరాతక చర్యలకు వ్యతిరేకంగా పోరాడింది.

తమ పరాధీనతనకు కారణమైన శిధిల సాంఘిక వ్యవస్థలను మరమ్మతు చేసుకోవాలనే సమస్యపై తెలుగువారి దృష్టి మరలించడానికి నిదర్శనం 1838 లో మద్రాసు నుండి ప్రారంభమైన మొట్టమొదటి దేశీయ తెలుగు పత్రిక 'వృత్తాంతిని,' 1842 లో ప్రారంభమైన 'వర్తమాన తరంగిణి'; 1863 లో బళ్ళారి నుండి "శ్రీయక్షిణి"; 1865 లో మద్రాసునుండి 'తత్వబోధిని,' 'సుజన రంజని' మున్నగునవి. క్రైస్తవ మిషనరీల ప్రచారోద్ధతిని ఎదుర్కొని భారతీయ తత్వశాస్త్రాలను మతాలను తిరిగి ప్రబోధించి స్వమతాభిమానాన్ని, ఆత్మాభిమానాన్ని ప్రేరేపించడానికి ఇవి కృషి చేశాయి. ఇందులో 'తత్వబోధిని' బ్రహ్మ సమాజం పత్రికగా గుర్తుంచుకోవాలి. ఆనాటి భోగం మేళాలు, పెళ్ళిళ్ళ దుబారా ఖర్చులు మొ|| సాంఘిక దురాచారాలు, ఇంగ్లీషు ఉద్యోగుల అకృత్యాలు గురించి కూడా ఈ పత్రికలు వ్రాసేవి. 'స్వదేశీ జన అభిప్రాయం' (నేటివ్ పబ్లిక్ ఒపీనియన్) అను పేరుతో ఒక ఇంగ్లీషు, తెలుగు – ద్విభాషాపత్రిక గూడా 1865 లో నడిచింది.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటానికి ముందున్న తెలుగు పత్రికలు (సమాచారం తెలిసినంతవరకు) ఇవి.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాట సందేశం దేశం నలుమూలలా కాశీకావడి బ్రాహ్మణులద్వారా, గోడలపై వ్రాతల (గోడ వార్తాపత్రికలా?) ద్వారా అందించబడింది. రహస్య సందేశాలు – గోధుమ చపాతీల ద్వారా, ఎర్రకలువల ద్వారా తిరుగుబాటునూ సిపాయిదళాలు అందించుకొన్నాయి. అప్పటికే ఉన్న తెలుగు పత్రికలలో 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం గురించిన ప్రస్తక్తి ఏరూపంలో ఉన్నదో పరిశోధకుల ద్వారా ఇంకా తెలియవలసిన విషయం.

## జాతీయ పునరుజ్జీవనోద్యమంలో:

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం అణచివేయబడినప్పటికీ భారత ప్రజలలో ఏర్పడిన స్వాతంత్ర్య కాంక్షలను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు అణచలేకపోయారు.

తమ దేశం బానిసత్వంలోకి పోవడానికి కారణభూతమైన శిధిల ఫ్యూడల్ సమాజ వ్యవస్థ, క్షీణసంస్కృతి, కరడుగట్టిన కుల, మత, సాంప్రదాయాలు, అంతులేని మూఢ నమ్మకాల నుండి బైటపడాలనే సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు యీ స్వాతంత్ర్య కాంక్షనుండే జనించాయి. యూరోప్‌లో వచ్చిన రినైజాన్స్ ఉద్యమం, శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధి, హేతువాద దృష్టి, పాశ్చాత్య దేశాల్లోని ఫ్యూడల్ వ్యతిరేక విప్లవాల-స్వేచ్ఛా, స్వాతంత్ర్య, సమానత్వభావ వీచికలు భారతదేశ మధ్య తరగతి మేధావి వర్గాన్ని ప్రభావితం చేశాయి.

బెంగాల్‌లో రాజారామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్; మహారాష్ట్రంలో గోవిందరనడే; దక్షిణ భారత దేశంలో కందుకూరి వీరేశలింగం, నారాయణగురు మున్నగు మహనీయులు భారత జాతీయ పునరుజ్జీవనోద్యమానికి నాయకత్వం వహించారు. సతీ సహగమనం, బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, భోగం మేళాలు, అంటరానితనం, మత మౌఢ్యం, నిర్మూలించబడడానికి వీరు మహోద్యమాలు నడిపారు. ఈ మహోద్యమాలకు పత్రికలు ప్రధాన సాధనాలైనాయి. తెలుగు దేశంలో వాస్తవంగా పత్రికారంగం రూపొందింది ఈ పునరుజ్జీవనోద్యమంలోనేనని చెప్పవచ్చు. తెలుగు పత్రికారంగంలో వీరేశలింగం యుగంగా చెప్పకోవలసిన ఈ యుగంలో, మద్రాసులో కాకుండా మొదటిసారిగా తెలుగు నడిగడ్డమీదనే అనేక పత్రికలు ఉద్భవించాయి.

1872 లో బందరులో ఉమా రంగనాయకులుగారు స్థాపించిన 'పురుషార్థ ప్రదాయని'తోనే ఈ నూతన యుగానికి నాంది జరిగింది. వీరేశలింగంగారు ఈ పత్రికలోనే తమ తొలి రచనలు ప్రచురించారు. సాంఘిక సంస్కరణోద్యమానికి కేంద్రస్థానమైన తమ రాజమండ్రి నుండి వరుస వరుసగా వీరేశలింగంగారు 1874 లో 'వివేకవర్ధని', 1875 లో 'హాస్య సంజీవని,' 1883 లో 'సతీ హితబోధిని', 1892 లో 'సత్య సంవర్ధని,' 1905 లో 'సత్యవాదిని' మొదలైన పత్రికలను తమ పోరాట ఆయుధాలుగా చేపట్టారు. ఈ పత్రికల నిర్వహణకు డబ్బు ఎక్కడిది? తాను వ్రాసిన శతాధిక గ్రంథాల రాబడి ఈ పత్రికలకు పెట్టుబడిగా, అంతకంటే సంఘ సంస్కరణోద్యమం పట్ల ప్రజల అభిమానమే ప్రధాన పెట్టుబడిగా ఆయన ఈ పత్రికలను నడిపారు. ప్రజల అభిమానమే పత్రికలకు అసలు పెట్టుబడి అని నిరూపించారు. ఆనాటి అభివృద్ధి నిరోధకులకు, పీఠాధిపతులకు, లంచగొండులకు, అవినీతిపరులకు వీరేశలింగంగారి పత్రికలంటే సింహస్వప్నమే.

1885 లో మద్రాసునుండి ఎ.వి. పార్థసారథి నాయుడు గారి "ఆంధ్ర ప్రకాశిక", 1874 లో గట్టుపల్లి

శేషాచార్యులుగారి "శశిరేఖ", 1896 లో బెజవాడనుండి దేవగుప్తం శేషాచలపతి గారి "దేశాభిమాని" (ఇది ఆ తరువాత దిన పత్రికగా కూడా నడిచింది), వీరేశలింగంగారి అనుయాయుడు షూజాయట్ ఆలీఖాన్ నర్సాపురం నుండి ఇదే సమయంలో ప్రారంభించిన "విద్వన్ మనోహారిణి," న్యాపతి సుబ్బారావుగారి "చింతామణి," రాయసం వెంకట శివుడుగారి "జనానా పత్రిక" మున్నగు పత్రికలు అనాడు తెలుగుదేశంలో సాంఘిక చైతన్యాన్ని దేశాభిమానాన్ని కలి గించడానికి ఎంతో కృషిచేశాయి. 1885 లో నెల్లూరునుండి పూండ్ల రామకృష్ణయ్యగారు ప్రారంభించిన 'అముద్రిత గ్రంథ చింతామణి' ఎన్నో ప్రాచీన గ్రంథాలను ప్రచురించింది.

వీరేశలింగంగారి సతీ హితబోధిని తెలుగుదేశంలో స్త్రీల కుద్దేశించిన మొదటి తెలుగు పత్రిక అయితే, రెండవ పత్రిక రాయసం వెంకట శివుడుగారు ప్రచురించిన జనానా పత్రిక. ఆ తరువాత స్త్రీలలో వచ్చిన చైతన్యమే తమ పత్రికలు తామే స్థాపించుకోవడానికి దోహదం చేసింది. 1919-20 మధ్య మరొక స్త్రీల పత్రిక 'సౌందర్యవల్లి'ని మద్రాసు నుండి గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారి సతీమణి రాంబాయి ప్రచురించారు. 1920 లో కాకినాడ నుండి మొసలికంటి రామా బాయమ్మగారి 'హిందూ సుందరి', అంతకుముందే 1910-18 లో పులగుర్తి లక్ష్మీనరసమాంబగారి 'సావిత్రి,' 1914 లో వింజమూరి వెంకట రత్నమ్మగారి 'అనసూయ' పత్రికలు ఈ కోవకు చెందిన పత్రికలు.

20 వ శతాబ్దారంభంలో చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు నడిపిన 'మనోరమ' (1906), 'దేశమాత' (1910) మున్నగు పత్రికలు కూడా సాంఘిక సంస్కరణోద్యమాన్ని జాతీయ ప్రబోధాన్ని ముందుకు తీసుకుపోయిన పత్రికలు. "భరతఖండంబు చక్కని పాడియావు, తెల్లవారను గడసరి గొల్లవారు....పితుకుచున్నారు." అన్న ప్రఖ్యాత గీతపద్యాన్ని రచించిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిన పత్రికా ఆంక్షలకు గురై ధరావతును కోల్పోయిన అనాటి తెలుగు సంపాదకులలో ఒకరు.

ఆ తరువాత దశలలో వ్యావహారిక భాషావాదానికి గిడుగు రామమూర్తిగారు "తెలుగు" పత్రికను నడిపారు. (1919-20). కొమర్రాజు లక్ష్మణరావుగారు తమ విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి ద్వారా తెలుగు సారస్వత ప్రచురణలో నూతనాధ్యాయాన్ని రచించారు.

వీరేశలింగం యుగంలోను, ఆ తరువాత సాగిన సాంఘిక సాంస్కృతిక భాషా పునరుజ్జీవనోద్యమాలను ప్రతిఘటించ చడానికి అనాటి ఛాందసవాదులు నడిపిన పత్రికలు కూడా లేకపోలేదు.

"పత్రికల హోరాహోరీ యుద్ధాలు" అనాడు జరుగకపో లేదు. అందులో చెప్పుకోదగినవీ, అభ్యుదయ భావాలకు ఎదురుదాడి సాగించినవి కొక్కొండ వెంకటరత్నంగారు మద్రాసు నుండి నడిపిన "హాస్యవర్ధని," శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రిగారు నడిపిన "వజ్రాయుధం," కాకినాడ నుండి కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి "ఆంధ్ర సాహిత్య పరిషత్" పత్రిక మొదలైనవి. వీరు తెలుగు భాషాభివృద్ధికి సేవచేసినవారే అయినప్పటికీ, అనాటి తిరోగమన వాదులకు ప్రాతినిధ్యం వహించినవారు.

ఏది ఏమైనా వీరేశలింగం యుగంలో పత్రికలు కల్గించిన సాంఘిక చైతన్యం, దేశాభిమానం ఆ తరువాత తెలుగుదేశంలో దేశభక్తి ఉద్యమాలకు పునాదులు వేశాయి. నవయుగాంధ్ర నిర్మాణానికి వెలుగుబాటలైనాయి. సాహిత్యానికి, కళలకు వలెనే పత్రికా రచనకుకూడా సామాజిక ప్రయోజనమే పరమ ప్రయోజనమని వీరేశలింగంగారు వరవడి దిద్దారు. తమ ఉద్యమాల ద్వారా, తమ పత్రికల ద్వారా రచనల ద్వారా, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, కొమర్రాజు లక్ష్మణరావు, గిడుగు రామమూర్తి, కాశీనా థుని నాగేశ్వరరావుగార్లు ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి యుగపురుషులైనారు.

## జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో:

1885 లో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ ఏర్ప డింది. రెండు దశాబ్దాల మితవాద రాజకీయాల అనంతరం లాలాలజపతిరాయ్, బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ (లాల్, బాల్, పాల్) అతివాద నాయకత్వంలో 1905 లో భారత స్వాతంత్ర్య పోరాట ప్రథమ వెల్లువ - వందేమాతరం ఉద్యమం లేచింది.

ఈ నూతన జాతీయ చైతన్యాన్ని ప్రతిబింబించే విధంగా దేశంలోను, తెలుగు దేశంలోను అనేక జాతీయ పత్రికలుద్భవించాయి. 1875 లో బంకించంద్ర ఛటర్జీ "వందేమాతరం" గేయం, 1910 లో గురజాడ అప్పారావు "దేశభక్తి గేయం" అనాటి దేశభక్తి ప్రబోధానికి చిహ్నాలు.

తన "కేసరి"; "మరాటీ" పత్రికలలో తీవ్రవాదవ్యాసాలు వ్రాసినందుకు లోకమాన్య బాలగంగధర తిలక్‌ను 1908 లో బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసింది. అదేసమయంలో తెలుగు దేశంలో "స్వరాజ్య" పత్రిక సంపాదకుడు గాడిచర్ల హరి సర్వోత్తమరావు "అరెరె! ఫరంగీ, క్రూర వ్యాఘ్రమా!" అని వ్రాసిన వ్యాసానికి రాజద్రోహ నేరం మోపి అరెస్టు చేసి, మూడేళ్ళ కఠినశిక్ష విధించింది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా తెలుగు పత్రికారంగం చేసిన "తొలి గర్జా ఘోష" ఇది (1908 జూలై 18). తెలుగుదేశంలో రాజకీయ ద్రోహానికి శిక్ష పడిన తొలి సంపాదకుడు ఈయన.

తిలక్‌కు 6 సంవత్సరాలు శిక్ష విధించి మాండలే జైలుకు పంపారు. అందుకు నిరసనగా బొంబాయి కార్మికవర్గం సమ్మె చేసింది. భారత రాజకీయ రంగంలో నూతన విప్లవశక్తి అడుగు పెట్టిందని లెనిన్ ఈ సమ్మెను ప్రశంసించారు.

1907–1908 ప్రాంతాల్లోనే రాజమండ్రి నుండి చిలుకూరి వీరభద్రరావుగారు "ఆంధ్రకేసరి," బందరు నుండి చిల్లరిగె శ్రీనివాసరావుగారు "నవయుగ" పత్రికలను నడిపారు. వందేమాతరం ఉద్యమంలో నవయుగ పత్రిక మూతపడింది.

## ఆంధ్ర, కృష్ణాపత్రికలు:

వందేమాతరం ఉద్యమానికి కొద్దిగా ముందే ఆనాడు తెలుగుదేశంలో జాతీయోద్యమానికి ధృవతారలనదగిన కృష్ణా పత్రిక, ఆంధ్రపత్రికలు ఉద్భవించాయి. ఈ పత్రికల స్థాపన – తెలుగు పత్రికారంగంలో వీరేశలింగం యుగం తరువాత – మరో నూతన శకానికి, జాతీయ పత్రికల శకానికి–దారి తీసింది.

తెలుగుదేశానికి మొదటి ఇంగ్లీషు విద్యాకేంద్రం, రాజకీయ ఉద్యమ కేంద్రం అయిన బందరులో 1902 ఫిబ్రవరి 1 న కృష్ణాపత్రికను కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావు గార్లు నెలకొల్పారు. 1907 లో ముట్నూరి కృష్ణారావుగారు ప్రధాన సంపాదకులై, దాదాపు నాల్గు దశాబ్దాలు స్వాతంత్ర్యోద్యమానికి, సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమానికి అఖండసేవ చేశారు. అవటపల్లి నారాయణరావు, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, కౌతా రామమోహనశాస్త్రి తదితరులెందరో ఆనాడు కృష్ణాపత్రికను, బందరు జాతీయ కళాశాలను జాతీయోద్యమ కేంద్రాలుగా నడిపారు.

బందరులోనే విద్యనభ్యసించి, వీరేశలింగంగారి "వివేక వర్ధని" పత్రికద్వారా సంస్కరణాభిలాష అలవరచుకొని స్వదేశ పరిశ్రమలను, వృత్తులను అన్వేషించుతూ బొంబాయి వెళ్ళి, ఆ తరువాత నవయుగాంధ్ర నిర్మాతలలో ఒకరుగా ప్రసిద్ధి కెక్కిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1908 సెప్టెంబరు 9 వ తేదీన బొంబాయిలో ఆంధ్రపత్రికను (వారపత్రిక) స్థాపించారు. 1914 లో మద్రాసుకు తరలించి ఆంధ్రప్రతికను దినపత్రికగా మార్చారు. వారి అమృతాంజనం పరిశ్రమ ఆంధ్రపత్రికకు, ఆ తరువాత సచిత్ర వారపత్రికకు, సారస్వత పత్రిక "భారతి"కి ఆర్థిక పునాది కల్పించింది. పత్రికలు ప్రజాసేవకోసం, పరిశ్రమలు పత్రికల ఆర్థిక పునాది, జీవనోపాధి కోసం అన్నది పంతులుగారి జీవితం నేర్పే పాఠం.

తెలుగు ప్రజలకు వార్తాపత్రిక పఠనం అలవరచుటకు సుమారు రెండు దశాబ్దాలు తెలుగుదేశంలోని ప్రతీ గ్రంథాలయానికి ఆంధ్రపత్రికను నాగేశ్వరరావుగారు ఉచితంగా పంపించారు. అనేక మందిని పత్రికా రచయితలుగా తీర్చిదిద్దారు. బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో విశాల జాతీయభావాలకు, దేశభక్తి ఉద్యమాలకు తమ పత్రికను అంకితం చేసిన నాగేశ్వరరావుగారు 1930 దశకంలో "కమ్యూనిస్టు మ్యానిఫెస్టో" వగైరా కమ్యూనిస్టు పార్టీ ప్రచురణలను ఉచితంగా వెలల తరబడి ఆంధ్రపత్రికలో ఎడ్వర్‌టైజుమెంటుగా వేశారంటే ఆశ్చర్యం కల్గవచ్చుగాని, దేశసేవకు అంకితమైన వారిలోగల సౌహార్దత కది నిదర్శనంగా ఉండగలదు.

ఆంధ్ర, కృష్ణాపత్రికలు రెండూ ఆనాడు తెలుగు ప్రజలలో దేశభక్తిని, జాతీయాభిమానాన్ని రగుల్కొల్పడంలో, తెలుగుభాషను తీర్చిదిద్ది, తెలుగు ప్రజల భావసమైక్యతకు, ఆంధ్రోద్యమానికి చేయూత ఇవ్వడంలో చరిత్రాత్మక పాత్ర వహించాయి. జాతీయోద్యమ సందేశాన్ని గ్రామ గ్రామానికి తీసుకుపోయాయి. దేశ శ్రేయస్సు, ప్రజల శ్రేయస్సే తప్ప ఇతర సంకుచిత స్వార్థప్రయోజనాలు, లాభాపేక్షలు పత్రికల లక్ష్యం కాదని, కారాదని ఈ పత్రికాధిపతు లిద్దరూ తమ ఆచరణద్వారా నిరూపించారు. అదే సందేశాన్ని 1929 సెప్టెంబరు 7,8 తేదీలలో బెజవాడ దుర్గా కళామందిరంలో తెలుగు ప్రజలు తమకు జరిపిన అఖండ సన్మానానికి సమాధానంగా కూడా చెప్పారు. పత్రికా రచనకు అత్యుత్తమ ఆదర్శాలను, అత్యున్నత ప్రమాణాలను నెలకొల్పిన ఈ మహామహుల అస్తమయంతో తెలుగు పత్రికా రంగంలో ఒక యుగం అంతరించింది.

## జాతీయోద్యమ ద్వితీయ వెల్లువ:

గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్య పోరాటం రెండవ వెల్లువ 1919–22 సహాయ నిరాకరణోద్యమంగా సాగింది. ఈ సమయంలోనే 1921 అక్టోబరు 29 వ తేదీన "ఆంధ్ర కేసరి"గా ఆ తర్వాత ప్రసిద్ధి కెక్కిన టంగుటూరి ప్రకాశం పంతులుగారు మద్రాసునుండి "స్వరాజ్య" పత్రికను ఇంగ్లీషు, తమిళ, తెలుగు భాషలలో ప్రచురించారు. స్వరాజ్య పత్రిక జాతీయ పోరాట నినాదాలను మార్మోగించింది. అనేకసార్లు ధరావతులు కోల్పోయింది. కె.ఎమ్. ఫణిక్కర్, పోతన్ జోసెఫ్, కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు, కె. సంతానం, కోలవెన్ను రామకోటేశ్వరరావు, జి.వి. కృపానిధి, ఖాసా సుబ్బారావు మున్నగు ప్రఖ్యాత పాత్రికేయులను తయారు చేసింది.

ఇదే పత్రిక విదేశ వార్తావిభాగంలో పనిచేసిన గుంటూరు వాస్తవ్యులు గోవిందరాజుల వెంకట కృష్ణారావుగారు భారతదేశంలో మొదటిసారిగా 1921 లో "లెనిన్ జీవితచరిత్ర" వ్రాశారు. దానితో ఆయనమీద బ్రిటిష్ ప్రభుత్వ సి.ఐ.డి నిఘా హెచ్చి, స్వరాజ్య పత్రికనుండి తప్పుకోవలసి వచ్చింది. ఆ తరువాత ఆయన కొంతకాలం మద్రాసునుండే "నవయుగం" అనే పత్రికను నడిపారు. తెలుగుదేశంలో సోషలిస్టు భావాల

వ్యాప్తికి పూనుకొన్న తొలి పత్రికా రచయిత వీరేనని చెప్పవచ్చు.

1919 లో గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు మద్రాసు నుండి "ది నేషనలిస్టు" అనే ఆంగ్ల వారపత్రికను మూడేళ్ళు నడిపారు. "కల్ట్ ఆఫ్ ది బుల్లెట్" అనే సంపాదకీయానికి బ్రిటిష్ ప్రభుత్వం రెండువేల రూపాయల ధరావతును వశపర్చుకొంది. 1922 లో తాడిపత్రి నుండి హరి సర్వోత్తమరావుగారి సంపాదకత్వాన్నే "మాతృసేవ" పత్రిక ప్రారంభమైంది. జాతీయవాంఛా ప్రచారానికి పాటుపడింది.

1922 లో రాజమండ్రి నుండి మద్దూరి అన్నపూర్ణయ్యగారు "కాంగ్రెస్ పత్రిక"ను, ఏలూరు నుండి ఆత్మకూరి గోవిందాచార్యులు గారు "సత్యాగ్రహి" పత్రికలను నడిపారు. ఈ పత్రికలు ప్రభుత్వ ఆగ్రహానికి వెంటనే గురి అయ్యాయి. కాంగ్రెస్ పత్రిక సంపాదకత్వం వహించిన వారందరూ – వరుసగా మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు, కాండ్రేగుల రామచంద్రరావులు అరెస్టులు, శిక్షలు అనుభవించారు. ఆ తరువాత 1930–32 ఉప్పుసత్యాగ్రహం సందర్భంలో ప్రెస్‌ను పోలీసులు నాశనం చేశారు. "సత్యాగ్రహి" ప్రెస్‌ను వేలం వేశారు.

ఏలూరు నుండి మున్నంగి శర్మగారి సంపాదకత్వాన వెలువడిన "గాండీవము," "దేవదత్తము" అను పత్రికలు, మద్రాసు నుండి ఎన్. గణేశన్‌గారి సంపాదకత్వాన "జన్మభూమి" పత్రిక జాతీయోద్యమానికి సేవచేశాయి. జన్మభూమి ఖరీదు "కానీ". ఆ పేరుతోనే అది కానీ పత్రికగా ప్రఖ్యాతి వహించింది.

1928 ఆ ప్రాంతాలలో నెల్లూరు వెంకట్రామ నాయుడు "జమీన్‌రైతు" పత్రికను ప్రారంభించారు.

ఇదే సమయంలో రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో పత్రికలు ప్రారంభమయ్యాయి. 1922 లో తాడిపత్రి నుండి 'మాతృసేవ', అనంతపురం నుండి హాస్యమంజూష, నంద్యాల నుండి "పినాకిని," "కౌమోదికి" మున్నగు పత్రికలు వెలువడ్డాయి. 1920 లో కల్లూరి సుబ్బారావుగారు అనంతపురం నుండి ఒక పత్రికను నడిపారు. వనం శంకర శర్మగారు "ఇంద్రావతి", మూలా నారాయణ స్వామిగారు "విజయవాణి" పత్రికలను, కడప నుండి అవధానం కృష్ణముని గారు "బ్రహ్మానందిని" పత్రికలను నడిపారు. జాతీయోద్యమ ప్రచారానికి ఈ పత్రికలూ తోడ్పడ్డాయి.

నైజాం నిరంకుశ పాలనలో అణగారిపోయిన ఫలితంగా తెలంగాణా ప్రాంతంలో పత్రికలు చాలా కాలం తలెత్తలేదు. అభివృద్ధి చెందలేదు. తెలంగాణా ప్రాంతంలో 1913 లో మహబూబ్‌నగర్ నుండి శ్రీనివాస శర్మగారు 'హితబోధిని' మాసపత్రికను, 1920 లో వర్ధంగల్ జిల్లా ఇంగుర్తి నుండి 'తెలుగు పత్రికను' ఒద్దిరాజు సోదరులు సీతారామచంద్రరావు, రాఘవరంగారావుగార్లు ప్రారంభించారు. నల్లగొండ నుండి 'నీలగిరి' పత్రికను అదే సంవత్సరంలో నరసింహారావుగారు నడిపారు. పై రెండు పత్రికలు సుమారు అయిదేళ్ళు నడిచాయి.

1925 లో "గోల్కొండ" పత్రికను సురవరం ప్రతాపరెడ్డి గారు ప్రారంభించారు. ఈ పత్రిక తెలంగాణా పత్రికారంగంలో ప్రముఖపాత్ర వహించింది. ముందు ద్వైవార పత్రికగాను, చివరి దశలో దినపత్రికగాను నడిచింది. తెలుగుభాషా సంస్కృతుల వికాసానికి, ఆంధ్రమహాసభ ఉద్యమానికి ఈ పత్రిక తోడ్పడింది. 1927 లో పి. ఎన్. శర్మగారు ప్రారంభించిన "సుజాత" మాసపత్రికను కొన్నాళ్ళు సురవరం, మాడపాటిగార్లు సంయుక్తంగా నిర్వహించారు.

1933–38 మధ్యకాలంలో "దేశబంధు," "దక్కన్ కేసరి," "ఆంధ్రవాణి," "తెలుగుతల్లి" (రాచమల్ల సత్యవతీ దేవి) "విభూతి" (పండిత వీరభద్రశర్మ) మున్నగు పత్రికలు వెలువడ్డాయి. ఇందులో తెలుగుతల్లి పత్రికను 1943 ఆ ప్రాంతాలలో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘంవారు కొన్నాళ్ళు నిర్వహించారు. 1945 లో "తెలంగాణా" అను తెలుగు దినపత్రికను, "డక్కన్ క్రానికల్" ఇంగ్లీషు దినపత్రికను రాజగోపాల్ మొదలియార్ స్థాపించారు. ఇందులో తెలంగాణా పత్రిక (బుక్కపట్నం రామానుజాచారి సంపాదకుడు) నిలిచి పోయింది. తరువాత డక్కన్ క్రానికల్ సంస్థవారే "ఆంధ్రభూమి" దినపత్రికను మొదలు పెట్టారు. "మీజాన్" అనే అరబ్బీ పేరుతో 1945 లో హైదరాబాదు నుండి వెలువడిన తెలుగు దిన పత్రికలో అడవి బాపిరాజుగారు సంపాదకులుగా, శ్రీనివాస చక్రవర్తి, తిరుమల రామచంద్ర, విద్వాన్ విశ్వం, రాంభట్ల కృష్ణమూర్తి మున్నగువారు సహాయ సంపాదకులుగాను పనిచేశారు. 1917 లో దేవులపల్లి రామానుజరావుగారు "శోభ" సారస్వత మాసపత్రిక నడిపారు. నైజాం నవాబును కూలదోసిన తెలంగాణా రైతాంగ విప్లవపోరాటం సందర్భంలో ఆనాటి ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ వారపత్రిక "ప్రజాశక్తి" విజయవాడ నుండి ప్రచురించబడుతున్నప్పటికీ ఎంతో ప్రధాన పాత్ర వహించింది.

సికింద్రాబాద్ నుండి 1955 లో "ఆంధ్ర జనత" దినపత్రిక శ్రీ కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం సంపాదకత్వాన కొంతకాలం నడించింది.

20 వ శతాబ్ద ప్రారంభంలో సారస్వత పత్రికలు అనేకం వెలువడ్డాయి. 1912 లో రాజమండ్రి నుండి రామయ్యగారు "ఆంధ్ర సాహిత్య పరిషత్" పత్రికను, ఆచంట జయంతి సాంఖ్యాయనశర్మగారు "కల్పలత"ను ప్రారంభించారు.

1923 లో బందరునుండి రెండేళ్ళపాటు కొతా రామమోహనశాస్త్రిగారు మోడరన్ రివ్యూను ఆదర్శంగా

పెట్టుకొని "శారద" పత్రికను నెలకొల్పారు. కాని, అది రెండేళ్లు మాత్రమే నడిచింది. ఇదే సమయములో శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ గార్లు "జయంతి" మాసపత్రికను కొన్నాళ్ళు నిర్వహించారు. తెలుగు సారస్వతరంగంలో ప్రఖ్యాతి వహించిన "భారతి" మాస పత్రికను 1924 లో కాశీనాథుని నాగేశ్వరరావుగారు ప్రారంభించి ఆంధ్రపత్రిక సముదాయానికి చేర్చారు.

## జాతీయోద్యమ తృతీయ వెల్లువలో:

1930–32 జాతీయోద్యమం తృతీయ వెల్లువగా ఉప్పు సత్యాగ్రహం జరిగిన సందర్భంలో తెలుగు పత్రికారంగం తిరిగి అనేక నిర్బంధాలకు గురి అయింది. అందులో రాజమండ్రి నుండి ప్రచురించబడుతున్న మద్దూరి అన్నపూర్ణయ్యగారి "కాంగ్రెస్ పత్రిక," ఏలూరునుండి వెలువడే "సత్యాగ్రహి," గుడివాడనుండి ప్రచురించబడే "దరిద్ర నారాయణ" మున్నగు పత్రికలు అనేక ఆంక్షలకు గురి అయ్యాయి. ధరావతులు కట్టలేక కొన్ని మూలబడ్డాయి. పశ్చిమ గోదావరి జిల్లాలో 'వీరభారతి' రహస్య పత్రికను కాళీపట్నం కొండయ్య ప్రభృతులు, కృష్ణా జిల్లాలో "జయభారత్," "రెడీ" మున్నగు రహస్య పత్రికలను మద్దుకూరి చంద్రశేఖరరావు ప్రభృతులు కొన్నాళ్ళు సైక్లోస్టయిల్ పత్రికలుగాను, కొన్నాళ్ళు అచ్చు పత్రికలుగాను ఎన్నో కష్టాల కోర్చి నడిపారు.

ఈ సమయానికే భారత జాతీయ విముక్తి పోరాటంలో అనేక నూతన శక్తులు, నూతన పరిణామాలు ఆవిర్భవించాయి. 1925 లో భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది. 1929–33 లో మీరట్ కుట్రకేసు జరిగింది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమాన్నీ; కార్మిక, కర్షకోద్యమాలనూ నిర్మించుతున్నందుకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు నడిపిన కుట్రకేసు ఇది. 1931 లో కరాచీ కాంగ్రెస్‌లో ప్రాథమిక హక్కుల తీర్మానం ఆమోదించబడింది. అదే సంవత్సరం భారత విప్లవయోధుడు భగత్‌సింగ్ ఉరికంబానికి ఎక్కాడు. టెర్రరిజంకాదు, శాస్త్రీయ సోషలిజమే శరణ్యమని చివరి రోజులలో ఆయన భావించాడు. 1934 లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పడింది. 1936 లో లక్నో కాంగ్రెస్ అధ్యక్ష పీఠం నుండి పండిట్ నెహ్రూ భారతదేశ గమ్యం సోషలిజమేనని ప్రకటించడం; కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సోషలిస్టులు, అతివాద కాంగ్రెస్ వాదులు అందరు కలిసి "సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటనగా" కలిసి పని చేయడం, 1939 లో త్రిపుర కాంగ్రెస్ మహాసభ అధ్యక్ష స్థానానికి సుభాష్ చంద్రబోసు గెలుపు మున్నగునవి ఆనాడు భారత రాజకీయ రంగంలో వచ్చిన వామపక్ష రాజకీయ వెలుగులకు సూచనలు.

భారతీయ పత్రికా రంగంలో కూడా ఈ పరిణామం ద్యోతకమైంది. అలహాబాద్ నుండి పండిట్ నెహ్రూ తదితరుల ఆధ్వర్యాన కోటంరాజు రామారావు, ఆ తరువాత ఎమ్. చలపతిరావు (ఎమ్.సి.) ప్రభృతుల సంపాదకత్వాన "నేషనల్ హెరాల్డ్" పత్రిక, బొంబాయి నుండి కమ్యూనిస్టు పార్టీ పత్రిక "నేషనల్ ఫ్రంట్" మున్నగు పత్రికలు ప్రారంభమయ్యాయి. భారతదేశ పత్రికా రంగంలో ఇది ఒక నూతన ఘట్టం. భారత జాతీయ విముక్తి పోరాట క్రమంలో వచ్చిన అభివృద్ధికర నూతన పరిణామాలూ, ప్రభావం తెలుగు పత్రికారంగంలో కూడా ప్రతిబింబించాయి.

## పత్రికారంగంలో మూల మలుపు:

1937 లో కమ్యూనిస్టు పార్టీ పత్రిక "నవశక్తి" అవతరణతో తెలుగు పత్రికారంగంలో సోషలిస్టు సమాజ నిర్మాణం ఆదర్శంగాగల వామపక్ష ప్రగతిశీల పత్రికారచన ప్రారంభమైంది. పత్రికారచనలో ఒక నవ శకానికి నాందీ ప్రస్తావన జరిగింది.

ఇదే సమయంలో భారతదేశ పత్రికా రంగంలోనూ, తెలుగు పత్రికా రంగంలో కూడా మరొక ముఖ్యమైన పరిణామం ప్రారంభమైంది. అదే – పత్రికారంగంలో పెట్టుబడిదారీ వర్గ ప్రవేశం. జాతీయోద్యమం తొలిదశలో దేశభక్తి యుతమైన పత్రికా రచన ప్రధాన కర్తవ్యంగా, ఏకైక లక్ష్యంగా పెట్టుకొని అనేకమంది జాతీయ నాయకులు, దేశభక్తులు పత్రికలను ప్రారంభించారు. ఆర్థిక నష్టాలు పొందుతున్న ఈ పత్రికలను ఒక్కొక్కటిగా భారత పెట్టుబడిదారీ వర్గాలు వశపరచుకోవడం జరిగింది. అదే విధంగా బిర్లాలూ, టాటాలూ, గోయంకాలు పత్రికారంగంలో ప్రవేశించారు. వార్తాపత్రికా రంగాన్ని వ్యాపారరంగంగా, అనేక ఇతర పరిశ్రమలలో ఒక పరిశ్రమగా మార్చివేసి, గొలుసు పత్రికల రూపంలో గుత్తాధిపత్యాన్ని నెలకొల్పుకోడానికి ఇది ఆ తరువాత దారి తీసింది. స్వాతంత్ర్య సంపాదనానంతరం ఈ పరిణామం మరింత స్పష్టంగా ద్యోతకమైంది.

ఈ విధంగా భారతీయ పత్రికా రచన అటు పెట్టుబడిదారీ పత్రికా రచనగా, పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాల ప్రచార సాధనంగా ఒక పాయ; ఇటు జాతీయోద్యమ లక్ష్యాల పరిపూర్తికి, సోషలిస్టు లక్ష్యసాధనకు పురోగమించే వామపక్ష ప్రగతిశీల పత్రికా రచనగా మరొక 'పాయ' చీలిపోయే యుగసంధిలోనే 1937 లో కమ్యూనిస్టుపార్టీ పత్రిక "నవశక్తి," 1938 లో రామనాథ గోయంకా పత్రిక "ఆంధ్రప్రభ" తెలుగు పత్రికారంగంలో అడుగుపెట్టాయి. తెలుగు పత్రికారంగంలో వచ్చిన ఈ పరిణామం యాదృచ్ఛిక ఘటన కాదని భవిష్యత్ నిరూపించింది.

1935 లో గద్దె లింగయ్యగారి సంపాదకత్వాన వెలువడిన "ప్రభ" మాసపత్రిక "కమ్యూనిస్టు ఇంటర్నేషనల్" గేయాన్ని "ఆకలి మంటచే మలమలమాడే అనాథలందరు లేవండోయ్" అన్న శీర్షికతో తొలిసారిగా ప్రచురించింది. "ఎగరాలి, ఎగరాలి మన ఎర్రజెండా" పాటనూ ప్రచురించింది. అనతి కాలంలోనే ప్రభుత్వ ఆగ్రహానికి బలైంది.

ఇంచుమించు ఇదే సమయంలో మద్రాసు నుండి ఎస్. జి. అచార్యగారి "ప్రజాబంధు," ఆ తరువాత తాపీ ధర్మారావుగారి "కాగడా" పత్రికలు ప్రగతిశీల పత్రికారచనలో గొప్పపాత్ర వహించాయి. చిత్రగుప్త, చిత్రాంగి, ఆనందవాణి మున్నగు కొత్త పత్రికలెన్నో వచ్చాయి.

"ఆంధ్రప్రభ" దినపత్రికకు కొంతకాలం "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" సంపాదకులైన ఖాసా సుబ్బారావుగారు సంపాదకులుగా వ్యవహరించారు. ఆ తరువాత న్యాపతి నారాయణమూర్తి గారు సంపాదకులుగా పనిచేశారు. "పాన్‌సుపారి" శీర్షికలో, వారు ప్రవేశపెట్టిన వ్యంగ్య చిత్రరచనా విధానంతో తెలుగు పత్రికా రచన కొత్తపుంతలు తొక్కింది. తరువాత నార్ల వెంకటేశ్వరరావుగారి సంపాదకత్వాన ఆంధ్రప్రభ తెలుగు పత్రికారంగంలో అనన్య ప్రచారంగల దినపత్రికగా అభివృద్ధి చెందింది. జర్నలిజంలో అనేక అధునాతన పద్ధతులను నార్ల వెంకటేశ్వరరావు గారు ప్రవేశపెట్టి, ఖ్యాతి గడించారు.

అంతకుముందే 1937 లో పిఠాపురం మహారాజా పీపుల్సు పార్టీ తరపున "జనవాణి" దినపత్రిక సుమారు రెండేళ్ళు నడిచింది. ఈ పత్రికకు తాపీధర్మారావుగారు సంపాదకులుగా ఉండి తొలిసారిగా సరళ వ్యావహారిక భాషలో పత్రికారచనకు ఒరవడి పెట్టారు. నార్ల వెంకటేశ్వరరావు మున్నగువారు ఈ పత్రికలో సహాయ సంపాదకులుగా పనిచేశారు. అనంతపురం నుండి పప్పూరి రామాచార్యులుగారి సంపాదకత్వాన "సాధన," మద్రాసు నుండి ఇదేకాలంలో ఆచార్య రంగాగారి "వాహిని" పత్రిక, గూడవల్లి రామబ్రహ్మంగారి "ప్రజామిత్ర" ప్రచురించబడినాయి. తదుపరి ఇంగ్లీషు, తెలుగు "స్వతంత్ర" వారపత్రికలు కూడా ఇక్కడ నుండే వెలువడ్డాయి.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో "ప్రజామిత్ర" మొదలైన పత్రికలు కొన్నాళ్ళు విజయవాడ నుండి వెలువడ్డాయి. ఏడిద కామేశ్వరరావుగారు సంపాదక బాధ్యతలు నిర్వహించారు. ఈ పత్రికలు జమీందారీ విధానానికి వ్యతిరేకంగా, రైతాంగ పోరాటాలను బలపరిచాయి. కొంతవరకు వామపక్ష భావాలను ప్రచారం చేయడానికి తోడ్పడ్డాయి. జాతీయోద్యమ పురోగతికి కృషి చేశాయి.

నవ్య సాహిత్య పరిషత్ తరపున తెలికచర్ల వెంకటరత్నంగారి సంపాదకత్వాన "ప్రతిభ;" ఆంధ్ర శేషగిరిరావుగారి సంపాదకత్వాన "ఆంధ్రభూమి"; స్త్రీల ప్రత్యేక పత్రికగా కె. ఎన్. కేసరిగారి ఆధ్వర్యాన "గృహలక్ష్మి;" శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి "ప్రబుద్ధాంధ్ర" మున్నగు పత్రికలు తెనుగు సాహితీ రంగంలో ఎంతో కృషిచేశాయి. కొంపెల్ల జనార్దనరావుగారి 'ఉదయిని' పత్రిక అతి స్వల్పకాలమే నడిచినా, సాహిత్య రంగంలో నూతన పోకడలకు పేరుగాంచింది. ముద్దుకృష్ణగారి 'జ్వాల', సాహితీ సమితి వారి 'సాహితి' మున్నగు పత్రికలు కూడా పేర్కొనదగినవి. జాతీయోద్యమ పురోగతి సాహిత్య రంగాలలో కూడా ప్రగతికి దోహదం చేసింది. నిడదవోలు నుండి కాశీపట్నం కొండయ్యగారు నడపిన 'విజ్ఞానం' తెలుగు దేశంలో వైజ్ఞానిక విషయ ప్రచారానికి స్థాపించబడిన మొదటి పత్రిక. మద్రాసు నుండి న్యాయపతి రాఘవరావు, కామేశ్వరమ్మగార్లు నడిపిన 'బాల;' బి.ఎన్.కె. సంస్థవారి 'చందమామ' తెలుగుదేశంలో ప్రచురించబడిన మొదటి బాలల పత్రికలు.

## కమ్యూనిస్టు పత్రికల ఆవిర్భావంతో వామపక్ష ప్రగతిశీల పత్రికారచన ప్రారంభం:

తెలుగుదేశంలో కమ్యూనిస్టు పత్రికలకు వరవడి పెట్టిన నవశక్తి వారపత్రిక 1937 డిసెంబరు 15 వ తేదీన రాజమండ్రి నుండి ప్రారంభమైంది. కమ్యూనిస్టు పార్టీ నిషేధంలో ఉండటంవలన, కమ్యూనిస్టులు కూడా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలోనే ఉండి ఆనాడు పని చేస్తూండటం వలన నవశక్తి పత్రికకు సి.యస్.పి. నాయకుడు మద్దూరి అన్నపూర్ణయ్యగారే డిక్లరేషన్ తీసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన నడుపుకోడానికి అంగీకరించారు. కొన్నాళ్ళు రాజమండ్రిలో ఉన్న తరువాత 'నవశక్తి'ని బెజవాడకు తరలించారు. 1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం రావడంతో బ్రిటిష్ ప్రభుత్వ దాడి ప్రారంభమయ్యే సూచనల దృష్ట్యా ముందే ప్రెస్ వగైరా దొరకకుండా జాగ్రత్త పెట్టుకొని నవశక్తి పత్రిక అదృశ్యమైంది. నవశక్తి సంపాదకవర్గంగా ఆనాడు మద్దుకూరి చంద్రశేఖర రావు (సంపాదకుడు), కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకటరామయ్య ఉండేవారు. కొండేపూడి లక్ష్మీనారాయణ పత్రికా నిర్వహణలో తోడ్పడ్డారు. సంపాదకులు; అరెస్టులు, అజ్ఞాతవాసాలు, కేసులకూ లోనయ్యారు.

1939–42 సంవత్సరాల మధ్య కమ్యూనిస్టు పార్టీ "స్వతంత్ర భారత్" రహస్య అచ్చుపత్రికను జయప్రదంగా నడిపింది. అనేకసార్లు పోలీసు దాడులు, సి.ఐ.డి.ల వేట జరిగినా పట్టుకోలేకపోయారు. పలువురు జాతీయ వాదులు పత్రికను చదివి మెచ్చుకునేవారు. "స్వతంత్ర భారత్" కోసం జరిగిన దాడులలో కొండేపూడి లక్ష్మీనారాయణ, ఎల్.వి. జోగారావుగార్లు పట్టుబడి చిత్రహింసలకు గురి అయ్యారు. రహస్య ప్రెస్ మాత్రం దొరకలేదు. ఈ పత్రిక సంపాదక బాధ్యత మద్దుకూరి చంద్రంగారే వహించారు.

కమ్యూనిస్టుపార్టీకి బహిరంగంగా రాగల అవకాశాలు రావడంతోనే, 1942 జూన్ 17 వ తేదీన బెజవాడనుండి "ప్రజాశక్తి" వారపత్రికను ప్రారంభించి తరువాత 1945 డిశంబరులో కమ్యూనిస్టు పార్టీ మొదటి దినపత్రికగా – తెలుగుదేశం నడిగడ్డనుండి ప్రచురించబడిన మొదటి తెలుగు దిన పత్రికగా – ప్రజాశక్తిని ప్రచురించింది. తెలుగుదేశంలోని అసంఖ్యాక కార్మిక, కర్షక, పేద ప్రజానీకం "ప్రజాశక్తి"ని దినపత్రికగా చేయడానికి పైసా పైసా చొప్పున విరాళా లిచ్చారు. కమ్యూనిస్టులు, కమ్యూనిస్టు అభిమానులు పెద్ద పెద్ద మొత్తాల్లో విరాళా లిచ్చారు. తెలుగు పత్రికా రంగంలో ఇది అపూర్వ విషయం. కమ్యూనిస్టు పార్టీపై పెట్టుబడిదారీ పత్రికల దుష్ప్రచారాన్ని కష్టజీవుల వాణిగా ప్రజాశక్తి జయప్రదంగా ఎదుర్కో గల్గింది.

1948 ఫిబ్రవరిలో ప్రజాశక్తి దినపత్రిక నిషేధించబడింది. పత్రికా కార్యాలయంపై అనేక సార్లు తీవ్రదాడులు జరిగాయి. ప్రజాశక్తి ప్రెస్‌ను, అమూల్యమైన గ్రంథాలయాన్ని పోలీసులు ధ్వంసం చేశారు. 1948 నిర్బంధకాండ సమయంలోనే పక్ష పత్రికగా విజయవాడనుండి "జనతా," మద్రాసునుండి "సందేశం" పత్రికలు కమ్యూనిస్టుపార్టీ లీగల్ పత్రికలుగా నడిచాయి.

ఈ నిర్బంధ కాలంలోనే సెట్టి ఈశ్వరరావుగారి "విశాలాంధ్ర" మాసపత్రిక, తాపీ ధర్మారావుగారూ, వారి కుమారుడు మోహన్‌రావుగారూ నడిపిన "జనవాణి" వార పత్రిక, తెనాలి నుండి బొల్లిముంత శివరామకృష్ణగారి "నగారా" పత్రికలు ఆ రోజుల్లో ప్రజాతంత్ర హక్కులకై నిలబడి పోరాడాయి.

నిర్బంధకాలం అనంతరం తిరిగి ప్రజాశక్తి కొన్నాళ్ళు ద్వైవారపత్రికగా నడిచింది. 1952 జూన్ 22 వ తేదీన విశాలాంధ్ర దినపత్రిక అవతరించింది. 1975 లో కమ్యూనిజం మాసపత్రిక, కొత్తబాట రాజకీయ వారపత్రిక ప్రారంభమయ్యాయి.

కమ్యూనిస్టు పత్రికలు జాతీయ విముక్తి పోరాటాన్ని ముందుకు తీసుకొని పోవడంలో కార్మిక, కర్షక, మధ్య తరగతి ప్రజలను సంఘటితపరచి సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాల్లో వారు పాల్గొనేటట్లు ఉత్తేజపరచాయి. అంతేకాక, నవయుగాంధ్ర నిర్మాతలైన కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు మున్నగు నవయుగాంధ్ర నిర్మాతలు ప్రారంభించిన జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని ముందుకు తీసుకుపోయాయి. "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అన్న నినాదాన్ని యిచ్చి నైజాం నవాబు బానిస పాలనలో మ్రగ్గుతున్న తెలంగాణా ప్రజలు విముక్తి చెందడానికి, తద్వారా ముక్కోటి తెలుగు ప్రజలు ఐక్యం గావడానికి జరిపిన మహోద్యమానికి కమ్యూనిస్టు పత్రికలు గురుతర కర్తవ్యాన్ని నిర్వహించాయి. ప్రజానాట్యమండలి, అభ్యుదయ రచయితల ఉద్యమాలకు అండగా నిలిచి తెలుగు దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనకు తోడ్పడ్డాయి. ఇదే సమయంలో యువజన, మహిళ, కార్మిక రంగాలకు "నవయుగ," "ఆంధ్రవనిత," "వర్కర్" ప్రత్యేక పత్రికలు, అభ్యుదయ రచయితల సంఘ పత్రికగా "అభ్యుదయ" నిర్వహించబడినాయి.

తెలుగు పత్రికారంగాన్ని ఆ విధంగా వివిధ రంగాలకు విస్తృత పరచడంలో విప్లవాత్మకమైన రచనలద్వారా, శ్రామిక, మధ్య తరగతులను సాంఘికంగా, రాజకీయంగా చైతన్య పరచడంలో కమ్యూనిస్టు పత్రికలు చరిత్రాత్మకమైన పాత్రను నిర్వహించాయి. ఇంచుమించు కమ్యూనిస్టు పత్రికలన్నింటికి మద్దుకూరి చంద్రశేఖర రావుగారు సంపాదకత్వం వహించి కమ్యూనిస్టు జర్నలిజాన్ని, వామపక్ష ప్రగతిశీల పత్రికారచనను మహోన్నత ప్రమాణాలకు తీసుకువెళ్ళారు. తెలుగు దేశంలో కమ్యూనిస్టు జర్నలిజానికి పితామహులుగా ప్రసిద్ధి కెక్కారు. ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగార్లు నెలకొల్పిన దేశభక్తియుత పత్రికారచనాసంప్రదాయాలను కొనసాగించారు.

1947 లో దేశ స్వాతంత్ర్య సంపాదన, 1953 లో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణం, 1956 లో విశాలాంధ్ర నిర్మాణం తదుపరి అనేక కొత్త దినపత్రికలు, వారపత్రికలు, సినిమా సాహిత్య రంగాలలో కొత్త పత్రికలు ప్రారంభమైనాయి.

అంతేకాదు, అంతవరకు ఉమ్మడి మద్రాసు రాష్ట్ర రాజధాని మద్రాసు నుండే ప్రచురించబడుతూ వచ్చిన తెలుగు దిన పత్రికలు తెలుగు దేశానికి తరలిరావడం ప్రారంభమైంది. 1959 లో ఆంధ్రప్రభ, 1965 లో ఆంధ్రపత్రిక విజయవాడ నుండి ఎడిషన్లు ప్రారంభించాయి. తెలుగు దేశంలో నూతనంగా పారిశ్రామికాధిపులైన వారి పెట్టుబడితో "ఆంధ్రజ్యోతి" దినపత్రిక 1960 లో విజయవాడ నుండి ప్రారంభమైంది. పత్రికా సిబ్బంది సమ్మె సందర్భంలో మద్రాసు "ఆంధ్రప్రభ"ను శ్రీ రామనాథ గోయంకా మూసివేసి, ఆ తరువాత విజయవాడ, చిత్తూరుల నుండి ఎడిషన్లు ప్రారంభించారు. చిత్తూరులో కొన్నాళ్ళు, ప్రస్తుతం బెంగుళూరు, మద్రాసుల నుండి "ఆంధ్రప్రభ" ప్రచురించబడుతున్నది. సమ్మె సందర్భంలో "ఆంధ్రప్రభ" నుండి రాజీనామా చేసి వైదొలగిన శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారే "ఆంధ్రజ్యోతి" పత్రిక స్థాపనకు పూనుకున్నారు. ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికను 1967లో ప్రారంభించారు. మద్రాసులో నడుస్తున్న ఆంధ్రపత్రిక శాశ్వతంగా అక్కడ నుండి నిష్క్రమించి ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదులో 1974 నుండి ఎడిషన్ ప్రారంభించింది. ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక, 'భారతి' మాసపత్రిక విజయవాడ నుండి

వెలువడుతున్నాయి. ఆంధ్రపత్రిక, ప్రభ, జ్యోతి, సచిత్రవార పత్రికలు కథల పత్రికలుగా తెలుగుదేశమంతటా, ముఖ్యంగా స్త్రీలలో విశేష ఆదరణ పొందాయి. తెలుగుదేశంలో అక్షరాస్యత అభివృద్ధి, స్త్రీలలో విద్యాభివృద్ధి కొంత వరకైనా జరిగిన ఫలితంగా పత్రికల చదువరుల సంఖ్య పెరిగింది. పలువురు స్త్రీలు కథ, నవలా రచయిత్రులుగా తెలుగు పత్రికారంగంలో నేడు ప్రవేశించారు. కందుకూరి వీరేశలింగంగారు స్త్రీల విద్యాభివృద్ధికి ఆనాడు ఎన్నో కష్టాలు ఎదుర్కొన్న స్థితితో పోల్చితే స్త్రీలు పెద్దసంఖ్యలో పత్రికా రంగానికి పరిచయం కావడం హర్షించదగిన పరిణామం.

1974 లో విశాఖపట్నంనుండి ప్రారంభమైన "ఈనాడు" దినపత్రిక 1975 నుండి హైదరాబాద్‌లో తన ప్రధాన ఎడిషన్‌ను ప్రారంభించింది. క్రమంగా ఆంధ్ర రాజధాని నగరం తెలుగు పత్రికలకు కేంద్రంగా మారుతూంది. బెంగాలీలు, మహారాష్ట్రులు, తమిళులు మున్నగు వారివలెనే తమకూ ఒక సంస్కృతీ కేంద్రం ఏర్పడాలని తెలుగు ప్రజలు చిరకాలంగా కన్న కలలు ఫలించడానికి, హైదరాబాద్ – తెలుగువారి సంస్కృతీ కేంద్రంగా ఏర్పడటానికి పత్రికా కేంద్రం అవడం కూడా ముఖ్యం.

## పత్రికారంగంలో నేటి పరిస్థితి:

దేశం స్వాతంత్ర్యం సంపాదించక పూర్వమే పత్రికా రంగంలో ప్రారంభమైన పెట్టుబడిదారీ వర్గాల యాజమాన్యం స్వాతంత్ర్య సంపాదనానంతరం విపరీతంగా పెరిగిపోయింది. 1952 లో ప్రభుత్వం నియమించిన ప్రెస్ కమీషన్ తన నివేదికను 1954 లో సమర్పించింది. ఆ నివేదిక ప్రకారం దేశంలోని పత్రికల మొత్తం సర్క్యులేషన్‌లో 50 శాతం 1952 నాటికి గుత్త పెట్టుబడిదారీ వర్గాల చేతుల్లోకి పోయింది. 1970 నాటికి ఇది 70 శాతానికి పెరిగింది. భారతదేశ ప్రజాతంత్ర పురోగమనానికి, మౌలిక ఆర్థిక సామాజిక మార్పులకు గుత్త పత్రికలు తీవ్ర ప్రతిబంధకంగా తయారైనాయి. దేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత కాంగ్రెసు ప్రభుత్వం అవలంబించిన పెట్టుబడిదారీ అభివృద్ధి పంథావలన దేశంలో గుత్త పెట్టుబడిదారీ విధానం ఏ మేరకు పెరిగిందో, ఆ మేరకు పత్రికా రంగంపై పెట్టుబడిదారీ ప్రాబల్యం కూడా పెరిగింది. బ్రిటిష్ యజమానుల చేతుల్లోని పత్రికలుకూడా భారత గుత్త పెట్టుబడిదారుల చేతుల్లోకి వచ్చాయి. బట్టల పరిశ్రమ, జనపనార పరిశ్రమ, సిమెంటు పరిశ్రమ, ఉక్కు పరిశ్రమ, యజమానులే దేశంలోని పత్రికారంగాన్ని, కాదు – పత్రికా పరిశ్రమను – కంట్రోల్ చేయడం మొదలుపెట్టారు. "ఫోర్తు ఎస్టేట్" అనబడే పత్రికారంగం "పారిశ్రామిక ఎస్టేట్"గా మారింది.

1. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ గ్రూపు(రామనాథ గోయంకా) 2. టైమ్సు ఆఫ్ ఇండియా గ్రూపు (సాహుజైన్స్) 3. హిందూస్థాన్ టైమ్సు గ్రూపు (బిర్లా కుటుంబం) 4. స్టేట్స్‌మన్ గ్రూపు (తాతా మఫత్‌లాల్ కుటుంబాలు), అమృత బజార్, హిందూ, మొదలైన పత్రికలు కూడా ఈ విధంగా గొలుసు పత్రికలుగా నేడు దేశంలోని పత్రికలలో అత్యధిక సర్క్యులేషన్‌ను కంట్రోలు చేస్తున్నాయి. 1966 లో 71 లక్షలు 91 వేల సర్క్యులేషన్ నుండి 1971 నాటికి 1 కోటి 29 లక్షలకు ఈగొలుసు పత్రికల సర్క్యులేషన్ పెరిగింది.

దేశంలోని ఇంగ్లీషు దినపత్రికల సర్క్యులేషన్‌లో 21 శాతం సర్క్యులేషన్‌ను కంట్రోల్ చేస్తున్న ఎక్స్‌ప్రెస్ గ్రూపు పత్రిక చెల్లించబడిన మూలధనం 1.2 కోట్లు. బ్యాంకులు తదితర ఆర్థిక సహాయ సంస్థల నుండి తెచ్చినది రు. 10 కోట్ల 60 లక్షలు.

వార్తాపత్రికల ఆర్థిక వ్యవహారాల పరిశీలనకు ప్రభుత్వం నియమించిన భవతోష్ దత్తా కమిటీ 1975 లో పార్లమెంటుకు సమర్పించిన నివేదికలో ఇతర అన్నిపరిశ్రమల కంటే వార్తా పత్రికా పరిశ్రమ లాభసాటిగా వుందని తెలియజేసింది. 63 వార్తాపత్రికల కంపెనీలు 1973 లో రు. 75 కోట్లు ఆదాయం సంపాదించాయి. పత్రికల అమ్మకం, ఎడ్వర్‌టైజుమెంట్ల ద్వారా రు. 71 కోట్లు ఇతరత్రా రూ. 4 కోట్లు. మొత్తం ఆదాయం 53.3 శాతం ఎడ్వర్‌టైజుమెంట్ల ద్వారా, 46.7 శాతం పత్రికల అమ్మకంద్వారా సంపాదించాయి. వార్తాపత్రికల ద్వారా వచ్చిన లాభాలను ఇతర పరిశ్రమలలోకి మళ్ళించడం జరుగుతూందని భవతోష్ కమిటీ బైటపెట్టింది.

న్యూస్ ప్రింటు కోటాలు 62.2 శాతం 82 పెద్ద పత్రికలు, 28.5 మధ్యరకం పత్రికలు, 9.5 శాతం చిన్న రకం పత్రికలు పొందుతున్నాయి.

వార్తలు, ఎడ్వర్‌టైజుమెంటు నిష్పత్తి 60:40 ఉండాలని ప్రభుత్వ నిబంధన. కాని, సరిగా అందుకు విరుద్ధంగా ఉంటోంది. గుత్త పత్రికలు అనేక ఆర్థిక నేరాలకు అక్రమాలకు ఒడికడుతున్నట్లు ఈ కమిటీ నివేదిక నిర్ధారణ చేసింది. వార్తాపత్రికలను కంట్రోలు చేస్తున్న ఆయా పారిశ్రామికాధిపతుల ప్రయోజనాలనే ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని వార్తాపత్రికలు ప్రతిబింబించుతున్నాయని ఈకమిటీ స్పష్టం చేసింది.

"ఈ వార్తాపత్రికా యజమానులు వ్యక్తిగత ఆస్తివిధానంలో విశ్వాసం కల్గినవారు గనుక తమ పత్రికలలో అందుకనుగుణమైన భావాలను, అందుకనుగుణమైన యథాతథ వ్యవస్థను బలపరుస్తారు. అందుకు భిన్నమైన భావాలను నిరుత్సాహపరుస్తారు. అట్టివార్తలను 'బ్లాక్ అవుట్' చేస్తారు", అని భవతోష్‌దత్తా కమిటీ నివేదించింది.

ఈ కమిటీ నివేదికలోని ఇన్ని వివరాలను యిక్కడ ఎందుకు ఉటంకించవలసి వచ్చిందంటే "పత్రికా స్వాతంత్ర్యం," "భావ ప్రకటనా స్వేచ్ఛ" – ఈ రెండూ పెట్టుబడిదారీ పత్రికల చేతుల్లో బూటకం చేయబడుతున్నాయి. స్వార్థపర వర్గాలు, పెట్టుబడిదారీ వర్గాలు స్వేచ్ఛగా తమ దోపిడీని కొనసాగించడానికి అవసరమైన "స్వేచ్ఛా స్వాతంత్ర్యా"లను మాత్రమే పత్రికా స్వాతంత్ర్యంగా, భావ ప్రకటనా స్వేచ్ఛగా యీ పత్రికలు చెలామణి చేస్తున్నాయన్న విషయం తేటతెల్లం చేయడానికే.

దేశంలో ఏర్పడిన పెట్టుబడిదారీ అభివృద్ధి పంథా 1969 వచ్చేసరికి తీవ్రసంక్షోభంలో పడిన ఫలితంగా స్వాతంత్ర్యానంతరం ఎన్నడూ రానంత తీవ్ర రాజకీయ సంక్షోభం వచ్చింది. కాంగ్రెస్ విభజన జరిగింది. 1971, 1972 ఎన్నికలలో దేశప్రజలు మౌలిక, ఆర్థిక, సామాజిక మార్పులకై తమ తీర్పు యిచ్చారు. ఫలితంగా రాజభరణాల రద్దు, బ్యాంకుల జాతీయకరణ, రాజ్యాంగ సవరణలు, భూగరిష్ట పరిమిత చట్టాలు మున్నగు అభివృద్ధికర చర్యలను, జాతీయోద్యమ లక్ష్యాల కనుగుణమైన చర్యలను ఇందిరాగాంధీ ప్రభుత్వం తీసుకుంది. జాతీయ దినపత్రికలుగా చెప్పకొనే పెట్టుబడిదారీ పత్రికలు ఈ అభివృద్ధికర చర్యలపై తీవ్ర యుద్ధం ప్రకటించాయి. ప్రజాస్వామ్యం నాశనమై పోతున్నదంటూ గోల పెట్టాయి. ప్రభుత్వరంగాన్ని తెగనాడాయి. భారతదేశాన్ని న్యూఢిల్లీ కాక మాస్కో పరిపాలిస్తున్నదంటూ సోవియట్ వ్యతిరేకతను రెచ్చగొట్టాయి.

మౌలిక ఆర్థిక సామాజిక మార్పులకు వ్యతిరేకంగా మితవాద, అభివృద్ధి నిరోధక శక్తులు వేర్పాటు ఉద్యమాలను లేవదీసినప్పుడు, ఆ తరువాత జయప్రకాశ్ నారాయణ సంపూర్ణ విప్లవాన్ని ప్రారంభించినప్పుడు పెట్టుబడిదారీ పత్రికలు ఈ ఉద్యమాలను బలపరుస్తూ దేశంలో అరాచకాన్ని రెచ్చగొట్టాయి. బంగ్లాదేశ్‌లోవలె సామ్రాజ్యవాదులు "అస్థిరీకరణ చర్య"లలో భాగంగా భారతదేశంలో విద్రోహకరమైన కుట్రను జరిపినప్పుడు భారత పెట్టుబడిదారీ పత్రికలు ఈ కుట్రను బలపరచాయి. ఇది ప్రజాతంత్ర ఉద్యమంగా చిత్రించాయి.

తెలుగు పత్రికారంగంలో కూడా జాతీయ పత్రికలనబడే పత్రికలు అభివృద్ధి నిరోధకుల పక్షానే నిలబడ్డాయి. 1955 ఆంధ్రరాష్ట్ర మధ్యంతర ఎన్నికలలో భూ సంస్కరణలను ఇతర మౌలిక ఆర్థిక సామాజిక మార్పులను వ్యతిరేకించడానికి "కమ్యూనిస్టు బూచి"ని చూపి భయపెట్టాయి. కమ్మేడ్లు అధికారంలోకి వస్తే... అన్న కార్టూన్లు, ప్రగతి అనే పేరిట సంపాదకీయాలు వ్రాసిన 'ఆంధ్రప్రభ' తన వర్గ నిజస్వరూపంతో బైటపడింది. మతాన్ని, దేవుణ్ణి, గుళ్లను, గోపురాలను కూడా ఎన్నికల రంగంలోకి తెచ్చింది. కమ్యూనిస్టులపైన పచ్చి అబద్ధ ప్రచారం చేసింది. ప్రజాస్వామ్యం, వ్యక్తి స్వేచ్ఛ ప్రమాదంలో పడ్డాయని పెట్టుబడిదారీ పత్రికలు కేకలు పెడుతుంటాయి. వాస్తవానికి అప్పుడు, యిప్పుడు కూడా ప్రమాదంలో పడింది ప్రజాస్వామ్య ప్రయోజనాలు, వ్యక్తి స్వేచ్ఛ కాదనీ, పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాల స్వార్థ ప్రయోజనాలకు దెబ్బ వస్తే అలా కేకలు పెడుతుంటాయనీ చరిత్ర నిరూపించింది.

1969లో కాంగ్రెస్‌లో రాజకీయ విభజన జరిగినప్పుడు, రాజభరణాల రద్దు, బ్యాంకుల జాతీయకరణ, రాజ్యాంగ సవరణలు మొదలగు ప్రజాతంత్ర ప్రగతిశీల సంస్కరణలు జరిగినప్పుడు కొన్ని పెట్టుబడిదారీ పత్రికలు ఈ సంస్కరణలను వ్యతిరేకించి, మితవాద, అభివృద్ధి నిరోధకశక్తుల వాదనలనే బలపరచాయి. 1971–72 ఎన్నికలలో త్రిపక్ష దుష్టకూటమి కొమ్ము కాచాయి. ఆ ఎన్నికల్లో ఈ దుష్టకూటమి ఓటమిని తమ ఓటమిగా అంగీకరించాయి.

భూసంస్కరణలు, తదితర ప్రగతిశీల మార్పులకు వ్యతిరేకంగా రాష్ట్రంలో భూస్వామ్య వర్గాలు "వేర్పాటు ఉద్యమ" రూపంలో తిరుగుదాడి మొదలుపెట్టినప్పుడు, వేర్పాటు ఉద్యమాన్ని ఈ పత్రికలు బలపరచాయి. ఆనాటి "అరాచకశక్తుల చర్యలను" "ప్రజాతంత్ర వెల్లువ"గా మసిపూసి మారేడు కాయ చేశాయి. పతాక శీర్షికలతో ఆ ఉద్యమాన్ని గోరంతలు కొండంతలుగా చేసి చూపాయి. చివరకు వేర్పాటు ఉద్యమ రూపంలో పెచ్చరిల్లిన "ఫాసిస్టు మూకలు" బెదిరింపులు పుచ్చుకొని సంపాదకుల వద్ద నిలబడి ఏమి చెబితే అది వ్రాయవలసిన "దుస్థితి" లో పడి, "పత్రికాస్వాతంత్ర్యం" గురించి అప్పుడు పలవరించాయి. ఆనాటి పత్రికలు తిరగవేస్తే "పత్రికా స్వేచ్ఛ" అన్నది ఎంత వెర్రితలలు వేసిందో, ప్రజాతంత్ర విధానానికి ఎంత విపత్కరంగా పరిణమించిందో అక్షరాలా బోధపడుతుంది. చరిత్ర అనే తెల్లని "న్యూస్‌ప్రింట్" పై శిలాక్షరాలనే "నల్లని అచ్చు అక్షరాల రూపంలో" ఇవి శాశ్వతంగా నిలిచి ఉన్నాయి.

దేశంలో, రాష్ట్రంలో పాలకవర్గాలు అనుసరించిన పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధి విధానం యొక్క మంచి–చెడూ సాంస్కృతిక రంగంలోను, పత్రికారంగంలోను మరింత విస్పష్టంగా గోచరించుతున్నాయి. దేశంలో సంపద కేంద్రీకరణ ఒకవైపు, ఆర్థిక వ్యత్యాసాలు, నిరుద్యోగం మరొక వైపు పెరిగాయి. పెరుగుతున్నాయి. మౌలికమైన ఆర్థిక సామాజిక మార్పులద్వారా ప్రజల సమస్యలను పరిష్కరించడానికి బదులు, శాస్త్రీయ సాంకేతిక విప్లవంద్వారా ఉత్పత్తి పెంచితే ప్రజల సమస్యలు పరిష్కార మౌతాయనే పెడధోరణిని పాలకులు అవలంబించుతున్నారు. కాని, పెరిగిన జాతీయసంపద కొద్దిమంది చేతులలో కేంద్రీకరించబడుతున్న దృష్ట్యా దేశంలో ఆర్థిక–సామాజిక వైరుధ్యాల తీవ్రత

మరింత పెరుగుతోంది. ఆర్థిక-సాంఘిక న్యాయంతో కూడిన అభివృద్ధి అనే జాతీయోద్యమ లక్ష్యం - రాజ్యాంగ లక్ష్యం గగన కుసుమంగా తయారవుతోంది. రాజ్యాంగ చట్టం ఆదేశిక సూత్రాలు కాగితంమీదనే ఉండిపోతున్నాయి.

## శాస్త్రీయ - సాంకేతిక విప్లవం:

దేశం ఆర్థికాభివృద్ధిలో అసమానతలు, వైరుధ్యాలు పెరిగినప్పటికీ విద్యా, విజ్ఞాన, సాంకేతిక పరిశోధనా రంగాలలో, పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలో పురోగతి పొందిన వాస్తవాల్ని కాదనలేము. అలాగే ప్రచార సాధనాలలో, ప్రసార సాధనాలలో కూడా అభివృద్ధి పొందింది. వార్తాపత్రికలు, రేడియోలతోబాటు, టెలివిజన్‌కూడా ప్రసార సాధనాల జాబితాలో (మీడియా) చేరింది. ఉపగ్రహాలద్వారా రేడియో, టెలివిజన్ ప్రసారాలు ప్రారంభమయ్యాయి. అక్షరాస్యులకే కాక నిరక్షరాస్యులకు కూడా రేడియో, టెలివిజన్‌ల ద్వారా, విజ్ఞానాలను, సాంఘిక, సాహిత్య, రాజకీయ పరిజ్ఞానాలను కళలను కూడా అందించడానికి అపారమైన అవకాశాలు ఏర్పడ్డాయి.

పత్రికారంగంలో ఈ శాస్త్రీయ, సాంకేతిక విప్లవంయొక్క ప్రభావం కొట్టవచ్చినట్లు కనబడుతూంది. పాత ప్రింటింగ్ పద్ధతులు, సాధనాలలో పెద్దమార్పు వచ్చింది. ఆఫ్‌సెట్ ప్రింటింగ్, ఫోటో కంపోజింగ్, ఫాక్సిమైల్ (Facsimile) పద్ధతులు అమలులోకి వచ్చాయి. ఎలక్ట్రానిక్ పేజీ మేకప్, వర్డ్ ప్రోసెసింగ్ (Word Processing), ఉపగ్రహాల ద్వారా డాటా కమ్యూనికేషన్ (Data Communication) పద్ధతులు కూడా ప్రవేశించాయి. ప్రింటింగ్ టెక్నాలజీలో వచ్చిన, వస్తున్న ఈ మార్పులు అధిక పెట్టుబడి, నిర్వహణ ఖర్చులతో కూడుకున్నవి. అందుచేత ఎక్కువ పెట్టుబడి పెట్టగల్గిన పారిశ్రామిక, వ్యాపారవర్గాలే పత్రికారంగంలో ఇపుడూ - ఇకముందు మరింత ఎక్కువగా ప్రవేశించడానికి, తమ గుత్తాధిపత్యం నెలకొల్పుకోడానికి దారితీస్తూంది. గొలుసు పత్రికల విధానం మరింత పెరుగుతూంది. జిల్లాలవారీ ఎడిషన్‌లు, టెలి ప్రింటర్ సర్వీసులు, మోటారు వ్యాన్ డిస్ట్రిబ్యూషన్‌ల ద్వారా సర్క్యులేషన్ పెంచుకోగల్గుతున్నాయి. ఆంధ్రప్రదేశ్ పత్రికారంగంలో కూడా ఈ పరిణామాలన్నీ ప్రవేశించాయి. ఈ ప్రభావం పరిశీలించే ముందు దేశం మొత్తంమీద పత్రికారంగంలో వచ్చిన పరిణామాలను కొంతైనా పరిశీలించడం అవసరం. పత్రికల సంఖ్య, సర్క్యులేషన్ పెరగడం ప్రజల విజ్ఞానానికి ఎంతో అవసరం. కాని, దానితోబాటు పత్రికల సామాజిక బాధ్యత పెరగాలి. అలా కానినాడు అది అరిష్టదాయక మవుతుంది.

## పత్రికల సర్క్యులేషన్ పెరుగుదల:

"1984 లో భారతదేశంలో పత్రికలు" అనే నివేదికను 1986 ఆగస్టు 11 వ తేదీన కేంద్ర సమాచార, ప్రసార శాఖామంత్రి లోక్‌సభకు సమర్పించారు. అందులో ప్రధానాంశాలు యివి:

తొంభయి ఒక్క భాషలలో పత్రికలు ప్రచురితమౌతున్న మనదేశంలో 1983 లో వార్తాపత్రికలు, వార, పక్ష మాసపత్రికల సంఖ్య అంతకుముందు సంవత్సరంకంటే 4.1 శాతం పెరిగింది. కాగా, పత్రికల సర్క్యులేషన్ కూడా 10.6 శాతం పెరిగింది. 1982 లో దేశంలో 5,00,94,000 కాపీల సర్క్యులేషన్‌తో 19,937 పత్రికలు వెలువడగా, 1983 లో 20,758 పత్రికలు 5,53,91,000 సర్క్యులేషన్‌తో ప్రచురితమయ్యాయి. 1983 లో కొత్తగా 69 దినపత్రికలు, 140 వారపత్రికలతో సహా 607 కొత్త వార్తాపత్రికలను ప్రారంభించారు. 1983 లో ఒకే ఎడిషన్‌గల వార్తాపత్రికలలో కలకత్తానుంచి వెలువడే బెంగాలీ దినపత్రిక "ఆనందబజార్ పత్రిక" 4,02,490 కాపీల సర్క్యులేషన్‌తో అగ్రస్థానంలో నిలిచింది. కాగా, కలకత్తానుంచి వెలువడే మరో బెంగాలీ దినపత్రిక "జుగంతర్" 3,27,549 కాపీల సర్క్యులేషన్‌తో రెండో స్థానం సంపాదించింది. అనేక ఎడిషన్‌లు ఉన్న దినపత్రికలలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ప్రథమ స్థానంలో ఉంది.

10 కేంద్రాలనుంచి వెలువడే ఈ ఇంగ్లీషు దినపత్రిక మొత్తం సర్క్యులేషన్ 5,67,801 కాపీలు. కాగా మూడు నగరాలనుంచి వెలువడే 'టైమ్స్ ఆఫ్ ఇండియా' అనే ఇంగ్లీషు దినపత్రిక 5,30560 సర్క్యులేషన్‌తో ద్వితీయస్థానం సంపాదించింది. కాలికట్, కొచ్చిన్, కొట్టాయం నుంచి వెలువడే మలయాళ దినపత్రిక 'మలయాళ మనోరమ' 5,27,657 కాపీల సర్క్యులేషన్‌తో మూడో స్థానంలో నిలిచింది.

ఇక వార, పక్ష, మాసపత్రికల విషయానికి వస్తే, కొట్టాయం నుంచి ప్రచురితమయ్యే మలయాళ వారపత్రిక 'మలయాళ మనోరమ' 1983 లో 6,48,524 కాపీల సర్క్యులేషన్‌తో ప్రథమస్థానం పొందింది. మద్రాసునుంచి వెలువడే మరో వారపత్రిక 'కుముదం' 5,88,359 సర్క్యులేషన్‌తో రెండో స్థానం సంపాదించింది. పత్రికల సంఖ్యలో దేశంలో హిందీ పత్రికలు (5,936) ప్రథమస్థానంలో ఉండగా, ఇంగ్లీష్ (3,840), ఉర్దూ (1,378), మరాఠీ (1,131) వరుసగా రెండు, మూడు, నాలుగు స్థానాలు పొందాయి. సర్క్యులేషన్ విషయానికి వస్తే 1983 లో 15,458,000 కాపీల సర్క్యులేషన్‌తో హిందీ వార్తాపత్రికలు అగ్రస్థానంలో వుండగా, 10,627,000 సర్క్యులేషన్‌తో ఇంగ్లీష్ పత్రికలు

ద్వితీయస్థానంలోనూ, 4,918,000 కాపీలతో మలయాళ పత్రికలు తృతీయస్థానంలో ఉన్నాయి.

కాగా, ఉత్తరప్రదేశ్‌లో 1982 లో అత్యధిక సంఖ్యలో పత్రికలు ప్రచురితమయ్యాయి. మొత్తం 2,912 పత్రికలు వెలువడ్డాయి. కాగా, 2,664 పత్రికలతో మహారాష్ట్ర ద్వితీయ స్థానం సంపాదించగా, పశ్చిమ బెంగాల్ 2,274 పత్రికలతో తృతీయస్థానం పొందింది. కాగా, సర్క్యులేషన్‌లో ఢిల్లీనుంచి వెలువడే పత్రికలు 8,176,000 కాపీలతో 1983 లో ప్రథమస్థానం పొందగా, మహారాష్ట్రలో 8,132,000ల కాపీలతో రెండోస్థానాన్ని, 6,022,000 కాపీల సర్క్యులేషన్‌తో ఉత్తరప్రదేశ్ నాలుగోస్థానంలో నిలిచింది.

ఇక అనేక భాషలలో పత్రికలు ప్రచురితమౌతున్న రాష్ట్రాలలో ఢిల్లీ ప్రథమస్థానం సంపాదించింది. ఢిల్లీనుంచి 15 ప్రధాన భాషలలో పత్రికలు వెలువడుతున్నాయి. 14 భాషలలో పత్రికలు వెలువడుతున్న తమిళనాడు ద్వితీయస్థానం పొందింది. కాగా, మహారాష్ట్రలో 13 భాషలలోనూ, పశ్చిమ బెంగాల్‌లో 12 భాషలలో, ఆంధ్రప్రదేశ్‌లో 11 భాషలలో, ఉత్తరప్రదేశ్‌లో 11 భాషలలో పత్రికలు వెలువడుతున్నాయి.

పత్రికలలో గుత్తాధిపత్యం నేడు మరింత పెరుగుతూంది. మరింతగా పారిశ్రామిక, వ్యాపారసంస్థల కంట్రోలు పెరుగుతూంది. లాభసాటి పరిశ్రమ లక్షణాలు మరింత పెరిగాయని విస్పష్టంగా చెప్పవచ్చు.

## భాషలవారీగా ఆంధ్రప్రదేశ్‌లో:

తెలుగు–490, ఉర్దు–254, ఇంగ్లీషు–181, హిందీ–17, బహుభాషాపత్రికలు–101.

ఆంధ్రప్రదేశ్‌లో పత్రికల సంఖ్య 1981 నాటికి ఇలా ఉంది:

దినపత్రికలు–62, వారపత్రికలు–377, ద్వై, త్రై వార పత్రికలు–2, పక్షపత్రికలు–161, మాసపత్రికలు–361, త్రై మాసపత్రికలు–52, ఇతరములు–35.

## గొలుసు పత్రికలు

| | పత్రిక | స్థాపన | ఏయేచోట్లనుండి ప్రచురణ |
|---|---|---|---|
| 1. | ఆంధ్రపత్రిక | 1914 | విజయవాడ, హైదారాబాద్ |
| 2. | ఆంధ్రప్రభ | 1935 | విజయవాడ, హైదారాబాద్ విజయనగరం, బెంగుళూరు |
| 3. | ఆంధ్రభూమి | 1960 | హైదారాబాద్, విశాఖపట్నం |
| 4. | ఈనాడు | 1975 | హైదారాబాద్, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి |
| 5. | ఉదయం | 1984 | హైదారాబాద్, విజయవాడ |
| 6. | ఆంధ్రజ్యోతి | 1960 | విజయవాడ, హైదారాబాద్ |

ఇవి ఇతర పట్టణాలనుండి కూడా ఎడిషన్లు ప్రారంభించడానికి సన్నాహాలలో ఉన్నాయి. విజయవాడనుండి కమ్యూనిస్టు పార్టీ దినపత్రిక విశాలాంధ్ర (1952), మార్క్సిస్టు పార్టీ పత్రిక ప్రజాశక్తి (1981) ప్రచురించబడుతున్నాయి.

ప్రతి దినపత్రికా ఒక సచిత్రవారపత్రిక, సినీపత్రిక, కథల మాసపత్రిక, స్త్రీల మాసపత్రిక, పిల్లలపత్రికలను అనుబంధ పత్రికలుగా ప్రచురిస్తున్నాయి.

ఖరీదైన గ్లేజుకాగితంపై, మల్టికలర్ ప్రింటింగ్‌తో, బరువైన పుస్తకాల్లాంటి అనేక ఇంగ్లీషు, భాషావారపత్రికలు ఎక్కువ ఆకర్షణ ఎక్కువ ధరలతో నేడు మార్కెట్‌లోకి వచ్చాయి, వస్తున్నాయి. ఇన్‌వెస్టిగేటివ్ జర్నలిజం (పరిశోధనాత్మక పత్రికారచన) బాగా వాడుకలోకి వచ్చింది. పాఠకులకు ఉత్కంఠ కలిగించే సంచలనాత్మక వార్తలు, వార్తావ్యాఖ్యలు, (వార్తతో వ్యాఖ్యను జోడించే పద్ధతి– అది వార్తా? లేక వ్యాఖ్యా? అన్నది తెలియదు) వూహాగానాలు (స్పెక్యులేషన్) దినపత్రికలలోను, వారపత్రికలలోను ఎక్కువయ్యాయి.

పెట్టుబడిదారీ వ్యాపార రంగంలో సరకుల అమ్మకం మధ్య తీవ్రమైన పోటీ ఉంటుంది. ఎక్కువ సరకులు అమ్ముడుపోడానికి ఎక్కువ ఆకర్షణీయమైన వ్యాపార ప్రకటనలు (ఎడ్వర్‌టైజుమెంట్సు) చేస్తారు. అందమైన స్త్రీల బొమ్మలతో,వారి అర్ధనగ్న, నగ్న చిత్రాలతో కామోద్రేకాన్ని రెచ్చగొట్టే భంగిమలలో, ఇట్టి వ్యాపార ప్రకటనలు వెలువడుతుంటాయి. అలాగే నేటి పత్రికలు కొన్ని సెక్స్, క్రైమ్, హింసాప్రవృత్తి (శాడిజమ్), సంచలనం (సెన్సేషనలిజం) ప్రధాన ఆకర్షణలుగా చేసి తమ సర్క్యులేషన్ పెంచుకోడానికి, తద్వారా ఎక్కువ వ్యాపార ప్రకటనలు సంపాదించి ఎక్కువ లాభాలు గడించడానికి ప్రయత్నిస్తున్నాయి.

## గడచిన దశాబ్దకాలంలో

1980 దశకం చివరి భాగంలో పత్రికారంగంలో ప్రారంభమైన శాస్త్రీయ సాంకేతిక విప్లవం, 1990 దశకం ప్రారంభ సంవత్సరాలలోనే ఆశ్చర్యకరము, అనూహ్యము అద్భుతము అయిన పరిణామాలతో ముందంజ వేసింది.

కంప్యూటర్‌లు పత్రిక కార్యాలయంలో ప్రవేశించి వార్తల సేకరణ, ఎడిటింగ్, కంపోజింగ్, పేజి మేకప్, ప్రింటింగ్‌ల వరకు వాస్తవంగా విప్లవాన్నే తీసుకువచ్చాయి.

వార్తలు సేకరించి టెలి ప్రింటర్, టెలెక్స్, ఫాక్స్ పద్ధతుల ద్వారా పత్రికా కేంద్రాలకు పంపే పద్ధతి కూడా పాతబడి పోయి, మోడెమ్ (Modem) పద్ధతి ద్వారా వార్తలకు జిల్లా కేంద్రాలలోనే ఎడిటింగ్, కంపోజింగ్ కూడా పూర్తిచేసి సరాసరి పత్రికా కార్యాలయానికి లేదా ఎక్కడెక్కడ పత్రికల ఎడిషన్‌లు ఉన్నాయో అక్కడికి కూడా అదే

వార్తను పంపవచ్చు. "లోకల్ నెట్ వర్క్, వైడ్ ఏరియా నెట్ వర్క్" పద్ధతులలో ఈ వార్తను పంపవచ్చు. ఒక కంప్యూటర్ (టెర్మినల్) వద్ద కూచుని మొత్తం కంపోజు అయిన వార్తలన్నింటిని సంపాదకుడు చూసుకోవచ్చు. వివిధ ఎడిషన్ల మధ్య అనుసంధానం సమన్వయం చేసుకోవచ్చు. టెలిఫోన్‌ల ద్వారా మాట్లాడవలసిన అవసరం లేకుండా టెర్మినల్స్ ద్వారానే మాట్లాడుకోవచ్చు. (ఉత్తర ప్రత్యుత్తరాలు.) సబ్ ఎడిటరు, కంపోజరు ఇక ఒకరే అయిపోయే రోజులువచ్చాయి. అనగా, సబ్ ఎడిటర్ వ్రాయడం, కంపోజిటర్లు కంపోజ్ చేయడం కాక, సబ్ ఎడిటరు లేదా రిపోర్టరు తానే ఎడిటింగ్, కంపోజింగ్ చేస్తాడు. కంప్యూటర్ నెట్ వర్కుకు అందిస్తాడు. ఇందువలన ఒక సబ్ ఎడిటర్ ఆరు గంటలులో చేసే పని ఒక గంటలో చేయవచ్చు.

అలాగే ప్రింటింగ్ పద్ధతులలో కూడా ప్రమాదకరమైన రసాయనాలు వాడనవసరం లేకుండా అనేక దశలను అధిగమించి నేరుగా ఫిల్ము, నేరుగా ప్లేట్ మేకింగ్ జరిపి, సరాసరి ముద్రణాయంత్రం మీదకు పంపించే సౌకర్యం వచ్చింది.

కలర్ ఫోటోలు ఒక చోట నుండి మరొక చోటకు పంపే సౌకర్యం వచ్చింది. (పిక్చర్ ప్రాసెస్సింగ్.)

కంప్యూటర్ (టెర్మినల్) మీదనే పేజీ మేకప్ చేసుకొనే సౌకర్యం వచ్చింది.

గంటకు 15 వేల కాపీలు బదులు గంటకు 50 వేల కాపీలు ముద్రించగల్గే యంత్రాలు వచ్చాయి. ఫాక్స్‌మైల్ పద్ధతి ద్వారా ఒక పత్రికను ఎన్నిచోట్ల నుంచి అయినా ఏకకాలంలో ప్రచురించడానికి అవకాశం ఇదివరకే వచ్చింది.

సంపాదకీయాలు, వ్యాఖ్యలు, విమర్శలు, వ్యాసాలు వ్రాసుకొనేవారికి రిఫరెన్స్ సమాచారం అంతా "డిస్క్" లలో పొందుపరచి ఎప్పుడు ఏ సమాచారం కావలిస్తే దానిని చూసుకోవచ్చు.

ఈ విధంగా ఆధునిక టెక్నాలజీ వచ్చి పత్రికారంగంలో అనూహ్యమయిన మార్పులను తెచ్చింది.

## వివిధ కేంద్రాలలో ఎడిషన్‌లు

ఒక్క కేంద్రంలోనే వార్తలను ఎడిట్ చేసి, కంపోజింగ్ చేసి అనుక్షణం యితర కేంద్రాలకు వార్తలు, ఫోటోలు, పంపించడానికి వచ్చిన ఈ ఆధునిక ప్రక్రియల వలన వివిధ కేంద్రాలలో ఒక పత్రిక తన ఎడిషన్‌లను పూర్వము కంటే తక్కువ మందీ మార్బలంతో ప్రారంభించవచ్చును. ఎక్కువ పెట్టుబడి, ఎక్కువ యాంత్రిక సౌలభ్యం ఉంటే చాలు మరో ఎడిషన్ ప్రారంభించవచ్చు.

ఇప్పటికే యించుమించు అన్ని పెద్ద పత్రికలు వివిధ జిల్లా ఎడిషన్‌లు, పట్టణ ఎడిషన్‌లు, ఒక పెద్ద నగరం అయితే వివిధ ఏరియాలకు ఎడిషన్‌లు ప్రారంభించాయి.

ఇందువల్ల ఎడ్వర్ టైజ్ మెంట్లు ఎక్కువ సంపాదించవచ్చు. కాని, ఒక జిల్లా వార్త ప్రక్క జిల్లాకు, ఒక పట్టణం వార్త మరొక పట్టణానికి తెలియని పరిస్థితి ఏర్పడింది.

## కంట్రిబ్యూటర్లు

మండలాలు ఏర్పడటంతో ప్రతీ మండలంలో ప్రతీ పత్రిక ఒక విలేకరిని కంట్రిబ్యూటర్ పేరుతో, వార్తల కొలమానం బట్టి డబ్బు యిచ్చే పద్ధతిలో నియమిస్తున్నారు. అయితే, వీరు పూర్తిగా జర్నలిస్టులుగా జీవించలేరు. అభివృద్ధిచెందలేరు. పత్రికా రచనను ప్రధాన వృత్తిగ చేసుకోలేరు. వీరికి బాగా వృత్తి శిక్షణ ఉండదు. ఇతర వృత్తులు, ఉద్యోగాలు చేసుకుంటూ, వారు కంట్రిబ్యూటర్స్‌గా పనిచేస్తూండటం వలన పత్రికా ధర్మాలకు, విలువలకు, నీతి, నిజాయితీ, నిష్పాక్షికత, వాస్తవికత సామాజిక శ్రేయస్సు, దేశభక్తి మున్నగు వాటికి కట్టుబడి ఉండటం లేదు. అనేక ప్రలోభాలకు లోనవుతున్నారు. ఇందువలన పత్రికా రచనకు విలేకరులకు ఒక నాటి విలువ ఉండటం లేదు. ఇన్ వెస్టిగేటివ్ జర్నలిజం, ఇంటర్ ప్రిటేటివ్ జర్నలిజం (పరిశోధనాత్మక పత్రికా రచన, వ్యాఖ్యతో కూడుకున్న పత్రికా రచన) పేరుతో వ్యక్తిగత విషయాలు పత్రికలకు ఎక్కిస్తున్నారు. పత్రికారచన దుష్ప్రచారం (బ్లాక్ మెయిలింగ్) స్థాయికి దిగజారుతోంది. పదవీ రాజకీయాలు, ముఠా రాజకీయాలు పత్రికలలో ప్రధానం అవుతున్నాయి.

దేశంలో వస్తున్న ఆర్థిక సామాజిక మార్పులు, అభివృద్ధి పథకాల అమలు, దైనందిన జీవిత సమస్యలు గురించి కాక సంచలనం కల్గించే వార్తలు ప్రధానం అవుతున్నాయి. ఒక్క మాటలో సామాజిక శ్రేయస్సు పత్రికా రంగానికి ప్రధాన లక్ష్యంగా ఉండే దశనుండి; కేవలం సర్క్యులేషన్ పెంపుదల, పలుకుబడి, ధనార్జన ప్రధాన లక్ష్యంగా ఉండే దశకు నేడు పత్రికారంగం దిగజారిందని చెప్పక తప్పదు. పోటాపోటీలలో నీతి, నియమాలు, చిత్తశుద్ధి బలి అయిపోతున్నాయి. విలేకరుల స్థాయీ, పరిజ్ఞానం కూడా పడిపోతోంది. వారికి ఉద్యోగ భద్రత, వృత్తి భద్రతలేకుండా పోతోంది. ఇందు వలన వారి నైతిక ప్రమాణాలు పడిపోతున్నాయి. ఇంగ్లీషు పత్రికల వలెనే తెలుగు పత్రికా రంగంలో కూడా మహిళలు ప్రవేశించడం ఈ దశకంలో వచ్చిన హర్షనీయ పరిణామం. సబ్ ఎడిటర్లుగా, వ్యాఖ్యాతలుగా, రిపోర్టర్లుగా కూడా స్త్రీలు నేడు సమర్థవంతంగా పనిచేస్తున్నారు. రచనా నైపుణ్యాన్ని, విషయ పరిజ్ఞానాన్ని ప్రదర్శిస్తున్నారు. నిస్సంకోచంగా ధైర్యంగా రాత్రి షిఫ్టులలో కూడా పని చేస్తున్నారు.

అలాగే దినపత్రికలలో వారంలో ఒక్కొక్క రోజు ఒక్కొక్క ప్రత్యేక పేజీ వేయడం సర్వత్రా వ్యాప్తిలోకి వచ్చింది. సాహిత్యం, కళలు, పరిశ్రమలు, వ్యవసాయం,

సైన్సు, ఆరోగ్యం, వైద్య విజ్ఞానం, మహిళల పేజీ, పిల్లల పేజీ – ఇలా అన్నితరగతుల పాఠకులను ఆకర్షించే విధంగా ప్రత్యేక పేజీలు, ప్రత్యేక శీర్షికలు ప్రారంభించారు.

ఇటీవల "బిజినెస్ పేజీ" పేర కొత్త పరిశ్రమ, కొత్త కంపెనీల షేర్లు, షేర్ల వ్యాసాలు తెలుగు పత్రికలలో కూడా చోటు చేసుకున్నాయి. ఆంధ్రదేశంలో ప్రవేశించిన షేర్ మార్కెట్‌ను పత్రికారంగం ప్రతిబింబించుతుంది. "రియల్ ఎస్టేట్" ఇళ్ళస్థలాలు, గృహనిర్మాణం తదితర పేజీలు ప్రత్యేక రోజులలో వెలువడుతున్నాయి.

తాజా సమాచారం (1993 అక్టోబరు) ప్రకారం ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రధానమైన తొమ్మిది దిన పత్రికలు – వాటి ఎడిషన్‌లు ఇలా ఉన్నాయి:

ఈనాడు: హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ, తిరుపతి, అనంతపురం, కరీంనగర్, రాజమండ్రి.

ఆంధ్రజ్యోతి: హైదరాబాద్, విజయవాడ, తిరుపతి, విశాఖపట్నం.

ఉదయం: హైదరాబాద్, విజయవాడ, తిరుపతి.

ఆంధ్రప్రభ: విజయవాడ, హైదరాబాద్, విజయనగరం, మద్రాసు.

ఆంధ్రభూమి: హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ (త్వరలో రాజమండ్రి).

కృష్ణాపత్రిక: హైదరాబాద్, విజయవాడ.

విశాలాంధ్ర: విజయవాడ.

ప్రజాశక్తి : విజయవాడ, హైదరాబాద్.

## సాంఘిక చిన్న దినపత్రికలు

గత దశాబ్దకాలంలో రాష్ట్రంలో అనేక చోట్ల పెద్ద పట్టణాలనుండి స్థానిక దినపత్రికలు వెలువడుతూ వచ్చాయి. కాని, ఎప్పుడైతే పెద్ద పత్రికలు జిల్లా ఎడిషన్‌లు ప్రారంభించి తెల్లవారే సరికి ఆ జిల్లా మారుమూల గ్రామాలతో సహా అన్ని ప్రాంతాల వార్తలు, ఫొటోలతో సహా వస్తూండటంతో, స్థానిక దిన పత్రికలు చావు దెబ్బ తింటున్నాయి.

రంగు రంగులతో, ఎక్కువ పేజీలతో, ప్రతీరోజూ సినీమా వార్తలతో, రోజుకొక ప్రత్యేక శీర్షికతో నేడు తెలుగు దినపత్రికలు పోటా పోటీల మీద సర్క్యులేషన్ పెంచుకోడానికి ప్రయత్నిస్తున్నాయి. ఎక్కువ పెట్టుబడితో, అత్యంతాధునిక శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానంతో, ఎవరు ఎక్కువ శీఘ్రంగా, ఎక్కువ చోట్లనుండి పత్రికను ఆకర్షణీయంగా ముద్రించుతారన్న విషయం ప్రధాన పోటీగా ఉంది.

## తెలుగు పత్రికల సర్క్యులేషన్

ఇండియన్ న్యూస్ పేపర్ సొసైటీ (I.N.S.) 1992 హేండ్ బుక్ ప్రకటించిన సమాచారం బట్టి ఆంధ్రప్రదేశ్ దినపత్రికల సర్క్యులేషన్ 30–6–1992 నాటికి యిలా ఉన్నది:

దినపత్రికలు 12 – వీటి మొత్తం సర్క్యులేషన్ 7,52,835.

| పేరు | స్థలం | సర్క్యులేషన్ |
|---|---|---|
| 1. ఆంధ్రభూమి | సికింద్రాబాద్ | 4074 |
| 2. ఆంధ్రజ్యోతి | విజయవాడ | 1,66,392 |
| 3. ఆంధ్రపత్రిక | విజయవాడ | 9081 |
| 4. ఆంధ్రప్రభ | విజయవాడ | 14,451 |
| 5. డక్కన్ క్రానికల్ (ఇంగ్లీషు) | సికింద్రాబాద్ | 70,259 |
| 6. ఈనాడు | హైదరాబాద్ | 3,08,834 |
| 7. మునిసిఫ్(ఉర్దూ) | " | 13,612 |
| 8. రెహినుమా–ఇ–డక్కన్(ఉర్దూ) | " | 25,022 |
| 9. సియాసత్ (") | " | 36,355 |
| 10. ఉదయం | హైదరాబాద్ | 62,922 |
| 11. ఉదయం | తిరుపతి | 29,406 |
| 12. విశాలాంధ్ర | విజయవాడ | 12,427 |
| **వారపత్రికలు: వీటి మొత్తం సర్క్యులేషన్** | | **5,98,245** |
| 1. ఆంధ్రభూమి | సికింద్రాబాద్ | 68,906 |
| 2. ఆంధ్రజ్యోతి | విజయవాడ | 66,764 |
| 3. ఆంధ్రప్రభ | విజయవాడ | 50,110 |
| 4. ఆంధ్రపత్రిక (1990–91) | " | 25,074 |
| 5. చిత్రభూమి | హైదరాబాద్ | 47,754 |
| 6. జ్యోతిచిత్ర | విజయవాడ | 45,660 |
| 7. మయూరి | హైదరాబాద్ | 47,367 |
| 8. సితార | " | 47,324 |
| 9. శివరంజని | " | 74,737 |
| 10. స్వాతి | విజయవాడ | 1,24,549 |
| **మాసపత్రికలు: వీటి మొత్తం సర్క్యులేషన్** | | **95,943** |
| 1. అన్నదాత | హైదరాబాద్ | 21,160 |
| 2. చతుర | " | 25,460 |
| 3. స్వాతి | విజయవాడ | 5,588 |
| 4. ఉద్యోగ విజయాలు | " | 25,023 |
| 5. విపుల | హైదరాబాద్ | 18,712 |

# తెలుగు పత్రికలు - పరిణామం - ప్రయోగం; ప్రయోజనం

- సి. రాఘవాచారి

వర్తక వాణిజ్యాల్లాగే వార్త సమాజాభివృద్ధికి బలీయమైన ఉపకరణంగా, సమాచార - ప్రసార - మాధ్యమాలు అనుశృతంగా ఎనలేని దోహద భూమిక నిర్వహిస్తూనే వున్నవి. కవిత్రయంలో ఆద్యుడు నన్నయ్య, ఆంధ్రమహాభారతం ఆదిపర్వంలో "వార్తయందు జగతి వర్ధిల్లుచుండు"నని చెప్పినది ఈనాటివలె శాస్త్ర సాంకేతిక సదుపకరణాల సంపత్తితో సమాచార రంగం, పత్రికా వ్యవస్థ అపారమైన హంగురంగుల్ని సమకూర్చుకోలేని పాతకాలంలోనే అయినా, యిప్పటికీ ఈ మాధ్యమానికి అంతకన్నా మహదాశయం ఊహించడం అసాధ్యం. వేయేండ్ల క్రింద ఛాందసుడని నన్నయ్యని ఈనాడు నన్నయ్యలెంత ఆడిపోసి ఈసడించుకొన్నా ఆ పద్యపాదాన్ని శీర్షికలుగా, కర్తవ్యప్రబోధక సూత్రంగా ఎలాంటి సంశయం లేకుండా మహోదారంగా వినియోగించుకుంటున్న విధాన మొక్కటే చాలు ఆయనకీ రుణగ్రస్త సమాజం అర్పిస్తున్న నివాళి అని చెప్పడానికి. ఆ లక్ష్యసాధనలో - జగతి వర్థిల్లేట్లు చేయడంలో - వార్తా పత్రికలకీనాడున్న విస్తృతి, ప్రాచుర్యం నిస్సంశయంగా మన వర్ధమాన సమాజం ప్రగతి దిశగా ప్రసవవేదనతో ప్రయాసపడుతున్న పరిస్థితుల్లో పెద్ద సానుకూలత. అనేకానేక పద్ధతుల్లో శక్తి సామర్థ్యాల పెంపుదలకు నిర్విరామ కృషితో తెలుగు పత్రికలు సమాచార ప్రసారం ద్వారా సంఘ పురోగతికి నిర్వహిస్తున్న పాత్ర రెండు పుష్కరాలుగా మరింత రాటుదేలి పదును సంతరించుకొన్నది.

మనం నివసిస్తున్న ఈ యుగం కాలమానం ద్వారా ఆధునికమేగాక ప్రజాస్వామ్య రాజ్య వ్యవస్థ నెంచుకొన్న విశేషాంశాన్ని దృష్టిలో పెట్టుకొన్నపుడు చైతన్యవంతులైన ప్రజల సహకారాన్నీ, భాగస్వామ్యాన్నీ పాలకవర్గాలు అర్థించి పొందడంలో ప్రచార సాధనాలకున్న ప్రాముఖ్యం ఎంత చెప్పినా యింకా మిగిలే వుంటుంది. పత్రికల విషయంలో యిది మరింత వాస్తవం. ప్రాతినిధ్యవ్యవస్థలో పాలకులకు అధికారం సంక్రమింపజేసే ప్రజలు సార్వభౌమాధికారం సద్వినియోగం చేసుకోడంలో, నిర్ణయాలు తీసుకోడంలో ఏర్పరచుకొనే అభిప్రాయాలకున్న ప్రాధాన్యం సుస్పష్టం. ఎన్నికలనగానే ప్రత్యామ్నాయాల్లో నచ్చిన దానికి పట్టంగట్టే స్వేచ్ఛ (Choice), అలాగే దాని అభివ్యక్తి (Vioce) వుండడం అనివార్యం. ఈ రెండూ లేనప్పుడది ఎన్ని సౌందర్య పోషకాలు దట్టించుకొన్నా, మరేదైనా కావచ్చు గాని ప్రజాస్వామ్యం మాత్రం కాదు; కాజాలదు. మనదేశ ప్రజలు స్వాతంత్ర్యానంతరం అర్థశతాబ్దిలో ఎదురైన అగ్నిపరీక్షల్లో సద్వివేచనా, విచక్షణా ప్రదర్శించి మనతోబాటే స్వాతంత్ర్యం సాధించిన తరుణ దేశాల్లో ప్రజాస్వామ్యానికి ఎక్కడాలేని భద్రమైన స్థితి కల్పించారు. ఈ వివేచనకు ప్రభుత్వ నిర్బంధాలను, నిరంకుశత్వాన్ని ఎదుర్కొని ప్రజల పక్షంగా నిర్భయంగా, నికరంగా (కొన్ని మినహాయింపులున్నా) నిలబడినవి పత్రికలు, రేడియో, టెలివిజన్ ప్రసార మాధ్యమాలకూ, అందులో పనిచేసే వారికీ పత్రికా రచయితల్లాగే ఈ శక్తియుక్తులున్నది వాస్తవమే. అయినా అవి ప్రభుత్వ యాజమాన్యంలోని వైనందున సూటిగా స్వేచ్ఛగా ప్రజాభిప్రాయాన్ని వ్యక్తీకరించేందుకున్న పరిమితులు గమనంలోకి తీసుకోక తప్పదు. ఈ విషయంలో వార్తలు, వ్యాఖ్యలు కేవలం రాజకీయాలకే పరిమితంకాక ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని మానవ జీవితంలో అభిలషణీయమైన మార్పుల దిశగా మలచుకొనేందుకు యిప్పటికన్నా ఎక్కువ స్థానం పత్రికల్లో కల్పించాల్సి వుందన్నదీ నిర్వివాదాంశమే. పత్రికా పాఠకుల్లోను పెరుగుదల రాశిలోనే కాక గతంలో వలె ఘటనలకు సంబంధించిన వార్తలతో సరిపుచ్చుకొనే పరిస్థితి పోయి ఎందుకు, ఎలా అలా జరిగిందన్న జిజ్ఞాస పెరిగినదీ మరో వాస్తవం; ఈ రెండు ప్రశ్నలు (Why and How) ప్రతి జర్నలిస్టుకూ తెలిసినవే అయినా యిప్పుడవి పరిశోధనా (Investigative) వ్యాఖ్యాన (Interpretative) జర్నలిజం ప్రక్రియలుగా విస్తరించి సంతరించుకొన్న విశ్వరూపం వారి తృష్ణకూ, ఆసక్తికీ నిదర్శనమే యీ పత్రికల ప్రతిస్పందన. ఈ కారణంగానే రేడియో, టి.వి. సినిమాలెంత పెరిగినా

పత్రికలకున్న "అక్షర" ప్రతిపత్తికి అభివృద్ధి చెందిన సమాజాల్లోనే విప్రతిపత్తి కలుగలేదు, భారతదేశంలోనూ, తెలుగుదేశం లోనూ పరిస్థితులు భిన్నంకావు. తెలుగు పత్రికలు లక్షల్లో సర్క్యులేషన్లు సాధించిందీ ఆ మాధ్యమాలు ప్రాచుర్యంలో కొచ్చినప్పుడేనన్నది గమనార్హం. అనాడు వ్యవసాయం వర్తక వాణిజ్యాలు, పరిశ్రమలు, పశుపోషణ, ఆరోగ్యం, పర్యావరణ సహా ఏ రంగంలోనూ శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక ప్రక్రియలు అవసరం కాని కొరవడని పరిస్థితుల్లేవు. ఈ విజ్ఞానం సాధారణ పాఠకులకు చేరవేసే సాక్షరతా సాధనాల్లో కంతటికీ యిప్పటికీ ముఖ్యమైనవీ పత్రికలే. దానితోబాటు సంఘసంస్కరణ, భాషా సాహిత్యరంగాలకు యిప్పటితీరు ఎలా వున్నా గతంలో పత్రికల సేవలు ప్రశస్తము. ఆ విషయానికొచ్చే ముందు తెలుగు పత్రికల స్థితిగతులపై దృష్టి సారించడం కొంత ప్రయోజనకరం.

తెలుగు పత్రికా ప్రపంచంలో ఈ రెండు పుష్కరాల్లో పెనుమార్పులు వచ్చాయి. ఈ మార్పులు పత్రికా వ్యవస్థపైన, వృత్తిపైన, పత్రికా రచయితలమీద, పాఠకులపైన ఎనలేని ప్రభావాన్ని కలిగించాయి, కలిగిస్తున్నాయి.

★ పత్రికల సర్క్యులేషన్, పాఠకుల సంఖ్య ఎన్నోరెట్లు పెరిగింది.

★ ఒకే పత్రిక ప్రచురణ కేంద్రాలు పెరిగాయి. విశాఖపట్నం, తిరుపతి సహా యితర పట్టణాలు ప్రచురణ కేంద్రాలుగా క్రొత్తగా ముందుకు వచ్చాయి. మరికొన్ని రానున్నాయి.

★ పత్రికల ఎడిషన్లు పెరిగి పెరిగి జిల్లాకొక ఎడిషన్‌గా ప్రచురించే స్థాయి (స్థితి) కి చేరుకున్నాం.

★ జిల్లాస్థాయిలోనే పూర్తికాలం పూర్తి వేతనం మీద పనిచేసే విలేకరులను నియమించడం ప్రారంభమై మండల కేంద్రాల్లో కూడా కంట్రిబ్యూటర్లను నియమించే పద్ధతివల్ల రాష్ట్రంలో పత్రికా వృత్తిని చేపట్టిన వారి సంఖ్య కొన్ని వేలు దాటి వుండొచ్చు.

★ శిక్షణ, రిఫ్రెషర్ కోర్సులు ప్రారంభమయినట్లే ప్రారంభమై, ఆ తర్వాత మటుమాయమై పోయాయి. వార్తలు పంపిస్తామన్న వారికల్లా గుర్తింపుకార్డు యిచ్చే పరిస్థితి ఏర్పడింది.

★ బహుశా ప్రపంచంలోనే అరుదైన విశేషం, అవసరం ఔచిత్యం సందర్భ విచక్షణతో నిమిత్తం లేకుండా తెలుగు దినపత్రిక ఫ్రంటు పేజీ ప్రతిరోజు రంగుల్లో ముద్రణ.

★ రాష్ట్రస్థాయి పత్రికలు జిల్లా ఎడిషన్లు ముద్రించడం ప్రారంభించడంతో స్థానిక దినపత్రికలకు ముప్పు ఏర్పడింది.

★ పత్రికల ఖరీదు పెరిగింది. ఎంత పెరిగిందంటే ప్రతికూల ఫలితాల దిశగా (Counter-Productive) ఆందోళనకర పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

★ అసలు సంపాదకులపేర్లు అదృశ్యమవుతున్నాయి. పత్రికాధిపతులే సంపాదకులుగా, వారి పేర్లే రోజూ దర్శనమిస్తున్నాయి.

★ పత్రికల్లో భాష ప్రామాణికం చేయకపోవడంతో విశృంఖలత పెరిగింది. హెడ్డింగుల్లో సెన్సేషనలిజం, ప్రాసకు, విహారించదగిన ప్రయాసకు ప్రాధాన్యత ఏర్పడింది.

★ ప్రింటింగ్ టెక్నాలజీ, కంప్యూటర్ల రంగ ప్రవేశంతో పత్రికా రచయితల వృత్తిలో చేరగలిగే వారిసంఖ్య తగ్గుతోంది. ప్రింటింగ్ క్వాలిటీ పెరిగిందే గానీ Content Quality కాదు.

★ టెక్నాలజీ ప్రవేశంతో పత్రికానిర్వహణ ఖర్చులు విపరీతంగా పెరిగి, కొత్తపత్రికలు పెట్టే అవకాశం సన్నగిల్లుతోంది. ఉన్నవారిదే, అందులో ఆర్థిక శక్తి వున్నవారిదే గుత్తాధిపత్యం అవుతోంది.

★ పత్రికా విలేకరులను కొనివేయవచ్చుననే అభిప్రాయం రాజకీయ నాయకుల్లో ఏర్పడింది. శిక్షణలేకుండా గుర్తింపు కార్డు ఇవ్వడంతో పాత్రికేయ వృత్తిలో అక్కడక్కడ అసాంఘిక శక్తులు ప్రవేశించాయి. తామూ పౌరులం అనే భావన సన్నగిల్లుతోంది.

★ ఫలానా పత్రిక ఫలానా పార్టీది, లేక ఆ పార్టీలో ఫలానా గ్రూపుది, ఫలానా వ్యక్తికి అనుకూలంగా వ్రాస్తుంది. అనే భావన పాఠకుల్లో కలుగుతోంది. ఆ మేరకు విశ్వసనీయత, నిష్పాక్షికత నీరసిస్తోంది.

★ పత్రిక ఈ చివరినుంచి ఆ చివరివరకూ రాజకీయమే. అందులోనూ వ్యక్తుల చుట్టూ పరిభ్రమించే రాజకీయాలు, ఇతర విషయాలకు ప్రజల విజ్ఞానాన్ని పెంపొందించడం, రాజకీయేతరంగా ఉన్నా ముఖ్య సమస్యలపై ప్రజలకు సమాచారాన్ని అందజేయడం రామ రామ సన్నగిల్లుతోంది.

★ పెద్దదైన ప్రతీ పత్రికా, జర్నలిస్టుల నోట మట్టిగొట్టడానికి తనదైన ఒక వార్తాసర్వీసు ప్రారంభించింది.

ఇవన్నీ మనం 10, 15 సంవత్సరాలుగా ఫీలవుతూ వస్తున్న ధోరణులు, పరిణామాలు, వీటికి పాఠకులూ, రచయితలుగా మనం ఎలా స్పందిస్తున్నాం? వాటితో పాటు మనంకూడా తోడ్పడుతున్నామా? మన Morality, మన Integrity ఏమవుతున్నాయి? ప్రతీపధోరణులకు మనం అడ్డుకట్ట వేయగలుగుతున్నామా? ఈ ప్రశ్నలకు సమాధానాలు సులభం కాదు.

ప్రతీ పత్రిక సర్క్యులేషన్‌లో 75 శాతం నాలుగు

సర్కారు జిల్లాల్లో, మిగతా 25 శాతం 19 జిల్లాల్లో వుంటూ వచ్చేరోజులు పోయాయి. పత్రికలు 23 జిల్లాలకు, అన్ని గ్రామాలకు అందే ప్రయత్నమే చేయని పరిస్థితి గతించింది. కొత్త పత్రికలు వచ్చి, పాత పత్రికల సర్క్యులేషన్‌ను పూర్తిగా మ్రింగివేయకుండా కొత్త పాఠకులను సృష్టించాయి. మొత్తం సర్క్యులేషన్ పెరగటమే కాక పత్రికల సంఖ్య కూడా పెరిగింది. ఇది సంతోషించాల్సిన, అహ్వానించదగిన పరిణామం, అయితే కొన్ని పత్రికలు ఈ కాలంలో మూతపడటానికి పాఠకుల కొరత కారణం కాదు. రాజకీయ చైతన్యం గల జిల్లాల్లో సర్క్యులేషన్ కొంచెం ఎక్కువగా వుండడం సహజం. కేరళతో సమానమైన రాజకీయ చైతన్యం మన రాష్ట్రంలో వున్నా, అంతసర్క్యులేషన్, అన్ని పత్రికలు, మన రాష్ట్రంలో లేకపోయవడానికి నిరక్షరాస్యత, పేదరికమే ప్రధాన కారణాలు. 1975కు, యిప్పటికీ అక్షరాస్యత ఏ మేరకు - పరిశోధన చేయవచ్చు. మొత్తం సర్క్యులేషన్‌లో పెరిగిందో? నాలుగు సర్కారు జిల్లాల ప్రాంతాల్లో తప్పకుండా తగ్గి వుండాలి. 27 వేల చిల్లర గ్రామాల్లో ఎన్నింటికి పత్రిక పోతోంది? గ్రామీణ ప్రాంతాల్లో సర్క్యులేషన్ పెరిగిందా? పట్టణాల్లో పెరుగుదల రేటు ఎక్కడ పెరిగింది? తరిగింది? ఇది వరకు రెండు పత్రికలు కొనేవారు ఇప్పుడు ఒకటే కొంటున్నారు? ఒకటి మానేస్తే, ఆ మానేసింది తెలుగు పత్రిక అయితే, ఇంట్లో స్త్రీలు, పిల్లలు చదవకుండా వుండే పరిస్థితి ఏర్పడిందా? విజ్ఞాన విస్తరణ ఆ మేరకు పరిమితమవుతుందా?

ప్రచురణ కేంద్రాల సంఖ్య రెట్టింపు కావడం మరొక అభిలషణీయమైన పరిణామం. ఒకే కేంద్రం నుంచి ప్రచురిస్తే 23 జిల్లాల్లో జరిగే పరిణామాలను ప్రచురించలేని పరిస్థితి తొలగి, ఆయా ప్రాంతాల్లోని వార్తలకు ఆ కేంద్రాల నుంచి ప్రచురితమయ్యే పత్రికలు అద్దం పట్టగలుగుతున్నాయి. ఇన్ని కేంద్రాల నుంచి ప్రచురితం కావడం వల్ల ఉద్యోగావకాశాలు పెరిగాయి. పాత్రికేయ వృత్తి పెంపొందించడానికి తోడ్పడింది. మారుమూల గ్రామాల్లో జరుగుతున్న అభివృద్ధి గురించిగాని, అన్యాయాల గురించి గాని వార్తలు వెలుగులోకి రావడం ప్రారంభమైంది. అయితే ఈ రూపాయికి రెండోవైపు కూడా వుంది.

ప్రతీ జిల్లాకు, నగరానికి ఓ ఎడిషన్; లేక కొన్ని జిల్లాలకు మాత్రమే ఎడిషన్లు, లేక పత్రికలోనే ఒకో జిల్లాకు ఒక పేజీ కేటాయింపు - ఇలా ఆంధ్రప్రదేశ్‌ను 25 సర్వస్వతంత్ర రిపబ్లిక్‌లుగా ప్రకటించే స్థాయికి జేరుకున్నాయి మన పత్రికలు.

రాష్ట్రంలో ఇతర చోట్ల జరుగుతున్న పరిణామాల గురించి రాజధాని నగరంలో వున్న వారికి తెలియదు. ఒక జిల్లాలో ఉన్న వారికి పక్క జిల్లాల్లో ఏం జరుగుతుందో తెలియదు. లాంఛనంగా ప్రకటించే ఒకటి రెండు వార్తలు తప్ప.

సప్లిమెంట్ లేక ప్రత్యేక పేజీని ఆ జిల్లా వార్తలతో నింపడానికి వార్తలు లేక, విలేకరుల నెట్‌వర్క్ లేక పంపించిన వార్తనల్లా - అందులో వార్త లేకపోయినా సరే —— ప్రచురించడం, ప్రచురించారు కాబట్టి అలాంటి వార్తలనే కంట్రిబ్యూటర్లు పంపడం, వేస్తుండటం - ఈ విషయంలోపడి క్వాలిటీ నీరసిస్తున్నది. గ్రామీణ జీవితాన్ని, గ్రామీణ సమస్యలను గ్రామీణాభివృద్దిని / లేమిని సమగ్రంగా ప్రతిబింబించని పత్రికలు మన చేతుల్లోకి వస్తున్నాయి.

జిల్లాలో ప్రచురితమవుతున్న చిన్న జిల్లా పత్రికలు అలసే అంతంత మాత్రం; ఇప్పుడవి జీవచ్ఛవాల్లా కొనసాగుతున్నాయి. వాటికి ఎదుగూ బొదుగూ లేదు. ఆర్థికంగా నిలదొక్కుకోలేని పరిస్థితిలో పడ్డాయి.

యాజమాన్యరంగంలో ఎటువంటి ప్రవేశం లేకుండానే కేవలం డబ్బు బలంతో పత్రికలకు యజమానులు కావచ్చు. కాని, నేటి పరిస్థితుల్లో ఎటువంటి శిక్షణా లేనిదే పాత్రికేయులు కాలేరు. భాషలో కాస్త పాండిత్యం అనువాదం చేసే శక్తి మాత్రమే వుండి పాత్రికేయ వృత్తిలో ఎటువంటి అనుభవం లేని వారిని ఉపసంపాదకులుగా తీసుకున్నా వారిని ఆరునెలలు, సంవత్సరం పాటు ప్రొబేషన్‌లో పెట్టి వేళ్ళు నలగ్గొట్టి ఆ తర్వాతనే ఉద్యోగం ఖాయం చేస్తున్నారు గాని ఎటువంటి క్వాలిఫికేషన్ లేకుండానే క్రింది స్థాయిలో విలేకరులై పోవచ్చు! (అవార్డుల నుంచి తప్పించుకోవడానికి వారికి కంట్రిబ్యూటర్లనే ముద్దుపేరు పెట్టారు) విశ్వవిద్యాలయాలు ఈ కోర్సు ప్రవేశపెట్టిన తరువాత ఈ కోర్సులో ఉత్తీర్ణులైన వారికి కొంత ప్రాధాన్యం, గుర్తింపు ఇవ్వడం ప్రారంభమైంది. 1975 తర్వాత వచ్చిన తెలుగు పత్రికల్లో —— లేక అదివరకే ప్రచురిస్తూ విస్తరణ కార్యక్రమం మొదలు పెట్టిన పత్రికల్లో - చేర్చుకున్న వారికి శిక్షణ ఇచ్చి పనిచేయించుకోవడం ప్రారంభమైంది. ఇదెంతైనా హర్షణీయమైన పరిణామం కాని జిల్లా ఎడిషన్లు వచ్చేసరికి మంచి పేరు కాస్తా ఎగిరిపోయింది. అడగడమే పాపం గుర్తింపు కార్డు ఇచ్చేస్తారు. మంచి వార్తలను పంపకపోయినందుకు వారిని నిందించాల్సిన పనిలేదు. అది వారి తప్పు కాదు. శిక్షణలేని సైన్యం ఏమి సాధిస్తుందో, శిక్షణ లేని విలేకరుల నెట్‌వర్క్ అంతే సాధిస్తుంది.

దేశంలో, బహుశా ప్రపంచంలో ఎక్కడా లేని రంగరంగ వైభవం తెలుగు పత్రికలకు పట్టింది. అదే ఫ్రంటుపేజీ రంగుల్లో ముద్రణ. ఇది చాలా ఖర్చుతో కూడిన ప్రక్రియ. మాస్ట్‌హెడ్‌ను రంగుల్లో ముద్రించడంతో ప్రారంభమై ఫ్రంటు పేజీ అంతా విస్తరించింది. వావీ వరుసా లేదన్నట్టు రంగు

దేనికుపయోగించాలి. అనే విచక్షణ, ఔచిత్యం లేకుండా అన్నీ రంగురంగుల్లో ప్రదర్శితమవుతున్నాయి. వేడుకకు, విషాదానికీ కూడా రంగులేనా?

కలర్‌లో ప్రచురించలేని పత్రిక వాసన చూసేవారు లేరు; వాటి సర్క్యులేషనూ కొడిగట్టి పోతున్న దీపంలా వుంటుంది. దాని వల్ల పెరిగే ఖర్చును పాఠకుల నెత్తిన రుద్దుతున్నారు. కలర్ అయితే సమయమెక్కువ తీసుకుంటుంది. అంటే తాజా వార్తలివ్వడానికి కూడా అడ్డం వస్తుంది.

ఒక అణా ఇచ్చి పత్రిక కొన్న రోజులున్నాయి. ఇప్పుడు పత్రిక ఖరీదు రెండు రూపాయలకు పెచ్చు. దారిద్ర్య రేఖకు దిగువనున్నవారి రోజువారీ ఆదాయం ఇది. ప్రయోజనం లేని, ప్రయోజనకరంగాని పోకడలను ప్రవేశ పెడితే ఖరీదు పెరక్క ఏమవుతుంది? మామూలుగా ధరల పెరుగుదలతోపాటు, పనికిమాలిన ప్రయోగాల ఖర్చు కూడా పాఠకుని నెత్తిన రుద్దుతున్నారు. కలర్ పేరుతో అడ్వర్టయిజ్‌మెంట్లకు విభైశాతం డబ్బు ఎక్కువ వసూలు చేసి లాభాలు చేసుకుంటున్నారు. ఆ పేరుతో పాఠకుల వద్ద నుంచి కూడా ఎక్కువ వసూలు చేసుకుంటున్నారు. అక్కడక్కడ కొన్ని కుటుంబాలు రెండు పత్రికలు కొనే అలవాటు వుంటూ వచ్చింది. ఖరీదు పెరగడంతో ఒక పత్రిక చందా మానుకుంటున్నారు. ఇలా ఖరీదు పెంచుకుంటూ పోతే సర్క్యులేషన్ తగ్గే ప్రమాదం లేకపోలేదు.

యజమానులు—యజమానుల మధ్య సాగుతున్న కుస్తీకి, సంపాదకుల హెడ్‌లైన్ల కుస్తీ జోడు చేశారు. ఫలితం హెడ్‌లైన్లు జోడు గుర్రాల సవారీ చేస్తున్నాయి. కింది వార్తలో వున్న ముఖ్యమైన విషయాన్ని సూచించడం హెడ్‌లైన్ కర్తవ్యం. ఇవాళ రేపు కనబడుతున్న హెడ్‌లైన్లలో ఆ కర్తవ్యాన్ని నెరవేర్చే విధంగా హెడ్‌లైన్లు పెట్టే వాళ్ళుంటే కృతయుగంలో వుండాల్సినవారే. ప్రాసలు, పదవిన్యాసం మహాకవుల పద్యాల్లో లైన్లు, సినిమా పాటల్లోని చరణాలు ఏదైనా శీర్షికా సాహిత్యంలో కాదేదీ... అన్నట్లు సర్వ సాధారణమై పోయింది.

కొన్ని సందర్భాల్లో సంపాదకుడు తాను పత్రికకు సంపాదకుడినని పత్రికా ముఖంగా చెప్పుకునే స్వాతంత్ర్యం కూడా కోల్పోవడం ఇటీవల కాలంలోని ముఖ్యపరిణామం. పత్రికకు సంపాదకత్వం వహించేది – సంపాదకుడో, అడ్వర్టయిజ్‌మెంట్ మేనేజరో అర్థం కావటంలేదు. ఎన్ని కాలమ్‌లు వార్తలివ్వాలో మేనేజరు నిర్ణయిస్తాడు. ఆఖరు నిముషంలో వచ్చి నాకు రెండు కాలమ్‌లు అడ్వర్టయిజ్‌మెంట్ వుంది స్థలం కావాలంటే ఆ మేరకు వార్తలు తీసి పారేయాల్సిందే. ఇదివరకూ వుంది. ఇప్పుడు మరీ ఎక్కువైంది ఇది రెండో పరిణామం.

ఎప్పుడైతే సంపాదకుడు తాను సంపాదకీయం వ్రాసి కూడా మరెవరో తాను వ్రాశానని అంటే నోరు మూసుకుని కూర్చోవాల్సి వస్తుందంటే, ఈ సంపాదకులు స్వయంగా Ghost Writers గా తయారయ్యారని వేరే చెప్పాల్సిన పనిలేదు. వీరిలో ఇంకో తరహా కూడా వున్నారు. ఆరోజు సంపాదకీయం ఏ విషయం మీద వ్రాయాలో, అందులో ఏ వైఖరి అవలంబించాలో యజమాని చెబుతాడు. దానికి అక్షరరూపం ఇవ్వటమే వారిపని. మరొక తరహా, ఆయన సంపాదకీయం మాత్రమే వ్రాస్తారు. ఇంకేపని చేయరు. ఆయన సాంప్రదాయక సంపాదకుడు కాదు. కాని ఆయనే సంపాదకునిగా చలామణి అవుతుంటారు. సంపాదక స్వాతంత్ర్యంపై యాజమాన్యం ఉచ్చు ఇంకా ఇంకా బిగుస్తోంది. సంపాదకుడు కేవలం నిమిత్తమాత్రునిగా మిగిలిపోతున్నాడు. తమ సంపాదకీయాల్లో ప్రపంచంలోని సమస్యలన్నింటికీ పరిష్కారాలు చేప్పే సంపాదకులు తమ సమస్యకు పరిష్కారం వెతుక్కోలేరా?

పాత్రికేయులు కూడా సమాజంలో పౌరులే. వారికేం కొమ్ములు లేవు. అందరిలాగే వారు కూడా సమాజాన్ని పీడించే రుగ్మతలకు లోనవుతుంటారు. సమాజంలోని బలహీనతలు వారినీ వెన్నంటుతుంటాయి. రాజకీయ నాయకత్వంలో సమాజంలోని కొంతమంది పెద్ద మనుషుల్లో ఏ లొసుగులు, బలహీనతలు, లోపాలు వున్నాయని వ్రాస్తుంటారో అవన్నీ తమలో కూడా ఎంతో కొంత వుండవచ్చన్నది పత్రికారచయితలు మరిచి పోతున్నారేమోననిపిస్తుంది.

అభివృద్ధి కార్యక్రమాలు విస్తరిస్తుండటంతో కొన్ని ముఖ్య విషయాల్లో – అంటే పరిశ్రమలు, వ్యవసాయం, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, విద్యలాంటి రంగాల్లో ప్రత్యేకంగా విజ్ఞానాన్ని సంపాదించుకుంటే తప్ప ఆ విషయాల మీద రిపోర్టు చేయటం కష్టమవుతుంది. దీనిని గమనించిన చోట్ల ముఖ్యంగా ఢిల్లీ, బొంబాయి లాంటి నగరాల్లో సైన్స్, విద్య, మెడికల్, ఇండస్ట్రియల్ విషయాల రిపోర్టింగ్‌కు ప్రత్యేక కరస్పాండెంట్ల నియామకం జరుగుతోంది. హైదరాబాద్ కూడా మెట్రోపాలిటన్ నగరమైనా, ఆయా రంగాల్లో విషయాలపై రిపోర్టింగ్‌కు ప్రత్యేకంగా విలేకరులను నియమించే అలవాటు ఇంకా రాలేదు. రాజకీయాల రిపోర్టింగ్ ప్రధానంగా కనిపిస్తోంది. ఇటీవల మరీ మితిమీరి పోతోంది.

గతంలో విలేకరులతో పోల్చి చూసుకుంటే ఈనాటి యువ విలేకరులు మంచి చొరవ aggressiveness, boldness, శైలిలో కొత్తదనం చూపిస్తున్నారు. సందేహంలేదు. కాని professionని సీరియస్‌గా తీసుకునేతత్వం వారిలో కనిపించడంలేదు. పరీక్షకు వెళ్ళే కొంతమంది విద్యార్థులు ఏదో ముక్కునపట్టి వ్రాసేసినట్లు ఫంక్షన్‌కు వెళ్ళటం, రిపోర్టు వ్రాసేసి ఇచ్చేయటం అంతే. తెచ్చిన రిపోర్టుకు బ్యాక్‌గ్రౌండ్

మెటీరియల్ చేర్చి ఇతర పత్రికలకన్నా మంచి రిపోర్టు ఇవ్వాలనే తపన కనపడటం లేదు.

బ్యాంకులు, ప్రభుత్వ కార్యాలయాల్లో ఉద్యోగాలకు వేలాది మంది పరీక్షలు వ్రాస్తున్నారు. కాని జర్నలిస్టు ఉద్యోగాలకు ఆ స్థితి ఇంకా రాలేదు. టాలెంట్ కావాలంటే మరో పత్రికలో పనిచేసే వారిని ఎక్కువ డబ్బు యిచ్చి తెచ్చుకోవాల్సి వస్తుంది. సంపాదకుల స్థాయిలో వేళ్లమీద లెక్కపెట్టే మంది మాత్రమే వున్నారు. ఇంత చిన్న మార్కెట్ వున్నప్పుడే మన పరిస్థితులను మనం మెరుగుపరచుకోలేకపోతే ఇంకెప్పుడు సాధ్యం? రాష్ట్రంలో విశ్వవిద్యాలయాలు, ఇతర సంస్థలు జర్నలిజం కోర్సులను నడిపిస్తున్నాయి. వారు తయారు చేసే వందల మంది మార్కెట్‌లోకి వస్తే అప్పటికి చాలా ఆలస్యమైపోతుంది. ఉన్న కొద్దిమంది సంపాదకులు, సంపాదకీయాలు రాసేవారు, రాయగలిగేవారు కనీస ప్రాతిపదిక మీద ఐక్యం కాగలిగితే – ఈ ప్రయత్నంలో ఇతర పాత్రికేయుల తోడ్పాటు చాలా అవసరం. పరిస్థితులను చాలా వరకు మెరుగుపరుచుకోవచ్చు. ఉద్యోగులు జీతం కోసం పనిచేస్తారు. పాత్రికేయులూ అంతే. అయితే నైపుణ్యతను, సమర్థతను, అనుభవాన్ని పెంచుకోగలిగితే వారి వృత్తిలో రాణించటానికి తోడ్పడుతుంది. ఇచ్చే జీతానికి చేస్తున్న పని చాలులే అనే ధోరణితో పనిచేస్తే 'ఎక్కడవేసిన గొంగళి' అక్కడ అనే సామెతగా తయారవుతుంది. ఒకవేళ కేవలం సీనియారిటీ ఆధారంగా పై మెట్టు ఎక్కగలిగినా, వారి అసమర్థత వారిని వెంటాడుతుంది.

సమాజంలో పౌరులందరికీ సమాజాభివృద్ధి పట్ల కర్తవ్యాలు, బాధ్యతలు ఎలా వున్నాయో పాత్రికేయులకు కూడా సమాజం పట్ల అలాగే కర్తవ్యాలు, బాధ్యతలు వున్నాయి. సూపర్ సిటిజన్స్‌గా ప్రవర్తించే వైఖరిని విడనాడాలి. ప్రభుత్వం అనేక అభివృద్ధి కార్యక్రమాల వల్లనైతేనేమి; రాజకీయ నాయకుల స్వార్థం, పరిపాలనా వ్యవస్థ అసమర్థతవల్లగాని ఆ పథకాల ఫలితాలు వారికి చేరటం లేదు. అలా చేర్చటంలో జర్నలిస్టులు ప్రత్యేకంగా నడుం బిగించి ప్రజా సేవకు పూనుకోనక్కరలేదు. వారి వృత్తి ధర్మాన్ని వారు నిర్వర్తించగలిగితే, సమాచార వాహకులుగా పనిచేస్తే అదే చాలు. ఒక్క మాటలో చెప్పాలంటే వారికి సమాజస్పృహ కలగాలి. కొంతమందే అయినా వారి అనైతిక వర్తనంతో పాత్రికేయ వృత్తికి, పాత్రికేయులందరికీ తలవంపు తెస్తున్నారు.

## భాష – అనివార్యమైన మార్పు

సాంఘిక సంస్కరణలకు ఉపయుక్తమైన మాధ్యమాలుగా నూరేండ్లకు పైగా గుర్తించదగిన పాత్ర నిర్వహించిన తెలుగు పత్రికలు భాషా వికాసానికీ ప్రజలకు సాహిత్యరీతుల్ని సన్నిహితం చేయడంలోనూ గణనీయమైన భూమిక నిర్వహించాయి. ఈనాడు తెలుగులో వ్యవహారిక భాషకు పట్టంగట్టిన పరిస్థితులకు ప్రజాబాహుళ్య సాధనాలైన సినిమా, రేడియో, టి.వి.లతోబాటు బహుశా కొంచెం ఎక్కువగానే దోహదం చేసినవి పత్రికలని జిజ్ఞాసువులు అంగీకరించకతప్పదు. ఈ విషయంలో ప్రత్యేకించి సాహిత్య పత్రికలుగా – వార, పక్ష మాసవర్గీకరణ క్రిందకు వచ్చేవి – పేర్కొనబడే వాటి ప్రయత్నాలకు తోడు అధికతర ప్రాచుర్యం, ప్రామాణికత వ్యవహార భాషకు కల్పించినవి దినపత్రికలు. ఈ పరిణామ క్రమంలో ఎన్నెన్నో పార్శ్వాలున్నాయి. తెలుగంతా ఒకే భాష అయినప్పుడు ప్రత్యేకించి పత్రికా భాషగా తెలుగు ఎలా వుండాలి? అన్నది చర్చనీయాంశం అవడం ఈ భాషను భావ ప్రకటనా మాధ్యమంగా ఎన్నుకొనే ప్రయోజనాన్ని బట్టి సాగే రగడ, గణితభాష – ఉచ్చరిత భాష, గ్రాంథిక భాష – గ్రామ్యభాష, కావ్యభాష – వ్రాత భాష, శాసన భాష – యిలా ఎన్నెన్నో పైకి చాలా సరళంగా, ఆయా భాష వినియోగించిన ప్రయోజనాలను బట్టి మాత్రమే అర్థం చేసుకోగలం. సంఘంలో మారుతున్న పరిస్థితుల పట్ల, అందుకు దారి తీస్తున్న పరిస్థితులపట్ల అలాగే పత్రికా భాషగా తెలుగు ప్రయోజనం ఏమిటో నిర్దిష్టమైన అవగాహన వుంటే తప్ప యిప్పటికి అందులో వచ్చిన మార్పులనుగాని, తప్పని సరిగా ముందురాబోయే మార్పులనుకాని అర్థం చేసుకోవడం ఆహ్వానించడం సాధ్యం కాదు.

ఉక్తి వైచిత్రికన్నా వక్తవ్యాంశం పత్రికా భాషలో అధికతర ప్రాధాన్యం కలిగి వుంటుంది. ఈనాటి నిత్యజీవన వ్యవహారంలో సమాచార ప్రసారం, ప్రచారం కీలకస్థానం ఆక్రమించుకున్నాయి. పాఠకులంతా ఒకే మూసలో పోసిన ఒకేస్థాయి భాషా పరిజ్ఞానం కలవారిగా వూహించుకోవడం సరికాదు. కాబట్టి ఈ పాఠకలోకంలో పత్రికా రచయితల సమసహోదరణకు పాత్రులైన పండిత పామరులను దృష్టిలో పెట్టుకుని చెప్పదలచుకొన్న విషయాన్ని (కావ్యాల్లో అయితే దానికో "సందేశం" అని పెద్ద పేరుంది కదా!) సూటిగా చెప్పే భాష వినియోగం పత్రికలకు అవసరం. ఈ వినియోగానికి అవసరమైన అర్హతలున్న 'భాషకే' ఆయోగం పడుతుంది. భాష – సిద్ధాంతుల, చరిత్రకారుల వాద ప్రతివాదాల, ఖండన మండనల దుర్గమారణ్యచ్ఛేదకులైన డిండిమభట్టులు ఆదరించినా, తృణీకరించినా, ఆమోదించినా, అధఃకరించినా లోక వ్యవహార ప్రాధాన్యం, ప్రయోజనం కలిగిన భాషలన్నీ యిలాగే అభివృద్ధి కావడాన్ని గమనించడానికి అసాధారణ చారిత్రక దృష్టి అవసరం లేదు.

బాలకవి శరణ్యంలో గిడుగువారి ప్రసక్తి ఒకటి యిక్కడ ఉదాహరించడం అప్రస్తుతం కాదు.

నోటికి అడ్డులేదట! పండితుల ధర్మాన వ్రాతలోనే వుండవలెనంటే నియమాలన్నీ కలము చేతపట్టుకోగానే చెయ్యి వణుకుతుందే! ఏమి వ్రాస్తే తప్పు పట్టుతారో వ్రాయకపోతే వ్యవహారము నడవదే. గనుకనే వాస్తవమైన లోకవ్యవహారములో (అనగా ఉత్తర ప్రత్యుత్తరాలలోను, దస్తావేజుల్లోను) నియమములక్కరలేదట – కొందరి మతమందు.

రోజూ ఏదో వ్రాయకపోతే నడవని వ్యవహారం, గడవని వ్యాపారం పత్రికాలోకం ప్రత్యేకత. అందువల్ల ఆ నియమాలు లేకపోవడమన్న నియతి ఏదో పూర్తిగా వర్తిస్తుంది. అట్లా అని ప్రతి 'కా' భాష, పత్రికా భాషగా అర్హమైనదనే సాహసానికి తలపడవచ్చునా అనేదొక సమస్య. పత్రికా భాషగా తెలుగు వినియోగపడుతున్న నిరంతర ప్రయోగ సరళిలో ఏవీ లేవనుకుంటూనే నియమాలు ఏవో తమకు నచ్చినవి పత్రికా రచయితలు పాటించక తప్పడమూ లేదు. అన్యదేశాల పట్ల అస్పృశ్యత దురాచారం ఈనాటి సాహిత్య కావ్యభాషల్లోనే వుండనప్పుడు విస్తృత ప్రచార సాధనాలైన పత్రికల్లో అవి పరిహార్యాలను ఛాందసం ఎవరికీ వుండనక్కర్లేదు, లేదుకూడా. కాని ఈ పదాలను యిముడ్చుకోక తప్పని ఆధునిక తెలుగును ప్రమాణీకరించినదిగా ఈనాటి పత్రికా భాషగా స్వీకరించవచ్చునా అన్నది మరో సందేహం. పరిశుద్ధ భాషా పదాల ఛాందసంతో నిమిత్తం లేకుండా వ్యవహారంలో కొనసాగుతున్న భాషను వాక్యనిర్మాణ అన్వయ విభక్తిపరమైన యితర సాధారణ నియమాలకు అనుసంధించి వినియోగంలోకి తెస్తున్నవి పత్రికలనడంలో సందేహంలేదు. ఈ విషయంలో మనది శుద్ధ హిందీవాదుల వర్తనానికి భిన్నమైన ఫక్కీ. Walkout తెలుగులో అజంత భాషా ధర్మం కూడా త్రోసిరాదని వాకౌట్ అనే వ్రాస్తున్నాం తప్ప "సదన్ త్యాగ్" లాగ సంస్కృతీకరింపబడిన సమానార్థకాల విశ్వామిత్ర సృష్టికి ప్రయత్నం లేకపోవడం గమనార్హం. ఒకనాడు కార్మికుల డిమాండ్ అని వ్రాయడాన్నే కొందరు సంపాదక పీఠాధిపతులు ఈసడించుకున్నా – మరిప్పుడు, తెలుగు బహువచనంకూడా మానేసి డిమాండ్స్ వంటి ప్రయోగాలు సహించే స్థితి ఏర్పడింది. విశ్వవిద్యాలయాల్లోనే వ్యవహార భాష వరదలు పారుతున్నప్పుడు పత్రికల అక్కర చెప్పనక్కర్లేదు.

వ్యవహార భాష అంటే సరిపోతుందా? ఎవరి వ్యవహారంలో వున్న భాష అన్న అనుబంధప్రశ్న అనివార్యం. తకీమని 'శిష్ట వ్యవహారం' అని దులుపుకోవడానికి ఆ శిష్టులెట్టివారు అన్న ధర్మసందేహం వస్తుంది. శిష్టులంటూ వుంటేకదా వారి వ్యవహారం అనుష్ఠేయమని ఎవరైనా శాసించడానికి? భగవద్గీతలో కృష్ణుని సిఫారుసు (యద్యదాచరతిశ్రేష్ట–) చెప్పుకోవడానికి బాగానే వుంటుంది. కాని ఆచరణలో చిక్కుల్ని తొలగించేది కాదు. సరళ గ్రాంధికం, శిష్ట వ్యావహారికం, ప్రామాణిక భాష, విషయోచిత భాష అంటే చెప్పి చెప్పి చివరకు ప్రయోగశరణం.. అన్న వాదం మాత్రమే శరణ్యమవుతుంది. వాడుకలోనికి ఎప్పుడో అప్పుడు సిద్ధాంతం చేయడం దుష్కరమేకాని వాడుకలో ఉన్నది పండితుల తప్పులనుటకు సాహసిస్తారే. అది మేము సహించలేము అవి గిడుగువారు అన్నది అక్షరాల నిత్యమే. సత్యమే, భాషా ప్రయోగాలకు ముందు ప్రామాణికత ఉండి తీరాలనుకోవడం అశాస్త్రీయవాదం, అది గుర్రం ముందు బండి పెట్టడంలాంటిదే.

వ్యావహారిక భాషా వికాసంలో డా॥ బూదరాజు రాధాకృష్ణగారు పేర్కొన్నట్లు కాలక్రమాన విశ్వవిద్యాలయాలు ఆమోదించినా, మానినా వ్యావహారికం చోటుచేసుకుంటుంది. కాలప్రవాహం ఆగనట్లు భాషా ప్రవాహము ఆగదు. ఆపలేము. ఇది చరిత్ర నేర్పే పాఠం, అప్రియంగా వున్నా ఈ సత్యాన్ని గుర్తించడానికి నిరాకరించే వారి విషయంలో చేయగలిగింది లేదు.

తెలుగు అకాడమీవారు గతంలో నిర్ధారించుకున్న నియమాలు చాలా వరకు ఈ సత్యాన్ని గుర్తించినవే కావడం సంతోషకారణం. కాని వీట్లో కూడా కొన్నింటికి సంబంధించి మార్పు యింకా అవసరం అని తోస్తుంది. ఉదా: 22 నియమం సాధ్యమయినంత వరకు గ్రాంధికానికి దగ్గరగా వుండే వ్యవహార క్రియారూపాలు మాత్రమే వాడవలెను. అంటే వ్యవహార శిష్టతా ప్రమాణాలకు కొలబద్దగా గ్రాంధికం నిర్దేశిస్తున్నట్టే కదా. సాధ్యమైనంతవరకు ఆ గ్రాంధికమే వ్యవహారం దగ్గరకు రావాలనడం సబబేమో.

అలాగే క్రియా రూపాలలో "అలిక" బదులు "వలె" గ్రహించవలెనన్న 25వ నియమం. ఈ నియమంలో "అలి" పై ఎంత కోపమున్నా పత్రికల్లో దాని స్వరూపం మార్చకుండానే ప్రయోగిస్తున్నది గమనించడం అవసరమేమో.

అసలు చిట్టచివరి నియమం మరీ విపుల విస్తరణతో కూడుకున్నది. వివరణలను అతిగా ఆక్షేపించేదీగానూ, ఈ నియమాల్లో సూచించని యితర రూపాలన్నింటికీ ఆధునిక శిష్ట వ్యవహారమే ప్రమాణము. తిరిగి ఆట మొదటి గడికొచ్చింది. ఏది శిష్ట వ్యవహారం?

ఇలాంటివెన్నో వెరసులకు, ప్రత్యాఖ్యానాలకు అవకాశాలు ఎప్పుడూ వుంటాయి. అయినా అవసరాన్ని బట్టి పరామర్శ, పునర్విమర్శ సదా వాంఛనీయమే. అందుకు ఈ చర్చ కొంత దోహదం చేస్తుంది. ఆశిస్తూ పత్రికా భాషగా తెలుగు ప్రామాణికత నిర్ధారణకు విశ్వవిద్యాలయాల్లోని పండితులు, ఆ రంగంలోని అనుభవజ్ఞుల సహాయ సహకారంతో నిర్దిష్ట కార్యక్రమం అవసరం.

పారిభాషిక పదాల ఏకరూపత సంబంధించి యిప్పటికీ అన్ని పత్రికలు పాటించగల సూటి నియమపట్టిక ఏదీ లేదు (Style Sheet) రోజా భాషతోనే తంటాలుపడుతున్నా లోకవ్యవహారాల్లో కుప్పతెప్పలుగా వచ్చిపడుతున్న భావనా సంపుటికి తగ్గ పదాల పొందికలో ప్రాప్తకాలజ్ఞత తప్ప ప్రయోగ విశిష్టత కానరావడంలేదు. వస్తు నిష్టను తెలుగు పత్రికల్లో సీనియర్‌లైన శిష్టుల వ్యవహారమే ఆ భాషకు ప్రమాణంగా వుండాలన్న ఆ నాలుగు గోడల వెలుపల జరుగుతున్న మార్పులను మదించి యిమడ్చడానికి ప్రయత్నం ప్రణాళికా బద్ధంగా సాగడంలేదు.

భాష కూర్పు బాగుంటే గ్రాంధికం, చెడిపోతే వ్యవహారికమని ఆ తప్పు ప్రజలపైకెత్తడం తప్ప నిర్మాణాత్మక కృషిలో శ్రద్ధాసక్తులంతంతే. సంస్కృతం వల్ల తెలుగుకు తెగులంటుకుందన్న ఆక్షేపణల్లో నిజం వుంటే ఇంగ్లీషువల్ల ఆ హాని తక్కువేమీ జరగడంలేదన్న నిజం ఈ నాటి వ్యవహారంలో తెలుగు స్థితివల్ల వెల్లడి అవుతుంది. ఈ పరిస్థితిలో మార్పులకు పత్రికలు కూడా కొంత చేయవచ్చుకదా.

ఆంధ్రకవి ఆదినుండా విశ్వదృష్టి కల కవి అని ప్రసిద్ధ సాహితీ చరిత్రకారులు డా॥ ఆరుద్ర తమ సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రలో ఒక సందర్భంగా పేర్కొన్నారు. భారత శ్రవణాసక్తి (పఠనాసక్తి అనలేదు పాపం!) కొద్దీ వ్యాస భారతాన్ని తెలుగులో తిరిగి రచించమని కోరిన రాజరాజనరేంద్రుడి ఆశయం కానీ, ఆకర్తవ్యాన్ని ప్రారంభించి మొదటి మూడు పర్వాలు కాస్త కొరతగా పూర్తిచేసిన నన్నయ్య లక్ష్యంకానీ విశ్వశ్రేయస్సు దృష్టి అన్నది జగద్విదితమే. అంటే అప్పటివారి అవగాహన మేరకు జగత్తుకంతా హితం సమకూర్చే విధంగా భారతాంధ్రీకరణ జరగాలన్నది వారిద్దరి అభిమతం. అప్పటికీ, యిప్పటికీ, వెయ్యేండ్లు గడిచిపోయాయి. తెలుగువారి విశ్వ పరిధి, దృష్టి ఎంతో విస్తృతి, పరిణతి సంతరించుకున్నాయి. అప్పుడూహలకు మాత్రమే పరిమితమైన ఎన్నెన్నో ఖండాలు, దేశాలు ఈనాడు తెలుగువారికి సుస్థిర ఆవాసాలైనాయి. ఈ క్రమంలో తెలుగువారు ప్రవాసాంధ్రులుగా, విదేశాంధ్రులుగా స్థిరపడిపోయి అక్కడిజాతీయ సంస్కృతీ స్రవంతుల్లో క్షీర నీరన్యాయం మేరకు కలసిపోయారు. "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అన్న నామడి తెలుగు భాష పట్ల దురభిమానం కొద్దీ ప్రచారంలో పెట్టింది కాదనీ, దాని సాహిత్య, సంస్కార సౌరభాల్ని విదేశాల్లోని మన తెలుగువారు, వాటి సంఘాలు ఆయా భాషాసాహిత్యాల్లోకి వ్యాపింపచేస్తే రుజువయ్యే అక్షరసత్యమనీ అంగీకరించడంలో భిన్నాభిప్రాయం వుండరాదు. స్వస్థాన వేషభాషాభిమానాలని నన్నయ్య పేర్కొన్నది యితర భాషా సంస్కృతుల నుండి అవశ్యం నేర్చుకోవలసిన విలక్షణాలను విశాల భావంతో స్వీకరించడానికి తెలుగు వారికేనాడు అవరోధం కాలేదు. కారాదు. స్వతంత్ర రచనలతో పాటుగా తెలుగు పాఠకులు ప్రపంచంలోని వివిధ సాహితీ ప్రక్రియలను అన్ని భాషా సముదాయాల నుండి అనువాదాల అనుకరణల రూపంలో ఎంత మక్కువతో స్వంతం చేసుకొన్నారో అలనాడు ఆంధ్రదేశంలో అసంఖ్యాకంగా ప్రాచుర్యంలో వున్న బెంగాలీ నవలలు, ఈనాటికీ బహుళంగా వున్న మనుషుల పేర్లు ఉదాహరణ. అలాగే వంగ సాహితీ సుమాల సౌరభాన్నీ – రవీంద్రకవీంద్రుని గీతాలు, శరత్ నవలల్నీ – ఎంతగా ఆదరించారో చెప్పనక్కర్లేదు. దక్షిణాది భాషా సాహిత్యాలనుండి – తమిళ, కన్నడ, మలయాళాల్లో – ఎన్నెన్నో రసనిష్యందమైన గ్రంథాల్ని తమ భాషలోకి పునఃసృష్టిచేసి మురిసిపోయే విశాల దృక్పథం తెలుగుజాతి సాంస్కృతిక జీవధాతు విలక్షణం.

*"ఏ భాష చెణుకైన ఏ యాస చినుకైన*

*తనలోన కలుపుకొని తరలింది తెలుగు"* అని 'విశ్వంభర' కవి, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా॥సి. నారాయణరెడ్డి అతి మధురంగా చెప్పారు.

వెయ్యేండ్ల మన తెలుగు సాహిత్యంలో వివిధ దశల్లో సాంఘిక ప్రయోజనం, అవసరాల్ని దృష్టిలో పెట్టుకుని వెలువడిన ఆణిముత్యాలను విదేశీ భాషల్లో పరిచయం చేయాల్సిన కర్తవ్యం ప్రధానమైనది. తెలుగువారూ; ఏ దేశమేగినా, ఎందుకాలిడినా తమ ఈ ప్రగతికి మూలాధాతువైన జాతి సంస్కారాన్ని విస్మరించరన్న ఆశతో ఆ సాహసానికి ప్రయత్న పూర్వకంగా అంకితం అవసరం. తెలుగులో మొదటి దశలో జరిగిన సాహిత్య కృషి స్థూలంగా పురాణ, యితిహాసాలను అనుసరించి జరిగిందన్నది వాస్తవం. వ్యాసభారత భాగవతాలు, వాల్మీకి రామాయణం అనువాదాలన్న న్యూనతాభావం రాకుండా కవిత్రయం, పోతన, విశ్వనాథ ప్రభృతులు వాటిని తెలుగులో మలిచిన కావ్యరీతి ప్రశంసనీయమే. ఇప్పటికీ చాలా వరకు – యితివృత్తాల్లో, మార్పులున్నా – తెలుగు రచనా రీతి కవిత్రయం నెలకొల్పిన పద్య కవితా పంథాలోనే జరుగుతున్నది. దీనితో బాటు జానపదుల జీవన ధర్మాలకు మర్మాలకు అద్దంపట్టే మౌఖిక సారస్వతాన్నీ తెలుగు కవులు విస్మరించలేరు. గురజాడ అప్పారావు సానబట్టిన ముత్యాల సరాలు పద్యంకాని పద్యమనిపించే హృద్యమైన కవితాప్రక్రియ, ద్విపద లాంటి తొలి రీతులూ కాలబాధితం కాకుండా సర్వులచే ఆదరింపబడుతున్నాయి. వెయ్యేండ్ల తెలుగు సాహిత్య ప్రస్థానంలో ఈ విశేషాల్ని జిజ్ఞాసువులు యథాశక్తి సందర్శించవచ్చు. యిందుకు తెలుగు పత్రికలు – సాహిత్య పత్రికలు – చేసిన కృషి అపారం.

– (ప్రతిభా వైజయంతికి కృతజ్ఞతలతో)

# తెలుగునాట ఆధునిక నాటకరంగం

కళాప్రపూర్ణ డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

కావ్యేషు నాటకం రమ్యం; నాటకాన్తంహి సాహిత్యం అని, సాహిత్య ప్రక్రియలలో నాటకానికి అగ్రతాంబూలమిచ్చారు. కాని, దాని ననుసరించి మన పూర్వకవులెవరూ తెలుగులో నాటకాలు వ్రాయలేదు.

1550 ప్రాంతంలో చిత్రకవి పెద్దన లక్షణ సార సంగ్రహంలో ప్రప్రథమంగా దేశీయ నాటక రూపమైన యక్షగానానికి లక్షణం చెప్పి, సంస్కృత నాటక లక్షణాలను ఉదాహరించాడు.

భారతంలో నన్నయ ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కుచూచితి అన్నదాన్నిబట్టి ఆనాడు నాటకాలు ప్రదర్శింపబడివుండవచ్చు ననుకోవడంలో తప్పులేదు.

ఎటుతిరిగీ 14 వ శతాబ్దంలో శ్రీనాథుడు తెలుగులో రచించిన క్రీడాభిరామం వీధినాటకంలో నాటి ఆంధ్రప్రజల సాంఘిక ఆచారాలు, వినోదాలు, వివిధ దేశి కళారూపాలు వర్ణించబడ్డాయి.

ఈనాడు మనకు కనిపించే ఆంధ్ర నాటకరంగం తొలిదశ ఈనాటికి నూటపదకొండు సంవత్సరాల క్రితం ప్రారంభమైంది. పండితులకు తప్ప పామరులకు అర్థం కాని ఆనాటి సంస్కృత నాటకాలు మినహా తెలుగులో నాటకాలంటూలేవు. ఆనాటి ప్రజాసామాన్యానికి అందుబాటులో వున్న కళారూపాలు జానపదకళారూపాలు మాత్రమే. అవి మన ప్రజలకు అందుబాటులో వుండి, వారి విజ్ఞానవికాసాలకు తోడ్పడ్డాయి.

నాటి జానపద కళారూపాలైన కురవంజి, యక్షగానం, వీధినాటకం, తోలుబొమ్మలాటలు, పగటి వేషాలు, బుర్ర కథలు, జముకులకథలు, హరికథలు, పిచ్చుకుంటుల కథలు, కాటమరాజు కథలు, హరిహరీ పదాలు మొదలైన చిత్ర విచిత్రమైన నూటయాభై కళారూపాలు ఆంధ్ర ప్రజల నుర్రూతలూగించాయి. వారి విజ్ఞాన వినోద వికాసాలకు తోడ్పడ్డాయి. ఆంధ్రదేశంలో ఆనాటికి చెప్పుకోదగ్గ నాటక కళాభివృద్ధి అంతంతమాత్రమే. దేశమంతా బ్రిటిష్ ప్రభుత్వ బానిసత్వంలో మ్రగ్గుతున్న రోజులవి.

## రాష్ట్రేతర నాటక సమాజాలు:

ధార్వాడవారు ఆంధ్రదేశమంతా పర్యటించివెళ్లిన తరువాత తెలుగు నాటక రంగ వికాసానికి ఈ క్రింది నాటక సమాజాలన్నీ తోడ్పడ్డాయి.

పూనా సాంగ్లీ నాటక సమాజం. బాలీవాలా థియేటర్, జంఖండికంపెనీ, దాదాబాయి తూంలే కంపెనీ, రిప్పన్ థియేటర్, సిర్వియాకంపెనీ, రాజ్దీ కంపెనీ, గూహరాబ్ మాడి థియేటరు, సిం. కన్నయసెట్టి కంపెనీ, నటేశం కంపెని, గుబ్బివీరన్న థియేటర్, పృథ్వీ థియేటర్ మొదలైన అనేక నాటక సమాజాలు హిందీ నాటకాలు ప్రదర్శించి అధునాతనరీతుల్లో ఆంధ్రనాటకరంగానికి ఊతమిచ్చాయి. అన్ని పట్టణాల్లోనూ నాటకోత్సాహం వెల్లివిరిసింది.

## పాతపద్ధతులకు స్వస్తి:

పై సమాజాలు ఆంధ్రదేశపు పట్టణాల్లో ప్రదర్శనలనిచ్చి వెళ్ళిన తరువాతే, అప్పటి వరకూ మనవారు ఉపయోగించే కాగడాలూ, చెక్కనగలూ, అర్థళపు పూతరంగులూ పోయి వాటిస్థానే వారు ప్రవేశపెట్టిన గాజుదీపాలు, ముఖానికి ఉపయోగించే నాజూకు రంగులూ, దగదగ మెరిసే హారాలు, పరాదా, చమ్కీదుస్తులూ, క్రిందినుండి పైకి పోయే తెరలూ, ప్రక్కతెరలూ, తెరలకు హంగుగా వుండే పైన వ్రేలాడే జాల్సూ వచ్చాయి. ధార్వాడ వారి నాటకాలు హిందీలో వుండేవి. నాటక ప్రారంభంలో నటి సూత్రధారుల సంభాషణలూ, విదూషకుని హాస్య ప్రసంగాలూ, ఛలోక్తులూ, మధ్య మధ్య కథావిధాన ప్రకటన మొదలైన విషయాలన్ని తెలుగునటుల్ని ఆకర్షించాయి.

## బందరులో:

ఈ స్థితిలో బందరులో 1880–82 ప్రాంతాలలో జూబిలీ థియేటరును దేవరసు వెంకట సుబ్బారావు, బాలకృష్ణగార్లు స్థాపించారు. 1884 లో మొగిలగిద్దల రామానుజరావుగారు హిందీలో నాటకా లాడారు. నాదెళ్ల పురుషోత్తమ కవి

దర్శకత్వం నిర్వహించారు. ఈయన లక్ష్మణస్వామి లాంటి ప్రసిద్ధ నటులు బిపిన్ చంద్రపాల్ మన్నన అందుకున్నారు. తరువాత హిందూ థియేటరు స్థాపించబడింది. కాశీనాథుని నాగేశ్వరరావు మొదలైన వారు నాటకాలను కట్టుదిట్టంగా ప్రదర్శించారు. ఆ తరువాత 1885 నుండి 1890 వరకు రాజాంకితం జగ్గారావు అధ్వర్యంలో జగన్మిత్ర సమాజం ఏర్పడి, నాటక ప్రదర్శనంలో చక్కని తెరలూ, సెట్టింగులూ పెట్టి, గొప్ప మార్పు తీసుకువచ్చి, చక్కగా నాటకాలను ప్రదర్శించారు.

తరువాత 1904 లో బి.టి. రాఘవాచార్యులుగారి అధ్వర్యంలో జగన్మోహినీ నాటక సమాజం స్థాపించబడి, 1910 వరకూ నాటకాలాడింది. ఈ సమాజానికి రచయితగాను, దర్శకుడుగాను రాఘవాచార్యులుగారు పనిచేశారు. ఈ సమాజం ఆంధ్రదేశం నాలుగు చెరగులా పర్యటించి, ప్రదర్శనాలిచ్చి, పేరు ప్రఖ్యాతులు గడించుకున్నది. ఈ రోజులలోనే రాజమహేంద్రవరంలో నాటకోత్సాహం వెల్లివిరిసింది.

## రాజమహేంద్రవర కళాకేంద్రం:

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, ఇమ్మానేని హనుమంతరావు, కందుకూరి వీరేశలింగం, వడ్డాది సుబ్బారాయుడు మొదలైన మహామహులు 1885–1890 సంవత్సరాలమధ్య హిందూ నాటక సమాజాన్ని స్థాపించారు. ప్రదర్శించే ప్రతి నాటకమూ కనులపండువుగా ప్రదర్శించేవారట.

ఆ తరువాత కృత్తివెంటి నాగేశ్వరరావు, యస్. గున్నేశ్వరరావుగార్లు ఒక నాటకసమాజాన్ని స్థాపించి కృష్ణా, గోదావరి జిల్లాలనుంచి నటులను రప్పించి ఉత్తమంగా నాటకాలు ప్రదర్శించడమేకాక, వారి సమాజాన్ని చక్కని శిక్షణాలయంగా తయారుచేశారు. ఇలా కొంతకాలం నడిపిన తరువాత గున్నేశ్వరరావుగారు నాటకాలను వ్యాపార సరళిలోనికి దించారు. నటులకు జీతాలనిచ్చి పోషించారు. పాపట్ల కాంతయ్యగారిని రప్పించి, మంచి పార్సీమట్లు పెట్టి పాటలతోనూ, పద్యాలతోనూ నాటక సమాజాన్ని నడిపారు. రంగాలంకరణనంతనూ మార్చేశారు. మంచి సీనరీలూ, తెరలూ, చమ్కీ కోట్లూ మొదలైన హంగులతో కనులపండువుగా ప్రదర్శనాలిచ్చారు. వీరిప్రదర్శనాలలోనృత్యప్రదర్శనాలుండేవి. ఏ దర్బారో అయితే ఒక్కసారి 50 మంది పరివారం హాజరయ్యేవాళ్ళు. అలా గున్నేశ్వరరావుగారు ఆదర్శంగా నాటక సమాజాన్ని నడిపారు. కిరాయి నాటకాలను వ్యాపార దృష్టితో నాటక సమాజాన్ని ప్రప్రథమంగా నడిపింది గున్నేశ్వరరావుగారే.

ఆ తరువాత చింతామణి నాటక సమాజం, నేషనల్ థియేటరూ, ఎమెచ్యూర్ థియేటరూ పనిచేశాయి. వీటిలో అంకరాజు రామారావు, ఏలూరిపాటి వెంకటరత్నంగార్లు ప్రముఖ నటులుగా పేరుపొందారు.

## బళ్ళారి సరస వినోదిని:

సర్కారు జిల్లాల్లో ఇలా నాటకరంగం అభివృద్ధిపొందుతూ వుంటే అటు బళ్ళారి కళాకారులు కదిలారు. ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగార్ల అధ్వర్యంలో సరస వినోదిని స్థాపించబడింది. ఇరువురూ పార్సీ, ఇంగ్లీషు నాటకాలను బాగా అవగాహన చేసుకున్నవారే. వీరి తొలి నాటకం చిత్రనళీయం. ఇది కృష్ణమాచార్యులు గారి రచనే. ఆయనే దర్శకుడు. ప్రధాన పాత్రకూడా ఆయనే ధరించేవారు. అతి మనోహరంగా నాటకాలను ప్రదర్శించేవారు. వీరి సమకాలికుడు కోలాచలం శ్రీనివాస రావుగారుకూడా అసామాన్యమైన ప్రతిభాశాలి. వీరిద్దరూ బ్రతికున్నంతవరకూ బళ్ళారి నాటక రంగం దేదీప్యమానంగా వెలుగొందింది. అనంతరం కృష్ణమాచారిగారి మేనల్లుడు తాడిపత్రి రాఘవాచార్యులుగారు బళ్ళారి నాటకరంగాన్ని నిర్వహించారు.

బళ్ళారి నాటకాల ప్రభావం ఆంధ్రదేశంలోవున్న ఔత్సాహికుల్ని ఉత్సాహపర్చింది.

## గుంటూరు ఫస్టు కంపెనీ:

గుంటూరులో 1882–84 మధ్య పాలూరు హనుమంతరావు గారు ఫస్టు కంపెనీని స్థాపించారు. ఈ సమాజంలో అద్వితీయ కళావైదుష్యాన్ని ప్రదర్శించి నట పితామహుడుగాను, నటకాగ్రేసరుడుగాను పేరు ప్రతిష్టలు గడించుకున్నవారు హరిప్రసాదరావుగారు. ఈ సమాజంలోనే బలిజేపల్లి, కోపల్లె హనుమంతరావు మొదలైన ప్రసిద్ధనటులు ఉద్భవించారు. ఆనాడు వీరు వచన నాటకాలను ప్రదర్శిస్తూ వుండేవారు. బళ్ళారివారి నాటకాలు వచ్చిన తరువాత వచన నాటకాలు మానివేశారు.

తరువాత షేక్, కనకరత్నంగారి అధ్వర్యంలో రెండవ కంపెనీ స్థాపించబడింది. ఒక ప్రక్క హరిప్రసాదరావు, రెండవ ప్రక్క మల్లాది గోవిందశాస్త్రి కాక, యడవల్లి వారి నాటకోదయం ప్రారంభమై, గుంటూరు నాటకరంగం విజృంభించింది.

## గురజాడ అవతరణ:

1900 సంవత్సరం నాటికి తెలుగునాటక రచన, తెలుగు నాటక రంగం పూర్ణవికాసం పొందుతూ వున్నాయి. నాటకాలన్నీ గ్రాంథిక భాషలో వుండేవి. ఈ స్థితిలో వ్యావహారిక భాషలో కూడా నాటకాన్ని ఉత్తమంగా వ్రాయవచ్చని గురజాడ కన్యాశుల్కాన్ని రచించి, ఆంధ్ర నాటక రంగంలో ఒక నూతనోత్తేజాన్ని కలిగించారు. కన్యాశుల్కం

వ్రాసేనాటికి విజయనగరంలో నాటకాలు ప్రదర్శింపబడుతూ వుండేవి.

కన్యాశుల్కం తొలి కూర్పు రచన ఎప్పుడు జరిగిందో ఇతమిత్థంగా తెలీదు. అయితే, తొలి ప్రదర్శనము 1892 లో జరిగినందున 1992 లో దేశమంతటా కన్యాశుల్క శతజయంతి ఉత్సవాలు జరిపారు.

## ఆనంద గజపతి:

1890 లో ఆనంద గజపతి సంస్కృతభాషా, సంస్కృత నాటకాలూ, వాటి ప్రయోగాలను పునరుద్ధరణ చేయాలనే సంకల్పంతో ఒక సమాజాన్ని స్థాపించి, దర్శకత్వం వహించి చతుర్విధ అభినయాలలోనూ ఆయనే శిక్షణ ఇచ్చేవారు. ఈ సమాజంలో కర్రా పేరయ్యశాస్త్రి, కర్రా పాపయ్యశాస్త్రి, చొప్పల్లి నరసింహం మొదలైన ప్రసిద్ధ నటులుండేవారు. ఇంతలో ఆనందగజపతి అస్తమయంతో ఆ సమాజం అస్తమించి పోగా విజయరామ డ్రమెటిక్ అకాడమీని తాతా ఉమామహేశంగారూ, రామాయణం సర్వేశ్వరశాస్త్రిగారూ; వాణీ విలాస సభను అనాసపరపు గోపాలరావు, చట్టి సత్యనారాయణగార్లు కలిసి అద్భుతంగా విజయనగర ఔత్సాహిక కళా కేంద్రాన్ని అభివృద్ధిలోకి తెచ్చారు.

## నెల్లూరు నాటక కళ:

1890–95 లో నెల్లూరులో ఆంధ్ర భాషాభిమాని అనే సమాజాన్ని వేదం వేంకటరాయశాస్త్రులుగారు, పూండ్ల రామకృష్ణయ్యగార్లు స్థాపించారు. సమాజ సభ్యులందరూ విద్యావంతులు. నాటక శిక్షణ అంతా శాస్త్రిగారిదే. శాస్త్రిగారి శాకుంతలాన్నీ, ప్రతాపరుద్రీయాన్నీ ప్రదర్శించేవారు. వీరి ప్రదర్శనాలముందు ఆంధ్రదేశంలో మరో సమాజం పోటీకి నిలబడేది కాదు. దీని తరువాత భాషాభిమాని సమాజం, ఆంధ్ర సభ అనే సంస్థలు స్థాపించబడ్డాయి. ఆంధ్ర సభ తూములూరి శివరామయ్య, రాయప్రోలు సుబ్రహ్మణ్యం, దుర్భా సుబ్రహ్మణ్యం, నేలనూతుల రామకృష్ణయ్య, కాశీ చెంచు మొదలైన ఉద్దండులతో మంచి క్రమశిక్షణా పద్ధతులతో నాటకాలను ప్రదర్శించారు. నెల్లూరు నాటకోత్సాహం అల్లూరుకు ప్రాకింది. అల్లూరులో పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారి ఆధ్వర్యంలో కృష్ణవిలాస సభ స్థాపించబడింది. ముఖ్యంగా రామదాసు నాటకాన్ని ప్రదర్శించడంలో పేరు ప్రతిష్టలు తెచ్చుకున్నారు. ఇందులో పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు పేరు పొందిన నటులు.

## ఏలూరు, మోతేవారి నాటక సమాజం:

1885–90 సంవత్సరాలలో వామనభట్ట జోషీగారు హిందీ నాటకాలు ఆడుతూ వుండేవారు. ఏలూరులో జమీందారైన మోతే నారాయణ రావుగారు సీతారామాంజనేయ నాటక సమాజాన్ని స్థాపించి, ఆంధ్రదేశంలో పేరుప్రతిష్టలు సంపాదించుకున్న అనేకమంది నటులను సమకూర్చి, ఏలూరు, విజయవాడ నగరాలలో రంగస్థలాలను నిర్మించి, కట్టుబాట్లతో నాటకాలను ప్రదర్శించారు. కవుల్నీ, చిత్రకారుల్నీ పోషించారు. నటుల్లో యడవల్లి, జొన్నవిత్తుల, వుప్పులూరి, కడియాల రత్తయ్య, అలమూరు పట్టాభి రామయ్య, అరణి, పంచాంగం, కొచ్చర్లకోట, ముంజులూరి, అద్దంకి మొదలైన ప్రసిద్ధ నటులందరూ వృద్ధిలోకి వచ్చారు. నారాయణరావుగారు శ్రీమంతులు అవడంవల్ల ఏ స్వార్థాలు లేకుండా జగజ్జేగీయమానంగా సీతారామాంజనేయ సమాజాన్ని నడిపారు.

## నర్సాపురం నాటక రంగం:

ఆ రోజుల్లో నర్సాపురానికి పూనానుండి వచ్చిన సాంగ్లీ హిందీ నాటక సమాజం నర్సాపురం కళాకారులలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. బుద్ధిరాజు బ్రహ్మానందం హిందూ నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజ దర్శకుడు మొగలిగిద్దల రామారావు. వేణీసంహారాన్ని, అభిజ్ఞాన శాకుంతలాన్ని ప్రదర్శించారు. తరువాత 1907 లో వై.యన్.కె.వి. అనే పేరుతో అళహంతి తిరుమల వెంకటాచార్యులుగారు ఒక నాటకసమాజాన్ని స్థాపించారు.

## పిఠాపురంలో:

ఈ రోజుల్లోనే (1900–1906) రాజా సూర్యారావుగారి సతీమణి కోలంక చెల్లయ్యమ్మారావుగారి పోషణలో ఒక నాటక సమాజాన్ని స్థాపించి, ఆంధ్రదేశ ముఖ్యనగరాలలో నాటకాలను ప్రదర్శించారు. పామగంటి లక్ష్మీనరసింహారావు, వెదురుమూడి శేషగిరిరావుగార్లు ఈ సమాజంనుంచే వచ్చారు. అనాడు నైజాంలో కూడా ప్రదర్శన లిచ్చారు.

అటు కాకినాడలో, ఇటు రాజమండ్రి, విశాఖపట్టణాల్లో నాటక సమాజాలు జోరుగా వున్న రోజుల్లో కల్లూరు సుందర రామయ్యగారు, పెద్దాపురంలో విద్యావినోదినీ సభను స్థాపించారు. వీరు అద్భుతంగా ప్రదర్శించిన నాటకం ప్రతాపరుద్రీయం.

అనాడు ఒక్క బళ్లారి మినహా రాయలసీమలో ఎక్కువ నాటక సమాజాలు లేకపోయినా చిత్తూరులో మాత్రం టి.వి. రంగాచార్యులు, కె. వరదాచారి, బి.వి. శేషాద్రి అయ్యరు రామవిలాస సభను స్థాపించారు. వీరు ఒక్క నాటకాలనేకాక, పురాణపఠనం, వుపన్యాసాలూ, గానకచ్చేరీలూ గ్రంథాలయం మొదలైన లలిత కళలన్నింటినీ పోషించారు. మన చలనచిత్ర ప్రసిద్ధనటుడు నాగయ్యగారూ, ఆర్.బి. రామకృష్ణంరాజు, రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు రామవిలాస సభలో ప్రసిద్ధ

నటులు గానూ, కళా పోషకులుగానూ ఎనలేని సేవలు చేశారు.

## మైలవరం బాలభారతి:

ధార్వాడ కంపెనీ ప్రభావంతో ఆంధ్రదేశపు ముఖ్య నగరాల్లో నాటక తృష్ణ ఎలా బయలుదేరిందో అలాగే విజయవాడలో కాశీనాథుని వీరమల్లయ్య, కారుపర్తి నాగలింగం, సుబ్బయ్యనాయుడు మొదలైనవారు హిందూ థియేటరును స్థాపించి, బొబ్బిలి, తారాశశాంక, హరిశ్చంద్ర మొదలైన నాటకాలను ప్రదర్శించారు.

అంతలో మైలవరం బాలభారతి సమాజం వెలిసింది. దీని పోషకులు సూరానేని వెంకటపాపయ్యారావు బహద్దరు జమీందారుగారు. మైలవరం కంపెనీ పున్నమినాటి చంద్రుడిలా ప్రకాశించింది. రంగాలంకరణతోనూ, ఫోకసింగులతోనూ ప్రదర్శన లిచ్చేవారు. గున్నేశ్వరరావుగారి వ్యాపారసరళి పద్ధతులు మైలవరం కంపెనీలో ప్రవేశపెట్టారు. యడవల్లి, నిడుముక్కల, అద్దంకి, సంజీవరావు, గురజనాయుడు, పారుపల్లి మొదలైన సుప్రసిద్ధ నటులందరూ ఇందులో పనిచేశారు. వీరంతా నెలజీతాలు తీసుకునేవారు. రానురాను సమష్టి కృషి తక్కువై, ధనదాహం ఎక్కువై, నాటకసమాజాన్ని వ్యాపారకేంద్రంగా మార్చివేశారు. క్రమేపీ క్షీణించిపోయింది. రాజావారి ఆస్థి అంతా అయిపోయింది. ఇలా అంతరించిపోయింది మైలవరం బాలభారతి.

## తెనాలి రంగస్థలం:

ఈకాలంలో తెనాలిలో శ్రీకృష్ణ హిందూథియేటరును చల్లా అంజనేయులుగారు స్థాపించారు. వీరు ప్రదర్శనలమీద వచ్చే ఆదాయంతో స్వంత హాలును గూడా నిర్మించుకోగలిగారు.

1921 వ సంవత్సరంలో భాగవతుల రాజగోపాలంగారు, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు రామవిలాస సభను స్థాపించారు. ఇందులో గోవిందరాజుల సుబ్బారావు, పెద్దిభొట్ల చలపతిరావు, మాధవపెద్ది, పులిపాటి, పిల్లలమర్రి, స్థానం, ముదిగొండ లింగమూర్తి మొదలైన ప్రసిద్ధనటులు ఉద్భవించారు.

వీరు ప్రదర్శించిన నాటకాలు ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం, బొబ్బిలి, రోషనార బాగా పేరు సంపాదించాయి. స్థానం నరసింహారావుగారు స్త్రీ పాత్రలు ధరించి ఆంధ్రదేశంలో అపూర్వమైన పేరు ప్రఖ్యాతుల్ని గడించారు. అలాగే మాధవపెద్ద వెంకటరామయ్యగారు ఉత్తమ నటుడుగా కీర్తింపబడ్డారు.

ఈనాటికీ' కాకినాడలో 1916 లో ఏర్పడిన యంగ్ మెన్స్ హాపీ క్లబ్ బాగా పని చేస్తూంది. కాళ్ళకూరివారి చింతామణి నాటకాన్ని కడు సమర్థనీయంగా ప్రదర్శించేవారు. ఏలూరిపాటి వెంకటరత్నం, పామర్తి బుచ్చిరాజు, దేవినేని జగన్నాయకులు ముఖ్యులుగా వుండేవారు. తరువాత 1919 లో ఆంధ్ర సేవాసంఘం ఏర్పడింది. సింగీతం సుబ్బారావు, పులవర్తి వెంకయ్య, జయంతి భావనారాయణ మొదలైనవారు కాకినాడ నాటక రంగాన్ని అభివృద్ధిపర్చారు.

## అటు విశాఖపట్టణంలో:

అటు విశాఖపట్టణంలో విక్రమ దేవవర్మగారి ఆధ్వర్యంలో నాటక కళ ఎంతో అభివృద్ధి పొందుతూవుంది. ఈవిధంగా ధార్వాడ నాటక సమాజాలూ, పూనా, సాంగ్లీ హిందూ నాటక సమాజం, సొహరాబ్ మోడీ హిందీ నాటక సమాజం వచ్చి వెళ్ళిన తరువాత నాటకోత్సాహం ప్రతి మారుమూల పల్లెకూ వెళ్ళింది. ఈనాటికి పౌరాణిక నాటకాలమీదా చారిత్రకనాటకాలమీదా మోజు మళ్ళింది. అందుకు కారణం ఉంది. దేశంలో పరాయిపాలన మూలాన జాతీయోద్యమం తలఎత్తింది. ప్రజలలో జాతీయ చైతన్యం, స్వాతంత్ర్య పిపాస ఎక్కువ కాసాగింది. ఇందుకు అనువుగా భారత వీరుల చరిత్రల్నీ, రసపుత్ర వీరుల జీవితాలను, మరాఠీ కథలనూ నాటకాలుగా వ్రాయ మొదలుపెట్టారు. రసపుత్ర విజయం, బొబ్బిలి మొదలైనవి 1915–16 సంవత్సరాలలో 388 తెలుగు నాటకాలు వెలువడ్డాయి. అందులో చారిత్రక నాటకాలు 38, సాంఘిక నాటకాలు 51.

ఈ కాలంలో సాంఘిక నాటకాలు ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి. వీరేశలింగంగారు బ్రహ్మసమాజికులు. దేశంలో సంఘ సంస్కరణ వాతావరణం తీసుకువచ్చారు. ఈకాలంలో నాటక కళాభివృద్ధికి ఎంతో మహదావకాశం కలిగింది. తెలుగులో పత్రికలు వెలువడ్డాయి. నాటకరంగాన్ని గూర్చి కోలాచలం శ్రీనివాసరావు గారు నటీనటులకూ, రచయితలకూ ప్రణాళికలను ప్రకటించారు. దీనిని ప్రాతిపదికగా తీసుకుని, పురాణం సూరిశాస్త్రి, ముత్తరాజు సుబ్బారావు, శ్రీపాద కామేశ్వరరావు, పాతాళభేది సుబ్రహ్మణ్యం మొదలైన కళాకోవిదులు పత్రికాముఖంగా నాటకాల్లో పద్యాలకు, పాటలకు అవకాశం వుందా లేదా అని చర్చలు లేవదీశారు. ఈ చర్చలవల్ల నటీనటుల్లో ఒక నూతన చైతన్యం రాసాగింది.

ఈకాలంలో గుంటూరులో బాలమిత్ర నాటకసమాజం వెలిసింది. ఇందులో అందరూ 18 సంవత్సరాలు నిండనివారే. వీరు శ్రీకృష్ణ లీలలు, ప్రమీల నాటకాలను ప్రదర్శించి ప్రజాదరణను పొందారు.

## బళ్లారి రాఘవ:

బళ్ళారి రాఘవ అటు బళ్ళారి మొదలు, ఇటు మద్రాసు వరకూ, మద్రాసునుండి బరంపురంవరకూ మొత్తం విశాలాంధ్ర నాటక రంగంలో బహునూతన విప్లవాన్ని తీసుకవచ్చిన ప్రతిభాశాలి. ఆయన 1920 లో తొలిసారిగా

విజయవాడలో ప్రదర్శనలిచ్చారు. అంతవరకు రాఘవ పేరు సర్వాంధ్రులకు తెలియదు. ఆంధ్రనాటకరంగంలో ఎంతోకాలం పాతుకుపోయిన పాత పద్ధతులకు స్వస్తిచెప్పారు. రచయితలకు, నటులకు కొత్తమార్గాన్ని ప్రతిపాదించారు. స్త్రీలే స్త్రీపాత్రలు ధరించాలని ఎలుగెత్తి చాటారు.

ఆయన నిర్వహించిన "హిరణ్యకశిపుడు", "రాజరాజు", "చాణక్య", "రామదాసు", "పఠాన్", "ఒథెల్లో", "షైలాక్", "హేమ్లెట్" పాత్రలను అఖండంగా ప్రదర్శించారు. రాఘవ నాటక ప్రదర్శనమంటే ఆంధ్రదేశం నలుమూలలనుంచీ నటులే ప్రేక్షకులుగా వచ్చేవారు. ఆయన పైన సూచించిన పాత్రల స్వభావాల్నే మార్చివేశారు. కొత్త అభినయాన్ని, కొత్త మనస్తత్వాలను ప్రవేశపెట్టారు. ఆంధ్రుల ప్రతిభా విశేషాలను ఒక్క ఆంధ్రదేశంలోనేగాక భారతదేశంలోనూ, అంతర్జాతీయ నాటకరంగంలోకూడా చాటారు.

రాఘవ ప్రతి పట్టణానికి విశాలమైన రంగస్థలం కొరకు కృషి చేశారు. సాంఘిక నాటకాలనూ, ఎమెచ్యూర్ నాటక సమాజాలనూ ప్రోత్సహించారు. అవిధంగా రాఘవ ఆంధ్ర నాటకరంగంలో ఒక విప్లవాన్ని తీసుకువచ్చారు.

ఈ రోజుల్లో నటీ నటులకు ఒక శిక్షణాలయాన్ని 1924 లో గూడవల్లి రామబ్రహ్మం, బి.టి. రాఘవాచార్యులు 'భరతముని' బృందం అనే పేరుతో ఒక నాటక శాలను స్థాపించారు. కాని, అట్టేకాలం నిలువలేకపోయింది.

ఆనాటి నటులందరూ ఎంతో క్రమశిక్షణతో ఈ నాటకాలను ప్రదర్శించారు. ఆనాటికీ, ఈనాటికీ ఆ నాటకాలు సజీవంగా శాశ్వత నాటకాలుగా నిలిచివున్నాయి. ఆ తరువాతి కాలంలో కంట్రాక్టు నటకుల చేతులలోనూ, వృత్తినాటక సంఘాల చేతులలోనూ పడి ఈ నాటకాలు కొంత అపఖ్యాతి పాలైనాయి.

## సత్యాగ్రహపు రోజులు:

1920 నుంచి, 30 వరకూ సత్యాగ్రహపు రోజులు. 1930 నుండి, 39 వరకూ ఆర్థిక మాంద్యం. నటీనటుల స్థితిగతులూ, నాటక సమాజాల స్థితిగతులూ దుర్భరంగా వున్నాయి. ప్రారంభ దినాలలో వున్న నాటక తృష్ణ క్రమేపీ చల్లబడుతూ వచ్చింది. స్వయంగా నాటక సమాజాలను పోషించే దాతలు తగ్గిపోయారు. ఈ రోజుల్లోనే కంట్రాక్టర్లు బయలుదేరారు.

## కంట్రాక్టు నాటకాలు:

సమష్టి కృషి అంతరించి వ్యక్తి స్వార్థం ఎక్కువైంది. నాటకాలను రసాభాసంగా తయారుచేశారు. వస్సుమోరు విధానానికి అవకాశ మిచ్చారు.స్టేజీమీద వివిధ రకాల పాటలు మొదలుపెట్టారు. నాటకం సకాలానికి ప్రారంభమవడం లేనే లేదు. రిహార్సల్సు లేకుండా నలుగురూ నాలుగు ప్రక్కల నుంచి వచ్చి ఎవరి చిత్తం వచ్చినట్లు వారు నాలుగు పాటలూ, పద్యాలు పాడి, ఎవరి కిరాయి వారు పుచ్చుకుని తెల్లవారేసరికి ఎవరికి వారే యమునా తీరేలాగా త్రోవబట్టేవారు. ఎవరికి డబ్బు ఇవ్వకపోయినా నాటకమే ఆగిపోయేది. కంట్రాక్టర్లు టిక్కెట్లు అమ్మి సొమ్ము చేసుకుని దొడ్డిదోవన పారిపొయ్యేవారు. ప్రేక్షకులు నాటకాలను తిట్టడం, తెరలు చించటం వంటి బీభత్సానికి దారి తీసింది.

## ఆంధ్ర నాటక కళాపరిషత్తు:

ఆంధ్రదేశంలో కంట్రాక్టు నాటకాలూ, వృత్తి నాటక సంఘాలూ ఏర్పడి నాటక రంగం అధోగతిలో పడిపోయే రోజులలో నాటక రంగాభివృద్ధికి పాటుపడాలనే ఉద్దేశంతో తెనాలిలో 1929 లో ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఏర్పడింది. నాటినుంచి నేటివరకు ఎన్నో పరిషత్తులు జరిపి, నాటకపోటీలు నిర్వహించి ఎంతోమంది కళారాధకులను సన్మానించి ఔత్సాహిక నాటకరంగానికి ఒక కొత్త ఉత్సాహాన్ని బలాన్ని చేకూర్చింది. తద్వారా ఎందరో రచయితలు కొత్త నాటకాలను వ్రాశారు. ఎన్నో ఉత్తమ నాటకాలు వెలుగులోకి వచ్చాయి. ఎందరో ఉత్తమ నటులుగా తీర్చిదిద్దబడ్డారు. కళాపరిషత్తు అభివృద్ధికోసం, కాశీనాథుని నాగేశ్వరరావు, రఘుపతి వెంకటరత్నం, వనారస గోవిందరావు, భట్టి పూర్ణయ్య పంతులు, విశ్వనాథ కవిరాజు, కాజ వెంకటరామయ్య, కొత్తపల్లి లక్ష్మయ్య, యం.ఆర్. అప్పారావు, పసల సూర్యచంద్రరావు, యత్రోజు మాధవాచార్యులు మొదలైనవారు ఎంతగానో పాటుబడ్డారు. అవిధంగా ఆంధ్ర నాటక కళాపరిషత్తు నవ్య నాటకరంగంలో ఒక నవచైతన్యాన్ని కలిగించింది.

## సురభి నాటకరంగం:

ఆంధ్రనాటకరంగంలో అత్యంత ప్రాముఖ్యం వహించేది సురభి నాటకాల చరిత్ర. ఆంధ్రనాటకరంగం ప్రారంభం తోపాటే సురభి నాటకరంగం కూడా సమాంతరంగా నడిచింది.

సురభి వారు మహారాష్ట్రకు చెందినవారు. శివాజీ ఆస్థానంలో సేనానాయకులుగానూ, ఉపనాయకులుగానూ పనిచేశారు. క్షత్రియకులానికి చెందినవారు. సింధే అవేర్, అణ్ణావు, రేకందార్, సార్వేమొదలైనవి వారి ఇంటిపేర్లు.

శివాజీ శంభాజీ గతించిన తరువాత మహమ్మదీయుల దండయాత్రలు తట్టుకోలేక 1850 నాటికే, ఆరెకాపులు, ఆరె మరాఠీలుగా ఆంధ్రదేశంలోని బళ్ళారి, రాయదుర్గం, ఆదోని ప్రాంతాలలో ప్రవేశించి బ్రిటిష్ ప్రభుత్వంద్వారా కడప మండలలో ఈనాములు సంపాదించి జీవనాన్ని సాగించారు.

' ఆనాటి కరువువల్ల జీవనోపాధి కష్టమైపోయింది. వారిలో శ్రావ్యమైన గాత్రాలు కలవారుండేవారు. పాటలు ఆటలతో

ప్రజలను అలరించారు. ప్రథమంలో ఈతమట్టల బొమ్మలా టలు ఆడారు.. తరువాత తోలుబొమ్మలు ఆడారు. ఆ తరువాత జింఖంకీ నాటకాలు ఆడారు.

తరువాత కడప జిల్లాలోవున్న సురభి గ్రామంలో నాటకాలను ప్రారంభించారు. అలా 1895 లో ప్రథమంగా కీచకవధ నాటకాన్ని ప్రదర్శించారు. సురభి నాటక సంస్థ సంస్థాపకులు వనారస గోవిందరావుగారు. మరెందరో గొప్పకళాకారులుగా వర్ధిల్లారు.

అలా వారి కుటుంబాలన్నీ నాటకాలనే వృత్తిగా చేసుకున్నారు. మన నాటకరంగంతోపాటు వారూ పట్టణాలు మొదలు పల్లెలవరకూ నాటకాలు ప్రదర్శించారు.

ఒకనాడు నాటక సమాజాలు నాటకాలను ప్రదర్శించాయి. వారే నాటకాలు వ్రాసుకోవడం, పురుషులు పురుషపాత్రలనూ, స్త్రీలు స్త్రీపాత్రలనూ, పిల్లలు బాల పాత్రలనూ ధరించేవారు. వారే తెరలను పెయింటింగ్ చేయటం, దుస్తులు కట్టుకోవడం, సంగీతాన్ని కూర్చుకోవడం, పక్కాహాలును రేకులతో నిర్మించుకోవడం, ప్రచారం చేసుకోవడం, ఒకవూరి నుంచి మరోవూరికి బండ్లమీద సామానంతా వేసుకుని మరోవూరిలో హాలును నిర్మించడం, హాలుప్రక్కనే కాపురముండటం, ప్రతిరోజూ టైముప్రకారం రోజుకొక నాటకం ప్రదర్శించటం - అలా 20 నాటకాలవరకూ ప్రదర్శించేవారు.

పావలా మొదలు పది రూపాయలు కలెక్షన్ వచ్చినా క్రమం తప్పకుండా నాటకాలాడేవారు. వారి నాటక ప్రదర్శనాలలో రంగురంగుల ఫోకసింగ్ లైట్లు, స్ప్రింగ్ వర్కుతో భూమిలోనుంచి లక్ష్మీదేవి ప్రసన్నం కావటం, నారదుడు వైరువర్కుద్వారా ఆకాశంనుండి భూలోకంలో ప్రత్యక్షమవడం, హనుమంతుడు సముద్రం దాటి లంకకు వెళ్ళడమూ, దేవుళ్ళు ప్రత్యక్షాలూ అంతర్ధానాలూ, మొదలైన ట్రిక్కులన్నింటిని ప్రవేశపెట్టి ప్రజలను ఆకట్టుకున్నారు.

అలా నూరు సంవత్సరాలు 30 తెలుగు నాటకాలను వేల సంఖ్యలో ఆంధ్రదేశమంతటా ప్రదర్శించారు. ఎంతోమంది ఉత్తమనటులుగా వెలుగొందారు. సురభి కమలాభాయి, సురభి బాలసరస్వతి, కోటేశ్వరి, పూర్ణిమ మొదలైనవారు సినీ ఆర్టిస్టులుగా వెలుగొందారు.

రానురాను నాటకాలకు ప్రజల ఆదరణ తగ్గిపోయింది. ప్రభుత్వం,వారి విషయం పట్టించుకోకపోవడంతో సమాజాలన్నీ మూలబడిపోయి, సామానుల నమ్ముకుని జీవిస్తున్నారు.

పేరుకు ఈనాడు నాలుగైదు సమాజాలు మాత్రం పని చేస్తున్నాయి. ఆంధ్ర నాటక రంగంలో సురభి నాటకాల చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖింపతగినది.

**పోరాటాలరంగస్థలం ప్రజానాట్యమండలి:**

ఆంధ్రనాటకరంగ చరిత్రలో 1943 నుండి 1949 వరకూ ఒక ఉజ్వల నాటకసంస్థ నడిచింది. అదే ప్రజానాట్యమండలి. ఉత్సాహంకొద్దీ నిర్మించింది కాదు ప్రజానాట్యమండలి. అది ఒక ఉధృత వాతావరణంలో రెండవ ప్రపంచయుద్ధకాలంలో ఆవిర్భవించింది. కమ్యూనిష్టు పార్టీ అండదండలతో ఉన్నతాశయ ప్రబోధంతో దేశానికి, ప్రజలకు సేవ చేసింది.

ప్రజానాట్యమండలి అంటే ప్రజాపోరాటాల రంగస్థలం. అది శ్రామికజనసంస్కృతిని ప్రతిబింబించింది. కడుపుకాలే ప్రజలకోసం పనిచేసింది. నాటకరంగంలో నవశకాన్ని ఏర్పరచి ప్రజలను జాగృతమొనర్చిన విప్లవనాట్యమండలి అది.

నాటక రంగం ఏనాడూ ఒక ఉద్యమంగా రూపొందలేదు. అలాంటి ఉద్యమాన్ని రూపొందించింది ఒక్క ప్రజానాట్యమండలి మాత్రమే.

కళ కళ కోసం కాదనీ అది ప్రజల జీవితాలను తీర్చిదిద్దాలనీ చాటింది ప్రజానాట్యమండలి. ప్రజలయొక్క భవిష్యత్తును తీర్చిదిద్దటానికీ దేశంలో ప్రజల మధ్యనున్న అసమానతల్ని తొలగించటానికీ పీడిత ప్రజలకు తిండి బట్ట నివాసంకలిగించేందుకూ పనిచేసింది. మతాలకూ కులాలకూ మూఢనమ్మకాలకూ, భాషాఛాందసవాదాలకూ వ్యతిరేకంగా పనిచేసింది ప్రజానాట్యమండలి.

ప్రజల కష్టాల్లో పాలు పంచుకుంది. సంప్రదాయమైన ప్రాచీన జానపద కళారూపాలను పునరుద్ధరించి, ఆయా కళారూపాల బాణీలలో, ఆనాడు దేశంలోవున్న క్లిష్టపరిస్థితులను ఇతివృత్తాలుగా తీసుకుని కళారూపాలను నూతన ప్రయోగంతో తీర్చిదిద్ది ప్రజలలో నవచైతన్యాన్ని కలుగచేసింది ప్రజానాట్యమండలి.

అలా మన ప్రాచీన జానపద కళారూపాలైన యక్షగానం, వీధినాటకం, బుర్రకథ, జముకుల కథ, పిచ్చుకుంటుల కథ, హరికథ, కోయవేషం, చెంచువేషం, అల్లాకెనాం, సోదె, జంతరపెట్టె, చక్కభజన, కోలాటం, డప్పులకోలాటం, రైతు కూలీ నృత్యాలు, బృందగానాలు, నాటకాలు, నాటికలు - ఇల్లా ఎన్నో కళారూపాల ద్వారా ఆంధ్రదేశం ఆమూలనుంచి ఈమూలవరకూ ఆయా జిల్లాలలో అనేక శిక్షణాశిబిరాలను ఏర్పాటుచేసి అనేక దళాలకు శిక్షణ ఇచ్చి ప్రతి మారుమూల గ్రామానికీ ప్రజానాట్యమండలి వెళ్ళి ప్రజలను మేల్కొల్పింది. సంగీత సాహిత్య నృత్య నాటకాలను ప్రజాశ్రేయస్సుకూ సంఘశ్రేయస్సుకూ వినియోగించింది. జాతీయ ఉద్యమంలో రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఫాసిస్టు మూకల్ని తిప్పి కొట్టడంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని చీల్చిచెండాడుతూ సంస్థానాధిపతులకు వ్యతిరేకంగా జమీందారీ భూస్వామ్య

వ్యవస్థకు వ్యతిరేకంగా నిరంకుశ నిక్రుష్ట నిజాంపాలనకు వ్యతిరేకంగానూ ప్రజలను మేల్కొలిపింది.

గ్రామీణ ప్రజలను దోచుకునే లంచగొండుల్నీ, రౌడీలనూ, గుండాలనూ, మంత్రగాళ్ళనూ వాళ్ళ వ్యవహారాలను బట్ట బయలుచేసింది. యువజన ఉద్యమాలకు వెన్నుదన్నుగా నిలబడి ఆంధ్రప్రజా జీవితంలో మహోజ్వల పాత్రను నిర్వహించింది.

వీరేశలింగం, గురజాడ, గిడుగు మొదలైన వారి ప్రగతిశీల భావాలను ప్రజలలో ప్రచారం చేసింది. కాంగ్రెసు ప్రభుత్వ దుష్టవిధానాలకూ, దమనకాండకూ వ్యతిరేకంగా పోరాడింది.

ఈ సాంస్కృతిక సమరంలో ప్రజా నాట్యమండలి కళాకారులు రెండు ప్రభుత్వాల నిర్బంధాలకూ, లాఠీ దెబ్బలకూ, చిత్రహింసలకూ, జైళ్ళకూ గురి అయ్యారు. నాటకాలనూ, బుర్రకథలనూ, పాటలనూ పాలకులు నిషేధించారు.

ఇలా అడుగడుగునా కత్తుల వంతెనలు దాటుకుంటూ, ప్రజానాట్యమండలి అప్రతిహతంగా పురోగమించింది. నిర్బంధకాండ మితిమీరడంతో ప్రజానాట్యమండలి కార్యక్రమాలన్నీ స్తంభించిపోయాయి. కళాకారులు చెల్లాచెదరైపోయారు.

ఆ తరవాత ప్రజానాట్యమండలి పునరుద్ధరించబడింది. ఈనాడు పద్దెనిమిది జిల్లాలలో అయిదువేలమంది కళాకారులతో ప్రజానాట్యమండలి ఉద్యమం ముందుకు దూసుకుపోతోంది. అభ్యుదయ పథంలో ప్రజలకూ కళలకూ సేవ చేస్తూవుంది. అదే ప్రజానాట్యమండలి విశిష్టత.

## వామపక్ష నాటకరంగం:

సాంఘికనాటక చరిత్రలో నాటి వుత్సాహం, జరిగిన పరిషత్తులు, ప్రయోక్తల చిత్తశుద్ధి ప్రతిభ, రచయితల కృషి ఇవి అన్నీ సామాజిక నాటక రచనకూ ఊపిరిపోశాయి. రాజకీయ సాంఘికచైతన్యం రచయితలలోనూ, ప్రజలలోనూ పెరగడంతో, సమకాలీన సాంఘిక పరిస్థితులను ప్రదర్శనలో ప్రదర్శించాలనే దృక్పథం నూతన భావాలకూ, కొత్త పోకడలకూ దారితీశాయి.

ఈ నేపథ్యంలో నక్సల్ బరీ ప్రభావంతో శ్రీకాకుళం జిల్లా గిరిజన రైతాంగం పోరాటం చేసిన కాలంలో ప్రచారం చేయటానికి ప్రజా కళారూపాలను ఎంచుకున్నారు. అలా ఎన్నుకున్న వాటిలో అత్తిలి కృష్ణారావు తూర్పురేఖలు నాటకం వెలువడింది. అలాగే చైతన్యాన్ని కలిగించిన మరోనాటకం వంగపండు ప్రసాదరావుది. సుబ్బారావు పాణిగ్రాహి పాటలు వ్రాసి, జముకుల కథలు చెప్పారు. వీరంతా జననాట్యమండలి ద్వారా ప్రచారం చేశారు. 1972 లో జననాట్యమండలి ఏర్పడింది. ప్రభుత్వ నిర్బంధాలను ఎదుర్కొంటూ పనిచేస్తూనే వుంది.

జననాట్యమండలిలో ప్రజలకు తెలిసిన కళాకారులు గద్దరు, వంగపండు ప్రసాదరావు. గద్దరు బీదలపాట్లు నాటికను వీధిభాగవతంగా ప్రచారం చేశాడు. తన పాటలతో ప్రజలను ఆకట్టుకొన్నాడు. వంగపండు ప్రసాదరావు శ్రీకాకుళం, విశాఖ మండలాలలో తన పాటలు, నాటకాలద్వారా ప్రజలను ప్రభావితం చేశాడు. వంగపండు వ్రాసిన భూభాగోతం నాటికను అనేక అభ్యుదయ నాటక సమాజాలు ప్రదర్శించాయి.

అదేవిధంగా అరుణోదయ, జనసాహితీలాంటి అభ్యుదయ నాటక సమాజాలు విప్లవ రాజకీయాలను ప్రజలలోకి తీసుకువెళ్ళాయి. పాటలు పాడుతూ, నాటికలను నాటకాలను ప్రదర్శించాయి. అలాగే పసుపులేటి పూర్ణచంద్రరావుగారు వామపక్ష భావాలతో నాటకాలను ప్రదర్శించారు. పూర్ణచంద్రరావు తన నాటక సమాజానికి అగస్టో బోల్ విముక్తి నాటక రంగం అని పేరుపెట్టారు. మన్నెంలో అనే నాటకాన్ని ప్రదర్శించారు. తూర్పు గోదావరి జిల్లాలో గిరిజనుల బాధల్ని వివరిస్తుందీ నాటకం. ఇలా వామపక్షభావాలు గల నాటక సమాజాలు అభ్యుదయ నాటకాలనూ, నాటికలనూ పాటలనూ ప్రదర్శించాయి.

## ఔత్సాహిక నాటకరంగం-మంచి చెడ్డలు:

ఔత్సాహిక నటులంటే కొత్తగా నాటక సమాజాలను ఉత్సాహం కొద్దీ స్థాపించి, నాటకాలను ప్రదర్శించేవారనీ, ప్రాథమిక దశలో వున్న నటులనీ కూడా చెప్పుకోవచ్చు. ఔత్సాహిక నటులకంతా కేవలం కళాదృష్టి తప్ప మరే విధమైన స్వార్థాలూ వున్నాయని చెప్పలేము. అనేకమంది ఉద్యోగాలు చేసుకునేవారూ, విద్యార్థులూ, విద్యాధికులూ, గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ ఉత్సాహవంతులైన యువకులు అనేకమంది ఔత్సాహిక నాటక సమాజాలను నడుపుతున్నారు.

ఔత్సాహిక నటులు ఎవ్వరూ ఒక్క దమ్మిడీ తీసుకోకపోయినా వారికి నాటక సమాజాలు నడపడం చాలా కష్టంగా ఉంది. ఎంతో ఉత్సాహంగా ప్రారంభించిన ఎన్నో నాటక సమాజాలు ఆర్థిక సమస్యలను తట్టుకోలేక అనతికాలంలోనే అనేకం అదృశ్యమై పోతున్నాయి.

ఇందుకు కారణాలు లేకపోలేదు. సమాజ ప్రారంభంలో ఏదో ఒక నాటకం ప్రదర్శించాలన్న ఉత్సాహం మినహా, సమాజాన్ని ఎలా నడపాలో, ఎలాంటి కట్టుబాటులుంటే నాటక సమాజం నిలుస్తుందో, పెట్టుబడి ఎంత కావాలో, ఆ పెట్టిన పెట్టుబడి ఎలా తీర్చాలో కూడా ఆలోచించరు.

ఒక్కొక్క సమాజం రెండు మూడు ప్రదర్శనలకే మూలబడిపోతూ వుంటుంది. ఇందుకు కారణం ఆ ప్రదర్శనలు విజయవంతం కాకపోవడమే. అంటే, ప్రేక్షకులను ఏమాత్రం సంతృప్తిపరచలేకపోతున్నాయన్నమాట. అయినప్పటికీ ఈనాడు కొన్ని అమెచ్యూర్ నాటక సమాజాలు ఆదర్శంగా నాటకాలను ప్రదర్శిస్తూనే వున్నాయి.

## లిటిల్ థియేటర్ ఉద్యమం:

ప్రపంచ వ్యాప్తంగా వున్న లిటిల్ థియేటర్ ఉద్యమాన్ని తెలుగుదేశంలో చేపట్టినవారు కీ.శే. కొప్పరపు సుబ్బారావుగారు. వీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. ప్రఖ్యాత నాటక రచయిత, ప్రయోక్త, సంగీతదర్శకుడు. ఒపెరా బాణీలో ప్రప్రథమంగా అల్లీ ముతా రచించింది వీరే. ఉత్తమ గ్రంథాలయాన్ని నెలకొల్పారు. సాంకేతిక ప్రమాణాలకు పనికివచ్చే ఉత్తమమైన లైటింగ్‌ను అమెరికానుంచి తెప్పించి ప్రయోగాలు చేశారు. అనేకమంది యువ నటీనటులకు శిక్షణ ఇచ్చి, ఉత్తమంగా నాటకాలు ప్రయోగింపచేశారు.

మద్రాసులో డా. గాలి బాలసుందరరావు ఆ తరవాతికాలంలో ఈ ఉద్యమాన్ని సాగించేందుకు కృషి చేశారు.

## సంగీత నాటక అకాడమి:

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఏర్పడిన నాటినుండి నాట్యకళ పత్రికను నడపడం, నాట్యసదస్సులూ, సంగీత సదస్సులూ జరుపుతూ, వృద్ధ కళాకారులకు కనీసవేతనమిస్తూ కొన్ని శాస్త్రీయ గ్రంథాలను ప్రకటిస్తూ ప్రసిద్ధ కళాకారులను సన్మానిస్తూ నాట్య విద్యాలయాలను, గురుకులవాస సంగీత, నృత్య విద్యాలయాలను నడుపుతూవచ్చింది.

## నాట్యసంఘం:

అదేవిధంగా ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం ఆయా జిల్లాలలో శాఖలను స్థాపించి కొత్త నాటకాలను ప్రయోగించి ప్రదర్శిస్తూ నాటక విద్యాలయమును కొంతకాలం నడిపింది. నాటక కళకు సేవ చేస్తూంది.

ఈ కాలంలోనే హైదరాబాదు నాట్యసంఘం ప్రాంతీయ శాఖను ప్రారంభించి, ఉత్సవాలను నిర్వహించి, హైదరాబాదులో నాటక రంగానికి నూతన జ్యోతిని వెలిగించిన మిత్రుడు ఎ.ఆర్. కృష్ణ. ఆధునిక సాంఘిక నాటకోద్యమానికి కొత్త ఊపు ఇచ్చిన వాళ్ళలో ఎ.ఆర్. కృష్ణ ముఖ్యుడు. ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం, నాట్యవిద్యాలయం ద్వారా విద్యార్థులకు నటనలో శిక్షణ, ప్రయోగాత్మక నాటకాల ప్రదర్శనాలు, ఇతర పట్టణాల్లో నాట్యసంఘ వుత్సవాలు, వారాంతపు నాటక ప్రదర్శనాలను ప్రదర్శించారు. బంగారు లేడి, నిశ్శబ్దం కోర్టు నడుస్తుంది మొదలైన ప్రయోగాలు చేశారు.

ఎ.ఆర్. కృష్ణ మాలపల్లి నాటకం ఒక నూతన ప్రయోగం, 12 రంగస్థలాలలో ఒకేసారి నాటకంలోని వివిధ సన్నివేశాలను ప్రదర్శించి, ఆంధ్రనాటక రంగంలో ఓ కొత్త ప్రయోగానికి అంకురార్పణ చేశారు. వ్యయప్రయాసలకోర్చి, నూరు ప్రదర్శనాలకు పైగా ప్రదర్శించారు. ఆయన మరణం తెలుగు నాటకరంగానికి తీరని లోటుగా మిగిలిపోయింది.

## వెంకటగిరి అమెచ్యూర్సు:

ఆ రోజుల్లో మారుమూల నెల్లూరు జిల్లాలో వెంకటగిరి అమెచ్యూర్సు దక్షిణాంధ్ర దేశంలో గొప్ప సంచలనాన్ని కలిగించారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తులో వారు వరుసగా మూడు సంవత్సరాలు ఈనాడు, యన్.జీ.ఓ., ఎదురీత నాటకాలకు వుత్తమ బహూమానాన్ని అందుకున్నారు. ఆత్రేయ ఈ సంస్థ ద్వారా వెలుగులోకొచ్చి రషీదా, ఈనాడు, యన్.జీ.ఓ, డాక్టర్ కోట్నీస్ మొదలైన నాటకాలను వ్రాసి ప్రదర్శించారు. సంగీత దర్శకుడు సి. మోహనదాసు ఈ సంస్థకు గుండెలాంటివాడు. హైదరాబాదులో సనత్‌నగర్ కల్చరల్ ఎసోసియేషన్ ద్వారా ఇ. సీతారామయ్య, బి. రామారావు ఎమ్.వి. రామారావు, వి.వి.యస్.యన్. రాజు మొదలైనవారు రెండు రెళ్ళు ఆరు, కరుణించని దేవతలు, కళ్ళు నాటకాలను దిగ్విజయంగా ప్రదర్శించారు.

## కూర్మా వేణుగోపాలస్వామి:

ఈ కాలంలోనే విశాఖపట్టణం ఆంధ్రవిశ్వవిద్యాలయంలో రిజిస్ట్రారుగా వున్న కూర్మా వేణుగోపాలస్వామిగారు ఆంధ్రాభ్యుదయ ఉత్సవాల పేరుతో విశ్వవిద్యాలయం ఆరుబయలు నాటకరంగస్థలాన్ని నిర్మించి, రాష్ట్రవ్యాపిత అంతర్ కళాశాలల అభ్యుదయోత్సవాలలో ఉత్తమంగా వచ్చిన నాటకాలన్నిటినీ ఈ ఆరు బయలు నాటక రంగస్థలంలో ప్రదర్శించి విద్యార్థులను నాటకరంగంవైపుకు త్రిప్పారు. ఆ ప్రదర్శనశాలలో ఎన్నో సాంఘిక నాటకాలనూ, నాటికలనూ సాంకేతిక విలువలతో, నూతన కాంతులతో, ప్రయోగం చేసి ప్రదర్శించారు. ఆ ప్రదర్శనాలు ఆంధ్రదేశంలోవున్న ఔత్సాహిక నాటక సమాజాల వారందరినీ ఉత్తేజితుల్ని చేశాయి. గోపాల స్వామిగారు ఆంధ్రయూనివర్శిటీలో థియేటర్ ఆర్ట్సును నెలకొల్పారు. ఆయనకూడా లిటిల్ థియేటర్ ఉద్యమాన్ని బలపర్చారు. ఆంధ్ర థియేటర్ ఫెడరేషన్‌ను రాజారావుతో కలిసి స్థాపించారు. ప్రజానాట్యమండలి పునరుద్ధరణ సభను 1974 లో ప్రారంభించారు.

## ఆంధ్ర ఆర్ట్సు థియేటర్:

విజయవాడలో ఆంధ్ర ఆర్ట్‌థియేటర్ ప్రజానాట్యమండలికి మారుగా, హనుమంతరాయ గ్రంథాలయ వైజ్ఞానిక శాఖగా పనిచేసింది. విజయవాడలో అనేక సమాజాలకు ఉత్సాహాన్ని కలిగించింది. ఈనాడు, పరివర్తన, విశ్వశాంతి, గాలిమేడలు, మావూరు, భయం, కప్పలు, ప్రగతి మొదలైన ఎన్నో నాటకాలను నాటికలను ప్రదర్శించడమే కాక, బుర్ర

కథలు, జముకుల కథలు మొదలైన కళారూపాలనుకూడా ప్రదర్శించింది. ఆర్టు థియేటర్‌లో మిక్కిలినేని, మాచినేని, లక్ష్మీవర్సయ్య, ఆత్రేయ, అనిసెట్టి, వి. మధుసూదనరావు, ఆదిశేషయ్య, జి.యస్.ఆర్. మూర్తి, కె. వెంకటేశ్వరరావు మొదలైన వారంతా కృషి చేశారు.

## రసన సమాఖ్య:

తరువాత విజయవాడ రైల్వే కళామండలిలో కే. వెంకటేశ్వరరావు, చలపతిరావు, ప్రఖ్య, శివం మొదలైనవారు నాటకాలు ప్రదర్శించారు.

కే. వెంకటేశ్వరరావు ఆ తరువాత రసన సమాఖ్యను స్థాపించి, కీర్తిశేషులు, రాగ రాగిణి, కనక పుష్యరాగం, లంకెల బిందెలు, దొంగవీరుడు, పునర్జన్మ మొదలైన నాటకాలను ప్రదర్శించాడు. నాటి నాటక రంగానికి జ్యోతిలా ప్రకాశించాడు. వెంకటేశ్వరరావు తన అసమాన నటనా వైదుష్యంతో ఎంతోమంది నటులమీద తన ముద్ర వేశాడు.

బహురూప నాటక సమాఖ్య ద్వారా కే. వెంకటేశ్వరరావు గణేశ్‌పాత్రో వ్రాసిన కొడుకుపుట్టాల, పావలా నాటికల్ని విశాఖమాండలిక భాషలో ప్రదర్శించాడు. బెత్తం మనిషి ఏకపాత్రాభినయాన్ని వెంకటేశ్వరరావు అద్భుతంగా తన నటనా వైదుష్యంతో వెలయించాడు. ఈ నాటికల్ని పాత్రో గొప్పగా రచన చేశాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నాటకశాస్త్రశాఖ అధ్యాపకులుగా పనిచేసిన అనంతరం కె. వెంకటేశ్వరరావు కన్ను మూశారు.

## బాపట్ల కళావని:

అదేరోజుల్లో బాపట్లనుంచి కళావనిద్వారా కొప్పరపాటి గంగాధరరావు నాటకాలను, నాటికలను వ్రాసి ఆంధ్రదేశమంతటా పరిషత్తుల్లో పోటీల్లో పాల్గొని ఎన్నో బహుమతుల్ని అందుకున్నారు. ఆయన నాటకాలను అనేక సమాజాలు ప్రదర్శించాయి.

గరికపాటి రాజారావు, ప్రజానాట్య మండలిని రద్దు చేసిన తరువాత రాజమండ్రి వెళ్ళి, రాఘవ కళానిలయం స్థాపించి భయం, గుడ్డిలోకం మొదలైన అనేక నాటకాలను ప్రదర్శించారు.

1970 ప్రాంతంలో లండనులో డిప్లొమా పొందిన చాట్ల శ్రీరాములు మారుతీరావు రచించిన లావాలో ఎర్రగులాబి సత్యంగారిల్లెక్కడ, గోటుహెల్ అనే నాటకాలను సాంకేతిక విలువలతో గొప్పగా ప్రదర్శించారు.

విద్యానగర్ కల్చరల్ ఎసోసియేషన్ ద్వారా దుగ్గిరాల సోమేశ్వరరావు, జె.యల్. నరసింహారావు, గరిమెళ్ల, ఇ.వి. సుబ్బారావు, ఇ.ఎల్. నరసింహారావు మొదలగువారు మంచి క్రమశిక్షణతో నాటకా లాడారు. ముఖ్యంగా ఎన్. ఆర్. నంది వ్రాసిన మరో మొహంజొదారో, అరణి నాటకాలు, సృజనాత్మక రచనలుగా, సృజనాత్మక ప్రదర్శనాలుగా ఈ సమాజం ఇంకా ఇతర నాటక సమాజాలు ప్రదర్శించాయి. నాటక రచనలో నంది వినూత్న పోకడలతో నాటకాలను వ్రాశారు.

ఆ కాలంలో, తూర్పు గోదావరి జిల్లాలో, రావుగోపాలరావు ఔత్సాహిక నాటక సమాజాలన్నిటికీ ప్రోత్సాహం కలిగించి ఎన్నో సాంఘిక నాటకాలను ప్రదర్శించి ఎంతోమంది నటుల్ని వెలుగులోకి తెచ్చారు. కీర్తిశేషులు నాటకంలో మురారి పాత్రను అద్భుతంగా అభినయించాడు. ఇదే మురారి పాత్రను కె. వెంకటేశ్వరరావుతో పాటు నటించిన సి.హెచ్. కృష్ణమూర్తి కూడా గొప్పగా నటించాడు.

## ఉత్తరాంధ్ర నాటకరంగం:

ఉత్తరాంధ్రలో విజయనగరం రాఘవ నాటకోత్సవాలు ఆ ప్రాంతంలో ఎంతో చైతన్యాన్ని కలిగించాయి. ముఖ్యంగా శ్రీకాకుళం నటరాజ కళాసమితి, జంషెడ్‌పూర్ ఆర్.వి. చలం చలన సమితి ఆ రకంగా ప్రభావితమయ్యాయి. నటరాజ కళాసమితి ఎంతో ప్రముఖంగా పనిచేసింది. జె.వి. సోమయాజులు, రమణమూర్తి, రావి కొండలరావు మొదలైనవారు నటించారు. పంజరం, కాళరాత్రి, కన్యాశుల్కం లాంటి నాటకాలను జయప్రదంగా ప్రదర్శించారు. ప్రఖ్య శ్రీరామమూర్తి రచయితగా నాటకాలు వ్రాసి ఇచ్చారు.

## విశాఖ నాటకరంగం:

విశాఖలో విశాఖ నాటక కళాసమితి, గజపతిరాజు అచ్యుత రామరాజు రావూజీ నాట్యమండలి, కే. వెంకటేశ్వరరావు యూనివర్సిటీ థియేటర్ ఆర్ట్స్ ద్వారా ఎన్నో నాటకాలను ప్రదర్శించారు. అత్తిలి కృష్ణారావు ఊరేగింపు, తూర్పు రేఖలు, సంధ్యారాగం మొదలైన విప్లవాత్మకమైన నాటకాలను నూతన ప్రయోగాలతో ప్రదర్శించారు. రావూజీ, అత్తిలి కృష్ణారావు, అచ్యుతరామరాజు, కే. వెంకటేశ్వరరావు, సత్యానంద్, మిశ్రో, కృష్ణచైతన్య, కాశీ విశ్వనాథ్, వంకాయల, విజయలక్ష్మి మొదలైన నటీనటులూ రచయితలూ విశాఖ నాటకరంగాన్ని వెలుగొందజేశారు.

అదేకాలంలో హైదరాబాదునుంచి ఆర్.వి.ఎస్. రామస్వామి, భానుప్రకాష్, శ్రీరంగం శ్రీధరాచార్య మొదలైనవారు ఎన్నో నాటకాలను ప్రదర్శించి పరిషత్తుల్లో బహుమతుల్ని అందుకున్నారు. అటు ఢిల్లీలో దక్షిణ భారత నటీనట సమాఖ్యద్వారా టి. రామచంద్రరావు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, కే. వెంకటేశ్వరరావు మొదలైనవారు ఎన్నో నాటక నాటికలను ప్రదర్శించి, రాష్ట్రేతరాంధ్ర ప్రజల్లో చైతన్యాన్ని కలిగించారు. తెన్నేటి విశ్వనాథం, కె. యల్.రావు – రైల్వేఆఫీసరు రామం – బెజవాడ గోపాలరెడ్డి

మోతే వేదకుమారి మొదలైనవారు నటీనట సమాఖ్యకు వెన్నెముకగా నిలిచారు.

## రాయలసీమలో:

ఇక రాయలసీమలో – అనంతపురం, ప్రొద్దుటూరు, కర్నూలు, తిరుపతి, కడప, గుంతకల్ మొదలైన ప్రాంతాల్లోకూడా ఔత్సాహిక నాటక సమాజాలూ, పరిషత్తులూ పని చేశాయి. ఆంధ్రలో జరిగినంత నాటకరంగాభివృద్ధి రాయలసీమలో జరగలేదనే చెప్పాలి.

నాటకరంగంకోసం కాజవెంకట రామయ్య, ఎల్జోజు మాధవాచార్యులు, దుక్కిపాటి మధుసూదనరావు, పసల సూర్యచంద్రరావు, పోలవరపు ప్రకాశరావు, వేమూరి ఆంజనేయశర్మ, పురుషోత్తమశాస్త్రి, శ్రీనివాస చక్రవర్తి, యజ్ఞన్న శాస్త్రి, మిక్కిలినేని సూరిశాస్త్రి, పి.యస్.ఆర్. అప్పారావు, సీతారామారావు, బి. కృష్ణంరాజు, గోవిందు చౌదరి మొదలైన ఎందరో కళామూర్తులు సేవ చేశారు.

## వివిధ పరిషత్తులు:

వివిధ పరిషత్తులూ, నూతన సాంఘిక నాటకాలూ, రకరకాల ప్రయోగాలూ నాటక రంగంలో నూతనోత్తేజం కలిగించాయి. ఆ కాలంలో విజయనగరంలో రాఘవ నాటకోత్సవాలూ, గూడూరు సంస్కృతీ సమ్మేళనం రాజమండ్రి లలిత కళాసమితి, గొల్లప్రోలు కొప్పరపు సుబ్బారావు నాటక కళాపరిషత్తు, ఆంధ్రనాటక కళాపరిషత్తు, ప్రొద్దుటూరు రాయల నాటక కళాపరిషత్తు ఇలాంటి నాటక పోటీలు ఆధునిక నాటక రంగానికి ప్రాణంపోశాయి. కొంతమంది నాటకరంగ పరిజ్ఞానాన్ని అభ్యసించారు. దర్శకులు తయారయ్యారు. నటులు నట శిక్షణను నేర్చుకున్నారు. పట్టణాల్లో కూడా సాంఘిక నాటకాలను చూడటానికి ప్రేక్షకులు ముందుకు వచ్చారు. రంగాలంకరణలో, కాంతి ప్రసరణలో, ప్రదర్శనా పద్ధతుల్లో కొత్త పోకడలతో సాంఘిక నాటకాలను ప్రదర్శించి, ఒక కొత్త స్పృహను కలిగించారు.

## సాంఘిక నాటకాలు:

అలాంటి నాటకాలు ఎదురీత, పునర్జన్మ, కీర్తిశేషులు, రాగరాగిణి, యన్.జి.ఒ, భయం, కాళరాత్రి, దొంగవీరడు శ్రీరంగనీతులు, ఇన్‌స్పెక్టర్ జనరల్, నిజరూపాలు, తరంగాలు, కొడుకు పుట్టాల, కళ్ళు, సంఘం చెక్కిన శిల్పాలు, మళ్ళీమధుమాసం, మరో మొహెంజొదారో, ఆర్తి, కుక్క, తరంగాలు, క్షీరసాగర మధనం, లాటక్కింతయులేదు, లేడి పంజా, కోహినూర్, గాలివాన, తుఫాన్, సంధ్యాఛాయ, ఆకాశ రామన్న, సంధ్యారాగంలో శంఖారావం, ఊరేగింపు, గారడి, పలుకే బంగారమాయె, ఊరుమ్మడి బ్రతుకులు, సర్పయాగం, సమాధానం కావాలి, నాతిచరామి, ప్రెసిడెంటు పట్టయ్య, తాజీ, మాట తప్పకు, చైర్‌మన్ అసామి, మాభూమి, ముందడుగు, పరివర్తన, ఈనాడు, పోతుగడ్డ మొదలైన నాటికా నాటకాలు ఆంధ్రదేశంలో ఎంతో పేరు తెచ్చుకున్నాయి.

## సాంఘిక నాటక రచయితలు:

గురజాడ కన్యాశుల్కం, కాళ్ళకూరివారి చింతామణి, మధుసేవ, వరవిక్రయం, కాలేజిగరల్, ప్రేమలీల, రంగూన్ రౌడి మొదలైన సాంఘిక నాటకాల తరువాత ఈ నలభై సంవత్సరాలలో కొండముది గోపాలరాయశర్మ, భమిడిపాటి రాధాకృష్ణ, ఆచార్య ఆత్రేయ, కొప్పుపాటి, సోమంచియజ్ఞన్న శాస్త్రి, అనిసెట్టి, పినిశెట్టి మల్లాది, నరసరాజు, బెల్లంకొండ రామదాసు, యన్.ఆర్. నంది, గొల్లపూడి మారుతీరావు, కాశీవిశ్వనాధ్ , దీన్‌బద్రూ, జాన్‌సన్, గణేశ్‌పాత్రో, వి.ఆర్. కృష్ణ, హరనాధరావు, భూషణబాబు, కారెపు అప్పలస్వామి, కొప్పరపు సుబ్బారావు, తారకరామారావు, పరచూరి బ్రదర్స్, యండమూరి వీరేంద్రనాధ్, జంధ్యాల, కె.యస్.శాయి, దాడి వీరభద్రరావు, ఆర్.వి. చలం, అత్తిలి కృష్ణరావు, అబ్బూరి గోపాలకృష్ణ, ఆర్.వి.యస్. రామస్వామి, తణికెళ్ళ భరణి, కె. చిరంజీవి, కప్పగంతుల మల్లికార్జునరావు, కొర్లపాటి శ్రీరామమూర్తి, సి.యస్.రావు పులిగొండ్ల రామకృష్ణయ్య, కొండేటి సుబ్రహ్మణ్యం మొదలైన వారెందరో ఎన్నో గొప్ప నాటకాలను రచించారు.

## నూతన ప్రయోగాలు:

ప్రదర్శనంలో అనేక మార్పుల్ని తీసుకువచ్చారు. అస్తవ్యస్తంగా వున్న ఆనాటి నాటకరంగ స్థలాలకు అనుగుణంగా నాటక రచనలోనే మార్పును తీసుకువచ్చారు. అంకాలను, రంగాలను తగ్గించుకున్నారు. స్త్రీ పాత్రల కరువువల్ల, రచనలో స్త్రీ పాత్రల్ని తగ్గించి నాటకాలను వ్రాసుకున్నారు. ఆర్కెస్ట్రాను భరించలేక, పద్యాలనూ పాటలనూ తీసివేశారు. వీలైతే రంగస్థల హంగులు పెద్దగా లేకుండా, ఒకేతెర మీద స్వల్ప మార్పులతో నాటకాలను ప్రదర్శించారు. రంగస్థల పరికరాలు ఎక్కువలేకుండా సింబాలిక్‌గా రంగస్థలాన్ని మలుచుకొన్నారు. ఇలాంటి మార్పులతో ఎన్నో నాటక సమాజాలు నాటకాలను ప్రదర్శించాయి.

## క్రమశిక్షణ, కట్టుబాట్లు:

ఎందరో మహానుభావులని త్యాగరాజన్నట్లు ఈ నలభై సంవత్సరాలలో, ఔత్సాహిక నాటకరంగాన్ని బ్రతికించటానికి అహర్నిశలూ ఎందరో నిస్వార్థంగా పని చేశారు. ఆనాటి పరిషత్తులూ, నటీనటుల వుత్సాహమూ, పట్టుదలా, క్రమశిక్షణా, ఆదర్శమూ, ఆశయ సాధనా నాటకరంగాన్ని వున్నత శిఖరాల నధిరోహింపచేసింది.

సాంఘిక నాటకాలే లేకపోతే ఔత్సాహిక నాటకరంగమే లేదు. అలా సాంఘిక నాటకాలను సామాజికస్పృహతో, సంఘచైతన్యంకోసం, సృజనాత్మకంగా ఎంతోమంది అభ్యుదయ భావాలతో నాటకాలు వ్రాశారు. వారందర్నీ ఒకసారి గుర్తుచేసుకోవడం అవసరం.

## నాటక శిక్షణ:

ఈ కాలంలో నాటక కళాభివృద్ధి కొరకు థియేటర్ ఫెడరేషన్ విజయవాడలోనూ, రాజమండ్రిలోనూ తాత్కాలిక నాటక కళాశాలలను నిర్వహించి యువ నటులలో సిద్ధాంత పరిజ్ఞాన వ్యాప్తికి తోడ్పడ్డది. 1938 సంవత్సరంలో బందాకనకలింగేశ్వరరావు ఏలూరులో నాటక పాఠశాలను నెలకొల్పి, చాలమంది నటీనటులకు సిద్ధాంత పరిజ్ఞానం కలిగించారు. నటన, ప్రయోగ విధానాలలో శిక్షణ యిచ్చి నాటక కళకు సేవ చేశారు.

1967 లో విజయవాడలో శ్రీనివాసచక్రవర్తి ప్రిన్సిపాల్‌గా కొద్దికాలం నాటక శిక్షణ కళాశాల నడిచింది.

## కొందరు రచయితలు - నటులు:

రచయితలు నూతన ప్రయోగాలు ప్రారంభించారు. ఆకాలంలో నార్లవారి కొత్తగడ్డ నాటికల సంపుటి వెలువడింది. అది రచయితలకూ, నటులకూ కొత్తవూపునిచ్చింది. కొండముది గోపాలరాయశర్మ, ఆత్రేయ, పినిశెట్టి, మల్లాది, కొప్పరపాటి, ప్రఖ్య శ్రీరామమూర్తి, కొడాలి గోపాలరావు, మొదలైన నాటక రచయితలు ముందుకొచ్చారు. గరికపాటి రాజారావు, రామచంద్ర కాశ్యప, పెరుమాళ్ళు, మాచినేని, నరసరాజు, ఆత్రేయ, మిక్కిలినేని, మల్లాది, రమణారెడ్డి, గాడేపల్లి, టి.జి. కమలాదేవి, సురభి బాలసరస్వతి, వెంపటి మొదలైన ఎందరో ఔత్సాహిక నటీ నటులు రంగస్థలమెక్కి విజయవంతులయ్యారు. ఆ తరువాత ఎందరో నాటక రచయితలూ, నటులూ కొల్లలుగా వచ్చారు. ఆ తరాల వారితో ఎందరో మహనీయులు భౌతికంగా నిష్క్రమించినా నాటకరంగానికి వారి సేవ మరువరానిది. స్థలాభావంతో వారందర్ని ఉదహరించలేకపోతున్నాను. ఈ నాటకరంగ పునరుజ్జీవనానికి కారణం ఔత్సాహికుల కృషి - పరిషత్తు సాంఘిక నాటకాల పునరుద్ధరణకు పీఠంగా నిలబడింది.

## ప్రసిద్ధ నటులు:

ఈ నాటకాల్లో పాత్రలు ధరించి, ఆ పాత్రలకు ప్రాణం పోసి, రచయిత వ్రాసిన నాటకానికి న్యాయం కలగజేసి, ఆయా పాత్రల్లో జీవించిన మహాకళాకారులు ఎందరో వున్నారు. గుర్తువచ్చిన కొందరి పేర్లను పేర్కొంటున్నాను. కె. వెంకటేశ్వరరావు, కొడాలి ఆదిశేషయ్య, పి.హెచ్. కృష్ణమూర్తి, రామన్నపంతులు, సోమయాజులు, రమణమూర్తి, రావుజీ, ఆర్.వి.చలం, కె.వి. నాగేశ్వరరావు, చాట్ల శ్రీరాములు, జి.యస్.ఆర్.మూర్తి, అట్లూరి బలరాం, శ్యామసుందర్, డి.యస్.యన్. మూర్తి, గరిమెళ్ళ రామమూర్తి, కృష్ణచైతన్య, కాశీ, మిశ్రో, మిక్కిలినేని, జవ్వాది రామారావు, ఎ.ఆర్. క్రిష్ణ, మాచినేని, దేశిరాజు జగన్నాథరావు, పట్టాభి, వంకాయల, వెంపటి, భానుప్రకాష్, శ్రీకాంత్ వర్మ, వీరభద్రరావు, నిర్మల, వాణీబాల, అన్నపూర్ణ, సరోజిని, సీతాలత, పద్మలత, ఉషాబాల, శకుంతల, విజయలక్ష్మి, ఉమ, బృంద మొదలైన ఉత్తమ నటీనటులు ఎన్నో నాటకాలలో పాత్రలను జీవింపచేశారు.

## అభ్యుదయ కళాశీలురు:

ప్రజానాట్యమండలి రంగస్థలం మీద ప్రగతిశీల వుద్యమంలో కోగంటి, కోడూరి, రాజారావు, మాచినేని, ఉమామహేశ్వరరావు, పెరుమాళ్ళు, కుటుంబరావు, మిక్కిలినేని, నాజరు, రామకోటి, అచ్చయ్య, మోహన్‌దాసు, టి.చలపతిరావు, వల్లం నరసింహారావు, మిక్కిలినేని, సీత, రాజమ్మ, రాధ, అన్నపూర్ణమ్మ మొదలైనవారంతా అహోరాత్రులు కృషి చేశారు. అలా నాటక ప్రయోజనానికి కొత్త అర్థం చెప్పింది ప్రజానాట్యమండలి.

## ఏది ఏమైనా...

ఏదిఏమైనా ఈనాడు ఆధునిక నాటకరంగంలో చెప్పుకోదగినంత పురోభివృద్ధి కానరావటం లేదు. అందుకు ముఖ్యకారణము సినిమా అభివృద్ధి. ఈనాడు ప్రజల వినోదానికి పట్టుకొమ్మగా నిలబడింది సినిమా ఒక్కటే. అందువల్ల నాటక రంగానికి ఆదరణ తగ్గిపోయింది. ఈనాడు నటులు ప్రదర్శించుకోటానికి ఆంధ్రదేశంలో తగిన రంగస్థలమే లేదు. అన్నీ సినిమాహాల్సుగా మారిపోయాయి. పరిషత్తులలో మినహా సాంఘిక నాటకాలకు ఆదరణ లేదు. అందువల్ల ఔత్సాహిక నాటక రంగంలో చెప్పుకోదగినంత అభివృద్ధి కనిపించడం లేదు. ఎంతోమంది రచయితలు ఎన్నో అభ్యుదయ సాంఘిక నాటకాలనూ, నాటికలనూ, రచిస్తున్నారు. అనేక ఔత్సాహిక నాటక సమాజాలు, నటీనటులున్నారు. కావలసినంత ఉత్సాహమూ ఉంది. కాని ప్రజాదరణా, ప్రభుత్వ ఆదరణా తక్కువగా ఉంది. ప్రక్కనున్న తమిళ నాటక రంగంతో మన నాటక రంగాన్ని పోల్చినట్లయితే మనం ఎక్కడున్నామో అర్థమౌతుంది.

అయితే, ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఫిలిం అభివృద్ధి కార్పొరేషన్ అన్ని జిల్లా ముఖ్య కేంద్రాలలో నాటక రంగస్థలాలను నిర్మించాలనే బృహత్తర కార్యక్రమాన్ని చేపట్టింది. ఇందువల్ల నాటక రంగానికి మంచి ప్రోత్సాహం లభించవచ్చు.

ఈనాడు ఆంధ్రదేశంలో ఇంకా విరివిగా పౌరాణిక పద్యనాటకాలను వృత్తినటులు ప్రదర్శిస్తూనే ఉన్నారు. వేల కువేలు కలెక్షన్స్ కూడా వస్తున్నాయి కాని, నాటకాలు మాత్రం పేలవంగా వుంటున్నాయి. అందుకు కారణం పాండవోద్యోగం ప్రదర్శిస్తే ముగ్గురు కృష్ణులు, ముగ్గురు అర్జునులు; చింతామణి ప్రదర్శిస్తే ముగ్గురు చింతామణులు, ముగ్గురు సుబ్బిశెట్టులు. ఈవిధంగా ప్రదర్శిస్తే తప్ప కలెక్షన్లు రావటం లేదు. కేవలం పద్యాలుపాడి వన్సుమోర్లతో ప్రేక్షకులను తృప్తిపరుస్తున్నారు. ఈ విధానం వృత్తి నాటక సమాజాలకు చరమాంకమే.

ఈనాడు అక్కడక్కడ కొన్ని ఔత్సాహిక నాటక సమాజాలు కొన్ని ఉత్తమ సాంఘిక నాటకాలను సృజనాత్మకంగా ప్రదర్శిస్తున్నాయి. అందుకు ఆ సమాజాలనూ, నటులనూ అభినందించవలసిందే. ఏది ఏమైనా ఆధునిక నాటక రంగ పురోగమనంలో ఆశకంటే నిరాశే ఎక్కువగా కనిపిస్తూంది.

## నా విజ్ఞప్తి

ఎందరో ఈ నాటక రంగానికి సేవ చేశారు. ఈ నలభై సంవత్సరాలలో అందర్ని నా యీ వ్యాసంలో ఉదాహరించకపోవచ్చు. కొందరి పేర్లే వచ్చివుండవచ్చు, కావాలని ఏ కళాకారులను విస్మరించలేదు. ఏ చిన్న తప్పు జరిగినా అది నాదే. అందరూ అమృత హృదయంతో నన్ను అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాను. ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు!

"అన్యాయం మీద ధ్వజమెత్తడం
అసమ్మతి చూపడం మా పని.....
కొండ శిఖరాలైనా ఢీకొని ఘోరంగా పోరాడవలసిందే
అడవుల్లో ఆకలములు తినైనా అగ్ని ధారలు
కురిపించాల్సిందే." – కుందుర్తి

# నాటక రంగంలో కొత్త ధోరణులు

డా॥ చాట్ల శ్రీరాములు

క్రీ.శ. 1880 సం॥లో కందుకూరి వీరేశలింగం గారి "వ్యవహార ధర్మబోధిని" మొట్టమొదటి ఆధునిక నాటకంగా పరిగణింపబడుతోంది. ఈ నాటకం సంఘంలోని దురాచారాలను వ్యంగ్యంగా విమర్శించింది. అంటే – తెలుగులో ఆధునిక నాటకం సంఘసంస్కరణోద్దేశ్యంతో మొదలయింది. అదే సమయంలో ధార్వాడ నాటక సమాజాలు ఆంధ్రదేశంలో పలుచోట్ల ప్రదర్శనలివ్వడంవల్ల, అప్పటికే ఇంగ్లీషు విద్యా ప్రభావం పెరగడం వల్ల ఆంధ్రదేశం అంతటా నాటకాలు ప్రదర్శించాలనీ, చూడాలనీ ఉత్సాహం పెరిగింది. ఈ ప్రారంభదశలో సాంఘిక నాటకాలు, చారిత్రాత్మక నాటకాలు, పౌరాణిక నాటకాలు; తరువాతి కాలంలో జాతీయోద్యమం ఊపందుకున్న సమయాలలో ఇవే నాటకాలని జాతీయత పెంపొందించే విధంగా అన్వయించుకుంటూ రచనలు చేసి నాటక ప్రదర్శనలు జరిగాయి.

తరువాత వృత్తి నాటక సమాజాలు మొదలయి వృత్తినటులతో పకడ్బందీగా జనాన్ని ఆకట్టుకునే విధంగా నాటకాలు తయారు చేసి ప్రదర్శించాయి. రానురాను నాటకాల్లో సంగీతం చోటు చేసుకుని సంగీత ప్రధానమైన నాటకాలు వచ్చాయి. వృత్తి నాటక సమాజాలు మూలపడ్డాక పద్యం పాడగల నటుల్ని నలుగుర్ని చేర్చి నాటకాలు ప్రదర్శించి కంట్రాక్టరు బాగుపడ్డాడు. ఈ విధంగా నాటక ప్రయోగం నానాటికీ దిగజారుతున్న సమయంలో ఆంధ్ర నాటక కళాపరిషత్తు నాటక పునరుజ్జీవనానికి నడుంకట్టింది. అదేసమయంలో ప్రజా నాట్యమండలి, నాటకాల ద్వారా జానపద కళారూపాల ద్వారా ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యడానికి ఉపక్రమించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కీ.శే. కె.వి. గోపాల స్వామిగారు ప్రయోగాత్మక నాటక రంగాన్ని ప్రారంభించి, విద్యార్థి దశలో యువకులు నాటక రంగం ఎడల మక్కువను పెంపొందించుకోవడానికి బాటలు వేశారు. అయితే, ఆంధ్ర నాటక కళాపరిషత్తు మొదలుపెట్టిన పోటీ నాటక ఉద్యమం యీ నాటికీ కొనసాగుతోంది. కాని, ప్రజా నాట్యమండలి ప్రారంభించిన ప్రచార నాటకోద్యమం, జానపద కళారూపాల ఉద్ధరణ, ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రయోగాత్మక నాటకరంగం తరువాతి కాలంలో మరుగునపడ్డాయి. ఆంధ్ర నాటక కళాపరిషత్తుతో ప్రారంభమై చిలవలు పలవలుగా అభివృద్ధి చెందిన పోటీ నాటక రంగం, ఆరంగంలోని ఆర్థిక స్థితిగతులు కలిసి తెలుగు నాటక రంగానికి కొన్ని అనివార్యమైన పరిధులు ఏర్పరచాయి. ఆపరిధులు నాటక రంగాన్ని కేవలం వాస్తవికతా వాదంతో రాయబడ్డ వచన నాటకానికి పరిమితం చేశాయి. అందువల్ల తెలుగు నాటక ప్రయోగంలో కొత్త ధోరణులు వచ్చే అవకాశం, వాతావరణం లేకపోయింది. అంతమాత్రంచేత గత నాలుగైదు దశాబ్దాలలో కొత్త తరహా నాటకాలు రాకపోలేదు. అయితే, ఆ రూపభేదం ఛాయా మాత్రంగా కనిపిస్తుంది. కాని, తెలుగు నాటకం మాత్రం వాస్తవిక పరిధిని దాటి ముందుకు పోలేకపోయింది.

1940 వ దశకం నుండి మొదలైన యీ పోటీ నాటకాల్ని పరిశీలిస్తే వీటిల్లో తొంభైశాతం వాస్తవిక నాటక కళారూపాలే అయినా, ఆ "వాస్తవికత" కూడా పరిమిత పరిధుల్లోనే కనిపిస్తుంది. వృత్తి నాటక సమాజాలు మూతపడి, వృత్తి నాటక కళాకారులు పలచబడినప్పటినుండీ తెలుగు నాటకం ఔత్సాహికుల మీద ఆధారపడింది. ఈ ఔత్సాహికులకున్న పరిమిత వనరులతో నాటకాన్ని పైవూరికి తీసుకెళ్ళి ప్రదర్శించాలంటే పూర్తి "వాస్తవికత" తెలుగు నాటకంలో అస్వాధమే అయింది. అందువలన వాస్తవికత వీలున్నంత మేరకే అనుసరించడం జరుగుతోంది. (ఉదా॥ మూడు నల్ల తెరలకి రెండు కేలండర్లు తగిలించి, తాహాతు మేరకు 3 కుర్చీలు లేదా ఒక సోఫా సెట్‌వేసి దాన్నే డ్రాయింగ్

రూమ్‌గా ఊహించుకోమంటాం). అదే విధంగా మూడు గంటల నాటకంలో కూడా ఒక స్త్రీ పాత్రే వుంటుంది. పురుష పాత్రలు కూడా వీలైనంత తక్కువగా వుండాలి. లేకపోతే ప్రయాణపు ఖర్చులు పెరుగుతాయి. ఇటువంటి వాస్తవికత మన తెలుగు నాటకాలకే చెల్లింది.

అయితే, యీ పోటీ నాటకపరిధిలోనే కొన్ని కొత్త ప్రయోగాలు జరిగాయి. ఉదాహరణకి, మన సంస్కృత రూపక లక్షణాలు, బ్రెఖ్ట్ ప్రదర్శనాశైలిలో కనిపించే మూకాభినయ ప్రక్రియ. ఈ ప్రక్రియతోపాటు నటుడ్ని "ఫ్రీజ్" చేసి కథా గమనాన్ని సూత్రధారుడు తెలియజేసే ప్రక్రియని మొట్టమొదటి సారిగా వాడిన నాటకం "మరో మొహెంజొదారో". రచయిత యన్.ఆర్.నంది. ఈ ప్రక్రియ తెలుగు నాటకంలో ఓ కొత్త వరవడి సృష్టించడమే గాకుండా ప్రయోక్తకి ప్రదర్శన సౌలభ్యం పెంచింది. ప్రేక్షకుడి ఆలోచనా పరిధిని విస్తృత పరచింది.

భారతీయ నాట్యసంఘ అనుబంధ సంస్థగా ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం అధివాస్తవికతా వాదంలో శ్రీ శ్రీ లఘునాటిక "విదూషకుడి ఆత్మహత్య," కుందుర్తివారి కవితా నాటకం "ఆశ," జి.వి. కృష్ణారావుగారి నవల "కీలుబొమ్మలు"ని నాటకంగా ప్రయోగం కాక, తెలుగులో మొట్టమొదటిసారిగా ఒక అనిబద్ధ నాటక ప్రయోగం (Theatre of the Absurd) "సంరక్షకుడు" ద్వారా నాటక రంగంలో కొత్త ధోరణులను ప్రవేశ పెట్టింది. నాట్యసంఘం తెరమరుగయ్యాక ఆ నాట్యసంఘ సూత్రధారి పద్మభూషణ్ ఎ.ఆర్.కృష్ణ దర్శకత్వంలో ఉన్నవ లక్ష్మీనారాయణగారి నవల "మాలపల్లి" "జీవనాటకం"గా రూపుదిద్దుకుంది. పన్నెండు రంగస్థలాల్లో ఏకకాలంలో "జీవితం"లాగా "నాటకం" సాగిపోవడం అన్నది యీ ప్రయోగం ద్వారా ప్రజలకు అందించడం జరిగింది.

1973 వ సం॥రంలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక ఏకాడెమీ చాట్ల శ్రీరాములు నిర్దేశకత్వంలో "థియేటర్ వర్క్‌షాప్" నిర్వహించడంతో నాటక రంగంలో వర్క్‌షాప్‌ల నిర్వహణ ద్వారా ఔత్సాహికుడికి నాటక రంగంలో విద్యాబోధన చేసే పద్ధతికి నాందీ వాక్యం పలికింది. ఆరువారాల పాటు నడిచిన యీ వర్క్‌షాప్‌లో 40 మంది నటులూ, సాంకేతిక నిపుణులూ సుశిక్షితులు కావడమేగాక అబ్బూరి గోపాలకృష్ణ రచన "త్రిజాకీ యమదర్శనం"తో బ్రెఖ్ట్ అవాస్తవికశైలి (తాదాత్మ్య విఛ్ఛిత్తి)లో కొత్త నాటక ఒరవడిని ప్రవేశ పెట్టడం జరిగింది. ఈ నాటకం ఓ ఆధునిక యక్షగానం.

వాస్తవికశైలిలోనే గాక విభిన్న ప్రయోగాలు చేసినవారిలో యండమూరి వీరేంద్రనాథ్ ఒకరు. ఈయన రచనల్లో ప్రముఖంగా చెప్పుకోతగినవి అభివ్యక్తి వాదంలో "కుక్క", అనిబద్ధ రూపకం "నిశ్శబ్దం నీకూ నాకు మధ్య," ఐక్యత్రయ సూత్రాల్ని అధిగమించి రాసిన "రుద్రవీణ" మొదలైనవి. బ్రెఖ్ట్ నాటకాలు జర్మనీలోనే గాక, ప్రపంచవ్యాప్తంగా ప్రయోగరీత్యా సంచలనం సృష్టించాయి. మామూలు మనిషిని ఆలోచింపజేశాయి. అయితే ఆయన రాసిన ("Exceptions and the Rule") అనే నాటకం మినహాయించి తెలుగులో ప్రయోగంగా మరే నాటకం వెలుగులోకి రాలేదు. ఈనాటకాన్ని "లాఒక్కింతయులేదు" అన్న పేరుతో రచయిత డి. ప్రభాకర్ స్వేచ్ఛానుసరణ చేశారు.

ఆధునిక వీధినాటకానికి ఆంధ్ర విశ్వవిద్యాలయ నాటక శాఖ ద్వారా అత్తిలి కృష్ణ నాందీ వాక్యం పలకగా, నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా వారు విశాఖపట్నంలో నిర్వహించిన నాటక శిక్షణా శిబిరం (1979–80)లో బాదల్ సర్కార్ ఊరేగింపు '(తెలుగు అనువాదం అత్తిలి పద్మావతీ కృష్ణ)' ప్రదర్శనద్వారా యీ బాటను పటిష్టం చేశారు. ఆధునిక వీధి నాటక చరిత్ర యిక్కడ మొదలై, యీనాడు చెప్పుకోదగ్గ రచనలు "పెద్ద బాలశిక్ష" (ఆకెళ్ళ సత్యనారాయణ మూర్తి) "గోగ్రహణం" (తనికెళ్ళ భరణి) లాంటివి అనేకం వచ్చాయి. ప్రజల సమస్యల గురించి రాయబడి, పోటీ నాటికలతో ప్రమేయం లేకుండా ప్రజల మధ్య ప్రదర్శించబడ్డ తెలుగు నాటకాలు యివే అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

నిరక్షరాస్యత నిర్మూలించడానికి అక్షరజ్యోతి వారు ఆంధ్రప్రదేశమంతటా వీధి నాటకాలు ప్రదర్శించి మంచి ప్రయోజనాలను సాధించారు. అయితే, యిందులో అనేక మంది ఆధునిక వీధి నాటక ప్రక్రియని సరిగ్గా అర్థం చేసుకోక, ఆ ప్రయోగం ద్వారా కావలసిన ప్రయోజనాన్ని సాధించలేక పోయారు. అలాగే ప్రదర్శన శాలల్లో ప్రయోగించడానికి నిర్దేశించిన అనేక నాటకాల్ని నాలుగు రోడ్ల కూడలిలో వీధినాటికగా ప్రదర్శించిన సందర్భాలూ వున్నాయి. డాక్యుమెంటరీ థియేటర్ ఆంధ్రదేశంలో ప్రాచుర్యం పొందలేదు. ఈ కోవలో జరిగిన ఒక ముఖ్య ప్రయోగం డి. యస్. యన్. మూర్తి చేసిన "నూరేళ్ల తెలుగు నాటక రంగం." అదే విధంగా "నన్నయ భారత రచన" టి.జె. రామనాథం దర్శకత్వం వహించిన మరో డాక్యుమెంటరీ నాటకం.

జానపద కళారూపాలను ప్రస్తుత సామాజిక అవసరాలు, పరిస్థితులకి అన్వయిస్తూ ప్రజల్ని చైతన్యవంతం చేసే ప్రయత్నం ఆనాడు ప్రజానాట్యమండలి చేసింది. అయితే, పోటీ నాటక పరిషత్తు ఉద్యమ ప్రభావంలో యీ ప్రయత్నం తెరమరుగయిపోయింది. ఒక దశాబ్దం క్రితం కేంద్రీయ సంగీత నాటక ఏకాడెమీ "నాటక రంగంలో యువదర్శకులకు ప్రోత్సాహం" అనే ఒక స్కీము ను ప్రారంభించింది. ఆనాడు యీ స్కీము ముఖ్యోద్దేశ్యం జానపద కళారూపాల్ని

ఆధునిక నాటకానికి జోడిస్తూ నాటకాన్ని సార్వజనీనంగా తయారుచేయడం; మన సంప్రదాయ కళలకూ, జానపద కళలకూ ఒక ఆధునిక ప్రయోజనం ఉందని సూచించడం.

ఈ స్కీము దక్షిణాదిలో కర్నాటక, తమిళనాడు, కేరళ రాష్ట్రాల్లో ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. ఎంతోమంది నలభై ఏళ్ళలోపు యువకులు జాతీయ స్థాయిలో దర్శకులుగా గుర్తింపు పొందారు. మరుగునపడ్డ ఎన్నో సాహిత్య కళాఖండాలు ఆధునిక నాటకాలుగా రూపుదిద్దుకున్నాయి. దురదృష్టవశాత్తూ యీ స్కీముని సరిగా అర్థంచేసుకుని తెలుగుదేశంలో నాటకాలు రచించిన రచయితలు లేరు. అంచేత దర్శకులు కరువయ్యారు. అయితే, గత పదేళ్ళలో యీ స్కీము ద్వారా వెలుగు చూసిన నాటకాలలో కొన్ని ముఖ్యమయినవి – జముకుల కథను జోడించి గిరిజనుల కష్టాలను హృద్యంగా చిత్రించిన నాటకం అత్తిలి కష్ణారావు రచన "తూర్పు రేఖలు" మొట్టమొదటి సారిగా చాట్ల శ్రీరాములు దర్శకత్వంలో ప్రయోగించబడింది. (ఈ స్కీము ప్రారంభానికి ముందే యీ ప్రయోగం జరిగింది.) తనికెళ్ళ భరణి రచించిన "గోగ్రహణం" నాటకానికి ఒగ్గుకథ కళారూపాన్ని జోడించి తల్లావఝ్ఝుల సుందరం దర్శకత్వం వహించి ప్రాంతీయ స్థాయిలో గుర్తింపు పొందగా, నడిమింటి నరసింగరావు రచన "బొమ్మలాట"లో బొమ్మలాట కళాకారుల కన్నీటి గాథల్ని హృద్యంగా చిత్రించి, దర్శకుడు లంక సత్యానంద్ జాతీయ స్థాయిలో పేరెన్నికగన్నాడు.

అలాగే ప్రభుత్వ యంత్రాంగంలోని లొసుగుల్ని వ్యంగ్యంగా చిత్రీకరించి, జానపద గీతాల్ని ప్రముఖంగా ఉపయోగించి తల్లావఝ్ఝుల శివాజీ రచించిన "మరీచిక"ను నాటకంగా మలచి ప్రాంతీయ స్థాయిలో వెలుగు చూపిన యువ దర్శకుడు ఉదయభాను.

ఈ వ్యాసం పరిధి యీ నాటి నాటక రంగంలో కొత్త ధోరణులకు పరిమితమైందని పాఠకులు గమనిస్తారని ఆశిస్తాను. ఆ కారణంగా యీ వ్యాసంలో నాటక రంగ చరిత్రను పునశ్చరణ చేయలేదు.

చివరిమాట. ఈ వ్యాసం రాసేనాటికి తెలుగు నాటకం ప్రేక్షకుడికోసం ఎదురు చూస్తోంది. టిక్కెట్టు కొని ప్రేక్షకుడు నాటకం చూడాలని ఆరాటపడుతోంది. అందుకోసం "రసరంజని" అనే సంస్థ స్థాపించి లక్షల రూపాయల వ్యయంతో "నిత్య నాటక పథకం" నెలకొల్పి ప్రపంచంలో ఎక్కడాలేని ఓ ప్రక్రియకు నాంది పలికింది. తెలుగువాడు "ఆరంభ శూరుడు"అనే నానుడి తప్పని ఋజువు చేస్తూ తెలుగు ప్రేక్షకుడు, టిక్కెట్టుకొని నాటకం చూసే ఒరవడి సృష్టించి "రసరంజని" కొత్త నాటక ఆవిర్భావానికి కృషి చేసేందుకు సహకరిస్తాడని ఆశిద్దాం.

మీ ఇష్టం ఈ ధాత్రిని
చేయవచ్చు స్వర్గంగా
చీల్చవచ్చు నరకంగా! – శ్రీశ్రీ

# జానపద కళా రూపాలు

ప్రొ॥ జయధీర్ తిరుమలరావు

ప్రస్తుతకాలంలో జానపద విజ్ఞానంలో జానపద కళల్ని అధ్యయనం చేయడం జరుగుతున్నది. ఇంత కాలం జానపద కళల అధ్యయనం అంటే కేవలం ఆ కళారూపంలో పాడే పాట యొక్క పాఠ్యం (టెక్స్ట్) లేదా సాహిత్యం పరిశీలించడమే. కాని ఆధునిక పరిశోధన పద్ధతులు అభి వృద్ధిచెందుతున్న కారణంగా కళారూపాల్ని సూక్ష్మ పద్ధతిలో విభిన్నరీతుల్లో పరిశీలిస్తున్నారు. వాస్తవమైన పాఠ్యాన్ని కాకుండా వస్తుపర రహితమైన సంగీతం, హావభావాలు, నటీనటుల సయోధ్య, ప్రదర్శన విధానం, ప్రేక్షకుల స్పందన ఇత్యాది అంశాలను ప్రధానం చేసుకుంటున్నారు. వేషధారణ, అలంకరణ, రంగస్థలం, ప్రదర్శన సందర్భాల్ని విభిన్న కోణాల్నించి పరిశీలిస్తున్నారు.

ఐతే అధ్యయన విధానం అభివృద్ధి చెందినంతగా కళారూపాల సేకరణ కొనసాగడం లేదు. గత ముప్పై ఏళ్ళ కాలంలో సంభవించిన సాంకేతిక పరిణామాల వల్ల ఆధునిక ప్రచార సాధనాలైన రేడియో, టేప్‌రికార్డర్, సినిమా, వీడియో, టి.వి., వి.సి.ఆర్ ఇత్యాదుల ప్రభావం వల్ల జానపద కళారూపాల ప్రాధాన్యం దెబ్బతింటున్నది. కళాకారుల జీవితం అడుగు స్థాయికి దిగజారి పోగా కళల పరిస్థితి వెలవెలపోతున్నది.

రాజకీయపరంగా సమాజంలోని అడుగు కులాల వారికి అభివృద్ధి కార్యక్రమాల పేరుతో కొద్దిపాటి సహకారం అందే వీలున్నప్పటికీ ఆ కింది కులాల వారిని యాచించి బ్రతికే ఆశ్రిత కులాల చేతుల్లో కునారిల్లుతున్న కళారూపాలను ఆదుకునే నాథుడు కరువయ్యాడు.

తెలుగు నేలలోని గ్రామాల్లో ఓ మూల ముఠాకక్షలు, మరోమూల రాజకీయాందోళనలు, ఓ ప్రక్క పెట్టుబడిదారీ అపసంస్కృత దాడి జానపద కళల్ని క్రుంగదీస్తున్నాయి. గ్రామీణ వ్యవస్థ, కుల వ్యవస్థలు పగుళ్ళు బారుతుంటే వాటిని అంటి పెట్టుకున్న కళాకారుల బ్రతుకుల్లో నిరాశ, నిస్పృహలు పెరిగి పోతున్నాయి. సంగీత వాద్యాలు మీటే చేతులు నగరాల్లో బరువులు మోస్తూ, రిక్షాలు తొక్కుతున్నాయి. సంచార జీవనం గడుపుతూ కళల్ని ప్రదర్శించే కళాకారులు కాంట్రాక్టు లేబర్‌గా నగరాలు దాటుతున్నారు. ఇది నేటి వర్తమాన సత్యం.

ఐతే గతం మాత్రం జానపదకళలకు గొప్ప ఊపు నిచ్చింది. నాటి నుండి నేటి దాకా జానపద కళలు ప్రజాకళలుగా రూపాంతరం చెంది సమాజానికి ఎంతో సేవ చేశాయి. అటు ఆంగ్లేయులను ఇటు జమీందార్లను నిరసిస్తూ ప్రజాకళలు కొత్తగా రూపమెత్తాయి. జాతీయో ద్యమ కాలంలో కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో జమీందారీ వ్యతిరేక పోరాటాలు, తెలంగాణా రైతాంగ పోరాటంలో ప్రజానాట్యమండలి నిర్వహణలో తదుపరి శ్రీకాకుళ పోరాట కాలం నుండి నేటి విప్లవోద్యమంలో జననాట్యమండలి దాక ఎన్నో కళారూపాలు తమ రంగు, రుచి మార్చుకొని ప్రజల మధ్యకు వచ్చాయి.

ఈ వ్యాసంలో వివిధ ఉద్యమాల దృష్టితో కాకుండా ఒక్కొక్క కళారూపం గురించి పరిశీలన చేయడం జరుగుతుంది. కళారూపాల ప్రాధాన్యత వివరించవలసి ఉంటుంది. కాబట్టి కళారూపాలు ఎలా మార్పుచెందాయో అనే విషయాలను వివరిస్తాను.

## బుర్రకథ:

జానపదుల తంబూర కథ, శారద కథ మొదలైన కళారూపాల్ని పిచ్చుగుంట్లు, జంగాలు అనాదిగా పాడు కుంటారు. ఆ కథల్లో ఒకే కుటుంబానికి చెందిన ఇద్దరు లేదా ముగ్గురు జట్టుగా ఉంటారు. ప్రధాన కథకుడు తంబూర మీటుతూ అందెలు వాయిస్తూ కథ చెబుతాడు. కథకుడికి అటొకరు, ఇటొకరు చేరి బుడికెలు వాయిస్తూ వంత పాడతారు. ఈ కథలకే తందాన కథలనీ, సమ్మెట్ల కథలని వ్యవహారంలో ఉంది.

ప్రజలలో ఈ బుర్రకథలకున్న ఆదరాన్ని గమనించి స్వాతంత్ర్యోద్యమ కాలం నుండి వీటిని వాడుకలోకి తీసుకు రావడానికి కృషి జరిగింది. అంతకు ముందు ప్రచారంలో

ఉన్న సంప్రదాయ సిద్ధమైన పద్ధతులతో కాకుండా వాటిని మార్చి ఆధునిక కథావస్తువుని తీసుకుని ఉపయోగించారు.

ఈ సంప్రదాయం 1920 ప్రాంతం కన్నా ముందునుండే ప్రారంభమైంది. చీరాల – పేరాల సత్యాగ్రహం జరిగిన వెంటనే దామరాజు పుండరీకాక్షుడు "గాంధీమహోదయం" వ్రాసి ప్రదర్శనలు ఇచ్చారు. పలనాడు, చీరాల – పేరాల సంఘటనల 'గుంటూరు గొప్ప' కళారూపంగా వ్రాశారు. వీటిని 'తందాన తానా' వరుసలోను, 'దండాలు తల్లీ' మకుటంతోను, స్త్రీకైతే 'కుశలవ మాదిరి' వరసల్లో పాడుకునేవారు. బుర్రకథల మార్పులో దీనిని మొదటిదశగా భావించవచ్చును.

జాతీయోద్యమ కాలం నుంచి ప్రచారంలోకి వచ్చిన బుర్రకథ వరసలకి మహారాష్ట్ర ప్రాంతం బుర్రకథకుల ఆహార్యం తోడైంది. ప్రధాన కథకుడు కాళ్ళకు గజ్జెలు, తలపాగా, చేతిలో రంగు రుమాలు, ధోవతి కట్టు ఇత్యాది మార్పులు వచ్చాయి. ప్రజలలో చైతన్యం తీసుకురావడం ప్రధానోద్దేశం కాబట్టి వంతలలో ఒకరు రాజకీయాలు చెప్పడానికే ప్రత్యేకించబడ్డారు. ఇతనికే "రాజకీయ వంత" అని పేరు. మరో వంత బుర్రకథని ప్రజలు ఆనందించడం కోసం, వారిని రంజింపచేయడం కోసం హాస్యం గుమ్మరిస్తుంటాడు. ఇతన్ని "హాస్యవంత" అంటారు. ఈ ముగ్గురు ఉమ్మడిగా కథ చెబుతారు. ప్రధాన కథకుడు గానమేకాకుండా నృత్యం, అభినయం చేస్తూ కథని రక్తికట్టిస్తాడు. భిక్షుక గాయకులు పాడే కథ ప్రదర్శన స్థాయి పెరిగి ఒక విశిష్ట కళారూపంగా ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూపింది.

కళని ప్రజాపరం చేయడానికి ఏర్పాటైన ప్రజానాట్యమండలి బుర్రకథని ఒక ఆయుధంగా మలచుకుంది. కృష్ణాజిల్లా దివి తాలూకాలో పెండ్యాల వెంకటేశ్వరరావు, పరుచూరి రామకోటయ్య యువజన సభల్లో బుర్రకథలు చెప్పారు. సిరివిశెట్టి సుబ్బారావు, కోసూరి పున్నయ, గోవర్ధన ఒక దళంగా గుంటూరు జిల్లాలో కాకుమాను సుబ్బారావు, దావులూరు, చింతల సూర్యనారాయణ ఒక దళంలో బుర్రకథలు చెప్పేవారు. నాజరు రంగంలోకి వచ్చాక బుర్రకథ స్వభావమే మారిపోయింది. మోటూరి ఉదయం, చింతల కోటేశ్వరమ్మ, మహంకాళి లక్ష్మి తదితరులతో మహిళా బుర్రకథ దళాలు ఏర్పడ్డాయి. బుర్రకథల రచనలో సుంకర సత్యనారాయణది అందె వేసిన చెయ్యి.

జాతీయోద్యమంలో కాంగ్రెస్ పార్టీ వారు బుర్రకథల్ని ఉపయోగించుకున్నా చెప్పుకోదగిన పేరు ప్రఖ్యాతులు రాలేదు. తెలంగాణా రైతాంగ పోరాటకాలంలో వచ్చిన బుర్రకథలు తదుపరి నిలవలేకపోయాయి.

సుంకర కష్టజీవి, తెలంగాణా, సీతారామరాజు, తిరునగరి రామాంజనేయులు, "తెలంగాణా వీరయోధులు" చెప్పుకోదగిన బుర్రకథలు. ఈ బుర్రకథలపై అటు మద్రాసు ప్రభుత్వం, ఇటు నైజాం ప్రభుత్వం నిషేధాలు విధించింది.

## వీధి భాగోతం:

వీధి భాగోతాలనే యక్షగానాలని, వీధి నాటకాలని పిలుస్తారు. వేల ఏళ్ళ నుండి ప్రజల జీవితాలకి అతి దగ్గరగా ఉంటూ వారి సంగీత సాహిత్య నృత్యాల సమ్మేళనంతో ప్రజలకు చిరపరచితమైన భాగోతాలంటే ఎంతో మక్కువతో తిలకిస్తారు. ఇందులో ద్విపదలు, దరువులు, కందార్థాలు ఉంటాయి. సూత్రధారి పాత్ర ముఖ్యమైనది. పాత్రలు తమకు తామే పరిచయం చేసుకుంటూ తాళయుక్తంగా నృత్యాభినయంతో రంగప్రవేశం చేస్తాయి.

వీధి భాగోతం ప్రదర్శనా పద్ధతులు లేదా శైలులు రెండు రకాలు. 1. కూచిపూడి పద్ధతి: శిష్టులకు దగ్గరగా ఉంటుంది. 2. జానపద పద్ధతి: గ్రామీణ ప్రజలకు ఆడి పాడి వినిపించే విధానం.

మొదటి రకం పద్ధతిలో కోగంటి గోపాలకృష్ణయ్య రాసిన "హిట్లర్ వీధి భాగోతం", 'సిమ్లా భాగోతం' చెప్పుకోదగినవి. ఇవి రెండు గ్రంథరూపంలో వచ్చాయి. తెలంగాణా రైతాంగ పోరాట కాలంలో శ్రామికజనులని చైతన్యపరచడం కోసం వీధి భాగోతాలు రాశారు. వీరిలో తిరునగరి రామాంజనేయులు, రాజారాం, సుద్దాల హనుమంతు, కాంచనపల్లి చినవెంకట రామారావు ముఖ్యులు. ఈ వీధి భాగోతాలన్నీ జానపద పద్ధతిలో ఉంటాయి.

## గొల్ల సుద్దులు:

గొల్ల సుద్దులు తెలంగాణాలో అత్యంత ప్రచారంలో ఉన్న ఒగ్గుకథలో ఒక భాగం. కురుమలకు బీరన్న ఆరాధ్య దైవం. ఈ దైవానికి సంబంధించిన కథలు చెబుతూ వాయించే ప్రధాన సంగీత వాద్యమైన "ఒగ్గు" ని వాయించడం వల్ల వీటికి ఒగ్గుకథ అని పేరు. ఒగ్గు కథలో గొల్లలకు నీతి వాక్యాలు చెప్పే గొల్ల సుద్దులు ఒక ఉపకథగా ఉంటుంది. ఈ ఉపకథలో పాడే దరువులు గొల్ల సుద్దుల్లో ప్రముఖంగా ఉంటాయి.

1940ల నుండి ఆంధ్రప్రాంతంలో బుర్రకథకు వచ్చిన వ్యాప్తి పోరాటకాలంలో తెలంగాణాలో గొల్లసుద్దులకు వచ్చింది. దీన్ని సులభంగా ప్రదర్శించ వచ్చును. గొల్లలు కట్టే ఎర్ర అంచుపంచెని మోకాళ్ళవరకు మడిచి, భుజం మీద గొంగళి వేసుకుంటాడు. కాళ్ళకు గజ్జెలు ఉంటాయి. మొలకు బిళ్ళ మొలతాడు ఉంటుంది. వంతల్ని ప్రేక్షకుల్లోంచి ఆహ్వానించడం దీని ప్రత్యేకత. గొల్ల సుద్దులు రాసిన వారిలో రాజారాం, తిరునగరి రామాంజనేయులు, సుద్దాల హనుమంతు ముఖ్యులు. వందలాది జట్లు వేలాది ప్రదర్శనలిచ్చి

ప్రజలను పోరాటోన్ముఖులను చేసిన ఘనత గొల్లసుద్దులకే దక్కుతుంది. ఒక ఎపిక్ పెర్ఫార్మెన్స్ (Epic performance) నుండి ప్రత్యేక కళారూపంగా గొల్లసుద్దులు రూపొందిన వైనం మరింత పరిశీలించవలసి వుంది.

### శారద కథ:

ఇది రెడ్డి తదితర కులాల వారిని యాచించి బతుకు వెళ్ళదీసే వీరముష్టులు మరియు జంగాలు పాడుకునే పాట. వీరు వాయించే తంబూర పేరు శారద. శారద వాద్యాన్ని వాయిస్తూ పాడే పాట శారద కథ.

ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి సంచారం చేస్తూ తిరిగే శారద గాయకులు నేటికీ చాలామంది ఉన్నారు. ఒక్కో కథని రెండు మూడు రోజులు వరసగా పాడతారు. ఒక స్త్రీ ఒక పురుషుడు గానీ, కుటుంబం లోని ఇద్దరు ముగ్గురు గాని కలసి పాడుతారు. ముఖ్యంగా చారిత్రక, సాంఘిక, పౌరాణిక కథలు గానం చేస్తారు. శారద గాయకులే తెలంగాణా పోరాటకాలంలో మరణించిన రేణిగుంట రామిరెడ్డి, చింతలాపురి రామిరెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి మొదలైన నాయకుల వీరోచిత కృత్యాలను చూసి కథలుగా మలిచారు. జానపద వృత్తిగాయకులే గానం చేస్తారు. "రేణిగుంట పోరాటం" అనే శారద కథని ప్రముఖంగా చెప్పుకోవచ్చును.

### పిట్టలదొర:

దీన్నే లత్కోరు సాబు, బుడ్డర్ ఖాన్, తుపాకిరాముడు అని పిలుస్తారు. పగటివేషాల్లో ఇది ఒక రకం. పగటి వేషాలనే పూర్వం "బహురూపాలు" అని పిలిచేవారు. వీటినే "బైరూపులు" అంటారు.

పిట్టల దొర వేషం వివిధ ప్రాంతాలలో కొద్దిమార్పులతో వేస్తారు. ఖాకీ రంగు ప్యాంటు కాళ్ళపైకి (ఒకటి కిందికి మరో కాలు పైకి) మలచుకొని చిరిగిన ఖాకి షర్టు వేసుకుంటారు. తలపై ఒక టోపి, చేతిలో కట్టె తుపాకి, మెడలో రుమాలు కట్టుకుంటాడు. మామూలు బిచ్చగాళ్ళలా కాకుండా అధికారంగా అడుక్కుంటాడు. సమాజంలోని కుళ్ళుని హాస్యధోరణిలో బయట పెడతాడు. కొద్దిమంది హాస్యానికి ప్రాధాన్యత ఇస్తారు. మొత్తానికి హాస్యవ్యంగ్యాలు కలగలిసి ఉంటాయి. ఈ రూపాన్ని తీసుకొని వేదికలమీద ప్రజలముందు కార్యకర్తలు, కళాకారులు ఎన్నో ప్రదర్శనలు ఇచ్చారు. పదిమండి ఇరవై నిమిషాలలోపు లైట్లు, సంగీతం అవసరం లేకుండా ఒకే కళాకారుడు ప్రదర్శించవచ్చును.

## క్రీడా నృత్య కళారూపాలు:

వీటిలో ధులా, కోలాటం, చుట్టకాముడు ముఖ్యమైనవి. ఈ మూడు సంప్రదాయ సిద్ధమైనవే. కాని ప్రజాపోరాటాలలో వీటిని కళారూపాలుగా తీర్చిదిద్ది వేదికలపై కూడా ప్రదర్శించారు. ప్రజలే చైతన్యవంతులై ఆడే క్రీడారూపం ఒకటి. ప్రజల కోసం కళాకారులు ఆడే కళారూపం ఒకటి వేర్వేరుగా ఉంటాయి. ఆటతో నృత్యం కలిసి ఉంటుంది.

### ధులా:

ఇది శ్రమజీవుల కళారూపం. దీన్ని ముస్లింలు జరుపుకునే పీర్లపండగ సందర్భంగా ఆడతారు. పాటతో ఆట జతకూడి ఉంటుంది. దీన్ని సామూహిక నృత్యక్రీడ అనవచ్చును. కాంపుల్లో, దళాల్లో ఉన్నవారు వలయాకారంగా నిలబడి అడుగులు వేస్తూ ఆ అడుగుల కనుగుణంగా లయబద్ధంగా పాడుతూ ఆడతారు.

### కోలాటం:

ధులా లాగే ఇది కూడా పురుషులు ఆడే ఆట. ఆంధ్రదేశం అంతటా వ్యాప్తిలో ఉంది. ఫాసిస్టు వ్యతిరేకోద్యమంలో కోలాటం పాటలు వచ్చాయి. ఈ బాణి ప్రజలది. ప్రజానాట్యమండలి కళాకారులు "మాస్కో పొలిమేరలోన" అనే పాట పాడేవారు. తెలంగాణా పోరాటకాలంలో దాన్నే "నాజి నైజాము రాజు – నల్లగొండ జిల్లాలోన" అని మార్చుకున్నారు.

### చుట్టకాముడు/ఉయ్యాల పాట:

బతుకమ్మ పండుగ సందర్భంలో స్త్రీలు పాడే పాట, ఆడే ఆట ఒక కళాత్మక ప్రదర్శనలా ఉంటుంది. బతుకమ్మ పాటల బాణినే కలుపు, నాటు, కోతల సందర్భంలోనూ పాడుకుంటారు. ఈ బాణీనే విరామ సమయంలో అవయవాల చలనాన్ని, పాటని మిళితం చేసి పాడుకుంటారు. అంటే పని పాటని విరామంలో ఆనందోత్సాహాలతో చుట్టకాముడి పాటగా పాడుకుంటారు. బతుకమ్మ పండుగలో చేసే వలయాకార నృత్యాన్ని కొద్ది మార్పులతో చుట్టకాముడు నృత్యంలో చేస్తారు. ఈ చుట్టకాముడు నృత్యం నల్లగొండ ప్రాంతంలో వెన్నెల్లో స్త్రీలు చేస్తారు.

పైన పేర్కొన్న మూడు నృత్యాల్ని సాయంకాలమో, రాత్రి పూటో ఆడుతారు.

### గానరూపకళలు:

గానం ప్రధానంగా ఉండే ప్రదర్శనని గానరూప కళలు అనవచ్చును. వీటిలో ఫకీర్లపాట, దండాగానం, బైరాగుల పాట ముఖ్యమైనవి. ఈ కళలు ప్రజానాట్య మండలిలో, తెలంగాణా పోరాటకాలంలో కళాకారులు ప్రదర్శించారు. ఫకీర్ల పాట, దండాగానం సుద్దాల హనుమంతు ఎక్కువగా ప్రదర్శించారు. బైరాగుల పాట అటు ఆంధ్ర, తెలంగాణా ప్రాంత కళాకారులు ఉపయోగించుకొన్నారు. (ప్రజాసాహితి,

ప్రజా కళారూపాల ప్రత్యేక సంచిక, జూన్ 1985 సంపుటి–8 సంచిక 11 చూడండి).

## నృత్యరూప కళలు:

నృత్యం ప్రధానంగా పాట అనుషంగికంగా ఉండే కళల్ని నృత్యరూప కళలు అనవచ్చును. ఈ కళలు వేదికపై ప్రదర్శించేవే. జానపద కళాకారులు వీటి జోలికి పోలేదు. వీటిలో గిరిజన నృత్యం, సుత్తీ కొడవలి నృత్యం, గేయ నాటిక, పాముల వాడు ప్రదర్శన ముఖ్యమైనవి.

కళింగ ప్రాంతం, తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాల్లో గిరిజనులున్నారు. వీరు వలయాకారంలో నిలిచి నడుముల చుట్టూ, భుజాల చుట్టూ చేతులు వేసుకొని లయబద్ధంగా అడుగులు వేస్తారు. తలలు వంచి ముందుకు అడుగులు వేయడం, తలలెత్తి వెనక్కి అడుగులేస్తూ ప్రక్కలకు తిరుగుతూ "రేలా రేలా రేరేలా" అని పాడుతుంటారు. వివిధ రకాలుగా (సంగీతం, సాహిత్యం, ఆహార్యం) గిరిజన నృత్యాలు చేయవచ్చును. సుత్తి కొడవలి నృత్యాన్నే "పంట సిరి నృత్యం" "సై సై నృత్యం" అంటారు. తెరవెనుక నుండి పాట, వాద్య, ధ్వని వినిపిస్తుండగా తెరముందు పురుషుడు సుత్తిని, స్త్రీ కొడవలిని పట్టుకుంటారు. పాట ముగింపులో సుత్తి కొడవలి ఆకారంగా విశ్వలంగా నిలుచోవడంతో నృత్యం ముగుస్తుంది.

కొద్దిపాటి రంగస్థల అలంకరణతో తెరముందు నటుల హావభావాలు ప్రదర్శిస్తుండగా తెరవెనుక నుండి పాట, సంగీతం వినవస్తుంది. డైలాగులు కూడా గానరూపంలో శక్తమంతంగా పాడడం దీని ప్రత్యేకత.

కళారూపాలు ఎంతో శక్తిమంతంగా ప్రజల కోసం నిలబడి చరిత్రగతిని మార్చడానికి దోహదపడినప్పటికీ వాటికి సాహిత్యంలోనూ, కళారంగంలోను ఒక ప్రామాణికమైన స్థానం కల్పించబడలేదు. విమర్శకులు, పండితులు వీటి జీవగుణాన్ని, బలాన్ని అంచనావేయడంలో విఫలమయ్యారు. వీటిపై సక్రమమైన విమర్శ రాలేదు. సరైన అధ్యయనం ఇంకా జరగవలసే ఉంది.

అటు జానపద కళాకారులు, ఇటు ప్రజా కళాకారులకి కళారంగాల్లో తమ స్థానం ఏమిటో స్పష్టంగా తెలియ కుంది. ఎన్నో బాధలకు లోనవుతున్నారు. ఆర్థికపరంగా నిలదొక్కుకోలేక పోతున్నారు. జానపద కళల్ని, ప్రజా కళల్ని భద్రపరుచుకోవాలంటే ముందు ఈ కళాకారుల్ని ఆదుకోవలసిన అవసరం ఉంది.

*జీవిస్తాం! జీవిస్తాం!*
*నవ్య జగత్తును సాధించేందుకు*
*భవ్య జగత్తును నిర్మించేందుకు*
*జీవిస్తాం! జీవిస్తాం! – శ్రీ శ్రీ*

# జానపద వాఙ్మయం

డా. నాయని కృష్ణకుమారి

జానపద వాఙ్మయం జానపద విజ్ఞానం (Folklore)లో ఒక భాగం. పురాశాస్త్రవేత్తలు (Anthropologists) జానపద విజ్ఞానంలోని అంశాలుగా పురాగాథలు (Myths), పురా కల్పిత గాథలు (Legends), జానపదకథలు(Folkatales), సామెతలు (Proverbs), పొడుపుకథలు (Riddles), కథా రహిత రూపాలు మొదలైన అంశాలెన్నిటినో గ్రహించారు. ఈ అంశాలు గేయ రూపంలోకాని, వచనరూపంలోకాని, దృశ్య లక్షణం కలిగికానీ ఉండవచ్చు. ఆయా ప్రక్రియల్ని బట్టి వాటిని జానపద గేయాలు, గేయగాథలు, జానపద వచనం, వచన కథలు, జానపద దృశ్యప్రక్రియ అని విశ్లేషించడానికి వీలు కలుగుతున్నది. వీటన్నిటిలోనూ వాడబడే భాష వ్యవహార భాషై ఉంటుంది. ఈ అంశాలన్నీ మనుష్యుడు మాట్లాడుకునే భాషయొక్క సహాయంవల్లనే రూపు దిద్దుకుంటున్నాయి. అందువల్ల వీటి సమాహార స్వరూపాన్ని భాష వ్యవహారాత్మక కళ (Verbal Art) అని పిలువవచ్చు. భాషతో ప్రమేయం లేకుండా మనుష్యుడు అనాదినుండీ ఉపయోగించే గృహపరికరాలు, వృత్తిసాధనాలు, అలంకార వస్తువులు, తిండివస్తువులు మొదలైన విషయ సమగ్రత జానపద విజ్ఞానంలో భాగమే. ఈ భాగాన్ని ప్లాస్టిక్ కళ (Plastic Art) అని వ్యవహరిస్తున్నారు. ఇంతేకాక, జానపదుల ఆచారవ్యవహారాలు, మత విధాన పద్ధతులు, మంత్రాలు, నమ్మకాలు మొదలైనవి కూడా జానపద విజ్ఞానంలో భాగాలు. ఇన్ని భాగాలలో విదితమయే మానవ జీవన చరిత్రను జానపద సంస్కృతి అని పిలుస్తున్నారు. ఈ సంస్కృతిని, వాఙ్మయాన్ని వాహికగా గ్రహించినప్పుడు, జానపద వాఙ్మయంద్వారా స్పష్టంగా వెల్లడించడానికి వీలు కలుగుతున్నది.

ప్రాచీనకాలంనుండీ అంచెలంచెలుగా, అనుస్యూతంగా, మనకు అందింపబడుతున్న సంస్కృతి యొక్క పరిణామాన్ని తెలుసుకోవడానికే ఈ వాఙ్మయాన్ని అధ్యయనం చేయవలసి ఉంటుంది. ఈ పరిణామ చరిత్రలో, ఈనాడు నవ నాగరికంగా, "శాస్త్రీయ జ్ఞానం" (Scientific Knowledge) అని మనం అనుకుంటున్న అంశం తక్కువగా కనిపించవచ్చు. నిరక్షరాస్యులు, అక్షరాస్యత తక్కువగా ఉన్నవారు, అతి నాగరిక సమాజంలో బ్రతుకుతున్నా అతి సామాన్యులుగా, సంప్రదాయంమీద మక్కువ కలవారు. వీరందరూ జానపద విజ్ఞానాన్ని రూపు కట్టించడంలో భాగస్వాములే. వీరి మాటలు, పాటలు, కథలు; వీరి నమ్మకాలు, విశ్వాసాలు; వీరు ప్రదర్శించే ప్రదర్శన కళలు; వీరు తయారుచేసే ప్లాస్టిక్ కళలు అన్నీ ఈ విజ్ఞానంలో భాగాలే. ఒక అభిప్రాయాన్ని మాటలలో, కథలలో, పాటలలో అభినయ పూర్వకంగా వ్యక్తంచేసే పైన పేర్కొన్న తరగతులకు చెందిన మనుషులు, ఆ అభిప్రాయం తాము బ్రతుకున్న కాలానికీ, జీవనవిధానానికీ సరిపోయేంత శాస్త్రీయంగా ఉండదని కూడా చూచాయగా తెలుసుకునే వారై ఉంటారు. వారు చెప్పే అభిప్రాయం, వారికి ముందు బ్రతికిన తమ వంశకర్తలయొక్క, జాతి కర్తలయొక్క, మహామనీషుల యొక్క తాము మొక్కే దేవతలయొక్క అభిప్రాయంగా, అది శిరోధార్యమైనదిగా భావించి దానిపై విశ్వాసాన్ని పెంచుకుంటారు. ఈ అభిప్రాయ ప్రసారమంతా, మౌఖికంగా, మనిషినుండి మనిషికి అందుతూ ఉంటుంది. దీనిని అధ్యయనం చేయడంవలన ప్రాచీన కాలంనుండీ ఏయే దశలలో, మానవ సంస్కృతి, ఏయే రూపాలను పొంది, పొరలు పొరలుగా పేరుకుని ఉందో పరిశోధకులకు వ్యక్తమౌతూ ఉంటుంది. ఆ ఎఱుకవలన మానవ జీవన పరిణామ దశలనూ, చరిత్రనూ అంచనా వేయడానికి వీలు కలుగుతుంది.

ప్రాక్చారిత్రక యుగంలో, నాగరిక దశకు మనుష్యుడు చేరుకోవడానికి ముందు, అతడు ఆటవిక దశను (Savagery), మోటుదశను (Barbarism) అనుభవించి ఉంటాడు. ఈ దశలలో అతని భావాలు, అతడుపయోగించిన వస్తువులు, అతని జీవన పద్ధతి అన్నీ అతడు వెలువరించిన మాటలో, పాటలో వ్యక్తమయి ఉంటాయి. అతడు నాగరికతను పొంది (Civilization) గ్రామాలలో – క్రమంగా పట్టణా లలో స్థిరనివాసం ఏర్పరచుకున్నప్పటికి, మొదటి దశా పరిణామాన్నంతటినీ తెలియజెప్పే విధంగా అతని మౌఖిక వాఙ్మయం రూపు దిద్దుకుని ఉంటుంది. దాన్నే తెలుగులో

జానపద వాఙ్మయమనీ, ఆంగ్లంలో Folk literature అనీ వ్యవహరిస్తున్నారు.

ఈ వాఙ్మయానికి, మిగిలిన నాగర వాఙ్మయంనుండి భిన్నంగా ఉండి, మనం గుర్తు పట్టగలిగే ముఖ్యమైన లక్షణాలు కొన్ని ఉన్నాయి. అవి:

1) ఈ వాఙ్మయమంతా మౌఖిక ప్రసారం కలిగి ఉంటుంది. అనగా ఇది లిపిబద్ధం చేయబడి ఉండదు. ఒక నోటినుండి మరొక నోటికి ప్రసరిస్తుంది. కనుక దీనికి స్థిర రూపం ఉండదు. ఎన్నో పాఠాంతరాలు కలిగి, బాహ్యమైన ఆకారం (Frame) మాత్రం నికరంగా ఉంటుంది. లిపిలేని అనాగరక భాషలలో కూడా ఈ వాఙ్మయాన్ని మనం చూడగలగడానికి ఈ మౌఖిక ప్రసరణమే ముఖ్య కారణం.

2) ఇది మూడు పాళ్లు గాన ద్వితీయమై ఉంటుంది. గాన గుణం మనుష్యుడు ఏ విషయాన్నయినా పాడడానికీ, జ్ఞాపకం ఉంచుకోవడానికీ అనువైన గుణం. కేవలం వచనంగా ఉన్నదానికంటే పాడబడేదాన్ని మెదడులో ముద్రించుకుని నిలుపుకోవడం సులువైన పని. మౌఖిక ప్రసారంలో ఉండే వాఙ్మయానికి స్వరబద్ధత అవసరమైన అంశం. తొలుత మౌఖిక ప్రసారం కలిగిన వేదాలు కూడా ఉదాత్తానుదాత్త స్వరితాలతో వల్లె వేయబడడం మనం గమనించవచ్చు.

3) దీనికి కర్త ఎవరో మనకు స్పష్టంగా తెలియడానికి వీలులేదు. ఇది స్వయంభువు అని చెప్పవచ్చు. అనగా ఏ పనివేళలలోనో, ఏ మతాచార విధులు నిర్వహించేటప్పుడో, తన మనస్సును కదిలించే ఉదంతాలు సంభవించినప్పుడో, మనుష్యుని భావధార పాటగా రూపు దిద్దుకుని బయటికి ప్రసరిస్తుంది. ఆ క్షణాన ఆ భావం ఒకరు చెప్పగా పదిమంది దానిని అనుసరించి, ఆవర్తించి ఉండవచ్చు. లేదా పదిమందీ కలసి, సామూహికంగా, ఒక ఆలోచన వెంట మరొక ఆలోచనను పూసలు గుచ్చిన రీతిగా పాదిగి, ఈ వాఙ్మయ స్వరూపాన్ని తీర్చి ఉండవచ్చు. అందువలన దీనిని అవిదిత కర్తృకం అన్నట్లుగానే, సామూహిక కర్తృకం అనికూడా అనవచ్చు.

4) నాగరిక సాహిత్యానికి ఉండే శాస్త్రముఖం దీనికి ఉండదు. అనగా ఇది నిసర్గ సుందరమైన అరణ్యం వంటిదేకాని, ప్రయత్న పూర్వకంగా తీర్చిదిద్దిన ఉద్యాన వనం కాదు. సాహిత్య శాస్త్రం, అలంకార శాస్త్రం, గణ యతి ప్రాసలతో కూడిన పద్య నియమాలు దీనికి పట్టవు. దీని శైలి అకృతక శైలి.

5) ఇందులో వెల్లడి అయ్యే కథాంశం, ఒక వ్యక్తికో, ఒక చారిత్రక కాలానికో కట్టుబడినదిగా కాక, ఒక పరిణామదశను వెల్లడించేదిగా ఉంటుంది. అందువలన ఈ వాఙ్మయాధ్యయనంలో మనకు స్పష్టంగా స్థలం, కాలం వంటి అంశాలు లభ్యం కావు.

6) ఈ వాఙ్మయాన్ని సృష్టించే కళాకారుడు సామాన్యవ్యక్తి. అతని జీవన పద్ధతులు సంఘంలో ఉండే సగటు మనిషి జీవనపద్ధతులై ఉంటాయి. అతని అలవాట్లు, ఆశయాలు, నమ్మకాలు, అతడు నివసిస్తున్న సంఘం నుండి గ్రహించినవే అయి ఉంటాయి. ఈ వాఙ్మయంలో సామాన్యుడు తన అనుభవాలను, ఆశయాలను, నమ్మకాలను అద్దంలో తన నీడను చూచుకున్న విధంగా చూచుకుంటుంటాడు. అందువలననే ఇది జనజీవితంలో స్థిరస్థానాన్ని పొంది, ఎప్పటికీ నశించిపోని రీతిలో నిలిచి ఉంటుంది.

పైన చెప్పిన లక్షణాలను సంక్షిప్తంగా క్రోడీకరిస్తే అవి ఇలా ఉంటాయి: 1) మౌఖిక ప్రచారం కలది. 2) గాన ద్వితీయం. 3) అవిదిత కర్తృకం. 4) శాస్త్రీయమైన కట్టుబాట్లు లేనిది. 5) స్థలకాల నిర్ణయం చేయడానికి వీలులేనిది. 6) సామాన్యుని జీవనస్థాయిని సూచించేది.

నేడు ఆంధ్రప్రదేశంలో ఉన్న జానపద వాఙ్మయాన్ని విశ్లేషిస్తే ఒక పట్టికగా అమర్చుకోడానికి వీలు కలుగుతుంది. (ముందు చూడండి)

ఈ పట్టికను బట్టి చూస్తే, మొత్తం ఈ వాఙ్మయాన్నంతటినీ మూడు శాఖలుగా విభజించవచ్చు. అవి: i) గేయశాఖ. ii) వచనశాఖ. iii) దృశ్యశాఖ.

ఈ మూడింటిలో గేయశాఖకు చెందిన జానపద కవిత్వం ఎక్కువ భాగం విస్తరించి ఉంటుంది. జానపదుని నోటివెంట గానరూపంలో వచ్చేమాట కవిత్వ లక్షణాలను రంగరించుకుని ఉంటుంది. ఈ గేయశాఖను రెండు ఉపవిభాగాలుగా విడదీయవచ్చు: 1) కథావిరహితమైన గేయశాఖ. 2) కథాసహితమైన గేయశాఖ.

(1) కథావిరహిత గేయ శాఖ: ఇందులో మనకు కనిపించే పాటలు, సామాన్యుని జీవన పద్ధతుల్ని, అతని ఆత్మాశ్రయ లక్షణాన్ని, అతని కుటుంబ జీవన సంబంధాలను ఆశ్రయించుకుని రూపుదిద్దబడతాయి. అందువలన ఈ ఉపశాఖను తిరిగి మూడు విభాగాలుగా చేయవచ్చు.

(i) శ్రామిక గేయాలు:– ఇవి సామాన్యుడు వ్యవసాయపు పనులు, వృత్తిపనులు, చేసుకునేటప్పుడు, అతని శ్రమను తగ్గించడానికై రూపుచెందే పాటలు. ఈ పాటలలో వస్తువు, వివిధ రసాలతో కూడిన అతని ఆత్మానుభూతిని వివరించేవిగా ఉంటాయి. ముఖ్యంగా శృంగారం, కరుణ ఈ పాటలలో చోటు చేసుకుంటాయి.

(ii) పారమార్థిక గేయాలు:– వీటిని శ్రమించే సందర్భంలో పాడరు కాని బిచ్చమడిగే వారు, సంసార ప్రవృత్తినుండి ప్రశమితులైన వయసుడిగిన వారు ఈ పాటలకు కర్తలు.

భజనలతో కూడుకున్న భక్తిగేయాలు; తత్త్వచింతన కలిగిన తాత్త్విక గేయాలు; గూఢార్థంతో, ప్రతీకాత్మకంగా జీవాత్మ పరమాత్మల సంబంధాన్ని సూచించే మార్మిక గేయాలు ఈ పారమార్థిక గేయాలలో కనిపిస్తాయి.

(iii) కౌటుంబిక గేయాలు:– వీటిని మళ్ళీ రెండు భాగాలు చేయవచ్చు (a) బంధుత్వాన్ని చూపించేవి. సామాన్యునికి, తన కుటుంబంలోని వ్యక్తులతో గల అనుబంధాలను తెలిపే పాటలివి. సాధారణంగా ఈ పాటలు స్త్రీలచే పాడబడినవై ఉంటాయి. తన కుటుంబ సభ్యులైన, తల్లి, తండ్రి, అత్తమామ, తోడబుట్టిన వారు, భర్త, బావ, మరిది, ఆడబిడ్డ, కడుపున పుట్టిన బిడ్డలు – వీరితో స్త్రీకి గల సంబంధాన్ని, ప్రేమను, కోపాన్ని, వాత్సల్యాన్ని తెలియజేసే పాటలివి. (b) ఆచారాన్ని తెలియజేసేవి. మనిషి పుట్టిన క్షణాన్నుండీ చనిపోయే సమయం వరకూ మానవ జీవితానికి సంబంధించిన ఆచారాలను, కర్మకాండను ఈ పాటలు తెలియజేస్తాయి. ఈ పాటలకు కూడా ఎక్కువగా స్త్రీలే కర్తలు. ఈవిధంగా కథలేని గేయశాఖలో, సామాన్య జీవన చిత్రణ ఇంత వైవిధ్యంతో కూడి ఉంటుంది.

(2) కథాసహిత గేయశాఖ: ఈ పాటలు నిడివిలో పెద్దవి. వీటిలో కథలు పొదగబడి ఉంటాయి. వీటిని పాడే సందర్భాన్నిబట్టి, వ్యక్తులనుబట్టి మూడు విభాగాలుగా చేయవచ్చు. (i) శ్రామిక గేయాలు (ii) స్త్రీల పాటలు (iii) వృత్తి గాయకుల పాటలు.

(i) *శ్రామిక గేయాలు:*– కథారహిత శ్రామిక గేయాల కువలె వీటిని శ్రమించే సందర్భాలలోనే పాడుతుంటారు. కాని, యివి చాలా నిడివి కలిగి, కథా కథనంతో కూడి ఉంటాయి. ఇందులో అద్భుత రసంతో కూడిన వీరుల కథలు, స్థానికులైన వీరుల పేరంటాండ్ర కథలు, పురాగాథలు, భారత రామాయణాది పౌరాణిక కథలు ఉండవచ్చు. వంచిన నడుమెత్తకుండా ఏకబిగిన మూడు గంటలపాటు పనిచేసేవారికి, అగకుండా సాగి శ్రమాపనోదం కలిగించే కథలివి. వీటిని గూడా ఎక్కువగా స్త్రీలే పాడుతుంటారు.

(ii) *స్త్రీల పాటలు:*– ఇండ్లలో వ్రతాలు, నోములు వంటివి నెరపినప్పుడు, తీరికగా భోజనానంతరం సాగోరినప్పుడు, పాడే కథలతో కూడిన పాటలు.

(iii) *వృత్తి గాయకుల పాటలు:*– మన దేశంలో జానపద గాయకులలో కొందరికి ఒక విశిష్టమైన ఆచారం ఉంది. కొన్ని కులాల వారిని ఆశ్రయించుకుని జీవించే మరికొన్ని కులాల వారు, జానపద కథా గేయ ప్రవర్తకులుగా కనిపిస్తుంటారు. వీరిని ఆశ్రిత జాతులు అనవచ్చు. ఉదాహరణకు గ్రామ పెత్తందారీతనం వహించే కాపులను (రెడ్లు) ఆశ్రయించుకుని పిచ్చుకుంట్లవారు కథలు పాడుతారు. కోమట్లను ఆశ్రయించి వీరముష్టివారు, విశ్వబ్రాహ్మణులను ఆశ్రయించుకుని రుంజ వారు, ఇంకా కొన్ని కులాలను ఆశ్రయించి మరికొన్ని కులాలవారు కథాగానం చేస్తారు. ఇట్లా కథాగానం చేయడం వీరికి సమగ్రమైన వృత్తి కాదు. వారి వారి వృత్తిపనులు చేసుకుంటూ, తీరిక దొరికిన వేళ తమకాశ్రయభూతులైన వారి ఉనికి పట్టులకు వెళ్ళి యాచించడం వీరికి పరిపాటి. వారి వంశగానం చేయడమే కాక, వారి కుటుంబాలలో జరిగిన జనన మరణాది విషయాలను గుర్తించి భద్రపరచడం వీరి విధాయక కృత్యం. ఆ రకంగా వీరు వంశంలోని ప్రధానోదంతాలను భద్రపరిచే వారు (Record Keepers)గా కూడా ఉంటారు. కొన్ని సందర్భాలలో వీరు భద్రపరిచిన కుటుంబ వివరాల మీద ఆధారపడి ఆ కుటుంబాలకు సంబంధించిన ఆస్తి తగాదాలను న్యాయస్థానం పరిష్కరిస్తూ కూడా ఉండేది. ఇటువంటి వారిని వృత్తి గాయకులనీ, ఆశ్రిత గాయకులనీ వ్యవహరించవచ్చు. వీరు గానం చేసే కథలు ఇతివృత్తాన్ని అనుసరించి కొన్ని స్పష్ట విభాగాలకు లోనవుతాయి. అవి : (1) వీర గాథలు (2) అద్భుత గాథలు (3) మత గాథలు (4) చారిత్రక గాథలు (5) స్త్రీ సంబంధి గాథలు.

1. ఇద్దరు వ్యక్తుల మధ్య స్పర్థనో, రెండు ఉద్యమాల మధ్య సంఘర్షణనో, రెండు రాజ్యాల మధ్య పగనో మిక్కిలి విపులంగా వర్ణించే గేయాలు వీర కథా గేయాలు. వీరులై పరాక్రమించే స్థానిక వీరుల కథలు, భూస్వాములకు రైతులకు మధ్యగల సంఘర్షణకు అద్దం పడుతూ, నాయకులుగా నిలిచి పోరాడే స్థానిక వీరుల కథలు, ఇద్దరు రాజుల మధ్య యుద్ధంగా నడిచిన కథలు మన రాష్ట్రంలో ఎన్నో వినపడతాయి.
2. బాలనాగమ్మ కథ, శివకుమారుని కథ, కాంభోజరాజు కథ వంటివి. ఇవి అద్భుత కార్యాలతో, మంత్ర తంత్రాలతో, అతి మానుష శక్తులతో కూడిన కథలు.
3. మతగాథలను మళ్ళీ రెండు ఉప విభాగాలుగా చేయవచ్చు. అందులో ఒకటి దేశ్యమైన గ్రామదేవతారాధనకు చెందిన కథలు (Little Tradition), రెండవది వేద పురాణ చోదితమై, ఆ ప్రభావంవల్ల అబ్బిన పురాణ కథలు (Great Tradition).
4. స్పష్టంగా, శాసనాలవలనా, ఇతర ఆధారాలవలన తెలిసిన చరిత్రాంశం చుట్టూ అల్లిన కథలు. ఇందులో చరిత్రాంశం స్పష్టంగా తెలియకపోయినా, అటువంటి అంశం ఉన్నదన్న విషయం అస్పష్టంగానైనా వ్యక్తమైతే అవి అస్పష్టచారిత్రక కథలు అనే ఉపవిభాగానికి లోనవుతాయి.
5. స్త్రీలు, అనేక సాంఘిక కారణాల చేత ప్రాణత్యాగం చేస్తే వారు జనుల మనస్సులలో దేవతలుగా మారి

# జానపద వాఙ్మయ స్వరూపము






కొనియాడబడతారు. అటువంటి కథలు స్త్రీ సంబంధి కథలు.

ఈ విధంగా కథ కలిగిన గేయశాఖలో ఇంత వైవిధ్యంతో కూడిన జానపద సాహిత్యం మన రాష్ట్రంలో లభిస్తుంది.

II. వచన శాఖ:– ఇందులో ఎక్కువ భాగం కథ కలిగిన భాగంగా మనకు లభిస్తుంది. ఇంతకు ముందు మనం పర్యాలోచించిన గేయశాఖలోని కథాంశమే వచనశాఖలోనూ కనిపిస్తుంది. అయితే కథాకథనం గేయశాఖలో ఎక్కువ కాలాన్ని మింగేదిగా ఉంటే వచనంలో మనకు క్లుప్తత కనిపిస్తుంది. ఇక్కడ కథ చెప్పేవారు సాధారణంగా వృద్ధులై ఉంటారు. తీరిక సమయాల్లో, పిల్లలను చుట్టూ ఉంచుకుని వారి కథల్ని చెప్పవచ్చు. ఇవి 1. పురాకథలు (Myths) 2. పురాకల్పిత కథలు (Legends) 3. నీతి కథలు (Diadectic Tales) 4. అద్భుత కథలు (Fairy tales) 5. వీరకథలు (Epics) ఈ శాఖలన్నీ ప్రత్యేకంగా, ఒక్కొక్కటీ గమనించ తగ్గవి. ఇవి కాక ఏ కథాంశమూ లేకుండా కనిపించే పొడుపు కథలు, సామెతలు, నుడికారాలు వంటి వాటిని కథారహిత వచనశాఖలో చేర్చవచ్చు.

III. దృశ్యశాఖ:– గేయమూ, కథా కలిగిన పైశాఖలతో పాటు దృశ్య లక్షణం కలిగిన శాఖ దృశ్యశాఖ. దీన్ని స్థూలంగా జానపద నాటక శాఖ అని కూడా పిలువవచ్చు. దీన్ని తిరిగి రెండు విభాగాలుగా చేయడానికి వీలుంది.

(i) మనుష్యులు తాము పాత్రధారులై ఆడే ప్రక్రియ.

(ii) మనుష్యులు తాము తెరవెనుక నుండి, బొమ్మలచేతనో, జంతువులచేతనో ఆడించే ప్రక్రియ.

మనుష్యులు ఆడే ప్రక్రియ : దీనిని స్థూలంగా నాలుగు రకాలుగా విభజించవచ్చు. 1. సామూహిక నృత్యం 2. పగటివేషం 3. వీధి నాటకం 4. యక్షగానం. ఈ ప్రక్రియలో పై విభాగం వాచికంవున్న విభాగం. సాహిత్యంలేకుండా కేవలం ఆంగిక చాలనమూ, వాద్యసహాయమూ కల ప్రక్రియకూడా ఉంది. దీనిని వాఙ్మయ స్పర్శలేని సామూహిక నృత్యం అని పేర్కోవచ్చు. గుండెతప్పెట్లు, డప్పునృత్యం, పులివేషం మొదలైనవన్నీ ఈ తెగకు సంబంధించినవి.

పగటి వేషాలకు ప్రత్యేక రంగస్థలం అక్కరలేదు. ప్రతి యింటి ముంగిలీ వేషధారి అయిన జానపద యాచకునకు రంగ స్థలమే. దాదాపు తొంభై పగటి వేషాలు ఆంధ్రదేశంలో వాడుకలో ఉన్నాయి. వీధి నాటకానికి నాలుగు రోడ్ల కూడలికానీ, గ్రామంలోని రచ్చబండకానీ రంగస్థలంగా అమరుతుంది. పౌరాణిక కథలూ, దేశ్యమైన కథలూ, మతపరమైన కథలూ ఆడబడతాయి. ఈ ప్రక్రియలో ఉపయోగించే ఏలలు, ధవళాలు, పదాలువంటి ఛందో విశేషాలన్నీ కేవలం జానపదమైనవి. వీటికి నాగరికత యొక్క వాసన తక్కువ. శాస్త్రముఖం కొద్ది. ఇవి సానపెట్టని వజ్రాలవలె అపరిష్కృత సౌందర్యంతో భాసిస్తుంటాయి. యక్షగానాలకు, పరిష్కృత లక్షణం ఉంది. నాగరికత స్పర్శకూడా ఉంటుంది. ఈ రెండు ప్రక్రియలకూ మధ్యగల తేడా చాలా తక్కువ.

మనుష్యులు ఆడించే ప్రక్రియ తిరిగి రెండు భాగాలు చేయవచ్చు: i) బొమ్మలాట. ii) జంతువులాట. i) బొమ్మలాటలో ఆంధ్రదేశంలో, మిక్కిలి ప్రశస్తి కెక్కిన ఆట తోలుబొమ్మలాట. తోలుబొమ్మలు చేయడం, వాటికి రంగులు వేయడం ఒక సాంకేతిక కళ (Technical art),గా వృత్తివిద్యగా వెనక రోజుల్లో రాణిస్తుండేది. ఆంధ్రదేశపు తోలుబొమ్మలు విదేశాలలో కూడా గుర్తింపును పొందాయి. తోలుబొమ్మలతో పాటు చెక్కబొమ్మలను, గుడ్డబొమ్మలను ఆడించడం కూడా ఉంది. ii) జంతువులాటలో గుఱ్ఱాల్ని, ఎలుగుబంట్లను, పాములను, కోతులను, గంగిరెద్దులను ఆడించి, యాచించి, పొట్టపోసుకుంటారు. అయితే ఈ జంతువులను ఆడించే ప్రక్రియలో వాచికం కొన్ని చోట్ల ఉండదు. (గుఱ్ఱమాట, పామునాట్యం.) కొన్ని చోట్ల వచన రూపంలో చాలా తక్కువగా ఉంటుంది. (ఎలుగుబంటి, కోతివగైరా.) దృశ్యశాఖలో బొమ్మలాట, గారడీ, మోడీ కట్టడం వంటివి కూడా చేర్చవచ్చు. దొమ్మరాట, గారడీలు వృత్తిపరమైనవికాగా, మోడీ, మంత్ర తంత్రాలతో కూడుకున్న కర్మకాండ (Ritual).

ఈ విధంగా ఆంధ్రప్రదేశంలోని జానపద వాఙ్మయం గేయ, వచన, దృశ్యశాఖలతోకూడి పరిపుష్టంగా విరాజిల్లుతున్న వాఙ్మయం.

# బంజారా చరిత్ర-సంస్కృతి

- గోనా నాయక్

బంజారాల చరిత్రను భిన్న ఆకరాల ద్వారా అధ్యయనం చేయవచ్చు. అందులో మొదటిది జానపదుల ఐతిహ్యాలు, రెండవది చారిత్రక ఆధారాలు.

**జానపదుల ఐతిహ్యాలు:**

శ్రీ మహావిష్ణువు మొదట భృగు, రఘు అనే ఇద్దరు మహార్షులను సృష్టించాడు. ఈ మహార్షులు ధజ్ మహారాజు, అంబాబాయిలను సృష్టించారు. వీరికి కవర్ ధజ్ అనే కుమారుడు జన్మించాడు. కవర్‌ధజ్‌కు - రాజ్‌ఫళ్, రాజ్‌ఫళ్‌కు రీమ్ పుట్టినాడు. రీమ్‌కు హాబల్, కాబల్ అనే ఇద్దరు కుమారులు పుట్టినారు. హాబల్ సంతతి హిందువులూ, కాబల్ సంతతి ముసల్మాన్‌లు (తురకలు). హాబల్ సంతతికి పుట్టిన తీడా అనే ఆయన బిడ్డలే బంజారాలు అని జానపదుల ఐతిహ్యాం వల్ల తెలుస్తుంది (ఈ ఐతిహ్యాం ప్రముఖ బంజారా రచయిత శ్రీ భూక్యా బాలాజిదాస్ గారి నుంచి సేకరించాను).

**చరిత్ర:**

రాణాప్రతాప్ మరణానంతరం నిరాశ్రయులైన ఈ జనులు బ్రతకడానికి కష్టమై కాలక్రమంలో జీవనోపాధి కోసం అడవులలోకి రావలసి వచ్చింది. చాలా కాలం అడవిలో నివసించిన వీరు, జీవనోపాధిగా పశువుల పెంపకం చేపట్టారు. దీనివల్ల ప్రతి ఒక్క కుటుంబానికి చాలినంత పశుసంపద పెరిగింది. వీరు తమ పశుసంతతితోపాటు మాతృభూమి అయిన రాజస్థాన్ పహాడ్ ప్రదేశాలను వదలి "మాళవ" వైపు పయనించారు. ఈ సమయంలో సుగాలీలు లేక లంబాడీలు తప్పనిసరిగా మొగలులకు సేవచేయవలసి వచ్చింది. వీరు మొగలు సైన్యానికి, ఆహార ధాన్యాలను, యుద్ధ సామగ్రిని సరఫరా చేసేవారు అని "షేర్ సింగ్ షేర్" అనే ఆంగ్ల కవి చెప్పారు. షాజహాన్ కాలంలో అతని వజీర్ అయిన అసఫ్‌ఖాన్ నేతృత్వంలో దక్షిణ బీజాపూర్ ఆదీఫ్‌సాహి మీద ఆక్రమణ చేయడానికి క్రీ.శ. 1630వ సంవత్సరంలో సుగాలీలు లేక లంబాడీలు మొగలు సైన్యంతో పాటు దక్షిణానికి వలస వచ్చారు. కాలక్రమంలో అక్కడే స్థిరపడ్డారు. యుద్ధ సమయంలో సైన్యానికి వీరు నిర్భయంగా ఆహార పదార్థాలు సరఫరా చేస్తుండేవారు. యుద్ధం చేస్తున్న ఏ పక్షంవారు కూడా వీరిని పీడించే వారు కాదు.

ఆ కాలంలో అసఫ్‌ఖాన్ జతకు వచ్చిన సుగాలి (లంబాడి) నాయకుడు "జంగి" వద్ద 1,80,000 పశువులు, "భంగీ" వద్ద 52,000 పశువులు ఉండేవని ఎఫ్.ఎస్. కంబర్‌లేజర్ గారు చెప్పారు. సంచార సమయంలో జంగి, భంగీ నాయకులు పశువులకు ఆహారం కోసం అసఫ్‌ఖాన్ దగ్గరికి పోయి తమ ఇబ్బందిని చెప్పుకున్నారు. జంగీ, భంగీ నాయకుల సేవలను పొందినవాడు కావున అసఫ్‌ఖాన్ వారికి సువర్ణాక్షరాలతో తామ్రఫలకం మీద అధికారాన్ని రాసి ఇచ్చాడు. అది ఇలా వుంది -

*"రంజన్ కా పాణీ*
*భప్పర్ కా ఘాస్*
*దీన్ కా తీన్ ఖీనీ మాఫ్*
*జార్ జహాన్ అసఫ్‌ఖాన్ కా ఘోడీ*
*వహాస్ భంగీ, జంగీ కాబైల్".*

ఈ తామ్రశాసనం వల్ల అసఫ్‌ఖాన్ సైనికులకు కొరత లేకుండా నిరంతరంగా ఆహారం సరఫరా చేయాలి. ఇందు వలన ఈ శాసనం బంజారాలకు ఒక రోజులో మూడు హత్యలు వరకు చేయడానికి కూడా అధికారం ఇచ్చింది. మార్గమధ్యంలో ఎవరైనా బంజారాల వద్ద వున్న ఆహార ధాన్యాలను దోచుకోవడం జరుగుతుందేమోనని ఈ అధికారాన్ని రాసి ఇచ్చాడు. బహు ధైర్యశాలులైన బంజారాల జోలికి ఎవ్వరూ వచ్చే వారు కాదు. హింగోళియా దగ్గర ఉన్న Musi అనుచోట నివసిస్తున్న భంగీ నాయకుని వంశకుల వద్ద ఇప్పటికీ ఈ తామ్రశాసనం వుంది. అందువల్ల నిజాం సర్కార్ వారిని ముఖ్య నాయకులని పిలుస్తారు. అంతేకాకుండా నాయకుని స్థానానికి వచ్చే ప్రతి ఒక్క కొత్త వ్యక్తికి నిజాం సర్కార్ గౌరవంగా బహుమతి పంపేవాడు. అదే సమయంలో ఇమోట్‌మల్ జిల్లా "యువళి" అనే

తాండాలో రామానాయక్ పటేల్ అనే అతడు ఉండేవాడు. ఇతడు జంగీ నాయకుని వంశస్థుడు. నిజాములు ఇచ్చిన అధికార ముద్ర ఇప్పటికీ హైదరాబాద్ కోర్టు ప్రవేశ ద్వారం వద్ద ఉన్న ఖిలాత్ అధికారపత్ర రూపంలో దొరుకుతుంది.

**బంజారాల మూల స్థానం:**

సుగాలీ లేక బంజారీల మూలస్థానంపై చరిత్రకారులలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. కాని వారి మూలాన్ని చూసి పట్టుకోవడంలో వారి వంశం కులం పరంపరలను గమనించడం అవసరం. రాజస్థాన్‌లోనే రాజపుత్ర గూర్జర, మాడివా మొదలగు ఉపజాతులలో కనిపించే ఆచార వ్యవహారాలు సాధారణంగా వీరిలో చూడవచ్చును.

లంబాడి, గూర్జర, మార్వాడి రాజపుత్రవంశాలలో పరస్పర సామాజిక సంబంధాలు కనిపించడం వలన ఈ వంశాలన్నీ ఒకే మూలం నుండి ఏర్పడినాయి అనడంలో సందేహం లేదు. ఈ మూడు వంశాలలోని వివాహ సాంప్రదాయాలను గమనిస్తే పెద్ద తేడాలు కనిపించవు. ఈ జాతులలో పోలికలు ఉండడం వల్ల, నిర్వివాదంగా రాజస్థాన్‌లోని రాజపుత్రులతో సంబంధం ఉందని గమనించవచ్చు. ఈ విధంగా సుగాలీలకు మూలస్థానం రాజస్థాన్ లేదా మార్వాడి అని నిర్ధారించవచ్చు.

రాజపుత్రులలో కనిపించే రాథోడ్, చౌహాన్, పమార్ మొదలైన వంశాలు మార్వాడి, గూర్జర లంబాడీలలో స్పష్టంగా గోచరించడం వల్ల రాజపుత్రులలో ఒక శాఖ ఈ లంబాడీలనడంలో ఎలాంటి సందేహం లేదు.

రాజపుత్రులలో కనిపించే ధార్మిక సంస్కారాలు, సంప్రదాయాలు మొదలైనవి ఇప్పటికీ ఈ మూడు వంశాలలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. రాజకీయ కారణంగా ఈ వంశాలు దూరప్రాంతాలకు వెళ్ళడం జరిగింది. కాని ఈ మూడు వంశాలు తమ మూల సంస్కృతిని మాత్రం సంపూర్ణంగా పోగొట్టుకోకుండా వాటిని మిగుల్చుకొని రావటం ఇప్పటికీ చూడవచ్చు. ఈ విధంగా లంబాడీలు మొదట్లో రాజస్థాన్‌కు చెందిన వారై; క్రమంగా, దక్షిణానికి వలస వచ్చి; అక్కడ కూడ సమూహాలుగా స్థిరపడ్డారని చెప్పవచ్చు. లంబాడీలకు రాజపుత్రులకు గల సంబంధాలను గురించి అనేక ఐతిహ్యాలు కనిపిస్తున్నాయి.

భారతదేశంలో మొగలుల పాలన ప్రారంభానికి ముందు కొన్ని రాజవంశాలు చిన్నచిన్న సంస్థానాలను పాలిస్తూ ఉండేవి. అలాంటి వంశాలలో రాజపుత్ర వంశం ఒకటి. వారిలో సుప్రసిద్ధుడు రాణాప్రతాపుడు. ఇతడు రాజస్థాన్, ఢిల్లీలోని కొన్ని ప్రదేశాలను పాలించాడు. అప్పటికే భారతదేశంలో ముస్లింల పాలన ప్రారంభమైంది. ఈ సమయంలో మొగల్ సామ్రాట్ అక్బర్ క్రీ.శ. 1576లో ఉదయపూర్ మీద దాడి చేశాడు. ఈ దాడిలో అక్బర్ ప్రతాపానికి తట్టుకోలేక రాణాప్రతాప్ హల్దిఘాట్ అనే ప్రాంతానికి పారిపోయాడు. ఎంతోమంది రాజభక్తిగల కుటుంబాలు అక్కడికి వెళ్ళాయి. మళ్ళీ ఆక్రమణ జరిగింది. అందువల్ల ప్రతాపుడు హల్దిఘాట్ యుద్ధంలో ఓటమిని చవి చూడవలసి వచ్చింది.

విజయుడైన అక్బర్ నీవు శరణాగతుడై వస్తే తిరిగి నీ రాజ్యాన్ని ఇస్తాను అని సందేశాన్ని పంపాడు. అప్పుడు వీర క్షత్రియ కులజుడైన రాణాప్రతాప్ ఈ సందేశానికి లోనుగాక, నేను నా శక్తి సామర్థ్యాలతో రాజ్యాన్ని తిరిగి పొందుతానే కాని శరణాగతుడను కాను అని తన రాజ్యాన్ని తిరిగి పొందే వరకు తాను అరణ్యంలోనే నివసిస్తానని ప్రతిజ్ఞపూని అడవికి చేరాడు. అతనితోపాటు ఎంతోమంది సైనికులు కూడా వెళ్ళారు. ఇదే సమయంలో రాజపుత్రుల మీద మొగలుల అత్యాచారాలు ఎక్కువ అయ్యాయి. దీనితో అనేక రాజపుత్ర కుటుంబాలు కూడ అడవిలో తలదాచుకున్నాయి. తమ రాజుతో పాటు అనేక కష్టనష్టాలు అనుభవిస్తూ రాజు చేసిన ప్రతిజ్ఞనే తమ ప్రతిజ్ఞగా భావిస్తూ వచ్చారు. దురదృష్టవశాత్తు రాజు ప్రతిజ్ఞ నెరవేరలేదు. ఆ దిగులుతో రాణాప్రతాపుడు మరణించాడు. కాని మొగలు సైన్యం రాణా ప్రతాపుని వెతకడానికై తీవ్ర ప్రయత్నాలు ప్రారంభించింది.

ఈ సందర్భంలో మొగులుల దాడి నుండి తమను తాము రక్షించుకొనుటకై వారు కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. ఈ కష్టాలను ఎదుర్కోలేక మార్వాడి, గూర్జర, మొదలైన వంశాలు తిరిగి తమ నివాస స్థానాలకు వచ్చాయి. బంజారాలు మాత్రం అడవిలోనే మిగిలిపోయి ప్రతాపుని ప్రతిజ్ఞను అనుసరిస్తూ సంచార జీవులైనారు. ఈ ఐతిహ్యం వలన బంజారాలు రాజపుత్ర వంశానికి సంబంధించిన వారని స్పష్టమవుతోంది. వీరి మూలాన్ని గురించి కొంతమంది చరిత్రకారుల అభిప్రాయాలు కూడా ఇదే సంబంధాన్ని స్పష్టం చేస్తున్నాయి. షేర్‌సింగ్ షేర్‌గారు వీరి మూలంపై ఈ విధంగా వ్రాశారు.

బంజారాలు రాజస్థాన్‌లోని (చారకులు) భట్రాజులుగాను, వాణిజ్య వ్యాపారులుగాను ఉండేవారని "కర్నల్ టాడ్ జేమ్స్" అభిప్రాయం (1873:573).

డాక్టర్ గ్రియర్సన్, నంజుండయ్య అయ్యర్ (1928) వారి అభిప్రాయంలో బంజారాలు క్షత్రియ లేక రాజపుత్రులు. ఉత్తరాది వారైనందున వీరి మూలస్థానం మార్వాడ్ అయింది (135-136).

**తాండాల చరిత్ర:**

చారిత్రకంగా ఉత్తర భారతంలో పుట్టిన 'తాండా' అనే ఈ పదం స్వయం సమృద్ధిని సాధించిన వివిధ జాతుల ప్రజలు ఓచోట కలిసి జీవిస్తూ తమలో ఒకరిని తమ గుంపుకు పెద్దగా ఎన్నుకొని అతనిని నాయక్‌గా వ్యవహరిస్తూ జీవించే ప్రజల ఉనికిని సూచిస్తుందని తెలుస్తుంది.

వీరిని గురించి మొట్టమొదట ప్రస్తావన క్రీ.శ. 6వ శతాబ్దానికి చెందిన దండి రచించిన "దశకుమార చరిత్ర" అను గ్రంథంలోనే పుష్పోద్భవ ఖండిక మొదటి భాగం 4వ అధ్యాయము నందున్న వర్తకుల "విడిది" అనే కథలో తెలుపబడింది.

శ్లో. *"తత్ కాలంగతి మనతి దూరే నివేశితం వణిక్ కటకం*
*కంచి దభ్యేత్య తత్రబలినో బలీ వర్దాన్ సచ్య*
*గోణీంశ్చ క్రీత్వా అన్యద్రవ్యణ మిషేణ*
*వసుతత్ గోణ సమ్మికం తైరుహ్యామానం శనైఃకటక మానయమ్".*

(అతడు దగ్గరలో విడిది చేసియున్న వర్తకుల వద్దకు వచ్చి కొన్ని గోనె సంచులను, ఎద్దులను కొనుగోలు చేసి తనకు లభించిన బంగారు నాణెములను ఆ సంచులలో నింపి వాటిని వర్తకుల సహాయంతో ఎద్దుల వీపుపై నుంచి ఆ వర్తకులలో ఒకడుగా కలిసిపోయాడు.)

ఇక్కడ వణిక్కటం అనుపదం వర్తకుల యొక్క తాత్కాలిక విడిదిని గురించి తెలియజేస్తుంది. దీనిని బట్టి "బంజరా" అనే పదం, వాణిజ్యకార్ అంటే వర్తకుడనే పదం నుంచి ఉద్భవించిందని గ్రహించవచ్చును. బంజారాల ముఖ్య వృత్తి భారతదేశం నలుమూలలా ధాన్యాన్ని కాయగూరలను రవాణా చేసేదిగా ఉండేది.

1417 ప్రాంతంలో ఫిరోజ్‌షా బహమని సోదరుడైన ఖాన్, గుల్బర్గాను ఆక్రమించుకొనే ప్రయత్నంలో ఉన్నప్పుడు ఒక బంజరా గుంపును నిర్బంధించినట్లు తెలుస్తుంది. 1791–92లో మైసూర్ యుద్ధం సందర్భంగా కారన్‌వాలీస్ ఆజ్ఞమేరకు ఆంగ్ల సైన్యానికి ఆహారం సరఫరా చేసేవారని ఆ ప్రాంతంలో తిరుగాడుతున్న వర్తకుల గురించి వీక్స్ అనే రచయిత తన గ్రంథంలో ప్రస్తావించాడు.

1772లో జరిగిన శ్రీరంగపట్నం శాంతి ఒప్పందం ప్రకారం మిత్రపక్షాల సైన్యాలు ఉపసంహరింపబడ్డాయి. యుద్ధంలో పాల్గొన్న బంజారాలు తిరిగి కృష్ణానదికి వాయవ్యాన ఉన్న తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. 1798లో నిజాం మరియు బ్రిటిష్ గవర్నర్లు కలసి మైసూర్ పాలకుల అధికారాన్ని తగ్గించేందుకు ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నారు. ఇందుకుగాను మరోసారి బంజారాలు అవసరమయ్యారు. బ్రిటిష్ గవర్నర్ హైదరాబాద్‌లో ఉన్న బంజారా నాయకుడికి కావలసిన ఆహార ధాన్యాలను 25,000 గేదెల సహాయంతో తెప్పించుకోవడంలో సఫలీకృతుడయ్యాడు.

ఆంగ్ల ఫ్రెంచ్ సైన్యాలు ఆధిపత్యం కోసం పోరాడుతున్నప్పుడు ఈయన అమరావతిలో (బీరర్) పోలీసు సూపరింటెండెంట్‌గా పనిచేసేవాడు. బంజారాలను గురించి ఆయన రాసిన పుస్తకంలో బంజారాలు స్థిరనివాసం లేకుండా సంచార జీవనం గడిపేవారని, వర్షాకాలంలో మాత్రం సొంత గుడిసెలను నిర్మించుకొనేవారని తెలియజేశాడు. తాత్కాలికంగా ఏర్పరచుకున్న ఈ గుడిసెలను "కుడి" లేదా "కురి' అని పిలిచేవారట. దసరా ఉత్సవాల తరువాత తమ గుడిసెలను వదిలి తాండాలను నిర్మించుకొనేవారు. పంటలు బాగా పండే మధ్యప్రదేశ్‌లోని "డుంబా" అనే ప్రాంతాలకు వెళ్ళేవారు.

"కుడి" గురించి ఈ గుడిసెలను నిర్మించేటప్పుడు తమ గుంపు పెద్ద అయిన "నాయక్" గుడిసె మధ్యన ఉండేటట్లు నిర్మించేవారు. వీటిని ఖాళీచేసి వెళ్ళిపోయేటప్పుడు తిరిగి వచ్చే ఆలోచన లేకపోతే వాటిని నేలమట్టం చేసేవారు. కొన్ని సందర్భాలలో ఉన్న వాటిని ఉన్నట్లుగానే వదిలి వెళ్ళి ఆహారధాన్యాలు సంపాదించుకొని తిరిగి తమ తమ గుడిసెల్లో ఆ ధాన్యాలను దాచి పెట్టుకొనేవారు.

18వ శతాబ్దానికి చెందిన "డుబోయిస్" అనే కవి హిందూ ఆచార సంప్రదాయాలనే పద్ధతులపై బాగా అధ్యయనం చేశాడు. లంబాడీలను గురించి ఈ విధంగా వ్రాశాడు. దేశంలో సంచరించే జాతులన్నింటిలోనూ, ప్రధానమైంది, విలక్షణమైంది "లంబాడా" జాతి. వీరినే 'సుకారు' అని బ్రింజారులని కూడా అంటారు అని చెప్పారు. ప్రొఫెసర్ శ్రీరామశర్మ గారు (1983) బంజారాల ప్రాముఖ్యతను గురించి వారి వలసల గురించి మరిన్ని వివరాలు తెలియజేశారు.

1. బంజారాలు మండి "సార్థ" వ్యవస్థలో అనగా ఆహార వస్తువుల సరఫరా విషయాలలో గుత్తాధిపత్యాన్ని కలిగి ఉండేవారు. రాజస్థాన్‌లో వీరిని బళారియా అని పిలిచేవారు. రవాణా చేయుట కోసం ఎద్దులను ఉపయోగించినందులకు వీరినిలా పిలిచేవారు. ఈ బళద్ గుంపునంతటికి "నాయకి" అని పిలవబడే వ్యక్తి సారథ్యం వహిస్తాడు. ఎడ్లతో ప్రయాణించే ఈ బళద్‌లను తాండాలని కూడా వ్యవహరిస్తారు.

2. భారతదేశంలోని బంజారాలు వారి వారి నివాస ప్రాంతాలను కలిగి ఉండేవారు. కేరళ, తెల్లానో, శిరియా, బరార్, కాందేశ్, నిమీద్, బవన్ అనునవి వీటిలో కొన్ని. తాండాలకు భౌగోళిక సరిహద్దులు కూడా ఉండేవి. ఒక తాండా నివాసులు వేరొక తాండా పరిధిలోనికి ప్రవేశించేవారు కారు. తాండా

పెద్దగా వ్యవహరించే నాయక్‌లు ఇతర తాండాలతో సంబంధాలను నెలకొల్పుకొనేవారు.

3. పంజాబ్ రాష్ట్రంలోని గురాత్ జిల్లాలో ఉండే తాండో అనే గ్రామంలో బంజారాలు ఎక్కువగా నివసిస్తున్నారు. డా. మదన్‌రాజ్ మెహతా ఉప్పు ఉత్పత్తిదారుల పదజాలం అను గ్రంథంలో రాజస్థాన్‌లోని సాంబర్, పక్బార్ సరస్సు మొదలైన ప్రాంతాలలో వాడే పదాలను సేకరించారు. కాని తాండా అనే పదం ఇందులో కనిపించదు. ఉప్పు గిడ్డంగి (Salt godown) అనుపదం ఉంది కాని అది తాండాలను సూచించదు. అందువల్ల సరుకులు రవాణా వృత్తిగా సంచార జీవనం గడిపే బంజారాల బృందాన్నే తాండా అని పిలుస్తారు.

## సంస్కృతి

### 1. సమాజ నిర్మాణం, కుల వ్యవస్థ:

జానపదులలో "గ్రామం" లాగ సుగాలీ సమాజానికి ప్రమాణం "తాండా". వీరి సంస్కృతిలో సామాజిక వ్యవస్థకు చాలా ప్రాధాన్యం వుంది. తాండాలోని ప్రతి వ్యవహారం నిర్దిష్టంగా వ్యవస్థితమై ఉంటుంది. తాండా సమాజంలోని ప్రతి ఒక్కరు తమ నాయకునికి లోబడి బ్రతుకును సాగిస్తుంటారు. అంతేకాకుండా తాండాలోని ప్రతి ఒక్కరు అక్కడి నియమాలకు బద్ధులై ఉండాలని విశ్వసిస్తారు. తాండా సంస్కృతికి చెందిన ప్రతి నియమాన్ని చట్ట సమానంగా భావిస్తారు. తాము ఒక ప్రత్యేకమైన తెగకు సంబంధించిన వారన్న స్పృహతో బ్రతుకుతుంటారు. దీనికి నిదర్శనం సమాజంలో తమకు తాము "గోర్" అనీ, సుగాలేతరులను "కోర్" అనీ పిలవటమే కాబట్టి సుగాలీ లేక బంజారా మొదలైన వ్యవహార నామాలు ఎన్ని ఉన్నా వీరి సంస్కృతిని మాత్రం "గోర్" సంస్కృతి అనే పిలుస్తారు.

### న్యాయనిర్ణయ పద్ధతి:

నసాబ్ (గోర్ పంచాయితీ) ముఖ్యంగా నాయకుని ఆధ్వర్యంలో జరుగుతుంది. "కార్‌భారీ" ఈ పంచాయితీ నిర్వహణలో ఏ పక్షపాతాలు లేని వ్యవహార దృష్టితో న్యాయాన్ని సక్రమ పద్ధతిలో జరిగేటట్లు చూస్తారు. న్యాయం కోసం నాయకుని దగ్గరకు వచ్చి ఫిర్యాదు చేస్తారు. అప్పుడు నాయకుడు వాది ప్రతివాదులను పిలిపించి "నసాబ్"కు అయ్యేఖర్చును మరియుఃతానిచ్చే తీర్పును శిరసా వహిస్తానంటే పంచాయితీ జరిపిస్తాను అని చెప్తాడు. అప్పుడు వారు ఒప్పుకుంటారు. తరువాత నాయకుడు కార్‌భారీతో కలిసి పంచాయితీ స్థలానికి చేరుకుంటారు. సాధారణంగా రచ్చకట్ట లేదా ఏదైనా దేవాలయాలలో పంచాయితీ ఏర్పాటు చేస్తారు. పంచాయితీ సమయంలో నాయక్, కార్‌భారీలతో పాటు ఢాడి, ఢాలియా, నావి, భారావా మొదలైనవారు కూడా తమ సహకారాన్ని అందిస్తారు. వీరితోపాటు తాండాలోని ఇతర జనాలు కూడా వస్తారు. న్యాయస్థానంలో పాల్గొనే అవకాశం అందరికి ఉంది. ఇక్కడ జరిగే చర్చను విని అవసరమైనప్పుడు సముచితమైన సలహాలను ఇవ్వవచ్చు. న్యాయస్థానంలో సామాన్యంగా స్త్రీలకు ప్రవేశం లేదు. అయితే వాది ప్రతివాదులలో ఒకరైనప్పుడు లేదా సాక్షులైనప్పుడు స్త్రీలకు న్యాయస్థానంలో ప్రవేశించడానికి అవకాశం ఉంటుంది.

సుగాలీ లేదా లంబాడీ న్యాయ పంచాయితీ చాలా గంభీరంగా ఉంటుంది. సామాన్యంగా తాండాలోని ఏదైనా దేవస్థానం పంచాయితీ "కట్ట" మొదలైన ప్రముఖ స్థలాల్లో పంచాయితీకి చేరుతారు.

ఇలా చేరిన సభలో న్యాయం గూర్చి వీలైనంత కూలంకషంగా చర్చిస్తారు. సాధారణంగా పంచాయితీకి వచ్చే ఏ సమస్యనైనా గంభీరంగానే పరిగణిస్తారు. ప్రతి ఒక్కరు సభా మర్యాదను పాటించాలి. లేకపోతే శిక్షకు గురి అవుతారు. సభ ఇచ్చే తీర్పుకు ప్రతి ఒక్కరు కట్టుబడి ఉండాలి. సభలో కూర్చున్నప్పుడు వారు అనుసరించే నీతి ఉన్నతమైనది. ముద్దాయిలకు అనేక విధాలైన దండనలను, శిక్షలను వారే ప్రతిపాదిస్తారు.

### వివాహ వ్యవస్థ:

తాండా సంస్కృతిలో సాంసారిక జీవితం ప్రధానమైంది. కనుక వివాహ సంప్రదాయం చాలా ముఖ్యమైంది. బంజారాలు కొన్ని శతాబ్దాల నుండి తమ వైవాహిక ఆచారాలు రక్షించుకు రావడంచేత వివాహ వ్యవహారంలో ప్రత్యేకతలు కనిపిస్తాయి. పూర్వం సంచార జీవులైన సుగాలీలు లేక లంబాడీలు సంవత్సరంలో 4 లేక 5 నెలలు వ్యాపారం కోసం సంచరించే వారు. ఈ కారణంగా అనేకమైన తాండాలు, నిర్దిష్టమైన స్థలాలు స్థిరంగా ఉండేవి కావు. స్థిరంగా ఉండకపోయినా తాండాల మధ్య పరస్పర సహకారం ఉండేవి. కావున ఒక తాండావారు మరొక తాండా వారితో వివాహ సంబంధం ఏర్పరుచుకోవడం సంభవమైంది. ఒక్కొక్క సందర్భంలో ఆయా తాండాలలోని వ్యక్తులతో కూడా వివాహాలు జరిగేవి.

లంబాడీల పెళ్ళికి కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. ఈనాడు కనిపించే ఒక రోజు పెళ్ళి కాదు. పూర్వం నెలల కొద్దీ ఈ సంబరం నడిచేది. ఇప్పుడు కొన్ని ప్రాంతాలలో (మహబూబ్‌నగర్ జిల్లా, అనంతపురం జిల్లా) ఇప్పటికీ 5 నుండి 10 రోజుల వరకు పెళ్ళి జరిగే ఆచారం వుంది. లంబాడీలలో అమ్మాయి, అబ్బాయి ఎన్నిక పూర్తిగా పెద్దలకు సంబంధించినది. అబ్బాయిని అమ్మాయి, అమ్మాయిని

అబ్బాయి పరస్పరం చూడడం, వచ్చినది లేనిది అడగడం ఈ సమాజంలో లేదు. వల్గురు పెద్దలు చేరి వారిద్దరిని ఎన్నుకుంటారు. ఇలా ఎన్నుకొనేటప్పుడు వారికి అమ్మాయి ఇంటి మర్యాద కన్నా; ఆ తాండా నాయకుడెవరు? ఆచార వ్యవహారములు ఏలాంటివి? మొదలైన అంశాలను ముఖ్యంగా గమనిస్తారు. ఎందుకంటే తాండా సంస్కృతి సంపూర్ణంగా నాయకునిపైనే ఆధారపడి ఉంటుంది. కనుక తాండా నాయకుడు మంచినడవడిక, సభ్యతను కల్గి ఉన్నాడని ఎక్కడ తెలుస్తుందో ఆ తాండా వారందరు అదే సభ్యతను కల్గి ఉంటారని భావించి అమ్మాయిని పెండ్లి చేసుకుంటారు.

ఇప్పుడిప్పుడు కేవలం తాండా నాయకునిపైనే ఆధారపడకుండా వారు స్వతంత్రంగా కూడా వివాహాలు చేసుకుంటున్నారు. కాని ఆచారంలో మాత్రం నాయకుడికి తెల్పడం ఇప్పటికీ ఉంది.

### పురోహితుడు లేకపోవడం:

లంబాడీల వివాహ సందర్భంలో కాని లేక ఏదైనా దేవుని పూజ విషయంలో కాని ప్రత్యేకంగా బయట నుంచి "కోర్" పురోహితుడు ఉండడు. తాండా నాయక్ లేక బగత్ (పూజారి) వీరిలో ఎవరో ఒకరు పురోహితుడుగా బాధ్యత వహిస్తారు.

### ఏడుపు సాంప్రదాయం:

తాండా సంస్కృతిలో ఏడవటం ఒక ముఖ్యమైన సంప్రదాయంగా మిగిలింది. ఇది ఇతర జాతులకు వింత అనిపించవచ్చు. ఎందుకంటే ఈ విధంగా ఏడుపు సాంప్రదాయం ఏ సమాజంలోను కనిపించదు. పెళ్ళి సందర్భంలో కులస్త్రీలు పెళ్ళికూతురికి ఏడ్వటం నేర్పిస్తారు. దీనినే "ఢావలో" అంటారు. ఏ సందర్భంలో ఎలా ఎడ్వాలో కూడా శిక్షణ ఇస్తారు. తల్లిదండ్రి అన్న బంధు బలగం వారి ఎదుట పెళ్ళికూతురు విభిన్న రీతుల్లో ఏడుస్తుంది. ఈ విధమైన ఏడ్పు పాటల సాంప్రదాయం వీరిలో ఎలా వచ్చింది అన్నదానికి ఒక ఉదంతం చెబుతారు.

పూర్వం సుగాలీలు లేక లంబాడీలు వ్యాపారం కోసం తండోపతండాలుగా దేశవిదేశాలలో సంచరించేవారు. అటువంటి సందర్భాలలో ఈ దండులలో ఒకరినొకరిని కలుసుకోవడం గడచిన ఎడబాటును తలచుకొని ఏడ్చే వారు. ఈ విధంగా పరస్పరం కలుసుకున్నప్పుడు ఆయా తాండాలలో వయస్సు వచ్చిన వారి పెళ్ళి సంబంధాల గురించి చెప్పుకునేవారు. వీరికి వారికి సరిపడితే మంచిమాట చేసుకొనేవారు. అలా పెళ్ళికూడా జరిగిపోయేది. మళ్ళీ వ్యాపారానికై ఈ తాండాలు వేరు వేరుగా సాగిపోయేవి. ఇలా విడిపోయేటప్పుడు పెళ్ళి అయిన స్త్రీ తనను పెంచిన వారిని బంధువులను మరలా కలవడం సాధ్యపడదని బాధతో ఏడ్వటం సహజం. కాలక్రమంలో ఈ వ్యాపార జీవనం పోయింది. అయితే ఇప్పుడు తాండాల్లో ఈనాడు పెళ్ళి అయిన స్త్రీ ఇష్టమైనప్పుడు తన పుట్టింటికి పోయి రావచ్చును. కాని ఏడుపు సాంప్రదాయం మాత్రం మిగిలిపోయింది.

### అన్న భార్యను తమ్ముడు పెళ్ళి చేసుకోవడం (దేవర న్యాయం):

లంబాడీలలో అన్న భార్యను తమ్ముడు వివాహం చేసుకోవడం ఒక సాంప్రదాయం. అన్న ఏదైనా ప్రమాదంలో చనిపోతే ఆమె పిల్లలకు తోడెవరని భావించి మరిదితో వివాహం చేస్తారు. ముందుగానే వివాహం అయినట్లయితే రెండవ భార్యగా స్వీకరిస్తారు. వదిన వయస్సులో పెద్దదైనా పెళ్ళిచేసుకోవడం జరుగుతుంది.

అంతేకాకుండా ఆమె వయస్సులో ఉన్నప్పుడే భర్త చనిపోతే ఆమె ఎక్కడైనా ఎవరితోనైనా వెళ్ళిపోతుందేమో, సమాజంలో సంసారానికి చెడ్డపేరు తెస్తుందేమోనని భావించి కూడా, వదినను మరిది వివాహం చేసుకుంటాడు. ఒకవేళ వదినను వివాహం చేసుకోక పోయినచో ఆమె ఎవరితోనైనా ఉన్నట్లు తెలిస్తే ఆ తాండా వారంతా మరిదిని ఎగతాళి చేస్తారు. అందుకే కొన్ని సమయాల్లో ఇష్టం లేకున్నా పెళ్ళి చేసుకోవల్సి ఉంటుంది.

## సాహిత్యం

### పండుగలు - జాతరలు:

బంజారాల పండుగలను పరిశీలిస్తే కొన్ని ప్రత్యేకతలు కనిపిస్తాయి. సాధారణంగా హిందువుల పండుగలాగ ఆయా మాస ఋతువులలో చేసే పండుగలాగనే కనిపించడం – విశేషించి మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలలో కనిపించే పండుగలు వీరిలోనూ కనిపిస్తాయి. దీనికితోడు ఆయా పండుగల ఆచార వ్యవహారాలు కూడా భిన్నంగా కనిపిస్తాయి. ఇంత మాత్రమే కాకుండా, హోళీ, దీపావళి, ఉగాది తప్ప ఏ పండుగలు ప్రతి సంవత్సరం జరపాలనే నియమం లేకపోవడం గుర్తించదగ్గ అంశం. వీరి పండుగకు దశరావ్, పూజా అనే పేర్లు ఉండటం ప్రత్యేకంగా గమనించదగ్గ అంశం. అంతేకాకుండా రెండు మూడు సంవత్సరాలకు ఒకసారి పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు తీజ్ (పూజా) వంటి పండుగగాని; మరియమ్మ జాతర, తులాభవాని, మంత్రాల్ యాడి మొదలగు స్త్రీ దేవతల పేరు మీద జాతరలు కానీ, జరుపుకుంటారు. అక్కడ జరిగే ప్రతి పండుగ తాండా నాయక్ ఆధ్వర్యంలో జరుగుతాయి.

## గేయాలు:

ఇతర గిరిజనులలో లాగానే బంజారాలలో కూడా గేయ వాఙ్మయం చాలా ముఖ్యమైనది. వారి జీవితంలో ప్రతి కదలిక పాటతో ముడిపడి ఉంది. బంజారాలు పాటకే కాక ఆటకు కూడా సుప్రసిద్ధులు. వీరి సాహిత్యంలో కనిపించే కొన్ని ప్రత్యేకతలు ఆసక్తికరంగా ఉన్నాయి. వారి పాటలలోనూ, కథలలోనూ కనిపించే మూలాంశాలకు ఈనాటికి వారిలో కనిపించే ఆచార సాంప్రదాయాలు ఈ క్రింది పాటల ద్వారా గమనించవచ్చును. సాధారణంగా వీరు ఏ వాయిద్యాలు లేకుండానే పాటలు పాడుతారు. కాని కొన్ని గేయాలకు కడవను, కొన్నింటికి ఇత్తడి పళ్ళాన్ని (థాళీర్ గీర్), మరికొన్నింటికి నగారాను సహాయక వాయిద్యాలుగా వాడుతారు. నగారా పాటలో స్త్రీలు కాళికి గజ్జెలు ధరించి ఆడుతూ పాడుతారు. తొలుత వివాహానికి సంబంధించిన కొన్ని గేయాలను పరిచయం చేస్తాను. సుగాలీ లేక లంబాడీ పెళ్ళిళ్లలో అడుగడుగుకు పాట ఉంటుంది. ఒక రకంగా శిష్టుల వివాహాలలోని మంత్రాల స్థానాన్ని బంజారాలలో పాటలు ఆక్రమిస్తాయి. ఈ పాటల ఘోషతో పెండ్లింటిలోని వాతావరణమే నాటకీయంగానూ, రసవత్తరంగానూ మారి పోతుంది. బంధుమిత్రులందరిలోనూ వైవాహిక సంబంధమైన భావోద్వేగం ఈ పాటల్ని వినగానే కలుగుతుంది. లంబాడీలు దాంపత్యధర్మం అతి ఉత్కృష్టమైందిగా నమ్ముతారు. వారు పార్వతీ పరమేశ్వరులను, సీతారాములను ఆదర్శంగా భావిస్తారు.

పాట: పెళ్ళికుమారుని చేసేటప్పుడు పాడే పాట.

*"లోటన ఘేటా ఎదలే కుమారా!*
*ఎదలే కుమార శరి రామేరి తారి!*
*గోరణిరో వాలమ్ వాడో ఏర,*
*సాడియాన మొళయా ఎదలే కుమార,*
*ఎదలే కుమార శరి రామేరి తారి."*

సందర్భం: తాండా స్త్రీలు పెళ్ళి కుమారుని చేసేటప్పుడు ఈ పాటను పాడుతారు.

అర్థం: ఓ పెళ్ళి కొడుకా! నీ పెళ్ళి అవుతుంది. బెల్లంతో పానకం (ఘేటా) చేస్తున్నాం. ఓ కుమారా! నీకు పూర్వం మన రాముడికి సీత దొరికినట్లు గుణవతి, శీలవతి అయిన అమ్మాయి నీకు భార్య కాబోతోంది. నీవు ఈ రోజు నుండి నిజమైన తాండా వాసుడివి కాబోతున్నావు.

## పెళ్ళి కూతురిని అత్తవారింటికి పంపేటప్పుడు ఏడుస్తూ పాడే పాట (హవేలి):

*"చుటమత జావేస హవేలి ఆహియా!*
*కనాదేకూజనా హారి హర వాళిరేస్ నంగొరి,*
*వడలాజు వడేస్ లింబుడాసు ఫేలేస్,*
*మారి నాయక్ బాపూర్ నంగొరీన్ హారి ఫరిదేకేస్."*

సందర్భం: తాండా సంస్కృతిలో పెళ్ళి కూతురుకు ఏడ్పు పాటను ఆ తాండా వృద్ధ స్త్రీలు నేర్పిస్తారు. వివాహమైన తరువాత పెళ్ళి కూతురు తాండా విడిచి వెళ్ళేముందు ఎట్లా నడుచుకోవాలో చెబుతారు. అప్పుడు పెళ్ళి కూతురు తాండా నాయకుని పేరున ఈ ఏడ్పు పాటను పాడుతుంది.

అర్థం: ఓ తండ్రి! నేను మిమ్ములను వదలి దూరంగా ఎట్లా ఉండగలను. అయినా సరే నేను పోక తప్పదు. నీ బిడ్డ ఈరోజు నుండి పరాయిదై పోతోంది. నాయక్, తండ్రి నీవు చెప్పినట్లే నేను బుద్ధిగా నడుచుకుంటాను. భర్తతో అణిగిమణిగి ఉంటాను.

పెళ్ళి కూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు పాడే పాట:

పాట: *దోళేజ హాసలేరి యాడీ,*
*పిళేజ భురియారి యాడీ,*
*తారేజ దూడీయా వేటేమ,*
*ఘూలన గోకలమో నాయకణ్ యాడీ,*

సందర్భం: పెళ్ళి కూతురును అత్తవారింటికి పంపే ముందు పెళ్ళి కూతురు తల్లిదండ్రి, అన్నా మరియు పూలవనం, పంట పొలాలు, ఇంటిలోని ఆవులను, నాగియా అనే పేరుగల ఎద్దును వీరందరిని వదిలి నేనెట్లు వెళ్ళాలి. ఒకవేళ వెళ్ళినా ఎట్లా మరువగలను! – అని పేరుపేరునా చెప్పి పాడే పాట ఇది.

అర్థం: తెల్లని కంఠ కడియం (వెండిది) ధరించిన ఓ తల్లీ! ముక్కుకు బంగారు (భురియా) ముక్కుపోగు లేసుకున్న తల్లీ! నిన్ను వదలి నేనెట్లా వెళ్ళాలి. అందుకే ఈ ఒక్కరోజు నన్ను నీ పొలలాంటి కడుపులో దాచుకోవా! అట్లు దాచుకోక పోయావో నీ బిడ్డ నీకు కనిపించదు. ఓ నాన్నా! ఈ తాండాను నేనెట్లా మరచిపోవాలి. ఈ ఆవులు, నాగియా అనే పేరుగల ఎద్దు, ఈ పూలవనం బావి, పంట పొలాలు నేనెట్లా మరిచిపోనూ! ఓ బాలాజీ! వీటన్నింటికి నీవే దిక్కు స్వామి. మా అన్నఇల్లు పాలుపొంగే విధంగా చల్లగా చూడు ఓ దేవా: నువ్వు కూడా మా వారిని చూసుకో.

పెళ్ళి కుమారుడి ఆస్తిని గురించి పాట:

*తూతో కేలోతో నవవే గావడి*
*అనాదేకూతో ఏక లంగాడి గావడి,*
*కాంఘా భోళా భూలాయేరీ*
*పాపిరాండియాతూ.*

సందర్భం: తనకు పెద్ద ఆస్తిపాస్తులున్నాయని చెప్పి నమ్మించి పెళ్ళి చేసుకొని, ఇంటికి వచ్చిన తరువాత భార్య ఆస్తి గురించి అడుగుతుంది. వానికి ఏమీ లేదని తెలుస్తుంది. ఆ సందర్భంలో ఆమె పాడే పాట.

అర్థం: నీవు మా అమ్మ నాన్నలతో, నాకు తొమ్మిది వందల ఆవులున్నాయని చెప్పితివి, నేను వచ్చి చూస్తే ఒకే ఒక కుంటి ఆవు ఇంటిముందుంది. నన్ను మోసం చేసి పెళ్ళి చేసుకుంటివి అంతేకాక 60 ఎకరాల పొలం ఉందని చెప్పితివి. వచ్చిచూస్తే గుట్టలు రాళ్ళుగల చేను ఉందని తెలిసింది. ఈ విధంగా మోసం చేయడం నీకు తగునా! అని భర్తతో అంటుంది.

ఇలా బంజారాల గేయాలు, చరిత్ర - సంస్కృతిని గమనించినచో కొంత అవగాహన ఏర్పడటమే కాకుండా; వారి ఆచార వ్యవహారాలు స్పష్టంగా తెలుస్తాయి. ఇప్పుడు చర్చించిన గేయాల్లోనూ, చరిత్ర సంస్కృతి అవశేషాలు కనిపించటం చాలా ఆసక్తికరమైన విషయం. ఇన్ని శతాబ్దాలు గడిచినా బంజారాలలో కనీసం సాహిత్యంలోనైనా ఈ రాచరిక లక్షణాలు మిగిలిపోవటం సాహిత్యానికి ఉన్న సాంప్రదాయక స్థిరత్వాన్ని నిరూపిస్తుంది.



అరకు - గిరిజన స్త్రీ

# మన సంగీత పరిణామ చరిత్ర

కళాప్రపూర్ణ డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు, ఎం.ఏ.

"సామవేదాత్ సంగీతం" – అనే నానుడి మన దేశంలో అనాదిగా వినవస్తూన్నదే. అయితే, వేదకాలం నాటి భారతీయ సమాజంలో శిష్టులైన ఆర్యఋషుల కృషి ఫలితంగా భారతీయ సంగీతం ఉద్భవించిందని చెప్పడం సరియేనా? ఇందులో ఒక సూక్ష్మం ఉంది. సంగీత కళ అనేది సమాజంలోని అన్ని తరగతుల జనులకూ చెందిన సహజమైన ప్రకృతి ధర్మం. దానిని శాస్త్రీయ దృష్టితో పరిగణించి పరిశీలించి ఒక శాస్త్రంగా దిద్ది తీర్చిన ఘనత పైన చెప్పిన పురాణ ప్రసిద్ధ స్త్రీ– పురుషులదో; వారి పేరున ప్రాతిశాఖ్యలు, శిక్షాశాస్త్రము (వేదములను ఉచ్చరించి సస్వరముగా పలుకురీతిని వివక్షించు శాస్త్రం), నాట్యశాస్త్రము వంటి వానిని పరోక్షంగా దేశమున కల్పించిన ఋషులదో కాక తప్పదు.

వేదకాలంనాటి భారతీయ సమాజంలోని వివిధ జాతులు, మన పురాణేతి హాసములనుబట్టి చూస్తే – సుర, అసుర, దనుజ, రక్షో, యక్ష, కిన్నర, కింపురుష, గరు డోరగ (నాగ), గంధర్వ, విద్యాధర, నిషాద, భిల్ల, మల్ల, కిరాతాదులు. వీరిలో గంధర్వులు, నిషాదులు మన సప్త స్వరాలలోని రెండింటికి తమ పేర్లను కూడ (గాంధారము, నిషాదము) ఇచ్చి పుణ్యం కట్టుకున్నారు. అంతేకాక, గంధర్వుల పేర సంగీతపు తొలిశాస్త్రం గాంధర్వవేదం అనే పేర ప్రసిద్ధి చెందింది.

ప్రాచీన కాలమునుండి మధ్యయుగాలలోని 12 వ శతాబ్ది వరకు, భారతీయ సంగీతం ఆసేతు శీతాచలం ఏకైక సాంప్రదాయాన్ని అనుసరించింది.

వేదములలోని సంగీతమును గాంధర్వ మనీ, మార్గ సంగీతమనీ; దేశంలోని ఆయా ప్రాంత జనులు పాడుకొను సంగీతమును గానమనీ, దేశిసంగీత మనీ అంటారు. భరతుని నుండి మతంగుని వరకు మన సాహిత్య చరిత్రలో వినబడే మార్గ – దేశి పద్ధతుల వేర్పాటును తొలిసారిగా పరిచయ పరచిన శాస్త్రజ్ఞులు వీరు. దీనినిబట్టి ఆనాటి ఋషులు కేవల వేద సంగీతమునేగాక, నానాటికి దేశి సంగీతములో కలుగుతూ వచ్చిన పరిణామములను పరిశీలిస్తూ తమ లక్షణమును నిర్ణయించేవారు అనే విషయం ఈనాడు ఎంతో మెచ్చుకోదగినది. వేదముల సంగీతంలో వారు చెప్పిన త్రిస్వర గానమును, చతుస్స్వర గానమును పోలిన ఉచ్చారణలు నేటికీ కొన్ని వెనుకబడిన ఆటవిక జాతులా, కొండజాతులా పాటలలో వినవచ్చును. అలాగే నేటి మన శాస్త్రీయ సంగీతంలో జన్యరాగములని పిలిచే వాటిలో ఐదు స్వరాల ఔడవ రాగాలెన్నో వివిధ జాతుల్నించీ వచ్చినవే. అయితే ఆటవిక, పార్వతీయ జాతుల గాన రీతులు ఆయా పేర్లతో రాగములుగా మన శాస్త్రంలోకి ఎక్కిపోయి ఏనాడో మన నాగరిక సంగీతంలో భాగంగా చొచ్చుకుపోయాయి. సామగానంలో రాణాయనీ శాఖ, కౌతుమీ శాఖ అని రెండు పద్ధతులుగా దేశంలో ప్రవర్తిల్లి, వేదకాలం నుండి నేటివరకూ గురువు నుండి శిష్యులకు నోటి పాఠంగా అనేక నిష్ఠా నియమాలతో నేర్చుకొనడం ద్వారా ఏ మాత్రమూ చెక్కుచెదరని స్వరములతో వినవస్తున్నవి. సామ గానంలో ఆంధ్రదేశంలోని కోనసీమ పండితులకు అంతర్ రాష్ట్రీయ సమావేశాలలో మంచి ప్రసిద్ధి, పరిగణన ఉన్నాయి.

చతుస్స్వర గానమునాటి నాలుగు స్వరములను అవరోహణ క్రమములో ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ అనే వారు. వీటిలో ప్రథమస్వరమునకు ఉదాత్తమును, ద్వితీయము అనుదాత్తము, తృతీయము స్వరితముకాగా, చతుర్థము తిరిగి ఉదాత్తమై, దాని క్రింద అవరోహణ స్వరములో ప్రథమ ద్వితీయుల అంతరముతో సమమైన అంతరములో మంద్ర అనే స్వరమునూ దానిక్రింద అనుస్వరమునూ కలుపుకొని గ రి స ని ద అని నేడు పలుకదగిన ఐదు స్వరము లేర్పడినవి.

పాశ్చాత్య చరిత్రకారు లీ కాలమును క్రీ.పూ. 400 అంటారు. క్రీ.పూ. 500 లో గ్రీసులో స్వర సప్తకమును శ్రుతుల వివరములను గణిత వివరముతో తేల్చి చూపించిన పైథాగరస్ విజ్ఞానము ఒక నూరేండ్లకు భారతదేశము చేరుకొనియుండవలెనని వారి ఊహ. భారతీయచరిత్రకారులు

దీనికి సమ్మతింపరు. ఋగ్వేదకాలమే క్రీ.పూ. 4000 కు ముందో, అధమము క్రీ.పూ. 1500 కు ముందో అయివుండాలంటే, తదనుబంధ సాహిత్యం ఆ కాలమునకు సమీపముననే ఉండవలెనుగాని బొత్తిగా అర్వాచీనమనడం పొసగదు.

నేటి ఖరహరప్రియ మేళస్వరములకు అత్యంత సమీపమైన యీ సామగాన సప్తస్వరములు గణితసంబంధరీత్యా ఎంతో నిర్దుష్టములై అనురూపమైన పరస్పరాంతర సంబంధమును కలిగి వున్నాయి. మధ్యమ గాంధారముల అంతరము షడ్జ నిషాదముల అంతరముతో సమానము. గాంధార రిషభముల అంతరము నిషాద దైవతముల అంతరముతోను, రిషభషడ్జముల అంతరము దైవత పంచముల అంతరముతోను సమానము.

ఒక్కొక్క స్వరమున కొక్కొక తంత్రి నుపయోగించు నేటి స్వర మండలము (లేక హార్ప్) అనాదు మత్తకోకిల, విపంచి, కాత్యాయన వీణ అను పేరులతో ప్రచారములో ఉండేది. తంత్రుల బిగింపుల తేడాలలోను, పొడవుల తేడాలలోను సామగాన సప్తస్వర ప్రకృతులలో సరిగమపదని అనే ఒక్కొక్క తీగకు వేరు వేరు కొలతలలోనో, బిగింపులలోనో వేరు వేరు వికృతులు లేక శ్రుతులు ఉండవచ్చునని తెలుసు కున్నారు. ఆ వికృతులను గణితానురూప సంబంధములో సాధించుటకు తొమ్మిది శ్రుతుల అంతరము గల షడ్జమధ్యమ సంవాదిత్వము, పదమూడు శ్రుతుల అంతరము గల షడ్జపంచమ సంవాదిత్వము తోడుపడినది.

షడ్జశ్రుతులు నాలుగింటిలో మొదటి మూడూ వికృతులు. ఆ మూడిటిలో మొదటిది కైశికీ నిషాదము. రెండవది కాకలీ నిషాదము. మూడవది చ్యుతషడ్జ నిషాదము, నాల్గవది ప్రకృతి లేక శుద్ధ షడ్జము.

**గ్రామము, మూర్ఛన జాతులు:** అయితే భరతుని కాలములో రాగములు, మేళములు అనే వ్యవహారము లేదు. ఒక నిర్దిష్ట (Absolute) శ్రుతిలో బిగించిన తంత్రులుగల కాత్యాయన వీణ, లేక స్వరమండలము (హార్ప్) లోని 21 తంత్రులను మూడు స్థాయిలుగా శ్రుతిచేసికొనేవారు. ఏక తంత్రిగల బ్రహ్మవీణ, నవతంత్రులుగల భరతుని మయూరి, నారదుని మహతి, మతంగి కిన్నరి ప్రచారమున ఉండేవి. అన్ని వేళల షడ్జమే ఆధారశృతి అనే వాడుకకూడా లేదు. షడ్జము గ్రహస్వరము = (ఆరంభస్వరము) అయినప్పుడు షడ్జగ్రామము మధ్యమము, ఆరంభ స్వరము అయినపుడు మధ్యమ గ్రామము అనేవారు. గ్రామము మారినపుడు శ్రుతుల అంతరములు సూక్ష్మముగా మారి, స్వరముల సంవాదిత్వములో కూడా మార్పులు సంభవిస్తాయి. భరతునినాటికి గాంధార గ్రామము వ్యవహారాచ్యుతమయి స్వర్గలోకమునకు పోయినది. నారదుని గ్రంథమునందు (సంగీత మకరందము) హరి వంశమందు, శార్ఙ్గ దేవుని సంగీత రత్నాకరమందు, గాంధార గ్రామ ప్రశంస కనబడుతుంది. రైవతుడను రాజు బ్రహ్మలోకము (స్వర్గలోకము)నకు పోయి గాంధార గ్రామమున గానము చేయు ఛాలిక్యమను గాంధర్వగాన క్రీడ నేర్చుకొని వచ్చి భరత ఖండములోని యాదవులకు నేర్పేడట. దివారాత్రములు లెక్కవేరుగా ఉండెడి ఆర్కిటిక్ ప్రాంతం దగ్గర ఆ బ్రహ్మలోకమో, స్వర్గలోకమో ఉండి, అక్కడి ఏ దేవ గంధర్వజాతులో గాంధార గ్రామమును ఆ కాలంలో గానము చేసే వారేమో! గ్రామ శబ్దమునుండే పాశ్చాత్య సంగీత శాస్త్రములోని గామత్ అను శబ్దము వచ్చినది.

యాదవులకు ఛాలిక్యమనే నృత్యగాన క్రీడను నేర్పిన రైవతుడు భారత భాగవతాలలోని కృష్ణ బలరాములలో బలరాముని మామగారు. భారతకాలం నాటి ఈ క్రీడ – గోపికా కృష్ణుల రాసక్రీడగా గుజరాత్, సౌరాష్ట్ర, రాజస్థాన్, మధురాబృందావన్ (యు.పి.), వంగదేశం, ఉత్కల, ఆంధ్ర, తమిళ, కర్ణాట, కేరళలకు వ్యాపించింది. ఒకటవ శతాబ్దంలో ధాన్యకటకం (కృష్ణా డెల్టా దగ్గర ధరణికోట) రాజధానిగా ఆంధ్రదేశమును దక్కనును (నేటి ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతము) లన్నిటినీ సామ్రాజ్యముగా ఏలిన శాతవాహనరాజు హాలుడు. ఆయన సంకలనం చేసిన శాలివాహన గాథాసప్తశతిలో ఆంధ్ర గ్రామ జీవితదృశ్యాలను వర్ణించే ప్రాకృతభాషా పద్యాలలో ఈ రాసక్రీడను గూర్చి చెప్పిన పద్యం ఒకటుంది. తెలుగులోని గొబ్బిళ్లు (గోపికా వ్రతం) పాటలూ, కోలాటపు పాటలూ, తమిళంలో కుమ్మికోలాట్టం పాటలూ భారత కాలంనాటి ఛాలిక్యానికి రాసక్రీడకీ దేశవ్యాప్తిని పొందిన విస్తరింపులే!

భరతుని నాట్యశాస్త్రములో సంగీత శాస్త్ర విషయములు ఆరు అధ్యాయములలో కలవు. అవి జాతి లక్షణ విధానము, ఆతోద్యజాతి విధానము, సుషిరాతోద్యాధికారము, తాళవిధానము, ధ్రువాధ్యాయము, పుష్కరవాద్య విధానము. భరతుడు సప్తస్వరములలో అవరోహణ క్రమముగా ఒక్కొక్కటి గ్రహస్వరముగా 14 మూర్ఛనలను ప్రస్తరించు విధానమును, 7 శుద్ధజాతులను, 11 మిశ్రజాతులను వివరించేడు. వీటిలో ఆంధ్రి అనే జాతి గాంధారి షాడ్జీ జాతుల సంయోగమున జన్మించిన మిశ్రజాతి అని చెప్పేడు.

**మతంగుడు – బృహద్దేశి:** భరతుడు చెప్పని విధముగా రాగమార్గమును వివరింతునని పంచ భరతులలో ఒకడుగా పేరొందిన మతంగముని తన బృహద్దేశిలో....

స్వరవర్ణ విశేషేణ ధ్వని భేదేన వాపునః
రజ్యతే యేన యః కశ్చిత్ సరాగః సమ్మతః సతాం
యోఽసే ధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః
రంజకో జన చిత్తానాం సచ రాగ ఉదాహృతః...

స్వరవర్ణ విభూషితమై, జన చిత్తములను రంజింపచేయు ధ్వని విశేషము రాగము – అన్నాడు. ఈ రాగములు మార్గపద్ధతి కంటె భిన్నములూ, దేశవ్యవహార సిద్ధములూ అయినందున వానిని గూర్చిన యీ గ్రంథము బృహద్దేశి అయినది. అది తొమ్మిదవ శతాబ్ది రాగములలో కొన్ని జనక రాగములనియు, వానినుండి భాషారాగములు, వానినుండి విభాషారాగములు, వానినుండి అంతర భాషారాగములు జన్మించెననీ మతంగుడు చెప్పేడు.

భరతుడు చెప్పిన ఆంధ్రీజాతి అనే ప్రాచీన రాగానికి స్వరాలు మతంగుని బృహద్దేశిలోను, 12 వ శతాబ్దివాడైన శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరంలోనూ స్వరాలు మాత్రమే కాకుండా ఒక సంస్కృత గేయమూ ఉదాహరింపబడ్డాయి. ఆ స్వరాలనుబట్టి పరిశోధిస్తే, అవి నేటి కళ్యాణి రాగానికి చెందిన స్వరాలనీ, అది ప్రాచీనాంధ్రులు భారతీయ సంగీతానికి ఇచ్చిన కానుకనీ తెలిసి సంతోషిస్తాము. ఇదొక్కటే కాకుండా మతంగుని బృహద్దేశిలో మరి రెండు రకాల ఆంధ్రీరాగాల ప్రశంస కనబడుతుంది.

**సోమేశ్వరుని అభిలషితార్థ చింతామణి:** కళ్యాణి చాళుక్య రాజయిన సోమేశ్వరుడు క్రీ.శ. 1131 లో అభిలషితార్థ చింతామణి లేక మానసోల్లాసమను విజ్ఞాన సర్వస్వమువంటి తన గ్రంథమున రెండు అధ్యాయములు సంగీతమునకు వినియోగించెను. సంగీత పరిణామ చరిత్రను సూచించు అతని శ్లోక మొకటి--

సామవేదాత్ స్వరాజాతాః స్వరేభ్యో గ్రామొఽసంభవః
గ్రామేభ్యో జాతయోజాతా జాతిభ్యో రాగనిర్ణయః
రాగేభ్యశ్చ తథా భాషావిభాషైశ్చాపి సంజాతసద్ధైవాన్తర
భాషికా . . .

అయితే, భరతుని నాటి గ్రామముల నుండి మూర్ఛనలు, వానినుండి జాతులూ ఎట్లు పరిణమించినవో విస్పష్టముగా తెలిసికొనదగు కీలకము చరిత్రలో లుప్తమైపోయి వాగ్గేయకారుల లక్షణ గ్రంథములలో అవ్యాఖ్యాతముగా గుప్తమై ఉన్నది. భరతుని ద్వావింశతి శ్రుతుల మేళము నుండి స్వరమండలములు ద్వారా ఆ గుప్తవిద్యను పరిశోధించి సాధించవలసి యున్నది.

సోమేశ్వరు డిచ్చిన రాగములలో భిన్నషడ్జము, గౌడ భేదములు, మాళవకైశిక, హిందోళ, శ్రీరాగము, భైరవి, సావేరి, బహుళి, బంగాళ, కర్ణాటబంగాళ, గుర్జరి, సౌరాష్ట్ర, పున్నాట(గ) మాటీ (శీ) భేదములు. ఆహిరి, ఛాయానటి, తోడి, వేలాఉల్లి (వేలావళి–బిలావల్?), కామోద, దేశానక (దేశాఖ్య లేక దేశాక్షి), సైంధవి రామకృతి (రామక్రియ) తుండకృతి (గుండక్రియ–గుణకల) వంటి రాగములు వేయి సంవత్సరములుగా వినబడుతున్న పేరులే అనిపించును. వీటిలో చాల రాగములకు సోమేశ్వరుడు లక్షణము కూడ చెప్పేడు.

ఈ సోమేశ్వరుడు సూచించిన రాగాలలో కళ్యాణి అనే రాగం కూడా కనబడుతోందని కొందరు పరిశోధకులు వ్రాశారు. పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన సోమేశ్వరుడు రాజకుమారులకోసం తాను రచించిన విజ్ఞాన సర్వస్వం మానసోల్లాసంలో తన రాజధాని పేరుతో ప్రాచీనాంధ్రీ జతియే కళ్యాణిగా పరిణమించిన రాగాన్ని చేర్చుకొన్నాడని చెప్పవచ్చు.

**సంగీత మకరందము:** 11 వ శతాబ్దికి చెందిన సంగీత మకరందమనే గ్రంథము నారద విరచితమని ప్రతీతి. కాని, యితడు పురాణ ప్రసిద్ధ దేవమౌని కాజాలడని పండితుల అభిప్రాయము. 20 పుంలింగ రాగములు, 24 స్త్రీ రాగములు, 13 నపుంసక రాగములు అను రాగవిభజనము మొదటిసారిగా యీ గ్రంథమున కనబడుతుంది. ఈ విభజనకు మూలాధారము ఆయా రాగములు శ్రోతకు కలిగించు అనుభూతి విశేషమేనట. వీర, రౌద్రరసములకు పుంలింగ రాగములు; కరుణ ప్రేమ హాస్యములు కలిగించుటకు స్త్రీ రాగములు; భయానక–బీభత్స–శాంతరసములకు నపుంసక రాగములు ప్రయోగింపవలెనని మకరందకారుని నిర్దేశము.

**శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము:** 1200–1247 ప్రాంతమున మరాట్వాడలోని దేవగిరి (దౌలతాబాద్) రాజధానిగా పరిపాలించిన యాదవవంశరాజు సింహణుని ఆస్థాన విద్వాంసుడు శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరమును రచించాడు. గ్రంథము పుట్టినది మహారాష్ట్రదేశములో అయినా ఆంధ్రదేశపు వెలమ ప్రభువు సర్వజ్ఞ సింహభూపాలుడూ, విజయనగర కర్నాటక సామ్రాజ్యపు ఆస్థాన విద్వాంసుడయిన చతురకల్లినాథ పండితుడూ సంగీతరత్నాకరమునకు సంగీత సుధ, కళానిధి అను ప్రసిద్ధ వ్యాఖ్యానములు రచించారు. శార్ఙ్గదేవుడు దేశములోని అన్ని ప్రాంతముల గాన సంప్రదాయములను పరిశీలించి తన శాస్త్రమును రచించడమే దానికి కారణము. ఆంధ్రి, గౌడి వంటి జాతి గానముల నిర్వచనము, ఆంధ్రైలా, కర్ణాటైలా, ద్రావిడైలా మున్నగు ఏలా ప్రబంధముల నిర్వచనము దీనికి తార్కాణములు. భరతుడు మొ॥ పూర్వాచార్యు లందరి మతములను పరిశీలించి ప్రాచీన కాలము నుండి తన కాలమువరకు సంగీత పరిణామాల్లో క్రమానుగతిని వివరించిన శార్ఙ్గదేవుడు సంగీత చరిత్ర జిజ్ఞాసువులకు స్తవనీయుడు. శార్ఙ్గదేవుడు రాగ వివేకాధ్యాయమున ప్రాక్ ప్రసిద్ధ (పూర్వప్రయుక్త) దేశిరాగములను గురించి చాల దూరము చర్చించేడు.

**జాయప – సోమనలు:** శార్ఙ్గదేవునికి కొంచెమించుమించు సమకాలికులైన జాయపసేనాని, పాల్కురికి సోమనా

థుడు; కాకతీయ సామ్రాజ్యమునకు సంబంధించి ఒకరు, సమకాలీనులై ఒకరును సంగీత చరిత్ర పరిణతికి తమ రచనల ద్వారా దోహదము చేశారు. జాయపసేనాని నృత్తరత్నావళి, గీతరత్నావళి, వాద్యరత్నావళి అను గ్రంథములను రచించాడు. వాటిలో దేశి నృత్యరీతులకు, దేశి సంగీత రీతులకు లక్షణము చెప్పేడు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున విజ్ఞాన సర్వస్వ పద్ధతిని వివరించిన అనేక విషయములలో సంగీత శాస్త్ర విషయములు కూడ గణింపదగినవి. అతడు చెప్పిన వివిధ వీణల పట్టిక విజ్ఞాన సర్వస్వములో చేర్చదగినది. అవి యివి: వీణోత్తమము, బ్రహ్మవీణ, కైలాసవీణ, సారంగవీణ, కూర్మవీణ, ఆకాశవీణ, పినాకవీణ, రావణవీణ, గౌరీవీణ, గాంధర్వవీణ, బాణవీణ, కాశ్యపవీణ, స్వయంభూవీణ, భుజంగవీణ, భోజవీణ, కిన్నర వీణ, త్రిసరివీణ, సరస్వతివీణ, మొల్లవీణ, మనోరథవీణ, గణనాథవీణ, కౌమారవీణ, అణివాణి, రావణహస్తము, తిపిరి, సకనె, వళి, విచిత్రక, నట, సాగరిక, కుంభిక, విపంచిక, సరవీణ, వరపాది, మల్లరి, కోలాష్టి, స్వరమండలము, ఘోషావతి, ఔదుంబరి, తంత్రీసాగరము, అంబుజ వీణ.

రెడ్డిరాజులు-శ్రీనాథుడు: శ్రీనాథ కవిసార్వభౌముని ఆస్థానకవిగా విద్యాధికారిగా ఆదరించిన రెడ్డి రాజులలో కొండవీడు రాజులలోని కుమార గిరి వసంత భూపాలుడు వసంత రాజీయమనే భరత నాట్యశాస్త్రానికి వ్యాఖ్య అనదగిన లక్షణగ్రంథాన్నీ, పెదకోమటి వేమారెడ్డి సంగీత చింతామణి అనే లక్షణ గ్రంథాన్నీ రచించారు. ఇవన్నీ సంస్కృతం! ప్రసిద్ధ నర్తకి లకుమాదేవి కుమారగిరి కొలువులో ఉండేది. శ్రీనాథుడు తన పల్నాటి వీర చరిత్ర ద్విపద కావ్యంలో నలగామరాజు కొలువులో రాజనర్తకీ నాట్యవిద్యాప్రదర్శనమునూ, సంగీతపు హంగుదారులను, ఆనాటి ప్రదర్శనలోని వివరాలను ఒక ఘట్టంలో వర్ణించాడు.

ప్రాచీనాచార్యుడైన భరతుని కాలమునుండి దేవగిరి వాసియైన శార్ఙ్గదేవుడి వరకు భారతీయ సంగీతము ఆయా లక్షణ కర్తల ప్రాంతీయము, సంకుచితము కాని సమగ్ర పరిశీలన మూలముగా ఏకత్ర సూత్రనిబద్ధమై ఒక శాస్త్రముగా విస్తరిల్లినది. 13 వ శతాబ్దిలో ఉత్తరాదిని సంభవించిన తురుష్కదండయాత్రలవల్ల. అల్లా ఉద్దీను ఖిల్జీకాలంలో శార్ఙ్గదేవుని ఉనికిపట్టయిన దేవగిరిని కూడా నాశనము చేయడంతో ఉత్తరాది సంగీతమున అల్లాఉద్దీన్ ఆస్థానమున పారశీక సంగీత పద్ధతుల ప్రభావం, గ్రామమూర్ఛన జాతి పద్ధతుల ద్వారా ప్రాచీన రాగస్వరూపముల నెరుగు కీలకములను మరుగుపరచివేచినది. వర్ధమానులగు సంగీత జిజ్ఞాసువులా రహస్యములను మనకు దక్కియున్న శాస్త్రగ్రంథముల సాక్ష్యము ద్వారా బయల్పరచవలసి వుంది.

వేదగాన యుగము లేక సామగాన యుగము: ఉదాత్త సాహితీ రూపము పొందిన మానవుని తొలి కవిత అని పాశ్చాత్యులచేత పొగడ్త పొంది, అపౌరుషేయముగా భారతీయులచే కీర్తింపబడు వేదఋక్కులు, గాథలు, సామములు – ఇవియే అనాది ప్రబంధములు, అనగా గేయములు. మన సంగీతమునకు ఆ స్థితి తొలి సోపానము గనుకనే సామగానము నుండి సంగీతము పుట్టెనన్న ప్రతీతి వచ్చింది.

గాంధర్వ యుగము లేక మార్గ సంగీత యుగము: గాంధర్వ పద్ధతి ప్రబంధాలు భక్తిరస ప్రధానములై సంస్కృత కావ్యభాషలో ఉండేవి. కపాలములు, కంబళములు అను పేర ఆ గేయములను సస్వరముగా భరతుని మొదలు శార్ఙ్గదేవుని వరకు కొందరు లక్షణ కర్తలు తమ గ్రంథములలో ప్రచారము చేశారు. ఈ యుగములో గానముచేసెడి గంధర్వులయిన నారద, తుంబురులు; అశ్వతర, కంబళులను నాగజాతివారు, గాంధార, తక్షశిలా ప్రాంత దేశీయులు కావచ్చును.

అఖ్యానయుగము: గాంధర్వ తత్త్వజ్ఞులు మూర్ఛనా స్థాన కోవిదులు అయిన కుశీలవులు మార్గవిధాన సంపన్నులై (రామాయణ) కావ్యమును ఏడుజాతుల (రాగాల)తో నిబద్ధము చేసి, తంత్రీలయతో కలిపి రామసభలో గానము చేసినట్లు వాల్మీకి రామాయణంలో వుంది. భారతమును, హరివంశమును, పురాణములను కూడ ఇదే విధముగా అరణ్యములందు ఋషుల గోష్ఠులలో, ధర్మ ప్రసంగములలో కుశీలవులు, సూతాదులు గానముచేసేవారు. భరతుడు ప్రవచించిన ఏడు శుద్ధజాతుల (రాగాల) లోను, వికృత జాతులలోను యీ అభ్యాసములను గానముచేసేవారు. అప్పటికింకా సంస్కృత గేయములకుండే సాహిత్య గౌరవము, సభాస్థాయి దేశభాషా రచనలకు రాలేదు.

ధ్రువగాన యుగము: మతంగ మహాముని తన కాలము నాడు క్రీ.శ. 4–7 శతాబ్దుల నడుమ ఒక ఉదార భావశాలియైన సంఘ సంస్కర్త. దేశమంతటా అన్ని ప్రాంతములూ, అన్ని జాతుల సంగీత రీతులనూ పరిశోధించి, దేశి సంప్రదాయమునకు సంగీత శాస్త్రములో లక్షణము కల్పించాడు. మార్గసంగీతమంటే భరతునకు పూర్వమునుంచి బ్రహ్మాది శాస్త్రకారులచేత నిర్దిష్టమయినదీ, వేదనిబద్ధమూ అయిన ఆనాటి శాస్త్రీయ సంగీతమనీ; దేశిసంగీతమంటే సంస్కృతేతర దేశ భాషలలోని గేయములు, ఆయా ప్రాంతముల జనులు నిత్య జీవితములో పాడుకొను సాంప్రదాయము – అనే వేరుపాటు మతంగుని వరకే సాగినది. గ్రామములూ, జాతులూ క్రమముగా రాగములుగా రూపొందినవి. దేశిరాగము లెన్నో లక్షణ గ్రంథాలకు ఎక్కినవి. మతంగుని నాటి నుండి మార్గ సంగీతము ప్రచారమున జనాదరము నానాటికీ కోల్పోయి ప్రాతపడి, లక్షణములోని కెక్కిన దేశి

సంగీత రీతులే క్రమముగా నేటి శాస్త్రీయ సంగీతముగా పరిణామము చెందినవి. పాట ఈ యుగంలో క్రీ.శ. 7,9 శతాబ్దుల నడుమ ధ్రువాపదముగా పేరుపొందిన వేరువేరు ప్రబంధరీతులుగా పరిణమించి, రాను రాను నేటికి కీర్తనగా, కృతిగా తేలినది.

రాగ కావ్య యుగము: భరతనాట్య శాస్త్ర వ్యాఖ్యాత యైన అభినవగుప్తపాదుడు చెప్పిన రాగ కావ్యములనే ప్రబంధము లీ యుగములోనివే. (పదవ శతాబ్దము.) టక్క రాగములో పాడవలసిన రాఘవ విజయ కావ్యమూ, కకుభ రాగములో పాడవలసిన మారీచవధా కావ్యమూ అభినవ గుప్తుని అభినవ భారతిలో ఉదాహృతములు.

గీతగోవింద యుగము: 12 శతాబ్దిలో ధ్రువాపదయుగ లక్షణములను రాగకావ్య యుగ లక్షణములను కలుపుకొని బహురాగములతో బహుధ్రువా పదములను, మధ్య మధ్య శ్లోకములతో భక్తి శృంగారాత్మ కేతివృత్తముతో సర్గములుగా విభజింపబడిన జయదేవుని గీతగోవింద మీ యుగలక్షణమునకు మార్గదర్శి. అష్టపదులని పేరుపడిన ఎనిమిది పాదములుగల శరభ పదములు, విజయ, ధవళము, మంగళాచారము మున్నగునవి దేశి సాంప్రదాయిక ప్రబంధరీతులు. ఒక్కొక్క పదమునకు రాగ తాళ నిర్దేశము కలిగిన గీత గోవిందము అలంకారికులకు, సాహిత్య వేత్తలకు, గీత నృత్య కోవిదులకు అత్యంత ప్రామాణిక గ్రంథము. గేయ రూప సాహిత్యములో ఇంతటి సర్వలక్షణ లక్షితమైన ప్రబంధము మరి యే భాషలోనూ లేదనుట అతిశయోక్తి కాదు.

పదకొండు–పదమూడు శతాబ్దముల మధ్య ఉత్తర హిందూస్థానములో సంభవించిన ముస్లిం దండయాత్రలవల్ల ఉత్తరాది సంగీతములోనే మార్పులు వచ్చాయనీ, దక్షిణాది సంగీత మంతగా చెక్కుచెదరలేదనీ సంగీత చరిత్రకారులు తరచుగా అంటూ ఉంటారు. కానీ అది సరికాదు. 1210 ప్రాంతం వాడైన శార్ఙ్గదేవుని ఆస్థాన విద్వాంసునిగా పోషించిన దేవగిరి యాదవ రాజ్యము, అల్లావుద్దీన్ ఖిల్జీ సేనాని అయిన మల్లిక్కాఫూర్ చేతిలో సర్వనాశనమయిపోయింది. ఇతగాడు రామేశ్వరం వరకు చేసిన దండయాత్రలలో రాజ్యాల సర్వనాశానికి తోడు అక్కడుండే సంగీత విద్వాంసులను, నర్తకులను బానిసలుగా ఢిల్లీకి తీసికొని పోయాడట. అటువంటి వారిలో గోపాలనాయకుడు అనే కర్ణాటక విద్వాంసుడు అల్లావుద్దీన్ కొలువులో పాడినప్పుడు అతడు స్వయముగా కల్పించిన ధ్రువపద గేయమును సుల్తాన్ గద్దె వెనుక దాగి ఒక్కసారి విన్న వెంటనే పాడగలిగిన ప్రతిభాశాలి అమీర్ ఖుస్రూ.

భరతుని నుండి శార్ఙ్గదేవుని వరకు దేశములో ప్రచారములో నుండిన సంగీత శాస్త్ర పద్ధతులన్నింటికీ అమీర్ ఖుస్రూవంటి పారశీక సంగీత విద్వాంసుల కుతర్కమువల్ల ఓటమి సంభవించి, ఆ గ్రంథములలోని అనాటి సంగీత రీతుల నెరుగు మర్మములు క్రమముగా వివరించి చెప్ప శాస్త్రకారులు కరువైపోయారు. దక్కన్‌లో భామినీ రాజ్యం కూడా ఏర్పడిన 1300 ప్రాంతంలో విద్యానగర రాజ్యస్థాపనకు కారకుడయిన విద్యారణ్యస్వామి వంటి ప్రాచీన భారతీయ సంప్రదాయ నిష్ణాతులకు కూడ వెనుకటి సంగీత శాస్త్ర పద్ధతులు అగమ్యగోచరమైపోయిన పరిస్థితి ఏర్పడింది. అందుకే భరతుడు నాట్యశాస్త్రములో చెప్పిన 22 శృతులు ఏవి? వాటిలో శుద్ధ స్వరము లేవి? వికృత స్వరము లేవి? వంటి ప్రాచీన సంగీత లక్షణములను వివరించేట ప్పుడు విద్యారణ్యుడు తన సంగీత సార గ్రంథములోను, రామామాత్యుడు తన స్వరమేళ కళానిధిలోను, గోవింద దీక్షితులు, వెంకటమఖి తమ సంగీత సుధ, చతుర్దండి ప్రకాశికలలోను వేరువేరు మార్గముల నవలంబించి, ప్రాచీన సంగీత రూపమును మరింత అయోమయము చేసివేశారు. భరతుని నుండి శార్ఙ్గదేవుని వరకూ సామవేదము నుండి షడ్జ మధ్యమ గాంధార గ్రామములు, గ్రామములనుండి మూర్ఛనల ద్వారా జాతులు, జాతులనుండి రాగములు ఏర్పడే విధమును తెలియజేయగా, విద్యారణ్యుడే మొదటి సారిగా 15 మేళ రాగములు కలవని, మిగిలిన రాగములన్నీ ఆ 15 మేళ కర్తలకు జన్యము లౌతాయని, పారశీక సంగీత పద్ధతిలోని మకాముల ననుసరించి జనక రాగములను, జన్య రాగములను వివరించాడు. విద్యారణ్యుల తర్వాత రామామాత్యుడు, సోమనాథుడు ఈ పద్ధతిని కొంత పెంచడానికి ప్రయత్నించారు. వెంకటమఖి, గోవిందామాత్యుడు శుద్ధ వికృత స్వరముల యెంపికలోనే ప్రాచీన లక్షణము నుండి పూర్తిగా భేదించి, భరతుని 22 శ్రుతులకు బదులు పారశీక పద్ధతి ప్రకారము స, రి, గ, మ, ప, ద, ని అనే ఏడు స్వరములలోను షడ్జ పంచమాలు వికృతులులేని స్థిరస్వరాలనీ, మధ్యమములు శుద్ధ ప్రతి మధ్యమములుగా 2 విధములనీ, రి, గ, ద, ని – 4 స్వరములూ ఒక్కొక్కటి అయిదేసి వికృతులు కలిగి ఉంటవనీ, 5 వికృతులలోను ఒక్కొక్కదాని మొదటి స్వరము శుద్ధ స్వరముగా ఉంటుందనీ వివరించారు.

ప్రతి ఒక్క లక్షణకర్త, తన కాలమునాడు వాద్య ప్రయోగములోను, గాత్ర సంగీతములోను ఆనాడు ప్రచారము నుండి గీతముల, రాగముల ప్రయోగములోను, అప్పటికి జరిగిపోయిన మార్పుల ననుసరించి క్రొత్తగా లక్షణము తయారుచేస్తూ ఉండడమూ, పాత లక్షణ శాస్త్రమునకూ, తాను చెప్పే శాస్త్రమునకూ అన్వయింపలేక, తన పూర్వ లక్షణ కర్తలను దుయ్యబట్టి విమర్శిస్తూండడమూ వీరంతా చేసిన పని.

లక్షణ కర్తలను వదలి లక్ష్య కర్తలైన వాగ్గేయకారుల

ద్వారా మన సంగీత స్వరూప పరిణామమును గ్రహించడం శ్రేయస్కరం. 11 వ శతాబ్దములో ఆంధ్ర భారత కర్తయైన నన్నయభట్టుకు సమకాలికుడుగా, వంగ – ఉత్కళ దేశముల సరిహద్దు ప్రాంతమున జన్మించిన మహాకవి జయదేవుడు సంస్కృతములో రచించిన 'గీత గోవిందము' శ్లోకములతో, గేయములతో కూడిన మొదటి సంగీత నృత్య ప్రబంధము. రాధా మాధవుల శృంగార గాథామయమైన ఈ శ్రవ్య కావ్యము భారతదేశములోని అన్ని రాష్ట్రముల వారికీ తొలి ప్రబంధముగా ఆరాధ్యనీయమైనది. దక్షిణ దేశములో ఆళ్వారులనీ, నాయనారులనీ ప్రసిద్ధికెక్కిన తమిళ భక్తియోగులు పాశురములనీ, తేవారములనీ గానము చేసిన కాలము గీత గోవిందమునకు కొన్ని శతాబ్దములకు ముందే జరిగినది. శంకర, రామానుజ, మధ్వాచార్యులు దక్షిణముననూ, జయదేవాదులు ఉత్తరముననూ భక్తి ఉద్యమమునకు తమ గేయ రచనల ద్వారా ప్రజానీకములో ప్రచారము గావించినారు.

చాళుక్యరాజుల పాలనలో తెలుగుభాషకు, తెలుగు కవితకు సభాగౌరవము, రాజపోషణ లభించాయి. కాని, తెలుగుపాట పల్లెజనుల వినోదోత్సవములలోనో, జాతరలలోనో, లేక తెలుగు తల్లుల ఇంటిపట్టు కూటములలోనో 'గాసట బీసటగా' సాహిత్య గౌరవము లేక అజ్ఞాతముగా ఉంటూండిన రోజులు.

అయితే, యీ తూర్పు చాళుక్య రాజులయిన గుణగ విజయాదిత్యుడూ రాజరాజనరేంద్రుడూ పాలించిన వేంగీ రాజ్యంలో వీరిద్దరి కొలువులకూ చెందిన రాజనర్తకీమణులుండేవారని, వారికై రాజులు చేయుంచిన దానశాసనాలద్వారా పరిశోధకులు చెపుతున్నారు. కాని, వారు తెలుగు పాటలెంతవరకూ గానం చేసేవారో తెలియదు.

భక్తి తరంగములలో మొదటి "అలగా" 13వ శతాబ్దములో సింహాచలములో కృష్ణమాచార్యుల 'సింహగిరి నరహరి వచనాల' ద్వారా తెలుగుపాట ఆలయ మంటపాలలో చిందులు నేర్చుకొన ప్రారంభించింది. అదే కాలములో కాకతీయ చక్రవర్తి గణపతి దేవుడు చాళుక్యరాజుల కంటే ఒక అడుగు ముందుకు వేసి, తిక్కనగారి మహాభారతము ద్వారానేకాక, గజసేనాధిపతియైన జాయప్పగారి "నృత్తరత్నావళి", "గీత రత్నావళు"ల ద్వారా సరస్వతీదేవి స్తనద్వయ క్షీరమును తెలుగువారిచే రెండిందాల తాగించినారు. జాయప్ప తన లక్షణ గ్రంథాలలో ఎక్కువగా దేశి సంగీత రీతులను దేశీ నృత్తరీతులను వివరించినట్లుగా వేరెవ్వరూ చేయలేదు.

ఆళ్వారుల తర్వాత ఆళ్వారులంతటి వాడై, తెలుగు పాటను సాళువ నరసరాయలు రాచకొలువుననే కాక దేవుని కంకితముగా చేసి, తిరుపతి కొండపై వెయ్యిరీతుల నాట్యమాడించిన మహావాగ్గేయకారుడు, సంకీర్తనాచార్యుడు, పద కవితా పితామహుడూ తాళ్ళపాక అన్నమాచార్యుడు. తమిళ భక్తుల విష్ణుస్తుతులకు ద్రావిడ వేదమని పేరు వచ్చినట్లే అన్నమాచార్యుడు వేంకటేశ్వరుని కంకితముగా రచించిన శృంగార, వైరాగ్య కీర్తనలకు "ఆంధ్రవేద"మని పేరు వచ్చింది. కీర్తనలద్వారా మేలుకొలుపుతో ప్రారంభించి ఏకాంతసేవ వరకూ వేరువేరు వేళల దేవుని సేవించే సంకీర్తన పద్ధతికి ప్రారంభకుడు అన్నమాచార్యుడు. ఈయన సంకీర్తనలు శృంగార పదములనీ, వైరాగ్య పదములనీ రెండు విధములు. శృంగార పదములలో దేవుడు నాయకుడు, నాయికలు అలంకార శాస్త్రములో చెప్పబడిన విధములన్నింటికీ దృష్టాంతరముగా ఎన్నో కీర్తనలు. ఈ పద్ధతి ననుసరించి అన్నమాచార్యుల కొడుకు, మనుమడు మాత్రమేకాక, క్షేత్రయ్య, సారంగపాణి వంటి వాగ్గేయకారులు పదకవితను బహువిధములుగా విస్తృత పరిచారు. క్షేత్రయ్య పదములు సాహిత్యభావ స్ఫూర్తియేకాక, తెలుగుభాష నుడికారములో అందమును దిద్దుకొని, కర్ణాటక సంగీతములో అనేక రాగములను సాహిత్యభావములతో, జీవిత ఘటనా సందర్భములతో సమన్వయ మిచ్చే విస్తృత ప్రయోగము లభించినది. అన్నమాచార్యుల శృంగార పదముల పద్ధతిని క్షేత్రయ్యాదు లనుసరింపగా, భక్తి కీర్తనల పద్ధతి ననుసరించి, భద్రాచల రామదాసు అని ప్రసిద్ధి కెక్కిన కంచర్ల గోపన్న తెలుగు దేశములోని గ్రామగ్రామముల అత్యంత ప్రచారము పొందిన భజన కీర్తనల గోష్ఠులకు గురువైనాడు.

కాళహస్తి సంస్థానపు ఆస్థాన విద్వాంసుడైన మునిపల్లె సుబ్రహ్మణ్య కవి 18 వ శతాబ్ది ఆరంభంలో రాగ తాళ, నృత్యశబ్దములతో కూడిన ఆఖ్యానాత్మకములైన కీర్తనలతో ఆధ్యాత్మ రామాయణ కీర్తనలను రచించాడు. అదేకాలంలో గుంటూరు జిల్లా కాజలో జన్మించి, కాశీ, పూరీ జగన్నాథం వంటి క్షేత్రాలలో పాండిత్య ప్రదర్శకములైన వేదాంత గ్రంథాలను ప్రచారము చేసిన నారాయణ తీర్థస్వామి అనే యతీంద్రులు కృష్ణలీలా తరంగిణి అనే మహాయక్షగానం ద్వారా భజన నాటక, సంకీర్తన పద్ధతులకు గురువై, అందులోని తరంగాలను సంకీర్తన గోష్ఠులలో గానం చేసే సంప్రదాయానికి ఆంధ్ర, తమిళ, కేరళ దేశాలలో శిష్యపరంపరను ఏర్పాటు చేసి, తమిళనాడులోని తిరుప్పూందుర్తిలో సిద్ధి పొందారు.

సంకీర్తనా చార్యుడైన అన్నమాచార్యుడు 'సంకీర్తన లక్షణము' అనే గ్రంథమును సంస్కృతములో రచించాడు. ఎందుకంటే, తన కాలమునాటికి పండిత సభా మర్యాదను పొందని ఏలలూ, వెన్నెల పాటలు, యక్షగానపు దరువులూ మొదలైన తెలుగు గేయములను గురించి వివరించాడు. యక్షగాన ప్రవక్తలలో కూచిపూడివారి గురువులైన సిద్ధేంద్రయోగి, నారాయణ తీర్థులు చెప్పకొనదగ్గవారు. సిద్ధేంద్రయోగి భామా కలాపము, నారాయణ తీర్థుని కృష్ణలీలా తరంగిణి